# హదీసు కిరణాలు

## (రియాజుస్సాలిహీన్)

### (మొదటి సంపుటం)


సంకలనం

ఇమామ్ అబూ జకరియా యహ్యా బిన్ షరఫ్ నవవీ (రహ్మాలై)

ఉర్దూ అనువాదం, వ్యాఖ్యానం

హాఫిజ్ సలాహుద్దీన్ యూసుఫ్

తెలుగు రూపం

హాఫిజ్ ఎస్.ఎమ్. రసూల్ షర్ఫీ



ప్రకాశకులు

**ట్రూత్ పబ్లికేషన్స్**

హైదరాబాద్ - 59, ఎ.పి. ఇండియా

# Hadeesu Kiranaalu (Part -1)

**Riyaz-us-Saaliheen (Telugu)**

*Compiled by:*
**Imam Abu Zakaria Yahya Bin Sharaf Navavi (RAH)**

*Urdu Translation by:*
**Hafiz Salahuddin Yousuf**

*Telugu Translation by:*
**Hafiz S.M. Rasool Sharfi**

*Edited by:*
**Mohd. Azeez-ur-Rahman**

| | | |
|---|---|---|
| First Edition | : | November 2005 |
| **Copies** | **:** | **2000** |
| **Price** | **:** | **Rs. 250/-** |
| *Printed at* | : | **Cosmic Printers**<br>Chatta Bazar, Hyderabad-2<br>Phone: 24564583 |
| *Binding at* | : | **Praja Book Binders**<br>Hanuman Takdi,<br>Hyderabad. Ph.24753913 |
| *Published by* | : | **Truth Publications**<br>Near Ujalesha Masjid,<br>Sayeedabad, Hyderabad - 59.<br>Ph: 24551559, 24557976, 24528950 |

# కృతజ్ఞతాంజలి!

**'రియాజుస్సాలిహీన్'** అనేది ఓ విశ్వ విఖ్యాత హదీసు సంకలన గ్రంథం. క్రీ.శ. 7వ శతాబ్దంలో ప్రఖ్యాత ఇస్లాం తత్వవేత్త, విద్వాంసులు అబూ జకరియా యహ్‌యా బిన్ షరఫ్ నవవీ (రహ్మాలై) గారి చేత సంకలనం చేయబడిన ఈ హదీసు గ్రంథం నేటికి కూడా ముస్లిం సమాజంలో గొప్ప ఆదరణకు నోచుకుంటోంది. ఈ గ్రంథ ప్రామాణికత మీద, దీని ప్రాముఖ్యత మీద యావత్తు ముస్లిం సమాజం ఏకాభిప్రాయాన్ని కలిగి ఉందని చెప్పటంలో ఏమాత్రం సందేహం లేదు. ఈ గ్రంథం ఇంత గొప్పగా జనాదరణ పొందటానికి కారణం ఇమామ్ నవవీ (రహ్మాలై) గారు ఇందులో ముత్యాలు, రతనాల వంటి హదీసులను పొందుపరిచారు.

ఇంత గొప్ప గ్రంథాన్ని "హదీసు కిరణాలు" అనే పేరుతో తెలుగులో ప్రచురించే సౌభాగ్యం మాకు కలగటం నిజంగా దైవానుగ్రహం. అందుకు మేము ఆయనకు ఎంత కృతజ్ఞతలు తెలుపుకున్నా తక్కువే. ఈ పుస్తకంలోని సుగుణాలన్నీ అల్లాహ్ తరపు నుంచి వచ్చినవి. లోపాలు మా స్వయంకృతాలు.

అల్లాహ్ ఈ సత్కార్యంలో పాలుపంచుకున్న వారందరికీ ఇహపరాల్లోనూ గొప్ప ప్రతిఫలాన్ని ప్రసాదించుగాక! (ఆమీన్)

**- ముహమ్మద్ సైఫుద్దీన్**
ప్రెసిడెంట్, ట్రూత్ పబ్లికేషన్స్

# ఆశీర్వచనాలు

భాష అన్నది అభిప్రాయాల వెల్లడికి సాధనం. ఆ సాధనాన్ని విని యోగించుకుని ఏ విషయాన్నయినా వెల్లడించవచ్చు, దేన్నయినా ప్రచారం చేయవచ్చు, ఏ దుష్ప్రచారమయినా చేయవచ్చు. ప్రకృతి ప్రసాదించిన సాధనాలను మానవ శ్రేయానికీ, మానవ సౌఖ్యానికీ, మానవ సాఫల్యానికీ వినియోగించిన వ్యక్తి ఎవరయినా సరే మానవుల్లో ఉత్తమ శ్రేణికి చెందిన వాడవడంలో ఎటువంటి సందేహమూ లేదు. మిత్రులు, సత్యపథ సహ చరులు ఎస్. ఎమ్. రసూల్‌గారు అటువంటి ఉత్తమ లక్షణాన్ని పుణికిపుచ్చు కున్న వ్యక్తి అనడం అతిశయోక్తి కాదు.

ఎస్. ఎమ్. రసూల్ పిన్న వయసులోనే ధర్మమార్గాన తాఁ నడవటమే కాక, ధర్మ పథ చిహ్నాలను తోటి మానవ సోదరులకు సయితం పరిచయం చేయాలన్న తపన గలవారు. ఈ భావన, తపన, ఆవేదన ఎంతయినా శ్లాఘనీయం. దైవం వీటిలో మరింత వృద్ధిని అనుగ్రహించుగాక! లోగడ రసూల్ ధార్మిక పుస్తకాలు కొన్నింటిని తెలుగులో అందజేసినా తొలిసారిగా ఈయన 'హదీసు' వచనాలను ఆంధ్రీకరించేందుకు పూనుకుని చాలా మటుకు సఫలీకృతులయ్యారనే నేను చెప్పగలను. దైవం ఈయన కలంలో ఇతోధిక శక్తిని ప్రసాదించుగాక!

'రియాజుస్సాలిహీన్' అనే హదీసు సంకలన గ్రంథాన్ని 'హదీసు కిరణాలు' అనే పేరుతో తెలుగు ప్రజలకు అందజేస్తున్నారు ఎస్.ఎమ్. రసూల్. అన్నివిధాలా ప్రోత్సాహానికీ, ప్రోద్బలానికి అర్హులు. అల్లాహ్ ఈయనకు, శక్తితోపాటు సద్బుద్ధినీ సదా తోడుగా కొనసాగనివ్వాలని ప్రార్థిస్తున్నాము.

హైదరాబాద్
23-11-2005

- **ఎస్.ఎమ్. మలిక్**
గౌరవ సంపాదకులు, 'గీటురాయి'

బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్

# గ్రంథ పరిచయం

ఇన్నల్ హమ్‌ద లిల్లాహ్. నహ్మదుహూ వ నస్తయీనుహూ వ నస్తగ్ఫిరుహూ వ నవూజు బిల్లాహి మిన్ షురూరి అన్ఫుసినా వమిన్ సయ్యిఆతి ఆమాలినా మైంయ్యహ్‌దిహిల్లాహు ఫలా ముజిల్లలహ్. వమైంయ్యుజ్‌లిల్ ఫలా హాదియ లహ్. వ అష్‌హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వహ్‌దహూ లా షరీకలహూ వ అష్‌హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహ్. సల్లల్లాహు అలైహి వ సల్లం. అమ్మాబాద్ :

ఇస్లాం ధర్మం సంపూర్ణ జీవన విధానం. యావత్ ప్రపంచ మానవాళి మార్గదర్శకత్వం కోసం పరమప్రభువైన అల్లాహ్ తరపు నుంచి అవతరించిన నిజధర్మం. ఈ ధర్మాన్ని అర్థం చేసుకోవటంలో, దాని బోధనల గురించి తెలుసుకోవటంలో రెండు వస్తువులు ప్రధాన భూమికను పోషిస్తాయి. ఒకటి : దివ్య ఖుర్‌ఆన్. రెండు : దైవప్రవక్త (సల్లం) గారి సున్నత్ అనగా హదీసులు. ఈ రెండింటి మూలం ఒక్కటే. అదే దైవవాణి (వహీ).

"అతను (అంటే ముహమ్మద్ - సల్లం) తన మనోవాంఛలను అనుసరించి చెప్పటం లేదు. ఇది ఒక వహీ, అతనిపై అవతరింపజేయబడుతుంది."
*(నజ్మ్ సూరా : 3, 4 సూక్తులు).*

వహీ అనేది అల్లాహ్ తరపు నుంచి ప్రవక్తలపై అవతరిస్తుంది. ప్రపంచంలో మానవాళి మార్గదర్శకత్వం కోసం పంపబడినవారు దైవప్రవక్తలు. వీరి సంఖ్య ఖచ్చితంగా అల్లాహ్‌కు మాత్రమే తెలుసు. అయితే ప్రతి జాతిలోనూ ఒక ప్రవక్త పుట్టాడన్నది ఎవరూ తిరస్కరించలేని నిజం.

"మేము ప్రతి జాతిలోనూ ఒక ప్రవక్తను ప్రభవింపజేశాము. అతని ద్వారా అందరికీ ఇలా హెచ్చరిక చేశాము : అల్లాహ్‌ను ఆరాధించండి. మిథ్యా దైవాల ఆరాధనకు దూరంగా ఉండండి." *(నహ్ల్ సూరా : 36)*

ఆ ప్రవక్తల పరంపరలో అందరికంటే చివర్లో ప్రభవించినవారే ముహమ్మద్ ముస్తఫా సల్లల్లాహు అలైహి వ సల్లం. ఆయన ప్రపంచమంతటి కోసం కారుణ్యమూర్తిగా, అంతిమ దైవప్రవక్తగా పంపబడ్డారు.

"ముహమ్మద్! ఇలా ప్రకటించు : మానవులారా! నేను మీ అందరి వైపునకు వచ్చిన అల్లాహ్ సందేశహరుణ్ణి." (ఆరాఫ్ సూరా : 157వ సూక్తి)

ఆయన తర్వాత ఇక ప్రళయం వరకూ మరే ప్రవక్తా రాడు. కనుక ఆయన ధర్మాన్ని పరిపూర్ణం చేయటం జరిగింది.

"ఈనాడు నేను మీ ధర్మాన్ని మీ కొరకు పరిపూర్ణం చేశాను. మీపై నా అనుగ్రహాన్ని పూర్తిచేశాను. మీ కొరకు ఇస్లామ్‌ను మీ ధర్మంగా అంగీ కరించాను." (మాయిదా సూరా : 3వ సూక్తి)

ఈ ధర్మంలో ఎలాంటి హెచ్చుతగ్గులు జరగకుండా ఉండటానికి దీనిని కాపాడే బాధ్యత కూడా అల్లాహ్ స్వయంగా తీసుకున్నాడు.

"ఈ జ్ఞాపికను మేము అవతరింపజేశాము. స్వయంగా మేమే దానిని రక్షిస్తాము." (హిజ్ర్ సూరా : 9వ సూక్తి)

దీనిద్వారా బోధపడేదేమిటంటే ఇస్లాం ఒక పరిపూర్ణమైన, సురక్షితమైన జీవన సంవిధానం. అది దైవవాణి (వహీయె ఇలాహి) ఆధారంగా రూపొందింది. దివ్య ఖుర్‌ఆన్ సూక్తులు దైవవాణే. అలాగే దైవప్రవక్త (సల్లం) ఖుర్‌ఆన్‌కు చెప్పిన వివరణలు, ప్రజలకు అనుసరించమని చెప్పిన బోధనలు కూడా వహీ ఆధారంగా చెప్పినవే.

ఇస్లాం ధర్మం ప్రపంచవాసులందరిది. కనుక దీని బోధనల్లో ఒక విధమైన సమ తౌల్యం, సమగ్రత కనిపిస్తుంది. బహుశా అందుకేనేమో ప్రపంచంలో నిశితబుద్ధితో ఆలోచించేవాడెవడైనా ఈ ధర్మాన్ని సులభంగా అర్థం చేసుకొని ఆచరించగలడు. ఇది విశ్వ ప్రభువు నిర్ణయించిన ధర్మం కనుక ఇందులో భౌగోళిక, వంశప్రాతిపదికలపై మానవు లను విభజించటం జరగలేదు. పైగా ఈ ధర్మంలో విశ్వాసానికి, సిద్ధాంతానికి, నీతి నడవడికలకు అత్యంత ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడింది.

"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి, ఒకే స్త్రీ నుండి సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులుగానూ, తెగలుగానూ చేశాము. వాస్తవానికి మీలో అందరికంటే ఎక్కువ భయభక్తులు కలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు. నిశ్చయంగా అల్లాహ్ సర్వజ్ఞానం కలవాడు, సకల విష యాలూ తెలిసినవాడూను." (హుజురాత్ : 13)

ఈ పవిత్ర ధర్మాన్ని ఆచరించటానికి దైవప్రవక్త (సల్లం) ను ఆదర్శమూర్తిగా పరిగణించటం జరిగింది. ఆయనగారి ఉత్తమ ఆదర్శాన్ని ఎల్లప్పుడూ దృష్టిలో పెట్టుకొని మసలుకోవటం, ఆయనగారి నైతికతా నడవడికల అద్దంలో చూసుకొని తమల్ని తాము సంస్కరించుకోవటం ముస్లింలకు పరిపాటి అయింది.

> "వాస్తవంగానే అల్లాహ్ ప్రవక్తలో మీకు ఒక మంచి ఆదర్శం ఉంది; అంతిమ దినంపై ఆశలు పెట్టుకొని అత్యధికంగా అల్లాహ్ను స్మరించే ప్రతి వ్యక్తికి." *(అహ్జాబ్ సూరా : 21)*

దైవప్రవక్త (సల్లం) గారి రేయింబవళ్ల దినచర్యలు, వ్యక్తిగతమైన సామూహికమైన జీవితానికి సంబంధించిన ప్రతి విషయం భద్రపరచబడి ఉంది. ప్రపంచంలోని మరే సంస్కర్త లేక నాయకుని లేక నేత యొక్క జీవితమూ ఈ విధంగా భద్రపరచబడిలేదు. ఎవరూ తిరస్కరించలేని సత్యమిది. దీనికిగల ముఖ్య కారణమేమిటంటే దైవప్రవక్త (సల్లం)ను అనుసరించనిదే ఎవరూ ఇస్లాం పరిధుల్లో ఉండలేరు. ఒక వ్యక్తి ముస్లిం అవటానికి అతను దైవప్రవక్త అడుగుజాడల్లో నడవటం చాలా అవసరం.

> "విశ్వాసులారా! మీరు అల్లాహ్కు విధేయత చూపండి, ప్రవక్తకు విధేయత చూపండి. మీ పనులను వృథా చేసుకోకండి." *(ముహమ్మద్ : 33)*

> "ప్రవక్తా! నీవు ప్రజలకు ఇలా చెప్పు : మీకు నిజంగానే అల్లాహ్ పట్ల ప్రేమ ఉంటే నన్ను అనుసరించండి. అప్పుడు అల్లాహ్ మిమ్మల్ని ప్రేమిస్తాడు. మీ పాపాలను మన్నిస్తాడు. ఆయన అమితంగా క్షమించేవాడు, అనన్యంగా కరుణించేవాడూను." *(ఆలి ఇమ్రాన్ : 31)*

అనుసరణ కోసం విద్యాజ్ఞానాలు చాలా అవసరం. ఫలానా విషయంలో దైవప్రవక్త ఆదేశం ఏమిటీ? ఆయన ఆచరణ ఏమిటి? అన్నది తెలుసుకున్నప్పుడే ఆయన్ని అనుసరించటానికి వీలవుతుంది. అంటే దైవప్రవక్త (సల్లం)ను అనుసరించటానికి హదీసు విద్య, ముస్లిం అవటానికి, పరలోకంలో ముక్తి పొందటానికి దైవప్రవక్త అనుసరణ చాలా ముఖ్యమన్నమాట. కాని మరోవైపు ప్రపంచంలోని ఏ గొప్ప సంస్కర్తకూ ఆ స్థానం లేదు. అతని జీవితంలోని ఒక కోణం గౌరవప్రదంగా ఉంటే మిగతా కోణాలన్నీ చీకటిగా ఉంటాయి. ఒకరి జీవిత చరిత్రలోని కొంతభాగం గుర్తుంటే మిగతా భాగమంతా అనామకంగా ఉంటుంది. ఒకరి జీవితంలోని బయటి జీవితం విజయవంతంగా కనపడినా గృహస్థ జీవితం మాత్రం విఫలమై ఉంటుంది. కనుక అటువంటి నాయకులు ఏ కారణాల చేతనయితే ఖ్యాతి గడించారో కేవలం ఆ కారణాల వైపు మాత్రమే ప్రజలు

తమ దృష్టిని కేంద్రీకరించారు. వాటిని మాత్రమే గుర్తుపెట్టుకున్నారు. మిగతా జీవితం మొత్తాన్ని వదలిపెట్టేశారు. కాని దైవప్రవక్త (సల్లం) జీవితం అన్ని విధాలుగా విజయ వంతమైనది. అత్యున్నత ఆదర్శప్రాయమైనది. కనుక ఆయన జీవితంలోని ప్రతి కోణం సురక్షితంగా ఉంది. అదీగాక ధర్మాన్ని అర్థం చేసుకోవటంలో, దాన్ని ఆచరించటంలో కూడా ఆయన సున్నతు (జీవన విధానం) ప్రధాన భూమికను పోషిస్తుంది. అందుచేత ఆయన జీవితాన్ని భద్రపరచటానికి అన్నిరకాల ఏర్పాట్లు జరిగాయి. ఆయన జీవితంలో జరిగిన చిన్న పెద్ద సంఘటలన్నింటిని, ఆయన ఆజ్ఞల్ని, అనుజ్ఞల్ని మొదలగు వాటి నన్నింటిని ఆయన సహచరులు గుర్తుపెట్టుకున్నారు. తమ జీవితాలను కూడా వాటికి అనుగుణంగా తీర్చిదిద్దుకున్నారు. అంతేగాకుండా వాటిలో ఎలాంటి హెచ్చుతగ్గులు చేయకుండా వాటిని యథాతథంగా తర్వాతి తరాల వారికి అందజేశారు. పైగా దైవప్రవక్త (సల్లం)ను అనుసరించాలన్న వారి విపరీతమైన కోరికే వారిని హదీసులను గుర్తు పెట్టుకునేందుకు దోహదం చేసింది. అందుకే ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ (రహ్మలై) ఇలా అన్నారు : హదీసులను గుర్తుపెట్టుకోవటానికి అత్యంత మంచి పద్ధతి వాటిని అనుసరించటం. ఆచరణ ఎంత ఎక్కువగా ఉంటే విషయాలు కూడా అన్ని ఎక్కువగా గుర్తుంటాయి. విషయపరిజ్ఞానం కూడా అంత పరిపక్వతనొందుతుంది.

దైవప్రవక్త సహచరులు కొందరు తమ అవసరాన్నిబట్టి దైవప్రవక్త (సల్లం) గారి బోధనల్ని రాసి భద్రపరచుకునేవారు. ఆ కాలంలో అరబ్బు దేశంలో వ్రాతపని అరుదుగా ఉండేది. వారు ఎక్కువగా తమ జ్ఞాపక శక్తిమీదే ఆధారపడేవారు. అరబ్బు చరిత్ర గురించి తెలిసిన వాడెవడైనా వారి ఈ అలవాటుని ధృవీకరిస్తాడు. అదీగాక దైవప్రవక్త (సల్లం) నుంచి హదీసులను నకలు చేసిన ఆయన అనుచరుల సంఖ్య కూడా పరిమితంగా లేదు. దైవప్రవక్త (సల్లం) గారి వార్థక్యంలోనైతే వారి సంఖ్య వేలకు దాటిపోయింది. వారిలో ఎవరైనా ఏ విషయాల్లోనైనా తప్పు చేస్తే అతన్ని సరిదిద్దటానికి ఎంతోమంది సహచరులు ఉండేవారు. ముఖ్యమైన వ్యవహారాల గురించి చర్చలు జరిపి సరైన నిర్ణయాలు తీసుకోవటం కోసం సమావేశాలు కూడా జరుగుతుండేవి. ముఖ్యంగా హజ్రత్ ఉమర్ (రజి) గారి ఖిలాఫత్ కాలంలోనయితే ఇలాంటి సమావేశాలు ఎన్నో జరిగాయి. ఎప్పుడైనా ఏ ముఖ్య వ్యవహారంలోనైనా సీనియర్ సహాబీల అవసరం ఏర్పడవచ్చు కనుక హజ్రత్ ఉమర్ (రజి) తాను ఖిలాఫత్ బాధ్యతలు చేపట్టిన ప్రారంభకాలంలో సీనియర్ సహాబీ లెవరూ ప్రభుత్వ అనుమతి లేకుండా, అత్యవసర పరిస్థితుల్లోనే తప్ప ఖిలాఫత్ ముఖ్య పట్టణాన్ని వదలి బయటికి వెళ్ళరాదని ఉత్తర్వులు జారీ చేశారు. తర్వాత ఆ సీనియర్ సహాబీల పర్యవేక్షణలో తాబయీన్లతో కూడిన ఒక పెద్ద, అత్యంత ప్రతిభావ్యుత్పత్తులు గల ఒక శిష్యగణం తయారయింది. వారంతా చాలా క్రమబద్ధతతో

హదీసుల సేకరణ, సంకలన కార్యాల కోసం బాగా కృషిచేశారు. ఆ కాలంలో ముఖ్యమైన హదీసు గ్రంథాలెన్నో సంకలనం చేయబడ్డాయి. ఉదా : సహీఫయె హుమామ్ ఇబ్నె మంబహ్ (హి.శ. 132). దీనిని ప్రముఖ దైవప్రవక్త సహచరులు హజ్రత్ అబూ హురైరా (రజి) గారి శిష్యులు సంకలనం చేశారు. అలాగే సహీఫయె సయీద్ బిన్ అరూబ (హి.శ. 156), సహీఫయె రబీ బిన్ సబీహ్ (హి.శ. 160). తర్వాత ముఅత్తా ఇమామ్ మాలిక్ బిన్ అనస్ (హి.శ. 179), వీటి తర్వాత సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లిం, అబూ దావూద్ మొదలగు ఎన్నో హదీసు గ్రంథాలు క్రోడీకరించబడ్డాయి. ఇక్కడ మచ్చుకు ప్రారంభకాలంలో సంకలనం చేయబడిన కొన్ని గ్రంథాల పేర్లు మాత్రమే పేర్కొనబడ్డాయి. హదీసు విద్యకు పునాదులుగా భావించబడే ఈ మూలగ్రంథాల్లో ఆ గ్రంథకర్తల నుంచి దైవప్రవక్త (సల్లం) వరకు ఆయా హదీసులను అందజేసిన వారందరి పేర్లూ నమోదు చేయబడి ఉన్నాయి. ఆ ఆధారాల ప్రాతిపదిక మీదే హదీసు యొక్క ప్రామాణికత, అప్రామాణికతల గురించి చర్చించటానికి వీలయింది. తర్వాత ఆ మూల గ్రంథాల నుంచే కొన్ని ఉపశీర్షికలతో ఇతర అనేక గ్రంథాలు సంకలనం చేయబడ్డాయి. వాటి గ్రంథకర్తలు వాటిలో తమ అభిరుచికి, అవసరాలకు అనుగుణంగా హదీసులను పొందు పరిచారు. బులూగుల్ మరామ్, రియాజుస్సాలిహీన్, మిష్కాత్ మొదలగు గ్రంథాలన్నీ ఆ కోవకు చెందినవే. ఈ గ్రంథాల్లో ప్రతి హదీసు చివర్లో, దాని ఆధారాలు, శాస్త్రపరంగా దాని ప్రామాణికతలు కూడా పేర్కొనబడ్డాయి. ఇటువంటి గ్రంథాల మూలంగా తక్కువ సమయంలో అత్యంత ఎక్కువ జ్ఞానం ఆర్జించటానికి వీలయింది. ధర్మ విషయాలు అర్థం చేసుకోవటం సులభమయింది. ఈ గ్రంథాలను సంకలనం చేసినవారు హదీసు విద్యలో ఆరితేరినవారు. వేలాది హదీసుల్లో నుంచి వారు వీటిని సేకరించారు. కనుక ఒక సామాన్య వ్యక్తి తనకు అవసరమైన విషయాలు హదీసు భాండాగారాల్లో వెతుక్కునే బదులు ఈ సంకలన గ్రంథాల ద్వారా గ్రహించటం అత్యంత సులభమై పోయింది. వీటిలో కొన్ని గ్రంథాలకు విపరీతమైన ఖ్యాతి లభించింది. అలాంటిదే ఈ రియాజుస్సాలిహీన్ గ్రంథం. దీని ద్వారా దైవంతో అనుబంధం, పరలోక చింతనా మార్గాలు సుగమం అయ్యాయి. సామాన్యులు, ప్రముఖులు, పండితులు, విద్యార్థు లందరి నుంచి ఈ గ్రంథానికి గొప్ప ఆదరణ లభించింది.

**రియాజుస్సాలిహీన్ :** ఎవరైనా దైవప్రవక్త (సల్లం) గారి విధానానికి అనుగుణంగా జీవితం గడపదలచుకుంటే ఆయనగారి దైనందిన కార్యక్రమాల గురించి తెలుసుకోవటం కోసం "రియాజుస్సాలిహీన్" ఎలాంటి హదీసుల సంకలనమంటే దానిద్వారా మనిషి చాలా వరకు తన అవసరాన్ని తీర్చుకోగలడు. హదీసు విజ్ఞాన జగత్తులో హి.శ. 7వ శతాబ్దా నికి చెందిన ప్రముఖ ధర్మపండితులు, హదీసువేత్త ఇమామ్ అబూ జకరియ్యా

యహ్యా బిన్ షరఫ్ నవవీ (హి.శ. 631 - 676) ఈ గ్రంథాన్ని సంకలనం చేశారు. ఆ కాలంలోని సుప్రసిద్ధ పండితులు, గొప్ప గొప్ప హదీసువేత్తలు సైతం ఆయన జ్ఞానాన్ని, పరిశోధనను, ఆయనగారి ధర్మపరాయణతను వేనోళ్లా పొగిడారు. ఆయన ఖ్యాతి సిరియా నుంచి మొదలై మొత్తం ఇస్లామీయ జగత్తులో వ్యాపించింది. ఆయన గ్రంథాలకు అన్నిచోట్లా గొప్ప ఆదరణ లభించింది. హదీసు జ్ఞానఖనుల్లో పరివ్యాప్తమై ఉన్న వేలాది హదీసుల నుంచి ఆయన ఈ సంకలనాన్ని తయారుచేశారు. ఇందులో మొత్తం 1894 హదీసులు ఉన్నాయి. అవి విశ్వాసాలు, చిత్తశుద్ధి మొదలుకొని దైవప్రవక్త (సల్లం) గారి విధానానికి అనుగుణంగా జీవితం గడపటం వరకు అన్ని విషయాల్లోనూ మనిషికి మార్గదర్శకత్వం వహిస్తాయి. దేవుని హక్కులు, దాసుల హక్కులు, ఆచరణల మహత్యం, చెడుల పట్ల ఏవగింపు, ఆత్మ నిగ్రహం, ధార్మిక - ప్రాపంచిక కర్తవ్యాల మధ్య సమతౌల్యం మొదలగు విషయాలకు సంబంధించిన హదీసులు వివిధ శీర్షికల క్రింద పొందుపరచ బడ్డాయి. ఇమామ్ నవవీగారు తాను రాసిన ఈ గ్రంథంలో ప్రతి అధ్యాయం క్రింద సదరు శీర్షికకు సంబంధించిన దివ్య ఖుర్‌ఆన్ సూక్తులు కొన్ని ప్రస్తావించారు. తర్వాత దానికే సంబంధించిన మరికొన్ని హదీసులు పేర్కొన్నారు. వీటిలో ఎక్కువ హదీసులు సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోనివే. మిగతావి ఇతర హదీసు గ్రంథాల్లోనివి. ఆ హదీసులతో పాటు వాటి ఆధారాలు కూడా ఇవ్వబడ్డాయి. మక్తబా దారుస్సలామ్, రియాద్, సవూదీ అరేబియా వారు హదీసును చదవగానే దాని సారాంశం పూర్తిగా బోధపడాలనీ, ప్రజలకు, విద్యార్థులకు హదీసుల్ని అర్థం చేసుకోవటంలో ఇబ్బందులేమీ కలగకుండా ఉండాలని ఈ పుస్తకం మీద మరింత కృషిచేసి ఇందులో ఆచూకీ గ్రంథాల పేర్లు, ముఖ్యాంశాలు, వివరణలు జోడించారు. ఈ పనిలో సుప్రసిద్ధ ధర్మపండితులు హాఫిజ్ సలాహుద్దీన్ యూసుఫ్ (లాహోర్)గారు ఎంతగానో శ్రమించారు. ఆయనగారు దివ్య ఖుర్‌ఆన్ గ్రంథానికి కూడా "అహ్సనుల్ కలామ్" అన్న పేరుతో వ్యాఖ్యానం రాసి వున్నారు. అది ప్రపంచంలోకెల్లా అతిపెద్ద ఖుర్‌ఆన్ ప్రింటింగ్ ప్రెస్ ద్వారా ప్రచురిత మయ్యింది.

తెలుగులో ఈ గ్రంథాన్ని వెలువరించదలచినప్పుడు వివరణలు, సారాంశాలు ప్రామాణికమైనవిగా, సర్వజనామోద యోగ్యంగా ఉండాలని అందులో ఎలాంటి లుకలుకలు, ప్రమాణబద్ధంకాని విషయాలు ఉండకూడదని ఆ దారుస్సలామ్ ద్వారా ప్రచురిత మైన మూలగ్రంథప్రతినే దృష్టిలో పెట్టుకోవటం జరిగింది.

ఇంత ముఖ్యమైన గ్రంథాన్ని తెలుగులో తర్జుమా చేయించి ప్రచురిస్తున్నందుకు మాకు కేవలం ఆనందమే కాదు రెట్టింపు ఆనందం కలుగుతోంది. ఎందుకంటే మా విద్యాలయం "జామిఅతుల్ ఖుర్‌ఆన్" నుంచే పట్టభద్రుడైన ఒక విద్యార్థి ఈ గ్రంథాన్ని

తెలుగులోకి అనువదించాడు. నిజానికి జామియా నుంచి పట్టభద్రులయ్యే విద్యార్థులు షరీఅత్ జ్ఞానంతోపాటు ఆధునిక విద్య అనగా ధార్మిక విద్యతోపాటు ప్రాపంచిక విద్యల్లోనూ ప్రవేశం కలవారై ఉండాలనీ, ప్రాంతీయ భాషల్లో ధర్మసేవ చేయటానికి అర్హత కలవారై ఉండాలన్న ఉద్దేశ్యంతోనే జామిఅతుల్ ఖుర్ఆన్ విద్యాలయం స్థాపించ బడింది. నేడు ఉర్దూలో ధర్మసేవ చేస్తున్న ఉలమాలకు కొదువ లేదు. కాని షరీఅత్ విద్య మీద పట్టును కలిగి ఉండి దాంతోపాటు ప్రాంతీయ భాషల్లో నైపుణ్యం గల పండితులు మాత్రం చాలా తక్కువ మంది ఉన్నారు. అల్లాహ్ కృషివల్ల ఈ సంస్థ నుంచి ఇంతకు ముందు ఇతర పుస్తకాలు కూడా తెలుగు భాషలో వెలువరించబడి తెలుగు జనావళి మన్ననలు అందుకున్నాయి. ఈ విద్యాలయ సంస్థాపకులు హాఫిజ్ వ ఖారీ ముహమ్మద్ తఖీయుద్దీన్ (అలైహిర్రహ్మ) గారు ఈ విద్యాలయ నిర్మాణం కోసం, దీని అభివృద్ధికోసం శాయశక్తులా కృషి చేశారు. అహర్నిశలూ శ్రమించారు. బహుశా ఇది ఆయన మరియు ఆయన సహాయకుల చిత్తశుద్ధి ఫలితమేనేమో.... అచిర కాలంలోనే ఈ జామియాకు ఎన్ని విజయాలు లభించాయంటే.... అందుకు అల్లాహ్‌కు ఎంత కృతజ్ఞతలు తెలుపుకున్నా తక్కువే. దాని స్థాపకులు ఇప్పుడు మన మధ్య లేరు కాని దీని పుణ్యంలో మనతోపాటు ఆయనకు కూడా భాగస్వామ్యం ఉంటుందని ఆశిద్దాం. ఎందుకంటే దీనికి అంకురార్పణం చేసింది ఆయనే. ఆ అంకురమే నేడు మహావృక్షంలా తయారైంది. దాని ఫలాలతో, చల్లని నీడలతో జనం ప్రయోజనం పొందుతున్నారు.

ఒక భాషలో ఉన్న పుస్తకాన్ని మరొక భాషలోకి అనువదించటం ఎంతో కష్టంతో కూడుకున్న పని. ఈ విషయం విద్యావంతులకు తెలియని విషయం కాదు. ముఖ్యంగా అది ఏదైనా ప్రత్యేక శాస్త్రానికి సంబంధించినదయితే....?! హదీసు విషయం అంతకంటే ఎక్కువ సున్నితమైనది. సాహిత్య పుస్తకాల్లోలాగా కాకుండా ఇందులో ప్రతి పదానికీ ఎంతో ప్రాముఖ్యత ఉంటుంది. ఇది ధర్మానికి, షరీఅత్‌కు సంబంధించిన వ్యవహారం. దీనికోసం చాలా సూక్ష్మదృష్టి, నిజాయితి అవసరం. అప్పుడే అందులోని ఏ విషయం కూడా తన వాస్తవపరిధి నుంచి వైదొలగకుండా ఉంటుంది. దీనికోసం షరీఅత్ విద్య మీద పట్టుని కలిగి ఉండటంతోపాటు భాషా నైపుణ్యం కూడా ఉన్న అనువాదకులు అవసరమవుతారు. ఈ సందర్భంగా మా ప్రియ విద్యార్థి మౌల్వీ రసూల్..... ఎంతైనా అభినందనీయుడు. ఈ అబ్బాయి ఈ మహోన్నత కార్యాన్ని ఎంతో కష్టపడి, నిజాయితితో పూర్తిచేశాడు. ప్రముఖ తెలుగు పండితులు, గౌరవనీయ సోదరులగు అజీజుర్రహ్మాన్ గారి పునఃపరిశీలనతో ఈ అనువాదానికి మరింత బలం చేకూరింది. ఆయన ఇంతకు ముందు ఎన్నో పుస్తకాలు, అనేక గ్రంథాలు తెలుగుభాషలోకి విజయవంతంగా అనువాదం

చేసివున్నారు, ఆయనగారు ఈ గ్రంథ ముసాయిదా ఆద్యంతం చదివారు. అవసరమైన చోట్ల సవరణలు చేశారు, తగిన సలహాలు సూచనలు ఇచ్చారు. జామియా కమిటీ అధ్యక్షులు జనాబ్ సైఫుద్దీన్ గారికి ఈ సందర్భంగా మనం ముఖ్యంగా కృతజ్ఞతలు తెలుపుకోవాలి. ఆయనగారు ప్రత్యేకమైన శ్రద్ధాసక్తులతో ఈ ప్రాజెక్టు పనుల్ని పర్యవేక్షిస్తూ ఉన్నారు. లేకపోతే ఈ పని ఇంత సులభంగా ముగింపుకి చేరుకోగలిగేది కాదు. చివరగా ఈ గ్రంథాన్ని అత్యంత అందంగా, ఆకర్షణీయంగా ప్రచురించటానికి కృషిచేసిన ప్రియ తములు మౌల్వీ రజియుద్దీన్ మస్వూద్‌గారి ప్రయత్నాలు బహుధా ప్రశంసనీయం. ఆయనగారు ఈ గ్రంథం యొక్క ఆంతరంగిక సౌందర్యంతోపాటు బాహ్య సొగసుకు, ప్రామాణికతకు కూడా ప్రాధాన్యత ఇచ్చారు. నిజం చెప్పాలంటే ధార్మిక పుస్తకాల ప్రచురణలో సాధారణంగా ఇలాంటి విషయాలకు చాలా తక్కువ ప్రాధాన్యతనిస్తారు.

విశ్వప్రభువైన అల్లాహ్ మనందరి కృషిని ఆమోదించుగాక! ఈ బృహత్తర కార్యంలో ఏ విధంగానైనా సహాయ సహకారాలనందించిన వారందరికి గొప్ప ప్రతిఫలం ప్రసాదించుగాక! వారికోసం దీనిని సదఖయె జారియా (శాశ్వత పుణ్యకార్యం)గా మలచుగాక! మనందరికి దైవగ్రంథాన్ని, దైవప్రవక్త (సల్లం) సున్నతును అర్థం చేసుకొని ఆచరించే, ఇతరులకు ఆ సందేశాన్ని అందజేసే సౌభాగ్యాన్ని ప్రసాదించుగాక! ఈ సంకలనం ద్వారా వీలైనంత ఎక్కువమందికి ప్రయోజనం పొందే అదృష్టాన్ని కలిగించుగాక!

**వ సల్లల్లాహు వ సల్లమ వ బారక అలా నబియ్యినా ముహమ్మదింవ్వ**
**ఆలిహీ వ అస్‌హాబిహీ అజ్‌మయీన్. సుబ్‌హానకల్లాహుమ్మ వబిహమ్‌దిక**
**అష్‌హదు అల్లా ఇలాహ ఇల్లా అంత అస్తగ్‌ఫిరుక వ అతూబు ఇలైక్.**

**ముహమ్మద్ అబ్దుల్ హాది ఉమరీ మదనీ**
మజ్లిసుల్ ఖజాయిల్ ఇస్లామీ అధ్యక్షులు,
బ్రిటన్

11, రజబ్ హి.శ. 1426
క్రీ.శ. 2005 ఆగస్టు, 17.

# గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) గారి సంక్షిప్త జీవిత విశేషాలు

- హాఫిజ్ సలాహుద్దీన్ యూసుఫ్

## జననం - జీవిత లక్ష్యం

ఇమామ్ నవవీ గారి పూర్తి పేరు అబూ జకరియ్యా ముహియుద్దీన్ యహ్యా బిన్ షరఫ్ నవవీ, బిన్ మరీ బిన్ హసన్ బిన్ హుసైన్ బిన్ ముహమ్మద్ బిన్ జుమ్అ బిన్ హిజామ్ - నవవీ అనగా నవాకు చెందినవాడు అని అర్థం. నవా అనేది డెమాస్కస్‌కు సమీపంలో హూరాన్ నగరంలోని ఒక బస్తీ పేరు. ఆయన ముత్తాత హిజామ్ ఇక్కడికి వచ్చి స్థిరపడ్డారు.

ఇమామ్ నవవీ ఈ నవా బస్తీలోనే హి. శ. 631వ యేట జన్మించారు. ఈయన తండ్రి పుణ్యాత్ముడు, సత్పురుషుడు. తన ప్రియ కుమారునిలో తెలివితేటలను, ప్రతిభా వ్యుత్పత్తులను గమనించిన ఆయన ఇమామ్ నవవీకి ఉత్తమ శిక్షణను అందించారు. షైఖ్ యాసీన్ బిన్ యూసుఫ్ మురాకషి ఇలా అంటున్నారు : నేను ఇమామ్ నవవీని నవా ఊరిలో చూశాను. అప్పుడు ఆయనకు పదేళ్లు ఉండి ఉంటాయి. తోటి పిల్లలు ఆయన్ని తమవెంట ఆడమని ఒత్తిడి చేస్తుంటే ఆయన వారి నుంచి తప్పించుకొని పారిపోతున్నారు. పిల్లల ఒత్తిడి మరీ పెరిగిపోవటంతో ఆయన ఏడ్వటం మొదలుపెట్టారు. ఆ సమయంలో కూడా దివ్య ఖుర్‌ఆన్ సూక్తులు పఠిస్తూ ఉన్నారాయన. ఆయన తెలివి తేటలు చూసి నాకు ఆయన మీద ప్రేమ పుట్టింది. నేను ఆయన గురువుగారి దగ్గరికి వెళ్ళి, "ఈ అబ్బాయి తన కాలంలో ఓ మహా పండితుడు, గొప్ప దైవారాధకుడు, ఐహిక అనాసక్తపరుడు అవుతాడని, ప్రజలకు ఇతని మూలంగా ప్రయోజనం కలుగుతుందని నేను ఆశిస్తున్నాను" అని ఆయనతో చెప్పాను. అందుకాయన "నువ్వు జ్యోతిషుడివా?" అని అడిగారు. "జ్యోతిషుణ్ణి అయితే కాను గాని నా నోటి ద్వారా ఈ పలుకులు అల్లాహ్ చెప్పించాడు" అన్నాను నేను.

ఆ ఉపాధ్యాయుడు ఆ విషయం ఇమామ్ నవవీ నాన్నతో చెప్పాడు. ఆ మాట వినగానే ఆయన నాన్న తన కుమారుణ్ణి ధర్మసేవ కోసం అంకితం చేద్దామని నిశ్చయించుకున్నారు. కొంతకాలంలోనే నవవీగారు ఖుర్‌ఆన్ చూసి చదవటం పూర్తి చేసుకున్నారు. అప్పుడు ఆయనకు యవ్వన దశ కూడా దగ్గరపడింది. ఆనాడు నవా బస్తీలో ధర్మవిద్యలో నైపుణ్యాన్ని బోధించే పాఠశాలలు లేవు. అందుకని ఇమామ్ నవవీ నాన్న ఆయన్ని డెమాస్కస్ తీసుకొని వెళ్ళారు. ఆ కాలంలో డెమాస్కస్ నగరం నిపుణులకు నిలయం.

పండితులకు అయువు పట్టు. ఎక్కడెక్కడినుంచో విద్యార్థులు అక్కడికి చేరుకునేవారు. వివిధ విద్యలు నేర్పించే పాఠశాలలు అక్కడ మూడువందలకు పైచిలుకు ఉండేవి. ఇమామ్ గారు అక్కడ రవాహియా అనే ఓ పాఠశాలలో విద్యాభ్యాసం మొదలుపెట్టారు. ఇది ఉమవీ యూనివర్సిటీ సంబంధిత పాఠశాల. దీనిని స్థాపించినవాడు ఒక వ్యాపారి. అతని పేరు జకియుద్దీన్ అబుల్ ఖాసిమ్ అలియాస్ ఇబ్నె రవాహా. అతని మారుపేరుతోనే ఆ పాఠశాలను 'మద్రసయె రవాహియా' అని పిలిచేవారు. ఆనాటి గొప్ప గొప్ప పండితులు ఆ పాఠశాలలో విద్యను బోధించేవారు. ఇమామ్ నవవీ (రహ్మలై) స్వయంగా ఇలా చెప్పారు : "నేను ఇక్కడ రెండేళ్లు గడిపాను. ఆ కాలంలో నేను ఎన్నడూ విశ్రాంతి కోసం నేలమీద మేను వాల్చలేదు. అలాగే అన్నం కూడా 'బతికితే చాలు' అన్నట్లుగా పుచ్చుకునేవాణ్ణి."

అక్కడ చదివిన పుస్తకాలన్నిటినీ ఆయన ఆ కాలంలోనే పరిశోధించి వాటికి పాద వ్యాఖ్యానాలు రాస్తూపోయారు. ఆయన శ్రమను, యోగ్యతను, విద్యపట్ల గల మక్కువను, అంకితభావాన్ని గమనించిన ఆయన గురువులు సైతం ముక్కున వేలేసుకున్నారు. ఆయన్ని అమితంగా ప్రేమించటం మొదలుపెట్టారు.

## అధ్యాపకులు - గురువులు

డెమాస్కస్‌లో ఉన్నప్పుడు ఇమామ్ నవవీ (రహ్మలై) ఇరవైకి పైచిలుకు పండితుల దగ్గర విద్యాభ్యాసం చేశారు. ఈ గురువులందరూ మహా పండితులు. వివిధ విద్యల్లో ఆరితేరినవారు. ఒకరు ఫికహ్ శాస్త్రంలో నిపుణుడైతే మరొకరు హదీసు శాస్త్ర పారంగతుడు. ఒకరు 'ఉసూల్' విద్యలో ప్రముఖుడైతే ఇంకొకరు అరబీ విద్యల్లో దిట్ట.

## విద్య పట్ల ఆసక్తి, అంకితభావం

ఇమామ్ నవవీ గారికి విద్యపట్ల గల శ్రద్ధాసక్తుల్ని ఆయనకు దానిమీద గల అంకితభావాన్ని చూసి అర్థం చేసుకోవచ్చు. ప్రతిరోజూ ఆయన పన్నెండు పాఠాలు చదివేవారు. పాఠం చదివినప్పుడే దాని వివరణ, పాదవ్యాఖ్యానం రాసేపని కూడా చేసేవారు. రాత్రిపూట చాలా తక్కువగా నిద్రపోయేవారు. నిద్ర ముంచుకువస్తే పుస్తకాల మీదే కాసేపు కునుకు తీసేవారు. తర్వాత మేల్కొని మళ్లీ విద్యా కార్యకలాపాల్లో నిమగ్నులయ్యేవారు. ఇమామ్ జహబీ (రహ్మలై) ఆయన గురించి ఇలా చెబుతున్నారు : రేయింబవళ్లు విద్యాపనుల్లో నిమగ్నమై ఉండే ఆయన గారి ఈ పద్ధతి ప్రజల్లో ఒక సామెతగా చెప్పుకోబడేది. ఆయన తన సమయమంతా విద్యార్జనకోసమే అంకితం చేసుకున్నారు. కాసేపు తరగతిలో కూర్చొని విద్యాభ్యాసం చేస్తారు. కాసేపు దాన్ని కంఠస్థం చేస్తూ ఉంటారు. మరికాసేపు పాఠంలోని కఠిన సందర్భాలను అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తారు.

ఇంకాసేపు ఇతర పుస్తకాలు చదువుతూ, చదివిన విషయాలు రాసుకుంటూ ఉంటారు. ఆఖరికి దారిలో నడిచినప్పుడు కూడా పాఠం గుర్తుచేసుకునేవారు లేదా ఏదయినా పుస్తకం చదువుతూ ఉండేవారు. అల్లాహ్ ఆయనకు జ్ఞాపకశక్తితో పాటు అవగాహనా సామర్థ్యం కూడా మెండుగా ప్రసాదించాడు. ఇది దేవుని మహదనుగ్రహం. అల్లాహ్ ప్రసాదించిన వరాలను సద్వినియోగం చేసుకునేవారి వృద్ధివికాసాల విషయంలో ఎలాంటి సందేహం అక్కర్లేదు. అలాగే ఇమామ్ నవవీ (రహ్మలై) కూడా దేవుడు తనకు అనుగ్రహించిన వరాలను బాగా సద్వినియోగం చేసుకొని గొప్ప ఉన్నతిని సాధించారు.

## నిరాడంబరత - ఉత్తమ నడవడిక

విద్యలో ఎంత ఉన్నతిని సాధించినా ఆయన స్వభావంలో మాత్రం ఎంతో అణకువ కనిపించేది. ఆయన ఎల్లప్పుడూ చాలా నిరాడంబరమైన దుస్తులు ధరించేవారు. ఆహారం కూడా సామాన్య ఆహారం. పూటగడవటానికన్నట్లు కాస్తంత పుచ్చుకునేవారు. రుచికరమైన ఆహారం తినటం, ఆడంబరంతో కూడిన వస్త్రాలు ధరించటం నిషిద్ధం కాదుగాని విద్యార్థుల విద్యా నిమగ్నతకు మాత్రం అవి ఎంతైనా విరుద్ధమే. అందుకే చాలామంది పండితులు, శాస్త్రవేత్తలు తమ జీవితాల్లో వీటికి అంతగా ప్రాముఖ్యతనివ్వరు. వీరి దృష్టిలో అసలు ప్రాముఖ్యత బోధన అధ్యయనాలు, ధర్మ సందేశ ప్రచార కార్యాలకు, పుస్తక పఠనానికి, రచనా వ్యాసంగానికి ఇతర విద్యావిషయిక కార్యాలకు మాత్రమే ఉంటుంది. వీటిలోనే వారికి ఆనందం, తృప్తి లభిస్తాయి. ఏమైనప్పటికీ ఇమామ్ నవవీ (రహ్మలై) దైవభీతి, ధర్మపరాయణత, ఐహిక అనాసక్తతలపరంగానూ చాలా గొప్ప స్థానాన్ని సంపాదించు కున్నారు. ఆయన ఉద్దేశ్యాలు చాలా గొప్పవి. కాని కోరికలు మాత్రం చాలా చిన్నవి. షేఖ్ ముహ్యుద్దీన్ గారు ఇమామ్ గారి గురించి ఇలా చెబుతున్నారు :

"ఆయనలో మూడు గొప్ప స్థానాలుండేవి. వాటిలో ప్రతిఒక్కటీ ఎలాంటి స్థాన మంటే ఎవరిలోనయినా అదొక్కటి ఉంటే అతన్ని సందర్శించుకోవటానికి ప్రజలు ప్రపంచం నలువైపుల నుంచి తండోపతండాలుగా వస్తారు. మొదటి స్థానం : విద్య మరియు దానికి సంబంధించిన బాధ్యతల నిర్వహణ. రెండవ స్థానం : ప్రపంచం పట్ల సంపూర్ణ నిరాసక్తత. మూడవ స్థానం : మంచి చేయమని ఆజ్ఞాపిస్తూ చెడు చేస్తున్నవారిని ఆపటం. ఇమామ్ నవవీలో ఈ మూడు సుగుణాలూ ఉండేవి. ఆయన ఓ మహా పండితుడు, ఓ నిరుపమాన ఐహిక అనాసక్తిపరుడు. అలాగే నిర్భయుడైన ఓ ధర్మసందేశ ప్రచారకుడు కూడా.

## మరణం, విద్యా సేవ

తన 19 యేండ్ల ప్రాయంలో ఇమామ్ డెమాస్కస్‌కు వచ్చారు. అక్కడ ఎందరో అధ్యాపకుల దగ్గర విద్యాభ్యాసం చేశారు. ఆ తర్వాత ఎన్నో విద్యాలయాల్లో బోధనా సేవలందించారు. రచనా వ్యాసంగంలో, గ్రంథసంకలనాల్లో చెప్పుకోదగిన కార్యాలు నిర్వర్తిం చారు. వాటిలో సహీహ్ ముస్లిం వివరణ, తహ్‌జీబుల్ అస్మా వల్లుగాత్, కితాబుల్ అజ్‌కార్, రియాజుస్సాలిహీన్ లాంటి ప్రధాన గ్రంథాలు కూడా ఉన్నాయి. వాటిద్వారా లక్షలాది జనం ప్రయోజనం పొందుతున్నారు. వాటిద్వారా విశ్వప్రభువు ఆమోదించే సన్మార్గం ఏదో తెలుసుకుంటున్నారు. డెమాస్కస్‌లో 28 యేళ్లు గడిపిన తర్వాత ఇమామ్ గారు తన జన్మస్థలానికి చేరుకున్నారు. ఆ సంవత్సరమే హి.శ. 676లో కొంతకాలం అనారోగ్యంపాలై చివరికి కన్నుమూశారు. కాని విజ్ఞానపరమైన తన సేవల ద్వారా మాత్రం ఆయన విజ్ఞాన జగత్తులో చిరస్మరణీయమైన స్థానాన్ని సంపాదించుకున్నారు. అల్లాహ్ ఆయన్ని క్షమించి ఆయనమీద దయజూపుగాక!



# విషయ సూచిక

## 1. సంస్కార ప్రకరణం

## 2. భోజన నియమాలు

## 3. వస్త్రధారణ ప్రకరణం

## నాల్గవ ప్రకరణం



## 5. సలాం ప్రకరణం



## 6. రోగుల పరామర్శ ప్రకరణం

## 7. ప్రయాణ ప్రకరణం

بسم الله الرحمن الرحيم

# مقدمة المؤلف

*అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.*

# గ్రంథకర్త (ఇమామ్ నవవీ - రహ్మ.లై)
# తొలిపలుకులు

الْحَمْدُ لِلّهِ الْوَاحِدِ الْقَهَّارِ ، الْعَزِيزِ الْغَفَّارِ ، مُكَوِّرِ اللَّيْلِ عَلَى النَّهَارِ ، تَذْكِرَةً لِأُولِي الْقُلُوبِ وَالأَبْصَارِ ، وَتَبْصِرَةً لِذَوِي الأَلْبَابِ وَالاعْتِبَارِ ، الَّذِي أَيْقَظَ مِنْ خَلْقِهِ مَنِ اصْطَفَاهُ فَزَهَّدَهُمْ فِي هذِهِ الدَّارِ ، وَشَغَلَهُمْ بِمُرَاقَبَتِهِ وَإِدَامَةِ الأَفْكَارِ ، وَمُلازَمَةِ الاتِّعَاظِ والادِّكَارِ ، وَوَفَّقَهُمْ لِلدَّأْبِ فِي طَاعَتِهِ ، وَالتَّأَهُّبِ لِدَارِ الْقَرَارِ ، وَالْحَذَرِ مِمَّا يُسْخِطُهُ ويوجبُ دَارَ الْبَوَارِ ، وَالْمُحَافَظَةِ عَلَى ذلِكَ مَعَ تَغَايُرِ الأَحْوَالِ وَالأَطْوَار .

పొగడ్తలన్నీ సర్వ శక్తిమంతుడు, ఒక్కడైన అల్లాహ్‌కు మాత్రమే శోభిస్తాయి. ఆయన సర్వాధికుడు, అమితంగా మన్నించేవాడు, రాత్రిని పగటిలోనికి, పగలును రాత్రిలోకి ప్రవేశింపజేసేవాడు (దీనివల్ల వేసవిలో రాత్రులు చిన్నవిగానూ, పగళ్ళు దీర్ఘమైనవి గానూ మరియు శీతాకాలంలో రాత్రులు దీర్ఘమైనవిగానూ, పగళ్లు చిన్నవిగానూ అయిపోతుంటాయి లేదా ఆయన రాత్రిని పగటిపైకి కమ్మివేసేవాడు, అంటే పగటి కాలం పూర్తవగానే రాత్రి వచ్చేస్తుంది. అలాగే, రాత్రి నిష్క్రమించగానే పగలు మొదలవుతుంది) రేయింబవళ్ళ ఈ రాక పోకలు అల్లాహ్ పనితనమే. మనోనేత్రం కలవారికి, విజ్ఞతాదృష్టి కలవారికి ఇందులో హితబోధ వుంది. బుద్ధిజీవులు, ఆలోచనా పరుల కొరకు ఇందులో గుణపాఠం ఉంది. సృష్టిలో తన ధర్మం కోసం ఎన్నుకున్న వారికి ఆయన (ఇహలోక వాస్తవికతను గురించి) కనువిప్పు కలిగించాడు. ఈ ప్రపంచంలో వారికి దైవభీతి,

ధర్మపరాయణతలు అనుగ్రహించాడు. ఇటువంటి వారు నిత్యం ఆయన ధ్యానంలో, ఆయన చింతనలో నిమగ్నులై వుంటారు. విశ్వంలో వ్యాపించివున్న దేవుని నిదర్శనాల నుండి గుణపాఠాన్ని గ్రహిస్తూ, అనునిత్యం తమ ప్రభువును స్మరిస్తూ ఉంటారు. ఆయనే వారికి ఆజ్ఞల్ని పాలించే సద్బుద్ధిని ప్రసాదిస్తాడు. పరలోక శాశ్వత నిలయం కోసం ముందస్తు ఏర్పాట్లు చేసుకునేందుకు, తమ ప్రభువు తమ పట్ల అప్రసన్నుడయ్యే చేష్టల నుంచీ, తమని నరకానికి గొనిపోయే పాపకార్యాల నుండి బయటపడే భాగ్యాన్ని ప్రసాదిస్తాడు. వారిపై ఎలాంటి విపత్కర పరిస్థితులు వచ్చిపడినా, కాలం ఏ మలుపు తిరిగినా, పరిస్థితుల స్వరూపంలో ఎలాంటి మార్పులు పొడసూపినా సరే వారు (దైవానికి విధేయత చూపే, చెడులకు దూరంగా ఉండే) తమ నడవడికపై స్థిరంగా ఉంటారు.

నేను అల్లాహ్‌ను స్తుతిస్తున్నాను. అత్యున్నతమైన, అతి పవిత్రమైన ఆయన కీర్తినీ, సర్వాంగవర్తీయ, సుప్రయోజనకర ఘనతను కొనియాడుతున్నాను. అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడని, ఆయన సద్వర్తనుడనీ, అత్యంత ఉదాత్తుడనీ, క్షమాశీలి అనీ, కనికరించేవాడనీ నేను సాక్ష్యమిస్తున్నాను. ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఆయన దాసుడని, సందేశహరుడని, ఆయనకు ప్రియుడు మరియు సఖుడని, సన్మార్గం వైపుకు దర్శకత్వం వహించేవారని, పటిష్ఠమైన ధర్మం వైపునకు ఆహ్వానించేవారని కూడా

أَحْمَدُهُ أَبْلَغَ حَمْدٍ وَأَزْكَاهُ ، وَأَشْمَلَهُ وَأَنْمَاهُ .

وَأَشْهَدُ أَنْ لَا إِلَهَ إِلَّا اللهُ الْبَرُّ الْكَرِيمُ ، الرَّؤُوفُ الرَّحِيمُ ، وَأَشْهَدُ أَنَّ مُحَمَّداً عَبْدُهُ وَرَسُولُهُ ، وَحَبِيبُهُ وَخَلِيلُهُ ، الْهَادِي إِلَى صِرَاطٍ مُسْتَقِيمٍ ، وَالدَّاعِي إِلَى دِينٍ قَوِيمٍ . صَلَوَاتُ اللهِ وَسَلَامُهُ عَلَيْهِ ، وَعَلَى سَائِرِ النَّبِيِّينَ ، وَآلِ كُلٍّ ، وَسَائِرِ الصَّالِحِينَ .

أَما بعدُ : فقد قال الله تعالى : ﴿ وَمَا خَلَقْتُ الْجِنَّ وَالْإِنسَ إِلَّا لِيَعْبُدُونِ ۝ مَا أُرِيدُ مِنْهُم مِّن رِّزْقٍ وَمَا أُرِيدُ أَن يُطْعِمُونِ ﴾ [ الذاريات : ٥٦ ، ٥٧] وَهذَا تَصْرِيحٌ بِأَنَّهُمْ خُلِقُوا للعِبَادَةِ ، فَحَقَّ عَلَيْهِمُ الاعْتِنَاءُ بِمَا خُلِقُوا لَهُ وَالإِعْرَاضُ عَنْ حُظُوظِ الدُّنْيَا بالزَّهَادَةِ ، فَإِنَّهَا دَارُ نَفَادٍ لا مَحَلُّ إِخْلادٍ ، وَمَرْكَبُ عُبُورٍ لا مَنْزِلُ حُبُورٍ ، ومَشْرَعُ انْفِصَامٍ لا مَوْطِنُ دَوَامٍ . فَلِهذَا كَانَ الأَيقَاظُ مِنْ أَهْلِهَا هُمُ الْعُبَّادَ ، وَأَعْقَلُ النَّاسِ فيهَا هُم الزُّهَّادَ .

قال الله تعالى :

﴿ إِنَّمَا مَثَلُ الْحَيَوٰةِ الدُّنْيَا كَمَاءٍ أَنزَلْنَٰهُ مِنَ السَّمَاءِ فَاخْتَلَطَ بِهِۦ نَبَاتُ الْأَرْضِ مِمَّا يَأْكُلُ النَّاسُ وَالْأَنْعَٰمُ حَتَّىٰٓ إِذَآ أَخَذَتِ الْأَرْضُ زُخْرُفَهَا وَازَّيَّنَتْ وَظَنَّ أَهْلُهَآ أَنَّهُمْ قَٰدِرُونَ عَلَيْهَآ أَتَىٰهَآ أَمْرُنَا لَيْلًا أَوْ نَهَارًا فَجَعَلْنَٰهَا حَصِيدًا كَأَن لَّمْ تَغْنَ بِالْأَمْسِ كَذَٰلِكَ نُفَصِّلُ الْءَايَٰتِ لِقَوْمٍ يَتَفَكَّرُونَ ﴾ [ يونس : ٢٤] والآيات في هذا المعنى كَثِيرةٌ . ولقد أَحْسَنَ القَائِلُ :

إِنَّ للهِ عِبَــــادًا فُطَـنَـا
طَلَّقُوا الدُّنْيَا وَخَافُوا الْفِتَنَا

نَظَرُوا فِيهَا فَلَمَّـا عَلِمُـوا
أَنَّهَـا لَيْسَتْ لِحَيٍّ وَطَنَـا

నేను సాక్ష్యం పలుకుతున్నాను. ఆయనపై మరియు ప్రవక్తలందరిపై, వారి అనుచరులపై, సకల సద్వర్తనులపై దైవ కారుణ్యం మరియు శాంతి వర్షించుగాక!

దైవప్రశస్తి, ప్రవక్త ప్రశంసల అనంతరం : అల్లాహ్ సెలవిచ్చాడు : "నేను జిన్నాతులను, మానవులను కేవలం వారు నన్ను ఆరాధించాలని మాత్రమే పుట్టించాను. నేను వారినుండి ఎలాంటి ఉపాధినీ ఆశించను; వారు నాకు అన్నం పెట్టాలని కోరను; దీనిద్వారా వెల్లడయ్యేదేమంటే మానవులు, జిన్నాతులు దైవదాస్యం కోసం మాత్రమే పుట్టించబడ్డారు. కాబట్టి వారు తప్పనిసరిగా తమ పుట్టుక పరమార్థం వైపు దృష్టి సారించాలి. లౌకిక అనాసక్తత, దైవ భక్తి భావాలను అలవరచుకోవాలి. ప్రాపంచిక భోగలాలసకు దూరంగా ఉండాలి. ఎందుకంటే ఇహలోకం ఏదో ఒకనాడు నశించి పోయేదే. ఇది శాశ్వత నిలయం కాదు. ఇదొక తాత్కాలిక వాహనమేగాని సుఖ సంతోషాల నికేతనం కాదు. ఇది అంత మయ్యే తటాకమే గాని శాశ్వత నివాసం కాదు. కాబట్టి ప్రపంచ వాసుల్లో ఎక్కువగా దాస్యం చేసేవారే అందరికన్నా విజ్ఞులు. ప్రాపంచిక సుఖ భోగాల కోసం పరుగులు తీయకుండా ఉండేవారే అందరిలోకెల్లా బుద్ధిజీవులు. అల్లాహ్ సెలవిస్తున్నాడు : "ఈ ప్రాపంచిక జీవితాన్ని ఇలా పోల్చవచ్చు. మేము ఆకాశం నుండి నీటిని కురిపించగా మనుషులూ పశువులూ అందరూ తినే భూ ఉత్పత్తులు బాగా దట్టంగా తయారయ్యాయి. ఆపై భూమి మంచి స్థితిలో

ఉన్నప్పుడు పొలాలు బాగా పండి శోభిల్లుతూ ఉన్నప్పుడు వాటి యజమానులు "ఇక మేము వీటివల్ల లాభం పొందగలము" అని అనుకుంటున్న సమయంలో, అకస్మాత్తుగా రాత్రి వేళనో, పగటి పూటనో మా ఆజ్ఞ వచ్చేసింది. అప్పుడు మేము అసలు అక్కడ నిన్న ఏమీ లేనట్లు దానిని సర్వనాశనం చేశాము. ఇలా మేము మా సూచనలను స్పష్టంగా వివరిస్తాము." (యూనుస్ - 24). దివ్య ఖుర్ఆన్‌లో ఈ భావాన్నిచ్చే వాక్యాలు అనేకం ఉన్నాయి. ఒకానొక కవి చాలా బాగా చమత్కరించాడు:

"బుద్ధిమంతులైన అల్లాహ్ దాసులు ఇహ లోకానికి విడాకులిచ్చేశారు. ప్రాపంచిక పరీక్షలంటే వారు భయంతో కంపిస్తారు."

"వారు ప్రపంచాన్ని బాగా పరికించారు. ఈ ప్రపంచం బతికున్న ఏ మనిషికీ గమ్యం కాజాలదు అన్న వాస్తవాన్ని గ్రహించిన పిదప .....

వారు ప్రపంచాన్ని (నౌక లేనిదే దాటటానికి వీలులేని) ఓ లోతైన సముద్రంగా ఖరారు చేశారు. దానికోసం తమ సత్కర్మలనే నౌకలుగా చేసుకున్నారు."

పైన నేను పేర్కొన్నట్లు, ఇహలోక వాస్తవికత ఇదే అయినప్పుడు, ఇంతకు ముందు నేను అన్నట్లు మన పరిస్థితి, మనందరి పుట్టుక పరమార్థం ఇదే అయినప్పుడు బాధ్యతగల ప్రతి వ్యక్తీ తప్పనిసరిగా సద్వర్తనుల నడవడికనే ఎంచుకోవాలి. బుద్ధిజీవులు, బుధజనుల బాటలోనే

جَعَلُوهَـا لُجَّةً وَاتَّخَـذُوا
صَالِحَ الأَعْمَالِ فِيهَا سفُنَا

فإذا كان حالُها ما وصفتُهُ ، وحالُنَا ومَا خُلِقْنَا لَهُ مَا قَدَّمْتُهُ ؛ فَحَقٌّ على المُكَلَّفِ أَنْ يَذْهَبَ بِنَفْسِهِ مَذْهَبَ الأخيَارِ ، ويَسْلُكَ مَسْلَكَ أُولِي النُّهَى وَالأبصارِ ، وَيَتَأَهَّبَ لِمَا أَشَرْتُ إِلَيْهِ ، وَيَهْتَمَّ بِمَا نَبَّهْتُ عَلَيْهِ . وَأَصْوَبُ طريقٍ له فِي ذلِكَ ، وَأَرْشَدُ مَا يَسْلُكُهُ مِنَ

الْمَسَالِكِ : التَّأَدُّبُ بِمَا صَحَّ عَنْ نَبِيِّنَا سَيِّدِ الأَوَّلِينَ وَالآخِرِينَ ، وَأَكْرَمِ السَّابِقِينَ وَاللاَّحِقِينَ . صَلَوَاتُ اللهِ وَسَلامُهُ عَلَيْهِ وَعَلَى سَائِرِ النَّبِيِّينَ . وَقَدْ قَالَ اللهُ تَعَالَى : ﴿ وَتَعَاوَنُوا عَلَى الْبِرِّ وَالتَّقْوَىٰ ﴾ [ المائدة : ٢ ] وَقَدْ صَحَّ عَنْ رسول الله ﷺ أَنَّهُ قَالَ : « واللهُ فِي عَوْنِ الْعَبْدِ مَا كَانَ الْعَبْدُ فِي عَوْنِ أَخِيهِ » وَأَنَّهُ قَالَ : « مَنْ دَلَّ عَلَى خَيْرٍ فَلَهُ مِثْلُ أَجْرِ فَاعِلِهِ » وَأَنَّهُ قَالَ : « مَنْ دَعَا إِلَى هُدًى كَانَ لَهُ مِنَ الأَجْرِ مِثْلُ أُجُورِ مَنْ تَبِعَهُ لا يَنْقُصُ ذٰلِكَ مِنْ أُجُورِهِمْ شَيْئاً » وَأَنَّهُ قَالَ لِعَلِيٍّ رَضِيَ اللهُ عَنْهُ : « فَوَاللهِ لأَنْ يَهْدِيَ اللهُ بِكَ رَجُلاً وَاحِداً خَيْرٌ لَكَ مِنْ حُمْرِ النَّعَمِ » .

నడవాలి. నేను సూచించిన దానికోసం సన్నాహాలు చేసుకోవాలి. నేను అప్రమత్తం చేసిన వాటి గురించి ఆలోచిస్తూ ఉండాలి. దీనికోసం అన్నింటికన్నా సవ్యమైనది, గమ్యం వైపుకు అత్యుత్తమ రీతిలో ముందుకు నడిపే రహదారి - మన ప్రవక్త (సఅసం) ద్వారా పటిష్ఠమైన ఆధారాలతో రుజువైన హదీసులను ఎంచుకోవడం. ముందు, వెనకటి తరాల వారందరికీ ఆయన నాయకులు. గతించినవారు, భవిష్యత్తులో రాబోయే వారందరిలోకెల్లా అత్యంత గౌరవనీయులు, ఆదరణీయులు. ఆయనపై, ఇంకా ఇతర ప్రవక్తలందరిపై దేవుని కరుణాకటాక్షాలు కురియుగాక! అల్లాహ్ ఆదేశించాడు : "మంచికి, దైవభక్తికి సంబంధించిన విషయాలలో మీరు పరస్పరం సహకరించుకోండి." (అల్ మాయిద - 2) దైవప్రవక్త సల్లల్లాహు అలైహి వ సల్లం ద్వారా దృఢమైన ఆధారంతో రుజువైన విషయం: ఆయన ఇలా బోధించారు - "ఒక దాసుడు తన సోదరునికి తోడ్పడుతున్నంత కాలం అల్లాహ్ అతనికి తోడ్పడుతూనే ఉంటాడు (245వ హదీసు). ఆయన ఇంకా ఇలా అన్నారు :

ఎవరైతే ఒక మంచిపని వైపుకు జనులను ఆహ్వానించాడో అతనికి ఆ పనిని అవలంబించిన వారందరికీ లభించే పుణ్య ఫలం లభిస్తుంది. అయితే దానివల్ల వారి పుణ్యంలోనూ ఎటువంటి కోత విధించటం జరగదు. (174వ హదీసు, 20వ అధ్యాయం). ఇంకా ఆయన హజ్రత్ అలీ (రజి)ని ఉద్దేశించి ఇలా ఉపదేశించారు :

فَرَأَيْتُ أَنْ أَجْمَعَ مُخْتَصَراً مِنَ الأَحَادِيثِ الصَّحِيحَةِ، مُشْتَمِلاً عَلَى مَا يَكُونُ طَرِيقاً لِصَاحِبِهِ إِلَى الآخِرَةِ ، ومُحَصِّلاً لآدَابِهِ البَاطِنَةِ وَالظَّاهِرَةِ ، جَامِعاً لِلتَّرْغِيبِ والتَّرْهِيبِ وَسَائِرِ أَنْوَاعِ آدَابِ السَّالِكِينَ : مِنْ أَحَادِيثِ الزُّهْدِ ، ورِيَاضَاتِ النُّفُوسِ ، وَتَهْذِيبِ الأَخْلاَقِ ، وطَهَارَاتِ القُلوبِ وَعِلاجِهَا ، وَصِيَانَةِ الجَوَارِحِ وَإِزَالَةِ اعْوِجَاجِهَا ، وَغَيْرِ ذلِكَ مِنْ مَقَاصِدِ العَارِفِينَ .

"అల్లాహ్ సాక్షిగా చెబుతున్నాను. నీ మూలంగా అల్లాహ్ ఏ ఒక్క వ్యక్తికైనా సన్మార్గాన్ని ప్రసాదిస్తే, అది నీ పాలిట ఎరుపు ఒంటెల కన్నా ఎంతో మేలైనది." (175వ హదీసు, 20వ అధ్యాయం)

ఈ హదీసులను దృష్టిలో పెట్టుకొనే నేను క్లుప్తంగా ప్రామాణిక హదీసులను క్రోడీకరించాలనుకున్నాను. అందులో పాఠకునికి పరలోకంలో సామాగ్రిగా ఉపయోగపడే హదీసులు ఉండాలని, తద్వారా అతనికి అంతర్బాహ్య సంస్కారాలు అలవడాలనీ, ఇంకా అవి సదాచరణవైపు ప్రోత్సాహకరంగా, దురాచరణ పట్ల హెచ్చరికగా ఉండాలని ఆశించాను. ఈ హదీసుల ద్వారా ప్రాపంచిక వ్యామోహం తగ్గటంతో పాటు ఆత్మ తృప్తికి సామాగ్రి సమకూరాలన్నది నా ఆశయం. ఈ హదీసులు నడవడికను తీర్చిదిద్దడంతో పాటు అంతరంగాలను కూడా శుద్ధి చేయాలనీ, మానసిక రుగ్మతలకు చికిత్స కావాలనీ కోరుకుంటున్నాను. మానవ అవయవాల సంరక్షణతో పాటు వాటి వక్రతలను కూడా సరిచేయగలగాలనీ, ఇవేగాకుండా దేవుణ్ణి కనుగొన్న వారి ఉద్దేశాలన్నీ కూడా ఈ హదీసుల ద్వారా నెరవేరాలని నేను కాంక్షిస్తున్నాను.

ఇందులో నేను కేవలం ప్రముఖ ప్రామాణికమైన గ్రంథాలకు సంబంధించిన దృఢమైన, స్పష్టమైన హదీసులను మాత్రమే ప్రస్తావించాలని, ప్రియ గ్రంథమైన ఖుర్ఆన్‌లోని గౌరవప్రదమైన వాక్యాలతో అధ్యాయములను ఆరంభించాలని,

وَأَلْتَزِمُ فِيهِ أَنْ لا أَذْكُرَ إِلَّا حَدِيثاً صَحِيحاً مِنَ الْوَاضِحَاتِ ، مُضَافاً إِلَى الْكُتُبِ الصَّحِيحَةِ الْمَشْهُورَاتِ ، وَأُصَدِّرَ الأَبْوَابَ مِنَ الْقُرْآنِ الْعَزِيزِ بِآيَاتٍ كَرِيمَاتٍ ، وَأُوَشِّحَ مَا يَحْتَاجُ إِلَى ضَبْطٍ أَوْ شَرْحِ مَعْنًى خَفِيٍّ بِنَفَائِسَ مِنَ التَّنْبِيهَاتِ . وَإِذَا قُلْتُ فِي آخِرِ حَدِيثٍ : مُتَّفَقٌ عَلَيْهِ ، فَمَعْنَاهُ : رواه البخاري ومسلم .

ఏదైనా పదానికి సరైన ఉచ్చారణ కావాలన్నా లేక దాని నిగూఢ భావాన్ని విపులీకరించవలసి వచ్చినా అక్కడ విలువైన సూచనలతో విషయాన్ని అలంకరించాలని నేను నిర్ణయించుకున్నాను. ఇంకా ఏ హదీసు చివరలోనైనా నేను "ముత్తఫఖున్ అలైహ్" అనంటే ఆ హదీసు బుఖారీ మరియు ముస్లింలు ఉభయులూ ఉల్లేఖించారని అర్థం చేసుకోవాలి.

وَأَرْجُو إِنْ تَمَّ هٰذَا الْكِتَابُ أَنْ يَكُونَ سَائِقاً لِلْمُعْتَنِي بِهِ إِلَى الْخَيْرَاتِ ، حَاجِزاً لَهُ عَنْ أَنْوَاعِ الْقَبَائِحِ وَالْمُهْلِكَاتِ . وَأَنَا سَائِلٌ أَخاً انْتَفَعَ بِشَيْءٍ مِنْهُ أَنْ يَدْعُوَ لِي ، وَلِوَالِدَيَّ ، وَمَشَايِخِي ، وَسَائِرِ أَحْبَابِنَا ، وَالْمُسْلِمِينَ أَجْمَعِينَ ، وَعَلَى اللهِ الْكَرِيمِ اعْتِمَادِي ، وَإِلَيْهِ تَفْوِيضِي وَاسْتِنَادِي ، وَحَسْبِيَ اللهُ وَنِعْمَ الْوَكِيلُ ، وَلا حَوْلَ وَلا قُوَّةَ إِلَّا بِاللهِ الْعَزِيزِ الْحَكِيمِ .

ఈ గ్రంథమే గనక పూర్తయితే - శ్రద్ధగా అధ్యయనం చేసేవారికి అది సత్కార్యాల వైపు నడిపించగలదని, అనేక చెడులు, వినాశకర పాపాల నుంచి రక్షించగలదని ఆశిస్తున్నాను. ఈ గ్రంథం సహాయంతో ఏ కొంతైనా లబ్ధిపొందిన సోదరుణ్ణి - నా కోసం, నా తల్లిదండ్రుల కోసం, నా గురువుల కోసం, మిత్రులు, మరియు ముస్లిములందరి కోసం దుఆ చేయవలసిందిగా అభ్యర్థిస్తున్నాను. మహోన్నతుడైన అల్లాహ్ పైనే నాకు నమ్మకముంది. నా సమస్త కార్యాలు, ఆయనకే అప్పజెబుతున్నాను, ఆయనపైనే నాకు విశ్వాసం. నాకు అల్లాహ్ చాలు. ఆయనే అత్యుత్తమ కార్యసాధకుడు, పాపాల బారి నుండి రక్షించబడాలన్నా, మంచి పనులు చేయాలన్నా ఆయన తోడ్పాటు లేకుండా సాధ్యం కాదు. ఆయన సర్వాధికుడు, వివేకవంతుడూను.

అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను.

**1వ అధ్యాయం**

بسم الله الرحمن الرحيم

# ١ ـ بَابُ الإخلَاصِ وَإحضَارِ النِّيَّةِ فِي جَمِيعِ الأعمَالِ وَالأقوَالِ وَالأحوَالِ البَارِزَةِ وَالخَفِيَّةِ

# సకల అంతర్బాహ్య వాక్కర్మల్లో, సర్వకాల సర్వావస్థల్లో సంకల్పశుద్ధి అవసరం

قَالَ الله تَعَالَى: ﴿وَمَآ أُمِرُوٓاْ إِلَّا لِيَعۡبُدُواْ ٱللَّهَ مُخۡلِصِينَ لَهُ ٱلدِّينَ حُنَفَآءَ وَيُقِيمُواْ ٱلصَّلَوٰةَ وَيُؤۡتُواْ ٱلزَّكَوٰةَۚ وَذَٰلِكَ دِينُ ٱلۡقَيِّمَةِ﴾ [البينة: ٥]، وَقَالَ تَعَالَى: ﴿لَن يَنَالَ ٱللَّهَ لُحُومُهَا وَلَا دِمَآؤُهَا وَلَٰكِن يَنَالُهُ ٱلتَّقۡوَىٰ مِنكُمۡ﴾ [الحج: ٣٧]، وَقَالَ تَعَالَى: ﴿قُلۡ إِن تُخۡفُواْ مَا فِي صُدُورِكُمۡ أَوۡ تُبۡدُوهُ يَعۡلَمۡهُ ٱللَّهُ﴾ [آل عمران: ٢٩].

అల్లాహ్ సెలవిచ్చాడు: "వారు అల్లాహ్‌కు దాస్యం చేయాలని, పూర్తి ఏకాగ్రతతో తమ ధర్మాన్ని ఆయన కొరకే ప్రత్యేకించుకోవాలని, నమాజ్‌ను స్థాపించాలని, జకాత్ ఇస్తూ ఉండాలని మాత్రమే ఆదేశించడం జరిగింది. ఇదే ఎంతో సరియైన ధర్మం." *(అల్ బయ్యినహ్ : 5)*

మరోచోట అల్లాహ్ సెలవిచ్చాడు : "వాటి మాంసమూ అల్లాహ్‌కు చేరదు, వాటి రక్తమూ చేరదు. కాని మీ భయభక్తులు ఆయనకు చేరుతాయి." *(అల్ హజ్జ్ - 37)*

ఇంకొకచోట ఆయన ఇలా ఆదేశించాడు : "ప్రవక్తా! ప్రజలను ఇలా హెచ్చరించు : "మీరు దాచినా లేక బహిర్గతం చేసినా - మీ మనసుల్లో ఉన్నదంతా అల్లాహ్‌కు తెలుసు." *(ఆలి ఇమ్రాన్ - 29)*

١ ـ وَعَنْ أَمِيرِ الْمُؤْمِنِينَ أَبِي حَفْصٍ عُمَرَ بنِ الخَطَّابِ بنِ نُفَيْلِ بنِ عَبْدِ العُزَّى بنِ رِيَاحِ بنِ عَبْدِ اللهِ بنِ قُرْطِ بنِ رَزَاحِ بنِ عَدِيِّ بنِ كَعْبِ بنِ لُؤَيِّ بنِ غَالِبٍ

1. విశ్వాసుల నాయకులు హజ్రత్ అబూ హఫ్స్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ఉపదేశించారు: ఆచరణలు సంకల్పాలపై ఆధారపడి ఉంటాయి. ప్రతి ఒక్కరికీ అతని

القُرَشِيِّ العَدَوِيِّ، رَضِيَ اللهُ عَنْهُ، قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «إِنَّمَا الأَعْمَالُ بِالنِّيَّاتِ، وَإِنَّمَا لِكُلِّ امْرِئٍ مَا نَوَى فَمَنْ كَانَتْ هِجْرَتُهُ إِلَى اللهِ وَرَسُولِهِ فَهِجْرَتُهُ إِلَى اللهِ وَرَسُولِهِ، وَمَنْ كَانَتْ هِجْرَتُهُ لِدُنْيَا يُصِيبُهَا أَوِ امْرَأَةٍ يَنْكِحُهَا فَهِجْرَتُهُ إِلَى مَا هَاجَرَ إِلَيْهِ» مُتَّفَقٌ عَلَى صِحَّتِهِ. رَوَاهُ إِمَامَا المُحَدِّثِيْنَ أَبُو عَبْدِ اللهِ مُحَمَّدُ بْنُ إِسْمَاعِيلَ بْنِ إِبْرَاهِيمَ بْنِ

మనసులోని ఉద్దేశానికి అనుగుణంగా ప్రతిఫలం దొరుకుతుంది. అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త కోసం వలస పోయిన వ్యక్తి ప్రస్థానం - నిజంగానే అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త కోసం చేసిన ప్రస్థానంగా పరిగణించబడు తుంది. ఎవడైతే ప్రాపంచిక ప్రయోజనం పొందాలనే ఉద్దేశంతో లేక ఏ స్త్రీనయినా వివాహమాడాలనే సంకల్పంతో వలస పోతాడో అతడు - తాను కోరుకున్న వాటి కోసం వలసపోయినట్లుగా భావించటం జరుగుతుంది.”

المُغِيرَةِ بْنِ بَرْدِزْبَهْ الجُعْفِيُّ البُخَارِيُّ، وَأَبُو الحُسَيْنِ مُسْلِمُ بْنُ الحَجَّاجِ بْنِ مُسْلِمٍ القُشَيْرِيُّ النَّيْسَابُورِيُّ رَضِيَ اللهُ عَنْهُمَا فِي صَحِيحَيْهِمَا اللَّذَيْنِ هُمَا أَصَحُّ الكُتُبِ المُصَنَّفَةِ.

ఈ హదీసు ప్రామాణికతపై ఏకాభి ప్రాయం ఉంది. హదీసు వేత్తల్లో అగ్రగణ్యులైన ఉభయులూ - అనగా అబూ అబ్దుల్లాహ్ ముహమ్మద్ బిన్ ఇస్మాయీల్ బుఖారీ మరియు అబుల్ హుసైన్ ముస్లిం బిన్ హజ్జాజ్‌లు - హదీసు సంకలన గ్రంథాలన్నిటిలోకెల్లా ప్రామాణికమైన తమ తమ గ్రంథాల్లో ఈ హదీసును పొందుపరచారు.

*(సహీహ్ బుఖారీలోని దైవవాణి ఆరంభ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మరికొన్ని ఉల్లేఖనాలలో ఈ హదీసు నేపథ్యం క్రింది విధంగా వివరించబడింది - ఒక వ్యక్తి ఉమ్మె ఖైస్ అనే స్త్రీకి వివాహ సందేశం పంపాడు. ఆమె ఆ సందేశాన్ని అంగీకరించడానికి అతను మదీనాకు వలస వెళ్ళాలన్న షరతు పెట్టింది. ఆ షరతు మూలంగానే ఆ వ్యక్తి మదీనాకు వలస వెళ్ళాడు. అక్కడ వారిద్దరికీ వివాహం జరిగింది. అప్పటినుంచీ ఆ వ్యక్తి దైవప్రవక్త సహచరుల మధ్య “ఉమ్మె ఖైస్ ప్రస్థానకుడు” గానే పేరుమోశాడు.

ఈ హదీసు ఆధారంగా పండితులు ఆచరణల్లో సంకల్పం ముఖ్యమనీ, సంకల్పానికి

అనుగుణంగానే ప్రతిఫలం లభిస్తుందన్న విషయంపై ఏకీభవిస్తున్నారు. సంకల్పం చేసుకునే చోటు మనస్సు. కనుక మనసులో సంకల్పించుకోవడం అవసరం. అంతేగాని దానిని నోటితో పలకాల్సిన అవసరం లేదు. పైగా అదొక అనాచారం. దీనికి శాస్త్రంలో రుజువు లభించదు. భారత ఉపఖండంలో సాధారణంగా నమాజు చేసేటప్పుడు సంకల్పాన్ని నోటితో పలికే ఆచారాన్ని ఇందుకు ఉదాహరణగా పేర్కొనవచ్చు. ఈ హదీసు ద్వారా బోధపడే మరో విషయం ఏమిటంటే ప్రతి పనిని సంకల్ప శుద్ధితో నెరవేర్చాలి. అంటే ఏ పని చేసినా దేవుని ప్రసన్నతను దృష్టిలో పెట్టుకొని చేయాలి. ఎందుకంటే దురుద్దేశంతో కలుషితమయ్యే ఏ పనీ అల్లాహ్ సమక్షంలో స్వీకృతిని పొందజాలదు.

٢ ـ وَعَنْ أُمِّ الْمُؤْمِنِينَ أُمِّ عَبْدِ اللهِ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «يَغْزُو جَيْشٌ الكَعْبَةَ فَإِذَا كَانُوا بِبَيْدَاءَ مِنَ الأَرْضِ يُخْسَفُ بِأَوَّلِهِمْ وَآخِرِهِمْ». قَالَتْ: قُلْتُ: يارسولَ اللهِ كَيْفَ يُخْسَفُ بِأَوَّلِهِمْ وَآخِرِهِمْ وَفِيهِمْ أَسْوَاقُهُمْ وَمَنْ لَيْسَ مِنْهُم!؟ قَالَ: «يُخْسَفُ بِأَوَّلِهِمْ وَآخِرِهِمْ، ثُمَّ يُبْعَثُونَ عَلَى نِيَّاتِهِم». مُتَّفَقٌ عَلَيهِ. هٰذَا لَفظُ البُخَارِيِّ.

2. విశ్వాసుల మాతృమూర్తి ఉమ్మె అబ్దుల్లాహ్ హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) ఇలా ప్రవచించారు: సైనిక పటాలం ఒకటి కాబాపైకి దండెత్తే ఉద్దేశ్యంతో బయలుదేరుతుంది. ఆ సైనిక పటాలం భూమండలంలోని ఒక ప్రదేశానికి చేరుకోగానే అక్కడి వారంతా భూమిలోనికి కూరుకుపోతారు."

హజ్రత్ ఆయిషా (రజి) అంటున్నారు - ఆ మాట విని నేను "ఓ దైవప్రవక్తా! వారంతా భూమిలో ఎందుకు కూర్చి వేయబడతారు? వారిలో బజారున పోయేవారు, వేరితరులు కూడా ఉంటారు కదా!" అని అడిగాను. (అంటే సైనికాధికారులతో పాటు సామాన్య సిపాయిలు లేదా బజారులో తిరిగే మామూలు మనుషులు కూడా ఉంటారని అర్థం.) దానికి ఆయన "మొదటి నుంచి చివరిదాకా వారందరూ నేలలోకి కూర్చివేయబడతారు. అయితే ఆ తరువాత వారంతా కూడా తమ తమ ఉద్దేశాల ఆధారంగా లేపబడతారు. (అంటే ప్రళయం సంభవించాక వారితో

వారి సంకల్పాలనుబట్టి వ్యవహరించడం జరుగుతుంది.) " అని చెప్పారు. (బుఖారీ - ముస్లిం, వాక్యాలు మాత్రం బుఖారీవి).

*(సహీహ్ బుఖారీలోని వాణిజ్య ప్రకరణం. సహీహ్ ముస్లింలోని ఉపద్రవాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషి ఉద్దేశ్యం, సంకల్పాన్ని బట్టి అతనిపట్ల మంచిగానో లేదా చెడుగానో వ్యవహరించడం జరుగుతుందని పై హదీసు ద్వారా బోధపడుతోంది. అంతేకాదు అన్యాయం, అక్రమాలకు ఒడిగట్టే దుండగుల సహచర్యంలో, వారి సాన్నిహిత్యంలో ఉండటం ఎంత అపాయకరమో కూడా ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. అయితే అసలు ఈ సైనిక పటాలం ఏది? అది ఎప్పుడు దండెత్తబోతుందన్న విషయం కేవలం అల్లాహ్‌కు మాత్రమే తెలుసు. ఈ భవిష్యవాణి అగోచర విషయాలకు సంబంధించినది. ఇది దైవప్రవక్త గారి ఒకానొక మహిమ. ఇటువంటి భవిష్యవాణులు దేవుని వహీ ద్వారా తెలుపబడినవై ఉంటాయి. కనుక వీటి ఉనికిపై, సత్యసంధతపై విశ్వాసం కలిగి ఉండటం అవసరం.

٣ ـ وَعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا قَالَتْ: قَالَ النَّبِيُّ ﷺ: «لا هِجْرَةَ بَعْدَ الفَتْحِ، وَلٰكِنْ جِهَادٌ وَنِيَّةٌ، وَإِذَا اسْتُنْفِرْتُمْ فَانْفِرُوا» مُتَّفَقٌ عَلَيهِ. وَمَعْنَاهُ: لا هِجْرَةَ مِنْ مَكَّةَ لأَنَّهَا صَارَتْ دَارَ إِسْلامٍ.

3. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మక్కా విజయం తరువాత హిజ్రత్ (వలస వెళ్ళవలసిన అవసరం) లేదు. అయితే దైవమార్గంలో పోరాటం మరియు సంకల్పం మాత్రం కొనసాగుతూ ఉంటాయి. దైవమార్గంలో పోరాడటం కోసం మిమ్మల్ని పిలవడం జరిగితే, మీరు (తక్షణమే) బయలుదేరండి. *(బుఖారీ, ముస్లిం)*

దీని భావం ఏమిటంటే, (హిజ్రీ శకం 8వ ఏట) మక్కా నగరం దారుల్ ఇస్లాం (ఇస్లామీయ రాజ్యం) అయిపోయింది. కనుక మక్కా విజయం తరువాత ఇక మక్కా నుండి వలసవెళ్ళాల్సిన అవసరం మిగిలి ఉండలేదు.

*(సహీహ్ బుఖారీలోని పోరాట ప్రకరణం. సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం.)*

## ముఖ్యాంశాలు

ఏదయినా దేశం లేక ప్రాంతం "సంక్షేమ రాజ్యం"గా ఏర్పడిన తరువాత ఇక ప్రజలు అక్కడి నుండి ఇతర ప్రాంతాలకు వలస వెళ్ళవలసిన అవసరం లేదు. అయితే దైవ తిరస్కారుల రాజ్యంలో సత్య ధర్మాన్ని ఆచరించడం, దానిపై నిలకడగా ఉండటం కష్టంగా పరిణమించినపుడు, ఆ ప్రదేశాల నుండి వలస వెళ్ళడం మాత్రం అవసరం. ఒక ఇస్లామీయ రాజ్యం నుండి మరొక ఇస్లామీయ రాజ్యానికి ప్రస్థానం చేయవలసిన అవసరం లేనప్పుడు, ధనరాసులు విరివిగా ఉన్నాయనో లేక నాగరిక సౌకర్యాలు పుష్కలంగా లభ్యమవుతున్నాయనో ఒక ఇస్లామీయ రాజ్యం నుండి దైవ తిరస్కార రాజ్యానికి వలసవెళ్ళి అక్కడ స్థిరపడిపోవడానికి ఇస్లామీయ చట్టం సుతరామూ సమ్మతించదన్న విషయం కూడా ఈ హదీసు ద్వారా బోధపడుతుంది. దురదృష్టవశాత్తూ ఇందులో నేటి ముస్లింలు కూడా చిక్కుకొని వున్నారు. ముఖ్యంగా వారి పెట్టుబడుల తరలింపు, ముస్లిం తత్త్వవేత్తల వలసలు ఆందోళనకరంగా పరిణమించాయి. వీటివల్ల దైవ తిరస్కార రాజ్యాల ఆర్థిక వ్యవస్థలకు ఊతం లభిస్తోంది. వారి లజ్జావిహీన నాగరికత అభివృద్ధి చెందుతోంది. గమనార్హమైన ఇంకొక విషయం ఏమిటంటే ప్రతి ముస్లిం తన మనసులో దైవమార్గంలో పోరాడాలనే పిపాస, కుతూహలం కలిగి ఉండాలి. దైవమార్గంలో పోరాడటానికి ఏ సందర్భంలో పిలుపు వచ్చినా వెంటనే హాజరు పలికేందుకు అనువుగా వీలైన మేరకు దానికోసం సన్నాహాలు చేసుకొని ఉండాలి.

٤ ـ وَعَنْ أَبِي عَبْدِ اللهِ جَابِرِ بْنِ عَبْدِ اللهِ الأَنْصَارِيِّ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: كُنَّا مَعَ النَّبِيِّ ﷺ فِي غَزَاةٍ فَقَالَ: «إِنَّ بِالْمَدِينَةِ لَرِجَالاً مَا سِرْتُمْ مَسِيراً وَلَا قَطَعْتُمْ وَادِياً إِلَّا كَانُوا مَعَكُمْ، حَبَسَهُمُ الْمَرَضُ»، وَفِي رِوَايَةٍ: «إِلَّا شَرَكُوكُمْ فِي الأَجْرِ» رَوَاهُ

4. హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ అన్సారీ (రజి) కథనం : మేము ఒకానొక యుద్ధంలో దైవప్రవక్త (సల్లం) వెంట ఉన్నాము. అప్పుడు ఆయన ఈ విధంగా ప్రవచించారు : "మదీనాలో కొంతమంది (యుద్ధానికి) రాలేకపోయారు. అయితే మీరు ప్రయాణించిన ప్రతిచోటా, మీరు నడిచిన ప్రతి లోయలోనూ వారు మీతోపాటే ఉన్నారు. అనారోగ్యం వారిని ఆపి ఉంచింది."

వేరొక ఉల్లేఖనంలో "పుణ్యంలో మీతో పాటు వారు కూడా భాగస్వాములయ్యార"ని ఉంది. (ముస్లిం)

مُسْلِمٌ. وَرَوَاهُ الْبُخَارِيُّ عَنْ أَنَسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: رَجَعْنَا مِنْ غَزْوَةِ تَبُوكَ مَعَ النَّبِيِّ ﷺ فَقَالَ: «إِنَّ أَقْوَاماً خَلْفَنَا بِالْمَدِينَةِ مَا سَلَكْنَا شِعْباً وَلَا وَادِياً إِلَّا وَهُمْ مَعَنَا، حَبَسَهُمُ الْعُذْرُ».

బుఖారీ ఉల్లేఖనంలో హ్రజత్ అనస్ (రజి) ఇలా ఉటంకిస్తున్నారు : మేము తబూక్ యుద్ధానంతరం దైవప్రవక్త (సల్లం) వెంట తిరిగి వచ్చాము. అప్పుడు ఆయన ఇలా అన్నారు : కొందరు మన వెనక మదీనాలోనే ఆగిపోయి ఉన్నారు. అయితే మనం నడిచిన ప్రతి కనుమ, ప్రతి లోయలోనూ వారు మనతోపాటే ఉన్నారు. తగిన కారణం వల్ల వారు రాలేకపోయారు.''

*(సహీహ్ బుఖారీలోని దైవమార్గంలో పోరాట ప్రకరణం. సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనసులో దైవమార్గంలో యుద్ధం చేయాలనే ఆకాంక్ష, సంకల్పం ఉంటే చాలు, ఏదయినా ధర్మబద్ధమైన అనివార్య కారణంచేత యుద్ధంలో పాల్గొనకపోయినా అల్లాహ్ అటువంటి వ్యక్తికి ఇంటిలోనే దైవమార్గంలో పోరాటం సలిపినంత ప్రతిఫలం, పుణ్యం ప్రసాదిస్తాడని పై హదీసు ద్వారా బోధపడుతోంది.

- وَعَنْ أَبِي يَزِيدَ مَعْنِ بْنِ يَزِيدَ بْنِ الْأَخْنَسِ، رَضِيَ اللهُ عَنْهُم، وَهُوَ وَأَبُوهُ وَجَدُّهُ صَحَابِيُّونَ، قَالَ: كَانَ أَبِي يَزِيدُ

5. హ్రజత్ అబూ యజీద్ మాన్ బిన్ యజీద్ బిన్ అఖ్నస్ (రజి) (ఈయన, ఈయన తండ్రీతాతలు ముగ్గురూ దైవప్రవక్త అనుచరులే) కథనం: మా నాన్న యజీద్ ఒకసారి దానధర్మాల నిమిత్తం కొన్ని దీనార్లు బయటికి తీసి వాటిని మస్జిద్‌లో ఒక వ్యక్తి దగ్గర (అవసరమున్న వానికి ఇవ్వమని) ఉంచి వెళ్ళిపోయారు. అదే సమయంలో నేను అక్కడికి వచ్చాను. (అవసరం నిమిత్తం) నేను ఆ వ్యక్తి నుండి దీనార్లు పుచ్చుకొని ఇంటికి తీసుకువచ్చాను. వాటిని చూసి మా నాన్నగారు "అల్లాహ్ సాక్షి! నేను ఇవి

أَخْرَجَ دَنَانِيرَ يَتَصَدَّقُ بِهَا فَوَضَعَهَا عِنْدَ رَجُلٍ فِي الْمَسْجِدِ فَجِئْتُ فَأَخَذْتُهَا فَأَتَيْتُهُ بِهَا، فَقَالَ: وَاللهِ مَا إِيَّاكَ أَرَدْتُ، فَخَاصَمْتُهُ إِلَى رَسُولِ اللهِ ﷺ فَقَالَ: «لَكَ مَا نَوَيْتَ يَا يَزِيدُ، وَلَكَ مَا أَخَذْتَ يَا مَعْنُ» رَوَاهُ الْبُخَارِيُّ.

నీకివ్వాలనుకోలేదు" అంటూ నాతో వాదనకు దిగారు. నేను ఆయన్ని దైవప్రవక్త (సల్లం) దగ్గరికి తీసుకువెళ్ళి ఆయనకు మా నాన్న వాదన గురించి వివరించాను. దానికి ఆయన: "ఓ యజీద్! నీకు నీ సంకల్పానికి అనుగుణంగా పుణ్యం లభిస్తుంది. ఓ మాన్! అలాగే నువ్వు తీసుకున్న దీనార్లు కూడా నీకొరకు ధర్మ సమ్మతమే అవుతాయి" అని తీర్పు చెప్పారు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణంలో అనుకోకుండా కన్నకొడుకుకే దానం చేసిన వాని అధ్యాయంలో ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

తాము చేసిన దానధర్మాలు అనుకోకుండా అవసరాల్లో వున్న తమ కొడుకుల చేతికే అందివస్తే వాటిని వాపసు తీసుకోవాల్సిన అవసరం లేదని ఈ హదీసు ద్వారా రూఢీ అవుతోంది. ఎందుకంటే తండ్రి మాత్రం అవసరాల్లో వున్న వ్యక్తికి ధర్మం చేయాలని అనుకున్నాడు కాబట్టి అతనికి తన ఉద్దేశానికనుగుణంగా చేసిన దానానికి పుణ్యం లభించి తీరుతుంది. అయితే కొందరు పండితుల అభిప్రాయం ప్రకారం ఇది నఫిల్ సదఖాలకు (స్వచ్ఛంద దానధర్మాలకు) మాత్రమే వర్తిస్తుంది. ఎందుకంటే విధిగా ఇవ్వవలసిన దానాలను (జకాత్ లాంటివి) ఖర్చుల నిమిత్తం తమపై హక్కుగల వారికి ఇవ్వకూడదు. మరో విషయం ఏమిటంటే తమ తరపున దానం చేయమని వేరొకరికి పని అప్పజెప్పడం ధర్మ సమ్మతమే. ఇక ఈ హదీసు ద్వారా బోధపడే మూడో విషయం ఏమిటంటే, ధార్మిక విషయాల్లో పరస్పరం వాదప్రతివాదాలు చేసుకోవడం, చర్చించుకోవడం అసభ్యత ఏమీ కాదు. అలాగే ధర్మ సందేహాన్ని నివృత్తి చేసుకునే ఉద్దేశ్యంతో కన్న తండ్రిని సమీప న్యాయనిర్ణేత లేక ధర్మవేత్త వద్దకు తీసుకుపోవటం కూడా తండ్రిపట్ల అవిధేయత అనిపించుకోదు.

*(ఫత్‌హుల్ బారీలో ఇది ఈ అధ్యాయంలోనే గాక, "భార్య మరియు తన పోషణలో వున్న అనాథలకు జకాత్ ఇచ్చే అధ్యాయం"లోనూ ఉంది.)*

٦ - وَعَنْ أَبِي إِسْحَاقَ سَعْدِ بْنِ أَبِي وَقَّاصٍ مَالِكِ بْنِ أُهَيْبِ بْنِ عَبْدِ مَنَافِ بْنِ

6. ఇహలోకంలోనే స్వర్గ సుఖాల శుభ వార్త పొందిన పదిమందిలో ఒకరైన అబూ ఇస్‌హాఖ్ సాద్ బిన్ అబూ వఖ్ఖాస్

زُهْرَةَ بْنِ كِلَابِ بْنِ مُرَّةَ بْنِ كَعْبِ بْنِ لُؤَيٍّ الْقُرَشِيِّ الزُّهْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ، أَحَدِ الْعَشَرَةِ الْمَشْهُودِ لَهُمْ بِالْجَنَّةِ، رَضِيَ اللهُ عَنْهُم، قَالَ: جَاءَنِي رَسُولُ اللهِ ﷺ يَعُودُنِي عَامَ حَجَّةِ الْوَدَاعِ مِنْ وَجَعٍ اشْتَدَّ بِي فَقُلْتُ: يَا رَسُولَ اللهِ إِنِّي قَدْ بَلَغَ بِي مِنَ الْوَجَعِ مَا تَرَى، وَأَنَا ذُو مَالٍ وَلَا يَرِثُنِي إِلَّا ابْنَةٌ لِي، أَفَأَتَصَدَّقُ بِثُلُثَي مَالِي؟ قَالَ: «لَا»، قُلْتُ: فَالشَّطْرُ يَا رَسُولَ اللهِ؟ فَقَالَ: «لَا»، قُلْتُ: فَالثُّلُثُ يَا رَسُولَ اللهِ؟ قَالَ: «الثُّلُثُ وَالثُّلُثُ كَثِيرٌ - أَوْ كَبِيرٌ - إِنَّكَ أَنْ تَذَرَ وَرَثَتَكَ أَغْنِيَاءَ خَيْرٌ مِنْ أَنْ تَذَرَهُمْ عَالَةً يَتَكَفَّفُونَ النَّاسَ، وَإِنَّكَ لَنْ تُنْفِقَ نَفَقَةً تَبْتَغِي بِهَا وَجْهَ اللهِ إِلَّا أُجِرْتَ عَلَيْهَا حَتَّى مَا تَجْعَلُ فِي فِي امْرَأَتِكَ» قَالَ: فَقُلْتُ: يَا رَسُولَ اللهِ أُخَلَّفُ بَعْدَ أَصْحَابِي؟ قَالَ: «

(రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) తాను అంతిమ హజ్ యాత్ర చేసిన యేట వ్యాధిగ్రస్తుణ్ణయిఉన్న నన్ను పరామర్శించే నిమిత్తం నా వద్దకు వచ్చారు. అప్పుడు నేను విపరీతమైన నొప్పితో బాధపడు తున్నాను. నేను ఆయన్ని "దైవప్రవక్తా! నా నొప్పి ఎంత తీవ్రంగా తయా రయిందో తమరు చూస్తూనే ఉన్నారు. నేనా డబ్బు కలవాణ్ణి. నాకు ఒక్కగానొక్క కూతురు తప్ప ఇతర వారసులెవరూ లేరు. నేను నా ధనంలోని మూడింట రెండొంతులను ఎవరికైనా దానం చేయవచ్చా?" అని అడిగాను. దానికి ఆయన "కూడదు" అన్నారు. తిరిగి నేను "సగం ధనం దానం చేయనా" అని అడి గాను. దానికి కూడా ఆయన "కూడదు" అనే అన్నారు. మళ్ళీ నేను "మూడింట ఒక వంతైనా దానం చేయలేనా దైవ ప్రవక్తా!" అని విన్నవించుకోగా అందుకు ఆయన "మూడింట ఒక వంతు అయితే చేయ గలవు. కాని అది కూడా ఎక్కువే (లేక) పెద్దదే అవుతుంది (అని అన్నారు). ఎందుకంటే నువ్వు నీ వారసులను పరుల ముందు చేయి చాపుతూ తిరిగే దరిద్రులుగా వదలి వెళ్ళడంకన్నా స్థితిమంతులుగా వదలి వెళ్ళడమే ఎంతో శ్రేయస్కరం. (గుర్తుం చుకో!) నువ్వు దైవప్రసన్నత కోసం ఏది ఖర్చుపెట్టినా దానికి నువ్వు ప్రతిఫలం పొందుతావు. ఆఖరికి నువ్వు నీ భార్య నోట్లో వేసే ముద్దకు కూడా ప్రతిఫలం

إِنَّكَ لَنْ تُخَلَّفَ فَتَعْمَلَ عَمَلاً تَبْتَغِي بِهِ وَجْهَ اللهِ إِلَّا ازْدَدْتَ بِهِ دَرَجَةً وَرِفْعَةً، وَلَعَلَّكَ أَنْ تُخَلَّفَ حَتَّى يَنْتَفِعَ بِكَ أَقْوَامٌ وَيُضَرَّ بِكَ آخَرُونَ. اللَّهُمَّ أَمْضِ لأَصْحَابِي هِجْرَتَهُمْ، وَلَا تَرُدَّهُمْ عَلَى أَعْقَابِهِمْ، لٰكِنِ الْبَائِسُ سَعْدُ بْنُ خَوْلَةَ» يَرْثِي لَهُ رَسُولُ اللهِ ﷺ أَنْ مَاتَ بِمَكَّةَ. مُتَّفَقٌ عَلَيْهِ.

పొందుతావు" అని ఉపదేశించారు. అప్పుడు నేను "ఓ దైవప్రవక్తా! నేను నా సహచరుల వెనుక ఉండిపోతానా? (అంటే నా సహచరులు ముందుగానే చనిపోయి నేను ఈ లోకంలో ఒక్కడినే ఉండిపోతానా?)" అని సందేహపడగా దానికి ఆయన (అయితేనేమి? మంచి దేగా) ఎందుకంటే నీ సహచరుల అనంతరం నువ్వు బ్రతికివుంటే దైవప్రసన్నత కోసం నువ్వు చేసుకునే ప్రతి ఆచరణతో నీ స్థాయి, అంతస్థులు పెరుగుతాయి. బహుశా నీకు ఇంకా జీవితం గడిపే అవకాశం లభిస్తుందేమో! అప్పుడు కొంత మంది (విశ్వాసులకు) నీవల్ల మేలు కలగవచ్చు, ఇంకొంతమంది (దైవ తిరస్కారులకు) నీ వల్ల కీడు కలగవచ్చు. ఓ అల్లాహ్! నా సహచరుల హిజ్రత్‌ని (ప్రస్థానాన్ని) పరిపూర్ణం గావించు. వారిని పరాజయం పాలుచేయకు" అని వేడుకున్నారు. కాని "సాద్ బిన్ ఖౌలా" దయార్హులు. ఎందుకంటే ఆయన మక్కాలో ఉండగానే కన్నుమూశారు. అందుకని ఆయన కనికరించబడాలని దైవప్రవక్త (సల్లం) దుఆ చేసేవారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని అంత్యక్రియల ప్రకరణం. సహీహ్ ముస్లింలోని వీలునామాల ప్రకరణం).*

## వివరణ

ప్రవక్త ప్రియ సహచరులు తమకెంతో ఇష్టమయిన మక్కా నగరాన్ని కేవలం అల్లాహ్

ప్రసన్నత కోసం వదలి మదీనాకు వలసవెళ్ళారు. అంతేకాదు, తాము దైవం కోసం వదలిపెట్టిన నగరంలో తిరిగి స్థిరపడటాన్ని కూడా వారు సుతరామూ ఇష్టపడేవారు కాదు. అందుకే హజ్రత్ సాద్ (రజి) తనకు మక్కాలోనే ఎక్కడ మృత్యువు సంభవిస్తుందోనని భయపడేవారు. అందుకే దైవప్రవక్త (సల్లం) ఆయన హిజ్రత్ పూర్తి కావాలని ప్రార్థన చేశారు. హజ్రత్ సాద్ (రజి) గారి దైన్యస్థితికి ఆయన చాలా దుఃఖించారు. ఎందుకంటే సాద్ (రజి) మక్కాలో ఉండగానే మరణించారు. ఆ విధంగా ఆయన దైవమార్గంలో ప్రస్థానానికి (హిజ్రత్‌కు) లభించవలసిన పూర్తి ప్రతిఫలాన్ని పొందలేకపోయారు.

## ముఖ్యాంశాలు

1. మరణం ఆసన్నమయిన తరువాత మనిషి తన ధనంలో మూడింట ఒక వంతుకంటే ఎక్కువ ధనాన్ని దానం చేయడంగాని లేక వీలు రాయించడం గాని చేయలేడన్న దానికి ఈ హదీసు నిదర్శనం.
2. మనిషి సంకల్పం సవ్యంగా వుంటే అతను, తాను భార్యా పిల్లలపై చేసే ఖర్చుకు కూడా పుణ్యఫలం పొందుతాడు.
3. చికిత్స చేయించుకోవటం కోసం లేక పుణ్యాత్ముల చేత ప్రార్థన చేయించుకునే మంచి ఉద్దేశ్యంతో మనిషి తన అనారోగ్యాన్ని, బాధను ఇతరుల ముందు వెల్లడించటంలో తప్పులేదు. ఇది అల్లాహ్ మీద ఫిర్యాదు చేసినట్లు కాదు.
4. దైవమార్గంలో ఖర్చుచేసేటప్పుడు, దానధర్మాలు చేసేటప్పుడు తమ సన్నిహిత బంధువులకు ఎక్కువ ప్రాధాన్యతనివ్వాలి.

٧ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ عَبْدِ الرَّحْمٰنِ بْنِ صَخْرٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِنَّ اللهَ لَا يَنْظُرُ إِلَى أَجْسَامِكُمْ، وَلَا إِلَى صُوَرِكُمْ، وَلَكِنْ يَنْظُرُ إِلَى قُلُوبِكُمْ وَأَعْمَالِكُم» رَوَاهُ مُسْلِم.

7. హజ్రత్ అబూ హురైరా అబ్దుర్రహ్మాన్ బిన్ సఖర్ (రజి) ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు: అల్లాహ్ మీ శరీరాలను, మీ ముఖాలను చూడడు. ఆయన మీ అంతరంగాలను, ఆచరణలను మాత్రమే చూస్తాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం.)*

## ముఖ్యాంశాలు

పై హదీసు ద్వారా కూడా చిత్తశుద్ధి, సవ్యమైన సంకల్పాల ప్రాముఖ్యత వెల్లడవుతోంది. కనుక ప్రతి సదాచరణలోనూ వీటిని దృష్టిలో పెట్టుకోవటం చాలా అవసరం.

ఆచరణల్ని పాడుచేసే విషయాల నుండి అంతరంగాన్ని కాపాడుకోవాలి. ఉదాహరణకు ప్రదర్శనాబుద్ధి, పరులకు చూపించి సత్కర్మలు చేయాలనే కోరిక, ప్రాపంచిక వ్యామోహం - ఇత్యాది నీచమైన స్వార్థపూరిత భావాల నుంచి మనసును రక్షించుకోవాలి. హృదయాల స్థితి అల్లాహ్‌కు మాత్రమే తెలుసు. కనుక ఆచరణల నిజ స్వరూపం ఏమిటో ప్రళయదినానే తెలిసి వస్తుంది. అప్పుడు దేవుని దర్బారులో వాటికి మంచి లేదా చెడు ప్రతిఫలం లభిస్తుంది. ప్రపంచంలో మాత్రం వ్యవహారం మనిషి బాహ్య ఆచరణల ఆధారంగానే జరుగుతుంది. అతని అంతరంగ స్థితిని అల్లాహ్‌కు వదలిపెట్టడం జరుగుతుంది.

## గమనిక

"రియాజుస్సాలిహీన్" కు చెందిన కొన్ని ప్రతుల్లో ఈ హదీసులోని 'వ ఆమాలికుమ్' (మీ కర్మలను) అనే పదాన్ని మినహాయించి నకలు చేయడం జరిగింది. ఇది సరికాదు. సహీహ్ ముస్లింలో "ఖులూబికుమ్" (అంతరంగాలు) అనే పదంతోపాటు "వ ఆమాలికుమ్" (మీ కర్మలు) అని కూడా ఉంది. ఆ అదనపు పదాన్ని ప్రస్తావించడం అవశ్యం. ఎందుకంటే అది లేకపోతే ప్రజలు ఈ హదీసును అర్థం చేసుకోవడంలో పొరబడవచ్చు. ఎవరికయినా గడ్డం పెంచడం తప్పనిసరి అనీ, దైవ తిరస్కారుల విధానాలను అనుకరించడం తగదని ఉపదేశిస్తే లేక పరదా పద్ధతి ప్రాముఖ్యత గురించి చెబితే, ఇతర ధార్మిక నియమాలను గురించి బోధిస్తే వారు వాటిని లక్ష్యపెట్టటం లేదు. "అసలు మనసులో భయం, భక్తి ఉంటే చాలండీ" అంటున్నారు. (అంటే నియమాలను పాటించాల్సిన అవసరం లేదని వారి భావం) పైపెచ్చు "అల్లాహ్ మీ అంతరంగాలను మాత్రమే చూస్తాడు" అన్న ఈ హదీసు వాక్యాన్ని నిదర్శనంగా చూపించి వాదిస్తున్నారు. నిజానికి దానితోపాటు "మరియు మీ కర్మల్ని చూస్తాడు" అన్న వాక్యం కూడా ఉంది. దీంతో ఆచరణ ప్రయోజనం, పైగా దైవప్రవక్త విధానానికి అనుగుణమైన ఆచరణ ప్రాముఖ్యత వెల్లడౌతుంది. వాస్తవానికి ఏక కాలంలో అంతరంగంతో పాటు బాహ్యాచరణల సంస్కరణ తప్పనిసరిగా జరగాలి. ఎందుకంటే రెండూ పరస్పరం విడదీయ రానివి. మనసు సవ్యంగా ఉంటే ఆచరణ కూడా సవ్యంగా ఉంటుంది. అలాగే ఆచరణ సవ్యంగా ఉంటే అంతరంగమూ బాగుంటుంది. ఆచరణల సంస్కరణ లేకుండా అంతరంగాలను చక్కదిద్దడం, అంతరంగాల దిద్దుబాటు లేనిదే ఆచరణల్ని సంస్కరించడం సంభవం కాదు. ఈ విషయాన్నే వేరొక హదీసులో ఈ విధంగా వివరించడం జరిగింది: "మానవ శరీరంలో ఒక మాంసపు ముద్ద ఉంది. అది గనక సవ్యంగా ఉంటే మొత్తం శరీరం సవ్యంగా ఉంటుంది. ఒకవేళ అదే చెడిపోతే శరీరమంతా చెడిపోతుంది. ఆ మాంసపు ముద్దే హృదయం." (588 వ హదీసు చూడండి). వేరితర హదీసుల ద్వారా కూడా ఆచరణల ప్రాముఖ్యత తెలియవస్తోంది. దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు - "ప్రతి ఒక్కరికీ ఆచరణలకు అనుగుణంగానే

అంతస్థులు ప్రాప్తిస్తాయి." మరోవిధంగా చెప్పాలంటే ఆచరణల ఆధారంగానే స్వర్గవాసుల శ్రేణుల్లో హెచ్చుతగ్గులుంటాయి. వేరొకచోట అల్లాహ్ ఇలా అంటున్నాడు - "మీరు మీ కర్మల ఆధారంగా స్వర్గంలోకి ప్రవేశించండి." మరి కర్మకు ఇంతటి ప్రాముఖ్యముండగా అల్లాహ్ శరీరాలు, ముఖాల మాదిరిగానే 'కర్మల్ని' కూడా పట్టించుకోడు అని అనటం ఎంతవరకు సమంజసం? వాస్తవానికి ఈమాన్ (విశ్వాసం) తరువాత స్వర్గ ప్రవేశానికి అర్హత కల్పించేది ఈ ఆచరణయే కదా!? *('రియాజుస్సాలిహీన్' పై అల్ బానీ గారి సూచనల సంగ్రహణం)*

٨ - وَعَنْ أَبِي مُوسَى عَبْدِ اللهِ بْنِ قَيْسٍ الأَشْعَرِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سُئِلَ رَسُولُ اللهِ ﷺ عَنِ الرَّجُلِ يُقَاتِلُ شَجَاعَةً، وَيُقَاتِلُ حَمِيَّةً، وَيُقَاتِلُ رِيَاءً، أَيُّ ذَلِكَ فِي سَبِيلِ اللهِ؟ فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ قَاتَلَ لِتَكُونَ كَلِمَةُ اللهِ هِيَ الْعُلْيَا فَهُوَ فِي سَبِيلِ اللهِ» مُتَّفَقٌ عَلَيْهِ.

8. హజ్రత్ అబూ మూసా అబ్దుల్లాహ్ బిన్ ఖైస్ అష్అరీ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) ను "ఒకడు తన శూర త్వాన్ని ప్రకటించుకోవడానికి, మరొకడు తన వంశ ప్రతిష్ఠను చాటుకోవడానికి, ఇంకొకడు పరుల మెప్పు పొందడానికి పోరాడుతున్నారు. అయితే ఈ ముగ్గురిలో ఎవరు దైవ మార్గంలో పోరాడుతున్నట్లు?" అని ప్రశ్నించడం జరిగింది. అందుకాయన "దైవవాక్కు (దైవధర్మం) ఉన్నతి కోసం పోరాడిన వాడు అల్లాహ్ మార్గంలో పోరాడినట్లు పరిగణించడం జరుగుతుంది" అని సమాధానమిచ్చారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని విద్యా ప్రకరణం. సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దేవుని సన్నిధిలో ఆచరణల్ని సత్సంకల్పాల ఆధారంగా పరికించడం జరుగుతుంది. కనుక ఆయన సన్నిధిలో దైవధర్మ ఔన్నత్యంకోసం పోరాడినవాడే వాస్తవానికి యోధుడనిపించు కోవటానికి అర్హుడు. అయితే ఇది అంతరంగంతో ముడిపడిన విషయం. మనుషులు దీనిని పసికట్టలేరు. కనుక ధర్మయుద్ధ రంగంలో హతుడైన ప్రతి ముస్లింనూ షహీద్ (అమర గతుడు)గానే వ్యవహరించడం జరుగుతుంది. గుండెల్లోని గుట్టును ఎరిగినవాడు అల్లాహ్‌యే గనక అతని సంకల్ప వ్యవహారం ఆయనకే వదలివేయడం జరిగింది.

٩ ـ وَعَنْ أَبِي بَكْرَةَ نُفَيْعِ بْنِ الحَارِثِ الثَّقَفِيِّ رَضِيَ الله عَنْهُ أَنَّ النَّبِيَّ ﷺ قَالَ: «إِذَا التَقَى المُسْلِمَانِ بِسَيْفَيْهِمَا فَالقَاتِلُ وَالمَقْتُولُ فِي النَّارِ»، قُلْتُ: يَا رَسُولَ الله، هٰذَا القَاتِلُ فَمَا بَالُ المَقْتُولِ؟ قَالَ: «إِنَّهُ كَانَ حَرِيصاً عَلَى قَتْلِ صَاحِبِهِ» مُتَّفَقٌ عَلَيْهِ.

9. హజ్రత్ అబూబక్రహ్ నుఫైబిన్ హారిస్ సఖఫీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) : "ఇద్దరు ముస్లింలు తమ తమ ఖడ్గాలతో పరస్పరం దాడికి దిగితే, హంతకుడు, హతుడు - ఇద్దరూ నరకానికి వెళతారు" అని చెప్పారు. నేను "దైవప్రవక్తా! హంతకుని మాట సరేగాని హతుడేం పాపం చేశాడని నరకానికి వెళతాడు?" అని సందేహపడ్డాను. అందుకాయన "అతనూ తన ప్రత్యర్థిని చంపాలన్న కసితోనే ఉన్నాడు కదా!" అని బదులిచ్చారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఉపద్రవాల ప్రకరణం. సహీహ్ ముస్లింలోని ఉపద్రవాల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

మనిషి ఏదైనా దుష్కర్మ చేయాలని దృఢంగా నిశ్చయించుకొని దానికి కావలసిన వస్తుసామగ్రినంతటినీ సమకూర్చుకుంటే చాలు, ఏదయినా కారణంచేత అతడు ఆ నిర్ణయంలో సఫలీకృతుడు కాకపోయినప్పటికీ దైవశిక్షకు గురవుతాడని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. అంటే తలంపు వేరు. దుష్ప్రేరణ వేరు. ఇవి రెండూ ఒకటి కావని భావం. చెడు తలంపులు మన్నించదగినవేగాని చెడు ప్రేరణలు మాత్రం క్షమార్హం కావు. అయితే ఈ హదీసులో ప్రస్తావించబడిన హెచ్చరిక కేవలం ఐహిక అహంభావం, మూఢత్వంతో కొట్లాడుకునే ముస్లింలకు మాత్రమే వర్తిస్తుంది. ధార్మిక విషయాలకు ఇది వర్తించదు. ఎందుకంటే ధార్మిక విషయమై కొట్లాడుకున్నప్పుడు వారిలోని ప్రతి ఒక్కరికీ తాను సత్యంపై ఉన్నానన్న దృఢ నమ్మకముండవచ్చు. అలాంటి పరిస్థితిలో వారు దేవుని దృష్టిలో క్షమార్హులవుతారు.

١٠ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ الله عَنْهُ قَالَ: قَالَ رَسُولُ الله ﷺ: «صَلَاةُ الرَّجُلِ

10. దైవప్రవక్త (సల్లం) ప్రవచించారని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలిపారు: మనిషి సామూహికంగా చేసే నమాజు అతను తన ఇంట్లో లేక బజారులో చేసే నమాజుకన్నా ఇరవై రెట్లకు పైగా

فِي جَمَاعَةٍ تَزِيدُ عَلَى صَلَاتِهِ فِي سُوقِهِ وَبَيْتِهِ بِضْعاً وَعِشْرِينَ دَرَجَةً، وَذٰلِكَ أَنَّ أَحَدَهُمْ إِذَا تَوَضَّأَ فَأَحْسَنَ الوُضُوءَ، ثُمَّ أَتَى المَسْجِدَ لا يُرِيدُ إِلا الصَّلاةَ، لا يَنْهَزُهُ إِلا الصَّلاةُ، لَمْ يَخْطُ خُطْوَةً إِلا رُفِعَ لَهُ بِهَا دَرَجَةٌ، وَحُطَّ عَنْهُ بِهَا خَطِيئَةٌ حَتَّى يَدْخُلَ المَسْجِدَ، فَإِذَا دَخَلَ المَسْجِدَ كَانَ فِي الصَّلاةِ مَا كَانَتِ الصَّلاةُ هِيَ تَحْبِسُهُ، وَالمَلائِكَةُ يُصَلُّونَ عَلَى أَحَدِكُمْ مَا دَامَ فِي مَجْلِسِهِ الذي صَلَّى فِيهِ يَقُولُونَ: «اللَّهُمَّ ارْحَمْهُ، اللَّهُمَّ اغْفِرْ لَهُ، اللَّهُمَّ تُبْ عَلَيْهِ، مَا لَمْ يُؤْذِ فِيهِ، مَا لَم يُحْدِثْ فِيهِ» مُتَّفَقٌ عَلَيْهِ، وَهٰذَا لَفْظُ مُسْلِمٍ. وَقَوْلُهُ ﷺ: «يَنْهَزُهُ» هُوَ بِفَتْحِ اليَاءِ وَالهَاءِ وَبِالزَّايِ: أَيْ يُخْرِجُهُ وَيُنْهِضُهُ.

ఘనమైనది. ఎందుకంటే ఒక వ్యక్తి చక్కగా వుజూ చేసుకుంటాడు, తరువాత నమాజు కోసం మస్జిద్‌కు వస్తాడు. నమాజు మాత్రమే అతణ్ణి మస్జిద్‌కు తీసుకువస్తే - అలాంటి వ్యక్తి మస్జిద్ చేరుకునేంత వరకూ అతను వేసే ఒక్కో అడుగుకు బదులుగా అతని ఒక్కో అంతస్థు పెరుగుతూ ఉంటుంది. అతని వల్ల జరిగిన ఒక్కో పాపం తొలగించ బడుతూ ఉంటుంది. ఆ తరువాత మస్జిద్‌లో ప్రవేశించిన పిదప నమాజు అతన్ని ఆపివుంచినంతసేపూ అతను నమాజు చేస్తున్నట్లుగానే పరిగణించ బడతాడు. మీలో ఎవడైనా నమాజు చేసిన స్థానంలో కూర్చొని ఉన్నంత వరకూ దైవదూతలు అతనిపై అల్లాహ్ కారుణ్యం కురవాలని వేడుకుంటూనే ఉంటారు. ఆ వ్యక్తి పరులకు హాని కలిగించనంతవరకు, అతని వుజూ భంగం కానంతవరకు దైవదూతలు "ఓ అల్లాహ్! ఈ వ్యక్తిని కరుణించు. ఓ అల్లాహ్! ఇతన్ని మన్నించు. ఓ అల్లాహ్! ఇతన్ని కనిపెట్టుకుని ఉండు" అని విన్నవించుకుంటూ ఉంటారు (బుఖారీ - ముస్లిం). హదీసు వాక్యాలు మాత్రం ముస్లింలోనివి. హదీసులో వచ్చిన పదం "యన్‌హజుహూ" అంటే అతన్ని బయటికి తీసుకు వస్తుంది లేక అతన్ని లేపుతుందని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని నమాజు ప్రకరణం. సహీహ్ ముస్లింలోని నమాజు ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

అంగళ్ళలో, ఇండ్లల్లో ఒంటరిగా నమాజు చేసుకోవచ్చు గాని దానికంటే సామూహికంగా చేసే నమాజు - ఇతర ఉల్లేఖనాల్లో ప్రస్తావించబడినట్లు - ఇరవై ఐదు నుంచి ఇరవై ఏడు రెట్లు శుభప్రదమైనది, శ్రేష్ఠమైనదనీ ఈ హదీసు ద్వారా విదితమవుతోంది. నమాజ్ ఇతర సత్కార్యాల కన్నా ఎంతో గొప్పదనీ, దైవదూతలు నమాజు చేసే వ్యక్తికి శుభశ్రేయాలు ప్రాప్తించాలని వేడుకుంటారని కూడా ఈ హదీసు ద్వారా తెలుస్తోంది.

١١ ـ وَعَنْ أَبِي العَبَّاسِ عَبدِ الله بْنِ عَبَّاس بْنِ عَبْدِ المُطَّلِبِ رَضِيَ الله عَنْهُمَا، عَنْ رَسُولِ الله ﷺ، فِيمَا يَرْوِي عَنْ رَبِّهِ، تَبَارَكَ وَتَعَالَى قَالَ: «إِنَّ الله كَتَبَ الحَسَنَاتِ وَالسَّيِّئَاتِ ثُمَّ بَيَّنَ ذٰلِكَ: فَمَنْ هَمَّ بِحَسَنَةٍ فَلَمْ يَعْمَلْهَا كَتَبَهَا اللهُ تَبَارَكَ وَتَعَالَى عِنْدَهُ حَسَنَةً كَامِلَةً، وَإِنْ هَمَّ بِهَا فَعَمِلَهَا كَتَبَهَا اللهُ عَشْرَ حَسَنَاتٍ إِلَى سَبْعِمِائَةِ ضِعْفٍ إِلَى أَضْعَافٍ كَثِيرَةٍ، وَإِنْ هَمَّ بِسَيِّئَةٍ فَلَمْ يَعْمَلْهَا كَتَبَهَا اللهُ عِنْدَهُ حَسَنَةً كَامِلَةً، وَإِنْ هَمَّ بِهَا فَعَمِلَهَا كَتَبَهَا اللهُ سَيِّئَةً وَاحِدَةً» مُتَّفَقٌ عَلَيْهِ

11. దైవప్రవక్త (సల్లం) తన ప్రభువు ద్వారా ఉల్లేఖించిన విషయాన్ని హజ్రత్ అబుల్ అబ్బాస్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్ (రజి) ఈ విధంగా ఉటంకించారు : అల్లాహ్ సత్కార్యాలను, దుష్కార్యాలను రాసి, పిదప వాటిని గురించి వివరించాడు; ఎవడైనా ఏదైనా మంచి పని చేయాలని సంకల్పించుకొని, (ఏదయినా కారణంచేత) దానిని అమలుపరచలేక పోయినప్పటికీ అల్లాహ్ తన వద్ద అతను ఒక సత్కార్యం పూర్తి చేసినట్లు రాసుకుంటాడు. మరి ఆ వ్యక్తి ఆ మంచి పని చేయాలని ఉద్దేశించుకొన్న పిదప దాన్ని నెరవేరిస్తే దానికి అల్లాహ్ పది నుండి ఏడు వందల రెట్లు - ఇంకా దానికంటే ఎన్నో రెట్లు అధికంగానే సత్కర్మలు చేసినట్లు అతని ఖాతాలో రాస్తాడు. (దీనికి భిన్నంగా) ఎవడైనా ఒక చెడుపని చేయాలనుకుని ఏదయినా కారణంచేత చేయకుండా ఉంటే అప్పటికీ అల్లాహ్ తన వద్ద, ఆ వ్యక్తి పూర్తిగా ఒక మంచి పని చేసినట్లు రాసుకుంటాడు. అయితే అతను ఆ చెడ్డపని చేయాలని సంకల్పించుకున్న పిదప దాన్ని చేసేస్తే మాత్రం

ఒక్క చెడ్డపని చేశాడని పొందుపరుస్తాడు. (బుఖారీ - ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని కారుణ్య ప్రకరణం. సహీహ్ ముస్లింలోని విశ్వాసాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) అల్లాహ్ ద్వారా ఉల్లేఖించిన పలుకులు "హదీసె ఖుద్సీ" అనబడతాయి. ఈ హదీసులో అల్లాహ్ ఇహపరాలలో తన దాసులపై కురిపించే అనంత అనుగ్రహాలు, విస్తృతమైన ఆయన ఉదాత్త గుణాలు వివరించబడ్డాయి.

12. దైవప్రవక్త (సల్లం) ప్రవచించగా తాను విన్నానని హజ్రత్ అబూ అబ్దుర్రహ్మాన్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) తెలియజేశారు: "మీ పూర్వీకుల్లోని ముగ్గురు వ్యక్తులు కలిసి ప్రయాణానికి బయలుదేరారు. దారిలో రాత్రయింది. ఆ ముగ్గురూ ఒక గుహలో శరణుతీసుకుందామని అందులోకి వెళ్ళారు. అంతలోనే పర్వతం పైనుంచి ఒక పెద్ద బండరాయి దొర్లిపడింది. దాంతో గుహ ముఖద్వారం మూసుకుపోయింది. దాంతో వారు ఆ ఆపద నుంచి బయటపడే మార్గం గురించి మాట్లాడుకున్నారు. ఆఖరికి తాము అంతకు మునుపు చేసుకున్న సత్కార్యాల ఆధారంగా అల్లాహ్‌ను వేడుకోవడం తప్ప ఆ విపత్తు నుండి బయటపడేందుకు వేరేమార్గం లేదన్న నిర్ణయానికి వచ్చారు. వారిలోని ఒకడు ఇలా వేడుకున్నాడు : "దేవా! నాకు మరీ ముసలివారైన తల్లిదండ్రులుండేవారు. సాయంత్రం పూట అందరికంటే ముందు నేను నా తల్లిదండ్రులకే పాలు

١٢ - وَعَنْ أَبِي عَبْدِ الرَّحْمٰنِ عَبْدِ اللهِ بْنِ عُمَرَ بْنِ الخَطَّابِ، رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «انْطَلَقَ ثَلاثَةُ نَفَرٍ مِمَّنْ كَانَ قَبْلَكُمْ حَتَّى آوَاهُمُ المَبِيتُ إِلَى غَارٍ فَدَخَلُوهُ، فَانْحَدَرَتْ صَخْرَةٌ مِنَ الجَبَلِ فَسَدَّتْ عَلَيْهِمُ الغَارَ، فَقَالُوا: إِنَّهُ لا يُنْجِيكُمْ مِنْ هٰذِهِ الصَّخْرَةِ إِلَّا أَنْ تَدْعُوا اللهَ بِصَالِحِ أَعْمَالِكُمْ. قَالَ رَجُلٌ مِنْهُمْ: اللَّهُمَّ كَانَ لِي أَبَوَانِ شَيْخَانِ كَبِيرَانِ، وَكُنْتُ لا أَغْبِقُ قَبْلَهُمَا أَهْلاً وَلا مَالاً. فَنَأَى بِي طَلَبُ الشَّجَرِ يَوْماً فَلَمْ أُرِحْ عَلَيْهِمَا حَتَّى نَامَا فَحَلَبْتُ لَهُمَا غَبُوقَهُمَا فَوَجَدْتُهُمَا نَائِمَيْنِ، فَكَرِهْتُ أَنْ أُوقِظَهُمَا وَأَنْ أَغْبِقَ قَبْلَهُمَا أَهْلاً أو مَالاً، فَلَبِثْتُ ـ والقَدَحُ على يَدي ـ أَنْتَظِرُ اسْتِيقَاظَهُمَا حَتَّى بَرَقَ الفَجْرُ وَالصِّبْيَةُ يَتَضَاغَوْنَ عِنْدَ قَدَمِي فاسْتَيْقَظَا فَشَرِبَا غَبُوقَهُما، اللَّهُمَّ إنْ كُنْتُ فَعَلْتُ

ذٰلكَ ابْتِغَاءَ وَجْهِكَ فَفَرِّجْ عَنَّا ما نَحْنُ فِيْهِ مِنْ هٰذِهِ الصَّخْرَةِ، فَانْفَرَجَتْ شَيْئاً لا يَسْتَطِيعُونَ الخُرُوجَ مِنْهُ. قَالَ الآخَرُ: اللَّهُمَّ إِنَّهُ كَانَتْ لِي ابْنَةُ عَمٍّ كَانَتْ أَحَبَّ النَّاسِ إِلَيَّ - وَفِي رِوَايَةٍ: كُنْتُ أُحِبُّهَا كَأَشَدِّ مَا يُحِبُّ الرِّجَالُ النِّسَاءَ - فَأَرَدْتُهَا علىٰ نَفْسِهَا فَامْتَنَعَتْ مِنِّي حَتَّى أَلَمَّتْ بِهَا سَنَةٌ مِنَ السِّنِينَ فَجَاءَتْنِي فَأَعْطَيْتُهَا عِشْرِينَ وَمِائَةَ دِينَارٍ علىٰ أَنْ تُخَلِّيَ بَيْنِي وَبَيْنَ نَفْسِهَا فَفَعَلَتْ، حَتَّى إِذَا قَدَرْتُ عَلَيْهَا - وفي رِوَايَةٍ: فَلَمَّا قَعَدْتُ بَيْنَ رِجْلَيْهَا - قَالَتْ: اتَّقِ اللهَ وَلا تَفُضَّ الخَاتَمَ إِلا بِحَقِّهِ، فَانْصَرَفْتُ عَنْهَا وَهِيَ أَحَبُّ النَّاسِ إِلَيَّ وَتَرَكْتُ الذَّهَبَ الذي أَعْطَيْتُهَا، اللَّهُمَّ إِنْ كُنْتُ فَعَلْتُ ذٰلكَ

త్రాగించేవాడిని. వారికంటే ముందు నా భార్యాబిడ్డలకు గానీ, నా నౌకర్లకు గాని త్రాపించేవాణ్ణి కాను. ఒకరోజు నేను (పశువులకు) చెట్లమేత కోసం చాలా దూరం వెళ్ళిపోయాను. నేను ఇంటికి తిరిగి వచ్చేసరికి నా తల్లిదండ్రులిద్దరూ నిద్రపోయారు. నేను ఆ పూట పాలు పితికి తీసుకు వచ్చాను. అప్పటికే వారు గాఢ నిద్రలో ఉండడం గమనించాను. వారిని మేల్కొలపడానికి నాకు మనసొప్పలేదు. వారికంటే ముందు నా భార్యాబిడ్డలకు, నౌకర్లకు పాలు త్రాగించడం కూడా నాకిష్టం లేదు. అందుకని నా పిల్లలు నా కాళ్ళ మీద పడి విలవిల్లాడినా కూడా (నేను వారికి త్రాపకుండా) పాలపాత్ర చేతిలో పట్టుకొని తెల్లవారే దాకా వాళ్ళ దగ్గరే నిలబడి, ఏ సమయంలోనైనా వారు మేల్కొంటారేమోనని ఎదురు చూడసాగాను. తెల్లవారిన తరువాత గాని వారు లేవలేదు. నిద్ర మేల్కొని రాత్రి వారికోసం ఉంచబడిన పాలు తాగారు. ఓ అల్లాహ్! కేవలం నీ ప్రసన్నత కోసమే నేనీ పని చేసివుంటే మేము చిక్కుకున్న ఈ గుహ ముఖ ద్వారం నుండి బండ రాయిని తొలగించి మమ్మల్ని రక్షించు."

అతని వేడుకోలు ఫలితంగా ఆ బండ రాయి కొద్దిగా జరిగింది. అయితే (అప్పటికీ) ఆ సందుగుండా వారు బయటికి రాలేకపోయారు.

తరువాత రెండో వ్యక్తి అభ్యర్థించుకో సాగాడు: "ఓ దేవా! నా బాబాయి కూతురు ఒకామె ఉండేది. నేనామెను అమితంగా ఇష్టపడేవాణ్ణి. (వేరొక ఉల్లేఖ నంలో ఇలా ఉంది): మగవారు ఆడ వారిని అమితంగా ప్రేమించినంతగా నేను ఆమెను ప్రేమించే వాడిని. ఒకసారి నేను ఆమె పొందుకోసం పరితపించాను. కాని అందుకామె ఒప్పుకోలేదు. ఆఖరికి దుర్భిక్షం ఆమెను గత్యంతరం లేక నా వద్దకు వచ్చేలా చేసింది. అప్పుడు ఆమె నాతో ఏకాంతంలో గడిపే షరతుపై నేనామెకు నూట ఇరవై దీనార్లు ఇచ్చాను (గత్యంతరం లేక ఆమె అవి తీసు కుంది). నా కోరిక తీర్చేందుకు సిద్ధ మయ్యింది. నేనామెను అక్రమించు కున్నప్పుడు, (వేరొక ఉల్లేఖనం ప్రకారం) నేను ఆమె రెండు తొడల మధ్య కూర్చు న్నప్పుడు ఆమె నాతో; "అల్లాహ్‌కు భయపడు! అక్రమంగా కన్నె పొరను చీల్చకు" అని అంది. ఆ మాటలు విన్న తడవుగా నేను ఆమె దగ్గర్నుండి లేచి పోయాను. నిజానికి ఆమె నాకు ప్రజల్లో అత్యంత ప్రియతమమైనది. నేను ఆమె కిచ్చిన బంగారు దీనార్లను కూడా వదులుకున్నాను. ఓ దేవా! నేను కేవలం నీ ప్రసన్నత కోసమే ఇలా చేసి ఉన్నట్ల యితే మాపై వచ్చిపడిన ఈ విపత్తు నుండి మమ్మల్ని రక్షించు."

రెండో వ్యక్తి వేడుకోలు తరువాత ఆ

ابْتِغَاءَ وَجْهِكَ فَافْرُجْ عَنَّا مَا نَحْنُ فِيهِ، فَانْفَرَجَتِ الصَّخْرَةُ غَيْرَ أَنَّهُمْ لا يَسْتَطِيعُونَ الْخُرُوجَ مِنْهَا. وَقَالَ الثَّالِثُ: اللَّهُمَّ اسْتَأْجَرْتُ أُجَرَاءَ وَأَعْطَيْتُهُمْ أَجْرَهُمْ غَيْرَ رَجُلٍ وَاحِدٍ تَرَكَ الذي لَهُ وَذَهَبَ، فَثَمَّرْتُ أَجْرَهُ حَتَّى كَثُرَتْ مِنْهُ الأَمْوَالُ، فَجَاءَنِي بَعْدَ حِينٍ فَقَالَ: يَا عَبْدَ اللهِ أَدِّ إِلَيَّ أَجْرِي، فَقُلْتُ: كُلُّ ما تَرَى مِنْ أَجْرِكَ: مِنَ الإِبِلِ وَالبَقَرِ وَالغَنَمِ وَالرَّقِيقِ. فَقَالَ: يَا عَبْدَ اللهِ لا تَسْتَهْزِىءْ بِي! فَقُلْتُ: لا أَسْتَهْزِىءُ بِكَ، فَأَخَذَهُ كُلَّهُ فَاسْتَاقَهُ فَلَمْ يَتْرُكْ مِنْهُ شَيْئاً، اللَّهُمَّ إِنْ كُنْتُ فَعَلْتُ ذَلِكَ ابْتِغَاءَ وَجْهِكَ فَافْرُجْ عَنَّا مَا نَحْنُ فِيهِ، فَانْفَرَجَتِ الصَّخْرَةُ فَخَرَجُوا يَمْشُونَ» مُتَّفَقٌ عَلَيْهِ.

బండరాయి ఇంకొంచెం తొలగింది. అయినా గాని వారు బయటపడేందుకు మార్గం సుగమం కాలేదు.

ఆ తరువాత మూడో వ్యక్తి వేడుకోవడం ప్రారంభించాడు: "ప్రభూ! నేను కొంత మంది పని మనుషులను జీతానికుంచు కున్నాను. నేను వారందరికీ జీతాలిచ్చే శాను. కాని వారిలో ఒకడు మాత్రం తన జీతం పుచ్చుకోకుండానే వెళ్ళిపోయాడు. నేను అతని జీతాన్ని వ్యాపారంలో పెట్టు బడిగా పెట్టాను. దాంతో చాలా ధనం పోగయ్యింది. కొంత కాలానికి ఆ వ్యక్తి వచ్చి, "ఓ దైవ దాసుడా! నాకు నా జీతం ఇవ్వు" అనడిగాడు. దానికి నేను, "నువ్వు చూస్తున్నటువంటి ఈ ఒంటెలు, ఆవులు, మేకలు, బానిసలు - అన్నీ నీ జీతం ఫలాలే (వాటిని నువ్వు తీసేసుకో)" అన్నాను. అందుకతను "ఓ దైవదాసుడా! నాతో పరాచికాలు వద్దు" అంటూ చిన్నబోయాడు. నేను "ఇది పరాచికం కాదు (నిజం చెబుతున్నాను)" అన్నాను. అప్పుడు అతను (నా కోసం) ఏమీ వదల కుండా ఆ సంపదనంతా తరలించుకొని వెళ్ళిపోయాడు. ఓ అల్లాహ్! నేను ఈ పని కేవలం నీ ప్రసన్న తను దృష్టిలో పెట్టుకొనే చేసినట్లయితే మేము చిక్కుకున్నటువంటి ఈ ఆపద నుంచి మమ్మల్ని కాపాడు."

దాంతో ఆ బండరాయి పూర్తిగా తొలగి

పోయి గుహద్వారం తెరుచుకో వటంతో
వారు ముగ్గురూ బయటపడ్డారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణం. సహీహ్ ముస్లింలోని కారుణ్య ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. సత్కార్యాల ఆధారంగా అల్లాహ్‌ను వేడుకోవడం ధర్మసమ్మతమేననీ, అలాగాకుండా వ్యక్తులను అడ్డం పెట్టుకొని వేడుకోవడం తగదని, పైగా ధర్మంలో ఓ కొత్త పోకడ (బిద్‌అత్) అని పై హదీసు ద్వారా తెలుస్తోంది. ధర్మావలంబనలో ప్రజలు ఇలాంటి కొత్త పుంతలు తొక్కరాదు. ఎందుకంటే అసలు షరీయత్‌లో దీనికి ఎలాంటి ఆధారమూ లేదు. రెండో విషయం ఏమిటంటే ఈ విధానం దైవప్రవక్త మరియు ఆయన అనుచరుల కాలం నాటి విధానానికి భిన్నమైనది.
2. ఆలుబిడ్డల ఆలనాపాలన కన్నా తల్లిదండ్రుల సేవకు ఎక్కువ ప్రాధాన్యతనివ్వాలి.
3. దైవభీతితో చెడు నడత నుంచి ఆగిపోవటం గొప్ప సదాచరణ.
4. కార్మికుల పట్ల ఉత్తమంగా వ్యవహరించాలి. వారిలో ఎవరి హక్కైనా మిగిలిపోయి ఉన్నట్లయితే దానిని ఉత్తమ రీతిలో నెరవేర్చాలి.
5. చిత్తశుద్ధితో, భక్తిప్రపత్తులతో, దీనాతిదీనంగా చేసే వేడుకోలు తప్పకుండా స్వీకృతిని పొందుతుంది.
6. అల్లాహ్ అప్పుడప్పుడూ తన దాసులకు అసాధారణ రీతిలో కూడా సహాయం చేస్తూ ఉంటాడు. దీనినే "కరామత్" అంటారు. ప్రవక్తల నిదర్శనాల లాగానే అల్లాహ్‌కు ప్రియులైన దాసుల (వలీల) మహిమలు కూడా వాస్తవమే. అయితే ఏ అద్భుతాలయినా మహిమలయినా అల్లాహ్ ఇష్టానుసారమే ఉనికిలోకి వస్తాయి. అంతేగాని ప్రవక్తలు, సజ్జనులు ఎప్పుడంటే అప్పుడు అద్భుతాలను, మహిమలను సృష్టించలేరు.



## 2వ అధ్యాయం

# ٢ ـ بَابُ التَّوبَةِ

# పశ్చాత్తాపం (తౌబా)

قال العلماءُ: التَّوبَةُ واجبةٌ مِنْ كُلِّ ذَنْبٍ، فَإِنْ كانَتِ المَعْصِيَةُ بَيْنَ العَبْدِ وَبَيْنَ اللهِ تَعالَى لا تَتَعَلَّقُ بحَقِّ آدَميٍّ؛ فَلَهَا ثَلاثَةُ شُرُوطٍ:

أَحَدُهَا: أَنْ يُقْلِعَ عَنِ المَعْصِيَةِ.

وَالثَّانِي: أَنْ يَنْدَمَ عَلَى فِعْلِهَا.

وَالثَّالِثُ: أَنْ يَعْزِمَ أَنْ لا يَعُودَ إِلَيْهَا أَبَداً. فَإِنْ فُقِدَ أَحَدُ الثَّلاثَةِ لَمْ تَصِحَّ تَوْبَتُهُ.

وَإِنْ كَانَتِ المَعْصِيَةُ تَتَعَلَّقُ بِآدَمِيٍّ فَشُرُوطُهَا أَرْبَعَةٌ: هٰذِهِ الثَّلاثَةُ، وَأَنْ يَبْرَأَ مِنْ حَقِّ صَاحِبِهَا؛ فَإِنْ كَانَتْ مَالاً أَوْ نَحْوَهُ رَدَّهُ إِلَيْهِ، وَإِنْ كَانَتْ حَدَّ قَذْفٍ وَنَحْوَهُ مَكَّنَهُ مِنْهُ أَوْ طَلَبَ عَفْوَهُ، وَإِنْ كَانَتْ غِيبَةً اسْتَحَلَّهُ مِنْهَا. وَيَجِبُ أَنْ يَتُوبَ مِنْ جَمِيعِ الذُّنُوبِ، فَإِنْ تَابَ مِنْ بَعْضِهَا صَحَّتْ تَوْبَتُهُ عِنْدَ أَهْلِ الحَقِّ مِنْ ذٰلِكَ الذَّنْبِ، وَبَقِيَ عَلَيْهِ البَاقِي. وَقَدْ تَظَاهَرَتْ دَلائِلُ الكِتَابِ، وَالسُّنَّةِ، وَإِجْمَاعُ الأُمَّةِ عَلَى وُجُوبِ التَّوْبَةِ:

విద్వాంసుల స్పష్టీకరణ : జరిగిపోయిన ప్రతి పాపానికి తప్పనిసరిగా పశ్చాత్తాపం చెందాలి. దాసుని పాపం అల్లాహ్‌కు మరియు ఆ దాసునికే పరిమితమై సాటి మానవుల హక్కుకి దానితో ఎలాంటి సంబంధం లేనట్లయితే అలాంటి వ్యక్తి పశ్చాత్తాపం అంగీకరించబడటానికి మూడు షరతులు ఉన్నాయి.

ఒకటి : పశ్చాత్తాపం చెందుతున్న పాపానికి తను పూర్తిగా స్వస్తి పలకాలి.

రెండు : జరిగిపోయిన పాపానికి సిగ్గుతో కుమిలిపోవాలి.

మూడు : భవిష్యత్తులో ఇంకెప్పుడూ అలా చేయనని గట్టిగా నిశ్చయించుకోవాలి.

ఈ మూడు నియమాల్లో ఏ ఒక్కటి లోపించినా అతని పశ్చాత్తాపం సరైనది కాదు.

ఒకవేళ జరిగిన పాపం తోటి మానవుల హక్కులకు సంబంధించినదైతే పశ్చాత్తాపం దైవ సన్నిధిలో అంగీకరించబడటానికి నాలుగు నిబంధనలున్నాయి. పై మూడు నిబంధనలతో పాటు నాల్గవ నిబంధన ఏమిటంటే, అతను తోటి మానవుని హక్కుని అతనికి తిరిగి ఇచ్చివేయాలి. పరులనుండి ధనం లేక మరేదైనా వస్తువు అధర్మంగా తీసుకొనివుంటే దాన్ని వాపసుచేయాలి. తోటి వ్యక్తులపై నీలాపనిందలు ఇత్యాదివి మోపి వున్నట్లయితే వారి శిక్షను తాను అనుభవించాలి లేదా క్షమాభిక్ష కోరి వారిని సంతోషపరచాలి. తోటి

قَالَ اللهُ تَعَالَى: ﴿ وَتُوبُوٓاْ إِلَى ٱللَّهِ جَمِيعًا أَيُّهَ ٱلْمُؤْمِنُونَ لَعَلَّكُمْ تُفْلِحُونَ ﴾ [النور: ٣١]، وَقَالَ تَعَالَى: ﴿ ٱسْتَغْفِرُواْ رَبَّكُمْ ثُمَّ تُوبُوٓاْ إِلَيْهِ ﴾ [هود: ٣]، وَقَالَ تَعَالَى: ﴿ يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ تُوبُوٓاْ إِلَى ٱللَّهِ تَوْبَةً نَّصُوحًا ﴾ [التحريم: ٨].

మనిషి వీపు వెనక చాడీలు చెప్పివుంటే అతణ్ణి నిర్దోషిగా నిలబెట్టాలి. అయితే పాపాలన్నిటిపై పశ్చాత్తాపం చెందటం మాత్రం తప్పనిసరి. ఏవో కొన్ని పాపాలపై మాత్రమే పశ్చాత్తాపపడితే అహ్లెసున్నత్ వారి దృష్టిలో ఆయా విషయాల్లో అతని పశ్చాత్తాపం సరైనదే గాని ఇతర పాపాలు మాత్రం ఇంకా అతనిపై మిగిలే వుంటాయి. పాపాలపై పశ్చాత్తాపం అవసరమన్న విషయమై ఖుర్ఆన్ హదీసుల్లో అనేక ఆధారాలున్నాయి. వాటిపై ముస్లిం సమాజ ఏకాభిప్రాయమూ ఉంది.

**అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు : "ఓ విశ్వాసులారా! మీరంతా కలసి (పశ్చాత్తాప భావంతో) అల్లాహ్ వైపుకు మరలండి. దీనివల్ల మీకు సాఫల్యం కలగవచ్చు."** ***(నూర్ - 31)***

**మరోచోట అల్లాహ్ ఉపదేశిస్తున్నాడు : "మీరు క్షమాభిక్ష కోసం మీ ప్రభువును వేడుకోండి. ఆయన వైపుకే మరలండి (పాపాలపై పశ్చాత్తాపపడండి)."** ***(హూద్ - 3)***

**ఇంకొకచోట ఇలా అంటున్నాడు : "విశ్వసించిన ఓ ప్రజలారా! చిత్తశుద్ధితో కూడిన పశ్చాత్తాపంతో అల్లాహ్ వైపుకు మరలండి."** ***(తహ్రీమ్ - 8)***

١٣ - وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «وَاللهِ إِنِّي لأَسْتَغْفِرُ اللهَ وَأَتُوبُ إِلَيْهِ فِي الْيَوْمِ أَكْثَرَ مِنْ سَبْعِينَ مَرَّةً» رَوَاهُ الْبُخَارِيُّ.

13. దైవప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లం) చెబుతుండగా తాను విన్నానని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలిపారు: దైవసాక్షి! నేను రోజుకు డెభ్భైకన్నా ఎక్కువసార్లు మన్నింపు కోసం వేడుకుంటూ, పాపాలపై పశ్చాత్తాపపడుతూ ఉంటాను." *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ప్రార్థనల ప్రకరణం.)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో నిత్యం పాపాలపై పశ్చాత్తాపం చెందుతూ మన్నింపు కోసం వేడుకుంటూ ఉండాలని పురికొల్పడం జరిగింది. దైవప్రవక్త (సల్లం) అత్యంత పునీతులు. అల్లాహ్ ఆయన వెనుకటి పాపాలను, జరగబోయే పాపాలను అన్నింటినీ మన్నించాడు. అసలు ఆయన చేత దొర్లిన పొరపాట్లను పాపాలు అనడం కూడా సబబు కాదు. అయితే సాధారణ వ్యక్తులకు సమ్మతమైనవిగా భావించబడే కొన్ని పనులు మహనీయులకు శోభాయమానం కావు. ఆయన గారు తీసుకున్న కొన్ని నిర్ణయాలలో మానవ సహజమైన దౌర్బల్యం వల్ల ఏదో ఒక దశలో స్వల్పమయిన పొరపాట్లు జరగవచ్చు. అలాంటి దైవప్రవక్తే రోజుకు డెబ్భైకన్నా ఎక్కువసార్లు పాపాల మన్నింపు కోసం వేడుకుంటుండగా పీకలదాకా పాపాల్లో మునిగివున్న మనం ఎలా ఉపేక్షించబడతాం!

2. నిరంతరం వీలైనంత ఎక్కువగా పాపాలపై పశ్చాత్తాపపడుతూ ఉండాలి. దీనివల్ల మనకు తెలియకుండానే మనవల్ల దొర్లిపోయే తప్పిదాలు మన్నించబడతాయి. రాబోయే హదీసులో కూడా పశ్చాత్తాప భావన గురించే నొక్కి వక్కాణించబడింది.

١٤ ـ وَعَنِ الأَغَرِّ بْنِ يَسَارٍ المُزَنِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «يَا أَيُّهَا النَّاسُ تُوبُوا إِلَى اللهِ وَاسْتَغْفِرُوهُ فَإِنِّي أَتُوبُ فِي اليَوْمِ مِائَةَ مَرَّةٍ» رَوَاهُ مُسْلِمٌ.

14. హజ్రత్ అగర్ర్ బిన్ యసార్ ముజనీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త సల్లల్లాహు అలైహి వ సల్లం ఇలా ప్రబోధించారు : "ప్రజలారా! పాపాలపై పశ్చాత్తాపభావంతో అల్లాహ్ వైపుకు మరలండి. మన్నింపు కోసం ఆయన్ను వేడుకోండి. నేను దైవసన్నిధిలో రోజుకు వందసార్లు పశ్చాత్తాప భావంతో కుంగిపోతూ ఉంటాను." (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ధ్యాన ప్రకరణం).*

١٥ ـ وَعَنْ أَبِي حَمْزَةَ أَنَسِ بْنِ مَالِكٍ الأَنْصَارِيِّ خَادِمِ رَسُولِ اللهِ ﷺ، رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «لَلَّهُ أَفْرَحُ

15. దైవప్రవక్త సేవకులు, హజ్రత్ అబూ హమ్జ అనస్ బిన్ మాలిక్ అన్సారీ (రజి) కథనం ప్రకారం ఆయన (స) ఇలా ప్రబోధించారు : "తన దాసుడు పాపాలపై పశ్చాత్తాప పడినందుకు అల్లాహ్, ఎడారి ప్రదేశంలో ఒంటెను పోగొట్టుకొని

بتوبة عبده من أحدكم سقط على بعيره وقد أضله في أرض فلاة» متفق عليه.

وفي رواية لمسلم: «لله أشد فرحاً بتوبة عبده حين يتوب إليه من أحدكم كان على راحلته بأرض فلاة، فانفلتت منه وعليها طعامه وشرابه فأيس منها، فأتى شجرة فاضطجع في ظلها، وقد أيس من راحلته، فبينما هو كذلك إذ هو بها قائمة عنده، فأخذ بخطامها ثم قال من شدة الفرح: اللهم أنت عبدي وأنا ربك، أخطأ من شدة الفرح».

తిరిగి పొందిన వ్యక్తి కన్నా ఎక్కువగా సంతోషిస్తాడు. *(బుఖారీ - ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : ఒక వ్యక్తి ఎడారి ప్రాంతంలో తన ఒంటెపై ప్రయాణిస్తున్నాడు. దానిపైనే అతని ఆహారసామగ్రి, నీరు ఉన్నాయి. (మార్గమధ్యంలో) ఆ ఒంటె తప్పిపోయింది. అతను ఇక ఆ ఒంటె దొరకదని భావించాడు. (వెతికి వేసారి) నిరాశతో తిరిగి వచ్చి ఓ చెట్టు నీడలో మేనువాల్చాడు. ఇంతలో ఆ ఒంటె వచ్చి అతని ముందు నిలబడింది. వెంటనే అతను దాని ముకుతాడు పట్టుకొని ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బైపోయి "ఓ అల్లాహ్! నీవే నా దాసుడివి, నేను నీ ప్రభువును" అన్నాడు. సంతోషం పట్టలేక ఆ వ్యక్తి మాటలు అలా తడబడ్డాయను కుంటే నిశ్చయంగా అల్లాహ్ తన దాసుని పశ్చాత్తాపంపై అంతకన్నా ఎక్కువగానే సంతోషిస్తాడు.

*(సహీహ్ బుఖారీలోని ప్రార్థనల ప్రకరణం. సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. పై హదీసులో కూడా పశ్చాత్తాపం ప్రోత్సహించబడింది, దాని ప్రాముఖ్యత గురించి నొక్కి వక్కాణించటం జరిగింది.
2. దాసుల పశ్చాత్తాప భావం చూసి అల్లాహ్ అమితంగా సంతోషిస్తాడు.
3. అసంకల్పితంగా దొర్లిపోయే పొరబాట్లను తప్పుపట్టడం జరగదు.
4. మాటల్లో చేవ తీసుకురావటం కోసం విషయాన్ని ప్రమాణం చేసి మరీ చెప్పటం ధర్మసమ్మతమే.
5. విషయాన్ని బోధపరిచేందుకు ఉదాహరణలు కూడా ఇవ్వవచ్చు.

16. హజ్రత్ అబూ మూసా అబ్దుల్లాహ్ బిన్ ఖైస్ అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు: "పగటిపూట పాపం చేసినవాడు రాత్రికి పశ్చాత్తాపం చెందాలని అల్లాహ్ రాత్రివేళ తన చేయిని చాపుతాడు. అలాగే రాత్రి వేళ పాపం చేసినవాడు పగలు పశ్చాత్తాపం చెందుతాడని అల్లాహ్ పగటిపూట తన చేయిని చాచి ఉంచుతాడు. (ఈ పరంపర) సూర్యుడు పడమటి దిక్కు నుండి ఉదయించేం తవరకూ (అంటే ప్రళయం వచ్చేంత వరకు) కొనసాగుతూనే ఉంటుంది." (ముస్లిం)

١٦ ـ وَعَنْ أَبِي مُوسَى عَبْدِ اللهِ بْنِ قَيْسٍ الأَشْعَرِيِّ رَضِيَ اللهُ عَنْهُ عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «إِنَّ اللهَ تَعَالَى يَبْسُطُ يَدَهُ بِاللَّيْلِ لِيَتُوبَ مُسِيءُ النَّهَارِ، وَيَبْسُطُ يَدَهُ بِالنَّهَارِ لِيَتُوبَ مُسِيءُ اللَّيْلِ، حَتَّى تَطْلُعَ الشَّمْسُ مِنْ مَغْرِبِهَا» رَوَاهُ مُسْلِمٌ.

*(సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

పై హదీసులో అల్లాహ్‌కు చేయి కూడా ఉంటుందనే గుణం గురించి వివరించడమైనది. అయితే ఆ చెయ్యి ఎలా ఉంటుంది? దాన్ని ఆయన ఎలా చాపుతాడు? అనే విషయం వాస్తవిక స్వరూప స్వభావాల గురించి మనకు తెలియదు. దాన్ని మనం వివరించనూలేము. అయితే దాని వాస్తవిక స్వరూప స్వభావాలు తెలియకపోయినప్పటికీ ఊహాగానాలు, ఉపమానాలు ఇవ్వకుండా దానిపై విశ్వాసముంచటం అవసరం. ఈ హదీసు ద్వారా బోధపడే మరొక విషయం ఏమిటంటే, రేయింబవళ్ళలో ఎప్పుడైనా ఏదైనా తప్పిదం జరిగిపోతే ఏమాత్రం జాప్యం చేయకుండా మనిషి వెంటనే పశ్చాత్తాప భావంతో కుమిలిపోతూ దైవసన్నిధిలో మోకరిల్లాలి.

17. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : "సూర్యుడు పడమటి దిక్కు నుంచి ఉదయించక మునుపే తన పాపాలపై పశ్చాత్తాపం చెందే వాని పశ్చాత్తాపాన్ని అల్లాహ్ సమ్మతించి ఆమోదిస్తాడు." (ముస్లిం)

١٧ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ تَابَ قَبْلَ أَنْ تَطْلُعَ الشَّمْسُ مِنْ مَغْرِبِهَا تَابَ اللهُ عَلَيْهِ» رَوَاهُ مُسْلِمٌ.

*(సహీహ్ ముస్లింలోని ధ్యానం, ప్రార్థనల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

నిఘంటువు ప్రకారం "తౌబా" అంటే మరలటం అని అర్థం. మనిషి పాపం చేసినప్పుడు అల్లాహ్‌కు దూరమవుతాడు. తిరిగి "తౌబా" చేసుకున్నప్పుడు (పశ్చాత్తాప పడినప్పుడు), ఆయన వైపుకి మరలి ఆయన సాన్నిహిత్యం, ఆయన క్షమాభిక్ష కోసం పరితపిస్తాడు. ఈ మార్పును, ఈ మరలింపునే 'తౌబా' (పశ్చాత్తాపం) అంటారు. అల్లాహ్ అతని వైపు దృష్టి సారిస్తాడంటే అతని పశ్చాత్తాపాన్ని ఆమోదిస్తాడని భావం.

١٨ - وَعَنْ أَبِي عَبْدِ الرَّحْمٰنِ عَبْدِ اللهِ بْنِ عُمَرَ بْنِ الْخَطَّابِ رَضِيَ اللهُ عَنْهُمَا عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «إِنَّ اللهَ عَزَّ وَجَلَّ يَقْبَلُ تَوْبَةَ الْعَبْدِ مَا لَمْ يُغَرْغِرْ» رَوَاهُ التِّرْمِذِي وَقَالَ: حَدِيثٌ حَسَنٌ.

18. దైవప్రవక్త (సల్లం) ప్రబోధించారని హజ్రత్ అబూ అబ్దుర్రహ్మాన్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ బిన్ ఖత్తాబ్ తెలియజేశారు: "జీవితంలోని అంతిమ ఘడియలు దాపురించక ముందువరకూ అల్లాహ్ తన దాసుని పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తూనే ఉంటాడు." ఈ హదీసును తిర్మిజీ ఉల్లేఖించి హసన్‌గా ఖరారు చేశారు.

*(సుననె తిర్మిజీలోని ప్రార్థనల ప్రకరణంలో చరమ ఘడియలకంటే ముందు పశ్చాత్తాపం ఆమోదించబడుతుందన్న అధ్యాయంలో ఈ హదీసు ప్రస్తావించ బడింది.)*

## ముఖ్యాంశాలు

పై హదీసులో "గర్‌గరా" అనే పదం వాడబడింది. ఇది ఆత్మ శరీరాన్ని వదలి కంఠానికి చేరుకునేదానికి ధ్వన్యానుకరణం. అంటే జీవితపు చివరి శ్వాసలన్నమాట.

ఈ హదీసును 'హసన్'గా ఖరారు చేయడం జరిగిందంటే ఈ హదీసు పరంపరలో వైవిధ్యాలకు, లొసుగులకు తావులేదు గాని దీని ఉల్లేఖకులు సహీహ్ హదీసుల ఉల్లేఖకుల కంటే తక్కువ స్థాయికి చెందినవారని అర్థం. హదీసువేత్తల దృష్టిలో సహీహ్ హదీసుల మాదిరిగా "హసన్" కోవకు చెందిన హదీసులు కూడా ఆచరించదగినవే.

١٩ - وَعَنْ زِرِّ بْنِ حُبَيْشٍ قَالَ: أَتَيْتُ صَفْوَانَ بْنَ عَسَّالٍ رَضِيَ اللهُ عَنْهُ أَسْأَلُهُ عَنِ الْمَسْحِ على الْخُفَّيْنِ فَقَالَ:

19. హజ్రత్ జిర్ర్ బిన్ హుబైష్ కథనం: నేను మేజోళ్ళపై మసా (తడి చేత్తో తుడవటం) గురించి అడుగుదామని

సఫ్వాన్ బిన్ అస్సాల్ వద్దకు వెళ్ళాను. ఆయన నన్ను "జిర్! ఏమిటి ఇలా వచ్చావ్?" అనడిగారు. అందుకు నేను "జ్ఞానసముపార్జన కోసం మీ దగ్గరి కొచ్చాను" అని జవాబిచ్చాను. అది విని ఆయన "జ్ఞానం ఆర్జించే వ్యక్తి కుతూహలం చూసి దైవదూతలు అతని పట్ల ప్రసన్నులై తమ బాహువుల్ని పరుస్తారు" అని చెప్పారు. నేను ఆయనతో "మల మూత్ర విసర్జన అనంతరం మేజోళ్ళపై మసా చేసే విషయంలో నాకు సందేహ ముంది. తమరు దైవప్రవక్త సహచరులు కదా! అందుకని దైవప్రవక్త ఈ విషయం గురించి బోధిస్తుండగా మీరేమైనా విన్నారేమో అడుగుదామని వచ్చాను" అని విన్నవించుకున్నాను. దానికి ఆయన "అవును (విన్నాను). మేము ప్రయాణంలో ఉన్నప్పుడు - మూడు పగళ్ళు, మూడు రాత్రుల వరకు లైంగిక అశుద్ధావస్థ ఎదురైతే తప్ప మలమూత్ర విసర్జనలకే మేజోళ్ళు తీయవలసిన అవసరం లేదని దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని ఆజ్ఞాపించేవారు" అని వివరించారు. ఆ తరువాత నేను "మరి తన మీద అభిమానం కలిగి ఉండటం గురించి ఆయన ఏమైనా ప్రబోధిస్తుండగా మీరు విన్నారా?" అనడిగాను. దానికి కూడా ఆయన "అవును, ఒకానొక ప్రయాణంలో మేము దైవప్రవక్త (సల్లం)

مَا جَاءَ بِكَ يَا زِرُّ؟ فَقُلْتُ: ابْتِغَاءُ العِلْمِ، فَقَالَ: إِنَّ المَلَائِكَةَ تَضَعُ أَجْنِحَتَهَا لِطَالِبِ العِلْمِ رِضًا بِمَا يَطْلُبُ، فَقُلْتُ: إِنَّهُ قَدْ حَكَّ فِي صَدْرِي المَسْحُ على الخُفَّيْنِ بَعْدَ الغَائِطِ وَالبَوْلِ، وَكُنْتَ امْرَءاً من أَصْحَابِ النَّبِيِّ ﷺ، فَجِئْتُ أَسْأَلُكَ: هَلْ سَمِعْتَهُ يَذْكُرُ فِي ذٰلك شَيْئاً؟ قَالَ: نَعَمْ، كَانَ يَأْمُرُنَا إِذَا كُنَّا سَفراً - أو مُسَافِرِينَ - أَنْ لا نَنْزِعَ خِفَافَنَا ثَلاثَةَ أَيَّامٍ وَلَيَالِيَهُنَّ إلا مِنْ جَنَابَةٍ، لٰكِنْ مِنْ غَائِطٍ وَبَوْلٍ وَنَوْمٍ. فَقُلْتُ: هَلْ سَمِعْتَهُ يَذْكُرُ فِي الهَوَى شَيْئاً؟ قَالَ: نَعَمْ كُنَّا مَعَ رَسُولِ الله ﷺ فِي سَفَرٍ، فَبَيْنَا نحنُ عِنْدَهُ إِذْ نَادَاهُ أَعْرَابِيٌّ بِصَوْتٍ لَهُ جَهْوَرِيٍّ: يَا مُحَمَّدُ، فَأَجَابَهُ رسولُ الله ﷺ نَحْواً مِنْ صَوْتِهِ: «هَاؤُمُ»،

فَقُلْتُ لَهُ: وَيْحَكَ اغْضُضْ مِنْ صَوْتِكَ فَإِنَّكَ عِنْدَ النَّبِيِّ ﷺ، وَقَدْ نُهِيتَ عَنْ هٰذَا! فَقَالَ: واللهِ لا أَغْضُضُ. قَالَ الأَعْرَابِيُّ: المَرْءُ يُحِبُّ القَوْمَ وَلَمَّا يَلْحَقْ بِهِمْ؟ قَالَ النَّبِيُّ ﷺ: «المَرْءُ مَعَ مَنْ أَحَبَّ يَوْمَ القِيَامَةِ» فَمَا زَالَ يُحَدِّثُنَا حَتَّى ذَكَرَ بَاباً مِنَ المَغْرِبِ «مَسِيرَةُ عَرْضِهِ أَو يَسِيرُ الرَّاكِبُ فِي عَرْضِهِ أَرْبَعِينَ أَو سَبْعِينَ عَاماً». قَالَ سُفْيَانُ أَحَدُ الرُّوَاةِ: «قِبَلَ الشَّام خَلَقَهُ اللهُ تَعَالَى يَوْمَ خَلَقَ السَّمَاوَاتِ وَالأَرْضَ

వెంట ఆయన దగ్గరే ఉన్నాము. అప్పుడు పల్లెటూరి బైతు ఒకడు 'ఓ ముహమ్మద్!' అని బిగ్గరగా అరిచాడు. దైవప్రవక్త (సల్లం) అంతే స్వరంతో "నేను ఇక్కడ వున్నాను" అని బదులు పలికారు. నేను ఆ పల్లెటూరి వ్యక్తికి, "నీ ధోరణి కడు శోచనీయం. కాస్త గొంతు తగ్గించి మాట్లాడు. నువ్వు ఇప్పుడు దైవప్రవక్త సన్నిధిలో ఉన్నావు. ఆయన సమక్షంలో నువ్విలా బిగ్గరగా మాట్లాడటం నిషిద్ధం" అని హితవు పలికాను. కాని అతను "దైవసాక్షి! (నా కంఠమే అంత) నేను నెమ్మదిగా మాట్లాడలేను" అన్నాడు. తర్వాత అతను దైవప్రవక్తతో "మనిషి కొందరిని కలవకుండానే వారిని అభిమానిస్తాడు. (అలాంటి వ్యక్తి గురించి మీ అభిప్రాయమేమిటి?)" అని అడిగాడు. అందుకాయన "మనిషి ప్రళయ దినాన తాను అభిమానించిన వారితోపాటే ఉంటాడు" అని చెప్పారు. తరువాత ఆయన మాతో మాట్లాడుతూ పడమటి దిక్కున ఉన్న ఓ ద్వారాన్ని గురించి ప్రస్తావించారు. దాని వెడల్పు నలభై లేక డెబ్భై సంవత్సరాల వ్యవధికి సమానంగా ఉంటుంది లేక ఆయన "దాని వెడల్పులో ఒక రౌతు నలభై లేక డెబ్భై సంవత్సరాలు ప్రయాణించగలడు" అన్నారు. ఈ హదీసు పరంపరలోని ఒకానొక ఉల్లేఖకులు హజ్రత్ సుఫియాన్

مفتوحاً للتوبة لا يغلق حتى تطلع الشمس منه» رواه الترمذي وغيره وقال: حديث حسن صحيح.

ఇలా అంటున్నారు:- "ఈ ద్వారం సిరియా వైపు ఉంది. అల్లాహ్ భూమ్యాకాశాలను పుట్టించిన నాడే దీనిని తయారు చేశాడు. అప్పటినుంచి అది 'పశ్చాత్తాపం' కోసం తెరుచుకొని ఉంది. సూర్యుడు దాని (అంటే పడమటి) దిశ నుండి ఉదయించేవరకూ అది మూసుకోదు." (దీనిని తిర్మిజీ తదితరులు ఉల్లేఖించి సహీహ్ మరియు హసన్‌గా ఖరారు చేశారు.)

*(సుననె తిర్మిజీలోని ప్రార్థనల ప్రకరణం. సుననె నసాయిలోని శుచీశుభ్రతల ప్రకరణం. ఇంకా సుననె ఇబ్నె మాజాలోని శుచీ శుభ్రతల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. వుజూలో మేజోళ్ళపై మసా చేయటం (తడి చేత్తో తుడవటం) ధర్మసమ్మతమేనని పై హదీసు ద్వారా రూఢీ అవుతోంది. ఈ వెసులుబాటు ప్రయాణీకునికి మూడు పగళ్ళు, మూడు రాత్రుల వరకూ ఉంటుంది. స్థానికునికైతే ఒక పగలూ ఒక రేయి వరకూ ఉంటుంది. మేజోళ్ళపై మసా చేయటం ధర్మసమ్మతం కావటానికి అవి పరిశుభ్రంగా ఉండి, సంపూర్ణ శుద్ధి జరిగిన తరువాత (అంటే మొదటిసారి వుజూ చేసుకొన్న పిదప) తొడగబడి ఉండాలి. అంతేగాకుండా అవి కాలి చీలమండలను సైతం కప్పివుంచాలి. చిన్న తరహా అశుద్ధత (హదసె అస్గర్ - అంటే వుజూ భంగపాటు)కు గురైనప్పుడు కాళ్ళు కడుక్కోకుండా, మేజోళ్లపై మసా చేసి వుజూ చేసుకుంటే సరిపోతుంది. నిద్రపోవడం వల్ల, మలమూత్ర విసర్జన లేక అపానవాయువు వెలువడటం వల్ల వుజూ భంగమయిపోతుంది. అయితే పెద్ద అశుద్ధత (హదసె అక్బర్ అంటే - లైంగిక అశుద్ధత, బహిష్టు, పురిటి రక్తస్రావం)కు లోనైనప్పుడు మాత్రం తప్పనిసరిగా మేజోళ్లు తీసి "గుసుల్" (తలంటుస్నానం) చేయాలి. అంటే కాలవ్యవధి పూర్తయిన తరువాత మేజోళ్లపై మసా చేయడం ధర్మసమ్మతం కానట్లే హదసె అక్బర్ వల్ల కూడా మేజోళ్లపై మసా చేయడం సమ్మతం కాదు. అదేవిధంగా వుజూ భంగమైన స్థితిలో మేజోళ్ళను తీసివేస్తే ఇక వాటిపై మసా పనికిరాదు. అయితే వుజూతో వున్నప్పుడు వెసులుబాటు కాలం పూర్తయినా లేక మేజోళ్లను తీసివేసినా సరే; పూర్తిగా వుజూ చేసుకునే బదులు కేవలం కాళ్ల వరకు కడుక్కుంటే సరిపోతుంది.

(ఫిక్‌హుస్సున్నహ్)

౨. ౖజూతో ఉన్నప్పుడు మేజోళ్లను తొలగించినా ఫరవా లేదు. ఎందుకంటే కాళ్ళు శుభ్రంగానే ఉన్నాయి. తిరిగి వాటిని తొడుక్కొని నిస్సంకోచంగా మసా చేసుకోవచ్చు.[1]

3. మనిషి సజ్జనులను అభిమానించాలి. అలా చేస్తే ప్రళయదినాన అతను సజ్జన సమూహంలోని వ్యక్తిగా పరిగణించబడతాడు. ఆలోచించి చూస్తే ఈ హదీసు ద్వారా ఇంకా ఎన్నో విషయాలు బోధపడతాయి.

٢٠ ـ وَعَـنْ أَبِـي سَعِيدٍ سَعْدِ بْـنِ مَالِك بْنِ سِنَانٍ الخُدرِيِّ رضي الله عنه أَنَّ نَبِيَّ اللهِ ﷺ قَالَ: «كَانَ فِيمَنْ كَانَ قَبْلَكُمْ رَجُلٌ قَتَلَ تِسْعَةً وَتِسْعِينَ نَفْساً، فَسَأَلَ عَنْ أَعْلَمِ أَهْلِ الأَرْضِ، فَدُلَّ عَلَى رَاهِبٍ، فَأَتَاهُ فَقَالَ: إِنَّهُ قَتَلَ تِسْعَةً وتِسْعِينَ نَفْساً، فَهَلْ لَهُ مِنْ تَوبَةٍ؟ فقَالَ: لا، فَقَتَلَهُ فَكَمَّلَ بِهِ مِائَةً، ثُمَّ سَأَلَ عَن أَعْلَمِ أَهْلِ الأَرْضِ، فَدُلَّ عَلَى رَجُلٍ عَالِمٍ فقَالَ: إِنَّهُ قَتَلَ مِائَةَ نَفْسٍ فَهَلْ له مِنْ تَوبَةٍ؟ فقَالَ: نَعَمْ، وَمَنْ يَحُولُ بَيْنَهُ وَبَيْنَ التَّوبَةِ؟ انطَلِقْ إِلى أَرْضِ كَذَا وَكَذَا، فَإِنَّ بِهَا أُنَاساً يَعْبُدُونَ اللهَ تَعَالَى فَاعْبُدِ اللهَ مَعَهُمْ، وَلا تَرْجِعْ إِلى أَرْضِكَ فَإِنَّهَا أَرْضُ سُوءٍ، فَانْطَلَقَ حَتَّى إِذَا نَصَفَ الطَّرِيقَ أَتَاهُ المَوتُ، فَاخْتَصَمَتْ فِيهِ مَلائِكَةُ الرَّحْمَةِ وَمَلائِكَةُ العَذَابِ. فَقَالَتْ مَلائِكَةُ الرَّحْمَةِ: جَاءَ تَائِباً مُقْبِلاً بِقَلبِهِ إِلى اللهِ تَعَالَى، وَقَالَتْ مَلائِكَةُ العَذَابِ: إِنَّه لَمْ يَعْمَلْ خَيْراً قَطُّ، فَأَتَاهُمْ مَلَكٌ فِي صُورَةِ

20. హజ్రత్ అబూ సయీద్ సాద్ బిన్ మాలిక్ బిన్ సినాన్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : పూర్వీకుల్లో ఒక వ్యక్తి ఉండేవాడు. అతను తొంభై తొమ్మిది హత్యలు చేశాడు. ఆ తరువాత (తన పాపాల నిష్కృతికి మార్గం తెలుసుకోవటం కోసం) ఈ భూలోకంలో అందరికంటే గొప్ప జ్ఞాని ఎవరని జనాన్ని అడుగుతూ పోయాడు. చివరికి అతనికి ఒక సాధువు గురించి తెలిసింది. ఆ సాధువు వద్దకు వెళ్ళి అతను "నేను తొంభైతొమ్మిది హత్యలు చేశాను. నా పాపానికి ప్రాయశ్చిత్తం ఉందా?" అని అడిగాడు. దానికి ఆ సాధువు "లేద"న్నాడు. (అతనికి కోపం వచ్చి) ఆ సాధువుని కూడా హత మార్చాడు. దాంతో వందమంది పూర్తయ్యారు. తరువాత అతను "అందరి కంటే అధికంగా తెలిసిన పండితుడెవరో నాకు చెప్పండి" అని మళ్ళీ జనాన్ని అడుగుతూ తిరగసాగాడు. ఒక పండితుని గురించి తెలుసుకొని అతని దగ్గరికి వెళ్ళి "నేను వందమందిని హత్య

1. (మసహ్ అలల్ జౌరబైన్ లిల్ ఖాసిమి చివర్లో అల్‌బానిగారి శీర్షిక చూడండి.)

చేశాను. ఇప్పుడు నా పాపానికి ప్రాయశ్చిత్తం ఉంటుందా?" అని అడిగాడు. దానికి ఆ పండితుడు "ఉంద"ని చెప్పి, ఇతనికీ - ఇతని పశ్చాత్తాపానికి మధ్య అడ్డురాగలవాడెవడు? అంటూ "నువ్వు ఫలానా చోటికి వెళ్ళు. అక్కడ కొంత మంది అల్లాహ్‌ను ఆరాధించడంలో నిమగ్నులై ఉన్నారు. నీవు కూడా వారితో కలిసి అల్లాహ్‌ను ఆరాధించు. (అల్లాహ్ నీ పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తాడు) ఇంకెప్పుడూ నీ ఊరికి తిరిగి రాకు. అది పాపిష్టి నేల" అని చెప్పి పంపించాడు.

ఆ వ్యక్తి బయలుదేరాడు. సగం దూరం వెళ్ళేసరికి అతనికి చావు వచ్చింది. (అతని ఆత్మను తీసుకెళ్ళడానికి) కారుణ్య దూతలు, శిక్షించే దూతలు ఇరువురూ వచ్చారు. వారి మధ్య గొడవ జరిగింది. "ఈ వ్యక్తి పశ్చాత్తాపభావంతో పాపాలనుండి మరలిపోయి పూర్తి ఏకాగ్రతతో అల్లాహ్ వైపుకు రాసాగాడ"ని కారుణ్య దూతలు వాదించగా, "ఇతను జీవితంలో ఒక్క మంచిపనైనా చేయలేద"ంటూ శిక్షించే దూతలు మొండి పట్టుపట్టారు. అంతలోనే ఒక దైవదూత మనిషి రూపంలో అక్కడికి వచ్చాడు. ఇరుపక్షాల దూతలు ఆ వ్యక్తి మధ్యవర్తిత్వాన్ని అంగీకరించారు. అప్పుడతను "ఈ రెండు ఊళ్ల మధ్యనున్న దూరాన్ని కొలవండి. (అతను బయలుదేరిన

آدمِيٍّ فَجَعَلُوهُ بَيْنَهُمْ - أيْ حَكَماً - فَقَالَ: قِيسُوا مَا بَيْنَ الأرْضَيْنِ فإلى أيَّتِهِمَا كَانَ أدْنَى فَهُوَ لَهُ، فَقَاسُوا فَوَجَدُوهُ أدنى إلى الأرضِ الَّتِي أرَادَ، فَقَبَضَتْهُ مَلائِكَةُ الرَّحْمَةِ» متفقٌ عليه. وَفي روَايَةٍ في الصَّحيح: «فَكَانَ إلى القَرْيَةِ الصَّالِحَةِ أقْرَبَ بِشِبْرٍ، فَجُعِلَ مِنْ أهْلِهَا»، وفي

స్థలానికి) ఏ ఊరు దగ్గరగా ఉందో తదనుగుణంగానే అతనితో వ్యవహరించడం జరుగుతుంది" అని తీర్పు చెప్పాడు. కొలిచి చూస్తే ఆ వ్యక్తి (పాప నిష్కృతి కోసం) పోదలచుకున్న ఊరే దగ్గరగా అనిపించింది వారికి. దాంతో కారుణ్యదూతలు అతణ్ణి తమ అధీనం లోకి తీసుకున్నారు. *(బుఖారీ - ముస్లిం)*

రِوَايَةٍ فِي الصَّحِيحِ: «فَأَوحَى اللهُ تَعَالى إلى هَذِهِ أَنْ تَبَاعَدِي، وَإلى هَذِهِ أَنْ تَقَرَّبِي، وَقَالَ: قِيسُوا ما بينَهُما، فَوَجَدُوهُ إلى هَذِهِ أَقْرَبَ بِشِبْرٍ فَغَفَرَ لَهُ»، وفي روايةٍ: «فَنَأَى بِصَدْرِهِ نَحْوَهَا».

సహీహ్‌లోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: కొలిచిన తర్వాత చూస్తే ఆ వ్యక్తి (భౌతికకాయం) సజ్జనుల ప్రాంతానికి ఒక జానెడు దగ్గరగా ఉన్నట్లు తేల డంతో అతన్ని కూడా ఆ ప్రాంతంలోని మంచి మనుషుల్లో చేర్చడం జరిగింది.

సహీహ్‌లోనే ఇంకొక ఉల్లేఖనంలోని వాక్యాలు ఈ విధంగా ఉన్నాయి : అల్లాహ్ (అతను బయలుదేరిన) ఊరిని అతనికి దూరంగా జరగమని ఆదేశించాడు. అలాగే (అతను వెళ్ళదలచుకున్న) ఊరిని అతనికి దగ్గరగా జరగమని ఆదేశించాడు. ఆ తరువాత (ఆ వ్యక్తి మృతదేహం నుంచి) ఆ రెండు ఊర్ల మధ్య ఎంత దూరం ఉందో కొలిచి చూడమని ఆజ్ఞాపించాడు. అల్లాహ్ ఆదేశానుసారం కొలిచి చూస్తే, అతని (భౌతికకాయం) సజ్జనుల ప్రాంతానికి ఒక జానెడు దగ్గరగా ఉండటం వారు గమనించారు. అందువల్ల అతన్ని మన్నించడం జరిగింది.

వేరొక ఉల్లేఖనంలో అతను తన రొమ్ము ఆధారంగా (అల్లాహ్ మహిమతో) బయలుదేరిన ప్రాంతానికి దూరం జరిగి రెండవ వైపుకు (కాస్తంత) దగ్గరయ్యాడని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణం. సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. చిత్త శుద్ధితో పశ్చాత్తాపపడాలేగాని అల్లాహ్ ప్రతి ఒక్కరి పశ్చాత్తాపాన్నీ ఆమోదిస్తాడనీ, పరమ దుర్మార్గుల కోసం కూడా పశ్చాత్తాప ద్వారం తెరిచే వుంటుందని పై హదీసు ద్వారా బోధపడుతోంది. (తౌబా కొరకు అనివార్యమైన నిబంధనలను ఇంతకు ముందే ప్రస్తావించడం జరిగింది.)
2. పండితులు ఏదయినా ధర్మ సందేహానికి సమాధానం ఇస్తున్నప్పుడు, అడిగేవాని మనస్తత్వాన్ని, అతని ఇక్కట్లను దృష్టిలో పెట్టుకొని సమాధానం ఇవ్వాలి. అటు దైవాజ్ఞలకూ విరుద్ధంగా పోకుండా, ఇటు పృచ్ఛకుని మనోమయ భావాలకు కూడా గాయం కలగకుండా ఎంతో ఓర్పుతో, నేర్పుతో సమాధానం ఇవ్వాలి. పృచ్ఛకుడు దైవకారుణ్యం పట్ల నిరాశచెంది పాపకార్యాల్లో మరింత నిర్భయుడైపోకుండా జాగ్రత్తపడాలి.
3. సజ్జనుల సహచర్యంలో ఉండటం శ్రేయస్కరం. మూర్ఖుల సాంగత్యం ఎన్నటికైనా ప్రమాదకరమే.
4. అవసరమైనప్పుడు దైవదూతలు అల్లాహ్ ఆదేశానుసారం మానవ రూపంలో కూడా వస్తుంటారు.

21. హజ్రత్ అబ్దుల్లాహ్ (రజి) కాబ్ బిన్ మాలిక్ కుమారుల్లో ఒకరు. తన తండ్రి అంధులైపోయినప్పుడు ఆయనకు తనే దారి చూపించేవారు. కాబ్ బిన్ మాలిక్ (రజి) తబూక్ యుద్ధ సందర్భంగా దైవ ప్రవక్త (సల్లం) వెంట యుద్ధానికి వెళ్ళకుండా వెనక ఉండిపోయిన సంఘటనను గురించి స్వయంగా **తనే** వివరిస్తుం

٢١ ـ وَعَنْ عَبْدِ اللهِ بْنِ كَعْبِ بْنِ مَالِكٍ، وَكَانَ قَائِدَ كَعْبٍ رضي الله عنه مِنْ بَنِيهِ حِينَ عَمِيَ قَالَ: سَمِعْتُ كَعْبَ بْنَ مَالِكٍ رضي الله عنه يُحَدِّثُ بِحَدِيثِهِ حِينَ تَخَلَّفَ عن رسولِ اللهِ ﷺ في غَزْوَةِ تَبُوكَ.

قَالَ كَعْبٌ: لَمْ أَتَخَلَّفْ عَنْ رسولِ الله ﷺ، فِي غَزْوَةٍ غَزَاهَا قَطُّ إلا فِي غزوَةِ تَبُوكَ، غَيْرَ أَنِّي قدْ تَخَلَّفْتُ في غزوةِ بَدْرٍ، وَلَمْ يُعَاتَبْ أَحَدٌ تَخَلَّفَ عَنْهُ، إنَّمَا خَرجَ رسولُ الله ﷺ والمُسْلِمُونَ يُرِيدُونَ عيرَ قُرَيْشٍ حَتَّى جَمَعَ اللهُ تَعَالَى بَيْنَهُمْ وَبَيْنَ عَدُوِّهِمْ عَلَى غَيْرِ مِيْعَادٍ. وَلَقَدْ شَهِدْتُ مَعَ رَسُولِ الله ﷺ لَيْلَةَ العَقَبَةِ حِيْنَ تَوَاثَقْنَا على الإسْلام، وَمَا أُحِبُّ أنَّ لِي بِهَا مَشْهَدَ بَدْرٍ، وإنْ كانَتْ بَدْرٌ أَذْكَرَ فِي النَّاسِ مِنْهَا. وَكَانَ مِنْ خَبَرِي حِينَ تَخَلَّفْتُ عَنْ رسولِ الله ﷺ، فِي غَزْوَةِ تَبُوكَ أَنِّي لَمْ أَكُنْ قَطُّ أَقْوَى وَلا أَيْسَرَ مِنِّي حِيْنَ تَخَلَّفْتُ عَنْهُ فِي تِلْكَ الغَزْوَةِ، وَاللهِ مَا جَمَعْتُ قَبْلَهَا رَاحِلَتَيْنِ قَطُّ حَتَّى جَمَعْتُهُمَا فِي تِلْكَ الغَزْوَةِ، وَلَمْ يَكُنْ رسولُ الله ﷺ يُرِيدُ غَزْوَةً إلا وَرَّى بِغَيْرِهَا حَتَّى كَانَتْ تِلْكَ الغَزْوَةُ، فَغَزَاهَا رسولُ الله ﷺ فِي حَرٍّ شَدِيدٍ، واسْتَقْبَلَ سَفَراً بَعِيداً وَمَفَازاً،

డగా తాను విన్నానని హజ్రత్ అబ్దుల్లా (రజి) తెలియజేశారు -

హజ్రత్ కాబ్ బిన్ మాలిక్ (రజి) ఇలా తెలిపారు : నేను ఒక్క తబూక్ యుద్ధంలో తప్ప మరే యుద్ధంలోనూ దైవప్రవక్త (సల్లం)ను వదలి వెనకుండి పోలేదు. బద్ర్ యుద్ధంలో కూడా నేను (యుద్ధంలో పాల్గొనకుండా) వెనకుండి పోయాను. అయితే బద్ర్ యుద్ధంలో పాల్గొననందుకు ఎవరిపైనా ఆగ్రహం వ్యక్తం కాలేదు. ఎందుకంటే ఈ యుద్ధానికి ముందు దైవప్రవక్త (సల్లం) మరియు ముస్లింలు ఖురైష్ తెగకు చెందిన వర్తక బిడారాలను అడ్డుకోవడానికి బయలుదేరారు. (అంటే మొదట్లో ఆయనకు యుద్ధంచేసే ఉద్దేశం లేదు) కాని అల్లాహ్ ఎలాంటి కాలనిర్ణయం లేకుండా హఠాత్తుగా శత్రువర్గాన్ని ముస్లింల ముందుకు తెచ్చి నిలబెట్టాడు. మేము ఇస్లాం స్వీకరిస్తామని ప్రమాణం చేసిన ఉఖబా ప్రమాణం సందర్భంలో కూడా నేను దైవప్రవక్త (సల్లం) సన్నిధికి హాజరయ్యాను. ప్రజల్లో ఉఖబా ప్రమాణం కన్నా బద్ర్ యుద్ధ సంఘటనే ఎక్కువ చర్చనీయాంశంగా మారినప్పటికీ నాకు మాత్రం బద్ర్ యుద్ధం కన్నా ఉఖబా ప్రమాణంలో హాజరుకావడమే ప్రియమైనదిగా తోచేది.

واسْتَقْبَلَ عَدَداً كَثِيراً، فَجَلَّى لِلْمُسلِمِينَ أَمْرَهُمْ لِيَتَأَهَّبُوا أُهْبَةَ غَزْوِهِمْ فَأَخْبَرَهُمْ بِوَجْهِهِمُ الذي يُرِيدُ، وَالمُسلِمُونَ مَعَ رسولِ الله كَثِيرٌ وَلا يَجْمَعُهُم كِتَابٌ حَافِظٌ -يريدُ بذلِكَ الدِّيوانَ- قَالَ كَعْبٌ: فَقَلَّ رَجُلٌ يُرِيدُ أَنْ يَتَغَيَّبَ إلا ظَنَّ أَنَّ ذٰلِكَ سَيَخْفَى بِهِ مَا لَمْ يَنْزِل فِيه وَحْيٌ مِنَ اللهِ، وَغَـزَا رسـولُ الله ﷺ تِلْـكَ الغَـزْوَةَ حِيـنَ طَابَتِ الثِّمَارُ وَالظِّلالُ فَأَنَا إِلَيْهَا أَصْعَرُ

నేను తబూక్ యుద్ధంలో పాల్గొనకపోవడానికి కారణమయిన వృత్తాంతం అసలు ఇది : తబూక్ యుద్ధంలో పాల్గొనకుండా వెనకుండిపోయిన రోజుల్లో నేను మునుపెన్నడూ లేనంతగా ఆరోగ్యవంతునిగా ఉన్నాను. సిరిసంపదలతో తులతూగుతూ ఉన్నాను. దైవం సాక్షి! అంతకు ముందెన్నడూ నా దగ్గర రెండు వాహనాలు ఉండేవి కావు. కాని ఆ యుద్ధ సమయంలో నా దగ్గర రెండు వాహనాలు ఉన్నాయి. సాధారణంగా దైవప్రవక్త (సల్లం) ఏ యుద్ధానికైనా వెళ్ళాలనుకుంటే వెళ్ళబోయే ప్రాంతాన్ని గురించి (తౌరియా) చూచాయగా మాత్రమే వివరించేవారు. (అంటే ఆయన ఏ దారిగుండా వెళుతున్నారో తెలపకుండా ఇతర దారులను ప్రస్తావించేవారు. దాంతో శత్రువులు సందిగ్ధంలో పడిపోయేవారు. ఆఖరికి తబూక్ యుద్ధం సమీపించింది. దైవప్రవక్త (సల్లం) తీవ్రమైన ఎండాకాలంలో ఈ యుద్ధం చేశారు. సుదీర్ఘ ప్రయాణం, చుక్క నీరు దొరకని ఎడారి ప్రాంతం గుండా ప్రయాణం చేయాలి. శత్రువులు కూడా చాలా ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. యుద్ధ సన్నాహాలు పూర్తి చేసుకోవడానికి వీలుగా ఉంటుందని భావించి, దైవప్రవక్త ముస్లింలకు తాము చేయబోయే యుద్ధతంత్రాన్ని గురించి

فَتَجَهَّزَ رسولُ الله ﷺ والمُسْلِمُونَ مَعَهُ، وَطَفِقْتُ أَغْدُو لِكَي أَتَجَهَّزَ مَعَه، فَأَرْجِعُ وَلَمْ أَقْضِ شَيْئاً، وَأَقُولُ فِي نَفْسِي: أَنَا قَادِرٌ عَلَى ذٰلِك إِذَا أَرَدْتُ، فَلَمْ يَزَلْ يَتَمَادَى بِي حَتَّى اسْتَمَرَّ بِالنَّاسِ الجِدُّ، فَأَصْبَحَ رسولُ الله ﷺ غَادِياً وَالمُسْلِمُونَ مَعَهُ، وَلَمْ أَقْضِ مِنْ جِهَازِي شَيْئاً، ثُمَّ غَدَوْتُ فَرَجَعْتُ وَلَمْ أَقْضِ شَيْئاً فَلَمْ يَزَلْ

పూర్తిగా విడమరచి చెప్పారు. ప్రయాణ దిశను కూడా సూచించారు.

దైవప్రవక్త (సల్లం) వెంట ముస్లింలు చాలా పెద్ద సంఖ్యలోనే వున్నారు. ముస్లిం యోధుల పేర్లన్నీ ఏదైనా పుస్తకంలో (అంటే రిజిష్టరులో) నమోదు చేయడానికి వీలులేకుండా ఉంది. అందుచేత యుద్ధానికి పోకుండా ఎగవేయాలనుకున్నవాడు తనను గురించి అల్లాహ్ వహీ ద్వారా ప్రవక్తకు తెలియపరిస్తే తప్ప మరెవరూ తెలుసు కోలేరని భావించేవాడు. దైవప్రవక్త (సల్లం) ఈ యుద్ధ నిర్ణయం తీసుకునే టప్పటికి (తోటలలో) కాయలు పండి కోతకొచ్చాయి. చెట్ల నీడలు చల్లగా తయారయ్యాయి. నా మనసు కూడా ఆ (పండ్లు, నీడల) వైపే మొగ్గు చూపింది. అయితే దైవప్రవక్త (సల్లం) మరియు ముస్లింలు యుద్ధ సన్నాహాలు పూర్తిచేసుకున్నారు. నేను కూడా ఆయనతో పాటు యుద్ధసన్నాహాలు చేసుకుందామని ఉదయం బయలు దేరేవాణ్ణి. కాని ఎలాంటి నిర్ణయం తీసుకోకుండానే వెనుతిరిగి వెళ్ళిపోయే వాడిని. నా దగ్గర అన్ని వసతులూ ఉన్నాయి. కనుక సన్నాహాలు పూర్తి చేసుకోవడానికి నాకెంతో సమయం పట్టదని భావించేవాణ్ణి. నేను అదే స్థితిలో ఉండగా ప్రజలు మాత్రం యుద్ధ

يَتَمَادَى بِي حَتَّى أَسْرَعُوا وَتَفَارَطَ الغَزْوُ، فَهَمَمْتُ أَنْ أَرْتَحِلَ فَأُدْرِكَهُمْ، فَيَا لَيْتَنِي فَعَلْتُ، ثُمَّ لَمْ يُقَدَّرْ ذٰلك لِي، فَطَفِقْتُ إِذَا خَرَجْتُ فِي النَّاسِ بَعْدَ خُرُوجِ رسولِ الله ﷺ يَحْزُنُنِي أَنِّي لا أَرَى لِي أُسْوَةً، إلا رَجُلاً مَغْمُوصاً عَلَيْهِ فِي النِّفَاقِ، أو رَجُلاً مِمَّنْ عَذَرَ اللهُ تعالَى مِنَ الضُّعَفَاءِ، وَلَمْ يَذْكُرْنِي رسولُ الله ﷺ حَتَّى بَلَغَ تَبوكَ، فَقَالَ وَهُوَ جَالِسٌ فِي القَوم بِتَبُوكَ: «مَا فَعَلَ كَعْبُ بْنُ مَالِكٍ؟» فَقَالَ رَجُلٌ مِنْ بَنِي سَلِمَةَ: يَا رسولَ الله حَبَسَهُ بُرْدَاهُ، وَالنَّظَرُ فِي عِطْفَيْهِ. فَقَالَ لَهُ

సన్నాహాలు చేసుకోవడంలో నిమగ్నులై ఉన్నారు. ఒక రోజు ఉదయం దైవప్రవక్త (సల్లం) ఆయన వెంట ముస్లింలు కూడా యుద్ధానికి బయలుదేరారు. అప్పటికీ నేను యుద్ధసన్నాహాల విషయమై ఎలాంటి నిర్ణయమూ తీసుకోలేకపోయాను. సన్నాహాలు చేసుకుందామని ఉదయం బయలుదేరాను. కాని సాయంత్రం తిరిగి వెళ్ళిపోయాను. ఎటూ తేల్చుకోలేకపోయాను. తరువాత కూడా నా పరిస్థితి అలాగే ఉండిపోయింది. అదే సమయంలో అటు ముస్లిం యోధులు సమధికోత్సాహంతో ముందుకు సాగిపోతున్నారు. యుద్ధ తంత్రం కూడా చాలా పకడ్బందీగా సాగింది. నేను అప్పుడు కూడా బయలుదేరి వారిని కలుసుకుందామని భావించాను. కనీసం అప్పుడైనా బయలుదేరి వుంటే బాగుండు. కాని నాకా అదృష్టం లేకపోయింది.

దైవప్రవక్త (సల్లం) వెళ్ళిపోయిన తరువాత బయట తిరిగి చూస్తే (మదీనాలో) ఛీత్కరించబడిన కపట విశ్వాసులు, అల్లాహ్ కారణగ్రస్తులుగా ఖరారు చేసిన బలహీనులు తప్ప నాలాంటి స్థితిమంతులెవరూ నాకు కనిపించలేదు. దాంతో నాకు దుఃఖం ముంచుకొచ్చేది. అటు దైవప్రవక్త (సల్లం) కూడా తబూక్ చేరుకునే వరకూ

مُعَاذُ بْنِ جَبَلٍ رضي الله عنه: بِئْسَ مَا قُلْتَ! وَاللهِ يَا رسولَ الله ما عَلِمْنَا عَلَيْهِ إلا خَيْراً، فَسَكَتَ رسولُ الله ﷺ. فَبَيْنَا هو عَلَى ذٰلِكَ رَأَى رَجُلاً مُبْيِضاً يَزُولُ بِهِ السَّرَابُ، فَقَالَ رسولُ الله ﷺ: «كُنْ أَبَا خَيْثَمَةَ»، فَإِذَا هُوَ أَبُو خَيْثَمَةَ الأَنْصَارِيُّ وَهُوَ الذي تَصَدَّقَ بِصَاعِ التَّمْرِ حِينَ لَمَزَهُ المُنَافِقُونَ، قَالَ كَعْبٌ: فَلَمَّا بَلَغَنِي أَنَّ رسولَ الله ﷺ قَدْ تَوَجَّهَ قَافِلاً من تَبُوكَ حَضَرَنِي بَثِّي، فَطَفِقْتُ أَتَذَكَّرُ الكَذِبَ وَأَقُولُ: بِمَ أَخْرُجُ مِنْ سَخَطِهِ غَداً، وَأَسْتَعِينُ عَلَى ذٰلِكَ بِكُلِّ ذِي رَأْيٍ مِنْ أَهْلِي، فَلَمَّا قِيلَ: إِنَّ رسولَ الله ﷺ قَدْ أَظَلَّ قَادِماً زَاحَ عَنِّي البَاطِلُ حَتَّى عَرَفْتُ أَنِّي لَمْ أَنْجُ مِنْهُ بِشَيْءٍ أَبَداً، فَأَجْمَعْتُ صِدْقَهُ، وَأَصْبَحَ رسولُ الله ﷺ قَادِماً، وَكَانَ إذا قَدِمَ مِن سَفَرٍ بَدَأَ بِالمَسْجِدِ فَرَكَعَ فِيهِ رَكْعَتَيْنِ ثُمَّ جَلَسَ لِلنَّاسِ، فَلَمَّا فَعَلَ ذٰلِكَ جَاءَهُ المُخَلَّفُونَ يَعْتَذِرُونَ إِلَيْهِ وَيَحلِفُونَ لَهُ، وكَانُوا بِضْعاً وَثَمانِينَ رَجُلاً فَقَبِلَ مِنْهُمْ عَلانِيَتَهُمْ وَبَايَعَهُمْ وَاسْتَغْفَرَ لَهُمْ وَوَكَلَ سَرَائِرَهُمْ إلى اللهِ تعالى حَتَّى جِئْتُ.

నన్ను గుర్తుచేయలేదు. తబూక్ చేరుకున్న తరువాత సహచరుల మధ్య కూర్చొని ఉన్నప్పుడు నన్ను గుర్తుచేసుకొని "కాబ్ బిన్ మాలిక్ ఏడి? (అతను యుద్ధానికి రాలేదా)?" అనడిగారు. వెంటనే బనూ సల్మా తెగకు చెందిన ఒక వ్యక్తి లేచి, "అతణ్ణి అతని రెండు దుప్పట్లు మరియు తన రెండు బాహువుల్ని చూసుకొని మురిసిపోవడాలు రాకుండా చేశాయి. (అంటే అతని సిరిసంపదలు మరియు దేహదారుఢ్యం అతణ్ణి ఆపివుంచాయని అర్థం). ఈ మాట విని హ్జ్రత్ ముఆజ్ బిన్ జబల్ (రజి) అతని మాటను ఖండిస్తూ "నువ్వు పొరబడుతున్నావు. దైవం సాక్షిగా చెబుతున్నాను. దైవప్రవక్తా! మేము కాబ్ బిన్ మాలిక్‌లో మంచితనం తప్ప మరేమీ చూడలేదు" అని అన్నారు. ఈ మాటలు విని దైవప్రవక్త (సల్లం) మౌనం వహించారు.

అంతలోనే ఆయన తెల్లని దుస్తులు ధరించిన ఓ మనిషి ఎడారిగుండా తమ వైపు వస్తున్నట్లు గమనించారు. (దగ్గరికొచ్చిన తర్వాత) అతనితో "నువ్వు అబూ ఖైసమావు కదూ!" అన్నారు. నిజంగానే ఆయన అబూ ఖైసమా అన్సారీయేనని తేలింది. (ఈయన ఎవరో కాదు) ఒకసారి ఈయన ఒక 'సా' ఖర్జూర పండ్లు దానం చేసినందుకు (కొద్దిపాటి

ఖర్జూరాలు దానం చేశారని) కపటులు ఈయన్ని గేలిచేశారు.

హజ్రత్ కాబ్ (రజి) అంటున్నారు : దైవప్రవక్త (సల్లం) తబూక్ నుండి తిరుగు ప్రయాణమయ్యారని తెలుసుకున్నప్పుడు నన్ను తీవ్ర దుఃఖం అలుముకుంది. కుంటిసాకులు చెబుదామని ప్రయత్నించసాగాను. దైవప్రవక్త (సల్లం) ఆగ్రహం నుండి తప్పించుకునే మార్గమేదని మనసులో అన్వేషణ మొదలయ్యింది. ఈ విషయమై నా కుటుంబంలోని బుద్ధిమంతుల్నందరినీ సంప్రదించసాగాను. దైవప్రవక్త (సల్లం) ఇంకొంచెం సేపట్లో రానున్నారని తెలుసుకున్న తరువాత నా మనసులోని కల్లబొల్లి ఆలోచనలన్నీ పటాపంచలైపోయాయి. అబద్ధాలు చెప్పి తప్పించుకోలేనని నాకర్థమయి పోయింది. ఏమయినాసరే ఉన్నదు న్నట్లు నిజం చెప్పాలని గట్టిగా నిర్ణయించుకున్నాను.

దైవప్రవక్త (సల్లం) తెల్లవారుజామున (మదీనాకు) తిరిగి వచ్చేశారు. ప్రయాణం నుండి తిరిగొచ్చిన తరువాత ముందుగా మస్జిద్‌కు వెళ్ళి రెండు రకాతుల నమాజు చేయటం ఆయన అలవాటు. ఆ తరువాత అయన ప్రజలను కలుసుకుంటారు. ఆనవాయితీ ప్రకారం ఆయన ఈసారి కూడా ప్రయాణం నుండి

فَلَمَّا سَلَّمْتُ تَبَسَّمَ تَبَسُّمَ المُغْضَبِ ثُمَّ قَالَ: تَعَالَ، فَجِئْتُ أَمْشِي حَتَّى جَلَسْتُ بَيْنَ يَدَيْهِ، فَقَالَ لِي: ما خَلَّفَكَ؟ أَلَمْ تَكُنْ قَدِ ابْتَعْتَ ظَهْرَكَ! قَالَ: قُلْتُ: يَا رسولَ الله إنِّي واللهِ لَو جَلَسْتُ عِنْدَ غَيْرِكَ من أَهْلِ الدُّنْيَا لَرَأَيْتُ أَنِّي سَأَخْرُجُ مِنْ سَخَطِهِ بِعُذْرٍ؛ لَقَدْ أُعْطِيتُ جَدَلًا، وَلٰكِنِّي وَاللهِ لَقَدْ عَلِمْتُ لَئِنْ حَدَّثْتُكَ اليَومَ حَدِيثَ كَذِبٍ تَرْضَى بِه عَنِّي لَيُوشِكَنَّ اللهُ [أن] يُسْخِطَكَ عَلَيَّ، وَإِنْ حَدَّثْتُكَ حَدِيثَ صِدْقٍ تَجِدُ عَلَيَّ فِيهِ إنِّي لأرْجُو فِيهِ عُقْبَى اللهِ عَزَّ

తిరిగొచ్చిన తరువాత అలాగే చేశారు. (యుద్ధానికి వెళ్లకుండా ఉండిపోయిన) కపటులు ఆయన దగ్గరికి వచ్చి కుంటిసాకులు చెప్పడం, ఒట్లువేయడం చేస్తున్నారు. ఈ విధంగా అబద్ధపు సాకులు చెప్పినవారు ఎనభైమందికి పైగానే ఉన్నారు. వారు చెప్పిన సాకుల్ని దైవప్రవక్త (సల్లం) అంగీకరించారు. వారిచేత ప్రమాణాలు చేయించుకొని వారి మన్నింపు కోసం వేడుకున్నారు. వారి అంతరంగాల స్థితిని అల్లాహ్‌కు వదలి వేశారు.

నేను కూడా దైవప్రవక్త (సల్లం) సన్నిధికి హాజరయ్యాను. నేనాయనకు సలాం చేయగానే ఆయన చిరునవ్వు చిందించారు. ఆ నవ్వులో కించిత్ అయిష్టత తొంగిచూసింది. ఆయన దగ్గరికి రమ్మన్నారు. నేను ఇంకాస్త ముందుకు వెళ్ళి ఆయనకెదురుగా కూర్చున్నాను. ఆయన నన్ను "చెప్పు, నువ్వు యుద్ధానికి ఎందుకు రాలేదు? వాహనం కొనుక్కోలేదా?" అనడిగారు. దానికి నేను ఇలా జవాబు చెప్పాను: "ఓ దైవప్రవక్తా! నేను దైవం సాక్షిగా చెబుతున్నాను. మీ బదులు నేను ఇంకెవరి ముందైనా కూర్చొని ఉంటే నిస్సంకోచంగా ఏదో ఒక సాకు చెప్పి అతని ఆగ్రహం నుండి తప్పించుకునేవాణ్ణి. నాకు వాక్చాతుర్యం బాగానే ఉంది. కాని దేవుని తోడు! ఈ

وَجَلَّ، واللهِ مَا كَانَ لِي مِنْ عُذْرٍ، وَاللهِ مَا كُنْتُ قَطُّ أَقْوَى وَلا أَيْسَرَ مِنِّي حِينَ تَخَلَّفْتُ عَنْكَ. قَالَ: فَقَالَ رسولُ الله ﷺ: «أَمَّا هٰذَا فَقَدْ صَدَقَ، فَقُمْ حَتَّى يَقْضِيَ اللهُ فِيكَ»، وَسَارَ رِجَالٌ مِنْ بَنِي سَلِمَةَ فَاتَّبَعُونِي، فَقَالُوا لِي: واللهِ مَا عَلِمْنَاكَ

أَذْنَبْتَ ذَنْباً قَبْلَ هٰذَا، لَقَدْ عَجَزْتَ فِي أَنْ لا تَكُونَ اعْتَذَرْتَ إِلى رسولِ الله ﷺ بِمَا اعْتَذَرَ إِلَيْهِ الْمُخَلَّفُونَ فَقَدْ كان كَافِيَكَ ذَنْبَكَ اسْتِغْفَارُ رسولِ الله ﷺ لَكَ. قَالَ: فَوالله مَا زَالُوا يُؤَنِّبُونَنِي حَتَّى أَرَدْتُ أَنْ أَرْجِعَ إِلى رسولِ الله ﷺ فَأُكَذِّبَ نَفْسِي، ثُمَّ قُلْتُ لَهُمْ: هَلْ لَقِيَ هٰذا مَعِي مِنْ أَحَدٍ؟ قَالُوا: نَعَمْ لَقِيَهُ مَعَكَ رَجُلانِ قَالا مِثْلَ مَا قُلْتَ، وَقِيلَ لَهُمَا مِثْلُ ما قِيلَ لَكَ، قَالَ: قُلْتُ: مَنْ هُمَا؟ قَالُوا: مُرَارَةُ بْنُ الرَّبِيعِ العَمْرِيُّ، وَهِلالُ بْنُ أُمَيَّةَ الوَاقِفِيُّ؟ قَالَ: فَذَكَرُوا لِي رَجُلَيْنِ صَالِحَيْنِ قَدْ شَهِدَا بَدْراً فِيهِمَا أُسْوَةٌ. قَالَ: فَمَضَيْتُ حِينَ ذَكَرُوهُمَا لِي. وَنَهَى رسولُ الله ﷺ عَنْ كَلامِنَا أَيُّهَا الثَّلاثَةُ مِنْ بينِ مَنْ تَخَلَّفَ عَنْهُ، قَالَ: فَاجْتَنَبَنَا النَّاسُ ـ أَو قالَ: تَغَيَّرُوا لَنَا ـ حَتَّى تَنَكَّرَتْ لِي فِي نَفْسِي الأَرْضُ،

రోజు నేను మీ ముందు అబద్ధం చెప్పి మీ ఆగ్రహం నుంచి తప్పించుకున్నా త్వరలోనే అల్లాహ్ మీకు వాస్తవం తెలియజేస్తాడు. అప్పుడైనా మీరు నా మీద కోప్పడతారు. దానికి బదులు నేను నిజం చెబితే (ప్రస్తుతానికి) మీరు నన్ను కోపగించుకున్నప్పటికీ దీని ద్వారానే అల్లాహ్ నాకు మేలు చేస్తాడని ఆశిస్తు న్నాను. దైవం సాక్షిగా నిజం చెబుతు న్నాను - నాకెలాంటి ఆటంకాలూ లేవు. పైగా నేను (యుద్ధానికి పోకుండా వెనక ఉండిపోయిన రోజుల్లో) ఆరోగ్యపరంగా, సిరిసంపదలపరంగా ఇదివరకెన్నడూ లేనంత దృఢంగా, సుఖంగా ఉన్నాను."

నా సంజాయిషీ విని దైవప్రవక్త (సల్లం) "ఇతను నిజం చెబుతున్నాడు" అన్నారు. తరువాత నావైపు తిరిగి "సరే వెళ్ళు. నీ విషయంలో అల్లాహ్ ఏదో ఒక నిర్ణయం అవతరింపజేసేంతవరకూ వేచి ఉండు" అని అన్నారు. (నేను అక్కడినుండి లేచి వెళ్తుండగా) బనూ సల్మా తెగకు చెందిన వారు కొందరు నా వెనకాలే వచ్చి, "దైవం సాక్షిగా చెబుతున్నాము. నువ్వు ఇంత వరకూ ఏ పాపమూ చేసినట్లు మేము చూడలేదు. యుద్ధానికి వెళ్ళకుండా ఉండిపోయిన ఇతర మనుషుల్లాగే నువ్వు కూడా ఏదో ఒక సాకు చెప్పక పోయావా! నువ్వు చేసిన ఈ తప్పుకి దైవప్రవక్త (సల్లం) చేసే మన్నింపు ప్రార్థన

فَمَا هِيَ بالأرْضِ الَّتِي أَعْرِفُ، فَلَبِثْنَا على ذلكَ خَمْسِينَ لَيْلَةً. فَأَمَّا صَاحِبَايَ فَاسْتَكَانَا وَقَعَدَا فِي بُيُوتِهِمَا يَبْكِيَانِ، وَأَمَّا أَنَا فَكُنْتُ أَشَبَّ القَوْمِ وَأَجْلَدَهُمْ، فَكُنْتُ أَخْرُجُ فَأَشْهَدُ الصَّلَاةَ مَعَ المُسْلِمِينَ، وَأَطُوفُ فِي الأَسْوَاقِ وَلا يُكَلِّمُنِي أَحَدٌ،

సరిపోయేది కదా!" అని సలహా యిచ్చారు.

"దైవం సాక్షి! నేను నిజం చెప్పినందుకు వారు నన్ను ఎంతగానో నిందించడం, మందలించడం చేశారు. వారి నిందలు భరించలేక నేనొక సందర్భంలో - మళ్ళీ దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి ఇంతకు ముందు నేను ఒప్పుకున్నది అబద్ధమని చెప్పి, ఏదైనా సాకు చూపెడదామని కూడా - మనసులో అనుకున్నాను. తరువాత నేను వారితో "ఇలాంటి పరిస్థితి నాతోపాటు ఇంకెవరికైనా ఎదురయిందా" అని అడిగాను. దానికి వారు "అవును. ఇంకా ఇద్దరున్నారు. వారికీ ఇలాంటి సమస్యే ఎదురయింది. వారూ నీ లాగే నిజం చెప్పారు. దైవప్రవక్త (సల్లం) నుంచి నీకు లభించిన సమాధానమే వాళ్ళకీ లభించింది" అని అన్నారు. "ఎవరు వారు?" అని అడిగాను. "ఒకతను మురారా బిన్ రబీ అమ్రి. రెండవతను హిలాల్ బిన్ ఉమయ్యా వాఖిఫీ." వారు ఈ రెండు పేర్లూ నా ముందు ప్రస్తావించారు. వీరిద్దరూ చాలా మంచివాళ్ళే. బద్ర్ యుద్ధంలో కూడా పాల్గొన్నారు. ఈ వ్యవహారంలో వారూ నాతో పాటు వున్నారు (ఇది నాకు కొంత ఊరటను కలిగించింది). ఈ ఇద్దరి పేర్లు విన్న తరువాత నేను నా తొలి అభిప్రాయంపైనే స్థిరంగా ఉండిపోయాను.

(ప్రజల నిందలు, మందలింపుల వల్ల నాలో ఏర్పడిన సందిగ్ధావస్థ దూరమయి పోయింది) నేను (వాళ్ళ చెరనుండి విడిపించుకొని) ముందుకు సాగాను.

యుద్ధానికి వెళ్ళకుండా వెనుకుండి పోయిన మా ముగ్గురితో ఎవరూ మాట్లాడకూడదని దైవప్రవక్త (సల్లం) ప్రజలను ఆదేశించారు. (ఆ ఆజ్ఞ తరువాత) జనం మాకు దూరంగా మసలుకోసాగారు (లేక) మా ముగ్గురి విషయంలో వారు చాలా మారిపోయారు (అని కాబ్ అన్నారు). ప్రజల ప్రవర్తన వల్ల నాకు - మనసులో - ఈ లోకమే విచిత్రంగా కనిపించింది. "నేను (నా స్వంత ప్రదేశంలో గాకుండా) మరేదైనా కొత్త ప్రదేశంలో ఉన్నానా?!" అనిపించింది నాకు. యాభై రాత్రులు మేము ఇలాగే గడిపాము.

నా సహచరులిద్దరూ (ఈ పరిస్థితిని) భరించలేక బయటికి రాకుండా ఇంట్లోనే కూర్చొని కన్నీరు మున్నీరుగా విలపించ సాగారు. కాని నేను యువకుణ్ని. వారిద్దరి కన్నా బాగా సత్తువ కలవాడిని. కనుక నేను బయటికి వచ్చి తోటి ముస్లింలతో పాటు నమాజులకు హాజరయ్యేవాణ్ణి. బజారుల్లో తిరిగేవాడిని. కాని ఎవరూ నాతో మాట్లాడేవారు కాదు. నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి కూడా వెళ్ళేవాడిని. నమాజు ముగిసిన తరువాత

وَآتِي رسولَ الله ﷺ فَأُسَلِّمُ عَلَيْهِ، وَهُوَ فِي مَجْلِسِهِ بَعْدَ الصَّلاةِ، فَأَقُولُ فِي نَفْسِي: هَلْ حَرَّكَ شَفَتَيْهِ بِرَدِّ السَّلام أَمْ لا؟ ثُمَّ أُصَلِّي قَرِيباً مِنْهُ وَأُسَارِقُهُ النَّظَرَ، فَإِذَا أَقْبَلْتُ عَلَى صَلاتِي نَظَرَ إِلَيَّ، وَإِذَا الْتَفَتُّ نَحْوَهُ أَعْرَضَ عَنِّي، حَتَّى إذا طَالَ ذٰلِكَ عَلَيَّ مِنْ جَفْوَةِ الْمُسْلِمِينَ مَشَيْتُ حَتَّى تَسَوَّرْتُ جِدَارَ حَائِطِ أَبِي قَتَادَةَ وَهُوَ ابْنُ عَمِّي وَأَحَبُّ النَّاسِ إِلَيَّ، فَسَلَّمْتُ عَلَيْهِ فَوَاللهِ مَا رَدَّ عَلَيَّ السَّلامَ، فَقُلْتُ لَه: يَا أَبَا قَتَادَةَ أَنْشُدُكَ باللهِ هَلْ تَعْلَمُنِي أُحِبُّ اللهَ

وَرَسُولَهُ ﷺ؟ فَسَكَتَ، فَعُدْتُ فَنَاشَدْتُه فَسَكَتَ، فَعُدْتُ فَنَاشَدْتُه فَقَالَ: اللهُ وَرَسُولُهُ أَعْلَمُ. فَفَاضَتْ عَيْنَايَ، وَتَوَلَّيْتُ حَتَّى تَسَوَّرْتُ الجدَارَ. فَبَيْنَا أنَا أَمْشِي في سُوقِ المَدِينَةِ إذَا نَبَطِيٌّ منْ نَبَطِ أَهْلِ الشَّام مِمَّنْ قَدِمَ بالطَّعَام يَبِيعُه بِالمَدِينةِ يَقُولُ: مَنْ يَدُلُّ عَلَى كَعْبِ بْنِ مَالِكٍ؟ فَطَفِقَ النَّاسُ يُشيرُونَ لَهُ إلَيَّ حَتَّى جَاءَنِي فَدَفَعَ إلَيَّ كِتَاباً مِنْ مَلِكِ غَسَّانَ، وَكُنْتُ كَاتِباً. فَقَرَأْتُهُ فإذَا فِيهِ: أَمَّا بَعْدُ فَإنَّهُ قَدْ بَلَغَنَا أنَّ صَاحِبَكَ قَدْ جَفَاكَ، وَلَمْ يَجْعَلْكَ اللهُ بِدَارِ هَوَانٍ ولا مَضْيَعَةٍ، فَالْحَقْ بِنَا نُوَاسِكَ فَقُلْتُ حِينَ قَرَأْتُهَا: وَهٰذِهِ أَيْضاً مِنَ البَلاءِ فَتَيَمَّمْتُ بهَا التَّنُّورَ فَسَجَرْتُهَا، حَتَّى إذَا

ఆయన సమావేశమై ఉన్నప్పుడు నేనాయనకు సలాం చేసేవాడిని. నా సలాంకు జవాబుగా దైవప్రవక్త గారి శుభప్రదమైన అధరాల్లో కదలిక కన్పిస్తుందేమోనని కుతూహలంతో ఎదురుచూసేవాడిని లేదా ఆయనకు దగ్గరగా నిలబడి నమాజు చేస్తూ క్రీగంటి చూపులతో ఆయన వైపు చూస్తూండే వాడిని. ఆ సమయంలో నేను ఏకాగ్రతతో నమాజు చేస్తున్నప్పుడు ఆయన నా వంక చూడడం, తిరిగి నేను ఆయన వైపు దృష్టి సారించగానే ఆయన తన చూపుల్ని మరల్చుకోవడం గమనించాను.

ఆఖరికి (మా పట్ల) ముస్లింల కఠిన వైఖరి, ఉదాసీనతలు సుదీర్ఘమై పోవడంతో (భరించలేక) ఒకరోజు నేను అబూ ఖతాదా (రజి) తోట ప్రహరీగోడ దూకి లోపలికి వెళ్ళాను. అబూ ఖతాదా (రజి) నా పినతండ్రి కుమారుడు; ప్రజల్లో నాకు అత్యంత ప్రియతముడు కూడాను; నేనాయనకు సలాం చేశాను. దైవం సాక్షిగా చెబుతున్నాను. ఆయన నా సలాంకు బదులు చెప్పలేదు. నేనాయన్ని "అబూ ఖతాదా! నేను దేవునిపై ప్రమాణం చేసి అడుగుతున్నాను. చెప్పు, నేను దైవం మరియు దైవప్రవక్త (సల్లం) పట్ల అభిమానం కల్గి వున్నానన్న సంగతి నీకు తెలియదా?" అనడిగాను. ఆయన

مَضَتْ أَرْبَعُونَ مِنَ الْخَمْسِينَ واسْتَلْبَثَ
الْوَحْيُ إِذَا رَسُولُ رَسولِ الله ﷺ يَأْتِينِي،
فَقَالَ: إِنَّ رَسُولَ الله ﷺ يَأْمُرُكَ أَنْ تَعْتَزِلَ
امْرَأَتَكَ، فَقُلْتُ: أُطَلِّقُهَا، أَمْ مَاذَا أَفْعَلُ؟
قَالَ: لا بَلِ اعْتَزِلْهَا فَلاَ تَقْرَبَنَّهَا، وَأَرْسَلَ
إِلى صَاحِبَيَّ بِمِثْلِ ذٰلِكَ. فَقُلْتُ لامْرَأَتِي:
الْحَقِي بِأَهْلِكِ فَكُونِي عِنْدَهُمْ حَتَّى
يَقْضِيَ اللهُ فِي هذا الأَمْرِ، فَجَاءَتِ امْرَأَةُ
هِلالِ بْنِ أُمَيَّةَ رسولَ الله ﷺ فَقَالَتْ لَهُ:
يا رسولَ الله إِنَّ هِلالَ بْنَ أُمَيَّةَ شَيْخٌ ضَائِعٌ
لَيْسَ لَهُ خَادِمٌ، فَهَلْ تَكْرَهُ أَنْ أَخْدُمَهُ؟ قَالَ:

నా ప్రశ్నకు జవాబు చెప్పకుండా మౌనం వహించారు. నేనాయన్ని మళ్ళీ అదే ప్రశ్న ఒట్టేసి మరీ అడిగాను. అప్పటికీ ఆయన మౌనం వీడలేదు. మూడోసారి అదే ప్రశ్న ప్రమాణం చేసి అడిగాను. అప్పుడు ఆయన "దేవునికి, ఆయన ప్రవక్తకే బాగా తెలుసు" అని (మాట్లాడటం యిష్టం లేనట్టు) జవాబు చెప్పారు. ఆ మాట విని నా కళ్ళల్లో నీళ్లు ఉబికి వచ్చాయి. చేసేది లేక నేను తిరిగి గోడదూకి బయటికి వచ్చేశాను.

ఓ రోజు నేను మదీనాలో ఓ వీధిగుండా వెళ్తుంటే సిరియా నుండి ధాన్యం అమ్ము కోవడానికొచ్చిన రైతుల్లోని ఒకతను "కాబ్ బిన్ మాలిక్ ఎవరో నాక్కాస్త చూపెట్టగలరా!" అని జనాన్ని అడగడం నేను చూశాను. జనం నావైపు చూపించారు. అతను నా దగ్గరికి వచ్చి గస్సాన్ రాజు పంపిన ఉత్తరమొకటి నా చేతి కందించాడు. నేను చదవటం రాయటం తెలిసిన వ్యక్తిని. కనుక ఆ ఉత్తరం తీసి చదివాను. అందులో ఈ విధంగా రాసి ఉంది -

ముఖ్యముగా వ్రాయునదేమనగా - మీ సహచరుడు (ప్రవక్త) మిమ్మల్ని చాలా వేధించినట్లు మాకు సమాచారమందింది. మీరిలా పరాభవం పాలయ్యే చోటులో ఉండి, నాశనమైపోవడానికి దేవుడు మిమ్మల్ని పుట్టించలేదు. మేము

«لا، ولٰكِنْ لا يَقْرَبَنَّكِ» فَقَالَتْ: إنَّهُ واللهِ ما بِهِ مِنْ حَرَكَةٍ إلى شَيءٍ، وواللهِ مَا زَالَ يَبْكِي مُنْذُ كَانَ مِنْ أَمْرِهِ مَا كَانَ إلى يَومِهِ هٰذَا. فَقَالَ لِي بَعْضُ أَهْلِي: لَو اسْتَأْذَنْتَ رسولَ الله ﷺ في امْرَأَتِكَ، فَقَدْ أذِنَ لامْرَأَةِ هِلالِ بْنِ أُمَيَّةَ أَنْ تَخْـدُمَـهُ؟ فَقُلْـتُ: لا أَسْتَـأْذِنُ فِيهَـا رسولَ الله ﷺ، وَمَا يُدْرِينِي مَاذَا يقولُ رسـولُ الله ﷺ إذَا اسْتَـأْذَنْتُـهُ وَأَنَـا رَجُـلٌ شَابٌّ! فَلَبِثْتُ بِذلكَ عَشْرَ لَيَالٍ، فَكَمُلَ لَنَـا خَمْسونَ لَيْلَةً مِنْ حِينَ نُهِيَ عَنْ كَلامِنَا.

మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాము. మీరు మా వద్దకు రండి, మేము మిమ్మల్ని తగు రీతిలో సత్కరిస్తాం."

ఆ ఉత్తరం చదివిన తరువాత నేను "ఇదీ ఓ పరీక్షే" అన్నాను. వెంటనే దాన్ని పొయ్యిలో పెట్టి తగులబెట్టేశాను. యాభైరోజుల్లో నలభై రోజులు గడిచిన తరువాత కూడా (మా విషయంలో) దైవవాణి అవతరించలేదు. అంతలోనే దైవప్రవక్త (సల్లం) దగ్గర్నుంచి ఒక వార్తాహరుడు నా వద్దకు రావడాన్ని నేను గమనించాను. అతను నా దగ్గరికి వచ్చి "నీవు నీ భార్యకు దూరంగా ఉండాలని దైవప్రవక్త (సల్లం) ఆదేశించారు" అన్నాడు. "ఏమిటీ, నానామెకు విడాకులివ్వాలా?" అని అతన్నడిగాను. "విడాకులివ్వనవసరం లేదు. నువ్వు ఆమెకు దూరంగా ఉండు. ఆమె దగ్గరికి పోమాకు" అని చెప్పాడతను. నా సహచరులిద్దరికీ దైవప్రవక్త (సల్లం) ఇలాంటి ఆజ్ఞే జారీ చేశారు. నేను నా ఆవిడతో, "నువ్వు నీ పుట్టింటికి వెళ్ళు, నా విషయంలో అల్లాహ్ ఏదైనా తీర్పు అవతరింపజేసేంత వరకూ అక్కడే ఉండు" అని అన్నాను.

అయితే (నా సహచరులిద్దరిలో) హిలాల్ బిన్ ఉమయ్యా (రజి) భార్య మాత్రం దైవప్రవక్త (సల్లం) వద్దకు వెళ్ళి "దైవప్రవక్తా! హిలాల్ బిన్ ఉమయ్యా

ثُمَّ صَلَّيْتُ صَلاةَ الفَجْرِ صَبَاحَ خَمْسِينَ لَيْلَةً عَلَى ظَهْرِ بَيْتٍ مِنْ بُيُوتِنَا، فَبَيْنَا أَنَا جَالِسٌ عَلَى الحَالِ الَّتِي ذَكَرَ اللهُ تَعَالَى مِنَّا، قَدْ ضَاقَتْ عَلَيَّ نَفْسِي وَضَاقَتْ عَلَيَّ الأَرْضُ بِمَا رَحُبَتْ، سَمِعْتُ صَوْتَ صَارِخٍ أَوْفَى عَلَى سَلْعٍ يَقُولُ بِأَعْلَى صَوْتِهِ: يَا كَعْبَ بْنَ مَالِكٍ أَبْشِرْ، فَخَرَرْتُ سَاجِداً، وَعَرَفْتُ أَنَّهُ قَدْ جَاءَ فَرَجٌ. فَآذَنَ رسولُ الله ﷺ النَّاسَ بِتَوبَةِ اللهِ عَزَّ وَجَلَّ عَلَيْنَا حِينَ صَلَّى صَلاةَ الفَجْرِ فَذَهَبَ قِبَلَ صَاحِبَيَّ مُبَشِّرُونَ، وَرَكَضَ رَجُلٌ إِلَيَّ فَرَساً

పండు ముసలివాడయ్యారు. ఆయనకు సేవకులు కూడా ఎవరూ లేరు. నేనా యనకు సేవచేస్తే మీరు అప్రసన్నులు కారుకదా!?" అని విన్నవించుకుంది. దానికి దైవప్రవక్త (సల్లం) "అది కాదు. అతను నీతో కలవకూడదని (సంభోగించ కూడదని) మాత్రమే చెబుతున్నాను" అన్నారు. ఆ మాటకు ఆయన భార్య "దైవసాక్షి! కదలడానిక్కూడా ఆయనలో సత్తువ లేదు. అంతేకాదు, దైవసాక్షిగా చెబుతున్నాను. ఈ సంఘటన జరిగి నప్పట్నుంచీ ఆయన సమయమంతా ఏడుపు పెడబొబ్బల్లోనే గడచిపోతోంది" అని అంది.

ఈ విషయం తెలుసుకొని మా ఇంటి వారలు కొందరు "దైవప్రవక్త (సల్లం) హిలాల్‌కు ఆయన భార్య సేవ చేయ డానికి అనుమతినిచ్చారు కదా! అలాగే నువ్వు కూడా ఆయన దగ్గరికి వెళ్ళి నీ భార్య విషయంలో అనుమతి తీసు కుంటే బాగుంటుంది" అని సలహా ఇచ్చారు. కాని (అందుకు నా మనసంగీక రించక) "దైవసాక్షి! ఎట్టి పరిస్థితిల్లోనూ నేను దైవప్రవక్త (సల్లం)ను అనుమతి కోరను. నేను యువకుణ్ని. (హిలాల్ మాదిరిగా ముసలివాణ్ణి కాను) అనుమతి అడిగితే ఆయనేం సమాధానం చెబుతారో ఏమో!" అని అన్నాను.

وَسَعَى سَاعٍ مِنْ أَسْلَمَ قِبَلِي وَأَوْفَى عَلَى الجَبَلِ، وَكَانَ الصَّوتُ أَسْرَعَ مِنَ الفَرَسِ، فَلَمَّا جَاءَنِي الذي سَمِعْتُ صَوتَهُ يُبَشِّرُنِي نَزَعْتُ لَهُ ثَوْبَيَّ فَكَسَوتُهُمَا إِيَّاهُ بِبِشَارَتِـهِ،

وَاللهِ مَا أَمْلِكُ غَيْرَهُمَا يَومَئِذٍ، وَاسْتَعَرْتُ ثَـوبَيْـنِ فَلَبِسْتُهُمَـا وانْطَلَقْـتُ أَتَـأَمَّـمُ رسولَ الله ﷺ يَتَلَقَّانِي النَّاسُ فَوجاً فَوجاً يُهَنِّئُونَنِي بالتَّوبَةِ وَيَقُولُونَ لِي: لِتَهْنِكَ تَوبَةُ اللهِ عليْكَ، حَتَّى دَخَلْتُ المَسْجِدَ فإذا رسولُ الله ﷺ جَالِسٌ حَولَهُ النَّاسُ، فَقَامَ

అలాగే మరో పది రాత్రులు గడిచి పోయాయి. మాతో మాట్లాడవద్దని దైవప్రవక్త (సల్లం) ప్రజల్ని ఆదేశించి పూర్తిగా యాభై రాత్రులు గడిచి పోయాయి. యాభయవ రోజు ఉదయం నేను నా ఇండ్లలోని ఒకానొక ఇంటి పైకప్పుపైనే నమాజు చేసుకొని కూర్చు న్నాను. అప్పుడు నా పరిస్థితి అల్లాహ్ (దివ్యఖుర్ఆన్‌లో) ప్రస్తావించినట్లు, నా హృదయం నిర్వేదంతో నిండిపోయి ఉంది. భూమి అంత విశాలంగా ఉన్న ప్పటికీ అది నా పాలిట కుంచించుకు పోయినట్లుగా తయారయ్యింది. అంతలో సలా కొండపై ఎక్కి ఎవరో బిగ్గరగా అరుస్తున్నట్లు నాకు వినిపించింది. “ఓ కాబ్ బిన్ మాలిక్! ఇక సంతోషించు” అన్న కేకలు వినిపించాయి. నేను వెంటనే (సంతోషం పట్టలేక అప్రయత్నంగానే) సాష్టాంగపడ్డాను. అల్లాహ్ తరపునుండి (గడ్డురోజులు తొలగిపోయి) విశాలత (మన్నింపు) అవతరించిందని అర్థం చేసుకున్నాను.

దైవప్రవక్త (సల్లం) ఫజ్ర్ నమాజు చేసిన తరువాత అల్లాహ్ మా (ముగ్గురి) పశ్చాత్తాపాన్ని అంగీకరించాడని ప్రజల సమక్షంలో ప్రకటించారు. ఈ ప్రకటన వినగానే ప్రజలు మాకు శుభాకాంక్షలు తెలియజేయడానికి రావడం మొదలెట్టారు. నా సహచరులిద్దరి వద్దకు కూడా

طَلْحَةُ بْنُ عُبَيْدِ الله رضي الله عنه يُهَرْوِلُ حَتَّى صَافَحَنِي وَهَنَّأَنِي، وَاللهِ مَا قَامَ رَجُلٌ مِنَ الْمُهَاجِرِينَ غَيْرُهُ، فَكَانَ كَعْبٌ لا يَنْسَاهَا لِطَلْحَةَ. قَالَ كَعْبٌ: فَلَمَّا سَلَّمْتُ عَلَى رسولِ الله ﷺ قَالَ وَهُوَ يَبْرُقُ وَجْهُهُ مِنَ السُّرورِ: أَبْشِرْ بِخَيْرِ يَوم مَرَّ عَلَيْكَ مُذْ وَلَدَتْكَ أُمُّكَ، فَقُلْتُ: أَمِنْ عِنْدِكَ يا رسولَ الله أَمْ مِنْ عِنْدِ اللهِ؟ قَالَ: لا بَلْ مِنْ عِنْدِ اللهِ عَزَّ وَجَلَّ، وَكَانَ رسولُ الله ﷺ إذَا سُرَّ اسْتَنَارَ وَجْهُهُ حَتَّى كَأَنَّ وَجْهَهُ قِطْعَةُ قَمَرٍ، وَكُنَّا نَعْرِفُ ذلك

శుభవార్తను అందజేసేవారు వెళ్ళారు. ఒకతను గుర్రాన్ని పరుగెత్తిస్తూ నా వైపు రాసాగాడు. అస్లం తెగకు చెందిన మరొక వ్యక్తి నా వైపు వస్తూ తొందరతొందరగా కొండెక్కాడు. అతని కంఠస్వరం గుర్రం పరుగుకన్నా వేగంగా ఉంది. ఆ వ్యక్తి నా దగ్గరికి వచ్చి (అందరి కన్నా ముందు) నాకు శుభవార్త వినిపించాడు. శుభవార్త పలుకులు విన్నంతనే నేను (బహుమతిగా) నా ఒంటిమీది బట్టలు తీసి అతనికి తొడిగించాను. దైవసాక్షి! ఆ రోజు నా దగ్గర ఆ బట్టలు తప్ప మరే ఆస్తీ లేదు. అందువల్ల నేను మరో జత బట్టలు (ఇతరుల నుండి) వాడుక నిమిత్తం తీసుకొని తొడుక్కున్నాను. ఆ తరువాత నేను దైవప్రవక్తను కలవాలని బయలుదేరాను. (దారిలో) జనం తండోపతండాలుగా వచ్చి పశ్చాత్తాప స్వీకరణపై నాకు శుభాకాంక్షలు తెలియజేయసాగారు. "శుభం నీకు. అల్లాహ్ నీ పశ్చాత్తాపాన్ని అంగీకరిం చాడు" అని చెబుతూ పోయారు.

నేను మస్జిదె నబవీలోకి ప్రవేశించాను. అక్కడ దైవప్రవక్త (సల్లం) ప్రజల మధ్య ఆసీనులై ఉన్నారు. నన్ను చూడగానే తల్హా బిన్ ఉబైదుల్లాహ్ (రజి) ఒక్క సారిగా నామీదకు గెంతి కరచాలనం చేస్తూ నాకు శుభాకాంక్షలు తెలియజేశారు. దైవసాక్షి! ముహాజిర్లలో తల్హా

مِنْهُ، فَلَمَّا جَلَسْتُ بَيْنَ يَدَيْهِ قُلْتُ: يا رسولَ الله إنَّ مِنْ تَوبَتِي أَنْ أَنْخَلِعَ مِنْ مَالِي صَدَقَةً إلى اللهِ وإلى رسولِه. فَقَالَ رسولُ الله ﷺ: أَمْسِكْ عَلَيْكَ بَعْضَ مَالِكَ فَهُوَ خَيْرٌ لَكَ، فَقُلْتُ: إنِّي أُمْسِكُ سَهْمِي الذي بِخَيْبَرَ. وَقُلْتُ: يا رسولَ الله إنَّ اللهَ تَعَالَى إنَّمَا أَنْجَانِي بالصِّدْقِ، وإنَّ مِنْ تَوْبَتِي أَنْ لا أُحَدِّثَ إلَّا صِدْقاً مَا بَقِيتُ،

(రజి) తప్ప ఇంకెవరూ ఆ విధంగా లేచి నిలబడలేదు. తల్హా (రజి) గారి ఈ ప్రవర్తనను కాబ్ ఎన్నటికీ మరచిపోలేదు.

హజ్రత్ కాబ్ (రజి) ఇంకా ఇలా అంటు న్నారు : నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి సలాం చేశాను. శుభప్రదమైన ఆయన ముఖారవిందం ఆనందంతో వెలిగిపోతోంది. "ఈ రోజు నీకు శుభ ప్రదం అవుగాక! నీ తల్లి నీకు జన్మనిచ్చి నప్పటి నుండి, నీ జీవితంలో, ఈ రోజు నీకోసం ఎంతో శ్రేష్ఠమైన రోజు" అని అన్నారాయన సంతోషం వెలిబు చ్చుతూ. అందుకు నేను "దైవప్రవక్తా! ఈ శుభవార్త మీ తరఫునుండా లేక దేవుని తరఫునుండా?" అనడిగాను. ఆ మాటకు ఆయన "లేదు, లేదు. ఈ శుభవార్త అల్లాహ్ తరఫునుండి వచ్చిందే" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) సంతోషంగా వున్నప్పుడు ఆయన ముఖారవిందం చంద్రబింబంలా ప్రకాశ మంతమైపోతుంది. దాన్నిబట్టి మేము ఆయన చాలా సంతోషంగా ఉన్నారని పసిగట్టేవాళ్ళము.

నేను ఆయన ముందు కూర్చొని "దైవప్రవక్తా! నా పశ్చాత్తాపం అంగీకరిం చబడినందుకు కృతజ్ఞతగా నేను నా ధనాన్నంతటినీ అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త మార్గంలో దానం చేయా లనుకుంటున్నాను" అని అన్నాను. అది

విని ఆయన "అంతా వద్దు, కొంత ధనం నీ దగ్గర ఉంచుకో. అది నీకే శ్రేయస్కరం" అని అన్నారు. "సరే! ఖైబర్‌లో నాకు దక్కిన వాటాను నేను నా కోసం వుంచుకుంటున్నాను" అన్నాను. ఇంకా ఇలా కూడా అన్నాను: దైవప్రవక్తా! నిజం చెప్పినందుకు దేవుడు నాకు విముక్తి నొసగాడు. కనుక నేను, నా పశ్చాత్తాపంలో భాగంగా ఇకముందు జీవితకాలమంతా నిజమే చెబుతానని ప్రమాణం చేస్తున్నాను.

దైవసాక్షి! దైవప్రవక్త (సల్లం) ముందు నేను ఈ వాగ్దానం చేసినప్పటినుండి నేటి వరకు కేవలం నిజం చెప్పిన కారణంగా దేవుడు నన్ను కటాక్షించినంతగా మరే ముస్లింనీ కటాక్షించినట్లు నేను చూడలేదు. దైవసాక్షి! దైవప్రవక్త (సల్లం) ముందు వాగ్దానం చేసిన రోజు నుంచి నేటి వరకు నేను ఎప్పుడూ అబద్ధమాడ లేదు. ఇకముందు కూడా బ్రతికి వున్నంతకాలం అసత్యాలు పలకకుండా దేవుడు నన్ను రక్షిస్తూ ఉంటాడని ఆశిస్తున్నాను."

హజ్రత్ కాబ్ (రజి) ఇంకా ఇలా అన్నారు: మా గురించి (దివ్య ఖుర్ఆన్‌లో) అవతరించిన వాక్యాలు ఇవే:

"అల్లాహ్ తన ప్రవక్తనూ, బహుకష్ట కాలంలో ప్రవక్తకు తోడ్పడిన ముహా

فَوَاللهِ مَا عَلِمْتُ أَحداً مِنَ الْمُسْلِمِينَ أَبْلاهُ اللهُ تعالى، في صِدْقِ الْحَدِيثِ مُنْذُ ذَكَرْتُ ذلِكَ لِرَسُولِ اللهِ ﷺ أَحْسَنَ مِمَّا أَبْلانِي اللهُ تعالى، وَاللهِ مَا تَعَمَّدْتُ كِذْبَةً منذُ قلتُ ذلك لِرسولِ اللهِ ﷺ إِلَى يَوْمِي هٰذا، وإِنِّي لأَرْجُو أَنْ يَحْفَظَنِي اللهُ تعالى فيمَا بَقِيَ، قال: فأَنْزَلَ الله تعالى: ﴿لَقَد تَّابَ ٱللَّهُ عَلَى ٱلنَّبِيِّ وَٱلْمُهَٰجِرِينَ وَٱلْأَنصَارِ ٱلَّذِينَ ٱتَّبَعُوهُ فِي سَاعَةِ ٱلْعُسْرَةِ﴾ حَتَّى بَلَغَ: ﴿إِنَّهُۥ بِهِمْ رَءُوفٌ رَّحِيمٌ ﴿١١٧﴾ وَعَلَى ٱلثَّلَٰثَةِ ٱلَّذِينَ خُلِّفُوا۟ حَتَّىٰٓ إِذَا ضَاقَتْ عَلَيْهِمُ ٱلْأَرْضُ بِمَا رَحُبَتْ﴾ حَتَّى بَلَغَ: ﴿ٱتَّقُوا۟ ٱللَّهَ وَكُونُوا۟ مَعَ ٱلصَّٰدِقِينَ ﴿١١٩﴾﴾ [التوبة: ١١٧-١١٩]،

قَالَ كَعْبٌ: واللهِ ما أَنْعَمَ الله عَلَيَّ مِن نِعمَةٍ قَطُّ بَعْدَ إذْ هَدانِي اللهُ للإسْلام أَعظَمَ في نَفْسِي مِنْ صِدْقِي رسولَ الله ﷺ أَنْ لا أَكُونَ كَذَبْتُهُ، فَأَهْلِكَ كما هلكَ الَّذينَ كَذَبُوا؛ إنَّ الله تعالى قال لِلَّذينَ كَذَبُوا حِينَ أَنْزَلَ الْوَحْيِ شَرَّ مَا قالَ لأَحَدٍ، فقالَ الله تعالى: ﴿سَيَحْلِفُونَ بِاللَّهِ لَكُمْ إِذَا انقَلَبْتُمْ إِلَيْهِمْ لِتُعْرِضُوا عَنْهُمْ فَأَعْرِضُوا عَنْهُمْ إِنَّهُمْ رِجْسٌ وَمَأْوَاهُمْ جَهَنَّمُ جَزَاءً بِمَا كَانُوا يَكْسِبُونَ ۝ يَحْلِفُونَ لَكُمْ لِتَرْضَوْا عَنْهُمْ فَإِن تَرْضَوْا عَنْهُمْ فَإِنَّ اللَّهَ لَا يَرْضَىٰ عَنِ الْقَوْمِ الْفَاسِقِينَ﴾ [التوبة: ٩٥، ٩٦].

జిర్లనూ, అన్సారులనూ క్షమించాడు. వారిలో కొందరి హృదయాలు వక్రత్వం వైపుకు మొగ్గినప్పటికీ (వారు ఆ వక్రత్వాన్ని అనుసరించకుండా ప్రవక్తకు తోడ్పడినందువల్ల) అల్లాహ్ వారిని క్షమించాడు. నిస్సందేహంగా ఆయన వారిపట్ల వాత్సల్యంతో, కనికరంతో వ్యవహరించాడు. ఇంకా వ్యవహారం వాయిదా వేయబడిన ఆ ముగ్గురిని కూడా క్షమించాడు. ఇంత పెద్ద వైశాల్యం కలిగివుండి కూడా, భూమి వారికి ఇరుకై పోయింది. వారి ప్రాణాలు కూడా వారికి భారమైపోయాయి. అల్లాహ్ నుండి తమను కాపాడుకోవటానికి స్వయంగా అల్లాహ్ కారుణ్యం తప్ప వేరే ఆశ్రయం ఏదీ లేదని వారు తెలుసు కున్నారు. అప్పుడు అల్లాహ్ కనికరంతో వారి వైపుకు మరలాడు, వారు ఆయన వైపుకు మరలి వచ్చేటందుకు. నిశ్చయంగా ఆయన చాలా క్షమించే వాడూ, కరుణించే వాడూను. కనుక విశ్వాసులారా! అల్లాహ్‌కు భయపడండి. సత్యవంతులకు తోడ్పడండి.”

*(అత్ తౌబా : 117 - 119)*

హజ్రత్ కాబ్ (రజి) అంటున్నారు: దైవ సాక్షిగా చెబుతున్నాను - ఇస్లాం స్వీకరణ భాగ్యం ప్రాప్తించిన తరువాత అల్లాహ్ నాకు అనేక వరాలు అనుగ్ర హించాడు.

قَالَ كَعْبٌ: كُنَّا خُلِّفْنَا أَيُّهَا الثَّلاثَةُ عَـنْ أَمْـرِ أُولَئِـكَ الَّـذِيـنَ قَبِـلَ مِنْهُـمْ رَسُولُ اللهِ ﷺ حِينَ حَلَفُوا لَهُ، فَبَايَعَهُمْ وَاسْتَغْفَرَ لَهُم، وَأَرْجَأَ رَسُولُ اللهِ ﷺ أَمْرَنَا

నా దృష్టిలో వాటిలోకెల్లా గొప్పవరం ఆయన నాకు దైవప్రవక్త (స) ముందు నిజం చెప్పే సద్బుద్ధిని ప్రసాదించడం మరియు అబద్ధం చెప్పకుండా రక్షించడం. ఒకవేళ నేను కూడా అసత్యం పలికివుంటే అబద్ధమాడినవారు నాశనమైపోయినట్లు నేను కూడా సర్వనాశనమైపోయి ఉండేవాడిని. ఎందుకంటే అల్లాహ్ తన వాణిని అవత రింపజేసినప్పుడు అందులో అబద్ధాలు పలికిన వారిని తూలనాడిన విధంగా మరెవరినీ తూలనాడలేదు. అటువంటి (దౌర్భాగ్యుల గురించి) అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు :

"నువ్వు (యుద్ధం నుండి) మరలివచ్చిన తరువాత నువ్వు వారిని ఉపేక్షించాలని వారు నీ ముందు ప్రమాణాలు చేస్తారు, కనుక నీవు వారిని తప్పకుండా ఉపే క్షించు. ఎందుకంటే, వారొక మాలిన్యం వంటివారు. వారి అసలు స్థానం నరకం. అది వారి సంపాదనకు ప్రతిఫలంగా వారికి లభిస్తుంది. నువ్వు వారికి ప్రస న్నుడవు కావాలని వారు నీ సమక్షంలో ప్రమాణాలు చేస్తారు. వాస్తవానికి, ఒకవేళ నువ్వు వారిపట్ల ప్రసన్నత చూపినా అల్లాహ్ మటుకు అలాంటి విద్రోహుల పట్ల ఎన్నటికీ ప్రసన్నుడు కాడు."

*(అత్ తౌబా : 95, 96)*

حَتَّى قَضَى الله تعالَى فيه بذلكَ؛ قال الله تعالى: ﴿وَعَلَى ٱلثَّلَٰثَةِ ٱلَّذِينَ خُلِّفُوا۟﴾ وَلَيْسَ الَّذي ذكَرَ مِمَّا خُلِّفْنَا تَخَلُّفُنَا عن الغَزْوِ، وإنَّمَا هُوَ تَخْلِيفُهُ إيَّانا وإرْجاؤُهُ أمْرَنَا عَمَّنْ حَلَفَ له واعْتَذَرَ إلَيْهِ فقبِلَ مِنْهُ. متفقٌ عليه. وفي روايةٍ: أنَّ النَّبيَّ ﷺ خَرَجَ في غَزْوَةِ تَبُوكَ يَوْمَ الخميسِ، وكانَ يُحِبُّ أنْ يَخْرُجَ يَوْمَ الخميسِ، وفي رواية: وكانَ لا يَقْدَمُ مِن سَفَرٍ إلَّا نَهَاراً في الضُّحَى، فإذَا قَدِمَ بَدَأ بالمَسْجِدِ فَصَلَّى فيهِ رَكْعَتَيْنِ ثُمَّ جَلَسَ فِيهِ.

హజ్రత్ కాబ్ (రజి) అంటున్నారు : దైవ ప్రవక్త (సల్లం) మా ముగ్గురి వ్యవహారాన్ని తాత్కాలికంగా నిలిపివేసి, అబద్ధపు ప్రమాణాలతో సాకులు చెప్పిన వారి వ్యవహారాన్ని తెమల్చారు. వారిచేత ప్రమాణాలు చేయించుకొని, వారి పాపాల మన్నింపు కోసం దైవాన్ని వేడుకున్నారు. మా సమస్యను మాత్రం వాయిదావేశారు. ఆఖరికి అల్లాహ్ ఈ వాక్యాల ద్వారా తీర్పును అవతరింపజేశాడు. అల్లాహ్ సెలవిచ్చాడు - "ఇంకా వ్యవహారం వాయిదా వేయబడిన ఆ ముగ్గురిని కూడా అల్లాహ్ క్షమించాడు." ఈ దైవసూక్తిలో 'ఖుల్లిఫూ' అనే పదానికి అర్థం, మేము యుద్ధానికి బయలు దేరకుండా వెనకుండిపోయేలా చేయబడ్డామని కాదు. మా విషయాన్ని తాత్కాలికంగా వదిలెయ్యడం జరిగిందని, ఒట్టువేసి సాకులు చెప్పిన వారి కారణాలు అంగీకరించబడి, మా వ్యవహారం మాత్రం వాయిదా వేయబడిందని అర్థం.

*(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దైవప్రవక్త (సల్లం) తబూక్ యుద్ధం కోసం గురువారం రోజు బయలుదేరారు. ఆయన గురువారం నాడు ప్రయాణం చేయడాన్ని యిష్టపడేవారు. ఇంకొక

ఉల్లేఖనంలో "ఆయన చాష్త్ నమాజు వేళ ప్రయాణం నుండి తిరిగొచ్చేవారు, ఆ తరువాత ముందుగా మస్జిద్‌లో ప్రవేశించి రెండు రకాతుల నమాజు ముగించుకొని అక్కడే కొంచెం సేపు కూర్చొనేవారు" అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని యుద్ధాల ప్రకరణం. సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

పై హదీసులో గ్రహించదగిన గుణపాఠాలు, హితబోధాంశాలు అనేకం ఉన్నాయి. వాటిలో కొన్ని ఇవి:

1. ముస్లిం అయిన వ్యక్తి సర్వకాల సర్వావస్థల్లోనూ సత్యమే పలకాలి - దానివల్ల తాత్కాలికంగా ఇక్కట్లపాలైనా సరే! ఎందుకంటే అంతిమంగా సత్యంలోనే దైవప్రసన్నత దాగి ఉంటుంది.
2. కాపట్య ధోరణిని విడనాడాలి. విధ్వంసం, వినాశకాలే ఎన్నటికైనా దాని పర్యవసానం.
3. మిక్కిలి కఠినమైన, సంకట పరిస్థితుల్లో కూడా అకుంఠిత దీక్షతో దైవమార్గంలో చేయబడే యుద్ధంలో పాల్గొనాలి.
4. ఇతరులు గుణపాఠం నేర్చుకోవాలన్న ఉద్దేశ్యంతో శ్రేయోభిలాషులైన ముస్లింలను కూడా తప్పుచేస్తే సామాజిక బహిష్కరణ గావించవచ్చు. దీనివల్ల సమాజంలో అవిధేయత, అవలక్షణాల వెన్ను విరిగిపోతుంది.
5. ధర్మపథంలో ఎదురయ్యే కష్టాలను సహనస్థైర్యాలతో ఎదుర్కోవాలి.
6. ఉన్న ధనాన్నంతా దానధర్మాల్లో ఖర్చు చేయడం అభిలషణీయం కాదు. సొంత అవసరాల కోసం కొంత ధనం ఉంచుకోవడం కూడా అవసరమే.
7. సంతోష సందర్భాల్లో శుభాకాంక్షలు తెలియజేయడం, అలాగే శుభాకాంక్షలు తెలియజేసినవారికి కానుకలు, బహుమానాలతో సత్కరించడం కూడా తప్పు కాదు.
8. పాపాల మన్నింపుకై వేడుకునే భాగ్యం కూడా ఒక దైవానుగ్రహమే. అందుకు తప్పనిసరిగా దైవానికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి.
9. చేసిన వాగ్దానాలను పాలించాలి.

22. హజ్రత్ అబూ నుజైద్ ఇమ్రాన్ బిన్ హుసైన్ ఖుజాయి (రజి) కథనం : జుహైనా తెగకు చెందిన ఒక స్త్రీ దైవ ప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చింది. ఆ సమయంలో ఆమె (ఏదో బలహీన క్షణంలో) కాలు జారిన పాపానికి గర్భం దాల్చి ఉంది. ఆమె దైవప్రవక్త (సల్లం)తో, "ఓ దైవప్రవక్తా! నేను శిక్షార్హమైన తప్పుచేశాను. కనుక నాకు ఆ శిక్ష విధించండి" అని విన్నవించుకుంది. దైవప్రవక్త (సల్లం) ఆమె సంరక్షకుణ్ణి (వారసుడు లేక సన్నిహిత బంధువుని) పిలిపించి, "ఈమె పట్ల మంచిగా మెలగు. ప్రసవానంతరం ఈమెను నా వద్దకు తీసుకురా" అని ఆదేశించారు. (ప్రవక్త ఆదేశానుసారం) ఆ వ్యక్తి అలాగే చేశాడు. (ఆమె ప్రసవించిన తరువాత) దైవప్రవక్త (సల్లం) ఆమెను ఆమె బట్టలతోనే గట్టిగా బంధించమని ఆజ్ఞాపించారు. ఆ తరువాత ఆయన ఆజ్ఞానుసారమే ఆమెమీద రాళ్లు రువ్వి (ఆమెను హతమార్చడం జరిగింది.) అనంతరం దైవప్రవక్త (సల్లం) ఆవిడ జనాజా నమాజు చేయించారు. దీనిపై హజ్రత్ ఉమర్ (రజి) అభ్యంతరం వ్యక్తం చేస్తూ "దైవప్రవక్తా! మీరు ఈ జారిణికి జనాజా నమాజు చేయిస్తారా?" అన్నారు. దానికి జవాబుగా దైవప్రవక్త (సల్లం) (ఉమర్! నీకు తెలియదు) ఈమె పడిన

٢٢ ـ وَعَنْ أَبِي نُجَيْدٍ ـ بضَمِّ النُّونِ وفتحِ الجيم ـ عِمْرَانَ بنِ الحُصَيْنِ الْخُزاعِيِّ رضي الله عنهما أَنَّ امْرَأَةً مِنْ جُهَيْنَةَ أَتَتْ رسُولَ اللهِ ﷺ وَهِيَ حُبْلَى مِنَ الزِّنَا، فقالَتْ: يا رسولَ اللهِ أَصَبْتُ حَدّاً فَأَقِمْهُ عَلَيَّ، فَدَعا نَبِيُّ اللهِ ﷺ وَلِيَّهَا فقالَ: «أَحْسِنْ إِلَيْهَا، فإذَا وَضعَتْ فَأْتِنِي»، فَفَعلَ فأَمَرَ بِهَا نَبِيُّ الله ﷺ، فَشُدَّتْ عَلَيْهَا ثِيَابُهَا، ثُمَّ امَرَ بِهَا فَرُجِمَتْ، ثُمَّ صَلَّى عَلَيْهَا. فقالَ لَهُ عُمَرُ: تُصَلِّي عَلَيْهَا يا رسولَ الله وقَدْ زَنَتْ؟ قالَ: «لَقَدْ تَابَتْ تَوْبَةً لَو قُسِمَتْ بَيْنَ سَبْعِينَ مِنْ أَهْلِ المدينَةِ لَوَسِعَتْهُم، وَهَلْ وَجَدْتَ أَفضَلَ مِنْ أَنْ جَادَتْ بِنَفْسِهَا للهِ عزَّ وجلَّ؟!» رواه مسلم.

పశ్చాత్తాపం ఎంత గొప్పదంటే, ఈమె పశ్చాత్తాపాన్ని మదీనాలోని డెబ్భై మందికి పంచినా అది వారి (పాపాల మన్నింపు)కి సరిపోతుంది. దైవప్రసన్నత కోసం ఈమె తన ప్రాణాన్ని సైతం (లెక్క చేయకుండా) త్యాగం చేసిందంటే ఇంతకన్నా ఘనకార్యం ఇంకేముంటుంది?" అన్నారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని శిక్షల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసు ద్వారా రాళ్లు రువ్వి శిక్షించడం ధర్మబద్ధమేనన్న విషయానికి రుజువు లభిస్తుంది. రెండోది : చిత్తశుద్ధితో చెందే పశ్చాత్తాపం ఎంతో శ్రేష్ఠమైనదని తెలుస్తోంది. ఇక మూడో విషయం ఏమిటంటే, ఈ హదీసు ద్వారా ప్రవక్త సహచరులు, సహచరిణులకు దేవునిపట్ల గల భక్తిభావం, పరలోక భీతి, పరలోక శిక్షకు బదులు ఇహలోక శిక్షను కోరుకోవడం మొదలగు విషయాలు తెలుస్తాయి. ఈ హదీసు ద్వారా రూఢీ అయ్యే నాల్గో విషయం ఏమిటంటే, "గునాహె కబీరా" (ఘోరపాపాని)కి ఒడిగట్టిన వ్యక్తి జనాజా నమాజు కూడా చేయవచ్చు. అయితే ఆ వ్యక్తి ఆ పాపాన్ని ధర్మసమ్మతంగా భావించి చేసి ఉండకూడదు. ఎందుకంటే ఈ వైఖరి 'కుఫ్ర్'ను (దైవధిక్కారాన్ని) సూచిస్తుంది. ఐదో విషయం ఏమిటంటే, గర్భం దాల్చివున్న స్త్రీ ప్రసవించి శిశువు పాలు విడిచిపెట్టనంతవరకూ ఆమెకు శిలాశిక్ష విధించరాదు.

23. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు : మనిషి దగ్గర ఓ లోయనిండా బంగారమున్నప్పటికీ అతను (దాంతో తృప్తి చెందకుండా) రెండో దానికోసం అర్రులు చాస్తాడు. (చివరికి) మన్ను మాత్రమే అతని నోటిని నింపగలదు. తన పాపాల నుండి మరలిపోయేవాని (పశ్చాత్తాపం చెందేవాని) వైపుకు అల్లాహ్ కూడా

٢٣ ـ وَعَنِ ابْنِ عَبَّاسٍ رضي الله عنهما أنَّ رسولَ الله ﷺ قال: «لَوْ أَنَّ لِابْنِ آدَمَ وَادِياً مَنْ ذَهَبٍ أَحَبَّ أَنْ يَكُونَ لَهُ وَادِيَانِ، وَلَنْ يَمْلأَ فَاهُ إلَّا التُّرَابُ، وَيَتُوبُ اللهُ عَلَى مَنْ تَابَ» متفقٌ عليه.

మరలుతాడు. (అంటే అతని పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తాడు.)

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని కారుణ్య ప్రకరణం. సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

పై హదీసులో మనిషి పేరాశ, ధనం పట్ల అతనికుండే విపరీతమైన వ్యామోహం గురించి తెలుపబడింది. సంపూర్ణ విశ్వాసం కలిగివున్నవారు మాత్రమే వాటికి దూరంగా ఉండగలరు.

٢٤ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رضي الله عنه أن رسولَ الله ﷺ قال: «يَضْحَكُ اللهُ سُبْحَانَهُ وَتَعَالَى إِلَى رَجُلَيْنِ يَقْتُلُ أَحدُهُمَا الآخَرَ يَدْخُلانِ الْجَنَّةَ، يُقَاتِلُ هٰذَا في سَبِيلِ اللهِ فَيُقْتَلُ، ثُمَّ يَتُوبُ اللهُ عَلَى الْقَاتِلِ فَيُسْلِمُ فَيُسْتَشْهَدُ» متفقٌ عليه.

24. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: అల్లాహ్ ఇద్దరు వ్యక్తుల్ని చూసి నవ్వుతాడు. వారిరువురిలో ఒకడు మరొకడ్ని చంపివుంటాడు. అయితే (పరలోకంలో) వారిరువురూ స్వర్గంలోకి ప్రవేశిస్తారు. మొదటి వ్యక్తి దైవమార్గంలో పోరాడుతూ (అవిశ్వాసి అయిన రెండో వ్యక్తి చేత) చంపబడ్డాడు. ఆ తరువాత అల్లాహ్ ఆ అవిశ్వాసికి కూడా పశ్చాత్తాప భాగ్యాన్ని ప్రసాదిస్తే దాంతో అతను ముస్లింగా మారి దైవమార్గంలో పోరాడుతూ అమరగతినొందాడు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

పశ్చాత్తాపంతో మహాపరాధాలు, ఘోరాతిఘోర పాపాలు కూడా మన్నించబడతాయని, ఇస్లాం స్వీకరించడం వల్ల మునుపు జరిగిన తప్పులన్నీ తుడిచిపెట్టుకుపోతాయని ఈ హదీసు ద్వారా వెల్లడౌతోంది. అల్లాహ్ నవ్వుతాడనేది కూడా ఆయన యొక్క ఒకానొక గుణవిశేషమే. దాని నిజస్వరూపం ఎలాగుంటుందో మనకు తెలీదు, తెలుసుకోలేము కూడా. అయినప్పటికీ దాన్ని ప్రతి ముస్లిం విధిగా విశ్వసించాల్సిందే.

3వ అధ్యాయం

# ٣ ـ بَابُ الصَّبْرِ

# సహనం, ఓర్పు

قال الله تعالى: ﴿ يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا اصْبِرُوا وَصَابِرُوا ﴾ [آل عمران: ٢٠٠]، وقال تعالى: ﴿ وَلَنَبْلُوَنَّكُم بِشَيْءٍ مِّنَ الْخَوْفِ وَالْجُوعِ وَنَقْصٍ مِّنَ الْأَمْوَالِ وَالْأَنفُسِ وَالثَّمَرَاتِ وَبَشِّرِ الصَّابِرِينَ ﴾ [البقرة: ١٥٥]، وقال تعالى: ﴿ إِنَّمَا يُوَفَّى الصَّابِرُونَ أَجْرَهُم بِغَيْرِ حِسَابٍ ﴾ [الزمر: ١٠]،

وقال تعالى: ﴿ وَلَمَن صَبَرَ وَغَفَرَ إِنَّ ذَٰلِكَ لَمِنْ عَزْمِ الْأُمُورِ ﴿٤٣﴾ ﴾ [الشورى: ٤٣]، وقال تعالى: ﴿ اسْتَعِينُوا بِالصَّبْرِ وَالصَّلَاةِ إِنَّ اللَّهَ مَعَ الصَّابِرِينَ ﴾ [البقرة: ١٥٣]، وقال تعالى: ﴿ وَلَنَبْلُوَنَّكُمْ حَتَّىٰ نَعْلَمَ الْمُجَاهِدِينَ مِنكُمْ وَالصَّابِرِينَ ﴾ [محمد: ٣١]؛ وَالآياتُ في الأمرِ بالصَّبْرِ وَبَيَانِ فَضْلِهِ كَثِيرَةٌ مَعْرُوفَةٌ.

అల్లాహ్ సెలవిచ్చాడు : "విశ్వాసులారా! సహనంతో వ్యవహరించండి. అసత్యవాదుల ముందు పరాక్రమం చూపండి."

*(ఆలి ఇమ్రాన్ : 200)*

మరోచోట అల్లాహ్ సెలవిచ్చాడు : "మేము మిమ్మల్ని తప్పకుండా భయప్రమాదాలకు, ఆకలి బాధకు, ధన, ప్రాణ, ఆదాయాల నష్టానికి గురిచేసి పరీక్షిస్తాము. ఈ పరిస్థితులలో మనః స్థయిర్యంతో ఉండేవారు, కష్టకాలం దాపురించినప్పుడు, "మేమంతా అల్లాహ్‌కే చెందినవారము. అల్లాహ్ వైపునకే మరలిపోవలసిన వారము" అని అనేవారికి శుభవార్తలు తెలుపు."

*(అల్ బఖర : 155)*

ఇంకొకచోట అల్లాహ్ అంటున్నాడు : ఓర్పు వహించేవారికి లెక్కలేనంత ప్రతిఫలం ఇవ్వబడుతుంది." (అజ్ జుమర్ - 10)

వేరొకచోట అల్లాహ్ ఇలా అంటున్నాడు : "అయితే ఎవరైనా సహనంతో వ్యవహరిస్తే, క్షమించివేస్తే, అది పెద్ద సాహసంతో, దృఢ సంకల్పంతో కూడుకున్న పని."

*(అష్ షూరా - 43)*

ఇంకొకచోట ప్రభువు ఆదేశించాడు : "విశ్వాసులారా! సహనం ద్వారా, నమాజు ద్వారా సహాయం అర్థించండి. సహనం కలవారికి అల్లాహ్ తోడుగా ఉంటాడు."

*(అల్ బఖర : 153)*

మరోచోట దేవుడు అంటున్నాడు : "మేము మిమ్మల్ని తప్పకుండా పరీక్షిస్తాము. తద్వారా మీ స్థితిని నిర్ణయిస్తాము. మీలో అల్లాహ్ మార్గంలో గట్టిగా కృషిచేసేవారు ఎవరో, స్థిరచిత్తులు ఎవరో చూస్తాము."

*(ముహమ్మద్ : 31)*

సహనం వహించమని ఆజ్ఞాపించే, దాని ఘనతను వివరించే భావాన్ని కలిగిన సుప్రసిద్ధమైన సూక్తులు ఇంకా అనేకం వున్నాయి.

25. అబూ మాలిక్ హారిస్ బిన్ ఆసిం అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : "శుచీ శుభ్రతలు సగం విశ్వాసం. అల్ హమ్దు లిల్లాహ్ (ప్రశంసలన్నీ అల్లాహ్ కొరకే) అనే పలుకు త్రాసును నింపివేస్తుంది. ఇంకా సుబ్హానల్లాహ్ (అల్లాహ్ పవిత్రుడు) మరియు అల్ హమ్దు లిల్లాహ్ అనే పలుకులు భూమ్యాకాశాల మధ్య ఖాళీని (పుణ్యంతో) నింపుతాయి. నమాజు వెలుగు వంటిది. (తద్వారా అతనికి ప్రపంచంలో సన్మార్గ దర్శకత్వం లభిస్తుంది. పరలోకంలో 'పుల్‌సిరాత్'ను దాటుతున్నప్పుడు కూడా ఈ వెలుగు విశ్వాసికి తోడ్పడుతుంది.) దానం (విశ్వాసానికి) నిదర్శనం వంటిది. సహనం తేజస్సు వంటిది. ఖుర్ఆన్ (పై అమలు చేస్తే అది) నీ కొరకు ఆధారంగా నిలుస్తుంది. లేకపోతే అదే నీ పాలిట ప్రతివాదనగా పరిణమిస్తుంది. మనుషులంతా ప్రతి రోజూ ఉదయం బయలు

٢٥ ـ وَعَنْ أبي مَالكٍ الحَارِثِ بْنِ عَاصِمٍ الأَشْعَرِيِّ رضي الله عنه قَالَ : قَالَ رسول الله ﷺ: «الطُّهُورُ شَطْرُ الإِيمَان، وَالْحَمدُ لله تَمْلأُ المِيزَانَ، وَسُبْحَانَ اللهِ وَالْحَمْدُ لله تَمْلآنِ ـ أَوْ تَمْلأُ ـ مَا بَيْنَ السَّمٰوَاتِ وَالأَرضِ، وَالصَّلاةُ نُورٌ، وَالصَّدَقَةُ بُرْهانٌ، وَالصَّبْرُ ضِيَاءٌ، وَالقُرْآنُ حُجَّةٌ لَكَ أَوْ عَلَيْكَ. كُلُّ النَّاسِ يَغْدُو، فَبَائِعٌ نَفْسَهُ فَمُعْتِقُها، أَوْ مُوبِقُهَا» رواه مسلم.

దేరి తమ స్వయాన్ని విక్రయిస్తూ ఉంటారు. కొందరు తమ ఆత్మల్ని (దైవశిక్షనుండి) కాపాడుకుంటే, మరికొందరు వాటిని నాశనం చేసు కుంటూ ఉంటారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. పారిశుద్ధ్యం చాలా ముఖ్యమైనది. అన్నిరకాల పరిశుభ్రతలూ ఇందులోకి వస్తాయి. విశ్వాసం అంటే దాని వాస్తవికత. కొందరి దృష్టిలో ఇక్కడ విశ్వాసం అంటే నమాజు అని అర్థం. నమాజు కోసం పారిశుద్ధ్యం అవసరం కాబట్టి పారిశుద్ధ్యాన్ని సగం నమాజుగా అభివర్ణించటం జరిగిందని వారి అభిప్రాయం.

2. ఈ హదీసు ద్వారా దైవధ్యానం (జిక్ర్) ఘనత వెల్లడౌతోంది.

3. ఈ హదీసులో ఎక్కువగా నమాజులు చేస్తుండమని పురికొల్పడం జరిగింది. ఎందుకంటే నమాజు వెలుగుతో ముస్లింకు అడుగడుగునా మార్గదర్శకత్వం లభిస్తూ ఉంటుంది. సిగ్గుమాలిన పనులు, నీతి బాహ్యతల నుండి అది మనిషిని రక్షిస్తుంది.

4. దానధర్మాలు (సదఖాలు) విశ్వాసి సత్యసంధతకు, అతని సంకల్పశుద్ధికి, శ్రేయోభి లాషలకు నిదర్శనాలు.

5. సహనం మహాత్మ్యం ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. విశ్వాసి చేతిలో అదొక అస్త్రం వంటిది. దానివల్ల అతనికి స్థైర్యం లభిస్తుంది.

6. దివ్య ఖుర్ఆను మనిషి విముక్తికి సాధనమూ కావచ్చు లేదా (దానిపై ఆచరించడం వదిలేస్తే) అది అతని నాశనానికి కారణభూతమూ కావచ్చు. దాని అవలంబనలో ముక్తి ఉంది. వైముఖ్యం కనబరిస్తే మూడుతుంది.

7. మానవుడు తన ఆత్మను ఊరికే వదిలేయకూడదు. దాన్ని ఆచరణలో పెట్టాలి. సదాచరణలోనే ఉంచాలి. లేకపోతే అది దురాగతాలకు ఒడిగట్టి వినాశాన్ని కొనితెచ్చుకుంటుంది.

8. మానవుడు తన తాత్కాలిక జీవితాన్ని దైవ విధేయతలో వెచ్చించాలి.

٢٦ ـ وَعَنْ أبي سَعيدِ سَعْدِ بْنِ مَالِكِ بْنِ سِنَانٍ الْخُدْرِيِّ رضي الله عنهما: أَنَّ نَاساً مِنَ الأَنْصارِ سَأَلُوا رسول الله ﷺ فَأَعْطَاهُمْ، ثُمَّ سَأَلُوهُ فَأَعْطَاهُمْ، حَتَّى نَفِدَ مَا عِنْدهُ، فَقَالَ لَهُمْ حِينَ أَنْفَقَ كُلَّ شَيْءٍ بِيَدِهِ: «مَا يَكُنْ عِنْدِي مِنْ خَيْرٍ فَلَنْ أَدَّخِرَهُ عَنْكُمْ، وَمَنْ يَسْتَعْفِفْ يُعِفَّهُ اللهُ، وَمَنْ يَسْتَغْنِ يُغْنِهِ اللهُ، وَمَنْ يَتَصَبَّرْ يُصَبِّرْهُ اللهُ. وَمَا أُعْطِيَ أَحَدٌ عَطَاءً خَيْراً وَأَوْسَعَ مِنَ الصَّبْرِ» متفقٌ عليه.

26. హజ్రత్ అబూ సయీద్ సాద్ బిన్ సినాన్ ఖుద్రీ (రజి) కథనం : కొంత మంది అన్సారులు దైవప్రవక్త (సల్లం)ను యాచించారు. దైవప్రవక్త (స) వారడి గింది ఇచ్చారు. వాళ్ళు మళ్ళీ యాచిం చారు. అప్పుడు కూడా ఆయన వారికి (ఎంతోకొంత) ఇచ్చారు. ఆఖరికి దైవప్రవక్త (సల్లం) దగ్గర ఉన్నదంతా అయిపోయింది. తన చేతిలో ఉన్న దంతా అయిపోయిన తరువాత ఆయన వారితో ఇలా అన్నారు: "నా వద్దకు ఏ కొంత ధనమొచ్చినా నేను దాన్ని నిల్వ చేసి ఉంచుకోను. ఎవడైతే యాచించ కుండా ఉండటానికి ప్రయత్నిస్తాడో అల్లాహ్ అతన్ని కాపాడుతాడు. నిరపేక్షా భావం అలవరచుకోవాలనుకున్న వ్యక్తిని అల్లాహ్ నిరపేక్షాపరునిగా చేస్తాడు. సహనం కోరే వ్యక్తికి అల్లాహ్ సహనం వహించే సద్బుద్ధిని ప్రసాదిస్తాడు. మనిషికి ఇవ్వబడిన కానుకల్లో ఓర్పును మించిన మేలైన, విశాలమైన కానుక మరొకటి లేదు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం. సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం)గారి దాతృత్వం, ఉదాత్త గుణం, హృదయ విశాలత మరియు ఉన్నత నైతికపు విలువలను గురించి ప్రస్తావించడం జరిగింది. అంతేగాకుండా సహనం, తృప్తి, నిరపేక్షాభావం మొదలగు సుగుణాలను అలవరచుకొని పరుల ముందు చేయి చాపకుండా ఆత్మ గౌరవంతో బతకాలని కూడా ఈ హదీసులో చెప్పబడింది.

٢٧ - وَعَنْ أَبِي يَحْيَى صُهَيْبِ بْنِ سِنَانٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «عَجَباً لأَمْرِ الْمُؤْمِنِ إنَّ أَمْرَهُ كُلَّهُ لَهُ خَيْرٌ، وَلَيْسَ ذٰلِكَ لأَحَدٍ إلَّا لِلْمُؤْمِنِ: إنْ أَصَابَتْهُ سَرَّاءُ شَكَرَ فَكَانَ خَيْراً لَهُ، وَإنْ أَصَابَتْهُ ضَرَّاءُ صَبَرَ فَكَانَ خَيْراً لَه» رواه مسلم.

27. హజ్రత్ అబూ యహ్యా సుహైబ్ బిన్ సినాన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు: విశ్వాసి వ్యవహారం చాలా విచిత్రంగా ఉంటుంది. అతను చేసే ప్రతి పనిలో అతని కొరకు మేలు ఉంటుంది. విశ్వాసికి తప్ప మరెవరికీ ఈ భాగ్యం ప్రాప్తించలేదు. అతనికి ఆనంద ఘడియలు ఎదురైతే అందుకు అతను దైవానికి కృతజ్ఞతలు తెలుపుకుంటాడు. ఈ కృతజ్ఞత వల్ల అతనికే మేలు కలుగుతుంది. (అంటే దానిపై పుణ్యం లభిస్తుంది). ఒకవేళ అతనికి కష్టాలు ఎదురైతే అతను సహనం వహిస్తాడు. ఈ సహనం కూడా అతనికి మేలే కలుగజేస్తుంది. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

పై హదీసులో చెప్పబడినట్లు విశ్వాసి వ్యవహారం కష్టసుఖాల్లో, కలిమి లేముల్లో - అన్నివేళలా మేలుతో కూడుకొని ఉంటుంది. అంటే కలిమిలో అల్లాహ్‌ను విస్మరించడం, ఆయన అనుగ్రహాలపై కృతజ్ఞత పాటించడానికి బదులు అవిధేయతకు పాల్పడటం, అదేవిధంగా కష్టాలు, ఆపదల సమయాల్లో సహనానికి బదులు ఆందోళనకు గురికావడం, దేవుని విధిరాతను తూలనాడటం, నిందించడం లాంటి చేష్టలు ఒక విశ్వాసికి ఎంతమాత్రం శోభించవని దీని భావం.

٢٨ - وَعَنْ أَنَسٍ رضي الله عنه قال: لَمَّا ثَقُلَ النَّبِيُّ ﷺ جَعَلَ يَتَغَشَّاهُ الْكَرْبُ فَقَالَتْ فَاطِمَةُ رضي الله عنها: وَاكَرْبَ

28. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) వ్యాధి తీవ్రరూపం దాల్చి, ఆరోగ్యం ఆందోళనకరంగా మారినప్పుడు, (ఆయన కుమార్తె) హజ్రత్ ఫాతిమా (రజి.అన్హా) "అయ్యో! నా

أَبَتَاه. فَقَالَ: «لَيْسَ عَلَى أَبِيكِ كَرْبٌ بَعْدَ الْيَوْمِ» فَلَمَّا مَاتَ قَالَتْ: يا أَبَتَاه أَجَابَ رَبًّا دَعَاه، يَا أَبَتَاه جَنَّةُ الْفِرْدَوْسِ مَأْوَاه، يَا أَبَتَاه إِلَى جِبْرِيلَ نَنْعَاه؛ فَلَمَّا دُفِنَ قَالَتْ فَاطِمَةُ رضي الله عنها: أَطَابَتْ أَنْفُسُكُمْ أَنْ تَحْثُوا عَلَى رسولِ الله ﷺ التُّرَابَ؟ رواه البخاري.

తండ్రి బాధను చూడండి" అంటూ వాపోయింది. అది విని దైవప్రవక్త (స) "ఈ రోజు తరువాత నీ తండ్రి ఇంకెన్నడూ బాధకు గురికాడమ్మా!" అన్నారు. ఆయన మరణించిన తరువాత ఆమె "అయ్యో నా తండ్రి! ప్రభువు పిలవగానే హాజరయ్యానంటూ వెళ్ళిపోయారు. అయ్యో నా తండ్రి, (ఇకపై కనిపించరు). ఫిరదౌసు ఉద్యానవనం (స్వర్గం) ఆయన నివాస స్థలం అయిపోయింది. అయ్యో నాన్నా! మేము జిబ్రయీల్ దూతకు మీ మరణవార్త గురించి తెలియజేస్తాము" అంటూ బాధపడ్డారు. ఆయన ఖననం చేయబడిన తరువాత హజ్రత్ ఫాతిమా (ప్రవక్త సహచరుల నుద్దేశించి) "దైవప్రవక్త (సమాధి)పై మన్ను పోయడానికి మీకు మనసెలా వొప్పింది" అంటూ ఆవేదన వ్యక్తం చేశారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని యుద్ధాల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

మృత్యువు ఆసన్నమయిన సమయంలో కలిగే బాధను, ఆందోళనను వ్యక్తం చేయవచ్చని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. అదేవిధంగా ఎవరైనా చనిపోయినప్పుడు సహజమైన రీతిలో దుఃఖాన్ని, ఖేదాన్ని వెల్లడించడంలోనూ తప్పులేదు. అయితే అతిగా రోదించడం, ఏడ్పులు, పెడబొబ్బలు పెట్టడం, జుత్తు పీక్కోవడం, బట్టలు చించుకోవడం లాంటి అవాంఛనీయమైన పనులు మాత్రం చేయరాదు. మృతుని గుణప్రశస్తుల్ని గురించి చెప్పడం ధర్మసమ్మతమే. హజ్రత్ ఫాతిమా (రజి) చివరగా పలికిన పలుకులు కూడా ఒక రకంగా ఆవేదనాభరిత వాక్యాలే.

దైవప్రవక్త (సల్లం) ఖననం చేయబడటంలో అభ్యంతరమేముంది? ఎందుకంటే అది షరీఅత్ ఇచ్చే ఆజ్ఞ. దాన్నుంచి ఎవరికీ (ఆఖరికి దైవప్రవక్తకు కూడా) మినహాయింపు ఉండదు.

٢٩ ـ وَعَنْ أَبي زَيْدٍ أُسَامَةَ بْنِ زَيْدِ بنِ حَارِثَةَ مَوْلَى رسولِ الله ﷺ وَحِبِّهِ وَابْنِ حِبِّهِ، رضي الله عنهما، أرْسَلَتْ بِنْتُ النَّبِيِّ ﷺ: إنَّ ابني قَدِ احْتُضِرَ فَاشْهدْنَا، فَأرْسَلَ يُقْرِئُ السَّلامَ وَيقُول: «إنَّ لله مَا أَخَذَ، وَلَه مَا أَعْطَى، وَكُلُّ شَيْءٍ عِنْدَه بأَجَلٍ مُسَمًّى، فَلْتَصْبِرْ وَلْتَحْتَسِبْ» فَأَرْسَلَتْ إلَيْهِ تُقْسِم عَلَيْهِ لَيَأْتِيَنَّهَا. فقَامَ وَمَعَه سَعْدُ بْنُ عُبَادَةَ، وَمُعَاذُ بْنُ جَبَلٍ، وَأُبَيُّ بْنُ كَعْبٍ، وَزَيْدُ بْنُ ثَابِتٍ، وَرِجَالٌ رضي الله عنهم، فَرُفِعَ إلَى رسولِ الله ﷺ الصَّبِيُّ، فَأَقْعَدَهُ في حَجْرِهِ وَنَفْسُهُ تَقَعْقَعُ؛ فَفَاضَتْ عَيْنَاهُ، فَقَالَ سَعْدٌ: يا رسولَ الله مَا هٰذَا؟ فَقَالَ: «هٰذِهِ رَحْمَةٌ جَعَلَهَا اللهُ

29. దైవప్రవక్త (సల్లం) చేత విముక్తి నొసగబడిన బానిస, ఆయనకు ప్రియతములు, ఇంకా ఆయన గారి ప్రియశిష్యుని కుమారుడైనటువంటి హజ్రత్ అబూ జైద్ ఉసామా బిన్ జైద్ బిన్ హారిసా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) కుమార్తె ఒకరు "నా కుమారునికి అంతిమ ఘడియ ఆసన్నమయింది. మీరు వెంటనే మా దగ్గరికి వచ్చేయండి" అంటూ తన తండ్రికి కబురుచేశారు. అయితే దైవప్రవక్త (సల్లం) దానికి సమాధానంగా సలాం చెబుతూ "అల్లాహ్ వెనక్కి తీసుకున్నది ఆయనదే, తాను ఇచ్చినది కూడా ఆయన సొంతమే. ఆయన ప్రతి వస్తువుకూ ఒక గడువుని నిర్ణయించాడు. అందువల్ల సహనం వహించి పుణ్యాన్ని ఆశించమని ఆమెతో చెప్పు" అని వచ్చిన వ్యక్తిని తిప్పి పంపారు దైవప్రవక్త. ఆమె రెండవసారి కూడా ప్రమాణం చేసి మీరు తప్పకుండా రావాలని కబురు చేసింది.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) బయలు దేరారు. ఆయన వెంట సాద్ బిన్ ఉబాదా (రజి), ముఆజ్ బిన్ జబల్ (రజి), ఉబై బిన్ కాబ్, తదితర సహ చరులు కూడా వున్నారు. పిల్లవాడ్ని

تَعَالَى فِي قُلُوبِ عِبَادِهِ»، وفي روايةٍ: «في قُلُوبِ مَنْ شَاءَ مِنْ عِبَادِهِ وإنَّمَا يَرْحَمُ اللهُ مِنْ عِبَادِهِ الرُّحَمَاءَ» متفق عليه. ومَعْنَى «تَقَعْقَعُ»: تَتَحَرَّكُ وَتَضْطَرِبُ.

ఆయన వద్దకు తీసుకువచ్చి ఆయన ఒడిలో పెట్టడం జరిగింది. ఆ అబ్బాయి కొన ఊపిరితో కొట్టుమిట్టాడు తున్నాడు. ఆ పరిస్థితిని చూసి దైవ ప్రవక్త (సల్లం) కళ్ళవెంబడి అశ్రుధారలు ప్రవహించాయి. అప్పుడు హజ్రత్ సాద్ (రజి) "దైవప్రవక్తా! ఇదేమిటీ (మీరు కూడా దుఃఖిస్తున్నారు?)" అని అడిగారు. అందుకు దైవప్రవక్త (సల్లం) "ఇది దేవుడు తన దాసుల హృదయాల్లో ఉంచిన వాత్సల్యం" అని సమాధాన మిచ్చారు.

వేరొక ఉల్లేఖనంలో "అల్లాహ్ తాను కోరిన దాసుల హృదయాల్లో (ఈ కారుణ్యాన్ని ఉంచాడు). తన దాసుల్లో జాలిగుండెలుగల వారిపైనే అల్లాహ్ జాలిచూపుతాడు" అని ఉంది.

*(బుఖారీ - ముస్లిం)*

హదీసులోని "తఖాఖవు" అనే పదానికి వణకడం, కొట్టుమిట్టాడటం అనే అర్థాలు ఉన్నాయి.

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. మనిషి మరణశయ్యపై ఉన్నప్పుడు అతని బంధువులంతా హాజరుకావాలన్న నియమం ఏమీ లేదు. అయితే జనాజా (అంత్య క్రియల) నమాజులో అందరూ హాజరు కావడం అభిలషణీయం.
2. మృత్యువుతో పోరాడుతున్న వ్యక్తి దగ్గర పుణ్యపురుషులు కూర్చుంటే, వారి దుఆ చలువతో ఆ వ్యక్తి గడ్డు పరిస్థితి త్వరగా గడిచిపోతుందని కుటుంబ సభ్యులు భావించడంలో తప్పులేదు.

3. విశ్వాసమున్న వ్యక్తికోసం ప్రమాణం చేయడం, ఆ వ్యక్తి ఆ ప్రమాణాన్ని నెరవేర్చడం భావ్యమే. దీనివల్ల పరస్పర విశ్వాసం, ప్రేమానురాగాలు పెంపొందుతాయి.

4. మృతునిపై సహజమైన రీతిలో దుఃఖించడం, మృతుని బంధువులకు ఈ విషాద సంఘటనపై సహనం వహించమని, అల్లాహ్ నుండి పుణ్యాన్ని ఆశించమని బోధించడం ధర్మసమ్మతమే.

5. ప్రేమానురాగాలు దైవానుగ్రహాన్ని, దైవ కారుణ్యాన్ని బడయటానికి ఉపకరించే సాధనాలు. వీటి లేమి మనిషి దౌర్భాగ్యానికి ఆనవాలు.

30. హజ్రత్ సుహైబ్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ప్రబోధనం - "పూర్వం ఒక రాజు ఉండేవాడు. అతని దగ్గర ఒక మాంత్రికుడు ఉండేవాడు. ఆ మాంత్రికుడు బాగా ముసలివాడై పోయిన తరువాత (ఒకనాడు) రాజుతో "నేనిక ముసలివాణ్ణయిపోయాను. నాకు ఒక బాలుణ్ణి అప్పగిస్తే నేనతనికి మాంత్రిక విద్యలన్నీ నేర్పిస్తాను" అన్నాడు. దానికి రాజు సరేనని ఒక బాలుణ్ణి అతని వద్దకు పంపాడు. మాంత్రికుడు ఆ బాలునికి మాంత్రికవిద్యను నేర్పేవాడు. అయితే ఆ బాలుడు మాంత్రికుని వద్దకు వెళ్ళే దారిలో ఒక మతగురువు నివాసం ఉండేది. ఆ బాలుడు మాంత్రికుని వద్దకు వెళ్ళినప్పుడల్లా (దారిలో కొంత సేపు) మత గురువు దగ్గర కూడా కూర్చొనేవాడు. ఆ విధంగా అతను ఆ గురువు మాటలకు ప్రభావితుడయ్యాడు. దాంతో అతను మాంత్రికుని వద్దకు వెళ్ళినప్పుడల్లా దారిలో మత

٣٠ ـ وَعَنْ صُهَيْبٍ رضي الله عنه أن رسولَ اللهِ ﷺ قال: «كَانَ مَلِكٌ فِيمَنْ كَانَ قَبْلَكُمْ، وَكَانَ لَهُ سَاحِرٌ، فَلَمَّا كَبِرَ قَالَ لِلْمَلِكِ: إِنِّي قَدْ كَبِرْتُ فَابْعَثْ إِلَيَّ غُلاماً أُعَلِّمْهُ السِّحْرَ فَبَعَثَ إِلَيْهِ غُلاماً يُعَلِّمُهُ، وَكَانَ فِي طَرِيقِهِ إِذَا سَلَكَ رَاهِبٌ فَقَعَدَ إِلَيْهِ وَسَمِعَ كَلامَهُ فَأَعْجَبَهُ، وَكَانَ إِذَا أَتَى السَّاحِرَ مَرَّ بِالرَّاهِبِ وَقَعَدَ إِلَيْهِ، فَإِذَا أَتَى السَّاحِرَ ضَرَبَهُ، فَشَكَا ذلكَ إِلَى الرَّاهِبِ

గురువు దగ్గర కూడా కూర్చోవడం ప్రారంభించాడు. (రావడంలో ఆలస్యమవుతున్నందుకు) మాంత్రికుడు బాలుణ్ణి కొట్టేవాడు. అతను ఈ విషయం మతగురువుకి తెలియజేశాడు. అది విని ఆయన, "మాంత్రికుడు నిన్ను కొడతాడని భయం వేస్తే ఇంట్లో (పనుంటే) ఆగమన్నారని చెప్పు. అలాగే ఆలస్యమెందుకయిందని ఇంట్లో నిలదీస్తే మాంత్రికుడు ఆగమన్నాడని చెప్పు" అని అన్నాడు.

అలాగే రోజులు గడుస్తున్నాయి. ఒకరోజు ఆ బాలుడు తను వెళ్ళే దారిలో ఒక పెద్ద మృగాన్ని చూశాడు. అది మనుషుల రాకపోకలకు అడ్డంకిగా నిల్చుంది. అప్పుడా బాలుడు ఈ రోజు మాంత్రికుడు గొప్పవాడో లేక మతగురువు గొప్పవాడో తేలిపోవాలని మనసులో అనుకున్నాడు. అతను చేతిలో ఒక రాయి తీసుకొని "ఓ అల్లాహ్! మతగురువు చేస్తున్న పని నీ దృష్టిలో మాంత్రికుని పనికన్నా ప్రీతికరమైనదైతే (ఈ రాయితో) మృగాన్ని చంపెయ్యి. మనుషులు తమ దారిన తాము వెళ్ళిపోతారు" అని వేడుకొని రాయిని మృగంపైకి విసిరేశాడు. ఆ దెబ్బకు మృగం చచ్చిపోయింది. దాంతో ప్రజలు (నిర్భయంగా) ఆ దారిగుండా రాకపోకలు సాగించారు. ఆ తరువాత

فَقَالَ: إذَا خَشِيتَ السَّاحِرَ فَقُلْ: حَبَسَنِي أَهْلِي، وإذَا خَشِيتَ أَهْلَكَ فَقُلْ: حَبَسَنِي السَّاحِرُ. فَبَيْنَمَا هُوَ عَلَى ذلكَ إذْ أَتَى عَلَى دَابَّةٍ عَظِيمَةٍ قَدْ حَبَسَتِ النَّاسَ فَقَالَ: اليَوْمَ أَعْلَمُ آلسَّاحِرُ أفضلُ أم الرَّاهِبُ أفضلُ؟ فَأَخَذَ حَجَراً فَقَالَ: اللَّهُمَّ إنْ كَانَ أمْرُ الرَّاهِبِ أَحَبَّ إلَيْكَ مِنْ أَمرِ السَّاحِرِ فَاقْتُلْ هٰذِهِ الدَّابَّةَ حَتَّى يَمْضِيَ النَّاسُ، فَرَمَاهَا فَقَتَلَهَا وَمَضَى النَّاسُ، فَأَتَى الرَّاهِبَ فَأَخْبَرَهُ. فَقَالَ لَهُ الرَّاهِبُ: أيْ بُنَيَّ أَنْتَ اليَوْمَ أفضَلُ مِنِّي، قَدْ بَلَغَ مِنْ أمْرِكَ مَا أرَى، وَإنَّكَ سَتُبْتَلَى، فَإنِ ابْتُلِيتَ فَلا تَدُلَّ عَلَيَّ؛ وَكَانَ الغُلامُ يُبْرِئُ الأَكْمَهَ

وَالأَبْـرَصَ، وَيُـدَاوِي النَّـاسَ مِـنْ سَـائِـرِ الأَدْوَاءِ. فَسَمِعَ جَلِيسٌ لِلْمَلِكِ كَانَ قَدْ عَمِيَ، فَأَتَاهُ بِهَدَايَا كَثِيرَةٍ فَقَالَ: مَا هٰهُنَا لَكَ أَجْمَعُ إِنْ أَنْتَ شَفَيْتَنِي، فَقَالَ: إِنِّي لا أَشْفِي أَحَداً، إِنَّمَا يَشْفِي اللهُ تَعَالَىَ، فَإِنْ آمَنْتَ بِاللهِ تَعَالَى دَعَوْتُ اللهَ فَشَفَاكَ، فَآمَنَ بِاللهِ تَعَالَى فَشَفَاهُ اللهُ تَعَالَى، فَأَتَى الْمَلِكَ فَجَلَسَ إِلَيْهِ كَمَا كَانَ يَجْلِسُ فقالَ لَهُ الْمَلِكُ: مَنْ رَدَّ عَلَيْكَ بَصَرَكَ؟ قَالَ:

అతను మతగురువు దగ్గరికి వెళ్ళి జరిగినదంతా వివరించాడు. అది విని మతగురువు “నాయనా! ఈ రోజు నీవు నాకంటే గొప్పవాడివి అయ్యావు. (దైవభక్తి, విద్యాపరంగా) నువ్వు ఏ స్థాయికి చేరుకున్నావో నాకర్థమయ్యింది. త్వరలోనే నీకు పరీక్షలు ఎదురౌతాయి. (అయితే ఒక విషయం మాత్రం గుర్తుంచుకో) ఆ పరీక్షా సమయం ఆసన్నమయినప్పుడు నా గురించి ఎవరికీ చెప్పకు సుమా!” అని హితవు పలికాడు.

ఈ బాలుడు పుట్టు గుడ్డివారిని కుష్టు రోగులను కూడా (దైవ సహాయంతో) నయం చేసేవాడు. అన్ని రకాల రోగాలకూ చికిత్సలు చేసేవాడు. రాజ దర్బారులోని ఒకతనికి కంటిచూపు పోయింది. అతను ఈ బాలుణ్ణి గురించి విని ఎన్నో కానుకలు వెంటబెట్టుకొని వచ్చి ఆ బాలునితో “నువ్వు గనక నాకు నయం చేస్తే నేను తీసుకువచ్చిన ఈ కానుకలన్నీ నీకే” అన్నాడు. దానికి ఆ అబ్బాయి “నేనెవరికీ నయం చేయలేను. నయం చేసేది కేవలం అల్లాహ్ మాత్రమే. నువ్వు కూడా అల్లాహ్‌ను విశ్వసిస్తే, నేను నీ కోసం దుఆ చేస్తాను (నీ వ్యాధి నయమయిపోతుంది)” అని చెప్పాడు. ఆ బాలుని మాటలు విని ఆ వ్యక్తి అల్లాహ్‌ను విశ్వసించాడు. అల్లాహ్ అతనికి నయం చేశాడు.

ఆ తరువాత అతను రాజు దగ్గరికి వెళ్ళి మునుపటిలాగే అతని ముందు కూర్చున్నాడు. రాజు అతన్ని చూసి "నీకు తిరిగి దృష్టి ఎలా వచ్చింది?" అనడిగాడు. దానికతను "నా ప్రభువు నాకు తిరిగి దృష్టిని ప్రసాదించాడు" అని సమాధానమిచ్చాడు. అందుకు రాజు "ఏమిటి? నేనుగాక నీకు వేరే ప్రభువు ఉన్నాడా?" అని ప్రశ్నించాడు. "నాకూ నీకూ ప్రభువు అల్లాహ్ (మాత్రమే)" అని ఆ వ్యక్తి జవాబిచ్చాడు.

దాంతో రాజు (కోపోద్రిక్తుడై) అతన్ని బంధించి శిక్షించసాగాడు. ఆఖరికి అతను ఆ బాలుని గురించి రాజుకి చెప్పేశాడు. బాలుణ్ణి రాజు దర్బారుకి తీసుకురావడం జరిగింది. "నువ్వు పుట్టుకతో అంధులైనవారిని, కుష్టు రోగుల్ని కూడా నయం చేస్తున్నావట. ఇంకా పెద్ద పెద్ద పనులు చేస్తున్నావట. ఇంద్రజాలంలో అంతటి నైపుణ్యం వచ్చిందా నీకు!" అని రాజు ఆ బాలుణ్ణి ప్రశ్నించాడు. దానికా బాలుడు "నేను ఎవరికీ నయం చేయలేను. నయం చేసేవాడు అల్లాహ్ మాత్రమే" అని సమాధానమిచ్చాడు. బాలుని సమాధానం విని రాజు అతన్ని కూడా బంధించి యాతన పెట్టసాగాడు. చివరికి ఆ బాలుడు మతగురువు గురించి చెప్పేశాడు.

رَبِّي. قالَ: وَلَكَ رَبٌّ غَيْرِي؟! قالَ: رَبِّي وَرَبُّكَ اللهُ، فَأَخَذَهُ فَلَمْ يَزَلْ يُعَذِّبُهُ حَتَّى دَلَّ عَلَى الغُلام، فَجِيْءَ بِالغُلام فقالَ لَهُ المَلِكُ: أيْ بُنَيَّ قَدْ بَلَغَ مِنْ سِحْرِكَ مَا تُبْرِئُ الأكْمَهَ وَالأبْرَصَ وَتَفْعَلُ وَتَفْعَلُ فقالَ: إنِّي لا أَشْفِي أَحَداً، إنَّما يَشْفِي اللهُ تعالَى، فَأَخَذَهُ فَلَمْ يَزَلْ يُعَذِّبُهُ حَتَّى دَلَّ عَلَى الرَّاهِبِ؛ فَجِيْءَ بالرَّاهِبِ فَقِيلَ لَهُ: ارْجِعْ عَنْ دِينِكَ، فَأَبَى، فَدَعَا بِالمِنْشَارِ فَوُضِعَ المِنْشَارُ في مَفْرِقِ رَأْسِهِ، فَشَقَّهُ حَتَّى وَقَعَ شِقَّاهُ، ثُمَّ جِيءَ بِجَلِيسِ المَلِكِ فقِيلَ لَهُ: ارْجِعْ عنْ دِينِكَ فَأَبَى، فَوُضِعَ المِنْشَارُ في مَفْرِقِ رَأْسِهِ، فَشَقَّهُ بِهِ حَتَّى وَقَعَ شِقَّاهُ، ثُمَّ جِيءَ بِالغُلامِ فَقِيلَ لَهُ: ارْجِعْ عَنْ دِينِكَ فَأَبَى، فَدَفَعَهُ إلَى نَفَرٍ مِنْ أصْحَابِهِ فَقَالَ: اذْهَبُوا بِهِ إلَى جَبَلِ كَذَا وَكَذا فَاصْعَدُوا بِهِ الجَبَلَ، فَإذَا بَلَغْتُمْ

ذِرْوَتَهُ فَإِنْ رَجَعَ عَنْ دِينِهِ وَإِلَّا فاطْرَحُوهُ، فَذَهَبُوا بِهِ فَصَعِدُوا بِهِ الْجَبَلَ فقالَ: اللَّهُمَّ اكْفِنِيهِمْ بِمَا شِئْتَ، فَرَجَفَ بِهِمُ الْجَبَلُ فَسَقَطُوا، وَجَاءَ يَمْشِي إِلَى الْمَلِكِ، فَقَالَ لَهُ الْمَلِكُ: مَا فَعَلَ بِأَصْحَابِكَ؟ فقالَ: كَفَانِيهِمُ اللهُ تعالى، فَدَفَعَهُ إِلَى نَفَرٍ مِنْ أَصْحَابه فقالَ: اذْهَبُوا به فاحْمِلُوهُ في قُرْقُورٍ وَتَوَسَّطُوا به الْبَحْرَ، فَإِنْ رَجَعَ عَنْ دِينِهِ وَإِلَّا فاقْذِفُوهُ، فَذَهَبُوا به فقالَ: اللَّهُمَّ اكْفِنِيهِمْ بِمَا شِئْتَ، فانْكَفَأَتْ بِهِمُ السَّفِينَةُ فَغَرِقُوا، وَجَاءَ يَمْشِي إِلَى الْمَلِكِ. فقالَ لَهُ الْمَلِكُ: مَا فَعَلَ بِأَصْحَابِكَ؟ فَقَالَ:

మతగురువుని కూడా (రాజు దర్బారులో) నిలబెట్టడం జరిగింది. తన ధర్మం నుండి మరలిపొమ్మని ఆయనకు చెప్పబడింది. కాని ఆయన అందుకు నిరాకరించాడు.

రాజు ఒక రంపాన్ని తెప్పించాడు. దాన్ని గురువు నడినెత్తిన ఉంచి ఆయన శిరస్సును కోయటం జరిగింది. దాంతో ఆయన తలకాయ రెండు ముక్కలై పోయింది. ఆ తరువాత రాజ దర్బారు లోని వ్యక్తిని తీసుకువచ్చారు. అతన్ని కూడా తన ధర్మం నుండి మరలి పొమ్మని ఆదేశించడం జరిగింది. ఆ వ్యక్తి కూడా నిరాకరించాడు. అతని తల పాపటిలో రంపం పెట్టి కోయడంతో అతని తల కూడా రెండు ముక్కలైంది. ఆ తరువాత బాలుణ్ణి పట్టుకొని తీసుకు వచ్చారు. తన ధర్మం నుండి తిరిగిపో వాలని అతన్ని కూడా ఆదేశించడం జరిగింది. కాని ఆ బాలుడు కూడా ససేమిరా అన్నాడు.

రాజు ఆ పసివాణ్ణి తన ప్రధాన భటులకు అప్పగించి "ఇతణ్ణి ఫలానా పర్వత శిఖరం పైకి తీసుకెళ్ళండి. ఇతను తన ధర్మం విడిచిపెడితే సరి; లేకపోతే అక్కణ్ణుంచి క్రిందికి తోసెయ్యండి" అని ఆజ్ఞాపించాడు. వాళ్ళు ఆ పిల్లవాడ్ని తీసుకొని కొండపైకెక్కారు. అక్కడ ఆ

كَفَانِيهِمُ الله تعالى. فقالَ لِلْمَلِكِ: إِنَّكَ لَسْتَ بِقَاتِلِي حَتَّى تَفْعَلَ مَا آمُرُكَ بِهِ. قالَ: مَا هُوَ؟ قالَ: تَجْمَعُ النَّاسَ فِي صَعِيدٍ وَاحِدٍ، وَتَصْلُبُنِي عَلَى جِذْعٍ، ثُمَّ خُذْ سَهْماً مِنْ كِنَانَتِي، ثُمَّ ضَعِ السَّهْمَ فِي كَبِدِ الْقَوْسِ ثُمَّ قُلْ: بِسْمِ اللهِ رَبِّ الْغُلامِ، ثُمَّ ارْمِنِي، فإِنَّكَ إِذَا فَعَلْتَ ذلكَ قَتَلْتَنِي. فَجَمَعَ النَّاسَ

బాలుడు, "దేవా! ఎలాగైనాసరే (నీయిష్ట ప్రకారం) వీళ్లకు వ్యతిరేకంగా నీవు నాకు అండగా ఉండు" అని వేడుకున్నాడు. దాంతో ఆ కొండ కంపించసాగింది. ఆ ప్రకంపనకు వాళ్ళందరూ క్రిందపడి పోయారు. ఆ పిల్లవాడు తిరిగి రాజు దగ్గరికి వచ్చాడు. రాజు అతణ్ణి చూసి (ఆశ్చర్యపోతూ) "నీ వెంటవెళ్ళిన వారు ఏమైపోయారు? (వాళ్లు నిన్ను క్రిందికి తోసెయ్యలేదా?)" అని అడిగాడు. దానికి ఆ బాలుడు "వారికి ప్రతిగా అల్లాహ్ నాకు తోడ్పడ్డాడ"ని సమాధాన మిచ్చాడు.

రాజు (కోపం చల్లారలేదు. ఆ పిల్లవాడ్ని ఇంకొంతమందికి అప్పజెప్పి "ఇతణ్ణి పడవ ఎక్కించుకొని సముద్రంలోకి తీసు కెళ్ళండి. వీడు తన ధర్మం నుండి మరలి పోతే సరి; లేకపోతే నడి సముద్రంలోకి విసరివేయండి" అని ఆజ్ఞాపించాడు. (రాజు ఆజ్ఞానుసారం) భటులు ఆ పిల్ల వాడిని తీసుకెళ్ళారు. అతను పడవలో కూర్చొని "దేవా! ఎలాగైనాసరే వీళ్లకు వ్యతిరేకంగా నీవు నాకు రక్షణ కల్పించు" అని వేడుకున్నాడు. దాంతో పడవ తల క్రిందులయింది. తోడవచ్చిన వారంతా మునిగిపోయారు.

తిరిగి ఆ పిల్లవాడు రాజు దగ్గరికి చేరు కున్నాడు. రాజు అతణ్ణి చూసి "వాళ్ళు

فِي صَعِيدٍ وَاحِدٍ، وَصَلَبَهُ عَلَى جِذْعٍ، ثُمَّ أَخَذَ سَهْماً مِنْ كِنَانَتِهِ، ثُمَّ وَضَعَ السَّهْمَ فِي كَبِدِ الْقَوْسِ، ثُمَّ قَالَ: بِسْمِ اللهِ رَبِّ الْغُلامِ، ثُمَّ رَمَاهُ فَوَقَعَ السَّهْمُ فِي صُدْغِهِ، فَوَضَعَ يَدَهُ فِي صُدْغِهِ فَمَاتَ. فَقَالَ النَّاسُ: آمَنَّا بِرَبِّ الْغُلامِ، فَأُتِيَ الْمَلِكُ فَقِيلَ لَهُ: أَرَأَيْتَ مَا كُنْتَ تَحْذَرُ قَدْ وَاللهِ نَزَلَ بِكَ حَذَرُكَ. قَدْ آمَنَ النَّاسُ. فَأَمَرَ بِالأُخْدُودِ بِأَفْوَاهِ السِّكَكِ فَخُدَّتْ وَأُضْرِمَ فِيهَا النِّيرَانُ وَقَالَ: مَنْ لَمْ يَرْجِعْ عَنْ دِينِهِ

ఏమైపోయారు?" అని అడిగాడు. దానికి ఆ పిల్లవాడు "వారికి ప్రతిగా అల్లాహ్ నాకు సహాయపడ్డాడు" అని జవాబి చ్చాడు. ఇంకా ఆ బాలుడు ఇలా అన్నాడు: "నేను చెప్పే పద్ధతి అనుస రించనంతవరకు నువ్వు నన్ను చంప లేవు." ఆ పద్ధతి ఏమిటని రాజు అడి గాడు. అప్పుడు పిల్లవాడు చెప్పాడు : "ప్రజలందరినీ ఒక ఖాళీ ప్రదేశంలో హాజరుపరచు. నన్ను ఉరికంబం ఎక్కించి నా అంబులపొది నుండి ఒక బాణం తీసుకో. ఆ తరువాత బాణాన్ని వింటి తంతువుపై వుంచి ఈ మాటలు (ఈ పిల్లవాని ప్రభువైన అల్లాహ్ నామ ముతో అని) చెప్పి బాణాన్ని నాపైకి ప్రయోగించు. అలా చేస్తే నువ్వు నన్ను చంపడంలో సఫలీకృతుడవుతావు."

రాజు (పిల్లవాడు చెప్పినట్లే) ప్రజలం దరినీ ఒక పెద్ద స్థలంలో సమీకరిం చాడు. ఉరితీయడం కోసం పిల్లవాడిని ఉరి కొయ్యల మీదకు ఎక్కించాడు. అతని అంబులపొది నుండి ఒక బాణం తీసి, దాన్ని వింటి తంతువుపై ఉంచి "బిస్మిల్లాహి రబ్బిల్ గులామి (ఈ పిల్ల వాని ప్రభువైన అల్లాహ్ నామముతో)" అంటూ బాణాన్ని వదలిపెట్టాడు. బాణం వచ్చి ఆ పిల్లవాని కణతకు తగిలింది. ఆ పిల్లవాడు కణతను పట్టుకొని నేలకొరి గాడు.

فَاَقْحِمُوهُ فيها، أَوْ قِيلَ لَهُ: اقْتَحِمْ، فَفَعَلُوا حَتَّى جَاءَتِ امْرَأَةٌ وَمَعَهَا صَبِيٌّ لَهَا، فَتَقَاعَسَتْ أَنْ تَقَعَ فيهَا، فَقَالَ لَهَا الْغُلامُ: يَا أُمَّاهُ اصْبِرِي فَإِنَّكِ عَلَى الْحَقِّ» رواه مسلم. «ذِرْوَةُ الْجَبَلِ»: أَعْلاهُ، وَهِيَ بِكَسْرِ الذَّالِ الْمُعْجَمَةِ وَضَمِّهَا، وَ«الْقُرْقُورُ» بِضَمِّ الْقَافَيْنِ: نَوْعٌ مِنَ السُّفُنِ، وَ«الصَّعِيدُ» هُنَا: الأَرْضُ الْبَارِزَةُ، وَ«الأُخْدُودُ»: الشُّقُوقُ فِي الأَرْضِ كَالنَّهْرِ الصَّغِيرِ، وَ«أُضْرِمَ»: أُوقِدَ، وَ«انْكَفَأَتْ» أَي: انْقَلَبَتْ، وَ«تَقَاعَسَتْ»: تَوَقَّفَتْ وَجَبُنَتْ.

జరిగినది చూసిన ప్రజలంతా "మేము ఈ బాలుని ప్రభువును విశ్వసించాము" అని నినదించసాగారు. కొంతమంది రాజువద్దకు వెళ్ళి "ప్రభూ! ఇన్నాళ్ళు తమరు జరగకూడదని భీతిల్లినదే జరిగిపోయింది. మీరు భయపడిన విపత్తు వచ్చిపడింది. ప్రజలంతా అల్లాహ్‌ను విశ్వసిస్తున్నారు" అని రాజుకు వార్తనందజేశారు. అది విని రాజు వెంటనే తోవల ప్రక్కల్లో కంద కాలు త్రవ్వమని ఆదేశించాడు. రాజు ఆదేశానుసారం కందకాలు త్రవ్వ బడ్డాయి. వాటిలో మంటలు రగిలించారు. తాము విశ్వసించిన ధర్మాన్ని వదలని ప్రజలను అందులోకి విసరి వేయుమని లేదా ఆ మంటల్లోకి దూకెయ్యమని వారితో చెప్పండని రాజు (తన భటులను) ఆజ్ఞాపించాడు. వారు (రాజాజ్ఞను శిరసావహించి) అలాగే చేశారు. (ఈ దారుణమారణ హోమం జరుగుతుండగా) ఒక స్త్రీ తన చేతుల్లో ఓ పసివాడిని మోసుకొని అక్కడికి వచ్చింది. అయితే మంటల్లో దూకటానికి తటపటాయిస్తుండగా ఆమె చేతు ల్లోని పసికందు "అమ్మా! సహనం వహించు. నిస్సందేహంగా నువ్వు సత్యంపై ఉన్నావు" అంటూ మంటల్లో దూకేయమని తల్లిని పురికొల్పాడు.

(ముస్లిం)

సదరు హదీసులో వచ్చిన పదం "జర్వ తుల్ జబల్" అంటే పర్వతాగ్రం (శిఖరం). దీని 'జ'ను ఇకారం మరియు ఉకారం రెండు విధాలా చదువవచ్చును. 'ఖుర్ఖూర్' (రెండు 'ఖ' లకూ ఉకారమే) అంటే ఇది పడవల్లోని ఒక రకము. 'సయీద్' అనే పదం ఖాళీ ప్రదేశం అన్న అర్థంలో ఉంది. 'ఉఖ్దూద్' అంటే భూమిపై ఉండే గుంటలు, కందకాలు. చిన్న కాలువ అని అనవచ్చు. 'ఉజ్రిమ' అంటే "రాజేయబడింది" 'ఇన్కఫఅత్' అంటే "తలక్రిందులైంది" ఇంకా 'తఖాఅసత్' అంటే "తటపటాయించింది" లేక "పిరికితనం చూపింది" అనే అర్థాలు వస్తాయి.

*(సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత, కారుణ్య ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. పై హదీసు ద్వారా కలిగే అతి ముఖ్యమైన గుణపాఠం ఏమిటంటే ధర్మావలంబనలో ఎదురయ్యే కష్టాలు, కడగండ్లను సహన స్థయిర్యాలతో ఎదుర్కోవాలి. అవసరమైతే ధర్మం కోసం ప్రాణాలర్పించడానికి కూడా వెనుకాడరాదు.

2. దేవుని ప్రియదాసుల (వలీల) మహిమలు వాస్తవమే. దేవుడు తన వివేచనతో తన యిష్టప్రకారం వాటి అవసరాన్ని గుర్తిస్తే తన దాసుల ద్వారా వాటిని ఉనికిలోకి తెస్తాడు.

3. ఈ హదీసు ద్వారా ఖుర్ఆన్ యొక్క సత్యబోధనా ప్రశస్తి ఇనుమడిస్తోంది. రేయింబవళ్ళ తెరల మరుగునపడి కాలం చేత విస్మరించబడిన అతి ముఖ్యమైన చారిత్రక ఘట్టాలను కళ్లకు కట్టినట్లు వివరించే దైవగ్రంథ హితబోధనామృతానికి ఇది అద్దం పడుతోంది.

4. హదీసు లేకుండా ఖురాన్ను వ్యాఖ్యానించడం, విశదీకరించడం సాధ్యం కాదు. హదీసులో కందకం వాళ్ళ గాథ వివరించబడనట్లయితే దివ్య ఖురాన్లో చెప్పబడిన

'అస్‌హాబుల్ ఉఖ్‌దూద్' (కందకాలవాళ్ళ) వృత్తాంత వాస్తవికత ఏమిటో మనకు అర్థం అయ్యేది కాదు. ఖురాన్ సూక్తుల్లోని ఈ సూక్ష్మతను, సమగ్రతను హదీసు విశదపరచింది.

5. ఇటువంటి గాథలు సత్య సందేశ ప్రదాతలకు స్ఫూర్తినీ, స్థయిర్యాన్నీ అందజేస్తాయి.

٣١ ـ وَعَنْ أَنَسٍ رضي الله عنه قال: مَرَّ النَّبِيُّ ﷺ بِامْرَأَةٍ تَبْكِي عِنْدَ قَبْرٍ فَقَالَ: «اتَّقِي اللهَ وَاصْبِرِي»، فَقَالَتْ: إِلَيْكَ عَنِّي؛ فَإِنَّكَ لَمْ تُصَبْ بِمُصِيبَتِي! وَلَمْ تَعْرِفْهُ، فَقِيلَ لَهَا: إِنَّهُ النَّبِيُّ ﷺ، فَأَتَتْ بَابَ النَّبِيِّ ﷺ، فَلَمْ تَجِدْ عِنْدَهُ بَوَّابِينَ، فقالت: لَمْ أَعْرِفْكَ، فقال: «إِنَّما الصَّبْرُ عِنْدَ الصَّدْمَةِ الأُولَى» متفق عليه. وفي رواية لمُسْلِمٍ: تَبْكِي عَلَى صَبِيٍّ لَهَا.

31. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం : ఒక స్త్రీ సమాధి దగ్గర కూర్చొని ఏడుస్తుండగా దైవప్రవక్త (సల్లం) అటుగా రావటం జరిగింది. ఆమెను చూసి ఆయన "దైవానికి భయపడుతూ సహనం వహించు తల్లీ!" అని ఆమెను ఓదార్చారు. అందుకు ఆ స్త్రీ (ముఖం చిట్లించుకొని) "మీకెందుకు? మీరు ఇక్కణ్ణుంచి వెళ్ళిపోండి. నాపై వచ్చిపడిన ఆపద మీకైతే కలగలేదుగా!" అని అన్నది. వాస్తవానికి ఆమె తనతో మాట్లాడిన వ్యక్తి ఎవరో గుర్తుపట్టలేదు.

తరువాత, ఆమెను ఓదార్చినది దైవప్రవక్త అని ఆ స్త్రీకి కొంతమంది తెలియజేశారు. అది తెలుసుకొని ఆమె (పరుగెత్తు కుంటూ) దైవప్రవక్త వాకిలి దగ్గరికి వచ్చింది. అక్కడ ఆమెకు ఒక్క ద్వార పాలకుడయినా కానరాలేదు. ఆ మహిళ (దైవప్రవక్త (సల్లం)ను కలుసుకొని) "(క్షమించండి) నాతో మాట్లాడింది మీరని తెలుసుకోలేకపోయాను" అని విన్నవించుకుంది. కాని దైవప్రవక్త (సల్లం) (అదేమీ పట్టనట్లుగా) "ఆపద వచ్చిపడినప్పుడు వహించే సహనమే అసలు సహనం" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో "ఆమె తన కుమారుని సమాధిపై రోదిస్తూ కూర్చుంది" అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం. సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

పై హదీసు అసలు ఉద్దేశ్యం ఏమిటో స్పష్టంగా తెలుస్తూనే ఉంది. అయితే ఇక్కడ చెప్పుకోదగిన మరో ముఖ్య విషయం ఏమిటంటే ఇందులో దైవప్రవక్త (సల్లం) గారి ఉన్నత నైతిక గుణాలు కూడా పొందుపరచబడ్డాయి. సదరు మహిళ దైవప్రవక్త (సల్లం)తో ఆయన స్థాయికి తగని రీతిలో సంభాషణ జరిపింది. అయినప్పటికీ ఆయన ఆ మహిళపై కినుక వహించలేదు. ఆమెను నువ్వు చాలా కరకుగా మాట్లాడావని కూడా అనలేదు. పైగా ఆమె రెండోసారి తన సన్నిధికి వచ్చినప్పుడు హితబోధ వచనాలతో సాగనంపారు. సత్యసందేశ ప్రదాతలకు ఇందులో గొప్ప గుణపాఠం ఉంది. నేటి విద్వాంసులు (ఉలమా), సత్యసందేశ ప్రచారకులు కూడా అలాంటి ఉత్తమ నడవడికను అలవరచుకుంటే ఎంత బాగుంటుంది!

٣٢ ـ وَعَنْ أَبِي هُرَيرَةَ رضي الله عنه أن رسول الله ﷺ قَالَ: «يَقُولُ اللهُ تعالى: مَا لِعَبْدِي المُؤْمِنِ عِنْدِي جَزَاءٌ إِذَا قَبَضْتُ صَفِيَّهُ مِنْ أَهْلِ الدُّنْيَا ثُمَّ احْتَسَبَهُ إِلَّا الجَنَّة» رواه البخاري.

32. దైవప్రవక్త (సల్లం) ప్రబోధించారని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలియజేశారు : అల్లాహ్ అంటున్నాడు: విశ్వాసి అయిన నా దాసుని నుంచి తనకు అత్యంత ప్రియమైన వస్తువుని నేను వెనక్కి తీసుకున్నా అతను దానిపై (సహనం వహించి) పుణ్యాన్ని ఆశిస్తాడు - అలాంటివానికోసం నా దగ్గర స్వర్గం తప్ప మరే ప్రతిఫలమూ లేదు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

సాధారణంగా ఆలుబిడ్డలు, తల్లిదండ్రులు మొదలగువారు మనిషికి అత్యంత ప్రియమైనవారై ఉంటారు. అలాంటి వారు మరణిస్తే అది దైవకృతమని భావించి సహనం వహించడం సంపూర్ణ విశ్వాసానికి నిదర్శనం. దీనికి భిన్నంగా అసహనం, అతిగా ఏడ్చి

పెడబొబ్బలు పెట్టడం అనాలోచితంగా మాట్లాడటం లాంటి చేష్టలు విశ్వాస బలహీనతకు ఆనవాళ్లు. మొదటి విధానానికి ప్రతిఫలం స్వర్గం కాగా; రెండో విధానం దైవాగ్రహానికి కారణభూతమవుతుంది.

٣٣ - وَعَنْ عَائِشَةَ رضي الله عنها أَنَّهَا سَأَلَتْ رسولَ الله ﷺ عَن الطَّاعُونِ، فَأَخْبَرَهَا أَنَّهُ كَانَ عَذَاباً يَبْعَثُهُ اللهُ تعالى عَلَى منْ يَشَاءُ، فَجَعَلَهُ اللهُ تعالى رَحْمَةً لِلْمُؤْمِنِينَ، فَلَيْسَ مِنْ عَبْدٍ يَقَعُ فِي الطَّاعُون فَيَمْكُثُ فِي بَلَدِهِ صَابِراً مُحْتَسِباً يَعْلَمُ أَنَّهُ لا يُصِيبُهُ إِلَّا مَا كَتَبَ اللهُ لَهُ إِلَّا كَانَ لَهُ مِثْلُ أَجْرِ الشَّهِيدِ» رواه البخاري.

33. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) దైవప్రవక్త (సల్లం)ను ప్లేగువ్యాధి గురించి అడిగారు. దానికి ఆయన ఆమెకు ఈ విధంగా తెలియజేశారు - "ఒకప్పుడు ఇదో శిక్షగా ఉండేది. అల్లాహ్ తాను కోరినవారిని దానికి గురిచేసేవాడు. కాని ఇప్పుడు అల్లాహ్ దాన్ని విశ్వాసులపాలిట కారుణ్య ప్రదమైనదిగా మార్చివేశాడు. అందుచేత ఇక ఏ దాసుడైనా ఈ ప్లేగు వ్యాధికి గురైనప్పటికీ సహనంతో పరలోక పుణ్య ఫలాపేక్షతో తనకు వ్యాధిసోకిన నగరంలోనే ఉంటూ, దైవం తన కోసం రాసిపెట్టినదే జరుగుతుందన్న గట్టి నమ్మకాన్ని కలిగివుంటే అలాంటి వ్యక్తికి దైవమార్గంలో అమరగతినొందిన వ్యక్తికి లభించినంత పుణ్యం ప్రాప్తిస్తుంది." *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని వైద్య ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

ప్లేగు లాంటి ప్రాణాంతక అంటువ్యాధులు సోకినప్పుడు దేవుని విధివ్రాతపై విశ్వాసంతో వ్యాధికి గురైన నగరంలోనే ఉంటూ, అలాంటి విపత్కాలంలో కూడా కంగారు పడిపోకుండా, ఆందోళన చెందకుండా నిలకడను ప్రదర్శించిన ఒక విశ్వాసి దైవమార్గంలో అమరగతినొందిన వ్యక్తి స్థాయికి చేరుకుంటాడనడంలో సందేహం లేదు. అదేవిధంగా నీటిలో మునిగి చనిపోయేవాడు, ప్రసవావస్థలో మరణించే స్త్రీలు మొదలైనవారికి కూడా ఇలాంటి పుణ్యమే లభిస్తుంది. ఇకపోతే ప్లేగువ్యాధి సోకినవారు తమ నగరాల్లోనే ఉండాలన్న ఆదేశంలోని మర్మం ఏమిటంటే దీనివల్ల ఆ అంటువ్యాధి ఇతర నగరాలకు, ఇతర ప్రాంతాలకు వ్యాపించకుండా

ఉంటుంది. అంతేకాదు; అంటువ్యాధి వ్యాపించిన నగర దరిదాపులకు కూడా వెళ్ళరాదని ఇతర ప్రాంతాలవారినీ ఆదేశించడం జరిగింది. దీనిద్వారా అర్థమయ్యేదేమిటంటే, ప్రాణరక్షణ, ఆరోగ్య భద్రతల నిమిత్తం చికిత్సా విధానాలను అవలంబించడం, మందులు తదితర ఔషధాలను వాడటం విధివ్రాతపై విశ్వాసానికి విరుద్ధం కాదు. వ్యాధికి గురైనప్పుడు చూపే సహనం దైవ నిర్ణయాల పట్ల దాసుల అంగీకారానికి, వారి విశ్వాస పరిపూర్ణతకు అద్దం పడుతుంది.

٣٤ ـ وَعَنْ أَنَسٍ رضي الله عنه قال: سَمِعْتُ رسولَ الله ﷺ يقُولُ: «إنَّ اللهَ عَزَّ وَجَلَّ قَالَ: إذَا ابْتَلَيْتُ عَبدِي بحَبِيبَتَيهِ فَصَبَرَ عَوَّضْتُهُ مِنهُمَا الجَنَّةَ» يُريدُ عَيْنَيْه، رواه البخاري.

34. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(సల్లం) ఇలా తెలియజేశారు - అల్లాహ్ అంటున్నాడు : "నేను నా దాసుని ప్రియమైన రెండు వస్తువులను (రెండు కళ్ళను) తీసేసుకొని పరీక్షించినప్పుడు అతను గనక సహనం వహిస్తే వాటికి బదులుగా నేనతనికి స్వర్గాన్ని ప్రసాదిస్తాను." *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

ఈ ప్రపంచంలో అంధత్వాన్ని మించిన దౌర్భాగ్యం మరొకటి లేదు. అయితే అంతపెద్ద అభాగ్యానికి ఓర్చుకున్నందుకు అల్లాహ్ తగిన ప్రతిఫలమే ఇస్తాడన్న విషయాన్ని మాత్రం మరువకూడదు. అంధత్వంపై సహనం వహించడమంటే మాటలు కాదు. అంధులు విశ్వాసభాగ్యాన్ని కల్గివుండాలేగాని అల్లాహ్ అలాంటివారికి గొప్ప ప్రతిఫలం ప్రసాదించడాన్ని తన బాధ్యతగా తీసుకుంటాడు.

٣٥ ـ وَعَنْ عَطَاءِ بْن أَبِي رَبَاحٍ قالَ: قالَ لِي ابْنُ عَبَّاسٍ رضي الله عنهما: ألا أُرِيكَ امْرَأَةً مِنْ أَهْلِ الجَنَّةِ؟ فَقُلْتُ: بَلَى، قالَ: هٰذِهِ المرْأَةُ السَّوْدَاءُ أَتَتِ النبيَّ ﷺ فقَالَتْ: إنِّي أُصْرَعُ، وَإنِّي أَتَكَشَّفُ،

35. హజ్రత్ అతా బిన్ అబూ రబాహ్ (రహ్మలై) కథనం : ఒకసారి హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) గారు "నేను నీకు (ఇహలోకంలోనే) స్వర్గ ప్రవేశానికి అర్హత పొందిన స్త్రీని చూపెట్టనా?" అని నాతో అన్నారు. దానికి నేను "తప్పకుండా చూపెట్టండి" అన్నాను. అప్పుడాయన నాకీ విషయం తెలియజేశారు : ఈ నల్లటి మహిళ (ఒకసారి) దైవప్రవక్త

فَادْعُ الله تعالى لِي قَالَ: «إنْ شِئْتِ صَبَرْتِ وَلَكِ الْجَنَّةُ، وَإِنْ شِئْتِ دَعَوْتُ الله تعالى أنْ يُعَافِيَكِ»، فَقَالَتْ: أَصْبِرُ، فَقَالَت: إنِّي أتَكَشَّفُ، فَادْعُ اللهَ ألا أتَكَشَّفَ، فَدَعَا لَهَا. متفق عليه.

(సల్లం) సన్నిధికి వచ్చి, "నాకు మూర్ఛ పోయే రోగముంది. దానివల్ల (ఆ సమయంలో) నా ఒంటిపైన ఆచ్ఛాదనం తొలగిపోతోంది. (ఈ వ్యాధి నయం కావాలని) తమరు నా కోసం దుఆ చేయండి" అని విన్నవించుకుంది. అది విని ఆయన "నువ్వు గనక ఈ బాధపై సహనం వహిస్తే నీకు స్వర్గం లభిస్తుంది లేదా నువ్వు కోరితే, అల్లాహ్ నీకు ఈ వ్యాధి నుండి ఉపశమనం కలిగించాలని నేను నీ కోసం దుఆ చేస్తాను" అన్నారు. అందుకామె "సరే అలాగయితే (బాధ కలిగినా ఫరవాలేదు) ఓర్పు వహిస్తాను. అయితే (మూర్ఛపోయే సమయంలో) నా ఒంటి ఆచ్ఛాదనం తొలగిపోతోంది. (నేనా సందర్భంలో) నగ్నం కాకుండా ఉండాలని మాత్రం మీరు దైవాన్ని ప్రార్థించండి" అని అన్నది. ఆమె కోరిక మేరకు దైవప్రవక్త (సల్లం) ఆవిడ కోసం దుఆ చేశారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

మనిషికి, తాను నిలకడగా బాధల్ని భరించగలనన్న ధీమా ఉన్నప్పుడు వెసులుబాటుకు బదులు ఎలాగైనా సరే పరీక్షలకు తట్టుకుని నిలబడాలనుకోవటమే ఉత్తమం. దీనిపై అతనికి అపారమైన పుణ్యం, ప్రతిఫలాలు లభిస్తాయి. అదేవిధంగా అనారోగ్యానికి లోనైనప్పుడు వైద్యపరమైన చికిత్సలు పొందుతూనే ఆ రోగం నుంచి ఉపశమనం కోసం దైవాన్ని కూడా ప్రార్థిస్తూ ఉండాలి. ఈ రెండింటిలో దేనినీ వదలకూడదు. ఇవి రెండూ తమ తమ వంతు ప్రయోజనాన్ని మనిషికి చేకూరుస్తాయి.

٣٦ ـ وَعَنْ أَبي عَبْدِ الرَّحْمنِ عَبْدِ الله بْن مَسْعُودٍ رضي الله عنه قال: كَأَنِّي أَنْظُرُ إِلَى رسولِ الله ﷺ يَحْكِي نَبِيّاً مِنَ الأَنْبِياءِ، صَلَوَاتُ اللهِ وَسَلامُهُ عَلَيْهِمْ، ضَرَبَهُ قَوْمُهُ فَأَدْمَوْهُ وَهُوَ يَمْسَحُ الدَّمَ عَنْ وَجْهِهِ، يَقُولُ: «اللَّهُمَّ اغْفِرْ لِقَوْمي فَإِنَّهُمْ لا يَعْلَمُونَ» متفق عليه.

36. హజ్రత్ అబూ అబ్దుర్రహ్మాన్ అబ్దుల్లాహ్ బిన్ మస్‌ఊద్ (రజి) కథనం: ఇప్పటికీ నాకు - దైవప్రవక్త (సల్లం) ప్రవక్తల్లో ఎవరో ఒకరి సంఘటనను గురించి వివరిస్తుంటే నేనాయన్ని ప్రత్యక్షంగా చూస్తున్నానేమోననిపిస్తోంది. (ఈ విషయంపై నాకు అంత నమ్మకముంది) ఆ ప్రవక్తను ఆయన జాతి ప్రజలు రక్తసిక్తమయ్యేలా కొట్టారు. అప్పుడు ఆ ప్రవక్త "ఓ దేవా! నా జాతి వారు అమాయకులు. వారికేమీ తెలీదు, నువ్వు వారిని క్షమించు" అని ముఖం నుంచి కారుతున్న రక్తాన్ని తుడుచుకుంటూ దైవాన్ని వేడుకోసాగాడు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణం. ఇంకా సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

పై హదీసులో చెప్పబడిన ప్రవక్త, హజ్రత్ నూహ్ (అలైహి) అయివుండవచ్చని కొంతమంది పండితులు భావించగా, కాదు ఆయన అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ సల్లమేనని మరికొంతమంది తలపోశారు. ఏదిఏమైనా ఈ హదీసులో ఒక దైవప్రవక్తలో ఉండే ఉన్నత నైతికత, ఉదాత్తగుణం విశదీకరించబడింది. ధర్మసందేశ ప్రచారకులకు ఇందులో గొప్ప గుణపాఠం ఉంది. ధర్మసందేశ ప్రచార మార్గంలో ఎదురయ్యే కష్టనష్టాలకు ఓర్చుకోవాలని ఈ హదీసు మనకు ప్రబోధిస్తోంది. ధర్మసందేశం అందజేస్తున్నప్పుడు ప్రజలు కరకుగా మాట్లాడినా, దురుసుగా ప్రవర్తించినా చిర్రుబుర్రులాడకుండా, నుదురు చిట్లించకుండా మన్నింపుల వైఖరిని అవలంబించాలి. అంతేకాదు, క్షమాపణ కోసం సన్మార్గ భాగ్య ప్రాప్తికోసం అల్లాహ్‌ను వేడుకుంటూ ఉండాలి. ఇంకా మూర్ఖుల పట్ల మూర్ఖంగా వ్యవహరించే బదులు మంచితనంతో వారిని చేరదీయాలి. ఈ తరహా ఉన్నత నైతికత, నడవడిక ఒక ధర్మ సందేశ ప్రచారకునికి (దాయీకి) ఎంతైనా అవసరం అని ఈ హదీసు పరోక్షంగా సూచిస్తోంది.

37. హజ్రత్ అబూ సయీద్ మరియు హజ్రత్ అబూ హురైరా (రజి)ల కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు : "ముస్లింకు అలసట కలిగినా, రోగమొచ్చినా, మనోవ్యథ, దుఃఖం, బాధ కలిగినా - చివరికి అతనికి ముల్లు గుచ్చుకున్నాసరే అల్లాహ్ దాని మూలంగా అతని పాపాలను క్షమిస్తాడు." *(బుఖారీ - ముస్లిం)*

హదీసులో వచ్చిన పదం 'వసబ్' అంటే రోగం అని అర్థం.

٣٧ ـ وَعَنْ أَبِي سَعِيدٍ وأَبِي هُرَيْرَةَ رضـي الله عنهمـا عـن النَّبـيِّ ﷺ قـالَ: «مَا يُصِيبُ الْمُسْلِمَ مِنْ نَصَبٍ وَلَاوَصَبٍ وَلَا هَمٍّ وَلا حَزَنٍ وَلا أذًى وَلا غَمٍّ، حَتَّى الشَّوْكَةُ يُشَاكُهَا إلَّا كَفَّرَ اللهُ بِها مِنْ خَطَايَاهُ» متفق عليه. وَ«الْوَصَبُ»: الْمَرَضُ.

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణం. సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో విశ్వాసి పట్ల అల్లాహ్ కనబరిచే ప్రత్యేక దయాదాక్షిణ్యాల వైఖరి వివరించబడింది. ప్రాపంచిక జీవితంలో ఎదురయ్యే కష్టాలు, కడగండ్లు ఆపదలన్నింటినీ అల్లాహ్ విశ్వాసుల కోసం పాపాల పరిహారంగా మార్చివేస్తాడు. అయితే విశ్వాసి వాటిపై సహనం వహించినప్పుడే అది సాధ్యమవుతుంది. దీనికి భిన్నంగా ఆపదలు వచ్చినప్పుడు ఆందోళన పడిపోవడం, విధివ్రాతను నిందించడం లాంటి చేష్టలకు దిగితే అతను ఒకవైపు పుణ్యఫలాన్ని కోల్పోవడమేగాకుండా మరోవైపు మరిన్ని పాపాల భారాన్ని మోయవలసి వస్తుంది.

38. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం : నేనొకసారి దైవప్రవక్త (సల్లం) వద్దకు వెళ్ళాను. అప్పుడు ఆయన జ్వరంతో బాధపడుతున్నారు. నేనాయనతో "దైవప్రవక్తా! మీకు చాలా తీవ్రమైన జ్వరం ఉన్నట్టుంది" అన్నాను. దానికి ఆయన "అవును. మీలోని ఇద్దరు మనుషులకు వచ్చే జ్వరం నాకొక్కనికే

٣٨ ـ وَعَن ابْنِ مَسْعُودٍ رضي الله عنه قـال: دَخَلْـتُ عَلَى النبيِّ ﷺ وَهُوَ يُوعَكُ فَقُلْتُ: يَا رَسُولَ الله إنَّكَ تُوعَكُ

وَعْكاً شَدِيداً قال: «أَجَلْ إنِّي أُوعَكُ كَمَا يُوعَكُ رَجُلانِ مِنكُمْ»، قُلْتُ: ذلكَ أنَّ لَكَ أَجْرَيْنِ؟ قال: «أَجَلْ ذلكَ كَذلكَ مَا مِنْ مُسْلِمٍ يُصِيبُهُ أَذًى؛ شَوْكَةٌ فَمَا فَوْقَهَا إلَّا كَفَّرَ بِهَا سَيِّئَاتِهِ، وَحُطَّتْ عَنْهُ ذُنُوبُهُ كَمَا تَحُطُّ الشَّجَرَةُ وَرَقَهَا» متفقٌ عليه. و«الْوَعْكُ»: مَغْثُ الْحُمَّى، وَقيلَ: الْحُمَّى.

వస్తుంది" అని చెప్పారు. "మరయితే మీకు పుణ్యం కూడా రెండింతలు లభిస్తుంది" అన్నాను. అందుకు ఆయన "అవును. నీవన్నది నిజమే. ఏ ముస్లిం కయినాసరే, అతనికేదయినా బాధ కలిగినా, ముల్లు గుచ్చుకున్నా లేక అంత కన్నా పెద్ద ఆపద ఏదైనా వచ్చిపడినా అల్లాహ్ దాన్ని అతని పాలిట పాపపరి హారంగా చేస్తాడు. దానివల్ల అతని పాపాలు చెట్ల ఆకుల మాదిరిగా రాలి పోతాయి" అని చెప్పారు.

*(బుఖారీ - ముస్లిం)*

హదీసులో ప్రస్తావనకు వచ్చిన పదం "అల్ - వాకు" అంటే "జ్వరం వల్ల జీర్ణాశయంలో, ప్రేగుల్లో కలిగే బాధ" అని అర్థం. మరికొంతమంది అభిప్రాయంలో సామాన్య జ్వరాన్నే 'అల్-వాకు' అంటారు.

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణం. సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్తలకు సామాన్య మానవులకంటే ఎక్కువగా కష్టాలు ఎదురౌతాయని, అందుకు వారికి లభించే పుణ్యం కూడా రెట్టింపు అయి ఉంటుందని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. ఒక విశ్వాసికి ఎక్కువగా కష్టాలు ఎదురౌతున్నాయంటే అది అతని పరిపూర్ణ విశ్వాసానికి తార్కాణమేగాని అతనిపట్ల దైవాగ్రహానికి నిదర్శనం కాదని గ్రహించాలి.

٣٩ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مَنْ يُرِدِ اللهُ بِهِ

39. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు: అల్లాహ్ తాను మేలు

خَيْـراً يُصِـبْ مِنْـهُ»، رواه البخـاري.
وضَبَطُوا «يُصِبْ»: بفَتْحِ الصَّادِ وكَسْرِهَا.

చేయాలనుకున్న వ్యక్తిని కష్టాలకు గురిచేస్తాడు. (బుఖారీ)

'యుసిబ్' అన్న పదంలో 'స' అక్షరాన్ని ఇకారంతోను, అకారంతోనూ (యుసబ్) రెండు విధాలుగా చదవడం సరైనదే. ఎలా చదివినా అర్థం మారదు.

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణంలో 'వ్యాధి పాపపరిహారం' అన్న అధ్యాయంలో ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

ప్రాపంచిక కష్టాలు, కడగండ్లు, బాధలు, విపత్తులు, రోగాలు, పేదరికం, ధనప్రాణ నష్టాలన్నింటిలోనూ విశ్వాసికి మేలే ఉంది. ఎందుకంటే ప్రపంచంలో కష్టాలు ఎదురైనప్పుడు అతను దైవం వైపుకు మరలుతాడు. తన అశక్తతను, నిస్సహాయస్థితినీ వ్యక్తపరుస్తూ దీనాతిదీనంగా దైవాన్ని వేడుకుంటాడు. దాంతో అతని పాపాలు మన్నించబడతాయి. కనుక పరలోకం దృష్ట్యా కూడా విశ్వాసికి ఇందులో ఎంతో మేలు ఉంది.

٤٠ ـ وَعَن أَنَسٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «لا يَتَمَنَّيَنَّ أَحَدُكُمُ الْمَوْتَ لِضُرٍّ أَصَابَهُ، فَإِنْ كَانَ لا بُدَّ فَاعلاً فَلْيَقُلِ: اللَّهُمَّ أَحْيِني مَا كَانَت الْحَيَاةُ خَيْراً لِي وَتَوَفَّني إِذَا كَانَتِ الْوَفَاةُ خَيْراً لِي» متفقٌ عليه.

40. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు: మీలో ఎవరూ తనకు బాధ కలిగిందని చావుని కోరుకోరాదు. తప్పనిసరి పరిస్థితుల్లోనైతే ఈ విధంగా వేడుకోవాలి: "దేవా! జీవితం నా కొరకు మేలుతో కూడుకొని ఉన్నంతవరకూ నన్ను సజీవంగా ఉంచు. మరణమే నా కొరకు శ్రేయస్కరమైనప్పుడు నాకు మరణాన్ని ప్రసాదించు." (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణం. సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

మనిషికి భవిష్యత్తు గురించిన జ్ఞానం లేదు. రానున్న కాలం తన కొరకు శ్రేయస్కరమైనదా కాదా అనే విషయం తనకు తెలీదు కాబట్టి జీవితంలో ఎదురైన కష్టాలకు,

బాధలకు కళవళపడిపోయి చావుని కోరుకోరాదు. ఇది చీకట్లో కూర్చొని బాణం విసిరే చందాన ఉంటుంది. ఎందుకంటే మిగిలిన జీవితం అతని కొరకు ప్రాపంచికంగా, పారలౌకికంగా కూడా ఎంతో మేలైనది కావచ్చు. అందుకే మృత్యువును కోరుకోవడాన్ని వారించటం జరిగింది. అయితే దైవమార్గంలో అమరగతి నొందాలని, పుణ్యక్షేత్రాలలో మరణం సంభవించాలని కోరుకోవడంలో తప్పులేదు. ఎందుకంటే అవి పై హదీసులోని 'వారింపు' పరిధిలోకి రావు. ఒకవేళ మరణాన్ని కోరుకోవడం తప్పదనుకుంటే మాత్రం హదీసులో ప్రస్తావించబడిన వాక్యాలతో దైవాన్ని ప్రార్థించాలి.

٤١ ـ وَعَنْ أبي عبدِ اللهِ خَبَّابِ بْنِ الأَرَتِّ رضي الله عنه قال: شَكَوْنَا إلَى رسول الله ﷺ وَهُوَ مُتَوَسِّدٌ بُرْدَةً لَهُ في ظلِّ الْكَعْبَةِ، فَقُلْنَا: أَلا تَسْتَنْصِرُ لَنَا أَلا تَدْعُو لَنَا؟ فَقَالَ: «قَدْ كَانَ مَنْ قَبْلَكُمْ يُؤْخَذُ الرَّجُلُ فَيُحْفَرُ لَهُ في الأَرْضِ فَيُجْعَلُ فيهَا، ثُمَّ يُؤْتَى بِالْمِنْشَارِ فَيُوضَعُ عَلَى رَأْسِهِ فَيُجْعَلُ نِصْفَيْنِ، وَيُمْشَطُ بِأَمْشَاطِ الْحَدِيدِ مَا دُونَ لَحْمِهِ وَعَظْمِهِ، مَا يَصُدُّهُ ذلكَ عَنْ دِينِهِ، وَاللهِ لَيُتِمَّنَّ اللهُ هٰذَا الأمْرَ حَتَّى يَسِيرَ الرَّاكِبُ مِنْ صَنْعَاءَ إلَى حَضْرَمَوْتَ لا يَخَافُ إلَّا اللهَ وَالذِّئْبَ عَلَى غَنَمِهِ، وَلٰكِنَّكُمْ تَسْتَعْجِلُونَ» رواه البخاري. وفي رواية: وَهُوَ مُتَوَسِّدٌ بُرْدَةً وَقَدْ لَقِينَا مِنَ الْمُشْرِكِينَ شِدَّةً.

41. హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ ఖబ్బాబ్ బిన్ అరత్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఒకసారి కాబాగృహం నీడలో ఒక దుప్పటిని దిండుగా చేసుకొని ఆసీనులై ఉండగా మేము ఆయనకు ఈ విధంగా ఫిర్యాదు చేసుకున్నాము : "(ఓ దైవ ప్రవక్తా!) మీరు మా కోసం దైవసహాయాన్ని ఎందుకు అర్థించటం లేదు? మా కోసం దుఆ ఎందుకు చేయడం లేదు?" అది విని ఆయన "మీకు పూర్వమయితే (విశ్వసించిన) ఒక వ్యక్తిని పట్టుకొచ్చి, భూమిలో అతనికోసం తవ్విన గుంతలో అతణ్ణి నిలబెట్టేవారు. ఆ తరువాత రంపంతో అతణ్ణి రెండు ముక్కలుగా కోసేవారు. ఇనుప దువ్వెనలతో అతని శరీరాన్ని మాంసం, ఎముకలు బయటపడేదాకా రక్కేవారు. అయినాసరే ఈ కఠిన పరీక్షలన్నీ అతణ్ణి తన ధర్మం నుండి మళ్ళించగలిగేవి కావు. (అందుచేత మీరు ఆందోళన పడవలసిన అవసరం లేదు.) దైవసాక్షి! దేవుడు ఈ పనిని (ధర్మాన్ని పూర్తిచేసి తీరతాడు. అప్పుడు ఒక బాటసారి

(ఒంటరిగా) 'సన్ఆ' నుండి హజర్మోత్ నగరం వరకూ నిశ్చింతగా ప్రయాణించ గలడు. దారిలో అతనికి అల్లాహ్ భయం, ఇంకా తోడేలు వచ్చి తన మేకల్ని తినేస్తుందేమోనన్న భయం తప్ప మరే భయమూ ఉండదు. కాని మీరు తొందరపడుతున్నారు" అంటూ తన సహచరులకు ధైర్యం చెప్పారు.

*(బుఖారీ)*

వేరొక ఉల్లేఖనంలో ఈ వాక్యాలు అదనంగా ఉన్నాయి: ఆ సమయంలో ఆయన దుప్పటిని దిండుగా చేసుకొని సేదతీర్చుకుంటుండగా మేము బహుదైవారాధకుల ఆగడాలకు గురై ఉన్నాము.

*(సహీహ్ బుఖారీలోని - దైవదౌత్య చిహ్నాల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. ధర్మమార్గంలో కష్టాలు ఎదురవడమనేది ఏ ఒక్క కాలానికో, ఏ ఒక్క వర్గానికో పరిమితం కాలేదు. అన్ని కాలాల్లోనూ, అన్ని ప్రాంతాల్లోనూ సత్యధర్మాన్ని అవలంబించినవారికి దుర్మార్గుల నుండి చేదు అనుభవాలే ఎదురయ్యాయి. వారిపై కష్టాల కొండలు విరుచుకుపడ్డాయి. అయినాసరే వారు ఏమాత్రం తొణకలేదు. ఎన్ని ఆపదలు వచ్చినా, ఎటువంటి చిత్రహింసలకు గురైనా తాము నమ్మిన ధర్మంపై కదలని కొండలా స్థిరంగా నిలబడ్డారు. కష్టాల కొలిమిలో ఎంత కాలితే అంతే కుందనంలా మెరిసిపోయారు. కాబట్టి ధర్మపథంలో పరీక్షలు ఎదురైనప్పుడు కళవళ పడిపోవడం, ఆందోళన చెందడం ఒక విశ్వాసికి ఎంతమాత్రం శోభించదు.

2. ప్రపంచంలో ఇస్లాం విజయం సాధిస్తుంది. లోకంలో సుఖశాంతులు వెల్లివిరుస్తాయనే శుభవార్తలు దైవప్రవక్త (సల్లం) మరియు ఆయన సహచరుల కాలంలోనే నిజమయ్యాయి. ప్రజలు తమ కళ్లారా వాటిని వీక్షించారు. నేటికీ (పాక్షికంగా నయినాసరే) ఇస్లామీయ చట్టాలు అమల్లో ఉన్న దేశాల్లో, ప్రాంతాల్లో శాంతి పరిఢవిల్లుతోందన్న వాస్తవాన్ని ఎవరూ కాదనలేరు.

٤٢ ـ وعن ابن مَسْعُودٍ رضي الله عنه قال: لَمَّا كَانَ يَوْمُ حُنَيْنٍ آثَرَ رسولُ الله ﷺ نَاساً في الْقِسْمَةِ: فَأَعْطَى الأَقْرَعَ بْنَ حَابِسٍ مِائَةً مِنَ الإِبِل، وَأَعْطَى عُيَيْنَةَ بْنَ حِصْنٍ مِثْلَ ذٰلِكَ، وَأَعْطَى نَاساً مِنْ أَشْرَافِ الْعَرَبِ وَآثَرَهُمْ يَوْمَئِذٍ في الْقِسْمَةِ. فَقَالَ رَجُلٌ: وَاللهِ إِنَّ هٰذِهِ قِسْمَةٌ مَا عُدِلَ فِيهَا، وَمَا أُرِيدَ فِيهَا وَجْهُ الله، فَقُلْتُ: وَالله لأُخْبِرَنَّ رَسُولَ الله ﷺ فَأَتَيْتُهُ فَأَخْبَرْتُهُ بِمَا قال: فَتَغَيَّرَ وَجْهُهُ حَتَّى كَانَ كَالصِّرْفِ. ثُمَّ قال: «فَمَنْ يَعْدِلُ إِذَا لَمْ يَعْدِلِ اللهُ وَرَسُولُهُ؟» ثُمَّ قال: «يَرْحَمُ اللهُ مُوسَى قَدْ أُوذِيَ بِأَكْثَرَ مِنْ هٰذَا فَصَبَرَ».

42. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం : హునైన్ యుద్ధ దినాన దైవప్రవక్త (సల్లం) యుద్ధప్రాప్తిని పంపిణీ చేసినప్పుడు కొంతమందికి (ఇస్లాంలో వారి హృదయాలు కుదుటపడాలన్న ఉద్దేశ్యంతో) ప్రాధాన్యతనిచ్చారు. అఖ్రా బిన్ హాబిస్‌కు ఆయన నూరు ఒంటెలు ఇచ్చారు. ఉయైనా బిన్ హిస్న్‌కు కూడా అన్ని ఒంటెలే ఇచ్చారు. అరబ్బు ప్రముఖులయిన కొందరికి ఆయన కానుకలు ఇచ్చారు. ఈ యుద్ధసంప్రాప్తి పంపిణీలో కూడా ఆ రోజు వారికి ప్రాధాన్యత ఇచ్చారు.

ఒక వ్యక్తి (ఇది చూసి) "దైవసాక్షి! ఈ పంపకంలో న్యాయం జరగలేదు. పంపిణీలో దైవప్రసన్నతా ధ్యేయాన్ని దృష్టిలో ఉంచుకోలేదు" అని అన్నాడు. ఇది విని నేను "దైవసాక్షి! తప్పకుండా నేనీవిషయం దైవప్రవక్తకు తెలియ జేస్తాను" అని అన్నాను. నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి జరిగిందంతా వివరించాను. ఈ విషయం విన్న వెంటనే ఆయన వదనంలో మార్పు వచ్చింది. ముఖం ఎర్రబారింది. తరువాత ఆయన "దేవుడు మరియు ఆయన ప్రవక్తే న్యాయం చేయకపోతే ఇంకెవడు న్యాయం చేస్తాడు?" అంటూ ఆవేదన వెలిబుచ్చారు. ఆయన ఇంకా ఇలా అన్నారు : ప్రవక్త మూసాపై అల్లాహ్

فَقُلْتُ: لا جَرَمَ لا أَرْفَعُ إِلَيْهِ بَعْدَهَا حَدِيثاً. متفقٌ عليه. وَقَوْلُهُ: «كَالصِّرْفِ» هُوَ بِكَسْرِ الصَّادِ الْمُهْمَلَةِ: وَهُوَ صِبْغٌ أَحْمَرُ.

దయదలచుగాక! ఆయన (తన జాతి ప్రజలచేత) ఇంతకన్నా ఎక్కువగానే బాధించబడ్డారు. అయినప్పటికీ ఆయన సహనం వహించారు.”

ఆ తరువాత ఇంకెప్పుడూ నేను ఆయనకు ఏ విషయమూ తెలియపరచరాదని మనసులో నిశ్చయించుకున్నాను.

(బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని “యుద్ధప్రాప్తిలో ఐదోవంతు ఫర్జ్” అన్న ప్రకరణం. సహీహ్ ముస్లింలో జకాత్ ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

సమకాలీన పరిస్థితులు, అవసరాల దృష్ట్యా కొత్తగా ఇస్లాం స్వీకరించినవారికి, సమాజంలో పేరు ప్రతిష్ఠలు, పదవీప్రాబల్యాలు కల్గి నూతనంగా ఇస్లాంలో చేరినవారికి ధర్మపరివర్తన అనంతరం వారి హృదయాలు కుదుటపడాలన్న సదుద్దేశ్యంతో వారికి ఇతర ముస్లింలకన్నా కొంచెం ఎక్కువ మోతాదులో సొమ్మును ప్రదానం చేసే విచక్షణాధికారం ఒక ఖలీఫా లేక ముస్లింల చక్రవర్తికి ఉంటుంది. ఇకపోతే పై హదీసులో దైవప్రవక్త (సల్లం) గారి పంపకంపై అభ్యంతరం లేవనెత్తిన వ్యక్తి ఒకానొక కపట విశ్వాసి అని ఇతర ఉల్లేఖనాల ద్వారా తెలుస్తోంది. నిజమైన విశ్వాసులు ఎన్నడూ దైవప్రవక్త అన్యాయం చేశారని నిందించిన పాపాన పోలేదు. ఇంకొక విషయం ఏమిటంటే, సామాన్య మానవుల్లాగే దైవప్రవక్త (సల్లం) కూడా ఇతరుల మాటలకు ప్రభావితులై అప్రసన్నులవడమో లేక సంతోషం వెలిబుచ్చటమో చేసేవారని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. ఎందుకంటే ఆయన కూడా మనలాంటి ఒక మానవుడే. మానవాతీత వ్యక్తి కారు. పరిస్థితుల ప్రభావం మనోమస్తిష్కాలపై పడటం మానవ సహజం అని మరువరాదు.

٤٣ ـ وَعَنْ أَنَسٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «إِذَا أَرَادَ اللهُ بِعَبْدِهِ خَيْراً عَجَّلَ لَهُ الْعُقُوبَةَ فِي الدُّنْيَا، وَإِذَا أَرَادَ اللهُ بِعَبْدِهِ الشَّرَّ أَمْسَكَ عَنْهُ بِذَنْبِهِ حَتَّى يُوَافِيَ بِهِ يَوْمَ الْقِيَامَةِ». وَقَالَ النَّبِيُّ ﷺ: «إِنَّ

43. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: అల్లాహ్ తన దాసునికి మేలు చేయాలని సంకల్పించుకుంటే (అతని పాపాలకు పర్యవసానంగా) ఇహలోకంలోనే తొందరగా అతణ్ణి శిక్షిస్తాడు. (అంటే

عِظَمَ الْجَزَاءِ مَعَ عِظَمِ الْبَلاءِ، وَإِنَّ اللهَ تعالى إِذَا أَحَبَّ قَوْماً ابْتَلاهُمْ، فَمَنْ رَضِيَ فَلَهُ الرِّضَا، وَمَنْ سَخِطَ فَلَهُ السُّخْطُ» رواه الترمذي وَقَالَ: حَدِيثٌ حَسَنٌ.

కష్టాలు, పరీక్షలకు గురిచేసి అతని పాపాలు సమసిపోయేలా చేస్తాడు.) ఒకవేళ అల్లాహ్ తన దాసునికి కీడు తలపెట్టదలిస్తే అతని పాపాల పర్యవసానాన్ని (ఇహలోకంలో ఇవ్వకుండా) నిలిపి ఉంచుతాడు. చివరికి ప్రళయ దినాన అతణ్ణి పూర్తిగా శిక్షిస్తాడు." ఇంకా ఆయన ఇలా అన్నారు : ప్రతిఫలం (పుణ్యం)లో శ్రేష్ఠత పరీక్ష తీవ్రతను బట్టి ఉంటుంది. (అంటే పరీక్ష ఎంత కఠినంగా ఉంటే దానికి లభించే పుణ్యం కూడా అంతగొప్పగా ఉంటుంది.) అల్లాహ్ ఏ జాతివారినయినా ఎక్కువగా అభిమానించినప్పుడు వారిని కష్టాలకు లోనుచేస్తాడు. అయితే వారిలో ఎవరైతే సహనం ప్రదర్శిస్తాడో అతనికి దైవప్రసన్నత లభిస్తుంది. మరెవరైతే (ఆ కష్టాలకు కళవళ పడిపోయి) దైవంపట్ల ఆగ్రహాన్ని వ్యక్తపరుస్తాడో అతడికి దైవాగ్రహమే దక్కుతుంది. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి ప్రామాణికమైనదిగా ఖరారు చేశారు.)

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయాలు).*

## ముఖ్యాంశాలు

ప్రపంచంలో విశ్వాసికి ఎదురయ్యే పరీక్షలు కూడా దైవానుగ్రహంతో సమానమని ఈ హదీసులో చెప్పబడింది. పరీక్షల కాఠిన్యతనుబట్టి అతని పాపాలు సమసిపోయి, దేవుని దగ్గర అతని పుణ్యఫలాలు అధికమవుతూ ఉంటాయి. కాబట్టి ప్రతి కష్టంపై, బాధపై సహనం వహించడం అవసరం. సహనం లేనిదే అలాంటి భాగ్యాన్ని పొందలేము. అంతేకాదు, అసహనం వల్ల పాపాలు మరిన్ని పెరిగిపోతాయి.

44. హ్రజత్ అనస్ (రజి) కథనం : అబూ తల్హా (రజి)గారి పిల్ల వాడొకడు జబ్బు పడ్డాడు. అయితే ఆయన (పని నిమిత్తం) ఎక్కడికో బయటికి వెళ్ళి ఉన్న సమయంలోనే ఆ పసివాడు చని పోయాడు. ఆయన ఇంటికి తిరిగివచ్చిన తరువాత "బాబు ఎలా ఉన్నాడు?" అని ఇంట్లో అడిగారు. దానికి ఆ పసివాడి తల్లి హ్రజత్ ఉమ్మె సులైమ్ "బాబు మునుపుకన్నా ఇప్పుడు చాలా ప్రశాం తంగా ఉన్నాడు" అని భర్తను సము దాయించి, రాత్రి భోజనం వడ్డించారు. ఆయన తృప్తిగా భోజనం చేశారు. తరువాత భార్యతో సంభోగం కూడా జరిపారు. సమాగమం పూర్తయిన తరువాత ఆవిడ తన భర్తకు (ఆయన బయటికి వెళ్ళివున్నప్పుడు పిల్లవాడు చనిపోయిన సంగతి తెలియజేసి), "ఇక అబ్బాయికి ఖనన సంస్కారాలు చేసి రండి" అని చెప్పింది. (ఆ రాత్రి ఖనన సంస్కారాలు జరిగాయి.) తెల్లవారాక అబూ తల్హా (రజి) దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి రాత్రి జరిగిన వృత్తాంత మంతా ఆయనకు వివరించారు. ఆ సంగతి విని ఆయన "గత రాత్రి నువ్వు నీ భార్యతో సమాగమం జరిపావా?" అని ప్రశ్నించారు. దానికాయన అవునని సమాధానమిచ్చారు. ఆ సమాధానం విని దైవప్రవక్త (సల్లం) ఆ దంపతుల కోసం "ఓ దేవా! వీరిద్దరికీ శుభాన్ని కలుగ జేయి" అని ప్రార్థించారు.

٤٤ ـ وَعَنْ أَنَسٍ رضي الله عنه قال: كَانَ ابْنٌ لأَبِي طَلْحَةَ رضي الله عنه يَشْتَكِي، فَخَرَجَ أَبُو طَلْحَةَ، فَقُبِضَ الصَّبِيُّ، فَلَمَّا رَجَعَ أَبو طَلْحَةَ قال: مَا فَعَلَ ابْنِي؟ قَالَتْ أُمُّ سُلَيْم ـ وَهِيَ أُمُّ الصَّبِيِّ ـ: هُوَ أَسْكَنُ مَا كَانَ، فَقَرَّبَتْ إِلَيْهِ الْعَشَاءَ فَتَعَشَّى، ثُمَّ أَصَابَ مِنْهَا، فَلَمَّا فَرَغَ قَالَتْ: وَارُوا الصَّبِيَّ، فَلَمَّا أَصْبَحَ أَبُو طَلْحَةَ أَتَى رسولَ الله ﷺ فَأَخْبَرَهُ، فَقَالَ: «أَعَرَّسْتُمُ اللَّيْلَةَ»، قال: نَعَمْ، قال: «اللَّهُمَّ بَارِكْ لَهُمَا» فَوَلَدَتْ غُلاماً، فَقَالَ لِي أَبُو طَلْحَةَ: احْمِلْهُ حَتَّى تَأْتِيَ بِهِ النبيَّ ﷺ، وَبَعَثَ مَعَهُ بِتَمَرَاتٍ، فَقَالَ: «أَمَعَهُ شَيْءٌ؟» قال:

نَعَمْ، تَمَرَاتٌ، فَأَخَذَهَا النَّبِيُّ ﷺ فَمَضَغَهَا ثُمَّ أَخَذَهَا مِنْ فِيهِ فَجَعَلَهَا فِي فِي الصَّبِيِّ، ثُمَّ حَنَّكَهُ وَسَمَّاهُ عَبْدَ اللهِ. متفقٌ عليه.
وفي روايةٍ لِلْبُخَارِيِّ: قال ابْنُ عُيَيْنَةَ: فَقَالَ رَجُلٌ مِنَ الأَنْصَارِ: فَرَأَيْتُ تِسْعَةَ أَوْلادٍ كُلُّهُمْ قَدْ قَرَؤُوا الْقُرْآنَ، يَعْنِي مِنْ أَوْلادِ عَبْدِ اللهِ الْمَوْلُودِ. وفي روايةٍ لمسلِمٍ: مَاتَ ابْنٌ لأَبِي طَلْحَةَ مِنْ أُمِّ سُلَيْمٍ، فَقَالَتْ لأَهْلِهَا: لا تُحَدِّثُوا أَبَا طَلْحَةَ بِابْنِهِ حَتَّى أَكُونَ أَنَا أُحَدِّثُهُ، فَجَاءَ فَقَرَّبَتْ إِلَيْهِ عَشَاءً

దైవప్రవక్త ప్రార్థన ఫలితంగా కొంతకాలానికి ఆయన భార్యకు మరో అబ్బాయి పుట్టాడు. (హజ్రత్ అనస్ (రజి) అంటున్నారు): అబూ తల్హా నాకు కొన్ని ఖర్జూర పండ్లు ఇచ్చి "ఈ చంటోణ్ణి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి తీసుకువెళ్ళు" అని ఆదేశించారు. (తండ్రి ఆజ్ఞ ప్రకారం అనస్ (రజి) బాబుని దైవప్రవక్త వద్దకు తీసుకొనివెళ్ళారు.) అప్పుడు ఆయన "బాబుతో పాటు మరేమైనా తెచ్చావా?" అనడిగారు. దానికి హజ్రత్ అనస్ (రజి) "అవును, కొన్ని ఖర్జూరపండ్లు తెచ్చానండీ" అని చెప్పారు. దైవప్రవక్త (సఅసం) ఆ ఖర్జూరాలను నోట్లోవేసుకొని నమిలారు. తరువాత వాటిని తన నోటినుండి తీసి ఆ పసివాడి నోట్లో పెట్టారు. ఈ విధంగా ఆయన ఆ పిల్లవాడికి ఉగ్గుపోసి "అబ్దుల్లాహ్" అని నామకరణం చేశారు.

*(బుఖారీ - ముస్లిం)*

బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో ఇబ్నె ఉయైనా అన్సార్లలోని ఒకరు తనకు ఈ విధంగా తెలియజేశారని అన్నారు : నేను (అబ్దుల్లాహ్ గారి) తొమ్మిదిమంది కుమారులను చూశాను. వారంతా ఖురాన్ చదువుకున్నవారే.

ముస్లింలోని ఒకానొక ఉల్లేఖనంలో ఈ విధంగా ఉంది : ఉమ్మె సులైమ్ ద్వారా

فَأَكَلَ وَشَرِبَ، ثُمَّ تَصَنَّعَتْ لَهُ أَحْسَنَ مَا كَانَتْ تَصَنَّعُ قَبْلَ ذٰلِكَ، فَوَقَعَ بِهَا فَلَمَّا أَنْ رَأَتْ أَنَّهُ قَدْ شَبِعَ وَأَصَابَ مِنْهَا قَالَتْ: يَا أَبَا طَلْحَةَ، أَرَأَيْتَ لَوْ أَنَّ قَوْماً أَعَارُوا عَارِيَتَهُمْ أَهْلَ بَيْتٍ فَطَلَبُوا عَارِيَتَهُمْ، أَلَهُمْ أَنْ يَمْنَعُوهُم؟ قَالَ: لا ، فَقَالَتْ: فَاحْتَسِبِ ابْنَكَ. قَالَ: فَغَضِبَ، ثُمَّ قَالَ:

పుట్టిన అబూ తల్హా (రజి) పిల్లవాడొకడు చనిపోయాడు. ఉమ్మె సులైమ్ తన ఇంట్లో వాళ్ళని బాబు చనిపోయాడన్న సంగతి మీరెవరూ అబూ తల్హాకు చెప్పవద్దనీ, స్వయంగా నేనే ఆయనకు తెలియపరుస్తానని చెప్పారు. (కొంత సేపటికి) అబూ తల్హా (రజి) ఇంటికి వచ్చారు. ఉమ్మె సులైమ్ (ర.అన్హా) ఆయనకు రాత్రి అన్నం వడ్డించారు. అబూ తల్హా భోజనాదులు ముగిం చారు. తరువాత ఆమె మునుపటికన్నా బాగా అలంకరించుకొని అందంగా తయారై భర్త దగ్గరికి వచ్చారు. ఆయన ఆమెతో సమాగమం జరిపారు. ఆయన రతిలో పూర్తిగా తృప్తిచెందారని భావిం చాక ఆమె తన భర్తను "ఓ అబూ తల్హా! మీరే చెప్పండి! కొందరు ఒక ఇంటివారికి ఏదైనా వస్తువు కొంతకాలం పాటు వాడుకోవటానికి ఇచ్చారనుకోండి. ఆ తరువాత వారు తమ వస్తువుని వాపసు చేయమని కోరితే ఆ ఇంటివాళ్ళు ఇవ్వకుండా ఉండటం భావ్యమేనా?" అని చూచాయగా ప్రశ్నిం చారు. దానికి అబూ తల్హా (రజి) అది సరైన పద్ధతి కాదని సమాధానం చెప్పారు. వెంటనే ఆమె "మరయితే మీరు మీ బాబు విషయంలో అల్లాహ్ నుండి పుణ్యాన్ని ఆశించండి" అన్నారు. (అంటే మీ అబ్బాయి కూడా దేవుడిచ్చిన అప్పగింత

تَرَكْتِنِي حَتَّى إِذَا تَلَطَّخْتُ ثُمَّ أَخْبَرْتِنِي بِابْنِي؛ فَانْطَلَقَ حَتَّى أَتَى رسولَ الله ﷺ فَأَخْبَرَهُ بِمَا كَانَ، فَقَالَ رسولُ الله ﷺ: «بَارَكَ اللهُ لَكُمَا فِي لَيْلَتِكُمَا»، قَالَ: فَحَمَلَتْ، قال: وَكَانَ رسولُ الله ﷺ فِي سَفَرٍ وَهِيَ مَعَهُ، وَكَانَ رسولُ الله ﷺ إِذَا أَتَى الْمَدِينَةَ مِنْ سَفَرٍ لا يَطْرُقُهَا طُرُوقاً فَدَنَوا مِنَ الْمَدِينَةِ، فَضَرَبَهَا الْمَخَاضُ، فَاحْتَبَسَ عَلَيْهَا أَبُو طَلْحَةَ، وَانْطَلَقَ

లాంటివాడు. తన అప్పగింతను దేవుడు వాపసు తీసేసుకున్నాడు.) ఈ మాట విని ఆయన కోపంతో మండి పడ్డారు. "నాకీ విషయం ముందుగా చెప్పకుండా ఎందుకు వదిలేశావు? నేను నీతో కలిసి మలినమైన తరువాత బాబు చనిపోయాడన్న సంగతి చెబుతావా?" అని రుసరుసలాడారు. (ఆ తరువాత) ఆయన వెళ్ళిపోయారు. దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి జరిగినదంతా వివరించారు. అది విని దైవప్రవక్త (సల్లం) "అల్లాహ్ మీరిద్దరూ కలిసిన ఈ రాత్రిలో శుభాన్ని కలుగజేయుగాక!" అని ప్రార్థించారు. ఆ తరువాత (కొంత కాలానికి) ఉమ్మె సులైమ్ మళ్ళీ గర్భవతి అయ్యారు.

అనస్ (రజి) ఇలా అంటున్నారు : దైవప్రవక్త (సల్లం) ఒకానొక ప్రయాణంలో ఉన్నారు. ఉమ్మె సులైమ్ కూడా (తన భర్తతో పాటు) దైవప్రవక్త పయన బృందంలో ఉన్నారు. దైవప్రవక్త (స) సాధారణంగా ప్రయాణం నుండి మదీనాకు తిరిగొచ్చినప్పుడు రాత్రిపూట వచ్చేవారు కాదు. ప్రయాణీకుల బృందం మదీనా నగర సమీపానికి చేరుకుంటుండగా ఉమ్మె సులైమ్‌కు పురిటినొప్పులు మొదలయ్యాయి. అబూ తల్హా (రజి)

كُوْدا ఆమె కోసం ఆగాల్సి వచ్చింది. దైవప్రవక్త (సల్లం) మాత్రం (ఆగకుండా) ప్రయాణం కొనసాగించారు.

అనస్ (రజి) ఉవాచ : అప్పుడు అబూ తల్హా (రజి) ఇలా వేడుకోసాగారు - "ఓ ప్రభూ! దైవప్రవక్త (సల్లం) మదీనా నగరం నుండి బయటికి వెళ్ళినప్పుడు నేను కూడా ఆయనతో పాటు వెళ్ళాలనీ, ఆయన మదీనా నగరంలోకి ప్రవేశించే టప్పుడు ఆయనతో పాటే ప్రవేశించాలని నేను కోరుకుంటానని నీకు తెలుసు. కాని ఇప్పుడు నేను (దైవప్రవక్త వెనుక ఆగిపోవటం నీవు చూస్తూనే ఉన్నావు)."

ఉమ్మె సులైమ్ (ర.అన్హా) (ఆయన మాటలు విని) "అబూ తల్హా! ఇంతకు ముందు నాకు కలిగిన నొప్పి ఇప్పుడు లేదు. పదండి, (మనం కూడా వెళ్ళి పోదాం)" అని అన్నారు.

తరువాత మేమందరం కూడా బయలు దేరాము. ఆ దంపతులు మదీనాకు చేరుకోగానే ఆమెకు మళ్ళీ ప్రసవవేదన మొదలయ్యింది. (కొంతసేపటికి) ఆమెకు ఒక బాబు పుట్టాడు. అప్పుడు మా అమ్మ (ఉమ్మె సులైమ్) నాతో "రేపు ఉదయం నువ్వు వీణ్ణి దైవప్రవక్త (స) సన్నిధికి తీసుకువెళ్ళే వరకూ వీడికి ఏ పాలూ త్రాపించకూడదు" అని చెప్పింది.

رسولُ الله ﷺ. قَالَ: يقُولُ أَبو طَلْحَةَ: إِنَّكَ لَتَعْلَمُ يَا رَبِّ أَنَّهُ يُعْجِبُنِي أَنْ أَخْرُجَ مَعَ رسولِ الله ﷺ إذَا خَرَجَ، وَأَدْخُلَ مَعَهُ إِذَا دَخَلَ، وَقَد احْتَبَسْتُ بِمَا تَرَى، تَقُولُ أُمُّ سُلَيْمٍ: يَا أَبَا طَلْحَةَ مَا أَجِدُ الذي كُنْتُ أَجِدُ، انْطَلِقْ، فانْطَلَقْنَا وضَرَبَهَا المَخَاضُ حِينَ قَدِمَا فَوَلَدَتْ غُلاماً. فقالَتْ لِي أُمِّي: يَا أَنَسُ لا يُرْضِعُهُ أَحَدٌ حَتَّى تَغْدُوَ بِهِ عَلَى رَسُولِ الله ﷺ، فَلَمَّا أَصْبَحَ احْتَمَلْتُهُ فانْطَلَقْتُ بِهِ إِلَى رسولِ الله ﷺ. وَذَكَرَ تَمَامَ الْحَدِيث.

తెల్లవారగానే నేను ఆ పసికందును దైవ ప్రవక్త (స) దగ్గరికి తీసుకువెళ్ళాను. (తరువాత ఏం జరిగిందో క్రితం హదీసులో ప్రస్తావించడం జరిగింది.)

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం. సహీహ్ ముస్లింలోని సంస్కార ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. సామాజిక జీవనంలో మనిషి ఏవిధంగా మసలుకోవాలో ఈ హదీసు బోధపరుస్తోంది. హదీసులో సహనశీలి, సద్గుణ సంపన్నురాలైన ఓ మహిళ పాత్ర అందుకు ఆదర్శప్రాయంగా నిలుస్తుంది. తన కొడుకు చనిపోయినప్పటికీ ఎలాంటి ఏడ్పులు, రోదింపులు లేకుండా దైవం నుండి సత్ఫలితాన్ని ఆశిస్తూ అత్యుత్తమ రీతిలో సహనం ప్రదర్శించిందంటే ఇది ఆమె మనో నిబ్బరానికీ, మొక్కవోని విశ్వాసానికి నిదర్శనం. అంతేకాదు, ఆమె అలసిసొలసి ఇంటికి తిరిగొచ్చిన భర్తను బాబు క్షేమంగా, నిక్షేపంగా ఉన్నాడని సముదాయించింది. ఆయనకు సపర్యలు చేసిన తరువాత గాని అబ్బాయి చనిపోయాడన్న సంగతి చెప్పలేదు. భర్తకు సేవచేయడం, అతనికి మనో ఉల్లాసాన్ని అందించడం ముస్లిం అయిన ప్రతి ఇల్లాలి విధి అన్న సంగతి దీని ద్వారా విదితమవు తోంది.
2. భర్త ఇంట్లో ఉన్నప్పుడు భార్య అలంకరించుకొని, ముస్తాబై భర్త ముందుకు రావడం అభిలషణీయం.
3. శిశువు జన్మించినప్పుడు ఏ సత్పురుషుని వద్దకన్నా తీసుకెళ్ళి శిశువుకు ఉగ్గుపోయించడం ధర్మసమ్మతమే.
4. కష్టాలు ఎదురైనప్పుడు దైవ నిర్ణయాలపట్ల తన ఆమోదాన్ని తెలిపే దాసునికి అల్లాహ్ గొప్ప ప్రతిఫలాన్ని, పుణ్యాన్ని ప్రసాదిస్తాడు.
5. స్త్రీలు కూడా యోధులతోపాటు ధర్మయుద్ధానికి వెళ్ళవచ్చు. అయితే అక్కడ దేవుని హద్దులకు లోబడి ఉండి దైవమార్గంలో పోరాడే యోధుల గాయాలకు కట్లుకట్టడం, రోగుల్ని పరామర్శించడం, అన్నపానీయాలు సమకూర్చడం వంటి సేవలు అందించాలి.
6. దంపతులు ఒండొకరిని ఓదార్చే ఉద్దేశ్యంతో అన్యాపదేశంగా శ్లేషభావాలను స్ఫురించే పదజాలాన్ని వాడవచ్చు. దీనినే అరబీలో 'తౌరియా' అంటారు. అది అబద్ధం క్రిందికి రాదు.

٤٥ ـ وَعَنْ أَبِي هُرَيْـرَةَ رَضِي الله عنه أن رسولَ الله ﷺ قال: «لَيْسَ الشديدُ بالصُّرَعَةِ، إِنَّمَا الشَّدِيدُ الَّذِي يَمْلِكُ نَفْسَهُ عِنْدَ الْغَضَبِ» متفقٌ عليه.

وَ«الصُّـرَعَـةُ» بِضَـمِّ الصَّـادِ وَفَتْـحِ الرَّاءِ، وَأَصْلُهُ عِنْدَ الْعَرَبِ مَنْ يَصْرَعُ النَّاسَ كَثِيراً.

45. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : కుస్తీపట్టి ఇతరులను చిత్తుచేసేవాడు పరాక్రమశాలి కాడు. కోపం వచ్చినప్పుడు తన్ను తాను అదుపులో పెట్టుకోగలిగినవాడే నిజమైన పరాక్రమ శాలి (పహిల్వాను).

*(బుఖారీ - ముస్లిం)*

'సురఆ' 'స'పై ఉకారం, 'ర'కు అకారం. అనేకమందిని చిత్తుచేసినవాడిని అరబ్బులు 'సురఆ' అని పిలిచేవారు.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం. సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

కోపం వచ్చినప్పుడు అహంకారంతో ఇతరులపై ప్రతాపం చూపేబదులు సాధ్యమైనంతవరకు ఆ కోపాన్ని దిగమ్రింగడానికి ప్రయత్నించాలని ఈ హదీసు బోధిస్తోంది. కోపం వచ్చినప్పుడు కయ్యానికి కాలుదువ్వి ఇతరులపై బలప్రదర్శన చేయటం బలవంతుల సామాన్య లక్షణం. అయితే ముంచుకువస్తున్న ఆ క్రోధాన్ని అణచుకొని, ఎదుటి వారిని చిత్తుచేసే బలం ఉండి కూడా క్షమించి వదలివేయడమనేది అందరికీ సాధ్యమయ్యే విషయం కాదు. మనసులో దేవుని భయమున్న ఒక విశ్వాసి మాత్రమే అలాంటి సంయమనం ప్రదర్శించగలడు.

٤٦ ـ وَعَـنْ سُلَيْمَـانَ بْـنِ صُـرَدٍ رضي الله عنه قـال: كُنْـتُ جَالِساً مَعَ النَّبِيِّ ﷺ وَرَجُلان يَسْتَبَّانِ، وَأَحَدُهُمَا قَدِ احْمَرَّ وَجْهُهُ، وانْتَفَخَتْ أَوْدَاجُهُ. فقال رسولُ الله ﷺ: «إِنِّي لأَعْلَمُ كَلِمَةً لَوْ قَالَهَا لَذَهَبَ عَنْهُ مَا يَجِدُ، لَوْ قَالَ: أَعُوذُ بِاللهِ مِنَ الشَّيْطَانِ الرَّجِيمِ، ذَهَبَ مِنْهُ مَا يَجِدُ».

46. హజ్రత్ సులైమాన్ బిన్ సుర్ద్ (రజి) కథనం : నేనొకసారి దైవప్రవక్త (సల్లం) వద్ద కూర్చొని ఉండగా ఇద్దరు వ్యక్తులు పరస్పరం దూషించుకుంటున్నారు. వారిద్దరిలో ఒకతని ముఖం (ఆగ్రహంతో) కందిపోయింది. నరాలు ఉబ్బుకొచ్చాయి. అది చూసి దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : "నాకు ఒక సూక్తి తెలుసు. ఇతను గనక దాన్ని పఠిస్తే

فَقَالُوا لَهُ: إِنَّ النَّبِيَّ ﷺ قَالَ: «تَعَوَّذْ بِاللهِ مِنَ الشَّيْطَانِ الرَّجِيمِ» متفق عليه.

ఇతని కోపం దూరమయిపోతుంది. ఈ వ్యక్తి గనక "అవూజుబిల్లాహి మినష్షైతానిర్రజీం" (శాపగ్రస్తుడైన షైతాన్ బారి నుండి అల్లాహ్ శరణు వేడు తున్నాను) అని అంటే ఇతని కోపోద్రే కాలు చల్లారి పోతాయి."

(ఆ తరువాత) అక్కడివారు ఆ వ్యక్తినుద్దేశించి "దైవప్రవక్త (సల్లం) నిన్ను శాపగ్రస్తుడైన షైతాన్ బారినుండి అల్లాహ్ శరణు వేడుకోమంటున్నార"ని చెప్పారు.
*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని 'సృష్టి ఆరంభ' ప్రకరణం. సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

మనిషి కోపావేశంలో ఉన్నప్పుడు, ఈ కోపం షైతాన్ దుష్ప్రేరణ వల్ల వచ్చిందని భావించి, దాన్నుండి అల్లాహ్ శరణు వేడుకోవాలి. ఈ మేల్కొలుపే అతని క్రోధానికి మంచి విరుగుడుగా పనిచేస్తుంది. ఆగ్రహోదగ్రులై అదుపుతప్పి ప్రవర్తించేవారు హదీసులో చెప్పబడిన 'తఅవ్వుజ్' (శరణువేడే) సూక్తిని పఠిస్తే మంచి ఫలితం ఉంటుంది.

٤٧ ـ وَعَنْ مُعَاذ بْنِ أَنَسٍ رضي الله عنه أَنَّ النَّبِيَّ ﷺ قالَ: «مَنْ كَظَمَ غَيْظاً، وَهُوَ قَادِرٌ عَلَى أَنْ يُنْفِذَهُ، دَعَاهُ اللهُ سُبْحَانَهُ وتَعَالَى عَلَى رُؤُوسِ الْخَلاَئِقِ يَوْمَ الْقِيَامَةِ حَتَّى يُخَيِّرَهُ مِنَ الْحُورِ الْعِينِ مَا شَاءَ» رواهُ أَبُو دَاوُدَ، وَالتِّرمِذِي وقال: حديثٌ حسنٌ.

47. హజ్రత్ ముఆజ్ బిన్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : కోపాన్ని ప్రదర్శించే శక్తిసామర్థ్యాలు ఉండి కూడా ఆ కోపాన్ని దిగమ్రింగేవాణ్ణి దేవుడు ప్రళయదినాన సృష్టి రాసులందరి ముందుకు పిలిచి అతనితో (స్వర్గంలోని) విశాలమైన కన్నులుగల సుందరాంగుల్లో నీకు నచ్చిన ఆమెను ఎంపిక చేసుకోవచ్చని అంటాడు. (ఈ హదీసును అబూదావూద్ మరియు తిర్మిజీలు ఉల్లేఖించారు.

ఇంకా తిర్మిజీ దీనిని హసన్‌గా ఖరారు చేశారు.)

*(అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం. తిర్మిజీలోని "కల్పాంత అభివర్ణన" ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. 'హూర్' అనేది 'హౌరా' అనే పదానికి బహువచనం. అత్యంత శ్వేత వన్నె చర్మం కలిగిన స్త్రీ అని దీనర్థం. ఇంకా 'ఈన్' అనేది 'ఐనా' అనే పదానికి బహువచనం. అంటే విశాలమైన కన్నులు కలదని భావం. ఈ రెండు పదాలు కూడా స్వర్గంలో విశ్వాసులకు ప్రసాదించబడే అత్యంత సౌందర్యవతులైన స్త్రీలను సూచిస్తున్నాయి.

కసి తీర్చుకునే శక్తిసామర్థ్యాలు, బలాధికారాలు, అనుకూల పరిస్థితులు ఉండి కూడా కేవలం దైవాజ్ఞను శిరసావహిస్తూ కోపాన్ని దిగమ్రింగి, ఆగ్రహావేశాలను అణచుకొని బలప్రదర్శనకు పూనుకోకుండా సహనం వహించే శక్తి మహత్మ్యం, పరలోకంలో అతనికి లభించే పుణ్యఫలాలు కూడా ఈ హదీసు ద్వారా బోధపడుతున్నాయి.

٤٨ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رضي الله عنه، أَنَّ رَجُلاً قَالَ لِلنَّبِيِّ ﷺ: أَوْصِنِي، قَالَ: «لا تَغْضَبْ»، فَرَدَّدَ مِرَاراً، قَالَ: «لا تَغْضَبْ» رواه البخاري.

48. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)ను "నాకేమైనా ఉపదేశించండి" అని కోరాడు. అందుకు ఆయన "కోపగించుకోకు" అన్నారు. అతను పలుమార్లు అదే ప్రశ్నవేశాడు. ప్రతిసారీ ఆయన "కోపగించుకోకు" అనే తాకీదు చేశారు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. ప్రాపంచిక వ్యవహారాల్లో చీటికిమాటికి చిర్రుబుర్రులాడటం తప్పే అయినప్పటికీ, దేవుడు విధించిన హద్దులు అతిక్రమించబడుతున్నప్పుడు మనిషికి కలిగే ఆగ్రహం, ఉక్రోషం మాత్రం ప్రశంసనీయమే. ఎందుకంటే ఇది ధర్మంపట్ల మనిషికున్న అభిమానాన్ని, విశ్వాసాన్ని సూచిస్తుంది.
2. ప్రతి చిన్న విషయానికీ కోపగించుకునే స్వభావమున్న వ్యక్తి తన బలహీనతను తెలుసుకొని దాన్ని దూరం చేసుకునేందుకు ప్రయత్నించుకోవడానికి వీలుగా మాటిమాటికీ అతనికి కోపం వల్ల కలిగే కష్టనష్టాలను గురించి వివరిస్తూ ఉండాలి.

3. కోపం వల్ల షైతాన్ ఉద్దేశ్యాలు నెరవేరుతాయి. కాబట్టి కోపగించుకోవడమనేది చాలా చెడ్డ విషయం. అందుకే అలాంటి సందర్భాల్లో షైతాన్ బారి నుండి అల్లాహ్ శరణు వేడుకోవాలని ఆదేశించడం జరిగింది.

٤٩ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مَا يَزَال الْبَلاءُ بالْمُؤْمِنِ وَالْمُؤْمِنَةِ في نَفْسِهِ وَوَلَدِهِ وَمَالِهِ حَتَّى يَلْقَى الله تعالى وَمَا عَلَيْهِ خَطِيئَةٌ» رواه التِّرمذيُّ وقال: حديثٌ حسنٌ صحيحٌ.

49. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : విశ్వాసులైన స్త్రీ పురుషుల ప్రాణానికి, సంతానానికి, ఇంకా వారి ధన సంపదలకు కూడా కఠిన పరీక్షలు ఎదురౌతూనే ఉంటాయి. (ఆ విధంగా కష్టాలు ఎదురౌతూ) ఆఖరికి వాళ్ళు (మరణానంతరం) దేవుణ్ణి కలుసుకున్నప్పుడు వారి (కర్మపత్రం)లో ఒక్క పాపం కూడా మిగిలి ఉండదు. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్ మరియు సహీహ్‌గా ఖరారు చేశారు.)

*(సుననె తిర్మిజీలోని 'ఐహిక అనాసక్తత' అనే అధ్యాయంలో ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

ఇహలోకంలో ఇతరులకన్నా విశ్వాసులే ఎక్కువగా కష్టాలకు, కఠిన పరీక్షలకు గురవుతూ ఉంటారని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. అయితే ఒక విశ్వాసికి ఇందులో కీడుకన్నా మేలే ఎక్కువగా ఉంటుంది. కష్టాలు ఎదురైనప్పుడు సహనం వహిస్తూ విశ్వాసంపై నిలకడను ప్రదర్శిస్తే దాని మూలంగా అతని పాపాలన్నీ తుడిచిపెట్టుకుపోతాయి.

٥٠ ـ وَعَنِ ابْنِ عَبَّاسٍ رضي الله عنهما قال: قَدِمَ عُيَيْنَةُ بْنُ حِصْنٍ فَنَزَلَ عَلَى ابْنِ أَخِيهِ الْحُرِّ بْنِ قَيْسٍ، وَكَانَ مِنَ النَّفَرِ الَّذِينَ يُدْنِيهِمْ عُمَرُ رضي الله عنه؛ وَكَانَ الْقُرَّاءُ أَصْحَابَ مَجْلِسِ عُمَرَ

50. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: ఉయైనా బిన్ హిస్న్ వచ్చి తన సోదర కుమారుడైన హుర్ర్ బిన్ ఖైస్ వద్ద బసచేశారు. ఈ హుర్ర్ బిన్ ఖైస్ హజ్రత్ ఉమర్ (రజి) (ఖలీఫాగా వున్నప్పుడు ఆయన) సన్నిహితుల్లో ఒకరు. (ఆ కాలంలో) హజ్రత్ ఉమర్ గారి సభికులు, సలహాదారులు, ఖుర్రాలై

رضي الله عنه وَمُشَاوَرَتِهِ كُهُولًا كَانُوا أَوْ شُبَّاناً فقَالَ عُيَيْنَةُ لابْنِ أَخِيهِ: يَا ابْنَ أَخِي لَكَ وَجْهٌ عِنْدَ الأَمِيرِ فاسْتَأْذِنْ لِي عَلَيْهِ، فاسْتَأْذَنَ فَأَذِنَ لَهُ عُمَرُ، فَلَمَّا دَخَلَ قالَ: هِيْ يَا ابْنَ الْخَطَّابِ، فَوَاللهِ مَا تُعْطِينَا الْجَزْلَ وَلا تَحْكُمُ فِينَا بالْعَدْلِ، فَغَضِبَ عُمَرُ رضي الله عنه حَتَّى هَمَّ أَنْ يُوقِعَ به، فَقَالَ لَهُ الْحُرُّ: يَا أَمِيرَ الْمُؤْمِنِينَ إنَّ اللهَ تعالى قَالَ لِنَبِيِّهِ ﷺ: ﴿خُذِ ٱلْعَفْوَ وَأْمُرْ بِٱلْعُرْفِ وَأَعْرِضْ عَنِ ٱلْجَٰهِلِينَ﴾ [الأعراف: ١٩٩]، وَإنَّ هٰـذَا مِـنَ الْجَـاهِلِيـنَ، وَاللهِ مَا جَاوَزَهَا عُمَرُ حِينَ تَلاهَا، وَكَانَ وَقَّافاً عِنْدَ كِتَابِ اللهِ تعالى. رواه البخاري.

(విద్యావంతులై) ఉండేవారు - వారు నడి వయస్కులైనా లేక నవ యువకులైనా సరే; అప్పుడు ఉయైనా గారు తన సోదర కుమారునితో ఇలా అన్నారు : "భ్రాతృజా! ఈ ఖలీఫా వద్ద నీకు మంచి పలుకుబడి ఉంది. కనుక నేనాయన్ని కలుసుకునేందుకు నువ్వు ఆయన వద్ద అనుమతి తీసుకో." హుర్ర్ బిన్ ఖైస్ (తన బాబాయికోసం) ఉమర్ (రజి)ని సంప్రతించి అనుమతి కోరగా ఆయన అనుమతినిచ్చారు. లోపలికి ప్రవేశించిన తరువాత ఉయైనా ఖలీఫానుద్దేశించి "ఓ ఇబ్నె ఖత్తాబ్! దైవసాక్షి! నీవు మాకు తగినంతగా (సొమ్ము) ఇవ్వడంగానీ, మా విష యంలో తీర్పులు న్యాయంగా ఇవ్వడంగానీ చేయటం లేదు" అని నిందించారు. ఆయన మాటలు విని ఉమర్ (రజి) ఆగ్రహోదగ్రులయ్యారు. ఆయన్ని (ఆ మాట అన్నందుకు) దండించాలని నిశ్చయించుకున్నారు. అంతలోనే హుర్ర్ బిన్ ఖైస్ కల్పించుకొని, "ఓ విశ్వాసుల నాయకా! అల్లాహ్ తన ప్రవక్తను ఈ విధంగా ఆదేశించాడు: 'ప్రవక్తా! మృదుత్వం, మన్నింపుల వైఖరిని అవలంబించు. మంచిని ప్రబోధించు. మూర్ఖులతో వాదానికి దిగకు.' (అల్ ఆరాఫ్ : 199) ఇతను (నా బాబాయి) కూడా మూర్ఖుడే. (కాబట్టి క్షమించి వదలిపెట్టండి)" అని విన్నవించుకున్నారు. దైవసాక్షి! హుర్ర్

ఈ సూక్తిని పఠించగానే ఉమర్ (రజి) అది విని ఒక్క అడుగైనా ముందుకు వేయలేదు. హజ్రత్ ఉమర్ (రజి) దివ్య ఖుర్ఆన్ ముందు (అంటే దాని ఆదేశాల ముందు) కడు వినయంగా లొంగిపోయేవారు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. పై హదీసులో 'ఖుర్రా' అనే పదం వాడబడింది. ఇది 'ఖారీ' అనే పదానికి బహువచనం. అసలు 'ఖారీ' అంటే చదువరుడు, పాఠకుడు అని అర్థం. హదీసులో ప్రస్తావనకు వచ్చిన 'ఖారీ' అంటే ఈ రోజుల్లో లాగా కేవలం దివ్య ఖురాన్‌ను శాస్త్రోక్తంగా, లయబద్ధంగా, మధురాతి మధురంగా పారాయణం చేసేవారని భావం ఎంతమాత్రం కాదు. పైగా ఇక్కడ ఖారీ అంటే ఖురాన్ యొక్క భావం అందులోని ఆజ్ఞలు, వారింపులు, ఆదేశాలను గురించి తెలిసిన ధర్మవేత్తలు (ఫుకహా), ఖురాన్‌కు భాష్యం చెప్పగల జ్ఞానఖనులు అని అర్థం. 'ఖులఫాయె రాషిదీన్'గా చరిత్రకెక్కిన నలుగురు ఖలీఫాల దర్బారులలో ఇలాంటి గొప్ప మేధావులు పండితులే సభ్యులుగా, సలహాదారులుగా నియమితులయ్యేవారు. దీనిద్వారా తెలిసేదేమిటంటే నాయకులు తమకు సలహాదార్లుగా ధర్మజ్ఞానం కలిగిన వారినే ఉంచుకోవాలి. సిరిసంపదలను కూడబెట్టుకోవడమే లక్ష్యంగా పెట్టుకున్న అవినీతిపరుల్ని సలహాదారులుగా నియమించుకోవడం తగదు. ప్రపంచ వ్యామోహం గల వ్యక్తుల సలహాలు చిత్తశుద్ధి, శ్రేయోభిలాషకు బదులు స్వార్థప్రయోజనాలతో కూడుకుని ఉంటాయి. కనుక వారి సలహాలను పాటించడం ఎంతమాత్రం శ్రేయస్కరం కాదు.

2. సమావేశాలు, సలహా మండలుల్లో సభ్యులుగా ఉండేందుకు విషయపరిజ్ఞానం దైవభక్తి చాలా అవసరం. అంతేగాని వాటిలో సభ్యత్వానికి ఎక్కువ వయసు ఉండాలన్న నిబంధన లేదు.

3. పరిపాలకుడు అత్యంత సహనశీలి, మృదు స్వభావి అయి ఉండాలి.

4. అలాగే సత్య స్వీకారంలో కూడా అతడు తడబాటుకు, సందిగ్ధానికి లోనుకాకూడదు.

51. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : "నా అనంతరం (అక్రమ రీతిలో) ప్రాధాన్యతనిచ్చే ధోరణి ప్రబలు

٥١ ـ وَعَن ابْنِ مَسْعُودٍ رضي الله عنه أنَّ رسولَ الله ﷺ قال: «إنَّهَا سَتَكُونُ بَعْدِي أَثَرَةٌ وَأُمُورٌ تُنْكِرُونَهَا! قَالُوا:

يَا رَسُولَ اللهِ فَمَا تَأْمُرُنَا؟ قال: تُؤَدُّونَ الْحَقَّ الَّذِي عَلَيْكُمْ، وَتَسْأَلُونَ اللهَ الذي لَكُمْ» متفقٌ عليه. «وَالأَثَرَةُ»: الانفرادُ بالشَّيْءِ عَمَّنْ لَهُ فيهِ حَقٌّ.

తుంది. మీరు చెడుగా భావించే దుష్ట కార్యాలు జరుగుతాయి." అది విని సహచరులంతా "దైవప్రవక్తా! మరి అలాంటి పరిస్థితుల్లో మాకు మీరిచ్చే ఆదేశం ఏమిటి?" అనడిగారు.

దానికి ఆయన "మీరు మీపై వున్న బాధ్యతలను సజావుగా నిర్వర్తించండి. కాని (మీకు దక్కవలసిన) మీ హక్కులను గురించి మాత్రం మీరు అల్లాహ్‌నే అడగండి" అని ఉపదేశించారు.

(బుఖారీ - ముస్లిం)

"అల్ అసరా" (ప్రాధాన్యతనివ్వటం) అంటే ఇతరులు కూడా హక్కుదారులుగా వున్న వస్తువుకు తానొక్కడే హక్కుదారుగా చెలామణి అవడం అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణం. సహీహ్ ముస్లింలో నాయకత్వ ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

ప్రజా నాయకులు, అధికారులు పరిపాలనా బాధ్యతలను సరిగ్గా నిర్వర్తించకుండా ప్రజల హక్కులను కాజేస్తూ, ప్రజలకు చెందవలసిన ధనాన్ని తమ జేబుల్లో నింపుకుంటూ బంధుప్రీతికి, ఆశ్రిత పక్షపాతానికి తావిస్తున్న పక్షంలో ప్రజలు వారిపై తిరుగుబాటు ధోరణుల్ని అనుసరించకుండా సహనాన్ని ప్రదర్శిస్తూ, దేవుని సన్నిధిలో తమ వల్ల జరిగిన పొరబాట్లపై పశ్చాత్తాపభావంతో కుమిలిపోతూ క్షమాభిక్ష వేడుకోవాలని, అధికార మదాంధుల ఆగడాల నుండి తమను కాపాడమని దేవుణ్ణి ప్రార్థిస్తూ ఉండాలని ఈ హదీసు బోధపరుస్తోంది. అయితే నాయకుల్లో దైవతిరస్కారం, దైవవ్యతిరేక ధోరణులు ప్రస్ఫుటమయితే మాత్రం ప్రజలు వారిని గద్దె దించి దేవుని నేలపై ధర్మాన్ని, న్యాయాన్ని నెలకొల్పడానికి తప్పకుండా ప్రయత్నించాలి.

٥٢ ـ وَعَنْ أَبِي يَحْيَى أُسَيْدِ بْنِ حُضَيْرٍ رضي الله عنه أَنَّ رَجُلاً مِنَ الأَنْصَارِ قَالَ: يَا رسولَ اللهِ أَلا تَسْتَعْمِلُنِي كَمَا

52. హజ్రత్ అబూ యహ్‌యా ఉసైద్ బిన్ హుజైర్ (రజి) కథనం : అన్సార్లలోని ఒకాయన దైవప్రవక్త (సల్లం)ను "ఓ దైవప్రవక్తా! మీరు ఫలానా వ్యక్తిని ఉద్యో

استَعْمَلْتَ فُلاناً فَقَالَ: «إنَّكُمْ سَتَلْقَوْنَ بَعْدِي أَثَرَةً، فاصْبِرُوا حَتَّى تَلْقَوني عَلَى الْحَوْضِ» متفقٌ عليه. وَ«أُسَيْدٌ»: بِضَمِّ الْهَمْزَةِ. وَ«حُضَيْرٌ»: بِحَاءٍ مُهْمَلَةٍ مَضْمُومَةٍ وَضَادٍ مُعْجَمَةٍ مَفْتُوحَةٍ، واللهُ أَعْلَمُ.

గిగా నియమించినట్లు నన్ను కూడా (ప్రభుత్వ) ఉద్యోగిగా ఎందుకు నియమించటం లేదు?" అని అడగ్గా ఆయన "మీరు నా అనంతరం (మిమ్మల్ని వదలి పెట్టి ఇతరులకు ప్రాధాన్యతనిచ్చే) పక్షపాత ధోరణులు చూస్తారు. అయితే మీరు మాత్రం (ప్రళయదినాన) నన్ను సరస్సు వద్ద కలుసుకునేంతవరకూ ఓర్పు వహించండి" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఉపద్రవాల ప్రకరణం. సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. దైవ ప్రవక్త పలికిన భవిష్యవాణి నిజమయింది. ఇది ఆయన మహిమోన్నతులకు, సత్యసంధతకు నిదర్శనం.
2. సరస్సు అంటే అల్లాహ్ పునరుత్థానదినాన లేక స్వర్గంలో దైవప్రవక్తకు ప్రసాదించనున్న కౌసర్ సరస్సు. ఆయన తన శుభ కరములతో తన అనుచర సమాజానికి ఆ జలాశయపు పవిత్రమైన పానీయాన్ని త్రాగిస్తారు. ఒకసారి ఆ నీరు తాగితే ఇక దాహం అన్న మాటే ఉండదు.
3. పదవీ వ్యామోహం మంచిది కాదు. పైగా పదవుల కోసం ఆశపడేవారికి పదవులు ఇవ్వరాదని హదీసులో తాకీదు చేయబడింది. అయితే ఎవరైనా తాను ఆ పదవికి అర్హుణ్ణని భావిస్తే, దైవభక్తి, ధర్మపరాయణత, వ్యవహార శైలి, విజ్ఞతా వివేచనల్లో తనకు సమ ఉజ్జీ అయిన వ్యక్తులెవరూ లేనప్పుడు, ఆ బాధ్యతను తాను నిర్వర్తించగలనని పై అధికారులకు దరఖాస్తు చేసుకోవడంలో మాత్రం తప్పు లేదు.

٥٣ ـ وَعَنْ أَبِي إِبْرَاهِيمَ عَبْدِ اللهِ بْنِ أَبِي أَوْفَى رضي الله عنهما أَنَّ رسولَ الله ﷺ فِي بَعْضِ أَيَّامِهِ الَّتِي لَقِيَ فِيهَا الْعَدُوَّ، انْتَظَرَ حَتَّى إِذَا مَالَتِ الشَّمْسُ قَامَ فِيهِمْ فَقَالَ: «يَا أَيُّهَا النَّاسُ لا تَتَمَنَّوْا لِقَاءَ الْعَدُوِّ،

53. హజ్రత్ అబూ ఇబ్రాహీం అబ్దుల్లాహ్ బిన్ అబూ ఔఫా (రజి) కథనం : శత్రువులతో తలపడాల్సి వచ్చిన రోజుల్లో దైవ ప్రవక్త (సల్లం) యుద్ధం కోసం నిరీక్షించారు. (అంటే యుద్ధాన్ని కొంతకాలం పాటు దాటవేయటానికి ప్రయత్నించారు.) సూర్యుడు నడినెత్తినుండి

وَاسْأَلُوا اللهَ العَافِيَةَ، فَإِذَا لَقِيتُمُوهُمْ فَاصْبِرُوا، وَاعْلَمُوا أَنَّ الْجَنَّةَ تَحْتَ ظِلَالِ السُّيُوفِ»، ثُمَّ قَالَ النَّبِيُّ ﷺ: «اللَّهُمَّ مُنْزِلَ الْكِتَابِ وَمُجْرِيَ السَّحَابِ، وَهَازِمَ الأَحْزَابِ، اهْزِمْهُمْ وَانْصُرْنَا عَلَيْهِمْ» متفقٌ عَلَيه وَبِالله التَّوفِيقُ.

క్రిందికి వాలిన తరువాత ఆయన జనం మధ్య నిలబడి ఈ విధంగా ప్రసంగించారు: "ప్రజలారా! మీరు ఎన్నడూ శత్రువుతో తలపడాల్సిన పరిస్థితి రావాలని కోరుకోకండి. నిత్యం శాంతినే కోరుకుంటూ అల్లాహ్‌ను ప్రార్థించండి- అయితే శత్రువులతో యుద్ధం చేయ వలసిన పరిస్థితి గనక ఎదురైతే మాత్రం సహన స్థైర్యాలతో పోరాడండి. స్వర్గం ఖడ్గచ్ఛాయల క్రింద ఉందన్న సంగతిని తెలుసుకోండి." తరువాత దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రార్థించారు : "దేవా! దివ్య గ్రంథాన్ని అవతరింపజేసినవాడా! మేఘాలను నడిపించేవాడా! శత్రుసేనలను ఓడించిన వాడా! ఈ శత్రువుల్ని కూడా ఓటమికి గురిచేసి వీరికి వ్యతిరేకంగా మాకు సహాయపడు."

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. దైవమార్గంలో పోరాడటం కోసం పూర్తిస్థాయి యుద్ధ సన్నాహాలు చేసుకొని ఉండాలని, ఎట్టి పరిస్థితిలోనైనా యుద్ధానికి సన్నద్ధులై ఉండాలని తాకీదు చేయబడినప్పటికీ సాధ్యమైనంతవరకు యుద్ధాన్ని నివారించటానికే ప్రయత్నించాలనీ, శత్రువుతో తలపడాల్సిన పరిస్థితిని ఉద్దేశపూర్వకంగా కోరుకోరాదని ఈ హదీసు బోధపరుస్తోంది.
2. సహనం విశ్వాసికి గొప్ప ఆయుధం వంటిది. యుద్ధరంగంలో సహనం వహించడమంటే, మృత్యువుకి భయపడి వెన్నుచూపి పారిపోకుండా స్థిరచిత్తంతో ఎదురొడ్డి పోరాడటమని అర్థం.
3. ఆయుధాలు, భౌతిక సాధన సంపత్తి. శక్తిసామర్థ్యాలు, సంఖ్యాబలంపైనే పూర్తి నమ్మకంతో ఉండరాదు. దాంతోపాటు యుద్ధంలో విజయం, సహాయం కోసం దైవాన్ని కూడా ప్రార్థిస్తూ ఉండాలి.

4వ అధ్యాయం

# ٤ ـ بَابُ الصِّدْقِ

# సత్యం

قال الله تعالى: ﴿ يَاأَيُّهَا الَّذِينَ ءَامَنُوا اتَّقُوا اللَّهَ وَكُونُوا مَعَ الصَّادِقِينَ ﴾ [التوبة: ١١٩]، وقال تعالى: ﴿ وَالصَّادِقِينَ وَالصَّادِقَاتِ ﴾ [الأحزاب: ٣٥]، وقال تعالى: ﴿ فَلَوْ صَدَقُوا اللَّهَ لَكَانَ خَيْرًا لَّهُمْ ﴾ [محمد: ٢١].

وَأَمَّا الأَحَادِيثُ:

అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు : "విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్‌కు భయపడండి, సత్యవంతుల్లో చేరిపోండి." (అత్ తౌబా : 119)

మరోచోట అల్లాహ్ సెలవిచ్చాడు : "సత్యం పలికే పురుషులు మరియు సత్యం పలికే స్త్రీలు....." (అల్ అహ్‌జాబ్ : 35)

ఇంకొకచోట అల్లాహ్ ఇలా అంటున్నాడు : "వారు తాము అల్లాహ్‌కు చేసిన ప్రమాణాన్ని నెరవేర్చటంలో తమ నిజాయితీని నిరూపించుకుని ఉంటే, అది వారికే శ్రేయస్కరమైనదిగా ఉండేది." (ముహమ్మద్ : 21)

٥٤ ـ فَالأَوَّلُ عَنِ ابْنِ مَسْعُودٍ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «إِنَّ الصِّدْقَ يَهْدِي إِلَى البِرِّ وَإِنَّ البِرَّ يَهْدِي إِلَى الجَنَّةِ، وَإِنَّ الرَّجُلَ لَيَصْدُقُ حَتَّى يُكْتَبَ عِنْدَ اللهِ صِدِّيقاً، وَإِنَّ الْكَذِبَ يَهْدِي إِلَى الْفُجُورِ، وَإِنَّ الفُجُورَ يَهْدِي إِلَى النَّارِ، وَإِنَّ الرَّجُلَ لَيَكْذِبُ حَتَّى يُكْتَبَ عِنْدَ اللهِ كَذَّاباً» متفق عليه.

54. హజ్రత్ ఇబ్నె మస్‌ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : "నిస్సందేహంగా సత్యం సత్కార్యం వైపుకు నడిపిస్తుంది. సత్కార్యం స్వర్గం వైపుకు మార్గం సుగమం చేస్తుంది. ఎవడైనా (నిత్యం) సత్యం పలుకుతూ ఉంటే, చివరికి అతడు సత్యసంధుడని అల్లాహ్ వద్ద వ్రాసుకోబడతాడు. నిస్సందేహంగా అసత్యం అవిధేయత (పాపకార్యాల) వైపుకు గొనిపోతుంది. అవిధేయత నరకానికి చేర్చుతుంది. ఎవడైనా

(నిత్యం) అసత్యమే పలుకుతూ ఉంటే, అతను అల్లాహ్ వద్ద అసత్యవాదిగా వ్రాసుకోబడతాడు." (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

హదీసులో వాడబడిన 'సిద్దీఖ్' (నిత్యం సత్యం పలికేవాడు), 'కజ్జాబ్' (నిత్యం అసత్యం పలికేవాడు) రెండు కూడా అతిశయోక్తి పదాలే. ఎల్లప్పుడూ నిజం చెప్పటమే అలవాటుగా చేసుకున్న వ్యక్తిని సిద్దీఖ్‌గానూ, నిత్యం అబద్ధం చెప్పే వైఖరిని అవలంబించిన అబద్ధాల రాయుడిని 'కజ్జాబ్'గానూ వ్యవహరిస్తారు. మనిషి ఇహలోకంలో తాను చేసుకున్న కర్మలవల్ల మంచివాడిగానో లేక చెడ్డవాడిగానో పేరుమోసినట్లే పరలోకంలో అల్లాహ్ వద్ద కూడా అతనికి అదే ముద్రపడుతుంది. అక్కడ సత్యశీలుడు (సిద్దీఖ్)గా వ్రాసుకోబడతాడంటే దానర్థం పరలోకంలో అతని సత్యాలకు ప్రతిఫలంగా పుణ్యం లభిస్తుందని. అక్కడ అబద్ధాలరాయుడు (కజ్జాబ్)గా వ్రాసుకోబడతాడంటే, అబద్ధమాడినందుకు అతను పరలోకంలో శిక్షార్హుడిగా ఖరారు చేయబడతాడని భావం. ఈ సత్యం ఇహపరాల మేళ్ళను పొందటానికి ఉపయోగపడే సాధనమని, అందువల్ల నిత్యం సత్యమే పలుకుతూ ఉండాలని ఈ హదీసులో పురికొల్పడం జరిగింది. అదేవిధంగా అసత్యం అనర్థాలకు దారితీస్తుందని, కనుక ఎల్లప్పుడూ అసత్యానికి దూరంగా ఉండాలని కూడా తాకీదు చేయబడింది.

55. హజ్రత్ అబూ ముహమ్మద్ హసన్ బిన్ అలీ బిన్ అబూతాలిబ్ (రజి) కథనం: నాకు దైవప్రవక్త (సల్లం) పలికిన ఈ వాక్యాలు గుర్తున్నాయి : "నిన్ను సంశయంలో పడవేసే ఏ పనైనాసరే - దాన్ని వదిలెయ్యి. నిన్ను సందిగ్ధానికి లోనుచెయ్యని పనిని మాత్రమే నెర వేర్చు. నిస్సందేహంగా నిజం చెప్పటం మనసుకు నెమ్మదినిస్తుంది. అబద్ధం మనసులో అలజడిని రేపుతుంది." (ఈ హదీసును తిర్మిజీ ఉల్లేఖించి దృఢ మైనదిగా పేర్కొన్నారు.)

٥٥ ـ الثَّاني: عَنْ أَبي مُحَمَّدٍ الحَسَنِ بْنِ عَلِيِّ بْنِ أَبي طَالِبٍ، رضي الله عنهما، قال: حَفِظْتُ مِنْ رسولِ الله ﷺ: «دَعْ مَا يَرِيبُكَ إِلَى مَا لا يَرِيبُكَ؛ فَإِنَّ الصِّدْقَ طُمَأْنِينَةٌ، وَالكَذِبَ رِيبَةٌ» رواه التِّرْمذي وقال: حديثٌ صحيحٌ. قَوْلُهُ: «يُرِيبُكَ» هُوَ بِفَتْحِ اليَاءِ وَضمِّها؛ وَمَعنَاهُ: اتْرُكْ مَا تَشُكُّ فِي حِلِّهِ، وَاعْدِلْ إِلَى مَا لا تَشُكُّ فِيهِ.

హదీసులో వాడబడిన పదం 'యరీబుక', 'య'అకార సమేతంగా మరియు ఉకారంతో కూడా చదువవచ్చు. ఒక విషయం ధర్మసమ్మతమా కాదా అన్న సందేహం ఏర్పడితే దానిని వదలిపెట్టు, నీ మనసులో ఎలాంటి సందేహం కలగని విషయాన్ని మాత్రమే ఆచరించు అని దీని భావం.

## ముఖ్యాంశాలు

దేవుడు నిషేధించిన పనులకు పాల్పడకుండా ఉండేందుకుగాను ధర్మసమ్మతమా కాదా అన్న సంశయాత్మక విషయాలను కూడా వదలిపెట్టడమే మేలని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. సందేహాస్పద విషయాల నుండి బయటపడినవాడు తన ధర్మాన్ని, మానాన్ని కాపాడుకున్నాడని వేరొక హదీసు ద్వారా వెల్లడౌతోంది.

٥٦ ـ الثَّالِثُ: عَنْ أَبِي سُفْيَانَ صَخْرِ بْنِ حَرْبٍ، رضي الله عنه، في حديثه الطَّويلِ في قِصَّةِ هِرَقْلَ، قالَ هِرَقْلُ: فَمَاذَا يَأْمُرُكُمْ؟ - يَعني النَّبيَّ ﷺ - قالَ أبو سُفْيَانَ: قُلْتُ: يقولُ: «اعْبُدُوا اللهَ وَحْدَهُ لا تُشْرِكُوا بِهِ شَيْئاً، واتْرُكُوا مَا يَقُولُ آباؤُكُمْ» وَيَأْمُرُنَا بِالصَّلاةِ، وَالصِّدْقِ، وَالعَفَافِ، وَالصِّلَةِ. متفقٌ عليه.

56. హజ్రత్ అబూ సుఫ్యాన్ సఖ్ర్ బిన్ హర్బ్ (రజి) తాను (రోమ్ చక్రవర్తి) హెరిక్లస్‌తో జరిపిన సుదీర్ఘ సంభాషణ గురించి ఈ విధంగా తెలియజేశారు : "అతను (అంటే దైవప్రవక్త ముహమ్మద్ మీకు ఏమని ఆదేశిస్తున్నాడు?" అని హెరిక్లస్ నన్ను అడిగాడు. అందుకు నేను ఇలా జవాబు చెప్పాను: "అతను ఒక్క అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించాలనీ, ఆయనకు సహవర్తులుగా ఎవరినీ నిలబెట్టకూడదనీ, మీ తాతముత్తాతల మాటల్ని వదలిపెట్టమని ఆదేశిస్తున్నాడు. ఇంకా నమాజు చేయమని, సత్యం పలకమనీ, సచ్ఛీలతను కల్గి ఉండమని, బంధుత్వ హక్కులను నెరవేర్చమని కూడా ఆదేశిస్తున్నాడు.

(బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని 'దైవవాణి అవతరణ ఆరంభ' ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

శత్రువులు సయితం దైవప్రవక్త (సల్లం)గారి బోధనల్లోని సత్యాన్ని ఒప్పుకునేవారన్న దానికి ఈ హదీసు ప్రబల తార్కాణం. ఎందుకంటే హదీసులోని అబూ సుఫ్యాన్ (రజి) మాటలు ఆయన ఇస్లాం స్వీకరించక మునుపు హెరిక్లస్ చక్రవర్తి దర్బారులో చెప్పినవి. దైవప్రవక్తకు బద్ధశత్రువుగా ఉన్నప్పుడు కూడా ఆయన దైవప్రవక్త (స) సత్యసంధతను కొనియాడటం గమనార్హం. సహీహ్ బుఖారీలో ఈ హదీసు పూర్తి వివరాలతో ఉల్లేఖించబడింది.

٥٧ ـ الرَّابِعُ: عَنْ أَبِي ثَابِتٍ، وَقِيلَ: أَبِي سَعِيدٍ، وَقِيلَ: أَبِي الْوَلِيدِ، سَهْلِ بْنِ حُنَيْفٍ، وَهُوَ بَدْرِيٌّ، رضي الله عنه، أن النبيَّ ﷺ قال: «مَنْ سَأَلَ اللهَ تعالى، الشَّهَادَةَ بِصِدْقٍ بَلَّغَهُ اللهُ مَنَازِلَ الشُّهَدَاءِ، وَإِنْ مَاتَ عَلَى فِرَاشِهِ» رواه مسلم.

57. హజ్రత్ అబూ సాబిత్ సహ్ల్ బిన్ హునైఫ్ కథనం : (ఈయన మారుపేరు విషయంలో కొంత అభిప్రాయ భేద ముంది. కొంతమంది దృష్టిలో ఈయన పేరు అబూ సాబిత్ కాగా, మరికొంత మంది దృష్టిలో అబూ సయీద్. ఇంకొంతమంది అబుల్ వలీద్ అంటు న్నారు. ఏదిఏమైనా ఈయన మాత్రం బద్ర్ యుద్ధంలో పాల్గొన్న సహాబీ.) దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : "నిజ హృదయంతో తాను అమరగతినొం దాలని అల్లాహ్‌ను వేడుకున్నవాడిని, అతను తన పడకపై మరణించినప్పటికీ అల్లాహ్ అతణ్ణి అమరగతుల స్థానాలకు చేరుస్తాడు." *(ముస్లిం)*

*(ముస్లింలోని నాయకత్వ ప్రకరణంలో ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో చిత్తశుద్ధి యొక్క శ్రేష్ఠత, ప్రాధాన్యతలు వివరించబడ్డాయి. చిత్తశుద్ధితో దైవమార్గంలో పోరాడి అమరగతినొందాలని సంకల్పించుకున్న వ్యక్తి ప్రపంచంలో ఆ భాగ్యానికి నోచుకోలేక పోయినప్పటికీ పరలోకంలో మాత్రం అల్లాహ్ అతనికి అమరవీరులకు ప్రసాదించబడే

ఉన్నత స్థానాలే ప్రసాదిస్తాడు. అయితే కొన్ని సందర్భాల్లో ఈ సంకల్పశుద్ధి లోపించిన కారణంగానే యుద్ధరంగంలో హతులయ్యే వారిని కూడా నరకంలో పడవేయటం జరుగుతుందన్న విషయం గమనార్హం.

٥٨ ـ الخامسُ: عَنْ أَبي هُرَيْرَةَ، رضي الله عنه، قال: قال رسول الله ﷺ: «غزا نَبِيٌّ مِنَ الأَنْبِياءِ صَلَواتُ اللهِ وسَلَامُهُ عَلَيْهِمْ فقَالَ لِقَومِهِ: لَا يَتْبَعَنِّي رَجُلٌ مَلَكَ بُضْعَ امْرَأَةٍ، وَهُوَ يُرِيدُ أَنْ يَبْنِيَ بها وَلَمَّا يَبْنِ بهَا، وَلا أَحَدٌ بَنَى بُيُوتاً لَمْ يَرْفَعْ سُقُوفَهَا، وَلا أَحَدٌ اشْتَرَى غَنَماً أو خَلِفَاتٍ وَهُوَ يَنْتَظِرُ أولادَهَا. فَغَزَا فَدَنَا مِنَ القَرْيَةِ صَلاةَ العَصْرِ أو قَرِيباً مِنْ ذٰلكَ، فَقَالَ للشَّمْسِ: إِنَّكِ مَأْمُورَةٌ وَأنَا مَأمُورٌ، اللَّهُمَّ احْبِسْهَا عَلَيْنَا، فَحُبِسَت حَتَّى فَتَحَ اللهُ عَلَيْهِ، فَجَمَعَ الغَنَائِمَ، فَجَاءَت ـ يَعني النَّارَ ـ لِتَأكُلَهَا فَلَمْ تَطْعَمْهَا، فَقَالَ: إنَّ فِيكُمْ غُلُولًا، فَلْيُبَايِعني مِنْ كُلِّ قَبيلَةٍ رَجُلٌ، فَلَزِقَتْ يَدُ رَجُلٍ بِيَدِهِ فقَالَ: فِيكُمُ الغُلُولُ، فَلْتُبَايِعْنِي قَبِيلَتُكَ، فَلَزِقَتْ يَدُ رَجُلَيْنِ أو ثَلاثَةٍ بِيَدِهِ فقَالَ: فيكُمُ الغُلُولُ. فَجَاؤُوا بِرَأسٍ مِثْلِ رَأسِ بَقَرَةٍ مِنَ الذَّهَبِ،

58. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారు : "ప్రవక్తలలో (వారందరిపై దేవుని శాంతి కల్గుగాక) ఒకాయన దైవమార్గంలో యుద్ధానికి బయలుదేరుతూ తన జాతివారితో ఇలా అన్నారు: "మీలో (కొత్తగా) పెళ్ళిచేసుకొని - మొదటిసారి భార్యతో గడపాలనుకుంటున్న వ్యక్తి, ఇల్లు కట్టుకొని ఇంకా కప్పువేసుకోని వ్యక్తి, సూడి మేకలు, ఒంటెలు కొని అవి త్వరలోనే ఈనుతాయని ఎదురుచూస్తున్న వ్యక్తి నాతోపాటు యుద్ధానికి రానవసరం లేదు."

ఆ తరువాత ఆ ప్రవక్త దైవమార్గంలో యుద్ధం చేయటానికి ప్రయాణమయ్యారు. వారు అస్ర్ వేళకు లేక అంతకన్నా కాస్త ముందే (యుద్ధం చేయవలసిన) ఊరికి చేరుకున్నారు. అప్పుడాయన సూర్యుడ్ని సంబోధిస్తూ "నువ్వు కూడా దైవాజ్ఞల్ని పాలించేవాడివే. నేనూ దైవాజ్ఞల్ని పాలించేవాడినే" అంటూ ఓ దేవా! మా కోసం ఈ సూర్యుడ్ని (అస్తమించకుండా) ఆపి ఉంచు" అని దైవాన్ని ప్రార్థించారు. (వారికోసం) సూర్యుడు నిలిపి ఉంచబడ్డాడు. అల్లాహ్ వారికి ఆ ఊరిపై విజయం సాధించి పెట్టేదాకా సూర్యుడు అస్తమించలేదు.

فوضعها فجاءت النار فأكلتها، فلم تحل الغنائم لأحد قبلنا، ثم أحل الله لنا الغنائم لما رأى ضعفنا وعجزنا فأحلها لنا» متفق عليه.

«الخلفات» بفتح الخاء المعجمة وكسر اللام: جمع خلفة، وهي الناقة الحامل.

యుద్ధానంతరం ఆయన యుద్ధప్రాప్తిని ఒకచోట పోగుచేశారు. దాన్ని తినేయ డానికి (ఆకాశం నుండి) అగ్ని వచ్చి తిన కుండానే వెళ్ళిపోయింది. అది చూసి ఆ దైవప్రవక్త (తన సైన్యంలోని వారితో) "మీలో ఎవరో (యుద్ధప్రాప్తిని అప్పగించే విషయంలో) ద్రోహానికి పాల్పడ్డారు. కాబట్టి మీలోని ప్రతి తెగనుండి ఒక్కొక్క వ్యక్తి వచ్చి నా సమక్షంలో ప్రమాణంచేసి చెప్పండి" అని అన్నారు. సైనికులు ప్రవక్త చేతిలో చెయ్యివేసి ప్రమాణం చేస్తుండగా ఒక వ్యక్తి చెయ్యి ప్రవక్త చేతికి అతుక్కుపోయింది. ప్రవక్త ఆ వ్యక్తితో "నీ తెగ వాళ్ళలోనే ఎవరో ఈ ద్రోహానికి పాల్పడి ఉండాలి. కాబట్టి నీ తెగవారంతా నా చేతిమీద ప్రమాణం చేయాలి" అని అన్నారు. ఆ తెగవారు ప్రమాణం చేస్తున్నప్పుడు ఇద్దరు లేక ముగ్గురు వ్యక్తుల చేతులు ప్రవక్త చేతులకు అతుక్కుపోయాయి. వారినుద్దేశించి ఆ దైవప్రవక్త "ఈ ద్రోహానికి పాల్పడింది మీరే" అని అన్నారు. అప్పుడు ఆ ముగ్గురు (తాము దాచిన) బంగారంతో తయారుచేసిన ఆవు తల లాంటి సొత్తును (యుద్ధ ప్రాప్తిలో కలిపి) పెట్టేశారు. అంతలోనే అగ్ని (మళ్ళీ) వచ్చి ఆ విజయప్రాప్తినంతా తినేసింది." (అంటే దైవమార్గంలో చేయబడిన పోరాటం దైవసమక్షంలో ఆమోదించ బడిందన్న విషయానికి అది తార్కాణం అన్నమాట!)

దైవప్రవక్త (సల్లం) ఇంకా ఇలా తెలియజేశారు : మనకు పూర్వం ఎవరికీ ఈ యుద్ధప్రాప్తి ధర్మసమ్మతంగా ఉండేది కాదు. అల్లాహ్ గత్యంతరం లేని మన స్థితినీ, బలహీనతల్ని చూసి దాన్ని మన కోసం ధర్మసమ్మతం చేశాడు.

*(బుఖారీ - ముస్లిం)*

'ఖలిఫాత్' 'ఖ'పై అకారం, 'ల'పై ఇకారం. ఇది 'ఖలిఫతున్'కు బహు వచనం. అంటే 'సూడిది' అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం. సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. ఇమామ్ సుయూతీ (రహ్మలై) అభిప్రాయం ప్రకారం పై హదీసులో పేర్కొనబడిన ప్రవక్త హజ్రత్ యోషా బిన్ నూన్ (అలైహి). యోధులు పూర్తి ఏకాగ్రతతో, స్థిరచిత్తంతో దైవమార్గంలో పోరాటం చేయాలంటే వారి ప్రాపంచిక అవసరాలను తీర్చడం కూడా చాలా అవసరమని ఈయన వ్యవహార శైలినిబట్టి తెలుస్తోంది.
2. యుద్ధప్రాప్తి ధర్మసమ్మతం చేయబడటం, ముహమ్మద్ (సల్లం)గారి ఉమ్మత్ (సమాజ) ప్రత్యేకతను చాటుతోంది. ఇంతకు మునుపు విజయ ధనాన్ని ఆకాశం నుండి అగ్ని వచ్చి దహించివేసేది. అలా అగ్ని వచ్చి విజయప్రాప్తిని దహించిందంటే దైవమార్గంలో వారు చేసిన పోరాటం సఫలీకృతమైనట్లు లెక్క.
3. ఈ హదీసులో విజయం చేకూరే వరకూ సూర్యుడు అస్తమించకుండా ఆగిపోయాడని చెప్పబడింది. ఇది ఆ దైవప్రవక్త మహిమ. దేవుడు తన ప్రవక్తల ద్వారా అప్పుడప్పుడూ వారి దైవదౌత్యానికి నిదర్శనంగా ఇటువంటి అద్భుతాలను సృష్టిస్తూ ఉంటాడు.

59. హజ్రత్ అబూ ఖాలిద్ హకీం బిన్ హిజామ్ (రజి) కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు : "అమ్మకందారు కొనుగోలుదారు పరస్పరం వేరుకానంతవరకూ వారిరు

٥٩ ـ السادسُ: عن أَبي خالدٍ حكيمِ بنِ حزامٍ، رضي الله عنه، قال: قال رسول الله ﷺ: «البيِّعانِ بالخِيارِ ما لم

يَتَفَرَّقا، فإن صَدَقا وبيَّنا بُورِكَ لَهُما في بيعِهِمَا، وإن كَتَمَا وكَذَبَا مُحِقَتْ بركةُ بَيْعِهِما» متفقٌ عليه.

వురికీ (వ్యవహారాన్ని రద్దుపరచే లేక కొనసాగించే) హక్కు ఉంటుంది. వారిద్దరూ నిజంచెప్పి (ఎలాంటి దాపరికం లేకుండా) వస్తువు నాణ్యతను గురించి వివరిస్తే ఆ వ్యవహారంలో వారి రువురికీ శుభం కలుగుతుంది. ఒకవేళ వారు దాపరికం చేసి అబద్ధాలాడితే ఆ వ్యవహారంలో శుభం లేకుండాపోతుంది.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వాణిజ్య ప్రకరణం. సహీహ్ ముస్లింలోని వాణిజ్య ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

1. అమ్మకందారు, కొనుగోలుదారులిద్దరూ హక్కుని కలిగివుంటారంటే అర్థం, వారిరువురూ వ్యవహారం చేస్తున్నంత వరకూ వారికి తమ వ్యవహారాన్ని రద్దుపరచుకొనే అధికారముంటుంది. సాధారణంగా ప్రజలు వ్యవహారానికి సంబంధించిన విషయాలు పూర్తిగా మాట్లాడుకున్న తరువాత ఇక వ్యవహారాన్ని రద్దుపరచటానికి వీలుండదని భావిస్తారు. ఈ భావన సరైనది కాదు. పై హదీసు వారి భావనను త్రోసిపుచ్చుతోంది.
2. నిజం చెప్పటం వల్ల వ్యవహారాల్లో శుభం కల్గుతుందనీ, అబద్ధం చెప్పి దాపరికంతో వ్యవహరిస్తే అలాంటి వ్యవహారాల్లో శుభం కొరవడుతుందని ఈ హదీసు బోధిస్తోంది.



5వ అధ్యాయం

# ٥ - بَابُ الْمُرَاقَبَةِ

# దైవధ్యానం

قال الله تعالى: ﴿ٱلَّذِى يَرَىٰكَ حِينَ تَقُومُ ﴿٢١٨﴾ وَتَقَلُّبَكَ فِى ٱلسَّٰجِدِينَ﴾ [الشعراء: ٢١٨ - ٢١٩]، وقال تعالى: ﴿وَهُوَ مَعَكُمْ أَيْنَ مَا كُنتُمْ﴾ [الحديد: ٤]، وقال تعالى: ﴿إِنَّ ٱللَّهَ لَا يَخْفَىٰ عَلَيْهِ شَىْءٌ فِى ٱلْأَرْضِ وَلَا فِى ٱلسَّمَآءِ﴾ [آل عمران: ٥]، وقال تعالى: ﴿إِنَّ رَبَّكَ لَبِٱلْمِرْصَادِ﴾ [الفجر: ١٤]، وقال تعالى: ﴿يَعْلَمُ خَآئِنَةَ ٱلْأَعْيُنِ وَمَا تُخْفِى ٱلصُّدُورُ ﴿١٩﴾﴾ [غافر: ١٩] والآياتُ في البَابِ كَثيرَةٌ مَعلُومَةٌ. وَأَمَّا الأحاديثُ:

అల్లాహ్ సెలవిచ్చాడు : "ఆయన నిన్ను, నీవు లేచినప్పుడు చూస్తాడు, సజ్దా చేసేవారిలో నీ రాకపోకలను గమనిస్తాడు."
(అష్ షుఅరా : 218, 219)

మరోచోట ఆయన సెలవిచ్చాడు : "మీరు ఎక్కడ వున్నా ఆయన మీతో వున్నాడు."
(అల్ హదీద్ : 4)

ఇంకొకచోట ఆయన సెలవిచ్చాడు : "భూమ్యాకాశాలలో ఏ వస్తువూ అల్లాహ్‌కు గోప్యంగా లేదు." (ఆలి ఇమ్రాన్ : 5)

మరోచోట అల్లాహ్ సెలవు ఈ విధంగా ఉంది : "యదార్థమేమిటంటే నీ ప్రభువు మాటువేసి ఉన్నాడు." (అల్ ఫజ్ర్ : 14)

ఇంకొకచోట అల్లాహ్ ఈ విధంగా అంటున్నాడు: "అల్లాహ్ చూపుల చౌర్యాన్ని సైతం ఎరుగును. హృదయాలు దాచి ఉంచిన రహస్యాన్ని సైతం ఎరుగును." (అల్ మూ'మిన్ : 19)

ఈ భావాన్ని కలిగిన ప్రముఖమైన దివ్య ఖుర్ఆన్ సూక్తులు అనేకం ఉన్నాయి.

٦٠ - فَالأَوَّل: عَنْ عُمَرَ بْنِ الخطاب، رضي الله عنه، قال: بَيْنَمَا نَحْنُ جُلُوسٌ عِنْدَ رسولِ الله ﷺ ذَاتَ يَوْمٍ إِذْ طَلَعَ عَلَيْنَا رَجُلٌ شَدِيدُ بَيَاضِ الثِّيَابِ،

60. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం : ఒకరోజు మేము దైవప్రవక్త (సల్లం) సన్నిధిలో కూర్చొని ఉండగా అకస్మాత్తుగా ఒక వ్యక్తి మా వద్ద ప్రత్యక్షమయ్యాడు. మిక్కిలి తెల్లని దుస్తులు

شَدِيدُ سَوَادِ الشَّعْرِ، لا يُرَى عَلَيْهِ أَثَرُ السَّفَرِ، ولا يَعْرِفُهُ مِنَّا أَحَدٌ، حَتَّى جَلَسَ إلى النَّبِيِّ ﷺ، فَأَسْنَدَ رُكْبَتَيْهِ إلى رُكْبَتَيْهِ، وَوَضَعَ كَفَّيْهِ عَلَى فَخِذَيْهِ وَقَالَ: يا مُحَمَّد أَخْبِرْنِي عَنِ الإِسْلام، فَقَالَ رسولُ الله ﷺ: «الإِسْلامُ أَنْ تَشْهَدَ أَنْ لا إِلٰه إِلَّا اللهُ، وأَنَّ مُحَمَّداً رسولُ اللهِ وَتُقِيمَ الصَّلاةَ، وتُؤْتِيَ الزَّكَاةَ، وَتَصُومَ رَمَضَانَ، وَتَحُجَّ الْبَيْتَ إِنِ اسْتَطَعْتَ إِلَيْهِ سَبِيلاً». قَالَ: صَدَقْتَ. فَعَجِبْنَا لَهُ يَسْأَلُهُ وَيُصَدِّقُهُ!

ధరించి బాగా నల్లని తలవెంట్రుకలు కలిగి ఉన్నాడు. అతనిలో ప్రయాణ బడలిక ఏమీ కనిపించలేదు. (కాబట్టి సమీప గ్రామం నుంచే వచ్చాడేమో అనుకున్నాము). అయితే మాలో ఎవరూ ఆ వ్యక్తిని గుర్తుపట్టలేదు. ఆ వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, తన మోకాళ్ళను దైవప్రవక్త (స) మోకాళ్ళకు ఆనిస్తూ, తన అరచేతులను ఆయన తొడలపై పెట్టి (కడు వినమ్రుడై) కూర్చు న్నాడు. ఆ తరువాత దైవప్రవక్త (స)ను, "ఓ ముహమ్మద్! నాకు ఇస్లాం గురించి బోధించండి" అని అడిగాడు. దానికి ఆయన "ఇస్లాం అంటే అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడనీ, ముహమ్మద్ (స) దేవుని ప్రవక్త అని నీవు సాక్ష్యం పలకాలి, నమాజును స్థాపించాలి, జకాత్ దానం చెల్లించాలి, రమజాన్ నెలలో ఉపవాసం పాటించాలి. వీలుంటే దైవగృహానికి (కాబాకు) యాత్ర చేయాలి. (ఇదే ఇస్లాం)" అని చెప్పారు. దైవప్రవక్త (స) సమాధానం విని ఆ వ్యక్తి 'నీవు చెప్పింది నిజం' అంటూ ఆయన మాటల్ని ధృవీకరించాడు. ఈ వ్యక్తి తనకు తెలియనట్లే అడుగుతున్నాడు, తిరిగి ప్రవక్త సమాధానాన్ని ధృవీకరిం చటం కూడా చేస్తున్నాడు. ఆ వింత చూసి మేము ఆశ్చర్యపోయాము.

قالَ: فَأَخبرْني عنِ الإيْمانِ. قالَ: «أنْ تُؤمِنَ باللهِ، وَمَلائِكَتِهِ، وَكُتُبِهِ، وَرُسُلِهِ، وَاليَومِ الآخِرِ، وَتُؤمِنَ بالقَدَرِ خَيْرِهِ وَشَرِّهِ». قالَ: صَدَقْتَ. قالَ: فَأَخبِرْني عنِ الإحسَانِ. قالَ: «أنْ تَعْبُدَ اللهَ كَأَنَّكَ تَرَاهُ؛ فَإنْ لم تَكُنْ تَرَاهُ فَإنَّهُ يَرَاكَ». قالَ: فأَخبِرني عنِ السَّاعَةِ. قالَ: «مَا المَسْؤُولُ عَنْهَا بِأَعْلَمَ مِنَ السَّائِلِ». قالَ: فَأخبِرني عنْ أَمَارَاتِهَا. قالَ: أنْ تَلِدَ الأَمَةُ رَبَّتَهَا،

"మరి ఈమాన్ అంటే ఏమిటి?" అని ఆ వ్యక్తి మళ్ళీ ప్రశ్నించాడు. "ఈమాన్ అంటే అల్లాహ్‌ను, ఆయన దూతలను, ఆయన (అవతరింపజేసిన) గ్రంథాలను, ఆయన పంపిన ప్రవక్తలను, పరలోక దినాన్ని, మంచీచెడుల విధివ్రాతను విశ్వసించాలి" అని దైవప్రవక్త (స) ఆ వ్యక్తికి బోధించారు. అతను మళ్ళీ "నిజం చెప్పావ్" అన్నాడు.

ఆ వ్యక్తి తిరిగి "ఇహ్సాన్ అంటే ఏమిటో బోధించ"మని అడిగాడు. దానికి దైవ ప్రవక్త (స), "అల్లాహ్‌ను నీవు నిజంగా చూస్తున్నట్లు (భక్తి ప్రపత్తులతో) ఆరాధించాలి. నీవు ఆయన్ని చూడలేకపోయినా (ఆరాధించేటప్పుడు కనీసం) ఆయనైతే నిన్ను చూస్తూనే ఉన్నాడన్న భావననైనా కలిగి ఉండాలి. ఇదే ఇహ్సాన్" అన్నారు.

తరువాత ఆ అపరిచిత వ్యక్తి "మరి ప్రళయం ఎప్పుడు వస్తుందో చెప్పండి" అని మరో ప్రశ్న వేశాడు. దానికి ఆయన "ఈ విషయం గురించి ప్రశ్నించబడే వాడికి పృచ్ఛకుని కన్నా ఎక్కువేమీ తెలియదు" అని బదులిచ్చారు. అందుకా వ్యక్తి "మరయితే దాని సంభవానికి సూచనలేవైనా ఉంటే తెలియజేయండి" అని విన్నవించుకున్నాడు. దానికి దైవప్రవక్త (సల్లం) ప్రళయ సూచనల గురించి ఈ విధంగా తెలియజేశారు: "అప్పుడు దాసి యజమాను

రాలిని కంటుంది. ఒకప్పుడు ఒంటిమీద సరిగ్గా బట్టలు కూడా లేకుండా బోసి కాళ్ళతో తిరుగుతూ, తిండికి కూడా గతి లేకుండా బతికిన పశువుల కాపర్లు (ఇప్పుడు) భవంతులు నిర్మించటంలో పరస్పరం పోటీపడటాన్ని నీవు కళ్లారా చూస్తావు."

తరువాత ఆ అపరిచిత వ్యక్తి వెళ్ళి పోయాడు. (హదీసు తెలియజేసిన హజ్రత్ ఉమర్ (రజి) ఇలా అంటు న్నారు.) తరువాత నేను చాలా సేపు (దైవ ప్రవక్త (సల్లం) సన్నిధిలోనే) ఉండి పోయాను. అప్పుడు ఆయన నన్ను "ఆ పృచ్ఛకుడు ఎవరో తెలుసా?" అని అడిగారు. అందుకు నేను "దేవునికీ, దైవప్రవక్తకే బాగా తెలుసు" అని కడు వినమ్రంగా జవాబిచ్చాను. దానికి ఆయన "వచ్చిన వ్యక్తి (ఎవరోకాదు) దైవదూత జిబ్రయీల్. మీకు మీ ధర్మం నేర్పడం కోసం వచ్చారు" అని చెప్పారు. (ముస్లిం)

"దాసి యజమానురాలిని కంటుంది" అంటే బానిసరాళ్ళ సంఖ్య విపరీతంగా పెరిగిపోతుందని అర్థం. ఫలితంగా సమాగమం నిమిత్తం ప్రత్యేకించబడిన దాసి తన యజమాని బిడ్డను కంటుంది. ఈ యజమాని బిడ్డ 'యజమాని' అనే అర్థంలోనే వాడబడింది. ఇదేకాకుండా ఈ వాక్యానికి (పండితులు) ఇంకా అనేక భాష్యాలు చెప్పారు. 'ఆలతన్' అంటే

وأنْ تَرَى الحُفَاةَ العُرَاةَ العَالَةَ رِعَاءَ الشَّاءِ يَتَطَاوَلُونَ في البُنْيَانِ». ثُمَّ انْطَلَقَ، فَلَبِثْتُ مَلِيّاً، ثُمَّ قَالَ: «يا عُمَرُ أَتَدْرِي مَنِ السَّائِلُ؟» قُلْتُ: اللهُ وَرسولُهُ أَعْلَمُ. قالَ: «فإنَّهُ جِبْرِيلُ أَتَاكُمْ يُعَلِّمُكُمْ أمرَ دِينِكُمْ» رواه مسلم. وَمَعْنَى: «تَلِد الأَمَةُ رَبَّتَهَا» أَيْ: سَيِّدَتَهَا؛ ومعناهُ أنْ تَكْثُرَ السَّرَارِيُّ حَتَّى تَلِدَ الأَمَةُ السُّرِّيَّةُ بِنْتاً لِسَيِّدِها، وَبِنْتُ السَّيِّدِ في مَعْنَى السَّيِّدِ، وقِيلَ غَيْرُ ذلكَ. وَ«العَالَةُ»: الفُقَرَاءُ. وَقَوْلُهُ: «مَلِيّاً» أي: زَمَناً طَوِيلاً، وَكَانَ ذلكَ ثَلاثاً.

అభాగ్యులు అని అర్థం. 'మలియ్యన్' అంటే సుదీర్ఘకాలం. హదీసులో దీనికి మూడు రోజులని భావం.

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం, ఇంకా సుననె అబూదావూద్, సుననె తిర్మిజీ, సుననె నసాయిలో కూడా ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు 'హదీసె జిబ్రయీల్'గా ప్రసిద్ధికెక్కింది. ఇందులో ఇస్లాం ధర్మ మౌలికాంశాలు వివరించబడ్డాయి. ప్రతి ముస్లిం ఈ మౌలిక సూత్రాలను గురించి తెలుసుకోవడం చాలా అవసరం. అనంతకాలం వరకూ జరగబోయే విషయాలన్నింటినీ అల్లాహ్ ముందుగానే రాసిపెట్టాడు. దాని గురించిన జ్ఞానం అల్లాహ్‌కు తప్ప మరెవరికీ లేదు. ఏది జరిగినా ఆయన (వ్రాసి వుంచిన) జ్ఞానానికనుగుణంగానే జరుగుతుంది. దీనినే 'తఖ్‌దీర్' (విధివ్రాత) అని అంటారు. 'మంచీచెడుల విధివ్రాత' అంటే విధివ్రాతకనుగుణంగా మేలు లేక కీడు జరగడం. ఉదాహరణకు ఆనందైశ్వర్యాలు, సిరిసంపదలు కలగటం, పంటల్లో అధిక దిగుబడులు రావటం లాంటి వాటిని విధివ్రాత వల్ల కలిగిన మేళ్ళుగానూ, దీనికి విరుద్ధంగా సంభవించే కరవుకాటకాలు, ఆపదలు, విపత్తులు వంటి వాటిని విధివ్రాత వల్ల కలిగిన నష్టాలుగానూ ప్రజలు భావిస్తారు. అయితే ఈ మేలు లేక కీడు అనేది మన వ్యావహారికమేగాని అల్లాహ్ ఏది చేసినా అందులో దైవలీల, ఆయన వివేచనాలు దాగి వుంటాయన్న విషయాన్ని మాత్రం మరువకూడదు.

٦١ ـ الثَّاني: عَنْ أَبِي ذَرٍّ جُنْدُبِ بْنِ جُنَادَةَ، وَأَبِي عَبْدِ الرَّحْمٰنِ مُعَاذِ بْنِ جَبَلٍ، رضي الله عنهما، عَنْ رسولِ الله ﷺ، قال: «اتَّقِ اللهَ حَيْثُمَا كُنْتَ وَأَتْبِعِ السَّيِّئَةَ الحَسَنَةَ تَمْحُهَا، وَخَالِقِ النَّاسَ بِخُلُقٍ حَسَنٍ» رواه التِّرمذيُّ وقال: حديثٌ حسنٌ.

61. హజ్రత్ అబూ జర్ర్ జుందుబ్ బిన్ జునాదా (రజి) మరియు అబూ అబ్దుర్రహ్మాన్ ముఆజ్ బిన్ జబల్ (రజి)ల కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు: నీవు ఎక్కడ వున్నా అల్లాహ్‌కు భయపడుతూ ఉండు. పాపకార్యం (జరిగిపోతే) తరువాత వెంటనే పుణ్యకార్యం చెయ్యి. (ఎందుకంటే) పుణ్యం పాపాన్ని తుడిచి పెట్టేస్తుంది. ఇంకా ప్రజల పట్ల మంచిగా మెలుగుతూ ఉండు." (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్'గా ఖరారు చేశారు.)

*(తిర్మిజీలోని సత్కార్యాలు, సత్సంబంధాల అధ్యాయాలలోనూ, ముస్నదె అహ్మద్‌లోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

పుణ్యకార్యం, పాపకార్యాన్ని తుడిచిపెట్టేస్తుందంటే అర్థం, పుణ్యం పాపానికి పరిహారంగా మారుతుందన్న మాట. అయితే ఇది చిన్న చిన్న పొరబాట్లు, తప్పిదాలకు మాత్రమే వర్తిస్తుంది. మహా పాతకాలు, ఘోరపాపాలు (కబీరా గునాహ్) చిత్తశుద్ధితో చేసిన పశ్చాత్తాపం వల్ల మాత్రమే మన్నించబడతాయి. అదేవిధంగా సాటి మానవుల హక్కులకు నష్టం వాటిల్లజేస్తే వారి నుండి క్షమాపణ వేడుకోవడమో లేక నష్టపరిహారాన్ని చెల్లించడమో చేయనంతవరకూ కేవలం పుణ్యకార్యాలు చేస్తుండటం వల్ల అవి క్షమార్హం కాజాలవు.

62. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: ఒకరోజు నేను (వాహనంపై) దైవప్రవక్త (సల్లం) వెనుక కూర్చొని ఉన్నాను. అప్పుడు ఆయన నన్నుద్దేశ్యించి ఇలా అన్నారు : "అబ్బాయీ! నేను నీకు కొన్ని ముఖ్యమైన విషయాలు చెప్తాను. (వాటిని నీవు సదా గుర్తుంచుకో) - నీవు అల్లాహ్‌ను (అంటే ఆయన ఆదేశాలను) కాపాడు; ఆయన నిన్ను కాపాడతాడు. నీవు దేవుని (హక్కులను) గుర్తుంచుకో; ఆయన నీ ముందున్నట్లే గ్రహిస్తావు. (అంటే ఆయన రక్షణ, సహాయ సహకారాలు నీ వెన్నంటే ఉంటాయి.) నీవు అర్థించదలచుకున్నప్పుడు అల్లాహ్‌నే అర్థించు. నీవు సహాయం కోరాలనుకుంటే (సాధనాలు ఉపయోగించటంతోపాటు) అల్లాహ్‌నే సహాయం కోసం అర్థించు. జాగ్రత్త! లోకమంతా ఏకమై నీకు మేలు చేకూర్చాలనుకున్నా అల్లాహ్ నీకోసం వ్రాసిపెట్టిన దానికంటే ఎక్కువేమీ అది నీకు మేలు చేకూర్చజాలదు. ఒకవేళ నీకు కీడు తలపెట్టాలన్న

٦٢ ـ الثَّالثُ: عَن ابْنِ عَبَّاسٍ، رضي الله عنهما، قال: كُنْتُ خَلْفَ النَّبِيِّ ﷺ، يَوْماً فَقَالَ: «يَا غُلامُ إنِّي أُعَلِّمُكَ كَلِمَاتٍ: احْفَظِ اللهَ يَحْفَظْكَ، احْفَظِ اللهَ تَجِدْهُ تُجَاهَكَ، إذَا سَأَلْتَ فَاسْأَلِ اللهَ، وَإذَا اسْتَعَنْتَ فاسْتَعِنْ باللهِ، واعْلَمْ: أَنَّ الأُمَّةَ لو اجْتَمَعَتْ عَلَى أنْ يَنْفَعُوكَ بشَيءٍ، لمْ يَنْفَعُوكَ إلا بشيءٍ قَدْ كَتَبَهُ اللهُ لَكَ، وإنِ اجْتَمَعُوا عَلَى أنْ يَضُرُّوكَ بشَيْءٍ؛ لمْ يَضُرُّوكَ إلا بشيءٍ قَدْ كَتَبَهُ اللهُ عَلَيْكَ؛ رُفِعَتِ الأقلامُ، وَجَفَّتِ الصُّحُفُ» رواهُ التِّرمذيُّ وَقالَ: حديثٌ حسنٌ

صحيحٌ. وفي روايةِ غيرِ الترمذيِّ: «احفَظِ الله تَجِدْهُ أَمَامَكَ، تَعَرَّفْ إلى اللهِ فِي الرَّخاءِ يَعْرِفْكَ في الشِّدَّةِ، واعْلَمْ أنَّ مَا أخطأكَ لمْ يكُنْ لِيُصيبَكَ، وَمَا أصابَكَ لمْ يَكُنْ لِيُخطِئَكَ، واعْلَمْ أنَّ النَّصرَ مَعَ الصَّبْرِ، وأنَّ الفرَجَ مَعَ الكَرْبِ، وأنَّ مَعَ العُسْرِ يُسْراً».

ఉద్దేశ్యంతో ఏకమైనా కూడా అల్లాహ్ నీ కోసం వ్రాసి ఉంచిన దానికంటే ఎక్కువ నష్టమేమీ అది కలిగించ జాలదు. ఎందుకంటే కలములు పైకి లేపుకోబడ్డాయి. (అంటే విధివ్రాత రాయటం అయిపోయింది.) పత్రాల సిరా ఆరిపోయింది. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్' మరియు 'సహీహ్' గా పేర్కొన్నారు.)

తిర్మిజీగాక వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: నీవు దేవుని (హక్కులను) గుర్తుంచుకో; నీవు ఆయన్ని నీ ముందున్నట్లు గ్రహిస్తావు. ఆనంద ఘడియల్లో నువ్వు ఆయన్ని జ్ఞాపకముంచుకో. ఆపద సమయాల్లో ఆయన నిన్ను జ్ఞాపకముంచుకుంటాడు. (అంటే నిన్ను ఆ కష్టాలనుండి గట్టెక్కిస్తాడు) నీ నుండి తప్పిపోయింది నీకు చేకూరేది కాదనీ, నీకు చేకూరింది నీ నుండి తప్పిపోయేది కాదని తెలుసుకో! ఇంకా ఈ విషయం కూడా తెలుసుకో! (దైవ) సహాయం సహనం వెంటే ఉంటుంది. కలిమితో పాటే లేమి ఉంటుంది. కష్టంతోపాటే సుఖం ఉంటుంది."

*(సుననె తిర్మిజీలోని "ప్రళయ సూచనలు" అధ్యాయంలోనూ, ముస్నదె అహ్మద్‌లోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

1. దైవ నిర్ణయాన్ని మార్చే శక్తి, అధికారం ఎవరికీ లేదు.
2. ప్రపంచంలో ఎదురయ్యే ఏ ఇబ్బంది కూడా ఎల్లకాలం ఉండేది కాదు, దాని తరువాత సుఖశాంతులు వెల్లివిరుస్తాయి.

3. ఏదైనా వస్తువుని సాధించడం కోసం అల్లాహ్‌ను తప్ప మరొకరిని సహాయం అర్థించడం తగదు. ఒకవేళ అలా చేస్తే అది 'షిర్క్' అవుతుంది.

4. మనిషి గనక దేవుని హక్కులను దృష్టిలో పెట్టుకొని వ్యవహరిస్తే దేవుడు కూడా తన దాసుణ్ణి ప్రత్యేకంగా కనిపెట్టుకొని ఉంటాడు. ఇతోధికంగా తోడ్పడుతూ ఉంటాడు.

٦٣ ـ الرَّابِعُ: عَنْ أَنَسٍ رضي الله عنه قال: إِنَّكُمْ لَتَعْمَلُونَ أَعْمَالاً هِيَ أَدَقُّ فِي أَعْيُنِكُمْ مِنَ الشَّعْرِ، كُنَّا نَعُدُّهَا عَلَى عَهْدِ رسولِ الله ﷺ مِنَ الْمُوبِقَاتِ» رواه البخـاري. وقـال: «الْمُـوبِقَـاتُ»: الْمُهْلِكَاتُ.

63. హజ్రత్ అనస్ (రజి) (తన కాలం నాటి ప్రజలను సంబోధిస్తూ) ఇలా అన్నారు : మీరు చేసే అనేక పనులు మీ కంటికి వెంట్రుక కన్నా సూక్ష్మమైనవిగా కనపడుతున్నాయేమో! (మీరు వాటిని అతి సామాన్యమైనవిగా కొట్టి పారేస్తున్నారు) కాని దైవప్రవక్త (సల్లం) కాలంలో వాటినే మేము అతి వినాశకరమైన పనులుగా భావించే వాళ్ళం. (బుఖారీ దీనిని ఉల్లేఖించి 'మూబిఖాత్' అంటే 'ప్రాణాంతక మైనవ'ని అన్నారు.)

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైకవచనాల ప్రకరణంలో ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

మనసులో దైవభీతి ఎక్కువగా ఉంటే మానవుడు దేవుని అవిధేయతకు పాల్పడటానికి జంకుతాడు. ఈ దైవభీతి అతనిలో లోపించిన కొద్దీ అతని మనసు పాపాలు చేయటానికి ధైర్యం పుంజుకుంటుంది. దైవప్రవక్త సహచరుల హృదయాల్లో దైవభక్తి చాలా ఎక్కువగా ఉండటం వల్ల వాళ్లు అతి సామాన్యమైన తప్పులు చేయటానికి కూడా భయపడేవారు. దైవప్రవక్త కాలానంతరం ఈ భయభక్తులు క్రమేపీ తగ్గుముఖం పట్టాయి. చివరికి అత్యంత వినాశకరమైన పాపాలను కూడా ప్రజలు తేలికైన పొరపాట్లుగా భావించడం మొదలు పెట్టారు. కాబట్టి దేవుని ఔన్నత్యాన్ని, ఆయన గొప్పదనాన్ని గురించి ఆలోచిస్తూ ఆయన పట్ల భయభక్తుల్ని మనసులో పెంపొందించుకోవటం ఎంతైనా అవసరం.

٦٤ ـ الْخَامِسُ: عَنْ أَبِي هُرَيْرَةَ، رضي الله عنه، عن النبيِّ ﷺ، قال: «إِنَّ الله تَعَالَى يَغَارُ، وَغَيْرَةُ اللهِ تَعَالَى أَنْ يَأْتِيَ

64. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : అల్లాహ్‌కు (కూడా) రోషం వస్తుంది. మనిషి కొరకు నిషేధిం

الْمَرْءُ مَا حَرَّمَ اللهُ عَلَيْهِ» متفقٌ عَلَيْه
وَ«الغَيْرَةُ» بفتح الغين: وَأَصْلُهَا الأَنَفَةُ.

చిన పనికి అతడు ఒడిగట్టినప్పుడు ఆయనకు ఈ రోషం వస్తుంది.

(బుఖారీ - ముస్లిం)

'గైరత్' 'గ'కు ఐకారం. అంటే అర్థం ఆత్మగౌరవం, పౌరుషం.

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడింది.)*

**ముఖ్యాంశాలు**

దేవుని నిషేధాజ్ఞల్ని, ఆయన విధించిన హద్దుల్ని అతిక్రమించటం ఆయన ఆగ్రహానికి కారణభూతమవుతుంది. కాబట్టి మనిషి దేవుని నిషేధాజ్ఞల్ని పాలిస్తూ, ఆయన విధించిన హద్దులకు కట్టుబడి ఉంటూ జీవితం గడపాలి. ఇందులోనే మనిషి ఇహపర సాఫల్యాలున్నాయి.

٦٥ ـ السَّادِسُ: عَنْ أَبِي هُرَيْرَةَ رضي الله عنه أَنَّهُ سَمِعَ النَّبِيَّ ﷺ يَقُولُ: «إِنَّ ثَلاثَةً مِنْ بَنِي إِسْرَائِيلَ: أَبْرَصَ، وَأَقْرَعَ، وَأَعْمَى، أَرَادَ اللهُ أَنْ يَبْتَلِيَهُمْ فَبَعَثَ إِلَيْهِمْ مَلَكاً، فَأَتَى الأَبْرَصَ فَقَالَ: أَيُّ شَيْءٍ أَحَبُّ إِلَيْكَ؟ قَالَ: لَوْنٌ حَسَنٌ، وَجِلْدٌ حَسَنٌ، وَيَذْهَبُ عَنِّي الَّذي قَدْ قَذِرَنِي النَّاسُ؛ فَمَسَحَهُ فَذَهَبَ عَنْهُ قَذَرُهُ وَأُعْطِيَ لَوْناً حَسَناً. قَالَ: فَأَيُّ الْمَالِ أَحَبُّ إِلَيْكَ؟ قَالَ: الإِبلُ ـ أَوْ قَالَ البَقَرُ؛ شَكَّ الرَّاوي ـ فَأُعْطِيَ نَاقَةً عُشَرَاءَ، فَقَالَ: بَارَكَ اللهُ لَكَ فِيهَا.

65. దైవప్రవక్త (సల్లం) ఈ వృత్తాంతాన్ని వివరిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలియజేశారు: పూర్వకాలంలో ఇస్రాయీల్ జాతిలో బొల్లిరోగి, ఒక బట్టతలవాడు, ఒక అంధుడు ఉండేవారు. అల్లాహ్ ఆ ముగ్గురినీ పరీక్షించాలని భావించి వారి దగ్గరికి ఒక దూతను పంపాడు. ఆ దైవదూత (మానవ రూపంలో మొదట) బొల్లిరోగి దగ్గరికి వెళ్ళి "నీకు అన్నింటి కన్నా యిష్టమైనది ఏది?" అని అడిగాడు. దానికి బొల్లిరోగి "మంచి రంగు, అందమైన దేహం అంటే నాకు చాలా యిష్టం. అంతేకాదు నాకున్న ఈ బొల్లి రోగం పోవాలి. దీని మూలంగానే జనం నన్ను అసహ్యించుకుంటున్నారు"

فَأَتَى الأَقْرَعَ فَقَالَ: أَيُّ شَيْءٍ أَحَبُّ إِلَيْكَ؟ قال: شَعْرٌ حَسَنٌ، وَيَذْهَبُ عَنِّي هٰذَا الذي قَذِرَنِي النَّاسُ؛ فَمَسَحَهُ فَذَهَبَ عَنْهُ، وَأُعْطِيَ شَعْراً حَسَناً. قال: فَأَيُّ المَالِ أَحَبُّ إِلَيْكَ؟ قَالَ: البَقَرُ، فَأُعْطِيَ بَقَرَةً حَامِلاً، وقَالَ: بَارَكَ اللهُ لَكَ فِيهَا.

అన్నాడు. ఆ దైవదూత అతని శరీరాన్ని తన చేత్తో స్పృశించాడు.

దైవదూత స్పృశించగానే (దేవుని మహిమతో) అతని అసహ్యాకరమైన బొల్లిరోగం పోయి అతనికి అందమైన రంగు వచ్చింది. ఆ తరువాత దైవదూత అతన్ని "నీకు ఎలాంటి సంపదంటే ఎక్కువ యిష్టం?" అని అడిగాడు. దానికా వ్యక్తి "ఒంటెలు (లేక) ఆవులంటే యిష్టమని చెప్పాడు. (ఇక్కడ ఉల్లేఖకునికి సందేహం కలిగింది) అతని కోరిక ప్రకారం అతనికి ఎనిమిది పది నెలల సూడి ఒంటె ప్రసాదించబడింది. దైవదూత అతన్ని "అల్లాహ్ నీకు ఇందులో శుభాన్ని ప్రసాదించుగాక! అని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

తరువాత ఆ దైవదూత బట్టతల వాడి దగ్గరికి వెళ్ళి "నీకు అన్నింటికన్నా యిష్ట మైంది ఏది?" అని అడిగాడు. దానికి బట్టతలవాడు, "నాకు అందమైన శిరోజా లంటే ఎంతో యిష్టం. అంతేకాదు, నా ఈ బట్టతల పోవాలి. దీన్ని చూసే ప్రజలు నన్ను అసహ్యించుకుం టున్నారు" అన్నాడు. దైవదూత తన చేత్తో అతని తల నిమిరాడు. దాంతో అతని బట్టతలపోయి (దేవుని మహిమతో) అతనికి అందమైన శిరోజాలు వచ్చాయి. "నీవు ఎలాంటి సంపదను బాగా

فَأَتَى الأَعْمَى فَقَالَ: أَيُّ شَيْءٍ أَحَبُّ إِلَيْكَ؟ قال: أَنْ يَرُدَّ اللهُ إِلَيَّ بَصَرِي فَأُبْصِرَ النَّاسَ، فَمَسَحَهُ فَرَدَّ اللهُ إِلَيْهِ بَصَرَهُ. قال: فَأَيُّ المَالِ أَحَبُّ إِلَيْكَ؟ قال: الغَنَمُ، فَأُعْطِيَ شَاةً وَالِداً. فَأَنْتَجَ هٰذَانِ وَوَلَّدَ هٰذَا، فَكَانَ لِهٰذَا وَادٍ مِنَ الإِبِلِ، وَلِهٰذَا وَادٍ مِنَ البَقَرِ، وَلِهٰذَا وَادٍ مِنَ الغَنَمِ.

ثُمَّ إِنَّهُ أَتَى الأَبْرَصَ فِي صُورَتِهِ وَهَيْئَتِهِ، فَقَالَ: رَجُلٌ مِسْكِينٌ قَدِ انْقَطَعَتْ

యిష్టపడతావు?" అని దైవదూత తిరిగి ఆ బట్టతలవాడిని అడిగాడు. "ఆవు లంటే నాకు మహా యిష్టం" అని చెప్పా డతను. అతను కోరినట్లే అతనికి ఒక సూడి ఆవు ప్రసాదించబడింది. "నీకు ఈ ఆవులో శుభం కల్గుగాక!" అంటూ దైవదూత ఆశీర్వదించి వెళ్ళిపోయాడు.

ఆ తరువాత దైవదూత అంధుడి దగ్గరికి వెళ్ళాడు. అతన్ని "నీకు అన్నిటికన్నా బాగా యిష్టమైన వస్తువు ఏది?" అని అడిగాడు. దానికి అంధుడు "అల్లాహ్ నాకు తిరిగి దృష్టిని ప్రసాదించాలి, దాంతో నేను ప్రజల్ని చూడగలగాలి" అంటూ తన కోరికను వ్యక్తపరిచాడు. దైవదూత అతనిపై చేయి తిప్పాడు. దాంతో దేవుడు ఆ అంధునికి తిరిగి దృష్టిని ప్రసాదించాడు. తరువాత దైవదూత అతన్ని, "నువ్వు అన్నింటికన్నా బాగా ఇష్టపడే జీవన సామగ్రి ఏమిటో చెప్పు" అని అడిగాడు. దానికతను "నాకు మేకలంటే మహా యిష్టం" అన్నాడు. అతని కోరిక ప్రకారం అతనికి ఒక సూడి మేకను అనుగ్రహించడం జరిగింది. ముందు పేర్కొనబడిన యిద్దరి (బొల్లిరోగి, బట్టతలవాడి) దగ్గరా రెండు రకాల పశువుల (ఒంటెలు మరియు ఆవుల) సంతతి బాగా పెరిగింది. అంధుడి మేక కూడా పిల్లల్ని

بِيَ الْحِبَالُ فِي سَفَرِي، فَلا بَلاغَ لِيَ الْيَوْمَ إِلَّا بِاللهِ ثُمَّ بِكَ، أَسْأَلُكَ بِالَّذِي أَعْطَاكَ اللَّوْنَ الْحَسَنَ وَالْجِلْدَ الْحَسَنَ وَالْمَالَ، بَعِيراً أَتَبَلَّغُ بِهِ فِي سَفَرِي، فَقَالَ: الْحُقُوقُ كَثِيرَةٌ. فَقَالَ: كَأَنِّي أَعْرِفُكَ، أَلَمْ تَكُنْ أَبْرَصَ يَقْذَرُكَ النَّاسُ فَقِيراً فَأَعْطَاكَ اللهُ؟! فَقَالَ: إِنَّمَا وَرِثْتُ هٰذَا المالَ كَابِراً عَنْ كَابِرٍ، فَقَالَ: إِنْ كُنْتَ كَاذِباً فَصَيَّرَكَ اللهُ إِلَى مَا كُنْتَ.

ఈనింది. దాంతో బొల్లి రోగి వద్ద ఒక లోయనిండా ఒంటెలు, బట్టతలవాడి దగ్గర ఒక లోయనిండా ఆవులు, అంధుడి దగ్గర ఓ లోయనిండా మేకల మంద తయారయ్యాయి.

(కొంత కాలం గడిచింది.) తిరిగి దైవ దూత మునుపటిలాగే మనిషి రూపంలో (ఒకప్పటి) బొల్లిరోగి దగ్గరికి వెళ్ళి "అయ్యా! నేనొక పేదవాణ్ణి, ప్రయా ణంలో నా సాధన సామగ్రి అంతా అయి పోయింది. ఈ రోజు దేవుడు, ఆ తరువాత నీవు సహాయం చేస్తే తప్ప నేను నా స్వగ్రామానికి చేరుకోలేను. అందుకే నీకు ఆకర్షణీయమైన రంగునూ, అందమైన శరీరాన్నీ ప్రసాదించిన ఆ దేవుడి పేరుతో అడుగుతున్నాను, నాకొక ఒంటెను దానం చెయ్యి. దానితో నేను నా స్వగ్రామానికి చేరుకుంటాను" అని అడిగాడు. దానికి ఆ బొల్లిరోగి "నాపై బాధ్యతలు (ఖర్చులు) చాలా ఉన్నాయి. (కనుక నేను నీకు ఎలాంటి సహాయం చేయలేను)" అని తెగేసి చెప్పేశాడు. అప్పుడు దైవదూత "నిన్నెక్కడో చూసినట్లు గుర్తుకొస్తోంది. నీవు ఒకప్పుడు ఒంటిపై తెల్లమచ్చలుండే బొల్లిరోగివి కదూ?! అప్పుడు జనం నిన్ను చూసి అసహ్యంతో పారిపోయేవారు. అప్పుడు నీవు నిరుపేదగా ఉంటే దేవుడు

وَأَتَى الأَقْرَعَ فِي صُورَتِهِ وَهَيْئَتِهِ، فقالَ لَهُ مِثْلَ ما قَالَ لِهٰذَا، وَرَدَّ عَلَيْهِ مِثْلَ مَا رَدَّ هٰذَا، فقالَ: إنْ كُنْتَ كَاذِباً فَصَيَّرَكَ اللهُ إلَى مَا كُنْتَ. وَأَتَى الأَعْمَى فِي صُورَتِهِ وَهَيْئَتِهِ، فقالَ: رَجُلٌ مِسْكِينٌ وابْنُ سَبِيلٍ انْقَطَعَتْ بِيَ الْحِبَالُ فِي سَفَرِي، فَلا بَلاغَ لِيَ الْيَوْمَ إلَّا باللهِ ثُمَّ بِكَ، أَسْأَلُكَ بِالَّذِي رَدَّ عَلَيْكَ بَصَرَكَ شَاةً أَتَبَلَّغُ بهَا فِي سَفَرِي؟ فقالَ: قَدْ كُنْتُ أَعْمَى فَرَدَّ اللهُ إلَيَّ بَصَرِي، فَخُذْ مَا شِئْتَ وَدَعْ مَا شِئْتَ، فَوَاللهِ مَا أَجْهَدُكَ الْيَوْمَ بِشَيْءٍ أَخَذْتَهُ للهِ عَزَّ وَجَلَّ. فقالَ: أَمْسِكْ مالَكَ فإنَّمَا ابْتُلِيتُمْ، فَقَدْ رضِيَ اللهُ عنكَ، وَسَخِطَ عَلَى صَاحِبَيْكَ» متفقٌ عليه. وَ«النَّاقَةُ الْعُشَرَاءُ»

(దయతలచి) నీకు ఈ సంపదను ప్రసాదించాడు కదూ!?" అని గుర్తుచేశాడు. దానికి ఆ బొల్లిరోగి "ఈ సంపద అంతా నాకు నా తాతముత్తాతల నుండి వారసత్వంగా లభించింది" అన్నాడు. "నువ్వు అబద్ధం చెబుతున్నట్లయితే దేవుడు నిన్ను నీ పూర్వస్థితికి చేర్చుగాక!" అని దైవదూత అతణ్ణి శపించి వెళ్ళిపోయాడు.

తరువాత ఆ దూత క్రితం లాగే మానవ రూపంలో (ఒకప్పటి) బట్టతలవాడి దగ్గరికి వచ్చి, బొల్లి రోగిని అడిగినట్లే అతన్ని కూడా అడిగాడు. ఆ బట్టతల వాడు కూడా బొల్లిరోగి లాగానే సమాధానం ఇచ్చాడు. అందుకు దైవదూత "నీవు చెప్పేది అబద్ధమయితే అల్లాహ్ నిన్ను నీ పూర్వస్థితికి చేర్చుగాక!" అంటూ ఆ బట్టతలవాణ్ణి కూడా శపించి వెళ్ళిపోయాడు.

ఆ తరువాత దైవదూత క్రితంలాగే మానవాకారంలో (ఒకప్పటి) కళ్ళులేని కబోది దగ్గరికి వెళ్ళాడు. ఆ కబోదితో కూడా "నేనొక అభాగ్యుణ్ణి. బాటసారిని. ప్రయాణంలో నా సామగ్రి అంతా అయిపోయింది. ఈ రోజు నేను అల్లాహ్ తోడ్పాటు మరియు నీ ఆర్థిక సహాయం లేకుండా నా స్వస్థలానికి చేరుకోలేని పరిస్థితి వచ్చింది. అందుకే నేను నీకు

దృష్టిని ప్రసాదించిన దేవుడి పేరుతో ఒక మేక ఇవ్వమని అర్థిస్తున్నాను, దానివల్ల నేను నా ప్రయాణాన్ని కొనసాగించి గమ్యానికి చేరుకోగలుగుతాను" అని విన్నవించుకున్నాడు.

దానికి ఆ అంధుడు, "నిస్సందేహంగా ఒకప్పుడు నేను గుడ్డివాణ్ణి. అల్లాహ్ నాకు తిరిగి చూపుని ప్రసాదించాడు. (నీ ముందున్న ఈ మేకల మందలో నుంచి) నీకిష్టమైన మేకల్ని తీసుకుని మిగతావి వదలిపెట్టిపో. దైవసాక్షి! ఈ రోజు దేవుడి పేరుతో నీవు (నా సంపదలో) ఏది తీసుకున్నా నాకెలాంటి అభ్యంతరం ఉండద"న్నాడు. అది విని ఆ దైవ దూత"నీ సంపదను నువ్వే ఉంచుకో! వాస్తవానికి మిమ్మల్ని పరీక్షించటం జరిగింది (ఆ పరీక్షలో నీవు నెగ్గావు). కాబట్టి అల్లాహ్ నీ పట్ల ప్రసన్నుడయ్యాడు. (నీ సహచరులిద్దరూ విఫలురైనందువల్ల) అల్లాహ్ వారి పట్ల అప్రసన్నుడయ్యాడు" అని చెప్పి వెళ్ళిపోయాడు. (బుఖారీ - ముస్లిం)

"అన్నాఖతుల్ ఉషరాఅ" ఉత్వ సమేతంగా, 'ష'పై అకారం, 'ర' దీర్ఘంతో ఉచ్చరించబడుతుంది. సూడి ఒంటె అని అర్థం. 'అన్‌తజ' వేరొక ఉల్లేఖనం ప్రకారం 'ఫనతజ' అంటే ఆ వ్యక్తి దాని సంతతికి యజమాని అయ్యాడని అర్థం.

بِضم العينِ وفتح الشينِ وبالمدِّ: هِيَ الحامِلُ. قولُهُ: «أَنْتَجَ»، وفي روايةٍ: «فَنَتَجَ» معْنَاهُ: تَوَلَّى نِتَاجَهَا، وَالنَّاتِجُ لِلنَّاقَةِ كَالقَابِلَةِ للمَرْأَةِ. وقولُهُ: «وَلَّدَ هذا» هُوَ بِتَشْدِيدِ اللاَّمِ: أيْ: تَوَلَّى وِلاَدَتَهَا، وهُوَ بمَعْنَى نَتَجَ في النَّاقَةِ. فالمُوَلِّدُ،

والناتِجُ، والقَابِلَةُ بمَعْنًى؛ لٰكِنْ هٰذَا لِلْحَيَوَانِ وذاكَ لِغَيْرِهِ. وقولُهُ: «انْقَطَعَتْ بي الحِبالُ» هُوَ بالحاءِ المهملةِ والباءِ الموحدةِ: أَي الأَسْبَابُ. وقولهُ: «لا أَجْهَدُكَ» معناه: لا أشقُّ عليْكَ في رَدِّ شَيْءٍ تَأْخُذُهُ أَوْ تَطْلُبُهُ مِنْ مَالِي. وَفي رِوَايةِ البُخَارِيِّ: «لا أَحْمَدُكَ» بالحاءِ المهملةِ والميم، ومعناهُ: لا أَحْمَدُكَ بِتَرْكِ شَيْءٍ تَحْتَاجُ إلَيْه، كما قالُوا: لَيْسَ عَلَى طُولِ الحياةِ نَدَمٌ، أَيْ عَلَى فَوَاتِ طُولِهَا.

'నాతిజ్' అంటే ఒంటెను తన సంరక్షణలో ఈనింపజేసేవాడు. స్త్రీల ప్రసవాన్ని పర్యవేక్షించే (ఖాబిలా) మంత్రసానిలాగా అన్నమాట. 'వల్లద హాజా' (ల౯్రింద ల వత్తు) అంటే మేక ఈనిన మేకపిల్లలకు యజమాని అయ్యాడని అర్థం. ఇంకా ఇది "నతజ ఫిన్నాఖా"కు సమానార్థమైన పదం. ఈ విధంగా 'మువల్లిద్' 'నాతిజ్' మరియు 'ఖాబిలా' లు సమానార్థాలు కలిగిన పదాలయ్యాయి. అయితే మొదటి పదాలు (మువల్లిద్, నాతిజ్) పశువులకు సంబంధించినవి కాగా, 'ఖాబిలా' అనే పదాన్ని మనుషుల కోసం ఉపయోగిస్తారు. 'హిబాల్' అంటే సాధన సామగ్రి (ప్రయాణ ఖర్చులు). 'లా అజ్‌హదుక' అంటే నీవు ఏది తీసుకున్నా, లేక నా సంపదలో ఏది కోరి తీసుకున్నా నేను దాన్ని నీ నుంచి లాక్కుని నిన్ను దుర్భరస్థితిలో పడవేయను అని అర్థం. బుఖారీలోని ఉల్లేఖనంలో 'లా అహ్మదుక' అని ఉంది. అంటే, నీవు నీకు అవసరమైన వస్తువుని నా దగ్గర నుండి తీసుకోకపోతే నేను నిన్ను పొగడను (నాకు నచ్చదు) అని అర్థం. ఇది "దీర్ఘాయుషుపై బాధపడటం లేదు" అన్న అరబ్బీ భాషకు చెందిన ఒక జాతీయాన్ని పోలి ఉంది. ఎందుకంటే దీనికి దీర్ఘాయుషు పొందలేకపోయానని బాధపడటం లేద'ని అసలు అర్థం.

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని 'ఐహిక అనాసక్తత' ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

సిరిసంపదల విస్తృతి కూడా మనిషికి ఒక పరీక్షేనని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. అయితే మనిషి భోగభాగ్యాలు, సిరిసంపదలు కలిగివున్నప్పటికీ ఏమాత్రం మిడిసిపడకుండా దేవుని గొప్పదనాన్ని, తన వాస్తవికతను దృష్టిలో పెట్టుకొని జీవితం కొనసాగిస్తే అతను తప్పకుండా ఈ పరీక్షలో నెగ్గుకురాగలడు. అలాంటి వ్యక్తి దేవుడు తనకు ప్రసాదించిన ధనంలో కొంతభాగాన్ని సమాజంలోని నిరుపేదలు, అభాగ్య జీవుల కోసం ఖర్చుపెట్టి, అందులో ఆనందాన్నీ, మానసిక తృప్తినీ ఆస్వాదిస్తాడు. దైవం అనుగ్రహించిన వరాలకు ఆచరణాత్మకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటాడు. దీనికి విరుద్ధంగా సిరిసంపదలు వచ్చిపడినప్పుడు తలబిరుసుతనానికి లోనై అహంకారాన్ని ప్రదర్శించినవాడు ఇహలోకంలో దైవం పెట్టిన పరీక్షలో వైఫల్యాన్ని చవిచూడటమే గాకుండా పరలోకంలోనూ దైవాగ్రహానికి, నరక యాతనకు గురౌతాడు.

66. హజ్రత్ అబూ యాలా షద్దాద్ బిన్ ఔస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : "(నిత్యం) ఆత్మపరిశీలన చేసుకుంటున్న వాడు (మరోమాటలో చెప్పాలంటే, నిత్యం దైవం ముందు తన నిస్పృహా యతను, అశక్తతను ఒప్పుకునేవాడు), ఇంకా మరణానంతర జీవితం కోసం సన్నాహాలు చేసుకునేవాడే వివేక వంతుడు. (దీనికి విరుద్ధంగా) తన మనోవాంఛలకు లొంగిపోయి, అల్లాహ్‌పై (గొప్ప) ఆశలు పెట్టుకొని కూర్చునేవాడు మూర్ఖుడు." (తిర్మిజీ దీనిని ఉల్లేఖించిన తరువాత 'హసన్'గా పేర్కొన్నారు.)

తిర్మిజీ తదితర పండితులు "దాన నఫ్సహూ" అంటే 'తన స్వయాన్ని

٦٦ - السَّابِعُ: عَنْ أَبِي يَعْلَى شَدَّادِ بْنِ أَوْسٍ رضي الله عنه، عن النبيِّ ﷺ قال: «الْكَيِّسُ مَنْ دَانَ نَفْسَهُ، وَعَمِلَ لِمَا بَعْدَ المَوْتِ، وَالْعَاجِزُ مَنْ أَتْبَعَ نَفْسَهُ هَوَاهَا، وَتَمَنَّى عَلَى اللهِ». رواه التِّرمِذيُّ وقال: حديثٌ حَسَنٌ.

قال التِّرمذيُّ وَغَيْرُهُ مِنَ الْعُلَمَاءِ: مَعْنَى «دَانَ نَفْسَهُ»: حَاسَبَهَا.

గురించి అవలోకనం చేసుకోవటం' అని అన్నారు.

*(జామె తిర్మిజీలోని 'ప్రళయ' అధ్యాయములలో ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

పై హదీసు ద్వారా ఆత్మ పరిశీలన, ఆచరణల ప్రాముఖ్యత వెల్లడౌతోంది. గాలిలో దీపం పెట్టి, పైవాడి మీదే భారమన్నట్టు, నేరాలపై నేరాలు చేస్తూ క్షమించేవాడు దేవుడున్నాడులే అంటూ బూటకపు విశ్వాసాన్ని ప్రదర్శిస్తే ప్రయోజనం ఉండదు. అల్లాహ్ సదాచరణకు బదులుగా పుణ్యాన్ని ప్రసాదిస్తాడు. అంతేగాని ఆచరణతో నిమిత్తం లేని ఆశలకు, అభిలాషలకు ఆయన దృష్టిలో విలువ లేదు.

67. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు: "మనిషి నిష్ప్రయోజనకరమైన విషయాలను విడిచిపెట్టడం, అతని ఉత్తమ విధేయతకు నిదర్శనం." (అంటే అతడు మంచి ముస్లిం అనడానికి ప్రబల తార్కాణం). (తిర్మిజీ తదితరులు దీనిని ఉల్లేఖించారు.)

٦٧ - الثَّامِنُ: عَنْ أَبِي هُرَيْرَةَ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مِنْ حُسْنِ إسْلامِ الْمَرْءِ تَرْكُهُ مَا لا يَعْنِيهِ» حديثٌ حسنٌ رواه التِّرْمذيُّ وَغَيْرُهُ.

*(సుననె తిర్మిజీలోని 'ఐహిక అనాసక్తత' అధ్యాయములలో ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

*ఈ హదీసుకు సాక్షిగా ఇతర హదీసులు ఉండటం వల్ల దీనిని దృఢమైనదిగా పేర్కొనడం జరిగింది. (ఫైజుల్ ఖదీర్ లిల్ మనావి, 6:12 మజ్మవుజ్జవాయిద్ 8 : 18)*

## ముఖ్యాంశాలు

ఎటువంటి ప్రయోజనం లేని వ్యర్థ విషయాలకు, చేష్టలకు దూరంగా ఉండాలనే దైనందిన జీవితానికి సంబంధించిన ఒక ముఖ్య సూత్రం ఈ హదీసులో వివరించబడింది. మనిషి గనక ఈ నియమాన్ని ఖచ్చితంగా, తప్పకుండా పాటిస్తే నిత్య జీవితంలో జరిగే ఎన్నో తప్పిదాల నుంచి, అవాంఛనీయ పరిస్థితుల నుంచి తన్ను తాను రక్షించుకోగలడు. అందుకే విద్వాంసులు ఈ నియమం ఇస్లాం ధర్మంలో నాల్గో భాగమని, మరికొంతమంది సగభాగమని, ఇంకా కొంతమంది ఇదే సంపూర్ణ ఇస్లాం అని ఉద్ఘాటించారు.

٦٨ ـ التَّاسِعُ: عَنْ عُمَرَ رضي الله عنه، عَنِ النَّبِيِّ ﷺ قال: «لا يُسْأَلُ الرَّجُلُ فِيمَ ضَرَبَ امْرَأَتَهُ» رواه أبو داود وغيره.

68. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారని హజ్రత్ ఉమర్ (రజి) ఉటంకించారు: "నీవు నీ భార్యను ఎందుకు కొట్టావని మనిషిని నిల దీయటం జరగదు." (అబూదావూద్, తదితరులు దీనిని ఉల్లేఖించారు.)

*(సుననె అబూదావూద్‌లోని 'వివాహ' ప్రకరణంలో ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు 'ఇబ్నెమాజా'లోనూ, 'ముస్నదె అహ్మద్'లోనూ వచ్చింది. ఈ హదీసు పరంపరలో 'దావూద్ బిన్ యజీద్ ఔది' అనే ఉల్లేఖకుడు ఉన్నాడు. హదీసువేత్తలు ఇతణ్ణి బలహీనకోవకు చెందిన హదీసు ఉల్లేఖకుడిగా గుర్తించారు. ఇతని గురువు అబ్దుర్రహ్మాన్ అల్ ముస్లి కూడా హదీసు విజ్ఞాన జగతిలో అపరిచితుడు. అల్లామా షైఖ్ అల్‌బానీ (రహ్మలై) కూడా 'ఇర్వావుల్ గలీల్' అనే గ్రంథంలో ఈ హదీసు పరంపరను బలహీనమైనదిగా ఖరారు చేశారు. ఈ హదీసు ప్రామాణికమైనది కాకపోవడం చేత ఇందులో వివరించబడిన విషయం కూడా సరైనది కాదు. భర్తలు అకారణంగా తమ భార్యల్ని కొట్టి వేధించడాన్ని, వారిపట్ల అనుచితంగా ప్రవర్తించడాన్ని ఇస్లాం ఎన్నటికీ సహించదు. భర్త తన భార్యను కారణమేదీ లేకుండానే కొట్టి హింసిస్తే ఇహలోకంలోనూ అతణ్ణి నిలదీసి అడగటం జరుగుతుంది. స్త్రీల పట్ల ఉత్తమ రీతిలో మెలగాలని ఇస్లాం నొక్కి వక్కాణిస్తోంది. కాబట్టి భర్త భార్యపై దౌర్జన్యానికి దిగి అధర్మంగా ఆమెను హింసించడం, ఆమె హక్కుల్ని కాలరాయటం చేస్తే దేవుని దృష్టిలో అతను నేరస్థుడిగా పరిగణించబడతాడు. ఆయన అతనిపట్ల పరలోకంలో చాలా కఠినంగా వ్యవహరిస్తాడు.

6వ అధ్యాయం

# ٦ - بَابٌ فِي التَّقْوَى

# దైవభీతి

قال الله تعالى: ﴿يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا اتَّقُوا اللَّهَ حَقَّ تُقَاتِهِ﴾ [آل عمران: ١٠٢]، وقال تعالى: ﴿فَاتَّقُوا اللَّهَ مَا اسْتَطَعْتُمْ﴾ [التغابن: ١٦] وهذه الآية مبينة للمراد من الأولى. وقال الله تعالى: ﴿يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا اتَّقُوا اللَّهَ وَقُولُوا قَوْلًا سَدِيدًا﴾ [الأحزاب: ٧٠] وَالآيَاتُ فِي الأَمْرِ بِالتَّقْوَى كَثِيرَةٌ مَعْلُومَةٌ، وقال تعالى: ﴿وَمَن يَتَّقِ اللَّهَ يَجْعَل لَّهُ مَخْرَجًا ۝ وَيَرْزُقْهُ مِنْ حَيْثُ لَا يَحْتَسِبُ﴾ [الطلاق: ٢، ٣]، وقال تعالى: ﴿إِن تَتَّقُوا اللَّهَ يَجْعَل لَّكُمْ فُرْقَانًا وَيُكَفِّرْ عَنكُمْ سَيِّئَاتِكُمْ وَيَغْفِرْ لَكُمْ وَاللَّهُ ذُو الْفَضْلِ الْعَظِيمِ﴾ [الأنفال: ٢٩] والآيَاتُ فِي الْبَابِ كَثِيرَةٌ مَعْلُومَةٌ.

وَأَمَّا الأَحَادِيثُ:

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : "విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్‌కు ఏ విధంగా భయపడాలో, ఆ విధంగా భయపడండి."

(ఆలి ఇమ్రాన్ : 102)

మరోచోట అల్లాహ్ సెలవిచ్చాడు : "మీకు సాధ్యమైనంత వరకు అల్లాహ్‌కు భయపడుతూ ఉండండి." (అత్ తగాబున్ : 16)

రెండో సూక్తి మొదటి సూక్తి అర్థాన్ని మరింత విపులీకరిస్తుంది. ఏ విధంగా భయపడాలో ఆ విధంగా అంటే మీకు సాధ్యమైనంతవరకు అని వివరిస్తుంది.

ఇంకొకచోట అల్లాహ్ ఈ విధంగా సెలవిచ్చాడు: "విశ్వాసులారా! అల్లాహ్‌కు భయపడండి. సూటిగా, సమంజసంగా మాట్లాడండి."

(అల్ అహ్‌జాబ్ : 70)

దైవానికి భయపడుతూ ఉండాలని ఆదేశిస్తున్న సుప్రసిద్ధ సూక్తులు అనేకం ఉన్నాయి. ఇంకొక చోట అల్లాహ్ ఇలా అంటున్నాడు : "ఎవడు అల్లాహ్‌కు భయపడుతూ పనిచేస్తాడో అతనికి అల్లాహ్ కష్టాల నుండి గట్టెక్కే మార్గం చూపుతాడు. ఇంకా అతని ఊహకు కూడా అందనటువంటి మార్గం ద్వారా, అతనికి ఉపాధిని ప్రసాదిస్తాడు." (అత్ తలాఖ్ : 2,3)

మరోచోట అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు : "మీరు గనక భయభక్తులను అవలంబిస్తే, అల్లాహ్ మీకు (సత్యా సత్యాల మధ్య విచక్షణ పాటించే) గీటురాయిని ప్రసాదిస్తాడు. మీ నుండి మీ చెడులను దూరం చేస్తాడు. మీ తప్పులను మన్నిస్తాడు. అల్లాహ్ అత్యధికంగా అనుగ్రహించే వాడు." (అన్ఫాల్ : 29)

ఈ అధ్యాయంలో దివ్యఖుర్ఆన్ సూక్తులు చాలా ఉన్నాయి. ఇప్పుడు ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసులు క్రింద పేర్కొనబడ్డాయి-

69. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం: ఒకసారి దైవప్రవక్తను "ప్రజల్లో అందరి కన్నా ఆదరణీయుడు ఎవడు?" అని ప్రశ్నించడం జరిగింది. దానికి ఆయన "వారిలో అందరికన్నా ఎక్కువగా దైవానికి భయపడుతూ ఉండేవాడు" అని సమాధానమిచ్చారు. అప్పుడు సహచరులు "ఓ దైవప్రవక్తా! మేమడుగుతున్నది దాని గురించి కాదు" అని విన్నవించుకున్నారు. అందుకు ఆయన "అలాగైతే యూసుఫ్ (అలైహి) (అందరి కన్నా శ్రేష్ఠులు). ఎందుకంటే ఆయన స్వయంగా ఒక దైవప్రవక్త. ఇంకా ఆయన తండ్రి, తాత కూడా దైవప్రవక్తలే. ముత్తాత కూడా దైవప్రవక్తే. అంతేకాదు ఆయన దేవుని స్నేహితుడు కూడాను" అని అన్నారు. సహచరులు మళ్ళీ "మేమడుగుతున్నది దీని గురించి కూడా కాదు" అన్నారు. అందుకు ఆయన "మరి మీరు నన్ను అరబ్బు వంశాల గురించి అడుగుతున్నారా ఏమిటి?"

٦٩ ـ فَالأَوَّلُ: عَنْ أَبي هُرَيْرَةَ رضي الله عنه قال: قِيلَ: يا رسولَ الله مَنْ أَكْرَمُ النَّاسِ؟ قال: «أَتْقَاهُمْ». فقَالُوا: لَيْسَ عَنْ هٰذَا نَسْأَلُكَ، قَالَ: «فَيُوسُفُ نَبِيُّ اللهِ ابْنُ نَبِيِّ اللهِ ابْنِ نَبِيِّ اللهِ ابْنِ خَلِيلِ اللهِ» قَالوا: لَيْسَ عَنْ هٰذَا نَسْأَلُكَ، قال: «فَعَنْ مَعَادِنِ العَرَبِ تَسْأَلُونِي؟ خِيَارُهُمْ في الجَاهِلِيَّةِ خِيَارُهُمْ في الإِسْلامِ إِذَا فَقُهُوا» متفقٌ عليه. و«فَقُهُوا» بِضَمِّ القَافِ عَلَى المَشْهُورِ، وحُكِيَ كَسْرُهَا، أَيْ: عَلِمُوا أَحْكَامَ الشَّرْعِ.

(అలాగయితే వినండి!) అజ్ఞాన కాలంలో శ్రేష్ఠులుగా భావించ బడిన వారు ఇస్లాం వచ్చిన తరువాత కూడా శ్రేష్ఠులుగానే ఉంటారు. (అంటే ఇస్లాం వ్యక్తుల ప్రాపంచిక పరువు ప్రతిష్ఠల్లో, అంతస్థుల్లో లోటు రానీయదు). కాకపోతే వారు ధర్మాన్ని అర్థం చేసుకునేవారై ఉండాలి."

*(బుఖారీ - ముస్లిం)*

'ఫఖుహూ' విస్తృత ప్రచారంలో 'ఖ'కు ఉకారం ఉన్నప్పటికీ ఇకారంతో కూడా చదవటం జరిగింది. ఈ పదానికి "వారు షరీఅత్ ఆదేశాలు తెలుసుకోవాలి" అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని మహిమోన్నతల ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడింది.)*

## ముఖ్యాంశాలు

ఇస్లాం ప్రభవనానికి పూర్వం ప్రాపంచికంగా గౌరవప్రతిష్ఠలు, వంశ విశిష్ఠతలను కలిగివున్న తెగలు, సమాజాల హోదాను, గొప్పదనాన్ని ఇస్లాం తరువాత కూడా ఉపేక్షించలేదన్న దానికి ఈ హదీసు ప్రబల తార్కాణం. ఇస్లాం రాకకు మునుపు కూడా కొన్ని అరబ్బు తెగలు దాతృత్వం, శూరత్వం, సత్యం కోసం ప్రాణాలను సైతం లెక్కచేయకుండా పోరాడటం వంటి విషయాల్లో పేరు గడించాయి. అయితే ఇస్లాం వీటితోపాటు ధర్మావగాహన, ధర్మబద్ధమైన ఆచరణ అవసరమన్న నియమం పెట్టి వారి శక్తిసామర్థ్యాలను, ఆత్మగౌరవం, అంకిత భావాలవంటి ఉత్తమ గుణాల దిశను ధర్మం వైపుకు మళ్ళించింది. అంతకు ముందు వారి శక్తి సామర్థ్యాలు దైవ తిరస్కార మార్గంలో వినియోగించబడేవి. కాని ఇస్లాం వచ్చిన తరువాత అవి దైవధర్మ ఔన్నత్యం కోసం అంకితమయ్యాయి.

70. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉపదేశించారు : నిస్సందేహంగా ప్రపంచం రమణీయంగా, మనోహరంగా కనబడుతుంది. అల్లాహ్ మిమ్మల్ని ఈ

٧٠ ـ الثَّاني: عَنْ أَبي سَعيدٍ الْخُدْرِيِّ رضي الله عنه، عن النبيِّ ﷺ قال: «إنَّ الدُّنْيَا حُلْوَةٌ خَضِرَةٌ، وَإنَّ اللهَ مُسْتَخْلِفُكُمْ فِيهَا فَيَنْظُرَ كَيْفَ تَعْمَلُونَ، فَاتَّقُوا الدُّنْيَا وَاتَّقُوا النِّسَاءَ؛ فَإِنَّ أَوَّلَ فِتْنَةِ

بَنِي إِسْرَائِيلَ كَانَتْ فِي النِّسَاءِ» رواه مسلم.

ప్రపంచానికి నాయకులుగా చేసి మీరు బాధ్యతల్ని ఎలా నెరవేరుస్తారో పరీక్షిస్తాడు. కాబట్టి (మీరు ఈ పరీక్షలో నెగ్గాలనుకుంటే) ప్రపంచానికి (మోసపోకుండా) జాగ్రత్తగా ఉండండి. స్త్రీల (వల్ల ఉత్పన్నమయ్యే ఉపద్రవాల)కు దూరంగా ఉండండి. ఎందుకంటే ఇస్రాయీల్ సంతతివారు మొట్ట మొదటిసారిగా స్త్రీల విషయంలోనే పరీక్షకు గురయ్యారు.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పండ్లు తినడానికి కమ్మగా మధురంగా ఉండి పైకి మనోహరంగా నిగనిగలాడుతూ కనిపించినట్లే ప్రపంచంలోని ప్రతి వస్తువూ మనిషికి అందంగా, ఆకర్షణీయంగా కనిపించి అతణ్ణి మంత్రముగ్ధుణ్ణి చేస్తుంది. అలాంటి మనోహర వస్తువుల కోవకు చెందినదే స్త్రీ కూడాను. స్త్రీలు సృష్టించే ఉపద్రవాలు, వారి పన్నాగాలు చాలా భయంకరంగా ఉంటాయి. కనుక మానవులు ప్రపంచంలోని అందమైన వస్తువుల పై పై ఆకర్షణకు మోసపోకుండా ఆంతరంగిక సౌందర్యానికి, గుణవిశేషాలకు ప్రాధాన్యతనివ్వాలి. షరీఅత్ ఆదేశాలను లక్ష్యపెట్టకుండా ప్రాపంచిక ఆకర్షణలకు, స్త్రీ వ్యామోహానికి లోనైనవాడు ఇహపరాల్లోనూ పెద్ద నష్టానికి గురవుతాడనీ, ఇందుకు విరుద్ధంగా షరీఅత్ సూచించిన విధానం ప్రకారం ప్రాపంచిక వస్తువుల నుండి తగు రీతిలో ప్రయోజనం పొందేవాడు వాటి ఇంద్రజాలానికి మోసపోకుండా సురక్షితంగా ఉంటాడనీ ఈ హదీసు బోధపరుస్తోంది.

٧١ ـ الثَّالِثُ: عَنِ ابْنِ مَسْعُودٍ رضي الله عنه أَنَّ النَّبِيَّ ﷺ كَانَ يَقُولُ: «اللَّهُمَّ إِنِّي أَسْأَلُكَ الْهُدَى وَالتُّقَى وَالْعَفَافَ وَالْغِنَى» رواه مسلم.

71. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా వేడుకునేవారని హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) తెలియజేశారు : "ఓ దేవా! నేను నీ నుండి సన్మార్గాన్ని, భయభక్తులను, సౌశీల్యాన్ని, (ప్రజలపట్ల) నిరపేక్షతా భావాన్ని అర్థిస్తున్నాను." (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని దైవధ్యాన ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసులో పేర్కొనబడిన దైవప్రవక్త గారి వేడుకోలు వచనాలలో ముందుగా

సన్మార్గాన్ని (హిదాయత్‌ను) ప్రసాదించమని కోరుకోవటం జరిగింది. అంటే జీవితంలో అడుగడుగునా దైవం తనకు సద్బుద్ధిని ప్రసాదించి సన్మార్గంపై ముందుకు నడిపించాలనీ, ఆ సన్మార్గంపైనే నిలకడగా ఉండేటట్లు చేయాలని అర్థం. తఖ్వా అంటే దైవం పట్ల భయభక్తుల్ని కలిగివుండటం. ఏదైనా మంచిపని చేయాలన్నా, ఏదైనా చెడుపనికి దూరంగా ఉండాలన్నా అంతర్గతంగా ప్రేరణవారణ భావాలతో మనిషికి ఈ దైవభీతే మార్గదర్శకత్వం వహిస్తుంది. సౌశీల్యం (ఇఫాఫ్) అంటే అల్లాహ్ నిషేధించిన విషయాల జోలికి పోకుండా ఉండటం. 'గినా' (నిరపేక్షాభావం) 'ఫఖ్ర్' (అపేక్ష)కు వ్యతిరేకపదం. అంటే మనసులోని నిరపేక్షాభావం. ప్రజలపట్ల, ప్రజల సొమ్ము పట్ల నిరపేక్షులుగా ఉండటమన్నమాట. అత్యంత సమగ్రమైన, భావగర్భితమైన ఈ వేడుకోలు వచనాలతో దేవుణ్ణి ప్రార్థిస్తే దేవుడు తప్పకుండా మేలుచేస్తాడు.

٧٢ ـ الرَّابِعُ: عَنْ أَبِي طَرِيفٍ عَدِيِّ بْنِ حَاتِمٍ الطَّائِيِّ رضي الله عنه قال: سَمِعْتُ رسول الله ﷺ يَقُولُ: «مَنْ حَلَفَ عَلَى يَمِينٍ ثُمَّ رَأَى أَتْقَى للهِ مِنْهَا فَلْيَأْتِ التَّقْوَى» رواه مسلم.

72. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ తరీఫ్ అదీ బిన్ హాతిం తాయి (రజి) తెలియజేశారు: 'ఎవరికైనా ఏదైనా విషయమై ప్రమాణం చేసిన తరువాత, దైవభక్తిపరంగా అంతకన్నా మెరుగైన విషయం కనబడితే అప్పుడు ఆ దైవ భక్తితో కూడిన విషయాన్నే అతను ఆచరించాలి." *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ప్రమాణాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

స్థూలంగా ఈ హదీసులో మనిషి ఎల్లప్పుడూ దైవం పట్ల భయభక్తుల్ని కల్గివుండాలని నొక్కి వక్కాణించబడింది. ఆఖరికి ఎవరైనా తాను దైవ అవిధేయతకు పాల్పడతానని ప్రమాణం చేస్తే అటువంటప్పుడు తప్పనిసరిగా ఆ వ్యక్తి తన తప్పుడు ప్రమాణాన్ని భంగం చేసుకొని పరిహారాన్ని చెల్లించాలి. అంతేగాని నిజంగానే దైవ అవిధేయతకు, దైవభీతికి వ్యతిరేకమైన చర్యలకు పాల్పడకూడదు.

٧٣ ـ الْخَامِسُ: عَنْ أَبِي أُمَامَةَ صُدَيِّ بْنِ عَجْلَانَ الْبَاهِلِيِّ رضي الله عنه قال: سَمِعْتُ رسولَ الله ﷺ يَخْطُبُ فِي حَجَّةِ الْوَدَاعِ فَقَالَ: «اتَّقُوا اللهَ، وَصَلُّوا خَمْسَكُمْ، وَصُومُوا شَهْرَكُمْ، وَأَدُّوا زَكَاةَ

73. దైవప్రవక్త (సల్లం) తన అంతిమ కాబా యాత్ర (హజ్జతుల్ విదా) సందర్భంగా ప్రసంగిస్తూ ఇలా అన్నారని హజ్రత్ అబూ ఉమామ సుదై బిన్ అజ్లాన అల్ బాహ్లి (రజి) తెలియజేశారు: "అల్లాహ్‌కు భయపడండి. మీ (పై

أَمْوَالِكُمْ، وَأَطِيعُوا أُمَرَاءَكُمْ، تَدْخُلُوا جَنَّةَ رَبِّكُمْ» رواه الترمذيُّ، في آخر كتاب الصّلاة وَقال: حديثٌ حسنٌ صحيح.

విధించబడిన) ఐదు పూటల నమాజులు చేస్తూ ఉండండి. మీ (రమజాన్) నెలలో ఉపవాసాలు పాటించండి. మీ సంపదల లోనుండి జకాత్ దానాన్ని చెల్లించండి. మీ పైఅధికారులకు విధేయత చూపండి. ఇలా చేస్తే మీరు మీ ప్రభువు స్వర్గంలోకి ప్రవేశిస్తారు." (తిర్మిజీ దీనిని నమాజు ప్రకరణం చివర్లో ఉల్లేఖించారు. ఇంకా దీనిని 'హసన్' మరియు 'సహీహ్'గా పేర్కొన్నారు.)

*(సుననె తిర్మిజీలోని నమాజు అధ్యాయములలో ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో 'హజ్జతుల్ విదా' (అంతిమ హజ్) అనే పదం వచ్చింది. అసలు 'విదా' అనేది 'తౌదీ' అనే పదం నుండి వచ్చింది. 'తౌదీ' అంటే వీడ్కోలు చెప్పడం. దైవప్రవక్త (సల్లం) తన జీవితంలో ఆఖరిసారిగా చేసిన కాబా యాత్రను 'హజ్జతుల్ విదా'గా వ్యవహరిస్తారు. ఒకవిధంగా దైవప్రవక్త (సల్లం) ఈ యాత్ర సందర్భంగానే ప్రజలందరికీ వీడ్కోలు పలికారు. అందుకే దీనికి 'హజ్జతుల్ విదా' (వీడ్కోలు హజ్) అనే పేరు వచ్చింది.

2. విశ్వాసులు తమ పైఅధికారులకు, నాయకులకు విధేయత చూపాలని కూడా ఈ హదీసులో నొక్కిచెప్పబడింది. అయితే వారు దైవాదేశాలకు విరుద్ధంగా ఆజ్ఞలు జారీ చేస్తూ బాహాటంగా దైవతిరస్కార ధోరణిని అవలంబిస్తున్నపక్షంలో విశ్వాసులు అటువంటి అధికారులకు విధేయత కనబరచాలన్న నియమం లేదు.



7వ అధ్యాయం

# ٧ - بَابُ فِي الْيَقِينِ وَالتَّوَكُّلِ

# దృఢ నమ్మకం, దైవాన్నే నమ్ముకోవటం

قال الله تعالى: ﴿وَلَمَّا رَءَا ٱلْمُؤْمِنُونَ ٱلْأَحْزَابَ قَالُوا۟ هَٰذَا مَا وَعَدَنَا ٱللَّهُ وَرَسُولُهُۥ وَصَدَقَ ٱللَّهُ وَرَسُولُهُۥ ۚ وَمَا زَادَهُمْ إِلَّآ إِيمَٰنًا وَتَسْلِيمًا﴾ [الأحزاب: ٢٢]، وقال تعالى: ﴿ٱلَّذِينَ قَالَ لَهُمُ ٱلنَّاسُ إِنَّ ٱلنَّاسَ قَدْ جَمَعُوا۟ لَكُمْ فَٱخْشَوْهُمْ فَزَادَهُمْ إِيمَٰنًا وَقَالُوا۟ حَسْبُنَا ٱللَّهُ وَنِعْمَ ٱلْوَكِيلُ ۝ فَٱنقَلَبُوا۟ بِنِعْمَةٍ مِّنَ ٱللَّهِ وَفَضْلٍ لَّمْ يَمْسَسْهُمْ سُوٓءٌ وَٱتَّبَعُوا۟ رِضْوَٰنَ ٱللَّهِ ۗ وَٱللَّهُ ذُو فَضْلٍ عَظِيمٍ﴾ [آل عمران: ١٧٣، ١٧٤]، وقال تعالى: ﴿وَتَوَكَّلْ عَلَى ٱلْحَىِّ ٱلَّذِى لَا يَمُوتُ﴾ [الفرقان: ٥٨]، وقال تعالى: ﴿وَعَلَى ٱللَّهِ فَلْيَتَوَكَّلِ ٱلْمُؤْمِنُونَ﴾ [إبراهيم: ١١]، وقال تعالى: ﴿فَإِذَا عَزَمْتَ فَتَوَكَّلْ عَلَى ٱللَّهِ﴾ [آل عمران: ١٥٩]،

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : "విశ్వాసులు (దైవతిరస్కారుల) సైన్యాలను చూసినప్పుడు ఇలా పలికారు: "అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త మనకు వాగ్దానం చేసిన విషయం ఇదే. అల్లాహ్, ఆయన ప్రవక్త నిజమే పలికారు." ఈ సంఘటన వారి విశ్వాసాన్నీ, వారి ఆత్మ సమర్పణనూ మరింత అధికం చేసింది. (అల్ అహ్‌జాబ్ : 22)

మరోచోట అల్లాహ్ ఇలా అంటున్నాడు : "ప్రజలు వారితో (అంటే విశ్వాసులతో) "మీకు వ్యతిరేకంగా పెద్ద సైన్యాలు మోహరించి ఉన్నాయి. వాటికి భయపడండి" అని అన్నప్పుడు, దానిని విని వారి విశ్వాసం ద్విగుణీకృతమయింది. వారు ఇలా సమాధానం చెప్పారు : "మాకు అల్లాహ్ చాలు. ఆయనే శ్రేష్ఠుడైన కార్యసాధకుడు." చివరికి వారు అల్లాహ్ ప్రసాదించిన వరాలతో, అనుగ్రహంతో తిరిగి వచ్చారు. వారికి ఏ విధమైన హానీ కలగలేదు. ఇంకా వారికి అల్లాహ్ అభీష్టం ప్రకారం నడిచే మహాభాగ్యం కూడా లభించింది. అల్లాహ్ అపరిమితంగా అనుగ్రహించేవాడు. (ఆలి ఇమ్రాన్ : 173)

ఇంకొకచోట అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు : "ప్రవక్తా! సజీవుడూ, ఎన్నడూ మరణించని వాడూ అయిన దేవునిపై నమ్మకం ఉంచు."

(అల్ ఫుర్ఖాన్ : 58)

వేరొకచోట పరమప్రభువు ఇలా అంటున్నాడు : "విశ్వాసులు అల్లాహ్‌నే నమ్ముకోవాలి." (ఇబ్రాహీం : 11)

మరొకచోట సెలవీయబడింది : "(ఓ ప్రవక్తా!) ఒక నిర్ణయాన్ని తీసుకొని దాన్ని అమలుపరచ టానికి సంకల్పించినప్పుడు అల్లాహ్‌పై భారం వెయ్యి." (ఆలి ఇమ్రాన్ : 159)

"అల్లాహ్‌పై భారం మోపాలని ఆదేశించే సుప్రసిద్ధమైన వాక్యాలు (దివ్య ఖుర్‌ఆన్‌లో) అనేకం ఉన్నాయి. ఒకచోట అల్లాహ్ ఈ విధంగా సెలవిస్తున్నాడు: "అల్లాహ్‌ను నమ్ముకున్నవానికి అల్లాహ్‌యే చాలు." (అత్ తలాఖ్: 3)

ఇంకొకచోట అల్లాహ్ ఇలా అంటున్నాడు: "నిజమైన విశ్వాసుల హృదయాలు అల్లాహ్ ప్రస్తావన విన్నంతనే భయంతో కంపిస్తాయి. వారి సమక్షంలో అల్లాహ్ ఆయతులు పారాయణం చేయబడినప్పుడు వారి విశ్వాసం పెరుగుతుంది. వారు తమ ప్రభువుపట్ల నమ్మకం కలిగి ఉంటారు." (అల్ అన్‌ఫాల్ : 2)

దైవంపై నమ్మకం యొక్క విశిష్ఠతను తెలియజేసే సూక్తులు ఇంకా అనేకం ఉన్నాయి. ఇక ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసులు చూడండి -

74. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా తెలియజేశారని హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఉటంకించారు : నాకు పలు సమాజాలు చూపించబడ్డాయి. నేను వారిలో ఒక ప్రవక్తను చూశాను. ఆయన వెనుక కొంతమంది ఉన్నారు. మరొక ప్రవక్త వెనుక కేవలం ఒకరు లేక ఇద్దరు

وَالآيَاتُ فِي الأَمْرِ بِالتَّوَكُّلِ كَثِيرَةٌ مَعْلُومَةٌ. وقال تعالى: ﴿ وَمَن يَتَوَكَّلْ عَلَى ٱللَّهِ فَهُوَ حَسْبُهُۥٓ ﴾ [الطلاق: ٣] أيْ: كَافِيهِ، وَقال تعالى: ﴿ إِنَّمَا ٱلْمُؤْمِنُونَ ٱلَّذِينَ إِذَا ذُكِرَ ٱللَّهُ وَجِلَتْ قُلُوبُهُمْ وَإِذَا تُلِيَتْ عَلَيْهِمْ ءَايَٰتُهُۥ زَادَتْهُمْ إِيمَٰنًا وَعَلَىٰ رَبِّهِمْ يَتَوَكَّلُونَ ﴾ [الأنفال: ٢] وَالآيَات فِي فَضْلِ التَّوَكُّلِ كَثِيرَةٌ مَعْرُوفَةٌ.

وَأَمَّا الأَحَادِيثُ:

٧٤ ـ فَالأَوَّلُ: عَنِ ابْنِ عَبَّاسٍ رضي الله عنهما قال: قال رسولُ الله صلى الله عليه وعلى آله وسلم: «عُرِضَتْ عَلَيَّ الأُمَمُ، فَرَأَيْتُ النَّبِيَّ وَمَعَهُ الرُّهَيْطُ، وَالنَّبِيَّ وَمَعَهُ الرَّجُلُ والرَّجُلانِ، وَالنَّبِيَّ وَلَيسَ مَعَهُ

أَحَدٌ إِذْ رُفِعَ لِي سَوَادٌ عَظِيمٌ فَظَنَنْتُ أَنَّهُمْ أُمَّتِي، فَقِيلَ لِي: هٰذَا مُوسَى وَقَوْمُهُ وَلٰكِنِ انْظُرْ إِلَى الأُفُقِ، فَنَظَرْتُ فَإِذَا سَوَادٌ عَظِيمٌ فَقِيلَ لِي: انْظُرْ إِلَى الأُفُقِ الآخَرِ، فَإِذَا سَوَادٌ عَظِيمٌ، فَقِيلَ لِي: هٰذِهِ أُمَّتُكَ، وَمَعَهُمْ سَبْعُونَ أَلْفاً يَدْخُلُونَ الجَنَّةَ بِغَيْرِ حِسَابٍ وَلا عَذَابٍ» ثُمَّ نَهَضَ فَدَخَلَ مَنْزِلَهُ، فَخَاضَ النَّاسُ فِي أُولٰئِكَ الَّذِينَ يَدْخُلُونَ الجَنَّةَ بِغَيْرِ حِسَابٍ وَلا عَذَابٍ، فَقَالَ بَعْضُهُمْ: فَلَعَلَّهُمُ الَّذِينَ صَحِبُوا رسولَ الله ﷺ، وَقَالَ بَعْضُهُمْ: فَلَعَلَّهُمُ الَّذِينَ وُلِدُوا فِي الإِسْلام، فَلَمْ يُشْرِكُوا بالله شَيْئاً - وَذَكَرُوا أَشْيَاءَ - فَخَرَجَ عَلَيْهِمْ رسولُ الله ﷺ فَقَالَ: «مَا الَّذِي تَخُوضُونَ فِيهِ؟» فَأَخْبَرُوهُ فَقَالَ: «هُمُ الَّذِينَ لا يَرْقُونَ، وَلَا يَسْتَرْقُونَ وَلَا يَتَطَيَّرُونَ، وَعَلَى رَبِّهِمْ يَتَوَكَّلُونَ» فَقَامَ عُكَّاشَةُ بْنُ مِحْصَنٍ فَقَالَ: ادْعُ اللهَ أَنْ يَجْعَلَنِي مِنْهُمْ، فَقَالَ: «أَنْتَ مِنْهُمْ» ثُمَّ قَامَ رَجُلٌ آخَرُ فَقَالَ: ادْعُ اللهَ أَنْ يَجْعَلَنِي مِنْهُمْ، فقال: «سَبَقَكَ بِهَا عُكَّاشَةُ» متفقٌ عليه.

వ్యక్తులు మాత్రమే ఉన్నారు. అసలు ఒక్క మనిషి కూడా తన వెనుకలేని ప్రవక్తను కూడా నేను వారిలో చూశాను. ఇంతలోనే ఒక పెద్ద జనసమూహం నా ముందు కనిపించింది. అది నా అనుచర సమాజం కావచ్చని నేను భావించాను. కాని అది మూసా (అలైహి) మరియు ఆయన అనుచర సమాజమని నాకు తెలియజేయబడింది.

అటువైపు చూడమని నాతో ఎవరో అన్నారు. (నేను అటువైపు చూశాను.) అక్కడ (మరొక) పెద్ద సమూహం కనిపించింది. "ఈ జనసమూహం నీ అనుచర సమాజమే. వీరిలో డెబ్భైవేల మంది ఎలాంటి విచారణ జరగ కుండానే, శిక్ష లేకుండానే స్వర్గంలోకి ప్రవేశిస్తారు" అని నాతో చెప్పబడింది.

దైవప్రవక్త (ఈ వృత్తాంతాన్ని వివరించిన తరువాత సమావేశం నుండి) లేచి తన కుటీరానికి వెళ్ళిపోయారు. సహచరులు మాత్రం ఎలాంటి లెక్కా, శిక్షా లేకుండా స్వర్గంలోకి ప్రవేశించే ఆ డెబ్భైవేల మంది ఎవరా! అని పరస్పరం చర్చించుకో సాగారు. కొంతమంది "బహుశా ఆ డెబ్భైవేలమంది దైవప్రవక్త సహచర్యాన్ని పొందినవారు కావచ్చు" అని అన్నారు. మరికొంతమంది "బహుశా వారు ఇస్లాం వచ్చిన తరువాత పుట్టి (ప్రాజ్ఞతలో) దేవునితో పాటు మరెవరినీ భాగస్వాము

లుగా నిలబెట్టని (షిర్క్ చేయని) వారు కావచ్చు" అని అన్నారు.

ఆ విధంగా వాళ్ళు (తమకు తోచిన విధంగా) పలు రకాలుగా మాట్లాడు కున్నారు. అంతలోనే దైవప్రవక్త (సల్లం) మళ్లీ అక్కడికి విచ్చేశారు. ఆయన వారిని "మీరు ఏ విషయం గురించి మాట్లాడు కుంటున్నారు?" అని అడిగారు. సహచరులు (ఆయన పరోక్షంలో) మాట్లాడుకున్నదంతా వివరించారు. అప్పుడు ఆయన ఇలా వివరించారు: "వారు (విచారణ లేకుండా స్వర్గంలోకి ప్రవేశించేవారు) ఎవరంటే, తాము ఎన్నడూ మంత్రాలు చదివి ఊదటం, జాల విద్య చేయటం వంటివి చేయరు. ఇతరుల చేత కూడా చేయించరు, ఇంకా దుశ్శకునాలను పాటించరు. కేవలం తమ ప్రభువుపైనే నమ్మకం కలిగి ఉంటారు."

(ఈ మాటలు వినగానే) ఉక్కాషా (రజి) లేచి, "దైవప్రవక్తా! దేవుడు నన్ను కూడా వారిలో చేర్చాలని మీరు నా కోసం ప్రార్థించండి" అని విన్నవించుకున్నారు. దానికి దైవప్రవక్త (స) "నీవు కూడా వారిలో ఉంటావు" అని చెప్పారు. మరొక వ్యక్తి లేచి అల్లాహ్ నన్ను కూడా వారిలో చేర్చమని ప్రార్థించండని దైవ ప్రవక్తను కోరాడు. దానికి ఆయన "ఉక్కాషా ఈ విషయంలో నిన్ను మించి పోయాడు" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

«الرُّهَيْطُ» بِضَمِّ الرَّاءِ: تَصْغِيرُ رَهْطٍ، وَهُمْ دُونَ عَشَرَةِ أَنْفُسٍ. «والأُفُقُ»: النَّاحِيَةُ وَالْجَانِبُ. «وَعُكَّاشَةُ» بِضَمِّ الْعَيْنِ وَتَشْدِيدِ الكَافِ وَبِتَخْفِيفِهَا، وَالتَّشْدِيدُ أَفْصَحُ.

'రుహైత్' 'ర'పై ఉకారం - ఇది రహ్తున్ అనే పదానికి న్యూనార్థము. పది కంటే తక్కువ సంఖ్యతోకూడిన నామవాచకాన్ని ఇది సూచిస్తుంది. 'ఉఫుఖ్'కు దిగ్మండలం వైపు అనే అర్థాలు వస్తాయి. 'ఉక్కాషా' (ప్రవక్త సహచరుని పేరు) ఉకార సమేతంగా, 'క' క్రింద 'క' వత్తు. అయితే ఒత్తు లేకుండానైనా (ఉకాషా అని) చదవవచ్చు. కాని ఒత్తు పలకటమే ఖచ్చితమైనది.

*(సహీహ్ బుఖారీలోని వైద్యప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో కేవలం అల్లాహ్‌పైనే నమ్మకం కలిగివుండే విశ్వాసుల ప్రశస్తి వెల్లడౌతోంది. మస్నూన్ (హదీసుల్లో పేర్కొనబడిన) దుఆల ద్వారా ఊదటం, మంత్రించడం ధర్మసమ్మతమే అయినప్పటికీ వీటికి కూడా దూరంగా ఉండి ఒక్క అల్లాహ్‌పైనే మొక్కవోని విశ్వాసాన్ని కనబరిచేవారు, దుశ్శకునాలను, క్షుద్రశక్తులను నమ్మకుండా ఉండేవారి మహత్యం కూడా ఈ హదీసు ద్వారా మనకు బోధపడుతోంది. హదీసులో వివరించబడిన వివిధ ప్రవక్తల అనుచర సమాజాల స్థితిగతులు దైవప్రవక్తకు కలలోగాని లేక మగత ఆవరించిన స్థితిలోగాని చూపబడి ఉంటాయి. లేకపోతే ఆయన దేవుని ఆహ్వానం మేరకు ఊర్ధ్వలోకాల పర్యటన (మేరాజ్) జరిపినప్పుడు వీటిని సందర్శించి ఉండవచ్చు. ఆయన చూసిన అనుచర సమాజాల్లోకెల్లా తన అనుచర సమాజమే అత్యధిక సంఖ్యలో ఉండటం గమనార్హం.

٧٥ ـ الثَّانِي: عَنِ ابْنِ عَبَّاسٍ رضي الله عنهما أيضاً أنَّ رسولَ الله ﷺ كَانَ يَقُولُ: «اللَّهُمَّ لَكَ أَسْلَمْتُ وَبِكَ آمَنْتُ، وَعَلَيْكَ تَوَكَّلْتُ، وإلَيْكَ أَنَبْتُ، وَبِكَ خَاصَمْتُ. اللَّهُمَّ أَعُوذُ بِعِزَّتِكَ؛

75. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా వేడుకునేవారని హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) తెలియజేశారు : "ఓ దేవా! నన్ను నేను నీకు సమర్పించుకున్నాను.నిన్నే విశ్వసించాను. నీపైనే భారం మోపాను. నీ వైపుకే మరలుతున్నాను. నీతోనే మొరపెట్టుకుంటున్నాను. దేవా! నీవు నన్ను సన్మార్గం నుండి తప్పించకుండా

لا إلٰهَ إلَّا أَنتَ أَنْ تُضِلَّنِي، أَنتَ الحَيُّ الَّذي لا يَمُوتُ، والجِنُّ وَالإِنسُ يَمُوتُونَ» متفقٌ عليه. وَهٰذَا لَفْظُ مُسْلِمٍ وَاخْتَصَرَهُ البُخَارِيُّ.

ఉండేందుకు నీ ఆధిక్యత యొక్క శరణునే వేడుకుంటున్నాను. నీవు తప్ప వేరొక ఆరాధ్య దేవుడు లేడు. నీవు మృత్యువంటూ లేని సజీవుడివి. నీవు తప్ప జిన్నాతులూ, మానవులందరూ కూడా మరణించేవారే. (బుఖారీ - ముస్లిం, వాక్యాలు మాత్రం ముస్లింలో నివి. బుఖారీ దీనినే సంక్షిప్తంగా నకలు చేశారు.)

*(సహీహ్ బుఖారీలోని, 'ఏకేశ్వరోపాసన' ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని 'దైవధ్యానం, ప్రార్థనల' ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

٧٦ ـ الثَّالِثُ: عَنِ ابْنِ عَبَّاسٍ رضي الله عنهما أيضاً قال: «حَسْبُنَا اللهُ وَنِعْمَ الْوَكِيلُ، قَالَهَا إبْرَاهِيمُ ﷺ حِينَ أُلْقِيَ فِي النَّارِ، وَقَالَها مُحَمَّدٌ ﷺ حِينَ قَالُوا: إِنَّ النَّاسَ قَدْ جَمَعُوا لَكُمْ فَاخْشَوْهُمْ فَزَادَهُمْ إِيمَاناً وَقَالُوا: حَسْبُنَا اللهُ وَنِعْمَ الوَكِيلُ» رواه البخاري. وفي روايةٍ له عن ابْنِ عَبَّاسٍ رضي الله عنهما قال: «كَانَ آخِرَ قَوْلِ إبْرَاهِيمَ ﷺ حِينَ أُلْقِيَ فِي النَّارِ: حَسْبِيَ اللهُ وَنِعْمَ الوَكِيلُ».

76. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ కథనం: "హస్బునల్లాహు వ నీమల్ వకీల్" (మాకు అల్లాహ్ చాలు. ఆయనే అత్యుత్తమ కార్యసాధకుడు). ఈ మాట హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) తనను (శత్రువులు) అగ్నిలో పడవేసినప్పుడు అన్నారు. దైవప్రవక్త (సల్లం)ను దైవ తిరస్కారులు (శత్రు సైన్యాల గురించి) భయపెట్టినప్పుడు ఆయన కూడా ఇదే మాట అన్నారు. (ఈ విషయాన్నే దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ ఈ విధంగా ధృవీకరించాడు): "ప్రజలు వారితో 'మీకు వ్యతిరేకంగా పెద్ద సైన్యాలు మోహరించి ఉన్నాయి, వాటికి భయపడండి' అని అన్నప్పుడు, దానిని విని వారి విశ్వాసం ద్విగుణీకృతమయింది. వారు ఇలా సమాధానమిచ్చారు: 'మాకు అల్లాహ్ చాలు. ఆయనే అత్యుత్తమ కార్యసాధకుడు." *(బుఖారీ)*

బుఖారీలోనే ఇబ్నె అబ్బాస్ గారి వేరొక ఉల్లేఖనం ఇలా ఉంది: ఇబ్రాహీం ప్రవక్తను అగ్నిలో పడవేసినప్పుడు ఆయన చివరగా పలికిన పలుకులు ఇవే.

"హస్బునల్లాహు వ నీమల్ వకీల్" అని.

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణంలో, ఆలి ఇమ్రాన్ సూరా వ్యాఖ్యానం క్రింద ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఎంతటి కఠోరమైన పరిస్థితులు ఎదురైనప్పటికీ దాసునికి కేవలం దైవంపైనే నమ్మకం, విశ్వాసం ఉండాలని ఈ హదీసు బోధపరుస్తోంది. దైవప్రవక్తల విధానం కూడా ఇదే.

٧٧ ـ الـرَّابعُ: عَـنْ أَبـي هُـرَيْـرَةَ رضي الله عنه، عن النبيِّ ﷺ قال: «يَدْخُلُ الجَنَّةَ أَقْوامٌ أَفْئِدَتُهُمْ مِثْلُ أَفْئِدَةِ الطَّيرِ» رواه مسلم. قِيلَ: مَعْنَاهُ مُتَوَكِّلُونَ، وَقِيلَ: قُلُوبُهُمْ رَقِيقَةٌ.

77. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : "పక్షుల మనసుల్లాంటి మనసు కలవారు స్వర్గంలోకి ప్రవేశిస్తారు." *(ముస్లిం)*

కొంతమంది అభిప్రాయంలో ఈ మాటకు (పక్షుల మాదిరిగా దేవునిపై) నమ్మకం కలిగివుండేవారని అర్థం. మరి కొంతమంది వీరు మృదువైన మనసు కలవారని అన్నారు.

*(సహీహ్ ముస్లింలోని స్వర్గ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసు ద్వారా దైవంపై నమ్మకం, మనసులోని మృదుత్వం, మార్దవాల గొప్పదనం తెలుస్తోంది. పైగా ఈ రెండు విషయాలూ మనిషికి స్వర్గ ప్రవేశానికి అర్హతను సంపాదించిపెడతాయని కూడా చెప్పబడింది.
2. ఒక విశ్వాసి మనసులో ఉపాధి, ఆహారాల గురించి ఎక్కువ చింతన ఉండకూడదు. విశ్వాసుల మనసులు పక్షుల మనసుల్లాగా ఎల్లప్పుడూ దేవునిపై నమ్మకంతో నిండి

ఉండాలి. పక్షులు ఎన్నడూ తమ కోసం ఆహారాన్ని నిల్వచేసి ఉంచుకోవు. ప్రతి రోజూ ఉదయం ఆహారాన్ని వెతుక్కుంటూ వెళ్ళి సాయంత్రానికి పొట్టనింపుకొని గూటికి చేరుకుంటాయి. వేరొక హదీసులో ఈ విషయమే ఇంకా విపులంగా చెప్పబడింది. పక్షులు ఉదయం పూట తమ గూళ్ళనుండి బయలుదేరినప్పుడు ఖాళీ కడుపుతో వెళతాయి. కాని సాయంత్రానికి కడుపు నింపుకొని తిరిగి వస్తాయి.

٧٨ ـ الْخَامِسُ: عَنْ جَابِرٍ رضي الله عنه أَنَّهُ غَزَا مَعَ النَّبِيِّ ﷺ قِبَلَ نَجْدٍ، فَلَمَّا قَفَلَ رسولُ الله ﷺ قَفَلَ مَعَهُمْ، فَأَدْرَكَتْهُمُ الْقَائِلَةُ فِي وَادٍ كَثِيرِ الْعِضَاهِ، فَنَزَلَ رسولُ الله ﷺ، وَتَفَرَّقَ النَّاسُ يَسْتَظِلُّونَ بِالشَّجَرِ، وَنَزَلَ رسولُ الله ﷺ تَحْتَ سَمُرَةٍ، فَعَلَّقَ بِهَا سَيْفَهُ، وَنِمْنَا نَوْمَةً، فَإِذَا رسولُ الله ﷺ يَدْعُونَا، وَإِذَا عِنْدَهُ أَعْرَابِيٌّ فَقَالَ: «إِنَّ هَذَا اخْتَرَطَ عَلَيَّ سَيْفِي وَأَنَا نَائِمٌ، فَاسْتَيْقَظْتُ وَهُوَ فِي يَدِهِ صَلْتاً، قَالَ: مَنْ يَمْنَعُكَ مِنِّي؟ قُلْتُ: اللهُ ـ ثَلاثاً» وَلَمْ يُعَاقِبْهُ وَجَلَسَ. متفقٌ عليه. وفي روايةٍ: قَالَ جَابِرٌ: كُنَّا مَعَ رسولِ الله ﷺ

78. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం ఒకసారి ఆయన దైవప్రవక్త (సల్లం) వెంట నజ్ద్ ప్రాంతం వైపు దైవమార్గంలో యుద్ధం చేయడానికి వెళ్ళారు. దైవప్రవక్త (స) యుద్ధం నుండి తిరిగి వస్తుండగా ఈయన కూడా వెంట వస్తున్నారు. (దారిలో) ముళ్ళచెట్లతో దట్టంగా ఉన్న ఒక లోయగుండా మధ్యాహ్నం పూట వెళుతున్నప్పుడు ప్రవక్త సహచరులకు నిద్ర ముంచు కొచ్చినట్లు అనిపించింది. అందుచేత దైవప్రవక్త (సల్లం) (విశ్రాంతి తీసుకునేం దుకు) ఆ ప్రాంతంలో దిగారు. (ఆయనతో పాటు సహచరులు కూడా ఆగారు). వాళ్ళంతా చెట్లనీడలు వెతుక్కుంటూ వేర్వేరు చోట్లకు వెళ్ళి పోయారు. దైవప్రవక్త (సల్లం) ఒక తుమ్మ చెట్టు క్రింద దిగి, తన ఖడ్గాన్ని ఆ చెట్టుకు వ్రేలాడదీశారు. తరువాత మేమందరం కాసేపు నిద్రపోయాము. అకస్మాత్తుగా దైవప్రవక్త మమ్మల్ని కేకవేస్తున్నట్లు (వినిపించింది). (మేము అక్కడికి వెళ్ళి) చూస్తే ఒక పల్లెటూరి వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గర కనిపించాడు. అప్పుడు ఆయన మమ్మల్ని

బِذَاتِ الرِّقَاعِ، فَإِذَا أَتَيْنَا عَلَى شَجَرَةٍ ظَلِيلَةٍ تَرَكْنَاهَا لِرسولِ الله ﷺ، فَجَاءَ رَجُلٌ مِنَ الْمُشْرِكِينَ، وَسَيْفُ رسولِ الله ﷺ مُعَلَّقٌ بِالشَّجَرَةِ، فَاخْتَرَطَهُ فَقَالَ: تَخَافُنِي؟ قَالَ: «لا»، قَالَ: فَمَنْ يَمْنَعُكَ مِنِّي؟ قَالَ: «الله». وَفِي رواية أبي بكرٍ الإسماعِيلي فِي صحيحِهِ: قال: مَنْ يَمْنَعُكَ مِنِّي؟ قَالَ: «الله»، قال: فَسَقَطَ السَّيْفُ مِنْ يَدِهِ،

ఉద్దేశించి, "ఈ వ్యక్తి నేను పడుకొని ఉండగా నాపై కత్తి దూశాడు. నేను కళ్ళు తెరిచి చూస్తే అతని చేతిలో ఒరనుండి దూసిన ఖడ్గం కనిపించింది. అతనలా ఖడ్గం పట్టుకొని "ఈ రోజు నానుండి నిన్నెవరు కాపాడతారు?" అనడిగాడు. దానికి నేను (ఎంతో ప్రశాంతంగా) "దేవుడు" అని జవాబి చ్చాను. (దైవ ప్రవక్త దేవుడు కాపాడతాడని మూడు సార్లు అన్నారు.) అయినా సరే ఆయన ఆ పల్లెవాసికి ఎలాంటి శిక్షా విధించ కుండా కూర్చున్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : మేము జాతుర్రిఖా యుద్ధంలో దైవప్రవక్త (సల్లం) వెంట ఉన్నాము. (ప్రయాణంలో) దట్టంగా నీడ పరిచిన ఓ చెట్టు దగ్గరికి చేరుకోగానే మేము ఆ చెట్టుని దైవప్రవక్త (విశ్రాంతి) కోసం వదలి పెట్టాము. (ఆయన ఆ చెట్టుక్రింద పడుకొని ఉండగా) బహుదైవారాధకు డొకడు అక్కడికి వచ్చాడు. చెట్టుకు వ్రేలాడదీసివున్న దైవప్రవక్త ఖడ్గాన్ని ఆయనపైకి దూసి, "ఇప్పుడు నీవు నాకు భయపడుతు న్నావా?" అని అడిగాడు. దానికి ఆయన "లేదు" అన్నారు. తిరిగి ఆ వ్యక్తి "నా బారినుండి నిన్నెవరు కాపాడతారు?" అని (ఎకసెక్కంగా) అడిగాడు. అందుకు ఆయన 'అల్లాహ్' అని జవాబిచ్చారు.

فَأخَذَ رسولُ الله ﷺ السَّيْفَ فَقَالَ: «مَنْ يَمْنَعُكَ مِنِّي؟»، فَقَالَ: كُنْ خَيْرَ آخِذٍ، فَقَالَ: «تَشْهَدُ أنْ لا إلٰه إلَّا اللهُ، وَأنِّي رسولُ الله؟» قال: لا، وَلٰكِنِّي أُعَاهِدُكَ أنْ لا أُقَاتِلَكَ، وَلَا أكُونَ مَعَ قَوم يُقَاتِلُونَكَ، فَخَلَّى سَبِيلَهُ، فَأتَى أصْحَابَهُ فَقَالَ: جِئْتُكُمْ مِنْ عِنْدِ خَيْرِ النَّاسِ. قَوْلُهُ: «قَفَلَ» أيْ: رَجَعَ. وَ«الْعِضَاهُ»: الشَّجَرُ الَّذي لَهُ شَوْكٌ. وَ«السَّمُرَةُ» بِفَتْحِ السِّينِ وَضَمِّ الْمِيم: الشَّجَرَةُ مِنَ الطَّلْحِ، وَهِيَ العِظَامُ مِنْ شَجَرِ الْعِضَاهِ. وَ«اخْتَرَطَ السَّيْفَ» أيْ: سَلَّهُ وَهُوَ في يَدِهِ. «صَلْتاً» أيْ: مَسْلُولاً، وَهُوَ بِفَتْحِ الصَّادِ وَضَمِّهَا.

'సహీహ్ అబూబక్ర్ ఇస్మాయిలీ'లో ఇంకా ఇలా ఉంది : ఆ వ్యక్తి, "నా నుంచి నిన్ను కాపాడేదెవరు?" అని ప్రశ్నించాడు. దానికి జవాబుగా ఆయన 'అల్లాహ్' అన్నారు. ఈ జవాబు వినగానే అతని చేతిలోని ఖడ్గం క్రిందపడి పోయింది. అప్పుడు దైవప్రవక్త ఆ కత్తిని తన చేతిలోకి తీసుకుని, "ఇప్పుడు నానుండి నిన్నెవరు కాపాడతారో చెప్పు?" అని ఎదురు ప్రశ్నించారు. దానికి అతడు "మీరు మంచి కోసమే కత్తి పట్టుకుంటారు" అని విన్నవించుకున్నాడు. అప్పుడు దైవప్రవక్త "అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడనీ, నేను ఆయన ప్రవక్తనని నీవు సాక్ష్యం పలకటానికి సిద్ధంగా ఉన్నావా?" అనడిగారు. దానికి అతడు "లేను. అయితే నేను మీతో యుద్ధం చేయనని, మీతో యుద్ధం చేసేవారికి కూడా సహాయపడనని మాత్రం నేను మాటిస్తున్నాను" అన్నాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) అతడి దారిన అతణ్ణి పోనిచ్చారు. ఆ వ్యక్తి తన మిత్రుల వద్దకు వెళ్ళి "నేను ప్రజలందరిలోకీ ఉత్తముడైన వాని దగ్గర నుండి వస్తున్నాను" అని చెప్పుకున్నాడు.

'ఖఫల' అంటే తిరుగు ప్రయాణమయ్యాడని అర్థం. 'ఇజాహున్' అంటే ముండ్లచెట్టు. 'సమురు' 'స'కు అకారం, 'మ'కు ఉకారం. అంటే చెట్టు. ఇది ముండ్ల చెట్లలో అన్నిటికన్నా పెద్ద రకము. 'ఇఖ్తరత' అంటే కత్తి

దూయటం. 'సల్‌తన్' 'స'కు అకారం మరియు ఉకారం (రెండు విధాలా చదువవచ్చు.) అంటే ఒరనుండి దూసిన కత్తి అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం, యుద్ధాల ప్రకరణల్లోనూ సహీహ్ ముస్లింలోని 'మహిమోన్నతల' ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావించబడింది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా దైవప్రవక్త (సల్లం)గారి మన్నింపుల వైఖరి, శత్రువులతోకూడా ఆయన సద్వర్తన, దేవునిపై ఆయనకున్న అచంచల విశ్వాసాలు వెల్లడౌతున్నాయి. యదార్థం ఏమిటంటే అల్లాహ్‌పై నమ్మకం కలిగివున్నవారికి ఆయన సహాయం తప్పకుండా అందుతుంది. ఈ హదీసులో దైవప్రవక్తను హతమార్చడానికి విఫలయత్నం చేసిన ఆ పల్లెటూరి వ్యక్తి తరువాత ఇస్లాం స్వీకరించాడు.

జాతుర్రిఖా యుద్ధం హి.శ. 6వ సంవత్సరంలో మండు వేసవికాలంలో జరిగింది. సూర్యుడు నిప్పులు చెరుగుతున్న ఎండల్లో కాళ్ళకు తొడుక్కోవటానికి చెప్పులు కూడా లేని కారణంగా ప్రవక్త సహచరులు కాళ్ళకు గుడ్డ పేలికలు, చింపిరి బట్టలు కట్టుకొని యుద్ధానికి బయలుదేరారు. అందుకే ఆ యుద్ధానికి జాతుర్రిఖా (చింపిరి గుడ్డల) యుద్ధం అనే పేరు వచ్చింది. అయితే మరికొంతమంది ఈ యుద్ధానికి ఆ పేరు రావటానికి ఇతరత్రా కారణాలున్నాయని అన్నారు.

٧٩ ـ السَّادِسُ: عَنْ عُمَرَ رضي الله عنه قال: سَمِعْتُ رسولَ الله ﷺ يَقُولُ: «لَوْ أَنَّكُمْ تَتَوَكَّلُونَ عَلَى الله حَقَّ تَوَكُّلِهِ لَرَزَقَكُمْ كَمَا يَرْزُقُ الطَّيْرَ، تَغْدُو خِمَاصاً وَتَرُوحُ بِطَاناً» رواه الترمذي، وقال: حديثٌ حسنٌ.

79. దైవప్రవక్త (సల్లం) ఉపదేశిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఉమర్ (రజి) తెలియజేశారు : మీరు అల్లాహ్‌పై ఏ విధంగా నమ్మకముంచాలో ఆ విధంగా నమ్మకాన్ని కలిగివుంటే ఆయన పక్షులకు ఆహారాన్ని ప్రసాదించినట్లే మీకు కూడా ఉపాధిని ప్రసాదిస్తాడు. పక్షులు ఉదయం పూట ఆకలితో బయలుదేరి సాయంత్రానికి కడుపు నింపుకొని తిరిగి వస్తాయి.

(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్'గా ఖరారు చేశారు.)

مَعْنَاهُ: تَذْهَبُ أَوَّلَ النَّهَارِ خِمَاصاً، أَيْ: ضَامِرَةَ الْبُطُونِ مِنَ الْجُوعِ، وَتَرْجِعُ آخِرَ النَّهَارِ بِطَاناً، أَيْ: مُمْتَلِئَةَ الْبُطُونِ.

ఉదయం పూట (పక్షులు) ఆకలితో బయలుదేరుతాయంటే అప్పుడు వాటి డొక్కలు లోపలికి పోయివుంటాయి. తిరిగి సాయంత్రానికి (గూటికి) మళ్ళి నప్పుడు కడుపులు నిండి ఉంటాయి.

*(సుననె తిర్మిజీలో 'ఐహిక అనాసక్తత' అధ్యాయములు)*

## ముఖ్యాంశాలు

దైవంపై నమ్మకం కలిగి ఉండటమంటే అర్థం వనరులు, సాధన సంపత్తిపైనే పూర్తిగా ఆధారపడకుండా, అల్లాహ్ అభీష్టం ప్రకారమే ఈ పని జరుగుతుందన్న విశ్వాసాన్ని కలిగి ఉండటం. ఎందుకంటే అల్లాహ్ అభీష్టం లేనిదే ఈ సాధనాలేవీ పనిచేయలేవు. కాని అంతా దేవుడి మీదే భారం అని చెప్పి చేతులు ముడుచుకొని కూర్చోవటం కూడా దైవ విశ్వాసానికి విరుద్ధమే. ఎందుకంటే మనిషికి అతని కృషి ఫలితం లభిస్తుందని దేవుడు స్వయంగా ప్రకటించాడు. పక్షులు తమ గూళ్ళలో కూర్చొని ఉంటే వాటికీ ఆహారం దొరకదు. ఆహారం కోసం అన్వేషణ జరిపినప్పుడే వాటికైనా అల్లాహ్ ప్రసాదించేది!

٨٠ ـ السَّابِعُ: عَنْ أَبِي عِمَارَةَ الْبَرَاءِ بْنِ عَازِبٍ رضي الله عنهما قال: قال رسولُ الله ﷺ: «يَا فُلانُ إِذَا أَوَيْتَ إِلَى فِرَاشِكَ فَقُلْ: اللَّهُمَّ أَسْلَمْتُ نَفْسِي إِلَيْكَ، وَوَجَّهْتُ وَجْهِي إِلَيْكَ، وَفَوَّضْتُ أَمْرِي إِلَيْكَ، وَأَلْجَأْتُ ظَهْرِي إِلَيْكَ، رَغْبَةً وَرَهْبَةً إِلَيْكَ، لا مَلْجَأَ وَلا مَنْجَى مِنْكَ إِلَّا إِلَيْكَ،

80. హజ్రత్ అబూ ఇమారా బరా ఇబ్నె ఆజిబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : "ఓయీ! నీవు పడకపై మేను వాల్చినప్పుడు ఈ దుఆ పఠించు:

"అల్లాహుమ్మ అస్లమ్తు నఫ్సీ ఇలైక, వ వజ్జహ్తు వజ్హీ ఇలైక, వ ఫవ్వత్తు అమ్రీ ఇలైక, వ అల్జాతు జహ్రీ ఇలైక, రగ్బతన్ వ రహ్బతన్ ఇలైక, లా మల్జఅ వలా మన్జా మిన్క ఇల్లా ఇలైక, ఆమన్తు బికితాబికల్లజీ అన్జల్త, వ నబియ్యికల్లజీ అర్సల్త."

(దేవా! నేను నా స్వయాన్ని నీకు సమర్పించుకున్నాను. నా ముఖాన్ని నీ

آمَنْتُ بِكِتَابِكَ الَّذي أَنزَلْتَ، وَنَبِيِّكَ الَّذي أَرْسَلْتَ؛ فَإِنَّكَ إنْ مِتَّ مِنْ لَيْلَتِكَ مِتَّ عَلَى الفِطْرَةِ، وَإِنْ أَصْبَحْتَ أَصَبْتَ خَيْراً» متفقٌ عليه. وفي روايةٍ في الصَّحيحين عَن البَرَاءِ قال: قال لِي رسول الله ﷺ: «إذَا أَتَيْتَ مَضْجعَكَ فَتَوَضَّأْ وُضوءَكَ للصَّلاة، ثُمَّ اضْطَجعْ عَلَى شِقِّكَ الأَيْمَنِ وَقُلْ ـ وذَكَرَ نَحْوَهُ، ثُمَّ قالَ ـ: وَاجْعَلْهُنَّ آخِرَ مَا تَقُولُ».

వైపుకు తిప్పుకున్నాను. నా వ్యవహారాలన్నీ నీకు అప్పగించాను. నిన్ను కోరుకుంటూ, నీ ఆగ్రహానికి భయపడుతూ నీ శరణుజొచ్చాను. నీవు ఆశ్రయమిస్తే తప్ప మరెక్కడా ఆశ్రయం లేదు. నీవు రక్షణ కల్పిస్తే తప్ప రక్షణ పొందటానికి మరోచోటు లేదు. నేను నీవు అవతరింపజేసిన గ్రంథాన్ని విశ్వసిం చాను. నీవు పంపిన ప్రవక్తను నమ్మాను.)

ఈ దుఆ పఠించి నీవు నిద్రపోయినప్పుడు రాత్రికి రాత్రే మరణం సంభవిస్తే, అప్పుడు నీవు సహజత్వం (ఇస్లాం ధర్మం)పై మరణించినట్లు పరిగణించబడతావు. ఒకవేళ తెల్లవారిన తరువాత బతికివుంటే అప్పుడు కూడా నీకు శుభం కలుగుతుంది.

*(బుఖారీ - ముస్లిం)*

ఉభయులూ (బుఖారీ - ముస్లిం) ఉల్లేఖించిన వేరొక హదీసులో హజ్రత్ బరా (రజి) గారి కథనం ఇలా ఉంది - దైవప్రవక్త (సల్లం) ప్రబోధించారు: నీవు నిద్రపోదలచినప్పుడు నమాజు కోసం చేసేవిధంగా వుజూ చెయ్యి. ఆ తరువాత (పడకపై) కుడివైపుకు తిరిగి పడుకొని ఈ వేడుకోలు వచనాలు పఠించు. (ఇంతకు ముందు ప్రస్తావించబడిన వాక్యాలు చెప్పారు.) ఆ తరువాత ఆయన "ఈ దుఆ వచనాలు (నీవు పడుకోవటానికి ముందు) ఆఖరి పలుకులు కావాలి. (ఆ తరువాత నీవు

ప్రాపంచికమైన ఏ మాటా మాట్లాడ కూడదు)" అని ఉపదేశించారు.

*(సహీహ్ బుఖారీలోని ప్రార్థనల ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని దైవధ్యానం, ప్రార్థనల ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

రాత్రిపూట నిద్రకు ఉపక్రమించే ముందు వుజూ చేసి పడుకోవటం ఉత్తమం. అదేవిధంగా హదీసులో చెప్పబడిన వేడుకోలు వచనాలు పఠించి నిద్రపోవటం వల్ల కూడా చాలా ప్రయోజనం ఉంటుంది. దీనివల్ల ఇస్లాం, ఈమాన్ భావాలలో తాజాదనం వస్తుంది. శాంతిశ్రేయాల కోసం దైవసన్నిధిలో పరితపించే దాసుని ప్రార్థన ఇది!

٨١ ـ الثَّامِنُ: عَنْ أَبِي بَكْرٍ الصِّدِّيق رضي الله عنه عبدِ اللهِ بنِ عثمانَ بنِ عامِرِ بن عُمَرَ بْنِ كَعْبِ بْنِ سَعْدِ بْنِ تَيْم بْنِ مُرَّةَ بْنِ كَعْبِ بْنِ لُؤَيِّ بْنِ غَالِبٍ القُرَشِيِّ التَّيمي رضي الله عنه ـ وَهُوَ وَأَبُوهُ وَأُمُّهُ صَحَابَةٌ، رضي الله عنهم ـ قال: نَظَرْتُ إِلَى أَقْدَامِ المُشْرِكِينَ وَنَحْنُ فِي الغَارِ وَهُمْ عَلَى رُؤُوسِنَا فقلتُ: يَا رسولَ اللهِ لَوْ أَنَّ أَحَدَهُمْ نَظَرَ تَحْتَ قَدَمَيْهِ لأَبْصَرَنَا فقالَ: «مَا ظَنُّكَ يَا أَبَا بَكْرٍ باثْنَيْنِ اللهُ ثَالِثُهُمَا» متفقٌ عليه.

81. హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ అబ్దుల్లా బిన్ ఉస్మాన్ ఖురషి, తమీమి (రజి) కథనం (ఈ అబూబక్ర్ మరియు ఆయన తల్లిదండ్రులు ముగ్గురూ కూడా దైవప్రవక్త సహచరులే) : మేము సూర్ గుహలో దాక్కున్నప్పుడు నేను (మా కోసం వెతుకుతున్న) బహుదైవారాధకుల కాళ్ళు చూశాను. అప్పుడు వాళ్ళు మా తలల దగ్గర నించొని ఉన్నారు. అప్పుడు నేను (భయంతో) ఇలా అన్నాను : "దైవప్రవక్తా! వాళ్ళు గనక తమ కాళ్ళ వంక చూసుకుంటే మనం వాళ్ళకి కనబడిపోతాము." దానికి ఆయన "ఓ అబూబక్ర్, ఇద్దరు వ్యక్తులకు తోడు మూడోవానిగా అల్లాహ్ వున్నప్పుడు ఆ ఇద్దరి గురించి నీ అభిప్రాయమేమిటి? (అంటే ఇక్కడున్నది మనమిద్దరమే కాదు, అల్లాహ్ కూడా మనతో ఉన్నాడు. అల్లాహ్ ఎవరికైనా తోడుగా ఉంటే ఇక వాళ్ళను ఎవరేం చేయగలుగుతారు?)" అంటూ ధైర్యం చెప్పారు.

*(బుఖారీ - ముస్లిం)*

(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)

## ముఖ్యాంశాలు

హదీసులో వచ్చిన సంఘటన దైవప్రవక్త (సల్లం) మక్కా నుండి మదీనాకు వలసపోయిన సందర్భంలోనిది. మక్కా బహుదైవారాధకుల ఆగడాలను, సత్యప్రచార మార్గంలో వారు కల్పిస్తున్న అవరోధాలను భరించలేక దైవప్రవక్త (సల్లం) దేవుని అనుమతితో తన ప్రియ సహచరుడైన హజ్రత్ అబూబక్ర్ (రజి)ని వెంటబెట్టుకొని మదీనాకు బయలుదేరారు. ఆయన్ని పట్టి తెచ్చినవారికి గొప్ప బహుమతి ఇస్తామని మక్కా బహుదైవారాధకులు ప్రకటించారు. ఆ బహుమతులకు కక్కుర్తిపడి అనేకమంది దైవప్రవక్తను పట్టుకునేందుకు వెంటపడ్డారు. అప్పుడు దైవప్రవక్త సూర్ గుహలో విశ్రాంతి తీసుకుంటూ ఉండగా ఆ దుండగులు గుహదాకా వచ్చారు. కాని 'దేవుడు కానరాడేమిటి?' అని ప్రశ్నించే ఆ దైవతిరస్కారులు దైవప్రవక్త కళ్ళముందు కనబడుతున్నా చూడలేకపోయారు.

ఈ హదీసులో దైవప్రవక్త అబూబక్ర్‌తో అన్న మాటలనుబట్టి ఆయన ధైర్యసాహసాలు, గుండె నిబ్బరం, దైవంపైగల అచంచల విశ్వాసం స్పష్టమవుతున్నాయి. ఇంకా దేవుడు; తన ప్రియతమ దాసులు కష్టాల్లో వున్నప్పుడు తప్పకుండా ఆదుకుంటాడన్న విషయం కూడా ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. అల్లాహ్ స్వయంగా ఇలా సెలవిచ్చాడు. "నిశ్చయంగా మేము మా ప్రవక్తలకూ, విశ్వాసులకూ ఇహలోక జీవితంలో కూడా తప్పకుండా సహాయం చేస్తాము; సాక్షులు నిలబడే రోజున కూడా సహాయం చేస్తాము." (అల్ మూ'మిన్ : 51)

82. విశ్వాసుల మాతృమూర్తి ఉమ్మె సలమా (రజి.అన్హా) కథనం: (ఈమె పేరు హింద్ బింతె అబూ ఉమయ్యా హుజైఫా మఖ్జూమియ్యా) దైవప్రవక్త (సల్లం) ఇంటినుండి బయలుదేరి నప్పుడు ఈ విధంగా ప్రార్థించేవారు:

"బిస్మిల్లాహి, తవక్కల్తు అలల్లాహి, అల్లాహుమ్మ ఇన్నీ అవూజు బిక అన్ అదిల్ల అవ్ ఉదల్ల అవ్ అజిల్ల అవ్ ఉజల్ల, అవ్ అజ్లిమ అవ్ ఉజ్లమ, అవ్ అజ్హల అవ్ యుజ్హల అలయ్య."

٨٢ ـ التَّاسِعُ: عَنْ أُمِّ الْمُؤْمِنِينَ أُمِّ سَلَمَةَ، واسْمُهَا هِنْدُ بِنْتُ أَبِي أُمَيَّةَ حُذَيْفَةَ المَخْزُومِيَّةِ، رضي الله عنها، أَنَّ النبيَّ ﷺ كانَ إِذَا خَرَجَ مِنْ بَيْتِهِ قالَ: «بِسْمِ اللهِ، تَوَكَّلْتُ عَلَى اللهِ، اللَّهُمَّ إِنِّي أَعُوذُ بِكَ أَنْ أَضِلَّ أَوْ أُضَلَّ، أَوْ أَزِلَّ أَوْ أُزَلَّ، أَوْ أَظْلِمَ أَوْ أُظْلَمَ، أَوْ أَجْهَلَ أَوْ يُجْهَلَ عَلَيَّ» حديثٌ صَحيحٌ رواه أبو داود والتِّرمذيُّ وَغَيرُهُمَا بِأَسانِيدَ

صَحيحة. قالَ التِّرمذيُّ: حَديثٌ حسنٌ صحيحٌ، وهذا لفظ أبي داود.

(దేవుని పేరుతో, దైవంపైనే నేను నమ్మకం పెట్టుకున్నాను. దేవా! నేను స్వయంగా మార్గం నుండి తప్పిపోవటం నుండి లేక తప్పించబడటం నుండి, జారటం నుండి లేక జారించబడటం నుండి, నేను స్వయంగా ఎవరినైనా బాధించటం నుండి లేక ఎవరిచేతనైనా నేను బాధించబడటాన్నుండి, నేను స్వయంగా మూర్ఖత్వానికి పాల్పడ కుండా, మరియు ఎవరైనా నాపట్ల మూర్ఖంగా ప్రవర్తించకుండా ఉండాలని నేను నీ శరణు కోరుకుంటున్నాను.)

ఈ హదీసు దృఢమైనది. దీనిని అబూ దావూద్, తిర్మిజీ తదితరులు దృఢమైన ఆధారాలతో ఉల్లేఖించారు. తిర్మిజీ దీనిని ప్రామాణికమైనదిగా, దృఢమైన దిగా పేర్కొన్నారు. వాక్యాలు మాత్రం అబూదావూద్ లోనివి.

*(సుననె తిర్మిజీలోని ప్రార్థనల ప్రకరణంలోనూ, ఇంకా సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

٨٣ ـ العَاشِرُ: عَنْ أَنَسٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مَنْ قَالَ -يَعْنِي إِذَا خَرَجَ مِنْ بَيْتِهِ-: بِسْمِ اللهِ

83. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారని హజ్రత్ అనస్ (రజి) తెలియజేశారు: ఇంటినుండి బయలుదేరే వ్యక్తి, "బిస్మిల్లాహి, తవక్కల్తు అలల్లాహి, వలా హౌల, వలా ఖువ్వత ఇల్లా బిల్లాహి" (దేవుని పేరుతో నేను ప్రారంభిస్తున్నాను, నేను ఆయన్నే నమ్ముకున్నాను. పాపాల నుండి మరలి పోవాలన్నా, మంచి పనులు చేయాలన్నా ఆయన శక్తివల్లనే సాధ్యమవుతుంది) అని పఠించి

تَوَكَّلْتُ عَلَى اللهِ، وَلا حَوْلَ وَلَا قُوَّةَ إلَّا بِاللهِ، يُقَالُ لَهُ: هُدِيتَ وَكُفِيتَ وَوُقِيتَ، وَتَنَحَّى عَنْهُ الشَّيْطَانُ». رواه أبو داود والترمذي، والنسائي وغيرهم. وقال الترمذي: حديثٌ حسنٌ، زاد أبو داود: «فيقول ـ يَعْنِي الشَّيْطَانَ ـ: لِشَيْطَانٍ آخَرَ: كَيْفَ لَكَ بِرَجُلٍ قَدْ هُدِيَ وَكُفِيَ وَوُقِيَ؟».

బయలు దేరినప్పుడు ఆ వ్యక్తితో "నీవు సన్మార్గం పొందావు, నీకు సహాయం కల్పించ బడింది, నీవు రక్షించబడ్డావు" అని అదృశ్యవాణి ఎవరికీ వినపడని విధంగా పలుకుతుంది. అంతేకాదు, షైతాన్ కూడా అలాంటి వ్యక్తినుండి దూరంగా పారిపోతాడు.

అబూదావూద్, తిర్మిజీ, నసాయి తదితరులు దీనిని ఉల్లేఖించారు. తిర్మిజీ దీనిని 'హసన్'గా పేర్కొన్నారు.

అబూదావూద్‌లో ఈ వాక్యాలు అదనంగా ఉన్నాయి : అప్పుడు ఒక షైతాన్ తోటి షైతాన్‌తో "ఈ వ్యక్తికి సన్మార్గం లభించింది, సహాయం అందింది, రక్షణ కల్పించబడింది. ఇక నువ్వు అతనిపై పట్టు ఎలా సాధిస్తావు?" అని అంటాడు.

*(సుననె తిర్మిజీలోని ప్రార్థనల ప్రకరణంలోనూ, సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణంలోనూ ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన ప్రార్థనలు మనిషికి దైవంపై ఉండవలసిన నమ్మకం, విశ్వాసాలను విశదపరచాయి. ఇంకా ఈ వేడుకోలు వచనాలలో షైతాన్ యొక్క కుయుక్తులు, కుశంకల నుండి కూడా శరణు కోరుకోబడింది. కనుక విశ్వాసులు ఈ వేడుకోలు వచనాలను పఠించటం అలవాటు చేసుకోవాలి.

٨٤ ـ وعَنْ أَنَسٍ رضي الله عنه قال: كَانَ أَخَوَانِ عَلَى عَهْدِ النَّبِي ﷺ، وَكَانَ أَحَدُهُمَا يَأْتِي النبيَّ ﷺ، والآخَرُ يَحْتَرِفُ، فَشَكَا المُحْتَرِفُ أَخَاهُ لِلنَّبِيِّ ﷺ فقال:

84. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) కాలంలో ఇద్దరు అన్నదమ్ములుండేవారు. వారిలో ఒకడు తరచూ దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చేవాడు. (ఆయన దగ్గర కూర్చొని

«لَعَلَّكَ تُرْزَقُ بِهِ» رواه الترمذي بإسناد صحيح على شرط مسلم. «يَحْتَرِفُ»: يَكْتَسِبُ وَيَتَسَبَّبُ.

ధర్మజ్ఞానాన్ని ఆర్జించేవాడు). రెండోవాడు పనిచేసి డబ్బు సంపాదించేవాడు. ఒకసారి రెండోవాడు తన సోదరుడు పనిచేయకుండా ఖాళీగా కూర్చుంటున్నాడని దైవప్రవక్తకు ఫిర్యాదు చేశాడు. దానికి ఆయన, "బహుశా నీకు అతని మూలంగానే ఉపాధి లభిస్తుందేమో!" అని అన్నారు.

(తిర్మిజీ ఈ హదీసును ముస్లిం నియమానికి కట్టుబడి దృఢమైన ఆధారంతో ఉల్లేఖించారు.)

'యహ్తరిఫు' అంటే సంపాదించడం, సాధనాలను ఉపయోగించటం అని అర్థం.

*(సుననె తిర్మిజీలోని ఐహిక 'అనాసక్తత' అధ్యాయములలో ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

1. పై హదీసులో చెప్పబడినట్లు ధార్మిక విద్య నేర్చుకోవడం కోసం తమల్ని తాము అంకితం చేసుకోవటం లేక కొంతమంది విద్యార్థులకు వృత్తి చింతన లేకుండా వారి ఖర్చులను భరిస్తూ వారిని ధర్మజ్ఞాన పరిశోధన కోసం ప్రత్యేకించడం కేవలం ధర్మసమ్మతమే కాదు, అభిలషణీయం కూడాను. ఇలాంటి ధార్మిక విద్యార్థులను ముస్లిం సమాజం భారంగా తలపోయకూడదు. అదేవిధంగా వారికి ఆర్థికంగా సహాయపడటానికి కూడా వెనుకాడరాదు. దేవుడు వారి చలువతో మీ సిరిసంపదల్లో శుభాభివృద్ధులు కలుగజేస్తాడు.
2. నిరాధారులు, నిరాశ్రయులకు సహాయం చేయటంవల్ల కూడా మనిషికి ఉపాధి లభిస్తుందని ఈ హదీసు బోధపరుస్తోంది.



8వ అధ్యాయం

# ٨ - بَابُ الاِسْتِقَامَةِ

# నిలకడ, స్థయిర్యము

٨ - بَابُ الاِسْتِقَامَةِ

قال الله تعالى: ﴿فَٱسْتَقِمْ كَمَآ أُمِرْتَ﴾ [هود: ١١٢]، وقال تعالى: ﴿إِنَّ ٱلَّذِينَ قَالُوا۟ رَبُّنَا ٱللَّهُ ثُمَّ ٱسْتَقَـٰمُوا۟ تَتَنَزَّلُ عَلَيْهِمُ ٱلْمَلَـٰٓئِكَةُ أَلَّا تَخَافُوا۟ وَلَا تَحْزَنُوا۟ وَأَبْشِرُوا۟ بِٱلْجَنَّةِ ٱلَّتِى كُنتُمْ تُوعَدُونَ ﴿٣٠﴾ نَحْنُ أَوْلِيَآؤُكُمْ فِى ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا وَفِى ٱلْـَٔاخِرَةِ ۖ وَلَكُمْ فِيهَا مَا تَشْتَهِىٓ أَنفُسُكُمْ وَلَكُمْ فِيهَا مَا تَدَّعُونَ ﴿٣١﴾ نُزُلًا مِّنْ غَفُورٍ رَّحِيمٍ ﴿٣٢﴾﴾ [فصلت: ٣٠، ٣٢]، وقال تعالى: ﴿إِنَّ ٱلَّذِينَ قَالُوا۟ رَبُّنَا ٱللَّهُ ثُمَّ ٱسْتَقَـٰمُوا۟ فَلَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُونَ ﴿١٣﴾ أُو۟لَـٰٓئِكَ أَصْحَـٰبُ ٱلْجَنَّةِ خَـٰلِدِينَ فِيهَا جَزَآءًۢ بِمَا كَانُوا۟ يَعْمَلُونَ ﴿١٤﴾﴾ [الأحقاف: ١٣، ١٤].

అల్లాహ్ సెలవిచ్చాడు : "ఓ ప్రవక్తా! నీవూ, (అవిశ్వాసం, తిరుగుబాటుల నుండి విశ్వాసం, విధేయతల వైపుకు) మరలివచ్చిన నీ సహచరులూ నీకు ఆజ్ఞాపించిన విధంగా ఋజు మార్గంపై స్థిరంగా ఉండండి." (హూద్ : 112)

మరొకచోట అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు : "అల్లాహ్‌యే మా ప్రభువు అని పలికి ఆ మాట మీదనే స్థిరంగా నిలబడే వారి కోసం దైవ దూతలు అవతరించి, "భయపడకండి, బాధ పడకండి, మీకు వాగ్దానం చేయబడిన స్వర్గం అనే శుభవార్తను విని ఆనందించండి. మేము ఈ ప్రాపంచిక జీవితంలో కూడ మీకు సహచరులుగా ఉంటాము, పరలోకంలో కూడ. అక్కడ మీరు కోరినదల్లా మీకు లభిస్తుంది. మీరు ఆశించే ప్రతివస్తువూ మీదవుతుంది. ఇవీ మీకు లభించే ఆతిథ్యపు ఏర్పాట్లు, క్షమా శీలుడూ, కరుణామయుడూ అయిన దేవుని వైపు నుండి" అని అంటారు.

(హామీమ్ అస్ సజ్‌దహ్ : 30 - 32)

ఇంకొకచోట ఇలా సెలవీయబడింది : "నిశ్చయంగా అల్లాహ్‌యే మా ప్రభువు అని ప్రకటించి, దానిపై స్థిరంగా ఉండిపోయిన వారికి ఏ భయమూ లేదు, వారు దుఃఖించడమూ జరగదు. అలాంటి వారే స్వర్గానికి పోయేవారు. అక్కడనే వారు శాశ్వతంగా ఉంటారు. ప్రపంచంలో తాము చేసిన పనులకు ప్రతిఫలంగా."

(అల్ అహ్‌ఖాఫ్ : 13-14)

٨٥ ـ وَعَنْ أَبِي عَمْرٍو، وقيل: أبي عَمْرَةَ سُفْيَانَ بنِ عبدِ اللهِ رضي الله عنه قال: قُلْتُ: يَا رسول اللهِ قُلْ لِي في الإسْلام قَوْلًا لا أَسْأَلُ عَنه أَحَداً غَيْرَكَ. قال: «قُلْ: آمَنْتُ باللهِ؛ ثُمَّ اسْتَقِمْ» رواه مسلم.

85. హజ్రత్ అబూ అమ్ర్ (కొందరి అభిప్రాయం ప్రకారం అబూ అమ్ర్ సుఫ్యాన్ బిన్ అబ్దుల్లాహ్ - రజి) కథనం: నేను దైవప్రవక్తను "నాకు ఇస్లాం గురించి ఏమైనా బోధించండి. (అయితే) దాని గురించి నేను మిమ్మల్ని తప్ప వేరొకళ్ళని అడగవలసిన అవసరం రాకూడదు" అని అడిగాను. దానికి ఆయన "నేను అల్లాహ్‌ను నమ్ముతున్నాను అని చెప్పు. తరువాత ఆ మాటపైనే నిలకడగా ఉండు" అని ఉపదేశించారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని విశ్వాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

స్థయిర్యాన్ని, (ఇస్తిఖామత్‌ను) ప్రదర్శించడమంటే ఇస్లాం ధర్మంలోని నిషేధాలను అమలుపరచడంలో నిలకడగా ఉండటం. దైవాజ్ఞల్ని, విధులను, దైవప్రవక్త సంప్రదాయాలను, పుణ్యకార్యాలను నిర్వర్తించడంతో పాటు దేవుని నిషేధాజ్ఞలకు, వారింపులకు దూరంగా ఉండటాన్నే 'ఇస్తిఖామత్' అంటారు. ఒట్టి నోటిమాటలను విశ్వాసం (ఈమాన్)గా పరిగణించడం జరగదు. విశ్వాసంతోపాటు ఆచరణ ఉంటేనే అది నిజమైన విశ్వాసంగా భావించబడుతుంది. ఎందుకంటే ఆచరణే విశ్వాసానికి ఫలితం. పండ్లు కాయని చెట్టు నిష్ప్రయోజనకరమైనట్లే ఆచరణ లేని విశ్వాసం (ఈమాన్) నిరర్థకం అవుతుంది.

٨٦ ـ وَعَنْ أَبِي هُرَيْرَةَ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «قَارِبُوا وَسَدِّدُوا، واعْلَمُوا أَنَّهُ لَنْ يَنْجُوَ أَحَدٌ مِنْكُمْ بِعَمَلِهِ»، قَالُوا: ولا أنتَ يَا رسولَ الله؟ قَالَ: «ولا أَنَا إلَّا أنْ يَتَغَمَّدَنِي اللهُ بِرَحْمَةٍ مِنْهُ وَفَضْلٍ» رواه مسلم.

86. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు: మధ్యేమార్గాన్ని అనుసరించండి. (వ్యవహారాల్లో నిలకడగా) ఖచ్చితంగా ఉండండి. మీలో ఎవరూ (కేవలం) తమ ఆచరణ ఆధారంగానే ముక్తిపొందలేరని తెలుసుకోండి!"

وَ«الْمُقَارَبَةُ»: القَصْدُ الَّذِي لا غُلُوَّ فِيهِ ولا تَقْصِيرَ. وَ«السَّدَادُ»: الاسْتِقَامَةُ وَالإِصَابَةُ، وَ«يَتَغَمَّدَنِي»: يُلْبِسُنِي وَيَسْتُرُنِي.

قَالَ العُلَمَاءُ: مَعْنَى الاسْتِقَامَةِ: لُزوم طَاعَةِ الله تَعَالَى؛ قَالُوا: وَهِيَ مِنْ جَوَامِعِ الْكَلِم، وَهِيَ نِظَامُ الأُمُورِ، وبِالله التَّوفِيق.

అందుకు సహచరులు "దైవప్రవక్తా! మీరు కూడానా?" అని సందేహపడగా, దానికి ఆయన "అవును, నేను కూడా (కేవలం నా ఆచరణ ఆధారంగా ముక్తి పొందలేను) అల్లాహ్ నన్ను తన కరుణా కటాక్షాలతో ముంచివేస్తే తప్ప" అని బదులిచ్చారు. *(ముస్లిం)*

'ముఖారబ' అంటే మధ్యేమార్గం. అతి వాదానికి, మరీ మితవాదానికి మధ్య ఉండేమార్గం. 'అస్సదాద్' అంటే నిలకడ, సూటిదనం. 'యతగమ్మదనీ' అంటే 'నన్ను తొడుక్కుంటే' లేక 'నన్ను కప్పుకుంటే' అని అర్థం.

విద్వాంసులు ఇలా అభిప్రాయపడ్డారు: స్థయిర్యం (ఇస్తిఖామత్) అంటే సదా దైవవిధేయతకు కట్టుబడి ఉండటం. ఇంకా పండితులు ఇలా అన్నారు : ఈ హదీసు వాక్యాలు 'జవామివుల్ కలిమ్' (సమగ్రమైన వచనాల)లోనివి. (అంటే పదాలు క్లుప్తంగా, భావగర్భితంగా ఉంటాయి.) అంతేకాదు, ఈ హదీసు వ్యవహార సరళిని సూచిస్తోంది. వబిల్లాహిత్తౌఫీఖ్.

*(సహీహ్ ముస్లింలోని 'కపటుల' ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

విశ్వాసం (ఈమాన్)తో పాటు ఆచరణకు కూడా ఎంతో ప్రాముఖ్యత ఉందన్నమాట వాస్తవమే! కాని కేవలం తాము చేసుకున్న సత్కర్మలు, సదాచరణలతోనే ముక్తి లభిస్తుందనీ,

దాని ఆధారంగానే స్వర్గంలోకి ప్రవేశించగలమని భావించడం కూడా సరికాదు. ఎందుకంటే కొన్ని సందర్భాల్లో ఆచరణలోని లోపాలవల్ల మన ఆచరణ దైవసన్నిధిలో స్వీకార భాగ్యాన్ని పొందలేకపోవచ్చు. అప్పుడు అలాంటి ఆచరణ వల్ల ఎలాంటి ప్రయోజనమూ ఉండదు. కాబట్టి మనిషి ఒక వైపు సదాచరణ చేస్తూనే మరోవైపు దైవ సన్నిధిలో తన ఆచరణ స్వీకృతిని పొందాలని, దేవుడు తన్ను తన కారుణ్య ఛాయల్లోకి తీసుకోవాలని, తను చేసే ప్రతి మంచిపనిలోనూ చిత్తశుద్ధిని ప్రసాదించాలని కోరుకుంటూ ఉండాలి. అయితే దైవప్రసన్నతను బడయటానికి ఏకైక మార్గం కూడా సదాచరణేనన్న సంగతిని మరువకూడదు సుమా!



## 9వ అధ్యాయం

# ٩ - بَابُ فِي التَّفَكُّرِ فِي عَظِيمِ مَخْلُوقَاتِ اللهِ تَعَالَى وَفَنَاءِ الدُّنْيَا وَأَهْوَالِ الآخِرَةِ وَسَائِرِ أُمُورِهِمَا وَتَقْصِيرِ النَّفْسِ وَتَهْذِيبِهَا وَحَمْلِهَا عَلَى الاسْتِقَامَةِ

# దేవుని గొప్ప సృష్టితాలలో యోచన గురించి, ప్రపంచ వినాశం, పరలోక ప్రతాపాలు, ఇహపరాల సమస్త వ్యవహారాలు, మనసు వల్ల జరిగే తప్పులు, దాని సంస్కరణ, మనఃస్థిమితం గురించి......

قال الله تعالى: ﴿ قُلْ إِنَّمَآ أَعِظُكُم بِوَٰحِدَةٍ ۖ أَن تَقُومُوا۟ لِلَّهِ مَثْنَىٰ وَفُرَٰدَىٰ ثُمَّ تَتَفَكَّرُوا۟ ﴾ [سبأ: ٤٦]، وقال تعالى: ﴿ إِنَّ فِى خَلْقِ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَٱخْتِلَٰفِ ٱلَّيْلِ وَٱلنَّهَارِ لَءَايَٰتٍ لِّأُو۟لِى ٱلْأَلْبَٰبِ ﴿١٩٠﴾ ٱلَّذِينَ يَذْكُرُونَ ٱللَّهَ قِيَٰمًا وَقُعُودًا وَعَلَىٰ جُنُوبِهِمْ وَيَتَفَكَّرُونَ فِى خَلْقِ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ رَبَّنَا مَا خَلَقْتَ هَٰذَا بَٰطِلًا سُبْحَٰنَكَ ﴾ الآيات [آل عمران: ١٩٠، ١٩١]، وقال تعالى: ﴿ أَفَلَا يَنظُرُونَ إِلَى ٱلْإِبِلِ كَيْفَ خُلِقَتْ ﴿١٧﴾ وَإِلَى ٱلسَّمَآءِ كَيْفَ رُفِعَتْ ﴿١٨﴾ وَإِلَى ٱلْجِبَالِ كَيْفَ نُصِبَتْ ﴿١٩﴾ وَإِلَى ٱلْأَرْضِ كَيْفَ سُطِحَتْ ﴿٢٠﴾ فَذَكِّرْ إِنَّمَآ أَنتَ مُذَكِّرٌ ﴿٢١﴾ ﴾ [الغاشية: ١٧،

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్‌ సెలవిచ్చాడు : "ప్రవక్తా! వారితో ఇలా అను, "నేను మీకు ఒక విషయాన్ని బోధిస్తున్నాను. అల్లాహ్‌ కోసం, మీరు ఒక్కరొక్కరూ ఇద్దరిద్దరూ కలిసి మీ మేధను ఉపయోగించి ఆలోచించండి." (సబా : 46)

వేరొకచోట అల్లాహ్‌ ఇలా అంటున్నాడు : "భూమీ, ఆకాశాల సృష్టిలో రేయింబవళ్ళు ఒకదాని తరువాత ఒకటి రావడంలో, నిలుచున్నా, కూర్చున్నా, పరుండినా అన్నివేళలా అల్లాహ్‌ను స్మరించే వారున్నూ, భూమీ ఆకాశాల నిర్మాణం గురించి చింతన చేసేవారున్నూ అయిన వివేకవంతులకు ఎన్నో సూచనలు ఉన్నాయి. (వారు అప్రయత్నంగా ఇలా అంటారు) ప్రభూ! ఇదంతా నీవు వ్యర్థంగా, లక్ష్యరహితంగా సృష్టించలేదు. నీవు పరిశుద్ధుడవు......."

(ఆలి ఇమ్రాన్ : 190-191)

٢١]، وقال تعالى: ﴿أَفَلَمْ يَسِيرُوا فِي الْأَرْضِ فَيَنظُرُوا﴾ الآية [محمد: ١٠].
والآيات في الباب كثيرةٌ.
وَمِنَ الأَحَادِيثِ الحديث السَّابق:
«الْكَيِّسُ مَنْ دَانَ نَفْسَهُ».

ఇంకొకచోట ఇలా సెలవీయబడింది: "అయితే వారు ఒంటెలను చూడరా అవి ఎలా సృష్టించ బడ్డాయో? ఆకాశాన్ని చూడరా అది పైకి ఎలా ఎత్తబడిందో? కొండలను చూడరా అవి ఎలా పాతిపెట్టబడ్డాయో? భూమిని చూడరా అది ఎలా పరచబడిందో? సరే అయితే, (ప్రవక్తా!) హితబోధ చేస్తూ ఉండు, నీవు కేవలం హితబోధ చేసేవాడవు మాత్రమే."

(అల్ గాషియహ్ : 17:21)

వేరొకచోట అల్లాహ్ ఇలా ప్రశ్నిస్తున్నాడు: "(వారికి పూర్వం గతించిన ప్రజల పర్యవసానం ఎలా జర్గిగిందో) చూసేందుకు వారు భూమిపై సంచరించలేదా?" (ముహమ్మద్ : 10)

ఈ అధ్యాయంలో ఇలాంటి సూక్తులు అనేకం ఉన్నాయి. ఇకపోతే హదీసుల్లో ఇంతకు ముందు ప్రస్తావించబడిన "అల్ కయ్యిసు మన్ దాన నఫ్సహూ" అన్న హదీసు ఈ అధ్యాయానికి కూడా వర్తిస్తుంది. (5వ అధ్యాయంలో 66వ హదీసు చూడండి.)

## 10వ అధ్యాయం

# ١٠ـ بَابٌ فِي الْمُبَادَرَةِ إِلَى الْخَيْرَاتِ، وَحَثُّ مَنْ تَوَجَّهَ لِخَيرٍ عَلَى الإِقْبَالِ عَلَيْهِ بِالْجِدِّ مِنْ غَيرِ تَرَدُّدٍ

# సత్కార్యాల కోసం తొందరపడటం గురించి, సత్కార్యాన్ని ఎలాంటి సంకోచం లేకుండా పూర్తి శ్రద్ధతో, చిత్తశుద్ధితో చేయమని సద్వర్తనుని పురికొల్పడం గురించి.

قال الله تعالى: ﴿فَاسْتَبِقُوا الْخَيْرَاتِ﴾ [البقرة: ١٤٨]، وقال تعالى: ﴿وَسَارِعُوا إِلَى مَغْفِرَةٍ مِنْ رَبِّكُمْ وَجَنَّةٍ عَرْضُهَا السَّمَاوَاتُ وَالْأَرْضُ أُعِدَّتْ لِلْمُتَّقِينَ﴾ [آل عمران: ١٣٣].

అల్లాహ్ సెలవిచ్చాడు: "మంచి పనుల వైపుకు పరుగులు తీయండి." (అల్ బఖర : 148)

మరొకచోట అల్లాహ్ ఇలా అంటున్నాడు : "మీ ప్రభువు క్షమాభిక్ష వైపుకు, స్వర్గం వైపునకు పోయే మార్గంలో పరుగెత్తండి. ఆ స్వర్గం భూమ్యాకాశాల అంత విశాలమయింది. అది భయభక్తులు కలవారి కొరకు తయారు చేయ బడింది." (అల్ బఖర : 133)

وَأَمَّا الأَحَادِيث:

ఇక ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసులు -

٨٧ ـ فالأول: عَنْ أبي هُرَيْرَةَ رضي الله عنه أنَّ رسولَ الله ﷺ قال: «بَادِرُوا بالأعْمَالِ فِتَناً كَقِطَعِ اللَّيْلِ المُظْلِمِ يُصْبِحُ الرَّجُلُ مُؤمناً وَيُمْسِي كَافِراً أو يُمْسِي مُؤمِناً وَيُصْبِحِ كَافِراً، يَبِيعُ دِينَهُ بعَرَضٍ مِنَ الدُّنْيَا» رواه مسلم.

87. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ప్రబోధించారు : రేజీకటి తునకల్లాగా కమ్ముకునే ఉపద్రవాలు రాకముందే మీరు మంచిపనులు చేయడానికి త్వరపడండి. (అటువంటి ఉపద్రవ కాలంలో) మనిషి ఉదయంపూట విశ్వాసిగా ఉండి సాయంత్రానికల్లా అవిశ్వాసిగా మారి

పోతాడు. సాయంత్రం వేళ విశ్వాసిగా ఉన్నవాడు ఉదయాని కల్లా అవిశ్వాసిగా మారిపోతాడు. ప్రాపంచిక తుచ్ఛ ప్రయోజనాల కోసం తన ధర్మాన్నే అమ్ముకుంటాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రళయం వచ్చేముందు ఒకదాని తరువాత ఒకటి ఉపద్రవాలు ఉత్పన్నమవుతూ ఉంటాయని ఈ హదీసులో చెప్పబడింది. అలాంటి ఉపద్రవాల్లో చిక్కుకున్న మనిషి దృష్టిలో ధర్మానికి, విశ్వాసానికి విలువే లేకుండా పోతుంది. అతడు ప్రాపంచిక ప్రయోజనాల కోసం పరుగులు తీస్తుంటాడు. చివరికి ప్రపంచంలో తనకు కలిగే స్వల్ప లాభాల కోసం తన ధర్మాన్ని, విశ్వాసాన్ని అమ్ముకోవటానికి కూడా వెనుకాడడు. తన ధర్మంపై నిలకడగా ఉంటాడో లేక విశ్వాసాన్ని అమ్ముకొని అవిశ్వాసిగా మారతాడో తనకే తెలియదు. నేడు ఇలాంటి మాయ మనుషులకు కొదువలేదు. ఉదయం ఒక రకంగా ఉంటే సాయంత్రానికి మరో రకంగా ఉంటారు. వేళ్ళపై లెక్కపెట్టగల కొందరికి తప్ప ఈ రోజుల్లో చాలామందికి తమ ధర్మంపై నిలకడ లేదు. దీనివల్ల ప్రళయం సంభవానికి ఇంకెంతో కాలం లేదని తెలుస్తోంది. ఇటువంటి ఉపద్రవ పరిస్థితుల్లో విశ్వాసులు సత్యధర్మంపై నిలకడగా ఉండాలని, మంచిపనులు చేయడంలో మిన్నగా ఉండాలని పై హదీసులో తాకీదు చేయబడింది.

88. హజ్రత్ అబూ సర్వఆ (సిర్వఆ అని కూడా చదువవచ్చు) ఉఖబా బిన్ హారిస్ కథనం : నేనొకసారి మదీనా నగరంలో దైవప్రవక్త (సల్లం) వెనుక 'అస్ర్' నమాజు చేశాను. ఆయన సలాం చేసి నమాజు ముగించాక చటుక్కున లేచి నిలబడ్డారు. ఆ తరువాత జనుల మెడల పైనుంచి గెంతుతూ తొందర తొందరగా తన సతీమణుల్లోని ఒకామె ఇంటికి వెళ్ళారు. ఆయన తొందరపాటును చూసి జనం కలవరపడ్డారు. (కొంత

٨٨ ـ الثاني: عَنْ أبي سِرْوَعَةَ ـ بكسرِ السينِ المهملةِ وفتحها ـ عقبةَ بْنِ الْحَارِثِ رضي الله عنه قال: صَلَّيْتُ وَرَاءَ النَّبِيِّ ﷺ بالمَدِينَةِ العَصْرَ، فَسَلَّمَ ثُمَّ قَامَ مُسْرِعاً فَتَخَطَّى رِقَابَ النَّاسِ إلَى بَعْضِ حُجَرِ نِسَائِهِ، فَفَزِعَ النَّاسُ مِنْ سُرعَتِهِ، فَخَرَجَ عَلَيْهِمْ، فَرَأى أَنَّهُمْ قَدْ عَجِبُوا مِنْ سُرْعَته، قَالَ: «ذَكَرْتُ شَيْئاً مِنْ تِبْرٍ عِنْدَنَا، فَكَرِهْتُ أنْ يَحْبِسَنِي، فَأَمَرْتُ بِقِسْمَتِه»

రواه البخاري. وفي رواية له: «كُنْتُ خَلَّفْتُ في البَيْتِ تِبْراً مِنَ الصَّدَقَةِ؛ فَكَرِهْتُ أن أُبَيِّتَهُ». «التِّبْرُ» قطع ذَهَبٍ أوْ فضَّةٍ.

సేపటికి) తిరిగి వచ్చిన దైవప్రవక్త (సల్లం) జనం తన తొందరపాటుకి ఆశ్చర్య పోవటం చూసి "మా ఇంట్లో (బంగారం లేక వెండి) తునకలో కొంతభాగం మిగిలివున్న సంగతి నాకు గుర్తొచ్చింది. అది నాకు (దైవధ్యానంలో) ఆటంకం కలిగించడం నాకిష్టం లేదు. అందుకే నేను (త్వరగా వెళ్ళి) దాన్ని (అవసర మున్నవారికి) పంచిపెట్టమని ఆదేశించి వచ్చాను" అని చెప్పారు. (బుఖారీ)

బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : ఇంట్లో నేను సదఖా సొత్తు అయిన (వెండి లేక బంగారపు) తునక ఒకటి వదలిపెట్టి వచ్చాను. రాత్రికి అది నా ఇంట్లో ఉండటానికి నేనిష్టపడను."

'తిబ్ర్' అంటే బంగారం లేక వెండి ముక్కలు.

*(సహీహ్ బుఖారీలోని ఉపద్రవాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. మనిషి దృష్టిని దైవధ్యానం నుండి మరల్చే వ్యామోహపూరిత వస్తువులను అక్కున చేర్చుకోరాదని ఈ హదీసు బోధపరుస్తోంది.
2. సాధారణ పరిస్థితుల్లో జనుల భుజాలపైనుండి దుముకుతూ వెళ్ళటం అవాంఛనీయమే అయినప్పటికీ కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో అవసరమని భావిస్తే అలా చేయడంలో తప్పులేదని కూడా ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

٨٩ ـ الثَّالِثُ: عَنْ جَابِرٍ رضي الله عنه قال: قال رجلٌ للنبيِّ ﷺ يَوْمَ أُحُدٍ: أَرَأَيْتَ إنْ قُتِلْتُ فَأَيْنَ أَنَا؟ قَالَ:

89. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : ఉహుద్ యుద్ధం జరిగిన రోజు ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)ను "ఒకవేళ నేను (దైవతిరస్కారుల చేతుల్లో) హతమైతే,

«في الجَنَّة» فَأَلْقَى تَمَرَاتٍ كُنَّ في يَدِهِ، ثُمَّ قَاتَلَ حَتَّى قُتِلَ. متفقٌ عليه.

ఆ తరువాత నేను ఎక్కడికి వెళతానో చెప్పగలరా?" అని ప్రశ్నించాడు. దానికి ఆయన 'స్వర్గానికి' అని సమాధాన మిచ్చారు. అది విన్నదే తడవుగా ఆ వ్యక్తి తన చేతిలోని ఖర్జూర పండ్లను పారేసి (కదనరంగంలో దూకాడు.) అక్కడ (శత్రువులతో వీరోచితంగా) పోరాడుతూ అమరగతినొందాడు. (బుఖారీ -ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని యుద్ధాల ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా దైవప్రవక్త సహచరులు దైవమార్గంలో వీరమరణం పొందటానికి ఎంతగా ఉవ్విళ్ళూరేవారో అర్థమవుతోంది. దైవమార్గంలో అమరగతినొందితే దానికి ప్రతిఫలంగా స్వర్గం లభిస్తుందనీ, ఒక విశ్వాసి నిజ మనస్సుతో వీరమరణాన్ని కోరుకుంటే అల్లాహ్ తప్పకుండా అతనికి ఆ భాగ్యాన్ని ప్రసాదిస్తాడని కూడా ఈ హదీసు ద్వారా బోధపడుతున్నది.

٩٠ ـ الرَّابع: عن أبي هريرة رضي الله عنه قال: جَاءَ رجلٌ إلى النَّبيِّ ﷺ، فقال: يا رسولَ الله! أيُّ الصَّدَقَةِ أَعْظَمُ أَجْراً؟ قَالَ: «أَنْ تَصَدَّقَ وَأَنْتَ صَحِيحٌ شَحِيحٌ تَخْشَى الفَقْرَ، وَتَأْمَلُ الغِنَى، وَلَا تُمْهِلْ حَتَّى إِذَا بَلَغَتِ الحُلْقُومَ. قُلْتَ: لِفُلانٍ كَذَا وَلِفُلانٍ كَذَا، وَقَدْ كَانَ لِفُلانٍ» متفقٌ عليه.

90. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం: ఒక వ్యక్తి దైవప్రవక్త (స) దగ్గరకు వచ్చి "ఓ దైవప్రవక్తా! ప్రతిఫలం రీత్యా ఎలాంటి దానం గొప్పది?" అనడిగాడు. దానికి ఆయన ఇలా అన్నారు : "నీవు ఆరోగ్యంగా ఉన్నావు, నీకు సంపదపై వ్యామోహం కూడా ఉంది, (ఖర్చుచేస్తే) ఎక్కడ పేదవాణ్ణయిపోతానోనన్న భయంతోపాటు ధనవంతుణ్ణవ్వాలన్న ఆశ కూడా ఉంది, అలాంటి పరిస్థితిలో చేసే దానం (పుణ్యం రీత్యా గొప్పది), కాబట్టి నీవు దానధర్మాలు చేయడంలో ఆలస్యం చేయకు! ఆఖరికి ప్రాణం పీకలమీదకు వచ్చినప్పుడు వాడికి ఇంత

ఇవ్వండి, వీడికి ఇంత ఇవ్వండి అని నువ్వు అన్నా లాభముండదు. ఎందు కంటే అప్పటికే అది ఒకడి (వారసుడి) సొంతం అయిపోయి వుంటుంది.

(బుఖారీ - ముస్లిం)

'హుల్‌ఖూమ్' శ్వాసనాళిక, 'మరీవు' ఆహారనాళిక.

«الحُلْقُومُ»: مَجْرَى النَّفَسِ. و«المَرِيءُ»: مَجْرَى الطَّعامِ وَالشَّرابِ.

*(సహీహ్ బుఖారీలోని వీలునామాల ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడిఉంది.)*

## ముఖ్యాంశాలు

మనిషి అన్నివిధాలా ఆరోగ్యంగా ఉన్నప్పుడు చేసే దానధర్మాలే నిజమైన దానధర్మాలుగా పరిగణించబడతాయి. జీవిత కాలమంతా పిసినిగొట్టుగా వ్యవహరించి తీరా మృత్యువు దాపురించినప్పుడు చేసే దానాలకు దేవుని దృష్టిలో ఏమంత ప్రాధాన్యత ఉండదు. పైగా ఆ సమయంలో మనిషి తన ధనంలో మూడోవంతుకంటే ఎక్కువ ధనాన్ని దానధర్మాలకోసం వెచ్చించనూ లేడు. తతిమ్మా ధనంపై వారసులకు హక్కు ఏర్పడుతుంది. కనుక దానిని దైవమార్గంలో ఖర్చుపెట్టడానికి వీలులేదు. అందుకే చావుబతుకుల్లో ఉన్నప్పుడు మనిషి తన ధనంలో నుండి దానాలుచేయాలన్నా లేక విరాళాలు ఇవ్వాలన్నా మూడోవంతుకన్నా ఎక్కువ ధనాన్ని ఇవ్వకూడదని ఆదేశించబడింది. ఇంకా ఈ హదీసులో మానవుడు సత్కార్యాల విషయంలో ముఖ్యంగా దానధర్మాలు చేయడంలో ఆలస్యం చేయకుండా ఆతురత కనబరచాలని కూడా చెప్పబడింది.

91. హజ్రత్ అనస్ (రజి) కథనం : ఉహుద్ సంగ్రామం జరిగిన రోజు దైవ ప్రవక్త (సల్లం) ఒక ఖడ్గాన్ని చేతిలో పట్టు కొని "ఇది ఎవరు తీసుకుంటారు?" అని ప్రకటించారు. దానికోసం సహచరు లందరూ చేతులు చాపారు. నేనంటే నేనని ఎగబడ్డారు. అప్పుడు ఆయన "దీనిని తీసుకొని దీని హక్కును నెర వేర్చగల వాడెవడు?" అని అడిగారు.

٩١ ـ الخامس: عن أنسٍ رضي الله عنه، أَنَّ رسولَ الله ﷺ أَخَذَ سَيْفاً يَوْمَ أُحُدٍ فَقَالَ: «مَنْ يَأْخُذُ مِنِّي هٰذَا؟» فَبَسَطُوا أَيْدِيَهُمْ، كُلُّ إِنسَانٍ مِنهُمْ يَقُولُ: أَنَا، أَنَا. قَالَ: «فَمَنْ يَأْخُذُهُ بِحَقِّهِ؟»، فَأَحْجَمَ القَوْمُ، فَقَالَ أَبو دُجَانَةَ رضي الله عنه: أَنَا آخُذُهُ بِحَقِّهِ، فَأَخَذَهُ فَفَلَقَ بِهِ هَامَ

الْمُشرِكِينَ. رواه مسلم. اسمُ أَبِي دُجَانَةَ: سِمَاكُ بْنُ خَرشَةَ. قَوْلُهُ: «أَحْجَمَ القَوْمُ»: أَيْ تَوَقَّفُوا. و«فَلَقَ بِهِ»: أي شَقَّ، «هَامَ الْمُشرِكِينَ»: أي رُؤُوسَهُم.

అది విని అందరూ వెనక్కి తగ్గారు. వారిలో అబూ దుజానా (రజి) ముందుకు వచ్చి "నేను దానిని తీసుకొని దాని హక్కును నెరవేర్చగలను" అన్నారు. ఆ విధంగా ఆయన దైవప్రవక్త (సల్లం) నుంచి ఖడ్గం తీసుకొని బహుదైవారాధకులను చీల్చిచెండాడారు. (ముస్లిం)

"అహ్జమల్ ఖౌమ్" అంటే వారు తటపటాయించారని అర్థం. 'ఫలఖ' అంటే చీల్చడం, చించడం. హామల్ ముష్రికీన్ అంటే బహుదైవారాధకుల తలలు.

*(సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల ఘనతా విశిష్టతలు)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా హజ్రత్ అబూ దుజానా (రజి) గారి ధైర్యసాహసాల ప్రశస్తి వెల్లడౌతోంది. అంటే దీనర్థం ఇతర సహచరులు పిరికితనాన్ని ప్రదర్శించారని కాదు. వాస్తవానికి తాము ఆ కరవాలం హక్కు నెరవేర్చలేమన్న భయంతోనే ఇతర సహచరులు దైవప్రవక్త నుండి దాన్ని పుచ్చుకోటానికి తటపటాయించారు. అందుకే మొదటిసారి ఆయన ఎలాంటి షరతు లేకుండా ఖడ్గం ఎవరు తీసుకుంటారని ప్రకటించినప్పుడు అందరూ ఎగబడ్డారు. ఖడ్గం తీసుకునే ఉద్దేశ్యం దానితో దైవమార్గంలో యుద్ధం చేయటమే. ఆ యుద్ధపిపాసలో మాత్రం ఏ సహచరుడూ వెనుకంజవేయలేదు.

٩٢ ـ السَّادس: عن الزُّبَيْرِ بْنِ عديٍّ قال: أَتَيْنَا أَنَسَ بْنَ مَالِكٍ رضي الله عنه فَشَكَوْنَا إِلَيْهِ مَا نَلْقَى مِنَ الحَجَّاجِ. فَقَالَ: «اصْبِروا فَإِنَّه لا يَأْتِي زَمَانٌ إِلَّا والَّذي بَعْدَهُ شَرٌّ مِنْهُ حَتَّى تَلْقَوا رَبَّكُمْ» سَمِعْتُهُ مِنْ نَبِيِّكُمْ ﷺ. رواه البخاري.

92. హజ్రత్ జుబైర్ బిన్ అదీ కథనం : మేము అనస్ బిన్ మాలిక్ (రజి) దగ్గరికి వెళ్ళి హజ్జాజ్ ఆగడాల గురించి ఆయనకు ఫిర్యాదు చేశాము. అప్పుడు ఆయన "ఓర్పు వహించండి! ఎందుకంటే, మీరు మీ ప్రభువును కలుసుకునే వరకూ మీపై వచ్చే కాలం అంతకంతకూ దిగజారిపోతూనే ఉంటుంది. ఈ

విషయం నేను మీ ప్రవక్త నోట విన్నాను" అని చెప్పారు. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని ఉపద్రవాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

రాను రాను పరిస్థితులు మరింత హీనంగా తయారవుతాయని, అదేవిధంగా ప్రజాధికారులు కూడా నైతికంగా నానాటికీ దిగజారిపోతుంటారని ఈ హదీసులో భవిష్యత్తును గురించి సూచించడం జరిగింది. అలాంటి పరిస్థితిలో అధికారులను వారి మానాన వారిని వదలిపెట్టి ప్రజల్లోని ప్రతి ఒక్కడూ స్వీయ సంస్కరణ గురించి ఆలోచించాలని, పరలోకంలో తనకు ఏ గతి పడుతుందోనని చింతిస్తూ ఉండాలని ఈ హదీసు బోధపరుస్తోంది. అధికారులు హింసాదౌర్జన్యాలకు పాల్పడితే ఓర్చుకోవాలని, సహనం వహించాలని అంటోంది.

٩٣ - السَّابع: عن أبي هريرة رضي الله عنه أن رسولَ الله ﷺ قال: «بادِروا بالأعْمَالِ سَبْعاً، هَلْ تَنْتَظِرُونَ إلَّا فَقْراً مُنْسِياً، أو غِنًى مُطْغِياً، أَوْ مَرَضاً مُفْسِداً، أَوْ هَرَماً مُفْنِداً أَوْ مَوْتاً مُجْهِزاً أَوْ الدَّجَّالَ فَشَرُّ غَائِبٍ يُنْتَظَرُ، أَوِ السَّاعَةَ فالسَّاعَةُ أَدْهَى وَأَمَرُّ!؟» رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

93. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ప్రబోధించారు : ఏడు రకాల అవస్థలు దాపురించకముందే మంచి పనులు చేయడానికి త్వరపడండి. మీరు (ధర్మాన్ని) మరచిపోయేటట్లు చేసే పేదరికం కోసం ఎదురుచూస్తున్నారా? హద్దుమీరి ప్రవర్తించేటట్టు చేసే కలిమిని కోరుకుంటున్నారా? మీ ఆరోగ్యాన్ని పాడుచేసే రోగం కోసం ఎదురు చూస్తున్నారా? లేక బుద్ధిని, వివేకాన్ని చెడ గొట్టే వృద్ధాప్యం కోసం ఎదురు చూస్తున్నారా? లేక తృటిలో ఉసురుతీసే చావుకోసం ఎదురుచూస్తున్నారా? లేక కనిపించని కీడుల్లో అత్యంత హానికరమైన దజ్జాల్ (ఉపద్రవాగ్రేసరుని) రాక కోసం ఎదురు చూస్తున్నారా? లేక ప్రళయం కోసం

ఎదురుచూస్తున్నారా? ప్రళయమైతే కడు భయంకరమైనది, చేదైనది.

ఈ హదీసును తిర్మిజీ ఉల్లేఖించి, 'హసన్'గా పేర్కొన్నారు.

*(తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయము)*

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన అవరోధాలు ఎదురైతే మనిషి సత్కార్యాలు చేసే భాగ్యాన్ని కోల్పోతాడని; అందుకని అవరోధాలు, ఆటంకాలు ఎదురుకాకముందే మానవుడు సత్కార్యాలు చేసి తన పరలోక జీవితాన్ని తీర్చిదిద్దుకోవాలని ఈ హదీసు చెబుతోంది.

٩٤ ـ الثامن: عنه أن رسولَ الله ﷺ قال يومَ خَيْبَرَ: «لأُعْطِيَنَّ هٰذِهِ الرَّايَةَ رَجُلاً يُحِبُّ اللهَ وَرَسُولَهُ، يَفْتَحُ اللهُ عَلَى يَدَيْهِ»، قال عُمَرُ رضي الله عنه: مَا أَحْبَبْتُ الإِمَارَةَ إِلَّا يَوْمَئِذٍ، فَتَسَاوَرْتُ لَهَا رَجَاءَ أَنْ أُدْعَى لَهَا، فَدَعَا رسولُ الله ﷺ عليَّ بنَ أَبي طَالب، رضي الله عنه، فَأَعْطَاهُ إِيَّاهَا،

94. దైవప్రవక్త (సల్లం) ఖైబర్ యుద్ధం జరిగిన రోజున ఇలా అన్నారని హ్రజత్ అబూహురైరా (రజి)యే ఉల్లేఖించారు: "నేను ఈ జెండాను దైవాన్నీ, ఆయన ప్రవక్తనూ ప్రేమించే వ్యక్తికి ఇస్తాను. దేవుడు అతని చేతుల మీదుగానే విజయాన్ని ప్రసాదిస్తాడు." హ్రజత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) ఇలా అన్నారు: నేనెన్నడూ పదవులు కోరుకోలేదు. కాని ఆ రోజు మాత్రం (ఆ భాగ్యం నాకు లభిస్తే బాగుండునని నా మనసు ఉవ్విళ్ళూరింది). అందుకే ఆ పదవి (సారథ్యం) కోసం నన్ను పిలుస్తారేమోనని నేను ఆతురతతో లేచి తొంగి తొంగి చూడసాగాను. (హదీసు ఉల్లేఖకులు అంటున్నారు.) ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) హ్రజత్ అలీని పిలిచి, ఆయనకు జెండాను అందజేస్తూ, "వెళ్ళు, దేవుడు

وَقَالَ: «امْشِ وَلا تَلْتَفِتْ حَتَّى يَفْتَحَ اللهُ عَلَيْكَ» فَسَارَ عَلِيٌّ شَيْئاً ثُمَّ وَقَفَ وَلَمْ يَلْتَفِتْ؛ فَصَرَخَ: يَا رسولَ الله، على ماذَا أُقاتل النَّاسَ؟ قالَ: «قَاتِلْهُمْ حَتَّى يَشْهَدوا أَنْ لَا إِلٰهَ إِلَّا الله، وَأَنَّ مُحَمَّداً رسولُ الله، فإذَا فَعَلُوا ذلكَ فَقَدْ مَنَعُوا مِنْكَ دِمَاءهُمْ وَأَمْوَالَهُمْ إلَّا بِحَقِّهَا، وَحِسَابُهُمْ عَلَى الله» رواه مسلم.

నీ ద్వారా విజయాన్ని ప్రసాదించేదాకా అటూ ఇటూ చూడకు" అని ఉపదేశించారు. హ్రజత్ అలీ (రజి) కొంతదూరం నడిచాక ఒకచోట ఆగిపోయారు. కాని ఎటూ చూడలేదు. "ఓ దైవప్రవక్తా! నేను ఏ ప్రాతిపదికపై ప్రజలతో పోరాడాలి?" అని బిగ్గరగా అడిగారు. "అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యదైవం లేడనీ, ముహమ్మద్ దైవప్రవక్త అని వారు సాక్ష్యమిచ్చేదాకా నీవు వారితో పోరాడు. వారు గనక అలా చేస్తే, నిస్సందేహంగా వారు నీ నుండి తమ ప్రాణాలను ధనాన్ని రక్షించుకున్న వారవుతారు. అయితే న్యాయపరంగా వారి ప్రాణాల నుండి, ధనం నుండి ప్రతీకారం తీర్చుకోవటం జరుగుతుంది. అంటే వారు ఏ ముస్లింనైనా హతమారిస్తే ప్రతీకారంగా అతణ్ణి కూడా హత మార్చడం జరుగుతుంది. ఎవరి ధనాన్నైనా కబళించినా లేక జకాత్ దానం చెల్లించకపోయినా అతణ్ణుండి దానిని వసూలు చేయడం అవసరం. నోటితో ఇస్లాం స్వీకరించామని అంటే చాలు వారి ప్రాణాలకూ, వారి ధన సంపదలకూ ఎలాంటి హాని జరగదు. (ఒకవేళ వారు మనస్పూర్తిగా ఇస్లాం స్వీకరించనట్లైతే) వారి లెక్క అల్లాహ్ చూసుకుంటాడు.

«فَتَسَاوَرْت» هُوَ بالسِّين المهملة: أيْ وَثَبْتُ مُتَطَلِّعاً.

అంటే ప్రళయం రోజు అల్లాహ్ స్వయంగా వారిని లెక్క అడుగుతాడు. (ముస్లిం)

'ఫతసావర్తు' అంటే నేను లేచి దైవప్రవక్త (సఅసం) వైపు తొంగి చూసేవాడిని, అని అర్థం.

*(సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల ఘనతావిశిష్టతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో హజ్రత్ అలీ (రజి) గారి ప్రత్యేకత, ఆయన విశిష్ఠతలు పొందు పరచబడ్డాయి.
2. దైవప్రవక్త గారి మహిమ ఇందులో బోధపడుతోంది. ఖైబర్ యుద్ధంలో జయం తమదేనని ఆయన ముందుగానే చెప్పారు. అన్నట్లుగానే ఆ యుద్ధంలో ముస్లింలే జయించారు.
3. బాహ్య పరిస్థితులను బట్టి ఇస్లామీయ ఆదేశాలు వర్తిస్తాయి. కనుక ఎవరైనా నోటితో తను ఇస్లాం స్వీకరించానని అంటే అతణ్ణి ముస్లింగానే భావించటం జరుగుతుంది. అతని అంతరంగాన్ని మాత్రం దైవానికే వదలివేయడం జరుగుతుంది. అయితే అలాంటివారు అన్యాయంగా హత్యకు పాల్పడితే లేక ధర్మం నుండి తిరిగిపోతే మాత్రం అందుకు ప్రాయశ్చిత్తంగా వారిని కూడా హతమార్చడం జరుగుతుంది.



11వ అధ్యాయం

# ١١- بَابٌ فِي الْمُجَاهَدَةِ

# పోరాట పటిమ

قال الله تعالى: ﴿ وَالَّذِينَ جَاهَدُوا فِينَا لَنَهْدِيَنَّهُمْ سُبُلَنَا وَإِنَّ اللَّهَ لَمَعَ الْمُحْسِنِينَ ﴾ [العنكبوت: ٦٩]، وقال تعالى: ﴿ وَاعْبُدْ رَبَّكَ حَتَّى يَأْتِيَكَ الْيَقِينُ ﴾ [الحجر: ٩٩]، وقال تعالى: ﴿ وَاذْكُرِ اسْمَ رَبِّكَ وَتَبَتَّلْ إِلَيْهِ تَبْتِيلًا ﴾ [المزمل: ٨] أي: انْقَطِعْ إِلَيْه. وقال تعالى: ﴿ فَمَن يَعْمَلْ مِثْقَالَ ذَرَّةٍ خَيْرًا يَرَهُ ﴾ [الزلزلة: ٧]، وقال تعالى: ﴿ وَمَا تُقَدِّمُوا لِأَنفُسِكُم مِّنْ خَيْرٍ تَجِدُوهُ عِندَ اللَّهِ هُوَ خَيْرًا وَأَعْظَمَ أَجْرًا وَاسْتَغْفِرُوا اللَّهَ إِنَّ اللَّهَ غَفُورٌ رَّحِيمٌ ﴾ [المزمل: ٢٠]، وقال تعالى: ﴿ وَمَا تُنفِقُوا مِنْ خَيْرٍ فَإِنَّ اللَّهَ بِهِ عَلِيمٌ ﴾

అల్లాహ్ సెలవిచ్చాడు : "మా కొరకు తీవ్ర ప్రయత్నం చేసే వారికి మేము మా మార్గాలను చూపుతాము, నిశ్చయంగా అల్లాహ్ సజ్జనులతో పాటే ఉంటాడు." (అల్ అన్ కబూత్ : 69)

మరొకచోట అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు : "అవశ్యంగా వచ్చే చివరి గడియవరకూ నీ ప్రభువు దాస్యం చేస్తూ ఉండు."

(అల్ హిజ్ర్ : 99)

ఇంకొకచోట అల్లాహ్ ఇలా అంటున్నాడు : "నీ ప్రభువు నామాన్ని స్మరిస్తూ ఉండు, అన్నిటినీ వదలి పూర్తిగా ఆయనకే అంకితమైపో. (అంటే అన్నిటినీ త్యజించి ఆయన వైపునకే దృష్టిని మరల్చు). (అల్ ముజ్జమ్మిల్ : 8)

వేరొకచోట సెలవీయబడింది : "ఎవడైనా రవ్వంత సత్కార్యం చేసి ఉన్నా సరే దాన్ని అతను చూసుకుంటాడు."

(అజ్ జిల్ జాల్ : 8)

మరొకచోట పరమప్రభువు ఇలా అంటున్నాడు: "మీరు ఏ సత్కార్యాన్ని మీ కోసం ముందుగా పంపించుకుంటారో, దానిని మీరు అల్లాహ్ వద్ద చూసుకుంటారు. అదే చాలా శ్రేష్ఠమైనది మరియు దాని ప్రతిఫలం చాలా పెద్దది. అల్లాహ్‌ను క్షమాభిక్ష కోసం అర్థిస్తూ ఉండండి. నిస్సందేహంగా అల్లాహ్ గొప్ప క్షమాశీలుడు, కరుణామయుడూను." (అల్ ముజ్జమ్మిల్ : 20)

[البقرة: ٢٧٣] والآيات في الباب كثيرة معلومة.

وَأَما الأحاديث:

ఇంకొకచోట అల్లాహ్ ఇలా అంటున్నాడు : "మీరు ఏమి ఖర్చుచేసినా, అది అల్లాహ్‌కు తెలియకుండా ఉండదు." (అల్ బఖర : 273)

ఈ అధ్యాయం క్రింద ఇంకా అనేక సుప్రసిద్ధ సూక్తులు ఉన్నాయి.

٩٥ ـ فالأول: عن أبي هريرة رضي الله عنه، قال: قال رسول الله ﷺ: «إنَّ الله تعالى قال: مَنْ عَادَى لِي وَلِيّاً فَقَدْ آذَنْتُهُ بِالْحَرْبِ. وَمَا تَقَرَّبَ إلَيَّ عَبْدِي بِشَيْءٍ أَحَبَّ إلَيَّ مِمَّا افْتَرَضْتُ عَلَيْهِ. وَمَا يَزَالُ عَبْدِي يَتَقَرَّبُ إلَيَّ بِالنَّوَافِلِ حَتَّى أُحِبَّه، فإذَا أَحْبَبْتُهُ كُنْتُ سَمْعَهُ الَّذي يَسْمَعُ به، وَبَصَرَهُ الَّذي يُبْصِرُ بِهِ، وَيَدَهُ الَّتي يَبْطِشُ بِهَا، وَرِجْلَهُ الَّتي يَمْشي بِهَا، وَإنْ سَأَلَنِي أَعْطَيْتُهُ؛ وَلَئِن اسْتَعَاذَنِي لأُعِيذَنَّهُ» رواه البخاري. «آذَنْتُهُ»: أعْلَمْتُهُ بأنِّي مُحارِبٌ لَهُ «اسْتَعَاذَنِي» رُوي بالنون وبالباء.

95. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారని హజ్రత్ అబూహురైరా (రజి) తెలియజేశారు : అల్లాహ్ అన్నాడు: ఎవడైతే నా స్నేహితునితో శత్రుత్వం పెట్టుకుంటాడో నేనతనిపై యుద్ధాన్ని ప్రకటిస్తున్నాను. నేను నా దాసుడిపై విధిగా చేసిన విషయాలను ఆచరించి అతను నాకు దగ్గరయితే అంతకన్నా నాకు ప్రీతికరమైన విషయం మరొకటి లేదు (అంటే విధులను ఆచరించి నా సామీప్యాన్ని పొందటం అంటే నాకు అత్యంత యిష్టం). ఇంకా నా దాసుడు నవాఫిల్ (స్వచ్ఛంద సత్కార్యాల) ద్వారా కూడా నాకు దగ్గరవుతూ ఉంటాడు. క్రమంగా నేనతణ్ణి ప్రేమిస్తాను. నేనతణ్ణి ప్రేమించడం మొదలుపెడితే, (క్రమ క్రమంగా) నేను అతను వినే చెవినైపోతాను, అతను చూసే కంటినైపోతాను, అతను పట్టుకునే చేయినైపోతాను, ఇంకా అతను నడిచే కాలునైపోతాను, అతను నాతో ఏదైనా అడిగితే నేనతనికి తప్పకుండా ఇస్తాను. దేని నుండి అయినా శరణువేడితే నేనతనికి తప్ప కుండా శరణు ఇస్తాను. *(బుఖారీ)*

'అజన్తుహూ' అంటే నేను నీతో యుద్ధానికి తలపడుతున్నానని అతనికి తెలియజేస్తున్నాను అని అర్థం. హదీసులో ప్రస్తావించబడిన 'ఇస్తఅజనీ' అనే పదం 'ఇస్తఅజబీ'గా కూడా ఉల్లేఖించబడింది.

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. వినూత్న పోకడలను అనుసరించేవారు, బహుదైవారాధకులు కొందరు తమ మిధ్యాభావాలకు ఈ హదీసును నిదర్శనంగా చూపెడుతున్నారు. వాస్తవానికి పై హదీసు భావం వారనుకుంటున్నది కాదు. వారు హదీసుకు వక్రభాష్యం చెబుతూ తప్పులపై తప్పులు చేస్తున్నారు. పై హదీసుకు స్పష్టమైన, ఖచ్చితమైన వివరణ ఏమిటంటే, మనిషి దేవుని విధులను నిర్వర్తించడంతోపాటు నఫిల్ (స్వచ్ఛంద) సత్కార్యాలు కూడా చేస్తూ ఉంటే అతను దేవునికి ప్రియతముడైపోతాడు. ఫలితంగా అతనికి దైవసహాయం లభిస్తూ ఉంటుంది, దేవుడు అతణ్ణి తన రక్షణలోకి తీసుకుంటాడు, అతని శరీరావయవాలను పర్యవేక్షిస్తుంటాడు, కాబట్టి అటువంటి వ్యక్తి దైవవిధేయతకు, ఇతర చెడుగులకు దూరంగా ఉంటాడు. ఆ విధంగా ఆ దాసుడు తన చెవులతో ఏది విన్నా, తన కళ్ళతో ఏది చూసినా, తన చేతులతో ఏది పట్టుకున్నా దేవుని అభీష్టం ప్రకారమే చేస్తాడు. అతని కాళ్ళు ఎటు నడిచి వెళ్ళినా అందులో దైవప్రసన్నత దాగి ఉంటుంది. ఈ రకమైన దైవప్రియత్వం, దైవవిధేయతల స్థానానికి దాసుడు చేరుకుంటే దేవుడు అతని ప్రార్థనలను తప్పకుండా స్వీకరిస్తాడు.

2. 'వలీ' అంటే ప్రత్యేకమైన వేషధారణతో సాధువుగా ఉండేవాడనో, సన్యాసి బైరాగిఅనో, ప్రాపంచిక ధ్యాస లేనివాడనో, సగం పిచ్చివాడనో, ఆరాధన విషయంలో తనదైన ఒక ఒరవడిని సృష్టించుకున్నవాడనో అర్థం కాదు. పైగా 'వలీ' అంటే ఇస్లామీయ విధులను ఖచ్చితంగా నిర్వర్తించేవాడనీ, స్వచ్ఛంద ఆరాధనలపట్ల సయితం ఎంతో మక్కువ గలవాడనీ, జీవితపు అన్ని రంగాలలో, సమస్త విభాగాలలో దైవవిధేయతకు కట్టుబడి ఉండేవాడనీ, తన ఉనికి ద్వారా సాటి మనుషులకు ఎలాంటి నష్టం వాటిల్లకుండా, హద్దులు అతిక్రమించకుండా ఉండేవాడనీ భావం.

3. అలాంటి దేవుని ప్రియదాసులను ప్రేమించేవారిపట్ల అల్లాహ్ కూడా ప్రసన్నుడౌతాడు. వారితో శత్రుత్వం పెట్టుకునేవారు దైవాగ్రహానికి గురౌతారు.

4. నఫిల్ (స్వచ్ఛంద)సత్కార్యాలను పాటిస్తే దేవుని సామీప్యం పొందుతారన్నమాట నిజమే. అయితే దేవుని విధులు (ఫర్జ్‌లు) ప్రవక్త సున్నతులను ఆచరించడంతోపాటు నఫిల్

సత్కార్యాలు చేస్తే లాభముంటుందిగాని ఫర్జ్‌లను (విధులను), సున్నతులను విడిచిపెట్టి, నఫిల్ కార్యాలు చేస్తే ఒరిగేదేమీ ఉండదు. ఫర్జ్‌లు, సున్నత్‌లతో నిమిత్తం లేకుండా కేవలం నఫిల్ కార్యాలతోనే దైవసామీప్యాన్ని పొందవచ్చునన్నది ఓ అభూతకల్పన, పసలేని వాదన.

٩٦ ـ الثاني: عن أنس رضي الله عنه، عن النَّبيِّ ﷺ فيمَا يَرْوِيهِ عَنْ رَبِّهِ عَزَّ وَجَلَّ قال: «إذَا تَقَرَّبَ العَبْدُ إلَيَّ شِبْراً تَقَرَّبْتُ إلَيْهِ ذِرَاعاً، وَإذَا تَقَرَّبَ إلَيَّ ذِرَاعاً تَقَرَّبْتُ منهُ بَاعاً، وَإذَا أتَانِي يَمْشِي أتَيْتُهُ هَرْوَلَةً» رواه البخاري.

96. తన ప్రభువు ఇలా అన్నాడంటూ దైవప్రవక్త (సల్లం) ఉల్లేఖించిన విషయాన్ని గురించి హజ్రత్ అనస్ (రజి) ఇలా తెలియజేశారు : "దాసుడు నాకు జానెడు దూరం దగ్గరయితే నేనతనికి మూరెడు దగ్గరవుతాను. అతను మూరెడు దూరం దగ్గరైతే నేను బారెడు దగ్గరవుతాను. అతను నా వైపుకు నడుచుకుంటూ వస్తే నేనతని వైపుకు పరుగెత్తుకుంటూ వస్తాను." *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ఏకేశ్వరోపాసన ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దాసులపై దేవుని దయాదాక్షిణ్యాలు, కరుణాకటాక్షాలు వివరించబడ్డాయి. దాసులు చేసే చిన్న చిన్న సత్కార్యాలను దేవుడు ఇంతలంతలు చేసి పుణ్యం ప్రసాదిస్తాడని చెప్పబడింది.

٩٧ ـ الثالث: عن ابن عباس رضي الله عنهما قال: قال رسولُ الله ﷺ: «نِعْمَتَانِ مَغْبُونٌ فِيهِمَا كَثِيرٌ مِنَ النَّاسِ: الصِّحَّةُ، والفَرَاغُ» رواه البخاري.

97. దైవప్రవక్త (సల్లం) ప్రబోధించారని హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) తెలియజేశారు : రెండు వరాలున్నాయి. వాటి దుర్వినియోగం వల్ల అనేక మంది నష్టానికి గురవుతారు. అవి : ఆరోగ్యం, తీరిక. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. హదీసులో 'ఘుబన్' అనే పదం వచ్చింది. ఘుబన్ అంటే నష్టం. తన వస్తువుని అతి తక్కువ ధరకు అమ్మటం లేదా ఇతరుల నుండి ఒక వస్తువును దాని అసలు ధరకంటే రెండు మూడు రెట్లు అధిక ధరకు కొనటాన్ని ఘుబన్ అని చెప్పుకోవచ్చు. ఈ రెండు పరిస్థితుల్లోనూ మనిషికి నష్టమే వాటిల్లుతుంది. తనకు నష్టం జరిగినప్పుడు మనిషి చాలా విచారపడ్డాడు.

పై హదీసులో మనిషిని ఒక వ్యాపారిగా మరియు ఆరోగ్యం, తీరికలను పెట్టుబడిగా అభివర్ణించడం జరిగింది. పెట్టుబడిని జాగ్రత్తగా ఉపయోగించుకున్న వ్యాపారి లాభాన్ని పొందుతాడు. దీనికి విరుద్ధంగా పెట్టుబడిని దుర్వినియోగం చేసుకుంటే నష్టాన్ని చవిచూడవలసి వస్తుంది. అదేవిధంగా ఆరోగ్యం, తీరిక లాంటి ప్రకృతి వరాలను సరిగ్గా వినియోగించుకోకపోతే మనిషి ప్రళయదినం నాడు చాలా విచారపడ్తాడనీ, బాధపడతాడని ఈ హదీసు హెచ్చరిస్తోంది.

2. మనుషుల్లో అనేకమంది ఈ రెండు భాగ్యాల విలువను గుర్తించరు. అందుకే వాళ్ళు తమ సమయాన్ని నిష్ప్రయోజనకరమైన పనుల్లో దుబారాగా వెచ్చిస్తుంటారు. తమ శరీర సత్తువను, దైవ అవిధేయతకు దారితీసే పనుల్లో వినియోగిస్తుంటారు. ప్రళయదినాన దేవుడు ఒక్కో విషయం గురించి లెక్క అడిగినప్పుడు మనిషి తన్ను తాను నిందించుకోవలసిన పరిస్థితి ఏర్పడుతుంది.

٩٨ ـ الرابع: عن عائشةَ رضي الله عنها، أَنَّ النَّبيَّ ﷺ كَانَ يَقُومُ مِنَ اللَّيْلِ حَتَّى تَتَفَطَّرَ قَدَمَاهُ، فَقُلْتُ لَهُ: لِمَ تَصْنَعُ هٰذَا يَا رَسُولَ اللهِ، وَقَدْ غَفَرَ اللهُ لَكَ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِكَ وَمَا تَأَخَّرَ؟! قَالَ: «أَفَلَا أُحِبُّ أَنْ أَكُونَ عَبْداً شَكُوراً؟» متفقٌ عليه. هذا لفظ البخاري، ونحوه في الصحيحين من رواية المُغيرة بن شُعْبَةَ.

98. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) రాత్రిళ్ళు తన పాదాలపై వాపు వచ్చేంతవరకూ నమాజులో నిలబడేవారు. అది చూసి నేను "మీకు ఇంత శ్రమ దేనికీ? అల్లాహ్ గతంలో మీవల్ల జరిగిన పాపాలను, జరగబోయే పాపాలను కూడా మన్నిం చేశాడు కదా?!" అని అడిగాను. దానికి ఆయన "నేను దైవానికి కృతజ్ఞుడైన దాసుణ్ణి కాకూడదా?" అని అనేవారు. (బుఖారీ - ముస్లిం, వాక్యాలు మాత్రం బుఖారీలోనివి. బుఖారీ - ముస్లింలలో ఇలాంటిదే ముగీరా బిన్ షోబా (రజి) ఉల్లేఖనం కూడా ఉంది.)

*(సహీహ్ బుఖారీలోని 'తహజ్జుద్' ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని 'కపటుల' ప్రకరణంలోనూ ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

1. దైవప్రవక్తలందరూ దురలవాట్ల వల్ల జరిగే ఘోర పాపాల (కబీరా గునాహ్)కు అతీతంగా ఉంటారన్న విషయమై యావత్తు ముస్లిం సమాజం ఏకాభిప్రాయంతో ఉంది. అయితే చిన్న చిన్న తప్పులు - మానవ సహజమైన దౌర్బల్యాల మూలంగా - దైవప్రవక్తల వల్ల కూడా జరగవచ్చని కొంతమంది విద్వాంసులు అభిప్రాయపడుతున్నారు. కాని దైవప్రవక్తలు ఇలాంటి

చిన్న తప్పుల నుండి కూడా పునీతులని అత్యధిక మంది విద్వాంసులు వాదిస్తున్నారు. మరి దేవుడు దైవప్రవక్తను మన్నించాడన్న దానికి అర్థం ఏమిటన్న ప్రశ్న ఈ సందర్భంగా తలెత్తుతుంది. వాస్తవం ఏమిటంటే సజ్జనులకు ఫర్వాలేదనిపించే పనులే దేవుని ప్రియదాసులకు మహాపాతకాలుగా తోస్తాయి. దైవప్రవక్త (సల్లం) తీసుకున్న కొన్ని నిర్ణయాలు ఉత్తమంగా లేకపోవటం చేత వాటిని తప్పులుగా, పొరపాట్లుగా అభివర్ణించడం జరిగింది. అయితే దేవుడు వాటిని కూడా క్షమించేశానని ప్రకటించాడు.

2. దేవుడు ఎవరికి ఎంతగా అనుగ్రహిస్తే వారు అంతగానే దైవానికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. దానికోసం దేవుని విధులను నిర్వర్తిస్తూ, దైవవిధేయతను పాటించడంతోపాటు వీలైనంత ఎక్కువగా స్వచ్ఛంద సత్కార్యాలు (నవాఫిల్) కూడా చేస్తూ ఉండాలి.

٩٩ ـ الخامس: عن عائشة رضي الله عنها أنها قالت: «كان رسولُ الله ﷺ إذَا دَخلَ العَشْرُ أَحْيَا اللَّيْلَ، وَأَيْقَظَ أَهْلَهُ، وَجَدَّ وَشَدَّ المِئْزَرَ» متفقٌ عليه. والمراد: العَشْرُ الأَوَاخِرُ مِنْ شهر رمضانَ. وَ«الْمِئْزَرُ»: الإِزَارُ، وَهُوَ كِنَايَةٌ عَنِ اعْتِزَالِ النِّسَاءِ، وَقيلَ: المُرَادُ تَشْمِيرُهُ للعِبَادَةِ. يُقَالُ: شَدَدْتُ لِهَذَا الأَمْرِ مِئْزَرِي، أيْ: تَشَمَّرْتُ، وَتفَرَّغْتُ لَهُ.

99. హజ్రత్ ఆయిషా (రజి.అన్‌హా) కథనం : దైవప్రవక్త (సల్లం) (రమజాన్ నెలలోని చివరి) దశకం ప్రారంభం కాగానే రాత్రిళ్ళు జాగారం చేసేవారు. తన ఇంటివారిని కూడా (రాత్రి ఆఖరి జాములో) మేల్కొలిపేవారు. (దైవారాధనలో) బాగా శ్రమించేవారు. నడుం బిగించేవారు. *(బుఖారీ - ముస్లిం)*

'అల్ అష్రుల్ అవాఖిర్' అంటే రమజాన్ నెలలోని చివరి దశకం. 'మీజర్' అంటే క్రిందివస్త్రం. ఆయన ఈ కాలంలో భార్యలకు దూరంగా ఉండేవారన్న విషయాన్ని ఈ పదం ద్వారా చూచాయగా చెప్పడం జరిగింది. మరికొంతమంది అభిప్రాయంలో దీనర్థం దైవారాధన కోసం నడుం బిగించడం. సాధారణంగా నేను ఈ పనికోసం నడుం కట్టుకున్నాను అని అంటారు. అంటే ఈ పనికోసం నేను సిద్ధమయ్యానని, తీరిగ్గా ఉన్నానని భావం.

*(సహీహ్ బుఖారీలోని 'తరావీహ్ నమాజు' ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని 'ఏతెకాఫ్' ప్రకరణంలోనూ ఈ హదీసును పొందుపరచడం జరిగింది.)*

## ముఖ్యాంశాలు

శుభప్రదమైన ఘడియలలో వీలైనంత ఎక్కువగా దైవారాధనలో గడపాలి, సత్కార్యాలు చేయాలి. దైవప్రవక్త (సల్లం) విధానం కూడా ఇదే.

١٠٠ ـ السادس: عن أبي هريرةَ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «المُؤْمِنُ القَوِيُّ خَيْرٌ وَأَحَبُّ إِلَى اللهِ مِنَ المُؤْمِنِ الضَّعِيفِ وَفي كُلٍّ خَيْرٌ. احْرِصْ عَلَى مَا يَنْفَعُكَ، واسْتَعِنْ باللهِ وَلَا تَعْجَزْ. وَإِنْ أَصَابَكَ شَيْءٌ فَلا تَقُلْ: لَوْ أَنِّي فَعَلْتُ كَانَ كَذَا وَكَذَا، وَلٰكِنْ قُلْ: قَدَرُ اللهِ، وَمَا شَاءَ فَعَلَ؛ فَإِنَّ (لَوْ) تَفْتَحُ عَمَلَ الشَّيْطَانِ». رواه مسلم.

100. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలియజేశారు : బలవంతుడైన విశ్వాసి బలహీనుడైన విశ్వాసికన్నా మెరుగైన వాడు, దేవునికి ప్రీతిపాత్రుడు. అయితే ప్రతి ఒక్కరిలోనూ (బలవంతుడైనా, బలహీనుడైనా) మంచి ఉంటుంది. మీకు ప్రయోజనం చేకూర్చే దానికోసమే ఆశపడండి. దైవ సహాయాన్ని అర్థించండి. లొంగిపోకండి. మీకేదైనా నష్టం కలిగితే ఇలా చేసినట్లైతే ఆ విధంగా జరిగేదే! అని అనకండి. దానికి బదులు దైవ నిర్ణయం ఇదేనేమో! ఆయన తాను కోరినది చేశాడు అని అనండి. ఎందుకంటే 'అయితే గీతే' అన్న పదాలు షైతాన్ పోకడలకు దారితీస్తాయి.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని 'విధివ్రాత' ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. బలవంతుడైన విశ్వాసి, బలహీనుడైన విశ్వాసి - ఇరువురిలోనూ మంచి ఉంటుందని పై హదీసులో చెప్పబడింది. ఈమాన్ (విశ్వాసం) అనేది వారిరువురిలోనూ ఉమ్మడిగా వున్న ధర్మం. అయితే బలవంతుడైన విశ్వాసి బలహీనుడైన విశ్వాసికన్నా యోగ్యుడనీ, అల్లాహ్‌కు ప్రియమైనవాడని చెప్పబడింది. ఎందుకంటే విశ్వాసి బలంగలవాడైతే ఆరాధనలు, విధులు, సున్నతులు చక్కగా నిర్వర్తించగలడు. ఇంకా దైవమార్గంలో పోరాడటానికి కూడా ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటాడు.

2. కష్టాల వలయంలో చిక్కుకున్నప్పుడు సహనాన్ని, స్థైర్యాన్ని, దైవ నిర్ణయాల పట్ల తన అంగీకారభావాల్ని ప్రదర్శించాలి. అంతేగాని ఇలా చేసినట్లయితే అలా జరిగేది కాదేమో! అని అనకూడదు. ఎందుకంటే అయితే, గీతే అంటూ కాకిలెక్కలు వేసినప్పుడు షైతాన్‌కు మనిషిని సన్మార్గం నుండి తప్పించడానికి అవకాశం దొరుకుతుంది.

١٠١ - السابع: عنه أَنَّ رسولَ الله ﷺ قال: «حُجِبَتِ النَّارُ بالشَّهَواتِ، وحُجِبَتِ الجَنَّةُ بالمَكَارِهِ» متفقٌ عليه. وفي روايةٍ لمسلم: «حُفَّت» بَدَلَ «حُجِبَتْ» وَهُوَ بمَعْنَاهُ؛ أيْ: بَيْنَهُ وَبَيْنَهَا هٰذا الحِجابُ؛ فإذا فَعَلَهُ دَخَلَهَا.

101. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉపదేశించారు: నరకం మనోవాంఛలతో ఆవరించబడి ఉన్నది. స్వర్గం అవాంఛనీయమైన పనులతో కప్పబడి ఉన్నది. *(బుఖారీ - ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో 'హుజిబత్'కు బదులు 'హుఫ్ఫత్' అన్న పదం ఉంది. రెండింటికీ అర్థం ఒక్కటే. మనిషికీ మరియు స్వర్గనరకాలకు మధ్య ఈ అడ్డుతెర ఉంది. మనిషి ఆయా పనులు చేస్తే స్వర్గంలోనో లేక నరకంలోనో ప్రవేశిస్తాడని భావం అన్నమాట.

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం, ఇంకా సహీహ్ ముస్లింలోని స్వర్గభాగ్యాల వర్ణన ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసుకు భావం ఏమిటంటే, మనిషికీ - నరకానికి మధ్య మనోవాంఛలు, ప్రాపంచిక సుఖాలు అడ్డంగా ఉన్నాయి. మనిషి తన మనోవాంఛలు, ప్రాపంచిక సుఖాల్లో చిక్కుకుంటే క్రమంగా అతను నరకంలోకి ప్రవేశిస్తాడు. దీనికి విరుద్ధంగా మనిషికీ - స్వర్గానికి మధ్య కష్టాలు, ఆపదలు లేదా ఇస్లాం ధర్మాదేశాలు, విధులు అడ్డంగా ఉన్నాయి. అలాంటి ఆపత్సమయాల్లో సహనాన్ని ప్రదర్శించడం, ఇస్లాం ధర్మ విధులను నిర్వర్తించడం మనిషికి ఒకింత కష్టంగా తోచినప్పటికీ పుణ్యఫలాపేక్షతో ఓర్చుకుంటే అతను స్వర్గప్రవేశానికి అర్హతను సంపాదిస్తాడు.

١٠٢ ـ الثامن: عن أبي عبدِ الله حُذَيْفَةَ بْنِ اليَمَانِ، رضي الله عنهما، قال: صَلَّيْتُ مَعَ النَّبيِّ ﷺ ذَاتَ لَيْلَةٍ، فَافْتَتَحَ البَقَرَةَ، فَقُلْتُ يَرْكَعُ عِنْدَ المِائَةِ، ثُمَّ مَضَى؛ فَقُلْتُ يُصَلِّي بِهَا فِي رَكْعَةٍ، فَمَضَى؛ فَقُلْتُ يَرْكَعُ بِهَا، ثُمَّ افْتَتَحَ النِّسَاءَ؛ فَقَرَأَهَا، ثُمَّ افْتَتَحَ آلَ عِمْرَانَ فَقَرَأَهَا، يَقْرَأُ مُتَرَسِّلاً إِذَا مَرَّ بِآيَةٍ فِيهَا تَسْبِيحٌ سَبَّحَ، وَإِذَا مَرَّ بِسُؤَالٍ سَأَلَ، وَإِذَا مَرَّ بِتَعَوُّذٍ تَعَوَّذَ، ثُمَّ رَكَعَ فَجَعَلَ يَقُولُ: «سُبْحَانَ رَبِّيَ العَظِيمِ» فَكَانَ رُكُوعُه نَحْواً مِنْ قِيَامِهِ ثُمَّ قَالَ: «سَمِعَ اللهُ لِمَنْ حَمِدَهُ»

102. హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ హుజైఫా బిన్ యమాన్ (రజి) కథనం : ఒకరాత్రి నేను దైవప్రవక్త (సల్లం) వెంట నమాజు చేశాను. నమాజులో ఆయన బఖర సూరా చదవటం ప్రారంభించారు. నేను (మనసులో) ఆయన నూరు వాక్యాల తరువాత రుకూ చేస్తారని అనుకున్నాను. కాని (నూరు వాక్యాలు అయిపోయిన తరువాత కూడా) ఆయన పారాయణాన్ని కొనసాగించారు. నేను (మనసులో) ఒక రకాతులో దీనిని చదువుతారేమో అనుకున్నాను. కాని ఆ తరువాత కూడా ఆయన ఇంకా చదువుతూనే ఉన్నారు. నేను ఈ సూరా పూర్తవగానే రుకూ చేస్తారేమో అనుకున్నాను. కాని (బఖరా సూరా పూర్తవగానే) ఆయన నిసా సూరా మొదలెట్టారు. అది కూడా పూర్తిగా చదివి ఆలి ఇమ్రాన్ సూరా చదవటం ప్రారంభించారు. అదీ పూర్తిగా చదివారు. నిదానంగా చదువుతూనే ఏదైనా వాక్యంలో దేవుని పవిత్రతను గురించిన ప్రస్తావన వస్తే అక్కడ దేవుని పవిత్రతను కొనియాడేవారు. దైవాన్ని అర్థించమనే వాక్యాలు వచ్చినప్పుడు అక్కడ ఆగి దైవాన్ని అర్థించేవారు, దేవుని శరణు వేడే ప్రస్తావన వస్తే దైవాన్ని శరణువేడుకునేవారు. (ఈ విధంగా ఆలి ఇమ్రాన్ సూరా పూర్తయిన తరువాత) ఆయన రుకూ చేశారు. రుకూలో 'సుబ్హాన రబ్బియల్ అజీం' అని పలికారు. ఆయన రుకూ దాదాపు

رَبَّنَا لَكَ الحَمْدُ» ثمَّ قَامَ قِيَاماً طَوِيلاً قَرِيباً مِمَّا رَكَعَ، ثمَّ سَجَدَ فَقَالَ: «سُبْحَانَ رَبِّيَ الأَعْلَى» فَكَانَ سُجُوْدُهُ قَرِيباً مِنْ قِيَامِهِ. رواه مسلم.

ఆయన ఖియామ్ (నిలబడి) నంతసేపు పట్టింది. తరువాత ఆయన 'సమి యల్లాహు లిమన్ హమిదా' అంటూ రుకూ నుంచి లేచి నిలబడ్డారు. అప్పుడు కూడా ఇంచుమించు రుకూ చేసి నంతసేపు నిలబడ్డారు (ఖౌమా చేశారు.) ఆ తరువాత సజ్దా చేశారు. సజ్దాలో 'సుబ్‌హాన రబ్బియల్ ఆలా' అని చదివారు. ఆయన సజ్దా కూడా ఆయన నిలబడినంతసేపు పట్టింది. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని 'ప్రయాణీకుల నమాజు' ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

1. నఫిల్ నమాజులను సామూహికంగా చేయవచ్చని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.
2. నమాజులో ఖుర్ఆన్ పారాయణం చేసినప్పుడు సూరాల వరుస క్రమాన్ని పాటిస్తూ చదవాలన్న నియమం లేదు. కొంతమంది వరుసక్రమాన్ని పాటించడం అవసరమని తలపోస్తున్నారు. కాని హదీసులో దైవప్రవక్త (సల్లం) ముందుగా సూరె నిసాను పఠించి ఆ తరువాత ఆలి ఇమ్రాన్ సూరాను పఠించడం గమనార్హం!
3. నఫిల్ నమాజులను సుదీర్ఘంగా చేయడం అభిలషణీయం.

١٠٣ ـ التاسع: عن ابن مسعود رضي الله عنه قال: صَلَّيْتُ مَعَ النَّبِيِّ ﷺ لَيْلَةً فَأَطَالَ القِيَامَ حَتَّى هَمَمْتُ بِأَمْرِ سُوءٍ! قِيلَ: وَمَا هَمَمْتَ بِهِ؟ قَالَ: هَمَمْتُ أَنْ أَجْلِسَ وَأَدَعَه. متفقٌ عليه.

103. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం : ఒక రాత్రి నేను దైవప్రవక్త (సల్లం)తో పాటు నమాజ్ చేశాను. ఆ నమాజులో దైవప్రవక్త (సల్లం) చాలా సేపు నిలబడి ఉన్నారు. నేను (ఆయనతో పాటు నిలబడలేక) ఒక చెడుపని చేద్దామని సంకల్పించు కున్నాను.

'అప్పుడు మీరేమి చేయదలచు కున్నారు?' అని ఎవరో అడగ్గా, "నేను

ఆ నమాజులో దైవప్రవక్తను అనుసరించకుండా కూర్చుందామనుకున్నాను" అని ఆయన చెప్పారు. (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని 'తహజ్జుద్' ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

1. నమాజులో ఇమామ్‌ను అనుసరించకుండా దానికి వ్యతిరేకమైన పనులు చేయటం చెడ్డ పని అని ఈ హదీసు చెబుతోంది. ఎందుకంటే ముఖ్తదీలు (అనుయాయులు) తప్పకుండా ఇమామ్‌ను అనుసరించాలని ఆదేశించబడింది.

2. సందేహాన్ని నివృత్తి చేసుకోవడం కోసం ప్రశ్నించడం ధర్మసమ్మతమేనని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది.

١٠٤ ـ العاشر: عن أنس رضي الله عنه، عن رسول الله ﷺ قال: «يَتْبَعُ المَيِّتَ ثَلاثَةٌ: أَهْلُهُ وَمَالُه وَعَمَلُه؛ فَيَرْجع اثْنَانِ وَيَبْقَى وَاحِدٌ: يَرْجِعُ أَهْلُهُ وَمَالُهُ، وَيَبْقَى عَمَلُهُ» متفقٌ عليه.

104. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారని హజ్రత్ అనస్ (రజి) తెలియజేశారు : మృతుని వెంట మూడు వస్తువులు వెళతాయి - అతని పరివారం, అతని సంపత్తి, అతని కర్మలు. వాటిలో రెండు వస్తువులు వెనక్కి తిరిగి వస్తాయి. ఒక్కటి మాత్రం అతనికి తోడుగా ఉంటుంది. అతని పరివారం, అతని ధనసంపదలు తిరిగి వస్తాయి. అతను చేసుకున్న కర్మలు మాత్రం తోడుగా ఉంటాయి. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణంలోనూ ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

మనిషి వీలైనంత ఎక్కువగా సత్కర్మలు చేసుకోవాలని ఈ హదీసులో పురికొల్పడం

జరిగింది. మనిషి చనిపోయిన తరువాత అతని బంధుమిత్రులందరూ అతణ్ణి సమాధిలో పూడ్చిపెట్టి అతణ్ణి ఒంటరిగా విడిచి వెళ్ళిపోతారు. అలాంటి భయంకరమైన సమాధి చీకట్లలో అతని సదాచరణ ఒక్కటే తోడుగా ఉండి, అతణ్ణి అక్కడి యాతనల నుంచి కాపాడుతుంది.

١٠٥ ـ الحادي عشر: عن ابن مسعود رضي الله عنه قال: قال النبي ﷺ: «الْجَنَّةُ أَقْرَبُ إِلى أَحَدِكُمْ مِنْ شِرَاكِ نَعْلِهِ وَالنَّارُ مِثْلُ ذلِكَ» رواه البخاري.

105. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : స్వర్గం మీ పాదుక పట్టీ కన్నా మీకు దగ్గరలో ఉంది. అదేవిధంగా నరకం కూడా అంతే సమీపంలో ఉంది. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

స్వర్గమైనా, నరకమైనా మనిషి చేసుకున్న కర్మలకు ప్రతిఫలంగా లభించేదే కాబట్టి ఈ రెండూ మనిషికి అత్యంత సమీపంలో ఉన్నాయని, చేతికందినంత దగ్గరలో ఉన్నాయని హదీసులో అభివర్ణించడం జరిగింది. మనిషి సత్కర్మలు చేస్తే స్వర్గానికి పోతాడు, దుష్కర్మలు చేస్తే నరకాగ్నికి ఆహుతి అవుతాడు. మనిషికీ, స్వర్గ నరకాలకు మధ్య ఒక్క మరణమే అడ్డుగోడగా ఉంది. అది తొలగిపోయిననాడు అతడు స్వర్గ సుఖాలకు అర్హుడవుతాడో లేక నరక జ్వాలలకు ఆహుతి అవుతాడో తేల్చేయడం జరుగుతుంది.

١٠٦ ـ الثاني عشر: عن أبي فِراسٍ رَبيعَةَ بْنِ كَعْبٍ الأَسْلَمِيِّ خَادِمِ رسول الله ﷺ، وَمِنْ أَهْلِ الصفَّةِ رضي الله عنه قال: كُنْتُ أَبِيتُ مَعَ رسول الله ﷺ، فَآتِيهِ بِوَضوئِهِ وحَاجَتِهِ، فقَالَ: «سَلْني»، فقُلْت: أَسْأَلُكَ مُرَافقَتَكَ في الجَنَّةِ. فقَالَ: «أَوَ غيرَ ذلِكَ؟»، قُلْت: هُوَ ذاكَ، قال: «فَأَعِنِّي عَلى نَفْسِكَ بكَثْرَةِ السُّجُودِ» رواه مسلم.

106. దైవప్రవక్త (సల్లం) సేవకులు మరియు సుఫ్ఫా విద్యార్థుల్లో ఒకరైన హజ్రత్ అబూ ఫిరాస్ రబీయా బిన్ కాబ్ అస్లమీ (రజి) కథనం : నేను రాత్రిపూట దైవప్రవక్త (సల్లం) వెంట ఉండేవాడిని. ఆ సమయంలో నేనాయనకు వుజూ చేసుకోవటానికి నీళ్ళు, ఇతర అవసరమైన వస్తువులు అందించేవాణ్ణి. (ఒకరోజు ఆయన నా పట్ల ప్రసన్నులై) "నానుండి నీకేం కావాలో కోరుకో" అన్నారు. అందుకు నేను "స్వర్గంలో మీకు తోడుగా ఉండే భాగ్యాన్ని కోరుకుంటున్నాను" అని విన్నవించు

కున్నాను. తిరిగి ఆయన "ఇంకా ఏమైనా కోరుకుంటున్నావా" అని అడిగారు. దానికి నేను "అది చాలు" అని అన్నాను. అప్పుడు ఆయన "మరయితే దానికోసం ఎక్కువగా సజ్దాలు చేస్తూ నాకు చేదోడుగా ఉండు" అని అన్నారు. (అంటే ఎక్కువగా నఫిల్ నమాజులు చేస్తూ ఉండు. ఈ విధంగా కోరిక సిద్ధించే మార్గంలో నాకు చేదోడుగా ఉండు. ఎందుకంటే నా ప్రార్థనతోపాటు నీ శ్రమ కూడా దానికి మరింత బలం చేకూర్చుతుంది.)

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని నమాజు ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. మస్జిదె నబవీ ప్రాంగణంలో ఒక అరుగు ఉండేది. అరబీ భాషలో అరుగును "సుప్ఫా" అంటారు. ఇస్లాంలో ఇది ప్రప్రథమ విద్యాపీఠం. దైవప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం గారే ఈ విద్యాపీఠానికి గురువుగా, బోధకునిగా వ్యవహరించేవారు. దైవప్రవక్త దగ్గర ధర్మజ్ఞానాన్ని నేర్చుకోవడానికి వచ్చే నిరుపేదలు, అభాగ్యులైన విద్యార్థులు ఈ అరుగు దగ్గరే కాలం గడిపేవారు.

2. ఈ హదీసు ఆచరణలోని ప్రాముఖ్యతను, దైవప్రవక్త విధానాన్ని అనుసరించవలసిన ఆవశ్యకతను తేటతెల్లం చేసింది. ఈ రెండూ లేకపోతే రేయింబవళ్ళు దైవప్రవక్తతో పాటు గడిపిన ఆయన ప్రియసహచరులకు కూడా స్వర్గంలో ఆయన సాంగత్యం లభించదని హెచ్చరిస్తోంది. మరలాంటప్పుడు ఆచరణకు, దైవప్రవక్త (సల్లం) విధానానికి ఏమాత్రం విలువ ఇవ్వని వారికి ఆ భాగ్యం లభిస్తుందనడం సరైనదేనా?!

107. దైవప్రవక్త (సల్లం) చేత స్వేచ్ఛనొసగబడిన బానిస, హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ (కొంతమంది అబూ అబ్దుర్రహ్మాన్ అంటారు) సౌబాన్ (రజి), దైవప్రవక్త ఈ విధంగా ఉపదేశిస్తుండగా

١٠٧ ـ الثالث عشر: عن أبي عبدِ الله ـ وَيُقَال: أَبو عَبْدِ الرَّحْمٰنِ ـ ثَوْبَانَ مَوْلَى رسولِ الله ﷺ قال: سَمِعتُ رسولَ الله ﷺ يقول: «عَلَيْكَ بِكَثْرَةِ

السُّجُودِ؛ فَإِنَّكَ لَنْ تَسْجُدَ لله سَجْدَةً إلَّا رَفَعَكَ اللهُ بهَا دَرَجَةً، وَحَطَّ عَنْكَ بهَا خَطِيئَةً». رواه مسلم.

తాను విన్నానని తెలియజేశారు: "సౌబాన్! నీవు ఎక్కువగా సజ్దాలు చేస్తూ ఉండు. ఎందుకంటే నీవు చేసే ప్రతి సజ్దాకు బదులుగా అల్లాహ్ నీకు ఒకింత పదోన్నతి కల్పిస్తాడు. మరియు ఒక పాపాన్ని తొలగిస్తాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సజ్దాలు ఎక్కువగా చేయడమంటే నమాజులు పాటించడమని అర్థం. ఫర్జ్ నమాజులే గాకుండా నఫిల్ నమాజులు కూడా చేస్తూ ఉంటే అవి విశ్వాసి స్థానాలను ఉన్నతం చేయటంతోపాటు పాపాలకు పరిహారంగా కూడా దోహదపడతాయి.

١٠٨ - الرابع عشر: عن أبي صَفْوَانَ عبدِ الله بنِ بُسْرٍ الأَسْلَمِيِّ، رضي الله عنه، قال: قال رسول الله ﷺ: «خَيْرُ النَّاسِ مَنْ طَالَ عُمُرُه وحَسُنَ عَمَلُه» رواه الترمذي، وقال: حديثٌ حسنٌ.
«بُسْر»: بضم الباءِ وبالسين المهملة.

108. హజ్రత్ అబూ సఫ్వాన్ అబ్దుల్లాహ్ బిన్ బుస్ర్ అస్లమీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : దీర్ఘాయుషుతో పాటు సదాచరణ కలిగిన వ్యక్తి ప్రజలందరిలోకెల్లా ఉత్తముడు.

(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్'గా పేర్కొన్నారు.)

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయములు)*

## ముఖ్యాంశాలు

విశ్వాసం (ఈమాన్), సదాచరణలతోపాటు దీర్ఘాయుషు లభించడం కూడా ఒక వరమే. దీనికి విరుద్ధంగా ఈ రెండింటిలో ఏది లోపించినా ఆయువు పెరిగిన కొద్దీ జీవితం పాపాల పుట్టగా తయారవుతుంది. ఇటువంటి దీర్ఘాయుషు మనిషి పాలిట వినాశకరంగా పరిణమిస్తుంది.

2. ఈ వరం విలువను గుర్తించనివారు చాలా నష్టపోతారు.

١٠٩ - الخامس عشر: عن أنس رضي الله عنه، قال: غَابَ عَمِّي أَنَسُ بنُ

109. హజ్రత్ అనస్ (రజి) కథనం : నా బాబాయి అనస్ బిన్ నజర్ బద్ర్ యుద్ధంలో పాల్గొనలేదు. (అందుకు

النَّضْرِ رضي الله عنه، عن قِتالِ بَدْرٍ، فقال: يا رسولَ الله غِبْتُ عَن أَوَّل قِتَالٍ قَاتَلْتَ المُشْرِكينَ، لَئِنِ اللهُ أَشْهَدَنِي قِتَالَ المُشْرِكينَ لَيُرِيَنَّ اللهُ مَا أَصْنَعُ. فَلَمَّا كَانَ يَوْمُ أُحُدٍ انْكَشَفَ المُسْلِمُونَ، فَقَالَ؛ اللَّهُمَّ أَعْتَذِرُ إِلَيْكَ مِمَّا صَنَعَ هَؤُلَاءِ - يَعْنِي أَصْحَابَه - وَأَبْرَأُ إِلَيْكَ مِمَّا صَنَعَ هَؤُلَاءِ - يَعْنِي المُشْرِكِينَ - ثُمَّ تَقَدَّمَ فَاسْتَقْبَلَهُ سَعْدُ بْنُ مُعَاذٍ، فَقَالَ: يَا سَعْدُ بْنَ مُعَاذٍ الجَنَّةُ وَرَبِّ الكَعْبَةِ، إِنِّي أَجِدُ رِيحَهَا مِنْ دُونِ أُحُدٍ. قَالَ سَعْدٌ: فَمَا اسْتَطَعْتُ

ఆయన ఎంతగానో విచారపడేవారు). ఒకసారి ఆయన దైవప్రవక్త (సల్లం)తో ఇలా అన్నారు - "దైవప్రవక్తా! మీరు బహుదైవారాధాకులతో చేసిన తొలి యుద్ధంలో నేను పాల్గొనలేదు. ఒకవేళ దేవుడు భవిష్యత్తులో నాకు బహుదైవారాధకులతో యుద్ధం చేసే అవకాశాన్ని కల్పించినట్లయితే అప్పుడు నేనేం చేస్తానో అల్లాహ్ చూస్తాడు (లేక చూపిస్తాడు)."

(కొంతకాలం తరువాత) ఉహుద్ యుద్ధం జరిగిన నాడు (ప్రారంభంలో) ముస్లింలు చెల్లాచెదరై ఓడిపోయారు. అప్పుడు ఆయన (నా బాబాయి) ఇలా అన్నారు - "ఓ దేవా! వీరి (వెనక్కి తగ్గిపోయిన నా స్నేహితుల) చేతకానితనానికి, ఇంకా ఈ బహుదైవారాధకుల నిర్వాకానికి నేను అతీతుణ్ణి" (ఇలా అన్న తరువాత) ఆయన ముందుకు నడిచారు. అప్పుడు ఆయనకు సాద్ బిన్ ముఆజ్ (రజి) ఎదురయ్యారు. ఆయన సాద్ (రజి) నుద్దేశించి "ఓ సాద్ బిన్ ముఆజ్! కాబాగృహపు ప్రభువుతోడు! ఉహుద్ కొండలకన్నా దగ్గర్లో నుంచి నాకు స్వర్గసువాసన వస్తోంది" అంటూ (శత్రువుల పంక్తుల్లోకి చొచ్చుకుపోయి వీరోచితంగా పోరాడుతూ అమరగతి నొందారు.) అప్పుడు హజ్రత్ సాద్ (రజి) "దైవప్రవక్తా! ఆయన చేసినది నా వల్ల

يا رَسولَ اللهِ مَا صَنَعَ! قال أنسٌ: فَوَجَدْنَا بِهِ بِضْعاً وَثَمَانِينَ ضَرْبَةً بالسَّيْفِ، أَوْ طَعْنَةً بِرُمْحٍ، أَوْ رَمْيَةً بِسَهْمٍ، وَوَجَدْنَاهُ قَدْ قُتِلَ وَمَثَّلَ بِهِ المُشرِكُونَ فَمَا عَرَفَهُ أَحَدٌ إلا أُختُهُ بِبَنَانِهِ. قال أنسٌ: كُنَّا نَرَى أَوْ نَظُنُّ أنَّ هَذِهِ الآيَةَ نَزَلَتْ فِيهِ وَفِي أَشْبَاهِهِ: ﴿مِّنَ ٱلْمُؤْمِنِينَ رِجَالٌ صَدَقُوا۟ مَا عَٰهَدُوا۟ ٱللَّهَ عَلَيْهِ﴾ [الأحزاب: ٢٣] إلى آخرها، متفقٌ عليه.

قوله: «لَيُرِيَنَّ اللهُ» رُوي بضم الياء وكسر الراء؛ أيْ: لَيُظْهِرَنَّ اللهُ ذٰلِكَ للنَّاسِ ورُوي بفتحهما، ومعناه ظاهر والله أعلم.

కాలేకపోయింది" అని విచారం వ్యక్తం చేశారు.

హ॥జత్ అనస్ (రజి) అంటున్నారు : మేము ఆయన శరీరంపై ఎనభై కంటే ఎక్కువ ఖడ్గం వేటులు, ఈటె పొడు పులు మరియు బాణాల గాయాలు చూశాము. మేము చూసేటప్పటికే ఆయన హత్యచేయబడి వున్నారు. హత్య చేయబడిన తరువాత బహుదైవా రాధకులు ఆయన మృతదేహాన్ని చీల్చి చెండాడారు. (ఆగ్రహావేశాలతో ఆయన శరీరావయవాలను ముక్కలు ముక్క లుగా నరికారు. ముఖాన్ని పాడు చేశారు). అందువల్ల ఎవరూ ఆయన్ని గుర్తుపట్టలేకపోయారు. చివరికి ఆయన చెల్లెలు ఆయన్ని వ్రేళ్ళ చిగుళ్ళ ఆధారంగా గుర్తుపట్టింది. హ॥జత్ అనస్ (రజి) అన్నారు : బహుశా ఈ దివ్య ఖుర్ఆన్ సూక్తి ఈయన మరియు ఈయన లాంటివారి గురించే అవత రించిందని మేమనుకుంటున్నాము- "విశ్వాసులలో కొందరు అల్లాహ్‌కు తాము చేసిన వాగ్దానాన్ని నిజం చేసి చూపినవారు ఉన్నారు......" (పూర్తి ఆయతు) (అల్ అహ్జాబ్ : 23)

*(బుఖారీ - ముస్లిం)*

'లయురియన్నల్లాహు' అంటే అల్లాహ్ దానిని ప్రజలముందు బహిరంగ పరుస్తాడు. ఇది 'లయరయన్నల్లాహు' అని కూడా ఉల్లేఖించబడుతోంది.

అప్పుడు దీనికి అల్లాహ్ చూస్తాడు అని అర్థం. (వల్లాహు ఆలము)

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం. సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

1. దైవమార్గంలో అమరగతినొంది స్వర్గంలోకి ప్రవేశించాలని ప్రవక్త సహచరులు ఎంతగా పరితపించిపోయేవారో ఈ హదీసు ద్వారా అవగతమవుతోంది.
2. మనిషి స్వచ్ఛందంగా మంచిపనులు చేయాలని భావించి దాని కోసం స్వయంగా కట్టుబడి ఉండటం ఎంతో అభిలషణీయమని కూడా ఈ హదీసు బోధపరుస్తోంది.

١١٠ - السادس عشر: عن أبي مسعودٍ عُقْبَةَ بنِ عَمْرو الأنصاريِّ البدريِّ رضي الله عنه قال: لَمَّا نَزَلَتْ آيَةُ الصَّدَقَةِ كُنَّا نُحَامِلُ على ظُهُورِنَا. فَجَاءَ رَجُلٌ فَتَصَدَّقَ بِشَيْءٍ كَثِيرٍ فَقَالُوا: مُرَاءٍ، وجاءَ رَجُلٌ آخَرُ فَتَصَدَّقَ بِصَاعٍ فقالوا: إنَّ اللهَ لَغَنِيٌّ عَنْ صاعِ هَذَا! فَنَزَلَتْ ﴿ الَّذِينَ يَلْمِزُونَ الْمُطَّوِّعِينَ مِنَ الْمُؤْمِنِينَ فِي الصَّدَقَاتِ وَالَّذِينَ لَا يَجِدُونَ إِلَّا جُهْدَهُمْ ﴾ [التوبة: ٧٩]. متفقٌ عليه [هذا لفظ البخاري]. و«نُحَامِلُ» بضم النون، وبالحاءِ المهملة: أيْ يَحْمِلُ أَحَدُنَا عَلَى ظَهْرِهِ بالأُجْرَةِ، وَيَتَصَدَّقُ بها.

110. హజ్రత్ అబూ మస్వూద్ ఉఖబా బిన్ అమ్ర్ అన్సారీ (రజి) కథనం: సదఖా (దానధర్మాల) సూక్తి అవతరించిన కాలంలో మేము వీపులపై మోపులు మోసేవాళ్ళం (అంటే కాయకష్టం చేసుకొని బ్రతికేవాళ్ళం). అలాంటి గడ్డు పరిస్థితుల్లో కూడా ఒక వ్యక్తి పెద్ద మొత్తంలో దానధర్మాలు చేశాడు. దానికి కపటులు ఇతను పరుల మెప్పుకోసం దానధర్మాలు చేస్తున్నాడని నిరుత్సాహపరచారు. మరో వ్యక్తి ఒక 'సా' (దాదాపు రెండున్నర కిలోల) ధాన్యం దానం చేయగా దేవుడికి ఈ రెండున్నర కిలోల ధాన్యం అక్కర్లేదంటూ కపటులు అతణ్ణి హేళన చేశారు. అప్పుడు ఈ సూక్తి అవతరించింది : "సంతోషంతో, ఇష్టంతో విశ్వాసులు చేసే ధన త్యాగాలను కించపరుస్తూ వారు మాట్లాడతారు. దేవుని మార్గంలో ఇచ్చేందుకు తాము శ్రమకోర్చి ఇచ్చేది తప్ప మరేదీ తమ వద్ద లేనివారిని

వారు హేళన చేస్తారు." (అత్ తౌబా:79)
(బుఖారీ - ముస్లిం)

వాక్యాలు మాత్రం బుఖారీలోనివి.

'నుహామిలు' అంటే మాలోని ఒక వ్యక్తి తన వీపుపై మోపులు మోసి దానివల్ల వచ్చిన కూలిని దానం చేసేవాడని భావం.

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణంలోనూ, మరియు సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ప్రతి మనిషీ తన శక్తిమేరకు దైవమార్గంలో ఖర్చుపెట్టాలని ఈ హదీసు బోధపరుస్తోంది. ఉంటే ఏదైనా ఇవ్వొచ్చు, లేకుంటే కొంతైనా దైవమార్గంలో ఖర్చుపెట్టవచ్చు. ఎక్కువగా దానధర్మాలు చేసేవారిని పరుల మెప్పుకోసం చేస్తున్నారని నిరుత్సాహపరచటం, తక్కువగా దానధర్మాలు చేసేవారిని హేళన చేయడం కపటుల లక్షణం అని కూడా పై హదీసు ద్వారా తెలుస్తోంది. విశ్వాసులు ఇలాంటి కపటాచారుల హేళనలకు నొచ్చుకోకుండా, తాము కూడా ఇతరులతో ఈ విధమైన దుర్భాషలాడకుండా జాగ్రత్తగా మసలుకోవాలి.

١١١ ـ السابع عشر: عن سعيدِ بنِ عبدِ العزيزِ، عن رَبيعةَ بنِ يزيدَ، عن أبي إدريسَ الخَوْلاَني، عن أبي ذَرٍّ جُنْدُبِ بنِ جُنَادَةَ، رضي الله عنه، عن النَّبيِّ ﷺ فِيمَا يَرْوِي عَنِ الله تبارك وتعالى أنه قال: «يا عِبَادي إِنِّي حَرَّمْتُ الظُّلْمَ عَلَى نَفْسِي وَجَعَلْتُهُ بَيْنَكُمْ مُحَرَّماً فَلاَ تَظَالَمُوا،

111. దైవప్రవక్త (సల్లం) అల్లాహ్ నుండి విన్న వృత్తాంతాన్ని సయీద్ బిన్ అబ్దుల్ అజీజ్, రబీయా బిన్ యజీద్ నుండి, ఆయన అబూ ఇద్రీస్ ఖౌలానీ నుండి, మరి ఆయన హజ్రత్ అబూజర్ జుందుబ్ బిన్ జునాదా (రజి) నుండి సేకరించారు : (అల్లాహ్ ఇలా అన్నాడు) "ఓ నా దాసులారా! నేను నాపై అన్యాయాన్ని నిషేధించుకున్నాను. అదే విధంగా మీ మధ్య కూడా దానిని నిషేధించాను. కనుక మీరు పరస్పరం అన్యాయానికి ఒడిగట్టకండి. నా దాసులారా! నేను సన్మార్గం చూపించిన వాడు తప్ప మీరందరూ మార్గభ్రష్టులే.

يا عِبَادِي كُلُّكُمْ ضَالٌّ إِلَّا من هَدَيْتُهُ؛ فَاسْتَهْدُونِي أَهْدِكُمْ، يَا عِبَادِي كُلُّكُمْ جَائِعٌ إِلَّا منْ أَطْعَمْتُهُ؛ فَاسْتَطْعِمُونِي أُطْعِمْكُمْ، يا عِبَادِي كُلُّكُمْ عَارٍ إِلَّا مَنْ كَسَوْتُهُ، فَاسْتَكْسُونِي أَكْسُكُم، يَا عِبَادِي إِنَّكم تُخطِئُونَ باللَّيلِ والنَّهَارِ وَأَنَا أَغْفِرُ الذُّنُوبَ جَمِيعًا، فَاسْتَغْفِرُونِي أَغْفِرْ لَكُمْ، يَا عِبَادِي إِنَّكُمْ لَنْ تَبْلُغُوا ضَرِّي فَتَضُرُّونِي، وَلَنْ تَبْلُغُوا نَفْعِي فَتَنْفَعُونِي، يَا عِبَادِي لَوْ أَنَّ أَوَّلَكُمْ وَآخِرَكُمْ، وَإِنْسَكُمْ وجِنَّكُمْ، كَانُوا عَلَى أَتْقَى قَلْبِ رَجُلٍ وَاحِدٍ منكُمْ مَا زَادَ ذَلكَ فِي مُلْكِي شَيْئًا، يا عِبَادِي لَوْ أَنَّ أَوَّلَكُمْ وَآخِرَكُمْ وَإِنْسَكُمْ وَجِنَّكُمْ كَانُوا

కనుక మార్గం చూపెట్టమని నన్ను అడగండి. నేను మీకు సన్మార్గం చూపిస్తాను. దాసులారా! నేను తినిపించినవాడు తప్ప మీరందరూ ఆకలిగొన్న వారే. కనుక అన్నం పెట్టమని నన్ను దగండి. నేను మీకు అన్నం తినిపిస్తాను. దాసులారా! నేను బట్టలు తొడిగించిన వాడు తప్ప మీరంతా నగ్నంగా ఉన్నవారే. కనుక బట్టలకోసం నన్ను అర్థించండి, నేను మీకు బట్టలు తొడిగిస్తాను. నా దాసులారా! మీరు రాత్రింబవళ్ళు తప్పులు చేస్తుంటారు. నేను పాపాలన్నిం టినీ తుడిచిపెట్టగలవాడను. కనుక క్షమాభిక్ష కోసం నన్ను మొరపెట్టుకోండి. మిమ్మల్ని నేను మన్నిస్తాను. నా దాసులారా! మీరు నాకు కీడు తలపెట్టే స్థానానికి చేరుకోలేరు. నాకు మేలు చేసే స్థాయికీ ఎదగలేరు.

ఓ నా దాసులారా! మొదటి నుంచి చివరి దాకా మీ మానవులు, జిన్నాతులందరూ కూడా మీలో అత్యంత దైవభక్తిపరాయణుడైన ఒక వ్యక్తిలా మారిపోయినా దానివల్ల నా సామ్రాజ్యానికి ఇసుమంత ప్రయోజనం ఉండదు. (అంతేకాదు) నా దాసులారా! మొదటి నుంచీ చివరిదాకా మీ మానవులు, జిన్నాతులందరూ కూడా మీలో అందరికన్నా పరమ అవిధేయిలాగా మారిపోయినా దానివల్ల నా సామ్రాజ్యానికి ఇసుమంత లోటు ఉండదు. ఓ నా దాసులారా! మొదటి నుంచి చివరిదాకా మీ మానవులు, జిన్నాతులందరూ ఒక స్థలంలో నిలబడి (తమ కోరికలు) నాతో అడిగితే,

عَلى اَفْجَرِ قَلْبِ رَجُلٍ وَاحِدٍ منكُمْ مَا نَقَصَ ذٰلكَ مِنْ مُلكِي شَيْئاً، يَا عِبَادِي لَوْ اَنَّ اَوَّلَكُمْ وَآخِرَكُمْ وَإِنسَكُمْ وَجِنَّكُمْ قَامُوا فِي صَعِيدٍ وَاحِدٍ، فَسَأَلُونِي فَاَعْطَيْتُ كلَّ إنسَانٍ مَسْأَلَتَهُ، مَا نَقَصَ ذٰلك مِمَّا عِنْدِي إلَّا كَمَا يَنْقُصُ المِخْيَطُ إذَا أُدْخِلَ البَحْرَ، يَا عِبَادِي إنَّمَا هِيَ اَعْمَالُكُمْ اُحْصِيهَا لَكُم، ثُمَّ اُوَفِّيكُم إيَّاهَا، فَمَنْ وَجَدَ خَيْراً فَلْيَحْمَدِ الله، وَمَنْ وَجَدَ غَيْرَ ذٰلكَ فَلا يَلُومَنَّ إلَّا نَفْسَهُ». قال سعيدٌ: كان أبو إدريسَ إذا حَدَّثَ بهذا الحديثِ جَثَا عَلى رُكبتيه. رواه مسلم. وروينا عن الإمام أحمدَ بنِ حنبلٍ رحمه الله قال: ليس لأهل الشام حديثٌ أَشرَفَ من هذا الحديث.

నేను వారందరికీ కోరుకున్నది ఇచ్చినప్పటికీ దానివల్ల నా దగ్గరున్న సంపదలో ఒక సూదిని సముద్రంలో ముంచి తీసినంతైనా లోటు ఏర్పడదు. నా దాసులారా! మీ కర్మలను నేను లెక్కపెట్టి ఉంచుతాను. ఆ తరువాత వాటికి పూర్తి ప్రతిఫలాన్ని ఇస్తాను. కనుక ఎవరికైనా మేలు కలిగితే అందుకు అతను దైవాన్ని స్తుతించాలి. ఎవరికైనా ఇతరత్రా ఏమైనా (కీడు) కలిగితే అందుకతను తన స్వయాన్నే నిందించుకోవాలి.

సయీద్ బిన్ అబ్దుల్ అజీజ్ (రహ్మాలై) ఉవాచ : అబూ ఇద్రీస్ ఖౌలానీ గారు ఎప్పుడు ఈ హదీసును వివరించినా తన మోకాళ్ళ ఆధారంగా పడిపోయేవారు. (దీనిని ముస్లిం ఉల్లేఖించారు. మేము దీనిని ఇమామ్ అహ్మద్ (రహ్మాలై) నుండి ఉల్లేఖించాము. ఆయన "సిరియా వాసుల దృష్టిలో దీనికన్నా విశిష్టత కలిగిన హదీసు మరొకటి లేదు" అని అన్నారు.)

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దేవుని శక్తిసామర్థ్యాలు, తిరుగులేని ఆయన ఆధిపత్యం విశదీకరించబడ్డాయి. కాబట్టి దాసులు ఏది అడగదలచుకున్నా ఆయన్నే అడగాలి. సన్మార్గం నుండి ఆహారం వరకు అన్నిరకాల భాండాగారాలు ఆయన దగ్గరే ఉన్నాయి. ఆ భాండాగారాలు కూడా ఏనాటికీ అంతం కానివి. విశ్వమంతా ఏకమై వ్యతిరేకించినా లేక సమర్థించినా ఎలాంటి మార్పులకూ గురికాని పటిష్టమైన రాజ్యాధికారం ఆయనది. అందుకే మనిషి అల్లాహ్ వాడై, క్షమాభిక్ష కోసం ఆయన్నే వేడుకుంటూ, తన అవసరాలు తీర్చమని ఆయన్ని మొరపెట్టుకోవడంలోనే అతని శ్రేయం ఇమిడివుంది.

**12వ అధ్యాయం**

# ١٢ ـ بَابُ الحَثِّ عَلَى الازْدِيَادِ مِنَ الخَيْرِ فِي أَوَاخِرِ العُمْرِ

# చరమ ఘడియల్లో వీలైనంత ఎక్కువగా సత్కార్యాలు చేయమని పురికొల్పడం గురించి.....

قال الله تعالى: ﴿أَوَلَمْ نُعَمِّرْكُم مَّا يَتَذَكَّرُ فِيهِ مَن تَذَكَّرَ وَجَاءَكُمُ النَّذِيرُ﴾ [فاطر: ٣٧] قال ابنُ عباس، والمُحَقِّقُونَ: مَعْنَاهُ: أَوَلَمْ نُعَمِّرْكُم سِتِّينَ سَنَةً؟ وَيُؤَيِّدُهُ الحَدِيثُ الَّذي سَنَذْكُرُهُ إنْ شاءَ الله تعالى، وقيل: معناه: ثمانيَ عَشْرَةَ سَنَةً، وَقِيلَ: أَرْبَعِينَ سَنَةً. قالهُ الحسن والكلبي ومَسْرُوقٌ، ونقلَ عن ابن عباس أيضاً. ونَقَلوا أنَّ أَهْلَ المدينةِ كانوا إذا بلغَ أَحَدُهُمْ أَرْبَعِينَ سَنَةً تَفَرَّغَ للعِبَادَةِ. وقيل: هو البُلُوغ.

అల్లాహ్ సెలవిచ్చాడు : "గుణపాఠం నేర్చుకోదల చినవాడు గుణపాఠం నేర్చుకోవడానికి సరిపడిన అయుష్షును మేము మీకు ఇవ్వలేదా? మీ వద్దకు హెచ్చరిక చేసేవాడు కూడా వచ్చి ఉన్నాడు కదా!" (ఫాతిర్ : 37)

హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) మరియు ఇతర పరిశోధకుల అభిప్రాయం ప్రకారం పై సూక్తి భావం : "మేము నీకు అరవై ఏళ్ళ ఆయుష్షు నొసగలేదా?" అని. ఇన్షాఅల్లాహ్ (రానున్న పేజీల్లో) మేము ప్రస్తావించబోతున్న హదీసు కూడా ఈ భావాన్ని సమర్థిస్తుంది. కొంతమంది పండితులు దీనర్థం పద్దెనిమిది సంవత్సరాలని, మరికొంతమంది నలభై సంవత్సరాలని అన్నారు. చివరి సంఖ్య హసన్ బస్రీ (రహ్మలై) కల్బీ, మరియు ఇమామ్ మస్రూఖ్‌లు అన్నది. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) నుంచి కూడా ఈ విధంగానే ఉల్లేఖించబడింది. మదీనా ప్రజలు నలభై ఏళ్ళ వయస్సు రాగానే ఆరాధన నిమిత్తం తీరుబడిగా ఉండేవారని కూడా వారు ఉల్లేఖించారు. అసలు దీనికి అర్థం ప్రాజ్ఞ వయస్సని ఇంకొంతమంది అభిప్రాయపడ్డారు. (చాలామంది ఇమాముల దృష్టిలో ప్రాజ్ఞవయస్సు పదిహేను సంవత్సరాలు. కాగా మరికొంత

وقوله تعالى: ﴿وَجَآءَكُمُ ٱلنَّذِيرُ﴾ قال ابنُ عباسٍ والجمهورُ: هو النبيُّ ﷺ، وقيل: الشَّيْب. قاله عِكرِمَةُ وابنُ عُيَيْنَةَ وغيرُهما. والله أعلم.

మంది; స్వప్నస్థలనం జరిగినప్పటి నుంచి ప్రాజ్ఞతగా పరిగణించడం జరుగుతుందని అభిప్రాయపడ్డారు.)

ఇంకా "మీ వద్దకు హెచ్చరిక చేసేవాడు కూడా వచ్చివున్నాడు కదా!" అన్న సూక్తిపై వ్యాఖ్యానిస్తూ హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) మరియు మెజారిటీ విద్వాంసులు, "ఇక్కడ హెచ్చరిక చేసేవాడంటే దైవప్రవక్త (సల్లం)" అని అన్నారు. అయితే ఇక్రిమా, ఇబ్నె ఉయైనా తదితరులు 'హెచ్చరిక చేసేవాడంటే మనిషి ముసలితనం' అని అభిప్రాయపడ్డారు. - వల్లాహు ఆలము

وَأَمَّا الأحاديث:

١١٢ ـ فالأوّل: عن أبي هريرةَ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «أَعْذَرَ اللهُ إلى امرِئٍ أَخَّرَ أَجَلَه حتى بَلَغَ سِتِّينَ سَنَةً» رواه البخاري. قال العلماء معناه: لَمْ يَتْرُكْ له عُذراً إذْ أَمْهَلَهُ هٰذِهِ المُدَّةَ. يُقالُ: أَعْذَرَ الرَّجُل إذا بَلَغَ الغَايَةَ في العُذْرِ.

112. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : దేవుడు మనిషి అరవైయేండ్ల దాకా బ్రతికుండేటట్లు అతని మరణాన్ని వాయిదావేస్తే ఇక అతని కోసం ఎలాంటి సాకులు వదల నట్లే. (అంటే ఇక అతను చూపెట్టే ఏ సాకునూ దేవుడు అంగీకరించడని అర్థం). దేవుడు మనిషికి ఇంత గడువు ఇచ్చాడంటే అతని కొరకు ఇక ఎలాంటి సాకులూ వదల్లేదనే దీని భావమని విద్వాంసులు అభిప్రాయపడ్డారు.

మనిషి సాకులు చూపెట్టడంలో పరాకాష్ఠకు చేరుకున్నప్పుడు 'ఆజరర్రజులు' అని వ్యవహరిస్తారు.

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఏదైనా కారణాన్ని పూర్తిచేయనంతవరకూ దేవుడు ఏ మనిషినీ, ఏ జాతినీ శిక్షకు గురిచేయడని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. అదేవిధంగా ఒక మనిషికి అరవైయేండ్ల

ఆయుష్షు లభించినప్పటికీ అతను విశ్వాస స్థితిలో చేయవలసిన పనులు చేయకుండా ఏమరుపాటులో జీవితాన్ని గడిపితే ఇక అతడు దైవశిక్ష నుంచి బయటపడటానికి దైవం ముందు ఎలాంటి సాకులూ చూపెట్టలేడని కూడా ఈ హదీసు బోధపరుస్తోంది.

2. మనిషి కనీసం అరవైయేండ్ల ప్రాయంలోనైనా ఏమరుపాటునుంచి తేరుకోవాలి. ఎందుకంటే ఆ తరువాత మరణ సమయం ఆసన్నమవుతుంది. మరణమైతే యవ్వనంలో కూడా వస్తుందనుకోండి. కాని యవ్వనంలో అలాంటి అవకాశాలు చాలా తక్కువ కాబట్టి జీవితంపై ఆశ ఉండవచ్చు. అయితే అరవై సంవత్సరాల తరువాత కూడా ఇంకా జీవితంపై ఆశపెట్టుకొని మునుపటిలాగే పాపాలు చేయటం, దైవ అవిధేయతకు ఒడిగట్టడం ఎంతో శోచనీయం. (అల్లాహ్ మనల్ని రక్షించుగాక!)

١١٣ - الثاني: عن ابن عباس، رضي الله عنهما، قال: كانَ عمرُ رضي الله عنه يُدْخِلُني مَعَ أَشْيَاخِ بَدْرٍ، فَكَأَنَّ بَعْضَهُمْ وَجَدَ في نَفْسِهِ فقال: لِمَ يَدْخُلُ هٰذَا معنا وَلَنَا أَبْنَاءٌ مِثْلُه؟! فقال عمرُ: إنَّه مِنْ حَيْثُ عَلِمتُمْ! فَدَعاني ذَاتَ يَوْم فَأَدْخَلَني مَعَهُمْ، فما رَأَيْتُ أَنَّه دعاني يَوْمَئِذٍ إلَّا لِيُرِيَهُمْ قال: ما تقولون في قول الله تعالى: ﴿إِذَا جَآءَ نَصْرُ ٱللَّهِ وَٱلْفَتْحُ ۝﴾ [النصر: ١]، فقال بعضهم: أُمِرْنَا نَحْمَدُ اللهَ وَنَسْتَغْفِره إذَا نَصَرَنَا وَفَتَحَ عَلَيْنَا. وَسَكَتَ بعضهمْ فلم يَقُلْ شَيْئاً. فقال لي: أَكَذلك تقولُ يا ابنَ عباسٍ؟ فقلت: لا، قال: فما تقول؟ قلت: هُوَ أَجَلُ رسولِ الله ﷺ، أَعْلَمَه له قال: ﴿إِذَا جَآءَ نَصْرُ ٱللَّهِ وَٱلْفَتْحُ ۝﴾ وذلك علامة أَجَلِك

113. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: హజ్రత్ ఉమర్ (రజి) గారు బద్ర్ యుద్ధంలో పాల్గొన్న పెద్దవాళ్ళతోపాటు నన్ను కూడా తన సమావేశాల్లో కూర్చో బెట్టుకునేవారు. దీనిపై కొందరు అభ్యంతరం వెలిబుచ్చారు. "ఈ అబ్బాయి వయస్సుగల మా పిల్లలు కూడా ఉండగా, మన సమావేశాల్లో ఇతన్నే ఎందుకు కూర్చోబెట్టుకోవాలి?" అని కొందరు అడగనే అడిగారు. అందుకు హజ్రత్ ఉమర్ (రజి) "ఇబ్నె అబ్బాస్ ప్రతిభ గురించి తెలిసిందేగా!" అని అన్నారు వారితో. ఆ తరువాత ఒకరోజు ఆయన నన్ను పిలిచి బద్ర్ యుద్ధంలో పాల్గొన్న ఆ పెద్ద మనుషులతో పాటు నన్నూ తన సమావేశంలో కూర్చోబెట్టుకున్నారు. బహుశా ఆ రోజు ఆయన వారికి నా గురించి తెలియజేయడానికే నన్ను పిలిచి ఉంటారు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) సమావేశంలోని సభ్యులను "అల్లాహ్ సహాయం వచ్చి, విజయ

﴿فَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ وَاسْتَغْفِرْهُ إِنَّهُ كَانَ تَوَّابًا ﴿٣﴾﴾ [النصر : ٣]، فقال عمر رضي الله عنه : ما أَعْلَم منها إلَّا ما تقُول.
رواه البخاري.

భాగ్యం లభించినప్పుడు.....'' అన్న దైవసూక్తి భావం గురించి మీ అభిప్రాయం ఏమిటి?'' అని అడిగారు. దానికి ఆ సభలోని కొందరు "ఇందులో అల్లాహ్ సహాయం అవతరించి ఆయన మమ్మల్ని గెలిపించినప్పుడు (అందుకు కృతజ్ఞతగా)మనం ఆయన్ని స్తుతించాలని, పాపాల మన్నింపుకోసం వేడుకోవాలని ఆదేశించబడింది'' అని జవాబు చెప్పారు. కొందరయితే అసలేమీ సమాధానం చెప్పకుండా మౌనంగా కూర్చున్నారు. అప్పుడు ఉమర్ (రజి) "ఇబ్నె అబ్బాస్! నువ్వేమంటావ్!'' అని ప్రశ్నించారు. అప్పుడు నేను "ఇందులో దైవప్రవక్త మరణ ప్రస్తావన ఉంది. అల్లాహ్ ఆయనకు (ఈ సూరాలో) దాని గురించే సూచించాడు. (దీని తాత్పర్యం ఏమిటంటే) "అల్లాహ్ సహాయం వచ్చి, విజయభాగ్యం లభించినప్పుడు... ఇది నీ మరణానికి సూచన. కనుక ఓ ప్రవక్తా! నీవు నీ ప్రభువు స్తోత్రంతోపాటు ఆయన పవిత్ర నామాన్ని స్మరించు, ఇంకా మన్నింపుకై ఆయన్ని వేడుకో. నిస్సందేహంగా ఆయన అమితంగా పశ్చాత్తాపాన్ని అంగీకరించేవాడు'' అంటూ ఈ సూరా తాత్పర్యాన్ని వివరించాను. దానికి హజ్రత్ ఉమర్ (రజి) "ఈ సూరాపై నువ్వు వివరించిన అభిప్రాయమే నా అభిప్రాయం కూడాను'' అని అన్నారు.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణంలోనూ, ఇంకా సుననె తిర్మిజీలోని వ్యాఖ్యానాల అధ్యాయములలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

1. మనిషికి కేవలం వయసు ఎక్కువగా ఉన్న కారణంగా ప్రాధాన్యత లభించాలన్న నియమం లేదు. పైగా బుద్ధిజ్ఞానాల, విజ్ఞతా వివేచనాల ఆధారంగా అతనికి విలువ, ప్రాధాన్యతలు లభించాలి. ఆ విధంగా ఒక చిన్న వయస్కుడైన బాలుడు కూడా తన అసామాన్య తెలివి తేటలు, ప్రతిభాపాటవాల ద్వారా పెద్దవారిని మించిపోవచ్చు.
2. మరణ ఘడియలు ఆసన్నమయినప్పుడు మనిషి వీలైనంత ఎక్కువగా దేవుణ్ణి కీర్తిస్తూ, ఆయన పవిత్రతను కొనియాడుతూ, గతంలో తనవల్ల జరిగిన పాపాలకు క్షమాభిక్షను వేడుకుంటూ కాలం గడపాలి.

١١٤ ـ الثالث: عن عائشة رضي الله عنها قالت: ما صَلَّى رسولُ الله ﷺ صلاةً بَعْدَ أَنْ نَزَلَتْ عَلَيْهِ ﴿إِذَا جَآءَ نَصۡرُ ٱللَّهِ وَٱلۡفَتۡحُ ۝١﴾ إلَّا يقولُ فيها: «سُبْحَانَكَ رَبَّنَا وَبِحَمْدِكَ، اللَّهُمَّ اغْفِرْ لي» متفق عليه.

وفي رواية في الصحيحين عنها: كان رسولُ الله ﷺ يُكْثِرُ أَنْ يقُولَ في رُكُوعِه وسُجُودِهِ: «سُبْحَانَكَ اللَّهُمَّ رَبَّنَا

114. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం: "అల్లాహ్ సహాయం వచ్చి విజయభాగ్యం లభించినప్పుడు....." అన్న దైవసూక్తి అవతరించిన తరువాత దైవప్రవక్త (సల్లం) తన ప్రతి నమాజు లోనూ "సుబ్హానక రబ్బనా వ బిహమ్దిక, అల్లాహుమ్మగ్ఫిర్లీ - (నీవు పవిత్రుడవు, ఓ మా ప్రభువా! నీ స్తోత్రంతోపాటు, దేవా! నన్ను మన్నించు)" అని వేడుకునే వారు. *(బుఖారీ - ముస్లిం)*

బుఖారీ - ముస్లింలలోని ఆయిషా (రజి. అన్హా) గారి వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: దివ్య ఖుర్ఆన్ భావం నుండి స్ఫూర్తిని పొందుతూ దైవప్రవక్త (సల్లం) తన రుకూల్లో, సజ్దాల్లో ఎక్కువగా "సుబ్హానక అల్లాహుమ్మ రబ్బనా వ బిహమ్దిక, అల్లా హుమ్మగ్ఫిర్లీ" అని ప్రార్థించేవారు.

'దివ్య ఖుర్ఆన్ భావం నుండి స్ఫూర్తిని పొందుతూ' అంటే "నీ ప్రభువు స్తోత్రం తోపాటు ఆయన పవిత్ర నామాన్ని

స్మరించు. ఇంకా మన్నింపుకై ఆయన్ని వేడుకో" అన్న దివ్య సూక్తిని పాటిస్తూ అని అర్థం.

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దైవప్రవక్త (స) తన మరణానికి ముందు ఎక్కువగా "సుబ్‌హానకల్లాహుమ్మ వబిహమ్దిక అస్తగ్ఫిరుక వ అతూబు ఇలైక్" అని ప్రార్థించేవారు. హజ్రత్ ఆయిషా (రజి. అన్‌హా)ఇలా అంటున్నారు: "దైవప్రవక్తా! మీరు కొన్ని వాక్యాలు పఠించడం నేను గమనిస్తున్నాను. ఆ వాక్యాలు ఏమిటి?" అని నేను అడిగాను. దానికి ఆయన "నా కొరకు నా సమాజంలో ఒక సూచన ఉంచబడింది. నేను దానిని చూసి నప్పుడు ఆ వాక్యాలు చదువుతాను. (ఆ నిదర్శనం ఇది) "ఇజా జాఅ నస్రుల్లాహి వల్ ఫత్‌హు....." (సూరా ఆఖరి వరకు).

ముస్లింలోనే ఇంకో ఉల్లేఖనంలో ఇలా ఉంది : దైవప్రవక్త (స) ఎక్కువగా 'సుబ్‌హానల్లాహి వ బిహమ్దిహీ అస్తగ్ఫిరుల్లాహ వ అతూబు ఇలైహ్" అని పఠించేవారు. (హజ్రత్ ఆయిషా ఇలా అంటున్నారు) : "ఓ దైవప్రవక్తా! మీరు ఎక్కువగా "సుబ్‌హానల్లాహి, వ బిహమ్దిహీ అస్తగ్ఫిరుల్లాహ వ అతూబు ఇలైహ్" అని చదువుతున్నారేమిటి?" అని నేనాయన్ని అడగ్గా, "నేను నా సమాజంలో ఒక సూచన చూస్తానని నా ప్రభువు నాకు తెలియజేశాడు. అది

وَبحَمْدِكَ، اللّٰهُمَّ اغفِرْ لي» يَتَأَوَّل القُرْآنَ.

معنى: «يَتَأَوَّلُ القُرآنَ» أيْ: يَعْمَلُ مَا أُمِرَ بِهِ في القُرْآنِ في قولِهِ تعالى: ﴿فَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ وَٱسْتَغْفِرْهُ﴾.

وفي رواية لمسلم: كان رسولُ الله ﷺ يُكثِرُ أَنْ يَقُولَ قَبلَ أَنْ يَمُوتَ: «سُبْحَانَكَ اللَّهُمَّ وبحَمْدِكَ، أَسْتَغْفِرُكَ وَأَتُوبُ إلَيْكَ». قالت عائشةُ: قلتُ: يا رسُولَ الله! ماهٰذِهِ الكَلِمَاتُ الَّتي أَرَاكَ أَحْدَثْتَها تقولها؟ قال: «جُعِلَتْ لي علامةٌ في أُمَّتي إذَا رَأَيْتُها قُلْتُها ﴿إِذَا جَآءَ نَصْرُ ٱللَّهِ وَٱلْفَتْحُ﴾ إلى آخر السورة».

وفي رواية له: كان رسولُ الله ﷺ يُكثِرُ مِنْ قَوْلِ: «سُبْحَانَ اللهِ وبِحَمْدِهِ. أَسْتَغْفِرُ اللهَ وَأَتُوبُ إِلَيْهِ». قالت: قلتُ: يا رسولَ الله! أَرَاكَ تُكْثِرُ مِنْ قَوْلِ: سُبْحَانَ اللهِ وَبِحَمْدِهِ، أَسْتَغْفِرُ اللهَ وَأَتُوبُ إِلَيْهِ؟ فقال: «أَخْبَرَنِي رَبِّي أَنِّي سَأَرَى عَلامَةً في أُمَّتِي فَإِذَا رَأَيْتُهَا أَكْثَرْتُ مِنْ قَوْلِ: سُبْحَانَ اللهِ وبِحَمْدِهِ، أَسْتَغْفِرُ اللهَ وَأَتُوبُ إِلَيْهِ؛ فَقَدْ رَأَيْتُهَا: ﴿إِذَا جَآءَ نَصْرُ ٱللَّهِ وَٱلْفَتْحُ ۝١﴾ فتحُ مكَّةَ، ﴿وَرَأَيْتَ ٱلنَّاسَ يَدْخُلُونَ فِي دِينِ ٱللَّهِ أَفْوَاجًا ۝٢ فَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ وَٱسْتَغْفِرْهُ إِنَّهُۥ كَانَ تَوَّابًا ۝٣﴾».

చూసినప్పుడు నేను ఆ వాక్యాలు చదవాలి. అదిగో! నేను ఆ సూచనను చూశాను" అని ఆయన ఇలా సమాధానమిచ్చారు.

"దైవ సహాయం అవతరించి, విజయం లభించినప్పుడు - అంటే మక్కా విజయ భాగ్యం వరించినప్పుడు - ప్రజలు తండోపతండాలుగా అల్లాహ్ ధర్మంలో ప్రవేశించటాన్ని నీవు చూసినప్పుడు (ప్రవక్తా!) నీవు నీ ప్రభువు స్తోత్రంతో పాటు ఆయన పవిత్ర నామాన్ని స్మరించు, ఇంకా మన్నింపుకై ఆయన్ని వేడుకో! నిస్సందేహంగా ఆయన అమితంగా పశ్చాత్తాపాన్ని అంగీకరించేవాడు. *(అన్ నస్ర్ సూరా)*

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణంలోనూ, అజాన్ ప్రకరణంలోనూ, యుద్ధాల ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని నమాజు ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

1. రుకూ మరియు సజ్దాల్లో 'సుబ్హాన రబ్బియల్ అజీం' మరియు 'సుబ్హాన రబ్బియల్ ఆలా'కు బదులుగా, 'సుబ్హానకల్లాహుమ్మ రబ్బనా వబిహమ్దిక అల్లాహుమ్మగ్ఫిర్లీ' అని పలకటం కూడా అభిలషణీయమే.

2. దేవుని తరఫునుంచి ఏదైనా అనుగ్రహం లభించినప్పుడు అందుకు దైవానికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి.

١١٥ - الرابع: عن أَنسٍ رضي الله عنه قال: إِنَّ اللهَ عَزَّ وَجَلَّ تَابَعَ الوَحْيَ عَلَى رسولِ الله ﷺ قَبْلَ وَفَاتِهِ، حَتَّى تُوُفِّيَ أَكْثَرَ مَا كَانَ الوَحْيُ. متفقٌ عليه.

115. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) మరణానికి (కొంత కాలం) ముందు వరకూ ఆయనపై దేవుడు అప్పుడప్పుడూ తన వాణి (వహీ)ని అవతరింపజేసేవాడు. అయితే

మరణ కాలం సమీపించినప్పుడు మాత్రం మునుపటికన్నా చాలా ఎక్కువగా ఆయనపై దైవవాణి అవతరించింది. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని 'దివ్య ఖుర్ఆన్ ఘనతా విశిష్టతల' ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని వ్యాఖ్యానాల ప్రకరణం ఆరంభంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) గారి జీవితంలోని ఆఖరి దినాల్లో ఎక్కువగా వహీ (దైవవాణి) అవతరించడం, త్వరలోనే ఆయన ఇహలోకాన్ని వీడిపోనున్నారన్న దానికి నిదర్శనం.

116. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : (ప్రళయదినాన) ప్రతి దాసుడూ, తాను మరణించిన స్థితిలోనే లేపబడతాడు. (ముస్లిం)

١١٦ ـ الخامس: عن جابرٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «يُبْعَثُ كُلُّ عَبْدٍ عَلى مَا مَاتَ عَلَيْهِ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని "స్వర్గ" ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'ఇన్నమల్ ఆమాలు బిల్ ఖవాతీమ్' (ఆచరణలు ముగింపునుబట్టి పరిగణించబడతాయి) అన్న హదీసు లాంటిదే పై హదీసు భావం కూడాను. మనిషి మంచి పనులు చేస్తూ చనిపోతే అతని పర్యవసానం కూడా బాగానే ఉంటుంది. దీనికి విరుద్ధంగా చెడుపనులు చేస్తున్నప్పుడు మరణం సంభవిస్తే దాని పర్యవసానం కూడా చెడుగానే పరిణమిస్తుంది. కాబట్టి మనిషి ఎల్లప్పుడూ ముఖ్యంగా వృద్ధాప్యంలో లేక వ్యాధిగ్రస్తుడైనప్పుడు దైవ అవిధేయతకు పాల్పడకుండా జాగ్రత్తపడాలి. మృత్యువు ఎప్పుడు ఎవరిని కబళిస్తుందో చెప్పలేం!

13వ అధ్యాయం

# ١٣ ـ بَابٌ فِي بَيَانِ كَثْرَةِ طُرُقِ الْخَيْرِ

# మంచి పనులకు మార్గాలు అనేకం

قال الله تعالى: ﴿ وَمَا تَفْعَلُوا مِنْ خَيْرٍ فَإِنَّ اللَّهَ بِهِ عَلِيمٌ ﴾ [البقرة: ٢١٥]، وقال تعالى: ﴿ وَمَا تَفْعَلُوا مِنْ خَيْرٍ يَعْلَمْهُ اللَّهُ ﴾ [البقرة: ١٩٧]، وقال تعالى: ﴿ فَمَن يَعْمَلْ مِثْقَالَ ذَرَّةٍ خَيْرًا يَرَهُ ﴾ [الزلزلة: ٧]، وقال تعالى: ﴿ مَنْ عَمِلَ صَالِحًا فَلِنَفْسِهِ ﴾ [الجاثية: ١٥]

అల్లాహ్ సెలవిచ్చాడు : "మీరు ఏ మేలు చేసినా, దాన్ని అల్లాహ్ తెలుసుకుంటాడు.'

(అల్ బఖర : 215)

మరొకచోట అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు : "మీరు చేసే ఏ పుణ్యకార్యమైనా అది అల్లాహ్‌కు తెలుస్తుంది." (అల్ బఖర : 197)

ఇంకొకచోట ఆయన ఇలా అంటున్నాడు : "ఎవడైనా రవ్వంత సత్కార్యం చేసి ఉన్నాసరే దాన్ని అతను చూసుకుంటాడు."

(అల్ జిల్‌జాల్ : 7)

వేరొకచోట ఇలా సెలవీయబడింది : "సత్కార్యం చేసేవాడు దానిని తనకోసమే చేసుకుంటాడు."

(అల్ జాసియహ్ : 15)

والآيات في الباب كثيرةٌ.

وأمّا الأحاديث فكثيرة جداً، وهي غير منحصرة، فنذكر طرفاً منها:

ఈ అధ్యాయం క్రింద ఇటువంటి సూక్తులు అనేకం ఉన్నాయి. ఇకపోతే ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసులు కూడా లెక్కకు మించి ఉన్నాయి. వాటిలో కొన్నింటిని మేము ప్రస్తావించబోతున్నాం.

١١٧ ـ الأوّل: عن أبي ذَرٍّ جُنْدُبِ بنِ جُنَادَةَ رضي الله عنه قال: قلتُ: يا رسولَ الله! أيُّ الأعمالِ أفضلُ؟

117. హజ్రత్ అబూజర్ర్ జుందుబ్ బిన్ జునాదా (రజి) కథనం : నేను దైవ ప్రవక్తను, "దైవప్రవక్తా! అన్నిటికన్నా ఉత్తమమైన సత్కార్యం ఏది?" అని అడిగాను. దానికి ఆయన "అల్లాహ్‌ను విశ్వసించడం, ఇంకా ఆయన మార్గంలో

قال: «الإيمانُ باللهِ، والجهادُ في سبيلِه» قلتُ: أيُّ الرِّقابِ أفضلُ؟ قَالَ: «أَنْفَسُهَا عِنْدَ أَهْلِهَا، وَأَكْثَرُهَا ثَمَناً»، قُلْتُ: فَإِنْ لَمْ أَفْعَلْ. قال: «تُعِينُ صَانِعاً أَوْ تَصْنَعُ لأَخْرَقَ»، قُلْتُ: يا رَسولَ الله! أَرَأَيْتَ إِنْ ضَعُفْتُ عَنْ بَعْضِ الْعَمَلِ؟ قال: «تَكُفُّ شَرَّكَ عَنِ النَّاسِ فَإِنَّها صَدَقَةٌ مِنْكَ عَلَى نَفْسِكَ». متفقٌ عليه. «الصَّانِعُ» بالصَّاد المهملة هذا هو المشهور، وَرُوِيَ «ضَائعاً» بالمعجمة: أَيْ ذَا ضَيَاعٍ مِنْ فَقْرٍ أَوْ عِيَالٍ، ونحو ذلكَ، وَ«الأَخْرَقُ»: الَّذي لا يُتقِنُ مَا يُحاوِلُ فِعْلَهُ.

పోరాడటం" అని సమాధానమిచ్చారు. తిరిగి నేను "ఎలాంటి బానిసకు స్వేచ్ఛ ప్రసాదించడం ఉత్తమం?" అని అడిగాను. అందుకు ఆయన "తన యజమాని దృష్టిలో అందరికన్నా యోగ్యుడూ, బాగా ఖరీదైనవాడికి స్వేచ్ఛ నొసగటం" అని అన్నారు. అప్పుడు నేను "అది నావల్ల కాకపోతే ఏం చేయాలి?" అని అడగ్గా, "అయితే ఏ పనివాడికైనా సహాయపడు లేకపోతే ఏ పనిరాని వాడికైనా అతని పనిచేసి పెట్టు" అని ఆయన అన్నారు. "ఓ దైవప్రవక్తా! నేను ఈ మాత్రం పని కూడా చేయలేక పోతేనో?!" అని నేను మళ్ళీ సందేహ పడగా, అందుకు ఆయన "ప్రజలను నీ కీడు నుండి రక్షించు. అదే నీ పాలిట 'సదఖా' (మంచిపని) అవు తుంది" అని అన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

'సానీ' అన్న పదానికే బహుళప్రచారం ఉంది. అయితే జాయిఅన్ అని కూడా ఉల్లేఖించబడింది. 'జాయీ' అంటే పేద రికం, సంతానభారం వంటి కష్టాలతో బాధపడుతున్నవాడు. 'అఖ్‌రఖ్' అంటే తన పని తాను సక్రమంగా చేసుకోలేని వాడు.

*(సహీహ్ బుఖారీలోని 'బానిస విమోచన' ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

పై హదీసు ద్వారా దైవమార్గంలో పోరాడటం, బానిసలకు విముక్తి నొసగి స్వేచ్ఛాయుత జీవితాన్ని ప్రసాదించడం లాంటి ఉత్తమ సత్కార్యాల మహత్యం వెల్లడౌతోంది. అదేవిధంగా

ఇతరుల పట్ల సానుభూతి, సహకార భావంతో మెలగాలని కూడా ఈ హదీసు చెబుతోంది. అంతేకాదు, మన మాటల వల్లగాని, చేతలవల్ల గాని సాటి మానవులకు బాధకలగకుండా జాగ్రత్తపడటం కూడా ఓ మహత్తర పుణ్యకార్యమేనని అంటోంది. సత్కర్మలు స్వీకృతిని పొందాలంటే దైవంపై విశ్వాసం ఉండటం అవసరం. విశ్వాసానికి ఫలితమే సదాచరణ. కనుక ఆ విశ్వాసమే లేకపోతే దైవసమక్షంలో ఏ సత్కార్యమూ స్వీకృతిని పొందజాలదు.

١١٨ ـ الثاني: عن أَبي ذَرٍّ أَيضاً رضـي اللهُ عنـه أَنَّ رَسُـولَ الله ﷺ قـال: «يُصْبِحُ عَلَى كُلِّ سُلاَمَى مِنْ أَحَدِكُمْ صَـدَقَـةٌ، فَكُـلُّ تَسْبِيحَـةٍ صَـدَقَـةٌ، وَكُـلُّ تَحْمِيْدَةٍ صَدَقَةٌ، وَكُلُّ تَهْلِيلَةٍ صَدَقَةٌ، وَكُلُّ تَكْبِيرَةٍ صَدَقَةٌ، وَأَمْرٌ بالمَعْرُوفِ صَدَقَةٌ، وَنَهْيٌ عَنِ المُنْكَرِ صَدَقَةٌ. وَيُجْزِىءُ مِنْ ذٰلكَ رَكْعَتَانِ يَرْكَعُهُما مِنَ الضُّحَى» رواه مسلم. «السُّلاَمَى» بضم السين المهملة وتخفيف اللام وفتح الميم: المَفْصِلُ.

118. హజ్రత్ అబూ జర్ర్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీలోని ప్రతి ఒక్కరిపై (శరీరంలోని ప్రతి కీలుపై) ఉదయం పూట ఒక సదఖా (సత్కార్యం) చేయటం తప్పనిసరి. అయితే ప్రతి తస్బీహ్ పలుకు (సుబ్‌హా నల్లాహ్ అనడం కూడా) ఒక సత్కార్యమే. ప్రతి తహ్మీద్ పలుకు (అల్ హమ్దులిల్లాహ్ అనడమూ) ఒక సత్కార్యమే. ప్రతి తహ్లీల్ (లా ఇలాహ ఇల్లల్లాహ్ అనడం కూడా) ఒక సత్కార్యమే. ప్రతి తక్బీర్ (అల్లాహు అక్బర్ అనడమూ) ఒక సత్కార్యమే. మంచిని గురించి ఆజ్ఞాపించడం సత్కార్యం. అలాగే చెడు నుంచి వారించడమూ సత్కార్యమే. అయితే సూర్యోదయం తరువాత మనిషి చేసే రెండు రకతుల నమాజు వీటన్నిటికీ ప్రత్యామ్నాయం కాగలదు. *(ముస్లిం)*

హదీసులో ప్రస్తావించబడిన పదం "సులామా" అంటే కీలు.

*(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషి దేహంలో మూడు వందల అరవై కీళ్ళు ఉంటాయి. ఈ కీళ్ల ఆధారంగానే మనిషి నడవటం, పని చేయటం, అటూ ఇటూ కదలటం మొదలగు చర్యలు చేస్తాడు. ఈ

కీళ్ళే లేకపోతే మనిషి కదల్లేడు, మెదల్లేడు. నించోటం, పడుకోవటం లాంటి కదలికలు కీళ్ళు లేకుండా సాధ్యం కావు. ఈ విధంగా చూస్తే మానవ శరీరంలోని ప్రతి కీలూ దేవుని వరమే. అందుకు ప్రతి మానవుడూ తప్పకుండా దైవానికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి.

ఈ వరాలపై కృతజ్ఞతలు తెలుపుకోవడం కోసం అతి సులువైన మార్గాన్ని సూచించడం - దేవుడు తన దాసులపై అనుగ్రహించిన మరొక వరం. ఒక సామాన్య మానవుడు కూడా ఈ మార్గాన్ని అనుసరించి దైవానికి కృతజ్ఞతలు తెలుపుకొగలడు. సుబ్‌హానల్లాహ్, అల్ హమ్దులిల్లాహ్, అల్లాహు అక్బర్, లా ఇలాహ ఇల్లల్లాహ్ అని పలకటం, తోటి మనుషులకు మంచిని గురించి బోధిస్తూ, చెడు పనుల నుండి వారించటం లాంటి పనులు దైవానుగ్రహాలకు కృతజ్ఞతలు తెలుపుకోవడానికి అతి సులువైన మార్గాలు. అదీ చేయలేకపోతే సూర్యోదయం అయిన తరువాత నుంచి సూర్యుడు నడినెత్తినుండి వాలక ముందు వరకు - ఈ మధ్య కాలంలో - ఎప్పుడైనా రెండు రకాతుల నమాజు చేసుకున్నా సరిపోతుంది. ఇంకా ఎక్కువ చేయాలనుకుంటే రెండేసి రకాతుల చొప్పున ఎనిమిది రకాతుల వరకూ చేయవచ్చు.

١١٩ ـ الثَّالِثُ عَنْهُ قَالَ: قَالَ النبيُّ ﷺ: «عُرِضَتْ عَلَيَّ أَعْمَالُ أُمَّتِي حَسَنُهَا وَسَيِّئُهَا، فَوَجَدْتُ فِي مَحَاسِنِ أَعْمَالِهَا الأَذَى يُمَاطُ عَنِ الطَّرِيقِ، وَوَجَدْتُ فِي مَسَاوِىءِ أَعْمَالِهَا النُّخَاعَةَ تَكُونُ فِي المَسْجِدِ لا تُدْفَنُ» رواه مسلم.

119. హ్రజత్ అబూ జర్ర్ (రజి) గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : నా సమాజపు సత్కర్మలూ, దుష్కర్మలూ అన్నీ నాకు చూపబడ్డాయి. ఆ సత్కర్మల (జాబితా)లో (జనులు నడిచే) దారి నుంచి (రాళ్ళు ముళ్ళవంటి) బాధాకరమైన వస్తువులను తొలగించడం కూడా ఉంది. ఇంకా, దాని దుష్కర్మల (జాబితా)లో మస్జిదులో ఉమ్మివేసి దానిపై మట్టిపోయకుండా వదిలేసే అసహ్యకరమైన చేష్ట కూడా ఉంది.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని మస్జిదుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ప్రజలకు మేలు చేకూర్చే పని అది ఎంత చిన్నదైనప్పటికీ అల్లాహ్ దాన్ని సత్కార్యంగా పరిగణిస్తాడు. దీనికి విరుద్ధంగా ప్రజలకు హాని కలిగించే పని అది ఎంత తేలికపాటిదైనప్పటికీ

దాన్ని దుష్కార్యాల్లో జమచేస్తాడు. కనుక మనిషి దైవప్రసన్నతను బడయటం కోసం ఎల్లప్పుడూ మంచిపనులు చేస్తుండాలనీ, ఆయన ఆగ్రహానికి గురికాకుండా ఉండాలంటే చెడు పనులకు బహుదూరంగా ఉండాలని పై హదీసులో పురికొల్పడం జరిగింది.

2. మస్జిదులను శుభ్రంగా ఉంచడం అవసరం. కనుక అక్కడ ఉమ్మివేయడం, ముక్కు చీదడం లాంటి అవాంఛనీయ, అసభ్యకరమైన చేష్టలు కూడా పాపాలుగానే పరిగణించ బడతాయి. పైగా అటువంటిదేదైనా కనబడితే వెంటనే శుభ్రం చేయాలని ఆదేశించబడింది.

١٢٠ ـ الرابع عنه: أنَّ ناساً قالوا: يا رسُولَ اللهِ! ذَهَبَ أَهْلُ الدُّثُورِ بِالأُجورِ، يُصَلُّونَ كَمَا نُصَلِّي، وَيَصُومُونَ كَمَا نَصُومُ، وَيَتَصَدَّقُونَ بِفُضُولِ أَمْوَالِهِمْ قال: أَوَلَيْسَ قَدْ جَعَلَ اللهُ لَكُمْ مَا تَصَدَّقُونَ بِهِ: إنَّ بِكُلِّ تَسْبِيحَةٍ صَدَقَةً، وَكُلِّ تَكْبِيرَةٍ صَدَقَةً، وَكُلِّ تَحْمِيدَةٍ صَدَقَةً وَكُلِّ تَهْلِيلَةٍ صَدَقَةً، وَأَمْرٌ بِالمَعْرُوفِ صَدَقَةٌ، وَنَهْيٌ عَنِ المُنْكَرِ صَدَقَةٌ، وَفي بُضْعِ أَحَدِكُمْ صَدَقَةٌ»، قالوا: يا رسُولَ اللهِ! أَيَأتي أَحَدُنَا

120. హజ్రత్ అబూజర్ర్ (రజి)గారే చేసిన కథనం ప్రకారం కొంతమంది దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి "దైవప్రవక్తా! ధనవంతులు పుణ్యంలో మమ్మల్ని మించిపోయారు. వాళ్ళు కూడా మాలాగే నమాజు చేస్తారు. మాలాగే ఉపవాసాలూ పాటిస్తారు. అయితే వాళ్ళు (మాకంటే ఎక్కువగా) తమ మిగులుధనం నుంచి సదఖాలు (దానధర్మాలు) చేస్తారు. (ఆ విధంగా మాకంటే ఎక్కువగా పుణ్యాన్ని సంపాదించగల్గుతున్నారు. మాకు ఆ అవకాశం లేదు)" అని విన్నవించు కున్నారు. దానికి ఆయన "సదఖాలు చేయటం కోసం అల్లాహ్ మీకు కూడా వేరే మార్గాలను సూచించాడే? నిస్సం దేహంగా సుబ్హానల్లాహ్ (అల్లాహ్ పవిత్రుడు) అనడం కూడా ఒక సదఖాయే (పుణ్యకార్యమే). అల్లాహు అక్బర్ (అల్లాహ్ అందరికంటే గొప్ప వాడు) అనడం కూడా ఒక పుణ్య కార్యమే. అల్హమ్దులిల్లాహ్ (ప్రశంస లన్నీ అల్లాహ్ కొరకే) అనటం కూడా ఒక పుణ్యకార్యమే. లా ఇలాహ ఇల్లల్లాహ్

(అల్లాహ్ తప్ప వేరొక దేవుడు లేడు) అని పలకటం కూడా ఒక పుణ్యకార్యమే. మంచిని ఆదేశించటం ఒక సత్కార్యం. అలాగే చెడును నిరోధించడమూ ఒక సత్కార్యమే. ఆఖరికి మీరు (మీ భార్యతో) సంభోగించడం కూడా ఒక పుణ్యకార్యమే!" అని అన్నారు. ఇది విని వారు (ఆశ్చర్యంతో) "ఏమిటి.... మాలో ఎవరైనా తన లైంగిక కోరికను తీర్చుకుంటే దానిపై కూడా అతనికి పుణ్యం లభిస్తుందా దైవప్రవక్తా!" అని సందేహపడగా, దానికి ఆయన, "మీరే చెప్పండి. ఆ వ్యక్తి తన కోరికను అధర్మమైన మార్గంలో తీర్చుకుంటే అతని పాలిట అది పాపమా కాదా? (పాపమే). అలాగే అతను ధర్మసమ్మతమైన రీతిలో తన వాంఛను తీర్చుకుంటే అతనికి పుణ్యం లభిస్తుంది" అని విడమరచి చెప్పారు. *(ముస్లిం)*

'దుసూర్' అంటే సిరిసంపదలు అని అర్థం. 'దస్ర్' అన్నది ఏకవచనం.

*(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

شَهْوَتَهُ، وَيَكُونُ لَهُ فِيهَا أَجْرٌ؟! قال: «أَرَأَيْتُم لَوْ وَضَعَهَا فِي حَرَامٍ أَكَانَ عَلَيْهِ وِزْرٌ؟ فَكَذٰلِكَ إِذَا وَضَعَهَا فِي الحَلَالِ كَانَ لَهُ أَجْرٌ». رواه مسلم. «الدُّثُورُ» بالثاء المثلثة: الأموالُ، واحِدُها: دَثْرٌ.

## ముఖ్యాంశాలు

పై హదీసు ద్వారా బోధపడే మొదటి విషయం ఏమిటంటే, ప్రవక్త (సల్లం) గారి ప్రియసహచరుల్లో సత్కార్యాల విషయమై ఒండొకరిని మించిపోయే పోటీతత్వం ఉండేది. అదేవిధంగా మంచిపనులు చేసే అవకాశాలు చేజారినప్పుడు వారు విపరీతమైన మనస్తాపానికి గురయ్యేవారు.

ఇకపోతే ఈ హదీసులో వివరించబడిన రెండో విషయం ఏమిటంటే, ఇస్లాం ధర్మంలో 'సత్కార్యం' అనే దానికి చాలా విస్తృతమైన అర్థం ఉంది. దేవుని అవిధేయత పొడసూపకుండా చిత్తశుద్ధితో, మంచి సంకల్పంతో చేసే ప్రతి పనీ సత్కార్యం క్రిందికే వస్తుంది. ఆఖరికి మనిషి

తన లైంగిక కోరికలు, మనోవాంఛల్ని తీర్చుకోవడమూ పుణ్యకార్యమే. అంతేకాదు; దైవానికి విధేయత చూపాలన్న లక్ష్యంతో చెడుపనులకు దూరంగా ఉంటే అది కూడా సత్కార్యాల పరిధిలోకే వస్తుంది.

١٢١ ـ الخامس: عنه قال: قال لي النبيُّ صلى الله عليه وآله وسلم: «لَا تَحْقِرَنَّ مِنَ المَعْرُوفِ شَيْئاً وَلَوْ أَنْ تَلْقَى أَخَاكَ بِوَجْهٍ طَلِيقٍ» رواه مسلم.

121. దైవప్రవక్త (సల్లం) తనతో ఇలా అన్నారని హజ్రత్ అబూజర్ (రజి) గారే తెలియజేశారు : ఏ మంచి పనినీ నీవు చులకనగా చూడకు. ఆఖరికి నీవు నీ సోదరుణ్ణి నగుమోముతో కలవటాన్ని అయినా సరే." *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సాటి మనిషిని నవ్వుతూ పలకరించడం కూడా ఒక సత్కార్యమేనని పై హదీసు ద్వారా బోధపడుతోంది. అలా పలకరించడం మనిషిలోని మంచినడవడికకు తార్కాణం. పైగా దీనివల్ల ప్రజల మధ్య ప్రేమాభిమానాలు పెంపొందుతాయి. ప్రజలు మానసికంగా దగ్గరై ఒకరినొకరు అర్థం చేసుకోగలుగుతారు. ఫలితంగా వారిలో ఆత్మీయతా భావం జనించి పరస్పర విభేదాలను మరచిపోతారు. ఇస్లాం ధర్మం ఆశించేది కూడా అదే!

١٢٢ ـ السادس: عن أبي هريرة رضي الله عنه قال: قال رسُولُ الله ﷺ: «كُلُّ سُلَامَى مِنَ النَّاسِ عَلَيْهِ صَدَقَةٌ كُلَّ يَوْمٍ تَطْلُعُ فيه الشَّمْسُ: تَعْدِلُ بَيْنَ الاثْنَيْنِ صَدَقَةٌ، وتُعِينُ الرَّجُلَ فِي دَابَّتِهِ، فَتَحْمِلُهُ عَلَيْهَا، أَوْ تَرْفَعُ لَهُ عَلَيْهَا مَتَاعَهُ صدقةٌ، والكلِمَةُ الطَّيِّبَةُ صَدَقَةٌ، وَبِكُلِّ خَطْوَةٍ تَمْشِيها إلى الصَّلَاةِ صَدَقَةٌ، وَتُمِيطُ الأذَى عَنِ الطَّرِيقِ صَدَقَةٌ» متفق عليه. ورواه مسلم أيضاً من روايةِ عائشةَ رضي الله عنها

122. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : సూర్యుడు ఉదయించే ప్రతిరోజూ ప్రజల (దేహంలోని) ప్రతి కీలు తరఫునుంచి తప్పకుండా ఒక సదఖా (సత్కార్యం) చేయాలి. (సదఖా అంటే కేవలం డబ్బు దానం చేయటమనే కాదు). పైగా ఇద్దరి వ్యక్తుల మధ్య నువ్వు న్యాయం చేస్తే, అది కూడా సదఖాయే (పుణ్యకార్యమే) అవుతుంది. ఎవరికయినా అతని వాహనంపై కూర్చో బెట్టడంలోగాని లేదా అతని సామానును ఎత్తి దానిపై ఉంచడంలోగాని అతనికి

قالت: قال رسول الله ﷺ: «إنَّهُ خُلِقَ كُلُّ إنسانٍ مِنْ بَني آدمَ على سِتِّينَ وَثَلاثِمائَةِ مَفصِلٍ، فَمَنْ كَبَّرَ اللهَ، وَحَمِدَ اللهَ، وَهَلَّلَ اللهَ، وَسَبَّحَ اللهَ، واسْتَغْفَرَ اللهَ، وَعَزَلَ حَجَراً عَنْ طَرِيقِ النَّاسِ أَوْ شَوْكَةً أَوْ عَظْماً مِنْ طَرِيقِ النَّاسِ، أَوْ أَمَرَ بِمَعْرُوفٍ أَوْ نَهى عَنْ مُنْكَرٍ، عَدَدَ السِّتِّينَ والثَّلاثِمائَةِ، فَإِنَّهُ يُمْسِي يَوْمَئِذٍ وَقَدْ زَحْزَحَ نَفْسَهُ عَنِ النَّارِ».

సహాయపడితే అది కూడా సత్కార్యమే అవుతుంది. ఒక మంచి మాట చెప్పటం కూడా పుణ్యకార్యమే. నువ్వు నమాజు కోసం నడిచివెళ్ళే ప్రతి అడుగులోనూ నీకు పుణ్యం ఉంది. జనులు నడిచే దారినుంచి బాధాకరమైన వస్తువులను తొలగించడం కూడా పుణ్యకార్యమే.

*(బుఖారీ - ముస్లిం)*

ఇమామ్ ముస్లిం (రహ్మాలై) ఈ హదీసును హజ్రత్ ఆయిషా (రజి. అన్హా) ఆధారంగా కూడా ఉల్లేఖించారు. అందులో దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ఉపదేశించారని ఉంది: ఆదం సంతతిలోని ప్రతి మనిషీ మూడువందల అరవై కీళ్ళతో పుట్టించ బడ్డాడు. కనుక అల్లాహు అక్బర్ అని దేవుని గొప్పదనాన్ని చాటుతూ, అల్ హమ్దులిల్లాహ్ అని దైవానికి కృతజ్ఞతలు తెలుపుతూ, లా ఇలాహ ఇల్లల్లాహ్ అని పలుకుతూ, సుబ్హానల్లాహ్ అని దేవుని పవిత్రతను కొనియాడుతూ, అస్తగ్ఫిరుల్లాహ్ అని దైవాన్ని క్షమాభిక్ష కోసం వేడుకుంటూ, జనులు నడిచే దారిలో ఏదైనా రాయి గాని, ముల్లుగాని లేక ఎముకగాని పడి వుంటే దానిని తొలగించినా లేక మంచిని గురించి ఆదేశించినా లేక చెడునుంచి ఇతరుల్ని ఆపినా, ఈ విధంగా మూడు వందల అరవై సంఖ్యకు సమానంగా పైన పేర్కొనబడిన మంచిపనులు చేసుకుంటే అటువంటి వ్యక్తి ఆ రోజు

సాయంత్రానికల్లా తన్ను తాను నరకాగ్ని నుంచి కాపాడుకుంటాడు."

*(సహీహ్ బుఖారీలోని ఒడంబడికల ప్రకరణంలోనూ, జిహాద్ ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణంలోనూ ఈ హదీసు పేర్కొనబడింది.)*

**ముఖ్యాంశాలు:**

సదఖాలు, దానధర్మాలు చేసే స్థోమత లేని వారు పైన పేర్కొనబడిన మంచిపనులను ఆచరించి తద్వారా దానధర్మాల వల్ల వచ్చే పుణ్యాన్ని సంపాదించుకోవచ్చనీ, పైగా తమ దేహంలోని మూడు వందల అరవై కీళ్ళపైఉన్న 'సదఖా' బాధ్యతను నెరవేర్చవచ్చనీ పై హదీసు ద్వారా బోధపడుతోంది.

١٢٣ ـ السابع: عنه عن النبيِّ ﷺ قال: «مَنْ غَدَا إلى المَسْجِدِ أَوْ رَاحَ، أَعَدَّ اللهُ لَهُ في الجَنَّةِ نُزُلًا كُلَّمَا غَدَا أَوْ رَاحَ» متفق عليه. «النُّزُلُ»: القُوتُ والرِّزْقُ وَمَا يُهَيَّأُ للضَّيْفِ.

123. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారని హజ్రత్ అబూహురైరా (రజి)గారే తెలియజేశారు : ఉదయం, సాయంత్రం మస్జిద్‌కు వెళ్ళే వ్యక్తికోసం- అతను ఉదయం పూటగాని, సాయంత్రం వేళ గాని మస్జిద్‌కు వెళ్ళినప్పుడల్లా దేవుడు స్వర్గంలో అతని ఆతిథ్యానికి ఏర్పాట్లు చేస్తాడు. *(బుఖారీ - ముస్లిం)*

'నుజుల్' అంటే భోజనం, ఆహారం. అతిథికోసం తయారుచేసేది.

*(సహీహ్ బుఖారీలోని 'అజాన్' ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని మస్జిదుల ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది).*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో మస్జిద్‌కు వెళ్ళి సామూహికంగా నమాజు చేయాలని పురికొల్పడం జరిగింది.

١٢٤ ـ الثامن: عنه قال: قال رسولُ الله ﷺ: «يَا نِسَاءَ المُسْلِمَاتِ!

124. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు : విశ్వాసులైన

«لا تَحْقِرَنَّ جَارَةٌ لِجَارَتِهَا وَلَوْ فِرْسِنَ شَاةٍ» متفق عليه. قال الجوهريُّ: الفِرْسِنُ مِنَ الْبَعِيرِ: كالحافِرِ مِنَ الدَّابَّةِ، قال: ورُبَّما اسْتُعِيرَ في الشَّاةِ.

మహిళల్లారా! ఏ ఇంటి స్త్రీ కూడా తన పొరుగింటి స్త్రీ (ఇచ్చే కానుక)ని అల్ప మైనదిగా భావించరాదు. ఆమె ఇచ్చే కానుక మేక కాలిగిట్ట అయినా సరే. (అంటే ఎంత సామాన్యమైన కానుక ఇచ్చినప్పటికీ దానిపై నొసలు చిట్లించ రాదని భావం). *(బుఖారీ - ముస్లిం)*

ఇతర జంతువుల గిట్టలను 'హాఫిర్' అన్నట్లు వాస్తవానికి 'ఫిర్సన్' అనే పదం ఒంటె కాలిగిట్ట కోసం వాడబడుతుంది. అయితే అప్పుడప్పుడూ మేక కాలి గిట్ట కోసం కూడా ఈ పదం ఉపయోగించ బడుతుందని జౌహరి అభిప్రాయ పడ్డారు.

*(సహీహ్ బుఖారీలోని కానుకల ప్రకరణంలోనూ, సంస్కార ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఇతరులు ఇచ్చే కానుకలు ఎంత సామాన్యమైనవి అయినప్పటికీ వాటిని తుచ్ఛమైనవిగా భావించకూడదు. ఎందుకంటే చిత్తశుద్ధితో ఇచ్చే చిన్న కానుక కూడా దేవుని దృష్టిలో పెద్దదిగా భావించబడుతుంది. లేదా ఈ హదీసు భావం ఏ స్త్రీ కూడాను తన పొరుగింటి స్త్రీకి ఒక మేక గిట్ట అయినా సరే కానుకగా పంపించడాన్ని అల్పంగా భావించరాదు అని కూడా కావచ్చు.

١٢٥ ـ التاسع: عنه عن النبيِّ ﷺ قال: «الإيمَانُ بِضْعٌ وَسَبْعُونَ، أَوْ بِضْعٌ وَسِتُّونَ شُعْبَةً: فَأَفْضَلُهَا قَوْلُ لَا إِلٰهَ إِلَّا الله، وَأَدْنَاهَا إِمَاطَةُ الأَذَى عَنِ الطَّرِيقِ، وَالحَيَاءُ شُعْبَةٌ مِنَ الإِيمَانِ» متفقٌ عليه.

125. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిం చారని హజ్రత్ అబూ హురైరా (రజి) గారే తెలియజేశారు: విశ్వాసానికి (ఈమాన్‌కు) డెబ్భై లేక అరవైకన్నా ఎక్కువ భాగా లున్నాయి. వాటిలో అత్యున్నత భాగం "లా ఇలాహ ఇల్లల్లాహ్" (అల్లాహ్ తప్ప వేరొక దేవుడు లేడు) అని పలకటం.

«البِضْعُ» من ثلاثةٍ إلى تسعةٍ، بكسر الباء وقد تُفْتَحُ. وَ«الشُّعْبَةُ»: القِطْعة.

కాగా జనం నడిచే దారిలోనుంచి (రాళ్ళు, ముళ్ళువంటి) బాధాకరమైన వస్తువులను తొలగించడం అట్టడుగున వున్న భాగం. ఇంకా వ్రీడ (లజ్జ) కూడా ఈమాన్ (విశ్వాసం)లో అంతర్భాగమే.

(బుఖారీ - ముస్లిం)

'జిజ్వున్' అన్న పదం మూడు నుంచి తొమ్మిది అంకెల వరకు సూచించడం కోసం వాడబడుతోంది. ఈ పదాన్ని 'బ'కు అకారమిచ్చి (బజ్వున్)అని కూడా చదువవచ్చు. 'షోబా' అంటే భాగం, శాఖ అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణంలో, ఇంకా సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణంలో కూడా ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

1. ఆచరణల పరంగా ఈమాన్ (విశ్వాసం)లో అనేక విభాగాలున్నాయి. ఇంకా విశ్వాసం మరియు ఆచరణ - ఈ రెండూ పరస్పరం విడదీయరానివి. ఒకదానిపై మరొకటి ఆధారపడి ఉంటాయి.

2. ఈ హదీసు ద్వారా వ్రీడ (లజ్జ) యొక్క ప్రాముఖ్యత వెల్లడౌతోంది. వ్రీడ వల్లనే మనిషి చెడు పనులకు దూరంగా ఉండి, మంచి పనులు చేయడానికి ప్రేరణ పొందుతాడు.

١٢٦ ـ العاشر: عنه، أنَّ رسولَ الله ﷺ قال: «بَيْنَمَا رَجُلٌ يَمْشِي بِطَرِيقٍ اشْتَدَّ عَلَيْهِ الْعَطَشُ، فَوَجَدَ بِئْراً فَنَزَلَ فيها فَشَرِبَ، ثُمَّ خَرَجَ فَإذَا كَلْبٌ يَلْهَثُ، يَأْكُلُ الثَّرَى مِنَ الْعَطَشِ، فقال الرَّجُلُ: لَقَدْ بَلَغَ هٰذَا الْكَلْبُ مِنَ الْعَطَشِ مِثْلَ الَّذِي كَانَ قَدْ بَلَغَ مِنِّي، فَنَزَلَ الْبِئْرَ

126. దైవప్రవక్త (సల్లం) తెలియజేసిన వృత్తాంతాన్ని హజ్రత్ అబూ హురైరా (రజి) గారే ఈ విధంగా ఉటంకించారు: ఒకానొక సమయంలో ఒక వ్యక్తి ఓ దారి గుండా నడచివెళుతుండగా అతనికి విపరీతంగా దాహం వేసింది. ఒకచోట బావి కనబడితే అందులోకి దిగి నీళ్ళు త్రాగి తిరిగి బయటికొచ్చాడు. అంతలోనే

فَمَلأَ خُفَّهُ مَاءً ثُمَّ أَمْسَكَهُ بِفِيهِ، حَتَّى رَقِيَ فَسَقَى الْكَلْبَ، فَشَكَرَ اللهُ لَهُ فَغَفَرَ لَهُ»، قَالُوا: يا رسولَ الله! إنَّ لَنَا فِي الْبَهَائِمِ أَجْراً؟ فَقَالَ: «فِي كُلِّ كَبِدٍ رَطْبَةٍ أَجْرٌ» متفقٌ عليه. وفي رواية للبخاري: «فَشَكَرَ اللهُ لَهُ فَغَفَرَ لَهُ، فَأَدْخَلَهُ الْجَنَّةَ». وفي روايةٍ لَهُما: «بَيْنَمَا كَلْبٌ يُطِيفُ بِرَكِيَّةٍ قَدْ كَادَ يَقْتُلُه الْعَطَشُ إذْ رَأَتْه بَغِيٌّ مِنْ بَغَايَا بَنِي إِسْرَائِيلَ، فَنَزَعَتْ مُوقَهَا فَاسْتَقَتْ لَهُ بِهِ، فَسَقَتْهُ فَغُفِرَ لَهَا بِهِ». «الْمُوقُ»: الْخُفُّ. وَ«يُطِيفُ»: يَدُورُ حَوْلَ «رَكِيَّةٍ» وَهِيَ الْبِئْرُ.

అక్కడ అతనికి ఒక కుక్క కనిపించింది. అది దప్పికతో నాలుక వెళ్ళబెట్టి (రొప్పుతూ) బురదమట్టిని నాకసాగింది. అది చూసి ఆ మనిషి "నేను దప్పికతో అల్లాడి పోయినట్లే ఈ కుక్క కూడా బాధపడుతుందేమో!" అనుకొని మళ్ళీ బావిలోకి దిగాడు. తన కాలి జోడును నీటితో నింపి, దాన్ని నోటితో పట్టుకొని పైకి తెచ్చాడు. ఆ నీరు కుక్కకు త్రాపించాడు. అప్పుడు అల్లాహ్ అతను చేసిన పనిని మెచ్చుకొని అతన్ని క్షమించాడు.

ఈ వృత్తాంతం విని అనుచరులు "దైవప్రవక్తా! భూత దయపై కూడా మాకు పుణ్యం లభిస్తుందా!" అని సందేహపడగా "అవును. తడి కాలేయం (ప్రాణం)గల ఏ జీవికి సహాయం చేసినా మీకు పుణ్యం లభిస్తుంది" అన్నారు దైవప్రవక్త (సల్లం). (బుఖారీ - ముస్లిం)

బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో, అల్లాహ్ అతను చేసిన పనిని స్వీకరించి అతణ్ణి క్షమించేశాడు. ఇంకా అతన్ని స్వర్గంలోకి ప్రవేశింపజేశాడు అని వుంది.

ఉభయులూ (బుఖారీ - ముస్లిం) ఉల్లేఖించిన వేరొక హదీసులో ఇలా ఉంది : ఒక కుక్క ఓ బావి చుట్టూ తారట్లాడుతుంది. దాహంతో దాని ప్రాణం పోయేటట్లుంది. అంతలోనే ఇస్రాయీల్ జాతికి చెందిన ఓ వ్యభిచారిణి ఆ కుక్కను చూసి (జాలిపడింది),

తన కాలి జోడును తీసి దానితో బావి నుండి నీరు చేది, ఆ కుక్కకు త్రాపించింది. ఆమె చేసిన ఈ సత్కార్యం వల్ల ఆమెను క్షమించివేయడం జరిగింది.

'మూఖ్' అంటే కాలిజోడు. యుతీపు అంటే తారట్లాడటం, చుట్టూ తిరగడం. 'రకియ్యా' అంటే బావి.

*(సహీహ్ బుఖారీలోని పానీయాల ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని 'సలాం' ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

1. మానవులు భూతదయను కలిగి ఉండాలని ఈ హదీసు ప్రబోధిస్తుంది. భూతదయ కనబరిచే వారి పట్ల అల్లాహ్ అమితంగా సంతోషిస్తాడు.
2. దేవుని కరుణాకటాక్షాలు ఎంతో విస్తృతమైనవి. ఆయన తలచుకుంటే ఓ చిన్న పనిని అంగీకరించి కూడా తన దాసులను క్షమించగలడు.

127. దైవప్రవక్త (సల్లం) తెలియ జేశారని హ్రజత్ అబూ హురైరా (రజి) గారే ఉటంకించారు : నేను స్వర్గంలో ఒక వ్యక్తి సంచరిస్తుండటం చూశాను. దారికి అడ్డంగా ఉండి, ముస్లింలకు ఇబ్బంది కరంగా మారిన ఒక చెట్టును అతను నరికివేశాడు (అందుకు దేవుడు ప్రసన్నుడై అతనికి స్వర్గభాగ్యాన్ని ప్రసాదించాడు). (ముస్లిం)

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : ఒక వ్యక్తి దారికి అడ్డంగా ఉన్న ఓ చెట్టుకొమ్మ దగ్గర్నుంచి వెళుతూ, "దైవసాక్షి! ఇది ముస్లింలకు బాధ కలిగించకుండా, నేను దీన్ని ఇక్కడి నుండి దూరం చేస్తాను"

١٢٧ - الْحَادِيَ عَشَرَ: عَنْهُ عن النبيِّ ﷺ قال: «لَقَد رَأَيْتُ رَجُلاً يَتَقَلَّبُ فِي الْجَنَّةِ فِي شَجَرَةٍ قَطَعَهَا مِنْ ظَهْرِ الطَّرِيقِ كَانَتْ تُؤْذِي الْمُسْلِمِينَ» رواه مسلم. وفي رواية: «مَرَّ رَجُلٌ بِغُصْنِ شَجَرَةٍ عَلَى ظَهْرِ طَرِيقٍ فَقَالَ: وَاللهِ! لأُنَحِّيَنَّ هٰذَا عَنِ الْمُسْلِمِينَ لا يُؤْذِيهِمْ، فَأُدْخِلَ الْجَنَّةَ». وفي رواية لهما: «بَيْنَمَا رَجُلٌ يَمْشِي بِطَرِيقٍ وَجَدَ غُصْنَ شَوْكٍ عَلَى الطَّرِيقِ، فَأَخَّرَهُ فَشَكَرَ اللهُ لَهُ، فَغَفَرَ لَهُ».

అని అన్నాడు. (అతను చేసిన ఈ చిన్నపనికి) అతణ్ణి స్వర్గంలోకి ప్రవేశింప జేయడం జరిగింది.

ఉభయుల (బుఖారీ - ముస్లింల) ఇంకొక ఉల్లేఖనం ప్రకారం ఒక వ్యక్తి దారిలో నడుస్తుండగా అతనికి ఓ ముండ్ల కంప కనబడింది. అతడు దాన్ని తీసిపారేశాడు. అల్లాహ్ అతడు చేసిన ఈ పనిని ఆమోదించి అతణ్ణి క్షమిం చాడు.

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని సత్కార్యాల పుస్తకంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ప్రజల్ని బాధల నుండి రక్షిస్తే అల్లాహ్ అమితంగా సంతోషిస్తాడు. ఆఖరికి నలుగురూ నడిచే దారి నుండి రాళ్ళు, ముళ్ళ వంటి బాధాకరమైన వస్తువులను తొలగించడం కూడా అల్లాహ్‌కు ఎంతో ప్రియమైన ఆచరణే. దీనికి భిన్నంగా దారుల్ని ఇరుకుగా చేసి జనాల్ని ఇబ్బందిపెట్టడం లేక నిష్కారణంగా దారులను మూసివేసి ప్రజలను అడ్డుకోవడం మొదలగు చర్యలు దైవాగ్రహానికి గురిచేస్తాయి. ఉదాహరణకు వివాహాది వేడుకల సందర్భంగా కొంతమంది ముష్కరులు మొండి ధైర్యంతో రోడ్లపైనే బైఠాయించి ఎన్నో అవాంఛనీయ చేష్టలకు పాల్పడుతుంటారు. కొంతమంది దుకాణందారులు, గృహస్తులు కాలిబాటల స్థలాలను కబ్జాలు చేస్తుంటారు. వీటివల్ల ప్రజలు ఎంతో అవస్థపడాల్సి వస్తుంది. ప్రజలు నైతికంగా ఎంత దిగజారిపోయారంటే ఇట్లాంటి అఘాయిత్యాలకు ఒడిగడుతూనే తామేదో గొప్ప పని చేస్తున్నట్లు బీరాలు పోతారు. ఒక ప్రక్క ధర్మబోధనలను ఉల్లంఘిస్తూనే, దైవాగ్రహానికి గురిచేసే పనులు చేస్తూనే వాటి గురించి గొప్పగా చెప్పుకుంటారు. ఇంతకన్నా నైతిక దుస్థితి ఇంకేముంటుంది చెప్పండి!

128. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన మరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఎవడైనా చక్కగా వుజూ చేసుకొని, జుమా నమాజు కోసం వచ్చి అత్యంత శ్రద్ధతో, నిశ్శబ్దంగా

١٢٨ ـ الثَّاني عَشَرَ: عَنْهُ قَالَ: قَالَ رَسولُ الله ﷺ: «مَنْ تَوَضَّأَ فَأَحْسَنَ الوُضُوءَ ثُمَّ أَتَى الْجُمُعَةَ، فَاسْتَمَعَ

وَأَنْصَتَ، غفِرَ لَهُ مَا بَيْنَهُ وَبَيْنَ الْجُمُعَةِ وَزِيَادَةُ ثَلاثَةِ أَيَّامٍ، وَمَنْ مَسَّ الْحَصَا فَقَدْ لَغَا» رواه مسلم.

ఉండి జుమా ఖుత్బా (ఉపన్యాసం) వింటే వెనకటి జుమా నుంచి ఈ జుమా వరకు (మధ్యకాలంలో) అతని వల్ల జరిగిన (చిన్న చిన్న) పాపాలన్నీ మన్నించ బడతాయి. ఇంకా అదనంగా మూడు రోజుల పాపాలు కూడా మన్నించబడ తాయి. మరెవడైతే కంకరరాళ్ళు ముట్టు కున్నాడో (అంటే ఉపన్యాసం జరుగుతు న్నప్పుడు వాటితో ఆడుకున్నాడో) అతడు వ్యర్థమైన పనిచేశాడు (అంటే తన జుమా పుణ్యాన్ని నాశనం చేసుకున్నాడని అర్థం). *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ఎన్నో విషయాలు వివరించబడ్డాయి. మొదటిది : ఇందులో వుజూను చక్కగా - అంటే ప్రవక్త పద్ధతిననుసరించి చేయాలని ఉపదేశించబడింది. రెండోది : ఈ హదీసులో జుమా ఆరాధన యొక్క ఘనతను గురించి తెలియజేయడం జరిగింది. ప్రాజ్ఞుడు, వయోజనుడు, స్థానికుడు, ఆరోగ్యవంతుడైన ప్రతి ముస్లిం; అతడు నగరంలో ఉన్నా లేక కుగ్రామంలో ఉన్నా ఈ జుమా నమాజును మాత్రం తప్పకుండా చేయాలి. ఇంకా ఈ జుమా నమాజును మస్జిద్‌లో సామూహికంగానే నెరవేర్చవలసి ఉంటుంది. ఇంట్లో వ్యక్తిగతంగా చేయడానికి వీలు లేదు. మూడోది : ప్రతి సత్కార్యానికి కనీసం పదిరెట్ల పుణ్యం లభిస్తుంది. ఆ విధంగా చూస్తే ఒక జుమా ఆరాధన చేయటం వల్ల పదిరోజుల వరకు జరిగిన దేవుని హక్కులకు సంబంధించిన పాపాలు మన్నించబడతాయన్నమాట. నాల్గోది : జుమా ప్రసంగం జరుగుతున్నప్పుడు నిశ్శబ్దంగా ఉండటం అవసరం. లేకపోతే జుమా పుణ్యం నీరుగారిపోయే ప్రమాదముంది. ఇక ఐదోది : జుమా నమాజు సందర్భంగా చేసే ప్రసంగం కూడా తప్పకుండా వినాలి. ఈ ప్రసంగం రెండు రకాతుల నమాజుకు సమానం. ఖతీబ్ (ఉపన్యాసకుడు) జుమా ప్రసంగం ముక్తసరిగా ఇవ్వడానికి ప్రయత్నించాలి.

١٢٩ ـ الثَّالِثَ عَشَرَ: عَنْهُ، أَنَّ رسُولَ اللهِ ﷺ قَالَ: «إذَا تَوَضَّأَ العَبْدُ المُسْلِمُ، أَوِ المُؤْمِنُ فَغَسَلَ وَجْهَهُ خَرَجَ مِنْ وَجْهِهِ كُلُّ خَطِيئَةٍ نَظَرَ إلَيْهَا بِعَيْنِهِ مَعَ المَاءِ، أَوْ مَعَ آخِرِ قَطْرِ المَاءِ، فَإِذَا غَسَلَ يَدَيْهِ خَرَجَ مِنْ يَدَيْهِ كُلُّ خَطِيئَةٍ كَانَ بَطَشَتْهَا يَدَاهُ مَعَ المَاءِ، أَوْ مَعَ آخِرِ قَطْرِ المَاءِ، فَإِذَا غَسَلَ رِجْلَيهِ خَرَجَتْ كُلُّ خَطِيئَةٍ مَشَتْهَا رِجْلاهُ مَعَ المَاءِ أَوْ مَعَ آخِرِ قَطْرِ المَاءِ حَتَّى يَخْرُجَ نَقِيًّا مِنَ الذُّنُوبِ» رواه مسلم.

దేహంగా దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారని హజ్రత్ అబూ హురైరా (రజి) ఉటంకించారు :

ముస్లిం లేక విశ్వాసి అయిన దాసుడు వుజూ చేస్తూ ముఖం కడుక్కున్నప్పుడు, ఆ నీళ్ళతోపాటు లేక ఆ నీటి చివరి బొట్టుతోపాటు అతను తన కళ్ళతో చేసిన అతని పాపాలన్నీ కొట్టుకుపోతాయి. తరువాత చేతులు కడుక్కున్నప్పుడు ఆ నీళ్ళతోపాటు లేక నీటి చివరి బొట్టుతో పాటు అతని చేతులు చేసిన పాపాలన్నీ కొట్టుకుపోతాయి. ఇంకా అతను కాళ్ళు కడుక్కున్నప్పుడు నీళ్ళతోపాటు లేక ఆఖరి బొట్టుతో పాటు తన కాళ్ళతో నడిచి చేసిన పాపాలన్నీ కొట్టుకు పోతాయి. ఆ విధంగా అతను పాపాల నుండి పరిశుద్ధుడై పోతాడు.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని 'శుచీశుభ్రతల' ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో వుజూ మహత్యం వివరించబడింది. రోజూ ఐదుపూటలా వుజూ చేసేవ్యక్తి పాపాల మాలిన్యం నుండి ఎలా కడిగివేయబడతాడో చూశారా? వుజూ వల్ల కేవలం శరీర అవయవాలే కాదు, మనసు కూడా పరిశుభ్రంగా ఉంటుంది. వుజూ చేయటం వల్ల చిన్న చిన్న పాపాలన్నీ తుడిచిపెట్టుకుపోతాయి.

١٣٠ ـ الرَّابِعَ عَشَرَ: عنه عن رسولِ اللهِ ﷺ قَالَ: «الصَّلَوَاتُ الخَمْسُ، وَالجُمُعَةُ إلَى الجُمُعَةِ، وَرَمَضَانُ إلَى رَمَضَانَ مُكَفِّرَاتٌ لِمَا بَيْنَهُنَّ إذَا اجْتُنِبَتِ الكَبَائِرُ» رواه مسلم.

130. ఆయన (అబూ హురైరా - రజి) గారే చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: (మనిషి) ఘోర (కబీరా) పాపాలకు దూరంగా ఉంటే, ఐదు పూటల నమాజులు, ఒక జుమా నుండి మరొక జుమా, ఒక రమజాన్

మాసం నుండి మరొక రమజాన్ మాసం వరకు మధ్య జరిగిన పాపాలకు పరిహార మవుతాయి. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక విశ్వాసి ఘోరపాపాలకు పాల్పడకుండా, సాటి మానవుల హక్కులను కొల్లగొట్టకుండా జాగ్రత్తగా మసలుకుంటే పైన పేర్కొనబడిన ఆరాధనలవల్ల అతను పూర్తిగా పాపాల నుండి పవిత్రుడయిపోతాడు.

١٣١ ـ الْخَامِسَ عَشَرَ: عنه قال: قال رسولُ الله ﷺ: «أَلا أَدُلُّكُم عَلَى مَا يَمْحُو اللهُ بِهِ الْخَطَايَا، وَيَرْفَعُ بِهِ الدَّرَجاتِ؟»، قالوا: بَلَى يَا رَسُولَ اللهِ! قال: «إِسْبَاغُ الْوُضُوءِ عَلَى الْمَكَارِهِ وَكَثْرَةُ الْخُطَا إِلَى الْمَسَاجِدِ، وَانْتِظَارُ الصَّلاةِ بَعْدَ الصَّلاةِ، فَذٰلِكُمُ الرِّبَاطُ» رواه مسلم.

131. ఆయన (అబూ హురైరా - రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తన సహచరులతో "దైవం (మానవుల) పాపాలను ప్రక్షాళనంచేసి, వారి స్థానాలను ఉన్నతం చేసేందుకు దోహదపడే విషయాలు ఏమిటో నేను మీకు చెప్పనా?" అని అన్నారు. దానికి ఆయన సహచరులు "తప్పకుండా చెప్పండి దైవప్రవక్తా!" అని విన్నవించుకున్నారు. అప్పుడు ఆయన "మనసు ఒప్పకపోయినా పూర్తిగా వుజూ చేయటం, మస్జిద్‌ల వైపు ఎక్కువగా అడుగులు వేయటం (అంటే దూరం నుంచి రావటం), ఒక నమాజు ముగిసిన పిదప తరువాతి నమాజు కోసం ఎదురు చూడటం ఇంకా ఇది (పుణ్యపరంగా) సరిహద్దుపై కాపలా కాయటం (తో సమానం)" అని చెప్పారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో 'రిబాత్' అన్న పదం వాడబడింది. రిబాత్ అంటే సరిహద్దుపై కాపలా కాయటం. ఒక దేశ సరిహద్దుల వద్ద కాపలా కాయడమనేది ఎప్పుడూ జరుగుతుండే పని. అందుకే ఎల్లప్పుడూ సత్కార్యాలు చేస్తూ ఉండటాన్ని, నిరంతరం ఆరాధనలు చేస్తూ ఉండటాన్ని సరిహద్దుపై కాపలాతో పోల్చడం జరిగింది. మనసు ఒప్పుకోకపోయినా పూర్తిగా వుజూ చేయడమంటే, విపరీతంగా చలివేస్తున్నప్పుడు గాని లేక అనారోగ్యానికి గురై వున్నప్పుడుగాని నీళ్ళతో వుజూ చేయడం భారంగా తోస్తుంది. అయితే ఒక విశ్వాసి దైవప్రసన్నత కోసం ఆ బాధను సహిస్తూ సరైన రీతిలో ప్రవక్త పద్ధతిననుసరించి వుజూ చేస్తే అతని సహనానికి తగిన పుణ్యం అతనికి లభిస్తుంది.

అదేవిధంగా ఇల్లు మస్జిద్‌కు దగ్గరగా ఉండటం కొన్ని విధాలుగా సౌకర్యంగానూ, ప్రయోజనకరంగానూ ఉన్నప్పటికీ, మస్జిద్‌కు నడిచివెళ్ళినందుకు లభించే పుణ్యాన్ని బట్టి చూస్తే ఇల్లు మస్జిద్‌కు దూరంగా ఉండటమే మంచిది. మనిషి ఆరాధనా సంకల్పంతో మస్జిద్ వైపు ఎన్ని అడుగులు వేస్తాడో అతనికి అంత పుణ్యం లభిస్తుంది. సమీప ఇండ్లవారు ఆ పుణ్యాన్ని పొందలేరు.

١٣٢ ـ السَّادسَ عَشَرَ: عن أبي موسى الأَشْعَرِيِّ رضي اللهُ عنه قال: قال رسولُ الله ﷺ: «مَنْ صَلَّى الْبَرْدَيْنِ دَخَلَ الْجَنَّةَ» متفقٌ عليه. «الْبَرْدَانِ»: الصُّبْحُ وَالْعَصْرُ.

132. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : రెండు శీతల నమాజులను చేసేవాడు స్వర్గంలోకి ప్రవేశిస్తాడు." *(బుఖారీ - ముస్లిం)*

'బర్‌దాన్' (రెండు శీతల నమాజులు) అంటే ఫజ్ర్ మరియు అస్ర్ నమాజులని భావం.

*(సహీహ్ బుఖారీలోని నమాజు వ్యవధుల ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని మస్జిదుల ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడింది).*

## ముఖ్యాంశాలు

సాధారణంగా ప్రజలు 'ఫజ్ర్' మరియు 'అస్ర్' నమాజుల పట్ల నిర్లక్ష్యం వహిస్తారు. ఫజ్ర్ వేళకు నిద్రనుండి మేల్కొని నమాజు కోసం మస్జిద్‌కు రావటం మనసుకు భారంగా తోస్తుంది. అదేవిధంగా అస్ర్‌వేళ సాధారణంగా ప్రజలు తమ దైనందిన కార్యకలాపాల్లో తలమునకలై ఉండి, నమాజు పట్ల అశ్రద్ధ వహిస్తారు. అందుకే పై హదీసులో ఆ నమాజుల మహత్యాన్ని వివరిస్తూ, వాటిని క్రమం తప్పకుండా నిర్వర్తిస్తూ ఉండమని తాకీదు చేయటం జరిగింది. ఈ రెండు నమాజులను నిత్యం క్రమం తప్పకుండా చేసేవాడికి మిగిలిన మూడు

నమాజులు చేయడం ఏమంత కష్టం కాదు. మనిషి ఈ రెండు నమాజులను కాపాడుకుంటే అవి అతని స్వర్గప్రవేశానికి దోహదకారి అవుతాయి.

١٣٣ـ السَّابِعَ عَشَرَ: عنه قال: قال رسولُ الله ﷺ: «إذَا مَرِضَ الْعَبْدُ أَوْ سَافَرَ كُتِبَ لَهُ مِثْلُ مَا كَانَ يَعْمَلُ مُقِيماً صَحِيحاً» رواه البخاري.

133. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారని హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) గారే తెలియజేశారు: దాసుడు అనారోగ్యానికి గురైనప్పుడు లేదా ప్రయాణంలో ఉన్నప్పుడు అతను స్థానికుడై ఆరోగ్యంగా ఉన్నప్పుడు చేసే (సత్) కర్మలు అతని పేర రాయబడ తాయి.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ 'సత్కర్మలు' అంటే విధులు (ఫరాయెజ్) కావు. మనిషి నిత్యం చేస్తూ ఉండే అభిలషణీయమైన స్వచ్ఛంద కార్యాలని భావం. షరీఅత్ పరమైన తగు కారణం వల్ల అతను ఆ పనులు చేయలేకపోయినా వాటి పుణ్యం మాత్రం అతని ఖాతాలో జమ అవుతూ ఉంటుంది. అయితే ఈ అవకాశం ఫర్జ్ (విధి) కార్యకలాపాలకు లేదు. ఫర్జ్ కార్యాలను ఎట్టి పరిస్థితుల్లోనూ వదలటానికి వీల్లేదు.

١٣٤ ـ الثَّامِنَ عَشَرَ: عَنْ جَابِرٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «كُلُّ مَعْرُوفٍ صَدَقَةٌ» رواه البخاري، ورواه مسلم من رواية حُذَيْفَةَ رضي الله عنه

134. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : "ప్రతి మంచి పనీ పుణ్యమే." (బుఖారీ - ముస్లిం (రహ్మాలై) గారు ఈ హదీసునే హజ్రత్ హుజైఫా (రజి) ఆధారంగా వెలికితీశారు).

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని 'జకాత్' ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

విశ్వాసి మంచితో, మేలుతో కూడుకున్న పని ఏదయినా చేస్తే అందుకు అతనికి 'సదఖా' చేసినంత పుణ్యం లభిస్తుందని ఈ హదీసు తెలియపరుస్తోంది. అన్ని రకాల సత్కార్యాలను, మేలుతో కూడుకున్న పనులను 'మారూఫ్' అంటారు. పైగా నేరాలకు, పాపాలకు దూరంగా ఉండటం కూడా 'మారూఫ్' (పుణ్యకార్యం) గానే భావించడం జరుగుతుంది.

١٣٥ ـ التَّاسعَ عَشَرَ: عَنْهُ قال: قال رسولُ الله ﷺ: «مَا مِنْ مُسْلِم يَغْرِسُ غَرْساً إلَّا كَانَ مَا أُكِلَ مِنْهُ لَهُ صَدَقَةً، وَمَا سُرِقَ مِنْهُ لَهُ صَدَقَة، ولا يَرْزَؤُه أَحَدٌ إلَّا كَانَ لَه صَدَقَةً» رواه مسلم. وفي رواية له: «فَلا يَغْرِسُ الْمُسْلِمُ غَرْساً، فَيَأْكُلَ مِنْهُ إِنسَانٌ وَلا دَابَّةٌ وَلا طَيْرٌ إلَّا كَانَ لَهُ صَدَقَةً إلى يَوْمِ الْقِيَامَةِ».

وفي رواية له: «لا يَغْرِسُ مُسلِمٌ غَرْساً، وَلا يَزْرَعُ زَرْعاً، فَيَأْكُلَ مِنْهُ إِنْسَانٌ وَلا دَابَّةٌ وَلا شَيْءٌ إلَّا كَانَت لَهُ صَدَقَةٌ» وَرَوَيَاهُ جَمِيعاً مِنْ رواية أَنَسٍ رضي الله عنه. قولُهُ: «يَرْزَؤُهُ» أي: يَنْقُصُهُ.

135. హజ్రత్ జాబిర్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఎవడైనా ముస్లిం ఒక చెట్టు నాటితే (దాని ఫలాలు పక్షులు, పందికొక్కులు, తదితర జంతువులు, కీటకాలవల్ల) తినేయబడినా అది అతని తరపునుండి 'సదఖా' (పుణ్యకార్యం) అవుతుంది. అలాగే అందులోనుంచి దొంగిలించబడినా దాన్ని అతని తరపు నుండి 'సదఖా'గానే భావించడం జరుగుతుంది. ఎవడైనా దానికి నష్టం కలిగిస్తే, అది కూడా సదఖాగానే పరిగణించబడుతుంది. (ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : ముస్లిం ఏదైనా చెట్టు నాటగా, దాన్ని (అంటే దాని ఆకులను, ఫలాలను) ఏ మానవుడైనా లేక జంతువైనా లేక పక్షి అయినా తినేస్తే, దానిపై అతనికి ప్రళయం వరకూ పుణ్యం లభిస్తూనే ఉంటుంది.

ముస్లింలోని ఇంకొక ఉల్లేఖనం ప్రకారం ముస్లిం ఏదైనా చెట్టునాటగా లేక చేను పండించగా ఏ మానవుడైనా లేక జంతువైనా లేక మరేదైనా దాన్ని తినేస్తే అందులో అతనికి పుణ్యమే లభిస్తుంది.

(బుఖారీ, ముస్లింలిరువురూ ఈ హదీసును హజ్రత్ అనస్ (రజి) ఆధారంగా కూడా ఉల్లేఖించారు).

'యర్జవుహూ' అంటే దాన్ని నష్టపరచటం లేదా దాంట్లో లోటు కల్పించడం అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని 'సేద్యం, కౌలు వ్యవసాయాల' ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని పండ్లు, పంటల వాటాల వ్యవహారం (ముసాఖాత్) ప్రకరణంలోనూ ఈ హదీసును పేర్కొనటం జరిగింది).*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా వ్యవసాయం, తోటల పెంపకం యొక్క ప్రాముఖ్యత వెల్లడౌతోంది. పంటలు పండిన తరువాత ప్రకృతి వైపరీత్యాలకు గురై నాశనమవడం గాని, దురాక్రమణకు గురవడం గాని, లేదా దొంగిలించబడడం గాని జరిగినప్పుడు ముస్లిం అయిన వ్యక్తి దానిపై సహనం వహిస్తే దానిపై కూడా అతనికి పుణ్యం లభిస్తుందని చెప్పబడింది.

١٣٦ ـ الْعِشْرُونَ: عَنْهُ قالَ: أَرَادَ بَنُو سَلِمَةَ أَنْ يَنْتَقِلُوا قُرْبَ الْمَسْجِدِ فَبَلَغَ ذلِكَ رسولَ اللهِ ﷺ، فَقَالَ لَهُمْ: «إِنَّهُ قَدْ بَلَغَنِي أَنَّكُمْ تُرِيدُونَ أَنْ تَنْتَقِلُوا قُرْبَ الْمَسْجِدِ؟»، فَقَالُوا: نَعَمْ يَا رسولَ اللهِ! قَدْ أَرَدْنَا ذلكَ، فَقَالَ: «بَنِي سَلِمَةَ دِيَارَكُمْ؛ تُكْتَبْ آثَارُكُمْ، دِيَارَكُمْ؛ تُكْتَبْ آثَارُكُمْ» رواه مسلم. وفي روايةٍ: «إِنَّ بِكُلِّ خَطْوَةٍ دَرَجَةً» رواه مسلم. ورواه البخاري أيضاً بِمَعْنَاهُ مِنْ رواية أَنَسٍ رضي الله عنه. و«بَنُو سَلِمَةَ» بكسر اللام: قبيلة معروفة من الأنصار رضي الله عنهم، و«آثَارُهُمْ» خُطَاهُمْ.

136. హజ్రత్ జాబిర్ (రజి) గారే ఇలా తెలిపారు : బనూ సలిమా తెగవారు మస్జిద్ సమీప ప్రాంతానికి తరలివెళదామని నిశ్చయించుకున్నారు. ఈ విషయం దైవప్రవక్త (సల్లం) గారికి తెలిసింది. అప్పుడు ఆయన వారితో "ఏమిటీ, మీరందరూ మస్జిద్ సమీప ప్రాంతానికి తరలివెళదామనుకుంటున్నారట?" అని అడిగారు. దానికి వారు "ఔను దైవప్రవక్తా! మేము నిజంగానే వెళదామనుకుంటున్నాము" అని సమాధానమిచ్చారు.

అందుకు ఆయన "బనూ సలిమా తెగవారలారా! మీరు మీ ఇండ్లలోనే ఉండండి. మీ అడుగు ముద్రలు లిఖించబడతాయి. మీరు మీ ఇండ్లలోనే ఉండండి. మీ అడుగుల ముద్రలు లిఖించబడతాయి" అని వారికి ఉపదేశించారు. *(ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో "మీరు (మస్జిద్ వైపు) వేసే ప్రతి అడుగుకీ ఒకింత (ఉన్నత) స్థానం లభిస్తుంది"

అని ఉంది. బుఖారీ కూడా హ(జత్ అనస్ (రజి) ఆధారంగా ఈ భావంలోనే ఉల్లేఖించారు.

'బనూ సలిమా' అనేది అన్సార్‌కు చెందిన ఒక పేరెన్నికగన్న తెగ. 'ఆసారుహుమ్' అంటే అడుగులు (అడుగుల ముద్రలు).

(సహీహ్ బుఖారీలోని 'అజాన్' ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని మస్జిదుల ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది).

## ముఖ్యాంశాలు

1. సత్కార్యం ఎంత కష్టమైనదయితే దానిపై లభించే పుణ్యం అంతే ఎక్కువగా ఉంటుంది.

2. మస్జిద్ నుండి ఇల్లు ఎంత దూరం ఉన్నప్పటికీ, మస్జిద్‌కు వెళ్ళి సామూహిక నమాజులో పాల్గొనాలి.

137. హ(జత్ అబూ ముంజిర్ ఉబై బిన్ కాబ్ (రజి) కథనం : ఒక వ్యక్తి ఉండేవాడు. నాకు తెలిసినంతవరకు మస్జిద్ నుండి అతని ఇల్లుకన్నా దూరంగా ఎవరి ఇల్లూ లేదు. అయినా అతను ఒక్క నమాజును కూడా వదిలేవాడు కాదు. అతనితో ఎవరో అన్నారు లేక నేనే అన్నాననుకుంటా, "ఒక గాడిదను కొనుక్కొని చీకటి పడినప్పుడు, ఎండ తీవ్రంగా ఉన్నప్పుడు దానిపై ఎక్కి రావచ్చుగదా?" అని. దానికి అతను, "నా ఇల్లు మస్జిద్ చెంతనుండటం నాకిష్టం లేదు. నేను (దూరం నుండి) మస్జిద్‌కు నడిచి రావడం, తిరిగి మస్జిద్ నుండి ఇంటికి తిరిగి వెళ్ళడం నా కర్మల

١٣٧ - الْحَادِي وَالْعِشْرُونَ: عَنْ أَبِي الْمُنْذِرِ أُبَيِّ بْنِ كَعْبٍ رضي الله عنه قال: كَانَ رَجُلٌ لا أَعْلَمُ رَجُلاً أَبْعَدَ مِنَ الْمَسْجِدِ مِنْهُ، وَكَانَ لا تُخْطِئُهُ صَلاةٌ فَقِيلَ لَه، أَوْ فَقُلْتُ لَه: لَوِ اشْتَرَيْتَ حِمَاراً تَرْكَبُهُ فِي الظَّلْمَاءِ، وفي الرَّمْضَاءِ؟ فَقَالَ: مَا يَسُرُّنِي أَنَّ مَنْزِلِي إلى جَنْبِ الْمَسْجِدِ، إِنِّي أُرِيدُ أَنْ يُكْتَبَ لِي مَمْشَايَ إِلَى الْمَسْجِدِ، وَرُجُوعِي إذَا رَجَعْتُ إِلَى أَهْلِي، فَقَالَ رسولُ الله ﷺ: «قَدْ جَمَعَ اللهُ لَكَ ذلِكَ كُلَّهُ» رواه مسلم. وفي روايةٍ: «إنَّ لَكَ مَا احْتَسَبْتَ». «الرَّمْضَاءُ»: الأَرْضُ الَّتِي أَصَابَهَا الْحَرُّ الشَّدِيدُ.

పత్రంలో వ్రాయబడాలని నేను కోరుకుం టున్నాను" అన్నాడు. (అతని మాటలు విని) దైవప్రవక్త (సల్లం) "అల్లాహ్ నీవు కోరుకున్నదంతా (నీ ఖాతాలో) జమ చేశాడు" అని అన్నారు.

వేరొక ఉల్లేఖనంలో "నీకు నీవు ఆశిం చిన పుణ్యం లభిస్తుంది" అని ఉంది.

'అమ్రమ్‌జా' అంటే ఎండకు కాలుతున్న నేల.

(సహీహ్ ముస్లింలోని మస్జిదుల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

1. ప్రవక్త (సల్లం) సహచరులు పరలోక పుణ్యాన్ని సంపాదించడం కోసం ఎలా పరితపించిపోయేవారో ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

2. మనిషికి లభించే పుణ్యం అతని సంకల్పానికి అనుగుణంగా ఉంటుంది. ఆ విధంగా చూస్తే ఇల్లు మస్జిద్‌కు దూరంలో ఉండటం కూడా శుభకరమే అని తెలుస్తోంది.

138. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిం చారని హజ్రత్ అబూ ముహమ్మద్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) తెలియజేశారు : నలభై (సద్) గుణా లున్నాయి. వాటిలో అత్యుత్తమమైన గుణం మేకపాలను (ఇతరులకు కానుకగా) ఇచ్చివేయడం. ఏ సదాచారి అయినా పుణ్యాన్ని ఆశిస్తూ, దేవుని తరఫునుండి చేయబడిన వాగ్దానాలను ధృవీకరిస్తూ వాటిలోని ఏ ఒక్క సద్గుణాన్ని ఆచరించినా దేవుడు తప్పకుండా అతనికి స్వర్గంలో ప్రవేశం కల్పిస్తాడు. (బుఖారీ)

١٣٨ ـ الثَّاني وَالعِشْرُونَ: عَنْ أبي محمدٍ عبدِ اللهِ بنِ عمرو بنِ العاص رضي الله عنهما قال: قال رسولُ الله ﷺ: «أَرْبَعُونَ خَصْلَةً أَعْلاَهَا مَنِيحَةُ الْعَنْزِ، مَا مِنْ عَامِلٍ يَعْمَلُ بِخَصْلَةٍ مِنْهَا رَجَاءَ ثَوَابِهَا وَتَصْدِيقَ مَوعُودِهَا إلَّا أَدْخَلَهُ اللهُ بِهَا الْجَنَّةَ» رواه البخاري. «الْمَنِيحَةُ»: أَنْ يُعْطِيَهُ إِيَّاهَا لِيَأْكُلَ لَبَنَهَا ثُمَّ يَرُدَّهَا إِلَيْهِ.

ఒక వ్యక్తి తన పశువును ఇతరుల కెవరికైనా ఇచ్చి, దాని పాలను కానుకగా సేవించమని చెప్పి, పశువును తిరిగి వాపసు చేయమంటాడు. అలాంటి పశువునే 'మనీహా' అని అంటారు.

*(సహీహ్ బుఖారీలోని 'కానుకల' ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసులో చెప్పబడిన విధంగా ఒక వస్తువుని తమ యాజమాన్యంలో ఉంచుకొని, తాత్కాలిక ప్రయోజనాల నిమిత్తం దాన్ని ఇతరులకు ఇచ్చివేస్తే దానివల్ల కూడా పుణ్యం లభిస్తుంది.

١٣٩ ـ الثَّالِثُ وَالْعِشْرُونَ: عَنْ عَدِيِّ بن حَاتِمٍ رضي الله عنه قال: سَمِعْتُ النَّبِيَّ ﷺ يقول: «اتَّقُوا النَّارَ وَلَوْ بِشِقِّ تَمْرَةٍ» متفقٌ عليه.

وفي روايةٍ لهما عنه قال: قال رسولُ الله ﷺ: «مَا مِنْكُمْ مِنْ أَحَدٍ إِلَّا سَيُكَلِّمُهُ رَبُّهُ لَيْسَ بَيْنَهُ وَبَيْنَهُ تَرْجُمَانٌ، فَيَنْظُرُ أَيْمَنَ مِنْهُ فَلا يَرَى إِلَّا مَا قَدَّمَ، وَيَنْظُرُ أَشْأَمَ مِنْهُ فَلا يَرَى إِلَّا مَا قَدَّمَ، وَيَنْظُرُ بَيْنَ

139. దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అదీ బిన్ హాతిం (రజి) తెలియజేశారు : మిమ్మల్ని మీరు అగ్ని నుండి కాపాడుకోండి! ఒక్క ఖర్జూరపు ముక్క (దానం) తోనైనా సరే; *(బుఖారీ - ముస్లిం)*

ఉభయులూ (బుఖారీ - ముస్లింలు), అదీ (రజి) ఆధారంగా వెలికితీసిన వేరొక ఉల్లేఖనంలో దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారని ఉంది : మీలోని ప్రతి ఒక్కరితోనూ అతని ప్రభువు (నేరుగా) సంభాషిస్తాడు. అప్పుడు అతనికి - అతని ప్రభువుకు మధ్య ఏ అనువాదకుడూ ఉండడు. (ఆ రోజు) మానవుడు తన కుడివైపు చూస్తాడు. అక్కడ అతనికి తాను అంతకుముందు చేసిన ఆచరణే కనిపిస్తుంది. ఆ తరువాత ముందువైపు చూస్తాడు. అక్కడ నరకాగ్ని మండుతూ

يَدَيْهِ فَلا يَرَى إِلَّا النَّارَ تِلْقَاءَ وَجْهِهِ، فَاتَّقُوا النَّارَ وَلَوْ بِشِقِّ تَمْرَةٍ، فَمَنْ لَمْ يَجِدْ فَبِكَلِمَةٍ طَيِّبَةٍ».

కనిపిస్తుంది. కనుక ఒక్క ఖర్జూరపు ముక్కతోనైనా సరే మిమ్మల్ని మీరు నరకాగ్ని బారినుండి కాపాడుకోండి; అదీ చేయలేకపోతే ఒక్క మంచిమాట చెప్పి అయినా సరే;

*(మొదటి ఉల్లేఖనం సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణంలోనూ, జకాత్ తదితర ప్రకరణాల్లోనూ వచ్చింది. ఇంకా సహీహ్ బుఖారీలోని తౌహీద్ మొదలగు ప్రకరణాల్లోనూ, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణంలోనూ రెండవ ఉల్లేఖనం పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

1. ప్రళయదినాన మనిషి దైవసన్నిధిలో నిలబడి ఉన్నప్పుడు అతనికి ఇరుప్రక్కలా తాను అంతకుముందు లోకంలో చేసుకున్న కర్మలుంటాయనీ, ఆ సమయంలో అతను పరమప్రభువుతో ప్రత్యక్షంగా మాట్లాడి తాను చేసిన కర్మలకు జవాబుదారీ వహించవలసి ఉంటుందని పై హదీసు తీవ్రంగా హెచ్చరిస్తోంది. రెండో విషయం ఏమిటంటే, ప్రతి వ్యక్తీ తన స్థోమతకు తగ్గట్టుగా దైవమార్గంలో ఖర్చుపెట్టడానికి, దానధర్మాలు చేయడానికి ప్రయత్నించాలి. అదేవిధంగా ఇతరులను నవ్వుతూ పలకరించడం, వారిపట్ల మృదువుగా మెలగడం లాంటి సద్వర్తనాలను అవలంబించడం కూడా ముక్తికి సోపానం కావచ్చు.

2. ప్రళయం రోజు మనిషికి పనికివచ్చేవి అతను చేసుకున్న సత్కర్మలే.

١٤٠ ـ الرَّابِعُ وَالْعِشْرُونَ: عَنْ أَنَسٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «إِنَّ اللهَ لَيَرْضَى عَنِ الْعَبْدِ أَنْ يَأْكُلَ الأَكْلَةَ فَيَحْمَدَهُ عَلَيْهَا، أَوْ يَشْرَبَ الشَّرْبَةَ فَيَحْمَدَهُ عَلَيْهَا» رواه مسلم. وَ«الأَكْلَة» بفتح الهمزة: وَهِيَ الغَدْوَةُ أَوِ العَشْوَةُ.

140. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : భోజనం చేసి దానిపై దైవానికి కృతజ్ఞతలు తెలుపుకునేవాడి పట్ల, నీళ్ళు త్రాగి దానిపై దైవాన్ని కొని యాడే దాసుడి పట్ల అల్లాహ్ అమితంగా ప్రసన్నుడౌతాడు. (ముస్లిం)

'అక్లా' అంటే ఉదయం లేక రాత్రి భోజనం.

*(సహీహ్ ముస్లింలోని దైవధ్యాన ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషికి రుచినీ, తృప్తినీ, ఆహ్లాదాన్ని ఇచ్చే భోజనం తినడం, నీళ్ళు త్రాగడం లాంటి వాటిపై దైవానికి కృతజ్ఞతలు తెలుపుకుంటే అందులోనూ పుణ్యం దొరుకుతుందని, ఆ విధంగా తినడం, త్రాగడం కూడా ముక్తికి దోహదపడవచ్చని పై హదీసు ద్వారా తెలుస్తోంది. (సుబ్‌హానల్లాహి వ బిహమ్దిహీ సుబ్‌హానల్లాహిల్ అజీం).

١٤١ ـ الْخَامِسُ وَالْعِشْرُونَ: عن أبي موسى رضي الله عنه عن النبيِّ ﷺ قال: «عَلَى كُلِّ مُسْلِمٍ صَدَقَةٌ»، قالَ: أَرَأَيْتَ إِنْ لَمْ يَجِدْ؟ قالَ: «يَعْمَلُ بِيَدَيْهِ فَيَنْفَعُ نَفْسَهُ وَيَتَصَدَّقُ»، قالَ: أَرَأَيْتَ إِنْ لَمْ يَسْتَطِعْ؟ قـالَ: «يُعِيـنُ ذَا الْحَـاجَـةِ الْمَلْهُوفَ»، قالَ: أَرَأَيْتَ إِنْ لَمْ يَسْتَطِعْ؟ قالَ: «يَأْمُرُ بِالْمَعْرُوفِ أَوِ الْخَيْرِ»، قالَ: أَرَأَيْتَ إِنْ لَمْ يَفْعَلْ؟ قالَ: «يُمْسِكُ عَنِ الشَّرِّ فَإِنَّهَا صَدَقَةٌ» متفقٌ عليه.

141. హజ్రత్ అబూ మూసా అష్‌అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త ఇలా అన్నారు: "ప్రతి ముస్లిం తప్పనిసరిగా 'సదఖా' చేయాలి." అందుకు అబూ మూసా అష్‌అరీ (రజి) "అతని దగ్గర అంత స్థోమత లేకపోతేనో?!" అని సందేహపడ్డారు. దానికి దైవప్రవక్త "అతను తన స్వహస్తాలతో (కష్టపడి) పనిచేసి (వచ్చిన జీతాన్ని) తన స్వయం కోసం ఉపయోగించుకోవాలి. ఇంకా సదఖా కూడా చేయాలి" అని చెప్పారు. "అతనిలో ఆ శక్తి కూడా లేకపోతే?" అని అబూమూసా (రజి) మళ్ళీ సందేహ పడగా, దానికి ఆయన (స), "ఎవడైనా అవసరాల్లో ఉన్న వ్యక్తి ఏదైనా ఆపదలో చిక్కుకొని ఉంటే అతణ్ణి ఆదుకోవాలి" అని జవాబు చెప్పారు. అప్పుడు మళ్ళీ ఆయన "అదీ చేయలేకపోతే" అని అడగ్గా, దైవప్రవక్త (స) "అప్పుడు అతను మంచిని లేదా మేలును గురించి ఆదే శిస్తూ ఉండాలి" అని అన్నారు. అబూ మూసా (రజి) గారు "మరి అదీ చేయ లేకపోతేనో?" అని మళ్ళీ సందేహపడగా అప్పుడు ఆయన (స), "అటువం టప్పుడు అతను పరులకు కీడు తలపెట్ట

కుండానైనా జాగ్రత్తపడాలి. నిస్సందే
హంగా ఇది కూడా సదఖాయే (ఒక
రకంగా దానమే)" అని చెప్పారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణంలోనూ, సంస్కార ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణంలోనూ ఈ హదీసు ఉంది).*

## ముఖ్యాంశాలు

1. మనిషి కష్టపడి, చెమటోడ్చి డబ్బు సంపాదించాలని ఈ హదీసు బోధిస్తోంది. తద్వారా అతను తన అవసరాలను తీర్చుకోవటంతో పాటు దైవమార్గంలో సదఖా (దానం) కూడా చేయగలడు.

2. సదఖా భావం చాలా విస్తృతమైనది. పుణ్యప్రదమైన, మేలుతో కూడిన అనేక రకాల సత్కార్యాలు దీని పరిధిలోకి వస్తాయి. ఆఖరికి చెడు పనులు చేయకుండా ఉండటం కూడా 'సదఖా' క్రిందికే వస్తుంది.



**14వ అధ్యాయం**

# ١٤ ـ بَابٌ فِي الاقْتِصَادِ فِي الْعِبَادَةِ

# ఆరాధనలో మధ్యేమార్గం

قال الله تعالىٰ: ﴿طه ۞ مَا أَنزَلْنَا عَلَيْكَ الْقُرْآنَ لِتَشْقَىٰ ۞﴾ [طه: ١، ٢]، وقال تعالىٰ: ﴿يُرِيدُ اللَّهُ بِكُمُ الْيُسْرَ وَلَا يُرِيدُ بِكُمُ الْعُسْرَ﴾ [البقرة: ١٨٥].

అల్లాహ్ సెలవిచ్చాడు : మేము ఈ ఖుర్ఆన్‌ను నీపై అవతరింపజేసింది నిన్ను కష్టానికి గురిచేయడానికి కాదు. (తాహా : 1,2)

మరొకచోట ఆయన ఇలా సెలవిచ్చాడు: "అల్లాహ్ మీకు సౌలభ్యం కలుగజేయాలనే అభిలషిస్తాడు. మిమ్మల్ని కష్టపెట్టాలనే తలంపు ఆయనకు లేదు." (అల్ బఖర : 185)

١٤٢ ـ وعن عائشةَ رضي الله عنها، أنَّ النبيَّ ﷺ دَخَلَ عَلَيْهَا وَعِنْدَهَا امْرَأَةٌ قال: «مَنْ هٰذِهِ؟» قالت: هَذِهِ فُلَانَةٌ تَذْكُرُ مِنْ صَلَاتِهَا، قَالَ: «مَهْ عَلَيْكُمْ بِمَا تُطِيقُونَ، فَوَاللهِ! لا يَمَلُّ اللهُ حَتَّى تَمَلُّوا» وَكَانَ أَحَبُّ الدِّيْنِ إِلَيْهِ مَا دَاوَمَ صَاحِبُهُ عَلَيْهِ. متفقٌ عليه.

142. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం ఒకసారి దైవప్రవక్త (సల్లం) తన దగ్గరకు వచ్చినప్పుడు అక్కడ ఆమె దగ్గర ఒక స్త్రీ కూర్చొని ఉంది. దైవప్రవక్త (సల్లం) "ఎవరీమె?' అని అడిగారు.

దానికి హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) "ఒక ఆవిడ (నఫిల్) నమాజులు ఎక్కువగా చేస్తుందంటూ జనం చెప్పుకుంటున్నారే! ఈమే ఆవిడ" అని తెలిపారు. అది విని దైవప్రవక్త (స) "ఇక అపు (ఈమె పొగడ్తలు)! మీ శక్తిమేరకే పనులు చేయండి. దైవసాక్షి! దేవుడు విసుగు చెందడు. కాని ఆఖరికి మీరే విసుగెత్తి పోవచ్చు (అంటే అతి ఎక్కువగా ఆరాధనలు చేయటం వల్ల మీకు విసుగు రావచ్చేమోగాని దానిపై పుణ్యం

وَ«مَهْ» كَلِمَةُ نَهْيٍ وَزَجْرٍ. وَمَعْنَى «لا يَمَلُّ اللهُ» أَيْ: لا يَقْطَعُ ثَوَابَهُ عَنْكُمْ وَجَزَاءَ أَعْمَالِكُمْ، وَيُعَامِلُكُمْ مُعَامَلَةَ الْمَالِّ حَتَّى تَمَلُّوا فَتَتْرُكُوا، فَيَنْبَغِي لَكُمْ أَنْ تَأْخُذُوا مَا تُطِيقُونَ الدَّوَامَ عَلَيْهِ لِيَدُومَ ثَوَابُهُ لَكُمْ وَفَضْلُهُ عَلَيْكُمْ.

ప్రసాదించే విషయంలో ఆయన మాత్రం విసుగుచెందడు). (దానికి బదులు) మనిషి చేసే ధర్మకార్యాలలో శాశ్వతంగా పాటించే ఆరాధనే దేవునికి అత్యంత ప్రీతికరమైనది. *(బుఖారీ - ముస్లిం)*

'మహ్' అనేది వారింపు, గద్దింపు కోసం వాడే శబ్దం. 'లా యమల్లుల్లాహు' అంటే దాని పుణ్యం, ప్రతిఫలం అంతం కాదు. దేవుడు మీపట్ల విసుగెత్తిపోయిన వానిలా వ్యవహరించడు. పైగా మీరే విసుగు చెంది చేస్తున్న పనిని వదలిపెట్టవచ్చు. కాబట్టి మీరు శాశ్వతంగా చేస్తూ ఉండ గలిగే పనిని ఎంచుకోవడమే మంచిది. ఇలాచేస్తే దాని పుణ్యం, దాని ఘనత సదా మీకు లభిస్తూ ఉంటాయి అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని 'తహజ్జుద్' ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజు ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది).*

## ముఖ్యాంశాలు

1. శక్తికి మించిన ఆరాధన చేయడాన్ని ఈ హదీసులో వారించటం జరిగింది. ఎందుకంటే ఇలా చేయడం వల్ల మనిషి కొన్ని రోజుల తర్వాత దానిపై విసుగు చెంది, అసలు ఆరాధననే మానేసే ప్రమాదముంది. కనుక, ఆరాధనలు, వినయవిధేయతల్లో మధ్యేమార్గాన్ని అవలంబించడం అవసరం.

2. దాసుడు ఎల్లప్పుడూ క్రమం తప్పకుండా చేసే పనినే అల్లాహ్ ఎక్కువగా యిష్టపడతాడు - ఆ పని ఎంత చిన్నదైనా సరే ఎందుకంటే ఎల్లప్పుడూ చేస్తూ ఉండే ఆచరణకు పుణ్యం కూడా ఎల్లప్పుడూ లభిస్తూనే ఉంటుంది. దీనికి విరుద్ధంగా కొన్ని రోజులపాటు చేసి వదలిపెట్టే పనులకు లభించే పుణ్యం కూడా అంతటితో ఆగిపోతుంది.

١٤٣ ـ وعن أنسٍ رضي الله عنه قال: جَاءَ ثَلاثَةُ رَهْطٍ إِلَى بُيُوتِ أَزْوَاجِ

143. హజ్రత్ అనస్ (రజి) కథనం : ముగ్గురు వ్యక్తులు దైవప్రవక్త సతీమణుల ఇండ్లకు వచ్చి, దైవప్రవక్త

ఆరాధన విషయమై వారిని ప్రశ్నించ సాగారు. వారికి ఆయన (స) ఆరాధన విధానం బోధించబడింది. వారు దాన్ని తక్కువగా భావించి, "ఆయనెక్కడా? మేమెక్కడా? ఆయన వల్ల గతంలో జరిగిన పాపాలు, జరగబోయే పాపాలన్నీ క్షమించబడ్డాయి. (కనుక మేము ఆయన కంటే ఎక్కువగా ఆరాధన చేయాలి)" అని అనుకున్నారు. వారిలో ఒకడు, "ఇక నుంచి నేను ఎల్లప్పుడూ రాత్రంతా నమాజుల్లో గడుపుతాను" అని అన్నాడు. రెండవవాడు, "నేను ఇకపై ఎల్లప్పుడూ ఉపవాసముంటాను. ఉపవాసాన్ని విరమించను" అని అన్నాడు. మూడో వ్యక్తి, "నేనైతే స్త్రీలకు దూరంగా ఉంటాను. ఎన్నటికీ వివాహం చేసు కోను" అని ప్రతిన బూనాడు.

(వారి మాటల గురించి తెలుసుకొని) దైవప్రవక్త (స) వారివద్దకు వెళ్ళి, "మీరు ఇలా అన్నారా?" అని ప్రశ్నించారు. (వారు అవునని సమాధానమివ్వగా) ఆయన, "జాగ్రత్త! దైవసాక్షి! నేను మీ అందరికంటే ఎక్కువగా దైవానికి భయపడేవాడ్ని, అందరికంటే ఎక్కువగా ఆయనపట్ల భీతిగలవాడ్ని. కాని నేను ఉపవాసాలూ ఉంటాను, (అప్పు డప్పుడూ) వాటిని వదలుతాను కూడా. (రాత్రి పూట) నమాజూ చేస్తాను. పడు కుంటాను కూడా. ఇంకా నేను స్త్రీలను వివాహం కూడా చేసుకుంటాను. (కనుక ఈ పనులన్నీ నా సంప్రదాయాలే).

النَّبِيِّ ﷺ، يَسْأَلُونَ عَنْ عِبَادَةِ النَّبِيِّ ﷺ، فَلَمَّا أُخْبِرُوا كَأَنَّهُمْ تَقَالُّوهَا وَقَالُوا: أَيْنَ نَحْنُ مِنَ النَّبِي ﷺ قَدْ غُفِرَ لَهُ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِهِ وَمَا تَأَخَّرَ. قالَ أَحَدُهُمْ: أَمَّا أَنَا فَأُصَلِّي اللَّيْلَ أبداً، وقال الآخرُ: وأَنَا أَصُومُ الدَّهْرَ وَلا أُفْطِرُ، وقالَ الآخَرُ: وَأَنَا أَعْتَزِلُ النِّسَاءَ فَلا أَتَزَوَّجُ أَبداً، فَجَاءَ رسولُ الله ﷺ إِلَيْهِم فقالَ: «أَنْتُمُ الَّذِينَ قُلْتُمْ كَذَا وَكَذَا؟! أَمَا واللهِ! إنِّي لأَخْشَاكُمْ

https://teluguislam.net

ఎవడైతే నా విధానం పట్ల విముఖత చూపుతాడో అతడు నా వాడు కాదు (అంటే నాకు అతనితో ఎలాంటి సంబంధం లేదు)" అని హెచ్చరించారు.
(బుఖారీ - ముస్లిం)

لله وَأَتقَاكُمْ له لكِنِّي أَصُومُ وَأُفطِرُ، وَأُصَلِّي وَأَرْقُدُ، وَأَتَزَوَّجُ النِّسَاءَ، فَمَنْ رَغِبَ عَنْ سُنَّتِي فَلَيْسَ مِنِّي» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని 'నికాహ్' ప్రకరణంలో, ఇంకా సహీహ్ ముస్లింలోని 'నికాహ్' ప్రకరణంలో కూడా ఈ హదీసు పొందుపరచబడి ఉంది).*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో ఆరాధనలో మధ్యేమార్గాన్ని అనుసరించాలని బోధించబడింది. మనిషి నికాహ్ (వివాహం) చేసుకోవాలని, దైవప్రవక్త జీవన విధానాన్ని అనుసరించాలని పురికొల్పడం జరిగింది. అంతేకాదు, ఎల్లప్పుడూ ఉపవాసాలుండటం, నిత్యం రాత్రిళ్ళు పడుకోకుండా జాగారం చేసి ఆరాధనలు చేయడం అవాంఛనీయమైనదని కూడా చెప్పబడింది.

2. ధర్మంలో కొత్తపోకడలను సృష్టించుకోవడం వల్ల ఒరిగే మేలు ఏమీ లేదు. దానివల్ల ఎలాంటి పుణ్యమూ లభించదు. పైగా అది వినాశానికి దారితీస్తుంది. వాస్తవానికి శుభశ్రేయాలు, పుణ్య ఫలాలన్నీ కేవలం దైవప్రవక్త (సల్లం) విధానంలోనే ఇమిడి ఉన్నాయి.

144. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: "ధర్మంలో తమకు తాముగా కాఠిన్యతను సృష్టించుకున్న వారు నాశనమయిపోయారు". ఆయన ఇదేమాట మూడుసార్లు అన్నారు.
(ముస్లిం)

١٤٤ - وعن ابنِ مسعودٍ رضي الله عنه، أن النبيَّ ﷺ قال: «هَلَكَ المُتَنَطِّعُونَ» قالَهَا ثلاثاً، رواه مسلم.
«الْمُتَنَطِّعُونَ»: الْمُتَعَمِّقُونَ الْمُشَدِّدُونَ في غيرِ مَوْضِعِ التَّشْدِيدِ.

'ముతనత్తివూన్' అంటే షరీఅత్‌లో కాఠిన్యత లేనిచోట కాఠిన్యతను ప్రదర్శించటం, అనవసరంగా కూపీలు లాగటం అని భావం.

*(సహీహ్ ముస్లింలోని విద్యా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసు ద్వారా వేదాంతికులు (అహ్లె తసవ్వుఫ్) తమకు తాముగా సృష్టించుకున్న కఠోరమైన ఆరాధనాభ్యాసాలు, కసరత్తులన్నీ అవాంఛనీయమైనవని తెలుస్తోంది. అలాంటి

ఆరాధనా పద్ధతులన్నీ దైవప్రవక్త విధానానికి భిన్నంగా ఉంటాయి. అదేవిధంగా ఈ హదీసు ధార్మిక విషయాల్లో అనవసరంగా లోతుల్లోకి పోయేవారికి, వెంట్రుక తోలు ఒలవడానికి ప్రయత్నించేవారికి కూడా వర్తిస్తుంది. దైవప్రవక్త సంప్రదాయాన్ని పాటించనివారు, ఆయన పట్ల విధేయత కనబరచని సందేహాల స్వాములే సాధారణంగా ఇలాంటి పనులు చేస్తుంటారు.

١٤٥ ـ عن أبي هريرة رضي الله عنه عن النبيِّ ﷺ قال: «إنَّ الدِّينَ يُسْرٌ، وَلَنْ يُشَادَّ الدِّينُ إلَّا غَلَبَه، فَسَدِّدُوا وَقَارِبُوا وَأَبْشِرُوا، وَاسْتَعِينُوا بالْغَدْوَةِ وَالرَّوْحَةِ وَشَيْءٍ مِنَ الدُّلْجَةِ» رواه البخاري.

وفي رواية له: «سَدِّدُوا وَقَارِبُوا وَاغْدُوا وَرُوحُوا، وَشَيْءٌ مِنَ الدُّلْجَةِ، الْقَصْدَ الْقَصْدَ تَبْلُغُوا».

قوله: «الدِّينُ» هو مَرْفُوعٌ عَلَى مَا لَمْ يُسَمَّ فَاعِلُهُ. وَرُوِيَ مَنْصُوباً، وَرُوِيَ: «لَنْ يُشَادَّ الدِّينَ أَحَدٌ». وقوله ﷺ: «إلَّا غَلَبَه»، أَيْ: غَلَبَه الدِّينُ وَعَجَز ذلكَ الْمُشَادُّ عَنْ مُقَاوَمَةِ الدِّينِ لِكَثْرَةِ طُرُقِهِ. وَ«الْغَدْوَةُ»: سَيْرُ أَوَّلِ النَّهَارِ. وَ«الرَّوْحَةُ»: آخِرُ النَّهَارِ. وَ«الدُّلْجَةُ»: آخِرُ اللَّيْلِ. وَهٰذَا اسْتِعَارَةٌ وَتَمْثِيلٌ، وَمَعْنَاهُ: اسْتَعِينُوا عَلَى طَاعَةِ اللهِ عَزَّ وَجَلَّ بالأَعْمَالِ في وَقْتِ نَشَاطِكُمْ،

145. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : నిస్సందేహంగా ధర్మం సులువైనది. ఎవడైనా ధర్మావలంబనలో అనవసరంగా కాఠిన్యాన్ని కోరితెచ్చుకుంటే ధర్మమే అతనిపై ఆధిక్యతను సాధిస్తుంది (అంటే అలాంటి వ్యక్తి తాను సృష్టించుకున్న కాఠిన్యాన్ని భరించలేక ధర్మాన్ని ఆచరించడమే వదలిపెడతాడు). కనుక మీరు సన్మార్గంపై నడవండి. మధ్యేమార్గాన్ని అనుసరించండి. మీ ప్రభువు తరఫునుండి లభించే పుణ్యానికి సంబరపడండి. ఉదయం, సాయంత్రం ఇంకా రాత్రిపూట కొంత సేపు (ఆరాధన చేయటం) ద్వారా సహాయాన్ని అర్థించండి. *(బుఖారీ)*

బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : సన్మార్గంపై నడవండి. మధ్యేమార్గాన్ని అనుసరించండి. ఇంకా ఉదయం, సాయంత్రం మరియు రాత్రి పూట కొంతసేపు (ఆరాధనకై) వెళ్ళండి! మధ్యేమార్గాన్ని అనుసరించండి! మీరు గమ్యానికి చేరుకుంటారు.

"అద్దీను" కర్త పేర్కొనబడని కర్మ అయినందువల్ల ఇక్కడ ఇది ఉకారాంతం.

وَفَرَاغِ قُلُوبِكُمْ بِحَيْثُ تَسْتَلِذُّونَ الْعِبَادَةَ وَلَا تَسْأَمُونَ، وَتَبْلُغُونَ مَقْصُودَكُمْ، كَمَا أَنَّ الْمُسَافِرَ الحَاذِقَ يَسِيرُ فِي هٰذِهِ الأَوْقَاتِ وَيَسْتَرِيحُ هُوَ وَدَابَّتُهُ فِي غَيْرِهَا، فَيَصِلُ الْمَقْصُودَ بِغَيْرِ تَعَبٍ، واللهُ أَعْلَمُ.

అయితే ఈ పదం అకారాం తంగా కూడా ఉల్లేఖించబడింది. 'ఇల్లా గలబహూ' అంటే ధర్మం అతనిపై ఆధిక్యత వహిస్తుంది. ధర్మంలో పలు విభాగాలు, మార్గాలు ఉన్నందువల్ల అనవసరంగా కఠోరాన్ని ప్రదర్శించేవాడు ధర్మావశ్యమైన పనులను నిర్వర్తించలేక లొంగిపోతాడు. 'ఘద్వా' అంటే తొలి పగటివేళ నడవటం. 'రౌహ్' అంటే పగలు చివరి భాగంలో నడవటం. 'దుల్‌జా' అంటే రాత్రి ఆఖరి ఘడియలు. ఇదో ఉపమానం, ఉదాహరణ. దీని భావం ఏమిటంటే, మీరు ఉత్సాహంగా ఉన్నప్పుడు, (ఏ చీకూ చింతా లేకుండా) మీ హృదయాలు నిర్మలంగా ఉన్నప్పుడే మీరు మంచి పనులు చేసుకొని దైవవిధేయతకు కట్టుబడి ఉండటం కోసం సహాయాన్ని అర్థించండి. అలాచేస్తే మీరు ఆరాధనలో మాధుర్యాన్ని ఆస్వాదిస్తారు. ఆరాధనలో విసుగుచెందరు. లక్ష్యానికి చేరుకుంటారు. అనుభవంగల ఒక బాటసారి చేసినట్లు - అతను పైన పేర్కొనబడిన వేళల్లోనే ప్రయాణాన్ని కొనసాగిస్తాడు. మిగతా వేళల్లో తనూ విశ్రాంతి తీసుకుంటాడు. ఇంకా తన జంతువు (వాహనాని)కి కూడా విశ్రాంతి తీసుకోనిస్తాడు. ఆ విధంగా అతను అలుపూసొలుపూ లేకుండా (నిక్షేపంగా) గమ్యానికి చేరుకుంటాడు. - వల్లాహు ఆలము -

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణంలోనూ, ఇంకా ప్రేమైక వచనాల ప్రకరణంలోనూ ఈ హదీసు ఉంది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో మధ్యేమార్గాన్ని అనుసరించమని చెప్పడంతో పాటు మనిషి ఆరాధనల కోసం తాజాగా, ఉత్సాహంగా ఉండే వేళల్ని ఎంచుకోవాలని చెప్పబడింది. దానివల్ల అతను దైవారాధనలో కమ్మటి అనుభూతిని, హాయిని ఆస్వాదించగలడు. అయితే ఇలా వేళల్ని నిర్ణయించుకోవడం అన్నది ఒక్క నఫిల్ ఆరాధనలకోసమే సుమా! ఫర్జ్ ఆరాధనల్ని షరీఅత్ నిర్ధారించిన వేళల్లోనే చేయాలి.

١٤٦ - وعن أنسٍ رضي الله عنه قال: دَخَلَ النَّبِيُّ ﷺ الْمَسْجِدَ فَإِذَا حَبْلٌ مَمْدُودٌ بَيْنَ السَّارِيَتَيْنِ فقالَ: «مَا هٰذَا الْحَبْلُ؟» قالُوا: هٰذَا حَبْلٌ لِزَيْنَبَ، فإذا فَتَرَتْ تَعَلَّقَتْ بِهِ. فقالَ النَّبِيُّ ﷺ: «حُلُّوهُ، لِيُصَلِّ أَحَدُكُمْ نَشَاطَهُ، فَإِذَا فَتَرَ فَلْيَرْقُدْ» متفقٌ عليه.

146. హజ్రత్ అనస్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) మస్జిద్‌లోకి ప్రవేశించగా అక్కడ రెండు నిట్టాడుల మధ్య ఒక పొడువాటి త్రాడు కట్టి ఉండటం ఆయనకు కనిపించింది. అది చూసి ఆయన "ఈ త్రాడు ఏమిటీ?" అని అడిగారు. అక్కడున్న వారు "ఈ త్రాడు జైనబ్ (రజి.అన్‌హా) గారిది. ఆమె (నించొని ఆరాధనచేస్తూ) అలసిపోయి నప్పుడు (అలసటను) దూరం చేయ టానికి దీని ఆధారంగా వ్రేలాడతారు" అని ఆయనకు తెలియ జేశారు. అది విని ఆయన (స), "దాన్ని విప్ప దీయండి. మీలో ఎవరైనా సరే, ఉత్సా హంగా ఉన్నప్పుడే నమాజు చేయండి. అలసట అనిపిస్తే పడుకోండి" అని ఆదేశించారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజు ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో కూడా ఆరాధన పేరుతో తమ ఆత్మలను ఒత్తిడికి లోనుచేసుకోవటం,

నమాజు చేస్తున్నప్పుడు ఏ వస్తువునైనా ఊతంగా చేసుకొని నిలబడటం లాంటి చేష్టలు చేయరాదని చెప్పబడింది.

2. కళ్లముందు ఏదైనా తప్పు జరుగుతున్నప్పుడు చేత్తో దాన్ని ఆపగలిగే శక్తి గనక ఉంటే, వెంటనే దానిని ఆపటానికి ప్రయత్నించాలి.

3. ఆరాధనల్లో మధ్యేమార్గాన్ని అనుసరించాలి. ఓపిక, ఉత్సాహం ఉన్నప్పుడే ఆరాధన చేయటానికి పూనుకోవాలి.

147. దైవప్రవక్త (సల్లం) ప్రబోధించారని హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) తెలియ జేశారు : మీలో ఎవరికైనా నమాజు చేస్తున్న సమయంలో కునికిపాటు వస్తే అతను (నమాజును వదిలిపెట్టి) నిద్ర దూరమయ్యేవరకూ పడుకోవాలి. ఎందు కంటే అలా కునికిపాట్లు పడుతూ నమాజు చేస్తున్నప్పుడు అతను మన్నింపు కోసం వేడుకోబోయి తన్ను తానే దూషించుకోవచ్చు. *(బుఖారీ - ముస్లిం)*

١٤٧ ـ وعن عائِشَةَ رضي الله عنها، أَنَّ رسولَ الله ﷺ قال: «إذَا نَعَسَ أَحَدُكُمْ وَهُوَ يُصَلِّي، فَلْيَرْقُدْ حَتَّى يَذْهَبَ عَنْهُ النَّوْمُ، فإنَّ أَحَدَكم إذَا صَلَّى وهُوَ نَاعِسٌ لا يَدْرِي لَعَلَّهُ يَذْهَبُ يَسْتَغْفِرُ فَيَسُبُّ نَفْسَهُ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని వుజూ ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజు ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

కునుకు తీస్తూ నమాజు చేసే వ్యక్తి, "ఓ దేవా! నన్ను క్షమించు" అని అనబోయి నిద్రలో "ఓ దేవా! నన్ను క్షమించకు" అని కూడా నోరుజారే ప్రమాదముంది. అందుకే నిద్ర ముంచుకొస్తున్నప్పుడు నమాజు చేయడం ఆపి ముందు ఆ కునికిపాట్లు దూరమయ్యే వరకు పడుకోవాలని ఆదేశించబడింది. సాధారణంగా ఈ ఆదేశం నఫిల్ నమాజులకే వర్తిస్తుంది. ఎందుకంటే ఫర్జ్ నమాజులలో రకాతుల సంఖ్య చాలా తక్కువగా ఉంటుంది. అంతేగాక, ఫర్జ్ నమాజును వీలైనంత తొందరగా ముగించాలని ఇమామ్‌కు తాకీదు చేయబడింది. కనుక ఫర్జ్ నమాజుల్లో ఇలాంటి పరిస్థితి ఏర్పడటం అరుదు. అంటే ఇంతకు ముందు వచ్చిన హదీసుల్లో చెప్పబడినట్లుగా మనసు ఉత్సాహంగా, దైవభక్తిలో లగ్నమై ఉన్నప్పుడే ఆరాధన చేయాలనేదే ఈ హదీసు భావం కూడాను.

148. హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ జాబిర్ బిన్ సమురా (రజి) కథనం : నేను దైవ ప్రవక్త (సల్లం) వెంట (ఆయన సారథ్యంలో) నమాజు చేసేవాడిని. ఆయన నమాజు మధ్యస్థంగా ఉండేది. ఇంకా ఆయన ప్రసంగం కూడా మధ్య స్థంగా ఉండేది. (ముస్లిం)

'ఖస్దన్' అంటే సుదీర్ఘానికి, సంక్షిప్తానికి మధ్యస్థమైనదని భావం.

١٤٨ ـ وعن أَبي عبدِ الله جابر بن سَمُرَةَ رضي الله عنهما قال: كُنْتُ أُصَلِّي مَعَ النَّبِيِّ ﷺ الصَّلَوَاتِ، فَكَانَتْ صَلاتُهُ قَصْداً وَخُطْبَتُهُ قَصْداً. رواه مسلم.

قولُهُ: «قَصْداً» أَيْ: بَيْنَ الطُّولِ وَالقِصَرِ.

*(సహీహ్ ముస్లింలోని 'జుమా' ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా సామూహికంగా చేసే నమాజులో ఇమామ్ సుదీర్ఘ పారాయణం చేయటం, అదేవిధంగా జుమా మరియు పండుగ సందర్భాల్లో సుదీర్ఘ ఉపన్యాసాలివ్వడం ప్రవక్త విధానానికి విరుద్ధమని తెలుస్తోంది.

149. హజ్రత్ అబూ జుహైఫా వహబ్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) సల్మాన్ (రజి)కు మరియు అబూ దర్దా (రజి)కు మధ్య (హిజ్రత్ అనంతరం) సోదరత్వాన్ని ఏర్పరచారు. సల్మాన్ (రజి) (ఒక రోజు తన ఇస్లామీయ సోదరుడు) అబూ దర్దాను కలవటం కోసం (ఆయన ఇంటికి వెళ్ళారు. అప్పుడు ఆయన (అబూ దర్దాగారి భార్య) ఉమ్మె దర్దా (ర.అన్హా) మురికిగా ఉన్న బట్టలు తొడుక్కొని ఉండటం గమనించారు. అది చూసి ఆయన కుశల ప్రశ్నలువేస్తూ "ఏమిటి మీరు ఇలాగైపోయారు?" అని అడి గారు. అందుకు ఆమె "మీ సోదరుడు

١٤٩ ـ وعن أبي جُحَيْفَةَ وَهْبِ بْنِ عبدِ الله رضي الله عنه قال: آخَى النَّبِيُّ ﷺ بَيْنَ سَلْمَانَ وأَبي الدَّرْدَاءِ، فَزَارَ سَلْمَانُ أَبَا الدَّرْدَاءِ، فَرَأَى أُمَّ الدَّرْدَاءِ مُتَبَذِّلَةً فقالَ: ما شَأْنُكِ؟ قالَتْ: أَخُوكَ أَبُو الدَّرْدَاءِ لَيْسَ لَه حَاجَةٌ في الدُّنْيَا، فَجاءَ أَبُو الدَّرْدَاءِ فَصَنَعَ لَه طَعَاماً، فقالَ لَهُ: كُلْ فَإِنِّي صَائِمٌ، قالَ: ما أَنا بآكِلٍ حَتَّى تَأْكُلَ، فَأَكَلَ، فَلَمَّا كانَ اللَّيْلُ ذَهَبَ أَبو الدَّرْدَاءِ يَقُوم فقالَ لَهُ: نَمْ فَنَامَ، ثُمَّ ذَهَبَ يَقُومُ فقالَ لَهُ: نَمْ، فَلَمَّا كانَ مِنْ آخِرِ اللَّيْلِ قالَ

سَلْمَانُ: قُم الآنَ، فَصَلَّيَا جَمِيعاً، فقالَ لَه سَلْمَـانُ: إنَّ لـرَبِّـكَ عَلَيْـكَ حَقّـا، وإنَّ لِنَفسكَ عَلَيْكَ حَقًّا، وَلأَهْلكَ عَلَيْكَ حَقًّا، فَأَعْطِ كُلَّ ذي حَقٍّ حَقَّهُ، فَأَتَى النبيَّ ﷺ فَذَكَرَ ذلكَ لَه، فقالَ النبيُّ ﷺ: «صَدَقَ سَلْمَانُ» رواه البخاري.

అబూ దర్దాకు ఈ ప్రపంచంలో ఏమీ అక్కర్లేదు'' అని (బాధపడుతూ) అన్నారు. (అంతలోనే) అబూ దర్దా (రజి) కూడా వచ్చేశారు. తన సోదరుడు సల్మాన్ (రజి) కోసం అన్నం వండించారు. (భోజనం వడ్డించిన తరువాత) ఆయనతో "మీరు తినండి, నేను ఉపవాసమున్నాను'' అన్నారు. దానికి సల్మాన్ (రజి) "మీరు (నాతోపాటు) తిననంతవరకు నేనూ తినను'' అన్నారు. అప్పుడు ఆయన కూడా (తన నఫిల్ ఉపవాసాన్ని విరమించుకొని ఆయనతోపాటు కూర్చొని) భోజనం చేశారు.

రాత్రి అయిన తరువాత అబూ దర్దా (రజి) నఫిల్ నమాజులు చేయటానికి ఉపక్రమించారు. అప్పుడు సల్మాన్ (రజి) "(ముందు) పడుకో (తరువాత లేచి నమాజు చేసుకోవచ్చు)'' అని అన్నారు. దాని ప్రకారమే అబూదర్దా (రజి) నిద్రపోయారు. కొంతసేపటికి నిద్రనుండి మేల్కొని తిరిగి నఫిల్ నమాజులు చేయటం ప్రారంభించారు. సల్మాన్ (రజి) (అప్పుడు కూడా ఆయన్ని ఆపి) "ఇంకాస్సేపు నిద్రపో'' అన్నారు. ఆ తరువాత రాత్రి ఆఖరి సమయం రాగానే సల్మాన్ (రజి) (మేల్కొని) ఆయనతో "ఇప్పుడు లేచి నమాజు చెయ్యి'' అన్నారు. ఇద్దరూ కలసి

నమాజు చేశారు. (నమాజు ముగించు కున్న తరువాత) ఆయన అబూదర్దా (రజి) తో ఇలా అన్నారు:

నిస్సందేహంగా నీపై నీ ప్రభువు హక్కు ఉంది (నిజమే!). కాని నీపై నీ ప్రాణానికి కూడా హక్కు ఉంది. నీ ఇంటివారికి (భార్యాపిల్లలకు)కూడా హక్కు ఉంది. కనుక ప్రతి హక్కుదారుని హక్కునూ నెరవేర్చు!

తరువాత సల్మాన్ (రజి) దైవప్రవక్త (సల్లం) సన్నిధిలో హాజరై జరిగినదంతా ఆయనకు వివరించారు. అది విని దైవ ప్రవక్త (సల్లం) "సల్మాన్ నిజం పలికాడు" అన్నారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ఉపవాస ప్రకరణంలోనూ, ఇంకా సంస్కార ప్రకరణంలోనూ ఈ హదీసు ఉంది.)*

## ముఖ్యాంశాలు

1. రాత్రిపూట నిద్రనుండి మేల్కొని నమాజు చేయటం దైవానికి ఎంతో ప్రీతికరమైన ఆచరణే అయినప్పటికీ, దానివల్ల ఇతరుల హక్కులకు భంగం కలిగితే మాత్రం అది అవాంఛనీయమైనదిగా ఖరారు చేయబడుతుంది.
2. రాత్రి నమాజు (అంటే తహజ్జుద్)కు సరైన సమయం రాత్రి చివరి మూడవ భాగం. కనుక రాత్రిపూట తొలి రెండు భాగాల్లో మనిషి నిద్రపోవటం, దాంపత్య హక్కులను నెరవేర్చటం వంటివి చేసుకోవాలి.
3. నఫిల్ ఉపవాసాలను అవసరమనుకుంటే విరమించుకోవచ్చు. వాటికి ఖజా లేదు.
4. ధర్మం ప్రాతిపదికపై పరస్పరం సోదర సంబంధాన్ని ఏర్పరచటం, ఆ తరువాత ఆ ఇస్లామీయ సోదరులు ఒకరినొకరు కలనుకోవటం కోసం ఇండ్లకు వెళ్ళడం ధర్మసమ్మతమే.
5. ప్రతి ఒక్కరూ తోటి వ్యక్తిని సరైన మార్గంలో నడిపించటానికి ప్రయత్నించాలి.
6. అనివార్య పరిస్థితుల్లో అపరిచిత స్త్రీతో మాట్లాడటం ధర్మసమ్మతమేనని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది.

150. హజ్రత్ అబూ ముహమ్మద్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం : "దైవసాక్షి! నేను జీవితాంతం పగలంతా ఉపవాసముంటూ రాత్రంతా నమాజులు చేయటంలో గడుపుతూ ఉంటాను" అని నేను శపథం చేసినట్టు దైవప్రవక్త (సల్లం)కు ఎవరో తెలియ జేశారు. అప్పుడు ఆయన (స), "నువ్విలా శపథం చేశావా?" అని నన్ను అడిగారు. దానికి నేను, "నా తల్లి దండ్రులు మీకోసం అర్పితమవుగాక! నేను ఆ విధంగా శపథం చేసిన మాట నిజమే" అని అన్నాను. దానికి ఆయన "ఈ పని చేసే శక్తి నీలో లేదు. కనుక నీవు కొన్నాళ్ళపాటు ఉపవాసాలు ఉండి, మరికొన్ని రోజులపాటు వాటిని వదిలెయ్యి. అదేవిధంగా (రాత్రిపూట) కొంతసేపు పడుకొని (ఆ తరువాత) నమాజు చెయ్యి. ప్రతి నెలా మూడు రోజులు ఉపవాసాలు పాటించు (చాలు). ఒక్క సత్కార్యానికి పదిరెట్లు పుణ్యం లభిస్తుంది కాబట్టి (మూడు రోజుల ఉపవాసానికి ముప్ఫై రోజులు ఉపవాసాలు పాటించినంత పుణ్యం లభిస్తుంది). ఆ లెక్కన నీవు పాటించే (మూడు దినాల ఉపవాస) ఆచరణతో నీవు ఎల్లకాలం ఉపవాసాలు పాటించి నట్లవుతుంది" అని నాకు హితబోధ చేశారు.

١٥٠ - وعن أبي محمدٍ عبدِ اللهِ بنِ عَمْرو بنِ العاصِ رضي الله عنهما قال: أُخْبِرَ النَّبِيُّ ﷺ أَنِّي أَقُول: وَاللهِ لأَصومَنَّ النَّهارَ، وَلأَقومَنَّ اللَّيْلَ مَا عِشْتُ، فَقَالَ رسُولُ الله ﷺ: «أَنْتَ الَّذي تَقُولُ ذلكَ؟»

فَقُلْتُ لَه: قَدْ قُلْتُهُ بِأَبي أَنْتَ وَأُمِّي يَارسولَ الله! قَالَ: «فإنّك لاتَسْتَطيعُ ذلكَ؛ فَصُمْ وَأَفطِرْ، وَنَمْ وَقُمْ، وَصُمْ مِنَ الشَّهرِ ثَلاثَةَ أيَّام فَإنَّ الْحَسَنَةَ بعَشْرِ أمْثَالِهَا، وَذلكَ مِثْلُ صِيَّامِ الدَّهْرِ»، قُلْتُ: فَإِنِّي أُطِيقُ أَفضَلَ مِنْ ذلكَ، قَالَ: «فَصُمْ يَوْماً وَأَفطِرْ يَوْمَيْنِ»، قُلْتُ: فَإِنِّي أُطِيقُ أَفضَلَ مِنْ ذلكَ، قالَ: «فَصُمْ يَوْماً وَأَفْطِرْ يَوْماً، فَذلكَ صِيَامُ دَاودَ ﷺ، وهُوَ أَعْدَلُ الصِّيَام». وفي رواية: «هوَ أَفْضَلُ الصِّيَام»، فَقُلْتُ: فَإِنِّي أُطِيقُ أفضَلَ مِنْ ذلكَ. فَقَالَ رسولُ الله ﷺ: «لا أَفْضَلَ مِنْ ذلكَ»، وَلأَنْ أَكُونَ قَبلْتُ الثَّلاثَةَ الأَيَّامَ الَّتي قال رسولُ الله ﷺ أَحَبُّ إليَّ منْ أَهْلي وَمَالي. وفي رواية: «أَلَمْ أُخبَرْ أَنَّكَ تَصومُ النَّهَارَ وَتَقُومُ اللَّيْلَ؟»، قلتُ: بَلَى يَا رسولَ اللهِ! قال: «فَلا تَفْعَلْ: صُمْ وَأَفْطِرْ، وَنَمْ وَقُمْ فَإنَّ لجَسَدِكَ عَلَيْكَ حَقًّا، وَإنَّ لعَيْنَيْكَ عَلَيْكَ حَقًّا، وإنَّ

لِزَوْجِكَ عَلَيْكَ حَقًّا، وَإِنَّ لِزَوْرِكَ عَلَيْكَ حَقًّا، وَإِنَّ بِحَسْبِكَ أَنْ تَصُومَ فِي كُلِّ شَهْرٍ ثَلاثَةَ أَيَّامٍ، فَإِنَّ لَكَ بِكُلِّ حَسَنَةٍ عَشْرَ أَمْثَالِهَا، فَإِنَّ ذلكَ صِيَامُ الدَّهْرِ»، فَشَدَّدْتُ فَشُدِّدَ عَلَيَّ، قُلْتُ: يارسولَ الله! إِنِّي أَجِدُ قُوَّةً، قَالَ: «صُمْ صِيَامَ نَبِيِّ اللهِ دَاوُدَ وَلا تَزِدْ عَلَيْهِ»، قلتُ: وَمَا كَانَ صِيَامُ دَاوُدَ؟ قال: «نِصْفُ الدَّهْرِ» فَكَانَ عَبْدُ اللهِ يقولُ بَعْدَ مَا كَبِرَ: يَا لَيْتَنِي قَبِلْتُ رُخْصَةَ رسولِ اللهِ ﷺ. وفي رواية: «أَلَمْ أُخْبَرْ

ఈ హితవు విని నేను "నాకు ఇంతకంటే ఎక్కువ శక్తి ఉంది" అన్నాను. దానికి ఆయన (స), "అయితే ఒకరోజు ఉపవాసం ఉండి, ఆ తరువాత రెండు రోజులు మానెయ్యి" అని అన్నారు. "నాకు అంతకంటే కూడా ఎక్కువ శక్తి ఉంది" అని నేను మళ్ళీ అన్నాను. "మరయితే నీవు ఒకరోజు ఉపవాసం పాటించి తరువాత ఒకరోజు మానేస్తూ ఉండు. ఇది హజ్రత్ దావూద్ (అలైహి) పాటించే ఉపవాస విధానం. ఇంకా ఇది ఉపవాసాలు పాటించే పద్ధతుల్లో అన్నిటికన్నా ఉత్తమమైనది మరియు సమంజసమైనదీను" అన్నారు దైవప్రవక్త (సల్లం).

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : "ఉపవాసాలు పాటించే అతి శ్రేష్ఠమైన విధానం ఇదే" అని దైవప్రవక్త (సల్లం) అన్నారు. "నేను ఇంతకన్నా ఎక్కువ శక్తిని కలిగి ఉన్నాను" అని విన్నవించుకోగా ఆయన "దీనికన్నా ఉత్తమమైన పద్ధతి మరొకటి లేనేలేదు" అన్నారు. (హదీసు ఉల్లేఖకులు హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ (రజి) ఇలా తెలియజేస్తున్నారు) : "నెలకు మూడు రోజులు ఉపవాసాలుంటే చాలని దైవప్రవక్త (సల్లం) చేసిన సూచనను నేను ఒప్పుకుని ఉంటే అది నాకు నా భార్యా పిల్లలు, సిరిసంపదలకన్నా ప్రీతికరంగా

ఉండేది" (అని వృద్ధాప్యం వచ్చిన తరువాత నాకు అర్థమయింది)."

మరొక ఉల్లేఖనం ప్రకారం : "నీవు (ప్రతిరోజూ) పగలంతా ఉపవాసముండి, రాత్రంతా నఫిల్ నమాజులు చేస్తున్నావట, నిజమేనా?" అని నన్ను దైవప్రవక్త (సల్లం) అడిగారు. దానికి నేను "(మీరు విన్నది) నిజమే దైవప్రవక్తా! కాని అలా చేయటంలో నాకు మంచి ఉద్దేశ్యమే తప్ప మరో (చెడు) ఉద్దేశ్యం లేదు" అని అన్నాను. అందుకు ఆయన (స), "నీవు దైవప్రవక్త హజ్రత్ దావూద్ (అలైహి) ఉపవాస విధానాన్ని పాటించు (చాలు). ఆయన ప్రజలందరిలోకెల్లా ఎక్కువగా దైవారాధన చేసేవారు. ఇంకా నీవు నెలలో ఒక (సారి) ఖుర్ఆన్ (పూర్తిగా) పఠనం చెయ్యి" అని ఉపదేశించారు. దానికి నేను "నాకు ఇంతకన్నా ఎక్కువ శక్తి ఉంది" అన్నాను. అప్పుడు ఆయన "మరయితే ఇరవై రోజుల్లో దాన్ని పూర్తిగా పఠించు" అని సలహా ఇచ్చారు. "నాకు అంతకన్నా ఎక్కువ శక్తి ఉంది" అని నేను మళ్ళీ అన్నాను. అప్పుడు ఆయన "సరే, అయితే నీవు దానిని ఏడు రోజుల్లో (పూర్తిగా) పఠించు. అంతకన్నా ఎక్కువగా పఠించకు" అని నాకు హితోపదేశం చేశారు. నేను మొండిగా ప్రవర్తించాను కనుక నా పట్ల కఠినంగా వ్యవహరించటం జరిగింది.

أنَّك تَصُومُ الدَّهر، وَتَقْرَأُ القُرْآنَ كُلَّ لَيْلَةٍ؟»، فَقُلْتُ: بَلَى يا رسولَ اللهِ! وَلَمْ أُرِدْ بذلِكَ إلَّا الْخَيْرَ، قَالَ: «فَصُمْ صَوْمَ نَبِيِّ اللهِ دَاوُدَ، فَإِنَّهُ كَانَ أَعْبَدَ النَّاسِ، وَاقْرَأ القُرْآنَ فِي كُلِّ شَهْرٍ»، قُلْت: يَا نَبِيَّ اللهِ! إنِّي أُطِيقُ أفضَلَ مِنْ ذلكَ؟ قالَ: «فاقْرَأْهُ فِي كُلِّ عِشْرِينَ»، قُلْت: يَا نبيَّ اللهِ! إنِّي أُطِيقُ أفْضَلَ مِنْ ذلكَ؟ قَالَ: «فَاقْرَأْه فِي كُلِّ عَشْرٍ»، قُلْت: يَانَبِيَّ اللهِ! إنِّي أُطِيقُ أَفْضَلَ مِنْ ذلكَ؟ قالَ: «فَاقْرَأْه فِي كُلِّ سَبْعٍ

وَلا تَزِدْ عَلَى ذلِكَ»، فَشَدَّدْتُ فَشُدِّدَ عَلَيَّ، وَقَالَ لِي النَّبِيُّ ﷺ: «إِنَّكَ لا تَدْرِي لَعَلَّكَ يَطُول بِكَ عُمُرٌ»، قَالَ: فَصِرْتُ إِلَى الَّذِي قَالَ لِي النَّبِيُّ ﷺ، فَلَمَّا كَبِرْتُ وَدِدْتُ أَنِّي كُنْتُ قَبِلْتُ رُخصَةَ نَبِيِّ اللهِ ﷺ. وفي رِواية: «وَإِنَّ لِوَلَدِكَ عَلَيْكَ حَقًّا»، وفي رِوايةٍ: «لا صَامَ مَنْ صَامَ الأَبَدَ» ثَلاثاً. وفي رِوايةٍ: «أَحَبُّ الصِّيَامِ إِلَى اللهِ تَعَالَى صِيَامُ دَاوُدَ، وَأَحَبُّ الصَّلاةِ إِلَى اللهِ تَعَالَى صَلاةُ دَاوُدَ: كَانَ يَنَامُ نِصفَ اللَّيْلِ، وَيَقُومُ ثُلُثَهُ، وَيَنَامُ سُدُسَهُ، وَكَانَ يَصُومُ يَوْماً وَيُفْطِرُ

(తరువాత) ఆయన "నీకు తెలియదు. బహుశా నీవు ఎక్కువ కాలం బ్రతికి ఉండగలుగుతావేమో!" అని నాతో అన్నారు. (హజ్రత్ అబ్దుల్లాహ్ ఇలా అంటున్నారు) ఆఖరికి నేను దైవప్రవక్త (సల్లం) సూచించిన (వయో) స్థితికి చేరుకున్నాను. అప్పుడు "అయ్యో! దైవప్రవక్త (సల్లం) ఇచ్చిన సౌలభ్యాన్ని వినియోగించుకుని ఉంటే ఎంత బాగుండేది!" అని నాకు అనిపించేది.

ఇంకొక ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "నీపై నీ సంతానానికి కూడా హక్కు ఉంది" అని అన్నారు.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: నిర్విరామంగా ఉపవాసాలను పాటించే వాని ఉపవాసం - అసలు ఉపవాసమే కాదు. దైవప్రవక్త (స) ఈ మాటను మూడుసార్లు అన్నారు.

ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : అల్లాహ్ కు అత్యంత ప్రియమైన ఉపవాసం హజ్రత్ దావూద్ (అలైహి) ఉపవాసం. ఇంకా అత్యంత ప్రియతమమయిన నమాజు (కూడా) హజ్రత్ దావూద్ (అలైహి) నమాజే. ఆయన అర్ధరాత్రి వరకు పడుకునేవారు. రాత్రి ఆఖరి భాగంలో నమాజ్ చేసేవారు. ఇంకా దాని ఆరవవంతు సమయం విశ్రమించేవారు. ఆయన ఒకరోజు విడిచిపెట్టి ఒకరోజు ఉపవాసం ఉంటారు. ఇంకా శత్రువుతో తలపడ

يَوْماً، وَلا يَفِرُّ إِذَا لاقَى». وفي رِوايةٍ قَالَ: أَنْكَحَنِي أَبِي امْرَأَةً ذَاتَ حَسَبٍ، وَكَانَ يَتَعَاهَدُ كَنَّتَهُ - أَيْ: امْرَأَةَ وَلَدِهِ - فَيَسْأَلُهَا عَنْ بَعْلِهَا، فَتَقُولُ لَهُ: نِعْمَ الرَّجُلُ مِنْ رَجُلٍ لَمْ يَطَأْ لَنَا فِرَاشاً وَلَمْ يُفَتِّشْ لَنَا كَنَفاً مُنْذُ أَتَيْنَاهُ. فَلَمَّا طَالَ ذلِكَ عليه ذَكَرَ ذلِكَ لِلنَّبِيِّ ﷺ. فَقَالَ: «الْقَنِي بِهِ» فَلَقِيتُهُ بَعْدَ ذلك فَقَالَ: «كَيْفَ تَصُومُ؟»، قُلْتُ: كُلَّ يَوْمٍ،

వలసి వచ్చినప్పుడు ఆయన (వెన్ను చూపి) పారిపోయేవారు కాదు.

మరొక ఉల్లేఖనం ప్రకారం హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ (రజి) అంటున్నారు : మా నాన్నగారు నా వివాహం ఒక గొప్పింటి స్త్రీతో జరిపించారు. ఆయన తన కోడల్ని చాలా బాగా చూసుకునేవారు. ఆమెను ఆమె భర్త (అంటే నా) గురించి అడిగేవారు. దానికి ఆమె "ఆయన జనులందరిలోకీ చాలా మంచివారు. ఆయన ఎన్నడూ నా పడకను తొక్కలేదు (అంటే నాప్రక్కన పడుకోలేదు) నా మర్మస్థానాన్ని ఏనాడూ అన్వేషించలేదు (నాతో సమాగమం జరుపలేదు)" అని సమాధానం చెప్పేది. చాలా కాలంపాటు పరిస్థితి ఇలాగే ఉండటం చూసి మా నాన్నగారు ఈ విషయం దైవప్రవక్త (సల్లం)కు తెలియజేశారు. "మీ అబ్బాయిని ఒకసారి నా దగ్గరకు పంపండి" అని ఆయన మా నాన్నగారికి చెప్పారు. ఆ తరువాత నేను దైవప్రవక్త (సల్లం)ను కలవగా, "నీవు ఉపవాసాలు ఏవిధంగా పాటిస్తావు?" అని ఆయన ప్రశ్నించారు. దానికి నేను 'ప్రతిరోజూ ఉపవాసాలుంటాను' అని అన్నాను. తరువాత ఆయన "నీవు ఖుర్ఆన్ను ఎలా (పఠించి) పూర్తి చేస్తావు?" అని అడిగారు. "ప్రతిరోజూ రాత్రి ఒక ఖుర్ఆన్ పూర్తిగా పఠిస్తాను"

قالَ: «وَكَيْفَ تَخْتِمُ؟»، قلتُ: كُلَّ لَيْلَةٍ، وَذَكَرَ نَحْوَ ما سَبَقَ، وَكَانَ يَقْرَأُ عَلَى بَعْضِ أَهْلِه السُّبُعَ الَّذي يَقْرَؤُهُ، يَعْرِضُهُ مِنَ النَّهارِ لِيَكُونَ أَخَفَّ عَلَيْهِ بِاللَّيْلِ، وَإِذَا أَرَادَ أَنْ يَتَقَوَّى أَفْطَرَ أَيَّاماً وَأَحْصَى وَصَامَ مِثْلَهُنَّ كَرَاهِيَةَ أَنْ يَتْرُكَ شَيْئاً فَارَقَ عَلَيْهِ النَّبِيَّ ﷺ.

كُلُّ هٰذِهِ الرِّوَايَاتِ صَحِيحَةٌ مُعْظَمُهَا فِي الصَّحِيحَيْنِ وَقَلِيلٌ مِنْهَا فِي أَحَدِهِمَا.

అన్నారు. ఆ తరువాత ఇంతకుముందు ప్రస్తావించబడిన మాటలే అన్నారు.

అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ (దివ్య ఖుర్‌ఆన్‌లో) తాను (రాత్రిపూట నఫిల్ నమాజులో పారాయణం చేసే) ఏడవ వంతు ఖుర్‌ఆన్‌ను తన ఇంటివారికి చదివి వినిపించేవారు. రాత్రిపూట దానిని అవలీలగా పారాయణం చేయగలిగేందుకు వీలుగా పగటి వేళ దానినే నెమరు వేసుకునేవారు. సత్తువ క్షీణించిందని అనుకున్నప్పుడు కొన్ని రోజులపాటు ఉపవాసాలుండటం మానేస్తారు. మానేసిన దినాలను లెక్కపెట్టుకొని తరువాత పూర్తిచేస్తారు. ఎందుకంటే దైవప్రవక్త (సల్లం) తనను వీడిపోయినప్పుడు తాను చేస్తున్న ఆచరణను వదలిపెట్టటానికి ఆయన యిష్టపడేవారు కాదు.

(పైన పేర్కొనబడిన ఉల్లేఖనాలన్నీ ప్రామాణికమైనవే. వీటిలో చాలా భాగం బుఖారీ-ముస్లిం రెండింటిలోనూ ఉంది. కొంత భాగం మాత్రం ఆ రెండింటిలో ఏదో ఒకదానిలోనే ఉంటుంది.)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని ఉపవాస ప్రకరణాల్లో ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో ప్రవక్త ప్రియసహచరుల ఐహిక అనాసక్తత, ఆరాధనా తత్పరత, దైవభక్తి పరాయణతలు పొందుపరచబడి ఉన్నాయి. వాటితో పాటు దైవప్రవక్త (సల్లం) గారు

సూచించిన మార్గదర్శక సూత్రాలు, హితోపదేశాలు కూడా ఉన్నాయి. మానవుడు అన్ని విషయా ల్లోనూ మధ్యేమార్గాన్ని అనుసరించాలని, సంతులన విధానాన్ని అవలంబించాలని, ధర్మ నియమాలను ఆచరించటంతోపాటు, ప్రాపంచిక జీవన కార్యకలాపాలను కూడా నిర్వర్తించాలని అవి ప్రబోధిస్తున్నాయి.

2. ఇంకా దైవప్రవక్త (సల్లం) సహచరిణుల సౌశీల్యం, వ్రీడా భావాల ప్రస్తావన కూడా ఈ హదీసులో ఉంది. తమ భర్తలు తమపట్ల అశ్రద్ధ వహించినా వారు ఎంతో సహనంతో గుట్టుగా సంసారాన్ని నెట్టుకొచ్చేవారు. హదీసులో పేర్కొనబడిన మహిళను ఆమె మామ,భర్తను గురించి అడిగినప్పుడు ఆమె ఎంతో నేర్పుతో సంస్కారవంతంగా చూచాయగా విషయాన్ని ఆయనకు తెలియజేసింది.

١٥١ - وعن أبي رِبْعِيٍّ حَنْظَلَةَ بنِ الرَّبِيعِ الأُسَيِّدِيِّ الْكَاتِبِ أَحَدِ كُتَّابِ رسولِ الله ﷺ قال: لَقِيَنِي أَبُو بَكْرٍ رضي الله عنه فقال: كَيْفَ أَنْتَ يا حَنْظَلَةُ؟ قُلْتُ: نَافَقَ حَنْظَلَةُ! قالَ: سُبْحَانَ الله مَا تَقُولُ؟! قُلْتُ: نَكُونُ عِنْدَ رسولِ الله ﷺ يُذَكِّرُنَا بِالْجَنَّةِ وَالنَّارِ كَأَنَّا رَأْيَ عَيْنٍ، فَإِذَا خَرَجْنَا مِنْ عِنْدِ رسولِ الله ﷺ عَافَسْنَا الأَزْوَاجَ وَالأَوْلادَ وَالضَّيْعَاتِ نَسِينَا كَثِيراً. قَالَ أَبُو بَكْرٍ رضي الله عنه: فَوَاللهِ إِنَّا لَنَلْقَى مِثْلَ هٰذَا، فَانْطَلَقْتُ أَنَا وَأَبُو بَكْرٍ حَتَّى دَخَلْنَا عَلَى رسولِ الله ﷺ. فَقُلْتُ: نَافَقَ حَنْظَلَةُ

151. దైవప్రవక్త (సల్లం) గారి ఒకానొక లేకరి అయిన హజ్రత్ అబూ రిబ్యీ హంజలా బిన్ రబీ అల్ ఉసయ్యిది కథనం : ఒకసారి హజ్రత్ అబూబక్ర్ (రజి) నన్ను కలుసుకొని 'బాగున్నావా హంజలా?'' అని కుశల ప్రశ్న వేశారు. దానికి నేను "హంజలా కపటి అయి పోయాడు'' అని సమాధానమిచ్చాను. అది విని ఆయన ఆశ్చర్యపోతూ "సుబ్హానల్లాహ్! ఏమిటి నువ్వనేది?'' అని అన్నారు. అందుకు నేను "(ఏం చెప్పమంటారు?) మనం దైవప్రవక్త (సల్లం) సన్నిధిలో ఉన్నప్పుడు, ఆయన మన ముందు స్వర్గనరకాల గురించి చెబుతూ ఉంటే (నిజంగానే మనం వాటిని మన కళ్ళతో చూస్తున్నట్లని పిస్తుంది. తీరా ఆయన సమావేశం నుంచి బయటికి రాగానే ఆలుబిడ్డల్లో ప్రాపంచిక పనిపాటల్లో మునిగిపోయి చాలా విషయాలు మరచిపోతుంటాము. (అందుకని నేను కూడా కపటినయి పోయాననిపిస్తోంది)'' అంటూ నా

يـا رسـولَ الله! فقـالَ رسـولُ الله ﷺ: «وَمَا ذَاكَ؟»، قُلْتُ: يا رسولَ الله! نَكُونُ عِنْدَكَ تُذَكِّرُنَا بالنَّارِ والجَنَّةِ كَأَنَّا رَأْيَ عَيْنٍ، فَإِذَا خَرَجْنَا مِنْ عِنْدِكَ عَافَسْنَا الأَزْوَاجَ وَالأَوْلَادَ وَالضَّيْعَاتِ نَسِينَا كَثِيراً. فقال رسولُ الله ﷺ: «والَّذي نَفْسي بيَدِهِ لَوْ تَدُومُونَ عَلَى مَا تَكُونُونَ عِنْدِي وَفي الذِّكْرِ لَصَافَحَتْكُمُ الْمَلَائِكَةُ عَلَى فُرُشِكُمْ وفي طُرُقِكُمْ، وَلٰكِنْ يا حَنْظَلَةُ! سَاعَةً وَسَاعَةً» ثَلاثَ مَرَّاتٍ، رواه مسلم.

బాధను వ్యక్తం చేశాను. అది విని ఆయన "దైవసాక్షి! మాక్కూడా అలాగే అనిపిస్తోంది (నిజంగా ఇది కాపట్యమే అయితే మేము కూడా ఈ కాపట్యానికి లోనై వున్నాము. కనుక ఇది ఎంతో ఆందోళనకరమైన విషయం)" అని తన మనోగతాన్ని కూడా వెలిబుచ్చారు.

ఆ తరువాత అబూబక్ర్ (రజి) మరియు నేను ఇద్దరం కలిసి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి చేరుకున్నాము. అక్కడికి చేరుకున్నాక నేను "దైవప్రవక్తా! హంజలా కపటి అయిపోయాడు" అని అన్నాను. అందుకు ఆయన "అదెలాగు?" అని ప్రశ్నించారు. "దైవప్రవక్తా! మేము మీ దగ్గరున్నప్పుడు మీరు మా ముందు స్వర్గనరకాల గురించి చెబుతూ ఉంటే నిజంగానే మేము వాటిని మా కళ్ళతో చూస్తున్నట్లనిపిస్తుంది. తీరా మీ సమావేశం నుంచి బయటికి రాగానే భార్యాపిల్లల్లో, పనిపాటల్లో మునిగి పోయి (మీరు చెప్పిన) చాలా విషయాలు మరచిపోతుంటాము" అంటూ నేను కారణం ఏకరువుపెట్టాను. నేను చెప్పినదంతా విని దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు : "ఎవరి చేతిలో నయితే నా ప్రాణం ఉందో ఆయన సాక్షిగా చెబుతున్నాను. మీరు నా సమక్షంలో ఉండే స్థితిలోనే ఎల్లప్పుడూ ఉంటే, (నిత్యం) దైవధ్యానంలో నిమ

గ్నులై ఉంటే దైవదూతలు మీ పడకలపై ఇంకా మీరు (నడిచే) దారుల్లో కూడా మీతో కరచాలనం చేస్తూ ఉంటారు. కాని ఓ హంజలా! కాలమంతా ఒకే విధంగా ఉండదు." ఆయన ఇదే మాట మూడుసార్లు అన్నారు. (అంటే, అను నిత్యం మనిషి ఒకేవిధంగా ఉండడు. సమయం, సందర్భాన్ని బట్టి అతని స్థితిలో మార్పు రావటమనేది సహజం).

'ఆఫస్నా' అంటే మేము పనుల్లో, ఆటపాటల్లో మునిగిపోతూ ఉంటాం. 'జైఆత్' అంటే జీవనం కొనసాగించే మార్గాలు. ఉదా: చేతివృత్తులు, వ్యవసాయం, వ్యాపారం, పరిశ్రమలు, సిరిసంపదలు వగైరా.

قَوْلُهُ: «رِبْعِيٌّ» بِكَسْرِ الرَّاءِ. «وَالأُسَيِّدِيّ» بِضَمِّ الْهَمْزَةِ وَفَتْحِ السِّينِ وَبَعْدَهَا يَاءٌ مَكْسُورَةٌ مُشَدَّدَةٌ. وَقَوْلُهُ: «عَافَسْنَا» هُوَ بِالْعَيْنِ وَالسِّينِ الْمُهْمَلَتَيْنِ، أَيْ: عَالَجْنَا وَلاَعَبْنَا. «وَالضَّيْعَاتُ»: الْمَعَايِشُ.

*(సహీహ్ ముస్లింలోని 'పశ్చాత్తాప' ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో కూడా ప్రవక్త గారి ప్రియసహచరుల దైవభీతి, ధర్మపరాయణతలు వివరించబడటంతో పాటు మనిషి మానసిక స్థితిగతుల్లో మార్పులు సంభవించటం మానవ సహజ ధర్మమని తెలియజేయడం జరిగింది. అయితే ఇది కాపట్యం కాదు. మనస్సు ఏమరుపాటుకు లోనై ఉన్నప్పుడు ఇలాంటి స్థితి ఆవరిస్తుంది. మనిషి ఈ చిత్తచాంచల్యాన్ని పూర్తిగా నిరోధించలేడు గాని ఎక్కువగా దైవనామస్మరణం చేయటంతో చాలావరకు దీనిని అదుపులో పెట్టుకోగలడు.

152. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: ఒకసారి దైవప్రవక్త (సల్లం) ఖుత్బా (ఉపన్యాసం) ఇస్తుండగా, అకస్మాత్తుగా ఆయన దృష్టి (ఎండలో) నిలబడి ఉన్న ఒక వ్యక్తిపై పడింది.

١٥٢ ـ وَعَنِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: بَيْنَمَا النَّبِيُّ ﷺ يَخْطُبُ إِذَا هُوَ بِرَجُلٍ قَائِمٍ، فَسَأَلَ عَنْهُ فَقَالُوا:

آبو إسرائيل نذر أن يقوم في الشمس ولا يقعد، ولا يستظل ولا يتكلم، ويصوم فقال النبي ﷺ: «مُرُوهُ فليتكلم وليستظل وليقعد وليتم صومه» رواه البخاري.

ఆయన ఆ వ్యక్తి గురించి అడగ్గా, "ఇతనిపేరు అబూ ఇస్రాయీల్. తను ఎండలో నించుంటాననీ, కూర్చోకుండా, నీడలోకి రాకుండా, ఎవరితోనూ మాట్లాడకుండా ఉంటానని, ఇంకా ఉపవాసం పాటిస్తానని మొక్కుకున్నాడు" అని అక్కడున్న వారు ఆయనకు తెలియజేశారు. అది విని ఆయన "మాట్లాడమని, నీడలోకి వచ్చి కూర్చోమని అతనికి చెప్పండి, అయితే ఉపవాసాన్ని మాత్రం పూర్తిచేయమనండి" అని ఆదేశించారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ప్రమాణాలు, మొక్కుబడుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. తమకు తాముగా సృష్టించుకున్న ఆరాధనా పద్ధతులు, స్వయం కల్పిత పోకడలతో దైవసామీప్యాన్ని పొందలేమని, పైగా ఖుర్ఆన్, హదీసుల ద్వారా రుజువైన మార్గాల ద్వారానే అది సాధ్యమని పై హదీసు బోధపరుస్తోంది.
2. షరీఅత్ ఆదేశించనటువంటి మొక్కుబడులను ఇంకా దైవ అవిధేయతకు దారితీసే మొక్కుబడులను నెరవేర్చకూడదు. హదీసులో పేర్కొనబడిన మొక్కుబడులు కొన్ని ఆ కోవకు చెందినవే.
3. దేవుని అవిధేయతకు దారితీసే మొక్కుబడిని నెరవేర్చకపోయినా దానికి పరిహారం చెల్లించవలసిన అవసరం లేదని వాదించే అత్యధిక విద్వాంసులకు ఈ హదీసు ప్రబల నిదర్శనం. ఎందుకంటే సదరు హదీసులో దైవప్రవక్త (సల్లం) ఆ వ్యక్తికి పరిహారం చెల్లించమని ఆదేశించలేదు.



## 15వ అధ్యాయం

# ١٥ - بَابٌ فِي الْمُحَافَظَةِ عَلَى الأَعْمَالِ

# సత్కార్యాలను నిత్యం పాటిస్తూ ఉండాలి

قال الله تعالى: ﴿أَلَمْ يَأْنِ لِلَّذِينَ ءَامَنُوٓاْ أَن تَخْشَعَ قُلُوبُهُمْ لِذِكْرِ ٱللَّهِ وَمَا نَزَلَ مِنَ ٱلْحَقِّ وَلَا يَكُونُواْ كَٱلَّذِينَ أُوتُواْ ٱلْكِتَٰبَ مِن قَبْلُ فَطَالَ عَلَيْهِمُ ٱلْأَمَدُ فَقَسَتْ قُلُوبُهُمْ﴾ [الحديد: ١٦]، وقال تعالى: ﴿وَقَفَّيْنَا بِعِيسَى ٱبْنِ مَرْيَمَ وَءَاتَيْنَٰهُ ٱلْإِنجِيلَ وَجَعَلْنَا فِى قُلُوبِ ٱلَّذِينَ ٱتَّبَعُوهُ رَأْفَةً وَرَحْمَةً وَرَهْبَانِيَّةً ٱبْتَدَعُوهَا مَا كَتَبْنَٰهَا عَلَيْهِمْ إِلَّا ٱبْتِغَآءَ رِضْوَٰنِ ٱللَّهِ فَمَا رَعَوْهَا حَقَّ رِعَايَتِهَا﴾ [الحديد: ٢٧]، وقال تعالى: ﴿وَلَا تَكُونُواْ كَٱلَّتِى نَقَضَتْ غَزْلَهَا مِنۢ بَعْدِ قُوَّةٍ أَنكَٰثًا﴾ [النحل: ٩٢]، وقال تعالى: ﴿وَٱعْبُدْ رَبَّكَ حَتَّىٰ يَأْتِيَكَ ٱلْيَقِينُ﴾ [الحجر: ٩٩].

وَأَمَّا الأَحَادِيثُ؛ فَمِنْهَا:

అల్లాహ్ సెలవిచ్చాడు : "విశ్వాసుల హృదయాలు అల్లాహ్ ప్రస్తావనతో చలించే సమయం, ఆయన అవతరింపజేసిన సత్యం ముందు వంగిపోయే సమయం ఇంకా రాలేదా? పూర్వం గ్రంథం ఇవ్వ బడిన ప్రజల మాదిరిగా వారు మారిపోకూడదు. ఒక సుదీర్ఘకాలం వారిపై గడచిపోయింది. అప్పుడు వారి హృదయాలు కఠినమయ్యాయి."
(అల్ హదీద్ : 16)

ఇంకొకచోట అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు : వారం దరి తరువాత మేము మర్యమ్ కుమారుడగు ఈసాను ప్రభవింపజేశాము, ఆయనకు ఇన్జీల్ను ప్రసాదించాము. ఆయనను అనుస రించిన వారి హృదయాలలో మేము జాలిని, కరుణను కలిగించాము. వైరాగ్యాన్ని (రుహ్బానియత్ను) వారు స్వయంగా కని పెట్టారు. మేము దానిని వారిపై విధించలేదు. కాని అల్లాహ్ ప్రసన్నతను పొందటానికి వారే స్వయంగా ఈ దురాచారాన్ని సృష్టించుకున్నారు. కాని తరువాత దానిని పాటించే విషయంలో మాత్రం న్యాయం చేకూర్చలేకపోయారు."
(అల్ హదీద్ : 27)

మరొకచోట ఇలా సెలవిస్తున్నాడు : "స్వయంగా తాను శ్రమతో నూలు వడికి, తరువాత తానే దానిని ముక్కలుముక్కలుగా చేసిన స్త్రీ మాదిరిగా చేయకండి." (అన్ నహ్ల్ : 92)

**వేరొక చోట ఇలా అంటున్నాడు : "అవశ్యంగా వచ్చే చివరి గడియ (మరణ ఘడియ) వరకూ నీ ప్రభువు దాస్యం చేస్తూ ఉండు."**

**(అల్ హిజ్ర్ : 99)**

**ఇక ఈ విషయానికి సంబంధించిన హదీసులు:**

153. ఇంతకు ముందు 14వ అధ్యాయంలో వచ్చిన (హదీసు వరుస సంఖ్య 142 చూడండి) హజ్రత్ ఆయిషా (రజి. అన్హా) హదీసులోని ఈ క్రింది వాక్యం సదరు అధ్యాయానికి కూడా వర్తిస్తుంది.

(దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు): "(మనిషి చేసే) ధర్మకార్యాలన్నిటిలో అతను నిత్యం చేస్తూ ఉండే కార్యమే దైవానికి అత్యంత ప్రీతికరమైనది."

١٥٣- حَدِيثُ عَائِشَةَ: وَكَانَ أَحَبُّ الدِّينِ إِلَيْهِ مَا دَاوَمَ صَاحِبُهُ عَلَيْهِ. وَقَدْ سَبَقَ فِي الْبَابِ قَبْلَهُ.

154. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు : "ఏ వ్యక్తి అయినా తాను రోజూ రాత్రిపూట ఆనవాయితీగా చేసే ఆరాధననుగాని, లేక అందులో కొంత భాగంగాని చేయకుండా నిద్రపోయి, (తెల్లవారాక) ఫజ్ర్ నమాజు నుంచి జుహర్ నమాజు వరకూ - ఈ మధ్యకాలంలో - ఎప్పుడు నెరవేర్చినా అతను దానిని రాత్రిపూట నెరవేర్చినట్లుగానే వ్రాసుకోబడుతుంది.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజు ప్రకరణం)*

١٥٤ - وعن عمرَ بنِ الخطابِ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مَنْ نَامَ عَنْ حِزْبِهِ مِنَ اللَّيْلِ، أَوْ عَنْ شَيْءٍ مِنْهُ فَقَرَأَهُ مَا بَيْنَ صَلاةِ الْفَجْرِ وَصَلاةِ الظُّهْرِ، كُتِبَ لَهُ كَأَنَّمَا قَرَأَهُ مِنَ اللَّيْلِ» رواه مسلم.

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో "హిజ్బ్" అనే పదం వాడబడింది. అసలు చెరువునుండి నీళ్ళు తీసుకునే 'వంతు'ను హిజ్బ్ అని అంటారు. కాలక్రమంలో మనిషి స్వచ్ఛందంగా నిర్ణయించుకొని పాటించే నఫిల్ ఆరాధనలకోసం ఈ పదాన్ని వాడటం జరిగింది. ఉదాహరణకు ప్రజలు తాము ప్రతిరోజూ ఇన్ని రకాతులు నఫిల్ నమాజులు చేస్తామని, రోజూ ఖుర్ఆన్‌లోని కొంతభాగం పారాయణం చేస్తామని స్వచ్ఛందంగానే నిర్ణయించుకుంటారు. అలాంటి ఆనవాయితీలను క్రమం తప్పకుండా పాటిస్తూ ఉండాలని ఈ హదీసు పురికొల్పుతోంది. ఎప్పుడైనా ఏ కారణం వల్లనయినా సమయానికి ఆ ఆనవాయితీని పాటించలేకపోయినప్పటికీ వీలైనంత తొందరగా దానిని నెరవేరిస్తే పూర్తి పుణ్యం లభిస్తుంది. సమయం తప్పినందువల్ల పుణ్యంలో మాత్రం ఎలాంటి కోత విధించబడదు.

١٥٥ - وعن عبدِ اللهِ بنِ عمرِو بنِ العاصِ رضي الله عنهما قال: قال لي رسولُ الله ﷺ: «يَا عَبْدَ اللهِ! لاتَكُنْ مِثْلَ فُلانٍ، كَانَ يَقُومُ اللَّيْلَ فَتَرَكَ قِيَامَ اللَّيْلِ» متفقٌ عليه.

155. దైవప్రవక్త (సల్లం) తనకు ఈ విధంగా ఉపదేశించారని హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) తెలియజేశారు: "ఓ అబ్దుల్లాహ్! ఫలానా వాడిలా అయిపోకు! అతను (ప్రతిరోజూ) రాత్రిపూట (శక్తికి మించిన) నఫిల్ నమాజులు చేస్తూ ఉండేవాడు. కాని తరువాత (వెగటు కలిగి) అసలు రాత్రి పూట నమాజులు చేయటమే మానేశాడు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని 'తహజ్జుద్' ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని 'ఉపవాస' ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

1. ఎవరిలోనైనా ఏదైనా విమర్శించదగిన తప్పు కనిపిస్తే నలుగురిలో అతని పేరు ప్రస్తావించకుండా ఆ తప్పును గురించి ప్రజలకు తెలియజేయాలి. దానివల్ల ప్రజలు ఆ తప్పును తెలుసుకొని దానికి దూరంగా ఉంటారు. ఇతరుల తప్పుల్ని దూరం చేయడానికి అనుసరించదగిన ఉత్తమ నైతిక విధానం ఇదే!
2. మనిషి ఏదైనా మంచి పని మొదలుపెడితే ఇక దానిని నిర్విరామంగా, పాటిస్తూ ఉండటం అభిలషణీయం.
3. నఫిల్ ఆరాధనల్లో, స్వచ్ఛంద సత్కార్యాల్లో శక్తికి మించిన భారాన్ని నెత్తిన వేసుకోకూడదు. అలా చేసే సామాన్యంగా ప్రజలు విసుగుతో ఆరాధనలు చేయటం మానేస్తుంటారు.

١٥٦ ـ وعن عائشةَ رضي الله عنها قالت: كان رسولُ الله ﷺ إذَا فَاتَتْهُ الصَّلاةُ مِنَ اللَّيْلِ مِنْ وَجَعٍ أَوْ غَيْرِهِ، صَلَّى مِنَ النَّهَارِ ثِنْتَيْ عَشْرَةَ رَكْعَةً؛ رواه مسلم.

156. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) నొప్పి లేక ఏ ఇతర కారణం వల్లనయినా రాత్రి నమాజు (తహజ్జుద్) చేయలేకపోతే పగలు పన్నెండు రకాతులు (చేసి దానిని) పూర్తిచేసేవారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజు ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

నఫిల్ నమాజులకు ఖజా పాటించనవసరం లేదుగాని - సదరు హదీసులో దైవప్రవక్త (స) చేసినట్లు - ఒకవేళ వాటిని పూర్తిచేస్తే అభిలషణీయంగా (ముస్తహబ్‌గా)నే పరిగణించ బడుతుంది.



16వ అధ్యాయం

# ١٦ - بَابٌ فِي الأَمْرِ بِالْمُحَافَظَةِ عَلَى السُّنَّةِ وَآدَابِهَا

# ప్రవక్త (స) సంప్రదాయాన్ని, మర్యాదలను కాపాడాలి

قال الله تعالى: ﴿وَمَآ ءَاتَىٰكُمُ ٱلرَّسُولُ فَخُذُوهُ وَمَا نَهَىٰكُمْ عَنْهُ فَٱنتَهُوا۟﴾ [الحشر: ٧]، وقال تعالى: ﴿وَمَا يَنطِقُ عَنِ ٱلْهَوَىٰٓ ۝ إِنْ هُوَ إِلَّا وَحْىٌ يُوحَىٰ ۝﴾ [النجم: ٣، ٤]، وقال تعالى: ﴿قُلْ إِن كُنتُمْ تُحِبُّونَ ٱللَّهَ فَٱتَّبِعُونِى يُحْبِبْكُمُ ٱللَّهُ وَيَغْفِرْ لَكُمْ ذُنُوبَكُمْ﴾ [آل عمران: ٣١]، وقال تعالى: ﴿لَّقَدْ كَانَ لَكُمْ فِى رَسُولِ ٱللَّهِ أُسْوَةٌ حَسَنَةٌ لِّمَن كَانَ يَرْجُوا۟ ٱللَّهَ وَٱلْيَوْمَ ٱلْءَاخِرَ﴾[الأحزاب:٢١]، وقال تعالى: ﴿فَلَا وَرَبِّكَ لَا يُؤْمِنُونَ حَتَّىٰ يُحَكِّمُوكَ فِيمَا شَجَرَ بَيْنَهُمْ ثُمَّ لَا يَجِدُوا۟ فِىٓ أَنفُسِهِمْ حَرَجًا مِّمَّا قَضَيْتَ وَيُسَلِّمُوا۟ تَسْلِيمًا﴾ [النساء:٦٥]، وقال تعالى: ﴿فَإِن تَنَٰزَعْتُمْ فِى شَىْءٍ فَرُدُّوهُ إِلَى ٱللَّهِ وَٱلرَّسُولِ﴾ [النساء: ٥٩]، قال الْعُلَمَاءُ: مَعْنَاهُ إِلَى الْكِتَابِ وَالسُّنَّةِ. وقال تعالى: ﴿مَّن يُطِعِ ٱلرَّسُولَ فَقَدْ أَطَاعَ ٱللَّهَ﴾ [النساء: ٨٠]،

అల్లాహ్ సెలవిచ్చాడు : "దైవప్రవక్త మీకు ఇచ్చిన దాన్ని పుచ్చుకోండి, ఆయన మిమ్మల్ని నిషేధించినదాని జోలికి పోకండి."

(అల్ హష్ర్ : 7)

ఇంకా ఆయన ఇలా సెలవిచ్చాడు : అతను (దైవప్రవక్త) తన మనోవాంఛలను అనుసరించి చెప్పటం లేదు. ఇది ఒక వహీ, అతనిపై అవతరింపజేయబడుతుంది.

(అన్ నజ్మ్ : 3 - 4)

ఇంకా ఈ విధంగా సెలవీయబడింది : "ప్రవక్తా! నీవు ప్రజలకు ఇలా చెప్పు: మీకు నిజంగానే అల్లాహ్‌పట్ల ప్రేమ ఉంటే నన్ను అనుసరించండి. అప్పుడు అల్లాహ్ మిమ్మల్ని ప్రేమిస్తాడు. మీ పాపాలను మన్నిస్తాడు."

(ఆలి ఇమ్రాన్ : 31)

ఇంకా ఇలా సెలవిచ్చాడు : "వాస్తవంగానే దైవ ప్రవక్తలో మీకు ఒక మంచి ఆదర్శం ఉండినది - అల్లాహ్‌పై, అంతిమదినంపై ఆశలు పెట్టుకొని అత్యధికంగా అల్లాహ్‌ను స్మరించే వ్యక్తికి." (అల్ అహ్‌జాబ్ : 21)

మరొకచోట ఇలా సెలవిచ్చాడు : కాదు, ముహమ్మద్! నీ ప్రభువు సాక్షిగా! వారు తమ పరస్పర విభేదాల విషయంలో నిన్ను

వقال تعالى: ﴿وَإِنَّكَ لَتَهْدِي إِلَىٰ صِرَاطٍ مُّسْتَقِيمٍ﴾ [الشورى: ٥٢]، وقال تعالى: ﴿فَلْيَحْذَرِ الَّذِينَ يُخَالِفُونَ عَنْ أَمْرِهِ أَن تُصِيبَهُمْ فِتْنَةٌ أَوْ يُصِيبَهُمْ عَذَابٌ أَلِيمٌ﴾ [النور: ٦٣]، وقال تعالى: ﴿وَاذْكُرْنَ مَا يُتْلَىٰ فِي بُيُوتِكُنَّ مِنْ آيَاتِ اللَّهِ وَالْحِكْمَةِ﴾ [الأحزاب: ٣٤]؛

والآيات في الباب كثيرة. وَأمّا الأحاديثُ:

న్యాయనిర్ణేతగా అంగీకరించనంతవరకు, ఇంకా నీవు ఏ నిర్ణయం చేసినా దానిని గురించి వారి మనస్సులలో ఏమాత్రం సంకోచం లేకుండా దానిని యథాతథంగా శిరసావహించ నంత వరకు వారు నిజమైన విశ్వాసులు కాలేరు." (అన్ నిసా : 65)

ఇంకా ఇలా సెలవిచ్చాడు : "మీ మధ్య ఏ విషయంలోనైనా వివాదం తలెత్తితే దాన్ని అల్లాహ్‌కు, ప్రవక్తకు నివేదించండి." (అన్ నిసా : 59)

విద్వాంసుల అభిప్రాయం ప్రకారం ఇక్కడ దీనికి (అల్లాహ్, ప్రవక్త అంటే) దైవగ్రంథము మరియు ప్రవక్త (స) సంప్రదాయము అని అర్థం. వీటి వెలుగులోనే ధర్మాధర్మాలను తర్కించుకోవాలని భావం.

ఇంకొకచోట ఇలా సెలవీయబడింది : "ప్రవక్తకు విధేయత చూపినవాడు వాస్తవంగా అల్లాహ్‌కు విధేయత చూపినట్లే." (అన్ నిసా : 80)

వేరొకచోట అల్లాహ్ ఇలా అన్నాడు : "(ప్రవక్తా!) నిశ్చయంగా నీవు రుజుమార్గం వైపునకు దారి చూపుతున్నావు." (అష్ షూరా : 52)

ఆయన ఇంకా ఇలా అన్నాడు : "దైవప్రవక్త ఆజ్ఞను ఉల్లంఘించే వారు, తాము ఏదైనా ఉపద్రవంలో చిక్కుకుపోతామేమో అనీ, తమపై బాధాకరమైన శిక్ష ఏదైనా అవతరిస్తుందేమో అని భయపడాలి." (అన్ నూర్ : 63)

ఆయన ఇంకా ఇలా అన్నాడు : "మీ ఇండ్లలో వినిపించబడే అల్లాహ్ వాక్యాలనూ, వివేకంతో కూడుకున్న విషయాలనూ జ్ఞాపకముంచు కోండి." (అల్ అహ్‌జాబ్ : 34)

ఈ అధ్యాయం క్రింద ఇలాంటి సూక్తులు ఇంకా ఉన్నాయి.ఇక దీనికి సంబంధించిన హదీసులు:

١٥٧ ـ فالأوّلُ: عَنْ أبي هُرَيْرَةَ رضي الله عنه عن النَّبيِّ ﷺ قال: «دَعُوني ما تَرَكْتُكُمْ إِنَّمَا أَهْلَكَ مَنْ كَانَ قَبْلَكُمْ كَثْرَةُ سُؤَالِهِم، وَاخْتِلافُهُمْ عَلَى أَنْبِيَائِهِمْ، فَإِذَا نَهَيْتُكُمْ عَنْ شَيْءٍ فَاجْتَنِبُوهُ، وَإِذَا أَمَرْتُكُمْ بِأَمْرٍ فَأْتُوا مِنْهُ مَا اسْتَطَعْتُمْ» متفقٌ عليه.

157. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : నేను మీకు తెలపకుండా వదలిపెట్టిన విషయాలను గురించి మీరు నన్ను (మాటిమాటికీ) అడగటం మానేయండి. ఈ పద్ధతే మీ పూర్వీకులను నాశనం చేసింది. వాళ్ళు (ఇలాగే) చీటికీ మాటికీ ప్రశ్నలు చేసి, తమ ప్రవక్తలతో విభేదించుకునేవారు. కనుక నేను ఏ విషయం నుండి అయినా వారిస్తే మీరు దానికి దూరంగా ఉండండి. నేను మీకేదైనా ఆజ్ఞ ఇస్తే వీలైనంతవరకు దాన్ని పాలించడానికి ప్రయత్నించండి. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని 'ఏతిసామ్' ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని ప్రవక్త మహిమోన్నతల ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

తగిన కారణమేదీ లేకుండా అనవసరంగా ప్రశ్నలు వేసి కూపీలు లాగడం, అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త ఆదేశాల్లో విభేదాలు సృష్టించడం, అనుమానాలు రేకెత్తించడం వినాశానికి దారితీస్తుంది. దేవుడు, ఆయన ప్రవక్త ఇచ్చిన ఆదేశాలను మారుమాట్లాడకుండా ఆచరణలో పెట్టాలి. ఇదే సరైన మార్గం. వెంట్రుక తోలు ఒలిచే చందాన ధర్మాదేశాల కూపీలులాగే ఫికహ్ విధానాలు కూడా ఇందులోకి వస్తాయి. వాటివల్ల విభేదాలు, జగడాల ద్వారం తెరచుకుంటుంది. అనైక్యతకు, అసంఘటితత్వానికి మార్గం సుగమం అవుతుంది. నేడు ముస్లిం సమాజం వినాశానికి గొనిపోయే ఇటువంటి అడ్డదారుల్ని వదలిపెట్టి మానవజాతి శాంతిశ్రేయాలకు పూచీవహించిన ఏకైక రుజుమార్గం వైపుకు మరలిరావాలి. ఎప్పటికైనా సత్యమార్గం ఒక్కటే. "ఫమాజా బాదల్ హఖ్ఖి ఇల్లజ్జలాల్" సత్యం తరువాత మార్గభ్రష్టత తప్ప ఇంకేం ఉంటుంది?

158. హజ్రత్ అబూ నజీహ్ ఇర్‌బాజ్ బిన్ సారియా (రజి) కథనం : ఒకసారి దైవ ప్రవక్త (సల్లం) మాకు ఎంతో ప్రభావ వంతమైన హితబోధ చేశారు. అది విని మా హృదయాలు భయంతో కంపించి పోయాయి. కళ్ళవెంబడి అశ్రుధారలు ప్రవహించాయి. అప్పుడు, మేము "ఓ దైవప్రవక్తా! ఇది వీడ్కోలు పలికేవాడు చేసే హితవులాగుంది. కనుక మీరు మాకు ఏమైనా ఉపదేశించండి" అని కోరాము. అప్పుడు ఆయన ఈ విధంగా ఉపదేశించారు -

"నేను మీకు దైవానికి భయపడుతూ ఉండమని, (మీ నాయకుడు చెప్పి నట్లు) విని ఆయనకు విధేయత చూపమని ఉపదేశిస్తున్నాను. మీకు నాయకుడిగా నియమించబడేవాడు నీగ్రో జాతికి చెందిన ఒక బానిస అయినాసరే, (మీరు అతనికి విధేయత చూపాలి). (గుర్తుంచుకోండి!) మీలో ఎవరైనా (నా తదనంతరం) బ్రతికి ఉంటే అతి త్వరలోనే అతను ఎన్నో విభేదాలు చూస్తాడు. కనుక (అలాంటి సంక్షోభ పరిస్థితుల్లో) మీరు నా సంప్రదాయాన్ని ఇంకా సన్మార్గం పొందిన, సజ్జనులైన ఖలీఫాల విధానాన్ని అనుసరించాలి. వాటిని మీరు దంతాలతోనైనాసరే (ఆఖరి సమయం వరకు) గట్టిగా పట్టుకోండి. ధర్మంలో కొత్తపోకడలకు దూరంగా ఉండండి. ఎందుకంటే ప్రతి బిద్అత్

١٥٨ ـ الثَّانِي: عَنْ أَبِي نَجِيحٍ الْعِرْبَاضِ بْنِ سَارِيَةَ رضي الله عنه قال: «وَعَظَنَا رسولُ الله ﷺ مَوْعِظَةً بَلِيغَةً وَجِلَتْ مِنْهَا الْقُلُوبُ وَذَرَفَتْ مِنْهَا الْعُيُونُ، فَقُلْنَا: يا رَسولَ الله! كأنَّهَا مَوْعِظَةُ مُوَدِّعٍ فَأَوْصِنَا. قال: «أُوصِيكُمْ بِتَقْوَى الله، وَالسَّمْعِ وَالطَّاعَةِ وإنْ تَأَمَّرَ عَلَيْكُمْ عَبْدٌ [حبشي]، وَإِنَّهُ مَنْ يَعِشْ مِنْكُمْ فَسَيَرَى اخْتِلافاً كَثِيراً. فَعَلَيْكُمْ بِسُنَّتِي وَسُنَّةِ الْخُلَفَاءِ الرَّاشِدِينَ الْمَهْدِيِّينَ، عَضُّوا عَلَيْهَا بِالنَّوَاجِذِ، وَإِيَّاكُمْ وَمُحْدثَاتِ الأُمُورِ فَإِنَّ كُلَّ بِدْعَةٍ ضَلالَةٌ» رواه أبو داود،

والترمذي وقال: حديث حسن صحيح.
«النَّواجذ» بالذالِ المعجمةِ: الأنيَابُ، وقيلَ: الأضرَاسُ.

(క్రొత్తపోకడ) మార్గభ్రష్టతే. (దీనిని అబూ దావూద్ మరియు తిర్మిజీలు ఉల్లేఖించారు. తిర్మిజీ దీనిని 'హసన్' మరియు 'సహీహ్'గా ఖరారు చేశారు.)

"నవాజిజ్" అంటే కొరుకుడు పళ్లు. కొందరి అభిప్రాయం ప్రకారం నవాజిజ్ అంటే దవడలు అని అర్థం.

*(సుననె అబూదావూద్‌లోని 'సున్నత్' ప్రకరణంలోనూ ఇంకా జామె తిర్మిజీలోని విద్యాప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో విశ్వాసులు దైవానికి భయపడుతూ ఉండాలని, తమ నాయకులకు విధేయత చూపాలని ప్రబోధించబడడంతోపాటు సజ్జనులైన ఖలీఫాల విధానాన్ని అనుసరించాలని, ధర్మంలో తలెత్తే కొత్తపోకడలకు దూరంగా ఉండాలని కూడా తాకీదు చేయబడింది. అంతేకాదు, రాబోయే కాలంలో ముస్లిం సమాజంలో విభిన్న వాదాలు తలెత్తుతాయని కూడా దైవప్రవక్త (సల్లం) ముందే భవిష్యవాణి పలికారు. అంతేకాదు, ఆ తరువాత వెంటనే సన్మార్గం ఏదో కూడా సూచించారు. ప్రవక్త సంప్రదాయాన్ని, సజ్జనులైన ఖలీఫాల ఆనవాయితీలను మించిపోకుండా ఉండటమే సరైన మార్గమని అన్నారు. లోకంలో పలువురి నుంచి పలువాదాలు, భేదాభిప్రాయాలు వినపడుతున్నప్పుడు సత్యాన్ని, సహేతుకాన్ని గ్రహించటంకోసం ఈ హదీసు ఒక ప్రమాణంగా దోహదపడుతుంది. దైవప్రవక్త సూచించిన ఈ ప్రామాణికతనే ముస్లింలు ఏకైక ప్రమాణంగా అంగీకరిస్తే ఎంత బాగుంటుంది!!

١٥٩ ـ الثَّالِثُ: عَنْ أَبِي هريرةَ رضي الله عنه، أن رسولَ الله ﷺ قال: «كُلُّ أُمَّتِي يَدْخُلُونَ الْجَنَّةَ إلَّا مَنْ أَبى». قِيلَ: وَمَنْ يَأبَى يا رسولَ الله؟ قالَ: «مَنْ أَطَاعَنِي دَخَلَ الْجَنَّةَ، وَمَنْ عَصَانِي فَقَدْ أَبَى» رواه البخاري.

159. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "స్వర్గం వద్దనుకున్నవారు తప్ప నా ఉమ్మత్ (సమాజం)లోని ప్రతి ఒక్కరూ స్వర్గంలోకి ప్రవేశిస్తారు" అని అన్నారు. అది విని "దైవప్రవక్తా! స్వర్గం వద్దనేవాడు కూడా ఉంటాడా?" అని ఎవరో సందేహపడగా, అందుకు ఆయన "నాకు విధేయత చూపినవాడు స్వర్గానికి పోతాడు.

నన్ను ధిక్కరించినవాడే స్వర్గం లోకి ప్రవేశించడానికి నిరాకరించిన వాడు" అని సమాధానమిచ్చారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని 'ఏతిసామ్' ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ ఉమ్మత్ అంటే ఉమ్మతె ఇజాబత్ అనగా దైవసందేశాన్ని అంగీకరించిన సమాజం అని అర్థం. దైవప్రవక్త పిలుపుకు అనుకూలంగా స్పందించి ఆయన్ని విశ్వసించిన వారన్నమాట. వీరిలో కూడా దైవప్రవక్త విధేయతలో నికార్సయిన విశ్వాసులు మాత్రమే స్వర్గంలోకి ప్రవేశిస్తారు. అవిధేయులకు, ధిక్కారులకు స్వర్గంలో ప్రవేశించే అర్హత లేదు.

١٦٠ - الرَّابِعُ: عَنْ أَبي مسلمٍ، وقِيلَ: أبي إِيَاسٍ سَلَمَةَ بْنِ عَمْرِو بْنِ الأكْوَعِ رضي الله عنه، أَنَّ رَجُلاً أَكَلَ عِنْدَ رسولِ الله ﷺ بِشِمَالِهِ فقالَ: «كُلْ بِيَمِينِكَ» قالَ: لا أَسْتَطِيعُ. قالَ: «لا اسْتَطَعْتَ» مَا مَنَعَهُ إِلَّا الْكِبْرُ، فَمَا رَفَعَهَا إِلَى فِيهِ. رواه مسلم.

160. హజ్రత్ అబూ ముస్లిం - మరి కొందరి అభిప్రాయంలో అబూ ఇయాస్ సలమా బిన్ అమ్ర్ బిన్ అక్వా (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (స) సమక్షంలో ఎడమచేత్తో తిన్నాడు. ఆయన ఆ వ్యక్తిని కుడిచేత్తో తినమని ఆదేశించారు. అందుకతను 'నేను (కుడి చేత్తో) తినలేను" అన్నాడు. దానికి ఆయన "నీవు (నిజంగానే కుడిచేత్తో) తినలేకపోదువు గాక!" అని శపిస్తూ "గర్వం ఇతణ్ణి అలా తినకుండా చేస్తుంది" అని అన్నారు. (ఇక ఆ తరువాత నుంచి) ఆ వ్యక్తి తన కుడి చేయిని నోటిదాకా లేపలేకపోయేవాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. తగు కారణమేదీ లేకుండా ఎడమచేత్తో తినటం, త్రాగటం ఎంతో అసభ్యకరమైన చేష్ట. చూసేవారికి కూడా అది చాలా అసహ్యంగా అనిపిస్తుంది. కేవలం తినటం, త్రాగటమే కాదు, ప్రతి మంచి పనినీ దైవప్రవక్త (సల్లం) కుడిచేత్తోనే మొదలుపెట్టేవారు.

2. గర్వంతో, తలబిరుసుతనంతో దైవప్రవక్త (సల్లం) సంప్రదాయాన్ని వదలిపెట్టడం ఎంతో ప్రమాదకరమైన విషయం. అది మనిషి విశ్వాసానికే (ఈమాన్‌కే) చేటు.

١٦١ ـ الْخَامِسُ: عَنْ أَبي عبدِ الله النُّعْمَانِ بْنِ بَشِير رضي الله عنهما، قال: سَمِعْتُ رسولَ الله ﷺ يقولُ: «لَتُسَوُّنَّ صُفُوفَكُمْ أَوْ لَيُخَالِفَنَّ اللهُ بَيْنَ وُجُوهِكُمْ» متفقٌ عليه. وفي روايةٍ لمسلمٍ: كانَ رسولُ الله ﷺ يُسَوِّي صُفُوفَنَا حَتَّى كَأَنَّمَا يُسَوِّي بِهَا الْقِدَاحَ حَتَّى إِذَا رَأَى أَنَّا قَدْ عَقَلْنَا عَنْهُ. ثُمَّ خَرَجَ يَوْماً، فقامَ حَتَّى كَادَ أَنْ يُكَبِّرَ، فَرَأَى رَجُلاً بَادِياً صَدْرُهُ فَقَالَ: «عِبَادَ اللهِ لَتُسَوُّنَّ صُفُوفَكُمْ أَوْ لَيُخَالِفَنَّ اللهُ بَيْنَ وُجُوهِكُمْ».

161. దైవప్రవక్త (సల్లం) ఇలా అంటుండగా తాను విన్నానని హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ నోమాన్ బిన్ బషీర్ (రజి) తెలియజేశారు: మీరు మీ పంక్తుల్ని తిన్నగా ఉంచుకోవాలి. లేకపోతే అల్లాహ్ మీ మధ్య వ్యతిరేకతలను సృష్టిస్తాడు.

*(బుఖారీ - ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దైవప్రవక్త (స) మాతో కలిసి బాణాలను సరిచేసినట్లే మా పంక్తులను తిన్నగా చేసేవారు. ఆ విధంగా మేము దీని ప్రాముఖ్యతను అర్థం చేసుకున్నామని గ్రహించాకే ఆయన (ఇఖామత్ అనంతరం 'అల్లాహు అక్బర్' అంటూ) నమాజు మొదలెట్టేవారు. ఒకసారి ఆయన (నమాజు చేయించటం కోసం) వచ్చారు. నమాజు కోసం నిలబడి అల్లాహు అక్బర్ అనబోయేంతలో (వెనుక నించున్న) ఒక వ్యక్తి రొమ్ము భాగం (పంక్తినుండి) బయటికి వచ్చినట్లు ఆయనకు కనిపించింది. అది చూసి ఆయన "దేవుని దాసులారా! (నమాజుకు ఉపక్రమించినప్పుడు) మీరు మీ పంక్తుల్ని తప్పకుండా తిన్నగా ఉంచుకోండి లేకపోతే అల్లాహ్ మీ మధ్య విభేదాలను సృష్టిస్తాడు (లేదా మీ

ముఖాలను వ్యతిరేకంగా మార్చి వేస్తాడు).

*(సహీహ్ బుఖారీలోని 'అజాన్' ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని 'నమాజ్' ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

హదీసులో వచ్చిన "అవ్ లయుఖాలిఫున్నల్లాహు బైన వుజూహికుమ్" (లేకపోతే అల్లాహ్ మీ ముఖాలను వ్యతిరేకంగా మార్చివేస్తాడు) అన్న వాక్యానికి శాబ్దిక అర్థం తీసుకుంటే, మీరు ఆజ్ఞోల్లంఘనకు పాల్పడుతున్నందుకు శిక్షగా అల్లాహ్ మీ ముఖాలను మెడలవైపుకు తిప్పి వేస్తాడని భావం. సందర్భానుసారం, అల్లాహ్ మీ మధ్య విభేదాలను, అంతరాలను సృష్టిస్తాడనే అర్థం కూడా వస్తుంది. ఏదిఏమైనా నమాజుకోసం నించున్నప్పుడు పంక్తులు సక్రమంగా, తిన్నగా ఉండాలని ఈ హదీసులో నొక్కి వక్కాణించబడింది. నేడు చాలామంది ముస్లింలు ఈ విషయం పట్ల ఏమరుపాటుకులోనై ఉన్నారు. ఈనాడు సాధారణంగా మస్జిదుల్లో దైవప్రవక్త (స) సంప్రదాయాన్ననుసరించి నమాజులో పంక్తుల్ని సక్రమంగా, తిన్నగా ఉంచే ఏర్పాటు చేయలేక పోవడం శోచనీయమైన విషయం.

162. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం : మదీనాలో రాత్రిపూట ఒక ఇల్లు పరివారసమేతంగా కాలిపోయింది. దైవ ప్రవక్త (సల్లం)కు ఈ విషయం తెలియ జేయబడగా, ఆయన "ఈ అగ్ని మీకు శత్రువు. కనుక మీరు పడుకోబోయే ముందు దానిని ఆర్పివేయండి" అని తాకీదు చేశారు. *(బుఖారీ - ముస్లిం)*

١٦٢ ـ السَّادِسُ: عن أبي موسىٰ رضي الله عنه قال: احْتَرَقَ بَيْتٌ بالْمَدِينَةِ علَى أَهْلِهِ مِنَ اللَّيْلِ، فَلَمَّا حُدِّثَ رسولُ الله ﷺ بِشَأْنِهِمْ قال: «إنَّ هَذِهِ النَّارَ عَدُوٌّ لَكُمْ، فَإذَا نِمْتُمْ فَأَطْفِئُوهَا عَنْكمْ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని అనుమతి తీసుకునే ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

హదీసులోని హెచ్చరిక నూనెవొత్తులు, క్రొవ్వొత్తులతో మండే దీపాలకు సంబంధించినది. వీటివల్ల ఏ క్షణంలోనైనా మంటలంటుకునే ప్రమాదం ఉంటుంది. కనుక వీటిని ఎంతో జాగ్రత్తగా వాడుకోవాలి. ఇతర పనుల్లో నిమగ్నమయ్యేముందు వీటిని ఆర్పివేయాలి. ముఖ్యంగా

రాత్రి పడుకోబోయేముందు ఏ కొంత నిప్పు అయినా దానిని నిర్లక్ష్యంగా వదలిపెట్టి పడుకో కూడదు. దైవప్రవక్త కాలంలో అటువంటి దీపాలే ఉపయోగించేవారు కనుక ఆయన ఈ విషయమై ప్రజల్ని అప్రమత్తం చేశారు. ఈనాటి విద్యుద్దీపాల వల్ల అటువంటి ప్రమాదమేమీ ఉండదుగాని వాటిపట్ల కూడా అప్రమత్తత అవసరమే. అలాగే వంటింట్లో రాత్రిపూట వంట గ్యాస్‌ను ఆఫ్ చేయటం అవసరం.

163. హజ్రత్ అబూ మూసా (రజి) గారే చేసిన మరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : అల్లాహ్ నాకిచ్చి పంపిన మార్గదర్శకత్వం మరియు జ్ఞానాలు నేలపై కురిసే వర్షం లాంటివి. ఆ నేలలోని కొంతభాగం సారవంతమైనది. అది (వర్షపు) నీటిని పీల్చుకొని పచ్చికను, చెట్లుచేమలను మొలకెత్తించింది. ఆ నేలలోని మరి కొంత భాగం బంజరుభూమి. అది (నీటిని పీల్చుకోలేకపోయినా) నిల్వ మాత్రం చేసి ఉంచింది. ఆ నీటితో అల్లాహ్ ప్రజలకు ప్రయోజనం చేకూర్చు తాడు. వారు ఆ నీటిని త్రాగుతారు (తమ పశువులకు) త్రాపిస్తారు, ఇంకా పంట పొలాలకోసం వినియోగిస్తారు. ఆ వర్షమే మెట్టపల్లాలు లేని చదునైన నేలపై కూడా కురిసింది. కాని ఆ నేల వర్షపు నీటిని నిలిపి ఉంచటంగాని, పచ్చికను మొలకెత్తించటం గాని చేయజాలదు. ఈ (తొలి రెండు) ఉదాహరణలు దైవధర్మాన్ని అర్థం చేసుకున్న వ్యక్తికి వర్తిస్తాయి. దేవుడు నాకిచ్చి పంపిన

١٦٣ ـ السَّابِعُ: عَنْهُ قال: قال رسولُ الله ﷺ: «إنَّ مَثَلَ مَا بَعَثَنِي الله بِهِ مِنَ الْهُدَى وَالعِلْمِ كَمَثَلِ غَيْثٍ أَصَابَ أَرْضاً فَكَانَتْ مِنْهَا طَائِفَةٌ طَيِّبَةٌ، قَبِلَتِ الْمَاءَ فَأَنْبَتَتِ الكَلأَ وَالعُشْبَ الْكَثِيرَ، وَكَانَ مِنْهَا أَجَادِبُ أَمْسَكَتِ الْمَاءَ، فَنَفَعَ اللهُ بِها النَّاسَ فَشَرِبُوا مِنْهَا وَسَقَوْا وَزَرَعُوا. وَأَصَابَ طَائِفَةً مِنْهَا أُخْرَى، إِنَّمَا هِيَ قِيعَانٌ لا تُمْسِكُ مَاءً وَلا تُنْبِتُ كَلأً. فَذلِكَ مَثَلُ مَنْ فَقُهَ في دِينِ الله، وَنَفَعَه بِمَا بَعَثَنِي اللهُ بِه، فَعَلِمَ وَعَلَّمَ، وَمَثَلُ مَنْ لَمْ يَرْفَعْ بِذلِكَ رَأساً، وَلَمْ يَقْبَلْ هُدَى اللهِ الَّذي أُرْسِلْتُ بِهِ» متفقٌ عليه.

«فَقُهَ» بِضم الْقَافِ عَلَى الْمَشْهُورِ، وَقِيلَ: بِكَسْرِهَا، أيْ: صَارَ فَقِيهاً.

జ్ఞానం, సన్మార్గాలతో అతనికి ప్రయో
జనం చేకూర్చాడు. అతను (స్వయంగా
ధర్మ)జ్ఞానాన్ని ఆర్జించి (ఇతరులక్కూడా)
బోధించాడు. ఇక (మూడవ) ఉదా
హరణ (ధర్మం) వైపు తలెత్తిఅయినా
చూడకుండా, దేవుడు నాకిచ్చి పంపిన
సన్మార్గాన్ని తృణీకరించినవానికి
వర్తిస్తుంది. *(బుఖారీ - ముస్లిం)*

'ఫఖుహ' అంటే ఆ వ్యక్తి ఫఖీహ్ (ధర్మ
వేత్త) అయ్యాడు అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని విద్యాప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని ప్రవక్త (స) మహిమోన్నతల ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) కు వొసగబడిన దివ్య జ్ఞానం మరియు సన్మార్గాలను ఈ హదీసులో ప్రయోజనం చేకూర్చే వర్షంతో పోల్చడం జరిగింది. ఎందుకంటే వర్షం బంజరుగా పడివున్న మృతభూమిని సస్యశ్యామలంగా మార్చేసినట్లు ఈ జ్ఞానోపదేశాలు కూడా మోడువారిన మానవ హృదయాలలో తిరిగి ప్రాణం పోస్తాయి. ఈ దివ్య జ్ఞానం ద్వారా ప్రయోజనం పొందే వానిని సారవంతమైన నేలతో పోల్చడం జరిగింది. ఇంకా ఈ దివ్య జ్ఞానాన్ని ఆర్జించి ఇతరుక్కూడా బోధించినప్పటికీ తాను మాత్రం దానిని ఆచరించకుండా దాని ఫలాలను పొందలేకపోయిన వాడిని గట్టి నేలతో పోల్చడం జరిగింది. అది వర్షపు నీటిని నిల్వచేసి ప్రజలకు ప్రయోజనం చేకూరుస్తుంది. కాని దానివల్ల ఆ నేలపై ఎలాంటి మొక్కలూ మొలకెత్తవు.

దీనికి భిన్నంగా దైవ జ్ఞానానికి అనుగుణంగా అమలుచేయటం కాదుగదా; కనీసం దాని గురించి వినడానికైనా సిద్ధపడని ఆజన్మ బధిరుల్ని మెట్టపల్లాలు లేని చదునైన గట్టినేలతో పోల్చడం జరిగింది. అది నీటినీ పీల్చుకోదు, ఆ ప్రాంతంలో మొక్కలు లాంటివీ మొలకెత్తవు. కనీసం ప్రజలకు ఉపయోగపడేవిధంగా వర్షపునీటిని నిల్వచేసి కూడా ఉంచదు. ఈ మూడో వ్యక్తి అందరికన్నా నీచుడు. తను స్వయంగా దైవజ్ఞానంతో ప్రయోజనం పొందడు సరికదా, ఇతరుక్కూడా ప్రయోజనం చేకూర్చడు. ఇంకా ఈ హదీసులో ప్రజలు ధర్మజ్ఞానాన్ని ఆర్జించి ఇతరులకు కూడా నేర్పాలని పురికొల్పడం జరిగింది. దానిపట్ల నిర్లక్ష్య ధోరణి, ఏమరుపాటు పనికిరాదని బోధించటం జరిగింది.

١٦٤ ـ الثَّامِنُ: عن جابرٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مَثَلِي وَمَثَلُكُمْ كَمَثَلِ رَجُلٍ أَوْقَدَ نَاراً فَجَعَلَ الْجَنَادِبُ وَالْفَرَاشُ يَقَعْنَ فِيهَا وَهُوَ يَذُبُّهُنَّ عَنْهَا وَأَنَا آخِذٌ بِحُجَزِكُمْ عَنِ النَّارِ، وَأَنْتُمْ تَفَلَّتُونَ مِنْ يَدَيَّ» رواه مسلم.

«الْجَنَادِبُ»: نَحْوُ الْجَرَادِ وَالْفَرَاشِ، هٰذَا هُوَ الْمَعْرُوفُ الَّذِي يَقَعُ فِي النَّارِ. وَ«الْحُجَزُ»: جَمْعُ حُجْزَةٍ، وَهِيَ مَعْقِدُ الإِزَارِ وَالسَّرَاوِيلِ.

164. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: నన్నూ, మిమ్మల్నందరినీ ఈ విధంగా పోల్చవచ్చు. ఒక వ్యక్తి అగ్నిని రాజేయగా, అందులోకి దీపపు పురుగులు, కీటకాలు వచ్చి పడిపోసాగాయి. ఆ వ్యక్తి (అవి అగ్నిలో పడిపోకుండా) ఆపడానికి ప్రయత్నిస్తున్నాడు. అలాగే నేను కూడా మిమ్మల్ని మీ నడుం పట్టి మరీ నరకాగ్నిలో పడిపోకుండా కాపాడుతున్నాను. కాని మీరు నా చేతుల్లో నుంచి జారి (విడిపించుకొని నరకాగ్నిలో పడి) పోతున్నారు. (ముస్లిం)

'జనాదిబ' అంటే మిడుత, దీపపు పురుగులాంటి కీటకం. ఈ కీటకం అగ్నిలో పడిపోతుందని ప్రతీతి. 'హుజజ్' అనేది 'హుజ్‌జతున్' కు బహువచనం. అంటే అంగవస్త్రము, షరాయి లాంటివి కట్టుకునే శరీరభాగం, నడుం అని అర్థం.

*(సహీహ్ ముస్లింలోని ప్రవక్త మహిమోన్నతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) గారికి తన ఉమ్మత్ (సమాజం) పట్ల ఉన్న ప్రేమా వాత్సల్యాలు, వారి సాఫల్యం కోసం ఆయన పడే ఉబలాటం, ఆతురతలు ఏ స్థాయిలో ఉండేవో తెలుస్తోంది. మానవాళి సన్మార్గం కోసం ఈ ఆర్ద్రత ఆయన హృదయంలో జీవితకాలమంతా ఉండింది. మరోవైపు ఈ హదీసులో మానవుల దౌర్భాగ్యం కూడా వివరించబడింది. ఉమ్మత్ పట్ల తనకుగల విపరీతమైన ప్రేమానురాగాల మూలంగా దైవప్రవక్త (సల్లం) వారి సన్మార్గం కోసం చిత్తశుద్ధితో, ఎలాంటి ప్రతిఫలాన్నీ ఆశించకుండా సకల సన్నాహాలూ చేస్తుండగా ప్రజలు మాత్రం ఈమాన్ (విశ్వాస) భాగ్యానికి నోచుకోక దీపపు పురుగుల మాదిరిగా తమను నరకాగ్నికి ఆహుతి చేసుకోవడానికే ఇష్టపడుతున్నారు.

165. హజ్రత్ జాబిర్ (రజి) గారే చేసిన కథనం : దైవప్రవక్త (స) (భోజనానంతరం) వ్రేళ్ళూ, మరియు కంచం నాక్కోవాలని ఆదేశించారు. ఆయన ఇంకా ఇలా అన్నారు : మీరు తినే ఆహారంలో శుభం ఎక్కడ (దాగి) వుంటుందో మీకు తెలియదు. *(ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో: దైవ ప్రవక్త (స) ఇలా ఉపదేశించారని ఉంది: మీలో ఎవరి (చేతి) నుండి అయినా అన్నం ముద్ద క్రిందపడిపోతే, అతను ఆ ముద్దను ఎత్తి దానికి తగిలిన మట్టిని శుభ్రంచేసుకొని తినేయాలిగాని దానిని షైతాన్ కోసం వదలిపెట్టకూడదు. వ్రేళ్ళను నాక్కోనంతవరకు తిన్న చేతిని గుడ్డతో తుడుచుకోరాదు. ఎందుకంటే, ఏ అన్నం (మెతుకు)లో శుభం ఉందో అతనికి తెలియదు.

ముస్లింలోని ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : షైతాన్ ప్రతి పనిలోనూ మీ దగ్గరకు వస్తుంటాడు. కనుక మీలో ఎవరి చేతి నుంచి అయినా అన్నం ముద్ద క్రిందపడిపోతే, అతను దాన్ని ఎత్తి దానికి తగిలిన మట్టిని శుభ్రంచేసుకొని తినేయాలి గాని దానిని షైతాన్ కోసం వదలిపెట్టకూడదు.

١٦٥ ـ التَّاسِعُ: عَنْهُ أَنَّ رسول الله ﷺ، أَمَرَ بِلَعْقِ الأَصَابِعِ وَالصَّحْفَةِ وَقَالَ: «إِنَّكُمْ لا تَدْرُونَ في أَيِّهَا الْبَرَكَةُ» رواه مسلم. وفي رواية لَهُ: «إِذَا وَقَعَتْ لُقْمَةُ أَحَدِكُمْ، فَلْيَأْخُذْهَا فَلْيُمِطْ مَا كَانَ بِهَا مِنْ أَذًى، وَلْيَأْكُلْهَا، وَلا يَدَعْهَا لِلشَّيْطَانِ، وَلا يَمْسَحْ يَدَهُ بِالْمِنْدِيلِ حَتَّى يَلْعَقَ أَصَابِعَهُ؛ فَإِنَّهُ لا يَدْرِي في أَيِّ طَعَامِهِ الْبَرَكَةُ». وفي رواية له: «إِنَّ الشَّيْطَانَ يَحْضُرُ أَحَدَكُمْ عِنْدَ كُلِّ شَيْءٍ مِنْ شَأْنِهِ حَتَّى يَحْضُرَهُ عِنْدَ طَعَامِهِ، فَإِذَا سَقَطَتْ مِنْ أَحَدِكُمُ اللُّقْمَةُ فَلْيُمِطْ مَا كَانَ بِهَا مِنْ أَذًى، فَلْيَأْكُلْهَا، وَلَا يَدَعْهَا لِلشَّيْطَانِ».

*(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

భోజనం చేసిన తరువాత ఎంగిలి చేతి వ్రేళ్లను నాక్కోవాలని, కంచాన్ని కూడా శుభ్రం

చేసుకోవాలని ఈ హదీసులో ఉపదేశించడం గమనార్హం. దీనివల్ల అనేక ప్రయోజనాలున్నాయి. మొదటిది : ఎంగిలి చేతిలో లేక కంచంలో మిగిలి వున్న పదార్థంలోనే బహుశా శుభం ఉండవచ్చు. అలాంటప్పుడు భోజనం చేసిన వ్యక్తి వాటిని శుభ్రం చేసి తినకపోతే అతను ఆ శుభాన్ని కోల్పోయే అవకాశముంది. రెండోది; ఇది వినమ్రతను, అణకువను సూచిస్తుంది. ఇలా చేయడం వల్ల అహంకారుల, గర్విష్టుల గర్వం అణుగుతుంది. మూడోది; దైవానికి కృతజ్ఞతలు తెలుపుకున్నట్లవుతుంది. నాల్గోది; ఇలా చేస్తే షైతాన్ పరాభవం పాలౌతాడు. అతని కుయుక్తుల్ని తిప్పికొట్టినట్లవుతుంది. ఈ రోజుల్లో ప్రజలు విందుభోజనాల్లో ఎంతో అన్నాన్ని మట్టిపాలుచేసి రోడ్లపై, చెత్తకుండీల్లో పారవేస్తున్నారు. ప్రజలు దైవప్రసాదితాన్ని ఏ విధంగా నిర్లక్ష్యం చేస్తున్నారో, ఇస్లామీయ ఆదేశాలను ఎలా తుంగలో తొక్కిపెడుతున్నారో దీన్నిబట్టి ఊహించవచ్చు. అల్లాహ్ మనల్ని రక్షించుగాక! (ఆమీన్)

١٦٦ - العَاشِرُ: عن ابنِ عباسٍ، رضيَ الله عنهما، قال: قامَ فينا رسولُ الله ﷺ بمَوْعِظَةٍ فقال: «يَا أَيُّهَا النَّاسُ إنَّكُمْ مَحْشُورُونَ إلَى اللهِ تَعَالَى حُفَاةً عُرَاةً غُرْلًا ﴿كَمَا بَدَأْنَآ أَوَّلَ خَلْقٍ نُّعِيدُهُۥ وَعْدًا عَلَيْنَآ إِنَّا كُنَّا فَٰعِلِينَ﴾ [الأنبياء: ١٠٤]، ألَا وَإنَّ أوَّلَ الخَلائِقِ يُكْسَى يَوْمَ القِيَامَةِ إبْرَاهِيمُ ﷺ، ألَا وَإنَّهُ سَيُجَاءُ بِرِجَالٍ مِنْ أُمَّتِي، فَيُؤْخَذُ بِهِمْ ذَاتَ الشِّمَالِ؛ فَأقُولُ: يَا رَبِّ! أصْحَابِي؛ فَيُقَالُ: إنَّكَ لا تَدْرِي مَا أحْدَثُوا بَعْدَكَ،

166. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) మా మధ్య నిలబడి ఇలా హితోపదేశం చేశారు : ప్రజలారా! మీరందరూ బోసి పాదాలతో, నగ్న శరీరాలతో (తల్లి కడుపునుండి పుట్టినప్పటిలాగా) వడుగు (ఖత్నా) చేయబడని వారిగా దైవం ముందు సమీకరించబడతారు. (దేవుడు దివ్య ఖుర్ఆన్‌లో సెలవిచ్చాడు): - మేము మొదట్లో సృష్టిని చేసినట్లే మళ్ళీ దానిని చేస్తాము. ఇది మాపై బాధ్యతగా ఉన్న ఒక వాగ్దానం. మేము ఈ పనిని ఎలాగైనా చేయవలసి ఉన్నది.

*(అల్ అంబియా : 104)*

"వినండి! ప్రళయదినాన అందరికన్నా ముందు హజ్రత్ ఇబ్రాహీం (అలైహి)కు బట్టలు తొడిగించటం జరుగుతుంది. ఇంకా వినండి! (ఆ రోజు) నా అనుచర సమాజానికి చెందిన కొంతమందిని తీసుకొచ్చి, వారిని పట్టుకొని వామపక్షం వైపు (నించోబెట్టడం) జరుగుతుంది.

فَأَقُولُ كَمَا قَالَ الْعَبْدُ الصَّالِحُ: ﴿ وَكُنتُ عَلَيْهِمْ شَهِيدًا مَّا دُمْتُ فِيهِمْ ﴾ إلى قوله: ﴿ الْعَزِيزُ الْحَكِيمُ ﴾ [المائدة: ١١٧، ١١٨]، فَيُقَالُ لِي: إِنَّهُمْ لَمْ يَزَالُوا مُرْتَدِّينَ عَلَى أَعْقَابِهِمْ مُنْذُ فَارَقْتَهُمْ» متفقٌ عليه.
«غُرْلًا» أَيْ: غَيْرَ مَخْتُونِينَ.

వారిని చూసి నేను, "ప్రభూ! వీళ్ళు నా అనుచరులే" అని అంటాను. అప్పుడు "ఓ దైవప్రవక్తా! నీ తదనంతరం వీళ్ళు (ధర్మంలో) ఎన్ని కొత్త పోకడలను సృష్టించారో నీకు తెలియదు" అని ఆయనకు తెలియజేయడం జరుగుతుంది. అది విని నేను 'సత్పురుషుడైన దాసుడు' (హజ్రత్ ఈసా ప్రవక్త) అన్నట్లుగానే, "నేను వారిమధ్య ఉన్నంత కాలం వరకే నేను వారిని కనిపెట్టి ఉన్నాను. నీవు నన్ను వెనక్కి పిలుచుకున్న తరువాత నీవే వారిని కనిపెట్టి ఉంటున్నావు. నీవు సర్వ విషయాలను కనిపెట్టి ఉండేవాడవు. ఇప్పుడు ఒకవేళ నీవు వారిని శిక్షించినట్లయితే వారు నీ దాసులు, ఒకవేళ క్షమించినట్లయితే నీవు శక్తిమంతుడవు, వివేకవంతుడవు" అని అంటాను. అప్పుడు నాతో "నీవు వీళ్ళను వదలిపెట్టి వెళ్ళిన తరువాత వీళ్ళు ధర్మభ్రష్టులై (జీవితాంతం అలాగే ఉండి) పోయారు" అని చెప్పబడుతుంది.

(బుఖారీ - ముస్లిం)

'గుజ్‌లన్' అంటే వడుగు (ఖత్నా) చేయబడనివారుగా అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని దైవప్రవక్తల ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని 'స్వర్గసుఖాల' ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

1. ధర్మభ్రష్టతకు శిక్ష నరకమేనని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. ఇది కుఫ్ర్

(దైవతిరస్కారం)లో నీచాతినీచమైన రకం. అందుకే ఇస్లామీయ షరీఅత్ ఇహలోక జీవితంలో దీనికి మరణశిక్షను నిర్ణయించింది.

2. కొంతమంది దైవప్రవక్త గారికి అగోచర విషయాలకు సంబంధించిన జ్ఞానం ఉండేదని, ఆయన సర్వాంతర్యామి అని తలపోస్తున్నారు. వీరి మూఢనమ్మకాలను, అంధవిశ్వాసాలను ఈ హదీసు పటాపంచలు చేస్తోంది. దైవప్రవక్త (సల్లం)కు అగోచర జ్ఞానం ఉన్నట్లయితే లేక ఆయన సర్వాంతర్యామి అన్న సంగతి నిజమయితే పై హదీసులో ధర్మభ్రష్టుల్ని ఆయన తన అనుచరులని ఎందుకు అంటారు? - ఆ తరువాత ధర్మభ్రష్టుల అసలు సంగతి బయటపడినప్పుడు హజ్రత్ ఈసా (అలైహిస్సలాం) తననూ, తన తల్లిని దైవాలుగా చేసుకున్న వారితో తనకు ఎలాంటి సంబంధం లేదని ప్రకటించినట్లుగానే ఆయన కూడా ఈ ధర్మభ్రష్టులకు తాను ఏవిధంగానూ బాధ్యుణ్ణి కానని ప్రకటిస్తారు కదా!

١٦٧ ـ الْحَادِيَ عَشَرَ: عَنْ أَبِي سعيدٍ عبدِ اللهِ بنِ مُغَفَّلٍ، رضي الله عَنْه، قال: نَهَى رسولُ الله ﷺ عَنِ الخَذْفِ وقالَ: «إِنَّهُ لا يَقْتُلُ الصَّيْدَ، وَلا يَنْكَأُ الْعَدُوَّ، وَإِنَّهُ يَفْقَأُ الْعَيْنَ، وَيَكْسِرُ السِّنَّ» متفقٌ عليه.

167. హజ్రత్ అబూ సయీద్ అబ్దుల్లాహ్ బిన్ ముగప్ఫల్ (రజి) గారి కథనం : చూపుడు వ్రేలు లేక బొటన వ్రేలిపై కంకరరాయిని పెట్టి కొట్టడాన్ని దైవప్రవక్త (సల్లం) వారించారు. ఆయన ఇంకా ఇలా హెచ్చరించారు: ఈ కంకరరాయి వేట జంతువునూ చంపజాలదు. శత్రువునూ గాయపరచదు. (అటువంటప్పుడు అలా రాయి విసరడం వల్ల లాభమేంటి?) పైగా (అది దారిన పోతున్న వారెవరికైనా తగిలితే) దానివల్ల వారి కన్ను పగలవచ్చు లేదా పన్ను రాలవచ్చు. *(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ముగప్ఫల్ (రజి) గారి స్నేహితుడొకడు వ్రేలిపై కంకర రాయిని ఉంచి విసిరాడు. ఆయన అతణ్ణి ఆపి, "దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా రాళ్ళు విసరడాన్ని వారించారు." ఆయన ఇంకా ఇలా అన్నారు: ఈ

وفي رواية: أنَّ قَرِيباً لابْنِ مُغَفَّلٍ خَذَفَ؛ فَنَهَاهُ وقال: إنَّ رسولَ الله ﷺ نَهَى عنِ الخَذْفِ وَقالَ: «إنَّهَا لا تَصِيدُ صَيْداً» ثُمَّ عادَ فقالَ: أُحَدِّثُكَ أنَّ رسولَ الله ﷺ نَهَى عَنْهُ، ثُمَّ عُدْتَ تَخْذِفُ!؟ لا أُكَلِّمُكَ أَبداً.

రాయి వేటజంతువును చంపజాలదు (అటువంటప్పుడు రాయి విసిరి ఏం లాభం?) అంటూ అతడికి హితోపదేశం చేశారు. కాని ఆ వ్యక్తి మళ్ళీ అదే పని చేశాడు. అప్పుడు హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ముగప్ఫల్ (రజి) "ఒక వైపు నేను నీకు దైవప్రవక్త (సల్లం) కంకరరాళ్ళు విసరడాన్ని వారించారని చెబుతుంటే మళ్ళీ నీవు అదేపని చేస్తావా? ఇక మీదట నేను నీతో మాట్లాడను పో" అని కసురు కున్నారు.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణంలోనూ, వ్యాఖ్యానాల ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని జంతువేట ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఇతరులకు నష్టం కలిగించే అపాయకరమైన పనులు చేయరాదని పై హదీసు ద్వారా వెల్లడౌతోంది. అదేవిధంగా దైవప్రవక్త ఆదేశాలను ఉల్లంఘించి మొండివైఖరిని అవలంబించేవారితో మాట్లాడకుండా ఉండటం, వారితో సంబంధాలను తెగ త్రెంపులు చేసుకోవడం ధర్మసమ్మతమేనని తెలుస్తోంది. హదీసులో పేర్కొనబడిన ప్రవక్త అనుచరుల విధానమే ఇందుకు నిదర్శనం.

١٦٨ ـ وعن عابِسِ بْنِ ربيعةَ قال: رَأَيْتُ عُمَرَ بنَ الخَطَّابِ، رضي الله عنه، يُقَبِّلُ الحَجَرَ ـ يَعْنِي الأَسْوَدَ ـ وَيقُولُ: إنِّي أَعْلَمُ أنَّكَ حَجَرٌ مَا تَنفَعُ وَلا تَضُرُّ، وَلَوْلا أنِّي رَأَيْتُ رسولَ الله ﷺ يُقَبِّلُكَ مَا قَبَّلْتُكَ. متفقٌ عليه.

168. హజ్రత్ ఆబిస్ బిన్ రబీఅ (రజి) కథనం : హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) గారు 'హజ్రె అస్వద్' ను చుంబిస్తూ ఇలా అనడం నేను చూశాను: "నీవు రాయి మాత్రమేనన్న సంగతి నాకు తెలుసు. ఎలాంటి ప్రయోజనాన్ని గాని, నష్టాన్నిగాని చేకూర్చలేవు. నేనేగనక దైవప్రవక్త (సల్లం) గారిని నిన్ను చుంబి స్తుండగా చూసి ఉండకపోయినట్లైతే

నేను (ఎన్నటికీ) నిన్ను చుంబించేవాణ్ణే
కాను (అని ఆయన అన్నారు)."
*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని హజ్ ప్రకరణంలో, ఇంకా సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

1. హజ్ యాత్రలో 'హజ్రె అస్వద్' (నల్లరాయి)ని చుంబించటాన్ని చూస్తే క్రొత్తవారెవరికైనా అజ్ఞాన కాలంలోలాగా ఇస్లాంలో కూడా రాళ్ళను ఆరాధించడం జరుగుతుందేమోనన్న అపార్థం కలగవచ్చు. ఆ అపార్థాన్ని దూరం చేసే ఉద్దేశ్యంతోనే హజ్రత్ ఉమర్ (రజి) నలుగురూ వినేటట్టు ఈ మాటలన్నారు. వాస్తవానికి ఇలా చుంబించడంలోని ఉద్దేశ్యం దైవప్రవక్తను అనుసరించడం తప్ప మరేమీ లేదు.

2. దైవప్రవక్త ఆజ్ఞల్లోని మర్మమేమిటో మనకు తెలిసినా, తెలియకపోయినా ప్రతి విషయంలోనూ ఆయన్ని అనుసరించటం అవసరం. కొంతమంది ఈ హదీసును నిదర్శనంగా చూపెట్టి మహాత్ముల సమాధులను చుంబించడాన్ని, వాటిని ఆరాధించడాన్ని ధర్మసమ్మతంగా తలపోస్తున్నారు. కాని ఈ భావన సరైనది కాదు. ఎందుకంటే 'హజ్రె అస్వద్'ను చుంబించడం స్వయంగా ఒక ఆరాధన. ఇంకా చెప్పాలంటే అది 'హజ్' ఆరాధనలో ఒక భాగం కూడాను. ఆరాధనలన్నీ దేవుడు లేక దైవప్రవక్త (సల్లం) ద్వారా నిర్ణయించబడి ఉన్నాయి. ఇక వాటిలో హెచ్చు తగ్గులు చేయటానికి వీల్లేదు. వాటిని ఆదర్శంగా చేసుకొని ఆరాధనల్లో కొత్తపుంతలు తొక్కడం కూడా సరైనది కాదు.



## 17వ అధ్యాయం

## ١٧ - بَابٌ فِي وُجُوبِ الانْقِيَادِ لِحُكْمِ اللهِ وَمَا يَقُولُهُ مَنْ دُعِيَ إِلَى ذٰلِكَ، وَأُمِرَ بِمَعْرُوفٍ أَوْ نُهِيَ عَنْ مُنْكَرٍ

## దైవాజ్ఞను పాలించడం అవసరం, ఎవరినన్నా దైవాజ్ఞల్ని పాలించమని ఆహ్వానించినప్పుడు, మంచిని గురించి ఆదేశించి చెడునుండి వారించినప్పుడు ఎదుటివ్యక్తి ఏం జవాబు చెప్పాలి?

قال الله تعالى: ﴿ فَلَا وَرَبِّكَ لَا يُؤْمِنُونَ حَتَّىٰ يُحَكِّمُوكَ فِيمَا شَجَرَ بَيْنَهُمْ ثُمَّ لَا يَجِدُوا فِي أَنفُسِهِمْ حَرَجًا مِّمَّا قَضَيْتَ وَيُسَلِّمُوا تَسْلِيمًا ﴿٦٥﴾ ﴾ [النساء: ٦٥]، وقال تعالى: ﴿ إِنَّمَا كَانَ قَوْلَ الْمُؤْمِنِينَ إِذَا دُعُوا إِلَى اللَّهِ وَرَسُولِهِ لِيَحْكُمَ بَيْنَهُمْ أَن يَقُولُوا سَمِعْنَا وَأَطَعْنَا وَأُولَٰئِكَ هُمُ الْمُفْلِحُونَ ﴿٥١﴾ ﴾ [النور: ٥١].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : "కాదు, ఓ ముహమ్మద్! నీ ప్రభువు సాక్షిగా! వారు తమ పరస్పర విభేదాల విషయంలో నిన్ను న్యాయనిర్ణేతగా స్వీకరించనంతవరకు, ఇంకా నీవు ఏ నిర్ణయం చేసినా దానిని గురించి వారి మనస్సులలో కూడా ఏమాత్రం సంకోచం లేకుండా దానిని యథాతథంగా శిరసావహించనంతవరకు వారు నిజమైన విశ్వాసులు కాలేరు." (అన్ నిసా : 65)

మరోచోట అల్లాహ్ ఇలా అంటున్నాడు : "విశ్వసించే వారి పని ఏమిటంటే, తమ వ్యాజ్యాన్ని దైవప్రవక్త పరిష్కరించే విషయంలో వారు అల్లాహ్ వైపుకూ, ప్రవక్త వైపుకూ పిలువబడితే, "మేము విన్నాము. విధేయత చూపాము" అని అనాలి. అలాంటివారే సాఫల్యం పొందుతారు. (అన్ నూర్ : 51)

وَفِيهِ مِنَ الأَحَادِيثِ حَدِيثُ أَبِي هُرَيْرَةَ الْمَذْكُورُ فِي أَوَّلِ الْبَابِ قَبْلَهُ، وَغَيْرُهُ مِنَ الأَحَادِيثِ فِيهِ.

ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసుల్లో ఒకటి ఇంతకుముందు అధ్యాయం ప్రారం

ఖంలో ప్రస్తావించబడింది. అదిగాక ఇంకా అనేక హదీసులు కూడా ఉన్నాయి.

١٦٩ ـ عن أَبي هريرة رضي الله عنه، قال: لَمَّا نَزَلَتْ عَلَى رسولِ الله ﷺ ﴿ لِّلَّهِ مَا فِى ٱلسَّمَٰوَٰتِ وَمَا فِى ٱلْأَرْضِ ۗ وَإِن تُبْدُوا۟ مَا فِىٓ أَنفُسِكُمْ أَوْ تُخْفُوهُ يُحَاسِبْكُم بِهِ ٱللَّهُ ﴾ الآية [البقرة: ٢٨٤]، اشْتَدَّ ذٰلكَ عَلَى أصْحَابِ رسول الله ﷺ، فَأَتَوا رسولَ الله ﷺ، ثُمَّ بَرَكُوا عَلَى الرُّكَبِ فَقَالُوا: أيْ رسولَ اللهِ! كُلِّفْنَا مِنَ الأعْمَالِ مَا نُطِيقُ: الصَّلاةَ وَالْجِهَادَ وَالصِّيَامَ وَالصَّدَقَةَ، وَقَدْ أُنْزِلَتْ عَلَيْكَ هٰذِهِ الآيَةُ

169. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : "ఆకాశాలలో, భూమిపై ఉన్న సమస్తమూ అల్లాహ్‌దే. మీరు మీ మనస్సులలో ఉన్న విషయాలను గ్రహించినా లేక దాచినా, వాటి గురించి ఎట్టకేలకు అల్లాహ్ లెక్క తీసుకుంటాడు." (అల్ బఖర : 284) అన్న దివ్య ఖుర్‌ఆన్ సూక్తి అవతరించినప్పుడు దైవప్రవక్త అనుచరులకు అది భారంగా తోచింది. వారు దైవప్రవక్త దగ్గరికి వెళ్ళి మోకాళ్ళ ఆధారంగా కూర్చొని "ఓ దైవప్రవక్తా! (ఇంతకు ముందు) మాలో నిర్వర్తించగల శక్తి ఉన్న ఆచరణలే మాపై మోపబడ్డాయి. (ఉదా) నమాజ్, జిహాద్, ఉపవాసాలు, దానధర్మాలు. కాని ఇప్పుడు మీపై ఈ సూక్తి అవతరించింది. ఈ సూక్తి (లోని విషయం) మా శక్తికి మించినది" అని విన్నవించుకున్నారు. అది విని ఆయన "మీకు పూర్వం గ్రంథవహులు (యూదులు, క్రైస్తవులు) "మేము విన్నాము కాని అంగీకరించట్లేదు" అన్నట్లుగా మీరు కూడా అలాగే జవాబు చెబుదామనుకుంటున్నారా ఏమిటి? జాగ్రత్త! మీరు మాత్రం 'మేము విన్నాము. శిరసావహించాము. స్వామీ! క్షమాభిక్ష పెట్టు అని మేము నిన్ను అర్థిస్తున్నాము. చివరికి మేమంతా

وَلا نُطِيقُهَا. قَالَ رسولُ الله ﷺ: «أَتُرِيدُونَ أَنْ تَقُولُوا كَمَا قَالَ أَهْلُ الْكِتَابَيْنِ مِنْ قَبْلِكُمْ: سَمِعْنَا وَعَصَيْنَا؟ بَلْ قُولُوا: سَمِعْنَا وَأَطَعْنَا غُفْرَانَكَ رَبَّنَا وإِلَيْكَ الْمَصِيرُ» فَلَمَّا اقْتَرَأَهَا الْقَوْمُ، وَذَلَّتْ بِهَا أَلْسِنَتُهُمْ؛ أَنْزَلَ اللهُ تَعَالَى فِي إِثْرِهَا: ﴿ءَامَنَ ٱلرَّسُولُ بِمَآ أُنزِلَ إِلَيْهِ مِن رَّبِّهِۦ وَٱلْمُؤْمِنُونَۚ كُلٌّ ءَامَنَ بِٱللَّهِ وَمَلَٰٓئِكَتِهِۦ وَكُتُبِهِۦ وَرُسُلِهِۦ لَا نُفَرِّقُ بَيْنَ أَحَدٍ مِّن رُّسُلِهِۦۚ وَقَالُوا۟ سَمِعْنَا وَأَطَعْنَاۖ غُفْرَانَكَ رَبَّنَا وَإِلَيْكَ ٱلْمَصِيرُ﴾ فَلَمَّا فَعَلُوا ذٰلِكَ نَسَخَهَا اللهُ تَعَالَى؛ فَأَنْزَلَ اللهُ عَزَّ وَجَلَّ: ﴿لَا يُكَلِّفُ

నీదెసకే మరలివస్తాము' అనాలి సుమా!" అని హితోపదేశం చేశారు.

ప్రజలు (దైవప్రవక్త సూచించిన) వాక్యాలను పఠించారు. వారి నాలుకలు ఆ వాక్యాలను చదువుతూ పలచబడిన తరువాత అల్లాహ్ "ఆమనర్రసూలు బిమా ఉంజిల ఇలైహి మిర్రబ్బిహీ వల్ మూ'మినూన్...." అన్న సూక్తులను అవతరింపజేశాడు. "ప్రవక్త తనపై తన ప్రభువు నుండి అవతరించిన దాన్ని విశ్వసించాడు. ఈ ప్రవక్తను అనుసరించేవారు కూడా దానిని హృదయపూర్వకంగా స్వీకరించారు. వారంతా అల్లాహ్‌నూ, ఆయన దూతలనూ, ఆయన గ్రంథాలనూ, ఆయన ప్రవక్తలనూ విశ్వసించారు. వారు ఇలా అంటారు: మేము ఆయన ప్రవక్తలలో ఏ ఒక్కరినీ భేదభావంతో చూడము. మేము ఆదేశం విన్నాం. శిరసావహించాం. స్వామీ! క్షమాభిక్ష పెట్టు అని మేము నిన్ను అర్థిస్తున్నాము. చివరకు మేమంతా నీదెసకే మరలి వస్తాము."

వారు (పై ఆయతులో చెప్పినట్లు) చేయగానే వారికి భారంగా తోచిన సూక్తిని అల్లాహ్ రద్దుపరచాడు. (దాని స్థానే) ఈ సూక్తిని అవతరింపజేశాడు. "ఏ ప్రాణిపైనా అల్లాహ్ దాని శక్తిసామర్థ్యాలకు మించిన బరువు బాధ్యతలను

اللَّهُ نَفْسًا إِلَّا وُسْعَهَا لَهَا مَا كَسَبَتْ وَعَلَيْهَا مَا اكْتَسَبَتْ رَبَّنَا لَا تُؤَاخِذْنَا إِن نَّسِينَا أَوْ أَخْطَأْنَا ﴾، قَالَ: «نَعَمْ ﴿ رَبَّنَا وَلَا تَحْمِلْ عَلَيْنَا إِصْرًا كَمَا حَمَلْتَهُ عَلَى الَّذِينَ مِن قَبْلِنَا ﴾، قَالَ: نَعَمْ ﴿ رَبَّنَا وَلَا تُحَمِّلْنَا مَا لَا طَاقَةَ لَنَا بِهِ ﴾، قَالَ: نَعَمْ ﴿ وَاعْفُ عَنَّا وَاغْفِرْ لَنَا وَارْحَمْنَا أَنتَ مَوْلَانَا فَانصُرْنَا عَلَى الْقَوْمِ الْكَافِرِينَ ﴾، قَالَ: نَعَمْ» رواه مسلم.

మోపడు. తాను సంపాదించిన పుణ్యానికి సత్ఫలితాన్నీ, తాను కూడబెట్టిన పాపానికి దుష్ఫలితాన్నీ ప్రతి వ్యక్తీ అనుభవిస్తాడు. "మా ప్రభూ! పొరపాటువల్ల జరిగే మా తప్పులను పట్టబోకు" దానికి అల్లాహ్ 'సరే' అన్నాడు. "స్వామీ! మాకు పూర్వం వారిపై మోపిన భారాన్ని మాపై మోపకు!" అల్లాహ్ 'సరే'నన్నాడు. "ప్రభూ! ఏ బరువును మోసే శక్తి మాలో లేదో, దానిని మాపై మోపకు." అల్లాహ్ దానికీ 'సరే'నన్నాడు. "మమ్మల్ని మన్నించి వదలిపెట్టు. మమ్మల్ని క్షమించు. మమ్మల్ని కరుణించు. నీవు మాకు రక్షకుడవు. అవిశ్వాసులకు వ్యతిరేకంగా నీవు మాకు సహాయపడు." అల్లాహ్ అందుకు కూడా అంగీకరించాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇస్లాం అవతరణ ప్రారంభకాలంలో మనిషి మనసులో జనించే ఆలోచనలు, దుశ్శంకలను గురించి కూడా దేవుడు నిలదీస్తాడన్న సూక్తి అవతరించింది. వాస్తవానికి మనసులో జనించే ఆలోచనల్ని మనిషి పూర్తిగా అదుపులో పెట్టుకోలేడు. అందుకే దైవప్రవక్త సహచరులకు సహజంగానే దానిగురించి భయం పట్టుకుంది. అయితే ప్రవక్త సూచనానుసారం ఆయన అనుచరులు దైవానికి విధేయత కనబరచినందుకు దేవుడు ఆ సూక్తిని రద్దుపరచి, సృష్టిలో ఏ జీవిపై కూడా శక్తికి మించిన బరువు బాధ్యతలు మోపటం జరగదని ప్రకటించాడు. ఇక షరీఅత్‌లో మానవశక్తికి మించిన పని ఏదీ లేదు, కనుక ఇకపై ప్రతి ముస్లిం దేవుడిచ్చిన ఆదేశాలన్నిటినీ తప్పకుండా పాటించాలి.

## 18వ అధ్యాయం

# ١٨ - بَابٌ فِي النَّهْيِ عَنِ الْبِدَعِ وَمُحْدَثَاتِ الأُمُورِ

# (ధర్మంలో) కొత్తపోకడలు, నూతన ఆచారాలు సృష్టించరాదు

قال الله تعالى: ﴿ فَمَاذَا بَعْدَ الْحَقِّ إِلَّا الضَّلَٰلُ ﴾ [يونس: ٣٢]، وقال تعالى: ﴿ مَّا فَرَّطْنَا فِي الْكِتَٰبِ مِن شَيْءٍ ﴾ [الأنعام: ٣٨]، وقال تعالى: ﴿ فَإِن تَنَٰزَعْتُمْ فِي شَيْءٍ فَرُدُّوهُ إِلَى اللَّهِ وَالرَّسُولِ ﴾ [النساء: ٥٩] أي: الْكِتَابِ وَالسُّنَّةِ. وَقَالَ تَعَالَى: ﴿ وَأَنَّ هَٰذَا صِرَٰطِي مُسْتَقِيمًا فَاتَّبِعُوهُ وَلَا تَتَّبِعُوا السُّبُلَ فَتَفَرَّقَ بِكُمْ عَن سَبِيلِهِۦ ﴾ [الأنعام: ١٥٣]، وقال تعالى: ﴿ قُلْ إِن كُنتُمْ تُحِبُّونَ اللَّهَ فَاتَّبِعُونِي يُحْبِبْكُمُ اللَّهُ وَيَغْفِرْ لَكُمْ ذُنُوبَكُمْ ﴾ [آل عمران: ٣١] وَالآيَاتُ فِي الْبَابِ كَثِيرَةٌ مَعْلُومَةٌ.

దివ్యఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : "సత్యాన్ని తృణీకరిస్తే మార్గభ్రష్టత్వం తప్ప ఇక మిగిలేదేమిటి?" (యూనుస్ : 32)

మరోచోట అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు : "విధి వ్రాత ఉన్న గ్రంథంలో మేము ఏ కొరతా చెయ్యలేదు." (అల్ అన్ ఆమ్ : 38)

ఇంకొకచోట ఆయన ఇలా అన్నాడు : "మీ మధ్య ఏ విషయంలోనైనా వివాదం తలెత్తితే దాన్ని అల్లాహ్‌కు, ప్రవక్తకు నివేదించండి." అంటే దైవ గ్రంథం మరియు ప్రవక్త సంప్రదాయం వైపుకు మరలండి. (అన్ నిసా : 59)

ఆయన ఇంకా ఇలా అన్నాడు : "నా ఋజు మార్గం ఇదే. కనుక మీరు దీనిపైనే నడవండి. వేరే మార్గాలపై నడవకండి. ఎందుకంటే అవి మిమ్మల్ని ఆయన మార్గం నుంచి తొలగించి విచ్ఛిన్నపరుస్తాయి." (అల్ అన్ ఆమ్ : 153)

ఇంకా ఇలా సెలవిచ్చాడు : "ప్రవక్తా! నీవు ప్రజలకు ఇలా చెప్పు: మీకు నిజంగానే అల్లాహ్ పట్ల ప్రేమ ఉంటే నన్ను అనుసరించండి. అప్పుడు అల్లాహ్ మిమ్మల్ని ప్రేమిస్తాడు, మీ పాపాలను మన్నిస్తాడు." (ఆలి ఇమ్రాన్ : 31)

وَأَمَّا الأَحَادِيثُ فَكَثِيرَةٌ جِدّاً، وَهِيَ مَشْهُورَةٌ، فَنَقْتَصِرُ عَلَى طَرَفٍ مِنْهَا:

ఈ అధ్యాయం క్రింద సుపరిచితమైన సూక్తులు చాలా ఉన్నాయి. హదీసులు కూడా చాలా ఎక్కువగానే ఉన్నాయి. అవి కూడా సుప్రసిద్ధమైనవే. వాటిలో కొన్నింటిని మాత్రమే మేము ఇక్కడ ప్రస్తావిస్తున్నాం -

١٧٠ - عن عائشةَ رضي الله عنها، قالت: قال رسولُ الله ﷺ: «مَنْ أَحْدَثَ في أَمْرِنَا هٰذَا مَا لَيْسَ مِنْهُ فَهُوَ رَدٌّ» متفقٌ عليه.

وفي رواية لمسلم: «مَنْ عَمِلَ عَمَلاً لَيْسَ عَلَيْهِ أَمْرُنَا فَهُوَ رَدٌّ».

170. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు : ఎవరైనా మా ఈ ధర్మంలో లేని కొత్త విషయాన్ని ప్రవేశపెడితే అది త్రోసిపుచ్చదగినది. (బుఖారీ - ముస్లిం)

"ఎవరైనా మేము ఆదేశించని పని ఏదైనా చేస్తే అది త్రోసిపుచ్చదగినది" అని ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఉంది.

*(సహీహ్ బుఖారీలోని 'ఒడంబడికల' ప్రకరణంలో ఇంకా సహీహ్ ముస్లింలోని వ్యాజ్యాల ప్రకరణంలోనూ ఈ హదీసు ఉంది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో అతి ముఖ్యమైన సూత్రం ఒకటి వివరించబడింది. దురదృష్టవశాత్తూ ముస్లింలు ఈ హదీసును, ఇందులో బోధింపబడిన విషయాన్ని పట్టించుకోవటం లేదు. ఫలితంగా ధర్మంలో కొత్తపోకడలు, వినూత్న చేష్టలు సర్వసామాన్యమైపోయాయి. ఇంకా చెప్పాలంటే అమాయక జనులు కొత్తపోకడల(బిద్అత్)ను, ఆచార వ్యవహారాలనే అసలు ధర్మంగా తలపోస్తున్నారు. ఈ నూతన ఆచారాలను విధులు (ఫరాయజ్)గా భావించి ఆచరిస్తున్నారు. దీనికి ధర్మజ్ఞానం లేకపోవడం మొదటి కారణమైతే పై హదీసులో వివరించబడిన నియమాన్ని అర్థం చేసుకోకపోవటం రెండో కారణం. మరి చూడబోతే దైవప్రవక్త (సల్లం) ఆ నియమాన్ని ఈ హదీసులో ఎంతో స్పష్టంగా తేటతెల్లం చేసి మరీ బోధించారు. దాని ప్రకారం ; దైవప్రసన్నతను బడయటానికి చేసే ప్రతి పనీ - ఖుర్ఆన్, హదీసుల ద్వారా దానికి రుజువు లభించకపోతే లేక షరీఅత్ సూత్రాలకు ప్రవక్త సహచరులు, వారి అనుచరులు (తాబెయీన్) చేసిన వ్యాఖ్యానాల ద్వారాగాని లేదా వారి ఆచరణ వల్లగాని దానికి ఆధారం లభించకపోతే - అది బిద్అత్ (క్రొత్త పోకడ) క్రిందికే వస్తుంది.

١٧١ ـ وعن جابر رضي الله عنه قال: كـان رسـولُ الله ﷺ، إذا خَطَـبَ احْمَـرَّتْ عَيْنَاهُ، وَعَلا صَوْتُهُ، واشْتَدَّ غَضَبُهُ، حَتَّى كَأَنَّهُ مُنْذِرُ جَيْشٍ يقُولُ: «صَبَّحَكُمْ وَمَسَّاكُمْ» ويقُولُ: «بُعِثْتُ أَنَا وَالسَّاعَةُ كَهَاتَيْنِ» وَيقْرِنُ بَيْنَ أُصْبُعَيْهِ؛ السَّبَّابَةِ وَالْوُسْطَى وَيقُولُ: «أَمَّا بَعْدُ؛ فَإِنَّ خَيْرَ الْحَدِيثِ كتَابُ الله، وَخَيْرَ الْهَـدْيِ هَـدْيُ مُحَمَّـدٍ ﷺ وَشَـرَّ الأُمُـورِ مُحْدَثَاتُهَا، وَكُلَّ بِدْعَةٍ ضَلالَةٌ» ثُمَّ يقُولُ: «أَنَا أَوْلَى بِكُلِّ مُؤْمِنٍ مِنْ نَفْسِهِ، مَنْ تَرَكَ مَالاً فَلأَهْلِهِ، وَمَنْ تَـرَكَ دَيْنـاً أَوْ ضَيَـاعـاً فَـإِلَيَّ وَعَلَيَّ» رواه مسلم.

171. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఖుత్బా (ఉపన్యాసం) ఇచ్చినప్పుడు ఆయన కళ్ళు ఎర్రబడేవి. గొంతు బిగ్గరగా అయ్యేది. కోపం తీవ్రమయిపోయేంది. శత్రుసైన్యం ఉదయంగాని లేక సాయంత్రం గాని మీపై దాడిచేయనుందని ప్రజల్ని అప్రమత్తం చేసేవానిలా ఆయన ఆ సమయంలో కనిపించేవారు. ఇలా అనేవారు: నేనూ మరియు ప్రళయం ఈ రెండు వ్రేళ్ల మాదిరిగా పంపబడ్డాము. ఇలా అన్నప్పుడు ఆయన తన చూపుడు వ్రేలునూ, మధ్యవ్రేలిని కలిపి చూపించేవారు (అంటే తన తరువాత ప్రళయం వరకూ ఇక ఏ ప్రవక్తా రాడని అర్థం.) ఇంకా ఇలా అనేవారు : చెప్పొచ్చేదేమిటంటే, నిస్సందేహంగా అన్నిటికన్నా మంచిపలుకు దైవగ్రంథము. మార్గాలన్నిటిలోకీ మేలైన మార్గం ముహమ్మద్ మార్గం. అన్ని పనుల్లోకెల్లా చెడ్డపనులు (ధర్మంలో) కొత్తగా సృష్టించబడినవి. ప్రతి కొత్తపోకడ (బిద్‌అత్) మార్గభ్రష్టతే." ఆ తరువాత "ప్రతి విశ్వాసిపై నాకు అతని ప్రాణానికన్నా ఎక్కువ హక్కు ఉంది. ఎవరైనా (తన తదనంతరం) ధనం వదలి వెళితే అది అతని వారసులకే చెందుతుంది.అదే ఎవరైనా రుణం గాని లేక అభాగ్య పరివారాన్నిగాని వదలివెళితే (ఆ

రుణాన్ని తీర్చే) బాధ్యత నాపై ఉంటుంది. ఇంకా (అతని సంతానాన్ని పర్యవేక్షించే) విధి కూడా నాపైనే ఉంటుంది." అని ఆయన అనేవారు.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) ఉపన్యసించే తీరును గురించి వివరించటం జరిగింది. దైవప్రవక్త ప్రభవనం ప్రళయం రాకకు సూచన అని చెప్పబడింది. ఖుర్ఆన్ మరియు హదీసుల ప్రాధాన్యాన్ని గురించి బోధిస్తూ క్రొత్తపోకడలు (బిద్అత్లు) వినాశానికి గొనిపోతాయని ఈ హదీసు హెచ్చరిస్తోంది. ఇంకా సమాజంలోని అనాథల్ని, అభాగ్య జీవుల్ని ఆదుకోవడం సమకాలీన ప్రభుత్వం యొక్క బాధ్యత అని కూడా అంటోంది. ఎందుకంటే ఖలీఫా (ప్రభుత్వాధినేత) దైవప్రవక్తకు ప్రతినిధి లాంటివాడు. ఆయన తన జీవితకాలంలో చేసిన పనుల్ని ఆయన తదనంతరం ఖలీఫా అయిన వ్యక్తి విధిగా నిర్వర్తించాలి. అయితే ప్రజలు వదలిపెట్టి వెళ్ళిన ఆస్తులకు వాళ్ళ వారసులే హక్కుదారులు అవుతారు గాని ఇతరులెవరికీ వాటిపై హక్కు ఉండదు.

172. (ఇంచుమించు పై హదీసును పోలిన) హ్రజత్ ఇర్బాజ్ బిన్ సారియా (రజి) హదీసు ఇంతకు ముందు "ప్రవక్త సంప్రదాయాన్ని కాపాడటం" అన్న అధ్యాయం క్రింద వచ్చింది.

١٧٢- وعن الْعِرْبَاضِ بن سَارِيَةَ، رضي الله عنه، حَدِيثُهُ السَّابِقُ فِي بَابِ الْمُحَافَظَةِ عَلَى السُّنَّةِ.



**19వ అధ్యాయం**

# ١٩ ـ بَابٌ فِي مَنْ سَنَّ سُنَّةً حَسَنَةً أَوْ سَيِّئَةً

# ఒక మంచి పని లేక చెడు పనిని మొదలెట్టినవాడు

قال الله تعالى: ﴿ وَالَّذِينَ يَقُولُونَ رَبَّنَا هَبْ لَنَا مِنْ أَزْوَاجِنَا وَذُرِّيَّاتِنَا قُرَّةَ أَعْيُنٍ وَاجْعَلْنَا لِلْمُتَّقِينَ إِمَامًا ﴾ [الفرقان: ٧٤]، وقال تعالى: ﴿وَجَعَلْنَاهُمْ أَئِمَّةً يَهْدُونَ بِأَمْرِنَا ﴾ [الأنبياء: ٧٣].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : వారు (కరుణామయుని దాసులు) ఇలా ప్రార్థిస్తూ ఉంటారు, "మా ప్రభూ! మాకు మా భార్యల ద్వారా మా సంతానం ద్వారా కన్నుల చల్లదనాన్ని ప్రసాదించు. మమ్మల్ని భయభక్తులు కలవారికి ఇమాములుగా (ప్రథములుగా) చేయి." (అల్ ఫుర్‌ఖాన్ : 74)

మరోచోట ఇలా సెలవిచ్చాడు : "మా ఆజ్ఞానుసారం మార్గదర్శకత్వం నెరపే వారిని మేము నాయకులుగా చేశాము."

(అల్ అంబియా : 73)

١٧٣ ـ عَنْ أبي عَمْرٍو، جَرِيرِ بن عبدِ الله، رضي الله عنه، قال: كُنَّا في صَدْرِ النَّهَارِ عِنْدَ رسولِ الله ﷺ، فَجَاءَهُ قَوْمٌ عُرَاةٌ مُجْتَابِي النِّمَارِ، أَو الْعَبَاءِ، مُتَقَلِّدِي السُّيُوفِ، عَامَّتُهُمْ مِنْ مُضَرَ، بَلْ كُلُّهُمْ مِنْ مُضَرَ؛ فَتَمَعَّرَ رسولُ الله ﷺ، لِمَا رَأَى بِهِمْ مِنَ الْفَاقَةِ؛ فَدَخَلَ ثُمَّ خَرَجَ، فَأَمَرَ بِلالاً فَأَذَّنَ وَأَقَامَ، فَصَلَّى ثُمَّ خَطَبَ؛

173. హజ్రత్ అబూ అమ్ర్ జరీర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం : (ఒకరోజు) ప్రాతఃకాలం మేము దైవప్రవక్త (సల్లం) సన్నిధిలో ఉండగా కొంతమంది వచ్చారు. వారి ఒంటిమీద సరిగ్గా బట్టలు కూడా లేవు. గళ్ల దుప్పట్లు లేక కంబళ్లు చుట్టుకొని ఉన్నారు. (వారి భుజాలకు) ఖడ్గాలు వ్రేలాడుతున్నాయి. వాళ్ళల్లో చాలామంది, చాలామంది ఏమిటీ దాదాపు అందరూ 'ముజర్' తెగకు చెందినవాళ్ళే. వారి పస్తుల పరిస్థితి చూసి

فَقَالَ: «﴿يَا أَيُّهَا النَّاسُ اتَّقُوا رَبَّكُمُ الَّذِي خَلَقَكُم مِّن نَّفْسٍ وَاحِدَةٍ﴾ إِلَى آخِرِ الآيَة: ﴿إِنَّ اللَّهَ كَانَ عَلَيْكُمْ رَقِيبًا﴾، وَالآيَةَ الأُخْرى الَّتِي فِي آخِرِ الْحَشْرِ: ﴿يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا اتَّقُوا اللَّهَ وَلْتَنظُرْ نَفْسٌ مَّا قَدَّمَتْ لِغَدٍ﴾ تَصَدَّقَ رَجُلٌ مِنْ دِينَارِهِ مِنْ دِرْهَمِهِ مِنْ ثَوْبِهِ مِنْ صَاعِ بُرِّهِ مِنْ صَاعِ تَمْرِهِ» حَتَّى قَالَ: «وَلَوْ بِشِقِّ تَمْرَةٍ»، فَجَاءَ رَجُلٌ مِنَ الأَنْصَارِ بِصُرَّةٍ كَادَتْ كَفُّهُ تَعْجِزُ عَنْهَا، بَلْ قَدْ عَجَزَتْ، ثُمَّ تَتَابَعَ النَّاسُ حَتَّى رَأَيْتُ كَوْمَيْنِ مِنْ طَعَامٍ وَثِيَابٍ، حَتَّى رَأَيْتُ وَجْهَ رسولِ الله ﷺ، يَتَهَلَّلُ كَأَنَّهُ مُذْهَبَةٌ؛ فقال رسولُ الله ﷺ: «مَنْ سَنَّ فِي الإِسْلامِ سُنَّةً حَسَنَةً فَلَهُ

దైవప్రవక్త ముఖారవిందం మారి పోయింది. ఆయన తన (కుటీరం) లోనికి వెళ్ళి తిరిగి బయటికొచ్చారు. అజాన్ ఇవ్వమని బిలాల్‌ని ఆదేశించారు. బిలాల్ (రజి) అజాన్ ఇచ్చి (ప్రజలు నమాజు కోసం హాజరైన తరువాత) ఇఖామత్ పలికారు. దైవప్రవక్త (స) నమాజు చేయించిన తరువాత ప్రజల ముందు ఉపన్యసించారు. ఆయన (స) ఇలా అన్నారు : ప్రజలారా! మిమ్మల్ని ఒకే ప్రాణినుంచి పుట్టించిన మీ ప్రభువుకు భయపడండి...... (సూక్తి చివరివరకు) అల్లాహ్ మిమ్మల్ని గమనిస్తున్నాడనే విషయాన్ని తెలుసుకోండి. (సూరె నిసా : 1) తరువాత సూరె హష్ర్‌లోని ఈ సూక్తిని పఠించారు: "విశ్వసించిన ఓ ప్రజలారా! అల్లాహ్‌కు భయపడండి. ప్రతి వ్యక్తీ తాను రేపటి కొరకు ఏమి సమకూర్చుకున్నాడో చూసుకోవాలి." (ఆ తరువాత ప్రజల్ని దానధర్మాలు చేయమని పురికొల్పారు). "ప్రతివ్యక్తీ తన దీనారునుండి, దిర్హము నుండి, తన బట్టల నుండి, ఇంకా గోధుమల 'సా' (ఒక ప్రమాణం) నుంచి, ఖర్జూరాల 'సా' నుండి దానం చేయాలన్నారు. అంతేకాదు, ఒక్క ఖర్జూరపు ముక్కైనా సరే దానం చేయాలని ప్రకటించారు.

అప్పుడు అన్సార్లలోని ఒకతను ఒక సంచి తీసుకొని వచ్చాడు. (బరువు మూలంగా) అతని చేయి ఆ సంచిని మోయలే

أَجْرُهَا، وَأَجْرُ مَنْ عَمِلَ بِهَا مِنْ بَعْدِهِ مِنْ غَيْرِ أَنْ يَنْقُصَ مِنْ أُجُورِهِمْ شَيْءٌ، وَمَنْ سَنَّ فِي الإِسْلامِ سُنَّةً سَيِّئَةً كَانَ عَلَيْهِ وِزْرُهَا وَوِزْرُ مَنْ عَمِلَ بِهَا مِنْ بَعْدِهِ مِنْ غَيْرِ أَنْ يَنْقُصَ مِنْ أَوْزَارِهِمْ شَيْءٌ» رواه مسلم.
قَوْلُهُ «مُجْتَابِي النِّمَارِ» هُوَ بالجيم وبعد الألِفِ باءٌ مُوَحَّدَةٌ. والنِّمَارُ: جَمْعُ نَمِرَةٍ، وَهِيَ: كِسَاءٌ مِنْ صُوفٍ مُخَطَّطٌ. وَمَعْنَى «مُجْتَابِيهَا» أي: لابِسِيهَا قَدْ خَرَقُوهَا فِي رُؤُوسِهِم. وَ«الْجَوْبُ»: الْقَطْعُ، وَمِنْهُ قَوْلُهُ تَعَالَى: ﴿وَثَمُودَ ٱلَّذِينَ جَابُوا۟ ٱلصَّخْرَ

నట్టుగా ఉంది. (కొంతదూరం వచ్చాక) అసలు మోయలేకపోయింది. ఆ తరువాత ప్రజలు ఒకణ్ణి చూసి మరొకడు దానాలు చేస్తూపోయారు. నేను చూస్తుండగానే అక్కడ రెండు కుప్పలు పేరుకున్నాయి. వాటిలో ఒకటి తినే వస్తువులది. రెండోది బట్టలది. అది చూసి దైవప్రవక్త (స) ముఖారవిందం మేలిమి బంగారపు ముక్కలా మెరుస్తుండటం నేను గమనించాను. తరువాత ఆయన ఇలా ఉద్బోధించారు: ఎవడైనా ఇస్లాంలో ఒక మంచిపని మొదలుపెడితే అతనికి తన పుణ్యం లభిస్తుంది, ఇంకా అతని తరువాత దానిని ఆచరించే వారి పుణ్యం కూడా లభిస్తుంది. దానివల్ల వారికి లభించే పుణ్యంలో ఎలాంటి కోత ఉండదు. దీనికి విరుద్ధంగా ఇస్లాంలో ఎవడైనా ఏదైనా చెడ్డపని ప్రారంభిస్తే అతనిపై దాని పాపభారం పడుతుంది, ఇంకా అతని తరువాత దానిని అమలు చేసేవారందరి పాపం కూడా అతని నెత్తి మీదే పడుతుంది. అయితే దీనివల్ల వారిపై పడే పాపభారంలో మాత్రం ఎలాంటి తగ్గింపు ఉండదు. *(ముస్లిం)*

'నిమార్' అనేది 'నమిరతున్' అనే పదానికి బహువచనం. గళ్ళున్న ఉన్ని వస్త్రం. 'ముజ్తాబీహా' అంటే వాటిని తొడుక్కొని ఉన్నవారు. దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చినవాళ్ళు ఆ దుప్పట్లను లేక

بِالْوَادِ ﴾ أَيْ: نَحَتُوهُ وَقَطَعُوهُ. وَقَوْلُهُ: «تَمَعَّرَ» هو بالعين المهملة، أَيْ تَغَيَّرَ، وَقَوْلُهُ: «رَأَيْتُ كَوْمَيْنِ» بفتح الكاف وضمها؛ أَيْ: صُبْرَتَيْنِ. وَقَوْلُهُ: «كَأَنَّهُ مُذْهَبَةٌ» هو بالذالِ المعجمةِ، وفتح الهاءِ والباءِ الموحدة. قَالَهُ الْقَاضِي عِيَاضٌ وَغَيْرُهُ. وَصَحَّفَهُ بَعْضُهُمْ فَقَالَ: «مُدْهُنَةٌ» بِدَالٍ مهملةٍ وضم الهاءِ وبالنونِ، وَكَذَا ضَبَطَهُ الْحُمَيْدِيُّ، وَالصَّحِيحُ الْمَشْهُورُ هُوَ الأَوَّلُ. وَالْمُرَادُ بِهِ عَلَى الْوَجْهَيْنِ: الصَّفَاءُ والاسْتِنَارة.

చర్మాలను మధ్యలో చింపి తలనుండి ఒంటిమీద వేసుకునేవారు. అంటే అవి చొక్కాగా పనికిరావు, వాటిని వాళ్ళు చుట్టుకోనూలేరు. 'జాబ్' అంటే కోయటం, ముక్కలు చేయటం. దివ్య ఖుర్‌ఆన్‌లో 'సమూదల్లజీన జాబుస్సఖ్‌ర బిల్‌వాద్'' (లోయలో కొండరాళ్ళను తొలచిన సమూద్ జాతి) అన్న వాక్యం లోని 'జాబూ' అన్న పదం 'జాబ్' నుండి వచ్చిందే. 'తమ-అ-ర' అంటే మారి పోయింది. "కీమైన్" ('క' కు ఉకారం కూడా సరైనదే) అంటే అర్థం రెండు కుప్పలు. 'ముజ్‌హబతున్' - ఖాజీ అయాజ్ తదితరులు ఈ పదాన్ని ఇలాగే కంఠస్థం చేశారు. కొంతమంది వాస్తవా నికి ఈ పదం 'ముద్‌హునహ్' అని అంటున్నారు. ఇమామ్ హుమైదీ కూడా ఇలాగే కంఠస్థం చేశారు. తొలి ఉల్లే ఖనమే ప్రామాణికమైనది, సుప్రసిద్ధ మైనదీను. అయితే రెండు పదాలకూ అర్థం మాత్రం ఒక్కటే-ముఖవర్చస్సు, కాంతి అని. (సహీహ్ ముస్లింలోని 'జకాత్' ప్రకరణం)

## ముఖ్యాంశాలు

కొందరు ప్రభృతులు పై హదీసులోని "మన్ సన్న ఫిల్ ఇస్లామి సున్నతన్ హసనతన్" అన్న వాక్యాన్ని ఆధారంగా చేసుకొని "బిద్అతె హసనా" (మంచి బిద్అత్) ధర్మసమ్మతమేనని వాదిస్తున్నారు. ఆ విధంగా వారు బిద్అత్ (కొత్తపోకడ)ను రెండు రకాలుగా వర్గీకరిస్తున్నారు. ఒకటి హసనా (మంచిది), రెండవది సయ్యిఆ (చెడ్డది). కాని ఈ వర్గీకరణ సరైనది కాదు. ధర్మంలో తలెత్తే కొత్తపోకడ ఎన్నటికీ మంచిది కాజాలదు. బిద్అత్ ఎప్పుడూ చెడ్డదే అయి ఉంటుంది. ఎందుకంటే బిద్అత్‌లను పుట్టించడమంటే వాస్తవానికి ఓ కొత్తధర్మాన్ని, ఓ వినూత్న

షరీఅత్‌ను నిర్మించడమన్నమాట! ఆ హక్కు మానవుడికి లేనేలేదు. షరీఅత్ నిర్మాణ హక్కులన్నీ అల్లాహ్‌కే చెందుతాయి. ఆయనే షరీఅత్ నిర్మాత. ఆయన ఆదేశానుసారమే ప్రవక్తలు మానవులకు షరీఅత్ ఆజ్ఞలను వినిపిస్తారు. దైవప్రవక్తలకు కూడా ఆ హక్కు ఇవ్వబడనప్పుడు పీఠాధిపతులకు, బాబాలకు ఆ హక్కు ఎక్కడ్నుంచి వచ్చింది?

అందుకే పై హదీసుకు సరైన భావం ఏమిటంటే, ఇస్లాంలో 'ధర్మసమ్మతమైన' పనిని అందరికన్నా ముందుగా నిర్వర్తించి, ఇతరులకు ఆదర్శంగా నిలిచిన వ్యక్తికి - అతను చేసిన దానిపై పుణ్యం లభించడంతో పాటు, ఇంకా ఎవరైనా ఆ మంచిపనిచేస్తే వారికి లభించినంత పుణ్యం అదనంగా అతని ఖాతాలో జమ అవుతూ ఉంటుంది. ధర్మంలో ఋజువు లభించని పనిని ఎంతమంచి పద్ధతిలో చేసినా దానిపై పుణ్యం సుతరామూ లభించదు. పైగా పాపానికి ఒడిగట్టినట్లుగా పరిగణించబడుతుంది. అలాంటి పని ఎన్నటికీ 'హసనా' కాజాలదు.

١٧٤ - وعن ابن مسعودٍ رضي الله عنه، أَنَّ النَّبِيَّ ﷺ قال: «ليس مِنْ نَفْسٍ تُقْتَلُ ظُلْماً إلَّا كَان عَلَى ابْنِ آدم الأوَّلِ كِفْلٌ مِنْ دَمِهَا لأَنَّهُ كَان أَوَّلَ مَنْ سَنَّ الْقَتْلَ» متفقٌ عليه.

174. హజ్రత్ ఇబ్నె మస్‌ఊద్ కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : (ప్రపంచంలో) అన్యాయంగా ఏ ప్రాణి అయినా హత్యచేయబడితే, దాని రక్తం చిందించిన నేరం కొంత హజ్రత్ ఆదం (అలైహి) పెద్ద కుమారుడి (ఖాబీల్)పై కూడా పడుతుంది. ఎందుకంటే (లోకంలో) అందరికన్నా ముందు అన్యాయపు హత్యకు శ్రీకారం చుట్టింది అతనే. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణంలోనూ, 'ఏతెసామ్' ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలో హతుని వారసులముందు చేసే ప్రమాణ ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

షరీఅత్‌కు విరుద్ధమైన పనుల్ని అందరికన్నా ముందుగా చేసి ఇతరులకు ఆదర్శంగా నిలవడం ఎంతపెద్ద నేరమో ఈ హదీసు ద్వారా అవగతమవుతోంది. దురదృష్టవశాత్తూ ఇతరులెవరైనా ఆ బాటలో నడిస్తే ప్రళయం వరకు దాని పాపం అతని నెత్తిన పడటం ఖాయం. కనుక మనిషి ఎల్లప్పుడూ దైవప్రవక్త (సల్లం) అడుగుజాడల్లోనే నడుస్తూ కొత్తపోకడలకు, వినూత్న ఆచారాలకు దూరంగా ఉండాలి. ఇందులోనే అతని శ్రేయం ఇమిడి ఉంది.

**20వ అధ్యాయం**

# ٢٠ - بَابٌ فِي الدَّلَالَةِ عَلَى خَيْرٍ وَالدُّعَاءِ إِلَى هُدىً أَوْ ضَلَالَةٍ

# ప్రజల్ని మంచి వైపుకు నడిపించడం, సన్మార్గం లేక మార్గభ్రష్టతల వైపుకు పిలవడం గురించి

قال تعالى: ﴿وَٱدْعُ إِلَىٰ رَبِّكَ﴾ [القصص: ٨٧]، وقالَ تعالى: ﴿ٱدْعُ إِلَىٰ سَبِيلِ رَبِّكَ بِٱلْحِكْمَةِ وَٱلْمَوْعِظَةِ ٱلْحَسَنَةِ﴾ [النحل: ١٢٥]، وقال تعالى: ﴿وَتَعَاوَنُوا۟ عَلَى ٱلْبِرِّ وَٱلتَّقْوَىٰ﴾ [المائدة: ٢]، وقال تعالى: ﴿وَلْتَكُن مِّنكُمْ أُمَّةٌ يَدْعُونَ إِلَى ٱلْخَيْرِ﴾ [آل عمران: ١٠٤].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : "నీ ప్రభువు వైపుకు ఆహ్వానించు."

(అల్ ఖసస్ : 87)

మరోచోట ఆయన సెలవిచ్చాడు : "ప్రవక్తా! (ప్రజల్ని) వివేకంతో, చక్కని హితబోధతో నీ ప్రభువు మార్గం వైపుకు ఆహ్వానించు."

(అన్ నహ్ల్ : 125)

ఇంకొకచోట ఆయన ఇలా అన్నాడు : "మంచికి, దైవభక్తికి సంబంధించిన పనులలో అందరితోనూ సహకరించండి."

(అల్ మాయిద : 2)

ఆయన ఇంకా ఇలా అన్నాడు : "మీలో మంచి వైపుకు పిలిచేవారు కొందరు తప్పకుండా ఉండాలి." (ఆలి ఇమ్రాన్ : 104)

١٧٥ - وعن أَبي مسعودٍ عُقْبَةَ بْنِ عَمْرو الأَنْصَارِيِّ الْبَدْرِيِّ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مَنْ دَلَّ عَلَى خَيْرٍ فَلَهُ مِثْلُ أَجْرِ فَاعِلِهِ» رواه مسلم.

175. హజ్రత్ అబూ మస్‌వూద్ ఉఖ్‌బా బిన్ అమ్ర్ అన్సారీ, బద్రి (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : "మంచి వైపుకు దారి చూపించిన వ్యక్తికి, దానిని నిర్వర్తించిన వ్యక్తికి సమానంగా పుణ్యం లభిస్తుంది."

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని 'నాయకత్వ' ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి ప్రయాణానికి ఒక వాహనం ఇవ్వమని అడిగాడు. అందుకు ఆయన తన దగ్గర ఎలాంటి వాహనమూ లేదన్నారు. అప్పుడు అక్కడున్న వారిలో ఒకతను కల్పించుకొని నేను మీకు ఒకాయన్ని చూపెడతాను, ఆయన ఈ వ్యక్తికోసం వాహనాన్ని సమకూర్చగలడన్నాడు. ఆ సందర్భంగానే దైవప్రవక్త (సల్లం) మంచి వైపుకు దారి చూపించిన వ్యక్తికి - దానిని నిర్వర్తించిన వ్యక్తికి సమానంగా పుణ్యం లభిస్తుందని చెప్పారు. ఈ హదీసు మంచి వైపుకు దారి చూపించే కార్యంపై పురికొల్పుతోంది. ప్రజల్ని మేలైన బాటలో నడిపించడం కూడా పుణ్యప్రదమైనదని చెబుతోంది.

176. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : (ప్రజల్ని) సన్మార్గం వైపుకు పిలిచిన వ్యక్తికి, అతన్ని అనుసరించిన వారందరికీ లభించినంత పుణ్యం లభిస్తుంది. అయితే ఇది వారి పుణ్యంలో మాత్రం ఎలాంటి లోటు రానివ్వదు. (దీనికి విరుద్ధంగా ప్రజల్ని) మార్గభ్రష్టత వైపుకు పిలిచిన వ్యక్తిపై, అతన్ని అనుసరించిన వారందరి పాపం మోపబడుతుంది. దీనివల్ల అతన్ని అనుసరించినవారి పాపాల్లో మాత్రం ఎలాంటి తగ్గింపు ఉండదు. *(ముస్లిం)*

١٧٦ - وعن أبي هريرة رضي الله عنه، أن رسولَ الله ﷺ قال: «مَنْ دَعَا إلَى هُدًى كَانَ لَهُ مِنَ الأجرِ مِثْلُ أُجُورِ مَنْ تَبِعَهُ لا يَنْقُصُ ذٰلِكَ مِنْ أُجُورِهِمْ شَيْئاً، وَمَنْ دَعَا إلَى ضَلالَةٍ كَانَ عَلَيْهِ مِنَ الإثْمِ مِثْلُ آثَامِ مَنْ تَبِعَهُ لا يَنْقُصُ ذٰلِكَ مِنْ آثَامِهِمْ شَيْئاً» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని విద్యా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పిలవడం, ఆహ్వానించడమంటే తన వాక్కర్మల చేత ఇతరుల్ని మంచి లేక చెడు కార్యాల వైపుకు ప్రోత్సహించడమని అర్థం. ఈ హదీసు ద్వారా మంచి లేక చెడు కార్యాలకు ప్రేరణగా నిలిచేవాడు పరలోకంలో దేవుని వద్ద పుణ్యాన్ని పొందుతాడు లేదా శిక్షించబడతాడని అవగతమవుతోంది. అంతేకాదు, మంచి పనుల్ని చేయమని ప్రజలను ప్రోత్సహిస్తే దానిపై ఎన్నో రెట్ల ప్రతిఫలం లభిస్తుంది. ఇందుకు విరుద్ధంగా చెడుపనులకై పురికొల్పితే అందరి పాపాలకూ అతణ్ణే బాధ్యుడిగా నిలబెట్టడం జరుగుతుంది.

١٧٧ - وعن أَبي العباسِ سَهْلِ بنِ سعدِ السَّاعِدِيِّ رضي الله عنه، أنَّ رسولَ الله ﷺ قال يَوْمَ خَيْبَرَ: «لأُعْطِيَنَّ الرَّايَةَ غَداً رَجُلاً يَفْتَحُ اللهُ عَلَى يَدَيْهِ، يُحِبُّ اللهَ وَرَسُولَهُ، وَيُحِبُّهُ اللهُ وَرَسُولُهُ»، فَبَاتَ النَّاسُ يَدُوكُونَ لَيْلَتَهُمْ أَيُّهُمْ يُعْطَاهَا. فَلَمَّا أَصْبَحَ النَّاسُ غَدَوْا عَلَى رسولِ الله ﷺ كُلُّهُمْ يَرْجُو أَنْ يُعْطَاهَا، فقال: «أَيْنَ عَلِيُّ بن أَبي طالبٍ؟»، فَقِيلَ: يارسولَ الله! هُوَ يَشْتَكِي عَيْنَيْه، قال: «فَأَرْسِلُوا إِلَيْهِ»، فَأُتِيَ بِهِ، فَبَصَقَ رسولُ الله ﷺ في عَيْنَيْهِ، ودَعَا لَهُ، فَبَرَأَ حَتَّى كَأَنْ لَمْ يَكُنْ بِهِ وَجَعٌ، فَأَعْطَاهُ الرَّايَةَ. فقال عَلِيٌّ رضي الله عنه: يارسولَ الله! أُقَاتِلُهُمْ حَتَّى يَكُونُوا مِثْلَنَا؟ فَقَالَ: «انْفُذْ عَلَى رِسْلِكَ حَتَّى تَنْزِلَ

177. హజ్రత్ అబుల్ అబ్బాస్ సహ్ల్ బిన్ సాద్ సాయిదీ (రజి) కథనం : ఖైబర్ యుద్ధం జరిగిననాడు దైవప్రవక్త (స) ఇలా అంటుండగా నేను విన్నాను - "రేపు నేను (యుద్ధ) పతాకం ఎలాంటి వ్యక్తికి ఇస్తానంటే, దేవుడు అతని చేతుల మీదుగా విజయం చేకూరుస్తాడు. అతను దేవుణ్ణి, ఆయన ప్రవక్తను అభిమానించేవాడై ఉంటాడు. దేవుడూ, దైవప్రవక్త కూడా అతణ్ణి ప్రేమిస్తున్నారు" అని అన్నారు. ప్రజలు రేపు తమలో ఏ అదృష్టవంతుడికి పతాకం ఇవ్వబడుతుందోనన్న ఆలోచనతోనే రాత్రంతా గడిపారు. తెల్లవారిన తరువాత వాళ్ళంతా దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చారు. వారిలో ప్రతి ఒక్కడూ యుద్ధపతాకం తనకే ఇస్తారన్న ఆశతో ఉన్నాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "అలీ బిన్ అబూ తాలిబ్ ఏడి?" అని అడిగారు. ఆయన కళ్ళల్లో నలతగా ఉందని ఆయనకు ఎవరో చెప్పారు. అతన్ని పిలుచుకురమ్మని దైవప్రవక్త (స) ఆదేశించారు. ఆయన ఆదేశానుసారం హజ్రత్ అలీ (రజి)ని పిలిపించటం జరిగింది. దైవప్రవక్త (స) హజ్రత్ అలీ కళ్ళకు తన లాలాజలం పూసి ఆయన కోసం ప్రార్థించారు. దాంతో అలీ (రజి) తనకసలు బాధే లేనట్లు పూర్తిగా ఉపశమనం పొందారు.

بِسَاحَتِهِمْ، ثُمَّ ادْعُهُمْ إِلى الإِسْلام، وَأَخْبِرْهُمْ بِمَا يَجِبُ عَلَيْهِمْ مِنْ حَقِّ اللهِ تَعَالَى فِيهِ، فَوَاللهِ لأَنْ يَهْدِيَ اللهُ بِكَ رَجُلاً وَاحِداً خَيْرٌ لَكَ مِنْ حُمْرِ النَّعَمِ» متفقٌ عليه. قوله «يَدُوكُونَ»: أيْ يَخُوضُونَ وَيَتَحَدَّثُونَ، قَوْلُهُ: «رِسْلِكَ» بكسر الراءِ وَبِفَتْحِهَا لُغَتَانِ، والْكَسْرُ أَفْصَحُ.

ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) యుద్ధ పతాకం ఆయనకే ఇచ్చారు. అప్పుడు హజ్రత్ అలీ (రజి) “వాళ్ళు కూడా మనలాగా (ముస్లింలుగా) మారేదాకా వారితో మనం యుద్ధం చేయాలా?” అని అడిగారు. దానికి ఆయన “నీవు నిదానంగా, నిమ్మళంగా వెళ్ళి వారి స్థావరానికి సమీపంలో దిగు. తరువాత (ముందుగా) వారిని ఇస్లాం వైపుకు ఆహ్వానించు. వారు విధిగా నిర్వర్తించవలసిన దేవుని హక్కులు (బాధ్యతలు) ఏమిటో వారికి తెలియజేయి. దైవసాక్షి! నీ ద్వారా దేవుడు ఏ ఒక్కడికి సన్మార్గాన్ని ప్రసాదించినా అది నీ పాలిట ఎరుపు ఒంటెలకన్నా ఎంతో మేలైనది” అని సమాధానమిచ్చారు. (బుఖారీ - ముస్లిం)

‘యదూకూన’ అనే పదానికి దీర్ఘంగా ఆలోచించడం, చర్చించడం అనే అర్థాలున్నాయి. ‘రిస్లిక్’ - దీనిని రస్లిక్ అని కూడా చదువవచ్చు - అయితే ‘రిస్లిక్’ అన్న పదమే అచ్చమైనది.

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్త మహిమోన్నతల ప్రకరణంలోనూ, జిహాద్ ప్రకరణంలోనూ ఇంకా తదితర ప్రకరణాల్లోనూ, సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతల ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో హజ్రత్ అలీ (రజి) గారి ఘనతా విశిష్టతలు, దైవప్రవక్త మహిమలు పొందుపరచబడ్డాయి. దైవమార్గంలో పోరాటం చేసేందుకు అనుసరించాల్సిన నియమావళి కూడా ఇందులో వివరించబడింది. ధర్మ విరోధులను ముందుగా ఇస్లాం వైపుకు ఆహ్వానించాలనీ, వారు దాన్ని తృణీకరిస్తే అప్పుడు వారితో పోరాడాలని ఈ హదీసు ద్వారా అవగతమవుతోంది.

ఈ పోరాటంలోగాని లేక పోరాటానికి ముందు ధర్మం వైపుకు ఆహ్వానించడం వల్లగాని ఏ కొందరికైనా ఇస్లాం స్వీకార భాగ్యం లభిస్తే, ఇకముందు వారు చేసే మంచి పనులపై ఆ పోరాటంలో పాల్గొన్న యోధులకు కూడా పుణ్యం లభిస్తూ ఉంటుంది.

١٧٨ - وعن أنس رضي الله عنه، أنَّ فَتَى مِنْ أَسْلَمَ قال: يا رسُولَ اللهِ! إنِّي أُريد الغَزْوَ ولَيْس مَعِي مَا أتجهَّزُ بِه؟ قَالَ: «ائتِ فُلاناً فإنهُ قَدْ كانَ تَجَهَّزَ فَمَرِضَ» فَأَتَاهُ فقال: إنَّ رسولَ الله ﷺ يُقْرِئُكَ السَّلامَ ويقُولُ: أَعْطِني الَّذي تجهَّزْتَ بِهِ، فقال: يَافُلانَةُ! أَعْطِيهِ الَّذي تجهزْتُ بِهِ، ولا تحْبِسي مِنْه شَيْئاً، فَواللهِ لا تحْبِسين مِنْه شَيْئاً فَيُبَارَكَ لَكِ فِيهِ. رواه مسلم.

178. హ(జత్ అనస్ (రజి) కథనం : అస్లం తెగకు చెందిన ఒక యువకుడు (దైవ ప్రవక్త (స) సన్నిధికి వచ్చి) "దైవప్రవక్తా! నేను దైవమార్గంలో యుద్ధం చేయాలనుకుంటున్నాను. కాని యుద్ధ సన్నాహాలు చేసుకోవడానికి నా దగ్గర సామాను ఏమీ లేదు" అని విన్నవించుకున్నాడు. దానికి ఆయన "ఫలానా వ్యక్తి దగ్గరికి వెళ్ళు. అతను యుద్ధ సన్నాహాలు చేసుకున్నాడు కాని (అకస్మాత్తుగా) జబ్బుపడ్డాడు. (నువ్వెళ్ళి అతని దగ్గరినుంచి యుద్ధ సామగ్రి తీసుకో)" అని అన్నారు. ఆ యువకుడు ఆయన చెప్పిన వ్యక్తి వద్దకు వెళ్ళి, "దైవప్రవక్త (స) మీకు సలాం చెప్పారు. మీరు యుద్ధం నిమిత్తం సమకూర్చుకున్న సామగ్రిని నాకివ్వమంటున్నారు" అని అన్నాడు. అది విని ఆ వ్యక్తి (తన భార్యతో) "ఏమేయ్! నేను యుద్ధం కోసం సమకూర్చుకున్న సామాను తెచ్చి ఇతనికివ్వు. అందులో ఏమీ మిగల్చ మాకు. దైవసాక్షి! నీవు ఏమీ (దాచి) పెట్టుకోకుండా ఇస్తే అందులో నీకు శుభం కలుగుతుంది" అని అన్నాడు.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసు ద్వారా బోధపడే మొదటి విషయం ఏమిటంటే మనిషి ఏదైనా సత్కార్యం చేయాలన్న ఉద్దేశ్యంతో అన్ని ఏర్పాట్లూ చేసుకున్న తరువాత అకస్మాత్తుగా అనారోగ్యం పాలవడం వల్లనో లేక మరే ఇతర కారణం వల్లనో తాను తలపెట్టిన కార్యాన్ని పూర్తిచేయలేకపోయినా తన దగ్గరున్న సామగ్రిని ఆ పని చేయాలనుకుంటున్నవారికి ఇస్తే దానిపై తనకు కూడా సమానంగా పుణ్యం లభిస్తుంది.
2. ధనాన్ని దైవమార్గంలో ఖర్చుచేయకుండా దాచి ఉంచితే అందులో శుభం లేకుండా పోతుంది. పైగా అది దైవాగ్రహానికి కారణభూతమవుతుంది.



## 21వ అధ్యాయం

# ٢١ - بَابٌ فِي التَّعَاوُنِ عَلَى الْبِرِّ وَالتَّقْوَى

# మంచికి, దైవభక్తికి సంబంధించిన విషయాల్లో చేదోడు వాదోడుగా ఉండటం

قال اللهُ تعالى: ﴿وَتَعَاوَنُوا عَلَى الْبِرِّ وَالتَّقْوَىٰ﴾ [المائدة: ٢]، وقال تعالى: ﴿وَالْعَصْرِ ۝ إِنَّ الْإِنسَانَ لَفِي خُسْرٍ ۝ إِلَّا الَّذِينَ آمَنُوا وَعَمِلُوا الصَّالِحَاتِ وَتَوَاصَوْا بِالْحَقِّ وَتَوَاصَوْا بِالصَّبْرِ﴾ [العصر: ١-٣].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : "మంచికి, దైవభక్తికి సంబంధించిన పనులలో అందరితోనూ సహకరించండి."

(అల్ మాయిద : 2)

మరోచోట ఆయన ఇలా అంటున్నాడు : "కాలం సాక్షిగా! నిస్సందేహంగా మానవుడు పెద్ద నష్టానికి గురిఅయి ఉన్నాడు. విశ్వసించి సత్కార్యాలు చేస్తూ ఉండేవారూ, ఒకరికొకరు సత్యోపదేశం, సహనబోధ చేసుకునేవారూ తప్ప."

(అల్ అస్ర్ : 1 - 3)

قال الإمامُ الشَّافِعِيُّ رَحِمَه الله كَلَاماً مَعْنَاهُ: إِنَّ النَّاسَ أَوْ أَكْثَرَهُمْ فِي غَفْلَةٍ عَنْ تَدَبُّرِ هٰذِهِ السُّورَةِ.

ప్రజలందరూ లేక చాలామంది ఈ 'సూరా' మీద యోచన చేసే విషయంలో అశ్రద్ధ వహిస్తున్నారని ఇమామ్ షాఫయి (రహ్మలై) అభిప్రాయం.

١٧٩ - عن أبي عبدِ الرحمٰنِ زيدِ بنِ خالدِ الْجُهَنِيِّ رَضيَ الله عنه قالَ: قالَ رَسُولُ الله ﷺ: «مَنْ جَهَّزَ غَازِياً فِي سَبِيلِ اللهِ فَقَدْ غَزَا وَمَنْ خَلَفَ غَازِياً فِي أَهْلِهِ بِخَيْرٍ فَقَدْ غَزَا» متفقٌ عليه.

179. హజ్రత్ అబూ అబ్దుర్రహ్మాన్ జైద్ బిన్ ఖాలిద్ జుహ్నీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : దైవమార్గంలో పోరాడే యోధుడికి యుద్ధసామగ్రిని సమకూర్చినవాడు కూడా నిస్సందేహంగా దైవమార్గంలో పోరాడినట్లౌతాడు. ఇంకా, దైవమార్గంలో పోరాడటానికి వెళ్ళిన యోధుని ఇంటి

బాగోగులు చూసిన వ్యక్తి (కూడా) దైవ మార్గంలో పోరాడినట్లుగా పరిగణించ బడతాడు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణంలోనూ ఈ హదీసు ఉంది.)*

## ముఖ్యాంశాలు

పై హదీసును అర్థం చేసుకొని దానిపై అమలు జరిపినట్లయితే ఇస్లామీయ సైనిక వ్యవస్థను అత్యంత శక్తిమంతమైనదిగా, విజయవంతమైనదిగా తీర్చిదిద్దవచ్చు. ఆ విధంగా దైవమార్గంలో సలిపేపోరాటంలో సామాన్య ప్రజానీకం పాల్గొనలేకపోయినా సైనికులకు సహాయసహకారాలు అందించి యోధులతోపాటు పుణ్యంలో భాగస్వాములు కావచ్చు. సమాజంలో బలశాలురు, పరాక్రమవంతులైన యువకులు ఎందరో ఉంటారు. కాని వారిదగ్గర వనరులు లేకపోవటం చేత ధర్మయుద్ధంలో పాల్గొనరు. దాంతో సైనిక వ్యవస్థ ఎంతో ఉపయోగకరమైన విభాగాన్ని కోల్పోయినట్లవుతుంది. కాని రెండోవైపు సమాజంలో మరికొందరివద్ద యుద్ధానికి అవసరమైన వనరులు పుష్కలంగా ఉన్నప్పటికీ యుద్ధానికి తగిన వయోపరిమితి, శారీరక శక్తిసామర్థ్యాలు ఉండవు. కనుక ఈ ఇరు వర్గాలవారు కలిసి చేదోడువాదోడుగా పనిచేస్తే సైనికవ్యవస్థ పటిష్ఠంగా తయారవటంతోపాటు అందరికీ సమానంగా పుణ్యం లభిస్తుంది. దైవప్రవక్త (స) మరియు ఆయన అనుచరుల హయాంలో నేటి సైనిక వ్యవస్థ మాదిరిగా యోధులు జీతాలపై సైన్యంలో చేర్చుకోబడేవారు కాదు. ప్రజలు స్వచ్ఛందంగా తమంతట తాము యుద్ధంలో పాల్గొనేవారని గ్రహించాలి. అయితే వ్యవస్థీకృతమైన సైన్యానికి కూడా ఈ హదీసు వర్తిస్తుంది. ప్రజలు సైనిక వ్యవస్థకు, యోధుల కుటుంబాలకు సహాయసహకారాలు అందించడం ద్వారా పుణ్యాన్ని పొందవచ్చు.

180. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం : దైవప్రవక్త (స) హుజైల్ తెగ శాఖ అయిన బనూ లహ్యాన్ వైపుకు (వారితో యుద్ధం చేయటానికి) ఒక సైనిక పటాలాన్ని పంపారు. ఆ సందర్భంగా ఆయన "ప్రతి ఇద్దరు వ్యక్తుల్లోనూ ఒకడు తప్పకుండా వెళ్ళాలి. పుణ్యం ఇద్దరికీ లభిస్తుంది (యుద్ధానికి

١٨٠ - وعن أبي سعيد الخُدْرِيِّ رضي اللهُ عَنْهُ أَنَّ رسولَ اللهِ ﷺ، بَعَثَ بَعْثاً إلى بَني لَحيانَ مِنْ هُذَيْلٍ فقالَ: «لِيَنْبَعِثْ مِنْ كُلِّ رَجُلَيْنِ أَحَدُهُما وَالأَجْرُ بَيْنَهُمَا» رواه مسلم.

వెళ్ళినవాడికి మరియు అతని ఇంటి బాగోగులు చూసిన వ్యక్తికి కూడా" అని బోధించారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇంతకు ముందు వచ్చిన హదీసులో ప్రస్తావించబడిన విషయమే ఇందులోనూ వివరించబడింది. ప్రజలందరూ యుద్ధంలో పాల్గొనలేరు. అయితే యుద్ధానికి వెళ్ళలేనివారు సైనికుల కుటుంబాలకు భద్రతను కల్పించడం, వారి అవసరాలను తీర్చడం లాంటి పనులుచేసి, తాము కూడా ఇంటిపట్టునవుండి ధర్మయుద్ధ పుణ్యాన్ని జుర్రుకోవచ్చు.

١٨١ ـ وعن ابن عباسٍ رضي الله عنهما: أنَّ رسُولَ الله ﷺ لَقِيَ رَكْباً بالرَّوْحَاءِ فقال: «مَنِ القَوْمُ؟»، قَالُوا: المُسْلِمُونَ، فَقَالُوا: مَنْ أَنْتَ؟ قال: «رسولُ الله»، فَرَفَعَتْ إلَيْهِ امْرَأَةٌ صَبِيّاً فَقَالَتْ: أَلِهٰذَا حَجٌّ؟ قال: «نَعَمْ وَلَكِ أَجْرٌ» رواه مسلم.

181. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం)కు 'రౌహా' ప్రాంతంలో ప్రయాణీకుల బృందం ఒకటి ఎదురయ్యింది. ఆయన వారితో "ఎవరు మీరు?" అని అడిగారు. దానికి వారు "మేము ముస్లింలము, మీరెవరు?" అని ప్రశ్నించారు. దానికి ఆయన "నేను దైవప్రవక్తను" అని అన్నారు. అది విని ఒక మహిళ తన పిల్లవాడిని ఎత్తుకొని ఆయనకు చూపిస్తూ "ఇతను హజ్ (యాత్ర) చేయవచ్చా?" అని అడిగింది. "అవును చేయవచ్చు. అయితే దాని పుణ్యం నీకు లభిస్తుంది" అని దైవ ప్రవక్త (స) చెప్పారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని 'హజ్' ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో దైవప్రవక్త (స) నిరాడంబరత వివరించబడింది. ఆయన ఎంత సాదాసీదాగా ఉండేవారంటే, ఆయన తన అనుచరులతోపాటు ఉన్నప్పుడు వారిలో దైవప్రవక్త ఎవరో ప్రజలు కనుక్కోలేకపోయేవారు.

2. పిల్లవాడు తల్లిదండ్రులతోపాటు హజ్ (యాత్ర) చేస్తే దాని పుణ్యం తల్లిదండ్రులకు లభిస్తుంది. ఎందుకంటే ఆ పసివాడిపై ఇంకా హజ్ విధి కాలేదు. కనుక ప్రాజ్ఞత వచ్చిన తరువాత ఆ పిల్లవాడు స్తోమత కలిగినవాడైతే తిరిగి అతను విధిగా హజ్ చేయవలసి ఉంటుంది. బాల్యంలో చేసిన హజ్‌తో సరిపెట్టుకుంటే చాలదు.

١٨٢ ـ وعَنْ أَبي موسى الأشْعَرِيِّ رضي الله عنه عن النَّبيِّ ﷺ أَنَّهُ قال: «الخَازِنُ المُسْلِمُ الأمِينُ الَّذي يُنْفِذُ ما أُمِرَ بِهِ، فَيُعْطِيه كامِلاً مُوَفَّراً، طَيِّبَةً بِهِ نَفْسُهُ فَيَدْفَعُهُ إلى الَّذي أُمِرَ لَهُ بِهِ أَحَدُ المُتَصَدِّقِينَ» متفقٌ عليه.

وفي رواية: «الَّذي يُعْطِي مَا أُمِرَ بِهِ»

وضبطُوا «المُتَصَدِّقَيْنِ» بفتح القاف مع كسر النون على التَّثْنِيَةِ، وَعَكْسُهُ على الجَمْعِ وكِلاهُمَا صَحِيحٌ.

182. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారని హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) తెలియజేశారు : నిజాయితీపరుడయిన ముస్లిం కోశాధికారి తనకు ఆజ్ఞాపించబడిన దానిని అమలు పరుస్తూ, ఎవరికయినా ఏదయినా ఇవ్వమని తనకు ఆదేశమయినప్పుడు సహృదయంతో, సంతోషంతో, ఏమీ తగ్గించకుండా పూర్తిగా ఇస్తూ ఉంటే - అతను కూడా దానధర్మాలు చేసేవారిలో ఒకడిగా పరిగణించబడతాడు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జకాత్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

ఎవరికయినా ఏదయినా బాధ్యత అప్పగించబడితే వారు ఆ బాధ్యతను సహృదయంతో నిర్వర్తించాలి. అంతేగాని తమకన్నా ఉచ్ఛస్థితిలో ఉన్నవారిని చూసి అసూయచెందటం, ఆ కోపాన్ని తమ క్రింద పనిచేసే వారిపై ప్రదర్శించటం, అవసరార్థం తమ దగ్గరికి వచ్చినవారిని కసురుకోవటం లాంటి కుచేష్టలకు పాల్పడకూడదు. తన బాధ్యతను సరిగ్గా నిర్వర్తించే వ్యక్తికి ఆ బాధ్యత అప్పగించినవారికి సమానంగా పుణ్యం లభిస్తుంది. ఒక కోశాధికారి తన విధులను సరిగ్గా నిర్వర్తిస్తే అతనికి తనను నియమించిన పై అధికారికి లభించినంత పుణ్యం లభిస్తుంది.

## 22వ అధ్యాయం

# ٢٢ ـ بَابٌ فِي النَّصِيحَةِ

# శ్రేయోభిలాష

قال تعالى: ﴿إِنَّمَا الْمُؤْمِنُونَ إِخْوَةٌ﴾ [الحجرات: ١٠]، وقال تعالى إخباراً عن نُوحٍ ﷺ: ﴿وَأَنصَحُ لَكُمْ﴾ [الأعراف: ٦٢]، وعَنْ هُودٍ ﷺ: ﴿وَأَنَا لَكُمْ نَاصِحٌ أَمِينٌ ﴿٦٨﴾﴾ [الأعراف: ٦٨].

وَأَمَّا الأَحَادِيث

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్‌ సెలవిచ్చాడు: "విశ్వాసులు పరస్పరం అన్నదమ్ములు" (అల్‌ హుజురాత్‌ : 10)

మరోచోట హజ్రత్‌ నూహ్‌ - అలైహి - తన జాతి వారితో అన్నమాటను ఈ విధంగా ప్రస్తావించాడు:

"నేను మీ బాగుకోరేవాడిని." (అల్‌ ఆరాఫ్‌ : 62)

ఇంకొకచోట హజ్రత్‌ హూద్‌ ప్రవక్త పలుకులు గమనించదగినవి: "నేను మీ యొక్క నమ్మదగిన శ్రేయోభిలాషిని." (అల్‌ ఆరాఫ్‌ : 68)

١٨٣ ـ فَالأَوَّلُ: عن أبي رُقَيَّةَ تميم بـنِ أوْسٍ الـدَّارِيِّ رضـي الله عنـه أَنَّ النَّبِيَّ ﷺ قال: «الدِّينُ النَّصِيحَةُ»، قُلْنَا: لِمَنْ؟ قَالَ: «للهِ وَلِكِتَابِهِ وَلِرَسُولِهِ وَلأَئِمَّةِ الْمُسْلِمِينَ وَعَامَّتِهِمْ» رواه مسلم.

183. హజ్రత్‌ అబూ రుఖయ్యా తమీమ్‌ బిన్‌ ఔస్‌ దారీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "ధర్మమంటే మంచిని అభిలషించటం" అని అన్నారు. అప్పుడు మేము "(దైవప్రవక్తా!) ఎవరి మంచిని అభిలషించాలి?" అని సందేహపడగా, "అల్లాహ్‌ మరియు ఆయన గ్రంథం, ఆయన ప్రవక్త, ముస్లిం నేతలు, ఇంకా సామాన్య ముస్లింలందరి విషయంలోనూ మంచిని అభిలషించటమే ధర్మం" అని ఆయన (స) అన్నారు. (ముస్లిం)

*(సహీహ్‌ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు శ్రేయోభిలాష ప్రాధాన్యతను వివరిస్తోంది. ప్రజలందరి బాగు కోరి పనిచేయాలని అంటోంది. దేవుని బాగు కోరడమంటే ఆయనపై అచంచల విశ్వాసాన్ని ప్రకటించి, మిక్కిలి చిత్తశుద్ధితో, భక్తిప్రపత్తులతో ఆయన్ని ఆరాధించడం అని అర్థం. దైవగ్రంథ హితం కోరడమంటే, మనస్ఫూర్తిగా దానిని ధృవీకరించాలి. దాని పారాయణాన్ని నిత్యకృత్యంగా చేసుకోవాలి. దాంట్లో మార్పులూ, చేర్పులూ చేయకుండా దాని ఆదేశాలను యథాతథంగా పాటించాలన్నమాట! ఆ తరువాత దైవప్రవక్త బాగు కోరడమంటే, ఆయన ప్రవక్త చెప్పిన విషయాన్ని ధృవీకరిస్తూ, ఆయనకు విధేయత చూపాలి. ఆయన సంప్రదాయాలను హెచ్చు తగ్గులు లేకుండా పాటించాలి. ముస్లిం నేతల హితం కోరడమంటే, సత్యం విషయంలో వారిని సమర్థించాలి. షరీఅత్‌కు విరుద్ధమైన ఆదేశాలు ఇవ్వనంతవరకూ వారికి విధేయత కనబరుస్తూ ఉండాలి. వారు పెడదారులు తొక్కినప్పుడు సన్మార్గం గురించి వారికి బోధించాలేగాని వారికి ఎదురు తిరగడం, తిరుగుబాటు ధోరణుల్ని అనుసరించటం మంచిపద్ధతి కాదు. ఒకవేళ వారు బహిరంగంగానే దైవధిక్కారానికి పాల్పడితే అలాంటి సమయంలో వారిని గద్దెదింపడం ముస్లిం ప్రజల కర్తవ్యం అవుతుంది. ఇక సామాన్య ముస్లిం ప్రజానీకం యొక్క బాగుకోరడమంటే, ఇహలోక జీవితంలో వారి ఆచరణల సంస్కరణకోసం, పరలోకంలో వారి సాఫల్యం కోసం పాటుపడటం, ప్రజల్ని సరైన మార్గంలో నడిపించడం, మంచిని గురించి ఆదేశిస్తూ, చెడుపనుల నుంచి వారించటమని అర్థం.

١٨٤ ـ الثَّاني: عَنْ جَرِيرِ بْنِ عبد الله رضي الله عنه قال: بَايَعْتُ رَسولَ الله ﷺ عَلى إقَامِ الصَّلاةِ، وإيتَاءِ الزَّكَاةِ، وَالنُّصْحِ لِكُلِّ مُسْلِمٍ. متفقٌ عليه.

184. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం : నేను నమాజును స్థాపిస్తానని, జకాత్ (విధిదానం) చెల్లిస్తానని ఇంకా ముస్లింలందరి శ్రేయాన్ని కోరుకుంటానని దైవప్రవక్త (సల్లం) ముందు 'బైత్' (ప్రతిజ్ఞ) చేశాను.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణం, ఇంకా సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

ప్రజలు ఒండొకరి మంచిని కోరుకోవాలని ఈ హదీసు చెబుతోంది. దైవప్రవక్త (సల్లం) నమాజ్, జకాత్ లాంటి విధులతోపాటు ప్రజాశ్రేయాన్ని కాంక్షించే విషయంలోనూ తన అనుచరుల నుండి 'బైత్' (ప్రమాణం) తీసుకునేవారంటే ఇస్లాంలో శ్రేయోభిలాషకు ఉన్న స్థానం ఏమిటో అర్థమవుతోంది.

١٨٥ ـ الثَّالِثُ: عَنْ أَنَسٍ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «لَا يُؤْمِنُ أَحَدُكُمْ حَتَّى يُحِبَّ لأَخِيهِ مَا يُحِبُّ لِنَفْسِهِ» متفق عليه.

185. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు: "తన కోసం యిష్టపడేదే తన సోదరునికోసం కూడా యిష్టపడనంతవరకూ మీలో ఎవరూ (నిజమైన) విశ్వాసి కాజాలరు." *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ మరియు సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణాల్లో ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు కూడా ముస్లింలు పరస్పరం మంచిని కోరుకోవాలని నొక్కి వక్కాణిస్తోంది. దీనిపై ప్రజలు నిక్కచ్చిగా అమలుచేస్తే నేడు సమాజంలో పేరుకుపోయిన అవినీతి, లంచగొండితనం, దగా, మోసం, కుట్రల జాడ్యాన్ని దూరం చేయటం ఏమంత కష్టం కాదు. ఇస్లాం ధర్మం ఇలాంటి అమూల్యమైన నైతిక సూత్రాలెన్నో బోధించింది. కాని శోచనీయమైన విషయం ఏమిటంటే మంచిని పెంచడానికి, చెడులను నిర్మూలించడానికి నియుక్తమైన ముస్లిం సమాజం సైతం నేడు పరిస్థితుల ఇంద్రజాలానికి మోసపోయి విశిష్టమైన, విలక్షణమైన ఇస్లామీయ నైతిక సూత్రాలను విస్మరించి కూర్చుంది. ఫలితంగా ఎన్నో వైఫల్యాలను చవిచూస్తోంది. దారితప్పిన జ్యోతికరునికి వెలుతురు కూడా అరువై పోయినట్లయింది నేటి ముస్లిం సమాజ పరిస్థితి!



23వ అధ్యాయం

# ٢٣ - بَابٌ فِي الأَمْرِ بِالْمَعْرُوفِ وَالنَّهْيِ عَنِ الْمُنْكَرِ

## మంచిని గురించి ఆదేశించడం, చెడు నుంచి ఆపడం

قال الله تعالى: ﴿وَلْتَكُن مِّنكُمْ أُمَّةٌ يَدْعُونَ إِلَى الْخَيْرِ وَيَأْمُرُونَ بِالْمَعْرُوفِ وَيَنْهَوْنَ عَنِ الْمُنكَرِ وَأُولَٰئِكَ هُمُ الْمُفْلِحُونَ﴾ [آل عمران: ١٠٤]، وقال تعالى: ﴿كُنتُمْ خَيْرَ أُمَّةٍ أُخْرِجَتْ لِلنَّاسِ تَأْمُرُونَ بِالْمَعْرُوفِ وَتَنْهَوْنَ عَنِ الْمُنكَرِ﴾ [آل عمران: ١١٠]، وقال تعالى: ﴿خُذِ الْعَفْوَ وَأْمُرْ بِالْعُرْفِ وَأَعْرِضْ عَنِ الْجَاهِلِينَ﴾ [الأعراف: ١٩٩]، وقال تعالى: ﴿وَالْمُؤْمِنُونَ وَالْمُؤْمِنَاتُ بَعْضُهُمْ أَوْلِيَاءُ بَعْضٍ يَأْمُرُونَ بِالْمَعْرُوفِ وَيَنْهَوْنَ عَنِ الْمُنكَرِ﴾ [التوبة: ٧١]، وقال تعالى: ﴿لُعِنَ الَّذِينَ كَفَرُوا مِن بَنِي إِسْرَائِيلَ عَلَىٰ لِسَانِ

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : "మీలో మంచివైపుకు పిలిచేవారూ, మేలు చెయ్యండి అని ఆజ్ఞాపించేవారూ, చెడునుండి వారించే వారూ కొందరు తప్పకుండా ఉండాలి. ఈ పని చేసేవారే సాఫల్యం పొందుతారు."

(ఆలి ఇమ్రాన్ : 104)

ఇంకొక చోట ఆయన ఇలా సెలవిచ్చాడు : "ఇక నుండి ప్రపంచంలో మానవులకు మార్గం చూపటంకోసం, వారి సంస్కరణకోసం రంగం లోకి తీసుకురాబడిన ఉత్తమ సమాజం మీరే. మీరు మంచిని చెయ్యండి అని ఆజ్ఞాపిస్తారు. చెడునుండి ఆపుతారు."

(ఆలి ఇమ్రాన్ : 110)

మరొకచోట ఇలా సెలవిచ్చాడు : "ప్రవక్తా! మన్నింపుల వైఖరిని అవలంబించు. మంచిని ప్రబోధించు, మూర్ఖులతో వాదానికి దిగకు."

(అల్ ఆరాఫ్: 199)

వేరొకచోట ఇలా అన్నాడు: "విశ్వాసులైన పురుషులూ, విశ్వాసులైన స్త్రీలూ, వారందరూ ఒకరికొకరు సహచరులు, వారు మేలు చెయ్యండి అని ఆజ్ఞాపిస్తారు. చెడునుంచి వారిస్తారు."

(అత్ తౌబా : 71)

ఆయన ఇంకా ఇలా అన్నాడు : "ఇస్రాయీలు సంతతి వారిలో అవిశ్వాసమార్గం అవలంబిం చిన వారిని దావూద్ నోట, మర్యమ్ కుమా

రుడైన మసీహ్ నోట శపించటం జరిగింది. ఎందుకంటే వారు అవిధేయులయ్యారు. అత్యాచారాలు చేయసాగారు. చెడుపనులు చెయ్యకుండా ఒకరినొకరు నిరోధించడం మానివేశారు. వారు అవలంబించిన మార్గం చాలా చెడ్డది." (అల్ మాయిద : 78 - 79)

ఆయన ఇంకా ఇలా అన్నాడు : (ప్రవక్తా! స్పష్టంగా ఇలా) ప్రకటించు, "ఇది సత్యం, మీ ప్రభువు నుండి వచ్చింది. ఇష్టమైనవారు దానిని స్వీకరించనూవచ్చు, ఇష్టంలేని వారు దానిని తిరస్కరించనూవచ్చు." (అల్ కహఫ్ : 29)

ఇంకా ఇలా అన్నాడు : "ప్రవక్తా! నీకు ఆజ్ఞాపించబడుతూ ఉండిన విషయాన్ని బహిరంగంగా ఎలుగెత్తి చాటు." (అల్ హిజ్ర్ : 94)

ఇంకా ఇలా అన్నాడు : "చెడునుండి ప్రజలను వారించే వారిని మేము రక్షించాము. దుర్మార్గులైన ఇతరులందరినీ వారి అవిధేయతల కారణంగా కఠినశిక్షకు గురిచేశాము." (అల్ ఆరాఫ్ : 165)

ఈ అధ్యాయం క్రింద సుప్రసిద్ధమైన దివ్య ఖుర్ఆన్ సూక్తులు చాలా ఉన్నాయి. ఇక ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసులు క్రింద పేర్కొనబడ్డాయి.

186. దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) తెలియజేశారు : "మీలో ఎవరైనా చెడు జరుగుతుండటం

دَاوُدَ وَعِيسَى ٱبْنِ مَرْيَمَ ۚ ذَٰلِكَ بِمَا عَصَوا۟ وَّكَانُوا۟ يَعْتَدُونَ ﴿٧٨﴾ كَانُوا۟ لَا يَتَنَاهَوْنَ عَن مُّنكَرٍ فَعَلُوهُ ۚ لَبِئْسَ مَا كَانُوا۟ يَفْعَلُونَ ﴾ [المائدة: ٧٨، ٧٩]، وقال تعالى: ﴿ وَقُلِ ٱلْحَقُّ مِن رَّبِّكُمْ ۖ فَمَن شَآءَ فَلْيُؤْمِن وَمَن شَآءَ فَلْيَكْفُرْ ﴾ [الكهف: ٢٩]، وقال تعالى: ﴿ فَٱصْدَعْ بِمَا تُؤْمَرُ ﴾ [الحجر: ٩٤]، وقال تعالى: ﴿ أَنجَيْنَا ٱلَّذِينَ يَنْهَوْنَ عَنِ ٱلسُّوٓءِ وَأَخَذْنَا ٱلَّذِينَ ظَلَمُوا۟ بِعَذَابٍۭ بَـِٔيسٍۭ بِمَا كَانُوا۟ يَفْسُقُونَ ﴾ [الأعراف: ١٦٥] وَالآياتُ فِي الباب كَثِيرَةٌ مَعلومَةٌ.

وَأَمّا الأَحاديثُ:

١٨٦ ـ فالأوَّلُ: عن أبي سعيدٍ الخُدْرِيِّ رضيَ اللهُ عنه قالَ: سَمِعْتُ

رسُـولَ الله ﷺ يَقُـولُ: «مَـنْ رَأَى مُنْكَـراً فَلْيُغَيِّـرْهُ بِيَـدِهِ، فَـإِنْ لَـمْ يَسْتَطِعْ فَبِلِسَانِهِ، فَإِنْ لَمْ يَسْتَطِعْ فَبِقَلْبِهِ وَذَلِكَ أَضْعَفُ الإِيمانِ» رواه مسلم.

చూస్తే (ముందు) దాన్ని చేత్తో ఆపటానికి ప్రయత్నించాలి. అంతశక్తి లేకపోతే నోటితోనైనా దాన్ని వారించాలి. అదీ చేయలేకపోతే (కనీసం) మనసులోనైనా దానిని చెడుగా భావించాలి. ఇది విశ్వాసపు అతి బలహీన స్థాయి."

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని విశ్వాసప్రకరణం)

## ముఖ్యాంశాలు

పై హదీసులో చూడటమంటే తెలుసుకోవడమని భావం. సమాజంలో తప్పు జరుగుతుందని తెలిస్తే చాలు దానిని మనం మన కళ్ళతో చూసినా చూడకపోయినా వెంటనే దానిని నిలువరించటానికి ప్రయత్నించాలి. అన్యాయానికి ఆదిలోనే అడ్డుకట్ట వేయాలి. సమాజాన్ని నైతికపు రుగ్మతలనుండి కాపాడాలని ముస్లింలకు ఇందులో తాకీదు చేయబడింది. ముస్లింలు ఈ హదీసును ఆచరిస్తూ, నిర్భయంగా, నిస్వార్థంగా - మంచిని పెంపొందించే, చెడుని నిర్మూలించే బాధ్యతను నిర్వర్తించినంతకాలం ముస్లిం సమాజం ఎన్నో నైతికపు రుగ్మతలు, దురాగతాల నుండి సురక్షితంగా ఉండగలిగింది. కాని ముస్లింలు ఈ బాధ్యతను విస్మరించినప్పుడు వారి సమాజం కూడా దురాగతాల ఊబిలో కూరుకుపోయింది. నేడు సత్య ధర్మ ధ్వజవాహకులు మళ్ళీ మేల్కొని ఈ దురాగతాలకు అడ్డుకట్ట వేయాలి.

١٨٧ - الثاني: عن ابن مسْعُودٍ رضي الله عنه، أَنَّ رسولَ الله ﷺ قال: «مَا مِنْ نَبِيٍّ بَعَثَهُ الله فِي أُمَّةٍ قَبْلِي إِلَّا كان لَه مِنْ أُمَّتِهِ حَوارِيُّون وَأَصْحابٌ يَأْخُذُون بِسُنَّتِهِ ويَقْتَدُون بِأَمْرِهِ، ثُمَّ إنها تخْلُفُ مِنْ بَعْدِهِمْ خُلُوفٌ يقُولُون مَا لَا يَفْعَلُونَ، وَيَفْعَلُونَ مَا لا يُؤْمَرُون، فَمَنْ جَاهَدَهُم

187. హజ్రత్ ఇబ్నె మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: నాకు పూర్వం పంప బడిన ప్రతి ప్రవక్తకూ, అతని సమాజంలో అతనికి కొంతమంది అనుచరులూ, సహచరులూ ఉండేవారు. వారు ఆ ప్రవక్త సంప్రదాయాన్ని ఆచరించేవారు. ఆయన ఆజ్ఞానుసారం నడుచుకునే వారు. ఆ తరువాత (కాలక్రమంలో ప్రవక్తల సమాజాల్లో) కొందరు అసమ

بِيَدِهِ فَهُوَ مُؤْمِنٌ، وَمَنْ جَاهَدَهُمْ بِقَلْبِهِ فَهُوَ مُؤْمِنٌ، وَمَنْ جَاهَدَهُمْ بِلِسَانِهِ فَهُوَ مُؤْمِنٌ، وليس وراء ذلك مِن الإيمانِ حَبَّةُ خَرْدَلٍ» رواه مسلم.

ర్థులు పుడతారు. వీళ్ళు (ఎలాంటి వారంటే) స్వయంగా ఆచరించకుండా (ప్రజలకు నీతులు) బోధిస్తుంటారు. తమకు ఆదేశించబడని పనులు చేస్తూ ఉంటారు. కనుక ఎవడైతే ఇలాంటి వారికి వ్యతిరేకంగా చేత్తో పోరాడతాడో అతను విశ్వాసి. మనసు (నిరసన భావం)తో పోరాడినవాడూ విశ్వాసియే. వాక్ (పటిమ)తో పోరాడినవాడు కూడా విశ్వాసియే. ఇక ఈమాన్ (విశ్వాసం)లో దీనికన్నా ఆవగింజంత కూడా తక్కువ స్థాయి లేదు." *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని విశ్వాసప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రతి ముస్లిం తన శక్తిమేరకు సమాజంలో పొడసూపే చెడులను నిర్మూలించడానికి తప్పనిసరిగా కృషిచేయాలని ఈ హదీసు ఉపదేశిస్తోంది. పైగా దానికోసం అతను చేసే కృషి అతని విశ్వాసానికి ప్రమాణమని కూడా చెబుతోంది. ఒక ముస్లిం సమాజంలో జరుగుతున్న అన్యాయాన్ని అడ్డుకుంటున్నాడంటే లేదా కనీసం మనసులోనైనా దాన్ని చెడుగా భావిస్తున్నాడంటే అది అతని విశ్వాసానికి (ఈమాన్‌కు) నిదర్శనం. కాని ఒకవేళ ముస్లిం అయిన వ్యక్తి కనీసం మనసులోనైనా చెడుని చెడుగా భావించట్లేదంటే ఇక అతను విశ్వాసపు అత్యంత బలహీనస్థాయి కంటే కూడా దిగజారిపోయాడని అర్థం చేసుకోవాలి.

١٨٨ - الثالثُ: عن أبي الوليدِ عُبَادَةَ بنِ الصَّامِتِ رضي الله عنه قال: بَايَعْنَا رسولَ الله ﷺ عَلى السَّمْعِ وَالطَّاعَةِ في العُسْرِ وَاليُسْرِ وَالمَنْشَطِ وَالمَكْرَهِ، وَعَلى أَثَرَةٍ عَلَيْنَا، وَعَلى أنْ لا نُنَازِعَ الأمْرَ أهْلَهُ إلا

188. హజ్రత్ అబుల్ వలీద్ ఉబాదా బిన్ సామిత్ (రజి) కథనం : "కలిమిలోనూ లేమిలోనూ, ఇష్టంవున్నా లేకపోయినా, పరులకు మాపై ప్రాధాన్యత నిచ్చి, ఎట్టిపరిస్థితుల్లోనైనా సరే (పాలకుల) ఆజ్ఞలను శిరసావహిస్తామని, వారికి విధేయత కనబరుస్తామనీ, (పాలకులు) బహిరంగంగా దైవధిక్కారానికి

أَنْ تَرَوْا كُفراً بَوَاحاً عِنْدَكُمْ مِنَ الله تَعَالَى فِيهِ بُرْهَانٌ، وَعَلَى أَنْ نَقُولَ بِالْحَقِّ أَيْنَمَا كُنَّا لَا نَخَافُ فِي اللهِ لَوْمَةَ لَائِمٍ. متفقٌ عليه.

పాల్పడినప్పుడు మా దగ్గర దేవుని తరఫు నుండి దానికి సంబంధించిన స్పష్టమైన నిదర్శనమేదైనా ఉంటే తప్ప పరిపాలనా వ్యవహారాల్లో పాలకులతో తగవులాడ బోమనీ, ఇంకా మేమెక్కడున్నా సత్యమే పలుకుతామని, దేవుని (ధర్మం) విషయంలో ఏ దెప్పిపొడిచేవాడి దెప్పనూ లెక్కచేయబోము అనీ మేము దైవప్రవక్త (సల్లం) చేతిమీద ప్రమాణం చేశాము." *(బుఖారీ - ముస్లిం)*

«المَنْشَط والمَكْرَه» بفتح ميميهما، أَيْ: في السَّهْلِ والصَّعْبِ. و«الأَثَرَةُ»: الاختِصاصُ بالمُشْتَرَكِ وقد سَبَقَ بيانُها. «بَوَاحاً»: بِفَتْحِ الْبَاءِ الْمُوَحَّدَةِ بَعْدَهَا وَاوٌ ثُمَّ أَلِفٌ ثمَّ حاءٌ مُهْمَلَةٌ: أي ظاهِراً لَا يَحْتَمِلُ تَأويلاً.

'మన్‌షత్' మరియు మక్రహ్ అంటే కష్టసుఖాలు. 'అల్ అస్‌రహ్' అంటే ఉమ్మడి భాగస్వామ్య వస్తువులకు తానొక్కడే యజమాని అయికూర్చోవటం లేదా కొంతమందికి ప్రత్యేకంగా ప్రాధాన్యతనివ్వటం. దీని ప్రస్తావన ఇంతకు ముందు కూడా వచ్చింది. 'బవ్వాహన్' అంటే బహిరంగంగా, స్పష్టంగా, ఎలాంటి వక్రభాష్యాలకూ తావు లేకుండా అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని ఉపద్రవాల ప్రకరణంలోనూ, అధికారాల ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

ముస్లిం పాలకులు నిరంకుశులు, పాపాత్ములైనా సరే వారు ధర్మ విరుద్ధమైన ఆదేశాలు ఇవ్వనంతవరకూ ప్రజలు వారికి విధేయత చూపాల్సిందే. ధర్మవిరుద్ధమైన విషయాల్లో మాత్రం వారికి విధేయత చూపనవసరం లేదు. అదేవిధంగా పాలకులు బహిరంగంగా దైవధిక్కారానికి, ధర్మ వ్యతిరేక కార్యకలాపాలకు ఒడిగడితే తప్ప వారిపై తిరుగుబాటు చేయకూడదు. ఎందుకంటే చీటికీ మాటికీ తిరుగుబాటు ధోరణుల్ని అవలంబించడం వల్ల రాజ్యం ఆర్థికంగా, సైనికంగా క్షీణించి, రాజ్య సమగ్రతకు, భద్రతకు ముప్పు వాటిల్లుతుంది.

2. ప్రపంచంలో ఎక్కడున్నా, ఏ స్థితిలోవున్నా సరే సత్యాన్నే ప్రకటించాలి. ధర్మాదేశాలను తప్పకుండా పాటించాలి. లోకం ఏమంటుందోనన్న భయం అక్కర్లేదు.

١٨٩ ـ الرَّابع: عن النُّعمانِ بنِ بَشيرٍ رضي الله عنهما عن النبيِّ ﷺ قال: «مَثَلُ القَائمِ في حُدودِ الله، وَالْوَاقعِ فيها كَمَثَلِ قَومٍ اسْتَهَمُوا عَلى سَفِينَةٍ، فَصَارَ بَعْضُهُمْ أَعْلاهَا وبَعْضُهُمْ أَسْفَلَهَا، وَكانَ الَّذِينَ في أَسْفَلِهَا إذَا اسْتَقَوْا مِنَ الماءِ مَرُّوا عَلى مَنْ فَوْقَهُمْ فَقَالُوا: لَوْ أَنَّا خَرَقْنَا في نَصِيبِنا خَرْقاً وَلَمْ نُؤْذِ مَنْ فَوْقَنَا، فَإنْ تَرَكُوهُمْ وَمَا أَرَادُوا هَلَكُوا جَميعاً، وإنْ أَخَذُوا عَلى أَيْدِيهِمْ نَجَوْا ونَجَوْا جَميعاً» رواه البخاري. «القَائمُ في حُدُودِ الله تَعالى» مَعْنَاهُ: المُنْكِرُ لَهَا، القَائمُ في دفعِهَا وإزالَتِهَا، والمُرادُ بالحُدُودِ: مَا نَهَى اللهُ عَنْهُ. «اسْتَهَمُوا»: اقترَعُوا.

189. హజ్రత్ నోమాన్ బిన్ బషీర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : దేవుని హద్దులకు లోబడి నడుచుకునేవారు మరియు వాటిని అతిక్రమించేవారి ఉదాహరణ ఎలాగుందంటే, కొంతమంది (ఒక నావలో ప్రయాణించడానికి అందులోని పై మరియు క్రింది భాగాల కోసం) చీటీ వేశారు. దాని ప్రకారం కొంతమంది పైభాగంలో కూర్చున్నారు. మరికొంత మంది క్రింది భాగంలో కూర్చున్నారు. (నావ సముద్రంలో ప్రయాణిస్తున్నప్పుడు) క్రిందివారికి నీళ్ళు అవసరమైతే వాళ్ళు పైకెళ్ళి పైన కూర్చొని ఉన్న వారిగుండా వెళ్ళవలసివచ్చేది. (ఇది పైనున్న వారికి ఇబ్బందికరంగా అనిపించేది). అప్పుడు క్రిందివాళ్ళు "మనం మన క్రింది భాగంలో రంధ్రం చేసుకొని (నీళ్ళు తోడుకుంటే) పైనున్న వాళ్ళకు ఇబ్బంది కల్గకుండా ఉంటుంది కదా!" అని అనుకున్నారు. అలాంటి సమయంలో పైనున్నవాళ్ళు క్రిందివాళ్ళను వారు తలపెట్టిన పని నుంచి వారించక పోతే అందరూ (మునిగి) చనిపోతారు. అదే వారిని అలా చేయకుండా చేత్తో ఆపితే తామూ మరియు వారందరూ కూడా బతికిబయటపడతారు. *(బుఖారీ)*

దేవుని హద్దుల్ని నెలకొల్పేవాడంటే ఆయన వారించిన విషయాలకు దూరంగా మసలుకునేవాడు. వాటిని రూపుమాపటానికి ప్రయత్నించేవాడని భావం. 'ఇస్తహమూ' అంటే వారు చీటీ వేశారని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని 'భాగస్వామ్య' ప్రకరణంలోనూ, 'సాక్ష్యాల' ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

సమాజంలో ప్రజలు తప్పుచేస్తే దాని దుష్పరిణామాలు కేవలం తప్పు చేసేవారికే పరిమితం కావు, క్రమంగా అవి సమాజాన్నంతటినీ కలుషితం చేస్తాయి. కనుక సమాజాన్ని వినాశం నుండి కాపాడాలంటే తప్పకుండా నేరస్తుల్ని, తప్పు చేసేవారిని చెయ్యిపట్టి ఆపాలి. లేకపోతే యావత్తు సమాజంపై దైవశిక్ష విరుచుకుపడే ఆస్కారముంది.

190. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఉమ్మె సలమా హింద్ బిన్తె అబూ ఉమయ్యా హుజైఫా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : (నా తదనంతరం) త్వరలోనే మీపై కొంతమంది పరిపాలకుల నియామకం జరుగు తుంది. వారి కొన్ని పనుల్ని మీరు పొగుడుతారు మరికొన్నింటిని తెగుడుతారు. అయితే (అప్పుడు మీలో) ఎవరైతే (వారి చెడుపనుల్ని) చెడుగా భావించాడో అతను ముక్తి పొందుతాడు. ఇంకా (వారి దౌష్ట్యాలను) ఖండించిన వాడు కూడా రక్షించబడతాడు. కాని (వారి విధానాలకు) రాజీపడి వారిని అనుసరించినవాడు మాత్రం (నాశనమైపోతాడు).

١٩٠ - الخامسُ: عَنْ أُمِّ المُؤْمِنِين أُمِّ سَلَمَةَ هِنْدِ بنتِ أَبي أُمَيَّةَ حُذيفَةَ رضي الله عنها عن النبيِّ ﷺ أنه قال: «إِنَّهُ يُسْتَعْمَلُ عَلَيْكُمْ أُمَرَاءُ فَتَعْرِفُونَ وَتُنْكِرُونَ فَمَنْ كَرِهَ فَقَدْ بَرِئَ، وَمَنْ أَنْكَرَ فَقَدْ سَلِمَ، ولٰكِنْ مَنْ رَضِيَ وَتَابَعَ» قالوا: يَا رَسُولَ

الله! ألَا نُقَاتِلُهُمْ؟ قَالَ: «لَا مَا أَقَامُوا فِيكُمُ الصَّلَاةَ» رواه مسلم.

ఇది విని సహచరులు, "దైవప్రవక్తా! మరి మేము అలాంటి నాయకులపై యుద్ధం చేయకూడదా?" అని అడగ్గా, దానికి ఆయన "చేయకూడదు, వారు మీ మధ్య నమాజు స్థాపిస్తున్నవారుగా ఉన్నంతకాలం (మీరు వారిపై యుద్ధం చేయకూడదు)" అని సమాధాన మిచ్చారు. (ముస్లిం)

مَعْنَاهُ: مَنْ كَرِهَ بِقَلْبِهِ وَلَمْ يَسْتَطِعْ إِنْكَاراً بِيَدٍ وَلَا لِسَانٍ فَقَدْ بَرِئَ مِنَ الإِثْمِ، وَأَدَّى وَظِيفَتَهُ، وَمَنْ أَنْكَرَ بِحَسَبِ طَاقَتِهِ فَقَدْ سَلِمَ مِنْ هٰذِهِ المَعْصِيَةِ، وَمَنْ رَضِيَ بِفِعْلِهِمْ وَتَابَعَهُمْ، فَهُوَ العَاصِي.

ఈ హదీసు భావం ఏమిటంటే, చేత్తోగాని లేక నోటితోగాని అధికారుల ఆగడాలను నిలువరించే శక్తిలేకపోవటం చేత మనసులో వాటిని చెడుగా భావించిన వాడు ఆ చెడునుండి బతికిపోయాడు. తనపై వున్న బాధ్యతను నిర్వర్తించాడు. అలాగే శక్తిమేరకు వాటిని ఖండించిన వాడు కూడా ఆ పాపం నుండి బయట పడ్డాడు. కాని వారి పనులకు తన ఆమోదాన్ని తెలుపుతూ, వారిని అనుసరించిన వాడు మాత్రం పాపాత్ముడయిపోయాడు.

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ముస్లిం అధికారులు, ప్రభుత్వాధినేతలు నమాజును స్థాపించినంతకాలం ప్రజలు వారికి విధేయత చూపాలన్న విషయంలోని మర్మం ఏమిటంటే, ఇస్లాంకు - దైవధిక్కారానికి మధ్య నమాజే విచక్షణా రేఖ.

2. శక్తి ఉంటే పరిపాలకుల ఆగడాలను అడ్డుకోవాలి. లేకపోతే కనీసం మనసులోనయినా వాటిని నిరసించాలి. అంతేగాని అన్యాయం, దుర్మార్గం విషయంలో వారితో చేతులు కలపకూడదు. పరిపాలకుల దురాగతాలను సమర్థించడం కూడా ఘోరపాపమే. దీనిప్రకారం చూస్తే ఈ రోజుల్లో నీతిమాలిన రాజకీయ పార్టీల్లో చేరడం ఒకవిధంగా ధర్మవ్యతిరేక కార్యక్రమాల్లో

పాలుపంచుకోవడంతో సమానం. ఎందుకంటే ఒక రాజకీయ పార్టీ అధికారంలోకి వచ్చిన తరువాత పార్టీ అధిష్టానం చేసే ప్రతి మంచిపనికీ, చెడుపనికీ పార్టీ కార్యకర్తలు కూడా తలూపవలసి ఉంటుంది. వారి అడుగులకు మడుగులొత్తాల్సి ఉంటుంది. అందుకు ఇస్లాం ధర్మం ఎన్నటికీ అనుమతించదు.

١٩١ ـ السَّادِسُ: عَن أُمِّ الْمُؤمِنينَ أُمِّ الْحَكَمِ زَيْنَبَ بِنْتِ جَحْشٍ رضي الله عنها أنَّ النَّبيَّ ﷺ دَخَلَ عَلَيْهَا فَزِعاً يَقُولُ: «لا إلهَ إلَّا الله، وَيْلٌ لِلْعَرَبِ مِنْ شَرٍّ قَدِ اقْتَرَبَ، فُتِحَ الْيَوْمَ مِن رَدْمِ يَأْجُوجَ وَمَأْجُوجَ مِثْلُ هذِهِ» وَحَلَّقَ بأُصْبُعَيْهِ الإِبْهَامِ وَالَّتِي تَلِيهَا. فَقُلْتُ: يَا رسولَ الله! أنَهْلِكُ وَفِينَا الصَّالِحُونَ؟ قال: «نَعَمْ إذَا كَثُرَ الْخَبَثُ» متفقٌ عليه.

191. విశ్వాసుల మాతృమూర్తి ఉమ్ముల్ హకమ్ జైనబ్ బిన్తె జహష్ (రజి. అన్హా) కథనం ప్రకారం (ఒకరోజు) దైవప్రవక్త (సల్లం) కంగారుపడుతూ ఆమె ఇంటికి వచ్చారు. ఆ సమయంలో ఆయన నోట ఈ పలుకులు వెలువడ్డాయి - "అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్య దైవం లేడు. అరబ్బులు నాశనమయిపోయే విపత్తు దగ్గరకొచ్చింది. ఈ రోజు యాజూజ్, మాజూజ్‌ల గోడ ఇంత తెరువబడింది." (ఆయన తన రెండు వ్రేళ్ళను బొటన వ్రేలిని, దానిప్రక్కనున్న వ్రేలితో కలుపుతూ వలయంలా చేసి చూపించారు). దానికి "ఏమిటి దైవప్రవక్తా! మనమంతా నాశనమయిపోతామా? (అప్పుడు) మనలో మంచివారు కూడా ఉంటారుగా!" అని నేను (జైనబ్‌ని) సందేహపడగా, "అవును, చెడు సర్వసామాన్యం అయిపోయినప్పుడు (మంచివాళ్ళు కూడా చెడ్డవాళ్ళతోపాటు దైవ శిక్షకు గురౌతారు)" అని అన్నారు దైవ ప్రవక్త (స). *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణంలోనూ, ఉపద్రవాల ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని ఉపద్రవాల ప్రకరణంలోనూ ఈ హదీసు పేర్కొనబడింది.)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో కూడా దేవుని అవిధేయత, షరీఅత్ ఆజ్ఞల ఉల్లంఘన వంటి చెడుగుల గురించి చెప్పబడింది. సమాజంలో చెడు సర్వసామాన్యమైపోయినప్పుడు, అందులో కొంతమంది సజ్జనులున్నప్పటికీ యావత్తు సమాజంపై దైవశిక్ష విరుచుకుపడవచ్చు. అయితే ఆ కొద్దిమంది సజ్జనులు మంచిని గురించి ప్రబోధించే, చెడుని నిరోధించే తమ వంతు కర్తవ్యాన్ని నిర్వర్తించి ఉంటే పరలోకంలో వారిని పాపాత్ముల నుండి వేరు చేయటం జరుగుతుంది. ఇంకా ఈ హదీసు చెడును, దేవుని అవిధేయత వంటి పాపాలను ఖండించాలని ప్రబోధిస్తోంది.

١٩٢ ـ السَّابِعُ: عَنْ أَبي سَعيدٍ الْخُدْرِيِّ رضي اللهُ عنه عن النَّبيِّ ﷺ قال: «إيّاكُمْ وَالْجُلُوسَ في الطرُقَاتِ» فقَالُوا: يَا رَسولَ الله! مَا لَنَا مِنْ مَجَالِسِنَا بُدٌّ؛ نَتَحَدَّثُ فِيهَا! فقال رسول الله ﷺ: «فإذَا أبَيْتُمْ إلَّا الْمَجْلِسَ فَأَعْطُوا الطَّرِيقَ حَقَّهُ» قالوا: وَمَا حَقُّ الطَّرِيقِ يَا رسولَ الله؟! قال: «غضُّ الْبَصَرِ، وَكَفُّ الأذَى، وَرَدُّ السَّلامِ، وَالأَمْرُ بالْمَعْرُوفِ، وَالنَّهْيُ عَنِ الْمُنْكَرِ» متفقٌ عليه.

192. హజ్రత్ అబూసయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "మీరు (జనులు నడిచే) దారుల్లో కూర్చోకండి" అని ఆదేశించారు. అప్పుడు సహచరులు, "దైవప్రవక్తా! దారుల్లో కూర్చోవటం తప్ప మాకు వేరే దిక్కులేదు. మేము అక్కడ కూర్చొని (చాలా ముఖ్యమైన) మాటలు మాట్లాడుకుంటాము" అని విన్నవించుకోగా, "సరే (దారుల్లో) కూర్చోవటం తప్పదనుకుంటే మరి మీరు దారి హక్కును నెరవేర్చండి" అని అన్నారు. అది విని సహచరులు మళ్ళీ, "ఈ దారి హక్కు ఏమిటి దైవప్రవక్తా!?" అని ప్రశ్నించగా, "చూపులు క్రిందికి వాల్చి ఉంచడం, బాధాకరమైన వస్తువులను దారినుండి తొలగించడం (లేదా ఎవరికీ తమ వల్ల ఇబ్బంది కల్గకుండా జాగ్రత్త పడటం), సలాంకు జవాబు పలకటం, మంచిని గురించి ప్రబోధించడం, చెడు నుంచి వారించడం (ఇదే దాని హక్కు)"

అని ఆయన బదులిచ్చారు.

(బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని 'అత్యాచారాల' ప్రకరణంలోనూ, అనుమతి తీసుకునే ప్రకరణంలోనూ; ఇంకా సహీహ్ ముస్లింలోని వస్త్రధారణ ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

జనులు నడిచే రోడ్లపై, కాలిబాటలపై కూర్చొని మాట్లాడు కోవడం ధర్మసమ్మతం కాదని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. దీనివల్ల వచ్చేపోయే జనులకు, ముఖ్యంగా స్త్రీలకు ఇబ్బంది కలగవచ్చు. రోడ్లపై కూర్చొని మాట్లాడుకోవటమే ధర్మసమ్మతం కానప్పుడు వేలమంది జనాలకు ఇబ్బంది కలిగేవిధంగా నడి రోడ్డుపైనే బహిరంగ సభలు నిర్వహించడం, సమావేశాలు జరపటం, వివాహాది వేడుకల సందర్భంగా రోడ్లను మూసి ట్రాఫిక్ సమస్యలను సృష్టించడం ఎలా ధర్మసమ్మతం అవుతుంది? దురదృష్టవశాత్తు ఈ సమస్య మన దేశంలో మరీ ఎక్కువగా ఉండటం శోచనీయం.

2. అయితే అనివార్య పరిస్థితుల్లో మాత్రం పైన హదీసులో పేర్కొనబడిన నియమనిబంధనల ననుసరించి రోడ్లపై సమావేశాలు జరుపుకోవటం ధర్మసమ్మతం అవుతుంది. దీనికి సంబంధించిన మరికొన్ని నియమాలు ఇతర హదీసుల్లో పేర్కొనబడ్డాయి. ఉదా: మంచిమాటలు మాట్లాడుకోవడం, ఎవరైనా ఎక్కువ బరువును మోసుకెళుతూ కనబడితే అతనికి సాయం చేయడం, ప్రమాదాలకు గురైన బాధితులను ఆదుకోవడం, దారి తెలియనివారికి దారి చూపించటం, బజారులో నడుస్తున్న వ్యక్తి తుమ్మి 'అల్‌హమ్దులిల్లాహ్' అని అంటే దానికి సమాధానంగా 'యర్‌హముకల్లాహ్' అని పలకడం మొదలగునవి.

١٩٣ ـ الثَّامِنُ: عَنِ ابنِ عباسٍ رضي الله عنهما أن رسولَ الله ﷺ رَأى خَاتَماً مِنْ ذَهَبٍ في يَدِ رَجُلٍ، فَنَزَعَهُ فَطَرَحَهُ وَقَالَ: «يَعْمِدُ أَحَدُكُمْ إِلَى جَمْرَةٍ

193. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఒక వ్యక్తి చేతికి బంగారపు ఉంగరం ఉండటం చూశారు. ఆయన దాన్ని (ఆ వ్యక్తి చేతినుండి) లాక్కొని పారేశారు. ఆ తరువాత (ప్రజలను) "మీలో ఎవరికైనా నరకజ్వాల (కు గురి) కావాలనుకుంటే దీనిని చేతికి తొడగవచ్చు" అని హెచ్చరించి వెళ్ళిపోయారు. ఆయన వెళ్ళిన

مِنْ نَارٍ فَيَجْعَلُهَا فِي يَدِهِ!» فَقِيلَ لِلرَّجُلِ بَعْدَ مَا ذَهَبَ رسولُ الله ﷺ خُذْ خَاتَمَكَ؛ انْتَفِعْ بِهِ. قَالَ: لا وَاللهِ! لا آخُذُهُ أَبَداً وَقَدْ طَرَحَهُ رسولُ الله ﷺ. رواه مسلم.

తరువాత అక్కడున్న వారిలో ఎవరో అతనితో "నీ ఉంగరాన్ని తీసుకో. (దాన్ని అమ్మిగాని లేక ఎవరికైనా బహుమానం ఇచ్చిగాని) నీవు దాంతో ప్రయోజనం పొందవచ్చు" అని సలహా ఇవ్వగా "దైవ సాక్షి! దైవప్రవక్త (సల్లం) వద్దని పారేసిన వస్తువుని నేనెన్నటికీ ముట్టుకోను" అని అన్నాడా వ్యక్తి.

*(సహీహ్ ముస్లింలోని వస్త్రధారణ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఇస్లాంలో పురుషులు బంగారు ఆభరణాలు తొడగటం నిషిద్ధం. ఆఖరికి మగవారు ఒక బంగారపు ఉంగరం కూడా తొడగరాదు. కాని శోచనీయమైన విషయం ఏమిటంటే, జనులు స్వయంగా కల్పించుకున్న ఆచారం వల్ల పెళ్ళి నిశ్చితార్థ సందర్భాల్లో, కాబోయే వరుడికి బంగారపు ఉంగరం తొడగటం మన సమాజంలో సర్వసాధారణమైపోయింది. మరోవైపు పురుషులు కూడా వాటిని ధరించడాన్ని డాబుగా భావిస్తున్నారు. నేడు మననాట ప్రబలుతున్న ఈ షరీఅత్ ఉల్లంఘన వినాశానికి దారితీస్తుందనడంలో సందేహం లేదు. కాబట్టి దీనిని రూపుమాపటానికి ప్రజలు వ్యక్తిగతంగానూ, సామూహికంగానూ కృషి చేయాలి. నిశ్చితార్థ సమయాల్లో కానుకలు ఇచ్చిపుచ్చుకోవడం, గొప్పగొప్ప విందు భోజనాల ఏర్పాట్లు చేయడం లేనిపోని భారాన్ని నెత్తిన వేసుకోవటం తప్ప మరేమీ కాదు. అసలు ఇస్లామీయ షరీఅత్‌లో దీనికి అనుమతి ఉందా లేదా అన్నదీ ఆలోచించాల్సిన విషయమే. దానికితోడు 'నిషిద్ధ' (హరాం) వస్తువులు కానుకలుగా ఇవ్వడమంటే తప్పు మీద తప్పు చేస్తున్నట్లే లెక్క. అల్లాహ్ ముస్లింలకు సద్బుద్ధిని ప్రసాదించుగాక!

2. ఈ హదీసు ద్వారా దైవప్రవక్త (సల్లం) పట్ల ఆయన సహచరులు ప్రదర్శించిన నిరుపమాన విధేయతాభావం వెల్లడౌతోంది.

١٩٤ ـ التَّاسِعُ: عَنْ أَبِي سَعِيدٍ الْحَسَنِ الْبَصْرِيِّ أَنَّ عَائِذَ بنَ عَمْرٍو رضي الله عنه دَخَلَ عَلَى عُبَيْدِ اللهِ بن زِيَادٍ فَقَالَ: أَيْ بُنَيَّ، إِنِّي سَمِعْتُ رسولَ الله ﷺ يَقُولُ: «إِنَّ

194. హజ్రత్ అబూ సయీద్ హసన్ బస్రీ (రహ్మాలై) కథనం : ఒకసారి ఆయిజ్ బిన్ అమ్ర్ (రజి), ఉబైదుల్లాహ్ బిన్ జియాద్ దగ్గరికి వెళ్ళి "చూడు నాయనా! ప్రజల పట్ల కఠినంగా వ్యవహరించే పాలకులు అతి నీచులు" అని దైవప్రవక్త (సల్లం)

شَرَّ الرِّعَاءِ الْحُطَمَةُ» فَإِيَّاكَ أَنْ تَكُونَ مِنْهُمْ فَقَالَ لَهُ: اجْلِسْ فَإِنَّمَا أَنتَ مِنْ نُخَالَةِ أَصْحَابِ مُحَمَّدٍ ﷺ، فقال: وَهَلْ كَانَتْ لَهُمْ نُخَالَةٌ، إِنَّمَا كَانَتِ النُّخَالَةُ بَعْدَهُمْ وَفِي غَيْرِهِمْ! رواه مسلم.

అంటుండగా నేను విన్నాను. కనుక నీవు కూడా వారిలాగా అవకుండా జాగ్రత్త పడు!" అని ఉపదేశించారు. అది విని ఉబైదుల్లా బిన్ జియాద్, "కూర్చో (చెబుతా)! నువ్వు ముహమ్మద్ (సల్లం) అనుచరుల్లోని తప్పు, తాలు వంటివాడివి కదూ!" అని హేళన చేసి మాట్లాడాడు. దానికి ఆయిజ్ (రజి), "ఏమిటి, దైవప్రవక్త అనుచరుల్లో తప్పు, తాలు అనదగ్గవారున్నారా? (అసంభవం). తప్పు, తాలు (లాంటి మనుషులు) వారు కాదు, వారి తరువాత వచ్చిన వాళ్ళు" అని అతనికి సమాధానం చెప్పారు.

(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా దైవప్రవక్త సహచరులైన హజ్రత్ ఆయిజ్ (రజి) గారి ధైర్యసాహసాలు, సత్యాన్ని చాటిచెప్పే ఆయన ధీరత్వం వెల్లడౌతున్నాయి. నిరంకుశుడైన బస్రా గవర్నరు ఉబైదుల్లాహ్ బిన్ జియాద్‌కు ఆయన ఏమాత్రం భయపడకుండా దైవప్రవక్త ప్రవచనాన్ని వినిపించారు. తన దురహంకారాన్ని ముఖం మీదే ఖండించినందుకు ఉబైదుల్లాహ్ కోపోద్రిక్తుడై ఆయన్ని దైవప్రవక్త సహచరుల్లో పొట్టులాంటివాడని అవమానించాడు. కాని వెంటనే ఆయన ప్రవక్త సహచరుల మహిమోన్నతలను చాటిచెప్పి, వాళ్ళలో ఎవరూ తప్పు, తాలూ లాంటి వ్యక్తులు లేరని, వారి తరువాత వచ్చిన నీలాంటివారే తప్పు, తాలూ అని నిర్భయంగా దీటైన సమాధానమిచ్చారు.

١٩٥ ـ الْعَاشِرُ: عَنْ حُذَيْفَةَ رضيَ اللهُ عنهُ عَنِ النبيِّ ﷺ قال: «وَالَّذِي نَفْسِي بِيَدِهِ! لَتَأْمُرُنَّ بِالْمَعْرُوفِ، وَلَتَنْهَوُنَّ

195. హజ్రత్ హుజైఫా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : "ఎవరి గుప్పెట్లోనైతే నా ప్రాణముందో ఆయన సాక్షిగా చెబుతున్నాను! మీరు తప్పకుండా మంచిని గురించి ఆజ్ఞాపించండి, చెడు నుంచి

عَنِ الْمُنْكَرِ، أَوْ لَيُوشِكَنَّ اللهُ أَنْ يَبْعَثَ عَلَيْكُمْ عِقَاباً مِنْهُ، ثُمَّ تَدْعُونَهُ فَلا يُسْتَجَابُ لَكُمْ» رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

వారించండి. లేకపోతే త్వరలోనే దేవుడు మీపై తన తరఫునుండి ఏదైనా శిక్షను అవతరింపజేయవచ్చు. ఇక ఆ తరువాత మీరు ఎంత ప్రార్థించినా మీ ప్రార్థనలు ఆలకించబడవు (జాగ్రత్త!)." (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు).

*(జామె తిర్మిజీలోని ఉపద్రవాల అధ్యాయములు)*

## ముఖ్యాంశాలు

మంచిని పెంపొందించే, చెడుని నిర్మూలించే బాధ్యతను విస్మరిస్తే దైవశిక్ష విరుచుకుపడటంతోపాటు, దేవుని సన్నిధిలో చేసుకునే ప్రార్థనలు కూడా స్వీకృతిని పొందజాలవని ఈ హదీసు ద్వారా తేటతెల్లమవుతోంది.

١٩٦ ـ الْحَادِيَ عَشَرَ: عَنْ أَبِي سَعِيدٍ الْخُدرِيِّ رضي الله عنه عن النَّبِيِّ ﷺ قَالَ: «أَفْضَلُ الْجِهَادِ كَلِمَةُ عَدْلٍ عِنْدَ سُلْطَانٍ جَائِرٍ» رواه أبو داود، والترمذي وقال: حديثٌ حسنٌ.

196. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : నిరంకుశుడైన రాజు ముందు న్యాయం గురించి మాట్లాడటం (దైవమార్గంలో చేసే) అత్యుత్తమ జిహాద్ (పోరాటానికి సమానం). (దీనిని అబూదావూద్ మరియు తిర్మిజీ ఉల్లేఖించారు. ఇంకా తిర్మిజీ దీనిని 'హసన్'గా పేర్కొన్నారు.)

*(జామె తిర్మిజీలోని ఉపద్రవాల అధ్యాయంలోనూ, ఇంకా సుననె అబూదావూద్‌లోని కితాబుల్ ములాహిమ్‌లోనూ పొందుపరచబడిన హదీసు).*

## ముఖ్యాంశాలు

వాస్తవానికి 'జిహాద్' అంటే కృషిచేయటం, ప్రయత్నించడం అని అర్థం. దైవధర్మ ఔన్నత్యానికి దోహదపడే ప్రతి కృషినీ, ప్రయత్నాన్నీ మనం 'జిహాద్'గా అభివర్ణించవచ్చు. ఇందులో అనేక దశలున్నాయి. వాటిలో అత్యున్నతస్థాయికి చెందిన జిహాద్ ఏమిటంటే, ప్రజాపాలకులకు దైవసందేశాన్ని వినిపించి, వారు పాల్పడుతున్న ధర్మవిరుద్ధమైన కార్యకలాపాలను, ప్రజావ్యతిరేక

విధానాలను ఎండగట్టడం. అదేవిధంగా సమాజంలో అవినీతి రాజ్యమేలుతూ ఎవరికీ దానిగురించి మాట్లాడే ధైర్యం లేకపోయినప్పుడు దానికి వ్యతిరేకంగా గళం విప్పడం కూడా గొప్ప జిహాద్ అవుతుంది.

197. హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ తారిఖ్ బిన్ షిహాబ్ బజలీ అహ్మసీ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) రికాబుపై కాలుపెట్టి (తన వాహనమెక్కుతుండగా) అంతలోనే ఒకవ్యక్తి వచ్చి ఆయన్ని "అన్నింటికంటే శ్రేష్ఠమైన జిహాద్ ఏది?" అని అడిగాడు. దానికి ఆయన, "నిరంకుశుడైన రాజుముందు సత్యాన్ని చాటిచెప్పటం" అని సమాధాన మిచ్చారు. (నసాయి దీనిని ప్రామాణిక మైన పరంపర ఆధారంగా ఉల్లేఖిం చారు).

١٩٧ ـ الثَّانِيَ عَشَرَ: عَنْ أَبي عبدِ الله طَارِقِ بنِ شِهَابٍ البَجَلِيِّ الأَحْمَسِيِّ رضي الله عنه أَنَّ رَجُلاً سَأَلَ النَّبِيَّ ﷺ، وَقَدْ وَضَعَ رِجْلَه في الغَرْزِ: أَيُّ الجِهَادِ أَفْضَلُ؟ قَالَ: «كَلِمَةُ حَقٍّ عِنْدَ سُلْطَانٍ جائِرٍ» رَوَاهُ النَّسَائِيُّ بإسنادٍ صحيحٍ. «الْغَرز» بِغَيْنٍ مُعْجَمَةٍ مَفْتُوحَةٍ ثُمَّ رَاءٍ سَاكِنَةٍ ثُمَّ زَايٍ، وَهُوَ رِكَابُ كَوْرِ الْجَمَلِ إِذَا كَانَ مِنْ جِلْدٍ أَوْ خَشَبٍ، وَقِيلَ: لَا يَخْتَصُّ بِجِلْدٍ وَخَشَبٍ.

198. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిం చారని హజ్రత్ ఇబ్నె మస్వూద్ (రజి) తెలియజేశారు : ఇస్రాయీల్ జాతి (ధర్మం)లో అన్నిటికన్నా ముందు ఏర్ప డిన లోపం ఏమిటంటే, వారిలో ఒక వ్యక్తి మరొక వ్యక్తితో, "అయ్యా! అల్లాహ్‌కు భయపడు. నీవు చేస్తున్న (చెడు) పనిని వదలిపెట్టు. అది నీకు ధర్మసమ్మతం కాదు" అని అంటాడు. కాని మరుసటి దినం ఆ వ్యక్తి (తన పద్ధతి మార్చుకోకుండా) అదే స్థితిలో ఉన్నప్పటికీ అతను నిస్సంకోచంగా ఆ వ్యక్తితోపాటు తింటాడు, తాగుతాడు, అతని వెంట కూర్చొని (కాలక్షేపం చేస్తాడు). (వాస్తవానికి ఎదుటివ్యక్తి తన

١٩٨ ـ الثَّالِثَ عَشَرَ: عن ابن مَسْعُودٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «إِنَّ أَوَّلَ مَا دَخَلَ النَّقْصُ عَلَى بَنِي إِسْرَائِيلَ أَنَّه كَانَ الرَّجُلُ يَلْقَى الرَّجُلَ فَيَقُولُ: يَا هٰذَا! اتَّقِ الله وَدَعْ مَا تَصْنَعُ فَإِنَّهُ لا يَحِلُّ لَكَ، ثُمَّ يَلْقَاهُ مِن الْغَدِ وهُو عَلَى حَالِهِ، فَلا يَمْنَعُهُ ذلِكَ أَنْ يَكُونَ أَكِيلَهُ وَشَرِيبَهُ وَقَعِيدَهُ، فَلَمَّا فَعَلُوا

పద్ధతిని మార్చుకోకుండా ఉన్నప్పుడు అతనికి దూరంగా ఉండాల్సింది. కాని అతను అలా చేయలేదు. ఇస్రాయీల్ జాతి ధోరణి ఇలాగే ఉండేది). వారు అలా చేసినందుకు అల్లాహ్ వారందరి హృదయాలనూ ఒకేలా మార్చివేశాడు.

తరువాత దైవప్రవక్త (సల్లం) దివ్య ఖుర్‌ఆన్‌లోని ఈ సూక్తిని పఠించారు: "ఇస్రాయీలు సంతతివారిలో అవిశ్వాస మార్గం అవలంబించిన వారిని దావూద్ నోట, మర్యమ్ కుమారుడైన మసీహ్ నోట శపించడం జరిగింది. ఎందుకంటే వారు అవిధేయులయ్యారు. అత్యాచారాలు చేయసాగారు. చెడుపనులు చెయ్యకుండా వారు ఒకరినొకరు నిరోధించడం మానివేశారు. వారు అవలంబించిన మార్గం చాలా చెడ్డది. ఈనాడు నీవు వారిలో చాలా ఎక్కువమందిని (విశ్వాసులకు ప్రతికూలంగా) అవిశ్వాసులను బలపరచేవారుగా, వారితో మైత్రి చేసేవారుగా చూస్తావు. నిశ్చయంగా వారి మనస్సులు వారి కోసం తయారు చేసిపెట్టిన ముగింపు బహుచెడ్డది. ఈ కారణంగా అల్లాహ్ వారిపై ఆగ్రహోదగ్రుడయ్యాడు. వారు శాశ్వత శిక్షకు గురి అవుతారు. వారు నిజంగానే అల్లాహ్‌నూ, ప్రవక్తనూ, ప్రవక్తపై అవతరించిన దానినీ విశ్వసించేవారే అయితే (విశ్వాసులకు ప్రతికూలంగా) అవిశ్వాసులను ఎన్నటికీ మిత్రులుగా చేసుకొని ఉండేవారు కాదు. కాని వారిలో చాలామంది అల్లాహ్ పట్ల విధేయతకు దూరమై

ذلِكَ ضَرَبَ الله قُلُوبَ بَعْضِهِمْ بِبَعْضٍ» ثُمَّ قال: ﴿لُعِنَ ٱلَّذِينَ كَفَرُوا۟ مِنۢ بَنِىٓ إِسْرَٰٓءِيلَ عَلَىٰ لِسَانِ دَاوُۥدَ وَعِيسَى ٱبْنِ مَرْيَمَ ۚ ذَٰلِكَ بِمَا عَصَوا۟ وَّكَانُوا۟ يَعْتَدُونَ ﴿٧٨﴾ كَانُوا۟ لَا يَتَنَاهَوْنَ عَن مُّنكَرٍ فَعَلُوهُ ۚ لَبِئْسَ مَا كَانُوا۟ يَفْعَلُونَ ﴿٧٩﴾ تَرَىٰ كَثِيرًا مِّنْهُمْ يَتَوَلَّوْنَ ٱلَّذِينَ كَفَرُوا۟ ۚ لَبِئْسَ مَا قَدَّمَتْ لَهُمْ أَنفُسُهُمْ﴾ إلى قوله: ﴿فَٰسِقُونَ ﴿٨١﴾﴾ [المائدة: ٧٨ـ ٨١] ثُمَّ قَالَ: «كَلَّا، وَاللهِ! لَتَأْمُرُنَّ بِالْمَعْرُوفِ، وَلَتَنْهَوُنَّ عَنِ الْمُنْكَرِ، ولَتَأْخُذُنَّ عَلَى يَدِ الظَّالِمِ، وَلَتَأْطِرُنَّهُ عَلَى الْحَقِّ أَطْراً، وَلَتَقْصُرُنَّهُ عَلَى الْحَقِّ قَصْراً، أَوْ لَيَضْرِبَنَّ الله بِقُلُوبِ بَعْضِكُمْ عَلَى بَعْضٍ، ثُمَّ لَيَلْعَنَنَّكُمْ كَمَا لَعَنَهُمْ» رواه أبو داود

పోయారు." *(అల్ మాయిద : 78 - 81)*

ఈ సూక్తి పఠించిన తరువాత ఆయన ఇలా అన్నారు : "లేదు, లేదు, మీరు తప్పకుండా మంచిని గురించి ఆదేశిం చాల్సిందే. చెడునుంచి వారించాల్సిందే. మీరు తప్పకుండా అన్యాయం చేసే వాడిని చెయ్యిపట్టి ఆపండి. బలవంతం గానైనా సరే అతణ్ణి న్యాయం వైపుకు మరల్చండి. సత్యాన్ని (అంగీకరించమని) అతనిపై ఒత్తిడి తీసుకురండి. లేకపోతే అల్లాహ్ మీ అందరి హృదయాలనూ ఒకేలా మార్చివేస్తాడు. వారిని శపించిన ట్లుగానే మిమ్మల్నీ శపిస్తాడు. (ఈ హదీసును అబూదావూద్ మరియు తిర్మిజీలు ఉల్లేఖించారు. ఇంకా తిర్మిజీ దీనిని 'హసన్' కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు. హదీసు వాక్యాలు మాత్రం అబూదావూద్‌వి.)

తిర్మిజీలోని వాక్యాలు ఈ విధంగా ఉన్నాయి : ఇస్రాయీల్ జాతి దురాగతా లకు ఒడిగట్టినప్పుడు వారి మత పండితులు వారిని వారించారు. కాని జాతి వారు మాత్రం పాపాలు చేయటం మానలేదు. ఆ తరువాత మత పండితులు కూడా (నిర్మొహమాటంగా) వారితో పాటు కూర్చోవటం, తినటం, త్రాగటం మొదలుపెట్టారు. దాంతో అల్లాహ్ వారందరి హృదయాలనూ ఒకేలా మార్చేశాడు. ఇంకా దావూద్ - అలైహి - మరియు ఈసా - అలైహి - నోట వారిని శపించాడు. ఎందుకంటే

الترمذي وقال: حديث حسن. هذا لفظ أبي داود، وَلفظ الترمذي: قال رسول الله ﷺ: «لمَّا وَقَعَتْ بَنُو إِسْرَائِيلَ في المَعَاصِي نَهَتْهُمْ عُلَمَاؤُهُمْ فَلَمْ يَنْتَهُوا، فَجَالَسُوهُمْ في مَجَالِسِهِمْ وَوَاكَلُوهُمْ وَشَارَبُوهُمْ، فَضَرَبَ اللهُ قُلُوبَ بَعْضِهِمْ بِبَعْضٍ، وَلَعَنَهُمْ عَلَى لِسَانِ دَاوُدَ وَعِيسَى ابنِ مَرْيَمَ ذلِكَ بِمَا عَصَوْا وكَانُوا يَعْتَدُونَ» فَجَلَسَ رسولُ الله ﷺ، وَكَانَ مُتَّكِئاً فَقَالَ: «لا وَالَّذِي نَفْسِي بِيَدِهِ! حَتَّى تَأْطِرُوهُمْ عَلَى الحَقِّ أَطْراً». قَوْلُهُ: «تَأْطِرُوهم» أَيْ: تَعْطِفُوهُمْ. و«لَتَقْصُرُنَّهُ» أَيْ: لَتَحْبِسُنَّهُ.

వారు (అల్లాహ్‌కు) అవిధేయత చూపారు. అత్యాచారాలు చేయడం మొదలెట్టారు.

ఇలా అన్నాక ఆనుకొని కూర్చుని వున్న ఆయన ఒక్కసారిగా లేచి సరిగ్గా కూర్చుని "తప్పదు, ఎవరి గుప్పెట్లోనైతే నా ప్రాణముందో ఆయన సాక్షిగా చెబుతున్నాను. మీరు ప్రజల్ని సత్యం వైపుకు మళ్ళించే దాకా (మీకు ముక్తి లభించదు)" అని చెప్పారు.

"త-తిరూహుమ్" అంటే వారిని మళ్ళించండని, "వల తఖ్‌సురున్నహూ" అంటే వారిని ఆపండి, బలవంతం చేయండని అర్థం.

*(సుననె అబూదావూద్‌లోని ములాహిమ్ ప్రకరణంలోనూ, సుననె తిర్మిజీలోని వ్యాఖ్యానాల అధ్యాయాల్లోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

మత పండితులు తమ బాధ్యతగా భావించి ప్రజల్ని చెడు కార్యాలనుంచి ఆపాలి. ఒకవేళ ప్రజలు ఆ చెడుపనుల్ని వదలిపెట్టేందుకు సిద్ధం కాకపోతే కనీసం మంచివాళ్ళైనా వాళ్ళతోపాటు కూర్చొని కాలక్షేపం చేయటం, వారితో కలసి తినడం, త్రాగడం లాంటి వాటికి దూరంగా ఉండాలని ఈ హదీసు ప్రబోధిస్తోంది. విశ్వాస రోషమున్న ఏ వ్యక్తికీ ఇలా వారితో పాటు కూర్చొని కాలక్షేపం చేయటానికి మనసొప్పదు. పండితులు ఆ మాత్రం రోషం ప్రదర్శించకపోతే వారు కూడా అవిధేయుల్లాగా దైవశాపానికి గురౌతారనడంలో సందేహం లేదు. అల్లాహ్ మనల్నందరినీ రక్షించుగాక!

199. హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (రజి) కథనం : ఒకసారి ఆయన ఇలా అన్నారు: "ప్రజలారా! మీరు ఈ దైవసూక్తిని పఠిస్తూనే ఉంటారు. "విశ్వాసులారా! మిమ్మల్ని గురించి మీరు ఆలోచించు కోండి. మీరు గనక స్వయంగా సన్మా

١٩٩ ـ الرَّابِعَ عَشَرَ: عن أبي بكرٍ الصِّدِّيقِ، رضي الله عنه، قال: يَا أَيُّهَا النَّاسُ إِنَّكُمْ لَتَقْرَؤُونَ هٰذِهِ الآيَةَ: ﴿ يَٰٓأَيُّهَا الَّذِينَ ءَامَنُوا عَلَيْكُمْ أَنفُسَكُمْ لَا يَضُرُّكُم مَّن ضَلَّ إِذَا

أَهْتَدَيْتُمْ﴾ [المائدة: ١٠٥] وإني سَمِعْتُ رسولَ الله ﷺ يقولُ: «إِنَّ النَّاسَ إِذَا رَأَوُا الظَّالِمَ فَلَمْ يَأْخُذُوا عَلَى يَدَيْهِ أَوْشَكَ أَنْ يَعُمَّهُمُ الله بِعِقَابٍ مِنْهُ» رواه أبو داود، والترمذي، والنسائي بأسانيد صحيحة.

ర్గంలో ఉంటే, ఇతరులు మార్గభ్రష్టులైనప్పటికీ మీకు ఎంతమాత్రం హాని కలగదు." (అల్ మాయిద : 105) కాని దైవప్రవక్త (సల్లం), "ప్రజలు ఒక అత్యాచారిని (అత్యాచారం చేస్తుండగా) చూసి కూడా అతణ్ణి చెయ్యిపట్టి ఆపకపోతే త్వరలోనే దైవశిక్ష వారందరినీ చుట్టుముడుతుంది" అని చెబుతుండగా నేను విన్నాను. (దీనిని అబూదావూద్, తిర్మిజీ మరియు నసాయీలు ప్రామాణికమైన పరంపరల ఆధారంగా ఉల్లేఖించారు.)

*(అబూదావూద్‌లోని ములాహిమ్ ప్రకరణంలోనూ, సునన్ తిర్మిజీలోని ఉపద్రవాల అధ్యాయాల్లోనూ, ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

పై హదీసులో ప్రస్తావించబడిన దైవసూక్తిని మొదటిసారిగా చూస్తే ఎవరికైనా అపార్థం కలగవచ్చు. ఈ ఆయతును చదివి - మనిషి స్వయంగా సన్మార్గంలో ఉన్నప్పుడు అతను ఇక మంచిని పెంపొందించే, చెడుని నిర్మూలించే బాధ్యతను నిర్వర్తించవలసిన అవసరం ఉండదనీ, తాను స్వయంగా చెడులకు దూరంగా ఉంటున్నాడు కాబట్టి, తోటివ్యక్తులు చేసే చెడుల గురించి తనను ప్రశ్నించడం జరగదనీ, ఆ విధంగా అసలు ముస్లిం సమాజంపై ప్రపంచంలో దైవధర్మాన్ని సంస్థాపించే బాధ్యతే లేదనీ, ప్రతి వ్యక్తీ తనను తాను సంస్కరించుకుంటే చాలన్న పెడర్థాన్ని తీసుకోవచ్చు. వాస్తవానికి ఈ ఆయతు ఉద్దేశ్యం అది కాదు. హజ్రత్ అబూబక్ర్ (రజి) చెప్పదలచుకున్నది కూడా అదే! ఆయన దైవప్రవక్త ప్రవచనాన్ని వినిపించి ఆ భావాన్ని ఖండించారు. దీనిద్వారా తెలిసేదేమిటంటే సాధ్యమైనంతవరకు చెడుని నిర్మూలించే బాధ్యత ప్రతి ఒక్కరిపై ఉంది. శక్తి ఉండి కూడా చేత్తో గాని లేక నోటితోనైనా సరే చెడుని నిరోధించడానికి కృషిచేయకపోతే చెడు చేసినవారితోపాటు దాన్ని సహించినవారు కూడా దైవాగ్రహానికి పాత్రులౌతారు.

ఇకపోతే పైన ప్రస్తావించబడిన దివ్య ఖుర్‌ఆన్ సూక్తికి సరైన భావం ఏమిటంటే, "విశ్వసించిన ప్రజలారా! జాగ్రత్తగా ఉండండి. మార్గభ్రష్టుల భ్రష్టత దుష్ప్రభావం మీపై కూడా పడవచ్చు. మీకు సన్మార్గం లభించిన తరువాత ఇక మార్గభ్రష్టత్వాన్ని కొనితెచ్చుకోకండి. మార్గభ్రష్టులకు నిరంతరం మంచిని గురించి ఆదేశిస్తూ, చెడునుండి నిరోధిస్తూ ఉన్నప్పుడే ఇది సాధ్యమవుతుంది. లేకపోతే వారి ప్రభావానికి లోనై మీరు కూడా భ్రష్టులైపోయే ప్రమాదముంది." హజ్రత్ అబూబక్ర్ (రజి) దైవప్రవక్త (సల్లం) హదీసును వినిపించి దివ్య ఖుర్‌ఆన్ సూక్తి అర్థాన్ని విడమరచి చెప్పారు.

## 24వ అధ్యాయం

## ٢٤ ـ بَابُ تَغْلِيظِ عُقُوبَةِ مَنْ أَمَرَ بِمَعْرُوفٍ أَوْ نَهَى عَنْ مُنْكَرٍ وَخَالَفَ قَوْلُهُ فِعْلَهُ

## మంచిని గురించి ఆదేశిస్తూ, చెడునుండి వారిస్తూ తాను మాత్రం దానికి విరుద్ధంగా చేసేవాడికి ఎదురయ్యే కఠిన పర్యవసానం గురించి.....

قال اللهُ تعالى: ﴿ أَتَأْمُرُونَ ٱلنَّاسَ بِٱلْبِرِّ وَتَنسَوْنَ أَنفُسَكُمْ وَأَنتُمْ تَتْلُونَ ٱلْكِتَٰبَ ۚ أَفَلَا تَعْقِلُونَ ﴿٤٤﴾ ﴾ [البقرة: ٤٤] وقال تعالى: ﴿ يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لِمَ تَقُولُونَ مَا لَا تَفْعَلُونَ ﴿٢﴾ كَبُرَ مَقْتًا عِندَ ٱللَّهِ أَن تَقُولُوا۟ مَا لَا تَفْعَلُونَ ﴿٣﴾ ﴾ [الصف: ٢، ٣] وقال تعالى إخباراً عن شُعَيْبَ ﷺ: ﴿ وَمَآ أُرِيدُ أَنْ أُخَالِفَكُمْ إِلَىٰ مَآ أَنْهَىٰكُمْ عَنْهُ ﴾ [هود: ٨٨].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"సన్మార్గాన్ని అవలంబించండి అని మీరు ఇతరులకైతే ఉపదేశిస్తారు - కాని మిమ్మల్ని మీరు మరచిపోతారేమిటి? మరి చూడబోతే మీరు గ్రంథపారాయణం చేస్తారు. అయినా మీరు బుద్ధిని బొత్తిగా ఉపయోగించరేమిటి?" (అల్ బఖర : 44)

మరొకచోట ఇలా అంటున్నాడు :

"విశ్వాసులారా! మీరు చేయని విషయాన్ని చేస్తాము అని చెబుతారెందుకు? మీరు చేయని దానిని చేస్తాము అని చెప్పటం అల్లాహ్ దృష్టిలో అత్యంత అప్రియమైన విషయం." (అస్ సఫ్ : 2,3)

ఇంకొకచోట షుఐబ్ - అలైహి - అన్నమాటను ప్రస్తావించాడు:

"(షుఐబ్ ఇలా అన్నాడు) ఏ విషయాల నుండి నేను మిమ్మల్ని వారిస్తున్నానో వాటిని నేనే స్వయంగా చేయటాన్ని నేను సుతరామూ యిష్టపడను." (హూద్ : 88)

٢٠٠ ـ وعن أبي زيدٍ أُسَامَةَ بنِ زيدِ بن حَارِثَةَ، رضي الله عنهما قال:

200. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ జైద్ ఉసామా బిన్ జైద్ బిన్ హారిసా

سَمِعْتُ رسولَ الله ﷺ، يقُولُ: «يُؤْتَى بالرَّجُلِ يَوْمَ القِيَامَةِ فَيُلْقَى في النَّارِ، فَتَنْدَلِقُ أَقْتَابُ بَطْنِهِ، فَيَدُورُ بِهَا كَمَا يَدُورُ الحِمَارُ في الرَّحَا، فَيَجْتَمِعُ إِلَيْهِ أَهْلُ النَّارِ فَيَقُولُونَ: يَا فُلانُ! مَا لكَ؟ أَلَمْ تَكُ تَأْمُرُ بالمَعْرُوفِ وَتَنْهى عَنِ الْمُنْكَرِ؟ فَيَقُولُ: بَلَى، كُنْتُ آمُرُ بالمَعْروفِ وَلا آتِيه، وَأَنْهَى عَنِ المُنْكَرِ وَآتِيهِ» متفق عليه.

قولُهُ: «تَنْدلِقُ» هُوَ بالدَّالِ المهملةِ، ومَعْنَاهُ تَخْرُجُ. وَ«الأَقْتَابُ» الأَمْعَاءُ، وَاحِدُهَا قِتْبٌ.

(రజి) తెలియజేశారు: "ప్రళయదినాన ఒక వ్యక్తిని తీసుకొచ్చి అగ్ని (నరకం)లో పడవేయటం జరుగుతుంది. దాంతో అతని పేగులు (కడుపులో నుండి) బయటికి వచ్చి పడతాయి. అతనా ప్రేగుల్ని పట్టుకొని గానుగ గాడిదలా (నరకంలో అటూ ఇటూ) తిరుగుతూ ఉంటాడు. ఇతర నరకవాసులు అతని వద్దకు చేరి, "అయ్యో! మీరేం పాపం చేశారని ఇక్కడున్నారు? మీరైతే మంచి పనులు చేయమని ప్రబోధిస్తూ, చెడు పనులు చేయవద్దని వారిస్తూ ఉండే వారు కదా!" అని అడుగుతారు. దానికి అతను, "నిజమే, నేను మంచిని గురించి ఆజ్ఞాపించిన మాట వాస్తవమే. కాని నేను మాత్రం మంచి పనులు చేసేవాణ్ణి కాదు. ఇతరులను చెడునుండి వారిస్తూ నేను స్వయంగా దానికి పాల్పడేవాణ్ణి" అని చెప్తాడు. (బుఖారీ - ముస్లిం)

'తందలిఖు' అంటే బయటికి వస్తాయి అని అర్థం. 'అఖ్‌తాబ్' అంటే ప్రేగులు. 'ఖిత్‌బున్' ఏకవచనం.

*(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

వేదికలపై నించొని ఊకదంపుడు ఉపన్యాసాలతో ప్రజలను ఉద్రూతలూగిస్తూ, వ్యక్తిగత జీవితంలో మాత్రం దానికి విరుద్ధమైన పనులుచేసే పండితులకు, సత్య సందేశ ప్రదాతలకూ ఈ హదీసు కనువిప్పు కావాలి. అలాగే ఇతరుల ముందు నీతి సూత్రాలు వల్లిస్తూ తమల్ని తాము మరచిపోయే తల్లిదండ్రులకు, ఉపాధ్యాయులకు, పీఠాధిపతులకు, మత, రాజకీయ నాయకులకు కూడా ఈ హదీసులో హెచ్చరిక ఉంది.

25వ అధ్యాయం

# ٢٥ ـ بَابُ الأَمْرِ بِأَدَاءِ الأَمَانَةِ

# అమానతులు

قال الله تعالى: ﴿إِنَّ ٱللَّهَ يَأْمُرُكُمْ أَن تُؤَدُّوا ٱلْأَمَـٰنَـٰتِ إِلَىٰٓ أَهْلِهَا﴾ [النساء: ٥٨]

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"ముస్లిములారా! ఎవరి అమానతులను వారికి అప్పగించమని అల్లాహ్ మిమ్మల్ని ఆజ్ఞాపిస్తున్నాడు." (అన్ నిసా : 58)

وقال تعالى: ﴿إِنَّا عَرَضْنَا ٱلْأَمَانَةَ عَلَى ٱلسَّمَـٰوَٰتِ وَٱلْأَرْضِ وَٱلْجِبَالِ فَأَبَيْنَ أَن يَحْمِلْنَهَا وَأَشْفَقْنَ مِنْهَا وَحَمَلَهَا ٱلْإِنسَـٰنُ إِنَّهُۥ كَانَ ظَلُومًا جَهُولًا ۝٧٢﴾ [الأحزاب: ٧٢].

మరోచోట అల్లాహ్ ఇలా అంటున్నాడు :

"మేము ఈ అమానతును ఆకాశాలముందూ, భూమిముందూ, పర్వతాలముందూ పెట్టాము. అవి దానిని మోయటానికి సిద్ధపడలేదు. దానికి భయపడ్డాయి. కాని మానవుడు దాన్ని తనపై మోపుకున్నాడు. నిస్సందేహంగా, అతడు అన్యాయం చేసుకున్నాడు, మూర్ఖుడు." (అల్ అహ్‌జాబ్ : 72)

*గమనిక : పై సూక్తిలో అమానతు అంటే దేవుని ఆజ్ఞలు, విధులు, నిషేధాలని అర్థం. ఆ విధంగా యావత్తు షరీఅత్ (ధర్మం) ఒక అమానతు (అప్పగింత) లాంటిదే. దేవుడు భూమ్యాకాశాల్లో, పర్వతాల్లో ఒక రకమైన గ్రహణశక్తిని సృజించాడు. అందుకే అవి ఈ అప్పగింతను భరించడానికి వెనుకంజవేశాయి. దైవప్రవక్త (సల్లం) ఆనుకొని నిలబడి ఉపన్యాసం ఇచ్చే చెట్టు కొమ్మ దుఃఖించిందని హదీసుల ద్వారా తెలుస్తోంది. భూమ్యాకాశాల, పర్వతాల గ్రహణశక్తి కూడా అలాంటిదే!*

٢٠١ ـ عن أَبي هريرة رضي الله عنه، أنَّ رسولَ الله ﷺ قالَ: «آيَةُ المُنَافِقِ ثَـلاثٌ: إِذَا حَـدَّثَ كَـذَبَ، وَإِذَا وَعَـدَ أَخْلَفَ، وَإِذَا اؤْتُمِنَ خَانَ» متفقٌ عليه.

201. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : మూడు విషయాల ద్వారా కపటిని గుర్తించవచ్చు. అతను మాట్లాడితే అబద్ధం పలుకుతాడు, ఏదైనా వాగ్దానం చేస్తే దాన్ని భంగపరు

స్తాడు, ఇంకా అతని దగ్గర అమానతు (అప్పగింత)ను ఉంచితే అందులో ద్రోహానికి పాల్పడతాడు.

*(బుఖారీ - ముస్లిం)*

وفي رواية: «وَإِنْ صَامَ وَصَلَّى وَزَعَمَ أَنَّهُ مُسْلِمٌ».

వేరొక ఉల్లేఖనంలో, "ఒకవేళ అతను నమాజ్ చేసినా, ఉపవాసాలు పాటించినా, తన్ను తాను ముస్లింగా భావించినాసరే (అతను కపటిగానే పరిగణించబడతాడు)" అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

మనసులో ఇస్లాం మరియు ముస్లింలతో విరోధాన్ని, అక్కసును దాచిపెట్టుకుని పైకి మాత్రం తాను ముస్లిమనని చెప్పుకునేవాడిని 'మునాఫిక్' (కపట విశ్వాసి) అని అంటారు. ఈ కపట స్వభావం 'కుఫ్ర్' (దైవతిరస్కారం) కన్నా హేయమైనది. అందుకే దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : "బాగా తెలుసుకోండి, కపటులు నరకంలో అట్టడుగు ప్రదేశానికి పోతారు" (అన్ నిసా : 145). దైవప్రవక్త (సల్లం) కాలంలో ఇలాంటి కపటులు అనేకమంది ఉండేవారు. దేవుడు ఆయనకు వహీ ద్వారా వారందరి పేర్లనూ తెలియజేశాడు. కాని ప్రస్తుత కాలంలో ఇలాంటి కపటులను గుర్తించడం చాలా కష్టం. కనుక ఇప్పుడు ఎవరినీ కపటులని అనడానికి వీల్లేదు. దైవప్రవక్త తదనంతరం వహీ (దైవవాణి) అవతరణ ఆగిపోయింది. ప్రజల మనసులో దాగివున్న కపట స్వభావాన్ని తెలుసుకోవడం ఇక అసాధ్యం. అయితే నేడు ముస్లింలలోనూ ఆచరణపరమైన కాపట్యం సామాన్యమైపోవడం శోచనీయం. హదీసులో సూచించబడిన కపట చేష్టల్ని ముస్లింలు కూడా అవలంబిస్తున్నారు. ఇది ఆచరణపరమైన కాపట్యమే గాని విశ్వాసపరమైన కాపట్యం కాదు. ఇస్లాంపై అపనమ్మకంతో కపట చేష్టలకు పాల్పడితే అది కుఫ్ర్ అవుతుంది. అయితే ఆచరణపరమైన కాపట్యం కూడా చాలా ప్రమాదకరమైనదే. కనుక ముస్లింలు అలాంటి చేష్టలకు దూరంగా ఉండటానికి ప్రయత్నించాలి. లేకపోతే వారు కూడా క్రమక్రమంగా కాపట్యగోతిలో పడిపోయే అవకాశముంది!

٢٠٢ ـ وعن حُذَيْفَةَ بنِ الْيَمَانِ رضي الله عنه، قال: حدثنا رسولُ الله ﷺ

202. హజ్రత్ హుజైఫా బిన్ యమాన్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) మాకు (భవిష్యత్తులో జరగబోయే) రెండు

حَدِيثَيْنِ قَدْ رَأَيْتُ أَحَدَهُمَا، وَأَنَا أَنْتَظِرُ الآخَرَ: حَدَّثَنَا أَنَّ الأَمَانَةَ نَزَلَتْ فِي جَذْرِ قُلُوبِ الرِّجَالِ، ثُمَّ نَزَلَ القُرآنُ فَعَلِمُوا مِنَ القُرْآنِ، وَعَلِمُوا مِنَ السُّنَّةِ، ثُمَّ حَدَّثَنَا عَنْ رَفْعِ الأَمَانَةِ فَقَالَ: «يَنَامُ الرَّجُلُ النَّوْمَةَ فَتُقْبَضُ الأَمَانَةُ مِنْ قَلْبِهِ، فَيَظَلُّ أَثَرُهَا مِثْلَ الوَكْتِ، ثُمَّ يَنَامُ النَّوْمَةَ فَتُقْبَضُ الأَمَانَةُ مِنْ قَلْبِهِ، فَيَظَلُّ أَثَرُهَا مِثْلَ أَثَرِ المَجْلِ، كَجَمْرٍ دَحْرَجْتَهُ عَلَى رِجْلِكَ، فَنَفِطَ فَتَرَاهُ مُنْتَبِراً

విషయాలు చెప్పారు. అందులో ఒకటి (నిజమయింది. దాన్ని నేను కళ్ళారా) చూశాను. ఇక రెండవ దానికోసం - ఎదురుచూస్తున్నాను. ఆయన మాతో ఇలా చెప్పి ఉన్నారు: "(ముందు) నిజాయితి ప్రజల హృదయాల్లో వ్రేళ్ళూనుకుంది (అంటే నిజాయితి మానవ సహజధర్మం అన్నమాట). ఆ తరువాత దివ్యఖుర్ఆన్ అవతరించింది. అప్పుడు వారు ఖుర్ఆన్ మరియు ప్రవక్త బోధనల ద్వారా దాని గురించి (మరింత వివరంగా) తెలుసుకున్నారు (అంటే మానవ సహజధర్మాన్ని ఖుర్ఆన్, హదీసుల ద్వారా ఇంకా బాగా ఆకళింపు చేసుకున్నారని అర్థం.)

ఆ తరువాత మనిషి హృదయం నుండి నిజాయితీ అడుగంటిపోవడం గురించి వివరిస్తూ ఆయన ఇలా అన్నారు : మనిషి ఒకసారి పడుకున్నప్పుడు అతని హృదయం నుండి నిజాయితీని స్వాధీనపరచుకోవటం జరుగుతుంది. దాంతో (గాయం నయమయిపోయిన తరువాత) మిగిలిన మచ్చ లాగా నిజాయితి తాలూకు ఒక చిన్న మచ్చ మాత్రమే అక్కడ ఉండిపోతుంది.

ఆ తరువాత అతను (రెండవసారి) పడుకున్నప్పుడు (మిగిలిపోయిన) నిజాయితీని కూడా తీసేయడం జరుగు

وَلَيْسَ فِيهِ شَيْءٌ» ثُمَّ أَخَذَ حَصَاةً فَدَحْرَجَ عَلَى رِجْلِهِ «فَيُصْبِحَ النَّاسُ يَتَبَايَعُونَ. فَلا يَكَادُ أَحَدٌ يُؤَدِّي الأَمَانَةَ حَتَّى يُقَالَ: إِ فِي بَنِي فُلانٍ رَجُلاً أَمِيناً، حَتَّى يُقَالَ لِلرَّجُلِ: مَا أَجْلَدَهُ، مَا أَظْرَفَهُ، مَا أَعْقَلَهُ وَمَا فِي قَلْبِهِ مِثْقَالُ حَبَّةٍ مِنْ خَرْدَلٍ مِ إِيمَانٍ» وَلَقَدْ أَتَى عَلَيَّ زَمَانٌ وَمَا أُبَالِ أَيُّكُمْ بَايَعْتُ؛ لَئِنْ كانَ مُسْلِماً لَيَرُدَّنَّهُ عَلَ دِينُهُ، وَلَئِنْ كَانَ نَصْرَانِيّاً أَوْ يَهُودِيّاً لَيَرُدَّ عَلَيَّ سَاعِيهِ، وَأَمَّا الْيَوْمَ فَمَا كُنْتُ أُبَايِ مِنْكُمْ إِلَّا فُلاناً وَفُلاناً. متفقٌ عليه.

తుంది. దాంతో ఒక నిప్పు రవ్వ కాలి మీద దొర్లినప్పుడు బొబ్బవచ్చి ఎలా ఉబ్బెత్తుగా కనిపిస్తుందో నిజాయితి తాలూకు గుర్తుకూడా అలాగే కనిపిస్తుంది. ఆ బొబ్బ లోపల ఏమీ ఉండదు (మనిషి నిజాయితీ పరిస్థితి కూడా అలాగే తయారవుతుంది). ఈ విషయం చెబుతూ ఆయన (ప్రజలకు అర్థం కావటం కోసం) ఒక కంకర రాయిని చేతిలోకి తీసుకొని దానిని తన కాలిపై దొర్లించారు.

(ఆ తరువాత ఇలా అన్నారు:) ప్రజలు అమ్మకాలు, కొనుగోళ్ళయితే చేస్తారు. కాని వారిలో ఎవరికీ ప్రజలు భద్ర పరచమని ఇచ్చిన అమానతులను అప్పగించాలన్న ధ్యాసే ఉండదు. ఆఖరికి ప్రజలు "ఫలానా తెగలో ఎంతో నిజాయితీపరుడైన మనిషి ఉండేవాడు" అని అంటారు. (అంటే నిజాయితీ పరులు అరుదైపోతారన్నమాట. అలాగే ప్రజల విశ్వాసం కూడా క్షీణించి పోతుంది) "(ఫలానా వ్యక్తి విశ్వాసంలో) ఎంత గట్టివాడు! ఎంత వివేకి!! ఎంత బుద్ధిమంతుడు!!!" అని ప్రశంసిస్తారు గాని నిజానికి అతని హృదయంలో ఆవగింజంత విశ్వాసం కూడా ఉండదు.

(హదీసు ఉల్లేఖకులు హజ్రత్ హుజైఫా (రజి) ఇలా అంటున్నారు:) నిస్సందే

హంగా చెబుతున్నాను. ఒకప్పుడు నేను మీలో ఎవరితో క్రయవిక్రయాలు జరుపుతున్నానన్న విషయాన్ని అసలు పట్టించుకునే వాణ్ణే కాదు. ఎందుకంటే (నేను వ్యవహారం జరుపుతున్న) వ్యక్తి ముస్లిం అయితే అతని (ఇస్లాం) ధర్మం నాకు రావలసిన హక్కును నాకు ఇప్పిస్తుందన్న నమ్మకం నాకు ఉండేది. ఒకవేళ ఆ వ్యక్తి క్రైస్తవుడో లేక యూదుడో అయివుంటే అతని పర్యవేక్షకుడు నాకు నా వస్తువుని ఇప్పించేవాడు (ఆ కాలంలో నిజాయితీ, విశ్వాసాలు గాలి, నీరులా సర్వత్రా వ్యాపించి ఉండేవి కనుక నాకు నష్టం కలుగుతుందన్న భయం లేకపోయింది). కాని నేడు (పరిస్థితులు మారిపోయాయి కాబట్టి) నేను మాలో ఫలానా (నమ్మకస్తు లైన) వ్యక్తులతోనే అమ్మకం, కొనుగోళ్ళ వ్యవహారం జరుపుతాను.

*(బుఖారీ - ముస్లిం)*

'జజ్ర్' అంటే వస్తువులోని తొలి భాగం పేరు. 'వక్త్' అంటే చిన్న మచ్చ. 'మజ్ల్' అంటే పని చేయటం వల్ల చేతులకూ, కాళ్ళకీ బొబ్బలు రావటం. 'ముంతబిరన్' అంటే ఉబ్బినది. 'సాయి' అంటే బాధ్యుడు, పర్యవేక్షకుడు.

قوله: «جَذْر» بفتح الجيم وَإسْكانِ الـذَّالِ الْمُعْجَمَـةِ: وَهُـوَ أَصْـلُ الشـيْءِ. و«الْوَكْتُ» بالتَّاءِ الْمُثَنَّاةِ مِنْ فَوْقُ: الأَثَرُ الْيَسِيرُ. وَ«الْمَجْلُ» بفتح الميم وإسكانِ الجيم، وَهُوَ تَنَفُّطٌ في الْيَدِ وَنَحْوِها مِنْ أثَرِ عَمَلٍ وَغَيْرِهِ. قوله: «منتبراً»: مرتفعاً. قوله: «سَاعِيهِ»: الْوَالي عَلَيْهِ.

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణంలోనూ ఉపద్రవాల ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణంలోనూ ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

"అమానత్" (నిజాయితి) అన్న పదానికి చాలా విస్తృతమైన భావముంది. ధర్మాదేశాలను పరిరక్షించడం, వ్యవహారాల్లో కచ్చితంగా ఉండటం, హక్కుదారులకు వారి హక్కులను అప్పగించడం ఇవన్నీ కూడా అమానత్ క్రిందికే వస్తాయి. పోను పోను సమాజంలో పొడసూపే నీతిరాహిత్యం వల్ల రోజు రోజుకీ ప్రజల హృదయాల నుంచి ఈ అమానత్ (నిజాయితీ) భావన క్షీణించి పోతుందని పై హదీసు ద్వారా తెలుస్తోంది. ఆఖరికి లోకంలో నిజాయితీ అనేది హదీసులో వివరించబడిన స్థాయికి కొడిగట్టుకుపోతుంది. ప్రస్తుతకాలంలో మన సమాజంలో కూడా నిజాయితి చాలా అరుదైపోయింది. ఇది దైవప్రవక్త పలుకుల్లోని సత్యసంధతకు ప్రబల నిదర్శనం.

٢٠٣ - وعن حُذَيْفَةَ، وأَبي هريرة، رضي الله عنهما قالا: قال رسولُ الله ﷺ: «يَجْمَعُ اللهُ، تَبَارَكَ وَتَعَالَى، النَّاسَ فَيَقُومُ الْمُؤْمِنُونَ حَتَّى تُزْلَفَ لَهُمُ الْجَنَّةُ، فَيَأْتُونَ آدَمَ، صَلَوَاتُ الله عَلَيْهِ، فَيَقُولُونَ: يَاأَبَانَا! اسْتَفْتِحْ لَنَا الْجَنَّةَ، فَيَقُولُ: وَهَلْ أَخْرَجَكُمْ مِنَ الْجَنَّةِ إِلَّا خَطِيئَةُ أَبِيكُمْ! لَسْتُ بِصَاحِبِ ذٰلِكَ، اذْهَبُوا إِلَى ابْنِي إِبْرَاهِيمَ خَلِيلِ الله، قال: فَيَأْتُونَ إِبْرَاهِيمَ، فَيَقُولُ إِبْرَاهِيمُ: لَسْتُ بِصَاحِبِ ذٰلِكَ إِنَّمَا كُنْتُ خَلِيلاً مِنْ

203. హజ్రత్ హుజైఫా మరియు అబూ హురైరా (రజి)ల కథనం ప్రకారం దైవ ప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు: (ప్రళయదినాన) అల్లాహ్ మానవులందరినీ (హష్ర్ స్థలంలో) సమీకరిస్తాడు. అప్పుడు విశ్వాసులు లేచి నించుంటారు. స్వర్గం వారికి దగ్గరగా తీసుకురాబడుతుంది. (దాంతో ఎప్పుడు స్వర్గంలోకి ప్రవేశిస్తామా అన్న ఆతురతతో) వాళ్ళందరూ (కలిసి) హజ్రత్ ఆదం (అలైహి) దగ్గరికి వెళ్ళి, "తండ్రీ! మా కోసం స్వర్గం (ద్వారాల)ను తెరిపించండి" అని అంటారు. దానికి ఆయన, "(అయ్యో! మీకు తెలియదా?!) మీ తండ్రి చేసిన పొరపాటే కదా మిమ్మల్ని స్వర్గం నుండి తీయించింది! కనుక నేను (మీ గురించి సిఫారసు చేసేందుకు) తగినవాడ్ని కాను, మీరు దేవుని స్నేహితుడైన నా కుమారుడు ఇబ్రాహీం దగ్గరికి వెళ్ళండి (ఆయన మీకోసం సిఫారసు చేయగలరు)" అని సమాధానమిస్తారు.

وَرَاءَ وَرَاءَ، اعْمِدُوا إِلَى مُوسَى الَّذِي كَلَّمَهُ اللهُ تَكْلِيماً، فَيَأْتُونَ مُوسَى، فَيَقُولُ: لَسْتُ بِصَاحِبِ ذٰلكَ؛ اذْهَبُوا إِلَى عِيسَى كَلِمَةِ اللهِ وَرُوحِهِ. فَيَقُولُ عِيسَى: لَسْتُ بِصَاحِبِ ذٰلكَ. فَيَأْتُونَ مُحَمَّداً ﷺ، فَيَقُومُ فَيُؤْذَنُ لَهُ، وَتُرْسَلُ الأَمَانَةُ والرَّحِمُ فَيَقُومَانِ جَنْبَتَي الصِّرَاطِ يَمِيناً وَشِمَالاً، فَيَمُرُّ أَوَّلُكُمْ كَالْبَرْقِ» قُلْتُ: بِأَبِي وَأُمِّي، أَيُّ شَيْءٍ كَمَرِّ الْبَرْقِ؟ قال: «أَلَمْ تَرَوْا كَيْفَ يَمُرُّ وَيَرْجِعُ فِي طَرْفَةِ عَيْنٍ؟ ثُمَّ كَمَرِّ الرِّيحِ، ثُمَّ كَمَرِّ الطَّيْرِ، وشدِّ الرِّجال تَجْرِي بِهِمْ أَعْمَالُهُمْ، وَنَبِيُّكُمْ قَائِمٌ عَلَى الصِّرَاطِ يَقُولُ: رَبِّ سَلِّمْ سَلِّمْ حَتَّى تَعْجِزَ أَعْمَالُ الْعِبَادِ، حَتَّى يَجِيءَ الرَّجُلُ لا يَسْتَطِيعُ السَّيْرَ إِلَّا زَحْفاً، وَفِي حَافَتَي الصِّرَاطِ كَلالِيبُ مُعَلَّقَةٌ مَأْمُورَةٌ بِأَخْذِ مَنْ أُمِرَتْ بِهِ، فَمَخْدُوشٌ نَاجٍ، وَمُكَرْدَسٌ فِي النَّارِ» والَّذي نَفْسُ أَبِي هُرَيْرَةَ بِيَدِهِ إِنَّ قَعْرَ جَهَنَّمَ لَسَبْعُونَ خَرِيفاً. رواه مسلم.

హజ్రత్ ఆదం -అలైహి- సమాధానం విని వాళ్ళంతా ఇబ్రాహీం (అలైహి) వద్దకు చేరుకుంటారు. ఆయన కూడా, "నేను అల్లాహ్ మిత్రుణ్ణన్న సంగతి నిజమేగాని నా స్థాయి మీ గురించి సిఫారసు చేసే టంతటిది కాదు. మీరు మూసా వద్దకు వెళ్ళండి (ఆయన మీ కోసం సిఫారసు చేయగలరు). ఆయనతో దేవుడు (ప్రత్యక్షంగా) మాట్లాడాడు" అంటూ తన నిస్సహాయతను వ్యక్తం చేస్తారు.

ఆ తరువాత వాళ్ళు మూసా -అలైహి- దగ్గరికి వెళ్తారు. ఆయన కూడా తాను ఆ పనికి యోగ్యుణ్ణి కానని, మీరు ఈసా -అలైహి- దగ్గరికి వెళ్ళండి, ఆయన దేవుని వచనం మరియు దైవాత్మ (కనుక మీ పని చేసిపెట్టగలరు) అని బదులి స్తారు. (దాంతో వాళ్ళంతా ఈసా -అలైహి- దగ్గరికి వెళ్ళగా) ఆయన కూడా తాను అందుకు తగినవాణ్ణి కానని సున్నితంగా తిరస్కరిస్తారు.

ఆఖరికి వాళ్ళంతా ముహమ్మద్ (అంటే నా) దగ్గరికి వస్తారు. ముహమ్మద్ నించుంటారు. (ప్రజల విషయంలో సిఫారసు చేయడానికి) ఆయనకు అనుమతి ఇవ్వబడుతుంది. నిజాయితి మరియు బంధుత్వాలను విడిచిపెట్టడం జరుగుతుంది. అవి రెండూ వచ్చి 'నరక వంతెన' (పుల్‌సిరాత్)కు ఇరుప్రక్కలా కుడి, ఎడమ దిశల్లో నించుంటాయి. (తరువాత ప్రజలు ఆ వంతెనను

దాటడం (ప్రారంభిస్తారు). అయితే మీలోని తొలి సమూహం మెరుపులా ఆ వంతెనను దాటుతుంది. (హదీసు ఉల్లేఖకులు ఇలా అంటున్నారు: ఈ మాట విని) నేను, "దైవప్రవక్తా! నా తల్లిదండ్రులను మీకు అర్పింతును గాక! మెరుపులా దాటటమంటే ఏమిటి? (నాకు అర్థం కాలేదు!)" అని అడిగాను. దానికి ఆయన "మెరుపు రెప్పపాటులో ఎలా మెరిసి వెళ్ళిపోతుందో నీవు చూడలేదా?!" అని అన్నారు.

ఆ తరువాత (రెండవ సమూహం) వాయు వేగంతో వంతెన దాటి వెళ్ళి పోతుంది. ఆ తరువాత (వచ్చే సమూహం) పక్షివేగంతో దాటి వెళ్ళి పోతుంది. ఇంకా కాళ్ళపై పరిగెత్తే అత్యంత గట్టి మనుషుల్ని వారి ఆచరణలు (వంతెనను) దాటిస్తాయి. మీ ప్రవక్త (నేను) ఆ వంతెనపై నించొని, "ప్రభూ! రక్షించు, రక్షించు" అని అంటూ ఉంటాడు. చివరికి కొంతమంది దాసులు చేసుకున్న (మంచి) పనులు (వారిని వంతెన నుండి వేగంగా) తీసు కెళ్ళ లేకపోతాయి. ఒక వ్యక్తి అయితే అసలు నడవలేక కాళ్లు ఈడ్చుకుంటూ వెళతాడు. ఆ నరకవంతెన కిరుప్రక్కలా (కొక్కెముల మాదిరిగా) ముళ్లు వ్రేలాడబడి ఉంటాయి. చెప్పిన వాళ్ళని పట్టుకోమని వాటికి ఆజ్ఞ ఇవ్వబడి

قوله: «وَرَاءَ وَرَاءَ» هُو بالفَتْح فيهمَا. وَقِيلَ: بالضَّمِّ بِلا تَنوين، وَمَعْنَاهُ: لَسْتُ بِتِلْكَ الدَّرَجَةِ الرَّفِيعَةِ، وَهِي كَلِمَةٌ تُذْكَرُ عَلَى سَبِيل التَّوَاضُعِ. وَقَدْ بَسَطْتُ مَعْنَاهَا فِي شَرْحِ صحيحِ مسلمٍ، والله أعلم. ـــ

ఉంటుంది. కనుక కొంతమంది (ఆ వంతెన దాటుతూ) గాయపడినప్పటికీ (నరకం నుండి) బయటపడతారు. కాని మరికొంత మందిని నరకంలో బోర్లాపడే యడం జరుగుతుంది. ఎవరి చేతిలోనైతే అబూహురైరా ప్రాణముందో ఆయన సాక్షిగా చెబుతున్నాను. నిస్సందేహంగా నరకం డెబ్భై సంవత్సరాల (వ్యవధి అంత) లోతు ఉంటుంది. *(ముస్లిం)*

'వరా' అంటే ఆ మహోన్నత స్థానానికి నేను తగిన వాడిని కాదు అని అర్థం. అణకువను వ్యక్తీకరించడం కోసం ఈ పదాన్ని వాడతారు. ముస్లిం గ్రంథ తాత్పర్యంలో నేను ఈ పదం యొక్క భావాన్ని సవివరంగా తెలియజేశాను. వల్లాహు ఆలము.

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో చెప్పబడిన మొదటి విషయం ఏమిటంటే, హష్ర్ స్థలంలో మానవుల పరిస్థితి చాలా దుర్భరంగా ఉంటుంది. దైవప్రవక్తలు కూడా దైవసన్నిధిలో హాజరు కావడానికి, దైవం ముందు పల్లెత్తు మాట మాట్లాడటానికి జంకుతూ ఉంటారు. ఆఖరికి ప్రవక్తల నాయకుడైనటువంటి ముహమ్మద్ (సల్లం) కూడా "ప్రభూ! రక్షించు, రక్షించు" అని శరణు వేడుకుంటారంటే ఇక సామాన్య మానవులకు ఆ రోజు ఎంత కఠినంగా గడుస్తుందో ఊహించటం కష్టం కాదు.
2. ఈ హదీసు ద్వారా దైవప్రవక్త ముహమ్మద్ (సల్లం)గారి ప్రశస్తి వెల్లడౌతోంది. పరలోకంలో ఆయన దైవం ముందు భూత, భవిష్యత్, వర్తమాన మానవులందరి కోసం సిఫారసు చేస్తారు.
3. మానవులందరికీ నరక వంతెనను దాటవలసి ఉంటుంది.
4. ఇంకా ఈ హదీసులో నిజాయితీ తత్పరత, బంధుత్వాల విశిష్ఠతలు కూడా వివరించబడ్డాయి.

٢٠٤ ـ وعن أبي خُبَيْبٍ ـ بضم الخاءِ المعجمة ـ عبدِ الله بن الزُّبَيْر، رضيَ الله عنهما، قال: لَمَّا وَقَفَ الزُّبَيْرُ يَوْمَ الْجَمَلِ دَعَانِي فَقُمْتُ إِلَى جَنْبِهِ، فَقَالَ: يَابُنَيَّ! إِنَّهُ لا يُقْتَلُ الْيَوْمَ إِلَّا ظَالِمٌ أَوْ مَظْلُومٌ، وَإِنِّي لا أُرَانِي إِلَّا سَأُقْتَلُ الْيَوْمَ مَظْلُوماً، وَإِنَّ مِنْ أَكْبَرِ هَمِّي لَدَيْنِي، أَفَتَرَى دَيْنَنَا يُبْقِي مِنْ مَالِنَا شَيْئاً؟ ثُمَّ قَالَ: يَابُنَيَّ! بِعْ مَالَنَا وَاقْضِ دَيْنِي، وَأَوْصَى بِالثُّلُثِ، وثُلُثِهِ لِبَنِيهِ ـ يعْنِي لِبَنِي عَبْدِ الله بنِ الزُّبير ثُلُثُ الثُّلُثِ ـ قَالَ: فَإِنْ فَضَلَ مِنْ مَالِنَا بَعْدَ

204. హజ్రత్ అబూ ఖుబైబ్ అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ (రజి) కథనం : (నా తండ్రి) జుబైర్ (రజి) జమల్ యుద్ధం జరిగిన రోజు (యుద్ధభూమిలో నించున్నప్పుడు నన్ను పిలిచారు. నేను ఆయన పిలుపు విని ఆయన ప్రక్కన నించున్నాను. అప్పుడాయన నాతో, "నాయనా! ఈ రోజు హతులయ్యేవారు బాధించేవాళ్ళు యినా అయి ఉంటారు. లేక బాధితు లయినా అయి ఉంటారు. నేను మాత్రం ఈ రోజు అన్యాయంగా చంపబడతానని అనుకుంటున్నాను. ఇప్పుడు నా మదిని ఎక్కువగా తొలుస్తున్నది నేను చేసిన అప్పు. మన అప్పు మన ధనంలో ఏమైనా మిగుల్చు తుందంటావా? (అంటే రుణం తీర్చిన తరువాత మన సంపదలో ఏమైనా మిగిలి ఉంటుందా?)" అని అన్నారు. ఆ తరువాత "మన ఆస్తి మొత్తం అమ్మేసి అప్పు తీర్చు నాయనా!" అని చెప్పారు. తన ధనంలో మూడో వంతును వసియ్యత్ (వీలు) చేశారు. ఆ మూడో వంతులోనే మూడో వంతు భాగం (తన కుమారుడైన) అబ్దుల్లాహ్ కుమారులకు చెందాలని ఆదేశించారు. "అప్పు తీర్చిన తరువాత నా సంపదలో ఏమయినా మిగిలితే అందులో మూడో వంతు నీ కుమారులకు చెందాలి" అని అన్నారు.

(హదీసు పరంపరలోని ఒకానొక ఉల్లేఖ కులైన) హిషామ్ ఉవాచ : (ఈ

సంఘటన జరిగిన కాలంలోనే) అబ్దుల్లాహ్ కుమారులైన ఖుబైబ్ మరియు అబ్బాద్‌లు, జుబైర్ (రజి) గారి కుమారులకు సమవయస్కులై ఉన్నారు (అంటే మనవళ్ళు కూడా చిన్న కుమారుల వయసుకి ఎదిగారన్న మాట!) అప్పుడు జుబైర్ (రజి) గారికి తొమ్మిదిమంది మగపిల్లలు, తొమ్మిది మంది ఆడపిల్లలు ఉన్నారు.

(హజ్రత్ అబ్దుల్లాహ్ అంటున్నారు): మా నాన్నగారు తన అప్పుని తీర్చమని నన్ను ఆదేశిస్తూ, "నాయనా! ఒకవేళ నీవు ఆ అప్పులో ఏ కొంతైనా తీర్చలేకపోతే అప్పుడు నీవు నా కార్యసాధకుణ్ణి సహాయం కోసం అర్థించు" అని అన్నారు. దానికి నేను, "దైవసాక్షి! కార్య సాధకుడు అంటే మీ ఉద్దేశ్యం ఏమిటో నాకు అర్థం కాలేదు" అని అన్నాను. "నాన్నగారు! మీ కార్యసాధకుడు ఎవరు?" అని కూడా అడిగాను. అందు కాయన "అల్లాహ్!" అని సమాధాన మిచ్చారు. దైవసాక్షిగా చెబుతున్నాను. ఆయన అప్పు తీర్చడం కష్టమనిపించి నప్పుడల్లా నేను, "ఓ జుబైర్ కార్యసాధకా! ఆయన రుణభారాన్ని తొలగించు" అని (దేవుణ్ని) వేడుకుంటూ ఉండేవాణ్ణి. ఆయన కార్యసాధకుడైన దేవుడే ఆయన రుణభారాన్ని తొలగించేవాడు. (నేను నిమిత్త మాత్రుణ్ణే).

قَضَاءِ الدَّيْنِ شَيْءٌ فَثُلُثُهُ لِبَنِيكَ، قال هِشامٌ: وكانَ بَعْضُ وَلَدِ عَبْدِ الله قَدْ وازَى بَعْضَ بَنِي الزُّبَيْرِ خُبَيْبٍ وَعَبَّادٍ، وَلَهُ يَوْمَئِذٍ تِسْعَةُ بَنِينَ وَتِسْعُ بَنَاتٍ. قَالَ عَبْدُ الله: فَجَعَلَ يُوصِينِي بدَيْنِهِ وَيَقُولُ: يَا بُنَيَّ! إِنْ عَجَزْتَ عَنْ شَيْءٍ مِنْهُ فَاسْتَعِنْ عَلَيْهِ بِمَوْلايَ. قَالَ: فَوَالله مَا دَرَيْتُ مَا أَرَادَ حَتَّى قُلْتُ: يَاأَبَتِ! مَنْ مَوْلاكَ؟ قَالَ: الله. قَالَ: فَوَالله مَا وَقَعْتُ فِي كُرْبَةٍ مِنْ دَيْنِهِ إِلَّا قُلْتُ: يَا مَوْلَى الزُّبَيْرِ! اقْضِ عَنْه دَيْنَهُ، فَيَقْضِيه. قَالَ: فَقُتِلَ الزُّبَيْرُ وَلَمْ يَدَعْ دِينَاراً وَلا دِرْهَماً إِلَّا أَرَضِينَ، مِنْهَا الْغَابَةُ وَإِحْدَى عَشَرَةَ دَاراً بِالْمَدِينَة، وَدَارَيْنِ بِالْبَصْرَةِ، وَدَاراً بِالْكُوفَة، وَدَاراً بِمِصْرَ. قال: وَإِنَّمَا كَانَ دَيْنُهُ الَّذِي كَانَ عَلَيْهِ أَنَّ الرَّجُلَ كَانَ يَأْتِيهِ بِالمالِ، فَيَسْتَوْدِعُهُ إِيَّاهُ، فَيَقُولُ الزُّبَيْرُ: لَا وَلكِنْ هُوَ سَلَفٌ إِنِّي أَخْشَى عَلَيْهِ الضَّيْعَةَ. وَمَا وَلِيَ إِمَارَةً قَطُّ وَلا جِبَايَةً ولا خَراجاً وَلا شَيْئاً إِلَّا أَنْ يَكُونَ فِي غَزْوٍ مَعَ رسولِ الله ﷺ، أَوْ مَعَ أَبِي بَكْرٍ وَعُمَرَ وَعُثْمَانَ رضي الله عنهم، قَالَ عَبْدُ الله:

فَحَسَبْتُ مَا كَانَ عَلَيْهِ مِنَ الدَّيْنِ فَوَجَدْتُهُ أَلْفَيْ أَلْفٍ وَمِائَتَيْ أَلْفٍ! فَلَقِيَ حَكِيمُ بْنُ حِزَامٍ عَبْدَ اللهِ بْنَ الزُّبَيْرِ فَقَالَ: يَاابْنَ أَخِي! كَمْ عَلَى أَخِي مِنَ الدَّيْنِ؟ فَكَتَمْتُهُ وَقُلْتُ: مِائَةُ أَلْفٍ. فَقَالَ حَكِيمٌ: وَاللهِ! مَا أَرَى أَمْوَالَكُمْ تَسَعُ هٰذِهِ! فَقَالَ عَبْدُ اللهِ: أَرَأَيْتُكَ إِنْ كَانَتْ أَلْفَيْ أَلْفٍ وَمِائَتَيْ أَلْفٍ؟ قَالَ: مَا أُرَاكُمْ تُطِيقُونَ هٰذَا، فَإِنْ عَجَزْتُمْ عَنْ

మా నాన్నగారు (ఈ యుద్ధంలోనే) చంపబడ్డారు. ఆయనకు కొన్ని భూముల ఆస్తి ఉంది. అవి తప్ప (నగదు రూపంలో) దీనార్లుగాని, దిర్హములుగాని ఆయన వదలిపెట్టిపోలేదు. ఆ భూము ల్లోనే 'గాబా' భూమి కూడా ఒకటి. ఇంకా మదీనాలో పదకొండు ఇండ్లు, బస్రాలో రెండు ఇండ్లు, కూఫాలో ఒక ఇల్లు, ఈజిప్టులో ఒక ఇల్లు వదలిపెట్టి పోయారు. ఆయనపై ఉన్న రుణం (కూడా వాస్తవానికది రుణం కాదు అది) ఎలాంటిదంటే, ఎవడైనా తన ధనం తీసుకువచ్చి ఆయన దగ్గర భద్రపరచ మని అప్పగిస్తే, దానికి ఆయన, "కాదు, ఇది అమానతు (అప్పగింత) కాదు. దీన్ని నేను మీ దగ్గర అప్పు తీసుకున్నానని భావించండి. ఎందుకంటే ఈ ధనం నా దగ్గర పాడయి (ఖర్చయి) పోతుందేమో నని భయంగా ఉంది" అని అనేవారు. (ఇస్లాంలో అమానతు (అప్పగింత)గా పెట్టిన ధనం పాడయిపోతే దానికి మూల్యం చెల్లించాల్సిన అవసరం లేదు. దీనికి భిన్నంగా అప్పుగా తీసుకున్న ధనాన్నయితే ఎట్టి పరిస్థితుల్లోనైనా సరే వాపసు చేయక తప్పదు!) ఆయన ఎన్నడూ ఏ ప్రభుత్వ పదవినీ చేపట్టలేదు. పన్నుల వసూళ్ళుగాని, ఇంకా ఏ ఇతర వసూళ్ళపని గానీ చేయలేదు (ఒకవేళ ఆయన ప్రభుత్వ పదవిలో పనిచేసి వున్నట్లయితే ఆయన దగ్గరున్న ఈ ధనం అక్రమంగా ఆర్జించబడిందనే నింద

شَيْءٍ مِنْهُ فَاسْتَعِينُوا بِي. قَالَ: وَكَانَ الزُّبَيْرُ قَدِ اشْتَرَى الْغَابَةَ بِسَبْعِينَ ومِائَة أَلْفٍ، فَبَاعَهَا عَبْدُ الله بِأَلْفِ أَلْفٍ وَستمائَةِ أَلْفٍ، ثُمَّ قَامَ فقال: مَنْ كَانَ لَهُ عَلَى الزُّبَيْرِ شَيْءٌ فَلْيُوافِنَا بِالْغَابَةِ، فَأَتَاهُ عَبْدُ الله بْنُ جَعْفَرٍ، وَكَانَ لَهُ عَلَى الزُّبَيْرِ أَرْبَعُمِائَةِ أَلْفٍ، فَقَالَ لِعَبْدِ الله: إِنْ شِئْتُمْ تَرَكْتُهَا لَكُمْ؟ قَالَ عَبْدُ الله: لا، قال: فَإِنْ شِئْتُمْ جَعَلْتُمُوهَا فِيمَا تُؤَخِّرُونَ إِنْ أَخَّرْتُمْ، فقال عَبْدُ الله: لا،

మోపబడేదేమో!). అయితే ఆయన దైవప్రవక్త (స), అబూబక్ర్ (రజి), ఉమర్ (రజి), ఉస్మాన్ (రజి)లతోపాటు ధర్మ యుద్ధాల్లో పాల్గొనేవాళ్ళు (అంటే ఈ ధనం యుద్ధప్రాప్తిగా లభించిందన్న మాట!)

అబ్దుల్లాహ్ (రజి) ఇంకా ఇలా అంటు న్నారు: ఆయన అప్పు మొత్తాన్ని నేనొక సారి లెక్కపెట్టి చూస్తే అది ఇరవై రెండు లక్షలదాకా తేలింది. హకీం బిన్ హిజామ్ (రజి) నన్ను కలిసినప్పుడు నాతో, "భ్రాతృజా! నా సోదరునికి (జుబైర్‌కి) ఎంత అప్పు ఉంది?" అని అడిగారు. నేను నిజాన్ని దాచుతూ "ఒక లక్ష" అని చెప్పాను. దానికి ఆయన, "దైవసాక్షి! మీ నాన్న నీ కోసం విడిచిపెట్టి వెళ్ళిన ధనం ఇంత అప్పుని తీర్చలేదని నా అను మానం" అని అన్నారు. అందుకు నేను "అప్పు ఇరవై లక్షలుంటే?" అని అడిగాను. దానికి, "నువ్వు (ఇంతపెద్ద) అప్పు తీర్చలేవనే నేను భావిస్తున్నాను. ఒకవేళ నువ్వు నిజంగానే దాన్ని తీర్చలేక పోయినప్పుడు నా సహాయాన్ని అర్థించ వచ్చు" అని అన్నారు హకీం బిన్ హిజామ్ (రజి).

"(మా నాన్న) జుబైర్ 'గాబా' భూమిని అప్పట్లో లక్షా డెబ్భైవేలకు కొన్నారు" అని అబ్దుల్లాహ్ (రజి) తెలిపారు. ఆ భూమినే అబ్దుల్లాహ్ (రజి) పదహారు లక్షలకు

అమ్మారు. ఆ తరువాత ఆయన నిలబడి, "(మా నాన్న) జుబైర్ (రజి) ఎవరికైనా అప్పు ఇవ్వాల్సి ఉంటే వారు 'గాబా' భూమి దగ్గర మమ్మల్ని కలుసుకొని మా నుండి తమ అప్పుని వసూలు చేసుకోవచ్చు" అని ప్రకటించారు. ఈ ప్రకటన విని అబ్దుల్లాహ్ బిన్ జాఫర్ (రజి) ఆయన దగ్గరికి వచ్చి "మీరు కోరుకుంటే (మీ నాన్న నుండి నాకు రావలసిన) అప్పును మాఫీ చేయగలను" అని అన్నారు. అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ 'అక్కర్లేద'న్నారు. అబ్దుల్లాహ్ బిన్ జాఫర్ (రజి) మళ్ళీ, "కావాలనుకుంటే మీరు నా అప్పుని (ఇప్పుడు కాకుండా) తరువాతయినా ఇవ్వొచ్చు" అని అన్నారు. అబ్దుల్లాహ్ దానిక్కూడా ఒప్పుకోలేదు. అప్పుడు ఆయన "(సరే, అయితే) ఈ భూమిలోని ఒక భాగాన్ని నాకిచ్చేయండి" అని అడిగారు. దానికి అబ్దుల్లాహ్ "ఇక్కణ్ణుంచి ఇక్కడిదాకా మీదండి" అని అన్నారు. (ఇంకా) ఆ భూమిలోని కొంతభాగాన్ని అమ్మి దాంతో (తండ్రి) జుబైర్ అప్పుని పూర్తిగా తీర్చేశారు. ఇంకా ఆ భూమిలో నాలుగున్నర భాగాలు మిగిలి ఉన్నాయి.

ఆ తరువాత అబ్దుల్లాహ్ ముఆవియా (రజి) దగ్గరికి వెళ్ళారు. ఆ సమయంలో అమ్ర్ బిన్ ఉస్మాన్, ముంజిర్ బిన్ జుబైర్ మరియు ఇబ్నె జమఅ కూడా

قال: فَاقْطعُوا لي قِطْعَةً، قال عَبْدُ الله: لَكَ مِنْ ههُنا إلى ههُنَا. فَبَاعَ عبدُ اللهِ مِنْهَا، فَقضَى عَنه دَيْنَهُ، وَأَوْفَاهُ وَبَقِيَ مِنْهَا أَرْبَعَةُ أَسْهُمٍ وَنِصْفٌ، فَقَدِمَ عَلَى مُعَاوِيَةَ وَعِنْدَهُ عَمْرُو بْن عُثْمَانَ، وَالْمُنْذِرُ بْنُ الزُّبَيْرِ، وَابْنُ زَمْعَةَ. فقال لَهُ مُعَاوِيَةُ: كَمْ قُوِّمَتِ الْغَابَةُ؟ قالَ: كُلُّ سَهْمٍ بِمِائَةِ أَلْفٍ قال: كَمْ بَقِيَ مِنْهَا؟ قالَ: أَرْبَعَةُ أَسْهُمٍ وَنِصْفٌ، فَقَالَ الْمُنْذِرُ بْنُ الزُّبَيْرِ: قَدْ أَخَذْتُ مِنها سَهْماً بِمِائَةِ أَلْفٍ. قالَ عَمْرُو بْن عُثْمَانَ: قَدْ أَخَذْتُ مِنْهَا سَهْماً بِمِائَةِ أَلْفٍ. وَقَالَ زَمْعَةُ: قَدْ أَخَذْتُ سَهْماً بِمِائَةِ أَلْفٍ، فَقَالَ مُعَاوِيَةُ: كَمْ بَقِيَ مِنْهَا؟ قالَ: سَهْمٌ وَنِصْفُ سَهْمٍ، قالَ: قَدْ أَخَذْتُهُ بِخَمْسِينَ وَمِائَةِ أَلْفٍ. قالَ: وَبَاعَ عَبْدُ الله بْنُ جَعْفَرٍ نَصِيبَهُ مِنْ مُعَاوِيَةَ بِسِتِّمِائَةِ أَلْفٍ. فَلَمَّا فَرغَ ابْنُ الزُّبَيْرِ مِنْ قَضَاءِ دَيْنِهِ قَالَ بَنُو الزُّبَيْرِ: اقْسِمْ بَيْنَنَا مِيرَاثَنَا. قالَ: وَاللهِ! لا أَقْسِمُ بَيْنَكُمْ حَتَّى أُنَادِيَ بالمَوسِمِ أَرْبَعَ سِنِينَ: أَلا مَنْ كَانَ لَهُ عَلَى الزُّبَيْرِ دَيْنٌ فَلْيَأْتِنَا فَلْنَقْضِهِ.

فَجَعَلَ كُلَّ سَنَةٍ يُنَادِي فِي الْمَوسِمِ، فَلَمَّا مَضَى أَرْبَعُ سِنِينَ قَسم بَيْنَهُمْ وَدَفَعَ الثُّلُثَ. وكَان للزُّبَيْرِ أَرْبَعُ نِسْوَةٍ، فَأَصَابَ كُلَّ امْرَأَةٍ أَلْفُ أَلْفٍ وَمِائَتَا أَلْفٍ، فَجَمِيعُ مَالِهِ خَمْسُونَ أَلْفِ أَلْفٍ وَمِائَتَا أَلْفٍ، رواه البخاري.

అక్కడే కూర్చొని ఉన్నారు. ముఆవియా అబ్దుల్లాహ్‌ను, "గాబా (భూమి) విలువ ఎంత?" అని అడిగారు. దానికి ఆయన, "ఒక్కోభాగం లక్ష" అని జవాబిచ్చారు. "ఇంకా ఎన్ని భాగాలు మిగిలి ఉన్నాయి?" అని మళ్ళీ అడిగారు. నాలుగున్నర భాగాలు ఇంకా మిగిలున్నాయని అబ్దుల్లాహ్ సమాధానమిచ్చారు. అప్పుడు ముంజిర్ బిన్ జుబైర్ కల్పించుకొని, "మిగిలున్నవాటిలో ఒక భాగాన్ని నేను లక్షకు తీసుకుంటున్నాను" అని అన్నారు. ఆ తరువాత అమ్ర్ బిన్ ఉస్మాన్, "లక్షకు నేను (కూడా) ఒక భాగం తీసుకున్నాను" అన్నారు. అలాగే ఇబ్నె జమఅ కూడా ఒక భాగాన్ని లక్షకు కొంటానని ప్రకటించారు.

ఆ తరువాత ముఆవియా (రజి), "ఇప్పుడెన్ని భాగాలు మిగిలున్నాయి?" అని అడిగారు. "ఒకటిన్నర భాగాలు ఇంకా మిగిలి ఉన్నాయని అబ్దుల్లాహ్ చెప్పారు. అప్పుడు ముఆవియా (రజి) "దీన్ని నేను లక్షన్నరకు తీసుకున్నాను" అని అన్నారు. అబ్దుల్లాహ్ బిన్ జాఫర్ తన భూభాగాన్ని ముఆవియాకు ఆరు లక్షలకు అమ్మారని అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ (రజి) తెలిపారు. అబ్దుల్లాహ్ అప్పంతా తీర్చేసిన తరువాత జుబైర్ కుమారులు తమ ఆస్తిని తమకు పంచి పెట్టమని కోరారు. దానికి అబ్దుల్లాహ్ (రజి) తన సోదరు లతో, "దైవసాక్షి! హజ్

కాలాల్లో (ఎడతెగ కుండా) నాలుగు సంవత్సరాల పాటు "జుబైర్ (రజి) ఎవరికైనా అప్పు ఇవ్వాల్సి వుంటే మా దగ్గరికి రండి. ఆయన అప్పుని మేము తీరుస్తాం" అని ప్రకటించాలి. అంత వరకూ నేను ఆస్తిని మీ మధ్య పంచేది లేదు" అని అన్నారు. అన్నట్లుగానే ఆయన ప్రతి సంవత్సరం హజ్ కాలంలో (జుబైర్ అప్పుకి సంబం ధించిన) ప్రకటన చేసేవారు. నాలుగు సంవత్సరాలు గడిచిన తరువాత (మిగి లిన ఆస్తిని) వారి మధ్య పంచేశారు. వీలు ప్రకారం మూడో వంతు ఆస్తిని సంబంధిత వ్యక్తు లకు ఇచ్చేశారు. జుబైర్ (రజి)కు నలుగురు భార్యలుండేవారు. ఒక్కో భార్యకు పన్నెండు లక్షల చొప్పున (ఆస్తిలో వాటాగా) లభించాయి. హజ్రత్ జుబైర్ (రజి) వదలివెళ్ళిన మొత్తం ఆస్తి ఐదు కోట్ల రెండు లక్షలు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని "ఖుమ్స్ (ఐదో భాగం) విధి" అన్న ప్రకరణంలో ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

1. మనిషికి తాను ఇంకా ఎక్కువకాలం బతకలేనన్న సందేహం కలిగినప్పుడు వీలైనంత త్వరగా వీలునామా రాసేయటం అభిలషణీయం.
2. ముందుగా ఆస్తిలో నుండి మృతుని రుణాన్ని తీర్చాలి. దాని తరువాతే వీలునామాను అమలుపరచటంగాని, ఆస్తిని వారసుల మధ్య పంచడంగాని చేయాలి.
3. తండ్రులు బ్రతికివున్నప్పుడు అవసరమనుకుంటే మనవళ్ల పేర కూడా వీలునామా రాయవచ్చు.
4. అప్పు తీర్చగల స్థోమత ఉన్నవాడు అప్పు పుచ్చుకోవడం ధర్మసమ్మతమే.
5. భూములు, ఇండ్లు, ఆస్తిపాస్తులు కూడబెట్టుకోవచ్చు. ధర్మసమ్మతమైన మార్గాల ద్వారా సంపాదిస్తున్నప్పుడు ఇస్లాం ధర్మం అలాంటి సంపాదనపై పరిమితులు విధించదు.

6. అల్లాహ్‌పై హజ్రత్ జుబైర్ (రజి) గారికున్న నమ్మకం మరియు విశ్వాసాలు ఆదర్శ ప్రాయమైనవి. ప్రతి విశ్వాసీ అలాంటి నమ్మకాన్ని, విశ్వాసాన్ని కల్గిఉండాలి.

7. ఈ హదీసు ప్రవక్త సహచరుల ఉదాత్త గుణాలను చాటిచెబుతోంది. కొంతమంది అప్పు తీర్చడంలో అబ్దుల్లాహ్ (రజి)కు సహకరించారు. మరికొందరైతే తమకు రావలసిన అప్పుని వాయిదా వేయవచ్చని, అవసరమైతే పూర్తిగా కూడా మాఫీ చేస్తామని కూడా ముందుకు వచ్చారు. కాని అబ్దుల్లాహ్ (రజి) మాత్రం దానికి ఒప్పుకోకుండా తన నిరపేక్షాభావాన్ని వ్యక్తం చేశారు. వారి హక్కుల్ని వారికి ఇచ్చివేసి అందరికన్నా ఉత్తమంగా వ్యవహరించారు.

8. దైవమార్గంలో పోరాడేవాని సంపదలో దైవంపై పూర్తినమ్మకం కలిగివున్న వాని సంపాదనలో శుభం ప్రాప్తమవుతుంది. అందుకే హజ్రత్ జుబైర్ (రజి) గారి భూమి దాని అసలు ఖరీదుకన్నా ఎన్నో రెట్లు ఎక్కువ ధర పలికింది. అప్పంతా తీర్చిన తరువాత కూడా చాలా ధనం మిగిలిపోయింది.

9. హజ్రత్ జుబైర్ (రజి) గారి ఉత్తమ నైతికత, ప్రజల పట్ల ఆయన శ్రేయోభిలాష భావాలు ఈ హదీసు ద్వారా వెల్లడౌతున్నాయి. ప్రజలు వస్తువులు భద్రపరచమని ఇస్తే ఆయన వాటిని అప్పుగా స్వీకరించేవారు. తనకు నష్టం జరిగినా ఫరవాలేదు గాని ప్రజలకు మాత్రం నష్టం జరగకూడదని ఆయన కోరుకునేవారు.

10. హజ్రత్ అబ్దుల్లాహ్ (రజి) గారి కార్యదక్షత ప్రశంసనీయం. ముందుగా ఆయన తన తండ్రి రుణభారాన్ని దించిన తరువాతే ఆస్తిని వారసులకు పంచారు. నీతి, నిజాయితీలతో వ్యవహరించారు.

11. వారసులు కూడా మాటిమాటికీ ఆస్తివాటాల సంగతి ఎత్తకుండా జుబైర్ (రజి) రుణభారం తొలగిపోయేవరకు సహకరించారు.



## 26వ అధ్యాయం

# ٢٦ ـ بَابُ تَحْرِيمِ الظُّلْمِ وَالأَمْرِ بِرَدِّ الْمَظَالِمِ

# దుర్మార్గ నిషేధం, దౌర్జన్యాలను అడ్డుకోవాలనే ఆజ్ఞల గురించి......

قال الله تعالى: ﴿ مَا لِلظَّالِمِينَ مِنْ حَمِيمٍ وَلَا شَفِيعٍ يُطَاعُ ﴾ [غافر: ١٨]. وقال تعالى: ﴿ وَمَا لِلظَّالِمِينَ مِن نَّصِيرٍ ﴾ [الحج: ٧١].

وأَمَّا الأَحَادِيثُ فَمِنْهَا حَدِيثُ أَبِي ذَرٍّ رضي الله عنه الْمُتَقَدِّمُ فِي آخِرِ بَابِ الْمُجَاهَدَةِ.

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"దుర్మార్గులకు ఆప్తమిత్రుడుగానీ, మాట చెల్లుబడి అయ్యే సిఫారసుదారుగానీ ఎవ్వడూ ఉండడు." (అల్ మూమిన్ : 18)

"దుర్మార్గులకు సహాయపడే వాడెవ్వడూ ఉండడు." (అల్ హజ్ : 81)

ఇక ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసుల విషయానికొస్తే, ఇంతకుముందు 'పోరాట పటిమ' అనే అధ్యాయం చివర్లో వచ్చిన అబూజర్ (రజి) హదీసు ఈ అధ్యాయానికి కూడా వర్తిస్తుంది. (111వ హదీసు చూడండి)

٢٠٥ ـ وعن جابرٍ رضي الله عنه أَنَّ رسولَ الله ﷺ قال: «اتَّقُوا الظُّلْمَ؛ فَإِنَّ الظُّلْمَ ظُلُمَاتٌ يَوْمَ الْقِيَامَةِ، وَاتَّقُوا الشُّحَّ فَإِنَّ الشُّحَّ أَهْلَكَ مَنْ كَانَ قَبْلَكُمْ، حَمَلَهُمْ عَلَى أَنْ سَفَكُوا دِمَاءَهُم وَاسْتَحَلُّوا مَحَارِمَهُمْ» رواه مسلم.

205. హ్రజత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : "దుర్మార్గానికి దూరంగా ఉండండి. ఎందుకంటే దుర్మార్గం ప్రళయదినాన కటిక చీకట్లవలె ఉంటుంది. ఇంకా పిసినారితనానికి దూరంగా ఉండండి. ఈ పిసినారితనమే మీకు పూర్వం గతించిన సమాజాల్ని సర్వనాశనం చేసింది; అయినవారి రక్తం

చిందించేందుకు, నిషిద్ధ విషయాల్ని ధర్మ సమ్మతం (హలాల్)గా తలపోసేందుకు ప్రేరేపించింది. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల పుస్తకం)*

## ముఖ్యాంశాలు

మితిమీరిన ధనవ్యామోహాన్ని పిసినారితనం అంటారు. మనిషి ప్రాపంచిక సిరిసంపదలు, భోగభాగ్యాల వలలో చిక్కుకున్నప్పుడు ధర్మాధర్మాల సంగతిని మరచిపోతాడు. ఆఖరికి తన స్వార్థం కోసం ఇతరుల ప్రాణాలు తీయడానికి కూడా వెనుకాడడు. ఈ రోజు మన సమాజ పరిస్థితి కూడా ఇలాగే ఉంది. ఉన్నవాడు లేని వాడిని దోచుకుంటున్నాడు. ధనవంతుడు ఇంకా ధనవంతుడై కోట్లకు పడగలెత్తుతున్నాడు. దానికోసం ఎన్ని అడ్డదారులు తొక్కవలసి వచ్చినా, ఎంతమంది అమాయకుల ప్రాణాలు పోయినాసరే తమ పబ్బం గడిస్తే చాలనుకుంటున్నారు. ప్రస్తుతం మన సమాజాన్ని ఏలుతున్న అవినీతి ఇలాగే కొనసాగితే మన సమాజం కూడా వినాశానికి లోనవుతుందనడంలో ఎలాంటి సందేహం లేదు.

٢٠٦ ـ وعن أبي هريرة رضي الله عنه أنَّ رسولَ الله ﷺ قال: «لَتُؤَدُّنَّ الْحُقُوقَ إلَى أهْلِهَا يَوْمَ الْقِيَامَةِ حَتَّى يُقَادَ لِلشَّاةِ الْجَلْحَاءِ مِنَ الشَّاةِ الْقَرْنَاءِ» رواه مسلم.

206. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ప్రళయదినాన మీరు హక్కుదారులకు వారి హక్కుల్ని తప్పకుండా ఇవ్వవలసి ఉంటుంది. ఆఖరికి కొమ్ములేని మేకకు కూడా కొమ్ములున్న మేకనుండి పరిహారం ఇప్పించబడుతుంది. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రళయదినాన దేవుని దర్బారులో ఎలాంటి పక్షపాతానికి తావు లేకుండా తిరుగులేని న్యాయం జరుగుతుందని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. ఆఖరికి జంతువులు పరస్పరం కొట్లాడుకుంటే వాటిలోని పీడిత జంతువులకు కూడా న్యాయం చేకూరుస్తాడు దేవుడు. పరమ ప్రభువు బుద్ధిజ్ఞానాలు లేని జంతువులనే క్షమించనప్పుడు అన్నీ తెలిసిన మానవులు దుర్మార్గానికి ఒడిగడితే ఎలా క్షమిస్తాడు? అని ఈ హదీసు హెచ్చరిస్తోంది.

٢٠٧ - وعن ابن عمرَ رضي الله عنهما قال: كُنَّا نَتَحَدَّثُ عَنْ حَجَّةِ الْوَدَاعِ وَالنَّبِيُّ ﷺ بَيْنَ أَظْهُرِنَا، وَلا نَدْرِي مَا حَجَّةُ الْوَدَاعِ، حَتَّى حَمِدَ اللهَ رسولُ الله ﷺ وَأَثْنَى عَلَيْهِ، ثُمَّ ذَكَرَ الْمَسِيحَ الدَّجَّالَ فَأَطْنَبَ فِي ذِكْرِهِ، وقالَ: «مَا بَعَثَ اللهُ مِنْ نَبِيٍّ إِلَّا أَنْذَرَهُ أُمَّتَهُ: أَنْذَرَهُ نُوحٌ وَالنَّبِيُّونَ مِنْ بَعْدِهِ، وَإِنَّهُ إِنْ يَخْرُجْ فِيكُمْ فَمَا خَفِيَ عَلَيْكُمْ مِنْ شَأْنِهِ فَلَيْسَ يَخْفَى عَلَيْكُمْ، إِنَّ رَبَّكُمْ لَيْسَ بِأَعْوَرَ، وَإِنَّهُ أَعْوَرُ عَيْنِ الْيُمْنَى، كَأَنَّ عَيْنَهُ عِنَبَةٌ طَافِيَةٌ. أَلَا إِنَّ اللهَ حَرَّمَ عَلَيْكُمْ دِمَاءَكُمْ وَأَمْوَالَكُمْ، كَحُرْمَةِ يَوْمِكُمْ هٰذَا، فِي بَلَدِكُمْ هٰذَا، فِي شَهْرِكُمْ هٰذَا، أَلا هَلْ بَلَّغْتُ؟» قالُوا: نَعَمْ، قالَ: «اللَّهُمَّ اشْهَدْ - ثَلاثاً - وَيْلَكُمْ، أَوْ: وَيْحَكُمْ، انْظُرُوا: لا تَرْجِعُوا بَعْدِي كُفَّاراً يَضْرِبُ بَعْضُكُمْ رِقَابَ بَعْضٍ» رواه البخاري وروى مسلم بعضه)

207. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) మా మధ్య ఉన్నప్పుడే మేము 'హజ్జతుల్ విదా' (అంతిమ హజ్) గురించి మాట్లాడుకునే వాళ్ళం. అప్పటికింకా మాకు 'హజ్జతుల్ విదా' అంటే ఏమిటో తెలీదు. ఎట్టకేలకు (హజ్జతుల్ విదా రానే వచ్చింది. ఆ సందర్భంగా) ఆయన దేవుని ప్రశంసల్నీ, పొగడ్తల్నీ కొనియాడారు. ఆ తరువాత 'మసీహుద్దజ్జాల్' గురించి ప్రస్తావించారు. అతని గురించి వివరంగా తెలియజేస్తూ ఇలా అన్నారు: అల్లాహ్ పంపిన ప్రవక్తలందరూ తమ తమ జాతుల వారిని ఇతన్ని (అంటే దజ్జాల్) గురించి తప్పకుండా అప్రమత్తం చేశారు. నూహ్ - అలైహి - (తన జాతి ప్రజలను) ఇతన్ని గురించి భయపెట్టారు. ఆయన తరువాత వచ్చిన ప్రవక్తలు కూడా భయపెట్టారు. ఒకవేళ అతను మీ మధ్య వెలిస్తే అతని రూపు రేఖలు మీకు తెలియకుండా ఉండవు (మీరతన్ని చాలా తేలికగా గుర్తుపట్టవచ్చు). దేవుడు ఒంటికన్ను వాడు కాదన్న సంగతైతే రహస్యంగా లేదు కదా! కాని అతను మాత్రం ఒంటికన్నువాడై ఉంటాడు. అతనికి ఒక్క కుడి కన్ను మాత్రమే ఉంటుంది. అదీ ద్రాక్ష పండులా ఉబ్బినట్లు కనిపిస్తుంది.

జాగ్రత్త! మీ నగరంలో, మీ ప్రదేశంలో ఈనాటి ఈ రోజు మీ కొరకు నిషిద్ధమైనట్లే (పరస్పరం) అల్లాహ్ మీ రక్తాన్ని, మీ ధనాన్ని నిషిద్ధం (హరాం) చేశాడు. నేను

మీకు (దేవుని సందేశాన్ని) అంద జేశానా?"

దానికి ఆయన అనుచరులందరూ (ముక్తకంఠంతో) అవునన్నారు. అప్పుడు ఆయన (ఆకాశం వైపు తలెత్తి) "అల్లాహ్! (దీనికి) నీవు సాక్షిగా ఉండు" అని మూడుసార్లు అన్నారు. ఆ తరువాత "మీరు నాశనమైపోతారు జాగ్రత్త! (లేక) మీ స్థితి కడు శోచనీయం చూడండి! నా తదనంతరం మీరు పరస్పరం మెడలు నరుక్కుంటూ అవిశ్వాసులై పోరాదు" అని అన్నారు. (దీనిని బుఖారీ ఉల్లేఖించారు. ముస్లిం ఇందులోని కొంతభాగాన్ని మాత్రం ఉల్లేఖించారు.)

*(సహీహ్ బుఖారీలోని యుద్ధాల ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణంలోనూ ఈ హదీసు ఉంది).*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో మసీహుద్దజ్జాల్ పుట్టుకను ప్రళయం రాకకు సూచనగా చెప్పబడింది. విశ్వాసులు మసీహుద్దజ్జాల్‌ని గుర్తుపట్టి అతని వలలో చిక్కుకోకుండా ఉండేందుకు అతని రూపురేఖల్ని కూడా వర్ణించడం జరిగింది. 'మసీహ్' అంటే ఒంటికన్నువాడు. 'దజ్జాల్' అనేది 'దజ్ల్' అనే పదం నుండి వచ్చిన అతిశయ పదం. దీనికి 'మోసకారి' అని అర్థం. ఇతను ప్రళయానికి ముందు చాలామందిని మోసం చేసి సన్మార్గం నుండి భ్రష్టుపట్టిస్తాడని హదీసుల్లో చెప్పబడింది.
2. ముస్లింల ధనప్రాణాలు పరస్పరం నిషిద్ధం గావించబడ్డాయి. కనుక ప్రతి ముస్లిం తోటి ముస్లిం ధన, మాన ప్రాణాలను పరిరక్షించాలి.
3. ముస్లింలు ఒకరినొకరు చంపుకోవటం మహాపాపం. ఇది 'కుఫ్ర్'కు దారితీస్తుంది.

208. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు : ఎవడైనా ఒక జానెడు భూ భాగాన్ని బలవంతంగా లాక్కొని ఎవరి

٢٠٨ - وعن عائشةَ رضي الله عنها أنَّ رسولَ الله ﷺ قال: «مَنْ ظَلَمَ قِيدَ شِبْرٍ مِنَ الأرضِ طُوِّقَهُ مِنْ سَبْعِ أَرَضِينَ» متفقٌ عليه.

పైనయినా దౌర్జన్యం చేస్తే (ప్రళయ దినాన అతని మెడకు) ఏడు భూ (గోళ)ముల కంఠబంధం తొడిగించడం జరుగుతుంది." *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని 'అత్యాచారాల' ప్రకరణంలోనూ సహీహ్ ముస్లింలోని 'వాణిజ్య' ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ప్రపంచంలో కొంచెం దౌర్జన్యానికి పాల్పడినా, పరలోకంలో అది పెద్ద శిక్షకు కారణభూతమవుతుందని ఈ హదీసు హెచ్చరిస్తోంది.

٢٠٩ ـ وعن أبي موسى رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «إنَّ اللهَ لَيُمْلِي للظَّالِمِ فإذَا أَخَذَهُ لَمْ يُفْلِتْهُ» ثُمَّ قرأَ: ﴿وَكَذَٰلِكَ أَخْذُ رَبِّكَ إِذَآ أَخَذَ ٱلْقُرَىٰ وَهِىَ ظَٰلِمَةٌ إِنَّ أَخْذَهُۥٓ أَلِيمٌ شَدِيدٌ﴾ [هود: ١٠٢] متفقٌ عليه.

209. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు : నిశ్చయంగా దేవుడు దౌర్జన్యం చేసేవాడికి అవకాశం ఇస్తాడు. కాని ఆయన అతన్ని పట్టుకున్నాడంటే ఇక (శిక్షించకుండా) వదలిపెట్టడు." ఆ తరువాత ఆయన ఈ సూక్తిని పఠించారు: "నీ ప్రభువు ఒక దుర్మార్గపు నగరాన్ని శిక్షించదలిస్తే ఆయన శిక్ష ఇలాగే ఉంటుంది. నిజంగానే ఆయన శిక్ష బహు కఠినమైనది, బాధాకరమైనది. (హూద్ : 102) *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యాన ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని సత్కార్యాల పుస్తకంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

దేవుడు దౌర్జన్యాలు చేసేవాడిని కొంతకాలం పాటు శిక్షించకుండా వదలిపెడతాడు. కాని అతని పాపం పండాక అతన్ని పట్టుకున్నాడంటే ఇక ఆయన పట్టునుండి విడిపించుకునే మార్గమేదీ ఉండదు. కనుక దౌర్జన్యాలకు, అత్యాచారాలకు దూరంగా ఉండాలి. దౌర్జన్యం చేసినా శిక్ష పడట్లేదని సంబరపడిపోకూడదు. దైవాగ్రహం ఎప్పుడు విరుచుకుపడుతుందో, దేవుడు వేసిన ఉచ్చు ఎప్పుడు బిగుసుకుంటుందో ఎవరికీ తెలియదు!

٢١٠ ـ وعن مُعَاذٍ رضي الله عنه قال: بَعَثَنِي رسولُ الله ﷺ فقال: «إنَّكَ تَأتِي قَوماً مِنْ أَهْلِ الْكِتَابِ، فَادعُهُمْ إلَى شَهَادَةِ أَنْ لا إِلٰهَ إِلَّا الله، وَأَنِّي رسولُ الله، فَإِنْ هُمْ أَطَاعُوا لذٰلكَ، فَأَعْلِمْهُمْ أَنَّ الله قَدِ افْتَرَضَ عَلَيْهِمْ خَمْسَ صَلَوَاتٍ فِي كُلِّ يَوْمٍ وَلَيْلَةٍ، فَإِنْ هُمْ أَطَاعُوا لذٰلكَ، فَأَعْلِمْهُمْ أَنَّ الله قَدِ افْتَرَضَ عَلَيْهِمْ صَدَقَةً تُؤخَذُ مِنْ أَغْنِيَائِهِمْ فَتُرَدُّ عَلَى فُقَرَائِهِمْ، فَإِنْ هُمْ أَطَاعُوا لذٰلكَ، فَإِيَّاكَ وَكَرَائِمَ أَمْوَالِهِمْ. وَاتَّقِ دَعْوَةَ الْمَظْلُومِ فَإِنَّهُ لَيْسَ بَيْنَهَا وَبَيْنَ اللهِ حِجَابٌ» متفقٌ عليه.

210. హజ్రత్ ముఆజ్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) నన్ను (యమన్ వైపుకు) పంపినప్పుడు ఇలా హిత బోధ చేశారు: (ఓ ముఆజ్!) నువ్వు గ్రంథ వహులైన ప్రజల దగ్గరికి వెళుతున్నావు. (కనుక ముందుగా) నువ్వు వారిని అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు, ముహమ్మద్ దైవప్రవక్త అని సాక్ష్యం పలకమని ఆహ్వానించు. వారు నీ మాట వింటే అప్పుడు, దేవుడు రేయింబవళ్ళలో వారిపై ఐదు (పూటల) నమాజులు విధిగా చేశాడని వారికి చెప్పు. దానికీ వారు ఒప్పుకుంటే, దేవుడు వారిపై జకాత్ దానాన్ని విధిగా చేశాడని, అది వారి ధనవంతుల నుండి వసూలు చేయబడి వారిలోని బీదవారికి పంచబడుతుందని తెలియజెయ్యి. అందుక్కూడా అంగీకరిస్తే (జకాత్ వసూలు చేసినప్పుడు) నీవు (స్వయంగా) వారి సంపదలోని నాణ్యమైన వస్తువుల్ని తీసుకోకుండా జాగ్రత్తపడు. (అలా చేస్తే వారిని పీడించినట్లవుతుంది కనుక) పీడితుని ఆర్తనాదం నుండి నిన్ను నీవు రక్షించుకో. ఎందుకంటే, పీడితుని ఆర్తనాదానికి - దేవునికి మధ్య ఎలాంటి అడ్డుతెర లేదు (అతని శాపానికి దేవుడు తప్పకుండా ఆమోద ముద్రవేస్తాడు). *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణంలోనూ, యుద్ధాల ప్రకరణంలోనూ ఏకేశ్వరోపాసనా సిద్ధాంత ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణంలోనూ ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

1. దైవ తిరస్కారులతో యుద్ధం అనివార్యమైపోతే యుద్ధం చేసే ముందు వారిని ఇస్లాం స్వీకరించమని ఆహ్వానించాలి. ఆ తరువాత వారికి నమాజ్, జకాత్ ఇంకా ఇతర విధుల గురించి బోధించాలి.
2. ఒక ప్రాంతంలోని ధనవంతుల నుండి జకాత్ ధనాన్ని వసూలు చేస్తే దాన్ని ఆ ప్రాంతంలోని బీదవారికే పంచిపెట్టాలి. మిగిలిపోతే ఇతర ప్రాంతాలకు కూడా తరలించవచ్చు.
3. జకాత్ వసూళ్ళపై నియుక్తులైన ఉద్యోగులు జకాత్ వసూలు చేసినప్పుడు ప్రజలపై దౌర్జన్యం చేయకూడదు. దౌర్జన్య పీడితుల శాపం ఊరికేపోదు. అల్లాహ్ దానిని తప్పకుండా అంగీకరిస్తాడు.

211. హజ్రత్ అబూ హుమైద్ అబ్దుర్రహ్మాన్ బిన్ సాద్ సాయిదీ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) అజ్ద్ తెగకు చెందిన ఒక వ్యక్తిని జకాత్ వసూళ్ళ కోసం ఉద్యోగిగా నియమించారు. అతణ్ణి ఇబ్నె లుత్‌బియ్యా అని పిలిచే వారు. అతను (జకాత్ వసూళ్ళు అయిపోయిన తరువాత) తిరిగివచ్చి, "ఈ సొమ్ము మీది. ఇది మాత్రం నాకు కానుకగా ఇవ్వబడింది" అని అన్నాడు.

అతను అన్నది విని దైవప్రవక్త (స) (మస్జిదులోని) వేదికపైకెక్కి దైవస్తోత్రం చేసిన తరువాత ఇలా అన్నారు -

"దేవుడు నాకు అప్పగించిన అధికారిక విషయాల్లోని (జకాత్ వసూళ్ళ) పనిపై ఒకర్ని నేను ఉద్యోగిగా నియమిస్తే, అతనేమో (వసూళ్ళు జరిగిన తరువాత) 'ఇది మీది. ఇది నాకు కానుకగా ఇవ్వ

٢١١ ـ وعن أبي حُمَيْدٍ عبد الرَّحْمٰنِ بْنِ سَعْدٍ السَّاعِدِيِّ رضي الله عنه قالَ: اسْتَعْمَلَ النَّبِيُّ ﷺ رَجُلاً مِنَ الأَزْدِ يقالُ لَهُ: ابْنُ اللُّتْبِيَّةِ عَلَى الصَّدَقَةِ، فَلَمَّا قَدِمَ قال: هٰذَا لَكُم، وَهٰذَا أُهْدِيَ إِلَيَّ، فَقَامَ رسولُ الله ﷺ عَلَى الْمِنْبَرِ، فَحَمِدَ اللهَ وَأَثْنَى عَلَيْهِ، ثُمَّ قالَ: «أَمَّا بَعْدُ فَإِنِّي أَسْتَعْمِلُ الرَّجُلَ مِنكُمْ عَلَى الْعَمَلِ مِمَّا وَلَّانِي اللهُ، فَيَأْتِي فَيَقُولُ: هٰذَا لَكُمْ، وَهٰذَا هَدِيَّةٌ أُهْدِيَتْ إِلَيَّ، أَفَلا جَلَسَ فِي بَيْتِ أَبِيهِ أَوْ أُمِّهِ حَتَّى تَأْتِيَه هَدِيَّتُهُ إِنْ كَانَ صَادِقاً،

والله لا يَأخُذُ أَحَدٌ مِنكُمْ شَيْئاً بِغَيْرِ حَقِّهِ إلَّا لَقِيَ اللهَ تَعَالَى، يَحْمِلُهُ يَوْمَ الْقِيَامَةِ، فَلا أَعْرِفَنَّ أَحَداً مِنْكُم لَقِيَ اللهَ يَحْمِلُ بَعِيراً لَهُ رغاءٌ، أَوْ بَقَرَةً لَهَا خُوَارٌ، أَوْ شَاةً تَيْعَرُ» ثُمَّ رَفَعَ يَدَيْهِ حَتَّى رُؤِيَ بَيَاضُ إِبْطَيْهِ فَقَالَ: «اللَّهُمَّ هَلْ بَلَّغْتُ» ثَلاثاً. متفقٌ عليه.

బడింది' అని అంటున్నాడు. అలాగయితే అతను (జకాత్ పనిమీద వెళ్ళకుండా) తన తండ్రి ఇంట్లోనో, తల్లి ఇంట్లోనో ఎందుకు కూర్చొని ఉండలేదు? అతను (కానుకలని) చెబుతున్న సంగతి నిజమే అయితే (ఇంట్లో కూర్చొని ఉన్నా) ఈ కానుకలు అతనికి చేరాల్సిందిగా! దైవసాక్షిగా చెబుతున్నాను. మీలో ఎవరైనా సరే (జకాత్ వసూళ్ళలో) తన హక్కు (జీతం)కు మించి ఏమైనా తీసుకుంటే ప్రళయ దినాన అతనా వస్తువుని ఎత్తుకొని ఉన్న స్థితిలోనే దైవాన్ని కలుసుకుంటాడు. (అక్రమంగా ఒంటెను తీసుకుంటే) ఒంటెనెత్తుకొని ఉన్న స్థితిలోనే కలుస్తాడు. ఆ ఒంటె (అతని వీపుపై) విలవిల్లాడుతూ ఉంటుంది. (ఆవుని తీసుకుంటే) అరుస్తూ ఉండే ఆవునే ఎత్తుకొని కలుస్తాడు. (ఒకవేళ మేకను తీసుకుంటే) మేకనే ఎత్తుకొని కలుస్తాడు. అది (అతని వీపుపై) 'మేమే' అని అరుస్తూ ఉంటుంది. నేను మీలో ఎవరినీ ఆ స్థితిలో చూడకూడదు సుమా!"

ఇలా అని ఆయన తన రెండు చేతులూ పైకెత్తారు. అలా చేతులెత్తినప్పుడు ఆయన చంకల్లోని తెల్లదనం కనిపించింది. తరువాత ఆయన "ఓ అల్లాహ్! నేను (నీ సందేశాన్ని ప్రజలకు) అందజేశానా?" అని మూడుసార్లు అన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని కానుకల ప్రకరణంలోనూ, జకాత్ ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని 'అప్పగింతల' ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ప్రభుత్వ ఉద్యోగులకు, అధికారులకు తీవ్రమైన మందలింపు ఉంది. నేడు చాలామంది ప్రభుత్వోద్యోగులు, అధికారులు తమ అధికారాన్ని ఆసరాగా చేసుకొని అక్రమంగా, అన్యాయంగా జేబులు నింపుకుంటున్నారు. ప్రజలు కూడా తమ స్వార్థ ప్రయోజనాల నిమిత్తం అధికారులకు అనేక కానుకలూ, బహుమతులు సమర్పించుకుంటూ ఉంటారు. అలాంటి అవినీతిపరులైన అధికారుల్ని ఈ హదీసు పరలోక శిక్షకోసం నిరీక్షించమని హెచ్చరిస్తోంది. దీనిప్రకారం అధికారం ఆసరాతో సంపాదించిన ధనమంతా లంచంగానే పరిగణించబడుతుంది. లంచం తీసుకోవటం, ఇవ్వటం రెండూ అధర్మకార్యాలే.

٢١٢ ـ وعن أبي هُرَيْرَةَ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «مَنْ كَانَتْ عِنْدَهُ مَظْلَمَةٌ لأَخِيهِ؛ مِنْ عِرْضِهِ أَوْ مِنْ شَيْءٍ، فَلْيَتَحَلَّلْهُ مِنْهُ الْيَوْمَ قَبْلَ أَنْ لا يَكُونَ دِينَارٌ وَلَا دِرْهَمٌ؛ إِنْ كَانَ لَهُ عَمَلٌ صَالِحٌ أُخِذَ مِنْهُ بِقَدْرِ مَظْلَمَتِهِ، وَإِنْ لَمْ يَكُنْ لَهُ حَسَنَاتٌ أُخِذَ مِنْ سَيِّئَاتِ صَاحِبِهِ فَحُمِلَ عَلَيْهِ» رواه البخاري.

212. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీలో ఎవరైనా సాటి సోదరుని మానమర్యాదలకు సంబంధించిన విషయంలోగాని, మరే విషయంలోనైనాగాని అతనిపై దౌర్జన్యానికి పాల్పడితే, (ఆ పాపాన్ని దూరం చేసుకోవటం కోసం) దీనార్లుగాని, దిర్హములుగాని లభించని రోజు దాపురించక ముందు - ఈ రోజే అతను ఆ పాపాన్ని ప్రక్షాళనం చేసుకోవాలి. (లేకపోతే ఆ రోజు పాపాన్ని తొలగించే పద్ధతి ఎలాగుంటుందంటే) దౌర్జన్యానికి పాల్పడిన వ్యక్తి దగ్గర సత్కార్యాలు ఉంటే, అతన్నుండి అతని దౌర్జన్యానికి సమానంగా సత్కార్యాలు తీసుకొని (పీడితులకు పంచడం జరుగుతుంది). ఒకవేళ అతని దగ్గర

సత్కార్యాలు అయిపోతే అతని ప్రత్యర్థి పాపాలను కూడా అతనిపైనే మోపటం జరుగు తుంది. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని అత్యాచారాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రపంచంలో దౌర్జన్యాలకు, అత్యాచారాలకు పాల్పడి బాధితుల నుండి క్షమాభిక్ష పొందకుండా లేదా దాని పరిహారాన్ని చెల్లించకుండా మరణిస్తే పరలోకంలో తీవ్రమైన పరిణామాలను ఎదుర్కోవలసి వస్తుందని ఈ హదీసు బోధిస్తోంది. కనుక సాటి మానవులను హింసించడంగాని, వారి హక్కులను కాజేయటంగాని చేస్తే చివరికి వినాశమే గతి అని గ్రహించాలి.

٢١٣ ـ وعن عبدِ الله بنِ عَمْرو بنِ الْعَاص رضي الله عنهما عن النَّبِيِّ ﷺ قال: «الْمُسْلِمُ مَنْ سَلِمَ الْمُسْلِمُونَ مِنْ لِسَانِهِ وَيَدِهِ، وَالْمُهَاجِرُ مَنْ هَجَرَ مَا نَهَى اللهُ عَنْهُ» متفقٌ عليه.

213. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : తన నోటితోగాని, చేత్తోగాని ఇతర ముస్లింలకు బాధ కలగకుండా మసలుకునే వాడే (నిజమైన) ముస్లిం. దేవుడు వారించిన విషయాలకు దూరంగా ఉండేవాడే (వాస్తవానికి) 'ముహాజిర్' (అంటే దైవమార్గంలో ప్రస్థానం చేసేవాడు). *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని విశ్వాసప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

తన మాటలవల్లగాని, చేతల వల్లగాని ఇతరులకు ఎలాంటి హాని జరగకుండా జాగ్రత్తపడేవాడే నిజమైన ముస్లిం అనబడటానికి అర్హుడు. అలాగే దైవ అవిధేయతకు దూరంగా ఉండేవాడే వాస్తవానికి ముహాజిర్. ఒక వ్యక్తి హిజ్రత్ (దైవమార్గంలో వలసపోవటం) చేసినప్పటికీ దైవ అవిధేయతను విడనాడకపోతే ఇక ఆ హిజ్రత్ వల్ల అతనికి ప్రయోజనం ఏముంటుంది? అసలు హిజ్రత్ అంటేనే దైవప్రసన్నత కోసం అన్నింటినీ వదలుకోవడం. మనిషి తన ప్రాంతాన్ని, ఆస్తి అంతస్తుల్ని, బంధుమిత్రులందరినీ వదలుకొని దైవమార్గంలో వలసపోయినప్పటికీ, దేవుడు వారించిన విషయాలను విడిచిపెట్టి ఉండలేకపోతే దైవ సన్నిధిలో అతని 'ప్రస్థానం' ఒక ప్రహసనంగా మాత్రమే మిగిలిపోతుంది.

214. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం : దైవప్రవక్త సామాను పర్యవేక్షణ కోసం ఒక వ్యక్తి నియమితుడై ఉండేవాడు. అతణ్ణి 'కిర్‌కిరా' అని పిలిచేవారు. ఆ వ్యక్తి చనిపోయినప్పుడు దైవప్రవక్త (సల్లం) అతను నరకంలో ఉన్నాడని అన్నారు. (అది విని) ప్రజలు అతణ్ణి (పరిశీలనగా) చూడసాగారు. అప్పుడు ప్రవక్త సహచరులకు ఆ వ్యక్తి దగ్గర అతను (యుద్ధప్రాప్తి నుండి) దొంగిలించిన నల్లని చారలుగల దుప్పటి ఒకటి దొరికింది. *(బుఖారీ)*

٢١٤ ـ وعنه رضي الله عنه قال: كَانَ عَلَى ثَقَلِ النَّبِيِّ ﷺ رَجُلٌ يُقَالُ لَهُ كِرْكِرَةُ، فَمَاتَ، فقال رسول الله ﷺ: «هُوَ فِي النَّارِ» فَذَهَبُوا يَنْظُرُونَ إِلَيْهِ فَوَجَدُوا عَبَاءَةً قَدْ غَلَّهَا. رواه البخاري.

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణంలోనూ, ఇంకా సుననె ఇబ్నె మాజాలోని జిహాద్ ప్రకరణంలోనూ ఈ హదీసు ఉంది.)*

## ముఖ్యాంశాలు

అప్పగింతల్లో ద్రోహానికి పాల్పడటం, పరుల సొమ్మును దొంగిలించడం మహా పాతకం. ఈ ద్రోహబుద్ధి మనిషిని నరకానికి గొనిపోతుంది.

215. హజ్రత్ అబూబక్రా నుఫై బిన్ హారిస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉద్బోధించారు : నిస్సందేహంగా దేవుడు భూమ్యాకాశాలను సృష్టించిన నాటికి కాలం పరిభ్రమించింది (అంటే సృష్టి ప్రారంభంలో ఉండిన సంవత్సరాలు, నెలల తీరు పునఃప్రారంభమైనది. అరబ్బు బహుదైవారాధకులు మధ్యలో 'నసీ' అనే పేరుతో కల్పించుకున్న నెలలమార్పిడి విధానం రద్దు చేయబడింది). సంవత్సరానికి పన్నెండు మాసాలు. వాటిలో

٢١٥ ـ وعن أبي بَكْرَةَ نُفَيْعِ بْنِ الحارثِ رضي الله عنه عن النَّبِيِّ ﷺ قال: «إِنَّ الزَّمَانَ قَدِ اسْتَدَارَ كَهَيْئَتِهِ يَوْمَ خَلَقَ اللهُ السَّمٰوَاتِ وَالأرضَ: السَّنَةُ اثْنَا عَشَرَ شَهْراً، مِنهَا أَرْبَعَةٌ حُرُمٌ: ثَلاثٌ مُتَوَالِيَاتٌ: ذُو الْقَعْدَةِ، وَذُو الْحِجَّةِ، وَالْمُحَرَّمُ، وَرَجَبُ مُضَرَ الَّذِي بَيْنَ جُمَادَى وَشَعْبَانَ، أَيُّ شَهْرٍ هٰذَا؟» قُلْنَا: اللهُ وَرَسُولُه أَعْلَمُ، فَسَكَتَ حَتَّى ظَنَنَّا أَنَّه سَيُسَمِّيهِ بِغَيْرِ اسْمِهِ، قَالَ: «أَلَيْسَ ذَا الْحِجَّةِ؟» قُلْنَا: بَلَى. قال: «فَأَيُّ بَلَدٍ هٰذَا؟» قُلْنَا: اللهُ وَرَسُولُه

నాలుగు నిషిద్ధ మాసాలున్నాయి. మూడు మాసాలు వరుసగా వస్తాయి. అవి జుల్ ఖాదా, జుల్ హిజ్జ్, ముహర్రం, (నాల్గోది) జుమాదివ్ (స్సానియా)కు - షాబాన్‌కు మధ్య ఉండే 'ముజర్' తెగకు చెందిన రజబ్.

(ఆ తరువాత ఆయన ఇది ఏ నెల? అని ప్రశ్నించారు. దానికి మేము అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తకే బాగా తెలుసు అని అన్నాం. మా జవాబు విని ఆయన మౌనంగా ఉండిపోయారు. మేము ఆయన ఏదైనా కొత్తపేరు చెబుతారేమో అనుకుంటుండగా అంతలోనే ఆయన "ఇది జుల్ హిజ్జా నెలకదూ?!" అని అడిగారు. దానికి మేము 'అవున'న్నాం. తరువాత ఆయన "ఇది ఏ నగరం?" అని అడిగారు. దానికి మేము అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తకే బాగా తెలుసని అన్నాం. అప్పుడు (కూడా) ఆయన మౌనంగానే ఉండిపోయారు. (ఆయన మౌనంగా ఉండిపోవటం చూసి) మేము ఏదన్నా కొత్త పేరుతో పిలుస్తారేమోననుకున్నాం. కాని అంత లోనే ఆయన "ఇది (మక్కా) నగరం కదూ?!" అని అడిగారు. దానికి మేము 'అవున'ని జవాబు చెప్పాం. ఆ తరువాత ఆయన "ఇవాళ ఏ రోజు?" అని అడిగారు. దానికి మేము అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తకే బాగా తెలుసని అన్నాం. అప్పుడు (మళ్ళీ)

أَعْلَمُ، فَسَكَتَ حَتَّى ظَنَنَّا أَنَّهُ سَيُسَمِّيهِ بِغَيْرِ اسْمِهِ. قال: «أَلَيْسَ الْبَلْدَةَ؟» قُلْنَا: بَلَى. قال: «فَأَيُّ يَوْمٍ هٰذَا؟» قُلْنَا: اللهُ وَرَسُولُهُ أَعْلَمُ، فَسَكَتَ حَتَّى ظَنَنَّا أَنَّهُ سَيُسَمِّيهِ بِغَيْرِ اسْمِهِ. قال: «أَلَيْسَ يَوْمَ النَّحْرِ؟» قُلْنَا: بَلَى. قال: «فَإِنَّ دِمَاءَكُمْ وَأَمْوَالَكُمْ وَأَعْرَاضَكُمْ عَلَيْكُمْ حَرَامٌ، كَحُرْمَةِ يَوْمِكُمْ هٰذَا فِي بَلَدِكُمْ هٰذَا فِي شَهْرِكُمْ هٰذَا، وَسَتَلْقَوْنَ رَبَّكُمْ فَيَسْأَلُكُمْ عَنْ أَعْمَالِكُمْ، أَلَا

فلا ترجعوا بعدي كفاراً يضرب بعضكم رقاب بعض، ألا ليبلغ الشاهد الغائب، فلعل بعض من يبلغه أن يكون أوعى له من بعض من سمعه» ثم قال: «ألا هل بلغت، ألا هل بلغت؟» قلنا: نعم. قال: «اللهم اشهد» متفق عليه.

ఆయన మౌనంగా ఉన్నారు. అది చూసి ఆయన ఏదైనా కొత్త పేరు చెబుతారేమో అనుకున్నాం. అంతలో ఆయనే (స్వయంగా) "ఇవాళ ఖుర్బానీ రోజు కదూ?!" అని అడిగారు. దానికి మేము 'అవున'న్నాం.

అప్పుడు ఆయన ఇలా ఉపదేశించారు: "అయితే (వినండి) ఈ నెలలో, ఈ నగరంలో, ఈ రోజు గౌరవప్రదమైనట్లు గానే (పరస్పరం మీ మధ్య) మీ ధన, మాన ప్రాణాలు కూడా (ఎంతో) గౌరవ ప్రదమైనవి. త్వరలోనే మీరు మీ ప్రభువుని కలుసుకోనున్నారు. అప్పుడు ఆయన మిమ్మల్ని మీ కర్మల గురించి అడుగుతాడు. జాగ్రత్త! నా తదనంతరం మీరు ఒండొకరి మెడలు నరుక్కుంటూ అవిశ్వాసులై పోకండి. ఇక్కడ హాజరైన వారు హాజరుకాని వారికి (ఈ విష యాలు) తెలియజేయాలి సుమా! బహుశా మీరు తెలియజేసే వ్యక్తి, నేను చెప్పిన విషయాన్ని (ప్రత్యక్షంగా) విన్న వానికంటే బాగా గుర్తుపెట్టుకునేవాడు కావచ్చు.

ఆ తరువాత ఆయన, "ఇప్పుడు చెప్పండి! నేను (దైవసందేశాన్ని) మీకు అందజేశానా?" అని అడిగారు. దానికి మేము 'అవున'నన్నాం. అప్పుడు ఆయన "దేవా! నీవు (దీనికి) సాక్షిగా ఉండు" అని అన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణంలోనూ, విద్యా ప్రకరణంలోనూ,*

*హజ్ ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని ఖసామా ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

1. సృష్టి ప్రారంభం నుండి నెలలో ఇరవై తొమ్మిది లేక ముప్ఫై దినాలుంటాయని, సంవత్సరానికి పన్నెండు నెలలు ఉంటాయన్న నిర్ణయమే కొనసాగుతూ వచ్చింది. అయితే అరబ్బులు తమ స్వార్థ ప్రయోజనాల దృష్ట్యా నెలల్లో మార్పులు చేసుకునేవారు. ఆ కాలంలో జుల్‌ఖాదా, జుల్ హిజ్జ్, ముహర్రం, రజ్జబ్ - ఈ నాలుగు నెలలూ గౌరవప్రద మైన మాసాలుగా పరిగణించబడేవి. ఈ నాలుగు మాసాల్లో వారు యుద్ధం, హత్యా ప్రతీకారం లాంటి విధ్వంసక చర్యలకు దూరంగా ఉండాలి. కాని వారు తమ అవసరాని కనుగుణంగా ఒక నిషిద్ధ మాసాన్ని సమ్మతమైన మాసంగా మార్చుకునేవారు. అలాగే ఒక సమ్మతమైన మాసాన్ని నిషిద్ధ మాసంగా చేసుకునేవారు. ఒక్కోసారి చాంద్రమాన సంవత్సరాన్ని సూర్యమాన సంవత్సరంతో సరిపెట్టటానికి చాంద్రమాన సంవత్సరానికి అదనంగా ఓ మాసాన్ని జోడించేవారు. ఈ నెలల మార్పిడీ విధానాన్నే అరబ్బులు 'నసీ' అని పిలిచేవారు. ఈ హదీసు వారు కల్పించుకున్న ఈ 'నసీ' విధానాన్నే ఖండిస్తోంది.
2. ప్రజలు ఒండొకరి ధన, మాన ప్రాణాలను కాపాడాలి. వాటిని గౌరవప్రదమైనవిగా భావించాలి.
3. పరలోకంలో ప్రభువు మానవులందరినీ తమ కర్మల విషయమై నిలదీస్తాడు.
4. ధర్మబోధనలు విని వాటిని తమవరకే పరిమితం చేసుకోకుండా ఇతరులకు కూడా బోధించాలి. మనం ధర్మ విషయాలు బోధించే వ్యక్తి వాటిని మనకన్నా ఉత్తమంగా ఆచరించవచ్చు!

216. హజ్రత్ అబూ ఉమామా ఇయాస్ బిన్ సాలబా హారిసీ (రజి) కథనం ప్రకారం (ఒకసారి) దైవప్రవక్త (స), "(అసత్య) ప్రమాణం చేసి (తోటి) ముస్లిం హక్కుని లాక్కున్నవాడికి దేవుడు నరకాగ్నిని తప్పనిసరి చేశాడు. ఇంకా స్వర్గాన్ని అతనికొరకు నిషేధించాడు" అని అన్నారు. అది విని ఒక వ్యక్తి, "ఆ హక్కు ఎంత చిన్నదైనా (దేవుడు అలాగే చేస్తాడా)?" అని సందేహపడగా, దానికి

٢١٦ ـ وعن أبي أُمَامَةَ إِيَاسِ بن ثَعْلَبَةَ الحارثيِّ رضي الله عنه أَنَّ رسولَ الله ﷺ قال: «مَنِ اقْتَطَعَ حَقَّ امرِئٍ مُسْلِمٍ بِيَمِينِهِ فَقَدْ أَوْجَبَ اللهُ لَه النَّارَ، وَحَرَّمَ عَلَيْهِ الْجَنَّةَ» فقال رَجُلٌ: وَإِنْ كَانَ شَيْئاً يَسِيراً يَا رَسُولَ اللهِ؟! فقال: «وَإِنْ كَانَ قَضِيبًا مِنْ أَرَاكٍ» رواه مسلم.

ఆయన "అది పీలూ చెట్టు కొమ్మ అయినా సరే!" అని అన్నారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రమాణాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

తోటి మానవుల హక్కుల్ని కాలరాస్తే పరలోకంలో ఎదురయ్యే పర్యవసానం ఏమిటో ఈ హదీసు వివరిస్తోంది. అసలు మానవ హక్కులకు ఎంత విలువ ఉంటే దేవుడు వాటిని కొల్లగొట్టేవారికి ఇంత పెద్ద శిక్ష విధించి ఉంటాడన్నది ఆలోచించాల్సిన విషయం. తెలియక అలాంటి పాపం చేస్తే దేవుడు ఏనాటికైనా క్షమిస్తాడేమోగాని బుద్ధిపూర్వకంగా, దానిని ధర్మసమ్మతంగా భావించి చేస్తే మాత్రం శాశ్వతంగా నరక జ్వాలల మధ్య కాలుతూ ఉండాల్సిందే!

217. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అదీ బిన్ ఉమైరా (రజి) తెలియజేశారు: మేము మీలో ఎవరినయినా ఏదైనా పనికి ఉద్యోగిగా నియమించినప్పుడు అతను ఒక సూదిగాని లేదా అంతకన్నా పెద్ద (లేక చిన్న) వస్తువుని గాని దాచి పెట్టుకుంటే అది ద్రోహం అవుతుంది. ప్రళయదినాన అతను దాన్ని తన వెంట తీసుకొనే (దైవ సన్నిధికి) వస్తాడు."

అది విని అన్సార్లకు చెందిన నల్లటి వ్యక్తి ఒకడు లేచి నిలబడ్డాడు. ఇప్పటికీ ఆ దృశ్యం నా కళ్ళముందు కదలాడుతోంది. అతను దైవప్రవక్తతో "దైవ ప్రవక్తా! మీరు నాకు అప్పగించిన బాధ్యతను తిరిగి తీసేసుకోండి" అని అన్నాడు. దానికి ఆయన "ఏమయింది నీకు?" అని అడిగారు. అందుకతను, "మీరు ఇలా అన్నారుగా! (దాంతో నాకు భయం పట్టుకుంది)" అని విన్నవించు

٢١٧ - وعن عَدِيِّ بنِ عُمَيْرَةَ رضي الله عنه قال: سَمِعْتُ رسولَ الله ﷺ يقُول: «مَنِ اسْتَعْمَلْنَاهُ مِنْكُمْ عَلَى عَمَلٍ، فَكَتَمَنَا مِخْيَطاً فَمَا فَوْقَهُ، كَانَ غُلُولاً يَأْتِي بِهِ يَوْمَ الْقِيَامَةِ» فَقَامَ إِلَيْهِ رَجُلٌ أَسْوَدُ مِنَ الأنصارِ، كَأَنِّي أَنْظُرُ إِلَيْهِ، فقال: يا رسولَ اللهِ! اقْبَلْ عَنِّي عَمَلَكَ، قال: «وَمَا لَكَ؟» قال: سَمِعْتُكَ تَقُولُ كَذَا وَكَذَا، قال: «وَأَنَا أَقُولُهُ الآنَ: مَنِ اسْتَعْمَلْنَاهُ عَلَى عَمَلٍ فَلْيَجِيءْ بِقَلِيلِهِ وَكَثِيرِهِ، فَمَا أُوتِيَ مِنْهُ أَخَذَ، وَمَا نُهِيَ عَنْهُ انْتَهَى» رواه مسلم.

కున్నాడు. అతని జవాబు విని, "ఇప్పుడు కూడా అదే మాట అంటున్నాను. మేము ఎవరినయినా ఏదైనా పనిపై నియమించగా అతను తనకు లభించిన దానిని - అది తక్కువైనా, ఎక్కువైనా - (మా దగ్గరికి) తీసుకురావాలి. అందులో అతనికి ఇచ్చింది తీసుకోవాలి. ఇవ్వనిది తీసుకోకుండా ఉండాలి" అని అన్నారు దైవప్రవక్త (సల్లం) *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ప్రభుత్వోద్యోగులు తమ విధులను నిక్కచ్చిగా, నిజాయితీగా నిర్వర్తించాలి. ఉద్యోగ కార్యకలాపాల్లో ఏమాత్రం నమ్మకద్రోహానికి పాల్పడినా, పదవి ఆసరాలో అక్రమంగా డబ్బు సంపాదించినా దేవుని దృష్టిలో వారు నేరస్తులుగా పరిగణించబడతారు.
2. ఉన్నతాధికారులు తమ క్రింది ఉద్యోగుల పనులను ఓ కంట కనిపెడుతూ ఉండాలి. విధి నిర్వహణలో ఉంటూనే దొడ్డిదారులగుండా డబ్బు సంపాదించే ఆస్కారం లేకుండా చేయాలి. లేకపోతే ఉన్నతాధికారుల నిర్లక్ష్యం కూడా నేరంగానే పరిగణించబడుతుంది. ఇక ఉన్నతాధికారులు సైతం తమ క్రింది ఉద్యోగులతో కుమ్మక్కై ప్రజాధనాన్ని కొల్లగొట్టడంలో పాలుపంచుకుంటే ఇది మరీ దిగజారిన విషయం. నేడు మన సమాజంలో జరుగుతున్నది కూడా ఇదే! అందుకే ప్రభుత్వ వ్యవస్థలో అవినీతి, లంచగొండితనం, కుంభకోణాలు లాంటి నేరాలు రోజురోజుకీ మితిమీరి పోతున్నాయి.

218. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం : ఖైబర్ సంగ్రామం జరిగిన నాడు దైవప్రవక్త సహచరులు కొందరు వచ్చి, ఆ వ్యక్తి అమరుడు (షహీద్), ఈ వ్యక్తి అమరుడు అని అనసాగారు. ఆ విధంగా వాళ్ళు ఒక వ్యక్తి దగ్గర్నుంచి వెళుతూ ఇతను (కూడా) అమరవీరుడని అన్నారు. అది విని దైవప్రవక్త "అసంభవం,

٢١٨ ـ وعن عمرَ بنِ الخطّاب رضي الله عنه قال: لَمَّا كَانَ يَوْمُ خَيْبَرَ أَقْبَلَ نَفَرٌ مِنْ أَصْحَابِ النَّبِيِّ ﷺ فَقَالُوا: فُلانٌ شَهِيدٌ، وَفُلانٌ شَهِيدٌ، حَتَّى مَرُّوا عَلَى رَجُلٍ فقالوا: فُلانٌ شَهِيدٌ. فقال النَّبِيُّ ﷺ: «كَلَّا إِنِّي رَأَيْتُهُ فِي النَّارِ فِي بُرْدَةٍ غَلَّهَا ـ أَوْ عَبَاءَةٍ ـ» رواه مسلم.

ఇతను ఒక దుప్పటిని దొంగిలించాడు. అందుకతను నరకంలో ఉండటం నేను చూశాను" అని చెప్పారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవమార్గంలో పోరాడి అమరగతి నొందినప్పటికీ సాటి మానవుల హక్కులను కొల్లగొట్టిన పాపం క్షమించబడదని ఈ హదీసు ద్వారా విదితమవుతోంది. ఇంకా ముస్లింల ఉమ్మడి ఖజానాలో మోసానికి పాల్పడటం మహాపాపమని తెలుస్తోంది.

٢١٩ ـ وعن أبي قَتَادَةَ الْحارِثِ بن رِبْعِيٍّ رضي الله عنه عن رسولِ الله ﷺ أَنَّهُ قَامَ فِيهِمْ، فَذَكَرَ لَهُمْ أَنَّ الْجِهَادَ فِي سَبِيلِ الله، وَالإِيمَانَ بِالله أَفْضَلُ الأَعْمَالِ، فَقَامَ رَجُلٌ فقال: يارسولَ الله! أَرَأَيْتَ إِنْ قُتِلْتُ فِي سَبِيلِ الله، تُكَفَّرُ عَنِّي خَطَايَايَ؟ فَقَالَ لَهُ رسولُ الله ﷺ: «نَعَمْ إِنْ قُتِلْتَ فِي سَبِيلِ الله وَأَنْتَ صَابِرٌ مُحْتَسِبٌ، مُقْبِلٌ غَيْرُ مُدْبِرٍ» ثُمَّ قال رسولُ الله ﷺ: «كَيْفَ قُلْتَ؟» قال: أَرَأَيْتَ إِنْ قُتِلْتُ فِي سَبِيلِ الله، أَتُكَفَّرُ عَنِّي خَطَايَايَ؟ فقال رسولُ الله ﷺ: «نَعَمْ وَأَنْتَ صَابِرٌ مُحْتَسِبٌ، مُقْبِلٌ غَيْرُ مُدْبِرٍ، إِلَّا الدَّيْنَ فَإِنَّ جِبْرِيلَ قال لِي ذٰلِكَ» رواه مسلم.

219. హజ్రత్ అబూ ఖతాదా హారిస్ బిన్ రిబ్‌యీ (రజి) కథనం : ఒకసారి దైవ ప్రవక్త (సల్లం) ప్రజల మధ్య నిలబడి, దైవమార్గంలో పోరాడటం, దైవాన్ని విశ్వసించటం సత్కార్యాలన్నింటిలోకెల్లా శ్రేష్ఠమైన పని అన్నారు. దానికి ఒక వ్యక్తి లేచి, "దైవప్రవక్తా! నేను దైవమార్గంలో (పోరాడుతూ) చంపబడితే నా పాపాలన్నీ మన్నించబడతాయంటారా?" అని అడిగాడు. అందుకాయన, "అవును, నువ్వు సహనాన్ని ప్రదర్శిస్తూ, పుణ్య ఫలాపేక్షతో, (యుద్ధభూమి నుండి) వెన్నుచూపి పారిపోకుండా, శత్రువులతో ఎదురొడ్డి పోరాడుతూ హత్య చేయబడినట్లైతే (నీ పాపాలన్నీ మన్నించబడతాయి)" అని అన్నారు. ఆ తరువాత ఆయనే అతనితో, "నువ్వడిగింది ఏమిటి? (ఇంకోసారి అడుగు)" అని అన్నారు. దానికతను, "నేను దైవ మార్గంలో పోరాడుతూ చంపబడితే నా పాపాలన్నీ మన్నించబడతాయంటారా?"

అని మళ్ళీ విన్నవించుకున్నాడు. అప్పుడ తనికి సమాధానంగా, "అవును నువ్వు సహనాన్ని ప్రదర్శిస్తూ, పుణ్యాన్ని ఆశిస్తూ, వెన్ను చూపి పారిపోకుండా, శత్రువులతో ఎదురొడ్డి పోరాడుతూ చంపబడితే ఒక్క అప్పు తప్ప (మిగతా పాపాలన్నీ క్షమించ బడతాయి) అప్పు మాత్రం క్షమించ బడదు. ఎందుకంటే (అప్పు తీర్చకపోతే క్షమించబడదని) జిబ్రయీల్ (దూత) నాతో చెప్పారు" అని ఆయన అన్నారు.
(ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

అప్పు అనేది సాటి మానవుల హక్కు. దాన్ని తీర్చకపోతే ఎట్టి పరిస్థితుల్లోనూ అది క్షమించబడదు. కనుక ప్రతి ముస్లిం సాటి మానవుల హక్కుల్ని ఎగవేయకుండా తీసుకున్న అప్పుల్ని తీర్చడంలో నిర్లక్ష్యం వహించకుండా జాగ్రత్తపడాలి.

220. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) (ఒకసారి తన సహచరులను) "దరిద్రుడంటే ఎవడో మీకు తెలుసా?" అని అడిగారు. "మా దృష్టిలో దిర్హములు (డబ్బు)గాని, (జీవన) సామగ్రిగాని లేనివాడు దరిద్రుడు" అని ఆయన సహచరులు సమాధానం చెప్పారు. అప్పుడు ఆయన ఇలా అన్నారు: "(కాని) నా అనుచర సమాజంలో దరిద్రుడు ఎవడంటే, ప్రళయదినాన ఒక వ్యక్తి నమాజులు, ఉపవాసాలు, జకాత్‌లు తన వెంట తీసుకొని వస్తాడు. (అయితే అతను ప్రపంచంలో) ఒకరిని తిట్టివుంటాడు,

٢٢٠ ـ وعن أبي هريرةَ رضي الله عنه، أنَّ رسولَ الله ﷺ قال: «أتَدْرُونَ مَا الْمُفْلِسُ؟» قَالُوا: الْمُفْلِسُ فِينَا مَنْ لَا دِرْهَمَ لَهُ وَلَا مَتَاعَ فقال: «إنَّ الْمُفْلِسَ مِنْ أُمَّتِي مَنْ يَأتِي يَوْمَ الْقِيَامَةِ بِصَلَاةٍ وَصِيَامٍ وَزَكَاةٍ، وَيَأتِي قَدْ شَتَمَ هٰذَا، وَقَذَفَ هٰذَا، وَأَكَلَ مَالَ هٰذَا، وَسَفَكَ دَمَ

هٰذَا، وَضَرَبَ هٰذَا، فَيُعْطَى هٰذَا مِنْ حَسَنَاتِهِ، وَهٰذَا مِنْ حَسَنَاتِهِ، فَإِنْ فَنِيَتْ حَسَنَاتُهُ قَبْلَ أَنْ يَقْضِيَ مَا عَلَيْهِ، أُخِذَ مِنْ خَطَايَاهُمْ فَطُرِحَتْ عَلَيْهِ، ثُمَّ طُرِحَ فِي النَّارِ» رواه مسلم.

ఒకడిపై అపనింద మోపి ఉంటాడు. ఒకడి సొమ్ముకు (అక్రమంగా) తిని ఉంటాడు. ఒకణ్ణి హత్య చేసివుంటాడు. ఇంకొకణ్ణి కొట్టివుంటాడు. కనుక అతని పుణ్యకార్యాలన్నీ వారందరికీ పంచి వేయబడతాయి. అతని సత్కార్యాలన్నీ అయిపోయి బాధితులకు రావాల్సిన హక్కులు ఇంకా బాకీ ఉంటే వారి పాపాలు అతని నెత్తిన వేయబడతాయి. ఆ విధంగా (తన సత్కార్యాలేమీ మిగల నందువల్ల) అతను నరకంలో పడవేయ బడతాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ముస్లింలు విధిగా నమాజ్, రోజా (ఉపవాసా)లను పాటిస్తూ, జకాత్ చెల్లిస్తూ ఉండాలన్న దాంట్లో సందేహం లేదు. అయితే వీటితో పాటు ముస్లింలు తమ నడవడికను, వ్యవహారాలను కూడా చక్కదిద్దుకోవాలి. ఆరాధనలతో పాటు లావాదేవీలలో కూడా ఉత్తమంగా మసలుకోవాలి. ఈ రెండింటిని సమాంతరంగా అమలుపరిచిన వాడే సాఫల్యం పొందుతాడు. దీనికి భిన్నంగా పై రెండింటిలో దేనిని విస్మరించినా అతనికి ముక్తి లభించకపోవచ్చు.

٢٢١ - وعن أُمِّ سَلَمَةَ رضي الله عنها، أَنَّ رسولَ الله ﷺ قال: «إِنَّمَا أَنَا بَشَرٌ، وَإِنَّكُمْ تَخْتَصِمُونَ إِلَيَّ، وَلَعَلَّ بَعْضَكُمْ أَنْ يَكُونَ أَلْحَنَ بِحُجَّتِهِ مِنْ بَعْضٍ، فَأَقْضِيَ لَهُ بِنَحْوِ مَا أَسْمَعُ، فَمَنْ قَضَيْتُ لَهُ بِحَقِّ أَخِيهِ فَإِنَّمَا أَقْطَعُ لَهُ قِطْعَةً مِنَ النَّارِ» متفقٌ عليه. «أَلْحَنَ» أَيْ: أَعْلَمَ.

221. హజ్రత్ ఉమ్మె సలమా (రజి. అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: నిస్సందేహంగా నేను కూడా (మీలాంటి) మనిషినే. (తీర్పుకోసం) మీరు నా దగ్గరికి వివాదాలు తీసుకువస్తుంటారు. (ఆ సందర్భంలో) మీలో కొందరు (తమ పక్షాన ధర్మం లేకపోయినా) వాక్చాతుర్యంతో - తమ ప్రత్యర్థికన్నా బాగా వాదించినప్పుడు వారి మాటలు విని నేను (నిజమే అనుకొని) వారికి

అనుకూలంగా తీర్పు ఇచ్చే అవకాశం ఉంది. అయితే ధర్మం తన సోదరుని (ప్రత్యర్థి) పక్షాన ఉన్నప్పటికీ అతని హక్కు విషయంలో నేను ఏ (రెండవ) వ్యక్తికైనా అనుకూలంగా తీర్పు ఇస్తే, వాస్తవానికి నేనతనికి నిప్పు రవ్వ త్రుంచి ఇస్తున్నానని గ్రహించాలి.

*(బుఖారీ - ముస్లిం)*

'అల్‌హన్' అంటే బాగా తెలిసినవాడు, చురుకైనవాడు, వాక్చతురుడు అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని ఆజ్ఞలు - ఆదేశాల ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని వ్యాజ్యాల ప్రకరణంలోనూ ఈ హదీసు ఉంది.)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) తాను కూడా మానవ మాత్రుణ్ణేనని స్వయంగా అంగీకరించారు. కనుక ఆయన కూడా ఎదుటివ్యక్తి వాక్చాతుర్యానికి, చురుకుదనానికి ప్రభావితులై అబద్ధాన్ని నిజమని భావించే అవకాశం ఉంది. కాని ధర్మం విషయంలో మాత్రం ఆయన వల్ల ఇలాంటి పొరపాట్లు జరగవు. ధర్మాన్ని పరిరక్షించే బాధ్యత దైవానిదే కనుక అలాంటి సందర్భాల్లో ఆయన తన ప్రవక్తను అప్రమత్తం చేస్తూ ఉంటాడు.

2. న్యాయనిర్ణేత తన ముందుకు వచ్చిన వాదప్రతివాదనల ఆధారంగానే తీర్పు ఇవ్వాలి. అలాగాకుండా కేవలం అనుమానంతోగాని లేదా తనకు నిజం తెలుసనిగాని తన యిష్టప్రకారం తీర్పులు ఇవ్వకూడదు.

٢٢٢ - وعن ابنِ عمرَ رضي الله عنهما، قال: قال رسولُ الله ﷺ: «لَنْ يَزَالَ الْمُؤْمِنُ في فُسْحَةٍ مِنْ دِينِهِ مَا لَمْ يُصِبْ دَماً حَرَاماً» رواه البخاري.

222. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు : అన్యాయంగా ఒకడి రక్తాన్ని చిందించకుండా ఉన్నంతకాలం విశ్వాసికి అతని ధర్మం విశాలమనిపిస్తుంది.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని 'రక్తశుల్క' ప్రకరణం ప్రారంభంలో ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

విశ్వాసి అన్యాయంగా హత్యకు ఒడిగట్టకుండా ఉన్నంతకాలం అతనికి ధర్మాన్ని ఆచరించే భాగ్యం లభిస్తూ ఉంటుంది లేదా సువిశాల దైవకారుణ్యం అతణ్ణి ఆవహించి ఉంటుంది. పై హదీసుకు రెండు భావాలూ వర్తించవచ్చు. రెండింటి సారాంశమూ ఒక్కటే. ఆ అన్యాయానికి ఒడిగట్టకుండా ఉన్నంతవరకు అతనిలో దైవకారుణ్యం పట్ల ఆశాజ్యోతి వెలుగుతూ ఉంటుంది. అతను దైవకరుణకు అర్హుడిగా పరిగణించబడతాడు. కాని అతను ఎవరినయినా అన్యాయంగా హత్య చేయగానే ఆ ఆశాజ్యోతి ఆరిపోయి అతను దైవకారుణ్యం పట్ల నిరాశా నిస్పృహలకు లోనయ్యే అవకాశముంటుంది.

٢٢٣ ـ وعن خَوْلَةَ بِنْتِ عَامِرٍ الأنصَارِيَّةِ، وَهِيَ امْرَأَةُ حَمْزَةَ رضي الله عنه وعنها، قالت: سَمِعْتُ رسولَ الله ﷺ يَقُولُ: «إنَّ رجَالًا يَتَخَوَّضُونَ في مَالِ الله بغَيْرِ حَقٍّ، فَلَهُمُ النَّارُ يَوْمَ القِيَامَةِ» رواه البخاري.

223. దైవప్రవక్త (సల్లం) ఇలా అంటుండంగా తాను విన్నానని హజ్రత్ ఖౌలా బిన్తె ఆమిర్ అన్సారియ్యా (రజి.అన్హా) - ఈమె హజ్రత్ హమ్జా గారి సతీమణి - తెలియజేశారు : కొంతమంది దేవుని ఖజానాను (ప్రజాధనాన్ని) అక్రమంగా ఖర్చుపెడుతుంటారు. అలాంటి వారి కోసం ప్రళయ దినాన నరకాగ్ని (సిద్ధంగా ఉంచబడుతుంది.) (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రజాధనాన్ని అక్రమంగా యిష్టం వచ్చినట్లు ఖర్చు చేయటం, ప్రజలందరికీ ఉపయోగ పడే పనులపై గాకుండా వ్యక్తిగత ప్రయోజనాలకోసం వినియోగించుకోవడం మహా పాపం, ఇలాంటి అవినీతికి పాల్పడిన వ్యక్తి జీవితంలో పశ్చాత్తాపం చెందకుండా మరణిస్తే పరలోకంలో నరకయాతనకు గురికావలసి ఉంటుంది.



## 27వ అధ్యాయం

# ٢٧ - بَابُ تَعْظِيمِ حُرُمَاتِ الْمُسْلِمِينَ وَبَيَانِ حُقُوقِهِمْ وَالشَّفَقَةِ عَلَيْهِمْ وَرَحْمَتِهِمْ

# ముస్లింల మానమర్యాదలను గౌరవించడం, వారి హక్కులను రక్షించటం, వారిపట్ల ప్రేమావాత్సల్యాలతో వ్యవహరించడం గురించి.......

قال الله تعالى: ﴿وَمَن يُعَظِّمْ حُرُمَٰتِ ٱللَّهِ فَهُوَ خَيْرٌ لَّهُۥ عِندَ رَبِّهِۦ﴾ [الحج: ٣٠] وقال تعالى: ﴿وَمَن يُعَظِّمْ شَعَٰٓئِرَ ٱللَّهِ فَإِنَّهَا مِن تَقْوَى ٱلْقُلُوبِ ﴿٣٢﴾﴾ [الحج: ٣٢] وقال تعالى: ﴿وَٱخْفِضْ جَنَاحَكَ لِلْمُؤْمِنِينَ ﴿٨٨﴾﴾ [الحجر: ٨٨] وقال تعالى: ﴿مَن قَتَلَ نَفْسًۢا بِغَيْرِ نَفْسٍ أَوْ فَسَادٍ فِى ٱلْأَرْضِ فَكَأَنَّمَا قَتَلَ ٱلنَّاسَ جَمِيعًا وَمَنْ أَحْيَاهَا فَكَأَنَّمَآ أَحْيَا ٱلنَّاسَ جَمِيعًا﴾ [المائدة: ٣٢].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

“ఎవడైనా అల్లాహ్ విధించిన పవిత్ర నియమాలను గౌరవిస్తే, అది అతని ప్రభువు దృష్టిలో స్వయంగా అతడికే శ్రేయస్కరమైనది.” (అల్ హజ్ : 30)

మరొకచోట ఇలా అంటున్నాడు :

“ఎవరైనా అల్లాహ్ నిర్ణయించిన చిహ్నాలను గౌరవిస్తున్నారంటే అది (వారి) హృదయాలలోని దైవభీతి వలననే.” (అల్ హజ్ : 32)

ఇంకొకచోట ఇలా సెలవిస్తున్నాడు :

“విశ్వాసుల పట్ల మృదువుగా మెలగు.” (అల్ హిజ్ర్ : 88)

ఆయన ఇంకా ఇలా అంటున్నాడు : “హత్యకు బదులుగాగాని లేదా కల్లోలాన్ని వ్యాపింపజేసినందుకుగాని కాక (అన్యాయంగా) ఒక మానవుణ్ణి చంపినవాడు సమస్త మానవులను చంపినట్లే. ఒక మానవుడి ప్రాణాలను కాపాడినవాడు

మొత్తం మానవుల ప్రాణాలను కాపాడినట్లే."

(అల్ మాయిద : 32)

224. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు : విశ్వాసులు పరస్పరం కట్టడం లాంటివారు. అందులోని ఒక భాగం మరో భాగానికి ఊతంగా ఉంటుంది. (అలాగే విశ్వాసులందరూ కూడా పరస్పరం కలసిమెలసి ఉంటారు).

దీని గురించి ఉపదేశిస్తున్నప్పుడు ఆయన తన చేతుల వ్రేళ్ళను ఒక దానిలో ఒకటి జొప్పించి (విశ్వాసులు కూడా ఇలాగే ఐకమత్యంతో ఉంటారని ప్రజలకు) చూపించారు.

(బుఖారీ - ముస్లిం)

٢٢٤ ـ وعن أبي موسى رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «المُؤمنُ للمُؤمِنِ كَالْبُنْيَانِ يَشُدُّ بَعْضُهُ بَعْضاً» وَشَبَّكَ بَيْنَ أَصَابِعِهِ. متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది).*

## ముఖ్యాంశాలు

ముస్లింలందరూ ఐకమత్యంతో ఉండాలని ఈ హదీసు బోధిస్తోంది. ప్రతి ముస్లిం ముస్లిం సమాజానికి ఒక ఇటుక లాంటివాడు. ఇటుకలన్నీ ఒకదానిపై ఒకటి పేర్చబడి పరస్పరం ఆధారాన్నిచ్చుకుంటూ గట్టి గోడలా నిలబడినట్లు ముస్లింలు కూడా పరస్పరం సహాయకారులుగా కలిసిమెలిసి ఉండాలని ఈ హదీసు ఉపదేశిస్తోంది.

225. హజ్రత్ అబూ మూసా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు : ఎవరైనా మా మస్జిదుల గుండాగాని లేక మా బజారుల గుండాగాని వెళ్తున్నప్పుడు, తమ వెంట బాణం ఉంటే దాన్ని ఆపి ఉంచాలి లేదా దాని మొనను చేత్తో

٢٢٥ ـ وعنه قال: قال رسولُ الله ﷺ: «مَنْ مَرَّ في شَيْءٍ مِنْ مَسَاجِدِنَا، أَوْ أَسْوَاقِنَا، وَمَعَهُ نَبْلٌ فَلْيُمْسِكْ، أَوْ لِيَقْبِضْ عَلَى نِصَالِهَا بِكَفِّهِ أَنْ يُصِيبَ أَحَداً مِنَ الْمُسْلِمِينَ مِنْهَا بِشَيْءٍ» متفقٌ عليه.

గట్టిగా పట్టుకొని నడవాలి. లేకపోతే అది ఏ ముస్లింకైనా తగిలి బాధ కలిగించ వచ్చు. (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని నమాజు ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

సత్యధర్మాన్ని స్వీకరించిన వారి రక్షణ కోసం ఇస్లాం ధర్మం ఎలాంటి కట్టుదిట్టమైన చర్యలు తీసుకుంటుందో ఈ హదీసు ద్వారా అవగతమవుతోంది. కాని శోచనీయమైన విషయం ఏమిటంటే శాంతి, సౌమనస్యాలను పరిరక్షించే ముస్లింలు సైతం నేడు ఆయుధాల వాడకంలో ఎంతో అజాగ్రత్త వహిస్తున్నారు. పనికిమాలిన సరదాల కోసం, వ్యర్థ వ్యసనాల కోసం ఆయుధాలను ఉపయోగించి భయోత్పాతాన్ని సృష్టిస్తున్నారు. అకారణంగా ఎంతోమంది అమాయకుల్ని పొట్టనబెట్టుకుంటున్నారు. విధ్వంసకర బాంబులను, మందుపాతరలను పేల్చుతూ ప్రజలకు మనశ్శాంతి లేకుండా చేస్తున్నారు. ముస్లింలు తమ ధర్మాదేశాల పట్ల ఎంత నిర్లక్ష్యంగా, నిర్భయంగా వ్యవహరిస్తున్నారో వారు అనుసరిస్తున్న వైఖరే చాటుతోంది.

226. హజ్రత్ నోమాన్ బిన్ బషీర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : విశ్వాసులు పరస్పరం అభిమానించుకోవటంలో, కనికరించుకోవటంలో, ప్రేమావాత్సల్యాలతో మెలగటంలో ఒక దేహం లాంటి వారు. దేహంలో ఒక అవయవానికి బాధకలిగినప్పుడు మొత్తం దేహమంతా బాధతో, జబ్బుతో మూలుగుతుంది. (బుఖారీ - ముస్లిం)

٢٢٦ ـ وعن النُّعْمَانِ بنِ بَشِيرٍ رضي الله عنهما قال: قال رسولُ الله ﷺ: «مَثَلُ الْمُؤْمِنِينَ فِي تَوَادِّهِمْ وَتَرَاحُمِهِمْ وَتَعَاطُفِهِمْ، مَثَلُ الْجَسَدِ إِذَا اشْتَكَى مِنْهُ عُضْوٌ تَدَاعَى لَهُ سَائِرُ الْجَسَدِ بِالسَّهَرِ وَالْحُمَّى» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణంలోనూ ఈ హదీసు ఉంది.)*

## ముఖ్యాంశాలు

ముస్లిం గ్రంథంలో ఇలాంటిదే ఇంకొక హదీసు ఉంది. దాని ప్రకారం విశ్వాసులందరూ ఒకే మనిషిలాంటివారు. అతని కంటికి బాధ కలిగినప్పుడు మొత్తం శరీరం ఆ బాధను అనుభవిస్తుంది. అతనికి తల నొప్పి వచ్చినప్పుడు శరీరమంతా ఆ నొప్పితో బాధపడుతుంది.

227. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) (మనవడు) హసన్ బిన్ అలీని ముద్దాడారు. అప్పుడు అఖ్రా బిన్ హాబిస్ కూడా అక్కడే ఉన్నారు. ఆయన ఆ దృశ్యాన్ని చూసి "(దైవప్రవక్తా!) నాకు పదిమంది పిల్లలున్నారు. కాని ఏనాడూ నేను వాళ్ళలో ఏ పిల్లవాడ్నీ ముద్దాడలేదు" అని అన్నారు. దానికి ఆయన అఖ్రా వైపు చూసి "కనికరించనివాడిపై కనికరం చూపబడదు" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

٢٢٧ ـ وعن أبي هُرَيْرَةَ رضي الله عنه قال: قَبَّلَ النَّبِيُّ ﷺ الْحَسَنَ بْنَ عَلِيٍّ رضي الله عنهما، وَعِنْدَهُ الأَقْرَعُ بْنُ حَابِسٍ، فقال الأَقْرَعُ: إنَّ لِي عَشَرَةً مِنَ الْوَلَدِ مَا قَبَّلْتُ مِنْهُمْ أَحَداً. فَنَظَرَ إلَيْهِ رسولُ الله ﷺ فقال: «مَنْ لا يَرْحَمْ لا يُرْحَمْ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్టతల ప్రకరణంలోనూ ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

పసిపిల్లలను ప్రేమతో ముద్దాడటం ధర్మసమ్మతమే. పైగా దీనిద్వారా దైవకారుణ్యాన్ని పొందవచ్చు. తల్లిదండ్రులు తమ పిల్లలపై వాత్సల్యం చూపాలి. ఇది పిల్లల హక్కు. ఆ హక్కుని నిర్వర్తించడంలో తల్లిదండ్రులు ఏ లోటూ రానివ్వకూడదు.

228. హజ్రత్ ఆయిషా (రజి. అన్హా) కథనం: కొంతమంది పల్లెవాసులు దైవ ప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి, "మీరు కూడా మీ పిల్లల్ని ముద్దాడుతారా?!" అని అడిగారు. దానికి ఆయన "అవును" న్నారు. అందుకు వారు, "మేము మాత్రం (మా పిల్లల్ని) ముద్దుపెట్టుకోం" అని అన్నారు. ఆ మాట విని, "దేవుడు మీ హృదయాల నుండి మమతానురాగాలు తీసివేస్తే దానికి నేనేం చేయగలను?" అని అన్నారు దైవప్రవక్త (స).

*(బుఖారీ - ముస్లిం)*

٢٢٨ ـ وعن عائشةَ رضي الله عنها قالت: قَدِمَ نَاسٌ مِنَ الأَعْرَابِ عَلَى رسولِ الله ﷺ، فقالوا: أَتُقَبِّلُونَ صِبْيَانَكُمْ؟ فقال: «نَعَمْ» قالوا: لَكِنَّا والله مَا نُقَبِّلُ! فقال رسولُ الله ﷺ: «أَوَأَمْلِكُ إنْ كَانَ اللهُ نَزَعَ مِنْ قُلُوبِكُمُ الرَّحْمَةَ!» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్ఠతల ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

పిల్లలపై ప్రేమావాత్సల్యాలు కురిపించడంలోనూ ఆనందం ఉంది. ఆ ఆనందాన్ని పొందడానిక్కూడా అదృష్టం ఉండాలి. అందరికీ ఆ భాగ్యం లభించదు. ప్రేమపరిమళాలతో నిండివున్న హృదయాలే అందులోని మాధుర్యాన్ని ఆస్వాదించగలవు.

229. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ప్రజలపై దయ జూపనివాడిపై దేవుడు కూడా దయ జూపడు. *(బుఖారీ - ముస్లిం)*

٢٢٩ ـ وعن جرير بن عبدِ الله رضي الله عنه قال: قال رسول الله ﷺ: «مَنْ لا يَرْحَمِ النَّاسَ لا يَرْحَمْهُ اللهُ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని ఏకేశ్వరోపాసనా ప్రకరణంలోనూ, సంస్కార ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్ఠతల ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

సృష్టిలోని జీవరాశుల పట్ల దయాదాక్షిణ్యాలతో వ్యవహరించటం దేవుని దృష్టిలో అత్యంత ప్రియమైన ఆచరణ. ఆఖరికి పశుపక్ష్యాదులపై కనికరించినా కూడా దేవుడు అమితంగా సంతోషిస్తాడు. కనికరం చూపేవ్యక్తి దైవకారుణ్యానికి అర్హుడౌతాడు. ప్రాణికోటిలో మనిషి ప్రత్యేకత నుద్దేశ్యించుకొని పై హదీసు వాక్యాల్లో ప్రజలపై దయచూపాలని ఆదేశించబడింది కాని వాస్తవానికి పశుపక్ష్యాదులపై కూడా తప్పకుండా దయచూపాల్సిందే.

230. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉద్బోధించారు : మీలో ఎవరైనా ప్రజలకు నమాజ్ (ఎవరికీ భారమనిపించకుండా నమాజును) క్లుప్తంగా చేయించాలి. ఎందుకంటే (నమాజుకు వచ్చే) వారిలో బలహీనులు, వ్యాధిగ్రస్తులు, వృద్ధులు కూడా ఉంటారు. ఒకవేళ ఎవరయినా ఒంటరిగా చేస్తున్న

٢٣٠ ـ وعن أبي هُريرة رضي الله عَنهُ، أنَّ رَسُوْلَ اللهِ ﷺ قال: «إذَا صَلَّى أَحَدُكُمْ لِلنَّاسِ فَلْيُخَفِّفْ، فَإِنَّ فِيهِمُ الضَّعِيفَ وَالسَّقِيمَ وَالكَبِيرَ. وَإِذَا صَلَّى أَحَدُكُمْ لِنَفْسِهِ فَلْيُطَوِّلْ مَا شَاءَ» متفقٌ عليه.
وفي رواية: «وَذَا الحَاجَةِ».

ప్పుడు కావాలనుకుంటే ఎంత సుదీర్ఘం గానయినా చేసుకోవచ్చు.

*(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో "అవసరం నిమిత్తం వెళ్ళవలసిన వారు (కూడా ఉంటారు)" అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

నమాజుకు వచ్చేవారిలో పెద్దలు, పిన్నలు, బాటసారులు, వృద్ధులు, వ్యాధిగ్రస్తులు కూడా ఉండవచ్చు. కనుక సామూహిక నమాజులో నమాజ్‌కు సారథ్యం వహించే వ్యక్తి (ఇమామ్) అనుయాయుల్ని (ముఖ్తదీలను) దృష్టిలో పెట్టుకొని నమాజును సంక్షిప్తంగా చేయించాలని పై హదీసులో తాకీదు చేయబడింది. నమాజును సంక్షిప్తంగా చేయించడమంటే అందులో క్లుప్తంగా ఖుర్ఆన్ పారాయణం చేయడమని అర్థం. అంతేగాని రుకూ, సజ్దా, ఖౌమా వంటి వాటిని సరిగ్గా నిర్వర్తించకుండా నమాజుని త్వరగా ముగించేయాలని భావం కాదు. నమాజులోని ప్రధానాంశాల్ని (తాదీలె అర్కాన్) సరిగ్గా నిర్వర్తించడం దైవప్రవక్త సంప్రదాయం. ఆయన "మీరు నన్ను ఏ విధంగా నమాజు చేస్తున్నట్టు చూశారో అదేవిధంగా మీరూ నమాజు చేయండి" అని ఆదేశించారు. కాబట్టి అందులోని ప్రధానాచరణల్ని తప్పకుండా సరైన రీతిలో నిర్వర్తించాలి. అందులో మాత్రం తొందరపాటు పనికిరాదు.

٢٣١ ـ وعن عَائشَةَ رضي الله عنها قَالَتْ: إنْ كَانَ رسولُ الله ﷺ لَيَدَعُ الْعَمَلَ، وَهُوَ يُحِبُّ أَنْ يَعْمَلَ بِهِ، خَشْيَةَ أَنْ يَعْمَلَ بِهِ النَّاسُ فَيُفْرَضَ عَلَيْهِمْ. متفقٌ عليه.

231. హజ్రత్ ఆయిషా (రజి.అన్‌హా) కథనం : దైవప్రవక్త (స) తనకిష్టమైన ప్పటికీ కొన్ని పనుల్ని ఆచరించకుండా వదలిపెట్టేవారు. తనను చూసి ప్రజలు కూడా దానిని ఆచరించడం మొదలు పెడితే, (క్రమంగా) అది వారిపై విధిగా చేయబడుతుందన్న భయంతోనే ఆయన అలా చేసేవారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని 'తహజ్జుద్' ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజు ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) తన అనుచర సమాజాన్ని ఎంతగానో ప్రేమించేవారు. ధార్మిక విషయాల్లోనయినా మరే విషయంలోనైనా సరే తన సమాజం ఇబ్బందుల్లో పడిపోవటాన్ని ఆయన ఏమాత్రం వాంఛించేవారు కాదు. అందుకే ప్రజల ముందు ఎక్కువగా నఫిల్ నమాజులు, నఫిల్ ఆరాధనలు చేయడానికి తటపటాయించేవారు. తనను చూసి ప్రజలు కూడా నిర్విరామంగా నఫిల్ నమాజులు చేయడం మొదలుపెడితే క్రమంగా వారు దాన్ని విధి (ఫర్జ్)గా తలపోసే అవకాశం ఉందని లేదా దేవుడే స్వయంగా వారిపై దాన్ని విధిగా చేయవచ్చనీ, దాని వల్ల సమాజం ఇబ్బందికి గురయ్యే అవకాశం ఉందన్న భయంతో తనకు ప్రియమైన ఆరాధనల్ని కూడా ఆయన త్యాగం చేసేవారు.

٢٣٢ ـ وَعَنْهَا رضي الله عنها قَالَتْ: نَهَاهُمُ النَّبِيُّ ﷺ عَنِ الْوِصَالِ رَحْمَةً لَهُمْ، فقالوا: إِنَّكَ تُوَاصِلُ؟ قال: «إِنِّي لَسْتُ كَهَيْئَتِكُمْ، إِنِّي أَبِيتُ يُطْعِمُنِي رَبِّي وَيَسْقِينِي» متفقٌ عليه. مَعْنَاهُ يَجْعَلُ فِيَّ قُوَّةَ مَنْ أَكَلَ وَشَرِبَ.

232. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం : దైవప్రవక్త (స) తన సహచరులపై జాలితో వారిని నిర్విరామంగా ఉపవాసాలు పాటించవద్దని ఆదేశించారు. దానికి ఆయన సహచరులు, "మరి మీరు స్వయంగా నిర్విరామ ఉపవాసాలు పాటిస్తున్నారుగా?" అని విన్నవించుకోగా, అందుకాయన, "నేను మీలాంటి వాడ్ని కాను. రాత్రి నేను (నా ప్రభువు వద్ద) గడుపుతాను - నా ప్రభువు నాకు తినిపిస్తాడు. త్రాగిస్తాడు.
*(బుఖారీ - ముస్లిం)*

అంటే దేవుడు నాకు తినే, త్రాగే, వ్యక్తికి లభించే శక్తిని ప్రసాదిస్తాడని అర్థం.

*(సహీహ్ బుఖారీ మరియు సహీహ్ ముస్లింలోని ఉపవాస ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

'నేను మీలాంటి వాడ్ని కాను' అంటే మీలాంటి మానవుణ్ణి కానని అర్థం ఎంతమాత్రం కాదు. దైవంతో తనకున్న సంబంధం, సామీప్యం మీకు లేవని చెప్పటమే ఆయన అసలు ఉద్దేశ్యం. ఈ సామీప్యం వల్ల దేవుడు ఆయనకు మనోబలాన్ని, ఆధ్యాత్మిక పారవశ్యాన్ని

ప్రసాదిస్తూ ఉంటాడు. ఆయన మనోమస్తిష్కాలను జ్యోతిర్మయం చేస్తుంటాడు. దాంతో ఆయన తినకపోయినా, త్రాగకపోయినా దైవం తరపునుండి ఆయనలో అంత శక్తి ఉత్పన్నమవుతూ ఉంటుంది. దీని ద్వారా నిర్విరామంగా ఉపవాసాలు పాటించడమనేది దైవప్రవక్త (సల్లం) గారి విశిష్టత అన్న సంగతి బోధపడుతోంది. దాన్ని సమాజం అనుసరించాల్సిన అవసరం లేదు. పైగా ఆయన ప్రజలు దీన్ని ఆచరించకూడదని ఆదేశించారు. ఇలాంటి సమాజపరమైన లేదా ఆరాధనాపరమైన ప్రత్యేక వ్యవహారాల్లో ఆయన ఆదేశాలే అనుసరణీయం గాని ఆయన ఆచరణలు కావు.

233. హజ్రత్ అబూ ఖతాదా హారిస్ బిన్ రిబ్ఈయా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: నేను నమాజుకై నించుంటాను. సుదీర్ఘంగా నమాజు చేయాలనుకుంటాను. కాని అంతలోనే నాకు ఎవడో ఒక పిల్లవాడి ఏడుపు వినపడుతుంది. దాంతో నావల్ల ఆ పిల్లవాడి తల్లికి బాధకలగడం యిష్టంలేక నమాజును క్లుప్తంగా ముగిస్తుంటాను. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం)*

٢٣٣ - وعن أَبِي قَتَادَةَ الْحَارِثِ بنِ رِبْعِيٍّ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «إِنِّي لأَقُومُ إِلَى الصَّلاةِ، وَأُرِيدُ أَنْ أُطَوِّلَ فِيهَا، فَأَسْمَعُ بُكَاءَ الصَّبِيِّ، فَأَتَجَوَّزُ فِي صَلاتِي كَرَاهِيَةَ أَنْ أَشُقَّ عَلَى أُمِّهِ» رواه البخاري.

## ముఖ్యాంశాలు

ఇక్కడ కూడా క్లుప్తంగా నమాజు చేయడమంటే సంక్షిప్త పారాయణమనే అర్థం. సహీహ్ ముస్లింలోని ఉల్లేఖనం ఈ విషయాన్ని వివరిస్తుంది. అందులో పిల్లవాడి ఏడుపు వినగానే దైవప్రవక్త (సల్లం) చిన్న సూరాని పారాయణం చేసేవారని ఉంది. దీనిద్వారా ఆయనకు తన అనుచర సమాజం పట్ల ఉన్న ప్రేమానురాగాలు విదితమవుతున్నాయి. ఆరాధనలో ఉన్నప్పుడు కూడా సహచరులెవరైనా కష్టాల్లో ఉంటే వెంటనే ఆయన దానికి ప్రతిస్పందించేవారు.

234. హజ్రత్ జుందుబ్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఉదయం నమాజు (ఫజ్ర్) చేసిన వ్యక్తి దేవుని రక్షణలో ఉంటాడు. కనుక దేవుడు తాను (ఇచ్చిన) రక్షణ గురించి మిమ్మల్ని ప్రశ్నించకుండా జాగ్రత్తపడండి. ఆయన

٢٣٤ - وعن جُنْدَبِ بنِ عبدِ الله رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مَنْ صَلَّى صَلاةَ الصُّبْحِ فَهُوَ فِي ذِمَّةِ الله فَلا يَطْلُبَنَّكُمُ اللهُ مِنْ ذِمَّتِهِ بِشَيْءٍ، فَإِنَّهُ مَنْ يَطْلُبْهُ مِنْ ذِمَّتِهِ بِشَيْءٍ يُدْرِكْهُ، ثُمَّ يَكُبُّهُ عَلَى وَجْهِهِ فِي نَارِ جَهَنَّمَ» رواه مسلم.

ఎవరినయినా (తన దాసునికిచ్చిన) రక్షణ విషయమై నిలదీశాడంటే, ఇక అతణ్ణి పట్టుకొని నరకంలో బోర్లా పడేస్తాడు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని నమాజు ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఫజ్ర్ నమాజు చేసిన వ్యక్తికి అల్లాహ్ రక్షణ కల్పిస్తాడని ఈ హదీసు చెబుతోంది. అలాంటి వ్యక్తి అల్లాహ్ రక్షణలో ఉంటాడు కనుక ఇతరులెవరూ అతనికి హానికల్గించకుండా జాగ్రత్తపడాలి. అతన్ని వేధించడంగాని, అతని ధన, మాన ప్రాణాలకు కీడు తలపెట్టడం గాని చేయకూడదు. ఎవడైనా దాన్ని లెక్కచేయకుండా ప్రతిరోజూ ఫజ్ర్ నమాజు పాటించే వ్యక్తిని హింసిస్తున్నాడంటే దేవుడు తన దాసుడికిచ్చిన రక్షణ విషయంలో అతను అభ్యంతరం తెలుపుతున్నాడన్నమాట! దేవుడు ప్రళయదినాన తన నిర్ణయాలను ధిక్కరించినవారిని తప్పకుండా నిలదీసి అడుగుతాడు.

2. ఇక్కడ ఉదయపు నమాజు అంటే ఒక్క ఫజ్ర్ నమాజ్ అనేకాదు. ఐదుపూటల నమాజులూ దీని క్రిందికి వస్తాయి. పెందలాడే మేల్కొని నమాజ్ చేయడం మనసుకు కష్టమని పిస్తుంది. అందుకే ప్రత్యేకంగా ఫజ్ర్ నమాజ్‌నే ఇక్కడ ప్రస్తావించడం జరిగింది. ఫజ్ర్ నమాజ్ చేసేవాడు తతిమ్మా నమాజులు కూడా సాధారణంగా పాటిస్తాడని దీని భావం.

٢٣٥ ـ وعن ابنِ عمرَ رضي الله عَنهُما أنَّ رَسُولَ اللهِ ﷺ قال: «المُسْلِمُ أخُو المُسْلِمِ، لا يَظْلِمُه، وَلا يُسْلِمُهُ، مَنْ كَانَ فِي حَاجَةِ أخِيهِ كَانَ اللهُ فِي حَاجَتِهِ، وَمَنْ فَرَّجَ عَنْ مُسْلِمٍ كُرْبَةً فَرَّجَ اللهُ عَنْهُ بِهَا كُرْبَةً مِنْ كُرَبِ يَوْمِ القِيَامَةِ، وَمَنْ سَتَرَ مُسْلِماً سَتَرَهُ اللهُ يَوْمَ القِيَامَةِ» متفقٌ عليه.

235. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉద్బోధించారు : ఒక ముస్లిం తోటి ముస్లింకు సోదరుడు. ఒక సోదరుడు తన సోదరుడిపై దౌర్జన్యం చేయడు, అతన్ని (నిస్సహాయుడిగా చేసి శత్రువుకి) అప్పగించడు. తన సోదరుని అవసరాలను తీర్చే పనుల్లో (తలమునకలై) ఉన్న వ్యక్తి అవసరాలను దేవుడు తీరుస్తాడు. ముస్లింపై వచ్చిపడిన ఒక కష్టాన్ని తొలగిస్తే దేవుడు కూడా ప్రళయదినాన అతనికి ఎదురయ్యే కష్టాలలో ఒక కష్టాన్ని అతన్నుండి తొలగిస్తాడు. ఇంకా తోటి ముస్లిం (పాపాల)ను తెరమరుగు

చేస్తే దేవుడు కూడా ప్రళయదినాన అతని పాపాలను తెరమరుగుచేస్తాడు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని అత్యాచారాల ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ముస్లింలందరూ ఒకే కుటుంబ సభ్యుల్లా కలిసిమెలిసి ఉండాలని ఈ హదీసు ప్రబోధిస్తోంది. కుటుంబంలో తండ్రి తన కొడుకుపై, సోదరుడు తన తోటి సోదరుడిపై ఎన్నటికీ దౌర్జన్యం చేయడు. తన కళ్ళముందే తన సోదరుడు శత్రువుచేతికి చిక్కడాన్ని ఎవడూ సహించడు. అతను అవసరాల్లో ఉంటే అతని అవసరాన్ని తీర్చడానికి అన్నివిధాలా కృషిచేస్తాడు. అతను కష్టాల్లో ఉంటే సానుభూతితో చలించిపోతాడు. అతని కష్టాలను దూరం చేయడానికి ప్రయత్నిస్తాడు. తన సోదరుని వల్ల ఏమైనా పొరపాట్లు జరిగితే వాటిని మరుగుపరుస్తాడు. ముస్లింలందరూ కూడా పరస్పరం అలాగే వ్యవహరించాలి. దీనివల్ల దేవుడు ప్రసన్నుడై ఇహపరాల్లో వారికి అమూల్య ప్రతిఫలాలను ప్రసాదిస్తాడు. ముస్లింలు దీనిపై అమలు జరిపితే పరలోక సాఫల్యంతో పాటు ఇహలోకపు ఇల్లుకూడా వారికొరకు స్వర్గధామం కాగలదు.

٢٣٦ ـ وعن أبي هريرة رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «الْمُسْلِمُ أَخُو الْمُسْلِمِ لا يَخُونُهُ وَلا يَكْذِبُهُ وَلا يَخْذُلُهُ، كُلُّ الْمُسْلِمِ عَلَى الْمُسْلِمِ حَرَامٌ عِرْضُهُ وَمَالُهُ وَدَمُهُ، التَّقْوَى هٰهُنَا، بِحَسْبِ امْرِىءٍ مِنَ الشَّرِّ أَنْ يَحْقِرَ أَخَاهُ الْمُسْلِمَ». رواه الترمذيُّ وقال: حديث حسن.

236. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : ఒక ముస్లిం తోటి ముస్లింకు సోదరుడు. ఒక ముస్లిం తోటి ముస్లింకు ద్రోహం చేయడు, అతనితో అబద్ధం చెప్పడు (లేదా అతన్ని అబద్ధం చెప్పేవాడిగా జమకట్టడు). అతణ్ణి నిస్సహాయుడిగా వదలిపెట్టడు. ఒక ముస్లిం ధన, మాన ప్రాణాలు తోటి ముస్లిం కొరకు నిషిద్ధం (గౌరవప్రద మైనదిగా) చేయబడ్డాయి. దైవభీతి ఇక్కడ (మనసులో) ఉంటుంది. ఒకడు తన తోటి ముస్లిం సోదరుణ్ణి అల్పుడిగా భావిస్తున్నాడంటే, అతని భావన ఒక్కటి చాలు అతడు చెడ్డవాడని చెప్పడానికి!

(దీనిని తిర్మిజీ ఉల్లేఖించి 'హసన్'గా పేర్కొన్నారు).

*(జామె తిర్మిజీలోని సత్కార్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇంతకుముందు వచ్చిన హదీసులోని విషయాన్నే ఇక్కడ ఇంకాస్త విపులంగా, వివరంగా చర్చించడం జరిగింది. ముస్లింలు పరస్పరం తమ సోదరుల ధన మాన ప్రాణాలను రక్షించాలని ఇందులో తాకీదు చేయబడింది. ఈ హదీసులో చెప్పబడిన ఇంకో ముఖ్య విషయం ఏమిటంటే, మనిషిలో దైవభీతి అనేది ఓ మనోమయస్థితి. ఎవరి మనసులో ఎంత దైవభీతి ఉందో ఎవరూ తొంగి చూడలేరు. మానవుని మనస్థితి దేవుడికే బాగా తెలుసు. కనుక ఎవరూ తాను గొప్ప దైవభక్తుణ్ణనీ, ఇతరులు తనకంటే అధములని ఎన్నడూ భావించరాదు. ఒకరి మనసులోని విశ్వాసం (ఈమాన్), చిత్తశుద్ధి, దైవభీతి గురించిన కచ్చితమైన జ్ఞానం దైవానికి తప్ప మరెవ్వరికీ ఉండదు. అందుకని ఇతరులెవరినీ అల్పులుగా భావించరాదు. అయితే బహిరంగంగా దేవుని అవిధేయతకు పాల్పడేవారి సంగతి వేరు. వారి చేష్టల మూలంగా వారిపట్ల తమ అయిష్టతను వ్యక్తం చేయవచ్చు. పైగా ఈ అయిష్టత నిజమైన విశ్వాసానికి ప్రతీక. కాని వీరిని కూడా అల్పులుగా భావించకుండా ఉండటమే ఉత్తమం. మొత్తానికి అయిష్టాన్ని వ్యక్తం చేయటం వేరు, అధములుగా భావించడం వేరన్నమాట!

٢٣٧ ـ وعنه قال: قال رسولُ الله ﷺ: «لا تَحَاسَدُوا وَلا تَنَاجَشُوا وَلا تَبَاغَضُوا وَلا تَدَابَرُوا ولا يَبِعْ بَعْضُكُمْ عَلَى بَيْعِ بَعْضٍ، وَكُونُوا عِبَادَ اللهِ إِخْوَاناً. الْمُسْلِمُ أَخُو الْمُسْلِمِ: لا يَظْلِمُهُ وَلا يَحْقِرُهُ وَلا يَخْذُلُهُ. التَّقْوَى هٰهُنَا ـ وَيُشِيرُ إِلَى صَدْرِهِ ثَلاثَ مَرَّاتٍ ـ بِحَسْبِ امْرِىءٍ مِنَ الشَّرِّ أَنْ يَحْقِرَ أَخَاهُ الْمُسْلِمَ. كُلُّ الْمُسْلِمِ عَلَى الْمُسْلِمِ حَرَامٌ دَمُهُ وَمَالُهُ وَعِرْضُهُ» رواه مسلم.

237. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు : "మీరు పరస్పరం అసూయ చెందకండి. క్రయవిక్రయాల సమయంలో (కొనే ఉద్దేశ్యం లేకుండానే) బేరంమీద బేరం చేస్తూ (వస్తువు) ధరను పెంచి మోసానికి పాల్పడకండి. ఒండొకరిపట్ల అక్కసును పెంచుకోకండి. పరస్పరం విముఖులైపోకండి. ఒకరి బేరం మీద ఇంకొకరు బేరమాడకండి. దేవుని దాసులారా! పరస్పరం అన్నదమ్ములై మెలగండి. ఒక ముస్లిం తోటి ముస్లింకు సోదరుడు. ఒక ముస్లిం తన

«النَّجْشُ»: أَنْ يَزِيدَ فِي ثَمَنِ سِلْعَةٍ يُنَادِيَ عَلَيْهَا فِي السُّوقِ وَنَحْوِهِ، وَلا رَغْبَةَ لَهُ فِي شِرَائِهَا بَلْ يَقْصِدُ أَنْ يَغُرَّ غَيْرَهُ، وَهذَا حَرَامٌ. «وَالتَّدَابُرُ»: أَنْ يُعْرِضَ عَنِ الإِنْسَانِ وَيَهْجُرَهُ وَيَجْعَلَهُ كَالشَّيْءِ الَّذِي وَرَاءَ الظَّهْرِ وَالدُّبُرِ.

సోదరుడిపై దౌర్జన్యం చేయడు, అతణ్ణి అల్పునిగా భావించడు, అతన్ని నిస్సహాయుడిగా వదలిపెట్టడు. దైవభీతి ఇక్కడుంటుంది (ఆయన తన ఛాతీవైపు సైగచేస్తూ మూడుసార్లు అన్నారు). ఒకడు తన తోటి ముస్లిం సోదరుణ్ణి అల్పుడిగా భావిస్తున్నాడంటే, ఆ ఒక్క భావన చాలు, అతను చెడ్డవాడని చెప్పటానికి. ఒక ముస్లిం ధన, మాన ప్రాణాలు తోటి ముస్లిం కొరకు 'నిషిద్ధం' (హరాం) చేయబడ్డాయి. *(ముస్లిం)*

'నజష్' అంటే, అంగడిలోనయినా లేక మరే ప్రదేశంలోనయినా అమ్మకానికి సిద్ధంగాఉన్న వస్తువును ఎక్కువ ధరతో బేరం కుదుర్చుకోవటం. నిజానికి అలా చేసే వ్యక్తికి ఆ వస్తువుని కొనాలని ఉండదు. ఆ వస్తువు ధరను పెంచి తొలి కొనుగోలుదారుని మోసగించే ఉద్దేశ్యంతో బేరమాడతాడు. ఇలా చేయడం నిషిద్ధం (హరాం). 'తదాబుర్' అంటే ఎదుటి వ్యక్తిని నిర్లక్ష్యం చేయడం, అతన్ని వదలిపెట్టడం, ఎదుటి వ్యక్తిపట్ల వీపు వెనకాల ఉన్న వస్తువుని పట్టించుకోనట్లుగా వ్యవహరించడం.

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఇందులో ముస్లింల పరస్పర శ్రేయోభిలాషను గురించి, సౌభ్రాతృత్వం గురించి మరింత విస్తృతంగా బోధించటం జరిగింది. ముందుగా ముస్లింలు పరస్పరం అసూయ చెందరాదని వారించబడింది. అసూయ అనేది అత్యంత నీచమైన నైతికరుగ్మత. అగ్ని కట్టెలను కాల్చినట్లు

ఇది మనిషి సత్కార్యాలను కాల్చి భస్మం చేసేస్తుంది. మనసులో అసూయాగ్ని రగిలిన వ్యక్తి ఇతరులు బాగుపడుతుంటే చూసి ఓర్చుకోలేడు. ఎల్లప్పుడూ ఇతరులు నాశనమయిపోవాలని కోరుకుంటాడు. ఆ తరువాత పై హదీసులో ముస్లింలు పరస్పరం విరోధాన్ని, అక్కసును పెంచుకోవడాన్నుంచి, పరస్పర వైముఖ్యం నుండి వారించటం జరిగింది. ఎందుకంటే ఇది ఇస్లామీయ సౌభ్రాతృత్వానికే గొడ్డలిపెట్టు.

చివరలో 'నజష్' నుండి వారించటం జరిగింది. నజష్ వ్యవహారం ఒట్టి దగా, మోసాలతో కూడుకున్నది. ఇది పరస్పర శ్రేయోభిలాష భావానికి విరుద్ధం. ప్రజలు పరస్పరం మంచిని అభిలషించాలని ఇస్లాం బోధిస్తోంది. ఒక వ్యక్తి బేరమాడుతున్నప్పుడు అతనికి పోటీగా ఇంకొకవ్యక్తి ఆ వస్తువుని బేరమాడటం వల్ల గొడవలు, తగాదాలు జరగటానికి ఆస్కారముంది. అందుకే దీనిని కూడా నిషేధించడం జరిగింది.

٢٣٨ ـ وعن أنسٍ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «لا يُؤْمِنُ أَحَدُكُمْ حَتَّى يُحِبَّ لأَخِيهِ مَا يُحِبُّ لِنَفْسِهِ» متفقٌ عليه.

238. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : "తన కోసం యిష్టపడేదే తన సోదరుని కోసం కూడా యిష్టపడ నంత వరకూ మీలో ఎవరూ (నిజమైన) విశ్వాసి కాజాలరు." *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ మరియు సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణాల్లో ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

ఒక ముస్లిం తన కోసం యిష్టపడేదే తన సోదరుని కోసం కూడా యిష్టపడితే, ఇక ప్రతి వ్యవహారంలోనూ అతను తోటి ముస్లిం మంచినే అభిలషిస్తాడు. అతనికి కీడు జరగాలని ఎన్నటికీ కోరుకోడు. ప్రజలమధ్య ఇలాంటి శ్రేయోభిలాష సర్వవ్యాప్తమైనపుడు సమాజంలో అందరూ పరస్పరం మంచిని కాంక్షించేవారు తప్ప ఒకరికి కీడు జరగాలని కోరుకునేవారెవరూ ఉండరు. పైగా సానుభూతితో, సహకార భావంతో కలిసి జీవిస్తారు. ఒండొకరి శ్రేయాన్ని కాంక్షిస్తారు. ఫలితంగా సమాజంలో శాంతి, సౌమనస్యాలు వర్థిల్లి సమాజం శ్రేయోరాజ్య రూపకల్పనకు దోహదపడుతుంది.

٢٣٩ ـ وعنه قال: قال رسولُ الله ﷺ: «انْصُرْ أَخَاكَ ظَالِماً أَوْ مَظْلُوماً» فَقَالَ رَجُلٌ: يَا رسولَ الله! أَنْصُرُهُ إذا كَانَ مَظْلُوماً أَرَأَيْتَ إنْ كَانَ ظَالِماً

239. హజ్రత్ అనస్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం ఒకసారి దైవప్రవక్త (సల్లం) "నీ సోదరుడు దౌర్జన్యం చేసే వాడయినా లేక పీడితుడయినా అతనికి

సహాయం చెయ్యి" అని అన్నారు. దానికి ఒక వ్యక్తి, "దైవప్రవక్తా! అతను పీడితుడయితే సహాయం చేస్తాను (గాని) అతనే స్వయంగా దౌర్జన్యం చేసేవాడయి నప్పుడు నేనతనికి సహాయం ఎలా చేసేది?" అని సందేహపడగా, "నువ్వతన్ని దౌర్జన్యం చేయకుండా ఆపు. అదే అతనికి నువ్వు చేసే సహాయం" అని అన్నారు దైవప్రవక్త (సల్లం). *(బుఖారీ)*

فَكَيْفَ أَنْصُرُهُ؟ قال: «تَحْجُزُهُ - أَوْ تَمْنَعُهُ - مِنَ الظُّلْمِ فَإِنَّ ذٰلِكَ نَصْرُهُ» رواه البخاري.

*(సహీహ్ బుఖారీలోని అత్యాచారాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సమాజంలోని దౌర్జన్యాన్ని, అత్యాచారాలను రూపుమాపాలని ఈ హదీసు ఆదేశిస్తోంది. దౌర్జన్యానికి గురైన వ్యక్తికి సహాయం చేయటంతోపాటు దౌర్జన్యానికి పాల్పడే వ్యక్తిని కూడా దౌర్జన్యం చేయకుండా ఆపాలి. ఇది సాహసోపేతమైన పని. ఒక అత్యాచారిని అత్యాచారం చేయకుండా ఆపటం కూడా శ్రేయోభిలాష క్రిందికే వస్తుంది. కనుక అత్యాచారిని అత్యాచారం చేయకుండా ఆపితేగాని శ్రేయోభిలాష విధి నెరవేరదు.

240. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స)ఇలా ప్రబోధించారు : ఒక ముస్లింకు తోటి ముస్లింపై ఐదు హక్కులున్నాయి. సలాంకు జవాబు చెప్పటం, వ్యాధి గ్రస్తుణ్ణి పరామర్శించటం, శవం (జనాజా) వెంట వెళ్ళటం, ఆహ్వానాన్ని అంగీకరించటం, తుమ్మినవానికి (అల్ హమ్దులిల్లాహ్ అని అతను అంటే) (యర్‌హముకల్లా అని) జవాబు చెప్పటం. *(బుఖారీ - ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా

٢٤٠ - وعن أبي هريرة رضي الله عنه أنَّ رسولَ الله ﷺ قال: «حَقُّ الْمُسْلِمِ عَلَى الْمُسْلِمِ خَمْسٌ: رَدُّ السَّلام، وَعِيَادَةُ الْمَرِيضِ، وَاتِّبَاعُ الْجَنَائِزِ وَإِجَابَةُ الدَّعْوَةِ، وَتَشْمِيتُ الْعَاطِسِ» متفقٌ عليه. وفي رواية لمسلم: «حَقُّ الْمُسْلِمِ سِتٌّ: إِذَا لَقِيتَهُ فَسَلِّمْ عَلَيْهِ، وَإِذَا دَعَاكَ فَأَجِبْهُ، وَإِذَا اسْتَنْصَحَكَ فَانْصَحْ لَهُ، وَإِذَا عَطَسَ فَحَمِدَ اللهَ فَشَمِّتْهُ، وَإِذَا مَرِضَ فَعُدْهُ، وَإِذَا مَاتَ فَاتْبَعْهُ».

ఉంది : ఒక ముస్లింకు తోటి ముస్లింపై ఆరు హక్కులున్నాయి. నువ్వతన్ని కలుసుకున్నప్పుడు అతనికి సలాం చెయ్యి. అతను నిన్ను (విందు భోజనానికి) ఆహ్వానిస్తే అతని ఆహ్వానాన్ని అంగీకరించు. అతను నీ నుంచి మంచిని ఆశిస్తే నువ్వు (కూడా) అతని శ్రేయాన్ని అభిలషించు. అతను తుమ్మి అల్ హమ్దులిల్లాహ్ అని అంటే దానికి నువ్వు (యర్‌హముకల్లాహ్ అని) జవాబు చెప్పు. అతను జబ్బు పడితే అతన్ని పరామర్శించు. అతను చనిపోతే అతని (శవం) వెంట వెళ్లు (అంటే అతని జనాజాకు హాజరుకమ్మని అర్థం.)

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణంలోనూ, నికాహ్ ప్రకరణంలోనూ, పానీయాల ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణంలోనూ ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన హక్కుల్ని ముస్లింల పరస్పర హక్కులని చెప్పి వారి మధ్య సౌభ్రాతృత్వాన్ని, ప్రేమానుబంధాలను మరింత బలోపేతం చేయటం జరిగింది. ఈ విషయాలు పైకి సామాన్యమైనవిగా కనబడతాయి. కాని పరిణామాల రీత్యా ఇవి బృహత్తర కార్యాలు. వీటిని ఆచరిస్తే సమాజం బాగుపడుతుందనటంలో ఎలాంటి సందేహం లేదు.

241. హజ్రత్ అబూ ఉమారా బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని ఏడు పనులు చేయమని ఆదేశించారు. ఇంకా ఏడు పనులు చేయవద్దని వారించారు. వ్యాధిగ్రస్తుణ్ణి పరామర్శించాలని, శవం (జనాజా) వెంట వెళ్ళాలని, తుమ్మినవాడికి జవాబు పలకాలని, ప్రమాణం చేసేవాడి ప్రమా

٢٤١ - وعن أبي عُمَارَةَ الْبَرَاءِ بن عازِبٍ رضي الله عنهما قال: أَمَرَنَا رسولُ الله ﷺ بِسَبْعٍ، وَنَهَانَا عَنْ سَبْعٍ: أَمَرَنَا بِعِيَادَةِ الْمَرِيضِ، وَاتِّبَاعِ الْجَنَازَةِ، وَتَشْمِيتِ الْعَاطِسِ، وَإِبْرَارِ الْمُقْسِمِ، وَنَصْرِ الْمَظْلُومِ، وَإِجَابَةِ الدَّاعِي، وَإِفْشَاءِ

السَّلامِ. وَنَهَانَا عَنْ خَوَاتِيمِ أَوْ تَخَتُّمٍ بِالذَّهَبِ، وَعَنْ شُرْبٍ بِالْفِضَّةِ، وَعَنِ الْمَيَاثِرِ الْحُمْرِ، وَعَنِ الْقَسِّيِّ، وَعَنْ لُبْسِ الْحَرِيرِ وَالإِسْتَبْرَقِ وَالدِّيبَاجِ. متفق عليه.

ణాన్ని నెరవేర్చాలని, బాధితుడికి సహాయం అందించాలని, ఆహ్వానించే వాడి ఆహ్వానాన్ని అంగీకరించాలని, సలాంను వ్యాప్తిచేయాలని ఆదేశించారు. ఇంకా బంగారపు ఉంగరాలు తొడగరాదని, వెండి పాత్రల్లో తినడం, త్రాగడం చేయరాదని, ఎర్రని పట్టు జీను ఉపయోగించరాదని, 'ఖస్' (ప్రాంతంలో తయారైన పట్టు) వస్త్రాలు తొడగరాదని, పట్టు వస్త్రాలు, ఇస్తబ్రఖ్ పట్టు వస్త్రాలు, దీబాజ్ పట్టు వస్త్రాలు ధరించరాదని ఆయన మమ్మల్ని వారించారు.

*(బుఖారీ - ముస్లిం)*

وفي رواية: وَإِنْشَادِ الضَّالَّةِ فِي السَّبْعِ الأُوَلِ. «الْمَيَاثِرِ» بِيَاءٍ مثنّاة قَبْلَ الألِفِ، وَثَاءٍ مُثَلَّثَةٍ بَعْدَهَا، وَهِيَ جَمْعُ مَيْثَرَةٍ، وَهِيَ شَيْءٌ يُتَّخَذُ مِنْ حَرِيرٍ وَيُحْشَى قُطْناً أَوْ غَيْرَهُ، وَيُجْعَلُ فِي السَّرْجِ وَكُورِ الْبَعِيرِ يَجْلِسُ عَلَيْهِ الرَّاكِبُ. «الْقَسِّيُّ» بفتح القاف وكسر السين المهملة المشدّدة: وَهِيَ ثِيَابٌ تُنْسَجُ مِنْ حَرِيرٍ وَكَتَّانٍ مُخْتَلِطَيْنِ. و«إِنْشَادُ الضَّالَّةِ»: تَعْرِيفُهَا.

వేరొక ఉల్లేఖనం ప్రకారం మొదటి ఏడు విషయాల్లో ఆయన దొరికిన వస్తువుల్ని గురించి (అవి వాటి యజమాని దగ్గరికి తిరిగి చేరుకునేందుకు ప్రకటిస్తూ ఉండాలని ఆదేశించారు.

'మయాసిర్' అనేది 'మైసరా'కు బహు వచనం. దీనిని పట్టు వస్త్రంతో తయారు చేసి అందులో నూలు మొదలగునవి కుక్కి దానిని వాహనారోహకుడు కూర్చో వటానికి వీలుగా గుర్రాల వీపులపై, ఒంటెల అంబారీలపై ఉంచుతారు. ఖస్సి అంటే పట్టు మరియు ఉన్ని రెండింటిని కలిపి తయారు చేసే వస్త్రాలు. "ఇన్షాదుజ్జాల్లహ్" అంటే దొరికిన వస్తువుల గురించి ప్రకటిం చటం అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణంలోనూ, పానీయాల ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని వస్త్రధారణ ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ప్రమాణం చేసేవాడి ప్రమాణాన్ని నెరవేర్చడమంటే ఎవరైనా మీపై నమ్మకంతో 'దైవంతోడు! మీరు తప్పకుండా ఈ పని చేయాల్సిందే' అని అంటే మీరు అతని నమ్మకాన్ని వమ్ముచేయకుండా ఆ పనిని పూర్తి చేయాలని అర్థం. అయితే ఆ పని అధర్మమైనది కాకూడదు. ధర్మసమ్మతమైన, నైతికపరమైన పనులైతే తప్పకుండా చేసిపెట్టాలి. బంగారం, పట్టు వస్త్రాలు కేవలం పురుషులకే నిషిద్ధం. స్త్రీలు నిస్సంకోచంగా వాటిని ధరించవచ్చు. ఇస్లాం ధర్మం స్త్రీలమాదిరి సౌకుమార్యం, నాజూకుతనం పురుషుల్లో ఉండటాన్ని గర్హిస్తుంది. అందుకే వారికి పట్టు, బంగారం ధరించటానికి అనుమతి ఇవ్వలేదు.



28వ అధ్యాయం

# ٢٨ - بَابُ سَتْرِ عَوْرَاتِ الْمُسْلِمِينَ وَالنَّهْيِ عَنْ إِشَاعَتِهَا لِغَيْرِ ضَرُورَةٍ

# తోటి ముస్లింల లోపాలను కప్పిపుచ్చాలి, అనవసరంగా వాటిని వ్యాపింపజేయరాదు

قال الله تعالى: ﴿إِنَّ الَّذِينَ يُحِبُّونَ أَن تَشِيعَ الْفَاحِشَةُ فِي الَّذِينَ آمَنُوا لَهُمْ عَذَابٌ أَلِيمٌ فِي الدُّنْيَا وَالْآخِرَةِ﴾ [النور: ١٩].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"విశ్వాసుల్లో అశ్లీలత వ్యాపించాలని కోరేవారు, ప్రపంచంలోనూ, పరలోకంలోనూ వ్యధాభరిత మైన శిక్షకు అర్హులు." (అన్ నూర్ : 19)

٢٤٢ - وعن أبي هريرة رضي الله عنه عن النبيِّ ﷺ قال: «لا يَسْتُرُ عَبْدٌ عَبْداً فِي الدُّنْيَا إِلَّا سَتَرَهُ اللهُ يَوْمَ الْقِيَامَةِ» رواه مسلم.

242. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : ఇహలోకంలో ఒక దాసుడు మరొక దాసుణ్ణి (అంటే అతని పాపాలను) తెరమరుగు పరిస్తే ప్రళయ దినాన దేవుడు అతన్ని (అంటే అతని పాపాలను) తెరమరుగు పరుస్తాడు." *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రజల లోటుపాట్లను అందరి ముందూ ప్రస్తావించి, వారిని అవమానం పాలుచేయకుండా వీలైనంత వరకు వారి తప్పుల్ని దాచి ఉంచటం ఉత్తమ నైతికతకు తార్కాణం. దేవుడు తన దాసుల పాపాలను కప్పిపుచ్చుతాడు. ఆ విధంగా తోటి మనుషుల పాపాలను దాచి ఉంచితే దైవత్వ గుణాన్ని పుణికిపుచ్చుకున్నట్లవుతుంది. అందుకే ఒకరి తప్పుల్ని రహస్యంగా దాచిపెట్టే వారిని దేవుడు చాలా యిష్టపడతాడు. పరలోకంలో వారి దోషాలను కప్పిపుచ్చి వారు పరాభవం పాలుగాకుండా కాపాడతాడు. వారి పాపాలను మన్నిస్తాడు లేదా తమ పాపాల

గురించి వారిని నిలదీయకుండానైనా ఉంటాడు. ఒకవేళ వారిని నిలదీసినా అందరిముందు కాకుండా ఒంటరిగా వారిని పాపాల గురించి అడుగుతాడు. ఆ తరువాత వారిని క్షమించనూవచ్చు లేదా అవసరమనుకుంటే శిక్ష నిమిత్తం కొంతకాలం నరకంలో ఉంచనూవచ్చు.

٢٤٣ ـ وعنه قال: سمعت رسولَ الله ﷺ يقول: «كُلُّ أُمَّتِي مُعَافًى إلَّا الْمُجَاهِرِينَ، وَإِنَّ مِنَ الْمُجَاهَرَةِ أنْ يَعْمَلَ الرَّجُلُ بِاللَّيْلِ عَمَلاً، ثُمَّ يُصْبِحُ وَقَدْ سَتَرَهُ اللهُ عَلَيْهِ فَيَقُولُ: يَا فُلانُ! عَمِلْتُ الْبَارِحَةَ كَذَا وَكَذَا، وَقَدْ بَاتَ يَسْتُرُهُ رَبُّهُ، وَيُصْبِحُ يَكْشِفُ سَتْرَ اللهِ عنه» متفق عليه.

243. దైవప్రవక్త (స) ఇలా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ హురైరా (రజి) గారే తెలియజేశారు : బహిరంగంగా పాపకార్యాలకు పాల్పడేవారు తప్ప నా అనుచర సమాజంలోని ప్రతి ఒక్కడూ క్షమార్హుడే. మనిషి రాత్రి పూట ఏదైనా (తప్పు)చేసి, తెల్లవారిన తరువాత తను చేసిన పాపాన్ని దేవుడు మరుగుపరచి ఉంచినప్పటికీ తాను మాత్రం (సిగ్గులేకుండా), "ఒరేయ్! రాత్రి నేను ఈ పని చేశాన్రా" అంటూ (నలుగురిలో) చెప్పుకోవటం కూడా బహిరంగ పాపమే అవుతుంది. అతని ప్రభువు అతని పాపాన్ని తెరమరుగున ఉంచగా, తెల్లవారాక అతనే స్వయంగా ఆ తెరను తొలగించటానికి ప్రయత్నిస్తున్నాడు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణంలోనూ ఈ హదీసు ఉంది.)*

## ముఖ్యాంశాలు

మానవ దౌర్బల్యం చేత మనిషివల్ల తప్పులు దొర్లటం సహజమే. తప్పు జరిగినప్పుడు దానిపై పశ్చాత్తాప భావంతో కుమిలిపోతూ, ఎవరికీ ఆ విషయం తెలియకుండా గుట్టుగా ఉంచుకుంటే దైవసన్నిధిలో ఆ తప్పు మన్నించబడుతుందని ఆశించవచ్చు. దైవాన్ని క్షమాభిక్ష వేడుకుంటే దేవుడు దాన్ని తప్పకుండా క్షమిస్తాడు. అందులో సందేహం లేదు. కాని సిగ్గూ ఎగ్గూ లేకుండా బహిరంగంగా అందరిముందు పాపకార్యాలకు పాల్పడేవాడిని, తాను చేసిన పాపాలను గురించి తానేదో ఘనకార్యం చేసినట్లు నలుగురికీ చెప్పుకునేవాణ్ణి మాత్రం దేవుడు

క్షమించడు. ఎందుకంటే, అలాంటి మనిషికి బొత్తిగా దైవభయం ఉండదు. దైవాజ్ఞలకు, ధర్మాదేశాలకు అతను పూచికపుల్లంత విలువ కూడా ఇవ్వడు.

ఇంకో ముఖ్యవిషయం ఏమిటంటే, అలాంటి వ్యక్తికి తాను చేస్తున్న చెడు పనులపై పశ్చాత్తాపం చెందే భాగ్యం కూడా లేకుండా పోతుంది. పైగా చెడుపని చేసి నలుగురిలో గర్వంగా చెప్పుకోవటం దైవశిక్షకు సవాలు విసరడంతో సమానం. మరి అలాంటి వ్యక్తి దైవ సన్నిధిలో క్షమార్హుడు ఎట్లా అవుతాడు?

٢٤٤ ـ وعنه عن النبيِّ ﷺ قال: «إذَا زَنَتِ الأَمَةُ فتبيَّنَ زِنَاهَا فَلْيَجْلِدْهَا الحَدَّ، وَلا يُثَرِّبْ عَلَيْهَا، ثُمَّ إنْ زَنَتِ الثَّانِيَةَ فَلْيَجْلِدْهَا الحَدَّ وَلا يُثَرِّبْ عَلَيْهَا، ثُمَّ إنْ زَنَتِ الثَّالِثَةَ فَلْيَبِعْهَا وَلَوْ بِحَبْلٍ مِنْ شَعَرٍ» متفق عليه.

«التَّثْرِيبُ»: التَّوبِيخُ.

244. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : బానిస స్త్రీ వ్యభిచారానికి పాల్పడినప్పుడు ఆమె వ్యభిచార నేరం బయటపడితే ఆమెకు కొరడా దెబ్బల శిక్ష విధించాలి. ఆమెను మందలించకూడదు. ఆమె మళ్ళీ వ్యభిచారం చేస్తే అప్పుడు కూడా ఆమెకు కొరడా దెబ్బల శిక్ష విధించాలి. అంతే గాని, ఆమెను మందలించకూడదు. కాని మూడోసారి కూడా ఆమె వ్యభిచారానికి పాల్పడితే వెంట్రుకలతో పేనిన తాడుకు బదులుగానైనా సరే ఆమెను అమ్మి వేయాలి. (ఆమె పీడ వదలించుకోవాలి).

*(బుఖారీ - ముస్లిం)*

'తస్‌రీబ్' అంటే మందలించటం అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని బానిసవిమోచన ప్రకరణంలోనూ సహీహ్ ముస్లింలోని శిక్షల ప్రకరణంలోనూ ఈ హదీసు ఉంది.)*

## ముఖ్యాంశాలు

బానిస స్త్రీ వ్యభిచరిస్తే శిక్షగా ఆమెకు యాభై కొరడా దెబ్బలు కొట్టడం జరుగుతుంది. ఈ శిక్ష స్వయంగా ఆమె యజమాని కూడా విధించవచ్చు. పై హదీసులో యజమానినే సంబోధించటం జరిగింది. మందలించకుండా, ఛీత్కరించుకోకుండా ఉంటే బహుశా ఆమె ఇంకోసారి అలాంటి ఘాతుకానికి పాల్పడకుండా ఉంటుందేమో! అందుకే ఊరికే ఆమెను ఛీత్కరించు

కోవటం తగదని చెప్పబడింది. కొన్నిసార్లు ప్రేమతో చెప్పే మాటలే మనసుపై మంచి ప్రభావాన్ని చూపుతాయి. అందుకే బానిస స్త్రీ వ్యభిచరిస్తే ముందుగా ఆమెకు ప్రేమతో నచ్చజెప్పాలి. వినకపోతే ఆమెను ఎంత తక్కువ ధరకైనా అమ్మి ఆమె పీడ వదిలించుకోవాలి.

٢٤٥ ـ وعنه قال: أُتِيَ النَّبِيُّ ﷺ بِرَجُلٍ قَدْ شَرِبَ خَمْراً قال: «اضْرِبُوهُ» قال أبو هُرَيْرَةَ: فَمِنَّا الضَّارِبُ بِيَدِهِ، وَالضَّارِبُ بِنَعْلِهِ، وَالضَّارِبُ بِثَوْبِهِ. فَلَمَّا انْصَرَفَ قَالَ بَعْضُ الْقَوْمِ: أَخْزَاكَ الله قال: «لا تَقُولُوا هٰكَذَا لا تُعِينُوا عَلَيْهِ الشَّيْطَانَ» رواه البخاري.

245. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం : మద్యం తాగివున్న ఒక వ్యక్తిని దైవప్రవక్త (సల్లం) దగ్గరికి తీసుకురావటం జరిగింది. అప్పుడు ఆయన (ఆగ్రహంతో) "ఇతణ్ణి వాయించండి" అన్నారు. ఆయన అలా అనగానే మాలో కొందరు చేతులతో, కొందరు పాదరక్షలతో, కొందరైతే బట్టలతోనే అతణ్ణి (ఎడాపెడా) కొట్టారు. (కాసేపటికి) అతను వెళ్ళిపోయాక కొందరు, "దేవుడు నిన్ను అవమానించు గాక!" అని అతనికి శాపనార్థాలు పెట్టసాగారు. అది విని ఆయన "అలా అనకండి. అతనికి వ్యతిరేకంగా షైతానుకు సహాయపడకండి" అని అన్నారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని శిక్షల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక ముస్లింను శపించడమంటే ఒకవిధంగా షైతాన్‌కు సహాయపడటమే. షైతాన్ కర్తవ్యం కూడా ముస్లింలను భ్రష్టుపట్టించటం, ఇహపరాలలో వారిని అవమానాలకు గురిచేయటమేకదా!

ఈ హదీసును ఆధారంగా చేసుకొని కొంతమంది మద్యం సేవించినందుకు నిర్ణీత శిక్ష ఏమీ లేదని, మద్యం తాగినవాడికి తగిన రీతిలో బుద్ధి చెబితే చాలని అభిప్రాయపడ్డారు. మరొక వర్గం వారు మద్యం తాగినందుకు నలభై కొరడా దెబ్బల శిక్షపడుతుందని వాదిస్తున్నారు. వాస్తవానికిది మద్యపాన శిక్ష నిర్ణయించబడటానికి పూర్వం జరిగిన సంఘటన. ఆ తరువాతి కాలంలో దైవప్రవక్త (సల్లం) ఒకసారి మద్యం తాగిన వ్యక్తికి నలభై కొరడా దెబ్బల శిక్ష విధించారు. ఇక అదే నిర్ణీత శిక్ష అయింది.

హ|జత్ అబూబక్ర్ (రజి) తన ఖిలాఫత్ హయాంలో, ఆ తరువాత హ|జత్ ఉమర్ (రజి) తాను ఖలీఫా అయిన తొలినాళ్ళలో దీనినే అమలుపరిచారు. ఆ తరువాత ఉమర్ (రజి) అదనంగా మరో నలభై చేర్చి మొత్తం ఎనభై (80) కొరడా దెబ్బల శిక్షను విధించటం మొదలుపెట్టారు. పండితుల అభిప్రాయం ప్రకారం మద్యపాన నేరానికి అసలు శిక్ష నలభై కొరడా దెబ్బలే గాని న్యాయనిర్ణేత ఉచితమని భావిస్తే అదనంగా మరో నలభై కొరడా దెబ్బల దాక విధించవచ్చు. అత్యధిక మంది విద్వాంసులు ఈ రెండవ అభిప్రాయాన్నే సమర్థించారు.



29వ అధ్యాయం

# ٢٩ ـ بَابُ قَضَاءِ حَوَائِجِ الْمُسْلِمِينَ

# తోటి ముస్లింల అవసరాలను తీర్చటం

قالَ اللهُ تعالى: ﴿وَٱفْعَلُوا۟ ٱلْخَيْرَ لَعَلَّكُمْ تُفْلِحُونَ ۩﴾ [الحج: ٧٧].

**దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:**

**(విశ్వాసులారా!) మేలు చేయండి. బహుశా దీని ద్వారానే మీరు సాఫల్యం పొందవచ్చు.**

**(అల్ హజ్ : 77)**

٢٤٦ ـ وعن ابن عمرَ رضي الله عنهما أنَّ رسولَ الله ﷺ قال: «الْمُسْلِمُ أَخُو الْمُسْلِمِ لا يَظْلِمُهُ وَلايُسْلِمُهُ. مَنْ كَانَ فِي حَاجَةِ أَخِيهِ كَانَ اللهُ فِي حَاجَتِهِ، وَمَنْ فَرَّجَ عَنْ مُسْلِمٍ كُرْبَةً فَرَّجَ اللهُ عَنْهُ بِهَا كُرْبَةً مِنْ كُرَبِ يَوْمِ الْقِيَامَةِ، وَمَنْ سَتَرَ مُسْلِماً سَتَرَهُ اللهُ يَوْمَ الْقِيَامَةِ» متفق عليه.

246. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉద్బోధించారు : ముస్లిం ముస్లింకు సోదరుడు. ఒక ముస్లిం తోటి ముస్లింపై (ఎన్నటికీ) దౌర్జన్యం చేయడు, అతన్ని నిస్సహాయుడిగా వదలిపెట్టడు. (ఒక ముస్లిం) తన సోదరుని అవసరాలు తీర్చే పనుల్లో (నిమగ్నుడై) ఉంటే దేవుడు అతని అవసరాలు తీరుస్తూ ఉంటాడు. ఎవరైనా ముస్లింను ఒక కష్టం నుంచి కాపాడితే, ప్రళయదినాన దేవుడు అతనికి ఎదురయ్యే కష్టాల్లోని ఒక కష్టాన్ని దూరం చేస్తాడు. ఎవరైనా ఒక ముస్లిం (వల్ల జరిగిన పొరపాట్ల)పై ఆచ్ఛాదన వేస్తే దేవుడు కూడా ప్రళయ దినాన అతని (తప్పుల్ని) మరుగు పరుస్తాడు. *(బుఖారీ - ముస్లిం)*

## ముఖ్యాంశాలు

ఎలాంటి ప్రతిఫలాన్నీ ఆశించకుండా, నిస్వార్థంతో, కేవలం దైవప్రసన్నతను పొందే

ఉద్దేశ్యంతోనే తోటి ముస్లింలకు సహాయం చేసి వారి అవసరాలను తీర్చాలి. తోటి ముస్లింలకు చేసే ఈ నిస్వార్థ సహాయ సహకారాలు దేవుని సన్నిధిలో శ్రేష్ఠమైన పుణ్యకార్యాలుగా లిఖించబడతాయి. ముస్లిం సమాజ అవసరాలను తీర్చేందుకు స్వచ్ఛందంగా పని చేసే వారి అవసరాలను దేవుడు తీరుస్తాడు. పరలోకంలో కూడా వారికి గొప్ప ప్రతిఫలం లభిస్తుంది.

٢٤٧ ـ وعن أبي هُريرةَ رضي الله عنهُ عن النبيِّ ﷺ قال: «مَن نَفَّسَ عَنْ مُؤْمِنٍ كُرْبَةً مِنْ كُرَبِ الدُّنْيَا، نَفَّسَ اللهُ عَنْهُ كُرْبَةً مِنْ كُرَبِ يَوْمِ الْقِيَامَةِ، وَمَنْ يَسَّرَ عَلَى مُعْسِرٍ يَسَّرَ اللهُ عَلَيْهِ فِي الدُّنْيَا وَالآخِرَةِ، وَمَنْ سَتَرَ مُسْلِماً سَتَرَهُ اللهُ فِي الدُّنْيَا وَالآخِرَةِ، واللهُ فِي عَوْنِ الْعَبْدِ مَا كَانَ الْعَبْدُ فِي عَوْنِ أَخِيهِ، وَمَنْ سَلَكَ طَرِيقاً يَلْتَمِسُ فِيهِ عِلْماً سَهَّلَ اللهُ لَهُ طَرِيقاً إِلَى الْجَنَّةِ. وَمَا اجْتَمَعَ قَوْمٌ فِي بَيْتٍ مِنْ بُيُوتِ اللهِ تَعَالَى، يَتْلُونَ كِتَابَ اللهِ، وَيَتَدَارَسُونَهُ بَيْنَهُمْ إِلَّا نَزَلَتْ عَلَيْهِمُ السَّكِينَةُ، وَغَشِيَتْهُمُ الرَّحْمَةُ، وَحَفَّتْهُمُ الْمَلَائِكَةُ، وَذَكَرَهُمُ اللهُ فِيمَنْ عِنْدَهُ. وَمَنْ بَطَّأَ بِهِ عَمَلُهُ لَمْ يُسْرِعْ بِهِ نَسَبُهُ» رواه مسلم.

247. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : విశ్వాసికి ప్రపంచంలో ఎదురయ్యే కష్టాలలోని ఒక కష్టాన్ని గనక ఎవడైనా దూరం చేస్తే, దేవుడు పరలోకంలో అతడికి ఎదురయ్యే కష్టాలలోని ఒక కష్టాన్ని దూరం చేస్తాడు. ఎవరైనా (ఆర్థిక) ఇబ్బందుల్లో ఉన్న ఒక అభాగ్యునికి సౌలభ్యాన్ని చేకూరిస్తే దేవుడు వారికి ఇహపరాల్లోనూ సౌలభ్యాన్ని ప్రసాదిస్తాడు. ఎవరైనా ఒక ముస్లిం (పాపాల)ను కప్పిపుచ్చితే, దేవుడు ఇహలోకంలోనూ, పరలోకంలోనూ అతని (పాపాలను) కప్పిపుచ్చుతాడు. దాసుడు తన సోదరుడికి సహాయం చేస్తున్నంతకాలం దేవుడు దాసునికి సహాయం చేస్తూ ఉంటాడు. ఎవడైనా విద్యాన్వేషణలో ఏదైనా మార్గంలో నడిస్తే తద్వారా దేవుడు అతనికోసం స్వర్గమార్గాన్ని సుగమం చేస్తాడు. ప్రజలు దైవగృహాలలోని ఏ గృహంలోనయినా సమావేశమయి దైవ గ్రంథాన్ని పఠించటం, దానిని ఇతరులకు బోధించటం చేసినప్పుడు వారిపై ప్రశాంతత ఆవరిస్తుంది. దైవకారుణ్యం వారిని అలుము కుంటుంది. దైవ

దూతలు వారిని చుట్టుముడతారు. దేవుడు వారి గురించి తన సన్నిధిలో వున్న దూతలకు చెబుతాడు. (వీట న్నిటికి భిన్నంగా) ఆచరణ మందగించిన వాణ్ణి అతని వంశ గౌరవం ముందుకు తీసుకు పోజాలదు. (అంటే దేవుని సన్నిధిలో ఎవరూ వంశం ప్రాతిపదికపై ముక్తి పొందలేరని అర్థం.) (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రార్థనల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ఇబ్బందుల్లో ఉన్న వారికి సౌలభ్యాన్ని చేకూర్చాలని చెప్పబడింది. ధర్మజ్ఞానాన్ని ఆర్జించే నిమిత్తం చేసే ప్రయాణం స్వర్గానికి పూబాట అవుతుందని చెప్పబడింది. ఖుర్ఆన్ పఠించటం, కొంతమంది ఒక చోట చేరి దానిని అభ్యసించడం, ఇతరులకు బోధించటం ఎంతో శుభప్రదమైన కార్యాలు. అయితే చనిపోయిన వారి పేరిట ఖుర్ఆన్‌ను పూర్తిగా పఠించి, ఆ సమయంలో ప్రత్యేకంగా వారి మన్నింపుకోసం ప్రార్థించటం లాంటి పనులు దీనిక్రిందికి రావు. ఏది చేసినా ఖుర్ఆన్ హదీసులకు అనుగుణంగానే చేయాలి. మనిషి సత్కార్యాలు చేయకుండా వంశప్రతిష్ఠల ప్రాతిపదికపై ముక్తి పొందగలనని భావించటం ఒక అపోహ. ఈ హదీసు అలాంటి అపోహల్ని పటాపంచలు చేసి ముక్తికి సదాచరణే శరణ్యమని చాటుతోంది.



# 30వ అధ్యాయం

# ٣٠ ـ بَابُ الشَّفَاعَةِ

# సిఫారసు చేయటం

قال الله تعالى: ﴿مَّن يَشْفَعْ شَفَاعَةً حَسَنَةً يَكُن لَّهُ نَصِيبٌ مِّنْهَا﴾ [النساء: ٨٥].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"మంచి విషయం నిమిత్తం సిఫారసు చేసేవాడికీ అందులో భాగం లభిస్తుంది."

(అన్ నిసా : 85)

٢٤٨ ـ وعن أبي موسى الأشعريِّ رضي الله عنه قال: كان النَّبيُّ ﷺ إذَا أَتَاهُ طَالِبُ حَاجَةٍ أَقْبَلَ عَلَى جُلَسَائِهِ فقال: «اشْفَعُوا تُؤْجَرُوا وَيَقْضِي اللهُ عَلَى لِسَانِ نَبِيِّهِ مَا أَحَبَّ» متفقٌ عليه. وفي رواية: «مَا شَاءَ».

248. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) తన దగ్గరికి ఎవరైనా అవసరంలో ఉన్న వ్యక్తి వచ్చి (సహాయం చేయమని కోరితే) ఆయన తనతోపాటు కూర్చొనివున్న వారితో "ఇతని కోసం సిఫారసు చేయండి. దానివల్ల మీకూ పుణ్యం లభిస్తుంది. దేవుడు తాను తలచిన నిర్ణయాన్ని తన ప్రవక్తనోట వెలువరిస్తాడు" అని అనేవారు. *(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో "మా అహబ్బ"కు బదులు 'మా షాఅ' అని ఉంది. (రెండింటి అర్థం ఒక్కటే).

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

ధర్మసమ్మతమైన విషయాల్లో తోటి సోదరుల కొరకు సిఫారసు చేయటం పుణ్యప్రదమే. కాని నిషిద్ధ విషయాల్లోగాని లేక షరీఅత్ విధించిన శిక్షల్ని రద్దుచేయమని గాని సిఫారసు చేసే అనుమతి, అర్హత ఎవరికీ లేదు.

249. బరీరా మరియు ఆవిడ భర్తకు సంబంధించిన సంఘటన గురించి హ్రజత్ ఇబ్నె అబ్బాస్ (రజి) చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) ఆమెతో, "నీవు నీ భర్త (ముగీస్) దగ్గరికి తిరిగి వెళ్ళిపోతే (బాగుంటుంది)" అని అన్నారు. దానికి ఆమె, "(నేను తిరిగి నా భర్త దగ్గరికి వెళ్ళాలని) ఆజ్ఞాపిస్తు న్నారా దైవప్రవక్తా!" అని అడిగింది. అందుకాయన "(లేదు లేదు) నేను కేవలం సిఫారసు చేస్తున్నానంతే" అన్నారు. దానికి ఆమె, "నాకు ఆయన అవసరం లేదు" అని తెగేసి చెప్పింది.

*(బుఖారీ)*

٢٤٩ ـ وعن ابنِ عباسٍ رضي الله عنهما في قِصَّةِ بَرِيرَةَ وَزَوْجِهَا قال: قال لَهَا النَّبيُّ ﷺ: «لَوْ رَاجَعْتِهِ؟» قَالَتْ: يَا رَسُولَ الله! تَأْمُرُنِي؟ قال: «إِنَّمَا أَشْفَعُ» قَالَتْ: لا حَاجَةَ لِي فِيهِ. رواه البخاري.

*(సహీహ్ బుఖారీలోని విడాకుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హ్రజత్ బరీరా (రజి.అన్హా) దైవప్రవక్త ప్రియసతీమణి ఆయిషా (రజి.అన్హా) గారి బానిసరాలు. ఈమె ముగీస్ అనే బానిసను వివాహమాడారు. హ్రజత్ ఆయిషా (రజి.అన్హా) ఈమెకు బానిసత్వం నుండి స్వేచ్ఛ నొసగారు. బానిసత్వం నుండి స్వేచ్ఛపొందిన స్త్రీకి తన బానిస భర్తతో సంసారం చేయటం యిష్టం లేకపోతే తన వివాహ బంధాన్ని త్రెంచుకునే హక్కు ఇచ్చింది ఇస్లాం ధర్మం. దాని ప్రకారం ఈమె కూడా తన హక్కును వినియోగించుకుంటూ తన భర్త ముగీస్ నుండి విడిపోయారు. కాని ముగీస్‌కు మాత్రం బరీరా అంటే వల్లమాలిన ప్రేమ. ఆమె ఎక్కడికి వెళ్ళినా ఇతను ఆమెను అనుసరిస్తూ తిరిగేవాడు. తనతో వివాహబంధాన్ని త్రెంచుకోవద్దని ప్రాధేయపడేవాడు. దైవప్రవక్తకు ఈ విషయం తెలిసింది. ఆయన ముగీస్ దైన్యస్థితికి జాలిపడ్డారు. అతనితో వివాహబంధాన్ని పునర్నిర్మించుకోమని బరీరాకు సిఫారసు చేశారు. కాని లాభం లేకపోయింది. ఇది షరీఅత్ ఆజ్ఞ అయితే కాదు కదా! ఇది కేవలం సలహా మరియు సిఫారసు మాత్రమే. అందుకని హ్రజత్ బరీరా (రజి.అన్హా)గారు ఈ సలహా తనకు ప్రయోజనకరమైనది కాదని తలపోసి దైవప్రవక్త (స) చేసిన సిఫారసును ఒప్పుకోలేదు. దీనిద్వారా ఇస్లాం ధర్మం వ్యక్తిగత హక్కుల్ని సమ్మతించి ఆమోదించిందని తెలుస్తోంది. ఇస్లాం వ్యక్తుల హక్కుల్ని గౌరవిస్తుంది. అయితే ఆ హక్కుల వినియోగం షరీఅత్ పరిమితులకు లోబడి ఉండాలి. షరీఅత్ ప్రసాదించిన స్వేచ్ఛను హరించడానికి ఎవరికీ అధికారం లేదు.

31వ అధ్యాయం

# ٣١ - بَابُ الإِصْلَاحِ بَيْنَ النَّاسِ

# ప్రజల మధ్య సయోధ్యకు ప్రయత్నించటం

دివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"ప్రజలు జరిపే రహస్య సమాలోచనల్లో సాధారణంగా ఏ మేలూ ఉండదు. కాని ఎవరైనా రహస్యంగా దానధర్మాలు చెయ్యండి అని బోధిస్తే లేక ఏదైనా సత్కార్యం కొరకు లేదా ప్రజల వ్యవహారాలను చక్కబరిచే ఉద్దేశ్యంతో ఎవరితోనైనా ఏదైనా రహస్యం చెబితే అది మంచి విషయమే." (అన్ నిసా : 114)

వేరొకచోట అల్లాహ్ ఇలా అంటున్నాడు :

"ఏది ఏమైనా (భార్యాభర్తల మధ్య) సర్దుబాటే అన్ని విధాలా ఉత్తమమైనది."

(అన్ నిసా : 128)

ఇంకొకచోట ఇలా అంటున్నాడు :

"మీ పరస్పర సంబంధాలను సంస్కరించుకోండి." (అల్ అన్‌ఫాల్ : 1)

ఆయన ఇంకా ఇలా సెలవిస్తున్నాడు :

"విశ్వాసులు పరస్పరం సోదరులు. కనుక మీ సోదరుల మధ్య సంబంధాలను సంస్కరించండి." (అల్ హుజురాత్ : 10)

قال الله تعالى: ﴿لَا خَيْرَ فِي كَثِيرٍ مِّن نَّجْوَىٰهُمْ إِلَّا مَنْ أَمَرَ بِصَدَقَةٍ أَوْ مَعْرُوفٍ أَوْ إِصْلَٰحٍۭ بَيْنَ ٱلنَّاسِ﴾ [النساء: ١١٤] وقال تعالى: ﴿وَٱلصُّلْحُ خَيْرٌ﴾ [النساء: ١٢٨] وقال تعالى: ﴿فَٱتَّقُوا۟ ٱللَّهَ وَأَصْلِحُوا۟ ذَاتَ بَيْنِكُمْ﴾ [الأنفال: ١] وقال تعالى: ﴿إِنَّمَا ٱلْمُؤْمِنُونَ إِخْوَةٌ فَأَصْلِحُوا۟ بَيْنَ أَخَوَيْكُمْ﴾ [الحجرات: ١٠].

250. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : ప్రజల (దేహాల్లోని) ప్రతి కీలు తరఫున సూర్యుడు ఉదయించే

٢٥٠ - وعن أبي هريرة رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «كُلُّ سُلامَى مِنَ النَّاسِ عَلَيْهِ صَدَقَةٌ كُلَّ يَوْمٍ تَطْلُعُ فِيهِ

الشَّمْسُ: تَعْدِلُ بَيْنَ الاثْنَيْنِ صَدَقَةٌ، وَتُعِينُ الرَّجُلَ فِي دَابَّتِهِ فَتَحْمِلُهُ عَلَيْهَا، أَوْ تَرْفَعُ لَهُ عَلَيْهَا مَتَاعَهُ صَدَقَةٌ. وَالْكَلِمَةُ الطَّيِّبَةُ صَدَقَةٌ، وَبِكُلِّ خَطْوَةٍ تَمْشِيهَا إِلَى الصَّلاةِ صَدَقَةٌ، وَتُمِيطُ الأَذَى عَنِ الطَّرِيقِ صَدَقَةٌ» متفقٌ عليه.

ప్రతిదినమూ తప్పనిసరిగా సదఖా (సత్కార్యం) చేయాలి. ఇద్దరు వ్యక్తుల మధ్య న్యాయమైన తీర్పుతో రాజీకుదర్చడం కూడా సదఖాయే (సత్కార్యమే) అవుతుంది. నీవు ఎవరినైనా అతని వాహనం మీద కూర్చోబెట్టడం లేదా అతని సామానును అతని వాహనంపై ఎక్కించటంలో సహాయపడటం కూడా సత్కార్యమే. ఒక మంచి మాట పలకటం కూడా సత్కార్యమే. నమాజు కోసం మస్జిద్‌కు వెళుతున్నప్పుడు నీవు వేసే ప్రతి అడుగూ సత్కార్యమే. దారినుండి ప్రజలకు హాని కలిగించే వస్తువుని తొలగించటం కూడా సత్కార్యంగానే పరిగణించబడుతుంది." *(బుఖారీ - ముస్లిం)*

ومعنى «تَعْدِلُ بَيْنَهُمَا»: تُصْلِحُ بَيْنَهُمَا بِالْعَدْلِ.

'తాదిలు బైనహుమా' అంటే వారిరువురి మధ్య న్యాయబద్ధంగా రాజీ కుదర్చటం అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణంలోనూ ఈ హదీసు ఉంది.)*

## ముఖ్యాంశాలు

మనిషి దేహంలోని ప్రతి అవయవం కదలటానికి, పని చేయటానికి వీలుగా దేవుడు ఎన్నో కీళ్ళు సృష్టించాడు. ఈ కీళ్ళ ఆధారంగానే మనిషి నడవటం, కూర్చోవటం, పరుగెత్తటం లాంటి పనులు చేసుకోగలుగుతున్నాడు. ఇవే లేకపోతే మనిషి బొమ్మలా ఎక్కడ వేస్తే అక్కడ కదలకుండా పడుండేవాడు. కాని దేవుడు మనిషికి కీళ్ళు ప్రసాదించి మహోపకారం చేశాడు. దానికిగాను అతను తప్పకుండా దైవానికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. మనిషి దేహంలో మొత్తం మూడువందల అరవై కీళ్ళు ఉంటాయని వేరొక హదీసు ద్వారా తెలుస్తోంది.

దేవుడు చేసిన మరో మహోపకారం ఏమిటంటే, మనిషి ఈ అనుగ్రహాలకు కృతజ్ఞతలు తెలుపుకునేందుకు అత్యంత సులువైన మార్గాన్ని సూచించాడు. పైన హదీసులో పేర్కొనబడిన

సత్కార్యాలను ధనిక బీద తేడా లేకుండా ప్రతి ఒక్కరూ చేయగలరు. కొన్ని ఉల్లేఖనాల్లోనయితే సూర్యోదయం అయిన తరువాత రెండు రకాతుల నమాజ్ చేసుకున్నా ఆ విధి నెరవేరుతుందని చెప్పబడింది. అసలు ఏమీ చేయలేకపోతే ఇతరులకు హాని కల్గించకుండా జాగ్రత్తపడినా చాలని మరికొన్ని ఉల్లేఖనాలు ఉద్ఘాటిస్తున్నాయి.

٢٥١ ـ وعن أُمِّ كُلْثُوم بِنْتِ عُقْبَةَ بن أَبي مُعَيطٍ رضي الله عنها قالت: سمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُولُ: «لَيْسَ الْكَذَّابُ الَّذِي يُصْلِحُ بَيْنَ النَّاسِ فَيَنمِي خَيْراً، أَوْ يَقُولُ خَيْراً» متفقٌ عليه.

251. దైవప్రవక్త (సల్లం) ప్రవచిస్తూ ఉండగా తాను విన్నానని ఉఖబా బిన్ అబూ ముఐత్ కుమార్తె ఉమ్మె కుల్సూమ్ (రజి.అన్హా) తెలియజేశారు: ప్రజల మధ్య సంబంధాలను చక్కదిద్దే (ఉద్దేశ్యంతో వాస్తవానికి విరుద్ధంగా మాట్లాడే)వాడు అబద్ధాలకోరు కాజాలడు. అతను (ఒకరి నుండి మరొకరికి) మంచి మాటలే చేరవేస్తాడు. ఏది చెప్పినా మంచి ఉద్దేశ్యంతోనే చెబుతాడు. *(బుఖారీ - ముస్లిం)*

وفي رواية مسلم زيادة، قالت: وَلَمْ أَسْمَعْهُ يُرَخِّصُ في شَيْءٍ مما يَقُولُهُ النَّاسُ إلَّا في ثَلاثٍ؛ تَعْنِي: الْحَرْبَ، وَالإِصْلاَحَ بَيْنَ النَّاسِ، وَحَدِيثَ الرَّجُلِ امْرَأَتَهُ، وَحَدِيثَ الْمَرْأَةِ زَوْجَهَا.

ముస్లిం ఉల్లేఖనంలో ఈ వాక్యాలు అదనంగా ఉన్నాయి: ఉమ్మె కుల్సూమ్ అంటున్నారు : దైవప్రవక్త (సల్లం) ప్రజలకు మూడు విషయాల్లో తప్ప మరే విషయంలోనూ వాస్తవానికి విరుద్ధంగా మాట్లాడేందుకు అనుమతి ఇచ్చినట్లు నేను వినలేదు. ఆ మూడు విషయాలు ఇవి : యుద్ధంలో, ప్రజల మధ్య సంబంధాలను చక్కదిద్దే సమయంలో, మనిషి తన భార్యతోగాని, భార్య తన భర్తతోగాని (పరస్పరం సంతోషపెట్టే ఉద్దేశ్యంతో) సంభాషించుకున్నప్పుడు.

*(సహీహ్ బుఖారీలోని ఒప్పందాల ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణంలోనూ ఈ హదీసు ఉంది.)*

## ముఖ్యాంశాలు

అబద్ధం చెప్పటం నిషిద్ధమే. కాని సమాజంలోని వ్యక్తుల మధ్య సంబంధాలను చక్కదిద్దే ఉద్దేశ్యంతోగాని, దంపతుల మధ్య సుహృద్భావాన్ని నెలకొల్పేందుకు గాని లేదా ప్రజలందరి ప్రయోజనాల దృష్ట్యాగాని అబద్ధం చెప్పటంలో మాత్రం తప్పులేదు. ఈ మూడు సందర్భాల్లో అబద్ధం చెప్పటానికి అనుమతి ఉంది. (1) ఇద్దరు వ్యక్తుల మధ్య విభేదాలు చోటుచేసుకున్నప్పుడు వారిరువురి మధ్య రాజీ కుదిర్చే ఉద్దేశ్యంతో వాళ్ళు చెప్పకపోయినా ఒకరి తరఫునుండి మరొకరికి మంచి మాటలు చెప్పటంలో తప్పులేదు. (2) యుద్ధ సమయంలో అవసరమైతే శత్రు సైన్యాన్ని సందిగ్ధంలో పడవేసేందుకు వాస్తవాలను దాచి వుంచుతూ అబద్ధాన్ని ప్రచారం చేయవచ్చు. (3) అదేవిధంగా సంసార రథం సాఫీగా ముందుకు సాగటంకోసం దాంపత్య జీవితంలోని అన్యోన్యతను కాపాడటం కోసం ఒక్కోసారి భర్త భార్యతోగాని, భార్య భర్తతోగాని అబద్ధం చెప్పాల్సిన అనివార్య పరిస్థితి ఏర్పడుతుంది. అలాంటి సందర్భాల్లో అబద్ధం చెప్పటానికి షరీఅత్ అనుమతిస్తోంది.

252. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) ఇంటి ముందు ఎవరో తగాదాపడి గట్టిగా మాట్లాడుకోవటం విన్నారు. వారిలో ఒకడు రెండవవాడితో తన అప్పులో కొంత వదిలెయ్యమని, తన పట్ల కాస్త మృదువుగా వ్యవహరించమని బ్రతిమాలుతున్నాడు. కాని రెండవ వ్యక్తి మాత్రం "దైవసాక్షి! నేను అలా చేయను" అని అంటున్నాడు. అంతలో దైవప్రవక్త (స) బయటకు వచ్చి, "మంచిపని చేయనని దేవుడి మీద ప్రమాణం చేసి మరీ చెబుతున్నాడు! ఎవడతను?" అని అడిగారు. అప్పుడతను (ముందుకు వచ్చి) "నేను దైవప్రవక్తా! (కాని ఇప్పుడు చెబుతున్నాను) తను కోరినట్టే ఇవ్వమనండి" అని తన కఠినవైఖరికి పశ్చాత్తాపపడుతూ అన్నాడు.

*(బుఖారీ - ముస్లిం)*

٢٥٢ ـ وعن عائشةَ رَضِيَ اللهُ عَنْهَا قالت: سمع رَسُولُ اللهِ ﷺ صَوْتَ خُصُومٍ بِالْبَابِ عَالِيَةً أَصْوَاتُهما، وإذا أَحَدُهُمَا يَسْتَوْضِعُ الآخَرَ وَيَسْتَرْفِقُهُ فِي شَيْءٍ، وَهُوَ يَقُولُ: وَاللهِ! لا أَفْعَلُ، فَخَرَجَ عَلَيْهِمَا رَسُولُ اللهِ ﷺ فقال: «أَيْنَ الْمُتَأَلِّي عَلَى اللهِ لا يَفْعَلُ الْمَعْرُوفَ؟»، فقال: أَنَا يَا رَسُولَ اللهِ! فَلَهُ أَيُّ ذٰلِكَ أَحَبَّ. متفق عليه.

معنى «يَسْتَوضِعُهُ»: يَسْأَلُهُ أَنْ يَضَعَ عَنْهُ بَعْضَ دَيْنِهِ. وَ«يَسْتَرْفِقُهُ»: يَسْأَلُهُ الرِّفْقَ وَ«المُتَأَلِّي»: الْحَالِفُ.

'యస్తౌజివుహూ' అంటే అప్పులో కొంత మాఫీ చేయమని అభ్యర్థించటం. 'యస్తర్ఫిఖుహూ' అంటే మృదువుగా వ్యవహరించమని బ్రతిమాలటం. 'ముతఅల్లి' ప్రమాణం చేసేవాడని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని ఒప్పందాల ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని వాణిజ్య ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావించబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

1. బాకీదారుల పట్ల మృదువైఖరిని అవలంబించాలి. బాకీదారుడు తీసుకున్న అప్పును తీర్చలేడనుకుంటే విశాల హృదయంతో ఆ అప్పులోని కొంతభాగాన్ని మాఫీ చేయాలి లేదా కనీసం అప్పు తీర్చడానికి మరింత గడువు అయినా ఇవ్వాలి. దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్, "మీ బాకీదారుడు ఆర్థిక ఇబ్బందులలో ఉంటే, అతని పరిస్థితి మెరుగుపడేవరకు గడువు ఇవ్వండి, లేక మీరు తెలిసినవారే అయితే, ఆ బాకీని అతనికి దానం చేయండి. అది మీకు ఎక్కువ శ్రేయస్కరం" అని ఉపదేశిస్తున్నాడు.
2. ఎవరైనా పుణ్య కార్యాలు చేయనని నిర్ణయించుకుంటే అతన్ని మందలించి ఆ నిర్ణయాన్ని మార్చుకునేలా చేయాలి. మంచిపనులు చేయమని ప్రేరేపించాలి.
3. మన వీధిలోనే, మన యింటిముందరే, మన కళ్ల ఎదుటే ఎవరైనా తగవులాడుకుంటుంటే చూసి మనకెందుకులే అని ఊరుకోరాదు. వారిని విడిపించటానికి, వారి మధ్య రాజీ కుదర్చటానికి ప్రయత్నించాలి.
4. తగవులాడుకునేవారు కూడా మధ్యవర్తులతో సహకరించాలి. అంతేగాని అడ్డొచ్చిన వాళ్ళపై తిరగబడటం తమ కోపాన్ని వాళ్ళపై వెళ్ళగ్రక్కటం చేయరాదు.

٢٥٣ ـ وعن أبي العباس سهل بن سعدٍ السَّاعِدِيِّ رضي الله عنه، أَنَّ رَسُولَ اللهِ ﷺ بَلَغَهُ أَنَّ بَنِي عَمْرِو بن عَوْفٍ كَانَ بَيْنَهُمْ شَرٌّ، فَخَرَجَ رسولُ الله ﷺ يُصْلِحُ بَيْنَهُمْ فِي أُنَاسٍ مَعَهُ، فَحُبِسَ

253. హజ్రత్ అబుల్ అబ్బాస్ సహ్ల్ బిన్ సాద్ సాయిదీ (రజి) కథనం : అమ్ర్ బిన్ ఔఫ్ తెగ వారి మధ్య తగాదా జరిగిందని దైవప్రవక్త (సల్లం)కు కబురందింది. ఆయన కొంతమందిని వెంటబెట్టుకొని వారి మధ్య రాజీ కుదిర్చే ఉద్దేశ్యంతో వారి దగ్గరికి వెళ్ళారు. అయితే (కొన్ని కారణాల వల్ల) ఆయన అక్కడే ఆగిపోవలసివచ్చింది. అప్పుడే నమాజు వేళ

కూడా అయింది. (మరోవైపు ప్రజలు ఆయన కోసం ఎదురుచూడసాగారు. చాలాసేపు ఎదురుచూసిన తరువాత) బిలాల్ (రజి), హజ్రత్ అబూబక్ర్ (రజి) దగ్గరికి వెళ్ళి, "(దైవప్రవక్త ఇంకా రాలేదు) ఆయన (స) అక్కడే ఆగి పోయినట్టుంది. నమాజ్ వేళ అయింది. మరి మీరు నమాజ్ చేయించగలరా?" అని అడిగారు. దానికాయన "సరే, నీ యిష్టం" అని అన్నారు. బిలాల్ (రజి) నమాజ్ కోసం ఇఖామత్ పలికారు. హజ్రత్ అబూబక్ర్ (అందరికన్నా) ముందు నిలబడి 'అల్లాహు అక్బర్' అంటూ నమాజు మొదలెట్టారు. ప్రజలు కూడా 'అల్లాహు అక్బర్' అంటూ ఆయన్ని అనుసరించారు. అంతలోనే దైవప్రవక్త (సల్లం) పంక్తుల గుండా నడుస్తూ వచ్చి పంక్తిలో నించున్నారు. ప్రజలు (దైవప్రవక్త వచ్చేశారని అబూబక్ర్‌కు తెలియపరచటానికి) చప్పట్లతో సైగ చేయసాగారు. (కాని అబూబక్ర్ (రజి) వినిపించుకోలేదు.) ఆయన నమాజ్ చేస్తున్నప్పుడు దేనివైపూ దృష్టి సారించరు. కాని ప్రజలు చప్పట్లు చరచటం అధికం చేసినప్పుడు ఆయన దృష్టి మళ్ళించారు. వెనుక పంక్తిలో దైవప్రవక్త ఉండటం గమనించి (వెనక్కి జరగబోయారు.) అయితే దైవప్రవక్త (సల్లం) ఆయన్ని (తన స్థానంలోనే నిలబడమని) సైగ చేశారు. కాని

رسُولُ الله ﷺ وَحَانَتِ الصَّلاةُ، فَجَاءَ بِلالٌ إِلَى أَبِي بَكْرٍ رضي الله عنهما فقال: يَاأَبَا بَكْرٍ! إِنَّ رسولَ الله ﷺ قَدْ حُبِسَ، وَحَانَتِ الصَّلاةُ، فَهَلْ لَكَ أَنْ تَؤُمَّ النَّاسَ؟ قال: نَعَمْ إِنْ شِئْتَ، فَأَقَامَ بِلالٌ الصَّلاةَ، وَتَقَدَّمَ أَبُـو بَكْـرٍ فَكَبَّـرَ وَكَبَّـرَ النَّـاسُ، وَجَـاءَ رسُولُ الله ﷺ يَمْشِي فِي الصُّفُوفِ حَتَّى قَامَ فِي الصَّفِّ، فَأَخَذَ النَّاسُ فِي التَّصْفِيقِ، وَكَانَ أَبُو بَكْرٍ رضي الله عنه لا يَلْتَفِتُ فِي صَلاتِهِ، فَلَمَّا أَكْثَرَ النَّاسُ التَّصْفِيقَ الْتَفَتَ، فَـإِذَا رسـولُ الله ﷺ، فَـأَشَـارَ إِلَيْـهِ رسُولُ الله ﷺ، فَرَفَعَ أَبُو بَكْرٍ رضي الله عنه يَدَهُ فَحَمِدَ اللهَ وَرَجَعَ الْقَهْقَرَى وَرَاءَهُ حَتَّـى قَـامَ فِـي الصَّـفِّ، فَتَقَـدَّمَ رسُولُ الله ﷺ، فَصَلَّى لِلنَّاسِ، فَلَمَّا فَرَغَ أَقْبَلَ عَلَى النَّاسِ فقـال: «أَيُّهَـا النَّـاسُ مَا لَكُمْ حِينَ نَابَكُمْ شَيْءٌ فِي الصَّلاةِ أَخَذْتُمْ فِي التَّصْفِيقِ؟! إِنَّمَا التَّصْفِيقُ لِلنِّسَاءِ. مَنْ نَابَهُ شَيْءٌ فِي صَلاتِهِ فَلْيَقُلْ: سُبْحَانَ الله، فَإِنَّهُ لا يَسْمَعُهُ أَحَدٌ حِينَ يَقُولُ: سُبْحَانَ

الله، إلَّا التَفَتَ. يَا أَبَا بَكْرٍ! مَا مَنَعَكَ أَنْ تُصَلِّيَ بِالنَّاسِ حِينَ أَشَرْتُ إِلَيْكَ؟»، فقال أبو بكرٍ: مَا كَانَ يَنْبَغِي لابْنِ أَبِي قُحَافَةَ أَنْ يُصَلِّيَ بِالنَّاسِ بَيْنَ يَدَيْ رَسُولِ اللهِ ﷺ. متفقٌ عليه.

معنى «حُبِسَ»: أَمْسَكُوهُ لِيُضِيفُوهُ.

అబూబక్ర్ (రజి) మాత్రం (తనను దైవప్రవక్త (స) తన సమక్షంలో ప్రజలకు సారథ్యం వహించటానికి యోగ్యుడిగా గుర్తించినందుకు కృతజ్ఞతగా) చెయ్యి ఎత్తి దైవాన్ని స్తుతించారు. తరువాత దైవప్రవక్త (స) కన్నా వెనక్కి జరిగి అందరి తోపాటు సమానంగా నించున్నారు.

తరువాత దైవప్రవక్త (సల్లం) ముందుకు వెళ్ళి నమాజు చేయించారు. నమాజు అనంతరం ప్రజలతో ఇలా అన్నారు : "ప్రజలారా! నమాజులో అనూహ్యమైన పరిణామం సంభవించగానే మీరు చప్పట్లు కొడతారేమిటి? చప్పట్లు కొట్టటం స్త్రీల పద్ధతి (అన్న సంగతి మీకు తెలియదా?) కనుక (ఇకనుంచి) నమాజులో ఊహించని సంగతేదైనా జరిగితే 'సుబ్‌హానల్లాహ్' అనాలి. ఎందు కంటే ఎవరైనా సుబ్‌హానల్లాహ్ అని అంటే తప్పకుండా దృష్టి మళ్ళిస్తారు."

(ఆ తరువాత అబూబక్ర్ (రజి)తో "ఓ అబూబక్ర్! ప్రజలకు నమాజు చేయించమని నేను సైగచేసినప్పటికీ మీరు ఎందుకు ఆగిపోయారు?" అని అడిగారు. దానికి, "దైవప్రవక్త సమక్షంలో అబూ ఖుహాఫా కొడుకు నమాజులో ప్రజలకు సారథ్యం వహించటం సమం జసంగా ఉండదు కదా" అని విన్నవిం చుకున్నారు హజ్రత్ అబూబక్ర్ (రజి).

*(బుఖారీ - ముస్లిం)*

'హుబిస' అంటే (ఇక్కడ) ఆయనకు అతిథి మర్యాదలు చేయటానికి ఆపివుం చారని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని 'నమాజులో దొర్లే పొరపాట్ల ఆదేశాలు' ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

1. బనూ అమ్ర్ బిన్ ఔఫ్ అనేది ఔస్‌కు చెందిన ఓ పెద్ద తెగ. ఈ తెగలో ఎన్నో కుటుంబాలు ఉండేవి. మదీనా వెలుపల ఖుబా ప్రాంతంలో ఈ తెగవారు నివాసముండేవారు. ఒకసారి ఏదో విషయంలో వారి మధ్య తగాదా వచ్చి, పరస్పరం కొట్టుకోవటం, రాళ్ళు విసురు కోవటం దాకా వెళ్ళింది వ్యవహారం. ఈ సంగతి తెలుసుకొని వెంటనే దైవప్రవక్త (స) వారిని విడిపించి, రాజీకుదిర్చే ఉద్దేశ్యంతో కొంతమంది సహచరులను వెంట బెట్టుకొని అక్కడికి చేరుకున్నారు. దీనిద్వారా ముస్లింల మధ్య తగాదాలు జరిగినప్పుడు రాజీ కుదర్చటం చాలా అవసరమని తెలుస్తోంది. ప్రారంభంలోనే రాజీ కుదిర్చితే తగాదా అంతటితో సద్దుమణుగుతుంది. లేకపోతే పరిస్థితి విషమించిన తరువాత ఆ తగాదాను అదుపుచేయటం కష్టతరం కావచ్చు.
2. ఒకే నమాజును ఒకడి తరువాత మరొకడు ఇద్దరు ఇమాముల సారథ్యంలో చేయవచ్చు.
3. నమాజులో ఇమామ్‌ను అప్రమత్తం చేయటానికి ముఖ్తదీలు (అనుయాయులు) సుబ్‌హానల్లాహ్ అనాలి. స్త్రీలయితే చప్పట్లు చరచాలి.
4. అవసరమైనప్పుడు నమాజులో కొద్దిగా మళ్ళటంగాని లేదా క్రీగంట చూపులతో చూడటం గాని చేయవచ్చు. అదేవిధంగా ముందుకు వెళ్ళటం, వెనక్కి జరగటం కూడా ధర్మసమ్మతమే. దీనివల్ల నమాజ్ భంగం కాదు.



**32వ అధ్యాయం**

# ٣٢ - بَابُ فَضْلِ ضَعَفَةِ الْمُسْلِمِينَ وَالْفُقَرَاءِ وَالْخَامِلِين

# దీన, నిరుపేద ముస్లింల విశిష్టత

قَالَ الله تعالى: ﴿وَٱصْبِرْ نَفْسَكَ ٱلَّذِينَ يَدْعُونَ رَبَّهُم بِٱلْغَدَوٰةِ وَٱلْعَشِيِّ يُرِيدُونَ وَجْهَهُۥ وَلَا تَعْدُ عَيْنَاكَ عَنْهُمْ﴾ [الكهف: ٢٨].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"తమ ప్రభువు ప్రసన్నతను అర్థిస్తూ ఎవరు ఉదయం, సాయంత్రం ఆయనను వేడు కుంటారో, వారి సహచర్యం పట్ల నీ హృదయాన్ని సంతృప్తపరచుకో. వారి నుండి నీ దృష్టిని ఏ మాత్రం మరల్చకు." (అల్ కహఫ్ : 28)

٢٥٤ - عن حَارِثَة بْنِ وَهْب رضي الله عنه قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقولُ: «أَلا أُخْبِرُكُمْ بِأَهْلِ الْجَنَّةِ؟ كُلُّ ضَعِيفٍ مُتَضَعِّفٍ، لَوْ أَقْسَمَ عَلَى اللهِ لَأَبَرَّهُ أَلَا أُخْبِرُكُمْ بِأَهْلِ النَّارِ؟ كُلُّ عُتُلٍّ جَوَّاظٍ مُسْتَكْبِرٍ» متفقٌ عليه.

254 దైవప్రవక్త (సల్లం) ఇలా అంటుండగా తాను విన్నానని హజ్రత్ హారిసా బిన్ వహబ్ (రజి) తెలిపారు. : నేను మీకు స్వర్గవాసుల గురించి చెప్పనా? (సాధారణంగా లోకులు) అల్పుడిగా జమకట్టే ప్రతి బలహీనుడు (స్వర్గవాసి అయివుంటాడు). అతను గనక దేవుని మీద ప్రమాణంచేస్తే దేవుడు అతని ప్రమాణాన్ని నిజం చేస్తాడు. (ఇక) నరకవాసుల గురించి చెప్పనా? పొగరు బోతు, పిసినిగొట్టు, గర్విష్ఠి అయిన ప్రతివాడూ (నరకవాసియే).

*(బుఖారీ - ముస్లిం)*

«الْعُتُلُّ»: الْغَلِيظُ الْجَافِي. وَ«الجَوَّاظُ» بفتح الجيم وتشديدِ الواوِ وبالظاءِ المعجمة: وَهُوَ الْجَمُوعُ الْمَنُوعُ، وَقِيلَ: الضَّخْمُ الْمُخْتَالُ في مِشْيَتِهِ، وَقِيلَ: الْقَصِيرُ الْبَطِينُ.

'ఉతుల్లో' అంటే పొగరుబోతు. 'జవ్వాజ్' అంటే ఎవరికీ ఇవ్వకుండా పోగుచేసి ఉంచేవాడు, పిసినిగొట్టు. కొందరి

అభిప్రాయంలో నిక్కుతూ నడిచే స్థూల కాయుడు. ఇంకా కొందరి అభిప్రాయంలో చిన్న బొజ్జ గలవాడని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని స్వర్గభాగ్యాల ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో సమాజంలోని దీనులు, బలహీనులు, నిరుపేదల విశిష్ఠతను గురించి చెప్పబడింది. లోకులు వారిని అల్పులుగా భావిస్తారు. సమాజంలో వారికి సరైన విలువ ఉండదు. కాని దైవభక్తి, విశ్వాసాల పరంగా వారు ఎంతో ఉన్నత స్థానంలో ఉంటారు. పైకి వారు బలహీనులు, నిస్సహాయులుగా కనపడినప్పటికీ వారు గనక దేవునిపై పూర్తి నమ్మకంతో ప్రమాణం చేస్తే దేవుడు తప్పకుండా వారి ప్రమాణాన్ని నిజం చేస్తాడు. వారిలో అంతటి శక్తి నిగూఢమై ఉంటుంది మరి!

٢٥٥ - وعن أبي العباس سهلِ بنِ سعدِ الساعِدِيِّ رضي الله عنه قال: مَرَّ رَجُلٌ عَلَى النَّبِيِّ ﷺ؛ فقال لرَجُلٍ عِنْدَهُ جَالِسٍ: «مَا رَأْيُكَ فِي هٰذَا؟»، فقال: رَجُلٌ مِنْ أَشْرَافِ النَّاسِ، هٰذَا وَاللهِ! حَرِيٌّ إِنْ خَطَبَ أَنْ يُنْكَحَ وَإِنْ شَفَعَ أَنْ يُشَفَّعَ. فَسَكَتَ رسولُ الله ﷺ، ثُمَّ مَرَّ رَجُلٌ آخَرُ، فَقَالَ لَهُ رَسُولُ اللهِ ﷺ: «مَا رَأْيُكَ فِي

255. హజ్రత్ అబుల్ అబ్బాస్ సహ్ల్ బిన్ సాద్ సాయిదీ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త ముందు నుంచి వెళ్ళాడు. ఆయన తన దగ్గర కూర్చొనివున్న మరో వ్యక్తితో "ఇతని గురించి నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగారు. దానికా వ్యక్తి "ఇతను చాలా పెద్ద మనిషి. దైవంతోడు! ఇతను ఎంత గొప్పవాడంటే, ఇతను ఎవరికన్నా వివాహ సందేశం పంపితే (దాన్నెవరూ నిరాకరించలేరు). తప్పకుండా అతని వివాహం జరిగిపోతుంది. ఎవరికోసమైనా సిఫారసు చేస్తే అతని సిఫారసు అంగీకరించబడుతుంది" అని అన్నాడు. అది విని దైవప్రవక్త (సల్లం) మౌనంగా ఉన్నారు. (కాసేపటికి) ఇంకో వ్యక్తి అక్కడి నుండి వెళ్ళాడు. "ఇతని

هٰذَا؟»، فقال: يا رسولَ اللهِ! هٰذَا رَجُلٌ مِنْ فُقَرَاءِ الْمُسْلِمِينَ هٰذَا حَرِيٌّ إنْ خَطَبَ أَنْ لا يُنْكَحَ، وَإِنْ شَفعَ أَنْ لا يُشَفَّعَ، وَإِنْ قَالَ أَنْ لا يُسْمَعَ لِقَوْلِهِ. فقال رسولُ الله ﷺ: «هذا خَيْرٌ مِنْ مِلْءِ الأرْضِ مِثْلَ هذا» متفقٌ عليه.

قوله: «حَرِيٌّ» هُوَ بفتح الحاءِ وكسر الراءِ وتشديد الياءِ: أيْ حَقِيقٌ. وقوله: «شَفَعَ» بفتح الفاءِ.

గురించి నీ అభిప్రాయం ఏమిటని దైవప్రవక్త (సల్లం) మళ్ళీ తన దగ్గరున్న వ్యక్తిని అడిగారు. దానికావ్యక్తి, "దైవ ప్రవక్తా! ఇతనొక నిరుపేద ముస్లిం. ఇతను ఎంత అల్పుడంటే, ఇతను వివాహ సందేశాన్ని పంపితే ఇతన్ని వివాహం చేసుకోవటానికి ఎవరూ ముందుకు రారు. ఇతను సిఫారసు చేస్తే ఎవరూ ఇతని సిఫారసుని లెక్కచేయరు. అసలు ఇతని మాటల్ని కూడా ఎవరూ పట్టించుకోరు" అని అన్నాడు. అందుకు దైవప్రవక్త (సల్లం) "లోకంలో మొదటి వ్యక్తుల్లాంటివారి కన్నా ఈ నిరుపేద వ్యక్తే మేలైనవాడు" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

'హరియ్యున్' అంటే యోగ్యుడు అని అర్థం. 'షఫఅ' అనే పదంలో 'ఫ'కు అకారం.

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. సమాజంలో కొందరు ముస్లింలు పేదరికంలో మగ్గుతూ అనామకులుగా జీవితం గడుపుతుంటారు. సమాజంలో వారికి తగినంత గుర్తింపు లభించదు. అసలు వారిని అడిగిచూసే మహానుభావుడే ఉండడు. అయితే అల్లాహ్ దృష్టిలో వీరిలో ఒక్కొక్కడు విశ్వాస భాగ్యం లేని లోకులందరికన్నా ఘనుడు. దేవుని సన్నిధిలో భక్తి విశ్వాసాలకే విలువ ఉంటుంది. ఇహలోకపు వంశప్రతిష్ఠలు, డాబు, దర్పం ఆయన దగ్గర పనికిరావు.
2. వివాహం కోసం సౌశీల్యవతులైన స్త్రీ, పురుషులను ఎంచుకోవాలి. వారు పేదవారైనప్పటికీ గుణానికి ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వాలి. పేదవారైనప్పటికీ వారు ధార్మికంగా ఇతర ముస్లింలకు జోడు కాగలరు. వివాహ సందర్భాల్లో ధర్మానికి, నైతికతకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వాలిగాని ప్రాపంచిక విషయాలను అంతగా పట్టించుకోరాదు.

٢٥٦ ـ وعن أبي سعيد الخدري رضي الله عنه عن النَّبِيِّ ﷺ قال: «احْتَجَّتِ الْجَنَّةُ وَالنَّارُ فقالتِ النَّارُ: فِيَّ الْجَبَّارُونَ وَالْمُتَكَبِّرُونَ، وَقَالَتِ الْجَنَّةُ: فِيَّ ضُعَفَاءُ النَّاسِ وَمَسَاكِينُهُمْ. فَقَضَى اللهُ بَيْنَهُمَا: إِنَّكِ الْجَنَّةُ رَحْمَتِي أَرْحَمُ بِكِ مَنْ أَشَاءُ، وَإِنَّكِ النَّارُ عَذَابِي أُعَذِّبُ بِكِ مَنْ أَشَاءُ، وَلِكِلَيْكُمَا عَلَيَّ مِلْؤُهَا» رواه مسلم.

256. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : స్వర్గం మరియు నరకం పరస్పరం వాదులాడు కున్నాయి. నాలో తలబిరుసులు, అహం కారులు ఉంటారని నరకం అంటే, నాలో బల హీనులు, నిస్సహాయులు ఉంటారని స్వర్గం అన్నది. అప్పుడు అల్లాహ్ వారిద్దరినీ సముదాయిస్తూ (స్వర్గంతో) "నీవు నా కారుణ్యానివి. నేను నీ ద్వారా నాకిష్టమైన వారిని కరుణిస్తాను. (తరువాత నరకంతో) నీవు నా శిక్షవి. నేను నీ ద్వారా నేను తలచినవారిని శిక్షి స్తాను. మీ ఇద్దరినీ నింపాల్సిన బాధ్యత నాది" అని అన్నాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని స్వర్గసుఖాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసులో బలహీనులు, నిరాధారజీవులు అంటే ప్రపంచంలో పేదరికంతో బాధపడుతున్నప్పటికీ దేవుడు ప్రసాదించిన దాంతోనే తృప్తిచెంది, దైవానికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ జీవితం గడిపేవారని అర్థం. వీరు ఇతరులను మోసగించి ధనం సంపాదించేవారు కారు. ఇలాంటివారి కోసం ఈ హదీసులో స్వర్గసుఖాల శుభవార్త వినిపించబడింది. వీరికి భిన్నంగా దైవాజ్ఞలను శిరసావహించకుండా, తలబిరుసుతనానికి ఒడిగట్టే అహంకారులు, పొగరుబోతులు నరకానికి పోతారని హెచ్చరించబడింది. పరిణామం రీత్యా ఈ ఇరువర్గాల్లో ఎవరు ఉత్తములో తెలుస్తూనే ఉంది.

స్వర్గనరకాల మధ్య సంభాషణ జరగడమనేది అసాధ్య విషయమేమీ కాదు. దేవుడు సర్వాధికారి. అన్నీ చేయగల సమర్థుడు. ఆయన నిర్జీవం నుండి సజీవాన్ని తీయగలడు. సజీవం నుండి నిర్జీవాన్ని తీసుకురాగలడు. ఆయన స్వర్గనరకాలకు మాట్లాడే, అర్థం చేసుకునే శక్తిని ప్రసాదిస్తే వాటి మధ్య సంభాషణ జరగటంలో ఆశ్చర్యమేముంది?! ముస్నదె అహ్మద్‌లో ఈ హదీసు ఇంకా వివరంగా వచ్చింది. సహీహ్ బుఖారీ వ్యాఖ్యాన ప్రకరణంలోని అబూ హురైరా (రజి) కథనం అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం కన్నా విపులంగా ఉంది.

257. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : ప్రళయదినాన ఒక లావుపాటి పెద్ద మనిషి (దేవుని సన్నిధికి) వస్తాడు. కాని దేవుని వద్ద అతని బరువు (విలువ) దోమ రెక్కంత కూడా ఉండదు. *(బుఖారీ - ముస్లిం)*

٢٥٧ ـ وعن أبي هريرة رضي الله عنه عن رسولِ الله ﷺ قال: «إِنَّهُ لَيَأْتِي الرَّجُلُ السَّمِينُ الْعَظِيمُ يَوْمَ الْقِيَامَةِ لا يَزِنُ عِنْدَ اللهِ جَنَاحَ بَعُوضَةٍ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని కపట విశ్వాసుల ప్రకరణంలోనూ ఈ హదీసు పొందుపరచబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

దేవుని వద్ద మనిషి దేహబలానికి అతని రూపురేఖలకు ఎలాంటి విలువా ఉండదని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. మనిషిలోని చిత్తశుద్ధి, భక్తీవిశ్వాసాలకే అక్కడ విలువ ఉంటుంది. కనుక మనిషి దేహ సౌందర్యానికన్నా అంతర్యాన్ని చెడు మాలిన్యాల నుంచి ప్రక్షాళనం చేసుకోవటానికే ఎక్కువ ప్రాధాన్యతనివ్వాలి.

258. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం : ఒక నల్లని స్త్రీయో లేక ఓ యువకుడో - మస్జిద్ ఊడ్చేవారు. ఒకసారి ఆమె కనిపించకపోవటంతో దైవప్రవక్త (సల్లం) ఆమె గురించి అడిగారు. ఆమె చనిపోయిందని సహచరులు చెప్పారు. దానికాయన (చిరు కోపంతో) "మరి ఆ విషయం నాతో ఎందుకు చెప్పలేదు?" అని అడిగారు. సహచరులు (అతడు లేక) ఆమె విషయాన్ని తేలికగా తీసుకున్నారు. అందుకే ఆయనకు తెలియపరచలేదు. అసలు సంగతి తెలుసుకొన్న తరువాత ఆయన "సరే, నాకు ఆమె సమాధి ఎక్కడుందో చూపించండి" అని కోరారు. సహచరులు ఆయనకు సమాధి చూపించగా ఆయన ఆమె సమాధివద్ద (జనాజా)

٢٥٨ ـ وعنه أنَّ امْرَأَةً سَوْدَاءَ كَانَتْ تَقُمُّ الْمَسْجِدَ، أَوْ شَاباً، فَفَقَدَهَا رسولُ اللهِ ﷺ، فَسَأَلَ عَنْهَا أَوْ عَنْهُ، فقالوا: مَاتَ. قال: «أَفَلاَ كُنْتُمْ آذَنْتُمُونِي» فَكَأَنَّهُمْ صَغَّرُوا أَمْرَهَا، أَوْ أَمْرَهُ فقال: «دُلُّونِي عَلَى قَبْرِهِ» فَدَلُّوهُ فَصَلَّى عَلَيْهَا، ثُمَّ قال: «إِنَّ هٰذِهِ الْقُبُورَ مَمْلُوءَةٌ ظُلْمَةً عَلَى أَهْلِهَا، وَإِنَّ اللهَ تَعَالَى يُنَوِّرُهَا لَهُمْ بِصَلاتِي عَلَيْهِمْ» متفقٌ عليه.

قوله: «تَقُمُّ» هو بفتح التَّـاءِ وَضَـمِّ الْقَـافِ: أَيْ تَكْنُـسُ. وَ«الْقُمَامَةُ»: الْكُنَاسَةُ. وَ«آذَنْتُمُونِي» بِمَدِّ الْهَمْزَةِ، أَيْ: أَعْلَمْتُمُونِي.

నమాజు చేశారు. తరువాత ప్రజలతో ఇలా అన్నారు : "నిస్సందేహంగా సమాధులు వాటిలో వున్న వారికొరకు చీకటితో నిండి ఉన్నాయి. నేను వాటి దగ్గర నమాజు చేసినప్పుడు దేవుడు వారికి వెలుతురును ప్రసాదిస్తాడు."

*(బుఖారీ - ముస్లిం)*

'తఖుమ్ము' అంటే ఊడ్వటం. ఖుమామా అంటే చెత్తాచెదారం. 'అజన్‌తుమూనీ' అంటే మీరు నాకు తెలియపరచారని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని మస్జిదుల ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణంలోనూ ఈ హదీసు పేర్కొనబడింది.)*

## ముఖ్యాంశాలు

మరికొన్ని ఉల్లేఖనాల ఆధారంగా పండితులు మస్జిద్‌ను శుభ్రం చేసే సేవకురాలు స్త్రీయేనన్న నిర్ణయానికి వచ్చారు. ఏదిఏమైనా ఇందులో దైవప్రవక్త (సల్లం) గారి వినమ్రత, అణకువ భావాలు వెల్లడౌతున్నాయి. ఓ సామాన్య స్త్రీకి సైతం ఆయన దృష్టిలో గౌరవం ఉండేది. ఈ హదీసు బోధించే మరొక విషయం ఏమిటంటే పుణ్యపురుషుల అంత్యక్రియల్లో (జనాజాలో) పాల్గొనాలి. ఏ కారణం చేతనైనా పాల్గొనలేకపోతే సమాధి దగ్గర అయినా నించొని జనాజా నమాజ్ చేసుకోవచ్చు.

٢٥٩ ـ وعنـــه قـــال: قـــال رسـولُ الله ﷺ: «رُبَّ أَشْعَـثَ مَـدْفُـوعٍ بِالأَبْوَابِ لَوْ أَقْسَمَ عَلَى اللهِ لأَبَرَّهُ» رواه مسلم.

259. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : కొందరు దుమ్ము కొట్టుకొని (చూడటానికి అసహ్యంగా) కనపడతారు. వారిని గుమ్మం వద్దనుంచే కసరి కొట్టడం జరుగుతుంది. కాని వారు గనక దైవంపై ప్రమాణం చేస్తే దేవుడు వారి ప్రమాణాన్ని తప్పకుండా నిజం చేస్తాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)*

260. హజ్రత్ ఉసామా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : నేను స్వర్గ ద్వారంలో నించొని చూశాను. స్వర్గంలో ప్రవేశించే వారిలో నాకు చాలా మంది అభాగ్యులే కనిపించారు. ధనవంతులు (స్వర్గంలో ప్రవేశించలేక) ఆగిపోతున్నారు. అయితే నరకవాసుల్ని నరకానికి తీసుకెళ్ళమని ఆదేశమయింది. నేను నరక ద్వారంలో (కూడా) నించొని చూశాను. అందులో ప్రవేశించేవారిలో చాలామంది స్త్రీలే ఉన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

'జద్దు' అంటే కలిమి, ఆర్థికంగా మంచి స్థితిలో ఉండటం. 'మహ్బూసూన' అంటే వారికి ఇంకా స్వర్గంలో ప్రవేశించ టానికి అనుమతి లభించలేదని భావం.

٢٦٠ ـ وعن أُسَامَةَ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «قُمْتُ عَلَى بَابِ الْجَنَّةِ، فإِذَا عَامَّةُ مَنْ دَخَلَهَا الْمَسَاكِينُ، وَأَصْحَابُ الجَدِّ مَحْبُوسُونَ، غَيْرَ أَنَّ أَصْحَابَ النَّارِ قَدْ أُمِرَ بِهِمْ إِلَى النَّارِ. وَقُمْتُ عَلَى بَابِ النَّارِ فإِذَا عَامَّةُ مَنْ دَخَلَهَا النِّسَاءُ» متفقٌ عليه.

وَ«الجَدُّ» بفتح الجيم: الْحَظُّ وَالْغِنَى. وقوله: «مَحْبُوسُونَ» أَيْ: لَمْ يُؤْذَنْ لَهُمْ بَعْدُ فِي دخول الجَنَّةِ.

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణంలోనూ, ఇంకా సహీహ్ ముస్లింలోని ప్రేమైక వచనాల ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

స్వర్గనరకాల స్థితిగతులను గురించి దేవుడు తన వాణి ద్వారా దైవప్రవక్త (సల్లం)కు తెలియపరచి ఉంటాడు లేదా ఆయన మగతలో ఈ సన్నివేశాలను తిలకించి ఉండవచ్చు. ఏదిఏమైనా ఈ హదీసు దీన, బలహీన ముస్లింల ఘనతను చాటి చెబుతోంది. అలాగే ధనవంతులు మిడిసిపాటుకు లోనుకాకుండా దైవానికి కృతజ్ఞులై జీవితం గడపాలని హెచ్చరిస్తోంది. మరికొన్ని ఉల్లేఖనాల్లో స్త్రీలు అధిక సంఖ్యలో నరకంలో ఉండటానికి కారణం; వారు తమ భర్తల పట్ల ఎక్కువగా కృతఘ్నతకు పాల్పడుతుండటమేనని దైవప్రవక్త (సల్లం) చెప్పారు. కనుక ముఖ్యంగా స్త్రీలు ఈ విషయాన్ని గ్రహించి తమ వైఖరిని మార్చుకోవటానికి ప్రయత్నించాలి.

261. దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారని హజ్రత్ అబూ హురైరా (రజి) అన్నారు : ఉయ్యాలలో (పసిపిల్లలుగా) ఉన్నప్పుడు మాట్లాడింది ముగ్గురే. (ఒకాయన) ఈసా (అలైహి), (రెండవ తను) జురైజ్. జురైజ్ అనే ఆయన దైవారాధకుడు. (ఆరాధన నిమిత్తం) ఆయన ఓ కుటీరాన్ని (ఆశ్రమంగా) తయారుచేసుకున్నాడు. (ఒకరోజు) ఆయన తన కుటీరంలో నమాజు చేస్తుండగా ఆయన తల్లి వచ్చి 'జురైజ్!' అని పిలిచింది. తల్లి పిలుపు విని ఆయన 'దేవా! (ఒకవైపు) అమ్మ పిలుస్తోంది. నేనా నమాజులో ఉన్నాను. (ఇప్పుడేం చేయాలి అన్న ఆలోచనలో పడిపోయాడు). చివరికి నమాజు మీదే భక్తిని లగ్నం చేసుకున్నాడు. (ఆయన తల్లి వెళ్ళిపోయింది) ఆమె మరుసటి దినం వచ్చినప్పుడు కూడా ఆయన నమాజులోనే ఉన్నాడు. ఆమె 'జురైజ్!' అని పిలిచింది. అప్పుడు కూడా ఆయన అమ్మ పిలుపుకు సమాధానం ఇవ్వాలా లేక నమాజులోనే కొనసాగాలా అన్న సందిగ్ధంలో పడిపోయాడు. చివరికి ఆయన నమాజునే కొనసాగించాడు. (ఆయనన్నుంచి ఎలాంటి సమాధానం రాకపోవటంతో ఆయన తల్లి వెళ్ళిపోయింది.) తిరిగి మూడోరోజు వచ్చినప్పుడు కూడా ఆయన నమాజులోనే ఉన్నాడు. ఆమె 'జురైజ్!' అని పిలిచింది. తల్లి పిలుపు విని ఆయన "దేవా! అటు

٢٦١ ـ وعن أبي هريرةَ رضي الله عنه عن النَّبيِّ ﷺ قال: «لَمْ يَتَكَلَّمْ في الْمَهْدِ إلَّا ثَلاثَةٌ عِيسى ابْنُ مَرْيَمَ، وَصَاحِبُ جُرَيْجٍ، وَكَانَ جُرَيْجٌ رَجُلاً عَابِداً، فَاتَّخَذَ صَوْمَعَةً فَكَانَ فِيهَا، فَأَتَتْهُ أُمُّهُ وَهُوَ يُصَلِّي فَقَالَت: يَا جُرَيجُ! فقالَ: يَا رَبِّ! أُمِّي وَصَلاتِي. فَأَقْبَلَ عَلَى صَلاتِهِ فَانْصَرَفَتْ. فَلَمَّا كَانَ مِنَ الْغَدِ أَتَتْهُ وَهُوَ يُصَلِّي فقالتْ: يَاجُرَيجُ! فقالَ: أَيْ ربِّ! أُمِّي وَصَلاتِي، فَأَقْبَلَ عَلَى صَلاتِهِ، فَلَمَّا كَانَ مِنَ الْغَدِ أَتَتْهُ وَهُوَ يُصَلِّي فَقَالَتْ: يَا جُرَيْجُ! فقال: أَيْ رَبِّ! أُمِّي وَصَلاتِي، فَأَقْبَلَ عَلَى صَلاتِهِ، فقالتْ: اللَّهُمَّ لا تُمِتْهُ حَتَّى يَنْظُرَ إلى وُجُوهِ الْمُومِسَاتِ. فَتَذَاكَرَ بَنُو إِسْرَائِيلَ جُرَيجاً وَعِبَادَتَهُ، وَكَانَتِ امْرَأَةٌ بَغِيٌّ يُتَمَثَّلُ بِحُسْنِهَا، فقالتْ: إنْ شِئْتُمْ لأَفْتِنَنَّهُ، فَتَعَرَّضَتْ لَهُ، فَلَمْ يَلْتَفِتْ إلَيْهَا، فَأَتَتْ رَاعِياً كَانَ يَأْوِي إلى صَومَعَتِهِ، فَأَمْكَنَتْهُ مِنْ نَفْسِهَا فَوَقَعَ عَلَيْهَا. فَحَمَلَتْ، فَلَمَّا وَلَدَتْ قَالَت: هُوَ مِنْ جُرَيجٍ، فَأَتَوْهُ فَاسْتَنْزَلُوهُ وَهَدَمُوا صَوْمَعَتَهُ، وَجَعَلُوا يَضْرِبُونَهُ، فقالَ: مَا شَأْنُكُمْ؟ قَالُوا: زَنَيْتَ بِهٰذِهِ الْبَغِيِّ فَوَلَدَتْ مِنْكَ. قالَ: أَيْنَ الصَّبِيُّ؟ فَجَاؤُوا بِهِ فقالَ: دَعُونِي حَتَّى أُصَلِّيَ،

فَصَلَّى، فَلَمَّا انصَرَفَ أَتَى الصَّبِيَّ فَطَعَنَ فِي بَطْنِهِ وقالَ: يَا غُلامُ! مَنْ أَبُوكَ؟ قالَ: فُلانٌ الرَّاعِي، فَأَقْبَلُوا عَلَى جُرَيجٍ يُقَبِّلُونَهُ وَيَتَمَسَّحُونَ بِهِ وَقالُوا: نَبْنِي لَكَ صَوْمَعَتَكَ مِنْ ذَهَبٍ، قالَ: لا، أَعِيدُوهَا مِنْ طِينٍ كَمَا كَانَتْ، فَفَعَلُوا. وَبَيْنَا صَبِيٌّ يَرْضَعُ مِنْ أُمِّهِ، فَمَرَّ رَجُلٌ رَاكِبٌ عَلَى دَابَّةٍ فَارِهَةٍ وَشَارَةٍ حَسَنَةٍ، فَقَالَتْ أُمُّهُ: اللَّهُمَّ! اجْعَل ابْنِي مِثْلَ هٰذَا، فَتَرَكَ الثَّدْيَ وَأَقْبَلَ إِلَيْهِ فَنَظَرَ إِلَيْهِ فقالَ: اللَّهُمَّ! لا تَجْعَلْنِي مِثْلَهُ، ثُمَّ أَقْبَلَ عَلَى ثَدْيِهِ فَجَعَلَ يَرْتَضِعُ، فَكَأَنِّي أَنْظُرُ إِلَى رسولِ الله ﷺ وَهُوَ يَحْكِي

అమ్మ పిలుస్తోంది. ఇటు నేను నమాజులో ఉన్నాను. (ఇప్పుడు నేనేం చేయాలి?" అన్న ఆలోచనలోనే ఉండి పోయాడు) ఆఖరికి నమాజునే కొన సాగించాలని తేల్చుకున్నాడు. అప్పుడు ఆయన తల్లి ఆయన్ని శపిం చింది. "దేవా! ఇతనికి వ్యభిచారిణులు ఎదురు పడేదాకా ఇతని ప్రాణం తీయకు" అని చెప్పి వెళ్ళిపోయింది.

(కొంత కాలానికి) ఇస్రాయీల్ జాతిలో జురైజ్ ఆరాధనకు బాగా పేరు వచ్చింది. వారిలో అందగత్తె అయిన ఒక వ్యభిచారిణి ఉండేది. ఆమె (ఇస్రాయీల్ జాతి వారితో) "మీరు సరేనంటే నేను ఈయన్ని నా వలలో వేసుకోగలను" అని అంది. ఆ తరువాత ఆమె ఆయన ముందుకు వచ్చి ఆయన్ని కవ్వించింది. కాని ఆయన మాత్రం తన దృష్టిని మరల్చ లేదు. ఆమె (అక్కడ్నుంచి) ఓ పశువుల కాపరి దగ్గరికి వెళ్ళింది. ఆ పశువుల కాపరి జురైజ్ ఆశ్రమానికి వస్తూపోతూ ఉండేవాడు. ఆ స్త్రీ పశువుల కాపరికి తన మీద అధికారమిచ్చింది. అతనామెతో వ్యభిచారం చేశాడు. దాంతో ఆమె గర్భవతి అయింది. (కొంత కాలానికి) ఆమెకు ఓ మగపిల్లవాడు పుట్టాడు. అయితే ఆ పిల్లవాడు తనకు జురైజ్ వల్ల పుట్టాడని ఆ స్త్రీ ప్రజల్లో ప్రచారం చేసింది. అది తెలుసుకొని జనం జురైజ్‌ను కొట్టడానికి పరుగెత్తారు. ఆయన్ని కుటీరం నుంచి ఈడ్చి

ارْتِضَاعَهُ بِأُصْبُعِهِ السَّبَّابَةِ فِي فِيهِ، فَجَعَلَ يَمُصُّهَا، قَالَ: «وَمَرُّوا بِجَارِيَةٍ وَهُمْ يَضْرِبُونَهَا، وَيَقُولُونَ: زَنَيْتِ سَرَقْتِ، وَهِيَ تَقُولُ: حَسْبِيَ اللهُ وَنِعْمَ الْوَكِيلُ. فقالَتْ أُمُّهُ: اللَّهُمَّ! لا تَجْعَل ابْنِي مِثْلَهَا، فَتَرَكَ الرَّضَاعَ وَنَظَرَ إلَيْهَا فَقَالَ: اللَّهُمَّ! اجْعَلْنِي مِثْلَهَا، فَهُنَالِكَ تَرَاجَعَا الْحَدِيثَ فقالت: مَرَّ رجُلٌ حَسَنُ الْهَيْئَةِ فَقُلْتُ: اللَّهُمَّ! اجْعَل ابْنِي مِثْلَهُ فَقُلْتَ:

కుటీరాన్ని నేలమట్టం చేశారు. తరువాత ఆయన్ని (క్రిందపడేసి) చితకబాద సాగారు. ఆయన (కొంతసేపటి తరువాత తేరుకొని) "అసలు నేనేం పాపం చేశానని మీరు నన్ను కొడుతున్నారు" అని అడిగాడు. దానికి వారు "నీవు ఆ స్త్రీతో వ్యభిచారం చేశావు, నీ వల్ల ఆమెకు ఒక పిల్లవాడు కూడా పుట్టాడు" అని అన్నారు. వారి మాటలు విని ఆయన "ముందు ఆ పిల్లవాడ్ని తీసుకురండి" అని అన్నాడు. వారు ఆ పిల్లవాడ్ని తీసు కొచ్చారు. తరువాత ఆయన "నన్ను కాస్త విడిచిపెడతారా? నమాజ్ చేసుకుం టాను" అని అన్నాడు. (వాళ్ళు ఆయన్ని విడిచిపెట్టారు). ఆయన నమాజ్ చేసుకున్నాడు. నమాజ్ ముగించుకున్న తరువాత పిల్లవాడి దగ్గరికి వచ్చి అతని పొట్టపై గిల్లి, "బాబూ! నీ తండ్రి ఎవరూ?" అని అడిగాడు. (అంతే, మాటలు కూడా రాని ఆ చంటిపిల్ల వాడు) "నా తండ్రి ఫలానా పశువుల కాపరి" అని చెప్పాడు. చంటిపిల్లవాడు మాట్లాడటం చూసి జనం ఆశ్చర్య పోయారు. జురైజ్‌కు ప్రభావితులై అందరూ ఆయన్ని చుంబించసాగారు. భక్తితో తాకసాగారు. వాళ్ళంతా జురైజ్‌తో "మేము తమరి కుటీరాన్ని బంగారంతో కట్టించి ఇస్తాం" అని అన్నారు. దానికి జురైజ్, "అవసరం లేదు, మునుపు ఎలాగుందో అలాగ మట్టితో కట్టించండి చాలు" అని అన్నాడు.

اللّٰهُمَّ! لا تَجْعَلْنِي مِثْلَهُ، وَمَرُّوا بِهٰذِهِ الأَمَةِ وَهُمْ يَضْرِبُونَهَا وَيَقُولُون: زَنَيْتِ سَرَقْتِ، فَقُلْتُ: اللّٰهُمَّ! لاتَجْعَل ابْنِي مِثْلَهَا فَقُلْتَ: اللّٰهُمَّ! اجْعَلْنِي مِثْلَهَا؟! قالَ: إنَّ ذلكَ الرَّجُلَ كَانَ جَبَّاراً فَقُلْتُ: اللّٰهُمَّ! لاتَجْعَلْنِي مِثْلَهُ، وَإِنَّ هٰذِهِ يَقُولُونَ لَهَا زَنَيْتِ، وَلَمْ تَزْنِ، وَسَرَقْتِ، وَلَمْ تَسْرِقْ، فَقُلْتُ: اللّٰهُمَّ! اجْعَلْنِي مِثْلَهَا» متفقٌ عليه.

(ఇక శైశవంలోనే మాట్లాడిన మూడవ పిల్లవాడి సంఘటన ఇలా ఉంది.) ఒక స్త్రీ తన చంటిపిల్లవాడికి పాలు త్రాపుతుండగా మంచి (ఖరీదైన) దుస్తులు ధరించివున్న ఒక రౌతు వేగంగా ఆమె ముందునుంచి దూసుకు వెళ్ళాడు. ఆ స్త్రీ అతడ్ని చూసి, "అల్లాహ్! నా పిల్లవాడిని కూడా అంతటి గొప్పవాడిగా చెయ్యి" అని కోరుకుంది. వెంటనే ఆ పిల్లవాడు తల్లి స్తనమును వదలిపెట్టి రౌతు వైపు (పరిశీలనగా) చూసి, "అల్లాహ్! నన్ను ఇతనిలా చేయకు" అని అన్నాడు. ఆ తరువాత తల్లి వైపుకు తిరిగి పాలు త్రాగటం ప్రారంభించాడు.

ఆ పిల్లవాడు పాలు త్రాగిన వైనాన్ని దైవ ప్రవక్త (స) తన చూపుడు వ్రేలుని నోట్లో పెట్టుకొని చప్పరిస్తూ చెప్పిన దృశ్యం ఇప్పటికీ తన కళ్ళముందు మెదలుతోందని (ఈ హదీసు ఉల్లేఖకులు హ్జరత్ అబూ హురైరా (రజి) అన్నారు.)

తరువాత ఆ స్త్రీ ముందునుంచే కొందరు ఒక బానిసరాలిని కొట్టుకుంటూ తీసుకు వెళ్ళారు. వాళ్ళు ఆ బానిసరాలిని (కొడ్తూనే) "నువ్వు వ్యభిచారం చేశావు. దొంగతనం చేశావు" అని తిట్టిపోస్తున్నారు. ఆమె మాత్రం "హస్బియల్లాహు వనిమల్ వకీల్" (నాకు అల్లాహ్-సహాయం-చాలు. ఆయనే-నన్ను రక్షించగల - శ్రేష్ఠమైన కార్యసాధకుడు)" అని అంటోంది. పిల్లవాడి తల్లి అది చూసి,

"దేవా! నా కొడుక్కి ఈ బానిసరాలి గతి పట్ట కూడదు" అని వేడుకుంది. వెంటనే పిల్లవాడు పాలు త్రాగటం వదలిపెట్టి ఆ బానిసరాలివైపు చూసి, "దేవా! నన్ను ఈమె లాగే చెయ్యి" అని అన్నాడు. అప్పుడు ఆ తల్లీకొడుకుల మధ్య ప్రశ్నోత్త రాలు జరిగాయి. తల్లి తన కొడుకుని, "ముందు ఆ సొగసరివాడు వెళ్ళినప్పుడు నేను నా కొడుకుని కూడా అంతటి వాడిని చేయుమని దైవాన్ని ప్రార్థిస్తే నువ్వేమో అలా చేయవద్దని ప్రార్థించావు. తరువాత కొంతమంది ఆ బానిసరాలిని 'నువ్వు వ్యభిచారం చేశావు, దొంగతనం చేశావ'ని తిడ్తూ కొట్టుకుంటూ తీసుకెళ్తుంటే నేను నా పిల్లవాడికి ఆ గతి పట్టకూడదని ప్రార్థించాను. కాని నువ్వు మాత్రం ఆమెలాగే అవ్వాలని కోరుకుంటున్నావు (అసలు నువ్విలా ఎందుకు మాట్లాడుతున్నావు?)" అని అడిగింది. దానికా చంటిపిల్లవాడు, "ముందు వెళ్ళిన ఆ సొగసరివాడు పరమ దుర్మార్గుడు. నేనూ అతనిలా కాకూడదని దైవాన్ని ప్రార్థించాను. కాని ఈ బానిస రాలిని వీళ్ళు వ్యభిచారం చేసిందని, దొంగతనం చేసిందని అంటున్నారుగాని నిజానికి ఆమె అలా చేయలేదు. అందుకే దేవుడు ఈమెలా నన్ను కూడా (సౌశీల్యవంతుడిగా), చేయాలని కోరు కున్నాను" అని సమాధానమిచ్చాడు.

*(బుఖారీ - ముస్లిం)*

وَ«المُـومِسَـاتُ»: بضَـمِّ الميـمِ الأُولَـى وإسْكَانِ الوَاوِ وكسرِ الميم الثانيةِ وبالسين المهملَةِ؛ وَهُنَّ الزَّوَانِي. وَالمُـومِسَـةُ: الزَّانِيَةُ. وقوله: «دَابَّةٌ فَارِهَةٌ» بالفاءِ: أيْ حَاذِقَةٌ نَفِيسَةٌ. وَ«الشَّارَةُ» بِالشِّينِ المُعْجَمَةِ وَتَخْفِيفِ الرَّاءِ: وَهِيَ الجَمَالُ الظَّاهِرُ في الهَيْئَـةِ وَالمَلْبَـسِ. وَمَعْنَـى «تَـرَاجَعَـا الحَدِيثَ» أيْ: حَدَّثَتِ الصَّبِيَّ وَحَدَّثَهَا، والله أعلم.

'మూమిసాత్' అంటే వ్యభిచారం చేసే స్త్రీలు. 'మూమిసా' ఏకవచనం. 'దాబ్బతున్ ఫారిహా' అంటే వేగంగా పోయే శ్రేష్ఠమైన వాహనం. 'షారహ్' శరీరాకృతిలో, దుస్తుల్లో కనిపించే అందం. 'తరాజఅల్ హదీస్' తల్లీ కొడుకులిద్దరూ మాట్లాడుకున్నారని అర్థం. 'వల్లాహు ఆలమ్'.

*(సహీహ్ బుఖారీలోని 'ప్రవక్తల స్థితిగతుల' ప్రకరణంలోనూ సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ ఓ విషయం గమనార్హం. ఈ హదీసులో శైశవ దశలో మాట్లాడిన పిల్లలు ముగ్గురే అని చెప్పబడింది. ఇంతకు ముందు మాంత్రికుడు - మతగురువు కథ (కందకాల వాళ్ళ కథ)లో ఈ ముగ్గురూ కాకుండానే ఇంకో చంటిపిల్లవాడు కూడా తన తల్లితో మాట్లాడాడని వచ్చింది. అసలు విషయం ఏమిటంటే, ఈ హదీసులోని ముగ్గురు పిల్లలంటే ఇస్రాయీల్ జాతికి చెందిన ముగ్గురని అర్థం. వాస్తవానికి పసితనంలో మాట్లాడిన పిల్లలు మొత్తం నలుగురు.

పై హదీసును అధ్యయనం చేస్తే ఈ క్రింది విషయాలు బోధపడతాయి.

1. నఫిల్ నమాజులకన్నా తల్లిదండ్రుల పిలుపుకే ఎక్కువ ప్రాధాన్యతనివ్వాలి. నఫిల్ నమాజు చేస్తున్నప్పుడు తల్లిదండ్రులు పిలిస్తే నమాజును వదలిపెట్టి ముందు తల్లిదండ్రుల మాట వినాలి.
2. మహానుభావుల చేత అద్భుతాలు జరగవచ్చు.
3. కొన్ని సందర్భాల్లో విశ్వాసులకు పెద్ద పెద్ద పరీక్షలు ఎదురుకావచ్చు. విశ్వాసులు అలాంటప్పుడు సహన స్థయిర్యాలతో వాటిని ఎదుర్కోవాలేగాని నిరాశా నిస్పృహలకు లోను కారాదు. దేవుడు విశ్వాసులైన దాసులకు ఏనాటికైనా తప్పకుండా సహాయం చేస్తాడు.
4. ప్రపంచంలో కలవారి అందానికి, ఆడంబరానికి దాసోహమయిపోయి వారిని అనుసరించే ప్రయత్నం చేయకూడదు. ఎల్లప్పుడూ సత్పురుషుల అడుగుజాడల్లోనే నడవాలి. సాఫల్యం ఇందులోనే ఉంది.

## 33వ అధ్యాయం

# ٣٣ - بَابُ مُلاَطَفَةِ الْيَتِيمِ وَالْبَنَاتِ وَسَائِرِ الضَّعَفَةِ وَالْمَسَاكِينِ وَالْمُنْكَسِرِينَ وَالإِحْسَانِ إِلَيْهِمْ وَالشَّفَقَةِ عَلَيْهِمْ وَالتَّوَاضُعِ مَعَهُمْ وَخَفْضِ الْجَنَاحِ لَهُمْ

# అనాధలు, బాలికలు, బలహీనులు, దీనులు, అగత్యపరుల పట్ల మృదువుగా, ఉత్తమంగా వ్యవహరించాలి. వారిమీద దయచూపాలి. వారిపట్ల వినమ్రంగా మెలగాలి

قال الله تعالى: ﴿وَٱخْفِضْ جَنَاحَكَ لِلْمُؤْمِنِينَ﴾ [الحجر: ٨٨]، وقال تعالى: ﴿وَٱصْبِرْ نَفْسَكَ مَعَ ٱلَّذِينَ يَدْعُونَ رَبَّهُم بِٱلْغَدَوٰةِ وَٱلْعَشِيِّ يُرِيدُونَ وَجْهَهُۥ وَلَا تَعْدُ عَيْنَاكَ عَنْهُمْ تُرِيدُ زِينَةَ ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا﴾ [الكهف: ٢٨]، وقال تعالى: ﴿فَأَمَّا ٱلْيَتِيمَ فَلَا تَقْهَرْ ۝ وَأَمَّا ٱلسَّآئِلَ فَلَا تَنْهَرْ﴾ [الضحى: ٩ - ١٠]، وقال تعالى: ﴿أَرَءَيْتَ ٱلَّذِى يُكَذِّبُ بِٱلدِّينِ ۝ فَذَٰلِكَ ٱلَّذِى يَدُعُّ ٱلْيَتِيمَ ۝ وَلَا يَحُضُّ عَلَىٰ طَعَامِ ٱلْمِسْكِينِ﴾ [الماعون: ١ - ٣].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"విశ్వాసుల వైపుకు మొగ్గు." (అల్ హిజ్ర్ : 88)

వేరొకచోట ఇలా సెలవిచ్చాడు:

"తమ ప్రభువు ప్రసన్నతను అర్థిస్తూ ఎవరు ఉదయం, సాయంత్రం ఆయనను వేడుకుంటారో, వారి సహచర్యం పట్ల నీ హృదయాన్ని సంతృప్తపరచుకో. వారినుండి నీ దృష్టిని ఏ మాత్రం మరల్చకు. నీవు ఇహలోకపు మెరుగులను కోరుకుంటావా?" (అల్ కహఫ్ : 28)

ఇంకొకచోట ఇలా సెలవిచ్చాడు :

"నీవు అనాధల పట్ల కఠినంగా ప్రవర్తించకు. యాచకుణ్ణి కసురుకోకు." (అల్ జుహా : 9,10)

ఆయన ఇంకా ఇలా అంటున్నాడు :

"పరలోక శిక్షను, బహుమానాన్ని తిరస్కరించే వ్యక్తిని నీవు చూశావా? అతడే అనాథలను కసరికొట్టేవాడు, పేదవాళ్ళకు అన్నం పెట్టు అని ప్రోత్సహించనివాడు." (అల్ మావూన్ : 1-3)

262. హజ్రత్ సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ కథనం : మేము ఆరుగురం (పేద వాళ్ళం) దైవప్రవక్త (సల్లం) వెంట ఉండే వాళ్ళం.(మమ్మల్ని అల్పులుగా భావించి) బహుదైవారాధకులు దైవప్రవక్త తో, "(ఓ ముహమ్మద్!) వీళ్ళను దూరంగా తొలగిపొమ్మను. వీళ్ళు మా మీదికి వస్తే మేం సహించం" అని అన్నారు. (ఆ ఆరుగురిలో) నేను, ఇబ్నె మసూద్, హుజైల్ తెగకు చెందిన ఒకతను మరియు బిలాల్, ఇంకా ఇద్దరున్నారు. వారి పేర్లు నాకు తెలియవు. (బహుదైవా రాధకుల ప్రతిపాదనపై) దైవప్రవక్త (సల్లం)కు దైవం తలచిన ఆలోచన వచ్చింది. ఆయన (ఆ ప్రతిపాదనకు అనుకూలంగా) మనసులో (మా గురించి) ఏదో అనుకున్నారు. అప్పుడు అల్లాహ్ (ఆయన్ని మందలిస్తూ) ఈ వాక్యాలను అవతరింపజేశాడు. "(ప్రవక్తా!) తమ ప్రభువు ప్రసన్నతను పొందగోరే ప్రయత్నంలో రేయింబవళ్ళూ ఆయన్ని వేడుకునేవారిని నీవు దూరంగా తొలగి పొమ్మనకు."

*(అల్ అన్ ఆమ్ : 52) (ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

٢٦٢ - وعن سعدِ بنِ أبي وَقَّاص رضي الله عنه قال: كُنَّا مَعَ النَّبِيِّ ﷺ سِتَّةَ نَفَرٍ، فقال المُشْرِكُونَ للنَّبِيِّ ﷺ: اطْرُدْ هَؤُلاءِ لا يَجْتَرِئُونَ عَلَيْنَا، وَكُنْتُ أَنَا وَابْنُ مَسْعُودٍ وَرَجُلٌ مِنْ هُذَيْلٍ وَبِلالٌ وَرَجُلانِ لَسْتُ أُسَمِّيهِمَا، فَوَقَعَ فِي نَفْسِ رسولِ اللهِ ﷺ مَا شَاءَ اللهُ أَنْ يَقَعَ فَحَدَّثَ نَفْسَهُ، فَأَنْزَلَ اللهُ تعالى: ﴿وَلَا تَطْرُدِ الَّذِينَ يَدْعُونَ رَبَّهُم بِالْغَدَاةِ وَالْعَشِيِّ يُرِيدُونَ وَجْهَهُ﴾ [الأنعام: ٥٢] رواه مسلم.

## ముఖ్యాంశాలు

దేవుని దృష్టిలో విశ్వసించి, సత్కార్యాలు చేసేవారికే విలువ ఉంటుంది. అలాంటివారు అభాగ్యులు, నిరుపేదలైనందువల్ల లోకులు వారిని నీచులుగా, అల్పులుగా భావించినా దేవుని సన్నిధిలో మాత్రం వారు గౌరవనీయులుగానే పరిగణించబడతారు. వీరికి భిన్నంగా అవిశ్వాసులు

ప్రాపంచికంగా ఎంత ఉన్నత స్థానంలో ఉన్నప్పటికీ వారి సిరిసంపదలకు, వారి భోగభాగ్యాలకు, ఇహలోకపు పెద్దరికానికి దేవుని దృష్టిలో పూచిక పుల్లంత విలువ కూడా ఉండదు. కనుక విశ్వాసులు కూడా ధర్మాన్నే ప్రమాణంగా తీసుకోవాలని ఈ హదీసు ప్రబోధిస్తోంది.

٢٦٣ ـ وعن أبي هُبَيْرَةَ عَائِذِ بن عَمْرٍو المُزَنِيِّ وَهُوَ مِنْ أَهْلِ بَيْعَةِ الرِّضْوَانِ رضي الله عنه، أنَّ أَبَا سُفْيَانَ أَتَى عَلَى سَلْمَانَ وَصُهَيْبٍ وَبِلالٍ في نَفَرٍ فَقَالُوا: مَا أَخَذَتْ سُيُوفُ اللهِ مِنْ عَدُوِّ اللهِ مَأْخَذَهَا، فقال أبو بكر رضي الله عنه: أَتَقُولُونَ هٰذَا لِشَيْخِ قُرَيْشٍ وَسَيِّدِهِمْ؟ فَأَتَى النَّبِيَّ ﷺ، فَأَخْبَرَهُ فقال: «يَا أَبَا بَكْرٍ لَعَلَّكَ أَغْضَبْتَهُمْ؟ لَئِنْ كُنْتَ أَغْضَبْتَهُمْ لَقَدْ أَغْضَبْتَ رَبَّكَ» فَأَتَاهُمْ فقال: يَا إِخْوَتَاهُ! أَغْضَبْتُكُمْ؟ قالوا: لا، يَغْفِرُ اللهُ لَكَ يَا أُخَيَّ. رواه مسلم.

263. హజ్రత్ అబూ హుబైరా ఆయిజ్ బిన్ అమ్ర్ ముజనీ (రజి) - ఈయన 'బైతుర్రిజ్వాన్'లో పాల్గొన్నారు - చేసిన కథనం : ఒకసారి హజ్రత్ సల్మాన్ (రజి), సుహైబ్ (రజి), బిలాల్ (రజి)ల దగ్గరికి అబూ సుఫ్యాన్ వచ్చారు. అక్కడే ఇంకొంతమంది ముస్లింలు కూడా ఉన్నారు. (అబూ సుఫ్యాన్ అప్పటికింకా ఇస్లాం స్వీకరించలేదు.) అక్కడున్న ముస్లింలు (అబూ సుఫ్యాన్‌ను చూసి) దైవవిరోధిపై దేవుని ఖడ్గాలవేటు సరిగ్గా పడలేదు" అని వెటకారంగా మాట్లాడారు. (ఈ మాటపై అబూబక్ర్ (రజి)కు రోషమొచ్చింది). మీరు ఖురైష్ తెగ పెద్దాయన్ని, నాయకుణ్ణి పట్టుకొని అంతమాట అంటారా?" అని అన్నారు. తరువాత దైవప్రవక్త (సల్లం) వద్దకు వెళ్ళి, వాళ్ళు అబూసుఫ్యాన్‌కు ఇంతమాట అన్నారని చెప్పారు. అది విని ఆయన (స), "అబూబక్ర్! మీరు వారి భావాలను గాయపరచారేమో ననిపిస్తుంది. ఒకవేళ (మీ మాటవల్ల) నిజంగానే ఆ ముస్లింల మనసు నొచ్చుకొని ఉంటే మీరు మీ ప్రభువును అప్రసన్నుణ్ణి చేశారు!" అని అన్నారు. దైవప్రవక్త జవాబు విని అబూబక్ర్ (రజి) వెంటనే (పశ్చాత్తాప పడుతూ) ఆ (నిరుపేద) ముస్లింల వద్దకు వెళ్ళి, "సోదరులారా! నేను

قولُهُ: «مَأْخَذَهَا» أيْ: لَمْ تَسْتَوفِ حَقَّهَا مِنْهُ. وقولُهُ: «يَا أُخَيَّ»: رُوِيَ بفتحِ الهمزةِ وكسر الخاءِ وتخفيفِ الياءِ، وَرُوِيَ بضمِ الهمزةِ وفتحِ الخاءِ وتشديدِ الياءِ.

మిమ్మల్ని కష్టపెట్టానా?" (నా మాటకు మీ మనసు నొచ్చుకుందా?)" అని అడిగారు. దానికి వారు, "లేదు భాయీ! దేవుడు మిమ్మల్ని క్షమిస్తాడు (జరిగి పోయిన దానికి బాధపడకండి)" అని అన్నారు. (ముస్లిం)

'మాఖజహా' అంటే దాన్నుండి తన హక్కును పూర్తిగా పొందలేదని అర్థం. ఈ హదీసులో 'యాఅఖీ' అన్న పదం 'యాఉఖై' అని కూడా ఉచ్చరించ బడింది.

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ముస్లిందరూ పరస్పరం ప్రేమానురాగాలతో కలిసిమెలిసి ఉండాలని ప్రబోధిస్తోంది. తోటి ముస్లింల గురించి ఎల్లప్పుడూ సదభిప్రాయాన్ని కలిగి ఉండాలి. ఎప్పుడైనా ప్రయత్నంగానో అప్రయత్నంగానో అన్నమాటల వల్ల తోటి ముస్లింకు బాధకలిగితే వెంటనే పశ్చాత్తాపంతో అతనికి క్షమాపణలు చెప్పుకోవాలి. ధనికులనీ, పేదవారనీ, కులీనులనీ, కులహీనులనీ ఎలాంటి తారతమ్యాలు లేవు. ఇస్లాం దృష్టిలో అందరూ సమానులేనన్న విషయాన్ని గ్రహించాలి.

٢٦٤ ـ وعن سهل بن سعد رضي الله عنه قال: قال رسول الله ﷺ: «أَنَا وَكَافِلُ الْيَتِيمِ في الجَنَّةِ هٰكَذَا» وَأَشَارَ بِالسَّبَّابَةِ وَالْوُسْطَى، وَفَرَّجَ بَيْنَهُمَا. رواه البخاري.

264. హజ్రత్ సహ్ల్ బిన్ సాద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : నేను మరియు అనాథల పోషకుడు స్వర్గంలో ఇలా ఉంటాం. ('ఇలా' అన్నప్పుడు) ఆయన తన చూపుడు వ్రేలు మరియు మధ్య వ్రేలిని కలపకుండా కొంతసందు ఉంచి చూపించారు. (అంటే స్వర్గంలో ఇద్దరూ ఒకేచోట ఉంటారు కాని స్థానాల్లో మాత్రం తారతమ్యం ఉంటుంది.) (బుఖారీ)

وَ«كَـافِـلُ الْيَتِيـمِ»: الْقَـائِـمُ بِأُمُورِهِ.

'కాఫిలుల్ యతీమ్' అంటే అనాథుడి వ్యవహారాల్ని చక్కబెట్టేవాడు. అతని బాగోగుల్ని పట్టించుకునేవాడని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని విడాకుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

స్వర్గంలో దైవప్రవక్త (సల్లం) సమీపంలో, ఆయన సహచర్యంలో చోటు లభించటం గొప్ప అదృష్టం. అనాథల పట్ల ఉత్తమంగా వ్యవహరించేవారు, వారి మంచిచెడ్డలు చూసేవారికి ఆ అదృష్టం లభిస్తుంది. అందుకే దైవప్రవక్త (సల్లం) అనాథల పట్ల మంచిగా వ్యవహరించే వారి ఇల్లు ఉత్తమ ఇల్లనీ, అనాథల్ని కష్టపెట్టేవారిల్లు అతి నీచమైన ఇల్లని అన్నారు.

٢٦٥ ـ وعن أبي هريرة رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «كَافِلُ الْيَتِيمِ لَهُ أَوْ لِغَيْرِهِ أَنَا وَهُو كَهَاتَيْنِ فِي الْجَنَّةِ» وَأَشَارَ الرَّاوِي وَهُو مَالِكُ بْنُ أَنَسٍ بِالسَّبَّابَةِ وَالْوُسْطَى. رواه مسلم.

265. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : అనాథుల పోషకుడు అనాథకు బంధువైనా, కాకపోయినా (సరే) నేను మరియు అతను స్వర్గంలో ఈ రెండు వ్రేళ్ళ మాదిరిగా (కలసి) ఉంటాం."

హదీసు ఉల్లేఖకులు మాలిక్ బిన్ అనస్ చూపుడువ్రేలు మరియు మధ్య వ్రేలితో సైగ చేసి చూపించారు. (ముస్లిం)

وقـولـه ﷺ:

«الْيَتِيم لَهُ أَوْ لِغَيْرِهِ» مَعْنَاهُ: قَرِيبُهُ، أَو الأَجْنَبِيُّ مِنْهُ، فَالْقَرِيبُ مِثْلُ أَنْ تَكْفُلَهُ أُمُّهُ أَوْ جَدُّهُ أَوْ أَخُوهُ أَوْ غَيْرُهُمْ مِنْ قَرَابَتِهِ، وَاللهُ أَعْلَمُ.

'అల్ యతీము లహూ అవ్ లిగైరిహీ' అంటే అనాథుడు పోషకుడికి సన్నిహిత బంధువయినా కానివాడయినాసరే అని అర్థం. ఆ అనాథని అతని తల్లిగాని, తాత గాని, సోదరుడుగాని లేక ఇతర బంధు వులు గాని పోషిస్తే వీళ్ళు సన్నిహితులన బడతారు. (వల్లాహు ఆలమ్)

*(సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సామూహిక అనాథపరిపోషక కార్యాకలాపాలు కేవలం బంధుమిత్రుల అనాథపిల్లలకే

పరిమితం కావు. సమాజంలోని ప్రతి అనాథకు, అవసరాల్లో ఉన్న ప్రతి వ్యక్తికీ ఇవి తమ సేవలనందజేస్తాయి. ముస్లింలు సామూహిక అనాథపరిపోషక వ్యవస్థను స్థాపించుకుంటే వారిలో ఎవరికీ భీమా చేయించుకోవాల్సిన అవసరం ఉండదు. భీమా అనేది వడ్డీ వ్యాపారంలోని ఒక రకం. నిరుపేదల నడ్డివిరిచే ఈ వడ్డీ వ్యాపార విధానాలను ఇస్లాం రూపుమాపాలని ఆదేశిస్తోంది. కనుక ముస్లింలు తమ ధర్మం బోధించే సమున్నత ఆర్థిక విధానాలను అమలుపరచుకుంటే ఇలాంటి అడ్డదారులు తొక్కాల్సిన అవసరం ఉండదు.

٢٦٦ ـ وعنه قال: قال رسولُ اللهِ ﷺ: «لَيسَ المِسْكِينُ الَّذي تَرُدُّهُ التَّمْرَةُ وَالتَّمْرَتَانِ، وَلا اللُّقْمَةُ وَاللُّقْمَتَانِ، إنَّمَا المِسْكِينُ الَّذِي يَتَعَفَّفُ» متفق عليه.

266. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : (ఇంటింటా తిరిగి) ఒకటి రెండు ఖర్జూరపు పండ్లు లేదా ఒకటి రెండు ముద్దలు అడుక్కునే వాడు నిరుపేద కాదు. (పేదరికంతో బాధపడుతున్నప్పటికీ) ముష్టెత్తకుండా (ఆత్మాభిమానంతో) బ్రతికేవాడే సిసలైన నిరుపేద. *(బుఖారీ - ముస్లిం)*

وفي رواية في «الصحيحين»: «لَيسَ المِسْكِينُ الَّذي يَطُوفُ عَلَى النَّاسِ تَرُدُّهُ اللُّقْمَةُ وَاللُّقْمَتَانِ، وَالتَّمْرَةُ وَالتَّمْرَتَانِ، وَلٰكِنَّ المِسْكِينَ الَّذي لا يَجِدُ غِنًى يُغْنِيهِ، وَلا يُفْطَنُ بِهِ فَيُتَصَدَّقَ عَلَيْهِ، وَلا يَقُومُ فَيَسْأَلَ النَّاسَ».

బుఖారీ - ముస్లింలో వేరొక ఉల్లేఖనంలోని వాక్యాలు ఈ విధంగా ఉన్నాయి: ప్రజల దగ్గర ఒకటి రెండు ముద్దలు లేదా ఒకటి రెండు ఖర్జూర పండ్లు అడుక్కుంటూ తిరిగేవాడు నిరుపేద కాదు. సిసలైన నిరుపేద ఎవరంటే, అతని దగ్గర ఇతరుల్ని యాచించకుండా ఉండేందుకు తగిన ఆర్థిక స్తోమత ఉండదు. మరోవైపు ప్రజలు అతనికి దానం చేయాలన్నా అతను వారికి పేదవాడిగానూ కనిపించడు. (తాను ఎంత పేదరికంతో బాధపడుతున్నప్పటికీ) ఇతరుల ముందు చేయి చాపటానికి అతను సిద్ధపడడు.

*(బుఖారీ - ముస్లింలలోని జకాత్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

సాధారణంగా వీధుల వెంట తిరుగుతూ భిక్షాటనం చేసేవారు నిరుపేదలై ఉండరు. వాళ్ళు పైసాపైసా జమచేసుకొని దాచిపెట్టుకుంటూ ఉంటారు. కాని కొంతమంది తాము ఎంత పేదరికంతో కునారిల్లుతున్నప్పటికీ తొడుక్కున్న దుస్తులవల్లగాని, బాహ్య అవతారం వల్లగాని తమ పేదరికాన్ని బయటపెట్టుకోరు. వారి ఆత్మాభిమానం వారిని ముష్టెత్తనీయదు. వాస్తవానికి నిరుపేదలు, దానధర్మాలు పుచ్చుకోవటానికి అర్హులు వీరే. కనుక దానధర్మాలు చేసినప్పుడు ఇలాంటి సిసలైన నిరుపేదల్ని వెతికి వారికే దానం చేయాలి. భిక్షాటనను వృత్తిగా చేసుకున్నవారికి దానాలు చేస్తే వారిని భిక్షాటనపై ప్రోత్సహించినట్లవుతుంది. ఇస్లాం భిక్షాటనను గర్హిస్తుంది.

٢٦٧ ـ وعنه، عن النَّبِيِّ ﷺ: «السَّاعِي عَلَى الأَرْمَلَةِ وَالمِسْكِينِ كَالمُجَاهِدِ فِي سَبِيلِ اللهِ» وَأَحْسَبُهُ قال: «وَكَالقَائِمِ الَّذِي لا يَفْتُرُ، وَكَالصَّائِمِ الَّذِي لا يُفْطِرُ» متفقٌ عليه.

267. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : వితంతువులు, నిరుపేదల బాగుకోసం కృషిచేసేవాడు దైవమార్గంలో పోరాడే యోధుడితో సమానం. (హదీసు ఉల్లేఖకులు ఇలా అంటున్నారు:) అతడు అలుపెరగకుండా దైవారాధన చేసేవాడితో, నిరంతరంగా ఉపవాసాలు పాటించేవాడితో సమానమని కూడా దైవప్రవక్త (సల్లం) అన్నారని నా అనుమానం.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వ్యయాల ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ వితంతువుల్ని, నిరుపేదల్ని కేవలం మచ్చుకు మాత్రమే ప్రస్తావించటం జరిగింది. వాస్తవానికి సమాజంలోని ఇతర అభాగ్యజీవులు, నిరాశ్రయులు, నిరాధారజీవులందరి పోషణ, సంరక్షణ కోసం చేసే కృషి దైవమార్గంలో చేయబడే పోరాటంతో సమానంగా పరిగణించబడుతుంది. దీనిద్వారా ఇస్లాంలో సంక్షేమ కార్యకలాపాలకు ఎంతటి ప్రాముఖ్యత ఉందో తెలుస్తోంది. దురదృష్టవశాత్తూ నేడు ముస్లింలు వీటిని విస్మరిస్తూ పోతున్నారుగాని ఇస్లాం ధర్మం సంక్షేమరాజ్య రూపురేఖల్ని సైద్ధాంతికంగా వివరించి, క్రియాత్మకంగా ఏనాడో దానిని స్థాపించి చూపించింది. ఈ హదీసు బోధించే ఇంకో విషయం ఏమిటంటే కేవలం నమాజ్, రోజాలు పాటించటమే

ఆరాధన కాదు. బలహీనులకు సహాయపడటం, వితంతువులు, నిరుపేదల్ని ఆదుకోవటంలాంటి పనులన్నీ కూడా ఆరాధనల క్రిందికే వస్తాయి.

٢٦٨ ـ وعنه، عن النَّبيِّ ﷺ قال: «شَرُّ الطَّعَام طَعَامُ الوَلِيمَةِ، يُمْنَعُهَا مَنْ يَأْتِيهَا، وَيُدْعَى إِلَيْهَا مَنْ يَأْبَاهَا، وَمَنْ لَمْ يُجِبِ الدَّعْوَةَ فَقَدْ عَصَى اللهَ وَرَسُولَهُ» رواه مسلم.

268. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: (అగత్యపరులు) వస్తుంటే వద్దని, రానివారి కోసం వెంపర్లాడే వలీమా విందు అత్యంత నీచమైనది. (వలీమా విందు) ఆహ్వానాన్ని అంగీకరించనివాడు దైవానికి, దైవ ప్రవక్తకు అవిధేయుడయ్యాడు.

*(ముస్లిం)*

وفي رواية في الصحيحين، عن أبي هريرةَ من قوله: «بِئْسَ الطَّعَامُ طَعَامُ الوَلِيمَةِ يُدْعَى إِلَيْهَا الأَغْنِيَاءُ وَيُتْرَكُ الفُقَرَاءُ».

బుఖారీ - ముస్లింలలోని అబూ హురైరా (రజి) గారి వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: పేదవారిని పిలవకుండా (కేవలం) ధనికులు మాత్రమే ఆహ్వానించబడే వలీమా విందు అత్యంత నీచమైనది.

*(బుఖారీ - ముస్లింలలోని నికాహ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ధనవంతులు తమ హోదాను, గొప్పతనాన్ని చాటేవిధంగా అత్యంత ఆడంబరంగా వలీమా విందు భోజనాలు ఏర్పాటు చేస్తుంటారు. ఈ పోకడ ఎన్నో ధార్మిక, నైతిక, సామాజిక రుగ్మతలకు దారితీస్తోంది. ఆడంబరంతో చేసే ఇలాంటి వలీమా విందుల్లో ప్రజలు దుబారాగా డబ్బు ఖర్చు చేస్తుంటారు. ఒక రకంగా ఇది షైతాన్ చేష్ట. దివ్య ఖుర్ఆన్‌లో దుబారాగా డబ్బు ఖర్చు చేసేవారు షైతాన్ సోదరులని చెప్పబడింది. నేడు మన సమాజంలో ఈ రుగ్మత దిన దిన ప్రవర్ధమానమవుతోంది. దీనివల్ల నైతికంగా కలిగే నష్టాలేమిటంటే, మనిషి ఇలాంటి విందులకు తన హోదాకు తగినవారు మాత్రమే రావాలని తాపత్రయపడుతాడు. వారు నిరాకరించినా తప్పకుండా హాజరు కావాల్సిందేనని వారిని ప్రాధేయపడతాడు.

దీనికి భిన్నంగా సమాజంలోని నిరుపేదల్ని, అభాగ్యజీవుల్ని ఆహ్వానించకుండా విస్మరిస్తాడు. వారు తన విందుకు హాజరయితే అది తన కీర్తికే కళంకంగా భావిస్తాడు. వాస్తవానికి ఆ విందుకు హక్కుదారులు ఆకలిగొన్నవారు, అగత్యపరులు, నిరుపేదలే. అలాంటప్పుడు

వారిని విస్మరించి ధనవంతుల్ని మాత్రమే ఆహ్వానించటం నైతికంగా ఎంతో దిగజారిన పని అనిపించుకుంటుంది. దీనివల్ల కలిగే ఇంకో దుష్పరిణామం ఏమిటంటే, ధనవంతులు చేసే ఘనమైన విందు ఏర్పాట్లని చూసి పేదవారు చిన్నబుచ్చుకుంటారు. తమ దగ్గర అంత స్తోమత లేకపోయినందుకు వారి మనసు చివుక్కుమంటుంది. ఈ విధంగా ఒక ముస్లింని మానసికంగా కష్టపెట్టడం కూడా పాపమే. ఇస్లాం ధర్మం అగత్యపరుల్ని ఆదుకోవాలని, వారి మనసును సంతుష్టపరచాలని, సమాజంలోని నిరుపేదల పట్ల ఉత్తమంగా వ్యవహరించాలని ఆదేశిస్తోంది.

ముస్లింలు వలీమా విందుల్లోగాని, మరే ఇతర విందుల్లోగాని రకరకాల వంటకాలు, ఘనమైన ఏర్పాట్లకు బదులు ఒకటి రెండు రకాల వంటకాలతో సరిపెట్టుకొని బంధు మిత్రులతోపాటు నిరుపేదలు, అభాగ్యుల్ని కూడా ఆహ్వానిస్తే పైన చెప్పబడిన మూడు రుగ్మతలూ ఉండవు. తద్వారా సమాజంలో అనతి కాలంలోనే మంచిమార్పులు కనిపిస్తాయి. పరలోకంలో కూడా దైవశిక్ష తప్పుతుంది.

ఇంకో విషయం ఏమిటంటే ఈ హదీసులో వలీమా విందు ఆహ్వానాన్ని అంగీకరించాలని తాకీదు చేయబడింది. అంటే ఇస్లామీయ బోధనలకు కట్టుబడి ఏర్పాటు చేయబడే వలీమా విందులకు తప్పకుండా వెళ్ళాలని భావం. ఇస్లామీయ నైతిక సూత్రాల్ని తుంగలో తొక్కేవారి విందులకు వెళ్ళకుండా ఉండటమే మంచిది. పైగా వాటిని బహిష్కరించాలి. దానివల్ల కనీసం ఆ పాపంలోనయినా పాలు పంచుకోకుండా మనల్ని మనం కాపాడుకోవచ్చు.

٢٦٩ ـ وعن أنسٍ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «مَنْ عَالَ جَارِيَتَيْنِ حَتَّى تَبْلُغَا جَاءَ يَوْمَ القِيَامَةِ أَنَا وَهُوَ كَهَاتَيْنِ» وَضَمَّ أَصَابِعَهُ. رواه مسلم. «جَارِيَتَيْنِ» أيْ: بِنْتَيْنِ.

269. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం)ఇలా ప్రవచించారు : ఇద్దరు కూతుళ్ళను వారికి యుక్త వయస్సు వచ్చే వరకూ పోషించినవాడు ప్రళయదినాన వస్తాడు. అప్పుడు నేను మరియు అతను ఇద్దరం ఈ రెండు వ్రేళ్ళ మాదిరిగా ఉంటాం.

ఆ మాట అన్నప్పుడు ఆయన తన చేతివ్రేళ్ళను కలిపి చూపించారు.

*(ముస్లిం)*

'జారియతైని' అంటే ఇద్దరు కూతుళ్ళు అని అర్థం.

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

అజ్ఞానకాలంలో స్త్రీ పుట్టుకను అవమానకరంగా భావించేవాళ్ళు. తండ్రి తనకు ఆడపిల్ల

పుట్టిందనే వార్త తెలియగానే ముఖం చాటేసేవాడు. లోలోన కుమిలిపోయేవాడు. లోకులకు ముఖం చూపించలేక నక్కి నక్కి తిరిగేవాడు. కొంతమంది కసాయి గుండెల తండ్రులైతే ఆ అవమానాన్ని భరించలేక కన్న కూతుళ్ళను సజీవంగా మట్టిలో పాతిపెట్టడానిక్కూడా వెనుకాడేవారు కాదు. అలాంటి కాలంలో ఇస్లాం అతివలకున్న విలువ ఏమిటో ప్రపంచానికి చాటి చెప్పింది. ఆడపిల్లల్ని కని పెంచి పెద్దచేసిన తల్లిదండ్రులకు స్వర్గసుఖాల శుభవార్తను అందజేసింది. కేవలం పుత్ర సంతానంపైనే కాదు పుత్రికల సంతానంపై కూడా సంబరాలు జరుపుకునేలా ప్రజల మనోమస్తిష్కాల్లో విప్లవం తీసుకువచ్చింది. మహిళల హక్కుల్ని పరిరక్షించటమేగాకుండా వారికి సమాజంలో గౌరవప్రదమైన స్థానాన్నిచ్చింది. వారి మానమర్యాదలను కాపాడటం కోసం కట్టుదిట్టమైన చర్యలు తీసుకుంది. పరదా పద్ధతిని పాటించి స్త్రీలు సౌశీల్యవంతమైన జీవితాన్ని గడపవచ్చని బోధించింది. స్త్రీ బలహీనతల దృష్ట్యా బయట పనిచేసి కుటుంబాన్ని పోషించే బాధ్యత ఆమెపై లేకుండా చేసింది. పురుషులతోపాటు స్త్రీలు కూడా కలిసి పనిచేయటం వల్ల జరిగే అనర్థాలేమిటో ఎవరికీ తెలియనివి కావు. కాని శోచనీయమైన విషయం ఏమిటంటే నేడు మన సమాజాల్లో స్వేచ్ఛ పేరిట స్త్రీలను బజారుకు లాగి వారి మానమర్యాదలను కాలరాస్తున్నారు. స్త్రీని వ్యాపార వస్తువుగా మారుస్తున్నారు. మరోవైపు స్త్రీలు కూడా అమాయకంగా మోసపోయి దీని వలలో చిక్కుకుపోతున్నారు. నిజం చెప్పాలంటే ఇస్లాం ధర్మమే ప్రప్రథమంగా స్త్రీలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ప్రసాదించింది. పురుషులతోపాటు న్యాయబద్ధంగా సమానహక్కుల్ని ప్రసాదించింది.

٢٧٠ - وعن عائشةَ رضي الله عنها قالت: دَخَلَتْ عَلَيَّ امْرَأَةٌ وَمَعَهَا ابْنَتَانِ لَهَا تَسْأَلُ، فَلَمْ تَجِدْ عِنْدِي شَيْئاً غَيْرَ تَمْرَةٍ وَاحِدَةٍ، فَأَعْطَيْتُهَا إِيَّاهَا فَقَسَمَتْهَا بَيْنَ ابْنَتَيْهَا وَلَمْ تَأْكُلْ مِنْهَا، ثُمَّ قَامَتْ فَخَرَجَتْ، فَدَخَلَ النَّبِيُّ ﷺ عَلَيْنَا، فَأَخْبَرْتُهُ فقال: «مَنِ ابْتُلِيَ مِنْ هٰذِهِ الْبَنَاتِ بِشَيْءٍ فَأَحْسَنَ إِلَيْهِنَّ كُنَّ لَهُ سِتْراً مِنَ النَّارِ» متفقٌ عليه.

270. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : ఒక స్త్రీ తన ఇద్దరు కూతుళ్ళను వెంటబెట్టుకొని నా దగ్గరికొచ్చి ఏమైనా దానం చేయమని అడిగింది. అప్పుడు నా దగ్గర ఆమెకివ్వటానికి ఒక ఖర్జూర పండు తప్ప మరేమీ లేదు. నేను ఆ ఒక్క ఖర్జూర పండునూ ఆమెకిచ్చేశాను. ఆ స్త్రీ నేనిచ్చిన ఖర్జూరపండును తన ఇద్దరు కూతుళ్ళకు పంచి ఇచ్చింది. తాను మాత్రం తినలేదు. కొంత సేపటికి ఆమె లేచి వెళ్ళిపోయింది. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) మా దగ్గరికి వచ్చి నప్పుడు నేనీ విషయాన్ని ఆయనకు తెలియజేయగా, దానికి ఆయన "ఈ ఆడపిల్లల వల్ల ఎవరైనా పరీక్షలకు

గుర్రైనప్పటికీ (సహనం వహిస్తూ) వారి పట్ల ఉత్తమంగా వ్యవహరించిన వ్యక్తి పాలిట ప్రళయదినాన ఆ ఆడ పిల్లలే నరకాగ్నికి అడ్డుగా నిలుస్తారు" అని అన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణంలోనూ, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణంలోనూ ఈ హదీసు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు కూడా ఆడపిల్లల పట్ల సద్వర్తన అవసరాన్ని నొక్కి వక్కాణిస్తోంది. ఇహలోకంలో కుమార్తెల పట్ల ఉత్తమంగా వ్యవహరిస్తే పరలోకంలో ఆ కుమార్తెలే తమ తల్లిదండ్రుల్ని నరకాగ్ని బారినుండి రక్షిస్తారని చెబుతోంది. కనుక ఆడ పిల్లల్ని ఈసడించుకోవటం, వారిని భారంగా భావించటం తగదు. ఒక ముస్లింకైతే ఇది అస్సలు శోభించదు.

٢٧١ ـ وعن عائشة رضي الله عنها قالت: جَاءَتْنِي مِسْكِينَةٌ تَحْمِلُ ابْنَتَيْنِ لَهَا، فَأَطْعَمْتُهَا ثَلاثَ تَمَرَاتٍ، فَأَعْطَتْ كُلَّ وَاحِدَةٍ مِنْهُمَا تَمْرَةً وَرَفَعَتْ إِلَى فِيهَا تَمْرَةً لِتَأْكُلَهَا، فَاسْتَطْعَمَتْهَا ابْنَتَاهَا، فَشَقَّتِ التَّمْرَةَ الَّتِي كَانَتْ تُرِيدُ أَنْ تَأْكُلَهَا بَيْنَهُمَا، فَأَعْجَبَنِي شَأْنُهَا فَذَكَرْتُ الَّذِي صَنَعَتْ لِرسولِ اللهِ ﷺ فقال: «إِنَّ اللهَ قَدْ أَوْجَبَ لَهَا بِهَا الجَنَّةَ، أَوْ أَعْتَقَهَا بِهَا مِنَ النَّارِ» رواه مسلم.

271. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : నా దగ్గరికి ఓ అభాగ్యురాలు తన ఇద్దరు కూతుళ్ళను ఎత్తుకొని వచ్చింది. నేనామెకు తినడానికి మూడు ఖర్జూరపండ్లు ఇచ్చాను. ఆమె వాటిలో రెండు ఖర్జూర పండ్లు ఇద్దరు కూతుళ్ళకు తలా ఒకటి ఇచ్చి మిగిలిన ఒక ఖర్జూరపండును తన నోట్లో వేసుకోబోయింది. (ఆ ఇద్దరు పిల్లలు ఆకలితో ఉన్నారు కాబోలు!) అది కూడా ఇచ్చేయమని అడిగారు. వెంటనే ఆమె తాను తినదలచుకున్న ఆ ఖర్జూరాన్ని రెండు ముక్కలు చేసి కూతుళ్ళిద్దరికీ చెరోముక్క ఇచ్చేసింది. అది చూసి నాకు చాలా సంతోషం కలిగింది. నేనీ విషయాన్ని దైవప్రవక్త (సల్లం)కు తెలియజేశాను. దానిపై ఆయన వ్యాఖ్యానిస్తూ, "దేవుడు ఆమె చేసిన పనికి మెచ్చుకొని ఆమెకోసం స్వర్గం తప్పనిసరి చేశాడు.

(లేదా ఆయన) దేవుడు ఆమెకు నరకాగ్ని నుండి విముక్తినొసగాడు" అని అన్నారు.

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు కూడా ఆడపిల్లల పోషణ, సంరక్షణల ఘనతను గురించి వివరిస్తోంది. దీనిద్వారా బోధపడుతున్న ఇంకో విషయం ఏమిటంటే, స్త్రీకి తన భర్త అనుమతిస్తాడన్న గట్టి నమ్మకముంటే ఆమె తన భర్త సంపాదనలో నుండి దానధర్మాలు కూడా చేయవచ్చు. దానివల్ల దంపతులిద్దరికీ పుణ్యం లభిస్తుంది. దానం చేసినందుకు భార్య, దానికి సంతోషంగా అనుమతి నిచ్చినందుకు భర్త - ఇద్దరూ ఆ పుణ్యంలో సమాన భాగస్వాములుగా పరిగణించబడతారు.

٢٧٢ - وعن أبي شُرَيْحٍ خُوَيْلِدِ بْنِ عَمْرٍو الخُزَاعِيِّ رضي الله عنه قال: قال النبيُّ ﷺ: «اللَّهُمَّ إِنِّي أُحَرِّجُ حَقَّ الضَّعِيفَيْنِ الْيَتِيمِ وَالمَرْأَةِ» حديث حسن رواه النسائي بإسنادٍ جيدٍ.

272. హజ్రత్ అబూ షురైహ్ ఖువైలిద్ బిన్ అమ్ర్ ఖుజాయి (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అనేవారు :

దేవా! ఇద్దరు అబలల హక్కుల విషయమై నేను ప్రజల్ని పదే పదే భయపెడుతున్నాను. (ఆ ఇద్దరు ఎవరంటే), అనాథ మరియు స్త్రీ. (ఈ హదీసు 'హసన్' కోవకు చెందినది. దీనిని నసాయి మంచి ఆధారాలతో వెలికి తీశారు).

ومعنى «أُحَرِّجُ»: أُلْحِقُ الحَرَجَ، وَهُوَ الإِثْمُ بِمَنْ ضَيَّعَ حَقَّهُمَا، وَأُحَذِّرُ مِنْ ذلكَ تَحْذِيراً بَلِيغاً، وَأَزْجُرُ عَنْهُ زَجْراً أَكِيداً.

'ఉహర్రిజు' అంటే వారిద్దరి హక్కుల్ని కాలరాసేవాడ్ని నేను పాపాత్ముడిగా భావిస్తున్నాను. (వారి హక్కులను నెరవేర్చటంలో నిర్లక్ష్యం వహించకండని) నేను పదే పదే భయపెడ్తున్నాను. (ఆ పాపానికి పాల్పడేవారిని) కఠినంగా వారిస్తున్నానని అర్థం.

(ముస్నదె అహ్మద్, ఇబ్నె మాజాలలో కూడా ఈ హదీసు ఉంది.)

## ముఖ్యాంశాలు

సమాజంలో బలవంతులు బలహీనులపై దౌర్జన్యాలకు పాల్పడటమనేది సాధారణంగా జరుగుతూ ఉంటుంది. ముఖ్యంగా ఈ దౌర్జన్యాలకు గురయ్యేది అబలలైన స్త్రీలు, అనాథలే. ప్రజలు స్త్రీల కోసం, అనాథల కోసం షరీఅత్ కేటాయించిన హక్కులు వారికి దక్కకుండా చేస్తుంటారు. ఒకవైపు వారి హక్కుల్ని కాలరాయటంతోపాటు మరోవైపు వారిని రకరకాలుగా వేధించటం, చిత్రహింసలకు గురిచేయటం చేస్తుంటారు. దైవప్రవక్త (స) ఇలాంటి దౌర్జన్య పరులకు పరలోకంలో వినాశం తప్పదని హెచ్చరించారు. బలవంతులు బలహీనుల హక్కుల్ని దోచుకుతినడాన్ని ఖండించారు.

కాని శోచనీయమైన విషయం ఏమిటంటే సత్యధర్మ ధ్వజవాహకులైన ముస్లింలు సైతం తమ ధర్మాదేశాల అమలుకు స్వస్తి పలికారు. మంచికి మారుపేరు కావాల్సిన ముస్లిం సమాజాల్లోనే ఇలాంటి రుగ్మతలు చోటుచేసుకుంటున్నాయి. బలవంతులు బలహీన వర్గాలపై దౌర్జన్యాలకు ఒడిగడుతున్నారు. పురుషులు స్త్రీలను నానా యాతనలకు గురిచేస్తున్నారు. ఫలితంగా నేడు ప్రపంచంలో ఇస్లాం అపఖ్యాతి పాలౌతోంది. ఇస్లాంలో మహిళల హక్కులకు రక్షణ లేదన్న అపవాదు మొదలయ్యింది. ఇస్లాం విరోధులు రకరకాల అనుమానాలు సృష్టించి దీనికి ఆజ్యం పోస్తున్నారు. కాని వాస్తవానికి ఇస్లాం ధర్మం పురుషులతోపాటు స్త్రీలకు కూడా సమాన హక్కుల్ని, సముచితమైన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను ప్రసాదించింది. నేటి ముస్లింలు వాటిని విస్మరిస్తున్నారంటే ఆ దోషం ఇస్లాంది కాదు. దానికి ఇస్లాంను ఆడిపోసుకోవటం సమంజసం కూడా కాదు.

నేడు ముస్లింలు ఆత్మపరిశీలన చేసుకోవాలి. తమ నడవడిక ద్వారా గాని, తాము అనుసరిస్తున్న విధానాల ద్వారాగాని ఇస్లాంధర్మం అపఖ్యాతి పాలు గాకుండా విజ్ఞతతో వ్యవహరించాలి. ఇస్లాం బోధించే అభ్యుదయ సుమగంధాల్ని లోకానికి తెలియజేయాలి. లేకపోతే తాము స్వయంగా దౌర్జన్యాలకు పాల్పడుతున్నందుకు, ఇంకా తమ ధర్మం గురించి తప్పుడు ప్రచారం చేస్తున్నందుకు వారు రెండింతల పాపాన్ని మోయవలసి ఉంటుంది.

273. హజ్రత్ ముస్అబ్ బిన్ సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ (రజి) కథనం ప్రకారం (ఆయన తండ్రి) అయిన సాద్ గారికి తాను తన క్రిందివారికన్నా గొప్పవాణ్ణని పించింది. (ఈ విషయం తెలుసుకొని) దైవప్రవక్త "ఈ బలహీనుల చలువతోనే మీకు (దైవం తరఫునుంచి) సహాయం లభిస్తుందని, ఉపాధి దొరుకుతుందని గ్రహించండి" అని అన్నారు.

٢٧٣ ـ وعن مُصْعَبِ بنِ سعدِ بن أبي وَقَّاص رضي الله عنهما قال: رَأَى سَعْدٌ أَنَّ لَهُ فَضْلاً عَلَى مَنْ دُونَهُ، فقال النَّبيُّ ﷺ: «هَلْ تُنْصَرُونَ وَتُرْزَقُونَ إِلَّا بِضُعَفَائِكُمْ» رواه البخاري هكذا مُرْسَلاً، فَإِنَّ مُصْعَبَ بْنَ سَعْدٍ تَابِعِيٌّ، ورواه الحافظ أبو بكر البَرْقَانِي في صحيحِهِ مُتَّصِلاً عن مُصْعَب عن أبيه رضي الله عنه.

ఈ హదీసును ఇమామ్ బుఖారీ (రహ్మాలై) ఇలాగే 'ముర్సల్'గా (అంటే సహాబీ పేరును ప్రస్తావించకుండా) నకలు చేశారు. ఎందుకంటే పైన పేర్కొనబడిన హదీసు ఉల్లేఖకులు ముస్అబ్ బిన్ సాద్ ఒకానొక తాబయీ మాత్రమే. హాఫిజ్ అబూబక్ర్ బుర్ఖానీ (రహ్మాలై) తన ప్రామాణిక గ్రంథంలో ఈ హదీసును 'ముత్తసిల్'గా (అంటే సహాబీ పేరుతోసహా) నకలు చేశారు. అంటే ముస్అబ్ తన తండ్రి నుంచి ఉల్లేఖించారన్నమాట. (ఆయన తండ్రి సాద్ (రజి) దైవప్రవక్త (స) సహచరుడన్న విషయం గమనార్హం).

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

స్థితిమంతులు తమల్ని తాము గొప్పవారిగానూ, తమకన్నా తక్కువ స్థాయిలో వున్నవారిని అల్పులుగానూ భావించకూడదు. పైగా బలహీనుల్ని, నిస్సహాయుల్ని గౌరవించాలి. వారు కష్టాల్లో ఉంటే ఆదుకోవాలి. బహుశా మీపై ఆధారపడి బతుకుతున్న వారిమీద కనికరంతోనే దేవుడు మీ సిరిసంపదల్లో వృద్ధిని ప్రసాదిస్తున్నాడేమో! అలాంటప్పుడు మీరు మిడిసిపడటం దేనికి?!

٢٧٤ ـ وعن أبي الدَّرْدَاءِ عُوَيْمِرٍ رضي الله عنه قال: سمِعْتُ رسولَ الله ﷺ يقول: «ابْغُونِي الضُّعَفَاءَ، فَإِنَّمَا تُنْصَرُونَ، وَتُرْزَقُونَ بِضُعَفَائِكُمْ» رواه أبو داود بإسناد جيد.

274. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూదర్దా ఉవైమిర్ (రజి) తెలియజేశారు: మీరు నన్ను బలహీనుల్లో అన్వేషించండి. నిస్సందేహంగా ఈ బలహీనుల వల్లనే మీకు సహాయం అందుతోంది. ఉపాధి లభిస్తోంది.

(దీనిని అబూదావూద్ మంచి ఆధారాలతో వెలికితీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

బలహీనులు, నిస్సహాయుల వల్ల స్థితిమంతులకు సహాయం లభించటంలోని ఆంతర్యం ఏమిటంటే సాధారణంగా నిరుపేదల, బలహీనుల హృదయాలు ఐహిక వ్యామోహానికి అతీతంగా ఉంటాయి. కనుక వారిలో చిత్తశుద్ధి మెండుగా ఉంటుంది. ఇతరుల కన్నా ఎక్కువగా వారు దైవాన్ని స్మరిస్తూ ఉంటారు. అలాంటివారు దైవసన్నిధిలో చేతులెత్తి ప్రార్థిస్తే దేవుడు వారిని ఒట్టి చేతులతో త్రిప్పిపంపడు. తప్పకుండా వారి ప్రార్థనలను ఆమోదిస్తాడు. కాబట్టి అలాంటి బలహీనుల్ని ఆదుకుంటే వారు తమని ఆదుకున్నవారు సుఖంగా ఉండాలని దైవాన్ని వేడుకుంటారు. వారి ప్రార్థనల ఫలితంగా వారికి దైవసహాయం అందుతూ ఉంటుంది. నసాయిలోని వేరొక ఉల్లేఖనం కూడా ఈ అర్థాన్ని సమర్థిస్తోంది. అందులో 'దేవుడు సమాజంలోని బలహీనుల ప్రార్థనలు, నమాజు మరియు వారి చిత్తశుద్ధి వల్ల ఆ సమాజాన్ని కాపాడుతుంటాడు' అని ఉంది. (ఔనుల్ మాబూద్)

'రియాజుస్సాలిహీన్' గ్రంథ ప్రతుల్లో చాలావాటిలో 'ఇబ్గూనీ ఫిజ్జుఅఫా' అని ఉంది. దాని ప్రకారమే మేము (నన్ను బలహీనుల్లో అన్వేషించండి) అని అనువదించాము. కాని అబూదావూద్ గ్రంథ ప్రతుల్లో 'ఫీ' అనే పదం లేదు. అయితే ఒక ప్రతిలో మాత్రం 'ఇబ్గూ లిజ్జుఅఫా' అని ఉంది. దాని ప్రకారం నా కోసం మీరు బలహీన ముస్లింలని వెతకండి (వారి నిష్కల్మష ప్రార్థనలతో నేను దైవసహాయాన్ని పొందుతాను) అని అర్థం.



34వ అధ్యాయం

# ٣٤ - بَابُ الْوَصِيَّةِ بِالنِّسَاءِ

# స్త్రీల పట్ల సద్వ్యవహారం

قال الله تعالى: ﴿ وَعَاشِرُوهُنَّ بِالْمَعْرُوفِ ﴾ [النساء: ١٩] وقال تعالى: ﴿ وَلَن تَسْتَطِيعُوٓا۟ أَن تَعْدِلُوا۟ بَيْنَ ٱلنِّسَآءِ وَلَوْ حَرَصْتُمْ فَلَا تَمِيلُوا۟ كُلَّ ٱلْمَيْلِ فَتَذَرُوهَا كَٱلْمُعَلَّقَةِ وَإِن تُصْلِحُوا۟ وَتَتَّقُوا۟ فَإِنَّ ٱللَّهَ كَانَ غَفُورًا رَّحِيمًا ﴾ [النساء: ١٢٩].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"వారి (స్త్రీల) పట్ల సద్భావంతో మెలగండి."

(అన్ నిసా : 19)

మరోచోట అల్లాహ్ ఇలా అంటున్నాడు:

భార్యల మధ్య పూర్తి న్యాయం చెయ్యటం మీ శక్తికి మించిన పని. మీరు ఎంత కోరినా దానిని సాధించలేరు. కనుక ఒక భార్యవైపు ఎక్కువగా మొగ్గి మరొకామెను డోలాయమాన స్థితిలో పడ వెయ్యకండి. మీరు మీ ప్రవర్తనను సరిజేసుకొని అల్లాహ్‌కు భయపడుతూ ఉంటే, అల్లాహ్ క్షమించేవాడు, కరుణించేవాడూను.

(అన్ నిసా : 129)

## సారాంశం

ఒకావిడకు మించి ఎక్కువ భార్యలు కల్గివున్న మనిషి ఎంత కోరుకున్నప్పటికీ భార్యలందరి మధ్య సమానమైన న్యాయం చేయలేడు. పైకి భార్యలందరి దగ్గర ఒక్కొక్క రాత్రి చొప్పున గడిపినప్పటికీ మనసులోని ప్రేమను మాత్రం అందరికీ సమానంగా పంచి ఇవ్వ లేడు. ఒక భార్యను చాలా ఎక్కువగా యిష్టపడవచ్చు. మరో భార్యను అంతగా యిష్టపడక పోవచ్చు. ఇది మనసుకు సంబంధించిన విషయం. ఇందులో సంతులనాన్ని, సమతూకాన్ని పాటించటం కష్టసాధ్యం.

అయితే దాని ప్రభావం బాహ్యాపరమైన వ్యవహారాలపై మాత్రం పడకూడదు. మనసుకు నచ్చిన భార్య వైపే పూర్తిగా మొగ్గిపోయి అంతగా యిష్టంలేని భార్యను విస్మరించటం, ఆమె నిత్యావసరాలను తీర్చకపోవటం తగదు. సాధ్యమైనంతవరకు బాహ్య వ్యవహారాల్లో భార్యలందరి మధ్య న్యాయంగా ప్రవర్తించటానికి ప్రయత్నించాలి. ఇక మనసులోని యిష్టాయిష్టాల సంగతిని దైవానికి వదలివేయాలి. మనిషికి వాటిని అదుపుచేసుకునే అధికారం లేదని దేవునికి తెలుసు.

ఆయన అతని దౌర్బల్యాన్ని క్షమించగలడు. అందుకే దైవప్రవక్త (స) తరచూ ఇలా ప్రార్థిస్తూ ఉండేవారు : "అల్లాహుమ్మ హాజా ఖస్మీ ఫీమా అమ్లికు ఫలాతలుమ్‌నీ ఫీమా తమ్లికు వలా అమ్లికు." (దేవా! నా అధీనంలో ఉన్న విషయాల్లో నేను ఇలా వంతులు నిర్ణయించుకున్నాను. ఇక నా ప్రమేయం లేకుండా నీ అధీనంలో ఉన్న విషయాల్లో మాత్రం (నా వల్ల ఏదైనా లోటు జరిగితే దానిపై) నన్ను నిందార్హునిగా చేయకు.)

275. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : స్త్రీల పట్ల మంచిగా మెలగండి. ఎందుకంటే స్త్రీ (మనిషి) ప్రక్కటెముకతో సృజించబడింది. ప్రక్క టెముకలో పైభాగం చాలా వంకరగా ఉంటుంది. మీరు గనక దాన్ని తిన్నగా చేయడానికి ప్రయత్నిస్తే అది విరిగి పోతుంది. దాని మానాన దాన్ని వదలి పెడితే అది అలాగే వంకరగా ఉండి పోతుంది. కనుక మీరు స్త్రీల పట్ల (ఔచితితో) మంచిగా మెలగండి."

*(బుఖారీ - ముస్లిం)*

బుఖారీ - ముస్లింలోని వేరొక ఉల్లేఖ నంలో ఇలా ఉంది : స్త్రీ ప్రక్కటెముక లాంటిది. నీవు దాన్ని సరిచేయటానికి ప్రయత్నిస్తే అది విరిగిపోతుంది. కనుక నీవు ఆమె నుండి ప్రయోజనం పొంద దలిస్తే అది వంకరగా ఉన్నప్పుడు కూడా ప్రయోజనం పొందగలవు."

ముస్లింలోని ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: నిస్సందేహంగా స్త్రీ ప్రక్క టెముకతో సృజించబడింది. అది ఏ విధంగానూ తిన్నగా కాదు. కనుక నీవు ఆమె నుండి ప్రయోజనం పొందాలను

٢٧٥ - وعن أبي هريرة رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «اسْتَوْصُوا بِالنِّسَاءِ خَيْراً؛ فَإِنَّ المَرْأَةَ خُلِقَتْ مِنْ ضِلَعٍ، وَإِنَّ أَعْوَجَ مَا فِي الضِّلَعِ أَعْلاهُ، فَإِنْ ذَهَبْتَ تُقِيمُهُ كَسَرْتَهُ، وَإِنْ تَرَكْتَهُ، لَمْ يَزَلْ أَعْوَجَ، فَاسْتَوْصُوا بِالنِّسَاءِ» متفقٌ عليه. وفي روايةٍ في الصحيحين: «المَرْأَةُ كَالضِّلَعِ إِنْ أَقَمْتَهَا كَسَرْتَهَا، وَإِنِ اسْتَمْتَعْتَ بِهَا، اسْتَمْتَعْتَ وَفِيهَا عَوَجٌ». وفي رواية لمسلم: «إِنَّ المَرْأَةَ خُلِقَتْ مِنْ ضِلَعٍ، لَنْ تَسْتَقِيمَ لَكَ عَلَى طَرِيقَةٍ، فَإِنِ اسْتَمْتَعْتَ بِهَا، اسْتَمْتَعْتَ بِهَا وَفِيهَا عَوَجٌ، وَإِنْ ذَهَبْتَ تُقِيمُهَا كَسَرْتَهَا، وَكَسْرُهَا طَلاقُهَا».

కుంటే వంకరగా ఉన్నప్పుడు కూడా ప్రయోజనం పొందగలవు. నీవు ఆమెను తిన్నగా చేయటానికి ప్రయత్నిస్తే ఆమెను విరగ్గొడతావు. ఆమెను విరవటం అంటే ఆమెకు విడాకులివ్వటమే.

ఈ హదీసులో ప్రస్తావించబడిన పదం 'అవజ్'ను అకారంతో★ ఉచ్చరించాలి.

قولُهُ: «عَوَج» هو بفتحِ العينِ والواوِ.

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణంలోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని స్తన్య సంబంధ ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావనకు వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో 'ఇస్తౌసూ బిన్నిసా' అనే పదం వచ్చింది. అంటే స్త్రీల విషయంలో నా హితవును అంగీకరించండి లేదా మీరు పరస్పరం స్త్రీల విషయమై సద్వ్యవహారం చేయమని తాకీదు చేసుకుంటూ ఉండాలి అని అర్థం. ఎలా చెప్పినా స్త్రీల పట్ల ఉత్తమంగా వ్యవహరించాలన్నదే దాని భావం. పుట్టుక రీత్యా స్త్రీ పురుషునికన్నా బలహీనురాలు. సాధారణంగా స్త్రీలు సంకుచిత మనస్కులై ఉంటారు. కనుక పురుషులు వారిపట్ల ఎంతో సహనంతో వ్యవహరించాలి. ప్రతి చిన్న విషయానికీ వారిని నిలదీయకుండా సాధ్యమైనంతవరకు సడలింపుల వైఖరిని అవలంబించాలి. వారివల్ల జరిగే చిన్న చిన్న పొరపాట్లను విశాల హృదయంతో మన్నించాలి.

దైవప్రవక్త (సల్లం) తన సమాజానికి చేసిన ఈ హితవులో కుటుంబ సుఖజీవన రహస్యం దాగి ఉంది. దానిని ఆచరిస్తే సంసార రథం సాఫీగా ముందుకు సాగుతుంది. దీనికి భిన్నంగా స్త్రీల పట్ల కటువుగా, నిర్దాక్షిణ్యంగా వ్యవహరించే కుటుంబాల్లో సుఖశాంతులు కరువైపోతాయి. సంసార జీవితం దుర్భరమైపోయి సొంత ఇల్లు కూడా నరకంలా అనిపిస్తుంది. తరువాత వ్యవహారం విడాకుల దాకా వెళ్ళిందంటే భార్యాభర్తల జీవితాలు పాడుబడటంతో పాటు పిల్లల భవిష్యత్తు కూడా నాశనమయిపోతుంది.

276. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జమ్‌అ కథనం: నేను దైవప్రవక్త (సల్లం) ప్రసంగిస్తుండగా విన్నాను. ఆయన (ముందుగా సాలిహ్ (అలైహి) గారి) ఒంటెను గురించి, దాని గిట్టలను నరికి వేసిన వ్యక్తి గురించి ప్రస్తావిస్తూ "ఇజిం

٢٧٦ ـ وعن عبدِ الله بن زَمْعَةَ رضي الله عنه، أنه سَمِعَ النَّبِيَّ ﷺ يَخْطُبُ، وَذَكَرَ النَّاقَةَ وَالَّذِي عَقَرَهَا، فقال رسولُ الله ﷺ: «﴿إِذِ ٱنۢبَعَثَ أَشۡقَىٰهَا﴾ [الشمس: ١٢] انْبَعَثَ لَهَا رَجُلٌ عَزِيزٌ، عَارِمٌ مَنِيعٌ فِي

★ కాని గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మలై) తహ్‌జీబుల్ అస్మావల్లుగాత్ అనే వేరొక గ్రంథంలో 'ఇవజ్' అని ప్రస్తావించారు. వాస్తవానికి ఇదే సరైనది, బహుళ ప్రచారం పొందినదీను.

رَمْطِهِ»، ثُمَّ ذَكَرَ النِّسَاءَ، فَوَعَظَ فِيهِنَّ، فَقَالَ: «يَعْمِدُ أَحَدُكُمْ فَيَجْلِدُ امْرَأَتَهُ جَلْدَ الْعَبْدِ، فَلَعَلَّهُ يُضَاجِعُهَا مِنْ آخِرِ يَوْمِهِ» ثُمَّ وَعَظَهُمْ فِي ضَحِكِهِمْ مِنَ الضَّرْطَةِ وقال: «لِمَ يَضْحَكُ أَحَدُكُمْ مِمَّا يَفْعَلُ؟» متفقٌ عليه.

బఅస అష్ఖాహా' అన్న దైవ సూక్తిని పఠించారు. అంటే ఒంటెను చంపటానికి బలాఢ్యుడైన ఆకతాయి వ్యక్తి ఒకడు దిగ్గున లేచాడు. అతనికి తన జాతి వారి సహకారం ఉండింది అని అన్నారు. ఆ తరువాత స్త్రీలను గురించి ప్రస్తావిస్తూ "మీలో కొందరు తమ భార్యల్ని బానిసల్ని బాదినట్లు బాదుతున్నారు. కాని అదే రోజు రాత్రి మళ్ళీ ఆమె ప్రక్కనే పడుకుంటారు. (ఇది అమానుషమైన చర్య)" అని హితబోధ చేశారు. ఆ తరువాత ఆయన అపానవాయువు (శబ్దంతో) వెలువడి నప్పుడు నవ్వరాదని జనానికి బోధిస్తూ, "తానూ చేసే పనికి నవ్వడమెందుకు?" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

وَ«الْعَارِمُ» بالعين المهملةِ والراءِ: هُوَ الشِّرِّيرُ المُفْسِد، وقولُهُ: «انْبَعَثَ» أَيْ: قَامَ بِسُرْعَةٍ.

'ఆరిమ్' అంటే ఆకతాయి, తుంటరి వాడు. 'ఇంబఅస' అంటే దిగ్గున లేచాడని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణం, తదితర ప్రకరణల్లోనూ ఇంకా సహీహ్ ముస్లింలోని స్వర్గ సుఖాల ప్రకరణంలోనూ ఈ హదీసు ప్రస్తావించబడి ఉంది.)*

## ముఖ్యాంశాలు

తప్పనిసరి పరిస్థితుల్లో భర్త భార్యను స్వల్పంగా దండించటానికి ఇస్లాం అనుమతిస్తోంది. అది కూడా ఇతర ప్రయత్నాలన్నీ విఫలమైనప్పుడే! దివ్య ఖుర్ఆన్ ప్రకారం భార్య భర్తకు విధేయత చూపకపోతే ముందుగా ఆమెకు నచ్చజెప్పాలి. అప్పటికీ భర్త మాట వినకపోతే భర్త ఆమెను తన పడక నుండి వేరుచేయాలి. అర్థం చేసుకునే స్త్రీకయితే అదే పెద్ద చురక. కాని అప్పటికీ ఆమె అతని మాట వినకపోతే అప్పుడు తల, ముఖానికి తగలకుండా భర్త ఆమెను స్వల్పంగా దండించవచ్చు. అది కూడా ఆమె ఇలా చేస్తే దారికి వస్తుందన్న నమ్మకం ఉన్నప్పుడే చేయాలి. లేకపోతే దానిక్కూడా దూరంగా ఉండటం మంచిది. అంతేగాని ఒకేసారి ఆమెతో కటువుగా వ్యవహరించటం, గొడ్డును బాదినట్లు బాదటం చేయకూడదు. ఇస్లాం ఇలా చేయటాన్ని ఎన్నటికీ అనుమతించదు.

దైవప్రవక్త (స) ఈ హదీసులో బోధిస్తున్నది కూడా అదే. సంసార రథానికి భార్యాభర్తలిద్దరూ రెండు చక్రాల్లాంటివారు. ఆడదానికి మగవాడు అవసరమయినట్లే మగవాడికి కూడా ఆడది కావాలి. దాంపత్య జీవితంలో ఇద్దరికీ ప్రాముఖ్యం ఉంది. స్త్రీ లేనిదే పురుషుడికి రాత్రి గడవటం కష్టమైపోతుంది. అలాంటప్పుడు భార్యను బానిసరాలిగా చేసి వేధించటం న్యాయమేనా? ఆమె కూడా మనిషేనన్న సంగతిని భర్త గుర్తించాలి. ఆమె భావాలను గౌరవించాలి. చిన్న చిన్న విభేదాలొచ్చినప్పుడు భార్యాభర్తలిద్దరూ పంతాలకు పోకుండా సాధ్యమైనంతవరకు సర్దుబాటు చేసుకొని కలిసిమెలిసి ఉండటానికి ప్రయత్నించాలి.

ఈ హదీసులో చెప్పబడిన ఇంకో విషయం ఏమిటంటే, అపానవాయువు సహజంగా అందరికీ వెలువడేదే. తాను చేసే పని ఇతరులకు ఎదురైనప్పుడు దానికి నవ్వడమెందుకు? కనుక ఎవరికైనా శబ్దంతో అపానవాయువు వెలువడితే నలుగురిలో నవ్వి అతన్ని నవ్వులపాలు చేయటం ఎంతో అసభ్యకరమైన చేష్ట. ఇస్లాం దీనిని గర్హిస్తుంది.

٢٧٧ ـ وعن أبي هريرةَ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «لا يَفْرَكْ مُؤْمِنٌ مُؤْمِنَةً إنْ كَرِهَ مِنْهَا خُلُقاً رَضِيَ مِنْهَا آخَرَ» أَوْ قَالَ: «غَيْرَهُ» رواه مسلم. وقولُهُ: «يَفْرَكْ» هو بفتحِ الياءِ وإسكانِ الفاءِ وفتحِ الراءِ معناه: يُبْغِض، يقالُ: فَرِكَتِ المَرْأَةُ زَوْجَهَا، وَفَرِكَهَا زَوْجُهَا، بكسر الراءِ، يَفْـرَكُهَـا بفتحِها، أَيْ: أَبْغَضَهَـا، والله أعلم.

277. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఏ విశ్వాసీ విశ్వాసురాలిని (భార్యను) అసహ్యించు కోరాదు. అతనికి ఆమెలో ఒక గుణం నచ్చక పోయినప్పటికీ అతనికి నచ్చిన మరో గుణం ఆమెలో ఉండవచ్చు. *(ముస్లిం)*

ఈ హదీసులో దైవప్రవక్త (స) "ఆఖర్" కు బదులు 'గైర' అనే పదాన్ని వాడి ఉంటారని ఒకానొక ఉల్లేఖకుని సందేహం. 'యఫ్రక్' అంటే (మనసులో) అక్కసును ఉంచుకోవటం. భార్య భర్తను అసహ్యించుకుందని చెప్పటానికి ఫరికతిల్ మర్అతు జౌజహా అనీ, భర్త అసహ్యించుకున్నాడని చెప్పటానికి ఫరికహా జౌజుహా అని అంటారు. అంటే ఆమెపట్ల వైరభావం కలిగి ఉన్నాడని అర్థం. (వల్లాహు అలమ్)

*(సహీహ్ ముస్లింలోని స్తన్య సంబంధ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రతి మనిషిలో కొన్ని తప్పుల (లోపా)తో పాటు కొన్ని ఒప్పులు కూడా ఉంటాయి. కనుక సంసార జీవనంలో భర్తకు భార్యలో చిన్నా చితకా ఏవైనా అవగుణాలు కనిపిస్తే వాటికి ప్రాముఖ్యం ఇవ్వకుండా ఆమెలోని మంచిగుణాల వైపు దృష్టి సారించాలి. అదేవిధంగా భార్యకు భర్తలో ఏమైనా లోపాలు కనపడితే పెద్ద మనసుతో వాటిని మన్నించి అతని సుగుణాలకు ప్రాముఖ్యం ఇవ్వాలి. ఇలా భార్యాభర్తలిద్దరూ విశాలహృదయంతో ఒకరినొకరు అర్థం చేసుకుంటూ మసలుకుంటే వారి జీవితాల్లో సుఖశాంతులు వెల్లివిరుస్తాయి. ఇద్దరూ అన్యోన్యంగా కలిసిమెలిసి ఉంటారు.

٢٧٨ - وعن عَمْرِو بن الأَحْوَص الجُشَمِيِّ رضي الله عنه أَنَّهُ سَمعَ النَّبيَّ ﷺ في حَجَّةِ الوَدَاعِ يقُولُ بَعْدَ أَنْ حَمِدَ الله تعالى، وَأَثنَى عَلَيهِ وذكَّرَ وَوَعَظَ، ثُمَّ قال: «أَلا وَاسْتَوْصُوا بالنِّسَاءِ خَيْراً، فَإِنَّمَا هُنَّ عَوَانٍ عِنْدَكُمْ لَيسَ تَمْلِكُونَ مِنْهُنَّ شَيْئاً غَيْرَ ذٰلِكَ إلَّا أَنْ يَأْتِينَ بِفَاحِشَةٍ مُبَيِّنَةٍ، فَإِنْ فَعَلْنَ فَاهْجُرُوهُنَّ فِي المَضَاجِعِ، وَاضْرِبُوهُنَّ ضَرْباً غَيْرَ مُبَرِّحٍ، فَإِنْ أَطَعْنَكُمْ فَلا تَبْغُوا عَلَيْهِنَّ سَبِيلاً؛ أَلَا إنَّ لَكُمْ عَلَى نِسَائِكُمْ حَقّاً، وَلِنِسَائِكُمْ عَلَيْكُمْ حَقّاً؛ فَحَقُّكُمْ عَلَيْهِنَّ أَنْ لا يُوطِئْنَ فُرُشَكُمْ مَنْ تَكْرَهُونَ، وَلا يَأْذَنَّ فِي بُيُوتِكُمْ لِمَنْ تَكْرَهُونَ، أَلا وَحَقُّهُنَّ عَلَيْكُمْ أَنْ تُحْسِنُوا إلَيْهِنَّ فِي كِسْوَتِهِنَّ وَطَعَامِهِنَّ» رواه الترمذي وقال: حديث حسن صحيح. قوله ﷺ: «عَوَانٍ» أَيْ: أَسِيرَاتٌ جَمْعُ عَانِيَةٍ، بِالعَيْنِ المُهْمَلَةِ، وَهِيَ الأَسِيرَةُ، وَالعَانِي: الأَسِيرُ. شَبَّهَ رسولُ الله ﷺ المَرْأَةَ فِي

278. హజ్రత్ అమ్ర్ బిన్ అహ్వస్ జుషమీ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) అంతిమ హజ్ సందర్భంగా ఉపన్యసిస్తూ ముందుగా దైవాన్ని స్తుతించారు. ప్రజలకు హితబోధ చేశారు. (ఇస్లాం బోధనలు) గుర్తు చేశారు. ఆ తరువాత ఇలా అన్నారు : “వినండి, భార్యల పట్ల మంచిగా మెలగండి. వారు మీ దగ్గర బందీలుగా ఉన్నారు. మీరు వారితో సంభోగించవచ్చు. వారు తమ శీలాన్ని కాపాడుకుంటూ మీ సంపదను కాపాడుతూ ఉంటారు. అంతేగాని దానికి మించి మీకు వారిపై ఎలాంటి అధికారం లేదు. అయితే వారు బహిరంగంగా నీతి బాహ్యతకు పాల్పడితే (అప్పుడు మీరు వారిని దండించవచ్చు.) ఒకవేళ వారు (అలాంటి తప్పేదయినా చేస్తే) మీరు వారిని పడకల నుండి వేరుగా ఉంచండి. (అప్పటికీ తప్పు మానుకోకపోతే) వారిని

హింసించకుండా కొట్టండి. వారు గనక మీకు విధేయత చూపితే ఇక (మీరు దురుద్దేశ్యంతో వారిని వదిలించుకునే) మార్గాలు అన్వేషించకండి. జాగ్రత్త! మీకు మీ భార్యలపై హక్కులు ఉన్నట్లే, మీ భార్యలకు కూడా మీపై హక్కులున్నాయి. వారిపై మీకున్న హక్కు ఏమిటంటే, వారు మీ పడకలను మీకిష్టం లేనివారిచే తొక్కినీయకూడదు. మీకిష్టం లేని వారిని ఇంట్లోకి రావటానికి అనుమతించకూడదు.

ఇక వారికి మీపై ఉన్న హక్కు ఏమిటో వినండి! మీరు వారికి (వీలైనంతవరకు) మంచి అన్న వస్త్రాలను సమకూర్చాలి.

(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్' మరియు 'సహీహ్'గా పేర్కొన్నారు.)

'అవానిన్' ఆనియతున్‌కు బహువచనం. అంటే బందీలు. 'ఆని' అనేది పులింగం. తన భర్త వద్ద ఉండే స్త్రీని దైవప్రవక్త (స) ఖైదీతో పోల్చిచెప్పారు. 'జర్బెముబర్రహ్' అంటే నొప్పి కలిగేలా కొట్టడం. 'వారి కోసం మార్గాలు అన్వేషించకండి' అంటే వారికి పైచేయి అయి వారిని హింసించటానికి ప్రయత్నాలు చేయకండి అని అర్థం. (లేదా విడాకులు ఇవ్వడానికి సాకులు వెతకటమనే భావం కావచ్చు.)

*(జామె తిర్మిజీ నికాహ్ అధ్యాయం)*

دُخُولِهَا تَحْتَ حُكْمِ الزَّوْجِ بِالأَسِيرِ وَ«الضَّرْبُ المُبَرِّحُ»: هُوَ الشَّاقُّ الشَّدِيدُ. وَقوله ﷺ: «فَلا تَبْغُوا عَلَيْهِنَّ سَبِيلاً» أَيْ: لا تَطْلُبُوا طَرِيقاً تَحْتَجُونَ بِهِ عَلَيْهِنَّ وَتُؤْذُونَهُنَّ بِهِ، والله أعلم.

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో కూడా ప్రయత్నాలన్నీ విఫలమైపోయినప్పుడు స్త్రీని దైవప్రవక్త (స) చెప్పినట్లు స్వల్పంగా మాత్రమే దండించాలని చెప్పబడింది. కొట్టడం వల్ల ఆమెలో మొండితనం మరింత పెరుగుతుందనే భయముంటే అసలు కొట్టకుండా ఉండటమే మంచిది.

2. భర్త బయటికి వెళ్ళినప్పుడు భార్య తన శీలంతోపాటు, భర్త సొమ్మును, సంపదను కనిపెట్టుకొని ఉండాలి. భర్తకు యిష్టంలేని వారిని - వారు అతని సన్నిహితులు, సమీప బంధువులైనా సరే - ఇంట్లో అడుగుపెట్ట నివ్వకూడదు.

3. భార్యకు మంచి ఆహారాన్ని, దుస్తుల్ని, నిత్యావసరాలను సమకూర్చటం భర్త కనీస బాధ్యత అనిపించుకుంటుంది.

٢٧٩ ـ وعن مُعَاوِيَةَ بنِ حَيْدَةَ رضي الله عنه قال: قلتُ: يا رسولَ اللهِ! ما حَقُّ زَوْجَةِ أَحَدِنَا عَلَيْهِ؟ قال: «أَنْ تُطْعِمَهَا إذَا طَعِمْتَ، وَتَكْسُوَهَا إذَا اكْتَسَيْتَ ولا تَضْرِبِ الْوَجْهَ، وَلا تُقَبِّحْ، وَلا تَهْجُرْ إلَّا في الْبَيْتِ» حديثٌ حسنٌ رواه أبو داودَ وقال: معنى «لا تُقَبِّحْ» أَيْ: لا تَقُلْ: قَبَّحَكِ الله.

279. హజ్రత్ ముఆవియా బిన్ హైదా (రజి) కథనం : నేను దైవప్రవక్త (సల్లం)ను, "మా భార్యలకు సంబంధించి మాపై ఉన్న బాధ్యతలేమిటి?" అని అడగ్గా, "నువ్వు అన్నం తిన్నప్పుడు ఆమెకు కూడా తినిపించు. నువ్వు బట్టలు తొడుక్కోవాలనుకున్నప్పుడు ఆమెకు కూడా తొడిగించు. ముఖం మీద మాత్రం కొట్టకు. (అదేపనిగా) ఆమె లోపాలు ఎంచకు.(సంస్కరణ నిమిత్తం) ఆమెను వేరుగా ఉంచాలనుకుంటే ఇంట్లోనే (వేరుగా) ఉంచు" అని ఆయన అన్నారు. (ఈ హదీసు హసన్ కోవకు చెందినది. దీనిని అబూదావూద్ వెలికితీశారు.) ఇంకా 'లా తుఖబ్బిహ్' అనే పదానికి భర్త భార్యను 'దేవుడు నిన్ను అందవికారిగా చేయాలని' శపించ కూడదనే అర్థం చెప్పారు.

*(సుననె అబూదావూద్‌లోని నికాహ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

భర్త మాట వినని స్త్రీకి బుద్ధి చెప్పే ఉద్దేశ్యంతో ఆమెను వేరుపరచాల్సిన పరిస్థితి ఎదురయినప్పుడు ఆమెను ఇంట్లోనే ఉంచి, ఆమెతో కలవకుండా ఉండాలి. అంతేగాని ఇంటినుండి గెంటేయకూడదు. స్త్రీని ఇంట్లో వేరుపరచి ఉంచినప్పటికీ, ఆమెతో మాట్లాడకుండా ఉండటం మంచిది కాదని, దానివల్ల భార్యాభర్తల యెడబాటు మరింత పెరిగిపోయే అవకాశ ముందని కొంతమంది అభిప్రాయపడుతున్నారు. అయితే అంతగా అవసరమనుకుంటే భార్యను ఇంటిబయట కూడా వేరుగా ఉంచవచ్చు. అంతేగాని నోటికొచ్చినట్లు తిట్టడం, రోజూ కొడుతూ ఉండటం, విడాకులిస్తానని, ఇంటి నుండి బయటికి గెంటేస్తానని బెదిరించటం, నిత్యావసరాలు సమకూర్చకపోవటం, అనుచితంగా అసభ్యకరంగా ప్రవర్తించటం, చిత్రహింసలు పెట్టడం, ముఖంపై కొట్టడం లాంటివి చేయకూడదు. చీటికీమాటికి భార్యను కసురుకోవటం, పిల్లల ముందు, బంధువుల ముందు అవమానపరచటం ఇవన్నీ అనాగరిక చేష్టలు. గృహిణి గృహరాణి లాంటిది. కనుక భర్త ఆమెకు తగిన గౌరవం ఇవ్వాలి. ఒకవేళ స్త్రీ హద్దుమీరి ప్రవర్తిస్తే అప్పుడు ఖుర్ఆన్, హదీసుల వెలుగులో సమస్యను పరిష్కరించాలే తప్ప ఆమె పట్ల అనుచితంగా ప్రవర్తించరాదు. లేకపోతే ఇహపరాల్లోనూ భర్త నష్టానికి గురికావలసి వస్తుంది.

280. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : ఉత్తమ నడవడిక గల వారే పరిపూర్ణ విశ్వాసులు. మీలో తమ భార్యల పట్ల మంచిగా మెలిగేవారే అందరికన్నా శ్రేష్ఠులు." (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్' మరియు 'సహీహ్'గా పేర్కొన్నారు.)

٢٨٠ ـ وعن أبي هريرةَ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «أَكْمَلُ المُؤْمِنِينَ إِيمَاناً أَحْسَنُهُمْ خُلُقاً، وَخِيَارُكُمْ خِيَارُكُمْ لِنِسَائِهِمْ» رواه التِّرمذي وقال: حديثٌ حسنٌ صحيحٌ.

*(జామె తిర్మిజీలోని నికాహ్ ప్రకరణం)*

281. హజ్రత్ ఇయాస్ బిన్ అబ్దుల్లాహ్ బిన్ అబూ జుబాబ్ (రజి) కథనం : దైవ ప్రవక్త (స) "దేవుని దాసీలను (అంటే స్త్రీలను) కొట్టకండని (ప్రజలకు) హితబోధ చేశారు. ఆయన ఈ హితోప దేశం చేసిన కొంతకాలానికి ఉమర్ (రజి) ఆయన దగ్గరికి వచ్చి "స్త్రీలు

٢٨١ ـ وعن إياسِ بنِ عبدِ اللهِ بنِ
ـي ذُبـابٍ رضـي الله عنـه قـال: قـال
سولُ الله ﷺ: «لا تَضْرِبُوا إِمَاءَ اللهِ» فَجَاءَ
مَرُ رضي الله عنه إلى رسولِ الله ﷺ،
قَـالَ: ذَئِـرْنَ النِّسَـاءُ عَلَـى أَزْوَاجِهِـنَّ،
رَخَّـصَ فـي ضَـرْبِهِـنَّ، فَـأطَـافَ بِـآلِ

رسـول الله ﷺ نِسَـاءٌ كَثِيـرٌ يَشْكُـونَ أَزْوَاجَهُـنَّ، فقـال رسـولُ الله ﷺ: «لَقَـدْ أَطَافَ بِآلِ بَيْتِ مُحَمَّدٍ نِسَاءٌ كَثِيرٌ يَشْكُونَ أَزْوَاجَهُنَّ لَيْسَ أُولٰئِكَ بِخِيَارِكُمْ» رواه أبو داود بإسنادٍ صحيح.

తమ భర్తలకు ఎదురుతిరుగుతున్నారని ఫిర్యాదు చేశారు. అప్పుడు దైవప్రవక్త (స) (అవసరమైతే) భార్యల్ని కొట్టేందుకు అనుమతి ఇచ్చారు. (ఆ తరువాత కొంత కాలానికి) ఎంతోమంది స్త్రీలు దైవప్రవక్త (స) సతీమణుల దగ్గరికి వచ్చి తమ భర్తలు తమల్ని కొడుతున్నారని ఫిర్యాదులు చేయసాగారు. ఆ సమయంలో దైవప్రవక్త (స) ప్రజలతో, "చాలా మంది స్త్రీలు ముహమ్మద్ ఇంటిదగ్గర గుమిగూడి తమ భర్తల గురించి ఫిర్యాదు చేస్తున్నారు. మీలో తమ భార్యల్ని వేధించేవారు మంచివారు కారు జాగ్రత్త!" అని అన్నారు.

(దీనిని అబూదావూద్ దృఢమైన ఆధారంతో వెలికితీశారు.)

قوله: «ذَئِرْنَ» هُوَ بذَالٍ مُعْجَمَةٍ مَفْتُوحَةٍ ثُمَّ هَمْزَةٍ مَكْسُورَةٍ ثُمَّ رَاءٍ سَاكِنَةٍ ثُمَّ نُونٍ، أَي: اجْتَرَأْنَ، قوله: «أَطَافَ» أَيْ: أَحَاطَ.

'జయిర్న' అంటే 'ఎదురు తిరగటం' అని అర్థం. 'అతాఫ' అంటే చుట్టుముట్టడం అని అర్థం.

*(సుననె అబూదావూద్‌లోని నికాహ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

చీటికిమాటికి భార్యల్ని కొట్టి హింసించటం నైతిక అధోగతికి తార్కాణమని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. కనుక భర్తలు తమ భార్యల పట్ల ఉత్తమ రీతిలో వ్యవహరించాలి. అందుకు దైవప్రవక్త (స) జీవితాన్ని ఆదర్శంగా తీసుకోవాలి. ఆయన ఏనాడూ ఏ భార్యనూ కొట్టలేదు. ఆఖరికి సేవకురాలిని కూడా కొట్టలేదు. అయితే ధర్మపోరాటంలో మాత్రం ఆయన దైవధిక్కారుల్ని తన చేతులతో శిక్షించారు. అలాగే దేవుని నిషేధాజ్ఞల్ని ఉల్లంఘించిన వారిని కూడా ఆయన దండించారు. (సునన్ నసాయి)

٢٨٢ ـ وعن عبدِ الله بنِ عمرِو بنِ العاص رضي الله عنهما، أن رسولَ اللهِ ﷺ قال: «الدُّنيَا مَتَاعٌ، وَخَيْرُ مَتَاعِهَا المَرْأَةُ الصَّالِحَةُ» رواه مسلم.

282. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : "ప్రపంచమంతా సామగ్రియే. అందులో సదాచార సంపన్నురాలైన భార్య అత్యుత్తమ సామగ్రి (లాంటిది). (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని స్తన్యసంబంధ ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

అబూదావూద్ మరియు నసాయిలలోని వేరొక హదీసులో సదాచార సంపన్నురాలైన భార్య ఈ లక్షణాలను కలిగి ఉంటుందని చెప్పబడింది : భర్త తన వంక చూసినప్పుడు అతన్ని పులకింపజేస్తుంది. భర్త ఆజ్ఞల్ని శిరసావహిస్తుంది. అతను ఇంట్లో లేనప్పుడు తన శీలాన్ని, అతని సొమ్మును కాపాడుతూ ఉంటుంది. కనుక మనిషి ఇహపరాల సాఫల్యం కావాలనుకుంటే, ధర్మపరాయణురాలైన స్త్రీనే వివాహమాడాలి. స్త్రీని ఎంపిక చేసేటప్పుడు ఆమె అందచందాలు, సిరిసంపదలు, వంశప్రతిష్ఠలకన్నా ధర్మానికే ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వాలి. అలాంటి స్త్రీ ఇహలోకంలో ఉత్తమ గృహిణిగా భర్తకు సహకరించటంతోపాటు అతని పరలోక సాఫల్యానికి కూడా తోడ్పడుతుంది.



35వ అధ్యాయం

# ٣٥ ـ بَابُ حَقِّ الزَّوْجِ عَلَى الْمَرْأَةِ

# భర్త హక్కులు

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"అల్లాహ్ స్త్రీ పురుషుల్లో ఒకరికి మరొకరిపై ఆధిక్యతను ప్రసాదించినందువల్ల, ఇంకా పురుషులు తమ సంపదను స్త్రీల కొరకు ఖర్చు చేస్తున్నందువల్ల పురుషులు స్త్రీలకు అధికారులు. కనుక సుగుణవతులైన స్త్రీలు విధేయత కలిగి ఉంటారు. పురుషులు లేనప్పుడు అల్లాహ్ రక్షణలో ఉంటూ వారి (భర్తల) హక్కులను కాపాడతారు.

(అన్ నిసా : 35)

قال الله تعالى: ﴿ٱلرِّجَالُ قَوَّٰمُونَ عَلَى ٱلنِّسَآءِ بِمَا فَضَّلَ ٱللَّهُ بَعْضَهُمْ عَلَىٰ بَعْضٍ وَبِمَآ أَنفَقُواْ مِنْ أَمْوَٰلِهِمْ ۚ فَٱلصَّـٰلِحَـٰتُ قَـٰنِتَـٰتٌ حَـٰفِظَـٰتٌ لِّلْغَيْبِ بِمَا حَفِظَ ٱللَّهُ﴾ [النساء: ٣٤].

ఇంతకు ముందు అధ్యాయంలో వచ్చిన అమ్ర్ బిన్ అహ్వస్ (రజి) హదీసు ఈ అధ్యాయానికి కూడా వర్తిస్తుంది.

وأَمَّا الأحاديثُ فمنها حديثُ عَمْرِو بنِ الأَحْوَصِ السَّابق في البَاب قَبْلَهُ.

283. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : భర్త తన భార్యను పడక మీదికి పిలిచినప్పుడు ఆమె (అకారణంగా) రాకపోతే, దానికిగాను భర్త ఆమెమీద అసంతృప్తితో ఉంటే తెల్లారే దాకా దైవదూతలు ఆమెను శపిస్తూ ఉంటారు. *(బుఖారీ - ముస్లిం)*

ఉభయులూ (బుఖారీ, ముస్లింలు) చేసిన వేరొక ఉల్లేఖనంలో "స్త్రీ తన భర్త (మీద కోపంతో) పడకనుంచి వేరయి

٢٨٣ ـ وعن أَبي هريرةَ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «إذَا دَعَا الرَّجُلُ امْرَأَتَهُ إلَى فِرَاشِهِ فَلَمْ تَأْتِهِ فَبَاتَ غَضْبَانَ عَلَيْهَا لَعَنَتْهَا المَلائِكَةُ حَتَّى تُصْبِحَ» متفقٌ عليه. وفي روايةٍ لهما: «إذا بَاتَتِ المَرْأَةُ هَاجِرَةً فِرَاشَ زَوْجِهَا لَعَنَتْهَا

الْمَلَائِكَةُ حَتَّى تُصْبِحَ». وفي رواية قال رسولُ الله ﷺ: «وَالَّذِي نَفْسِي بِيَدِهِ! مَا مِنْ رَجُلٍ يَدْعُو امْرَأَتَهُ إِلَى فِرَاشِهِ فَتَأْبَى عَلَيْهِ إِلَّا كَانَ الَّذِي فِي السَّمَاءِ سَاخِطاً عَلَيْهَا حَتَّى يَرْضَى عَنْهَا».

రాత్రి గడిపితే, తెల్లారేవరకూ (అంటే ఆమె తిరిగి అతని దగ్గరికి రానంత వరకు) దైవదూతలు ఆమెను శపిస్తూ ఉంటారు" అని ఉంది.

వేరొక ఉల్లేఖనంలో దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : నా ప్రాణాన్ని తన గుప్పెట్లో వుంచుకున్న వాని (ప్రభువు) సాక్షిగా చెబుతున్నాను! ఏ మగాడైనా తన భార్యను పడకమీదికి పిలిచినప్పుడు ఆమె నిరాకరిస్తే, తిరిగి భర్త ఆమె పట్ల ప్రసన్నుడు కానంతవరకూ నింగినున్న వాడు (అల్లాహ్) ఆ స్త్రీ పట్ల అప్రసన్నుడై ఉంటాడు.

*(బుఖారీ - ముస్లింలలోని నికాహ్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

స్త్రీకి తన భర్త ఆజ్ఞల్ని శిరసావహించటం విధి. కనుక తగిన కారణమేదీ లేకుండా భర్త ఆజ్ఞల్ని పాలించకపోతే ఆమె దైవాగ్రహానికి పాత్రురాలవుతుంది. భర్త తిరిగి ఆమె పట్ల ప్రసన్నుడు కానంతవరకూ దేవుడు కూడా ఆమె పట్ల ప్రసన్నుడు కాడు. తిరిగి తన భర్త దగ్గరికి వెళ్ళి క్షమాపణలు చెప్పుకోనంతవరకూ దైవదూతలు ఆమెను శపిస్తూ ఉంటారు. తమ మంకుతనం, మొండివైఖరితో భర్తల్ని సతాయించే స్త్రీలకు ఈ హదీసు కనువిప్పు కావాలి.

ఈ హదీసు ద్వారా దేవుడు ఆకాశాల్లో ఉన్నాడని తెలుస్తోంది. కాని కొందరు దేవుడు సర్వాంతర్యామి, ప్రతిచోటా ఉన్నాడు అని అంటుంటారు. నిజమే! విశ్వంలో దేవుడు లేని చోటంటూ లేదు. అయితే ఆయన తన అస్తిత్వపరంగా అన్నిచోట్లా ఉన్నాడా? అంటే కాదు, అస్తిత్వపరంగా ఆయన సప్తాకాశాలపైనే ఉన్నాడు. జ్ఞానపరంగా, అధికారపరంగా మాత్రం ఆయన విశ్వమంతా వ్యాపించి ఉన్నాడు. సృష్టిలోని ప్రతి వస్తువుపై ఆయనకు తిరుగులేని అధికారముంది. విశ్వంలోని అణువణువునూ ఆయన జ్ఞానం పెనవేసుకుని ఉంది. సర్వాంతర్యామి అంటే అసలు అర్థం ఇది!

٢٨٤ ـ وعن أَبي هريرة رضي الله عنه أيضاً أَن رسولَ اللهِ ﷺ قال: «لا يَحِلُّ

284. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : భర్త (ఇంట్లో) ఉన్న

لِامْرَأَةٍ أَنْ تَصُومَ وَزَوْجُهَا شَاهِدٌ إِلَّا بِإِذْنِهِ، وَلا تَأْذَنَ فِي بَيْتِهِ إِلَّا بِإِذْنِهِ» متفقٌ عليه وهذا لفظ البخاري.

ప్పుడు అతని అనుమతి లేనిదే భార్య (నఫిల్) ఉపవాసాలు పాటించ రాదు. అలాగే, భర్త అంగీకారం లేకుండా ఆమె ఇతరులెవరినీ ఇంట్లో రావటానికి అనుమతించరాదు. (బుఖారీ- ముస్లిం, వాక్యాలు మాత్రం బుఖారీవి)

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా బోధపడుతున్న ఒక ముఖ్య విషయం ఏమిటంటే, నఫిల్ (స్వచ్ఛంద) ఆరాధనవల్ల తోటి మనిషి హక్కుకు భంగం వాటిల్లే ప్రమాదముంటే అప్పుడు నఫిల్ ఆరాధనకన్నా మనిషి హక్కుకే ఎక్కువ ప్రాధాన్యత నివ్వాలి. అంటే నఫిల్ ఆరాధనను వదలిపెట్టి తోటి మానవుని హక్కుని రక్షించాలి.

٢٨٥ ـ وعن ابنِ عمرَ رضي الله عنهما عن النبيِّ ﷺ قال: «كُلُّكُمْ رَاعٍ، وَكُلُّكُمْ مَسْؤولٌ عَنْ رَعِيَّتِهِ، وَالأَمِيرُ رَاعٍ، وَالرَّجُلُ رَاعٍ عَلَى أَهْلِ بَيْتِهِ؛ وَالمَرْأَةُ رَاعِيَةٌ عَلَى بَيْتِ زَوْجِهَا وَوَلَدِهِ، فَكُلُّكُمْ رَاعٍ، وَكُلُّكُمْ مَسْؤُولٌ عَنْ رَعِيَّتِهِ» متفقٌ عليه.

285. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : మీలో ప్రతివాడూ బాధ్యతగల వ్యక్తే. మిమ్మల్నందరినీ తమ తమ బాధ్యతల నిర్వహణ గురించి (దేవుని సన్నిధిలో) ప్రశ్నించటం జరుగుతుంది. పాలకుడు (ప్రజా సంక్షేమానికి) బాధ్యుడు. మనిషి తన ఇంటివారి (సంరక్షణకు) బాధ్యుడు. అలాగే స్త్రీ (కూడా) తన భర్త ఇంటికి, అతని పిల్లల (ఆలనాపాలన)కు బాధ్యురాలు. కనుక మీలో ప్రతి ఒక్కరూ బాధ్యతల గల మనిషే. మిమ్మల్నందరినీ తమ తమ బాధ్యతల గురించి ప్రశ్నించటం జరుగుతుంది. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రజలయినా, పాలకులయినా భర్త అయినా, భార్యఅయినా - సమాజంలోని ప్రతి

ఒక్కరూ తమ తమ కార్యరంగాలకు బాధ్యులని ఈ హదీసు చెబుతోంది. కనుక ప్రతివ్యక్తీ తన విధుల్ని, బాధ్యతల్ని సజావుగా నిర్వర్తించాలి. తన అధీనంలో ఉన్న వారి హక్కుల్ని నెరవేర్చాలి. ఈ బాధ్యతా నిర్వహణలో ఏమాత్రం నిర్లక్ష్యానికి పాల్పడినా పరలోకంలో దేవునికి జవాబు చెప్పుకోవలసి ఉంటుంది.

٢٨٦ - وعن أَبي عَليٍّ طلق بن عليٍّ رضي الله عنه، أَنَّ رسولَ اللهِ ﷺ قال: «إذَا دَعَا الرَّجُلُ زَوْجَتَهُ لِحَاجَتِهِ فَلْتَأْتِهِ وَإِنْ كَانَتْ عَلَى التَّنُّورِ» رواه الترمذي والنسائي وقال الترمِذِي: حديث حسن صحيح.

286. హజ్రత్ అబూ అలీ తలఖ్ బిన్ అలీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స), "భర్త తన అవసరం నిమిత్తం భార్యను పిలిస్తే ఆ సమయంలో ఆమె పొయ్యి దగ్గర వంట చేసుకుంటున్నా కూడా వెంటనే అతని దగ్గరికి వచ్చేయాలి" అని చెప్పారు. దీనిని తిర్మిజీ మరియు నసాయి వెలికితీశారు. ఇంకా తిర్మిజీ దీనిని 'హసన్' మరియు 'సహీహ్' గా పేర్కొన్నారు.

*(సుననె తిర్మిజీలోని స్తన్య సంబంధ అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ఇందులో భార్య తన భర్త ఆజ్ఞల్ని శిరసావహించాలని నొక్కి వక్కాణించటం జరిగింది. షరీఅత్‌లో భర్తలకు గొప్ప స్థానమున్న సంగతి నిజమే కాని స్త్రీలు తమ భర్తలను గౌరవించినట్లుగానే భర్తలు కూడా తమ భార్యల హక్కుల్ని తప్పకుండా గుర్తించాలి. షరీఅత్ స్త్రీలకు కూడా హక్కుల్ని ప్రసాదించిందన్న విషయాన్ని మరువరాదు.

٢٨٧ - وعن أَبي هريرة رضي الله عنه عن النبيِّ ﷺ قال: «لَوْ كُنْتُ آمِراً أَحَداً أَنْ يَسْجُدَ لأَحَدٍ لأَمَرْتُ المَرْأَةَ أَنْ تَسْجُدَ لِزَوْجِهَا» رواه الترمذي وقال: حديث حسن صحيح.

287. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "నేనెవరికైనా ఇతరులకు సజ్దా (పాదాభివందనం) చేయుమని ఆజ్ఞాపించేటట్లయితే తన భర్త ముందు సజ్దా చేయమని స్త్రీకి ఆదేశించి ఉండేవాణ్ణి" అని అన్నారు. తిర్మిజీ దీనిని వెలికితీసి హసన్ మరియు సహీహ్‌గా పేర్కొన్నారు.

*(సుననె తిర్మిజీలోని స్తన్య సంబంధ అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

'సజ్దా' 'చేయమని ఆదేశించి ఉండేవాణ్ణి' అంటే ఎవరికీ ఆ అనుమతి ఇవ్వలేదనే కదా అర్థం. ఎందుకు ఇవ్వలేదంటే కారణం అందరికీ తెలిసిందే. మానవుడు ఒక్క దేవుడి ముందు తప్ప మరెవరి ముందూ సాష్టాంగపడకూడదు. సజ్దా (సాష్టాంగపడటం) అనేది దాస్యానికి ప్రతీక. మనిషి దైవానికి తప్ప మరెవరికీ దాసుడు కాజాలడు. అలాంటప్పుడు సామాన్య మానవుల ముందు, చెట్టు పుట్టలు, రాళ్ళు రప్పల ముందు సృష్టిశ్రేష్ఠుడైన మనిషి తలవంచటం ఎంతవరకు సమంజసం!

ఏది ఏమైనా ఈ హదీసు ద్వారా దాంపత్య జీవితంలో భర్తకు ఎంతటి గౌరవప్రదమైన స్థానముందో తెలుస్తోంది. అయితే భర్తలు భార్యల హక్కుల్ని గుర్తించినప్పుడే తమకూ గౌరవం లభిస్తుందన్న సంగతిని గ్రహించాలి.

288. హజ్రత్ ఉమ్మె సలమా (రజి. అన్‌హా) కథనం ప్రకారం దైవప్రవక్త (స), "భర్త తన పట్ల ప్రసన్నుడిగా ఉన్న స్థితిలో మరణించే స్త్రీ స్వర్గానికి వెళుతుంద"ని చెప్పారు.
(తిర్మిజీ దీనిని వెలికితీసి హసన్‌గా పేర్కొన్నారు)

٢٨٨ ـ وعن أُمِّ سَلَمَة رضي الله عنها قالت: قال رسولُ الله ﷺ: «أَيُّمَا امْرَأَةٍ مَاتَتْ، وَزَوْجُهَا عَنْهَا رَاضٍ دَخَلَتِ الجَنَّةَ» رواه الترمذي وقال: حديث حسن.

*(సుననె తిర్మిజీలోని స్తన్య సంబంధ అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ధర్మాదేశాల్ని, ధర్మవిధుల్ని పాటిస్తూ మరోవైపు భర్తను కూడా సంతోషపెట్టే స్త్రీలకే ఆ భాగ్యం లభిస్తుంది. దేవుడు వారి చిన్న చిన్న పాపాలను మన్నించి ప్రారంభంలోనే వారిని స్వర్గానికి పంపుతాడు. సమాజంలో వక్రబుద్ధిగల గయ్యాళులు, ఘటికురాళ్ళతోపాటు సౌశీల్యవతులు, సదాచార సంపన్నులైన స్త్రీలూ ఉంటారు. అలాంటి సత్ప్రవర్తనగల మహిళలకే ఈ హదీసులోని శుభవార్త.

289. హజ్రత్ ముఆజ్ బిన్ జబల్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : స్త్రీ తన భర్తకు బాధ కలిగించినప్పుడు (స్వర్గంలోని) అప్సరసల్లో అతనికి కాబోయే భార్య (ఇహలోకపు సవతి మీద మండి పడుతూ) "ఆయన్ని బాధపెట్టకు.

٢٨٩ ـ وعن مُعاذِ بنِ جبلٍ رضي الله عنه عن النَّبيِّ ﷺ قال: «لا تُؤْذِي امْرَأَةٌ زَوْجَهَا فِي الدُّنْيَا إلَّا قَالَتْ زَوْجَتُهُ مِنَ الحُورِ العِينِ: لا تُؤْذِيهِ قَاتَلَكِ اللهُ! فَإِنَّمَا هُوَ عِنْدَكِ دَخِيلٌ يُوشِكُ أَنْ يُفَارِقَكِ إِلَيْنَا» رواه الترمذيُّ وقال: حديث حسن.

దేవుడు నిన్ను నాశనం చేస్తాడు. ఆయన నీ దగ్గర (కొన్నాళ్ళపాటు) అతిథిగా ఉన్నారంతే; త్వరలోనే ఆయన నిన్ను విడిచిపెట్టి నా దగ్గరికి రాబోతున్నారు" అని అంటుంది.

తిర్మిజీ దీనిని వెలికితీసి 'హసన్'గా పేర్కొన్నారు.

*(సుననె తిర్మిజీలోని స్తన్యసంబంధ అధ్యాయం, ఇబ్నె మాజాలోని నికాహ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇస్లామీయ షరీఅత్ స్త్రీల పట్ల ఉత్తమంగా మెలగాలని పురుషులను ఆజ్ఞాపించినట్లుగానే తమ భర్తల పట్ల అనుచితంగా, అసభ్యకరంగా ప్రవర్తించరాదని స్త్రీలను కూడా ఆదేశిస్తోంది. భర్తలతో కరకుగా మాట్లాడటం, వారి పట్ల దురుసుగా ప్రవర్తించటం, వారి స్తోమతకు మించి కోరికలు కోరటం ఇవన్నీ భర్తలను బాధపెట్టే చేష్టలుగానే పరిగణించబడతాయి. కాని నేడు సమాజంలోని చాలా మంది స్త్రీలలో ఈ అనుచిత వైఖరి రోజురోజుకీ పెరిగిపోతోంది. భర్తల పట్ల గౌరవం సన్నగిల్లుతోంది. ఇది విపరీతమే. భార్యాభర్తలిద్దరూ ఒండొకరి హక్కుల్ని గుర్తించి, పరస్పరం స్నేహ, సుహృద్భావాలతో కలిసిమెలసి ఉండాలి.

290. హజ్రత్ ఉసామా బిన్ జైద్ కథనం ప్రకారం దైవప్రవక్త (స) "నా తదనంతరం పురుషులపాలిట స్త్రీలకన్నా దారుణమైన ఉపద్రవం మరొకటి లేదు" అని అన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

٢٩٠ ـ وعن أسامة بن زيد رضي الله عنهما عن النبي ﷺ قال: «مَا تَرَكْتُ بَعْدِي فِتْنَةً هِيَ أَضَرُّ عَلَى الرِّجَالِ مِنَ النِّسَاءِ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) స్త్రీ ఉనికి ఉపద్రవాలకు మూలమని చెప్పారు. చెడు నడతగల స్త్రీలవల్ల ఉపద్రవాలు మొదలవుతాయన్న విషయంలో సందేహం లేదు. సమాజంలోని అనేక చెడుల్లో ప్రత్యక్షంగానైనా, పరోక్షంగానైనా స్త్రీ ప్రమేయం ఎంతో కొంత తప్పకుండా ఉంటుంది. సాధారణంగా భార్యల గొంతెమ్మ కోర్కెలను తీర్చటం కోసమే భర్తలు

అక్రమార్జనకు పాల్పడుతుంటారు. అలాంటి స్త్రీలే గనక నిరాడంబరత్వాన్ని అలవరచుకుంటే, వారి భర్తలకు డబ్బుకోసం అడ్డదారులు తొక్కాల్సిన అవసరం ఉండదు. వివాహ వేడుకల సందర్భాల్లో కూడా స్త్రీలే ఎక్కువగా ఆచారాలు, సంప్రదాయాల పేరిట తమ భర్తలతో ఎన్నో ధర్మవిరుద్ధమైన పనులు చేయిస్తారు. దుబారాగా డబ్బు ఖర్చు చేయిస్తుంటారు. నేడు వివాహాలు కష్టతరమై పోతున్నాయంటే దానికి స్త్రీలే కారణం. సాధారణంగా పురుషులకన్నా స్త్రీలే ఎక్కువగా పురాతన ఆచార వ్యవహారాలకు ప్రాధాన్యతనిస్తారు. కనుక వైవాహిక వ్యవస్థ బాగుపడాలంటే ముందుగా స్త్రీల ఆలోచనా ధోరణిలో మార్పు రావాలి.



## 36వ అధ్యాయం

# ٣٦ ـ بَابُ النَّفَقَةِ عَلَى العِيَالِ

# ఆలుబిడ్డలపై ఖర్చు చేయడం

قال الله تعالى: ﴿وَعَلَى الْمَوْلُودِ لَهُ رِزْقُهُنَّ وَكِسْوَتُهُنَّ بِالْمَعْرُوفِ﴾ [البقرة: ٢٣٣]، وقال تعالى: ﴿لِيُنفِقْ ذُو سَعَةٍ مِّن سَعَتِهِ وَمَن قُدِرَ عَلَيْهِ رِزْقُهُ فَلْيُنفِقْ مِمَّا آتَاهُ اللَّهُ لَا يُكَلِّفُ اللَّهُ نَفْسًا إِلَّا مَا آتَاهَا﴾ [الطلاق: ٧]، وقال تعالى: ﴿وَمَا أَنفَقْتُم مِّن شَيْءٍ فَهُوَ يُخْلِفُهُ﴾ [سبأ: ٣٩].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్‌ సెలవిచ్చాడు:

"పిల్లల తండ్రి వారి తల్లులను తగురీతిలో భోజన వస్త్రాలను సమకూర్చి పోషించవలసి ఉంటుంది." (అల్‌ బఖర : 233)

మరోచోట ఇలా సెలవిచ్చాడు :

"సంపన్నుడైన వ్యక్తి తన ఆర్థిక స్తోమతను బట్టి ఖర్చు పెట్టాలి. తక్కువ ఉపాధి ఇవ్వబడిన వ్యక్తి, అల్లాహ్‌ తనకు ఇచ్చిన ధనం నుంచే ఖర్చుపెట్టాలి. అల్లాహ్‌ తాను ప్రసాదించిన దానికి మించి ఎవరిపైనా భారం మోపడు." (అత్‌ తలాఖ్‌ : 7)

ఇంకొకచోట ఇలా అన్నాడు :

"మీరు దేనిని ఖర్చు చేసినప్పటికీ దాని స్థానంలో ఆయనే మీకు మరింత ఇస్తాడు." (సబా : 39)

٢٩١ ـ وعن أَبي هريرةَ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «دِينَارٌ أَنْفَقْتَهُ فِي سَبِيلِ اللهِ، وَدِينَارٌ أَنْفَقْتَهُ فِي رَقَبَةٍ، وَدِينَارٌ تَصَدَّقْتَ بِهِ عَلَى مِسْكِينٍ،

291. హజ్రత్‌ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : ఒక దీనారుని నువ్వు దేవుని మార్గం (అంటే ధర్మోన్నతి కోసం చేసే కృషి)లో ఖర్చు చేస్తావు. ఒక దీనారుని నువ్వు బానిసకు స్వేచ్ఛ ప్రసాదించటం కోసం ఖర్చు చేస్తావు. మరో దీనారు ఓ అభాగ్యుడికి దానంగా ఇస్తావు. ఇంకో దీనారుని నువ్వు నీ ఆలుబిడ్డలకోసం ఖర్చు పెడతావు.

وَدِينَارٌ أَنفَقتَهُ عَلَى أَهْلِكَ، أَعْظَمُهَا أَجْراً الَّذِي أَنفَقتَهُ عَلَى أَهْلِكَ» رواه مسلم.

అయితే వీటన్నింటిలో నువ్వు నీ ఆలుబిడ్డల కోసం ఖర్చుపెట్టే దీనారే అత్యంత పుణ్యప్రదమైనది." (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు జకాత్ ఇచ్చే స్తోమతలేని తక్కువ ఆదాయంగల వారికి ఉద్దేశించబడినది. అలాంటివారు తమ దగ్గరున్న డబ్బుతో ముందుగా తమ ఆలుబిడ్డల అవసరాలను తీర్చాలి. వారి భోజన వస్త్రాల కోసం డబ్బు ఖర్చుపెట్టాలి. అందులోనే వారికి ఎంతో పుణ్యం లభిస్తుంది. మనిషి ఆలుబిడ్డలపై ఖర్చుపెట్టడం అతని విధి. దీనికి భిన్నంగా దానధర్మాలు చేయటం నఫిల్ (స్వచ్ఛంద) ఆరాధన మాత్రమే. అలాంటప్పుడు విధిని (ఫర్జ్‌ను) విస్మరించి స్వచ్ఛంద (నఫిల్) ఆరాధనల్ని పాటిస్తే లాభమేంటి? అయితే జకాత్ ఇచ్చే స్థోమత కలిగిన ధనవంతులకు ఈ నిబంధన వర్తించదు. వారి వ్యవహారం ఇందుకు భిన్నంగా ఉంటుంది. స్థోమత కలిగివున్న ధనవంతులు తమ జకాత్ సొమ్మును తమ ఆలుబిడ్డలపై ఖర్చు పెట్టకూడదు. దానిని జకాత్ సొమ్ము పుచ్చుకోవటానికి అర్హులైనవారికే ఇవ్వాలి.

٢٩٢ ـ وعن أَبي عبدِ الله وَيُقَالُ له: أَبي عبد الرَّحمٰن ثَوْبَانَ بن بُجْدُدَ مَوْلَى رسول الله ﷺ قال: قال رسولُ الله ﷺ: «أَفْضَلُ دِينَارٍ يُنفِقُهُ الرَّجُلُ دِينارٌ يُنْفِقُهُ عَلَى عِيَالِهِ، وَدِينَارٌ يُنْفِقُهُ عَلَى دَابَّتِهِ فِي سَبِيلِ اللهِ، وَدِينَارٌ يُنفِقُهُ عَلَى أَصْحَابِهِ فِي سَبِيلِ اللهِ» رواه مسلم.

292. దైవప్రవక్త (స)చే స్వేచ్ఛనొసగ బడిన బానిస హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ సౌబాన్ బిన్ బుజ్‌దుద్ - ఈయన్ని అబూ అబ్దుర్రహ్మాన్ అని కూడా పిలుస్తారు - చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : "మనిషి తన ఆలుబిడ్డల కోసం ఖర్చుపెట్టే దీనారు (పుణ్యం రీత్యా) అత్యుత్తమ దీనారు. తరువాత దైవమార్గంలో (ఉపయోగించే) తన వాహనం కోసం ఖర్చుపెట్టేది. ఆ తరువాత దైవమార్గంలో తన సహచరుల కోసం ఖర్చుపెట్టే దీనారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు కూడా తక్కువ ఆదాయం గలవారికే వర్తిస్తుంది. చాలీచాలని జీతాలతో బతికేవారు అతిగా దానాలు చేసి ఆలుబిడ్డల్ని ఇబ్బందులకు లోనుచేయటం కూడా మంచిపద్ధతి

కాదు. అలాంటి వారు తమ ఆలుబిడ్డల్ని సుఖపెడితే అదే వారి పాలిట గొప్ప దానంగా పరిగణించబడుతుంది. ఆ తరువాత కూడా ఏమైనా మిగిలివుంటే అప్పుడు హదీసులో వివరించబడిన క్రమంలో ఖర్చుపెట్టాలి.

٢٩٣ـ وعن أُمِّ سَلَمَةَ رضي الله عنها قَالَتْ: قلتُ: يا رسولَ الله! هَلْ لِي أَجْرٌ فِي بَنِي أَبِي سَلَمَةَ أنْ أُنفِقَ عَلَيْهِمْ، وَلَسْتُ بِتَارِكَتِهِمْ هٰكَذَا وَهٰكَذَا إِنَّمَا هُمْ بَنِيَّ؟ فقال: «نَعَمْ لَكِ أَجْرُ مَا أَنْفَقْتِ عَلَيْهِمْ» متفقٌ عليه.

293. హజ్రత్ ఉమ్మె సలమా (రజి. అన్హా) కథనం : నేనొకసారి దైవ ప్రవక్తతో, "దైవప్రవక్తా! నేను (నా భర్త) అబూ సలమా పిల్లల కోసం డబ్బు ఖర్చు పెడితే అందులో నాకు పుణ్యం లభిస్తుందా? వాళ్ళు అటూ ఇటూ అడుక్కుంటూ తిరుగుతూ ఉంటే నేను చూడలేకపోతున్నాను. వాళ్ళు కూడా నా పిల్లలే కదా!" అని అడిగాను. దానికి ఆయన "అవును, నువ్వు వారికోసం ఖర్చు చేస్తున్నదానికి నీకు (తప్పకుండా) పుణ్యం లభిస్తుంది" అని సమాధాన మిచ్చారు. *(బుఖారీ - ముస్లిం)*

*(బుఖారీ - ముస్లింలోని జకాత్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

తల్లిదండ్రులు కడుపుతీపితోనే తమ సంతానంపై డబ్బు ఖర్చుపెడతారు. అయినప్పటికీ దేవుడు దానిపై కూడా తల్లిదండ్రులకు ఎంతో పుణ్యాన్ని ప్రసాదిస్తాడు. కొన్ని సందర్భాల్లోనయితే ఈ పుణ్యం ఇతర దానధర్మాలకన్నా రెట్టింపు అయిపోతుంది. ఇది దేవుని మహదానుగ్రహం.

٢٩٤ ـ وعن سعدِ بنِ أَبي وَقَّاصٍ رضي الله عنه في حدِيثِهِ الطَّوِيلِ الَّذِي قَدَّمْنَاهُ فِي أَوَّلِ الْكِتَابِ فِي بَابِ النِّيَّةِ أنَّ رسولَ الله ﷺ قال له: «وَإِنَّكَ لَنْ تُنْفِقَ نَفَقَةً تَبْتَغِي بِهَا وَجْهَ الله إِلَّا أُجِرْتَ بِهَا حَتَّى مَا تَجْعَلُ فِي فِي امْرَأَتِكَ» متفقٌ عليه.

294. గ్రంథ ప్రారంభంలో సంకల్పానికి సంబంధించిన అధ్యాయం క్రింద మేము పేర్కొన్న సుదీర్ఘ హదీసులో సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ (రజి) దైవప్రవక్త (స) తనతో "నీవు దైవ ప్రసన్నతను బడయటం కోసం ఖర్చుచేసేదానికి నీకు తప్పకుండా పుణ్యం లభిస్తుంది. ఆఖరికి నీవు నీభార్య నోటికందించే దానిపై (ముద్ద) కూడా నీకు పుణ్యం దొరుకు

తుంది" అని అన్నారని తెలియజేశారు.

(బుఖారీ - ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణం; సహీహ్ ముస్లింలోని వీలునామా ప్రకరణం)

## ముఖ్యాంశాలు

మనిషికి సహజంగానే తన ఆలుబిడ్డలపై ప్రేమ ఉంటుంది. ఈ ప్రేమానురాగాల మూలంగానే అతను వారిని పోషించటానికి కష్టపడతాడు. వారి అవసరాలన్నీ తీరుస్తాడు. వారు సుఖంగా ఉంటే తానూ సంతోషిస్తాడు. అయితే మనిషి ఇదంతా తాను దైవాజ్ఞమేరకే చేస్తున్నానని సంకల్పించుకుంటే చాలు అతని సంతోషం కూడా 'ఆరాధన' అయిపోతుంది. దానిపై అతనికి పుణ్యమూ లభిస్తుంది.

۲۹۵ ـ وعن أَبي مَسْعُودٍ الْبَدْرِيِّ رضي الله عنه عن النَّبِيِّ ﷺ قال: «إذَا أَنْفَقَ الرَّجُلُ عَلَى أَهْلِهِ نَفَقَةً يَحْتَسِبُهَا فَهِيَ لَهُ صَدَقَةٌ» متفقٌ عليه.

295. హజ్రత్ అబూ మస్ఊద్ బద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) "మనిషి గనక పుణ్యాన్ని ఆశిస్తూ తన భార్యాబిడ్డలపై డబ్బు ఖర్చుపెడితే అది అతని తరఫున దానంగా పరిగణించబడు తుంది" అని అన్నారు.

(బుఖారీ - ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

'పుణ్యాన్ని ఆశించడమంటే' దేవుడు తనపై మోపిన ఆలుబిడ్డల పోషణా బాధ్యతను నిర్వహిస్తున్నాననీ, బంధువుల హక్కుల్ని నెరవేర్చాలన్న దైవాజ్ఞను పాటిస్తున్నాననీ, దీనివల్ల దేవుడు తన పట్ల ప్రసన్నుడౌతాడని భావించటం. ఇలా భావించి ఆలుబిడ్డల కోసం డబ్బు ఖర్చుపెడితే దానిపై కూడా పుణ్యం లభిస్తుంది.

۲۹٦ ـ وعن عبد الله بن عمرو بن العاص رضي الله عنهما قال: قال رسولُ الله ﷺ: «كَفَى بِالْمَرْءِ إِثْماً أَنْ يُضَيِّعَ مَنْ يَقُوتُ» حديثٌ صحيحٌ رواه أبو

296. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : "మనిషి ఒకరి తిండి తిప్పలకు బాధ్యుడై తన (బాధ్యతను) నిర్లక్ష్యం చేయటం చాలు అతను పాపిష్టి మనిషి అని చెప్పటానికి!" (ఈ హదీసు దృఢమైనది. దీనిని అబూదావూద్ వెలికితీశారు.)

داودَ وغيرُه. ورواه مسلم في صحيحه بمَعْنَاهُ قال: «كَفَى بِالمَرْءِ إِثْماً أنْ يَحْبِسَ عَمَّنْ يَمْلِكُ قُوتَهُ».

ఇమామ్ ముస్లిం కూడా దీనిని "మనిషి ఒకరి తిండికి యజమాని అయి అతనికి తిండి పెట్టకుండా ఉండటం చాలు అతను పాపిష్ఠి మనిషి అని చెప్పటానికి!" అని దైవప్రవక్త (స) చెప్పారన్న అర్థంలో ఉల్లేఖించారు.

*(సుననె అబూదావూద్ మరియు సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

ఆలుబిడ్డల పోషణలో నిర్లక్ష్యం వహించటం మహాపాపం. మనిషి కర్మల జాబితాలో ఇతర పాపాలేమీ లేకుండా ఈ ఒక్క పాపం ఉన్నా దానిపై దేవుడు ప్రళయదినాన అతన్ని పట్టుకొని శిక్షిస్తాడు.

ఈ హదీసు భావం ఎంతో విస్తృతమైనది. ఒక్క ఆలుబిడ్డలే గాకుండా పోషణాపరంగా తనపై ఆధారపడివున్న వారందరూ దీనిక్రిందికి వస్తారు. తన అధీనంలో పనిచేసే ఉద్యోగులు, నౌకర్లు, సేవకుల హక్కుల్ని నెరవేర్చే బాధ్యత గనక తనపై ఉంటే యజమాని తప్పకుండా ఆ బాధ్యతను నిర్వర్తించాలి. బాధ్యతా నిర్వహణలో ఏమాత్రం నిర్లక్ష్యానికి పాల్పడినా దేవుని దృష్టిలో అతను నేరస్థుడిగా పరిగణించబడతాడు.

٢٩٧ - وعن أَبي هريرةَ رضي الله عنه أَنَّ النَّبِيَّ ﷺ قال: «مَا مِنْ يَوْمٍ يُصْبِحُ العِبَادُ فِيهِ إِلَّا مَلَكَانِ يَنْزِلانِ، فَيَقُولُ أَحَدُهُمَا: اللَّهُمَّ أَعْطِ مُنْفِقاً خَلَفاً، وَيَقُولُ الآخَرُ: اللَّهُمَّ أَعْطِ مُمْسِكاً تَلَفاً» متفقٌ عليه.

297. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : ప్రతి రోజూ ఇద్దరు దైవదూతలు దిగివస్తారు. వారిలో ఒక దూత, "దేవా! ఖర్చుపెట్టేవాడికి ప్రతి ఫలాన్ని ప్రసాదించు!" అని ప్రార్థిస్తే, రెండవ దూత, "దేవా! కూడబెట్టుకునే వాడి సంపదను నాశనం చెయ్యి" అని అంటాడు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ మరియు సహీహ్ ముస్లింలలోని జకాత్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా మంచివారికి మేలు జరగాలని ప్రార్థించటంతోపాటు చెడ్డవారిని శపించటం కూడా ధర్మసమ్మతమేనని తెలుస్తోంది. ఇంకా దీనిద్వారా బోధపడే మరో ముఖ్య విషయం ఏమిటంటే, ఇతరుల కోసం డబ్బు ఖర్చు పెట్టటం పుణ్యప్రదమైనట్లుగానే, అసలు ఖర్చు చేయకుండా పిసినారితనానికి పాల్పడటం కూడా పాపమే. పిసినారితనం మనిషిని దైవశిక్షకు

గురిచేస్తుంది. ఇతరులకు ఇవ్వకుండా, తామూ అనుభవించకుండా సంపదను వృథాగా నాశనం చేసుకునే పిసినిగొట్టుల్ని మనుషులేకాదు, దైవదూతలు కూడా అసహ్యించుకుంటారు. పిసినారులకు ఎక్కడా విలువ ఉండదు.

٢٩٨ ـ وعنه، عن النَّبيِّ ﷺ قال: «اليَدُ العُلْيَا خَيْرٌ مِنَ اليَدِ السُّفْلَى وَابْدَأْ بِمَنْ تَعُولُ، وَخَيْرُ الصَّدَقَةِ مَا كَانَ عَنْ ظَهْرِ غِنًى، وَمَنْ يَسْتَعْفِفْ، يُعِفَّهُ اللهُ، وَمَنْ يَسْتَغْنِ، يُغْنِهِ اللهُ» رواه البخاري.

298. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు : "పై (ఇచ్చే) చెయ్యి, క్రింది (పుచ్చుకునే) చెయ్యికన్నా శ్రేష్ఠమైనది. డబ్బు ఖర్చుపెట్టేటప్పుడు ముందు నీపై ఆధారపడి ఉన్న వారితో మొదలుపెట్టు. అవసరాలన్నీ తీరి పోయాక చేసే దానమే అత్యుత్తమ దానం. ఎవరైనా ఇతరుల ముందు చేయి చాపకుండా ఉండాలనుకుంటే దేవుడు (తప్పకుండా) వారికా భాగ్యాన్ని ప్రసాదిస్తాడు. ఇంకా ఎవరైనా నిరపేక్షా భావాన్ని కోరుకుంటే దేవుడు అతన్ని నిరపేక్షాపరునిగా మారుస్తాడు."

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవమార్గంలో ఖర్చుపెట్టడం గొప్ప పుణ్య కార్యమే. అయితే తనపై ఆధారపడివున్న వారి అవసరాలను తీర్చకుండా దానధర్మాల్లో డబ్బు ఖర్చుపెట్టడం సముచితం కాదు. ముందు ఆలుబిడ్డలు, మరియు తన అధీనంలో ఉన్నవారి అవసరాలను తీర్చాలి. దేవుని సన్నిధిలో ఇది కూడా దానంగానే పరిగణించబడుతుంది.

మనిషి తన ఆత్మగౌరవాన్ని కాపాడుకోవాలి. ఇతరుల ముందు చేయి చాపి అడుక్కోవటం మర్యాదస్తులకు శోభించదు. కనుక నిరపేక్షాభావాన్ని అలవరచుకోవాలి. లేనిదానికోసం వెంపర్లాడకుండా ఉన్నదాంట్లోనే తృప్తిగా బ్రతకాలి. ఆత్మతృప్తిని, నిరపేక్షా భావాన్ని ప్రసాదించమని దేవుణ్ణి ప్రార్థిస్తూ ఉండాలి. దేవుడు తప్పకుండా అనుగ్రహిస్తాడు.

## 37వ అధ్యాయం

# ٣٧ - بَابُ الإِنْفَاقِ مِمَّا يُحِبُّ وَمِنَ الجَيِّدِ

# ప్రీతికరమైన సంపదను ఖర్చు చేయటం

قال الله تعالى: ﴿لَن تَنَالُوا۟ ٱلْبِرَّ حَتَّىٰ تُنفِقُوا۟ مِمَّا تُحِبُّونَ﴾ [آل عمران: ٩٢]، وقال تعالى: ﴿يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ أَنفِقُوا۟ مِن طَيِّبَٰتِ مَا كَسَبْتُمْ وَمِمَّآ أَخْرَجْنَا لَكُم مِّنَ ٱلْأَرْضِ ۖ وَلَا تَيَمَّمُوا۟ ٱلْخَبِيثَ مِنْهُ تُنفِقُونَ﴾ [البقرة: ٢٦٧].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"అత్యంత ప్రీతికరమైన వస్తువులను (దైవ మార్గంలో) ఖర్చుపెట్టనంతవరకు మీరు సత్కార్యస్థాయికి చేరుకోలేరు."

(ఆలి ఇమ్రాన్ : 92)

ఇంకోచోట ఆయన ఇలా అంటున్నాడు:

"విశ్వసించిన ప్రజలారా! మీరు సంపాదించిన ధనంలోని, మేము మీ కొరకు నేల నుండి ఉత్పత్తి చేసిన దానిలోని మేలైన భాగాన్ని దైవమార్గంలో ఖర్చుపెట్టండి. ఆయన మార్గంలో ఇవ్వటానికి పనికిరాని వస్తువులను ఏరితీసే ప్రయత్నం చేయకండి." (అల్ బఖర : 267)

٢٩٩ - عن أنسٍ رضي الله عنه قال: كَانَ أَبُو طَلْحَةَ رضي الله عنه أَكْثَرَ الأَنْصَارِ بِالمَدِينَةِ مَالاً مِنْ نَخْلٍ، وَكَانَ أَحَبُّ أَمْوَالِهِ إِلَيْهِ بَيْرَحَاءَ، وَكَانَتْ مُسْتَقْبِلَةَ المَسْجِدِ وَكَانَ رسولُ الله ﷺ يَدْخُلُهَا وَيَشْرَبُ مِنْ مَاءٍ فِيهَا طَيِّبٍ قَالَ أَنَسٌ: فَلَمَّا نَزَلَتْ هٰذِهِ

299. హజ్రత్ అనస్ (రజి) కథనం : మదీనాలోని అన్సార్ ముస్లింలలో హజ్రత్ అబూ తల్హా (రజి) గొప్ప ధనవంతులు. ఆయనకు ఎన్నో ఖర్జూరపు తోటలుండేవి. తన సంపదలో ఆయనకు 'బైరహా' అనే తోటంటే చాలా యిష్టం. అది మస్జిదె నబవీ ముందు భాగంలో ఉండేది. దైవప్రవక్త (సల్లం) (కూడా తరచూ) ఆ తోటలోకి వెళ్తుండేవారు. అక్కడ లభించే మంచినీళ్ళు త్రాగేవారు. (కొంత కాలానికి) "మీకు అత్యంత

الآيَةُ: ﴿لَن تَنَالُوا۟ ٱلْبِرَّ حَتَّىٰ تُنفِقُوا۟ مِمَّا تُحِبُّونَ﴾ قام أَبو طَلْحَةَ إلى رسولِ الله ﷺ فقال: يارسولَ الله! إنَّ الله تَعَالَى أَنْزَلَ عَلَيْكَ: ﴿لَن تَنَالُوا۟ ٱلْبِرَّ حَتَّىٰ تُنفِقُوا۟ مِمَّا تُحِبُّونَ﴾ وَإِنَّ أَحَبَّ مَالِي إِلَيَّ بَيْرَحَاءُ، وَإِنَّهَا صَدَقَةٌ للهِ تَعَالَى أَرْجُو بِرَّهَا، وَذُخْرَهَا عِنْدَ اللهِ

ప్రీతికరమైన దానిని (దైవమార్గంలో) ఖర్చు చేయనంతవరకు మీరు పుణ్య స్థాయికి చేరుకోలేరు" అనే దైవసూక్తి అవతరించినప్పుడు అబూ తల్హా లేచి, "దైవప్రవక్తా! మీకు అత్యంత ప్రీతికర మైన వస్తువుని ఖర్చుచేయనంత వరకూ మీరు పుణ్యస్థాయికి చేరుకో లేరని అంటున్నాడు దేవుడు. నా సంపద మొత్తంలో బైరహా తోట నాకు అత్యంత ప్రీతికరమైనది. అందుచేత నేను దానిని అల్లాహ్ కోసం దానం చేస్తూ దానిపై నాకు పుణ్యం లభిస్తుందని, ఇంకా (పర లోకంలో కూడా) దేవునివద్ద దాని పుణ్యం నిలువచేసి ఉంచబడుతుందని ఆశిస్తున్నాను. కనుక దైవప్రవక్తా! మీరు దీనిని దేవుడు ఎక్కడ వినియోగించ మంటే అక్కడ వినియోగించండి" అని అన్నారు.

تَعَالَى، فَضَعْها يارسولَ الله! حَيْثُ أَرَاكَ اللهُ، فَقَالَ رسولُ اللهِ ﷺ: «بَخٍ! ذلِكَ مَالٌ رَابِحٌ، ذلِكَ مَالٌ رَابِحٌ، وَقَدْ سَمِعْتُ مَا قُلْتَ، وَإِنِّي أَرَى أَنْ تَجْعَلَهَا فِي الأَقْرَبِينَ»، فقال أَبو طَلْحَةَ: أَفعَلُ يَا رسولَ الله! فَقَسَّمَهَا أَبو طَلْحَةَ فِي أَقَارِبِهِ، وَبَنِي عَمِّهِ. متفقٌ عليه.

ఆయన మాటలు విని దైవప్రవక్త (స) "ఓహో! ఇదెంతో లాభదాయకమైన సంపద. నిజంగా ఇది ఎంతో లాభ దాయకమైన సంపద. ఇప్పుడు నువ్వన్న మాటలన్నీ నేను విన్నాను. అయితే నువ్వు ఈ తోటను నీ బంధువుల్లో పంచిపెడితే సముచితంగా ఉంటుందని నేను భావిస్తున్నాను" అని అన్నారు.

దానికి అబూ తల్హా (రజి) "(అలాగే) చేస్తాను దైవప్రవక్తా!" అని అన్నారు. అన్న

ప్రకారమే ఆ తోటను ఆయన తన బంధువులకు, పెద్దనాన్న, చిన్నాన్న పిల్లలకు పంచిపెట్టారు."

(బుఖారీ - ముస్లిం)

'మాలున్ రాబిహున్'. ఈ పదం సహీహ్ లో 'రాబిహున్' మరియు 'రాయివున్' రెండు విధాలా ఉల్లేఖించబడింది. 'రాయివున్' అంటే దీని లాభం తిరిగి నీకే చేరుతుంది అని అర్థం. 'బైరహా' ఒకానొక ఖర్జూరపు తోట. ఈ పదం బీరహా అని కూడా ఉచ్చరించబడింది.

قوله ﷺ: «مَالٌ رَابِحٌ» رُوِيَ في الصحيح «رَابِحٌ» و «رَايِحٌ» بالباءِ الموحدةِ وبالياءِ المثناةِ، أَيْ: رَايِحٌ عَلَيْكَ نَفْعُهُ، وَ «بَيْرَحَاءُ»: حَدِيقَةُ نَخْلٍ، وَرُوِيَ بكسرِ الباءِ وَفتحِها.

(సహీహ్ బుఖారీ మరియు సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో దైవప్రవక్త సహచరులు ప్రదర్శించిన నిరుపమాన త్యాగభావం ప్రకటితమవుతోంది. ఆయన సహచరులు దైవ సంకేతంపై ప్రాణాలర్పించటానికైనా సిద్ధంగా ఉండేవారు.
2. 'మీరు పుణ్యస్థాయికి చేరుకోలేరంటే' పరిపూర్ణ విశ్వాస స్థాయికి చేరుకోలేరని అర్థం. అత్యంత ప్రీతికరమైన వస్తువుని త్యాగం చేయటం పరిపూర్ణ విశ్వాసానికి తార్కాణం.
3. బంధువులు నిరుపేదలు, అభాగ్యులై ఉంటే దానధర్మాలు చేసేటప్పుడు వారికే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వాలి. లేని పరిస్థితుల్లో ఎవరికయినా ఇవ్వొచ్చు.

## 38వ అధ్యాయం

## ٣٨ ـ بَابُ وُجُوبِ أَمْرِهِ أَهْلَهُ وَأَوْلَادَهُ الْمُمَيِّزِينَ وَسَائِرَ مَنْ فِي رَعِيَّتِهِ بِطَاعَةِ اللهِ تَعَالَى وَنَهْيِهِمْ عَنِ الْمُخَالَفَةِ وَتَأْدِيبِهِمْ وَمَنْعِهِمْ عَنِ ارْتِكَابِ مَنْهِيٍّ عَنْهُ

## తన ఇంటివారిని, ప్రాజ్ఞులైన సంతానాన్ని ఇంకా తన అధీనంలో ఉన్నవారందరినీ దైవానికి విధేయత చూపమని ఆజ్ఞాపించటం, వైముఖ్యం నుండి వారిని నిరోధించటం, అవసరమైతే శిక్షించటం, నిషిద్ధ విషయాల జోలికి పోకుండా వారిని ఆపటం విధి.

قال الله تعالى: ﴿وَأْمُرْ أَهْلَكَ بِالصَّلَوٰةِ وَاصْطَبِرْ عَلَيْهَا﴾ [طه: ١٣٢]، وقال تعالى ﴿يَٰٓأَيُّهَا الَّذِينَ ءَامَنُوا قُوٓا أَنفُسَكُمْ وَأَهْلِيكُمْ نَارًا﴾ [التحريم: ٦].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా ఆదేశిస్తున్నాడు:

“నీ కుటుంబ సభ్యులను నమాజు చెయ్యమని ఆజ్ఞాపించు. స్వయంగా నీవు కూడా దానిని పాటించు.” (తాహా : 132)

మరోచోట ఇలా అంటున్నాడు :

“విశ్వాసులారా! మిమ్మల్నీ, మీ పరివారాన్నీ నరకాగ్ని నుండి కాపాడుకోండి.”

(అత్ తహ్రీమ్ : 6)

٣٠٠ ـ عن أبي هريرةَ رضي الله عنه قال: أخذ الحسنُ بنُ عليٍّ رضي الله عنهما تمرةً مِنْ تَمْرِ الصَّدَقَةِ فَجَعَلَهَا فِي فِيهِ فقال رسولُ الله ﷺ: «كِخْ كِخْ، ارْمِ بِهَا، أَمَا عَلِمْتَ أَنَّا لا نَأْكُلُ الصَّدَقَةَ!؟» متفقٌ عليه.

300. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : ఒకసారి (దైవప్రవక్త ముద్దుల మనవడు) హజ్రత్ హసన్ (రజి) సదఖా చేయబడిన ఖర్జూరాన్ని తీసుకొని (ఆడు కుంటూ దాన్ని) నోట్లో వేసుకున్నాడు. అది చూసి వెంటనే దైవప్రవక్త (స) “అయ్యో! దాన్ని ఊసెయ్యి, మనం

సదఖా చేయబడింది తినమని నీకు తెలియదా!" అని అన్నారు. (బుఖారీ - ముస్లిం)

వేరొక ఉల్లేఖనంలో "మనకు సదఖా (వస్తువుని అనుభవించటం) ధర్మ సమ్మతం కాదు" అని ఉంది.

'కఖ్, కఖ్' - దీన్ని 'కఖిన్, కఖిన్' అని కూడా చదవవచ్చు. చిన్నపిల్లల్ని చెడుల జోలికి పోకుండా మందలించటానికి ఈ పదాన్ని వాడుతారు. హ|జత్ హసన్ (రజి) ఆ సమయంలో పసిపిల్లవాడు.

وفي رواية: «أَنَّا لا تَحِلُّ لَنَا الصَّدَقَةُ»، وقوله: «كَخْ كَخْ» يُقَالُ بإسْكَانِ الخَاءِ، وَيُقَالُ بِكَسْرِهَا مَعَ التَّنوينِ وَهِيَ كَلِمَةُ زَجْرٍ للصَّبِيِّ عَنِ المُسْتَقْذَرَاتِ، وَكَانَ الحَسنُ رضي الله عنه صبياً.

*(సహీహ్ బుఖారీ మరియు సహీహ్ ముస్లింలలోని జకాత్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసు ద్వారా దైవప్రవక్త కుటుంబీకులకు, ఆయన వంశస్థులకు దానధర్మాలు పుచ్చుకోవటం ధర్మసమ్మతం కాదని తెలుస్తోంది. ఆయన వంశస్థులంటే హాషిమ్ మరియు ముత్తలిబ్ సంతతి.
2. పిల్లలకు పసితనం నుంచే సరైన శిక్షణను ఇవ్వాలి. తల్లిదండ్రులు తమ పిల్లలు చేసే పనుల్ని ఓ కంట గమనిస్తూ ఉండాలి. వారివల్ల ఏదైనా పొరపాటు జరిగితే వెంటనే వారిని సరిదిద్దాలి. వారికి చిన్నప్పటినుంచే ధర్మాధర్మాలను గురించి బోధిస్తూ ఉండాలి.
3. దానధర్మాల వల్ల వచ్చే ధనం ప్రజాధనం అవుతుంది. ఏ ఇంట్లోనయినా లేక సంస్థలోనయినా సొమ్ము సమీకరించబడితే దాని భద్రతకు బాధ్యులైన యజమానులు దానిని అన్ని విధాలా కాపాడుతూ నిజమైన హక్కుదారులకు చేరేటట్లు చూడాలి. తమ బంధుమిత్రులెవరూ దానిని ఉపయోగించుకోకుండా కాపాడాలి.

301. దైవప్రవక్త సంరక్షణలో పెరిగిన హ|జత్ అబూ హఫ్స్ ఉమర్ బిన్ అబూ సలమా అబ్దుల్లాహ్ ఇబ్నె అబ్దుల్ అసద్ (రజి) కథనం : నేను దైవప్రవక్త (స) సంరక్షణలో పెరుగుతుండేవాడ్ని. నేను అన్నం తినేటప్పుడు కంచంలో (ని ఆహారాన్ని అన్ని వైపుల నుంచి తీసుకొని

٣٠١ ـ وعن أَبي حَفْصٍ عُمَرَ بن أبي سَلَمَةَ عبدِ الله ابنِ عبدِ الأسدِ رَبيبِ رسول الله ﷺ قال: كُنْتُ غُلاماً فِي حَجْرِ رسولِ الله ﷺ وَكَانَتْ يَدِي تَطِيشُ فِي الصَّحْفَةِ، فقال لي رسولُ اللهِ ﷺ: «يَا غُلامُ! سَمِّ اللهَ

تعالى، وَكُلْ بِيَمِينِكَ، وَكُلْ مِمَّا يَلِيكَ» فَمَا زَالَتْ تِلْكَ طِعْمَتِي بَعْدُ. متفقٌ عليه.

తింటూ) చెయ్యిని అటూ ఇటూ కదిలిస్తూ ఉండేవాణ్ని. దైవప్రవక్త (స) అది చూసి, "అబ్బాయీ! (అన్నం తినేముందు) 'బిస్మిల్లా' పఠించు. కుడి చేత్తో తిను. (కంచంలో) నీ ముందు భాగంలో ఉన్నది తీసుకొని తిను" అని ఉపదేశించారు. ఆ రోజు నుండి నేను దైవప్రవక్త చెప్పిన ప్రకారమే తింటూ వస్తున్నాను. (బుఖారీ - ముస్లిం)

وَ«تَطِيشُ»: تَدُورُ فِي نَوَاحِي الصَّحْفَةِ.

'తతీషు' అంటే చెయ్యి కంచం అంచుల దగ్గర కదలాడుతూ ఉండేదని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని అన్నపానీయాల ప్రకరణం - సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసు కూడా పిల్లలకు సభ్యతా సంస్కారాలు నేర్పాలని ప్రబోధిస్తోంది.
2. అన్నం తినేముందు 'బిస్మిల్లాహ్' పఠించి మరీ తినటం ప్రారంభించాలి. పలువురు ఒకే పళ్ళెంలో తింటున్నప్పుడు ప్రతి ఒక్కరూ తమ ముందు భాగంలో ఉన్న ఆహారాన్నే తీసుకుని తినాలి. అయితే పళ్లెంలో రకరకాల పండ్లు, ఫలాలు ఉన్నప్పుడు మాత్రం ఎటువైపు నుంచైనా తీసుకొని తినవచ్చు.
3. పిల్లలు తప్పుచేస్తే -అప్పటికప్పుడే- వారిని సరిదిద్దాలి. సరైన విధానం గురించి బోధించాలి. అలా చేస్తే పిల్లలు తమ తప్పుని తెలుసుకొని ఇంకెప్పుడూ అలాంటి తప్పు చేయకుండా ఉంటారు.

٣٠٢ - وعن ابنِ عمرَ رضي الله عنهما قال: سمعتُ رسولَ الله ﷺ يقول: «كُلُّكُمْ رَاعٍ، وَكُلُّكُم مَسْؤُولٌ عَنْ رَعِيَّتِهِ، الإِمَامُ رَاعٍ، وَمَسْؤُولٌ عَنْ رَعِيَّتِهِ، وَالرَّجُلُ رَاعٍ فِي أَهْلِهِ وَمَسْؤُولٌ عَنْ رَعِيَّتِهِ، وَالمَرْأَةُ رَاعِيَةٌ فِي بَيْتِ زَوْجِهَا وَمَسْؤُولَةٌ عَنْ رَعِيَّتِهَا، وَالخَادِمُ رَاعٍ فِي مَالِ سَيِّدِهِ،

302. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : మీలో ప్రతి మనిషీ ఓ బాధ్యత గల వ్యక్తి. మిమ్మల్నందరినీ తమ తమ బాధ్యతల గురించి (దేవుని సన్నిధిలో) ప్రశ్నించటం జరుగుతుంది. పాలకుడు (ప్రజా సంక్షేమానికి) బాధ్యుడు. అతన్ని తన బాధ్యత విషయమై ప్రశ్నించటం

وَمَسْؤُولٌ عَنْ رَعِيَّتِهِ، فَكُلُّكُمْ رَاعٍ وَمَسْؤُولٌ عَنْ رَعِيَّتِهِ» متفقٌ عليه.

జరుగుతుంది. (సాధారణ) మనిషి తన పరివారానికి బాధ్యుడు. అతన్ని తన బాధ్యత (పరివారాన్ని) గురించి ప్రశ్నించటం జరుగుతుంది. అలాగే స్త్రీ కూడా తన భర్త ఇంటికి బాధ్యత వహిస్తుంది. ఆమె (కూడా) తన బాధ్యత విషయమై ప్రశ్నించబడుతుంది. సేవకుడు తన యజమాని సొమ్ముకు బాధ్యుడు. అతడు తన బాధ్యత గురించి ప్రశ్నించ బడతాడు. కనుక మీలో ప్రతి ఒక్కడూ (తమ కార్యక్షేత్రంలో) బాధ్యతగల వ్యక్తే. మీలో ప్రతి ఒక్కడూ తన బాధ్యత విషయమై ప్రశ్నించబడతాడు.

*(బుఖారీ - ముస్లిం)*

٣٠٣ ـ وعن عمرِو بنِ شُعَيْبٍ، عن أبيه، عن جَدِّهِ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مُرُوا أَوْلادَكُمْ بِالصَّلاةِ وَهُمْ أَبْنَاءُ سَبْعِ سِنِينَ، وَاضْرِبُوهُمْ عَلَيْهَا، وَهُمْ أَبْنَاءُ عَشْرٍ، وَفَرِّقُوا بَيْنَهُمْ فِي المَضَاجِعِ» حديثٌ حسنٌ رواه أبو داود بإسنادٍ حسنٍ.

303. హజ్రత్ అమ్ర్ బిన్ షుఐబ్ తన తండ్రి నుండి, ఆయన తన తాత నుండి చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు : మీ పిల్లల్ని ఏడు సంవత్సరాల ప్రాయం నుండే నమాజు చెయ్యండని ప్రోత్సహిస్తూ ఉండండి. పది సంవత్సరాల తరువాత (కూడా వారు నమాజు పట్ల నిర్లక్ష్యం వహిస్తే) వారిని కొట్టండి. వారి పడకల్ని వేరుపర చండి. (ఈ హదీసు 'హసన్' కోవకు చెందినది. అబూదావూద్ దీనిని ప్రామాణికమైన ఆధారంతో వెలికి తీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసు ద్వారా నమాజుకు ఉన్న ప్రాముఖ్యత వెల్లడౌతోంది. శిక్షణ నిమిత్తం పిల్లల్ని స్వల్పంగా దండించవచ్చని కూడా తెలుస్తోంది. దండించడమంటే పశువుని బాదినట్లు చితక బాదమని కాదు. పిల్లవాడి తప్పుని సరిదిద్దటం కోసం మరీ చిత్రహింసలు పెట్టకుండా మెల్లగా కొట్టాలి. అంతేగాని పిల్లల్ని కొట్టడం ఉద్దేశ్యం కాకూడదు. మరోవైపు కొంతమంది అసలు పిల్లల్ని కొట్టడం కాదు కదా, వారిని మందలించటం కూడా తగదని అంటారు. కాని ఈ భావన సరైనది కాదు. పిల్లలకు సభ్యతా సంస్కారాలు నేర్పటం కోసం అప్పుడప్పుడూ స్వల్పంగా దండించటం కూడా అవసరమే. పసిపిల్లల్ని ఎంతగానో ప్రేమించిన దైవప్రవక్త (స) స్వయంగా కొట్టమని ఆదేశిస్తున్నారంటే - ఇన్షాఅల్లాహ్ - దానివల్ల మంచిఫలితాలే ముందుకు వస్తాయి.
2. పిల్లలకు నమాజు మాదిరిగానే ఇతర షరీఅత్ ఆజ్ఞలు కూడా బోధిస్తూ ఉండాలని పండితులు అంటున్నారు. వీలైతే వారిచేత ఆచరణాత్మకంగా కూడా అభ్యాసం చేయించాలి. ఉదాహరణకు రమజాన్ మాసంలో పిల్లల్ని వారి శక్తి సామర్థ్యాలకనుగుణంగా కొన్ని రోజులు ఉపవాసాలు పాటించమని ప్రోత్సహిస్తూ ఉండాలి. దీనివల్ల పసితనంలోనే వారికి ఉపవాసాల ప్రాముఖ్యత బోధపడుతుంది. ఆ విధంగా రోజుకి ఐదుపూటల నమాజుతోపాటు రమజాన్ నెలలో ఉపవాసాలు పాటించటం కూడా ఒక ముస్లింకు తప్పనిసరి అన్న సంగతి పెద్దవారయిన తరువాత వారికి తెలిసివస్తుంది. అదేవిధంగా పిల్లలకు వారి అవగాహనాశక్తిని బట్టి ఇతర ధర్మ నియమాలను కూడా బోధించవచ్చు.
3. పదేళ్ళ ప్రాయంలో పిల్లలు లైంగికంగా ప్రాజ్ఞులవ్వక పోయినప్పటికీ ఆ వయసులోనే వారిలో లైంగిక స్పందనలు మొదలౌతాయి. కనుక ఆ వయస్సులో ఉన్న పిల్లల్ని వేర్వేరుగా పడుకోబెట్టడం ఎందుకైనా మంచిది. ముఖ్యంగా ఆడ, మగ పిల్లల మధ్య ఈ జాగ్రత్త తప్పనిసరి.

٣٠٤ ـ وعن أبي ثُرَيَّةَ سبْرَةَ بن مَعْبَدٍ الجُهَنِـيِّ رضـي الله عنـه قـال: قـال رسـولُ الله ﷺ: «عَلِّمُـوا الصَّبِـيَّ الصَّـلاةَ

304. హజ్రత్ అబూ సురయ్యా సబ్రా బిన్ మాబద్ జుహనీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉద్బోధించారు : ఏడేళ్ళప్రాయంలో పిల్లవాడికి నమాజు నేర్పించండి. పదేళ్ళ ప్రాయంలో (అతను నమాజు పట్ల అశ్రద్ధ

لِسَبْعِ سِنِينَ، وَاضْرِبُوهُ عَلَيْهَا ابْنَ عَشْرِ سِنِينَ» حديث حسنٌ رواه أبو داود، والترمذي وقال: حديث حسن. وَلَفْظُ أَبِي دَاوُدَ: «مُرُوا الصَّبِيَّ بِالصَّلاةِ إِذَا بَلَغَ سَبْعَ سِنِينَ».

వహిస్తే) అతన్ని కొట్టండి." (ఈ హదీసు హసన్ కోవకు చెందినది. దీనిని అబూ దావూద్ మరియు తిర్మిజీలు వెలికితీశారు.)

అబూ దావూద్ వాక్యాలు ఇలా ఉన్నాయి : "పిల్లవాడు ఏడేళ్ళ ప్రాయానికి చేరుకోగానే అతన్ని నమాజు చేయమని ఆదేశించండి."

*(సుననె అబూదావూద్ మరియు సుననె తిర్మిజీలోని నమాజ్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

తల్లిదండ్రుల్లో, గురువుల్లో ఎవరయితే నమాజ్ చేస్తారో వారు మాత్రమే పిల్లలకు నమాజ్ చేయమని బోధించగలరు. పెద్దలే నమాజ్ చేయకుండా పిల్లల్ని చేయమంటే చేస్తారా? పెద్దలు చిన్నపిల్లలకు ఆదర్శం కావాలి. అప్పుడే పిల్లలు వారి మాట వింటారు. ప్రవక్త సహచరుల కాలంలో ఒక వ్యక్తి ముస్లిం అయి కూడా నమాజును వదలిపెట్టే ప్రసక్తే ఉండేది కాదు. కాని శోచనీయమైన విషయం ఏమిటంటే, నేడు ముస్లిం సమాజాల్లోనే ఎంతోమంది పిల్లల తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు నమాజును నిర్లక్ష్యం చేస్తున్నారు. అలాంటప్పుడు వారి సంరక్షణలో పెరుగుతున్న పిల్లలకు నమాజును గురించి, ఇతర ధర్మ విషయాల గురించి బోధించేదెవరు? నేటి స్కూళ్ళలో కూడా పిల్లలకు నమాజ్ చేసుకునే సౌకర్యం, అవకాశం లేకపోవటం ఇంకా ఆందోళనకరమైన విషయం. ప్రతి వ్యక్తీ తన అధీనంలో ఉన్న వారికి బాధ్యుడు. పరలోకంలో దేవుని సన్నిధిలో తన బాధ్యత విషయమై అతణ్ణి నిలదీయటం జరుగుతుంది.



## 39వ అధ్యాయం

# ٣٩ - بَابُ حَقِّ الْجَارِ وَالْوَصِيَّةِ بِهِ

# ఇరుగుపొరుగువారి హక్కుల్ని నెరవేర్చాలి, వారిపట్ల సద్భావంతో మెలగాలి

قال الله تعالى: ﴿ وَٱعْبُدُوا ٱللَّهَ وَلَا تُشْرِكُوا بِهِۦ شَيْـًٔا ۖ وَبِٱلْوَٰلِدَيْنِ إِحْسَـٰنًا وَبِذِى ٱلْقُرْبَىٰ وَٱلْيَتَـٰمَىٰ وَٱلْمَسَـٰكِينِ وَٱلْجَارِ ذِى ٱلْقُرْبَىٰ وَٱلْجَارِ ٱلْجُنُبِ وَٱلصَّاحِبِ بِٱلْجَنۢبِ وَٱبْنِ ٱلسَّبِيلِ وَمَا مَلَكَتْ أَيْمَـٰنُكُمْ ﴾[النساء: ٣٦].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"మీరంతా అల్లాహ్‌కు దాస్యం చేయండి. ఎవరినీ ఆయనకు భాగస్వాములుగా చేయకండి. తల్లిదండ్రుల ఎడల సద్భావంతో మెలగండి. బంధువులూ, అనాథలూ, నిరుపేదల పట్ల మంచిగా వ్యవహరించండి. పొరుగున ఉన్న బంధువులు, అపరిచితులైన పొరుగువారు, ప్రక్కనున్న మిత్రులు, బాటసారులు, మీ అధీనంలో ఉన్న దాసదాసీ జనం పట్ల ఉదార బుద్ధితో వ్యహరించండి." (అన్ నిసా : 36)

٣٠٥ - وعن ابنِ عمرَ وعائشةَ رضي الله عنهما قالا: قال رسولُ الله ﷺ: «مَا زَالَ جِبْرِيلُ يُوصِينِي بِالْجَارِ حَتَّى ظَنَنْتُ أَنَّهُ سَيُوَرِّثُهُ» متفق عليه.

305. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) మరియు హజ్రత్ ఆయిషా (రజి. అన్హా)ల కథనాల ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు: జిబ్రయీల్ నాకు మాటిమాటికీ పొరుగువాని (హక్కుల) గురించి ఎంతగా తాకీదు చేశారంటే, అది చూసి నాకు ఆస్తిలో (కూడా) ఆయన పొరుగువాణ్ణి వాటా దారుడిగా ఖరారు చేస్తారేమోనని పించింది. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా ఇస్లాంలో ఇరుగుపొరుగువారి హక్కులకు ఎంతటి ప్రాముఖ్యం ఉందో తెలుస్తోంది.

٣٠٦ ـ وعن أبي ذرٍّ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «يَا أَبَا ذَرٍّ إذا طَبَخْتَ مَرَقَةً، فَأَكْثِرْ مَاءَهَا، وَتَعَاهَدْ جيرَانَكَ» رواه مسلم.

وفي رواية له عن أَبي ذرٍّ قال: إن خليلي ﷺ أَوْصَاني: «إذَا طَبَخْتَ مَرَقاً فَأَكْثِرْ مَاءَهُ، ثُمَّ انْظُرْ أَهْلَ بَيْتٍ مِنْ جِيرَانِكَ، فَأَصِبْهُمْ مِنْهَا بِمَعْرُوفٍ».

306. హజ్రత్ అబూజర్ర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తనకు ఇలా ఉపదేశించారు : "అబూజర్ర్! నువ్వు చారు వండితే అందులో నీళ్ళు (కొంచెం) ఎక్కువ పోయి. ఇరుగు పొరుగు వారిని గుర్తుంచుకో. (ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో హజ్రత్ అబూజర్ర్ (రజి) కథనం ఇలా ఉంది : "నీవు చారు వండితే అందులో నీళ్ళు ఎక్కువగా పొయ్యి. తరువాత ఇరుగు పొరుగువారి ఇండ్లలో ఎంతమంది సభ్యులున్నారో అంచనా వేసుకొని తగురీతిలో వారికి కూడా దాంట్లో నుండి కొంత (కానుకగా) ఇవ్వు'' అని నా మిత్రులు (దైవప్రవక్త -స) నాకు తాకీదు చేశారు.

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇరుగుపొరుగు వారు ఆకలితో అలమటిస్తుంటే తాను మాత్రం రుచికరమైన వంటకాలతో సుష్టుగా భోంచేయటం ఎంతో అవాంఛనీయమైన చేష్ట అనిపించుకుంటుంది. మనిషి తన ఇంటి సుఖంతోపాటు నిరుపేదలు, అభాగ్యులైన తన ఇరుగుపొరుగువారి కష్టసుఖాలను గురించి కూడా ఆలోచించాలి. స్థోమత ఉన్నవారు తమ ఇరుగుపొరుగువారికి చేతనయినంత సహాయం చెయ్యాలి. ఏమీ లేనివారైతే కనీసం కూరలు లాంటివి వండుకున్నప్పుడు నీళ్ళు ఎక్కువ పోసి వండవలసి వచ్చినాసరే అందులో కొంత ఇరుగుపొరుగువారికి కూడా పంపాలి.

٣٠٧ ـ وعن أَبي هريرة رضي الله عنه أَن النبي ﷺ قال: «والله لا يُؤْمِنُ، والله

307. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఒకసారి,

لا يُـؤمِـنُ، واللهِ لا يُـؤمِـنُ!» قِيـلَ: مَـنْ يَا رسولَ اللهِ؟! قال: «الَّذي لا يَأمَنُ جَارُهُ بَوَائِقَهُ!» متفق عليه.

وفي روايةٍ لمسلمٍ:
«لا يَدْخُلُ الجَنَّةَ مَنْ لا يَأمَنُ جَارُهُ بَوَائِقَهُ».

«البَوَائِقُ»: الغَوَائِلُ وَالشُّرُورُ.

"దైవసాక్షి! అతను విశ్వాసి కాజాలడు, దైవసాక్షి! అతను విశ్వాసి కాడు. దైవసాక్షి అతను విశ్వాసి కానేకాడు" అని అన్నారు. "ఎవరు దైవప్రవక్తా!?" అని అడగ్గా, "తన తుంటరి చేష్టలతో ఇరుగుపొరుగు వారికి మనశ్శాంతి లేకుండా చేస్తున్న వాడు" అని ఆయన సమాధాన మిచ్చారు. *(బుఖారీ - ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో తన తుంటరి చేష్టలతో ఇరుగుపొరుగు వారికి మనశ్శాంతి లేకుండా చేసేవాడు స్వర్గంలోకి ప్రవేశించలేడు" అని ఉంది.

'బవాయిఖ్' అంటే మోసాలు, తుంటరి చేష్టలు అని అర్థం.

(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఇరుగుపొరుగు వారిని కష్టపెట్టడం ఎంతటి ఘోరమైన పాపమంటే దానివల్ల మనిషి పరలోకంలో స్వర్గానికి నోచుకోలేకపోతాడు.

٣٠٨ ـ وعنـه قـال: قـال رسـولُ الله ﷺ: «يَا نِسَاءَ المُسْلِمَاتِ! لا تَحْقِرَنَّ جَارَةٌ لِجَارَتِهَا وَلَوْ فِرْسِنَ شَاةٍ» متفقٌ عليه.

308. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (స) మహిళలతో ఇలా అన్నారు : ముస్లిం మహిళల్లారా! ఏ ఇరుగింటి స్త్రీ తన పొరుగింటావిడ (ఇచ్చిన కానుక)ను అల్పమైనదిగా భావించకూడదు సుమా! అది మేక కాలి గిట్ట అయినా సరే! *(బుఖారీ - ముస్లిం)*

## ముఖ్యాంశాలు

ఒకేచోట నివసించేవారు ఒండొకరికి కానుకలు ఇచ్చిపుచ్చుకుంటూ ఉండాలి. దీనివల్ల

పరస్పరం ప్రేమాభిమానాలు పెంపొందుతాయి. ధనికులు తమ స్థోమతకు తగ్గట్టుగా, అదేవిధంగా పేదవారు తమకు ఉన్నంతలోనే ఇరుగుపొరుగువారికి కానుకలు ఇచ్చిపుచ్చుకుంటూ ఉండాలి. పేదవారు "ఇంత మామూలు వస్తువు కానుకగా ఎలా ఇవ్వాలా?" అని ఎప్పుడూ అనుకోకూడదు. చిత్తశుద్ధితో ఇస్తే అది ఎంత మామూలు వస్తువైనప్పటికీ దేవుని సన్నిధిలో స్వీకృతిని పొందుతుంది.

అలాగే ధనవంతులు కూడా పేదవారిచ్చే కానుకలను స్వీకరించి వారిని ఆదరించాలి. అయితే ధనికులు మాత్రం పేదవారికయినా తమ స్థోమతకు తగిన కానుకలే ఇవ్వాలి. తమకిష్టం లేని వస్తువుల్ని, పాడయిపోయిన ఆహారపదార్థాల్ని తమ ఇరుగుపొరుగున ఉంటున్న పేదవారికి ఇవ్వటం భావ్యం కాదు. ఇలా చేయటం వల్ల ఇరుగుపొరుగు పేదవారిని అధములుగా భావించినట్లవుతుంది. కానుకలు ఇచ్చేది ఎదుటివారి పట్ల తమకున్న గౌరవాన్ని, ప్రేమను తెలియజేయటం కోసమే. అలాంటప్పుడు పొరుగున ఉంటున్న పేదవారిని అల్పులుగా భావిస్తూ వారికేదైనా ఇస్తే అది కానుక ఎలా అవుతుంది? దానికి దేవుని దృష్టిలో ఎలాంటి విలువా లేదు. ఒకవేళ ఎదుటివ్యక్తిని అల్పునిగా భావించకుండా తన దగ్గరున్న మామూలు వస్తువేదైనా వినియోగంలో లేకపోతే దాన్ని ఏ పేదవాడికైనా ఇచ్చివేయడంలో తప్పులేదు. అయితే ఇచ్చే వస్తువు ఉపయోగకరమైనదయి ఉండాలి.

٣٠٩ ـ وعنه، أن رسول الله ﷺ قال: «لا يَمْنَعْ جَارٌ جَارَهُ أَنْ يَغْرِزَ خَشَبَةً في جِدَارِهِ»، ثُمَّ يَقُولُ أَبو هريرةَ: مَا لي أَرَاكُمْ عَنْهَا مُعْرِضِينَ! وَاللهِ! لأَرْمِيَنَّ بهَا بَيْنَ أَكْتَافِكُمْ. متفقٌ عليه. رُوِيَ «خَشَبَهُ» بِالإِضَافَةِ وَالجَمْعِ. وَرُوِيَ «خَشَبَةً» بالتَّنوِينِ عَلى الإِفْرَادِ. وقوله: ما لي أَرَاكُمْ عَنْهَا مُعْرِضِينَ: يَعْني عَنْ هذِهِ السُّنَّةِ.

309. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : తన గోడకు తన పొరుగు వాడు గూటం కొట్టుకుంటా నంటే దానికి ఎవడూ అభ్యంతరం పెట్టకూడదు.

ఈ హదీసు వినిపించిన తరువాత అబూ హురైరా, (ప్రజలతో) "మరి మీరు ఈ హదీసును నిర్లక్ష్యం చేస్తున్నారెందుకు? దైవసాక్షి! (మీరు ఎంత వినిపించుకోక పోయినా) నేనీ హదీసును మీ మధ్య ప్రవేశపెట్టితీరుతాను" అని అనేవారు.

'ఖషబహూ' మరియు 'ఖషబతన్'. ఈ పదం రెండు విధాలుగానూ ఉల్లేఖిం చబడింది. 'ఖషబహూ' అన్నది సంయోగ పదం. ఇందులో 'ఖషబ' బహువచనం.

'మీరు వైముఖ్యం చూపటం నేను గమనిస్తున్నాను. అంటే దైవప్రవక్త వారి ఈ ఆదేశం పట్ల వైముఖ్యం చూపుతున్నారని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని అత్యాచారాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని వాణిజ్య ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

రెండు ఇరుగుపొరుగు ఇండ్లకు ఒకే గోడ ఉన్నప్పుడు ఈ సమస్య ఎదురవుతుంది. ఇద్దరికీ ఒకే గోడ ఉన్నప్పుడు దానికి మేకులుగాని, గూటం గాని కొట్టే అవసరం వారిలో ఎవరికైనా ఏర్పడవచ్చు. ఉమ్మడి గోడను ఉపయోగించుకోవటంలో ఆ ఇద్దరికీ సమాన హక్కు ఉంటుంది. అలాంటప్పుడు పొరుగువాని హక్కును కాదనటం సమంజసం కాదు. పొరుగువాడు తన గోడలో మేకు కొట్టుకోవటానికి కూడా అనుమతించకపోవటం మనిషి సంకుచిత స్వభావాన్ని సూచిస్తుంది. కొన్ని సందర్భాలలో ప్రజలు పొరుగింటి నుంచి ఏ కాస్త శబ్దం వచ్చినా ఏదో కొంప మునిగిపోయినట్లు అతిగా ఆవేశపడిపోతుంటారు. ప్రతి చిన్న ఇబ్బందికీ పోట్లాటకు దిగుతుంటారు. ఇవి నైతికంగా ఎంతో దిగజారిన చేష్టలు. ఒక విశ్వాసికి ఇవి ఎంతమాత్రం శోభించవు. పైగా ఇరుగుపొరుగువారి పట్ల ఉత్తమంగా వ్యవహరించాలి. సానుభూతి, సహకార భావాలతో కలిసిమెలసి ఉండాలి.

310. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : అల్లాహ్‌ను, అంతిమదినాన్ని విశ్వసించే వ్యక్తి తన పొరుగువాడిని కష్టపెట్టకూడదు. అల్లాహ్‌ను, అంతిమదినాన్ని విశ్వసించేవాడు అతిథికి మర్యాద చెయ్యాలి. అల్లాహ్‌ను, అంతిమదినాన్ని విశ్వసించేవాడు పలికితే మంచిమాట పలకాలి లేదా ఊరుకోవాలి. *(బుఖారీ - ముస్లిం)*

٣١٠ ـ وعنه، أن رسول الله ﷺ قال: «مَنْ كَانَ يُؤْمِنُ بِاللهِ وَالْيَوْمِ الآخِرِ، فَلا يُؤْذِ جَارَهُ، وَمَنْ كَانَ يُؤْمِنُ بِاللهِ وَالْيَوْمِ الآخِرِ، فَلْيُكْرِمْ ضَيْفَهُ، وَمَنْ كَانَ يُؤْمِنُ بِاللهِ وَالْيَوْمِ الآخِرِ، فَلْيَقُلْ خَيْراً أَوْ لِيَسْكُتْ» متفق عليه.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ఈమాన్ (విశ్వాస) శుభాలను గురించి వివరించటం జరిగింది. పై హదీసులో పేర్కొనబడిన సద్గుణాలు ఒక విశ్వాసిలో గనక లేకపోతే అతని విశ్వాసం శుభరహితమని గ్రహించాలి. ఆచరణలేని విశ్వాసం నిష్ఫల వృక్షంతో సమానం.

٣١١ـ وعن أَبي شُرَيْح الخُزَاعِيِّ رضي الله عنه، أَنَّ النَّبِيَّ ﷺ قال: «مَنْ كَانَ يُؤْمِنُ بِاللهِ وَالْيَوْمِ الآخِرِ، فَلْيُحْسِنْ إِلَى جَارِهِ، وَمَنْ كَانَ يُؤْمِنُ بِاللهِ وَالْيَوْمِ الآخِرِ، فَلْيُكْرِمْ ضَيْفَهُ، وَمَنْ كَانَ يُؤْمِنُ بِاللهِ وَالْيَوْمِ الآخِرِ، فَلْيَقُلْ خَيْراً أَوْ لِيَسْكُتْ» رواه مسلم بهذا اللفظ، وروى البخاري بعضه.

311. హజ్రత్ అబూ షురైహ్ ఖుజాయీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : అల్లాహ్‌ను, అంతిమదినాన్ని విశ్వసించేవాడు తన ఇరుగుపొరుగువారి పట్ల ఉత్తమంగా వ్యవహరించాలి. అల్లాహ్‌ను అంతిమ దినాన్ని విశ్వసించేవాడు తన (ఇంటికి వచ్చిన) అతిథికి గౌరవం ఇవ్వాలి. అల్లాహ్‌ను, అంతిమదినాన్ని విశ్వసించే వాడు పలికితే మంచిమాట పలకాలి లేదా మౌనంగా ఉండాలి. (ఈ హదీసును ఈ వాక్యాలతో ఇమామ్ ముస్లిం ఉల్లేఖించారు. ఇమామ్ బుఖారీ ఇందులోని కొంతభాగాన్ని మాత్రమే ఉల్లేఖించారు.)

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

٣١٢ـ وعن عائشةَ رضي الله عنها قالت: قُلْتُ: يا رسولَ اللهِ! إِنَّ لِي جَارَيْنِ، فَإِلَى أَيِّهِمَا أُهْدِي؟ قال: «إِلَى أَقْرَبِهِمَا مِنْكِ بَاباً» رواه البخاري.

312. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : నేను దైవప్రవక్తతో (మాట్లాడుతూ) "దైవప్రవక్తా! నాకు ఇద్దరు పొరుగువాళ్ళున్నారు. నేను వారిలో కానుకను ఎవరికి ఇవ్వాలి?" అని అడిగాను. దానికి ఆయన "వారిలో ఎవరి గడప నీకు దగ్గరగా ఉంటే వారికి ఇవ్వు" అని చెప్పారు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని కానుకల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇరుగుపొరుగు వారందరికీ కానుకలు పంపే తాహతు లేని పరిస్థితిలో వారిలో ఏ ఒక్కరికో కానుక ఇవ్వదలచుకుంటే తమకు అత్యంత సమీపంలో ఉన్న పొరుగువారికి ఆ కానుక ఇవ్వాలి.

٣١٣ - وعن عبد الله بن عمر رضي الله عنهما قال: قال رسول الله ﷺ: «خَيْرُ الأَصْحَابِ عِنْدَ الله تعالى خَيْرُهُمْ لِصَاحِبِهِ، وَخَيْرُ الجِيرَانِ عِنْدَ الله تعالى خَيْرُهُمْ لِجَارِهِ» رواه الترمذي وقال: حديث حسن.

313. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : తన సహచరుల పట్ల ఉత్తమంగా మెలిగేవాడే దేవుని దృష్టిలో అత్యుత్తమ సహచరుడు. తమ ఇరుగుపొరుగువారి పట్ల ఉత్తమంగా మెలగేవాడే దేవుని దృష్టిలోనూ అత్యుత్తమ పొరుగువాడు. (దీనిని తిర్మిజీ ఉల్లేఖించి 'హసన్'గా పేర్కొన్నారు.)

*(జామె తిర్మిజీలోని సత్కార్యాలు - సత్సంబంధాల అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

'సహచరుడు' అన్న పదం విస్తృతార్థంలో వాడబడింది. తమ నివాస ప్రాంతంలోని సహచరులు, ప్రయాణంలో పరిచితులైన సహచరులందరూ దీని క్రిందికి వస్తారు. జీవితంలో తారసపడే ప్రతి వ్యక్తి పట్లా మంచిగా మెలగాలి. అలాగే ఇరుగుపొరుగువారితో కూడా సత్సంబంధాలు కలిగి ఉండాలి. దైవసామీప్యాన్ని, ఆయన ప్రసన్నతను పొందటానికి ఇదెంతో మేలైన మార్గం.



40వ అధ్యాయం

# ٤٠ ـ بَابُ بِرِّ الْوَالِدَيْنِ وَصِلَةِ الأَرْحَامِ

## తల్లిదండ్రుల యెడల గౌరవాన్ని కలిగి ఉండాలి. బంధువుల హక్కులను నెరవేర్చాలి.

قال الله تعالى: ﴿وَاعْبُدُوا اللَّهَ وَلَا تُشْرِكُوا بِهِ شَيْئًا وَبِالْوَالِدَيْنِ إِحْسَانًا وَبِذِي الْقُرْبَىٰ وَالْيَتَامَىٰ وَالْمَسَاكِينِ وَالْجَارِ ذِي الْقُرْبَىٰ وَالْجَارِ الْجُنُبِ وَالصَّاحِبِ بِالْجَنبِ وَابْنِ السَّبِيلِ وَمَا مَلَكَتْ أَيْمَانُكُمْ﴾ [النساء: ٣٦]، وقال تعالى: ﴿وَاتَّقُوا اللَّهَ الَّذِي تَسَاءَلُونَ بِهِ وَالْأَرْحَامَ﴾ [النساء: ١]، وقال تعالى: ﴿وَالَّذِينَ يَصِلُونَ مَا أَمَرَ اللَّهُ بِهِ أَن يُوصَلَ﴾ الآيـــة [الرعد: ٢١]،

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"మీరంతా అల్లాహ్‌కు దాస్యం చెయ్యండి. ఎవరినీ ఆయనకు భాగస్వాములుగా నిలబెట్టకండి. తల్లిదండ్రుల యెడల సద్భావంతో మెలగండి. బంధువులూ, అనాథలూ, నిరుపేదల పట్ల మంచిగా వ్యవహరించండి. పొరుగున ఉన్న బంధువులు, అపరిచితులైన పొరుగువారు, ప్రక్కనున్న మిత్రులు, బాటసారులు, మీ ఆధీనంలో ఉన్న దాసదాసీజనం పట్ల ఉదార బుద్ధితో వ్యవహరించండి."

*(అన్ నిసా : 36)*

వేరొకచోట ఇలా సెలవిస్తున్నాడు :

"ఏ దేవుని పేరు చెప్పుకొని మీరు పరస్పరం మీ మీ హక్కులను కోరుకుంటారో, ఆ దేవునికి భయపడండి." (అన్ నిసా : 1)

ఇంకొకచోట ఇలా అంటున్నాడు :

"వారి (విశ్వాసుల) వైఖరి ఎలా ఉంటుందంటే, స్థిరపరచండి అని అల్లాహ్ ఆదేశించిన సంబంధాలను స్థిరపరుస్తారు." (అర్రాద్ : 21)

మరొకచోట ఆయన ఇలా అన్నాడు :

"తన తల్లిదండ్రుల పట్ల సద్భావంతో మెలగమని

وقال تعالى: ﴿ وَوَصَّيْنَا ٱلْإِنسَٰنَ بِوَٰلِدَيْهِ حُسْنًا ﴾ [العنكبوت: ٨]،

మేము మానవునికి ఉపదేశించాము." (అల్ అన్కబూత్ : 8)

ఆయన ఇంకా ఇలా అన్నాడు :

وقال تعالى: ﴿ ۞ وَقَضَىٰ رَبُّكَ أَلَّا تَعْبُدُوٓا۟ إِلَّآ إِيَّاهُ وَبِٱلْوَٰلِدَيْنِ إِحْسَٰنًا ۚ إِمَّا يَبْلُغَنَّ عِندَكَ ٱلْكِبَرَ أَحَدُهُمَآ أَوْ كِلَاهُمَا فَلَا تَقُل لَّهُمَآ أُفٍّ وَلَا تَنْهَرْهُمَا وَقُل لَّهُمَا قَوْلًا كَرِيمًا ﴿٢٣﴾ وَٱخْفِضْ لَهُمَا جَنَاحَ ٱلذُّلِّ مِنَ ٱلرَّحْمَةِ وَقُل رَّبِّ ٱرْحَمْهُمَا كَمَا رَبَّيَانِى صَغِيرًا ﴾ [الإسراء: ٢٣، ٢٤]،

"నీ ప్రభువు ఇలా నిర్ణయం చేశాడు: మీరు కేవలం ఆయనను తప్ప మరెవరినీ ఆరాధించకండి. తల్లిదండ్రులతో మంచితనంతో వ్యవహరించండి. ఒకవేళ మీ వద్ద వారిలో ఒకరుగాని ఇద్దరుగాని ముసలివారై ఉంటే, వారి ముందు విసుగ్గా 'ఛీ' అని కూడా అనకండి. వారిని కసురుకుంటూ సమాధానం ఇవ్వకండి. వారితో మర్యాదగా మాట్లాడండి. మృదుత్వమూ, దయాభావమూ కలిగి వారిముందు వినమ్రులై ఉండండి. ఇంకా, "ప్రభూ! బాల్యంలో వారు నన్ను కారుణ్యంతో, వాత్సల్యంతో పోషించినట్లు, నీవు వారిపై కరుణ జూపు" అంటూ ప్రార్థిస్తూ ఉండండి." (అల్ ఇస్రా : 33, 34)

ఇంకొకచోట ఇలా అన్నాడు :

وقال تعالى: ﴿ وَوَصَّيْنَا ٱلْإِنسَٰنَ بِوَٰلِدَيْهِ حَمَلَتْهُ أُمُّهُۥ وَهْنًا عَلَىٰ وَهْنٍ وَفِصَٰلُهُۥ فِى عَامَيْنِ أَنِ ٱشْكُرْ لِى وَلِوَٰلِدَيْكَ ﴾ [لقمان: ١٤].

"మానవుడు తన తల్లిదండ్రుల హక్కును గుర్తించాలని స్వయంగా మేమే అతనికి నిర్దేశించాము. అతని తల్లి బలహీనతపై బలహీనతను సహించి అతనిని తన కడుపున మోసింది. అతను పాలు విడిచిపెట్టటానికి రెండు సంవత్సరాలు పట్టింది. (ఇందుకే మేము అతనికి) "నాకు కృతజ్ఞుడవై ఉండు, నీ తల్లి దండ్రులకు కృతజ్ఞతలు తెలుపు (అని ఉపదేశించాము.)" (లుఖ్మాన్ : 14)

٣١٤ ـ عن أبي عبد الرحمن عبد الله بن مسعود رضي الله عنه قال: سَأَلْتُ النبيَّ ﷺ: أَيُّ الْعَمَلِ أَحَبُّ إلى اللهِ تَعَالى؟ قال: «الصَّلاةُ عَلَى وَقْتِهَا»،

314. హజ్రత్ అబూ అబ్దుర్రహ్మాన్ అబ్దుల్లాహ్ బిన్ మసూద్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (స)ను "దైవానికి ప్రీతికరమైన ఆచరణ ఏది?" అనడిగాను. దానికి ఆయన "వేళకు

قُلْتُ: ثُمَّ أَيٌّ؟ قال: «بِرُّ الْوَالِدَيْنِ»، قُلْتُ: ثُمَّ أَيٌّ؟ قال: «الْجِهَادُ فِي سَبِيلِ اللهِ» متفقٌ عليه.

నమాజు చేయడం" అని సమాధాన మిచ్చారు. నేను "ఆ తరువాత ఏది?" అని అడిగాను. ఆయన (స) "తల్లి దండ్రుల పట్ల మంచిగా మెలగటం" అని అన్నారు. "ఆ తరువాత ఏది?" అని అడిగాను. అందుకాయన "దైవ మార్గంలో పోరాడటం" అని చెప్పారు.
*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని నమాజు వ్యవధుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

వేళకు నమాజు పాటించటమంటే నమాజుకు సమయం కాగానే తొందరగా నమాజు చేసుకోవటం లేదా క్రమం తప్పకుండా పాటించటమని భావం. ప్రాపంచిక కార్యకలాపాల్లో నిమగ్నులై నమాజును నిర్లక్ష్యం చేయటం తగదు. నమాజు మరియు దైవమార్గంలో పోరాటం-ఈ రెండూ ధర్మంలో అత్యంత శ్రేష్ఠమైన ఆచరణలు. వీటితోపాటు తల్లిదండ్రుల పట్ల మంచిగా మెలగటాన్ని ప్రస్తావించటం వల్ల దాని ప్రాముఖ్యత వెల్లడౌతోంది.

٣١٥ـ وعن أبي هريرةَ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «لا يَجْزِي وَلَدٌ وَالِداً إلَّا أنْ يَجِدَهُ مَمْلُوكاً، فَيَشْتَرِيَهُ، فَيُعْتِقَهُ» رواه مسلم.

315. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : బానిసత్వంలో మగ్గుతున్న తండ్రిని కొని ఆయనకు విముక్తి ప్రసాదిస్తేనే తప్ప సంతానం ఆయన రుణం తీర్చుకోలేదు. *(ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని బానిస విముక్తి ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక బానిసకు స్వేచ్ఛ ఇవ్వడమంటే అతనికి ఓ కొత్త జీవితాన్ని ప్రసాదించటంతో సమానం. అదేవిధంగా సంతానం ఇహలోకంలోకి అడుగుపెట్టడానికి తండ్రే మూలకారకుడు గనక ఆయనకు ఎన్ని సేవలు చేసినప్పటికీ సంతానం ఆయన రుణాన్ని తీర్చుకోలేదు. తల్లిదండ్రుల స్థానం అంత గొప్పది మరి!

٣١٦ـ وعنه أيضاً رضي الله عنه، أن رسولَ اللهِ ﷺ قال: «مَنْ كَانَ يُؤْمِنُ باللهِ وَالْيَوْمِ الآخِرِ، فَلْيُكْرِمْ ضَيْفَهُ، وَمَنْ كَانَ

316. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : అల్లాహ్‌ను,

يُؤْمِنُ بِاللهِ وَالْيَوْمِ الآخِرِ، فَلْيَصِلْ رَحِمَهُ، وَمَنْ كَانَ يُؤْمِنُ بِاللهِ وَالْيَوْمِ الآخِرِ، فَلْيَقُلْ خَيْراً أَوْ لِيَصْمُتْ» متفقٌ عليه.

అంతిమదినాన్ని విశ్వసించే వ్యక్తి తన (ఇంటికొచ్చిన) అతిథిని గౌరవించాలి. అల్లాహ్‌ను, అంతిమ దినాన్ని విశ్వసించే వ్యక్తి తన బంధువులతో సత్సంబంధాలు పెట్టుకోవాలి. అల్లాహ్‌ను అంతిమ దినాన్ని విశ్వసించే వ్యక్తి పలికితే మంచి మాటే పలకాలి లేదా మౌనం వహించాలి." *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'సిలారహ్మీ' (బంధుప్రేమ) అంటే బంధువులతో ఉత్తమంగా వ్యవహరించటం, ఎల్లప్పుడూ వారితో సత్సంబంధాలను కొనసాగించటం. కనుక బంధువులెవరయినా అనుచితంగా ప్రవర్తిస్తూ బంధుత్వాల తెగత్రెంపులకు పాల్పడినప్పటికీ బంధుత్వ హక్కులను నిర్వర్తించటంలోగాని, వారితో సత్సంబంధాలు పెట్టుకోవటంలోగాని తమ తరఫునుంచి ఎలాంటి లోటూ రానివ్వకూడదు. 'బంధుప్రేమ' అంటే ఇదే. ఇస్లామీయ షరీఅత్‌లో బంధుప్రేమకు ఎంతో ప్రాముఖ్యముంది. బంధువుల పట్ల మంచిగా మెలగాలని ఇస్లాం తాకీదు చేస్తోంది. తండ్రి తరఫు బంధువులు, తల్లి తరఫు బంధువులు ఇరువర్గాలవారూ బంధువుల క్రిందికే వస్తారు. వారందరితోనూ సద్భావంతో మెలగటం చాలా అవసరం.

٣١٧ ـ وعنه قال: قال رسولُ الله ﷺ: «إنَّ الله تَعَالى خَلَقَ الخَلْقَ حَتَّى إذَا فَرَغَ مِنْهُمْ قَامَتِ الرَّحِمُ، فَقَالَتْ: هٰذَا مَقَامُ الْعَائِذِ بِكَ مِنَ الْقَطِيعَةِ، قال: نَعَمْ أمَا تَرْضَيْنَ أَنْ أَصِلَ مَنْ وَصَلَكِ، وَأَقْطَعَ مَنْ قَطَعَكِ؟ قالت: بَلَى، قال: فَذٰلِكَ لَكِ»، ثم قال رسولُ الله ﷺ: «اقْرَؤُوا إنْ شِئْتُمْ: ﴿ فَهَلْ عَسَيْتُمْ إِن تَوَلَّيْتُمْ أَن تُفْسِدُوا فِي الْأَرْضِ وَتُقَطِّعُوا أَرْحَامَكُمْ ﴿٢٢﴾ أُولَٰئِكَ الَّذِينَ لَعَنَهُمُ اللَّهُ فَأَصَمَّهُمْ وَأَعْمَىٰ

317. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : దేవుడు సమస్త సృష్టిరాసుల్ని సృష్టించిన తరువాత 'బంధుత్వం' లేచి నిలబడి "(దేవా!) నేను బంధుత్వాల తెగత్రెంపుల బారినుండి నీ శరణు కోరుకుంటున్నాను" అని అంది. దానికి "అయితే నీతో సత్సంబంధాలు పెట్టుకున్న వాడితో నేనూ సత్సంబంధాలు పెట్టుకుంటాను. నీతో తెగత్రెంపులు చేసుకున్నవాడితో నేనూ తెగత్రెంపులు చేసుకుంటాను, ఇది

أَبْصَـٰرَهُمْ ﴾ [محمد: ٢٢، ٢٣] متفق عليه.

నీకిష్టమే కదా!" అని అడిగాడు దేవుడు. దానికి బంధుత్వం "ఇష్టమే ప్రభూ!" అని అంది. అప్పుడు దేవుడు "సరే ఆ భాగ్యం నీకు దక్కుతుంది" అని అన్నాడు.

ఈ విషయం గురించి మీకు ప్రమాణం కావాలనుకుంటే దివ్య ఖుర్ఆన్‌లోని ఈ వాక్యాలు చదువుకోండి.

"ఒకవేళ మీరు విముఖులైపోతే భూమిపై మళ్ళీ కల్లోలాన్ని రేకెత్తిస్తారు. పరస్పరం బంధుత్వాల తెగత్రెంపులు చేసుకుంటారు. అల్లాహ్ శపించింది, అంధులు గానూ, బధిరులుగానూ చేసింది ఇలాంటి వారినే." (ముహ మ్మద్ : 22, 23) *(బుఖారీ - ముస్లిం)*

وفي رواية للبخاري: «فقال الله تعالى: مَنْ وَصَلَكِ، وَصَلْتُهُ، وَمَنْ قَطَعَكِ، قَطَعْتُهُ».

బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో "దేవుడు ఇలా అన్నాడు : నీతో సత్సంబంధాలు పెట్టుకున్నవాడితో నేనూ సత్సంబంధాలు పెట్టుకున్నాను. నీతో తెగత్రెంపులు చేసుకున్నవాడితో నేనూ తెగత్రెంపులు చేసుకున్నాను" అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

బంధువుల పట్ల మంచిగా మెలిగితే దేవుడు కూడా సంతోషిస్తాడు. దీనికి భిన్నంగా బంధువుల హక్కుల్ని నెరవేర్చకుండా వారితో సత్సంబంధాలు కొనసాగించటానికి నిరాకరించటం దైవాగ్రహానికి కారణభూతమవుతుంది. ఈ హదీసు కూడా బంధుప్రేమను గురించి తాకీదు చేస్తోంది.

318. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం ఒక వ్యక్తి దైవప్రవక్త (స) దగ్గరికి వచ్చి, "దైవప్రవక్తా! నా సత్ప్రవర్తనకు అందరికన్నా ఎక్కువ హక్కుదారులెవరు?" అని అడిగాడు. దానికి ఆయన "నీ తల్లి" అని చెప్పారు. "ఆ తరువాత ఎవరు?" అని అడిగాడా వ్యక్తి. దానికి ఆయన 'నీ తల్లి' అనే చెప్పారు. ఆ వ్యక్తి మళ్ళీ, "ఆ తరువాత ఎవరు?" అని అడిగాడు. అప్పుడు కూడా "నీ తల్లి" అనే చెప్పారు దైవప్రవక్త (స). ఆ వ్యక్తి మళ్ళీ అడిగాడు "ఆ తరువాత ఎవరు?" అని. అప్పుడు ఆయన 'నీ తండ్రి' అని చెప్పారు.

*(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: "దైవ ప్రవక్తా! నా సత్ప్రవర్తనకు ఎవరెక్కువ హక్కుదారులు?" అని ఆ వ్యక్తి అడగ్గా "నీ తల్లి. ఆ తరువాత నీ తల్లే. ఆ తరువాత కూడా నీ తల్లే. ఆ తరువాత నీ తండ్రి. తరువాత నీకు ఎవరెంత దగ్గరి వారయితే వారు" అని ఆయన చెప్పారు.

'సహాబా' అంటే సహచర్యం, సత్ప్రవర్తన అన్న అర్థంలో వాడబడింది. 'సుమ్మ అబాక' అంటే ఆ తరువాత నీవు నీ తండ్రిపట్ల మెలగు అని అర్థం. 'అబాక' అనుకుంటే వాక్యంలో ఓ క్రియ అంతర్థానంగా ఉందని భావించాల్సి వస్తుంది. కాని వేరొక ఉల్లేఖనంలో స్పష్టంగా

٣١٨ ـ وعنه رضي الله عنه قال: جَاءَ رَجُلٌ إلى رسولِ الله ﷺ فقال: يارسولَ الله! مَنْ أَحَقُّ النَّاسِ بِحُسْنِ صَحَابَتِي؟ قال: «أُمُّكَ»، قال: ثُمَّ مَنْ؟ قال: «أُمُّكَ»، قال: ثُمَّ مَنْ؟ قال: «أُمُّكَ»، قال: ثُمَّ مَنْ؟ قال: «أَبُوكَ» متفقٌ عليه.

وفي روايةٍ: يا رسولَ الله! مَنْ أَحَقُّ بِحُسْنِ الصُّحْبَةِ؟ قال: «أُمُّكَ، ثُمَّ أُمُّكَ، ثُمَّ أُمُّكَ، ثُمَّ أَبَاكَ، ثُمَّ أَدْنَاكَ أَدْنَاكَ». وَ«الصَّحَابَةُ» بِمَعْنَى: الصُّحْبَةِ. وقوله: «ثُمَّ أَبَاكَ» هٰكَذَا هو منصوب بفعلٍ محذوفٍ، أي: ثم بِرَّ أباك. وفي رواية: «ثُمَّ أَبُوكَ»، وهذا واضِح.

'సుమ్మ అబూక' అని ఉంది. (ఈ సందర్భంలో క్రియ అంతర్ధానంగా ఉందని భావించాల్సిన అవసరం ఉండదు.)

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు సత్సంబంధాల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసు ద్వారా కుమారులు లేక కుమార్తెలు చూపే సత్ప్రవర్తనకు తండ్రికన్నా తల్లి మూడు రెట్లు ఎక్కువ హక్కుదారు అవుతుందని తెలుస్తోంది. దీనికి స్త్రీ శారీరక బలహీనత ఒక కారణం కావచ్చు. ఈ శారీరక బలహీనత కారణంగా తల్లి తన సంతానంపై ఎక్కువగా ఆధారపడవలసి వస్తుంది. రెండో విషయం ఏమిటంటే తల్లి తన సంతానం కోసం మూడు దుర్భరమైన కష్టాలను భరిస్తుంది. ఈ కష్టాల్లో తండ్రి ఏ విధంగానూ పాలుపంచుకోడు. 1. తొమ్మిది మాసాలపాటు తల్లి బిడ్డను తన కడుపున మోస్తుంది. 2. జీవన్మరణాల సమస్య వంటి ప్రసవవేదనను భరిస్తుంది. 3. ప్రసవించిన తరువాత రెండు సంవత్సరాల పాటు బిడ్డకు పాలిస్తుంది. ఈ కష్టాలవల్ల రాత్రిళ్ళు ఆమె నిద్రపాడవుతుంది. ఆమె సౌందర్యం కళావిహీనమై పోయి ఆరోగ్యం దెబ్బతింటుంది. బిడ్డ ఆరోగ్యాన్ని కాపాడటం కోసం ఒక్కోసారి ఆమెకు ఆహార విషయంలో ఎన్నో జాగ్రత్తలు పాటించవలసి ఉంటుంది. ఎడతెరిపి లేకుండా ఇన్ని కష్టాలు, బాధలు భరించాల్సి వస్తుంది. కనుకనే ఇస్లాం ధర్మం తల్లికి ఎంతో ఉన్నత స్థానాన్ని ప్రసాదించింది.

319. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం): "ముసలి వారై పోయిన తల్లి దండ్రులు - వారిరువురిలో ఒక్కరుగాని లేక ఇద్దరుగాని బ్రతికుండగా (వారికి సేవ చేసుకొని) స్వర్గంలోకి ప్రవేశించ లేకపోయినవాడి ముక్కుకి మన్ను తగల! వాడి ముక్కుకి మన్ను తగల! వాడి ముక్కుకి మన్ను తగల!" అని మూడు సార్లు శపించారు. *(ముస్లిం)*

٣١٩ ـ وعنه، عن النَّبِيِّ ﷺ قال: «رَغِمَ أَنْفُ، ثُمَّ رَغِمَ أَنْفُ، ثُمَّ رَغِمَ أَنْفُ مَنْ أَدْرَكَ أَبَوَيهِ عِنْدَ الْكِبَرِ، أَحَدَهُمَا أَوْ كِلَيْهِمَا، فَلَمْ يَدْخُلِ الجَنَّةَ» رواه مسلم.

(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ముక్కుకి మన్ను తగలడమంటే పరాభవం పాలవటమని అర్థం. తల్లిదండ్రుల యెడల మంచిగా మెలిగి, వారికి సేవ చేసి దైవప్రసన్నతను పొందనివాడు నిజంగా దురదృష్టవంతుడే. దీనికి భిన్నంగా తల్లిదండ్రులకు సేవచేసినవాడికి పరలోకంలో స్వర్గసుఖాలు లభిస్తాయి. తల్లిదండ్రులు ముసలివారయినా, కాకపోయినా ఎల్లప్పుడూ వారికి సేవ చేస్తుండాలి. సాధారణంగా వృద్ధాప్యంలో తల్లిదండ్రులు తమ సంతానంపై ఎక్కువగా ఆధారపడవలసి వస్తుంది. అందుకే హదీసులో ప్రత్యేకంగా వృద్ధాప్య ప్రస్తావన తేబడింది. ఇలాంటి దైన్యస్థితిలో తల్లిదండ్రుల్ని నిస్సహాయులుగా వదలిపెట్టడం మనిషి కసాయితనాన్ని సూచిస్తుంది. తాము చేసిన ఈ పాపానికి శిక్షగా సంతానం పరలోకంలో స్వర్గభాగ్యాన్ని కోల్పోతుంది.

٣٢٠ ـ وعنه رضي الله عنه أن رجلاً قال: يا رسولَ الله! إنَّ لِي قَرَابَةً أَصِلُهُمْ وَيَقْطَعُونِي، وَأُحْسِنُ إِلَيْهِمْ وَيُسِيئُونَ إِلَيَّ، وَأَحْلُمُ عَنْهُمْ وَيَجْهَلُونَ عَلَيَّ، فقال: «لَئِنْ كُنْتَ كَمَا قُلْتَ، فَكَأَنَّمَا تُسِفُّهُمُ المَلَّ، وَلا يَزَالُ مَعَكَ مِنَ اللهِ ظَهِيرٌ عَلَيْهِمْ مَا دُمْتَ عَلَى ذٰلِكَ» رواه مسلم.

وَ«تُسِفُّهُم» بضم التاءِ وكسرِ السين المهملةِ

320. హజ్రత్ అబూ హురైరా (రజి)గారే చేసిన కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (స) వద్దకు వచ్చి, "దైవప్రవక్తా! నా బంధువులు కొందరున్నారు. నేను వారితో సత్సంబంధాలు కొనసాగించాలని ప్రయత్నిస్తున్నప్పటికీ వారు మాత్రం నాతో తెగత్రెంపులు చేసుకోవాలని చూస్తున్నారు. నేను వారిపట్ల మంచిగా మెలగుతుంటే వారేమో నాకు కీడు తలపెడుతున్నారు. నేను వారిపట్ల ఉదారవైఖరిని అనుసరిస్తుంటే వారు మాత్రం నాపట్ల మూర్ఖంగా ప్రవర్తిస్తున్నారు" అని దైవప్రవక్తకు తన గోడు వినిపించుకున్నాడు. అతని మాటలు విని ఆయన, 'నువ్వు చెప్పింది నిజమే అయితే నువ్వు వారి నోళ్ళల్లో వేడిబూడిదను పోస్తున్నావనుకో. నువ్వు మాత్రం వారిపట్ల ఇలాగే సత్ప్రవర్తనతో మెలగుతున్నంతకాలం దేవుని తరఫు నుండి వారికి వ్యతిరేకంగా ఒక సహాయకుడు నీ వెంట ఉంటాడు" అని అన్నారు. *(ముస్లిం)*

وتشديدِ الفاءِ، وَ«المَلُّ» بفتح الميم، وَتشديدِ اللام وهو الرَّمَادُ الحَارُّ: أيْ كَأَنَّمَا تُطْعِمُهُمُ الرَّمَادَ الحَارَّ، وَهُوَ تَشْبِيهٌ لِمَا يَلْحَقُهُمْ مِنَ الإثْمِ بِمَا يَلْحَقُ آكِلَ الرَّمَادِ الحَارِّ مِنَ الألَمِ، وَلا شَيْءَ عَلَى هَذَا المُحْسِنِ إلَيْهِمْ، لَكِنْ يَنَالُهُمْ إثْمٌ عَظِيمٌ بِتَقْصِيرِهِمْ فِي حَقِّهِ، وَإدْخَالِهِمُ الأذَى عَلَيْهِ، وَالله أعلم.

'తుసిప్ఫుహుముల్ మల్ల' అంటే నువ్వు వారికి వేడిబూడిద తినిపిస్తున్నావని అర్థం. దైవప్రవక్త (సల్లం) ఇచ్చిన ఈ ఉదాహరణలోని ఆంతర్యం ఏమిటంటే, కాలుతున్న బూడిద తింటున్నవాడికి నోరు కాలినట్లే బంధుత్వాల తెగ త్రెంపులకు పాల్పడుతున్నవాడి పాపం కూడా పండుతూ ఉంటుంది. అయితే వారిపట్ల మంచిగా మెలగుతున్న వ్యక్తి మాత్రం నిందార్హుడు కాడు. అతని హక్కుల్ని కాలరాసి, అతణ్ణి బాధపెడుతున్నందుకు బంధువిచ్ఛిత్తికి పాల్పడిన వారే మహాపరాధులుగా పరిగణించబడతారు. (వల్లాహు ఆలము)

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇతర బంధువులు తమ పట్ల అనుచితంగా ప్రవర్తిస్తున్నారన్న నెపంతో తాము కూడా వారితో బంధుత్వాన్ని త్రెంచుకోవటం భావ్యం కాదు. ఎందుకంటే ఇస్లాంలో ఇతర బంధువులు తమకు అపకారం తలపెట్టినప్పటికీ తాము మాత్రం వారితో ఉపకార భావంతోనే మెలగాలని తాకీదు చేయబడింది. బంధువులతో ఎల్లప్పుడూ మంచిగా మెలిగేవాడు దేవుని దృష్టిలో అత్యంత గౌరవనీయుడిగా, ఆదరణీయుడిగా పరిగణించబడతాడు. అలాంటి వ్యక్తి కోసం దైవం ఆకాశాల నుండి ప్రత్యేక సహాయకులను పంపుతాడు. దీనికి భిన్నంగా బంధుత్వ తెగత్రెంపులకు పాల్పడేవాడు దేవుని దృష్టిలో అత్యంత నీచుడిగా పరిగణించబడతాడు. అతని పర్యవసానం కూడా కాలుతున్న బూడిద తింటున్న వాడి మాదిరిగా అత్యంత హీనంగా ఉంటుంది.

٣٢١ ـ وعن أَنسٍ رضي الله عنه أنَّ رسولَ الله ﷺ قال: «مَنْ أَحَبَّ أَنْ يُبْسَطَ له في رِزْقِهِ، وَيُنْسَأَ لَهُ في أَثَرِهِ، فَلْيَصِلْ

321. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : తన ఉపాధిలో సమృద్ధిని, ఆయుష్షులో పెరుగుదలను

رَحِمَهُ» متفقٌ عليه. ومَعْنَى «يُنْسَأَ لَهُ فِي أَثَرِهِ»، أَيْ: يُؤَخَّرَ له فِي أَجَلِهِ وَعُمْرِهِ.

కోరుకుంటున్నవాడు తన బంధువులతో సత్సంబంధాలు పెట్టుకోవాలి.

(బుఖారీ - ముస్లిం)

'యున్సఅ లహూ ఫీ అసరిహీ' అంటే 'తనకు దీర్ఘాయుష్షు వొసగబడాలని' అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

బంధువులతో మంచిగా మెలిగే వ్యక్తికి పరలోకంలో ఎలాగూ పుణ్యం లభిస్తుంది. దాంతోపాటు ఇహలోకంలోనూ అతనికి పై హదీసులో పేర్కొనబడిన రెండు రకాల ప్రయోజనాలు కలుగుతాయి. ఉపాధిలో వృద్ధినొసగబడటమంటే దైవం తరఫునుండి నిజంగానే అతని ఉపాధిలో అభివృద్ధి కనిపించవచ్చు లేదా అతని ఉపాధిలో శుభం కలుగుతుందన్న అర్థమైనా కావచ్చు. అదేవిధంగా ఆయుష్షులో పెరుగుదల అంటే నిజంగానే అల్లాహ్ అతని ఆయుష్షుని పొడిగించవచ్చు లేదా అతని ఆయుష్షులో శుభాన్ని ప్రసాదించవచ్చు. ఆయుష్షులో శుభం కలిగితే జీవితంలో మనిషి సర్వతోముఖాభివృద్ధిని సాధిస్తాడు.

٣٢٢ - وعنه قال: كَانَ أَبُو طَلْحَةَ أَكْثَرَ الأَنْصَارِ بِالمَدِينَةِ مَالاً مِنْ نَخْلٍ، وَكَانَ أَحَبُّ أَمْوَالِهِ إِلَيْهِ بَيْرَحَاءَ، وَكَانَتْ مُسْتَقْبِلَةَ المَسْجِدِ، وَكَانَ رسولُ الله ﷺ يَدْخُلُهَا، وَيَشْرَبُ مِنْ مَاءٍ فِيهَا طَيِّبٍ، فَلَمَّا نَزَلَتْ هذه الآيَةُ: ﴿لَن تَنَالُوا۟ ٱلْبِرَّ حَتَّىٰ تُنفِقُوا۟ مِمَّا تُحِبُّونَ﴾ [آل عمران: ٩٢] قَامَ أَبُو طَلْحَةَ إلى رسول الله ﷺ فقال: يا رسولَ الله! إِنَّ اللهَ تَبَارَكَ وَتَعَالَى يقول: ﴿لَن تَنَالُوا۟ ٱلْبِرَّ حَتَّىٰ تُنفِقُوا۟ مِمَّا تُحِبُّونَ﴾ وإِنَّ أَحَبَّ مَالِي إِلَيَّ بَيْرَحَاءُ، وَإِنَّهَا صَدَقَةٌ للهِ تَعَالَى، أَرْجُو بِرَّهَا وَذُخْرَهَا عِنْدَ اللهِ

322. హజ్రత్ అనస్ (రజి) గారే చేసిన కథనం : మదీనా నగరంలోని అన్సార్ ముస్లింలందరిలో హజ్రత్ అబూ తల్హా (రజి) గొప్ప ధనికులు. ఆయనకు అనేక ఖర్జూర తోటలుండేవి. ఆ తోటల్లో ఆయనకు 'బైరహా' తోట అంటే ఎంతో యిష్టం. అది మస్జిదె నబవీకి ముందు భాగంలో ఉండేది. దైవప్రవక్త (స) తరచూ ఆ తోటలోకి వెళుతుండేవారు. అక్కడ దొరికే మంచినీళ్ళు త్రాగేవారు. ఆ కాలంలోనే "మీరు అమితంగా ప్రేమించే వస్తువులను (అల్లాహ్ మార్గంలో) ఖర్చుపెట్టనంతవరకు మీరు సత్కార్యస్థాయికి చేరుకోలేరు" అనే దైవసూక్తి (అలి ఇమ్రాన్ : 92) అవతరిం

تعالى، فَضَعْهَا يارسولَ اللهِ! حَيْثُ أَرَاكَ اللهُ. فقال رسولُ اللهِ ﷺ: «بَخٍ! ذلِكَ مَالٌ رَابِحٌ، ذلِكَ مَالٌ رَابِحٌ! وَقَدْ سَمِعْتُ مَا قُلْتَ، وَإِنِّي أَرَى أَنْ تَجْعَلَهَا فِي الأَقْرَبِينَ»، فقال أَبُو طَلْحَةَ: أَفْعَلُ يا رسولَ اللهِ! فَقَسَمَهَا أَبُو طَلْحَةَ فِي أَقَارِبِهِ وبَنِي عَمِّهِ. متفقٌ عليه. وَسَبَقَ بَيَانُ أَلْفَاظِهِ فِي بَابِ الإِنْفَاقِ مِمَّا يُحِبُّ.

చింది. ఈ సూక్తి అవతరించినప్పుడు హజ్రత్ అబూ తల్హా (రజి) దైవప్రవక్త ముందు ఇలా ప్రకటించారు:

“దైవప్రవక్తా! ‘మీరు అమితంగా ప్రేమించే వస్తువులను (తన మార్గంలో) ఖర్చుపెట్టనంతవరకు మీరు సత్కార్య స్థాయికి చేరుకోలేరని దేవుడంటున్నాడు. అలాగైతే నాకున్న సంపద మొత్తంలో బైరహా తోట నాకు అత్యంత ప్రీతికర మైనది. దాన్ని నేను దైవమార్గంలో దానం చేస్తున్నాను. దానివల్ల నాకు పుణ్యం లభిస్తుందని, ఇంకా పరలోకంలోనూ దాని పుణ్యం నాకోసం నిల్వచేసి ఉంచ బడుతుందని ఆశిస్తున్నాను. దేవుడు ఎలా ఆజ్ఞాపిస్తే అలా మీరు దీనిని వినియోగించండి.”

ఆయన మాటలు విని దైవప్రవక్త (స) “ఓహో! ఇదెంతో లాభదాయకమైన సంపదే. నిజంగా ఇదెంతో లాభదాయక మైన సంపద. నువ్వు చెప్పిన మాటలన్నీ నేను విన్నాను. అయితే నువ్వు ఈ సంపదను (అభాగ్యులైన) నీ బంధువు లకు పంచిపెడితే సముచితంగా ఉంటుందని నేను భావిస్తున్నాను” అని అన్నారు.

దానికి హజ్రత్ అబూ తల్హా (రజి) “మీరు చెప్పినట్లే చేస్తాను దైవప్రవక్తా!” అని అన్నారు. (ఆ తరువాత దైవప్రవక్త సలహాననుసరించి) ఆయన ఆ తోటను

తన బంధువులకు, చిన్నాన్న, పెద్దనాన్న కుమారులకు పంచివేశారు."

(బుఖారీ - ముస్లిం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు ప్రీతికరమైన వస్తువుల త్యాగానికి సంబంధించిన అధ్యాయంలో కూడా వచ్చింది. ఈ హదీసు చివరి భాగంలో బంధుప్రేమ గురించి చెప్పబడింది కాబట్టి సదరు అధ్యాయం క్రింద కూడా దీనిని ప్రస్తావించటం జరిగింది. దీని ద్వారా బోధపడే విషయమేమిటంటే, దానధర్మాలు చేసినప్పుడు ముందుగా తమ సన్నిహిత బంధువులను దృష్టిలో పెట్టుకోవాలి. వారు అవసరాల్లో ఉన్నారనుకుంటే వారికే ఇవ్వాలి. ఆ తరువాత కూడా సదఖా సొమ్ము మిగిలి ఉంటే దానిని ఇతరులకు కూడా దానం చేయవచ్చు. దీనికి భిన్నంగా ఇతరులను సుఖపెట్టి సొంత బంధువులనే విస్మరించటం ఎంతమాత్రం వాంఛనీయం కాదు.

323. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) వద్దకు వచ్చి, "నేను (ధర్మం కోసం) ప్రస్థానం (హిజ్రత్) చేస్తాననీ, జిహాద్ (ధర్మయుద్ధం)లో పాల్గొంటానని మీతో ప్రమాణం చేసి చెబుతున్నాను. (దీనివల్ల) నాకు దైవం తరఫునుండి పుణ్యం లభించాలని కోరుకుంటున్నాను" అని అన్నాడు. అది విని దైవప్రవక్త, ఆ వ్యక్తితో 'నీ తల్లిదండ్రుల్లో ఒకరైనా బ్రతికి ఉన్నారా?' అనడిగారు. దానికావ్యక్తి, 'అవును, ఇద్దరూ బ్రతికి ఉన్నారు' అని సమాధానమిచ్చాడు. అందుకాయన 'నువ్వు నిజంగానే దేవుడు నీకు పుణ్యాన్ని ప్రసాదించాలని కోరుకుంటున్నావా?' అని అడిగారు. అతను 'అవును' అన్నాడు. అప్పుడాయన 'అలాగయితే నువ్వు నీ తల్లిదండ్రుల దగ్గరికి తిరిగి వెళ్ళిపో.

٣٢٣ ـ وعن عبدِ الله بنِ عمرِو بنِ العاص رضي الله عنهما قال: أَقْبَلَ رَجُلٌ إلى نَبِيِّ اللهِ ﷺ، فقال: أُبَايِعُكَ عَلى الهِجْـرَةِ وَالجِهَـادِ أَبْتَغِـي الأَجْـرَ مِـنَ الله تعالى. قال: «فَهَلْ لَكَ مِنْ وَالِدَيْكَ أَحَدٌ حَيٌّ؟» قال: نَعَمْ بَلْ كِلاهُمَا قال: «فَتَبْتَغِي الأَجْرَ مِنَ اللهِ تعالى؟»، قال: نَعَمْ. قال: «فَارْجِعْ إلَى وَالِدَيْكَ، فَأَحْسِنْ صُحْبَتَهُمَا» متفقٌ عليه. وهذا لَفْظُ مسلِمٍ.

وفي رواية لهما: جاء رجل فاستأذنه في الجهاد فقال: «أَحَيٌّ وَالِدَاكَ؟» قال: نعم، قال: «فَفِيهِمَا فَجَاهِدْ».

వారిద్దరికీ బాగా సేవ చెయ్యి (అందులోనే నీకు ఆ పుణ్యం లభిస్తుంది)' అని చెప్పి పంపించారు. (బుఖారీ - ముస్లిం) వాక్యాలు మాత్రం ముస్లింవి.

బుఖారీ - ముస్లింలలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి తనను ధర్మయుద్ధంలో పాల్గొనడానికి అనుమతించమని కోరాడు. దానికి ఆయన "నీ తల్లిదండ్రులు బ్రతికి ఉన్నారా?" అని అడిగారు. ఆ వ్యక్తి 'ఉన్నార'న్నాడు. అతని జవాబు విని ఆయన "అయితే వారిద్దరి సేవలోనే పోరాడుతూ ఉండు" అని చెప్పి పంపించారు.

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సాధారణ పరిస్థితుల్లో జిహాద్ సామాజిక బాధ్యత(ఫర్జె కిఫాయా)గా పరిగణించబడుతుంది. అలాంటప్పుడు ముస్లింలందరూ కాకుండా పరిస్థితుల స్వరూపానికి అనుగుణంగా కొంతమంది సైన్యంలో చేరితే అందరి తరపున ఆ బాధ్యత నెరవేరుతుంది. ఇలాంటి సాధారణ పరిస్థితుల్లో సైన్యంలో చేరాలన్నా లేక యుద్ధంలో పాల్గొనాలన్నా తల్లిదండ్రుల అనుమతిని పొందటం అవసరం. ఎందుకంటే తల్లిదండ్రుల సేవ వైయక్తిక విధి (ఫర్జె ఐన్). అంటే ప్రతి ఒక్కరూ దాన్ని నిర్వర్తించి తీరాలి. 'ఫర్జె కిఫాయా' కోసం 'ఫర్జె ఐన్'ను వదలిపెట్టడం ధర్మసమ్మతం కాదు. పై హదీసులో చెప్పబడిన విషయం ఈ సందర్భానికి సంబంధించినదే. అయితే కొన్ని పరిస్థితుల్లో జిహాద్ కూడా వైయక్తిక విధి (ఫర్జె ఐన్)గా మారిపోతుంది. అలాంటి సందర్భాల్లో జిహాద్‌లో పాల్గొనటానికి తల్లిదండ్రుల అనుమతి అవసరం లేదు. ఎందుకంటే ఆ పరిస్థితిలో ప్రతి ఒక్కరూ వైయక్తికంగా జిహాద్‌లో పాల్గొనటం అనివార్యమయిపోతుంది. ముఖ్యంగా శత్రుసైన్యాలు ఇస్లామీయ రాజ్యంపైకి దండెత్తివచ్చినప్పుడు ఇలాంటి పరిస్థితి ఆసన్నమవుతుంది.

324. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: ఒక బంధువు ఉపకారం చేస్తే దానికి బదులుగా ఉపకారం చేసేవాడు (నిజమైన) బంధుప్రియుడు కాడు. తన బంధువులు తనతో తెగత్రెంపులు చేసుకున్నప్పటికీ వారితో సత్సంబంధాలు కొనసాగించేవాడే (సిసలైన) బంధుప్రియుడు. *(బుఖారీ)*

٣٢٤ ـ وعنه، عن النَّبِيِّ ﷺ قال: «لَيْسَ الوَاصِلُ بِالمُكافِىءِ وَلَكِنَّ الوَاصِلَ الَّـذي إذَا قَطَعَـتْ رَحِمُـهُ وَصَلَهَـا» رواه البخاري.

وَ«قَطَعَتْ» بفتحِ القَافِ وَالطَّاءِ.
و«رَحِمُهُ» مَرْفُوعٌ.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

బంధుప్రేమ (సిలారహ్మీ) బంధువుల మధ్య ఎలాంటి సద్భావనను, సదభిప్రాయాన్ని కోరుకుంటుందో ఈ హదీసు వివరిస్తోంది. తమకు ఉపకారం చేసే బంధువులకు ఉపకారం చేయడంలో గొప్పేముంది? అది బంధుప్రేమ కాదు. ఒక ఉపకారికి ఉపకారం చేసినట్లవుతుంది అంతే! తోటి బంధువులెవరైనా తమ పట్ల అనుచితంగా ప్రవర్తిస్తూ, తమతో బంధుత్వాన్ని త్రెంచుకోవటానికి ప్రయత్నిస్తున్నప్పటికీ తాము మాత్రం విశాల హృదయంతో వారిని మన్నిస్తూ, వారి కీడుకు బదులుగా మేలు చేసి తమ ఉదారత్వాన్ని ప్రదర్శించాలి. వారితో బంధుత్వ సంబంధాలను కొనసాగించడానికి ముందుకు రావాలి. అసలు సిసలైన బంధుప్రేమ అంటే ఇది! ఇస్లాం కోరేది కూడా ఇలాంటి బంధుప్రేమనే! ఇతరులు మనల్ని నీచంగా చూసినప్పుడు మనం వారిపట్ల సద్భావంతో మెలగటానికి అహం అడ్డొస్తుంది. కాని ఆ అహంభావాన్ని అణచుకొని షరీఅత్ ఆదేశాల్ని పాటించాలి. అయితే అది అందరికీ సాధ్యమయ్యే పని కాదు. మరోవైపు పరిపూర్ణ విశ్వాసాన్ని పొందాలంటే మనసులోని అహంభావాన్ని అణచుకోక తప్పదు.

325. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు : "బంధుత్వం దైవ పీఠానికి వ్రేలాడబడి "నాతో సత్సంబంధాలు పెట్టుకున్నవాడితో దేవుడు కూడా సత్సంబంధాలు పెట్టుకొనుగాక! నన్ను విచ్ఛిన్నం చేసినవాడిని దేవుడు కూడా

٣٢٥ ـ وعن عائشةَ قالت: قال رسولُ الله ﷺ: «الرَّحِمُ مُعَلَّقَةٌ بِالعَرْشِ تَقُـولُ: مَـنْ وَصَلَنِـي وَصَلَـهُ اللهُ، وَمَـنْ قَطَعَنِي قَطَعَهُ اللهُ» متفقٌ عليه.

విచ్ఛిన్నం చేయుగాక!' అని ప్రార్థిస్తూ ఉంటుంది." (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

బంధుత్వం మాట్లాడటం, దేవునితో సంభాషించటం అసంభవమేమీ కాదు. దేవుడు తలచుకుంటే ఏమైనా చేయగలడు. సృష్టిలోని ప్రతి వస్తువుకీ గ్రహణ శక్తినీ, మాట్లాడే సామర్థ్యాన్నీ ప్రసాదించగలడు.

٣٢٦ - وعــن أُمِّ المُــؤْمِنِيــنَ مَيْمُونَةَ بِنْتِ الحَارِثِ رضي الله عنها أَنَّهَا أَعْتَقَتْ وَلِيدَةً وَلَمْ تَسْتَأْذِنِ النَّبِيَّ ﷺ، فَلَمَّا كَانَ يَوْمُهَا الَّذي يَدُورُ عَلَيْهَا فِيهِ، قالت: أَشَعَرْتَ يا رسولَ الله! أَنِّي أَعْتَقْتُ وَلِيدَتِي؟ قال: «أَوَ فَعَلْتِ؟»، قالت: نَعَمْ. قال: «أَمَا إِنَّكِ لَوْ أَعْطَيْتِهَا أَخْوَالَكِ كان أَعْظَمَ لِأَجْرِكِ» متفقٌ عليه.

326. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ మైమూనా బిన్తె హారిస్ (రజి.అన్హా) కథనం ప్రకారం ఆమె ఒకసారి ఒక దాసికి బానిసత్వం నుంచి స్వేచ్ఛను ప్రసాదించారు. ఈ విషయంలో ఆమె దైవప్రవక్త (స) నుండి అనుమతి తీసుకోలేదు. ఆమె దాంపత్య వంతు వచ్చిన రోజు దైవప్రవక్త (సల్లం) ఆమె వద్దకు వెళ్ళారు. అప్పుడు ఆమె "దైవ ప్రవక్తా! మీరీ విషయం గమనించారా? నేను నా దాసికి విముక్తి ప్రసాదించాను" అని అన్నారు. దానికి ఆయన "నిజంగా అలా చేశావా?" అని అడిగారు. అందు కామె 'అవున'ని సమాధానమిచ్చారు. అప్పుడు, "నీవా దాసిని నీ మేనమామ లలో ఎవరికైనా ఇచ్చివుంటే (దాంతో పాటు బంధుప్రేమ కనబరచినందుకు) నీకు మరింత పుణ్యం లభించి ఉండేది కదా!' అని అన్నారు దైవప్రవక్త (సల్లం) (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని కానుకల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక స్త్రీ తన సొంత సొమ్మును తనకు యిష్టమైన రీతిలో వినియోగించుకోగలదు. దానికోసం భర్తనుండి అనుమతి పొందాల్సిన అవసరం లేదు. అయితే భర్త సొమ్మును ఆ విధంగా వినియోగించే హక్కు ఆమెకు లేదు.

ఈ హదీసు ద్వారా బోధపడే రెండో విషయం ఏమిటంటే, అభాగ్యులైన బంధువులకు దానం ఇవ్వడం ఒక బానిసకు స్వేచ్ఛ కల్పించటం కన్నా ఎక్కువ శ్రేష్ఠమైన పుణ్యకార్యం అనిపించుకుంటుంది. ఎందుకంటే బానిసకు విముక్తి కలిగించడమంటే ఒక విధంగా దానం చేయటంతో సమానం. కాని అభాగ్యులైన బంధువులకు దానం చేయటం వల్ల ఒక వైపు దానం చేసినందుకు పుణ్యం లభించటంతోపాటు మరోవైపు బంధుప్రేమ వెల్లడించినందుకు కూడా పుణ్యం లభిస్తుంది.

٣٢٧ ـ وعن أَسْمَاءَ بِنْتِ أَبي بَكْرٍ الصِّدِّيقِ رضي الله عنهما قالت: قَدِمَتْ عَلَيَّ أُمِّي وَهِيَ مُشْرِكَةٌ فِي عَهْدِ رسولِ الله ﷺ، فَاسْتَفْتَيْتُ رسولَ الله ﷺ قُلتُ: قَدِمَتْ عَلَيَّ أُمِّي وَهِيَ رَاغِبَةٌ، أَفَأَصِلُ أُمِّي؟ قال: «نَعَمْ صِلِي أُمَّكِ» متفقٌ عليه.

327. హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (రజి) కుమార్తె అస్మా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త(కు మరియు మక్కా బహుదైవారాధకులకు మధ్య జరిగిన హుదైబియా ఒప్పంద) కాలంలో ఒకసారి మా అమ్మ నా దగ్గరికి వచ్చింది. అప్పటికి ఆమె ఇంకా బహుదైవారాధకురాలిగానే ఉంది. నేను ఆమె వచ్చిన సంగతి దైవప్రవక్త (సల్లం) ముందు ప్రస్తావిస్తూ "దైవప్రవక్తా! మా అమ్మ నా దగ్గరికి వచ్చి ఉంది. ఆమె నా నుండి సద్వర్తనను ఆశిస్తోంది. మరి నేను (బహుదైవారాధకురాలైన) మా అమ్మ పట్ల మంచిగా మెలగవచ్చా?'' అని అడిగాను. అందుకాయన "అవును, నువ్వు మీ అమ్మ పట్ల (తప్పకుండా) సత్ప్రవర్తనతో మెలగాలి'' అని అన్నారు.

(బుఖారీ - ముస్లిం)

وقولُهَا: «رَاغِبَةٌ»، أَيْ: طَامِعَةٌ عِنْدِي تَسْأَلُنِي شَيْئاً؛ قِيلَ: كَانَتْ أُمُّهَا مِنَ النَّسَبِ، وقيلَ: مِنَ الرَّضَاعَةِ، وَالصَّحِيحُ الأَوَّلُ.

'రాఘిబా' అంటే నా నుంచి ఏదో

ఆశిస్తుందని అర్థం. కొంతమంది 'ఆ వచ్చినావిడ ఆమె సొంత తల్లేన'ని అన్నారు. మరికొంతమంది ఆమెకు పాలుపట్టిన తల్లి అని అన్నారు. ఈ రెండింటిలో మొదటి అభిప్రాయమే సరైనది.

*(సహీహ్ బుఖారీలోని కానుకల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసులో పేర్కొనబడిన స్త్రీ మక్కా నుండి మదీనాకు వచ్చింది. ఈవిడపేరు ఖుతైలా బిన్తె అబ్దుల్ ఉజ్జా అని కొంతమంది అంటే 'ఖీలా' అని మరికొంతమంది అభిప్రాయపడ్డారు. ఏదిఏమైనా ఈ హదీసు ద్వారా బోధపడేదేమిటంటే, తల్లిదండ్రులు బహుదైవారాధకులైనా లేక దైవ తిరస్కారులైనా వారికి తప్పకుండా సేవ చేయాలి. వారిపట్ల ఉత్తమంగా మెలగాలి. ఇహలోకంలో వారిపట్ల మంచిగా మెలగాలని దివ్య ఖుర్ఆన్ ఆదేశిస్తోంది.

328. అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్ (రజి) భార్య హజ్రత్ జైనబ్ సఖఫియ్యా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) (స్త్రీలకు) ఇలా ఉపదేశించారు : "మహిళల్లారా! దానం చేయండి. మీ నగల్లో నుంచైనా సరే; (తప్పకుండా) దానం చేయండి."

జైనబ్ (రజి.అన్హా) ఇలా తెలియజేస్తున్నారు: (దైవప్రవక్త ఉపదేశం విన్న తరువాత) నేను (నా భర్త) అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్ దగ్గరికి తిరిగి వచ్చిన తరువాత ఆయనతో మాట్లాడుతూ, "మీ ఆదాయం కూడా చాలా తక్కువే కదండి! దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని దానాలు చేయాలని బోధించారు. అందుకే నేను నా సదఖా (దానం) మీకిస్తే అది

٣٢٨ ـ وعن زَيْنَبَ الثَّقَفِيَّةِ امْرَأَةِ عبدِ الله بنِ مسعودٍ رضي الله عنه وعنها قالت: قال رسولُ الله ﷺ: «تَصَدَّقْنَ يَا مَعْشَرَ النِّسَاءِ! وَلَوْ مِنْ حُلِيِّكُنَّ»، قالت: فَرَجَعْتُ إلى عبدِ الله بن مسعودٍ فقلتُ له: إِنَّكَ رَجُلٌ خَفِيفُ ذَاتِ الْيَدِ وَإِنَّ رسولَ الله ﷺ قَدْ أَمَرَنَا بِالصَّدَقَةِ فَأْتِهِ، فَاسْأَلْهُ، فَإِنْ كَانَ ذٰلِكَ يُجْزِىءُ عَنِّي وَإِلَّا صَرَفْتُهَا إلى غَيْرِكُمْ. فقال عبدُ الله: بَلِ ائْتِيهِ

అَنْتِ، فَانطَلَقْتُ، فَإِذَا امْرَأَةٌ مِنَ الأَنْصَارِ بِبَابِ رسولِ الله ﷺ، حَاجَتِي حَاجَتُهَا، وَكَانَ رسولُ الله ﷺ قَدْ أُلْقِيَتْ عَلَيْهِ المَهَابَةُ، فَخَرَجَ عَلَيْنَا بِلالٌ، فَقُلْنَا لَهُ: ائتِ رسولَ اللهِ ﷺ، فَأَخْبِرْهُ أَنَّ امْرَأَتَيْنِ بِالبَابِ تَسْأَلانِكَ: أَتُجْزِىءُ الصَّدَقَةُ عَنْهُمَا عَلَى أَزْوَاجِهِمَا وَعَلَى أَيْتَامٍ فِي حُجُورِهِمَا؟، ولا تُخْبِرْهُ مَنْ نَحْنُ، فَدَخَلَ بِلالٌ عَلَى رسولِ اللهِ ﷺ، فَسَأَلَهُ، فقال لهُ رسولُ اللهِ ﷺ: «مَنْ هُمَا؟»، قال: امْرَأَةٌ مِنَ الأَنْصَارِ وَزَيْنَبُ. فقال رسولُ الله ﷺ: «أَيُّ الزَّيَانِبِ هِيَ؟»، قال: امْرَأَةُ عَبدِ اللهِ، فقال رسولُ اللهِ ﷺ: «لَهُمَا أَجْرَانِ: أَجْرُ القَرَابَةِ وَأَجْرُ الصَّدَقَةِ» متفقٌ عليه.

దానంగా పరిగణించబడుతుందో లేదో కాస్త మీరు దైవప్రవక్త (సల్లం) దగ్గరికెళ్ళి అడిగి తెలుసుకోండి! ఆయన కాదంటే ఆ దానాన్ని ఇంకెవరికైనా ఇచ్చేస్తాను" అని అన్నాను. దానికి అబ్దుల్లా "లేదు, నువ్వే వెళ్ళి అడిగి తెలుసుకొని రా" అని అన్నారు.

అప్పుడు నేను స్వయంగా దైవప్రవక్తను అడిగి తెలుసుకుందామని వెళ్ళాను. నేను వెళ్ళేసరికి దైవప్రవక్త గుమ్మం దగ్గర ఒక అన్సారీ మహిళ కలిసింది. నేను అడగదలచుకున్న విషయమే ఆవిడ కూడా అడగాలని వచ్చింది. దైవ ప్రవక్తది మహా గంభీర వ్యక్తిత్వం (ఆయనకు భయపడి మేము లోనికి ప్రవేశించే ధైర్యం చేయలేకపోయాము).

అదే సమయంలో హజ్రత్ బిలాల్ (రజి) బయటికి వచ్చారు. మేమాయన్ని ఆపి "మీరు దైవప్రవక్త దగ్గరికి వెళ్ళి గుమ్మం దగ్గర ఇద్దరు స్త్రీలున్నారని చెప్పండి. వాళ్ళు తమ భర్తలకు, తమ పోషణలో పెరుగుతున్న అనాథపిల్లలకు దానం చేస్తే అది (షరీఅత్ దృష్టిలో) దానంగా పరిగణించబడుతుందో లేదో అడుగుతున్నారని చెప్పండి. అయితే (దయచేసి) మేమెవరమో ఆయన (స)కు తెలియజేయకండి" అని కోరాము.

హజ్రత్ బిలాల్ దైవప్రవక్త (స) దగ్గరికి వెళ్ళి ఈ విషయం గురించి ఆయనకు

చెప్పారు. విషయం తెలుసుకొని ఆయన "ఎవరా ఇద్దరు స్త్రీలు?" అని అడిగారు. "ఒకామె అన్సార్‌కు చెందిన స్త్రీ. మరో ఆమె జైనబ్" అని బిలాల్ సమాధానమిచ్చారు. దైవప్రవక్త "ఏ జైనబ్?" అని మళ్ళీ అడిగారు. అందుకు బిలాల్ (రజి) "అబ్దుల్లాహ్ బిన్ మస్‌వూద్ భార్య" అని చెప్పారు. అప్పుడాయన, "వాళ్ళకు రెట్టింపు పుణ్యం లభిస్తుందని చెప్పు. ఒకటి : బంధుప్రేమతో మసలుకున్నందుకు లభించే పుణ్యం. రెండు : దానం చేసినందుకు లభించే పుణ్యం" అని అన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ మరియు సహీహ్ ముస్లింలలోని జకాత్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

1. దీని ప్రకారం ఒక స్త్రీ నిరుపేద అయిన తన భర్తకు సదఖా సొమ్ము ఇవ్వగలదు. కాని భర్త మాత్రం తన భార్యకు దానం చేయటానికి వీల్లేదు. ఎందుకంటే ఖర్చులరీత్యా తమపై ఆధారపడివున్న వారికి దానం చేస్తే అది షరీఅత్ దృష్టిలో దానం క్రిందికి రాదు. భార్య ఖర్చుల్ని భరించటం భర్త బాధ్యత కాబట్టి అతను ఆమెకు దానంగా ఏదైనా ఇచ్చినా వాస్తవానికి అది దానంగా పరిగణించబడదు. అదేవిధంగా తన సంతానంపై, తల్లిదండ్రులపై సదఖా మరియు జకాత్ సొమ్మును ఖర్చుచేయటం తగదు.

2. అవసరమొచ్చినప్పుడు స్త్రీ పరదా పాటిస్తూ ఇంటినుండి బయటికి రావచ్చు.

3. పురుషుల మాదిరిగానే స్త్రీలు కూడా ధర్మ సందేహాలను నివృత్తి చేసుకోవటంలో, కొత్త విషయాలు తెలుసుకోవటంలో ఆసక్తి కనబరచాలి. ఇందులో సిగ్గుపడాల్సిన అవసరం ఏమీ లేదు. విద్య నేర్చుకోవటానికి పరదా అడ్డురాదు.

٣٢٩ ـ وعن أَبي سُفْيَانَ صَخْرِ بن حَرْبٍ رضي الله عنه في حَدِيثِهِ الطَّوِيلِ في قِصَّةِ هِرَقْلَ أَنَّ هِرَقْلَ قالَ لأَبِي سُفْيَانَ:

329. (రోము చక్రవర్తి అగు) హెరక్లియస్ కథకు సంబంధించి తాను వివరించిన సుదీర్ఘ హదీసులో హజ్రత్ అబూ సుఫ్యాన్ సఖ్ర్ బిన్ హర్బ్ (రజి) కథనం ప్రకారం హెరక్లియస్ అబూ సుఫ్యాన్‌ను

فَمَاذَا يَأْمُرُكُمْ بِهِ؟ يَعْنِي النَّبِيَّ ﷺ، قال: قُلْتُ: يَقُولُ: «اعْبُدُوا اللهَ وَحْدَهُ، وَلا تُشْرِكُوا بِهِ شَيْئاً، وَاتْرُكُوا مَا يَقُولُ آبَاؤُكُمْ» وَيَأْمُرُنَا بِالصَّلاةِ، وَالصِّدْقِ، وَالعَفَافِ، وَالصِّلَةِ. متفقٌ عليه.

"ఆయన (అంటే దైవప్రవక్త) మిమ్మల్ని ఏ విషయాల గురించి ఆదేశిస్తున్నాడు?" అని అడిగాడు.

దానికి అబూ సుఫ్యాన్, "మీరంతా ఒకే దేవుణ్ణి ఆరాధించండి. ఆ దేవునికి ఎవరినీ భాగస్వాములుగా నిలబెట్టకండి. మీ పూర్వీకుల మాటల్ని వదలిపెట్టండి" అని ఆయన అంటున్నాడు. ఇంకా మమ్మల్ని నమాజు చెయ్యమనీ, సత్యం పలకమనీ, సౌశీల్యవంతమైన జీవితాన్ని గడపమనీ, బంధువులను ప్రేమించమని ఆదేశిస్తున్నాడు" అతని సమాధాన మిచ్చారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వహీ ప్రారంభ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ఏకదైవారాధనా ప్రస్తావనతోపాటు ఉత్తమ గుణగణాలు కూడా పొందుపరచపడ్డాయి. ఆరాధనలన్నిటిలో సామూహికంగా నమాజు చేయటమనేది చాలా ముఖ్యమైన ఆరాధన. అదేవిధంగా సత్యం పలకటమనేది మనిషి నైతికతకు, ఉత్తమ నడవడికకు నిదర్శనం. ఒక ముస్లిం దేవునిపై, దైవప్రవక్తలపై విశ్వాసం ప్రకటించిన తరువాత ఆరాధనలన్నిటినీ తు.చ. తప్పకుండా పాటిస్తూ తన్ను తాను ఉత్తమ నడవడికకు నిదర్శనంగా మలచుకోవాలి.

٣٣٠ ـ وعن أبي ذرٍّ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «إِنَّكُمْ سَتَفْتَحُونَ أَرْضاً يُذْكَرُ فِيها القِيرَاطُ». وفي رواية: «سَتَفْتَحُونَ مِصْرَ وهِيَ أَرْضٌ يُسَمَّى فِيها القِيرَاطُ، فَاسْتَوْصُوا بِأَهْلِهَا خَيْراً، فَإِنَّ

330. హజ్రత్ అబూజర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉద్బోధించారు: "త్వరలోనే మీరు ఒక ప్రాంతాన్ని జయించనున్నారు. అక్కడ ఖీరాత్ (అనే పదం) వాడబడుతుంది. వేరొక ఉల్లేఖనం ప్రకారం, "త్వరలోనే మీరు ఈజిప్టును జయిస్తారు. అది ఖీరాత్ (అనే పదం) వ్యవహరించబడే ప్రాంతం. మీరు (ఆ ప్రాంతాన్ని స్వాధీనపరచుకున్న

لَهُمْ ذِمَّةً وَرَحِماً». وَفي رِوايَةٍ: «فإذا افْتَتَحْتُمُوهَا فَأَحْسِنُوا إلى أَهْلِهَا، فَإِنَّ لَهُمْ ذِمَّةً وَرَحِماً»، أَو قال: «ذِمَّةً وَصِهراً» رواه مسلم.

తరువాత) అక్కడి ప్రజలపట్ల మంచిగా వ్యవహరించండి. ఎందుకంటే వారికి మనపై హక్కు ఉంది. (ఇంకా) వారికి మనకూ బంధుత్వమూ ఉంది." వేరొక ఉల్లేఖనం ప్రకారం, "మీరు ఆ ప్రాంతాన్ని జయించినప్పుడు అక్కడి ప్రజల పట్ల ఉత్తమంగా వ్యవహరించండి. ఎందుకంటే వారికి మనపై హక్కు ఉంది. (ఇంకా) వారికీ - మనకూ బంధుత్వం ఉంది లేదా ఆయన "వారికి మనపై హక్కు ఉంది. (అలాగే) అత్తవారి బంధుత్వమూ ఉంది" అని అన్నారు.

*(ముస్లిం)*

قال العُلَمَاءُ: الرَّحِمُ الَّتِي لَهُمْ: كَـوْنُ هَـاجَـرَ أُمِّ إسْمَـاعِيـلَ ﷺ مِنْهُـمْ وَ«الصِّهْرُ»: كَوْنُ مَارِيَةَ أُمِّ إبْرَاهِيمَ ابنِ رسولِ الله ﷺ مِنهم.

దైవప్రవక్త హజ్రత్ ఇస్మాయీల్ (అలైహి) తల్లి హాజిరా (అలైహి) ఆ ప్రాంతానికి చెందినవారు కావటం చేత వారితో బంధుత్వమేర్పడింది, అదేవిధంగా దైవప్రవక్త కుమారులు ఇబ్రాహీంకు తల్లి అయిన మారియా (రజి.అన్హా) కూడా ఆ ప్రాంతానికే చెందినవారు కావటం చేత వారితో అత్తవారి బంధుత్వమూ ఉందని విద్వాంసులు అభిప్రాయపడ్డారు.

*(సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దీనారు, దిర్హముల మాదిరిగానే 'ఖీరాత్' కూడా ఒక రకమైన నాణెం. ఇది దీనారు, దిర్హములలో ఒక భాగం. దిర్హంలో, ఓ చిన్న భాగాన్ని 'దానిఖ్' అంటారు. దానిఖ్‌లో సగమే ఈ ఖీరాత్. ఆ కాలంలో ఈజిప్టులో ఇది చాలా వాడుకలో ఉండేది. ఈ హదీసులో ముస్లింలకు ఈజిప్ట్ ప్రజలతో రెండు విధాలుగానూ బంధుత్వం ఉన్నందువల్ల వారిపట్ల ఉత్తమంగా

వ్యవహరించాలని తాకీదు చేయబడింది. అందుకే ఈ హదీసును ఈ అధ్యాయం క్రింద ప్రస్తావించటం జరిగింది. దైవప్రవక్త (స) చెప్పినట్లుగా ఆయన తదనంతరం అనతికాలంలోనే ముస్లింలు ఈజిప్టును జయించారు. ఇది ఆయన భవిష్యత్ ప్రకటనల్లోని సత్యసంధతకు ప్రబల నిదర్శనం.

٣٣١ - وعن أبي هريرة رضي الله عنه قال: لما نَزَلَتْ هذِهِ الآيةُ: ﴿وَأَنذِرْ عَشِيرَتَكَ ٱلْأَقْرَبِينَ﴾ [الشعراء: ٢١٤] دَعَا رسولُ الله ﷺ قُرَيْشاً، فَاجْتَمَعُوا، فَعَمَّ وَخَصَّ وقال: «يَا بَنِي عَبْدِ شَمْسٍ! يَا بَنِي كَعْبِ بْنِ لُؤَيٍّ! أَنْقِذُوا أَنْفُسَكُمْ مِنَ النَّارِ، يَا بَنِي مُرَّةَ بنِ كَعْبٍ! أَنْقِذُوا أَنْفُسَكُمْ مِنَ النَّارِ، يَا بَنِي عَبْدِ مَنَافٍ! أَنْقِذُوا أَنْفُسَكُمْ مِنَ النَّارِ، يَا بَنِي هَاشِمٍ! أَنْقِذُوا أَنْفُسَكُمْ مِنَ النَّارِ، يَا بَنِي عَبْدِ المُطَّلِبِ! أَنْقِذُوا أَنْفُسَكُمْ مِنَ النَّارِ، يَافَاطِمَةُ! أَنْقِذِي نَفْسَكِ مِنَ النَّارِ، فَإِنِّي لا أَمْلِكُ لَكُمْ مِنَ الله شَيْئاً، غَيْرَ أنَّ لَكُمْ رَحِماً سَأَبُلُّهَا بِبِلالِهَا» رواه مسلم. قوله ﷺ: «بِبِلالِهَا» هو بفتح الباءِ الثَّانيةِ وَكَسْرِهَا، وَ«البِلالُ»: المَاءُ. وَمَعْنَى الحَدِيثِ: سَأَصِلُهَا، شَبَّهَ قَطِيعَتَهَا بِالحَرَارَةِ تُطْفَأُ بِالمَاءِ وَهذِهِ تُبَرَّدُ بِالصِّلَةِ.

331. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : "(ప్రవక్తా!) నీ దగ్గరి బంధువులను భయపెట్టు" అన్న దివ్య ఖుర్ఆన్ సూక్తి (అష్ షూరా : 214) అవతరించినప్పుడు దైవప్రవక్త (సల్లం) ఖురైషులందరినీ పిలిచారు. దాంతో (ఖురైష్ తెగకు చెందిన) సామాన్యులు, ప్రముఖులందరూ ఒకచోట సమావేశమయ్యారు. అప్పుడు ఆయన తన తెగవారికి దైవ సందేశాన్ని అందజేస్తూ ఇలా అన్నారు :

"ఓ అబ్దె షమ్స్ వంశీయులారా! ఓ కాబ్ బిన్ లుఅయ్యి వంశీయులారా! మిమ్మల్ని మీరు నరకాగ్ని బారినుండి కాపాడుకోండి. హాషిం వంశీయులారా! మిమ్మల్ని మీరు నరకాగ్ని బారినుండి కాపాడుకోండి. అబ్దుల్ ముత్తలిబ్ వంశీయులారా! మిమ్మల్ని మీరు నరకాగ్ని బారినుండి రక్షించుకోండి. ఓ ఫాతిమా! నిన్ను నీవు నరకజ్వాలల నుంచి కాపాడుకో. ఎందుకంటే దైవశిక్ష నుండి మిమ్మల్ని కాపాడటానికి నాకు ఎలాంటి అధికారం లేదు. అయితే మీకు నాతో బంధుత్వం ఉంది కనుక (ఇహలోకంలో ఉన్నంతకాలం) బంధుత్వ సంబంధాలను మాత్రం కొనసాగిస్తాను." (ముస్లిం)

'బిలాల్' అంటే 'నీళ్ళు' అని అర్థం. 'సఅబుల్లుహా బిబిలాలిహా' అంటే నేను బంధుత్వ సత్సంబంధాలను కొనసాగిస్తానని అర్థం. ఈ హదీసులో దైవప్రవక్త (స) బంధుత్వ తెగత్రెంపుల్ని మంటతో పోల్చారు. మంటల్ని నీటితో చల్లారుస్తారు. అదేవిధంగా బంధుత్వ తెగత్రెంపుల మంటల్ని బంధుప్రేమతో చల్లార్చవచ్చు.

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. పరలోకంలో దేవుని సన్నిధిలో వంశగౌరవాలకు, పరువుప్రతిష్ఠలకు ఎలాంటి విలువా ఉండదు. ఆఖరికి మహాప్రవక్త ముహమ్మద్ (సల్లం) బంధువులకు కూడా దీని నుండి మినహాయింపు లేదు. అక్కడ కేవలం విశ్వాసం మరియు సదాచరణల ప్రాతిపదికపైనే ఎవరికైనా విముక్తి లభిస్తుంది. దైవప్రవక్త మరియు ఇతర పుణ్యాత్ములు సిఫారసు చేస్తారు. కాని వారు ఎవరికోసం సిఫారసు చేస్తారు? దేవుడు ఎవరి కోసం అనుమతిస్తే వారికోసం మాత్రమే చేస్తారు. ఈ అనుమతి కూడా విశ్వాసులైన పాపాత్ములకే లభిస్తుందని గ్రహించాలి. బహుదైవారాధకులకు, దైవతిరస్కారులకు విముక్తి లభించదు. వారు పుణ్యాత్ములు చేసే సిఫారసు భాగ్యానికీ నోచుకోలేరు.

2. సత్య సందేశ ప్రచార కార్యక్రమాన్ని సన్నిహిత బంధువులతోనే మొదలుపెట్టాలి. వారికి ధర్మ సందేశాన్ని, దేవుని ఆదేశాలను గురించి బోధించాలి.

3. బంధువులు బహుదైవారాధకులైనా, దైవతిరస్కారులైనా సరే వారితో సత్సంబంధాలు కొనసాగించటంలో మాత్రం ఎలాంటి లోటు రానీయకూడదు.. వారి హక్కుల్ని నిర్వర్తిస్తూ ఉండాలి. వారికున్న ప్రప్రథమ హక్కు ఏమిటంటే వారికి విశ్వాసాన్ని, సదాచరణను బోధించి పరలోకంలో వారిని నరకాగ్ని బారినుంచి కాపాడాలి.

332. దైవప్రవక్త (స) మెల్లిగా కాకుండా బిగ్గరగా, "ఫలానా తెగవారు నా మిత్రులు కాజాలరు. దేవుడు మరియు సదాచార సంపన్నులైన విశ్వాసులే నా మిత్రులు. అయితే ఆ తెగవారితో నాకు బంధుత్వముంది. కనుక నేను బంధుత్వ

٣٣٢ ـ وعن أبي عبدِ الله عمرِو بن العاصِ رضي الله عنهما قال: سمعتُ رسول الله ﷺ جهاراً غَيْرَ سِرٍّ يقولُ: «إنَّ آلَ بَنِي فُلانٍ لَيْسُوا بِأَوْلِيَائِي، إنَّمَا وَلِيِّيَ اللهُ وَصَالِحُ المُؤْمِنِين، وَلَكِنْ لَهُمْ رَحِمٌ أَبُلُّهَا بِبِلالِهَا»، متفق عليه. واللَّفظُ للبخاري.

సత్సంబంధాలను మాత్రం తప్పకుండా కొనసాగిస్తాను" అని ప్రకటిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) తెలియజేశారు. (బుఖారీ - ముస్లిం, వాక్యాలు మాత్రం బుఖారీలోనివి)

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

హదీసులో ఫలానా తెగవారంటే దైవప్రవక్త గారి అవిశ్వాసులైన సన్నిహిత బంధువులని అర్థం. తనకు వారితో బంధుత్వమున్నప్పటికీ తాను వారిని మనస్ఫూర్తిగా ప్రేమించటం లేదని, అలాంటి దైవతిరస్కారులు తనకు మిత్రులు కాజాలరని ఆయన స్పష్టంగా చెప్పేశారు. విశ్వాసికి - దైవతిరస్కారికి మధ్య మైత్రి అసంభవం. నిజమైన విశ్వాసి అయిన వ్యక్తి అల్లాహ్‌ను, ఆ తరువాత అల్లాహ్‌ను విశ్వసించిన సదాచార సంపన్నులనే ప్రేమిస్తాడు. వారినే తన మిత్రులుగా చేసుకుంటాడు. అయితే బంధువులెవరయినా అవిశ్వాసులుగా, దైవతిరస్కారులుగా ఉన్నట్లయితే వారితో బంధుత్వ సంబంధాలను కొనసాగిస్తూ వారిపట్ల ఉత్తమంగా వ్యవహరించటం మాత్రం తప్పదు.

333. హజ్రత్ అబూ అయ్యూబ్ ఖాలిద్ బిన్ జైద్ అన్సారీ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్తను, "నాకు నరకం నుండి దూరం చేసి స్వర్గానికి గొనిపోయే ఆచరణ గురించి తెలియజెయ్యండ'ని అడిగాడు. దానికాయన, "అల్లాహ్‌ను (మాత్రమే) ఆరాధించు. ఆయనకు సహవర్తులుగా ఎవరినీ నిలబెట్టకు. నమాజును స్థాపించు. జకాత్ (విధి దానం) చెల్లించు. బంధువులతో సత్సంబంధాలు పెట్టుకో" అని ఆ వ్యక్తికి ఉపదేశించారు. (బుఖారీ - ముస్లిం)

٣٣٣ - وعن أبي أَيُّوبَ خالدِ بن زيدِ الأنصاري رضي الله عنه أن رجلاً قال: يارسولَ الله! أَخْبِرْني بِعَمَلٍ يُدْخِلُني الجَنَّةَ، وَيُبَاعِدُني مِنَ النَّارِ. فقال النبيُّ ﷺ: «تَعْبُدُ الله، وَلا تُشْرِكُ بِهِ شَيْئاً، وَتُقِيمُ الصَّلاةَ، وَتُؤْتي الزَّكَاةَ، وَتَصِلُ الرَّحِمَ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రజలు పరలోకంలో తమల్ని తాము నరకాగ్ని బారినుంచి రక్షించుకొని స్వర్గంలోకి ప్రవేశించే అర్హత పొందటానికి చేయవలసిన పనులేమిటో ఈ హదీసు ప్రబోధిస్తోంది. స్వర్గంలోకి ప్రవేశించటానికి ఈ పనులు చేయటం చాలా అవసరం. అందువల్ల విశ్వసించకుండా, సత్కార్యాలు చేయకుండా ఒకరి సిఫారసుతో స్వర్గం లభిస్తుందని కనే కలలు పరలోకంలో కల్లలౌతాయని ప్రతి ఒక్కరూ గ్రహించాలి.

٣٣٤ - وعن سَلْمَانَ بنِ عامرٍ رضي الله عنه عن النَّبِيِّ ﷺ قال: «إذَا أَفطَرَ أَحَدُكُمْ، فَلْيُفْطِرْ عَلَى تَمْرٍ، فَإنَّهُ بَرَكَةٌ، فَإنْ لَمْ يَجِدْ تَمْراً، فَالمَاءُ، فَإنَّهُ طَهُورٌ»، وقال: «الصَّدَقَةُ عَلَى المِسْكِينِ صَدَقَةٌ، وَعَلَى ذِي الرَّحِمِ ثِنْتَانِ: صَدَقَةٌ وَصِلَةٌ». رواه الترمذي وقال: حديث حسن.

334. హజ్రత్ సల్మాన్ బిన్ ఆమిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీలో ఎవరైనా (ఇఫ్తార్ సమయంలో) ఉపవాసాన్ని విరమిస్తున్నప్పుడు ఖర్జూర పండుతో విరమించాలి. ఎందుకంటే ఖర్జూర పండులో శుభం ఉంది. ఖర్జూర పండు దొరక్కపోతే నీళ్ళతో ఉపవాసాన్ని విరమించుకోవాలి. ఎందుకంటే నీరు పరిశుభ్రం చేసే వస్తువు.

ఆయన ఇంకా ఇలా అన్నారు : ఒక అభాగ్యుడికి చేసే దానం (సామాన్య) దానంగా పరిగణించబడుతుంది. కాని (అభాగ్యుడైన) బంధువుకు చేసే దానం రెండు విధాలుగా ప్రయోజనకరమైనది. ఒకటి : అది దానంగా పరిగణించబడుతుంది. రెండు : బంధుప్రేమతో ఇచ్చినట్లుగా కూడా ఉంటుంది. (దీనిని తిర్మిజీ ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు)

*(జామె తిర్మిజీలోని జకాత్ అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

1. ఖర్జూర పండుతోగాని, నీళ్ళతోగాని ఉపవాస విరమణ (ఇఫ్తార్) చేస్తే ఎంతో పుణ్యం లభిస్తుంది.

2. నిరుపేదలు, అభాగ్యులైన బంధువులకు దానాలు చేయటం వల్ల రెట్టింపు పుణ్యం దొరుకుతుంది. సాధారణంగా ప్రజలు తమ సన్నిహిత బంధువుల్ని విస్మరించి ఇతరులకు దానధర్మాలు చేస్తుంటారు. ఇది సరైన పద్ధతి కాదు. దానధర్మాలు చేసినప్పుడు సన్నిహిత బంధువులకే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వాలి.

٣٣٥ ـ وعن ابن عمرَ رضي الله عنهما قال: كَانَتْ تَحْتِي امْرَأَةٌ، وَكُنْتُ أُحِبُّهَا، وَكَانَ عُمَرُ يَكْرَهُهَا، فقال لي: طَلِّقْهَا، فَأَبَيْتُ، فَأَتَى عُمَرُ رضي الله عنه النَّبيَّ ﷺ، فَذَكَرَ ذلِكَ لَهُ، فقال النبيُّ ﷺ: «طَلِّقْهَا» رواه أبو داود، والترمذي وقال: حديث حسن صحيح.

335. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: ఒక స్త్రీ నా దాంపత్యంలో ఉండేది. ఆమె అంటే నాకు (చాలా) ఇష్టం. కాని ఆమె నా భార్యగా ఉండటం ఉమర్ (అంటే మా నాన్న)కు యిష్టముండేది కాదు. ఆయన నన్ను "ఆమెకు విడాకు లివ్వు"అని ఆదేశించారు. కాని నేను ఆమెకు విడాకులివ్వటానికి నిరాకరించాను. అప్పుడు ఉమర్ దైవప్రవక్త (స) దగ్గరికి వెళ్ళి, ఆయనకు ఈ విషయం తెలియజేశారు. తరువాత దైవప్రవక్త నన్ను (పిలిచి) "ఆమెకు విడాకులిచ్చెయ్యి" అని ఆజ్ఞాపించారు. (దీనిని అబూదావూద్ మరియు తిర్మిజీలు ఉల్లేఖించారు. ఇంకా తిర్మిజీ దీనిని 'హసన్' మరియు 'సహీహ్'గా పేర్కొన్నారు).

*(జామె తిర్మిజీలోని విడాకుల ప్రకరణం, సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ధార్మిక, నైతిక ప్రయోజనాల దృష్ట్యా తల్లిదండ్రులు తమ కుమారుడ్ని భార్యకు విడాకులిచ్చెయ్యమని ఆదేశిస్తే వారి ఆదేశాన్ని పాటించటం తప్పనిసరి అవుతుంది. ఇతర ఉద్దేశ్యాలతో ఇలాంటి ఆదేశమిస్తే దాన్ని పాటించాల్సిన అవసరం లేదు. తల్లిదండ్రులకు నచ్చజెప్పి వారిని ఒప్పించాలి. ప్రతి చిన్న విషయానికీ భార్యకు విడాకులిచ్చి అన్యాయానికి పాల్పడటం ఎంతమాత్రం తగదు.

٣٣٦ ـ وعن أبي الدَّرْدَاءِ رضي الله عنه أن رَجُلاً أَتَاهُ فقال: إنَّ لِي امْرَأَةً وَإنَّ أُمِّي تَأْمُرُنِي بِطَلاقِهَا؟ فقال: سَمِعْتُ رسولَ اللهِ ﷺ يَقُولُ: «الوَالِدُ أَوْسَطُ أَبْوَابِ الجَنَّةِ، فَإنْ شِئْتَ فَأَضِعْ ذٰلِكَ البَابَ، أَوِ احْفَظْهُ» رواه الترمذي وقال: حديثٌ حسنٌ صحيح.

336. హజ్రత్ అబూ దర్దా (రజి) కథనం ప్రకారం ఒక వ్యక్తి ఆయన దగ్గరికి వచ్చి, "నాకో భార్య ఉంది. నా తల్లి ఆమెకు విడాకులిచ్చెయ్యమని ఆదేశిస్తోంది (ఇప్పుడు నేనేం చేయాలి)?" అని అడిగాడు.

దానికి జవాబుగా అబూ దర్దా (రజి) దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచిస్తుండగా తాను విన్నానని తెలియజేశారు : తండ్రి స్వర్గ ద్వారాలన్నింటిలో మధ్య ద్వారం లాంటివాడు. నీ కిష్టమయితే ఆ ద్వారాన్ని నాశనం చేసుకో లేదా కాపాడుకో." (దీనిని తిర్మిజీ ఉల్లేఖించి హసన్ మరియు సహీహ్‌గా పేర్కొన్నారు.)

*(జామె తిర్మిజీలోని సత్కార్యాలు - సత్సంబంధాల అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

పై హదీసులో వచ్చిన వ్యక్తి తల్లి గురించి అడిగితే హజ్రత్ అబూ దర్దా (రజి) తండ్రి గురించి సమాధానమిచ్చినట్లు అనిపిస్తుంది. హదీసులో ఆయన 'వాలిద్' అన్న పదాన్ని వాడారు. వాలిద్ అంటే జన్మనిచ్చినవాడు, జన్మనిచ్చినవారంటే తల్లి అయినా కావచ్చు లేదా తండ్రి అయినా కావచ్చు. ఈ హదీసులో కూడా కన్నవారి విధేయతకు ప్రాధాన్యతనివ్వాలని చెప్పబడింది.

٣٣٧ ـ وعن البَرَاءِ بن عازِبٍ رضي الله عنهما عن النبيِّ ﷺ قال: «الخَالَةُ بِمَنْزِلَةِ الأُمِّ» رواه الترمذي وقال: حديثٌ حسن صحيح. وفي الباب أَحاديثُ كثيرةٌ في الصحيح مشهورةٌ؛ منها حديثُ أصحابِ الغارِ، وحديثُ جُرَيْجٍ وَقَدْ سَبَقَا، وأَحادِيثُ مشهورةٌ في الصحيح

337. హజ్రత్ బరా బిన్ అజిబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "పినతల్లికి తల్లి స్థానముంది" అని ప్రవచించారు. దీనిని తిర్మిజీ ఉల్లేఖించి హసన్ మరియు సహీహ్‌గా పేర్కొన్నారు.

(ఇమామ్ నవవీ రహ్మాలై ఇలా అంటున్నారు) 'సహీహ్'లో ఈ అధ్యాయానికి సంబంధించిన సుప్రసిద్ధమైన హదీసు

حَذَفْتُهَا اخْتِصَاراً، وَمِنْ أَهَمِّهَا حَدِيثُ عَمْرِو بنِ عَبَسَةَ رضي الله عنه الطَّويلُ الْمُشْتَمِلُ عَلَى جُمَلٍ كَثِيرَةٍ مِنْ قَوَاعِدِ الإِسْلام وَآدَابِهِ، وَسَأَذْكُرُهُ بِتَمَامِهِ إِنْ شَاءَ الله تعالى في بابِ الرَّجَاءِ، قال فيه: دَخَلْتُ عَلَى النَّبِيِّ ﷺ بِمَكَّةَ، يَعْنِي فِي أَوَّلِ النُّبُوَّةِ، فَقُلْتُ لَهُ: مَا أَنْتَ؟ قال: «نَبِيٌّ»، فقلتُ: وَمَا نَبِيٌّ؟ قال: «أَرْسَلَنِي اللهُ تعالى»، فقلتُ: بِأَيِّ شَيْءٍ أَرْسَلَكَ؟ قال: «أَرْسَلَنِي بِصِلَةِ الأَرْحَامِ، وَكَسْرِ الأَوْثَانِ، وَأَنْ يُوَحَّدَ اللهُ لا يُشْرَكُ بِهِ شَيْءٌ» وَذَكَرَ تَمَامَ الحديث. والله أعلم.

లెన్నో ఉన్నాయి. వాటిలో ఇంతకు ముందు వచ్చిన గుహ వారి కథ, జురైజ్ కథలున్న హదీసులు కూడా పేర్కొన దగినవి.

ఇవేగాకుండా ప్రసిద్ధమైన హదీసులు ఇంకా చాలా ఉన్నాయి గాని (అధ్యాయాన్ని) సంక్షిప్తం చేసే ఉద్దేశ్యంతో నేను వాటిని ప్రస్తావించకుండా వదలి వేస్తున్నాను. వాటిలో అత్యంత ముఖ్యమైనది హజ్రత్ అమ్ర్ బిన్ అబసా హదీసు. అది చాలా సుదీర్ఘమైన హదీసు. అందులో ఇస్లామీయ నియమావళి, సభ్యతా సంస్కారాల గురించిన అనేక వాక్యాలున్నాయి. ఇన్షా అల్లాహ్ ఆ హదీసు మొత్తం నేను 'బాబుర్రజా'లో ప్రస్తావిస్తాను. ఆ హదీసులో హజ్రత్ అమ్ర్ బిన్ అబసా (రజి) ఇలా తెలియజేశారు :

దైవప్రవక్త (సల్లం)కు ప్రవక్త పదవి లభించిన తొలినాళ్ళలో నేనొకసారి మక్కా వెళ్ళాను. అప్పుడు నేనాయనతో మాట్లాడుతూ, "మీరెవరు?" అని అడిగాను. ఆయన "దైవప్రవక్తను" అని అన్నారు. తిరిగి నేను "దైవప్రవక్త అంటే ఏమిటి?" అని అడిగాను. దానికాయన "(ప్రజలను సన్మార్గం చూపటం కోసం దైవం తరఫునుండి పంపబడేవానిని దైవప్రవక్త

అని అంటారు) దేవుడు నన్ను ప్రవక్తగా నియమించి పంపాడు" అని అన్నారు. "దేవుడు మిమ్మల్ని ఏ లక్ష్యం కోసం పంపించాడు" అని నేను మళ్ళీ అడిగాను. "బంధువుల మధ్య సత్సంబంధాలను నెలకొల్పటం కోసం, విగ్రహాలను పడగొట్టడం కోసం, ఇంకా ఒకే దేవుడు పూజింపబడటం కోసం, (ప్రజలు) ఆయనకు సహవర్తులుగా ఎవరినీ నిలబెట్టకుండా ఉండటం కోసం దేవుడు నన్ను పంపించాడు" అని అన్నారు దైవ ప్రవక్త (సల్లం).

*(సుననె తిర్మిజీలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పినతల్లికి తల్లి స్థానముందంటే అర్థం తల్లిని గౌరవించినట్లుగానే పినతల్లినీ గౌరవించాలి. ఆమె పట్ల కూడా ఉత్తమంగా వ్యవహరించాలి.



41వ అధ్యాయం

# ٤١ - بَابُ تَحْرِيمِ الْعُقُوقِ وَقَطِيعَةِ الرَّحِمِ

# తల్లిదండ్రులను ఎదిరించటం, బంధుత్వాలను త్రెంచటం నిషిద్ధం

قال الله تعالى: ﴿ فَهَلْ عَسَيْتُمْ إِن تَوَلَّيْتُمْ أَن تُفْسِدُوا فِي الْأَرْضِ وَتُقَطِّعُوا أَرْحَامَكُمْ ﴿٢٢﴾ أُولَٰئِكَ الَّذِينَ لَعَنَهُمُ اللَّهُ فَأَصَمَّهُمْ وَأَعْمَىٰ أَبْصَارَهُمْ ﴾ [محمد: ٢٢ـ ٢٣]، وقال تعالى: ﴿ وَالَّذِينَ يَنقُضُونَ عَهْدَ اللَّهِ مِن بَعْدِ مِيثَاقِهِ وَيَقْطَعُونَ مَا أَمَرَ اللَّهُ بِهِ أَن يُوصَلَ وَيُفْسِدُونَ فِي الْأَرْضِ أُولَٰئِكَ لَهُمُ اللَّعْنَةُ وَلَهُمْ سُوءُ الدَّارِ ﴾ [الرعد: ٢٥]، وقال تعالى: ﴿ ۞ وَقَضَىٰ رَبُّكَ أَلَّا تَعْبُدُوا إِلَّا إِيَّاهُ وَبِالْوَالِدَيْنِ إِحْسَانًا إِمَّا يَبْلُغَنَّ عِندَكَ الْكِبَرَ أَحَدُهُمَا أَوْ كِلَاهُمَا فَلَا تَقُل لَّهُمَا أُفٍّ وَلَا تَنْهَرْهُمَا وَقُل لَّهُمَا قَوْلًا كَرِيمًا ﴿٢٣﴾ وَاخْفِضْ لَهُمَا جَنَاحَ الذُّلِّ مِنَ الرَّحْمَةِ وَقُل رَّبِّ ارْحَمْهُمَا كَمَا رَبَّيَانِي صَغِيرًا ﴾ [الإسراء: ٢٣ـ ٢٤].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"ఒకవేళ మీరు విముఖులైపోతే, భూమిపై మళ్ళీ కల్లోలాన్ని రేకెత్తిస్తారు, పరస్పరం బంధుత్వాల తెగత్రెంపులకు ఒడిగడతారు. ఇక మీ నుండి ఇంతకంటే ఏమి ఆశించవచ్చు? అల్లాహ్ శపించింది, అంధులుగానూ, బధిరులుగానూ చేసింది ఇలాంటి వారినే!"

(ముహమ్మద్ : 22,23)

మరోచోట ఆయన ఇలా సెలవిస్తున్నాడు :

"అల్లాహ్‌తో చేసుకున్న ఒడంబడికను దృఢపరచిన తరువాత భంగపరిచేవారు, అల్లాహ్ కలపండి అని ఆదేశించిన సంబంధాలను త్రెంచేవారూ, ధరణిపై కల్లోలాన్ని వ్యాపింపజేసే వారూ, శాపానికి అర్హులు. వారి కొరకు పర లోకంలో బహుచెడ్డ నివాసం ఉన్నది."

(అర్రాద్: 25)

ఇంకొకచోట ఆయన ఇలా సెలవిస్తున్నాడు :

"నీ ప్రభువు ఇలా నిర్ణయం చేశాడు : మీరు కేవలం ఆయనను తప్ప మరెవరినీ ఆరాధించ కండి. తల్లిదండ్రులతో మంచితనంతో వ్యవహ రించండి. ఒకవేళ మీ వద్ద వారిలో ఒకరుగాని, ఇద్దరుగాని ముసలివారై ఉంటే, వారి ముందు

వినుగ్గా "ఛీ" అని కూడా అనకండి. వారిని కసరుకుంటూ సమాధానం ఇవ్వకండి. వారితో మర్యాదగా మాట్లాడండి. మృదుత్వమూ, దయా భావమూ కలిగి వారి ముందు వినమ్రులై ఉండండి. "ప్రభూ! బాల్యంలో వారు నన్ను కారుణ్యంతో, వాత్సల్యంతో పోషించినట్లు వారిపై (కూడా) కరుణ జూపు" అని ప్రార్థిస్తూ ఉండండి.

**(అల్ ఇస్రా : 23, 24)**

338. హజ్రత్ అబూ బక్రా నుఫై బిన్ హారిస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "ఘోరాతిఘోర పాపాలు ఏవో నేను మీకు తెలుపనా?" అని మమ్మల్ని అడిగారు. ఆయన ఇదే ప్రశ్న మూడు సార్లు అడిగారు. దానికి మేము "తప్పకుండా తెలుపండి దైవప్రవక్తా!" అని అన్నాం. అప్పుడాయన "ఇతరుల్ని దైవానికి సమానంగా నిలబెట్టడం, తల్లిదండ్రుల పట్ల అవిధేయతకు పాల్పడటం" అని తెలిపారు. ఆ సమయంలో ఆనుకొని కూర్చొనివున్న ఆయన ఒక్కసారిగా సరిగ్గా కూర్చొని "జాగ్రత్తగా వినండి! అబద్ధమాడటం, అబద్ధపు సాక్ష్యాలు చెప్పడం కూడా (ఘోరాతి ఘోరమైన పాపాలే)" అని అన్నారు. ఇలా మాటిమాటికీ అదే మాట చెబుతూ పోతుంటే, చివరికి మాకు ఈయన ఇక ఈ మాటలు ఆపి మౌనం వహిస్తే బాగుండుననిపించింది.

*(బుఖారీ - ముస్లిం)*

٣٣٨ ـ وعـن أَبـي بكْـرَةَ نُفَيْـع بـن الحـارثِ رضـي الله عنـه قـال: قَـال رسـولُ الله ﷺ: «أَلا أُنَبِّئُكُـمْ بِـأَكْبَـرِ الكَبَائِرِ؟» ـ ثَلاثاً ـ قُلْنَا: بَلَى يا رسولَ الله! قـال: «الإِشْـرَاكُ بـالله، وَعُقُـوقُ الْوَالِدَيْنِ»، وَكَانَ مُتَّكِئاً فَجَلَسَ، فقال: «أَلا وَقَوْلُ الزُّور وَشَهَادَةُ الزُّور» فَمَا زَالَ يُكَرِّرُهَا حَتَّى قُلْنَا: لَيْتَهُ سَكَتَ. متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని సాక్ష్యాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో కొన్ని ముఖ్యమైన ఘోరాతిఘోర పాపాలను గురించి చెప్పటం జరిగింది. ఖుర్‌ఆన్ హదీసుల్లో కఠినంగా హెచ్చరించబడిన పాపాలే ఘోర పాపాలనబడతాయి. తల్లిదండ్రుల మాట వినకపోవటాన్ని బహుదైవారాధనతోపాటు ప్రస్తావించటం ద్వారా బహుదైవారాధనలాగే తల్లిదండ్రుల అవిధేయత కూడా మహాపరాధమని తెలుస్తోంది. అదేవిధంగా అబద్ధమాడటం గురించి చెప్పినప్పుడు దైవప్రవక్త (సల్లం) ఆనుకొని కూర్చున్నవారల్లా ఒక్కసారిగా లేచి కూర్చున్నారు. దీనిద్వారా ఆయన దృష్టిలో అబద్ధమాడటం, అబద్ధపు సాక్ష్యాలు చెప్పటం ఎంతటి ఘోరపాతకాలో అవగతమవుతోంది.

٣٣٩ ـ وعن عبدِ الله بْنِ عمرِو بنِ العاصِ رضي الله عنهما عن النبيِّ ﷺ قال: «الكَبَائِرُ: الإِشْرَاكُ باللهِ، وَعُقُوقُ الـوَالِـدَيْـنِ، وَقَتْـلُ النَّفْـسِ، وَالْيَمِيـنُ الْغَمُـوسُ» رواه البخـاري. «الْيَمِيـنُ الْغَمُوسُ» الَّتي يَحْلِفُهَا كَاذِباً عَامِداً، سُمِّيَتْ غَمُوساً، لأَنَّهَا تَغْمِسُ الحَالِفَ في الإِثْمِ.

339. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలిపారు : ఇతరుల్ని దైవానికి సాటి కల్పించటం, తల్లిదండ్రుల మాట వినకపోవటం, (అన్యాయంగా) ఒకర్ని హత్య చేయటం (లేదా ఆత్మ హత్య చేసుకోవటం) అసత్య ప్రమాణం చేయటం (మొదలగునవి) ఘోర పాపాలు. *(బుఖారీ)*

'యమీనె గుమూస్' అంటే బుద్ధిపూర్వకంగా అబద్ధపు ఒట్లు వేయటం. గుమూస్ అంటే ముంచటం అని అర్థం. ఈ ప్రమాణం మనిషిని పాపంలో ముంచుతుంది కనుక దీనిని యమీనె గుమూస్ (ముంచే ప్రమాణం) అని అంటారు.

*(సహీహ్ బుఖారీలోని ప్రమాణాలు, మొక్కుబడుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఘోరపాపాలు ఇవేగాకుండా ఇంకా చాలా ఉన్నాయి. సందర్భానుసారం దైవప్రవక్త (సల్లం) ఇక్కడ కొన్నింటిని మాత్రమే పేర్కొన్నారు. లేక ఇవి పాపాలన్నిటిలో ఘోరాతిఘోరమైన పాపాలని చెప్పటం ఆయన ఉద్దేశ్యం అయి ఉండవచ్చు.

340. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) తన సహచరులతో, "ఘోర పాపాల్లో ఒకటి మనిషి తన తల్లి దండ్రులను దూషించటం" అని చెప్పారు. అది విని సహచరులు "దైవ ప్రవక్తా! ఎవడైనా తన కన్న తల్లిదండ్రుల్ని దూషిస్తాడా?" అని ఆశ్చర్యంగా అడిగారు. దానికి ఆయన "అవును, ఇతను ఇంకొకడి తండ్రిని దూషిస్తే ఆ వ్యక్తి ఇతని తండ్రిని దూషి స్తాడు. ఇతను ఇంకొకడి తల్లిని దూషిస్తే ఆ వ్యక్తి ఇతని తల్లిని దూషిస్తాడు. (అప్పుడు ఇతను తన సొంత తల్లిదండ్రుల్ని దూషించినట్లు కాదా?!)" అని అన్నారు.

(బుఖారీ - ముస్లిం)

٣٤٠ - وعنه، أن رسول الله ﷺ قال: «مِنَ الْكَبَائِرِ شَتْمُ الرَّجُلِ وَالِدَيْهِ!»، قالوا: يا رسولَ الله! وَهَلْ يَشْتُمُ الرَّجُلُ وَالِدَيْهِ؟! قال: «نَعَمْ؛ يَسُبُّ أَبَا الرَّجُلِ، فَيَسُبُّ أَبَاه، وَيَسُبُّ أُمَّهُ، فَيَسُبُّ أُمَّهُ» متفقٌ عليه. وفي روايةٍ: «إِنَّ مِنْ أَكْبَرِ الْكَبَائِرِ أَنْ يَلْعَنَ الرَّجُلُ وَالِدَيْهِ!» قِيلَ: يارسولَ الله! كَيْفَ يَلْعَنُ الرَّجُلُ وَالِدَيْهِ؟! قال: «يَسُبُّ أَبَا الرَّجُلِ، فَيَسُبُّ أَبَاهُ، وَيَسُبُّ أُمَّهُ، فَيَسُبُّ أُمَّهُ».

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : "ఘోర పాపాల్లో ఒకటి మనిషి తన తల్లి దండ్రుల్ని శపించటం" అని దైవప్రవక్త (స) అన్నారు. దానికి "దైవ ప్రవక్తా! ఎవడైనా తన కన్న తల్లిదండ్రుల్ని ఎలా శపిస్తాడు?" అని ఎవరో సందేహం వెలి బుచ్చగా, "ఇతను ఇంకొకడి తండ్రిని దూషిస్తే అతను ఇతని తండ్రిని దూషి స్తాడు. ఇతను ఇంకొకని తల్లిని దూషిస్తే అతను ఇతని తల్లిని దూషిస్తాడు" అని ఆయన అన్నారు.

(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఏ మనిషీ ఇతరుల తల్లిదండ్రుల్ని దూషించటంగాని, వారిని కించపరుస్తూ మాట్లాడటం గాని చేయరాదు. అలా చేయటం వల్ల సమాధానంగా ఇతరులు కూడా తన తల్లిదండ్రుల్ని దూషించే అవకాశం ఉంది. ఆ విధంగా మనిషి తన తల్లిదండ్రుల్ని తానే స్వయంగా పరాభవించిన వాడవుతాడు.

٣٤١ ـ وعن أبي محمد جُبَيْرِ بن مُطْعِمٍ رضي الله عنه أَنَّ رسولَ اللهِ ﷺ قال: «لا يَدْخُلُ الجَنَّةَ قَاطِعٌ»، قال سفيانُ في روايتِهِ: يَعْنِي: قَاطِعُ رَحِمٍ. متفق عليه.

341. హజ్రత్ అబూ ముహమ్మద్ జుబైర్ బిన్ ముత్‌యిమ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: "తెగత్రెంపులు చేసేవాడు స్వర్గంలోకి ప్రవేశించడు."

వేరొక ఉల్లేఖనంలో "బంధుత్వాలను త్రెంచేవాడు" అని ఉందని సుఫ్యాన్ (రహ్మాలై) తెలియజేశారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

బంధువులతో తెగత్రెంపులు చేసుకోవటం లేదా బంధువులను విడదీయటం ఎంతటి ఘోరమైన పాపమో ఈ హదీసు చూస్తే తెలుస్తుంది. బంధువిచ్ఛిత్తికి పాల్పడిన పాపి స్వర్గ సుఖాలను అనుభవించటానికి అనర్హుడని ఈ హదీసు హెచ్చరిస్తోంది.

٣٤٢ ـ وعن أَبي عِيسى المُغِيرَةِ بن شُعْبَةَ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «إنَّ اللهَ تَعَالَى حَرَّمَ عَلَيْكُمْ عُقُوقَ الأُمَّهَاتِ، وَمَنْعاً وهاتِ، وَوَأْدَ البَنَاتِ، وَكَرِهَ لَكُمْ قِيلَ وقالَ، وَكَثْرَةَ السُّؤَالِ، وَإِضَاعَةَ المَالِ» متفقٌ عليه.

342. హజ్రత్ అబూ ఈసా ముగీరా బిన్ షోబా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మాతృమూర్తులకు అవిధేయత చూపటాన్ని, తనపై ఉన్న బాధ్యతలను నెరవేర్చకుండా తనకు లేని హక్కుల కోసం ఇతరులపై ఒత్తిడి తేవటాన్ని, ఆడపిల్లల్ని సజీవ సమాధి చేయటాన్ని దేవుడు నిషేధించాడు. అలాగే వ్యర్థప్రేలాపనల్ని,

قولُهُ: «مَنْعاً»

مَعْنَاهُ: مَنْعُ مَا وَجَبَ عَلَيْهِ، وَ«هَاتِ»: طَلَبُ مَا لَيْسَ لَهُ. وَ«وَأْدَ البَنَاتِ» مَعْنَاهُ: دَفْنُهُنَّ فِي الحَيَاةِ، وَ«قِيلَ وَقَالَ» مَعْنَاهُ:

అనవసరమైన ప్రశ్నలు వేయటాన్ని, ధనాన్ని నాశనం చేసుకోవ టాన్ని ఆయన అసహ్యించుకున్నాడు.

(బుఖారీ - ముస్లిం)

الحَدِيثُ بِكُلِّ مَا يَسْمَعُهُ، فَيَقُولُ: قِيلَ كَذَا، وَقَالَ فُلانٌ كَذَا، مِمَّا لا يَعْلَمُ صِحَّتَهُ، وَلا يَظُنُّهَا، وَكَفَى بِالمَرْءِ كَذِباً أَنْ يُحَدِّثَ بِكُلِّ مَا سَمِعَ. وَ«إِضَاعَةُ المَالِ»: تَبْذِيرُهُ وَصَرْفُهُ فِي غَيْرِ الوُجُوهِ المَأْذُونِ فِيهَا مِنْ مَقَاصِدِ الآخِرَةِ وَالدُّنْيَا، وَتَرْكُ حِفْظِهِ مَعَ إِمْكَانِ الحِفْظِ. وَ«كَثْرَةُ السُّؤَالِ»: الإِلْحَاحُ فِيمَا لا حَاجَةَ إِلَيْهِ.

'మన్అన్' అంటే తనపై ఉన్న బాధ్యతల్ని నిర్వర్తించకుండా ఉండటం, 'హాతి' అంటే తనకు లేని హక్కుని గురించి అడగటం. 'వాదుల్ బనాత్' అంటే ఆడ పిల్లల్ని సజీవంగా సమాధి చేయటం. 'ఖీల వ ఖాల' అంటే ఒకరి నోటిమాటల్ని నిజానిజాలు తెలుసుకోకుండానే ఇత రుల ముందు ప్రస్తావించటం. అలా ప్రస్తావించేవాడికి కనీసం అలా జరిగి ఉంటుందన్న అనుమానం కూడా ఉండదు. ఒక వ్యక్తి తాను విన్న మాటల్ని (నిజానిజాలు తెలుసుకోకుండా) ఈ విధంగా ఇతరుల ముందు చెప్పు కుంటూ తిరగటం చాలు- అతను అబద్ధాల రాయుడని చెప్పటానికి!

'ఇజాఅతుల్ మాల్' అంటే డబ్బు దుబారాగా ఖర్చు చేయటం, షరీఅత్ దృష్ట్యా ఇహపరాల ప్రయోజనమేదీ లేని చోట్ల ధనాన్ని వినియోగించటం,ధనాన్ని కాపాడుకునే అవకాశాలున్నప్పటికీ దానికోసం ప్రయత్నించకపోవటం. 'కస్రతుస్సువాల్' అంటే అనవసరంగా అధిక ప్రశ్నలు వేయటం.

وفي الباب أَحَادِيثُ سَبَقَتْ فِي البَابِ قَبْلَهُ كَحَدِيثِ: «وَأَقْطَعُ مَنْ قَطَعَكِ»، وحديث: «مَنْ قَطَعَنِي قَطَعَهُ اللهُ».

ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసులు ఇంకా ఉన్నాయి. అవి ఇంతకుముందు అధ్యాయంలో కూడా వచ్చాయి.

42వ అధ్యాయం

# ٤٢ - بَابُ فَضْلِ بِرِّ أَصْدِقَاءِ الأَبِ وَالأُمِّ وَالأَقَارِبِ وَالزَّوْجَةِ وَسَائِرِ مَنْ يُنْدَبُ إِكْرَامُهُ

# తల్లిదండ్రుల బంధుమిత్రుల పట్లా, ఆదరణీయులగు పెద్దల పట్ల, ఇల్లాలి స్నేహితురాళ్ళ పట్ల మర్యాదగా మసలుకోవటం

٣٤٣ - عن ابنِ عمرَ رضي الله عنهما أنَّ النبيَّ ﷺ قال: «إن أبرَّ البرِّ أَنْ يَصِلَ الرَّجُلُ وُدَّ أَبِيهِ».

343. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు :

"మనిషి తన తండ్రి స్నేహితులతో సత్సంబంధాలు పెట్టుకోవటం అత్యుత్తమ సత్కార్యం.

وعن عبدِ اللهِ بنِ دينارٍ عن عبدِ الله بنِ عمرَ رضي الله عنهما أَنَّ رَجُلاً مِنَ الأَعْرَابِ لَقِيَهُ بِطَرِيقِ مَكَّةَ، فَسَلَّمَ عَلَيْهِ عَبْدُ الله بْنُ عُمَرَ، وَحَمَلَهُ عَلى حِمَارٍ كَانَ يَرْكَبُهُ، وَأَعْطَاهُ عِمَامَةً كَانَتْ عَلَى رَأْسِهِ،

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ దీనార్ (రహ్మాలై) అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) నుండి చేసిన కథనం : మక్కా వెళ్ళేదారిలో ఆయనకు ఒక పల్లెటూరి వ్యక్తి కలిశాడు. అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ఆ వ్యక్తికి సలాం చేసి తాను ఎక్కి వెళుతున్న గాడిదపై ఆ వ్యక్తిని కూడా కూర్చోపెట్టుకున్నారు. ఇంకా తల పాగాను కూడా ఆ వ్యక్తికే తొడిగించారు.

హదీసు ఉల్లేఖకులు అబ్దుల్లాహ్ బిన్ దీనార్ ఇలా తెలియజేస్తున్నారు : అది చూసి మేము అబ్దుల్లాహ్ బిన్ ఉమర్‌తో

قال ابنُ دِينَارٍ: أَصْلَحَكَ اللهُ إِنَّهُمُ الأَعْرَابُ وَهُمْ يَرْضَوْنَ بِالْيَسِيرِ، فقال عبدُ اللهِ بنُ عمرَ: إِنَّ أَبَا هذا كانَ وُدّاً لِعُمَرَ بنِ الخطاب رضي الله عنه وإنِّي سَمِعْتُ رسولَ الله ﷺ يقول: «إنَّ أَبَرَّ البِرِّ صِلَةُ الرَّجُلِ أَهْلَ وُدِّ أَبِيهِ». وفي رواية عن ابن دينار عن ابنِ عُمَرَ أَنَّهُ كانَ إذا خَرَجَ إِلَى مَكَّةَ كَانَ لَهُ حِمَارٌ يَتَرَوَّحُ عَلَيْهِ إذا مَلَّ رُكُوبَ الرَّاحِلَةِ، وَعِمَامَةٌ يَشُدُّ بِهَا رَأْسَهُ، فَبَيْنَا هُوَ يَوْماً عَلَى ذَلِكَ الحِمَارِ إِذْ مَرَّ بِهِ أَعْرَابِيٌّ، فقال: أَلَسْتَ ابنَ فُلانِ بْنِ فُلانٍ؟ قَالَ: بَلَى. فَأَعْطَاهُ الحِمَارَ، فقال: ارْكَبْ هٰذَا، وَأَعْطَاهُ العِمَامَةَ وقال: اشْدُدْ بِهَا رَأْسَكَ، فقال لَهُ بَعْضُ أَصْحَابِهِ: غَفَرَ اللهُ لَكَ أَعْطَيْتَ هٰذَا الأَعْرَابِيَّ حِمَاراً كُنْتَ تَرَوَّحُ عَلَيْهِ، وَعِمَامَةً كُنْتَ تَشُدُّ بِهَا رَأْسَكَ؟ فقالَ: إِنِّي سَمِعْتُ رسولَ الله ﷺ يَقُولُ: «إِنَّ مِنْ أَبَرِّ البِرِّ أَنْ يَصِلَ الرَّجُلُ أَهْلَ وُدِّ أَبِيهِ بَعْدَ أَنْ يُوَلِّيَ» وَإِنَّ أَبَاهُ كَانَ صَدِيقاً لِعُمَرَ رضي الله عنه، روى هٰذِهِ الرِّوَايَاتِ كُلَّهَا مسلم.

"దేవుడు మీకు మేలు చేయుగాక! వీళ్ళు పల్లెటూరి మనుషులు. అతి సామాన్య వస్తువులకే ఎంతగానో సంబరపడిపోయే రకాలు. (అలాంటి వ్యక్తికి మీరు ఇంత మర్యాద చెయ్యాల్సిన అవసరం ఏమొచ్చింది?!)" అని అడిగాము. అందుకాయన "ఇతని తండ్రి (మా నాన్న) ఉమర్ బిన్ ఖత్తాబ్‌కు స్నేహితుడు. 'మనిషి తన తండ్రి మిత్రులతో సత్సంబంధాలు పెట్టుకోవటం ఎంతో గొప్ప పుణ్యకార్యమ'ని దైవప్రవక్త (సల్లం) చెబుతుండగా నేను విన్నాను. (అందుకే నేను ఈ వ్యక్తిని గౌరవిస్తున్నాను)" అని చెప్పారు.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) మక్కా వెళ్ళినప్పుడు ఆయన దగ్గర ఓ గాడిద ఉండేది. ఒంటెపై ప్రయాణించి విసుగెత్తి పోయినప్పుడు ఆయన గాడిదపై ప్రయాణించి కాస్త విశ్రాంతి తీసుకునేవారు. ఇంకా ఆయన దగ్గర ఓ తలపాగా కూడా ఉండేది. దాన్ని ఆయన తలకు కట్టుకునే వారు. ఒకరోజు ఆయన తన గాడిదపై ప్రయాణిస్తుండగా ఆయనకు ఒక వ్యక్తి ఎదురయ్యాడు. ఆయన అతన్ని, "నువ్వు ఫలానావాని కొడుకువి కదూ!?" అని అడిగారు. దానికతను, "అవును, ఆయన కొడుకునే" అని సమాధానమిచ్చాడు. ఆయన ఆ వ్యక్తికి తన గాడిద ఇచ్చి "నువ్వు దీనిపై ఎక్కి వెళ్ళు" అని అన్నారు. ఆ తరువాత తలపాగా కూడా

ఇస్తూ, "దీన్ని నీ తలకు కట్టుకో" అని అన్నారు.

అది చూసి ఆయన స్నేహితులు కొందరు ఆశ్చర్యచకితులయి, "దేవుడు మిమ్మల్ని మన్నించుగాక! మీరు విశ్రాంతి కోసం ఉపయోగించే గాడిదను, ఆఖరికి మీరు ధరించివున్న తల పాగాను కూడా ఈ పల్లెటూరి వ్యక్తికి ఇచ్చేశారేమిటి?" అని అడిగారు. అప్పుడు ఇబ్నె ఉమర్ (రజి) ఇలా సమాధానమిచ్చారు :

'మనిషి తన తండ్రి మరణానంతరం అతని మిత్రులతో సత్సంబంధాలు పెట్టుకోవటం ఎంతో గొప్ప పుణ్యకార్యమ'ని దైవప్రవక్త (సల్లం) చెబుతుండగా నేను విన్నాను. ఇతని తండ్రి (మా నాన్న) ఉమర్‌కు స్నేహితుడు. (అందుకే నేనితనికి మర్యాద ఇస్తున్నాను)."

(ఈ ఉల్లేఖనాలన్నీ ముస్లింవి)

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

తల్లిదండ్రుల మరణానంతరం వారి మిత్రులతో సత్సంబంధాలను కొనసాగించటం, వారి పట్ల మంచిగా మెలగటం అవసరం. ఇలా చేయుటం గొప్ప పుణ్యకార్యంగా పరిగణించబడుతుంది. దీనికి విరుద్ధంగా తల్లిదండ్రులు మరణించిన తరువాత వారి బంధుమిత్రుల్ని విస్మరించటం, వారితో సంబంధాలు కొనసాగించకపోవటం షరీఅత్ దృష్టిలో ఎంతో అవాంఛనీయమైన చేష్ట అనిపించుకుంటుంది.

344. హజ్రత్ అబూ ఉసైద్ మాలిక్ బిన్ రబీయా సాయిదీ (రజి) కథనం : ఒకసారి మేము దైవప్రవక్త (సల్లం) సన్నిధిలో కూర్చొని ఉన్నాం. ఆ సమ

٣٤٤ ـ وعن أبي أُسَيْدٍ ـ بضم الهمزة وفتح السين ـ مالِك بن رَبِيعَةَ السَّاعِدِيِّ رضي الله عنه قال: بَيْنَا نَحْنُ

جُلُوسٌ عِنْدَ رسول الله ﷺ إِذْ جَاءَهُ رَجُلٌ مِنْ بَنِي سَلَمَةَ فقال: يا رسولَ الله! هَلْ بقِيَ مِنْ بِرِّ أَبَوَيَّ شَيْءٌ أَبَرُّهُمَا بِهِ بعدَ مَوْتِهِمَا؟ فقال: «نَعَم، الصَّلاةُ عَلَيْهِمَا، وَالاسْتِغْفَارُ لَهُمَا، وَإِنْفَاذُ عَهْدِهِمَا مِنْ بَعْدِهِمَا، وَصِلَةُ الرَّحِمِ الَّتِي لا تُوصَلُ إِلَّا بِهِمَا، وَإِكْرَامُ صَدِيقِهِمَا» رواه أبو داود.

యంలో బనూ సలమా తెగకు చెందిన ఒక వ్యక్తి ఆయన దగ్గరికి వచ్చి, "దైవప్రవక్తా! నా తల్లిదండ్రులు మరణించిన తరువాత కూడా నేను వారికి చేయ గల సేవ ఏదైనా మిగిలి ఉంటుందా?" అని అడిగాడు. దానికి, "అవును, ఉంటుంది. వారి కోసం ప్రార్థిస్తూ ఉండటం, వారి మన్నింపు కోసం వేడుకోవటం, వారి తదనంతరం వారి ప్రమాణాలను పూర్తి చేయటం, కేవలం వారి ద్వారానే కలిసే బంధుత్వాలను కలపటం, వారి స్నేహితులను గౌరవించటం" అని ఆయన సమాధాన మిచ్చారు. *(అబూ దావూద్)*

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

తల్లిదండ్రులకు సేవ చేసుకోవటానికి వారి జీవితాలను మనపాలిట భాగ్యంగా గుర్తించాలి. వారు మరణించిన తరువాత కూడా వారికి సేవ చేయాలనుకుంటే పై హదీసులో చెప్ప బడిన పద్ధతుల ద్వారా వారికి తమ సేవలు అందజేయవచ్చు. మరణించిన తల్లిదండ్రులకు పుణ్యం ప్రాప్తం కావాలంటే హదీసులో వివరించబడిన పద్ధతులనే అనుసరించాలి. వీటికి బదులు ఖురాన్ ఖానీలద్వారా, దశదిన కర్మలు, నలభై దినాల కర్మ (చహ్లుమ్)ల ద్వారా మరణించినవారికి పుణ్యం లభిస్తుందని భావించటం కేవలం అపోహ మాత్రమే. ఇవి బిద్అత్ (కొత్తపుంత)లు. వీటికి ఖుర్ఆన్ హదీసుల ద్వారా ఎలాంటి రుజువు లభించదు.

మరణించిన వారికి పుణ్యప్రాప్తి జరగాలంటే దైవప్రవక్త చెప్పినట్లు మృతుల కోసం ప్రార్థిస్తూ ఉండాలి. వారి మన్నింపు కోసం దైవాన్ని వేడుకుంటూ ఉండాలి. ఇలాంటి ప్రార్థనల వల్ల మరణించిన వారికే గాకుండా బ్రతికున్న వారికి కూడా ప్రయోజనం ఉంటుంది. సంతానం మరణించిన తమ తల్లిదండ్రుల కోసం ప్రార్థిస్తే దేవుడు వారి తల్లిదండ్రుల్ని మన్నించి పరలోకంలో వారికి గౌరవప్రదమైన స్థానాలను ప్రసాదించటంతో పాటు తమ తల్లిదండ్రులకోసం ప్రార్థించినందుకు సంతానానికి కూడా పుణ్యం నొసగుతాడు. వేరొక హదీసు ప్రకారం మనిషి మరణంతో అతని ఆచరణల పరంపర ఆగిపోతుంది. కాని ఆ తరువాత కూడా మూడు విధాలుగా

అతనికి పుణ్యం లభిస్తూనే ఉంటుంది. అతను చేసిన మంచి పని అతని మరణం తరువాత కూడా ప్రజలకు ప్రయోజనకరంగా ఉంటే అతనికి ఎడతెగకుండా ఆ పుణ్యం లభిస్తూ ఉంటుంది. అదేవిధంగా తాను వదలివెళ్ళిన ప్రజోపయోగ జ్ఞానం వల్ల, సదాచార సంపన్నులైన సంతానం చేసే ప్రార్థనల వల్ల కూడా తనకు పుణ్యం లభిస్తూ ఉంటుంది.

٣٤٥ ـ وعن عائشةَ رضي الله عنها قالت: مَاغِرْتُ عَلى أَحَدٍ مِنْ نِسَاءِ النَّبي ﷺ مَا غِرْتُ عَلى خديجةَ رضي الله عنها، وَمَا رَأَيْتُهَا قَطُّ، وَلٰكِنْ كَانَ يُكْثِرُ ذِكْرَهَا، وَرُبَّمَا ذَبَحَ الشَّاةَ، ثُمَّ يُقَطِّعُهَا أَعْضَاءً، ثُمَّ يَبْعَثُهَا فِي صَدَائِقِ خَدِيجةَ، فَرُبَّمَا قُلْتُ لَهُ: كَأَنْ لَمْ يَكُنْ فِي الدُّنْيَا إِلَّا خَدِيجَةُ! فيقولُ: «إِنَّهَا كَانَتْ وَكَانَتْ وَكَانَ لِي مِنْهَا وَلَدٌ» متفقٌ عليه.

345. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : నేను దైవప్రవక్త భార్యలలో ఖదీజా గారి పట్ల ఈర్ష్య చెందినంతగా మరెవరి పట్లా చెందలేదు. అసలు నేనామెను చూడనైనా చూడలేదు. కాని దైవప్రవక్త (స) ఆమె గురించే ఎక్కువగా చెబుతూ ఉండేవారు. మేకను కోసినప్పుడు ఆయన దాని మాంసాన్ని ముక్కలు ముక్కలుగా చేసి తరచూ ఆమె స్నేహితురాండ్రకు (ఆ మాంసాన్ని కానుకగా) పంపుతుండేవారు. ఒక్కోసారి నేను (ఉండబట్టలేక) "మీకు ఈ లోకంలో ఒక్క ఖదీజాయే ఉంది కాబోలు" అని అనేదాన్ని. ఆ మాటకు ఆయన ఖదీజా గారి గుణగణాలు ఏకరువు పెడుతూ, "ఆమె ఎంతో మంచి మహిళ, ఆమె ద్వారానే నాకు సంతానం కలిగింది" అని అంటుండేవారు.

*(బుఖారీ - ముస్లిం)*

وفي روايةٍ وإنْ كَانَ لَيَذْبَحُ الشَّاةَ، فَيُهْدِي فِي خَلائِلِهَا مِنْهَا مَا يَسَعُهُنَّ. وفي روايةٍ كَانَ إِذَا ذَبَحَ الشَّاةَ يقولُ: «أَرْسِلُوا بِهَا إِلى أَصْدِقَاءِ خَدِيجَةَ».

మరొక ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) మేకను కోసినప్పుడు హజ్రత్ ఖదీజా స్నేహితురాండ్రకు వారికి సరిపోయేటంత మాంసం కానుకగా ఇచ్చేవారు. ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: ఆయన మేకను కోసినప్పుడు "ఇది

ఖదీజా స్నేహితురాండ్రకు పంపించండి"
అని ఆదేశించేవారు.

వేరొక ఉల్లేఖనం ప్రకారం హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) ఇలా తెలిపారు: ఒకసారి ఖదీజా గారి సోదరి హాలా బిన్తె ఖువైలిద్ దైవప్రవక్తను (ఇంట్లోకి రావటానికి) అనుమతి కోరింది. అప్పుడు ఆయనకు ఖదీజా (ర.అన్హా) అనుమతి కోరుతున్నట్లు అనిపించింది (అంటే ఆయనకు ఖదీజా (రజి.అన్హా) అనుమతి కోరే తీరు గుర్తుకొచ్చింది). దాంతో ఆయనకు ఎంతో సంతోషం కలిగింది. ఆ సంతోషంలోనే ఆయన (అప్రయత్నంగా) "అల్లాహ్! హాలా బిన్తె ఖువైలిద్" అని అన్నారు.

وفي روايةٍ قالت: استأذنت هالةُ بنتُ خُوَيلِدٍ أُختُ خديجةَ علَى رسولِ الله ﷺ، فعرَفَ استئذانَ خديجةَ، فارْتاحَ لذلك فقال: «اللَّهمَّ هالةُ بنتُ خُوَيلِدٍ». قولُها: «فارْتاحَ» هو بالحاءِ، وفي الجمع بينَ الصحيحين للحُمَيدي: «فارْتاعَ» بالعين ومعناه: اهتمَّ به.

ఇమామ్ హుమైదీగారి గ్రంథం "అల్ జమా బైనస్సహీహైన్" లో 'ఫర్తాహ'కు బదులు 'ఫర్తాఅ' అని ఉంది. అంటే ఆయన ఆ గొంతు విని కించిత్ విచారానికి లోనయ్యారని అర్థం.

*(సహీహ్ బుఖారీ - సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో దైవప్రవక్త సతీమణి హజ్రత్ ఖదీజా (రజి.అన్హా) గుణగణాలు పొందుపరచబడి ఉన్నాయి.
2. హజ్రత్ ఖదీజా (రజి.అన్హా) సద్గుణసంపన్నురాలైన స్త్రీ అయిన కారణంగా దైవప్రవక్త ఆమెను ఎంతగానో ప్రేమించేవారు.
3. తన సతీమణి మరణానంతరం కూడా ఆయన (స) ఆమె స్నేహితురాళ్ళకు కానుకలు పంపుతూ ఉండేవారు. వారిని గౌరవించేవారు.
4. ఒక్క ఇబ్రాహీం తప్ప ఆయన సంతానమంతా హజ్రత్ ఖదీజా (రజి.అన్హా) ద్వారానే కలిగింది. ఇబ్రాహీం మాత్రం హజ్రత్ మారియా (రజి.అన్హా) కడుపున పుట్టారు.
5. తాను గాఢంగా ప్రేమించిన వ్యక్తి గుర్తుకొచ్చినప్పుడు మనిషి సహజంగానే భావోద్వేగాలకు

లోనవుతాడు. దైవప్రవక్త (స) కూడా మనలాంటి మానవులే. కనుక మరణించిన తన సతీమణి గుర్తుకొచ్చినప్పుడు ఆయన తన గతాన్ని నెమరువేసుకోవటంలో ఆశ్చర్యమేముంది?!

٣٤٦ ـ وعن أَنسِ بنِ مالكٍ رضي الله عنه قال: خَرَجْتُ مَعَ جَرِيرِ بنِ عبدِ الله البَجَلِيِّ رضي الله عنه في سَفَرٍ، فَكَانَ يَخْدُمُني فقلتُ لَهُ: لا تَفْعَلْ، فقال: إنِّي قَدْ رَأَيْتُ الأنْصَارَ تَصْنَعُ بِرَسُولِ اللهِ ﷺ شَيْئاً آلَيْتُ عَلى نَفْسِي أَنْ لا أَصْحَبَ أَحَداً مِنْهُمْ إلَّا خَدَمْتُهُ. متَّفقٌ عليه.

346. హజ్రత్ అనస్ బిన్ మాలిక్ (రజి) కథనం : నేను జరీర్ బిన్ అబ్దుల్లాహ్ బజలీతో పాటు ఒకానొక ప్రయాణంలో బయలుదేరాను. ప్రయాణంలో ఆయన నాకు సేవ చేయటానికి ప్రయత్నించే వారు (చూడబోతే నేనాయనకంటే చాలా చిన్నవాణ్ణి). అందుకని నేనాయనకు "(దయచేసి) మీరిలా చెయ్యకండి" అని విన్నవించుకున్నాను. దానికి ఆయన "అన్సారీ ముస్లింలు దైవప్రవక్త (సఅసం)కు ఇలాగే (సేవలు) చేస్తుండటం నేను చూశాను. అప్పటినుండి నేను కూడా ఏ అన్సారీతో కలిసి ఉన్నా సరే, వారికి సేవ చేయాలని ప్రతిన బూనాను" అని చెప్పారు. (హజ్రత్ అనస్ (రజి) అన్సార్‌కు చెందిన వ్యక్తి అన్న సంగతి గమనార్హం).

*(బుఖారీ - ముస్లిం)*

## ముఖ్యాంశాలు

1. దైవప్రవక్త సహచరులు ఆయనను ఎంతగా అభిమానించేవారంటే ఆ అభిమానం మూలంగా వారు ఆయన సేవకులకు - వాళ్ళు వయసులో తమకన్నా చిన్నవారైనప్పటికీ - వారికి సేవ చేయటానికి ఏమాత్రం తటపటాయించేవారు కాదు. ఇది దైవప్రవక్త సహచరుల అణకువకు, వినమ్రతా భావానికి ప్రబల తార్కాణం.

2. ఆయన సహచరులందరూ పరస్పరం స్నేహ, సౌభ్రాతృత్వ భావాలతో కలిసిమెలిసి ఉండేవారు. ఒండొకరి శ్రేయాన్ని కోరుకునేవారు. దైవప్రవక్త పట్ల వారికున్న అసామాన్య ప్రేమాభిమానాలే ఇందుకు కారణం.

43వ అధ్యాయం

# ٤٣ ـ بَابُ إِكْرَامِ أَهْلِ بَيْتِ رَسُولِ اللهِ ﷺ وَبَيَانِ فَضْلِهِمْ

# దైవప్రవక్త (స) పరివారాన్నీ, వారి ఔన్నత్యాన్నీ గౌరవించాలి

قال الله تعالى: ﴿إِنَّمَا يُرِيدُ ٱللَّهُ لِيُذْهِبَ عَنكُمُ ٱلرِّجْسَ أَهْلَ ٱلْبَيْتِ وَيُطَهِّرَكُمْ تَطْهِيرًا﴾ [الأحزاب: ٣٣] وقال تعالى: ﴿وَمَن يُعَظِّمْ شَعَٰٓئِرَ ٱللَّهِ فَإِنَّهَا مِن تَقْوَى ٱلْقُلُوبِ﴾ [الحج: ٣٢].

దివ్య ఖుర్‌ఆన్‌లో దైవప్రవక్త కుటుంబీకులను సంబోధిస్తూ అల్లాహ్ ఇలా అన్నాడు:

"దైవప్రవక్త కుటుంబీకులైన మీ నుండి కల్మషాన్ని తొలగించాలని, మిమ్మల్ని పూర్తిగా పరిశుద్ధపరచాలని అల్లాహ్ కోరుతున్నాడు."
(అల్ అహ్‌జాబ్ : 33)

మరోచోట ఆయన ఇలా సెలవిచ్చాడు :

"ఎవరైనా అల్లాహ్ నిర్ణయించిన చిహ్నాలను గౌరవిస్తున్నారంటే అది హృదయాలలోని దైవభీతి మూలంగానే." (అల్ హజ్ : 32)

٣٤٧ ـ وعن يزيدَ بنِ حَيَّانَ قال: انطَلَقْتُ أَنَا وَحُصَيْنُ بْنُ سَبْرَةَ، وَعَمْرُو بْن مُسْلِمٍ إلى زَيْدِ بْن أَرْقَمَ رضي الله عنهم، فَلَمَّا جَلَسْنَا إِلَيْهِ قَال له حُصَيْنٌ: لَقَدْ لَقِيتَ يَا زَيْدُ خَيْراً كَثِيراً، رَأَيْتَ رسولَ الله ﷺ، وَسَمِعْتَ حَدِيثَهُ، وَغَزَوْتَ مَعَهُ، وَصَلَّيْتَ خَلْفَهُ، لَقَدْ لَقِيتَ يَازَيْدُ! خَيْراً كَثِيراً، حَدِّثْنَا يَا زَيْدُ! مَا سَمِعْتَ مِنْ رسولِ الله ﷺ قال: يَاابْنَ أَخِي! وَاللهِ! لَقَدْ كَبِرَتْ

347. హజ్రత్ యజీద్ బిన్ హయ్యాన్ కథనం : నేను, హుసైన్ బిన్ సబ్రా, అమ్ర్ బిన్ ముస్లిం - మేము ముగ్గురం హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ దగ్గరికి వెళ్ళాం. అప్పుడు హుసైన్ బిన్ సబ్రా జైద్ బిన్ అర్ఖమ్‌తో మాట్లాడుతూ,

"మీరెన్నో శుభాలను పొందారు. దైవప్రవక్త (సల్లం)ను చూశారు. ఆయన మాటలు విన్నారు. ఆయనతో పాటు యుద్ధాల్లోనూ పాల్గొన్నారు. ఆయన

سِنِّي، وَقَدُمَ عَهْدِي، وَنَسِيتُ بَعْضَ الَّذِي كُنْتُ أَعِي مِنْ رسولِ الله ﷺ، فَمَا حَدَّثْتُكُمْ، فَاقْبَلُوا، وَمَا لا فَلا تُكَلِّفُونِيهِ. ثُمَّ قال: قَامَ رسولُ الله ﷺ يَوْماً فِينَا خَطِيباً بِمَاءٍ يُدْعَى خُمّاً بَيْنَ مَكَّةَ وَالمَدِينَةِ، فَحَمِدَ اللهَ، وَأَثْنَى عَلَيْهِ، وَوَعَظَ، وَذَكَّرَ، ثُمَّ قال: «أَمَّا بَعْدُ: ألا أَيُّهَا النَّاسُ، فَإِنَّمَا أَنَا بَشَرٌ يُوشِكُ أَنْ يَأْتِيَ رسولُ رَبِّي فَأُجِيبَ، وَأَنَا تَارِكٌ فِيكُمْ ثَقَلَيْنِ: أَوَّلُهُمَا كِتَابُ الله، فِيهِ الهُدَى وَالنُّورُ، فَخُذُوا بِكِتَابِ الله، وَاسْتَمْسِكُوا بِهِ». فَحَثَّ عَلَى كِتَابِ الله، وَرَغَّبَ فِيهِ ثُمَّ قال: «وَأَهْلُ بَيْتِي أُذَكِّرُكُمُ اللهَ فِي أَهْلِ بَيْتِي، أُذَكِّرُكُمُ اللهَ فِي أَهْلِ بَيْتِي» فَقَالَ لَهُ حُصَيْنٌ: وَمَنْ أَهْلُ بَيْتِهِ

సారథ్యంలో నమాజులు కూడా చేశారు. జైద్‌గారూ! నిజంగా మీరు ఎన్నో శుభాలను పొందినవారు. కాబట్టి మీరు దైవప్రవక్త నుంచి విన్న మాటలు కాస్త మాక్కూడా బోధించండి" అని కోరారు.

దానికి హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి) ఇలా అన్నారు : "చూడు నాయనా! నేను ముసలివాణ్ణయిపోయాను. దైవప్రవక్త (సల్లం)తో పాటు నా సహచర్యం గతించి చాలా కాలమయింది. దైవప్రవక్త నుంచి నేర్చుకున్న కొన్ని విషయాలు నేను మరిచిపోయాను కూడా. కనుక (ఇప్పుడు) నేను మీకు చెప్పబోయే విషయాలు విని తెలుసుకోండిగాని నాకు గుర్తులేని విషయాల గురించి మాత్రం ఇబ్బంది పెట్టకండి.

"ఒకరోజు మక్కా మదీనా నగరాల మధ్య 'ఖమ్' అని పిలువబడే నీటి గుంట దగ్గర దైవప్రవక్త (సల్లం) మాకు ఉపన్యాసమిచ్చారు. ముందుగా ఆయన దేవుని ప్రశంసల్ని, ఆయన పొగడ్తల్ని స్తుతించారు. ప్రజలకు హితోపదేశం చేశారు. ఆ తరువాత ఇలా అన్నారు :

"ప్రజలారా! జాగ్రత్తగా వినండి! నేనూ ఒక మానవుడినే. నా ప్రభువు దగ్గరినుండి దూత వస్తే, ప్రభువు పిలుపుకు హాజరు పలికి (అందరిలాగే నేను కూడా) వెళ్ళిపోతాను. నేను మీ మధ్య రెండు బరువైన వస్తువులు వదలి వెళుతున్నాను. వాటిలో మొదటిది : దైవగ్రంథము.

అందులో (మనిషి జీవన) సంవిధాన ముంది. (సన్మార్గంపై నడిపించే) వెలుగు ఉంది. కనుక మీరు దైవగ్రంథాన్ని అనుసరిస్తూ దాన్ని గట్టిగా పట్టుకోండి."

ఆ విధంగా అప్పుడు దైవప్రవక్త (స) దైవగ్రంథాన్ని ఆచరించమని ప్రజలను ప్రోత్సహించారు. దానిని అనుసరించ మని పురికొల్పారు. తరువాత ఇలా అన్నారు :

ఇక (రెండో విషయం) నా కుటుంబీ కులకు సంబంధించినది. నా కుటుంబీ కుల విషయంలో నేను మీకు దేవుణ్ణి గుర్తు చేస్తున్నాను.

హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి) ఈ సంఘటన వివరించిన తరువాత మా ముగ్గురిలో ఒకరైన) హుసైన్ ఆయనతో "జైద్‌గారూ! దైవప్రవక్త కుటుంబీకు లంటే ఎవరు? ఆయన సతీమణులు ఆయన కుటుంబీ కులు కారా?" అని సందేహం వెలి బుచ్చారు. దానికి జైద్ "(ఎందుకుకారు?) ఆయన సతీ మణులు ఆయన కుటుంబీకులే. కాని (ఇక్కడ) ఆయన కుటుంబీకు లంటే ఆయన తదనంతరం దాన ధర్మాల సొమ్ము అనుభవించడానికి నిషేధిం చబడిన వారని అర్థం" అని చెప్పారు. "మరి ఈ దానధర్మాలు నిషేధించబడిన వాళ్ళు ఎవరెవరు?" అని హుసైన్ మళ్ళీ

يَا زَيْدُ! أَلَيْسَ نِسَاؤُهُ مِنْ أَهْلِ بَيْتِهِ؟ قَالَ: نِسَاؤُهُ مِنْ أَهْلِ بَيْتِهِ، وَلٰكِنْ أَهْلُ بَيْتِهِ مَنْ حُرِمَ الصَّدَقَةَ بَعْدَهُ، قَالَ: وَمَنْ هُمْ؟ قَالَ: هُمْ آلُ عَلِيٍّ، وَآلُ عَقِيلٍ، وَآلُ جَعْفَرٍ، وَآلُ عَبَّاسٍ قال: كُلُّ هٰؤُلاءِ حُرِمَ الصَّدَقَةَ؟ قَالَ: نَعَمْ. رواه مسلم.

ప్రశ్నించారు. అందుకాయన "అలీ, ఉఖైల్, జాఫర్, అబ్బాస్‌ల సంతతివారే వాళ్ళు" అని సమాధానమిచ్చారు. "వీళ్ళందరికీ దానధర్మాల సొమ్ము అనుభవించటం నిషిద్ధమేనా?" అని హుసైన్ మళ్ళీ అడిగారు. ఆ మాటకు "అవును" అని అన్నారు హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి). *(ముస్లిం)*

وفي رواية: «ألا وَإِنِّي تَارِكٌ فِيكُمْ ثَقَلَيْنِ: أَحَدُهُمَا كِتَابُ اللهِ وَهُوَ حَبْلُ اللهِ، مَنِ اتَّبَعَهُ كَانَ عَلَى الْهُدَى، وَمَنْ تَرَكَهُ كَانَ عَلَى ضَلَالَةٍ»

వేరొక ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : జాగ్రత్తగా వినండి! నేను మీ మధ్య రెండు బరువైన వస్తువులు వదలి వెళుతున్నాను. వాటిలో ఒకటి దైవగ్రంథము. ఇది (దేవుని దగ్గరికి చేరుకోవటానికి) దేవునిత్రాడు (లాంటిది). ఈ గ్రంథాన్ని అనుసరించిన వాడు సన్మార్గంపై ఉంటాడు. దీనిని వదలిపెట్టిన వాడు భ్రష్టుపట్టి పోతాడు.

*(సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. దైవప్రవక్త (సల్లం) కూడా మానవమాత్రులేనని, మానవులందరిలాగే ఆయనకు కూడా మరణం సంభవిస్తుందన్న విషయం ఈ హదీసు ద్వారానే రూఢీ అవుతోంది.
2. దైవగ్రంథాన్ని గట్టిగా పట్టుకోవాలనీ, దైవప్రవక్త కుటుంబీకులను గౌరవించాలని ఈ హదీసు తాకీదు చేస్తోంది.
3. రెండు వర్గాల వారు దైవప్రవక్త కుటుంబీకులనబడతారు. వారిలో ఒకరు దైవప్రవక్త సతీమణులు. వీరు దైవప్రవక్త కుటుంబీకులన్న విషయాన్ని దివ్య ఖుర్‌ఆన్ సయితం ధృవీకరించింది. రెండవ వర్గం ఆయన వంశస్థులైన హాషిం మరియు ముత్తలిబ్ తెగలవారు. వీరిలోని అలీ, ఉఖైల్, జాఫర్, అబ్బాస్, హారిస్‌ల సంతానమంతా దైవప్రవక్త కుటుంబీకులు (అహ్లెబైత్)గానే పరిగణించబడతారు. దానధర్మాల ద్వారా వచ్చే సొమ్ము నిషేధించబడింది ఈ రెండవ వర్గం వారిపైనే.

దైవప్రవక్త వంశస్థులపై జకాత్ లాంటి విధిగా ఇవ్వబడే దానాలు మాత్రమే నిషేధించబడ్డా యని కొంతమంది అభిప్రాయపడ్డారు. వీరి దృష్టిలో ప్రజలు స్వచ్ఛందంగా ఇచ్చే దానాల్ని దైవప్రవక్త వంశస్థులు కూడా స్వీకరించవచ్చు. కాని మెజారిటీ విద్వాంసుల అభిప్రాయం ప్రకారం ప్రవక్త వంశీయుల కొరకు అన్నిరకాల దానాలూ నిషిద్ధమే. ఎందుకంటే దైవప్రవక్త (సల్లం) తన వంశీయులు సదఖా (దానం) స్వీకరించటం హరాం (నిషిద్ధం) అని అన్నారు. విధిగా ఇచ్చే దానమైనా, స్వచ్ఛందంగా ఇచ్చే దానమైనా రెండూ దానం (సదఖా) క్రిందికే వస్తాయి కదా!

4. మరికొన్ని సందర్భాల్లో దైవప్రవక్త (సల్లం) "నేను మీ మధ్య దైవగ్రంథాన్ని మరియు నా సంప్రదాయాన్ని వదలివెళుతున్నాను" అని అన్నారు. ఈ హదీసులో దైవగ్రంథంతోపాటు దైవప్రవక్త కుటుంబీకుల ప్రస్తావన కూడా ఉంది. ఈ రెండు ప్రవచనాల్లో ఎలాంటి వైరుధ్యం లేదు. స్థూలంగా దీని భావం ఏమిటంటే, దైవగ్రంథాన్ని అనుసరించటంతో పాటు ప్రవక్త ఆదేశాలను కూడా పాటించాలి. అదే విధంగా ఆయన వంశస్థుల్ని గౌరవించాలి. వారి హక్కుల్ని పరిరక్షించాలి.

٣٤٨ ـ وعَن ابن عُمَرَ رضي الله عنهما، عَنْ أبي بَكْرٍ الصِّدِّيق رضي الله عنه مَوْقُوفاً عَلَيْهِ أَنَّهُ قَالَ: ارْقُبُوا مُحَمَّداً ﷺ فِي أَهْلِ بَيْتِهِ. رواه البخاري.
مَعْنَى «ارْقُبُوا» رَاعُوهُ وَاحْتَرِمُوهُ وَأَكْرِمُوهُ، والله أعلم.

348. హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (రజి) ఇలా అన్నారని ఇబ్నె ఉమర్ (రజి) తెలియజేశారు - ఇది అబూబక్ర్ (రజి) మాటే. దైవప్రవక్త (స) ఇలా అన్నారో లేదో తెలీదు - : ముహమ్మద్ (సల్లం)ను దృష్టిలో పెట్టుకొని మీరు ఆయన కుటుంబీకుల్ని గౌరవించండి."

*(బుఖారీ)*

'ఉర్ఖుబూ' అంటే ఆయన్ని దృష్టిలో పెట్టుకోండి. ఆయన్ని గౌరవించండి. ఆదరించండి అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త కుటుంబీకుల్ని గౌరవించటం స్వయంగా దైవప్రవక్తను గౌరవించటంతో సమానమని ఈ హదీసులో చెప్పబడింది. ప్రవక్త కుటుంబీకులను గౌరవించేవాడు వాస్తవానికి ప్రవక్తను గౌరవిస్తున్నవాడుగా పరిగణించబడతాడు. దీనికి భిన్నంగా ప్రవక్త కుటుంబీకులను అభిమానించని మనిషి హృదయంలో ప్రవక్త అభిమానానికి కూడా చోటు ఉండదని అర్థం.

కాని ఇక్కడ తెలుసుకోవలసిన విషయం ఒకటుంది. ప్రవక్త కుటుంబీకుల్ని అభిమానించడమంటే, వారి గౌరవంలో అతిశయిల్లి వారు మానవాతీతులని, వారివల్ల అసలు తప్పులే జరగవని భావించటం కాదు. ఈ భావన ధర్మంలో వైపరీత్యానికి దారితీసింది. కొంతమంది దైవప్రవక్త (సల్లం) వంశం వారిని గౌరవించే విషయంలో హద్దులు దాటిపోయారు. ఫలితంగా మార్గభ్రష్టతకు లోనయ్యారు. వాస్తవానికి ప్రవక్త కుటుంబీకులను అభిమానించటమంటే, మహోన్నతమైన వారి జీవితాలను ఆదర్శంగా చేసుకోవటం అన్నమాట! వారి ఉత్తమ నడవడికను అలవరచుకోవటం, వారి దైవభీతిని, ధర్మపరాయణతను ప్రేమించి, తాము కూడా వారి అడుగుజాడల్లో నడవటానికి ప్రయత్నించటం. అంతేగాని ప్రత్యేకంగా ఒక కుటుంబానికి లేనిపోని పవిత్రతను అంటగట్టి వారిని గౌరవించే విషయంలో అతిశయిల్లటం ధర్మభ్రష్టత తప్ప మరేమీ కాదు!



## 44వ అధ్యాయం

# ٤٤ - بَابُ تَوْقِيرِ الْعُلَمَاءِ وَالْكِبَارِ وَأَهْلِ الْفَضْلِ وَتَقْدِيمِهِمْ عَلَى غَيْرِهِمْ وَرَفْعِ مَجَالِسِهِمْ وَإِظْهَارِ مَرْتَبَتِهِمْ

# పండితులను, పెద్దలను, పలుకుబడిగల వారిని గౌరవించాలి, వారికి ఇతరులపై ప్రాధాన్యతనివ్వాలి, సమున్నత స్థానాన్ని ప్రసాదించాలి. వారి స్థాయిని ఇనుమడింపజేయాలి

قال الله تعالى: ﴿قُلْ هَلْ يَسْتَوِى ٱلَّذِينَ يَعْلَمُونَ وَٱلَّذِينَ لَا يَعْلَمُونَ إِنَّمَا يَتَذَكَّرُ أُوْلُوا ٱلْأَلْبَٰبِ﴾ [الزمر: ٩].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"ప్రవక్తా! వారిని అడుగు, తెలిసినవారూ, తెలియనివారూ ఇద్దరూ సమానులు కాగలరా? బుద్ధిమంతులు మాత్రమే హితబోధను స్వీకరిస్తారు." *(అజ్ జుమర్ : 9)*

٣٤٩ - وعن أبي مسعودٍ عُقْبَةَ بن عمرو البدريِّ الأنصاريِّ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «يَؤُمُّ القَوْمَ أَقْرَؤُهُمْ لِكِتَابِ الله، فَإِنْ كَانُوا فِي القِرَاءَةِ سَوَاءً، فَأَعْلَمُهُمْ بِالسُّنَّةِ، فَإِنْ كَانُوا فِي السُّنَّةِ سَوَاءً، فَأَقْدَمُهُمْ هِجْرَةً، فَإِنْ كَانُوا فِي الهِجْرَةِ سَوَاءً، فَأَقْدَمُهُمْ سِنّاً، وَلا يَؤُمَّنَّ الرَّجُلُ الرَّجُلَ فِي سُلْطَانِهِ، وَلا يَقْعُدْ فِي بَيْتِهِ عَلَى تَكْرِمَتِهِ إلَّا بِإذْنِهِ» رواه مسلم.

349. హజ్రత్ అబూ మస్‌వూద్ ఉఖ్బా బిన్ అమ్ర్ బద్రీ అన్సారీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : దైవగ్రంథాన్ని బాగా పారాయణం చేసేవ్యక్తి (నమాజులో) ప్రజలకు సారథ్యం వహించాలి. ఒకవేళ ప్రజలందరూ గ్రంథపారాయణం బాగా చేసేవారే అయినప్పుడు వారిలో దైవ ప్రవక్త విధానం (సున్నత్) గురించి అందరికన్నా బాగా తెలిసిన వ్యక్తి సారథ్యం వహించాలి. ఒకవేళ సున్నత్

وفي روايةٍ لَهُ: «فَأَقْدَمُهُمْ سِلْماً» بَدَلَ «سِنّاً»، أَيْ: إسْلاماً. وفي روايةٍ: «يَؤُمُّ القَوْمَ أقْرَؤُهُمْ لِكِتَابِ اللهِ، وَأَقْدَمُهُمْ قِرَاءَةً، فَإِنْ كَانَتْ قِرَاءَتُهُمْ سَوَاءً فَيَؤُمُّهُمْ أَقْدَمُهُمْ هِجْرَةً، فَإِنْ كَانُوا فِي الهِجْرَةِ سَوَاءً، فَلْيَؤُمَّهُمْ أَكْبَرُهُمْ سِنّاً». وَالمُرَادُ بِـ«سُلْطَانِهِ» مَحَلُّ وِلايَتِهِ، أَوِ المَوْضِعُ الَّذِي يَخْتَصُّ بِهِ وَ«تَكْرِمَتُهُ» بفتح التاءِ وكسر الراءِ: وَهِيَ مَا يَنْفَرِدُ بِهِ مِنْ فِرَاشٍ وَسَرِيرٍ وَنَحْوِهِمَا.

జ్ఞానంలో కూడా ప్రజలందరూ సమానులే అయినప్పుడు వారిలో ప్రప్రథమంగా దైవమార్గంలో హిజ్రత్ (ప్రస్థానం) చేసినవారు సారథ్యం వహించాలి. ఒకవేళ హిజ్రత్‌లో కూడా అందరూ సమానులుగా ఉంటే అప్పుడు వయసులో అందరికన్నా పెద్దవాడు వారికి సారథ్యం వహించాలి. మనిషి ఇంకొకరి ఆధిక్యతగల ప్రాంతంలో ఉంటూ వారికి సారథ్యం వహించకూడదు. అతని ఇంట్లో అతని అనుమతి లేనిదే అతని గౌరవాసనంపై కూర్చోకూడదు. (ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో వయసులో అందరికన్నా పెద్దవాడు అనేచోట 'అందరికన్నా ముందు ఇస్లాం స్వీకరించినవాడు' అని ఉంది.

ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దైవ గ్రంథాన్ని చాలా బాగా పారాయణం చేసేవాడు, దాని పారాయణంలో ప్రావీణ్యత గల వ్యక్తి ప్రజలకు సారథ్యం వహించాలి. ఒకవేళ అందరి పారాయణం ఒకేలాగుంటే అప్పుడు అందరి కన్నా ముందు దైవమార్గంలో హిజ్రత్ (ప్రస్థానం) చేసిన వ్యక్తి సారథ్యం వహించాలి. ఒకవేళ హిజ్రత్‌లో కూడా అందరూ సమానులుగా ఉంటే అప్పుడు వయసులో అందరికన్నా పెద్దవాడు సారథ్యం వహించాలి.

'సుల్తానుహూ' అంటే తన అధీనంలో

ఉన్న ప్రాంతం లేదా తనకు ప్రత్యేకించ బడిన ప్రాంతం. 'తక్రిమతుహూ' అంటే ఒక వ్యక్తికి ప్రత్యేకించబడిన పడక, మంచం మొదలగునవి.

*(సహీహ్ ముస్లింలోని నమాజు ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. నమాజు సారథ్యానికి (ఇమామత్‌కు) ఎవరు ఎక్కువ అర్హులో ఈ హదీసులో ఒక క్రమం ప్రకారం వివరించటం జరిగింది. ఖుర్‌ఆన్‌ను మధురాతి మధురంగా పారాయణం చేసేవారు నమాజులో ప్రజలకు సారథ్యం వహించటానికి అందరికన్నా ఎక్కువ అర్హులుగా పరిగణించబడతారు. ఖుర్‌ఆన్ పారాయణం చేసేవారిలో (ఖారీల్లో) కూడా దైవభీతిగల ఖారీలను ఎంచుకోవటం మంచిది. మరికొన్ని హదీసుల్లో తమలో అందరి కన్నా మంచివాణ్ణి ఇమామ్‌గా ఎన్నుకోవాలని ఆదేశించటం జరిగింది. ఇంకో విషయం ఏమిటంటే ఖుర్‌ఆన్ పారాయణంలో సహజత్వం ఉండాలి. అందులో కృత్రిమత తొంగిచూడకూడదు. దివ్య ఖుర్‌ఆన్‌ను ఇంపైన స్వరంతో లయబద్ధంగా మెల్లగా ఆగి ఆగి పఠించాలి.
2. ఒక నిర్ణీత ప్రాంతానికి చెందిన రాజులు, అధినేతలు, ఉన్నతాధికారులు తమ తమ ప్రాంతాలలో నమాజుకు సారథ్యం వహించటానికి అందరికన్నా ఎక్కువ హక్కుదారులుగా పరిగణించబడతారు. దైవప్రవక్త (స) మరియు ఆయన సహచరుల కాలంలో ఆనాటి గవర్నర్లు, ఉన్నతాధికారులే మస్జిదుల్లో ప్రజలకు ఇమామత్ చేసేవారు. కాని శోచనీయమైన విషయం ఏమిటంటే, నేడు ముస్లిం దేశాల ఏలికల్లోనే దురాచరణ సర్వసామాన్యమైపోతోంది. ఉన్నతాధికారులు, వారి క్రింద పనిచేసేవారందరూ నమాజులాంటి బృహత్తర విధి పట్ల నిర్లక్ష్యం వహిస్తున్నారు.
3. ఇతరుల ఇళ్ళకు, కార్యాలయాలకు వెళ్ళినప్పుడు అక్కడ వారి కోసం ప్రత్యేకించబడిన కుర్చీలపై కూర్చోకూడదు. ఒకవేళ వారు అందుకు అనుమతి ఇస్తే అప్పుడు కూర్చోవటంలో తప్పులేదు. అదేవిధంగా ఇతర పండితుల మింబర్ల (వేదికల)పై, ఇమాముల ముసల్లాలపై తాము ముందుగా వెళ్ళి నించోటం కూడా మంచిది కాదు.

350. హజ్రత్ ఉఖబా బిన్ అమ్ర్ (రజి) గారే చేసిన కథనం : (మేము నమాజు కోసం నించున్నప్పుడు) దైవప్రవక్త (సల్లం) మా భుజాలను తాకుతూ "తిన్నగా నిలబడండి, మీరు విభేదించు కోకండి, లేదా మీ హృదయాలు కూడా

٣٥٠ ـ وعنه قال: كان رسولُ الله ﷺ يَمْسَحُ مَنَاكِبَنَا فِي الصَّلاةِ وَيَقُولُ: «اسْتَوُوا وَلَا تَخْتَلِفُوا، فَتَخْتَلِفَ قُلُوبُكُمْ، لِيَلِنِي مِنْكُمْ أُولُو الأَحْلَامِ وَالنُّهَى، ثُمَّ الَّذِينَ يَلُونَهُمْ ثُمَّ الَّذِينَ

పరస్పరం విభేదించుకుంటాయి (నేను నమాజు చేయిస్తున్నప్పుడు) మీలోని బుద్ధిమంతులు, తెలివిగలవారు నాకు దగ్గరగా నిలబడాలి. వారి వెనుక వారి కన్నా తక్కువ ప్రతిభావంతులు నిలబడాలి. ఆ తరువాత వారికన్నా తక్కువ ప్రతిభావంతులు నిలబడాలి" అని చెప్పేవారు. *(ముస్లిం)*

'లియలినీ' అనే పదం 'లియలీన్నీ' అని కూడా ఉల్లేఖించబడింది. (రెండింటికీ ఒకే అర్థం). 'నుహా' అంటే తెలివిగల వారు. 'ఉలుల్ అహ్లామ్' అంటే ప్రాజ్ఞులు. మరికొంతమంది అభిప్రాయంలో ఉలుల్ అహ్లామ్ అంటే నెమ్మదస్తులు, గొప్పవారని అర్థం.

*(సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

يَلُونَهُمْ» رواه مسلم. وقوله ﷺ: «لِيَلِنِي» هو بتخفيف النُون وَلَيسَ قَبلَهَا يَاءٌ، وَرُوِيَ بِتَشْدِيدِ النُونِ مَعَ يَاءٍ قَبْلَهَا. وَ «النُّهَى»: العُقُولُ. وَ «أُولُو الأحْلام» هُمُ البَالِغونَ، وَقِيلَ: أَهْلُ الحِلْمِ وَالفَضْلِ.

## ముఖ్యాంశాలు

1. నమాజులో పంక్తులు తిన్నగా ఉండటానికి దైవప్రవక్త (సల్లం) ఎంత ప్రాముఖ్యం ఇచ్చేవారంటే, తన సహచరుల భుజాలు పట్టుకొని మరీ వారి పంక్తులను తిన్నగా చేసేవారు. అంతేకాదు నమాజులో పంక్తుల వక్రత్వం మనసుల వక్రతకు దారితీస్తుందని ఆయన హెచ్చరించేవారు.
2. నమాజులో ఇమామ్‌కు వెనుక మొదటి పంక్తిలో ప్రాజ్ఞులు, సమయస్ఫూర్తి గలవారు నించోవాలి. దీనివల్ల నమాజులో ఇమామ్ వల్ల ఏదైనా పొరపాటు జరిగినప్పుడు ఇమామ్‌కు సూచించటానికి, అవసరమైతే మరో వ్యక్తి ఇమామ్ స్థానంలో నిలబడి నమాజు కొనసాగించటానికి ఈ పద్ధతి చాలా ఉపయోగపడుతుంది.

351. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : (నమాజులో) నెమ్మదస్తులు, తెలివిగలవారు నాకు

٣٥١ - وعن عبدِ اللهِ بنِ مسعودٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «لِيَلِنِي مِنكُمْ أُولُو الأَحْلامِ وَالنُّهَى، ثُمَّ

الَّذِينَ يَلُونَهُمْ» ثَلاثاً «وَإِيَّاكُمْ وَهَيْشَاتِ الأَسْوَاقِ» رواه مسلم.

దగ్గరగా నిలబడాలి. వారి వెనుక వారి కన్నా తక్కువ సమయస్ఫూర్తి గలవారు నిలబడాలి - ఇలా క్రమంగా నిలబడాలని దైవప్రవక్త (సల్లం) మూడుసార్లు అన్నారు. ఆ తరువాత బజారుల్లోలాగా (మస్జిదుల్లో) గోల చేయకండి" అని అన్నారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

٣٥٢ ـ وعن أَبي يَحْيَى وَقِيلَ: أَبي مُحَمَّدٍ سَهْلِ بنِ أَبي حَثْمَةَ ـ بفتح الحاءِ المهملة وإسكانِ الثاءِ المثلثةِ ـ الأنصاري رضي الله عنه قال: انْطَلَقَ عَبْدُ اللهِ بْنُ سَهْلٍ وَمُحَيِّصَةُ بْنُ مَسْعُودٍ إلَى خَيْبَرَ وَهِيَ يَوْمَئِذٍ صُلْحٌ، فَتَفَرَّقَا، فَأَتَى مُحَيِّصَةُ إلَى عَبْدِ الله بْنِ سَهْلٍ وَهُوَ يَتَشَحَّطُ في دَمِهِ قَتِيلاً، فَدَفَنَهُ، ثُمَّ قَدِمَ المَدِينَةَ فَانْطَلَقَ عَبْدُ الرَّحْمٰنِ بْنُ سَهْلٍ وَمُحَيِّصَةُ وَحُوَيِّصَةُ ابْنَا مَسْعُودٍ إلَى النَّبِيِّ ﷺ، فَذَهَبَ عَبْدُ الرَّحْمٰنِ يَتَكَلَّمُ فَقَالَ: «كَبِّرْ كَبِّرْ» وَهُوَ أَحْدَثُ القَوْمِ، فَسَكَتَ، فَتَكَلَّمَا فقال: «أَتَحْلِفُونَ وَتَسْتَحِقُّونَ قَاتِلَكُمْ؟» وَذَكَرَ تَمَامَ الحَدِيثِ. متفقٌ عليه.

352. హజ్రత్ అబూ యహ్యా - కొంత మంది అభిప్రాయం ప్రకారం అబూ ముహమ్మద్ సహ్లా బిన్ అబూ హస్మా అన్సారీ (రజి) కథనం : అబ్దుల్లాహ్ బిన్ సహ్లా (రజి) మరియు ముహయ్యిసా బిన్ మసూద్ (రజి) ఒకసారి ఖైబర్ ప్రాంతానికి వెళ్ళారు. అప్పుడు ఖైబర్ యూదులకు మరియు ముస్లింలకు మధ్య ఒప్పందం జరిగివుంది. అక్కడికి వెళ్ళిన తరువాత వారిద్దరూ తమ తమ పనుల నిమిత్తం వేరయిపోయారు. (పని ముగిసిన తరువాత) ముహయ్యిసా (రజి) అబ్దుల్లాహ్ బిన్ సహ్లా దగ్గరికి వచ్చి చూస్తే ఆయన హత్యచేయబడి రక్తపు మడుగులో కొట్టుమిట్టాడుతున్నారు. (ప్రాణం పోయిన తరువాత) ముహయ్యిసా ఆయనకు ఖనన సంస్కారాలు చేసి తిరిగి మదీనాకు వచ్చారు. (బంధుమిత్రులందరికీ ఈ విషయం తెలిసింది). అప్పుడు అబ్దుర్రహ్మాన్ బిన్

సహ్లా ఇంకా మసూద్ (రజి) గారి ఇద్దరు కుమారులు ముహయ్యిసా మరియు హువయ్యిసా అంతా కలిసి (ఈ విషయం గురించి ఫిర్యాదు చేయటా నికి) దైవప్రవక్త దగ్గరికి వెళ్ళారు. అక్కడికి వెళ్ళిన తరువాత అబ్దుర్రహ్మాన్ ఈ విషయం గురించి మాట్లాడబోయారు. కాని దైవప్రవక్త (స) ఆయన్ని ఆపి, "పెద్దవారు, పెద్దవారు మాట్లాడాలి" అని అన్నారు. అబ్దుర్రహ్మాన్ ఆ ముగ్గురిలో అందరికంటే చిన్నవారు. అందుకని ఆయన మౌనం వహించారు. అప్పుడు మస్వూద్ గారి ఇద్దరు కొడుకులు మాట్లాడారు. (వీళ్ళు హతుని బాబాయి కుమారులు). వాళ్ళు చెప్పిందంతా విని దైవప్రవక్త (స) "మీరు (ఈ విషయమై) ప్రమాణం చేయటానికి సిద్ధంగా ఉన్నారా? మీ సోదరుని హంతకుడి నుండి పరిహారాన్ని కోరుకుంటున్నారా?" అని వారిని అడిగారు.

(హదీసు ఉల్లేఖకులు మిగిలిన సంఘటన అంతా వివరించారు.)

*(బుఖారీ - ముస్లిం)*

"కబ్బిర్, కబ్బిర్" అంటే పెద్దాయన మాట్లాడాలని అర్థం.

وقوله ﷺ: «كَبِّرْ كَبِّرْ» معناه: يَتَكَلَّمُ الأَكْبَرُ.

(సహీహ్ బుఖారీలోని రక్తశుల్కాల ప్రకరణం, సహీహ్ ముస్లింలో - హతుని వారసులనుండి తీసుకునే ప్రమాణ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

(1). గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసు భాగాన్నే

ఇక్కడ ప్రస్తావించారు. హదీసు మూలగ్రంథాల్లో ఈ హదీసు పూర్తిగా వివరించబడి ఉంది. ఇక్కడ ఈ హదీసును ప్రస్తావించడంలోని ఔచిత్యం ఏమిటంటే, ఒక సమావేశంలో మాట్లాడటానికి అక్కడున్న వారిలో వయసురీత్యా అందరికన్నా పెద్దవారికి హక్కు ఉంటుంది. అయితే సమావేశంలో ఉన్న వారందరూ ప్రాజ్ఞులు, ప్రతిభావంతులైనప్పుడు మాత్రమే వయస్సు రీత్యా పెద్దవారికి ఆ హక్కు ఉంటుంది. ఒకవేళ విజ్ఞతలో అందరూ సమానులు కాకపోతే అలాంటి పరిస్థితుల్లో అందరికన్నా విజ్ఞుడే ఆ సమావేశంలో మాట్లాడటానికి ఎక్కువ హక్కుదారుగా పరిగణించబడతాడు.

2. ఈ హదీసులో 'ఖసామత్' ప్రస్తావన కూడా వచ్చింది. ఏ ప్రాంతంలోనైనా ఒక వ్యక్తి హత్యచేయబడి హంతకుడెవరో తెలియనప్పుడు హతుని వారసుల్లోని యాభైమంది లేదా అంతకన్నా తక్కువ మంది యాభైసార్లు ప్రమాణం చేసి ఈ ప్రాంతానికి చెందినవాడే ఇతణ్ణి హత్యచేసి ఉంటాడని చెప్పాలి. వారు గనక ఆ విధంగా యాభైసార్లు ప్రమాణం చేసి చెబితే ఆ ప్రాంతంలోని వారంతా కలిసి హతుని వారసులకు రక్తపరిహారం చెల్లించవలసి ఉంటుంది. అయితే ప్రత్యర్థులు కూడా తమ ప్రాంతం వారెవరూ ఈ హత్య చేయలేదని ప్రమాణం చేసి చెబితే వారికి రక్త పరిహారం చెల్లించాల్సిన అవసరం ఉండదు. అప్పుడు హతుని వారసులకు ముస్లింల సంఘటిత నిధి (బైతుల్ మాల్) నుండి రక్తపరిహారం ఇవ్వబడుతుంది. ఈ పద్ధతిలో హతుని వారసులు మరియు ప్రత్యర్థుల నుండి ప్రమాణం తీసుకోవటాన్నే 'ఖసామా' అంటారు. ఇస్లాంకు పూర్వం అజ్ఞానకాలంలో ఈ పద్ధతి అమల్లో ఉండేది. ఇస్లాం దీని ప్రాముఖ్యతను గుర్తించి ఆ తరువాత కూడా దీనిని కొనసాగించింది.

హదీసులోని సంఘటనలో దైవప్రవక్త (స) హతుని వారసులను ఖసామా చేయటానికి సిద్ధంగా ఉన్నారా? అని అడిగారు. కాని అబ్దుల్లాహ్ బిన్ సహ్లను ఆ ప్రాంతం వారే హత్యచేశారన్న సంగతి తమకు ఇతమిత్థంగా తెలియనందుకు వారు ఖసామా చేయటానికి యిష్టపడలేదు. అందుకని దైవప్రవక్త (స) యూదుల చేత కూడా ప్రమాణం చేయించలేదు. అయితే దైవప్రవక్త (స) హతుని వారసులకు 'బైతుల్ మాల్' నుండి పరిహారం చెల్లించారు.

353. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : ఉహుద్ యుద్ధంలో అమరగతినొందిన వారిని దైవప్రవక్త (సల్లం) ఒక్కో సమాధిలో ఇద్దరేసి చొప్పున ఖననం చేశారు. ఆ సమయంలో ఆయన "వీరిద్దరిలో ఎవరికి ఎక్కువ ఖుర్ఆన్

٣٥٣ ـ وعن جابرٍ رضي الله عنه أنَّ النَّبيَّ ﷺ كَانَ يَجْمَعُ بَيْنَ الرَّجُلَيْنِ مِنْ قَتْلَى أُحُدٍ يَعْنِي فِي القَبْرِ، ثُمَّ يَقُولُ: «أَيُّهُمَا أَكْثَرُ أَخْذاً لِلقُرْآنِ؟» فَإِذَا أُشِيرَ لَهُ إِلَى أَحَدِهِمَا قَدَّمَهُ فِي اللَّحْدِ. رواه البخاري.

గుర్తుంది" అని అడిగేవారు. అక్కడున్న వారు వారిద్దరిలో ఎవరివైపు చూపెడితే వారిని ముందుగా సమాధిలోకిదించే వారు (అంటే అతన్ని ఖిబ్లావైపు ఉంచేవారు). *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని 'జనాయెజ్' ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. సమాధుల్లో రెండు రకాలున్నాయి. సాధారణంగా నలువైపుల నుంచి నిలువుగా త్రవ్వబడే సమాధిని 'షఖ్' అని అంటారు. మరికొన్ని సమాధుల్ని ఒక ప్రక్కకు తవ్వి లోపల డొల్లగా చేస్తారు. ఇలాంటి సమాధిని 'లిహ్ద్' అని అంటారు.
2. ఈ హదీసు ద్వారా ఖుర్‌ఆన్ సంస్మర్త (హాఫిజ్)ల మహత్యం వెల్లడౌతోంది.

٣٥٤ ـ وعن ابنِ عمرَ رضي الله عنهما أنَّ النبي ﷺ قال: «أَرَاني في المَنَامِ أَتَسَوَّكُ بِسِوَاكٍ، فَجَاءَنِي رَجُلانِ، أَحَدُهُمَا أَكْبَرُ مِنَ الآخَرِ، فَنَاوَلْتُ السِّوَاكَ الأَصْغَرَ، فَقِيلَ لِي: كَبِّرْ، فَدَفَعْتُهُ إِلَى الأَكْبَرِ مِنْهُمَا» رواه مسلم مُسْنَداً والبخاري تعليقاً.

354. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు: కలలో నేను మిస్వాక్ చేస్తుండగా నా దగ్గరికి ఇద్దరు వ్యక్తులు వచ్చారు. వారిలో ఒకడు రెండవవాని కన్నా (కాస్త) పెద్దవాడు. నేను నా మిస్వాక్ (పనుదోము పుల్ల)ను వారిద్దరిలో చిన్న వాడికిచ్చాను. అంతలో ఎవరో నాతో, 'పెద్దాయనకివ్వు' అని అన్నారు. అప్పుడు నేను ఆ మిస్వాక్‌ను పెద్దవాని (చేతి)కిచ్చాను."

ఈ హదీసును ముస్లిం (రహ్మాలై) ముస్నద్‌గా, మరియు బుఖారీ (రహ్మాలై) ముఅల్లఖ్‌గా ఉల్లేఖించారు.

*(సహీహ్ బుఖారీలోని వుజూ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని స్వప్నాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక హదీసు పరంపరలోని ఉల్లేఖకులందరినీ పేర్కొంటే ఆ హదీసు 'ముస్నద్'

అనబడుతుంది. ఒకవేళ పరంపరలో మొదటినుంచి ఒకర్ని గాని, ఇద్దర్నిగాని లేదా అసలు ఉల్లేఖకులందరినీ పేర్కొనకుండా ఒట్టి హదీసును మాత్రమే ప్రస్తావిస్తే అలాంటి హదీసును 'ముఅల్లఖ్' అని అంటారు. ఇమామ్ బుఖారీ (రహ్మాలై) తన గ్రంథంలో పై హదీసును పరంపర లేకుండా ప్రస్తావించారు.

ఈ హదీసు ద్వారా ఒకరి మిస్వాక్‌ను అతని అనుమతితో ఇంకొకరు ఉపయోగించవచ్చని తెలుస్తోంది. ఇంకో విషయం ఏమిటంటే, వ్యవహారాలన్నిటిలోనూ పెద్దవారికే ప్రాముఖ్యత నివ్వాలి. ఒకవేళ చిన్నవారిలో అలాంటి నేర్పు, నైపుణ్యాలు కనిపిస్తే వారిని ప్రోత్సహించడంలోనూ తప్పు లేదు.

٣٥٥ ـ وعن أبي موسى رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «إنَّ مِنْ إجْلالِ اللهِ تَعَالَى إكْرَامَ ذِي الشَّيْبَةِ المُسْلِمِ، وَحَامِلِ القُرْآنِ غَيْرِ الغَالِي فِيهِ وَالجَافِي عَنْهُ، وَإكْرَامَ ذِي السُّلْطَانِ المُقْسِطِ». حديثٌ حسنٌ رواه أبو داود.

355. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : జుత్తు నెరసి (ముసలి వాడయిపోయి)న ముస్లింని గౌరవించటం, ఖుర్‌ఆన్‌కు బాధ్యత వహించిన (హాఫిజ్, ఖారీ, ఆలిం మొదలగు) వారిని గౌరవించటం - అయితే వారు ఖుర్‌ఆన్ విషయంలో హద్దుమీరి ప్రవర్తించేవారు, దానిపట్ల వైముఖ్యం చూపేవారు అయి ఉండకూడదు - అదేవిధంగా న్యాయంగా పరిపాలించే రాజుని గౌరవించటం - దేవుణ్ణి గౌరవించటంతో సమానం.

ఈ హదీసు హసన్ కోవకు చెందినది. దీనిని అబూదావూద్ ఉల్లేఖించారు.

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సదాచార సంపన్నులయిన పెద్దల్ని, పండితుల్ని, పరిపాలకుల్ని గౌరవించాలని ఈ హదీసు ప్రబోధిస్తోంది. పవిత్రమైన జీవితం గడుపుతూ వృద్ధాప్య దశకు చేరుకున్న ముసలివారినీ, దివ్య ఖుర్‌ఆన్ సేవను తమ నిత్యకృత్యంగా చేసుకున్న పండితుల్నీ, ప్రజలకు న్యాయవంతమైన పరిపాలనను అందజేసే పాలకుల్నీ గౌరవించటం దైవాన్ని గౌరవించటంతో సమానమని చెబుతోంది. దివ్య ఖుర్‌ఆన్‌ను ఆసాంతం కంఠస్థం చేసుకున్న హాఫిజ్‌లనూ, దానిని మధురాతి

మధురంగా పారాయణం చేసే ఖారీలనూ, ఖుర్ఆన్ పండితులందరినీ గౌరవించాలి. అయితే ఖుర్ఆన్ విషయంలో హద్దు మీరి ప్రవర్తించే వారు, దేవుడు అందులో అస్పష్టంగా ఉంచిన వాక్యాలకు వక్ర భాష్యం చెప్పే కుహనా పండితులు మాత్రం ఖుర్ఆన్‌కు బాధ్యత వహించేవారి క్రిందికి రారు. కనుక అలాంటి వారిని గౌరవించాల్సిన అవసరం లేదు.

٣٥٦ ـ وعن عَمْرِو بنِ شُعَيْبٍ، عن أبيهِ، عَنْ جَدِّهِ رضي الله عنهم قال: قال رسولُ الله ﷺ: «لَيْسَ مِنَّا مَنْ لَمْ يَرْحَمْ صَغِيرَنَا، وَيَعْرِفْ شَرَفَ كَبِيرِنَا» حديثٌ صحيحٌ رواه أبو داود والترمذي، وقال الترمذي: حديثٌ حسنٌ صحيحٌ. وفي رواية أبي داود «حَقَّ كَبِيرِنَا».

356. హజ్రత్ అమ్ర్ బిన్ షుఐబ్ తన తండ్రి నుండి ఆయన తన తాత నుండి గ్రహించిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : మన చిన్న వారిపై దయజూపనివాడితో, మన పెద్దల గౌరవోన్నతుల్ని లెక్కచేయని వాడితో మనకెలాంటి సంబంధం లేదు.

(అబూదావూద్ మరియు తిర్మిజీలు దీనిని వెలికితీశారు. ఈ హదీసు దృఢ మైనది. తిర్మిజీ దీనిని ప్రామాణిక మైనదిగా పేర్కొన్నారు.)

అబూదావూద్‌లోని వేరొక ఉల్లేఖనంలో "మన పెద్దల హక్కుని" అని ఉంది.

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం, సుననె తిర్మిజీలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'మనకెలాంటి సంబంధం లేదు' లేదా 'మనలోని వాడు కాడు' అంటే అతను ముస్లింల విధానాన్ని అనుసరించటం లేదని భావం. పెద్దలు తమ పిన్నలపట్ల వాత్సల్యం కనబరచాలి. వారిపట్ల దయాదాక్షిణ్యాలతో మెలగాలి. అదేవిధంగా చిన్నవారు కూడా తమకంటే వయసులో పెద్దవారిని, పండితులను గౌరవించాలి.

٣٥٧ ـ وعن مَيْمُونِ بنِ أَبي شَبِيبٍ رحمه الله أنَّ عَائِشَةَ رضي الله عنها مَرَّ بِهَا سَائِلٌ، فَأعْطَتْهُ كِسْرَةً، وَمَرَّ بِهَا رَجُلٌ عَلَيْهِ ثِيَابٌ وَهَيْئَةٌ، فَأَقْعَدَتْهُ، فَأكَلَ، فَقِيلَ لَهَا

357. హజ్రత్ మైమూన్ బిన్ అబీ షబీబ్ (రహ్మాలై) కథనం : హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) సమీపం నుండి ఒక అడుక్కునేవాడు వెళ్ళాడు. ఆమె అతనికి ఓ రొట్టెముక్క ఇచ్చారు. ఇంకొక వ్యక్తి

فـي ذلـك، فقـالـت: قـال رسـولُ الله ﷺ: «أَنْزِلُوا النَّاسَ مَنَازِلَهُمْ» رواه أبو داود. لكِنْ قال: مَيْمُون لَمْ يُدْرِكْ عَائِشَةَ. وَقَدْ ذَكَرَهُ مُسْلِمٌ في أَوَّل صَحِيحِهِ تَعْلِيقاً فقال: وَذُكِرَ عَنْ عَائِشَةَ رضي الله عنها قالت: أمرنا رسـولُ الله ﷺ أَنْ نُنْـزِلَ النَّـاسَ مَنَـازِلَهُـمْ، وَذَكَرَهُ الحَاكِمُ أَبُو عبدِ الله في كِتابِهِ «مَعْرِفَة عُلُوم الحَدِيثِ» وقال: هو حديثٌ صحيح.

వచ్చాడు. అతని ఒంటిపై మంచి దుస్తులున్నాయి. ఆ వ్యక్తి స్థితిమంతుడిలా కనిపిస్తున్నాడు. ఆమె అతణ్ణి కూర్చోబెట్టి (అన్నం తినిపించారు). అతను అన్నం తిని వెళ్ళిపోయాడు. మీరు ఎందుకిలా చేశారని ఆమెను ఎవరో అడిగితే ఆమె దైవప్రవక్త (స) "ప్రజల స్థాయిని బట్టి వారితో వ్యవహరించమని చెప్పారు (అందుకే నేనలా చేశాను)" అని అన్నారు.

ఈ హదీసును అబూదావూద్ వెలికితీసి మైమూన్ (రహ్మలై) హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) నుండి హదీసులు విన లేదని విమర్శించారు. ఇదే హదీసును ఇమామ్ ముస్లిం (రహ్మలై) తన గ్రంథ పీఠికలో పరంపర లేకుండా ప్రస్తావించారు. "ప్రజలతో వారి స్థాయిని బట్టి వ్యవహరించాలని దైవప్రవక్త (సల్లం) తమల్ని ఆదేశించారని" హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) తెలిపినట్లు ఆయన పేర్కొన్నారు. ఆయనే కాదు ఇమాం హాకిమ్ అబూ అబ్దుల్లాహ్ (రహ్మలై) కూడా ఈ హదీసుని తన గ్రంథం "మారిఫతు ఉలూమిల్ హదీస్"లో ప్రస్తావించి 'ఇది దృఢమైన హదీసు' అని చెప్పారు.

## ముఖ్యాంశాలు

వ్యక్తుల పరువు ప్రతిష్ఠలు, సమాజంలో వారికున్న గౌరవోన్నతులను బట్టి వారితో వ్యవహరించాలి. ఉత్తముల పట్ల ఉత్తమంగానే ప్రవర్తించాలి. ఒక గౌరవనీయుణ్ణి అతని స్థాయికంటె దిగజార్చటంగాని, ఒక అల్పుణ్ణి గౌరవస్థానాలపై ఎక్కించటం గాని చేయకూడదు. ప్రతి వ్యక్తికీ సముచితమైన స్థానం ఇవ్వాలి. లేకపోతే సమాజంలో అపసవ్యత చోటుచేసుకుంటుంది.

358. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: ఉయైనా బిన్ హిస్న్ (మదీనాకు) వచ్చి తన భాతృజుడైన హుర్ర్ బిన్ ఖైస్ దగ్గర బస చేశారు. ఈ హుర్ర్ బిన్ ఖైస్ హజ్రత్ ఉమర్ (రజి) (ఖలీఫాగా ఉన్నప్పుడు ఆయన) సన్నిహితుల్లో ఒకరు. ఆ కాలంలో హజ్రత్ ఉమర్ సభికులు, సలహాదారులందరూ విద్యావంతులై (ఖుర్రాలై) ఉండేవారు - వారిలో నడి వయస్కులూ ఉండే వారు, అలాగే నవయువకులూ ఉండేవారు. అప్పుడు ఉయైనా తన సోదర కుమారునితో "భాతృజా! ఈ ఖలీఫా దర్బారులో నీకు పలుకుబడి ఉంది. కనుక నేనాయన్ని కలుసుకునేందుకు నీవు ఆయన దగ్గర అనుమతి తీసుకో' అని కోరారు. హుర్ర్ బిన్ ఖైస్ ఆయన కోసం ఉమర్‌ని సంప్రతించి అనుమతి కోరగా ఆయన అనుమతి ఇచ్చారు. లోనికి వెళ్ళిన తర్వాత ఉయైనా ఖలీఫాను పట్టుకొని, "ఓ ఇబ్నె ఖత్తాబ్! దైవసాక్షి! నీవు మాకు తగినంతగా (సొమ్ము) ఇవ్వడంగానీ, మాకు న్యాయంగా తీర్పు ఇవ్వటం గానీ చేయటం లేదు" అని నిందించారు. ఆయన మాటలు విని హజ్రత్ ఉమర్ (రజి) ఆగ్రహోదగ్రులయ్యారు. ఆయన్ని శిక్షించాలని నిశ్చయించుకున్నారు. అంతలోనే హుర్ర్ బిన్ ఖైస్ కల్పించుకొని, "ఓ విశ్వాసుల నాయకా! అల్లాహ్ తన ప్రవక్త నుద్దేశ్యించి 'ప్రవక్తా! మృదుత్వం, మన్నింపుల వైఖరిని

٣٥٨ - وعن ابن عباس رضي الله عنهما قال: قَدِمَ عُيَيْنَةُ بْنُ حِصْنٍ، فَنَزَلَ عَلَى ابْنِ أَخِيهِ الحُرِّ بْنِ قَيْسٍ، وَكَانَ مِنَ النَّفَرِ الَّذِينَ يُدْنِيهِمْ عُمَرُ رضي الله عنه، وَكَانَ القُرَّاءُ أَصْحَابَ مَجْلِسِ عُمَرَ وَمُشَاوَرَتِهِ، كُهُولًا كَانُوا أَوْ شُبَّانًا، فَقَالَ عُيَيْنَةُ لابْنِ أَخِيهِ: يَاابْنَ أَخِي! لَكَ وَجْهٌ عِنْدَ هٰذَا الأَمِيرِ، فَاسْتَأْذِنْ لِي عَلَيْهِ، فَاسْتَأْذَنَ لَهُ، فَأَذِنَ لَهُ عُمَرُ رضي الله عنه، فَلَمَّا دَخَلَ قَالَ: هِي يَا ابْنَ الخَطَّابِ! فَوَاللهِ! مَا تُعْطِينَا الجَزْلَ، وَلَا تَحْكُمُ فِينَا بِالعَدْلِ، فَغَضِبَ عُمَرُ رضي الله عنه حَتَّى هَمَّ أَنْ يُوقِعَ بِهِ، فقالَ لَهُ الحُرُّ: يَا أَمِيرَ المُؤْمِنِينَ! إِنَّ اللهَ تَعَالَى قَالَ لِنَبِيِّهِ ﷺ: ﴿ خُذِ ٱلْعَفْوَ وَأْمُرْ بِٱلْعُرْفِ وَأَعْرِضْ عَنِ ٱلْجَٰهِلِينَ ﴾ وَإِنَّ هٰذا مِنَ الجَاهِلِينَ.

وَاللهِ! مَاجَاوَزَهَا عُمَرُ حِينَ تَلاهَا عَلَيْهِ، وَكَانَ وَقَّافاً عِنْدَ كِتَابِ الله تعالى. رواه البخاري.

అవలంబించు. మంచిని ప్రబోధించు. మూర్ఖులతో వాదానికి దిగకు' అని ఆదేశించాడు. ఇతను (నా బాబాయి) కూడా మూర్ఖుడే. (కాబట్టి ఇతన్ని క్షమించి వదలిపెట్టండి)" అని విన్నవించుకున్నారు. దైవసాక్షి! హుర్ర్ ఈ సూక్తి పఠించగానే ఉమర్ (రజి) ఆ సూక్తిని ఉల్లంఘించలేకపోయారు. ఆయన దివ్య ఖుర్ఆన్ ముందు (అంటే దాని ఆదేశాల ముందు) కడు వినయంగా లొంగిపోయేవారు. *(బుఖారీ)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసును ఈ అధ్యాయం క్రింద ప్రస్తావించడంలోని ఉద్దేశ్యం పండితుల, దైవగ్రంథ విద్వాంసుల విశిష్టతను విశదపరచటమే. అలాంటి మేధావుల్నే హజ్రత్ ఉమర్ (రజి) తన సలహా మండలిలో సభ్యులుగా నియమించుకునేవారు. సమాజంలోని విద్యావంతులకు తగిన గౌరవోన్నతులను ప్రసాదించి పరిపాలనలో వారి సేవలు పొందేవారు.

٣٥٩ - وعن أبي سعيدٍ سَمُرَةَ بنِ جُنْدُبٍ رضي الله عنه قال: لَقَدْ كُنْتُ عَلَى عَهْدِ رسولِ الله ﷺ غُلاماً، فَكُنْتُ أَحْفَظُ عَنْهُ، فَمَا يَمْنَعُنِي مِنَ القَوْلِ إِلَّا أَنَّ هَهُنَا رِجَالاً هُمْ أَسَنُّ مِنِّي. متفقٌ عليه.

359. హజ్రత్ అబూ సయీద్ సమురా బిన్ జుందుబ్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) కాలంలో నేను చాలా చిన్న పిల్లాడిని. దైవప్రవక్త (సల్లం) చెప్పే మాటలు, చేసే పనులు నేను గుర్తుపెట్టుకునేవాణ్ణి. కాని నా కంటే వయసులో పెద్దవారు ఉండగా వారి సమక్షంలో నేనావిషయాలు చెప్పలేకపోయేవాణ్ణి." (సహీహ్ బుఖారీలోని మహిమోన్నతుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఒక నగరంలోగాని లేదా ఒక ప్రాంతంలోగాని ఒక గొప్ప హదీసు పండితుడు ఉండగా

సామాన్యులు హదీసు బోధన చేయటం వాంఛనీయం కాదని హదీసువేత్తలు అంటున్నారు. అయితే ఆ గొప్ప పండితుని అనుమతితో సామాన్య పండితుడుగాని అదేవిధంగా గురువు అనుమతితో శిష్యుడుగాని హదీసు బోధించటంలో తప్పు లేదు. ముఖ్యంగా ఒక సభలో హదీసు జ్ఞానం గురించి అందరికన్నా బాగా తెలిసిన హదీసువేత్త ఉండగా ఇతరులెవరూ హదీసు బోధన చేయటానికి సాహసించకుండా ఉండటమే సంస్కారమనిపించుకుంటుంది. అయితే ఒక పట్టణంలో అనేకమంది హదీసువేత్తలు ఉన్నప్పుడు వారిలో ధర్మపరాయణుడయిన హదీసువేత్త ఎవరయినాసరే హదీసు బోధ చేయటంలో తప్పులేదు.

٣٦٠ - وعن أنس رضي الله عنه قال: قال رسول الله ﷺ: «مَا أَكْرَمَ شَابٌّ شَيْخاً لِسِنِّهِ إِلَّا قَيَّضَ اللهُ لَهُ مَنْ يُكْرِمُهُ عِنْدَ سِنِّهِ»

360. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ఏ యువకుడైనా ఒక ముసలి వాణ్ణి అతని ముసలితనం చూసి గౌరవిస్తే దేవుడు అతని ముసలితనంలో అతన్ని గౌరవించేవారిని పుట్టిస్తాడు.”

*(ఈ హదీసును ఇమామ్ తిర్మిజీ వెలికితీసి అరుదైనదిగా ఖరారు చేశారు).*



45వ అధ్యాయం

# ٤٥ ـ بَابُ زِيَارَةِ أَهْلِ الْخَيْرِ وَمُجَالَسَتِهِمْ وَصُحْبَتِهِمْ وَمَحَبَّتِهِمْ وَطَلَبِ زِيَارَتِهِمْ وَالدُّعَاءِ مِنْهُمْ وَزِيَارَةِ الْمَوَاضِعِ الْفَاضِلَةِ

# మహాత్ముల దగ్గరికి వెళ్ళాలి, వారి సమావేశాల్లో కూర్చోవాలి, వారి సాహచర్యాన్ని పొందాలి. వారిని అభిమానించాలి, తమ కోసం దేవుణ్ణి ప్రార్థించమని వారిని కోరాలి, పుణ్యక్షేత్రాలను సందర్శించాలి

قال الله تعالى: ﴿ وَإِذْ قَالَ مُوسَىٰ لِفَتَىٰهُ لَآ أَبْرَحُ حَتَّىٰٓ أَبْلُغَ مَجْمَعَ ٱلْبَحْرَيْنِ أَوْ أَمْضِىَ حُقُبًا ﴾ إلى قوله تعالى: ﴿ قَالَ لَهُۥ مُوسَىٰ هَلْ أَتَّبِعُكَ عَلَىٰٓ أَن تُعَلِّمَنِ مِمَّا عُلِّمْتَ رُشْدًا ﴾ [الكهف: ٦٠ ـ ٦٦] وقال تعالى: ﴿ وَٱصْبِرْ نَفْسَكَ مَعَ ٱلَّذِينَ يَدْعُونَ رَبَّهُم بِٱلْغَدَوٰةِ وَٱلْعَشِىِّ يُرِيدُونَ وَجْهَهُۥ ﴾ [الكهف: ٢٨].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

(మూసాకు సంబంధించిన గాథను వారికి వినిపించండి) అప్పుడు మూసా తన సేవకునితో "రెండు నదుల సంగమ స్థలానికి చేరనంత వరకు, నేను నా ప్రయాణాన్ని ఆపను. లేకపోతే నేను సుదీర్ఘ కాలం నడుస్తూనే ఉంటా" అని అన్నాడు. తరువాత వారు వాటి సంగమ ప్రదేశానికి చేరినప్పుడు, తమ దగ్గరున్న చేప విషయంలో అశ్రద్ధ వహించారు. అది నదిలోకి, సొరంగం గుండా పోయినట్లు దూసుకు పోయింది. ముందుకుపోయిన తరువాత మూసా తన సేవకునితో, "మా ఉదయపు ఆహారం తీసుకురా. ఈనాటి ప్రయాణంలో మేము బాగా అలసిపోయాము" అని అన్నాడు. దానికి సేవకుడు "చూశారా ఏమయిందో! మనం ఆ రాయి దగ్గర విశ్రాంతి కోసం ఆగినప్పుడు నాకు చేప విషయమే జ్ఞాపకం లేకుండా పోయింది.

షైతాన్ నన్ను ఏమరుపాటుకు గురిచేశాడు. నేను దాని గురించి మీకు చెప్పటం మరిచి పోయాను. చేప విచిత్రమైన రీతిలో బయటపడి నదిలోకి వెళ్ళిపోయింది" అని అన్నాడు. అది విని మూసా "మనం అన్వేషిస్తూ వచ్చినది ఆ ప్రాంతం కొరకే కదా!" అని అన్నాడు. కనుక వారిద్దరూ తమ అడుగు జాడలలో వెనక్కి తిరిగి వెళ్ళారు. అక్కడ వారు మా దాసులలోని ఒక దాసుణ్ణి కనుగొన్నారు. మేము అతనికి మా కారుణ్యాన్ని ప్రసాదించాము. మా తరపునుండి ఒక ప్రత్యేక జ్ఞానాన్ని ప్రసాదించాము.

మూసా అతనితో "మీరు నేర్చుకున్న వివేకాన్ని మీరు నాకు కూడా బోధించేందుకు నేను మీ వెంట ఉండవచ్చా?" అని అడిగాడు.
(అల్ కహఫ్ : 60 - 66)

ఇంకొకచోట అల్లాహ్ ఇలా ఆదేశిస్తున్నాడు,

"తమ ప్రభువు ప్రసన్నతను అర్థిస్తూ ఉదయం సాయంత్రం ఆయన్ను వేడుకుంటూ ఉండేవారి సాహచర్యం పట్ల నీ హృదయాన్ని సంతృప్త పరచుకో." (అల్ కహఫ్ : 28)

٣٦١ - وعن أنسٍ رضي الله عنه قال: قال أبو بكر لِعمر رضي الله عنهما بَعْدَ وَفَاةِ رسولِ اللهِ ﷺ: انْطَلِقْ بِنَا إِلَى أُمِّ أَيْمَنَ رضي الله عنها نَزُورُهَا كَمَا كَانَ رسولُ اللهِ ﷺ يَزُورُهَا، فَلَمَّا انْتَهَيَا إِلَيْهَا بَكَتْ، فَقَالَا لَهَا: مَا يُبْكِيكِ أَمَا تَعْلَمِينَ أَنَّ

361. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త తదనంతరం ఒకసారి హజ్రత్ అబూబక్ర్ (రజి) ఉమర్ (రజి)తో, "ఉమ్మె ఐమన్ (రజి.అన్హా) దగ్గరికి పోదాం పదండి. దైవప్రవక్త (స) ఆమెను పరామర్శించటానికి వెళ్ళినట్లు మనం కూడా వెళదాం" అని అన్నారు. ఆ తరువాత వాళ్ళిద్దరూ కలిసి ఆమె దగ్గరికి వెళ్ళగానే ఆమె బావురుమన్నది. "ఏడ్వడమెందుకు? దైవప్రవక్తకు దేవుని

مَا عِنْدَ اللهِ خَيْرٌ لِرَسُولِ اللهِ ﷺ؟ فقالت: إنِّي لا أَبْكِي أنِّي لا أعْلَمُ أنَّ مَا عِنْدَ اللهِ تَعَالَى خَيْرٌ لِرسولِ اللهِ ﷺ، وَلٰكِنْ أَبْكِي أَنَّ الوَحْيَ قَدِ انْقَطَعَ مِنَ السَّمَاءِ، فَهَيَّجَتْهُمَا عَلَى البُكَاءِ، فَجَعَلا يَبْكِيَانِ مَعَهَا. رواه مسلم.

దగ్గర (ఇహలోకంలో కంటే) ఎంతో శ్రేష్ఠమైన స్థానం లభిస్తుందని నీకు తెలియదా?" అంటూ వాళ్ళిద్దరూ ఆమెను ఓదార్చారు. అప్పుడు ఆమె, "దైవ ప్రవక్తకు దేవుని దగ్గర గొప్ప స్థానముందని తెలియక నేను ఏడ్వటం లేదు. ఆకాశం నుండి వహీ (దైవవాణి) అవతరణ ఆగిపోయినందుకు ఏడుస్తున్నాను" అని అన్నారు. ఆమె మాటలు వాళ్ళిద్దరిని కూడా ఏడ్చేలా చేశాయి. ఆమెతోపాటు వాళ్ళూ ఏడ్వటం మొదలు పెట్టారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హజ్రత్ ఉమ్మె ఐమన్ (రజి.అన్హా) అబిసీనియా దేశానికి చెందిన బానిస స్త్రీ. దైవప్రవక్త తండ్రి అబ్దుల్లాహ్ గారి దగ్గర సేవకురాలిగా పనిచేసేది. అబ్దుల్లాహ్ మరణించిన తరువాత దైవప్రవక్త పుట్టారు. ఆయనను పెంచటంలో ఆయన తల్లి ఆమినాకు ఉమ్మె ఐమన్ ఎంతగానో తోడ్పడ్డారు. ఆ తరువాత కాలంలో దైవప్రవక్త (స) ఆమెకు బానిసత్వం నుండి స్వేచ్ఛను ప్రసాదించి జైద్ బిన్ హారిసాకిచ్చి వివాహం చేశారు.

ఈ హదీసు ద్వారా మహాత్ములు దూరమైపోయినప్పుడు విలపించటంలో తప్పులేదని తెలుస్తోంది. అదేవిధంగా తమ బంధుమిత్రులు తరచూ సందర్శిస్తూ ఉండేవారిని తాము కూడా సందర్శించడానికి వెళ్ళడం పుణ్యప్రదమని కూడా బోధపడుతోంది.

٣٦٢ - وعن أبي هريرةَ رضي الله عنه عن النبيِّ ﷺ: «أنَّ رَجُلاً زَارَ أَخاً لَهُ فِي قَرْيَةٍ أُخْرَى، فَأَرْصَدَ اللهُ عَلَى مَدْرَجَتِهِ مَلَكاً، فَلَمَّا أَتَى عَلَيْهِ قَالَ: أَيْنَ تُرِيدُ؟

362. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఒకడు వేరొక ప్రాంతంలో ఉంటున్న తన సోదరుణ్ణి కలవటానికి బయలుదేరాడు. దేవుడు అతను వెళ్ళే దారిలో ఒక దూతను కూర్చోబెట్టాడు. ఆ వ్యక్తి అక్కడికి రాగానే దైవదూత అతన్ని "ఎక్కడికి వెళ్తున్నావ్?" అని

قال: أُرِيدُ أخاً لِي فِي هٰذِهِ القَرْيَةِ. قَالَ: هَلْ لَكَ عَلَيْهِ مِنْ نِعْمَةٍ تَرُبُّهَا عَلَيْهِ؟ قَالَ: لا، غَيْرَ أَنِّي أَحْبَبْتُهُ فِي اللهِ تعالى، قَالَ: فَإِنِّي رسولُ اللهِ إِلَيْكَ بِأَنَّ اللهَ قَدْ أَحَبَّكَ كَمَا أَحْبَبْتَهُ فِيهِ» رواه مسلم.

అడిగాడు. "ఈ ఊర్లో నా సోదరుడు న్నాడు. అతన్ని కలవటానికి వెళ్తున్నాను" అని ఆ వ్యక్తి సమాధానమిచ్చాడు. "అతను నీకేదైనా ఉపకారం చేసి ఉంటాడు. నువ్విప్పుడు అతని ఉపకారాన్ని తీర్చడానికి వెళ్తున్నావు, అవునా?'' అని అడిగాడు దూత. "అలాంటిదేం లేదు. నేను దైవం కోసం అతన్ని ప్రేమిస్తున్నాను. ఆ ప్రేమతోనే నేను అతని దగ్గరికి వెళ్తున్నాను" అని చెప్పాడా వ్యక్తి. అప్పుడు దైవదూత, "నేను దేవుని తరఫునుండి నీ వద్దకు పంపబడిన దూతను. నీవు నీ సోదరుణ్ణి దైవం కోసం ప్రేమించినట్లే దేవుడు కూడా నిన్ను ప్రేమిస్తున్నాడని (తెలియపరచ టానికి వచ్చాను)'' అని చెప్పాడు. (ముస్లిం)

يقال: «أَرْصَدَه» لِكَذَا: إِذَا وَكَّلَهُ بِحِفْظِهِ، وَ«المَدْرَجَةُ» بفتح الميم وَالراءِ: الطَّرِيقُ، وَمَعْنَى «تَرُبُّهَا»: تَقُومُ بِهَا، وَتَسْعَى فِي صَلاحِهَا.

అతణ్ణి రక్షించటం కోసం ఎవరినన్నా నియమించాడని చెప్పటానికి 'అర్సదహూ లికజా' అని వ్యవహరిస్తారు. 'మద్రజతు' అంటే 'దారి'. 'తరుబ్బుహా' అంటే నీవు దాన్ని కాపాడుతున్నావు, దాన్ని చక్కదిద్దటం కోసం కృషి చేస్తున్నావని భావం.

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఎవర్ని ప్రేమించినా దైవం కోసమే ప్రేమించాలి. ఎవరిని కలవటానికి వెళ్ళినా దైవప్రసన్నతను బడసే ఉద్దేశ్యంతోనే వెళ్ళాలి. కాని సాధారణంగా ప్రజలు ప్రాపంచిక ప్రయోజనాల కోసమే పరస్పరం కలుస్తూ ఉంటారు. ప్రాపంచిక ఉద్దేశ్యంతో కలవటంలోనూ తప్పులేదు గాని హదీసులో ప్రస్తావించబడిన విశిష్టత మాత్రం దైవం కోసం కలిసేవారికే దక్కుతుంది.

363. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ఎవరైనా రోగగ్రస్తుణ్ణి పరామర్శించటంగాని లేదా దైవం కోసం తన సోదరుణ్ణి కలవటం గాని చేసినప్పుడు (దేవుని తరఫు నుండి) ఒక ప్రకటన చేసేవాడు, "నీకు అభినందనలు. నీ నడక సార్థకమవుగాక! నీకు స్వర్గంలో స్థానం లభించుగాక!" అని ఎలుగెత్తి ప్రార్థిస్తాడు.

తిర్మిజీ దీనిని వెలికితీసి 'హసన్'గా పేర్కొన్నారు. కాని మరికొన్ని ప్రతుల్లో ఈ హదీసు 'గరీబ్' (అంటే అరుదైనది) అని ఉంది.

٣٦٣ - وعنه قال: قال رسولُ الله ﷺ: «مَنْ عَادَ مَرِيضاً أَوْ زَارَ أَخاً لَهُ فِي الله، نَادَاهُ مُنَادٍ بِأَنْ طِبْتَ، وَطَابَ مَمْشَاكَ، وَتَبَوَّأْتَ مِنَ الجَنَّةِ مَنْزِلاً» رواه الترمذي وقال: حديثٌ حسنٌ، وفي بعض النسخ: غريبٌ.

*(జామె తిర్మిజీలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

వ్యాధిగ్రస్తుల్ని పరామర్శించటం, కేవలం దైవప్రసన్నతను బడసే ఉద్దేశ్యంతో తోటి ముస్లిం సోదరుల్ని కలవటం అత్యంత శ్రేష్ఠమైన ఆచరణలు. సత్పురుషులను కలవటానికి వెళ్ళటం కూడా సదాచరణే. మనిషి మంచివారిని కలవటానికి వెళ్ళినప్పుడు అతను వేసే ప్రతి అడుగుకు బదులుగా అతని కర్మల జాబితాలో పుణ్యకార్యాలు లిఖించబడతాయి.

364. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : మంచి స్నేహితుడు కస్తూరి అమ్మేవాడితో సమానం. చెడ్డ స్నేహితుడు కొలిమి ఊదేవాడితో సమానం. కస్తూరి అమ్మేవాడి దగ్గర కూర్చుంటే అతను నీకు కానుకగా కస్తూరి ఇస్తాడు లేదా దాన్ని నువ్వు కొనయినా కొంటావు. ఈ రెండూ

٣٦٤ - وعن أَبي موسى الأشعَرِيِّ رضيَ اللهُ عنه أَن النَّبِيَّ ﷺ قال: «إِنَّمَا مَثَلُ الجَلِيسِ الصَّالِحِ وَجَلِيسِ السُّوءِ، كَحَامِلِ المِسْكِ، وَنَافِخِ الكِيرِ، فَحَامِلُ المِسْكِ، إِمَّا أَنْ يُحْذِيَكَ، وَإِمَّا أَنْ تَبْتَاعَ مِنْهُ وَإِمَّا أَنْ

تَجِدَ مِنْهُ رِيحاً طَيِّبَةً، وَنَافِخُ الْكِيرِ، إمَّا أَنْ يُحْرِقَ ثِيَابَكَ، وَإمَّا أَنْ تَجِدَ مِنْهُ رِيحاً مُنْتِنَةً» متفقٌ عليه. «يُحْذِيكَ»: يُعْطِيكَ.

కాకపోయినా కనీసం నీకు అతని దగ్గర్నుంచి సువాసనయినా వస్తుంది. అదే నువ్వు కొలిమి ఊదే వాడి దగ్గర కూర్చుంటే (అతను నీ మీదకు నిప్పు రవ్వలు ఎగరేసి) నీ బట్టల్ని కాలుస్తాడు లేదా అతని దగ్గర్నుంచి నీకు దుర్వాస నయినా అంటుతుంది.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఎల్లప్పుడూ సజ్జనుల సాహచర్యాన్ని మాత్రమే ఎంచుకోవాలి. దుర్జనుల సాహచర్యాన్ని, స్నేహాన్ని విసర్జించాలి. ఎందుకంటే కస్తూరి అమ్మేవాడి దగ్గర కూర్చుంటే ఎన్నో విధాలుగా ఉపయోగమున్నట్లే సజ్జనులతో సావాసం చేస్తే అన్నీ ప్రయోజనాలే కలుగుతాయి. వారితో కలిసి ఉండటం వల్ల మనిషి వారిలోని సద్గుణాలను గ్రహించి క్రమక్రమంగా తను కూడా వారిలాగే మంచి మనిషిగా మారతాడు. దీనికి భిన్నంగా చెడు సావాసాల వల్ల చెడులకు అలవాటు పడి ఆఖరికి తను కూడా చెడుల చెట్టుగా మారిపోతాడు.

٣٦٥ ـ وعن أبي هريرة رضي الله عنه عَنِ النَّبِيِّ ﷺ قال: «تُنْكَحُ المَرْأَةُ لأَربَعٍ: لِمَالِهَا، وَلِحَسَبِهَا، وَلِجَمَالِهَا، وَلِدِينِهَا، فَاظْفَرْ بِذَاتِ الدِّينِ تَرِبَتْ يَدَاكَ» متفقٌ عليه.

365. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : సాధారణంగా నాలుగు విషయాలను చూసి స్త్రీని వివాహం చేసుకుంటారు. ఆమె సిరిసంపదలను చూసి, ఆమె కుటుంబం, వంశాలను చూసి, ఆమె అందాన్ని చూసి, (మరి కొంతమంది) ఆమె ధర్మపరాయణ తను చూసి వివాహమాడతారు. కాని నీవు మాత్రం ధర్మపరాయణురాలైన స్త్రీని వివాహమాడి సాఫల్యం పొందు. నీ చేతులకు మన్ను తగల!

*(బుఖారీ - ముస్లిం)*

ومعناه: أَنَّ النَّاسَ يَقْصِدُونَ فِي العَادَةِ مِنَ المَرْأَةِ هٰذِهِ الخِصَالَ الأَرْبَعَ، فَاحْرِصْ أَنْتَ عَلَى ذَاتِ الدِّينِ، وَاظْفَرْ بِهَا، وَاحْرِصْ عَلَى صُحْبَتِهَا.

ఈ హదీసు భావం ఏమిటంటే, సాధారణంగా ప్రజలు వివాహ సందర్భంలో ఈ నాలుగు విషయాలను దృష్టిలో పెట్టుకొని వివాహమాడతారు. నువ్వు మాత్రం ధర్మపరాయణురాలైన స్త్రీనే కోరుకోవాలి. అలాంటి స్త్రీని వివాహ మాడటానికే కృషిచేయాలి. ఆమె సాహచర్యాన్నే అభిలషించాలి.

*(సహీహ్ బుఖారీ మరియు సహీహ్ ముస్లింలలోని నికాహ్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

ధర్మపరాయణురాలైన స్త్రీని వివాహమాడితేనే మనిషి వైవాహిక జీవితం సార్థకమవుతుంది. ధర్మపరాయణురాలైన స్త్రీకి భర్త స్థానం ఏమిటో తెలిసి ఉంటుంది కనుక ఆమె తన భర్త పట్ల విధేయతా భావంతో మసలుకుంటుంది. దాంతో జీవితంలో ఎన్ని కష్టాలెదురైనప్పటికీ మనిషి దాంపత్య జీవితంలో సుఖాన్ని అనుభవిస్తాడు. అదీగాక ఆమె అతని సంతానాన్ని సదాచార సంపన్నులుగా తీర్చిదిద్దుతుంది.

ఇకపోతే పై హదీసులో పేర్కొనబడిన మిగతా మూడు రకాల స్త్రీల వల్ల కుటుంబ జీవనం ఎన్నో ఒడిదుడుకులకు లోనవుతుంది. మనిషికి బయటి కష్టాలతో పాటు ఇంట్లో ఆలుబిడ్డల వల్ల కూడా ఎన్నో ఇబ్బందులు ఎదురౌతాయి. దాని దుష్ప్రభావం వల్ల సంతానం తల్లిదండ్రులకు అవిధేయులుగా మారే అవకాశమూ ఉంది. కనుక వైవాహిక జీవితం కోసం స్త్రీని ఎన్నుకున్నప్పుడు ధర్మపరాయణతకే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి.

٣٦٦ ـ وعن ابنِ عباسٍ رضي الله عنهما قال: قال النبيُّ ﷺ لِجبريلَ: «مَا يَمْنَعُكَ أَنْ تَزُورَنَا أَكْثَرَ مِمَّا تَزُورُنَا؟» فَنَزَلَتْ ﴿ وَمَا نَتَنَزَّلُ إِلَّا بِأَمْرِ رَبِّكَ لَهُ مَا بَيْنَ أَيْدِينَا وَمَا خَلْفَنَا وَمَا بَيْنَ ذَٰلِكَ ﴾ رواه البخاري.

366. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) జిబ్రయీల్ (అలైహి)తో మాట్లాడుతూ, "ఇప్పుడు మీరు మమ్మల్ని కలవటానికి ఇన్నిసార్లు వస్తున్నారు కదా! ఇంతకన్నా ఎక్కువ సార్లు మమ్మల్ని కలవటానికి రాకూడదా?!" అని అడిగారు. అప్పుడు దివ్య ఖుర్ఆన్‌లోని ఈ సూక్తులు అవతరించాయి.

"ప్రవక్తా! మేము నీ ప్రభువు ఆజ్ఞ లేకుండా క్రిందికి దిగిరాము. మా ముందు ఉన్నదీ, మా వెనుక ఉన్నది, ఆ రెండింటి మధ్య ఉన్నది, ప్రతిదీ ఆయనదే." (మర్యమ్ : 64)

(బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హజ్రత్ జిబ్రయీల్ (అలైహి) 'వహీ' (దైవవాణి)ని తీసుకొని దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చేవారు. దైవప్రవక్తకు జిబ్రయీల్ ద్వారా మరిన్ని విషయాలు తెలుసుకోవాలన్న ఆతురత ఉండేది. అందుకే జిబ్రయీల్‌ను ఇంకా ఎక్కువగా తన దగ్గరికి వస్తూ ఉండమని ఆహ్వానించారు. కాని ఆయన మాత్రం దైవప్రవక్త ఆహ్వానాన్ని మర్యాదపూర్వకంగా తిరస్కరించారు. తనలాంటి దైవదూతలందరూ భూమిపైకి రావాలన్నా తిరిగి దేవుని దగ్గరికి వెళ్ళాలన్నా అందుకు దేవుని అనుమతి అవసరమని, ఈ విషయంలో తమకెలాంటి నిర్ణయాధికారం లేదని చెప్పారు.

٣٦٧ ـ وعنْ أبي سعيدٍ الخُدْرِيِّ رضـي الله عنـه عـن النبـيِّ ﷺ قـال: «لا تُصَاحِبْ إلَّا مُؤْمِناً، وَلا يَأكُلْ طَعَامَكَ إلَّا تَقِـيٌّ». رواه أبـو داود، والتـرمـذي بإسْنَادٍ لا بأس بِهِ.

367. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) "విశ్వాసి అయిన వ్యక్తిని మాత్రమే మీ స్నేహితుడిగా చేసుకోండి. ఇంకా మీ అన్నం దైవభక్తిగలవారే తినాలి సుమా!" అని ఉపదేశించారు.

(అబూదావూద్, తిర్మిజీ - తిర్మిజీ దీనిని అంగీకరించదగిన ఆధారాలతో వెలికి తీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం, సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవ తిరస్కారులతో సావాసం చేయటం వల్ల విశ్వాసులు కూడా వారికి ప్రభావితులయ్యే అవకాశం ఉంది. అందుకే అలాంటి వారితో స్నేహం, సాహచర్యం మంచిది కాదని చెప్పబడింది. దీనికి భిన్నంగా విశ్వాసులతో స్నేహం చేస్తే వారు ఒండొకరికి ఆలంబనగా ఉంటారు. వారి

విశ్వాసం మరింత తేజోమయమవుతుంది. ఈ హదీసు ద్వారా బోధపడే రెండో విషయం ఏమిటంటే విందు భోజనాలకు ఆహ్వానించేటప్పుడు సజ్జనుల్ని, దైవభక్తిగలవారినే ఆహ్వానించాలి. అదేవిధంగా దానధర్మాలు చేసినప్పుడు కూడా ధర్మచింతన గల ముస్లింలను వెతికి వారికే దానాలు చెయ్యాలి.

٣٦٨ ـ وعن أَبي هريرة رضي الله عنه أَنَّ النبيَّ ﷺ قال: «الرَّجُلُ عَلَى دِينِ خَلِيلِهِ، فَلْيَنْظُرْ أَحَدُكُمْ مَنْ يُخَالِلُ». رواه أبو داود، والترمذي بإسنادٍ صحيحٍ، وقال الترمذي: حديثٌ حسنٌ.

368. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు : మనిషి తన స్నేహితుడి ధర్మానికి (అతి ఎక్కువగా) ప్రభావితుడవుతాడు. కాబట్టి మీలో ప్రతి ఒక్కడూ తాను ఎవరితో స్నేహం చేస్తున్నాడో చూసుకోవాలి.

(అబూ దావూద్ మరియు తిర్మిజీలు దీన్ని దృఢమైన ఆధారాలతో వెలికి తీశారు. ఇంకా తిర్మిజీ దీని ఆధారాన్ని ప్రామాణికమైనదిగా పేర్కొన్నారు.)

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో కూడా ధర్మపరాయణులైన వ్యక్తులతోనే స్నేహం చెయ్యాలని, దైవతిరస్కారులతో స్నేహానికి దూరంగా ఉండాలని తాకీదు చేయబడింది. ధర్మానికి ఏమాత్రం ప్రాముఖ్యం ఇవ్వకుండా ప్రపంచాన్నే సర్వస్వంగా భావించేవారితో స్నేహం చేస్తే క్రమంగా విశ్వాసులు కూడా వారికి ప్రభావితులై ప్రాపంచిక వ్యామోహంలో చిక్కుకునే ప్రమాదముంది. కాబట్టి ప్రతి ఒక్కరూ తాము ఎవరితో ఎలాంటి స్నేహసంబంధాలను కలిగి ఉన్నారో ఆత్మపరిశీలన చేసుకుంటూ ఉండాలి.

٣٦٩ ـ وعن أَبي موسى الأشْعَرِيِّ رضي الله عنه أَنَّ النَّبِيَّ ﷺ قال: «المَرْءُ مَعَ مَنْ أَحَبَّ» متفقٌ عليه. وفي رواية قال: قِيلَ لِلنَّبِيِّ ﷺ: الرَّجُلُ يُحِبُّ الْقَوْمَ وَلَمَّا يَلْحَقْ بِهِمْ؟ قال: «المَرْءُ مَعَ مَنْ أَحَبَّ».

369. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు : మనిషి తాను అభిమానించిన వారితో పాటే ఉంటాడు.

*(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : ఒక వ్యక్తి కొంతమందిని అభిమానించి

నప్పటికీ వారి స్థాయికి చేరుకోలేక పోతేనో?!" అని ఎవరో సందేహపడగా, "మనిషి తాను అభిమానించినవారి వెంటే ఉంటాడు" అని అన్నారు దైవప్రవక్త (సల్లం).

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ధర్మపరాయణులు, సదాచార సంపన్నులను అభిమానిస్తే పరంలోకంలో కూడా వారి సాహచర్య భాగ్యం లభిస్తుంది. ప్రజలు తాము అభిమానించేవారంతటి గొప్పవారు కాలేకపోయినప్పటికీ దేవుడు తన కరుణా కటాక్షాలతో సామాన్య ప్రజానీకానికి కూడా అంతటి గౌరవాన్ని కల్పిస్తాడు. దీనికి విరుద్ధంగా చెడ్డవారిని, అవినీతిపరుల్ని అభిమానిస్తే పరలోకంలో భయంకరమైన పరిణామాల్ని ఎదుర్కోవలసి వస్తుంది. దేవుడు ఆ నీచులతో పాటు వారిని అభిమానించిన వారిని కూడా నేరస్తులుగా నిలబెడతాడు.

370. హజ్రత్ అనస్ కథనం ప్రకారం ఒక పల్లెటూరి వ్యక్తి దైవప్రవక్తను, "ప్రళయం ఎప్పుడొస్తుంద"ని అడిగాడు. "దానికోసం నువ్వేం ఏర్పాట్లు చేసుకున్నావు?" అని అడిగారు దైవప్రవక్త (సల్లం). దానికావ్యక్తి, "దైవాన్ని, దైవ ప్రవక్తను ప్రేమించటం" అని అన్నాడు. అతని సమాధానం విని దైవ ప్రవక్త "మరయితే నీవు ఎవరిని ప్రేమిస్తున్నావో వారితోనే ఉంటావు" అని అన్నారు.

(బుఖారీ, ముస్లిం వాక్యాలు మాత్రం ముస్లింవి)

٣٧٠ ـ وعن أنس رضي الله عنه أنَّ أعرابياً قال لِرسولِ الله ﷺ: مَتَى السَّاعَةُ؟ قال رسولُ الله ﷺ: «مَا أَعْدَدْتَ لَهَا؟» قال: حُبُّ اللهِ ورسولِهِ، قال: «أَنْتَ مَعَ مَنْ أَحْبَبْتَ». متفقٌ عليه، وهذا لفظ مسلمٍ.

బుఖారీ - ముస్లింలలోని వేరొక ఉల్లేఖనం ప్రకారం ఆ వ్యక్తి ఇలా అన్నాడు: "నేను దానికోసం ఎక్కువగా ఉపవాసా

وفي روايةٍ لهما: مَا أَعْدَدْتُ لَهَا مِنْ كَثِيرِ صَوْمٍ، وَلَا صَلاةٍ، وَلَا صَدَقَةٍ، وَلٰكِنِّي أُحِبُّ اللهَ وَرَسُولَهُ.

లేమీ పాటించలేదు. అధికంగా నమాజులుగాని, దానధర్మాలుగాని చెయ్యలేదు. అయితే నేను దేవుణ్ణి, దైవప్రవక్తను మాత్రం ప్రేమిస్తున్నాను."

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త సహచరుల్లో ఎవరైనా తాను దేవుణ్ణి, దైవప్రవక్తను ప్రేమిస్తున్నానని అంటే అవి ఒట్టి నోటిమాటలే కావు. వారి దృష్టిలో దేవుణ్ణి, దైవప్రవక్తను ప్రేమించడమంటే జీవితంలోని అన్ని విషయాల్లోనూ వారికి విధేయత చూపటం, వారి ఆజ్ఞల్ని శిరసావహించడమన్నమాట. పై హదీసులో ఆ పల్లెటూరి వ్యక్తి తాను ప్రళయానంతరం పరలోక జీవితం కోసం అంత ఎక్కువగా నమాజులు, ఉపవాసాలు, దానధర్మాలు చేయలేదనీ, అయితే దేవుణ్ణి, దైవప్రవక్తను మాత్రం మనస్ఫూర్తిగా అభిమానిస్తున్నానని చెప్పాడు. ఇక్కడ నమాజులు, ఉపవాసాలంటే స్వచ్ఛంద (నఫిల్) ఆరాధనలన్నమాట. ఫర్జ్ ఆరాధనలు (విధులు) మాత్రం ఎవరైనాసరే తప్పకుండా నిర్వర్తించాల్సిందే. ఫర్జ్ ఆరాధనలు పాటించకుండా ఎవరైనా తాను దేవుణ్ణి, దైవప్రవక్తను ప్రేమిస్తున్నానని అంటే అవి ఒట్టి బూటకపు మాటలే. మనిషి నిజంగా దేవుణ్ణి, దైవప్రవక్తను అభిమానించేవాడైతే అతని అభిమానం ఫర్జ్ ఆరాధనలు పాటించడంలోనే కనపడుతుంది. అలాంటి వ్యక్తి అతి ఎక్కువగా స్వచ్ఛంద (నఫిల్) ఆరాధనలు చేసి ఉండకపోయినప్పటికీ తన నిష్కల్మషమైన అభిమానం వల్ల దేవుని సన్నిధిలో కృతార్థుడవుతాడు. ఫర్జ్‌లను విస్మరించి నఫిల్ ఆరాధనల్ని పట్టుకొని వ్రేలాడితే దానివల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదు. దేవుని సన్నిధిలో అలాంటి నఫిల్ ఆరాధనలకు ఎలాంటి విలువా ఉండదు.

٣٧١ ـ وعن ابنِ مسعودٍ رضي الله عنه قال: جَاءَ رَجُلٌ إِلَى رسولِ اللهِ ﷺ فَقَالَ: يَارَسولَ اللهِ! كَيْفَ تَقُولُ فِي رَجُلٍ أَحَبَّ قَوْماً وَلَمْ يَلْحَقْ بِهِمْ؟ فَقَالَ رسولُ الله ﷺ: «الْمَرْءُ مَعَ مَنْ أَحَبَّ» متفقٌ عليه.

371. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, "దైవప్రవక్తా! ఒక మనిషి కొందరిని అభిమానిస్తున్నాడు గాని తాను మాత్రం వారి స్థాయికి చేరుకోలేకపోతున్నాడు. అలాంటి వ్యక్తి గురించి మీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు. దానికి ఆయన "మనిషి తాను అభిమానించినవారితో పాటే ఉంటాడు" అని చెప్పారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

వారి స్థాయికి చేరుకోలేకపోతున్నారంటే ఇహలోకంలో సత్కార్యాలు చేయటంలో తమ అభిమాన పాత్రుల స్థాయికి చేరుకోలేక పోతున్నారని అర్థం. కాని పరలోకంలో మాత్రం వారు దైవభక్తి గలవారిని అభిమానించినందుకు దేవుడు తన కరుణాకటాక్షాలతో వారిని కూడా వారి అభిమానపాత్రుల స్థాయికి చేర్చి వారితోపాటు ఉంచుతాడు. పై హదీసులో ఈ విషయం గురించి దైవప్రవక్తను అడుగుతున్నది ఆయన (స) సహచరుడే. ఎవరి గురించి అడుగుతున్నాడో వారూ సహచరులే - అయినప్పటికీ భావం రీత్యా ఈ హదీసు అందరికీ వర్తిస్తుంది. ప్రళయం వచ్చేవరకు పుణ్యాత్ముల్ని అభిమానించేవారందరికీ పరలోకంలో పుణ్యగతులే ప్రాప్తమవుతాయి. అయితే దానికోసం దైవగ్రంథానికి, దైవప్రవక్త సంప్రదాయానికి కట్టుబడి ఆచరిస్తూ, వీలైనంతవరకు ధర్మాదేశాల్ని పాటిస్తూ ఉండాలి.

٣٧٢ ـ وعن أبي هُريرة رضي الله عنه عن النبيِّ ﷺ قال: «النَّاسُ مَعَادِنُ كَمَعَادِنِ الذَّهَبِ وَالفِضَّةِ، خِيَارُهُمْ فِي الجَاهِلِيَّةِ خِيَارُهُمْ فِي الإِسْلام إِذَا فَقُهُوا، وَالأَرْوَاحُ جُنُودٌ مُجَنَّدَةٌ، فَمَا تَعَارَفَ مِنْهَا ائْتَلَفَ، وَمَا تَنَاكَرَ مِنْهَا اخْتَلَفَ» رواه مسلم. وروى البخاري قوله: «الأَرْوَاحُ» إلخ من روايةِ عائشةَ رضي الله عنها.

372. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : బంగారం, వెండి గనుల్లాగా ప్రజలు (కూడా వేర్వేరు) గనుల్లాంటి వారు. అజ్ఞాన కాలంలో మంచి వాళ్ళుగా ఉండినవారు ఇస్లాం స్వీకరించిన తరువాత కూడా మంచివాళ్ళుగానే ఉంటారు. అయితే వారు ధర్మం పట్ల సరయిన అవగాహన కలిగి ఉండాలి.

అదేవిధంగా ఆత్మలు కూడా అనేక సైన్యాల మాదిరిగా ఉంటాయి. (ఆత్మావస్థలో) ఒక ఆత్మకు మరో ఆత్మతో పరిచయముంటే (ప్రపంచంలోనూ) వారి మధ్య మైత్రి ఏర్పడుతుంది. అదే విధంగా (ఆత్మావస్థలో) పరిచయంలేని ఆత్మలు (ప్రపంచంలోనూ) అపరిచితులుగానే ఉండిపోతాయి. *(ముస్లిం)*

ఇమామ్ బుఖారీ ఈ హదీసులో వచ్చిన ఆత్మల ప్రస్తావనను మాత్రం హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) ఆధారంగా ఉల్లేఖించారు.

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

గనుల్లో అనేక రకాలుంటాయి. కొన్ని గనుల నుంచి స్వచ్ఛమైన ఖనిజాలు వెలువడితే మరికొన్ని గనుల నుంచి నాసిరకపు ఖనిజాలు వెలువడతాయి. అదేవిధంగా మనుషుల్లో కూడా మంచి, చెడు - రెండు రకాల వారుంటారు. సమాజంలో గౌరవోన్నతులు, పేరు ప్రతిష్ఠలు గలవారెవరైనా ఇస్లాం స్వీకరిస్తే వారి గౌరవానికి, పేరు ప్రతిష్ఠలకు ఎలాంటి భంగం వాటిల్లదు. ఆ తరువాత కూడా వారు గౌరవంగా ప్రతిష్ఠాత్మక జీవితాన్ని గడపవచ్చు. అయితే వారు ధార్మిక స్పృహ, ధర్మం గురించి సరయిన అవగాహన కలిగి ఉండాలి. ధర్మాదేశాల్ని పాటించేవారయి ఉండాలి.

ఆత్మలు అనేక సైన్యాల మాదిరిగా ఉంటాయంటే, వాటి మనస్తత్వాలకనుగుణంగా వేర్వేలు సమూహాలుగా ఉంటాయని అర్థం. మంచిని కోరే ఆత్మలకు ఆ ఆత్మావస్థలోనే ఇతర మంచి ఆత్మలతో పరిచయమేర్పడుతుంది. అదేవిధంగా చెడుని ప్రేమించే మనస్తత్వం గల ఆత్మలకు ఇతర చెడ్డ ఆత్మలతో పరిచయమేర్పడుతుంది. ప్రపంచంలోకి వచ్చిన తరువాత ఆ పరిచయాలే స్నేహ సంబంధాలుగా మార్పు చెందుతాయి.

٣٧٣ ـ وعـن أُسَيْـر بـن عَمْـرو وَيُقَالُ: ابْنُ جابِـرٍ ـ وهو بضم الهمزة، وفتح السين المهملة ـ قال: كَانَ عُمَرُ بْنُ الخَطَّاب رضي الله عنه إذا أَتَى عَلَيْهِ أَمْدَادُ أَهْلِ الْيَمَنِ سَأَلَهُمْ: أَفِيكُمْ أُوَيْسُ بْنُ

373. హజ్రత్ ఉసైర్ బిన్ అమ్ర్ - మరికొంతమంది అభిప్రాయం ప్రకారం ఉసైర్ బిన్ జాబిర్ కథనం :

"యమన్ దేశం నుండి ముస్లిం యుద్ధ వీరులకు సహాయపడేవారెవరైనా వస్తే హజ్రత్ ఉమర్ (రజి) వారిని "మీలో ఉవైస్ బిన్ ఆమిర్ అనే పేరుగల వ్యక్తి ఎవరైనా ఉన్నారా?" అని అడుగుతుండే వారు. ఒకనాడు ఓ బృందంతోపాటు నిజంగానే ఉవైస్ వచ్చారు. మీరు 'ఉవైస్ బిన్ ఆమిర్ గారేనా?' అని ఉమర్

عَامِرٍ؟ حَتَّى أَتَى عَلَى أُوَيْسٍ رضي الله عنه، فقال له: أَنْتَ أُوَيْسُ بْنُ عامِرٍ؟ قال: نَعَمْ، قال: مِنْ مُرَادٍ ثُمَّ مِنْ قَرَنٍ؟ قال: نَعَمْ، قال: فَكَانَ بِكَ بَرَصٌ، فَبَرَأْتَ مِنْهُ إِلَّا مَوْضِعَ دِرْهَمٍ؟ قال: نَعَمْ قال: لَكَ وَالِدَةٌ؟ قال: نَعَمْ، قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقول: «يَأْتِي عَلَيْكُمْ أُوَيْسُ بْنُ عَامِرٍ مَعَ أَمْدَادِ أَهْلِ الْيَمَنْ، مِنْ مُرَادٍ ثُمَّ مِنْ قَرَنٍ، كَانَ بِهِ بَرَصٌ، فَبَرَأَ مِنْهُ إِلَّا مَوْضِعَ دِرْهَمٍ، لَهُ وَالِدَةٌ هُوَ بِهَا بَرٌّ، لَوْ أَقْسَمَ عَلَى اللهِ لأَبَرَّهُ، فَإِنِ اسْتَطَعْتَ أَنْ يَسْتَغْفِرَ لَكَ فَافْعَلْ» فَاسْتَغْفِرْ لِي، فَاسْتَغْفَرَ لَهُ، فقال له عُمَرُ: أَيْنَ تُرِيدُ؟ قال: الْكُوفَةَ، قال: أَلَا أَكْتُبُ لَكَ إِلى عَامِلِهَا؟ قال: أَكُونُ فِي غَبْرَاءِ النَّاسِ أَحَبُّ إِلَيَّ، فَلَمَّا كَانَ مِنَ الْعَامِ الْمُقْبِلِ حَجَّ رَجُلٌ مِنْ أَشْرَافِهِمْ، فَوَافَى عُمَرَ، فَسَأَلَهُ عَنْ أُوَيْسٍ،

అడిగారు. ఆయన అవునన్నారు. “మీకు మురాద్ కుటుంబంతోనూ, ఖర్న్ తెగతోనూ సంబంధముందా?” అని అడిగారు. ఆయన ‘ఉంద’ని చెప్పారు. ఆ తరువాత ఉమర్ (రజి) “మీ శరీరంపై తెల్లమచ్చలుండేవి. ఇప్పుడు అవన్నీ నయమయిపోయి దిర్హం నాణెమంత మచ్చమాత్రమే మిగిలి ఉంది కదూ!?” అని అడిగారు. ఆయన అవునన్నారు. ఆ తరువాత “మీ తల్లి బ్రతికి ఉందా?” అని అడిగారు. “అవును, బ్రతికే ఉంది” అని ఆయన సమాధానమిచ్చారు. (ఆయన తాననుకుంటున్న ఉవైసే అన్న నమ్మకం కుదిరాక) హజ్రత్ ఉమర్ దైవప్రవక్త (స) ఇలా చెబుతుండగా తాను విన్నానని తెలియజేశారు:

యమన్ దేశం నుండి ముస్లిం సైన్యాలకు జిహాద్‌లో సహకరించేవారితో పాటు మురాద్ కుటుంబానికి, ఖర్న్ తెగకు చెందిన ఉవైస్ బిన్ ఆమిర్ అనే అతను మీ దగ్గరికి వస్తాడు. ఒకప్పుడు అతని శరీరంపై ఉండిన తెల్లమచ్చలన్నీ నయమయిపోయి కేవలం ఒక దిర్హం నాణెమంత మచ్చ మాత్రమే మిగిలి ఉంటుంది. అతను తన తల్లి పట్ల చాలా ఉత్తమంగా ప్రవర్తిస్తాడు. అతను గనక దేవునిపై ఏదైనా ప్రమాణం చేస్తే దేవుడు తప్పకుండా అతని ప్రమాణాన్ని పూర్తి చేస్తాడు. కాబట్టి (ఓ ఉమర్!) నీకు నీ పాపాల మన్నింపు కోసం అతని చేత

ప్రార్థన చేయించుకునే అవకాశం లభిస్తే తప్పకుండా చేయించుకో."

తరువాత హజ్రత్ ఉమర్ (రజి), "అందుకే అడుగుతున్నాను. మీరు నా పాపాల మన్నింపు కోసం దేవుణ్ణి ప్రార్థించండి" అని కోరారు. ఉమర్ (రజి) కోరినట్లుగానే ఉవైస్ ఖర్నీ ఆయన మన్నింపు కోసం దేవుణ్ణి ప్రార్థించారు. ఆ తరువాత హజ్రత్ ఉమర్ (రజి) "ఇప్పుడు మీరెక్కడికి వెళ్ళాలనుకుంటు న్నారు?" అని అడిగారు. కూఫాకు వెళ్ళాలనుకుంటు న్నానని చెప్పారాయన. "అలాగయితే నేను కూఫా గవర్నర్‌కు మీ గురించి లేఖ రాసివ్వమంటారా?" అని అడిగారు. దానికాయన, "(అవసరం లేదు). నేను ఎవరికీ తెలియకుండా ఎవరూ పట్టించు కోకుండా ఉండే నిరుపేదలు, అభాగ్యులతో పాటు ఉండాలనుకుంటు న్నాను" అని అన్నారు.

మరు సంవత్సరం యమన్ దేశానికి చెందిన గొప్ప మనుషుల్లో ఒకాయన కాబా యాత్ర (హజ్) కోసం వచ్చాడు. (ఆ యాత్రలోనే) అతను హజ్రత్ ఉమర్ (రజి)ని కలవటం జరిగింది. ఆయన ఆ వ్యక్తిని ఉవైస్ (రహ్మాలై) గురించి అడిగారు. దానికావ్యక్తి, "నేను వచ్చినప్పుడు ఆయన ఎంతో నిరాడంబర జీవితం గడుపుతున్నారు. ఆయన దగ్గర జీవన సామగ్రి చాలా తక్కువగా ఉంది" అని అన్నాడు. అప్పుడు హజ్రత్ ఉమర్

فقال: تَرَكْتُهُ رَثَّ الْبَيْتِ قَلِيلَ المتاعِ، قال: سَمِعْتُ رسولَ الله ﷺ يقول: «يأتي عَلَيْكُمْ أُوَيْسُ بْنُ عَامِرٍ مَعَ أَمْدَادِ مِنْ أَهْلِ الْيَمَنِ، مِنْ مُرادٍ ثُمَّ مِنْ قَرَنٍ، كَانَ بِهِ بَرَصٌ فَبَرَأَ مِنْهُ إِلَّا مَوْضِعَ دِرْهَمٍ، لَهُ وَالِدَةٌ هُوَ بِهَا بَرٌّ، لَوْ أَقْسَمَ عَلَى الله لأَبَرَّهُ، فَإِنِ اسْتَطَعْتَ أَنْ يَسْتَغْفِرَ لَكَ، فَافْعَلْ» فَأَتَى أُوَيْساً، فقال: اسْتَغْفِرْ لي، قال: أَنْتَ أَحْدَثُ عَهْداً بِسَفَرٍ

صَالِحٍ، فَاسْتَغْفِرْ لِي. قال: لَقِيتَ عُمَرَ؟ قال: نَعَمْ، فَاسْتَغْفَرَ لَهُ، فَفَطِنَ لَهُ النَّاسُ، فَانْطَلَقَ عَلَى وَجْهِهِ. رواه مسلم. وفي روايةٍ لمسلمٍ أيضاً عن أُسَيْرِ بنِ جابرٍ رضي الله عنه أنَّ أهلَ الكُوفَةِ وَفَدُوا على عُمَرَ رضي الله عنهُ، وَفِيهِم رَجُلٌ مِمَّنْ كانَ يَسْخَرُ بِأُوَيْسٍ، فقال عُمَرُ: هَلْ هَاهُنا أَحَدٌ مِنَ القَرَنِيِّينَ؟ فَجَاءَ ذٰلِكَ الرَّجُلُ، فقالَ عُمَرُ: إنَّ رَسُولَ اللهِ ﷺ قد قال: «إنَّ رَجُلاً يَأتِيكُمْ

తాను దైవప్రవక్త (స) ద్వారా విన్న విషయం అతనికి ఈ విధంగా చెప్పారు:

“యమన్ దేశం నుండి ముస్లిం యోధులకు సహాయం చేసేవారితో పాటు మురాద్ కుటుంబానికి, ఖర్న్ తెగకు చెందిన ఉవైస్ బిన్ ఆమిర్ అనే ఆయన మీ దగ్గరికి వస్తాడు. ఒకప్పుడు ఆయనకు తెల్లమచ్చల రోగం ఉండి ఉంటుంది. ఆ రోగమంతా నయమయిపోయి దిర్హము నాణెమంత మచ్చ మాత్రమే మిగిలి పోతుంది. ఆయన తల్లి (బ్రతికి) ఉంటుంది. ఆయన తన తల్లి పట్ల ఎంతో ఉత్తమంగా మెలగుతాడు. ఆయన గనక దేవునిపై ప్రమాణం చేస్తే దేవుడు (తప్పకుండా) ఆయన ప్రమాణాన్ని పూర్తిచేస్తాడు. కనుక నీకు ఆయన చేత నీ పాపాల మన్నింపుకోసం ప్రార్థన చేయించుకునే అవకాశం లభిస్తే తప్పకుండా చేయించుకో!”

హజ్రత్ ఉమర్ (రజి) చెప్పింది విని ఆ యమన్ దేశస్థుడు హజ్ పూర్తి చేసుకున్న తరువాత ఉవైస్ (రహ్మలై) దగ్గరికి వెళ్ళి తన కోసం మన్నింపు ప్రార్థన చేయమని కోరాడు. దానికి ఉవైస్ (రహ్మలై) “మీరు ఇప్పుడే ఓ పుణ్యప్రదమైన ప్రయాణాన్ని ముగించుకొని వచ్చారు. కాబట్టి మీరే నా మన్నింపు కోసం ప్రార్థించాల”న్నారు. తరువాత “మీరు ఉమర్ గారిని కలిశారా?” అని అడిగారు. దానికావ్యక్తి కలిశానన్నాడు. ఉవైస్ హజ్రత్ ఉమర్

مِنَ اليَمَن يُقَالُ لَهُ: أُوَيْسٌ، لَا يَدَعُ بِاليَمَنِ غَيْرَ أُمٍّ لَهُ، قَدْ كَانَ بِهِ بَيَاضٌ فَدَعَا اللهَ تعالى، فَأَذْهَبَهُ إلَّا مَوضِعَ الدِّينَارِ أَوِ الدِّرْهَمِ، فَمَنْ لَقِيَهُ مِنكُمْ، فَلْيَسْتَغْفِرْ لَكُمْ». وفي روايةٍ له عَن عمرَ رضي الله عنه قال: إنِّي سَمِعْتُ رسولَ الله ﷺ يقول: «إنَّ خَيْرَ التَّابِعِينَ رَجُلٌ يُقَالُ له: أُوَيْسٌ، وَلَه وَالدَةٌ، وَكَانَ بِهِ بَيَاضٌ، فَمُروه، فَلْيَسْتَغْفِرْ لَكُمْ». قوله: «غَبْرَاءِ النَّاسِ» بفتح الغين المعجمة، وإسكان الباءِ وبالمد، وهم فُقَرَاؤُهمْ وَصَعَالِيكُهُمْ وَمَنْ لَا يُعْرَف عَيْنُه مِن أَخلاطِهِمْ. وَ«الأَمْداد» جَمْع مَدَدٍ وَهُم الأَعْوَان وَالنَّاصِرُونَ الَّذِينَ كَانُوا يُمِدُّونَ المُسْلِمِينَ في الجِهَاد.

(రజి) మన్నింపు కోసం ప్రార్థించారు. అప్పుడు ప్రజలు ఆయన గొప్పదనాన్ని గుర్తించారు. ఉవైస్ (రహ్మాలై) ముందుకు నడిచారు. (ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో హజ్రత్ ఉసైర్ బిన్ జాబిర్ (రజి) కథనం ఇలా ఉంది : కూఫా ప్రాంతానికి చెందిన కొందరు హజ్రత్ ఉమర్ (రజి) దగ్గరికి వచ్చారు. వారిలో ఒకడు ఉవైస్ (రహ్మాలై)ని ఎగతాళి చేసేవాడు. (అతనికి ఉవైస్ (రహ్మాలై) గొప్పదనం ఏమిటో తెలియదు) ఇక్కడ ఖర్న్ తెగకు చెందినవారు ఎవరైనా ఉన్నారా?" అని ఉమర్ (రజి) అడిగారు. అప్పుడు ఆ వ్యక్తి ముందుకు వచ్చాడు. ఉమర్ (రజి) అతనికి, దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారని తెలియజేశారు:

"మీ దగ్గరికి యమన్ నుండి ఉవైస్ అనే ఆయన వస్తాడు. ఆయన మీ దగ్గరికి వచ్చినప్పుడు యమన్‌లో తన తల్లి ఒక్క తినే వదలివస్తాడు. ఒకప్పుడు అతనికి బొల్లి రోగం ఉంటుంది. అతను దేవుణ్ణి ప్రార్థిస్తే దేవుడు అతని రోగాన్ని నయం చేస్తాడు. అతని శరీరంపై దీనారు లేక దిర్హం నాణెమంత మచ్చ మాత్రమే మిగిలిపోతుంది. కనుక మీలో ఎవరైనా అతన్ని కలిస్తే (తప్పకుండా) అతని చేత మన్నింపుకోసం ప్రార్థన చేయించు కోండి."

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో హజ్రత్ ఉమర్ (రజి) దైవప్రవక్త (స) ఇలా అంటుండగా తాను విన్నానని తెలియ జేశారు : తాబయీన్లలో (అంటే ప్రవక్త సహచరుల అనుచరుల్లో) ఉవైస్ అనే ఆయన అందరికన్నా గొప్పవాడు. ఆయన తల్లి బ్రతికి ఉంటుంది. ఆయన శరీరంపై తెల్లమచ్చలుంటాయి. మీరు ఆయన్ని మీ మన్నింపు కోసం ప్రార్థించ మని కోరండి."

'గబ్రావున్నాస్' అంటే గుట్టుగా ఉండే ఆ ప్రాంతపు నిరుపేదలు, అగత్య పరులు. 'అమ్దాద్' మదద్‌కు బహు వచనం. వారు యుద్ధంలో ముస్లిం యోధులకు సహకరించేవారని అర్థం.

*(సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసు దైవప్రవక్త (సల్లం) గారి స్పష్టమైన మహిమను గురించి తెలియజేస్తోంది. ఉవైస్ ఖర్నీ వస్తారని ఆయన తన జీవిత కాలంలోనే చెప్పారు. ఉవైస్ ఖర్నీ (రహ్మాలై) వచ్చిన తరువాత చూస్తే ఆయన గురించి దైవప్రవక్త (స) ఇచ్చిన సూచనలన్నీ నిజమని తేలాయి.
2. ప్రాపంచిక పటాటోపాలకు దూరంగా, నిరాడంబరంగా, గుట్టుగా జీవనం సాగించటం ఉత్తమం.
3. తల్లిదండ్రుల పట్ల మంచిగా మెలగాలి.
4. ఈ హదీసు ద్వారా ఉవైస్ ఖర్నీ (రహ్మాలై) తాబయీన్లందరిలోకెల్లా గొప్పవారని తెలుస్తోంది. కొంతమంది హజ్రత్ సయీద్ బిన్ ముసయ్యిబ్ (రహ్మాలై) తాబయీన్లలో గొప్పవారని అన్నారంటే వారు వేరే ఉద్దేశ్యంతో అని ఉంటారు. ఎందుకంటే, ఖుర్ఆన్ హదీసుల జ్ఞానంలో, ధర్మావగాహనలో ఇతర తాబయీన్లందరికన్నా సయీద్ బిన్ ముసయ్యిబ్ (రహ్మాలై) ప్రవీణులన్న విషయంలో ఏకాభిప్రాయముంది. కాని హదీసుపరంగా చూస్తే దేవుని దృష్టిలో ఉవైస్ (రహ్మాలై) అందరికన్నా గొప్పవారని తెలుస్తోంది. (నవవీ)

٣٧٤ - وعن عمرَ بنِ الخطاب رضي الله عنه قال: اسْتَأْذَنْتُ النَّبِيَّ ﷺ في العُمْرَةِ، فَأَذِنَ لي، وقال: «لا تَنْسَنَا يَا أُخَيَّ مِنْ دُعَائِكَ» فقال كَلِمَةً مَا يَسُرُّنِي أَنَّ لي بِهَا الدُّنْيَا. وفي روايةٍ قال: «أَشْرِكْنَا يَا أُخَيَّ فِي دُعَائِكَ». حديثٌ صحيحٌ رواه أبو داود، والترمذي وقال: حديثٌ حسنٌ صحيحٌ.

374. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం: నేను ఉమ్రాకు వెళ్ళటానికి దైవప్రవక్త (సల్లం) అనుమతి కోరాను. అప్పుడు ఆయన అనుమతి ఇస్తూ, "సోదరా! (ఉమ్రాలో) నువ్వు దేవుణ్ణి ప్రార్థించేటప్పుడు మమ్మల్ని మరచిపోకు సుమా!" అని అన్నారు. ఆయన అన్న ఆ మాటకు నేనెంతగా పొంగిపోయానంటే, మొత్తం ప్రపంచం నా సొంతమయినా నాకు అంత ఆనందం కలిగేది కాదు.

వేరొక ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు : "సోదరా! నీ ప్రార్థనలో మమ్మల్ని కూడా చేర్చుకో." (ఈ హదీసు ప్రామాణికమైనది. దీనిని అబూదావూద్ మరియు తిర్మిజీలు వెలికితీశారు. తిర్మిజీ దీనిని 'హసన్' మరియు 'సహీహ్'గా పేర్కొన్నారు.)

*(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం, సుననె తిర్మిజీలోని ప్రార్థనల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రయాణానికి బయలుదేరుతున్న వారిని తమ కోసం ప్రార్థించమని కోరటం ఉత్తమం, ముఖ్యంగా హజ్ (కాబాయాత్ర) కోసం వెళుతున్నవారిని; కాబా గృహాన్ని సందర్శించినప్పుడు తమకోసం కూడా ప్రార్థించమని కోరాలి. దీనివల్ల రెండు ప్రయోజనాలున్నాయి. ఒకటి: ఒక ముస్లిం పరోక్షంగా ఉన్న తన సోదరుని కోసం ప్రార్థిస్తే దేవుడు అతని ప్రార్థనను తప్పకుండా ఆమోదిస్తాడు. ఎందుకంటే పరోక్షంగా చేసే ప్రార్థనలో చిత్తశుద్ధి ఉంటుంది. ఇక రెండో ప్రయోజనం ఏమిటంటే, పుణ్యక్షేత్రంలో చేసే ప్రార్థనలకు త్వరగా స్వీకృతి లభిస్తుంది. అదేవిధంగా హజ్, ఉమ్రాల కోసం వెళ్ళేవారు అక్కడికి వెళ్ళిన తరువాత కేవలం తమ కోసమే ప్రార్థించుకోకుండా బంధుమిత్రుల కోసం కూడా ప్రార్థించాలి.

దైవప్రవక్త (స) తన అనుచర సమాజానికి తండ్రి లాంటివారని అందరికీ తెలుసు. గౌరవోన్నతుల రీత్యా సృష్టిలో ఆయన అందరికన్నా శ్రేష్ఠులు. అందులో సందేహానికి ఏమాత్రం తావులేదు. అదేవిధంగా ఆయన ధార్మికంగా ప్రతి వ్యక్తికీ ఒక సోదరుని లాంటివారని కూడా ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

٣٧٥ ـ وعن ابن عُمَرَ رضي الله عنهما قال: كَانَ النَّبِيُّ ﷺ يَزُورُ قُبَاءَ رَاكِباً وَمَاشِياً، فَيُصَلِّي فِيهِ رَكْعَتَيْنِ. متفقٌ عليه.

وفي روايةٍ: كان النَّبِيُّ ﷺ يَأْتِي مَسْجِدَ قُبَاءَ كُلَّ سَبْتٍ رَاكِباً وَمَاشِياً، وَكَانَ ابْنُ عُمَرَ يَفْعَلُهُ.

375. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) వాహనంపైగాని లేదా నడిచిగాని 'ఖుబా'కు వెళ్ళి అక్కడ రెండు రకాతుల నమాజు చేసి వచ్చే వారు. *(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో దైవప్రవక్త (స) ప్రతి శనివారం వాహనంపైగాని నడిచిగాని ఖుబా మస్జిద్‌కు వెళ్ళేవారనీ, ఇబ్నె ఉమర్ (రజి) కూడా (దైవప్రవక్తను అనుసరిస్తూ) అలాగే చేసేవారని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. మదీనా నగరానికి రెండు మైళ్ళ దూరంలో 'ఖుబా' అనే చిన్న ఊరు ఉండేది. ప్రస్తుతం అది మదీనాలో ఒక పేటగా మారిపోయింది. ఒక హదీసులో దైవప్రవక్త (స) ఖుబా మస్జిద్‌లో నమాజ్ చేస్తే ఉమ్రా చేసినంత పుణ్యం లభిస్తుందని చెప్పారు. (తిర్మిజీ)
2. దైవప్రవక్త ఆచరణల్ని అనుసరించటంలో హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కు మంచి పేరుంది. ఇది ఆయన ప్రత్యేకతగా చెప్పబడుతుంది.

## 46వ అధ్యాయం

# ٤٦ - بَابُ فَضْلِ الْحُبِّ فِي اللهِ وَالْحَثِّ عَلَيْهِ وَإِعْلَامِ الرَّجُلِ مَنْ يُحِبُّهُ أَنَّهُ يُحِبُّهُ، وَمَاذَا يَقُولُ لَهُ إِذَا أَعْلَمَهُ

# దైవం కోసం ప్రేమించమని ప్రోత్సహించటం గురించి, తోటి మనిషిని ప్రేమిస్తే అతని ముందు తన ప్రేమను ప్రకటించటం గురించి, దానికి ఎదుటి వ్యక్తి ఇచ్చే సమాధానం గురించి.....

قال الله تعالى: ﴿مُّحَمَّدٌ رَّسُولُ ٱللَّهِ وَٱلَّذِينَ مَعَهُۥٓ أَشِدَّآءُ عَلَى ٱلْكُفَّارِ رُحَمَآءُ بَيْنَهُمْ﴾ [الفتح: ٢٩] إلى آخر السورة. وقال تعالى: ﴿وَٱلَّذِينَ تَبَوَّءُو ٱلدَّارَ وَٱلْإِيمَٰنَ مِن قَبْلِهِمْ يُحِبُّونَ مَنْ هَاجَرَ إِلَيْهِمْ﴾ [الحشر: ٩].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

ముహమ్మద్ అల్లాహ్ ప్రవక్త. ఆయన వెంట ఉన్నవారు అవిశ్వాసుల పట్ల కఠినులుగానూ, పరస్పరం దయార్ద్ర హృదయులుగానూ ఉంటారు. (సూరా చివరి వరకు).

(అల్ ఫతహ్ : 29)

వేరొకచోట ఆయన ఇలా అంటున్నాడు :

"శరణార్థుల రాకకు పూర్వమే, విశ్వసించి వలస కేంద్రంలో స్థిరపడినవారు తమ దగ్గరికి వలస వచ్చిన వారిని ప్రేమిస్తారు."

(అల్ హష్ర్ : 9)

పైన పేర్కొనబడిన రెండు సూక్తులు విశ్వాసుల మధ్య స్నేహపూర్వక సంబంధాలుండా లనీ, వారు పరస్పరం ప్రేమభావంతో మెలగాలని ప్రబోధిస్తున్నాయి. ప్రవక్త సహచరులు కేవలం దైవప్రసన్నత కోసమే పరస్పరం ప్రేమించు కునేవారు. స్నేహ భావంతో కలిసిమెలిసి ఉండే వారు. వారి స్నేహంలో ప్రాపంచిక ఉద్దేశ్యాలు ఉండేవి కావు. విశ్వాసుల మధ్య ప్రేమ, సఖ్యతలు స్వార్థ ప్రయోజనాలకు అతీతంగా ఉంటాయి.

376. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఈ మూడు లక్షణా లున్న వ్యక్తి విశ్వాస మాధుర్యాన్ని ఆస్వాదిస్తాడు. (ఒకటి) దేవుడు మరియు దైవప్రవక్త (స) తనకు అందరికన్నా ప్రియతములై ఉండాలి. (రెండు) కేవలం దైవప్రసన్నత కోసమే తోటి వ్యక్తిని ప్రేమించాలి. (మూడు) దేవుడు తనను అవిశ్వాస స్థితినుండి రక్షించిన తరువాత తిరిగి దాని వైపుకు మరలిపోవటాన్ని తను అగ్నిలో పడటాన్ని ఎంతగా అసహ్యాంచుకుంటాడో అంతగా అసహ్యాంచుకోవాలి. (బుఖారీ - ముస్లిం)

٣٧٦ ـ وعن أَنسٍ رضي الله عنه عن النَّبيِّ ﷺ قال: «ثلاثٌ مَنْ كُنَّ فيهِ وَجَدَ بِهِنَّ حَلَاوَةَ الإِيمانِ: أَنْ يَكُونَ اللهُ وَرَسُولُهُ أَحَبَّ إِلَيْهِ مِمَّا سِواهُما، وَأَنْ يُحِبَّ المَرْءَ لَا يُحِبُّهُ إِلَّا للهِ، وَأَنْ يَكْرَهَ أَنْ يَعُودَ في الكُفْرِ بَعْدَ أَنْ أَنْقَذَهُ اللهُ مِنْهُ، كَمَا يَكْرَهُ أَنْ يُقْذَفَ فِي النَّارِ». متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీ మరియు సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

1. విశ్వాసికి ఉండవలసిన ముఖ్య లక్షణాలలో ఒకటి, కేవలం దైవం కోసం ఇతరుల్ని ప్రేమించటం. దైవం కోసం ఇతరుల్ని ప్రేమించేవాడే వాస్తవానికి విశ్వాసమాధుర్యాన్ని ఆస్వాదించగలడు. అతని ప్రేమ, అతని స్నేహం ప్రాపంచిక ప్రయోజనాలకు అతీతంగా, నిస్వార్థంగా ఉంటుంది. అప్పుడు ఎన్ని కష్టాలెదురైనప్పటికీ ఆ స్నేహం చెక్కుచెదరకుండా స్థిరంగా ఉంటుంది.

2. విశ్వంలోని ప్రతి వస్తువుకన్నా దేవుణ్ణి, దైవప్రవక్తనే ఎక్కువగా అభిమానించాలి. వారి ఆజ్ఞల్ని, ఆదేశాల్ని పాలించాలి. ఆలుబిడ్డలు, తల్లిదండ్రుల ప్రేమకన్నా, ప్రాపంచిక వ్యామోహం కన్నా దేవుడు, దైవప్రవక్త ప్రసన్నతకే ఎక్కువ ప్రాధాన్యత నివ్వాలి.

3. ఒకసారి ఇస్లాం స్వీకరించిన తరువాత ఇక దాని పట్ల వైముఖ్యం చూపకూడదు. తన అవిశ్వాసం మూలంగా నరకాగ్నిలో పడబోతున్న మనిషిని దేవుడు రక్షించి విశ్వాస

భాగ్యాన్ని ప్రసాదించాడు. ఆ వ్యక్తి తిరిగి అవిశ్వాసం వైపుకు మరలితే నరకంలో పడక తప్పదు. కావాలని ఎవరూ అగ్నిగుండంలో దూకరు. మరలాంటప్పుడు దైవ అవిధేయతకు పాల్పడకుండా ఉండాలి కదా!

٣٧٧ ـ وعن أبي هريرةَ رضيَ الله عنه عن النَّبيِّ ﷺ قال: «سَبْعَةٌ يُظِلُّهُمُ الله في ظِلِّهِ يَوْمَ لا ظِلَّ إلَّا ظِلُّهُ: إمَامٌ عَادِلٌ، وَشَابٌّ نَشَأَ في عِبَادَةِ الله عَزَّ وَجَلَّ، وَرَجُلٌ قَلْبُهُ مُعَلَّقٌ بالمَسَاجِدِ، وَرَجُلانِ تَحَابَّا في الله اجْتَمَعَا عَلَيْهِ وَتَفَرَّقَا عَلَيْهِ، وَرَجُلٌ دَعَتْهُ امْرَأَةٌ ذَاتُ حُسْنٍ وَجَمَالٍ، فقال: إنِّي أخَافُ الله، وَرَجُلٌ تَصَدَّقَ بِصَدَقَةٍ، فَأَخْفَاهَا حَتَّى لَا تَعْلَمَ شِمَالُهُ ما تُنْفِقُ يَمِينُهُ، وَرَجُلٌ ذَكَرَ الله خَالِياً فَفَاضَتْ عَيْنَاهُ» متفقٌ عليه.

377. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు : దేవుని నీడ తప్ప మరెలాంటి నీడ కనబడని (ప్రళయ) దినాన దేవుడు ఏడుగురిని తన (కారుణ్య) నీడలో ఉంచుతాడు. ఆ ఏడుగురు : (1) న్యాయంగా పాలించిన పరిపాలకుడు. (2) తన యవ్వనాన్ని దైవారాధనలో గడిపిన యువకుడు. (3) మనసు ధ్యాస అంతా మస్జిద్‌లోనే ఉండే వ్యక్తి. (4) కేవలం దైవప్రసన్నత కోసం పరస్పరం ప్రేమించుకునే ఇద్దరు వ్యక్తులు. (అలాగే), దైవప్రసన్నత ప్రాతిపదికగా పరస్పరం విడిపోయేవారు. (5) సౌందర్యం, సౌకుమార్యం కలిగి వున్న స్త్రీ చెడు కార్యానికి పిలిస్తే తాను దేవునికి భయపడుతున్నానంటూ ఆమె కోరికను నిరాకరించిన వ్యక్తి. (6). కుడి చేత్తో చేసింది ఎడమ చేతికి కూడా తెలియనంత గోప్యంగా దానాలు చేసిన వ్యక్తి. (7) ఏకాంతంలో దేవుణ్ణి జ్ఞాపకం చేసుకొని (ఆయన భీతితో) కన్నీరు కార్చిన వ్యక్తి. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో దేవుడు ప్రళయదినాన ముఖ్యంగా ఏడుగురికి తన కారుణ్య ఛాయలో ఆశ్రయం కల్పిస్తాడని చెప్పబడింది. మరికొన్ని హదీసుల్లో ఈ ఆచరణలుగాక ఇతర ఆచరణల

వల్ల కూడా ప్రళయదినాన ఆ సౌభాగ్యం లభిస్తుందని చెప్పబడింది. ఇలాంటి ఆచరణల సంఖ్య డెబ్భై వరకు ఉండవచ్చని పండితులు అభిప్రాయపడుతున్నారు. దైవప్రవక్త (స) ఈ హదీసుల్ని వేర్వేరు సమయాలలో సందర్భోచితంగా చెప్పి ఉంటారు కాబట్టి వీటిమధ్య ఎలాంటి వైరుధ్యం లేదు.

٣٧٨ - وعنه قال: قال رسولُ الله ﷺ: «إن الله تعالى يقولُ يَوْمَ القِيَامَةِ: أَيْنَ المُتَحابُّونَ بِجَلالي؟ اليَوْمَ أُظِلُّهُمْ في ظِلِّي يَوْمَ لا ظِلَّ إلَّا ظِلِّي» رواه مسلم.

378. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : ప్రళయదినాన దేవుడు, "నా ఔన్నత్యం ప్రాతిపదికపై పరస్పరం అభిమానించుకున్న వారు ఎక్కడున్నారు? నా (కారుణ్య) నీడ తప్ప మరే నీడా లభించని ఈ రోజు నేను వారికి నా నీడ పట్టున ఆశ్రయం కల్పిస్తాను" అని అంటాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

٣٧٩ - وعنه قال: قال رسولُ اللهِ ﷺ: «وَالَّذي نَفْسي بيَدِهِ! لَا تَدْخُلُوا الجَنَّةَ حَتَّى تُؤْمِنُوا وَلَا تُؤْمِنُوا حَتَّى تَحَابُّوا، أَوَ لا أَدُلُّكُمْ عَلى شَيْءٍ إذَا فَعَلْتُمُوهُ تَحَابَبْتُمْ؟ أَفْشُوا السَّلامَ بينكم» رواه مسلم.

379. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఎవరి చేతిలో నయితే నా ప్రాణముందో ఆయన సాక్షిగా చెబుతున్నాను! మీరు విశ్వసించనంతవరకు స్వర్గంలోకి ప్రవేశించలేరు. అలాగే మీరందరూ (కేవలం దైవం కోసం) పరస్పరం అభిమానించుకోనంత వరకూ (నిజమైన) విశ్వాసులు కాజాలరు. మీ మధ్య అభిమానం పెంపొందాలంటే మీరు ఏం చెయ్యాలో చెప్పనా? 'సలాంను మీ మధ్య సర్వసామాన్యం చేసుకోండి.' (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'సలాం' (అస్సలాము అలైకుమ్ అని అనటం) పరస్పర ప్రేమ భావాన్ని

పెంపొందింపజేస్తుంది. అందుకే పరిచితులైనా, అపరిచితులైనా ప్రతి ఒక్కరికీ సలాం చెయ్యాలని తాకీదు చేయబడింది. కేవలం సలాం చేయటం మూలంగానే విశ్వాసులు అయిపోతారని, స్వర్గంలోకి ప్రవేశిస్తారని దీనర్థం ఎంతమాత్రం కాదు. ఆచరణ లేని విశ్వాసం వల్ల ప్రయోజనం ఉండదని చెప్పటమే ఈ హదీసు ఉద్దేశ్యం. విశ్వాసం మరియు ఆచరణ రెండూ తోడయితేనే మనిషికి స్వర్గభాగ్యం లభించేది!

٣٨٠ ـ وعنه عن النَّبيِّ ﷺ: «أَنَّ رَجُلاً زَارَ أَخاً لَهُ فِي قَرْيَةٍ أُخْرَى، فَأَرْصَدَ الله لَهُ عَلَى مَدْرَجَتِهِ مَلَكاً» وذكر الحديث إلى قوله: «إِنَّ الله قَدْ أَحَبَّكَ كَمَا أَحْبَبْتَهُ فِيهِ» رواه مسلم. وقد سبق بالباب قبله.

380. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం : ఒక వ్యక్తి వేరొక ఊరిలో ఉంటున్న తన సోదరుణ్ణి కలవటానికని బయలుదేరాడు. అది గమనించి దేవుడు అతను వెళ్ళేదారిలో అతని రక్షణ నిమిత్తం ఒక దూతను కూర్చో బెట్టాడు.... (ఈ హదీసు ఇంతకు ముందు కూడా వచ్చింది. అందులో చివరిలో ఈ వాక్యం ఉంది:) నీవు నీ సోదరుణ్ణి దైవప్రసన్నత కోసం ప్రేమించినట్లే దేవుడు కూడా నిన్ను ప్రేమిస్తున్నాడు." (ముస్లిం)

٣٨١ ـ وعن البَرَاءِ بن عَازِبٍ رضي الله عنهما عن النَّبيِّ ﷺ أنه قال في الأَنْصَارِ: «لَا يُحِبُّهُمْ إِلَّا مُؤْمِنٌ، وَلَا يُبْغِضُهُمْ إِلَّا مُنَافِقٌ، مَنْ أَحَبَّهُمْ أَحَبَّهُ اللهُ، وَمَنْ أَبْغَضَهُمْ أَبْغَضَهُ اللهُ» متفقٌ عليه.

381. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : అన్సార్ ముస్లింలను (నిజమైన) విశ్వాసులు అభిమానిస్తారు. కపటులు మాత్రమే వారిని ద్వేషించగలరు. (తెలుసుకోండి!) అన్సార్‌లను అభిమానించిన వారిని దేవుడు అభిమానిస్తాడు. వారిని ద్వేషించినవారిని దేవుడు (కూడా) ద్వేషిస్తాడు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మదీనాలో ఔస్ మరియు ఖజ్‌రజ్ అనే రెండు తెగలుండేవి. ఇస్లాంకు పూర్వం ఈ రెండు తెగల మధ్య ఎల్లప్పుడూ చీటికిమాటికి తగాదాలు, కొట్లాటలు జరుగుతుండేవి. ఇస్లాం

స్వీకరించిన తరువాత ఈ రెండు తెగలవారు ఐకమత్యంతో మెలగటమేగాక ఇతర ప్రాంతాలనుండి మదీనాకు వలస వచ్చిన విశ్వాసుల పట్ల నిరుపమాన ఔదార్యాన్ని ప్రదర్శించారు. అన్సార్‌లు ఇస్లాంకు, ముస్లింలకు, స్వయాన దైవప్రవక్తకు చేసిన సేవలు ఇస్లామీయ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగినవి. వారు అడుగడుగునా దైవప్రవక్తకు సహకరించారు. ఇస్లాం ధర్మ ఔన్నత్యం కోసం తమ సర్వస్వాన్ని ధారపోశారు. వారు ఇస్లాంకు చేసిన ఎనలేని సేవలకు గుర్తింపుగా దేవుడు వారికి 'అన్సార్' (సహాయకులు) అనే కితాబు ఇచ్చాడు. వారి పట్ల అభిమానం కల్గి వుండటం విశ్వాసానికి చిహ్నంగా చేశాడు. వారిని ప్రేమించేవారు, వారిని తమ అభిమానులుగా భావించినవారే నిజమైన విశ్వాసులని, వారిని ద్వేషించేవారు, వారిపట్ల విరోధాన్ని పెంచుకునేవారు కపటులని ప్రకటించాడు.

٣٨٢ ـ وعن مُعاذٍ رضي الله عنه قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقول: «قَالَ اللهُ عَزَّ وَجَلَّ: المُتَحَابُّونَ في جَلاَلِي، لَهُمْ مَنَابِرُ مِنْ نُورٍ يَغْبِطُهُمُ النَّبِيُّونَ وَالشُّهَدَاءُ». رواه الترمذي وقال: حديثٌ حسنٌ صحيحٌ.

382. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించగా తాను విన్నానని హజ్రత్ ముఆజ్ (రజి) తెలియజేశారు : దేవుడు ప్రళయదినాన, "నా ఔన్నత్యం ప్రాతిపదికపై పరస్పరం అభిమానించుకున్న వారు ఎక్కడున్నారు? వారికోసం ప్రవక్తలు, అమరవీరులు సయితం అసూయ చెందేటటువంటి జ్యోతిర్మయ వేదికలు (సిద్ధంగా) ఉన్నాయి" అని అంటాడు.

(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి, హసన్ మరియు సహీహ్‌గా పేర్కొన్నారు.)

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రసన్నత కోసం, దైవధర్మ ఔన్నత్యం కోసం పరస్పరం అభిమానించుకునేవారికి ప్రళయదినాన దేవుని సన్నిధిలో ఎంతో గౌరవప్రదమైన స్థానం లభిస్తుందని చెప్పబడింది. ఇక్కడ దైవప్రవక్తలు వారి గౌరవస్థానాన్ని చూసి ఈర్ష్య చెందుతారంటే వారికి ప్రవక్తల కంటే గొప్ప స్థానం లభిస్తుందని భావం ఎంతమాత్రం కాదు. స్వర్గంలో అందరికంటే గొప్ప స్థానాన్ని పొందేవారు దైవప్రవక్తలే. అందులో ఎలాంటి సందేహం లేదు. అయితే ధర్మం ప్రాతిపదికపై పరస్పరం అభిమానించుకునేవారికి కూడా ఎంతో ఉన్నతస్థానం లభిస్తుంది. దాన్ని చూసి ప్రవక్తలు, అమరవీరులు కూడా అబ్బురపోతారు.

383. హ్జ్రత్ అబూ ఇద్రీస్ ఖౌలానీ (రహ్మాలై) కథనం : నేనొకసారి డెమాస్కస్ లోని మస్జిద్‌కు వెళ్ళాను. అక్కడ నాకు ఓ యువకుడు కనిపించాడు. అతని ముందరి రెండు పళ్ళు మిలమిల మెరిసి పోతున్నాయి. ప్రజలు అతని దగ్గర కూర్చొని తమ మధ్య ఏర్పడే విభేదాలను అతనికి నివేదించుకుంటున్నారు. వాటి విషయంలో ఆయన అభిప్రాయాలను అంగీకరిస్తున్నారు. ఈయన ఎవరని నేను అక్కడున్న వారిని అడిగాను. వారు "ఈయన (దైవప్రవక్త అనుచరులు) ముఆజ్ బిన్ జబల్" అని చెప్పారు.

మరుసటి రోజు నేను పెందలాడే మస్జిద్‌కు చేరుకున్నాను. కాని ఆయన నాకంటే ముందుగానే వచ్చి నమాజ్ చేసుకుంటున్నారు. నేను ఆయన నమాజు ముగించుకునేవరకు ఆగి, తరువాత ఆయనకు ఎదురుగా వెళ్ళి సలాం చేసి, "దైవసాక్షి! దైవం కోసం నేను మిమ్మల్ని అభిమానిస్తున్నాను" అని అన్నాను. దానికి ఆయన "నిజంగా దైవం కోసమే అభిమానిస్తున్నారా?" అని అడిగారు. "దైవసాక్షి! నిజంగా దైవం కోసమే అభిమానిస్తున్నాను" అని అన్నాను నేను. ఆయన మళ్ళీ "నిజంగా నేనా?" అని అడిగారు. నేను "నిజం. దైవసాక్షి!" అని విన్నవించుకున్నాను. అప్పుడు ఆయన నా దుప్పటి కొన పట్టుకొని నన్ను తన వైపుకు లాక్కుని

٣٨٣ ـ وعن أبي إدريسَ الخَوْلانيِّ رَحِمَهُ الله قال: دَخَلْتُ مَسْجِدَ دِمَشْقَ، فإذَا فَتَى بَرَّاقُ الثَّنَايَا وَإذَا النَّاسُ مَعَهُ، فَإذَا اخْتَلَفُوا في شَيْءٍ، أَسْنَدُوهُ إلَيْهِ، وَصَدَرُوا عَنْ رَأيِهِ، فَسَأَلْتُ عَنْهُ، فَقِيلَ: هٰذَا مُعَاذُ بْنُ جَبَلٍ رضي الله عنه، فَلَمَّا كَانَ مِنَ الْغَدِ هَجَّرْتُ، فَوَجَدْتُهُ قَدْ سَبَقَنِي بِالتَّهْجِيرِ، وَوَجَدْتُهُ يُصَلِّي، فَانْتَظَرْتُهُ حَتَّى قَضَى صَلاَتَهُ، ثُمَّ جِئْتُهُ مِنْ قِبَلِ وَجْهِهِ، فَسَلَّمْتُ عَلَيْهِ، ثُمَّ قُلْتُ: وَاللهِ إنِّي لأُحِبُّكَ لِلهِ، فَقَالَ: آللهِ؟ فَقُلْتُ: أَللهِ، فقال: آللهِ؟ فَقُلْتُ: أَللهِ، فَأَخَذَنِي بِحَبْوَةِ رِدَائِي، فَجَبَذَنِي إلَيْهِ، فَقَالَ: أَبْشِرْ، فَإنِّي سَمِعْتُ

రسولَ اللهِ ﷺ يقول: «قال الله تعالى: وَجَبَتْ مَحَبَّتِي لِلْمُتَحَابِّينَ فِيَّ، وَالْمُتَجَالِسِينَ فِيَّ، وَالْمُتَزَاوِرِينَ فِيَّ، وَالْمُتَبَاذِلِينَ فِيَّ» حديث صحيح رواه مالك في الْمُوَطَّأ بإسناده الصَّحيح. قَوْلُهُ: «هَجَّرْتُ» أَيْ: بَكَّرْتُ، وَهُوَ بتشديد الجيم. قوله: «آللهِ، فَقُلْتُ: أَللهِ» الأوَّلُ بهمزة ممدودة لِلاِسْتفهام، والثاني بلا مدٍّ.

"మరయితే ఈ శుభవార్త విని సంతోషించు. దైవప్రవక్త (సల్లం) ఇలా చెబుతుండగా నేను విన్నాను -

"దేవుడు - తన కోసం పరస్పరం అభిమానించుకునేవారిని, తనకోసం ఒకచోట సమావేశమయ్యేవారిని, తన కోసం ఒండొకరిని సందర్శించు కునేవారిని, తన కోసం ఒండొకరిపై ఖర్చుచేసేవారిని తాను తప్పకుండా ప్రేమిస్తానని అంటున్నాడు."

(ఈ హదీసు దృఢమైనది. దీనిని ఇమామ్ మాలిక్ తన గ్రంథం 'మువత్తా'లో పేర్కొన్నారు.)

'హజ్జర్‌తు' అంటే పెందలాడే వెళ్ళటం. 'ఆల్లాహి ఫ ఖుల్‌తు అల్లాహి" ఇందులో మొదటి అల్లాహ్ పదాన్ని దీర్ఘంగా, రెండవ పదాన్ని హ్రస్వంగా పలకాలి. దీర్ఘంగా 'ఆల్లాహి' అని పలికితే అది ప్రశ్నార్థకాన్ని సూచిస్తుంది.

*(ముఅత్తా ఇమామ్ మాలిక్‌లోని కవితా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఏ పనిచేసినా దైవప్రసన్నతను దృష్టిలో పెట్టుకొని చేసేవారు దేవుని అభిమానానికి పాత్రులవుతారు.
2. మనిషికి ఎవరిపట్లనయినా ప్రేమాభిమానాలుంటే ఆ విషయం అతనికి తెలియజేయాలి.
3. ఇతరులు ప్రార్థనలో నిమగ్నులై ఉన్నప్పుడు వారిని కలుసుకోవాలనుకునేవారు, వారు ప్రార్థన ముగించుకునేంతవరకు వేచి ఉండాలి. ప్రార్థన సమయంలో వారికి ఎదురుగా కూర్చోకూడదు. దీనివల్ల వారి ఏకాగ్రతకు భంగం కలిగే అవకాశం ఉంది.

384. హజ్రత్ అబూ కరీమా మిఖ్దాద్ బిన్ మాదీకరిబ్ (రజి)కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు: మనిషికి తన (తోటి) సోదరుని పట్ల అభిమానముంటే, తాను అతన్ని అభిమానిస్తున్నట్లు అతనికి తెలియజెయ్యాలి.

(దీనిని అబూదావూద్ మరియు తిర్మిజీలు ఉల్లేఖించారు. తిర్మిజీ దీనిని ప్రామాణికమైనదిగా ఖరారు చేశారు.)

٣٨٤ ـ عن أَبي كَرِيمَةَ المِقْدَادِ بْنِ مَعْدِيكَرِبَ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «إذا أَحَبَّ الرَّجُلُ أَخَاهُ، فَلْيُخْبِرْهُ أَنَّهُ يُحِبُّهُ» رواه أبو داود، والترمذي وقال: حديثٌ حسنٌ.

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత ప్రకరణం, సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఎదుటివ్యక్తికి తాను అతన్ని అభిమానిస్తున్నట్లు తెలియజేయటంలోని మర్మం ఏమిటంటే, ఈ సంగతి ఎదుటి వ్యక్తికి కూడా తెలిసిపోతుంది. అప్పుడు అతను కూడా మొదటి వ్యక్తిని అభిమానించటం మొదలుపెడతాడు. ఫలితంగా వారి మధ్య స్నేహం ఏర్పడుతుంది. దైవం కోసం చేసే ఈ స్నేహం ధర్మానికి ఎంతగానో ఉపయోగపడుతుంది.

385. హజ్రత్ ముఆజ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఒకసారి తన చెయ్యి పట్టుకొని ఇలా అన్నారు : ఓ ముఆజ్! దైవసాక్షిగా చెబుతున్నాను. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ఇంకా ఓ ముఆజ్! ప్రతి నమాజు తరువాత "అల్లాహుమ్మ అయిన్నీ అలా జిక్రిక, వ షుక్రిక, వ హుస్ని ఇబాదతిక్" (దేవా! నేను నీ ధ్యానం చేయటానికి, నీకు కృతజ్ఞతలు తెలుపుకోవటానికి, తగు రీతిలో నిన్ను ఆరాధించటానికి నాకు సహాయం చెయ్యి) అని చెప్పటం మాత్రం వదలిపెట్టవద్దని నేను నీకు ఉపదేశిస్తున్నాను.) (ఈ హదీసు దృఢమైనది. దృఢమైన ఆధారాలతో

٣٨٥ ـ وعن مُعَاذٍ رضي الله عنه، أَنَّ رسولَ الله ﷺ أَخَذَ بِيَدِهِ وقال: «يَا مُعَاذُ! واللهِ! إنِّي لأُحِبُّكَ، ثُمَّ أُوصِيكَ يَا مُعَاذُ لَا تَدَعَنَّ فِي دُبُرِ كُلِّ صلاةٍ تَقُولُ: اللَّهُمَّ أَعِنِّي عَلَى ذِكْرِكَ وشُكْرِكَ، وَحُسْنِ عِبَادَتِكَ». حديث صحيحٌ، رواه أبو داود والنسائي بإسناد صحيح.

అబూదావూద్ మరియు నసాయీలు దీనిని ఉల్లేఖించారు.)

*(సుననె అబూదావూద్‌లోని విత్ర్ ప్రకరణం, సుననె నసాయీలోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దైవప్రవక్త (స) తాను ముఆజ్ (రజి)ని అభిమానిస్తున్నానన్న సంగతి ఆయనకు తెలియజేసిన తరువాత ఆయనకు ఓ ధర్మాదేశాన్ని బోధించారు. దీనిద్వారా తెలిసేదేమిటంటే దైవం కోసం పరస్పరం అభిమానించుకునేవారు, స్నేహం చేసేవారు ధార్మిక విషయాల్లో ఒండొకరికి సహాయపడుతూ ఉండాలి. పరస్పరం ధర్మాదేశాలను గురించి బోధించుకుంటూ ఉండాలి.

٣٨٦ ـ وعن أَنسٍ رضي الله عنه، أَنَّ رَجُلاً كَانَ عِنْدَ النَّبِيِّ ﷺ فَمَرَّ رَجُلٌ بِهِ، فَقَالَ: يَا رَسولَ اللهِ! إِنِّي لأُحِبُّ هٰذا، فقال له النَّبِيُّ ﷺ: «أَأَعْلَمْتَهُ؟» قَالَ: لا، قَالَ: «أَعْلِمْهُ»، فَلَحِقَهُ، فَقَالَ: إِنِّي أُحِبُّكَ في الله، فَقالَ: أَحَبَّكَ الَّذي أَحْبَبْتَنِي لَهُ. رواه أبو داود بإسنادٍ صحيح

386. హజ్రత్ అనస్ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (స) దగ్గర కూర్చొని ఉండగా ఇంకో వ్యక్తి అతని సమీపం నుండి వెళ్ళాడు. అప్పుడు దైవప్రవక్త దగ్గర కూర్చున్న వ్యక్తి, వెళుతున్న వ్యక్తి వైపు చూపిస్తూ) "దైవప్రవక్తా! నేను ఇతన్ని ప్రేమిస్తున్నాను" అని అన్నాడు. "మరి ఈ విషయం అతనితో చెప్పావా?" అని అడిగారు దైవప్రవక్త (స). అందుకా వ్యక్తి 'చెప్పలేద'న్నాడు. అప్పుడు ఆయన "నువ్వీ సంగతి అతనికి తెలియజెయ్యి" అని ఆదేశించారు. దైవప్రవక్త (స) ఆదేశం విని (తక్షణమే) ఆ వ్యక్తి అతన్ని కలుసుకొని "దైవం కోసం నేను నిన్ను ప్రేమిస్తున్నాను" అని చెప్పాడు. అందుకతను "ఎవరికోసం నువ్వు నన్ను ప్రేమిస్తున్నావో ఆయన కూడా నిన్ను ప్రేమించుగాక!" అని దీవించాడు. (అబూదావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికితీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## 47వ అధ్యాయం

# الْعَبْدَ وَالْحَثُّ عَلَى التَّخَلُّقِ بِهَا وَالسَّعْيِ فِي تَحْصِيلِهَا

# దైవానికిష్టమయిన దాసుని లక్షణాల గురించి, అటువంటి లక్షణాలను అలవరచుకోవటానికి ప్రయత్నించటం గురించి....

قال الله تعالى: ﴿ قُلْ إِن كُنتُمْ تُحِبُّونَ اللَّهَ فَاتَّبِعُونِي يُحْبِبْكُمُ اللَّهُ وَيَغْفِرْ لَكُمْ ذُنُوبَكُمْ وَاللَّهُ غَفُورٌ رَّحِيمٌ ﴾ [آل عمران: ٣١]، وقال تعالى: ﴿ يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا مَن يَرْتَدَّ مِنكُمْ عَن دِينِهِ فَسَوْفَ يَأْتِي اللَّهُ بِقَوْمٍ يُحِبُّهُمْ وَيُحِبُّونَهُ أَذِلَّةٍ عَلَى الْمُؤْمِنِينَ أَعِزَّةٍ عَلَى الْكَافِرِينَ يُجَاهِدُونَ فِي سَبِيلِ اللَّهِ وَلَا يَخَافُونَ لَوْمَةَ لَائِمٍ ذَٰلِكَ فَضْلُ اللَّهِ يُؤْتِيهِ مَن يَشَاءُ وَاللَّهُ وَاسِعٌ عَلِيمٌ ﴾ [المائدة: ٥٤].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"ప్రవక్తా! నీవు ప్రజలకు ఇలా చెప్పు : మీకు నిజంగానే అల్లాహ్ పట్ల ప్రేమ ఉంటే నన్ను అనుసరించండి. అప్పుడు అల్లాహ్ మిమ్మల్ని ప్రేమిస్తాడు. మీ పాపాలను మన్నిస్తాడు. ఆయన అమితంగా క్షమించేవాడూ అనన్యంగా కరుణించేవాడూను." (ఆలి ఇమ్రాన్ : 31)

ఇంకొకచోట ప్రభువు ఇలా సెలవిస్తున్నాడు:

"విశ్వాసులారా! మీలో ఎవరైనా తమ ధర్మంనుడి వైదొలగిపోతే (పోవచ్చు), అల్లాహ్ ఇంకా ఎంతోమందిని సృష్టిస్తాడు. అల్లాహ్ వారిని ప్రేమిస్తాడు. వారు అల్లాహ్‌ను ప్రేమిస్తారు. వారు విశ్వాసుల పట్ల మృదువుగానూ, అవిశ్వాసుల పట్ల కఠినంగానూ ప్రవర్తిస్తారు. అల్లాహ్ మార్గంలో అవిశ్రాంత కృషి చేస్తారు. నిందించే వారి నిందలకు వారు భయపడరు. ఇది అల్లాహ్ అనుగ్రహం. ఆయన దానిని తాను కోరిన వారికి ప్రసాదిస్తాడు. ఆయన అపారమైన సాధన సంపత్తికి యజమాని, సర్వమూ తెలిసినవాడు." (అల్ మాయిదా : 54)

## వివరణ

దేవుడిని అభిమానించేవారు దైవప్రవక్తకు విధేయత చూపుతారు. దైవప్రవక్త చూపిన సంప్రదాయాన్ని అనుసరిస్తారు. ఆయన్ని అనుసరించకుండా, ఆయన విధానానికి విలువ ఇవ్వకుండా దేవుడిని ప్రేమిస్తున్నామని చెప్పుకుంటే అది ఒట్టి బూటకమే అవుతుంది. దేవుడు కూడా తన ప్రవక్తను అనుసరించేవారినే యిష్టపడతాడు. కనుక దైవప్రసన్నతను చూరగొనాలంటే దైవప్రవక్త సంప్రదాయాన్ని అనుసరించటమే ఏకైక మార్గమని గ్రహించాలి.

ఇకపోతే దైవాన్ని అభిమానించేవారు పై రెండవ సూక్తిలో పేర్కొనబడిన గుణగణాలను అలవరచుకోవాలి. విశ్వాసుల పట్ల మృదువుగానూ, అవిశ్వాసుల పట్ల కఠినంగానూ వ్యవహరించాలి. దేవుని మార్గంలో ఎదురయ్యే కష్టాలను, కడగండ్లను సహనస్థయిర్యాలతో ఎదుర్కోవాలి. ఇలాంటి సద్గుణాలను అలవరచుకోకుండా ఎవరూ దైవ సామీప్యాన్ని, ఆయన ప్రసన్నతను పొందలేరు.

387. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) దేవుడు ఇలా అంటున్నాడని తెలియజేశారు :

"ఎవరైనా నా మిత్రుణ్ణి ద్వేషిస్తే నేనతనిపై యుద్ధాన్ని ప్రకటిస్తున్నాను. నా దాసుడు నేను విధించిన పనుల్ని (ఫర్జ్‌లను) నిర్వర్తించి నా సామీప్యం పొందాలనుకుంటే, దాన్ని నేను అన్నింటికన్నా ఎక్కువగా యిష్టపడతాను. (వాటితోపాటు) నా దాసుడు స్వచ్ఛంద ఆరాధనల (నవాఫిల్) ద్వారా కూడా నా సామీప్యాన్ని పొందటానికి కృషి చేస్తూ ఉంటాడు. అది చూసి నేనతన్ని ప్రేమించటం మొదలుపెడతాను. నేను గనక అతన్ని ప్రేమించానంటే నేనతను వినే చెవినైపోతాను, అతను చూసే కన్ను నయిపోతాను, అతను పట్టుకునే చేయినైపోతాను, అతను నడిచే కాలునైపోతాను.

٣٨٧ ـ وعن أبي هريرةَ رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «إنَّ اللهَ تعالى قال: مَنْ عَادَى لِي وَلِيّاً فَقَدْ آذَنْتُهُ بِالحَرْبِ، وَمَا تَقَرَّبَ إليَّ عَبْدِي بِشَيْءٍ أَحَبَّ إليَّ مِمَّا افْتَرَضْتُ عَلَيْهِ، وَمَا يَزَالُ عَبْدِي يَتَقَرَّبُ إليَّ بِالنَّوَافِلِ حَتَّى أُحِبَّهُ، فَإذَا أَحْبَبْتُهُ، كُنْتُ سَمْعَهُ الَّذِي يَسْمَعُ بِهِ، وَبَصَرَهُ الَّذِي يُبْصِرُ بِهِ، وَيَدَهُ الَّتي يَبْطِشُ بِها، وَرِجْلَهُ الَّتي يَمْشِي بِها، وإنْ سَأَلَنِي أَعْطَيْتُهُ، وَلَئِن اسْتَعَاذَنِي لأُعِيذَنَّهُ» رواه البخاري. معنى «آذَنْتُهُ»: أَعْلَمْتُهُ بِأَنِّي مُحَارِبٌ له. وقوله: «اسْتَعَاذَنِي» روي بالباءِ وروي بالنون.

అతను నన్నేదయినా అడిగితే తప్ప కుండా ఇస్తాను. అతను శరణు కోరితే తప్పకుండా నేనతనికి శరణు ఇస్తాను.

*(బుఖారీ)*

'ఆజంతుహూ' అంటే నేనతనితో యుద్ధం ప్రకటిస్తున్నానన్న సంగతి అతనికి తెలియజేస్తాను అని అర్థం. 'ఇస్తఆజనీ' అన్న పదం 'ఇస్తఆజబీ' అని కూడా ఉల్లేఖించబడింది. రెండింటికీ ఒకే అర్థం వస్తుంది.

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దేవుని మిత్రులు (ఔలియా అల్లాహ్) అనదగిన వారిలో ఉండవలసిన లక్షణాలు ఈ హదీసులో పొందుపరచబడ్డాయి. పరిపూర్ణ భక్తీ విశ్వాసాలు కలిగివున్న వ్యక్తి మాత్రమే దేవుని మిత్రుడు (వలీ) అని పిలువబడటానికి అర్హుడు. దివ్య ఖుర్ఆన్‌లో దేవుని మిత్రుల లక్షణాలను గురించి వివరిస్తూ వారు విశ్వాసులు, దైవభక్తిపరులు, ధర్మపరాయణులై ఉంటారని చెప్ప బడింది. దాని ప్రకారం చూస్తే దైవభీతిపరుడైన ప్రతి విశ్వాసి దేవుని మిత్రుడే అవుతాడు. దేవుని మిత్రులంటే ఆకాశం నుండి దిగివచ్చిన వారేమీ కారు. వాళ్ళూ అందరిలాంటి మనుషులే. భక్తీ విశ్వాసాలు తప్ప వారిలో మానవాతీత లక్షణాలేమీ ఉండవు.

కొంతమంది అమాయకులు దేవుని మిత్రులంటే మానవాతీత వ్యక్తులనీ, వారిలో అసామాన్య శక్తులుంటాయనీ, వారు అద్భుతాలు, మహిమలు సృష్టించగలవారయి ఉంటారని తలపోస్తుంటారు. ధర్మంతో ఏమాత్రం సంబంధం లేకుండా, కనీసం తమ శరీర శుభ్రత గురించయినా పట్టించుకోకుండా బజారుల వెంబడి తిరిగే పిచ్చివాళ్ళని పట్టుకొని దేవుని మిత్రులని అంటుంటారు. ఇది ప్రజల మూర్ఖత్వం కాకపోతే ఏమిటి?! మతి స్థిమితం లేని పిచ్చివాళ్లు, ధర్మాదేశాల్ని పట్టించుకోని వాళ్ళు 'ఔలియా అల్లాహ్' ఎలా కాగలగుతారు? వాస్తవానికి దేవుని మిత్రులనదగినవారు దైవాదేశాల్ని, దైవప్రవక్త సంప్రదాయాన్ని తు.చ. తప్పకుండా పాటిస్తారు. దైవభీతి, ధర్మపరాయణతలు మూర్తీభవించిన వ్యక్తిత్వం గలవారయి ఉంటారు. అలాంటి దేవుని ప్రియదాసుల్ని ద్వేషించటం, వారితో వైరాన్ని పెంచుకోవటం దేవునితో శత్రుత్వాన్ని కొని తెచ్చుకోవటంతో సమానం. పరిపూర్ణ విశ్వాసం గలవారు దేవుని దృష్టిలో కూడా ఆదరణీయులుగా పరిగణించబడతారు.

విశ్వాసి దేవుని విధుల్ని పాటిస్తూ, స్వయంగా తన తరపునుండి కూడా (నఫిల్) ఆరాధనలు చేస్తూ దైవసామీప్యాన్ని పొందటానికి కృషి చేస్తూ ఉంటాడు. ఆ విధంగా కృషిచేసి అతను చివరకు దైవప్రసన్నతను చూరగొంటాడు. దేవుడు అతన్ని తన ప్రియదాసుడిగా చేసుకుంటాడు. అతనికి ప్రత్యేక రక్షణ కల్పిస్తాడు. వారి అవయవాల ద్వారా చెడుపనులు జరగకుండా కాపాడ తాడు. ఇక ఆ దాసుడు ఏది విన్నా, ఏది చూసినా, ఏది చేసినా దైవాభీష్టాన్ని దృష్టిలో పెట్టుకునే చేస్తాడు. దేవుడు అసహ్యించుకునే విషయాల జోలికి పోకుండా తన్ను తాను కాపాడుకోగల్గుతాడు. దేవుడు దాసుని కన్ను, చెవి, చెయ్యి, కాలు అయిపోవడమంటే భావం ఇదే!

కాని బహుదైవారాధకులు కొందరు దేవుడు నిజంగానే వలీల చెవులుగా, కళ్ళుగా, కాళ్ళుగా రూపుచెందుతాడని, వారిలో అంతర్లీనమైపోతాడని ఆఖరికి ఈ వలీలే భగవదవతారం ఎత్తుతారని ఈ హదీసుకు వక్రభాష్యం చెబుతుంటారు. ఇలాంటివారు దేవునితోపాటు ఎవరినయినా ప్రార్థించవచ్చని అంటారు. సహాయం అవసరమైనప్పుడు, యా అల్లాహ్ అనే బదులు యా ముహమ్మద్!, యా అలీ! యా హుసైన్! యా అబ్దుల్ ఖాదిర్! అని కూడా అర్థిస్తారు. నిజానికి ఇదంతా మార్గభ్రష్టతే. ఇంకా చెప్పాలంటే ఇది 'షిర్క్' (అంటే దైవానికి ఇతరుల్ని సాటి కల్పించటం)తో సమానం.

ఆరాధనలన్నిటిలో విధులకు (ఫర్జ్‌లకు) ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి. దేవుని విధులను పాటిస్తూ, దైవ సామీప్యాన్ని పొందే మార్గం ఇతర మార్గాలన్నిటికన్నా దేవునికి అత్యంత ప్రియమైనది. ఎందుకంటే ఫర్జ్ ఆరాధనలు ధర్మానికి పునాదుల్లాంటివి. పునాది గట్టిగా లేకపోతే కట్టడం కూడా బలహీనంగానే ఉంటుంది. అదేవిధంగా విధుల్ని నిర్వర్తించకుండా కేవలం నఫిల్ ఆరాధనలు చేస్తే దానివల్ల ఒనగూడే ప్రయోజనం ఏమీ ఉండదు. ఫర్జ్‌లను నిర్వర్తించని వాడు అసలు ముస్లిం అని చెప్పటానికి అనర్హుడు. ఫర్జ్ ఆరాధనల్ని వదలిపెట్టేవారికి ఖుర్‌ఆన్ హదీసుల్లో ఎన్నో హెచ్చరికలు చేయబడ్డాయి. కాని నఫిల్ ఆరాధనల్ని వదలిపెట్టిన వారిని తప్పుపట్టడం జరగదు. అయితే ఫర్జ్‌లతో పాటు నఫిల్ కార్యాలు కూడా పాటిస్తే దాని ప్రయోజనం మరింత ఎక్కువవుతుంది. దైవ సన్నిధిలో గౌరవప్రదమైన స్థానం లభిస్తుంది, అలాంటి వారే దేవుని మిత్రులవుతారు.

దేవుడు తన ప్రియదాసుల ప్రార్థనల్ని తప్పకుండా అంగీకరిస్తాడు. వారు కోరింది ఇవ్వటానికి సదా సిద్ధంగా ఉంటాడు. అయితే ప్రార్థన స్వీకరించబడుతుందంటే తక్షణమే వారు అనుకున్నది జరిగిపోతుందని అర్థం ఎంతమాత్రం కాదు. దేవుడు పరిస్థితుల ఉచితానుచితాలను బట్టి త్వరగాగాని లేదా కొంచెం ఆలస్యంగాగాని వారి ప్రార్థనల్ని స్వీకరిస్తాడన్నదే దాని భావం!

388. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు: దేవుడు తన దాసుణ్ణి ప్రేమించినప్పుడు, "దేవుడు ఫలానా దాసుణ్ణి ప్రేమిస్తున్నాడు కాబట్టి

٣٨٨ ـ وعنه عن النَّبِيِّ ﷺ قال: «إذا أَحَبَّ اللهُ تعالى العَبْدَ، نَادَى جِبْرِيلَ: إنَّ اللهَ تعالى يُحِبُّ فُلاناً، فَأَحْبِبْهُ، فَيُحِبُّهُ جِبْرِيلُ، فَيُنَادِي فِي أَهْلِ السَّمَاءِ: إنَّ اللهَ

يُحِبُّ فُلاناً، فَأَحِبُّوهُ، فَيُحِبُّهُ أَهْلُ السَّمَاءِ، ثُمَّ يُوضَعُ لَهُ القَبُولُ فِي الأَرْضِ» متفق عليه. وفي رواية لمسلم: قال رَسولُ الله ﷺ: «إنَّ اللهَ تعالى إذا أَحَبَّ عَبْداً دَعَا جِبْرِيلَ، فقال: إنِّي أُحِبُّ فُلاناً فَأَحْبِبْهُ، فَيُحِبُّهُ جِبْرِيلُ، ثُمَّ يُنَادِي فِي السَّمَاءِ،

నువ్వు కూడా అతన్ని ప్రేమించు” అని జిబ్రయీల్ దూతకు చెబుతాడు. దైవాదేశం మేరకు జిబ్రయీల్ కూడా ఆ దాసుడ్ని ప్రేమించటం మొదలుపెడతారు. ఆ తరువాత ఆయన నింగినున్న వారి ముందు, “దేవుడు ఫలానా దాసుణ్ణి ప్రేమిస్తున్నాడు. కాబట్టి మీరు కూడా అతడిని ప్రేమించండి” అని అంటారు. దాంతో ఆ దాసుడ్ని నింగినున్న వారు కూడా ప్రేమించడం మొదలుపెడతారు. తరువాత నేలనున్న వారిలోనూ అతనికి ఆదరణ లభిస్తుంది. (బుఖారీ - ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దేవుడు ఏ దాసుడినయినా ప్రేమించినప్పుడు జిబ్రయీల్ దూతను పిలిచి, “నేను ఫలానా దాసుడ్ని ప్రేమిస్తు న్నాను. కనుక నువ్వు కూడా అతన్ని ప్రేమించాలి” అని అంటాడు. దేవుని ఆదేశం విని జిబ్రయీల్ కూడా ఆ వ్యక్తిని ప్రేమించటం మొదలుపెడతారు. ఆ తరువాత నింగినున్న వారితో, “దేవుడు ఫలానా వ్యక్తిని ప్రేమిస్తున్నాడు కనుక మీరు కూడా అతన్ని ప్రేమించండి” అని జిబ్రయీల్ చెబుతారు. దాంతో నింగి నున్నవారూ అతన్ని ప్రేమిస్తారు. తరువాత అతనికి నేలనున్నవారిలోనూ ఆదరణ లభిస్తుంది.

అదేవిధంగా దేవుడు ఏ దాసుడినయినా ద్వేషించినప్పుడు జిబ్రయీల్ దూతను పిలిచి “నేను ఫలానా వ్యక్తిని ద్వేషిస్తు

فَيَقُولُ: إِنَّ اللهَ يُحِبُّ فُلاناً، فَأَحِبُّوهُ فَيُحِبُّهُ أَهْلُ السَّمَاءِ، ثُمَّ يُوضَعُ له القَبُولُ في الأرْضِ، وإذا أَبْغَضَ عَبْداً دَعَا جِبْرِيلَ، فَيَقُولُ: إنِّي أُبْغِضُ فُلاناً، فَأَبْغِضْهُ، فَيُبْغِضُهُ جِبْرِيلُ، ثُمَّ يُنَادِي في أَهْلِ السَّمَاءِ: إنَّ اللهَ يُبْغِضُ فُلاناً، فَأَبْغِضُوهُ، فَيُبْغِضُهُ أَهْلُ السَّمَاءِ ثُمَّ تُوضَعُ له البَغْضَاءُ في الأرْضِ».

న్నాను. కాబట్టి నువ్వు కూడా అతణ్ణి ద్వేషించు" అని అంటాడు. దేవుని ఆజ్ఞ మేరకు జిబ్రయీల్ కూడా అతన్ని ద్వేషిస్తారు. తరువాత ఆయన నింగినున్న వారి ముందు, "దేవుడు ఫలానా వ్యక్తిని ద్వేషిస్తున్నాడు. కాబట్టి మీరు కూడా అతన్ని ద్వేషించండి" అని ప్రకటిస్తారు. దాంతో నింగినున్న వారు కూడా అతన్ని ద్వేషిస్తారు. ఆ తరువాత నేలనున్న వారిలో కూడా అతని పట్ల ద్వేషభావం పుడుతుంది."

*(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దేవుని ప్రియదాసులకు లభించే ప్రతిఫలం ఏమిటో ఈ హదీసులో వివరించబడింది. దేవుని అభిమానానికి పాత్రుడైన వాడు నింగినున్న వారిలోనూ, నేలనున్న వారిలోనూ ఆదరణీయుడిగా పరిగణించబడతాడు. దీనికి విరుద్ధంగా దేవుని ఆగ్రహానికి గురయినవాడికి రెండు లోకాల్లోనూ పరాభవమే మిగులుతుంది. ప్రాపంచిక జీవితంలో ఎవరయినా ప్రేమాభిమానాలకు పాత్రులు కాగలిగారంటే వారి నైజంలో ఉన్న మంచితనం, సాధుస్వభావం మూలంగానే వారు ఆ స్థితికి ఎదిగారని గమనించాలి. అంటే వారు మంచిని మంచిగా, చెడును చెడుగానే తలపోస్తారు. అయితే మనిషి నిరంతరం పాపాలకు పాల్పడుతూపోతే క్రమక్రమంగా అతని నైజం (గుణం, స్వభావం) కూడా మారిపోతుంది. అదేగనక జరిగితే అతడు మంచిని చెడుగా, చెడును మంచిగా నమ్మే నికృష్ట స్థితికి దిగజారుతాడు. అట్టి పరిస్థితిలో లోకంలో అతని నిర్ణయాలకు, అభిప్రాయాలకు విలువ లేకుండా పోతుంది. ఎందుకంటే ఇలాంటి పాపాత్ములు సాధారణంగా సజ్జనులను యిష్టపడరు. దుర్మార్గుడు ఎల్లప్పుడూ దుర్మార్గుల స్నేహాన్నే కోరుకుంటాడు.

٣٨٩ - وعن عائشةَ رضي الله عنها، أنَّ رسولَ الله ﷺ بَعَثَ رَجُلاً عَلَى سَرِيَّةٍ، فَكَانَ يَقْرَأُ لأَصْحَابِهِ في صَلاتِهِمْ، فَيَخْتِمُ بـ ﴿قُلْ هُوَ اللَّهُ أَحَدٌ﴾ فَلَمَّا رَجَعُوا،

398. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (స) ఒకాయన్ని ఒకానొక సైనికపటాలానికి నాయకునిగా నియమించి పంపారు. ఆయన తన

ذَكَرُوا ذٰلِكَ لِرسولِ الله ﷺ فقال: «سَلُوهُ لِأَيِّ شَيْءٍ يَصْنَعُ ذٰلِكَ؟» فَسَأَلُوه، فَقَالَ: لِأَنَّها صِفَةُ الرَّحْمٰنِ، فَأَنَا أُحِبُّ أَنْ أَقْرَأَ بِها، فقال رسولُ اللهِ ﷺ: «أَخْبِرُوهُ أَنَّ اللهَ تعالى يُحِبُّهُ» متفقٌ عليه.

తోటి సైనికులకు నమాజు చేయించి నప్పుడల్లా ఖుర్‌ఆన్ పారాయణం చేసి నప్పుడు చివరగా "ఖుల్‌హువల్లాహు అహద్" (సూరా తప్పకుండా) చదివే వారు. సైనికదళం తిరిగి వచ్చిన తరువాత అందులోని సైనికులు దైవప్రవక్తకు ఈ విషయం చెప్పారు. అందుకాయన "ఆ వ్యక్తి అలా ఎందుకు చేస్తాడో అడగండి" అని అన్నారు. వాళ్ళు ఆయన్ని ఈ విషయం గురించి అడగ్గా, "ఇందులో కరుణామయుని గుణాలు పొందుపరచబడ్డాయి. అందుకే దాన్ని (ఎక్కువగా) చదవటాన్ని నేను యిష్టపడతాను" అని ఆ వ్యక్తి చెప్పాడు. అప్పుడు ఆయన "మరయితే దేవుడు కూడా అతన్ని యిష్టపడుతున్నాడని అతనికి తెలియజేయండి" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ తౌహీద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దేవుని గుణగణాలతో నిండివున్న దివ్య ఖుర్‌ఆన్ సూక్తుల్ని, సూరాల్ని యిష్టపడటం, వాటిని మాటిమాటికీ పఠిస్తూ ఉండటం ద్వారా కూడా దైవాభిమానాన్ని చూరగొనవచ్చు. ఈ హదీసు ద్వారా బోధపడుతున్న మరొక ముఖ్య విషయం ఏమిటంటే, నమాజులోని ప్రతి రకాత్‌లో ఖిరాత్ (దివ్య ఖుర్‌ఆన్ పారాయణం) చేసినప్పుడు చివరగా "ఖుల్‌హువల్లాహు అహద్" సూరా పఠించటం ధర్మసమ్మతమే. ఇందులో షరీఅత్‌పరమైన ఆంక్షలేమీ లేవు.

48వ అధ్యాయం

# ٤٨ - بَابُ التَّحْذِيرِ مِنْ إِيذَاءِ الصَّالِحِينَ وَالضَّعَفَةِ وَالْمَسَاكِينِ

# సజ్జనుల్ని, బలహీనుల్ని, అభాగ్యుల్ని హింసించటం మహా పాపం

قال اللهُ تعالى: ﴿ وَالَّذِينَ يُؤْذُونَ الْمُؤْمِنِينَ وَالْمُؤْمِنَاتِ بِغَيْرِ مَا اكْتَسَبُوا فَقَدِ احْتَمَلُوا بُهْتَانًا وَإِثْمًا مُبِينًا ﴾ [الأحزاب: ٥٨] وقال تعالى: ﴿ فَأَمَّا الْيَتِيمَ فَلَا تَقْهَرْ ۝ وَأَمَّا السَّائِلَ فَلَا تَنْهَرْ ﴾ [الضحى: ٩ ـ ١٠].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

ఏ తప్పూ చేయకపోయినప్పటికీ విశ్వాసులైన స్త్రీ పురుషుల్ని కష్టపెట్టేవారు, ఒక పెద్ద అభాండ భారాన్ని, ఒక బహిరంగ నేరాన్ని తమ నెత్తిన మోపుకున్నట్లే. (అల్ అహ్‌జాబ్ : 57)

ఇంకొకచోట ఆయన ఇలా అన్నాడు :

"నీవు అనాథల పట్ల దురుసుగా ప్రవర్తించకు. యాచకుణ్ణి కసురుకోకు." (అజ్ జుహా : 9,10)

وأما الأحاديث، فكثيرة منها: حديثُ أبي هريرةَ رضي الله عنه في الباب قبل هذا: «مَنْ عَادَى لِي وليّاً فَقَدْ آذَنْتُهُ بِالحَرْبِ». ومنها حديث سعدِ بن أبي وقاصٍ رضي الله عنه السابق في «باب ملاطفة اليَتيم» وقوله ﷺ: «يَا أَبَا! بَكرٍ لَئِنْ كُنْتَ أَغْضَبْتَهُم، لَقَدْ أَغْضَبْتَ رَبَّكَ».

ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసులు చాలా ఉన్నాయి. వాటిలో ఇంతకు ముందు అధ్యాయంలో వచ్చిన, "ఎవరైనా నా దాసుడ్ని ద్వేషిస్తే నేనతనిపై యుద్ధాన్ని ప్రకటిస్తాను" అన్న హదీసు, ఇంకా 'అనాథుల పట్ల మృదువుగా వ్యవహరించాలి' అన్న అధ్యాయంలో "ఓ అబూబక్ర్! నీవు గనక వారి మనసును నొప్పించినట్లయితే దేవుడు కూడా నిన్ను కోపగించుకుంటాడు" అన్న ప్రస్తావన గల సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ హదీసులు ఈ అధ్యాయానికి వర్తిస్తాయి.

390. హజ్రత్ జుందుబ్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ఉద్బోధించారు : ఉదయం (ఫజ్ర్) నమాజు చేసిన వ్యక్తి దేవుని రక్షణలో ఉంటాడు. తన రక్షణ విషయంలో (జోక్యం కల్పించుకున్నారని) దేవుడు మిమ్మల్ని నిలదీసే స్థితి రాకూడదు సుమా! ఎందుకంటే ఆయన ఎవరి నయినా ఏదయినా విషయంలో నిలదీశాడంటే, ఇక అతన్ని పట్టుకొని నరకాగ్నిలో బోర్లాపడేస్తాడు. (ముస్లిం)

٣٩٠ ـ وعن جُنْدُبِ بنِ عبدِ الله رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مَنْ صَلَّى صَلاةَ الصُّبْحِ، فَهُوَ فِي ذِمَّةِ الله، فَلاَ يَطْلُبَنَّكُمُ الله مِنْ ذِمَّتِهِ بِشَيْءٍ، فَإِنَّهُ مَنْ يَطْلُبْهُ مِنْ ذِمَّتِهِ بِشَيْءٍ يُدْرِكْهُ، ثُمَّ يَكُبَّهُ عَلَى وَجْهِهِ فِي نَارِ جَهَنَّمَ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని మస్జిదుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో 'జిమ్మతుల్లాహ్' అనే పదం వాడబడింది. దీనికి 'దేవుని రక్షణ' లేదా 'దేవుని ఒప్పందం' అనే రెండు అర్థాలున్నాయి. కాబట్టి ఈ హదీసుని మనం రెండు విధాలుగా అర్థం చేసుకోవచ్చు. దేవుని రక్షణ అనే అర్థాన్ని తీసుకుంటే దాని ప్రకారం, ఫజ్ర్ (ఉదయం) నమాజు చేసిన వ్యక్తికి దేవుని రక్షణ ఏర్పడుతుంది. అతన్ని రక్షించే బాధ్యత దేవుడు తనపై వేసుకుంటాడు. అలాంటప్పుడు ఆ సత్పురుషుణ్ణి బాధిస్తే దేవుడి రక్షణలో జోక్యం కల్పించుకున్నట్లవుతుంది. ఆ పాపానికి ఒడిగట్టిన వారిని దేవుడు పట్టుకొని శిక్షిస్తాడు.

ఇకపోతే జిమ్మతుల్లాహ్ అనే పదానికి దేవుని రక్షణకు బదులు దైవ ఒప్పందం అనే అర్థాన్ని తీసుకుంటే, అప్పుడు హదీసు భావం ఈ విధంగా ఉంటుంది : ఫజ్ర్ నమాజు చేసిన వ్యక్తి తాను ఇక ఆ రోజల్లా మంచిపనులే చేస్తానని, చెడులకు దూరంగా ఉంటానని దేవునితో ఒప్పందం చేసుకున్నట్లు లెక్క. ఇక ఆ తరువాత అతను తన వాగ్దానాన్ని భంగపరచి చెడు కార్యాలకు పాల్పడితే పరలోకంలో దేవుడు అతన్ని తన ఒప్పందం గురించి నిలదీస్తాడన్నమాట. మొదటి భావాన్ని దృష్టిలో ఉంచుకొని ఈ హదీసును ఈ అధ్యాయం క్రింద ప్రస్తావించటం జరిగింది.

**49వ అధ్యాయం**

# ٤٩ - بَابُ إِجْرَاءِ أَحْكَامِ النَّاسِ عَلَى الظَّاهِرِ وَسَرَائِرُهُمْ إِلَى اللهِ تَعَالَى

# ప్రజలతో వారి బాహ్యాచరణల్ని బట్టి వ్యవహరించాలి, వారి ఆంతరంగిక వ్యవహారాలు దేవుడు చూసుకుంటాడు

قال الله تعالى: ﴿ فَإِن تَابُوا وَأَقَامُوا الصَّلَوٰةَ وَءَاتَوُا الزَّكَوٰةَ فَخَلُّوا سَبِيلَهُمْ ﴾ [التوبة: ٥].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిస్తున్నాడు:

"ఒకవేళ వారు (దైవతిరస్కారులు, బహుదైవా రాధకులు) పశ్చాత్తాపపడితే, నమాజు స్థాపిస్తే, జకాత్ ఇస్తే ఇక వారి మానాన వారిని వదలి పెట్టండి." *(అత్ తౌబా : 5)*

## వివరణ

అవిశ్వాసులెవరైనా తాము గతంలో చేసిన దైవతిరస్కారానికి, బహుదైవారాధనకు పశ్చాత్తాప భావంతో కుమిలిపోతూ ఇస్లాం స్వీకరించి, నమాజ్, జకాత్, ఉపవాసాలు మొదలగు ఇస్లామీయ ఆదేశాల్ని ఆచరించటం మొదలుపెడితే ఇక వారి ధనమాన ప్రాణాలను కాపాడటం తోటి ముస్లింల బాధ్యతగా పరిగణించబడుతుంది. ఒకవేళ వారి విశ్వాసంలో కాపట్యమున్నా లేదా స్వార్థ ప్రయోజనాల కోసం ఇస్లాం స్వీకరించినా పైకి వారు నమాజ్, జకాత్ లాంటి విధులు నిర్వర్తిస్తూ ఉన్నంత కాలం వారిని ముస్లింలుగానే పరిగణించాలి. ఇతర ముస్లింల మాదిరిగా వారి ధనప్రాణాలకూ ఇస్లామీయ రాజ్యంలో రక్షణ కల్పించాలి. ఇస్లాం ధర్మం ప్రజలతో వారి బాహ్య ఆచరణల్ని బట్టి వ్యవహరించమని ఆదేశిస్తోంది. కనుక ఒక వ్యక్తిలో కాపట్యం, అవిశ్వాసం స్పష్టంగా బహిర్గతం కానంతవరకూ అతన్ని కపటిగా, అవిశ్వాసిగా ఖరారు చేయటం తగదు. ఎవరి మనసులో ఏముందో ఎవరు తొంగిచూడగలరు? కనుక వారి అంతర్గత వ్యవహారాన్ని దైవానికి వదలిపెట్టాలి. ఆ విషయాన్ని దేవుడు చూసుకుంటాడు.

అయితే ఎవరైనా నోటితో తాము ఇస్లాం స్వీకరించామని చెప్పి, ధర్మంలోని మౌలిక విషయాలను విశ్వసించటానికి నిరాకరిస్తే మాత్రం వారు ముస్లింలుగా పరిగణించబడటానికి అర్హులు కారు. ఉదాహరణకు దైవప్రవక్త (స) అంతిమ ప్రవక్త అనీ, ఆయనతో ప్రవక్తల

పరంపర సమాప్తమయిపోయిందన్నది ఇస్లాం ధర్మంలోని ప్రధానాంశం. దీనిని అంగీకరించకపోతే మొత్తం ధర్మాన్నే తిరస్కరించినట్లవుతుంది. ఇలాంటి వారికి ఇస్లాంలో ఎలాంటి స్థానం లేదు. ఇంకా చెప్పాలంటే వీరిని ధర్మభ్రష్టులుగా, మార్గవిహీనులుగా పరిగణించాలి.

٣٩١ـ وعن ابن عمرَ رضي الله عنهما، أن رسولَ الله ﷺ قال: «أُمِرْتُ أَنْ أُقَاتِلَ النَّاسَ حَتَّى يَشْهَدُوا أَنْ لا إلهَ إلَّا الله، وَأَنَّ مُحَمَّداً رسولُ الله، وَيُقِيمُوا الصَّلاةَ، وَيُؤْتُوا الزَّكاةَ فَإِذَا فَعَلُوا ذٰلِكَ، عَصَمُوا مِنِّي دِمَاءَهُمْ وَأَمْوَالَهُمْ إلَّا بِحَقِّ الإِسْلامِ، وَحِسابُهُمْ عَلَى الله تعالى» متفقٌ عليه.

391. హ్రజత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : "అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడనీ, ముహమ్మద్ (స) దైవప్రవక్త అనీ ప్రజలు సాక్ష్యం ఇవ్వ నంతవరకూ, (ఆ తరువాత) నమాజ్ స్థాపించి, జకాత్ దానం చెల్లించనంత వరకూ వారితో యుద్ధం చేస్తూ ఉండా లని నాకు ఆదేశ మయింది. వారు ఈ విధులు నెరవేరిస్తే ఇస్లామీయ చట్టాలకు అనుగుణంగా వారి ధనప్రాణాలకు నా నుండి రక్షణ ఉంటుంది. (ఇస్లామీయ చట్టాలకు అనుగుణంగా అంటే వారు ఎవరినన్నా అన్యాయంగా హత్య చేస్తే దానికి ప్రతిగా వారికి కూడా మరణ దండన ఉంటుంది). ఆ తరువాత వారి (అంతర్గత వ్యవహారాల) లెక్కను దేవుడు చూసుకుంటాడు."

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ మరియు సహీహ్ ముస్లింలలోని విశ్వాస ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

ఇస్లాంలో జిహాద్ లక్ష్యం - ఈ ధరిత్రిని దైవతిరస్కార మాలిన్యం నుంచి, బహుదైవత్వ పోకడల నుంచి ప్రక్షాళనం చేయటం. లోకం నుండి అన్యాయాన్ని, అక్రమాలను, దౌర్జన్యాలను పారద్రోలటం. ఈ ఆశయ సిద్ధికోసం ఇస్లాం ధర్మం సదా కృషి చేస్తూ ఉంటుంది. ఈ సమున్నత లక్ష్యం పూర్తిగా నెరవేరనంతవరకు లోకంలో జిహాద్ ప్రక్రియ కొనసాగుతూనే ఉంటుంది. అందుకే ఒక హదీసులో జిహాద్ ప్రళయం వరకు కొనసాగుతుందని చెప్పబడింది. పై హదీసులో 'ప్రజలు' అంటే బహుదైవారాధకులు, విగ్రహ పూజారులని అర్థం చేసుకోవాలి.

ఇస్లాం స్వీకరించే ప్రజల ధనప్రాణాలకు ఇస్లామీయ రాజ్యం రక్షణ కల్పిస్తుంది. వారి సిరిసంపదలకు, ప్రాణాలకు ఎలాంటి హాని జరగకుండా కాపాడుతుంది. అయితే ఇతర ముస్లింలలాగానే క్రొత్తగా విశ్వసించిన వారు కూడా తమ ధనంలో నుండి జకాత్ దానం చెల్లించవలసి ఉంటుంది. వాళ్ళలో ఎవరైనా హత్యకు పాల్పడితే ఇస్లామీయ రాజ్యం హంతకులకు మరణశిక్ష విధిస్తుంది. ఇస్లామీయ చట్టాలు వీరందరికీ సమానంగా వర్తిస్తాయి.

ఇకపోతే ఈ హదీసులో వివరించబడిన ఆఖరి విషయం - క్రొత్తగా ఇస్లాం స్వీకరించే ప్రజలతో, వారి బాహ్య ఆచరణలకు అనుగుణంగానే వ్యవహరించాలి. వారి అంతరంగిక విషయాలను త్రవ్వి చూడాల్సిన అవసరం లేదు. వారి అవిశ్వాసం స్పష్టంగా బహిర్గతం కానంతవరకు వారికి ఎలాంటి హాని తలపెట్టరాదు. వారి మనోమయ వ్యవహారాలను గురించి దైవానికి నివేదించుకోవాలి. దైవానికి నివేదించుకోవటమంటే, ప్రళయదినాన దేవుడు వారి విషయంలో సరైన తీర్పు ఇస్తాడు. వారి రహస్య వ్యవహారాల గురించి ఇతర ముస్లింలను ప్రశ్నించటం జరగదు. ఈ ఆఖరి విషయాన్ని బోధించటం కోసమే గ్రంథకర్త ఈ హదీసును సదరు అధ్యాయం క్రింద ప్రస్తావించారు. దీని ప్రకారం ఒకే దేవుణ్ణి ఆరాధిస్తూ ధర్మంలో అనాచారాలకు పాల్పడే ముస్లింలను అవిశ్వాసులనటం భావ్యం కాదని పండితులు అంటున్నారు.

392. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ తారిఖ్ బిన్ అష్యమ్ (రజి) తెలియజేశారు : అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడులేడని ప్రకటించి, అల్లాహ్‌ను త్రోసిరాజని పూజించబడే ఇతర ఆరాధ్య వస్తువులను తిరస్కరించిన వ్యక్తి ధన ప్రాణాలు (ఇతరుల కోసం) నిషిద్ధం అయిపోతాయి. అతని (లోపలి) వ్యవహారాన్ని దేవుడు చూసుకుంటాడు.

(ముస్లిం)

٣٩٢ ـ وعن أَبي عَبْدِ الله طَارِقِ بنِ أَشْيَمَ رضي الله عنه قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقُولُ: «مَن قال: لا إلهَ إلّا الله، وَكَفَرَ بِمَا يُعْبَدُ مِنْ دُونِ الله، حَرُمَ مَالُهُ وَدَمُهُ، وَحِسابُهُ عَلى الله تعالى» رواه مسلم.

(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)

393. హజ్రత్ అబూ మాబద్ మిఖ్‌దాద్ బిన్ అస్వద్ (రజి) కథనం : ఒకసారి నేను దైవప్రవక్తతో మాట్లాడుతూ, "యుద్ధరంగంలో నాకు ఏ అవిశ్వాసి

٣٩٣ ـ وعن أَبي مَعْبَدِ المِقْدَادِ بن الأسْوَدِ رضي الله عنه، قال: قلتُ لِرسُولِ اللهِ ﷺ: أرَأيْتَ إنْ لَقيتُ رَجُلاً مِنَ

الكُفَّارِ، فَاقْتَتَلْنَا، فَضَرَبَ إِحْدَى يَدَيَّ بِالسَّيْفِ، فَقَطَعَهَا، ثُمَّ لاذَ مِنِّي بِشَجَرَةٍ، فقال: أَسْلَمْتُ لله، أأَقْتُلُهُ يارسولَ الله! بَعْدَ أَنْ قَالها؟ فقَالَ: «لاتَقْتُلْهُ»، فَقُلْتُ: يارَسُولَ الله! قَطَعَ إِحْدَى يَدَيَّ، ثُمَّ قال ذلِكَ بَعْدَ مَا قَطَعَهَا؟! فقال: «لا تَقْتُلْهُ، فَإِنْ قَتَلْتَهُ فَإِنَّهُ بِمَنزِلَتِكَ قَبْلَ أَنْ تَقْتُلَهُ، وَإِنَّكَ بِمَنْزِلَتِهِ قَبْلَ أَنْ يَقُولَ كَلِمَتَهُ الَّتِي قال» متفقٌ عليه. ومعنى «إِنَّهُ بِمَنْزِلَتِكَ» أَيْ: مَعْصُومُ الدَّمِ مَحْكُومٌ بِإِسْلَامِهِ، ومعنى «إِنَّكَ بِمَنْزِلَتِهِ» أَيْ: مُبَاحُ الدَّمِ بِالْقِصَاصِ لِوَرَثَتِهِ، لا أَنَّهُ بِمَنْزِلَتِهِ فِي الْكُفْرِ، والله أعلم.

అయినా ఎదురై మేమిద్దరం పరస్పరం తలపడి పోరాడుకుంటున్నప్పుడు, అతను తన ఖడ్గంతో నా చేయినొకదాన్ని నరికి ఆ తరువాత వెంటనే ఏదో ఒక చెట్టుచాటుకెళ్ళి 'నేను దేవుణ్ణి విశ్వసించాను' అని అన్నాడనుకోండి. అలాంటి వ్యక్తిని నేను హతమార్చవచ్చా?" అని అడిగాను. అందుకాయన (స), "అలాంటి వ్యక్తిని హతమార్చకూడదు" అని అన్నారు. "దైవప్రవక్తా! అతను నా చేయి ఒకటి నరికిన తరువాత కదా అతను ఈ మాట అన్నది!" అని నేను సందేహపడగా, "లేదు, నువ్వతన్ని హతమార్చకూడదు. నువ్వు గనక అతన్ని హతమారిస్తే దానికి పూర్వం నువ్వున్న స్థానంలో అతనుంటాడు. అలాగే ఆ మాట అనకముందు అతనున్న స్థానంలో నువ్వుంటావు" అని హెచ్చరించారు దైవప్రవక్త (స).

*(బుఖారీ - ముస్లిం)*

అతను నువ్వున్న స్థానంలో ఉంటాడంటే, అతని ప్రాణానికి రక్షణ ఏర్పడుతుంది. అతను ముస్లింగా పరిగణించబడతాడని అర్థం. అలాగే నువ్వు అతని స్థానంలో ఉంటావంటే, నీ హత్యకు ప్రతిహత్యగా అతని వారసులు నిన్ను హతమార్చవచ్చని అర్థం. అంతేగాని నువ్వు అవిశ్వాసివి అవుతావని అర్థం మాత్రం కాదు.

*(సహీహ్ బుఖారీలోని యుద్ధాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

394. హ్జ్రత్ ఒసామా బిన్ జైద్ కథనం: దైవప్రవక్త (సల్లం) ఓసారి మమ్మల్ని జుహైనా తెగకు ఉప తెగ అయిన హుర్ఖా వారి వైపు (యుద్ధానికి) పంపించారు. (మరునాడు) ఉదయాన్నే మేము వారి నీటి కొలనులపై దాడిచేశాము. యుద్ధం జరుగుతున్నప్పుడు నేను మరియు ఒక అన్సార్ వ్యక్తి ఇద్దరం కలిసి ఒక అవి శ్వాసితో పోరాడుతూ అతన్ని చుట్టు ముట్టాము. అదే సమయంలో అతను "అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యదేవుడు లేడు" అని అన్నాడు. ఆ మాట వినగానే (నా సహచరుడైన) అన్సార్ వ్యక్తి అతన్ని వదిలేశాడు. కాని నేను మాత్రం నా (చేతిలో వున్న) ఈటెను విసిరి అతన్ని హతమార్చాను.

మేము మదీనాకు తిరిగి వచ్చిన తరువాత దైవప్రవక్త(స)కు ఈ విషయం తెలిసిపోయింది. "ఒసామా! అతను అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడని పలికిన తరువాత కూడా నువ్వతడ్ని వధించావా?" అని ఆయన నన్ను అడిగారు. అందుకు నేను "అతను ప్రాణం కాపాడుకోవటానికే అలా అన్నాడు దైవప్రవక్తా!" అని సంజాయిషీ చెప్పుకున్నాను. కాని ఆయన మళ్ళీ అదే విషయాన్ని ప్రస్తావిస్తూ, "ఒసామా! అతడు అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు

٣٩٤ ـ وعن أُسَامَةَ بنِ زَيْدٍ رضي الله عنهما، قال: بَعَثَنَا رسولُ الله ﷺ، إلى الحُرَقَةِ مِنْ جُهَيْنَةَ، فَصَبَّحْنا القَوْمَ عَلَى مِياهِهِمْ، وَلحِقتُ أنَا وَرَجُلٌ مِنَ الأنْصارِ رَجُلاً مِنْهُمْ، فَلَمَّا غَشِيْناهُ قال: لا إلهَ إلَّا اللهُ، تَكَفَّ عَنْهُ الأَنْصَارِيُّ، وَطَعَنْتُهُ بِرُمْحِي حَتَّى قَتَلْتُهُ، فَلَمَّا قَدِمْنا المَدِينَةَ، بَلَغَ ذلكَ النَّبيَّ ﷺ فقال لي: «يا أُسَامَةُ! أَقَتَلْتَهُ بَعْدَ ما قالَ: لا إلهَ إلَّا اللهُ؟» قلتُ: يا رسولَ الله! إنَّمَا كَانَ مُتَعَوِّذاً، فَقَالَ: «أَقَتَلْتَهُ بَعْدَ مَا قَالَ: لا إلهَ إلَّا اللهُ؟!» فَمَا زَالَ يُكَرِّرُها عَلَيَّ حَتَّى تَمَنَّيْتُ أنِّي لَمْ أَكُنْ أَسْلَمْتُ قَبْلَ ذٰلِكَ اليَوْمِ. متفقٌ عليه. وفي روايةٍ: فَقَالَ رسولُ الله ﷺ: «أَقَالَ: لا إلهَ إلَّا اللهُ، وَقَتَلْتَهُ؟!» قلتُ: يا رسولَ اللهِ! إنَّمَا قَالَهَا خَوْفاً مِنَ السِّلاحِ، قال: «أفَلاَ شَقَقْتَ عَنْ قَلْبِهِ حَتَّى تَعْلَمَ أَقَالَهَا أمْ لا؟!» فَمَا زَالَ يُكَرِّرُهَا حَتَّى تَمَنَّيْتُ أنِّي أَسْلَمْتُ يَوْمَئِذٍ.

«الحُرَقَة» بضم الحاء المهملة وفتح الراء: بَطْنٌ مِنْ جُهَيْنَةَ القَبِيلَةِ المَعْرُوفَةِ. وقوله: «مُتَعَوِّذاً»، أَيْ: مُعْتَصِماً بِهَا مِنَ القَتْلِ، لا مُعْتَقِداً لَهَا.

లేదని అన్న తరువాత కూడా నువ్వతడ్ని వధించావా?" అని నిలదీశారు. ఆ తరువాత కూడా ఆయన మాటిమాటికీ అదే ప్రశ్న వేయటం మొదలెట్టారు. దాంతో (నాకు భయం పుట్టుకొచ్చి) నేను ఆ రోజు వరకు అసలు ముస్లిం అయి ఉండకపోతే బావుండేది కదా! (నా వల్ల ఈ తప్పు జరగకుండా ఉండేది) అని అనుకున్నాను. (బుఖారీ - ముస్లిం)

హుర్ఖా అరబ్బులో ప్రసిద్ధిచెందిన తెగ. ఇది జుహైనా తెగలో ఒక శాఖ. 'ముఅవ్విజన్' అంటే దైవంపై విశ్వాసంతో కాదు, చంపకుండా ఉండటానికి మాత్రమే అతనలా అన్నాడని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని యుద్ధాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

తోటి ముస్లింల పట్ల వారి బాహ్యాచరణల ఆధారంగానే వ్యవహరించాలని ఈ హదీసు కూడా నొక్కి వక్కాణిస్తోంది. బాహ్య ఆచరణల ఆధారంగా వ్యవహరించే విధానం ముస్లిం సమాజానికి అన్ని విధాలా మేలైనది. ఇది ప్రజల ప్రతీకార చర్యలకు అడ్డుకట్ట వేస్తుంది. లేకపోతే ప్రతి వ్యక్తీ ప్రత్యర్థిని ప్రతీకారం తీర్చుకునే ఉద్దేశ్యంతో హత్యచేసి ఆనక 'ప్రాణరక్షణ కోసమే అతను ఇస్లాం స్వీకరించాడ'ని చెప్పే ప్రమాదముంది. అందుకే ఇలాంటి ప్రతీకార చర్యలకు ఆస్కారం లేకుండా ఆదిలోనే అడ్డుకట్ట వేయటం జరిగింది. తోటి ముస్లింల లోపలి వ్యవహారాల్ని త్రవ్వి చూడటం, కూపీలు లాగడం వ్యర్థమైన పని కాకపోతే మరేమిటి?

ఇకపోతే హజ్రత్ ఒసామా (రజి) చేసిన హత్యా నేరానికి ఆయన్నుండి ప్రతీకారం తీర్చుకోకపోవటానికి కారణం ఏమిటంటే ఆయన ఉద్దేశ్యపూర్వకంగా ఆ వ్యక్తిని చంపలేదు. ప్రాణరక్షణ కోసం నోటిమాటల ద్వారా విశ్వాసం ప్రకటించేవారిని వధించవచ్చని ఆయన అనుకున్నారు. ఆ విధంగా పొరపాటుగా ఆయన వల్ల ఈ హత్య జరిగింది. అయితే ఇలాంటి సందర్భంలోనూ హంతకుడు హతుని వారసులకు రక్తపరిహారం (దియత్) చెల్లించవలసి ఉంటుంది.

395. హజ్రత్ జుందుబ్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం : దైవప్రవక్త (స) ఒక ముస్లిం సైనిక పటాలాన్ని కొంతమంది బహుదైవారాధకుల వైపు పంపారు. ఇరుపక్షాల మధ్య పోరు మొదలయింది. ఆ సమయంలో బహుదైవారాధకుడొకడు గురిపెట్టి మరీ ఒక్కొక్క ముస్లింను వధించసాగాడు. అది చూసి ఒక ముస్లిం యోధుడు అదను దొరికితే అతణ్ణి కూడా అలాగే వధించాలని కాచుకొని ఉన్నాడు. ఆ ముస్లిం వ్యక్తి ఒసామా బిన్ జైదే అని మేము చెప్పుకుంటుండగా ఒసామా (రజి) ఆ బహుదైవారాధకుణ్ణి అదుపులోకి తీసుకొని ఒక్క వేటు వేద్దామని ఖడ్గం పైకెత్తేసరికి ఆ బహుదైవోపాసి "అల్లాహ్ తప్ప వేరొక దేవుడు లేడు" అని అన్నాడు. కాని ఆయన (అతని మాటలేవీ పట్టించుకోకుండా) అతన్ని వధించారు. (ఈ యుద్ధంలో ముస్లింలకు విజయం వరించింది.)

ముస్లింలకు విజయం లభించిందన్న శుభవార్తను అందజేయటానికి ఒక వ్యక్తి దైవప్రవక్త (స) సన్నిధికి వెళ్ళాడు. దైవప్రవక్త (స) ఆ వ్యక్తిని యుద్ధ సంగతుల గురించి అడిగారు. ఆ వ్యక్తి అన్ని విషయాలు, ఆఖరికి ఒసామా (రజి) సంఘటన కూడా ఆయనకు వివరించాడు. ఆయన ఒసామా బిన్ జైద్ (రజి)ని పిలిపించి "ఆ వ్యక్తిని హతమార్చావెందుకు?" అని అడిగారు.

٣٩٥ ـ وعن جُنْدُبِ بنِ عبد الله رضي الله عنه، أنَّ رسولَ اللهِ ﷺ، بَعَثَ بَعْثاً مِنَ المُسْلِمِينَ إلى قَوْمٍ مِنَ المُشْرِكِينَ، وأنَّهُمُ الْتَقَوْا، فَكانَ رَجُلٌ مِنَ المُشْرِكِينَ إذا شاءَ أَنْ يَقْصِدَ إلى رَجُلٍ مِنَ المُسْلِمِينَ قَصَدَ لَهُ فَقَتَلَهُ، وَأَنَّ رَجُلاً مِنَ المُسْلِمِينَ قَصَدَ غَفْلَتَهُ، وكُنَّا نَتَحَدَّثُ أَنَّهُ أُسامَةُ بْنُ زَيْدٍ، فَلَمَّا رَفَعَ السَّيْفَ، قال: لا إلهَ إلَّا اللهُ، فَقَتَلَهُ فَجاءَ الْبَشِيرُ إلى رسولِ اللهِ ﷺ فَسَأَلَهُ، وَأَخْبَرَهُ، حَتَّى أَخْبَرَهُ خَبَرَ الرَّجُلِ كَيْفَ صَنَعَ، فَدَعاهُ فَسَأَلَهُ، فقال: «لِمَ

قَتَلْتَهُ؟» فقَالَ: يا رسولَ اللهِ! أَوْجَعَ في المُسْلِمِينَ، وَقَتَلَ فُلاناً وفُلاناً - وسَمَّى له نفراً - وإنِّي حَمَلْتُ عَلَيْهِ، فَلَمَّا رَأى السَّيْفَ قال: لا إلهَ إلَّا اللهُ. قال رسولُ الله ﷺ: «أَقَتَلْتَهُ؟» قال: نَعَمْ، قال: «فَكَيْفَ تَصْنَعُ بلا إلهَ إلَّا اللهُ إذا جاءَتْ يَوْمَ القِيامَةِ؟» قالَ: يا رسولَ اللهِ! اسْتَغْفِرْ لي. قال: «وكَيْفَ تَصْنَعُ بلا إلهَ إلَّا الله إذا جَاءَتْ يَوْمَ القِيامَةِ» فَجَعَلَ لا يَزِيدُ عَلى أَنْ يقُولَ: «كَيْفَ تَصْنَعُ بِلا إلهَ إلَّا اللهُ إذا جَاءَتْ يَوْمَ القِيامَةِ؟» رواه مسلم.

అందుకాయన, "దైవప్రవక్తా! అతను ముస్లింలకు చాలా తిప్పలు పెట్టాడు. ఫలానా, ఫలానా ముస్లింలను వధించాడు. అందుకే అతనిపై ఎగబడ్డాను. కాని నా ఖడ్గం పైకి లేవగానే (ప్రాణ భయంతో) అతను "అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు" అన్నాడు. అయినా నేనతన్ని వదలకుండా కడ తేర్చాను" అని సంజాయిషీ చెప్పుకుంటూ ఆ వ్యక్తి ఎవరెవరిని హత్య చేశాడో పేర్లతో సహా చెప్పారు. కాని దైవప్రవక్త (స) మళ్ళీ అదే మాటను ప్రస్తావిస్తూ "అందుకని నువ్వతన్ని వధించావా?" అని నిలదీశారు. ఒసామా (రజి) 'అవున'న్నారు. "మరి అతనన్న అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడనే మాట ప్రళయదినాన దైవసన్నిధికి వస్తే అప్పుడు నువ్వేం జవాబు చెబుతావు?" అని మందలించారు దైవప్రవక్త (స).

అప్పుడు ఒసామా (రజి) పశ్చాత్తాపంతో, "దైవప్రవక్తా! దేవుడు నాకు క్షమాభిక్ష పెట్టాలని ప్రార్థించండి" అన్నారు. "(అది సరే) ప్రళయదినాన అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడన్న మాట దైవసన్నిధికి వస్తే ఏం చేస్తావ్?" మళ్ళీ మందలింపు ధోరణిలో అడిగారు దైవప్రవక్త (స). ఆయన మాటిమాటికీ ఇదే ప్రశ్న వేస్తూ పోయారుగాని ఇంకేమీ మాట్లాడలేదు.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

٣٩٦ ـ وعن عبدِ الله بنِ عُتْبَةَ بنِ مسعودٍ قال: سَمِعْتُ عُمَرَ بْنَ الخَطَّاب، رضي الله عنه، يقولُ: «إنَّ نَاساً كَانُوا يُؤخَذُونَ بالْوَحْيِ فِي عَهْدِ رسولِ الله ﷺ، وإنَّ الوَحْيَ قَدِ انْقَطَعَ، وإنَّما نَأْخُذُكُمُ الآنَ بما ظَهَرَ لَنَا مِنْ أَعْمَالِكُمْ، فَمَنْ أَظْهَرَ لَنَا خَيْراً، أَمِنَّاهُ وَقَرَّبْنَاهُ، ولَيْسَ لَنَا مِنْ سَرِيرَتِهِ شَيْءٌ، اللهُ يُحاسِبُهُ في سَرِيرَتِهِ، ومَنْ أَظْهَرَ لَنَا سُوءاً، لَمْ نَأْمَنْهُ، ولَمْ نُصَدِّقْهُ وإنْ قالَ: إنَّ سَرِيرَتَهُ حَسَنَةٌ» رواه البخاري.

396. హ్రజత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) చెబుతుండగా తాను విన్నానని హ్రజత్ అబ్దుల్లాహ్ బిన్ ఉత్బా బిన్ మస్ఊద్ (రజి) తెలియజేశారు: "దైవప్రవక్త కాలంలో కొంతమంది (తప్పుచేసిన వారి)ని వహీ (దైవవాణి) ద్వారా నిలదీయటం జరిగేది. కాని ఇప్పుడు వహీ అవతరణ ఆగిపోయింది. (కనుక ఒకరి అంతరంగ స్థితిగతులను గురించి తప్పుపట్టడం ఇప్పుడిక సాధ్యం కాదు). కనుక ఇప్పుడు మీ బాహ్య ఆచరణల ఆధారంగానే మిమ్మల్ని నిలదీస్తాం. ఎవరైతే పైకి మంచిపనులు చేస్తాడో మేమతనికి రక్షణ కల్పిస్తాం. అతణ్ణి చేరదీస్తాం. అతని లోపలి వ్యవహారం గురించి పట్టించుకోవాల్సిన అవసరం మాకు లేదు. దానిని దేవుడు చూసుకుంటాడు. మరెవరైనా పైకి చెడ్డపనులు చేసి మా ఉద్దేశం మంచిదే అన్నాసరే; అతనికి మా రక్షణ ఉండదు. మేమతని మంచితనాన్ని ధృవీక రించము."

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని సాక్ష్యాధారాల ప్రకరణం)*

50వ అధ్యాయం

# ٥٠ ـ بَابُ الْخَوْفِ

# దైవభీతి

قال الله تعالى: ﴿ وَإِيَّٰيَ فَٱرْهَبُونِ ﴾ [البقرة: ٤٠] وقال تعالى: ﴿ إِنَّ بَطْشَ رَبِّكَ لَشَدِيدٌ ﴾ [البروج: ١٢] وقال تعالى: ﴿ وَكَذَٰلِكَ أَخْذُ رَبِّكَ إِذَآ أَخَذَ ٱلْقُرَىٰ وَهِيَ ظَٰلِمَةٌ إِنَّ أَخْذَهُۥٓ أَلِيمٌ شَدِيدٌ ۝ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَةً لِّمَنْ خَافَ عَذَابَ ٱلْأٓخِرَةِ ذَٰلِكَ يَوْمٌ مَّجْمُوعٌ لَّهُ ٱلنَّاسُ وَذَٰلِكَ يَوْمٌ مَّشْهُودٌ ۝ وَمَا نُؤَخِّرُهُۥٓ إِلَّا لِأَجَلٍ مَّعْدُودٍ ۝ يَوْمَ يَأْتِ لَا تَكَلَّمُ نَفْسٌ إِلَّا بِإِذْنِهِۦ فَمِنْهُمْ شَقِيٌّ وَسَعِيدٌ ۝ فَأَمَّا ٱلَّذِينَ شَقُوا۟ فَفِي ٱلنَّارِ لَهُمْ فِيهَا زَفِيرٌ وَشَهِيقٌ ﴾ [هود: ١٠٢ - ١٠٦] وقال تعالى: ﴿ وَيُحَذِّرُكُمُ ٱللَّهُ

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

కేవలం నాకు మాత్రమే భయపడండి.
(అల్ బఖర : 40)

ఇంకొకచోట ఆయన ఇలా అంటున్నాడు :

నిస్సందేహంగా నీ ప్రభువు పట్టు బహుగట్టిది.
(అల్ బురూజ్ : 12)

మరొకచోట ఆయన ఇలా సెలవిస్తున్నాడు :

నీ ప్రభువు ఒక దుర్మార్గపు నగరాన్ని శిక్షించదలిస్తే ఆయన శిక్ష ఇలాగే ఉంటుంది. నిజంగానే ఆయన శిక్ష బహు కఠినమైనది. బహుబాధాకరమైనది. వాస్తవానికి పరలోక శిక్షకు భయపడే ప్రతి మనిషికీ ఇందులో ఒక సూచన ఉంది. అది మానవులందరూ సమావేశమయ్యే రోజు. ఆ రోజు జరిగేదంతా అందరి కళ్ళముందే జరుగుతుంది. మేము ఆ రోజుని తీసుకు రావటంలో ఎక్కువ ఆలస్యమేమీ చెయ్యటం లేదు. దానికోసం ఒక గడువు నిర్ణయించబడి ఉంది. అది వచ్చినప్పుడు దేవుని అనుమతితో ఏమైనా మనవి చేసుకోవటం తప్ప ఆ రోజు నోరెత్తటానికి కూడా ఎవరికీ ధైర్యం ఉండదు. ఆ రోజున దురదృష్టవంతులు కొందరుంటారు. అదృష్టవంతులు కొందరుంటారు. దురదృష్ట వంతులైన వారు నరకానికి పోతారు. (అక్కడి తీవ్రమైన వేడి, దప్పికల వల్ల) వారు అరుస్తూ రొప్పుతూ ఉంటారు. (హూద్ : 102 - 105)

نَفْسَهُۥ﴾ [آل عمران: ٢٨] وقال تعالى: ﴿يَوْمَ يَفِرُّ ٱلْمَرْءُ مِنْ أَخِيهِ ۝٣٤ وَأُمِّهِۦ وَأَبِيهِ ۝٣٥ وَصَٰحِبَتِهِۦ وَبَنِيهِ ۝٣٦ لِكُلِّ ٱمْرِئٍ مِّنْهُمْ يَوْمَئِذٍ شَأْنٌ يُغْنِيهِ﴾ [عبس: ٣٤ ـ ٣٧] وقال تعالى: ﴿يَٰٓأَيُّهَا ٱلنَّاسُ ٱتَّقُوا۟ رَبَّكُمْ ۚ إِنَّ زَلْزَلَةَ ٱلسَّاعَةِ شَىْءٌ عَظِيمٌ ۝١ يَوْمَ تَرَوْنَهَا تَذْهَلُ كُلُّ مُرْضِعَةٍ عَمَّآ أَرْضَعَتْ وَتَضَعُ كُلُّ ذَاتِ حَمْلٍ حَمْلَهَا وَتَرَى ٱلنَّاسَ سُكَٰرَىٰ وَمَا هُم بِسُكَٰرَىٰ وَلَٰكِنَّ عَذَابَ ٱللَّهِ شَدِيدٌ﴾ [الحج: ١، ٢]، وقال تعالى: ﴿وَلِمَنْ خَافَ مَقَامَ رَبِّهِۦ جَنَّتَانِ﴾ [الرحمن: ٤٦] الآيات. وقال تعالى: ﴿وَأَقْبَلَ بَعْضُهُمْ عَلَىٰ بَعْضٍ يَتَسَآءَلُونَ ۝٢٥ قَالُوٓا۟ إِنَّا كُنَّا قَبْلُ فِىٓ أَهْلِنَا مُشْفِقِينَ ۝٢٦ فَمَنَّ ٱللَّهُ عَلَيْنَا وَوَقَىٰنَا عَذَابَ ٱلسَّمُومِ ۝٢٧ إِنَّا كُنَّا مِن قَبْلُ نَدْعُوهُ ۖ إِنَّهُۥ هُوَ ٱلْبَرُّ ٱلرَّحِيمُ﴾ [الطور: ٢٥ـ٢٨] والآيات

ఆయన ఇంకా ఇలా సెలవిస్తున్నాడు :

"దేవుడు తనను గురించి (అంటే తన అప్రసన్నత గురించి) మిమ్మల్ని భయపెడుతున్నాడు." (ఆలి ఇమ్రాన్ : 28)

వేరొకచోట ఆయన ఇలా అన్నాడు:

"ఆ రోజు మనిషి తన సోదరునికీ, తన తల్లికీ, తన తండ్రికీ, తన భార్యకూ, తన సంతానానికీ దూరంగా పరుగెత్తుతాడు. ఆ రోజున వారిలో ప్రతి ఒక్కరికీ తమను గురించి తప్ప ఇతరుల్ని గురించి పట్టించుకోలేని ఆపత్సమయం వస్తుంది." (అబస్ : 34-37)

ఇంకొకచోట ఆయన ఇంకా ఇలా అన్నాడు :

మానవులారా! మీ ప్రభువు ఆగ్రహం నుండి మిమ్మల్ని మీరు రక్షించుకోండి. నిస్సందేహంగా ప్రళయం నాటి భూకంపం మహాభయంకరంగా ఉంటుంది. దానిని మీరు చూసినప్పుడు దాని పరిస్థితి ఎలా ఉంటుందంటే, పాలుపట్టే స్త్రీ పాలు త్రాగుతున్న తన బిడ్డను మరచిపోతుంది, గర్భిణీ గర్భం పడిపోతుంది, ప్రజలు మీకు మత్తులో ఉన్నట్లు కనిపిస్తారు. కాని వాస్తవానికి వారు తాగిన మైకంలో ఉండరు. అల్లాహ్ శిక్షే అంత తీవ్రంగా ఉంటుంది. (అల్ హజ్ : 1,2)

ఆయన ఇంకా ఇలా అన్నాడు :

తన ప్రభువు సన్నిధిలో హాజరుకావలసి ఉంటుందనే భయం కలిగి ఉండే ప్రతి వ్యక్తికి రెండు స్వర్గాలు (తోటలు) లభిస్తాయి. (అర్ రహ్మాన్ : 46)

ఆయన ఇంకా ఇలా అన్నాడు :

స్వర్గవాసులు స్వర్గంలో పరస్పరం (ప్రాపంచిక జీవితంలో జరిగిన) విషయాలను గురించి అడిగి తెలుసుకుంటారు. వారు, "మేము మొదట మా కుటుంబీకుల మధ్య ఉన్నప్పటికీ దైవానికి భయపడేవాళ్ళం. చివరికి దేవుడు

మాపై కనికరం చూపాడు. మమ్మల్ని తీవ్రమైన వడగాలి శిక్ష నుండి రక్షించాడు. మేము గత జీవితంలో ఆయన్నే వేడుకుంటూ ఉండేవాళ్ళం. ఆయన నిజంగానే మహోపకారి మరియు అనంత కరుణామయుడు."

(అత్ తూర్ : 25 - 28)

في الباب كثيرة جداً معلوماتٌ، والغرضُ الإشارةُ إلى بعضها وقد حَصَلَ. وأَما الأحاديث فكثيرةٌ جداً، فنذكرُ مِنها طَرَفاً وبالله التَّوفيقُ:

ఈ అధ్యాయం క్రింద సుప్రసిద్ధమైన సూక్తులు ఇంకా ఎన్నో ఉన్నాయి. వాటిలో కొన్నింటిని మాత్రమే ఇక్కడ ప్రస్తావించాం. ఇకపోతే ఈ అధ్యాయానికి సంబంధించి హదీసులు కూడా చాలా ఉన్నాయి. వాటిలో కొన్నింటిని ఇక్కడ పేర్కొంటున్నాం. ఆ సద్బుద్ధిని ప్రసాదించేవాడు కూడా దేవుడే.

٣٩٧ - عن ابن مسعودٍ رضي الله عنه قال: حدثنا رسولُ الله ﷺ، وهو الصَّادِقُ المصدوقُ: «إنَّ أَحَدَكُمْ يُجْمَعُ خَلْقُهُ في بَطْنِ أُمِّهِ أَرْبَعينَ يَوْماً نُطْفَةً، ثمَّ يَكُونُ عَلَقَةً مِثْلَ ذٰلِكَ، ثُمَّ يَكُونُ مُضْغَةً مِثْلَ ذلِكَ، ثُمَّ يُرْسَلُ المَلَكُ، فَيَنْفُخُ فِيهِ الرُّوحَ، وَيُؤْمَرُ بِأَرْبَعِ كَلِماتٍ: بِكَتْبِ رِزْقِهِ، وَأَجَلِهِ، وَعَمَلِهِ، وَشَقِيٌّ أَوْ سَعِيدٌ.

397. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం : దైవప్రవక్త సత్యమూర్తి. దేవుని సృష్టిచేత తనను సత్యమూర్తి అని పిలిపించుకున్నవారాయన. ఆయన ఇలా ప్రబోధించారు :

"మీలో ప్రతి ఒక్కడూ తన మాతృ గర్భంలో (మొదట) నలభై రోజులదాకా వీర్యపు బిందువు రూపంలో ఉంటాడు. ఆ తరువాత మరో నలభై రోజులపాటు పేరుకుపోయిన రక్తపు ముద్ద ఆకారంలో ఉంటాడు. ఆ తరువాత ఇంకో నలభై రోజులపాటు మాంసపు ముద్దలా ఉంటాడు. ఆ తరువాత దాని దగ్గరికి ఒక దైవదూతను పంపటం జరుగు తుంది. అతను ఆ పిండంలో ప్రాణాన్ని పోస్తాడు. అప్పుడు దాని ఉపాధిని, మరణాన్ని, అతని ఆచరణను, అతను దురదృష్టవం తుడవుతాడా లేక అదృష్ట

فَوَالَّذِي لا إِلٰهَ غَيْرُهُ إِنَّ أَحَدَكُمْ لَيَعْمَلُ بِعَمَلِ أَهْلِ الجَنَّةِ حَتَّى مَا يَكُونُ بَيْنَهُ وَبَيْنَهَا إِلَّا ذِرَاعٌ، فَيَسْبِقُ عَلَيْهِ الكِتَابُ فَيَعْمَلُ بِعَمَلِ أَهْلِ النَّارِ فَيَدْخُلُهَا، وإِنَّ أَحَدَكُمْ لَيَعْمَلُ بِعَمَلِ أَهْلِ النَّارِ حَتَّى مَا يكونُ بَيْنَهُ وَبَيْنَهَا إِلَّا ذِرَاعٌ، فَيَسْبِقُ عَلَيْهِ الكِتَابُ فَيَعْمَلُ بِعَمَلِ أَهْلِ الجَنَّةِ فَيَدْخُلُهَا» متفقٌ عليه.

వంతుడవుతాడా అనే విషయాలను వ్రాసి పెట్టమని ఆ దైవదూతకు ఆజ్ఞ అవుతుంది.

ఏకైక ఆరాధ్యదైవం సాక్షిగా చెబుతున్నాను. నిస్సందేహంగా మీలో ఒకడు స్వర్గానికి గొనిపోయే మంచిపనులు చేస్తూ ఉంటాడు. అతను స్వర్గానికి పోవటానికి ఇంకా ఒక అడుగు దూరమే మిగిలి ఉంటుంది. అంతలో విధివ్రాత అతన్ని మించిపోతుంది. దాంతో అతను నరకానికి గొనిపోయే చెడ్డపనులు చేసి నరకంలో ప్రవేశిస్తాడు. దీనికి భిన్నంగా మీలో ఒకడు నరకానికి గొనిపోయే పనులు చేస్తుంటాడు. ఆఖరికి అతనికీ నరకానికి మధ్య ఒక అడుగు దూరం మాత్రమే మిగిలి ఉంటుంది. అంతలో విధి అతన్ని మించిపోతుంది. ఫలితంగా అతను స్వర్గానికి గొనిపోయే మంచి పనులు చేసి స్వర్గంలోకి ప్రవేశిస్తాడు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విధివ్రాత ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక మనిషి పెరిగి పెద్దయిన తర్వాత మంచివాడవుతాడా లేక చెడ్డవాడవుతాడా, స్వర్గానికి పోతాడా లేక నరకానికి పోతాడా అన్న విషయం దేవుడికి మనిషి పుట్టకముందు నుంచే తెలుసు. దేవుడు తన జ్ఞానంతో ఈ విషయాలన్నిటినీ వ్రాసిపెట్టాడు. దేవుడు విధివ్రాతను ముందుగానే వ్రాసిపెట్టాడంటే ఇక మనిషి గత్యంతరం లేనివాడుగా పుట్టించబడతాడని అర్థం ఎంతమాత్రం కాదు. దేవుడు మనిషికి మంచీచెడుల, ధర్మాధర్మాల విచక్షణా జ్ఞానాన్ని ప్రసాదించాడు. సన్మార్గమేదో, దుర్మార్గమేదో సుస్పష్టంగా విశదపరచాడు. స్వర్గానికి గొనిపోయే మార్గాన్ని, నరకానికి గొనిపోయే మార్గాన్ని చూపించి మనిషి తన బుద్ధిని, విచక్షణా జ్ఞానాన్ని ఉపయోగించుకొని

వాటిలో ఏదో ఒకటి ఎన్నుకునే 'ఎంపిక అధికారాన్ని' కూడా దేవుడు ప్రసాదించాడు. అందుకే దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా అంటున్నాడు : మేము అతనికి మార్గం చూపాం. ఇక అతను కృతజ్ఞతలు తెలిపేవాడయినా కావచ్చు లేదా సత్యాన్ని తిరస్కరించేవాడయినా కావచ్చు. (దహ్ర్ : 3) మరొకచోట అల్ కహఫ్ సూరాలో, "ఇష్టమైనవారు సత్యాన్ని స్వీకరించనూ వచ్చు. యిష్టం లేనివారు దానిని తిరస్కరించనూవచ్చు' అని అంటున్నాడు. దీని ద్వారా విధివ్రాత విషయంలో మనిషి అశక్తుడిగా, గత్యంతరం లేనివాడుగా పుట్టించబడలేదని తెలుస్తోంది.

ఇకపోతే గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మలై) విధివ్రాతకు సంబంధించిన హదీసును 'దైవభీతి' అన్న అధ్యాయం క్రింద ప్రస్తావించటంలోని ఆంతర్యం ఏమిటంటే, మనిషి ఎల్లప్పుడూ దైవానికి భయపడుతూ తనకు విశ్వాస స్థితిలోనే మరణం సంభవించాలని కోరుకుంటూ ఉండాలి. దానికోసం అనువైన పద్ధతుల్ని అవలంబించాలి. వీలైనంతవరకు విశ్వాసాన్ని (ఈమాన్‌ను), దైవభీతిని అంటిపెట్టుకొని ఉండాలి. మనిషి మంచిపని చేయాలనుకుంటే మంచికి మార్గం సుగమం అవుతుందని, అలాగే చెడుపని చేయాలనుకున్నప్పుడు దానికోసం కూడా అనేక మార్గాలు తెరుచుకుంటాయన్న వాస్తవాన్ని గ్రహించి మసలుకోవాలి. అంతేకాదు; ఎట్టి పరిస్థితుల్లోనూ చెడును దరిచేరనీయకూడదు. ఎందుకంటే ఆ స్థితిలోనే అతనికి మరణం సంభవిస్తే జీవితాంతం చేసుకున్న పుణ్యకార్యాలన్నీ బూడిదలో పోసిన పన్నీరయిపోతాయి.

٣٩٨ ـ وعنـــه قـــال: قـــال رسولُ الله ﷺ: «يُؤْتَى بِجَهَنَّمَ يَوْمَئِذٍ لَهَا سَبْعُونَ أَلْفَ زِمَامٍ، مَعَ كُلِّ زِمَامٍ سَبْعُونَ أَلْفَ مَلَكٍ يَجُرُّونَهَا» رواه مسلم.

398. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : ఆ రోజు (అంటే ప్రళయదినాన) నరకాన్ని (అందరి ముందుకు) తీసుకొచ్చినప్పుడు దానికి డెబ్భైవేల కళ్లాలుంటాయి. ప్రతి కళ్లాన్ని డెబ్భైవేలమంది దైవదూతలు పట్టుకొని లాగుతూ ఉంటారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని స్వర్గసుఖాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రళయదినాన నరక దృశ్యం ఎంత భయంకరంగా ఉంటుందో ఈ హదీసులో వర్ణించటం జరిగింది. ఈ స్థితి అగోచర విషయాలకు సంబంధించినది. మానవులెవరూ ఆ భయంకర దృశ్యాన్ని ఊహించనయినా ఊహించలేరు. అయినప్పటికీ దానిని విశ్వసించటం మాత్రం ప్రతి ముస్లిం విధి.

٣٩٩ ـ وعن النُّعْمَانِ بنِ بَشِيرٍ، رضي الله عنهما، قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقول: «إنَّ أهْوَنَ أهْلِ النَّارِ عَذَاباً يَوْمَ القِيَامَةِ لَرَجُلٌ يُوضَعُ في أخْمَصِ قَدَمَيْهِ جَمْرَتَانِ يَغْلِي مِنْهُمَا دِمَاغُهُ مَا يَرَى أنَّ أحَداً أشَدُّ مِنْهُ عَذَاباً، وَإنَّهُ لأهْوَنُهُمْ عَذَاباً» متفق عليه.

399. దైవప్రవక్త (స) ఇలా చెబుతుండగా తాను విన్నానని హజ్రత్ నోమాన్ బిన్ బషీర్ (రజి) తెలియజేశారు : ప్రళయ దినాన నరకవాసుల్లో అతి తేలికపాటి శిక్షననుభవించేవాడి పరిస్థితి ఎలా ఉంటుందంటే, అతని పాదాల క్రింద రెండు నిప్పు రవ్వలు ఉంచబడతాయి. వాటి మంటకు అతని మెదడు కుత కుత ఉడికిపోతూ ఉంటుంది. ఆ శిక్ష అనుభవిస్తున్నవాడు అందరికంటే కఠినమైన శిక్ష తనకే విధించబడుతోందని అనుకుంటాడు. కాని వాస్తవానికి అందరి కన్నా తేలికైన శిక్షననుభవించేది అతనే.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో అలాంటి వ్యక్తికి నిప్పుతో తయారుచేయబడిన చెప్పులు తొడిగించటం జరుగుతుందనీ, దాంతో పొయ్యి మీదున్న కుండ ఉడికినట్లు అతని మెదడు కుత కుత ఉడికిపోతూ ఉంటుందని చెప్పబడింది. మరికొన్ని ఉల్లేఖనాల ద్వారా ఆ వ్యక్తి ఎవరోకాదు, స్వయాన దైవప్రవక్త గారి సొంత బాబాయి అబూ తాలిబ్ అని తెలుస్తోంది. ఈయన దైవప్రవక్త (స)ను బాల్యంలో పెంచిపోషించారు. ప్రవక్త పదవి లభించిన తరువాత కూడా అడుగడుగునా ఆయనకు సహాయపడ్డారు. అవిశ్వాసులకు వ్యతిరేకంగా జీవితాంతం ఆయనకు సహకరించి ఎన్నో కష్టాలను ఎదుర్కొన్నారు. కాని తాను మాత్రం విశ్వాస భాగ్యానికి నోచుకోలేకపోయారు. అందుకే కడకు ఆయన నరకాగ్నికి ఆహుతి కావలసి వచ్చింది.

٤٠٠ ـ وعن سَمُرَةَ بنِ جُنْدُبٍ، رضي الله عنه، أنَّ نبيَّ اللهِ ﷺ قال: «مِنْهُمْ

400. హజ్రత్ సమురా బిన్ జుందుబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : నరకవాసుల్లో కొందరు తమ కాళ్ళ చీలమండల దాకా, మరికొందరు మోకాళ్ళదాకా, ఇంకొందరు

مَنْ تَأْخُذُهُ النَّارُ إِلَى كَعْبَيْهِ، وَمِنْهُمْ مَنْ تَأْخُذُهُ إِلَى رُكْبَتَيْهِ، وَمِنْهُمْ مَنْ تَأْخُذُهُ إِلَى حُجْزَتِهِ، وَمِنْهُمْ مَنْ تَأْخُذُهُ إِلَى تَرْقُوَتِهِ» رواه مسلم. «الحُجْـزَةُ»: مَعْقِـدُ الإِزَارِ تَحْتَ السُّرَّةِ. وَ «التَّرْقُوَةُ» بفتح التاءِ وضمِّ القاف: هِيَ العَظْمُ الَّذِي عِنْدَ ثُغْرَةِ النَّحْرِ، وَللإِنْسَانِ تَرْقُوَتَانِ فِي جَانِبَيِ النَّحْرِ.

నడుందాకా, ఇంకా కొందరైతే రొమ్ము పైభాగందాకా అగ్నిలో చిక్కుకొని ఉంటారు. (ముస్లిం)

'హజ్‌జతున్' అంటే బొడ్డుక్రింద షరాయి తదితర వస్త్రాలు కట్టుకునే మొలభాగం. 'తర్‌ఖూతున్' అంటే కుత్తుక దగ్గరుండే ఎముక. మనిషి రొమ్ముకు ఇరువైపులా రెండు ఎముకలు ఉంటాయి.

*(సహీహ్ ముస్లింలోని స్వర్గసుఖాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

స్వర్గంలో వివిధ అంతస్తులు ఉన్నట్లే నరక శిక్షలో కూడా హెచ్చు తగ్గులుంటాయని ఈ హదీసు తెలుపుతోంది.

٤٠١ ـ وعن ابنِ عمرَ رضي الله عنهما أنَّ رسولَ الله ﷺ قال: «يَقُومُ النَّاسُ لِرَبِّ العَالَمِينَ حَتَّى يَغِيبَ أَحَدُهُمْ فِي رَشْحِهِ إِلَى أَنْصَافِ أُذُنَيْهِ» متفقٌ عليه.

وَ «الرَّشْحُ»: العَرَقُ.

401. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : (ప్రళయదినాన) మానవులు సకల లోకాల ప్రభువు ముందు నిలబడి నప్పుడు (భయాందోళనలతో వారికి చెమట ధారలు కారుతూ ఉంటాయి.) కొంతమంది తమ చెవుల సగభాగం దాకా చెమటలో మునిగిపోయి ఉంటారు. (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని స్వర్గ సుఖాల ప్రకరణం)*

٤٠٢ ـ وعن أنس رضي الله عنه، قال: خَطَبَنَا رسولُ الله ﷺ، خُطْبَةً ما سَمِعتُ مِثْلَهَا قَطُّ، فقال: «لَوْ تَعْلَمُونَ مَا أَعْلَمُ لَضَحِكْتُمْ قَلِيلاً وَلَبَكَيْتُمْ كَثِيراً»، فَغَطَّى أَصْحَابُ رسولِ اللهِ ﷺ وجُوهَهُمْ،

402. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవ ప్రవక్త (స) ఒకసారి మాకో ఉపన్యాసం ఇచ్చారు. అలాంటి ఉపన్యాసం నేనెప్పుడూ వినలేదు. ఆ సందర్భంగా ఆయన ఇలా అన్నారు : నాకు తెలిసిన విషయాలు మీకు గనక తెలిస్తే మీరు

وَلَهُمْ خَنِينٌ. متفقٌ عليه. وفي رواية: بَلَغَ رسولَ اللهِ ﷺ عَنْ أَصْحَابِهِ شَيْءٌ فَخَطَبَ، فقال: «عُرِضَتْ عَلَيَّ الجَنَّةُ وَالنَّارُ، فَلَمْ أَرَ كَالْيَوْمِ في الخَيْرِ وَالشَّرِّ، وَلَوْ تَعْلَمُونَ مَا أَعْلَمُ لَضَحِكْتُمْ قَلِيلاً، وَلَبَكَيْتُمْ كَثِيراً» فَمَا أَتَى عَلَى أَصْحَابِ رسولِ الله ﷺ يَوْمٌ أَشَدُّ مِنْهُ غَطَّوا رُؤُوسَهُمْ وَلَهُمْ خَنِينٌ.

«الخَنِينُ» بالخاءِ المعجمة: هُوَ البُكَاءُ مَعَ غُنَّةٍ وَانْتِشَاقِ الصَّوْتِ مِنَ الأَنْفِ.

చాలా తక్కువగా నవ్వుతారు. ఎక్కువగా విలపిస్తారు. ఆ మాట వినగానే ఆయన అనుచరులు ముఖాలమీద గుడ్డలు కప్పుకున్నారు. కాసేపటికి (లోపలి నుంచి)వారి శోకాలు వినిపించసాగాయి.

*(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దైవప్రవక్తకు తన అనుచరుల గురించి ఒక ఫిర్యాదు అందింది. అప్పుడాయన తమ అనుచరుల్ని ఉద్దేశ్యించి ప్రసంగిస్తూ ఇలా అన్నారు : స్వర్గం మరియు నరకం నాకు కనిపించాయి. నేను ఈ రోజు చూసినంతటి మంచినీ, చెడునూ ఇదివరకెన్నడూ చూడలేదు. ఒకవేళ నాకు తెలిసిన విషయాలు గనక మీకు తెలిస్తే మీరు తక్కువగా నవ్వుతారు, ఎక్కువగా ఏడుస్తారు.

దైవప్రవక్త నుంచి ఆ మాట విన్న తర్వాత అనుచరులకు ఆ రోజు అత్యంత కఠినంగా గడిచింది. వాళ్ళు తలల మీద (గుడ్డలు) కప్పుకొని విలపించటం మొదలుపెట్టారు.

'ఖనీన్' అంటే ఏడుస్తూ ముక్కునుండి శోకాలు తీయటం అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

1. ఈ హదీసు ద్వారా స్వర్గం మరియు నరకం ఎప్పుడో ఉనికిలోకి వచ్చివున్నాయని తెలుస్తోంది. దైవప్రవక్తకు వాటి దర్శనం కూడా చేయించటం జరిగింది.
2. అతిగా నవ్వటం మంచిది కాదు. పరలోకం పట్ల ఏమరుపాటులో ఉన్నవారే, ఎక్కువగా

నవ్వుతారు. కనుక ముస్లిం అయిన వ్యక్తి ఎల్లప్పుడూ సావధానంగా ఉంటూ, పరలోక చింతనలో జీవితం గడపాలి. ఎక్కువగా నవ్వటం వల్ల మనిషి హృదయం నిర్జీవమైపోతుందని మరికొన్ని హదీసులు హెచ్చరిస్తున్నాయి.

3. ఒక విశ్వాసి హృదయం ఎల్లప్పుడూ దైవభీతితో, పరలోక చింతనతో నిండి ఉండాలి.

٤٠٣ ـ وعن المِقْدَادِ رضي الله عنه، قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقُولُ: «تُدْنَى الشَّمْسُ يَوْمَ القِيامَةِ مِنَ الخَلْقِ حَتَّى تَكُونَ مِنْهُمْ كَمِقْدَارِ مِيل» قَالَ سُلَيْمُ بْنُ عَامِرٍ الرَّاوِي عَنِ المِقْدَادِ: فَوَاللهِ! مَا أَدْرِي مَا يَعْنِي بِالْمِيلِ، أَمَسَافَةَ الأَرْضِ أَمِ المِيلَ الَّذِي تُكْتَحَلُ بِهِ العَيْنُ، «فَيَكُونُ النَّاسُ عَلَى قَدْرِ أَعْمَالِهِمْ فِي العَرَقِ، فَمِنْهُمْ مَنْ يَكُونُ إِلى كَعْبَيْهِ، وَمِنْهُمْ مَنْ يَكُونُ إِلى رُكْبَتَيْهِ، وَمِنْهُمْ مَنْ يَكُونُ إِلى حِقْوَيْهِ، وَمِنْهُمْ مَنْ يُلْجِمُهُ العَرَقُ إِلْجَاماً» وَأَشَارَ رسولُ اللهِ ﷺ بِيَدِهِ إِلى فِيهِ. رواه مسلم.

403. దైవప్రవక్త (సల్లం) ఇలా చెబుతుండగా తాను విన్నానని హజ్రత్ మిఖ్దాద్ (రజి) తెలియజేశారు : ప్రళయ దినాన సూర్యుడు సృష్టికి దగ్గర చేయబడతాడు. ఆఖరికి సూర్యునికీ - వారికీ మధ్య ఒక మైలు దూరమే మిగిలి పోతుంది.

మిఖ్దాద్ (రజి) నుండి ఈ హదీసును గ్రహించిన ఉల్లేఖకుడు సులైమ్ బిన్ ఆమిర్ (రజి) ఇలా అంటున్నారు: దైవప్రవక్త (స) ఈ సందర్భంగా 'మీల్' అనే పదాన్ని వాడారు. అయితే మీల్ అంటే మైలు దూరమా లేక కళ్ళకు సుర్మా పెట్టుకోవటానికి ఉపయోగించే పుల్లమాదిరి వస్తువా? దైవసాక్షి! ఆయన ఏ ఉద్దేశ్యంతో 'మీల్' అని అన్నారో నాకు మాత్రం ఖచ్చితంగా తెలియదు. (ఎందుకంటే అరబీలో మీల్ అనే పదానికి రెండో అర్థం కూడా ఉంది.)

"సూర్యుడు అంత సమీపంలో మండుతున్నప్పుడు మానవులు తాము చేసుకున్న కర్మలకనుగుణంగా చెమటలో మునిగిపోయి ఉంటారు. కొంతమంది కాలి చీలమండల దాకా, మరికొందరు మోకాళ్ళదాకా, మరికొందరు నడుందాకా మునిగిపోయి ఉంటారు. మరికొందరికి

చెమట కళ్ళెం వేసినట్లుంటుంది. ఆ సందర్భంగా ఆయన తన నోటివైపు సైగ చేసి చూపించారు. (అంటే నోటి దాకా చెమటలో మునిగిపోయి ఉంటారని భావం). (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని స్వర్గసుఖాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో 'మీల్' అనే పదానికి సరైన అర్థమేమిటో ఉల్లేఖకునికి తెలియలేదు. ఒక మైలు దూరం అనే అర్థం తీసుకున్నప్పటికీ ఆ స్థితిలో మానవులపై సూర్యప్రతాపం ఎంత తీవ్రంగా ఉంటుందో కాస్త ఆలోచించండి! నేటి శాస్త్రవేత్తల అంచనా ప్రకారం సూర్యుడు భూమికి 9 కోట్ల మైళ్ళ దూరంలో ఉన్నాడు. అంతదూరాన ఉన్నప్పటికీ ఎండాకాలంలో ప్రజలు దాని వేడికి మలమల మాడిపోతారు. చెమటపట్టి బట్టలు కూడా తడిసిపోతాయి. మరి అదే సూర్యుడు భూమికి ఒక మైలంత సమీపానికి వచ్చేస్తే ఇక అప్పుడు పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించండి!

٤٠٤ ـ وعن أبي هريرةَ رضيَ الله عنه، أنَّ رسولَ الله ﷺ قال: «يَعْرَقُ النَّاسُ يَوْمَ القِيَامَةِ حَتَّى يَذْهَبَ عَرَقُهُمْ في الأرْضِ سَبْعِينَ ذِرَاعاً، وَيُلْجِمُهُمْ حَتَّى يَبْلُغَ آذَانَهُمْ» متفقٌ عليه. ومعنى «يَذْهَبُ في الأَرْضِ»: ينزل ويغوص.

404. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ప్రళయదినాన మానవులు చెమటలో మునిగిపోయి ఉంటారు. వారి చెమట భూమిలోపల డెబ్భై గజాల దాకా ఇంకిపోయి ఉంటుంది. అది వారికి కళ్ళెం వేస్తుంది (అంటే నోటిదాకా వస్తుంది). ఆ తరువాత చెవుల దాకా వస్తుంది. (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని స్వర్గసుఖాల ప్రకరణం)*

٤٠٥ ـ وعنه قال: كُنَّا مع رسولِ اللهِ ﷺ إذ سَمِعَ وَجْبَةً فقال: «هَلْ تَدْرُونَ مَا هٰذَا؟» قُلْنَا: اللهُ وَرَسُولُهُ أَعْلَمُ. قال: «هٰذَا حَجَرٌ رُمِيَ في النَّارِ مُنْذُ سَبْعِينَ

405. హజ్రత్ అబూ హురైరా (రజి)గారే చేసిన కథనం : ఒకసారి మేము దైవప్రవక్త (స) వెంట ఉండగా ఏదో వస్తువు క్రింద పడ్డట్టు పెద్ద శబ్దం వినిపించింది. అప్పు

خَرِيفاً فَهُوَ يَهْوِي فِي النَّارِ الآنَ حَتَّى انْتَهَى إِلَى قَعْرِهَا، فَسَمِعْتُمْ وَجْبَتَهَا» رواه مسلم.

డాయన మమ్మల్ని ఉద్దేశించి, "ఇప్పుడు వినపడిన శబ్దం ఏమిటో మీకు తెలుసా?" అని అడిగారు. మేము, "దేవునికి, ఆయన ప్రవక్తకే బాగా తెలుసు" అని అన్నాం. "డెబ్భై యేళ్ళ క్రితం ఒక రాయిని నరకంలో పడవేయటం జరిగింది. ఇప్పటివరకూ అది నరకం (కూపం)లో పడుతూనే ఉంది. ఇప్పుడే దాని అడుగు భాగానికి చేరుకుంది. ఇప్పుడు వినపడిన పెద్ద శబ్దం అదే!" అని అన్నారు దైవప్రవక్త (సల్లం).

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని స్వర్గ సుఖాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. నరక కూపమే డెబ్భై సంవత్సరాల లోతు ఉందంటే, అక్కడి శిక్ష ఇంకెంత భయంకరంగా ఉంటుందో ఊహించండి.
2. ఈ హదీసు ద్వారా ప్రవక్త సహచరుల మహిమ వెల్లడౌతోంది. దైవప్రవక్తతో పాటు వాళ్ళు కూడా నరకంలో రాయి పడిన శబ్దం విన్నారు.
3. మానవులు అత్యంత బాధాకరమైన నరక శిక్షకు భయపడి చెడు ఆలోచనలకు, చెడు చేష్టలకు దూరంగా ఉండాలన్నదే ఈ హదీసు ఉద్దేశ్యం.

٤٠٦ ـ وعن عَدِيِّ بنِ حَاتِمٍ رضيَ الله عنه، قال: قال رسولُ الله ﷺ: «مَا مِنْكُمْ مِنْ أَحَدٍ إِلَّا سَيُكَلِّمُهُ رَبُّهُ لَيْسَ بَيْنَهُ وَبَيْنَهُ تَرْجُمَانٌ، فَيَنْظُرُ أَيْمَنَ مِنْهُ، فَلا يَرَى إِلَّا مَا قَدَّمَ وَيَنْظُرُ أَشْأَمَ مِنْهُ، فَلا يَرَى إِلَّا مَا قَدَّمَ، وَيَنْظُرُ بَيْنَ يَدَيْهِ، فَلا يَرَى إِلَّا النَّارَ تِلْقَاءَ وَجْهِهِ، فَاتَّقُوا النَّارَ وَلَوْ بِشِقِّ تَمْرَةٍ» متفقٌ عليه.

406. హజ్రత్ అదీ బిన్ హాతిం (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు : మీలోని ప్రతి ఒక్కరితోనూ అతని ప్రభువు త్వరలోనే (నేరుగా) సంభాషించనున్నాడు. ఆ సమయంలో అతనికి అతని ప్రభువుకు మధ్య ఏ అనువాదకుడూ ఉండడు. అప్పుడు మానవుడు తన కుడివైపు చూస్తాడు. అక్కడ అతనికి తాను అంతకుముందు చేసిన కర్మలే

కనిపిస్తాయి. ఎడమవైపు చూసినా తాను అంతకుముందు చేసిన ఆచరణే కనిపిస్తుంది. ఆ తరువాత అతను ముందువైపు చూస్తాడు. తన ముఖం ముందు నరకాగ్ని (భగభగ) మండుతూ కనిపిస్తుంది. అందుకే (చెబుతున్నాను), ఒక్క ఖర్జూరపు ముక్క (దానం) చేసి అయినా సరే మిమ్మల్ని మీరు నరకాగ్ని బారినుండి కాపాడుకోండి.

*(బుఖారీ - ముస్లిం)*

*(ఈ హదీసు ఇంతకు ముందు కూడా వచ్చింది)*

٤٠٧ ـ وعن أبي ذرٍّ رضي الله عنه، قال: قال رسولُ اللهِ ﷺ: «إنِّي أَرَى مَا لا تَرَوْنَ، أَطَّتِ السَّمَاءُ وَحُقَّ لَهَا أَنْ تَئِطَّ، مَا فِيهَا مَوْضِعُ أَرْبَعِ أَصَابِعَ إلَّا وَمَلَكٌ وَاضِعٌ جَبْهَتَهُ سَاجِداً للهِ تَعَالى، واللهِ! لَوْ تَعْلَمُونَ مَا أَعْلَمُ، لَضَحِكْتُمْ قَلِيلاً، وَلَبَكَيْتُمْ كَثِيراً، وَمَا تَلَذَّذْتُمْ بِالنِّسَاءِ عَلَى الفُرُشِ، وَلَخَرَجْتُمْ إلى الصُّعُدَاتِ تَجْأَرُونَ إلى اللهِ تَعَالى» رواه الترمذي وقال: حديثٌ حسن. وَ «أَطَّتْ» بفتح الهمزة وتشديد الطاءِ، وَ «تَئِطُّ» بفتح التاءِ وبعدها همزة مكسورة، وَالأَطِيطُ: صَوْتُ الرَّحْلِ وَالْقَتَبِ وَشِبْهِهِمَا، وَمَعْنَاهُ: أنَّ كَثْرَةَ مَنْ فِي السَّمَاءِ مِنَ المَلائِكَةِ العَابِدِينَ قَدْ أَثْقَلَتْهَا حَتَّى أَطَّتْ.

407. హజ్రత్ అబూజర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీరు చూడలేని విషయాలు నేను చూస్తున్నాను. ఆకాశం కిక్కిరిసి పోతోంది. కిక్కిరిసిపోక తప్పదు కూడాను! (ఎందుకంటే) అక్కడ నాలుగు అంగుళాల ఖాళీ స్థలమయినా లేకుండా ప్రతిచోటా దైవదూతలు తమ నుదుటితో దైవానికి సాష్టాంగ ప్రణామాలు చేస్తున్నారు. దైవసాక్షి! నాకు తెలిసిన విషయాలు మీకు గనక తెలిస్తే మీరు తక్కువగా నవ్వుతారు. ఎక్కువగా ఏడుస్తారు. (అంతేకాదు) మీరు మీ భార్యల ద్వారా పొందే పడక సుఖాన్ని కూడా విడిచిపెడతారు. దేవుణ్ణి వేడు కుంటూ (కొండల, అడవుల) మార్గాల్లో బయలుదేరుతారు.

(దీనిని తిర్మిజీ ఉల్లేఖించి 'హసన్'గా పేర్కొన్నారు)

وَ «الصُّعُدَاتُ» بضم الصاد والعين: الطُّرُقَاتُ، ومعنى «تَجْأَرُونَ»: تَسْتَغِيثُونَ.

'అత్తత్' (భూత క్రియాపదం) 'తయిత్తు' (వర్తమాన క్రియాపదం) దానినుంచే అతీత్ అనే పదం వస్తుంది. అంబారీ, చవుడోలు లాంటి వస్తువుల శబ్దం అని అర్థం. ఆకాశాన అత్యధిక సంఖ్యలో దూతలు దేవుణ్ణి ఆరాధిస్తూ ఉండటం చేత ఆకాశం కిక్కిరిసినట్లు శబ్దం వస్తోందని దీని భావం. 'సువుదాత్' అంటే దారులు, 'తజ్అరూన్' అంటే శరణును, సహాయాన్ని అర్థిస్తూ అని అర్థం.

*(సునన్ తిర్మిజీలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. మానవులు దైవానికి భయపడుతూ జీవితం గడపాలని ఈ హదీసు నొక్కి వక్కాణించింది. ఒక విశ్వాసి దేవుని గొప్పదనాన్ని ఎంత ఎక్కువగా శ్లాఘిస్తే అంత ఎక్కువగా అతని హృదయంలో దైవభీతి, ధర్మపరాయణతా భావాలు పెంపొందుతాయి. మనిషి దేవుని కారుణ్యం పట్ల ఆశాభావంతో పాటు దైవశిక్ష పట్ల భయంతో జీవితం గడుపుతాడు. ఫలితంగా మంచిపనులు చేస్తూ చెడులకు దూరంగా మసలుకోగల్గుతాడు.
2. ఆకాశాన అత్యధిక సంఖ్యలో దైవదూతలు క్షణం తీరికలేకుండా ఎల్లప్పుడూ దైవం ముందు సాష్టాంగపడి దైవారాధన చేస్తూ ఉంటారు. దైవదూతలు దైవాజ్ఞల్ని ఉల్లంఘించటమనే ప్రసక్తే ఉండదు. అలాంటి దైవదూతలే అంతటి అకుంఠిత దీక్షతో దైవారాధన చేస్తున్నారంటే, ఇక అనునిత్యం దేవుని ఆదేశాలను అతిక్రమించే మానవులు దైవారాధన చేయటం ఎంత అవసరమో ఆలోచించండి! కనుక మనిషి అవిధేయతకు పాల్పడకుండా సత్కార్యాలు చేయటానికి దేవుని సహాయాన్ని అర్థిస్తూ, దుష్కార్యాల బారినుండి ఆయన శరణు వేడుకుంటూ ఉండటం చాలా అవసరం.

٤٠٨ - وعن أَبي بَرْزَةَ - بِرَاءٍ ثُمَّ زَايٍ - نَضْلَةَ بنِ عُبَيْدٍ الأَسْلَمِيِّ رضي الله عنه، قال: قال رسولُ الله ﷺ: «لا تَزُولُ قَدَمَا عَبْدٍ حَتَّى يُسْأَلَ عَنْ عُمُرِهِ فِيمَ أَفْنَاهُ، وَعَنْ عِلْمِهِ فِيمَ فَعَلَ فِيهِ، وَعَنْ مَالِهِ مِنْ أَيْنَ اكْتَسَبَهُ، وَفِيمَ أَنْفَقَهُ، وَعَنْ جِسْمِهِ فِيمَ

408. హజ్రత్ అబూ బర్జా నజ్లా బిన్ ఉబైద్ అస్లమీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ప్రళయదినాన ఈ ఐదు విషయాల గురించి దర్యాప్తు జరగనిదే దాసుడు దైవసన్నిధి నుంచి కదల్లేడు.

1. అతను తన జీవితాయుష్షును ఏ పనుల్లో గడిపాడు? 2. తన జ్ఞానాన్ని దేనికోసం ఉపయోగించాడు? 3. ధనాన్ని ఏ విధంగా సంపాదించాడు? 4. సంపాదించిన ధనాన్ని ఏ పనుల కోసం ఖర్చు పెట్టాడు? 5. (దేవుడు ప్రసాదించిన) శరీరాన్ని ఏ పనుల్లో వినియోగించాడు?

(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి, హసన్ మరియు సహీహ్‌గా పేర్కొన్నారు)

أبلاه» رواه الترمذي وقال: حديث حسن صحيح.

*(సుననె తిర్మిజీలోని ప్రళయ వర్ణన ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. జీవితమనేది మనిషికి దేవుడు ప్రసాదించిన అమూల్య వరం. జీవితంలోని ప్రతి క్షణం ఎంతో విలువైనది. ప్రళయదినాన దేవుడు తాను అనుగ్రహించిన వరాల గురించి లెక్క తీసుకుంటాడు. కనుక మనిషి అమూల్యమైన తన జీవితాన్ని అవిధేయతా మార్గంలో వెచ్చించకూడదు.
2. మనిషి తాను నేర్చుకున్న విద్యకు అనుగుణంగా ఆచరించాడా లేదా అనే విషయం గురించి దేవుని దర్బారులో ప్రశ్నించటం జరుగుతుంది. విద్యార్థి అనేవాడు తాను ఆర్జిస్తున్న జ్ఞానం ద్వారా సృష్టికర్తను గ్రహించగలగాలి. విద్య ద్వారా అతనిలో మంచిని ప్రేమించి, చెడుని విడనాడే విచక్షణా జ్ఞానం పెంపొందాలి. తన విద్య సాటి మానవులకు ప్రయోజనం చేకూర్చాలి. వారిని సన్మార్గంపై నడిపించాలి. అలాంటి జ్ఞానమే ప్రయోజనకరమైన జ్ఞానంగా పరిగణించబడుతుంది. ఇంకా పరలోకంలోనూ అదే ముక్తికి సోపానంగా కూడా పరిణమిస్తుంది.
3. మనిషి ధర్మసమ్మతమైన మార్గాల ద్వారానే డబ్బు సంపాదించాలి. సంపాదించిన ధనాన్ని తిరిగి షరీఅత్ అనుమతించే పనుల్లోనే ఖర్చుపెట్టాలి. అక్రమంగా ఆర్జించటంగాని, దైవాజ్ఞల్ని ఉల్లంఘిస్తూ దుబారాగా డబ్బు ఖర్చుపెట్టడంగాని చేస్తే పరలోకంలో అలాంటి వ్యక్తి నేరస్తుడిగా పరిగణించబడతాడు. దేవుని సన్నిధిలో అతను తన పనులకు జవాబుదారీ వహించవలసి ఉంటుంది. అదేవిధంగా మనిషి శరీరం కూడా దేవుడు ప్రసాదించిందే! కాబట్టి దానిని చెడుపనుల నుండి కాపాడుకోవాలి. తమ శారీరక శక్తిని, సామర్థ్యాన్ని దేవుని ఆదేశాల్ని నిర్వర్తించటం కోసం ఉపయోగించాలి. అందులో ఏమాత్రం నిర్లక్ష్యం వహించినా దేవుడు ప్రళయదినాన నిలదీస్తాడన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి.

మొత్తానికి ఈ హదీసు మానవుడు దైవానికి భయపడుతూ, పరలోకంలో తన కర్మలకు లెక్క చూపవలసి ఉంటుందనే విషయాన్ని దృష్టిలో పెట్టుకొని బాధ్యతాయుతంగా జీవితం గడపాలని ప్రబోధిస్తోంది.

٤٠٩ ـ وعن أبي هريرة رضي الله عنه، قال: قَرَأَ رسولُ اللهِ ﷺ: ﴿ يَوْمَئِذٍ تُحَدِّثُ أَخْبَارَهَا ﴾ ثم قال: «أَتَدْرُونَ مَا أَخْبَارُهَا؟» قالوا: اللهُ وَرَسُولُهُ أَعْلَمُ. قال: «فَإِنَّ أَخْبَارَهَا أَنْ تَشْهَدَ عَلَى كُلِّ عَبْدٍ أَوْ أَمَةٍ بِمَا عَمِلَ عَلَى ظَهْرِهَا تَقُولُ: عَمِلْتَ كَذَا وَكَذَا فِي يَوْمِ كَذَا وَكَذَا، فَهٰذِهِ أَخْبَارُهَا» رواه التِّرمذي وقال: حديثٌ حسنٌ.

409. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : దైవప్రవక్త (స) ఈ సూక్తిని పఠించారు : "ఆ రోజున భూమి తన (పైన సంభవించిన) విశేషాలను వివరిస్తుంది." (జిల్‌జాల్ సూరా)

ఆ తరువాత ఆయన తన సహచరులను, "భూమి వివరించే విశేషాలేమిటో మీకు తెలుసా?" అని అడిగారు. అందుకు సహచరులు "దేవుడు, దైవప్రవక్తకే బాగా తెలుసు" అని విన్నవించుకున్నారు. అప్పుడాయన ఈ విధంగా తెలియజేశారు: దేవుని దాసదాసీలు (అంటే మానవులు) తన వీపుపై చేసిన పనుల గురించి భూమి (ఆ రోజున) సాక్ష్యం చెబుతుంది. నువ్వు ఫలానా రోజు, ఫలానా పని చేశావు కదూ! అని అంటుంది. భూమి విశేషాలను వివరించటమంటే ఇదే! (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు).

*(సుననె తిర్మిజీలోని ప్రళయ వర్ణన ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దేవుడు ప్రళయదినాన భూమికి కూడా మాట్లాడే శక్తిని ప్రసాదిస్తాడు. అప్పుడు అది మానవులు చేసిన పనుల్ని పూసగ్రుచ్చినట్లు వివరిస్తుంది. ప్రతి మనిషికి అతను చేసిన పనుల్ని సమయం, స్థలంతో సహా గుర్తు చేస్తుంది. తను చేసిన మంచిపనులకు లేదా చెడు పనులకు ఆ స్థలమే సాక్షిగా నిలబడుతుంది. కనుక మానవుడికి దాన్ని తిరస్కరించే అవకాశమే లేకుండాపోతుంది. మనిషి ఎంత రహస్యంగా పాపం చేసివున్నా సరే అతను దేవుని లెక్కనుండి మాత్రం తప్పించుకోలేడు.

410. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) తన సహచరులతో మాట్లాడుతూ ఇలా అన్నారు : ప్రళయ శంఖం పూరించేవాడు (దైవదూత) శంఖాన్ని నోటి దగ్గర పెట్టుకొని (పూరించటానికి సిద్ధంగా) ఉన్నాడు. శంఖం పూరించటానికి దేవుని అనుమతి ఎప్పుడు లభిస్తుందా అని చెవులు రిక్కించి మరీ ఎదురు చూస్తు న్నాడు. మరి అలాంటప్పుడు నేను నవ్వుతూ, త్రుళ్ళుతూ ఎలా ఉండ గలను?!" ఆ మాట వినగానే సహచ రులు భయంతో వణికిపోయారు. అది గమనించి దైవప్రవక్త "(భయపడకండి) హస్బునల్లాహు వనీమల్ వకీల్ (మాకు దేవుడున్నాడు. ఆయన శ్రేష్ఠమైన కార్యసాధకుడు) అని అనండి" అంటూ వారికి ధైర్యం చెప్పారు.

(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్'గా పేర్కొన్నారు)

دیవ్య ఖుర్ఆన్‌లో "ప్రళయదినాన శంఖం పూరించబడుతుందని" చెప్ప బడిన శంఖమే ఈ హదీసులోని శంఖం కూడాను. శంఖం గురించి దైవప్రవక్త (స) కూడా ఇలాగే వివరించారు.

٤١٠ - وعن أَبي سعيدٍ الخُدْرِيِّ رضي الله عنه، قال: قال رسولُ الله ﷺ: «كَيْفَ أَنْعَمُ وَصَاحِبُ الْقَرْنِ قَدِ الْتَقَمَ الْقَرْنَ، وَاسْتَمَعَ الإِذْنَ مَتَى يُؤْمَرُ بِالنَّفْخِ فَيَنْفُخُ» فَكَأَنَّ ذٰلِكَ ثَقُلَ عَلَى أَصْحَابِ رسولِ اللهِ ﷺ، فقال لَهُمْ: «قُولُوا: حَسْبُنَا الله وَنِعْمَ الْوَكِيلُ» رواه الترمذي وقال: حديثٌ حسنٌ. «الْقَرْنُ»: هُوَ الصُّورُ الَّذِي قال الله تعالى: ﴿وَنُفِخَ فِي ٱلصُّورِ﴾ كَذَا فَسَّرَهُ رسولُ الله ﷺ.

*(సుననె తిర్మిజీలోని వ్యాఖ్యానాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (స) మరియు ఆయన సహచరుల వల్ల సాధారణంగా తప్పులు జరిగేవి కావు. ఆ మహానుభావులు పాపాలకు పాల్పడకుండా ఉండటానికి శాయశక్తులా

ప్రయత్నించేవారు. మానవ సహజమైన దౌర్బల్యం వల్ల ఏదైనా తప్పు జరిగిపోతే వెంటనే పాపభీతితో నిలువెల్లా కంపించిపోయేవారు. అంతేకాదు, తమవల్ల జరిగిన వెనుకటి పాపాలన్నిటినీ మన్నించేశానని దేవుడు ప్రకటించినప్పటికీ, తమ ముందు ఎప్పుడైనా పరలోక ప్రస్తావన వస్తే, భయంతో వణికిపోయేవారు. కాని నేడు మనం పీకల దాకా పాపాల్లో కూరుకుపోయి ఉన్నాం. రేయింబవళ్ళలో ఎన్నో దైవాజ్ఞల్ని, దైవవిధులను నిర్లక్ష్యం చేస్తుంటాం. అయినా గాని మన హృదయాలలో దైవభీతి, పరలోక చింతన మచ్చుకైనా కానరాదు. మనలో రోజురోజుకీ పాపభీతి నశించిపోతోంది. మనం దీని గురించి ఆత్మ పరిశీలన చేసుకోవాల్సిన అవసరం నేడు ఎంతైనా ఉంది.

٤١١ ـ وعن أبي هريرة رضي الله عنه، قال: قال رسولُ الله ﷺ: «مَنْ خَافَ أَدْلَجَ، وَمَنْ أَدْلَجَ بَلَغَ المَنْزِلَ. أَلا إِنَّ سِلْعَةَ اللهِ غَالِيَةٌ، أَلا إِنَّ سِلْعَةَ اللهِ الجَنَّةُ» رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

وَ «أَدْلَجَ» بإسْكان الدَّال، ومعناه: سَارَ مِنْ أَوَّلِ اللَّيْلِ، وَالمُرَادُ: التَّشْمِيرُ في الطَّاعَة. والله أعلم.

411. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు: భయపడినవాడు తెల్లవారక ముందే బయలుదేరుతాడు. తెల్లవారక ముందే బయలుదేరినవాడు గమ్యానికి చేరుకుంటాడు. జాగ్రత్తగా వినండి! అల్లాహ్ బేరం ఎంతో విలువైనది. ఇంకా జాగ్రత్తగా వినండి! అల్లాహ్ బేరమంటే స్వర్గమే సుమా!

(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు)

'అద్‌లజ' అంటే వేకువ జామున బయలుదేరటం. దైవాజ్ఞల్ని శిరసావహించటంలో త్వరపడటమని ఇక్కడ దాని భావం.

*(సుననె తిర్మిజీలోని ప్రళయ వర్ణన ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దైవప్రవక్త (స) పరలోక చింతనతో జీవితం గడిపే ఒక విశ్వాసిని, శత్రువు దాడి నుండి కాపాడుకోవటానికి తెల్లవారకముందే బయలుదేరే బాటసారితో పోల్చారని ఇమామ్ తీబి (రహ్మాలై) అభిప్రాయపడ్డారు. షైతాన్ విశ్వాసిని భ్రష్టుపట్టించటానికి అవకాశం కోసం ఎదురుచూస్తూ ఉంటాడు. మరోవైపు మనిషి మనసులోని చాంచల్యం, అతని మనోవాంఛలు కూడా షైతాన్‌కు దోహదం చేస్తాయి. మనిషి గనక ఈ పరలోక ప్రయాణంలో కడు జాగరూకతతో

వ్యవహరిస్తూ, తన ఆచరణల్లో చిత్తశుద్ధిని కాపాడుకుంటే అతను షైతాన్ వలలో చిక్కుకోకుండా నిక్షేపంగా గమ్యానికి చేరుకుంటాడు.

ఈ పరలోక ప్రయాణం ఏమంత సులభమైన పని కాదు. ఈ మార్గంలో ఎన్నో వ్యయప్రయాసలకు ఓర్చుకోవలసి ఉంటుంది. దేవుడు విశ్వాసులకు ప్రసాదించే స్వర్గం ఓ అమూల్య వరం. మనిషి తన ధనప్రాణాలను దైవం కోసం త్యాగం చేయనంతవరకు ఆ అమూల్య వరాన్ని పొందలేడు.

"విశ్వాసుల నుండి అల్లాహ్ వారి ప్రాణాలనూ, వారి సంపదలను స్వర్గానికి బదులుగా కొన్నాడు." (అత్ తౌబా : 111వ సూక్తి)

٤١٢ ـ وعن عائشةَ رضي الله عنها، قالت: سمعتُ رسولَ اللهِ ﷺ يقول: «يُحْشَرُ النَّاسُ يَوْمَ القِيَامَةِ حُفَاةً عُرَاةً غُرْلاً» قُلْتُ: يا رسولَ الله! الرِّجَالُ وَالنِّسَاءُ جَمِيعاً يَنْظُرُ بَعْضُهُمْ إلى بَعضٍ!؟ قال: «يَا عَائِشَةُ! الأَمرُ أَشَدُّ مِنْ أَنْ يُهِمَّهُمْ ذلِكَ». وفي روايةٍ: «الأَمرُ أَهَمُّ مِنْ أَنْ يَنْظُرَ بَعْضُهُمْ إلى بَعْضٍ» متفقٌ عليه.

«غُرْلاً» بضَمِّ الغَيْنِ المُعْجَمَةِ، أي: غَيْرَ مَخْتُونِينَ.

412. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : ఒకసారి దైవప్రవక్త (స) "ప్రళయదినాన మానవులు (హష్ర్ ప్రదేశంలో) బోసి పాదాలతో, నగ్న శరీరాలతో, వడుగులు చేయ బడనివారుగా సమీకరించబడతారు" అని చెప్పారు. అది విని నేను ఆశ్చర్యపోతూ "దైవ ప్రవక్తా! ఆ స్థితిలో స్త్రీ పురుషులు ఒకర్నొకరు చూసుకుంటారా?" అని అడిగాను. దానికాయన "ఆయిషా! ఆ స్థితి మహా ఆందోళనకరంగా ఉంటుంది. కనుక ఆ సమయంలో వారికి ఒకర్నొకరు చూసుకోవాలనే ఆలోచనే ఉండదు" అని అన్నారు. వేరొక ఉల్లేఖనం ప్రకారం "ఆ పరిస్థితి ఒకర్నొకరు చూసుకోలేనంత తీవ్రంగా ఉంటుంది" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

'గుర్లన్' అంటే వడుగులు చేయబడని వారుగా అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని స్వర్గ సుఖాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రళయదినాన హష్ర్ స్థలంలో మానవులు భయాందోళనకరమైన పరిస్థితుల్ని ఎదుర్కోవలసి ఉంటుందని ఈ హదీసు హెచ్చరిస్తోంది. కనుక విశ్వాసులు పరలోకంలో దైవం ముందు తాము చేసివచ్చిన పనులకు జవాబుదారీ వహించవలసి ఉంటుందని గ్రహించాలి. దైవసన్నిధిలో హాజరుకాకముందే తమ ఆచరణలకు జవాబు చెప్పుకోవటానికి అన్నివిధాలా సిద్ధంగా ఉండాలి. ఒక్క క్షణమైనా పరలోకం పట్ల ఏమరుపాటు తగదు. ఆ రోజు ఎదురయ్యే పరాభవం, అవమానాల నుండి కాపాడుకోవటానికి ఇహలోకంలో భక్తి విశ్వాసాలతో కూడిన జీవితం గడపాలి. దీనికి భిన్నంగా దైవం పట్ల, పరలోకం పట్ల ఏమాత్రం భయం లేకుండా, నిర్లజ్జగా బ్రతికేవారు ఎలాంటి ఘాతుకాలకయినా ఒడిగడతారు. దేవుడు విధించిన హద్దుల్ని చాలా సులువుగా అతిక్రమిస్తారు. అయితే అలాంటి వారు తమ కోసం దైవశిక్ష ఎల్లప్పుడూ మాటేసి ఉంటుందని గ్రహించాలి.



## 51వ అధ్యాయం

# ٥١ ـ بَابُ الرَّجَاءِ

# దైవ కారుణ్యం పట్ల ఆశాభావం

قال الله تعالى: ﴿قُلْ يَٰعِبَادِيَ الَّذِينَ أَسْرَفُوا عَلَىٰٓ أَنفُسِهِمْ لَا تَقْنَطُوا مِن رَّحْمَةِ اللَّهِ إِنَّ اللَّهَ يَغْفِرُ الذُّنُوبَ جَمِيعًا إِنَّهُ هُوَ الْغَفُورُ الرَّحِيمُ﴾ [الزمر: ٥٣] وقال تعالى: ﴿وَهَلْ نُجَٰزِيٓ إِلَّا الْكَفُورَ﴾ [سبأ: ١٧] وقال تعالى: ﴿إِنَّا قَدْ أُوحِيَ إِلَيْنَآ أَنَّ الْعَذَابَ عَلَىٰ مَن كَذَّبَ وَتَوَلَّىٰ﴾ [طه: ٤٨] وقال تعالى: ﴿وَرَحْمَتِي وَسِعَتْ كُلَّ شَيْءٍ﴾ [الأعراف: ١٥٦].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

(ప్రవక్తా) దేవుడు ఇలా అంటున్నాడని చెప్పు : తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్న ఓ నా దాసులారా! అల్లాహ్ కారుణ్యం పట్ల నిరాశ చెందకండి. నిశ్చయంగా అల్లాహ్ పాపాలన్నింటినీ క్షమిస్తాడు. నిశ్చయంగా ఆయన క్షమించే వాడు, కరుణించే వాడూను.

*(అజ్ జుమర్ : 53)*

ఇంకొకచోట ఆయన ఇలా అంటున్నాడు :

"కృతఘ్నుడైన మానవునికి తప్ప ఇటువంటి (చెడు) ప్రతిఫలాన్ని మేము మరెవ్వరికీ ఇవ్వము." (సబా : 17)

మరోచోట ఆయన ఇలా సెలవిస్తున్నాడు :

"తిరస్కరించి విముఖుడయ్యే వానికి శిక్ష ఉంది' అని మాకు వహీ ద్వారా తెలుపబడింది" అంటూ మూసా మరియు హారూన్ (అలైహిముస్సలాం) ఫిరౌన్‌కు తెలియజేశారు. (తాహా : 48)

వేరొకచోట ఆయన ఇలా అన్నాడు :

నా కారుణ్యం ప్రతి వస్తువునీ ఆవరించి ఉంది. (అంటే ఇహలోకంలో నేను అందరినీ కరుణిస్తాను. పరలోకంలో మాత్రం ఈ కారుణ్యం నా పట్ల భయభక్తులు గలవారికే ప్రత్యేకం).

*(ఆరాఫ్ : 156)*

### వివరణ

పైన పేర్కొనబడిన దివ్యఖుర్‌ఆన్ సూక్తుల్లో ఒక వైపు ప్రజల్ని పరలోక శిక్ష గురించి భయపెట్టడంతోపాటు మరో వైపు దైవ కారుణ్యం పట్ల వారికి ఆశాభావమూ కలిగించటం

జరిగింది. జీవితమంతా పాపాలపై పాపాలకు ఒడిగడుతూ చివరికి అవిశ్వాస స్థితిలోనే తనువు చాలించే దురదృష్టవంతులకు పరలోకంలో నరకయాతన ఎటూ తప్పదు. కాని గతంలో ఎన్ని పాపాలు చేసినప్పటికీ కనీసం జీవితపు చివరి దశలోనయినా తమ పాపాలపై పశ్చాత్తాప భావంతో కృంగిపోతూ దైవాన్ని విశ్వసించి, ఇకపైనయినా సదాచరణ చేయటానికి పూనుకుంటే, అలాంటి వారిని దేవుడు క్షమించకపోడు. జీవితమంతా పాపాల్లోనే గడిచిపోయింది కదా! చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్లు ఇప్పుడు విశ్వసించినా ప్రయోజనం ఏముంటుంది? అని అనుకోవటం ఎంతమాత్రం సరికాదు. దైవకారుణ్యం పట్ల ఏ దశలోనయినా నిరాశా నిస్పృహలకు లోను కారాదు. దేవుడు అనంత కరుణామయుడు. అమితంగా మన్నించేవాడు. తన దాసులు జీవితపు అంతిమ దశలోనయినా చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడితే ఆయన వారి పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తాడు. వారు నిష్కల్మష హృదయంతో విశ్వసించి, సత్కార్యాలు చేయటానికి ఉపక్రమిస్తే, వారి పాపాలు సముద్రంలోని నురుగుకు సమానంగా ఉన్నాసరే వాటినన్నిటినీ క్షమించేస్తాడు.

ఒక్కోసారి మనిషి గత జీవితానికి స్వస్తి పలికి, ఇకపైనయినా పరిశుద్ధమయిన జీవితం గడపాలనుకుంటాడు. కాని అదే సమయంలో షైతాన్ అతనిలో రకరకాల దుష్ట ఆలోచనలు రేకెత్తిస్తుంటాడు. "నీ పాపాలు హద్దు దాటిపోయాయి. ఇన్ని పాపాలకు దేవుని సన్నిధిలో కూడా క్షమాభిక్ష లభించదు. అలాంటప్పుడు నువ్వు విశ్వసించినా, పశ్చాత్తాపపడినా లాభమేంటి?" అని రకరకాల ఆలోచనలు మనిషికి అడ్డు తగులుతూ ఉంటాయి. వాస్తవానికి ఇవన్నీ షైతాన్ దుష్ప్రేరేపణలు తప్ప మరేమీ కావు. ఎంతపెద్ద పాపాత్ముడయినా సరే అతను దైవసన్నిధికి వస్తే దైవకారుణ్యం అతన్ని తన ఒడిలోకి తీసుకుంటుంది. దేవుడు పశ్చాత్తాపపడే దాసుని పాపాలను క్షమించటానికి సదా సిద్ధంగా ఉంటాడు. అయితే దేవుడు క్షమిస్తాడంటే అర్థం దాసుడు ఒక వైపు పశ్చాత్తాపం చెందుతూనే మరోవైపు మాటిమాటికీ దేవుని హద్దుల్ని అతిక్రమిస్తూ పోవచ్చని ఎంతమాత్రం కాదు. క్షమించేవాడు, కరుణించేవాడు దేవుడున్నాడులే అన్న దురుద్దేశ్యంతో పాపం చేస్తే అది మరీ ఘోరమైన పాపంగా పరిగణించబడుతుంది. దేవుడు అలాంటి పాపాత్ములకు మరింత తీవ్రమైన శిక్ష విధిస్తాడు.

దైవ కారుణ్యం పట్ల ఆశాభావం ఉండాలన్న మాట వాస్తవమే. దాని పట్ల నిరాశానిస్పృహలకు లోనుకావటం దైవతిరస్కారంతో సమానమే. అందులో ఎలాంటి సందేహానికి తావులేదు. అయితే ఆ ఆశాభావం కూడా సకారాత్మకంగా ఉండాలి. ఎవడైనా ముళ్ళచెట్లు నాటి వాటికి తియ్యటి పళ్లు కాస్తాయని ఎదురుచూస్తూ కూర్చుంటే..... అది ఆశాభావం కాదు, మూర్ఖత్వం అనిపించుకుంటుంది. ఒక వ్యక్తి చదువుకోకుండా, ఏమాత్రం కష్టపడకుండా తను డాక్టర్ని, ఇంజనీర్ని కావాలని అనుకుంటే అది సాధ్యమేనా? అలాగే దాసుడు ఒకవైపు తలబిరుసుతనంతో వ్యవహరిస్తూ మరోవైపు నన్ను నీ కారుణ్య కడలిలో ముంచెత్తమని దైవాన్ని కోరుకుంటూ కూర్చుంటే అది దాసుని అవివేకం కాకపోతే మరేమిటి? దైవకారుణ్యానికి సంబంధించిన ఈ భావన చాలా సున్నితమైనది. దీన్ని సరిగ్గా అర్థం చేసుకోకపోతే ఆచరణల్లో అపసవ్యత చోటు చేసుకుంటుంది.

413. హజ్రత్ ఉబాదా బిన్ సామిత్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడనీ, ఆయన ఒక్కడేననీ, ఆయనకు ఇతర భాగస్వాములెవరూ లేరనీ, ముహమ్మద్ (స) ఆయన దాసుడు మరియు ప్రవక్త అనీ, అలాగే ఈసా కూడా దేవుని దాసుడు, ఆయన ప్రవక్త మాత్రమే అనీ, కాకపోతే ఆయన (తన తల్లి) మర్యమ్ వైపుకు చేరవేయ బడిన దైవాజ్ఞ అనీ, దేవుని తరఫునుంచి వచ్చి (మర్యమ్ గర్భంలో శిశువు రూపు దాల్చి)న ఒక ఆత్మ మాత్రమేననీ, స్వర్గ నరకాల ఉనికి యదార్థమనీ ధృవీకరించిన వ్యక్తిని దేవుడు స్వర్గంలో ప్రవేశింప జేస్తాడు - అతని ఆచరణ ఎలాగున్నా సరే. *(బుఖారీ - ముస్లిం)*

٤١٣ ـ وعن عُبَادةَ بنِ الصامتِ رضي الله عنه، قال: قال رسولُ الله ﷺ: «مَنْ شَهِدَ أنْ لا إلٰهَ إلَّا اللهُ وَحْدَهُ لا شَريكَ لَهُ، وَأَنَّ مُحَمَّداً عَبْدُهُ وَرَسُولُهُ، وَأَنَّ عِيسَى عَبْدُ اللهِ وَرَسُولُهُ، وَكَلِمَتُهُ أَلْقاها إلى مَرْيَمَ وَرُوحٌ مِنْهُ، والجَنَّةَ حَقٌّ وَالنَّارَ حَقٌّ، أَدْخَلَهُ اللهُ الجَنَّةَ عَلى ما كانَ مِنَ العَمَلِ» متفقٌ عليه.

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్య దేవుడు లేడనీ, ముహమ్మద్ (స) దైవప్రవక్త అని ధృవీకరించిన వ్యక్తి కోసం దేవుడు నరకాన్ని నిషిద్ధం చేస్తాడని ఉంది.

وفي روايةٍ لمسلم: «مَنْ شَهِدَ أَنْ لا إلٰهَ إلَّا اللهُ، وَأَنَّ مُحَمَّداً رَسُولُ اللهِ، حَرَّمَ اللهُ عَلَيْهِ النَّارَ».

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసు ద్వారా దైవప్రవక్తలు కూడా మానవమాత్రులేనన్న విషయం బోధపడుతోంది. దైవప్రవక్తలు భగదవతారాలన్న భావనను ఈ హదీసు త్రోసిపుచ్చుతోంది. క్రైస్తవులు యేసుక్రీస్తును దేవుని కుమారుడన్నారు. యూదులు ఉజైర్‌ను దేవుని కుమారుడన్నారు. సహవాస దోషం వల్ల ఈ వ్యాధి ముస్లింలకు కూడా అంటుకుంది. ముస్లింలలోని ఒక వర్గం మహాప్రవక్త ముహమ్మద్ (సల్లం) సాక్షాత్తు దేవుని వెలుగు అని అనటం మొదలుపెట్టారు. ఆయన్ని ఓ

మానవాతీత శక్తిగా తలపోస్తున్నారు. ఇవన్నీ పెడ భావాలు తప్ప మరేమీ కావు. వెలుగు (నూర్) అనేది దేవుని గుణం. దేవుని పేర్లలోగాని, ఆయన గుణగణాల్లో గాని వేరొకరిని సాటి కల్పిస్తే 'షిర్క్' (బహుదైవారాధన) చేసినట్లవుతుంది. దైవప్రవక్తలు మానవమాత్రులని సాక్ష్యం చెప్పటం కూడా విశ్వాసం (ఈమాన్)లో అంతర్భాగమే. దాన్ని నిరాకరిస్తే మొత్తం ఏకేశ్వరోపాసన సిద్ధాంతాన్ని నిరాకరించినట్లవుతుంది.

హజ్రత్ ఈసా - అలైహి - దేవుని వచనం (కలిమతుల్లాహ్), దేవుని ఆజ్ఞ. అంటే ఆయన పుట్టుక సృష్టి నిబంధనలకు భిన్నంగా దైవాజ్ఞ మేరకు జరిగిందని అర్థం. 'రూహుల్లాహ్' (దైవాత్మ) అనేది దేవుని తరపునుండి ఆయనకు నొసగబడిన గౌరవాత్మకమైన బిరుదు. అంతేగాని దైవాత్మ అంటే నిజంగానే దేవుని ఆత్మ అని అర్థం ఎంతమాత్రం కాదు. దివ్య ఖుర్‌ఆన్‌లో సమూద్ జాతి వైపు పంపబడిన ఒంటెను 'నాఖతుల్లాహ్' (దేవుని ఒంటె) అని పిలవటం జరిగింది. అలాగే పవిత్ర కాబాగృహాన్ని 'బైతుల్లాహ్' (దేవుని గృహం) అని వ్యవహరిస్తుంటాం. అంతమాత్రాన అది దేవుడు నివసించే ఇల్లని అర్థం చేసుకుంటామా? దేవుడు సప్తాకాశాలపై మహోన్నత అధికార పీఠంపై అధిష్టించి ఉన్నాడన్న సంగతి అందరికీ తెలిసిందే కదా!

ఇకపోతే పై హదీసు ద్వారా బోధపడే మరో ముఖ్య విషయం ఏమిటంటే, ఘోరపాపానికి (కబీరా గునాహ్‌కు) ఒడిగట్టినంతమాత్రాన మనిషి విశ్వాస పరిధుల్ని అతిక్రమించినట్లు కాదు. మానవ సహజమైన దౌర్బల్యం వల్ల ఒక విశ్వాసి ఘోరపాపానికి ఒడిగట్టినప్పటికీ అతను విశ్వాసి గానే ఉంటాడు. అతణ్ణి స్వర్గప్రవేశానికి అర్హుడిగానే పరిగణించటం జరుగుతుంది. అయితే అతని స్వర్గప్రవేశం మాత్రం దేవుని యిష్టాయిష్టాలపై ఆధారపడి ఉంటుంది. ఆయన తలచు కుంటే మొదట్లోనే అతని పాపాలన్నీ క్షమించేసి అతనికి స్వర్గప్రవేశాన్ని కల్పించవచ్చు. లేదా కొంతకాలం పాటు నరకంలో అతని పాపాలకు శిక్ష విధించి తరువాత స్వర్గానికి పంపవచ్చు. కాని విశ్వాసికి శాశ్వత నరకశిక్ష మాత్రం ఉండదు. పాపాలకు శిక్ష అనుభవించిన తరువాత అతనికి స్వర్గంలో ప్రవేశించే వీలు ఉంటుంది.

٤١٤ ـ وعن أبي ذرٍّ رضي اللهُ عنه، قال: قال النَّبيُّ ﷺ: «يقولُ اللهُ عزَّ وَجَلَّ: مَنْ جاءَ بِالحَسَنَةِ، فَلَهُ عَشْرُ أَمْثالِها أَوْ أَزِيدُ، وَمَنْ جاءَ بِالسَّيِّئَةِ، فَجَزاءُ سَيِّئَةٍ مِثْلُها أَوْ أَغفِرُ. وَمَنْ تَقَرَّبَ مِنِّي شِبْراً، تَقَرَّبْتُ مِنْهُ ذِرَاعاً، وَمَنْ تَقَرَّبَ مِنِّي ذِرَاعاً، تَقَرَّبْتُ مِنْهُ بَاعاً، وَمَنْ أَتَانِي يَمْشِي، أَتَيْتُهُ هَرْوَلَةً، وَمَنْ لَقِيَنِي بِقُرَابِ الأَرْضِ خَطِيئَةً

414. హజ్రత్ అబూజర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) దేవుడు ఇలా అంటున్నాడని తెలియజేశారు :

ఒక సత్కార్యం చేసిన వ్యక్తికి నేను పది లేదా అంతకన్నా ఎక్కువ రెట్ల పుణ్యాన్ని ప్రసాదిస్తాను. కాని ఒక దుష్కార్యం చేసిన వ్యక్తికి, దానికి సమానమైన ప్రతిఫల మయినా ఇస్తాను లేదా దాన్ని కూడా క్షమించేస్తాను. ఎవరైనా నా వైపు జానెడు దూరం జరిగితే, నేనతని వైపు మూరెడు

దూరం జరుగుతాను. ఎవరైనా నా వైపు మూరెడు దూరం జరిగితే నేన తనివైపు బారెడు దూరం జరుగుతాను. ఎవరైనా నా వైపు నడిచివస్తే, నేనతని వైపుకు పరుగెత్తుకొస్తాను. నా దగ్గరికి ఎవరైనా ఒక్క బహుదైవారాధనా పాపం మినహా భూమండలం నిండా పాపాలు తీసుకొని వస్తే నేనతని దగ్గరికి దానికి సమానంగా మన్నింపును తీసుకొని వస్తాను. (ముస్లిం)

لا يُشْرِكُ بِي شَيْئاً، لَقِيتُهُ بِمِثْلِهَا مَغْفِرَةً». رواه مسلم.

ఈ హదీసు భావం ఏమిటంటే, ఎవరైనా నాకు విధేయత చూపి నా సామీప్యాన్ని పొందాలనుకుంటే నేను నా కారుణ్యాన్ని వెంటబెట్టుకొని అతని దగ్గరికొస్తాను. నాకు విధేయత చూపే విషయంలో అతను చురుకుదనాన్ని కనబరిస్తే నేనతని దగ్గరికి పరుగెత్తుకొస్తాను. అంటే అతని వైపు నా కారుణ్య కడలి కదలి వస్తుంది. ఈ విషయంలో నేను అతని కంటే ముందుంటాను. అతనికి నా దగ్గరికి వచ్చే ఇబ్బంది లేకుండా నేనే అతని దగ్గరికి వస్తాను. 'ఖురాబుల్ అర్జ్'. దీనిని కొంతమంది ఖిరాబుల్ అర్జ్ అని కూడా ఉచ్చరించారు. కాని ఖురాబుల్ అర్జ్ అనటమే సరైనది. 'దాదాపు భూ మండలం నిండా' అని ఈ పదానికి అర్థం.

معنى الحديث: «مَنْ تَقَرَّبَ» إليَّ بطاعَتي «تقَرَّبْتُ» إلَيْه بِرَحْمَتِي، وَإنْ زَادَ زِدتُ، «فَإنْ أَتاني يَمْشي» وَأَسْرَعَ في طاعَتي «أَتَيْتُهُ هَرْوَلَةً» أَيْ: صَبَبْتُ عَلَيْهِ الرَّحْمَةَ، وَسَبَقْتُهُ بها، وَلَمْ أُحْوِجْهُ إلى المَشْيِ الكَثيرِ في الوُصُولِ إلى المَقْصُودِ،

وَ«قُرَابُ الأرْضِ» بضمِّ القافِ ويُقالُ: بكسرِها، والضمُّ أصحّ، وأشهر، ومعناه: ما يُقارِبُ مِلأَها، واللهُ أعلم.

*(సహీహ్ ముస్లింలోని దైవధ్యానం, ప్రార్థనల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దేవుడు తన ప్రియదాసులకు అపారంగా అనుగ్రహిస్తాడని చెప్పటానికి ఈ హదీసు ప్రబల తార్కాణం. విశ్వాసులు చేసే ఒక్కొక్క సత్కార్యానికి లెక్కలేనంత పుణ్యఫలాన్ని

అనుగ్రహిస్తాడు దేవుడు. కనుక మానవులు దేవుని కారుణ్యం పట్ల, ఆయన క్షమాభిక్ష పట్ల ఎన్నటికీ నిరాశా నిస్పృహలకు లోనుకారాదు.

415. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : ఒక పల్లెటూరి వ్యక్తి దైవప్రవక్త (స) సన్నిధికి వచ్చి "దైవప్రవక్తా! (స్వర్గాన్ని గాని, నరకాన్ని గాని) అనివార్యం చేసే రెండు స్థితులేవి?" అని అడిగాడు. దానికి సమాధానమిస్తూ ఆయన "మనిషి బహుదైవారాధనకు ఒడిగట్టని స్థితిలో మరణిస్తే స్వర్గంలోకి ప్రవేశిస్తాడు, అదే బహుదైవారాధన చేస్తూ మరణిస్తే నరకాగ్నికి ఆహుతి అవుతాడు" అని చెప్పారు. (ముస్లిం)

٤١٥ ـ وعن جابر رضيَ الله عنه، قالَ: جاءَ أَعرابيٌّ إلى النَّبيِّ ﷺ، فقال: يا رَسُولَ اللهِ! ما المُوجِبَتَانِ؟ فَقالَ: «مَنْ مَاتَ لا يُشْرِكُ بِاللهِ شَيْئاً دَخَلَ الجَنَّةَ، وَمَنْ مَاتَ يُشْرِكُ بِهِ شَيْئاً، دَخَلَ النَّارَ» رواهُ مُسلم.

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

416. హజ్రత్ అనస్ (రజి) కథనం : ఒకసారి ముఆజ్ (రజి) దైవప్రవక్త వెనుక ఆయన వాహనం మీద ప్రయాణిస్తుండగా ఆయన "ముఆజ్!" అని పిలిచారు. "చిత్తం, సెలవీయండి దైవప్రవక్తా!" అని అన్నారు ముఆజ్ (రజి). ఆయన మళ్ళీ "ముఆజ్!" అని పిలిచారు. అందుకాయన "చిత్తం, సెలవీయండి దైవప్రవక్తా! తమరి సేవకోసం సిద్ధంగా ఉన్నాను" అని అన్నారు. దైవప్రవక్త (స) "ముఆజ్!" అని మళ్ళీ పిలిచారు. అప్పుడు కూడా "చిత్తం, దైవప్రవక్తా! సెలవీయండి. మీ సేవకోసం సిద్ధంగా ఉన్నాను" అని విన్నవించుకున్నారు. ఇలా మూడుసార్లు జరిగింది.

٤١٦ ـ وَعَنْ أَنَسٍ رضي اللهُ عنه، أَنَّ النَّبيَّ ﷺ، وَمُعَاذٌ رَدِيفُهُ عَلَى الرَّحْلِ قالَ: «يا مُعاذُ»، قال: لَبَّيْكَ يا رَسُولَ اللهِ! وَسَعْدَيْكَ، قَالَ: «يا مُعَاذُ»، قالَ: لَبَّيْكَ يَا رَسُولَ اللهِ! وَسَعْدَيْكَ، قَالَ: «يَا مُعَاذُ»، قالَ: لَبَّيْكَ يَا رَسُولَ اللهِ! وَسَعْدَيْكَ، ثلاثاً، قالَ: «ما مِنْ عَبْدٍ يَشْهَدُ أَنْ لا إِلَـهَ إِلَّا اللهُ، وَأَنَّ مُحَمَّداً عَبْدُهُ

وَرَسُولُهُ صِدْقاً مِنْ قَلْبِهِ إِلَّا حَرَّمَهُ اللهُ عَلى النَّارِ»، قالَ: يَا رَسُولَ اللهِ! أَفَلا أُخْبِرُ بِها النَّاسَ فَيَسْتَبْشِرُوا؟ قال: «إذاً يَتَّكِلُوا» فَأَخْبَرَ بِها مُعَاذٌ عِنْدَ مَوْتِهِ تَأَثُّماً. متفقٌ عليه. وقوله: «تأثُّماً» أي: خَوْفاً مِنَ الإثمِ في كَتْمِ هذا العِلْمِ.

ఆ తరువాత ఆయన "అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడనీ, ముహమ్మద్ దేవుని దాసుడు, ఆయన ప్రవక్త అని హృదయపూర్వకంగా సాక్ష్యం చెప్పేవాడికి దేవుడు నరకాగ్నిని నిషిద్ధం చేస్తాడు" అని చెప్పారు. ఆ మాట వినగానే హజ్రత్ ముఆజ్ (రజి) "దైవప్రవక్తా! ఈ విషయం ప్రజలకు తెలియజేయనా, వారూ విని సంతోషిస్తారు?" అని అడిగారు. దానికి సమాధానంగా ఆయన "(వద్దు) ఈ విషయం వారికి చెబితే (వారు ఆచరణలు మానుకొని) దీన్నే నమ్ముకొని కూర్చుంటారు" అని అన్నారు. అందుకని హజ్రత్ ముఆజ్ (రజి) (చాలారోజుల వరకు ఈ విషయాన్ని రహస్యంగానే ఉంచారు. అయితే ఈ హదీసుని అసలు వెల్లడించకపోతే జ్ఞానాన్ని దాచిపెట్టుకున్న కారణంగా) తాను పాపినయిపోతానేమో నన్న భయంతో మరణించే ముందు ఈ విషయం ప్రజలకు తెలియజేశారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని విద్యా ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసులోని బాహ్యార్థం ప్రకారం దేవుడు ఒక్కడేననీ, ముహమ్మద్ (స) దైవప్రవక్త అని సాక్ష్యమిచ్చే వ్యక్తికి నరకం నిషిద్ధం చేయబడుతుందని తెలుస్తోంది. ఇంతకు ముందు మనం విశ్వాసుల్లో ఎవరయినా తప్పు చేస్తే దేవుడు వారిని కొంతకాలం పాటు నరకంలో ఉంచే అవకాశముందని చెప్పుకున్నాం. ఈ రెండు విషయాల్లో పరస్పర వైరుధ్యమున్నట్లు కనపడవచ్చు. వాస్తవం ఏమిటంటే, ఈ హదీసులో 'సాక్ష్య'మంటే ఒట్టి నోటిమాటలనే కాదు; దానితోపాటు దైవాజ్ఞల్ని, దేవుని విధుల్ని కూడా తప్పకుండా పాటించాలి. భక్తి విశ్వాసాలకు అనుగుణంగా జీవితం గడపాలి. సదరు హదీసులోని 'హృదయ పూర్వకంగా' అనే పదం ఈ విషయాన్నే సూచిస్తోందని ఇమామ్ తీబీ (రహ్మాలై) అభిప్రాయపడ్డారు.

కొందరు గతంలో తమవల్ల జరిగిన బహుదైవారాధనకు, దైవ తిరస్కారానికి పశ్చాత్తాప పడుతూ క్రొత్తగా ఇస్లాం స్వీకరిస్తారు. దేవుడు ఒక్కడేననీ, ముహమ్మద్ (స) దైవప్రవక్త అని హృదయపూర్వకంగా విశ్వసించినప్పటికీ సదాచరణ చేసే భాగ్యం లేకుండా మరణిస్తారు. పై హదీసులో సాక్ష్యం చెప్పేవారంటే ఇలాంటి వారేనని మరికొంతమంది పండితులు అభిప్రాయ పడుతున్నారు. ఇంకా కొంతమంది ఈ హదీసును విశ్వాసులకు శాశ్వత నరకయాతన ఉండదన్న అర్థంలో తీసుకున్నారు. ఎందుకంటే దైవాన్ని, దైవప్రవక్తను విశ్వసించినవారు కూడా ఒకవేళ తప్పు చేసి వుంటే దైవాజ్ఞ మేరకు కొంతకాలంపాటు నరకంలో శిక్ష అనుభవించవలసి ఉంటుంది. ఆ తరువాత దేవుడు వారికి నరకం నుండి విముక్తి కల్పిస్తాడు.

ఈ హదీసు ద్వారా బోధపడే ఇంకో విషయం ఏమిటంటే, ప్రజలు సరిగ్గా అర్థం చేసుకోలేని ధర్మ విషయాలను వారికి బోధించకూడదు. ఎందుకంటే తమ అవగాహనా లోపం వల్ల వారు వాటిని అర్థం చేసుకోవటంలో పొరబడి పెడదోవపట్టే ప్రమాదముంది.

٤١٧ ـ وعَنْ أبي هريرةَ ـ أَوْ أبي سَعِيدٍ الخُدْرِيِّ، رضي الله عنهما، شَكَّ الـرَّاوِي، وَلَا يَضُـرُّ الشَّـكُّ فـي عَيـنِ الصَّحابيِّ؛ لأنهم كُلَّهُمْ عُدُولٌ ـ قال: لَمَّا كانَ غَزْوَةُ تَبُوكَ، أصابَ الناسَ مَجَاعَةٌ، فَقالُوا: يا رَسُولَ اللهِ! لَوْ أَذِنْتَ لنَا فَنَحَرْنَا نَـوَاضِحَنـا، فَـأَكَلْنـا وادَّهَنّـا؟ فَقـالَ رَسُـولُ اللهِ ﷺ: «افْعَلُـوا»، فَجَـاءَ عُمَـرُ رَضِيَ اللهُ عَنْهُ، فقالَ: يا رَسُولَ اللهِ! إنْ فَعَلْتَ قَلَّ الظهْرُ، وَلٰكِنِ ادْعُهُمْ بِفَضْلِ أَزْوَادِهِمْ، ثُمَّ ادْعُ اللهَ لَهُمْ عَلَيْهَا بِالبَرَكَةِ لَعَلَّ اللهَ أَنْ يَجْعَلَ فِي ذٰلِكَ البَرَكَةَ. فَقالَ

417. హజ్రత్ అబూ హురైరా (రజి) లేదా అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం : (ఇక్కడ హదీసు ఉల్లేఖకునికి సందేహం కలిగింది. అయితే ప్రవక్త సహచరుల విషయంలో సందేహమున్నా నష్టం ఏమీ ఉండదు. ప్రవక్త సహచరులందరూ విశ్వసనీయులే).

"తబూక్ దండయాత్ర జరిగినప్పుడు ప్రజల అన్నవసతులకు కరువు వచ్చింది. వారు దైవప్రవక్త (స) దగ్గరికి వెళ్ళి, "దైవ ప్రవక్తా! మీరు అనుమతి ఇస్తే మా ఒంటెల్ని కోసుకొని తింటాం. వాటి క్రొవ్వుని కూడా ఉపయోగించు కుంటాం" అని విన్నవించుకున్నారు. దానికి ఆయన సరే అలాగే కానీయండి అన్నారు. అంతలో హజ్రత్ ఉమర్ (రజి) అక్కడికి వచ్చారు. (ఆ మాట విని) ఆయన "దైవప్రవక్తా! తమరీ విధంగా అనుమతినిస్తే వాహనాల కొరత

رَسُولُ اللهِ ﷺ: «نَعَمْ»، فَدَعَا بِنِطْعٍ فَبَسَطَهُ، ثُمَّ دَعَا بِفَضْلِ أَزْوَادِهِمْ، فَجَعَلَ الرَّجُلُ يَجِيءُ بِكَفِّ ذُرَةٍ، وَيَجِيءُ الآخَرُ بِكَفِّ تَمْرٍ، وَيَجِيءُ الآخَرُ بِكِسْرَةٍ حَتَّى اجْتَمَعَ عَلَى النِّطْعِ مِنْ ذٰلِكَ شَيْءٌ يَسِيرٌ، فَدَعَا رَسُولُ اللهِ ﷺ بِالبَرَكَةِ، ثُمَّ قَالَ: «خُذُوا فِي أَوْعِيَتِكُمْ»، فَأَخَذُوا فِي أَوْعِيَتِهِمْ حَتَّى مَا تَرَكُوا فِي العَسْكَرِ وِعاءً إِلَّا مَلَؤُوهُ، وَأَكَلُوا حَتَّى شَبِعُوا وَفَضَلَ فَضْلَةٌ، فقالَ رَسُولُ اللهِ ﷺ: «أَشْهَدُ أَنْ لا إِلٰهَ إِلَّا اللهُ، وَأَنِّي رَسُولُ اللهِ، لا يَلْقَى اللهَ بِهِمَا عَبْدٌ غَيْرُ شَاكٍّ، فَيُحْجَبَ عَنِ الجَنَّةِ» رواهُ مسلم.

ఏర్పడుతుంది. దానికి బదులు ఒక పని చేస్తే బాగుంటుంది. వీళ్ళ దగ్గర మిగిలివున్న ఆహారపదార్థాలు తెప్పించండి. ఆ తరువాత మీరు వీరికి ఇందులో శుభం కలగాలని దేవుణ్ణి ప్రార్థించండి. బహుశా దేవుడు ఈ మిగిలిన ఆహార పదార్థాల్లోనే సమృద్ధిని ప్రసాదించవచ్చుకదా!" అని అన్నారు. 'సరే అలాగే చేద్దాం' అని అన్నారు దైవ ప్రవక్త (స).

తరువాత ఆయన ఒక తోలు వస్త్రం తెప్పించి దాన్ని క్రింద పరచారు. ఆ తరువాత తమ దగ్గర మిగిలివున్న ఆహార పదార్థాలు తీసుకురమ్మని తన అనుచరుల్ని ఆదేశించారు. అప్పుడు ఒకడు గుప్పెడు జొన్న విత్తులు, మరొకడు గుప్పెడు ఖర్జూరపండ్లు, ఇంకొకడు రొట్టె ముక్కలు - ఇలా తెచ్చి ఆ వస్త్రంపై ఉంచుతూ పోయారు. దాంతో ఆ వస్త్రంపై కొన్ని ఆహార పదార్థాలు పోగయ్యాయి. అప్పుడాయన అందులో శుభం కలగాలని దేవుణ్ణి ప్రార్థించారు. ఆ తరువాత అందులో నుంచి ఆహార పదార్థాలు తీసుకొని తమ పాత్రల్లో నింపుకోమని ప్రజల్ని ఆదేశించారు.

అనుచరులు ఆ ఆహారపదార్థాలతో తమ పాత్రలు నింపుకోసాగారు. సైన్యం దగ్గర ఒక్క పాత్ర కూడా ఖాళీగా లేకుండా అన్నింటినీ ఆహారపదార్థాలతో

నింపారు. అందరూ కడుపునిండా తిన్న తరువాత కూడా ఇంకా ఎంతో అన్నం మిగిలిపోయింది.

ఆ సందర్భంగా ఆయన (స) ఇలా ప్రవచించారు : అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడనీ, నేను దైవప్రవక్తనని (స్వయంగా నేనే) సాక్ష్యం చెబుతున్నాను. ప్రజల్లో ఎవరైనా ఈ రెండు విషయాలను ఎలాంటి సంకోచం లేకుండా ధృవీకరిస్తే ఇక వారిని స్వర్గంలో ప్రవేశించకుండా అడ్డుకునేదెవరు?!" *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా దైవప్రవక్త (స) మహత్మ్యం వెల్లడౌతోంది. ఆయన ప్రార్థనతో అతికొద్ది ఆహారం సైన్యంలోని వారందరికీ సరిపోయింది. అందరూ కడుపునిండా తిన్న తరువాత కూడా ఇంకా మిగిలిపోయింది. అయితే తబూక్ యుద్ధంలో ఎంతమంది సైనికులు పాల్గొన్నారన్నది ఇతమిత్థంగా తెలియటం లేదు. కొన్ని ఉల్లేఖనాల ద్వారా ముప్ఫై నుండి నలభైమంది సైనికులు ఆ యుద్ధంలో పాల్గొన్నారని తెలుస్తోంది. కాని ఆ ఉల్లేఖనాలు ఏమంత ప్రామాణికమైనవి కావు. సహీహ్ బుఖారీలోని ఉల్లేఖనం ఆ యుద్ధంలో చాలా ఎక్కువ మంది పాల్గొన్నారని మాత్రం సూచిస్తోంది.

సహీహ్ బుఖారీలోని వాక్యాలు ఇలా ఉన్నాయి : "ఈ యుద్ధంలో దైవప్రవక్తతో పాటు ముస్లింలు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. అందరిపేర్లూ ఒక పుస్తకంలో నమోదు చేయటం కష్టమయిపోయింది. వహీ ద్వారా దైవప్రవక్తకు తెలియవస్తే తప్ప యుద్ధానికి ఎగనామం పెట్టేవారిని కనుక్కోలేని పరిస్థితి ఏర్పడింది." దీనిద్వారా ఆ యుద్ధంలో పాల్గొన్నవారు చాలా ఎక్కువ సంఖ్యలోనే ఉండి ఉంటారని తెలుస్తోంది. అయినప్పటికీ దైవప్రవక్త ప్రార్థన మహిమతో కొద్ది అన్నం వారందరికీ సరిపోయింది.

ఈ హదీసు ద్వారా బోధపడే ఇంకో విషయం ఏమిటంటే, చిన్నవారు సందర్భ ఔచిత్యాన్ని దృష్టిలో పెట్టుకొని తమకన్నా పెద్దవారికి సలహాలు ఇవ్వటంలో తప్పులేదు. అలాగే పెద్దవారు కూడా చిన్నవారి సలహాలను గౌరవించాలి. వాటిని తేలిగ్గా కొట్టిపారేయరాదు. సముచితమైన సలహాలను స్వీకరించటాన్ని తమ కీర్తికి కళంకంగా తలపోయకూడదు.

418. హ(జత్ ఇత్‌బాన్ బిన్ మాలిక్ (రజి) కథనం : ఈయన బద్ర్ యుద్ధంలో పాల్గొన్నవారిలో ఒకరు -

నేను మా బనూ సాలిమ్ తెగవారికి నమాజ్ చేయించేవాణ్ణి. నేనుండే చోటుకి మా తెగవారుండే ప్రాంతానికి మధ్య ఒక కాలువ అడ్డంగా ప్రవహిస్తూ ఉండేది. భారీ వర్షం కురిసినప్పుడు ఆ కాలువ దాటి వెళ్ళడం నాకు కష్టంగా ఉండేది. అందుచేత నేను దైవప్రవక్త (స) సన్నిధికి వెళ్ళి ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, "దైవ ప్రవక్తా! నా చూపు తగ్గిపోయింది. నేనుండే చోటుకి, మా తెగవారుండే చోటుకి మధ్య కాలువ అడ్డంగా ఉంది. వర్షం కురిసినప్పుడు అది (నిండుగా) ప్రవహిస్తూ ఉంటుంది. దాన్ని దాటి అవల మా తెగవారుండే చోటుకి వెళ్ళడం నాకు కష్టంగా ఉంది. కనుక మీరు మా ఇంటికి వచ్చి ఏదో ఒకచోట నమాజ్ చేయిస్తే నేను ఆ చోటుని నా నమాజ్ స్థలంగా చేసుకుంటాను" అని విన్నవించుకున్నాను. దానికాయన "సరే త్వరలోనే ఆ పని చేస్తాను" అని అన్నారు.

మరునాడు ఉదయం బాగా ప్రొద్దెక్కిన తరువాత దైవప్రవక్త (స) మరియు అబూబక్ర్ (రజి)లు మా ఇంటికి వచ్చారు. దైవప్రవక్త (స) లోపలికి రావటానికి అనుమతి కోరారు. నేను రావచ్చ

٤١٨ ـ وَعَنْ عِتْبَانَ بنِ مالِكٍ رضي الله عنه، وهو مِمَّنْ شَهِدَ بَدْراً، قالَ: كُنْتُ أُصَلِّي لِقَومِي بَني سالم، وَكَانَ يَحُولُ بَيْنِي وَبَيْنَهُمْ وَادٍ إذا جاءَتِ الأمْطَارُ، فَيَشُقُّ عَلَيَّ اجْتِيَازُهُ قِبَلَ مَسْجِدِهِمْ، فَجِئْتُ رَسُولَ اللهِ ﷺ، فقلتُ له: إنِّي أنكَرْتُ بَصَرِي، وَإنَّ الوَادِيَ الَّذِي بَيْنِي وَبَيْنَ قَوْمِي يَسِيلُ إذَا جاءَتِ الأمطارُ، فَيَشُقُّ عَلَيَّ اجْتِيَازُهُ، فَوَدِدْتُ أنَّكَ تَأتِي، فَتُصَلِّي في بَيْتِي مَكَاناً أتَّخِذُهُ مُصَلًّى، فقال رسولُ الله ﷺ: «سَأفْعَلُ»، فَغَدا عليَّ رَسُولُ اللهِ، وأبو بكرٍ رَضِيَ اللهُ عنه، بَعْدَ ما اشْتَدَّ النَّهارُ، وَاسْتَأذَنَ رَسُولُ اللهِ ﷺ، فَأذِنْتُ لَهُ، فَلَمْ يَجْلِسْ حَتَّى قالَ: «أيْنَ تُحِبُّ أنْ أُصَلِّيَ مِنْ بَيْتِكَ؟» فَأشَرْتُ لَهُ إلى المَكَانِ الَّذِي أُحِبُّ أنْ يُصَلِّيَ فيه، فَقَامَ رَسُولُ اللهِ ﷺ، فَكَبَّرَ وَصَفَفْنَا وَرَاءَهُ، فَصَلَّى رَكْعَتَيْنِ، ثُمَّ سَلَّمَ وَسَلَّمْنَا حِينَ سَلَّمَ، فَحَبَسْتُهُ عَلَى خَزِيرَةٍ تُصْنَعُ لَهُ، فَسَمِعَ أهْلُ الدَّارِ أنَّ رَسُولَ اللهِ ﷺ

فِي بَيْتِي، فَثَابَ رِجَالٌ مِنْهُم حَتَّى كَثُرَ الرِّجَالُ فِي الْبَيْتِ، فَقَالَ رَجُلٌ: مَا فَعَلَ مَالِكٌ لا أَرَاهُ! فَقَالَ رَجُلٌ: ذَلِكَ مُنَافِقٌ لا يُحِبُّ اللهَ وَرَسُولَهُ، فقالَ رَسُولُ اللهِ ﷺ: «لا تَقُلْ ذَلِكَ، أَلا تَرَاهُ قَالَ: لا إِلٰهَ إِلَّا اللهُ، يَبْتَغِي بِذَلِكَ وَجْهَ اللهِ تَعالى؟!». فَقَالَ: اللهُ وَرَسُولُهُ أَعْلَمُ، أَمَّا نَحْنُ فَوَاللهِ! مَا نَرَى وُدَّهُ، وَلا حَدِيثَهُ إِلَّا إِلى الْمُنَافِقِينَ! فقالَ رسولُ اللهِ ﷺ: «فَإِنَّ اللهَ قَدْ حَرَّمَ عَلى النَّارِ مَنْ قَالَ: لا إِلٰهَ إِلَّا اللهُ، يَبْتَغِي بِذَلِكَ وَجْهَ اللهِ» متفقٌ عليه.

న్నాను. ఆయన లోపలికి దయచేశారు. కూర్చోకముందే ఆయన నన్ను, "ఈ ఇంట్లో నేను ఎక్కడ నమాజ్ చేయటం నీకిష్టమో చెప్పు" అని అడిగారు. నేనాయనకు నాకిష్టమైన చోటు చూపించాను. ఆయన ఆ చోట్లో నిలబడి అల్లాహు అక్బర్ అని నమాజ్ మొదలెట్టారు. మేము కూడా వెనుక ఒక వరుసలో నిలబడి ఆయన్ని అనుసరించాం. ఆయన రెండు రకాతుల నమాజ్ చేయించిన తరువాత సలాం చేసి నమాజ్ ముగించారు. మేము కూడా ఆయన్ని అనుసరిస్తూ సలాం చేసి నమాజ్ ముగించుకున్నాం.

దైవప్రవక్తకు ఆతిథ్యమివ్వాలని (మా ఇంట్లో) ఖజీరా (ఒక రకమైన వంటకం) తయారు చేశారు. నేను దైవప్రవక్తతో అది తిని వెళుదురుగాని, కాసేపు ఉండమని చెప్పాను. అంతలో దైవప్రవక్త (స) మా ఇంటికొచ్చారన్న సంగతి తెలుసుకొని ఇరుగుపొరుగు జనమంతా మా ఇంటికి రావటం మొదలుపెట్టారు. ఆ విధంగా ఇంట్లో చాలామంది జనం గుమిగూడారు. వారిలో ఒకడు "ఇంటి యజమాని కనపడటం లేదేమిటి?" అని అన్నాడు. మరోవ్యక్తి అందుకొని, "ఎందుకు కనబడతాడు, అతను కపట విశ్వాసి, దేవుడన్నా, దైవప్రవక్త అన్నా అతనికి అసలు అభిమానమే లేదు" అని అన్నాడు వెటకారంగా.

అది విని దైవప్రవక్త (స) (చిరుకోపంతో) "అలా అనకండి. ఈ వ్యక్తి దైవప్రసన్నత కోసం అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్య దేవుడు లేడని అనటం మీరు చూడ లేదా?" అని మందలించారు. "నిజం ఏమిటో దేవుడికి, దైవప్రవక్తకే బాగా తెలుసు. మాకు మాత్రం ఇతని అభిమానం, ఇతని మాటలు చూస్తుంటే కపట విశ్వాసిలాగే కనిపిస్తాడు" అని అన్నాడా వ్యక్తి. అప్పుడు ఆయన (అతణ్ణి అలా అనకూడదని వారిస్తూ, "దైవ ప్రసన్నత కోసం లా యిలాహ ఇల్లల్లాహ్ (అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు) అని పలికిన వ్యక్తికి దేవుడు నరకం నిషిద్ధం చేస్తాడు" అని చెప్పారు.

*(బుఖారీ - ముస్లిం)*

'ఖజీరా' అంటే మెత్తటి పిండి మరియు కొవ్వు కలిపి తయారుచేసే ఒక రకమైన వంటకం. 'సాబ రిజాలున్' అంటే జనం గుమిగూడారు అని అర్థం.

و «عِتْبَان» بكسر العين المهملة، وإسكان التاء المُثَنَّاة فَوْقُ وبَعْدَها باءٌ مُوَحَّدَةٌ. وَ «الخَزِيرَةُ» بالخاءِ المُعْجَمَةِ، وَالزَّاي: هي دَقيقٌ يُطْبَخُ بشَحْم. وقوله: «ثَابَ رِجَالٌ» بالثَّاءِ المُثَلَّثَةِ، أيْ: جَاؤُوا وَاجْتَمَعُوا.

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. షరీఅత్ పరమైన కారణమేదయినా ఉంటే మనిషి ఇంట్లో కూడా నమాజ్ చేసుకోవచ్చని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.
2. అలాంటి అనివార్య పరిస్థితుల్లో ఇంట్లో నమాజ్ చేసుకోవటానికి కొంత స్థలాన్ని ప్రత్యేకించుకోవటం మంచిది.
3. తోటి విశ్వాసుల పట్ల దురభిప్రాయాన్ని కల్గి వుండటం తగదు.
4. విశ్వాసికి అంతిమంగానయినా స్వర్గం లభించి తీరుతుంది.

419. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం : దైవప్రవక్త (స) సన్నిధికి కొందరు ఖైదీలు వచ్చారు. వారిలో ఒక స్త్రీ (కూడా) ఉంది. ఆమె తన చంటిపిల్ల వాడ్ని వెతుక్కుంటూ తిరుగుతోంది. ఖైదీల దగ్గర చంటి పిల్లవాడెవడయినా కనబడితే వెంటనే అతన్ని ఒళ్ళోకి తీసుకొని హృదయానికి హత్తుకొని పాలు త్రాపించేది. అది గమనించిన దైవప్రవక్త (స) మమ్మల్ని "ఈ స్త్రీ తన బిడ్డను అగ్నిలో పడవేయగలదంటారా?" అని అడిగారు. మేము "దైవసాక్షి! అది అసంభవం" అని అన్నాం. అందుకాయన "నిస్సందేహంగా ఈ తల్లికి తన బిడ్డపై ఎంతగా మమకారముందో, దేవునికి తన దాసులపై అంతకన్నా ఎక్కువగానే మమకారముంది" అని చెప్పారు.

(బుఖారీ - ముస్లిం)

٤١٩ ـ وعن عمر بن الخطاب رضيَ اللهُ عنه، قال: قَدِمَ رَسُولُ اللهِ ﷺ بِسَبْيٍ، فَإِذَا امْرَأَةٌ مِنَ السَّبْيِ تَسْعَى، إِذْ وَجَدَتْ صَبِيّاً فِي السَّبْيِ أَخَذَتْهُ، فَأَلْزَقَتْهُ بِبَطْنِهَا، فَأَرْضَعَتْهُ، فقالَ رَسُولُ اللهِ ﷺ: «أَتَرَوْنَ هٰذِهِ المَرْأَةَ طَارِحَةً وَلَدَهَا فِي النَّارِ؟» قُلْنَا: لَا وَاللهِ! فَقَالَ: «لَلّٰهُ أَرْحَمُ بِعِبَادِهِ مِنْ هٰذِهِ بِوَلَدِهَا» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసు పూర్వాపరాలు పరిశీలిస్తే తెలిసేదేమిటంటే, ఆ మహిళా ఖైదీ పిల్లవాడు తప్పిపోయాడు. మరోవైపు పాలు పట్టని కారణంగా ఆమె పాలిండ్లలో పాలు నిండిపోయి ఎదలో నొప్పి మొదలయ్యింది. ఆ ఎద బాధను తగ్గించుకోవటానికి ఆమె ఏ చంటి పిల్లవాడు కనబడినా హృదయానికి హత్తుకొని పాలు పట్టేది. ఆఖరికి తన పిల్లవాడు దొరికిన తరువాత అతన్ని తన గుండెలకు హత్తుకొని పాలు త్రాపించటం మొదలు పెట్టింది.
2. హదీసులో పేర్కొనబడిన మహిళా ఖైదీ కనబడిన పిల్లవాడినల్లా ఎత్తుకొని పాలు పట్టింది. దాని మూలంగా ఆమె పాలు త్రాగిన పిల్లలమధ్య స్తన్య పంబంధ బంధుత్వమేర్పడే అవకాశముంది. ఫలితంగా భవిష్యత్తులో వారి మధ్య వివాహ సంబంధాలూ నిషిద్ధమయి పోతాయి. ఒక విధంగా చెప్పాలంటే, ఆమె చేసిన పని మున్ముందు అనేక ప్రమాదాలకు

దారితీయవచ్చు. కాని దైవప్రవక్త (స) అది గమనించి కూడా ఊరుకున్నారు. పిల్లలకు పాలుపట్టకుండా ఆమెను ఆపలేదు. ఎందుకంటే ఆమె తనకు ఛాతీలో విపరీతమైన నొప్పి కలిగినందువల్లే అలా చేసింది. ఆ విధంగా ఆమె పిల్లలకు పాలు పట్టి ఉండకపోతే ఆమె ఆరోగ్యానికి ప్రమాదం ఏర్పడేది. అందుకే దైవప్రవక్త (స) ఆమెను వారించలేదు. దీనిద్వారా అనివార్య పరిస్థితుల్లో పెద్ద ప్రమాదాల నుంచి తప్పించుకోవటానికి చిన్నపాటి తప్పులు చేయవచ్చని తెలుస్తోంది.

3. ఈ హదీసులో 'దాసుడు' అనే పదం విస్తృత అర్థంలో వాడబడింది. అది ముస్లిములతో పాటు ముస్లిమేతరులకూ వర్తిస్తుంది. అంటే దేవుడు ఇహలోకంలో మానవులందరినీ సమానంగా ప్రేమిస్తున్నాడని అర్థం. అయితే పరలోకంలో మాత్రం దేవుని ఈ ప్రేమ విశ్వాసులకు ప్రత్యేకమయిపోతుంది. అవిశ్వాసులకు పరలోకంలో దైవకారుణ్యాన్ని పొందే అవకాశం ఉండదు. దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు:

"(ఇహలోకంలో) నా కారుణ్యం ప్రతి వస్తువునూ ఆవరించి ఉంది. నా పట్ల అవిధేయతకు దూరంగా ఉండేవారి కొరకూ, జకాత్ దానం చెల్లించేవారి కొరకూ, నా సూక్తులను విశ్వసించేవారి కొరకూ నేను దానిని (పరలోకం కోసం) వ్రాసి ఉంచుతాను."

(అల్ ఆరాఫ్ : 156)

٤٢٠ - وعن أَبي هريرة رضيَ اللهُ عنه قال: قال رسُولُ اللهِ ﷺ: «لَمَّا خَلَقَ اللهُ الخَلْقَ، كَتَبَ فِي كِتَابٍ، فَهُوَ عِنْدَهُ فَوْقَ العَرْشِ: إنَّ رَحْمَتِي تَغْلِبُ غَضَبِي».

وفي روايةٍ: «غَلَبَتْ غَضَبِي». وفي روايةٍ: «سَبَقَتْ غَضَبِي» متفقٌ عليه.

420. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు: దేవుడు విశ్వాన్ని సృష్టించినప్పుడు తన దగ్గర, సింహాసనం మీద ఉన్న ప్రత్యేక గ్రంథంలో "(నిశ్చయంగా) నా ఆగ్రహం కన్నా నా అనుగ్రహమే ఎక్కువగా ఉంటుంది" అని రాశాడు.

వేరొక ఉల్లేఖనంలో "నా ఆగ్రహంపై పైచేయిగా ఉంటుంది" అని పేర్కొనబడింది. ఇంకొక ఉల్లేఖనంలో "(నా అనుగ్రహం) నా ఆగ్రహాన్ని మించి పోయింది" అని ఉంది.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని తౌహీద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ కితాబ్ (గ్రంథం) అంటే బహుశా దేవుని నిర్ణయమై ఉండవచ్చని ఇమామ్ ఖత్తాబీ (రహ్మలై) అభిప్రాయపడుతున్నారు. దివ్యఖుర్ఆన్‌లో ఒకచోట "అంతిమంగా నేనూ, నా ప్రవక్తలు ఆధిక్యం వహించి తీరుతామని దేవుడు రాసిపెట్టాడు" అన్న వాక్యం ఉంది. ఇక్కడ రాసిపెట్టడమంటే నిర్ణయం గైకొనటమని అర్థం. అలాగే ఈ హదీసులో కూడా గ్రంథంలో వ్రాసిపెట్టడమంటే నిర్ణయించుకోవటమని అర్థం కావచ్చు. లేదా గ్రంథమంటే దేవుడు యావత్తు సృష్టి విధివ్రాతను రాసి ఉంచిన 'లౌహె మహ్ఫూజ్' (సురక్షిత ఫలకం) అయినా కావచ్చు. దేవుడు సప్తాకాశాలపై మహోన్నతమైన పీఠాన్ని అధీష్టించి ఉన్నాడు. ఆయన దగ్గరే ఈ గ్రంథం ఉంది. అయితే దేవుడు పీఠంపై అధీష్టించి ఉన్న స్థితి, దేవుడు రాసే తీరు మానవ ఊహకందని అగోచర విషయాలు. అయినప్పటికీ వాటిని విశ్వసించటం విధి. ఈమాన్ బిల్ గైబ్ (అగోచరాన్ని విశ్వసించటం) అంటే అదే! (ఫత్‌హుల్ బారీ)

٤٢١ ـ وعنه قال: سَمِعْتُ رسُولَ اللهِ ﷺ يقول: «جَعَلَ اللهُ الرَّحْمَةَ مِائَةَ جُزْءٍ، فَأَمْسَكَ عِنْدَهُ تِسْعَةً وَتِسْعِينَ، وَأَنْزَلَ في الأَرْضِ جُزْءاً وَاحِداً، فَمِنْ ذٰلِكَ الجُزْءِ يَتَرَاحَمُ الخَلَائِقُ حَتَّى تَرْفَعَ الدَّابَّةُ حَافِرَهَا عَنْ وَلَدِهَا خَشْيَةَ أَنْ تُصِيبَهُ». وفي روايةٍ: «إِنَّ للهِ تَعَالى مِائَةَ رَحْمَةٍ أَنْزَلَ مِنْهَا رَحْمَةً وَاحِدَةً بَيْنَ الجِنِّ والإِنْسِ وَالبَهَائِمِ وَالهَوامِّ، فَبِهَا يَتَعَاطَفُونَ، وَبِهَا يَتَرَاحَمُونَ، وَبِهَا تَعْطِفُ الوَحْشُ عَلَى وَلَدِهَا، وَأَخَّرَ اللهُ تَعَالى تِسْعاً وتِسْعِينَ رَحْمَةً يَرْحَمُ بِهَا عِبَادَهُ يَوْمَ القِيَامَةِ» متفقٌ عليه.

421. దైవప్రవక్త (స) ఈ విధంగా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ హురైరా (రజి) గారే తెలియజేశారు: దేవుడు కారుణ్యాన్ని వంద భాగాలుగా విభజించాడు. వాటిలో తొంభైతొమ్మిది భాగాలు తన దగ్గర ఉంచుకొని తతిమ్మా ఒక భాగం మాత్రం భూమిపై అవతరింపజేశాడు. ఆ ఒక్క భాగం వల్లనే దేవుని సృష్టిరాసులు పరస్పరం కారుణ్య భావంతో మసలుకుంటున్నాయి. ఆఖరికి ఈ కారుణ్యం మూలంగానే జంతువు తన పిల్లకు ఎక్కడ బాధ కలుగుతుందోనన్న భయంతో తన కాలిగిట్టను జాగ్రత్తగా పైకి ఎత్తుకుంటుంది.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దేవుని దగ్గర వంద కారుణ్యాలున్నాయి. ఆయన వాటిలో ఒక కారుణ్య భాగాన్ని జిన్నాతులు, మానవులు, పశువులు, కీటకాల మధ్య అవతరింపజేశాడు. ఆ

ورواهُ مسلم أيضاً من رواية سَلْمَانَ الفَارِسيِّ رضي اللهُ عنه قالَ: قالَ رَسُولُ اللهِ ﷺ: «إنَّ لِلهِ تَعَالى مِائَةَ رَحْمَةٍ فَمِنْهَا رَحْمَةٌ يَتَرَاحَمُ بِهَا الخَلْقُ بَيْنَهُمْ، وَتِسْعٌ وَتِسْعُونَ لِيَوْمِ القِيَامَةِ». وفي روايةٍ: «إنَّ اللهَ تَعَالَى خَلَقَ يَوْمَ خَلَقَ السَّمٰواتِ وَالأرْضَ مِائَةَ رَحْمَةٍ كُلُّ رَحْمَةٍ طِبَاقُ مَا بَيْنَ السَّماءِ إلى الأرْضِ، فَجَعَلَ مِنها في الأرْضِ رَحْمَةً، فَبِها تَعْطِفُ الوَالِدَةُ عَلى وَلَدِهَا، وَالْوَحْشُ وَالطَّيْرُ بَعْضُهَا عَلَى بَعْضٍ، فَإذَا كَانَ يَوْمُ القِيَامَةِ، أكْمَلَهَا بِهٰذِهِ الرَّحْمَةِ».

ఒక్క కారుణ్య భాగం మూలంగానే వారు ఒకరిపట్ల మరొకరు దయాదాక్షిణ్యాలతో మసలుకుంటున్నారు. దాని మూలం గానే ఒక పశువు తన పిల్లపై ప్రేమ కనబరుస్తుంది. మిగిలిన తొంభైతొమ్మిది కారుణ్యాలను దేవుడు తన దగ్గర ఉంచుకున్నాడు. వాటిని ఆయన ప్రళయ దినాన తన దాసుల్ని కరుణించ టానికి ఉపయోగిస్తాడు.

(బుఖారీ - ముస్లిం)

ఈ హదీసును ఇమామ్ ముస్లిం (రహ్మాలై) సల్మాన్ ఫార్సీ (రజి) ద్వారా కూడా ఉల్లేఖించారు. దాని ప్రకారం దైవప్రవక్త (స) ఈ విధంగా ప్రవచించారు : నిస్సందేహంగా దేవుని దగ్గర వంద కారుణ్యాలున్నాయి. వాటిలో ఒక కారుణ్యం మూలంగానే సృష్టిలోని జీవరాసులు పరస్పరం కనికార భావంతో మసలుకుంటున్నాయి. మిగతా తొంభై తొమ్మిది కారుణ్యాలూ ప్రళయదినం కోసం (భద్రంగా) ఉంచబడ్డాయి.

ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దేవుడు ఆకాశాలనూ భూమినీ సృష్టించిననాడు వంద కారుణ్యాలను కూడా సృష్టించాడు. ఒక్కొక్క కారుణ్యం భూమ్యాకాశాల మధ్య నున్న ఖాళీ స్థలం నిండా ఉంటుంది. ఆ తరువాత దేవుడు వాటిలో ఒక కారుణ్యాన్ని భూమిపై అవతరింపజేశాడు. ఆ ఒక్క కారుణ్యం మూలంగానే తల్లి తన బిడ్డపై వాత్సల్యం చూపుతుంది. పశుపక్ష్యాదులు పరస్పరం

కనికారభావంతో మసలుకుంటున్నాయి. ప్రళయదినాన దేవుడు తన దగ్గరున్న తొంభైతొమ్మిది కారుణ్యాలతో ఈ ఒక్క కారుణ్యాన్ని కూడా కలిపి పరిపూర్ణం చేస్తాడు. (ఆ పరిపూర్ణ కారుణ్యంతో తన దాసుల్ని కరుణిస్తాడు.)

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. మానవులు తమ తోటి మానవుల పట్ల, తమ చుట్టూ ఉన్న జీవరాసుల పట్ల దయాదాక్షిణ్యాలతో మెలగటం కూడా దైవానుగ్రహమేనని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. సృష్టిలోని జీవరాసులన్నీ ఒండొకరి పట్ల కారుణ్యం, కనికారాలతో మసలుకోవాలన్న ఉద్దేశ్యంతోనే దేవుడు తన కారుణ్యంలోని ఒక భాగాన్ని భూమిపై అవతరింపజేశాడు. ఇకపోతే మానవుల్లో రాతి గుండె కల వాడెవడయినా ఏమాత్రం దయలేకుండా ప్రవర్తిస్తున్నాడంటే అది అతని దౌర్భాగ్యం అనుకోవాలి. దైవప్రవక్త (స) ఒకానొక సందర్భంగా మృదుస్వభావి కాని వ్యక్తి ఎన్నో మేళ్ళను కోల్పోతాడని చెప్పారు.
2. ప్రళయదినాన దేవుడు తన దాసులపట్ల పరిపూర్ణ కారుణ్యంతో వ్యవహరిస్తాడంటే మానవులకు ఇందులో గొప్ప శుభవార్త ఉందన్నమాట వాస్తవమే! కాని దీన్ని ఆసరాగా చేసుకొని దైవాజ్ఞల్ని ఉల్లంఘిస్తూ, దేవుని హద్దుల్ని అతిక్రమిస్తూ పోయేవారు ప్రళయదినాన ఆయన ఆగ్రహం కూడా చాలా తీవ్రంగా ఉంటుందని తెలుసుకోవాలి. ఒకవైపు విధుల్ని నిర్వర్తించకుండా, వైముఖ్య ధోరణిని, అహంకార భావాన్ని ప్రదర్శిస్తూ మరోవైపు దైవకారుణ్యం తమకోసం దిగివస్తుందని అనుకుంటే ముండ్లకంపను నాటి మధురాతిమధురమైన పండ్లు కాస్తాయని ఆశించినట్లుంటుంది!

٤٢٢ ـ وعنه عن النَّبِيِّ ﷺ، فِيما يَحكِي عَنْ رَبِّهِ تَبَارَكَ وَتَعَالَى، قال: «أَذْنَبَ عَبْدٌ ذَنْباً، فقالَ: اللَّهُمَّ اغفِرْ لي ذَنبي، فقالَ

422. దైవప్రవక్త (స) దేవుని పలుకులను ఈ విధంగా ఉల్లేఖించారని హజ్రత్ అబూ హురైరా (రజి) గారు తెలియజేశారు:

దాసుడు తప్పు చేసిన తరువాత "ప్రభూ! నా పాపాన్ని క్షమించు అని వేడుకుంటే దానికి సమాధానంగా దేవుడు, "నా దాసుడు తప్పు చేసినప్పటికీ తనను క్షమించే ప్రభువు ఒకడు ఉన్నాడనీ,

ఆయన తనను ఆ పాపం విషయమై నిలదీయగలడన్న విషయాన్ని మాత్రం మర్చిపోలేదు" అని అంటాడు. తరువాత ఆ దాసుడు మళ్ళీ తప్పుచేసి, "ప్రభూ! నా పాపాన్ని క్షమించు" అని వేడుకున్నప్పుడు దానికి సమాధానంగా దేవుడు, "నా దాసుడు తప్పయితే చేశాడు గాని తనను క్షమించే ప్రభువు ఉన్నాడనీ, ఆయన తనను ఆ పాపం విషయమై నిలదీయగలడన్న విషయాన్ని మాత్రం మర్చిపోలేదు" అని అంటాడు. దాసుడు మళ్ళీ ఏదో ఒక పాపానికి ఒడిగట్టి తరువాత "ప్రభూ! నా పాపాన్ని క్షమించు" అని వేడుకుంటే అప్పుడు దానికి సమాధానంగా, "నా దాసుడు పాపమయితే చేశాడుగాని తనను క్షమించే దేవుడున్నాడని, ఆ పాపం విషయమై ఆయన తనను పట్టు కుంటాడన్న విషయాన్ని మాత్రం మర్చి పోలేదు, కనుక నేను నా దాసుణ్ణి క్షమించేశాను. అతను ఇక తన యిష్టం వచ్చినట్లు చేసుకోవచ్చు" అని అంటాడు. (బుఖారీ - ముస్లిం)

తనకు యిష్టం వచ్చినట్లు చేసుకో వచ్చంటే అర్థం అతను తప్పులు చేస్తూ తిరిగి పశ్చాత్తాపపడుతూ ఉన్నంతకాలం నేను అతన్ని క్షమిస్తూనే ఉంటాను. ఎందుకంటే పశ్చాత్తాపం (తౌబా) పూర్వపు పాపాలన్నిటినీ తుడిచిపెట్టేస్తుంది.

الله تَبَارَكَ وَتَعَالَى: أَذْنَبَ عَبْدِي ذَنْباً، فَعَلِمَ أَنَّ لَهُ رَبّاً يَغْفِرُ الذَّنْبَ، وَيَأْخُذُ بِالذَّنْبِ، ثُمَّ عَادَ فَأَذْنَبَ، فقالَ: أَيْ رَبِّ! اغْفِرْ لِي ذَنْبِي، فقالَ تَبَارَكَ وَتَعَالَى: أَذْنَبَ عَبْدِي ذَنْباً، فَعَلِمَ أَنَّ لَهُ رَبّاً يَغْفِرُ الذَّنْبَ، وَيَأْخُذُ بِالذَّنْبِ، ثُمَّ عَادَ فَأَذْنَبَ، فقالَ: أَيْ رَبِّ! اغْفِرْ لِي ذَنْبِي، فقالَ تَبَارَكَ وَتَعَالَى: أَذْنَبَ عَبْدِي ذَنْباً، فَعَلِمَ أَنَّ لَهُ رَبّاً يَغْفِرُ الذَّنْبَ، وَيَأْخُذُ بِالذَّنْبِ، قَدْ غَفَرْتُ لِعَبْدِي فَلْيَفْعَلْ مَا شَاءَ» متفقٌ عليه. وقوله تعالى: «فَلْيَفْعَلْ مَا شَاءَ» أي: مَا دَامَ يَفْعَلُ هكَذَا، يُذْنِبُ وَيَتُوبُ أَغفِرُ لَهُ، فَإِنَّ التَّوبَةَ تَهْدِمُ مَا قَبْلَهَا.

(సహీహ్ బుఖారీలోని తౌహీద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)

## ముఖ్యాంశాలు

విశ్వాసి అయిన దాసుడు దేవుని ఆదేశాలకు కట్టుబడి జీవితం గడుపుతున్నప్పటికీ మానవ సహజమైన దౌర్బల్యం వల్ల మాటిమాటికీ తప్పులు జరిగిపోతుంటే, తప్పు జరిగిన ప్రతిసారీ దేవుని సన్నిధిలో హాజరై, పశ్చాత్తాప భావంతో కుమిలిపోతూ తన తప్పుకు క్షమాభిక్ష పెట్టమని ప్రాధేయపడితే దేవుడు అలాంటి దాసుణ్ణి తప్పకుండా క్షమిస్తాడు. ఎందుకంటే ఆ విశ్వాసి కావాలని తప్పు చేయలేదు. తప్పుచేసి పశ్చాత్తాపపడకుండా ఊరుకోనూ లేదు. పైగా ఆ తప్పు గురించి దేవుడు తనను ప్రశ్నిస్తాడన్న భయంతో వణకిపోయాడు. ఇది అతని నిష్కల్మష పాపభీతికి అద్దం పడుతుంది. ఆ సద్గుణాన్ని చూసి దేవుడు అతణ్ణి క్షమించడానికి అంగీకరిస్తు న్నాడు. అంతేకాదు, దాసుడు నా సన్నిధిలో తన నిస్సహాయతను, అశక్తతను వెల్లడిస్తూ పశ్చాత్తాప పడుతూ ఉన్నంతకాలం నేనతణ్ణి క్షమిస్తూనే ఉంటానని ప్రకటిస్తున్నాడు.

దీనికి భిన్నంగా కొందరు మాటిమాటికీ పాపాలు చేస్తున్నప్పటికీ వారిలో పశ్చాత్తాపభావం మచ్చుకైనా కానరాదు. తమ పాపాలను క్షమించమని వారు దైవాన్ని వేడుకోనయినా వేడుకోరు. కనీసం ఈ పాపాల గురించి దేవుడు తమల్ని ప్రశ్నిస్తాడన్న భయం కూడా వారిలో ఉండదు. పైపెచ్చు తప్పుచేసిన తరువాత తలబిరుసుతనాన్ని, అహంకారాన్ని ప్రదర్శిస్తూ ఉంటారు. ఇలాంటి వారిని మాత్రం దేవుడు సుతరామూ క్షమించడు.

٤٢٣ ـ وعنه قال: قال رسولُ الله ﷺ: «وَالَّذي نَفْسي بِيَدِهِ! لَوْ لَمْ تُذْنِبُوا، لَذَهَبَ اللهُ بِكُمْ، وَلَجَاءَ بِقَوْمٍ يُذْنِبُونَ، فَيَسْتَغْفِرُونَ اللهَ تَعَالَى، فَيَغْفِرُ لَهُمْ» رواه مسلم.

423. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : ఎవరి గుప్పెట్లో నయితే నా ప్రాణముందో ఆయున సాక్షిగా చెబుతున్నాను. ఒకవేళ మీరు పాపాలు చేయకపోతే దేవుడు మిమ్మల్ని తొలగించి (మీ స్థానంలో) ఇతరుల్ని తీసుకొచ్చి పెడతాడు. వారు పాపాలు చేసి తమకు క్షమాభిక్షపెట్టమని దైవాన్ని వేడుకుంటారు. దేవుడు కూడా వారిని క్షమిస్తాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో మానవుల సహజ లక్షణాన్ని గురించి వివరించటం జరిగింది. మానవ సహజమైన దౌర్బల్యం వల్ల మనుషులు పాపాలు చేయటమనేది మామూలే! తప్పులు, పొరపాట్లు

చేయనివాడు అసలు మానవుడే కాడు. మానవులే గనక తప్పు చేసేవారు అయిఉండకపోతే దేవుడు మానవజాతిని తొలగించి ఈ భూమిమీద తప్పులు చేసే వేరొక జాతిని పుట్టించి ఉండేవాడు. అంటే దేవుడు పాపాలు చేయటాన్ని ప్రేమిస్తాడని దీని అర్థం ఎంతమాత్రం కాదు. తప్పుచేసిన తరువాత మానవుడు పశ్చాత్తాపభావంతో తన ప్రభువు వైపునకు మరలుతాడే... ఆ మలుపునే ఆయన ఎంతగానో యిష్టపడతాడు.

٤٢٤ ـ عن أبي أيُّوبَ خَالدِ بنِ زيد رضي الله عنه، قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقول: «لَوْلا أَنَّكُمْ تُذْنِبُونَ، لَخَلَقَ اللهُ خَلْقاً يُذْنِبُونَ، فَيَسْتَغْفِرُونَ، فَيَغْفِرُ لَهُمْ» رواه مسلم.

424. దైవప్రవక్త (స) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ అయ్యూబ్ అన్సారీ (రజి) తెలియజేశారు: మీరు గనక పాపాలు చేయకపోతే దేవుడు (మీ స్థానంలో) ఇంకొకర్ని సృష్టించి ఉండేవాడు. వారు తప్పుచేసి మన్నింపుకోసం వేడుకుంటూ ఉంటే దేవుడు వారిని మన్నించేవాడు.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)*

٤٢٥ ـ وعن أبي هريرة رضي الله عنه، قال: كُنَّا قُعُوداً مَعَ رسولِ الله ﷺ، مَعَنَا أَبو بكرٍ وَعُمَرُ، رضي الله عنهما، في نَفَرٍ، فَقَامَ رسولُ اللهِ ﷺ، مِنْ بَيْنِ أَظْهُرِنَا، فَأَبْطَأَ عَلَيْنَا، فَخَشِينَا أَنْ يُقْتَطَعَ دُونَنَا، فَفَزِعْنَا، فَقُمْنَا، فَكُنْتُ أَوَّلَ مَنْ فَزِعَ، فَخَرَجْتُ أَبْتَغِي رسولَ اللهِ ﷺ، حَتَّى أَتَيْتُ حَائِطاً لِلأَنْصَارِ ـ وَذَكَرَ الحَديثَ بطُوله إلى قوله :ـ فقال رسولُ اللهِ ﷺ: «اذْهَبْ فَمَنْ لَقِيتَ وَرَاءَ هٰذَا الحَائِطِ يَشْهَدُ أَنْ لا إِلٰهَ إِلَّا

425. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : మేమొకసారి దైవప్రవక్త (స)తో పాటు కూర్చొని ఉన్నాం. ఆ సమయంలో అబూబక్ర్ (రజి) మరియు ఉమర్ (రజి)లు కూడా కొంతమందితో పాటు అక్కడే ఉన్నారు. అంతలో దైవప్రవక్త (స) మా మధ్యనుంచి లేచి ఎక్కడికో వెళ్ళి పోయారు. వెళ్ళి చాలా సేపయినా తిరిగిరాలేదు. ఆయన ఒంటరిగా ఉండటం చూసి శత్రువులు ఆయనకేదయినా నష్టం తలపెట్టారేమోనన్న భయం మమ్మల్ని పీడించ సాగింది. మేము కంగారుపడి (ఆయన్ని వెతుకుదామని) లేచి నిలబడ్డాం. దైవ

ప్రవక్త (స) గురించి అందరికంటే ముందు తల్లడిల్లింది నేనే. కనుక నేను దైవప్రవక్త (స)ను వెతుక్కుంటూ అన్సార్లకు చెందిన ఒక తోట దగ్గరికి చేరుకున్నాను. (ఆ తరువాత హజ్రత్ అబూహురైరా (రజి) జరిగిన కథంతా వివరించారు. అందులో ఆఖరికి దైవ ప్రవక్త (స) తనతో ఇలా అన్నారని తెలియజేశారు:) "వెళ్ళు. ఈ తోట బయట నీకు గట్టి నమ్మకంతో దేవుడు తప్ప నిజమైన ఆరాధ్యదేవుడు మరెవ్వడూ లేడని సాక్ష్యం చెప్పేవాళ్ళు ఎవరు కానవచ్చినా వారికి స్వర్గ శుభ వార్తను వినిపించు." *(ముస్లిం)*

اللهُ، مُسْتَيْقِناً بِهَا قَلْبُهُ فَبَشِّرْهُ بِالجَنَّةِ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. విశ్వాసులయిన వారు చివరికి స్వర్గానికి వెళతారన్నదే ఈ హదీసు భావం కూడాను. వారు ప్రారంభంలోనయినా స్వర్గంలో ప్రవేశించవచ్చు లేదా కొంతకాలం నరకంలో శిక్ష అనుభవించిన తరువాత అయినా స్వర్గానికి వెళ్ళవచ్చు. అది దేవుని యిష్టాయిష్టాలపై ఆధారపడి ఉంటుంది. అయితే విశ్వాసులకు శాశ్వత నరక శిక్ష మాత్రం ఉండదు.
2. ప్రస్తుత కాలంలో దైవప్రవక్త (స) 'సర్వాంతర్యామి' అనే మూఢ నమ్మకం మొదలయ్యింది. కొందరు అమాయకులు తమ అజ్ఞానం వల్ల దైవప్రవక్త (స) అన్నిచోట్లా ఉంటారని, మరణించిన తరువాత కూడా ఆయన విశ్వమంతా వ్యాపించి ఉన్నారని గుడ్డిగా నమ్ముతున్నారు. ఈ హదీసు వారి మూఢ నమ్మకాలను త్రోసిపుచ్చుతోంది. దైవప్రవక్త (స) సర్వాంతర్యామి అన్నమాట నిజమయితే ఆయన గైర్హాజరులో సహచరులు ఆయన గురించి కంగారుపడాల్సిన అవసరం ఏముంది?!
3. దైవప్రవక్త సహచరులు ఆయన్ను ఎల్లవేళలా కంటికి రెప్పలా కాపాడుకునేవారు. ఆయన ఎక్కడికయినా వెళ్ళి రావటంలో ఏ కాస్త ఆలస్యమయినా సహచరులు ఆయన క్షేమం గురించి కంగారు పడిపోయేవారు. ఈ ధోరణి దైవప్రవక్త పట్ల వారికిగల విపరీతమైన ప్రేమాభిమానాలకు అద్దం పడుతోంది.

٤٢٦ - وعن عبدِ الله بنِ عَمْرِو بنِ العاصِ رضي الله عنهما، أنَّ النبيَّ ﷺ تلا قَوْلَ اللهِ عَزَّ وَجَلَّ في إبراهيم ﷺ: ﴿رَبِّ إِنَّهُنَّ أَضْلَلْنَ كَثِيرًا مِّنَ ٱلنَّاسِ فَمَن تَبِعَنِى فَإِنَّهُۥ مِنِّى﴾ [إبراهيم: ٣٦]، وَقَوْلَ عيسى ﷺ: ﴿إِن تُعَذِّبْهُمْ فَإِنَّهُمْ عِبَادُكَ وَإِن تَغْفِرْ لَهُمْ فَإِنَّكَ أَنتَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ﴾ [المائدة: ١١٨]، فَرَفَعَ يَدَيْه وقال: «اللَّهُمَّ! أُمَّتِي أُمَّتِي» وَبَكَى، «فقال الله عَزَّ وَجَلَّ: يَا جبريلُ! اذْهَبْ إلى مُحَمَّدٍ وَرَبُّكَ أَعْلَمُ، فَسَلْهُ مَا يُبْكِيهِ؟» فَأَتَاهُ

426. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం ఒకానొక సందర్భంగా దైవప్రవక్త (స) దివ్య ఖుర్ఆన్‌లో హజ్రత్ ఇబ్రాహీం (అలైహి) గురించి అల్లాహ్ ప్రస్తావించిన సూక్తిని పఠించారు : ఆయన దైవాన్ని వేడు కుంటూ, "ప్రభూ! ఈ విగ్రహాలు ఎంతోమంది ప్రజల్ని మార్గభ్రష్టత్వానికి గురిచేశాయి. కనుక వారిలో నా విధా నాన్ని అనుసరించిన వాడే నా ధర్మంపై ఉన్నాడు (అతనికే నేను బాధ్యుణ్ణి) అని అన్నారు. (ఇబ్రాహీం : 36) తరువాత ఆయన దివ్య ఖుర్ఆన్‌లో ఈసా (అలైహి) పలుకుల్ని గురించి ప్రస్తావించే సూక్తిని పఠించారు: ఆయన ప్రళయ దినాన దేవునితో మాట్లాడుతూ, "నీవు వీరిని శిక్షించదలిస్తే (శిక్షించవచ్చు. ఎందుకంటే) వీరు నీ దాసులు. ఒకవేళ నీవు వీరిని క్షమించి వదలిపెట్టదలచు కుంటే (నీకు ఆ అధికారం కూడా ఉంది.) నిస్సందేహంగా నీవు గొప్ప శక్తి సంపన్నుడవు, తిరుగులేని వివేచనా పరుడవు" అని అంటారు.

*(అల్ మాయిదా : 118)*

ఈ వాక్యాలు పఠించిన తరువాత దైవప్రవక్త (స) చేతులెత్తి "దేవా! నా అనుచర సమాజం! నా అనుచర సమాజం" అని అంటుండగానే ఆయనకు దుఃఖం ముంచుకువచ్చింది. అది చూసి దేవుడు జిబ్రయీల్ దూతను

جبريلُ، فأخبَرَهُ رسولُ اللهِ ﷺ بمَا قال وَهُوَ أعْلَمُ، «فقال اللهُ تعالى: يَا جبريلُ! اذهَبْ إلى مُحَمَّدٍ فَقُلْ: إنَّا سَنُرْضِيكَ في أُمَّتِكَ وَلا نَسُوؤُكَ» رواه مسلم.

"జిబ్రయీల్! నీ ప్రభువుకు అంతా తెలుసు (అయితే నామమాత్రానికి) నువ్వు ముహమ్మద్ దగ్గరికి వెళ్లి ఆయన విలపించటానికి కారణమేమిటో అడుగు" అని ఆదేశించాడు. జిబ్రయీల్ (అలైహి) ఆయన దగ్గరికి వచ్చారు. ఆయన తాను (తన అనుచర సమాజం కోసం) ఏమని ప్రార్థించారో జిబ్రయీల్‌కు చెప్పారు. వాస్తవానికి దేవునికి అంతా తెలుసు. అప్పుడు దేవుడు జిబ్రయీల్ దూతతో మళ్ళీ ఇలా అన్నాడు : "జిబ్రయీల్! ముహమ్మద్ దగ్గరికి వెళ్ళి, దేవుడు మిమ్మల్ని మీ అనుచర సమాజం విషయంలో సంతుష్ట పరుస్తాననీ, మిమ్మల్ని అయిష్టానికి గురిచేయనని మాటిస్తున్నాడని చెప్పు."

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్తకు తన అనుచర సమాజం పట్ల ఎనలేని ప్రేమాభిమానాలుండేవి. తన అనుచర సమాజంలోని ప్రతి ఒక్కరికీ ప్రళయదినాన విముక్తి లభించాలని ఆయన పరితపించేవారు. మరోవైపు దేవునికి కూడా ముహమ్మద్ (సల్లం) పట్ల ప్రత్యేకమైన గౌరవం, అభిమానం ఉంది. ప్రళయదినాన దేవుని కారుణ్యం, దైవప్రవక్త ప్రేమాభిమానాలు తోడయినప్పుడు ముహమ్మద్ (సల్లం) అనుచర సమాజానికి ఎంతో మేలు కలుగుతుంది. ఎంతోమంది విశ్వాసుల విముక్తికి, స్వర్గప్రవేశానికి అది దోహదం చేస్తుంది.

٤٢٧ ـ وعن مُعَاذِ بنِ جَبَلٍ رضي الله عنه، قال: كُنْتُ رِدْفَ النبيِّ ﷺ على حِمارٍ فقَالَ: «يا مُعَاذُ! هَل تَدري مَا حَقُّ اللهِ عَلى

427. హజ్రత్ ముఆజ్ (రజి) కథనం : ఒకసారి నేను దైవప్రవక్త గాడిదపై ఆయన వెనుక కూర్చొని ఉండగా ఆయన నన్ను పిలిచి, "ముఆజ్! దేవునికి తన దాసులపై, దాసులకు దేవునిపై

عِبَادِهِ، وَمَا حَقُّ الْعِبَادِ عَلَى اللهِ؟» قلت: اللهُ وَرَسُولُهُ أَعْلَمُ. قال: «فَإِنَّ حَقَّ اللهِ عَلَى العِبَادِ أَن يَعْبُدُوهُ، وَلَا يُشْرِكُوا بِهِ شَيْئاً، وَحَقَّ العِبَادِ عَلَى اللهِ أَنْ لا يُعَذِّبَ مَنْ لا يُشرِكُ بِهِ شَيئاً»، فقلتُ: يا رسولَ اللهِ! أفَلا أُبَشِّرُ النَّاسَ؟ قال: «لا تُبَشِّرْهُمْ فَيَتَّكِلُوا» متفقٌ عليه.

ఉన్న హక్కులేమిటో నీకేమయినా తెలుసా?" అని అడిగారు. "దేవునికి, దైవప్రవక్తకే బాగా తెలుసు" అని అన్నాను నేను. అప్పుడాయన, "దైవానికి దాసులపై వున్న హక్కు ఏమిటంటే, దాసులు ఆయన్ని మాత్రమే ఆరాధించాలి. ఆయనకు మరెవరినీ సాటి కల్పించకూడదు. అలాగే దేవుడు కూడా తనకు ఇతరుల్ని సాటి కల్పించని దాసుల్ని శిక్షించకుండా ఉండాలి. ఇది దాసుల హక్కు" అని వివరించారు.

అప్పుడు నేను, "దైవప్రవక్తా! నేనీ శుభ వార్త ప్రజలకు తెలియజేయనా?" అని అడిగాను. అందుకాయన "వద్దు, నువ్వీ శుభవార్తను వారికి తెలియజేస్తే, ఇక వారు (ఆచరణలు మానుకొని) దీనిమీదే ఆధారపడి పోతారు" అని హెచ్చరించారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలో తౌహీద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సామాన్య ప్రజలు ఈ హదీసును చూసి ఒక్క 'షిర్క్' (బహుదైవారాధన) మినహా ఇతర ఏ పాపాలు చేసినా దేవుడు శిక్షించడని అపార్థం చేసుకునే అవకాశముంది. అందుకే దైవప్రవక్త ఈ విషయం సామాన్య ప్రజలకు తెలియజేయవద్దని ముఆజ్ (రజి)ని వారించారు. లేకపోతే ప్రజలు ఈ హదీసుమీదే ఆధారపడిపోయి ఆచరణకు దూరమయిపోయే ప్రమాదముంది. మనిషి దేవుడు తప్ప వేరొక ఆరాధ్యుడు లేడనీ, ముహమ్మద్ (సల్లం) దైవప్రవక్త అని సాక్ష్యం పలికి బహుదైవారాధనకు ఒడిగట్టకుండా ఉంటే అతనికి శాశ్వత నరకయాతన శిక్ష తప్పుతుందన్న మాట వాస్తవమే! అంతిమంగా అతనికి తప్పకుండా స్వర్గం లభిస్తుంది. కాని కొందరు అజ్ఞానులు విశ్వాసి ఎన్ని పాపాలు చేసినా అసలు అతన్ని శిక్షించడమే జరగదనీ, నికార్సయిన విశ్వాసులతో పాటు ప్రారంభంలోనే అతను కూడా స్వర్గంలో ప్రవేశిస్తాడని తలపోస్తుంటారు. ఇతర ఆధారాల ద్వారా ఈ భావన సరైనది కాదని తెలుస్తోంది. మొత్తానికి ఈ హదీసులో విశ్వాసికి నరకశిక్ష ఉండదంటే అర్థం, శాశ్వతనరక శిక్ష తప్పుతుందనేగాని అసలు శిక్షే ఉండదని మాత్రం కాదు.

428. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : సమాధిలో ముస్లింను (అతని విశ్వాసం గురించి) ప్రశ్నించినప్పుడు అతను అల్లాహ్ తప్ప నిజమైన ఆరాధ్యదేవుడు మరెవ్వడూ లేడనీ, ముహమ్మద్ (సల్లం) దైవప్రవక్త అని సాక్ష్యం పలుకుతాడు. దివ్య ఖుర్ఆన్ లోని "విశ్వాసులకు దేవుడు ఒక స్థిరమైన వాక్కు ద్వారా ఇహపరాల్లోనూ నిలకడను ప్రసాదిస్తాడు" (ఇబ్రాహీం : 27) అనే దైవసూక్తి చెప్పేది కూడా ఇదే!

*(బుఖారీ - ముస్లిం)*

٤٢٨ ـ وعن البَرَاءِ بن عازِبٍ رضي الله عنهما عن النبيِّ ﷺ، قال: «المُسْلِمُ إذَا سُئِلَ في القَبْرِ يَشْهَدُ أَنْ لا إلٰهَ إلَّا الله، وَأَنَّ مُحَمَّداً رسولُ الله، فذلك قولُه تعالى: ﴿يُثَبِّتُ ٱللَّهُ ٱلَّذِينَ ءَامَنُوا۟ بِٱلْقَوْلِ ٱلثَّابِتِ فِى ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا وَفِى ٱلْءَاخِرَةِ﴾ [إبراهيم: ٢٧]» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని ఇబ్రాహీం సూరా వ్యాఖ్యానం, సహీహ్ ముస్లింలోని స్వర్గసుఖాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన దివ్య ఖుర్ఆన్ సూక్తికి ఈ హదీసు ఒక వివరణ లాంటిది. మరణించిన వ్యక్తిని సమాధిలో పూడ్చిపెట్టిన తరువాత అతని దగ్గరకు ఇద్దరు దైవదూతలు వచ్చి అతని విశ్వాసం గురించి ప్రశ్నిస్తారు. మానవుల్లో ప్రతి ఒక్కరినీ ఈ విధంగా ప్రశ్నించటం జరుగుతుంది. అలాంటి సందర్భంలో విశ్వాసులకు దేవుడు ప్రత్యేకమైన బలిమిని ప్రసాదిస్తాడు. దాని ఆధారంగా వారు సరైన జవాబు చెప్పగల్గుతారు.

429. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు: అవిశ్వాసి ఏదయినా సత్కార్యం చేస్తే ఇహలోకంలోనే అతనికి ఏదో ఒకవిధంగా దాని ప్రతిఫలాన్ని తినిపించటం జరుగుతుంది. (పరలోకంలో దానికి ఎలాంటి ప్రతిఫలం మిగిలి ఉండదు). కాని అదే విశ్వాసి (ఏదయినా సత్కార్యం చేస్తే) దేవుడు అతని సత్కా

٤٢٩ ـ وعن أنسٍ رضي الله عنه عن رسولِ اللهِ ﷺ قال: «إنَّ الكافِرَ إذا عَمِلَ حَسَنَةً، أُطعِمَ بِهَا طُعمَةً مِنَ الدُّنْيَا، وَأَمَّا المُؤْمِنُ، فَإِنَّ اللهَ تَعَالَى يَدَّخِرُ لَهُ حَسَنَاتِهِ فِي الآخِرَةِ، وَيُعْقِبُهُ رِزْقاً في الدُّنْيَا عَلى طَاعَتِهِ». وفي روايةٍ: «إنَّ الله لا يَظْلِمُ مُؤْمِناً حَسَنَةً يُعطَى بِهَا في الدُّنْيَا، وَيُجْزَى

بِهَا فِي الآخِرَةِ، وَأَمَّا الكَافِرُ، فَيُطْعَمُ بِحَسَنَاتِ مَا عَمِلَ لِلهِ تعالى فِي الدُّنْيَا حَتَّى إِذَا أَفْضَى إِلى الآخِرَةِ، لَمْ يَكُنْ لَهُ حَسَنَةٌ يُجْزَى بِهَا» رواه مسلم.

ర్యాలను పరలోకం కోసం నిక్షేపంగా ఉంచుతాడు. (అంతేకాదు) అతని విధేయత మూలంగా ఇహలోకంలోనూ అతనికి ఉపాధిని ప్రసాదిస్తాడు.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దేవుడు ఏ విశ్వాసికీ అతని సత్కార్యాల విషయంలో అన్యాయం చెయ్యడు. ఇహలోకంలోనూ, పరలోకంలోనూ అతనికి అతను చేసిన సత్కార్యానికి బదులుగా ప్రతిఫలం లభిస్తుంది. కాని అవిశ్వాసి మాత్రం దేవుని కోసం చేసే సత్కార్యాల ప్రతిఫలాన్ని ఇహలోకంలోనే పొందుతాడు. ఆఖరికి పరలోకానికి వచ్చినప్పుడు ప్రతిఫలం పొందగలిగే సత్కార్యమేదీ అతని దగ్గర మిగిలుండదు.

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ప్రళయ వర్ణన ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ప్రపంచంలో అవిశ్వాసులు కూడా ఎన్నో ప్రజోపయోగ కార్యాలు చేస్తుంటారు. కాని సిరిసంపదల రూపేణాగాని, గౌరవమర్యాదల రూపేణాగాని ఇహలోకంలోనే దేవుడు వారికి దాని ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు. పరలోకంలో వారికోసం ఎలాంటి పుణ్యాన్ని మిగిల్చి ఉంచడు. ఎందుకంటే పరలోకంలో పుణ్యం పొందటానికి మనిషి తప్పకుండా దేవుణ్ణి, సత్యధర్మాన్ని విశ్వసించే వాడయి ఉండాలి. ఆ విశ్వాసం లేనివారు పరలోక పుణ్యానికి నోచుకోలేరు. ఆచరణ దైవసన్నిధిలో స్వీకృతిని పొందాలంటే దానికి విశ్వాస బలం తోడు కావాలి.

٤٣٠ - وعن جابرٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مَثَلُ الصَّلَوَاتِ الخَمْسِ كَمَثَلِ نَهْرٍ جَارٍ غَمْرٍ عَلَى بَابِ أَحَدِكُمْ يَغْتَسِلُ مِنْهُ كُلَّ يَوْمٍ خَمْسَ مَرَّاتٍ» رواه مسلم. «الغَمْرُ»: الكَثِيرُ.

430. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: ఐదు పూటలా నమాజ్ (చేయటం) మీ వాకిలిముందు నుంచి నిండుగా ప్రవహిస్తున్న కాలువలో రోజుకి ఐదుసార్లు స్నానం చేయటంతో సమానం. (ముస్లిం)

అల్ గమ్ర్ అంటే నిండుగా, అధికంగా అని అర్థం.

*(సహీహ్ ముస్లింలోని మస్జిదుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రతిరోజూ ఐదుపూటల నమాజ్ చేస్తే, దానివల్ల కలిగే ప్రయోజనం ఏమిటో ఈ హదీసులో వివరించటం జరిగింది. రోజూ ఐదుసార్లు స్నానం చేసే మనిషి శరీరంపై మురికి మాలిన్యాలు ఉండనట్లే ఐదుపూటల నమాజ్ చేస్తే చిన్నాచితకా పాపాలన్నీ సమసిపోతాయి. దేవుణ్ణి క్షమాభిక్ష కోరుకుంటే పెద్ద పాపాలు కూడా క్షమించబడతాయి. సాధారణంగా ఐదు పూటలా నమాజ్ చేసే వ్యక్తి ఘోరపాపాలకు పాల్పడడు. ఎప్పుడైనా పొరపాటున తన వల్ల పెద్ద పాపమేదయినా జరిగిపోయినా వెంటనే పశ్చాత్తాప భావంతో కుమిలిపోతూ దైవాన్ని క్షమాభిక్షపెట్టమని ప్రార్థిస్తాడు. ఆ విధంగా ఐదుపూటలా నమాజ్ పాటించేవ్యక్తి పాపాల నుండి ప్రక్షాళనం పొందుతాడు.

٤٣١ - وعن ابنِ عباسٍ رضي الله عنهما، قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقول: «مَا مِنْ رَجُلٍ مُسْلِمٍ يَمُوتُ فَيَقُومُ عَلَى جَنَازَتِهِ أَرْبَعُونَ رَجُلاً لَا يُشْرِكُونَ بِاللهِ شَيْئاً إِلَّا شَفَّعَهُمُ اللهُ فِيهِ» رواه مسلم.

431. దైవప్రవక్త (స) ఇలా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) తెలియజేశారు : మరణించిన ఒక ముస్లిం వ్యక్తి జనాజా నమాజ్‌లో అల్లాహ్‌కు ఇతర దేవుళ్ళను సాటికల్పించకుండా ఉండే నలభైమంది జనం గనక పాల్గొంటే దేవుడు అతని విషయంలో వారు చేసే సిఫారసును తప్పకుండా అంగీకరిస్తాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జానాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఎవరి జనాజా నమాజ్‌లోనయినా నలభైమంది ఏకేశ్వరోపాసకులు హాజరై మరణించిన వ్యక్తి మన్నింపు కోసం ప్రార్థిస్తే దేవుడు తప్పకుండా వారి ప్రార్థనను స్వీకరిస్తాడు. ఇక్కడ సిఫారసును అంగీకరించటమంటే భావం ఇదే! మరోవైపు మృతుడు కూడా సిఫారసు అంగీకరించబడటానికి అర్హుడయి ఉండాలన్న విషయాన్ని మాత్రం మరువరాదు.
2. జనాజా నమాజ్‌లో ఏకేశ్వరోపాసకులు ఎంత ఎక్కువమంది హాజరైతే మరణించిన వ్యక్తికి అంత మంచిదని పై హదీసుద్వారా బోధపడుతోంది.

٤٣٢ ـ وعن ابنِ مسعودٍ رضي اللهُ عنه قال: كُنَّا مَعَ رسولِ اللهِ ﷺ في قُبَّةٍ نَحواً مِنْ أَرْبَعينَ، فقال: «أَتَرضَوْنَ أَنْ تَكُونُوا رُبُعَ أَهْلِ الجَنَّةِ؟» قُلْنَا: نَعَمْ، قال: «أَتَرْضَوْنَ أَنْ تَكُونُوا ثُلُثَ أَهْلِ الجَنَّةِ؟» قُلْنَا: نَعَم، قال: «وَالَّذِي نَفْسُ مُحَمَّدٍ بِيَدِهِ! إِنِّي لأَرْجُو أَنْ تَكُونُوا نِصْفَ أَهْلِ الجَنَّةِ، وَذَلِكَ أَنَّ الجَنَّةَ لا يَدْخُلُهَا إِلَّا نَفْسٌ مُسْلِمَةٌ، وَمَا أَنْتُمْ فِي أَهْلِ الشِّرْكِ إِلَّا كَالشَّعْرَةِ البَيْضَاءِ فِي جِلْدِ الثَّوْرِ الأَسْوَدِ، أَوْ كَالشَّعْرَةِ السَّوْدَاءِ فِي جِلْدِ الثَّوْرِ الأَحْمَرِ» متفقٌ عليه.

432. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం : ఒకసారి మేము దాదాపు నలభై మంది (సహచరులం) దైవప్రవక్తతో పాటు ఓ గుడారంలో ఉన్నాము. ఆ సందర్భంలో దైవప్రవక్త (స) మాతో మాట్లాడుతూ, "మొత్తం స్వర్గవాసుల్లో మీరు నాల్గోవంతు సంఖ్యలో ఉంటారంటే అది మీకు సంతోషకరమేనా?" అని అడిగారు. దానికి మేము 'సంతోష కరమే' అని సమాధానమిచ్చాం. తిరిగి ఆయన "మరి మీరు స్వర్గవాసుల్లో మూడోవంతు సంఖ్యలో ఉంటారంటే అది మీకు సంతోషకరమేనా?" అని అడిగారు. దానికి 'సంతోషకరమే' అని అన్నాం. ఆ తరువాత ఆయన, "మరి స్వర్గంలో సగం మంది మీరే ఉంటారంటే అది మీకు సంతోషకరమేనా" అని మళ్ళీ అడిగారు. మేము 'సంతోషకరమే!' అని అన్నాం.

అప్పుడాయన ఇలా తెలియజేశారు : ఎవరి గుప్పెట్లోనయితే ముహమ్మద్ ప్రాణముందో ఆయన సాక్షిగా చెబుతున్నాను. మొత్తం స్వర్గవాసుల్లో సగం మంది మీరే ఉంటారని నేను ఆశిస్తున్నాను. ఎందుకంటే (దైవాజ్ఞల్ని) శిరసావహించినవాడే స్వర్గంలో ప్రవేశిస్తాడు. బహుదైవారాధకులతో పోల్చుకుంటే మీ సంఖ్య నల్లెద్దు చర్మంపై తెల్లవెంట్రుకలా లేదా ఎర్రెద్దు చర్మంపై నల్ల వెంట్రుకలా ఉంటుంది. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. బహుదైవారాధకులకు భిన్నంగా విశ్వాసులు అత్యల్ప సంఖ్యలో ఉంటారని ఈ హదీసు ద్వారా అవగతమవుతోంది. దివ్య ఖుర్ఆన్ కూడా ఈ విషయాన్ని స్పష్టం చేసింది.
2. రెండో విషయం ఏమిటంటే స్వర్గంలో ముహమ్మద్ అనుచర సమాజంలోని విశ్వాసులు అత్యధిక సంఖ్యలో దాదాపు సగం మంది ఉంటారు. ఇది ముహమ్మద్ (స) అనుచర సమాజానికి ఎంతో గొప్ప శుభవార్త!

٤٣٣ ـ وعن أبي موسى الأشعري رضي الله عنه، قال: قال رسولُ اللهِ ﷺ: «إذَا كَانَ يَوْمُ القِيَامَةِ دَفَعَ اللهُ إلى كُلِّ مُسْلِمٍ يَهُودياً أَوْ نَصرَانِياً فَيَقُولُ: هٰذَا فِكَاكُكَ مِنَ النَّارِ». وفي روايةٍ عنهُ عنِ النبيِّ ﷺ قال: «يَجيءُ يَوْمَ القِيَامَةِ نَاسٌ مِنَ المُسْلِمِينَ بِذُنُوبٍ أَمْثَالِ الجبَالِ يَغفِرُهَا اللهُ لَهُم» رواه مسلم.. قوله: «دَفَعَ إلى كُلِّ مُسْلِمٍ يَهُودِيّاً أَوْ نَصْرَانِيّاً فَيَقُولُ: هٰذَا فِكَاكُكَ مِنَ النَّارِ» مَعْنَاهُ مَا جَاءَ في حديث أبي هريرة رضي اللهُ عنهُ: «لِكُلِّ أَحَدٍ مَنْزِلٌ في الجَنَّةِ، وَمَنْزِلٌ في النَّارِ، فَالمُؤْمِنُ إذَا دَخَلَ الجَنَّةَ خَلَفَهُ الكَافِرُ في النَّارِ، لأَنَّهُ

433. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ప్రళయ దినాన దేవుడు ప్రతి ముస్లింకు ఒక యూదుణ్ణిగానీ, క్రైస్తవుణ్ణిగాని ఇచ్చి, "ఇతను నీ నరక శిక్షకు పరిహారంగా పనికొస్తాడు' అని అంటాడు.

వేరొక ఉల్లేఖనంలో అబూ మూసా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు: ప్రళయ దినాన కొంతమంది ముస్లింలు కొండల మాదిరి పాపాలను వెంటబెట్టుకొని వస్తారు. దేవుడు వారిని (కూడా) క్షమిస్తాడు. *(ముస్లిం)*

'దేవుడు ప్రతి ముస్లింకు ఒక యూదుణ్ణిగాని, క్రైస్తవుణ్ణిగాని అప్పగిస్తాడ'న్న మాటను అబూ హురైరా (రజి) ఉల్లేఖించిన వేరొక హదీసులోని విషయం విపులీకరిస్తోంది. ప్రతి మనిషికీ స్వర్గంలో ఒక స్థానం, నరకంలో ఒక స్థానం ఉంటుంది. ఒక విశ్వాసి స్వర్గానికి పోయినప్పుడు నరకంలో అతని స్థానాన్ని ఎవడో ఒక అవిశ్వాసి పూరించుకుంటాడు. అతని అవిశ్వాసం మూలంగానే అతనికా గతి పడుతుంది.

مُسْتَحِـقٌّ لِـذٰلِـكَ بِكُفْـرِهِ». وَمَعْنَـى «فِكَاكُكَ»: أَنَّكَ كُنْتَ مُعَرَّضاً لِدُخُولِ النَّارِ، وَهٰذَا فِكَاكُكَ؛ لِأَنَّ اللهَ تعالى قَدَّرَ لِلنَّارِ عَدَداً يَمْلَؤُهَا، فَإِذَا دَخَلَهَا الكُفَّارُ بِذُنُوبِهِمْ وَكُفْرِهِمْ، صَارُوا فِي مَعْنَى الفِكَاكِ لِلْمُسْلِمِينَ، والله أعلم.

'ఇతను నీ నరకశిక్షకు పరిహారమంటే' వాస్తవానికి నీవు నరకానికి పోవలసిన వాడివి. కాని ఈ అవిశ్వాసి నీ నరక శిక్షకు పరిహారమయ్యాడని అర్థం. దేవుడు నరకాన్ని ఓ నిర్ణీత సంఖ్యలో (అవిశ్వాసులతో) నింపాలని నిర్ణయించాడు. కాబట్టి అవిశ్వాసులు తమ అవిశ్వాస వైఖరి, తాము చేసుకున్న పాపాల మూలంగా నరకంలో ప్రవేశించినప్పటికీ వారు ముస్లింల పాలిట పరిహారంగా పరిగణించ బడతారు. వాస్తవం దేవునికే బాగా తెలుసు.

*(సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)*

٤٣٤ ـ وعـن ابـنِ عمـرَ رضـيَ الله عنهما قال: سمِعْتُ رسولَ اللهِ ﷺ يقول: «يُدْنَى المُؤْمِنُ يَوْمَ القِيَامَةِ مِنْ رَبِّهِ حَتَّى يَضَعَ كَنَفَهُ عَلَيْهِ، فَيُقَرِّرُهُ بِذُنُوبِهِ، فيقولُ: أتعرِفُ ذَنْبَ كَذَا؟ أتعـرِفُ ذَنْـبَ كَـذَا؟ فيقول: رَبِّ أَعْرِفُ، قال: فَإِنِّي قَد سَتَرْتُهَا عَلَيْكَ فِي الدُّنْيَا، وَأَنَا أَغْفِرُهَا لَكَ اليَوْمَ،

434. దైవప్రవక్త (స) ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) తెలియజేశారు : విశ్వాసి ప్రళయదినాన తన ప్రభువుకు దగ్గరవుతాడు. ఆయన అతన్ని తన కారుణ్య ఛాయల్లోకి తీసుకుంటాడు. ఆ తరువాత అతను తన పాపాలను ఒప్పుకునేలా చేస్తాడు. "ఫలానా నేరంతో నీకు సంబంధముంది కదూ! నువ్వు ఫలానా పాపం చేశావు కదూ!" అని అడుగుతాడు. దానికి విశ్వాసి "చేశాను ప్రభూ!" అని ఒప్పుకుంటాడు. అప్పుడు దేవుడు, "ప్రపంచంలో నీ పాపాలను (ప్రజల ముందు బహిర్గతం కాకుండా) దాచి ఉంచాను. మళ్ళీ ఈ రోజు వాటిని (కూడా) క్షమిస్తున్నాను" అని అంటాడు. ఆ తరువాత (దుష్కర్మలు క్షమించ

فَيُعطَى صَحِيفَةَ حَسَنَاتِهِ» متفقٌ عليه.

బడగా మిగిలిన) సత్కర్మల పత్రం అతనికి ఇవ్వబడుతుంది.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని హూద్ సూరా వ్యాఖ్యానం, సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రళయదినాన దేవుడు తానుకోరిన విశ్వాసుల పట్ల ప్రత్యేక వ్యవహారం చేస్తాడనీ, వారి పాపాలను ముందుగానే క్షమించి స్వర్గంలో ప్రవేశింపజేస్తాడనటానికి ఈ హదీసు ప్రబల తార్కాణం.

٤٣٥ ـ وعن ابنِ مسعودٍ، رضي الله عنه، أنَّ رَجُلاً أَصَابَ مِنِ امْرَأَةٍ قُبْلَةً، فَأَتَى النَّبيَّ ﷺ، فأخبرَه، فأنزل الله تعالى: ﴿ وَأَقِمِ ٱلصَّلَوٰةَ طَرَفَيِ ٱلنَّهَارِ وَزُلَفًا مِّنَ ٱلَّيْلِ إِنَّ ٱلْحَسَنَٰتِ يُذْهِبْنَ ٱلسَّيِّـَٔاتِ ﴾ [هود: ١١٤] فقال الرجل: أَلِي هذا يا رسولَ الله؟! قال: «لِجَمِيعِ أُمَّتِي كُلِّهِمْ» متفقٌ عليه.

435. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం : ఒక వ్యక్తి ఓ స్త్రీని ముద్దాడాడు. కాని తరువాత (పాపభీతితో) దైవప్రవక్త దగ్గరికి వచ్చి, తన తప్పుని ఒప్పుకున్నాడు. ఆ సందర్భంగా దేవుడు (దివ్య ఖుర్‌ఆన్‌లోని) ఈ సూక్తిని అవతరింపజేశాడు. "నమాజును స్థాపించు - పగలు రెండు సంధ్యావేళల్లోనూ, కొంత రాత్రి గడిచిన తరువాతనూ. నిస్సందేహంగా సత్కర్మలు, దుష్కర్మల్ని దూరం చేస్తాయి." (హూద్ : 114) "ఈ ఆదేశం నాకొక్కడికేనా దైవప్రవక్తా!" అని అడిగాడా వ్యక్తి. దానికి సమాధానంగా "(లేదు). నా అనుచర సమాజంలోని వారందరికీ" అని అన్నారు దైవప్రవక్త (సల్లం). *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ వ్యవధుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. నమాజ్ చేయటం వల్ల చిన్న చిన్న పాపాలన్నీ క్షమించబడతాయి.
2. దివ్య ఖుర్‌ఆన్‌లోని సూక్తులు ఓ ప్రత్యేక సందర్భానికి సంబంధించి అవతరించినవే అయినప్పటికీ అవి అన్ని కాలాల్లోనూ, అందరికీ వర్తిస్తాయి.

436. హజ్రత్ అనస్ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (స) దగ్గరికి వచ్చి, "దైవప్రవక్తా! నేను శిక్షార్హమైన తప్పు చేశాను. కాబట్టి నాకు శిక్ష విధించండి" అని విన్నవించుకున్నాడు. అంతలోనే నమాజ్‌కు వేళ అయింది. ఆ వ్యక్తి (కూడా) దైవప్రవక్తతో పాటు నమాజ్ చేశాడు. నమాజ్ ముగించుకున్న తరువాత "దైవప్రవక్తా! నేను శిక్షార్హమైన తప్పు చేశాను. కాబట్టి నాకు శిక్ష విధించండి" అని మళ్ళీ విన్నవించుకున్నాడా వ్యక్తి. దానికి ఆయన "నువ్వు మాతో పాటు నమాజ్ చేశావు కదూ!" అని అడిగారు. ఆ వ్యక్తి చేశానన్నాడు. "మరయితే నీ తప్పు క్షమించబడింది" అని అన్నారు దైవప్రవక్త (సల్లం).

(బుఖారీ - ముస్లిం)

٤٣٦ ـ وعن أنسٍ، رضي الله عنه، قال: جَاءَ رَجُلٌ إلى النبيِّ ﷺ فقال: يا رسولَ الله! أَصَبْتُ حداً، فَأَقِمْهُ عَلَيَّ، وَحَضَرتِ الصَّلاةُ، فَصَلَّى مَعَ رسولِ اللهِ ﷺ، فَلَمَّا قَضَى الصَّلاةَ قال: يا رسولَ الله! إنِّي أَصَبْتُ حداً، فأَقِمْ فيَّ كتَابَ الله. قال: «هَلْ حضَرْتَ مَعَنَا الصَّلاةَ» قال: نَعم. قال: «قد غُفِرَ لَكَ» متفقٌ عليه. وقوله: «أَصَبْتُ حَدّاً» معناه: مَعْصيةً تُوجبُ التَّعْزِير، وَلَيْسَ الْمُرَادُ الحَدَّ الشَّرْعِيَّ الحَقِيقِيَّ كَحَدِّ الزِّنَا والخمر وَغَيْرِهِمَا، فإنَّ هٰذِهِ الحُدودَ لا تَسْقُطُ بالصلاةِ، ولا يجوز لِلإمامِ تَرْكُهَا.

హదీసులోని 'అసబ్‌తు హద్దన్' అనే పదానికి నా వల్ల శిక్షార్హమైన పాపం జరిగిపోయిందని అర్థం. అయితే ఇక్కడ దాని భావం వ్యభిచారం, మద్యపానం లాంటి నేరాలకు విధించే షరీఅత్ పరమైన శిక్ష అని ఎంతమాత్రం కాదు. ఎందుకంటే అటువంటి పెద్ద నేరాలకు విధించే శిక్షలు నమాజ్ చేసినంత మాత్రాన తప్పవు. ఆఖరికి రాజ్యాధి నేతకు కూడా ఆ శిక్షను తొలగించే అధికారం లేదు.

*(సహీహ్ బుఖారీలోని 'పోరాటకుల' ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)*

٤٣٧ـ وعنه قال: قال رسولُ الله ﷺ: «إنَّ الله لَيَرْضَى عن الْعَبْدِ أَنْ يَأْكُلَ الأكلَةَ، فَيَحْمَدُهُ عليها، أَوْ يَشْرَبَ الشَّرْبَةَ، فَيَحْمَدُهُ عَلَيها» رواه مسلم. «الأَكْلَةُ»: بفتح الهمزة وهي المرةُ الواحدةُ مِنَ الأكلِ كَالْغَدوَةِ والْعَشْوَةِ، والله أعلم.

437. హజ్రత్ అనస్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : దాసుడు అన్నం తిని లేదా నీళ్లు త్రాగి దేవునికి కృతజ్ఞతలు చెప్పుకుంటే దేవుడు ఎంతగానో సంతోషిస్తాడు.

ఒకసారి అన్నం తినటాన్ని 'అక్లా' అని అంటారు. ఉదా : ఉదయంగాని, సాయంత్రంగాని తీసుకునే ఆహారం.

*(సహీహ్ ముస్లింలోని, దైవధ్యానం, ప్రార్థనల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

భోజనాదులు సేవించిన తరువాత 'అల్‌హమ్దు లిల్లాహ్' అంటూ దైవానికి కృతజ్ఞతలు తెలుపుకోవాలి. సంప్రదాయ బద్ధమైన ప్రార్థన ఏదయినా చేసుకుంటే ఇంకా మంచిది. ఉదాహరణకు ఈ ప్రార్థన:

"అల్‌హమ్దు లిల్లాహిల్లజీ అత్‌అమ వ సఖా వ సవ్వగహూ వ జఅల లహూ మఖ్‌రజా."

(అల్లాహ్‌కు కృతజ్ఞతలు. ఆయన తినిపించాడు, త్రాపించాడు. తిన్న ఆహారం సయించేలా చేశాడు. దాని విసర్జనకు ఒక మార్గాన్ని కూడా ఏర్పాటు చేశాడు.) (అబూ దావూద్)

ఇదిగాక ఇంకా ఎన్నో ప్రార్థనలు ఉన్నాయి. వాటిలో ఏదయినా చదువుకోవచ్చు.

ఇకపోతే 'దైవకారుణ్యం పట్ల ఆశాభావం' అనే అధ్యాయం క్రింద అన్నపానీయాలకు సంబంధించిన హదీసుని ప్రస్తావించటంలోని ఔచిత్యం ఏమిటంటే మనిషి తిన్నప్పుడు, త్రాగినప్పుడు, లేచినప్పుడు, పడుకున్నప్పుడు సర్వావస్థల్లోనూ దైవాన్ని స్మరిస్తూ ఉండాలి. అప్పుడే దైవకారుణ్యం పట్ల ఆశాభావాన్ని కల్గివుండటానికి అర్థం ఉంటుంది. అలాగే; దైవం గనక తలచుకుంటే ఈ అనుగ్రహాలన్నింటినీ తిరిగి లాక్కోగలడనీ లేదా అనుగ్రహాలు పుష్కలంగా ఉన్నా మనిషికి వాటిని అనుభవించే భాగ్యం దక్కకుండా చేయవచ్చన్న సంగతిని మరువరాదు. దైవం ఈ దుస్థితి నుండి మనల్ని రక్షించుగాక!

٤٣٨ ـ وعن أبي موسى، رضي الله عنه عن النبيِّ ﷺ، قال: «إنَّ الله تعالى،

438. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు: పగలు తప్పు చేసేవాడు పశ్చాత్తాపం చెందితే అతని పశ్చాత్తాపాన్ని అంగీకరించటానికి దేవుడు రాత్రి తన

يَبْسُطُ يَدَهُ بِاللَّيْلِ لِيَتُوبَ مُسِيءُ النَّهَارِ، وَيَبْسُطُ يَدَهُ بِالنهارِ لِيَتُوبَ مُسِيءُ اللَّيْلِ حتى تَطْلُعَ الشمسُ مَنْ مَغْرِبِها» رواه مسلم.

చేయిని చాస్తాడు. రాత్రి తప్పు చేసిన వాడు పశ్చాత్తాపం చెందితే అతని పశ్చాత్తాపాన్ని అంగీకరించటానికి పగలు తన చేయిని చాస్తాడు. ఈ పరంపర సూర్యుడు పశ్చిమం నుండి ఉదయించే వరకు (అంటే ప్రళయం వరకు) కొనసాగుతూనే ఉంటుంది. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సాధారణంగా మనం ఏదైనా వస్తువు తీసుకోవాలనుకున్నప్పుడు చేతులు చాస్తాము, వద్దనుకుంటే చేతులు ముడుచుకుంటాము. ఇక్కడ కూడా దేవుడు చేయి చాపుతాడంటే ఆయన దాసుల పశ్చాత్తాపాల్ని స్వీకరిస్తాడనే అర్థం.

ఇకపోతే దేవుడు చేయి చాపే తీరుని మనం ఊహించలేము. ఆ స్థితిని మనం విశ్వంలోని ఇతర వస్తువులతో కూడా పోల్చలేము. అయితే దేవుని ఇతర గుణగణాల మాదిరిగానే దీనిని కూడా విశ్వసించటం విధి. మరో విషయం ఏమిటంటే దేవుడు తన దాసుల పశ్చాత్తాపాన్ని ప్రళయం రానంతవరకూ స్వీకరిస్తూనే ఉంటాడు. ప్రళయానికి ముందు సూర్యుడు పడమటి నుంచి ఉదయించగానే ఈ పరంపర ఆగిపోతుంది. ఇక ఆ తరువాత విశ్వసించినా, పశ్చాత్తాపపడినా ప్రయోజనం ఉండదు. కనుక పాపాలపై పశ్చాత్తాప పడటంలో ఆలస్యం చేయకూడదు. సమయం మించిపోకమునుపే బాధాతప్త హృదయంతో పశ్చాత్తాపం చెందాలి.

٤٣٩ ـ وعن أبي نَجِيحٍ عَمْرِو بنِ عَبَسَةَ ـ بفتحِ العينِ والباءِ ـ السُّلَمِيِّ، رضيَ اللهُ عنه، قال: كنتُ وَأَنَا في الجاهِلِيَّةِ أَظُنُّ أَنَّ النَّاسَ عَلى ضَلالَةٍ، وأَنَّهُمْ لَيْسُوا على شيءٍ، وَهُمْ يَعْبُدُونَ الأوثانَ، فَسَمِعْتُ بِرَجُلٍ بِمَكَّةَ يُخْبِرُ أخباراً، فَقَعَدْتُ عَلى رَاحِلَتِي، فَقَدِمْتُ عَلَيْهِ، فإذا رسولُ اللهِ ﷺ، مُسْتَخْفِياً جُرَآءُ عليهِ قَوْمُهُ، فَتَلَطَّفْتُ حَتَّى دَخَلْتُ عَلَيْهِ

439. హజ్రత్ అబూ నజీహ్ అమ్ర్ బిన్ అబసా సులమీ (రజి) కథనం : (ఇస్లాంకు మునుపు) అజ్ఞాన కాలంలో నేను, ప్రజలు భ్రష్ట మార్గంలో నడుస్తున్నారని, వారు ఆచరిస్తున్నది (నిజ) ధర్మం కాదని అనుకుంటూ ఉండేవాణ్ణి. ఆ కాలంలో ప్రజలు విగ్రహాలను ఆరాధించేవారు. ఇది ఇలా ఉండగా ఒకసారి నేను మక్కాలో ఎవరో వ్యక్తి (విగ్రహారాధనకు వ్యతిరేకంగా) మాట్లాడుతున్నాడని విన్నాను. ఆ వార్త

بِمَكَّةَ، فقلتُ له: ما أَنتَ؟ قال: «أَنَا نَبِيٌّ» قُلتُ: وما نبيٌّ؟ قال: «أَرْسَلَنِي الله» قلتُ: وبأَيِّ شَيْءٍ أَرْسَلَكَ؟ قال: «أَرْسَلَني بِصِلَةِ الأَرْحامِ، وكَسْرِ الأَوْثانِ، وَأَنْ يُوَحَّدَ اللهُ لا يُشْرَكُ بِهِ شَيْءٌ» قلتُ: فَمَن مَعَكَ عَلَى هَذا؟ قال: «حُرٌّ وَعَبْدٌ» ومعه يَوْمَئِذٍ أبو بكرٍ وبِلالٌ، رضي الله عنهما، قلت: إنِّي مُتَّبِعُكَ، قال: «إِنَّكَ لَنْ تَسْتَطِيعَ ذلكَ يَوْمَكَ هٰذا؛ أَلا تَرَى حَالِي وحالَ النَّاسِ؟ ولٰكِنِ ارْجِعْ إلى أَهْلِكَ فإذا سَمِعْتَ بي قد ظَهَرْتُ فَأْتِني» قال: فَذَهَبْتُ إلى أَهْلِي، وَقَدِمَ رسولُ اللهِ ﷺ المَدِينَةَ، وكنتُ في أَهْلِي، فَجَعَلْتُ أَتَخَبَّرُ الأَخْبارَ، وَأَسْأَلُ النَّاسَ حينَ قَدِمَ المدينةَ، حَتَّى قَدِمَ نَفَرٌ مِنْ أَهْلِي المدينةَ، فقلتُ: مَا فَعَلَ هذا الرَّجُلُ

విని నేను నా వాహనంపై కూర్చొని ఆయన దగ్గరికి వెళ్ళాను. అక్కడికి వెళ్ళిన తర్వాత దైవప్రవక్త (స) తన ఉద్యమాన్ని రహస్యంగా నడుపుతున్నారని, ఆయన జాతివారు ఆయన్ని అణగద్రొక్కటానికి ప్రయత్నిస్తున్నారని తెలిసింది. అందుకని నేను కూడా రహస్యంగానే మక్కాలో దైవప్రవక్త (స) దగ్గరికి చేరుకున్నాను. (ఆ సందర్భంగా నేనాయన్ని కొన్ని ప్రశ్నలడిగాను.)

(ముందుగా) నేను "మీరెవరు?" అని అడిగాను. "దైవప్రవక్తను" అని ఆయన సమాధానమిచ్చారు. తరువాత నేను "దైవప్రవక్త అని ఎవరిని అంటారు" అని అడిగాను. "(దేవుని తరపునుండి పంప బడేవాడు) నన్ను దేవుడు పంపాడు" అని సమాధాన మిచ్చారాయన. "దేవుడు మిమ్మల్ని దేనికోసం పంపాడు" నేను మళ్ళీ అడిగాను. దానికి సమాధానంగా ఆయన "బంధువుల మధ్య సత్సంబంధాలు నెలకొల్పటానికి, విగ్రహాలను పగలగొట్టటానికి, ఒక్క అల్లాహ్‌యే పూజించబడటానికీ, (ప్రజలు) ఇతరుల్ని ఆయనకు సాటి కల్పించకుండా ఉండటానికి నేను పంపబడ్డాను" అని అన్నారు. "ఈ పనిలో మీకు తోడుగా ఎవరున్నారు?" అని అడిగాను. "ఒక స్వేచ్ఛాపరుడు, ఒక బానిస" అని అన్నారాయన. ఆ సమయంలో ఆయన

వెంట హజ్రత్ అబూబక్ర్ (రజి) మరియు బిలాల్ (రజి) ఉన్నారు.

ఆ తరువాత 'నేను కూడా తమరి బాటలో నడవాలనుకుంటున్నాను' అని అన్నాను. ప్రస్తుతం నువ్వు ఆ పని చేయలేవు. నాకూ - ప్రజలకూ మధ్య ఏర్పడిన ఘర్షణాత్మకమైన పరిస్థితుల్ని నువ్వు చూస్తున్నావుగా? కనుక ప్రస్తుతం నీవు ఇంటికి వెళ్ళిపో. నేను (అవిశ్వాసులపై) విజయం సాధించానని తెలుసుకున్నప్పుడు తిరిగి నా దగ్గరికి రా" అని చెప్పి పంపించారు దైవప్రవక్త (స).

నేను ఇంటికి తిరిగొచ్చేశాను. కొంత కాలానికి దైవప్రవక్త (మక్కా వదలిపెట్టి) మదీనాకు వెళ్ళిపోయారు. ఆ సమయంలో నేను ఇంటిదగ్గరే ఉన్నాను. దైవప్రవక్త (స) గురించి సమాచారం తెలుసుకోవటం ప్రారంభించాను. ఆయన మదీనా వెళ్ళిపోయిన తరువాత నేనాయన్ని గురించి ప్రజలను అడిగి తెలుసుకునేవాణ్ణి. ఆ కాలంలోనే మదీనావాసుల బృందం ఒకటి ఇటు రావటం జరిగింది. నేను వాళ్ళను "మక్కా నుండి మదీనాకు వచ్చినాయన ఎలాగున్నారు?" అని అడిగాను. దానికి వారు , "ఆయన్ని విశ్వసించేవారి సంఖ్య విపరీతంగా పెరిగిపోతోంది. ఆయన తెగవారే ఆయన్ని హతమార్చటానికి

الذي قدِم المدينةَ؟ فقالوا: النَّاسُ إليهِ سِرَاعٌ وَقَدْ أَرَادَ قَوْمُه قَتْلَهُ، فَلَمْ يَسْتَطِيعُوا ذلِكَ، فَقَدِمتُ المدينَةَ، فَدَخَلتُ عليهِ، فقلتُ: يا رسولَ اللهِ! أتَعرِفُني؟ قال: «نَعم أَنتَ الَّذي لَقيتَني بِمكَّةَ» قال: فقلتُ: يا رسولَ اللهِ! أَخْبِرْني عمَّا عَلَّمَكَ اللهُ وَأَجْهَلُهُ، أخبِرْني عَنِ الصَّلاةِ؟ قال: «صَلِّ صَلاةَ الصُّبحِ، ثُمَّ اقْصُرْ عَنِ الصَّلاةِ حَتَّى تَرْتَفِعَ الشَّمسُ قِيدَ رُمْحٍ، فَإِنَّهَا تَطْلُعُ حِينَ تَطْلُعُ بَيْنَ قَرْنَي شَيْطَانٍ، وَحِينَئِذٍ يَسْجُد لها الكُفَّارُ، ثُمَّ صَلِّ، فَإِنَّ الصَّلاةَ مشهودةٌ مَحْضورَةٌ حتى يستَقِلَّ الظِّلُّ بالرُّمحِ، ثُمَّ اقْصُر عن الصَّلاةِ، فإنه حينئذٍ تُسْجَرُ جَهَنَّمُ، فإذا أقبل الفَيءُ فصَلِّ، فإنَّ الصَّلاةَ مَشهودةٌ مَحضورةٌ حتى

ప్రయత్నించారు కానీ హతమార్చలేక పోయారు" అని చెప్పారు.

ఈ వార్త విని నేను మదీనాకు ప్రయాణ మయ్యాను. ఆయన దగ్గరికి వెళ్ళి "దైవప్రవక్తా! నన్ను గుర్తుపట్టారా?" అని అడిగాను. అందుకాయన, "గుర్తు పట్టాను, నువ్వు నన్ను మక్కాలో కలుసు కున్నావు కదూ!" అని అన్నారు. అప్పుడు నేనాయనతో "దైవప్రవక్తా! నాకు తెలియని విషయాలేవయినా దేవుడు మీకు నేర్పి ఉంటే అవి నాక్కూడా నేర్పిం చండి. నాకు నమాజ్ గురించి బోధిం చండి" అని విన్నవించుకున్నాను. ఆ సందర్భంగా ఆయన నాకు ఈ విధంగా బోధించారు:

"నువ్వు ఉదయం (ఫజ్ర్) నమాజ్ చెయ్యి. ఆ తరువాత సూర్యుడు ఒక ఈటె అంత పైకి ఎక్కేదాకా నమాజ్ చేయకుండా ఉండు. ఎందుకంటే సూర్యుడు ఉదయించేటప్పుడు షైతాన్ యొక్క రెండు కొమ్ముల మధ్యనుండి ఉదయిస్తాడు. ఆ సమయంలో అవి శ్వాసులు సూర్యునికి సాష్టాంగప్రణామం చేస్తారు. దాని తరువాత నుంచి నువ్వు వస్తువు నీడ (తగ్గుతూ) ఈటె అంత అయిపోయే వరకూ నమాజ్ చెయ్యి (ఈ సమయంలో సూర్యుడు నడినెత్తిమీది నుంచి క్రిందికి దిగుతుంటాడు. నమాజ్ చేస్తున్నప్పుడు దైవదూతలు సాక్ష్యం

تُصَلِّيَ العصرَ، ثم اقصُرْ عن الصلاة حتى تَغرُبَ الشمسُ، فإنها تَغرُبُ بين قَرنَي شيطانٍ، وحينئذٍ يسجدُ لها الكُفَّارُ» قال: فقلتُ: يا نَبِيَّ الله! فالوضوءُ حدِّثني عنه؟ فقال: «ما مِنكُم رجُلٌ يُقَرِّبُ وَضُوءَهُ، فَيَتَمَضمَضُ ويستَنشِقُ فَيَنتَثِرُ، إلَّا خَرَّتْ خطايَا وجهه وفيهِ وخياشِيمِهِ، ثم إذا غَسَلَ وجهَهُ كما أَمَرَهُ اللهُ، إلَّا خرّت خطايا وجهِهِ مِنْ أَطرافِ لحيَتِهِ مع الماءِ، ثم يغسِل يديه إلى المِرفَقَيْنِ، إلَّا خرّت خطايا يديه من أناملِه مع الماءِ، ثم يَمسحُ رَأسَهُ، إلَّا خَرّتْ خَطَايَا رَأسِهِ من أطرافِ شَعْرِهِ مع الماء، ثُمَّ

يَغْسِلُ قَدَمَيْهِ إلى الكَعْبَيْنِ، إلا خَرَّتْ خطايا رِجْلَيه من أنامِلِهِ مع الماءِ، فإن هو قامَ فصلَّى، فحمِدَ الله تعالى، وأَثْنَى عليهِ وَمَجَّدَهُ بالذي هو له أهلٌ، وفَرَّغَ قلبه لله تعالى، إلَّا انصَرَفَ من خطيئتِهِ كهَيْئَتِهِ يومَ وَلَدَتْهُ أُمُّهُ». فحدّثَ عَمرُو بن عَبَسَةَ بهذا الحديثِ أَبَا أُمَامَة صاحِبَ رسولِ الله ﷺ فقال له أبو أُمَامَة: يا عَمْرُو بنَ عَبَسَةَ! انظُر ما تقولُ! في مقامٍ وَاحِدٍ يعطى هذا الرَّجُلُ؟

فَقال عَمْرٌو: يا أَبَا أُمامة! لقد كبِرَتْ سِنِّي، ورَقَّ عَظمِي، وَاقْتَرَبَ أَجَلِي، وما بِيْ حَاجَةٌ أنْ أكذبَ على اللهِ تعالى، ولا على رسولِ اللهِ ﷺ، لو لم أَسْمَعْهُ مِن رسولِ الله ﷺ إلَّا مَرَّةً أَوْ مَرَّتَيْنِ أَو ثلاثاً - حتَّى عَدَّ سبعَ مَرَّاتٍ - ما حَدَّثْتُ أَبداً بِهِ، ولكنِّي سمِعتُهُ أكثر من ذلك. رواه مسلم. قوله:

పలకటానికి, పుణ్యాలను నమోదు చేసుకోవటానికి హాజరవుతుంటారు. సూర్యుడు నడినెత్తి నుండి వాలుతున్నప్పుడు నమాజ్ చెయ్యకు. ఆ సమయంలో నరకాగ్నిని రగిలించటం జరుగుతుంది. ఆ తరువాత నీడ పెరుగుతున్నప్పుడు (జుహ్ర్ వేళ మొదలవుతుంది. అప్పుడు) నువ్వు నమాజ్ చెయ్యి, నమాజ్‌కు సాక్ష్యం పలకటానికి (పుణ్యాలు నమోదు చేయటానికి) దైవదూతలు హాజరవుతూ ఉంటారు. ఆ తరువాత అస్ర్ నమాజ్ చెయ్యి. అస్ర్ నమాజ్ అనంతరం సూర్యుడు అస్తమించేవరకూ (ఎలాంటి) నమాజ్ చేయరాదు. ఎందుకంటే సూర్యుడు షైతాన్ యొక్క రెండు కొమ్ముల మధ్య నుంచి అస్తమిస్తూ ఉంటాడు. ఆ సమయంలో అవిశ్వాసులు సూర్యునికి సాష్టాంగ ప్రణామం చేస్తుంటారు."

తరువాత నేను "దైవప్రవక్తా! నాకు వుజూ గురించి బోధించండి" అని అడిగాను. అప్పుడాయన వుజూ గురించి ఈ విధంగా బోధించారు. "మీలో ఎవరైనా వుజూ చేస్తున్నప్పుడు (చేతులు కడుక్కున్న తరువాత) పుక్కిలించాలి. ఆ తరువాత ముక్కులోకి నీళ్లు ఎక్కించి ముక్కుని శుభ్రంగా కడుక్కోవాలి. అలా చేసినప్పుడు అతని ముఖం, నోరు, ముక్కు వల్ల జరిగిన తప్పులన్నీ రాలి

పోతాయి. ఆ తరువాత దైవాదేశం ప్రకారం అతను తన ముఖం కడుక్కు న్నప్పుడు ముఖం వల్ల జరిగిన పాపాలు నీటితోపాటు గడ్డం అంచులమీది నుండి రాలిపోతాయి. తరువాత రెండు చేతులు కడుక్కున్నప్పుడు వాటివల్ల జరిగిన తప్పులు నీళ్ళతోపాటు వ్రేళ్ళవైపునుండి రాలిపోతాయి. తరువాత తలకు మసహ్ చేసినప్పుడు అతని వల్ల జరిగిన తప్పులు నీళ్ళతో పాటు వెంట్రుకల చివరి భాగాల నుండి రాలిపోతాయి. ఆ తరువాత రెండు కాళ్ళను చీలమండల వరకు కడుక్కున్నప్పుడు కాళ్ళవల్ల జరిగిన తప్పులు నీళ్ళతోపాటు వ్రేళ్ళ ద్వారా క్రిందికి రాలిపోతాయి. ఇక ఆ తరువాత అతను నమాజ్‌కు ఉపక్రమించి తగినవిధంగా దేవుణ్ణి స్తుతించి ఆయన ఔన్నత్యాన్ని కొనియాడుతూ తన మనసును ఆయన భక్తియందే లగ్నం చేసుకుంటే అతని పాపాలన్నీ సమసి పోయి అప్పుడే తన తల్లి కడుపున పుట్టినట్లు పునీతుడయిపోతాడు."

హజ్రత్ అమ్ర్ బిన్ అబసా (రజి) ఈ హదీసును దైవప్రవక్త సహచరుడైన అబూ ఉమామా (రజి)కు చెప్పారు. అది విని అబూ ఉమామా (రజి) ఆయనతో "ఓ అమ్ర్ బిన్ అబసా! నువ్వేం చెబు తున్నావో బాగా అర్థం చేసుకొని చెప్పు. మనిషి ఒకేచోట కూర్చొని ఉండి ఇంత

«جُرَآءُ عليهِ قومُه»: هو بجيمٍ مضمومة وبالمدّ على وزنِ عُلماءَ، أي: جاسِرُون مُستطِيلونَ غيرُ هائبينَ. هذه الرواية المشهورةُ، ورواه الحُمَيْدِيُّ وغيرُهُ: «حِراءُ» بكسر الحاء المهملة، وقال: معناه: غِضابٌ ذَوُو غَمٍّ وهمٍّ، قد عِيلَ صبرُهُمْ به، حتّى أثّرَ في أجسامِهِمْ، من قولِهم: حَرَى جِسمُهُ يَحْرِي، إذا نَقَصَ مِنْ ألمٍ أوْ غمٍّ ونحوِهِ، والصَّحيحُ أنَّهُ بالجيم. قوله ﷺ: «بين قَرنَي شيطانٍ» أيْ: ناحيتي

رأسه، والمرادُ التَّمثيلُ، معناهُ: أنه حينئذٍ يَتَحَرَّكُ الشَّيطانُ وشِيعتهُ، وَيَتَسَلَّطُونَ. وقوله: «يُقَرِّبُ وَضوءَه» معناه: يُحْضِرُ الماءَ الذي يَتَوَضَّأُ به. وقوله: «إلَّا خَرَّتْ خَطايا» هو بالخاء المعجمة: أَيْ سقطت، ورواه بعضُهم «جرَتْ» بالجيم، والصحيح بالخاءِ وهو رواية الجُمهور. وقوله: «فَيَنْتَثِرُ» أَيْ: يَستَخرِجُ ما في أَنفِهِ مِنْ أذًى والنَّثرَةُ: طَرَفُ الأنفِ.

పెద్ద భాగ్యాన్ని పొందగలగటం సాధ్యమేనా?" (ఒక్క వుజూతోనే పాపాలన్నీ క్షమించబడతాయా?)" అని హెచ్చరిస్తూ మాట్లాడారు. దానికి ఆయన "అబూ ఉమామా! నా వయస్సు చాలా పెరిగి పోయింది. నా ఎముకలు బలహీనమయ్యాయి. నాకు చావు సమీపించింది. ఇలాంటి సమయంలో దేవునిపైగాని, దైవప్రవక్తపైగాని అబద్ధాన్ని ఆపాదించాల్సిన అవసరం నాకు లేదు. దైవప్రవక్త నోట ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లు కాదు, ఏడుకన్నా తక్కువసార్లు నేను ఈ హదీసు విని ఉంటే నేను మీకు ఈ హదీసు వినిపించి ఉండేవాణ్ణి కాను. నిజానికి నేను ఈ హదీసును దానికన్నా ఎక్కువసార్లు ఆయన నోట విని ఉన్నాను. *(ముస్లిం)*

ఈ హదీసులో 'బైన ఖర్నయిష్షయితాని' సూర్యుడు షైతాన్ యొక్క రెండు కొమ్ముల మధ్యనుంచి ఉదయిస్తాడంటే షైతాన్ మరియు అతని అనుచరగణం ఈ సమయంలో కార్యోన్ముఖులవుతారనీ, ప్రజల్ని లొంగదీసుకొని వారిని భ్రష్టుపట్టిస్తారని అర్థం.

*(సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ధర్మసందేశ ప్రదాతలు తమ కర్తవ్య నిర్వహణలో విజ్ఞతావివేచనలతో వ్యవహరించాలని ఈ హదీసు ప్రబోధిస్తోంది. సంధేశప్రదాత తక్కువ శక్తి కలవాడయి ప్రత్యర్థులు

విపరీతమైన శక్తి సామర్థ్యాలను కలిగివున్నప్పుడు సందేశ ప్రదాత (దాయీ) విజ్ఞతతో వ్యవహరిస్తూ కనీసం తన దగ్గరున్న శక్తినయినా కాపాడుకోవటానికి ప్రయత్నించాలి. అందుకే దైవప్రవక్త (స) ఇస్లాం ఆవిర్భవించిన తొలినాళ్ళలో అమ్ర్ బిన్ అబసా.(రజి)కు ప్రస్తుతానికి నువ్వు ముస్లిం అయ్యావన్న సంగతిని రహస్యంగానే ఉంచి ఇంటికి వెళ్ళిపొమ్మని, తరువాత పరిస్థితులు అనుకూలించినప్పుడు తిరిగి తన వద్దకు రమ్మని తాకీదు చేశారు.

2. పరిస్థితులు ఎంత విషమించినా, ఎన్ని ప్రతికూల పవనాలు వీచినా సత్యసందేశ ప్రదాత దైవసహాయంపై ఆశలు మాత్రం వదులుకోకూడదు. ఏనాటికైనా దేవుడు తనకు సహాయం చేయకపోడనీ, సత్యధర్మం విజయాన్ని సాధించి తీరుతుందని గొప్ప ఆశాభావంతో ఉండాలి.

3. నమాజ్ వేళల్లో దైవదూతలు హాజరవుతారు. ప్రజలు చేసే పనుల గురించి రాసుకొని ఆ సమాచారాన్ని దైవానికి అందజేస్తారు. కనుక నమాజ్‌ను ప్రశాంతంగా అత్యంత భక్తిశ్రద్ధలతో ఆచరించాలి.

4. సంధ్యావేళల్లో నమాజ్ చేయకూడదు. ఆ సమయాల్లో చేసే నమాజ్ అయిష్టకరమైనదిగా పరిగణించబడుతుంది. నమాజ్ చేయకూడని వేళలు ఇవి:

(అ) ఫజ్ర్ నమాజ్ తరువాత నుంచి సూర్యుడు ఉదయించేవరకు.

(ఆ) సూర్యుడు నడినెత్తినుండి వాలినప్పుడు (మిట్టమధ్యాహ్నం వేళ)

(ఇ) అస్ర్ నమాజ్ తరువాత నుండి సూర్యుడు అస్తమించేవరకు.

(ఈ) అదేవిధంగా నరిగ్గా నూర్యుడు ఉదయించినప్పుడుగాని లేదా అస్తమించినప్పుడుగాని నమాజ్ చేయరాదు.

5. వుజూ మరియు నమాజ్‌లు చిన్న చిన్న పాపాలకు పరిహారంగా ఉపయోగపడతాయి. వీటివల్ల చిన్నా చితకా తప్పులన్నీ మన్నించబడతాయి.

6. ఆ రోజుల్లో అరబ్బులు అనాగరికులు కావటం వల్ల సాధారణంగా కాలాన్ని నిర్ధారించటానికి, సమయాన్ని కొలవటానికి మొరటు కొలమానాలను వాడేవారు. అందుకే వారికి విషయం అర్థమయ్యేందుకు సూర్యోదయం, సూర్యాస్తమయం, మిట్టమధ్యాహ్నం గురించి చెప్పినప్పుడు 'ఈటె'ను ఉదాహరించి చెప్పారు. ప్రస్తుత కాలంలో ప్రపంచంలో ఖగోళశాస్త్రం అభివృద్ధి చెందటం వల్ల గ్రహగమనాలను, వాటి వేగాల్ని సరిగ్గా అంచనా వేసి సూర్యోదయం, సూర్యాస్తమయ వేళల్ని కచ్చితంగా నిర్ధారించటం జరుగుతోంది. అయితే ఇప్పటికీ కొన్ని మారుమూల గ్రామాల్లో ప్రజలు సమయాన్ని తెలుసుకోవటానికి మొరటు విధానాలనే అనుసరిస్తున్నారని అంటే అందులో ఆశ్చర్యపోవలసిన విషయమేమీ లేదు!

7. ఇస్లాం రాకకు పూర్వం - అజ్ఞానకాలంలో - కూడా ఎంతోమంది బుద్ధిజీవులు విగ్రహారాధనను భ్రష్టత్వంగా తలపోసేవారు.

٤٤٠ ـ وعن أبي موسى الأشعَريِّ، رضي الله عنه، عن النَّبيِّ ﷺ، قال: «إذا أرادَ اللهُ تعالى رحمةَ أُمَّةٍ، قَبضَ نبيَّهَا قبلَها، فجعَلَهُ لها فَرطاً وسلَفاً بين يَدَيها، وإذا أَراد هَلَكَةَ أُمَّةٍ، عذَّبها ونبيُّهَا حَيٌّ، فَأَهْلَكَهَا وهوَ حَيٌّ ينظُرُ، فأَقَرَّ عيْنَهُ بِهَلاكِهَا حين كذَّبوهُ وعَصَوا أَمْرَهُ» رواه مسلم.

440. హజ్రత్ అబూ మూసా అష్‌అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : దేవుడు ఏదయినా సమాజాన్ని కరుణించదలచుకున్నప్పుడు ముందుగా ఆ సమాజ ప్రవక్తను లేపుకొని ఆయన్ని ఆ సమాజం పాలిట సారథిగా, సౌకర్య కర్తగా చేస్తాడు. (దీనికి భిన్నంగా) ఆయన ఏదయినా సమాజాన్ని నాశనం చేయదలచుకుంటే ఆ సమాజ ప్రవక్త బ్రతికి వున్నప్పుడే వారిపై శిక్షను అవతరింప జేస్తాడు. వారు నాశనమయిపోవటాన్ని ప్రవక్త తన కళ్ళారా చూస్తాడు. సమాజం తన ప్రవక్తను ధిక్కరించి, ఆయన అజ్ఞలకు అవిధేయత చూపినప్పుడు దేవుడు వారిని నాశనం చేసి ఆ ప్రవక్త కళ్లు చల్లబడేలా చేస్తాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ప్రవక్త (స) ఘనతావిశిష్ఠతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

తమ ప్రవక్తలను ధిక్కరించే సమాజాల పట్ల దేవుడు ఏవిధంగా వ్యవహరిస్తాడో ఈ హదీసు వివరిస్తోంది. ఇందులోని అంశం ప్రజలను దైవప్రవక్త పట్ల అవిధేయతకు దూరంగా ఉండమని, లేకపోతే వినాశాన్ని కొనితెచ్చుకోవలసి ఉంటుందని హెచ్చరిస్తోంది. దైవప్రవక్తను తమ సారథిగా తలపోసి ఆయనకు విధేయత చూపితే ప్రళయదినాన ఆయన సిఫారసు భాగ్యాన్ని పొందే అవకాశముంటుందని ప్రేరేపిస్తోంది.

52వ అధ్యాయం

# ٥٢ ـ بَابُ فَضْلِ الرَّجَاءِ

# ఆశాభావ విశిష్టత

قال الله تعالى إخباراً عن العبدِ الصَّالِحِ: ﴿وَأُفَوِّضُ أَمْرِيٓ إِلَى ٱللَّهِۚ إِنَّ ٱللَّهَ بَصِيرٌۢ بِٱلْعِبَادِ ۝ فَوَقَىٰهُ ٱللَّهُ سَيِّـَٔاتِ مَا مَكَرُوا۟﴾ [غافر: ٤٤ ـ ٤٥].

**దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ తన ప్రియదాసుడైన ఒకనొక విశ్వాసి గురించి చెబుతూ అతను ఇలా అన్నాడని ప్రస్తావించాడు:**

**"నేను నా వ్యవహారాన్ని అల్లాహ్‌కు అప్పగిస్తున్నాను. ఆయన తన దాసులను కనిపెట్టుకొని ఉంటాడు. చివరకు ఆ విశ్వాసికి వ్యతిరేకంగా వారు పన్నిన అన్ని కుయుక్తుల నుంచి అల్లాహ్ అతనిని రక్షించాడు."**

***(అల్ మూమిన్ : 44 - 45)***

## వివరణ

పై సూక్తిలో పేర్కొనబడిన విశ్వాసి మూసా (అలైహి) కాలానికి చెందిన వ్యక్తి. అతను ఫిరౌన్ జాతీయుడు అయి వుండి కూడా మూసా-అలైహి-ను విశ్వసించాడు. అతను తన జాతి వారికి చేసిన సుదీర్ఘమైన హితబోధను దివ్య ఖుర్‌ఆన్ సవివరంగా ప్రస్తావించింది. మూసాకు కీడు తలపెట్టే ప్రయత్నాలు మానుకోండని ఇతను తన జాతివారిని హెచ్చరించాడు. తాను మూసా - అలైహి - ధర్మాన్ని విశ్వసిస్తున్నానని చెప్పాడు. దాంతో ఫిరౌన్ తరపునుండి అతని ప్రాణానికి అపాయం ఏర్పడింది. అంచేత అతను తన హితబోధ చివరిలో తన వ్యవహారాన్ని దేవునికి అప్పగిస్తున్నానని చెప్పాడు. దేవుడు తనకు మేలు చేస్తాడన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశాడు. కనుక దేవుడు అతని ఆశను వమ్ము చేయకుండా ఫిరౌన్ పన్నిన కుట్రల నుంచి అతణ్ణి రక్షించాడు.

٤٤١ ـ وعن أبي هريرة، رَضيَ الله عنه عن رسولِ اللهِ ﷺ، أنَّهُ قال: «قال اللهُ، عَزَّ وجلَّ: أَنَا عِنْدَ ظَنِّ عَبْدِي

441. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) దేవుడు ఇలా అంటున్నాడని తెలియజేశారు:

بي، وأنا مَعَهُ حَيثُ يَذكُرُني، وَاللهِ! للهُ أَفرَحُ بِتَوبَةِ عَبدِهِ مِن أَحَدِكُم يَجِدُ ضَالَّتَهُ بِالفَلاةِ، وَمَنْ تَقَرَّبَ إِلَيَّ شِبراً، تَقَرَّبتُ إِلَيهِ ذِرَاعاً، وَمَنْ تَقَرَّبَ إِلَيَّ ذِراعاً، تَقَرَّبتُ إليه بَاعاً، وإذا أَقبَلَ إِلَيَّ يَمْشي، أَقبَلتُ إليه أُهَرْوِلُ» متفقٌ عليه

"నేను నా దాసునితో అతను నా గురించి ఊహించినట్టుగానే వ్యవహరిస్తాను. అతను నన్ను ఎక్కడ గుర్తుచేసుకున్నా నేను అతని తోడుంటాను." దైవసాక్షి! మీలో ఎవరికైనా తన వస్తువు అడవిలో తప్పిపోయి తిరిగి దొరికితే అతను ఎంతగా సంతోషిస్తాడో, దాసుడు పశ్చాత్తాపపడినప్పుడు దేవుడు అంతకన్నా ఎక్కువగా సంతోషిస్తాడు. ఎవరైనా నా వైపు ఒక జానెడు దూరం జరిగితే నేను అతనివైపు మూరెడు దూరం జరుగుతాను. ఎవరైనా నా వైపు మూరెడు దూరం జరిగితే నేనతని వైపు బారెడు దూరం జరుగుతాను. అతను నా వైపునకు నడిచి వస్తే నేనతని వైపునకు పరుగెత్తుకొస్తాను. *(బుఖారీ - ముస్లిం)*

وهذا لفظ إحدى روايات مسلم. وتقدَّم شرحُهُ في الباب قبله. وروي في الصحيحين: «وأنا معه حينَ يذكُرُني» بالنون، وفي هذه الرواية «حَيثُ» بالثاء وكلاهما صحيح.

ఇవి ముస్లింలోని ఒకానొక ఉల్లేఖనంలోని వాక్యాలు. ఈ హదీసు వివరణ ఇంతకు ముందు అధ్యాయంలో వచ్చింది.

*(సహీహ్ బుఖారీలోని తౌహీద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ప్రజలు దైవం పట్ల సదభిప్రాయాన్ని, దేవుడు తమకు మేలు చేస్తాడనే ఆశాభావాన్ని కలిగి ఉండాలని బోధిస్తోంది. అయితే ఎలాంటి కృషిచేయకుండా ఫలితం దక్కాలని కోరుకోవటం ఎంత మూర్ఖత్వమో, సదాచరణ చేయకుండా దేవుడు తమకు మంచి చేస్తాడని అనుకోవటం కూడా అంతే మూర్ఖత్వం అవుతుంది. అంటే ఒకవిధంగా ఈ హదీసు పరోక్షంగా మనిషిని ఆచరణ వైపునకు ప్రోత్సహిస్తోందన్నమాట! సాధారణంగా మంచిపనులు చేసేవారు దైవం పట్ల సదభిప్రాయాన్ని కలిగి ఉంటారు. చెడు పనులు చేసేవారు దైవం పట్ల దురభిప్రాయాన్నే కలిగి ఉంటారు. అలాంటప్పుడు దేవుడు కూడా వారితో వారి అభిప్రాయాలకు అనుగుణంగానే వ్యవహరిస్తాడు. మంచి అభిప్రాయం కలిగివున్న వారికి మంచి చేస్తాడు. చెడు అభిప్రాయం

కలిగి ఉండేవారికి చెడు చేస్తాడు. వారి ఆశాభావాలకు మూలం వారి ఆచరణలే కాబట్టి దేవుడు వారి ఆచరణలకు అనుగుణంగా వారికి ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు.

442. దైవప్రవక్త (సల్లం) తన మరణానికి మూడు రోజుల ముందు ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) తెలియజేశారు:

"మీలో ప్రతి ఒక్కరూ దైవం పట్ల సదభిప్రాయాన్ని (మంచి ఆశాభావాన్ని) కలిగివున్న స్థితిలోనే మరణించాలి సుమా!" *(ముస్లిం)*

٤٤٢ ـ وعن جابرِ بنِ عبدِ اللهِ، رضيَ اللهُ عنهما، أنهُ سمعَ النبيَّ ﷺ، قبلَ مَوْتِهِ بثلاثةِ أيَّامٍ يقولُ: «لَا يَمُوتَنَّ أَحَدُكُم إلَّا وَهُوَ يُحْسِنُ الظَّنَّ باللهِ عزَّ وجلَّ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని స్వర్గ సుఖాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఎవరు ఎప్పుడు మరణిస్తారో ఎవరికీ తెలియదు. మరణ సమయంలో మనిషికి దైవకారుణ్యం పట్ల ఆశాభావం ఉండాలి. మనిషి విశ్వసించి, సత్కార్యాలు చేసినప్పుడే అది సాధ్యమవుతుంది. కనుక మనిషి ఎల్లప్పుడూ సత్కార్యాలు చేస్తూ ఉంటే దైవకారుణ్యం పట్ల ఆశాభావాన్ని కలిగివున్న స్థితిలో అతనికి మరణం సంభవించే అవకాశాలున్నాయి. దివ్య ఖుర్ఆన్‌లోని "మీరు ముస్లింలుగానే మరణించండి" అనే సూక్తికి భావం కూడా ఇదే!

443. దేవుడు ఇలా అంటున్నాడని దైవప్రవక్త (స) చెబుతుండగా తాను విన్నానని హజ్రత్ అనస్ (రజి) తెలియజేశారు:

"ఓ ఆదం పుత్రుడా! నువ్వు నన్ను అర్థిస్తూ, నా నుండి మంచిని ఆశించినంతకాలం నేను నిన్ను క్షమిస్తూ ఉంటాను. నీ ఆచరణలు ఎలా వున్నా సరే నేను వాటిని పట్టించుకోను. ఓ ఆదం పుత్రుడా! నీ పాపాలు అంబరాలను చుంబిస్తున్నా సరే నువ్వు గనక

٤٤٣ ـ وعن أنسٍ، رضي الله عنه قال: سمعتُ رسولَ اللهِ ﷺ، يقول: «قال الله تعالى: يَا ابْنَ آدَمَ! إنَّكَ مَا دَعَوْتَني وَرَجَوْتَني غَفَرْتُ لَكَ عَلى مَا كَانَ مِنْكَ وَلَا أُبَالي، يَا ابْنَ آدَمَ! لَوْ بَلَغَتْ ذُنُوبُكَ عَنَانَ السماءِ، ثم اسْتَغْفَرْتَني غَفَرتُ لَكَ، يَا ابْنَ آدَمَ! إنَّكَ لَو أَتَيْتَني بِقُرابِ الأرْضِ خطايا، ثُمَّ لَقِيتَني لا تُشرِ

నన్ను మన్నింపు కోసం అర్థిస్తే నేను నిన్ను మన్నించేస్తాను. ఓ ఆదం పుత్రుడా! నాకు ఇతరుల్ని సాటికల్పించే (షిర్క్) పాపం చేయకుండా ఇతర పాపాలు నువ్వు భూమండలం నిండా తీసుకొని నా దగ్గరి కొస్తే నేను భూమండలం నిండా మన్నింపుతో వచ్చి నిన్ను కలుసుకుంటాను.

(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి, దీన్ని హసన్ కోవకు చెందినదిగా పేర్కొన్నారు.)

بي شيئاً، لأتيتك بقرابها مغفرة» رواه الترمذي. وقال: حديث حسن. «عَنَانُ السماءِ» بفتح العين، قيل: هو مَا عَنَّ لَكَ منها، أي: ظَهَرَ إذَا رَفَعْتَ رَأْسَكَ، وقيلَ: هو السَّحَابُ. و«قُرَابُ الأرض» بضم القاف، وقيلَ: بكسرها، والضم أصح وأشهر، وهو: ما يُقَارِبُ مِلأهَا، والله أعلم.

*(సుననె తిర్మిజీలోని ప్రార్థనల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసు ఉద్దేశ్యం మనిషి తన జీవితాన్ని పాపమయం చేసుకోవాలన్నది కాదు. వాస్తవానికి ఈ హదీసు భావం ఏమిటంటే, ఏమరుపాటులో మనిషి వల్ల ఎన్ని పాపాలు జరిగిపోయినా సరే చివరికి అతని పాపాలతో భూమండలం నిండిపోయినాసరే అతను దైవకారుణ్యం పట్ల నిరాశ చెందనవసరం లేదు. మనస్ఫూర్తిగా పశ్చాత్తాపపడి దైవాన్ని క్షమాభిక్ష పెట్టమని వేడుకుంటే దేవుడు తప్పకుండా అతన్ని తన కారుణ్య ఛాయల్లోకి తీసుకుంటాడు.

2. బహుదైవారాధన క్షమార్హం కాని పాపం. మానవులు ఇతర పాపాలు ఎన్ని చేసినా దేవుడు క్షమిస్తాడు గాని తనకు ఇతరుల్ని సాటికల్పిస్తే మాత్రం ఆయన దానిని ఎన్నటికీ సహించడు. విశ్వాసులు బహుదైవారాధన మినహా ఇతర పాపాలేవయినా చేసివుంటే దేవుడు ప్రారంభంలోనే ఆ పాపాలను మన్నించి వారికి స్వర్గప్రవేశాన్ని కల్పిస్తాడు లేదా తాను తలచుకుంటే కొంతకాలం పాటు వారిని నరకంలోనే ఉంచి వారి పాపాలకు అనుగుణంగా వారికి శిక్ష విధించనూవచ్చు. కాని బహుదైవారాధకులకు మాత్రం శాశ్వత నరకయాతన తప్పదు.

53వ అధ్యాయం

# ٥٣ ـ بَابُ الْجَمْعِ بيْنَ الْخَوْفِ وَالرَّجَاءِ

## దైవంపట్ల భీతి, ఆశ రెండూ ఉండాలి

اعْلَمْ أَنَّ المُخْتَارَ لِلعَبْدِ في حَالِ صِحَّتِهِ أَن يَكُونَ خائفاً راجياً، ويَكونَ خَوْفُهُ ورجاؤُه سواءً، وفي حالِ المَرَضِ يُمَحِّضُ الرَّجَاءَ. وقواعِدُ الشَّرْعِ مِن نُصُوصِ الكِتَابِ وَالسُّنَّةِ وَغَيْرِ ذَلكَ مُتظاهِرَةٌ على ذلك.

قال الله تعالى: ﴿فَلَا يَأْمَنُ مَكْرَ اللَّهِ إِلَّا الْقَوْمُ الْخَاسِرُونَ﴾ [الأعراف: ٩٩]

గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మలై) ఇలా అంటున్నారు:

తెలుసుకోండి; ఆరోగ్యంగా ఉన్నప్పుడు మనిషి దైవశిక్ష పట్ల భీతిభావంతో పాటు ఆయన కారుణ్యం పట్ల ఆశాభావాన్ని కూడా కలిగి ఉండటం ఉత్తమం. ఈ రెండు భావాలూ అతనిలో సమపాళ్ళలో ఉండాలి. అయితే అనారోగ్య స్థితిలో మాత్రం ఆశాభావమే ఎక్కువగా ఉండాలి (ఈ స్థితిలో మరీ అంత ఎక్కువగా దైవశిక్షకు భయపడాల్సిన అవసరం లేదు). షరీఅత్ సూత్రాలు, అంటే దైవగ్రంథం, దైవ ప్రవక్త విధానం ఇతర ఆధారాలు ఈ విషయాన్ని ప్రస్ఫుటం చేస్తున్నాయి.

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"వాస్తవానికి వినాశాన్ని కోరుకుంటున్న జాతి మాత్రమే అల్లాహ్ ఎత్తుగడ పట్ల నిర్భయంగా ఉండగలదు." *(అల్ ఆరాఫ్ : 99)*

ఇంకొకచోట ఆయన ఇలా అంటున్నాడు:

"దేవుని కారుణ్యంపట్ల నిరాశచెందేది అవిశ్వాసులే." *(యూసుఫ్ : 87)*

మరొకచోట ఆయన ఇలా సెలవిస్తున్నాడు:

"ఆ రోజున కొందరి ముఖాలు (సంతోషంతో) ప్రకాశిస్తూ ఉంటాయి. మరికొందరి ముఖాలు నల్లబడిపోయి ఉంటాయి."

*(ఆలి ఇమ్రాన్ : 106)*

وقال تعالى: ﴿ إِنَّهُ لَا يَاْيْـَٔسُ مِن رَّوْحِ ٱللَّهِ إِلَّا ٱلْقَوْمُ ٱلْكَٰفِرُونَ ﴾ [يوسف: ٨٧] وقال تعالى: ﴿ يَوْمَ تَبْيَضُّ وُجُوهٌ وَتَسْوَدُّ وُجُوهٌ ﴾ [آل عمران: ١٠٦] وقال تعالى: ﴿ إِنَّ رَبَّكَ لَسَرِيعُ ٱلْعِقَابِ وَإِنَّهُۥ لَغَفُورٌ رَّحِيمٌ ﴾ [الأعراف: ١٦٧] وقال تعالى: ﴿ إِنَّ ٱلْأَبْرَارَ لَفِى نَعِيمٍ ۝١٣ وَإِنَّ ٱلْفُجَّارَ لَفِى جَحِيمٍ ﴾ [الانفطار: ١٣، ١٤] وقال تعالى: ﴿ فَأَمَّا مَن ثَقُلَتْ مَوَٰزِينُهُۥ ۝٦ فَهُوَ فِى عِيشَةٍ رَّاضِيَةٍ ۝٧ وَأَمَّا مَنْ خَفَّتْ مَوَٰزِينُهُۥ ۝٨ فَأُمُّهُۥ هَاوِيَةٌ ﴾ [القارعة: ٦ ـ ٩] والآيات في هذا المعنى كثيرة. فَيَجْتَمِعُ الخوفُ والرجاءُ في آيتَيْنِ مُقْتَرِنَتَيْنِ أو آياتٍ أو آية.

వేరొకచోట ఆయన ఇలా అంటున్నాడు:

నిశ్చయంగా నీ ప్రభువు వడిగా (త్వరగా) శిక్షించే వాడు. ఇంకా ఆయన మన్నింపుతో, కరుణతో వ్యవహరించేవాడు కూడాను."

(అల్ ఆరాఫ్ : 167)

ఆయన ఇంకా ఇలా అన్నాడు :

"నిస్సందేహంగా సజ్జనులు సుఖసంతోషాలలో తేలియాడుతూ ఉంటారు. దుర్జనులు నరకానికి పోతారు." (అల్ ఇన్ఫితార్ : 13, 14)

ఆయన ఇంకా ఇలా కూడా సెలవిచ్చాడు :

"ఆ తరువాత త్రాసు పళ్ళాలు బరువుగా ఉన్న వారు తమకు ఇష్టమైన భోగభాగ్యాల్లో ఓలలాడు తారు. (దీనికి భిన్నంగా) త్రాసు పళ్ళాలు తేలికగా ఉండేవారి నివాస స్థలం లోతైన గొయ్యి అవు తుంది." (అల్ ఖారిఅహ్ : 6 - 9)

ఈ అర్థాన్నిచ్చే వాక్యాలు ఇంకా చాలా ఉన్నాయి. దివ్య ఖుర్ఆన్లో పలుచోట్ల రెండు లేక అంతకంటే ఎక్కువ వరుస వాక్యాల్లోగాని లేదా ఒకే వాక్యంలోగాని ఈ రెండు భావాలను కలిపి వివరించటం జరిగింది.

## వివరణ:

దైవభీతి, ఆశాభావం - ఈ రెండింటినీ దివ్య ఖుర్ఆన్ పలు సందర్భాల్లో ఒకేచోట ప్రస్తావించి వివరించింది. సంపూర్ణ విశ్వాసంలో ఈ రెండూ ప్రధాన పాత్ర వహిస్తాయి. దైవశిక్ష పట్ల భయం లేకపోతే మనిషి సునాయాసంగా దైవ అవిధేయతకు పాల్పడగలడు. అదేవిధంగా దైవకారుణ్యం పట్ల నిరాశానిస్పృహలకు లోనయితే అసలు సదాచరణ చేయటమే మాను కుంటాడు. కనుక మనిషికి దైవశిక్ష పట్ల భీతిభావంతోపాటు ఆయన కారుణ్యం పట్ల ఆశాభావం కూడా ఉండాలి. దివ్య ఖుర్ఆన్లో ఒకచోట విశ్వాసుల లక్షణాల గురించి వివరిస్తూ, వారు తమ ప్రభువును భయంతోనూ, ఆశతోనూ వేడుకుంటారని చెప్పబడింది. అందుకే 'విశ్వాసం అనేది భయానికి, ఆశకు మధ్య ఉండే స్థితి' అని అంటారు.

٤٤٤ ـ وعن أبي هريرة، رضي الله عنه، أنَّ رسُولَ اللهِ ﷺ، قال: «لَوْ يَعْلَمُ المُؤْمِنُ ما عِنْدَ اللهِ مِنَ العُقُوبَةِ، ما طَمِعَ بجَنَّتِهِ أَحَدٌ، وَلَوْ يَعْلَمُ الكافِرُ مَا عِنْدَ اللهِ مِنَ الرَّحْمَةِ، مَا قَنِطَ مِنْ جَنَّتِهِ أَحَدٌ» رواه مسلم.

444. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: దేవుని వద్ద ఎలాంటి శిక్ష వుందో విశ్వాసికి తెలిసిపోతే అతను తనకు స్వర్గం లభిస్తుందని ఎన్నటికీ అనుకోడు. అవిశ్వాసి గనక దేవుని వద్ద ఉన్న కారుణ్యం గురించి తెలుసుకుంటే అతను ఎన్నటికీ స్వర్గం పట్ల నిరాశ చెందడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని పశ్చాత్తాప ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు, మనిషిని దైవశిక్ష గురించి హెచ్చరించటంతోపాటు ఆయన కారుణ్యం పట్ల ఆశాభావాన్ని కల్గివుండాలని కూడా ప్రబోధిస్తోంది. కనుక మనిషి దైవశిక్ష నుండి తన్ను తాను కాపాడుకుంటూ మరోవైపు దేవుని మన్నింపును, ఆయన ప్రసన్నతను ఆశిస్తూ జీవితం గడపాలి. దైవానికి విధేయత చూపిన వారిపై దైవకారుణ్యం తప్పక అవతరిస్తుంది. అలాగే దైవ అవిధేయతకు పాల్పడిన వారిపై ఆయన శిక్ష కూడా తప్పక విరుచుకుపడుతుంది.

٤٤٥ ـ وعن أبي سَعيدِ الخدريِّ، رضيَ اللهُ عنه، أنَّ رسُولَ الله ﷺ، قال: «إذا وُضِعَتِ الجَنَازَةُ واحْتَمَلَهَا النَّاسُ أَوِ الرجالُ عَلى أَعْنَاقِهِمْ، فَإِنْ كَانَتْ صالِحَةً قالَتْ: قَدِّمُوني قَدِّمُوني، وَإِنْ كانَتْ غَيرَ صَالِحَةٍ، قالَتْ: يا وَيْلَها! أَيْنَ تَذْهَبُونَ بها؟ يَسْمَعُ صَوْتَها كُلُّ شَيْءٍ إلَّا الإِنْسانَ، وَلَوْ سَمِعَهُ صَعِقَ» رواهُ البخاري.

445. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : జనాజాను సిద్ధం చేసి ఉంచిన తరువాత ప్రజలు లేదా పురుషులు దాన్ని తమ భుజాలపై మోసుకెళుతున్నప్పుడు అది మంచి మనిషి శవమైతే "నన్ను త్వరగా తీసు కెళ్ళండి, నన్ను త్వరగా తీసుకెళ్ళండి" అని అంటుంది. అదే చెడ్డవాని శవమైతే "అయ్యో నా పాడుగాను! నన్ను ఎక్కడికి తీసుకెళుతున్నారు?" అని అంటుంది. ఆ మాటల శబ్దాన్ని ఒక్క మానవుడు తప్ప ప్రతి వస్తువూ వింటుంది. మాన

వుడు గనక ఆ స్వరం వింటే సొమ్మ సిల్లిపోతాడు. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం)

446. హజ్రత్ ఇబ్నె మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : స్వర్గం మీ పాదుక పిరికన్నా సమీపంలో ఉంది. నరకం కూడా అదేవిధంగా (దగ్గర్లో) ఉంది. (బుఖారీ)

٤٤٦ - وعن ابنِ مسعودٍ، رضيَ اللهُ عنه قالَ: قالَ رسُولُ الله ﷺ: «الجَنَّةُ أَقْرَبُ إلى أَحَدِكُمْ مِنْ شِرَاكِ نَعْلِهِ وَالنَّارُ مِثْلُ ذلك» رواه البخاري.

(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

సన్మార్గంపై నడిచేవాడు చాలా సులువుగా స్వర్గాన్ని పొందగలడు. అలాగే దుర్మార్గాన్ని ఎంచుకున్నవాడు అతి తేలికగా నరకంలో పడిపోతాడు. స్వర్గనరకాలు మనిషికి అత్యంత సమీపంలో ఉంటాయంటే దాని భావం ఇదే! ఈ హదీసు సత్కార్యాలు చేయమని పురికొల్పటంతో పాటు దుష్కార్యాలు చేయవద్దని కూడా హెచ్చరిస్తోంది.



54వ అధ్యాయం

# ٥٤ ـ بَابُ فَضْلِ الْبُكَاءِ مِنْ خَشْيَةِ اللهِ تَعَالَى وَشَوْقاً إِلَيْهِ

# దైవభీతితో కంటతడిపెట్టటం, దైవాన్ని కలుసుకోవాలని వేగిరపడటం గురించి....

قالَ اللهُ تعالى: ﴿وَيَخِرُّونَ لِلْأَذْقَانِ يَبْكُونَ وَيَزِيدُهُمْ خُشُوعًا ۩ ﴾ [الإسراء: ١٠٩] وقال تعالى: ﴿أَفَمِنْ هَٰذَا الْحَدِيثِ تَعْجَبُونَ ۝ وَتَضْحَكُونَ وَلَا تَبْكُونَ ﴾ [النجم: ٥٩، ٦٠].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

(విశ్వాసులు) తమ గడ్డాలను నేలకు ఆనించి విలపిస్తూ పడిపోతారు. దానిని (అంటే ఖుర్‌ఆన్‌ను) విన్న తరువాత వారి అణకువ మరింత పెరిగిపోతుంది.

(బనీ ఇస్రాయీల్ : 109)

మరోచోట ఆయన ఇలా అన్నాడు :

"మీరు ఖుర్‌ఆన్ గురించి ఆశ్చర్యపోతున్నారా? ఏడ్వాల్సింది పోయి నవ్వుతున్నారా?"

(అన్ నజ్మ్ : 59, 60)

## వివరణ

విశ్వాసుల ముందు ఖుర్‌ఆన్ పారాయణం జరిగినప్పుడు వారు దైవభీతితో కంపించిపోతారు. దైవశిక్ష ప్రస్తావన వినగానే విలపించటం మొదలుపెడతారు. కాని అవిశ్వాసులకు ఖుర్‌ఆన్ వినిపించినా వారిలో ఎలాంటి ప్రతిస్పందన ఉండదు. పైగా వారు ఖుర్‌ఆన్ పారాయణాన్ని అపహాస్యం చేస్తారు. ఆటపాటలతో దానిని నిర్లక్ష్యం చేస్తారు. దైవప్రస్తావన వినగానే భయంతో విలపించటం, ఆయన్ని కలుసుకోవాలని తాపత్రయ పడటం విశ్వాసుల లక్షణం.

٤٤٧ ـ وعَن ابن مَسعودٍ، رضيَ اللهُ عنه، قالَ: قال لي النبيُّ ﷺ: «اقرأ عليَّ القُرآنَ» قلتُ: يا رسُولَ اللهِ! أَقرأُ عَلَيْكَ، وَعَلَيْكَ أُنْزِلَ؟! قالَ: «إني أُحِبُّ أَنْ أَسْمَعَهُ

447. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (స) తన ముందు ఖుర్‌ఆన్ చదివి వినిపించవలసిందిగా నన్ను కోరారు. నేను ఆశ్చర్యపోతూ, "దైవప్రవక్తా! ఖుర్‌ఆన్ మీపైనే అవతరించింది కదా! అలాంటప్పుడు

مِنْ غَيْرِي» فقرأتُ عليه سورةَ النِّسَاءِ، حتى جئتُ إلى هذهِ الآيةِ: ﴿ فَكَيْفَ إِذَا جِئْنَا مِن كُلِّ أُمَّةٍ بِشَهِيدٍ وَجِئْنَا بِكَ عَلَىٰ هَٰٓؤُلَآءِ شَهِيدًا ﴾ [النساء: ٤١] قال: «حَسْبُكَ الآنَ» فَالْتَفَتُّ إِلَيْهِ، فَإِذَا عَيْنَاهُ تَذْرِفَانِ. متفق عليه.

మీకు నేను ఖురాన్ చదివి వినిపించటమేమిటి?" అని అన్నాను. "నాకు ఇతరుల ద్వారా ఖుర్‌ఆన్ పారాయణం వినాలనిపిస్తోంది" అని అన్నారు దైవప్రవక్త. అప్పుడు నేను 'నిసా' సూరా పారాయణం మొదలుపెట్టాను. ఆ విధంగా నేను పారాయణం చేస్తూ, "మేము ప్రతి సమాజం నుండి ఒక సాక్షిని తెచ్చి, నిన్ను (అంటే ముహమ్మద్‌ను) వారందరిపై సాక్షిగా నిలబెట్టినప్పుడు వీరి పరిస్థితి ఏమిటి?" అనే వాక్యం దగ్గరికి చేరుకోగానే ఆయన "ఇక చాలు" అన్నారు. నేను తలపైకెత్తి చూస్తే ఆయన కళ్ళు అశ్రుధారలై ప్రవహిస్తున్నాయి." *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దివ్య ఖుర్‌ఆన్‌ను పూర్తి ఏకాగ్రతతో, అర్థం చేసుకుంటూ పారాయణం చేసినప్పుడు లేదా విన్నప్పుడు భక్తి పారవశ్యంతో హృదయం తాదాత్మ్యం చెందుతుంది. సహజంగానే మనిషి కంటతడిపెడతాడు. ఈ లక్షణాలు మనిషిలోని విశ్వాసాన్ని, దైవం పట్ల అతనిలోవున్న భీతిభావాన్ని సూచిస్తాయి. తాము స్వయంగా ఖుర్‌ఆన్ పారాయణం చేయటంతో పాటు ఇతరుల ద్వారా కూడా వినటం పుణ్యప్రదమన్న సంగతి ఈ హదీసు ద్వారా రూఢీఅవుతోంది.

٤٤٨ ـ وعن أنسٍ، رضيَ اللهُ عنه، قَالَ: خَطَبَ رَسُولُ اللهِ ﷺ، خُطْبَةً ما سَمِعْتُ مِثْلَهَا قَطُّ، فقالَ: «لَوْ تَعْلَمُونَ مَا أَعْلَمُ لَضَحِكْتُمْ قَلِيلاً وَلَبَكَيْتُمْ كثيراً»

448. హజ్రత్ అనస్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (స) మాకు ఒక ఉపన్యాసమిచ్చారు. అలాంటి ఉపన్యాసం నేనెప్పుడూ వినలేదు. ఆయన (స) ఇలా అన్నారు : (ప్రజలారా!) నాకు తెలిసిన విషయాలు గనక మీకు తెలిస్తే మీరు తక్కువగా నవ్వుతారు. ఎక్కువగా ఏడుస్తారు.

قال: فَغَطَّى أَصْحَابُ رَسُولِ اللهِ ﷺ، وُجُوهَهُمْ، ولهُمْ خَنِينٌ، متفقٌ عليه، وَسَبَقَ بَيَانُهُ في بَابِ الخَوْفِ.

ఈ మాట విని ఆయన సహచరులు తమ ముఖాలు కప్పుకున్నారు. ఆ సమయంలో వారు ఏడుస్తున్న శబ్దం వినిపించింది. *(బుఖారీ - ముస్లిం)*

*ఈ హదీసు ఇంతకుముందు 'దైవభీతి' అధ్యాయంలో కూడా వచ్చింది.*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (స) తన అనుచరులకు హితబోధ చేసినప్పుడు వారు దైవభీతితో విలపించేవారు. దుష్కర్మలు చేస్తే దేవుడు శిక్షిస్తాడని వింటే చాలు భయంతో వణకిపోయేవారు. ఇది దైవం పట్ల వారికున్న భయభక్తులకు అద్దం పడుతోంది.

٤٤٩ ـ وعن أبي هريرةَ، رضي اللهُ عنه، قالَ: قالَ رسُولُ اللهِ ﷺ: «لَا يلِجُ النَّارَ رَجُلٌ بَكَى مِنْ خَشْيَةِ اللهِ حَتَّى يَعُودَ اللَّبَنُ في الضَّرْعِ، وَلَا يَجْتَمِعُ غُبَارٌ في سَبِيلِ اللهِ وَدُخانُ جَهَنَّمَ» رواهُ الترمذي وقال: حديثٌ حسنٌ صحيحٌ.

449. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : (పితకబడిన) పాలు తిరిగి పొదుగులోకి వెళ్ళిపోయే వరకూ దైవభీతితో కంటతడిపెట్టినవాడు నరకానికి పోడు. అదేవిధంగా దైవ మార్గంలో లేపబడిన దుమ్ముధూళి, నరకధూమంతో కలవదు.

(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి, హసన్ మరియు సహీహ్‌గా పేర్కొన్నారు)

*(సుననె తిర్మిజీలోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కంట తడిపెట్టేంత దైవభీతి ఉన్న వ్యక్తి ఘోరపాపాలకు ఒడిగట్టటాన్ని ఊహించగలమా? సాధారణంగా అలాంటి వ్యక్తి దేవుని ఆదేశాలను పాటిస్తూ పాపాలకు దూరంగా మసలుకుంటూనే జీవితం గడుపుతాడు. అందుకే పితికినపాలు తిరిగి పొదుగులోకి వెళ్ళిపోవటం ఎంత అసంభవమో అలాంటి మంచివ్యక్తి నరకానికి పోవటం కూడా అంతే అసంభవమని అంటే అది అతిశయోక్తి కాదు.

అదేవిధంగా దైవమార్గంలో పోరాడే యోధునికి కూడా దేవుడు నరకాన్ని నిషిద్ధం చేశాడు. దైవమార్గంలో పోరాడటం వల్ల దుమ్ముధూళి కొట్టుకున్న యోధుని శరీరాన్ని నరకాగ్ని కూడా కాల్చలేదు.

450. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు : దేవుని నీడ తప్ప మరెలాంటి నీడ కనబడని (ప్రళయ) దినాన దేవుడు ఏడుగురిని తన (కారుణ్య) ఛాయలో ఉంచుతాడు. ఆ ఏడుగురు : (1) న్యాయంగా పరిపాలించిన పాలకుడు. (2) తన యవ్వనాన్ని దైవారాధనలో గడిపిన యువకుడు. (3) మనసంతా మస్జిద్‌లోనే ఉండే వ్యక్తి. (4) కేవలం దైవ ప్రసన్నత కోసం పరస్పరం ప్రేమించుకునే ఇద్దరు వ్యక్తులు (అలాగే), దైవ ప్రసన్నత ప్రాతిపదికగా పరస్పరం విడిపోయేవారు. (5) అందం, అంతస్థూ కలిగి వున్న స్త్రీ చెడు కార్యానికి పిలిస్తే తాను దేవునికి భయపడుతున్నానంటూ ఆమె కోరికను నిరాకరించిన వ్యక్తి. (6) కుడి చేత్తో చేసింది ఎడమచేతికి కూడా తెలియనంత గోప్యంగా దానాలు చేసిన వ్యక్తి. (7) ఏకాంతంలో దేవుణ్ణి జ్ఞాపకం చేసుకొని (ఆయన భీతితో) కన్నీరు కార్చిన వ్యక్తి. *(బుఖారీ - ముస్లిం)*

٤٥٠ ـ وعنـــه قـــالَ: قـــالَ رسُولُ اللهِ ﷺ: «سَبْعَةٌ يُظِلُّهُمُ اللهُ في ظِلِّهِ يَوْمَ لَا ظِلَّ إلَّا ظِلُّهُ: إمامٌ عادلٌ، وشَابٌّ نَشَأَ في عِبَادَةِ اللهِ تَعالى، وَرَجُلٌ قَلْبُهُ مُعَلَّقٌ في المَسَاجِدِ، وَرَجُلانِ تَحَابَّا في اللهِ، اجْتَمَعَا عَلَيْهِ، وَتَفَرَّقَا عَلَيْهِ، وَرَجُلٌ دَعَتْهُ امْرَأَةٌ ذاتُ مَنْصِبٍ وَجَمالٍ، فَقَالَ: إنِّي أَخافُ اللهَ، ورَجُلٌ تَصَدَّقَ بِصَدَقَةٍ فَأَخْفاها حتَّى لَا تَعْلَمَ شِمالُهُ ما تُنْفِقُ يَمِينه، ورَجُلٌ ذَكَرَ اللهَ خالِياً فَفَاضَتْ عَيْنَاهُ» متفقٌ عليهِ.

451. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ షిఖ్ఖీర్ (రజి) కథనం : నేనొకసారి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళాను. ఆ సమయంలో ఆయన నమాజ్ చేస్తున్నారు. (నమాజ్‌లో) ఆయన ఏడుస్తుంటే పొయ్యిపై ఉంచిన కుండ శబ్దం చేసినట్లు ఆయన రొమ్ము నుండి శబ్దం రాసాగింది.

٤٥١ ـ وعَن عبدِ اللهِ بنِ الشِّخِّيرِ، رضيَ اللهُ عنه، قال: أَتيْتُ رسُولَ اللهِ ﷺ، وهُوَ يُصَلِّي ولجَوْفِهِ أَزِيزٌ كَأَزِيزِ المِرْجَلِ مِنَ البُكاءِ. حديث صحيح رواه أبو داود والتِّرمذي في الشَّمائلِ بإسنادٍ صحيحٍ.

(ఈ హదీసు ప్రామాణికమైనది, అబూ దావూద్ దీనిని ఉల్లేఖించారు. దీన్నే ఇమామ్ తిర్మిజీ 'షమాయిల్'లో ప్రామాణికమైన ఆధారంతో ఉల్లేఖించారు.)

*(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం, సుననె తిర్మిజీలోని "షమాయిలె ముహమ్మదియ్యహ్" ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా దైవప్రవక్త (స) నమాజ్ చేస్తున్నప్పుడు దైవభీతితో ఎంతగానో విలపించేవారని తెలుస్తోంది. దైవసన్నిధిలో బాధాతప్త హృదయంతో దేవుణ్ణి వేడుకుంటూ కంటతడిపెట్టడం కూడా మహాభాగ్యమే. ఆ భాగ్యం నికార్సయిన విశ్వాసులకే లభిస్తుంది.

452. హజ్రత్ అనస్ (రజి) కథనం : ఓసారి దైవప్రవక్త (సల్లం) ఉబై బిన్ కాబ్ (రజి)తో, "నేను నీ ముందు 'లమ్‌యకు నిల్లజీ' సూరా చదివి వినిపించాలని దేవుడు ఆదేశించాడు" అని అన్నారు. 'దేవుడు నా పేరు తీసుకొని మరీ ఆదేశించాడా?' అడిగారు ఉబై బిన్ కాబ్ (ఆశ్చర్యపోతూ). దైవప్రవక్త (స) 'ఔను' అని అనగానే ఉబై బిన్ కాబ్ (పట్టరాని సంతోషంతో) ఒక్కసారిగా బావురుమన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో రోదించటం మొదలుపెట్టారు అని ఉంది.

٤٥٢ ـ وعن أنسٍ، رضي اللهُ عنه قال: قالَ رسُولُ الله ﷺ، لأُبيِّ بن كَعْبٍ، رضيَ اللهُ عنه: «إنَّ اللهَ، عزَّ وَجَلَّ، أَمَرَنِي أَنْ أَقرَأَ عَلَيْكَ: ﴿لَمْ يَكُنِ الَّذِينَ كَفَرُوا﴾ [البينة: ١]» قَالَ: وَسَمَّانِي؟ قالَ: «نَعَمْ» فَبكى أُبيٌّ، متفقٌ عليه. وفي روايةٍ: فَجَعَلَ أُبيٌّ يَبْكِي.

*(సహీహ్ బుఖారీలోని మహిమోన్నతుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

1. ఈ హదీసు ద్వారా ఉబై బిన్ కాబ్ (రజి) ఘనత, గొప్పదనాలు వెల్లడౌతున్నాయి. ఆయన స్వయంగా ఖుర్‌ఆన్ సంస్మర్త. ఖుర్‌ఆన్‌ను మధురాతిమధురంగా పారాయణం

చేసేవారు. ఖుర్‌ఆన్ విద్యలో అసామాన్య నైపుణ్యం మూలంగానే దేవుడు ఆయనకు అంత గొప్ప స్థానాన్ని ప్రసాదించాడు.

2. ఇతరులకు ఖుర్‌ఆన్ పఠించి వినిపించటం కూడా సున్నత్ (సంప్రదాయం).

3. 'జ్ఞానం' విషయంలో వినమ్రత వాంఛనీయమే కాదు, అత్యంత అవసరం కూడా. మహాప్రవక్త (సల్లం) ద్వారా (ఈ సందర్భంగా) ఈ వినమ్రతే ఉట్టిపడింది. అన్యథా జ్ఞానాహంకారం మహామహులనే నాశనం చేసేస్తుంది.

4. సంతోషాతిశయంతో ఆనందభాష్పాలు రాలటం, ఎక్కిఎక్కి ఏడ్వటం సహజ విషయమే. ఆ సంతోషంలో అణకువ, అశక్తత కూడా వెల్లడైతే సుబ్‌హానల్లాహ్! అంతకన్నా కావలసిందేముంటుందీ?!

453. హ॥జ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (స) తదనంతరం ఒకసారి హ॥జ్రత్ అబూబక్ర్ (రజి) ఉమర్ (రజి)తో "ఉమ్మె ఐమన్ (రజి.అన్‌హా) దగ్గరికి పోయి వద్దాం పదండి. దైవప్రవక్త (స) ఆమెను పరామర్శించటానికి వెళ్ళినట్లు మనం కూడా వెళదాం" అని అన్నారు. ఆ తరువాత వాళ్ళిద్దరూ కలిసి ఆమె దగ్గరికి వెళ్ళగానే ఆమె ఒక్కసారిగా బావురుమన్నది. "ఏడుస్తావెందుకు? దైవప్రవక్తకు దేవుని దగ్గర (ఇహలోకంలో కంటే) ఎంతో శ్రేష్ఠమైన స్థానం లభిస్తుందని నీకు తెలియదా?"అని వాళ్ళిద్దరూ ఆమెను ఓదార్చారు. అప్పుడు ఆమె, "దైవప్రవక్తకు దేవుని దగ్గర గొప్ప స్థానముందని తెలియక నేను ఏడ్వటం లేదు. ఆకాశం నుండి వహీ (దైవవాణి) అవతరణ ఆగిపోయినందుకు ఏడుస్తు న్నాను" అని అన్నారు. ఆ మాట వినగానే వాళ్ళిద్దరికి కూడా ఏడ్పు ఆగలేదు.

٤٥٣ ـ وعنهُ قالَ: قال: أبو بكرٍ لعمرَ، رضيَ اللهُ عنهما، بعدَ وفاةِ رسُولِ اللهِ ﷺ: انْطَلِقْ بنا إلى أُمِّ أَيْمَنَ، رضيَ اللهُ عنها، نَزُورُها كما كانَ رسُولُ اللهِ ﷺ، يَزُورُها، فَلَمَّا انتَهَيْنَا إلَيْها بَكَتْ، فَقالا لها: ما يُبْكِيكِ؟ أَمَا تَعْلَمِينَ أَنَّ ما عِنْدَ اللهِ تَعالى خَيْرٌ لِرَسُولِ اللهِ ﷺ! قالَتْ: إنِي لَا أَبْكِي أنّي لا أَعْلَمُ أَنَّ ما عِنْدَ اللهِ خَيْرٌ لِرَسُولِ اللهِ ﷺ، ولكِنِّي أَبْكِي أَنَّ الوَحْيَ قَدِ انْقَطَعَ مِنَ السَّماءِ؛ فَهَيَّجَتْهُما عَلى البُكاءِ، فَجَعَلا يَبْكِيانِ مَعَهَا. رواهُ مسلم وقد سبق في باب زيارة أهل الخير.

ఆమెతోపాటు వాళ్ళూ రోదించటం మొదలుపెట్టారు. (ముస్లిం)

*(ఈ హదీసు ఇంతకుముందు సజ్జనుల్ని సందర్శించే అధ్యాయంలో కూడా వచ్చింది.)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా శుభాలు తొలగిపోయినప్పుడు విలపించటం ధర్మసమ్మతమేనని తెలుస్తోంది. సజ్జనుల ఉనికి ఎంతోమందికి ప్రయోజనకరంగా ఉంటుంది. అటువంటి మహానుభావులు లోకం వదలివెళ్ళిపోయినప్పుడు ప్రజలు సహజంగానే దుఃఖిస్తారు.

٤٥٤ ـ وعن ابنِ عمَر، رضيَ اللهُ عنهما، قال: لمَّا اشْتَدَّ بِرَسُولِ اللهِ ﷺ وَجَعُهُ، قِيلَ لَهُ في الصَّلاةِ، فقال: «مُرُوا أَبَا بَكْرٍ فَلْيُصَلِّ بالنَّاسِ» فقالتْ عائشةُ، رضيَ اللهُ عنها: إنَّ أَبَا بَكْرٍ رَجُلٌ رَقِيقٌ إذا قَرَأَ القُرآنَ غَلَبَهُ البُكاءُ، فقالَ: «مُرُوهُ فَلْيُصَلِّ».

454. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (స) వ్యాధి తీవ్ర రూపం దాల్చినప్పుడు (ప్రజలు సామూహిక) నమాజ్ విషయమై ఆయన్ని ప్రశ్నించారు. అప్పుడు ఆయన “ప్రజలకు సారథ్యం వహించి నమాజ్ చేయించమని అబూబక్ర్‌కు చెప్పండి” అని ఆదేశించారు. అందుకు ఆయిషా (రజి.అన్హా) “(దైవప్రవక్తా!) అబూబక్ర్ (రజి) సున్నిత మనస్కులు. (నమాజ్‌లో) ఖుర్ఆన్ పఠించినప్పుడు ఆయన తీవ్రంగా విలపిస్తారు. (కాబట్టి ఈ విషయంలో ఆయన్ని క్షమించండి)” అని విన్నవించుకున్నారు. కాని దైవప్రవక్త (స) (ఆమె మాటను నిరాకరిస్తూ) “ఆయనకు నమాజ్ చేయించమని చెప్పండి” అని అన్నారు.

وفي روايةٍ عن عائشةَ، رضيَ اللهُ عنها، قالَتْ: قلتُ: إنَّ أبا بكرٍ إذا قامَ مَقَامَكَ لَمْ يُسْمِعِ النَّاسَ مِنَ البُكاءِ. متفقٌ عليه.

హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) ఉల్లేఖనంలో ఇలా ఉంది : నేను దైవప్రవక్తకు “అబూబక్ర్ మీ స్థానంలో నిలబడితే తీవ్ర దుఃఖానికి లోనయి ప్రజలకు ఖుర్ఆన్ చదివి వినిపించలేరు” అని విన్నవించుకున్నాను. (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసు ద్వారా హజ్రత్ అబూబక్ర్ (రజి) వైశిష్ట్యం వెల్లడౌతోంది. ఈ వైశిష్ట్యం మూలంగానే దైవప్రవక్త సహచరులు ఆయన్ని దైవప్రవక్త (స) తదనంతరం తమ 'ఖలీఫా' (నాయకుడి)గా ఎన్నుకున్నారు. ఆ సమయంలో హజ్రత్ ఉమర్ (రజి) మాట్లాడుతూ, "దైవప్రవక్త (స) మన ధర్మం కోసం ఎంపిక చేసిన వ్యక్తినే మనం మన ప్రాపంచిక వ్యవహారాల నాయకుడిగా ఎన్నుకుందాం" అంటూ ప్రజల్లో ఎలుగెత్తి చాటారు.
2. దీనిద్వారా దివ్య ఖుర్ఆన్ పారాయణం చేస్తున్నప్పుడు విలపించటం ధర్మసమ్మతమేనని తెలుస్తోంది. హజ్రత్ అబూబక్ర్ (రజి) కూడా దివ్య ఖుర్ఆన్‌ను పారాయణం చేసినప్పుడు తీవ్రమైన భావోద్వేగానికి లోనయి దుఃఖించేవారు. ఈ లక్షణం ఆయన సంపూర్ణ విశ్వాసానికి ప్రతిబింబం.

٤٥٥ ـ وعن إبراهيمَ بنِ عبدِ الرَّحمٰنِ بنِ عَوْفٍ أَنَّ عبدَ الرَّحمٰنِ بنَ عَوْفٍ، رَضيَ اللهُ عنهُ، أُتيَ بطَعامٍ وكانَ صائماً، فقالَ: قُتِلَ مُصْعَبُ بنُ عُمَيرٍ، رضيَ اللهُ عنه، وَهُوَ خَيْرٌ مِنِّي، فَلَمْ يُوجَدْ لَهُ ما يُكَفَّنُ فيهِ إلَّا بُرْدَةٌ إنْ غُطِّيَ بها رَأسُهُ بَدَتْ رِجْلاهُ، وإنْ غُطِّيَ بها رِجْلاهُ بَدَا رأسُهُ، ثمَّ بُسِطَ لَنا مِنَ الدُّنيا ما بُسِطَ ـ أَوْ قالَ: أُعْطِينا مِنَ الدُّنْيا مَا أُعْطِينَا ـ قَدْ خَشِينَا أنْ تَكُونَ

455. హజ్రత్ ఇబ్రాహీం బిన్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రహ్మాలై) కథనం: ఓసారి అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) ఉపవాసంలో ఉన్నప్పుడు (ఇఫ్తార్ వేళ) ఆయనకు అన్నం వడ్డించబడింది. ఆ సందర్భంగా ఆయన మాట్లాడుతూ, "ముస్అబ్ బిన్ ఉమైర్" అమరగతులయ్యారు. ఆయన నాకన్నా గొప్పవారు. ఆయన అంత్యక్రియలు జరిపినప్పుడు (తన దగ్గర) ఒక దుప్పటి మాత్రమే ఉంది. (అది కూడా ఎంత చిన్నదంటే) దాంతో ఆయన ముఖాన్ని కప్పితే ఆయన కాళ్లు బయటికి కనిపించేవి. కాళ్లను కప్పితే ముఖంపై అచ్ఛాదనం ఉండేది కాదు. ఆ తరువాత మాకు ఎంత సమృద్ధిగా ప్రాపంచిక సిరిసంపదలు వొసగబడ్డాయో మీరు చూస్తున్నారుగా! (లేక) దేవుడు ఎంత ఎక్కువగా సిరిసంపదలు ప్రసాదించాడో కనబడు

حَسَنَاتُنا عُجِّلَتْ لَنَا . ثُمَّ جَعَلَ يَبْكِي حتَّى تَرَكَ الطَّعامَ . رواهُ البخاري .

తూనే ఉంది. కాని ఈ సిరిసంపదలు చూస్తుంటే మనం చేసుకున్న పుణ్య కార్యాలకు ప్రతిఫలం ప్రపంచంలోనే ఇవ్వబడుతుందేమోనని పిస్తోంది'' అని చెప్పి అన్నం కూడా తినకుండా రోదించటం మొదలు పెట్టారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త సహచరులు ఒండొకరి గొప్పదనాన్ని గుర్తించి గౌరవించేవారు. ఇహలోకంలోనే స్వర్గసుఖాల శుభవార్త వినిపించబడిన పదిమందిలో హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి) కూడా ఉన్నారు. ఆ విధంగా చూస్తే ముస్అబ్ బిన్ ఉమైర్ (రజి)కన్నా అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫే గొప్పవారు. కానీ ఆయన ముస్అబ్ (రజి) వీర మరణాన్నీ, ఆయన గడిపిన నిరుపేద జీవితాన్ని తలచుకొని తనకంటే ముస్అబ్ బిన్ ఉమైరే గొప్పవారని చెప్పేవారు.

రెండో విషయం ఏమిటంటే, దైవప్రవక్త సహచరులు ప్రాపంచిక సిరిసంపదలకు దూరంగా ఉండేవారు. అవిశ్వాసులకు ఇచ్చినట్లు దేవుడు తమ సత్కార్యాలకు కూడా ఇహలోకంలోనే ప్రతిఫలాన్ని ప్రసాదిస్తున్నాడేమోనని తల్లడిల్లేవారు. మరి చూడబోతే వారు తాము సంపాదించిన ధనాన్నంతటినీ తిరిగి దైవమార్గంలోనే ఖర్చుపెట్టేవారు. అయినప్పటికీ ప్రాపంచిక ఐశ్వర్యాలు తమల్ని వినాశానికి గురి చేస్తాయేమోనని ఆందోళన చెందేవారు.

٤٥٦ ـ وعن أبي أُمامةَ صُدَيِّ بنِ عجلانَ الباهليِّ، رضيَ الله عنه عن النبيِّ ﷺ قال: «لَيْسَ شيءٌ أَحَبَّ إلى اللهِ تعالى من قَطْرَتَيْنِ وَأَثَرَيْنِ: قَطْرَةُ دُمُوعٍ من خَشْيَةِ اللهِ، وَقَطْرَةُ دَمٍ تُهَرَاقُ في سَبِيلِ الله. وَأَمَّا الأَثَرَانِ: فَأَثَرٌ في سَبِيلِ اللهِ تعالى، وَأَثَرٌ في فَرِيضَةٍ مِنْ فَرَائِضِ الله تعالى» رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

456. హజ్రత్ అబూ ఉమామా సుదై బిన్ అజ్లాన్ బాహిలీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు: దేవునికి రెండు బొట్లు, రెండు మచ్చల కన్నా ఎక్కువ ప్రియమైన వస్తువు మరేదీ లేదు. ఒకటి దైవభీతి మూలంగా రాలిన కన్నీటి బొట్టు, రెండు దైవమార్గంలో (పోరాడినప్పుడు) చిందే రక్తపు బొట్టు. ఇకపోతే రెండు మచ్చల్లో ఒకటి దైవమార్గంలో పోరాడినప్పుడు

(కలిగిన గాయం వల్ల) ఏర్పడిన మచ్చ. రెండోది: ఏదయినా దైవవిధిని నిర్వర్తించినప్పుడు కలిగిన మచ్చ.

(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు).

*(సుననె తిర్మిజీలోని జిహాద్ ప్రకరణం)*

وفي الباب أحاديثُ كثيرةٌ، منها: حديث العِرْباضِ بنِ ساريةَ، رضي الله عنه، قال: وَعَظَنَا رسولُ اللهِ ﷺ، مَوْعِظَةً وَجِلَتْ منها القُلُوبُ، وَذَرَفَت منْهَا العُيُونُ.

ఈ అధ్యాయం క్రింద ఇంకా అనేక హదీసులున్నాయి. వాటిలో ఇర్‌బాజ్ బిన్ సారియా (రజి) హదీసు కూడా ఒకటి. అందులో ఆయన ఇలా తెలియజేశారు : దైవప్రవక్త (స) ఓసారి మాకు హితబోధ చేశారు. దాంతో మా హృదయాలు కంపించాయి. కళ్ళవెంబడి అశ్రుధారలు ప్రవహించాయి.

## 55వ అధ్యాయం

## ٥٥ - بَابُ فَضْلِ الزُّهْدِ فِي الدُّنْيَا وَالْحَثِّ عَلَى التَّقَلُّلِ مِنْهَا وَفَضْلِ الْفَقْرِ

## ఐహిక అనాసక్తత, ప్రాపంచిక ఐశ్వర్యాలను స్వల్పంగా అనుభవించటం, నిరుపేద జీవితాన్ని గడపటం గురించి...

قَالَ اللهُ تعالى: ﴿إِنَّمَا مَثَلُ ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا كَمَآءٍ أَنزَلْنَٰهُ مِنَ ٱلسَّمَآءِ فَٱخْتَلَطَ بِهِۦ نَبَاتُ ٱلْأَرْضِ مِمَّا يَأْكُلُ ٱلنَّاسُ وَٱلْأَنْعَٰمُ حَتَّىٰٓ إِذَآ أَخَذَتِ ٱلْأَرْضُ زُخْرُفَهَا وَٱزَّيَّنَتْ وَظَنَّ أَهْلُهَآ أَنَّهُمْ قَٰدِرُونَ عَلَيْهَآ أَتَىٰهَآ أَمْرُنَا لَيْلًا أَوْ نَهَارًا فَجَعَلْنَٰهَا حَصِيدًا كَأَن لَّمْ تَغْنَ بِٱلْأَمْسِ كَذَٰلِكَ نُفَصِّلُ ٱلْءَايَٰتِ لِقَوْمٍ يَتَفَكَّرُونَ ﴿٢٤﴾﴾ [يونس: ٢٤] وقال تعالى: ﴿وَٱضْرِبْ لَهُم مَّثَلَ ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا كَمَآءٍ أَنزَلْنَٰهُ مِنَ ٱلسَّمَآءِ فَٱخْتَلَطَ بِهِۦ نَبَاتُ ٱلْأَرْضِ فَأَصْبَحَ هَشِيمًا تَذْرُوهُ ٱلرِّيَٰحُ وَكَانَ ٱللَّهُ عَلَىٰ كُلِّ شَىْءٍ مُّقْتَدِرًا ﴿٤٥﴾ ٱلْمَالُ وَٱلْبَنُونَ زِينَةُ ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا وَٱلْبَٰقِيَٰتُ ٱلصَّٰلِحَٰتُ خَيْرٌ عِندَ رَبِّكَ ثَوَابًا وَخَيْرٌ أَمَلًا ﴿٤٦﴾﴾

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"ఈ ప్రాపంచిక జీవితాన్ని ఈ విధంగా పోల్చి చెప్పవచ్చు. మేము ఆకాశం నుండి నీటిని కురిపించగా మనుషులూ, పశువులూ అందరూ తినే భూ ఉత్పత్తులు బాగా దట్టంగా తయారవుతాయి. ఆపై భూమి మంచి స్థితిలో ఉండి, పొలాలు బాగా పండి శోభిల్లుతూ ఉన్నప్పుడు వాటి యజమానులు "ఇక మేము వాటి వల్ల లాభం పొందగలము' అని అనుకుంటున్న సమయంలో, అకస్మాత్తుగా రాత్రి వేళనో, పగటి పూటనో మా ఆజ్ఞ వచ్చేస్తుంది. అప్పుడు మేము అసలు అక్కడ నిన్న ఏమీ లేనట్లు దానిని సర్వనాశనం చేస్తాము. యోచన చేసి అర్థం చేసుకునే వారికొరకు మేము మా వాక్యాలను ఇలాగే (ఉదాహరణలతో సహా) స్పష్టంగా వివరించి చెబుతాము. (యూనుస్ : 24)

ఇంకొకచోట ఆయన ఇలా అంటున్నాడు :

"ప్రవక్తా! ఇహలోక జీవిత వాస్తవాన్ని వారికి ఈ ఉపమానం ద్వారా బోధించు : మేము ఆకాశం నుండి వర్షాన్ని కురిపిస్తే నేలపై పచ్చిక బాగా దట్టంగా పెరుగుతుంది. మరునాడు అదే పచ్చిక పొట్టుగా మారిపోతుంది. దానిని గాలులు లేపుకు పోయి తిరుగుతూ ఉంటాయి. అల్లాహ్ 'ప్రతి దానిపై అధికారం కలవాడు. ఈ సంపద,

సంతాన సౌభాగ్యాలు కేవలం ఐహిక జీవితపు తాత్కాలిక అలంకారాలు మాత్రమే. అసలు, శాశ్వతంగా ఉండిపోయే పుణ్యకార్యాలే నీ ప్రభువు దృష్టిలో ఉత్తమమైనవి. కాబట్టి వాటిని నమ్ముకోవటమే మంచిది."

(అల్ కహఫ్ : 45, 46)

మరొకచోట ఆయన సెలవిస్తున్నాడు :

"బాగా తెలుసుకోండి, ఇహలోక జీవితం ఒక ఆట, ఒక వినోదం, బాహ్య పటాటోపం, పరస్పరం ప్రగల్భాలు చెప్పుకోవటం, సంపద, సంతానాల విషయంలో ఒకరిపై ఒకరు ఆధిక్యం పొందటానికి ప్రయత్నించటం తప్ప మరేమీ కాదు. దాని దృష్టాంతం ఇలా ఉంది : ఒకసారి వర్షం కురిసినప్పుడు దాని వల్ల మొలకెత్తి పెరిగిన చెట్టూ చేమలను చూచి, రైతులు సంబరపడతారు. తరువాత అవి పండుతాయి. ఆ తరువాత అవి పసుపు పచ్చగా, ఆపై ఎండిపోయిన పొట్టుగా మారిపోవటాన్ని మీరు గమనిస్తూనే ఉంటారు. దీనికి భిన్నంగా పరలోకంలో తీవ్రమైన శిక్ష ఉంటుంది. అల్లాహ్ పెట్టే క్షమాభిక్ష, ఆయన ప్రసన్నతలు ఉంటాయి. (కనుక) ప్రాపంచిక జీవితం ఒక మాయతడిక తప్ప మరేమీ కాదు. (అల్ హదీద్ : 20)

వేరొకచోట ఆయన ఇలా అంటున్నాడు :

స్త్రీలూ, సంతానమూ, వెండి బంగారు రాసులూ, మేలుజాతి గుర్రాలూ, పశువులూ, సేద్యపు భూములు వంటి వాటిపై వ్యామోహాన్ని ప్రజల కొరకు ఆకర్షణీయంగా చేయబడింది. కాని ఇవన్నీ అశాశ్వతమైన ఐహిక జీవన సంపదలు మాత్రమే. అసలైన ఉత్తమ నివాసం అల్లాహ్ వద్ద ఉన్నదే. (ఆలి ఇమ్రాన్ : 14)

ఆయన ఇంకా ఇలా అంటున్నాడు :
"మానవులారా! అల్లాహ్ వాగ్దానం నిస్సందేహంగా

[الكهف: ٤٥، ٤٦] وقال تعالى: ﴿ اعْلَمُوا أَنَّمَا الْحَيَاةُ الدُّنْيَا لَعِبٌ وَلَهْوٌ وَزِينَةٌ وَتَفَاخُرٌ بَيْنَكُمْ وَتَكَاثُرٌ فِي الْأَمْوَالِ وَالْأَوْلَادِ كَمَثَلِ غَيْثٍ أَعْجَبَ الْكُفَّارَ نَبَاتُهُ ثُمَّ يَهِيجُ فَتَرَاهُ مُصْفَرًّا ثُمَّ يَكُونُ حُطَامًا وَفِي الْآخِرَةِ عَذَابٌ شَدِيدٌ وَمَغْفِرَةٌ مِنَ اللَّهِ وَرِضْوَانٌ وَمَا الْحَيَاةُ الدُّنْيَا إِلَّا مَتَاعُ الْغُرُورِ ﴾ [الحديد: ٢٠] وقال تعالى: ﴿ زُيِّنَ لِلنَّاسِ حُبُّ الشَّهَوَاتِ مِنَ النِّسَاءِ وَالْبَنِينَ وَالْقَنَاطِيرِ الْمُقَنْطَرَةِ مِنَ الذَّهَبِ وَالْفِضَّةِ وَالْخَيْلِ الْمُسَوَّمَةِ وَالْأَنْعَامِ وَالْحَرْثِ ذَلِكَ مَتَاعُ الْحَيَاةِ الدُّنْيَا وَاللَّهُ عِنْدَهُ حُسْنُ الْمَآبِ ﴾ [آل عمران: ١٤] وقال تعالى: ﴿ يَا أَيُّهَا النَّاسُ إِنَّ وَعْدَ اللَّهِ حَقٌّ فَلَا تَغُرَّنَّكُمُ الْحَيَاةُ الدُّنْيَا وَلَا يَغُرَّنَّكُمْ بِاللَّهِ الْغَرُورُ ﴾ [فاطر: ٥] وقال تعالى: ﴿ أَلْهَاكُمُ التَّكَاثُرُ ۝١ حَتَّى زُرْتُمُ الْمَقَابِرَ ۝٢ كَلَّا سَوْفَ

تَعْلَمُونَ ۝ ثُمَّ كَلَّا سَوْفَ تَعْلَمُونَ ۝ كَلَّا لَوْ تَعْلَمُونَ عِلْمَ ٱلْيَقِينِ ﴾ [التكاثر: ١ ـ ٥]

وقال تعالى: ﴿ وَمَا هَٰذِهِ ٱلْحَيَوٰةُ ٱلدُّنْيَآ إِلَّا لَهْوٌ وَلَعِبٌ وَإِنَّ ٱلدَّارَ ٱلْءَاخِرَةَ لَهِىَ ٱلْحَيَوَانُ لَوْ كَانُوا۟ يَعْلَمُونَ ﴾ [العنكبوت: ٦٤]

والآيات في الباب كثيرة مشهورة.

وأمَّا الأحاديثُ فأكثرُ مِنْ أَنْ تُحْصَرَ فَنُنَبِّهُ بِطَرَفٍ مِنها على ما سواه.

సత్యమైనది. కనుక ఇహలోక జీవితం మిమ్మల్ని మోసంలో పడవేయకూడదు." (ఫాతిర్ : 5)

ఇంకొకచోట ఇలా సెలవిచ్చాడు :

"ఒకరిని మించి ఒకరు ఎక్కువగా ప్రపంచాన్ని పొందాలనే ధ్యాస మిమ్మల్ని ఏమరుపాటులో పడవేసింది. చివరకు మీరు ఈ వ్యామోహంలోనే శ్మశానికి చేరుకుంటారు. మీరనుకునేది ఎంతమాత్రం కాదు, త్వరలోనే మీకా విషయం తెలిసిపోతుంది. మరొకసారి వినండి, మీరను కునేది ఎంతమాత్రం నిజం కాదు, అతి త్వర లోనే మీకు తెలిసిపోతుంది. ఎంతమాత్రం కాదు, మీరు గనక నిశ్చయజ్ఞానంతో తమ వైఖరి పర్యవసానాన్ని తెలుసుకుంటే (మీ నడవడిక ఇలా ఉండేది కాదు). (అత్ తకాసుర్ : 1 - 5)

ఇంకొకచోట ఆయన ఇలా అంటున్నాడు :

ఈ ప్రాపంచిక జీవితం ఒక క్రీడ, ఒక వినోదం తప్ప మరేమీ కాదు, అసలు జీవన గృహం పరలోక గృహమే. ప్రజలు ఈ విషయాన్ని తెలుసుకుంటే ఎంత బాగుంటుంది.

(అల్ అన్‌కబూత్ : 64)

ఈ అధ్యాయానికి సంబంధించిన సుప్రసిద్ధమైన సూక్తులు ఇంకా ఎన్నో ఉన్నాయి.

ఇకపోతే హదీసులు కూడా లెక్కలేనన్ని ఉన్నాయి. వాటిలో కొన్నింటిని ఇక్కడ ప్రస్తావిస్తున్నాం.

٤٥٧ ـ عن عَمْرِو بنِ عوفٍ الأنصاريِّ، رضيَ اللهُ عنه، أنَّ رسولَ اللهِ، ﷺ، بَعَثَ أبا عُبيدةَ بنَ الجرَّاحِ، رَضِيَ الله عنه، إلى البَحْرَيْنِ يَأْتِي بِجِزْيَتِهَا، فَقَدِمَ بِمَالٍ مِنَ البَحْرَيْنِ،

457. హజ్రత్ అమ్ర్ బిన్ ఔఫ్ అన్సారీ (రజి) కథనం : దైవప్రవక్త (స) అబూ ఉబైదా బిన్ జర్రాహ్ (రజి) ను బహ్రైన్ ప్రాంతం నుంచి జిజ్‌యా సొమ్మును వసూలు చేసుకొని రమ్మని పంపించారు. ఆయన బహ్రైన్ వెళ్ళి జిజ్‌యా సొమ్ము తీసుకొని (మదీనాకు) తిరిగొచ్చారు. ఆయన వచ్చిన సంగతి అన్సార్లందరికీ

فَسَمِعَتِ الأنصارُ بقُدوم أبي عُبَيْدَةَ، فَوافَوْا صَلاةَ الفَجْرِ مَعَ رسولِ الله ﷺ، فَلَمَّا صَلَّى رسولُ الله ﷺ، انصَرَفَ، فَتَعَرَّضُوا لَهُ، فَتَبَسَّمَ رسولُ الله ﷺ حِينَ رَآهُمْ، ثُمَّ قال: «أَظُنُّكُمْ سَمِعتُم أَنَّ أَبَا عُبَيْدَةَ قَدِمَ بِشَيْءٍ مِنَ الْبَحْرَيْنِ؟» فقالوا: أَجَل يا رسولَ الله! فقال: «أَبْشِرُوا وَأَمِّلُوا ما يَسرُّكُمْ، فوالله! ما الفَقْرَ أَخْشَى عَلَيْكُمْ، وَلكِنِّي أَخْشَى أَنْ تُبْسَطَ الدُّنْيَا عَلَيْكُمْ كما بُسِطَتْ عَلَى مَنْ كَانَ قَبْلَكُمْ، فَتَنَافَسُوهَا كَمَا تَنَافَسُوهَا؛ فَتُهْلِكَكُمْ كَمَا أَهْلَكَتْهُمْ» متفقٌ عَلَيْهِ.

తెలిసిపోయింది. మరునాడు వాళ్ళం దరూ దైవప్రవక్త వెంట ఫజ్ర్ నమాజ్‌లో పాల్గొన్నారు. ఆయన నమాజ్ చేయించారు. ఆ తరువాత వెళ్ళిపోతుండగా వాళ్ళు ఆయన చుట్టూ గుమిగూడారు. దైవప్రవక్త (స) వారిని చూసి చిరునవ్వు నవ్వుతూ "అబూ ఉబైదా బహ్రైన్ నుంచి ఎంతోకొంత సొమ్ము తీసుకు వచ్చాడని మీకు తెలిసిపోయిందనుకుంటా" అని అన్నారు. "ఔను, అది తెలుసుకునే వచ్చాం. దైవప్రవక్తా!" అని విన్నవించుకున్నారు అనుచరులు. అందుకు ఆయన "మీకు శుభవార్త! (నిజంగానే బహ్రైన్ నుంచి సొమ్ము వచ్చింది). మీరు ఇష్టపడే సంపద దొరుకుతుందని ఆశించండి. (కాని ఒక విషయం మాత్రం గుర్తుపెట్టుకోండి). దైవసాక్షిగా చెబుతున్నాను. మీరు ఆర్థిక ఇబ్బందులకు గురవుతారన్న భయం నాకు లేదు. కాని గత సమాజాల్లో మాదిరిగా మీక్కూడా పుష్కలంగా ప్రాపంచిక సిరిసంపదలు లభిస్తే మీరూ వారిలాగే ప్రాపంచిక వ్యామోహంలో పోటీ పడతారేమోనని నాకు భయంగా ఉంది. అలా చేస్తే ఈ ప్రాపంచిక వ్యామోహం గత సమాజాలను నాశనం చేసినట్లుగా మిమ్మల్ని కూడా నాశనం చేయవచ్చు" అని వారిని హెచ్చరించారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఫర్జుల్ ఖుమ్స్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక జాతి దారిద్ర్యావస్థలో కునారిల్లటంకన్నా అంతులేని ఐశ్వర్యాలతో తులతూగుతూ ఉండటమే ధార్మికంగా ఎంతో ప్రమాదకరమని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. అందుకే దైవప్రవక్త తన అనుచర సమాజాన్ని ప్రాపంచిక సిరిసంపదల సమృద్ధిని గురించి అప్రమత్తం చేశారు. ఇహలోకపు భోగభాగ్యాల వలలో చిక్కుకోకుండా తమల్ని తాము కాపాడుకోమని హెచ్చరించారు. పధ్నాలుగు వందల సంవత్సరాలకు పూర్వం దైవప్రవక్త (స) ఊహించిన పరిణామాలు నేడు నిజమవుతున్నట్లు అనిపిస్తున్నాయి. అనేకమంది ధనవంతులు ప్రాపంచిక భోగలాలస మైకంలో పడి విశ్వాసాన్ని, సదాచరణను విస్మరిస్తున్నారు. ధర్మం విషయంలో ఏమరుపాటుకు లోనై ఉన్నారు. ప్రజలు ఇలాంటి ఉపద్రవాలకు లోనవుతారనే దైవప్రవక్త (స) హెచ్చరించింది!

٤٥٨ ـ وعن أبي سعيدٍ الخدريِّ، رَضِـيَ اللهُ عنـه، قـالَ: جَلَـسَ رسـولُ الله ﷺ، عَلى المِنْبَرِ، وَجَلَسْنَا حَوْلَهُ، فقال: «إنَّ مِمَّا أَخَافُ عَلَيْكُمْ مِنْ بَعْدِي مَـا يُفْتَـحُ عَلَيْكُـمْ مِـن زَهْـرَةِ الـدُّنْيَـا وَزِينَتِهَا». متفقٌ عليه.

458. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం : ఓసారి దైవప్రవక్త (స) (మస్జిదె నబవీలోని) వేదికపై కూర్చొని ఉండగా మేము కూడా ఆయన చుట్టూ కూర్చున్నాం. ఆ సందర్భంగా ఆయన మాకు హితబోధ చేస్తూ, "నా తదనంతరం ప్రాపంచిక సౌందర్యం, దాని పటాటోపం మీపై (వెల్లువలా) వచ్చిపడుతుందేమోనని నాకు భయంగా ఉంది" అని ఆందోళన వ్యక్తం చేశారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

٤٥٩ ـ وعنه أنَّ رسولَ الله ﷺ قال: «إنَّ الدُّنْيَا حُلْوَةٌ خَضِرَةٌ، وَإنَّ اللهَ تعالى مُسْتَخْلِفُكُم فِيهَا، فَيَنْظُرُ كَيْفَ تَعْمَلُونَ، فَاتَّقُوا الدُّنْيَا وَاتَّقُوا النِّسَاءَ» رواه مسلم.

459. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవ ప్రవక్త (స) ఇలా ప్రవచించారు : నిశ్చయంగా ఈ ప్రపంచం తియ్యనైనది, సస్యశ్యామలమైనది. వాస్తవా నికి దేవుడు మిమ్మల్ని ఈ ప్రపంచంలో ప్రతినిధులుగా పుట్టించి, మీరు ఎలా పనిచేస్తారో నని పరీక్షిస్తున్నాడు. కనుక మీరు ప్రాపంచిక (మాయల) విషయంలో, స్త్రీల

(ద్వారా ఎదురయ్యే పరీక్షల) విష
యంలో అప్రమత్తంగా ఉండండి.
*(ముస్లిం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ప్రాపంచిక సిరిసంపదలు, స్త్రీల పట్ల అప్రమత్తంగా ఉండాలని చెప్పబడింది. ముఖ్యంగా స్త్రీల మూలంగా తలెత్తే ఉపద్రవాలకు దూరంగా ఉండాలని తాకీదు చేయబడింది. దానికోసం ప్రజలు ఇస్లామీయ షరీఅత్ సూచించే జాగ్రత్తల్ని పాటించాలి. స్త్రీలు పరదా పద్ధతిని అవలంబించాలి. బజారుల్లో నడుస్తున్నప్పుడు చూపులు క్రిందికి వాల్చి నడవాలి. పరాయి పురుషులూ, స్త్రీల కలయిక జరగకుండా నిరోధించాలి. ఏ స్త్రీ కూడా పరాయి పురుషుడితో ఏకాంతంలో ఉండకుండా కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవాలి. అలా చేసినప్పుడే సమాజం అసభ్య కార్యాలకు దూరంగా, లజ్జారహిత చేష్టల నుండి పరిశుద్ధంగా ఉంటుంది. షరీఅత్ నిబంధనల్ని తేలిగ్గా కొట్టిపారేసే ప్రభృతులే సాధారణంగా స్త్రీల వలలో చిక్కుకొని, వారి చంచల మైన చూపుల బాణాలకు క్షతగాత్రులై, వారి అందచందాలకు ఆహుతి అయిపోతుంటారు.

460. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "దైవమా! అసలు జీవితమంటే పరలోక జీవితమే" అని అన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

٤٦٠ـ وعن أنسٍ، رضيَ الله عنه، أنَّ النبيَّ ﷺ، قال: «اللَّهُمَّ لا عَيْشَ إلَّا عَيْشُ الآخِرَةِ». متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీ మరియు సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (స) రెండు సందర్భాల్లో ఈ మాట చెప్పారు. వాస్తవానికి ఇదో చిన్న కవిత. కందక యుద్ధం జరిగిన రోజుల్లో ఆయన అనుచరులు కందకాలు తవ్వి మట్టిమోస్తున్నప్పుడు వారిలో ఉత్సాహాన్ని కలిగించటానికి వారి ముందు ఈ కవిత చదివారు. "దేవా! జీవితమంటే అసలు పరలోక జీవితమే" అంటూ ముహాజిర్, అన్సార్ ముస్లింలను క్షమించమని దైవాన్ని వేడుకున్నారు. కందక యుద్ధం జరిగినప్పుడు ముస్లింలు ఎంతో గడ్డు పరిస్థితుల్లో జీవితం గడుపుతున్నారు. వారి దగ్గర తినడానికి సరిగ్గా తిండి కూడా లేని కాలం అది. నకనకలాడుతున్న కడుపులతో శత్రువులనుంచి ఆత్మ రక్షణ కోసం కందకాలు తవ్వుతున్న అనుచరులను ఓదార్చుతూ ఆయన ఈ కవిత చదివారు. ఇహలోకంలో కొద్దిరోజులపాటు కష్టాలను, బాధల్ని దైవం కోసం సహిస్తే, పరలోకంలో సుఖశాంతులతో కూడిన శాశ్వత జీవితం లభిస్తుందని ఈ కవిత ద్వారా తన అనుచరులకు బోధించారాయన.

రెండవసారి దైవప్రవక్త (స) తన వీడ్కోలు హజ్ సందర్భంగా అసంఖ్యాక ముస్లిం జనవాహినిని చూసినప్పుడు కూడా ఆయన ఇదేమాట అన్నారు. తమ సంఖ్యాబలాన్ని, శక్తి సామర్థ్యాలను, ఆధిపత్యాన్ని చూసుకొని ఆనందంతో మిడిసిపాటుకు లోను కారాదనీ, ఇహ లోకపు శక్తిసామర్థ్యాలు, ప్రాపంచిక పటాటోపాలు ఏదో ఒకనాడు నశించిపోగలవని హెచ్చరించారు. పరలోక జీవితమే అసలు శాశ్వత జీవితమనీ, దానికోసం కృషి చేయమని ఉపదేశించారు.

٤٦١ ـ وعنهُ عن رسولِ الله ﷺ قال: «يَتْبَعُ المَيِّتَ ثَلاثَةٌ: أَهْلُهُ وَمَالُهُ وَعَمَلُهُ: فَيَرْجِعُ اثْنانِ، وَيَبْقى وَاحِدٌ: يَرْجِعُ أَهْلُهُ وَمَالُهُ وَيَبْقَى عَمَلُهُ». متفقٌ عليه.

461. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : మృతుని వెంట మూడు వస్తువులు (సమాధి దగ్గరికి) వెళతాయి. (1) అతని కుటుంబీకులు. (2) అతని సంపద (3) అతని కర్మలు. రెండు వస్తువులు వెనక్కి తిరిగివస్తాయి. ఒకటి మాత్రం అక్కడే ఉండిపోతుంది. కుటుంబీకులు, సంపద తిరిగివస్తాయి. కాని కర్మలు మాత్రం అతని వెంటే ఉంటాయి. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని (పేమైక వచనాల ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

మనిషి మరణించినప్పటి నుంచి పరలోకంలో దైవసన్నిధిలో తన లెక్క తెమలేదాకా తాను గత జీవితంలో చేసుకున్న కర్మలే అతనికి తోడుగా ఉంటాయి. ఆ కర్మల ఆధారంగానే పరలోకంలో అతన్ని సౌభాగ్యుడిగానో, దౌర్భాగ్యుడిగానో తేల్చటం జరుగుతుంది. ఒకవేళ అతను ప్రపంచంలో మంచిపనులు చేసి వుంటే మరణానంతరం సుఖవంతమైన శాశ్వత జీవితం అతనికి స్వాగతం పలుకుతుంది. దురాచరణకు ఒడిగట్టిన దౌర్భాగ్యుడికి ప్రపంచంలో ఎనలేని సంపదలున్నా మరణానంతరం అవేమీ అతనికి ప్రయోజనాన్ని చేకూర్చలేవు. పైగా అతను చేసిన పాపాలకు పర్యవసానంగా సమాధినుంచే అతనికి శిక్ష మొదలౌతుంది.

٤٦٢ ـ وعنه قال: قال رسولُ الله ﷺ: «يُؤتَى بأَنْعَمِ أَهْلِ الدُّنْيا مِنْ أَهْلِ النَّارِ يَوْمَ القِيامَةِ، فَيُصْبَغُ في النَّارِ صَبْغَةً، ثُمَّ يُقَالُ: يا ابْنَ آدَمَ! هَلْ رَأَيْتَ

462. హజ్రత్ అనస్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు : ప్రళయదినాన ప్రపంచంలో అందరికన్నా ఎక్కువగా సౌఖ్యం అనుభవించిన నరకవాసి ప్రవేశపెట్టబడతాడు. ఒకసారి నరకంలో ముంచి

خَيْراً قَطُّ؟ هَلْ مَرَّ بِكَ نَعِيمٌ قَطُّ؟ فَيَقُولُ: لا واللهِ! يا رَبِّ. وَيُؤْتَى بِأَشَدِّ النَّاس بُؤْساً في الدُّنْيَا مِنْ أَهْلِ الجَنَّةِ، فَيُصْبَغُ صَبْغَةً في الجَنَّةِ، فَيُقَالُ لَهُ: يَاابْنَ آدَمَ! هَلْ رَأَيْتَ بُؤْساً قَطُّ؟ هَلْ مَرَّ بِكَ شِدَّةٌ قَطُّ؟ فيقولُ: لا وَاللهِ! مَا مَرَّ بِي بُؤْسٌ قَطُّ، وَلَا رَأَيْتُ شِدَّةً قَطُّ» رواه مسلم.

తీసిన పిదప అతనితో, "ఆదం పుత్రుడా! గతంలో నీవెప్పుడయినా సౌఖ్యాన్ని చవి చూశావా? నీకు ఇంతకు ముందు సౌఖ్యాన్ని అనుభవించినట్లు గుర్తుందా?" అని అడగటం జరుగుతుంది. దానికావ్యక్తి, "(అమ్మో) లేదు. దైవసాక్షి! ప్రభూ! గతంలో నేనెప్పుడూ సౌఖ్యాన్ని అనుభవించలేదు" అని అంటాడు. ఆ తరువాత ప్రపంచంలో అందరికన్నా ఎక్కువగా కష్టాలు అనుభవించిన స్వర్గవాసి హాజరుపరచబడతాడు. అతన్ని ఒకసారి స్వర్గంలో ఉంచి తీసిన తరువాత అతనితో "ఓ ఆదం పుత్రుడా! గతంలో నువ్వెప్పుడైనా కష్టాలు ఎదుర్కొన్నావా? నీకు ఇంతకు ముందు కష్టాలు వచ్చినట్లు గుర్తుందా?" అని అడగటం జరుగుతుంది. దానికి సమాధానంగా ఆ స్వర్గవాసి "దైవసాక్షి! నేనెన్నడూ కష్టాలు చూడలేదు. గతంలో నేను బాధపడినట్లు నాకు గుర్తే లేదు" అని అంటాడు. *(ముస్లిం)*

## ముఖ్యాంశాలు

మనిషి ఇహలోకపు భోగభాగ్యాల కోసం, ఇక్కడి విలాసాల కోసం ధర్మాధర్మాలను కూడా లెక్కచేయడు. ఇహలోకాన్నే సర్వస్వంగా తలపోసి, ప్రాపంచిక మజాలు జుర్రుకోవటమే జీవిత పరమార్థంగా భావించి అధర్మంగా ప్రవర్తిస్తాడు. ప్రపంచంలో ఎదురయ్యే కష్టాలను, బాధలను భరించటానికి వెనుకాడతాడు. వాస్తవానికి నరకంలో విధించే శిక్షతో పోల్చుకుంటే ప్రాపంచిక కష్టాలు అసలు కష్టాలే కావు. అదేవిధంగా స్వర్గవాసులకు లభించే సుఖాల ముందు, ఇహలోకపు భోగభాగ్యాలకు, సుఖశాంతులకు పూచిక పుల్లంత విలువ కూడా లేదు. ఒక్కసారి నరకంలో ముంచితీస్తే ఇహలోకపు భోగభాగ్యాలు, విలాసాలు అన్నీ మర్చిపోతాడు మనిషి!

463. హజ్రత్ ముస్తౌరిద్ బిన్ షద్దాద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీరు సముద్రంలో వ్రేలు ముంచి తీస్తే దానికి ఎంత నీరు అంటుకుంటుందో పరలోక జీవితం ముందు ఇహలోక జీవితం (విలువ) కూడా అంతే సుమా!"
*(ముస్లిం)*

٤٦٣ ـ وعن المُسْتَوْرِدِ بنِ شَدَّادٍ رَضِيَ اللهُ عنه، قال: قالَ رسولُ الله ﷺ: «مَا الدُّنْيَا في الآخِرَةِ إلَّا مِثْلُ مَا يَجْعَلُ أَحَدُكُمْ أُصْبُعَهُ في اليَمِّ، فَلْيَنْظُرْ بِمَ يَرْجِعُ؟» رواه مسلم.

## ముఖ్యాంశాలు

ఇహలోకంలో ఎదురయ్యే కష్టసుఖాలు పరలోకంలో లభించే శిక్షలు, అనుగ్రహాల ముందు సముద్రంలోని నీటి బొట్టుతో సమానం. పరలోక శిక్షలతో పోల్చుకుంటే ఇహలోకంలోని కష్టాలు, బాధలను అనుభవించటమే తేలిక. అదేవిధంగా పరలోకంలోని దైవానుగ్రహాలు, స్వర్గసుఖాల ముందు ఇహలోకపు భోగలాలసకు, విలాసవంతమైన జీవితానికి పూచికపుల్లంత విలువ కూడా ఉండదు. అసలు స్వర్గసుఖాల గురించి మనిషి ఊహించనయినా ఊహించలేడు.

464. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (స) ఓ బజారుగుండా వెళుతున్నారు. ఆయన ఇరుప్రక్కలా జనం ఉన్నారు. అలా వెళుతూ ఉండగా ఆయన పొట్టి చెవులుగల ఒక చచ్చిన మేక పిల్లను చూశారు. దాని చెవి పట్టుకొని ఆయన అక్కడున్న వారితో, "మీలో ఎవరైనా దీన్ని ఒక్క దిర్హముకైనా కొనటానికి యిష్టపడతారా?" అని అడిగారు. అక్కడున్నవారు, "(ఒక్క దిర్హం కాదు కదా) దానికన్నా తక్కువ ఖరీదుకు కూడా మేము దాన్ని తీసుకోము. ఒకవేళ తీసుకున్నా దాన్ని మేమేం చేసుకుంటాం" అని అన్నారు. ఆయన, "ఒకవేళ ఉచితంగా లభించినా

٤٦٤ ـ وعن جابرٍ، رَضِيَ اللهُ عنهُ أنَّ رسولَ اللهِ ﷺ مَرَّ بالسُّوقِ وَالنَّاسُ كَنَفَتَيْهِ، فَمَرَّ بِجَدْيٍ أَسَكَّ مَيِّتٍ، فتَنَاوَلَهُ، فَأَخَذَ بِأُذُنِهِ، ثُمَّ قال: «أَيُّكُمْ يُحِبُّ أَنْ يَكُونَ هٰذَا لَهُ بِدِرْهَمٍ؟» فَقالوا: مَا نُحِبُّ أَنَّهُ لَنَا بِشَيْءٍ

وَمَا نَصْنَعُ بِهِ؟ ثم قال: «أَتُحِبُّونَ أَنَّهُ لَكُمْ؟» قَالُوا: وَاللهِ! لَوْ كَانَ حَيّاً كَانَ عَيْباً، أَنَّهُ أَسَكُّ. فَكَيْفَ وَهو مَيِّتٌ! فقال: «فَوَاللهِ! لَلدُّنْيَا أَهْوَنُ عَلَى اللهِ مِنْ هذا عَلَيْكُمْ» رواه مسلم. قوله: «كَنَفَتَيْهِ» أَيْ: عن جانبيه. و«الأسكّ» الصغير الأُذُن.

తీసుకోవటానికి యిష్టపడతారా?" అని మళ్ళీ అడిగారు. దానికి వారు, "దైవం తోడు, ఇది బ్రతికున్నా (మేము దీన్ని తీసుకోవటానికి యిష్టపడేవాళ్ళం కాము) దీనిలో లోపం ఉంది. దీని చెవులు పొట్టిగా ఉన్నాయి. ఇక చచ్చిపోయిన తరువాత ఏం తీసుకుంటాం?" అని అన్నారు. అప్పుడు ఆయన "దైవసాక్షి! మీరు ఈ మేకపిల్లను ఎంత తుచ్ఛమైనదిగా భావిస్తున్నారో దేవుని దృష్టిలో ఈ లోకం అంతకన్నా తుచ్ఛమైనది" అని చెప్పారు. (ముస్లిం)

'అసక్కు' అంటే పొట్టిచెవులు గలది అని అర్థం.

(సహీహ్ ముస్లింలోని ప్రేమైక వచనాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా కూడా ఈ లోకం నిజస్థితి ఏమిటో అవగతమవుతోంది. కాని దీనికోసం ఈ మనిషి ఎన్ని పిల్లిమొగ్గలు వేస్తాడో?!

٤٦٥ ـ وعن أبي ذرٍّ رَضِيَ اللهُ عنه، قال: كُنْتُ أَمْشِي مَعَ النبيِّ ﷺ، في حَرَّةِ بالمدينةِ، فَاسْتَقْبَلَنَا أُحُدٌ فقال: «يا أبا ذَرٍّ». قلتُ: لَبَّيْكَ يا رسولَ اللهِ! فقال: «مَا يَسُرُّنِي أَنَّ عِنْدِي مِثْلَ أُحُدٍ هذا ذَهَباً تَمْضِي عَلَيَّ ثَلَاثَةُ أَيَّامٍ وَعِنْدِي مِنْهُ دِينَارٌ، إِلَّا شَيْءٌ أُرْصِدُهُ لِدَيْنٍ، إِلَّا أَنْ أَقُولَ بِهِ فِي عِبَادِ اللهِ هٰكَذَا وَهٰكَذَا وَهٰكَذَا» عن يَمِينِه

465. హజ్రత్ అబూజర్ర్ (రజి) కథనం: ఒకరోజు నేను దైవప్రవక్త (స) వెంట మదీనా నగరం వెలుపల కంకర నేలపై నడుస్తుండగా మా ఎదురుగా ఉహుద్ పర్వతం వచ్చింది. అప్పుడు ఆయన 'అబూజర్ర్' అని పిలిచారు. నేను 'సెలవియ్యండి దైవప్రవక్తా!' అని అన్నాను. ఆ సందర్భంగా ఆయన (ఉహుద్ పర్వతంవైపు చూపుతూ) నాతో ఇలా అన్నారు: "నా దగ్గర ఉహుద్ పర్వతమంత బంగారం ఉంటే నేను అందులో అప్పు తీరిపోయేంత బంగారాన్ని మాత్రం

సంభాళించు కోగలను. ఆ తర్వాత మూడు రాత్రులు గడిచినంత కాలంలో అందులో ఒక్క దీనారు కూడా నా దగ్గర మిగిలి ఉండటాన్ని నేను యిష్టపడను. నేనా ధనాన్నంతా ప్రజలకు 'అలా ఇలా' పంచిపెట్టేస్తాను. ఈ మాట అన్నప్పుడు ఆయన తన కుడివైపు నుంచి, ఎడమ వైపు నుంచి, వెనుక నుంచి ఖర్చుపెడ తానని చేతిని అటూ ఇటూ త్రిప్పి చూపించారు.

ఇంకాస్త దూరం వెళ్ళిన తరువాత ఆయన "ఎక్కువ సిరిసంపదలు కలిగి వున్నవారే (ప్రళయదినాన) తక్కువ పుణ్యం పొందుతారు. ధనాన్ని అలా ఇలా కుడి నుంచి, ఎడమవైపు నుంచి, వెనుక నుంచి (ప్రజల కోసం) ఖర్చుపెట్టే వారు తప్ప. కాని అలాంటి వారు చాలా తక్కువ మంది ఉంటారు" అని అన్నారు. ఆ తరువాత నాతో, "నువ్విక్కడే ఉండు. నేను తిరిగొచ్చేదాకా ఇక్కడి నుంచి కదలకు" అని చెప్పి ఆయన చీకట్లో నాకు కనపడకుండా ముందుకు వెళ్ళిపోయారు. అంతలో ఏదో శబ్దం విని పించింది. ఎవడైనా (శత్రువు) ఆయన మీద దాడి చేశాడేమోనని నాకు భయం వేసింది. ఆయన వెళ్ళినవైపు నేను కూడా పోదామనుకున్నాను. కాని నేనొచ్చేదాకా ఇక్కడ్నుంచి కదలకు అన్న ఆజ్ఞ గుర్తొచ్చి అక్కడే ఆగిపోయాను. కాస్సే పటికి ఆయనే వచ్చారు. నాకు శబ్దం విని

وعن شماله وعَنْ خلفه، ثم سار فقال: «إنَّ الأكثَرِينَ هُمُ الأقَلُّونَ يَوْمَ القيامةِ إلَّا مَنْ قَالَ بالمَالِ هٰكذا وهٰكذا وهٰكذا» عن يمينِه، وعن شمالهِ، ومِنْ خَلْفه «وَقَليلٌ مَا هُمْ». ثم قال لي: «مَكَانَكَ لا تَبْرَحْ حَتَّى آتيَكَ». ثم انْطَلَقَ في سَوَادِ اللَّيْلِ حتى تَوَارَى، فَسَمِعْتُ صَوْتاً قَدِ ارْتَفَعَ، فَتَخَوَّفْتُ أَنْ يَكُونَ أَحَدٌ عَرَضَ للنَّبيِّ ﷺ فَأَرَدْتُ أَنْ آتِيَهُ فَذَكَرْتُ قولَه: «لا تَبْرَحْ حَتَّى آتيَكَ» فلم أَبْرَحْ حَتَّى أَتَانِي، فَقُلْتُ: لقد سَمِعْتُ صَوْتاً تَخَوَّفْتُ منه، فَذَكَرْتُ له،

فقال: «وَهَلْ سَمِعْتَهُ»؟ قلت: نَعَم، قال: «ذَاكَ جبريلُ أتاني فقال: مَن ماتَ مِنْ أُمَّتِكَ لا يُشرِكُ باللهِ شيئاً دَخَلَ الجَنَّةَ، قلتُ: وَإِنْ زَنَى وَإِنْ سَرَقَ؟ قال: وَإِن زَنَى وَإِن سَرَقَ» متفقٌ عليه، وهذا لفظ البخاري.

పించిన సంగతి, దానికి నేను భయపడిన సంగతి అంతా ఆయనకు తెలియ జేశాను. ఆయన "నీకా శబ్దం వినిపించిందా?" అని అడిగారు. నేను వినిపించిందన్నాను. అప్పుడు ఆయన ఆ శబ్దం గురించి చెబుతూ ఇలా అన్నారు : "అది జిబ్రయీల్ (దూత) నా దగ్గరికి వచ్చినప్పుడు అయిన శబ్దం. 'మీ అనుచర సమాజంలో దైవానికి ఇతరుల్ని ఏ మాత్రం సాటికల్పించకుండా మరణించిన వ్యక్తి స్వర్గానికి వెళ్తాడు" అని ఆయన నాతో చెప్పారు. నేనామాటలు విని "అతను వ్యభిచారం చేసివున్నా, దొంగతనాలకు పాల్పడివున్నా (స్వర్గానికి వెళతాడా?)"అని అడిగాను. దానికి జిబ్రయీల్ "ఔను, వ్యభిచారం చేసి వున్నా, దొంగతనాలకు పాల్పడి వున్నా సరే" అని అన్నారు. (బుఖారీ - ముస్లిం, వాక్యాలు మాత్రం బుఖారీవి).

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులోని చివరి వాక్యాలకు భావం ఒకే దేవుణ్ణి నమ్మి, ఆయన్ని మాత్రమే ఆరాధిస్తూ ఉండే విశ్వాసి వల్ల ఘోరపాపాలు జరిగివున్నా కూడా అంతిమంగా అతను స్వర్గవాసియే అవుతాడని. అల్లాహ్ తలచుకుంటే తన కరుణాకటాక్షాలతో అతన్ని క్షమించి నరకానికి పంపించవచ్చు లేదా అతను కొంతకాలం శిక్ష అనుభవించిన తరువాత స్వర్గానికి వెళ్ళవచ్చు లేదా కొంతమంది పండితుల అభిప్రాయం ప్రకారం ఈ హదీసులో ప్రస్తావించబడిన వ్యక్తి తన మరణానికి ముందు చిత్తశుద్ధితో స్వచ్ఛమైన 'తౌబా' చేసుకున్నప్పటికీ ఆ తర్వాత మంచిపనులు చేసే వ్యవధి లభించనివాడు కావచ్చు. ఇలాంటి వారి వల్ల జరిగిన ఘోరపాపాలను కూడా అల్లాహ్ క్షమించేస్తాడు.

ఈ హదీసులోని తొలిభాగం సదరు అధ్యాయానికి సంబంధించినది. ఇందులోని వాక్యాలు ప్రజలు తమ దగ్గర ప్రాపంచిక సిరిసంపదలు చాలా తక్కువగా ఉంచుకోవాలని ప్రబోధిస్తున్నాయి. ఎందుకంటే ఇహలోకంలో ఎక్కువ సిరిసంపదలున్నవారు పరలోకంలో చాలా తక్కువ పుణ్యాన్ని పొందే అవకాశాలున్నాయి. ఈ హదీసు ద్వారా బోధపడే రెండో విషయం ఏమిటంటే, అప్పు తీర్చటం కోసం ధనాన్ని కూడబెట్టడం కేవలం ధర్మ సమ్మతమే కాదు, పైగా విధి కూడాను. స్వచ్ఛంద (నఫిల్) దానధర్మాలు చేయటంకన్నా అప్పు తీర్చటం చాలా అవసరం. వీటన్నింటిని మించి ఈ హదీసు దైవప్రవక్త దాతృత్వాన్ని, ఆయన ఉదార స్వభావాన్ని వెల్లడిస్తోంది.

٤٦٦ ـ وعن أَبي هريرةَ، رضي الله عنه عنْ رسولِ الله ﷺ قال: «لو كان لي مِثْلُ أُحُدٍ ذَهباً، لَسَرَّني أَنْ لا تَمُرَّ عَلَيَّ ثَلاثُ لَيَالٍ وَعِندي منه شَيءٌ إلَّا شَيءٌ أُرْصِدُهُ لِدَينٍ» متفقٌ عليه.

466. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు : నా దగ్గర ఉహుద్ పర్వత మంత బంగారం ఉంటే అందులో నా అప్పు తీరిపోయేటంత (ధనం) తప్ప మూడు రాత్రులు గడిచేలోగా అందులో ఒక్క చిల్లిగవ్వ కూడా మిగలకుండా ఉండటాన్నే నేను యిష్టపడతాను.

*(బుఖారీ - ముస్లిం)*

## ముఖ్యాంశాలు

అంటే మూడు రాత్రులు గడిచేలోగా నేనా ధనాన్నంతటినీ దైవమార్గంలో ఖర్చుపెట్టి చేతులు దులుపుకుంటానని అర్థం. దీనిద్వారా ఆయన ఇహలోక సిరిసంపదల పట్ల ఎంత అనాసక్తత కనబరిచేవారో తెలుస్తోంది. తన దగ్గర ధనం నిల్వ ఉండటాన్ని ఆయన సుతరామూ యిష్టపడేవారు కాదు.

٤٦٧ ـ وعنه قال: قال رسولُ الله ﷺ: «انْظُرُوا إلى مَنْ هُوَ أَسْفَلَ مِنكُم وَلا تَنظُرُوا إلى مَنْ هُوَ فَوقَكُم فَهُوَ أَجْدَرُ أَن لا تَزدَرُوا نعمَةَ اللهِ عَلَيْكُمْ» متفق عليه وهذا لفظ مسلمٍ.

467. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు: మీరు (ప్రాపంచిక సిరిసంపదల రీత్యా) మీకన్నా తక్కువ స్థితిలో ఉన్నవారి వైపు చూడండి. అంతే గాని మీకన్నా ఉచ్ఛస్థితిలో ఉన్నవారి వైపు చూడకండి. దేవుడు మీకు ప్రసాదించిన అనుగ్రహాల పట్ల మీరు కృతజ్ఞతా భావంతో ఉండటానికి ఇదెంతో అనువైన పద్ధతి.

*(బుఖారీ - ముస్లిం, వాక్యాలు మాత్రం ముస్లింవి.)*

وفـي روايـة البخاري: «إذا نَظَرَ أَحَدُكُمْ إلى مَنْ فُضِّلَ عليهِ في المالِ وَالخَلْقِ، فَلْيَنْظُرْ إلى مَنْ هو أَسْفَلَ مِنْه».

బుఖారీ వాక్యాలు ఈ విధంగా ఉన్నాయి: మీలో ఎవరైనా సిరిసంపదల రీత్యా, అందం రీత్యా తనకన్నా మంచి స్థితిలో ఉన్నవారిని చూస్తే, అతను (ఆయా విషయాల్లో) తనకన్నా హీన స్థితిలో ఉన్నవారివైపు కూడా దృష్టి సారించాలి."

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోలలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రాపంచిక సిరిసంపదల్లో, అందచందాల్లో తనకన్నా మంచి స్థితిలో ఉన్నవారిని చూసినప్పుడు సహజంగానే మనిషి ఈర్ష్యాసూయలకు లోనవుతాడు. దైవానుగ్రహాల పట్ల అతనిలో ఒకింత కృతఘ్నతా భావం జనిస్తుంది. ఇలాంటి దుష్టభావాలు జనించకుండా ఉండాలంటే మనిషి తనకన్నా హీనస్థితిలో ఉన్నవారివైపు కూడా దృష్టి సారిస్తూ ఉండాలి. ఈ రోగానికి ఇదే సరైన చికిత్స. మనం ఒక మామూలు ఇంట్లో ఎలాంటి ఇబ్బందులు లేకుండా హాయిగా జీవితం గడుపుతున్నప్పుడు మనకన్నా ఉచ్ఛస్థితిలో ఉన్న ధనవంతుల సుందర హర్మ్యాలను, ఎత్తైన బంగ్లాలను చూసి న్యూనతాభావానికి లోనుకాకూడదు. పైగా మన పరిసరాల్లో మనకన్నా హీనమైన స్థితిని అనుభవిస్తున్న వారిని చూసి దేవుడు మనల్ని వారికన్నా మంచిస్థితిలో ఉంచినందుకు కృతజ్ఞతలు తెలుపుకోవాలి. ఎండల్లో మాడిపోతూ, వానల్లో తడిసిపోతూ చెట్లక్రింద, రోడ్లప్రక్కన బ్రతుకులు వెళ్ళదీస్తున్న వారిని చూసి మనకు ఆ గతి పట్టనందుకు సంతోషించాలి. అంతేగాని ప్రాపంచిక సిరిసంపదల తళుకుబెళుకులను చూసి అసంతృప్తికి లోనుకారాదు. అయితే దైవభీతి, ధర్మపరాయణత లాంటి విషయాల్లో మాత్రం ఎల్లప్పుడూ మనకన్నా గొప్పవారినే ఆదర్శంగా తీసుకోవాలి. దానివల్ల మనలో కూడా ధార్మిక చింతన, దైవారాధనా భావాలు పెంపొందుతాయి.

٤٦٨ ـ وعنه عن النَّبيِّ ﷺ، قال: «تَعِسَ عَبْدُ الدِّينَارِ وَالدِّرْهَمِ وَالقَطِيفَةِ وَالخَمِيصَةِ، إنْ أُعْطِيَ رضِيَ، وَإنْ لَمْ يُعْطَ لَمْ يَرْضَ» رواه البخاري.

468. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు : దిర్హములు, దీనార్ల పూజారి ఒకటి రెండు ఉన్ని దుప్పట్ల పూజారి, నాశనమయిపోవునుగాక! అతను ఈ వస్తువులు దొరికితే సంబర పడతాడు. లేకపోతే అలుగుతాడు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దిర్హములు, దీనార్ల పూజారి అంటే దైవాదేశాలకన్నా ప్రాపంచిక సిరిసంపదలను ఎక్కువగా ఆరాధించేవాడని అర్థం. ఇలాంటి వ్యక్తి రేయింబవళ్లు ధనసంపాదనలోనే తలమునకలై ఉండి దైవాన్ని మరిచిపోతాడు. దేవుణ్ణి పూజించటానికి బదులు ధనాన్నే పూజించటం మొదలుపెడతాడు. ఆఖరికి ఈ ధనపూజే అతణ్ణి వినాశ కూపంలోకి నెట్టివేస్తుంది.

٤٦٩ ـ وعنه، رضي الله عنه قال: لَقَدْ رَأَيْتُ سَبْعِينَ مِنْ أَهْلِ الصُّفَّةِ، مَا مِنْهُمْ رَجُلٌ عليه رداءٌ، إِمَّا إِزَارٌ وَإِمَّا كِسَاءٌ، قَدْ رَبَطُوا فِي أَعْنَاقِهِمْ، فَمِنْهَا مَا يَبْلُغُ نِصْفَ السَّاقَيْنِ، وَمِنْهَا مَا يَبْلُغُ الكَعْبَيْنِ، فَيَجْمَعُهُ بِيَدِهِ كَرَاهِيَةَ أَنْ تُرَى عَوْرَتُهُ» رواه البخاري.

469. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం : నేను డెబ్భైమంది సుఫ్ఫా మనుషుల్ని (విద్యార్థుల్ని) చూశాను. వారిలో ఎవరిదగ్గరా శరీరానికి చాలినంత వస్త్రం ఉండేది కాదు. ఉంటే లుంగీ ఉండేది లేకపోతే (పాడువాటి) దుప్పటి ఉండేది. దాన్ని వాళ్ళు భుజాల మీది నుంచి చుట్టుకునేవారు. అది కూడా (చాలీచాలనట్టుగా) పిక్కల వరకు లేదా గిలకల వరకు (వ్రేలాడుతూ) ఉండేది. ఆచ్ఛాదనం తొలగిపోతుందేమోనని భయంతో వాళ్ళు ఆ వస్త్రాన్ని ముడుచుకొని పట్టుకునేవారు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని ప్రార్థనా స్థలాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సుఫ్ఫా అంటే అరుగు అని అర్థం. మస్జిదె నబవీ ముందు ఓ అరుగు ఉండేది. ఆ అరుగు దగ్గర దైవప్రవక్త వద్ద ధార్మిక జ్ఞానాన్ని ఆర్జించే విద్యార్థులు, సైనిక శిక్షణ పొందే యోధులు ఉండేవారు. వీరిని అహ్లెసుఫ్ఫా (సుఫ్ఫా విద్యార్థులు) అని పిలిచేవారు. సుఫ్ఫా విద్యార్థుల సంఖ్య ఎంతో ఇతమిత్థంగా తెలియదు. ఇస్లాంలో ఇది తొలి పాఠశాలగా, తొలి సైనిక శిబిరంగా విరాజిల్లింది. నేడు ధర్మజ్ఞానాన్ని ఆర్జించే విద్యార్థులకు ఈ సుఫ్ఫా పాఠశాలలో ఎంతో గుణపాఠం ఉంది. ప్రవక్త అనుచరులు అన్నపానీయాలకు ప్రాముఖ్యత ఇవ్వకుండా రేయింబవళ్లు ఆ అరుగు దగ్గరే ఉంటూ కష్టపడి ధర్మజ్ఞానాన్ని ఆర్జించటంతోపాటు సైనిక శిక్షణ కూడా పొందేవారు.

٤٧٠ ـ وعنه قال: قال رسولُ الله ﷺ: «الدُّنْيَا سِجْنُ المُؤْمِنِ وَجَنَّةُ الكَافِرِ» رواه مسلم.

470. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : విశ్వాసికి ప్రపంచం చెరసాల వంటిది. అవిశ్వాసికి ఇది స్వర్గం లాంటిది. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

విశ్వాసికి ఇహలోకంలో తన మనోవాంఛల్ని, కోరికల్ని అదుపులో పెట్టుకొని భక్తివిశ్వాసాలతో కూడిన జీవితాన్ని గడపవలసి ఉంటుంది. దైవాదేశాలకు, షరీఅత్ నిబంధనలకు లోబడి వ్యవహరించవలసి ఉంటుంది. ఆ విధంగా చూస్తే ఒక విశ్వాసి పాలిట ఈ ప్రపంచం చెరసాలతో సమానం. కాని అవిశ్వాసికి అలాంటి నియమనిబంధనలేవీ ఉండవు. అతను షరీఅత్ ఆదేశాలకు కట్టుబడి జీవితం గడపడు. పైగా తన మనోవాంఛలకు అనుగుణంగా ప్రవర్తిస్తాడు. ఎల్లప్పుడూ ఇహలోకపు భోగభాగ్యాల మజాలు జుర్రుకోవటంలో మునిగి ఉంటాడు. ఆ విధంగా అవిశ్వాసులకు ఇహలోకమే స్వర్గంలా కనిపిస్తుంది. కాని యదార్థానికి ఇహలోకపు భోగభాగ్యాలు అశాశ్వతమైనవి. ప్రాపంచిక సిరిసంపదలు ఒక మాయతడిక తప్ప మరేమీ కావు. ప్రపంచంలో కొద్దిపాటి కష్టాన్ని దైవం కోసం సంతోషంగా అనుభవించిన వారికి పరలోకంలో ఎన్నటికీ తరగని సుఖాలు లభిస్తాయి. వారు అక్కడ అలాగే శాశ్వతంగా ఉంటారు. దీనికి విరుద్ధంగా ఇహలోకపు భోగభాగ్యాల వలలో చిక్కుకొని దైవాన్ని విస్మరించినవారి భోగలాలస వారి మరణంతోనే మూన్నాళ్ల ముచ్చటగా తీరిపోతుంది. ఆ తరువాత పరలోకంలో వారు భగభగమండే నరకాగ్నికి ఆహుతి అవుతారు. అక్కడ వారు చావనూ లేరు. అందులోనుంచి తప్పించుకోనూ లేరు.

٤٧١ ـ وعن ابن عمرَ رضي الله عنهما، قال: أخذ رسولُ الله ﷺ بِمَنْكِبَيَّ، فقال: «كُنْ فِي الدُّنْيَا كَأَنَّكَ غَرِيبٌ، أَوْ عَابِرُ سَبِيلٍ». وَكَانَ ابنُ عُمَرَ رضي الله عنهما، يقول: إِذَا أَمْسَيْتَ فَلا تَنْتَظِرِ الصَّبَاحَ، وَإِذَا أَصْبَحْتَ فَلا تَنْتَظِرِ المَسَاءَ، وَخُذْ مِنْ صِحَّتِكَ لِمَرَضِكَ وَمِنْ حَيَاتِكَ لِمَوْتِكَ. رواه البخاري.

471. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (స) నా భుజాలు పట్టుకొని, "ప్రపంచంలో ఓ అపరిచిత వ్యక్తిలా, ఓ బాటసారిలా జీవితం గడుపు" అని అన్నారు.

హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) ఇలా అనేవారు : మీరు సాయంత్రం పూట (ఏదైనా మంచిపని చేయదలచుకుంటే) ఉదయం కోసం ఎదురుచూడకండి. ఉదయమైతే సాయంత్రం కోసం

ఎదురుచూడకండి. ఆరోగ్యంగా ఉన్నప్పుడు అనారోగ్యావస్థ కోసం, జీవించి ఉన్నప్పుడు చావుకోసం ఏమైనా (మంచి పనులు) చేసుకోండి." *(బుఖారీ)*

ఈ హదీసుని వివరిస్తూ పండితులు ఇలా అన్నారు : దీని భావం ఏమిటంటే, నీవు ఈ ప్రపంచాన్ని అతిగా పట్టించుకోకు. దాన్ని శాశ్వత నిలయంగా భావించకు. ఎక్కువ కాలం వరకు ప్రపంచంలో ఉండాలని, దాన్ని చూడాలని మాత్రం కోరుకోకు. ఒక అపరిచిత బాటసారి తన దేశం కాని దేశంలో ఎలా ఉంటాడో ప్రపంచంలో అలా ఉండు. తన ఇంటికి బయలుదేరిన బాటసారి పరదేశాన్ని (సుఖాల్ని) పట్టించుకోడు. అలాగే నీవు కూడా ఇహలోకంపై అంతగా మోజు పడకు.

قالوا في شرح هذا الحديث: معناه لا تَركَنْ إلى الدُّنْيَا وَلا تَتَّخِذْهَا وَطَناً، وَلا تُحَدِّثْ نَفْسَكَ بِطُولِ البَقَاءِ فِيهَا، وَلا بِالاعْتِنَاءِ بِهَا، وَلا تَتَعَلَّقْ مِنهَا إلَّا بِمَا يَتَعَلَّقُ بِهِ الْغَرِيبُ فِي غَيْرِ وَطَنِهِ، وَلا تَشْتَغِلْ فِيهَا بِمَا لا يَشْتَغِلُ بِهِ الْغَرِيبُ الَّذي يُرِيدُ الذَّهَابَ إلى أَهْلِهِ. وَبِاللهِ التَّوفِيقُ.

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇహలోకపు భోగభాగ్యాలు మూన్నాళ్ళముచ్చట అని తెలుసుకున్నవాడు ప్రపంచంలో తనకు బంగారపు కొండలు కావాలని ఎన్నటికీ కోరుకోడు. మరణానంతర శాశ్వత జీవితం గురించి ఆలోచిస్తాడు. కాని మానవుడు ఎంత మూర్ఖుడు! క్షణక్షణం అనిశ్చింతగా నడిచే ఈ ఇహలోక జీవితపు ఆనందాల కోసం అంతులేని సిరిసంపదలు కూడబెట్టుకుంటున్నాడు. ఇహలోకంలోనే శాశ్వతంగా ఉండాలని కోరుకుంటున్నాడేమో!

472. హ్రజత్ అబుల్ అబ్బాస్ సహ్ల్ బిన్ సాద్ సాయిదీ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (స) దగ్గరికి వచ్చి, "దైవప్రవక్తా! దేవుడు, ప్రజలు నన్ను అభిమానించాలంటే ఏం చెయ్యాలో చెప్పండి" అని అడిగాడు. "లోకంపట్ల అనాసక్తత చూపు.

٤٧٢ ـ وعن أبي الْعَبَّاسِ سَهْلِ بنِ سَعْدٍ السّاعديِّ رضي اللهُ عنهُ، قالَ: جاءَ رَجُلٌ إلى النبيِّ ﷺ، فقالَ: يا رسولَ اللهِ

دُلَّنِي عَلَى عَمَلٍ إذَا عَمِلْتُهُ أَحَبَّنِيَ اللهُ، وَأَحَبَّنِيَ النَّاسُ، فقال: «ازْهَدْ فِي الدُّنْيَا يُحِبَّكَ اللهُ، وَازْهَدْ فِيمَا عِنْدَ النَّاسِ يُحِبَّكَ النَّاسُ» حديثٌ حسنٌ رواه ابن مَاجَه وغيره بأسانيد حسنةٍ.

దేవుడు నిన్ను ప్రేమిస్తాడు. ఆ తర్వాత ప్రజల దగ్గర ఉన్నవాటి పట్ల అనాసక్తత కనబరచు. అప్పుడు ప్రజలు నిన్ను అభిమానిస్తారు" అని సమాధాన మిచ్చారు దైవప్రవక్త (స).

(ఈ హదీసు హసన్ కోవకు చెందినది. ఇబ్నెమాజా తదితరులు దీనిని ప్రామా ణికమైన ఆధారాలతో వెలికితీశారు.)

*(సుననె ఇబ్నెమాజాలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'ఐహిక అనాసక్తత' అంటే ప్రాపంచిక జీవన సామగ్రిని పూర్తిగా కాలదన్ని భిక్షాటన చేసుకొని లేదా పస్తులుండి జీవితం గడపమని అర్థం ఎంతమాత్రం కాదు. వాస్తవానికి ఐహిక అనాసక్తత అంటే ధర్మసమ్మతమైన మార్గాల ద్వారా వచ్చే సంపదపై సంతృప్తి చెందటం, దొడ్డిదోవల్లో డబ్బు సంపాదించకుండా ఉండటం అని అర్థం. మనిషి బ్రతుకుతెరువు కోసం మార్గాలు అన్వేషించకుండా ఉండటాన్ని, ఇహలోకపు సంబంధ బాంధవ్యాలన్నింటిని త్రెంచుకొని ఒంటరి జీవితం గడుపుతూ దేహాన్ని శుష్కించుకోవటాన్ని ఇస్లాం ధర్మం సుతరామూ ఇష్టపడదు. కనుక అవసరం మేరకు ప్రాపంచిక సంబంధాలు కలిగి ఉండటం, జీవనోపాధి కోసం కృషిచేయటం 'ఐహిక అనాసక్తత' కు విరుద్ధం కాదు. పైగా ధర్మసమ్మతమైన మార్గాల ద్వారా డబ్బు సంపాదించటాన్ని, దాంతో సంతృప్తి చెందటాన్ని ఇస్లాం ఒక 'ఆరాధన'గా పరిగణిస్తుంది.

అయితే మనిషి పరులవద్ద ఉన్న సిరిసంపదల కోసం అర్రులు చాచకూడదు. ఎల్లప్పుడూ వాటి పట్ల నిరపేక్షాభావంతో ఉండాలి. ప్రజల ధనం పట్ల అనాసక్తత కనబరిచేవాడిని ప్రజలు అభిమానిస్తారు. అలాంటి మనిషికి ప్రజల దృష్టిలో గౌరవప్రదమైన స్థానం లభిస్తుంది. దీనికి భిన్నంగా పరుల ధనం కోసం వెంపర్లాడేవాడిని, ఏ కష్టం చేయకుండా భిక్షాటన చేసేవాడిని ప్రజలు నీచుడిగా చూస్తారు. అలాంటి వ్యక్తి సమాజంలో అప్రతిష్ఠ పాలౌతాడు.

٤٧٣ - وعن النُّعْمَانِ بنِ بَشِيرٍ رضيَ الله عنهما، قالَ: ذَكَرَ عُمَرُ بنُ الخَطَّاب، رضي الله عنه، مَا أَصَابَ النَّاسُ مِنَ الدُّنْيَا، فقال: لَقَدْ رَأَيْتُ رسولَ اللهِ ﷺ،

473. హజ్రత్ నోమాన్ బిన్ బషీర్ (రజి) కథనం : హజ్రత్ ఉమర్ (రజి) గతంలో ప్రజల ప్రాపంచిక స్థితిని గుర్తుచేస్తూ ఇలా అన్నారు : "దైవప్రవక్త (స) ఒక్కో సారి రోజంతా (తినటానికి తిండిలేక) ఆకలి బాధతో పొట్టను వంచి ఉంచటం

يَظَلُّ الْيَوْمَ يَلْتَوِي مَا يَجِدُ مِنَ الدَّقَلِ مَا يَمْلأُ بِهِ بَطْنَهُ. رواه مسلم. «الدَّقَلُ» بفتح الدال المهملة والقاف: رَدِيْءُ التَّمْرِ.

నేను కళ్ళారా చూశాను. ఆయనకు కడుపునింపుకోవటానికి తాలు ఖర్జూరాలు కూడా దొరికేవి కావు.” (ముస్లిం)

‘దఖల్’ అంటే తప్ప, తాలు అయిన ఖర్జూరాలు అని అర్థం.

*(సహీహ్ ముస్లింలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

రెండవ ఖలీఫా హజ్రత్ ఉమర్ (రజి) కాలంలో ముస్లింలు ఎన్నో విజయాలు సాధించారు. ముస్లింల ధాన్యాగారం అపారమైన సిరిసంపదలతో నిండిపోయింది. ప్రజలు అష్టైశ్వర్యాలతో తులతూగుతున్నారు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) ప్రజల్లో కృతజ్ఞతాభావం పెంపొందించాలన్న ఉద్దేశ్యంతో వారికి ఇస్లాం ఆరంభ దినాలను గుర్తుచేశారు. ఆ కాలంలో దైవప్రవక్త అనుచరులు చాలా కఠినమైన పరిస్థితుల్ని ఎదుర్కొన్నారు. కొన్ని కొన్ని రోజుల వరకూ పస్తులు గడపాల్సి వచ్చేది. చివరికి దైవప్రవక్తకు కూడా తినడానికి ఏమీ దొరికేది కాదు. అలాంటి గడ్డు పరిస్థితుల్లోనే వారు ఇస్లాం ధర్మ ఔన్నత్యం కోసం కృషిచేశారు. హజ్రత్ ఉమర్ (రజి) ఆనాటి పరిస్థితుల్ని గుర్తుచేసి నేడు మీరు ప్రాపంచిక సిరిసంపదలు, భోగభాగ్యాల ప్రవాహంలో కొట్టుకుపోరాదని, ఇహలోక ఐశ్వర్యాల్లో మునిగిపోయి దైవాన్ని విస్మరించకూడదని హెచ్చరించారు.

٤٧٤ ـ وعن عائشةَ رضي الله عنها، قالتْ: تُوُفِّيَ رسولُ الله ﷺ، وَمَا في بَيْتِي مِنْ شَيْءٍ يَأْكُلُهُ ذُو كَبِدٍ إلَّا شَطْرُ شَعِيرٍ في رَفٍّ لِي، فَأَكَلْتُ مِنْهُ حَتَّى طَالَ عَلَيَّ، فَكِلْتُهُ فَفَنِيَ. متفقٌ عليه. «شَطْرُ شَعِيرٍ» أَيْ: شَيْءٌ مِنْ شَعِيرٍ، كَذَا فَسَّرَهُ التِّرْمذيُّ.

474. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) చనిపోయినప్పుడు మా ఇంట్లో ప్రాణమున్న జీవి తినగలిగే వస్తువేదీ లేదు. నా గూడులో ఉండిపోయిన కొన్ని బార్లీ బియ్యం తప్ప. నేను చాలాకాలం వరకు ఆ కాస్త ధాన్యమే తింటుండేదాన్ని ఆ తరువాత ఒకరోజు నేను దాన్ని కొలిచిచూశాను. దాంతో అది (కూడా) నిండుకుంది.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (స) మరణించేకాలం నాటికి ముస్లింలు యుద్ధాల ద్వారా వచ్చిన ధనంతో మునుపటికన్నా కాస్త మెరుగైన జీవితాన్ని గడుపుతున్నారు. కాని స్వయంగా దైవప్రవక్త (స)

మాత్రం జీవితాంతం నిరుపేదగా బ్రతకటాన్నే యిష్టపడ్డారు. ఆయన యుద్ధప్రాప్తి ద్వారా వచ్చిన ధనంలో కొంతైనా తన దగ్గర ఉంచుకునేవారు కాదు. మరోవిషయం ఏమిటంటే ఈ హదీసును ఆయనగారి ప్రియాతి ప్రియమైన సతీమణి హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) వివరించారు. ఆవిడ ఇంటి పరిస్థితే ఇలా ఉందంటే ఆయన ఇహలోక సిరిసంపదల పట్ల ఎంత అనాసక్తతా భావంతో ఉండేవారో ఊహించవచ్చు.

٤٧٥ ـ وعن عمرو بنِ الحارثِ أخي جُوَيْرِيَةَ بِنْتِ الحَارِثِ أُمِّ المُؤْمِنينَ رضي الله عنهما، قال: مَا تَرَكَ رسولُ اللهِ ﷺ عِنْدَ مَوْتِهِ دِينَاراً، وَلا دِرْهَماً، وَلا عَبْداً، وَلا أَمَةً، وَلا شَيْئاً إلَّا بَغْلَتَهُ البَيْضَاءَ الَّتي كَانَ يَرْكَبُهَا، وَسلاحَهُ، وَأَرْضاً جَعَلَهَا لابْنِ السَّبيلِ صَدَقَةً. رواه البخاري.

475. విశ్వాసుల మాతృమూర్తి జువైరియా (రజి.అన్హా) సోదరులు అమ్ర్ బిన్ హారిస్ (రజి) కథనం : దైవప్రవక్త (స) మరణించినప్పుడు తాను ప్రయాణం కోసం ఉపయోగించే తెల్లని కంచరగాడిదను, తన ఆయుధాలను, ఇంకా బాటసారులకు విరాళంగా ఇచ్చిన కొంత భూమిని మాత్రం వదలివెళ్ళారు. ఇవి తప్ప ఆయన ఒక్క దీనారుగాని దిర్హముగాని, బానిసగాని, బానిసరాలిని గాని వదలివెళ్ళలేదు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని వీలునామాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హిజ్రీ శకం ఐదో ఏట బనూ ముస్తలిఖ్ యుద్ధం జరిగినప్పుడు చాలామంది అవిశ్వాస స్త్రీలు, పురుషులు ఖైదీలుగా పట్టుబడ్డారు. వారిలో జువైరియా (రజి.అన్హా) కూడా ఉన్నారు. ఈమె దైవప్రవక్త (స) వాటాలోకి వచ్చారు. ఆయన ఈవిడకు స్వేచ్ఛనొసగి తన ధర్మపత్నిగా చేసుకున్నారు. ఈ విషయం ఆయన అనుచరులకు తెలియగానే వారు తమ మాతృమూర్తి గౌరవార్థం ఆమె తెగకు చెందిన ఖైదీలందరినీ విడుదల చేసేశారు. అలా విడుదలైన వారు సుమారు వందమంది వరకూ ఉన్నారు. ఈ విధంగా హజ్రత్ జువైరియా (రజి.అన్హా) తన తెగ ఖైదీలందరికీ స్వేచ్ఛకల్పించిన సౌభాగ్యవతిగా పేరుమోశారు.

దైవప్రవక్తకు తన జీవితకాలంలో ఫిదక్ మరియు ఖైబర్ ప్రాంతాల మధ్య కొంతభూమి లభించింది. అయితే ఆయన దాన్ని కూడా ప్రజలకు దానంగా ఇచ్చివేశారు. ఒకానొక సందర్భంగా ఆయన ప్రజలతో మాట్లాడుతూ, "మా ప్రవక్తల వర్గంలో ఎవరైనా చనిపోతే వారి ధనం వారసులకు చెందదు. మేము వదలిపెట్టిపోయేదంతా విరాళంగానే పరిగణించబడుతుంది" అని అన్నారు. తాను చనిపోయే ముందు ఆయన తన దాసదాసీలందరికీ స్వేచ్ఛను ప్రసాదించారు.

476. హ్రజత్ ఖబ్బాబ్ బిన్ అరత్ (రజి) కథనం : మేము దైవప్రసన్నత కోసం దైవప్రవక్త (స) వెంట (మక్కా నుండి మదీనాకు) వలసవెళ్ళాం. కాబట్టి మాకు దాని ప్రతిఫలం ప్రసాదించటం దేవుని బాధ్యత అయిపోయింది. మాలో కొందరు ఇహలోకంలో తమ ప్రతి ఫలంలో ఏమీ అనుభవించ కుండానే చనిపోయారు. వారిలో ముస్అబ్ బిన్ ఉమైర్ (రజి) ఒకరు. ఆయన ఉహుద్ యుద్ధంలో అమరగతి నొందినప్పుడు ఒక గొంగళి మాత్రం వదలివెళ్ళారు. దాంతో (ఆయన శవాన్ని) తలవైపు నుంచి కప్పితే కాళ్లు బయట ఉండేవి. కాళ్లవైపు నుంచి కప్పితే తల బయట ఉండేది. అందుచేత దైవప్రవక్త "ఆ దుప్పటిని తలవైపు నుంచి కప్పి కాళ్ళను ఇజ్ఖిర్ గడ్డితో కప్పమ"ని మాకు ఆజ్ఞా పించారు.

మాలో ఇంకొందరి పుణ్యఫలాలు పండి నాయి. వారు ఇప్పుడు వాటిని ఏరు కుంటున్నారు. (అంటే ప్రయోజనం పొందుతున్నారని అర్థం.)

*(బుఖారీ - ముస్లిం)*

دేవుడు వారికోసం ప్రాపంచిక సిరిసంప దల ద్వారాలను తెరిచాడని, వాటిపై వారికి ఆధిక్యతను ప్రసాదించాడన్న విషయాన్ని ఇక్కడ ఈ విధంగా పోల్చి చెప్పటం జరిగింది.

٤٧٦ ـ وعن خَبَّابِ بنِ الأَرَتِّ رضي الله عنه، قال: هَاجَرْنَا مَعَ رسولِ اللهِ ﷺ نَلْتَمِسُ وَجْهَ اللهِ تعالى، فَوَقَعَ أَجْرُنَا عَلى اللهِ، فَمِنَّا مَنْ مَاتَ وَلَمْ يَأْكُلْ مِنْ أَجْرِهِ شَيْئاً، مِنْهُمْ مُصْعَبُ بن عُمَيْرٍ رضي الله عنه، قُتِلَ يَوْمَ أُحُدٍ، وَتَرَكَ نَمِرَةً، فَكُنَّا إِذَا غَطَّيْنَا بِهَا رَأْسَهُ، بَدَتْ رِجْلاهُ، وَإِذَا غَطَّيْنَا بِهَا رِجْلَيْهِ، بَدَا رَأْسُهُ، فَأَمَرَنَا رسولُ الله ﷺ أَنْ نُغَطِّيَ رَأْسَهُ، وَنَجْعَلَ عَلى رِجْلَيْهِ شَيْئاً مِنَ الإِذْخِرِ، وَمِنَّا مَنْ أَيْنَعَتْ لَهُ ثَمَرَتُهُ، فَهُوَ يَهْدِبُهَا. متفقٌ عليه.

«النَّمِرَةُ»: كِسَاءٌ مُلَوَّنٌ مِنْ صُوفٍ. وقوله: «أَيْنَعَتْ» أَيْ: نَضِجَتْ وَأَدْرَكَتْ. وقوله: «يَهْدِبُهَا» هُوَ بفتح الياءِ وضم الدال وكسرها، لُغَتَانِ، أَيْ: يَقْطِفُهَا وَيَجْتَنِيهَا، وَهٰذِهِ اسْتِعَارَةٌ لِمَا فَتَحَ الله تَعَالَى عَلَيْهِمْ مِنَ الدُّنْيَا وَتَمَكَّنُوا فيهَا.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జనాయెజ్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా దైవమార్గంలో చేయబడే పోరాటం, ప్రస్థానాల గొప్పదనం వెల్లడౌతోంది. ఇస్లామీయ యోధులకు ఇహలోకంలో యుద్ధప్రాప్తి రూపంలో వాటి ప్రతిఫలం లభిస్తుంది. అలాగే పరలోకంలోనూ వాటి పుణ్యం లభిస్తుంది. అయితే యుద్ధరంగంలోనే అమరగతినొందే వీరులు ఇహలోకంలో విజయప్రాప్తికి నోచుకోలేకపోయినప్పటికీ పరలోకంలో వారికోసం ఆ పుణ్యం నిక్షిప్తం చేయబడి ఉంటుంది.

٤٧٧ ـ وعن سَهْلِ بنِ سَعْدٍ السَّاعِدِيِّ رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «لَوْ كَانَتِ الدُّنْيَا تَعدِلُ عِنْدَ اللهِ جَنَاحَ بَعُوضَةٍ، مَا سَقَى كَافِراً مِنْهَا شَرْبَةَ مَاءٍ». رواه الترمذي وقال: حديث حسن صحيح.

477. హజ్రత్ సహ్లా బిన్ సాద్ సాయిదీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : దేవుని దృష్టిలో ఈ లోకానికి దోమ రెక్కపాటి విలువ అయినా ఉండి ఉంటే ఆయన అవిశ్వాసులకు ఈ లోకంలో గుక్కెడు మంచినీళ్ళు కూడా త్రాగించేవాడు కాడు. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్ మరియు సహీహ్ కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు.)

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

దీనిద్వారా ఇహలోక సిరిసంపదలకు, ఇక్కడి భోగభాగ్యాలకు దేవుని దృష్టిలో ఎలాంటి ప్రాముఖ్యం లేదని తెలుస్తోంది. కనుక విశ్వాసులు కూడా వీటికి ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వకూడదు. పరలోక జీవితాన్ని మెరుగుపరచుకోవటానికి వీటిని సాధన సామగ్రిగా మాత్రమే ఉపయోగించుకోవాలి.

٤٧٨ ـ وعن أَبي هُرَيْرَةَ رضي الله عنه قال: سمعتُ رسولَ الله ﷺ يقول: «أَلا إنَّ الدُّنْيَا مَلْعُونَةٌ، مَلْعُونٌ مَا فيها، إلَّا ذِكْرَ اللهِ تَعَالَى، وَمَا وَالاهُ، وَعَالِماً وَمُتَعَلِّماً». رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

478. దైవప్రవక్త (స) ఇలా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలియజేశారు : ప్రజలారా జాగ్రత్త! ఈ లోకం ముదనష్టపుది. ఇందులో వున్నవన్నీ ముదనష్టపు వస్తువులే. దైవధ్యానం, దానితో సంబంధమున్న ఇతర విషయాలు, ధర్మజ్ఞానం

కలవారు. ఇంకా దానిని అభ్యసించేవారు తప్ప. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్' కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు.)

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసుని చూసి నిజంగానే లోకంలోని వస్తువులన్నీ ముదనష్టపు వస్తువులని అర్థం చేసుకోకూడదు. మనిషిని దైవధ్యానం నుండి దూరంచేసే వస్తువులే వాస్తవానికి ముదనష్టపు వస్తువులు. ఆ విధంగా లోకంలో ఒక వస్తువు ముదనష్టపుదయినా కావచ్చు లేదా ప్రశంసించదగినదయినా కావచ్చు. అది ఆ వస్తువు ఉపయోగంపై ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు ధనాన్ని ధర్మసమ్మతమయిన మార్గాల ద్వారా సంపాదించి ఖర్చుపెడితే అది అభినందించదగిన విషయమే. కాని అదే ధనాన్ని దొడ్డిదోవలగుండా ఆర్జిస్తే ఆ ధనమే ధూర్త వస్తువు అయిపోతుంది. అలాగే దైవసామీప్యానికి దోహదపడి, దాసులకు మార్గదర్శకత్వం వహించే జ్ఞానం ప్రశంసించదగినది, ఆర్జించదగినదీను. అన్యథా అది తూలనాడదగినదే. మనిషి విద్యా విషయికంగా ఎన్ని ఉన్నత శిఖరాలను అధిరోహించినా, ఎన్ని డిగ్రీలు సంపాదించినా సృష్టికర్తను గ్రహించలేని డిగ్రీలన్నీ వ్యర్థమే! ఈ హదీసు ద్వారా ధర్మజ్ఞానుల, విద్యార్థుల ప్రశస్తి వెల్లడవుతోంది.

479. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : సంపదను కూడ బెట్టుకోకండి. దానివల్ల మీలో ఇహలోక జీవితం పట్ల ఆసక్తి పెరిగే ప్రమాద ముంది.
(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు)

٤٧٩ ـ وعن عَبْدِ اللهِ بنِ مَسعودٍ رضيَ الله عنه، قال: قال رسولُ الله ﷺ: «لا تَتَّخِذُوا الضَّيعَةَ فَتَرْغَبُوا في الدُّنيَا». رواه الترْمِذي وقال: حديثٌ حسنٌ.

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ 'సంపద' అంటే సేద్యపుభూములు, ధనం మొదలగు ఉత్పత్తి సాధనాలని అర్థం. మనిషి దైవప్రసన్నతను విస్మరించి రేయింబవళ్ళు ధనసంపదలు కూడబెట్టుకోవటమే తన జీవిత లక్ష్యంగా చేసుకోకూడదని ఈ హదీసు భావం. అయితే మనిషి తన దగ్గర అవసరానికి సరిపడ సేద్యపు భూములను, యంత్రాలను, ధనాన్ని ఉంచుకోవటం మాత్రం ఆక్షేపణీయం కాదు.

480. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం : ఒకసారి మేము మా ఇంటికప్పు మరమ్మత్తు చేసుకుంటుండగా దైవప్రవక్త (సల్లం) అటుగా వెళుతున్నారు. ఆయన మమ్మల్ని చూసి "ఏమిటి మీరు చేస్తున్నది?" అని అడిగారు. మేము "ఈ గుడిసె కూలిపోయేలా ఉంది. అందుకని మేము దీనికి మరమ్మత్తు చేస్తున్నామ"ని చెప్పాం. అప్పుడు ఆయన, "నేను దానికన్నా ముందే వ్యవహారం (మరణం) సంభవిస్తుందే మోననుకుంటున్నాను" అని అన్నారు.

అబూదావూద్, తిర్మిజీలు దీనిని బుఖారీ,ముస్లింల ఆధారంతో ఉల్లేఖించారు. తిర్మిజీ దీనిని 'హసన్, సహీహ్'గా పేర్కొన్నారు.

٤٨٠ ـ وعن عبدِ اللهِ بنِ عمرِو بنِ العاصِ رضيَ اللهُ عنهما قال: مَرَّ عَلَيْنَا رسولُ اللهِ ﷺ، وَنَحنُ نُعالِجُ خُصّاً لَنَا فقال: «ما هذا؟» فَقُلْنَا: قَدْ وَهَى، فَنَحْنُ نُصْلِحُهُ، فقال: «ما أَرَى الأَمْرَ إلَّا أَعْجَلَ مِنْ ذَلِكَ». رواه أبو داود، والترمذي بإسناد البخاري ومسلم، وقال الترمذي: حديثٌ حسنٌ صحيحٌ.

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయం, అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఇండ్లకు మరమ్మత్తులు చేసుకోరాదన్నది దైవప్రవక్త ఉద్దేశ్యం ఎంతమాత్రం కాదు. మనిషి నిత్యం మరణాన్ని దృష్టిలో పెట్టుకొని ఉండాలని, ఏ క్షణంలోనూ చావుపట్ల ఏమరుపాటుకు లోనుకాకూడదని ఈ హదీసు భావం.

481. దైవప్రవక్త (స) ఇలా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ కాబ్ బిన్ ఇయాజ్ (రజి) తెలిపారు : ప్రతి సమాజంలోనూ ఓ ఉపద్రవం తలెత్తుతుంది. నా అనుచర సమాజానికి పొంచివున్న ఉపద్రవం ధనవ్యామోహం. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్, సహీహ్‌గా పేర్కొన్నారు.)

٤٨١ ـ وعن كَعْبِ بنِ عِيَاضٍ رضي الله عنه، قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقول: «إنَّ لِكُلِّ أُمَّةٍ فِتْنَةً، وَفِتْنَةُ أُمَّتِي المَالُ» رواه الترمذي قال: حديثٌ حسنٌ صحيحٌ.

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో 'ఫిత్నా' అనే పదం ఉపయోగించబడింది. అరబ్బీ భాషలో ఈ పదానికి ఉపద్రవం, పరీక్షావస్తువు అనే అర్థాలున్నాయి. దివ్య ఖుర్‌ఆన్‌లో సిరిసంపదలు, సంతానం మానవుల పాలిట పరీక్షా వస్తువులని చెప్పబడింది. మరి చూడబోతే ఈ రెండూ దేవుడు ప్రసాదించే వరాలే. కాకపోతే ఈ వరాల ద్వారా ఇహలోకంలో మానవులను పరీక్షించటం జరుగుతుంది. అంచేతనే వాటిని 'ఫిత్నా'గా అభివర్ణించటం జరిగింది. ఈ హదీసు ముహమ్మదీయ అనుచర సమాజాన్ని ధన సంపదల విషయంలో మధ్యేమార్గాన్ని అనుసరించాలని లేకపోతే దేవుడు ప్రసాదించిన వరాలే తమ పాలిట తలవంపుగా మారే అవకాశముందని హెచ్చరిస్తోంది.

٤٨٢ ـ وعن أبي عَمْرو، ويقالُ: أبو عبدِ الله، ويقال: أبو لَيْلى عُثْمانَ بنِ عَفَّانَ رضي الله عنه، أنَّ النبيَّ ﷺ قال: «لَيْسَ لابْنِ آدمَ حَقٌّ في سِوى هٰذِهِ الخِصَالِ: بَيْتٌ يَسْكُنُهُ، وَثَوْبٌ يُوَارِي عَوْرَتَهُ، وَجِلْفُ الخُبْزِ، وَالمَاءُ» رواه الترمذي وقال: حديث صحيح.

482. హజ్రత్ అబూ అమ్ర్ - ఈయన్ని అబూ అబ్దుల్లాహ్, అబూ లైలా ఉస్మాన్ బిన్ అప్ఫాన్ అని కూడా అంటారు - కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రవచించారు : మనిషికి ఈ (క్రింది) వస్తువుల్లో తప్ప ఇతర వస్తువుల్లో ఎలాంటి హక్కులేదు.

1. అతను నివసించే ఇల్లు. 2. తొడుక్కునే బట్టలు. 3. కూరలేని రొట్టె. 4. నీళ్లు.

(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి ప్రామాణికమైనదిగా ఖరారు చేశారు.)

قال الترمذي: سَمِعتُ أَبا داوُدَ سُلَيْمَانَ بنَ سَالِمِ البَلْخيَّ يقولُ: سَمِعْتُ النَّضرَ بْنَ شُمَيْلٍ يقولُ: الجلفُ: الخبزُ لَيْسَ مَعَهُ إِدَامٌ. وَقَالَ غَيْرُهُ: هُوَ غَلِيظُ الخُبزِ. وقَالَ الهَرَوِيُّ: المُرَادُ بِهِ هُنَا وِعَاءُ الخُبزِ، كالجَوَالِقِ وَالخُرجِ، والله أعلم.

ఇమామ్ తిర్మిజీ ఇలా అంటున్నారు : జిల్ఫ్ అంటే కూరలేని రొట్టె. మరికొంత మంది జిల్ఫ్ అంటే మందంగా ఉండే రొట్టె అని అన్నారు. ఇమామ్ హర్వీ (రహ్మాలై) ఇక్కడ జిల్ఫ్ అంటే రొట్టెలు ఉంచే వస్తువనీ, ఉదాహరణకు గోనె సంచి, గంప లాంటిదని అభిప్రాయ పడ్డారు. వాస్తవం దేవునికే బాగా తెలుసు.

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

٤٨٣ ـ وعنْ عبدِ اللهِ بنِ الشِّخِّيرِ ـ بكسر الشين والخاءِ المشددة المعجمتين ـ رضيَ الله عنه أنَّهُ قالَ: أتيْتُ النَّبيَّ ﷺ وَهُوَ يقْرأُ: ﴿أَلْهَاكُمُ التَّكَاثُرُ ۝١﴾ قال: «يقُولُ ابنُ آدمَ: مَالِي، مَالِي، وَهلْ لَكَ يَا ابْنَ آدمَ! مِنْ مَالِكَ إلَّا مَا أكلْتَ، فَأفْنَيْتَ، أَوْ لَبِسْتَ فَأبْلَيْتَ، أَوْ تَصَدَّقْتَ، فَأمْضَيْتَ؟!» رواه مسلم.

483. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ షిఖ్ఖీర్ (రజి) కథనం : నేనొకసారి దైవప్రవక్త (స) దగ్గరికి వెళ్ళాను. ఆ సమయంలో ఆయన "వీలైనంత ఎక్కువగా ప్రాపంచిక సిరిసంపదలు పొందాలన్న ధ్యాస మిమ్మల్ని ఏమరుపాటులో పడవేసింది" అనే దైవసూక్తిని పఠిస్తు న్నారు. తరువాత ఆయన (స) ఇలా అన్నారు : మనిషి నా ధనం, నా సంపద అని అంటాడు. ఓ మనిషీ! వాస్తవానికి నువ్వు (ఈ లోకంలో) తిని అవజేసింది, తొడుక్కొని వాడుకున్నది, ఇంకా దాన ధర్మాలు చేసి (పరలోక జీవితం కోసం) పంపుకున్నదే నీ ధనం! *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత, ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దేవుడు మనిషికి ఇహలోకంలో సమృద్ధిగా సిరిసంపదలు ప్రసాదించి ఉంటే అతను వాటిని వీలైనంత ఎక్కువగా దానధర్మాలు చేసి ఖర్చుపెట్టాలి. ఈ దానధర్మాల పుణ్యం అతనికి పరలోకంలో ఉపయోగపడుతుంది. ఇకపోతే అతను తన అన్నవస్త్రాల కోసం ఇతర అవసరాల కోసం ఖర్చుపెట్టుకొనే ధనం ఇహలోకంలోనే అంతమయిపోతుంది. పరలోకంలో దానికి ఎలాంటి ప్రతిఫలం మిగిలి ఉండదు.

٤٨٤ ـ وعن عبدِ اللهِ بنِ مُغَفَّلٍ رضي الله عنه، قال: قال رَجُلٌ لِلنَّبيِّ ﷺ: يا رسولَ اللهِ! واللهِ! إنِّي لأُحِبُّكَ، فقال: «انْظُرْ ماذا تَقُولُ؟» قال: وَاللهِ! إنِّي لأُحِبُّكَ، ثَلاثَ مَرَّاتٍ، فقال: «إنْ كُنْتَ

484. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ముగప్ఫల్ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్తతో మాట్లాడుతూ, "దైవప్రవక్తా! దైవసాక్షిగా చెబుతున్నాను. నేను మిమ్మల్ని అభిమా నిస్తున్నాను" అని అన్నాడు. దానికాయన "నువ్వేం మాట్లాడుతున్నావో బాగా ఆలోచించుకొని మాట్లాడు" అని

అన్నారు. ఆ వ్యక్తి మళ్ళీ, "నిజం, దైవ సాక్షిగా చెబుతున్నాను. నేను మిమ్మల్ని అభిమానిస్తున్నాను" అని అన్నాడు. మూడుసార్లు ఇదేమాట అన్నాడావ్యక్తి. అప్పుడు దైవప్రవక్త (స), "మరయితే పేదరికం కోసం చాపను సిద్ధంగా ఉంచుకో, ఎందుకంటే నన్ను అభిమానించేవాడి వైపునకు పేదరికం వరదలా ముంచుకు వస్తుంది" అని అన్నారు. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు.)

تُحِبُّنِي فَأَعِدَّ لِلفقرِ تِجفافاً، فإنَّ الفقرَ أَسْرَعُ إلى من يُحِبُّني مِنَ السَّيْلِ إلى مُنْتَهاهُ» رواه الترمذي وقال: حديث حسن.

«التِّجْفَافُ» بكسرِ التاءِ المثناةِ فوقُ وإسكانِ الجيمِ وبالفاءِ المكررة، وَهُوَ شَيْءٌ يُلْبَسُهُ الفَرَسُ، لِيُتَّقَى بِهِ الأذَى، وَقَدْ يَلبَسُهُ الإِنْسَانُ.

*(సునసె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఆధారాల రీత్యా బలహీనమైనదేగాకుండా దీని మూలం కూడా ప్రామాణిక హదీసులకు విరుద్ధంగా ఉందని పండితులు తేల్చిచెప్పారు. ఎందుకంటే ప్రామాణికమైన హదీసుల్లో పేదరికం ప్రియమైనదని, ధనం అసహ్యకరమైన వస్తువని ఎక్కడా లేదు. పైగా సజ్జనులు ధనం సంపాదించటం అభిలషణీయమని చెప్పబడింది. సజ్జనులు ధర్మసమ్మతమైన మార్గాల ద్వారా ధనాన్ని ఆర్జిస్తారు. ఖర్చుపెట్టేటప్పుడు కూడా దైవప్రసన్నతను దృష్టిలో పెట్టుకునే ఖర్చు చేస్తారు. ఆ విధంగా వారు ధనం మూలంగా ఇతరులకన్నా ఎక్కువ పుణ్యాలను సంపాదిస్తారు. అలాంటప్పుడు ధనం అయిష్టకరమైనది ఎలా అవుతుంది?!

485. హజ్రత్ కాబ్ బిన్ మాలిక్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా ప్రబోధించారు : ఆకలితో ఉన్న రెండు తోడేళ్ళను మేకల మందలోకి వదలితే అవి మేకలకు కలిగించే నష్టం మనిషిలోని ఆస్తి అంతస్తుల వ్యామోహం ధర్మానికి కలిగించే నష్టంకన్నా ఎక్కువేమీ కాదు. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్, సహీహ్‌గా పేర్కొన్నారు.)

٤٨٥ - وعن كَعبِ بنِ مالكٍ رضيَ الله عنه قال: قال رسولُ الله ﷺ: «مَا ذِئْبَانِ جَائِعَانِ أُرْسِلا فِي غَنَمٍ بِأَفْسَدَ لَهَا مِنْ حِرْصِ المَرْءِ عَلَى المَالِ وَالشَّرَفِ، لِدِينِهِ» رواه الترمذي وقال: حديث حسن صحيح.

*(సునసె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ఆస్తిఅంతస్తుల వ్యామోహం ఎంతటి వినాశాన్ని సృష్టిస్తుందో నేడు మనం మన పరిసరాల్లోనే చూడవచ్చు. ఆఖరికి ధార్మిక పండితులు, తమల్ని తాము ధర్మపరాయణులుగా చెప్పుకునే వారు సైతం నేడు మన సమాజంలో ఈ రుగ్మతకు గురై ఉన్నారు. అనేక ధార్మిక సంస్థల్లో ధన,పదవీ వ్యామోహాల ప్రాతిపదికమీదే విభేదాలు తలెత్తుతున్నాయి. ఎంతోమంది ధార్మిక పండితులు కూడా ఈ రొంపిలో దిగబడి ఉండటం ఎంతో శోచనీయమైన విషయం.

٤٨٦ ـ وعن عبدِ اللهِ بنِ مَسْعُودٍ رضي الله عنه، قال: نَامَ رسولُ اللهِ ﷺ على حَصيرٍ، فَقَامَ وَقَدْ أَثَّرَ فِي جَنْبِهِ. قُلْنَا: يَا رَسُولَ اللهِ! لو اتَّخَذْنَا لَكَ وِطَاءً! فقال: «مَا لِي وَلِلدُّنْيَا؟ مَا أَنَا في الدُّنْيَا إِلَّا كَرَاكِبٍ اسْتَظَلَّ تَحْتَ شَجَرَةٍ ثُمَّ رَاحَ وَتَرَكَهَا». رواه الترمذي وقال: حديث حسن صحيح.

486. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (స) ఓ చాపపై పడుకొని లేచారు. దాంతో ఆయన ఒంటిపై చాప తాలూకు చారలు ఏర్పడ్డాయి. అది చూసి మేము "దైవ ప్రవక్తా! మీరు గనక అనుమతిస్తే మేము మీ కోసం మెత్తటి పరుపు ఒకటి తయారుచేసి ఇస్తాం" అని విన్నవించుకున్నాము. దానికి ఆయన "అలాంటివి ఎందుకు నాకు? ఓ చెట్టుక్రింద కాసేపు సేదతీర్చుకొని తిరిగి చెట్టుని వదలి వెళ్ళిపోయే బాటసారి లాంటిది నా ఇహ లోక జీవితం" అని అన్నారు. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్ మరియు సహీహ్‌గా పేర్కొన్నారు.)

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయం)*

٤٨٧ ـ وعن أَبِي هريرةَ رضي الله عنه، قال: قال رسولُ اللهِ ﷺ: «يَدْخُلُ الفُقَرَاءُ الجَنَّةَ قَبْلَ الأَغْنِيَاءِ بِخَمْسِمِائَةِ عَامٍ» رواه الترمذي وقال: حديث صحيح.

487. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు : నిరుపేదలు ధన వంతులకన్నా ఐదొందల సంవత్సరాల ముందే స్వర్గంలోకి ప్రవేశిస్తారు.

(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి ప్రామాణిక మైనదిగా ఖరారు చేశారు.)

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ నిరుపేదలంటే లోకంలో విశ్వసించి, సత్కార్యాలు చేసిన సదాచార సంపన్నులయిన పేదవారని అర్థం. వీళ్ళు ధనవంతుల కన్నా ముందుగా స్వర్గానికి పోతారు. దేవుడు ధనవంతుల నుండి వారి సంపాదన ఖర్చుల గురించి లెక్క తీసుకుంటాడు. నిరుపేదలకు అలాంటి ఆటంకాలేవీ ఉండవు.

٤٨٨ - وعن ابن عَبَّاس، وَعِمْرَانَ بنِ الحُصَيْنِ، رضيَ الله عنهم عن النبيِّ ﷺ قال: «اطَّلَعْتُ في الجَنَّةِ فَرَأَيْتُ أَكْثَرَ أَهْلِهَا الفُقَرَاءَ، وَاطَّلَعْتُ في النَّارِ فَرَأَيْتُ أَكْثَرَ أَهْلِهَا النِّسَاءَ» متفقٌ عليه من رواية ابن عباس. ورواه البخاري أيضاً من روايةِ عِمْرَانَ بن الحُصَيْنِ.

488. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి), ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి)ల కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు : నేను స్వర్గంలోకి తొంగి చూశాను. స్వర్గవాసుల్లో అధికంగా నాకు నిరుపేదలే కనిపించారు. ఆ తరువాత నేను నరకంలోకి తొంగిచూశాను. నరకవాసుల్లో ఎక్కువగా నాకు స్త్రీలే కనిపించారు. (బుఖారీ - ముస్లిం లు ఇరువురూ ఈ హదీసును ఇబ్నె అబ్బాస్ నుండి సేకరించారు. అంతేకాక బుఖారీ దీనిని ఇమ్రాన్ బిన్ హుసైన్ నుండి కూడా ఉల్లేఖించారు.)

*(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

٤٨٩ - وعن أُسَامَةَ بنِ زَيْدٍ رضيَ الله عنهما عنِ النَّبيِّ ﷺ قال: «قُمْتُ عَلى بَابِ الجَنَّةِ، فَكَانَ عَامَّةُ مَنْ دَخَلَهَا المَسَاكِينَ، وَأَصْحَابُ الجَدِّ مَحْبُوسُونَ، غَيْرَ أَنَّ أَصْحَابَ النَّارِ قَدْ أُمِرَ بِهِمْ إلى النَّارِ» متفقٌ عليه.

489. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా తెలియజేశారు : నేను స్వర్గ ద్వారంలో నించొని చూశాను. స్వర్గంలో ప్రవేశించే వారిలో నాకు చాలామంది అభాగ్యులే కనిపించారు. ధనవంతులు (స్వర్గంలో ప్రవేశించలేక) ఆగిపోతున్నారు. (అంతలో) నరకవాసుల్ని నరకానికి తీసుకెళ్ళమని ఆదేశమయింది.

*(బుఖారీ - ముస్లిం)*

*ఈ హదీసు ఇంతకుముందు 'బలహీన ముస్లింల విశిష్టత' అధ్యాయంలో కూడా వచ్చింది.*

٤٩٠ - وعن أبي هريرة رضي الله عنه عن النبيِّ ﷺ قال: «أَصْدَقُ كَلِمَةٍ قَالَهَا شَاعِرٌ كَلِمَةُ لَبِيدٍ:

490. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఇలా అన్నారు : కవుల కవితలలో "దేవుడు తప్ప ప్రతిదీ నశించిపోయేదే" అంటూ లబీద్ చెప్పిన కవిత అత్యంత సత్యవంతమైనది. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని మహిమోన్నతుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని కవితా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా మంచి కవితలు చెప్పటం, వినటం సందర్భానుసారం వాటిని ఉపయోగించటం కూడా ధర్మసమ్మతమేనని తెలుస్తోంది. ఇకపోతే గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మలై) ఈ హదీసును ఈ అధ్యాయం క్రింద ప్రస్తావించటంలోని మర్మం ఏమిటంటే, ప్రజలు ఇహలోకం అశాశ్వతమైనదనీ, పరాత్పరుడైన దేవుడు తప్ప ప్రపంచంలోని ప్రతి వస్తువూ ఏదో ఒకనాడు నశించిపోయేదేనన్న కఠోర సత్యాన్ని గ్రహించాలి. తద్వారా పరలోక జీవితాన్ని మెరుగుపరచుకోవటం కోసం కృషిచెయ్యాలి.

## 56వ అధ్యాయం

٥٦ - بَابُ فَضْلِ الْجُوعِ وَخُشُونَةِ الْعَيْشِ وَالاقْتِصَارِ
عَلَى الْقَلِيلِ مِنَ الْمَأْكُولِ وَالْمَشْرُوبِ
وَالْمَلْبُوسِ وَغَيْرِهَا مِنْ حُظُوظِ النَّفْسِ وَتَرْكِ الشَّهَوَاتِ

# పస్తులతో, ఆర్థిక ఇబ్బందులతో జీవితం గడపటం, మామూలు అన్నపానీయాలు, వస్త్ర సౌకర్యాలతోనే తృప్తిగా బతకటం, మనోవాంఛలకు దూరంగా ఉండటం గురించి......

قال الله تعالى: ﴿فَخَلَفَ مِنْ بَعْدِهِمْ خَلْفٌ أَضَاعُوا الصَّلَاةَ وَاتَّبَعُوا الشَّهَوَاتِ فَسَوْفَ يَلْقَوْنَ غَيًّا ﴿٥٩﴾ إِلَّا مَن تَابَ وَآمَنَ وَعَمِلَ صَالِحًا فَأُولَٰئِكَ يَدْخُلُونَ الْجَنَّةَ وَلَا يُظْلَمُونَ شَيْئًا﴾ [مريم: ٥٩، ٦٠] وقال تعالى: ﴿فَخَرَجَ عَلَىٰ قَوْمِهِ فِي زِينَتِهِ قَالَ الَّذِينَ يُرِيدُونَ الْحَيَاةَ الدُّنْيَا يَا لَيْتَ لَنَا مِثْلَ مَا أُوتِيَ قَارُونُ إِنَّهُ لَذُو حَظٍّ عَظِيمٍ ﴿٧٩﴾ وَقَالَ الَّذِينَ أُوتُوا الْعِلْمَ وَيْلَكُمْ ثَوَابُ اللَّهِ خَيْرٌ لِّمَنْ آمَنَ وَعَمِلَ صَالِحًا﴾ [القصص: ٧٩ - ٨٠] وقال تعالى: ﴿ثُمَّ لَتُسْأَلُنَّ يَوْمَئِذٍ عَنِ النَّعِيمِ﴾ [التكاثر: ٨] وقال تعالى: ﴿مَن كَانَ يُرِيدُ

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"వారి తదనంతరం వారి స్థానంలో కొందరు అయోగ్యులు వచ్చారు. వారు నమాజును త్యజించారు, మనోవాంఛలను అనుసరించారు. కనుక వారు త్వరలోనే మార్గం తప్పిన దానికి ఫలితం అనుభవిస్తారు. అయితే పశ్చాత్తాపపడి మరలే వారూ, విశ్వసించి సత్కార్యాలు చేసే వారూ స్వర్గంలో ప్రవేశిస్తారు. వారికి రవ్వంత అన్యాయం కూడా జరగదు.

*(మర్యమ్ : 59, 60)*

"ఒకరోజు ఖారూన్ తన జాతి ముందు తన పూర్తి వైభవంతో ప్రత్యక్షమయ్యాడు. ఐహిక జీవితం పట్ల వ్యామోహం కలవారు అతణ్ణి చూసి, "ఖారూన్‌కు ఇవ్వబడింది మాకూ లభిస్తే ఎంత బాగుండేది. అతను చాలా అదృష్టవంతుడు" అని అన్నారు. కాని జ్ఞాన సంపన్నులు మాత్రం, "అయ్యో దౌర్భాగ్యులారా! విశ్వసించి మంచి పనులు చేసే వ్యక్తికి అల్లాహ్ ఇచ్చే ప్రతిఫలమే శ్రేష్ఠమైనది. ఈ మహాభాగ్యం సహనం చూపే వారికి తప్ప మరెవరికీ దొరకదు" అని అన్నారు.

*(అల్ ఖసస్ : 79, 80)*

"ఆ రోజున (ప్రళయదినాన) మీరు తప్పనిసరిగా

﴿ٱلۡعَاجِلَةَ عَجَّلۡنَا لَهُۥ فِيهَا مَا نَشَآءُ لِمَن نُّرِيدُ ثُمَّ جَعَلۡنَا لَهُۥ جَهَنَّمَ يَصۡلَىٰهَا مَذۡمُومٗا مَّدۡحُورٗا﴾ [الإسراء: ١٨].

(ఇహలోక) సౌఖ్యాలను గురించి ప్రశ్నించబడతారు. *(అత్ తకాసుర్ : 8)*

**"ఇహలోక ప్రయోజనాలను కోరుకునేవాడికి మేము ఇక్కడే వాటిని ఇచ్చివేస్తాము. ఎవరికి ఎంత ఇవ్వదలచుకుంటామో అంతమేరకు. తరువాత అతని జాతకంలో నరకం వ్రాసేస్తాము. అందులో అతడు దూషింపబడినవాడై, కారుణ్యానికి దూరమైనవాడై దహింపబడతాడు.**

***(అల్ ఇస్రా : 18)***

والآياتُ في الباب كثيرةٌ مَعْلُومَةٌ.

**ఈ అధ్యాయం క్రింద సుప్రసిద్ధమైన సూక్తులు ఇంకా చాలా ఉన్నాయి.**

మనిషి ఇహలోక సౌఖ్యాల్ని పొందటం కోసం ఎన్ని ప్రయత్నాలు చేసినా దేవుడు అతని అదృష్టంలో వ్రాసివుంచినంతమేరకే అతనికి సౌఖ్యాలు లభిస్తాయి. మరి అలాంటప్పుడు దేవుణ్ణి మరచిపోయి ప్రాపంచిక ఆనందాల కోసం వెంపర్లాడటమెందుకు? దానికి బదులు సహనాన్ని, సంతృప్తభావాన్ని అలవరచుకుంటే ఇహపరాల్లోనూ ఆనందమయమైన జీవితాన్ని గడపవచ్చుకదా! అందుకని మనిషి ఎల్లప్పుడూ పరలోక జీవితాన్ని మెరుగుపరచుకోవటం కోసమే కృషిచేస్తూ ఉండాలని పై సూక్తులు బోధిస్తున్నాయి.

٤٩١ ـ وعن عائشةَ رضي الله عنها قالت: مَا شَبِعَ آلُ مُحَمَّدٍ ﷺ مِنْ خُبْزِ شَعِيرٍ يَوْمَيْنِ مُتَتَابِعَيْنِ حَتَّى قُبِضَ. متفقٌ عليه.

وفي رواية: مَا شَبِعَ آلُ مُحمَّدٍ ﷺ، مُنْذُ قَدِمَ المَدِينَةَ مِنْ طَعَامِ البُرِّ ثَلاثَ لَيَالٍ تِبَاعاً حَتَّى قُبِضَ.

491. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : ముహమ్మద్ (సల్లం) ఇంటివారు ఎన్నడూ వరుసగా రెండురోజులయినా బార్లీ రొట్టెలు కడుపునిండా తిని ఎరుగరు. ఆయన మరణించేవరకూ పరిస్థితి అలాగే ఉండింది.

(బుఖారీ - ముస్లిం)

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : ముహమ్మద్ (సల్లం) ఇంటివారు మదీనా వచ్చినప్పటినుంచి ఎన్నడూ వరుసగా మూడురోజుల పాటుకూడా గోధుమ రొట్టెలు కడుపునిండా తినలేదు. ఆయన మరణించేదాకా అదే పరిస్థితి.

*(సహీహ్ బుఖారీలోని అన్నపానీయాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత, ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (స) తన జీవితపు ఆఖరి దశలో కుటుంబ ఖర్చుల నిమిత్తం ఒక ఏడాదికి సరిపోయేధనాన్ని నిల్వచేసి ఉంచుకోవాలనుకున్నారు. కాని తన దాతృస్వభావం మూలంగా అలా చేయలేకపోయారు. సంపాదించిన ధనాన్నంతటిని ఆయన నిరుపేదలు, అభాగ్యుల కోసమే ఖర్చుపెట్టేవారు. చివరకు ఆయన నిర్యాణం చెందేటప్పటికి ఇంట్లో చిల్లిగవ్వ కూడా మిగలలేదు. ఒకరోజు కడుపునిండా తింటే రెండోరోజు తినడానికి ఒక్క రొట్టెముక్క కూడా లభించేదికాదు. కొన్ని కొన్ని వారాలపాటు ఒక్కపొద్దులు గడపవలసివచ్చేది. ప్రవక్త గారి నిరుపమాన ఐహిక అనాసక్తతకు, అసామాన్యమైన నిరపేక్షాభావానికి ఈ హదీసు ఒక మచ్చుతునక మాత్రమే.

٤٩٢ ـ وعن عُروَةَ عَنْ عائشةَ رضي الله عنها، أَنَّها كانَتْ تقُولُ: وَالله يَا ابْنَ أُخْتِي! إنْ كُنَّا لَنَنْظُرُ إلى الهِلالِ، ثُمَّ الهِلالِ، ثُمَّ الهلالِ: ثَلاثَةَ أَهِلَّةٍ في شَهْرَيْنِ، وَمَا أُوقِدَ في أَبْيَاتِ رسولِ الله ﷺ نَارٌ. قُلْتُ: يَاخَالَةُ! فَمَا كَانَ يُعِيشُكُمْ؟ قالت: الأَسْوَدَانِ: التَّمْرُ وَالمَاءُ، إلَّا أَنَّهُ قَدْ كَانَ لِرسول الله ﷺ جيرانٌ مِنَ الأنْصَارِ، وَكَانَتْ لَهُمْ مَنَائِحُ وَكَانُوا يُرْسِلُونَ إلى رسولِ الله ﷺ مِنْ أَلْبَانِهَا فَيَسْقِينَا. متفق عليه.

492. విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) తనతో ఇలా అనే వారని హజ్రత్ ఉర్వా (రజి) తెలియ జేశారు: "బాబూ! దైవసాక్షిగా చెబుతున్నాను. మేము ఒక నెలవంకను చూసేవాళ్ళం; రెండు నెలవంకలు చూసే వాళ్ళం. ఆ విధంగా రెండు మాసాల్లో మాకు మూడు నెలవంకలు కనిపించేవి. కాని ఆ రెండు మాసాలవరకు దైవప్రవక్త ఇండ్లలో పొయ్యి రాజేయబడేది కాదు.

ఆ మాట విని ఉర్వా (రజి) ఆయిషా (రజి.అన్హా)ను "పిన్నీ! మరి మీరప్పుడు ఏం తిని ఉండేవారు?" అని అడిగారు. దానికి సమాధానమిస్తూ హజ్రత్ ఆయిషా (రజి.అన్హా), "రెండు నల్లని వస్తువులు. అంటే ఖర్జూరపండ్లు, నీళ్ళతో కడుపు నింపుకునేవాళ్ళం. అయితే దైవప్రవక్తకు ఇరుగుపొరుగున కొందరు అన్సార్ ముస్లింలు నివసించేవారు. వారిదగ్గర పాలిచ్చే పశువులుండేవి. అప్పుడప్పుడూ వారు దైవప్రవక్తకు పాలు (కానుకగా)

పంపితే ఆయన మాక్కూడా ఆ పాలు త్రాగటానికి ఇచ్చేవారు" అని చెప్పారు.
*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని కానుకల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

٤٩٣ ـ وَعَنْ أَبِي سَعِيْدٍ المَقْبُرِيِّ عَنْ أَبِيْ هُرَيْرَةَ رضي الله عنه، أنه مَرَّ بِقَوْمٍ بَيْنَ أَيْدِيهِمْ شَاةٌ مَصْلِيَّةٌ، فَدَعَوْهُ فَأَبَى أَنْ يَأْكُلَ، وقال: خَرجَ رسولُ اللهِ ﷺ مِنَ الدُّنيَا وَلَمْ يَشْبَعْ مِنْ خُبْزِ الشَّعِيرِ. رواه البخاري.
«مَصْلِيَّةٌ» بفتحِ الميم، أَيْ: مَشْوِيَّةٌ.

493. హజ్రత్ అబూ సయీద్ మఖ్బురి (రజి) కథనం : కొంతమంది (ఓ విందు భోజనంలో) వేయించిన మేకను తమ ముందు పెట్టుకొని ఉన్నారు. అంతలో అబూ హురైరా (రజి) అటుగా వెళుతుండటం చూసి వారు ఆయన్ని కూడా (విందుకు) ఆహ్వానించారు. కాని అబూ హురైరా (రజి) "దైవప్రవక్త (స) తాను ఇహలోకం వదలి వెళ్ళినప్పుడు బార్లీ రొట్టెలతోనయినా కడుపునిండా అన్నం తినలేకపోయారు" అని చెప్పి ఆ భోజనం తినకుండా వెళ్ళిపోయారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని అన్నపానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. దైవప్రవక్త సహచరులు ఆయన్ని అనుసరించటానికి ఎంతగా తాపత్రయపడేవారో ఈ హదీసు ద్వారా విదితమవుతోంది. చివరికి దైవప్రవక్తను అనుసరించటం విధికానటువంటి విషయాల్లో కూడా వారు ఆయన్ని అనుసరించటానికి ప్రత్యేక శ్రద్ధ కనబరిచేవారు. దైవప్రవక్త (సల్లం) పట్ల వారికి గల ఎనలేని ప్రేమాభిమానాలకు ఇది దర్పణం పడుతోంది. ప్రస్తుత కాలంలో తాము దైవప్రవక్త ప్రేమికులం అంటూ నోటిమాటలతో కపటప్రేమను ప్రదర్శించే వారిలాంటి వారు కారు దైవప్రవక్త సహచరులు. వారు నిజమైన ప్రేమికులు. ఆ ప్రేమకు ప్రతిరూపమే దైవప్రవక్త అనుసరణ పట్ల వారికి ఇంత తపన, తాపత్రయం!

2. దుబారాతో కూడిన విందు భోజనాలను నిరుత్సాహపరిచే ఉద్దేశ్యంతో వాటిని బహిష్కరించటం, అలాంటి విందులకు హాజరుకాకపోవటం షరీఅత్‌కు విరుద్ధం కాదు. పైగా ఇలా చేస్తే షరీఅత్ సూత్రాలను, దాని ప్రమాణాలను రక్షించినట్లు అవుతుంది. కాని నేడు చాలావరకు విందుభోజనాల్లో ఈ దుబారా ఖర్చు సర్వసామాన్యమైపోయింది. చివరికి తమను తాము ధార్మిక వ్యక్తులుగా చెప్పుకునే పెద్ద మనుషుల విందు భోజనాలు కూడా అందుకు తీసిపోనట్టుగా ఉండటం మరింత ఆందోళనకరమైన విషయం.

494. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (స) తన జీవితంలో ఎన్నడూ బల్ల (టేబుల్)పై భోజనం చేయలేదు. అలాగే జీవితాంతం వరకు మెత్తటి పిండితో చేసిన రొట్టెలు (కూడా) తిన లేదు. *(బుఖారీ)*

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : ఆయన వేయించిన మేక మొహం కూడా చూడలేదు.

٤٩٤ ـ وعن أنسٍ رضي الله عنه، قال: لَمْ يَأْكُلِ النَّبِيُّ ﷺ عَلَى خِوَانٍ حَتَّى مَاتَ، وَمَا أَكَلَ خُبْزاً مرَقَّقاً حَتَّى مَاتَ. رواه البخاري. وفي روايةٍ له: وَلَا رَأَى شَاةً سَمِيطاً بِعَيْنِهِ قَطُّ.

*(సహీహ్ బుఖారీలోని అన్నపానీయాల ప్రకరణం)*

495. హజ్రత్ నోమాన్ బిన్ బషీర్ (రజి) ఇలా అంటున్నారు : నేను మీ ప్రవక్తను చూశాను. ఆయన దగ్గర కడుపునింపు కోవటానికి తాలు ఖర్జూరాలు కూడా ఉండేవి కావు. *(ముస్లిం)*

٤٩٥ ـ وعن النُّعمانِ بنِ بشيرٍ رضي الله عنهما قال: لَقَدْ رَأَيْتُ نَبِيَّكُمْ ﷺ، وَمَا يَجِدُ مِنَ الدَّقَلِ مَا يَمْلأُ بِهِ بَطْنَهُ. رواه مسلم. الدَّقَلُ: تَمْرٌ رَدِيءٌ.

*(సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

496. హజ్రత్ సహ్ల్ బిన్ సాద్ (రజి) కథనం : దైవప్రవక్త (స) తాను దైవ ప్రవక్తగా ఎన్నికయినప్పటి నుంచి మరణించేవరకు మెత్తటి పిండితో తయారుచేసిన రొట్టెల మొహం కూడా చూడలేదు.

కొంతమంది సహ్ల్ (రజి)తో మాట్లాడుతూ, "దైవప్రవక్త కాలంలో మీ దగ్గర జల్లెడలు ఉండేవా?" అని అడిగారు. దానికి సమాధానమిస్తూ ఆయన "దైవ ప్రవక్త (స) తాను ప్రవక్తగా ఎన్నికయినప్పటి నుంచి మరణించే వరకు ఒక్క జల్లెడ కూడా చూడలేదు" అని అన్నారు.

٤٩٦ ـ وعن سهلِ بنِ سعدٍ رضي اللهُ عنه قال: مَا رَأَى رَسُولُ اللهِ ﷺ النَّقِيَّ مِنْ حِينَ ابْتَعَثَهُ اللهُ تعالى حتَّى قَبَضَهُ اللهُ تعالى، فَقِيلَ لَهُ: هَلْ كَانَ لَكُمْ في عَهْدِ رسولِ اللهِ ﷺ مَنَاخِلُ؟ قَالَ: مَا رَأَى رسولُ اللهِ ﷺ مُنْخلاً مِنْ حِينَ ابْتَعَثَهُ اللهُ تعالى حتَّى قَبَضَهُ اللهُ تَعالى، فَقِيلَ لَهُ: كَيْفَ كُنْتُمْ تَأْكُلُونَ الشَّعِيرَ غَيْرَ مَنْخُولٍ؟ قالَ: كُنَّا نَطْحَنُهُ وَنَنْفُخُهُ، فَيَطِيرُ مَا طارَ،

وما بَقِيَ ثَرَّيْنَاهُ. رواهُ البخاري. قوله: «النَّقِيّ» هو: بفتح النون وكسر القاف وتشديد الياء، وَهُوَ الخُبْزُ الحُوَّارَى، وَهُوَ: الدَّرْمَكُ. قوله: «ثَرَّيْنَاهُ» هُوَ بثاءٍ مُثَلَّثَةٍ، ثُمَّ رَاءٍ مُشَدَّدَةٍ، ثُمَّ ياءٍ مُثَنَّاةٍ مِنْ تحت ثُمَّ نون، أَيْ: بَلَلْنَاهُ وَعَجَنَّاهُ.

"మరి మీరు జల్లెడపట్టని యవలు (రొట్టెలు) ఎలా తినేవార"ని ప్రజలు సందేహపడగా, దానికి ఆయన "మేము యవలు గింజల్ని దంచిన తరువాత పిండిని ఊదేవాళ్ళం. దాంతో పొట్టంతా ఎగిరిపోయేది. మిగతా పిండిని మేము (రొట్టెలకోసం) నానబెట్టుకునేవాళ్ళం" అని చెప్పారు. *(బుఖారీ)*

'నఖీ' అంటే మైదా పిండి. 'సర్రైనా' అంటే 'మేమూ పిండిని నానబెట్టుకునేవాళ్ళం' అని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని అన్నపానీయాల ప్రకరణం)*

٤٩٧ ـ وعن أبي هُريرة رضي الله عنه قال: خَرَجَ رسُولُ اللهِ ﷺ ذاتَ يَوْمٍ أَوْ لَيْلَةٍ، فَإِذَا هُوَ بِأَبِي بَكْرٍ وَعُمَرَ رضي الله عنهما، فَقَالَ: «مَا أَخْرَجَكُمَا مِنْ بُيُوتِكُمَا هَـٰذِهِ السَّاعَةَ»؟ قَالا: الجُوعُ يَا رسولَ اللهِ! قالَ: «وَأَنَا، وَالَّذِي نَفْسِي بِيَدِهِ! لأَخْرَجَنِي الَّذِي أَخْرَجَكُمَا. قُومَا» فَقَامَا مَعَهُ، فَأَتَى رَجُلاً مِنَ الأَنْصَارِ، فَإِذَا هُوَ لَيْسَ فِي بَيْتِهِ، فَلَمَّا رَأَتْهُ المَرْأَةُ قَالَتْ: مَرْحَباً وَأَهْلاً. فَقَالَ لَهَا رسولُ اللهِ ﷺ: «أَيْنَ فُلانٌ؟» قَالَت: ذَهَبَ يَسْتَعْذِبُ

497. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : ఒకరోజు పగలో లేక రాత్రో దైవప్రవక్త ఇంటినుంచి బయలుదేరారు. దారిలో ఆయనకు అబూబక్ర్, ఉమర్ (రజి)లు కలిశారు. దైవప్రవక్త (స) వారిని చూసి, "ఈ వేళప్పుడు బయలుదేరా రేమిటి?" అని అడిగారు. "ఆకలి (భరించలేక బయటికొచ్చాం) దైవప్రవక్తా!" అని విన్నవించుకున్నారు ఆ ఇద్దరు అనుచరులు. "ఎవరి గుప్పెట్లోనయితే నా ప్రాణముందో ఆయన సాక్షిగా చెబుతున్నాను. మీరిద్దరు ఎందుకు బయలుదేరారో నేనూ అందుకే బయలుదేరాను. పదండి" అని అన్నారు దైవప్రవక్త (స). ఇద్దరూ ఆయన వెంట నడిచారు. దైవప్రవక్త ఓ అన్సార్ ముస్లిం ఇంటిదగ్గర ఆగారు. ఆ సమయంలో అతను ఇంట్లో లేడు. అతని ఇల్లాలు దైవప్రవక్తను చూసి

لَنَا الْمَاءَ، إِذْ جَاءَ الأَنْصَارِيُّ، فَنَظَرَ إِلَى رَسولِ اللهِ ﷺ وَصَاحِبَيْهِ، ثُمَّ قَالَ: الحَمْدُ للهِ، مَا أَحَدٌ اليَوْمَ أَكْرَمَ أَضْيَافاً مِنِّي. فَانْطَلَقَ فَجَاءَهُمْ بِعِذْقٍ فِيهِ بُسْرٌ وَتَمْرٌ وَرُطَبٌ، فَقَالَ: كُلُوا، وَأَخَذَ المُدْيَةَ، فَقَالَ لَهُ رسولُ اللهِ ﷺ: «إِيَّاكَ وَالحَلُوبَ» فَذَبَحَ لَهُمْ، فَأَكَلُوا مِنَ الشَّاةِ وَمِنْ ذٰلِكَ العِذْقِ وَشَرِبُوا، فَلَمَّا أَنْ شَبِعُوا وَرَوُوا قَالَ رسولُ اللهِ ﷺ لأَبِي بَكْرٍ وَعُمَرَ رضيَ الله عنهما: «وَالَّذِي نَفْسِي بِيَدِهِ لَتُسْأَلُنَّ عَنْ هٰذَا النَّعِيمِ يَوْمَ القِيَامَةِ، أَخْرَجَكُمْ مِنْ بُيُوتِكُمُ الجُوعُ، ثُمَّ لَمْ تَرْجِعُوا حَتَّى أَصَابَكُمْ هٰذَا النَّعِيمُ» رواه مسلم. قَوْلُهَا: «يَسْتَعْذِبُ» أَيْ: يَطْلُبُ المَاءَ العَذْبَ، وَهُوَ الطَّيِّبُ.

وَ «العِذْقُ» بكسر العين وإسكان الذال المعجمة: وَهُوَ الكِبَاسَةُ، وَهِيَ الغُصْنُ.

وَ «المُدْيَةُ» بضم الميم وكسرها: هي السِّكِّينُ. وَ «الحَلُوبُ» ذَاتُ اللَّبَنِ.

وَالسؤالُ عَنْ هذا النعيمِ سُؤالُ تَعْدِيدِ النِّعَمِ

'స్వాగతం, సుస్వాగతం' అంటూ ఆయన్ని లోపలికి ఆహ్వానించింది. "మీ ఆయన ఏడి?" అని అడిగారు దైవప్రవక్త (స). "మంచినీళ్ళు తీసుకురావటానికి వెళ్ళారు" అని చెప్పిందామె. అంతలో ఆ అన్సార్ వ్యక్తి కూడా వచ్చాడు. దైవ ప్రవక్తను, ఆయన వెంట ఉన్న ఇద్దరు అనుచరుల్ని చూసి అతను "అల్‌హమ్దు లిల్లాహ్. ఈ రోజు ఆతిథ్య మిచ్చేవారిలో నాకన్నా అదృష్టవంతుడు ఉండడు" అని అన్నాడు సంతోషాన్ని వ్యక్తంచేస్తూ. ఆ తరువాత అతనెళ్ళి ఖర్జూరపు గెల ఒకటి పట్టుకొచ్చాడు. అందులో దోరమాగిన, ఎండిన, పచ్చిగా ఉన్న ఖర్జూరాలు ఉన్నాయి. అతను "మీరు ఇవి తింటూ ఉండండి" అని (గెలవారికిచ్చి) తను కత్తి చేతిలోకి తీసుకున్నాడు.

దైవప్రవక్త (అతని ఉద్దేశ్యాన్ని పసిగట్టి) "పాలిచ్చే మేకను మాత్రం కోయకు సుమా!" అని అన్నారు. అతను ఒక మేకను కోసి వారికి (వండి) పెట్టాడు. వారు ఆ మేకమాంసం, ఖర్జూర పండ్లు తిని కడుపునింపుకున్నారు. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) అబూబక్ర్, ఉమర్ లను ఉద్దేశ్యించి "ఎవరి గుప్పెట్లో నయితే నా ప్రాణముందో ఆయన సాక్షిగా చెబుతున్నాను. ప్రళయదినాన మిమ్మల్ని ఈ అనుగ్రహాలను గురించి తప్పకుండా ప్రశ్నించటం జరుగుతుంది. మీరు ఆకలితో (కడుపు చేతపట్టుకొని) ఇండ్లనుంచి బయలుదేరారు. కాని

ఇప్పుడు ఈ అనుగ్రహాలను అనుభవించి తిరిగివెళుతున్నారు” అని అన్నారు. (ముస్లిం)

لا سُؤالُ تَوْبِيخٍ وَتَعْذِيبٍ. واللهُ أَعْلَمُ. وهذا الأَنصارِيُّ الَّذِي أَتَوْهُ هُوَ أَبُو الهَيْثَمِ بنُ التَّيِّهان رضي الله عنه، كَذَا جَاءَ مُبَيَّناً في رِوايةِ الترمذي وغيره.

“ఈ అనుగ్రహాలను గురించి మిమ్మల్ని ప్రశ్నించటం జరుగుతుందం”టే దేవుడు మీకు తన అనుగ్రహాలు గుర్తుచేస్తాడని అర్థం. అంతేగాని మిమ్మల్ని దండించటం కోసమో లేక మందలించటం కోసమో ప్రశ్నించటం జరుగుతుందని అర్థం ఎంతమాత్రం కాదు. వాస్తవం దేవునికే బాగా తెలుసు. ఇకపోతే ఈ హదీసులో దైవప్రవక్తకు ఆతిథ్యమిచ్చిన అన్సార్ వ్యక్తి అబుల్ హైసమ్ బిన్ తీహాన్ (రజి) అని తిర్మిజీ, తదితరుల ఉల్లేఖనాల ద్వారా తెలుస్తోంది.

*(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇస్లాం ఆవిర్భవించిన తొలినాళ్ళలో, మదీనాకు వలసవచ్చిన తరువాత కూడా దైవప్రవక్త, ఆయన అనుచరులు దుర్భర దారిద్ర్యాన్ని ఎదుర్కొన్నారు. వారాలు గడిచిపోయినా ఒక్కపూట కూడా కడుపునిండా భోజనం దొరికేది కాదు. నకనకలాడే కడుపులతో దైవప్రవక్త అనుచరులు ఆహారాన్వేషణలో బయలుదేరేవారు. ఎక్కడయినా తినడానికి ఏమయినా దొరికితే దాంతోనే తృప్తి చెందేవారు. ఒకవైపు దైవానికి కృతజ్ఞతలు తెలుపుకుంటూనే మరోవైపు తాము తిన్న ఆహారానికి ప్రళయదినాన లెక్కచూపవలసి ఉంటుందని భయంతో బ్రతికేవారు.

498. హజ్రత్ ఖాలిద్ బిన్ ఉమైర్ అదవీ (రజి) కథనం : ఒకసారి ఉత్బా బిన్ గజ్వాన్ మాముందు ప్రసంగించారు. ఆయన బస్రా ప్రాంతానికి గవర్నర్‌గా ఉండేవారు. తన ప్రసంగానికి ముందు దేవుణ్ణి స్తుతించి ఆ తరువాత ఇలా అన్నారు :

٤٩٨ ـ وعن خالدِ بنِ عُمَيْرٍ العَدَوِيِّ قال: خَطَبَنَا عُتْبَةُ بنُ غَزْوَانَ، وكانَ أَمِيراً عَلى البَصْرَةِ، فَحَمِدَ اللهَ وَأَثْنى عَلَيْهِ، ثُمَّ قال: أَمَّا بَعْدُ؛ فَإِنَّ الدُّنْيَا قَدْ آذَنَتْ بِصُرْمٍ، وَوَلَّتْ حَذَّاءَ، وَلَمْ يَبْقَ مِنهَا إلَّا صُبَابَةٌ

كَصُبَابَةِ الإِنَاءِ يَتَصَابُّهَا صَاحِبُهَا، وَإِنَّكُمْ مُنْتَقِلُونَ مِنْهَا إِلَى دَارٍ لا زَوَالَ لَهَا، فَانْتَقِلُوا بِخَيْرِ مَا بِحَضْرَتِكُمْ، فَإِنَّهُ قَدْ ذُكِرَ لَنَا أَنَّ الحَجَرَ يُلْقَى مِنْ شَفِيرِ جَهَنَّمَ فَيَهْوِي فِيهَا سَبْعِينَ عَاماً، لا يُدْرِكُ لَهَا قَعْراً، واللهِ لَتُمْلأنَّ... أَفَعَجِبْتُمْ!؟ وَلَقَدْ ذُكِرَ لَنَا أَنَّ مَا بَيْنَ مِصْرَاعَيْنِ مِنْ مَصَارِيعِ الجَنَّةِ مَسِيرَةُ أَرْبَعِينَ عاماً، وَلَيَأْتِيَنَّ عَلَيْهِ يَوْمٌ وَهُوَ كَظِيظٌ مِنَ الزِّحامِ، وَلَقَدْ رَأَيْتُنِي سابعَ سَبْعَةٍ مَعَ رسولِ اللهِ ﷺ، مَا لَنَا طَعَامٌ إلَّا وَرَقُ الشَّجَرِ، حَتَّى قَرِحَتْ أَشْدَاقُنَا، فَالْتَقَطْتُ بُرْدَةً فَشَقَقْتُهَا بَيْنِي وَبَيْنَ سَعْدِ بنِ مَالِكٍ، فَاتَّزَرْتُ بِنِصْفِهَا، وَاتَّزَرَ سَعْدٌ بِنِصْفِهَا، فَمَا أَصْبَحَ اليَوْمَ مِنَّا أَحَدٌ إلَّا أَصْبَحَ أَمِيراً عَلَى مِصْرٍ مِنَ الأَمْصَارِ. وَإِنِّي أَعُوذُ باللهِ أَنْ أَكُونَ فِي نَفْسِي عَظِيماً، وَعِنْدَ اللهِ صَغِيراً. رواهُ مسلم. قوله: «آذَنَتْ» هُوَ بِمَدِّ الأَلِفِ، أَيْ: أَعْلَمَتْ. وقوله: «بِصُرْمٍ» هُوَ بضم الصاد، أي: بِانْقِطَاعِهَا وَفَنَائِهَا. وقوله: «وَوَلَّتْ حَذَّاءَ» هو بحاءٍ مهملةٍ مفتوحةٍ، ثمَّ

"నిస్సందేహంగా ప్రపంచం తన ముగింపుని ప్రకటించుకున్నది. బహువేగంతో వెనుదిరిగింది. పాత్రలో మిగిలిపోయిన పానీయంలా ఉంది ఇప్పుడు దాని పరిస్థితి. త్రాగేవాడు మిగిలిపోయింది (కూడా) తాగేస్తాడు. మీరు (ఇహలోకాన్ని వీడి) శాశ్వతమైన (పర)లోకానికి చనిపోనున్నారు. కనుక మీరక్కడికి మీ దగ్గరున్న మంచి వస్తువుల్ని పట్టుకెళ్ళండి. ఎందుకంటే నరకం అంచునుండి ఒక రాయిని అందులో పడవేస్తే డెబ్భై ఏళ్ళ దాకా అది నరకంలో పడుతూ ఉంటుందని, అప్పటికీ అడుగుభాగానికి చేరుకోలేదని మనకు తెలియజేయబడింది. దైవసాక్షి! ఆ నరకం మానవులతోనే నింపబడు తుంది. ఆశ్చర్యంగా ఉందా?! అంతేకాదు, స్వర్గద్వారం వెడల్పు ఒక తలుపు నుంచి ఇంకో తలుపుకి మధ్య నలభైయేండ్ల వ్యవధి అంత దూరం ఉంటుందని కూడా మనకు తెలియజేయబడింది. ఏదో ఒకరోజు అలాంటి స్వర్గం కూడా జనంతో కిక్కిరిసిపోతూ ఉంటుంది.

నిజం చెప్పాలంటే (ఇస్లాం ఆవిర్భవించిన తొలినాళ్ళలో) దైవప్రవక్తకు తోడయిన ఏడుగురిలో నేను ఏడో వ్యక్తిని. ఆ కాలంలో మా దగ్గర తినడానికి చెట్ల ఆకులు తప్ప మరేమీ ఉండేవికావు. అవి తినటం వల్ల మా పెదాల చివర్లు

కందిపోయేవి. ఆ రోజుల్లోనే నాకు ఓ దుప్పటి దొరికింది. నేను దాన్ని రెండు భాగాలుగా చించి ఒకటి నేనుంచుకొని రెండోది సాద్ బిన్ అబూ వఖ్ఖాస్‌కు ఇచ్చాను. మేమిద్దరం వాటిని లుంగీలుగా కట్టుకునేవాళ్ళం. కాని ఈ రోజు మనలోని ప్రతి ఒక్కరూ ఏదో ఒక నగరానికి అధికారులుగా ఉన్నారు. కనుక ఇప్పుడు నేను దేవుని దృష్టిలో చిన్నవాణ్ణయినప్పటికీ మనసులో మాత్రం గొప్పవాడిగా ఊహించుకోవటం నుంచి కాపాడమని దైవాన్ని వేడుకుంటు న్నాను. (ముస్లిం)

ذال معجمة مشدَّدة، ثمَّ ألف ممدودة، أَيْ: سَرِيعَةً وَ «الصُّبَابَةُ» بضم الصاد المهملة: وَهِيَ البَقِيَّةُ اليَسِيرَةُ. وقوله: «يَتَصَابُّها» هو بتشديد الباءِ قبل الهاءِ، أَيْ: يَجْمَعُهَا. وَ «الكَظِيظُ»: الكَثِيرُ المُمْتَلِىءُ. وقوله: «قَرِحَتْ» هُوَ بفتحِ القاف وكسر الراءِ، أي: صارَتْ فِيهِ قُرُوحٌ.

(సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దైవప్రవక్త సహచరుల నిరుపేద జీవనంతో పాటు ఈ క్రింది ముఖ్య విషయాలు వివరించబడ్డాయి.

1. ఈ హదీసులో పరలోకాన్ని గుర్తుచేసి నరకశిక్ష గురించి హెచ్చరించటం జరిగింది.
2. ప్రపంచం క్షీణత, వినాశం వైపు అత్యంత వేగంగా పరుగిడుతోందని చెప్పబడింది.
3. స్వర్గనరకాల వైశాల్యం, వాటి ఔన్నత్యాలు వివరించబడ్డాయి.
4. తర్వాతి కాలంలో దైవప్రవక్త సహచరులకు కలిగిన సిరిసంపదల విస్తృతి గురించి ప్రస్తావించబడింది. దీనిద్వారా దేవుడు వారికి ప్రపంచంలో అధికారాన్ని, ఆధిక్యతను ప్రసాదిస్తాడన్న వాగ్దానం నెరవేరిందని చెప్పబడింది.
5. తర్వాత దైవప్రవక్త సహచరుల గుణవిశేషాలు ఈ హదీసులో పొందుపరచబడ్డాయి. ప్రపంచంలో అధికారం లభించిన తర్వాత కూడా వారిలో ఎలాంటి గర్వం పొడసూపలేదు. ఎప్పటిలాగే వారిలో వినమ్రత, అణకువ భావాలే కనిపించాయి. తమల్ని తాము గర్వం నుంచి కాపాడుకోవటానికి వారు ఎల్లప్పుడూ దైవసహాయం కోరుతూ ఉండేవారు.
6. ప్రజల దృష్టిలో గొప్పవాడు కావాలని కోరుకోరాదు. అల్లాహ్ సన్నిధిలో గొప్పవాడుగా అవ్వాలని కోరుకోవాలి.

499. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం : ఒకసారి ఆయిషా (రజి. అన్హా) పైన వేసుకునే దుప్పటిని, క్రింద (లుంగీలాగా) కట్టుకునే మందంగా ఉన్న ఇంకో దుప్పటిని తీసి చూపిస్తూ, "దైవప్రవక్త (సల్లం) ఈ రెండు దుప్పట్ల లోనే తనువు చాలించార"ని చెప్పారు.

*(బుఖారీ - ముస్లిం)*

٤٩٩ ـ وعن أَبي موسى الأَشْعَرِيِّ رضـي اللهُ عنـه قـال: أَخْـرَجَـتْ لَنـا عَـائِشَـةُ رضي اللهُ عنها كِسَاءً وَإِزَاراً غَلِيظاً قَالَتْ: قُبِضَ رسولُ اللهِ ﷺ فِي هٰذَيْنِ. متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

500. హజ్రత్ సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ (రజి) కథనం : మొట్టమొదటిసారిగా దైవమార్గంలో (శత్రువులపై) బాణాలు విసిరిన అరబ్బు వ్యక్తిని నేను. మేము దైవప్రవక్త (సల్లం)తో పాటు యుద్ధాలు చేసినప్పుడు మా దగ్గర తినడానికి హుబ్లా, తుమ్మ చెట్ల ఆకులు తప్ప మరేమీ ఉండేవి కావు. అవి తినటం వల్ల మాలో కొందరికి మేకపెంటికల్లాంటి మల విసర్జన జరిగేది. (పొడిగా ఉండటం చేత) మలం విడివిడిగా ఉండేది.

*(బుఖారీ - ముస్లిం)*

హుబ్లా, సముర్ అనేవి పేరుగాంచిన అడవివృక్షాలు.

٥٠٠ ـ وعنْ سَعد بنِ أَبي وَقَّاصٍ رضي اللهُ عنه، قال: إنِّي لأَوَّلُ العَرَبِ رَمَى بِسَهْمٍ فِي سَبِيلِ اللهِ، وَلَقَدْ كُنَّا نَغْزُو مَعَ رَسُولِ اللهِ ﷺ مَا لَنَا طَعَامٌ إلَّا وَرَقُ الحُبْلَةِ، وَهـذا السَّمُـرُ، حَتَّى إنْ كَـانَ أَحَدُنَا لَيَضَعُ كَمَا تَضَعُ الشَّاةُ مَا لَهُ خَلْطٌ. متفـقٌ عليـه. «الحُبْلَـةُ» بضـم الحـاء المهملة وإسكانِ الباءِ الموحدةِ: وهيَ والسَّمُرُ نَوْعانِ مَعْرُوفانِ مِنْ شَجَرِ البَادِيَةِ.

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

501. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) ఈ విధంగా ప్రార్థించారు : "దేవా! ముహమ్మద్ కుటుంబానికి పూటకు

٥٠١ ـ وعن أَبي هُرَيْرَةَ رضي الله عنه، قال: قال رسولُ اللهِ ﷺ: «اللَّهُمَّ اجْعَلْ رزْقَ آلِ مُحَمَّدٍ قُوتاً» متفقٌ عليه.

قال أهلُ اللُّغةِ وَالغَريبِ: مَعْنَى «قُوتاً» أَيْ: مَا يَسدُّ الرَّمَقَ.

సరిపోయేటంత ఉపాధిని ప్రసాదించు చాలు.” (బుఖారీ - ముస్లిం)

భాషావేత్తలు, పదకోవిదులు 'ఖూత్' అనే పదానికి అర్థం ప్రాణాన్ని నిలిపి ఉంచే టంత ఆహారమని చెప్పారు.

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్తలు ఎందుకు పుడతారు? ఆర్భాటం, యాంత్రిక జీవనం నుంచి సుఖమయమైన జీవితం వైపు, ప్రాపంచిక పటాటోపాల నుంచి పరలోక జీవిత వాస్తవాల వైపు ప్రజల దృష్టిని మళ్ళించటానికే కదా! అందుకని దైవప్రవక్తలు ముందు తాము స్వయంగా విలాసాలకు, భోగభాగ్యాలకు దూరంగా ఉండటానికి ఇష్టపడతారు. తమ జీవితం మీద మచ్చరాకుండా, తద్వారా తమ లక్ష్యం ప్రభావితం కాకుండా జాగ్రత్తపడతారు. ఆ కారణంగానే దైవప్రవక్త సల్లల్లాహు అలైహి వ సల్లం పై విధంగా దుఆ చేశారు. ఇందులో పండితులకు, ధర్మసందేశ ప్రదాతలకూ హితబోధ ఉంది. వారి జీవితాలు కూడా నిరాడంబరంగా, ప్రాపంచిక పటాటోపాల నుంచి స్వచ్ఛంగా ఉండాలి లేదా 'బుద్ధిచెప్పి గడ్డి తినేవార'ని ప్రజలు వారిని నిందిస్తారు. ఒకవేళ దేవుడు వారికి సిరిసంపదలు ప్రసాదించి ఉంటే వారు దైవప్రవక్తగారి ధనిక సహచరుల జీవితాలను ఆదర్శంగా తీసుకోవాలి. ధనరాశులను కూడబెట్టుకోవటం, వాటికోసం శక్తియుక్తు లన్నింటిని ధారపోయటం వారి జీవిత లక్ష్యం కాకూడదు.

٥٠٢ ـ وعن أبي هُرَيْرَةَ رضي الله عنه قال: وَاللهِ الذي لا إلهَ إلَّا هُوَ، إنْ كُنْتُ لأَعْتَمِدُ بِكَبِدِي عَلَى الأَرْضِ مِنَ الجُوعِ، وَإنْ كُنْتُ لأَشُدُّ الحَجَرَ عَلَى بَطْنِي مِنَ الجُوعِ. وَلَقَدْ قَعَدْتُ يَوْماً عَلَى طَرِيقِهِمُ الَّذِي يَخْرُجُونَ مِنْهُ، فَمَرَّ بِيَ النَّبِيُّ ﷺ، فَتَبَسَّمَ حِينَ رَآنِي، وَعَرَفَ مَا فِي وَجْهِي وَمَا فِي نَفْسِي، ثُمَّ قالَ: «أَبَا هِرٍّ» قُلْتُ: لَبَّيْكَ

502. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : తాను తప్ప వేరొక ఆరాధ్యుడు లేని దేవుని సాక్షిగా చెబుతున్నాను. ఒకప్పుడు నేను ఆకలి బాధకు (తట్టుకో లేక) నేలమీద బోర్లా పడుకునేవాణ్ణి. (అలాగే కొన్నిసార్లు) తీవ్రమైన ఆకలితో కడుపుకి రాళ్ళు కట్టుకునేవాణ్ణి. ఒకరోజు నేను జనం నడిచేదారిలో కూర్చొని ఉండగా దైవప్రవక్త (స) నా సమీపం నుంచి వెళ్తున్నారు. నన్ను చూసి ఆయన చిరునవ్వు నవ్వారు. నా ముఖ కవళికల్ని,

يَـا رَسُـولَ اللهِ! قَـالَ: «الْحَـقْ» وَمَضَـى فَـاتَّبَعْتُـهُ، فَـدَخَـلَ فَـاسْتَـأْذِنُ، فَـأَذِنَ لـي فَدَخَلْتُ، فَوَجَدَ لَبَناً فِي قَدَحٍ فَقَالَ: «مِنْ أَيْنَ هٰذَا اللَّبَنُ؟» قَالُوا: أَهْدَاهُ لَكَ فُلانٌ - أَوْ فُلانَةٌ - قالَ: «أَبَا هِرٍّ» قُلْتُ: لَبَّيْكَ يَا رسولَ اللهِ! قَالَ: «الْحَقْ إلَى أَهْلِ الصُّفَّةِ فَادْعُهُمْ لِي» قال: وَأَهْلُ الصُّفَّةِ أَضْيَافُ الإِسْلام، لا يَـأْوُونَ عَلَـى أَهْـلٍ، وَلا مَـالٍ، وَلا عَلَـى أَحَدٍ، وَكَانَ إذَا أَتَتْهُ صَدَقَةٌ بَعَثَ بِهَا إِلَيْهِمْ، وَلَمْ يَتَنَاوَلْ مِنْهَا شَيئاً، وَإذَا أَتَتْهُ هَدِيَّةٌ أَرْسَلَ إِلَيْهِـمْ، وَأَصَـابَ مِنهَـا وَأَشْـرَكَهُـمْ فِيهَـا، فَسَاءَنِي ذٰلِكَ فَقُلْتُ: وَمَا هٰذَا اللَّبَنُ فِي أَهْلِ الصُّفَّةِ! كُنْتُ أَحَقَّ أَنْ أُصِيبَ مِنْ هٰذَا اللَّبَنِ شَرْبَةً أَتَقَوَّى بِهَا، فَإذَا جَاؤُوا وَأَمَرَنِي فَكُنْتُ أَنَا أُعْطِيهِمْ، وَمَا عَسَى أَنْ يَبْلُغَنِي مِنْ هٰذَا اللَّبَنِ، وَلَمْ يَكُنْ مِنْ طَاعَةِ اللهِ وَطَاعَةِ رَسُولِهِ ﷺ بُدٌّ، فَأَتَيْتُهُمْ فَدَعَوْتُهُمْ، فَأَقْبَلُوا

మనసులో ఉన్న బాధను అర్థం చేసుకొని 'అబూ హురైరా!' అని పిలిచారు. నేను 'సెలవియ్యండి దైవప్రవక్తా!' అన్నాను. 'నాతోరా' అని చెప్పి ఆయన బయలు దేరారు. నేను కూడా ఆయన వెంట నడిచాను. (అలా నడుస్తూ ఉండగా ఆయన ఇల్లు వచ్చింది.)

ఆయన ఇంట్లోకి ప్రవేశించారు. ఆయన అనుమతితో నేను కూడా లోపలికి వెళ్ళాను. ఇంట్లో ఆయనకు పాలతో నిండివున్న గిన్నె కనిపించింది. "ఈ పాలెక్కడివి?" అని ఇంట్లోవాళ్ళని అడిగారు. ఫలానా అతను లేదా ఫలానా ఆమె మీకు కానుకగా పంపించారని ఇంట్లో వాళ్ళు చెప్పారు. అప్పుడు ఆయన 'అబూహురైరా!' అని పిలిచారు. 'సెలవియ్యండి దైవప్రవక్తా!' అన్నాను నేను. "నువ్వెళ్ళి అరుగు దగ్గర ఉన్న వాళ్ళందరినీ నా దగ్గరికి తీసుకురా" అని ఆదేశించారాయన.

(దైవప్రవక్త (స) దగ్గర ధార్మిక జ్ఞానం నేర్చుకుంటూ మస్జిదె నబవీ) అరుగు దగ్గర ఉండేవాళ్ళు ఇస్లాం ధర్మ అతిథు లుగా భావించబడేవాళ్ళు. వారు నిరాశ్ర యులు. 'నా' అన్నవారెవరూ లేకుండా, సిరిసంపదలతో నిమిత్తం లేకుండా నిరాధారులుగా బ్రతికేవారు. దైవప్రవక్త (స) తన దగ్గరికి దానం చేయబడిన వస్తు వేదయినా వస్తే ఆయన దాన్ని సుఫ్ఫా వాళ్ళకే పంపించేవారు. తాను మాత్రం

وَاسْتَأْذَنُوا، فَأَذِنَ لَهُمْ وَأَخَذُوا مَجَالِسَهُمْ مِنَ الْبَيْتِ قال: «يَا أَبَا هِرٍّ» قُلْتُ: لَبَّيْكَ يَا رسولَ اللهِ! قال: «خُذْ فَأَعْطِهِمْ» قال: فَأَخَذْتُ الْقَدَحَ، فَجَعَلْتُ أُعْطِيهِ الرَّجُلَ فَيَشْرَبُ حَتَّى يَرْوَى، ثُمَّ يَرُدُّ عَلَيَّ الْقَدَحَ، فَأُعْطِيهِ الرَّجُلَ فَيَشْرَبُ حَتَّى يَرْوَى، ثُمَّ يَرُدُّ

దానిని అనుభవించేవారు కారు. కాని కానుకలు వచ్చినప్పుడు మాత్రం ఆయన సుఫ్ఫా(అరుగు)వాళ్ళను పిలిపించి ఆ కానుకను తానూ అనుభవించేవారు, వారికి కూడా పంచి ఇచ్చేవారు.

కాని ఇప్పుడు నేనున్న పరిస్థితిలో ఆయన అరుగు దగ్గరున్న వారిని కూడా పిలవ మన్నమాట నేను సహించలేకపోయాను. ఆ తర్వాత మనసులోనే ఇలా అను కున్నాను: "అరుగు దగ్గరవున్న వాళ్ళం దరికీ ఈ కాసిన్నిపాలు ఏం సరి పోతాయి? నేనొక్కణ్ణి తాగేసినా నాక్కొస్త బలం వచ్చినట్లుంటుంది. వాళ్ళందరూ వచ్చిన తరువాత దైవప్రవక్త (స) వాళ్ళకు పాలు త్రాపించమని నన్నే ఆదేశిస్తారు. నా వంతు వచ్చేటప్పటికి పాలు మిగిలుంటాయన్న నమ్మకం లేదు. కాని దేవునికి దైవప్రవక్తకు విధేయత చూపక తప్పదు కదా!"

నేను అరుగువాళ్ళ దగ్గరికి వెళ్ళి వాళ్ళని, పిలుచుకొని వచ్చాను. వాళ్ళు దైవప్రవక్త (సల్లం) అనుమతితో ఇంట్లోకి వచ్చి కూర్చున్నారు. ఆయన 'అబూహుర్రైరా!' అని పిలిచారు. నేను 'సెలవియ్యండి దైవప్రవక్తా!' అన్నాను. 'ఈ పాల గిన్నె పట్టుకొని వీళ్ళందరికి పాలు త్రాపించు' అని ఆదేశించారాయన. నేనా గిన్నెను చేత్తో పట్టుకొని ఒక్కొక్కరికి ఇస్తూ పోయాను. ఒకతనికిస్తే అతను కడుపు నిండా త్రాగి ఇచ్చేవాడు. నేనా గిన్నెను

عَلَيَّ القَدَحَ، فَيَشْرَبُ حَتَّى يَرْوَى ثُمَّ يَرُدُّ عَلَيَّ القَدَحَ حَتَّى انْتَهَيْتُ إلى النَّبِيِّ ﷺ، وَقَدْ رَوِيَ القَوْمُ كُلُّهُمْ، فَأَخَذَ القَدَحَ فَوَضَعَهُ عَلى يَدِهِ، فَنَظَرَ إِلَيَّ فَتَبَسَّمَ، فَقَالَ: «أَبَا هِرٍّ» قُلْتُ: لَبَّيْكَ يَا رسولَ اللهِ! قالَ: «بَقِيتُ أَنَا وَأَنْتَ» قُلْتُ: صَدَقْتَ يَا رسولَ اللهِ! قالَ: «اقْعُدْ فَاشْرَبْ» فَقَعَدْتُ فَشَرِبْتُ، فَقَالَ: «اشْرَبْ» فَشَرِبْتُ، فَمَا زَالَ يَقُولُ: «اشْرَبْ» حَتَّى قُلْتُ: لا وَالَّذِي بَعَثَكَ بِالحَقِّ مَا أَجِدُ لَهُ مَسْلَكاً! قال: «فَأَرِنِي» فَأَعْطَيْتُهُ القَدَحَ، فَحَمِدَ اللهَ تعالى، وَسَمَّى وَشَرِبَ الفَضْلَةَ. رواه البخاري.

ఇంకొకడి చేతికిచ్చేవాణ్ణి. ఆ విధంగా అందరూ కడుపునిండా త్రాగిన తరువాత దైవప్రవక్త వంతు వచ్చింది. ఆయన గిన్నె చేతిలోకి తీసుకొని నా వైపు చూసి చిరునవ్వు నవ్వుతూ "అబూహురైరా!" అన్నారు. నేను "సెలవియ్యండి దైవ ప్రవక్తా!" అన్నాను. "ఇక నువ్వూ, నేనూ మాత్రమే మిగిలిపోయాం" అన్నా రాయన. "ఔను దైవప్రవక్తా!" అన్నాను నేను. "కూర్చో, కూర్చొని పాలు త్రాగు" అంటూ (గిన్నె నా చేతికిచ్చారు). నేను కూర్చొని త్రాగాను. ఆయన ఇంకా త్రాగమన్నారు. నేను మళ్ళీ త్రాగటం మొదలుపెట్టాను. ఆయన (సల్లం) ఇంకా త్రాగు; ఇంకా త్రాగు; అని అంటు న్నారు. (నేను త్రాగుతూ పోయాను) ఆఖరికి ఇక త్రాగలేక, "మీకు సత్య ధర్మం ఇచ్చిపంపిన దేవుని సాక్షిగా చెబుతున్నాను. నా కడుపులో ఇక దీనికి ఏమాత్రం చోటు లేదు" అని అన్నాను. అప్పుడు ఆయన "ఏది, ఆ గిన్నె ఇటివ్వు" అన్నారు. నేను పాలగిన్నె ఆయన చేతికందించాను. ఆయన దేవుణ్ణి స్తుతించి, ఆయన పేరుతో మిగిలివున్న పాలు త్రాగారు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో దైవప్రవక్త మహిమతోపాటు అరుగువాసుల పట్ల ఆయనకు గల ప్రేమావాత్సల్యాలు కూడా వివరించబడ్డాయి.
2. దైవప్రవక్త (సల్లం) సదఖా సొమ్ము తినేవారు కాదు. కానుకలు మాత్రం స్వీకరించేవారు.

3. కానుకగా లభించిన తినుబండారాలను కూడా ఆయన ఇతరులతో కలిసి భుజించేవారు.
4. ఒక ముస్లిం వదలిపెట్టిన ఎంగిలి ఆహారపదార్థాలు తినవచ్చు, త్రాగవచ్చు.
5. అతిథికి మరింత తినమని, త్రాగమని చెప్పటం అభిలషణీయం.
6. దేవుడు పుష్కలంగా ప్రసాదించినప్పుడు కడుపునిండా తినేయటంలో తప్పులేదు. ముఖ్యంగా పేదవాడికి, ఆకలిగొన్నవాడికి కడుపునిండా అన్నం పెట్టడం అభిలషణీయం.

٥٠٣ ـ وعن مُحَمَّدِ بن سِيرِينَ عن أبي هريرة رضي الله عنه، قال: لَقَدْ رَأَيْتُني وَإِنِّي لأَخِرُّ فِيمَا بَيْنَ مِنْبَرِ رسولِ اللهِ ﷺ، إلى حُجْرَةِ عَائِشَةَ رضي الله عنها مَغْشِيّاً عَلَيَّ، فَيَجِيءُ الجَائي، فَيَضَعُ رِجْلَهُ عَلَى عُنُقِي، وَيَرى أَنِّي مَجْنُونٌ وَمَا بِي مِنْ جُنُونٍ، مَا بِي إلَّا الجُوعُ. رواه البخاري.

503. హజ్రత్ అబూ హురైరా (రజి) తనతో ఇలా చెప్పారని ముహమ్మద్ బిన్ సీరీన్ తెలియజేశారు: ఒకప్పుడు నేను ప్రవక్త (స) వేదికకు - ఆయిషా (రజి. అన్హా) కుటీరానికి మధ్య స్పృహ తప్పి పడివుండేవాణ్ణి. వచ్చేపోయేవాళ్లు నాకు పిచ్చి పట్టిందేమోననుకొని నా మెడ మీద కాలుపెట్టి చూసేవారు. నిజానికి నాకెలాంటి పిచ్చితనం ఉండేది కాదు. ఆకలికి తట్టుకోలేక నేను అలా పడి పోయేవాణ్ణి. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ఏతెసామ్ ప్రకరణం)*

٥٠٤ ـ وعن عائشةَ رضي الله عنها، قَالَتْ: تُوُفِّيَ رسولُ اللهِ ﷺ، وَدِرْعُهُ مَرْهُونَةٌ عِنْدَ يَهُودِيٍّ في ثَلاثِينَ صَاعاً مِنْ شَعِيرٍ. متفقٌ عليه.

504. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) మరణించిన కాలం నాటికి ఆయన కవచం ముప్పై 'సా'ల బార్లీ ధాన్యానికి బదులుగా ఓ యూదుడి దగ్గర తాకట్టుపెట్టబడి ఉంది. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని వాణిజ్య ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త గారి నిరాడంబర జీవితానికి, ఐహిక నిరపేక్షా భావానికి ఈ హదీసు ఓ మచ్చుతునక మాత్రమే. ఆయన త్యాగమయ జీవితంలో ఇలాంటి సంఘటనలు కోకొల్లలుగా ఉన్నాయి. ఆయన అనుంగు అనుచరుల్లో అనేకమంది ధనవంతులున్నప్పటికీ ఆయన

వారినుండి ధనం అప్పు తీసుకోవటానికి కూడా మనస్కరించేవారు కారు. అనుచరులు తనకు ఇచ్చిన అప్పుని తిరిగి వాపసుతీసుకోరని ఆయనకు తెలుసు. ఇది ఆయనకు నచ్చేదికాదు. అందుకే ఆయన ముస్లిమేతరుల నుండి అప్పు తీసుకునేవారు.

٥٠٥ ـ وعن أنسٍ رضي الله عنه قال: رَهَنَ النَّبِيُّ ﷺ دِرْعَهُ بِشَعِيرٍ، وَمَشَيْتُ إلى النَّبِيِّ ﷺ بِخُبْزِ شَعِيرٍ، وَإهَالَةٍ سَنِخَةٍ، وَلَقَدْ سَمِعْتُهُ يَقُولُ: «مَا أَصْبَحَ لآلِ مُحَمَّدٍ صَاعٌ وَلا أَمْسَى» وَإنَّهُمْ لَتِسْعَةُ أَبْيَاتٍ. رواه البخاري. «الإهَالَةُ» بكسر الهمزة: الشَّحْمُ الذَّائِبُ. وَ «السَّنِخَةُ» بالنون والخاءِ المعجمة؛ وَهِيَ: المُتَغَيِّرَةُ.

505. హ్జ్రత్ అనస్ (రజి) కథనం : దైవ ప్రవక్త (స) బార్లీ ధాన్యానికి బదులుగా తన కవచాన్ని తాకట్టుపెట్టారు. నేనాయన దగ్గరికి బార్లీ రొట్టె, కరగబెట్టిన కొవ్వు తీసుకొని వెళ్ళాను. ఆ కొవ్వు కూడా కాస్తంత పాడయిపోయినట్లే ఉంది. ఆయన తరచూ ఇలా అంటుండేవారు, "ముహమ్మద్ కుటుంబంలో ఉదయం, సాయంత్రం కలిపి మొత్తం ఒక 'సా' ధాన్యమైనా ఉడకవు." మరి చూడబోతే ఆయన కుటుంబంలో మొత్తం తొమ్మిది ఇళ్ళు ఉండేవి. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని వాణిజ్య ప్రకరణం)*

٥٠٦ ـ وعن أبي هُرَيْرَةَ رضي الله عنه، قال: لَقَدْ رَأَيْتُ سَبْعِينَ مِنْ أَهْلِ الصُّفَّةِ، مَا مِنْهُمْ رَجُلٌ عَلَيْهِ رِدَاءٌ، إمَّا إزَارٌ وَإمَّا كِسَاءٌ، قَدْ رَبَطُوا فِي أَعْنَاقِهِمْ مِنْهَا مَا يَبْلُغُ نِصْفَ السَّاقَيْنِ، وَمِنْهَا مَا يَبْلُغُ الكَعْبَيْنِ، فَيَجْمَعُهُ بِيَدِهِ كَرَاهِيَةَ أَنْ تُرَى عَوْرَتُهُ. رواه البخاري.

506. హ్జ్రత్ అబూ హురైరా (రజి) కథనం : నేను డెబ్బై మంది సుఫ్ఫా విద్యార్థుల్ని చూశాను. వారిలో ఎవరి దగ్గరా ఒంటికి చాలినంత బట్టకూడా ఉండేది కాదు. కొందరి దగ్గర ఒక లుంగీ మాత్రమే ఉండేది. మరికొందరి దగ్గర ఒక దుప్పటి ఉండేది. దాన్ని వాళ్ళు భుజాల మీద కట్టుకునేవారు. అది కూడా పిక్కల దాకా లేదా గిలకల దాకా వచ్చేది. ఆచ్ఛాదనం తొలగిపోతుందేమోనన్న భయంతో వాళ్ళు ఆ దుప్పటిని చేత్తో ముడుచుకొని పట్టుకునేవారు.

*(బుఖారీ)*

507. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (స) పరుపు తోలుతో తయారుచేయబడింది. అందులో పలుచటి ఖర్జూర చెట్ల బెరడు నింపబడి ఉండేది. *(బుఖారీ)*

٥٠٧ ـ وعن عائشةَ رضي الله عنها قالت: كَانَ فِرَاشُ رسولِ اللهِ ﷺ مِنْ أُدْمٍ حَشْوُهُ لِيفٌ. رواه البخاري.

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

508. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: ఒకసారి మేము దైవప్రవక్త (సల్లం) తోపాటు కూర్చొని ఉండగా ఒక అన్సార్ వ్యక్తి వచ్చాడు. అతను దైవప్రవక్త (స)కు సలాంచేసి తిరిగి వెళుతుండగా ఆయన అతన్నుద్దేశించి, "ఓ అన్సారీ సోదరా! నా సోదరుడు సాద్ బిన్ ఉబాదా ఎలా ఉన్నాడ"ని అడిగారు. క్షేమంగానే ఉన్నారని చెప్పాడా వ్యక్తి. అప్పుడు దైవప్రవక్త (స) "ఆయన్ని పరామర్శించటానికి (నాతోపాటు) ఎవరొస్తారు?" అంటూ లేచి నించున్నారు. మేము కూడా ఆయనతోపాటు లేచి నించున్నాం. అప్పుడు మేము పదిమందికి పైనే ఉన్నాం. మా దగ్గర చెప్పులుగాని, మేజోళ్లుగాని, టోపీలుగాని ఏమీ లేవు. (ఆఖరికి ఒంటిమీద) చొక్కాలు కూడా లేవు. ఆ కంకర నేలమీద అలాగే నడుస్తూ ఆయన దగ్గరికి చేరుకున్నాం. (మమ్మల్ని చూసి) ఆయన ఇంటివాళ్ళు ప్రక్కకు తప్పుకున్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం), ఆయన వెంట వెళ్ళిన సహచరులు సాద్ బిన్ ఉబాదాను దగ్గరి కెళ్ళి పరామర్శించారు. (ముస్లిం)

٥٠٨ ـ وعن ابنِ عمرَ رضي الله عنهما قال: كُنَّا جُلُوساً مَعَ رسولِ الله ﷺ، إذْ جَاءَ رَجُلٌ مِنَ الأنصَارِ، فَسَلَّمَ عَلَيْهِ، ثُمَّ أَدْبَرَ الأنصَارِيُّ، فقال رسولُ الله ﷺ: «يَا أَخَا الأنصَارِ، كَيْفَ أَخِي سَعْدُ بنُ عُبَادَةَ؟» فقال: صَالِحٌ، فقال رسولُ الله ﷺ: «مَنْ يَعُودُهُ مِنْكُمْ؟» فَقَامَ وَقُمْنَا مَعَهُ، وَنَحْنُ بِضْعَةَ عَشَرَ مَا عَلَيْنَا نِعَالٌ، وَلا خِفَافٌ، وَلا قَلانِسُ، وَلا قُمُصٌ، نَمْشِي فِي تِلْكَ السِّبَاخِ، حَتَّى جِئْنَاهُ، فَاسْتَأْخَرَ قَوْمُهُ مِنْ حَوْلِهِ حَتَّى دَنَا رسولُ الله ﷺ وَأَصْحَابُهُ الَّذِينَ مَعَهُ. رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

٥٠٩ - وعن عِمْرَانَ بنِ الحُصَيْنِ رضي الله عنهما عن النَّبيِّ ﷺ أنه قال: «خَيْرُكُمْ قَرْنِي، ثُمَّ الَّذِينَ يَلُونَهُمْ، ثُمَّ الَّذِينَ يَلُونَهُمْ» قال عِمْرَانُ: فَمَا أدري قال النَّبيُّ ﷺ مَرَّتَيْنِ أَوْ ثَلاثاً «ثُمَّ يَكُونُ بَعْدَهُمْ قَوْمٌ يَشْهَدُونَ وَلا يُسْتَشْهَدُونَ، وَيَخُونُونَ وَلا يُؤْتَمَنُونَ، وَيَنْذِرُونَ وَلا يُوفُونَ، وَيَظْهَرُ فِيهِمُ السِّمَنُ» متفقٌ عليه.

509. హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : మీలో నా జీవిత కాలంలో ఉన్నవారే అందరికన్నా శ్రేష్ఠులు. ఆ తరువాత మీ కాలానికి సమీపంలో ఉండేవారు శ్రేష్ఠులు. ఆ తరువాత వారికి సమీపంలో ఉండేవారు (తరువాతి తరాల వారందరికన్నా) శ్రేష్ఠులు - దైవప్రవక్త (సల్లం) తన జీవిత కాలం తరువాత రెండు కాలాలను ప్రస్తావించారా లేక మూడు కాలాలను ప్రస్తావించారా అన్న విషయం నాకు గుర్తులేదు - ఆ తరువాతి కాలంలో ఇతరులు అడగకముందే తమంతటతామ సాక్ష్యాలు చెప్పేవారు పుడతారు. వారు నమ్మకద్రోహులై ఉంటారు. వారిలో నిజాయితి అన్న మాటే ఉండదు. వారు మొక్కుబడులు చేసు కుంటారు కాని వాటిని నెరవేర్చరు. (ప్రాపంచిక భోగలాలసకు అలవాటు పడి) బాగా బలిసి లావుగా కనిపిస్తారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సాక్ష్యాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో మూడు కాలాలను అత్యంత శ్రేష్ఠమైన కాలాలుగా అభివర్ణించటం జరిగింది. మొదటిది : దైవప్రవక్త (స) జీవిత కాలం. రెండోది : ప్రవక్త సహచరుల అనుయాయుల (తాబయీన్ల) కాలం. మూడోది : తాబయీన్ల అనుయాయుల కాలం. మొత్తానికి ఈ మూడు

కాలాల్లోనూ ఇస్లాం ధర్మం మూడుపువ్వులు, ఆరుకాయలుగా విరాజిల్లింది. ప్రజల్లో దైవభీతి, ధర్మపరాయణతా భావాలు మెండుగా ఉండేవి. ధర్మవిరోధులు వ్యాపింపజేసే దురాచారాల (బిద్అత్‌ల)కు నిలువ నీడ లేకుండేది. కాని దైవప్రవక్త (సఅసం) చెప్పినట్లుగానే ఆ తరువాతి కాలాల్లో క్రమంగా ప్రజల భక్తివిశ్వాసాలు క్షీణిస్తూపోయాయి. వారిలో ఆచరణా భావం సన్నగిల్లింది.

٥١٠ - وعن أبي أُمامة رضي الله عنه قالَ: قالَ رسولُ الله ﷺ: «يَا ابْنَ آدَمَ! إِنَّكَ أَنْ تَبْذُلَ الفَضْلَ خَيْرٌ لَكَ، وَأَنْ تُمْسِكَهُ شَرٌّ لَكَ، وَلا تُلامُ عَلَى كَفَافٍ، وَابْدَأْ بِمَنْ تَعُولُ» رواه الترمذي وقال: حديث حسن صحيح.

510. హజ్రత్ అబూ ఉమామా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : "ఓ మనిషీ! మిగిలి పోయిన ధనాన్ని దైవమార్గంలో ఖర్చు పెడితే దానివల్ల నీకు ప్రయోజనం కలుగుతుంది. ఒకవేళ నువ్వు దాన్ని నిల్వచేసి ఉంచుకుంటే దానివల్ల నీకే నష్టం. నీకు చాలినంత ధనాన్ని ఉంచు కుంటే మాత్రం నువ్వు నిందార్హుడివి కావు. (అయితే) ఖర్చుపెట్టేటప్పుడు నీపై ఆధారపడివున్న వారితోనే మొదలు పెట్టాలిసుమా!

*(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు.)*

*(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం, సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయాలు).*

## ముఖ్యాంశాలు

మనిషి తన దగ్గర తన ఆలుబిడ్డల ఖర్చులకు సరిపోయేటంతటి ధనాన్ని నిల్వ ఉంచుకోవటంలో తప్పులేదు. పైగా ఇది చాలా అవసరం కూడా. అయితే అవసరానికి మించి ధనం కూడబెట్టటం మాత్రం ఖండించదగిన విషయం. ఎందుకంటే ఇది ప్రాపంచికంగా, పారలౌకికంగా రెండు విధాలుగానూ మానవులకు నష్టకరమే. ప్రపంచంలో ధనం కూడబెట్టటం వల్ల సంపద ప్రవాహం నిలిచిపోయి ఆర్థిక వ్యవస్థలో అనేక వైపరీత్యాలు చోటుచేసుకుంటాయి. ఇది ఎన్నో సామాజిక దుష్పరిణామాలకు దారితీయవచ్చు. ఇకపోతే ప్రపంచంలో జకాత్ చెల్లించకుండా ధనం కూడబెట్టే పిసినారి పుంగవులకు పరలోకంలో బాధాకరమైన శిక్షల రుచిచూడక తప్పదు.

511. హ(జత్ ఉబైదుల్లాహ్ బిన్ మిహ్సన్ అన్సారీ ఖుతమీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీరు మీ ఇంట్లో (మానసిక) ప్రశాంతతతో, శారీరకమైన ఆరోగ్యంతో ఉండి, మీ దగ్గర ఆ రోజుకి సరిపోయే ఆహారం ఉంటే చాలు మీకు ప్రాపంచిక వస్తు సరంజామా అంతా దొరికి పోయినట్లే."

٥١١ - وعن عُبَيْدِ الله بن مِحْصَنٍ الأَنْصَارِيِّ الخُطمِيِّ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مَنْ أَصْبَحَ مِنْكُمْ آمِناً في سِرْبِهِ، مُعَافًى فِي جَسَدِهِ، عِنْدَهُ قُوتُ يَوْمِهِ، فَكَأَنَّمَا حِيزَتْ لَهُ الدُّنْيَا بِحَذَافِيرِها» رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

*(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు.)*

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

శరీరారోగ్యం, మానసిక ప్రశాంతతలతోపాటు ఓ పూట కడుపునిండా అన్నం దొరకటం నిజంగా మహా అదృష్టం. ఆరోగ్యం, మనశ్శాంతే కరువయిపోయినప్పుడు మనిషి దగ్గర ఎనలేని సంపదలున్నా ఏం ప్రయోజనం? ధనం మానసిక అశాంతిని దూరం చేయలేదు. మనిషి ఆయుష్షునూ పెంచలేదు. కనుక మనిషి ప్రాపంచిక సిరిసంపదల కోసం అర్రులు చాచేబదులు సహనాన్నీ, తృప్తినీ అలవరచుకోవాలి. అందులోనే అతనికి సుఖశాంతులు లభిస్తాయి.

512. హ(జత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ఇస్లాం స్వీకరించి, తగినంత ఉపాధిని పొంది, దేవుడు ప్రసాదించిన దానితోనే తృప్తి చెందినవాడు ముక్తి పొందాడు. *(ముస్లిం)*

٥١٢ - وعن عبدِ الله بن عمرو بن العاص رضي الله عنهما، أنَّ رسولَ الله ﷺ قال: «قَدْ أَفْلَحَ مَنْ أَسْلَمَ، وَكَانَ رِزْقُهُ كَفَافاً، وَقَنَّعَهُ اللهُ بِمَا آتَاهُ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

విజయమంటే పరలోకంలో దేవుని కరుణాకటాక్షాలు పొందటం. దేవుని కారుణ్యం పొందటానికి ఇస్లాం మాత్రమే ఏకైక మార్గం. దురదృష్టవశాత్తు మనిషికి గనక ఇస్లాం భాగ్యం లభించకపోతే ఇక భూమండలం నిండా సిరిసంపదలు కూడా పరలోకంలో మనిషికి విజయాన్ని సాధించి పెట్టలేవు. పైగా ప్రపంచంలో కళ్లు మూయటంతోనే దైవశిక్ష అతన్ని తన అదుపులోకి

తీసుకుంటుంది. అతన్ని నరక సంకెళ్ళతో బంధించటం జరుగుతుంది. ఆ విధంగా అతను ఘోర పరాజయం పాలౌతాడు.

మరొక విషయం, దైనందిన జీవితావసరాలు తీరిపోయేటంతటి ధనంతోనే తృప్తి చెందటం జీవితంలో సుఖసౌఖ్యాలకు ఆయువుపట్టు. ప్రాపంచికమైన దురాశ, అత్యంత ఎక్కువగా ధనం సంపాదించాలన్న కోరిక మనిషికి మనశ్శాంతి లేకుండా చేస్తాయి. అందుకే ఒక హదీసులో "సిరిసంపదల విస్తృతి కలిమి కాదు. మనసులోని నిరపేక్షాభావమే అసలు కలిమి" అని చెప్పబడింది. (ఈ హదీసు ముందు రాబోతోంది. 522వ హదీసు చూడండి).

٥١٣ - وعن أبي مُحَمَّدٍ فَضَالَةَ بنِ عُبَيْدٍ الأَنْصَارِيِّ رَضِيَ الله عنه، أَنَّهُ سَمِعَ رسولَ اللهِ ﷺ يَقُولُ: «طُوبَى لِمَنْ هُدِيَ إلى الإسْلام، وَكَانَ عَيْشُهُ كَفَافاً، وَقَنِعَ» رواه الترمذي وقال: حديث حسن صحيح.

513. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ ముహమ్మద్ ఫజాలా బిన్ ఉబైద్ అన్సారీ (రజి) తెలియజేశారు : ఇస్లాం భాగ్యం లభించి, జీవితం గడిచిపోయేటంత ఉపాధిని పొంది, దాంతో తృప్తి చెందిన వాడికోసం శుభవార్త ఉంది. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్' 'సహీహ్'గా పేర్కొన్నారు).

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో 'తూబా' అనే పదం వచ్చింది. నిఘంటువుపరంగా దీనికి శుభవార్త అని అర్థం. అయితే స్వర్గాన్ని కూడా తూబా అని పిలుస్తారు. మరికొన్ని ఉల్లేఖనాల ద్వారా స్వర్గంలో ఒకానొక చెట్టుపేరు తూబా అని తెలుస్తోంది. ఏది ఏమైనా ఇస్లాం ధర్మాన్ని నిక్కచ్చిగా ఆచరించి, దేవుడు ప్రసాదించిన ఉపాధితో తృప్తిపడి, ఆయనకు కృతజ్ఞతలు తెలుపుకుంటూ జీవితం గడిపేవాడికి స్వర్గసుఖాల శుభవార్త ఉందన్నమాట మాత్రం వాస్తవం.

٥١٤ - وعن ابنِ عباسٍ رضيَ الله عنهما قال: كانَ رسولُ اللهِ ﷺ يَبِيتُ اللَّيَالِيَ المُتَتَابِعَةَ طَاوِياً، وَأَهْلُهُ لا يَجِدُونَ عَشَاءً، وَكَانَ أَكْثَرُ خُبْزِهِمْ خُبْزَ الشَّعِيرِ. رواه الترمذي وقال: حديثٌ حسنٌ صحيح.

514. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) వరుసగా కొన్ని రేత్రులపాటు పస్తులు గడిపేవారు. ఆయన కుటుంబీకులకు కూడా రాత్రి భోజనం లభించేది కాదు. వారు రొట్టెల్లో ఎక్కువగా యవల రొట్టెలు తినేవారు. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్, సహీహ్‌గా పేర్కొన్నారు).

*(సునన్ తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయాలు)*

٥١٥ ـ وعن فضالة بن عُبَيْدٍ رضي الله عنه، أنَّ رسولَ الله ﷺ كَانَ إذَا صَلَّى بِالنَّاسِ، يَخِرُّ رِجَالٌ مِنْ قَامَتِهِمْ في الصَّلاةِ مِنَ الخَصَاصَةِ ـ وَهُمْ أَصْحَابُ الصُّفَّةِ ـ حَتَّى يَقُولَ الأَعْرَابُ: هؤُلاءِ مَجَانِينُ، فَإذَا صلى رسولُ الله ﷺ انْصَرَفَ إلَيْهِمْ، فقال: «لَوْ تَعْلَمُونَ مَا لَكُمْ عِنْدَ الله تعالى، لأَحْبَبْتُمْ أَنْ تَزْدَادُوا فَاقَةً وَحَاجَةً» رواه الترمذي وقال: حديثٌ صحيحٌ.

«الخَصَاصَةُ»: الفَاقَةُ وَالجُوعُ الشَّدِيدُ.

515. హ్రజత్ ఫజాలా బిన్ ఉబైద్ (రజి) కథనం : దైవప్రవక్త (స) ప్రజలకు నమాజ్ చేయించినప్పుడు (వెనుక) పంక్తుల్లో నించున్న వారిలో కొంతమంది ఆకలితో (సొమ్మసిల్లి) పడిపోయేవారు - సుఫ్ఫా వాళ్ళే వారు - పల్లెటూరి బైతులు వాళ్ళను అలా పడిపోవటం చూసి పిచ్చోళ్ళనేవారు. దైవప్రవక్త (సల్లం) నమాజ్ ముగించిన తరువాత వారి వైపునకు తిరిగి, "దేవుని దగ్గర మీకు ఎంత పుణ్యం లభిస్తుందో తెలిస్తే మీరు ఇంతకన్నా ఎక్కువ అగత్యాన్ని, ఆకలిని తట్టుకోవటానికి ఇష్టపడతారు" అని చెప్పేవారు.

*(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి దృఢమైనదిగా పేర్కొన్నారు)*

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

ధార్మిక విద్యనభ్యసించే విద్యార్థులకు ఇందులో గొప్ప గుణపాఠం ఉంది. వారు పాఠశాలలను ఎంచుకునేటప్పుడు సౌకర్యాలు, సదుపాయాలు, స్కాలర్‌షిప్పులు పుష్కలంగా దొరికే పాఠశాలలను ఎంచుకోరాదు. భోజన సదుపాయాలు, ఇతరత్రా సౌకర్యాలు లేకున్నా ఉన్నత విద్యా ప్రమాణాలతో ఉత్తమ శిక్షణను అందించే పాఠశాలలను మాత్రమే ఎంచుకోవాలి. ధార్మిక విద్యార్థులకు ఈ హదీసు బోధించే మరొక విషయం ఏమిటంటే, ఆర్థికపరమైన ఇబ్బందులు ఎదురైనప్పుడు పస్తులతోనయినా కాలం గడపాలికాని ప్రజలముందు చేయి చాపకూడదు. సుఫ్ఫా విద్యార్థుల నడవడికను అందుకు ఆదర్శంగా తీసుకోవాలి. విద్యార్థి దశలోని నిరపేక్షాభావం మనిషిని జీవితాంతం నిరపేక్షాపరునిగా, సహనశీలునిగా ఉంచుతుంది. ఈ దశలో అడుక్కునే అలవాటు జీవితాంతం అదే నీచమైన అలవాటుకి గురిచేస్తుంది. సహనం, తృప్తి, నిరపేక్షాభావంలోనే పండితుల గౌరవమర్యాదలు ఇమిడి ఉన్నాయి. అంతేగాని ప్రజల జేబులవంక ఆబగా చూడటంలో, వారి ముందు ముష్టెత్తుకోవటంలో లేదు.

516. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధి స్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ కరీమా మిఖ్దామ్ బిన్ మాదీ కరిబ్ (రజి) తెలియజేశారు : మనిషి నింపుకునే పొట్టకన్నా నికృష్టమయిన కంచం మరొకటి లేదు. మనిషి వెన్నెముకను నిలిపి ఉంచటానికి కొన్ని ముద్దల తిండి చాలు. ఇంకా ఎక్కువ తినటం తప్పదను కుంటే మొత్తం కడుపులో మూడో వంతును అన్నం కోసం మరో మూడో వంతును నీళ్ళకోసం, ఇంకో మూడో వంతును శ్వాసకోసం కేటాయించు కోవాలి. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్' కోవకు చెందినదిగా పేర్కొన్నారు.)

٥١٦ ـ وعن أبي كَرِيمَةَ المِقْدَام بن مَعْدِيكَرِبَ رضي الله عنه قال: سَمِعْتُ رسولَ اللهِ ﷺ يقُولُ: «مَا مَلأَ آدَمِيٌّ وِعَاءً شَرّاً مِنْ بَطْنٍ، بِحَسْبِ ابن آدَمَ أُكُلاتٌ يُقِمْنَ صُلْبَهُ، فَإِنْ كَانَ لا مَحَالَةَ، فَثُلُثٌ لِطَعَامِهِ، وَثُلُثٌ لِشَرَابِهِ، وَثُلُثٌ لِنَفَسِهِ». رواه الترمذي وقال: حديث حسن.

*(సునన్ తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయాలు)*

517. హజ్రత్ అబూ ఉమామా ఇయాస్ బిన్ సాలబా అన్సారీ హారిసీ (రజి) కథనం : ఒకరోజు దైవప్రవక్త (సల్లం) ముందు ఆయన అనుచరులు ప్రాపంచిక భోగభాగ్యాల గురించి ప్రస్తావించారు. అప్పుడు ఆయన తన సహచరుల నుద్దేశ్యించి, "మీరు వినటం లేదా? మీరు వినటం లేదా? నిరాడంబరత విశ్వాసంలో అంతర్భాగం. నిస్సందేహంగా నిరాడంబరత విశ్వాసంలో అంతర్భాగం" అని అన్నారు. అంటే ఆడంబరాలతో కూడుకున్న వస్తువులకు దూరంగా ఉండటం అని ఆయన ఉద్దేశ్యం. (అబూ దావూద్)

٥١٧ ـ وعن أَبي أُمَامَةَ إِيَاسِ بنِ ثَعْلَبَةَ الأَنْصَارِيِّ الحَارِثي رضي الله عنه قال: ذَكَرَ أَصْحَابُ رَسولِ اللهِ ﷺ يوماً عِنْدَهُ الدُّنْيَا، فقال رسولُ اللهِ ﷺ: «أَلا تَسْمَعُونَ؟ أَلا تَسْمَعُونَ؟ إِنَّ البَذَاذَةَ مِنَ الإِيمَانِ، إِنَّ البَذَاذَةَ مِنَ الإِيمَانِ» يَعْني: التَّقَحُّلَ. رواه أبو داود.

«الْبَذَاذَةُ»: بِالْبَاءِ الْمُوَحَّدَةِ وَالذَّالَيْنِ الْمُعْجَمَتَيْنِ، وَهِيَ رَثَاثَةُ الْهَيْئَةِ، وَتَرْكُ فَاخِرِ اللِّبَاسِ، وَأَمَّا «التَّقَحُّلُ» فَبِالْقَافِ وَالحَاءِ؛ قَالَ أَهْلُ اللُّغَةِ: الْمُتَقَحِّلُ: هُوَ الرَّجُلُ الْيَابِسُ الجِلدِ مِنْ خُشُونَةِ الْعَيْشِ، وَتَرْكِ التَّرَفُّهِ.

'బజాజా' అంటే మనిషి బాహ్య అవతారం బాగా ఉండకపోవటం, ఖరీదైన వస్త్రాలు వాడకుండా ఉండటం అని అర్థం. భాషావేత్తల దృష్టిలో 'ముతఖహ్హిల్' అంటే పొడి ఆహారం తింటూ సౌఖ్యాలకు దూరంగా ఉండటం వలన చర్మం ముడుతలు పడినవాడని అర్థం.

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషికి ఐహిక సౌఖ్యాల పట్ల ఆసక్తి పెరిగిన కొద్దీ అతనిలో పరలోక చింతన సన్నగిల్లి, క్రమంగా ప్రాపంచిక వ్యామోహం అతన్ని ఆవహిస్తుంది. దీనికి భిన్నంగా ఆడంబరాలకు దూరంగా ఉండే వ్యక్తి సదా తన పరలోక జీవితాన్ని మెరుగుపరచుకునే ప్రయత్నంలోనే తలమునకలై ఉంటాడు. అందుకే ఈ హదీసు - మనిషి వీలైనంతవరకు నిరాడంబర జీవితాన్ని గడపటానికి కృషిచేయాలని ఉపదేశిస్తోంది. ఇక్కడ గమనించదగిన విషయం మరొకటుంది. నిరాడంబరంగా బ్రతకటమంటే అపరిశుభ్రంగా ఉండటమని అర్థం ఎంతమాత్రం కాదు. నిజానికి ఇస్లాం ధర్మం పరిశుభ్రత సగం విశ్వాసమని చెబుతోంది. మరలాంటప్పుడు పరిశుభ్రత ప్రాముఖ్యతను ఒక విశ్వాసి ఎలా కాదనగలడు?

٥١٨ - وعن أبي عبد الله جابر بن عبد الله رضي الله عنهما قال: بَعَثَنَا رسولُ اللهِ ﷺ، وَأَمَّرَ عَلَيْنَا أَبَا عُبَيْدَةَ رضي الله عنه، نَتَلَقَّى عِيراً لِقُرَيْشٍ، وَزَوَّدَنَا جِرَاباً مِنْ تَمْرٍ لَمْ يَجِدْ لَنَا غَيْرَهُ، فَكَانَ أَبُو عُبَيْدَةَ يُعْطِينَا تَمْرَةً تَمْرَةً، فَقِيلَ: كَيْفَ كُنْتُمْ تَصْنَعُونَ بِهَا؟ قَالَ: نَمَصُّهَا كَمَا يَمَصُّ الصَّبِيُّ، ثُمَّ نَشْرَبُ عَلَيْهَا مِنَ المَاءِ، فَتَكْفِينَا يَوْمَنَا إِلَى اللَّيْلِ، وَكُنَّا نَضْرِبُ بِعِصِيِّنَا الخَبَطَ، ثُمَّ نَبُلُّهُ بِالمَاءِ فَنَأْكُلُهُ. قَالَ:

518. హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ జాబిర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) అబూ ఉబైదా (రజి)ను మాకు నాయకునిగా నియమించి, మమ్మల్ని ఖురైష్ తెగకు చెందిన ఒక బిడారు కోసం మాటేసి ఉండమని చెప్పి పంపించారు. ఆ సందర్భంగా ఆయన మాకు ప్రయాణంలో తినటం కోసమని ఖర్జూర పండ్ల బస్తా ఒకటి ఇచ్చారు. మాకివ్వటానికి ఆయన దగ్గర ఇంకేమీ లేదు. అబూ ఉబైదా (రజి) మాకు ఒక్కొక్క ఖర్జూర పండు మాత్రమే ఇచ్చేవారు.

وَانطَلَقْنَا عَلى سَاحِلِ الْبَحْرِ، فَرُفِعَ لَنَا عَلى سَاحِلِ الْبَحْرِ كَهَيْئَةِ الْكَثِيبِ الضَّخْمِ، فَأَتَيْنَاهُ فَإِذا هِيَ دَابَّةٌ تُدْعَى الْعَنْبَرَ، فقال أَبُو عُبَيْدَةَ: مَيْتَةٌ، ثُمَّ قال: لا، بَلْ نَحْنُ رُسُلُ رَسُولِ اللهِ ﷺ، وفي سبيلِ اللهِ، وَقَدِ اضْطُرِرْتُمْ فَكُلُوا، فأَقَمْنَا عَلَيْهِ شَهْراً، وَنَحْنُ ثَلاثُمِائَةٍ، حَتَّى سَمِنَّا، وَلَقَدْ رَأَيْتُنَا نَغْتَرِفُ مِنْ وقْبِ عَيْنِهِ بِالْقِلالِ الدُّهْنَ وَنَقْطَعُ مِنْهُ الْفِدَرَ كالثَّوْرِ أَوْ كَقَدْرِ الثَّوْرِ، وَلَقَدْ أَخَذَ مِنَّا أَبُو عُبَيْدَةَ ثَلاثَةَ عَشَرَ رَجُلاً فَأَقْعَدَهُمْ في وَقْبِ عَيْنِهِ وَأَخَذَ ضِلَعاً مِنْ أَضْلاعِهِ فَأَقَامَهَا ثُمَّ رَحَلَ أَعْظَمَ بَعِيرٍ مَعَنَا فَمَرَّ مِنْ تَحْتِهَا وَتَزَوَّدْنَا مِنْ لَحْمِهِ وَشَائِقَ، فَلَمَّا قَدِمْنَا الْمَدِينَةَ أَتَيْنَا

'మరి మీరు ఆ ఒక్క ఖర్జూర పండుతో ఎలా గడిపేవార'ని ఎవరో అడిగితే, దానికి సమాధానమిస్తూ ఆయన ఇలా అన్నారు : మేము దాన్ని చిన్నపిల్లలు చూషించినట్లు చూషించేవాళ్ళం. ఆ తరువాత నీళ్ళు త్రాగి కడుపునింపు కునేవాళ్ళం. అది ఆ రోజు రాత్రి వరకు సరిపోయేది. ఇంకా మేము మా దగ్గరున్న కర్రలతో చెట్ల ఆకులు రాల్చి వాటిని నీటిలో నానబెట్టి తినేవాళ్ళం.

హదీసు ఉల్లేఖకులు ఇలా అంటు న్నారు: మేము సముద్ర తీరం వెంబడి ప్రయాణిస్తుండగా అక్కడ మాకు ఒక పెద్ద ఇసుక దిబ్బ మాదిరిగా ఉన్న వస్తువేదో కనిపించింది. దగ్గరికి వెళ్ళి చూస్తే అదో పెద్ద (సముద్ర) జంతువు. దాన్ని 'అంబర్' అని పిలుస్తారు. (మా నాయకుడు) అబూ ఉబైదా (రజి) దాన్ని చూసి ముందు "ఇది మృత జంతువు (అంచేత తినడానికి పనికిరాదు)" అని అన్నారు. మరికాసేపటికి ఆయనే, "అయినా ఫర్వాలేదు, మనం దైవప్రవక్త తరఫున పంపబడిన వాళ్ళం. దైవ మార్గంలో బయలుదేరాం. ఇప్పుడు (దీని మాంసం తినడం తప్ప మనకు గత్యం తరం లేదు. కాబట్టి తినండి" అని అన్నారు.

ఆ తరువాత నెల రోజులపాటు మేము ఆ మాంసంతోనే గడిపాం. ఆ సమ

యంలో మేము మూడొందలమందిమి ఉన్నాం. ఆ మాంసం తిని మా శరీరాలు లావెక్కాయి. మేమా జంతువు కను గుంతల నుండి కొన్ని బుంగల నూనె తోడాము. ఇంకా దాని శరీరం నుండి ఎద్దులాంటి లేదా ఎద్దంతటి మాంసపు ముక్కలు కోశాము. అబూ ఉబైదా (రజి) మాలో పదమూడు మందిని దాని కనుగుంతలో కూర్చోబెట్టారు. ఇంకా దాని ప్రక్కటెముకల్లోనుంచి ఒక ఎముకను నిలబెట్టారు. మా దగ్గరున్న అతి ఎత్తైన ఒంటెపై అంబారి ఉంచి దాన్ని ఆ ఎముక సందుగుండా పోని చ్చారు. మేము దాని మాంసాన్ని ముక్కలు ముక్కలుగా కోసి ప్రయాణంలో తినటానికి ఉంచుకున్నాం.

మదీనా చేరుకున్న తరువాత మేము దైవప్రవక్త (స) సన్నిధికి వెళ్ళి ఆయన (సల్లం)కు ఆ (వింత) జంతువు గురించి తెలియజేశాం. అంతా విన్న తరువాత ఆయన "అది దేవుడు మీ కోసం (సముద్రం నుండి) వెలికి తీసిన ఆహారం. మీ దగ్గర దాని మాంసం మిగిలివుంటే కాస్త మాక్కూడా తినిపించండి" అని కోరారు. అప్పుడు మేమా మాంసంలో కొంతభాగం దైవప్రవక్తకు పంపించగా ఆయన దాన్ని తిన్నారు."

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జంతువేట ప్రకరణం)

رسولَ الله ﷺ فذَكَرْنَا ذلكَ له، فقال: «هُوَ رِزْقٌ أَخرَجَهُ اللهُ لَكُمْ، فَهَلْ مَعَكُمْ مِنْ لَحْمِهِ شَيْءٌ فَتطْعِمُونَا؟» فَأَرْسَلْنَا إلى رسولِ الله ﷺ مِنْهُ فَأَكَلَهُ. رواه مسلم. «الجِرَابُ»: وِعَاءٌ مِنْ جِلْدٍ مَعْرُوفٍ، وَهُوَ بكسر الجيم وفتحِها، والكسرُ أَفصَحُ. قوله: «نَمَصُّهَا» بفتح الميم. و«الخَبَطُ» وَرَقُ شَجَرٍ مَعْرُوفٍ تَأْكُلُهُ الإِبلُ. وَ«الكَثِيبُ»: التَّلُّ مِنَ الرَّمْلِ، و«الوَقْبُ»: بفتح الواوِ وإسكان القافِ وبعدها باءٌ موحدةٌ، وَهُوَ نُقْرَةُ العَيْنِ. و«القِلالُ» الجِرارُ. و«الفِدَرُ» بكسرِ الفَاءِ وَفَتْحِ الدال: القِطَعُ. «رَحَلَ البَعِيرَ» بتخفيف الحاءِ: أَيْ جَعَلَ عَلَيْهِ الرَّحْلَ. «الوَشَائِقُ» بالشين المعجمةِ وَالقَافِ: اللَّحْمُ الَّذي اقْتُطِعَ لِيُقَدَّدَ مِنْهُ. والله أعلم.

## ముఖ్యాంశాలు

ఇస్లాం ఆవిర్భవించిన తొలినాళ్ళలో ముస్లింలకు దుర్భర దారిద్ర్యాన్ని ఎదుర్కోనవలసి వచ్చింది. రోజులు గడవటమే కష్టంగా ఉండేది. కొన్నిసార్లు ఒక ఖర్జూర పండు, గుక్కెడు నీళ్ళుతాగి రోజంతా దాంతోనే గడపవలసి వచ్చేది. అయినప్పటికీ ప్రవక్త సహచరులు దైవప్రసన్నత కోసం దాన్ని సంతోషంతో భరించేవారు.

ఇంకో ముఖ్య విషయం ఏమిటంటే, ఈ హదీసు ద్వారా సముద్రపు మృతజంతువులను తినడం ధర్మసమ్మతమేనని తెలుస్తోంది. సముద్రపు నీరు, సముద్రపు మృతజంతువులు రెండూ ధర్మసమ్మతమేనని మరికొన్ని హదీసులు స్పష్టంగా పేర్కొంటున్నాయి.

٥١٩ - وَعَنْ أَسْمَاءَ بِنْتِ يَزِيدَ رضى الله عنها قالت: كَانَ كُمُّ قَمِيصِ رَسُولِ الله ﷺ إِلَى الرُّصْغِ. رواه أبوداود، والترمذي وقال: حديث حسن. «الرُّصْغ» بالصاد وَالرُّسْغ بالسين أَيْضًا: هُوَ الْمَفْصِلُ بَيْنَ الكَفِّ وَالسَّاعِدِ.

519. హజ్రత్ అస్మా బిన్తె యజీద్ (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) చొక్కా చేతులు మణికట్ల వరకు ఉండేవి. (అబూదావూద్, తిర్మిజీలు దీనిని ఉల్లేఖించారు. ఇంకా తిర్మిజీ దీనిని హసన్‌గా పేర్కొన్నారు.)

## ముఖ్యాంశాలు

అవసరానికి మించి పొడవైన దుస్తులు ధరించటం సాధారణంగా గర్వానికి చిహ్నంగా భావించబడుతుంది. అంతేకాదు, అటూ ఇటూ కదలటానికి, పనులు చేసుకోవటానికి కూడా ఇటువంటి వస్త్రధారణ ఇబ్బందికరంగా ఉంటుంది. మరోవైపు అవసరానికి మించి పొట్టి దుస్తులు వేసవి తాపం నుంచి, చలి తీవ్రతల నుంచి రక్షించలేవు. కనుక మధ్యేమార్గమే అత్యుత్తమ మార్గం. దైవప్రవక్త మార్గమూను.

٥٢٠ - وَعَنْ جابرٍ رضى الله عنه قَالَ: إِنَّا كُنَّا يَوْمَ الْخَنْدَقِ نَحْفِرُ، فَعَرَضَتْ كُدْيَةٌ شَدِيدَةٌ، فَجَاؤُوا إِلى النبيِّ ﷺ فقالوا: هٰذِه كُدْيَةٌ عَرَضَتْ فى الخَنْدَقِ. فقال: «أَنَا نَازِلٌ» ثُمَّ قَامَ، وَبَطْنُهُ مَعْصُوبٌ بِحَجَرٍ، وَلَبِثْنَا ثَلاثَةَ أَيَّامٍ لاَ نَذُوقُ ذَوَاقًا فَأَخَذَ النَّبِيُّ ﷺ المِعْوَلَ، فَضَرَبَ، فَعَادَ كَثِيبًا أَهْيَلَ، أَوْ أَهْيَمَ، فَقُلْتُ: يَارسولَ اللهِ! ائْذَنْ لى إلى

520. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : కందక యుద్ధం జరిగిన రోజుల్లో మేము కందకాలు త్రవ్వుతుంటే గట్టి చట్టుబండ ఒకటి అడ్డం వచ్చింది (ప్రవక్త సహచరులు దాన్ని పగులగొట్టలేకపోయారు). వాళ్ళంతా దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి, "కందకంలో ఈ చట్టుబండ అడ్డం వచ్చింది (ఎంత ప్రయత్నించినా పగలటం లేదు)" అని విన్నవించుకున్నారు. దానికి ఆయన "సరే, నేనే

స్వయంగా కందకంలో దిగి ప్రయత్ని స్తాను" అన్నారు.

ఆ తరువాత ఆయన లేచి నిలబడ్డారు. ఆ సమయంలో ఆయన (తీవ్రమైన ఆకలివల్ల) కడుపుకు రాయి కట్టుకొని ఉన్నారు. మూడ్రోజుల నుంచి మేము దేని రుచీ చూడలేదు. అలాంటి పరిస్థితిలోనే దైవప్రవక్త (సల్లం) సుత్తెతో ఆ చట్టుబండమీద గట్టిగా మోదారు. దాంతో అది ఇసుక దిబ్బలా మారి పోయింది. అంటే ఇసుక మాదిరిగా నుజ్జునుజ్జయి పోయింది.

నేను దైవప్రవక్త (సల్లం)ను, "నేను ఇంటికి వెళ్ళటానికి అనుమతించండి" అని కోరాను. (ఆయన అనుమతి ఇచ్చిన తరువాత ఇంటికి వెళ్ళి) భార్యతో, "దైవప్రవక్త (సల్లం) (తీవ్రమైన ఆకలితో) ఉన్నారు. నేనాయన పరిస్థితిని చూసి సహించలేకుండా ఉన్నాను. నీ దగ్గర తినే పదార్థాలు ఏమైనా ఉన్నాయా?" అని అడిగాను. "మనింట్లో కాసిన్ని బార్లీ గింజలు, ఒక మేకపిల్ల మాత్రం ఉన్నాయండీ" అని చెప్పింది నా భార్య. నేనా మేకపిల్లను కోశాను. బార్లీ గింజల్ని దంచాను. ఆ తరువాత మాంసాన్ని కుండలో వేసి (పొయ్యి మీద) పెట్టాను. కాసేపటికి (రొట్టెల కోసం) పిండి తయారయింది, పొయ్యిమీద ఉన్న కుండలు కూడా ఉడకటానికి సిద్ధంగా ఉన్నాయి.

అప్పుడు నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి

الْبَيْتِ، فقلتُ لامْرَأَتِى: رَأَيْتُ بِالنَّبِيِّ ﷺ شَيْئًا مَا فِى ذَلِكَ صَبْرٌ فَعِنْدَكِ شَيْءٌ؟ فقالتْ: عِنْدِى شَعِيرٌ وَعَنَاقٌ فَذَبَحْتُ الْعَنَاقَ، وَطَحَنْتُ الشَّعِيرَ حَتَّى جَعَلْنَا اللحمَ فِى الْبُرْمَةِ، ثُمَّ جِئْتُ النبيَّ ﷺ، وَالعَجِينُ قَدِ انْكَسَرَ وَالْبُرْمَةُ بَيْنَ الأَثَافِيِّ قَدْ كَادَتْ تَنْضَجُ، فقلتُ: طُعَيِّمٌ لِي فَقُمْ أَنْتَ يارسولَ اللهِ! وَرَجُلٌ أَوْ رَجُلَانِ، قال: «كَمْ هُوَ؟» فَذَكَرْتُ لَه فقال: «كثيرٌ طَيِّبٌ، قُلْ لَهَا لا تَنْزِعِ الْبُرْمَةَ، وَلاَ الْخُبْزَ مِنَ التَّنُّورِ حَتَّى آتِيَ» فقال: «قُومُوا» فقام الْمُهَاجِرُوْنَ وَالأَنْصَارُ، فَدَخَلْتُ عَلَيْهَا فقلتُ: وَيْحَكِ جَاءَ النبيُّ

వెళ్ళి ఆయనతో, "దైవప్రవక్తా! నేను కొంచెం భోజనం తయారుచేశాను. కనుక మీరు (మా ఇంటికి) దయచేయండి, ఒకరిద్దర్ని తమ వెంట తీసుకురావచ్చు" అని అన్నాను. "ఆ అన్నం ఎంతుంది?" అని అడిగారు దైవప్రవక్త (సల్లం). నేనాయనకు దాని గురించి వివరంగా తెలియజేశాను. అందుకాయన 'చాలా ఎక్కువే ఉంది, బ్రహ్మాండమైన అన్నం తయారు చేశావ్. నేనొచ్చేదాకా పొయ్యి మీద నుంచి కుండలు దించవద్దు, కాగు గంపనుండి రొట్టెలు కూడా తీయవద్దు, ఈ విషయం నీ భార్యతో చెప్పు" అని అన్నారు. ఆ తరువాత ఆయన (తన సహచరులందరితో) "పదండి" అని అన్నారు. ఆయన పిలుపు విని ముహాజిర్లు, అన్సార్లందరూ బయలుదేరారు.

నేను తొందరతొందరగా ఇంటికి వెళ్ళి మా ఆవిడతో "దేవుడే మమ్మల్ని కాపాడాలి. దైవప్రవక్త (స), ఆయన వెంట ముహాజిర్లు, అన్సార్లు అందరూ బయలు దేరి వస్తున్నారు" అని చెప్పాను. అప్పుడు మా ఆవిడ నాతో "దైవప్రవక్త (సల్లం) అన్నం ఎంతుందని అడిగారా?" అని అంది. నేను అడిగారని చెప్పాను.

దైవప్రవక్త (సల్లం) తన సహచరులందరితో, "లోపలికి వచ్చేయండి, ఇరుకు ఇరుకుగా కూర్చోకండి" అని అన్నారు. ఆ తరువాత ఆయన రొట్టెల్ని ముక్కలు ముక్కలుగా చేసి వాటి మీద మాంసాన్ని ఉంచుతూ పోయారు.

ﷺ وَالْمُهَاجِرُوْنَ وَالأَنْصَارُ وَمَنْ مَعَهُم! قالتْ: هل سَأَلَكَ؟ قلتُ: نَعَمْ، قال: «ادْخُلُوا وَلاَ تَضَاغَطُوا» فَجَعَلَ يَكْسِرُ الخُبْزَ، وَيَجْعَلُ عَلَيْهِ اللحْمَ، وَيُخَمِّرُ البُرْمَةَ وَالتَّنُّوْرَ إِذَا أَخَذَ مِنْهُ، وَيُقَرِّبُ إِلى أَصْحَابِهِ ثُمَّ يَنْزِعُ، فَلَمْ يَزَل يَكْسِرُ وَيَغْرِفُ حَتَّى شَبِعُوا، وَبَقِيَ مِنْهُ، فقال: «كُلِي هٰذَا وَأَهْدِيْ، فَإِنَّ النَّاسَ أَصَابَتْهُمْ مَجَاعَةٌ» متفقٌ عليه. وفي روايةٍ: قال جابرٌ: لمَّا حُفِرَ الخَنْدَقُ رَأَيْتُ بِالنَّبِيِّ ﷺ خَمَصًا، فَانْكَفَأْتُ إِلى امْرَأَتِي فقلتُ: هل عِنْدَكِ شَيْءٌ؟ فَإِنِّي رَأَيْتُ بِرسولِ اللهِ ﷺ خَمَصًا شَدِيْدًا فَأَخْرَجَتْ

إِلَيَّ جِرَابًا فِيهِ صَاعٌ مِنْ شَعِيرٍ، وَلَنَا بُهَيْمَةٌ دَاجِنٌ فَذَبَحْتُهَا، وَطَحَنَتِ الشَّعِيرَ، فَفَرَغَتْ إِلَى فَرَاغِي، وَقَطَّعْتُهَا فِي بُرْمَتِهَا، ثُمَّ وَلَّيْتُ إِلَى رسولِ اللهِ ﷺ، فَقَالَتْ: لاَ تَفْضَحْنِي بِرسولِ اللهِ ﷺ وَمَنْ مَعَهُ، فَجِئْتُهُ فَسَارَرْتُهُ فَقُلْتُ: يا رسولَ اللهِ! ذَبَحْنَا بُهَيْمَةً لَنَا، وَطَحَنَتْ صَاعًا مِنْ شَعِيرٍ، فَتَعَالَ أَنْتَ وَنَفَرٌ مَعَكَ، فَصَاحَ رسولُ اللهِ ﷺ فقال: «يَا أَهْلَ الْخَنْدَقِ! إِنَّ جابرًا قَدْ صَنَعَ سُؤْرًا فَحَيَّهَلاً بِكُمْ» فقال النبيُّ: «لاَ تُنْزِلُنَّ بُرْمَتَكُمْ وَلاَ تَخْبِزُنَّ عَجِينَكُمْ حَتَّى أَجِيءَ» فَجِئْتُ، وَجَاءَ النَّبِيُّ ﷺ يَقْدُمُ النَّاسَ، حَتَّى جِئْتُ امْرَأَتِي فَقَالَتْ: بِكَ وَبِكَ! فقلتُ: قَدْ فَعَلْتُ الَّذِي قُلْتِ. فَأَخْرَجَتْ عَجِينًا، فَبَسَقَ فِيهِ وَبَارَكَ، ثُمَّ عَمَدَ إِلَى بُرْمَتِنَا فَبَصَقَ وَبَارَكَ، ثُمَّ قَالَ: «ادْعِي خَابِزَةً فَلْتَخْبِزْ مَعَكِ، وَاقْدَحِي مِنْ بُرْمَتِكُمْ وَلاَ تُنْزِلُوهَا» وَهُمْ أَلْفٌ، فَأُقْسِمُ

కుండలోనుండి మాంసాన్ని, కాగుగంప నుండి రొట్టెల్ని తీసిన తరువాత (వెంటనే) వాటిని మూసేవారు. ఆ రొట్టెలు, మాంసాన్ని సహచరులకు పంచిపెట్టే వారు. ఆ తరువాత మళ్ళీ తీసి (మిగిలిన వారికి) ఇచ్చేవారు. ఆ విధంగా ఆయన రొట్టెల్ని ముక్కలు ముక్కలుగా చేసి వాటిమీద మాంసాన్ని ఉంచి అందరికీ ఇస్తూ పోయారు. సహచరులందరూ కడుపునిండా తిన్న తరువాత కూడా ఆహారపదార్థాలు మిగిలిపోయాయి. చివర్లో ఆయన మా ఆవిడతో "ఈ అన్నం తిను, ఇతరులకు కూడా కానుకగా ఇవ్వు. ప్రజలు ఆకలితో ఉన్నారు" అని అన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనం ప్రకారం హజ్రత్ జాబిర్ (రజి) ఇలా అంటున్నారు : కందకాలు త్రవ్వుతున్న రోజుల్లో దైవప్రవక్త (సల్లం) విపరీతమైన ఆకలితో ఉండటం గమనించి నేను మా ఆవిడ దగ్గరికి వెళ్ళి, "దైవప్రవక్త (స) విపరీతమైన ఆకలితో ఉన్నట్లు కనిపిస్తున్నారు. నీ దగ్గర (తినే వస్తువులు) ఏమైనా ఉన్నాయా?" అని అడిగాను. ఆమె నాకు ఒక సంచి తీసి చూపించింది. అందులో ఒక 'సా' బార్లీ ధాన్యం ఉన్నాయి. మా ఇంట్లో ఒక పెంపుడు మేకపిల్ల కూడా ఉంది. నేను దాన్ని జిబహ్ చేశాను. మా ఆవిడ బార్లీ గింజలు విసరి పిండి తయారు చేసింది. నేను మాంసం కోసినంతసేపట్లో నా భార్య బార్లీ విసరి పిండి తయారుచేసి ఉంచింది. అప్పుడు నేను మాంసాన్ని

ముక్కలు ముక్కలుగా కోసి కుండల్లో పెట్టి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి బయలు దేరుతుండగా మా ఆవిడ నాతో, "(ఇంట్లో అన్నం చాలా తక్కువగా ఉంది. ఎక్కువ మందిని పిలుచుకొని వచ్చి) దైవప్రవక్త (సల్లం), ఆయన సహచరుల ముందు నన్ను అవమాన పరచకండి" అని అన్నది.

నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి మెల్లిగా ఆయనతో మాట్లాడుతూ, "దైవప్రవక్తా! మేము మా దగ్గరున్న మేక పిల్లను కోశాము. ఒక 'సా' బార్లీ గింజలు విసరి పిండి తయారు చేశాము. కనుక మీరు, మీతోపాటు మరికొంతమంది మా ఇంటికి దయచేయండి" అని అన్నాను. నేను చెప్పింది విన్న తరువాత దైవప్రవక్త (సల్లం) బిగ్గరగా కేకవేసి పిలుస్తూ, "కందకం (త్రవ్వుతున్న) ప్రజలారా! జాబిర్ భోజనం తయారుచేశాడు. కనుక మీరందరూ వచ్చేయండి" అని అన్నారు. ఆ తరువాత ఆయన నాతో, "నేనొచ్చేం తవరకు (పొయ్యిమీద నుంచి) కుండలు దించకండి. ఆ పిండితో రొట్టెలు కూడా తయారుచేయకండి" అని అన్నారు.

నేను ఇంటికి తిరిగొచ్చాను. దైవప్రవక్త (సల్లం) కూడా ప్రజల్ని వెంటబెట్టుకొని బయలుదేరి వస్తున్నారు. నేను మా ఆవిడ దగ్గరికి వెళ్ళాను (ఆయన అనుచరులందరూ వస్తున్నారని చెప్పాను). మా ఆవిడ నా మీద రుసరుస లాడటం మొదలుపెట్టింది. "(ఇందులో

بِاللهِ لَأَكَلُوا حَتَّى تَرَكُوهُ وَانحَرَفُوا، وَإِنَّ بُرْمَتَنَا لَتَغِطُّ كَمَا هِيَ، وَإِنَّ عَجِينَنَا لَيُخْبَزُ كَمَا هُوَ. قَوْلُه: «عَرَضَتْ كُدْيَةٌ»: بضم الكاف وإسكان الدال وبالياء المثناة تحت، وهي قطعةٌ غليظةٌ صُلْبَةٌ مِنَ الأرضِ لا يعمل فيها الفَأْسُ. وَ«الكَثِيبُ» أَصْلُهُ تَلُّ الرَّمْلِ، وَالْمُرَادُ هُنَا: صَارَتْ تُرَابًا نَاعِمًا، وَهُوَ مَعْنَى «أَهْيَلَ». وَ«الأَثَافِيُّ»: الأَحْجَارُ الَّتِي يَكُونُ عَلَيْهَا القِدرُ. وَ«تَضَاغَطُوا»: تَزَاحَمُوا. وَ«المَجَاعَةُ»: الجُوعُ، وهو

نا తప్పేముంది) నేను నువ్వు చెప్పినట్లే చేశాను'' అని అన్నాను నేను. అంతలో దైవప్రవక్త (సల్లం) వచ్చేశారు. మా ఆవిడ ఆ పిండి తీసుకొచ్చి ఆయన ముందు పెట్టింది. ఆయన అందులో తన లాలాజలాన్ని కలిపి శుభప్రాప్తి కోసం ప్రార్థించారు. ఆ తరువాత ఆయన మా కుండల దగ్గరికి వచ్చారు. వాటిల్లో కూడా తన లాలాజలాన్ని కలిపి శుభప్రాప్తి కోసం ప్రార్థించారు. తరువాత మా ఆవిడతో "రొట్టెలు చేసే ఆమెను పిలిచి నీతోపాటు రొట్టెలు తయారుచెయ్యమని చెప్పు నువ్వు కుండల్లో నుంచి (కూర) తీసి కంచాల్లో పెడ్తూపో, దాన్ని పొయ్యిమీద నుంచి మాత్రం దించమాకు'' అని అన్నారు.

అప్పుడు భోజనానికి వచ్చిన వాళ్ళు మొత్తం వెయ్యిమంది ఉన్నారు. దైవ సాక్షిగా చెబుతున్నాను. వాళ్ళందరూ (కడుపు నిండా) భోజనం చేశారు. ఇంకా మిగిల్చారు కూడా. వాళ్ళు వెళ్ళిపోయిన తరువాత చూస్తే మా కుండలు ఇంతకు ముందులాగే నిండుగా ఉడుకు తున్నాయి. పిండితో రొట్టెలు ఇంకా తయారవుతూనే ఉన్నాయి.

'కుద్‌యతున్' అనగా గొడ్డలి కూడా పని చేయని గట్టినేల. "కసీబున్"కు అసలు అర్థం 'ఇసుక తిన్నె.' రాయి ఇసుకలాగా మెత్తబడిపోయిందని ఇక్కడ దాని భావం. "అహ్‌యల"కు కూడా అదే అర్థం. "అసాఫియ్యు" అనగా పాత్ర

بفتح الميم. وَ«الخَمَصُ» بفتح الخاءِ المعجمة والميم: الجُوعُ. وَ«انكَفَأْتُ»: انقَلَبْتُ وَرَجَعْتُ. وَ«البُهَيْمَةُ» بضم البَاءِ: تَصغير بَهْمَة، وَهِيَ العَنَاقُ ـ بفتح العين ـ. وَ«الدَّاجِنُ»: هِيَ الَّتِي أَلِفَتِ البَيْتَ. وَ«السُّؤرُ»: الطَّعَام الَّذِي يُدْعَى النَّاسُ إِلَيْهِ، وَهُوَ بالفَارِسِيَّةِ، وَ«حَيَّهَلاً» أَي: تَعَالَوا. وَقَوْلُهَا: «بِكَ وَبِكَ» أي: خَاصَمَتْهُ وَسَبَّتْهُ، لأَنَّهَا اعْتَقَدَتْ أَنَّ الَّذِي

عندَهَا لا يَكْفِيهِم، فَاسْتَحْيَتْ وَخَفِيَ عَلَيْهَا مَا أَكْرَمَ اللهُ سُبْحَانَهُ وتعالى بِهِ نَبِيَّهُ ﷺ مِنْ هذِهِ الْمُعْجِزَةِ الظَّاهِرَةِ وَالآيَةِ الْبَاهِرَةِ. «بَسَقَ» أي: بَصَقَ، وَيُقَالُ أَيضًا: بَزَقَ - ثَلاثُ لُغَاتٍ -. وَ«عَمَدَ» بفتح الميم، أي: قَصَدَ. وَ«اقْدَحِيْ» أي: اغْرِفِيْ؛ وَالمِقْدَحَةُ: المِغْرَفَةُ. وَ«تَغِطُّ» أي: لِغَلَيَانِهَا صَوتٌ، والله أعلم.

ఉంచబడే రాయి (పొయ్యికి ఉపయోగించే మూడు రాళ్లు అని భావం). 'తజాగతూ' అంటే 'గుంపుగా రండి' అని అర్థం. 'మజాఅతు' అనగా ఆకలి. 'ఇంకఫాతు' అనగా 'నేను వెనక్కి తిరిగాను' అని అర్థం. 'బుహైమా' అనేది బహీమకు న్యూనపదం. మేకపిల్ల (అనాఖ్)ని ఈ విధంగా పిలుస్తారు. 'దాజిన్' అనగా పెంపుడు జంతువు. 'సూర్' అనగా విందులో ఆహ్వానితులకు సమర్పింపబడే అన్నం. ఇది పారశీక పదం. 'హయ్యహలా' అనగా రండి అని అర్థం. 'బిక వబిక' అనగా ఆమె తన భర్తతో పోట్లాడింది. అతని మీద రుసరుసలాడింది. ఎందుకంటే తన దగ్గరవున్న ఆహారపదార్థాలు ఆ అతిథులందరికీ సరిపోవని భావించి తను చిన్నబుచ్చుకుంది. అల్లాహ్ తన ప్రవక్తకు ప్రసాదించిన బహిరంగ మహిమ, స్పష్టమైన నిదర్శనం ఆమెకు తెలియదు. 'బసఖ' దీన్ని మూడు విధాలుగా చదవవచ్చు. మూడింటికీ ఒకే అర్థం. అతను ఉమ్మాడు అని. 'అమద' అనగా అతను సంకల్పించుకున్నాడని అర్థం. 'ఇఖ్‌దహీ' అనగా 'గరిటతో తీసిఇస్తూ పో' అని అర్థం. 'మిఖ్‌దహతున్' అనగా గరిట లేక చెమ్చా. 'తగిత్తు' అనగా పొంగినప్పుడు వచ్చే శబ్దం. వల్లాహు ఆలము.

*(సహీహ్ బుఖారీలోని యుద్ధాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో కూడా దైవప్రవక్త సల్లల్లాహు అలైహి వ సల్లంతో పాటు ఆయన సహచరుల పేదరికం, వారు పస్తులతో గడిపిన జీవితాలు వివరించబడ్డాయి. దైవప్రవక్త మహిమతో అతికొద్ది అన్నం ఎంతోమంది ప్రజలకు సరిపోయింది. ఇంకా ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) గారి అణకువభావం కూడా వివరించబడింది. ఆయన తన సహచరులతో కలిసి ఎంతో కష్టమైన పనులు కూడా చేసేవారు. మన నేతలు, నాయకులు కూడా ఈ గొప్ప ఆదర్శాన్ని అవలంబిస్తే ఎంత బాగుంటుంది!

2. కానుకలు ఇవ్వటం అభిలషణీయం. ముఖ్యంగా ఎదుటివారు ఆకలిగా ఉన్నప్పుడు, అవసరాల్లో ఉన్నప్పుడు దీని ప్రాముఖ్యత మరింత పెరిగిపోతుంది.

٥٢١ ـ وعن أنس رضى الله عنه قال: أبوطَلحَةَ لأمِّ سُلَيْمٍ: قَد سَمِعتُ صَوتَ رسولِ اللهِ ﷺ ضَعِيفًا أعرِفُ فِيهِ الجُوعَ، فَهَل عِندَكِ من شَيءٍ؟ فقالتْ: نَعَمْ، فَأَخرَجَتْ أَقْرَاصًا مِن شَعِيرٍ، ثُمَّ أَخَذَتْ خِمَارًا لَهَا، فَلَفَّتِ الخُبزَ بِبَعضِهِ، ثُمَّ دَسَّتْهُ تَحتَ ثَوبِي وَرَدَّتْنِي بِبَعضِهِ، ثُمَّ أَرسَلَتْنِي إلى رسولِ اللهِ ﷺ، فَذَهَبْتُ بِهِ، فَوَجَدتُ رسولَ اللهِ ﷺ جَالِسًا فى المَسجِدِ، وَمَعَهُ النَّاسُ، فَقُمتُ عَلَيهِمْ، فقالَ لِي رسولُ اللهِ ﷺ: «أَرسَلَكَ أَبُوطَلْحَةَ»؟ فقلتُ: نَعَمْ، فقال «أَلِطَعَامٍ؟» فقلت نَعَم، فقال رسولُ الله ﷺ: «قُومُوا» فَانطَلَقُوا وَانطَلَقتُ بَيْنَ

521. హ॥జ్రత్ అనస్ (రజి) కథనం : ఒకసారి హ॥జ్రత్ అబూ తల్హా (రజి) (తన సతీమణి) ఉమ్మె సులైమ్ (రజి. అన్హా)తో మాట్లాడుతూ, "దైవప్రవక్త (సల్లం) గొంతు బలహీనంగా వినబడుతోంది. బహుశా ఆకలివల్లనేనేమో! నీ దగ్గర (ఆయన తినడానికి) ఏదయినా ఉందా?" అని అడిగారు. ఆమె ఉందంటూ బార్లీ పిండితో చేసిన కొన్ని రొట్టెలు తీసి చూపించారు. వాటిని తన వోణీలో ఒక మూలన కట్టి దాన్ని నా బట్టల క్రింద దాచిపెట్టారు. వోణీ మిగతా భాగాన్ని నా ఒంటికి చుట్టి నన్ను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి పంపించారు.

నేనా రొట్టెలు తీసుకొని వెళ్ళాను. ఆ సమయంలో దైవప్రవక్త (సల్లం) మస్జిద్‌లో కూర్చొని ఉన్నారు. ఆయనతోపాటు సహచరులు కూడా కూర్చొని ఉన్నారు. నేను వారి దగ్గరికి వెళ్ళి నిలబడ్డాను. దైవప్రవక్త (సల్లం) నన్ను చూసి "నిన్ను అబూ తల్హా పంపించారా?" అని అడిగారు. నేను ఔనన్నాను. ఆయన "భోజనానికా?" అని మళ్ళీ అడిగారు. 'ఔనండీ' అని నేను జవాబు చెప్పాను.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) (తన సహచరులందరితో) "పదండి" అంటూ లేచారు. దాంతో వాళ్ళందరూ బయలు దేరారు. నేను వాళ్ళకు ముందు నడుస్తూ అబూ తల్హా (రజి) దగ్గరికి వెళ్ళి ఈ విషయం ఆయనకు తెలియజేశాను.

అబూ తల్హా (రజి) ఉమ్మె సులైమ్ (రజి. అన్హా) తో "ఉమ్మె సులైమ్! దైవప్రవక్త (సల్లం) తన సహచరులందరినీ వెంట బెట్టుకొని వస్తున్నారు. మనదగ్గరేమో వాళ్ళందరికి సరిపోయేటంత ఆహారం లేదు (ఇప్పుడేం చేద్దాం?)" అని (కంగారు పడిపోతూ)అన్నారు. "దేవునికి, దైవప్రవక్తకు అంతా తెలుసు" అని అన్నారామె. ఆ తరువాత అబూతల్హా (రజి) కూడా ఇంటినుంచి బయలు దేరారు. దారిలో దైవప్రవక్త (సల్లం)ను కలుసుకున్నారు. దైవప్రవక్త (స) అబూ తల్హాతో పాటు ఆయన ఇంటిముఖం పట్టారు. ఇంటికి చేరుకున్నాక ఇద్దరూ ఇంట్లోకి ప్రవేశించారు. దైవప్రవక్త (సల్లం) ఉమ్మె సులైమ్‌తో "మీ ఇంట్లో ఏముందో తీసుకురండి" అని అన్నారు. అప్పుడామె ఆ రొట్టెల్ని దైవప్రవక్త (స) ముందు ఉంచారు.

దైవప్రవక్త (సల్లం) ఆదేశంతో ఆ రొట్టెల్ని ముక్కలు ముక్కలుగా చేయుటం జరిగింది. ఉమ్మె సులైమ్ (రజి.అన్హా) అందులో నెయ్యి కుప్పెనుండి నెయ్యిని తుడిచిపోశారు. అది ఆ రొట్టెల్లోకి కూర లాగా పనికొచ్చింది. తరువాత దైవప్రవక్త (సల్లం) దానిపై దేవుడు తలచినది

أَيدِيهِم حَتَّى جِئتُ أَبَاطَلْحَةَ فَأَخبَرتُهُ، فقال أبوطَلحَةَ: يَاأُمَّ سُلَيمٍ! قَد جَاءَ رسولُ اللهِ ﷺ بالنَّاسِ وَلَيسَ عِندَنَا مَا نُطعِمُهُم! فقالت: اللهُ وَرَسُولُهُ أعلم. فَانطَلَقَ أبوطَلحَةَ حَتَّى لَقِيَ رسولَ اللهِ ﷺ، فَأَقبَلَ رسولُ اللهِ ﷺ مَعَه حَتَّى دَخَلا، فقال رسولُ اللهِ ﷺ: «هَلُمِّي ما

عِنْدَكِ يَا أُمَّ سُلَيْمٍ!» فَأَتَتْ بِذَلِكَ الْخُبْزِ، فَأَمَرَ بِهِ رسولُ اللهِ ﷺ فَفُتَّ، وَعَصَرَتْ عَلَيْهِ أُمُّ سُلَيْمٍ عُكَّةً فَأَدَمَتْهُ، ثُمَّ قال فِيهِ رسولُ اللهِ ﷺ ما شَاءَ اللهُ أَنْ يَقُولَ، ثُمَّ قال: «ائذَنْ لِعَشَرَةٍ» فَأَذِنَ لهم، فَأَكَلُوا حَتَّى شَبِعُوا، ثم خَرَجُوا، ثُمَّ قَالَ: «ائذَنْ لِعَشَرَةٍ» فَأَذِنَ لَهم فَأَكَلُوا حَتَّى شَبِعُوا ثُمَّ خَرَجُوا، ثُمَّ قَالَ: «ائذَنْ لِعَشَرَةٍ» فَأَذِنَ لَهم حتَّى أَكَلَ الْقَوْمُ كُلُّهُمْ وَشَبِعُوا، ثُمَّ قَالَ: وَالْقَوْمُ سَبعُونَ رَجُلاً أَوْ ثَمَانُونَ. متفقٌ عليه. وفي رواية: فما زال يَدْخُلُ عَشَرَةٌ وَيَخْرُجُ عَشَرَةٌ، حتى لم يَبْقَ مِنهم أَحَدٌ إلاَّ دَخَلَ، فَأَكَلَ حتَّى شَبِعَ، ثم هَيَّأَهَا فَإِذَا هِيَ مِثْلُهَا حِينَ أَكَلُوا مِنْهَا. وفي رواية: فَأَكَلُوا عَشَرَةً عَشَرَةً، حتَّى فَعَلَ ذلك بِثَمَانِينَ رَجُلاً، ثُمَّ أَكَلَ النبيُّ ﷺ بعد ذلك وَأَهْلُ البَيتِ، وَتَرَكُوا سُؤْرًا. وفي رواية: ثُمَّ أَفضَلُوا مَا بَلَّغُوا جِيرَانَهُم. وفي رواية عن أنسٍ قال: جِئْتُ رسولَ اللهِ ﷺ يَوْمًا، فَوَجَدْتُهُ جَالِسًا مَعَ أصحابِهِ، وَقَد

పఠించి "పదిమందిని భోజనానికి పిలవండి" అని అన్నారు. అబూ తల్హా (రజి) పదిమందిని పిలవగా వారు కడుపునిండా తిని వెళ్ళిపోయారు. తరువాత దైవప్రవక్త (స) "మరో పదిమందిని రానివ్వండి" అన్నారు. అబూ తల్హా మరో పదిమందిని పిలిచారు. వారు కూడా కడుపునిండా తిని వెళ్ళిపోయారు. ఇంకో పదిమందిని రానివ్వండి అన్నారు దైవప్రవక్త (స). ఆయన ఇంకో పదిమందికి అనుమతినిచ్చారు. ఆ విధంగా అందరూ కడుపునిండా తిని వెళ్ళిపోయారు. వాళ్ళు మొత్తం డెబ్భై, ఎనభై మంది ఉన్నారు. (బుఖారీ - ముస్లిం)

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: సహచరులు పదిమంది చొప్పున లోపలికి వెళ్ళి వచ్చేవారు. లోపలికి వెళ్ళి కడుపునిండా తినకుండా వచ్చినవాడు బహుశా వారిలో ఒక్కడూ ఉండడు. చివరికి అందరూ తిన్న తర్వాత అన్నాన్ని ఒకచోట సమీకరించి చూస్తే అది ప్రజలు తినకముందు ఎలా ఉందో అలాగే ఉంది.

మరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : ప్రజలు పదిమంది చొప్పున అన్నం తిన్నారు. ఆ విధంగా ఎనభైమంది తిన్నారు. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం), ఆ ఇంటివారు తిన్నారు. ఆ తరువాత మిగిలిన అన్నాన్ని వారు వదలిపెట్టారు.

ఇంకొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : వారు తిన్న తరువాత కూడా ఎంతో

عَصَبَ بَطْنَهُ بعصَابَةٍ، فقلتُ لِبَعضِ أصحَابِهِ: لِمَ عَصَبَ رسولُ اللهِ ﷺ بَطْنَهُ؟ فقالوا: مِنَ الجُوعِ، فَذَهَبْتُ إلى أبي طَلحَةَ، وَهُوَ زَوجُ أُمِّ سُلَيم بنتِ مِلحَانَ، فقلتُ: يَا أبَتَاه! قَد رَأيتُ رسولَ اللهِ ﷺ عَصَبَ بَطنَهُ بِعِصَابَةٍ، فَسَألتُ بَعضَ أصحَابِهِ، فقالوا مِنَ الجُوعِ. فَدَخَلَ أبُوطَلحَةَ على أُمِّي فقال: هَل مِن شيءٍ؟ قلت: نعم عِندِي كِسَرٌ مِن خُبزٍ وَتَمَرَاتٌ، فإنْ جَاءَنَا رسولُ اللهِ ﷺ وَحدَهُ أشبَعْنَاهُ، وَإن جَاءَ آخَرُ معه قَلَّ عَنهم، وَذَكَرَ تَمَامَ الحَديث.

అన్నం మిగిలిపోయింది. దాన్ని వారు ఇరుగుపొరుగు వారికి పంపించు కున్నారు.

హజ్రత్ అనస్ (రజి) గారే చేసిన వేరొక ఉల్లేఖనం ఇలా ఉంది : నేనొకసారి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళాను. అప్పుడు ఆయన తన సహచరులతో పాటు కూర్చొని ఉన్నారు. తన కడుపుకు ఏదో కట్టు కట్టుకొని ఉన్నారు. నేను ఆయన సహచరుల్ని, "దైవప్రవక్త (సల్లం) కడుపుకు కట్టు ఎందుకు కట్టుకున్నార"ని అడిగాను. 'ఆకలి వల్ల' అని వారు సమాధానమిచ్చారు.

ఆ మాట విని నేను ఉమ్మె సులైమ్ బిన్తె మిల్‌హాన్ భర్త అబూ తల్హా (రజి) దగ్గరికి వెళ్ళి "నాన్నా! దైవప్రవక్త (స) తన కడుపుకు కట్టుకట్టుకొని ఉన్నారు. అలా ఎందుకు చేశారని నేనాయన సహచరుల్ని అడిగితే, వారు తీవ్రమైన ఆకలివల్ల అలా చేశారని చెప్పారు" అని అన్నాను. అప్పుడు అబూ తల్హా (రజి) మా అమ్మ దగ్గరికి వెళ్ళి, "తినటానికి ఏమైనా ఉందా?" అని అడిగారు. "అవును. మనింట్లో కొన్ని రొట్టె ముక్కలు, కొన్ని ఖర్జూర పండ్లు ఉన్నాయండీ. దైవప్రవక్త (సల్లం) ఒక్కరే వస్తే మనం ఆయనకు కడుపునిండా తినిపించగలం. ఆయనతోపాటు ఇతరులు కూడా వస్తే ఇవి సరిపోవు" అని చెప్పింది మా అమ్మ.

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

## 57వ అధ్యాయం

### ٥٧ـ بَابُ الْقَنَاعَةِ وَالْعَفَافِ وَالاقْتِصَادِ فِي الْمَعِيشَةِ وَالإِنْفَاقِ وَذَمِّ السُّؤَالِ مِنْ غَيْرِ ضَرُورَةٍ

# ఆత్మ తృప్తితో బ్రతకటం, ఇతరుల ముందు చెయ్యి చాపకుండా ఉండటం, ఖర్చుచేయటంలో మధ్యేమార్గాన్ని అవలంబించటం గురించి......

قال الله تعالى: ﴿وَمَا مِن دَآبَّةٍ فِي الْأَرْضِ إِلَّا عَلَى اللَّهِ رِزْقُهَا﴾[هود: ٦] وقال تعالى: ﴿لِلْفُقَرَآءِ الَّذِينَ أُحْصِرُوا فِي سَبِيلِ اللَّهِ لَا يَسْتَطِيعُونَ ضَرْبًا فِي الْأَرْضِ يَحْسَبُهُمُ الْجَاهِلُ أَغْنِيَآءَ مِنَ التَّعَفُّفِ تَعْرِفُهُم بِسِيمَاهُمْ لَا يَسْـَٔلُونَ النَّاسَ إِلْحَافًا﴾[البقرة: ٢٧٣] وقال تعالى: ﴿وَالَّذِينَ إِذَآ أَنفَقُوا لَمْ يُسْرِفُوا وَلَمْ يَقْتُرُوا وَكَانَ بَيْنَ ذَٰلِكَ قَوَامًا﴾[الفرقان: ٦٧] وقال تعالى:

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"ధరణిపై సంచరించే ప్రతి ప్రాణి ఉపాధి బాధ్యత అల్లాహ్‌పైనే ఉంది." *(హూద్ : 6)*

ఇంకొకచోట ఆయన ఇలా అంటున్నాడు :

"అల్లాహ్ కార్యంలో నిమగ్నులైన కారణంగా, తమ జీవనోపాధి కోసం భూమిపై తిరిగే అవకాశం లేనందువల్ల లేమికి గురిఅయిన వారు ప్రత్యేకంగా ధన సహాయానికి అర్హులు. వారిని ఎరుగని మనిషి వారి ఆత్మాభిమానం చూసి వారు భాగ్యవంతులని భావిస్తాడు. వారి ముఖాలను చూసి మీరు వారి నిజస్థితిని గ్రహించగలరు. లోకుల వెంటపడి సహాయం చెయ్యండి అని బ్రతిమాలే మనుషులు కారు వారు." *(అల్ బఖర : 273)*

వేరొకచోట ఇలా సెలవిచ్చాడు :

"(కరుణామయుని దాసులు ఎవరంటే), ఖర్చుపెడితే దుబారాగానూ ఖర్చుపెట్టకుండా, లోభత్వాన్నీ ప్రదర్శించకుండా - ఈ రెండు తీవ్రవైఖరుల మధ్య సమతూకాన్ని పాటించే వారు." *(అల్ ఫుర్ఖాన్ : 67)*

﴿ وَمَا خَلَقْتُ الْجِنَّ وَالْإِنسَ إِلَّا لِيَعْبُدُونِ ۝ مَا أُرِيدُ مِنْهُم مِّن رِّزْقٍ وَمَا أُرِيدُ أَن يُطْعِمُونِ ﴾ [الذاريات: ٥٦، ٥٧]

وأما الأحاديث، فتَقَدَّمَ مُعْظَمُهَا فِي البَابَيْنِ السَّابِقَيْنِ، وَمِمَّا لَمْ يَتَقَدَّمْ:

ఆయన ఇంకా ఇలా అంటున్నాడు :

"నేను జిన్నాతులనూ, మానవులనూ కేవలం నా ఆరాధన కోసమే పుట్టించాను. నేను వారి నుండి ఎలాంటి ఉపాధినీ కోరను; వారు నాకు అన్నం పెట్టాలనీ కోరను."

*(అజ్ జారియాత్ : 56, 57)*

ఈ అధ్యాయానికి సంబంధించిన అనేక హదీసులు గత రెండు అధ్యాయాల్లోనూ వచ్చాయి. తతిమ్మా హదీసులను ఇక్కడ పొందుపరుస్తున్నాం.

٥٢٢ ـ عن أبي هُرَيرَةَ رضيَ اللهُ عنه عن النبيِّ ﷺ قال: «لَيسَ الغِنَى عَن كَثْرَةِ العَرَضِ، وَلٰكِنَّ الغِنَى غِنَى النَّفْسِ» متفق عليه. «العَرَضُ» بفتح العين والراء: هُوَ المَالُ.

522. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : సిరిసంపదల విస్తృతి కలిమి కాదు. మనసులోని నిరపేక్షా భావమే అసలు కలిమి.

(బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషి తన దగ్గరున్న ధనంతో తృప్తిగా జీవించడమే నిరపేక్షాభావం. నిరపేక్షాభావాన్ని అలవరచుకున్న వ్యక్తి ఇతరుల ముందు చేయి చాపకుండా, దురాశలకు పోకుండా ఆత్మ సంతృప్తితో బ్రతుకుతాడు.

٥٢٣ ـ وعن عبدِالله بن عمرو رضي الله عنهما أنَّ رسولَ الله ﷺ قال: «قَدْ أَفْلَحَ مَنْ أَسلَمَ، وَرُزِقَ كَفَافًا، وَقَنَّعَهُ اللهُ بما آتاهُ» رواه مسلم.

523. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : "ఇస్లాం స్వీకరించి, చాలినంత ఉపాధిని పొంది, దైవప్రసాదితాలపై తృప్తినొసగబడిన వ్యక్తి ముక్తి పొందాడు." (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

524. హజ్రత్ హకీమ్ బిన్ హిజామ్ (రజి) కథనం : నేనొకసారి దైవప్రవక్త (సల్లం)ను (ధనం) ఇవ్వమని అడిగితే ఆయన ఇచ్చారు. నేను మళ్ళీ అడిగాను. ఆయన నాకు (మరికొంత ధనం) ఇచ్చారు. నేను ఇంకా ఇవ్వమని అడిగాను. అప్పుడు ఆయన నాకు (ఇంకాస్త ధనం) ఇస్తూ, "హకీమ్! ఈ ధనం (పైకి) పచ్చగా, తియ్యగా కనిపిస్తుంది. కాని దాన్ని నిరపేక్షా భావంతో తీసుకున్న వ్యక్తికి అందులో శుభం కలుగుతుంది. అత్యాశతో తీసుకున్న వ్యక్తికి అందులో శుభం కలగదు. అతను ఎంత తిన్నా కడుపునిండని (రోగి) లాంటివాడు. పైచేయి (ఇచ్చే చెయ్యి) క్రింది చెయ్యి (పుచ్చుకునే చెయ్యి) కన్నా ఎంతో శ్రేష్ఠమైనది" అని ఉపదేశించారు.

అప్పుడు నేనాయనతో, "దైవప్రవక్తా! మిమ్మల్ని సత్య సందేశాన్నిచ్చి పంపిన దేవుని సాక్షిగా చెబుతున్నాను. ఇకపై నేను ఇహలోకాన్ని వదలివెళ్ళేవరకు ఎవరినీ ఏమీ చేయిచాపి అడగను" అని అన్నాను.

హజ్రత్ అబూబక్ర్ (రజి) (తన పాలనా కాలంలో) (ధనం ఇవ్వటానికి) హకీమ్ (రజి)ని ఎన్నిసార్లు పిలిచినప్పటికీ ఆయన దాన్ని స్వీకరించటానికి నిరాకరించారు. ఆ తరువాత ఉమర్ (రజి) (తన హయాంలో) ఆయనకు కానుకలు ఇవ్వటానికి అనేకసార్లు పిలిపించారు.

٥٢٤ ـ وعن حَكيم بن حِزَام رضى الله عنه قال: سَأَلْتُ رسولَ اللهِ ﷺ فَأَعطَانى، ثم سَأَلْتُهُ فَأَعطَانى، ثُمَّ سَأَلْتُهُ فَأَعطَانِى، ثُمَّ قال: «ياحَكِيمُ! إنَّ هذا المَالَ خَضِرٌ حُلوٌ، فَمَن أَخَذَهُ بِسَخَاوَةِ نَفْسٍ بُورِكَ فيهِ، وَمنَ أَخَذَهُ بإشْرَافِ نَفْسٍ لَم يُبَارَكْ لَهُ فيهِ، وكَانَ كَالَّذِىْ يَأكُلُ وَلاَ يَشْبَعُ، وَاليَدُ العُلْيَا خَيرٌ مِنَ اليَدِ السُّفْلَى» قال حكيمٌ فقلتُ: يارسولَ الله! وَالَّذى بَعَثَكَ بِالحقِّ لاَ أَرزَأُ أَحَدًا بَعدَكَ شَيئًا حتَّى أُفَارِقَ الدُّنْيَا. فَكَانَ أَبُوبكرٍ رضى الله عنه يَدْعُو حَكِيمًا لِيُعطِيَهُ، فَيَأبَى أَنْ يَقبَلَ مِنهُ شَيْئًا، ثُمَّ إنَّ عمرَ رضى الله عنه، دعاهُ لِيُعْطِيَهُ فأَبَى أَن يَقبَلَهُ. فقال: يامَعْشَرَ المُسْلِمِينَ! أُشهِدُكُم عَلى حَكِيمٍ أَنِّى أَعْرِضُ عَلَيه حَقَّهُ الَّذِى قَسَمَهُ اللهُ لَهُ فِى هٰذا الفَيءِ، فَيَأبَى أَنْ يَأْخُذَهُ. فَلَمْ يَرْزَأْ حَكِيمٌ أَحَدًا مِنَ النَّاسِ بَعْدَ النَّبِيِّ ﷺ حتَّى تُوُفِّىَ. متفقٌ عليه.

«يَرْزَأْ» بِرَاءٍ ثُمَّ زَايٍ ثُمَّ همزةٍ، أَيْ: لَمْ يَأْخُذْ مِنْ أَحَدٍ شَيْئًا، وَأَصلُ الرُّزْءِ: النُّقصَانُ، أي لَمْ يَنْقُصْ أَحَدًا شَيْئًا بالأخذ مِنهُ. وَ«إِشْرَافُ النَّفسِ»: تَطَلُّعُهَا وَطَمَعُهَا بِالشَّيْءِ. وَ«سَخَاوَةُ النَّفْسِ»: هِيَ عَدَمُ الإشْرَاف إلى الشَّيْءِ، وَالطَّمَعِ فيه، وَالمُبَالاةِ بِهِ وَالشَّرَهِ.

కాని అప్పుడు కూడా ఆయన వాటిని స్వీకరించటానికి నిరాకరించారు. ఆ సందర్భంగా హజ్రత్ ఉమర్ (రజి), ప్రజలతో మాట్లాడుతూ ఇలా అన్నారు: ముస్లింలారా! నేను హకీమ్‌కు విజయ ప్రాప్తి నుండి రావలసిన వాటాను తీసి ఆయనకు ఇస్తున్నాను. కాని ఆయన దాన్ని స్వీకరించటానికి నిరాకరిస్తున్నారు. దీనికి మీరు సాక్షులుగా ఉండాలి."

ఆ విధంగా హజ్రత్ హకీమ్ (రజి) దైవ ప్రవక్త (సల్లం) నుండి దానం స్వీకరించిన నాటి నుంచి చనిపోయేవరకు ఎవరి నుండీ, ఎలాంటి వస్తువూ తీసుకోలేదు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వీలునామాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషి ఎంత డబ్బు కూడబెట్టుకున్నా అతని ధనదాహం మాత్రం తీరదు. పైగా ధనం పెరిగినకొద్దీ అతని ధనాశ కూడా విచ్చలవిడిగా పెరుగుతూ పోతుంది. ఒక లోయనిండా బంగారం లభిస్తే మనిషి రెండవదానికోసం అర్రులు చాస్తాడు. ఆఖరికి నోట్లో (సమాధి) మన్నుపడితే గాని అతని ఆత్రం చల్లారదు.

అర్థింపు, అత్యాశలు లేకుండా ధనం లభించినప్పుడు దాన్ని స్వీకరించడంలో తప్పులేదు. కాని అలాంటి ధనాన్ని కూడా తృణీకరించటం గొప్పవారి లక్షణం. అది వారిలోని ఐహిక అనాసక్తతను, నిరపేక్షాభావాన్ని సూచిస్తుంది. హకీమ్ (రజి) అలాంటి నిరపేక్షతనే ప్రదర్శించారు.

٥٢٥ ـ وعن أَبِي بُردَةَ عن أبي موسى الأشعَرِيِّ رضي الله عنه قال: خَرَجْنَا مَعَ رَسُولِ الله ﷺ في غَزَاةٍ،

525. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) నుండి అబూ బుర్దా చేసిన కథనం: మేము దైవప్రవక్త (సల్లం) వెంట ఒకానొక యుద్ధానికి బయలుదేరాము. అప్పుడు మేము ఆరుగురం ఉన్నాం. మా దగ్గర ఒకే ఒక ఒంటె ఉంది. దానిమీద మేము

وَنَحْنُ سِتَّةُ نَفَرٍ بَيْنَنَا بَعِيرٌ نَعْتَقِبُهُ، فَنَقِبَتْ أَقْدَامُنَا وَنَقِبَتْ قَدَمِي، وَسَقَطَتْ أَظْفَارِي، فَكُنَّا نَلُفُّ عَلَى أَرْجُلِنَا الخِرَقَ، فَسُمِّيَتْ غَزْوَةَ ذَاتِ الرِّقَاعِ لِمَا كُنَّا نَعْصِبُ عَلَى أَرْجُلِنَا من الخِرَقِ. قال أبوبُردَةَ: فَحَدَّثَ أبومُوسَى بِهٰذا الحَدِيث، ثُمَّ كَرِهَ ذَلِكَ، وقال: مَا كُنْتُ أَصْنَعُ بِأَنْ أَذكُرَهُ! قَالَ: كَأَنَّهُ كَرِهَ أَنْ يَكُونَ شَيْئًا مِنْ عَمَلِهِ أَفْشَاهُ. متفقٌ عليه.

వంతులవారీగా ప్రయాణించసాగాము. (చాలాదూరం నడిచిన కారణంగా) మా కాళ్లు పగిలిపోయాయి. నా కాళ్ళు కూడా పగిలి గోళ్ళు ఊడిపోయాయి. (ఆ బాధను భరించలేక మేము) కాళ్ళకు చింపిరిగుడ్డలు కట్టుకున్నాం. మేము మా కాళ్ళకు చింపిరిగుడ్డలు కట్టుకున్న కారణంగానే ఆ యుద్ధానికి జాతుర్రిఖా (చింపిరిగుడ్డల) యుద్ధమనే పేరు పడింది.

అబూ మూసా అష్అరీ (రజి) ఈ హదీసును ఉల్లేఖించిన తరువాత దీని గురించి చెప్పినందుకు అయిష్టత వ్యక్తం చేశారు. "నేనసలు దీన్ని ప్రస్తావించ కుండా ఉందామనుకున్నాను" అన్నారు. తను చేసిన సత్కార్యాలను గురించి ఇతరులకు చెప్పుకోవటం ఆయనకు ఇష్టం లేదన్నమాట. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని యుద్ధాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో కూడా దైవప్రవక్త సహచరుల ఐహిక అనాసక్తత, నిరాడంబరమైన వారి జీవితం, దైవనిర్ణయాల పట్ల వారి అంగీకారభావాలు పొందుపరచబడ్డాయి.
2. ప్రదర్శనాబుద్ధికి దూరంగా ఉండటం కోసం చేసిన మంచి పనుల గురించి ఇతరులకు చెప్పకుండా ఉండటమే ఉత్తమం.

٥٢٦ ـ وعن عمرو بنِ تَغْلِبَ ـ بفتح التاء المثناة فوق وإسكانِ الغينِ المعجمةِ وكسر اللامِ ـ رضي اللهُ عنه، أن رسولَ اللهِ ﷺ أُتِيَ بِمَالٍ أَوْ سَبيٍ فَقَسَّمَهُ، فَأَعْطَى رجالاً، وَتَرَكَ رِجَالاً،

526. హజ్రత్ అమ్ర్ బిన్ తగ్‌లిబ్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (స) దగ్గరికి (విజయసొత్తుగా) కొంత ధనమో లేక కొంతమంది ఖైదీలో వచ్చారు. ఆయన (సల్లం) దాన్ని ప్రజలకు పంచిపెట్టారు.

فَبَلَغَهُ أَنَّ الَّذِينَ تَرَكَ عَتَبُوا، فَحَمِدَ اللهَ، ثُمَّ أَثْنَى عَلَيْهِ، ثُمَّ قَالَ: «أَمَّا بَعْدُ؛ فَوَاللهِ! إِنِّي لأُعْطِي الرَّجُلَ وَأَدَعُ الرَّجُلَ، وَالَّذِي أَدَعُ أَحَبُّ إِلَيَّ مِنَ الَّذِي أُعْطِي، وَلٰكِنِّي إِنَّمَا أُعْطِي أَقْوَامًا لِمَا أَرَى فِي قُلُوبِهِمْ مِنَ الْجَزَعِ وَالْهَلَعِ، وَأَكِلُ أَقْوَامًا إِلَى مَا جَعَلَ اللهُ فِي قُلُوبِهِمْ مِنَ الْغِنَى وَالْخَيْرِ، مِنْهُمْ عَمْرُو بْنُ تَغْلِبَ» قَالَ عَمْرُو بْنُ تَغْلِبَ: فَوَاللهِ! مَا أُحِبُّ أَنَّ لِي بِكَلِمَةِ رَسُولِ اللهِ ﷺ حُمْرَ النَّعَمِ. رواه البخاري. «الْهَلَعُ»: هُوَ أَشَدُّ الْجَزَعِ، وَقِيلَ الضَّجَرُ.

అయితే ఆ ధనం కొంతమందికిచ్చి మరికొంతమందికి ఇవ్వనందున ధనం లభించని వారు అలిగారు. ఈ విషయం దైవప్రవక్త (సల్లం)కు తెలిసింది. ఆయన (వేదికపైకెక్కి) దైవస్తోత్రం చేసిన తరువాత ఇలా అన్నారు : దైవసాక్షి! నేను కొందరికి ఇస్తాను. మరికొందరికి ఇవ్వకుండా ఉంటాను. కాని నిజానికి నేనిచ్చే వారికన్నా ఇవ్వకుండా ఉండేవారే నాకు అత్యంత ప్రియతములు. నేను వారి హృదయాల్లో అశాంతి, ఆందోళనా భావాల్ని గమనిస్తున్నాను. అందుకే ఆ ధనం వారికిచ్చాను. ఇక మిగతావారి హృదయాల్లో దేవుడు మంచితనాన్ని, నిరపేక్షాభావాన్ని ఉంచాడు. నాకు వారి మీద నమ్మకముంది. అమ్ర్ బిన్ తగ్‌లిబ్ కూడా అలాంటివాడే.

అమ్ర్ బిన్ తగ్‌లిబ్ ఇలా అంటున్నారు: దైవసాక్షి! దైవప్రవక్త (సల్లం) చెప్పిన ఆ మాటకు బదులుగా నాకు ఎరుపు ఒంటెలిచ్చినా నేను వాటిని తీసుకోవటానికి ఇష్టపడను. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జుమా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త సల్లల్లాహు అలైహి వ సల్లం తన దగ్గరికి వచ్చే ధనాన్నంతా పేదలకు పంచిపెట్టేవారు. ధనం పంచిపెట్టేటప్పుడు ఆయన అనేక విషయాలను దృష్టిలో పెట్టుకునేవారు. అవసరాల్లో ఉన్నవారికి ఇచ్చేవారు. ఎవరికయినా ఆ ధనం మీద హక్కు ఉంటే వారికి పంచిపెట్టేవారు. అలాగే ధనం ఇవ్వకపోతే అసహనంతో మూతి ముడుచుకుంటారనే భయమున్నవారికి కూడా ఆయన ఎంతోకొంత ఇచ్చిపంపేవారు. ఈ సందర్భంగా ఆత్మతృప్తితో బ్రతికే నిరపేక్షాపరులైన ముస్లింలను ఆయన ఉద్దేశ్యపూర్వకంగానే ఉపేక్షించేవారు. ఈ హదీసులో అమ్ర్

బిన్ తగ్‌లిబ్‌ను ఆయన అలాంటి వ్యక్తిగానే పరిగణించారు. దీనిద్వారా అమ్ర్ బిన్ తగ్‌లిబ్ ప్రశస్తి వెల్లడౌతోంది.

٥٢٧ ـ وعن حكيم بن حِزام رضى الله عنه أنَّ النَّبِيَّ ﷺ قالَ: «اليَدُ العُلْيَا خَيْرٌ مِنَ اليَدِ السُّفْلَى، وَابْدَأْ بِمَنْ تَعُولُ، وَخَيْرُ الصَّدَقَةِ عَنْ ظَهْرِ غِنًى، وَمَنْ يَسْتَعْفِفْ يُعِفَّهُ اللهُ، وَمَنْ يَسْتَغْنِ يُغْنِهِ اللهُ» متفق عليه.

527. హజ్రత్ హకీమ్ బిన్ హిజామ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ఇచ్చే చెయ్యి పుచ్చుకునే చెయ్యికన్నా ఎంతో గొప్పది. నువ్వు ధనం ఖర్చుపెట్టేటప్పుడు నీపై ఆధారపడివున్న వారితోనే మొదలుపెట్టు. అవసరాలు తీరిన తరువాత చేసే దానమే అత్యుత్తమ దానం. ఇతరుల ముందు చేయి చాప కుండా ఉండాలనుకున్న వాడ్ని దేవుడు దాన్నుండి కాపాడతాడు. అలాగే నిరపేక్షా భావాన్ని అవలంబించాలనుకున్న వ్యక్తిని దేవుడు నిరపేక్షాపరునిగా చేసేస్తాడు.

*(బుఖారీ - ముస్లిం)*

وهذا لفظ البخارى، ولفظ مسلم أخصر.

ఇవి బుఖారీ వాక్యాలు. ముస్లిం వాక్యాలు మరింత క్లుప్తంగా ఉన్నాయి.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జకాత్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

ఇతరుల ముందు చెయ్యిచాపి అడుక్కోకుండా, ప్రజల సిరిసంపదల పట్ల నిరపేక్షా భావాన్ని కనబరిచేవారు దైవానికి ప్రియమైనదాసులుగా పరిగణించబడతారు. దేవుడు అలాంటి వారికి సహాయం చేసి వారి ఆత్మగౌరవాన్ని కాపాడతాడు. వారికి ఆత్మ సంతృప్తిని, సహన సౌభాగ్యాలను ప్రసాదిస్తాడు.

٥٢٨ ـ وعن أبى سُفْيَانَ صَخْرِ بن حَرْبٍ رضىَ اللهُ عنه قال: قال رسولُ اللهِ ﷺ: «لاَ تُلحِفُوا فى المسألَةِ، فوَاللهِ!

528. హజ్రత్ అబూ సుఫ్యాన్ సఖర్ బిన్ హర్బ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : లోకుల వెంటపడి బ్రతిమాలి అడుక్కోకండి. దైవసాక్షి! మీరు నన్ను ఏదైనా వస్తువు అడిగి, నేను అన్యమనస్కంగా మీకు ఆ

لاَ يَسْأَلُنِيْ أَحَدٌ مِنْكُمْ شَيْئًا، فَتُخْرِجَ لَهُ مَسْأَلَتُهُ مِنِّي شَيْئًا وَأَنَا لَهُ كَارِهٌ، فَيُبَارَكَ لَهُ فِيمَا أَعْطَيْتُهُ» رواه مسلم.

వస్తువు ఇవ్వాల్సివస్తే, అలాంటప్పుడు నేను మీకిచ్చే వస్తువులో శుభం ప్రాప్తించదు." (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

٥٢٩ ـ وعن أبي عبدالرحمٰن عَوْفِ ابنِ مالكٍ الأَشْجَعِيِّ رضيَ اللهُ عنه قالَ: كُنَّا عِنْدَ رسُولِ اللهِ ﷺ تِسْعَةً أَوْ ثَمانِيَةً أَوْ سَبْعَةً، فَقَالَ: «أَلاَ تُبَايِعُوْنَ رَسُولَ اللهِ ﷺ» وَكُنَّا حَدِيثِي عهدٍ بِبَيْعَةٍ، فَقُلْنَا: قَدْ بَايَعْنَاكَ يارسُولَ اللهِ! ثم قال: «أَلاَ تُبَايِعُوْنَ رَسولَ اللهِ» فَبَسَطْنَا أَيْدِيَنَا وقلنا: قَدْ بَايَعْنَاكَ يارسولَ اللهِ! فَعَلاَمَ نُبَايِعُكَ؟ قَالَ: «على أَنْ تَعْبُدُوْا اللهَ وَلاَ تُشْرِكُوا بِهِ شَيْئًا، وَالصَّلَوَاتِ الخَمْسِ وَتُطِيْعُوا» وَأَسَرَّ كَلِمَةً خَفِيَّةً: «وَلاَ تَسْأَلُوا النَّاسَ شَيْئًا» فَلَقَدْ رَأَيْتُ بَعْضَ أُولئكَ النَّفَرِ يَسْقُطُ سَوْطُ أَحَدِهِمْ فَمَا يَسْأَلُ أَحَدًا يُنَاوِلُهُ إِيَّاهُ. ورواه مسلم.

529. హ్రజత్ అబూ అబ్దుర్రహ్మాన్ ఔఫ్ బిన్ మాలిక్ అష్జయీ (రజి) కథనం : మేము తొమ్మిది లేక ఎనిమిది లేక ఏడు మందిమి దైవప్రవక్త (సల్లం) దగ్గర కూర్చొని ఉండగా ఆయన మమ్మల్ని, "మీరు దైవప్రవక్తకు ప్రమాణం చెయ్యరా?" అని అడిగారు. మేము కొంతకాలం ముందే ఆయనకు ప్రమాణం చేసివున్నాం. అందుచేత, "దైవప్రవక్తా! మేము (ఇంతకు ముందే) మీకు ప్రమాణం చేశాం" అని విన్నవించుకున్నాం. ఆయన మళ్ళీ, "మీరు దైవప్రవక్తకు ప్రమాణం చెయ్యరా?" అని అడిగారు. అప్పుడు మేము (ప్రమాణం చేయుటానికి) చేతులు చాపుతూ, "దైవప్రవక్తా! మేము మీకు ప్రమాణం చేసి ఉన్నాం కదా! ఇక ఇప్పుడు దేని గురించి మీకు ప్రమాణం చెయ్యాలి?" అని అడిగాం. దానికి ఆయన (సల్లం) "ఒకే దేవుణ్ణి ఆరాధిస్తామని, ఆయనకు ఎవరినీ సాటి కల్పించమని, ఐదు పూటలా నమాజ్ చేస్తామని, దైవానికి విధేయత చూపుతామని" - తరువాత మెల్లిగా అన్నారు: "ప్రజలనుండి ఏమీ అడుక్కోమని ప్రమాణం చెయ్యండి."

ఆ విధంగా ప్రమాణం చేసిన వారిలో కొందరిని, నేను గమనించిన విషయం చెబుతున్నాను. వారు (వాహనం మీద ఉన్నప్పుడు) కొరడా క్రిందజారిపోతే దాన్ని అందివ్వమని కూడా ఎవరినీ అడిగేవారు కారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

530. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియ జేశారు : నిత్యం ప్రజల దగ్గర అడుక్కుంటూ తిరిగేవాడు ముఖంపై ఒక్క మాంసపు తునకయినా లేని స్థితిలో దైవాన్ని కలుసుకుంటాడు. *(బుఖారీ - ముస్లిం)*

٥٣٠ ـ وعن ابنِ عمرَ رضيَ اللهُ عنهما أنَّ النَّبيَّ ﷺ قال: «لاَ تَزَالُ المَسألَةُ بِأَحَدِكُمْ حَتَّى يَلْقَى اللهَ تعالى وَلَيْسَ فِى وَجْهِهِ مُزْعَةُ لَحْمٍ» متفقٌ عليه. «المُزْعَةُ» بضم الميمِ وإسكانِ

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జకాత్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

ముఖం మీద మాంసం ఉండదంటే బహుశా పరలోకంలో అతనికి ఘోర అవమానం ఎదురౌతుందని అర్థం కావచ్చు లేదా అందుకు శిక్షగానో, చేసిన పాపానికి ప్రాయశ్చిత్తంగానో నిజంగా అలా జరగవచ్చు. పూర్వాపరాల దృష్ట్యా రెండవ మాటే సరైనదనిపిస్తోంది. ఈ హదీసులో ముష్టెత్తుకోవటాన్ని ఛీత్కరించుకోవటం జరిగింది. దానికి ఫలితంగా ఇహపరాల్లోనూ ఘోర అవమానాన్ని ఎదుర్కోవలసి ఉంటుందని హెచ్చరించటం జరిగింది.

531. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఒకసారి వేదికపై నించొని దానధర్మాల గురించి, ఇతరుల ముందు చేయి చాపకుండా ఉండటం గురించి ప్రస్తావించారు. ఆ సందర్భం గానే ఆయన ఇలా అన్నారు: పైచేయి క్రిందిచేయికన్నా ఎంతో శ్రేష్ఠమైనది.

٥٣١ ـ وعنه أَنَّ رسُولَ اللهِ ﷺ قال وهو على المِنْبَرِ، وَذَكَرَ الصَّدَقَةَ وَالتَّعَفُّفَ عَنِ المَسأَلَةِ: «اليَدُ العُلْيَا خَيْرٌ مِنَ اليَدِ السُّفْلَى. وَاليَدُ العُلْيَا هِيَ المُنفِقَةُ، وَالسُّفْلَى هِيَ السَّائِلَةُ» متفقٌ عليه.

పైచెయ్యి ఖర్చుపెట్టే చెయ్యి. క్రింది చెయ్యి అర్థించే చెయ్యి.

(బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జకాత్ ప్రకరణాలు)*

٥٣٢ ـ وعن أبى هُريرة رضىَ الله عنه قَال: قَال رسُولُ الله ﷺ: «مَنْ سَأَلَ النَّاسَ تَكَثُّرًا فَإِنَّمَا يَسْأَلُ جَمْرًا، فَلْيَسْتَقِلَّ أَوْ لِيَسْتَكْثِرْ» رواه مسلم.

532. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ధనాన్ని కూడబెట్టే ఉద్దేశ్యంతో అడుక్కునేవాడు వాస్తవానికి అగ్నిజ్వాలల్ని కోరుకుంటున్నాడు. కనుక అతను ఎక్కువ అడుక్కోవచ్చు లేదా తక్కువ అడుక్కోవచ్చు. (అది అతని యిష్టం). (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

అవసరం లేకపోయినా ఇతరుల ముందు చేయి చాపి అడుక్కోవటం ఎంత పెద్ద పాపమంటే ఆ విధంగా మనిషి తన్ను తాను నరకజ్వాలలకు గురిచేసుకుంటాడు. కాని శోచనీయమైన విషయం ఏమిటంటే ఏ మతంలోనయితే ముష్టెత్తుకోవటాన్ని ఇంత ఘోరమైన పాపంగా పరిగణిం చబడిందో ఆ మతావలంబీకుల్లోనే ఈ రుగ్మత సర్వసామాన్యంగా ఉంది. ఇస్లామీయ బోధనల పట్ల ముస్లింల ఈ ఏమరుపాటుతనం, ఈ నిర్లక్ష్యవైఖరి ఎంతైనా తూలనాడదగినదే.

٥٣٣ ـ وعن سَمُرَةَ بن جُنْدب رضىَ اللهُ عنه قَال: قَال رسُولُ الله ﷺ: «إنَّ المَسْأَلَةَ كَدٌّ يَكُدُّ بها الرَّجُلُ وَجْهَهُ، إلاَّ أنْ يَسْأَلَ الرَّجُلُ سُلْطَانًا أوْ فى أمْرٍ لاَبُدَّ مِنْهُ» رواه الترمذى وقال: حديث حسن صحيح. «الكَدُّ»: الخدشُ ونحوه.

533. హజ్రత్ సమురా బిన్ జుందుబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : భిక్షాటన ఒక గాయం లాంటిది. మనిషి భిక్షాటన చేసి తన ముఖాన్ని గాయపరచుకొంటాడు. అయితే (తన హక్కు ఇవ్వమని) అధికారిని అడగటం లేదా గత్యంతరం లేని పరిస్థితిలో అడుక్కోవటం మాత్రం (గాయపరచుకునే భిక్షాటనల క్రిందికి రావు).

*(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్, సహీహ్‌గా పేర్కొన్నారు.)*

534. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఎవరికయినా పస్తులు ఎదురయినప్పుడు తన పస్తుల గురించి ప్రజల ముందు వెళ్ళబుచ్చుకుంటే అతని పస్తులు తీరవు. దానికి బదులు దేవుని ముందు వెళ్ళబుచ్చుకుంటే దేవుడు త్వరగాగాని లేదా ఆలస్యంగా గాని అతనికి ఉపాధిని ప్రసాదిస్తాడు. (దీనిని అబూదావూద్, తిర్మిజీలు ఉల్లేఖించారు. ఇంకా తిర్మిజీ దీనిని 'హసన్'గా పేర్కొన్నారు).

٥٣٤ ـ وعن ابن مسعود رضيَ اللهُ عنه قَال: قَال رسُولُ اللهِ ﷺ: «مَنْ أَصابَتْهُ فَاقَةٌ فَأَنْزَلَهَا بِالنَّاسِ لَمْ تُسَدَّ فاقَتُهُ، وَمَنْ أَنْزَلَهَا بِاللهِ، فَيُوشِكُ اللهُ لَهُ بِرِزْقٍ عاجِلٍ أَوْ آجِلٍ» رواه أبوداود، والترمذي وقال: حديث حسن.
«يُوشِكُ» بكسر الشين: أي يُسْرِعُ.

*(సునవె అబూదావూద్‌లోని జకాత్ ప్రకరణం, సునవె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

1. అందరి అవసరాలనూ తీర్చేవాడు అల్లాహ్ ఒక్కడే. కనుక ఆపదలు, అవసరాలు ఎదురైనప్పుడు ఆయనవైపుకే మరలాలి.
2. అయితే భౌతిక కారణాల దృష్ట్యా, అవసరం మేరకు మనుషుల్ని కూడా అర్థించవచ్చు. కాని అప్పుడు కూడా మనసులో 'దేవుడు తలచుకుంటేనే ఈ మనిషి ఇస్తాడు, లేకపోతే ఇవ్వలేడు' అని గట్టి నమ్మకముండాలి.

535. హజ్రత్ సౌబాన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఒకసారి ప్రజలతో మాట్లాడుతూ "ప్రజల దగ్గర అడుక్కోనని ఎవరయినా నాకు పూచీ ఇస్తే నేనతనికి స్వర్గం ప్రాప్తించే విషయంలో పూచీ వహిస్తాను" అని అన్నారు. అప్పుడు నేను దైవప్రవక్తతో "నేను పూచీ ఇస్తున్నాను" అని చెప్పాను.

٥٣٥ ـ وعَنْ ثَوْبانَ رضيَ اللهُ عنه قال: قال رسُولُ اللهِ ﷺ: «مَنْ تَكَفَّلَ لي أَنْ لَا يَسْأَلَ النَّاسَ شَيْئاً، وأَتَكَفَّلُ له بالجَنَّةِ؟» فقلتُ: أنا؛ فَكانَ لَا يَسْأَلُ أَحَداً شَيْئاً. رواه أبو داود بإسنادٍ صحيحٍ.

ఆ తరువాత నుంచి సౌబాన్ (రజి) ప్రజల దగ్గర నుండి ఏ వస్తువూ అడిగేవారు కాదు.

*(అబూ దావూద్ దీనిని ప్రామాణికమైన ఆధారంతో వెలికి తీశారు.)*

*(సుననె అబూదావూద్‌లోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రజల దగ్గర అడుక్కోకూడదంటే అనవసరంగా అడగకూడదని అని అర్థం. అవసరం వచ్చినప్పుడు అడగటంలో తప్పులేదు. కాని అలాంటి పరిస్థితుల్లో కూడా ఎవరి ముందూ చేయి చాపకుండా ఉండటం ఉత్తమ గుణం. హదీసులో సౌబాన్ (రజి) తర్వాతి కాలంలో ఈ గుణాన్నే అలవరచుకున్నారు. ఆయన గురించి ఇబ్నెమాజా గ్రంథంలో చెప్పబడింది. గుర్రం మీద ఎక్కి ఉన్నప్పుడు తన చేతిలో నుంచి కొరడా గనక జారిపోతే దాన్ని అందివ్వమని కూడా ఆయన అడిగేవారు కారట. తను స్వయంగా గుర్రం దిగి కొరడా ఎత్తుకునేవారట.

٥٣٦ - وعن أبي بِشْرٍ قَبِيصَةَ بن المُخَارِق رضيَ اللهُ عنه قال: تَحَمَّلْتُ حَمَالَةً فَأَتَيْتُ رَسُولَ اللهِ ﷺ أَسْأَلُهُ فيها، فقال: «أَقِمْ حَتى تَأتِيَنا الصَّدَقَةُ فَنَأمُرَ لكَ بها» ثُمَّ قالَ: «يا قَبِيصَةُ! إنَّ المَسأَلَةَ لاَ تَحِلُّ إلاَّ لأحَدِ ثَلاَثَةٍ: رَجُلٍ تَحَمَّلَ حَمالَةً، فَحَلَّتْ لَهُ المَسْأَلَةُ حتَّى يُصيبَها، ثُمَّ يُمْسِكُ. وَرَجُلٌ أَصابَتْهُ جَائِحَةٌ اجْتَاحَتْ مَالَهُ، فَحَلَّتْ لَهُ المَسألَةُ حتَّى

536. హజ్రత్ అబూ బిష్ర్ ఖబీసా బిన్ ముఖారిఖ్ (రజి) కథనం : నేను (ఇద్దరు వ్యక్తుల మధ్య గొడవను సద్దు మణచటం కోసం ధనం చెల్లించే) పూచీ వహించాను. ఆ తరువాత దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి ఈ విషయంలో నాకు సహాయం చెయ్యమని అర్థించాను. దానికి ఆయన, "కాస్సేపాగు, దానధర్మాలేమైనా వస్తే ఇప్పిస్తాను" అన్నారు.

ఆ తరువాత కాసేపటికి ఆయన నాతో ఇలా అన్నారు : "ఖబీసా! ముగ్గురికి తప్ప మరెవరికీ ఇతరుల దగ్గర ధనం అర్థించటం ధర్మసమ్మతం కాదు. వారిలో ఒకడు; (నీలాగా) పూచీ వహించిన వాడు. ఇలాంటి వ్యక్తి తన అవసరం మేరకు అర్థించవచ్చు. అవసరం తీరిన

يُصِيبَ قِوامًا مِنْ عَيْشٍ، أَوْ قَالَ: سِدادًا مِنْ عَيْشٍ، وَرَجُلٌ أَصَابَتْهُ فَاقَةٌ، حَتَّى يَقُولَ ثَلاَثَةٌ مِنْ ذَوِي الحِجَى مِنْ قَوْمِهِ: لَقَدْ أَصَابَتْ فُلاَنًا فَاقَةٌ، فَحَلَّتْ لَهُ الْمَسْأَلَةُ حَتَّى يُصِيبَ قِوامًا مِنْ عَيْشٍ، أَوْ قَالَ: سِدادًا مِنْ عَيْشٍ. فَمَا سِواهُنَّ مِنَ الْمَسْأَلَةِ يا قَبِيصَةُ! سُحْتٌ، يَأْكُلُهَا صاحِبُها سُحْتًا» رواهُ مسلم. «الحَمَالَةُ» بفتح الحاءِ: أَنْ يَقَعَ قِتَالٌ وَنَحْوُهُ بَيْنَ فَرِيقَيْنِ، فَيُصلِحُ إِنسانٌ بَيْنَهُمْ عَلى مالٍ يَتَحَمَّلُهُ وَيَلتَزِمُهُ عَلى نفسه. وَ«الجائِحَةُ» الآفَةُ تُصِيبُ مَالَ الإنسانِ وَ«القِوَامُ» بكسر القاف وفتحها: هُوَ مَا يقومُ بِهِ أَمْرُ الإِنسانِ مِنْ مَالٍ ونحوِهِ. وَ«السِّدادُ» بكسر السين: مَا يَسُدُّ حاجَةَ المُعْوِزِ وَيَكْفِيهِ. وَ«الفَاقَةُ»: الفَقْرُ. و«الحِجَى» العقلُ.

తరువాత అర్థించటం మానుకోవాలి. రెండోవ్యక్తి; ఏదైనా ఆపదలో చిక్కుకొని ధనాన్ని పోగొట్టుకున్నవాడు. ఇలాంటి వ్యక్తి తనకు జరుగుబాటు అయ్యేంత (లేదా) తన అవసరాలు తీరేటంత ధనాన్ని మాత్రమే అర్థించాలి. మూడో వ్యక్తి; పస్తులుండాల్సిన గతి పట్టినవాడు. అతన్ని ఎరిగినవాళ్ళలో ఎవరైనా ముగ్గురు ప్రాజ్ఞులు అతని పస్తు పరిస్థితిని గురించి ధృవీకరిస్తే అప్పుడు అతను కూడా తనకు జరుగుబాటు అయ్యేంత (లేదా) తన అవసరాలు తీరేటంత ధనం మాత్రమే అర్థించాలి. ఓ ఖబీసా! ఈ ముగ్గురు మినహా ఇతరులు ధనం అర్థించటం నిషిద్ధం. ఒకవేళ ఎవరైనా అలా అర్థిస్తే అతను నిషిద్ధవస్తువు తింటున్నాడని తెలుసు కోవాలి. *(ముస్లిం)*

ఇద్దరు వ్యక్తులు లేదా రెండు పక్షాల మధ్య ఏదైనా వ్యవహారంలో వివాదం జరిగినప్పుడు మూడోవ్యక్తి ఎవరైనా - వారి మధ్య ఒప్పందాన్ని కుదిర్చి, వారిలో ఒకరికి రెండోవ్యక్తి నుండి పైకం రావలసి ఉంటే, ఆ పైకం చెల్లించే విషయంలో తాను పూచీ వహించి -ఆ తరువాత రుణ గ్రహీత రుణం చెల్లించలేకపోయినప్పుడు మధ్యవర్తిగా ఉన్న వ్యక్తి తన పూచీని నిర్వర్తించటానికి ఇతరుల దగ్గర ధనం అర్థించవచ్చు. దీనినే 'హమాలా' అంటారు.

*(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

٥٣٧ ـ وَعن أبي هريرة رضيَ الله عنهُ أنَّ رسُولَ الله ﷺ قال: «لَيْسَ المِسْكِينُ الَّذي يَطُوفُ عَلَى النَّاسِ تَرُدُّهُ اللُّقْمَةُ وَاللُّقْمَتَانِ، وَالتَّمْرَةُ وَالتَّمْرَتَانِ، وَلكِنَّ المِسْكِينَ الَّذي لاَ يَجِدُ غِنًى يُغْنِيهِ، وَلاَ يُفْطَنُ لَهُ فَيُتَصَدَّقَ عَلَيْهِ، وَلاَ يَقُومُ فَيَسْأَلَ النَّاسَ» متفقٌ عليه.

537. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : ప్రజల దగ్గర ఒకటి రెండు ముద్దలు లేదా ఒకటి రెండు ఖర్జూర పండ్లు అడుక్కుంటూ తిరిగేవాడు నిరుపేద కాడు. సిసలైన నిరుపేద ఎవ రంటే, అతని దగ్గర ఇతరుల్ని యాచించ కుండా ఉండేందుకు తగిన ఆర్థిక స్తోమత ఉండదు. మరోవైపు ప్రజలు అతనికి దానం చేయాలన్నా అతను పేదవాడిగా కనిపించడు. (తాను ఎంత పేదరికంతో బాధపడుతున్న ప్పటికీ) ఇతరుల ముందు చేయి చాపటానికి సిద్ధపడడు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*



58వ అధ్యాయం

# ٥٨ - بَابُ جَوَازِ الأَخْذِ مِنْ غَيْرِ مَسْأَلَةٍ وَلاَ تَطَلُّعٍ إِلَيْهِ

# అర్థింపు, అత్యాశలు లేకుండా లభించే ధనాన్ని స్వీకరించటం ధర్మసమ్మతమే

٥٣٨ - عَنْ سالمِ بنِ عبدِ اللهِ بن عُمَرَ، عَنْ أبيهِ عبدِ اللهِ بنِ عُمَرَ، عَنْ عُمَرَ رضي اللهُ عنهم قال: كان رسولُ اللهِ ﷺ يُعْطِيني العَطَاءَ، فَأَقُولُ: أَعطهِ مَن هُوَ أَفقَرُ إِلَيهِ مِنِّي، فقال: «خُذْهُ؛ إِذَا جاءَكَ مِن هذا المَالِ شَيْءٌ، وَأَنتَ غَيرُ مُشْرِفٍ ولا سَائِلٍ، فَخُذْهُ فتَمَوَّلْهُ فَإن شِئتَ كُلْهُ، وإن شِئْتَ تَصَدَّقْ بِهِ، وَمَا لا، فَلا تُتبِعْهُ نَفْسَكَ» قال سَالمٌ: فَكَانَ عَبدُ الله لا يَسأَلُ أَحَداً شَيئاً، وَلا يَرُدُّ شَيئاً أُعطِيَهُ. متفقٌ عليه.

538. హ॥జత్ సాలిమ్ తన తండ్రి అబ్దుల్లాహ్ నుండి ఆయన తన తండ్రి ఉమర్ (రజి) నుండి చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) నాకేదయినా ఇచ్చి నప్పుడు నేను, "దీన్ని మీరు నాకంటే ఎక్కువ అవసరాల్లో ఉన్న వ్యక్తికి ఇవ్వండి" అనేవాడ్ని. దానికాయన, "ఫర్వాలేదు తీసుకో. నువ్వు అత్యాశకు పోకుండా, అర్థించకుండా ఉన్నప్పుడు నీకు ఈ ధనం గనక లభిస్తే దాన్ని తీసు కొని నీ సంపదలో కలుపుకో. ఇక ఆ తరువాత దాన్ని అనుభవించనయినా అనుభవించు, లేదా ఇతరులకు దానంగానయినా ఇవ్వు. అది నీ యిష్టం. అయితే ఆ విధంగా లభించని ధనం వెంట మాత్రం పడకు" అని ఉపదేశిం చేవారు.

సాలిమ్ అంటున్నారు : అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ ఎవరి దగ్గరా ఏ వస్తువూ అడిగే వారు కారు. అయితే (అర్థించకుండానే) ఎవరైనా ఏదైనా ఇస్తే దాన్ని నిరాకరించే వారు కూడా కారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జకాత్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

పై హదీసులో మొదటగా దైవప్రవక్త సహచరుల త్యాగభావం వివరించబడింది. వారు ఎల్లప్పుడూ తమకంటే ఎక్కువ అవసరాల్లో ఉన్నవారికి సహాయపడుతూ ఉండేవారు. రెండో విషయం, కానుకలు స్వీకరించవచ్చు. అయితే దానికి సంబంధించి మనసులో ముందుగానే ఆశ ఉండకూడదు. మూడో విషయం, తన అవసరాల కోసం, తన ఆలుబిడ్డల అవసరాలను తీర్చటం కోసం, ఇతర అవసరార్థుల అవసరాలు తీర్చి దేవుడు ఇష్టపడే మార్గాల్లో ఖర్చుపెట్టి దైవప్రసన్నతను బడసే ఉద్దేశ్యంతో ధనం కూడబెట్టుకోవచ్చు.



59వ అధ్యాయం

## ٥٩ - بَابُ الْحَثِّ عَلَى الأكْلِ مِنْ عَمَلِ يَدِهِ وَالتَّعَفُّفِ بِهِ عَنِ السُّؤَالِ وَالتَّعَرُّضِ لِلإعْطَاءِ

# చెమటోడ్చి డబ్బు సంపాదించి, తన స్వయాన్ని పోషించుకోవటంతోపాటు ఇతరులకు కూడా సహాయం చేయటం ఉత్తమ కార్యం

قال الله تعالى: ﴿فَإِذَا قُضِيَتِ ٱلصَّلَوٰةُ فَٱنتَشِرُوا۟ فِى ٱلْأَرْضِ وَٱبْتَغُوا۟ مِن فَضْلِ ٱللَّهِ﴾ [الجمعة: ١٠].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:
"విశ్వాసులారా! నమాజు ముగిసిన తరువాత భూమిపై వ్యాపించండి, అల్లాహ్ అనుగ్రహాన్ని అన్వేషించండి." *(అల్ జుముఅహ్ : 10)*

**వివరణ :**

ఇక్కడ అల్లాహ్ అనుగ్రహమంటే ఉపాధి అని అర్థం. అంటే నమాజు ముగిసిన తరువాత వెంటనే తిరిగి బ్రతుకుతెరువుకు మార్గాలను అన్వేషించమని పై సూక్తికి భావం. ఈ వాక్యం మనిషి కష్టపడి పని చేయాలని ప్రబోధిస్తోంది. మనిషి ఏదైనా వ్యాపారంగాని, ఉద్యోగంగాని చేసి కష్టపడి డబ్బు సంపాదించుకుంటే అతనికి ఇతరుల ముందు చేయిచాపి అడుక్కోవాల్సిన అగత్యం ఉండదు. పైగా తనే నలుగురికి సహాయం చేయగల స్థాయికి ఎదుగుతాడు.

٥٣٩ - عن أبي عبدِ الله الزُّبَيْرِ بن العوَّام رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «لأَنْ يَأْخُذَ أَحَدُكُمْ أَحبُلَهُ

539. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ బిన్ అవ్వామ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : ప్రజల ముందు ముష్టెత్తడంకన్నా తాడు తీసుకొని కొండపైకెళ్ళి వీపుమీద కట్టెలమోపు తీసుకొచ్చి అమ్ముకొని డబ్బు సంపాదించుకోవటం మేలు. పైగా అలా చేస్తే

ثُمَّ يَأْتِيَ الجَبَلَ، فَيَأْتِيَ بِحُزْمَةٍ مِنْ حَطَبٍ عَلَى ظَهْرِهِ فَيَبِيعَهَا، فَيَكُفَّ اللهُ بِهَا وَجْهَهُ، خَيْرٌ لَهُ مِنْ أَنْ يَسْأَلَ النَّاسَ، أَعطَوْهُ أَوْ مَنَعُوهُ» رواه البخاري.

దేవుడు అతని ఆత్మాభిమానాన్ని కాపాడ తాడు. అదే (ప్రజల దగ్గర అడుక్కుంటే) వారు ఇవ్వొచ్చు, ఇవ్వకపోవచ్చు.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జకాత్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ముష్టెత్తుకోవటం కంటే కష్టపడి డబ్బు సంపాదించటం అన్నివిధాలా మేలైనదని ఈ హదీసులో చెప్పబడింది. ఒక వృత్తి ప్రజల దృష్టిలో ఎంతటి నీచమైనదైనా సరే ఇంకొకరి ముందు చేయిచాపటం కన్నా అది ఎంతో గౌరవప్రదమైనది. అందులోనే మనిషి ఆత్మగౌరవం దెబ్బతినకుండా ఉంటుంది. అలాగాకుండా ఇతరులను అడుక్కుంటూ తిరిగితే ఎన్నో అవమానాలు ఎదుర్కోవలసివస్తుంది. మొత్తానికి చెప్పొచ్చేదేమిటంటే ఇస్లాం ధర్మం మనిషిని అవమానకర జీవితం నుంచి వెలికితీసి గౌరవప్రదమైన జీవితపు బాటలో నడిపిస్తుంది.

٥٤٠ ـ وعن أبي هُريرةَ رضي الله عنه قالَ: قالَ رسولُ الله ﷺ: «لأَنْ يَحتَطِبَ أَحَدُكُم حُزمَةً عَلى ظهرِه، خَيْرٌ لَهُ من أَنْ يَسأَلَ أَحداً، فَيُعْطِيَهُ أَو يَمْنَعَهُ» متفقٌ عليه.

540. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీరు ఇంకొకడి దగ్గర అడుక్కోవటం కన్నా వీపుమీద ఓ కట్టెల మోపు ఎత్తుకొని వచ్చి దాన్ని అమ్మగా వచ్చిన డబ్బుతో అవసరాలు తీర్చుకో వటం మేలు. ఎందుకంటే ఇంకొకడ్ని అడిగితే అతను ఇవ్వొచ్చు. ఇవ్వకపో వచ్చు (ఇవ్వని పక్షంలో మీరు అవమానం పాలౌతారు).

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జకాత్ ప్రకరణాలు)*

٥٤١ ـ وعنه عنِ النَّبِيِّ ﷺ قال: «كانَ دَاوُدُ عليهِ السَّلامُ لا يَأْكُل إلَّا مِن عَمَلِ يَدِهِ» رواه البخاري.

541. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : హజ్రత్ దావూద్ అలైహిస్సలాం చేతి కష్టార్జితం తినేవారు.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని వాణిజ్య ప్రకరణం)*

542. హ|జ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : జకరియ్యా అలైహిస్సలాం వడ్రంగి పని చేసేవారు. (ముస్లిం)

٥٤٢ ـ وعنه أنَّ رسولَ اللهِ ﷺ قال: «كانَ زَكَرِيَّا عليه السلامُ نجَّاراً» رواه مسلم.

(సహీహ్ ముస్లింలో ఘనతా విశిష్టతల ప్రకరణం)

543. హ|జ్రత్ మిఖ్‌దాద్ బిన్ మాదీకరిబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : స్వహస్తాలతో సంపాదించే సంపాదన కన్నా పవిత్రమైన సంపాదన తినేవాడు మరెవడూ లేడు. దేవుని ప్రవక్త అయిన దావూద్ (అలైహి) స్వహస్తాలతో సంపాదించి తినేవారు. (బుఖారీ)

٥٤٣ ـ وعن المِقدَام بنِ مَعْدِيكَرِبَ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «مَا أَكَلَ أَحَدٌ طَعَاماً قَطُّ خَيْراً مِن أَن يَأْكُلَ مِن عَمَلِ يَدِهِ، وَإِنَّ نبيَّ اللهِ دَاوُدَ ﷺ كان يَأْكُلُ مِن عَمَلِ يَدِهِ» رواه البخاري.

(సహీహ్ బుఖారీ వాణిజ్య ప్రకరణం)

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన అన్ని హదీసుల సారాంశం ఒక్కటే. మనిషి ఇతరులపై ఆధారపడకుండా తన కష్టార్జితంతో జీవితం గడపాలి. ప్రజల ముందు దేబిరిస్తూ తిరగటం వల్ల, ముష్టెత్తి అడుక్కోవటం వల్ల, అతని ఆత్మాభిమానం దెబ్బతింటుంది. నలుగురిలో అవమానానికి గురికావాల్సి వస్తుంది. అంచేత ప్రతి మనిషీ కష్టపడి పనిచేసి డబ్బు సంపాదించాలి. పూర్వకాలంలో దైవప్రవక్తలు కూడా కాయకష్టం చేసి డబ్బు సంపాదించేవారు. కష్టార్జితంగా వచ్చిన ధనాన్ని పవిత్రమైనదిగా భావించేవారు. బ్రతుకు తెరువు కోసం భౌతిక వనరులపై ఆధారపడటం దైవ విశ్వాసానికి విరుద్ధం కాదని దీనిద్వారా తెలుస్తోంది. ముందు జీవనోపాధి కోసం మార్గాలు అన్వేషించాలి. ఆపై దాని ఫలితం విషయంలో మాత్రం దేవుణ్ణే నమ్ముకోవాలి. అదే నిజమైన విశ్వాసం, నమ్మకం.

పై హదీసుల ద్వారా బోధపడే మరో ముఖ్య విషయం ఏమిటంటే ఏ వృత్తినీ, ఉపాధినీ అల్పమైనదిగా భావించకూడదు. స్వభావపరంగా సమాజంలోని ఏ వృత్తీ నీచమైనది, అంటరానిది కాదు. అలాంటప్పుడు వృత్తుల ప్రాతిపదికపై మానవ సమాజాన్ని వర్గాలుగా, వర్ణాలుగా విభజించి కొందరిని జన్మతా అల్పులుగా, అధములుగా జమకట్టడం, మరికొందరికి లేనిపోని పవిత్రతను అంటగట్టటం అమానుషమైన వైఖరి అనిపించుకుంటుంది. కాయకష్టం చేసేవారు వాస్తవానికి దైవప్రవక్తల వృత్తుల్ని, విధానాల్ని అనుసరిస్తున్నారు. కాబట్టి సమాజంలో అందరిలాగే వారికి కూడా సముచితమైన స్థాయి, గౌరవమర్యాదలు లభించాలి.

## 60వ అధ్యాయం

# ٦٠ - بَابُ الْكَرَمِ وَالْجُودِ وَالإِنْفَاقِ فِي وُجُوهِ الْخَيْرِ ثِقَةً بِاللهِ تَعَالَى

# దాతృత్వం, ఔదార్యం, దైవప్రసన్నతా దృష్టితో మంచిపనుల కోసం ధనం ఖర్చుపెట్టటం

قال الله تعالى: ﴿وَمَآ أَنفَقْتُم مِّن شَىْءٍ فَهُوَ يُخْلِفُهُۥ﴾ [سبأ: ٣٩] وقال تعالى: ﴿وَمَا تُنفِقُوا۟ مِنْ خَيْرٍ فَلِأَنفُسِكُمْ وَمَا تُنفِقُونَ إِلَّا ٱبْتِغَآءَ وَجْهِ ٱللَّهِ وَمَا تُنفِقُوا۟ مِنْ خَيْرٍ يُوَفَّ إِلَيْكُمْ وَأَنتُمْ لَا تُظْلَمُونَ﴾ [البقرة: ٢٧٢] وقال تعالى: ﴿وَمَا تُنفِقُوا۟ مِنْ خَيْرٍ فَإِنَّ ٱللَّهَ بِهِۦ عَلِيمٌ﴾ [البقرة: ٢٧٣].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : "మీరు దేనిని ఖర్చుపెట్టినప్పటికీ దాని స్థానంలో ఆయనే మీకు మరింత ఇస్తాడు." *(సబా : 39)*

మరోచోట ఆయన ఇలా అంటున్నాడు : "మంచి మార్గంలో మీరు ఖర్చుచేసే ధనం మీకే మేలు చేకూరుస్తుంది. అసలు మీరు ఖర్చుచేసేది అల్లాహ్ సంతోషం పొందటానికేగా! కనుక మంచిమార్గంలో మీరు ఏమి ఖర్చు చేసినా, దాని ప్రతిఫలం మీకు పూర్తిగా లభిస్తుంది. మీకు అన్యాయం ఎంతమాత్రం జరగదు." *(అల్ బఖరా : 272)*

"మీరు మంచికోసం ఏమి ఖర్చుచేసినా అది అల్లాహ్‌కు తెలియకుండా ఉండదు." *(అల్ బఖర : 273)*

## వివరణ

పై సూక్తుల్లో ఖర్చుపెట్టడమంటే మంచిపనుల కోసం, ధర్మసమ్మతమైన మార్గాల్లో ఖర్చుపెట్టడమని అర్థం. ఆ విధంగా ఖర్చుచేసిన ధనం వృధా పోదు. పైగా ఇహపరాల్లోనూ దేవుడు దానికి మంచిప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు. అయితే ఇతరుల్ని చూపించటం కోసమో లేక సమాజంలో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకోవచ్చన్న ఉద్దేశ్యంతోనో ధనం ఖర్చుచేస్తే దానివల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదు. పైగా అది దైవాగ్రహానికి, దైవశిక్షకు కారణభూతం కావచ్చు. కనుక దానధర్మాలు చేసినప్పుడు కేవలం దైవప్రసన్నతనే దృష్టిలో పెట్టుకొని చెయ్యాలి. మంచి ఉద్దేశ్యంతో చేసేదానం ఎంత తక్కువ పరిమాణంలో ఉన్నాసరే దేవుడు దానిని స్వీకరించి దానికి ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు.

544. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : ఇద్దరు వ్యక్తుల పట్ల తప్ప మరెవరి పట్లా అసూయ చెందటం ధర్మ సమ్మతం కాదు. వారిలో ఒకడు, దేవుడు సిరిసంపదలు ప్రసాదించటంతోపాటు వాటిని మంచిమార్గంలో ఖర్చుపెట్టే సద్బుద్ధిని ప్రసాదించినవాడు. రెండో వాడు, దేవుడు విజ్ఞతను ప్రసాదిస్తే దాని ద్వారా నిర్ణయాలు తీసుకుంటూ, ఆ విజ్ఞతను ఇతరులకు కూడా బోధించేవాడు.

*(బుఖారీ - ముస్లిం)*

٥٤٤ ـ وعَنِ ابن مسعودٍ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «لا حَسَدَ إلَّا في اثنتَينِ: رَجُلٌ آتاهُ اللهُ مَالًا، فَسَلَّطَهُ عَلى هَلَكَتِهِ في الحَقِّ، وَرَجُلٌ آتاه اللهُ حِكْمَةً، فَهُوَ يَقْضِي بِهَا وَيُعَلِّمُهَا» متفقٌ عليه.

معناه: يَنبَغِي أَن لا يُغبَطَ أَحَدٌ إلَّا على إحدَى هَاتَينِ الخَصْلَتَينِ.

*(సహీహ్ బుఖారీలోని విద్యా ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

అసూయ అనేది ఓ ప్రాణాంతక మానసిక రుగ్మత. అది మనిషి మనశ్శాంతిని హరించివేసి హృదయంలో అలజడిని రేపుతుంది. దేవుడు ఎవరికయినా ఏదైనా వరాన్ని ప్రసాదిస్తే అసూయాపరుడు దాన్ని చూసి లోలోనే ఉడికిపోతాడు, ఇతరుల నుండి ఆ వస్తువు తొలగిపోవాలని, నాశనమయిపోవాలని కోరుకుంటాడు. ఈ అసూయలోనే 'గిబ్‌తా' అనే ఇంకో రకమైన అసూయ ఉంది. దాన్ని మనం తెలుగులో 'మాత్సర్యం' అని చెప్పవచ్చు. దేవుడు ఇతరులకేదయినా అనుగ్రహిస్తే దాన్ని చూసి సంతోషించి, దేవుడు తనకు కూడా ఆ భాగ్యాన్ని ప్రసాదించాలని కోరుకోవటాన్ని 'మాత్సర్యం' అంటారు. మాత్సర్యం ధర్మసమ్మతమేగాని మొదటిరకమైన అసూయ మాత్రం ధర్మసమ్మతం కాదు.

545. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఒకసారి తన సహచరులతో, మాట్లాడుతూ, "మీలో తన ధనం కన్నా తన వారసుని ధనాన్ని ఎక్కువగా యిష్టపడేవాళ్ళెవరైనా ఉన్నారా?" అని అడిగారు. "మాలో ప్రతి ఒక్కడికీ తన ధనమంటేనే ఎక్కువ యిష్టం దైవప్రవక్తా!" అని విన్న

٥٤٥ ـ وعنه قال: قال رسولُ اللهِ ﷺ: «أَيُّكُم مَالُ وَارِثِهِ أَحَبُّ إليه مِن مَالِه؟» قالُوا: يا رَسولَ اللهِ! مَا مِنَّا أَحَدٌ إلَّا مَالُه أَحَبُّ إليه. قال: «فإنَّ مَالَه ما قدَّمَ وَمَالَ وَارِثِهِ ما أَخَّرَ» رواه البخاري.

వించుకున్నారు సహచరులు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) "మనిషి (దాన ధర్మాలు చేసి) ముందుకి పంపించుకున్నదే అతని ధనం. ఆ తరువాత అతను వదలిపెట్టిపోయే ధనమంతా అతని వారసులదే!" అని అన్నారు.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషి తాను ఎక్కువగా యిష్టపడే ధనాన్ని దైవాజ్ఞలకు అనుగుణంగా, ఆయన యిష్టపడే పనుల కోసం ఖర్చుపెట్టినప్పుడే అది అతని ధనం అనిపించుకుంటుంది. ఆ ధనమే పరలోకంలో అతనికి లాభం చేకూర్చగలుగుతుంది. మిగతా ధనంలో తాను ప్రపంచంలో తిని అనుభవించిన ధనం ప్రపంచంలోనే వృథా అయిపోతుంది. చనిపోయినప్పుడు వదలిపెట్టిపోయే ధనం వారసుల పరం అయిపోతుంది. దానివల్ల అతనికి ఎలాంటి ప్రయోజనం ఉండదు. అంచేత మనిషి తన దగ్గరున్న ధనాన్ని వీలైనంత ఎక్కువగా దానధర్మాలు చేసి తన స్వంత ధనంగా మార్చుకోవటానికి ప్రయత్నిస్తూ ఉండాలి.

٥٤٦ ـ وعَن عَدِيِّ بنِ حاتم رضي الله عنه أنَّ رسولَ اللهِ ﷺ قال: «اتَّقُوا النَّارَ وَلَوْ بِشِقِّ تَمْرَةٍ» متفقٌ عليه.

546. హజ్రత్ అదీ బిన్ హాతిం (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు : "ఒక ఖర్జూరపండు ముక్కను దానం చేసైనా సరే మిమ్మల్ని మీరు నరకాగ్ని బారి నుండి కాపాడుకోండి." *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

٥٤٧ ـ وعن جابرٍ رضي الله عنه قال: ما سُئِلَ رسولُ اللهِ ﷺ شَيْئاً قَطُّ فقالَ: لا. متفقٌ عليه.

547. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం)ను ఏదైనా వస్తువు అడిగినప్పుడు ఆయన 'లేదు' అని ఎన్నడూ అనలేదు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్టతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు దైవప్రవక్త(సల్లం)గారి అసామాన్య దాతృగుణానికి అద్దం పడుతోంది. ఆయన ఏనాడూ అడిగిన వారికి లేదని జవాబు చెప్పలేదు. తన దగ్గరుంటే ఇచ్చేసేవారు. లేకపోతే అప్పు తీసుకొని అయినా ఇచ్చేవారు. అదీ కానప్పుడు ఇస్తానని వాగ్దానం చేసేవారు. కాని లేదని మాత్రం చెప్పేవారు కాదు.

٥٤٨ ـ وعن أبي هُريرةَ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مَا مِن يَوْمٍ يُصْبِحُ العِبَادُ فِيْهِ إلَّا مَلَكَانِ يَنْزِلانِ، فَيَقُولُ أَحَدُهُمَا: اللَّهُمَّ أَعْطِ مُنْفِقاً خَلَفاً، وَيَقُولُ الآخَرُ: اللَّهُمَّ أَعْطِ مُمْسِكاً تَلَفاً» متفقٌ عليه.

548. హజ్రత్ అబూహురైరా (రజి) చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : ప్రతిరోజూ ఇద్దరు దైవ దూతలు దిగివస్తారు. వారిలో ఒకదూత, "దేవా! ఖర్చుపెట్టేవాడికి ప్రతిఫలాన్ని ప్రసాదించు" అని ప్రార్థిస్తే, రెండో దూత, "దేవా! కూడబెట్టుకునే వాడి సంపదను నాశనం చెయ్యి" అని ప్రార్థిస్తూ ఉంటాడు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

٥٤٩ ـ وعنه أنَّ رسولَ اللهِ ﷺ قال: «قَالَ اللهُ تعالى: أنفِقْ يَا ابْنَ آدَمَ يُنْفَقْ عَلَيْكَ» متفقٌ عليه.

549. హజ్రత్ అబూహురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దేవుడు ఇలా అంటున్నాడని దైవప్రవక్త (సల్లం) తెలియజేశారు : "ఆదం పుత్రుడా! ఖర్చు పెట్టు, నీపై కూడా ఖర్చుపెట్టడం జరుగుతుంది." *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వ్యాఖ్యానాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

٥٥٠ ـ وعنْ عبد الله بن عَمْرو بن العَاص رضي الله عنهما أَنَّ رَجُلاً سَأَلَ رسولَ الله ﷺ: أَيُّ الإسْلام خَيْرٌ؟ قال: «تُطْعِمُ الطَّعَامَ، وَتَقْرَأُ السَّلامَ عَلى مَنْ عَرَفْتَ وَمَنْ لَمْ تَعْرِفْ» متفقٌ عليه.

550. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)ను, "ఇస్లాంలో అన్నిటికన్నా శ్రేష్ఠమైన ఆచరణ ఏది?" అని అడిగాడు. దానికి ఆయన "ప్రజలకు అన్నం తినిపించు, పరిచయమున్నా లేకపోయినా,

ప్రతి వ్యక్తికీ సలాం చెయ్యి. (ఇవే ఇస్లాంలో అన్నిటికన్నా శ్రేష్ఠమైన ఆచరణలు)" అని చెప్పారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని విశ్వాస ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

బీదసాదలకు అన్నదానం చేయటం, అతిథి అభ్యాగతులకు భోజన సదుపాయాలు సమకూర్చటం మొదలగునవన్నీ ప్రజలకు అన్నం తినిపించటం క్రిందికే వస్తాయి. అలాగే అవసరాల్లో ఉన్న వ్యక్తి అవసరం తీర్చడం, ఆకలిగొన్న వాడికి అన్నంపెట్టడం, బట్టలు లేనివారికి బట్టలు తొడిగించటం, అనారోగ్యంతో బాధపడుతున్న వారికి చికిత్సనందించటం, రుణగ్రస్తుని రుణభారాన్ని తగ్గించటం మొదలైన ప్రజోపయోగ కార్యకలాపాలన్నీ ఈ హదీసు భావపరిధిలోకి వస్తాయి.

٥٥١ ـ وعنـــه قـــال: قـــالَ رسولُ الله ﷺ: «أَرْبَعُونَ خَصْلَةً أَعلاهَا مَنِيحَةُ العَنْزِ ما مِن عَامِلٍ يَعْمَلُ بِخَصْلَةٍ مِنهَا رَجَاءَ ثَوَابِها وَتَصْدِيقَ مَوْعُودِهَا إِلَّا أَدْخَلَهُ اللهُ تعالى بهَا الجَنَّةَ» رواه البخاري.

551. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు: నలభై (సత్) గుణాలున్నాయి. వాటిలో అత్యుత్తమమైన గుణం మేకపాలను ఇతరులకు కానుకగా ఇచ్చివేయటం. ఏ సదాచార సంపన్నుడయినా పుణ్యఫలాపేక్షతో, దేవుని వాగ్దానాన్ని ధృవీకరిస్తూ వాటిలోని ఏ ఒక్క సద్గుణాన్ని ఆచరించినా దేవుడు తప్పకుండా అతనికి స్వర్గంలో ప్రవేశం కల్పిస్తాడు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని కానుకల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో 'మనీహ' అనే పదం వాడబడింది. మనీహా అంటే కానుకగా ఇవ్వబడిన పశువు. ఒకవ్యక్తి తన పశువును ఇతరులకెవరికైనా ఇచ్చి, దాని పాలను కానుకగా సేవించమని చెబుతాడు. కొంతకాలం తరువాత తిరిగి ఆ పశువును దాని యజమానికి వాపసు చేయవలసి ఉంటుంది. ఇది కూడా కానుకగానే పరిగణించబడుతుంది. ప్రజలు ఈ విధంగా

పరోపకారభావంతో పరస్పరం కానుకలు ఇచ్చిపుచ్చుకుంటూ ఉండాలి. దానివల్ల మనుషుల మధ్య ప్రేమానురాగాలు పెంపొందుతాయి.

552. హజ్రత్ అబూ ఉమామా సుదయ్ బిన్ అజ్‌లాన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఓ మనిషీ! నీ దగ్గర మిగిలిపోయిన ధనాన్ని నువ్వు ఖర్చుపెడితే అది నీకే మంచిది. దాన్ని నీ దగ్గర ఆపుకుంటే దానివల్ల నీకే నష్టం. అవసరాలకు సరిపోయేటంత ధనాన్ని కూడబెట్టుకున్న పక్షంలో నీవు నిందార్హుడివి కావు. ఖర్చు పెట్టేటప్పుడు నీపై ఆధారపడివున్న వారితోనే మొదలుపెట్టు. పైచేయి క్రింది చేయి కన్నా ఎంతో గొప్పది. (ముస్లిం)

٥٥٢ ـ وعن أبي أُمَامَةَ صُدَيِّ بن عَجْـلانَ رضـي الله عنـه قـال: قـالَ رسولُ الله ﷺ: «يَا ابْنَ آدَمَ! إِنَّكَ أَن تَبْذُلَ الفَضْلَ خَيْرٌ لَكَ، وَأَنْ تُمْسِكَهُ شَرٌّ لَكَ، وَلا تُلامُ عَلى كَفَافٍ، وَابْدَأْ بِمَنْ تَعُولُ، وَاليَدُ العُلْيَا خَيْرٌ مِنَ اليَدِ السُّفْلَى» رواه مسلم.

553. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవ ప్రవక్త (సల్లం)ను ఇస్లాం పేరుతో ఏదడిగినా ఆయన తప్పకుండా ఇచ్చే వారు. ఒక వ్యక్తి ఆయన దగ్గరికి వచ్చి (తనకు ధనం ఇవ్వమని) కోరగా ఆయన అతనికి రెండు కొండల మధ్య ఉన్న మేకలన్నీ ఇచ్చేశారు. ఆ వ్యక్తి తన జాతి వారి దగ్గరికి వెళ్ళి, "ఓ నా జాతి ప్రజలారా! ఇస్లాం స్వీకరించండి ముహమ్మద్ (సల్లం) పేదరికం గురించి భయపడని వానిలా ధనం ఇస్తారు" అని అన్నాడు.

నిజంగానే ఆ కాలంలో ప్రజలు ప్రాపంచిక సిరిసంపదల కోసం ఇస్లాం స్వీకరించేవారు. కాని అనతికాలంలోనే ఇస్లాం ధర్మం వారికి ప్రపంచంలోని ఇతర

٥٥٣ ـ وعن أنسٍ رضي الله عنه قال: مَا سُئِلَ رسولُ اللهِ ﷺ عَلَى الإسْلام شَيْئاً إِلَّا أَعْطاه، وَلَقَد جَاءَهُ رَجُلٌ، فَأَعْطَاهُ غَنَماً بَيْنَ جَبَلَيْنِ، فَرَجَعَ إِلى قَوْمِهِ فَقَالَ: يَا قَوْمِ! أَسْلِمُوا؛ فَإِنَّ مُحَمَّداً يُعْطِي عَطَاءَ مَنْ لَا يَخْشَى الفَقْرَ، وَإِنْ كَانَ الرَّجُلُ لَيُسْلِمُ مَا يُرِيدُ إِلَّا الدُّنْيَا، فَمَا يَلْبَثُ إِلَّا يَسِيراً حَتَّى يَكُونَ الإسْلامُ أَحَبَّ إِلَيْهِ مِنَ الدُّنْيَا وَمَا عَلَيْهَا. رواه مسلم.

వస్తువులన్నిటికన్నా ప్రీతికరమైనదిగా మారిపోయేది. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్ఠతల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

క్రొత్తగా ఇస్లాం స్వీకరించేవారిలో ఇస్లాం పట్ల అభిమానాన్ని పెంపొందించటానికి, వారిని ధర్మంపై నిలకడగా ఉంచే ఉద్దేశ్యంతో వారికి ధనం ఇవ్వటం ధర్మసమ్మతమేనని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. దీని ఫలితంగా ప్రారంభంలో ప్రజలు ధనానికాశపడి ఇస్లాం స్వీకరించినా ఆ తరువాత క్రమక్రమంగా వారిలో ఇస్లాం పట్ల అభిమానం పెంపొందుతుంది. అనతికాలంలోనే వారు నిజమైన, నికార్సయిన ముస్లింలుగా మారిపోతారు. బహుశా ఈ ఉద్దేశ్యంతోనే దివ్య ఖుర్ఆన్‌లో క్రొత్తగా ఇస్లాం స్వీకరించేవారికి జకాత్ సొమ్ము ఇవ్వవచ్చని చెప్పబడింది. హనఫీ ఫికహ్ పండితులు క్రొత్తగా ఇస్లాం స్వీకరించేవారికి జకాత్ ధనం ఇవ్వవచ్చనే ఆదేశం రద్దుచేయబడిందని అభిప్రాయపడుతున్నారు. కాని నిజం చెప్పాలంటే ఈ పద్దుక్రింద జకాత్ సొమ్ము ఖర్చుపెట్టడం ప్రళయం వరకూ ధర్మసమ్మతమే. నేడు కూడా దాని అవసరం ఉంది. క్రొత్తగా ఇస్లాం స్వీకరించేవారికి ధనసహాయం అందిస్తే ఈ రోజు కూడా మనం దాని సత్పరిణామాలను చూడగలం.

٥٥٤ ـ وعن عُمَرَ رضي الله عنه قال: قَسَمَ رسولُ اللهِ ﷺ قَسْماً، فقُلْتُ: يا رسولَ اللهِ! لَغَيْرُ هؤُلاءِ كَانُوا أَحَقَّ بِهِ مِنْهُم؟ قال: «إِنَّهُمْ خَيَّرُونِي أَنْ يَسْأَلُونِي بِالْفُحْشِ، أَوْ يُبَخِّلُونِي، وَلَسْتُ بِبَاخِلٍ» رواه مسلم.

554. హజ్రత్ ఉమర్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) కొంత ధనం (ప్రజలకు) పంచిపెట్టారు. అప్పుడు నేను, "దైవప్రవక్తా! ఈ ధనం తీసుకోవటానికి వీళ్ళకన్నా ఎక్కువ హక్కుదారులున్నారు కదా! (మీరు వీళ్ళకే ఎందుకిస్తున్నారు?)" అని అన్నాను. దానికాయన (సల్లం) "వీళ్ళు రెండు విధాలుగా నాపై ఒత్తిడి తీసుకువస్తున్నారు. ధనం ఇవ్వాల్సిందేనని గట్టిగా అడుగుతారు (అంచేత ఇవ్వాల్సివస్తోంది). లేదా నన్ను పిసినారి అంటారు. నిజానికి నేను ఎలాంటి పిసినారితనం చూపటం లేదు" అని చెప్పారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

అజ్ఞానులు, సంస్కారహీనులైన పల్లెటూరి మనుషులు క్రొత్తగా ఇస్లాం స్వీకరించినప్పుడు ప్రారంభంలో దైవప్రవక్త (సల్లం) పట్ల అనుచితంగా ప్రవర్తించేవారు. తమ మాటలతో, చేతలతో ఆయన మనసుకు బాధ కలిగించేవారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) వారిలో మార్పు వస్తుందన్న ఆశతో, వారు ఇస్లాం ధర్మంపై నిలకడగా ఉండి సభ్యతా సంస్కారాలు నేర్చుకుంటారన్న ఉద్దేశ్యంతో వారికి ఎంతోకొంత ధనమిచ్చి వారి హృదయాలను జయించటానికి ప్రయత్నించేవారు.

555. హజ్రత్ జుబైర్ బిన్ ముత్‌యిమ్ (రజి) కథనం ప్రకారం ఆయన దైవప్రవక్త (సల్లం)తో పాటు హునైన్ యుద్ధం నుండి తిరిగి వస్తుండగా (మధ్యలో ఒక చోట) కొంతమంది పల్లెటూరి మనుషులు దైవప్రవక్త (సల్లం)ను (ధనం ఇవ్వమని) వెంటబడి అడగసాగారు. ఆఖరికి వాళ్ళు ఆయన్ని బలవంతాన ఒక తుమ్మచెట్టు దగ్గరికి తీసుకొని వెళ్ళారు. అంతలో ఆయన దుప్పటి ముళ్ళల్లో చిక్కుకుంది. అప్పుడు ఆయన అక్కడే ఆగి, "దుప్పటన్నా ఇస్తారా? నా దగ్గర ఈ ముండ్ల చెట్లన్ని ఒంటెలుండి నట్లయితే నేను వాటన్నిటినీ మీకు పంచేసేవాణ్ణి, అప్పుడు నేను పిసినారిని, అబద్ధాలు చెప్పేవాడిని, పిరికివాడిని కానని మీరు తెలుసుకుంటారు" అని అన్నారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

٥٥٥ ـ وعـن جُبَيْـرِ بـن مُطْعِـمٍ رضيَ الله عنه أنه قال: بَيْنَمَا هُوَ يَسِيرُ مَعَ النَّبِيِّ ﷺ مَقْفَلَهُ مِن حُنَيْنٍ، فَعَلِقَهُ الأَعْرَابُ يَسْأَلُونَهُ، حَتَّى اضْطَرُّوهُ إلى سَمُرَةٍ، فَخَطِفَتْ رِدَاءَهُ، فَوَقَفَ النَّبِيُّ ﷺ فقال: «أَعْطوني رِدَائي، فَلَوْ كَانَ لي عَدَدُ هذِهِ العِضَاهِ نَعَماً، لَقَسَمْتُهُ بَيْنَكُمْ، ثُمَّ لا تَجِدُونِي بَخِيلاً وَلا كَذَّاباً وَلا جَبَاناً» رواه البخاري. «مَقْفَلَهُ» أيْ: حَالَ رُجُوعِهِ. وَ «السَّمُرَةُ»: شَجَرَةٌ. وَ «العِضَاهُ»: شَجَرٌ لَهُ شَوْكٌ.

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా ఒకటేమో క్రొత్తగా ఇస్లాం స్వీకరించినవారి మనసులను ఇస్లాం పట్ల సంతుష్టపరచటానికి ధనం ఖర్చుపెట్టవచ్చని తెలుస్తోంది. రెండోది ఇందులో దైవప్రవక్త సల్లల్లాహు అలైహి వ సల్లం గారి ఉత్తమ నడవడిక కూడా వివరించబడింది. పల్లెటూరి మనుషుల కరకు మాటలను, వారి దురుసు చేష్టలను ఎంతగానో సహించేవారు. ఈ హదీసు ద్వారా బోధపడే మూడో విషయం ఏమిటంటే - ప్రజలకు నాయకుడైన వాడిలో అబద్ధం, పిరికితనం, పిసినారి

తనం లాంటి అవలక్షణాలు ఉండకూడదు. అంతేకాదు, మూర్ఖుల అపార్థాలను దూరం చేయటం కోసం అవసరమైతే తమ ఉత్తమ వ్యవహారాన్ని, తమలోని మంచి గుణాలను వారి ముందు ప్రస్తావించవచ్చని కూడా ఈ హదీసు మనకు బోధపరుస్తోంది. ఆ విధంగా ప్రస్తావించటం గర్వం, ఆత్మస్తుతి క్రిందికి రాదు.

556. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : దానధర్మాలు సంపదలో లోటును ఏర్పరచవు. దేవుడు మన్నింపుల వైఖరిని అవలంబించే దాసుని గౌరవాన్ని మరింత పెంచుతాడు. ఎవరైనా దైవం కోసం అణకువను ప్రదర్శిస్తే దేవుడు అతనికి ఔన్నత్యాన్ని ప్రసాదిస్తాడు. (ముస్లిం)

٥٥٦ ـ وعن أبي هُريرةَ رضيَ اللهُ عنه أنَّ رسولَ اللهِ ﷺ قال: «مَا نَقَصَتْ صَدَقَةٌ مِنْ مَالٍ، وَمَا زَادَ اللهُ عَبْداً بِعَفْوٍ إلَّا عِزّاً، وَمَا تَوَاضَعَ أَحَدٌ للهِ إلَّا رَفَعَهُ اللهُ عَزَّ وَجَلَّ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. పై హదీసు దానధర్మాల వల్ల సంపదలో వెలితి రాదని చెబుతోంది. నిజమే.....! మనిషి దానం చేస్తే దేవుడు తతిమ్మా ధనంలో శుభాన్ని అవతరింపజేస్తాడు. కొన్నిసార్లు ఇహలోకంలోనే దానికి రెట్టింపు ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు. ఇక పరలోకంలో ఆ దానానికి ఎలాగూ పుణ్యం లభిస్తుంది. కనుక ఏ విధంగా చూసినా దానధర్మాల వల్ల మనిషి సంపదకు నష్టం లేదు.
2. తను మన్నింపుల వైఖరిని అవలంబిస్తే ప్రజలు తనను తక్కువగా అంచనా వేస్తారనీ, తనను బలహీనుడిగా తలపోస్తారని అనుకుంటాడు మనిషి. కాని దానికి భిన్నంగా ఈ హదీసులో దేవుడు అలాంటి వారికి ప్రజల్లో మరింత గౌరవ మర్యాదలను ప్రసాదిస్తాడని చెప్పబడింది. క్షమాగుణంతో వ్యవహరించేవారిని సాధారణంగా జనం గౌరవిస్తారు. అంతేకాదు పరలోకంలో కూడా అలాంటి వారికి గొప్ప పుణ్యఫలం లభిస్తుంది. ఆ విధంగా మనిషి అటు దైవం దృష్టిలోనూ, ఇటు జనం దృష్టిలోనూ గౌరవవంతునిగా భావించబడతాడు.

557. దైవప్రవక్త (సల్లం) ఇలా చెబుతుండగా తాను విన్నానని హజ్రత్ అబూ కబ్షా అమ్ర్ బిన్ సాద్ అన్మారీ (రజి) తెలియజేశారు : నేను మూడు విషయాల గురించి ప్రమాణం చేస్తున్నాను.

٥٥٧ ـ وعن أبي كَبْشَةَ عَمْرِو بْنِ سَعدٍ الأنماريِّ رضي الله عنه أنه سمعَ رسولَ اللهِ ﷺ يقُولُ: «ثَلاثَةٌ أُقْسِمُ عَلَيْهِنَّ وَأُحَدِّثُكُمْ حَدِيثاً فَاحْفَظُوهُ: مَا نَقَصَ مَالُ

عَبْدٍ مِنْ صَدَقَةٍ، وَلا ظُلِمَ عَبْدٌ مَظْلَمَةً صَبَرَ عَلَيْهَا إِلَّا زَادَهُ اللهُ عِزًّا، وَلا فَتَحَ عَبْدٌ بَابَ مَسْأَلَةٍ إِلَّا فَتَحَ اللهُ عَلَيْهِ بَابَ فَقْرٍ۔ أَوْ كَلِمَةً نَحْوَهَا ۔ وَأُحَدِّثُكُمْ حَدِيثاً فَاحْفَظُوهُ. قال: إِنَّمَا الدُّنْيَا لأَرْبَعَةِ نَفَرٍ: عَبدٍ رَزَقَهُ اللهُ مَالاً وَعِلْماً، فَهُوَ يَتَّقِي فِيهِ رَبَّهُ، وَيَصِلُ فِيهِ رَحِمَهُ، وَيَعْلَمُ لِلَّهِ فِيهِ حَقّاً، فَهٰذَا بِأَفْضَلِ المَنَازِلِ. وَعَبدٍ رَزَقَهُ اللهُ عِلْماً، وَلَمْ يَرْزُقْهُ مَالًا، فَهُوَ صَادِقُ النِّيَّةِ يَقُولُ: لَوْ أَنَّ لِي مَالًا لَعَمِلْتُ بِعَمَلِ فُلانٍ، فَهُوَ بِنِيَّتِهِ، فَأَجْرُهُمَا سَوَاءٌ. وَعَبْدٍ رَزَقَهُ اللهُ مَالاً، وَلَمْ يَرْزُقْهُ عِلْماً، فَهُوَ يَخْبِطُ فِي مَالِهِ بِغَيْرِ عِلْمٍ، لا يَتَّقِي فِيهِ رَبَّهُ، وَلا يَصِلُ فِيهِ

ఒక విషయం మీతో చెబుతున్నాను. దాన్ని మీరు గుర్తుంచుకోండి. దాన ధర్మాలు చేయటం వల్ల దాసుని సంపదలో లోటు ఏర్పడదు. దౌర్జన్యపీడితుడు సహనం వహిస్తే దేవుడు తప్పకుండా అతని గౌరవాన్ని ఇనుమడింపజేస్తాడు. భిక్షాటన మొదలెట్టే దాసుని కోసం దేవుడు దారిద్ర్య ద్వారాన్ని తెరుస్తాడు. (ఆయన దారిద్ర్యమో లేక ఇంకేదో అన్నారు). ఇంకో విషయం చెబుతున్నాను అది (కూడా) గుర్తుంచుకోండి. ప్రపంచంలో నాలుగు రకాల మనుషులున్నారు. మొదటిరకం మనుషులు : దేవుడు వీరికి సంపద, జ్ఞానాలు ప్రసాదిస్తే వీరు వాటి విషయంలో దైవానికి భయపడుతూ ఉంటారు. బంధువుల పట్ల ఉత్తమంగా వ్యవహరిస్తారు. ఇంకా తమ దగ్గరున్న సంపదలో దేవుని హక్కుని గుర్తిస్తారు. ఇలాంటి వారు స్వర్గంలో అత్యుత్తమ స్థానాల్లో ఉంటారు. రెండవ రకం మనుషులు : దేవుడు వీరికి జ్ఞానమైతే ఇచ్చాడు గాని సంపద ఇవ్వలేదు. ఉంటాడు. ఇలాంటివారు సత్సంకల్పంతో "మా దగ్గర గనక ధనముంటే మేము కూడా ఫలానా మనిషిలా దాన్ని (మంచిపనుల్లో) ఖర్చుపెట్టేవాళ్ళం" అని అంటారు. వాళ్ళకు ఈ సత్సంకల్పం మూలంగా మొదటి రకం మనుషులకు సమానంగా ప్రతిఫలం లభిస్తుంది. మూడో రకం మనుషులు : దేవుడు వీరికి ధనం ఇస్తాడు కాని జ్ఞానం ఇవ్వడు. ఇలాంటి వారు మంచీ చెడులను

رَحِمَهُ، وَلا يَعْلَمُ للهِ فِيهِ حَقّاً، فَهٰذَا بِأَخْبَثِ الْمَنَازِلِ. وَعَبْدٍ لَمْ يَرْزُقْهُ اللهُ مَالاً وَلا عِلْماً، فَهُوَ يَقُولُ: لَوْ أَنَّ لِي مَالاً لَعَمِلْتُ فِيهِ بِعَمَلِ فُلانٍ، فَهُوَ بِنِيَّتِهِ، فَوِزْرُهُمَا سَوَاءٌ» رواه الترمذي وقال: حديث حسن صحيح.

గురించి ఏమాత్రం తెలుసుకోకుండా (ఎడాపెడా) డబ్బు ఖర్చుపెడుతుంటారు. ధనం విషయంలో దైవానికి భయపడరు. బంధువుల హక్కుల్ని నిర్వర్తించరు. తమ దగ్గరున్న ధనంలో దేవుని హక్కుల్ని గుర్తించరు. ఇలాంటి వారు అందరికన్నా అధములు. నాల్గో రకం మనుషులు : దేవుడు వీరికి ధనం, జ్ఞానం (రెండూ) ఇవ్వడు. "అయినప్పటికీ వారు మా దగ్గర గనక ధనముంటే మేము కూడా ఫలానా మనిషిలా (విలాసాల కోసం ఎడాపెడా) ఖర్చుపెడతాం" అని అంటారు. వారి సంకల్పం ఇలా (చెడుగా) ఉండటం మూలంగా వారు మూడోరకం మనుషు లకు సమానమైన పాపాత్ములుగా పరిగణించబడతారు."

*(తిర్మిజీ - హసన్, సహీహ్)*

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

పై హదీసులో మంచి లేక చెడు సంకల్పం అంటే దృఢ నిశ్చయమని భావం. దృఢ నిశ్చయం లేని పక్షంలో పుణ్యఫలం, పాపఫలం అనేవి ఉండవు. సంపదను గనక షరీఅత్ సూచించిన విధంగా ఖర్చుపెడితే అది ఎంతో గొప్పది. విచ్చలవిడిగా ఖర్చుపెడితే దానికన్నా చెడ్డది మరొకటి లేదు. అదేవిధంగా విద్యను కూడా అభ్యసించి ఆచరిస్తే అది మహా గొప్పదిగా భావింపబడుతుంది. ఆచరణ లేని విద్య, అజ్ఞానం మనిషికి శుభాలు ప్రాప్తం గాకుండా చేస్తాయి.

٥٥٨ ـ وعن عائشةَ رضي الله عنها أَنَّهُمْ ذَبَحُوا شَاةً، فقالَ النبيُّ ﷺ: «مَا بَقِيَ مِنْهَا؟»، قالت: ما بقِيَ مِنها إلَّا كَتِفُهَا، قال: «بَقِيَ كُلُّهَا غَيْرَ كَتِفِهَا» رواه الترمذي

558. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం కొంతమంది ఒక మేకను కోశారు. (దాని మాంసంలో చాలా భాగం ప్రజలకు పంచిపెట్టారు). ఆ సందర్భంగా దైవప్రవక్త (సల్లం) ఆయిషా

(రజి.అన్హా)తో మాట్లాడుతూ, "ఆ మాంసంలో ఇంకా ఎంత మిగిలి ఉంది?" అని అడిగారు. "అంతా అయి పోయింది, ఒక్క భుజం మాత్రమే మిగిలి ఉంది" అని చెప్పారామె. దానికాయన "(కాదు, కాదు) ఆ భుజం తప్ప తతిమ్మా మాంసమంతా మిగిలే ఉంది" అని అన్నారు. *(తిర్మిజీ, హసన్ సహీహ్)*

وقال: حديث صحيح. معناه: تَصَدَّقُوا بها إلَّا كَتِفَهَا، فقال: بَقِيَتْ لَنَا في الآخِرَةِ إلَّا كَتِفَهَا.

ఈ హదీసు భావం ఏమిటంటే, మేకను కోసిన వాళ్ళు ఒక భుజాన్ని మాత్రం ఉంచుకొని మిగతా మాంసమంతా దానం చేసేశారు. దానం చేసిన మాంసా నికి పరలోకంలో ప్రతిఫలం లభిస్తుంది కాబట్టి అది మిగిలే ఉంది. ఇక మాంసంలో మిగిలిపోయిన భుజాన్ని ఎలాగూ కోసినవాళ్ళు తింటారు కాబట్టి పరలోకంలో దానికి ప్రతిఫలం లభిం చదు. ఆ విధంగా అది అయిపోయిన దాంతో సమానమన్నది దైవప్రవక్త ప్రవచనంలోని ఉద్దేశ్యం.

559. హజ్రత్ అస్మా బిన్తె అబూ బక్ర్ సిద్దీఖ్ (రజి.అన్హా) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) నాతో మాట్లాడుతూ, "ధనం మూటగట్టి ఉంచుకోకు. అలా చేస్తే దేవుడు కూడా (నీకివ్వకుండా) మూటగట్టి ఉంచుతాడు" అన్నారు.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : "ఖర్చుపెట్టు, పదే పదే లెక్కపెట్టకు. అలా చేస్తే దేవుడు కూడా లెక్కపెట్టి మరీ

٥٥٩ ـ وعن أسماءَ بنتِ أبي بكرٍ الصديق رضي الله عنهما قالت: قال لي رسولُ اللهِ ﷺ: «لا تُوكِي فَيُوكَى عَلَيْكِ». وفـي روايـةٍ: «أَنْفِقِـي أَوِ انفَحِـي، أَوِ انْضِحِـي، وَلا تُحْصِـي، فَيُحْصِـي اللهُ عَلَيْكِ، وَلا تُوعِي فَيُوعِي اللهُ عَلَيْكِ» متفقٌ عليه. وَ «انْفَحِي» بالحاءِ المهملة: وهو بمعنى أَنْفِقِي، وكذلك: «انْضِحِي».

ఇస్తాడు. అలాగే మాటిమాటికి సర్దిపెట్ట మాకు. అలాచేస్తే దేవుడు నీ పట్ల కూడా అలాగే వ్యవహరిస్తాడు.''

(బుఖారీ - ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జకాత్ ప్రకరణాలు)

٥٦٠ ـ وعن أبي هريرة رضي الله عنه أنه سمع رسولَ اللهِ ﷺ يقولُ: «مَثَلُ البَخِيلِ وَالمُنْفِقِ، كَمَثَلِ رَجُلَيْنِ عَلَيْهِمَا جُنَّتَانِ مِنْ حَدِيدٍ مِنْ ثُدِيِّهِمَا إلى تَرَاقِيهِمَا، فَأَمَّا المُنْفِقُ فَلا يُنْفِقُ إلَّا سَبَغَتْ، أَوْ وَفَرَتْ على جلدِهِ حَتَّى تُخْفِيَ بَنَانَهُ، وَتَعْفُوَ أَثَرَهُ، وَأَمَّا البَخِيلُ فَلا يُرِيدُ أَنْ يُنْفِقَ شَيْئاً إلَّا لَزِقَتْ كُلُّ حَلْقَةٍ مَكَانَهَا، فَهُوَ يُوَسِّعُهَا فَلا تَتَّسِعُ» متفقٌ عليه.

وَ «الجُنَّةُ»: الدِّرْعُ. وَمَعنَاهُ: أَن المُنْفِقَ كُلَّمَا أَنْفَقَ سَبَغَتْ، وَطَالَتْ حَتَّى تجُرَّ وَرَاءَهُ، وَتُخْفِيَ رِجْلَيهِ وأَثَرَ مَشْيِهِ وَخُطُوَاتِهِ.

560. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) పిసినారిని, ఖర్చుపెట్టేవాడిని కవచాలు ధరించివున్న ఇద్దరు వ్యక్తులతో ఈ విధంగా పోల్చి చెబుతుండగా నేను విన్నాను. ఆ ఇరువురి శరీరాలూ రొమ్ము నుండి కంఠం వరకు కవచాలతో కప్పబడి ఉన్నాయి. వారిరువురిలో ఖర్చుపెట్టే వాడు ఖర్చుపెట్టాలని ప్రయత్నించి నప్పుడు, అతని కవచం పూర్తిగా వదులయిపోయి అతని మునివ్రేళ్ళు సయితం కష్టబడే విధంగా క్రిందికి జారి పోతుంది. అతని కాలిముద్రలను కూడా కనపడనీయకుండా చేస్తుంది. దీనికి భిన్నంగా పిసినారి అసలు ఏమీ ఖర్చు పెట్టాలని అనుకోడు కాబట్టి కవచంలోని ప్రతికొండీ ఎక్కడికక్కడ బిగుసుకు పోతుంది. అతను దాన్ని వదులుచేసుకో వాలని ప్రయత్నిస్తాడు, కాని అది వదులు కాదు. (బుఖారీ - ముస్లిం)

దీని భావం ఏమిటంటే, దానశీలుడు దానం చేయాలని ప్రయత్నించినప్పుడు (అతని చేతులకు కలిపివేయబడివున్న కవచం) పూర్తిగా వదులయిపోయి

వెనుకనుండి క్రిందికి జారిపడుతూ ఉంటుంది. అతని పాదాలను కప్పి వేయటమే గాకుండా అతని కాలి ముద్రలను కూడా చెరిపివేస్తుంది.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జకాత్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

దానధర్మాలు మనిషికి కవచాల్లాంటివని ఈ హదీసు భావం. దానధర్మాలు చేయటం వల్ల భవిష్యత్తులో రాబోయే ఆపదలు తొలగిపోతాయి. పైగా అతని సంపదకు దేవుని తరఫునుండి రక్షణ ఏర్పడుతుంది. దానశీలి దానం చేయాలనుకున్నప్పుడు ఎంతో ఉదారంగా వ్యవహరిస్తాడు. సంతోషంగా డబ్బు ఖర్చుపెడతాడు. కాని పిసినారికి అసలు దానం చెయ్యాలనే తలంపే రాదు. ఒకవేళ వచ్చినా డబ్బు ఖర్చుపెట్టటానికి అతనికి చేతులు రావు.

٥٦١ ـ وعنه قال: قال رسولُ اللهِ ﷺ: «مَنْ تَصَدَّقَ بِعِدْلِ تَمْرَةٍ مِنْ كَسْبٍ طَيِّبٍ، وَلا يَقْبَلُ اللهُ إِلَّا الطَّيِّبَ، فَإِنَّ اللهَ يَقْبَلُهَا بِيَمِينِهِ، ثُمَّ يُرَبِّيهَا لِصَاحِبِهَا، كَمَا يُرَبِّي أَحَدُكُمْ فَلُوَّهُ حَتَّى تَكُونَ مِثْلَ الجَبَلِ» متفقٌ عليه.

561. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: దేవుడు పవిత్ర సంపాదన (నుండి ఇచ్చే దానాల్ని) మాత్రమే స్వీకరిస్తాడు. అంచేత ఎవరైనా తమ పవిత్ర సంపాదనలో నుండి ఒక ఖర్జూరపుటంత ధనం దానం చేసినా దేవుడు దాన్ని తన కుడిచేత్తో అందుకుంటాడు. ఆ తరువాత దాన్ని మీరు గుర్రపు పిల్లను పెంచి పెద్దచేసినట్లుగా దానం చేసినవాడికోసం పెంచుతాడు. అలా పెరుగుతూ చివరకు అది పర్వతమంత పెద్దదిగా అయిపోతుంది.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జకాత్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

1. అక్రమంగా సంపాదించి చేసే దానధర్మాలకు అల్లాహ్ దృష్టిలో ఎలాంటి విలువ

ఉండదు. దీనికి భిన్నంగా హలాల్ సంపాదనలో నుంచి ఒక ఖర్జూర పండు దానం చేసినా అది కొండంత పుణ్యాన్ని తెచ్చిపెడ్తుంది.

2. ఈ హదీసులో అల్లాహ్‌కు చెయ్యి ఉందనే ప్రస్తావన వచ్చింది. అల్లాహ్‌కు చేతులు ఉన్నాయని నమ్మటం విధి. అయితే అల్లాహ్ చేతులను వేటితోనూ పోల్చరాదు. వాటి ఆకారాన్ని వివరించటం కూడా ధర్మసమ్మతం కాదు. ఆఖరికి 'ఇక్కడ చెయ్యి అంటే తీసుకోవటం, అంగీకరించటం' అని భావాలు తీయటం కూడా సరికాదు.

٥٦٢ ـ وعنه عن النبيِّ ﷺ قال: «بَيْنَما رَجُلٌ يَمْشي بِفَلاةٍ مِنَ الأَرْضِ، فَسَمِعَ صَوْتاً في سَحَابَةٍ: اسْقِ حَدِيقَةَ فُلانٍ، فَتَنَحَّى ذٰلِكَ السَّحَابُ فَأَفْرَغَ مَاءَهُ في حَرَّةٍ، فإذا شَرْجَةٌ مِنْ تِلْكَ الشِّرَاجِ قَدِ اسْتَوْعَبَتْ ذٰلِكَ المَاءَ كُلَّهُ، فَتَتَبَّعَ المَاءَ، فإذَا رَجُلٌ قَائِمٌ في حَدِيقَتِهِ يُحَوِّلُ المَاءَ

562. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు: ఒకాయన ఓ మైదానంగుండా వెళుతుండగా మేఘాల్లో నుంచి, "ఫలానా వ్యక్తి తోటలో వర్షం కురిపించు" అని (ఎవరో ఆజ్ఞాపిస్తున్నట్టు) వినపడింది. అంతలో ఆ మేఘాల్లో నుండి ఒక మబ్బుతునక విడి పోయి ఓ నల్లని రాతినేలపై వర్షం కురిపించింది. (దాంతో చిన్న చిన్న కాలువలు ఏర్పడ్డాయి). చివరకు ఒక (పెద్ద) కాలువ మిగతా కాలువలన్నిటిని తనలో కలుపుకొని ప్రవహించసాగింది. అది చూసి ఆయన కూడా ఆ ప్రవాహం వెంట నడవసాగాడు. (కొంతదూరం వెళ్ళాక) ఆయనకు ఎవరో ఒక వ్యక్తి తన తోటలో నిలబడి తన దగ్గరున్న పని ముట్టుతో తోటకు నీళ్ళు పెడుతున్నట్టు కనిపించాడు. ఆయన అతని దగ్గరికెళ్ళి "ఓ దేవుని దాసుడా! నీ పేరేమిటి?" అని అడిగాడు. తాను ఇంతకు ముందు మేఘాల్లో విన్న పేరే చెప్పాడా వ్యక్తి. అతను "ఎందుకు అడుగుతున్నారు?" అన్నాడు. అందుకాయన "కురిపించిన

بِمسْحَابِه، فقال له: يَا عَبْدَ الله! ما اسْمُكَ؟ قَـال: فُـلانٌ، لِـلاسْـم الَّـذي سَمِـعَ فـي السَّحَابَةِ، فقال له: يا عَبْدَ الله! لِمَ تَسْأَلُنِي عَن اسْمِي؟ فَقَال: إنِّي سَمِعْتُ صَوْتاً في السَّحَابِ الَّذي هذَا مَاؤُهُ يَقُولُ: اسْقِ حَدِيقَةَ فُلانٍ، لِاسْمِكَ، فما تَصْنَعُ فِيهَا؟ فقالَ: أَمَّا إذْ قُلْتَ هٰذَا، فَإنِّي أَنْظُرُ إلى مَا يَخْرُجُ مِنْهَا، فَأَتَصَدَّقُ بِثُلُثِهِ، وَآكُلُ أَنَا وَعِيَالِي ثُلُثاً، وَأَرُدُّ فِيهَا ثُلُثَهُ» رواه مسلم. «الحَرَّةُ»: الأَرضُ المُلْبَسَةُ حِجَارَةً سَوْدَاءَ. وَ«الشَّرجَةُ» بفتح الشين المعجمة وإسكان الراءِ وبالجيم: هِيَ مَسِيلُ الماءِ.

మేఘంలో నుండి, 'ఫలానా వ్యక్తి తోటలపై వర్షం కురిపించు' అని (ఎవరో ఆజ్ఞాపిస్తున్నట్టు) విన్నాను. నువ్వు చెప్పిన పేరూ నేను విన్న పేరు ఒక్కటే. అది సరేకాని (దేవుడు ప్రత్యేకంగా నీ తోటలోనే వర్షం కురిపించమని మేఘాల్ని ఆదేశించటానికి) అసలు నువ్వు చేస్తున్న పనేంటి?" అని అడిగాడు. దానికా వ్యక్తి "మీరు అడిగారు కాబట్టి చెబుతున్నాను. ముందుగా నేను ఈ తోటలో పండే పంటను అంచనా వేసుకుంటాను. మొత్తం పంటలో మూడో వంతు దానం చేస్తాను. మరో మూడో వంతు నాకూ, నా ఆలుబిడ్డల ఆహారానికి సరిపోతుంది. మిగతా మూడో వంతును నేను వచ్చే పంటకోసం ఉపయోగిస్తాను" అని చెప్పాడు.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో కూడా దానధర్మాల గొప్పదనంతో పాటు మహిమలు, అద్భుతాల గురించి కూడా వివరించటం జరిగింది. ఒక మనిషి మేఘాల నుంచి మాటలు విన్నాడు. అసలు సాధారణంగా ఇలా జరగదు కాని దేవుడు తలచుకుంటే అది అసంభవం కూడా కాదు. అయితే మానవుల్లో ఎవరూ కూడా తాను తలచినప్పుడు మహిమలు ప్రదర్శించగలననీ, విశ్వసూత్రాలకు విరుద్ధమైన పని చేసి చూపించగలనని బొంకలేడు. దేవుడు తలచినప్పుడే అలాంటి అద్భుతాలు జరుగుతాయి. ఈ రోజుల్లో చాలామంది మహిమలు, అద్భుతాల పేరుతో జనాన్ని మోసం చేస్తున్నారు. జనం వారిపట్ల జాగ్రత్తగా ఉండాలి.

## 61వ అధ్యాయం

# ٦١ ـ بَابُ النَّهْيِ عَنِ الْبُخْلِ وَالشُّحِّ

# పిసినారితనానికి ,పేరాశకు దూరంగా ఉండాలి

٦١ ـ بَابُ النَّهْيِ عَنِ الْبُخْلِ وَالشُّحِّ

قال الله تعالى: ﴿ وَأَمَّا مَنۢ بَخِلَ وَٱسْتَغْنَىٰ ۝٨ وَكَذَّبَ بِٱلْحُسْنَىٰ ۝٩ فَسَنُيَسِّرُهُۥ لِلْعُسْرَىٰ ۝١٠ وَمَا يُغْنِى عَنْهُ مَالُهُۥٓ إِذَا تَرَدَّىٰٓ ﴾ [الليل: ٨ ـ ١١] وقال تعالى: ﴿ وَمَن يُوقَ شُحَّ نَفْسِهِۦ فَأُو۟لَٰٓئِكَ هُمُ ٱلْمُفْلِحُونَ ﴾ [التغابن: ١٦].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"ఎవరు పిసినారితనం వహించాడో, (దేవుని పట్ల) నిర్లక్ష్య వైఖరి అవలంబించాడో, పైగా మంచిని తృణీకరించాడో అతనికి మేము కఠినమార్గంలో నడిచేందుకు సౌకర్యాన్ని కలుగజేస్తాము. అతను నశిస్తే ఇక అతని ధనం అతనికి ఎలా ఉపయోగపడుతుంది?"

*(అల్ లైల్ : 8 - 11)*

ఇంకోచోట ఇలా అంటున్నాడు :

"తమ హృదయలోభత్వం నుండి రక్షణ పొందినవారే సాఫల్యం పొందేవారు."

*(అత్ తగాబున్ : 16)*

**వివరణ :**

అరబీ భాషలో పిసినారితనానికి 'బుఖ్ల్' మరియు 'షుహ్' అనే రెండు పదాలు వస్తాయి. రెండింటికి దాదాపు అర్థం ఒక్కటే. అయితే కొంతమంది పండితులు ఈ రెండు పదాల మధ్య భేదాన్ని గుర్తిస్తున్నారు. మనిషి దైవమార్గంలో డబ్బు ఖర్చుపెట్టకపోవటం 'బుఖ్ల్' అవుతుందనీ, అదే ఇతరుల ధనాన్ని అక్రమంగా కబళిస్తే దాన్ని 'షుహ్' అంటారని అభిప్రాయపడుతున్నారు. ఆ విధంగా చూస్తే బుఖ్ల్ కన్నా షుహ్ ఇంకా ఘోరమైన నేరమని తెలుస్తోంది. పై సూక్తుల ప్రకారం మానవుల్లో తమ ధనంలో నుండి జకాత్ పన్నును చెల్లిస్తూ, అవసరమైనప్పుడు దానధర్మాలు చేస్తూ, అక్రమ ఆర్జనకు దూరంగా ఉండేవారు పరలోకంలో ముక్తిపొందుతారు. దీనికి భిన్నంగా పేరాశకు, పిసినారితనానికి గురైన వారు ఇహపరాల్లో వినాశాన్ని చవిచూస్తారు.

٥٦٣ ـ وعن جابر رضي الله عنه أنَّ رسولَ اللهِ ﷺ قالَ: «اتَّقُوا الظُّلْمَ، فَإِنَّ

563. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : అన్యాయానికి దూరంగా ఉండండి. ఎందుకంటే అన్యాయం

الظُّلْمَ ظُلُمَاتٌ يَوْمَ القِيَامَةِ، وَاتَّقُوا الشُّحَّ، فَإِنَّ الشُّحَّ أَهْلَكَ مَنْ كَانَ قَبْلَكُمْ، حَمَلَهُمْ على أَن سَفَكُوا دِمَاءَهُمْ وَاسْتَحَلُّوا مَحَارِمَهُم» رواه مسلم.

ప్రళయదినాన కటిక చీకట్ల రూపంలో ఉంటుంది. ఇంకా పేరాశకు దూరంగా ఉండండి. ఎందుకంటే ఈ పేరాశే మీకు పూర్వం గతించిన సమాజాల్ని నాశనం చేసింది, ప్రజలు ఒండొకరి రక్తం చిందించేందుకు, నిషిద్ధ వస్తువుల్ని ధర్మ సమ్మతం (హలాల్)గా చేసుకునేందుకు ప్రేరేపించింది. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*



## 62వ అధ్యాయం

# ٦٢ - بَابُ الإِيثَارِ وَالمُوَاسَاةِ

# త్యాగం, సానుభూతి

قال الله تعالى: ﴿ وَيُؤْثِرُونَ عَلَىٰٓ أَنفُسِهِمْ وَلَوْ كَانَ بِهِمْ خَصَاصَةٌ ﴾ [الحشر: ٩] وقال تعالى: ﴿ وَيُطْعِمُونَ ٱلطَّعَامَ عَلَىٰ حُبِّهِۦ مِسْكِينًا وَيَتِيمًا وَأَسِيرًا ﴾ [الإنسان: ٨] إلى آخر الآيات.

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ ఇలా అంటున్నాడు:

"వారు (విశ్వాసులు) స్వయంగా అగత్యం కలవారైనప్పటికీ, తమకంటే ఇతరులకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు."

*(అల్ హష్ర్ : 9)*

మరోచోట ఇలా అంటున్నాడు :

"వారు (అంటే విశ్వాసులు ఎలాంటివారంటే) అల్లాహ్ మీది ప్రేమతో పేదలకూ, అనాథులకూ, ఖైదీలకూ అన్నం పెట్టేవారు."

*(అద్ దహ్ర్ - 8)*

٥٦٤ - وَعَنْ أبي هُرَيرةَ رضي الله عنه قال: جَاءَ رَجُلٌ إلى النَّبيِّ ﷺ فقال: إنِّي مَجْهُودٌ، فَأَرْسَلَ إلى بَعْضِ نِسَائِهِ، فَقَالت: وَالَّذي بَعَثَكَ بالحَقِّ مَا عِندي إلَّا مَاءٌ، ثم أَرْسَلَ إلى أُخْرى، فَقَالَتْ مِثْلَ ذٰلِكَ، حَتَّى قُلْنَ كُلُّهُنَّ مِثلَ ذٰلِكَ: لا والَّذي بَعَثَكَ بالحَقِّ! مَا عِندي إلَّا مَاءٌ. فقال النبيُّ ﷺ: «مَنْ يُضِيفُ هٰذا اللَّيْلَةَ؟» فقال رَجُلٌ مِن الأنصَارِ: أنَا يَا رسُولَ اللهِ!

564. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, "నేను (బాగా ఆకలితో) నీరసించిపోయాను. (నాక్కాస్త అన్నం పెట్టండి)" అని (దీనంగా) వేడుకున్నాడు. దైవప్రవక్త (సల్లం) అతనికి భోజనం ఏర్పాటు చేయమని ఒక భార్యకు చెప్పి పంపించారు. ఆమె "మిమ్మల్ని సత్యధర్మం ఇచ్చిపంపిన దేవుని సాక్షిగా చెబుతున్నాను. నా దగ్గర నీళ్ళు తప్ప మరేమీ లేదు" అని చెప్పింది. తరువాత ఇంకో భార్య దగ్గరికి పంపారు. ఆమె కూడా అలాగే జవాబు చెప్పింది. చివరకు ఆయన భార్యలందరూ అదే

فَانطَلَقَ بِهِ إِلى رَحْلِهِ، فَقَالَ لِامْرَأَتِهِ: أَكْرِمِي ضَيْفَ رسولِ اللهِ ﷺ. وفي رواية قال لِامْرَأَتِهِ: هَلْ عِندَكِ شَيْءٌ؟ فَقَالَتْ: لا، إلَّا قُوتَ صِبيانِي. قال: عَلِّلِيهِمْ بِشَيْءٍ، وَإِذَا أَرَادُوا العَشَاءَ فَنَوِّمِيهِم، وَإِذَا دَخَلَ ضَيْفُنَا، فَأَطفِئِي السِّرَاجَ، وَأَرِيهِ أَنَّا

సమాధానమిచ్చారు: 'మిమ్మల్ని సత్య ధర్మం ఇచ్చి పంపిన దేవుని సాక్షిగా చెబుతున్నాను. నా దగ్గర మంచినీళ్ళు తప్ప మరేమీ లేదు' అని. అప్పుడు దైవప్రవక్త (స) తన సహచరులను, "మీలో ఈ రోజు రాత్రి (ఈ వ్యక్తికి) ఆతిథ్యమిచ్చేవారెవరయినా ఉన్నారా?" అని అడిగారు. ఒక అన్సార్ వ్యక్తి లేచి, "నేను ఇస్తాను దైవప్రవక్తా!" అన్నారు. ఆ తరువాత అన్సారీ సహచరుడు ఆ వ్యక్తిని తన ఇంటికి తీసుకొని వెళ్ళి, "ఇతను దైవప్రవక్త గారి అతిథి. ఇతనికి ఆతిథ్యమివ్వాలి" అన్నారు తన భార్యతో.

వేరొక ఉల్లేఖనం ప్రకారం ఆయన తన భార్యను "మన దగ్గర (భోజనానికి) ఏమైనా ఉందా?" అని అడిగారు. "పిల్లల అన్నం మాత్రం ఉందండీ" అని చెప్పిందావె. అప్పుడాయన తన భార్యతో, "ఈ రాత్రి పిల్లలు అన్నం అడిగితే వాళ్ళకు ఏదో ఒకటి ఇచ్చి నిద్రపుచ్చు. అతిథి ఇంట్లోకి రాగానే దీపం ఆర్పెయ్యి. ఆయన ముందు మనం కూడా అన్నం తిన్నట్టు నటిద్దాం" అన్నారు.

ఆ తరువాత అందరూ భోజనానికి కూర్చున్నారు. (ఆమె దీపం ఆర్పేసింది). వచ్చిన అతిథి (కడుపునిండా) భోజనం చేశాడు. కాని ఆ దంపతులు మాత్రం పస్తుండిపోయారు. మరునాడు ఉదయం ఆ అన్సారీ సహచరుడు

نَـأْكُـل؛ فقعَـدُوا وَأَكَـلَ الضَّـيْـفُ وبَـاتَـا طَاوِيَيْنِ، فَلَمَّا أَصْبَحَ غَدَا عَلى النَّبيِّ ﷺ فقَـال: «لَقَـد عَجِـبَ الله مِـنْ صَنِيعِكُمَـا بِضَيْفِكُمَا اللَّيْلَةَ» متفقٌ عليه.

దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళగానే ఆయన, "రాత్రి మీరు మీ అతిథికి చేసిన సేవ చూసి దేవుడు సంతోషించాడు" అంటూ ఆ పుణ్యదంపతుల్ని కొనియాడారు. *(బుఖారీ - ముస్లిం)*

(సహీహ్ బుఖారీలోని మహిమోన్నతుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఇంటికి వచ్చిన అతిథికి కడుపునిండా అన్నంపెట్టి తాము పస్తులు గడిపిన ఓ ఆదర్శ దంపతుల గాథ ఈ హదీసులో వివరించబడింది. చరిత్రలో ఇలాంటి ఉదాహరణలు చాలా అరుదుగా కనిపిస్తాయి. ఈ హదీసు మనకు సహనాన్ని, త్యాగభావాన్ని బోధిస్తోంది. ఏ సమాజ ప్రజల్లోనయితే త్యాగభావం సర్వసామాన్యం అవుతుందో అక్కడ లూటీలు, దోపిడీలు జరగవు. సానుభూతి, కరుణా భావాలతో ఆ ప్రదేశం స్వర్గాన్ని తలపిస్తుంది.

٥٦٥ ـ وعنـــه قـــالَ: قـــالَ رسـولُ الله ﷺ: «طَعَـامُ الاثْنَيْـنِ كَـافـي الثَّلاثَةِ، وَطَعَامُ الثَّلاثَةِ كَافِي الأَرْبَعَةِ» متفقٌ عليه. وفـي روايـةٍ لمسلـمٍ عـن جـابـرٍ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «طَعَامُ الوَاحِدِ يَكفِي الاثْنَيْنِ، وَطَعَامُ الاثْنَيْنِ يَكْفِي الأَرْبَعَةَ، وَطَعَـامُ الأَرْبَعَـةِ يَكْفِـي الثَّمَانِيَةَ».

565. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు: (కలిసి తింటే) ఇద్దరి భోజనం ముగ్గురికి సరిపోతుంది. ముగ్గురి భోజనం నలుగురికి సరిపోతుంది." *(బుఖారీ - ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో హజ్రత్ జాబిర్ (రజి) గారి కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు: ఒక వ్యక్తి భోజనం ఇద్దరికి సరిపోతుంది. ఇద్దరి భోజనం నలుగురికి సరిపోతుంది. నలుగురి భోజనం ఎనిమిదిమందికి సరిపోతుంది.

*(సహీహ్ బుఖారీలోని భోజనాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

٥٦٦ - وعن أبي سعيدٍ الخُدريِّ رضي الله عنه قال: بينَمَا نَحْنُ في سَفَرٍ مَعَ النَّبيِّ ﷺ إذ جاءَ رَجُلٌ عَلى رَاحِلَةٍ لَهُ، فَجَعَلَ يَصرِفُ بَصَرَهُ يَميناً وَشِمَالاً، فَقالَ رسولُ اللهِ ﷺ: «مَنْ كَانَ مَعَهُ فَضْلُ ظَهْرٍ فَلْيَعُدْ بِهِ عَلى مَنْ لا ظَهْرَ لَهُ، وَمَنْ كَانَ لَهُ فَضْلٌ مِنْ زَادٍ فَلْيَعُدْ بِهِ عَلى مَنْ لا زَادَ لَهُ» فَذَكَرَ مِنْ أَصْنَافِ المَالِ مَا ذَكَرَ حَتَّى رَأَيْنَا أَنَّهُ لا حَقَّ لأحَدٍ مِنَّا في فَضْلٍ. رواه مسلم.

566. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం : మేమొకసారి దైవప్రవక్త (సల్లం) వెంట ప్రయాణంలో ఉండగా ఒక వ్యక్తి తన వాహనంపై (దైవప్రవక్త -సల్లం- దగ్గరికి) వచ్చి అటూ ఇటూ చూడసాగాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు "ఎవరి దగ్గరయినా అదనంగా వాహనాలుంటే అతను ఆ వాహనాన్ని అసలు వాహనం లేనివాడికి ఇవ్వాలి. ఎవరి దగ్గరయినా అదనంగా ప్రయాణసామగ్రి (అన్నం మొదలగునవి) ఉంటే దాన్ని అసలు ప్రయాణసామగ్రి లేనివారికి ఇవ్వాలి."

ఆ విధంగా ఆయన ఎన్నో రకాల సొమ్ములను ప్రస్తావించారు. ఆయన అలా చెప్పుకుంటూ పోతుంటే మన అదనపు సొమ్ములో అసలు మనకు హక్కే లేదేమోననిపించింది. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని సంప్రాప్త వస్తువుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సామూహిక జనజీవనంలో ముస్లింలు పరస్పరం సానుభూతి, త్యాగభావాలతో వ్యవహరించాలి. ముఖ్యంగా కష్టకాలాల్లో ఒండొకరికి సహాయపడాలి. తమ దగ్గర అదనంగా, ఉపయోగంలో లేని ధనాన్ని, వస్తువులను అభాగ్యులైన ఇతర ముస్లింలకు ఇవ్వాలి. ఇలా ఇవ్వడం విధి ఏమీ కాదుగాని ప్రజలు నైతికంగా ఆలోచించి ఉదారంగా వ్యవహరిస్తే దానికి దైవసన్నిధిలో వారు గొప్ప ప్రతిఫలాన్ని పొందుతారు. సమాజంలో నైతిక ప్రమాణాలు ఉన్నతంగా ఉంటే ప్రజలు ఇలాంటి పుణ్యప్రదమైన కార్యాలను కూడా తమ కర్తవ్యంగా భావించి నిర్వర్తిస్తారు. కాని సమాజంలో ఆ నైతికపు విలువలే దిగజారిపోయినప్పుడు ప్రజల్లో పరస్పర సానుభూతి,

త్యాగభావాలకు బదులు బలహీనుల్ని పీడించటం, తోటివారి సొమ్ము కోసం అర్రులు చాచటం లాంటి చేష్టలు పెచ్చరిల్లుతాయి.

٥٦٧ ـ وعـن سَهـلِ بـنِ سعـدٍ رضـي الله عنـه أَنَّ امـرَأَةً جَـاءَت إلـى رسولِ اللهِ ﷺ بِبُرْدَةٍ مَنْسُوجَةٍ، فقالت: نَسَجتُهـا بِيَـدَيَّ لأَكْسُـوَكَهـا، فَـأَخَـذَهَـا النَّبِيُّ ﷺ مُحتَاجاً إلَيهَا، فَخَرجَ إلَيْنَا وَإنَّهَا لإزَارُهُ، فقال فُلانٌ: اكْسُنِيهَا مَا أَحْسَنَهَا! فَقَـالَ: «نَعَـمْ» فَجَلَـسَ النَّبِـيُّ ﷺ فـي المَجْلِسِ، ثُمَّ رَجَعَ فطَوَاهَا، ثُمَّ أَرسَلَ بِهَا

567. హజ్రత్ సహ్ల్ బిన్ సాద్ (రజి) కథనం : ఒక మహిళ ఓ దుప్పటి నేసుకొని తీసుకు వచ్చి దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ, "(దైవప్రవక్తా!) మీకు తొడిగించాలని దీన్ని నేను నా స్వహస్తాలతో నేశాను" అని అన్నది. దైవప్రవక్త (సల్లం)కు దాని అవసరం ఉండటంతో ఆయన దాన్ని స్వీకరించారు. ఆ తరువాత ఆయన దాన్ని లుంగీలాగా కట్టుకొని మా దగ్గరి కొచ్చారు. అప్పుడు ఒక వ్యక్తి ఆయనతో, "అబ్బ! ఈ దుప్పటి ఎంత బాగుంది. (దైవప్రవక్తా!) దాన్ని నాకు తొడిగించరూ?" అన్నాడు. ఆయన సరేనన్నారు. సహచరుల సమావేశంలో (కాసేపు) కూర్చున్న తరువాత ఆయన ఇంటికి వెళ్ళి ఆ దుప్పటిని మడతపెట్టి ఆ వ్యక్తికి ఇవ్వమని పంపించారు.

ఆ తరువాత జనం అతన్ని పట్టుకొని, "దైవప్రవక్త (సల్లం) అవసరం ఉండి తొడుక్కున్నారు. కాని నువ్వు (ఆయన అవసరాన్ని పట్టించుకోకుండా) దుప్పటి ఇవ్వమని అడిగావు. దైవప్రవక్త అడిగిన వారిని ఒట్టి చేతులతో త్రిప్పిపంపరని నీకు తెలుసుకదా! (అయినా ఎందుకు అడిగావు). నీ ధోరణి ఏం బాగా లేదు"

إِلَيْهِ، فَقَالَ لَهُ الْقَوْمُ: مَا أَحْسَنْتَ، لَبِسَهَا النَّبِيُّ ﷺ مُحْتَاجاً إِلَيها، ثُمَّ سَأَلْتَهُ، وَعَلِمْتَ أَنَّهُ لا يَرُدُّ سَائِلاً! فقال: إِنِّي وَاللهِ! مَا سَأَلْتُهُ لأَلْبِسَهَا، إِنَّمَا سَأَلْتُهُ لِتَكُونَ كَفَنِي. قال سَهْلٌ: فَكانت كَفَنَهُ. رواه البخاري.

అని మందలించసాగారు. దానికి అతను "దైవసాక్షి! ఈ దుప్పటిని నేను తొడుక్కోవటానికి అడగలేదు. (నేను మరణించిన తరువాత) అది నా శవానికి వస్త్రం కావాలని మాత్రమే అడిగాను" అని అన్నాడు.

ఉల్లేఖకుని ఉవాచ : అతను చని పోయిన తరువాత ఆ దుప్పటి అతని శవానికి వస్త్రంగానే ఉపయోగించ బడింది. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసు ద్వారా కానుకలు స్వీకరించటం ధర్మసమ్మతమేనని తెలుస్తోంది. కానుకలు ఇచ్చిపుచ్చుకోవటం వల్ల పరస్పరం ప్రేమ పెరుగుతుంది. స్వయంగా దైవప్రవక్త (సల్లం) కూడా ఒకానొక సందర్భంగా "మీరు పరస్పరం కానుకలు ఇచ్చిపుచ్చుకుంటూ ఉండండి. దానివల్ల మీ మధ్య ప్రేమ పెంపొందుతుంది" అని ఉపదేశించారు.

ఈ హదీసు ద్వారా బోధపడే ఇంకో విషయం ఏమిటంటే, దైవప్రవక్త కడుక్కున్న నీళ్ళను, ఆయన చెమటను, వెంట్రుకలు మొదలగువాటిని ఆయన సహచరులు శుభప్రదమైనవిగా భావించేవారు. వాటివల్ల శుభప్రాప్తి జరుగుతుందని తలపోసేవారు. అయితే ఈ పద్ధతి దైవప్రవక్త (సల్లం) వ్యక్తిత్వానికే పరిమితం. ఇతరులు ఉపయోగించిన వస్తువుల్ని అలా పుణ్యప్రదమైనవిగా భావించటం ధర్మసమ్మతం కాదు. ఎందుకంటే సహచరులు కూడా ఒక్క దైవప్రవక్త (సల్లం) నుండి తప్ప ఖలీఫాల నుండిగాని, ఏ ఇతర గొప్ప సహాబీల నుండిగాని శుభం ఒనగూడుతుందని భావించలేదు. అలాంటప్పుడు సాధారణ వలీలు, మహాత్ముల వస్తువుల నుండి శుభప్రాప్తిని ఆశించటం ఎంతవరకు సమంజసం? అదీగాక సహచరులు దైవప్రవక్త శరీరంతో సంబంధమున్న వస్తువుల్ని మాత్రమే శుభప్రదమైనవిగా భావించేవారు గాని ఆయన ఇంటి గోడల్ని, కిటికీలను, తలుపుల్ని అంటిపెట్టుకొని కూర్చోలేదు. కాని నేడు చాలామంది అమాయకులు తమ అజ్ఞానం వల్ల దైవప్రవక్త (సల్లం) సమాధిని, సమాధి కడుగును కూడా శుభప్రదమైనవిగా భావిస్తున్నారు. అంతేకాదు ప్రముఖ వలీల, మహాత్ముల సమాధులను, వారి నివాసాలను దైవిక శక్తి స్వరూపాలుగా భావిస్తున్నారు. ఇవన్నీ మూఢనమ్మకాలే తప్ప వాస్తవానికి షరీఅత్‌లో వీటికి ఎలాంటి విలువ లేదు.

568. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : అష్అరీ తెగవాళ్ళు యుద్ధ రంగంలో ఉన్నప్పుడు వారి ఆహార పదార్థాలు అయిపోవస్తే, లేక (స్వస్థలం) మదీనాలో ఉన్నప్పుడు తమ ఆలుబిడ్డల ఆహారానికి కొరత ఏర్పడితే అప్పుడు వారందరూ తమ దగ్గరున్న ఆహారపదార్థాలన్నిటిని ఒక వస్త్రంలో పోగుచేసి ఒక పాత్రతో వాటిని అందరూ సమానంగా పంచుకుంటారు. అందుచేత వారు నాతోపాటు ఉన్నారు, నేను వారితో పాటు ఉన్నాను. *(బుఖారీ - ముస్లిం)*

٥٦٨ ـ وعن أبي موسى رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «إنَّ الأشعَرِيِّينَ إذَا أَرمَلُوا فِي الغزوِ، أَوْ قَلَّ طَعَامُ عِيَالِهِمْ بِالمَدِينَةِ، جَمَعُوا مَا كَانَ عِندَهُمْ فِي ثَوبٍ وَاحِدٍ، ثُمَّ اقتَسَمُوهُ بَيْنَهُمْ فِي إنَاءٍ وَاحِدٍ بِالسَّوِيَّةِ فَهُمْ مِنِّي وَأَنَا مِنْهُمْ» متفقٌ عليه. «أَرمَلُوا»: فَرَغَ زَادُهُم، أَوْ قَارَبَ الفَرَاغَ.

*(సహీహ్ బుఖారీలోని భాగస్వామ్య ప్రకరణం, సహీహ్ ముస్లింలోని మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

"వారు నాతో పాటు ఉన్నారు. నేను వారితో పాటు ఉన్నాను" అంటే సత్కార్యాలు, సుగుణాల్లో మేము పరస్పరం చాలా సన్నిహితంగా, ఒకే లాగున్నామని అర్థం. ఈ హదీసు అష్అరీ తెగవారి మహిమోన్నతులను వెల్లడించడంతోపాటు ప్రజలు పరస్పరం సానుభూతి త్యాగభావాలతో వ్యవహరించాలని, ముఖ్యంగా కరువు పరిస్థితుల్లో ఒకరికొకరు సహకరించుకుంటూ వనరుల్ని సక్రమంగా, సజావుగా అందరికి ఆమోదయోగ్యమైన రీతిలో వినియోగించుకోవాలని ప్రబోధిస్తోంది.

## 63వ అధ్యాయం

# ٦٣ - بَابُ التَّنَافُسِ فِي أُمُورِ الآخِرَةِ وَالإِسْتِكْثَارِ مِمَّا يُتَبَرَّكُ بِهِ

# పారలౌకిక విషయాల్లో ఒకర్నొకరు మించిపోవటానికి ప్రయత్నించటం, శుభప్రదమైన వస్తువుల పట్ల ఆసక్తిని కనబరచటం.....

قال الله تعالى: ﴿وَفِي ذَٰلِكَ فَلْيَتَنَافَسِ الْمُتَنَافِسُونَ﴾ [المطففين: ٢٦].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : "ఇతరుల్ని మించిపోవాలని కోరుకునేవారు దీన్ని (స్వర్గాన్ని) పొందే విషయంలో మించి పోవటానికి కృషిచేయాలి."

*(అల్ ముతఫ్ఫిఫీన్ : 26)*

٥٦٩ - وعن سهل بن سعد رضي الله عنه أن رسول الله ﷺ أُتِيَ بِشَرَابٍ، فَشَرِبَ مِنْهُ، وَعَنْ يَمِينِهِ غُلَامٌ، وَعَنْ يَسَارِهِ الأَشْيَاخُ، فقال لِلْغُلَامِ: «أَتَأْذَنُ لِي أَنْ أُعْطِيَ هؤُلاءِ؟» فَقَالَ الغُلَامُ: لا وَاللهِ يَا رَسُولَ اللهِ لا أُوثِرُ بِنَصِيبِي مِنكَ أَحَداً، فَتَلَّهُ رسولُ الله ﷺ في يَدِهِ. متفقٌ عليه. «تَلَّهُ» بالتاءِ المثناة فوق، أَيْ: وَضَعَهُ، وهٰذا الغُلامُ هُوَ ابنُ عَبَّاسٍ رضي الله عنهما.

569. హజ్రత్ సహ్ల్ బిన్ సాద్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం)కు ఎవరో ఏదో పానీయం (కానుకగా) సమర్పించుకున్నారు. ఆయన అందులో కొంత తాగారు. ఆ సమయంలో ఆయనకు కుడి ప్రక్కన ఒక బాలుడు ఉన్నాడు. ఎడమ ప్రక్కన పెద్దవాళ్ళున్నారు. దైవ ప్రవక్త (సల్లం) ఆ పిల్లవాడితో, "నువ్వు అనుమతిస్తే నేనీ పానీయాన్ని పెద్దలకు ఇస్తాను" అన్నారు. దానికా బాలుడు, "దైవసాక్షి! నేను ఒప్పుకోను. మీరిచ్చే వస్తువుని నేను ఇతరులకు త్యాగం చెయ్యలేను దైవప్రవక్తా!" అని అన్నాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) పానీయ గిన్నెను ఆ బాలునికే ఇచ్చేశారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని అత్యాచారాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సమావేశంలో కూర్చొని ఉన్నవారికి ఏదైనా పంచిపెట్టాలనుకున్నప్పుడు కుడివైపు నుండి మొదలుపెట్టాలి. హదీసులో ప్రస్తావనకు వచ్చిన సంఘటనలో దైవప్రవక్త (సల్లం)కు కుడివైపున అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ ఉన్నారు. ఆయన ఆ సమావేశంలోని వారందరికన్నా చాలా చిన్నవారు. పెద్దలంతా దైవప్రవక్త (సల్లం)కు ఎడమవైపు కూర్చొని ఉన్నారు. సాధారణ పరిస్థితుల్లో ఏదయినా వస్తువు పంచిపెట్టాలన్నప్పుడు పెద్దలనుండి మొదలుపెడతారు. కాని మరోవైపు సమావేశాల్లో ఉన్నప్పుడు కుడివైపు నుండి మొదలుపెట్టాలన్న నియమం కూడా ఉంది. అంచేత దైవప్రవక్త (సల్లం) ఇబ్నె అబ్బాస్ చిన్న పిల్లవాడని చూడకుండా ఆయన హక్కుని గుర్తించి, ఆయన అనుమతితో ఆ పానీయాన్ని పెద్దలికివ్వాలని నిశ్చయించుకున్నారు.

ఇబ్నె అబ్బాస్ (రజి) ఆ సమావేశంలో అందరికన్నా చిన్నవారు. నైతికంగా చూస్తే పెద్దల గౌరవార్థం ఆయన తన హక్కుని త్యాగం చేసి ఆ పానీయం పెద్దలకే ఇవ్వమని చెప్పాలి. కాని ఆయన తన హక్కుని త్యాగం చేయటంకన్నా దైవప్రవక్త శుభ అధరాలు తాకిన పానీయాన్ని ముందుగా తాను సేవించటానికే ఎక్కువ ప్రాధాన్యతనిచ్చారు.

٥٧٠ ـ وعن أبي هريرة رضي الله عنه عن النَّبي ﷺ قالَ: «بَيْنَا أَيُّوبُ عليه السلام يَغْتَسِلُ عُرْيَاناً، فَخَرَّ عَلَيْهِ جَرَادٌ مِنْ ذَهَبٍ، فَجَعَلَ أَيُّوبُ يَحْثِي فِي ثَوبِهِ، فَنَادَاهُ رَبُّهُ عَزَّ وَجَلَّ: يَا أَيُّوبُ! أَلَمْ أَكُنْ أَغْنَيْتُكَ عَمَّا تَرَى؟! قال: بَلَى وَعِزَّتِكَ، وَلٰكِنْ لا غِنَى بِي عَنْ بَرَكَتِكَ» رواه البخاري.

570. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : ఒకసారి అయ్యూబ్ (అలైహి) దిగంబరులై స్నానం చేస్తుండగా ఆయనపై బంగారు మిడుతలు వచ్చి పడసాగాయి. అయ్యూబ్ వాటిని దోసిళ్ళతో పట్టుకొని వస్త్రంలో సమీకరించుకోసాగారు. అప్పుడు ఆకాశం నుండి దేవుడు ఆయన్ని పిలుస్తూ, "ఓ అయ్యూబ్! నేను (నీకు విపరీతమైన సిరిసంపదలను ప్రసాదించి) నువ్వు ప్రోగుచేసుకుంటున్నవాటి నుంచి నిన్ను నిరపేక్షాపరునిగా చెయ్యలేదా?" అని అడిగాడు. దానికి అయ్యూబ్ "నీ ఔన్నత్యం సాక్షి! నిస్సందేహంగా చేశావు. కాని నాపై అవతరించే శుభం విషయంలోనయితే నిరపేక్షాపరునిగా చెయ్యలేదు కదా!" అన్నారు అయ్యూబ్ (అలైహిస్సలాం) *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని దైవప్రవక్తల ప్రకరణం)*

## 64వ అధ్యాయం

# ٦٤ـ بَابُ فَضْلِ الغَنِيِّ الشَّاكِرِ وَهُوَ مَنْ أَخَذَ المَالَ مِنْ وَجْهِهِ وَصَرفه فِي وُجُوهِهِ المَأمُورِ بِهَا

# కృతజ్ఞుడైన ధనవంతుడు

قال الله تعالى: ﴿ فَأَمَّا مَنْ أَعْطَىٰ وَاتَّقَىٰ ۝ وَصَدَّقَ بِالْحُسْنَىٰ ۝ فَسَنُيَسِّرُهُ لِلْيُسْرَىٰ ﴾ [الليل: ٥ ـ ٧] وقال تعالى: ﴿ وَسَيُجَنَّبُهَا الْأَتْقَى ۝ الَّذِي يُؤْتِي مَالَهُ يَتَزَكَّىٰ ۝ وَمَا لِأَحَدٍ عِندَهُ مِن نِّعْمَةٍ تُجْزَىٰ ۝ إِلَّا ابْتِغَاءَ وَجْهِ رَبِّهِ الْأَعْلَىٰ ۝ وَلَسَوْفَ يَرْضَىٰ ﴾ [الليل: ١٧ ـ ٢١] وقال تعالى: ﴿ إِن تُبْدُوا الصَّدَقَاتِ فَنِعِمَّا هِيَ وَإِن تُخْفُوهَا وَتُؤْتُوهَا الْفُقَرَاءَ فَهُوَ خَيْرٌ لَّكُمْ وَيُكَفِّرُ عَنكُم مِّن سَيِّئَاتِكُمْ وَاللَّهُ بِمَا تَعْمَلُونَ خَبِيرٌ ﴾ [البقرة: ٢٧١] وقال تعالى: ﴿ لَن تَنَالُوا الْبِرَّ حَتَّىٰ تُنفِقُوا مِمَّا تُحِبُّونَ وَمَا تُنفِقُوا مِن شَيْءٍ فَإِنَّ اللَّهَ بِهِ عَلِيمٌ ﴾ [آل عمران: ٩٢] والآيات في فضلِ الإنفاقِ في الطاعات كثيرةٌ مَعْلُومَةٌ.

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్‌ సెలవిచ్చాడు :

ఎవరు (దైవమార్గంలో) ధనాన్ని వినియోగించాడో, (దైవ అవిధేయతకు) భయపడ్డాడో, మంచిని సత్యమని అంగీకరించాడో అతనికి మేము సన్మార్గంలో నడిచేందుకు సౌకర్యాన్ని కలుగజేస్తాము. *(అల్‌ లైల్‌ : 5 - 7)*

పరిశుద్ధుడు కావటానికి తన సంపదను ఖర్చు చేసే పరమ దైవభీతిపరుడు దానికి (నరకానికి) దూరంగా ఉంచబడతాడు. అతనికి ఎవ్వరూ ఏ విధమైన ఉపకారం చెయ్యలేదు, దానికి అతను బదులు తీర్చేందుకు. అతను కేవలం మహోన్నతుడైన తన ప్రభువు ప్రసన్నతను పొందటానికి మాత్రమే ఈ పని చేస్తున్నాడు. ఆ ప్రభువు తప్పకుండా అతడంటే సంతోషిస్తాడు. *(అల్‌ లైల్‌ : 17 - 21)*

"మీరు మీ దానధర్మాలను బహిరంగంగా చేసినా మంచిదే. కాని రహస్యంగా నిరుపేదలకు దానమివ్వటం మీకు ఎక్కువ మేలు చేకూరుస్తుంది. మీ వల్ల జరిగిన దుష్కార్యాలెన్నో దానివల్ల సమసిపోతాయి. మీరు ఏమి చేసినా అది అల్లాహ్‌కు తెలుస్తుంది.

*(అల్‌ బఖర : 271)*

"మీరు అమితంగా ప్రేమించే వస్తువులను (దైవమార్గంలో) ఖర్చుపెట్టనంతవరకు మీరు సత్కార్యస్థాయికి చేరుకోలేరు. మీరు ఖర్చు

చేసేదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు."

*(ఆలి ఇమ్రాన్ : 92)*

٥٧١ ـ وعن عبدِ الله بن مسعودٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «لا حَسَدَ إلَّا في اثْنَتَيْن: رَجُلٌ آتَاهُ الله مَالاً، فَسَلَّطَهُ على هَلَكَتِهِ في الحَقِّ، وَرَجُلٌ آتَاهُ الله حِكْمَةً فَهُوَ يَقْضِي بِهَا وَيُعَلِّمُهَا» متفقٌ عليه وتقدم شرحه قريباً.

571. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్‌వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ఇద్దరు వ్యక్తుల పట్ల తప్ప మరెవ్వరి పట్లా అసూయ చెందటం ధర్మసమ్మతం కాదు. వారిలో ఒకడు : దేవుడు సిరిసంపదలను ప్రసాదించి, వాటిని సత్యమార్గంలో ఖర్చుపెట్టే సద్బుద్ధిని ప్రసాదించినవాడు. రెండో వ్యక్తి: దేవుడు విజ్ఞతా వివేచనాలను ప్రసాదిస్తే వాటి ప్రకారం నిర్ణయాలు తీసుకుంటూ, ఆ వివేచనను ఇతరులకు కూడా బోధించేవాడు.

*(బుఖారీ - ముస్లిం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు వచ్చినప్పటికీ ఇందులోని విషయం సదరు అధ్యాయానికి కూడా వర్తిస్తుండటంతో దీనిని మళ్లీ ఇక్కడ ప్రస్తావించటం జరిగింది. అల్లాహ్ ఎవరికైనా ధనం ఇస్తే వారు అందుకు కృతజ్ఞతలు తెలుపుకోవాలి. అల్లాహ్ ఆదేశించిన మార్గంలో ఆ ధనాన్ని ఖర్చుపెడితే ఆయనకు కృతజ్ఞతలు తెలుపుకున్నట్లవుతుంది. అదేవిధంగా విద్యను అభ్యసించిన తర్వాత దాన్ని ఆచరణలో పెట్టడమే ఆ దైవానుగ్రహానికి కృతజ్ఞతలు! మరో విషయం, ఇతరులకు మంచి చేసే ఉద్దేశ్యంతో విద్యనభ్యసించాలనీ, ధనం సంపాదించాలని ఆశపడటంలో తప్పులేదు.

٥٧٢ ـ وعن ابْنِ عمرَ رضي الله عنهما عن النَّبِي ﷺ قال: «لا حَسَدَ إلَّا في اثْنَتَيْن: رَجُلٌ آتَاهُ الله القُرآنَ، فَهُوَ يَقُومُ بِهِ آنَاءَ اللَّيْلِ وَآنَاءَ النَّهارِ، وَرَجُلٌ آتَاهُ الله مَالاً، فَهُوَ يُنْفِقُهُ آناء اللَّيْلِ وَآنَاءَ النَّهارِ» متفقٌ عليه. «الآنَاءُ»: السَّاعَاتُ.

572. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ఇద్దరు వ్యక్తుల పట్ల తప్ప మరెవ్వరిపట్లా అసూయ చెందరాదు. ఒకరు; దేవుడు ఖుర్‌ఆన్ జ్ఞానాన్ని ప్రసాదించగా రేయింబవళ్ళు దాన్ని ఆచరించే వ్యక్తి. రెండోవాడు: దేవుడు సిరిసంపదలు

అనుగ్రహించగా వాటిని రేయింబవళ్ళు (దైవమార్గంలో) ఖర్చుపెట్టే వ్యక్తి.
*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని తౌహీద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇంతకు ముందు హదీసులో ఇక్కడ 'ఖుర్ఆన్' అని చెప్పినచోట 'వివేచనం' అన్న పదం వాడబడింది. 'వివేచనం' అన్నా 'ఖుర్ఆన్' అన్నా అర్థం ఒక్కటే! ఖుర్ఆన్‌ను ఆచరించటం అనే మాటలో దాన్ని పారాయణం చేయటం, దాన్ని ఇతరులకు బోధించటం, దాని ఆధారంగా తీర్పులు ఇవ్వటం, దానికి అనుగుణంగా ఉత్తర్వులు జారీచేయటం అన్నీ వచ్చేస్తాయి. ఈ విధంగా పై రెండు హదీసులకూ భావం ఒక్కటే.

٥٧٣ ـ وَعن أبي هُريرة رضيَ الله عنه أَنَّ فُقَرَاءَ المُهَاجِرِينَ أَتَوْا رسولَ اللهِ ﷺ، فَقَالوا: ذَهَبَ أَهْلُ الدُّثُورِ بِالدَّرَجَاتِ العُلَا، وَالنَّعِيمِ المُقِيمِ، فَقَالَ: «وَمَا ذَاكَ؟» فَقَالُوا: يُصَلُّونَ كَمَا نُصَلِّي، وَيَصُومُونَ كَمَا نَصُومُ، وَيَتَصَدَّقُونَ ولا نَتَصَدَّقُ، وَيَعْتِقُونَ وَلا نَعْتِقُ، فقال رسولُ اللهِ ﷺ: «أَفَلا أُعَلِّمُكُمْ شَيْئاً تُدْرِكُونَ بِهِ مَنْ سبَقَكُمْ، وَتَسْبِقُونَ مَنْ بَعْدَكُمْ، وَلا يَكُونُ أَحَدٌ أَفضَلَ مِنكُمْ إلَّا مَنْ صَنَعَ مِثْلَ مَا صَنَعْتُمْ؟» قَالُوا: بَلَى يَا رسولَ اللهِ! قَالَ: «تُسَبِّحُونَ، وَتَحمَدُونَ، وَتُكَبِّرُونَ، دُبُرَ كُلِّ صَلاةٍ ثَلاثاً وَثَلاثِينَ مَرَّةً» فَرَجَعَ فُقَرَاءُ المُهَاجِرِينَ إلى

573. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : ముహాజిర్లలో పేద ప్రజలైన కొంతమంది ఓ రోజు దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, "(దైవప్రవక్తా!) ధనికులు (మాకన్నా) గొప్ప స్థానాలను, శాశ్వత సుఖాలను పొందుతారు" అని అన్నారు. "అదెలాగూ?" అని అడిగారు దైవప్రవక్త (సల్లం). దానికి వారు సమాధానమిస్తూ, "వారూ మాలాగే నమాజులు చేస్తున్నారు. ఉపవాసాలు పాటిస్తున్నారు. అయితే వారు దానధర్మాలు కూడా చేస్తున్నారు. కాని (స్తోమత లేనికారణంగా) మేము (దానధర్మాలు) చేయటం లేదు. వారు బానిసల్ని కూడా విడిపిస్తున్నారు. మేమా పని చేయలేకపోతున్నాం" అని అన్నారు.

అది విని దైవప్రవక్త (సల్లం), అయితే నేను మీకో విషయం తెలియజేయనా? దాన్ని గనక మీరు పాటిస్తే, మిమ్మల్ని మించిపోయినవారి స్థాయికి మీరూ

رسولِ اللهِ ﷺ، فقالُوا: سَمِعَ إخوَانُنَا أَهْلُ الأَمْوَالِ بِمَا فَعَلْنَا، فَفَعَلُوا مِثْلَهُ؟ فَقَالَ رسولُ اللهِ ﷺ: «ذلكَ فَضْلُ اللهِ يُؤْتِيهِ مَنْ يَشَاءُ» متفقٌ عليه وهذا لفظ روايةِ مسلم.

«الدُّثُورُ»: الأَمْوَالُ الكَثِيرَةُ، وَاللهُ أعلمُ.

చేరుకుంటారు. మీ తరువాత వచ్చిన వారికంటే కూడా మీరు మించిపోతారు. మీ పద్ధతిని పాటించేవారు తప్ప మీకన్నా శ్రేష్ఠులు మరెవ్వరూ ఉండబోరు" అని అన్నారు.

"తప్పకుండా తెలియజేయండి దైవ ప్రవక్తా!" అని విన్నవించుకున్నారు సహచరులు. అప్పుడాయన "ప్రతి నమాజు తరువాత 'సుబ్‌హానల్లాహ్', 'అల్‌హమ్దులిల్లాహ్', 'అల్లాహుఅక్బర్' అని (ప్రతి ఒక్కటి) ముప్ఫైమూడుమార్లు చొప్పున పఠించండి" అని అన్నారు.

(పేద ప్రజలు దాన్ని ఆచరించటం మొదలుపెట్టారు. కొంతకాలానికి ధనికు లకు కూడా ఆ విషయం తెలిసి పోయింది. వాళ్ళు కూడా దాన్ని పాటించ సాగారు). అప్పుడు ముహాజిర్ నిరు పేదలు మళ్ళీ దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళి, "మేము చేస్తున్నది ధనిక సోదరు లకు కూడా తెలిసిపోయింది. వాళ్ళూ మాలాగే దాన్ని ఆచరించటం మొదలు పెట్టారు" అని ఫిర్యాదు చేసుకున్నారు. దానికాయన "అది దేవుని అనుగ్రహం. దేవుడు తాను కోరినవారికి తన అనుగ్ర హాన్ని ప్రసాదిస్తాడు" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

(వాక్యాలు మాత్రం ముస్లింవి).

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని మస్జిదుల ప్రకరణం)*

65వ అధ్యాయం

# ٦٥ - بَابُ ذِكْرِ الْمَوْتِ وَقِصَرِ الأَمَلِ

# మరణాన్ని గుర్తుచేసుకుంటూ ఉండటం, కోరికల్ని అదుపులో ఉంచుకోవటం.....

قال الله تعالى: ﴿ كُلُّ نَفْسٍ ذَآئِقَةُ ٱلْمَوْتِ وَإِنَّمَا تُوَفَّوْنَ أُجُورَكُمْ يَوْمَ ٱلْقِيَـٰمَةِ فَمَن زُحْزِحَ عَنِ ٱلنَّارِ وَأُدْخِلَ ٱلْجَنَّةَ فَقَدْ فَازَ وَمَا ٱلْحَيَوٰةُ ٱلدُّنْيَآ إِلَّا مَتَـٰعُ ٱلْغُرُورِ ﴾ [آل عمران: ١٨٥] وقال تعالى: ﴿ وَمَا تَدْرِى نَفْسٌ مَّاذَا تَكْسِبُ غَدًا وَمَا تَدْرِى نَفْسٌ بِأَىِّ أَرْضٍ تَمُوتُ ﴾ [لقمان: ٣٤] وقال تعالى: ﴿ فَإِذَا جَآءَ أَجَلُهُمْ لَا يَسْتَـْٔخِرُونَ سَاعَةً وَلَا يَسْتَقْدِمُونَ ﴾ [النحل: ٦١] وقال تعالى: ﴿ يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تُلْهِكُمْ أَمْوَٰلُكُمْ وَلَآ أَوْلَـٰدُكُمْ عَن ذِكْرِ ٱللَّهِ وَمَن يَفْعَلْ ذَٰلِكَ فَأُو۟لَـٰٓئِكَ هُمُ ٱلْخَـٰسِرُونَ ۝ وَأَنفِقُوا۟ مِن مَّا رَزَقْنَـٰكُم مِّن قَبْلِ أَن يَأْتِىَ أَحَدَكُمُ ٱلْمَوْتُ فَيَقُولَ رَبِّ لَوْلَآ أَخَّرْتَنِىٓ إِلَىٰٓ أَجَلٍ قَرِيبٍ فَأَصَّدَّقَ وَأَكُن مِّنَ ٱلصَّـٰلِحِينَ ۝ وَلَن يُؤَخِّرَ ٱللَّهُ نَفْسًا إِذَا جَآءَ أَجَلُهَا وَٱللَّهُ خَبِيرٌۢ بِمَا تَعْمَلُونَ ﴾ [المنافقون: ٩ - ١١] وقال

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"చివరకు ప్రతి జీవీ మరణిస్తుంది. మీరంతా మీ పూర్తి ప్రతిఫలాన్ని ప్రళయంనాడు పొందుతారు. అక్కడ నరకాగ్ని నుండి కాపాడబడి, స్వర్గంలో ప్రవేశపెట్టబడేవాడు మాత్రమే యదార్థానికి సఫలీకృతుడు. ఇక ఈ ప్రపంచం, అది కేవలం మాయావస్తువు మాత్రమే."
*(ఆలి ఇమ్రాన్ : 185)*

"తాను రేపటి రోజున ఏమి సంపాదించనున్నదో ఏ ప్రాణీ ఎరుగదు. ఏ భూభాగంపై తనకు మృత్యువు రానున్నదో ఏ వ్యక్తీ ఎరుగడు." *(లుఖ్మాన్ : 34)*

"ఆ కాలం వచ్చేసినప్పుడు, అది ఒక్క గడియ కూడా వెనుకా ముందూ కాజాలదు."
*(అన్ నహ్ల్ : 61)*

"విశ్వాసులారా! మీ సిరిసంపదలూ, మీ సంతానమూ, మిమ్మల్ని అల్లాహ్ సంస్మరణ నుండి మరల్చరాదు. ఎవరైతే ఇలా మరల్చబడతారో వారే నష్టానికి గురి అయ్యేవారు. మీలో ఎవరికైనా మరణ సమయం సమీపించి, అతను, 'ఓ నా ప్రభూ! నీవు నాకు మరికొంత వ్యవధి ఎందుకివ్వలేదు, నేను దాన ధర్మాలు చేసి సజ్జనులలో కలిసిపోయే వాణ్ణికదా?' అని వాపోయే పరిస్థితి రాకముందే మేము మీకు ఇచ్చిన ఉపాధినుండి

تعالى: ﴿ حَتَّىٰٓ إِذَا جَآءَ أَحَدَهُمُ ٱلْمَوْتُ قَالَ رَبِّ ٱرْجِعُونِ ۝٩٩ لَعَلِّىٓ أَعْمَلُ صَٰلِحًا فِيمَا تَرَكْتُ ۚ كَلَّآ ۚ إِنَّهَا كَلِمَةٌ هُوَ قَآئِلُهَا ۖ وَمِن وَرَآئِهِم بَرْزَخٌ إِلَىٰ يَوْمِ يُبْعَثُونَ ۝١٠٠ فَإِذَا نُفِخَ فِى ٱلصُّورِ فَلَآ أَنسَابَ بَيْنَهُمْ يَوْمَئِذٍ وَلَا يَتَسَآءَلُونَ ۝١٠١ فَمَن ثَقُلَتْ مَوَٰزِينُهُۥ فَأُو۟لَٰٓئِكَ هُمُ ٱلْمُفْلِحُونَ ۝١٠٢ وَمَنْ خَفَّتْ مَوَٰزِينُهُۥ فَأُو۟لَٰٓئِكَ ٱلَّذِينَ خَسِرُوٓا۟ أَنفُسَهُمْ فِى جَهَنَّمَ خَٰلِدُونَ ۝١٠٣ تَلْفَحُ وُجُوهَهُمُ ٱلنَّارُ وَهُمْ فِيهَا كَٰلِحُونَ ۝١٠٤ أَلَمْ تَكُنْ ءَايَٰتِى تُتْلَىٰ عَلَيْكُمْ فَكُنتُم بِهَا تُكَذِّبُونَ ۝١٠٥ ﴾ إلى قوله تعالى: ﴿ كَمْ لَبِثْتُمْ فِى ٱلْأَرْضِ عَدَدَ سِنِينَ ۝١١٢ قَالُوا۟ لَبِثْنَا يَوْمًا أَوْ بَعْضَ يَوْمٍ فَسْـَٔلِ ٱلْعَآدِّينَ ۝١١٣ قَٰلَ إِن لَّبِثْتُمْ إِلَّا قَلِيلًا ۖ لَّوْ أَنَّكُمْ كُنتُمْ تَعْلَمُونَ ۝١١٤ أَفَحَسِبْتُمْ أَنَّمَا خَلَقْنَٰكُمْ عَبَثًا وَأَنَّكُمْ إِلَيْنَا لَا تُرْجَعُونَ ﴾ [المؤمنون: ٩٩ ـ ١١٥] وقال تعالى:

ఖర్చుపెట్టండి. కాని ఎవరి ఆచరణ వ్యవధి అయినా ముగిసిపోయే సమయం ఆసన్నమై నప్పుడు, అల్లాహ్ ఇక అతనికి ఎంతమాత్రం అదనపు వ్యవధి ఇవ్వడు. మీరు చేస్తున్నదంతా అల్లాహ్‌కు బాగా తెలుసు."

*(అల్ మునాఫిఖూన్ : 9 - 11)*

"చివరకు వారిలో ఎవడికైనా మరణం వస్తే వాడు, "ప్రభూ! నేను వదలిపెట్టివచ్చిన లోకానికే నన్ను తిరిగి పంపెయ్యి, ఇక నేను మంచిపనులు చేస్తానని ఆశిస్తున్నాను" అని అనటం మొదలుపెడతాడు. ఇది ఎంత మాత్రం జరిగే పనికాదు, అతను పలికేది కేవలం ఒక మాట మాత్రమే. ఇప్పుడు ఈ (మరణించేవారి) అందరివెనుక ఒక గోడ అడ్డంగా ఉన్నది. అది మరొక జీవితం వచ్చే రోజు వరకు ఉంటుంది. తరువాత శంఖం ఊదబడినంతనే వారి మధ్య ఏ బంధుత్వమూ ఉండదు. వారు ఒకరినొకరు పరామర్శించు కోరు. అప్పుడు ఎవరి (త్రాసు) పళ్ళెములు బరువుగా ఉంటాయో వారే సాఫల్యం పొందుతారు. ఎవరి (త్రాసు) పళ్లెములు తేలికగా ఉంటాయో, వారే తమను తాము నష్టానికి గురిచేసుకునేవారు. వారు నరకంలో శాశ్వతంగా ఉంటారు, అగ్ని వారి ముఖాల చర్మాన్ని తినివేస్తుంది, వారి దవడలు బయటపడతాయి -

(దేవుడు అడుగుతాడు), "నా వాక్యాలు మీకు వినిపించబడేటప్పుడు వాటిని నిరాకరించిన వారు మీరేకదా?" దానికి వారు "ఓ మా ప్రభూ! మా దౌర్భాగ్యం మమ్మల్ని కప్పేసింది. నిజం గానే మేము మార్గం తప్పినవారము. ఓ స్వామీ! ఇక మమ్మల్ని ఇక్కణ్ణుంచి బయటకు తీయి. తరువాత మేము అలాంటి పాపాలు చేస్తే దుర్మార్గులవుతాము" అని అంటారు.

﴿أَلَمْ يَأْنِ لِلَّذِينَ ءَامَنُوٓا۟ أَن تَخْشَعَ قُلُوبُهُمْ لِذِكْرِ ٱللَّهِ وَمَا نَزَلَ مِنَ ٱلْحَقِّ وَلَا يَكُونُوا۟ كَٱلَّذِينَ أُوتُوا۟ ٱلْكِتَٰبَ مِن قَبْلُ فَطَالَ عَلَيْهِمُ ٱلْأَمَدُ فَقَسَتْ قُلُوبُهُمْ وَكَثِيرٌ مِّنْهُمْ فَٰسِقُونَ ﴿١٦﴾﴾ [الحديد: ١٦] والآيات في الباب كثيرة معلومة.

అల్లాహ్ దానికి సమాధానం పలుకుతూ "నా ముందు నుంచి వెళ్ళిపోండి, ఇందులోనే పడి ఉండండి, నాతో మాట్లాడకండి" అంటాడు.

"నా దాసులు కొందరు, మా ప్రభూ! మేము విశ్వసించాము, మమ్మల్ని క్షమించు. మాపై దయచూపు, నీవు కరుణామయులలోకెల్లా ఉత్తమ కరుణామయుడవు" అని అన్నప్పుడు, వారిని పరిహసించింది మీరేకదా! చివరకు వారిపట్ల మీ మంకువైఖరి మిమ్మల్ని, "నేనూ ఒకణ్ణి ఉన్నాను" అనే విషయాన్ని కూడా మరచిపోయేలా చేసింది. మీరు వారిని పరిహసిస్తూనేపోయారు. ఈనాడు నేను వారి సహనానికి ఈ ప్రతిఫలం ఇచ్చాను. వారే సఫలురు. తరువాత అల్లాహ్ వారిని ఇలా అడుగుతాడు, "చెప్పండి, భూలోకంలో మీరు ఎన్ని సంవత్సరాలు ఉన్నారు?" దానికి వారు 'ఒకరోజో లేక రోజులో కొంత భాగమో అక్కడ ఉన్నాము. లెక్కపెట్టేవారిని అడగండి" అంటారు. అప్పుడు ఇలా సెలవీయబడు తుంది :

"కొంతకాలమే ఉన్నారు కదా! అయ్యో మీరు ఈ విషయాన్ని అప్పుడు తెలుసుకొని ఉంటే ఎంత బాగుండేది. మేము మిమ్మల్ని వృధాగానే పుట్టించామని, మా వైపుకు మీరు ఎన్నడూ మరలిరావటమనేది జరగదని భావించారా?"

*(అల్ మూమినూన్ : 99 - 115)*

"విశ్వాసుల హృదయాలు అల్లాహ్ ప్రస్తావనతో చలించే సమయం, ఆయన అవతరింపజేసిన సత్యం ముందు వంగిపోయే సమయం ఇంకా రాలేదా? పూర్వం గ్రంథం ఇవ్వబడిన ప్రజల మాదిరిగా వారు మారిపోకూడదు. ఒక సుదీర్ఘ కాలం వారిపై గడచిపోయింది. అప్పుడు వారి హృదయాలు కఠినమయ్యాయి. ఈనాడు వారిలో అనేకులు పరమ దుర్మార్గులు.

(అల్ హదీద్ : 16)

**వివరణ :**

ఇహలోకం అశాశ్వతం. ఇక్కడి సుఖాలు, ఆనందైశ్వర్యాలన్నీ ఓ మాయతడిక మాత్రమే. ఆ తర్వాత ఎన్నటికీ అంతంకాని పరలోక జీవితం మొదలవుతుంది. అక్కడి సౌఖ్యాలు, భోగ భాగ్యాలు అనంతమైనవి, శాశ్వతమైనవి. అయితే ఆ శాశ్వత సుఖమయ పరలోక జీవితానికి అర్హులు కేవలం విశ్వాసులు మాత్రమే అవుతారు. దైవ అవిధేయులకు, దైవధిక్కారులకు అక్కడ బాధాకరమైన శిక్ష ఉంటుంది. మనిషి జీవించి ఉన్నంతకాలం ఈ విషయాలేవీ పట్టించు కోడు. ఎందుకంటే ప్రాపంచిక సుఖాలు అతని కళ్ళపై ఏమరుపాటు తెరలు వేసి ఉంచుతాయి. కాని మరణించిన తరువాత వాస్తవాలు కళ్ళముందు వచ్చినప్పుడు మనిషి ఇంకోసారి ప్రపంచానికి వెళ్ళి మంచిపనులు చేసుకునే అవకాశం కోసం దేవుణ్ణి ప్రార్థిస్తాడు. కాని అది అసంభవమని తెలుసుకొని పరిపరి విధాలా చింతిస్తాడు.

మరణం ఎప్పుడొస్తుందో ఎవరికీ తెలియదు. కనుక మనిషి నిత్యం మరణాన్ని గుర్తుచేసుకుంటూ ఉండాలి. పరలోక జీవితం కోసం సన్నాహాలు చేసుకోవటంలో ఏమాత్రం నిర్లక్ష్యం వహించకూడదు.

٥٧٤ ـ وعن ابن عمرَ رضي الله عنهما قال: أَخَذَ رسولُ اللهِ ﷺ بِمَنكِبِي فَقَالَ: «كُنْ فِي الدُّنْيَا كَأَنَّكَ غَرِيبٌ أَوْ عَابِرُ سَبِيلٍ». وَكَانَ ابْنُ عُمَرَ رضي الله عنهما يقول: إذَا أَمْسَيْتَ فَلا تَنْتَظِرِ الصَّبَاحَ، وَإِذَا أَصْبَحْتَ فَلا تَنْتَظِرِ الْمَسَاءَ، وَخُذْ مِنْ صِحَّتِكَ لِمَرَضِكَ، وَمِنْ حَيَاتِكَ لِمَوْتِكَ. رواه البخاري.

574. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఓసారి నా భుజం మీద చెయ్యేసి, "ప్రపంచంలో ఓ పరదేశీయుడిలాగా లేదా ఓ బాటసారిలాగా జీవించు" అని ఉపదేశించారు.

ఇబ్నె ఉమర్ (రజి) ప్రజలతో ఇలా అనేవారు : సాయంత్రమయితే తెల్లారేదాకా వేచిచూడకు. తెల్లారితే సాయంత్రం వరకు వేచిచూడకు. ఆరోగ్యంగా ఉన్నప్పుడు అనారోగ్య పరిస్థితుల కోసం, బ్రతికుండగానే మరణానంతర జీవితం కోసం ఏర్పాట్లు చేసుకో. (బుఖారీ)

٥٧٥ ـ وعنه أنَّ رسولَ اللهِ ﷺ قال: «مَا حَقُّ امْرِىءٍ مُسْلِمٍ، لَهُ شَيْءٌ يُوصِي فِيهِ يَبِيتُ لَيْلَتَيْنِ إِلَّا وَوَصِيَّتُهُ مَكْتُوبَةٌ عِنْدَهُ» متفقٌ عليه، هذا لفظ البخاري. وفي

575. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి)గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : ఒక ముస్లిం దగ్గర వీలునామా వ్రాయవలసిన వస్తువేదయినా ఉండి రెండు రాత్రులు

رواية لمسلم «يَبِيتُ ثَلاثَ لَيَالٍ». قال ابن عمر: مَا مَرَّتْ عَلَيَّ لَيْلَةٌ مُنْذُ سَمِعْتُ رسولَ الله ﷺ قَالَ ذٰلِكَ إلَّا وَعِنْدِي وَصِيَّتِي.

గడిచిపోయినా కూడా అతను వీలునామా వ్రాయకుండా ఉంటే అది అతనికి ఎంతమాత్రం సమ్మతం కాదు. (బుఖారీ - ముస్లిం. పై వాక్యాలు బుఖారీవి.)

ముస్లింలోని వాక్యాలు ఈ విధంగా ఉన్నాయి. మూడు రాత్రులు గడిచి పోయినా వీలునామా వ్రాయకుండా ఉండటం (సమ్మతం కాదు).

హజ్రత్ ఇబ్నె ఉమర్ ఉవాచ : దైవప్రవక్త (సల్లం) ఈ మాట అన్న తరువాత నేను ఒక్క రాత్రయినా నా దగ్గర వీలునామా వ్రాసిపెట్టుకోకుండా గడపలేదు.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని వీలునామాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఎవరి మరణం ఎప్పుడొస్తుందో ఎవరికీ తెలియదు. కాబట్టి ధనవంతులైన వాళ్ళు ముందుగానే తమ ఆస్తికి సంబంధించిన వీలునామాలు వ్రాసిపెట్టుకోవాలి. దాంతో వారి మరణానంతరం ఆస్తి పంపిణీ వ్యవహారాల్లో వారి బాధ్యత తీరిపోయినట్లవుతుంది. వారసుల మధ్య తగాదాలు చెలరేగకుండా ఉంటాయి. అందుకే దైవప్రవక్త (సల్లం) ముస్లింలు వీలైనంత త్వరగా వీలునామాలు వ్రాసి ఉంచుకోవాలని తాకీదు చేశారు.

٥٧٦ ـ وعن أنس رضي الله عنه قال: خَطَّ النَّبِيُّ ﷺ خُطُوطاً فقال: «هذا الإِنسَانُ، وَهذا أَجَلُهُ، فَبَيْنَمَا هُوَ كَذٰلِكَ إذ جَاءَ الخَطُّ الأَقْرَبُ» رواه البخاري.

576. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) అనేక గీతలు గీసి చూపిస్తూ, “ఈ (గీత) మానవుడు (అంటే అతని కోరికలు). ఇది అతని చావు. మానవుడు తన కోరికల్లో నిమగ్నుడై ఉన్నంతలోనే అతని దగ్గరికి సమీప గీత (చావు) వచ్చేస్తుంది. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

٥٧٧ ـ وعن ابنِ مسعُودٍ رضيَ الله عنه قال: خطَّ النَّبيُّ ﷺ خطًّا مُرَبَّعاً، وَخَطَّ خَطًّا في الوَسَطِ خَارِجاً مِنْهُ، وَخطَّ خُطَطاً صِغَاراً إلى هٰذَا الَّذي في الوَسَطِ مِنْ جَانِبِهِ الَّذي في الوَسَطِ، فَقَالَ: «هٰذَا الإنسَانُ، وَهٰذَا أَجَلُهُ مُحِيطاً بِهِ ـ أَوْ قَدْ أَحَاطَ بِهِ ـ وَهٰذَا الَّذي هُوَ خَارِجٌ أَمَلُهُ، وَهٰذِه الخُطَطُ الصِّغَارُ الأَعْرَاضُ، فَإنْ أَخْطَأَهُ هٰذَا نَهَشَهُ هٰذَا، وَإنْ أَخْطَأَهُ هٰذَا نَهَشَهُ هٰذَا» رواه البخاري. وَهٰذِهِ صُورَتُهُ:

577. హ(జత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) చతురస్రాకారపు గీతలు గీశారు. దాని మధ్యలో నుండి బయటికి వచ్చేలా మరో (పెద్ద) గీత గీశారు. దాని ప్రక్కన ఇంకొన్ని చిన్న చిన్న గీతలు గీశారు. ఆ తరువాత వాటి వైపు చూపిస్తూ, ఇది మానవుడు. అతని చుట్టూవున్న ఈ (చతురస్రాకారపు) గీతలు అతని చావు. ఈ బయటికి వెళ్తున్న గీత అతని కోరికలు. ఈ చిన్న చిన్న గీతలు మనిషికి ఎదురయ్యే విపత్తులు. ఒక విపత్తు తప్పిపోయినా మరో విపత్తు అతనిపై వచ్చిపడుతుంది. ఒకదాని నుండి బయటపడినా మరో విపత్తులో చిక్కుకుంటాడు. (బుఖారీ)

దాని రేఖాచిత్రం ఇలా ఉంటుంది :




*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మానవ జీవితం విపత్తుల వలయం. మనిషికి ఎప్పుడూ ఏదో ఒక రకమైన ఆపదలు వస్తూనే ఉంటాయి. ఆ ఆపదల్లోనే అతని జీవితం కడతేరుతుంది. అలాంటి అనిశ్చిత జీవితంలోనే మనిషి అంతులేని కోరికలు కోరుకుంటాడు. వాటిని తీర్చుకోవటానికి దైవాన్ని, ధర్మాన్ని విస్మరించి ఎడారుల్లో ఎండమావుల కోసం పరుగెత్తినట్లు తన మనోవాంఛల వెంట పరుగెత్తుతాడు. చివరికి మిగిలేది శూన్యం. అతని కోరికలు ఎన్నటికీ తీరవు. తీరిన ప్రతికోరిక మరో కోరికను వెంటేసుకొని వస్తుంది. అతని కోరికలు నెరవేరకముందే అతనిపైకి మృత్యువు పంజా విసురుతుంది.

మనిషి చావు ఎల్లప్పుడూ అతని తలమీదే వ్రేలాడుతూ ఉంటుంది. అంచేత మనిషి ఎన్నడూ చావుపట్ల ఏమరుపాటుకు లోనుకారాదు. ఎన్నటికీ నెరవేరని కోరికల వెంటపడి చావుని విస్మరించడం వివేకం అనిపించుకోదు సుమా!

578. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఏడు రకాల పరిస్థితులు దాపురించకమునుపే త్వరగా మంచి పనులు చేసుకోండి. మిమ్మల్ని (ధర్మం) మరచిపోయేటట్లు చేసే పేదరికం కోసం నిరీక్షిస్తున్నారా? లేక హద్దు మీరి ప్రవర్తించేటట్టు చేసే కలిమిని కోరుకుంటున్నారా? లేక మీ ఆరోగ్యాన్ని పాడుచేసే రోగం కోసం ఎదురుచూస్తున్నారా? లేక బుద్ధిని, వివేకాన్ని చెడగొట్టే వృద్ధాప్యం కోసం ఎదురుచూస్తున్నారా? లేక తృటిలో ప్రాణాలు తీసే మరణం కోసం ఎదురుచూస్తున్నారా? లేక దజ్జాల్ రాక కోసం ఎదురుచూస్తున్నారా? అతను అగోచరాల్లో అత్యంత హానికరమైన వాడు. ప్రళయం కోసం ఎదురుచూస్తున్నారా? ప్రళయం అతి భయంకరమైనది, అత్యంత చేదైనది. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు).

٥٧٨ ـ وعن أبي هريرة رضيَ اللهُ عنه أنَّ رسُولَ الله ﷺ قال: «بَادِرُوا بالأعْمَالِ سَبْعاً، هَلْ تَنتَظِرُونَ إلَّا فَقْراً مُنْسِياً، أوْ غِنًى مُطغِياً، أوْ مَرَضاً مُفْسِداً، أوْ هَرَماً مُفَنِّداً، أوْ مَوْتاً مُجْهِزاً، أوِ الدَّجَّالَ، فَشَرُّ غَائِبٍ يُنْتَظَرُ، أوِ السَّاعَةَ وَالسَّاعَةُ أدْهَى وَأَمَرُّ؟!» رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయాలు)*

579. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మజాలను హరించేదాన్ని అంటే చావుని అతి ఎక్కువగా గుర్తుచేసుకుంటూ ఉండండి. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు).

٥٧٩ ـ وعنه قال: قال رسولُ الله ﷺ: «أكْثِرُوا ذِكْرَ هَاذِمِ اللَّذَّاتِ» يَعني المَوْتَ، رواه التِّرمذيُّ وقال: حديثٌ حسنٌ.

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయాలు)*

580. హజ్రత్ ఉబై బిన్ కాబ్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) మూడో వంతు రాత్రి గడిచిన తరువాత లేచి ఇలా అనేవారు : ప్రజలారా! దైవాన్ని స్మరించండి. శరీరంలో దడ పుట్టించేది (తొలి శంఖారావం) వచ్చేసింది. దాని తరువాత వచ్చేది కూడా (రెండో శంఖారావం) సమీపించింది. మృత్యువు తన భీతావహరూపంతో వచ్చేసింది, మృత్యువు తన భీతావహ రూపంతో వచ్చేసింది.

నేను దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ, "దైవప్రవక్తా! నేను చాలా ఎక్కువగా మీకోసం దరూద్ పంపుతూ ఉంటాను. అయితే నేను మీ దరూద్ కోసం ఎంత సమయం కేటాయించనూ?" అని అడిగాను. దానికాయన 'నీకిష్టమైనంతసేపు కేటాయించుకో' అని అన్నారు. నేను, "నాల్గోవంతు సమయం కేటాయించుకోనా?" అని అడిగాను. "నీ యిష్టం. ఇంకా ఎక్కువ కేటాయించుకుంటే నీకే లాభం" అని అన్నారాయన. "అయితే సగం సమయం దానికోసమే కేటాయించుకోమంటారా?" అని అడిగాను. "నీ యిష్టం. ఇంకా ఎక్కువ కేటాయించుకుంటే నీకే లాభం" అని అన్నారాయన. నేను మళ్ళీ "అయితే మూడింట రెండొంతుల సమయం మీ దరూద్ కోసమే కేటాయించుకుంటాను" అని అన్నాను. అప్పుడు కూడా ఆయన, "నీ యిష్టం. ఇంకా ఎక్కువ కేటాయించు

٥٨٠ ـ وعن أُبيِّ بنِ كعب رَضيَ اللهُ عنه: كَانَ رَسولُ اللهِ ﷺ إذا ذَهَبَ ثُلثُ اللَّيْلِ، قامَ فقالَ: «يا أَيها النَّاسُ! اذْكُرُوا اللهَ جَاءَتِ الراجِفَةُ تَتْبَعُها الرَّادِفَةُ، جاءَ المَوْتُ بما فِيهِ، جاءَ المَوْتُ بِمَا فِيهِ» قلتُ: يَارَسُولَ اللهِ! إنّي أُكْثِرُ الصَّلاةَ عَلَيْكَ، فَكَمْ أَجْعَلُ لكَ مِنْ صَلاتِي؟ قالَ: «مَا شِئْتَ» قُلْتُ: الرُّبُعَ؟ قالَ: «مَا شِئْتَ، فَإِنْ زِدتَ فَهُوَ خَيْرٌ لَكَ» قلتُ: فَالنِّصْفَ؟ قالَ: «مَا شِئْتَ، فَإِنْ زِدتَ فَهُوَ خَيْرٌ لَكَ» قلتُ: فَالثُّلُثَيْنِ؟ قالَ: «مَا شِئْتَ، فَإِنْ

زِدتَ فَهُوَ خَيْرٌ لَكَ» قلتُ: أَجْعَلُ لَكَ صَلاتِي كُلَّهَا؟ قالَ: «إذاً تُكْفى هَمَّكَ، وَيُغْفَرُ لَكَ ذَنْبُكَ» رواهُ الترمذي وقال: حديث حسن.

కుంటే నీకే మంచిది" అనే అన్నారు. ఆఖరికి నేను, "దైవప్రవక్తా! నేను నా సమయమంతా మీ దరూద్ కోసమే అంకితం చేసుకుంటున్నాను" అని అన్నాను. అందుకాయన, "అలాగయితే నువ్వు చేసే ఈ ఆచరణ నీ దుఃఖాలకు (విరుగుడుగా) పనికొస్తుంది. ఇంకా దీనివల్ల నీ పాపాలు కూడా క్షమించబడతాయి" అని చెప్పారు. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు).

*(సుననె తిర్మిజీలోని ప్రళయ వర్ణన అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

'రాజిఫహ్' అంటే దడ పుట్టించేదని అర్థం. ప్రళయం సంభవించే కాలంలో ఇస్రాఫీల్ దూత మొదటిసారి శంఖం పూరించినప్పుడు భూమి, పర్వతాలు మొదలగు సృష్టిరాసులన్నీ నుజ్జునుజ్జయిపోతాయి. అందుకే ప్రళయాన్ని తొలిశంఖారావం పేరుతో 'రాజిఫహ్' అని కూడా పిలుస్తారు. ఆ తరువాత రెండోసారి శంఖం పూరించబడుతుంది. దాన్ని 'రాదిఫహ్' అని అంటారు. మొత్తానికి దైవప్రవక్త (సల్లం) ఈ హదీసులో మనిషికి మరణ సమయంలో ఎదురయ్యే భీతావహ పరిస్థితుల్ని గురించి వివరించారు.



## 66వ అధ్యాయం

# ٦٦- بَابُ اسْتِحْبَابِ زِيَارَةِ الْقُبُورِ لِلرِّجَالِ وَمَا يَقُولُهُ الزَّائِرُ

# పురుషులు సమాధుల్ని సందర్శించటం గురించి.....

٥٨١- عن بُرَيْدَةَ، رضيَ اللهُ عنه قال: قال رسُولُ اللهِ ﷺ: «كُنْتُ نَهَيْتُكُمْ عَنْ زِيَارَةِ الْقُبُورِ فَزُورُوهَا» رواهُ مسلم.

581. హజ్రత్ బురైదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఓసారి ప్రజలతో ఇలా అన్నారు : ఇంతకు ముందు నేను మిమ్మల్ని సమాధులను సందర్శించవద్దని వారించేవాణ్ణి. కాని ఇప్పుడు చెబుతున్నాను. మీరు సమాధులను సందర్శించండి. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఇస్లాం ఆవిర్భవించిన తొలినాళ్ళలో దైవప్రవక్త (సల్లం) తన అనుచరులను సమాధుల్ని సందర్శించవద్దని వారించారు. అనుచరులు క్రొత్తగా ఇస్లాం స్వీకరించిన వారవటంచేత సమాధులను సందర్శించినప్పుడు అజ్ఞానకాలపు భావోద్రేకాలకు లోనయి షరీఅత్‌కు విరుద్ధమయిన పనులు చేస్తారేమోనని ఆయన తల్లడిల్లేవారు. అయితే ఆ తరువాతి కాలంలో వారు ఇస్లామీయ సూత్రాల్ని బాగా ఆకళింపు చేసుకొని నికార్సయిన ముస్లింలుగా పరిణతిచెందిన తరువాత ఆయనకు ఆ భయం వీడిపోయింది. అప్పుడాయన తన అనుచరులు సమాధుల్ని సందర్శించేందుకు అనుమతినిచ్చారు. పైగా తరచూ సందర్శిస్తూ ఉండాలని తాకీదు చేశారు. తామూ ఏదో ఒకనాడు మరణించేవారమేనన్న భావన ప్రజల మనోమస్తిష్కాలలో మెదులుతూ ఉండాలన్నదే ఆయన ప్రవచనంలోని ఉద్దేశ్యం.

ఇకపోతే స్త్రీలు సమాధుల్ని సందర్శించవచ్చా లేదా? అన్న విషయంలో పండితులు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేస్తున్నారు. వాటిలో అన్నిటికన్నా సహేతుకమైన విషయం ఏమిటంటే, స్త్రీలు కూడా సమాధుల్ని సందర్శించవచ్చు. అయితే వారు అక్కడికి వెళ్ళి షరీఅత్‌కు విరుద్ధమైన అవాంఛనీయ చేష్టలకు పాల్పడకుండా జాగ్రత్తపడాలి.

٥٨٢- وعن عائشةَ رضيَ اللهُ عنها قالت: كان رسُولُ اللهِ ﷺ، كُلَّمَا كانَ

582. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం)తో నా దాంపత్య వంతు వచ్చిన ప్రతి రాత్రి ఆఖరి జాములో ఆయన 'బఖీ'

لَيْلَتَهَا مِنْ رسولِ اللهِ ﷺ يَخْرُجُ مِنْ آخِرِ اللَّيْلِ إلى البَقِيعِ، فيَقُولُ: «السَّلامُ عَلَيْكُمْ دَارَ قَوْمٍ مُؤْمِنِينَ، وَأَتَاكُمْ مَا تُوعَدُونَ، غَداً مُؤَجَّلُونَ، وَإِنَّا إِنْ شَاءَ اللهُ بِكُمْ لاحِقُونَ، اللَّهُمَّ اغْفِرْ لأَهْلِ بَقِيعِ الغَرْقَدِ» رواهُ مسلم.

శ్మశానానికి వెళ్ళి ఇలా ప్రార్థించేవారు :

"అస్సలాము అలైకుమ్ దార ఖౌమిన్ మూమినీన్ వ ఆతాకుమ్ మా తూఅదూన, గదన్ ముఅజ్జలూన వ ఇన్నా ఇన్‌షా అల్లాహు బికుమ్ లాహిఖూన, అల్లాహుమ్మగ్‌ఫిర్ లి అహ్లి బఖీయిల్ గర్‌ఖద్."

ఓ ముస్లిం వాడ ప్రజలారా! మీకు శాంతి కల్గుగాక! మీతో వాగ్దానం చేయబడిన రేపటి దినం వచ్చేసింది. దైవం తలిస్తే మేము కూడా మిమ్మల్ని కలుసుకుంటాం. దేవా! బఖీవాసులను క్షమించు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా రాత్రివేళ కూడా సమాధుల్ని సందర్శించటానికి వెళ్ళవచ్చునని తెలుస్తోంది. సందర్శకులు శ్మశానానికి వెళ్ళినప్పుడు హదీసులో పేర్కొనబడిన విధంగా ప్రార్థించాలి. సమాధుల్లో ఉన్నవారి మన్నింపుకోసం దైవాన్ని వేడుకోవాలి. అయితే ఒక విషయం గమనార్హం. ఇక్కడ 'అస్సలాము అలైకుం' అనేది ఒక ప్రార్థన మాత్రమే. ఎందుకంటే సమాధుల్లో ఉన్నవారు సందర్శకుల సలాంను విని వారికి జవాబుగా ప్రతి సలాం చేస్తారని ఎక్కడా లేదు. ఒకవేళ దైవం కోరితే ప్రజల మాటల్ని సమాధుల్లో ఉన్న మృతులకు వినిపించగలడు. అంతేకాని వారు తప్పకుండా విని సలాంకు ప్రతి సలాం చేస్తారన్న భావన సరైనది కాదు. నిజమేమిటో దైవానికే బాగా తెలుసు. కాబట్టి మనవరకు మనం దైవప్రవక్త (సల్లం) సంప్రదాయాన్ని పాటిస్తున్నామనే భావనతోనే సమాధుల్లో ఉన్నవారికి సలాం చెయ్యాలి.

٥٨٣ - وعن بُرَيْدَةَ رضيَ اللهُ عنهُ قال: كَانَ النَّبِيُّ ﷺ يُعَلِّمُهُمْ إِذَا خَرَجُوا إِلى المَقَابِرِ أَنْ يَقُولَ قَائِلُهُمْ: «السَّلامُ عَلَيْكُمْ أَهْلَ الدِّيَارِ مِنَ المُؤْمِنِينَ وَالمُسْلِمِينَ وَإِنَّا إِنْ شَاءَ اللهُ بِكُمْ لَلاحِقُونَ، أَسْأَلُ اللهَ لَنَا وَلَكُمُ العَافِيَةَ» رواهُ مسلم.

583. హజ్రత్ బురైదా (రజి) కథనం ప్రకారం ప్రజలు శ్మశానానికి వెళ్ళినప్పుడు దైవప్రవక్త (సల్లం) వారికి ఈవిధంగా ప్రార్థించమని బోధించేవారు :

"అస్సలాము అలైకుం అహ్లద్దియారి మినల్ మూమినీన వల్ ముస్లిమీన వ ఇన్నా ఇన్షాఅల్లాహు బికుమ్ లలాహిఖూన, అస్‌అలుల్లాహ లనా వలకుముల్ ఆఫియహ్."

విశ్వాసుల, ముస్లింల వాడ ప్రజలారా! మీకు శాంతి కల్గుగాక! దైవం తలచుకుంటే తప్పకుండా మేము కూడా మిమ్మల్ని కలుసుకుంటాం. నాకూ, మీకూ క్షేమాన్ని ప్రసాదించమని నేను దైవాన్ని కోరుకుంటున్నాను. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లిం - జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ద్వారా ప్రజలు శ్మశానాలకు వెళ్ళి చనిపోయిన తమ బంధుమిత్రుల మన్నింపుకోసం ప్రార్థించుకోవచ్చని తెలుస్తోంది. బ్రతికున్నవారి ప్రార్థనవల్ల చనిపోయినవారికి ప్రయోజనం కలుగుతుంది. అంతేగాని సమాధులపై పుష్పగుచ్ఛాలు ఉంచటం వల్ల, వాటిపై దుప్పట్లు కప్పటం వల్ల మృతులకు ఎలాంటి ప్రయోజనం కలగదు. అదో వ్యర్థ ప్రయాస మాత్రమే.

584. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: ఓసారి దైవప్రవక్త (సల్లం) మదీనాలో కొందరి సమాధుల సమీపం నుండి వెళ్తూ వాటి వైపునకు తిరిగి ఇలా అన్నారు :

"అస్సలాము అలైకుం యా అహ్లల్ ఖుబూర్ యగ్ఫిరుల్లాహు లనా వలకుమ్ అంతుమ్ సలఫునా వ నహ్ను బిల్ అస్రి."

"ఓ సమాధి వాసులారా! మీకు శాంతి కల్గుగాక! దేవుడు మమ్మల్ని, మిమ్మల్నందరినీ క్షమించాలి, మీరు మాకంటే ముందే వెళ్ళిపోయారు. మేము మీ వెనకే రాబోతున్నాం."(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్'గా పేర్కొన్నారు)

*(సుననె తిర్మిజీలోని జనాయెజ్ అధ్యాయం)*

٥٨٤ـ وعن ابنِ عَبَّاسٍ، رَضيَ اللهُ عنهما، قال: مَرَّ رسُولُ اللهِ ﷺ بقُبُورٍ بِالمَدِينَةِ فَأَقْبَلَ عَلَيْهِمْ بِوَجْهِهِ فقالَ: «السَّلامُ عَلَيْكُمْ يَا أَهْلَ القُبُورِ، يَغْفِرُ اللهُ لَنَا وَلَكُمْ، أَنْتُمْ سَلَفُنَا وَنَحْنُ بِالأَثَرِ» رواهُ الترمذي وقال: حديث حسن.

## 67వ అధ్యాయం

## ٦٧ـ بَابُ كَرَاهِيَةِ تَمَنِّي الْمَوْتِ بِسَبَبِ ضُرٍّ نَزَلَ بِهِ وَلَا بَأْسَ بِهِ لِخَوْفِ الْفِتْنَةِ فِي الدِّينِ

## ఆపదలు వచ్చిపడినప్పుడు చావుని కోరుకోవటం అవాంఛనీయం, ధర్మంలో ఉపద్రవాలు తలెత్తినప్పుడు మాత్రం అలా కోరుకోవడంలో తప్పులేదు

٥٨٥ـ عَنْ أبي هُريرة رضيَ اللهُ عنه أنَّ رسُولَ اللهِ ﷺ قال: «لا يَتَمَنَّى أَحَدُكُمُ المَوْتَ إمَّا مُحْسناً، فَلَعَلَّهُ يَزْدَادُ، وَإمَّا مُسيئاً فَلَعَلَّهُ يَسْتَعْتِبُ» متفقٌ عليه، وهذا لفظ البخاري. وفي روايةٍ لمسلم عن أبي هُرَيْرَةَ رضيَ اللهُ عنه عن رسُولِ اللهِ ﷺ قال: «لا يَتَمَنَّيَنَّ أَحَدُكُمُ المَوْتَ، وَلا يَدْعُ بِهِ مِنْ قَبْلِ أَنْ يَأْتِيَهُ؛ إنَّهُ إذَا ماتَ انْقَطَعَ عَمَلُهُ، وَإنَّهُ لا يَزِيدُ المُؤْمِنَ عُمُرُهُ إلَّا خيراً».

585. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీలో ఎవరూ (కావాలని) చావుని కోరుకోరాదు. ఎందుకంటే ఒకవేళ అతను మంచివాడైతే (బ్రతికుంటే) మరిన్ని మంచిపనులు చేసుకోగల్గుతాడు! లేదా అతను చెడ్డవాడయినా (ముస్ముందు) పశ్చాత్తాపం చెందగలడు! *(బుఖారీ - ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో అబూ హురైరా (రజి) గారి కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: మీలో ఎవరూ చావుని కోరుకోరాదు. అది రాకమునుపే దానికోసం ప్రార్థించరాదు. ఎందుకంటే చావుతోటే అతని కర్మల పరంపర ఆగిపోతుంది. ఒక విశ్వాసి ఆయుష్షు పెరిగితే దాని వల్ల అతనికి లాభమే (గాని నష్టం లేదు).

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని ప్రార్థనల ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

పై రెండు హదీసులు మనిషి చావుని కోరుకోరాదని చెబుతున్నాయి. విశ్వాసులైన వారికి ఎక్కువ ఆయుష్షు లభిస్తే అది వారికి అన్నివిధాలా ప్రయోజనకరమే. విశ్వాసులు ఎంత ఎక్కువ కాలం బ్రతికితే అన్ని ఎక్కువ పుణ్యకార్యాలు చేసుకుంటారు. ఒకవేళ పొరపాటున ఏదైనా తప్పు జరిగిపోయినా తిరిగి పశ్చాత్తాపం చెందుతారు. కనుక విశ్వాసులు తమకు లభించిన ఆయుష్షును సువర్ణావకాశంగా భావించి వీలైనంత ఎక్కువగా పుణ్యాలు చేసుకోవటానికి ప్రయత్నించాలి.

586. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీలో ఎవరూ కూడా తనకేదయినా నష్టం కలిగినప్పుడు చావుని కోరుకోరాదు. గత్యంతరం లేదనుకుంటే ఇలా వేడుకోవాలి :

"అల్లాహుమ్మ అహ్‌యినీ మాకానతిల్ హయాతు ఖైరన్ లీ, వ తవఫ్ఫనీ ఇజా కానతిల్ వఫాతు ఖైరన్ లీ." "దేవా! జీవితం నా పాలిట ప్రయోజనకరమైనంతవరకూ నన్ను సజీవంగా ఉంచు, ఒకవేళ మరణమే నాకోసం మేలయితే అప్పుడు నాకు మరణాన్ని ప్రసాదించు." (బుఖారీ - ముస్లిం)

٥٨٦ـ وعن أنسٍ رضيَ الله عنه قال: قالَ رسُولُ الله ﷺ: «لا يَتَمَنَّيَنَّ أَحَدُكُمُ المَوْتَ لِضُرٍّ أَصَابَهُ، فَإِنْ كَانَ لا بُدَّ فَاعِلاً، فَلْيَقُلِ: اللَّهُمَّ أَحْيِنِي مَا كَانَتِ الحَيَاةُ خَيْراً لِي، وَتَوَفَّنِي إِذَا كَانَتِ الوَفَاةُ خَيْراً لِي» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ప్రార్థనల ప్రకరణం)*

587. హజ్రత్ ఖైస్ బిన్ అబూ హాజిం (రహ్మ.లై) కథనం: మేము ఖబ్బాబ్ బిన్ అరత్ (రజి)ని పరామర్శించేందుకు ఆయన ఇంటికి వెళ్ళాం. ఆ సమయంలో ఆయన (ఏదో వ్యాధికి

٥٨٧ـ وعَنْ قَيْسِ بنِ أبي حازم قالَ: دَخَلْنا عَلى خَبَّابِ بنِ الأَرَتِّ رضيَ اللهُ عنهُ نَعُودُهُ وَقَدِ اكْتَوَى سَبْعَ كَيَّاتٍ

فقال: إنَّ أَصْحَابَنَا الَّذينَ سَلَفُوا مَضَوْا، وَلَمْ تَنْقُصْهُمُ الدُّنْيَا، وَإِنَّا أَصَبْنَا مَا لا نَجِدُ لَهُ مَوْضعاً إلَّا التُّرَابَ وَلَوْلا أَنَّ النَّبيَّ ﷺ نَهَانَا أَنْ نَدْعُوَ بِالمَوْتِ لَدَعَوْتُ بِهِ، ثُمَّ أَتَيْنَاهُ مَرَّةً أُخرَى وَهُوَ يَبْنِي حَائِطاً لَهُ، فقال: إنَّ المُسْلِمَ لَيُؤْجَرُ في كُلِّ شَيْءٍ يُنْفِقُهُ إلا في شَيْءٍ يَجْعَلُهُ في هٰذَا التُّرَابِ. متفقٌ عليه، وهذا لفظ رواية البخاري.

చికిత్సగా) ఏడు వాతలు పెట్టించుకొని వున్నారు. అప్పుడాయన మాతో మాట్లాడుతూ ఇలా అన్నారు :

"మన పూర్వీకులైన సహచరులు గతించి పోయారు. వారు ప్రపంచంలో జీవించినా వారి పుణ్యంలో మాత్రం ఎలాంటి లోటు ఏర్పడలేదు. (కారణం వారు ఇహలోకపు భాగ్యాల్ని అనుభవించ లేదు). కాని ఇప్పుడు మనకు ఎన్నో సిరిసంపదలు కలిగాయి. వాటిని భవన నిర్మాణాల్లో ఉపయోగించటం తప్ప ఖర్చుపెట్టటానికి మనకు వేరే మార్గం కనిపించటం లేదు. దైవప్రవక్త (సల్లం) చావును కోరుకోవద్దని మనకు తాకీదు చేశారు. లేకపోతే నేను తప్పకుండా చావుని కోరుకునేవాణ్ణి."

రెండోసారి మేమాయన్ని పరామర్శించటానికి వెళ్ళినప్పుడు ఆయన ఏదో గోడ కట్టే పనిలో ఉన్నారు. మమ్మల్ని చూసి ఆయన, "విశ్వాసి దేనికోసం డబ్బు ఖర్చుపెట్టినా అతనికి పుణ్యం లభిస్తుంది. కాని ఈ మట్టి (నిర్మాణాల) కోసం ఖర్చుపెడితే మాత్రం అతనికి పుణ్యం లభించదు" అని అన్నారు.

(బుఖారీ - ముస్లిం, వాక్యాలు బుఖారీవి).

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని దైవధ్యానం, ప్రార్థనల ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

పూర్వ కాలంలో కొన్ని రోగాలకు చికిత్స నిమిత్తం శరీరంమీద వాతలు పెట్టించుకునేవారు. సదరు హదీసులో దైవప్రవక్త అనుచరులు ఖబ్బాబ్ (రజి) కూడా తన శరీరం మీద ఏడుచోట్ల వాతలు పెట్టించుకున్నారని తెలుస్తోంది. అయితే చికిత్స నిమిత్తమయినా ఈ విధంగా శరీరం మీద వాతలు పెట్టటం ఎంతవరకు సమంజసం? దీనిగురించి దైవప్రవక్త(సల్లం) బోధనలు చెప్పేదేమిటంటే ఇతర చికిత్సావిధానాలు, మందులు ఉన్నప్పుడు ఈ విధంగా శరీరం మీద వాతలుపెట్టే చికిత్సను ఆశ్రయించకుండా ఉండటమే మంచిది.

"ఈ మట్టికోసం ఖర్చుపెడితే పుణ్యం లభించదు" అంటే అవసరానికి మించి భవన నిర్మాణపు పనుల్లో డబ్బు ఖర్చుపెడితే దానివల్ల పుణ్యం లభించదని భావం. మనిషికి తలదాచు కోవటానికి, ఎండకు వానకు చలికి తట్టుకోవటానికి, క్రూరమృగాల నుంచి సురక్షితంగా ఉండ టానికి ఒక ఇల్లు ఎంతైనా అవసరం. అది మనిషి జీవితపు కనీస అవసరం. కనుక పై హదీసులో వచ్చిన హెచ్చరిక కేవలం అవసరానికి మించిన భవన నిర్మాణాలపై అవసరానికి మించి ఖర్చు చేయటానికి మాత్రమే సంబంధించినది. శోచనీయమైన విషయం ఏమిటంటే ఈ రోజుల్లో ముస్లింల సంపద మొత్తం వివాహ వేడుకల సందర్భంగా అనవసరమైన ఆచారాల పేరిట దుబారాగా ఖర్చవుతోంది లేదా పెద్ద పెద్ద భవంతులు, ఎత్తయిన మేడలు కట్టడంలో ఖర్చవు తోంది!



**68వ అధ్యాయం**

# ٦٨ـ بَابُ الْوَرَعِ وَتَرْكِ الشُّبُهَاتِ

# సందేహాస్పద విషయాల జోలికి పోరాదు

قال الله تعالى: ﴿وَتَحْسَبُونَهُ هَيِّنًا وَهُوَ عِندَ اللَّهِ عَظِيمٌ ﴾ [النور: ١٥] وقال تعالى: ﴿إِنَّ رَبَّكَ لَبِالْمِرْصَادِ﴾ [الفجر: ١٤].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"మీరు దానిని మామూలు విషయంగా భావించారు. వాస్తవానికి అల్లాహ్ దృష్టిలో అది చాలా పెద్ద విషయం." *(అన్ నూర్ : 15)*

"నిస్సందేహంగా నీ ప్రభువు మాటేసి ఉన్నాడు. (అంటే మీ ఆచరణల్ని పరీక్షిస్తున్నాడు)." *(అల్ ఫజ్ర్ : 14)*

**వివరణ :**

పైన పేర్కొనబడిన దివ్య ఖుర్‌ఆన్ సూక్తుల్లో మొదటి సూక్తి దైవప్రవక్త సతీమణి హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) పై కపటులు, అవిశ్వాసులు కలిసి అభాండాన్ని సృష్టించినప్పుడు ఆమె సౌశీల్యాన్ని, పాతివ్రత్యాన్ని చాటుతూ అవతరించినది. దురదృష్టవశాత్తు కొంతమంది ముస్లింలు కూడా కపటులకు వంతపాడి ఆ పాపంలో పాలుపంచుకున్నారు. కారణం వారు దాన్ని మామూలు విషయంగా భావించడమే. కాని ఆ తర్వాత దైవప్రవక్త సతీమణిపై అభాండాలు వేయటం మామూలు విషయం కాదని, అది ఘోరాతిఘోరమైన నేరమని దేవుడు ముస్లింలను హెచ్చరించాడు.

ఇకపోతే గ్రంథకర్త ఈ సూక్తిని సదరు అధ్యాయం క్రింద ప్రస్తావించటంలోని ఔచిత్యం ఏమిటంటే సాధారణంగా మనిషి మామూలు విషయాలుగా భావించి ఎన్నో తప్పులు, పాపాలకు ఒడిగడుతుంటాడు. నిజానికి ఎంత చిన్నదయినప్పటికీ పాపం పాపమే.

٥٨٨ـ وعن النُّعْمَانِ بنِ بَشِيرٍ رضيَ اللهُ عنهما قال: سَمِعْتُ رسُولَ اللهِ ﷺ يقُولُ: «إنَّ الحلالَ بَيِّنٌ، وَإنَّ الحَرَامَ بَيِّنٌ، وَبَيْنَهُمَا مُشْتَبِهَاتٌ لا يَعْلَمُهُنَّ كَثِيرٌ مِنَ النَّاسِ، فَمَنِ اتَّقَى الشُّبُهَاتِ، اسْتَبْرَأَ لِدِينِهِ وَعِرْضِهِ، وَمَنْ

588. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ నోమాన్ బిన్ బషీర్ (రజి) తెలియజేశారు: హలాల్ (ధర్మసమ్మతమైన) విషయాలేవో స్పష్టంగా తెలియజేయబడ్డాయి. హరామ్ (నిషిద్ధ) విషయాలు కూడా స్పష్టంగా తెలియజేయబడ్డాయి. అయితే ఆ రెండింటిమధ్య అనుమానాస్పద

وَقَعَ فِي الشُّبُهَاتِ ، وَقَعَ فِي الحَرَامِ، كَالرَّاعِي يَرْعَى حَوْلَ الحِمَى يُوشِكُ أَنْ يَرْتَعَ فِيهِ، أَلاَ وَإِنَّ لِكُلِّ مَلِكٍ حِمَى، أَلا وَإِنَّ حِمَى اللهِ مَحَارِمُهُ، أَلا وَإِنَّ فِي الجَسَدِ مُضغَةً إِذَا صَلَحَت صَلَحَ الجَسَدُ كُلُّهُ، وَإِذَا فَسَدَتْ فَسَدَ الجَسَدُ كُلُّهُ، أَلا وَهِيَ القَلْبُ» متفقٌ عليه. وَرَوَيَاهُ مِنْ طُرُقٍ بِأَلفَاظٍ مُتَقَارِبَةٍ.

విషయాలు కొన్ని ఉన్నాయి. వాటి గురించి చాలామందికి తెలియదు. కాబట్టి అనుమానాస్పద విషయాలకు దూరంగా ఉన్నవాడు తన ధర్మాన్ని, గౌరవాన్ని కాపాడుకున్నవాడవుతాడు. దీనికి భిన్నంగా అనుమానాస్పద విషయాల జోలికి పోయినవాడు నిషిద్ధ విషయాల్లో పడిపోయే ప్రమాదముంది. అతడు గరిక గట్టుపై పశువుల్ని మేపుకుంటున్న కాపరి లాంటివాడని చెప్పవచ్చు. అతని పశువులు (ఏ క్షణంలోనయినా) గట్టుదాటి ప్రక్కనున్న పొలంలోకి వెళ్ళి మేసే ప్రమాదముంటుంది.

వినండి! ప్రతి రాజుకీ నిర్ణీత సరిహద్దులుంటాయి.అలాగే అల్లాహ్ (సామ్రాజ్య) సరిహద్దులంటే ఆయన నిషేధించిన విషయాలే.

వినండి! మానవ శరీరంలో ఒక మాంసపు ముద్ద ఉంది. అది బాగుంటే మొత్తం శరీరం బాగుంటుంది. ఒకవేళ అది పాడయితే మొత్తం మానవ శరీరమే పాడయిపోతుంది. బాగా గుర్తుంచుకోండి! ఆ మాంసపు ముద్దే మానవ హృదయం. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణం, సహీహ్ ముస్లింలోని లావాదేవీల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

అనుమానాస్పదమైనవి అంటే అత్యధికమంది ప్రజలకు అవి ధర్మసమ్మతమైనవో కావో తెలియవని అర్థం. అలాంటి విషయాలకు దూరంగా ఉండటమే మంచిది. ధర్మాధర్మాలను లెక్కచేయకుండా మనిషి అనుమానాస్పద విషయాల వెంటపడితే త్వరలోనే అతను నిషిద్ధ విషయాల్లోనూ చిక్కుకునే ప్రమాదముంది.

589. హజ్రత్ అనస్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం)కు దారిలో ఒక ఖర్జూర పండు కనిపించింది. దాన్ని చూసి ఆయన, "ఇది దానం చేయబడిన ఖర్జూర పండేమోనన్న భయం గనక నాకు లేకపోతే నేను దీన్ని నిస్సంకో చంగా తిని ఉండేవాణ్ణి" అని అన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

٥٨٩ - وعن أنسٍ رضيَ اللهُ عنه أنَّ النَّبيَّ ﷺ، وَجَدَ تَمْرَةً في الطَّريقِ، فقالَ: «لَوْلا أَنِّي أَخافُ أَنْ تَكُونَ مِنَ الصَّدَقَةِ لأَكَلْتُهَا» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని లావాదేవీల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

590. హజ్రత్ నవ్వాస్ బిన్ సమ్ఆన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : ఉత్తమ నైతికతకు మారుపేరే సత్కార్యం. నీ మదిని తొలిచేది, ప్రజలకు తెలిస్తే బాగుండదని నువ్వు భావించేదే పాపకార్యం. *(ముస్లిం)*

٥٩٠ - وعنِ النَّوَّاسِ بنِ سَمعانَ رضيَ الله عنه عن النَّبيِّ ﷺ قال: «البِرُّ حُسنُ الخُلُقِ، وَالإثْمُ مَا حاكَ في نَفْسِكَ، وَكَرِهْتَ أَنْ يَطَّلِعَ عَلَيْهِ النَّاسُ» رواهُ مسلم. «حَاكَ» بالحاءِ المهملةِ والكافِ، أَيْ: تَرَدَّدَ فيهِ.

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇస్లాంలో ఉత్తమ నీతినడవడికలకు ఎంతో ప్రాముఖ్యం ఉంది. ఉత్తమ నీతినడవడికలంటే ఇతరుల్ని నగుమోముతో పలకరించటం, ప్రజలకు కష్టపెట్టకుండా ఉండటం, వీలైనంతవరకు వారికి సౌలభ్యం కలుగజేయటానికి కృషిచేయటం, ప్రజల కష్టాల్లో పాలుపంచుకోవటం, మంచిపనుల్లో ఇతరులకు తమవంతు సహాయం అందించటం, అవసర మైన చోట విశాల హృదయంతో డబ్బు ఖర్చుపెట్టటం, తమకోసం ఇష్టపడేదే ఇతరుల కోసం కూడా ఇష్ట పడటం మొదలగునవి. ఇవన్నీ నైతిక విలువలు. ఇస్లాం దృష్టిలో ఇవే సత్కార్యాలు కూడాను. వీటికి భిన్నంగా నీచమైన, చెడ్డదైన ప్రతి పనీ పాపకార్యమే అవుతుంది. పై హదీసులో పాపకార్యానికి రెండు గుర్తులు తెలియజేయబడ్డాయి. ఒకటి: ఆ పని చేయాలా వద్దా అని మనసులో సందేహం వస్తూ ఉంటుంది. రెండు: ఆ పని గురించి ప్రజలకు తెలియటం తనకిష్టం ఉండదు. ఏదయినా పనికి ముందు ఈ రెండు ఆలోచనలు గనక మనసులో పుట్టినట్లయితే అది తప్పకుండా పాపకార్యమే అయి ఉండాలి.

591. హజ్రత్ వాబిసా బిన్ మాబద్ (రజి) కథనం : నేనోసారి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వెళ్ళాను. అప్పుడు (నేనేమీ చెప్పకముందే) ఆయన, "నువ్వు సత్కార్యం గురించి అడగటానికొచ్చావు కదూ!?" అన్నారు. నేను ఔనన్నాను. దానికాయన, "నీ మనసునడుగు (చెబు తుంది). నువ్వు చేస్తున్న పనిపట్ల మనస్సు నిమ్మళంగా ఉండి, హృద యంలో ఎలాంటి అలజడి లేకపోతే అదే సత్కార్యం. కాని నీ మదిని తొలి చేది, నీ హృదయంలో సంశయాలు సృష్టించేదే పాపకార్యం. ప్రజలు నీతో ఆ పని సమ్మతమేనని చెప్పినాసరే; సమ్మతమేనని చెప్పినాసరే.

(ఈ హదీసు హసన్ కోవకు చెందినది, దీనిని అహ్మద్, దారిమీలు ఉల్లేఖిం చారు).

*(సుననె దారిమి - వాణిజ్య ప్రకరణం)*

٥٩١ ـ وعن وابصة بن معبد رضيَ اللهُ عنه قال: أَتَيْتُ رسُولَ اللهِ ﷺ فقال: «جِئْتَ تَسْأَلُ عَنِ البِرِّ؟» قلتُ: نعم، فقال: «اسْتَفْتِ قَلْبَكَ، البِرُّ: مَا اطْمَأَنَّتْ إِلَيْهِ النَّفْسُ، وَاطْمَأَنَّ إِلَيْهِ القَلْبُ، وَالإِثْمُ مَا حَاكَ في النَّفْسِ وَتَرَدَّدَ في الصَّدْرِ، وَإِنْ أَفْتَاكَ النَّاسُ وَأَفْتَوكَ» حديثٌ حسن، رواهُ أحمدُ، وَالدَّارِمِيُّ في «مُسْنَدَيْهِمَا».

592. హజ్రత్ అబూ సిర్వఆ ఉఖబా బిన్ హారిస్ (రజి) గారే స్వయంగా చేసిన కథనం ప్రకారం ఆయన అబూ ఇహాబ్ బిన్ అజీజ్ కూతుర్ని వివాహమాడారు. అప్పుడు ఆయన దగ్గరికి ఒక స్త్రీ వచ్చి, "నేను ఉఖబాకూ, అతను పెళ్ళాడిన అమ్మాయికి - ఇద్దరికి (వారి చిన్న తనంలో) పాలు పట్టాను" అని చెప్పింది. ఆ మాటకు ఉఖబా, "నువ్వు నాకు పాలు పట్టావన్న సంగతి నాకసలు తెలి

٥٩٢ ـ وعن أبي سِرْوَعَةَ ـ بكسر السين المهملة ونصبها ـ عُقْبَةَ بنِ الحارِثِ رضيَ اللهُ عنهُ أَنَّهُ تزوَّجَ ابْنَةً لأبي إهابِ بن عَزِيزٍ، فَأَتَتْهُ امْرَأَةٌ فقالت: إِنِّي قَدْ أَرْضَعْتُ عُقْبَةَ والَّتِي قَدْ تَزَوَّجَ بها، فقالَ لها عُقْبَةُ: ما أَعْلَمُ أَنَّكِ أَرْضَعْتِني وَلا أَخْبَرْتِني، فَرَكِبَ إلى رَسُولِ اللهِ ﷺ بالمَدِينَةِ، فَسَأَلَهُ، فقال رسُولُ الله ﷺ: «كَيْفَ، وَقَدْ

قِيلَ ؟!» فَفَارَقَهَا عُقْبَةُ وَنَكَحَتْ زَوْجاً غَيرَهُ. رواهُ البخاري. «إِهَابٌ» بكسر الهمزة، وَ«عَزِيزٌ» بفتح العين وبزاي مكرَّرة.

యదు. నువ్వు (పెళ్ళికి ముందైనా) ఆ విషయం నాతో చెప్పలేదు" అని అన్నారు.

ఆ తరువాత ఆయన దైవప్రవక్త (సల్లం) దగ్గరికి ప్రయాణమయ్యారు. ఆయన దగ్గరికి వెళ్ళి (పరిస్థితిని వివరించి) ఇప్పుడు తానేం చేయాలో చెప్పమని అడిగారు. దానికి ఆయన "ఈ సంగతి తెలిసిన తరువాత ఇక నీ వివాహబంధం ఎలా నిలిచి ఉంటుంది?" అని అన్నారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని విద్య, లావాదేవీలు, నికాహ్, సందేహాస్పద విషయాల ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

ప్రసవం, పిల్లలకు పాలు త్రాపించటం, స్త్రీల లోవిషయాల్లాంటి పురుషులకు తెలియకుండా ఉండే సమస్యల్లో ఒకే ఒక స్త్రీ సాక్ష్యం కూడా చెల్లుతుందని చెప్పటానికి ఈ హదీసు ప్రబల తార్కాణం. ఇందులో ఒక స్త్రీ తాను ఉఖబా దంపతులిరువురికీ చిన్నప్పుడు పాలు త్రాపించాననీ, ఆ విధంగా వారిద్దరూ పాలవరస అన్నాచెల్లెళ్ళు అయ్యారని చెప్పగానే ఆ దంపతులు విడిపోయారు. దైవప్రవక్త (సల్లం) కూడా పాలవరుస సంబంధం ఉందని తెలిసిన తర్వాత వారి దాంపత్యం ధర్మసమ్మతం కాదని ఖరారు చేశారు.

٥٩٣ ـ وعنِ الحَسَنِ بنِ عليٍّ رضيَ اللهُ عنهما قال: حَفِظْتُ مِنْ رسُولِ اللهِ ﷺ: «دَعْ مَا يَرِيبُكَ إِلى مَا لا يَرِيبُكَ» رواهُ الترمذي وقال: حديثٌ حسن صحيح. مَعناهُ: اتْرُكْ مَا تَشُكُّ فِيهِ، وَخُذْ مَا لا تَشُكُّ فِيهِ.

593. హజ్రత్ హసన్ బిన్ అలీ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా నేను విని గుర్తుపెట్టు కున్నాను. "నిన్ను సంశయంలో పడవేసే విషయాన్ని వదలిపెట్టు. నిస్సందేహమైన పనులు మాత్రమే చెయ్యి." (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు)

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత అధ్యాయం)*

594. హ॥జత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : హ॥జత్ అబూబక్ర్ సిద్దీఖ్ (రజి) గారి దగ్గర ఒక బానిస ఉండేవాడు. అతను డబ్బు సంపాదించి తెస్తే అబూ బక్ర్ దాన్ని వినియోగించుకునే వారు. ఒకరోజు బానిస ఏదో తెచ్చిస్తే అబూబక్ర్ (రజి) దాన్ని తీసుకొని తిన్నారు. కాసేప యిన తరువాత బానిస ఆయనతో, "మీరు తిన్నదేమిటో తెలుసా?" అని అడిగాడు. "ఏమిటో చెప్పు" అన్నారు అబూబక్ర్ (రజి). దానికతను, "అజ్ఞానకాలంలో నేను ఒకతనికి జోస్యం చెప్పాను. అసలు జోతిష్యం అంటే ఏమిటో సరిగ్గా నాక్కూడా తెలియదు. నేను అతనికి ఏదో చెప్పి మోసపుచ్చాను. ఇవ్వాళ అతను నన్ను కలుసుకొని ఈ వస్తువు ఇచ్చాడు. అందులో కొంత మీకిస్తే మీరు దాన్ని తిన్నారు" అని చెప్పాడు.

ఆ మాట వినగానే అబూబక్ర్ (రజి) చేతిని నోట్లోకి దోపుకొని కడుపులోకి దిగి పోయిన దాన్ని కూడా బయటికి కక్కే శారు. *(బుఖారీ)*

బానిస తాను సంపాదించిన ధనంలో కొంతభాగం (పన్నురూపంలో) యజమా నికి ఇచ్చుకోవలసి ఉంటుంది. దానినే 'ఖరాజ్' అంటారు. 'ఖరాజ్' పోగా మిగిలి నదంతా బానిసకే చెందుతుంది.

*(సహీహ్ బుఖారీలోని మహిమోన్నతుల ప్రకరణం)*

٥٩٤ ـ وعن عائشةَ رضيَ اللهُ عنها قالت: كانَ لأبي بَكْرٍ الصِّدِّيقِ رضيَ اللهُ عنه، غُلامٌ يُخْرِجُ لَهُ الخَراجَ وَكانَ أَبو بَكْرٍ يَأْكُلُ مِنْ خَرَاجِهِ، فَجَاءَ يَوماً بِشَيْءٍ، فَأَكَلَ مِنْهُ أَبو بَكْرٍ، فَقَالَ لَهُ الغُلامُ: تَدْري مَا هٰذَا؟ فَقَالَ أَبو بَكْرٍ: وَمَا هُوَ؟ قَالَ: كُنْتُ تَكَهَّنْتُ لإنْسَانٍ فِي الجَاهِلِيَّةِ وَمَا أُحْسِنُ الكَهَانَةَ إلَّا أَنِّي خَدَعْتُهُ، فَلَقِيَني، فَأَعْطَاني بِذٰلِكَ هٰذَا الَّذي أَكَلْتَ مِنْهُ، فَأَدْخَلَ أَبو بَكْرٍ يَدَهُ فَقَاءَ كُلَّ شَيْءٍ في بَطْنِهِ. رواهُ البخاري. «الخَراجُ» شَيْءٌ يَجْعَلُهُ السَّيِّدُ عَلَى عَبْدِهِ يُؤَدِّيهِ إلى السيِّد كُلَّ يَوْمٍ، وَبَاقي كَسْبِهِ يَكُونُ للعَبْدِ.

## ముఖ్యాంశాలు

ఇస్లాంకు పూర్వం అజ్ఞాన కాలంలో జోతిష్య వ్యాపారం చాలా జోరుగా సాగుతుండేది. ఇస్లాం ధర్మం వచ్చిన తరువాత జ్యోతిష్యాన్ని, జ్యోతిష్యం ద్వారా ధనం ఆర్జించటాన్ని నిషిద్ధపరచటం జరిగింది. అందుకే బానిస తనకు ఇచ్చిన ఆహార పదార్థం జోస్యం చెప్పి ఆర్జించినదని తెలియగానే అబూబక్ర్ (రజి) తిన్నది కూడా బయటికి కక్కేశారు.

٥٩٥ - وعن نافع أنَّ عُمَرَ بْنَ الخَطَّابِ رَضِيَ اللهُ عَنْهُ، كَانَ فَرَضَ لِلْمُهَاجِرِينَ الأَوَّلِينَ أَرْبَعَةَ آلافٍ، وَفَرَضَ لابْنِهِ ثَلاثَةَ آلافٍ وَخَمْسَمِائَةٍ، فَقِيلَ لَهُ: هُوَ مِنَ المُهَاجِرِينَ فَلِمَ نَقَصَهُ؟ فقال: إنَّما هَاجَرَ بِهِ أَبُوهُ. يقُولُ: لَيْسَ هُوَ كَمَنْ هَاجَرَ بِنَفْسِهِ. رواهُ البخاري.

595. హ(జత్ నాఫే (రహ్మాలై) కథనం : హ(జత్ ఉమర్ (రజి) అగ్ర ముహాజిర్లకు (సంవత్సరానికి) నాల్గువేల దిర్హంల వేతనం నిర్ణయించారు. తన కుమారునికి మాత్రం మూడున్నర వేలే నిర్ణయించారు. ఎవరో దీని గురించి ఆయనతో మాట్లాడుతూ, "మీ కుమారుడు కూడా ముహాజిరే కదా! ఆయన వేతనం ఎందుకని తగ్గించారు?" అని అడగ్గా, అందుకాయన "అతణ్ణి అతని తండ్రి హిజ్రత్ చేయించాడు" అని అన్నారు. అతను స్వయంగా హిజ్రత్ చేసిన వారిలాంటి వాడు కాడని ఆయన అభిప్రాయం.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో హ(జత్ ఉమర్ (రజి) గారి నీతినిజాయితీలు, ఇహలోకపు సిరిసంపదల పట్ల ఆయన అనాసక్తతా భావం వివరించబడ్డాయి. ఆయన తన కుమారునికి ఇతర ముహాజిర్ల కంటే ఐదువందల దిర్హమ్‌లు తక్కువ వేతనం నిర్ణయించారు. ముహాజిర్లు అంటే ఇతర దేశాల నుంచి ఇస్లామీయ రాజ్యానికి వలస వచ్చినవారు. స్వయాన ఉమర్ మరియు ఆయన కుమారుడు అబ్దుల్లాహ్ కూడా ఆ విధంగా వలస వచ్చినవారే. ఆ కాలంలో ముహాజిర్లకు ప్రభుత్వ ధనాగారం నుంచి ఉపకార వేతనాలు ఇవ్వబడేవి. ఆ ఉపకార వేతనాలను ఖలీఫా నిర్ణయిస్తాడు. హ(జత్ ఉమర్ (రజి) ఖలీఫాగా ఎన్నికైనప్పుడు ఆయన తన కుమారునికి ఇతర ముహాజిర్ల కంటే తక్కువ వేతనం నిర్ణయించారు. అలా ఎందుకు చేశారని ప్రజలు అడగ్గా "నా కొడుకు ఒంటరిగా హిజ్రత్ చేసి ఇక్కడికి రాలేదు. అతను నా వెంట వచ్చాడు" అని చెప్పారు.

కాని ఈ రోజుల్లో ముస్లిం దేశాలమీద పడి భక్షిస్తున్న పాలక మహాశయుల జీవితాల వైపు ఒకసారి చూడండి. తమ బంధుమిత్రులకే హోదాలు, తమ పార్టీవారికే పదవులు, తమ అడుగులకు మడుగులొత్తేవారి కోసం, తమ అవినీతికి కొమ్ముకాసేవారి కోసమే జాతీయ వనరులన్నీ వెచ్చిస్తారు. సామాన్య ప్రజల సమస్యలు, పేదోళ్ల కష్టాలు వారికి అస్సలు పట్టవు. ప్రతి పనిలోనూ సొంతలాభాలు అంచనా వేసుకునే స్వార్థపరులయ్యారు నేటి మన నాయకులు!

٥٩٦ ـ وعن عَطِيَّةَ بن عُرْوَةَ السَّعْدِيِّ الصَّحَابِيِّ رَضِيَ اللهُ عَنْهُ قالَ: قالَ رَسُولُ اللهِ ﷺ: «لَا يَبْلُغُ العَبْدُ أَنْ يَكُونَ مِنَ المُتَّقِينَ حَتَّى يَدَعَ مَا لا بَأْسَ بِهِ، حَذَراً لِمَا بِهِ بَأْسٌ». رواهُ الترمذي وقال: حديث حسن.

596. హజ్రత్ అతియ్యా బిన్ ఉర్వా సాదీ సహాబీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : దోషపూరిత విషయాలనుండి తన్ను తాను కాపాడుకునేందుకు (కొన్ని) దోషరహిత విషయాలకు కూడా దూరంగా ఉండనంత వరకూ మనిషి దైవభీతిపరుల స్థాయికి చేరుకో లేడు. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు).

*(సుననె తిర్మిజీలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

షేఖ్ అల్‌బానీ గారు ఈ హదీసుని బలహీనమైనదిగా ఖరారు చేశారు. వివరాల కోసం ఖర్జావీ గారి "అల్ హలాల్ వల్ హరామ్" పుస్తకం 178వ పేజీ చూడండి.

## ముఖ్యాంశాలు

సందేహాస్పద విషయాలకు దూరంగా ఉండటం దైవభీతిపరులకు చాలా అవసరమనీ, అది వారి లక్షణమని ఈ హదీసులో నొక్కిచెప్పబడింది. ఆధారాల రీత్యా ఈ హదీసు బలహీనమైనది అయినప్పటికీ ఇందులోని విషయం ఇతర ప్రామాణిక హదీసుల్లో వివరించబడిన విషయమే కనుక దానిని అంగీకరించవచ్చు.

69వ అధ్యాయం

# ٦٩ـ بَابُ اسْتِحْبَابِ الْعُزْلَةِ عِنْدَ فَسَادِ الزَّمَانِ أَوِ الْخَوْفِ مِنْ فِتْنَةٍ فِي الدِّينِ أَوْ وُقُوعٍ فِي حَرَامٍ وَشُبُهَاتٍ وَنَحْوِهَا

# కల్లోలం, ఉపద్రవాలు చెలరేగినప్పుడు ఏకాంతాన్ని ఆశ్రయించటం

قال الله تعالى: ﴿فَفِرُّوٓا۟ إِلَى ٱللَّهِ ۖ إِنِّى لَكُم مِّنْهُ نَذِيرٌ مُّبِينٌ ۝٥٠﴾ [الذاريات: ٥٠].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : "అల్లాహ్ వైపునకు పరుగెత్తండి. నేను ఆయన తరఫున మీకు స్పష్టంగా హెచ్చరిక చేసేవాడుగా వచ్చాను."

*(అజ్ జారియాత్ : 50)*

**వివరణ :**

అల్లాహ్ వైపునకు పరుగెత్తడమంటే, ఆయన్ని విశ్వసించి, ఆయన విధేయతను పాటించడమని అర్థం. గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మలై) ఈ సూక్తిని ఇక్కడ పొందుపరచటంలోని ఔచిత్యం ఏమిటంటే, సామూహిక జనజీవనంలో కల్లోలాలు చెలరేగి, ధర్మంలో ఉపద్రవాలు తలెత్తి ధర్మాన్ని ఆచరించడమే దుర్భరమైపోయినప్పుడు మనిషి ఆ కల్లోలభరిత వాతావరణాన్ని వదలిపెట్టి కొండలు, అడవుల్లోకెళ్ళి దైవారాధన చేసుకుంటూ ప్రశాంతంగా జీవితం గడుపుకోవటం మేలు. దానివల్ల మనిషి కనీసం తన ధర్మాన్నయినా రక్షించుకోగల్గుతాడు.

٥٩٧ ـ وعن سعد بن أبي وقَّاص رضي الله عنه قال: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يَقُول: «إِنَّ اللهَ يُحِبُّ العَبْدَ التَّقِيَّ الغَنِيَّ الخَفِيَّ» رواه مسلم. المُرَاد بـ «الغَنِيِّ»: غَنِيُّ النَّفْسِ، كما سَبَقَ في الحديث الصحيح.

597. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ (రజి) తెలియజేశారు : దైవానికి భయపడుతూ, (ఇహలోకం పట్ల) నిరపేక్షాభావంతో, గుట్టుగా జీవితం గడిపే మనిషిని దేవుడు ప్రేమిస్తాడు. (ముస్లిం)

ఇంతకు ముందు చెప్పినట్లు ఇక్కడ 'గనీ' అంటే ఆత్మ సంతృప్తితో, నిరపేక్షా భావంతో ఉండేవాడని అర్థం.

*(సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

598. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ, "దైవప్రవక్తా! ప్రజలందరిలోకెల్లా శ్రేష్ఠమైన వాడెవడు?" అని అడిగాడు. "తన ధనప్రాణాలను దైవమార్గంలో అర్పించే విశ్వాసి" అని చెప్పారు దైవప్రవక్త (సల్లం). అతని తరువాత ఎవడు శ్రేష్ఠుడు?" అని అడిగాడా వ్యక్తి. అందుకాయన "ఏదో ఒక పర్వత కనుమలో వెళ్ళి ఒంటరిగా తన ప్రభువును ఆరాధించుకునేవాడు" అని చెప్పారు.
వేరొక ఉల్లేఖనంలో, "దైవానికి భయపడుతూ, ప్రజలకు కీడు తలపెట్టకుండా జాగ్రత్తపడేవాడు" అని ఉంది.

(బుఖారీ-ముస్లిం)

٥٩٨ ـ وعن أبي سعيد الخُدري رضي الله عنه قال: قَالَ رجُلٌ: أَيُّ النَّاسِ أَفضَلُ يَا رَسولَ الله! قال: «مُؤْمِنٌ مُجَاهِدٌ بِنَفْسِهِ وَمَالِهِ فِي سَبِيلِ الله» قال: ثم من؟ قال: «ثم رَجُلٌ مُعْتَزِلٌ فِي شِعْبٍ مِنَ الشِّعَابِ يَعْبُدُ رَبَّه». وفي روايةٍ: «يَتَّقِي الله، وَيَدَعُ النَّاسَ مِنْ شَرِّهِ» متفقٌ عليه.

(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో కూడా దైవమార్గంలో పోరాటం తర్వాత రెండో స్థానంలో కేవలం దైవారాధన చేయటం కోసం, తన మూలంగా ప్రజలకు హాని కలగకూడదనే ఉద్దేశ్యంతో ఏకాంతాన్ని ఆశ్రయించేవాడి గొప్పదనం వివరించబడింది. ఇంకా ధర్మ సందేహాలను గురించి పండితులను అడిగి తెలుసుకోవటం అభిలషణీయమనే విషయం కూడా ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

599. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి)గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు: అతి త్వరలోనే ఒక కాలం రానున్నది. అప్పుడు ముస్లిం యొక్క శ్రేష్ఠమైన సంపద మేకలు అయి ఉంటాయి. వాటిని తోలుకొని అతను పర్వత శిఖరాలపైకి, వర్షం కురిసే (అడవి) ప్రాంతాలకు పోతాడు. వాస్తవానికి అతను తన ధర్మాన్ని ఉపద్రవాల నుండి

٥٩٩ ـ وعنه قال: قال رسولُ الله ﷺ: «يُوشِكُ أَنْ يَكُونَ خَيْرَ مَالِ المُسْلِمِ غَنَمٌ يَتْبَعُ بِهَا شَعَفَ الجِبَالِ، وَمَوَاقِعَ القَطْرِ يَفِرُّ بِدِينِهِ مِنَ الفِتَنِ» رواه البخاري. و«شَعَف الجِبَالِ»: أعلاَهَا.

కాపాడుకోవటానికే అలా ఊరు విడిచి వెళ్ళిపోతాడు. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణం)

## ముఖ్యాంశాలు

రానున్న కాలంలో ప్రజల నీతి నడవడికలు ఎంతగా దిగజారిపోతాయంటే మనుషుల మధ్య ఉండి ధర్మాన్ని ఆచరించటం కష్టసాధ్యమైపోతుంది. అలాంటి సమయంలో ధర్మాన్ని కాపాడుకోవటం కోసం జనారణ్యాలను వదలివెళ్ళటం తప్ప గత్యంతరం ఉండదు.

٦٠٠ ـ وعَنْ أبي هُريرة رضي الله عنه عَنِ النَّبِيِّ ﷺ قال: «مَا بَعَثَ اللهُ نَبِيّاً إِلَّا رَعَى الْغَنَمَ» فَقَالَ أَصْحَابُه: وَأَنْتَ؟ قَالَ: «نَعَمْ، كُنْتُ أَرْعَاهَا عَلَى قَرَارِيطَ لأَهْلِ مَكَّةَ» رواه البخاري.

600. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (స) "దేవుడు పంపిన ప్రతి ప్రవక్త మేకల్ని కాసాడు" అని అన్నారు. ఆ మాట విని సహచరులు ఆశ్చర్యంగా "మీరు కూడా కాసారా?" అని అడిగారు. దానికాయన, "అవును, నేను కొన్ని ఖీరాతుల జీతంపై మక్కావాసుల మేకల్ని కాసేవాణ్ణి" అని అన్నారు. (బుఖారీ)

(సహీహ్ బుఖారీలోని బాడుగల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

మేకల్ని కాయటానికి చాలా ఓర్పు, శ్రద్ధ అవసరం. ఒకవిధంగా ఇది సహనానికి అభ్యాసం లాంటిది. ఈ అభ్యాసం దైవప్రవక్తల లక్ష్యసాధనలో ఉపయోగపడుతుంది. తాము దైవ సందేశం అందజేయబోయే ప్రజలపట్ల తమ వ్యవహార శైలి ఎలా ఉండాలి, ప్రజల నుండి ఎదురయ్యే కష్టాలను ఎలా భరించాలి అన్న విషయం దైవప్రవక్తలకు బోధపడుతుంది.

٦٠١ ـ وعنه عَنْ رسولِ الله ﷺ أنه قال: «مِنْ خَيْرِ مَعَاشِ النَّاسِ لَهُمْ رَجُلٌ مُمْسِكٌ عِنَانَ فَرَسِهِ في سَبِيلِ الله، يَطِيرُ عَلَى مَتْنِهِ، كُلَّمَا سَمِعَ هَيْعَةً أَوْ فَزْعَةً، طَارَ عَلَيْهِ يَبْتَغِي القَتْلَ أَوِ المَوْتَ مَظَانَّه، أَوْ رَجُلٌ في غُنَيْمَةٍ في رَأْسِ شَعَفَةٍ مِنْ هٰذِهِ الشَّعَفِ، أَوْ

601. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : ప్రజలందరిలోకెల్లా అత్యుత్తమ జీవి దైవమార్గంలో తన గుర్రపు కళ్ళెం చేతబట్టుకొని దానిపై స్వారీ చేసి మెరుపు వేగంతో (అటూ ఇటూ) వెళుతుంటాడు. ఎక్కడినుంచయినా ప్రేలుళ్ళు, ఆందోళన కలిగించే

بَطْنِ وَادٍ مِنْ هَٰذِهِ الأَوْدِيَةِ، يُقِيمُ الصَّلاةَ، وَيُؤْتِي الزَّكَاةَ، وَيَعْبُدُ رَبَّهُ حَتَّى يَأْتِيَهُ اليَقِينُ لَيْسَ مِنَ النَّاسِ إِلَّا فِي خَيْرٍ» رواه مسلم.

శబ్దాలేవయినా వినపడితే మెరుపులా అక్కడికి చేరుకుంటాడు. తాను హత మయ్యే, మరణాన్ని పొందే స్థలాల్ని వెతుక్కుంటూ ఉంటాడు.

లేక (అత్యుత్తమ జీవి ఎవరంటే) ఏదయినా పర్వత శిఖరంపైకిగాని లేదా ఏదయినా లోయకుగాని కొన్ని మేకల్ని తోలుకొని వెళ్ళి స్థిరపడతాడు. అక్కడే నమాజును స్థాపిస్తాడు. జకాత్ దానం చెల్లిస్తాడు. తన ప్రభువును ఆరాధిస్తూ ఉంటాడు. ఆఖరికి అతనికి మరణం వచ్చినప్పుడు అతను ప్రజల మధ్య మంచి స్థితిలో ఉంటాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

«يَطِيرُ» أَيْ: يُسْرِعُ. وَ«مَتْنُهُ»: ظَهْرُهُ. وَ«الهَيْعَةُ»: الصَّوْتُ للحَرْبِ وَ«الفَزْعَةُ»: نَحْوُهُ. وَ«مَظَانُّ الشَّيْءِ»: المَوَاضِعُ الَّتِي يُظَنُّ وُجُودُهُ فِيهَا. وَ«الغُنَيْمَةُ»- بضم الغين -تصغير الغنم. وَ«الشَّعَفَةُ» بفتح الشين والعين: هي أعلى الجَبَلِ.

'యతీరు' అనగా తొందర చేస్తున్నాడని భావం. 'మత్నుహూ' అనగా అతని వీపు. 'హైఅతున్' అనగా యుద్ధ శబ్దం (పేలుళ్లు, ఫైరింగులు మొదలగునవి). 'ఫజ్అతు' అర్థం కూడా అలాంటిదే. 'మజానుష్షై' అనగా ఒక వస్తువు ఉండ గలదన్న నమ్మకం ఉన్నచోట. గునైమా అనగా కొన్ని మేకలు. 'షఅఫా' అంటే పర్వతపు అగ్రభాగం(శిఖరం) అని అర్థం.

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో ఇద్దరు వ్యక్తుల్ని ప్రజలందరిలోకెల్లా గొప్ప వ్యక్తులుగా అభివర్ణించటం జరిగింది. ఒకతను : జిహాద్ (ధర్మయుద్ధ) సన్నాహాల్లో తలమునకలై ఉండి దైవమార్గంలో పోరాటానికి సదా సిద్ధంగా ఉండే వ్యక్తి. రెండవతను : తన ధర్మాన్ని కాపాడుకోవటానికి, దానిని ఆచరించటానికి సామూహిక జనజీవనానికి దూరంగా కొండల్లో, అడవుల్లో స్థిరపడేవాడు.

70వ అధ్యాయం

## ٧٠ - بَابُ فَضْلِ الاخْتِلَاطِ بِالنَّاسِ

## సహజీవన శ్రేష్ఠత

وَحُضُورِ جَمْعِهِمْ وَجَمَاعَاتِهِمْ وَمَشَاهِدِ الْخَيْرِ، وَمَجَالِسِ الذِّكْرِ مَعَهُمْ، وَعِيَادَةِ مَرِيضِهِمْ، وَحُضُورِ جَنَائِزِهِمْ، وَمُوَاسَاةِ مُحْتَاجِهِمْ، وَإِرْشَادِ جَاهِلِهِمْ، وَغَيْرِ ذٰلِكَ مِنْ مَصَالِحِهِمْ لِمَنْ قَدرَ عَلَى الأَمْرِ بِالْمَعْرُوفِ، وَالنَّهْيِ عَنِ الْمُنْكَرِ وَقَمَعَ نَفْسَهُ عَنِ الإِيذَاءِ، وَصَبَرَ عَلَى الأَذَى

సహజీవనం అంటే తోటివారితోపాటు ప్రజా సముదాయాలకు, సంఘాలకు, పుణ్యక్షేత్రాలకు, దైవధ్యాన సమావేశాలకు హాజరుకావటం. వ్యాధిగ్రస్తుల్ని పరామర్శించటం, జనాజా నమాజుల్లో పాల్గొనటం, అభాగ్యులకు చేయూత నివ్వటం, అమాయకుల్ని సన్మార్గంపై నడిపించటం తదితర పుణ్యకార్యాల నిమిత్తం ప్రజలతో సత్సంబంధాలు పెట్టుకోవడం అని అర్థం. దానికోసం తాము మంచిని ఆదేశించి చెడులను నిర్మూలించగలిగేవారయి ఉండాలి. ప్రజలకు హాని తలపెట్టకుండా జాగ్రత్త పడాలి. ఇతరుల నుండి ఎదురయ్యే కష్టాలపై సహనం వహించాలి.

اعْلَم أَن الاخْتِلاط بالنَّاسِ على الوَجْهِ الَّذي ذَكَرْتُهُ هُو المختار الذي كان عليهِ رسولُ اللهِ ﷺ وسائِرُ الأنبياءِ صلواتُ اللهِ وسلامُه عليهم، وكذلك الخُلفاءُ الرَّاشدونَ، ومَنْ بعدَهُم مِنَ الصَّحَابَةِ وَالتَّابعينَ، وَمَنْ بَعدَهُم مِنْ عُلَماءِ المُسْلِمينَ وَأَخيارِهِم، وَهُوَ مَذْهَبُ أَكْثَرِ التَّابعينَ وَمَنْ بَعدَهُمْ، وَبِهِ قَالَ

గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మలై) ఇలా అంటున్నారు :

ఒక విషయం తెలుసుకోండి, ప్రజలతో కలిసిమెలిసి ఉండటం గురించి నేను చెప్పిన పద్ధతే అభిలషణీయమైనది. దైవప్రవక్త (సల్లం), ఇంకా ఇతర దైవ ప్రవక్తలు, సన్మార్గగాములైన ఖలీఫాలు, ఆ తర్వాత ప్రవక్త సహచరులు వారి అనుచరులు, ఆ తర్వాతి కాలంలో వచ్చిన ముస్లిం సమాజంలోని పండితులు పుణ్యాత్ములు - అందరి

الشَّافِعِيُّ وأَحْمَدُ، وَأَكْثَرُ الفُقَهَاءِ رضي الله عنهم أجمعينَ، قال الله تعالى: ﴿وَتَعَاوَنُوا عَلَى الْبِرِّ وَالتَّقْوَى﴾ [المائدة: ٢] والآيات في معنى ما ذكرتُه كثيرة معلومة.

విధానం కూడా ఇదే! అత్యధిక మంది తాబయీన్లు, ఆ తరువాత వచ్చినవారి విధానం కూడా ఇదే. ఇమామ్ షాఫయీ, ఇమామ్ అహ్మద్ ఇంకా చాలామంది ధర్మవేత్తల అభిప్రాయం కూడా ఇలాగే ఉంది. అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు:

"మంచికి, దైవభక్తికి సంబంధించిన పనుల్లో పరస్పరం సహకరించుకోండి."
*(అల్ మాయిదా : 2)*

నేను పేర్కొన్న భావానికి సంబంధించిన సుప్రసిద్ధమైన దివ్య ఖుర్ఆన్ సూక్తులు చాలా ఉన్నాయి.

## వివరణ

గ్రంథకర్త ఈ అధ్యాయాన్ని ఎంతో క్లుప్తంగా వివరించినప్పటికీ ఇది ఎంతో సమగ్రమైనది. ఇస్లామీయ ప్రబోధనల సారాంశమంతా ఇందులోకి వచ్చేసింది. ఇస్లాం ధర్మం వైరాగ్యాన్ని (రహ్బానియ్యత్‌ను) బోధించదు. మనిషి మనశ్శాంతి కోసం సామూహిక జనజీవనం నుండి పారిపోయి కొండల్ని, అడవుల్ని ఆశ్రయించాలని చెప్పదు. పైగా మనిషి సంఘంలోనే జీవిస్తూ దేవుని హక్కులతో పాటు తోటి మానవుల హక్కుల్ని కూడా నిర్వర్తించడమే గొప్పతనమని అంటుంది. ధర్మాధర్మాల సంఘర్షణలో ధర్మ ఔన్నత్యం కోసం కృషిచేస్తూ, అధర్మాన్ని సంఘం నుండి పారద్రోలటానికి ప్రయత్నించాలి. దానికోసం జీవితంలో ఎదురయ్యే కష్టాలను, కడగండ్లను ఓర్పుతో, నేర్పుతో మార్కొనే సామర్థ్యాన్ని కలిగి ఉండాలి. అందుకే ఒక హదీసులో చెప్పబడింది- ప్రజలతో సంబంధాలు పెట్టుకోకుండా వారినుండి ఎదురయ్యే ఇబ్బందుల్ని ఓర్చుకోలేని విశ్వాసికన్నా ప్రజలతో కలిసిమెలిసి ఉంటూ వారివల్ల కలిగే ఇబ్బందుల్ని ఓర్చుకునేవాడే శ్రేష్ఠుడు అని.

71వ అధ్యాయం

# ٧١ـ بَابُ التَّوَاضُعِ وَخَفْضِ الْجَنَاحِ لِلْمُؤْمِنِينَ

# తోటి విశ్వాసుల పట్ల నమ్రతతో, అణకువతో వ్యవహరించాలి

قال الله تعالى: ﴿ وَٱخْفِضْ جَنَاحَكَ لِمَنِ ٱتَّبَعَكَ مِنَ ٱلْمُؤْمِنِينَ ﴾ [الشعراء: ٢١٥] وقال تعالى: ﴿ يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ مَن يَرْتَدَّ مِنكُمْ عَن دِينِهِۦ فَسَوْفَ يَأْتِى ٱللَّهُ بِقَوْمٍ يُحِبُّهُمْ وَيُحِبُّونَهُۥٓ أَذِلَّةٍ عَلَى ٱلْمُؤْمِنِينَ أَعِزَّةٍ عَلَى ٱلْكَٰفِرِينَ ﴾ [المائدة: ٥٤] وقال تعالى: ﴿ يَٰٓأَيُّهَا ٱلنَّاسُ إِنَّا خَلَقْنَٰكُم مِّن ذَكَرٍ وَأُنثَىٰ وَجَعَلْنَٰكُمْ شُعُوبًا وَقَبَآئِلَ لِتَعَارَفُوٓا۟ إِنَّ أَكْرَمَكُمْ عِندَ ٱللَّهِ أَتْقَىٰكُمْ ﴾ [الحجرات: ١٣] وقال تعالى: ﴿ فَلَا

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"ప్రవక్తా! విశ్వాసులలో నిన్ను అనుసరించే వారిపట్ల మృదువుగా మెలగు."

*(అష్ షుఅరా : 215)*

"విశ్వాసులారా! మీలో ఎవరైనా తమ ధర్మం నుండి వైదొలగిపోతే (పోవచ్చు). అల్లాహ్ ఇంకా ఎంతోమందిని సృష్టిస్తాడు. అల్లాహ్ వారిని ప్రేమిస్తాడు. వారు అల్లాహ్‌ను ప్రేమిస్తారు. వారు విశ్వాసుల పట్ల మృదువుగానూ, అవిశ్వాసుల పట్ల కఠినంగానూ ప్రవర్తిస్తారు."

*(అల్ మాయిదా : 54)*

"మానవులారా! మేము మిమ్మల్ని ఒకే పురుషుని నుండి, ఒకే స్త్రీ నుండి సృజించాము. తరువాత మీరు ఒకరినొకరు పరిచయం చేసుకునేందుకు మిమ్మల్ని జాతులుగానూ, తెగలుగానూ చేశాము. వాస్తవానికి మీలో అందరికంటే ఎక్కువ భయభక్తులు కలవాడే అల్లాహ్ దృష్టిలో ఎక్కువ గౌరవపాత్రుడు."

*(అల్ హుజురాత్ : 13)*

"మీరు మీ పవిత్రతను గురించి గొప్పలు చెప్పుకోకండి. నిజమైన భయభక్తులు గలవాడెవడో ఆయనకు బాగా తెలుసు."

*(అన్ నజ్మ్ : 32)*

"ఆరాఫ్ జనులు ప్రతి ఒక్కణ్ణీ అతని ముఖాకృ

تُزَكُّوا أَنفُسَكُمْ هُوَ أَعْلَمُ بِمَنِ اتَّقَىٰ ﴾ [النجم: ٣٢] وقال تعالى: ﴿ وَنَادَىٰ أَصْحَابُ الْأَعْرَافِ رِجَالًا يَعْرِفُونَهُم بِسِيمَاهُمْ قَالُوا مَا أَغْنَىٰ عَنكُمْ جَمْعُكُمْ وَمَا كُنتُمْ تَسْتَكْبِرُونَ ﴿٤٨﴾ أَهَٰؤُلَاءِ الَّذِينَ أَقْسَمْتُمْ لَا يَنَالُهُمُ اللَّهُ بِرَحْمَةٍ ۚ ادْخُلُوا الْجَنَّةَ لَا خَوْفٌ عَلَيْكُمْ وَلَا أَنتُمْ تَحْزَنُونَ ﴾ [الأعراف: ٤٨ـ ٤٩].

తిని బట్టి గుర్తుపడతారు. స్వర్గవాసులను పిలిచి, 'మీకు శాంతి కలుగుగాక!' అని అంటారు. వారు స్వర్గంలోకి ప్రవేశించనేలేదు. కాని దానిని ఆశిస్తున్నారు. వారి దృష్టి నరకవాసుల వైపునకు మళ్ళినప్పుడు ఇలా అంటారు, "ప్రభూ! మమ్మల్ని మటుకు ఈ దుర్మార్గులలో చేర్చకు."

తరువాత ఎత్తైన ప్రదేశాలలో ఉన్న ఈ (ఆరాఫ్) ప్రజలు నరకంలో ఉన్న కొందరు పెద్ద మనుషులను వారి ఆనవాళ్ళ ద్వారా గుర్తుపట్టి ఇలా అంటారు: "చూశారా మీరూ, మీ అనుచర వర్గాలుగానీ, మీరు గొప్పగా భావించిన ఆస్తిపాస్తులుగానీ, ఈ రోజు మీకు ఏ విధంగానూ పనికిరాలేదుగదా! మీరు "వీరికి అల్లాహ్ తన కారుణ్యాన్ని ఏమాత్రం ప్రసాదించడు" అని ప్రమాణాలు చేసి అంటూ ఉండిన వారే కదా ఈ స్వర్గవాసులు. ఈ రోజు వారితోనే "స్వర్గంలోకి ప్రవేశించండి. మీకు భయంగాని, దుఃఖంగాని లేదు" అని అనటం జరిగింది."

*(అల్ ఆరాఫ్ : 48 - 49)*

## వివరణ

మొదటి రెండు సూక్తుల్లో విశ్వాసుల పట్ల మృదువుగా వ్యవహరించాలని ఆదేశించబడింది. మూడో సూక్తిలో - మీ అందరి మూలం ఒక్కటే. మీరంతా ఆది దంపతులైన ఆదం హవ్వాల సంతానమే. కనుక కులగోత్రాలు, వంశప్రాతిపదికలపై మీలో ఎవరికీ ఎవరి మీదా ఎలాంటి విశిష్టత లేదు. ఈ తెగలు, వంశాలు పరస్పర పరిచయాల కోసం పుట్టుకొచ్చినవేగాని ఒకరిమీద ఒకరు గర్వాన్ని, పొగరుమోతుతనాన్ని ప్రదర్శించటానికి, బీరాలు పోవటానికి ఏర్పడినవి కావు. అల్లాహ్ దృష్టిలో వంశాలకు, తెగలకు ఎలాంటి ప్రాధాన్యత లేదు. ఆయన దృష్టిలో విశ్వాసం, ధర్మపరాయణతలు మాత్రమే విలువైనవి. ఎవరిలో ఎంత విశ్వాసం, మరెంత దైవభీతి అయితే ఉంటాయో వారు అంత గౌరవవంతులుగా భావింపబడతారు. ఈ సుగుణాలు లేని వ్యక్తిని అతని కులగోత్రాలు, వంశప్రతిష్ఠలు దేవుని సమక్షంలో అతణ్ణి గౌరవవంతునిగా నిలబెట్టలేవు - అని (మూడో సూక్తిలో) చెప్పబడింది.

చివరి సూక్తిలో ఆరాఫ్ వాసుల ప్రస్తావన వచ్చింది. స్వర్గానికి - నరకానికి మధ్యలో ఒక గోడ లేక ఒక ప్రత్యేకమైన చోటు ఉంది. దాన్నే ఆరాఫ్ అని అంటారు. ఎవరి సత్కర్మలు,

దుష్కర్మలు సమానంగా ఉంటాయో వారు ఈ ప్రదేశంలో తాత్కాలికంగా ఉంటారు. అక్కణ్ణుంచి నరకవాసుల కష్టాలను, స్వర్గవాసుల సుఖాలను తిలకిస్తూ ఉంటారు. ప్రపంచంలో తమ అందదండల్ని చూసుకొని గర్వం ప్రదర్శిస్తూ ముస్లింల పేదరికాన్ని, వెనకబాటుతనాన్ని హేళనచేస్తూ, "వీరికి దైవకారుణ్యం లభించదు" అని పగలబడి నవ్వుకున్న పొగరుమోతుల్ని కూడా వీరు అక్కడ చూస్తారు. వారి ముఖకవళికల్ని చూసి ఆరాఫ్ వాసులు వారిని గుర్తుపడతారు. ఆ పొగరుమోతుల కళ్ళముందే నిరుపేదలు, బలహీనులైన విశ్వాసులను స్వర్గంలోకి వెళ్ళమని ఆదేశించటం జరుగుతుంది. వారు స్వర్గానికి వెళ్తారు.

దీనిద్వారా చెప్పదలచుకున్నదేమిటంటే, ప్రాపంచిక అండదండలు, అధికారం అంగబలాలు, ఐహిక సిరిసంపదలు అల్లాహ్ దగ్గర పనికిరావు. అక్కడ కేవలం విశ్వాసం మాత్రమే పనికివస్తుంది. ఆ విశ్వాసికి ప్రాపంచిక అండదండలు, ఐహిక సిరిసంపదలు లేకున్నాసరే. ఇప్పుడు దీనికి సంబంధించిన హదీసులు చూడండి :

٦٠٢ - وعن عِيَاضِ بنِ حِمَارٍ رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «إنَّ اللهَ أوحَى إليَّ أنْ تَوَاضَعُوا حتَّى لا يَفْخَرَ أحَدٌ على أحَدٍ، ولا يَبْغِي أحَدٌ على أحَدٍ» رواه مسلم.

602. హజ్రత్ ఇయాజ్ బిన్ హిమార్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : పరస్పరం అణకువతో వ్యవహరించమని, ఎవరూ ఎవరిమీదా గొప్పలు చెప్పుకోకూడదని, ఎవరూ ఎవరి మీదా అత్యాచారానికి పాల్పడకూడదని దేవుడు నన్ను వహీద్వారా ఆదేశించాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని స్వర్గసుఖాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కులగోత్రాలు, సిరిసంపదల ప్రాతిపదికపై ఒకర్ని నీచంగా భావించటం, ఒకరిపై అన్యాయానికి ఒడిగట్టడం సమంజసమైన విషయం కాదు. దేవుడు సమాజంలో ఎవరికయినా ఏదయినా గొప్ప స్థానాన్ని ప్రసాదిస్తే దానికి అతను కృతజ్ఞతలు తెలుపుకోవాలిగాని సాటి మానవులను అల్పులుగా భావించటం, వారిమీద అత్యాచారాలకు పాల్పడటం చేయరాదు.

٦٠٣ - وَعَنْ أبي هُرَيرة رضي الله عنه، أنَّ رسولَ اللهِ ﷺ قال: «مَا نَقَصَتْ

603. హజ్రత్ అబూ హురైరా (రజి)గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : దానధర్మాలు సంపదలో లోటు ఏర్పరచవు. దాసుడు మన్నింపుల వైఖరిని అవలంబిస్తే దేవుడు

صَدَقَةٌ مِن مالٍ، وَما زادَ اللهُ عَبْداً بِعَفْوٍ إلَّا عِزًّا، وما تَوَاضَعَ أَحَدٌ للهِ إلَّا رَفَعَهُ اللهُ» رواه مسلم.

అతని గౌరవాన్ని ఇతోధికం చేస్తాడు. ఎవరయినా దైవం కోసం అణకువను ప్రదర్శిస్తే దేవుడు అతనికి ఔన్నత్యాన్ని ప్రసాదిస్తాడు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దానధర్మాల వల్ల సంపద పైకి తరిగిపోతున్నట్లు కనిపిస్తుంది. కాని కొన్ని సందర్భాల్లో అల్లాహ్ దానికి ప్రతిఫలంగా మరింత సంపదను ప్రసాదిస్తాడు. ఒకవేళ సంపదలో వృద్ధి జరిగినా జరగకపోయినా పరలోకంలో మాత్రం అందుకు గొప్ప ప్రతిఫలాన్ని తప్పకుండా అనుగ్రహిస్తాడు. అలా జరిగితే ఆ సంపదలో ఏర్పడిన లోటు పూర్తయినట్లే కదా!

లేదా ఈ హదీసుకు భావం, మిగతా సంపదలో అల్లాహ్ శుభాన్ని ప్రసాదించి సంపద తరిగినట్లు కనిపించకుండా చేస్తాడని కావచ్చు.

మృదుత్వాన్ని, మన్నింపుల వైఖరిని అవలంబిస్తే జనం తమను తక్కువగా అంచనా వేస్తారనీ, తాము వారికి లోకువ అయిపోతామని భావిస్తారు సాధారణంగా మనుషులు. కాని దైవప్రవక్త (సల్లం) చెబుతున్నారు - ఈ వైఖరిని గనక అవలంబిస్తే అంతిమంగా గౌరవమర్యాదలే లభిస్తాయి. జనం తమను మునుపుకంటే ఎక్కువగా గౌరవించటం మొదలుపెడతారు. ఇకపోతే పరలోకంలో ఉన్నత స్థానాలు ఎలాగూ దక్కుతాయి.

٦٠٤ ـ وعن أنس رضي الله عنه أنَّهُ مَرَّ عَلى صِبيانٍ فَسَلَّم عَلَيْهِمْ وقال: كان النَّبيُّ ﷺ يفعَلُهُ. متفقٌ عليه.

604. హజ్రత్ అనస్ (రజి) ఓసారి కొంత మంది పిల్లల సమీపం నుంచి వెళ్తూ వారికి సలాం చేసి, దైవప్రవక్త (సల్లం) కూడా ఇలాగే (చిన్నపిల్లలకు) సలాం చేసేవారని చెప్పారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

చిన్న పిల్లలకు సలాం చెయ్యటమనేది మనిషిలోని నమ్రతా భావాన్ని సూచిస్తుంది. దైవప్రవక్త (సల్లం) ఎప్పుడయినా చిన్నపిల్లలు ఎదురయితే తానే ముందుగా వారికి సలాం చేసేవారు. ఇస్లాం ధర్మం మనిషి తన ఇంటికి వెళ్ళినప్పుడు తన ఆలుబిడ్డలకు కూడా సలాం చెయ్యాలని ఆదేశిస్తోంది. అంతేకాదు తన అధీనంలో ఉన్నవారికి, నౌకర్లకు, సేవకులకు కూడా సలాం చెయ్యాలి. ఇతరులకు సలాం చెయ్యనివారు గర్వానికి లోనయి ఉన్నారని గ్రహించాలి.

605. హజ్రత్ అనస్ (రజి) కథనం : మదీనాలోని దాసీలలో ఎవరయినా దైవ ప్రవక్త (సల్లం)ను ఆయన చెయ్యిపట్టు కొని తాము కోరిన చోటుకి తీసుకెళ్ళ గలిగేవారు. (అంతటి మృదు స్వభావి ఆయన). (బుఖారీ)

٦٠٥ ـ وعنه قال: إنْ كانَتِ الأَمَةُ مِنْ إمَاءِ المَدِينَةِ لَتَأْخُذُ بِيَدِ النبيِّ ﷺ، فَتنطَلِقُ بِهِ حَيْثُ شَاءَتْ. رواه البخاري.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం)*

606. హజ్రత్ అస్వద్ బిన్ యజీద్ (రహ్మాలై) కథనం : దైవప్రవక్త (సల్లం) ఇంట్లో ఏం చేసేవారని ఆయిషా (రజి. అన్హా)ను అడగ్గా, "ఆయన ఇంట్లో ఉన్నప్పుడు ఇంటి పనుల్లో నిమగ్నులై ఉండేవారు, కాని నమాజ్‌కు వేళ అవ గానే లేచి నమాజ్‌కు వెళ్ళిపోయే వారు" అని చెప్పారామె. *(బుఖారీ)*

٦٠٦ ـ وعن الأَسْوَدِ بنِ يَزِيدَ قال: سُئِلَتْ عَائِشَةُ رضيَ الله عنها: مَا كَانَ النَّبِيُّ ﷺ يَصنَعُ في بَيْتِهِ؟ قالت: كان يَكُون في مِهْنَةِ أَهْلِهِ ـ يَعني: خِدمَةَ أهلِه ـ فإذا حَضَرَتِ الصَّلاةُ، خَرَجَ إلى الصَّلاَة. رواه البخاري.

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో కూడా దైవప్రవక్త (సల్లం) గారి పరిపూర్ణ అణకువ భావం వివరించబడింది. చాలామంది పురుషులు ఇంటిపనుల్లో తమ భార్యలకు లేక ఇంటి ఆడవాళ్ళకు సహాయం చేయటాన్ని అవమానకరంగా, తమ కీర్తికి కళంకంగా భావిస్తారు. ఈ వైఖరి దైవప్రవక్త విధానానికి పూర్తిగా విరుద్ధం. ఇంటిపనుల్లో స్త్రీకి సహాయం చేయటం కూడా దైవప్రవక్త గారి ఆదర్శ సంప్రదాయమే. ఇందులో అవమానాన్ని ఊహించుకోవాల్సిన అవసరం లేదు. అలాగే ఇంటి పనుల్లోనే పూర్తిగా మునిగిపోయి నమాజును సైతం మర్చిపోవటం కూడా మంచిపద్ధతి కాదు. నమాజ్ వేళ అవగానే పురుషులు నమాజ్ కోసం మస్జిద్‌కు వెళ్ళిపోవాలి. స్త్రీలు కూడా తమకు ఎక్కడ వీలయితే అక్కడ తప్పకుండా నమాజ్ చేసుకోవాలి.

607. హజ్రత్ అబూ రిఫాఅ తమీమ్ బిన్ ఉసైద్ (రజి) కథనం : ఓసారి దైవప్రవక్త (సల్లం) ప్రసంగిస్తుండగా నేనాయన దగ్గరికి వెళ్ళి, "దైవప్రవక్తా! ఓ బాటసారి

٦٠٧ ـ وعن أبي رِفَاعَةَ تَمِيمِ بن أُسَيدٍ رضي الله عنه قال: انتَهَيْتُ إلى رسولِ اللهِ ﷺ وهو يَخطُبُ، فقلتُ:

ధర్మం గురించి తెలుసుకోవాలని వచ్చాడు. అతనికి తన ధర్మమేమిటో తనకే తెలియదు" అని అన్నాను. ఆ మాట విని దైవప్రవక్త (సల్లం) నావైపు దృష్టి మళ్ళించారు. ప్రసంగం ఆపి నా దగ్గరికొచ్చారు. ఆయన కోసం ఓ కుర్చీ హాజరుపరచబడింది. ఆయన దానిపై కూర్చొని దేవుడు తనకు నేర్పిన విషయాలను నాకు బోధించటం మొదలు పెట్టారు. (కాసేపయిన తరువాత) మళ్ళీ ప్రసంగం చెయ్యటానికి వెళ్ళి (తాను చెప్పదలచుకున్న) మాటను పూర్తిచేశారు. (ముస్లిం)

يا رسولَ اللهِ! رَجُلٌ غَرِيبٌ جَاءَ يَسْأَلُ عَنْ دِينِـهِ لا يَـدْرِي مَـا دِينُـهُ؟ فَـأَقْبَـلَ عَلَـيَّ رَسُولُ اللهِ ﷺ، وَتَرَكَ خُطْبَتَهُ حَتَّى انْتَهَى إِلَيَّ، فَأُتِيَ بِكُرسِيٍّ، فَقَعَدَ عَلَيهِ، وَجَعَلَ يُعَلِّمُنِي مِمَّا عَلَّمَهُ اللهُ، ثم أَتَى خُطْبَتَهُ، فَأَتَمَّ آخِرَهَا. رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)*

608. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం)అన్నం తిన్న తరువాత తన మూడువ్రేళ్ళనూ నాక్కునేవారు. తరచూ ఇలా అంటుండేవారు: మీలో ఎవరి (చేతిలో నుంచైనా అన్నం) ముద్ద క్రిందపడిపోతే వారు దాన్ని ఎత్తుకొని శుభ్రంచేసుకొని తినాలి. అంతేగాని దాన్ని షైతాన్‌కోసం వదిలేయకూడదు."

ఇంకా దైవప్రవక్త (సల్లం) కంచాన్ని నాకి శుభ్రం చేసుకోవాలని ఆదేశించేవారు. "మీరు తినే భోజనంలోని ఏ భాగంలో శుభం ఉందో మీకు తెలియదు" అని అనేవారు. (ముస్లిం)

٦٠٨ ـ وعن أنسٍ رضيَ الله عنه أنَّ رَسُولَ اللهِ ﷺ كان إذا أكَلَ طَعَاماً لَعِقَ أَصَابِعَهُ الثَّلاثَ. قال: وقال: «إذَا سَقَطَتْ لُقْمَـةُ أَحَـدِكُـمْ، فَلْيُمِـطْ عَنْهَـا الأذَى، وَلْيَـأكُلْهَـا، وَلا يَـدَعْهَـا للشَّيْطَانِ» وَأَمَرَ أَنْ تُسْلَتَ القَصْعَةُ. قال: «فَإِنَّكُمْ لاتَدْرُونَ في أيِّ طَعَامِكُمُ البَرَكَةُ». رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని అన్నపానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

భోజనం చేసిన తరువాత కంచాన్ని, వ్రేళ్ళను నాకి శుభ్రం చేసుకోవటంలో మనిషిలోని అణకువభావం ఉట్టిపడుతుంది. అన్నం తింటున్నప్పుడు చేతిలోనుండి క్రిందపడిపోయిన ముద్దను ఎత్తుకోకపోవటం, వ్రేళ్ళను నాకి శుభ్రం చేసుకోకపోవటం, కంచంలో సగం అన్నం మెతుకులు అలాగే వదిలేయటం లాంటివి అహంకారుల చేష్టలు. అలాచేస్తే దేవుడు ప్రసాదించిన ఆహారాన్ని అగౌరవపరచినట్లవుతుంది.

609. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఓసారి తన అనుచరులతో మాట్లాడుతూ, "దేవుడు పంపిన ప్రతి ప్రవక్త మేకల్ని కాసాడు" అన్నారు. ఆ మాట విని, "మీరు కూడా కాసారా?" అని అడిగారు అనుచరులు. "ఔను, నేను కూడా కొన్ని ఖీరాతుల జీతంపై మక్కావాసుల మేకల్ని కాసేవాణ్ణి" అని చెప్పారు దైవప్రవక్త (సల్లం). *(బుఖారీ)*

٦٠٩ ـ وعن أبي هُريرةَ رضي الله عنه عن النَّبيِّ ﷺ قال: «مَا بَعَثَ اللهُ نَبِيّاً إلَّا رَعَى الغَنَمَ» قَالَ أصحابُه: وَأَنْتَ؟ فقال: «نَعَمْ كُنْتُ أَرْعَاهَا عَلى قَرَارِيطَ لأهْلِ مَكَّةَ» رواهُ البخاري.

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకుముందు 'ఏకాంతాన్ని ఆశ్రయించటం' అనే అధ్యాయంలో వచ్చింది. ఇది సదరు అధ్యాయానికి సంబంధించినది కాబట్టి దీన్ని ఇక్కడ కూడా ప్రస్తావించటం జరిగింది. ఈ హదీసు మనిషి తన కష్టార్జితాన్ని మాత్రమే అనుభవించాలనీ, ఏదో ఒక వృత్తిని చేపట్టి అందులో కష్టపడి పనిచేయటం వినమ్రుల లక్షణమని ప్రబోధిస్తోంది.

610. హజ్రత్ అబూ హురైరా (రజి)గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : ఎవరయినా నన్ను (మేక మొదలగు జంతువుల) కాళ్ళు, భుజాలు (వండి) విందుకు ఆహ్వానించినా నేను వారి ఆహ్వానాన్ని అంగీకరిస్తాను. ఎవరయినా నాకు (ఆ) భుజాలు, కాళ్ళే గనక కానుకగా ఇస్తే వాటిని నేను (సంతోషంగా) స్వీకరిస్తాను. *(బుఖారీ)*

٦١٠ ـ وعنهُ عن النبيِّ ﷺ قال: «لَوْ دُعِيتُ إلى كُرَاعٍ أَوْ ذِرَاعٍ لأَجَبْتُ، وَلَوْ أُهْدِيَ إلَيَّ ذِرَاعٌ أَوْ كُرَاعٌ لَقَبِلْتُ» رواهُ البخاري.

*(సహీహ్ బుఖారీలోని సమర్పణల ప్రకరణం)*

٦١١ ـ وعن أنس رضي الله عنه قال: كَانَتْ نَاقَةُ رَسُولِ اللهِ ﷺ العَضْبَاءُ لَا تُسْبَقُ، أَوْ لا تَكَادُ تُسْبَقُ، فَجَاءَ أَعْرَابِيٌّ عَلَى قَعُودٍ لَهُ، فَسَبَقَهَا، فَشَقَّ ذلِكَ عَلَى المُسْلِمِينَ حَتَّى عَرَفَهُ، فَقَالَ: «حَقٌّ عَلَى اللهِ أَنْ لا يَرْتَفِعَ شَيْءٌ مِنَ الدُّنْيَا إِلَّا وَضَعَهُ» رواهُ البخاري.

611. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) దగ్గర 'అజ్బా' అనే పేరుగల ఒక ఆడ ఒంటె ఉండేది. ఇతర ఒంటెలేవీ దాన్ని మించిపోగలిగేవి కావు. ఒకసారి ఓ పల్లెటూరి వ్యక్తి తన ఒంటెపై ప్రయాణిస్తూ వచ్చి దైవప్రవక్త ఒంటెను మించిపోయాడు. అది చూసి ముస్లింలు నిర్ఘాంతపోయారు. దైవప్రవక్త (సల్లం) వారి నిర్ఘాంతాన్ని చూసి, "ప్రపంచంలో ఏదయినా వస్తువు వర్థిల్లుతుంటే దేవుడు దాన్ని (ఎప్పుడో ఒకప్పుడు) నొక్కిపెడతాడు. ఇలా చేయటం దేవుని విధి" అని అన్నారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ ప్రపంచంలో ఏ వస్తువూ ఎల్లకాలం ఉచ్ఛస్థితిలో ఉండలేదు. సృష్టిలోని చరాచరాలకు నిమ్నోన్నతలు, ఉచ్ఛనీచ స్థితులు, ప్రగతి అధోగతులు కాలక్రమంలో సహజంగానే సంక్రమిస్తూ వస్తున్నాయి. ఈ సృష్టిలోని ప్రతి వస్తువు - అది ఎంత గొప్పదయినాసరే; ఏదో ఒకనాడు వినాశాన్ని చవిచూడాల్సిందే. కనుక అహంకారాన్ని ప్రదర్శించటానికి, గర్వాన్ని ఒలకబోయటానికి ఈ సృష్టిలో దేనికీ అర్హత లేదు.



## 72వ అధ్యాయం

# ٧٢ - بَابُ تَحْرِيمِ الْكِبْرِ وَالإِعْجَابِ

# గర్వాహంకారాలను ప్రదర్శించటం నిషిద్ధం

قالَ اللهُ تعالى: ﴿ تِلْكَ ٱلدَّارُ ٱلْآخِرَةُ نَجْعَلُهَا لِلَّذِينَ لَا يُرِيدُونَ عُلُوًّا فِى ٱلْأَرْضِ وَلَا فَسَادًا وَٱلْعَٰقِبَةُ لِلْمُتَّقِينَ ﴾ [القصص: ٨٣] وقال تعالى: ﴿ وَلَا تَمْشِ فِى ٱلْأَرْضِ مَرَحًا ﴾ [الإسراء: ٣٧] وقال تعالى: ﴿ وَلَا تُصَعِّرْ خَدَّكَ لِلنَّاسِ وَلَا تَمْشِ فِى ٱلْأَرْضِ مَرَحًا إِنَّ ٱللَّهَ لَا يُحِبُّ كُلَّ مُخْتَالٍ فَخُورٍ ﴿١٨﴾ ﴾ [لقمان: ١٨]. ومعنى «تُصَعِّر خَدَّكَ للنَّاس» أَيْ: تميله وَتُعرِضُ بِهِ عَنِ النَّاسِ تَكَبُّراً عَلَيْهِمْ. وَ«المَرَح»: التَّبَخْتُر. وقال تعالى: ﴿ ۞ إِنَّ قَٰرُونَ كَانَ مِن قَوْمِ مُوسَىٰ فَبَغَىٰ عَلَيْهِمْ وَءَاتَيْنَٰهُ مِنَ ٱلْكُنُوزِ مَآ إِنَّ مَفَاتِحَهُۥ لَتَنُوٓأُ بِٱلْعُصْبَةِ أُو۟لِى ٱلْقُوَّةِ إِذْ قَالَ لَهُۥ قَوْمُهُۥ لَا تَفْرَحْ إِنَّ ٱللَّهَ لَا يُحِبُّ ٱلْفَرِحِينَ ﴿٧٦﴾ ﴾ [القصص: ٧٦] إلى قوله تعالى: ﴿ فَخَسَفْنَا بِهِۦ وَبِدَارِهِ ٱلْأَرْضَ ﴾ الآيات.

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"ఇక, పరలోకంలోని గృహాన్ని మేము భూమిపై తమ పెద్దరికాన్ని కోరుకోనివారికీ, కల్లోలాన్ని సృష్టించగోరని వారికీ ప్రత్యేకించి ఉంచుతాము. మేలైన పరిణామం మాత్రం భయభక్తులు కలవారికే. *(అల్ ఖసస్ : 83)*

"నేలమీద నిక్కుతూ నడవకండి." *(అల్ ఇస్రా : 37)*

"ప్రజలతో ముఖం ప్రక్కకు త్రిప్పి మాట్లాడకు, భూమిపై నిక్కుతూ నడవకు. అహంభావి, బడాయికోరు అయిన ఏ వ్యక్తినీ అల్లాహ్ ప్రేమించడు." *(లుఖ్మాన్ : 18)*

ముఖం త్రిప్పి మాట్లాడటమంటే, అహంభావంతో విముఖత చూపుతూ మాట్లాడటమని అర్థం. నిక్కుతూ అంటే గర్వాన్ని ప్రదర్శిస్తూ అని భావం.

ఇంకొకచోట దేవుడు ఇలా అంటున్నాడు : "ఇదొక యదార్థం; ఖారూన్ మూసా జాతికి చెందిన ఒక వ్యక్తి. అతను తన జాతికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేశాడు. మేము అతనికి ఎన్నో నిధులను ఇచ్చాము. వాటి తాళపు చెవులను బలాఢ్యులైన వ్యక్తుల ఒక సమూహం కూడా చాలా కష్టంగా ఎత్తగలదు. ఒకసారి అతని జాతి ప్రజలు అతనితో, "విర్రవీగకు. విర్రవీగే వారిని అల్లాహ్ ప్రేమించడు" అన్నారు..... చివరకు మేము అతన్నీ, అతని గృహాన్నీ భూమిలోనికి అణగద్రొక్కాము. *(అల్ ఖసస్ : 76 - 81)*

612. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్ (రజి) కథనం ప్రకారం ఓసారి దైవప్రవక్త (సల్లం) (ప్రజలకు) ఉపదేశం చేస్తూ, "మనసులో లేశమాత్రమయినా గర్వ ముంటే అతను స్వర్గంలోకి ప్రవేశించ లేడు" అన్నారు. అది విని ఒక వ్యక్తి సందేహపడుతూ, "(దైవప్రవక్తా!) మనిషి తన బట్టలూ, తన చెప్పులు నీటుగా ఉండాలని కోరుకుంటాడు (మరి ఇది కూడా గర్వమేనా?)" అని అడిగాడు. అందుకాయన "దేవుడు సుందర స్వరూపుడు, సౌందర్యాన్ని యిష్టపడ తాడు. వాస్తవానికి గర్వమంటే సత్యాన్ని త్రోసిపుచ్చటం, ప్రజల్ని నీచులుగా భావించటం" అని సమాధానమిచ్చారు. (ముస్లిం)

٦١٢ - وعن عبدِ اللهِ بن مسعُودٍ رضِيَ اللهُ عنه عن النَّبيِّ ﷺ قال: «لا يَدْخُلُ الجَنَّةَ مَنْ كَانَ في قَلْبِهِ مِثْقَالُ ذَرَّةٍ مِنْ كِبْرٍ» فقالَ رَجُلٌ: إنَّ الرَّجُلَ يُحِبُّ أَنْ يَكُونَ ثَوبُهُ حَسَناً، وَنَعْلُهُ حَسَنَةً؟ قال: «إنَّ اللهَ جَمِيلٌ يُحِبُّ الجَمَالَ؛ الكِبْرُ بَطَرُ الحَقِّ وَغَمْطُ النَّاسِ» رواه مسلم. بَطَرُ الحَقِّ: دَفْعُهُ وَرَدُّهُ عَلى قَائِلِهِ، وَغَمْطُ النَّاسِ: احْتِقَارُهُمْ.

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషి మనసులో లేశమాత్రం గర్వమున్నా దేవుడు అతణ్ణి యిష్టపడడు. గర్వాహంకారాలకు లోనయి దైవాన్ని, ఆయన ధర్మాన్ని విశ్వసించటానికి నిరాకరించేవారు నరకాగ్నికి ఆహుతి అవుతారనటంలో సందేహం లేదు. కాని ఎవరయినా తమ సిరిసంపదలను, అందచందాలను, పేరుప్రతిష్ఠల్ని, హోదా అంతస్థులను చూసుకొని మిడిసిపాటుకు లోనయి సత్యాన్ని తృణీకరిస్తే, లేదా తోటివారిని నీచులుగా లెక్కగడితే - అలాంటి మిడిసిపాటు కూడా గర్హనీయమే కాని - వీరికి శాశ్వత నరకయాతన మాత్రం ఉండదు. కొంతకాలంపాటు నరకంలో శిక్షననుభవించిన తరువాత వీరు కూడా స్వర్గభోగాలకు నోచుకోగల్గుతారు.

613. హజ్రత్ సలమా బిన్ అక్వా (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) సమక్షంలో ఎడమచేత్తో తిన్నాడు. ఆయన ఆ వ్యక్తిని కుడిచేత్తో తినమని ఆదేశించారు. అతను "నేను (కుడిచేత్తో)

٦١٣ - وعنْ سلمةَ بنِ الأكْوعِ رضِيَ اللهُ عنه أنَّ رَجُلاً أَكَلَ عِنْدَ رسولِ اللهِ ﷺ بِشِمَالِهِ، فقالَ: «كُلْ بِيَمِينِكَ». قالَ: لَا أَسْتَطِيعُ! قالَ:

«لا اسْتَطَعْتَ» مَا مَنَعَهُ إلَّا الكِبْرُ، قال: فما رَفَعَها إلى فِيهِ. رواهُ مسلم.

తినలేను" అన్నాడు. దానికి ఆయన "నువ్వు (నిజంగానే కుడిచేత్తో) తినలేక పోదువుగాక!" అని శపించారు. అతని గర్వం అతణ్ణి దైవప్రవక్త (సల్లం) మాట వినకుండా చేసింది.

(ఇక ఆ తరువాత నుంచి) ఆ వ్యక్తి తన కుడిచేతిని నోటిదాకా లేపలేకపోయే వాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని అన్నపానీయాల ప్రకరణం)*

٦١٤ ـ وعنْ حَارِثَةَ بنِ وَهْبٍ رضِيَ اللهُ عنه قال: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يقولُ: «ألَا أُخبِرُكُمْ بأهْلِ النَّارِ؟ كُلُّ عُتُلٍّ جَوَّاظٍ مُسْتَكْبِرٍ» متفقٌ عليه. وتقدَّمَ شرحُه في بابِ ضَعَفَةِ المسلمين.

614. దైవప్రవక్త (సల్లం) ఇలా అంటుం డగా తాను విన్నానని హజ్రత్ హారిసా బిన్ వహబ్ (రజి) తెలిపారు : నరకవాసు లెవరో నేను మీకు తెలియజేయనా? పొగరుబోతు, పిసినిగొట్టు, గర్విష్టిఅయిన ప్రతివాడూ (నరకవాసియే). *(బుఖారీ - ముస్లిం)*

٦١٥ ـ وعن أبي سعيدٍ الخُدريِّ رضِيَ اللهُ عنه عنِ النبيِّ ﷺ قال: «احْتَجَّتِ الجَنَّةُ وَالنَّارُ، فَقَالَتِ النَّارُ: فِيَّ الجَبَّارُونَ وَالمُتَكَبِّرُونَ، وَقَالَتِ الجَنَّةُ: فِيَّ ضُعَفَاءُ النَّاسِ وَمَسَاكِينُهُمْ. فَقَضَى اللهُ بَيْنَهُمَا: إنَّكِ الجَنَّةُ رَحْمَتِي، أَرْحَمُ بِكِ مَنْ أَشَاءُ، وَإنَّكِ النَّارُ عَذَابِي، أُعَذِّبُ بِكِ مَنْ أَشَاءُ، وَلِكِلَيْكُمَا عَلَيَّ مِلْؤُهَا» رواهُ مسلم.

615. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : స్వర్గం మరియు నరకం పరస్పరం వాదులాడుకున్నాయి. నాలో తలబిరుసులు, అహంకారులు ఉంటారని నరకం అంటే, నాలో బలహీనులు, నిస్సహాయులు ఉంటారని స్వర్గం అన్నది. అప్పుడు అల్లాహ్ వారిద్దరినీ సముదాయిస్తూ, (స్వర్గంతో) "నువ్వు నా కారుణ్యానివి. నేను నీ ద్వారా నాకిష్టమైన వారిని కరుణిస్తాను. (తరువాత నరకంతో) నువ్వు నా శిక్షవి. నేను నీ ద్వారా నేను తలచిన వారిని

శిక్షిస్తాను. (ఇకపోతే) మీ ఇద్దరినీ నింపా ల్సిన బాధ్యత నాది" అని అన్నాడు.

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని స్వర్గసుఖాల ప్రకరణం)

٦١٦ ـ وعن أبي هُريرةَ رضي اللهُ عنه أنَّ رسولَ اللهِ ﷺ قال: «لا يَنْظُرُ اللهُ يَوْمَ القِيَامَةِ إلى مَنْ جَرَّ إزارَهُ بَطَراً» متفقٌ عليه.

616. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : అహంకారంతో తన ధోవతీని (లుంగీ, షరాయీని) నేలమీద ఈడుస్తూ నడిచేవాని వైపు ప్రళయదినాన దేవుడు కన్నెత్తి అయినా చూడడు.

(బుఖారీ - ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని వస్త్రధారణ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఇక్కడ 'కన్నెత్తి చూడడు' అంటే కారుణ్యదృష్టితో చూడడని అర్థం. ప్రళయదినాన దేవుడు అహంకారులు, పొగరుబోతుల వైపు కారుణ్యదృష్టితో చూడడు. పైగా ఆగ్రహంతో చూస్తాడు. ఈ హదీసులో 'ఇజార్' అనే పదం ఉపయోగించబడింది. ఇజార్ అంటే శరీరంలోని క్రింది సగభాగానికి తొడుక్కునే వస్త్రం. అది షరాయి, ప్యాంటు, లుంగీ, ధోవతి ఏదయినా కావచ్చు. వేరొక హదీసులో దైవప్రవక్త (సల్లం) పురుషులు క్రింది అంగవస్త్రాన్ని చీలమండలకు పైన ఉండేవిధంగా ధరించాలని తాకీదు చేశారు. అంగవస్త్రాన్ని నేలపై ఈడిస్తూ నడవటం అహంకారుల లక్షణం. ప్రళయదినాన అలాంటివారు గొప్ప అవమానాన్ని ఎదుర్కొంటారు.

٦١٧ ـ وعنه قال: قال رَسُولُ اللهِ ﷺ: «ثَلاثَةٌ لا يُكَلِّمُهُمُ اللهُ يَوْمَ القِيَامَةِ، وَلا يُزَكِّيهِمْ، وَلا يَنْظُرُ إلَيْهِمْ، وَلَهُمْ عَذَابٌ أَلِيمٌ: شَيْخٌ زَانٍ، وَمَلِكٌ كَذَّابٌ، وَعَائِلٌ مُسْتَكْبِرٌ» رواهُ مسلم.

«العَائِلُ»: الفقير.

617. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : ముగ్గురు వ్యక్తుల్ని ప్రళయదినాన దేవుడు పలకరించడు. వారిని ప్రక్షాళనం చేయడు. అసలు వారివైపు చూడనయినా చూడడు. పైగా అక్కడ వారి కోసం బాధాకరమైన శిక్ష ఉంటుంది. వారు; వృద్ధ వ్యభిచారి, అబద్ధాలకోరు అయిన రాజు, పొగరు బోతు నిరుపేద. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఇక్కడ కూడా దేవుడు ముగ్గురు వ్యక్తులను పలకరించడంటే వారిపట్ల ప్రేమతో, సంతోషంగా గాకుండా క్రోధంతో, ఆగ్రహంతో మాట్లాడతాడని అర్థం. ఇకపోతే హదీసులో పేర్కొనబడిన ఆ ముగ్గురు వ్యక్తులు చేసే నేరాలు సాధారణంగా చాలామంది చేస్తుంటారు, మరి దేవుడు ఆ ముగ్గురినే పలకరించకుండా ఉండటానికి కారణమేమిటి అనే సందేహం రావచ్చు. దానికి సమాధానం ఏమిటంటే వారు తామున్న స్థితిలో ఆ నేరాలు చేస్తే అవి ఇంకా ఘోర నేరాలుగా పరిగణించబడతాయి. యువకులకయినా, వృద్ధులకయినా వ్యభిచారం అనేది పాపమే. కాని ఒక వృద్ధుడు ఆ పని చేస్తే అది ఘోరాతిఘోర నేరంగా పరిగణించబడుతుంది. ఎందుకంటే వృద్ధాప్యంలో వ్యభిచరించటమనేది మనిషిలోని చిత్తచాంచల్యాన్ని, దైవం పట్ల నిర్భీతిని సూచిస్తుంది. అదేవిధంగా అబద్ధం చెప్పటమనేది ప్రతి ఒక్కరికీ నిషిద్ధమే. కాని సత్యాన్ని, న్యాయాన్ని కాపాడవలసిన రాజే ధర్మాసనంపై కూర్చొని అబద్ధం చెబితే అది మరింత లజ్జావిహీనమైన విషయం అనిపించుకుంటుంది. రాజుకు సర్వాధికారాలూ ఉంటాయి. అతను ఎవరికైనా భయపడి అబద్ధం చెప్పాల్సిన అవసరం ఉండదు. అయినా కూడా అతను అబద్ధం చెబుతున్నాడంటే అది అతని నీతి మాలినతనానికి అద్దం పడుతుంది.

అదేవిధంగా గర్వాహంకారాలనేవి మానవుల్లో ఎవరికీ శోభించవు. కాని అదే పూటకు కూడా గతిలేని ఓ కటిక దరిద్రుడు అహంకారాన్ని ప్రదర్శిస్తే అది ఇంకా దారుణం. వాస్తవానికి అతను దైవం విషయంలోనే నిరపేక్షాభావాన్ని కనబరుస్తున్నాడు. అది చాలా ప్రమాదకరమైన విషయం.

618. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) దేవుడు ఇలా అంటున్నాడని తెలియజేశారు : గౌరవం నా అంగవస్త్రం. అహంకారం నా దుప్పటి. ఎవరయినా వాటిని లాక్కోవాలని ప్రయత్నిస్తే నేనతణ్ణి శిక్షిస్తాను. (ముస్లిం)

٦١٨ ـ وعنــه قــال: قــال رسولُ الله ﷺ: «قَالَ الله عَزَّ وَجَلَّ: العِزُّ إزَارِي، وَالكِبْرِيَاءُ رِدَائِي، فَمَنْ يُنَازِعُنِي عَذَّبْتُهُ». رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం, సుననె ఇబ్నె మాజాలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ 'లాక్కోవట'మంటే అలాంటి దైవిక గుణాల్ని తాము అవలంబించటానికి ప్రయత్నించటం అని అర్థం. అధికారం, ఆధిక్యతలు, గర్వాహంకారాలు సకల లోకాలకూ ప్రభువైన అల్లాహ్‌కు మాత్రమే శోభిస్తాయి. మానవుల్లో ఎవరికయినా కొద్దో గొప్పో అధికారం, ఆధిక్యతలు లభించాయంటే అవి దైవప్రసాదితాలే. అందుకు వారు దైవానికి కృతజ్ఞతలు

తెలుపుకోవాలిగాని తలబిరుసుతనానికి పాల్పడకూడదు. పరలోకంలో తలబిరుసులకు నరకమే నివాస స్థలం!

619. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం: పూర్వం ఒకడు ఖరీదైన బట్టలు ధరించి అహంకారంతో, చక్కగా తల దువ్వుకొని నిక్కుతూ నడవసాగాడు. అంతలో దేవుడు అతణ్ణి భూమిలోకి దిగదోశాడు. ఇక అతను ప్రళయదినం వరకూ అలా భూమిలోకి దిగబడి పోతూనే ఉంటాడు. *(బుఖారీ - ముస్లిం)*

٦١٩ ـ وعَنه أنَّ رسولَ الله ﷺ قال: «بَيْنَما رَجُلٌ يَمْشِي في حُلَّةٍ تُعْجِبُه نَفْسُهُ، مُرَجِّلٌ رَأْسَهُ، يَخْتَالُ في مِشْيَتِهِ، إذْ خَسَفَ اللهُ بِهِ، فَهو يَتَجَلْجَلُ في الأرْضِ إلى يَوْمِ القِيَامَةِ» متفقٌ عليه. «مُرَجِّلٌ رَأْسَهُ»، أي: مُمَشِّطُهُ، «يَتَجَلْجَلُ» بالجيمين، أيْ: يَغُوصُ وَيَنْزِلُ.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని వస్త్రధారణ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు మనిషి తన ఠీవిని, సౌందర్యాన్ని చూసుకొని మిడిసిపాటుకు లోనుకాకూడదని, పైగా దైవానికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ మసలుకోవాలని ప్రబోధిస్తోంది.

620. హజ్రత్ సలమా బిన్ అక్వా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : మనిషి ఎల్లప్పుడూ అహంకారాన్ని ప్రదర్శిస్తూపోతే చివరికి అతను తలబిరుసుల జాబితాలో నమోదుచేయబడతాడు. ఆ తరువాత ఇతనికి కూడా వారికి పట్టిన గతే పడుతుంది. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్'గా పేర్కొన్నారు).

٦٢٠ ـ وعن سَلَمَةَ بنِ الأكْوَعِ رضيَ اللهُ عنه قال: قال رسُولُ اللهِ ﷺ: «لا يَزَالُ الرَّجُلُ يَذْهَبُ بِنَفْسِهِ حَتَّى يُكْتَبَ فِي الجَبَّارِينَ، فَيُصِيبَهُ مَا أصَابَهُمْ» رواهُ الترمذي وقالَ: حديثٌ حسنٌ. «يَذْهَبُ بِنَفْسِهِ» أيْ: يَرْتَفِعُ وَيَتَكَبَّرُ.

*(సునన్ తిర్మిజీలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మంచివారి అలవాట్లను, సద్గుణాలను అవలంబించటం అభిలషణీయమైనట్లే చెడ్డవారి చెడు విధానాలను, వారి దుర్గుణాలను అవలంబించటం కూడా అత్యంత అసహ్యాకరం. మనిషి ఎలాంటి వారి పోకడలను అనుసరిస్తాడో అంతిమంగా అతను వారి వర్గంలోనే చేరతాడు.

## 73వ అధ్యాయం

# ٧٣ ـ باب حسن الخلق

# ఉత్తమ నడవడిక

قَالَ الله تعالى: ﴿ وَإِنَّكَ لَعَلَىٰ خُلُقٍ عَظِيمٍ ﴾ [القلم: ٤] وقال تعالى: ﴿ وَالْكَاظِمِينَ الْغَيْظَ وَالْعَافِينَ عَنِ النَّاسِ ﴾ الآية [آل عمران: ١٣٤].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"ప్రవక్తా! నిస్సందేహంగా నువ్వు నైతికంగా ఎంతో ఉన్నత స్థానంలో ఉన్నావు." *(అల్ ఖలమ్ : 4)*

"(భయభక్తులు కలవారైన విశ్వాసులు) కోపాన్ని దిగమ్రింగుతారు. ఇతరుల తప్పుల్ని క్షమిస్తారు. ఇలాంటి సజ్జనులంటే అల్లాహ్‌కు ఎంతో యిష్టం." *(ఆలి ఇమ్రాన్ : 134)*

٦٢١ ـ وعن أنسٍ رضيَ الله عنه قال: كانَ رسُولُ اللهِ ﷺ أَحْسَنَ النَّاسِ خُلُقاً. متفقٌ عليه.

621. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవ ప్రవక్త (సల్లం) మానవులందరిలోకెల్లా సుగుణవంతులు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్ఠతల ప్రకరణం)*

٦٢٢ ـ وعنه قال: مَا مَسِسْتُ دِيبَاجاً وَلَا حَرِيراً أَلْيَنَ مِنْ كَفِّ رَسُولِ اللهِ ﷺ، وَلَا شَمَمْتُ رائحَةً قَطُّ أَطْيَبَ مِنْ رَائِحَةِ رَسُولِ اللهِ ﷺ، وَلَقَدْ خَدَمْتُ رَسُولَ اللهِ ﷺ عَشْرَ سِنِينَ، فَمَا قَالَ لِي قَطُّ: أُفٍّ، وَلَا قالَ لِشَيْءٍ فَعَلْتُهُ: لِمَ فَعَلْتَهُ؟ وَلَا لِشَيْءٍ لَمْ أَفْعَلْهُ: أَلَا فَعَلْتَ كَذَا؟. متفقٌ عليه.

622. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) హస్తం కన్నా సుకుమారమైన పట్టువస్తువేదీ నేను ముట్టుకోలేదు. దైవప్రవక్త (సల్లం) శరీర సువాసన కన్నా పవిత్రమైన పరిమళం నేనెన్నడూ ఆఘ్రాణించలేదు. నేను పదేళ్ళపాటు దైవప్రవక్త (సల్లం)కు సేవ చేశాను. కాని నేను చేసిన పని విషయంలో ఆయన నన్ను ఎన్నడూ ఇలా ఎందుకు చేశావని అనలేదు. అలాగే నేను చేయని పని విషయంలో ఇలా

ఎందుకు చేయలేదు అని కూడా అనలేదు. (బుఖారీ - ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని మహిమోన్నతుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్టతల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

తన దగ్గర పదేండ్లు పనిచేసిన ఓ నౌకరుని యజమాని అంత సుదీర్ఘ కాలంలో ఏనాడైనా కసురుకోకుండా ఉండటం, కనీసం ఫలానా పని ఎందుకు చేయలేదు అని కూడా అడగకుండా ఉండటం ఉత్తమోత్తమ నైతికతకు నిలువెత్తు నిదర్శనం. దివిటీ పెట్టి వెతికినా లోకంలో ఇలాంటివారు కానరారు. ప్రపంచ చరిత్రలో ఇప్పటివరకు ఇలాంటి ఉదాహరణ మరొకటి లేదు. దైవప్రవక్త అనుచర సమాజం కూడా ఆయనగారి ఈ ఉత్తమ నడవడికను ఆదర్శంగా తీసుకుంటే ఎంతబాగుండు!

٦٢٣ ـ وعن الصَّعبِ بنِ جَثَّامَةَ رضيَ اللهُ عنه قال: أَهْدَيْتُ رسُولَ اللهِ ﷺ حِمَاراً وَحْشِيّاً، فَرَدَّهُ عَلَيَّ، فلمَّا رأى ما في وَجْهِي قالَ: «إِنَّا لَمْ نَرُدَّهُ عَلَيْكَ إِلاَّ لِأَنَّا حُرُمٌ» متفق عليه.

623. హజ్రత్ సాబ్ బిన్ జస్సామా (రజి) కథనం : నేనొకసారి దైవప్రవక్త (సల్లం)కు ఓ అడవి గాడిదను కానుకగా సమర్పించుకున్నాను. కాని ఆయన దాన్ని నాకు వాపసు చేసేశారు. అప్పుడు నా ముఖ కవళికల్లో వచ్చిన మార్పును చూసి ఆయన నాతో, "మేము 'ఇహ్రాం' దీక్షబూని ఉన్నాం. అందుకే దాన్ని వాపసు చేసేశాం" అని అన్నారు. (బుఖారీ - ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని హజ్ ప్రకరణాలు)

## ముఖ్యాంశాలు

హజ్, లేక ఉమ్రా యాత్ర కోసం దీక్షబూనటాన్ని 'ఇహ్రాం' అని అంటారు. ఇహ్రాం దీక్షబూనిన వానిని 'ముహ్రిం' అని పిలుస్తారు. ఒక ముహ్రిం ఇహ్రాం స్థితిలో ఉన్నప్పుడు తాను స్వయంగా జంతువుల్ని వేటాడటం గాని లేదా వేటాడటంలో ఇతరులకు సహకరించటం గాని చేయకూడదు. బహుశా ఆ కారణంవల్లనే దైవప్రవక్త (సల్లం) సాబ్ బిన్ జస్సామా కానుకను నిరాకరించి ఉంటారు.

ఈ సందర్భంగా గమనార్హమైన విషయం మరొకటుంది. ఇతరులచేత వేటాడబడిన జంతువుల మాంసాన్ని 'ముహ్రిం' కూడా తినవచ్చని మరికొన్ని హదీసులు ఉద్ఘాటిస్తున్నాయి. కాని మరోవైపు పై హదీసు ద్వారా అలా వేటాడబడిన జంతువుల మాంసాన్ని ముహ్రిం తిన కూడదని తెలుస్తోంది. చాలామంది విద్వాంసులు ఈ రెండురకాల హదీసుల మధ్య భావ సారూప్యతను సూచించారు. దాని ప్రకారం ముహ్రిం కానివారు తమ స్వయం కోసం జంతువుల్ని వేటాడి అందులో కొంతమాంసాన్ని ముహ్రింకు కానుకగా ఇస్తే ముహ్రిం దాన్ని నిస్సంకోచంగా స్వీకరించవచ్చు. మొదటిరకం హదీసుల్లో ప్రస్తావించబడిన విషయం అదే.

ఇకపోతే రెండో రకం హదీసుల్లో చెప్పబడిన విషయం ఏమిటంటే ఇతరులెవరయినా ప్రత్యేకంగా ముహ్రిం కోసమే జంతువుని వేటాడి దాని మాంసాన్ని ముహ్రింకు కానుకగా ఇస్తే దాన్ని స్వీకరించడం ధర్మసమ్మతం కాదు (ఫత్హుల్ బారీ). అదేవిధంగా జంతువు ఎవరికోసం వేటాడబడినప్పటికీ ఒకవేళ అది ప్రాణాలతో ఉంటే ముహ్రిం దాన్ని ఎట్టిపరిస్థితుల్లోనూ స్వీకరించకూడదు. ఇమామ్ బుఖారీ అభిప్రాయం కూడా ఇదే. ఆయన ఈ హదీసును, "ముహ్రిం సజీవంగా ఉన్న వేట జంతువుల కానుకను స్వీకరించకూడద"నే శీర్షిక క్రింద ప్రస్తావించారు.

624. హజ్రత్ నవ్వాస్ బిన్ సమ్ఆన్ (రజి) కథనం : నేను దైవప్రవక్త (సల్లం)ను సత్కార్యం, దుష్కార్యాల గురించి అడిగాను. దానికి ఆయన, "సత్కార్యమంటే ఉత్తమ నడవడిక. దుష్కార్యమంటే మదిని తొలిచేది, దాని గురించి ప్రజలు తెలుసుకుంటే బాగుం డదని నువ్వు తలచేది" అని చెప్పారు. *(ముస్లిం)*

٦٢٤ ـ وعن النَّوّاس بن سمعان رضيَ اللهُ عنه قال: سألتُ رَسُولَ الله ﷺ عن البِرِّ والإثمِ فقالَ: «البِرُّ حُسْنُ الخُلُقِ، والإثْمُ: مَا حَاكَ فِي نَفْسِكَ، وكَرِهْتَ أَنْ يَطَّلِعَ عَلَيْهِ النَّاسُ» رواهُ مسلم.

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మంచి నడవడికను కలిగివుండటం కూడా సత్కర్మలు చేయటంతో సమానమని ఈ హదీసులో చెప్పబడింది. ఎందుకంటే మంచినడవడిక గల వ్యక్తి మంచిపనులు మాత్రమే చేస్తాడు. చెడు పనులకు దూరంగా మసలుకుంటాడు.

పై హదీసులో పాపం గురించి కూడా అందరికీ అర్థమయ్యే విధంగా ఒక ప్రధాన సూత్రం వివరించబడింది. అదేమిటంటే- ప్రతి చెడుపనినీ మనిషి అంతరంగం అసహ్యించు కుంటుంది. తాను ఆ చెడుపని చేస్తే ప్రజలు తనను నిందిస్తారేమోనని కూడా మనిషి లోలోపల భయపడతాడు. అలాంటి ప్రతిపనీ చెడ్డదే అవుతుంది. అయితే ఈ అంతరాత్మ ప్రబోధనం కూడా మనిషి హృదయం పూర్తిగా మలినం కాకుండా ఉన్నంతవరకు మాత్రమే జరుగుతుంది.

ఎప్పుడైతే మనిషి హృదయం పూర్తిగా మలినమైపోయి తన సహజత్వాన్ని కోల్పోతుందో అప్పుడు పెద్ద పెద్ద నేరాలు కూడా ఆ హృదయాన్ని కదిలించలేవు. ఆ హృదయం మనుషులెవరికీ భయపడదు. మనిషిలో వాసనశక్తి సరిగ్గా ఉంటే అతను దుర్వాసనను పసిగట్టగలుగుతాడు. కాని ఎల్లప్పుడూ దుర్వాసన మధ్య ఉండేవాడి వాసనశక్తి ఎంతగా పాడయిపోతుందంటే పెంటకుప్పలపై కూర్చున్నా కూడా అతనికి దుర్వాసన రాదు. మలినమయిపోయిన హృదయం సంగతి కూడా అంతే.

٦٢٥ ـ وعن عبدِ الله بنِ عمرو بنِ العاص رضي الله عنهما قال: لم يكن رسولُ اللهِ ﷺ فَاحِشاً ولا مُتَفَحِّشاً. وكان يَقُولُ: «إنَّ مِن خِيارِكُم أَحْسَنَكُم أَخْلاقاً» متفقٌ عليه.

625. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) అప్రయత్నంగాగాని, ప్రయత్నపూర్వకంగా గాని అశ్లీల మాటలు మాట్లాడే వారు కారు. పైగా తరచూ (మమ్మల్ని ఉపదేశిస్తూ), "నైతికత రీత్యా మీలో ఉత్తముడైనవాడే అందరికంటే శ్రేష్ఠుడు" అని అనేవారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని మహిమోన్నతుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్టతల ప్రకరణం)*

٦٢٦ ـ وعن أبي الدرداءِ رضي الله عنه: أنَّ النبيَّ ﷺ قالَ: «مَا من شَيءٍ أَثْقَلُ في مِيزَانِ المُؤْمِنِ يَومَ القِيَامَةِ من حُسْنِ الخُلُقِ، وإنَّ الله يُبغِضُ الفَاحِشَ البَذِيَّ» رواه الترمذي وقال: حديث حسن صحيح. «البَذِيُّ»: هو الَّذي يَتَكَلَّم بالفُحشِ، ورَدِيءِ الكلام

626. హజ్రత్ అబూ దర్దా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు: ప్రళయదినాన విశ్వాసి త్రాసులో ఉత్తమ నడవడిక కన్నా బరువైన వస్తువు మరొకటి ఉండదు. నిస్సందేహంగా దేవుడు దుర్భాషలాడే వాణ్ణి బూతు మాటలు మాట్లాడేవాణ్ణి అసహ్యించుకుంటాడు. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్, సహీహ్‌గా పేర్కొన్నారు)

*(సుననె తిర్మిజీలోని సత్కార్యాలు - సత్సంబంధాల అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ప్రళయదినాన దైవసన్నిధిలో మనిషికి ఇహలోకంలో తాను చేసుకున్న పుణ్యకర్మలే ఉపయోగపడతాయి. ఈ పుణ్యకర్మలు ఇతర కర్మలన్నింటికన్నా ఎక్కువ బరువుని కలిగి ఉంటాయి. అయితే ఈ అదృష్టం మాత్రం ఒక్క విశ్వాసులకే ప్రత్యేకం. దైవంపై విశ్వాసం లేనివారు ఎన్ని పుణ్యకార్యాలు చేసినా వాటికి దైవసన్నిధిలో విలువ ఉండదు. అదేవిధంగా

చెడునడత కలవారిని, బూతు మాటలు మాట్లాడేవారిని దేవుడు అసహ్యించుకుంటాడంటే వారు పరలోకంలో వైఫల్యాన్ని చవిచూస్తారని అర్థం.

627. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : ప్రజల్ని అతి ఎక్కువగా స్వర్గానికి గొనిపోయే కర్మలు ఏవని దైవప్రవక్త (సల్లం)ను ప్రశ్నించటం జరిగింది. దానికి ఆయన, "దైవభీతి, ఉత్తమ నడవడికలు" అని సమాధానమిచ్చారు. మరి ప్రజల్ని అతి ఎక్కువగా నరకానికి గొనిపోయే కర్మలు ఏవని అడగ్గా, దానికి సమాధానమిస్తూ ఆయన, "నోరు మరియు మర్మాంగం" అని చెప్పారు.

٦٢٧ ـ وعن أبي هُريرة رضيَ الله عنه قال: سُئِلَ رسولُ اللهِ ﷺ عَنْ أكثرِ مَا يُدْخِلُ النَّاسَ الجَنَّةَ. قال: «تقْوَى اللهِ وَحُسنُ الخُلُقِ» وَسُئِلَ عَنْ أكثرِ مَا يُدْخِلُ النَّاسَ النَّارَ، فقَالَ: «الفَمُ وَالفَرْجُ». رواه الترمذي وقال: حديث حسن صحيح.

*(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్, సహీహ్‌గా పేర్కొన్నారు)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఎంతో భావగర్భితమైనది. దైవభీతి మూలంగా మనిషికి- దైవంతో సరైన అనుబంధం ఏర్పడుతుంది. తనలో ఉత్తమ నడవడిక గనక ఉంటే మనిషి ప్రజల హక్కుల్ని నెరవేర్చటంలో నిర్లక్ష్యం చేయడు. కనుక ఈ రెండు ఆచరణలు ఎలాంటివంటే వీటిమూలంగా ప్రజలు అత్యధికంగా స్వర్గానికి వెళ్తారు.

అదేవిధంగా నోరు ; నోటితో మనిషి ధర్మధిక్కారపు మాటలు మాట్లాడతాడు. చాడీలు చెబుతాడు. ఇతరుల మీద నిందలు మోపుతాడు. తిట్లు శాపనార్థాలు పెడ్తాడు. ఇవన్నీ నోటికర్మలు. మర్మాంగం వ్యభిచారానికి కారణభూతమవుతుంది. ఈ విధంగా ఈ రెండు అవయవాల వల్ల అత్యధికంగా ప్రజలు నరకానికి వెళ్తారు. కనుక ప్రతి వ్యక్తి దైవభీతితో, ఉత్తమ నడవడికతో జీవితం గడుపుతూ నోరు, మర్మాంగాల మూలంగా జరిగే అనర్థాలకు దూరంగా ఉండటం చాలా అవసరం. లేకపోతే అతని పరలోక జీవితం నాశనమయిపోతుంది.

628. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : విశ్వాసుల్లో ఉత్తమ నడవడిక గలవారే పరిపూర్ణ విశ్వాసులు. మీలో మీ భార్యల పట్ల ఉత్తమంగా వ్యవహరించేవారే ఉత్తములు. (తిర్మిజీ

٦٢٨ ـ وعنه قال: قال رسولُ الله ﷺ: «أكمَلُ المُؤْمنينَ إيمَاناً أحسَنُهُم خُلُقاً، وَخِيارُكم خِيارُكم لِنسَائِهِمْ». رواه الترمذي وقال: حديث حسن صحيح.

దీనిని ఉల్లేఖించి 'హసన్' సహీహ్‌గా పేర్కొన్నారు)

*(సుననె తిర్మిజీలోని విశ్వాసాల అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో నైతికతకు, విశ్వాసానికి అవినాభావ సంబంధముందని చెప్పబడింది. మనిషి నడవడిక ఎంత ఉన్నతంగా ఉంటుందో అతని విశ్వాసం కూడా అంత పరిపక్వత చెందివుంటుంది. విశ్వాసంలో పరిణతి రావాలంటే ముందుగా నైతికతలో పరిపూర్ణత రావాలి.

629. దైవప్రవక్త (సల్లం) ఈవిధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) తెలియజేశారు : విశ్వాసి తన ఉత్తమ నడవడిక మూలంగా ఒక ఉపవాసి స్థాయికి, రాత్రంతా మేల్కొని ఆరాధన చేసే ఆరాధకుని స్థాయికి చేరుకుంటాడు. *(అబూదావూద్)*

٦٢٩ ـ وعن عائشةَ رضيَ اللهُ عنها قالت: سَمِعْتُ رسولَ اللهِ ﷺ يقول: «إنَّ المُؤمنَ لَيُدْرِكُ بِحُسْنِ خُلُقِه دَرَجَةَ الصَّائِمِ القَائِمِ» رواه أبو داود.

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ 'ఉపవాసి' అంటే తరచూ నఫిల్ ఉపవాసాలు పాటించేవాడని అర్థం. అలాగే పై హదీసులో 'ఖాయిమ్' అనే పదం కూడా వాడబడింది. ఖాయిమ్ అంటే రాత్రిళ్ళు జాగారం చేసి దైవారాధనలో గడిపేవాడని భావం. ఈ రెండూ చాలా కష్టమైన ఆచరణలు. కాని ఆచరించే వారికి మాత్రం లెక్కలేనంత పుణ్యం లభిస్తుంది. అదే సమయంలో పైన పేర్కొనబడిన నఫిల్ ఆరాధనలు పాటించలేకపోయినప్పటికీ, కేవలం విధుల్ని మాత్రమే నిర్వర్తిస్తూ ఉత్తమ నడవడికను కలిగివున్న వ్యక్తికి కూడా ఉపవాసుల, నఫిల్ ఆరాధకుల మాదిరి పుణ్యం లభిస్తుంది. దేవుని దృష్టిలో ఉత్తమ నడవడికకు అంతటి ప్రాముఖ్యం ఉంది మరి!

630. హజ్రత్ అబూ ఉమామా బాహిలీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : ధర్మం తన పక్షాన ఉన్నప్పటికీ వివాదాన్ని ఉపసంహరించుకునే వ్యక్తికి స్వర్గ పరిసరాల్లో ఒక గృహాన్ని

٦٣٠ ـ وعن أبي أُمَامَةَ الباهِلِيِّ رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «أنَا زَعِيمٌ ببيتٍ في رَبَضِ الجنَّةِ لِمَنْ تَرَكَ

المِرَاءَ وَإن كَانَ مُحِقًّا، وبِبَيْتٍ في وَسَطِ الجنَّةِ لِمَن تَرَكَ الكَذِبَ، وَإن كَانَ مَازِحاً، وَبِبَيْتٍ في أَعلى الجَنَّةِ لِمَنْ حَسُنَ خُلُقُهُ» حديث صحيح، رواه أبو داود بإسناد صحيح. «الزَّعِيمُ»: الضَّامِنُ.

ఇప్పించేందుకు నేను పూచీ వహిస్తున్నాను. అలాగే పరాచికానికయినా అబద్ధాలు పలకనివానికి నడి స్వర్గంలో ఒక గృహాన్ని ఇప్పించేందుకు, ఉత్తమ నడవడికను కలిగివున్న వ్యక్తికి స్వర్గంలో ఎత్తయిన ప్రదేశంలో ఒక గృహాన్ని ఇప్పించేందుకు నేను పూచీ వహిస్తున్నాను. (ఈ హదీసు దృఢమైనది. అబూదావూద్ దీనిని ఉల్లేఖించారు)

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ధర్మం తమ పక్షాన ఉన్నప్పటికీ వివాదాన్ని రూపుమాపే ఉద్దేశ్యంతో తమ హక్కుల్ని వదలుకోవటం ఉత్తముల లక్షణం. అదేవిధంగా ఒక వ్యక్తి ఎగతాళికయినా అబద్ధం చెప్పటం లేదంటే అతను షరీఅత్‌కు, దేవుడు, దైవప్రవక్త (సల్లం) ఆదేశాల అమలుకు ఎక్కువ ప్రాముఖ్యతనిస్తున్నాడని అర్థం. అందుకే అతను అబద్ధం చెబితే ప్రజలు చెడుగా భావించని సందర్భాల్లో కూడా అబద్ధానికి దూరంగా ఉంటాడు. ఎట్టి పరిస్థితుల్లోనయినా అబద్ధం పలకకుండా ఉండటాన్ని దేవుడు అమితంగా ఇష్టపడతాడు. ఇలాంటి ఉత్తమ లక్షణాలు నీతిమంతులకే చెల్లుతాయి.

٦٣١ ـ وعن جابر رضي الله عنه أنَّ رسولَ الله ﷺ قال: «إنَّ مِنْ أَحَبِّكُم إليَّ، وَأَقرَبِكُم مِنِّي مَجلساً يَومَ القِيَامَةِ، أَحَاسِنَكُمْ أخلاقاً. وَإنَّ أَبغَضَكُمْ إليَّ، وَأَبعَدَكُم مِنِّي يَوْمَ القِيَامَةِ الثَّرثَارُونَ وَالمُتَشَدِّقُونَ وَالمُتَفَيْهِقُونَ» قالوا: يا رسولَ الله! قَدْ عَلِمْنَا الثَّرثَارُونَ وَالمُتَشَدِّقُونَ، فَمَا المُتَفَيْهِقُونَ؟ قال: «المُتَكَبِّرُون» رواه الترمذي وقال: حديث حسن. «الثَّرثَارُ»: هُوَ كَثِيرُ الكَلام تَكَلُّفاً.

631. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : మీలో అందరికన్నా ఎక్కువ నీతిమంతులు ప్రళయదినాన నాకు అత్యంత ప్రియతములుగా, నాకు అందరికన్నా సమీపంలో కూర్చొని ఉంటారు. వదరుబోతులు, డాబుసరిగా మాట్లాడేవారు, వికటంగా నవ్వుతూ మాట్లాడేవారు ప్రళయదినాన నాకు అత్యంత అయిష్టులుగా, అందరికన్నా దూరంగా ఉంటారు.

అది విని సహచరులు సందేహపడుతూ, "దైవప్రవక్తా! వదరుబోతులు,

డాబుసరిగా మాట్లాడేవారంటే అర్థమయింది. కాని ఈ వికటంగా మాట్లాడేవారంటే ఎవరు?" అని అడిగారు. దానికి సమాధానమిస్తూ దైవప్రవక్త (సల్లం) "వారు అహంకారులు" అని చెప్పారు.

*(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు)*

وَ«الْمُتَشَدِّقُ»: الْمُتَطَاوِلُ عَلَى النَّاسِ بِكَلامِهِ، وَيَتَكَلَّمُ بِمِلْءِ فِيهِ تَفَاصُحاً وَتَعْظِيماً لِكَلامِهِ وَ«الْمُتَفَيْهِقُ»: أَصْلُهُ مِنَ الفَهْقِ، وَهُوَ الامْتِلاءُ، وَهُوَ الَّذِي يَمْلأُ فَمَهُ بِالْكَلَامِ، وَيَتَوَسَّعُ فيه، وَيُغْرِبُ بِهِ تَكَبُّراً وَارتِفَاعاً، وَإِظْهَاراً للفَضِيلَةِ عَلَى غَيرِهِ. وروى التِّرمذيُّ عن عبدِ اللهِ بنِ المبارَكِ رحمه الله في تَفْسِيرِ حُسْنِ الخُلُقِ قال: هُوَ طَلاقَةُ الوَجهِ، وَبَذْلُ المَعرُوفِ، وَكَفُّ الأَذَى.

అసలు అరబీ మూలంలో 'ముతఫైహిఖ్' అనే పదం వాడబడింది. ఈ పదం 'ఫహఖ్' నుండి వచ్చింది. ఫహఖ్ అంటే నోరు తెరవటం. ఇలాంటి వ్యక్తి మాట్లాడుతున్నప్పుడు నోరు తెరిచి (మాటల్ని సాగదీస్తూ) గర్వం ఉట్టిపడేలా విచిత్రంగా మాట్లాడుతుంటాడు. ఇమామ్ తిర్మిజీ (రహ్మాలై) తన గ్రంథంలో ఉత్తమ నైతికతను గురించి వివరిస్తూ హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ముబారక్ (రహ్మాలై) చెప్పిన మాటను నకలుచేశారు. దాని ప్రకారం ఉత్తమ నైతికత అంటే నగుమోముతో పలకరించటం, దానధర్మాలు చేయటం, ఇతరుల్ని కష్టపెట్టకుండా ఉండటం.

*(సుననె తిర్మిజీలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు కూడా ఉత్తమ నైతికతను ప్రబోధిస్తోంది. అనవసరంగా, అనాలోచితంగా మాట్లాడి ప్రజల ముందు డాంబికాలను ప్రదర్శించకూడదని తాకీదు చేస్తోంది. మితంగా, సౌమ్యంగా మాట్లాడటం మంచివారి లక్షణాలు. దీనికి విరుద్ధంగా అతిగా మాట్లాడటం, ప్రజల్ని భయపెట్టేలా ప్రగల్భాలు పలకటం ధూర్తుల లక్షణం.

## 74వ అధ్యాయం

# ٧٤ ـ بَابُ الْحِلْمِ وَالأَنَاةِ وَالرِّفْقِ

# సౌమ్యం, విజ్ఞత, మృదుత్వం

قال الله تعالى: ﴿وَالْكَاظِمِينَ الْغَيْظَ وَالْعَافِينَ عَنِ النَّاسِ وَاللَّهُ يُحِبُّ الْمُحْسِنِينَ﴾ [آل عمران: ١٣٤]. وقال تعالى: ﴿خُذِ الْعَفْوَ وَأْمُرْ بِالْعُرْفِ وَأَعْرِضْ عَنِ الْجَاهِلِينَ﴾ [الأعراف: ١٩٩]. وقال تعالى: ﴿وَلَا تَسْتَوِي الْحَسَنَةُ وَلَا السَّيِّئَةُ ادْفَعْ بِالَّتِي هِيَ أَحْسَنُ فَإِذَا الَّذِي بَيْنَكَ وَبَيْنَهُ عَدَاوَةٌ كَأَنَّهُ وَلِيٌّ حَمِيمٌ ۝ وَمَا يُلَقَّاهَا إِلَّا الَّذِينَ صَبَرُوا وَمَا يُلَقَّاهَا إِلَّا ذُو حَظٍّ عَظِيمٍ﴾ [فصلت: ٣٤، ٣٥]. وقال تعالى: ﴿وَلَمَن صَبَرَ وَغَفَرَ إِنَّ ذَٰلِكَ لَمِنْ عَزْمِ الْأُمُورِ﴾ [الشورى: ٤٣].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

“వారు (అంటే విశ్వాసులు) కోపాన్ని దిగమ్రింగే వారు. ఇతరుల తప్పులను క్షమించేవారు - ఇలాంటి సజ్జనులంటే అల్లాహ్‌కు ఎంతో యిష్టం.” *(ఆలి ఇమ్రాన్ : 134)*

“ప్రవక్తా! మృదుత్వం, మన్నింపుల వైఖరిని అవలంబించు. మంచిని ప్రబోధించు. మూర్ఖులతో వాదానికి దిగకు.” *(అల్ ఆరాఫ్ : 199)*

“ప్రవక్తా! మంచీ, చెడూ ఒకటి కావు. నీవు చెడును శ్రేష్ఠమైన మంచిద్వారా తొలగించు. అప్పుడు నీ పట్ల శత్రుభావం కలవాడు నీకు ప్రాణస్నేహితుడై పోవటాన్ని నీవు గమనిస్తావు. ఈ సుగుణయోగం సహనశీలురకు తప్ప మరెవరికీ లభ్యం కాదు. ఈ స్థానం మహా అదృష్టవంతులకు తప్ప మరెవరికీ దక్కదు.” *(ఫుస్సిలత్ : 34, 35)*

“ఎవరయినా సహనంతో వ్యవహరిస్తే, క్షమించివేస్తే, అది పెద్ద సాహసంతో, దృఢ సంకల్పంతో కూడుకున్న పని.” *(అష్ షూరా : 43)*

٦٣٢ ـ وَعن ابنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ لأَشَجِّ عَبْدِ الْقَيْسِ: «إِنَّ فِيكَ خَصْلَتَيْنِ يُحِبُّهُمَا اللهُ: الحِلْمُ وَالأَنَاةُ». رَوَاهُ مُسْلِم.

632. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) అషజ్జ్ అబ్దుల్ ఖైస్‌ను ఉద్దేశ్యించి, “నీలో దేవుడు యిష్టపడే రెండు సుగుణాలున్నాయి. అవి సౌమ్యం, నిదానం” అని అన్నారు.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'అషజ్జ్ అబ్దుల్ ఖైస్' ఈయన అసలు పేరు ముంజిర్ బిన్ ఆయిజ్ లేదా ముంఖజ్ బిన్ ఆయిజ్. దైవప్రవక్త (సల్లం) అనుచరులు.

ఈ హదీసు ఏ పని చేసినా సౌమ్యంగా, నిదానంగా చేయాలని, ఈ రెండు సుగుణాలు దేవునికి ప్రియమైన గుణాలని ప్రబోధిస్తోంది. తొందరపాటులో చేసే పనులు అసంపూర్తిగా, అస్తవ్యస్తంగా ఉంటాయి.

٦٣٣ - وعن عائشةَ رضي الله عنها قالت: قال رسولُ اللهِ ﷺ: «إنَّ اللهَ رفيقٌ يُحِبُّ الرِّفْقَ فِي الأَمْرِ كُلِّهِ» متفقٌ عليه.

633. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : దేవుడు మృదు స్వభావి. అన్ని విషయాల్లోనూ ఆయన మృదుత్వాన్ని ఇష్టపడతాడు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)*

٦٣٤ - وعنها أن النبيَّ ﷺ قال: «إنَّ اللهَ رَفِيقٌ يُحِبُّ الرِّفقَ، وَيُعْطِي عَلى الرِّفقِ ما لا يُعْطِي عَلى العُنفِ وَمَا لا يُعْطِي على مَا سِوَاهُ» رواه مسلم.

634. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : దేవుడు మృదు స్వభావి. ఆయన మృదుత్వాన్ని ఇష్టపడతాడు. కాఠిన్యం వల్లగాని, మరే ఇతర విషయం వల్లగాని ప్రసాదించనిది దేవుడు మృదుత్వం మూలంగా ప్రసాదిస్తాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రజలు తమ పరస్పర వ్యవహారాల్లో మృదుత్వం, మార్దవాలతో మెలగాలి. పరస్పరం మార్దవంతో వ్యవహరించుకునే దాసుల్ని దేవుడు అమితంగా యిష్టపడతాడు. దానిపై వారికి పుణ్యాన్ని కూడా ప్రసాదిస్తాడు. అయితే ధార్మిక విషయాల్లో, దేవుని హద్దుల విషయాల్లో మాత్రం ఎలాంటి మృదుత్వానికి, రాజీతత్వానికి తావివ్వకూడదు సుమా!

635. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ఏ వస్తువులోనయినా మృదుత్వముంటే అది ఆ వస్తువును హృద్యంగా మలుస్తుంది. ఆ మృదుత్వాన్నే తీసివేస్తే అది లోపభూయిష్టంగా కనిపిస్తుంది. *(ముస్లిం)*

٦٣٥ ـ وعنها أن النبيَّ ﷺ قال: «إنَّ الرِّفقَ لا يكُونُ فِي شَيءٍ إلَّا زانَهُ، وَلَا يُنْزَعُ مِنْ شَيءٍ إلَّا شَانَهُ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మృదుత్వం మనిషికి పెట్టని ఆభరణం. మృదు స్వభావం గల మనిషిని అందరూ యిష్టపడతారు, గౌరవిస్తారు. అంతేకాదు, మృదుత్వాన్ని, మన్నింపుల వైఖరిని అవలంబించేవారిని దేవుడు కూడా ప్రేమిస్తాడు. దీనికి భిన్నంగా కఠినాత్ములు ఇటు ప్రజల దృష్టిలోనూ, అటు దేవుని దృష్టిలోనూ నీచులుగా పరిగణించబడతారు.

636. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : ఒక పల్లెటూరి వ్యక్తి మస్జిద్‌లో మూత్రం పోశాడు. అది చూసి ప్రజలు అతన్ని కొట్టబోయారు. అంతలో దైవ ప్రవక్త (సల్లం) వారిని అడ్డుకొని, "అతన్ని వదలిపెట్టండి. ఆ మూత్రంపై ఒక బిందె నీళ్లు పారబోయండి. మీరు సౌలభ్యం కోసం ప్రభవింపజేయబడ్డారు, కాఠిన్యం కోసం కాదు" అని అన్నారు. *(బుఖారీ)*

٦٣٦ ـ وعن أَبي هريرةَ رضي الله عنه قال: بَالَ أَعْرَابِيٌّ فِي المسجدِ، فَقَامَ النَّاسُ إلَيْهِ لِيَقَعُوا فِيهِ، فقال النَّبِيُّ ﷺ: «دَعُوهُ وَأَرِيقُوا عَلَى بَوْلِهِ سَجْلاً مِنْ مَاءٍ، أَوْ ذَنُوباً مِن ماءٍ، فَإِنَّمَا بُعِثْتُم مُيَسِّرِينَ وَلَمْ تُبْعَثُوا مُعَسِّرِينَ» رواه البخاري. «السَّجْلُ» بفتح السين المهملة وإسكان الجيم: وَهِيَ الدَّلْو المُمْتَلِئَةُ مَاءً، وَكَذلِكَ الذَّنُوبُ.

*(సహీహ్ బుఖారీలోని శుచీ శుభ్రతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రజలకు నీతిని, నడవడికను బోధించేటప్పుడు వారి పట్ల వీలైనంతవరకు మృదుత్వం, మన్నింపుల వైఖరిని అవలంబించాలి. ముఖ్యంగా పల్లెటూరి వ్యక్తులు, ఏమీ తెలియని అమాయకుల పట్ల మృదువుగా వ్యవహరించాలి. కాఠిన్యాన్ని ప్రదర్శిస్తే వారు బెదిరిపోయి నకారాత్మకంగా స్పందించే ప్రమాదముంది. అంచేత వారికి నడవడికను బోధించాలనుకున్నప్పుడు ముందుగా వారిని ఆప్యాయంగా దగ్గరకు తీసుకోవాలి. కొన్నిసార్లు వారు మూర్ఖంగా ప్రవర్తించినా మన్నింపుల ధోరణితో వారిని సరిదిద్దే ప్రయత్నం చేయాలి.

637. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : "సౌలభ్యాన్ని కలగజేయండి. ప్రజలను కాఠిన్యానికి గురిచేయకండి. శుభవార్తలు అందించండి, ద్వేషం కలిగించే మాటలు చెప్పకండి." (బుఖారీ - ముస్లిం)

٦٣٧ ـ وعن أنس رضي الله عنه عن النبيِّ ﷺ قال: «يَسِّرُوا وَلَا تُعَسِّرُوا، وَبَشِّرُوا وَلَا تُنَفِّرُوا» متفقٌ عليه.

(సహీహ్ బుఖారీలోని విద్యాప్రకరణం, సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం)

638. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : మృదుత్వం లేని వాడు సకల ప్రాప్తాలనూ కోల్పోతాడు. (ముస్లిం)

٦٣٨ ـ وعن جرير بن عبدِ الله رضي الله عنه قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقُولُ: «مَنْ يُحْرَمِ الرِّفْقَ يُحْرَمِ الخَيْرَ كُلَّهُ» رواه مسلم.

(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)

639. హజ్రత్ అబూబక్ర్ (రజి) కథనం: ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)ను తనకు ఏమైనా ఉపదేశించమని కోరాడు. దానికి ఆయన, "నువ్వు కోపగించుకోకు" అన్నారు. ఆ వ్యక్తి పలుమార్లు అదే ప్రశ్న అడిగాడు. ప్రతిసారీ ఆయన 'కోపగించుకోకు' అనే అన్నారు. (బుఖారీ)

٦٣٩ ـ وعن أبي هريرةَ رضي الله عنه أَنَّ رَجُلاً قال لِلنبيِّ ﷺ: أَوْصِني. قال: «لا تَغْضَبْ» فَرَدَّدَ مِرَاراً؛ قال: «لَا تَغْضَبْ». رواه البخاري.

(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం)ను ఉపదేశించమని కోరిన వ్యక్తి బహుకోపిష్టి అని ఇతర ఉల్లేఖనాల ద్వారా తెలుస్తోంది. అందుకే దైవప్రవక్త (సల్లం) ఆ వ్యక్తి స్వభావాన్ని గమనించి ప్రతిసారీ అతనికి కోపగించుకోవద్దనే ఉపదేశించారు. మనిషికి కోపం రావటం సహజమే. కాని ఆ కోపాన్ని దిగమ్రింగటం ఉత్తముల లక్షణం.

٦٤٠ - وعن أَبي يَعلَى شدَّادِ بن أوسٍ رضي الله عنه عن رسولِ الله ﷺ قال: «إنَّ الله كَتَبَ الإحسَان عَلى كُلِّ شَيءٍ، فإذا قَتَلتُم فَأَحسِنُوا القِتْلَةَ، وَإذَا ذَبَحْتُم فَأَحسِنُوا الذِّبْحَةَ، وَليُحِدَّ أَحَدُكُم شَفْرَتَه، وَليُرِحْ ذَبِيحَتَه» رواه مسلم.

640. హజ్రత్ అబూ యాలా షద్దాద్ బిన్ ఔస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : నిస్సందేహంగా దేవుడు ప్రతి పనిని ఉత్తమంగా నిర్వర్తించటం విధిగా చేశాడు. కనుక మీరు (ఒక ప్రాణిని) చంపినప్పుడు ఉత్తమమైన రీతిలో చంపండి. (జంతువుల్ని) జిబహ్ చేసినప్పుడు ఉత్తమమైన రీతిలో జిబహ్ చేయండి. మీలో ప్రతి ఒక్కరూ కత్తికి సానపట్టి జిబహ్ చేయబడే జంతువుకి సుఖాన్ని కలగజేయాలి సుమా! *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జంతువేట ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ ప్రాణిని చంపటమంటే హాని తలపెట్టే విష జంతువుని చంపటం లేదా హత్యచేసిన నేరస్థుణ్ణిగాని యుద్ధరంగంలో శత్రువుని గాని చంపటం అని అర్థం. ఇలాంటి సందర్భాల్లో జీవహింస సమ్మతమేగాని ఆ జీవిని చిత్రహింసలు పెట్టిమరీ చంపటం ఎట్టి పరిస్థితుల్లోనూ సమ్మతం కాదు. ఇస్లాం ధర్మం ఒక నేరస్థునికి మరణశిక్ష విధించినా చిత్రహింసలు పెట్టి చంపకూడదని తాకీదు చేస్తోంది. ఇస్లాంకు పూర్వం అజ్ఞాన కాలంలో ప్రజలు ఒక మనిషిని చంపాలనుకున్నప్పుడు అతనికి చిత్రహింసలు పెట్టిన తరువాతగాని చంపేవారు కారు. ముందు చెవి, ఆ తరువాత ముక్కు, ఆ తర్వాత కాళ్లుచేతులు ఇలా ఒక్కొక్క అవయవమే వేరుచేసి చివరికి ప్రాణాలు తీసేవారు. ఇస్లాం ధర్మం ఈ పద్ధతిని తీవ్రంగా ఖండించింది. మనిషిని ఆ విధంగా చావుబతుకుల మధ్య ఇరికించి, చిత్రహింసలు పెట్టి చంపటం పాశవిక చర్యగా పేర్కొంది.

అదేవిధంగా జంతువుల్ని కోసినప్పుడు కత్తికి సానబట్టుకోవాలని, మెడవైపునుండి కోయకూడదని తాకీదు చేయబడింది. ఎందుకంటే కత్తి మొండిగా ఉన్నా లేదా మెడవైపు నుండి కోసినా దానివల్ల జంతువుకి విపరీతమైన నొప్పి కలుగుతుంది. జంతువుని ఆ విధంగా హింసిస్తూ చంపటం కూడా ఇస్లాం దృష్టిలో గర్హించదగిన విషయమే. నేడు యూరపు దేశాల్లో జంతువుల్ని యంత్రాల ద్వారా కోసే పద్ధతిని అవలంబిస్తున్నారు. దానివల్ల జంతువయితే అవలీలగా చావగలుగుతుందిగాని అధిక రక్తస్రావం జరగకపోవటంతో చాలా వరకు రక్తం

జంతువు మాంసంలోనే ఉండిపోతుంది. అటువంటి మాంసం ఆరోగ్యానికి హానికరంగా పరిణమించవచ్చు. జంతువు మాంసం ధర్మసమ్మతం కావాలంటే అధికస్రావం జరగాలని ఇస్లాం ఆదేశిస్తోంది. అందుకని జంతువుల్ని కోయటానికి ఇస్లాం ధర్మం సూచించిన పద్ధతే అన్నివిధాలా శ్రేయస్కరం.

٦٤١ ـ وعن عائشةَ رضي الله عنها قالت: مَا خُيِّرَ رسولُ اللهِ ﷺ بَينَ أمْرَينِ قَطُّ إلَّا أخَذَ أيسَرَهُما، مَا لَم يَكن إثماً، فَإن كَانَ إثماً، كَانَ أبعَدَ النَّاسِ مِنهُ. وَمَا انتَقَمَ رسولُ اللهِ ﷺ لِنَفسِهِ في شَيءٍ قَطُّ، إلَّا أن تُنتَهَكَ حُرمَةُ اللهِ، فَيَنتَقِمَ لِلهِ تعالى. متفقٌ عليه.

641. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం)కు ఏవయినా రెండు విషయాల్లో ఒకదాన్ని అవలంబించే ఎంపిక స్వేచ్ఛ ఇస్తే ఆయన ఆ రెండింటిలో సులభమైన విషయాన్నే ఎంచుకునేవారు. అయితే ఆ విషయం పాపకార్యమయి ఉండకూడదు. ఆ విషయం పాపకార్యమయిన పక్షంలో అందరికన్నా ఎక్కువగా ఆయనే దానికి దూరంగా ఉంటారు. దైవప్రవక్త (సల్లం) ఎన్నడూ తన సొంత వ్యవహారంలో ఇతరులకు ప్రతీకారం చేయలేదు. కాని దేవుని నిషిద్ధ విషయాల్లో జోక్యం చేసుకుంటే మాత్రం ఆయన దైవం కోసం ప్రతీకారం చేసేవారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని మహిమోన్నతుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్టతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రవక్త తన అనుచర సమాజానికి ఆదర్శకర్తగా వ్యవహరిస్తాడు. ప్రవక్త వాక్కర్మల్ని ఆయన అనుచర సమాజం తమ పాలిట ఆదర్శప్రాయంగా భావిస్తుంది. అలాంటప్పుడు ప్రవక్తే స్వయంగా ఆచరణయోగ్యం కాని క్లిష్టమైన పద్ధతులు, విధానాలను అవలంబిస్తే తన అనుచర సమాజం కాఠిన్యానికి గురికావలసి వస్తుంది. అందుకే దైవప్రవక్త (సల్లం) ఎల్లప్పుడూ వీలైనంతవరకు సులభమైన విధానాలనే పాటించేవారు. శిక్షలు, ఆరాధనలు, విధులు ప్రతి విషయంలోనూ అనుచర సమాజ సౌకర్యాన్ని దృష్టిలో పెట్టుకొని వ్యవహరించేవారు.

642. హజ్రత్ ఇబ్నె మస్ఊద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : నరకానికి ఎవరు (లేక) నరకం ఎవరిపై నిషిద్ధమో నేను మీకు తెల్పనా? ప్రజలతో సన్నిహితంగా ఉంటూ సౌకర్యాన్ని కలగజేస్తూ, మృదుత్వం మార్దవాలతో వ్యవహరించే ప్రతి వ్యక్తిపై నరకం నిషిద్ధమే. (తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్'గా పేర్కొన్నారు)

٦٤٢ - وعن ابنِ مسعودٍ رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «ألا أُخبِرُكُمْ بِمَنْ يَحْرُمُ على النَّارِ - أو بِمَنْ تَحْرُمُ عَلَيْهِ النَّارُ -؟ تَحْرُمُ عَلى كُلِّ قَرِيبٍ هَيِّنٍ لَيِّنٍ سَهْلٍ». رواه الترمذي وقال: حديثٌ حسنٌ.

*(సుననె తిర్మిజీలోని ప్రళయ వర్ణనల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

సన్నిహితంగా ఉండటమంటే తమ నడవడికతో, మంచి ప్రవర్తనతో ప్రజల హృదయాల్లో చోటు సంపాదించుకోవటమని అర్థం. అదేవిధంగా సౌకర్యాన్ని కలుగజేస్తూ మృదువుగా వ్యవహరించటమంటే ప్రాపంచిక వ్యవహారాల్లో వారిపట్ల అణకువతో, ప్రేమతో వ్యవహరించటమని భావం. ఈ హదీసులో కూడా ఉత్తమ నడవడికకు గల గొప్పదనం వివరించబడింది. దీనికి విశ్వాసంతో ప్రగాఢమైన సంబంధముంది. మనిషిని నరకాగ్ని నుంచి కాపాడేది ఆ విశ్వాసమే!

75వ అధ్యాయం

## ٧٥ ـ بَابُ الْعَفْوِ وَالإِعْرَاضِ عَنِ الْجَاهِلِينَ

## మన్నింపుల వైఖరి, మూర్ఖుల పట్ల ఉపేక్షాభావం

قال الله تعالى: ﴿ خُذِ ٱلْعَفْوَ وَأْمُرْ بِٱلْعُرْفِ وَأَعْرِضْ عَنِ ٱلْجَٰهِلِينَ ﴾ [الأعراف: ١٩٩]. وقال تعالى: ﴿فَٱصْفَحِ ٱلصَّفْحَ ٱلْجَمِيلَ﴾ [الحجر: ٨٥]. وقال تعالى: ﴿ وَلْيَعْفُواْ وَلْيَصْفَحُوٓاْ أَلَا تُحِبُّونَ أَن يَغْفِرَ ٱللَّهُ لَكُمْ ﴾ [النور: ٢٢]. وقال تعالى: ﴿ وَٱلْعَافِينَ عَنِ ٱلنَّاسِ وَٱللَّهُ يُحِبُّ ٱلْمُحْسِنِينَ ﴾ [آل عمران: ١٣٤]. وقال تعالى: ﴿ وَلَمَن صَبَرَ وَغَفَرَ إِنَّ ذَٰلِكَ لَمِنْ عَزْمِ ٱلْأُمُورِ ﴾ [الشورى: ٤٣]. والآيات في الباب كثيرة معلومة.

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"ప్రవక్తా! మృదుత్వం, మన్నింపుల వైఖరిని అవలంబించు, మంచిని ప్రబోధించు. మూర్ఖులతో వాదానికి దిగకు." *(అల్ ఆరాఫ్ : 199)*

"ప్రవక్తా! నీవు (వారి కుచేష్టలను) పెద్దమనిషి తరహాలో మన్నించు." *(అల్ హిజ్ర్ : 85)*

"వారిని క్షమించాలి, వారి (తప్పుల్ని) ఉపేక్షించాలి. మిమ్మల్ని అల్లాహ్ క్షమించాలని మీరు కోరుకోరా?" *(అన్ నూర్ : 22)*

"వారు (అంటే విశ్వాసులు) ఇతరుల తప్పుల్ని క్షమించేవారు - ఇలాంటి సజ్జనులంటే అల్లాహ్‌కు ఎంతో యిష్టం." *(ఆలి ఇమ్రాన్ : 134)*

"ఎవరయినా సహనంతో వ్యవహరిస్తే, క్షమించివేస్తే అది పెద్ద సాహసంతో, దృఢ సంకల్పంతో కూడుకున్న పని." *(అష్ షూరా : 43)*

٦٤٣ ـ وعن عائشةَ رضي الله عنها أَنَّها قالت لِلنبيِّ ﷺ: هل أَتَى عَلَيْكَ يَوْمٌ كَانَ أَشَدَّ مِنْ يَوْمِ أُحُدٍ؟ قال: «لَقَدْ لَقِيتُ مِنْ قَوْمِكِ، وَكَانَ أَشَدُّ مَا لَقِيتُ مِنْهُمْ يَوْمَ

643. హజ్రత్ ఆయిషా (రజి.అన్‌హా) కథనం ప్రకారం ఆమె ఒకసారి దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ, "మీకు ఉహుద్ యుద్ధం కంటే కఠినమైన రోజు ఎప్పుడయినా ఎదురయిందా?" అని అడిగారు. దానికి సమాధానమిస్తూ దైవ ప్రవక్త (సల్లం) ఇలా అన్నారు :

"నేను నీ జాతి ప్రజల చేతిలో అనేక బాధలు భరించాను. ఆ బాధల్లో ఉఖబా దినం నాకు అత్యంత వ్యధాభరితంగా గడిచింది. ఆ రోజు నేను (తాయెఫ్ నాయకుడయిన) అలీ బిన్ అబ్దె యాలీల్ బిన్ అబ్దె కులాల్‌ను కలిసి మాట్లాడాను. అతను నేను ఆశించి నట్లుగా నా సందేశాన్ని అంగీకరించ లేదు. నేను అక్కడినుండి తీవ్ర మన స్తాపంతో వెనుదిరిగాను. ఖర్నె సఆలిబ్ ప్రాంతం చేరుకున్న తరువాతగాని నేను ఆ బాధ నుండి కోలుకోలేకపోయాను. అప్పుడు నేను తలపైకెత్తి చూస్తే ఒక మబ్బు తునక నా మీద నీడ పట్టి ఉన్నట్లు కనిపించింది. కాస్త జాగ్రత్తగా పరిశీలించి చూస్తే ఆ మబ్బు తునక మధ్య జిబ్రయీల్ దూత కనిపించారు. ఆయన నన్ను పిలిచి, "మీ జాతి ప్రజలు మిమ్మల్ని అన్నమాటలు, మీకిచ్చిన సమాధానాలు దేవుడు విన్నాడు. ఆయన మీ దగ్గరికి పర్వత (సంచాలక) దూతను పంపాడు. ఈ జాతి ప్రజల విషయంలో మీరు ఏం ఆజ్ఞాపించదలచుకున్నారో ఈ దైవదూతను ఆజ్ఞాపించండి" అన్నారు. ఆ తరువాత పర్వత నిర్వహణ దూత నన్ను పలకరించాడు. "ముహమ్మద్! మీ జాతి ప్రజలు మిమ్మల్ని అన్నమాటలు దేవుడు విన్నాడు. నేను పర్వత (వ్యవ హారాల) దూతను. మీరు ఆజ్ఞాపించి నట్లు చేయమని దేవుడు నన్ను మీ దగ్గరికి పంపించాడు. మీరు ఏ ఆజ్ఞ

العَقَبَةِ، إذْ عَرَضْتُ نَفسِي عَلى ابْنِ عَبْدِ يَالِيلَ بنِ عَبْدِ كُلالٍ، فَلَمْ يُجِبْنِي إلى ما أَرَدْتُ، فَانْطَلَقْتُ وَأَنَا مَهْمُومٌ عَلى وَجْهِي، فَلَمْ أَسْتَفِقْ إلَّا وَأَنَا بِقَرْنِ الثَّعَالِبِ، فَرَفَعْتُ رَأْسِي، فَإذا أَنَا بِسَحَابَةٍ قَدْ أَظَلَّتنِي، فَنَظَرْتُ فَإذا فِيها جبريلُ عليه السلام، فَنَادَانِي فقال: إنَّ الله تعالى قَدْ سَمِعَ قَولَ قَومِكَ لَكَ، وَمَا رَدُّوا عَلَيكَ، وَقَد بَعَثَ إلَيكَ مَلَكَ الجِبَالِ لِتَأمُرَهُ بِمَا شِئْتَ فِيهِم، فَنَادانِي مَلَكُ الجِبَالِ، فَسَلَّمَ عَلَيَّ ثُمَّ قَالَ: يَا مُحَمَّدُ! إنَّ الله قَدْ سَمِعَ قَولَ قَومِكَ لَكَ، وَأَنَا مَلَكُ الجِبَالِ، وَقَدْ بَعَثَنِي رَبِّي إلَيْكَ لِتَأمُرَنِي بِأَمْرِكَ، فَمَا شِئْتَ؟ إنْ شِئْتَ أَطْبَقْتُ عَلَيهِمُ الأَخْشَبَيْنِ»

فقال النبيُّ ﷺ: «بَلْ أَرْجُو أَنْ يُخْرِجَ اللهُ مِنْ أَصْلَابِهِمْ مَنْ يَعْبُدُ اللهَ وَحْدَهُ لَا يُشْرِكُ بِهِ شَيْئاً» متفقٌ عليه. «الأَخْشَبَان»: الجَبَلان المُحِيطَان بمكّة. والأَخْشَبُ: هو الجبل الغليظ.

ఇవ్వదలచుకున్నారో ఇవ్వండి. మీరు ఆజ్ఞాపించాలేగాని నేను ఈ జాతి ప్రజలను (రెండు వైపులా ఉన్న) కొండల్ని కలిపేసి నుజ్జునుజ్జు చేసేస్తాను" అన్నాడు.

అందుకు నేను, "వద్దు, (తొందరపడి అంత పని చేయకు) వీళ్ళు కాకపోయినా వీళ్ళ సంతానంలోనయినా ఒక్క అల్లాహ్‌ను మాత్రమే ఆరాధిస్తూ, ఆయనకు మరెవ్వరినీ సాటి కల్పించకుండా ఉండేవారు పుడతారని నాకు నమ్మకం ఉంది" అని అన్నాను.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని యుద్ధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మదీనా నగరానికి సమీపంలో 'ఉహుద్' అనే కొండ ఉంది. అక్కడే ఉహుద్ యుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో దైవప్రవక్త (సల్లం)గారి ముఖారవిందానికి స్వల్పంగా గాయాలయ్యాయి. బాణం దెబ్బతగిలి రెండు పళ్ళు కూడా ఊడిపోయాయి. ముష్కరమూకలు ఆయనమీద దాడి చేయటంతో ఆయన ఓ గుంతలో పడిపోయారు. అంతేకాదు ఆయనగారి సొంత బాబాయి హజ్రత్ హమ్జా (రజి) కూడా ఈ యుద్ధంలోనే అమరగతినొందారు. శత్రువులు ఆయన శవాన్ని ముక్కలు ముక్కలుగా నరికి చాలా దారుణంగా ప్రవర్తించారు. ఒకవిధంగా ఉహుద్ సంగ్రామ దినం దైవప్రవక్త (సల్లం) పాలిట అత్యంత కఠినమైన దినం. కాని అవన్నీ తన వ్యక్తిగతమైన బాధలు కాబట్టి ఆయన వాటిని ఉపేక్షించారు. ఇందుకు భిన్నంగా తాయెఫ్ వాసులు తన సందేశాన్ని నిరాకరించినప్పుడు మాత్రం ఆయన తీవ్ర మనస్తాపానికి గురయ్యారు. తన అనుచర సమాజం తన కళ్ళముందే నరకానికి గొనిపోయే కుచేష్టలకు పాల్పడుతుంటే ఆయన హృదయం పరి పరి విధాలా చింతించేది.

ఈ హదీసు ధార్మిక వ్యవహారాల్లో కష్టాలు, బాధలు ఎదురయినప్పుడు వాటిని ఓర్చుకొని సహన స్థయిర్యాలను ప్రదర్శించాలని ప్రబోధిస్తోంది. ధర్మప్రచార కార్యక్రమమంటే నల్లేరుపై నడకలా సాగేదికాదు. ధర్మ ప్రచార కార్యక్రమానికి పూనుకున్న తరువాత ఎన్నో కష్టాల్ని ఎదుర్కొనవలసి వస్తుంది. వ్యయప్రయాసలకు ఓర్చుకోవాల్సి వస్తుంది. ప్రజల నుండి తిట్లు, శాపనార్థాలు వినాల్సివస్తుంది. వాటికి అదరక, బెదరక మొక్కవోని గుండెబలంతో సహనస్థయిర్యాలను ప్రదర్శిస్తూ పనిచేసినప్పుడే ధర్మప్రచార కార్యం నెరవేరుతుంది.

٦٤٤ ـ وعنها قالت: ما ضَرَبَ رسولُ اللهِ ﷺ شَيْئاً قَطُّ بيَدِهِ، وَلَا امْرَأَةً وَلَا خَادِماً، إلَّا أَن يُجَاهِدَ في سَبِيلِ اللهِ، وما نِيلَ مِنْهُ شَيءٌ قَطُّ فَيَنتَقِمَ مِنْ صَاحِبِهِ، إلَّا أنْ يُنتَهَكَ شَيءٌ مِنْ مَحَارِمِ اللهِ تعالى، فَيَنْتَقِمَ لِلهِ تعالى. رواه مسلم.

644. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) తన చేత్తో ఎవర్నీ దండించలేదు. ఏ స్త్రీని గాని, బానిసనుగాని కొట్టలేదు. అయితే ఆయన దైవమార్గంలో యుద్ధం మాత్రం చేసేవారు. ఆయనకు ఎవరివల్లనయినా బాధకలిగితే దానికాయన ప్రతీకారం చేసేవారు కారు. కాని ఎవరైనా దేవుడు నిషేధించిన విషయంలో జోక్యం చేసుకుంటే మాత్రం ఆయన దైవం కోసం ప్రతీకారం చేసేవారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్టతల ప్రకరణం)*

٦٤٥ ـ وعن أَنس رضي الله عنه قال: كُنتُ أَمْشِي مَعَ رسولِ اللهِ ﷺ، وعليهِ بُرْدٌ نَجْرَانِيٌّ غَلِيظُ الحَاشِيَةِ، فأَدرَكَهُ أَعْرَابِيٌّ، فَجَبَذَهُ بِرِدَائِهِ جَبْذَةً شَدِيدَةً، فَنَظَرتُ إلى صَفحَةِ عَاتِقِ النَّبِيِّ ﷺ، وَقَدْ أَثَّرَت بِهَا حَاشِيَةُ الرِّداءِ مِنْ شِدَّةِ جَبذَتِهِ، ثُمَّ قال: يَا مُحَمَّدُ! مُرْ لي مِن مَالِ اللهِ الَّذِي عِندَكَ. فَالتَفَتَ إلَيهِ، فَضَحِكَ، ثُمَّ أَمَرَ لَهُ بِعَطَاءٍ. متفقٌ عليه.

645. హజ్రత్ అనస్ (రజి) కథనం : నేనొకసారి దైవప్రవక్త (సల్లం) వెంట నడుస్తున్నాను. ఆ సమయంలో ఆయన దళసరి అంచులుగల నజ్రాన్ దుప్పటి కప్పుకొని ఉన్నారు. దారిలో ఓ పల్లెటూరి వ్యక్తి కలిసి ఆయన దుప్పటి పట్టుకొని గట్టిగా లాగాడు. నేను దైవప్రవక్త (సల్లం) భుజం వంక చూస్తే, అలా గట్టిగా లాగటం వల్ల దుప్పటి అంచులు గీసుకుపోయి ఆయన భుజం కందిపోయి ఉంది. ఆ పల్లెటూరి వ్యక్తి అంతటితో ఊరుకోక, "దేవుడు మీకిచ్చిన సొమ్ములో నుంచి నాక్కొంచెం ఇప్పించరూ!" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం) అతని వైపు తిరిగి చూసి నవ్వుతూ ఇతనికి కొంతధనం ఇవ్వండి" అని (తన సహచరుల్ని) ఆజ్ఞాపించారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వస్త్రధారణ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

646. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఒకానొక ప్రవక్తకు సంబంధించిన సంఘటనను వివరిస్తున్నప్పుడు నేను చూశాను. ఇప్పటికీ నాకు దైవప్రవక్త (సల్లం) నా కళ్లెదుట ఆ సంఘటన వివరిస్తున్న అనుభూతి కలుగుతోంది. ఆ ప్రవక్తను ఆయన జాతి ప్రజలు రక్తం కారేలా కొట్టారు. అయినా కూడా ఆ ప్రవక్త తన మొహం మీది రక్తాన్ని తుడుచుకుంటూ, "దేవా! నా జాతి ప్రజలను క్షమించు, వీళ్ళు తెలీక ఇలా చేస్తున్నారు" అని ప్రార్థించారు.

(బుఖారీ - ముస్లిం)

٦٤٦ - وعن ابن مسعودٍ رضي الله عنه قال: كأنِّي أنظُرُ إلى رسولِ اللهِ ﷺ يَحكِي نَبِيّاً مِنَ الأنبياءِ، صَلَوَاتُ اللهِ وَسَلامُه عَلَيهم، ضَرَبَهُ قَومُهُ فَأَدْمَوْهُ، وَهُوَ يَمسَحُ الدَّمَ عَنْ وَجهِهِ، وَيقول: «اللَّهُمَّ اغفِر لِقَومي فَإنَّهُم لَا يَعْلَمُونَ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హదీసులో పేర్కొనబడిన ప్రవక్త ఎవరో కాదు, స్వయానా ముహమ్మద్ ప్రవక్తేనని పండితులు రాశారు. ఇది కూడా ఆయనలోని గొప్ప నైతికతకు అపూర్వ నిదర్శనం. తనకు తన జాతివారి నుంచి ఎదురైన అనుభవాన్ని ఆయన అన్యాపదేశంగా చెప్పారేగాని వారిపేరు ప్రస్తావించలేదు. తాయెఫ్ నగరంలో ధర్మప్రచార కార్యం నిర్వహించినప్పుడు ఆయనకు ఈ అనుభవం ఎదురైందని మనందరికి తెలుసు!

647. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : కుస్తీపట్టి ఇతరులను చిత్తుచేసేవాడు పరాక్రమశాలి (పహిల్వాను) కాడు. కోపం వచ్చినప్పుడు తన్ను తాను అదుపులో పెట్టుకోగలిగినవాడే నిజమైన పరాక్రమశాలి.

(బుఖారీ - ముస్లిం)

٦٤٧ - وعن أبي هريرةَ رضي الله عنه أن رسولَ اللهِ ﷺ قال: «لَيسَ الشَّديدُ بالصُّرَعَةِ، إنَّمَا الشَّدِيدُ الَّذِي يَملِكُ نَفْسَهُ عِندَ الغَضَبِ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)*

## 76వ అధ్యాయం

## ٧٦ - بَابُ احْتِمَالِ الأَذَى

# కష్టాలు ఎదురైనప్పుడు సహనం వహించటం

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

వారు (విశ్వాసులు) కోపాన్ని దిగ మ్రింగేవారు, ఇతరుల తప్పులను క్షమించేవారు - ఇలాంటి సజ్జనులంటే అల్లాహ్‌కు ఎంతో యిష్టం.”

*(ఆలి ఇమ్రాన్ : 134)*

ఎవరయినా సహనంతో వ్యవహరిస్తే, క్షమించివేస్తే అది పెద్ద సాహసంతో, దృఢ సంకల్పంతో కూడుకున్న పని.”

*(అష్ షూరా : 43)*

قال الله تعالى: ﴿ وَٱلْكَٰظِمِينَ ٱلْغَيْظَ وَٱلْعَافِينَ عَنِ ٱلنَّاسِ ۗ وَٱللَّهُ يُحِبُّ ٱلْمُحْسِنِينَ ﴾ [آل عمران: ١٣٤]، وقال تعالى: ﴿ وَلَمَن صَبَرَ وَغَفَرَ إِنَّ ذَٰلِكَ لَمِنْ عَزْمِ ٱلْأُمُورِ ﴾ [الشورى: ٤٣]. وفي الباب: الأحاديث السابقة في الباب قبله.

648. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, “దైవప్రవక్తా! నా బంధువులు కొందరున్నారు. నేను వారితో సత్సంబంధాలు పెట్టుకోవాలని ప్రయత్నిస్తుంటే వారేమో నాతో తెగత్రెంపులు చేసుకోవాలని చూస్తున్నారు. నేను వారి పట్ల మంచిగా మెలగుతుంటే వారేమో నాకు కీడు తలపెడుతున్నారు. నేను వారిపట్ల ఉదార వైఖరిని అనుసరిస్తుంటే వారుమాత్రం నా పట్ల మూర్ఖంగా ప్రవర్తిస్తున్నారు” అని మొరపెట్టు

٦٤٨ ـ وعن أبي هريرةَ رضي الله عنه أن رجلاً قال: يارسولَ اللهِ! إنَّ لي قَرابَةً أَصِلُهُمْ وَيَقْطَعوني، وَأُحسنُ إليهم وَيُسيئُونَ إليَّ، وأحلُمُ عنهم وَيَجْهَلُونَ عَلَيَّ! فقال: «لَئِنْ كُنْتَ كَمَا قُلْتَ فَكَأَنَّمَا تُسِفُّهُمُ المَلَّ

وَلا يَزَالُ مَعَكَ مِنَ اللهِ تَعَالَى ظَهِيرٌ عَلَيهِم مَا دُمْتَ عَلَى ذٰلِكَ» رواه مسلم. وَقَد سَبَقَ شَرْحُهُ فِي (بَابِ صلة الأرحام).

కున్నాడు. అతని మాటలు విని దైవ ప్రవక్త (సల్లం) "నువ్వు చెప్పింది నిజమే అయితే (వాస్తవానికి) నువ్వు వారి నోళ్ళల్లో వేడి బూడిదను పోస్తున్నావనుకో. నువ్వు వారిపట్ల ఇలాగే సత్ప్రవర్తనతో మెలగుతున్నంత కాలం దేవుని తరపు నుండి వారికి వ్యతిరేకంగా ఒక సహాయకుడు నీ వెంట ఉంటాడు" అని చెప్పి పంపించారు. *(ముస్లిం)*



**77వ అధ్యాయం**

## ٧٧ ـ بَـابُ الْغَضَـبِ إِذَا انْتُهِكَـتْ حُرُمَاتُ الشَّرْعِ وَالانْتِصَارِ لِدِينِ اللهِ تَعَالَى

## షరీఅత్ ఆదేశాల పట్ల అపచారం జరిగితే ఆగ్రహం వ్యక్తం చేయాలి, దైవధర్మానికి తోడ్పడాలి

قـال الله تعـالـى: ﴿وَمَن يُعَظِّمْ حُرُمَٰتِ ٱللَّهِ فَهُوَ خَيْرٌ لَّهُۥ عِندَ رَبِّهِۦ﴾ [الحج: ٣٠]. وقال تعالى: ﴿إِن تَنصُرُوا۟ ٱللَّهَ يَنصُرْكُمْ وَيُثَبِّتْ أَقْدَامَكُمْ﴾ [محمد: ٧]

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"ఎవడైనా అల్లాహ్ విధించిన పవిత్ర నియమాలను గౌరవిస్తే, అది అతని ప్రభువు దృష్టిలో స్వయంగా అతడికి శ్రేష్ఠమైనది."

*(అల్ హజ్ : 30)*

"విశ్వాసులారా! మీరు అల్లాహ్‌కు సహాయం చేస్తే, ఆయన మీకు సహాయం చేస్తాడు, మీ పాదాలను స్థిరంగా ఉంచుతాడు"

*(ముహమ్మద్ - 7)*

٦٤٩ ـ وعن أبي مسعودٍ عقبةَ بن عمرو البدريِّ رضي الله عنه قال: جَاءَ رَجُلٌ إلى النبيِّ ﷺ، فقال: إنِّي لأَتَأَخَّرُ عَن صَلاةِ الصُّبحِ مِن أجلِ فلانٍ ممَّا يُطِيل

649. హజ్రత్ అబూ మస్‌ఊద్ ఉఖ్బా బిన్ అమ్ర్ బద్రీ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి ఫలానా అతను నమాజ్ సుదీర్ఘంగా చేయిస్తుండటం వల్ల తను ఫజ్ర్ వేళ సామూహిక నమాజ్‌లో పాల్గొనలేక పోతున్నానని ఫిర్యాదు చేశాడు. ఆ సందర్భంగా దైవప్రవక్త (సల్లం) (ప్రజలకు ఉపన్యాసమిస్తూ) విపరీతమైన ఆగ్రహాన్ని వ్యక్తం చేశారు. అంతకుముందు ఏ ఉపన్యాసంలోనూ ఆయన అంతగా కోపగించుకోవటం నేను చూడలేదు.

بِنَا! فَمَا رَأَيْتُ النَّبِيَّ ﷺ غَضِبَ فِي مَوعِظَةٍ قَطُّ أَشَدَّ مِمَّا غَضِبَ يَومئذٍ؛ فقال: «يَا أَيُّهَا النَّاسُ! إِنَّ مِنكم مُنَفِّرِين. فأَيُّكم أَمَّ النَّاسَ فَلْيُوجِز؛ فإِنَّ مِنْ ورائِهِ الكَبِيرَ والصَّغِيرَ وذا الحَاجَةِ» متفقٌ عليه.

అప్పుడాయన ప్రజలకు హితబోధచేస్తూ, "జనులారా! మీలో కొందరు ప్రజలకు ధర్మం పట్ల విరక్తిపుట్టించేవారున్నారు. బాగా గుర్తుంచుకోండి! మీలో ప్రజలకు నమాజ్ చేయించేవారు క్లుప్తంగా చేయిం చాలి. ఎందుకంటే మీ వెనుక నమాజ్ చేసేవారిలో వృద్ధులు, చిన్నపిల్లలు, పని మీద వెళ్ళాల్సినవారు కూడా ఉంటారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసు ద్వారా నాలుగు విషయాలు బోధపడుతున్నాయి. ఒకటి : ప్రజలను ఇబ్బం దుల్లో పడవేసే సమస్య గురించి ప్రజానాయకునికి ఫిర్యాదు చేయవచ్చు. రెండు : ధర్మాదేశాలు ఉల్లంఘించబడుతున్నప్పుడు కోపాన్ని వ్యక్తం చేయవచ్చు. మూడు : ముక్తదీలను దృష్టిలో పెట్టుకొని ఇమాము నమాజును మరీ సుదీర్ఘంగా కాకుండా సంక్షిప్తంగా చేయించాలి. నమాజు లేక ఖుర్‌ఆన్ పారాయణం సంక్షిప్తంగా చేయటమంటే దైవప్రవక్త విధానాన్ని, నమాజులో పాటించ వలసిన కనీస స్థిమితాన్ని కూడా లెక్కచేయకుండా కాకి పొడిచినట్లు నేలమీద త్వరత్వరగా సజ్దాలు కొట్టి నమాజు ముగించేయటం కాదు. పైగా ఇమాము అయినవాడు ఇటు నమాజు విధులను చక్కగా నిర్వర్తిస్తూ అటు ముక్తదీలకు కూడా భారం అనిపించకుండా మధ్యరకమైన నమాజు చేయించాలి. ఇకపోతే నాల్గవ విషయం : ఇమాము అయినవాడు ప్రజలకు ఆరాధన మీద విసుగు పుట్టించే పద్ధతులను అవలంబించరాదు.

٦٥٠ ـ وعن عائشةَ رضي الله عنها قالت: قَدِمَ رسولُ اللهِ ﷺ مِنْ سَفَرٍ، وقَدْ سَتَرْتُ سَهْوَةً لي بِقِرامٍ فِيهِ تَمَاثِيلُ، فَلَمَّا رآهُ رسولُ اللهِ ﷺ هتكَهُ وَتَلَوَّنَ وجهُهُ وَقَالَ: «يَا عَائِشَةُ! أَشَدُّ النَّاسِ عَذَاباً عِندَ اللهِ يَوْمَ القِيَامَةِ الَّذِينَ يُضَاهُونَ بِخَلْقِ اللهِ» متفقٌ عليه. «السَّهْوَةُ»: كالصُّفَّةِ تَكُونُ بين يدي البيت. و«القِرام» بكسر القاف: سِتر رقيق، و«هتكه»: أفسد الصورة التي فيه.

650. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : నేను మా ఇంటి గుమ్మానికి ఒక తెర వ్రేలాడదీసి ఉంచాను. దాని మీద బొమ్మలు వేసి ఉన్నాయి. దైవ ప్రవక్త (సల్లం) ప్రయాణం నుంచి తిరిగొచ్చినప్పుడు దాన్ని చూసి (వెంటనే) ఆ బొమ్మల రూపాల్ని మార్చేశారు. ఆగ్ర హంతో ఆయన ముఖవర్ణం మారి పోయింది. తర్వాత ఆయన నాతో, "ఆయిషా! దేవుని సృష్టిని పోలిన వాటిని

సృష్టించేవారికి ప్రళయదినాన అందరి కన్నా తీవ్రమైన శిక్ష విధించబడుతుంది" అని చెప్పారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని వస్త్రధారణ ప్రకరణాలు)*

651. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం : ఓసారి మఖ్జూమ్ కుటుంబానికి చెందిన ఒక స్త్రీ దొంగ తనం చేసింది. (ఆమెకు హస్తఖండన శిక్ష విధించబడుతుంద నటంతో) ఖురైషులు ఆందోళన చెందారు.

అప్పుడు వారు పరస్పరం సంప్రతించుకొని 'ఈ విషయమై దైవప్రవక్త (సల్లం)తో ఎవరు మాట్లాడతారు?' అని అన్నారు. వారిలో కొందరు సలహా ఇస్తూ ఒక్క ఉసామా బిన్ జైద్ తప్ప దైవప్రవక్త (సల్లం) దగ్గర ఎవరూ ఈ విషయం గురించి మాట్లాడలేరని, దైవప్రవక్త (సల్లం) ఆయన్ని అమితంగా అభిమానిస్తారని చెప్పారు. (చివరికి వారంతా ఉసామాను దైవప్రవక్త దగ్గర సిఫారసు చేయటం కోసం ఒప్పించారు). అలాగే ఉసామా వెళ్ళి దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడారు.

అది విని దైవప్రవక్త (సల్లం) ఉసామాను మందలిస్తూ "ఏమిటీ...నువ్వు దేవుడు నిర్ణయించిన శిక్షలలో ఒక శిక్ష గురించి సిఫారసు చేయటానికి వచ్చావా?" అని అన్నారు.

٦٥١ ـ وعنها أنَّ قُرَيشاً أَهَمَّهُم شَأْنُ المَرأَةِ المَخزُومِيَّةِ التي سَرَقَتْ فقالوا: من يُكَلِّمُ فِيها رسولَ اللهِ ﷺ؟ فقالوا: مَنْ يَجتَرِىءُ عليهِ إلا أُسَامَةُ بنُ زيدٍ حِبُّ رسولِ اللهِ ﷺ؟ فَكَلَّمَهُ أُسَامَةُ؛ فقال رسولُ اللهِ ﷺ: «أَتَشْفَعُ في حَدٍّ مِن حُدُودِ اللهِ تعالى؟!» ثم قامَ فَاخْتَطَبَ ثم قال: «إنما أَهْلَكَ مَنْ قَبْلَكُم أَنَّهُم كَانُوا إذَا سَرَقَ

ఆ తర్వాత లేచి ప్రజల ముందు ఉపన్య సిస్తూ, "మీకు పూర్వం గతించిన జాతు లను ఈ విషయమే నాశనం చేసింది. వారు తమలో పలుకుబడి గల వ్యక్తి ఎవరైనా దొంగతనం చేస్తే అతడ్ని శిక్షించ కుండా వదలిపెట్టేవారు. అదే బలహీను డైన వ్యక్తి ఎవరయినా దొంగతనం చేస్తే అతడికి శిక్ష విధించేవారు. దైవసాక్షి! ముహమ్మద్ కూతురు ఫాతిమా అయినా సరే దొంగతనం చేస్తే నేనామె చేతిని నరికి తీరుతాను" అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

فِيهِمُ الشَّرِيفُ تَرَكُوهُ، وإذا سَرَقَ فِيهِم الضَّعِيفُ أَقَامُوا عَلَيهِ الحَدَّ! وَايْمُ اللهِ، لو أَنَّ فَاطِمَةَ بنتَ محمدٍ سَرَقَتْ لَقَطَعْتُ يَدَهَا» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని శిక్షల ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

షరీఅత్ విధించిన శిక్షల్ని తగ్గించటానికిగాని, లేదా శిక్షాపద్ధతిని మార్చటానికిగాని మానవుల్లో ఎవరికీ హక్కులేదు. ఈ విషయంలో ఒకరు మరొకరి కోసం సిఫారసు చేయటం, ఒకరి సిఫారసును అంగీకరించటం అన్నీ అధర్మ కార్యకలాపాలుగానే పరిగణించబడతాయి. ఇస్లాం ధర్మమే మొట్టమొదటిసారిగా ప్రపంచానికి 'చట్టం దృష్టిలో సమానత'ను అందించింది. ప్రజలైనా, పాలకులైనా, కులీనులైనా, కులహీనులైనా, ధనికులైనా, నిరుపేదలైనా చట్టం దృష్టిలో అందరూ సమానులేననీ, పేరు ప్రతిష్ఠలు, కులగోత్రాల ప్రాతిపదికపై శిక్షాస్మృతిలో ఎలాంటి భేదభావం ఉండకూడదని ప్రబోధించింది.

652. హజ్రత్ అనస్ (రజి) కథనం : ఒకరోజు దైవప్రవక్త (సల్లం) (మస్జిదులో) ఖిబ్లావైపు (గోడమీద) కఫం పడి ఉండటం చూశారు. ఆ దృశ్యం చూసి ఆయన గగుర్పాటుకు లోనయ్యారు. ఆయన ముఖకవళికల్లోనూ దాని ప్రభావం కనిపించింది. వెంటనే లేచి తనే స్వయంగా దాన్ని గీకి శుభ్రపరిచారు. ఆ తరువాత ఇలా అన్నారు :

٦٥٢ ـ وعن أنس رضي الله عنه أنَّ النَّبيَّ ﷺ رَأى نُخَامَةً في القِبلَةِ، فَشَقَّ ذَلِكَ عَلَيهِ حَتَّى رُؤِيَ في وَجهِهِ، فَقَامَ فَحَكَّهُ بِيَدِهِ فقال: «إن أَحَدَكم إذا قَامَ في صَلاتِهِ فإنَّهُ يُنَاجِي رَبَّه، وإنَّ رَبَّهُ بَينَهُ وبَينَ القِبلَةِ، فَلا يَبْزُقَنَّ أَحَدُكُم قِبَلَ القِبْلَةِ،

وَلكِن عَنْ يَسَارِهِ، أَوْ تَحتَ قَدَمِهِ» ثُمَّ أَخَذَ طَرَفَ رِدائِهِ فَبَصَقَ فِيهِ، ثُمَّ رَدَّ بَعْضَهُ على بَعْضٍ فقال: «أَو يَفْعَلُ هٰكَذَا» متفقٌ عليه.
وَالأَمرُ بالبُصَاقِ عَنْ يَسَارِهِ أو تَحْتَ قَدَمِهِ هُوَ فِيما إذا كَانَ في غَيْرِ المَسجِدِ، فَأمَّا في المَسجِدِ فَلاَ يَبصُقُ إلَّا في ثَوبِهِ.

మీలో ఎవరైనా నమాజ్ చేస్తున్నప్పుడు అతను తన ప్రభువుతో గుసగుస లాడుతుంటాడు. అతనికి ఖిబ్లా వైపునకు మధ్య అతని ప్రభువు ఉంటాడు. అందువల్ల మీలో ఎవరూ ముందు వైపు ఉమ్మివేయకూడదు. ఒకవేళ వేయ దలచుకుంటే ఎడమ వైపుగాని లేదా తన కాలిక్రిందగాని ఉమ్మివేసుకోవాలి.

ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) తన అంగవస్త్రంలోని ఒక మూలను ఎత్తి పట్టుకొని అందులో ఉమ్మివేసి వస్త్రాన్ని రెండు వైపులతో రుద్దివేస్తూ, "లేదా ఇలా చెయ్యాలి" అని అన్నారు. (బుఖారీ - ముస్లిం)

ఇమామ్ నవవీ (రహ్మాలై) ఇలా అంటు న్నారు : ఎడమ వైపుగాని, కాలిక్రిందగాని ఉమ్మివేయాలనే ఆజ్ఞ మస్జిద్ వెలుపల నమాజ్ చేసే సందర్భానికి సంబంధిం చినది. అదే మస్జిద్‌లో ఉన్నప్పుడయితే ఒక్క అంగవస్త్రంలో తప్ప మరెక్కడా ఉమ్మి వేయకూడదు.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని నమాజ్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

మస్జిద్‌లను పరిశుభ్రంగా ఉంచాలని, మలిన వస్తువులు కనిపిస్తే వాటిని వెంటనే మస్జిద్‌నుండి తొలగించాలని ఈ హదీసు ప్రబోధిస్తోంది. మస్జిద్‌లో అసలు ఉమ్మివేయరాదు. మస్జిద్ వెలుపల నమాజ్ చేస్తున్నప్పుడు ఖిబ్లావైపు మాత్రం ఉమ్మివేయకూడదు. ఒకవేళ అనివార్యమనుకుంటే ఎడమవైపుగాని లేదా కాలిక్రిందగాని ఉమ్మివేసుకోవాలి. మస్జిద్‌లోపల నమాజ్ చేస్తున్నప్పుడు ఉమ్మివస్తే రుమాలులోగాని, చేతిగుడ్డలోగాని ఉమ్మివేసి ఆ తర్వాత ఆ గుడ్డను రుద్దివేయాలి.

## 78వ అధ్యాయం

## ٧٨ - بَابُ أَمْرِ وُلَاةِ الأُمُورِ بِالرِّفْقِ بِرَعَايَاهُمْ وَنَصِيحَتِهِمْ وَالشَّفَقَةِ عَلَيْهِمْ وَالنَّهْيِ عَنْ غِشِّهِمْ، وَالتَّشْدِيدِ عَلَيْهِمْ، وَإِهْمَالِ مَصَالِحِهِمْ، وَالْغَفْلَةِ عَنْهُمْ وَعَنْ حَوَائِجِهِمْ

## పాలకులు ప్రజలపట్ల మృదువుగా వ్యవహరించాలి. వారి శ్రేయాన్ని అభిలషించాలి, వారిని కరుణించాలి, వారిని మోసగించటం, వారిపట్ల కటువుగా వ్యవహరించటం, వారి ప్రయోజనాలను నిర్లక్ష్యం చేయటం, వారిని ఉపేక్షించటం చేయకూడదు

قال الله تعالى: ﴿ وَٱخْفِضْ جَنَاحَكَ لِمَنِ ٱتَّبَعَكَ مِنَ ٱلْمُؤْمِنِينَ ﴾ [الشعراء: ٢١٥].

دివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

“విశ్వాసులలో నిన్ను అనుసరించేవారిపట్ల మృదువుగా మెలగు.” *(అష్ షుఅరా : 215)*

وقال تعالى: ﴿ ۞ إِنَّ ٱللَّهَ يَأْمُرُ بِٱلْعَدْلِ وَٱلْإِحْسَٰنِ وَإِيتَآيِٕ ذِى ٱلْقُرْبَىٰ وَيَنْهَىٰ عَنِ ٱلْفَحْشَآءِ وَٱلْمُنكَرِ وَٱلْبَغْىِ يَعِظُكُمْ لَعَلَّكُمْ تَذَكَّرُونَ ﴾ [النحل: ٩٠].

న్యాయం చెయ్యండి అనీ, ఉపకారం చెయ్యండి అనీ, బంధువుల హక్కులు నెరవేర్చండి అనీ అల్లాహ్ ఆజ్ఞాపిస్తున్నాడు. చెడునూ, అశ్లీలతనూ, అన్యాయాన్నీ, మితిమీరి ప్రవర్తించటాన్నీ నిషేధిస్తున్నాడు. ఆయన మీకు హితబోధ చేస్తున్నాడు, మీరు గుణపాఠం నేర్చుకోవాలని. *(అన్ నహ్ల్ : 90)*

٦٥٣ - وعن ابنِ عمرَ رضي الله عنهما قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقول: «كُلُّكُم رَاعٍ، وكُلُّكُم مَسؤُولٌ عَنْ رَعِيَّتِهِ: الإمامُ رَاعٍ وَمَسؤُولٌ عَنْ رَعِيَّتِهِ، وَالرَّجُلُ رَاعٍ في أَهْلِهِ وَمَسؤُولٌ عَنْ رَعِيَّتِهِ، وَالمرأَةُ رَاعِيَةٌ في بَيتِ زَوجِها وَمَسؤُولَةٌ عَنْ

653. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీలో ప్రతి మనిషీ ఓ బాధ్యతగల వ్యక్తి. మిమ్మల్నందరినీ తమ తమ బాధ్యతల గురించి (దేవుని సన్నిధిలో) ప్రశ్నించటం జరుగుతుంది. పాలకుడు (ప్రజా సంక్షేమానికి) బాధ్యుడు. అతన్ని తన బాధ్యత విష

رَعِيَّتِهَا، وَالخَادِمُ رَاعٍ فِي مَالِ سَيِّدِهِ وَمَسؤُولٌ عَنْ رَعِيَّتِهِ، وَكُلُّكُم رَاعٍ وَمَسؤُولٌ عَنْ رَعِيَّتِهِ» متفقٌ عليه.

యమై ప్రశ్నించటం జరుగుతుంది. (సాధారణ) మనిషి తన పరివారానికి బాధ్యుడు. అతన్ని తన బాధ్యత (పరివారాన్ని) గురించి ప్రశ్నించటం జరుగుతుంది. అలాగే స్త్రీ కూడా తన భర్త ఇంటికి బాధ్యత వహిస్తుంది. ఆమె (కూడా) తన బాధ్యత విషయమై ప్రశ్నించబడుతుంది. సేవకుడు తన యజమాని సొమ్ముకు బాధ్యుడు. అతడూ తన బాధ్యత గురించి ప్రశ్నించబడతాడు. కనుక మీలో ప్రతి ఒక్కడూ (తన కార్యక్షేత్రంలో) బాధ్యతగల వ్యక్తే. మీలో ప్రతి ఒక్కడూ తన బాధ్యత విషయమై ప్రశ్నించబడతాడు.

*(బుఖారీ - ముస్లిం)*

٦٥٤ - وعن أَبي يَعْلَىٰ مَعْقِل بن يَسَارٍ رضي الله عنه قال: سمعتُ رسولَ الله ﷺ يقول: «ما مِنْ عَبدٍ يَستَرعِيهِ اللهُ رَعيَّةً، يَمُوتُ يَومَ يَمُوتُ وَهُوَ غَاشٌّ لِرَعِيَّتِهِ، إلا حَرَّمَ اللهُ عَلَيهِ الجَنَّةَ» متفقٌ عليه. وفي روايةٍ: «فَلَمْ يَحُطْهَا بِنُصحِهِ لَمْ يَجِدْ رَائِحَةَ الجَنَّةِ». وفي روايةٍ لمسلم: «مَا مِن أَمِيرٍ يَلِي أُمورَ المُسلِمينَ، ثُمَّ لَا يجهَدُ لَهُم، وَيَنْصَحُ لَهُم، إلَّا لَمْ يَدْخُلْ مَعَهُمُ الجَنَّةَ».

654. దైవప్రవక్త (సల్లం) ఈవిధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ యాలా మాఖిల్ బిన్ యసార్ (రజి) తెలియజేశారు: దేవుడు ఏ దాసుని కయినా ఒకరి తాలూకు పాలనా బాధ్యతలు అప్పగించగా అతను తన పాలితులను మోసపుచ్చుతూ మరణిస్తే దేవుడు అతనికి స్వర్గాన్ని నిషేధిస్తాడు.

*(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో, "అతను వారి సంక్షేమాన్ని కోరుకుంటూ వారి హక్కుల్ని కాపాడకపోతే అతనికి స్వర్గ పరిమళం కూడా దక్కదు" అని ఉంది.

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది: ముస్లింల వ్యవహారాలకు

బాధ్యతవహించే పాలకుడు వారి సమస్యల పరిష్కారం కోసం తగిన విధంగా శ్రమించకపోతే, వారి బాగును కోరుకోకపోతే అతను వారితోపాటు స్వర్గంలోకి ప్రవేశించలేడు.”

*(సహీహ్ బుఖారీలోని ఆదేశాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ముస్లింల పాలనా వ్యవహారాలకు బాధ్యత వహించటమంటే మాటలు కాదు. ముస్లిం సమాజమన్న తర్వాత వారికి సవాలక్ష సమస్యలుండవచ్చు. ముస్లింలకు బాధ్యుడైన వ్యక్తి వాటి పరిష్కార మార్గాలను తెలుసుకోవటం కోసం కృషి చేయవలసి ఉంటుంది. అతను గనక ప్రజా సంక్షేమాన్ని కోరుకుంటూ, పూర్తి ఏకాగ్రతతో పనిచేయకపోతే దేవుని సన్నిధిలో నేరస్థుడిగా పరిగణించబడతాడు. తన పాలితులయిన ప్రజలు విశ్వాసం, సదాచరణల మూలంగా స్వర్గంలోకి ప్రవేశిస్తారు కాని తాను మాత్రం (బాధ్యతను మరచిన కారణంగా) ఆ భాగ్యానికి నోచుకోలేకపోతాడు. అందువల్ల ప్రజావ్యవహారాలకు బాధ్యత వహించే రాజులు, అధికారులు రాజ్య మదాంధకారంతో వ్యవహరించకుండా రేపు దైవసన్నిధిలో ఈ బాధ్యత నిర్వహణ గురించి ప్రశ్నించబడుతుందనే భీతిభావంతో మసలుకోవాలి. ప్రజలకు సంపూర్ణ న్యాయాన్ని, సుఖశాంతులను అందజేయటానికి అన్నివిధాలా కృషిచేయాలి.

655. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) ఈ నా ఇంట్లో ఈ విధంగా ప్రార్థిస్తుండగా నేను విన్నాను : దేవా! ఎవరైనా నా అనుచర సమాజ వ్యవహారాలకు బాధ్యత వహించి, వారిని కష్టాల పాల్జేస్తే, నువ్వు కూడా అతన్ని కష్టాలపాల్జెయ్యి. మరెవరయినా నా అనుచర సమాజ వ్యవహారాలకు బాధ్యతవహించి, వారిపట్ల మృదువుగా మెలిగితే నువ్వు కూడా వారిపట్ల మృదువుగా వ్యవహరించు.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

٦٥٥ ـ وعن عائشةَ رضي الله عنها قالت: سمعتُ رسولَ اللهِ ﷺ يقول في بَيتي هذا: «اللَّهُمَّ مَنْ وَلِيَ مِنْ أَمرِ أُمَّتي شَيْئاً، فَشَقَّ عَلَيهم، فَاشقُقْ عليه، وَمَن وَلِيَ مِنْ أمر أُمَّتي شَيْئاً، فَرَفَقَ بِهِم، فَارفُق بِهِ» رواه مسلم.

656. హ(జత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : ఇస్రాయీల్ జాతి రాజ్య వ్యవహారాలను దైవప్రవక్తలు నడిపేవారు. ఒక ప్రవక్త చనిపోగానే ఆయన స్థానంలో మరొక ప్రవక్త ఆయనకు వారసుడు అయ్యేవాడు. కాని నా తదనంతరం మాత్రం మరే దైవప్రవక్తా రాడు. కాకపోతే ఖలీఫాలు ఉంటారు, చాలా ఎక్కువ సంఖ్యలో ఉంటారు.

ఈ మాట విని అనుచరులు, "దైవ ప్రవక్తా! ఈ సందర్భంగా తమరు మాకిచ్చే ఆజ్ఞ ఏమిటి?" అని అడిగారు. దానికి ఆయన, "మొదటగా ప్రమాణం చేసినవారి ప్రమాణాన్ని పూర్తిచేయండి. ఆ తర్వాతగాని వేరొకరితో ప్రమాణం చేయండి. వారి హక్కుల్ని నెరవేర్చండి. మీ హక్కుల గురించి దేవుణ్ణి ప్రార్థించండి. (వారు గనక బాధ్యతా నిర్వహణలో నిర్లక్ష్యం వహిస్తే) దేవుడు ఏయే వ్యవహారాలకు వారిని బాధ్యులుగా చేశాడో ఆయా వ్యవహారాలను గురించి స్వయంగా దేవుడే వారిని నిలదీస్తాడు.

*(బుఖారీ - ముస్లిం)*

٦٥٦ ـ وعن أَبي هريرةَ رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «كَانَتْ بَنُو إسرَائِيلَ تَسُوسُهُمُ الأَنْبِيَاءُ، كُلَّمَا هَلَكَ نَبِيٌّ خَلَفَهُ نَبِيٌّ، وَإِنَّهُ لَا نَبِيَّ بَعْدِي، وَسَيَكُونُ بعدي خُلَفَاءُ فَيَكْثُرُونَ» قالوا: يَا رسول الله! فَمَا تَأْمُرُنَا؟ قال: «أَوفُوا بِبَيعَةِ الأَوَّلِ فَالأَوَّلِ، ثُمَّ أَعْطُوهُمْ حَقَّهُم، وَاسأَلُوا اللهَ الَّذي لَكُم، فَإِنَّ اللهَ سَائِلُهُم عَمَّا استَرعَاهُم» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని దైవప్రవక్తల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

స్వతహాగా రాజకీయాలు చెడ్డవేమీ కావు. అవి చెడ్డవయితే దైవప్రవక్తలు వాటిని నిర్వహించేవారే కాదు. దైవప్రవక్తలు రాజ్య వ్యవహారాలు నడిపేవారంటే అర్థం ప్రభుత్వ నిర్వహణ, ప్రజా సంక్షేమం మొదలగు రాజకీయ బాధ్యతలన్నీ దైవప్రవక్తలే చూసుకునేవారు. పూర్వకాలంలో

ధార్మిక, ప్రాపంచిక వ్యవహారాలన్నీ మిళితమయి ఉండేవి. రెండింటినీ దైవప్రవక్తలే నిర్వహించేవారు. మన ప్రవక్త (సల్లం) తదనంతరం ఖ్యాతిగాంచిన నలుగురు ఖలీఫాల కాలంలో, ఆ తర్వాత కూడా చాలాకాలం వరకూ ఈ విధానమే అమల్లో ఉండంది. రాచరికపు వ్యవస్థలో ఒక రాజు తర్వాత అతని వారసులు రాజులుగా చెలామణి అయినట్లు ఇస్రాయీల్ జాతి ఆరంభకాలంలో ప్రభుత్వాన్ని నిర్వహించే ఒక దైవప్రవక్త చనిపోగానే ఆయన స్థానంలో మరొక దైవప్రవక్త ఆయనకు వారసుడిగా పరిపాలనా బాధ్యతలు చేపట్టేవారు.

కాని అంతిమ ప్రవక్త ముహమ్మద్ (సల్లం)తో దైవప్రవక్తల పరంపర నిలిచిపోయింది. ఆయన తర్వాత ఇక మరే దైవప్రవక్తా ప్రభవించడు. కాకపోతే ఖలీఫాలు పరిపాలనా బాధ్యతలు నిర్వహిస్తారు. ఏకకాలంలో అనేకమంది అభ్యర్థులు ఖలీఫా పదవి కోసం ప్రాకులాడుతూ దేశంలో రాజకీయ సంక్షోభం ఏర్పడినప్పుడు ప్రజలు మొట్టమొదటిసారిగా బైత్ (ప్రమాణం) ద్వారా ఎన్నుకున్న ఖలీఫాకే విధేయత చూపాలి, అతను అధికారంలో ఉండగా పాలనా వ్యవహారాల్లో వేరొకరి అడుగులకు మడుగులు ఒత్తడం అధర్మం అని దైవప్రవక్త (సల్లం) ప్రబోధించారు.

ప్రభుత్వాధినేతల వల్ల జరిగే ప్రతి చిన్న లోపాన్నీ గోరంతను కొండంత చేసి ప్రచారం చేయటం, రాజ్యంలో అరాచకాన్ని సృష్టించి తిరుగుబాటు ధోరణులను అవలంబించటాన్ని ఇస్లామీయ షరీఅత్ విపరీతంగా గర్హిస్తుంది. అధికారులు పాలనా వ్యవహారాల్లో షరీఅత్ ఆదేశాలకు అనుగుణంగా వ్యవహరిస్తున్నంతకాలం ప్రజలు వారికి విధేయత చూపుతూ ఉండాలి. అంతేగాని ప్రతి చిన్న తప్పుకీ ప్రజలు తిరుగుబాటు బావుటా ఎగురవేస్తే ఒకవైపు ఇస్లామీయ రాజ్యవ్యవస్థ దెబ్బతినటంతోపాటు మరోవైపు ఈ వైఖరి ప్రజల విశ్వాసానికే గొడ్డలిపెట్టు అవుతుంది.

657. ఒకసారి హజ్రత్ ఆయిజ్ బిన్ అమ్ర్ (రజి) ఉబైదుల్లాహ్ బిన్ జియాద్ దగ్గరికి వెళ్ళి, "చూడు నాయనా! 'ప్రజల పట్ల కఠినంగా వ్యవహరించే పాలకులు అతి నీచులు' అని దైవప్రవక్త (సల్లం) ప్రవచిస్తుండగా నేను విన్నాను. కనుక నువ్వూ వారిలాగా అవకుండా జాగ్రత్త పడు!" అని ఉపదేశించారు. *(ముస్లిం)*

٦٥٧ ـ وعن عائِذِ بنِ عمرٍو رضي الله عنه أَنَّهُ دَخَلَ عَلى عُبَيدِ اللهِ بن زِيَادٍ، فقال له: أَيْ بُنَيَّ! إنِّي سَمِعتُ رسولَ اللهِ ﷺ يقول: «إنَّ شَرَّ الرِّعَاءِ الحُطَمَةُ» فإيَّاكَ أَن تَكُونَ مِنهُم. متفقٌ عليه.

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో 'హుతమా' అనే పదం వాడబడింది. హుతమా అంటే పశువుల్ని విపరీతంగా కొట్టిబాధించే కాపరులు అని అర్థం. ప్రజల హక్కులను కాలరాస్తూ, నిర్దాక్షిణ్యంగా హింసిస్తూ,

వారిమీద దారుణంగా అన్యాయానికి ఒడిగట్టే పాలకులను ఇక్కడ పశువుల పట్ల నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించే కాపరులతో పోల్చటం జరిగింది.

658. ఒకసారి హజ్రత్ అబూ మర్యమ్ అజ్దీ (రజి) దైవప్రవక్త (సల్లం) ఈవిధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని ముఆవియా (రజి)కు ఉపదేశిస్తూ చెప్పారు : దేవుడు ఎవరినయినా ముస్లింల కొన్ని వ్యవహారాలకు అధికారిగా నియమించినప్పుడు అతను వారి అవసరాలకు, అక్కరలకు, పేదరికానికి మధ్య అడ్డుగా నిలిస్తే (వారి అవసరాలను తీర్చకపోతే) ప్రళయదినాన దేవుడు కూడా అతని అవసరాలకు అక్కరలకు, పేదరికానికి అడ్డుగా ఉంటాడు.

హజ్రత్ ముఆవియా (రజి) (ఈ హదీసు విన్న తరువాత) ప్రజల అవసరాల గురించి తెలుసుకోవటానికి ఒక వ్యక్తిని నియమించారు.

(అబూ దావూద్, తిర్మిజీ)

٦٥٨ ـ وعن أبي مَريَم الأزدِيِّ رضي الله عنه، أنه قال لِمُعاوِيَةَ رضي الله عنه: سَمِعتُ رسولَ الله ﷺ يقول: «مَنْ وَلَّاهُ اللهُ شَيئاً مِن أُمورِ المُسلِمِينَ، فَاحتَجَبَ دُونَ حَاجَتِهِم وخَلَّتِهِم وفَقرِهِم، احتَجَبَ الله دُونَ حَاجَتِهِ وخَلَّتِهِ وفَقرِهِ يَومَ القِيامَةِ» فَجَعَلَ مُعَاوِيَةُ رَجُلاً على حَوائِجِ النَّاسِ. رواه أبو داود، والترمذي.

(సుననె అబూదావూద్‌లోని పన్నుల ప్రకరణం, సుననె తిర్మిజీలోని ఆదేశాల అధ్యాయం)

## ముఖ్యాంశాలు

ఆటంకంగా పరిణమించటమంటే బాధిత ప్రజల్ని తమ దగ్గరికి రానీయకుండా అడ్డుకోవటమని అర్థం. ప్రజల కష్టనష్టాలను గురించి తెలుసుకోకుండా, తెలియపరిచేవారినీ దరిచేరనీయకుండా నిర్దాక్షిణ్యంగా అణచివేసే నిరంకుశ ప్రభువులను ప్రళయదినాన దేవుడు తన కారుణ్యఛాయలకు బహుదూరంలో ఉంచుతాడు. వారిని అస్సలు పట్టించుకోడు. ఆ రోజు వారు కరుణామయుని సన్నిధికి వెళ్ళి తమ గోడుని వినిపించుకోవాలని ఎంతగానో అభిలషిస్తారు కాని వారికా భాగ్యం లభించదు.

**79వ అధ్యాయం**

# ٧٩ ـ بَابُ الْوَالِي الْعَادِلِ

# న్యాయశీలుడైన పరిపాలకుడు

قال الله تعالى: ﴿إِنَّ ٱللَّهَ يَأْمُرُ بِٱلْعَدْلِ وَٱلْإِحْسَٰنِ﴾ [النحل: ٩٠]. وقال تعالى: ﴿وَأَقْسِطُوٓاْ إِنَّ ٱللَّهَ يُحِبُّ ٱلْمُقْسِطِينَ﴾ [الحجرات: ٩].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :
"న్యాయం చెయ్యండి అనీ, ఉపకారం చెయ్యండి అనీ, బంధువుల హక్కులు నెర వేర్చండి అనీ అల్లాహ్ ఆజ్ఞాపిస్తున్నాడు."
*(అన్ నహ్ల్ : 90)*

"న్యాయం చేయండి, ఎందుకంటే అల్లాహ్ న్యాయం చేసేవారిని ప్రేమిస్తాడు."
*(అల్ హుజురాత్ : 9)*

٦٥٩ ـ وعن أبي هريرةَ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «سَبعَةٌ يُظِلُّهُمُ اللهُ في ظِلِّه يومَ لا ظِلَّ إلَّا ظِلُّهُ: إمَامٌ عَادِلٌ، وشَابٌّ نَشَأَ في عِبَادَةِ اللهِ تعالى، وَرَجُلٌ قَلْبُهُ مُعَلَّقٌ في المَسَاجِدِ، وَرَجُلَانِ تَحَابَّا في اللهِ، اجتَمَعَا عليهِ، وَتَفَرَّقَا عَلَيهِ، ورجُلٌ دَعَتْهُ امرَأَةٌ ذَاتُ مَنصِبٍ وَجَمالٍ، فَقَالَ: إنِّي أَخَافُ اللهَ، وَرَجُلٌ تَصَدَّقَ بِصَدَقَةٍ، فَأَخْفَاهَا حَتَّى لَا تَعْلَمَ شِمَالُهُ مَا تُنفِقُ يَمِينُهُ، ورَجُلٌ ذَكَرَ اللهَ خَالِياً فَفَاضَتْ عَيناهُ» متفقٌ عليه.

659. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : దేవుని నీడ తప్ప మరె లాంటి నీడ కనిపించని (ప్రళయ) దినాన దేవుడు ఏడుగురు వ్యక్తుల్ని తన (కారుణ్య) నీడలో ఉంచుతాడు. ఆ ఏడుగురు : (1) న్యాయంగా పాలించిన పరిపాలకుడు (2) తన యవ్వనాన్ని దైవారాధనలో గడిపిన యువకుడు (3) మనసంతా మస్జిద్‌లోనే ఉండే వ్యక్తి (4) కేవలం దైవప్రసన్నత కోసం పరస్పరం ప్రేమించుకునే ఇద్దరు వ్యక్తులు (అలాగే), దైవప్రసన్నత ప్రాతిపదికగా పరస్పరం విడిపోయేవారు (5) అందం, అంతస్థూ కలిగివున్న స్త్రీ చెడుకార్యానికి పిలిస్తే తాను దేవునికి భయపడుతున్నా నంటూ ఆమె కోరికను నిరాకరించిన వ్యక్తి (6) కుడిచేత్తో చేసింది ఎడమచేతికి

కూడా తెలియనంత గోప్యంగా దానాలు చేసిన వ్యక్తి (7) ఏకాంతంలో దేవుణ్ణి జ్ఞాపకం చేసుకొని (ఆయన భీతితో) కన్నీరు కార్చిన వ్యక్తి. *(బుఖారీ - ముస్లిం)*

٦٦٠ - وعن عبدِ الله بنِ عمرِو بنِ العاص رضي اللهُ عنهما قال: قال رسولُ اللهِ ﷺ: «إنَّ المُقْسِطِينَ عِنْدَ اللهِ عَلى مَنَابِرَ مِنْ نُورٍ: الَّذِينَ يَعْدِلُونَ في حُكْمِهِمْ وَأَهْلِيهِمْ وَمَا وَلُوا» رواهُ مسلم.

660. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : (ఇహ లోకంలో) న్యాయానికి కట్టుబడి ఉండే వారు దేవుని సన్నిధిలో వెలుగుతో నిండిన వేదికలపై ఉంటారు. న్యాయానికి కట్టుబడి ఉండేవారంటే తమ స్వంత విషయాల్లో, కుటుంబం, ఇతర బాధ్యతల విషయంలో న్యాయంగా వ్యవహరించేవారని అర్థం. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని పదవుల ప్రకరణం)*

٦٦١ - وعَن عَوفِ بنِ مَالِكٍ رَضِيَ اللهُ عنه قال: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يقولُ: «خِيَارُ أَئِمَّتِكُمُ الَّذِينَ تُحِبُّونَهُمْ وَيُحِبُّونَكُمْ، وَتُصَلُّونَ عَلَيْهِمْ وَيُصَلُّونَ عَلَيْكُمْ، وَشِرَارُ أَئِمَّتِكُمُ الَّذِينَ تُبْغِضُونَهُمْ وَيُبْغِضُونَكُمْ، وَتَلْعَنُونَهُمْ وَيَلْعَنُونَكُمْ!» قَالَ: قُلْنَا: يَا رَسُولَ اللهِ! أَفَلَا نُنَابِذُهُمْ؟ قَالَ: «لَا، مَا أَقَامُوا فِيكُمُ الصَّلَاةَ، لَا،

661. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా చెబుతుండగా తాను విన్నానని హజ్రత్ ఔఫ్ బిన్ మాలిక్ (రజి) తెలియజేశారు: మీ పాలకుల్లో మీరు అభిమానించేవారు, మిమ్మల్ని అభిమానించేవారు, మీరు శ్రేయం కోరి ప్రార్థించేవారు, మీ శ్రేయం కోరి ప్రార్థించేవారు అత్యుత్తమ పాలకులు. ఇంకా మీ పాలకుల్లో మీరు అసహ్యించుకునేవారు, మిమ్మల్ని అసహ్యించుకునేవారు, మీరు ఛీత్కరించుకునేవారు, మిమ్మల్ని ఛీత్కరించుకునేవారే అత్యంత హీనులైన పాలకులు.

హజ్రత్ ఔఫ్ బిన్ మాలిక్ ఇలా అంటున్నారు : రెండో మాట విని మేము సందేహపడుతూ, "దైవప్రవక్తా! మరి మేము అలాంటి పాలకులతో ప్రమాణాన్ని భగ్నం చేసి వారిపై తిరుగుబాటు చేయకూడదా?" అని అడిగాం. దానికాయన "లేదు, వారు మీ మధ్య నమాజ్ స్థాపించేవారుగా ఉన్నంతవరకూ (అలా చేయకండి), వారు మీమధ్య నమాజ్ స్థాపించేవారుగా ఉన్నంత వరకూ" అని అన్నారు. *(ముస్లిం)*

مَا أَقَامُوا فِيكُمُ الصَّلَاةَ» رواهُ مسلم.
قوله: «تُصَلُّونَ عَلَيْهِمْ»: تَدْعُونَ لَهُمْ.

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో మంచి, చెడు - రెండు రకాల పరిపాలకుల గురించీ చెప్పటం జరిగింది. కొందరు పరిపాలకులు ప్రజల సంక్షేమాన్ని, శ్రేయాన్ని కోరుకుంటూ వారికి న్యాయవంతమైన పరిపాలనను అందజేయటానికి కృషిచేస్తారు. అలాంటి పరిపాలకులు అత్యుత్తమ పరిపాలకులుగా ఖ్యాతిగడిస్తారు. ప్రజలు తమ అభిమాన ప్రభువులు, పాలకుల క్షేమం, శ్రేయాల కోసం దేవుణ్ణి ప్రార్థిస్తూ ఉంటారు. ఆ సచ్ఛీలురైన పాలకులు కూడా తమ ప్రజల బాగుకోసం ప్రార్థిస్తూ ఉంటారు. ఆ విధంగా వారి రాజ్యం మూడు పూవులు ఆరుకాయలుగా సుఖసంతోషాలతో, శాంతి సౌమనస్యాలతో వర్ధిల్లుతూ ఉంటుంది.

మరోవైపు పాలకుల్లో కొందరు నీచులు, స్వార్థపరులు కూడా ఉంటారు. వారు నిత్యం తమ అధికారాన్ని, తమ వ్యక్తిగత ప్రయోజనాలను కాపాడుకోవటానికి మాత్రమే కృషి చేస్తుంటారు. ప్రజలకు న్యాయవంతమైన పరిపాలనను అందజేయాలనిగాని, వారి సమస్యలను పరిష్కరించాలనిగాని వారికి ఏమాత్రం ఆసక్తి ఉండదు. తత్కారణంగా ప్రజలు వారిని బహిరంగంగా కాకపోయినా లోలోన అయినా దూషిస్తారు. చరిత్రలో వారికి దుష్ట పరిపాలకులనే ముద్ర పడిపోతుంది.

ఈ హదీసు ద్వారా బోధపడే మరో ముఖ్య విషయం ఏమిటంటే పరిపాలకులు బహిరంగంగా దైవతిరస్కారానికి పాల్పడుతూ, ఇస్లామీయ గౌరవ చిహ్నాలను అవమానపరచనంతవరకూ, నమాజ్‌ను స్థాపిస్తూ ఉన్నంతవరకూ - వారు దౌర్జన్యానికి పాల్పడేవారయినా సరే - ప్రజలు వారికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయరాదు. ఎందుకంటే చీటికి మాటికీ తిరుగుబాట్లు చేయటం వల్ల లాభంకన్నా నష్టమే ఎక్కువ జరుగుతుంది.

٦٦٢ ـ وعنْ عِيَاضِ بنِ حِمارٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يقولُ: «أَهْلُ الجَنَّةِ ثَلاَثَةٌ: ذُو سُلْطَانٍ مُقْسِطٌ مُوَفَّقٌ، وَرَجُلٌ رَحِيمٌ رَقِيقُ القَلْبِ لِكُلِّ ذِي قُرْبى وَمُسْلِمٍ، وعَفِيفٌ مُتَعَفِّفٌ ذُو عِيالٍ» رواهُ مسلم.

662. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఇయాజ్ బిన్ హిమార్ (రజి) తెలియ జేశారు : "ముగ్గురు స్వర్గవాసులవుతారు. (ఒకడు:) న్యాయంగా పరిపాలించే, సదాచరణచేసే భాగ్యం కలిగివున్న రాజు (రెండోవాడు:) బంధువులు, ముస్లింల విషయంలో దయామయుడు, జాలి గుండె కలిగిన మనిషి. (మూడోవాడు:) అవసరాల్లో ఉండికూడా అడుక్కోని ఆత్మాభిమాని. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని స్వర్గసుఖాల ప్రకరణం)*

## 80వ అధ్యాయం

# ٨٠ ـ بَابُ وُجُوبِ طَاعَةِ وُلاَةِ الأُمُورِ فِي غَيْرِ مَعْصِيَةٍ وَتَحْرِيمِ طَاعَتِهِمْ فِي الْمَعْصِيَةِ.

# ధర్మసమ్మతమైన విషయాల్లో పాలకులకు విధేయత చూపటం విధి, అధర్మ విషయాల్లో వారికి విధేయత చూపటం నిషిద్ధం

قال الله تعالى: ﴿يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ أَطِيعُواْ ٱللَّهَ وَأَطِيعُواْ ٱلرَّسُولَ وَأُوْلِي ٱلۡأَمۡرِ مِنكُمۡ﴾ [النساء: ٥٩].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :
"విశ్వసించిన ప్రజలారా! విధేయత చూపండి అల్లాహ్‌కు, విధేయత చూపండి ప్రవక్తకు, మీలో అధికారం అప్పగించబడిన పెద్దలకు."
*(అన్ నిసా : 59)*

**వివరణ :**

పై దివ్య ఖుర్‌ఆన్ సూక్తిని నిశితంగా పరిశీలిస్తే మనకు ఒక విషయం బోధపడుతుంది. అల్లాహ్‌కు, ప్రవక్తకు అనే ముందు విధేయత చూపండి అనే పదం వాడబడిందిగాని అధికారం అప్పగించబడిన పెద్దలకు అనేమాట ముందు మాత్రం ఆ పదం వాడబడలేదు. ఇందులోని మర్మం ఏమిటంటే దేవునికి, దైవప్రవక్తకు - మరో మాటలో చెప్పాలంటే దైవగ్రంథానికి, దైవప్రవక్త దివ్య వచనాలకు ఎట్టిపరిస్థితుల్లోనయినా తప్పనిసరిగా విధేయత చూపవలసి ఉంటుంది. కాని పరిపాలకులకు చూపవలసిన విధేయత అలాంటిది కాదు. ఖుర్‌ఆన్, హదీసుల బోధనలకు అనుగుణంగా ఉండే పరిపాలకుల ఆదేశాలను తప్పకుండా పాటించాలి. కాని అందుకు విరుద్ధంగా ఉండే ఆదేశాల్ని మాత్రం తప్పకుండా త్రోసిపుచ్చాలి.

٦٦٣ ـ وعن ابنِ عمرَ رضيَ الله عنهما عَنِ النَّبِيِّ ﷺ قال: «عَلى المَرْءِ المُسْلِمِ السَّمْعُ وَالطَّاعَةُ فِيما أَحَبَّ وَكَرِهَ،

663. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ముస్లిం అయిన ప్రతి వ్యక్తి తనకు ఇష్టమున్నా లేకపోయినాసరే (తమ నాయకుడు) చెప్పే మాటను వినాలి. (అతని ఆజ్ఞను)

إِلَّا أَنْ يُؤْمَرَ بِمَعْصِيَةٍ، فَإِذَا أُمِرَ بِمَعْصِيَةٍ فَلَا سَمْعَ وَلَا طَاعَةَ» متفقٌ عليه.

శిరసావహించాలి - పాపకార్యానికి పాల్పడమని అతడు ఆజ్ఞాపిస్తే తప్ప. ఒకవేళ (నాయకుడు స్వయంగా) పాప కార్యానికి పాల్పడమని ఆజ్ఞాపిస్తే మాత్రం దాన్ని శిరసావహించకూడదు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఆదేశాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ముస్లింలు తమ నాయకులకు ఎంతవరకు విధేయత చూపాలో, ఏ విషయాల్లో వారిని అనుసరించాలో మరే విషయాల్లో వారితో విభేదించాలో నిర్ణయించటం జరిగింది. కనుక ముస్లిం పాలకులు దేవుడు, దైవప్రవక్త బోధనలు, ఇస్లామీయ షరీఅత్ ఆదేశాల పరిధిలో మసలుకోవటంలోనే తమ గౌరవం ఇమిడి ఉందని గ్రహించాలి. అలాగాకుండా హద్దుమీరి ప్రవర్తిస్తే పరలోక శిక్షతోపాటు ఇహలోకంలోనూ ఎన్నో అవమానాలకు గురికావలసి వస్తుంది.

٦٦٤ ـ وعنه قال: كُنَّا إذا بَايَعْنَا رَسُولَ اللهِ ﷺ عَلَى السَّمْعِ وَالطَّاعَةِ يَقُولُ لَنَا: «فِيما اسْتَطَعْتُمْ» متفقٌ عليه.

664. హజ్రత్ ఇబ్నె ఉమర్‌గారే చేసిన కథనం : మేము దైవప్రవక్త (సల్లం)తో 'వింటాము, శిరసావహిస్తాము' అని ప్రమాణం చేసినప్పుడు ఆయన మాతో "మీ శక్తిమేరకే" అని చెప్పేవారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఆదేశాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ముస్లిం పాలకులు జారీచేసే ఆజ్ఞలు ఇస్లామీయ షరీఅత్‌కు అనుగుణంగా ఉండటంతోపాటు ప్రజల శక్తిసామర్థ్యాలకు మించనివిగా ఉండటం కూడా చాలా అవసరం. అలా కాని పరిస్థితుల్లో ప్రజలు వాటిని శిరసావహించకపోయినా తప్పులేదు. పాలకులు ప్రజలు మోయలేని భారాన్ని వారిపై మోపి వారి సహనాన్ని పరీక్షించే చర్యలకు పాల్పడకూడదు.

٦٦٥ - وعنه قال: سمعت رَسُولَ اللهِ ﷺ يقول: «مَنْ خَلَعَ يَداً مِنْ طَاعَةٍ لَقِيَ اللهَ يَوْمَ القِيَامَةِ وَلا حُجَّةَ لَهُ، وَمَنْ مَاتَ وَلَيْسَ فِي عُنُقِهِ بَيْعَةٌ مَاتَ مِيتَةً جَاهِلِيَّةً» رواهُ مسلم. وفي روايةٍ له: «وَمَنْ مَاتَ وَهُوَ مُفَارِقٌ لِلْجَمَاعَةِ، فَإِنَّهُ يَمُوتُ مِيتَةً جَاهِلِيَّةً». «المِيتَةُ» بكسر الميم.

665. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) తెలియజేశారు: (ధర్మసమ్మతమైన విషయాల్లో తమ నాయకుని) విధేయత నుండి మడమ త్రిప్పుకునే వ్యక్తి ప్రళయదినాన దేవుణ్ణి కలుసుకున్నప్పుడు అతని దగ్గర ఎలాంటి ఆధారమూ ఉండదు. తన మెడలో ఎవరి ప్రమాణమూ లేని స్థితిలో మరణించేవ్యక్తి అజ్ఞానకాలపు చావు చస్తాడు. (ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : (ముస్లింల) సామూహిక వ్యవస్థ నుండి వైదొలగి మరణించేవ్యక్తి అజ్ఞాన కాలపు చావు చస్తాడు. (సహీహ్ ముస్లిం లోని నాయకత్వ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ముస్లింలు తమ పాలకులకు తప్పనిసరిగా విధేయత చూపాలని, వారి విధేయతను ధిక్కరిస్తే మొత్తం ధర్మాన్నే ధిక్కరించినట్లవుతుందని ఈ హదీసుద్వారా కూడా బోధపడుతోంది. పాలకులకు అవిధేయులుగా ఉండి మరణించటాన్ని అజ్ఞానకాలపు చావు అని ఎందుకు అనబడిందంటే - ఇస్లాంకు పూర్వం అజ్ఞానకాలంలో ఒకే నాయకుణ్ణి అనుసరించాలనే నియమం ఉండేది కాదు. పైగా దాన్ని వారు ఎంతో అవమానకరంగా భావించేవారు. ఇస్లాం ధర్మం ఆ అస్తవ్యస్త వ్యవస్థను నిర్మూలించి నియమబద్ధమైన ఓ వినూత్న సమాజాన్ని స్థాపించింది. ప్రజలు తమ నాయకులకు తప్పకుండా విధేయత చూపాలని నొక్కివక్కాణించింది.

పై హదీసులో పరిపాలకుడు అంటే ముస్లింల సామూహిక వ్యవస్థకు అధికారికంగా ఎన్నికయిన నాయకుడని అర్థం. అంతేగాని ముస్లిం సమాజంలోని చిట్టిపొట్టి సంస్థలు, సంఘాల నాయకులని దాని అర్థం ఎంతమాత్రం కాదు. ఎందుకంటే వారు అధికారికంగా ఎన్నుకోబడినవారు కారు. వారికి అవిధేయత కనబరిస్తే దేశ సమగ్రతకు భంగం వాటిల్లుతుందని గాని, ముస్లింల సామూహిక వ్యవస్థకు విఘాతం కలుగుతుందని గాని భయం ఉండదు. అంచేత వారిపట్ల అవిధేయతను కనబరచటాన్ని దైవతిరస్కారం, ధర్మభ్రష్టతల అంతటి నేరంగా పరిగణించలేము. హదీసులో నాయకుని పట్ల అవిధేయత కనబరచటాన్ని దైవతిరస్కారంతో

సమానంగా చెప్పబడింది. దీనిద్వారా నాయకుడంటే ముస్లింల సామూహిక వ్యవస్థకు అధికారికంగా ఎన్నుకోబడిన నాయకుడని అవగతమవుతుంది. అయితే ఇతర చిన్న చిన్న సంస్థల, సంఘాల నాయకుల్ని ఆయా సంస్థల సభ్యులు, కార్యకర్తలు గౌరవించాలి. షరీఅత్‌కు అనుగుణమైన విషయాల్లో తప్పనిసరిగా వారికి విధేయత చూపాలి. లేకపోతే సమాజంలోని ఏ సంస్థా, ఏ సంఘమూ నిలకడగా ఉండజాలదు. అయితే ఇలాంటి సంఘాల నుండి వైదొలగిపోవటం లేదా వారికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయటం దైవధిక్కారమంతటి ఘోరమైన నేరం మాత్రం కాదు.

٦٦٦ - وَعَنْ أَنَسٍ رضيَ الله عنه قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «اسْمَعُوا وَأَطِيعُوا، وَإِنِ اسْتُعْمِلَ عَلَيْكُمْ عَبْدٌ حَبَشِيٌّ، كَأَنَّ رَأْسَهُ زَبِيبَةٌ» رواه البخاري.

666. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : (నాయకుల మాట) వినండి, వారికి విధేయత చూపండి. నేరేడు పండులాంటి తల గల ఒక నీగ్రోజాతి బానిస మీకు నాయకునిగా నియమించబడినా సరే! *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

నేరేడుపండు లాంటి తలగల వాడంటే చిన్న తలకాయతో వికృతంగా కనిపించే మనిషి అని అర్థం. చిన్న తలకాయ, నల్లని శరీర వర్ణం, దానికితోడు బానిసత్వం - ఇన్ని అవలక్షణాలున్న మనిషిని సాధారణంగా ఎవరూ గౌరవదృష్టితో చూడరు. కాని అలాంటి వ్యక్తి అయినాసరే; తన దైవభక్తి, ధర్మపరాయణత, బుద్ధికుశలతల ప్రాతిపదికపై నాయకునిగా నియమించబడితే ముస్లింలు అతనికి కూడా విధేయత చూపాలని పై హదీసు నొక్కివక్కాణిస్తోంది.

٦٦٧ - وعن أبي هريرةَ رضيَ اللهُ عنه قال: قَالَ رسُولُ اللهِ ﷺ: «عَلَيْكَ السَّمْعُ وَالطَّاعَةُ فِي عُسْرِكَ وَيُسْرِكَ وَمَنْشَطِكَ وَمَكْرَهِكَ وَأَثَرَةٍ عَلَيْكَ» رواهُ مسلم.

667. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు:కలిమిలోనూ, లేమిలోనూ, సంతోష సమయాల్లోనూ విచార వేళల్లోనూ (పాలకులు) నీకన్నా ఇతరులకు ప్రాధాన్యతనిచ్చినప్పుడు కూడా (వారి మాట) వినటం, శిరసా వహించటం నీ విధి. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

జాతీయ ప్రయోజనాల నిమిత్తం పరిపాలకుల ఆజ్ఞల్ని శిరసావహించటం చాలా అవసరం. అందుకే ప్రజలు వ్యక్తిగత ప్రయోజనాలకు బదులు జాతీయ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని సర్వకాల, సర్వావస్థల్లో నాయకులకు విధేయత చూపుతూ ఉండాలి. వారు షరీఅత్ హద్దులకు లోబడి ఉన్నంతవరకూ వారి ఆజ్ఞల్ని శిరసావహిస్తూనే ఉండాలి.

٦٦٨ ـ وعن عبدِ الله بنِ عَمرِو رضيَ اللهُ عنهما قال: كُنَّا مَعَ رسولِ اللهِ ﷺ في سَفَرٍ، فنَزَلْنا مَنْزِلاً، فَمِنَّا مَنْ يُصْلِحُ خِبَاءَهُ، وَمِنَّا مَنْ يَنْتَضِلُ، وَمِنَّا مَنْ هُوَ فِي جَشَرِهِ، إذْ نَادَى مُنَادِي رسولِ اللهِ ﷺ: الصَّلاةَ جَامِعَةً. فَاجْتَمَعْنَا إلى رَسُولِ اللهِ ﷺ فقال: «إنَّهُ لَمْ يَكُنْ نَبِيٌّ قَبْلِي إلَّا كَانَ حَقاً عَلَيْهِ أَنْ يَدُلَّ أُمَّتَهُ عَلَى خَيْرِ مَا يَعْلَمُهُ لَهُمْ، وَيُنْذِرَهُمْ شَرَّ مَا يَعْلَمُهُ لَهُمْ، وَإنَّ أُمَّتَكُمْ هٰذِهِ جُعِلَ عَافِيَتُها فِي أَوَّلِهَا، وَسَيُصِيبُ آخِرَهَا بَلاءٌ وَأُمُورٌ تُنْكِرُونَهَا، وَتَجِيءُ فِتَنٌ يُرَقِّقُ بَعْضُهَا بَعْضاً، وَتَجِيءُ الفِتْنَةُ فَيَقُولُ المُؤْمِنُ: هٰذِهِ مُهْلِكَتِي، ثُمَّ تَنْكَشِفُ، وَتَجِيءُ الفِتْنَةُ فَيَقُولُ المُؤْمِنُ: هٰذِهِ هٰذِهِ. فَمَنْ أَحَبَّ أنْ يُزَحْزَحَ عَنِ النَّارِ، وَيُدْخَلَ الجَنَّةَ، فَلْتَأْتِهِ مَنِيَّتُهُ وَهُوَ يُؤْمِنُ بِاللهِ وَاليَوْمِ الآخِرِ، وَلْيَأْتِ إلَى النَّاسِ

668. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ (రజి) కథనం : ఒకసారి మేము దైవప్రవక్త (సల్లం) వెంట ప్రయాణిస్తూ ఒకచోట మజిలీ చేశాము. అప్పుడు మాలో కొంత మంది తమ గుడారాలు చక్కబెట్టుకో సాగారు. మరికొంతమంది విలువిద్యల ప్రదర్శనలు జరుపుకోసాగారు. ఇంకొంత మంది పశువుల బాగోగులు చూడ టంలో నిమగ్నులై ఉన్నారు. అంతలో దైవప్రవక్త (సల్లం) గారి ప్రకటనకర్త 'నమాజ్ మొదలుకాబోతోంది' అని ప్రకటించాడు.

ఆ ప్రకటన విని మేమంతా దైవప్రవక్త (సల్లం) దగ్గరికి చేరుకున్నాం. అప్పు డాయన మమ్మల్ని ఉద్దేశ్యించి ఇలా బోధించారు : "నాకు పూర్వం వచ్చిన ప్రతి ప్రవక్తపై తన అనుచర సమాజాన్ని తాను వారికోసం శ్రేయోదాయకమైన ఆచరణలుగా భావించేవాటి వైపునకు నడిపించటం, తాను వారి పాలిట హాని కరమయిన ఆచరణలుగా భావించేవాటి నుండి హెచ్చరించటం విధిగా ఉండేది. ఇకపోతే మీ ఈ సమాజ శ్రేయం దాని తొల్దొలి (కాలం)లో ఉంది. దాని ఆఖరిలో పరీక్షలుంటాయి. మీరు అసహ్యించుకునే పనులు జరుగు

الَّذِي يُحِبُّ أَنْ يُؤْتَى إِلَيْهِ. وَمَنْ بَايَعَ إِمَاماً فَأَعْطَاهُ صَفْقَةَ يَدِهِ، وَثَمَرَةَ قَلْبِهِ، فَلْيُطِعْهُ إِنِ اسْتَطَاعَ؛ فَإِنْ جَاءَ آخَرُ يُنَازِعُهُ، فَاضْرِبُوا عُنُقَ الآخَرِ» رواهُ مسلم. قَوْلُهُ: «يَنْتَضِلُ» أَيْ: يُسَابِقُ بِالرَّمْيِ بِالنَّبْلِ وَالنُّشَّابِ. وَ«الجَشَرُ» بفتح الجيمِ والشين المعجمةِ وبالراء: وهيَ الدَّوابُّ الَّتِي تَرْعى وَتَبِيتُ مَكَانَهَا. وقوله: «يُرَقِّقُ بَعْضُهَا بَعْضاً» أي: يُصَيِّرُ بَعْضَهَا رَقِيقاً، أي: خَفِيفاً لِعِظَمِ مَا بَعْدَهُ، فالثَّانِي يُرَقِّقُ الأَوَّلَ. وقيلَ: مَعْنَاهُ: يَسُوقُ بَعْضُهَا إِلى بَعْضٍ بِتَحْسِينِهَا وَتَسْوِيلِهَا، وقِيلَ: يُشْبِهُ بَعْضُها بَعْضاً.

తాయి. ఎన్నో ఉపద్రవాలు తలెత్తు తాయి. ఒక ఉపద్రవం మరో ఉప ద్రవాన్ని చిన్నదిగా చేసేస్తుంది. (తలెత్తే ప్రతి ఉపద్రవం తనకంటే ముందు వచ్చిన ఉపద్రవం కన్నా భయంకరంగా ఉంటుంది). ఒక ఉపద్రవం ఎదుర వటం చూసి విశ్వాసి, తనను నాశనం చేసే ఉపద్రవం అదేననుకుంటాడు. కాని అంతలో అది దూరమయిపోయి మరో ఉపద్రవం తలెత్తుతుంది. దాన్ని చూసి విశ్వాసి అన్నిటికన్నా పెద్ద ఉపద్రవం అదేననుకుంటాడు.

“ఎవరయితే నరకాగ్ని నుండి రక్షించబడి స్వర్గానికి పంపబడాలనుకుంటున్నాడో అతనికి తాను దేవుణ్ణి, అంతిమదినాన్ని విశ్వసిస్తూ ఉన్న తరుణంలో మరణం సంభవించాలి. ఇంకా అతను తన పట్ల, ఉత్తమ వ్యవహారం జరగాలని కోరుకుం టున్నట్లుగానే ప్రజలపట్ల కూడా ఉత్త మంగా వ్యవహరిస్తూ ఉండాలి. ఎవ రయినా ఏ నాయకునితోనయినా ప్రమాణం చేసి అతనికి తన హస్తం, హృదయాల ఫలాన్ని అందజేస్తే (అంటే మనసులో ఆ ప్రమాణాన్ని నెరవేర్చాలని గట్టిగా నిశ్చయించుకుంటే) అతను తన నాయకునికి వీలైనంతగా విధేయత చూపాలి. ఆ తర్వాత వేరే వ్యక్తి ఎవ రయినా అతన్ని లోబరుచుకోవాలనే ఉద్దేశ్యంతో అతనితో కొట్లాడితే ఆ వ్యక్తి తలను నరికివేయండి.” *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

తొల్దొలి కాలమంటే దైవప్రవక్త సహచరులు, వారి అనుచరులైన తాబయీన్లు, వారి అనుచరులైన తబేతాబయీన్ల జీవిత కాలమన్నమాట. అదే వేరొక హదీసులో 'ఖైరుల్ ఖురూన్' (అత్యుత్తమకాలం)గా చెప్పబడింది. ఆ కాలం, దాని తర్వాత వచ్చిన కాలాలన్నిటికన్నా శ్రేష్ఠమయినదిగా, శుభకరమైనదిగా వర్ణిల్లింది. ఆ తర్వాత కాలగమనంలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఎన్నో ఉపద్రవాలు తలెత్తాయి. ఆ విధంగా ముస్లిం సమాజం సయితం చెడులకు, నీతి బాహ్యతలకు ఆలవాలమయిపోయింది.

ఉపద్రవాలు తలెత్తుతాయని ముందే చెప్పటంలోని ఉద్దేశ్యం సమాజాన్ని జాగరూక పరచటం, చెడుల నుండి హెచ్చరించటం, ప్రజల్ని ఉపద్రవాల పట్ల అప్రమత్తం చేయటం. అందుకే ఆ ఉపద్రవాల నుండి మనుషులు తమల్ని తాము కాపాడుకునే మార్గాన్ని కూడా సూచించటం జరిగింది. దేవునిపై, అంతిమ దినంపై మొక్కవోని విశ్వాసంతో ప్రజల పట్ల ఉత్తమంగా వ్యవహరిస్తూ,మంచి నడవడికను కలిగివుంటే ఆ ఉపద్రవాల వల్ల మనిషికి ఎలాంటి హాని జరగదని చెప్పబడింది.

ప్రళయ సమీపకాలంలో నాయకుల్లో పదవీ వ్యామోహం పెచ్చరిల్లుతుందని కూడా ఈ హదీసు సూచిస్తోంది. అలాంటి పరిస్థితుల్లో ప్రజలందరూ మొట్టమొదటి నాయకునికే విధేయత చూపాలి. అతనితో కలిసి తిరుగుబాటుదారుల పీచమణచివేయాలి. వ్యతిరేకవాదుల కుంపట్లను కూల్చివేయాలి. అప్పుడే ఇస్లామీయ రాజ్యవ్యవస్థ పటిష్టంగా ఉండగల్గుతుంది.

669. హజ్రత్ అబూ హునైదా వాయిల్ బిన్ హుజ్ర్ (రజి) కథనం : ఒకసారి సలమా బిన్ యజీద్ జూఫీ (రజి) దైవ ప్రవక్త (సల్లం)ను అడిగారు: "దైవప్రవక్తా! ఒకవేళ కొంతమంది (చెడ్డ) పరిపాలకులు మాపై నియమింపబడి కేవలం తమ హక్కుల గురించి మమ్మల్ని డిమాండ్ చేస్తూ, మా హక్కుల్ని కాలరాస్తుంటే అప్పుడు మేము ఏం చేయాలో చెబుతారా?" అని. దానికి దైవప్రవక్త (సల్లం) మొదటిసారి తలత్రిప్పుకున్నారు. (ఏ సమాధానం చెప్పలేదు). సలమా

٦٦٩ ـ وعن أبي هُنَيْدَةَ وائِلِ بن حُجْرٍ رضيَ اللهُ عنه قالَ: سَأَلَ سَلَمَةُ بنُ يَزِيدَ الجُعْفِيُّ رَسُولَ اللهِ ﷺ، فقالَ: يَا نَبِيَّ اللهِ! أَرَأَيْتَ إِنْ قَامَتْ عَلَيْنَا أُمَرَاءُ يَسْأَلُونَا حَقَّهُمْ، ويمْنَعُونَا حَقَّنَا، فَمَا تَأْمُرُنَا؟ فَأَعْرَضَ عنه، ثُمَّ سَأَلَهُ، فَقَالَ رَسُولُ

الله ﷺ: «اسمَعُوا وَأَطِيعُوا؛ فَإِنَّما عَلَيْهِمْ مَا حُمِّلُوا، وَعَلَيْكُمْ مَا حُمِّلْتُمْ» رواهُ مسلم.

మళ్ళీ అదేమాట అడిగారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) సమాధానమిస్తూ, "(నాయకుల మాట) వినండి, వారికి విధేయత చూపండి. వారి బాధ్యతల భారాన్ని వారు మోస్తారు. మీ బాధ్యతల భారాన్ని మీరు మోయాలి" అన్నారు.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పాలకులు, పాలితులు - ఇరువురునూ తమ తమ కార్యక్షేత్రాల్లో బాధ్యతాయుతులేనని ఈ హదీసు చెబుతోంది. ఆ బాధ్యతా నిర్వహణలో ఏమాత్రం నిర్లక్ష్యం వహించినా ఆ పాపభారాన్ని తామే మోయవలసి ఉంటుంది. దానికి వారు ప్రళయదినాన శిక్షను అనుభవిస్తారు. అయితే పరిపాలకులు తమ విధులు సరిగ్గా నిర్వర్తించటం లేదని ప్రజలు కూడా అవిధేయతకు పాల్పడటానికి ఇస్లాం ధర్మం ఎంతమాత్రం అనుమతించదు. ఎందుకంటే ఒక తప్పును మరో తప్పుతో ప్రక్షాళించటం సాధ్యం కాదు. పైగా దానివల్ల రాజ్యంలో మరింత కల్లోలం చెలరేగుతుంది. అంతేకాదు, దేశప్రయోజనాల దృష్ట్యా పరిపాలకుల పట్ల అవిధేయతకు పాల్పడటంకన్నా వారి ఆగడాలను, అన్యాయాన్ని సహించటమే అన్ని విధాలా మంచిది. అయితే షరీఅత్ అనుమతి మేరకు, సంఘసంస్కరణకోసం కృషిచేయటం, పరిపాలకుల అన్యాయాన్ని ఎండగట్టటం, నాయకుల దౌర్జన్యాన్ని నిరసించటం, అదేవిధంగా మంచిని గురించి ఆజ్ఞాపించే, చెడుని నిర్మూలించే విధిని నిర్వర్తించటంలాంటి చర్యలు తిరుగుబాటు ధోరణుల క్రిందికి రావు. పైగా ప్రజలందరూ తమ శక్తిమేరకు వ్యక్తిగతంగా, సామూహికంగా ఇలాంటి చర్యలు చేపట్టటం చాలా అవసరం.

٦٧٠ - وَعَنْ عَبْدِ اللهِ بنِ مَسْعُودٍ رضيَ اللهُ عنه قال: قال رسُولُ الله ﷺ: «إنَّهَا سَتَكُونُ بَعْدِي أَثَرَةٌ، وَأُمُورٌ تُنْكِرُونَهَا!» قالوا: يا رَسُولَ الله! كَيْفَ

670. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఒకసారి తన అనుచరుల్ని ఉద్దేశ్యించి మాట్లాడుతూ, "నా తదనంతరం స్వార్థం రాజ్యమేలుతుంది. ఇంకా మీరు అసహ్యించుకునే ఎన్నో చెడు పనులు జరుగుతాయి" అన్నారు.

تَأْمُرُ مَنْ أَدْرَكَ مِنَّا ذلِكَ؟ قال: «تُؤَدُّونَ الحَقَّ الَّذي عَلَيْكُمْ، وَتَسْأَلُونَ اللهَ الَّذي لَكُمْ» متفقٌ عليهِ.

అది విని సహచరలు, "దైవప్రవక్తా! మాలో ఎవరైనా ఆ కాలంలో గనక బ్రతికి ఉంటే అప్పుడు మమ్మల్ని ఏం చేయమంటారు?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం), "మీరు మీ బాధ్యతల్ని నిర్వర్తించాలి. మీకు రావలసిన హక్కుల్ని గురించి మాత్రం దేవుణ్ణి ప్రార్థించాలి" అని బదులిచ్చారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

٦٧١ - وعن أبي هريرة رضي اللهُ عنه قال: قال رسولُ اللهِ ﷺ: «مَنْ أَطَاعَنِي فَقَدْ أَطَاعَ اللهَ، وَمَنْ عَصَانِي فَقَدْ عَصَى اللهَ، وَمَنْ يُطِعِ الأَمِيرَ فَقَدْ أَطَاعَنِي، وَمَنْ يَعْصِ الأَمِيرَ فَقَدْ عَصَانِي» متفقٌ عليهِ.

671. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : నాకు విధేయత చూపితే దేవునికి విధేయత చూపినట్లవుతుంది. నా పట్ల అవిధేయత కనబరిస్తే దేవుని పట్ల అవిధేయత కనబరచినట్లవుతుంది. తమ నాయకునికి విధేయత చూపితే నాకు విధేయత చూపినట్లవుతుంది. తమ నాయకునిపట్ల అవిధేయత కనబరిస్తే నా పట్ల అవిధేయత కనబరచినట్లవుతుంది. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఆదేశాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ 'నాయకుడు' అంటే అధికారంలో ఉన్న ముస్లిం పరిపాలకుడు, ఏదైనా ప్రాంతపు గవర్నరు, ముఖ్యమంత్రి, ప్రధానాధికారి మొదలగువారని అర్థం. వీరు అల్లాహ్ పట్ల అవిధేయతకు పాల్పడనంతవరకు ముస్లింలు వీరికి తప్పకుండా విధేయత చూపాలి. వీరికి విధేయత చూపకపోవటం చాలా పెద్ద పాపం. రాజ్యంలో శాంతిభద్రతలతోపాటు క్రమబద్ధత కూడా చాలా అవసరం. ప్రజలు తమ పరిపాలకులకు విధేయత పాటించినప్పుడే అది సాధ్యమవుతుంది.

672. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ఎవరికయినా తమ నాయకునిలో ఏదయినా విషయం నచ్చకపోతే అతను సహనం వహించాలి. ఎవరయినా తమ పరిపాలకుని విధేయతా పరిధినుండి జానెడు దూరం మించి పోయినా సరే అతను అజ్ఞానపు చావును కొనితెచ్చుకుంటాడు.

*(బుఖారీ - ముస్లిం)*

٦٧٢ ـ وعن ابنِ عباسٍ رضي الله عنهما أنَّ رسولَ اللهِ ﷺ قال: «مَنْ كَرِهَ مِنْ أَمِيرِهِ شَيْئاً فَلْيَصْبِرْ، فَإِنَّهُ مَنْ خَرَجَ مِنَ السُّلْطَانِ شِبْراً مَاتَ مِيتَةً جَاهِلِيَّةً» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని ఉపద్రవాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

673. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూబక్ర్ (రజి) తెలియజేశారు పరిపాలకుణ్ణి పరాభవించినవాణ్ణి దేవుడు అవమానానికి గురిచేస్తాడు.

తిర్మిజీ దీనిని ఉల్లేఖించి హసన్‌గా పేర్కొన్నారు.

ఈ అధ్యాయానికి సంబంధించిన ప్రామాణికమైన హదీసులు ఇంకా ఎన్నో ఉన్నాయి. వాటిలో కొన్ని వివిధ అధ్యాయాల క్రింద ఇంతకుముందే ప్రస్తావనకు వచ్చాయి.

٦٧٣ ـ وعن أبي بكرةَ رضي الله عنه قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقول: «مَنْ أَهَانَ السُّلْطَانَ أَهَانَهُ اللهُ» رواه الترمذي وقال: حديث حسن. وفي الباب أحاديث كثيرة في الصحيحِ، وقد سبق بعضها في أبواب.

*(సుననె తిర్మిజీలోని ఉపద్రవాల అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

నాయకుణ్ణి పరాభవించటమంటే అతని ఆజ్ఞల్ని నిర్లక్ష్యం చేయటం, అతనికి విధేయత చూపకపోవటం అని అర్థం. దానిమూలంగా నాయకుని పరువుప్రతిష్ఠలు దెబ్బతింటాయి. రాజ్యంలో శాంతిసౌమనస్యాలు వర్ధిల్లాలంటే, నేరప్రవృత్తి ప్రబలకుండా ఉండాలంటే నాయకుల

పట్ల ప్రజల్లో భయభక్తులు ఉండటం చాలా అవసరం. మొత్తానికి నాయకులు బహిరంగంగా దైవధిక్కారానికి పాల్పడకుండా ఉండేంతవరకూ, నమాజ్ లాంటి ఇస్లామీయ విధుల్ని నెరవేరుస్తూ ఉన్నంతవరకూ న్యాయవంతమైన పరిపాలనను అందించటంలో వారివల్ల లోపాలు జరిగినా దేశప్రయోజనాల దృష్ట్యా, విజ్ఞతా వివేచనాల దృష్ట్యా ముస్లిం ప్రజానీకం తమ నాయకులకు విధేయత చూపటాన్ని మానుకోకూడదని ఇస్లాం ధర్మం నొక్కివక్కాణిస్తోంది.

ఇస్లాం ధర్మంలోని ఈ ఆదేశం నేటి ప్రజాస్వామ్య వ్యవస్థకు పూర్తిగా భిన్నమైనది. ప్రజాస్వామ్య వ్యవస్థలో అధికార పక్షంతోపాటు ప్రతిపక్షం కూడా తప్పనిసరిగా ఉంటుంది. అది ఎల్లప్పుడూ అధికారపక్షంపై విమర్శనాస్త్రాలు సంధిస్తూ ఉంటుంది. సామాన్య ప్రజానీకాన్ని పాలకవర్గానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయమని పురికొల్పి అధికారాన్ని తమ హస్తగతం చేసుకోవాలని ప్రయత్నిస్తూ ఉంటుంది. ఇస్లామీయ రాజ్యవ్యవస్థలో పాలకవర్గం, ప్రతిపక్ష వర్గమన్న ప్రసక్తే ఉండదు. అందరూ ఒకే సమాజంలోని సభ్యులు. ఒకే నావలో పయనిస్తున్న ప్రయాణీకుల్లాంటివారు. ఇందులో వ్యక్తిగత ప్రయోజనాలు, లక్ష్యాలకు బదులు ప్రజలందరి ఉమ్మడి ప్రయోజనాలు, లక్ష్యాలకు ప్రాధాన్యత ఉంటుంది. అంచేత పాలకుల వల్ల స్వల్పమైన తప్పులు జరిగినప్పుడు వారికి విధేయత చూపకపోవటం, వారికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయటం నేరంగా పరిగణించబడుతుంది.

ప్రజాస్వామ్య వ్యవస్థలో ఎన్నికల నిర్వహణ ఎంతో ఖర్చుతో కూడుకున్న పని. ఈ తరహా వ్యవస్థలో తరచూ ఎన్నికలు జరుగుతుండటం వల్ల ప్రభుత్వ ఖజానాకు ఎన్నో కోట్ల, బిలియన్ రూపాయాల నష్టం వస్తుంది. అంతేకాదు, ఎన్నికల కాలంలో వివిధ పార్టీల కార్యకర్తలు ప్రచారాల పేరిట వీధుల్లో తిరిగి ప్రజలమధ్య విద్వేషాన్ని రగుల్గొల్పుతారు. ఈ చేష్టలు ఇస్లామీయ శాంతిదాయక బోధనలతో ఏమాత్రం పొసగవు. ఇస్లాంలో నాయకులు ఓ నిర్ణీత కాలంలోనే పరిపాలించాలన్న నియమం లేదు. చీటికి మాటికి నాయకుల్ని గద్దె దింపి క్రొత్తవారికి పట్టం కట్టటాన్ని కూడా ఇస్లాం ధర్మం గర్హిస్తుంది. ప్రజలు తమ నాయకుల తప్పుల్ని ఉపేక్షించాలని చెప్పటంలోని ఉద్దేశ్యం అదే. నాయకులకు వీలైనంత ఎక్కువ పరిపాలనా వ్యవధి లభించాలి. దానివల్ల దేశసమగ్రత దెబ్బతినకుండా ఉంటుంది. ప్రజల శ్రేయం కూడా అందులోనే ఇమిడి ఉంది.



## 81వ అధ్యాయం

# ٨١ - بَابُ النَّهْيِ عَنْ سُؤَالِ الْإِمَارَةِ وَاخْتِيَارِ تَرْكِ الْوِلَايَاتِ إِذَا لَمْ يَتَعَيَّنْ عَلَيْهِ أَوْ تَدْعُ حَاجَةٌ إِلَيْهِ

# పదవుల్ని కాంక్షించకూడదు, తన అవసరం లేదనుకున్నప్పుడు ప్రభుత్వ పదవుల్ని వదిలేయుటమే మంచిది

قال الله تعالى: ﴿ تِلْكَ ٱلدَّارُ ٱلْآخِرَةُ نَجْعَلُهَا لِلَّذِينَ لَا يُرِيدُونَ عُلُوًّا فِى ٱلْأَرْضِ وَلَا فَسَادًا وَٱلْعَـٰقِبَةُ لِلْمُتَّقِينَ ﴾ [القصص: ٨٣].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"పరలోకంలోని గృహాన్ని మేము భూమిపై తమ పెద్దరికాన్ని కోరుకోనివారికీ, కల్లోలాన్ని సృష్టించగోరని వారికీ ప్రత్యేకించి ఉంచుతాము. మేలైన పరిణామం మాత్రం భయభక్తులు కలవారికే." *(అల్ ఖసస్ : 83)*

**వివరణ :**

పదవీవ్యామోహం గల వ్యక్తి ప్రపంచంలో పెద్దరికాన్ని కోరుకుంటాడు. ఇలాంటి పెద్ద మనుషుల మూలంగానే ప్రపంచంలో కల్లోలం చెలరేగుతుంది. పదవుల్ని కాంక్షించటం, వాటిని పొందటం కోసం కృషిచేయుటం పరిణామం రీత్యా సాధారణంగా చెడుపనులుగానే పరిగణించబడతాయి. మనిషి ఎల్లప్పుడూ పదవులకు, ప్రాపంచిక పటాటోపాలకు దూరంగా ఉండటమే అన్ని విధాలా శ్రేయస్కరం.

٦٧٤ - وعن أبي سعيد عبدِ الرحمنِ بنِ سَمُرَةَ رضي الله عنه قال: قال لي رسولُ اللهِ ﷺ: «يَا عَبدَ الرَّحْمنِ بْنَ سَمُرَةَ، لا تَسأَلِ الإمَارَةَ فَإِنَّكَ إِنْ أُعْطِيتَهَا عَنْ

674. హజ్రత్ అబూ సయీద్ అబ్దుర్రహ్మాన్ బిన్ సమురా (రజి) కథనం: ఒకసారి దైవప్రవక్త (సల్లం) నాకు ఈ విధంగా హితోపదేశం చేశారు : "అబ్దుర్రహ్మాన్ బిన్ సమురా! నువ్వు ఎన్నటికీ పదవిని కోరుకోకు. ఎందుకంటే నువ్వు కోరుకోకుండానే నీకు పాలనాధికారాలు లభిస్తే ఆ బాధ్యతా నిర్వహణలో నీకు

غَيْرِ مَسْأَلَةٍ أُعِنْتَ عَلَيْهَا، وَإِنْ أُعْطِيتَهَا عَنْ مَسْأَلَةٍ وُكِلْتَ إِلَيْهَا، وَإِذَا حَلَفْتَ عَلَى يَمِينٍ، فَرَأَيْتَ غَيْرَهَا خَيْراً مِنهَا فَأْتِ الَّذِي هُوَ خَيْرٌ، وَكَفِّرْ عَنْ يَمِينِكَ» متفقٌ عليه.

దైవసహాయం అందుతుంది. కాని ఒకవేళ నీ కోరిక మేరకు పాలనాధికారాలు లభిస్తే ఆ బాధ్యత అంతా నీదే అవుతుంది. (అందులో నీకు దైవ సహాయం లభించదు). అదేవిధంగా నువ్వు ఏదయినా పనిచేస్తానని మొక్కుకున్నప్పుడు ఆ తర్వాత దానికి వ్యతిరేకంగా మరో పని చేయటం ఉత్తమమని భావిస్తే మొక్కుబడిని భంగం చేసుకొని ఆ ఉత్తమమైన పనే చెయ్యి. అయితే మొక్కుబడిని భంగం చేసినందుకు పరిహారం ఇచ్చుకోవాలి సుమా!"

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని ప్రమాణాలు మొక్కుబడుల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

'ఇమారత్' అంటే ప్రభుత్వం (అధికారం) లేదా దానికే సంబంధించిన ఏదైనా పదవి అని అర్థం. దానికోసం వెంపర్లాడటం, దాన్ని పొందటానికి కృషిచేయటాన్ని ఇస్లామీయ షరీఅత్ గర్హిస్తుంది. ఎందుకంటే ఇది చాలా పెద్ద బాధ్యత. దాన్ని నిర్వహించటమంటే మాటలుకాదు. అయితే ఎవరికయినా ఈ హోదా కోరుకోకుండానే లభిస్తే దాన్ని స్వీకరించటం తప్పు కూడా కాదు. ఎందుకంటే కార్యదక్షులు, యోగ్యులకే పదవులు కోరుకోకుండా లభిస్తాయి. అంతేకాదు, అలాంటివారికి బాధ్యతా నిర్వహణలో దైవసహాయం కూడా తోడుంటుంది. దీనికి భిన్నంగా వ్యామోహంతో పదవుల్ని చేజిక్కించుకునేవారు సాధారణంగా చవటలు, చేతకాని దద్దమ్మలై ఉంటారు. అలాంటి వారికి దైవసహాయం కూడా లభించదు. ప్రజాస్వామ్య వ్యవస్థలో నాయకులు ధర్మాధర్మాలను లెక్కచేయకుండా రకరకాల కుత్సితాలు, కుతంత్రాలకు పాల్పడి అధికారాన్ని చేజిక్కించుకుంటున్నారు. ఫలితంగా ఎవరూ సమర్థవంతమైన పరిపాలనను అందజేయలేకపోతున్నారు. దానికి ఇంకో కారణం, వారిలో ఎవరికీ పరిపాలనా నిర్వహణలో దైవసహాయం లభించక పోవటమే.

ఈ హదీసులో చెప్పబడిన ఇంకో విషయం ఏమిటంటే ఎవరయినా ఏదయినా పని చేస్తానని ప్రమాణం చేసి, ఆ తర్వాత దానికి వ్యతిరేకంగా మరో పని చేస్తే ఎక్కువ లాభం కలుగుతుందనుకుంటే అలాంటి పరిస్థితిలో ప్రమాణాన్ని భంగంచేసి ఉత్తమమైన పనే చేయాలి. అయితే ప్రమాణ భంగానికి పరిహారాన్ని మాత్రం చెల్లించాలి. పరిహారంగా ఒక బానిసకు విముక్తిని

ప్రసాదించాలి. లేదా పదిమంది నిరుపేదలకు మధ్యరకమైన భోజనం పెట్టాలి లేదా బట్టలు తొడిగించాలి. ఇవేవీ చేయలేమనుకుంటే మూడు రోజులు ఉపవాసవ్రతం పాటించాలి.

675. హజ్రత్ అబూ జర్ర్ (రజి) కథనం: ఓ రోజు దైవప్రవక్త (సల్లం) నాకు ఈ విధంగా ఉపదేశించారు : అబూ జర్ర్! నువ్వు నాకు బలహీనుడిలా కనిపిస్తు న్నావు. కనుక నేను నా స్వయంకోసం యిష్టపడేదే నీ కోసం కూడా ఇష్టపడు తున్నాను. నువ్వు ఇద్దరు వ్యక్తులకు కూడా నాయకత్వం వహించకు. ఏ అనాథుని సొమ్ముకూ బాధ్యత వహిం చకు. *(ముస్లిం)*

٦٧٥ ـ وعن أبي ذرٍّ رضي الله عنه قال: قال لي رسولُ اللهِ ﷺ: «يَا أَبَا ذَرٍّ! إِنِّي أَرَاكَ ضَعِيفاً، وَإِنِّي أُحِبُّ لَكَ مَا أُحِبُّ لِنَفْسِي، لَا تَأَمَّرَنَّ عَلى اثْنَيْنِ وَلَا تَوَلَّيَنَّ مَالَ يَتِيمٍ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హజ్రత్ అబూజర్ర్ (రజి) సాత్వికులు, నిరాడంబర జీవి. ప్రాపంచిక వ్యవహారాల్లో ఆయన ఎక్కువగా ఆసక్తి కనబరచేవారు కారు. అందుకే దైవప్రవక్త (సల్లం) ఆయనకు ఆ విధంగా హితోపదేశం చేశారు. పదవులు, బాధ్యతల విషయంలో ఆయన్ని బలహీనుడిగా ఖరారు చేశారు. ప్రాపంచిక విషయాల్లో ఆసక్తి కనబరిచేవారు మాత్రమే పదవులు, పరిపాలనా బాధ్యతల్ని నిర్వహించగలరు. ప్రపంచాన్ని అసహ్యించుకునేవారు, బాధ్యతల నుండి పారిపోయేవారు పరిపాలనా వ్యవహారాల్ని నిర్వహించలేరు.

676. హజ్రత్ అబూజర్ర్ (రజి) గారే చేసిన కథనం : ఒకసారి నేను దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ, "దైవప్రవక్తా! మీరు నన్ను ఎక్కడైనా ప్రభుత్వాధికారిగా నియమించరెందుకు?" అని అడిగాను. అప్పుడు ఆయన (చిరుకోపంగా) తన చేత్తో నా భుజాన్ని తట్టి, "అబూజర్ర్! నువ్వు బలహీనుడివి. ఉద్యోగమనేది ఒక అమానతు (అప్పగింత). న్యాయంగా దాన్ని పొంది, దాని విధుల్ని

٦٧٦ ـ وعنه قال: قلتُ: يا رسولَ اللهِ! أَلا تَسْتَعمِلُنِي؟ فَضَرَبَ بِيَدِهِ عَلى مَنْكِبِي ثُمَّ قالَ: «يَا أَبَا ذَرٍّ! إِنَّكَ ضَعِيفٌ، وَإِنَّهَا أَمَانَةٌ، وَإِنَّهَا يَوْمَ القِيَامَةِ خِزْيٌ وَنَدَامَةٌ، إِلَّا مَنْ أَخَذَهَا بِحَقِّهَا، وأَدَّى الذِي عَلَيهِ فِيهَا» رواه مسلم.

నిర్వర్తించేవారిని తప్ప (అసమర్థుల్ని) అది ప్రళయదినాన పరాభవానికి, పశ్చా త్తాపానికి గురిచేస్తుంది" అని చెప్పారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రభుత్వ, పాలనా వ్యవహారాలకు సంబంధించిన పదవుల్ని పొందటం ధర్మసమ్మతమేనని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. అయితే ఆయా పదవుల్ని పొందేవారిలో ముఖ్యంగా రెండు లక్షణాలుండాలి. ఒకటి : సమర్థత. రెండోది: కార్యదక్షత. ఈ రెండు లక్షణాలూ లేనివారు పదవుల్ని నిర్వహించటానికి అనర్హులు. ఉదాహరణకు ప్రజానాయకునిగా నియమించబడే వ్యక్తి ప్రజలకు న్యాయవంతమైన పరిపాలనను అందించే కార్యదక్షతతోపాటు తన విధుల్ని నిర్వర్తించగల సామర్థ్యాన్ని కూడా కలిగి ఉండాలి. అలాగే ఏ పదవిని, ఏ ఉద్యోగాన్ని పొందాలన్నా తనలో ఆ రెండు లక్షణాలు ఉన్నాయో లేవో ముందుగానే చూసుకోవాలి.

677. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఒకానొక సందర్భంగా ఇలా అన్నారు : మీరు తప్పకుండా పదవుల కోసం వెంపర్లాడతారు. (కాని గుర్తుంచుకోండి!) ఈ విషయమే ప్రళయదినాన మిమ్మల్ని పశ్చాత్తాపానికి గురిచేస్తుంది. (బుఖారీ)

٦٧٧ ـ وعن أبي هُريرةَ رضِيَ اللهُ عنه أنَّ رسولَ اللهِ ﷺ قال: «إنَّكُمْ سَتَحرِصونَ عَلى الإمَارَةِ، وَستَكُونُ نَدَامَةً يَوْمَ القِيَامَةِ» رواه البخاري.

*(సహీహ్ బుఖారీలోని ఆదేశాల ప్రకరణం)*

## 82వ అధ్యాయం

# ٨٢ ـ بَابُ حَثِّ السُّلْطَانِ وَالْقَاضِي وَغَيْرِهِمَا مِنْ وُلَاةِ الْأُمُورِ عَلَى اتِّخَاذِ وَزِيرٍ صَالِحٍ وَتَحْذِيرِهِمْ مِنْ قُرَنَاءِ السُّوءِ وَالْقَبُولِ مِنْهُمْ

# రాజులు, న్యాయమూర్తులు ఇంకా ఇతర ఉన్నతాధికారులు తమ కొలువులో సదాచార సంపన్నులైనవారినే ఉద్యోగులుగా నియమించుకోవాలి, వారిని చెడు సావాసాలకు దూరంగా ఉండాలని, వారి కానుకల్ని స్వీకరించకూడదని హెచ్చరిస్తూ ఉండాలి

قَالَ الله تعالى: ﴿ الْأَخِلَّاءُ يَوْمَئِذٍ بَعْضُهُمْ لِبَعْضٍ عَدُوٌّ إِلَّا الْمُتَّقِينَ ﴾ [الزخرف: ٦٧].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"ఆ రోజు భయభక్తులు కలవారు తప్ప (ప్రపంచంలోని మిగతా) స్నేహితులందరూ ఒకరి కొకరు శత్రువులై పోతారు."

*(అజ్ జుఖ్‌రుఫ్ : 67)*

**వివరణ :**

ప్రపంచంలో మంచి వ్యక్తుల మధ్య స్నేహం, ధర్మం, న్యాయం పరస్పర శ్రేయోభిలాషల ప్రాతిపదికగా జరుగుతుంది. అంచేత ఈ స్నేహాలు, ఈ భవబంధాలు ప్రళయదినాన కూడా వారిమధ్య నిలిచి ఉంటాయి. ఇమామ్ నవవీ (రహ్మాలై) పైన పేర్కొనబడిన దివ్య ఖుర్‌ఆన్ సూక్తిని నిదర్శనంగా చేసుకొని ప్రభుత్వ ఉన్నతాధికారులు కూడా పాలనావ్యవహారాలు నిర్వహించటానికి సదాచార సంపన్నులైన వారినే తమ సహోద్యోగులుగా నియమించుకోవాలని అంటున్నారు. మంత్రులు, సలహాదార్లు ఇతర అధికారుల నియామకంలో దైవభక్తికి, ధర్మపరాయణతకు ప్రాధాన్యతనివ్వాలి. ఆ విధంగా నియమితులయ్యే అధికారులు బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తూ, ఉన్నతాధికార్లకు మంచి సలహాలు ఇస్తూ దేశాన్ని ప్రగతిపథంలో నడిపించటానికి కృషిచేస్తారు. దీనికి భిన్నంగా అవినీతిపరుల్ని, స్వార్థప్రియుల్ని తమ సహోద్యోగులుగా నియమించుకుంటే అలాంటి వారు పై అధికారులను తమ చేతుల్లో కీలుబొమ్మలుగా చేసుకుంటారు. తాము

స్వయంగా పెడదోవల్లో నడవడంతోపాటు ప్రభుత్వాన్ని కూడా పెడదోవ పట్టిస్తారు. ఆ తర్వాత ప్రళయదినాన వారందరూ దైవసన్నిధిలో ఒండొకరిపై నిందారోపణలు చేసుకోవటం మొదలుపెడతారు.

٦٧٨ - عن أبي سعيدٍ وأبي هريرةَ رضي الله عنهما أن رسولَ الله ﷺ قال: «مَا بَعَثَ اللهُ مِن نَبِيٍّ، وَلا اسْتَخْلَفَ مِنْ خَلِيفَةٍ إلَّا كَانَتْ لَهُ بِطَانَتَانِ بِطَانَةٌ تَأمُرُهُ بِالمَعْرُوفِ وَتَحُضُّهُ عليهِ، وَبِطَانَةٌ تَأمُرُهُ بِالشَّرِّ وَتَحُضُّهُ عليهِ، وَالمَعصُومُ من عَصَمَ اللهُ» رواه البخاري.

678. హజ్రత్ అబూ సయీద్ మరియు అబూ హురైరా (రజి)ల కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు: దేవుడు పంపిన ప్రతి ప్రవక్తకు, ఆయన తర్వాత ఎన్నికయిన ప్రతి ఖలీఫాకు ఇద్దరు అంతరంగికులుండేవారు. వారిలో ఒక అంతరంగికుడు మంచిని గురించి ఆదేశిస్తూ, దాన్ని ఆచరించమని ప్రేరేపించేవాడు. మరో అంతరంగికుడు చెడుని గురించి ఆదేశిస్తూ, దాన్ని ఆచరించమని ప్రేరేపించేవాడు. అయితే అలాంటి పరిస్థితుల్లో ఎవర్నయితే దేవుడు కాపాడుతాడో వారే సురక్షితంగా ఉండగలరు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని విధివ్రాత ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. దైవభీతి కలవారిని, నీతి నిజాయితీలు కలవారినే తమ అంతరంగికులుగా, సలహాదార్లుగా నియమించుకోవాలని ఈ హదీసు అన్యాపదేశంగా పరిపాలకులను ఆదేశిస్తోంది. అలాంటివారు పరిపాలకులకు మంచి సలహాలు ఇచ్చి అల్లకల్లోలం సృష్టించేవారి నుంచి రాజ్యాన్ని కాపాడుతారు. 2. పరిపాలకుడు దైవం మరియు దైవప్రవక్త ఆదేశాలకు కట్టుబడి పరిపాలన చేయాలి. అతని పరువు మర్యాదలు అందులోనే ఉన్నాయి. అంతేకాదు, దైవానికి దైవప్రవక్తకు విధేయత చూపే పరిపాలకుడు దుర్జనుల నుంచి, వారి కీడు నుంచి కూడా సురక్షితంగా ఉండగల్గుతాడు.

٦٧٩ - وعن عائشةَ رضيَ الله عنها قالتْ: قال رسولُ الله ﷺ: «إذا أرَادَ اللهُ

679. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : దేవుడు ఏ ప్రజానాయకునికయినా మంచి చేయాలని తలపెట్టి

بالأمير خيراً، جعل له وزير صدقٍ، إن نسي ذكّره، وإن ذكر أعانه، وإذا أراد به غير ذلك جعل له وزير سوءٍ، إن نسي لم يذكّره، وإن ذكر لم يعنه» رواه أبو داود بإسنادٍ جيدٍ على شرط مسلم.

నప్పుడు అతనికి సత్యబద్ధుడైన మంత్రిని అనుగ్రహిస్తాడు. అతను (పాలనా వ్యవహారాలకు సంబంధించిన విషయమేదయినా) మర్చిపోతే అతని మంత్రి అతనికి గుర్తుచేస్తాడు. తనకు గుర్తున్నప్పుడు కూడా అతను సహాయపడతాడు. ఒకవేళ దేవుడు ఆ నాయకునికి మరేదయినా (హాని) చేయాలని తలపెట్టినప్పుడు అతనికి ఏ దుష్టమంత్రినయినా అంటగడతాడు. తను (పాలనా వ్యవహారాల్లో) ఏదయినా మర్చిపోతే అతను గుర్తుచేయడు. తనకు గుర్తున్నప్పుడయినా అతను తనకు సహాయపడడు. (అబూదావూద్ దీనిని ముస్లిం షరతులకు అనుగుణంగా మంచి ఆధారాలతో నకలు చేశారు).

*(సుననె అబూదావూద్‌లోని నాయకత్వ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఏ నాయకునికయినా దైవభీతిపరులు, సదాచార సంపన్నులయిన మంత్రులు, సలహాదార్లు లభించి, నిత్యం ప్రయోజనకరమైన సలహాలు, సేవలను అందజేస్తూ, చెడుకార్యాల నుండి హెచ్చరిస్తూ ఉంటే దాన్ని దైవప్రసన్నతకు నిదర్శనంగా భావించాలి. అందుకు భిన్నంగా ఏ నాయకునికయినా ప్రభుత్వాన్ని తప్పుదోవపట్టించే స్వార్థపరులు, అవకాశవాదులయిన మంత్రులు, సలహాదార్లు లభిస్తే ఇహపరాల దృష్ట్యా ఆ రాజ్యం పతనావస్థకు చేరుకోబోతుందని గ్రహించాలి.

## 83వ అధ్యాయం

## ٨٣ - بَابُ النَّهْيِ عَنْ تَوْلِيَةِ الْإِمَارَةِ وَالْقَضَاءِ وَغَيْرِهِمَا مِنَ الْوِلَايَاتِ لِمَنْ سَأَلَهَا أَوْ حَرَصَ عَلَيْهَا فَعَرَّضَ بِهَا

## పాలనాధికారాలను, న్యాయమూర్తి పదవిని అడిగేవారికి లేదా కాంక్షించేవారికి అలాగే వాటికోసం పైరవీలు చేసుకునేవారికి ఆ హోదాలు ఇవ్వకూడదు

٦٨٠ - عن أبي موسى الأشعري رضي الله عنه قال: دخلتُ على النبيِّ ﷺ أنا ورجلان من بني عمِّي، فقال أحدُهُما: يا رسولَ اللهِ! أمِّرنا على بعضِ ما ولاك اللهُ عزَّ وجلَّ، وقال الآخرُ مثلَ ذلك، فقال: «إنَّا واللهِ! لا نُوَلِّي هذا العملَ أحداً سأله، أو أحداً حرَص عليه» متفقٌ عليه.

680. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం : ఓ రోజు నేను మా బాబాయి కుమారులిద్దరితో కలిసి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళాను. వారిద్దరిలో ఒకతను దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ, "దైవప్రవక్తా! దేవుడు మిమ్మల్ని రాజ్యాధినేతగా చేసిన ప్రాంతాలలో కొన్నింటికి మమ్మల్ని గవర్నర్లుగా నియమించండి" అని కోరాడు. రెండొవ తను కూడా అదే కోరిక కోరాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) (చిరుకోపంతో), "దైవ సాక్షి! పదవులకోసం అప్పీలు చేసుకునే వారికి, పదవీ వ్యామోహపరులకు మేము ఈ పదవీ బాధ్యతల్ని అప్పగించం" అని ఖరాఖండీగా చెప్పేశారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఆదేశాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

పదవీ కాంక్షాపరులు సాధారణంగా తమ స్వార్థప్రయోజనాల కోసమే ప్రభుత్వ పదవుల్ని చేజిక్కించుకోవటానికి ప్రయత్నిస్తారు. దానివల్ల దేశప్రజల ప్రయోజనాలు దెబ్బతింటాయి. ప్రభుత్వం ఏర్పడేది సామాన్య ప్రజల ప్రయోజనాలను కాపాడటం కోసమేగాని కొద్దిమంది బడావ్యక్తుల పబ్బం గడవటం కోసం కాదు. ప్రజల కోసం ఏర్పడే ప్రభుత్వం ఆ ప్రజల ప్రయోజనాలనే కాపాడలేకపోయినప్పుడు ఇక ఆ ప్రభుత్వం ఉండి లాభమేంటి?

# ١ - كِتَابُ الآدَابِ
# సంస్కార ప్రకరణం

**84వ అధ్యాయం**

## ٨٤ - بَابُ الْحَيَاءِ وَفَضْلِهِ وَالْحَثِّ عَلَى التَّخَلُّقِ بِهِ
## వ్రీడ, దాని మహాత్యం, దాన్ని అలవరచుకోవాలనే ఉపదేశం

681. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: ఒకసారి దైవప్రవక్త (సల్లం) ఒకతని సమీపం నుండి వెళ్ళారు. ఆ సమయంలో అతను తన సోదరునికి "మరీ అంత ఎక్కువగా సిగ్గుపడకూడద"ని ఉపదేశిస్తున్నాడు. అది విని దైవప్రవక్త (సల్లం), "అతన్ని వదిలెయ్యి. నిస్సందేహంగా సిగ్గు కూడా విశ్వాసంలో అంతర్భాగమే" అని అన్నారు.

(బుఖారీ - ముస్లిం)

٦٨١ - عَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عنهما أنَّ رسولَ اللهِ ﷺ مَرَّ عَلَى رَجُلٍ مِنَ الأنْصَارِ وَهُوَ يَعِظُ أَخَاهُ فِي الحَيَاءِ، فَقَالَ رَسُولُ اللهِ ﷺ: «دَعْهُ فَإِنَّ الحَيَاءَ مِنَ الإِيْمَانِ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని విశ్వాస ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

పై హదీసులో చెప్పబడిన వ్యక్తి చాలా ఎక్కువగా సిగ్గుపడేవాడని తెలుస్తోంది. అలాంటివారు ప్రాపంచిక వ్యవహారాల్లో యధేచ్ఛగా పనిచేయలేరు. సిగ్గు మనిషిని పాపకార్యాల నుండి, దగా, మోసం, కాపట్యాల నుండి కాపాడుతుంది. అందుకే అది విశ్వాసంలో అంతర్భాగమని చెప్పటం జరిగింది. ఈ లక్షణం మనిషికి పుట్టుకతో అలవడేదే. కాని మనిషి దాన్ని ధార్మికంగా ప్రయోజనకరమైనదిగా మలచుకోవాలి.

682. హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : "సిగ్గు వల్ల మేలే జరుగుతుంది." *(బుఖారీ - ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : సిగ్గు పూర్తిగా ప్రయోజన దాయకమే. అంటే దాని పరిణామం మేలుతో కూడుకొని ఉంటుంది.

٦٨٢ ـ وعن عِمْرَانَ بن حُصَيْنٍ، رضي الله عنهما قال: قال رسولُ الله ﷺ: «الحَيَاءُ لا يَأْتي إلَّا بِخَيْرٍ» متفقٌ عليه. وفي روايةٍ لمسلمٍ: «الحَيَاءُ خَيْرٌ كُلُّهُ» أَوْ قَالَ: «الحَيَاءُ كُلُّهُ خَيْرٌ».

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సిగ్గు మనిషిని దైవం పట్ల అవిధేయతకు పాల్పడటం నుంచి, దుర్నడత నుంచి, ఇంకా ఎన్నో పాపకార్యాల నుంచి కాపాడుతుంది. ఫలితంగా దానివల్ల సమాజానికి ఎంతో ప్రయోజనం కలుగుతుంది. అంతేకాదు పాపకార్యాలకు దూరంగా మసలుకోవటం వల్ల దేవుని దృష్టిలో కూడా అతను సచ్ఛీలుడైన దాసుడిగా పరిగణించబడతాడు. కనుక ఏ విధంగానయినా సిగ్గు వల్ల మేలే జరుగుతుంది.

683. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : విశ్వాసానికి (ఈమాన్‌కు) డెబ్భై లేక అరవైకన్నా ఎక్కువ భాగా లున్నాయి. వాటిలో అత్యున్నత భాగం "లా ఇలాహ ఇల్లల్లాహ్" అని పలకటం. అయితే జనులు నడిచేదారిలో నుండి (రాళ్ళు, ముళ్ళవంటి) బాధాకరమైన వస్తువులను తొలగించటం అట్టడుగున ఉన్న భాగం. ఇంకా వ్రీడ (సిగ్గు) కూడా విశ్వాసానికి సంబంధించిన ఒక విభాగమే. *(బుఖారీ - ముస్లిం)*

٦٨٣ـ وعن أَبي هُريرةَ رضيَ الله عنه، أنَّ رسولَ الله ﷺ قال: «الإِيْمَانُ بِضْعٌ وَسَبْعُونَ، أَوْ بِضْعٌ وَسِتُّونَ شُعْبَةً، فَأَفْضَلُهَا قولُ لا إلٰهَ إلا الله، وَأَدْنَاهَا إمَاطَةُ الأذَى عَنِ الطَّرِيقِ، وَالحَيَاءُ شُعْبَةٌ مِنَ الإيْمَانِ» متفقٌ عليه. «البِضعُ»: بكسر الباءِ، ويجوز فتحها، وَهُوَ مِنَ الثَّلاثَةِ إلى العَشَرَةِ. وَ«الشُّعْبَةُ»: القطعَةُ وَالخَصْلَةُ. وَ«الإمَاطَةُ»: الإزَالَةُ. وَ«الأذَى»: مَا يُؤذِي كَحَجَرٍ وَشَوْكٍ وَطِينٍ وَرَمَادٍ وَقَذَرٍ وَنَحْوِ ذلكَ.

## ముఖ్యాంశాలు

ఈ హదీసు ఇంతకు ముందు 'సత్కార్యాలు అనేక రకాలు' అనే అధ్యాయంలో కూడా

వచ్చింది. ఇక్కడ మళ్లీ దీనిని ప్రస్తావించటంలోని ఉద్దేశ్యం ఏమిటంటే, విశ్వాసంలో ఎన్నో స్థాయిలు, అంతస్తులు ఉన్నాయనీ, వాటిలో సిగ్గుకు కూడా ఒక స్థానం ఉందనీ, పైగా సిగ్గు మానవ అంతరంగాన్ని తీర్చిదిద్దటంలో ఎంతో ప్రభావవంతమైన పాత్రను పోషిస్తుంది కనుక దానికి విశ్వాసంలో అత్యంత ముఖ్యస్థానం ఉందని తెలియజెప్పటం.

٦٨٤ - وعن أَبِي سعيدٍ الخُدْرِيِّ رضي الله عنه، قال: كان رسولُ اللهِ ﷺ أَشَدَّ حَيَاءً مِنَ العَذْرَاءِ في خِدْرِهَا، فَإِذَا رَأَى شَيْئاً يَكْرَهُهُ عَرَفْنَاهُ في وَجْهِهِ. متفقٌ عليه. قال العلماءُ: حَقِيقَةُ الحَيَاءِ خُلُقٌ يَبْعَثُ عَلَى تَرْكِ القَبِيحِ، وَيَمْنَعُ مِنَ التَّقْصِيرِ في حَقِّ ذِي الحَقِّ. وَرَوَيْنَا عَنْ أَبِي القَاسِمِ الجُنَيْدِ رَحِمَهُ اللهُ قال: الحَيَاءُ رُؤْيَةُ الآلاءِ - أي النِّعَمِ - وَرُؤْيَةُ التَّقْصِيرِ، فَيَتَوَلَّدُ بَيْنَهُمَا حَالَةٌ تُسَمَّى حَيَاءً.

684. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఇంటి మూలన పరదాలో ఉండే కన్నెపిల్ల కన్నా ఎక్కువ బిడియస్తులు. ఏదయినా అయిష్టకరమైన వస్తువుని చూసినప్పుడు ఆయనకు కలిగే అయిష్టతను మేమా యన ముఖాన్ని చూసే గుర్తుపట్టగలిగేవాళ్ళం. *(బుఖారీ - ముస్లిం)*

వాస్తవానికి వ్రీడ అనేది అసహ్యాకరమైన విషయాలను వదలిపెట్టమని ప్రేరేపించే గుణమనీ, హక్కుదారునికి హక్కు ఇవ్వకుండా వెలితి చేయటాన్నుంచి ఆపే గుణమనీ పండితులు అభిప్రాయపడుతున్నారు. మేము నకలుచేసిన అబుల్ ఖాసిం జునైద్ (రహ్మాలై) గారి అభిప్రాయం ప్రకారం వ్రీడ అంటే దేవుడు ప్రసాదించిన అనుగ్రహాల్ని, తమ వల్ల జరుగుతున్న తప్పుల్ని అవలోకనం చేసుకోవటం. ఆ రెండింటి మధ్య నుంచే వ్రీడ పుడుతుంది.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్ఠతల ప్రకరణం)*

**85వ అధ్యాయం**

## ٨٥ ـ بَابُ حِفظِ السِّرِّ

## రహస్యాలను దాచటం

قال الله تعالى: ﴿ وَأَوْفُوا بِالْعَهْدِ إِنَّ الْعَهْدَ كَانَ مَسْئُولًا ﴾ [الإسراء: ٣٤].

**దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :**

"చేసిన వాగ్దానాన్ని నెరవేర్చండి. నిస్సందేహంగా వాగ్దానం విషయంలో మీరు సమాధానం చెప్పవలసి ఉంటుంది."

*(అల్ ఇస్రా : 34)*

**వివరణ :**

ఒక వ్యక్తి మరొక వ్యక్తితో తనకు సంబంధించిన రహస్య విషయమేదయినా చెప్పినప్పుడు ఆ రహస్యాన్ని మూడోవ్యక్తికి తెలియకుండా దాచాలని కోరుకుంటాడు. ఆ విధంగా రహస్యం కూడా ఒక వాగ్దానమే. అలాంటి వాగ్దానాలను కూడా తప్పనిసరిగా నెరవేర్చాలి. పై సూక్తిలో వాగ్దానాన్ని నెరవేర్చటమంటే రహస్యాన్ని దాచటమని అర్థం.

٦٨٥ ـ عن أبي سعيدٍ الخُدْرِيِّ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «إِنَّ مِنْ أَشَرِّ النَّاسِ عِنْدَ اللهِ مَنْزِلَةً يَوْمَ القِيَامَةِ الرَّجُلَ يُفْضِي إِلى المَرْأَةِ وَتُفْضِي إِلَيْهِ ثُمَّ يَنْشُرُ سِرَّهَا» رواه مسلم.

685. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ప్రళయదినాన దేవుని దృష్టిలో స్థాయి రీత్యా అత్యంత నీచమయినవాడు ఎవడూ అంటే - ఆలుమగలు పరస్పరం సంభోగించుకున్న తరువాత ఆ రహస్యాలను ఇతరులతో చెప్పుకునేవాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని నికాహ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

హదీసులో 'యుఫ్‌జీ' అనే పదం వాడబడింది. యుఫ్‌జీ అంటే కలవటమని అర్థం. ఇక్కడ దాని భావం సంభోగించటం. సాధారణంగా నూతన వధూవరులకు శోభనం జరిగినప్పుడు తెల్లారిన తరువాత భర్త తన స్నేహితులతో, భార్య తన స్నేహితురాండ్రతో శోభన గదిలో జరిగిన

రహస్య విషయాలను గురించి చెప్పుకుంటూరు. పై హదీసు ద్వారా అలా చెప్పుకోవటం ఘోర పాపమని తెలుస్తోంది. అలాంటి విషయాలకు దూరంగా ఉండటం చాలా అవసరం. సంభోగ మనేది ఒక రహస్య విషయం. అది ఆలుమగలవరకే పరిమితమై ఉండాలి. దాని గురించి ఇతరులతో చెప్పుకోవటం అవివేకం అనిపించుకుంటుంది.

686. హ(జత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) కథనం : హ(జత్ ఉమర్ (రజి) తన కూతురు హ(జత్ హఫ్సా విధవరా:ల యినప్పటి సంగతిని గురించి ఈ విధంగా తెలియజేస్తున్నారు :

"నేను ముందుగా ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్‌ను కలిసి హఫ్సా గురించి ఆయ నతో మాట్లాడాను. తను కోరుకుంటే నా కూతురు హఫ్సాను తనకిచ్చి వివాహం చేస్తానని చెప్పాను. దానికాయన ఆలో చించి నిర్ణయం తీసుకుంటానని చెప్పారు. నేను చాలా రోజుల వరకు ఆయన నిర్ణయం కోసం వేచి చూశాను. ఓ రోజు ఆయన నన్ను కలుసుకొని ప్రస్తుతం తనకు వివాహం చేసుకొనే ఉద్దేశ్యం లేదని చెప్పారు.

ఆ తర్వాత నేను అబూబక్ర్ (రజి) ని కలుసుకొని తను కోరుకుంటే నా కూతురు హఫ్సాను తనకిచ్చి వివాహం చేస్తానని చెప్పాను. దానికి అబూబక్ర్ మౌనం వహించారు. ఏ సమాధానం చెప్పలేదు. ఆయన వల్ల నాకు ఉస్మాన్ వల్ల కన్నా ఎక్కువ బాధ కలిగింది. నేను మళ్ళీ చాలా రోజుల వరకు (సంబంధం కోసం) ఎదురుచూస్తూ ఉన్నాను. ఒకరోజు దైవప్రవక్త (సల్లం) తను

٦٨٦ ـ وعن عبدِ اللهِ بن عمرَ رضي الله عنهما أنَّ عمرَ رضي الله عنه حينَ تَأَيَّمَتْ بِنْتُهُ حَفْصَةُ قال: لَقِيتُ عُثْمَانَ بن عَفَّان رضِيَ الله عنه، فَعَرَضْتُ عَلَيْهِ حَفْصَةَ فَقلتُ: إنْ شِئْتَ أَنْكَحْتُكَ حَفْصَةَ بِنْتَ عُمَرَ؟ قال: سَأَنْظُرُ فِي أَمْرِي. فَلَبِثْتُ لَيَالِيَ، ثُمَّ لَقِيَنِي، فقال: قَدْ بَدَا لِي أَنْ لا أَتَزَوَّجَ يَومِي هٰذَا. فَلَقِيتُ أَبَا بَكْرٍ الصِّدِّيقَ رضي الله عنه، فَقُلْتُ: إنْ شِئْتَ أَنْكَحْتُكَ حَفْصَةَ بِنْتَ عُمَرَ، فَصَمَتَ أَبُو

بكرٍ رضي الله عنه، فَلَمْ يَرْجِعْ إِلَيَّ شَيْئاً! فَكُنْتُ عَلَيْهِ أَوْجَدَ مِنِّي عَلى عُثْمَانَ، فَلَبِثْتُ لَيَالِيَ، ثُمَّ خَطَبَهَا النَّبِيُّ ﷺ، فَأَنْكَحْتُهَا إِيَّاهُ. فَلَقِيَنِي أَبُو بَكْرٍ فَقَالَ: لَعَلَّكَ وَجَدْتَ عَلَيَّ حِينَ عَرَضْتَ عَلَيَّ حَفْصَةَ فَلَمْ أَرْجِعْ إِلَيْكَ شَيْئاً؟ فَقُلْتُ: نَعَمْ، قال: فَإِنَّهُ لَمْ يَمْنَعْنِي أَنْ أَرْجِعَ إِلَيْكَ فِيمَا عَرَضْتَ عَلَيَّ إِلَّا أَنِّي كُنْتُ عَلِمْتُ أَنَّ النَّبِيَّ ﷺ ذَكَرَهَا، فَلَمْ أَكُنْ لأُفْشِيَ سِرَّ رسولِ اللهِ ﷺ، وَلَوْ تَرَكَهَا النَّبِيُّ ﷺ لَقَبِلْتُهَا. رواه البخاري. قوله: «تَأَيَّمَتْ» أيْ: صَارَتْ بِلا زَوْجٍ، وَكَانَ زَوْجُهَا تُوُفِّيَ رضي الله عنه. «وَجَدْتَ»: غَضِبْتَ.

హఫ్సాను వివాహమాడతానని సందేశం పంపారు. అప్పుడు నేను హఫ్సాను దైవప్రవక్తకిచ్చి వివాహం చేశాను.

ఆ తర్వాత ఒకరోజు అబూబక్ర్ కలిసి, "ఉమర్! నా మూలంగా మీరు చాలా బాధపడి ఉంటారు. మీరు హఫ్సాను నాకిచ్చి వివాహం చేస్తానని ముందు కొచ్చినా నేను మీకు ఏ సమాధానం చెప్ప లేదు. (అందుకు నన్ను క్షమించండి)" అన్నారు. దానికి నేను "ఔనండీ!" అని ముక్తసరిగా సమాధానం చెప్పాను.

అప్పుడు హజ్రత్ అబూబక్ర్ (రజి) నాతో ఇలా అన్నారు : దైవప్రవక్త (సల్లం) ఒకానొక సందర్భంగా తాను హఫ్సాను వివాహం చేసుకుంటానని అన్నారు. అందుకే మీరడిగినప్పుడు నేను ఏ సమాధానం చెప్పలేకపోయాను. దైవప్రవక్త (సల్లం) గారికి సంబంధించిన రహస్యాన్ని నేను బయటపెట్ట దలచుకో లేదు. ఒకవేళ తన నిర్ణయాన్ని మార్చుకొని ఉన్నట్లయితే నేను హఫ్సా వివాహ సందేశాన్ని అంగీకరించేవాణ్ణి. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని యుద్ధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసు ఇక్కడ బోధించే ప్రధాన విషయం - ఇతరుల రహస్యాలను దాచాలి. వాటిని ఇంకొకరి ముందు బయటపెట్టరాదు. ఇది గాకుండా ఈ హదీసులో ఇంకా ఎన్నో ముఖ్య విషయాలు బోధించబడ్డాయి. ఉదా॥ ఉత్తములను, సంస్కారవంతులను తమ కూతురిని పెళ్లిచేసుకోమని కోరవచ్చు. మగపెళ్ళివారు తమంతట తాము పెళ్ళి ఉద్దేశ్యం బయట

పెట్టనంతవరకూ ఆడపిల్లను ఇంట్లో కూర్చోబెట్టి ఉంచాలన్న ఆచారం సరైనది కాదు. మనదేశంలో ఇలాగే జరుగుతోంది. ఈ ఆచారం దైవప్రవక్త ప్రబోధనలకు విరుద్ధం. దీనిని మార్చాలి.

2. ఎవడైనా వ్యక్తి లేక ఏదయినా కుటుంబంవారు ఒక అమ్మాయిని వివాహమాడాలన్న కోరికను వ్యక్తం చేసి దానికోసం ప్రయత్నాలు జరుపుతున్నప్పుడు ఆ ఇరు కుటుంబాల మధ్య పెళ్లిమాటలు సాగుతున్నంతకాలం మధ్యలో ఇంకొకరు ఆ అమ్మాయికి లేక ఆమె కుటుంబంవారికి వివాహ సందేశం పంపటం ధర్మసమ్మతం కాదు.

٦٨٧ ـ وعن عائشةَ رضي الله عنها قالتْ: كُنَّ أَزْوَاجُ النَّبِيِّ ﷺ عِنْدَهُ، فَأَقْبَلَتْ فَاطِمَةُ رضي الله عنها تَمْشِي، مَا تُخْطِىءُ مِشْيَتُهَا مِنْ مِشْيَةِ رسولِ اللهِ ﷺ شَيْئاً، فَلَمَّا رَآهَا رَحَّبَ بِهَا وقال: «مَرْحَباً بِابْنَتِي» ثُمَّ أَجْلَسَهَا عَنْ يَمِينِهِ أَوْ عَنْ شِمَالِهِ، ثُمَّ سَارَّهَا فَبَكَتْ بُكَاءً شَدِيداً، فَلَمَّا رَأَى جَزَعَهَا، سَارَّهَا الثَّانِيَةَ فَضَحِكَتْ، فقلتُ لَهَا: خَصَّكِ رسولُ اللهِ ﷺ مِنْ بَيْنِ نِسَائِهِ بِالسِّرَارِ، ثُمَّ أَنْتِ تَبْكِينَ؟ فَلَمَّا قَامَ رَسولُ اللهِ ﷺ سَأَلْتُهَا: مَا قَالَ لَكِ رسولُ الله ﷺ؟ قالت: مَا كنتُ لأُفْشِيَ عَلَى رسولِ اللهِ ﷺ سِرَّهُ. فَلَمَّا تُوُفِّيَ رسولُ اللهِ ﷺ قلتُ: عَزَمْتُ عَلَيْكِ بِمَا لِي عَلَيْكِ مِنَ الحَقِّ، لَمَا حدَّثْتِنِي ما قال لكِ رسولُ اللهِ ﷺ. فقالتْ: أَمَّا الآنَ فَنَعَمْ، أَمَّا

687. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) సతీమణులందరూ ఆయన దగ్గర కూర్చొని ఉండగా హజ్రత్ ఫాతిమా (రజి. అన్హా) అక్కడికి వచ్చారు. ఆమె నడక అచ్చం (ఆమె తండ్రి) నడకలాగే ఉంది. ఆమెను చూడగానే దైవప్రవక్త (సల్లం) "నా కూతురికి స్వాగతం" అంటూ ఆమెను సాదరంగా ఆహ్వానించారు. ఆమెను తన కుడి ప్రక్కన లేక ఎడమ ప్రక్కన కూర్చోబెట్టుకొని రహస్యంగా (ఆమె చెవిలో) ఏదో మాట చెప్పారు. దాంతో ఆమె విపరీతంగా విలపించటం మొదలుపెట్టారు. దైవప్రవక్త (సల్లం) ఆమె కళవళపాటుని చూసి మళ్లీ ఏదో ఆమె చెవిలో రహస్యంగా చెప్పారు. ఆ మాట వినగానే ఆమె సంతోషంగా నవ్వారు. అప్పుడు నేనామెను "దైవప్రవక్త (సల్లం) తన సతీమణులందర్నీ వదలి ప్రత్యేకంగా నీకొక్కదానికే రహస్య విషయం వినే అదృష్టాన్ని కల్పించారు. (దానికి నువ్వు సంతోషించటానికి బదులు) ఎందుకో కంటతడిపెట్టావు!" అని అన్నాను.

حِينَ سَارَّنِي فِي المَرَّةِ الأولَى فَأَخْبَرَنِي «أَن جِبْرِيلَ كَانَ يُعَارِضُهُ القُرْآنَ فِي كُلِّ سَنَةٍ مَرَّةً أَوْ مَرَّتَيْنِ، وَأَنَّهُ عَارَضَهُ الآنَ مَرَّتَيْنِ، وَإِنِّي لا أُرَى الأَجَلَ إِلَّا قَدِ اقْتَرَبَ، فَاتَّقِي اللهَ وَاصْبِرِي، فَإِنَّهُ نِعْمَ السَّلَفُ أَنَا لَكِ» فَبَكَيْتُ بُكَائِي الَّذِي رَأَيْتِ. فَلَمَّا رَأَى جَزَعِي سَارَّنِي الثَّانِيَةَ، فَقَالَ: «يَا فَاطِمَةُ! أَمَا تَرْضَيْنَ أَنْ تَكُونِي سَيِّدَةَ نِسَاءِ المُؤْمِنِينَ، أَوْ سَيِّدَةَ نِسَاءِ هَذِهِ الأُمَّةِ؟» فَضَحِكْتُ ضَحِكِي الَّذِي رَأَيْتِ. متفقٌ عليه، وهذا لفظ مسلم.

కాసేపటికి దైవప్రవక్త (సల్లం) అక్క ణ్ణుంచి లేచి వెళ్ళిపోయిన తరువాత నేను ఫాతిమాతో మాట్లాడుతూ, "దైవ ప్రవక్త (సల్లం) నీతో రహస్యంగా చెప్పిం దేమిటి?" అని అడిగాను. ఫాతిమా ఆ విషయం చెప్పటానికి నిరాకరిస్తూ, "దైవప్రవక్త (సల్లం) చెప్పిన రహస్యాన్ని నేను బయటపెట్టలేను" అని అన్నారు. చివరికి దైవప్రవక్త (సల్లం) చనిపోయిన తరువాత నేను తిరిగి ఫాతిమాను కదిలించి, "నీ మీద నాకున్న (మాతృ త్వపు) హక్కు సాక్షిగా అడుగుతున్నాను. దైవప్రవక్త (సల్లం) అప్పుడు నీతో చెప్పిన రహస్యం ఏమిటి?" అని అన్నాను. దానికి ఫాతిమా "ఇప్పుడయితే చెప్ప గలను" అంటూ ఈ విధంగా తెలియ జేశారు :

"మొదటిసారి దైవప్రవక్త (సల్లం) నాతో రహస్యంగా ఈ సంగతి చెప్పారు : 'ప్రతి యేట జిబ్రయీల్ (అలైహి) నా దగ్గర ఒకసారి మాత్రమే ఖుర్ఆన్ (మొత్తం) పారాయణం చేసేవారు. కాని ఈ ఏడు ఆయన ఖుర్ఆన్ (మొత్తం) రెండుసార్లు పారాయణం చేశారు. దాన్నిబట్టి నా (మరణ) కాలం ఎంతో దూరంలో లేదని నాకనిపిస్తోంది. కనుక నువ్వు దైవానికి భయపడుతూ సహనంతో వ్యవహరిం చాలి. గతించేవారిలో నీకు అత్యంత మేలైనవాణ్ణి నేనే.' ఈ మాట విని నేనెంత

ఏడ్చానో మీరూ చూశారు. ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) నా కళవళపాటుని చూసి మళ్ళీ రహస్యంగా, 'ఫాతిమా! నువ్వు ముస్లిం మహిళలందరికీ నాయకురాలివి అవుతావు. లేక ముస్లిం అనుచర సమాజంలోని మహిళలందరికీ నాయకురాలివి అవుతావు. ఈ విషయం నీకు సంతోషం కలిగించదా?' అని అన్నారు. అప్పుడు నేను నవ్వాను. అది కూడా చూశారు మీరు."

*(బుఖారీ - ముస్లిం, వాక్యాలు మాత్రం ముస్లింవి)*

٦٨٨ ـ وعن ثابتٍ عن أنسٍ رضي الله عنه قال: أَتَى عَلَيَّ رسولُ اللهِ ﷺ وَأَنَا أَلْعَبُ مَعَ الْغِلْمَانِ، فَسَلَّمَ عَلَيْنَا، فَبَعَثَنِي فِي حَاجَةٍ، فَأَبْطَأْتُ عَلَى أُمِّي. فَلَمَّا جِئْتُ قَالَتْ: مَا حَبَسَكَ؟ فقلتُ: بَعَثَنِي رسولُ اللهِ ﷺ لِحَاجَةٍ، قالت: مَا حَاجَتُهُ؟ قلتُ: إِنَّهَا سِرٌّ. قالت: لا تُخْبِرَنَّ بِسِرِّ رَسُولِ اللهِ ﷺ أَحَداً. قال أَنَسٌ: وَاللهِ! لَوْ حَدَّثْتُ بِهِ أَحَداً لَحَدَّثْتُكَ بِهِ يا ثَابِتُ! رواه مسلم، وروى البخاري بَعْضَهُ مُخْتَصَراً.

688. హజ్రత్ సాబిత్, అనస్ (రజి) నుండి చేసిన కథనం : ఒకరోజు నేను (నా స్నేహితులయిన) పిల్లలతో కలిసి ఆడుకుంటుండగా దైవప్రవక్త (సల్లం) నా దగ్గరికి వచ్చారు. ముందుగా ఆయన మాకు సలాం చేసిన తర్వాత నన్ను ఒక పనిమీద పంపించారు. దాంతో నేను ఇంటికి వెళ్ళేసరికి ఆలస్యమయింది. ఇంటికి వెళ్ళగానే మా అమ్మ ఆలస్యం ఎందుకయిందని అడిగింది. "దైవప్రవక్త (సల్లం) నన్ను ఒక పనిమీద పంపించా రమ్మా!" అన్నాను నేను. "ఏమిటా పని?" అని అడిగింది మా అమ్మ. నేను అదొక రహస్య విషయమని చెప్పాను. అప్పుడు మా అమ్మ "దైవప్రవక్త (సల్లం) రహస్యాన్ని ఎవరితోనూ చెప్పకు సుమా!" అంటూ నాకు హితోపదేశం చేసింది.

హజ్రత్ అనస్ (రజి) (ఈ హదీసు వివరించిన తరువాత) "ఓ సాబిత్! నేనా రహస్యం ఎవరితోనయినా చెప్పాలనుకుంటే నీకే చెప్పేవాణ్ణి" అని అన్నారు. (ముస్లిం-బుఖారీ ఈ హదీసులోని కొంత భాగాన్ని సంక్షిప్తంగా వివరించారు)

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు కూడా తోటి వ్యక్తుల రహస్య విషయాలను బయటపెట్టకూడదని తాకీదు చేస్తోంది. హజ్రత్ అనస్ దైవప్రవక్త (సల్లం) తనకు చెప్పిన పని రహస్యమైనదని అనగానే ఆయన తల్లి ఇక దాని గురించి అడగటం మానుకుంది. అంతేకాదు, దైవప్రవక్త రహస్యాన్ని రహస్యంగానే ఉంచాలని కొడుక్కి హితోపదేశం చేసింది. కనుక మిత్రులు, స్నేహితుల రహస్య విషయాలను ఎవరిముందూ బయటపెట్టకూడదు. ఒకవేళ వారి అనుమతి లభిస్తే అప్పుడు ఆ విషయాలు ఇతరులతో చెప్పటంలో తప్పు లేదు.



## 86వ అధ్యాయం

# ٨٦ - بَابُ الْوَفَاءِ بِالْعَهْدِ وَإِنْجَازِ الْوَعْدِ

# వాగ్దాన పాలన

قال الله تعالى: ﴿وَأَوْفُوا۟ بِٱلْعَهْدِ إِنَّ ٱلْعَهْدَ كَانَ مَسْـُٔولًا﴾ [الإسراء: ٣٤]. وقال تعالى: ﴿وَأَوْفُوا۟ بِعَهْدِ ٱللَّهِ إِذَا عَٰهَدتُّمْ﴾ [النحل: ٩١]. وقال تعالى: ﴿يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ أَوْفُوا۟ بِٱلْعُقُودِ﴾ [المائدة: ١]. وقال تعالى: ﴿يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لِمَ تَقُولُونَ مَا لَا تَفْعَلُونَ ۝ كَبُرَ مَقْتًا عِندَ ٱللَّهِ أَن تَقُولُوا۟ مَا لَا تَفْعَلُونَ﴾ [الصف: ٢-٣].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"చేసిన వాగ్దానాన్ని నెరవేర్చండి. నిస్సందేహంగా వాగ్దానం విషయంలో మీరు సమాధానం చెప్పవలసి ఉంటుంది."

*(అల్ ఇస్రా : 34)*

"మీరు అల్లాహ్‌తో ఏదయినా వాగ్దానం చేసివుంటే ఆ వాగ్దానాన్ని నెరవేర్చండి."

*(అన్ నహ్ల్ : 91)*

"విశ్వాసులారా! మీరు చేయని విషయాన్ని చేస్తాము అని చెబుతారెందుకు? మీరు చేయని దానిని చేస్తాము అని చెప్పటం అల్లాహ్ దృష్టిలో అత్యంత అప్రియమైన విషయం."

*(అస్ సఫ్ : 2, 3)*

**వివరణ :**

ప్రమాణాలు లేక వాగ్దానాల్లో రెండు రకా లున్నాయి. అందులో ఒకటి, మనుషులు పరస్పరం చేసుకునే వాగ్దానాలు, ప్రమాణాలు. దైనందిన జీవితంలో మానవుల మధ్య జరిగే లావాదేవీలు, వ్యవహారాలన్నీ కూడా దాని క్రిందికే వస్తాయి. ఇకపోతే రెండవ రకమైన వాగ్దానం, మనిషి తాను పుట్టకముందు తను ఒక్క దేవుణ్ణి మాత్రమే పూజిస్తానని అల్లాహ్‌తో చేసిన వాగ్దానం. దాన్నే "అలస్తు వాగ్దానం" అని అంటారు. అదేవిధంగా మనిషి విశ్వసించి నప్పుడు కూడా తను దైవాదేశాలకు అను గుణంగా నడుచుకుంటానని వాగ్దానం చేస్తాడు. మనిషి ఈ రెండు రకాల ప్రమాణాల్ని, వాగ్దానాలను నెరవేర్చాలని షరీఅత్ ఆదేశి స్తోంది.

٦٨٩ - عن أبي هريرةَ رضي الله عنه، أنَّ رسولَ الله ﷺ قال: «آيةُ المُنافِقِ

689. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : కపట విశ్వాసికి మూడు లక్షణాలుంటాయి.

ثَـلاثٌ: إِذَا حَـدَّثَ كَـذَبَ، وَإِذَا وَعَـدَ أَخْلَفَ، وَإِذَا اؤْتُمِنَ خَانَ» متفقٌ عليه. زَادَ فـي روايـةٍ لمسلـم: «وَإِنْ صَـامَ وَصَلَّـى وَزَعَمَ أَنَّهُ مُسْلِمٌ».

- అతను మాట్లాడితే అబద్ధం చెబుతాడు.
- ఏదయినా వాగ్దానం చేస్తే దాన్ని భంగపరుస్తాడు.
- అతని దగ్గర ఏదయినా వస్తువు అప్పగింత (అమానతు)గా పెడితే అందులో నమ్మకద్రోహానికి పాల్పడతాడు. *(బుఖారీ - ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో, "అతను ఉపవాసాలు పాటిస్తూ, నమాజులు చేస్తూ తాను ముస్లిం నని ప్రకటించుకున్నా సరే!" అన్న వాక్యం అదనంగా ఉంది.

٦٩٠ ـ وعن عبدِ اللهِ بنِ عمرِو بنِ العاصِ رضي الله عنهما، أنَّ رَسُولَ اللهِ ﷺ قال: «أَرْبَعٌ مَنْ كُنَّ فِيهِ كَانَ مُنَافِقاً خَالِصاً. وَمَنْ كَانَتْ فِيهِ خَصْلَةٌ مِنْهُنَّ كَانَتْ فيه خَصْلَةٌ مِنَ النِّفَاقِ حَتَّى يَدَعَهَا: إِذَا اؤْتُمِنَ خَانَ، وَإِذَا حَدَّثَ كَذَبَ، وَإِذَا عَاهَدَ غَدَرَ، وَإِذَا خَاصَمَ فَجَرَ» متفقٌ عليه.

690. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు: ఈ (క్రింద పేర్కొనబడే) నాలుగు లక్షణాలు ఎవరిలోనయినా ఉంటే అతను పచ్చి కపటి అని అనుకోవాలి. (అన్నీ లేక పోయినా) వాటిలో ఏ ఒక్క లక్షణమున్నా దాన్ని విడనాడనంతవరకూ అతనిలో ఒక కపట లక్షణమున్నట్లు భావించాలి.

- అప్పగింతలో ద్రోహానికి పాల్పడటం.
- మాట్లాడితే అబద్ధం చెప్పటం.
- వాగ్దానం చేసి మోసానికి పాల్పడటం.
- కొట్లాడినప్పుడు తిట్లపురాణం మొదలెట్టడం. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని ప్రమాణాలు, మొక్కుబడుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనసులో ఇస్లాం పట్ల వైరాన్ని, అక్కసును దాచిపెట్టుకొని పైకి మాత్రం తాము ముస్లింలమని చెప్పుకునే కుటిల స్వభావాన్ని 'కపట విశ్వాసం' అని అంటారు. దైవప్రవక్త (సల్లం) హయాంలో ఇలాంటి కపటులు చాలామంది ఉండేవారు. వారిలో పై హదీసులో సూచించబడిన లక్షణాలు కొట్టొచ్చినట్లు కనిపించేవి. కాని వారి మనసుల్లో ఉన్న కుళ్ళును ముస్లింలెవరూ తెలుసుకోలేకపోయేవారు. ఆఖరికి దైవప్రవక్త (సల్లం)కు కూడా తన సాహచర్యంలో ఉంటున్నవారిలో కపట విశ్వాసుల్ని కనిపెట్టడం కష్టంగా ఉండేది. అయితే దేవుడు తన ప్రవక్తకు 'వహీ' వాణి ద్వారా నికార్సయిన ముస్లింలెవరో, కపట ముస్లింలెవరో తెలియజేశాడు. కాని ఈ రోజుల్లో కపట విశ్వాసుల్ని కనిపెట్టే విశ్వసనీయమైన మార్గాలేవీ లేవు. అయినప్పటికీ వారి నడవడికలో కాపట్య లక్షణాలు ప్రస్ఫుటమవుతుంటాయని, దానిద్వారా కపటుల్ని గుర్తించవచ్చని హదీసులు ఉద్ఘాటిస్తున్నాయి.

పండితుల అభిప్రాయం ప్రకారం కాపట్యం రెండు రకాలుగా ఉంటుంది. ఒకటి, విశ్వాసంలో కాపట్యం. రెండోది, ఆచరణాత్మకమైన కాపట్యం. విశ్వాసంలో కాపట్యమంటే, మనసులో దైవతిరస్కార భావాన్ని దాచిపెట్టుకొని పైకి దైవంపై విశ్వాసాన్ని ప్రకటించటం. నేడు ముఖ్యంగా కమ్యూనిస్ట్, సెక్యులర్ భావాలుగల ముస్లిం ఇళ్ళల్లో పుట్టేవారు ఇలాంటి విశ్వాసులే అయి ఉంటారు. ఇకపోతే రెండవ రకమైన కాపట్యం ఏమిటంటే, మనసులో స్వచ్ఛమైన విశ్వాసమున్నప్పటికీ ఆచరణలో కపటచేష్టలు జరిగిపోతుంటాయి. దురదృష్టవశాత్తూ నేడు ముస్లింలలో చాలా మంది ఈ ఆచరణాత్మకమైన కపటరోగానికే గురై ఉన్నారు. అల్లాహ్ అన్ని రకాల కాపట్య స్వభావాల నుండి మన మనసుల్ని ప్రక్షాళనం చేయుగాక!

691. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) నాతో, "బహ్రైన్ నుండి ధనం గనక వస్తే నేను నీకు ఇంతింత ఇస్తాను" అని అన్నారు. కాని ఆయన జీవించి ఉన్నంతవరకూ బహ్రైన్ నుండి ధనం రాలేదు. ఆఖరికి ఆయన ఇహలోకం వీడిపోయారు. ఆ తర్వాత బహ్రైన్ నుండి ధనం వచ్చింది. అప్పుడు (ఖలీఫాగా ఉన్న) హజ్రత్ అబూబక్ర్ (రజి), "దైవప్రవక్త (సల్లం) ఎవరికయినా ఏదయినా ఇస్తానని వాగ్దానం చేసి ఉంటే లేదా ఆయన

٦٩١ - وعن جابرٍ رضي الله عنه قال: قال لي النبيُّ ﷺ: «لَوْ قَدْ جَاءَ مَالُ الْبَحْرَيْنِ أَعْطَيْتُكَ هٰكَذَا وَهٰكَذَا وَهٰكَذَا» فَلَمْ يَجِىءْ مَالُ الْبَحْرَيْنِ حَتَّى قُبِضَ النَّبِيُّ ﷺ، فَلَمَّا جَاءَ مَالُ الْبَحْرَيْنِ أَمَرَ أَبُو

بَكْرٍ رضي الله عنه فَنَادَى: مَنْ كَانَ لَهُ عِنْدَ رسولِ الله ﷺ عِدَةٌ أَوْ دَيْنٌ فَلْيَأْتِنَا. فَأَتَيْتُهُ وَقُلْتُ لَهُ: إِنَّ النَّبِيَّ ﷺ قَالَ لِي كَذَا وَكَذَا، فَحَثَى لِي حَثْيَةً، فَعَدَدْتُهَا، فَإِذَا هِيَ خَمْسُمِائَةٍ، فقال لي: خُذْ مِثْلَيْهَا. متفقٌ عليه.

ఎవరికైనా ఋణపడి ఉంటే వాళ్లంతా నా దగ్గరికి వచ్చి (తమ హక్కుల్ని) వసూలు చేసుకోవచ్చు" అంటూ అధికారికంగా ఒక ప్రకటన గావించారు. ఆ ప్రకటన విని నేను అబూబక్ర్ (రజి) దగ్గరికెళ్ళి, "దైవప్రవక్త (సల్లం) నాతో ఈ ఈ మాటలు చెప్పార"ని అన్నాను. అప్పుడాయన దోసిలి నిండా నాణాలు తీసి నాకిచ్చారు. నేను వాటిని లెక్కపెట్టి చూస్తే అవి అయిదొందలు తేలాయి. ఆ తర్వాత ఆయన నాతో, "ఇంకా కావాలంటే వాటికి రెట్టింపు తీసుకో" అని అన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సాక్ష్యాధారాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్టతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) 'హాకజా, హాకజా, హాకజా' (ఇంతింత) అని మూడుసార్లు అన్నారు. ఆ సమయంలో ఆయన మూడుసార్లు దోసిళ్ళు ఎత్తి చూపారని బుఖారీలోని వేరొక ఉల్లేఖనం చెబుతోంది. అంటే మూడు దోసిళ్ళ నిండా ధనం ఇస్తానన్నారన్నమాట. దాని ప్రకారం హజ్రత్ అబూబక్ర్ (రజి) దైవప్రవక్త (సల్లం) వాగ్దానాన్ని నెరవేరుస్తూ జాబిర్ (రజి)కు మూడు దోసిళ్ళనిండా నాణాలు ఇచ్చారు.

మనిషి తన మరణం తర్వాత అయినా తన వాగ్దానాల్ని, ప్రమాణాల్ని పూర్తిచేయించాలని ఈ హదీసు తాకీదు చేస్తోంది. చావుతో వాగ్దాన బాధ్యత తీరినట్లు కాదు. మనిషి చనిపోయేముందే తన వాగ్దానాలను నెరవేర్చమని తన వారసుల్ని ఆదేశించి వెళ్ళాలి లేదా కనీసం వారసులయినా నైతికవిధిగా భావించి తమ పెద్దల వాగ్దానాలను, ప్రమాణాలను నెరవేర్చాలి. రాజ్యస్థాయిలో చేయబడే వాగ్దానాలను ఆ తరువాత వచ్చే రాజ్యాధికారులు నెరవేర్చవలసి ఉంటుంది. అందుకు హజ్రత్ అబూబక్ర్ (రజి) చేసిన పనిని ఆదర్శంగా తీసుకోవచ్చు.



## 87వ అధ్యాయం

# ٨٧ ـ بَابُ الأَمْرِ بِالْمُحَافَظَةِ عَلَى مَا اعْتَادَهُ مِنَ الْخَيْرِ

# మంచి అలవాట్లను కొనసాగించాలి

قال الله تعالى: ﴿إِنَّ ٱللَّهَ لَا يُغَيِّرُ مَا بِقَوْمٍ حَتَّىٰ يُغَيِّرُوا۟ مَا بِأَنفُسِهِمْ﴾ [الرعد: ١١]. وقال تعالى: ﴿وَلَا تَكُونُوا۟ كَٱلَّتِى نَقَضَتْ غَزْلَهَا مِنۢ بَعْدِ قُوَّةٍ أَنكَٰثًا﴾ [النحل: ٩٢]. «وَالأَنْكَاثُ» جَمْعُ نِكْثٍ، وَهُوَ الْغَزْلُ الْمَنْقُوضُ. وقال تعالى: ﴿وَلَا يَكُونُوا۟ كَٱلَّذِينَ أُوتُوا۟ ٱلْكِتَٰبَ مِن قَبْلُ فَطَالَ عَلَيْهِمُ ٱلْأَمَدُ فَقَسَتْ قُلُوبُهُمْ﴾ [الحديد: ١٦]. وقال تعالى: ﴿فَمَا رَعَوْهَا حَقَّ رِعَايَتِهَا﴾ [الحديد: ٢٧].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"యదార్థం ఏమిటంటే, ఒక జాతి స్వయంగా తన లక్షణాలను మార్చుకోనంతవరకు అల్లాహ్ దాని స్థితిని మార్చడు." *(అర్రాద్ : 11)*

"స్వయంగా తాను శ్రమతో నూలు వడికి, తరువాత తానే దానిని ముక్కలు ముక్కలుగా చేసిన స్త్రీ స్థితిలాగా మీ పరిస్థితి కాకూడదు." *(అన్ నహ్ల్ : 92)*

"పూర్వం గ్రంథం ఇవ్వబడిన ప్రజల మాదిరిగా విశ్వాసులు మారిపోకూడదు. ఒక సుదీర్ఘ కాలం వారిపై గడిచిపోయింది. అప్పుడు వారి హృదయాలు కఠినమయ్యాయి." *(అల్ హదీద్ : 16)*

"వారు దానిని పాటించే విషయంలో న్యాయం చేకూర్చలేకపోయారు." *(అల్ హదీద్ : 27)*

## వివరణ

అల్లాహ్ మానవులకు రాజ్యం, అధికారం, సిరిసంపదలు, గౌరవమర్యాదలు లాంటి అనుగ్రహాలు ప్రసాదించి పరీక్షిస్తాడు. అందుకు వారు కృతజ్ఞతలు తెలుపుకుంటే వారికి మరిన్ని అనుగ్రహాలు ప్రసాదిస్తాడు. అదే కృతఘ్నతా వైఖరికి పాల్పడితే ఇచ్చిన వరాలను కూడా లాక్కుంటాడు - ఇది మొదటి సూక్తికి భావం. రెండవ సూక్తిలో మంచిమార్గాన్ని వదలి చెడు మార్గాన్ని అవలంబించటాన్ని ఎంతో శ్రమతో నూలువడికి తర్వాత స్వయంగా దానిని ముక్కలు ముక్కలుగా చేసే ఉదాహరణతో పోల్చిచెప్పటం జరిగింది. మూడో సూక్తిలో ప్రత్యేకంగా విశ్వాసులను గ్రంథవహుల పోకడలకు దూరంగా ఉండమని హితబోధచేయటం జరిగింది. గ్రంథవహులంటే యూదులు, క్రైస్తవులు, దైవగ్రంథం అవతరింపజేయబడినవారు. వీరు ముందు దైవాదేశాలను పాటించారు. కాని కొంతకాలం తర్వాత ప్రాపంచిక సుఖాలకు దాసులయిపోయి దైవాదేశా

లను నిర్లక్ష్యం చేశారు. ఫలితంగా వారి హృదయాలు కఠినమైపోయాయి. వారిలో చాలామంది అవిధేయులయ్యారు. నాల్గవ సూక్తిలో కూడా వీరి గురించే చెప్పబడింది. వీరు ధర్మంలో లేని వేదాంతమార్గాన్ని స్వయంగా సృష్టించుకున్నారు. తర్వాత దాన్ని పాటించనూ లేకపోయారు.

మొత్తానికి పై సూక్తుల ద్వారా చెప్పొచ్చేదేమిటంటే మనిషి పుణ్యప్రదమైన మార్గాన్ని ఎల్లప్పుడూ అంటిపెట్టుకొని ఉండాలి. మధ్యలో దాన్ని వదలిపెట్టడం చాలా ప్రమాదకరం.

692. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) నన్ను సంబోధిస్తూ, "ఓ అబ్దుల్లాహ్! ఫలానా వానిలా అయిపోమాకు. అతను రాత్రిళ్ళు నిద్రలేచి ఆరాధన చేసే వాడు. ఆ తర్వాత అతను నిద్రలేవటం మానుకున్నాడు" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

٦٩٢ - وعن عبدِ اللهِ بن عمرِو بن العاص رضي الله عنهما قال: قال لي رسولُ اللهِ ﷺ: «يَا عَبْدَ اللهِ! لا تَكُنْ مِثْلَ فُلانٍ، كَانَ يَقُومُ اللَّيْلَ فَتَرَكَ قِيَامَ اللَّيْلِ» متفقٌ عليه.

(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఉపవాసాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

మనిషి ఏదయినా మంచిపని చేయటం ప్రారంభిస్తే దాన్ని అలాగే కొనసాగిస్తూ ఉండాలి. మధ్యలో ఆ పనిని మానుకోకూడదు. మంచి పనుల్ని మధ్యలోనే విరమించుకునే మనిషి తనకు తెలియకుండానే చెడు వైపునకు మొగ్గే ప్రమాదముంది. ఆరంభించిన మంచి పనిని స్థయిర్యంతో, నిలకడగా కొనసాగించటంలోనే మనిషి విజయం, క్షేమం దాగి ఉంది.

88వ అధ్యాయం

# ٨٨ ـ بَابُ اسْتِحْبَابِ طِيْبِ الْكَلَامِ وطَلَاقَةِ الْوَجْهِ عِنْدَ اللِّقَاءِ

# ఇతరుల్ని కలుసుకున్నప్పుడు వారితో నవ్వుతూ మాట్లాడాలి

قال الله تعالى: ﴿وَٱخۡفِضۡ جَنَاحَكَ لِلۡمُؤۡمِنِينَ ۝﴾ [الحجر: ٨٨]. وقال تعالى: ﴿وَلَوۡ كُنتَ فَظًّا غَلِيظَ ٱلۡقَلۡبِ لَٱنفَضُّواْ مِنۡ حَوۡلِكَ﴾ [آل عمران: ١٥٩].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"విశ్వాసుల పట్ల మృదువుగా మెలగు."

*(అల్ హిజ్ర్ : 88)*

"ప్రవక్తా! నీవేగనక కర్కశుడవు, కఠిన హృదయుడవు అయినట్లయితే వారందరూ (నీ సహచరులు) నీ చుట్టుప్రక్కల నుండి దూరంగా పోయేవారు." *(ఆలి ఇమ్రాన్ : 159)*

**వివరణ**

మొదటి సూక్తిలో దైవప్రవక్త (సల్లం)ను మృదుత్వం, నమ్రతా వైఖరిని అవలంబించమని ఆదేశించబడింది. రెండవ సూక్తిలో - ధర్మప్రచార కార్యానికి మృదుత్వం, ప్రేమ, అణకువ ఇలాంటి ఇతర నైతిక విలువలు చాలా అవసరం. ఇవి లేకుంటే ప్రజలు దగ్గరికి రారు. దూరంగా పారిపోతారు. అభిమానించటానికి బదులు అసహ్యించుకుంటారని చెప్పబడింది.

٦٩٣ ـ عَنْ عَدِيِّ بن حَاتمٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «اتَّقُوا النَّارَ وَلَوْ بِشِقِّ تَمْرَةٍ فَمَنْ لَمْ يَجِدْ فَبِكَلِمَةٍ طَيِّبَةٍ» متفقٌ عليه.

693. హజ్రత్ అదీ బిన్ హాతిమ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఖర్జూరపు ముక్కతో నయినా సరే నరకాగ్ని నుండి మిమ్మల్ని మీరు కాపాడుకోండి. అదీ లభించకపోతే కనీసం ఓ మంచి మాట మాట్లాడి అయినాసరే. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

٦٩٤ ـ وعن أَبي هريرةَ رضي الله عنه أَن النَّبيَّ ﷺ قال: «وَالكَلِمَةُ الطَّيِّبَةُ

694. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : "ఒక మంచిమాట కూడా

صَدَقَةٌ» متفقٌ عليه. وهو بعض حديث تقدم بطوله.

సదఖాయే (దానం చేయటంతో సమానమే). (బుఖారీ - ముస్లిం)

٦٩٥ ـ وعن أَبي ذَرٍّ رضيِ الله عنه قال: قال لي رسولُ اللهِ ﷺ: «لا تَحْقِرَنَّ مِنَ المَعْرُوفِ شَيْئاً، وَلَوْ أَنْ تَلْقى أَخَاكَ بِوَجْهٍ طَلِيقٍ» رواه مسلم.

695. హజ్రత్ అబూజర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఒకసారి నాకు హితోపదేశం చేస్తూ, "ఏ మంచి పనినీ అల్పంగా భావించకు. నీ సోదరుణ్ణి నవ్వుతూ పలకరించటాన్నయినా సరే." (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

షరీఅత్ దృష్టిలో అభిలషణీయమైన ప్రతి పనినీ 'మారూఫ్'గానే భావించాలి. అలాంటి మంచి పనుల్లో దేన్నీ అల్పమయినదిగా భావించకూడదు. ఆఖరికి ఇతరులతో నవ్వుతూ మాట్లాడటాన్ని కూడా చులకనగా చూడకూడదు. సాధారణంగా ప్రజలు దానికి అంతగా ప్రాధా న్యత ఇవ్వకపోవచ్చు. కాని నైతికంగా అది చాలా గొప్ప గుణం. ఎదుటివ్యక్తి పట్ల తమకున్న ప్రేమాభిమానాలను వ్యక్తం చేసుకునే విధానం. అందుకే ఇస్లాం ధర్మం దానికి అంతగా ప్రాధాన్యతనిస్తోంది.



## 89వ అధ్యాయం

## ٨٩ - بَابُ اسْتِحْبَابِ بَيَانِ الْكَلَامِ وَإِيضَاحِهِ لِلْمُخَاطَبِ وَتَكْرِيرِهِ لِيُفْهَمَ إِذَا لَمْ يُفْهَمْ إِلاَّ بِذٰلِكَ

## ఎదుటి వ్యక్తికి అర్థమయ్యే విధంగా మాట్లాడాలి

٦٩٦ - عن أنسٍ رضي الله عنه أن النبيَّ ﷺ كانَ إذا تَكَلَّمَ بِكَلِمَةٍ أَعَادَهَا ثَلاثاً حَتَّى تُفْهَمَ عَنْهُ، وَإِذا أَتَى عَلى قَوْمٍ فَسَلَّمَ عَلَيْهِمْ سَلَّمَ عَلَيْهِمْ ثَلاثاً. رواه البخاري.

696. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఏదయినా విషయం చెప్పినప్పుడు అందరికీ అర్థమయ్యేలా మూడుసార్లు చెప్పేవారు. ఎవరిదగ్గరి కయినా వెళ్ళి సలాం చేసినప్పుడు కూడా మూడుసార్లు సలాం చేసేవారు

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని విద్యా ప్రకరణం)*

٦٩٧ - وعن عائشةَ رضي الله عنها قالت: كَانَ كَلامُ رسولِ اللهِ كَلاماً فَصْلاً يَفْهَمُهُ كُلُّ مَنْ يَسْمَعُهُ. رواه أبو داود.

697. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) ఏదయినా మాట్లాడినప్పుడు ఆగి ఆగి మాట్లాడే వారు. ఆయన మాటలు వినే ప్రతి వ్యక్తి (చాలా సులభంగా) వాటిని అర్థం చేసుకోగలిగేవాడు. *(అబూదావూద్)*

*(సుననె అబూదావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఈ హదీసులో 'ఫస్‌లన్' అనే పదం వాడబడింది. ఫస్‌లన్ అంటే స్పష్టంగా, సుబోధకంగా అని హదీసు వ్యాఖ్యానకర్తలు రాశారు. అయితే అందులోనే దైవప్రవక్త (సల్లం) ఆగి ఆగి మాట్లాడేవారన్న అర్థం కూడా వస్తుంది. ఆయన నోటినుండి వెలువడే ప్రతిమాట స్పష్టంగా ఉండేది. సంబోధకుల స్థాయిని బట్టి ఆయన వారితో అచ్చమైన అరబీ భాషలో మాట్లాడేవారు.

## 90వ అధ్యాయం

## ٩٠ - بَابُ إِصْغَاءِ الْجَلِيسِ لِحَدِيثِ جَلِيسِهِ الَّذِي لَيْسَ بِحَرَامٍ وَاسْتِنْصَاتِ الْعَالِمِ وَالْوَاعِظِ حَاضِرِي مَجْلِسِهِ

## తోటివారి మాటల్ని రహస్యం కాకపోతే వినవచ్చు, పండితుడుగాని, బోధకుడుగాని తన సమావేశంలో ఉన్నవారితో నిశ్శబ్దంగా ఉండమని చెప్పవచ్చు

٦٩٨ - عن جَرِيرِ بنِ عبدِ اللهِ رضي الله عنه قال: قال لي رسولُ الله ﷺ في حَجَّةِ الْوَدَاعِ: «اسْتَنْصِتِ النَّاسَ» ثُمَّ قال: «لَا تَرْجِعُوا بَعْدِي كُفَّاراً يَضْرِبُ بَعْضُكُمْ رِقَابَ بَعْضٍ» متفقٌ عليه.

698. హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం : అంతిమ కాబా యాత్ర (హజ్జతుల్ విదా) సమయంలో దైవ ప్రవక్త (సల్లం) ప్రజలను నిశ్శబ్దంగా ఉండమని చెప్పు అని నన్నాదేశించారు. (కాసేపటికి నిశ్శబ్దం ఏర్పడిన) తరువాత ఆయన ఉపన్యసిస్తూ, "ప్రజలారా! నా తదనంతరం మీరు పరస్పరం మెడలు నరుక్కుంటూ అవిశ్వాసులయిపోకండి" అని హితోపదేశం చేశారు.

*(బుఖారీ - ముస్లిం)*

(సహీహ్ బుఖారీలోని విద్యా ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)

### ముఖ్యాంశాలు

హదీసులో వచ్చిన "నిశ్శబ్దంగా ఉండమని చెప్పు" అనే మాట ద్వారా గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) రెండు విషయాలు బోధించదలచారు. ఒకటి: తోటివారి రహస్యంగాని మాటలు వినటం ధర్మసమ్మతమేనన్న విషయం. ఇది గూఢచర్యం అంటే ప్రజల రహస్యాలను దేవులాడటం క్రిందికి రాదు. అది కూడా ప్రజల మధ్య నిశ్శబ్దం ఏర్పడినప్పుడే ప్రజలు ఒకరి విషయాలను మరొకరు వినగల్గుతారు. ఇకపోతే రెండో విషయం ఏమిటంటే, సభలు, సమావేశాలు జరుగుతున్నప్పుడు ఉపన్యాసకులుగాని, సభానిర్వాహకులు గాని ప్రజల్ని నిశ్శబ్దంగా ఉండమని ఆదేశించవచ్చు. అలా ఆదేశించటం సభానియమాల క్రిందికే వస్తుంది.

**91వ అధ్యాయం**

## ٩١ ـ بَابُ الْوَعْظِ وَالاقْتِصَادِ فِيهِ
## హితబోధలోనూ మధ్యేమార్గాన్ని అవలంబించాలి

قال الله تعالى: ﴿ادْعُ إِلَىٰ سَبِيلِ رَبِّكَ بِالْحِكْمَةِ وَالْمَوْعِظَةِ الْحَسَنَةِ﴾ [النحل: ١٢٥].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :
"ప్రవక్తా! నీ ప్రభువు మార్గం వైపునకు ఆహ్వానించు, వివేకంతో చక్కని హితబోధతో."
*(అన్ నహ్ల్ : 125)*

٦٩٩ ـ عن أَبي وَائِلٍ شَقِيقِ بنِ سَلَمَةَ قال: كَانَ ابْنُ مَسْعُودٍ رضي الله عنه يُذَكِّرُنَا في كُلِّ خَمِيسٍ، فَقَالَ لَهُ رَجُلٌ: يا أَبَا عَبْدِ الرَّحْمٰنِ! لَوَدِدْتُ أَنَّكَ ذَكَّرْتَنَا كُلَّ يَوْمٍ، فقال: أَما إِنَّهُ يَمْنَعُنِي مِنْ ذٰلِكَ أَنِّي أَكْرَهُ أَنْ أُمِلَّكُمْ وَإِنِّي أَتَخَوَّلُكُمْ بِالمَوْعِظَةِ، كَمَا كَانَ رسولُ اللهِ ﷺ يَتَخَوَّلُنَا بِهَا مَخَافَةَ السَّآمَةِ عَلَيْنَا. متفقٌ عليه. «يَتَخَوَّلُنَا»: يَتَعَهَّدُنَا.

699. హజ్రత్ అబూ వాయిల్ షఖీఖ్ బిన్ సలమా (రజి) కథనం : ఇబ్నె మస్‌వూద్ (రజి) ప్రతి గురువారం మాకు హితబోధ చేస్తుండేవారు. ఓ రోజు ఒక వ్యక్తి ఆయనతో, "అబూ అబ్దుర్రహ్మాన్! మీరు మాకు ప్రతి రోజూ హితబోధ చేస్తుండాలని నా కోరిక" అని అన్నాడు. దానికాయన "ప్రతి రోజూ హితబోధ చేసి మిమ్మల్ని విసుగెత్తించటం నాకిష్టం లేదు. అందుకే నేను ప్రతి రోజూ హితబోధ చేయటం లేదు. దైవప్రవక్త (సల్లం) కూడా మేమెక్కడ విసుగెత్తిపోతామోనన్న భయంతో మాకు హితబోధ చేయటానికి ఒక దినాన్ని నిర్ణయించారు. అలాగే నేను కూడా మీకు హితబోధ చేయటానికి ఒక దినాన్ని నిర్ణయించాను" అని అన్నారు.
*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని విద్యా ప్రకరణం, సహీహ్ ముస్లింలోని కపటవిశ్వాసుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రజలకు ధర్మబోధ చేయటంలోనూ మధ్యేమార్గాన్ని అవలంబించాలి. లేకపోతే ప్రజలు ధర్మబోధనల పట్ల విసుగెత్తిపోయి అసలు ధార్మిక సమావేశాలకు హాజరుకావటమే మానుకుంటారు. అదేపనిగా హితబోధ చేస్తూపోతే చివరికి ప్రజలు విసుగెత్తిపోతారు. అదేవిధంగా విద్యాశిక్షణల కోసం వేళల్ని నిర్ణయించినప్పుడు కూడా ప్రజలు తమంతటతాము సంతోషంగా ధార్మిక సమావేశాలకు హాజరయ్యే విధంగా సరియైన వేళల్ని గుర్తించి నిర్ణయించాలి. అంతేగాని ప్రజల్ని భయపెట్టిగాని, ఆశ చూపించిగాని ధార్మిక సమావేశాలకు హాజరుపరచటం సమంజసమైన విషయం కాదు.

٧٠٠ - وعن أبي اليَقْظَانِ عَمَّارِ بن يَاسِرٍ رضي الله عنهما قال: سَمِعْتُ رسولَ الله ﷺ يقول: «إنَّ طُولَ صَلاَةِ الرَّجُلِ، وَقِصَرَ خُطْبَتِهِ، مَئِنَّةٌ مِنْ فِقْهِهِ، فَأَطِيلوا الصَّلاةَ وَأَقْصِروا الخُطْبَةَ» رواه مسلم. «مَئِنَّةٌ» بميم مفتوحة، ثم همزة مكسورة، ثم نون مشدّدة، أيْ: عَلاَمَةٌ دَالَّةٌ عَلى فِقْهِهِ.

700. దైవప్రవక్త (సల్లం) ఇలా అంటుండగా తాను విన్నానని హజ్రత్ అబుల్ యఖ్జాన్ అమ్మార్ బిన్ యాసిర్ (రజి) తెలియజేశారు : సుదీర్ఘమైన నమాజ్ చేయటం, ముక్తసరిగా ఉపన్యసించటం అనేది మనిషి వివేకానికి ఆనవాలు. కనుక మీరు నమాజ్‌ను సుదీర్ఘంగా చేయండి, ఉపన్యాసం ముక్తసరిగా ఇవ్వండి. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జుమా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సుదీర్ఘంగా నమాజ్ చేయటమంటే ఇమామ్ అయిన వ్యక్తి తన వెనక నమాజ్ చేస్తున్నవారి (ముఖ్తదీల) ఇబ్బందుల్ని ఏమాత్రం పట్టించుకోకుండా చాలా సుదీర్ఘంగా నమాజ్ చేయించటమని అర్థం ఎంతమాత్రం కాదు. ఎందుకంటే అలా చేయటాన్ని హదీసుల్లో గర్హించటం జరిగింది. వెనక నమాజ్ చేసేవారిలో వృద్ధులు, బలహీనులు, పిల్లలు మొదలైనవారు ఉంటారు. కనుక నమాజ్‌కు సారథ్యం వహించే వ్యక్తి (ఇమామ్) వారందరినీ దృష్టిలో పెట్టుకొని ఎవరికీ భారం అనిపించని విధంగా నమాజ్ చేయించాలి.

రెండో విషయం ఏమిటంటే, శుక్రవారం రోజు చేసే ఆరాధనలో నమాజ్‌కన్నా ఉపన్యాసం (ఖుత్బా) ముక్తసరిగా ఉండాలి. అంతేగాని సుదీర్ఘంగా ఉపన్యాసం దంచి ఆ తరువాత నమాజ్ దగ్గరికి వచ్చేసరికి తొందరచేయటం మంచిదికాదు. నమాజ్‌ను పూర్తి ఏకాగ్రతతో, అత్యంత భక్తిశ్రద్ధలతో, సక్రమంగా, ప్రశాంతంగా చేయాలి. అవసరమైతే దానికోసం ప్రసంగాన్ని (ఖుత్బాను) ముక్తసరు చేసుకోవాలి.

701. హజ్రత్ ముఆవియా బిన్ హకమ్ సులమీ (రజి) కథనం : నేనొకసారి దైవ ప్రవక్త (సల్లం)తో పాటు నమాజ్ చేస్తుండగా అక్కడున్న వారిలో ఎవరో తుమ్మారు. దానికి నేను 'యర్హముకల్లాహ్' అని అన్నాను. దాంతో ప్రజలంతా నావైపే చూడసాగారు. నాక్కాస్త ఇబ్బందిగా అనిపించి, "మీ అమ్మ కడుపులు కాల! ఏమయింది మీకు నా వంక అలా చూస్తున్నారు?" అని అన్నాను. దానికి వారు తమ చేతులను తమ తొడలపై చరచి సైగచేయసాగారు. అప్పుడు వారు నన్ను నిశ్శబ్దంగా ఉండమని చెబుతున్నారని అర్థం చేసుకొని నేను నిశ్శబ్దంగా ఉండిపోయాను. కాసేపటికి దైవప్రవక్త (సల్లం) నమాజు ముగించుకున్నారు.

నా తల్లిదండ్రుల్ని ఆయనకోసం అర్పింతును! ఆయనకన్నా ఉత్తమంగా బోధించే గురువుని నేను అంతకు ముందుగాని, ఆ తరువాతగాని ఎన్నడూ చూడలేదు. దైవసాక్షి! ఆయన నన్ను మందలించలేదు. నన్ను కొట్టలేదు. దూషించనూ లేదు. పైగా (ఎంతో ప్రేమగా) ఇలా అన్నారు : "ఇది నమాజ్. ఇందులో ప్రజలు మాట్లాడుకునే (ఇతరత్రా) మాటలు మాట్లాడుకోరాదు. దేవుని పవిత్రతను కొనియాడటం, దేవుని గొప్పదనాన్ని చాటడం, ఖుర్ఆన్‌ను పారాయణం చేయటం - వీటి సమాహారమే నమాజ్" అని అన్నారు.

٧٠١ ـ وعن مُعَاوِيَةَ بنِ الحَكَمِ السُّلَمِيِّ رضي الله عنه قال: بَيْنَا أَنَا أُصَلِّي مَعَ رَسولِ اللهِ ﷺ، إذْ عَطَسَ رَجُلٌ مِنَ القَوْمِ فقُلْتُ: يَرْحَمُكَ اللهُ، فَرَمَاني القَوْمُ بِأَبْصَارِهِمْ! فَقُلْتُ: وَاثُكْلَ أُمِّيَاهُ! مَا شَأْنُكُمْ تَنظُرونَ إليَّ؟ فَجَعَلُوا يَضْرِبُونَ بِأَيْدِيهِمْ عَلى أَفْخَاذِهِمْ! فَلَمَّا رَأَيْتُهُمْ يُصَمِّتُونَني لكِنِّي سَكَتُّ. فَلَمَّا صلّى رسولُ اللهِ ﷺ، فَبِأَبي هُوَ وَأُمِّي، مَا رَأَيْتُ مُعَلِّماً قَبْلَه وَلاَ بَعْدَه أَحْسَنَ تَعْلِيماً مِنْه، فَوَاللهِ! مَاكَهَرَني وَلاَضَرَبَني ولاَ شَتَمَنِي، قال: «إنَّ هذِه الصَّلاَةَ لاَ يَصْلُحُ فِيها شَيءٌ مِنْ كَلام النَّاس، إنَّمَا هِيَ التَّسْبِيحُ والتَّكْبِيرُ، وَقِراءَةُ القُرْآنِ» أَو كما قال

رسولُ اللهِ ﷺ. قلتُ: يا رسولَ اللهِ! إني حَدِيثُ عَهْدٍ بجَاهِلِيَّةٍ، وَقَدْ جَاءَ اللهُ بالإِسْلاَمِ، وَإِنَّ مِنَّا رِجالاً يَأْتُونَ الْكُهَّانَ، قال: «فَلاَ تَأْتِهِمْ»، قلتُ: وَمِنَّا رِجَالٌ يَتَطَيَّرونَ؟ قال: «ذَاكَ شَيْءٌ يَجِدونَه في صُدورِهِمْ، فَلاَ يَصُدَّنَّهُمْ» رواه مسلم. «الثُّكْل» بضم الثاءِ المُثلثة: المُصِيبَةُ وَالفَجِيعَة. «مَا كَهَرَنِي» أَيْ: مَا نَهَرَنِي.

లేదా దైవప్రవక్త (సల్లం) ఇలాంటి మాటలే అని ఉంటారు.

అప్పుడు నేనాయనతో, "దైవప్రవక్తా! నేను నిన్నమొన్నటి వరకూ అజ్ఞాన జీవితమే గడిపాను. (ఇప్పుడే) దేవుడు (మా దగ్గరికి) ఇస్లాం ధర్మం తీసు కొచ్చాడు. (అజ్ఞానకాలంలో) మాలో కొందరు జ్యోతిషుల్ని సంప్రదించేవారు. (అలా సంప్రతించటం ధర్మసమ్మత మేనా?)" అని అడిగాను. దానికాయన, "నువ్వు జ్యోతిషుల దగ్గరికి వెళ్ళకు" అని అన్నారు. "మరి మాలో కొంతమంది దుశ్శకునాలు కూడా చూస్తారు?" అన్నాను నేను. అందుకాయన, "అవన్నీ మనసుకు నచ్చచెప్పుకునే మాటలే. నిజానికి అవేవీ ప్రజల పనుల్ని పాడు చేయవు" అని చెప్పారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని మస్జిదుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసు ద్వారా నాలుగు విషయాలు బోధపడుతున్నాయి. ఒకటి : నమాజులో మాట్లాడటం నిషిద్ధమైనట్లే ఇతరుల తుమ్ముకు జవాబు చెప్పటం కూడా నిషిద్ధం. అయితే తుమ్మినవాడు స్వయంగా నమాజులో అల్‌హమ్దులిల్లాహ్ అని అంటే అందులో తప్పులేదు. అల్‌హమ్దులిల్లాహ్ అన్న వచనంలో అల్లాహ్ ప్రశంస ఉంది. కనుక నమాజులో ఇది సమ్మతమే. రెండు : ఇందులో దైవప్రవక్త (సల్లం) ప్రజలకు ధర్మవిషయాలు ఏ విధంగా బోధించేవారో వివరించబడింది. ఏమీ తెలియనివారికి ఆయన ఎంతో ఉత్తమమైన పద్ధతిలో ధర్మ విషయాలు బోధించేవారు. అజ్ఞానం వల్ల వారు చేసే తప్పులపై ఎలాంటి కినుక, కోపం వ్యక్తపరిచేవారు కాదు. ఇస్లాం ధర్మప్రచారకులకు ఇందులో గొప్ప హితబోధ ఉంది. మూడు : భవిష్యత్తులో జరగబోయే సంఘటనల గురించి తెలుసుకోవటానికి జ్యోతిషుల దగ్గరికి వెళ్ళటం నిషిద్ధం. నాలుగు : దుశ్శకునాలు చూడటాన్ని కూడా దైవప్రవక్త (సల్లం) వారించారు. అజ్ఞానకాలంలో జోస్యం, దుశ్శకునాలు చాలా ఎక్కువగా ఉండేవి. ఇస్లాం వచ్చి వాటిని అంతమొందించింది. కాని అజ్ఞానులైన ముస్లింలలో నేడు ఈ రుగ్మతలు మళ్ళీ పురుడుపోసుకున్నాయి. అల్లాహ్ అలాంటి ముస్లింలకు సన్మార్గం చూపుగాక!

٧٠٢ ـ وعن العِرْبَاضِ بنِ سارِيَةَ رضي الله عنه قال: وَعَظَنَا رسولُ اللهِ ﷺ مَوْعِظَةً وَجِلَتْ مِنْها القُلُوبُ، وَذَرَفَتْ مِنْها العُيونُ. وَذَكَرَ الحَدِيثَ وَقَدْ سَبَقَ بِكَمَالِهِ في باب الأَمْر بالمُحَافَظَةِ عَلى السُّنَّة، وَذَكَرْنا أَنَّ التِّرْمِذيَّ قال: إِنَّهُ حديث حسنٌ صحيحٌ.

702. హజ్రత్ ఇర్‌బాజ్ బిన్ సారియా (రజి) కథనం : ఓసారి దైవప్రవక్త (సల్లం) మాకు ఎంతో ప్రభావవంతమైన హిత బోధ చేశారు. అది విని మా హృదయాలు భయంతో కంపించిపోయాయి. కళ్ళవెంట అశ్రుధారలు ప్రవహించాయి... (హదీసు చివరిదాకా). ఈ హదీసు పూర్తిగా ఇంతకుముందు 'ప్రవక్త (స) సంప్రదాయాన్ని కాపాడాలి' అనే అధ్యాయంలో కూడా వచ్చింది. అక్కడ మేము ఇమామ్ తిర్మిజీ ఈ హదీసుని హసన్, సహీహ్‌గా నిర్ధారించారని కూడా పేర్కొన్నాం.

*(సుననె తిర్మిజీలోని విద్యా విషయక అధ్యాయం)*

*పై హదీసుని పూర్తిగా చదివితే ప్రసంగం అనేది ముక్తసరిగా, సమగ్రంగా, ప్రభావవంతంగా, ప్రయోజనకరంగా ఉండాలనే విషయం బోధపడుతుంది.*



92వ అధ్యాయం

# ٩٢ ـ بَابُ الْوَقَارِ وَالسَّكِينَةِ

# ప్రశాంతత, హుందాతనం

قال الله تعالى: ﴿وَعِبَادُ الرَّحْمَٰنِ الَّذِينَ يَمْشُونَ عَلَى الْأَرْضِ هَوْنًا وَإِذَا خَاطَبَهُمُ الْجَاهِلُونَ قَالُوا سَلَامًا﴾ [الفرقان: ٦٣].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు:

"కరుణామయుని (అసలు) దాసులు ఎవరంటే, వారు నేలపై వినమ్రులై నడుస్తారు, మూర్ఖులు వారిని పలకరించినప్పుడు 'మీకో సలామ్' అని చెప్పి అక్కణ్ణుంచి వెళ్ళి పోతారు." *(అల్ ఫుర్ఖాన్ : 63)*

**వివరణ :**

నేలపై నిక్కుతూ నడవటమనేది మూర్ఖత్వానికి నిదర్శనం. దీనికి భిన్నంగా అణకువతో వినయవినమ్రతలు ఉట్టిపడేలా నడవటం హుందాతనానికి తార్కాణం. అదేవిధంగా మూర్ఖులతో వాదులాటకు దిగటం కూడా హుందాతనానికి విరుద్ధమే. విశ్వాసులైన దాసులు తమకు ఎప్పుడైనా మూర్ఖులు తారసిల్లితే ఉత్తమోత్తమ రీతిలో అక్కణ్ణుంచి తప్పించుకోవటానికి ప్రయత్నిస్తారు.

٧٠٣ ـ عن عائشةَ رضي الله عنها قالتْ: مَا رَأَيْتُ رسولَ اللهِ ﷺ مُسْتَجْمِعاً قَطُّ ضَاحِكاً حَتَّى تُرَى مِنْه لَهَوَاتُه، إِنَّمَا كانَ يَتَبَسَّمُ. متفقٌ عليه. «اللَّهَوَات» جَمْع لَهَاةٍ: وَهِيَ اللَّحْمَةُ الَّتِي في أَقْصَى سَقْفِ الْفَمِ.

703. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) తన గొంతుక తిత్తులు కనబడేవిధంగా విరగబడి నవ్వటం నేనెన్నడూ చూడలేదు. ఆయన కేవలం చిరునవ్వు చిందించేవారు. *(బుఖారీ - ముస్లిం)*

లహవాత్ అనేది 'లహాతున్' అనే పదానికి బహువచనం. గొంతుకలో నోటి చివర పైభాగంలో ఉండే మాంసపు తిత్తిని లహాతున్ అని అంటారు.

**ముఖ్యాంశాలు**

విపరీతమైన నవ్వు మనిషిని దేవుని విషయంలో ఏమరుపాటుకు గురి చేస్తుంది. అందుకే దివ్య ఖుర్‌ఆన్‌లో ఒకచోట, "వారు నవ్వటం తగ్గించాలి, ఏడ్వటం హెచ్చించాలి" అని చెప్పబడింది. అదీగాక బిగ్గరగా, పగలబడి నవ్వటం మూలంగా మనిషి తన గాంభీర్యాన్ని, హుందాతనాన్ని కోల్పోతాడు. సౌమ్యులు, పరువుప్రతిష్ఠలు కలిగివున్న వారెవరూ పగలబడి నవ్వరు. వారి పెదవులపై ఎల్లప్పుడూ చిరునవ్వే తొణకిసలాడుతూ ఉంటుంది.

## 93వ అధ్యాయం

# ٩٣ - بَابُ النَّدْبِ إِلَى إِتْيَانِ الصَّلاَةِ وَالْعِلْمِ وَنَحْوِهِمَا مِنَ الْعِبَادَاتِ بِالسَّكِينَةِ وَالْوَقَارِ

# నమాజుకుగాని, విద్యాభ్యాసం కోసంగాని లేదా ఇత్యాది ఆరాధనలకోసం గాని వెళ్ళినప్పుడు ప్రశాంతంగా, హుందాగా వెళ్ళాలి

قال الله تعالى: ﴿ وَمَن يُعَظِّمْ شَعَٰٓئِرَ ٱللَّهِ فَإِنَّهَا مِن تَقْوَى ٱلْقُلُوبِ ﴾ [الحج: ٣٢].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

“ఎవరైనా అల్లాహ్ నిర్ణయించిన చిహ్నాలను గౌరవిస్తున్నారంటే అది హృదయాలలోని దైవభీతి వలననే.” *(అల్ హజ్ : 32)*

**వివరణ :**

ఇక్కడ చిహ్నాలు అంటే దేవుని ఆదేశాలు అని అర్థం. వాటిని పాటించటం చాలా అవసరం. కేవలం పాటించటమే కాదు, వాటిని పాటించే తీరులోనూ గౌరవభావం ద్యోతకమవ్వాలి. దైవారాధన చేసినప్పుడు, ఆయన ఆజ్ఞల్ని పాటించేటప్పుడు అత్యంత భక్తిశ్రద్ధలతో, ప్రశాంతంగా, హుందాతనంతో ప్రవర్తించాలి.

٧٠٤ - وعن أبي هريرةَ رضي الله عنه قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقول: «إذا أُقِيمَتِ الصَّلاةُ، فَلا تَأْتُوهَا وَأَنْتُمْ تَسْعَوْنَ، وَأْتُوهَا وَأَنْتُمْ تَمْشُونَ، وَعَلَيْكُمُ السَّكِينَةَ، فَمَا أَدْرَكْتُمْ فَصَلُّوا، وَمَا فَاتَكُمْ

704. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలియజేశారు : నమాజు చేయటానికి (జన సమూహం) నిలబడినప్పుడు అందులో చేరటానికి పరుగెత్తుకుంటూ పోకూడదు. అలా గాకుండా ప్రశాంతంగా నడచివెళ్ళాలి. సామూహిక నమాజును మీరు ఏమేరకు పొందారో ఆ మేరకు చేయండి. మిగతా

فَأَتِمُّوا» متفقٌ عليه. زاد مسلم في روايةٍ له: «فإنَّ أَحَدَكُمْ إذا كَانَ يَعْمِدُ إلى الصَّلاةِ فَهُوَ في صَلاةٍ».

నమాజును (వ్యక్తిగతంగా చేసి) పూర్తి చేసుకోండి." (బుఖారీ - ముస్లిం)

ముస్లిం తన ఉల్లేఖనంలో, "మీలో ఎవరైనా నమాజ్ కోసం వెళితే అతనా సమయంలో నమాజ్‌లోనే ఉన్నట్లు పరిగణించబడతాడు" అనే వాక్యాన్ని అదనంగా పేర్కొన్నారు.

*(సహీహ్ బుఖారీలోని జుమా ప్రకరణం, సహీహ్ ముస్లింలోని మస్జిదుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. సామూహిక నమాజ్‌లో పాల్గొనేందుకు పరుగెత్తుకుంటూ వెళ్ళటాన్ని ఈ హదీసులో వారించటం జరిగింది. ఆరాధనల్లో ప్రశాంతత, హుందాతనం అవసరం.
2. మనిషి ఇంట్లో వుజూ చేసి నమాజుకై బయలుదేరితే అప్పటి నుంచే అతను నమాజులో ఉన్నట్లుగా పరిగణించబడతాడు.
3. వెనుకవచ్చే వారు ఇమాముతో కలిసి చేసే రకాతును మొదటి రకాతుగా భావించాలి. ఆ తర్వాత ఒంటరిగా చేసుకునే రకాతులు వారికి చివరి రకాతులు అవుతాయి.

٧٠٥ ـ وعن ابن عباسٍ رضي الله عنهما أَنَّهُ دَفَعَ مَعَ النَّبِيِّ ﷺ يَوْمَ عَرَفَةَ فَسَمِعَ النَّبِيُّ ﷺ وَرَاءَهُ زَجْراً شَدِيداً وَضَرْباً وَصَوْتاً للإِبلِ، فَأَشَارَ بِسَوْطِهِ إِلَيْهِمْ وقال: «أَيُّهَا النَّاسُ عَلَيْكُمْ بِالسَّكِينَةِ فَإِنَّ الْبِرَّ لَيْسَ بِالإِيضَاعِ» رواه البخاري، وروى مسلم بعضه. «الْبِرُّ»: الطَّاعَةُ. وَ«الإِيضَاعُ» بِضادٍ معجمةٍ قبلها ياءٌ وهمزةٌ مكسورةٌ، وَهُوَ الإِسْرَاعُ.

705. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం ఆయన అరఫా రోజు దైవప్రవక్త (సల్లం)తో పాటు (అరఫా స్థలం నుండి) తిరిగి వెళుతుండగా దైవప్రవక్తకు తన వెనుక ఎవరో గట్టిగా మందలించినట్లు, కొట్టినట్లు ఒంటె అరుపు వినపడింది. ఆయన (వెనక్కి తిరిగి) కొరడా పట్టుకొని వున్న చేత్తోనే సైగ చేస్తూ, "ప్రజలారా! ప్రశాంతంగా నడవండి. ఎందుకంటే వేగంగా నడవటం పుణ్య కార్యం కాదు" అని అన్నారు. (ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని హజ్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

పై హదీసులో ప్రస్తావించబడిన సంఘటన కాబా యాత్ర (హజ్) సందర్భంగా జరిగినది. ఇస్లాం ధర్మం ఆరాధనలన్నిటిలోనూ ప్రశాంతత, నింపాదితనం ఉండాలని ఆదేశిస్తోంది. ముఖ్యంగా హజ్ విషయంలో ఈ ఆదేశం మరింత ప్రాముఖ్యతను సంతరించుకుంటుంది. ఎందుకంటే కాబా యాత్ర జరిగినప్పుడు ప్రపంచం నలుమూలల నుంచి లక్షలాదిమంది దేవుని భక్తులు అక్కడ గుమిగూడతారు. కాబా గృహ ప్రాంగణంలో జన సందోహం ఇసుకేస్తే రాలనంత దట్టంగా ఉంటుంది. అలాంటప్పుడు భక్తులు ఏమాత్రం తొందరపాటు ప్రదర్శించినా జనం మధ్య తోపులాటలు, తొక్కిసలాటలు జరిగి ప్రాణాపాయకరమైన పరిస్థితి నెలకొనే అవకాశాలున్నాయి. అంచేత ముఖ్యంగా హజ్ సమయంలో మాత్రం భక్తులు చాలా నెమ్మదిగా, నిదానంగా మసలుకోవాలి.



94వ అధ్యాయం

## ٩٤ ـ بَابُ إِكْرَام الضَّيْفِ

## అతిథులకు మర్యాద చేయటం గురించి

قال الله تعالى: ﴿هَلْ أَتَىٰكَ حَدِيثُ ضَيْفِ إِبْرَٰهِيمَ ٱلْمُكْرَمِينَ ۝٢٤ إِذْ دَخَلُوا۟ عَلَيْهِ فَقَالُوا۟ سَلَـٰمًا ۖ قَالَ سَلَـٰمٌ قَوْمٌ مُّنكَرُونَ ۝٢٥ فَرَاغَ إِلَىٰٓ أَهْلِهِۦ فَجَآءَ بِعِجْلٍ سَمِينٍ ۝٢٦ فَقَرَّبَهُۥٓ إِلَيْهِمْ قَالَ أَلَا تَأْكُلُونَ﴾ [الذاريات: ٢٤ ـ ٢٧]. وقال تعالى: ﴿وَجَآءَهُۥ قَوْمُهُۥ يُهْرَعُونَ إِلَيْهِ وَمِن قَبْلُ كَانُوا۟ يَعْمَلُونَ ٱلسَّيِّـَٔاتِ ۚ قَالَ يَـٰقَوْمِ هَـٰٓؤُلَآءِ بَنَاتِى هُنَّ أَطْهَرُ لَكُمْ ۖ فَٱتَّقُوا۟ ٱللَّهَ وَلَا تُخْزُونِ فِى ضَيْفِىٓ ۖ أَلَيْسَ مِنكُمْ رَجُلٌ رَّشِيدٌ﴾ [هود: ٧٨].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"ఓ ప్రవక్తా! ఇబ్రాహీమ్ యొక్క గౌరవనీయులైన అతిథులగాథ నీకు చేరిందా? వారు అతని వద్దకు వచ్చి 'మీకు సలామ్' అని అన్నారు. అతను, 'మీకు కూడా సలామ్ - ఎవరో కొత్తవారులాగా ఉన్నారు' అని అన్నాడు. తరువాత అతను తన ఇంటికి వెళ్ళి, ఒక (వేపబడిన) బలిసిన మంచి ఆవు దూడను తెచ్చి అతిథుల ముందుపెట్టాడు. (కాని వారు దాన్ని తినకపోవటంతో ఆశ్చర్యపోయి) మీరు ఎందుకని తినటం లేదు?" అని అడిగాడు. *(అజ్ జారియాత్ : 24 - 27)*

"(లూత్ ఇంటికి అతిథులు రాగానే) అతని జాతి ప్రజలు అప్రయత్నంగానే అతని ఇంటి వైపునకు పరుగెత్తారు. మొదటినుండీ వారు ఇలాంటి నీచపు పనులకే అలవాటు పడ్డ వారు. లూత్ వారితో ఇలా అన్నాడు : "సోదరులారా! ఇదిగో, నా కూతుళ్ళు ఉన్నారు. వీరు మీకు ఎక్కువ పరిశుద్ధులు అయినవారు. కొంచెమన్నా దేవునికి భయపడండి. నా అతిథుల విషయంలో నన్ను అవమానంపాలు చెయ్యకండి. మీలో ఒక్కడైనా మంచివాడు లేడా?" *(హూద్ : 78)*

٧٠٦ ـ عن أبي هريرةَ رضي الله عنه أنَّ النبيَّ ﷺ قال: «مَنْ كَانَ يُؤْمِنُ باللهِ وَالْيَوْمِ الآخِرِ فَلْيُكْرِمْ ضَيْفَهُ، وَمَنْ كَانَ

706. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : దేవుణ్ణి, అంతిమదినాన్ని విశ్వసించేవారు తమ అతిథులకు మర్యాద చేయాలి. దేవుణ్ణి, అంతిమ

يُؤْمِنُ بِاللهِ وَالْيَوْمِ الآخِرِ فَلْيَصِلْ رَحِمَهُ وَمَنْ كَانَ يؤمِنُ بِاللهِ وَالْيَوْمِ الآخِرِ فَلْيَقُلْ خَيْراً أَوْ لِيَصْمُتْ» متفقٌ عليه.

దినాన్ని విశ్వసించేవారు తమ బంధువులతో మంచిసంబంధాలు పెట్టుకోవాలి. దేవుణ్ణి, అంతిమదినాన్ని విశ్వసించేవారు పలికితే మంచిమాటే పలకాలి లేదా మౌనం వహించాలి."

(బుఖారీ - ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)

٧٠٧ ـ وعن أبي شُرَيْحٍ خُوَيلدِ بن عمرٍو الخُزَاعِيِّ رضي الله عنه قال: سَمِعْتُ رسولَ اللهِ ﷺ يقول: «مَنْ كان يُؤْمِنُ باللهِ وَالْيَوْمِ الآخِرِ فَلْيُكرِمْ ضَيفَهُ جَائِزَتَهُ» قالوا: وما جَائِزَتُهُ يا رسولَ اللهِ؟ قال: «يَومُهُ ولَيْلَتُهُ، والضِّيَافَةُ ثَلاثَةُ أَيَّامٍ، فما كان وَرَاءَ ذلكَ فهو صَدَقَةٌ عليه» متفقٌ عليه. وفي روايةٍ لمسلمٍ: «لا يَحِلُّ لِمُسلِمٍ أن يُقِيمَ عِند

707. దైవప్రవక్త (సల్లం) ఇలా చెబుతుండగా తాను విన్నానని హజ్రత్ అబూ షురైహ్ ఖువైలిద్ బిన్ అమ్ర్ ఖుజాయీ (రజి) తెలియజేశారు: దేవుణ్ణి, అంతిమ దినాన్ని విశ్వసించేవారు తమ అతిథుల్ని గౌరవిస్తూ వారి హక్కుని నెరవేర్చాలి.

అప్పుడు కొంతమంది సహచరులు, "దైవప్రవక్తా! అతని హక్కు ఏమిటి?" అని అడిగారు. అందుకాయన, "ఒక పగలు, ఒక రాత్రి (ఆతిథ్యం పుచ్చుకోవటం) అతని హక్కు. మూడు రోజులు అతనికి సాధారణ ఆతిథ్యమివ్వాలి. అంతకంటే ఎక్కువ రోజులు ఆతిథ్యమిస్తే అది (అతిథికి) దానం ఇచ్చినట్లుగా భావించబడుతుంది.

(బుఖారీ - ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది, "తన సోదరుని దగ్గర ఎక్కువ కాలం (అతిథిగా) ఉండి అతన్ని పాపంలో పడవేయటం ఏ ముస్లింకూ సమ్మతం కాదు" అని దైవప్రవక్త (సల్లం) అన్నారు.

أَخِيهِ حتى يُؤْثِمَهُ» قالوا: يا رسولَ الله! وكَيْفَ يُؤْثِمُهُ؟ قال: «يُقِيمُ عِنْدَهُ وَلا شَيْءَ لَهُ يَقْرِيهِ بِهِ».

అది విని ఆయన అనుచరులు కొంత మంది, "దైవప్రవక్తా! అతిథి అతన్ని పాపంలో ఎలా పడవేస్తాడు?" అని అడిగారు. దానికాయన, "ఆతిథ్యకర్త దగ్గర సత్కరించటానికి ఏమీ లేనప్పుడు అతిథి తిష్ఠవేసి కూర్చుంటే (ఆతిథ్యకర్త ఏం చేస్తాడు?)" అని అన్నారు.

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సంప్రాప్త వస్తువుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో అతిథికి - ఆతిథ్యకర్తకు మధ్య ఉండాల్సిన నైతిక సంబంధాలు, నియమ నిబంధనల గురించి వివరించటం జరిగింది. ఇంటికి వచ్చిన అతిథికి తొలిరోజు రేయింబవళ్ళు తమకు ఉన్నంతలోనే అత్యుత్తమంగా మర్యాదలు చేయాలి. తరువాత రెండ్రోజుల వరకు సాధారణ రీతిలోనే ఆతిథ్యమివ్వాలి. మూడు రోజులు అయిన తరువాత అతిథి స్వయంగా తన నైతికవిధిగా భావించి అక్కణ్ణుంచి వెళ్ళిపోవాలి. అలా వెళ్ళిపోకుండా అక్కడే తిష్ఠవేసి కూర్చుంటే తను ఆతిథ్యకర్త దగ్గర దానం పుచ్చుకుంటున్నట్లుగా పరిగణించటం జరుగుతుంది.



## 95వ అధ్యాయం

# ٩٥ - بَابُ اسْتِحْبَابِ التَّبْشِيرِ وَالتَّهْنِئَةِ بِالْخَيْرِ

# శుభవార్తలు అందజేయటం, శుభాకాంక్షలు తెలపటం అభిలషణీయం

قال الله تعالى: ﴿فَبَشِّرْ عِبَادِ ۝ الَّذِينَ يَسْتَمِعُونَ الْقَوْلَ فَيَتَّبِعُونَ أَحْسَنَهُ﴾ [الزمر: ١٧-١٨]. وقال تعالى: ﴿يُبَشِّرُهُمْ رَبُّهُم بِرَحْمَةٍ مِّنْهُ وَرِضْوَانٍ وَجَنَّاتٍ لَّهُمْ فِيهَا نَعِيمٌ مُّقِيمٌ﴾ [التوبة: ٢١] وقال تعالى: ﴿وَأَبْشِرُوا بِالْجَنَّةِ الَّتِي كُنتُمْ تُوعَدُونَ﴾ [فصلت: ٣٠]. وقال تعالى: ﴿فَبَشَّرْنَاهُ بِغُلَامٍ حَلِيمٍ﴾ [الصافات: ١٠١]. وقال تعالى: ﴿وَلَقَدْ جَاءَتْ رُسُلُنَا إِبْرَاهِيمَ بِالْبُشْرَىٰ﴾ [هود: ٦٩]. وقال تعالى: ﴿وَامْرَأَتُهُ قَائِمَةٌ فَضَحِكَتْ فَبَشَّرْنَاهَا بِإِسْحَاقَ وَمِن وَرَاءِ إِسْحَاقَ يَعْقُوبَ﴾ [هود: ٧١]. وقال تعالى: ﴿فَنَادَتْهُ الْمَلَائِكَةُ وَهُوَ قَائِمٌ يُصَلِّي فِي الْمِحْرَابِ أَنَّ اللَّهَ يُبَشِّرُكَ بِيَحْيَىٰ﴾ [آل عمران: ٣٩]. وقال تعالى: ﴿إِذْ قَالَتِ الْمَلَائِكَةُ يَا مَرْيَمُ إِنَّ اللَّهَ يُبَشِّرُكِ بِكَلِمَةٍ مِّنْهُ اسْمُهُ الْمَسِيحُ﴾ الآية [آل عمران: ٤٥]، والآيات في الباب كثيرة معلومة.

దివ్య ఖురాన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"ఓ ప్రవక్తా! మాటను శ్రద్ధగా విని, అందులోని మంచి మంచి విషయాలను అనుసరించే నా దాసులకు శుభవార్త అందజెయ్యి." *(అజ్ జుమర్ : 17, 18)*

"వారి ప్రభువు వారికి తన కారుణ్యం, తన సంతోషాల శుభవార్తనూ, శాశ్వత భోగాల సామగ్రిగల స్వర్గవనాల శుభవార్తనూ ఇస్తున్నాడు." *(అత్ తౌబా : 21)*

"మీకు వాగ్దానం చేయబడిన స్వర్గం అనే శుభ వార్తను విని ఆనందించండి." *(ఫుస్సిలత్ : 30)*

"మేము అతనికి ఒక సహనశీలుడైన కుమారుడు కలుగుతాడనే శుభవార్తను అందజేశాము." *(అస్ సాఫ్ఫాత్ : 101)*

"ఇబ్రాహీమ్ వద్దకు మా దూతలు శుభవార్తను తీసుకొని చేరారు." *(హూద్ : 69)*

"ఇబ్రాహీమ్ భార్య కూడా అక్కడ నిలబడి ఉన్నది. ఆమె ఆ శుభవార్త విని నవ్వింది. అప్పుడు మేము ఆమెకు ఇస్‌హాఖ్ శుభవార్తనూ, ఇస్‌హాఖ్ తరువాత యాఖూబ్ శుభ వార్తను అందజేశాము." *(హూద్ : 71)*

"జకరియ్యా తన గదిలో నిలబడి నమాజ్ చేస్తూ ఉన్నప్పుడు, దైవదూతలు సమాధానంగా ఇలా ప్రకటించారు: "అల్లాహ్ నీకు

وأما الأحاديث فكثيرة جدًّا، وهي مشهورة في الصحيح، منها:

యహ్యా (ను గురించిన) శుభవార్త ఇస్తున్నాడు." *(ఆలి ఇమ్రాన్ : 39)*

"దైవదూతలు ఇలా అన్నారు : 'మర్యమ్! అల్లాహ్ తన ఒక 'ఆజ్ఞ'కు సంబంధించిన శుభవార్తను నీకు పంపుతున్నాడు. అతని పేరు ఈసా మసీహ్." *(ఆలి ఇమ్రాన్ : 45)*

٧٠٨ - عن أبي إبراهيمَ وَيُقَالُ: أبو محمدٍ، ويقالُ أبو مُعَاوِيَةَ - عَبْدِ اللهِ بنِ أبي أَوْفَى رضي الله عنه أَنَّ رسولَ اللهِ ﷺ بَشَّرَ خَدِيجَةَ رَضي الله عنها، بِبَيْتٍ في الجَنَّةِ مِنْ قَصَبٍ، لا صَخَبَ فِيهِ ولا نَصَبَ. متفقٌ عليه. «القَصَبُ» هُنَا: اللُّؤْلُؤُ المُجَوَّفُ. وَ«الصَّخَبُ»: الصِّيَاحُ وَاللَّغَطُ. وَ«النَّصَبُ»: التَّعَبُ.

708. హజ్రత్ అబూ ఇబ్రాహీమ్ లేక అబూ ముహమ్మద్ లేక అబూ ముఆవియా అబ్దుల్లాహ్ బిన్ అబూ ఔఫా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) హజ్రత్ ఖదీజా (రజి)కు స్వర్గంలో ఆమె కోసం ప్రత్యేక మణులతో నిర్మించబడిన గృహం ఉందని శుభవార్త తెలియజేశారు. ఆ నిలయంలో ఎలాంటి అల్లరిగాని, అలుపుగాని ఉండదు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణాలు)*

٧٠٩ - وعن أبي موسى الأشْعَرِيِّ رضي الله عنه، أَنَّهُ تَوَضَّأَ في بَيْتِهِ، ثُمَّ خَرَجَ فقال: لأَلْزَمَنَّ رسولَ اللهِ ﷺ، وَلأَكُونَنَّ مَعَهُ يَوْمِي هذا، فَجَاءَ المَسْجِدَ، فَسَأَلَ عَنِ النَّبِيِّ ﷺ فقالوا: وَجَّهَ هٰهُنَا، قال: فَخَرَجْتُ على أَثَرِهِ أَسْأَلُ عَنْهُ، حَتَّى دَخَلَ بِئْرَ أَرِيسٍ، فَجَلَسْتُ عِنْدَ البَابِ حَتَّى قَضَى رسولُ اللهِ ﷺ حَاجَتَهُ وَتَوَضَّأَ، فَقُمْتُ إِلَيْهِ، فَإِذَا هُوَ قَدْ جَلَسَ عَلَى بِئْرِ أَرِيسٍ، وَتَوَسَّطَ قُفَّهَا، وَكَشَفَ عَنْ سَاقَيْهِ وَدَلَّاهُمَا في البِئْرِ،

709. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం ఓ రోజు ఆయన ఇంట్లో వుజూ చేసుకొని బయలుదేరారు. ఆ రోజు దైవప్రవక్త (సల్లం)కు తోడుండి, పగలంతా ఆయన సేవలో గడపాలని మనసులో నిశ్చయించుకొని మస్జిద్‌కు వెళ్ళారు. అక్కడికెళ్ళి దైవప్రవక్త (సల్లం) ఎక్కడున్నారని విచారిస్తే, ఆయన సహచరులు కొందరు ఆయన అటు వైపు వెళ్ళారని చెప్పారు.

(అబూ మూసా ఇలా తెలియజేస్తున్నారు:) అక్కణ్ణుంచి నేను ఆయన

فَسَلَّمْتُ عَلَيْهِ ثُمَّ انصَرَفْتُ، فَجَلَسْتُ عِنْدَ البَابِ فَقُلْتُ: لَأَكُونَنَّ بَوَّابَ رَسُولِ اللهِ ﷺ اليَوْمَ، فَجَاءَ أَبُو بَكْرٍ رَضِيَ اللهُ عنه فَدَفَعَ البَابَ فَقُلْتُ: مَنْ هٰذَا؟ فقال: أَبُو بَكْرٍ، فَقُلْتُ: عَلَى رِسْلِكَ، ثُمَّ ذَهَبْتُ فَقُلْتُ: يَا رَسُولَ اللهِ! هٰذَا أَبُو بَكْرٍ يَسْتَأْذِنُ، فَقَالَ: «ائْذَنْ لَهُ وَبَشِّرْهُ بالجَنَّةِ» فَأَقْبَلْتُ حَتَّى قُلْتُ لِأَبِي بَكْرٍ: ادْخُلْ وَرَسُولُ اللهِ يُبَشِّرُكَ بِالجَنَّةِ، فَدَخَلَ أَبُو بَكْرٍ حَتَّى جَلَسَ عَنْ يَمِينِ النَّبِيِّ ﷺ مَعَهُ فِي القُفِّ، وَدَلَّى رِجْلَيْهِ فِي البِئْرِ كَمَا صَنَعَ رَسُولُ اللهِ ﷺ وَكَشَفَ عَنْ سَاقَيْهِ، ثُمَّ رَجَعْتُ وَجَلَسْتُ، وقَدْ تَرَكْتُ أَخِي يَتَوَضَّأُ وَيَلْحَقُنِي، فَقُلْتُ: إِنْ يُرِدِ اللهُ بِفُلَانٍ -يُرِيدُ أَخَاهُ- خَيْراً يَأْتِ بِهِ، فَإِذا

వెళ్ళిన దారిగుండా నడుచుకుంటూ జనాన్ని విచారించుకుంటూ అటు వైపు వెళ్ళాను. (చివరికి దైవప్రవక్త (సల్లం) కనిపించారు). ఆయన అరీస్ తోటలోకి ప్రవేశించారు. నేను మాత్రం దాని తలుపు దగ్గరే కూర్చున్నాను. దైవప్రవక్త (సల్లం) తమ అవసరాలు తీర్చుకొని వుజూ చేసుకున్న తర్వాత నేనాయన దగ్గరికి వెళ్ళాను. ఆ సమయంలో ఆయన అరీస్ బావి గట్టు మీద కాళ్ళు బావిలోకి వ్రేలాడదీసుకొని కూర్చొని వున్నారు. కాళ్ళమీది ఆచ్ఛాదనం తొలగించుకున్నారు. నేనాయనకు సలాం చేసి తిరిగి తలుపు దగ్గరికొచ్చి కూర్చున్నాను. మనసులో ఆ రోజంతా దైవప్రవక్త (సల్లం)కు ద్వారపాలకునిగా ఉండాలనుకున్నాను.

కాస్సేపటికి అబూబక్ర్ (రజి) వచ్చి తలుపు కొట్టారు. నేను "ఎవరూ?" అన్నాను. "అబూబక్ర్" అని సమాధానమిచ్చారాయన. "కాస్త ఉండండి" అని చెప్పి నేను దైవప్రవక్త దగ్గరికెళ్ళి, "దైవప్రవక్తా! అబూబక్ర్ వచ్చారు. లోనికి రావటానికి అనుమతి అడుగుతున్నారు" అని చెప్పాను. అందుకు దైవప్రవక్త (సల్లం), "ఆయన్ని రానివ్వు. ఇంకా ఆయనకు స్వర్గ శుభవార్త వినిపించు" అని అన్నారు. నేనెళ్ళి (తలుపు తెరిచి), "రండి, దైవప్రవక్త (సల్లం) మీకు స్వర్గ శుభవార్త తెలియజేస్తున్నారు" అంటూ

ఆయన్ని లోనికి ఆహ్వానించాను. అబూబక్ర్ లోపలికి వచ్చి దైవప్రవక్త (సల్లం)కు కుడిప్రక్కన బావిగట్టు మీద కూర్చున్నారు. ఆయన కూడా దైవప్రవక్త (సల్లం) లాగే పిక్కల మీదనుంచి అచ్ఛాదనను తొలగించుకొని కాళ్ళు బావిలోకి జారవిడిచి కూర్చున్నారు. నేను తిరిగి తలుపు దగ్గరికెళ్ళి కూర్చున్నాను.

నేను (ఇంటి నుండి) వచ్చేటప్పుడు మా సోదరుడు వుజూ చేసుకుంటున్నాడు. నేనతన్ని వెంట తీసుకొని రాకుండా అక్కడే వదలిపెట్టి వచ్చాను. తను వెనక వస్తాడనుకున్నాను. దేవుడు అతని శ్రేయస్సు గురించి సంకల్పిస్తే ఆయనే అతడ్ని ఇక్కడికి పంపిస్తాడని అనుకున్నాను మనసులో.

అంతలో మరో వ్యక్తి వచ్చి తలుపు నెట్ట సాగాడు. నేను 'ఎవరూ?' అనడిగాను. "ఉమర్ బిన్ ఖత్తాబ్" అవతలనుంచి ఆయన సమాధానమిచ్చారు. "కాస్త ఆగండి" అంటూ నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికెళ్ళి సలాంచేసి "ఉమర్ (రజి) వచ్చారు. లోపలికి అనుమతించ మని అడుగుతున్నారు" అన్నాను. దానికాయన, "సరే, రమ్మను. ఆయన క్కూడా స్వర్గ శుభవార్త తెలియజేయి" అన్నారు. నేను తలుపు దగ్గరికెళ్ళి, "రండి, దయచేయండి. దైవప్రవక్త (సల్లం) మీకు స్వర్గ శుభవార్త తెలియ జేస్తున్నారు" అంటూ ఆయన్ని కూడా

إِنْسَانٌ يُحَرِّكُ الْبَابَ، فَقُلْتُ: مَنْ هٰذَا؟ فَقَالَ: عُمَرُ بنُ الخَطَّابِ، فَقُلْتُ: عَلَى رِسْلِكَ. ثُمَّ جِئْتُ إِلَى رَسُولِ اللهِ ﷺ، فَسَلَّمْتُ عَلَيْهِ وقُلْتُ: هٰذَا عُمَرُ يَسْتَأْذِنُ؟ فَقَالَ: «ائْذَنْ لَهُ وَبَشِّرْهُ بِالْجَنَّةِ» فَجِئْتُ عُمَرَ، فَقُلْتُ: أَذِنَ وَيُبَشِّرُكَ رَسُولُ اللهِ ﷺ بِالجَنَّةِ، فَدَخَلَ فَجَلَسَ مَعَ رَسُولِ اللهِ ﷺ فِي القُفِّ عَنْ يَسَارِهِ، وَدَلَّى رِجْلَيْهِ فِي البِئْرِ

ثُمَّ رَجَعْتُ فَجَلَسْتُ فَقُلْتُ: إِنْ يُرِدِ اللهُ بِفُلانٍ خَيْراً - يَعْنِي أَخَاهُ - يَأْتِ بِهِ، فَجَاءَ إِنْسَانٌ فَحَرَّكَ البَابَ. فَقُلْتُ: مَنْ هَذَا؟ فَقَالَ: عُثْمَانُ بنُ عَفَّانَ. فَقُلْتُ: عَلَى رِسْلِكَ. وجِئْتُ النَّبِيَّ ﷺ فَأَخْبَرْتُهُ فقالَ: «ائْذَنْ لَهُ وَبَشِّرْهُ بِالجَنَّةِ مَعَ بَلْوَى تُصِيبُهُ» فَجِئْتُ فَقُلْتُ: ادْخُلْ وَيُبَشِّرُكَ رَسُولُ اللهِ بِالجَنَّةِ مَعَ بَلْوَى تُصِيبُكَ، فَدَخَلَ فَوَجَدَ القُفَّ قَدْ مُلِىءَ، فَجَلَسَ وِجَاهَهُمْ مِنَ الشِّقِّ الآخَرِ. قَالَ سَعِيدُ بنُ المُسَيَّبِ: فَأَوَّلْتُهَا قُبُورَهُمْ. متفقٌ عليه. وزادَ في روايةٍ: وَأَمَرَنِي رسولُ اللهِ بِحِفْظِ البَابِ. وَفِيها: أَنَّ عُثْمَانَ حِينَ بَشَّرَهُ حَمِدَ اللهَ تَعالى، ثُمَّ قَالَ: اللهُ المُسْتَعَانُ. قوله: «وَجَّه» بفتح

లోనికి ఆహ్వానించాను. హజ్రత్ ఉమర్ (రజి) లోపలికి వెళ్ళి దైవప్రవక్త (సల్లం)కు ఎడమ ప్రక్కన బావి గట్టు మీద కూర్చు న్నారు. ఆయన కూడా కాళ్ళను బావిలో జారవిడిచారు. నేను తిరిగొచ్చి మళ్ళీ తలుపు దగ్గరే కూర్చున్నాను.

నా మనసులో ఒకే ఆలోచన (సుడులు) తిరుగుతోంది. "దేవుడు అతని (నా సోదరుని) శ్రేయస్సు గురించి సంకల్పిస్తే అతడ్ని ఇక్కడికి రప్పిస్తాడు" అని. అంతలోనే ఇంకో వ్యక్తి వచ్చి తలుపు తట్టాడు. నేను "ఎవరండీ!" అన్నారు. "ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్" అని సమాధాన మిచ్చారాయన. "కాస్త ఉండండి" అంటూ నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి ఈ సంగతి తెలియజేశాను. అందుకాయన "రమ్మను, ఆయనపై ఒక ఆపద వచ్చివడుతుందని, తత్ఫలితంగా ఆయన స్వర్గానికి వెళ్తాడని శుభవార్తను కూడా అందజేయి" అని అన్నారు. నేను తలుపు దగ్గరికెళ్ళి, "దయచేయండి. మీరొక ఆపదకు గురవుతారని, తత్ఫలితంగా స్వర్గానికి వెళ్తారని దైవప్రవక్త (సల్లం) మీకు శుభ వార్త తెలియజేయమన్నారు" అంటూ ఆయన్ని లోనికి ఆహ్వానించాను. హజ్రత్ ఉస్మాన్ (రజి) లోపలికి వెళ్ళారు. చూస్తే బావి గట్టు (మీద దైవప్రవక్తకు ఇరు ప్రక్కల ఉన్న) స్థలం నిండిపోయి ఉంది. అందువల్ల ఆయన ఆవలివైపు ఉన్న

గట్టుమీద దైవప్రవక్త (సల్లం)కు ఎదురుగా కూర్చున్నారు.

హజ్రత్ సయీద్ బిన్ ముసయ్యబ్ (రహ్మాలై) ఈ హదీసు గురించి వ్యాఖ్యానిస్తూ, "ఈ హదీసు వారి సమాధులు కూడా అలాగే ఏర్పాటవుతాయనే విషయాన్ని సూచిస్తోందని నా అభిప్రాయం" అని అన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో ఈ వాక్యాలు అదనంగా ఉన్నాయి: దైవప్రవక్త (సల్లం)నన్ను ద్వారపాలకునిగా ఉండమని ఆదేశించారు. ఆ ఉల్లేఖనంలో ఇలా కూడా ఉంది : హజ్రత్ ఉస్మాన్ (రజి)కు శుభవార్త తెలియజేయగానే ఆయన దైవానికి కృతజ్ఞతలు అర్పించుకున్నారు. తరువాత, "సహాయం కోసం దేవుణ్ణే అర్థించాలి" అని అన్నారు.

الواوِ وتشديدِ الجيمِ، أَيْ: تَوَجَّهَ. وقوله: «بِئْر أَرِيسٍ»: هو بفتحِ الهمزةِ وكسرِ الراءِ، وبعدَهَا ياءٌ مثنَّاةٌ مِن تحتُ ساكِنَةٌ، ثُمَّ سِينٌ مُهْمَلةٌ، وهو مصروفٌ، ومنهم مَنْ مَنَعَ صَرْفَهُ. و«القُفُّ» بضم القافِ وتشديدِ الفاءِ: هُوَ الْمَبْنِيُّ حَوْلَ البِئْرِ. قوله: «عَلى رِسْلِكَ» بكسر الراء على المشهور، وقيل بفتحها، أَي: ارْفُقْ.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసును సదరు అధ్యాయం క్రింద ప్రస్తావించటంలోని ఔచిత్యం ఏమిటో తెలుస్తూనే ఉంది. దీనిద్వారా ప్రజలకు శుభవార్తలు చెప్పవచ్చని నిరూపించబడింది. ఈ హదీసులో అబూబక్ర్, ఉమర్, ఉస్మాన్ - ముగ్గురు ఖలీఫాలకూ స్వర్గశుభవార్తలు ఇవ్వబడ్డాయి. ఇంత స్పష్టమైన నిదర్శనాల తర్వాత కూడా ఆ ముగ్గురు ఖలీఫాల నిజాయితీని, విశ్వాసాన్ని శంకించటం ఒట్టి మూర్ఖత్వం.
2. ఉస్మాన్ (రజి) గారి మీద ఆపద వచ్చిపడుతుందని దైవప్రవక్త (సల్లం) చెప్పిన భవిష్యత్ వాణి ఆయన ఖిలాఫత్ చివరికాలంలో నెరవేరింది. అబ్దుల్లాహ్ బిన్ సబా అనే ఓ యూదుడి దుష్ప్రచారానికి ప్రభావితులైన ఒక వర్గం ఉస్మాన్ (రజి) ఇంటిని ముట్టడించి చివరకు ఆయన్ని ఇంట్లోనే హతమార్చారు. దీనిద్వారా దైవప్రవక్త (సల్లం) గారి సత్యసంధత వెల్లడౌతోంది.

710. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : ఓ రోజు మేము దైవప్రవక్త (సల్లం) చుట్టూ కూర్చొని ఉన్నాం. అప్పుడు ఆ సమావేశంలో అబూబక్ర్ మరియు ఉమర్ (రజి)లు కూడా మా మధ్య ఉన్నారు. హఠాత్తుగా దైవప్రవక్త (సల్లం) అక్కణ్ణుంచి లేచి వెళ్ళిపోయారు. ఎంతసేపయినా తిరిగి రాలేదు. దాంతో మాకు భయం పుట్టింది. మేము తోడుగా లేకపోవటం చూసి ఎవరయినా ఆయన్ని చంపారేమోనని ఆందోళనపడుతూ లేచి (ఆయన్ని వెతకటానికి) బయలుదేరాం. అందరికంటే ముందు నేను భయ పడ్డాను.

నేను దైవప్రవక్త (సల్లం)ను వెతు క్కుంటూ అన్సార్లకు చెందిన బనూ నజ్జార్ తెగవారి తోట ప్రహరీ గోడ దగ్గరికి చేరుకున్నాను. తోట లోపలికి వెళ్ళటానికి ఏదయినా ద్వారం కనిపిస్తుందేమోనని ప్రాకారం చుట్టూ తిరిగి చూశాను. కాని నాకెక్కడా ద్వారం ఉన్నట్లు కనిపించ లేదు. అంతలో ఓ చిన్న కాలువపై నా దృష్టి పడింది. అది తోట వెలుపల ఉన్న బావి దగ్గర్నుంచి తోటలోపలికి ప్రవహి స్తోంది. నేను ఎలాగో (నా దేహాన్ని) ముకు ళించుకొని ఆ కాలువదారి గుండా లోపలికి ప్రవేశించి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి చేరుకున్నాను. ఆయన (నన్ను చూసి ఆశ్చర్యంతో) “అబూహురైరా?”

٧١٠ - وعنْ أبي هريرةَ رضيَ الله عنهُ قال: كُنَّا قُعُوداً حَوْلَ رسولِ الله ﷺ، وَمَعَنَا أبُو بكْرٍ وعُمَرُ رضيَ عنهما في نَفَرٍ، فَقامَ رَسُولُ الله مِنْ بين أظْهُرِنا فَأبْطَأ عَلَيْنَا، وَخَشِينا أنْ يُقْتَطَعَ دُونَنَا وَفزِعْنَا فَقُمْنَا، فَكُنْتُ أوَّلَ مَنْ فزِعَ، فَخَرَجْتُ أبْتَغِي رسُولَ الله ﷺ، حتى أتَيْتُ حَائِطاً لِلأنْصَارِ لِبَني النَّجَّارِ، فَدُرْتُ بِهِ هَلْ أجِدُ لَهُ بَاباً؟ فَلَمْ أجِدْ، فَإذَا رَبِيعٌ يَدْخُلُ في جَوْفِ حَائِطٍ مِنْ بِئْرٍ خَارِجَهُ - وَالرَّبِيعُ: الجَدْوَلُ الصَّغِيرُ - فَاحْتَفَزْتُ، فَدَخَلْتُ عَلى رسُولِ الله فقال: «أبُو هُرَيْرَةَ؟» فَقُلْتُ: نَعَمْ يَا رَسُولَ الله،

قَالَ: «مَا شَأْنُكَ؟» قلتُ: كُنْتَ بَيْنَ ظَهْرَيْنَا فَقُمْتَ فَأَبْطَأْتَ عَلَيْنَا، فَخَشِينَا أَنْ تُقْتَطَعَ دُونَنَا، فَفَزِعْنَا، فَكُنْتُ أَوَّلَ مَنْ فَزِعَ، فَأَتَيْتُ هٰذَا الحائِطَ، فَاحْتَفَزْتُ كَمَا يَحْتَفِزُ الثَّعْلَبُ، وَهٰؤلاءِ النَّاسُ وَرَائي. فَقَالَ: «يَا أَبَا هُرَيْرَةَ» وَأَعْطَاني نَعْلَيْهِ فَقَالَ: «اذْهَبْ بِنَعْلَيَّ هَاتَيْنِ، فَمَنْ لَقِيتَ مِنْ وَرَاءِ هٰذَا الحائِطِ يَشْهَدُ أَنْ لَا إِلٰهَ إِلَّا اللهُ مُسْتَيْقِناً بِها قَلْبُهُ، فَبَشِّرْهُ بِالجَنَّةِ» وَذَكَرَ الحَدِيثَ بِطُولِهِ، رواهُ مسلم. «الرَّبِيعُ» النَّهْرُ الصَّغِيرُ، وَهُوَ الجَدْوَلُ - بفتح الجيم - كَمَا فَسَّرَهُ فِي الحَدِيثِ. وقولُه: «احْتَفَزْتُ» رويَ بِالرَّاءِ وبِالزَّايِ وَمَعْنَاهُ بِالزَّايِ: تَضَامَمْتُ وَتَصَاغَرْتُ حَتَّى أَمْكَنَنِي الدُّخُولُ.

అని అన్నారు. "అవును దైవప్రవక్తా! నేనే" అన్నాను నేను. "ఏమయింది?" అని అడిగారాయన. "(దైవప్రవక్తా!) మీరు మా మధ్యలో ఉండి, హఠాత్తుగా లేచి వెళ్ళిపోయారు. ఎంతసేపయినా తిరిగి రాకపోవటంతో మాకు భయం వేసింది. మేము తోడుగా లేకపోవటం చూసి ఎవరయినా మిమ్మల్ని చంపి ఉంటారేమోనని తల్లడిల్లాము. అందరికంటే ముందు నేను తల్లడిల్లాను. నేను మిమ్మల్ని వెతుక్కుంటూ ఈ తోట దగ్గరికి చేరుకున్నాను. (లోనికి రావటానికి ఎటూ ద్వారం కనిపించకపోవటంతో ఈ కాలువదారి గుండా) తోడేలు ముకుళించుకున్నట్లు నన్ను నేను ముకుళించుకొని లోపలికి వచ్చాను. నా వెనక ప్రజలు కూడా బయలుదేరారు" అని చెప్పుకుంటూ పోయాను.

దైవప్రవక్త (సల్లం) నన్ను సంబోధించి, "అబూ హురైరా!" అంటూ తన పాద రక్షలు నాకిచ్చి , "నా పాదరక్షలు వెంట తీసుకొని వెళ్ళు. ఈ తోట ప్రహరీ వెలుపల అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్య దేవుడు లేడని దృఢచిత్తంతో పలికేవారు ఎవరు కనిపించినా వారికి స్వర్గ శుభ వార్తను అందించు" అని అన్నారు (.....హదీసు చివరిదాకా). (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని విశ్వాసాల ప్రకరణం)*

711. హజ్రత్ ఇబ్నె షుమాసా (రజి) కథనం : హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) మరణశయ్యపై ఉన్నప్పుడు మేము ఓ రోజు ఆయన దగ్గరికి వెళ్ళాం. అప్పుడు ఆయన చాలా సేపటిదాకా ఏడుస్తూ ఉన్నారు. గోడ వైపు మొహం చాటేసుకున్నారు. ఆయన కుమారుడు, "నాన్నగారూ! దైవప్రవక్త మీకు ఫలానా శుభ వార్త తెలుపలేదా? దైవప్రవక్త మీకు ఫలానా శుభవార్త తెలుపలేదా?" అంటూ ఆయనకు ధైర్యం చెప్పబోయారు. అప్పుడాయన అతని వైపు తిరిగి చూస్తూ ఇలా అన్నారు :

"నిశ్చయంగా పరలోకం కోసం మనం సమకూర్చుకునే సామగ్రిలో అత్యంత విలువైనది దేవుని ఏకత్వాన్నీ ఆయన దౌత్యాన్ని ధృవీకరించటం - అంటే అల్లాహ్ తప్ప నిజమైన ఆరాధ్య దేవుడు మరొకడు లేడని, ముహమ్మద్ (సల్లం) దైవప్రవక్త అని సాక్ష్యం చెప్పటం.

"(బాబూ!) నా అనుభవంలో మూడు రకాల కాలాలు గడిచాయి. నాకు బాగా జ్ఞాపకం ఉంది. ఒకప్పుడు దైవప్రవక్త (సల్లం) పట్ల వైరభావం కలిగి ఉండటంలో నన్ను మించినవాడు లేడు. అదను దొరికితే ఆయన్ని హతమార్చాలి అన్న విషయమే నాకు ఆనాడు అత్యంత ప్రియమైనది. ఆ కాలంలో గనక నాకు చావు వచ్చి ఉంటే, నిశ్చయంగా నేను

٧١١ - وعَن ابنِ شُمَاسَةَ قَالَ: حَضَرْنَا عَمْرَو بنَ العَاصِ رضيَ الله عنه، وَهُوَ في سِيَاقَةِ المَوْتِ فَبَكى طَويلاً، وَحَوَّلَ وَجْهَهُ إلى الجدَار، فَجَعَلَ ابنُهُ يَقُولُ: يَا أَبَتَاه، أَمَا بَشَّرَكَ رَسُولُ الله ﷺ بكَذَا؟ أَمَا بَشَّرَكَ رَسُولُ الله ﷺ بكَذَا؟ فَأَقْبَلَ بوَجْهِهِ فَقَالَ: إنَّ أَفْضَلَ مَا نُعِدُّ شَهَادَةُ أَنْ لَا إلهَ إلَّا الله، وَأَنَّ مُحَمَّداً رَسُولُ الله، إنِّي قَدْ كُنْتُ عَلَى أَطْبَاقٍ ثَلاثٍ: لَقَدْ رَأَيْتُني وَمَا أَحَدٌ أَشَدَّ بُغْضاً لِرَسُولِ الله ﷺ مِنّي، وَلَا أَحَبَّ إلَيَّ مِن أَنْ أَكُونَ قَدِ اسْتَمْكَنْتُ مِنْهُ فَقَتَلْتُهُ، فَلَوْ مُتُّ عَلَى تِلْكَ الحالِ لَكُنْتُ مِنْ أَهْلِ النَّارِ، فَلَمَّا جَعَلَ اللهُ الإسْلامَ في قَلْبِي أَتَيْتُ

النَّبِيَّ ﷺ فَقُلْتُ: ابْسُطْ يَمِينَكَ فَلأُبَايِعْكَ، فَبَسَطَ يمِينَهُ فَقَبَضْتُ يَدِي، فَقَالَ: «ما لكَ يا عَمرو؟» قلت: أَرَدْتُ أَنْ أَشْتَرِطَ قَالَ: «تَشْتَرِطُ مَاذَا؟» قُلْتُ: أَنْ يُغْفَرَ لِي، قَالَ: «أَمَا عَلِمْتَ أَنَّ الإِسْلَامَ يَهْدِمُ ما كَانَ قَبلَهُ، وَأَن الهجرَة تَهدِمُ ما كان قَبْلَهَا، وَأَنَّ الحَجَّ يَهدِمُ ما كَانَ قَبلَه؟» وما كان أَحَدٌ أَحَبَّ إِلَيَّ مِنْ رسولِ اللهِ ﷺ، وَلَا أَجَلَّ في عَينِي مِنْهُ، ومَا كُنتُ أُطِيقُ أَن أَملأَ عَينِي منه إجلالًا لَهُ، ولَوْ سُئِلْتُ أَنْ أَصِفَهُ ما أَطَقْتُ لِأَنِي لم أَكُنْ أَملأُ عيني منهُ، ولو مُتُّ على تِلْكَ الحَالِ لَرَجَوتُ أن أَكونَ مِنْ أَهْلِ الجَنَّةِ، ثم وُلِّينَا أَشيَاءَ ما أَدري ما حَالي فِيها؟ فَإِذا أَنا مُتُّ

నరకవాసుల్లో కలిసిఉండేవాణ్ణి. కాని ఆ తర్వాత దేవుడు నా హృదయంలో ఇస్లాం పట్ల అభిమానం జనించేలా చేశాడు. అప్పుడు నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి, "మీ కుడిచేయి చాపండి, (ఇస్లాం స్వీకరిస్తానని) మీతో ప్రమాణం చేస్తాను" అని అన్నాను. ఆయన చేయి చాపగానే నా చేయి వెనక్కి తీసుకున్నాను. ఆయన (ఆశ్చర్యపోయి), "ఏమయింది అమ్ర్?" అని అడిగారు. "నేను ఒక షరతు పెట్టా లనుకుంటున్నాను" అన్నాను. "ఏం షరతు పెట్టాలనుకుంటున్నావు?" అని అడిగారాయన. "నా పాపాలన్నీ క్షమించ బడాలి" అని చెప్పాను.

దానికి దైవప్రవక్త (సల్లం) (చిరునవ్వు నవ్వి), "నీకు తెలియదా అమ్ర్?! ఇస్లాం (స్వీకరణ) పూర్వపు పాపాలన్నిటినీ తుడిచిపెట్టేస్తుంది. హిజ్రత్ (దైవమార్గం లో చేసే ప్రస్థానం) పూర్వపు పాపాల న్నిటినీ తుడిచిపెట్టేస్తుంది. అలాగే హజ్ (కాబా యాత్ర) కూడా గతంలో జరిగిన పాపాలన్నిటినీ తుడిచిపెట్టేస్తుంది" అని అన్నారు. (నేను ఇస్లాం స్వీకరించి ఆయన చేతిమీద ప్రమాణం చేశాను. అప్పట్నుంచి) నాకు దైవప్రవక్త కంటే ఎక్కువ ప్రియతములు, నా దృష్టిలో ఆయనకంటే గొప్పవారు మరెవరూలేరు. ఆయన ఔన్నత్యపు గాంభీర్యత మూలం గా నేనాయన్ని పూర్తిగా చూడగలిగేవాణ్ణి

కూడా కాను. ఎవరయినా ఆయన రూపు రేఖల్ని వర్ణించమని నాతో అంటే నేను వర్ణించలేను. అసలు నేనాయన్ని పూర్తిగా ఎన్నడూ చూడనేలేదు. నేను ఆ కాలం లోనే చనిపోయి ఉంటే నిశ్చయంగా స్వర్గవాసుల్లో చేరిపోయేవాణ్ణి.

ఆ తర్వాతి కాలంలో మేము ఎన్నో విషయాలకు బాధ్యత వహించాము. (ప్రభుత్వ పదవులు పొందాము). (ప్రళయదినాన) వాటిగురించి ప్రశ్నించి నప్పుడు నా పరిస్థితి ఏమవుతుందోనని భయంగా ఉంది. (బాబూ!) నేను చనిపోయిన తరువాత నా జనాజా వెంట ఏడ్చిపెడబొబ్బలు పెట్టే స్త్రీలుగాని, అగ్నిగాని ఉండకూడదు. నన్ను ఖననం చేసినప్పుడు నా మీద కొద్దికొద్దిగా మన్ను పోయండి. తరువాత మీరు నా సమాధి దగ్గర నేను ఓ ఒంటెను కోసి దాని మాంసాన్ని పంచిపెట్టినంతసేపు నించోండి. దానివల్ల నాక్కాస్త ధైర్యం లభిస్తుంది. నా ప్రభువు పంపే దూతలకు నేనేం జవాబు చెబుతానో చూస్తాను.!"

*(ముస్లిం)*

فـلا تَصحَبْنِـي نَـائحَـةٌ ولا نَـارٌ، فـإذا دَفَنتُمونِي، فَشُنُّوا عليَّ التُّـرَابَ شَنّاً، ثم أَقِيمُوا حولَ قَبرِي قَدْرَ ما تُنحَرُ جَزورٌ، وَيُقسَمُ لحَمُهَا، حَتَّى أَستَأنِسَ بِكُمْ، وأَنظُرَ مَا أُرَاجِعُ بِهِ رسُلَ ربي. رواه مسلم.

قوله: «شُنُّوا» رُوِيَ بـالشينِ المعجمَـةِ وبالمهملةِ، أَي: صبُّوهُ قليلاً قَلِيلاً والله سبحانه أعلم.

*(సహీహ్ ముస్లింలోని విశ్వాసాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) తన జీవితంలోని మూడు దశలను గురించి ఇక్కడ వివరించారు. ఇస్లాం స్వీకరించక ముందు మొదటి దశ, స్వీకరించిన తరువాత రెండోదశ, ఆఖరి కాలంలో ప్రభుత్వ పదవుల్ని నిర్వహించటం మూడో దశ. మూడో దశలో తను ఎన్నో పదవులకు బాధ్యత వహించారు. ఆ బాధ్యతల నిర్వహణలో తన వల్ల ఏమైనా లోటుపాట్లు

జరిగివుంటే, దేవుని దగ్గర తను పట్టుబడిపోతానని ఆయన విపరీతంగా భయపడిపోయేవారు.

పై హదీసు ద్వారా ఈ క్రింది విషయాలు బోధపడుతున్నాయి:

1. ఇస్లాం స్వీకరించకముందు ప్రజలకు దానిపట్ల ఉండిన విపరీతమైన ద్వేషం ఇస్లాం స్వీకరించిన తరువాత అది విపరీతమైన ప్రేమగా మారిపోయింది.
2. మరణం ఆసన్నమయినప్పుడు గత జీవితంలో జరిగిన లోపాలను గుర్తు చేసుకుంటూ, దైవకారుణ్యాన్ని ఆశిస్తూ విలపించటం ధర్మసమ్మతమే.
3. మరణం సమీపించినవారికి దైవకారుణ్య శుభవార్తలు వినిపించి పరలోక జీవితం గురించి ధైర్యం చెప్పాలి.
4. ఇస్లాం స్వీకరించటం వల్ల అంతకుముందు జరిగిన పాపాలన్నీ క్షమించబడతాయి. అయితే దానికోసం ఇస్లాం ధర్మం ఆశించే విధంగా ఆచరణ చేయవలసి ఉంటుంది. అదేవిధంగా హజ్, నమాజులు కూడా మనిషి వల్ల జరిగే చిన్న చిన్న తప్పుల్ని తుడిచిపెట్టేస్తాయి. ఘోరపాపాలు ఏవయినా జరిగివుంటే వాటి పరిష్కృతి కోసం మనిషి పశ్చాత్తాపం చెందవలసి ఉంటుంది.
6. ఎవరయినా చనిపోతే ఏడ్చి పెడబొబ్బలు పెట్టటం తగదు.
7. ఖనన సంస్కారాలు అయిపోయిన తరువాత కాసేపు సమాధి దగ్గర నిలబడి మృతునికి స్థయిర్యం లభించాలని ప్రార్థించాలి. ఇతర హదీసుల్లో దైవప్రవక్త (సల్లం) కూడా అలా చేయమని ఆజ్ఞాపించారు.
8. ఖనన సంస్కారాలు అయిపోయిన తరువాత కొంతమంది సజ్జనులు సమాధి దగ్గర నిలబడితే దానివల్ల సమాధిలోవున్న వ్యక్తికి ప్రశాంతత లభిస్తుంది. దైవదూతలు వేసే ప్రశ్నలకు సునాయాసంగా జవాబు చెప్పగల్గుతాడు. అందుకే ఈ హదీసులో సమాధి దగ్గర నిలబడి మృతునికి స్థయిర్యం లభించాలని కోరుకుంటూ ప్రార్థన చేయాలని తాకీదు చేయబడింది.



## 96వ అధ్యాయం

# ٩٦ - بَابُ وَدَاعِ الصَّاحِبِ وَوَصِيَّتِهِ عِنْدَ فِرَاقِهِ لِسَفَرٍ وَغَيْرِهِ وَالدُّعَاءِ لَهُ وَطَلَبِ الدُّعَاءِ مِنْهُ

# బంధుమిత్రుల్ని సాగనంపినప్పుడు హితవు చెప్పి మరీ సాగనంపాలి, వారి శ్రేయస్సు కోసం ప్రార్థించాలి. తమకోసం కూడా ప్రార్థించమని వారిని కోరాలి

قال الله تعالى: ﴿ وَوَصَّىٰ بِهَآ إِبْرَٰهِـۧمُ بَنِيهِ وَيَعْقُوبُ يَٰبَنِىَّ إِنَّ ٱللَّهَ ٱصْطَفَىٰ لَكُمُ ٱلدِّينَ فَلَا تَمُوتُنَّ إِلَّا وَأَنتُم مُّسْلِمُونَ ﴿١٣٢﴾ أَمْ كُنتُمْ شُهَدَآءَ إِذْ حَضَرَ يَعْقُوبَ ٱلْمَوْتُ إِذْ قَالَ لِبَنِيهِ مَا تَعْبُدُونَ مِنۢ بَعْدِى قَالُوا۟ نَعْبُدُ إِلَٰهَكَ وَإِلَٰهَ ءَابَآئِكَ إِبْرَٰهِـۧمَ وَإِسْمَٰعِيلَ وَإِسْحَٰقَ إِلَٰهًا وَٰحِدًا وَنَحْنُ لَهُۥ مُسْلِمُونَ ﴾ [البقرة: ١٣٢ - ١٣٣].

وأما الأحاديث:

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెల విచ్చాడు:

"ఇదే (ఇస్లాం) మార్గంలో నడవండి అని ఇబ్రాహీమ్ తన సంతానానికి హితోపదేశం చేశాడు. ఈ ఉపదేశాన్నే యాఖూబ్ కూడా తన సంతానానికి చేశాడు: "నా బిడ్డలారా! ఈ ధర్మాన్నే అల్లాహ్ మీ కొరకు ఎన్నిక చేశాడు. కనుక మీరు మరణించే వరకూ ముస్లిములు గానే ఉండండి." యాఖూబు మృత్యు దశలో ఉన్నప్పుడు మీరు అక్కడ ఉన్నారా? మర ణించే ముందు అతను తన కుమారులను ఇలా అడిగాడు : "బిడ్డలారా! నా తరువాత మీరు ఎవరిని ఆరాధిస్తారు?" వారంతా ఇలా సమాధానం చెప్పారు: "మీరూ, మీ పెద్దలైన ఇబ్రాహీమ్, ఇస్మాయీల్, ఇస్‌హాఖ్ దేవుడుగా భావించిన ఆ ఏకైక దేవుణ్ణే మేమూ ఆరా ధిస్తాం. మేము ఆయనకే ముస్లిం (విధేయు) లయి ఉంటాం."

*(అల్ బఖర : 132, 133)*

పై దివ్య ఖుర్‌ఆన్ సూక్తుల్లో హజ్రత్ యాఖూబ్ (అలైహి) చరమ దశలో తన సంతానానికి హితోపదేశం చేశారు. ఈ సూక్తు లను ఆధారంగా చేసుకొని గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) ప్రయాణ సమయాల్లో కూడా వెళ్ళేవారికి హితోపదేశం చేయవచ్చని అంటు న్నారు. అదీగాకుండా మృత్యు దశను గుర్తించటం చాలా కష్టం. మరో వైపు స్థాని కంగా ఉండేటప్పటికన్నా ప్రయాణాల్లో ఉన్న ప్పుడు మనిషి మృత్యు వాతనపడే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. అంచేత ప్రయాణానికి బయలుదేరేవారికి హితోపదేశం చేసి సాగ నంపటం అన్ని విధాలా ఉత్తమం.

٧١٢ ـ فمنها حَديثُ زيدِ بنِ أَرْقَمَ رضي الله عنه ـ الذي سبق في باب إكرام أَهْـلِ بَيْـتِ رسـولِ الله ﷺ ـ قـال: قـامَ رسولُ اللهِ ﷺ فِينَا خَطِيباً ، فَحَمِدَ اللهَ ، وَأَثْنى عَلَيْهِ، وَوَعَظَ وَذَكَّرَ، ثُمَّ قال: «أَمَّا بَعْدُ، أَلا أَيُّهَا النَّاسُ إِنَّمَا أَنا بَشَرٌ يُوشِكُ أَنْ يَأْتِيَ رَسُولُ رَبِّي فأُجِيبَ، وَأَنَا تَارِكٌ فِيكُمْ ثَقَلَيْنِ: أَوَّلُهُمَا: كِتَابُ اللهِ، فِيهِ الهُدَى وَالنُّورُ، فَخُذُوا بِكِتَابِ اللهِ، وَاسْتَمْسِكُوا بِهِ» فَحَثَّ عَلى كِتَابِ اللهِ، وَرَغَّبَ فِيهِ، ثُمَّ قال: «وَأَهْلُ بَيْتِي، أُذَكِّرُكُمُ اللهَ في أَهْلِ بَيْتِي» رواه مسلم. وَقَدْ سَبَقَ بطُولِهِ.

712. హజ్రత్ జైద్ బిన్ అర్ఖమ్ (రజి) కథనం :

"ఓ రోజు దైవప్రవక్త (సల్లం) మా మధ్య నిలబడి ఉపన్యాసం ఇచ్చారు. ముందుగా ఆయన దేవుని ప్రశంసల్ని, ఆయన పొగడ్తల్ని స్తుతించారు. ప్రజలకు హితోపదేశం చేశారు. ఆ తరువాత ఇలా అన్నారు :

"ప్రజలారా! జాగ్రత్తగా వినండి! నేనూ ఒక మానవుణ్ణే. నా ప్రభువు దగ్గరి నుండి దూత వస్తే, (అందరిలాగే నేను కూడా) ప్రభువు పిలుపుకు హాజరు పలికి వెళ్ళి పోతాను. నేను మీ మధ్య రెండు బరు వైన వస్తువులు వదలివెళ్తున్నాను. వాటిలో మొదటిది : దైవగ్రంథము. అందులో (మనిషి జీవన) సంవిధాన ముంది. (సన్మార్గంపై నడిపించే) వెలుగు ఉంది. కనుక మీరు దైవగ్రంథాన్ని అనుసరిస్తూ దాన్ని గట్టిగా పట్టుకోండి."

ఆ విధంగా అప్పుడు దైవప్రవక్త (సల్లం) దైవగ్రంథాన్ని ఆచరించమని ప్రజలను

ప్రోత్సహించారు. దానిని అనుసరించమని పురికొల్పారు. తరువాత ఇలా అన్నారు :

ఇక (రెండో విషయం) నా కుటుంబీకులకు సంబంధించినది. నా కుటుంబీకుల విషయంలో నేను మీకు దేవుణ్ణి గుర్తుచేస్తున్నాను. *(ముస్లిం)*

713. హజ్రత్ అబూ సులైమాన్ మాలిక్ బిన్ హువైరిస్ (రజి) కథనం : ఒకసారి మేము దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళాం. అక్కడికి వెళ్ళిన మేమంతా దాదాపు సమవయస్కులైన నవయువకులం. ఆయన దగ్గర మేము ఇరవై రాత్రులు గడిపాం. ఆయన చాలా దయామయులు, మృదు మనస్కులు. మాకు మా వాళ్ళు గుర్తొస్తున్నారని గ్రహించి ఆయన మమ్మల్ని మా ఇండ్ల విషయాల గురించి అడిగారు. మేమాయనకు మా వివరాలన్నీ తెలియజేశాం.

అంతా విన్న తరువాత ఆయన మమ్మల్ని (మా స్వస్థలానికి సాగనంపుతూ) "మీరు మీ వాళ్ళ దగ్గరికి వెళ్ళిపొండి. మీ వాళ్ళలోనే ఉండి వారికి (ధర్మం గురించి) బోధించండి. (మంచిని గురించి) ఆదేశించండి. ఫలానా వేళకు ఫలానా నమాజు చేయండి, ఫలానా వేళకు ఫలానా నమాజ్ చేయండి. నమాజ్ వేళ

٧١٣ ـ وعن أبي سُلَيْمَانَ مَالكِ بْنِ الحُوَيْرِثِ رضي الله عنه قال: أَتَيْنَا رسولَ اللهِ ﷺ وَنحنُ شَبَبَةٌ مُتَقَارِبُونَ، فَأَقَمْنَا عِنْدَهُ عِشْرِينَ لَيْلَةً، وكانَ رسولُ اللهِ ﷺ رَحِيماً رَفِيقاً، فَظَنَّ أَنَّا قَدِ اشْتَقْنَا أَهْلَنَا، فَسَأَلَنَا عَمَّنْ تَرَكْنَا مِنْ أَهْلِنَا، فَأَخْبَرْنَاهُ، فقال: «ارجعُوا إلى أَهْلِيكم، فَأَقِيمُوا فِيهِمْ، وَعلِّمُوهُم وَمُرُوهُمْ، وَصَلُّوا صَلاةَ كَذَا في حِينِ كَذَا، وَصَلُّوا كَذَا في حِينِ كَذَا، فَإِذَا حَضَرَتِ الصَّلاةُ فَلْيُؤَذِّنْ لَكُمْ أَحَدُكُمْ، وَلْيَؤُمَّكُمْ أَكبَرُكُم»

అయినప్పుడు మీలో ఒకరు అజాన్ ఇవ్వాలి. అందరిలోకెల్లా ఎక్కువ వయ స్సున్న వ్యక్తి నమాజ్ చేయించాలి" అని హితోపదేశం చేశారు. (బుఖారీ - ముస్లిం)

బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో ఈ వాక్యం అదనంగా ఉంది: "మీరు నన్ను ఏవిధంగా నమాజ్ చేస్తున్నట్లు చూశారో ఆ విధంగా నమాజ్ చేయండి."

متفقٌ عليه. زَاد البخاري فِي رِوايةٍ له: «وَصَلُّوا كَمَا رَأَيْتُمُونِي أُصَلِّي». قوله: «رَحِيماً رَفِيقاً» رُوِيَ بفاءٍ وقافٍ، ورُوِيَ بقافين.

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఈ హదీసు యువకుల్లో ధార్మిక విద్య నేర్చుకోవాలనే ఆకాంక్ష ఉండాలని ప్రబోధిస్తోంది. హదీసులో చెప్పబడినట్లు ఒకానొక తెగకు చెందిన కొందరు యువకులు ధార్మిక విద్యను అభ్యసించాలనే పట్టుదలతో తమ ఆప్తుల్ని, ఆత్మీయులందర్నీ వదలి ఎంతో దూరం ప్రయాణంచేసి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళారు. దీనిద్వారా విద్యాభ్యాసం కోసం అవసరమైతే దూరప్రాంతాలకు, విదేశాలకు కూడా వెళ్ళాలన్న విషయం బోధపడుతోంది.
2. ధార్మిక విద్యను అభ్యసించిన తరువాత తెలియని వారికి దాన్ని బోధించాలి.
3. నమాజ్ చేయటం కోసం ముందుగా అజాన్ ఇవ్వాలి.
4. అందరిలోకీ ఎక్కువ వయస్సున్న వ్యక్తి సామూహిక నమాజ్‌కు సారథ్యం వహించాలి. అందరూ సమవయస్కులై ఉన్నప్పుడు అందరికన్నా బాగా ఖుర్ఆన్ పారాయణం చేయగలిగే వ్యక్తి నమాజ్‌కు నేతృత్వం వహించాలి. ఆ తర్వాత ఖుర్ఆన్ హదీసుల జ్ఞానంలో అందరికన్నా నిష్ణాతుడైన వ్యక్తి నమాజ్ చేయించటానికి అర్హుడిగా పరిగణించబడతాడు.
5. అజాన్, ఇమామత్‌ల గురించి దైవప్రవక్త (సల్లం) చేసిన బోధనల సారం ఏమిటంటే, ఎక్కడయినా, ఏ సమయంలోనయినా అజాన్ ఇచ్చి సామూహికంగా నమాజ్ చేయ టానికి కృషిచేయాలి.

714. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం : ఒకసారి నేను ఉమ్రాకు వెళ్ళటా నికి దైవప్రవక్త (సల్లం) అనుమతి కోరాను. అప్పుడు ఆయన అనుమతి ఇస్తూ, "సోదరా! (ఉమ్రాలో) నువ్వు దేవుణ్ణి ప్రార్థించేటప్పుడు మమ్మల్ని

٧١٤ - وعن عُمَرَ بنِ الخطَّاب رضيَ اللهُ عنه قال: اسْتَأْذَنْتُ النبيَّ ﷺ في العُمْرَةِ، فَأَذِنَ، وقال: «لا تَنْسَنَا يَا أُخَيَّ مِنْ دُعَائِكَ»، فقالَ كَلِمَةً مَا يَسُرُّنِي أَنَّ لِي بهَا الدُّنْيَا. وفي رواية قال: «أَشْرِكْنَا

يَا أُخَيَّ فِي دُعَائِكَ». رواه أبو داود، والترمذي وقال: حديث حسن صحيح.

మరచిపోకు" అని అన్నారు. ఆయన అన్న ఆ మాటకు నేనెంత పొంగిపోయానంటే, మొత్తం ప్రపంచం నా సొంతమయినా నాకు అంత ఆనందం కలిగేది కాదు.

వేరొక ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : "సోదరా! నీ ప్రార్థనలో మమ్మల్ని కూడా చేర్చుకో."

*(దీనిని అబూదావూద్ మరియు తిర్మిజీలు వెలికితీశారు. తిర్మిజీ దీనిని 'హసన్' మరియు 'సహీహ్'గా పేర్కొన్నారు.)*

٧١٥ - وعن سالم بن عَبْدِ اللهِ بن عُمَرَ أَنَّ عَبْدَ اللهِ بْنَ عُمَرَ رضي الله عنهما كَانَ يَقُولُ لِلرَّجُلِ إِذَا أَرَادَ سَفَراً: اُدْنُ مِنِّي حَتَّى أُوَدِّعَكَ كَمَا كَانَ رسولُ اللهِ ﷺ يُوَدِّعُنَا، فيقُولُ: «أَسْتَوْدِعُ اللهَ دِينَكَ، وَأَمَانَتَكَ، وَخَوَاتِيمَ عَمَلِكَ». رواه الترمذي، وقال: حديث حسن صحيح.

715. హజ్రత్ సాలిమ్ (రజి) కథనం : హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) ప్రయాణానికి నిశ్చయించుకున్న వ్యక్తిని ఉద్దేశ్యించి ఇలా అనేవారు: "దగ్గరకు రా. దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని సాగనంపిన విధంగా నేను నిన్ను సాగనంపుతాను. ఆయన మమ్మల్ని ఈ విధంగా ఆశీర్వదించి సాగనంపేవారు:

"అస్తాదివుల్లాహ దీనక, వ అమానతక, వ ఖవాతీమ అమలిక."

"నేను నీ ధర్మాన్ని, నీ నిజాయితీని, నీ ఆచరణల ముగింపుని దేవునికి అప్పజెబుతున్నాను."

*(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి 'హసన్', 'సహీహ్'గా పేర్కొన్నారు.)*

٧١٦ - وعن عبدِ اللهِ بنِ يَزِيدَ الخَطْمِيِّ الصَّحَابِيِّ رضي الله عنه قَالَ: كَانَ رَسُولُ اللهِ ﷺ إذا أَرَادَ أَنْ يُوَدِّعَ

716. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ యజీద్ ఖత్మీ సహాబీ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఏదయినా సైనిక దళాన్ని సాగనంపినప్పుడు ఈవిధంగా ఆశీర్వదించి మరీ సాగనంపేవారు: "నేను మీ

الجَيْشَ قَالَ: «أَسْتَوْدِعُ اللهَ دِينَكُمْ، وَأَمَانَتَكُمْ، وَخَوَاتِيمَ أَعمَالِكُمْ». حديث صحيح، رواه أبو داود وغيره بإسناد صحيح.

ధర్మాన్ని, మీ నిజాయితీని, మీ ఆచరణల ముగింపుని దేవునికి అప్పజెబుతున్నాను."
(అబూదావూద్, దీని ఆధారాలు ప్రామాణికమైనవి.)

*(సుననె అబూదావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

٧١٧ ـ وعن أنسٍ رضي الله عنه قال: جَاءَ رَجُلٌ إلى النَّبيِّ ﷺ فقال: يا رَسُولَ اللهِ! إني أُرِيدُ سَفراً، فَزَوِّدْني، فَقَالَ: «زَوَّدَكَ اللهُ التَّقْوَى» قال: زِدْني، قال: «وَغَفَرَ ذَنْبَكَ»، قال: زِدْني، قال: «وَيَسَّرَ لَكَ الخيرَ حَيْثُمَا كُنْتَ» رواه الترمذي وقال: حديث حسن.

717. హజ్రత్ అనస్ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, "దైవప్రవక్తా! నేను (ఓ చోటుకి) ప్రయాణం చేయాలనుకుంటున్నాను. కనుక నాకు ప్రయాణ సామగ్రిని ప్రసాదించండి (అంటే నన్ను ఆశీర్వదించండి)" అని అడిగాడు. "దేవుడు నీకు భక్తి సామగ్రిని ప్రసాదించుగాక!" అని ఆశీర్వదించారు. దైవప్రవక్త (సల్లం). ఇంకా ఆశీర్వదించమని అడిగాడా వ్యక్తి. దైవప్రవక్త, "దేవుడు నీ పాపాలను క్షమించుగాక!" అని ఆశీర్వదించారు. ఆ వ్యక్తి మరింత సామగ్రి కావాలన్నాడు. అప్పుడు, "నువ్వెక్కడున్నా దేవుడు నీ కోసం మంచిని సులభం చేయుగాక!" అని ఆశీర్వదించారు ఆయన.

*(తిర్మిజీ దీనిని ఉల్లేఖించి, 'హసన్' కోవకు చెందినదిగా పేర్కొన్నారు.)*

## 97వ అధ్యాయం

# ٩٧ ـ بَابُ الاسْتِخَارَةِ وَالْمُشَاوَرَةِ
# ఇస్తిఖారా మరియు పరస్పరం సంప్రతింపులు జరుపుకోవటం గురించి....

قال الله تعالى: ﴿وَشَاوِرْهُمْ فِي ٱلْأَمْرِ﴾ [آل عمران: ١٥٩]، وقال تعالى: ﴿وَأَمْرُهُمْ شُورَىٰ﴾ [الشورى: ٣٨] أي: يَتَشاوَرُونَ بَيْنَهُم فِيهِ.

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెల విచ్చాడు:

"(ప్రవక్తా!) ముఖ్య వ్యవహారాల్లో వారిని (నీ అనుచరుల్ని) కూడా సంప్రదించు."

*(ఆలి ఇమ్రాన్ : 159)*

"వారు (అంటే విశ్వాసులు) తమ వ్యవహారా లను పరస్పర సంప్రదింపుల ద్వారా నడుపు కుంటారు." *(అష్ షూరా : 38)*

٧١٨ ـ عن جابرٍ رضي الله عنه قال: كَانَ رسولُ اللهِ ﷺ يُعَلِّمُنَا الاستِخَارَةَ في الأُمُورِ كُلِّهَا كالسُّورَةِ مِنَ القُرْآنِ، يَقُولُ: «إذا هَمَّ أَحَدُكُمْ بِالأمرِ، فَلْيَرْكَعْ رَكعَتَيْنِ مِنْ غَيْرِ الفَرِيضَةِ، ثم ليقُلْ: اللَّهُمَّ! إنِّي أَسْتَخيرُكَ بِعِلْمِكَ، وأَسْتَقدِرُكَ بِقُدْرَتِكَ، وَأَسْأَلُكَ مِنْ فَضْلِكَ العَظِيمِ؛ فَإِنَّكَ تَقْدِرُ وَلَا أَقْدِرُ، وَتَعْلَمُ وَلَا أَعْلَمُ، وَأَنتَ عَلَّامُ الغُيُوبِ. اللَّهُمَّ! إنْ كُنتَ تَعْلَمُ

718. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) మాకు అన్ని పనుల కోసం ఇస్తిఖారా ప్రార్థనను దివ్యఖుర్ఆన్ లోని సూరా నేర్పించినట్లు నేర్పించే వారు. "మీరు ఏదయినా నిర్ణయం తీసుకోవాలనుకున్నప్పుడు రెండు రకాతుల నఫిల్ నమాజ్ చేసి ఆ తరు వాత ఈ విధంగా ప్రార్థించాలి" అని ఉపదేశించేవారు:

"అల్లాహుమ్మ ఇన్నీ అస్తఖీరుక బిఇల్మిక వ అస్తఖ్‌దిరుక బి ఖుద్‌రతిక వ అస్అలుక మిన్ ఫజ్లికల్ అజీమి. ఫ ఇన్నక తఖ్‌దిరు వలా అఖ్‌దిరు వ తాలము వలా ఆలము వ అంత అల్లాముల్ గుయూబ్. అల్లాహుమ్మ ఇన్ కుంత తాలము అన్న హాజల్అమ్ర

أَنَّ هٰذَا الأمرَ خَيْرٌ لي في دِيني وَمَعاشي وَعَاقِبَةِ أَمري - أَوْ قالَ: عَاجِلِ أَمْرِي وَآجِله - فاقْدُرْهُ لي وَيَسِّرْهُ لي، ثمَّ بَارِكْ لي فيهِ، وَإن كُنْتَ تَعْلَمُ أَنَّ هٰذَا الأمْرَ شرٌّ لي في دِيني وَمَعَاشِي وَعَاقِبَةِ أمري - أو قال: عَاجِلِ أَمري وَآجِلِهِ - فاصْرِفهُ عَنِّي،

ఖైరున్ లీ ఫీ దీనీ వ మఆషీ వ ఆఖిబతి అమ్రీ అవ్‌ఖాల ఫీ ఆజిలి అమ్రీ వ ఆజిలిహీ ఫఖ్‌దుర్‌హు లీ వ ఇస్‌కుంత తాలము అన్న హాజల్ అమ్ర షర్రున్ లీ ఫీ దీనీ వ మఆషీ వ ఆఖిబతి అమ్రీ అవ్ ఖాల ఫీ ఆజిలి అమ్రీ వ ఆజిలిహీ ఫస్‌రిఫ్‌హు అన్నీ వస్‌రిఫ్‌నీ అన్‌హు వఖ్‌దుర్‌లియల్ ఖైర హైసు కాన సుమ్మ రజ్జినీ బిహీ."

దేవా! నేను నీ జ్ఞాన భాగ్యంతో సాఫల్యాన్ని ప్రసాదించమని అడుగుతున్నాను. నీ అధికార సాయంతో (నా దశ దిశలను మలచుకునే) శక్తిని ప్రసాదించమని కోరుతున్నాను. మహోన్నతమైన నీ అనుగ్రహాన్ని ప్రసాదించమని అభ్యర్థించుకుంటు న్నాను. నిశ్చయంగా నువ్వే అధికారం కలవాడివి. నాకు ఎలాంటి అధికారమూ లేదు. నీకు అన్నీ తెలుసు. నాకు ఏమీ తెలియదు. అగోచర జ్ఞానివి నీవే. దేవా! నీ జ్ఞానం ప్రకారం ఈ పని ధార్మికంగా, ప్రాపంచికంగా, పరలోక పరిణామం రీత్యా (లేదా) త్వరగా లేక ఆలస్యంగా నాకు ప్రయోజనకరమైతే దాన్ని నా అదృష్టంలో ఉంచు. దాని సాధనను నా కొరకు సులభతరం చెయ్యి. దాన్ని నా కొరకు శుభప్రదమైనదిగా చెయ్యి. కాని ఒకవేళ నీ జ్ఞానం ప్రకారం ఈ పని ధార్మికంగా, ప్రాపంచికంగా పరలోక పరిణామం రీత్యా (లేదా) త్వరగా గానీ, ఆలస్యంగా గానీ నాకు నష్టం కలిగించేదయితే దాన్ని

وَاصْرِفْنِي عَنْهُ وَاقْدُرْ لِي الخَيْرَ حَيْثُ كَانَ، ثُمَّ رَضِّنِي بِهِ» قال: «ويسمِّي حاجته». رواه البخاري.

నా నుండి దూరంగా ఉంచు. దాని బారి నుండి నన్ను కాపాడు. సాఫల్యం ఎక్కడు న్నాసరే దాన్ని నా అదృష్టంగా మలచు. ఆ తరువాత నా మనసు దానిపై కుదుట పడేలా చెయ్యి."

(హాజత్ అమ్ర అనేచోట) తమ అవస రాన్ని పేర్కొనాలి. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని తహజ్జుద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

నిఘంటువులో 'ఇస్తిఖారా' అంటే శ్రేయాన్ని ఆశించటం అని అర్థం. మనిషి ఇస్తిఖారా ప్రార్థన ద్వారా దేవుడు తనకు శ్రేయస్కరమైన మార్గాన్ని చూపుతాడని ఆశిస్తాడు. ఇకపోతే ఆ ప్రార్థన స్వీకృతిని పొందిందా లేదా అన్న విషయాన్ని తెలుసుకోవటం అసాధ్యం. ఇస్తిఖారా ప్రార్థన చేసిన వ్యక్తికి కలలో తనకు ఎదురైన సమస్యకు సంబంధించి పరిష్కార మార్గం కనిపిస్తుందని లేదా మనసు సరైన నిర్ణయం వైపు మొగ్గుతుందని సాధారణంగా కొంతమంది చెబుతుంటారు. కాని అలా జరుగుతుందని హదీసుల్లో ఎక్కడా చెప్పబడలేదు. దైవం కోరితే ఎవరికయినా స్వప్నావస్థలో పరిష్కార మార్గాలు కనిపించవచ్చు లేదా దేవుని తరఫునుండి మనసులో సరైన నిర్ణయాలూ జనించవచ్చు. అయితే అందరి విషయంలోనూ అలా జరుగుతుందని మాత్రం ఇతమిత్థంగా చెప్పలేము. కనుక ఇస్తిఖారా చేసిన తరువాత దైవిక సంకేతాల కోసం ఎదురుచూడకుండా బాగా ఆలోచించి తమ దృష్టికి ప్రయోజనకరంగా తోచిన నిర్ణయాలే తీసుకోవాలి. దైవం తలిస్తే దానివల్ల తప్పకుండా మేలు కలుగుతుంది.

ఇస్తిఖారా ప్రార్థనకు ముందు రెండు రకాతుల నఫిల్ నమాజ్ చేయవలసి ఉంటుంది. కనుక నమాజ్ చేయకూడని వేళలు మినహా ఇతర సమయాల్లో ఎప్పుడయినా ఈ ప్రార్థన చేయవచ్చు. చాలామంది ఇస్తిఖారా ప్రార్థనను రాత్రి పడుకోబోయేముందు చేయాలని అనుకుంటుంటారు. అవన్నీ ఒట్టి మాటలే. ఇస్తిఖారా ప్రార్థన ఎప్పుడయినా రెండు రకాతుల నఫిల్ నమాజ్ తరువాత లేదా నమాజులోనే తషహ్హుద్, దరూదె షరీఫ్‌ల తరువాత సలాంకు ముందయినా చేయవచ్చు. అలాగే సజ్దాలో ఉన్న స్థితిలోనయినా చేయవచ్చు. ప్రార్థన కంఠస్థం లేకపోతే నమాజ్ చేసుకున్న తరువాత పుస్తకంలో చూసి కూడా చదువుకోవచ్చు.

## 98వ అధ్యాయం

٩٨ - بَابُ اسْتِحْبَابِ الذَّهَابِ إِلَى الْعِيدِ، وَعِيَادَةِ الْمَرِيضِ وَالْحَجِّ وَالْغَزْوِ وَالْجَنَازَةِ وَنَحْوِهَا مِنْ طَرِيقٍ وَالرُّجُوعِ مِنْ طَرِيقٍ آخَرَ، لِتَكْثِيرِ مَوَاضِعِ الْعِبَادَةِ

## పండుగ నమాజులకు, రోగగ్రస్తుల్ని పరామర్శించటానికి, హజ్, జిహాద్, జనాజా నమాజ్‌కు లేక మరే ఆరాధనకయినా వెళ్ళినప్పుడు దారులు మార్చి నడిస్తే పుణ్యం లభించటంతోపాటు ఎక్కువ ప్రదేశాల్లో దైవారాధన చేసినట్లవుతుంది

٧١٩ - عن جابرٍ رضيَ اللهُ عنه قال: كَانَ النَّبِيُّ ﷺ إذا كَانَ يَوْمُ عِيدٍ خَالَفَ الطَّرِيقَ. رواه البخاري. قوله: «خَالَفَ الطَّرِيقَ» يعني: ذَهَبَ في طَرِيقٍ، وَرَجَعَ في طَرِيقٍ آخَرَ.

719. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) పండుగ రోజు (నమాజ్‌కు వెళ్ళినప్పుడు) దారులు మార్చి నడిచేవారు. *(బుఖారీ)*

అంటే వెళ్ళినప్పుడు ఒక దారిగుండా వెళ్ళి, తిరిగొచ్చినప్పుడు వేరొక దారి గుండా వచ్చేవారని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని పండుగల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) ప్రార్థనా స్థలాలకు ఒక దారిగుండా వెళ్ళి మరోదారిగుండా తిరిగి రావటంలోని ఆంతర్యం ఏమిటి? దీని గురించి పండితులు అనేక అభిప్రాయాలు వెల్లడించారు. ప్రజలు ప్రార్థనా స్థలాలకు వెళ్ళివచ్చినప్పుడు దారిలో దేవుని ఏకత్వాన్నీ, ఆయన పవిత్రతను కొనియాడతారు. ఆయన ఔన్నత్యాన్ని స్తుతిస్తారు. దానివల్ల ఎక్కువ ప్రదేశాల్లో దైవారాధన చేసినట్లవుతుందని గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మలై) అభిప్రాయపడుతున్నారు. కొంతమంది పండితులు ప్రళయదినాన ఆ దారులు తమగుండా దైవాన్ని స్తుతిస్తూ నడచిన దాసుల గురించి దైవసన్నిధిలో సాక్ష్యం చెబుతాయని అభిప్రాయపడ్డారు. సాధారణంగా పండుగరోజు ప్రజలు ఇతర రోజుల్లోకన్నా ఎక్కువగా దానధర్మాలు చేస్తారు. కనుక దారులు మార్చి నడవటం వల్ల

ఎక్కువమంది అవసరార్థుల అవసరాలు తీరే అవకాశాలున్నాయని మరికొంతమంది పండితులు అభిప్రాయపడుతున్నారు. ఏదిఏమైనా ప్రార్థనా స్థలాలకు ఒకదారి గుండా వెళ్ళి మరోదారి గుండా తిరిగి రావటం దైవప్రవక్త సంప్రదాయం అనే విషయం మాత్రం సత్యం.

٧٢٠ - وعن ابن عُمَرَ رضيَ الله عنهما أنَّ رسولَ اللهِ ﷺ كانَ يَخْرُجُ مِنْ طَرِيقِ الشَّجَرَةِ، وَيَدْخُلُ مِنْ طَرِيقِ المُعَرَّسِ، وإذا دَخَلَ مَكَّةَ دَخَلَ مِنَ الثَّنِيَّةِ العُلْيَا وَيَخْرُجُ مِنَ الثَّنِيَّةِ السُّفْلى. متفقٌ عليه.

720. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) (మదీనా నగరం నుండి) బయటికి వెళ్ళదలచుకున్నప్పుడు షజరా మార్గం గుండా బయటికి వెళ్ళేవారు. తిరిగి నగరంలోకి ప్రవేశించేటప్పుడు ముఅర్రస్ దారిగుండా ప్రవేశించేవారు.

మక్కా నగరంలోకి ప్రవేశించినప్పుడు 'సనియ్యా ఉల్యా' (ఎత్తైన గుట్టల) మార్గం గుండా ప్రవేశించేవారు. అక్కణ్ణుంచి 'సనియ్యా సుఫ్లా' (పల్లపు గుట్టల) దారి గుండా వెడలేవారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'సనియ్యా' అంటే కనుమ అని అర్థం. మదీనా నుండి మక్కాకు వెళ్ళినప్పుడు దైవప్రవక్త (సల్లం) మెరక ప్రాంతం గుండా వెళ్ళి తిరిగొచ్చినప్పుడు పల్లపు ప్రాంతం గుండా తిరిగొచ్చేవారు. షజరా అనేది ఓ ప్రముఖ ప్రాంతం. దైవప్రవక్త (సల్లం) ఆ ప్రాంతం గుండా జుల్ హులైఫా అనే ప్రదేశానికి వెళ్ళి, అక్కడ ఒక రాత్రి గడిపేవారు. తిరుగు ప్రయాణంలో ముఅర్రస్ దారిగుండా మదీనా నగరంలోకి ప్రవేశించేవారు. జుల్ హులైఫా ప్రదేశంలో ఉన్న మస్జిదునే ముఅర్రస్ అని అంటారు. అది మదీనా నగరానికి ఆరు మైళ్ళ దూరంలో ఉంటుంది. ఈ హదీసు కూడా దైవ ప్రవక్త (సల్లం) ప్రార్థనా స్థలాలకు ఒక దారిగుండా వెళ్ళి మరొక దారిగుండా తిరిగొచ్చేవారని తెలుపుతోంది.

# 99వ అధ్యాయం

## ٩٩ - بَابُ اسْتِحْبَابِ تَقْدِيمِ الْيَمِينِ فِي كُلِّ مَا هُوَ مِنْ بَابِ التَّكْرِيمِ

## ప్రతి మంచి పనినీ కుడివైపునుండి ఆరంభించటం అభిలషణీయం

كَالْوُضُوءِ وَالْغُسْلِ وَالتَّيَمُّمِ، وَلُبْسِ الثَّوْبِ وَالنَّعْلِ وَالْخُفِّ وَالسَّرَاوِيلِ وَدُخُولِ الْمَسْجِدِ، وَالسِّوَاكِ، وَالاكْتِحَالِ، وَتَقْلِيمِ الْأَظْفَارِ، وَقَصِّ الشَّارِبِ وَنَتْفِ الْإِبْطِ وَحَلْقِ الرَّأْسِ، وَالسَّلَامِ مِنَ الصَّلَاةِ وَالْأَكْلِ وَالشُّرْبِ، وَالْمُصَافَحَةِ وَاسْتِلَامِ الْحَجَرِ الْأَسْوَدِ، وَالْخُرُوجِ مِنَ الْخَلَاءِ، وَالْأَخْذِ وَالْعَطَاءِ، وَغَيْرِ ذٰلِكَ مِمَّا هُوَ فِي مَعْنَاهُ. وَيُسْتَحَبُّ تَقْدِيمُ الْيَسَارِ فِي ضِدِّ ذٰلِكَ، كَالِامْتِخَاطِ وَالْبُصَاقِ عَنِ الْيَسَارِ، وَدُخُولِ الْخَلَاءِ، وَالْخُرُوجِ مِنَ الْمَسْجِدِ، وَخَلْعِ الْخُفِّ وَالنَّعْلِ وَالسَّرَاوِيلِ وَالثَّوْبِ، وَالِاسْتِنْجَاءِ وَفِعْلِ الْمُسْتَقْذَرَاتِ وَأَشْبَاهِ ذٰلِكَ

قال الله تعالى: ﴿ فَأَمَّا مَنْ أُوتِيَ كِتَٰبَهُۥ

ఉదాహరణకు వుజూ చేయటం, గుసుల్ చేయటం, తయమ్ముమ్ చేయటం, దుస్తులు, పాదరక్షలు, మేజోళ్ళు, షరాయి ఇత్యాదివి ధరించటం, మస్జిద్‌లోకి ప్రవేశించటం, మిస్వాక్ చేయటం, సుర్మా పూసుకోవటం, గోళ్ళు మీసాలు కత్తిరించుకోవటం, చంకలోని వెంట్రుకలు పెరికివేయటం, శిరోజాలు గొరిగించుకోవటం, నమాజును సలాంతో ముగించటం, తినటం, త్రాగటం, కరచాలనం చేయటం, హజ్రె అస్వద్‌ను (నల్లరాయిని) చుంబించటం, మరుగుదొడ్డి నుండి వెడలటం, ఏదయినా ఇవ్వటం తీసుకోవటం లాంటి పనులన్నీ కుడి వైపు నుండి ప్రారంభించాలి.

వీటికి భిన్నమైన పనులను ఎడమవైపునుండి ప్రారంభించటం అభిలషణీయం. ఉదాహరణకు ముక్కు శుభ్రం చేసుకోవటం, ఎడమ వైపు ఉమ్మివేయటం, మరుగుదొడ్డిలోకి ప్రవేశించటం, మస్జిద్‌నుండి బయటికి రావటం, మేజోళ్ళు, పాదరక్షలు, దుస్తులు ఇత్యాదివి ధరించిన తరువాత వాటిని విడవటం, మూత్రశుద్ధి చేసుకోవటం, అపరిశుభ్రమైన పనులు చేయటం మొదలగునవి.

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

తన కర్మల పత్రం తన కుడి చేతికివ్వబడిన

بِيَمِينِهِ فَيَقُولُ هَآؤُمُ ٱقْرَءُوا۟ كِتَٰبِيَهْ ﴾ الآيات [الحاقة: ١٩]، وقال تعالى: ﴿ فَأَصْحَٰبُ ٱلْمَيْمَنَةِ مَآ أَصْحَٰبُ ٱلْمَيْمَنَةِ ۝٨ وَأَصْحَٰبُ ٱلْمَشْـَٔمَةِ مَآ أَصْحَٰبُ ٱلْمَشْـَٔمَةِ ﴾ [الواقعة: ٨، ٩].

వ్యక్తి, "చూడండి, నా కర్మల పత్రాన్ని తీసుకొని చదవండి" అని అంటాడు.

*(అల్ హాఖ్ఖహ్ : 19)*

"కుడి పక్షంవారు; కుడి పక్షంవారి (అదృష్టాన్ని) గురించి ఏమనాలి. ఎడమ పక్షంవారు; ఎడమపక్షంవారి (దురదృష్టాన్ని) గురించి ఏమనాలి." *(అల్ వాఖిఅహ్ : 8,9)*

## వివరణ

ప్రళయదినాన దేవుని కరుణాకటాక్షాలకు అర్హులయ్యే దాసులకు వారి కర్మల పత్రాలు కుడిచేతిలో ఇవ్వబడతాయి. ఇది వారి అదృష్టానికి, సౌభాగ్యానికి ప్రతీకగా భావించబడుతుంది. వీరు దైవ సింహాసనానికి కుడిప్రక్కన ఉంటారు కనుక వీరిని "అస్హాబుల్ యమీన్" అని అంటారని మరికొంతమంది పండితులు అభిప్రాయపడ్డారు. ఏది ఏమైనప్పటికీ గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) పైన పేర్కొనబడిన సూక్తుల ద్వారా మంచిపనుల కోసం కుడివైపు అవయవాలను ఉపయోగించటం మరియు అవాంఛనీయ పనుల కోసం ఎడమ చెయ్యి, ఎడమ కాలు ఉపయోగించటం పుణ్యప్రదమన్న విషయాన్ని నిరూపించారు. హదీసుల్లో కూడా దీని గురించి విశదంగా బోధించటం జరిగింది. మచ్చుకు కొన్ని హదీసులు గమనించండి:

٧٢١ ـ عن عائشةَ رضيَ الله عنها قالَتْ: كَانَ رسولُ اللهِ ﷺ يُعْجِبُهُ التَّيَمُّنُ في شَأْنِهِ كُلِّه: في طُهُورِهِ، وَتَرَجُّلِهِ، وتَنَعُّلِهِ. متفقٌ عليه.

721. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) ప్రతి పనినీ కుడివైపు నుండి ప్రారంభించటాన్ని ఎక్కువగా యిష్టపడేవారు. చివరికి వుజూ చేసుకోవటం, తల దువ్వుకోవటం, పాద రక్షలు ధరించటమయినా సరే.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వుజూ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని శుచి, శుభ్రతల ప్రకరణం)*

٧٢٢ ـ وعنها قالت: كانَتْ يَدُ رسولِ اللهِ ﷺ اليُمْنى لِطَهُورِهِ وطَعَامِهِ، وكَانَتِ اليُسْرَى لِخَلائِهِ وَمَا كَانَ مِنْ أَذًى.

722. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) గారి కుడిచేయి వుజూ చేసుకోవటం కోసం, భోజనం చేయటం కోసం ఉప

یوగపడేది. ఎడమచేయి మలమూత్ర శుద్ధికోసం, ఇతర అపరిశుభ్రమైన పనుల కోసం ఉపయోగపడేది.

حديث صحيح، رواه أبو داود وغيره بإسناد صحيح.

(ఈ హదీసు దృఢమైనది, అబూదావూద్ తదితరులు దీనిని దృఢమైన ఆధారా లతో వెలికి తీశారు.)

*(సుననె అబూదావూద్‌లోని శుచి, శుభ్రతల ప్రకరణం)*

723. హజ్రత్ ఉమ్మె అతియ్యా (రజి. అన్‌హా) కథనం : దైవప్రవక్త (సల్లం) తన కూతురు జైనబ్ (రజి.అన్‌హా)కు (ఆమె భౌతిక కాయానికి) స్నానం చేయించే విషయమై మమ్మల్ని ఉద్దేశ్యించి, “స్నానం కుడివైపునుండి మొదలు పెట్టండి; ముందుగా వుజూలో కడగవల సిన అవయవాలు కడగండి” అని అన్నారు. *(బుఖారీ - ముస్లిం)*

٧٢٣ - وعن أم عَطِيَّةَ رضيَ الله عنها أنَّ النبيَّ ﷺ قالَ لَهُنَّ في غَسْلِ ابْنَتِهِ زَيْنَبَ رضي الله عنها: «ابْدَأْنَ بِمَيَامِنِهَا وَمَوَاضِعِ الوُضوءِ مِنْهَا» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. మనిషి బ్రతికుండగా తన పనుల్ని కుడివైపునుండి మొదలుపెట్టినట్లుగానే చనిపోయిన తరువాత అతని శవస్నానాన్ని కూడా కుడివైపునుండే మొదలుపెట్టాలి.
2. హజ్రత్ జైనబ్ (రజి.అన్‌హా) భౌతికకాయానికి స్నానం చేయించిన స్త్రీలలో ఉమ్మె అతియ్యా కూడా ఉన్నారు. శవ స్నానానికి సంబంధించి దైవప్రవక్త (స) వారందరికీ సూచనలిచ్చారు. దీనిద్వారా స్త్రీ భౌతిక కాయానికి అత్యంత దగ్గరి మహ్రమ్ బంధువు అయిన భర్తగాని లేక ఇతర స్త్రీలు గాని స్నానం చేయించాలని బోధపడుతోంది.

724. హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు : మీలో ఎవ రయినా చెప్పులు తొడుక్కున్నప్పుడు మొదట కుడి కాలికి తొడుక్కోవాలి. విడిచేటప్పుడు మొదట ఎడమ కాలి

٧٢٤ - وعن أبي هُريرةَ رضيَ الله عنه أن رسولَ الله ﷺ قال: «إذا انْتَعَلَ أَحَدُكُمْ فَلْيَبْدَأْ باليُمْنى، وَإذَا نَزَعَ فَلْيَبْدَأْ بِالشِّمَالِ. لِتَكُنِ اليُمْنى أَوَّلَهُمَا تُنْعَلُ، وَآخِرَهُمَا تُنْزَعُ» متفقٌ عليه.

చెప్పు విడవాలి. ఇలా తొడుక్కోవటంలో కుడికాలు ఎప్పుడూ ముందుండాలి, వదలడంలో ఎప్పుడూ చివర ఉండాలి. (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని వస్త్ర ధారణ ప్రకరణం)*

725. హజ్రత్ హఫ్సా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) తన కుడి చేతిని తినటం, త్రాగటం కోసం, బట్టలు ధరించటం కోసం ఉపయోగించేవారు. ఎడమ చేతిని వేరే పనుల కోసం ఉపయోగించేవారు.

٧٢٥ ـ وعن حَفْصَةَ رضيَ الله عنها أنَّ رسولَ اللهِ ﷺ، كان يَجْعَلُ يَمِينَه لِطَعَامِه وَشَرَابِهِ وَثِيَابِهِ، وَيَجْعَلُ يَسَارَهُ لِمَا سِوَى ذلكَ. رواه أبو داود والترمذي وغيره.

*(అబూదావూద్, తిర్మిజీ తదితరులు దీనిని ఉల్లేఖించారు)*

*(సుననె అబూ దావూద్‌లోని శుచి, శుభ్రతల ప్రకరణం)*

726. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీరు బట్టలు ధరించేటప్పుడు, వుజూ చేసినప్పుడు కుడివైపు నుండి మొదలుపెట్టండి."

٧٢٦ ـ وعن أبي هُريرةَ رضي الله عنه أنَّ رسولَ اللهِ ﷺ قال: «إذا لَبِسْتُمْ، وَإذا تَوَضَّأتُمْ، فَابْدَؤُوا بِأَيَامِنِكُمْ» حديث صحيح، رواه أبو داود والترمذي بإسناد صحيح.

*(అబూ దావూద్, తిర్మిజీ, దీని ఆధారాలు దృఢమైనవి)*

*(సుననె అబూ దావూద్‌లోని వస్త్రధారణ ప్రకరణం, సుననె తిర్మిజీలోని వస్త్రధారణ అధ్యాయం)*

727. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) (తన వీడ్కోలు హజ్‌లో) మినా ప్రదేశానికి చేరుకున్నాక 'జమ్రా' దగ్గరికెళ్ళి దానికి కంకర్రాళ్ళు రువ్వారు. ఆ తరువాత మినాలోని తన విడిది గృహానికి చేరుకొని పశుబలి ఇచ్చారు. తరువాత వెంట్రుకలు గొరిగే మనిషిని పిలిచి ఇటుప్రక్క వెంట్రుకలు గొరగమని చెబుతూ కుడివైపు చూపిం

٧٢٧ ـ وعن أنسٍ رضي الله عنه أنَّ رسولَ اللهِ ﷺ أتى مِنًى، فَأتَى الجَمْرَةَ فَرَمَاهَا، ثُمَّ أتَى مَنْزِلَهُ بِمِنًى، وَنَحَرَ، ثُمَّ قال لِلحلاَّقِ: «خُذْ» وَأَشَارَ إلى جَانِبِه الأيْمَنِ، ثُمَّ الأيْسَرِ، ثمَّ جَعَلَ يُعْطِيهِ

النَّاسَ. متفقٌ عليه. وفي روايةٍ: لمَّا رَمَى الجَمْـرَةَ، وَنَحَـرَ نُسُكَـهُ وَحَلَـقَ، نَـاوَلَ الحَلَّاقَ شِقَّهُ الأَيْمَنَ فَحَلَقَهُ، ثم دَعَا أَبَا طَلْحَةَ الأنصَارِيَّ رضي الله عنه، فَأَعطَاهُ إيَّاهُ، ثمَّ نَاوَلَهُ الشِّقَّ الأَيْسَرَ فقال: «احْلِقْ» فَحَلَقَهُ فَأَعْطَاهُ أَبَا طَلْحَةَ فقال: «اقسِمْهُ بَيْنَ النَّاسِ».

చారు. తరువాత ఎడమప్రక్క వెంట్రుకలు గొరిగించుకొని ఆ వెంట్రుకలన్నీ ప్రజలకు ఇవ్వసాగారు.

*(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దైవప్రవక్త (సల్లం) జమ్రాకు కంకర్రాళ్ళు రువ్వి, పశుబలి ఇచ్చిన తరువాత తల గొరిగించుకోదలచి వెంట్రుకలు గొరిగే మనిషికి తన కుడివైపు శిరోజాలు అందించారు. అతను వాటిని గొరిగేశాడు. అప్పుడాయన అబూ తల్హా (రజి)ని పిలిచి ఆ వెంట్రుకలు ఆయనకిచ్చారు. తరువాత ఎడమ వైపు శిరోజాలు అందిస్తూ "ఇప్పుడు వీటిని గొరుగు" అని అన్నారు. అతను వాటిని కూడా గొరిగేశాడు. దైవప్రవక్త (సల్లం) ఆ వెంట్రుకలు కూడా అబూ తల్హా (రజి)కు ఇచ్చి, వాటిని ప్రజలకు పంచిపెట్టమని ఆదేశించారు.

*(సహీహ్ బుఖారీలోని వుజూ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. కాబా యాత్రికులు జిల్ హిజ్జా మాసపు పదో తేదీన అరఫాత్ స్థలం నుండి తిరిగొచ్చి 'జమ్రా అఖబా'కు కంకర్రాళ్ళు కొట్టవలసి ఉంటుంది. ఆ తరువాత పశుబలి ఇచ్చి, శిరోజాలు గొరిగించుకోవటంగానీ, కత్తిరించుకోవటం గాని చేస్తారు. చివరగా కాబా గృహం చుట్టూ ప్రదక్షిణాలు చేస్తారు. ఈ ప్రదక్షిణాలనే 'తవాఫె ఇఫాజా' లేక 'తవాఫె జియారత్' అని అంటారు.
2. తల వెంట్రుకలు గొరిగించుకున్నప్పుడుగాని, కత్తిరించుకున్నప్పుడుగాని కుడివైపు నుండి ప్రారంభించాలి.
3. దైవప్రవక్త గుర్తులను శుభప్రదమైనవిగా భావించటం ధర్మసమ్మతమే. అయితే ఈ పద్ధతి ఒక్క దైవప్రవక్త గుర్తులకు మాత్రమే పరిమితం.

# ٢ ـ كِتَابُ أَدَبِ الطَّعَامِ

# 2. భోజన నియమాలు

**100వ అధ్యాయం**

## ١٠٠ ـ بَابُ التَّسْمِيَةِ فِي أَوَّلِهِ وَالْحَمْدِ فِي آخِرِهِ

## భోజనానికి ముందు బిస్మిల్లాహ్ పఠించాలి, చివర్లో అల్‌హమ్దు లిల్లాహ్ అనాలి

٧٢٨ ـ عن عُمَرَ بنِ أبي سَلَمَةَ رضي الله عنهما قال: قال لي رسولُ الله ﷺ: «سَمِّ اللهَ وكُلْ بيَمِينِكَ، وكُلْ مِمَّا يَلِيكَ» متفقٌ عليه.

728. హజ్రత్ ఉమర్ బిన్ అబూ సలమా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఓసారి నాకు హితోపదేశం చేస్తూ, "(భోజనానికి ముందు) అల్లాహ్ పేరు చెప్పు. కుడిచేత్తో తిను. నీకు దగ్గరగా ఉన్న వాటిని తీసు కొని తిను" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని భోజనాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఈ హదీసు భోజనం చేసినప్పుడు పాటించవలసిన కనీస నియమాలను బోధిస్తోంది. భోజనానికి ముందు 'బిస్మిల్లాహ్' అని పఠించి తినడం ప్రారంభించాలి. తమకు దగ్గరలో ఉన్న వస్తువుల్ని తీసుకొని తినాలి. అంటే ఒక పెద్ద కంచంలో ఒకే రకమైన ఆహార పదార్థం ఉండి, ఒకరికంటే ఎక్కువ మంది అందులో తింటున్నప్పుడు ప్రతి ఒక్కరూ తమకు ముందున్న పదార్థమే తీసుకొని తినాలి. అలాకాకుండా ఇతరుల ముందునుంచి ఏరుకొని తినటం సభ్యత అనిపించుకోదు. ఒకవేళ పళ్ళెంలో అనేక రకాల తినుబండారాలు, పండ్లు ఫలాలు ఉంటే మాత్రం అప్పుడు తమకు నచ్చిన వస్తువులు ఇతరుల ముందు నుంచి తీసుకొని తినటంలోనూ తప్పులేదు.

٧٢٩ ـ وعن عَائشةَ رضيَ الله عنها قـالَـتْ: قـالَ رسـولُ الله ﷺ: «إذا أكـلَ أَحَدُكُمْ فَلْيَذْكُرِ اسْمَ اللهِ تعَالَى، فإنْ نَسِيَ أَنْ يَذْكُرَ اسْمَ اللهِ تعالى في أَوَّلِهِ، فَلْيَقُلْ: بِسْمِ اللهِ أَوَّلَهُ وَآخِرَهُ». رواه أبو داود، والترمذي وقال: حديث حسن صحيح.

729. హ(జత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీలో ఎవరయినా అన్నం తినదలచుకున్నప్పుడు మొదట్లో దైవనామాన్ని గుర్తుచేసుకోవాలి. మొదట్లో గుర్తు చేసుకోవటం మరచిపోతే ఆ తరువాత గుర్తొచ్చినప్పుడు 'బిస్మిల్లాహి అవ్వలహూ వ ఆఖిరహూ' (మొదట్లో నయినా, చివర్లోనయినా అల్లాహ్ పేరుతోనే తింటున్నాను)" అని అనాలి. (అబూ దావూద్, తిర్మిజీ, తిర్మిజీ దీనిని 'హసన్', 'సహీహ్' గా పేర్కొన్నారు.)

(సుననె అబూ దావూద్, సుననె నసాయీలోని భోజనాల ప్రకరణం)

٧٣٠ ـ وعن جابِرٍ رضيَ الله عنه قال: سَمِعْتُ رسولَ اللهِ ﷺ يقولُ: «إذا دَخَلَ الرَّجلُ بَيْتَهُ، فَذَكَرَ اللهَ تعالى عِنْدَ دُخُولِهِ وعِنْدَ طَعامِهِ، قالَ الشَّيْطانُ لأَصْحَابِهِ: لا مَبِيتَ لَكُم ولا عَشَاءَ، وإذا دخَلَ، فَلَمْ يَذْكُرِ اللهَ تَعَالى عِنْدَ دخُولِهِ، قالَ الشَّيْطَانُ: أَدْرَكْتُمُ المَبِيتَ؛ وإذا لَمْ يَذْكُرِ اللهَ تَعَالى عِنْدَ طَعَامِهِ قال: أَدْرَكْتُمُ المَبِيتَ وَالعَشَاءَ» رواه مسلم.

730. దైవప్రవక్త (సల్లం) ఈవిధంగా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హ(జత్ జాబిర్ (రజి) తెలియజేశారు : మనిషి తన ఇంట్లోకి వెళ్తాడు కదా! ఇంట్లోకి వెళ్ళినప్పుడు, ఆ తర్వాత భోజనం చేసినప్పుడు దేవుణ్ణి గుర్తుచేసుకుంటే (అది తెలుసుకొని) షైతాన్ తన అను చరులతో, "ఈ రాత్రి మీరిక్కడ ఆగడా నికి తావు లేదు, మీకిక్కడ భోజనం కూడా లభించదు" అని అంటాడు. మనిషి ఇంట్లోకి ప్రవేశించినప్పుడు దేవుణ్ణి గుర్తు చేసుకోకపోతే, "షైతాన్ (తన అనుచరులతో), "ఈ రాత్రి మీకిక్కడ స్థానం దొరికింది" అంటాడు. భోజనం చేసినప్పుడు కూడా దేవుణ్ణి గుర్తుచేసుకోకపోతే, "ఈ రాత్రి మీకిక్కడ ఉండటానికి స్థలం ఉంది. అలాగే

భోజనం కూడా ఉంది" అని అంటాడు.

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

సర్వకాల, సర్వావస్థల్లోనూ షైతాన్ దుష్టప్రేరణల నుండి, వాడి కుయుక్తుల నుండి సురక్షితంగా ఉండాలంటే అనునిత్యం అల్లాహ్‌ను స్మరిస్తూ ఉండాలి. పై హదీసులో దేవుణ్ణి గుర్తు చేసుకోవడమంటే ఆయా వేళలకు సంబంధించిన సంప్రదాయబద్ధమైన (మస్నూన్) దుఆలు పఠించటం అని అర్థం. ఉదాహరణకు భోజనానికి ముందు 'బిస్మిల్లాహ్' అని పఠించాలి. అదేవిధంగా ఇంట్లోకి ప్రవేశించినప్పుడు, "అల్లాహుమ్మ ఇన్నీ అస్అలుక ఖైరల్ మౌలిజి వ ఖైరల్ మఖ్రజి, బిస్మిల్లాహి వలజ్‌నా వ అలల్లాహి రబ్బినా తవక్కల్‌నా" అనే దుఆ పఠించాలి.

٧٣١ ـ وعن حُذَيْفَةَ رضيَ اللهُ عنه قال: كُنَّا إذا حَضَرْنَا مَعَ رَسولِ الله ﷺ طَعَاماً، لَمْ نَضَعْ أيدِيَنَا حَتَّى يَبْدَأَ رسولُ الله ﷺ فَيَضَعَ يَدَه. وَإنَّا حَضَرْنَا مَعَهُ مَرَّةً طَعَاماً، فَجَاءَتْ جَارِيَةٌ كَأنَّهَا تُدْفَعُ، فَذَهَبَتْ لِتَضَعَ يَدَهَا في الطَّعَامِ، فَأخَذَ

731. హజ్రత్ హుజైఫా (రజి) కథనం : మేము దైవప్రవక్త (సల్లం)తో పాటు కలిసి భోజనానికి కూర్చున్నప్పుడు ఆయన తన చేత్తో మొదలుపెట్టనంతవరకూ మేము ఆ భోజనాన్ని ముట్టుకునేవాళ్ళం కాము. ఓసారి మేమాయనతో పాటు భోజనానికి కూర్చున్నాం. అంతలో ఓ అమ్మాయి వెనుకనుంచి ఎవరో నెట్టినట్టు వేగంగా వచ్చి అన్నంలో చెయ్యి పెట్టబోయింది. అంతలో దైవప్రవక్త (సల్లం) ఆ అమ్మాయి చెయ్యిపట్టుకొని ఆపారు. ఆ తర్వాత మరో పల్లెటూరి వ్యక్తి కూడా అలాగే వెనుక నుంచి ఎవరో నెట్టినట్టు వేగంగా వచ్చి అన్నంలో చెయ్యి పెట్టబోయాడు. ఆయన అతని చెయ్యి కూడా పట్టుకున్నారు. తరువాత ఇలా అన్నారు :

"భోజనం తినేముందు దైవనామాన్ని గుర్తుచేసుకోకపోతే షైతాన్ కూడా ఆ

رسولُ الله ﷺ بيدِهَا، ثمَّ جاءَ أعْرَابيٌّ كأنَّمَا يُدْفَعُ، فأخَذَ بيَدِهِ، فقال رسولُ اللهِ ﷺ: «إنَّ الشَّيْطَانَ يَسْتَحِلُّ الطَّعَامَ أنْ لا يُذْكَرَ اسمُ اللهِ تعالى عليه، وَإنَّهُ جاءَ بهذهِ الجَارِيَةِ لِيَسْتَحِلَّ بهَا، فأخَذْتُ بيَدِهَا، فَجَاءَ بهذا الأعْرَابيِّ لِيَسْتَحِلَّ بهِ، فأخَذْتُ بيَدِهِ، وَالَّذي نَفسي بيَدِه! إنَّ يَدَه في يَدي معَ يَدَيْهِمَا» ثمَّ ذَكَرَ اسمَ اللهِ تَعالى وَأكلَ. رواه مسلم.

భోజనాన్ని తనకోసం సమ్మతం చేసుకుంటాడు. వాడు ఈ పిల్ల ద్వారా భోజనం తిందామని వచ్చాడు. కాని నేను ఈమెను చెయ్యి పట్టుకొని ఆపాను. ఆ తర్వాత వాడు ఈ పల్లెటూరి వ్యక్తి ద్వారా అన్నం తిందామని వచ్చాడు. కాని నేను ఇతన్ని కూడా ఆపాను. ఏ అల్లాహ్ చేతిలో నయితే నా ప్రాణముందో ఆయన సాక్షి! నిశ్చయంగా వీళ్ళిద్దరి చేతులతోపాటు ఆ షైతాన్ చెయ్యి కూడా నా చేతిలో ఉంది."

ఆ తర్వాత ఆయన (సల్లం) అల్లాహ్ పేరు తీసుకొని భోజనం మొదలు పెట్టారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

భోజనానికి ముందు అల్లాహ్ పేరు స్మరించుకోకపోతే షైతాన్ మరియు వాడి అనుచరులు కూడా ఆ భోజనం తింటారని ఈ హదీసు ద్వారా కూడా నిరూపించబడింది. కాబట్టి భోజనానికి ముందు తప్పకుండా బిస్మిల్లాహ్ పఠించాలి. పై హదీసులో దైవప్రవక్త (సల్లం) షైతాన్ చెయ్యి పట్టుకున్నారని చెప్పబడింది. నిజంగానే అలా జరిగి ఉండవచ్చు. దైవ సూచనతో ఆయన వాడి చెయ్యిపట్టుకొని వాడిని ఆ అన్నం తినకుండా ఆపి ఉంటారు. ఒక దైవప్రవక్త దగ్గర ఉండే దివ్యజ్ఞానం మనకు లేదు. కనుక మనం దాని వాస్తవిక స్థితిని అర్థం చేసుకోలేము. అందుకని మనవరకు మనం షైతాన్ యొక్క దుష్టయత్నాల నుంచి సురక్షితంగా ఉండాలంటే ఒక్కటే మార్గం. అలాంటి సందర్భాల్లో అల్లాహ్ నామం స్మరించుకోవాలి.

ఈ హదీసులో మరో భోజన నియమం వివరించబడింది. అదేమిటంటే, ఎక్కువ మంది కలిసి భోజనం చేస్తున్నప్పుడు వారిలో అందరికంటే పెద్దవాడు, గొప్పవాడైన వ్యక్తి ముందు భోజనం మొదలెట్టాలి. అంతేగాని కుక్కలు విస్తరాకుల కోసం కలబడినట్లు అందరూ ఒకేసారి అన్నాలమీద పడిపోరాదు. ఈ రోజుల్లో విందు భోజనాల దగ్గర అలాగే జరుగుతోంది. ఇది ఇస్లామీయ బోధనలకు పూర్తిగా విరుద్ధం. మన సమాజంలోని నామకా ముస్లింలకు సరిగ్గా అన్నం తినటం కూడా రాదు. భోజనాల దగ్గర వారు తాము ఎన్నడూ భోజనం మొహమే చూడలేదన్నట్లు ప్రవర్తిస్తారు. అల్లాహ్ వారికి సద్బుద్ధిని ప్రసాదించుగాక!

732. హజ్రత్ ఉమయ్యా బిన్ మఖ్షీ సహాబీ (రజి) కథనం : ఒక వ్యక్తి అల్లాహ్ పేరు తీసుకోకుండానే అన్నం తిన సాగాడు. ఆ సమయంలో దైవప్రవక్త (సల్లం) అక్కడే కూర్చొని అతన్ని గమనిస్తున్నారు. అతని కంచంలో ఒక్క ముద్ద మాత్రమే మిగిలిపోయింది. దాన్ని కూడా తిందామని నోటిదగ్గరికి ఎత్తుకో గానే (తాను బిస్మిల్లాహ్ పఠించలేదన్న విషయం గుర్తొచ్చి) అతను, "బిస్మిల్లాహి అవ్వలహూ వ ఆఖిరహూ" అని అన్నాడు. అదంతా గమనిస్తూ ఉన్న దైవప్రవక్త (సల్లం) అప్పుడు చిరునవ్వు నవ్వి, "ఇప్పటివరకు అతనితోపాటు షైతాన్ కూడా తింటూ ఉన్నాడు. కాని ఇతనిప్పుడు బిస్మిల్లాహ్ అని అనగానే ఆ షైతాన్ తన కడుపులో ఉన్నదంతా కక్కేశాడు" అని అన్నారు.

*(అబూ దావూద్, నసాయి)*

٧٣٢ ـ وعن أُمَيَّةَ بنِ مخشِيٍّ الصَّحَابيِّ رضيَ الله عنه قال: كانَ رسُولُ اللهِ ﷺ جَالِساً، وَرَجُلٌ يأكُلُ، فَلَمْ يُسمِّ اللهَ حَتَّى لَمْ يَبْقَ مِنْ طَعَامِهِ لُقْمَةٌ، فَلَمَّا رَفَعَهَا إلى فِيهِ، قالَ: بِسمِ اللهِ أَوَّلَهُ وَآخِرَهُ، فَضَحِكَ النبيُّ ﷺ، ثمَّ قال: «مَا زَالَ الشَّيطَانُ يَأكُلُ مَعَهُ، فَلَمَّا ذَكَر اسمَ اللهِ اسْتَقَاءَ مَا في بَطنِهِ». رواه أبو داود، والنسائي.

*(సునన్ అబూ దావూద్‌లోని భోజనాల ప్రకరణం)*

*గమనిక : ఇమామ్ ముంజిరీ (రహ్మాలై) ఈ హదీసు నసాయీ గారి 'సునన్ కుబ్రా' గ్రంథంలో ఉందని చెప్పారు. షేఖ్ అల్ బానీ (రహ్మాలై) ఈ హదీసును బలహీనమైనదిగా ఖరారు చేశారు.*

733. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : ఓసారి దైవప్రవక్త (సల్లం) తన ఆరుగురు సహచరులతోపాటు కలిసి భోజనం చేస్తుండగా అంతలో ఓ పల్లెటూరి వ్యక్తి వచ్చి (అవురావురు మంటూ) రెండు ముద్దల్లోనే ఆ అన్నమంతా తినేశాడు.

٧٣٣ ـ وعن عائشةَ رضيَ الله عنها قالَتْ: كَانَ رسولُ الله ﷺ يَأكُلُ طَعَاماً في سِتَّةٍ مِنْ أَصحَابِهِ، فَجَاءَ أَعْرَابِيٌّ، فأكَلَهُ

بِلُقْمَتَيْنِ، فقال رسولُ الله ﷺ: «أما إنَّهُ لَوْ سَمَّى لَكَفَاكُمْ»، رواه الترمذي وقال: حديثٌ حسنٌ صحيحٌ.

అప్పుడు దైవప్రవక్త (సల్లం) తన సహచరుల్ని సంబోధిస్తూ, "వినండి! ఇతను గనక (భోజనానికి ముందు) అల్లాహ్ పేరు తీసుకొని ఉంటే ఈ అన్నం మీ అందరికీ సరిపోయేది!" అని అన్నారు.

*(తిర్మిజీ - హసన్, సహీహ్)*

*(సుననె తిర్మిజీలోని భోజనాల అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

భోజనానికి ముందు బిస్మిల్లాహ్ పఠిస్తే, ఆ అన్నంలో శుభం ప్రాప్తిస్తుందనీ, బిస్మిల్లాహ్ పఠించకపోతే అందులో శుభం అంతరిస్తుందని ఈ హదీసు సారాంశం.

٧٣٤ ـ وعن أبي أُمامة رضيَ الله عنه أنَّ النبيَّ ﷺ كانَ إذا رَفَعَ مَائِدَتَهُ قال: «الحَمْدُ لله كَثِيراً طَيِّباً مُبَارَكاً فِيه، غَيْرَ مَكْفِيٍّ وَلَا مُوَدَّعٍ، وَلا مُسْتَغْنًى عَنْهُ رَبَّنَا» رواه البخاري.

734. హజ్రత్ అబూ ఉమామా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) (భోజనం చేశాక) తన ముందు నుంచి పాత్రలు ఎత్తినప్పుడు ఈ విధంగా పలికేవారు : "అల్‌హమ్దు లిల్లాహి కసీరన్ తయ్యిబన్ ముబారకన్ ఫీహ్. గైర ముక్ఫియ్యిన్ వలా మువద్దయిన్ వలా ముస్తగ్‌నన్ అన్‌హు రబ్బునా."

"విస్తారమైన, శుద్ధమైన, శుభప్రదమైన స్తోత్రాలన్నీ అల్లాహ్‌కే శోభిస్తాయి. ఈ అనుగ్రహం మాకు ఇంతటితో చాలినట్లు కాదు. ఇది మా ఆఖరి భోజనం కూడా కాదు. మా ప్రభూ! మేము దీనిపట్ల నిరపేక్షులుగా కూడా ఉండలేము." (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని భోజనాల ప్రకరణం)*

735. హజ్రత్ ముఆజ్ బిన్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : అన్నం తిన్న తరువాత, "అల్‌హమ్దు లిల్లాహిల్లజీ అత్‌అమనీ హాజా వ రజఖనీహి మిన్ గైరి హౌలిన్ మిన్నీ వలా ఖువ్వతిన్" (అల్లాహ్‌కు కృతజ్ఞతలు. ఆయన నాకు ఈ భోజనం తినిపించాడు. ఇంకా నా శక్తిసామర్థ్యాల ప్రమేయం లేకుండానే నాకు ఈ ఉపాధి నొసగాడు)" అని పలికే వ్యక్తి వల్ల అప్పటివరకు జరిగిపోయిన (చిన్న చిన్న) పాపాలన్నీ మన్నించబడతాయి.

*(అబూ దావూద్, తిర్మిజీ - హసన్)*

٧٣٥ - وعن مُعَاذِ بن أنسٍ رضيَ اللهُ عنه قال: قَالَ رسُولُ اللهِ ﷺ: «مَنْ أَكَلَ طَعَاماً فقال: الحَمْدُ للهِ الَّذي أَطْعَمَني هذا، وَرَزَقَنِيهِ مِنْ غيرِ حَوْلٍ مِنِّي وَلا قُوَّةٍ، غُفِرَ لَهُ مَا تَقَدَّمَ مِنْ ذَنْبِهِ» رواه أبو داود، والترمذي وقال: حديثٌ حسنٌ.

*(సుననె అబూ దావూద్‌లోని వస్త్రధారణ ప్రకరణం, సుననె తిర్మిజీలోని ప్రార్థనల అధ్యాయం)*

**101 వ అధ్యాయం**

# ١٠١ - بَـابُ لاَ يَعِيبُ الطَّعَامَ وَاسْتِحْبَابُ مَدْحِهِ

# అన్నంలో లోపం ఎత్తిచూపకూడదు, పైగా అన్నం బాగుంటే పొగడాలి

736. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఎన్నడూ ఏ అన్నంలోనూ లోపం ఎత్తిచూపలేదు. ఆయనకు అది ఇష్టమయితే తినేవారు, ఇష్టం లేకపోతే మానుకునేవారు.

(బుఖారీ - ముస్లిం)

٧٣٦ ـ عن أبي هُريرة رضيَ اللهُ عنهُ قالَ: مَا عَابَ رسُولُ اللهِ ﷺ طَعَاماً قَطُّ، إن اشْتَهاهُ أَكلَهُ، وَإِنْ كَرِهَهُ تَرَكَهُ. متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్తల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో కూడా దైవప్రవక్త (సల్లం) గారి ఉత్తమ నడవడిక బోధించబడింది. అందులో మనందరికి మంచి ఆదర్శం ఉంది. మన విధానం దైవప్రవక్త (సల్లం) విధానానికి పూర్తిగా విరుద్ధమైనది. భోజన రుచుల్లో ఒక్కపూట ఏ చిన్న తేడావచ్చినా మనం పెద్ద గలాటా చేస్తాం. దిక్కులు పిక్కటిల్లేలా కేకలు పెడతాం. దైవప్రవక్త ఆదర్శ విధానానికి అనుగుణంగా నేడు మన జీవితాల్లో మార్పు రావలసిన అవసరం ఎంతైనా ఉంది.

737. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఓసారి తమ ఇంటి వారిని కూరపెట్టమని అడిగారు. ఒక్క సిర్కా తప్ప ఇంట్లో మరే కూరా లేదని చెప్పారు ఇంటివాళ్ళు. అప్పుడాయన అదే తెప్పించుకొని తినడం మొదలుపెట్టారు. తింటూ తింటూ, "ఆహా... సిర్కా కూర ఎంత రుచిగా ఉంది! ఆహా.... సిర్కా

٧٣٧ ـ وعن جابرٍ رضيَ الله عنه أنَّ النبيَّ ﷺ سَأَلَ أَهْلَهُ الأُدْمَ فقالُوا: ما عِنْدَنَا إلَّا خَلٌّ، فَدَعَا بِهِ، فَجَعَلَ يَأْكُلُ ويقول: «نِعْمَ الأُدْمُ الخَلُّ، نِعْمَ الأُدْمُ الخَلُّ» رواه مسلم.

కూర ఎంత రుచిగా ఉంది!!" అని అనసాగారు. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)

## ముఖ్యాంశాలు

ఈ హదీసు కూడా అన్నపానీయాల విషయంలో దైవప్రవక్త (సల్లం) ఎంతటి నిరాడంబరులో, ఎంతటి సాధుప్రియులో వివరించబడింది. ఏ విధంగానైతే వస్త్రధారణ మొదలగు విషయాల్లో ఆయన రాచరికపు ఠీవిని, డాబు దర్పాన్ని ప్రదర్శించలేదో అదేవిధంగా భోజనాది విషయాల్లోనూ ఆయన పరమాన్నాలు తినడానికి మోజుపడలేదు. పైగా తనకు ఏది వడ్డిస్తే అది ఆరగించి సంతృప్తి చెందేవారు. దైవప్రవక్త జీవితంలోని ప్రతి సందర్భం మనకు ఆదర్శప్రాయమేనని చెప్పటానికి ఈ ఒక్క నిదర్శనం చాలు!



## 102 వ అధ్యాయం

## ١٠٢ ـ بَابُ مَا يَقُولُهُ مَنْ حَضَرَ الطَّعَامَ وَهُوَ صَائِمٌ إِذَا لَمْ يُفْطِرْ

## ఉపవాసి ముందు అన్నం సమర్పించబడితే అతను ఏం చేయాలి?

٧٣٨ ـ عن أبي هُريرة رضيَ اللهُ عنه قَالَ: قَالَ رسولُ اللهِ ﷺ: «إذا دُعِيَ أَحَدُكُمْ، فَلْيُجِبْ؛ فَإِنْ كَانَ صَائِماً فَلْيُصَلِّ، وَإِنْ كَانَ مُفْطِراً فَلْيَطْعَمْ» رواه مسلم. قال العُلَمَاءُ: مَعْنى «فَلْيُصَلِّ»: فَلْيَدْعُ، ومعنى «فَلْيَطْعَمْ»: فَلْيَأْكُلْ.

738. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఎవరినయినా విందుకు ఆహ్వానిస్తే ఆ ఆహ్వానాన్ని వారు (తప్పకుండా) అంగీకరించాలి. ఒకవేళ పిలువబడే వ్యక్తి ఉపవాసి అయితే అతను పిలిచేవారి కోసం దేవుణ్ణి ప్రార్థించాలి. కాని పిలువబడే వ్యక్తి ఉపవాసి కాకపోతే (లేదా నఫిల్ ఉపవాసముండి ఆ ఉపవాసాన్ని విరమించుకుంటే మాత్రం) ఆ విందుని ఆరగించాలి. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని నికాహ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

నఫిల్ ఉపవాసాలు విరమించుకోవటానికి షరీఅత్ అనుమతినిస్తోంది. వాటిని తిరిగి నెరవేర్చవలసిన బాధ్యత కూడా ఉండదు. అనేక హదీసుల్లో వివరించబడిన దైవప్రవక్త (సల్లం) విధానం ద్వారా ఈ విషయం బోధపడుతోంది. కనుక ఎవరయినా విందుకు ఆహ్వానించినప్పుడు నఫిల్ ఉపవాసాన్ని విరమించుకొని విందు ఆరగించటం ధర్మసమ్మతమే కాని ఎవరికయినా నఫిల్ ఉపవాసం విరమించుకోవటం ఇష్టం లేకపోతే కనీసం విందుకు ఆహ్వానించిన వ్యక్తికి శుభం ప్రాప్తించాలని ప్రార్థన అయినా చేయాలి.

## 103వ అధ్యాయం

## ١٠٣ - بَابُ مَا يَقُولُهُ مَنْ دُعِيَ إِلَى طَعَامٍ فَتَبِعَهُ غَيْرُهُ

## అతిథి తనతోపాటు మరెవరినయినా విందుకు తీసుకెళ్ళదలచినప్పుడు ఆతిథ్యకర్త నుండి అనుమతి తీసుకోవాలి

٧٣٩ - عن أبي مسعودٍ البَدْرِيِّ رضيَ الله عنه قال: دَعَا رَجُلٌ النَّبِيَّ ﷺ لِطَعَامٍ صَنَعَهُ لَهُ خَامِسَ خَمْسَةٍ، فَتَبِعَهُمْ رَجُلٌ، فَلَمَّا بَلَغَ البابَ، قال النبيُّ ﷺ: «إِنَّ هذا تَبِعَنَا؛ فَإِنْ شِئْتَ أَنْ تَأْذَنَ لَهُ، وَإِنْ شِئْتَ رَجَعَ» قال: بل آذَنُ لهُ يا رسولَ اللهِ! متفق عليه.

739. హజ్రత్ అబూ మస్‌వూద్ బద్రీ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) కోసం భోజనం తయారుచేసి ఆయనతో పాటు మరో నలుగురిని విందుకు ఆహ్వానించాడు. విందుకు ఆహ్వానించబడినవారు మొత్తం ఐదుగురు. ఆ ఐదుగురితో పాటు ఇంకో వ్యక్తి కూడా బయలుదేరాడు. అందరూ కలిసి ఆతిథ్య కర్త ఇంటి గుమ్మం దగ్గరికి చేరుకున్న తరువాత దైవప్రవక్త (సల్లం) ఆతిథ్యకర్తతో మాట్లాడుతూ, "ఈ వ్యక్తి మాతోపాటు అదనంగా వచ్చేశాడు. మీకిష్టమయితే అతన్ని అనుమతించండి. లేదంటే తిరిగి వెళ్ళిపోతాడు" అని అన్నారు.

అందుకు ఆతిథ్యకర్త, "(ఫర్వాలేదు), దైవప్రవక్తా! నేను ఇతన్ని కూడా అనుమతిస్తున్నాను" అని అన్నాడు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని భోజనాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

తమకు ఆహ్వానం లేని విందుకు వెళ్ళటం సభ్యత కాదు. ఒకవేళ భోజనానికి ముందు విందుచేస్తున్న వ్యక్తి అనుమతి తీసుకుంటే అప్పుడు ఆ విందుకు హాజరు కావటంలోనూ తప్పు లేదు. అందుకే దైవప్రవక్త (సల్లం) తన వెంటవచ్చిన వ్యక్తి కోసం ఆతిథ్యకర్త దగ్గర అనుమతి తీసుకున్నారు.

## 104వ అధ్యాయం

## ١٠٤ ـ بَابُ الأَكْلِ مِمَّا يَلِيهِ وَوَعْظِهِ وَتَأْدِيبِهِ مَنْ يُسِيءُ أَكْلَهُ

## కంచంలో తమకు దగ్గరున్న పదార్థాలు తీసుకొని తినాలి, అనుచిత పద్ధతిలో తినేవారికి హితోపదేశం చేయాలి, అవసరమైతే మందలించాలి

٧٤٠ ـ عن عمر بن أبي سَلَمَةَ رضي الله عنهما قال: كنتُ غلاماً في حِجْرِ رسولِ اللهِ ﷺ، وَكَانَتْ يَدِي تَطِيشُ في الصَّحْفَةِ، فقال لِي رسولُ اللهِ ﷺ: «يَا غُلامُ! سَمِّ اللهَ تَعَالى، وَكُلْ بِيَمِينِكَ، وكُلْ مِمَّا يَلِيكَ» متفقٌ عليه. قوله: «تَطِيشُ» بكسر الطاء وبعدها ياءٌ مثناة من تحت، معناه: تتحرّك وتمتدّ إلى نواحي الصَّحْفَةِ.

740. హజ్రత్ ఉమర్ బిన్ అబూ సలమా (రజి) కథనం : నేను బాల్యంలో దైవ ప్రవక్త (సల్లం) పోషణలో ఉండేవాణ్ణి. ఆ రోజుల్లో నేను అన్నం తిన్నప్పుడు నా చేయి పళ్లెంలో అటూ ఇటూ తిరుగాడుతూ ఉండేది. అది చూసి దైవప్రవక్త (సల్లం), "అబ్బాయీ! (అన్నం తినే ముందు) దైవనామాన్ని పఠించు. కుడి చేత్తో తిను. నీకు దగ్గరలో ఉన్న వాటిని తీసుకొని తిను" అని నాకు హితోపదేశం చేశారు. *(బుఖారీ - ముస్లిం)*

٧٤١ ـ وعن سَلَمَةَ بنِ الأكوَعِ رضيَ اللهُ عنه أن رَجُلاً أكلَ عِنْدَ رسولِ الله ﷺ بشمالِه، فقال: «كُلْ بيَمِينِكَ» قال: لا أستطيعُ، قالَ: «لا استَطَعْتَ» ما مَنَعَهُ إلَّا الكِبْرُ! فَمَا رَفَعَهَا إلى فِيهِ. رواه مسلم.

741. హజ్రత్ సలమా బిన్ అక్వా (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గర ఎడమ చేత్తో తింటున్నాడు. దైవ ప్రవక్త (సల్లం) అది చూసి కుడిచేత్తో తినమని అతనికి ఉపదేశించారు. అందుకా వ్యక్తి తాను కుడిచేత్తో తినలేనని బదులిచ్చాడు. దానికి ఆయన "నువ్వు (నిజంగానే కుడిచేత్తో) తినలేకపోదువు గాక!" అని శపించారు. "అతని గర్వం అతణ్ణి మాట వినకుండా చేస్తోంది" అని అన్నారు. (ఇక ఆ తరువాత నుంచి) ఆ వ్యక్తి తన కుడిచేతిని నోటిదాకా లేపలేక పోయేవాడు. *(ముస్లిం)*

## 105వ అధ్యాయం

## ١٠٥ - بَابُ النَّهْيِ عَنِ القِرَانِ بَيْنَ تَمْرَتَيْنِ وَنَحْوِهِمَا إِذَا أَكَلَ جَمَاعَةٌ إِلاَّ بِإِذْنِ رِفْقَتِهِ

## బంతి భోజనంలో తోటివారి అనుమతి లేకుండా ఖర్జూరాలు, ఇతర తినుబండారాలు ఒకేసారి రెండేసి చొప్పున తినకూడదు

٧٤٢ - عن جَبَلَةَ بن سُحَيْمٍ قال: أَصَابَنَا عامُ سَنَةٍ مَعَ ابْنِ الزُّبَيْرِ، فَرُزِقْنَا تَمْراً، وَكَانَ عَبْدُ الله بن عمر رضي الله عنهما يَمُرُّ بِنَا وَنَحْنُ نَأْكُلُ فيقولُ: لا تُقَارِنُوا، فإن النبي ﷺ نَهى عن الإقرانِ، ثم يقولُ: إِلَّا أَنْ يَسْتَأْذِنَ الرَّجُلُ أَخَاهُ. متفقٌ عليه.

742. హజ్రత్ జబలా బిన్ సుహైమ్ (రజి) కథనం : అబ్దుల్లాహ్ బిన్ జుబైర్ (రజి) ఖిలాఫత్ కాలంలో ఒకసారి కరువు వచ్చింది. ఆ కాలంలో మాకు కొన్ని ఖర్జూర పండ్లు ఇవ్వబడ్డాయి. మేమా ఖర్జూర పండ్లు తింటుండగా హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) మా సమీపం నుండి వెళ్తూ, “ఒకేసారి రెండేసి ఖర్జూరాలు తినకండి. దైవప్రవక్త (సల్లం) మాకు ఒకేసారి రెండేసి తినుబండారాలు తినకూడదని చెప్పారు. అయితే బంతి లోని సహచరుల అనుమతితో అలా తినవచ్చని చెప్పారు” అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని భోజనాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

సభ్యతా సంస్కారాలకు స్వస్తిపలికిన నేటి ముస్లింలకు ఈ హదీసులో గొప్ప గుణపాఠముంది. బంతి భోజనాల్లో మనం సాధారణంగా చూస్తూ ఉంటాం. ఒక్కో వ్యక్తి ప్రక్కన ఉన్నవారందరినీ మర్చిపోయి వడ్డించబడిన మంచి మంచి ఆహార పదార్థాలన్నీ తన పళ్లెంలో కుమ్మరించుకుంటుంటాడు. తిండి విషయంలో ఈ ఆత్రం దైవప్రవక్త హితోపదేశాలకు పూర్తిగా విరుద్ధమైనది. ఆయన బోధనలు చెప్పేదేమిటంటే మనం అన్నం తినేటప్పుడు కేవలం మన కడుపు నింపుకోవడంలోనే ఉండిపోకూడదు. ప్రక్కనున్నవారి గురించి కూడా ఆలోచించాలి.

## 106వ అధ్యాయం

## ١٠٦ ـ بَابُ مَا يَقُولُهُ وَيَفْعَلُهُ مَنْ يَأْكُلُ وَلاَ يَشْبَعُ

## ఎంత తిన్నా కడుపు నిండకపోతే ఏం చేయాలి?

٧٤٣ ـ عَنْ وَحْشِيِّ بْنِ حَرْبٍ رضيَ الله عنه أن أصحابَ رسولِ الله ﷺ قالُوا: يا رسولَ اللهِ! إِنَّا نَأْكُلُ وَلَا نَشْبَعُ؟ قال: «فَلَعَلَّكُمْ تَفْتَرِقُونَ» قالُوا: نَعَمْ. قال: «فَاجْتَمِعُوا عَلَى طَعَامِكُمْ، وَاذْكُرُوا اسْمَ اللهِ، يُبَارَكْ لَكُمْ فيه» رواه أبو داود.

743. హజ్రత్ వహ్షీ బిన్ హర్బ్ (రజి) కథనం : దైవప్రవక్త సహచరులు ఒకసారి ఆయనతో మాట్లాడుతూ, "దైవప్రవక్తా! మేము తినడానికి తింటున్నాము గాని, మా కడుపులు నిండటంలేదు" అని అన్నారు. "బహుశా మీరు విడివిడిగా తింటున్నారేమో!" అన్నారు దైవప్రవక్త (సల్లం). దానికి సహచరులు 'అవున' న్నారు. అప్పుడాయన "మీరందరూ కలిసి అన్నం తినండి. తినే ముందు బిస్మిల్లాహ్ పఠించండి. దానివల్ల మీకు అందులో శుభం ప్రాప్తిస్తుంది" అని వారికి హితోపదేశం చేశారు. (అబూ దావూద్)

*(సుననె అబూదావూద్‌లోని భోజనాల ప్రకరణం)*

## 107వ అధ్యాయం

## ١٠٧ ـ بَابُ الأَمْرِ بِالأَكْلِ مِنْ جَانِبِ الْقَصْعَةِ وَالنَّهْيِ عَنِ الأَكْلِ مِنْ وَسَطِهَا

## పళ్లెంలో ఒక ప్రక్కనుండి తినాలి, మధ్యలో నుండి తీసుకొని తినకూడదు

فيه: قوله ﷺ: «وَكُلْ مِمَّا يَلِيكَ» متفقٌ عليه كما سبق.

దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : మీకు దగ్గరలో ఉన్నవాటిని తినండి. (బుఖారీ - ముస్లిం) ఈ హదీసు ఇంతకు ముందు కూడా వచ్చింది.

٧٤٤ ـ وعن ابنِ عباسٍ رضيَ اللهُ عنهما عنِ النبيِّ ﷺ قال: «الْبَرَكَةُ تَنْزِلُ وَسَطَ الطَّعَامِ، فَكُلُوا مِنْ حَافَتَيْهِ وَلا تَأْكُلُوا مِنْ وَسَطِهِ» رواه أبو داود، والترمذي وقال: حديثٌ حسنٌ صحيحٌ.

744. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : శుభం అన్నం మధ్యలో అవతరిస్తుంది. కనుక మీరు దాని ఇరు ప్రక్కల నుంచి తినండి. మధ్యలో నుండి తినకండి. *(అబూదావూద్, తిర్మిజీ - హసన్, సహీహ్)*

*(సుననె అబూ దావూద్‌లోని భోజనాల ప్రకరణం, సుననె తిర్మిజీలోని భోజనాల అధ్యాయాలు)*

٧٤٥ ـ وعن عبدِ اللهِ بنِ بُسْرٍ رضيَ الله عنه قال: كان لِلنَّبِيِّ ﷺ قَصْعَةٌ يُقَالُ لها: الْغَرَّاءُ، يَحْمِلُهَا أَرْبَعَةُ رِجالٍ، فَلَمَّا أَضْحَوْا وَسَجَدُوا الضُّحَى أُتِيَ بِتِلْكَ الْقَصْعَةِ، يعني وقد ثُرِدَ فيها، فَالتَفُّوا عليها، فَلَمَّا كَثُرُوا جَثَا رسولُ اللهِ ﷺ.

745. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ బుస్ర్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) దగ్గర ఒక పళ్లెం ఉండేది. దాన్ని 'గర్రా' అనే వారు. దాన్ని నలుగురు (నాలుగు వైపుల నుండి) పట్టుకొని తీసుకెళ్ళేవారు.

సాధారణంగా బాగా ప్రొద్దెక్కి, దైవప్రవక్త అనుచరులు 'చాష్త్' నమాజ్ చేసుకున్న తర్వాత ఆ పళ్లాన్ని తీసుకొచ్చేవారు. అందులో సరీద్ (పలుచటి కూరలో రొట్టె

فقالَ أعرابيٌّ: ما هذه الجِلْسَةُ؟ قال رسولُ اللهِ ﷺ: «إنَّ الله جَعَلَني عَبْداً كَرِيماً، وَلَمْ يَجْعَلْني جَبَّاراً عَنِيداً»، ثمَّ قالَ رسولُ اللهِ ﷺ: «كُلُوا مِنْ حَوَالَيْهَا، وَدَعُوا ذِرْوَتَهَا يُبَارَكْ فيها» رواه أبو داود بإسناد جيد. «ذِرْوَتَهَا»: أعْلاها؛ بكسر الذال وضمها.

ముక్కలు నానబెట్టి తయారుచేసే ఒక రకమైన వంటకం) తయారుచేయబడి ఉండేది. ప్రజలు ఆ పళ్లెం చుట్టూ కూర్చొనేవారు. ఎక్కువ మంది జనం రావటం వల్ల (స్థలం చాలకపోతే) దైవ ప్రవక్త (సల్లం) మోకాళ్ళు మడచి కూర్చొనేవారు.

అది చూసి ఒక పల్లెటూరి వ్యక్తి, "అదేంటి, అలా కూర్చున్నారు?" అని అడిగాడు. దానికాయన "నిశ్చయంగా దేవుడు నన్ను దయామయుడైన దాసునిగా పుట్టించాడు. ఆయన నన్ను అహంకారిగా, తలబిరుసువానిగా పుట్టించలేదు" అని అన్నారు.

తరువాత ఇలా ఉపదేశించారు : పళ్లెం పై (అంటే మధ్య) భాగాన్ని వదలిపెట్టి ప్రక్కల నుండి తినండి. ఎందుకంటే మధ్యలో శుభం అవతరిస్తుంది.

*(అబూ దావూద్ దీన్ని మంచి ఆధారాలతో ఉల్లేఖించారు)*

## ముఖ్యాంశాలు

కలిసి భుజించటం, కంచంలో ఒక ప్రక్క నుంచి ఆహారం తీసుకొని తినటం శుభప్రదమని ఈ హదీసులో చెప్పబడింది. మోకాళ్ల ఆధారంగా కూర్చొని తినటం పుణ్యప్రదమని కూడా ఇందులో వివరించబడింది. ఇంకా ఇందులో దైవప్రవక్త (సల్లం) మహిమోన్నతులు, ఆయన వినమ్రత, అణకువ భావాలు కూడా పొందుపరచబడ్డాయి.

## 108వ అధ్యాయం

## ١٠٨ - بابُ كَرَاهِيَةِ الأكْلِ مُتَكِئاً

## ఒత్తిగిలి తినటం అవాంఛనీయం

٧٤٦ - عن أَبي جُحَيْفَةَ وَهْبِ بنِ عبدِ الله رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «لا آكُلُ مُتَّكِئاً» رواه البخاري. قال الخَطَّابِيُّ: المُتَّكِيءُ هُنَا: هو الجالِسُ مُعْتَمِداً على وِطاءٍ تحته، قال: وَأَرَادَ أَنَّهُ لا يَقْعُدُ عَلى الْوِطَاءِ وَالْوَسَائِدِ كَفِعْلِ مَنْ يُرِيدُ الإكْثَارَ مِنَ الطَّعَامِ، بل يَقْعُدُ مُسْتَوْفِزاً لا مُسْتَوطِئاً، وَيَأْكُلُ بُلْغَةً. هذا كلامُ الخَطَّابي، وَأَشَارَ غَيْرُهُ إلى أَنَّ المُتَّكِيءَ هو المائلُ عَلى جَنْبِهِ، والله أعلم.

746. హజ్రత్ అబూ జుహైఫా వహబ్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం), "నేను (ఎన్నడూ) ఒత్తిగిలి తినను" అని అన్నారు. (బుఖారీ)

ఇమామ్ ఖత్తాబీ (రహ్మాలై) ఇలా అంటున్నారు : ఒత్తిగిలి అంటే క్రింద పరువబడి ఉన్న పరుపుకు ఆనుకొని కూర్చోవటం అని అర్థం. విపరీతంగా అన్నం బొక్కేయాలని పరుపులపై, దిండ్లపై కూర్చొని తినేవారిలాగా తాను కూర్చోనని దైవప్రవక్త ఉద్దేశ్యం. ఆయన అన్నం తినటానికి తేరకుదేరి కూర్చునే వారు కారు. అలాకాకుండా అప్రశాంతంగా కూర్చొని పూట గడిచేటంత మాత్రమే తినేవారు.

ఇది ఇమామ్ ఖత్తాబీ అభిప్రాయం. ఆయనగాక ఇతర పండితులందరూ ఒత్తిగిలి అంటే ఓ ప్రక్కకు ఒరిగి తినడం అని సూచించారు. - వాస్తవం అల్లాహ్‌కు తెలుసు.

*(సహీహ్ బుఖారీలోని భోజనాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

అసలు ఒత్తిగిలి తినటం అంటే ఏమిటి? దీని గురించి భిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. కొంతమంది ఒత్తిగిలి అంటే ఏదో ఒక ప్రక్కకు వంగి తినటమని అభిప్రాయపడ్డారు.

ఉదాహరణకు కుడిచేయిగాని, ఎడమ చేయిగాని నేలకు ఆనించి కూర్చోవటం, గోడకు ఆనుకొని కూర్చోవటం మొదలగు పద్ధతులు ఒత్తిగిలి కూర్చోవటం క్రిందికి వస్తాయి.

ఇమామ్ ఖత్తాబీ (రహ్మాలై) అభిప్రాయంలో ఒత్తిగిలి అంటే మెత్తగా ఉండే పరుపు మీద తీరిగ్గా, ప్రశాంతంగా కూర్చోవటం. అలాగే ఎక్కువ తినాలనే ఉద్దేశ్యంతో బాసికపట్టు వేసుకొని కూర్చోవటం. కాని ఈ పద్ధతి వత్తిగిలి కూర్చోవటం క్రిందికి వస్తుందని చెప్పలేం. కనుక ఒత్తిగిలి అనే పదానికి మొదట్లో చెప్పిన భావమే సరయినదిగా తోస్తోంది. హాఫిజ్ ఇబ్నె హజర్ (రహ్మాలై) ఇలా అంటున్నారు : అన్నం తినటానికి కూర్చొనే పద్ధతుల్లో అభిలషణీయమైన పద్ధతి ఏమిటంటే, కాళ్ళు మోకాళ్ళ వరకు మడచి అరికాళ్ళ మీద కూర్చోవాలి. లేదా కుడికాలు ఎత్తి ఎడమకాలి ఆధారంగా కూర్చోవాలి. (ఫత్హుల్ బారీ).

٧٤٧ ـ وعن أنسٍ رضيَ الله عنه قال: رَأَيْتُ رسولَ اللهِ ﷺ جَالساً مُقْعِياً يَأْكُلُ تَمْراً. رواه مسلم. «المُقْعِي»: هو الذي يُلْصِقُ أَلْيَتَيْهِ بالأرضِ، ويَنْصِبُ سَاقَيْهِ.

747. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) తొడలు నిలబెట్టి కూర్చొని ఖర్జూర పండ్లు తింటుండగా చూశాను. (ముస్లిం)

'ముఖ్యియా' అంటే పిరుదులు నేలకు ఆనించి ముంగాళ్ళ ఆధారంగా కూర్చున్న వాడు అని అర్థం.

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) భోజనం చేస్తున్నప్పుడు కూర్చున్న తీరుని గురించి వివరించటం జరిగింది. ఈ విధంగా కూర్చోవటంలో మనిషి మిక్కిలి అప్రశాంతంగా ఉంటాడు. వాస్తవానికి దైవప్రవక్త (సల్లం) తొందరగా ఏదయినా పనిమీద వెళ్లాల్సి ఉన్నప్పుడు ఆ విధంగా కూర్చొని కొన్ని ఖర్జూర పండ్లు మాత్రమే తిని వెళ్ళిపోయేవారు. ఈ విషయాన్ని హజ్రత్ అనస్ (రజి) గారి వేరొక ఉల్లేఖనం సమర్థిస్తోంది. ఆ ఉల్లేఖనం కూడా ముస్లిం గ్రంథంలోనే ఉంది.



## 109వ అధ్యాయం

١٠٩ - بَابُ اسْتِحْبَابِ الأَكْلِ بِثَلَاثِ أَصَابِعَ، وَاسْتِحْبَابِ لَعْقِ الأَصَابِعِ، وَكَرَاهَةِ مَسْحِهَا قَبْلَ لَعْقِهَا وَاسْتِحْبَابِ لَعْقِ القَصْعَةِ وَأَخْذِ اللُّقْمَةِ الَّتِي تَسْقُطُ مِنْهُ وَأَكْلِهَا وَجَوَازِ مَسْحِهَا بَعْدَ اللَّعْقِ بِالسَّاعِدِ وَالْقَدَمِ وَغَيْرِهِمَا

## మూడు వ్రేళ్ళతో తినడం, అన్నం తిన్న తరువాత వ్రేళ్ళను నాక్కోవటం అభిలషణీయం, వ్రేళ్ళను నాక్కోకుండానే శుభ్రం చేసుకోవటం అవాంఛనీయం, క్రిందపడిపోయిన అన్నం మెతుకుల్ని ఎత్తుకొని తినటం అభిలషణీయం, వ్రేళ్ళను నాక్కున్న తరువాత వాటిని మణికట్టువద్ద, అరికాలి వద్ద రుద్దుకొని శుభ్రం చేసుకోవచ్చు.

٧٤٨ - عن ابن عباس رضيَ الله عنهما قال: قالَ رسولُ اللهِ ﷺ: «إذا أَكَلَ أَحَدُكُمْ طَعَاماً، فَلَا يَمسَحْ أَصَابِعَهُ حتى يَلعَقَهَا أَوْ يُلْعِقَهَا» متفقٌ عليه.

748. హ|జత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీలో ఎవరయినా అన్నం తిన్న తరువాత తమ చేతివ్రేళ్ళను తాము స్వయంగా నాక్కోనంతవరకు లేదా ఇతరులచేత నాకించనంతవరకు వాటిని తుడుచుకోరాదు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని భోజనాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

అన్నం తిన్న తరువాత చెయ్యి కడుక్కునే ముందు లేక తుడిచి శుభ్రం చేసుకునే ముందు వాటిని స్వయంగా నాక్కోవాలి. లేదా దాన్ని అసహ్యంగా తలపోయనివారి చేత నాకించాలి. ఉదాహరణకు భార్య, పిల్లలు తన అభిమానులు మొదలగువారు. వీరిచేత వ్రేళ్ళు నాకించటంలో తప్పులేదు. కాని అసలు ఇలా వ్రేళ్ళు నాక్కోవటంలోని ఆంతర్యమేమిటో రాబోయే హదీసుల్లో వివరించబడింది.

749. హజ్రత్ కాబ్ బిన్ మాలిక్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) మూడు వ్రేళ్ళతో తినటం నేను చూశాను. తిన్న తరువాత ఆయన ఆ వ్రేళ్ళు నాక్కు న్నారు. *(ముస్లిం)*

٧٤٩ - وعن كعب بن مالك رضيَ اللهُ عنه قال: رَأَيْتُ رسولَ اللهِ ﷺ يَأْكُلُ بِثلاثِ أَصابِعَ، فإذا فَرَغَ لَعِقَها. رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సాధారణంగా పొగరుబోతులు రెండు వ్రేళ్ళతో, కొన్ని సందర్భాల్లోనయితే ఒక వేలితోనే తింటారు. దీనికి విరుద్ధంగా పీకలదాకా బొక్కేయాలని ఉవ్విళ్ళూరే ఆత్రగాళ్ళు మూడు కంటే ఎక్కువ వ్రేళ్ళతో తింటారు. కాని అన్నిటికంటే శ్రేష్ఠమైన పద్ధతి దైవప్రవక్త (సల్లం) గారి భోజన పద్ధతి. అయితే అవసరాన్ని బట్టి ఎక్కువవ్రేళ్ళతో తినడంలోనూ తప్పులేదు.

750. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : (భోజనం చేశాక) వ్రేళ్ళనూ, పళ్ళాన్నీ నాక్కోవాలని దైవప్రవక్త (సల్లం) ఆదేశిం చారు. ఇంకా ఆయన, "అన్నంలోని ఏ భాగంలో శుభం ఉందో మీకు తెలి యదు" అని కూడా అనేవారు. *(ముస్లిం)*

٧٥٠ - وعن جابرٍ رضيَ الله عنه أنَّ رسولَ اللهِ ﷺ أَمَرَ بِلَعْقِ الأَصابِعِ وَالصَّحْفَةِ، وقال: «إِنَّكُمْ لا تَدرُونَ في أَيِّ طَعَامِكم البَرَكَةُ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

భోజనం తిన్న తర్వాత వ్రేళ్ళను నాక్కోవటంలోని ఆంతర్యమేమిటో ఈ హదీసులో వివరించబడింది. శుభం అనేది తినేసిన అన్నంలో ఉందో లేక వ్రేళ్ళకు, పళ్ళానికి అంటుకొని ఉన్న అన్నంలో ఉందో తెలియదు. కనుక ఆ అన్నాన్ని కూడా వృధాకానివ్వకుండా శుభ్రంగా నాక్కోవాలి. బహుశా అందులోనే శుభం ఉండవచ్చు లేదా మనిషి ఆరోగ్యానికి, శక్తికి ఆ భాగం ఎక్కువ ఉపయోగకరమైనది కావచ్చు. అంతేకాదు, అలా వ్రేళ్ళను నాక్కోవటంలో దైవానుగ్రహం పట్ల కృతజ్ఞతా భావం ఉట్టిపడుతుంది.

751. హజ్రత్ జాబిర్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీలో ఎవరిచేతిలో నుంచయినా అన్నం ముద్ద క్రింద

٧٥١ - وعنه أنَّ رسولَ اللهِ ﷺ قال: «إذا وَقَعَت لُقمَةُ أَحَدِكُمْ، فَلْيَأْخُذْهَا فَلْيُمِطْ ما كان بها مِن أذًى ولْيَأكُلْها، ولا يَدَعْهَا

للشَّيْطَانِ، ولا يَمسَحْ يَدَهُ بِالْمِنديلِ حتَّى يَلعَقَ أَصَابِعَهُ فإنه لا يَدرِي في أيِّ طعامِهِ البرَكَةُ» رواه مسلم.

పడిపోతే, దాన్ని ఎత్తుకొని, దానికి అంటుకున్న మట్టిని శుభ్రం చేసుకొని తినాలి. అంతేగాని, దాన్ని షైతాన్‌కు వదలేయకూడదు. అన్నంలోని ఏ భాగంలో శుభం ఉందో తెలియదు. కనుక అన్నం తిన్నాక వ్రేళ్ళను నాక్కోనంతవరకు చేతిని రుమాలుతో తుడుచుకోరాదు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

అన్నం తినేటప్పుడు మెతుకులు క్రిందపడిపోతే వాటిని ఎత్తుకొని శుభ్రం చేసుకొని తినాలి. క్రిందపడిపోయిన మెతుకుల్ని అలాగే వదిలేయటం గర్విష్టుల లక్షణం. కృతజ్ఞులు, వినమ్రులయిన దాసులు దైవప్రసాదాన్ని మట్టిపాలు కానివ్వరు. క్రిందపడిపోయిన మెతుకుల్ని ఎత్తుకొని తినటాన్ని తమ కీర్తికి కళంకంగా భావించరు.

٧٥٢ ـ وعنه أنَّ رسولَ اللهِ ﷺ قال: «إن الشَّيْطَانَ يحضُرُ أحدَكم عِندَ كلِّ شَيءٍ مِنْ شَأْنِهِ، حتى يَحْضُرَهُ عِندَ طَعَامِهِ؛ فَإِذا سَقَطَتْ لُقْمَةُ أَحَدِكم فَلْيَأْخُذْهَا فَلْيُمِط ما كانَ بها مِن أذى، ثُمَّ لِيَأْكُلْهَا ولا يَدعْهَا لِلشَّيْطَانِ، فإذا فَرَغَ فَلْيَلْعَقْ أَصَابِعَهُ؛ فإنه لا يَدرِي في أيِّ طعامِهِ البَرَكَةُ» رواه مسلم.

752. హజ్రత్ జాబిర్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : నిశ్చయంగా మీరు చేసే అన్ని పనుల్లోనూ షైతాన్ మీతోపాటు ఉంటాడు. చివరికి మీరు అన్నం తినేటప్పుడు కూడా షైతాన్ మీ దగ్గరికొస్తాడు. కనుక మీలో ఎవరి చేతిలోనుంచయినా అన్నం ముద్ద క్రిందపడిపోతే దాన్ని ఎత్తుకొని, దానికి అంటుకున్న మట్టిని శుభ్రం చేసుకొని తినాలి. అంతేగాని, దాన్ని షైతాన్ కోసం వదలిపెట్టకూడదు. ఇంకా అన్నంలోని ఏ భాగంలో శుభం ఉందో తెలియదు. కనుక భోజనం పూర్తయ్యాక వ్రేళ్ళను (శుభ్రంగా) నాక్కోవాలి.

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

753. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) అన్నం తిన్న తర్వాత తన మూడు వ్రేళ్ళనూ నాక్కొనేవారు. ఇలా అనేవారు : "మీలో ఎవరి చేతిలో నుంచయినా అన్నం ముద్ద క్రిందపడి పోతే దాన్ని ఎత్తుకొని, దానికి అంటిన మట్టిని శుభ్రం చేసుకొని తినాలి. అంతే గాని, దాన్ని షైతాన్‌కు వదిలేయ కూడదు."

కూరల పాత్రల్ని కూడా నాక్కొని శుభ్రం చేసుకోవాలని ఆయన మమ్మల్ని ఆదేశిం చేవారు. "అన్నంలోని ఏ భాగంలో శుభం వుందో మీకు తెలియదు" అని అనే వారు. *(ముస్లిం)*

٧٥٣ ـ وعن أنسٍ رضي الله عنه قال: كان رسولُ اللهِ ﷺ إذا أكلَ طَعَاماً، لعِقَ أصابعَهُ الثلاثَ، وقالَ: «إذا سَقَطَتْ لُقمَةُ أحَدِكم فَلْيَأخُذْهَا، وليُمِطْ عنها الأذى، وليَأكُلْهَا، ولا يَدَعْهَا لِلشَّيطَانِ» وَأمَرَنَا أن نَسلُتَ القَصعَةَ وقال: «إنكم لا تَدرُونَ في أيِّ طَعَامِكم البَرَكَةُ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

754. హజ్రత్ సయీద్ బిన్ హారిస్ (రహ్మాలై) కథనం ప్రకారం ఆయన హజ్రత్ జాబిర్ (రజి)తో మాట్లాడుతూ, "మంటమీద పెట్టి వండిన పదార్థాలు తింటే వుజూ భంగమవుతుందా?" అని అడిగారు. అందుకాయన దానివల్ల వుజూ భంగం కాదంటూ ఇలా వివరిం చారు : దైవప్రవక్త (సల్లం) కాలంలో ఇలాంటి (వండిన) ఆహారపదార్థాలు మాకు చాలా అరుదుగా లభించేవి. ఒకవేళ ఎప్పుడయినా మేము అలాంటి పదార్థాలు తిన్నా, తర్వాత చేతులు తుడుచుకోవటానికి మా దగ్గర చేతి గుడ్డలు ఉండేవి కావు. అంచేత అవి తిన్న తర్వాత మేము చేతుల్ని అరచేతు

٧٥٤ ـ وعن سعيد بنِ الحارثِ أنه سأل جابراً رضيَ الله عنه عنِ الوضوءِ ممَّا مَسَّتِ النَّارُ، فقال: لا، قد كُنَّا زَمَنَ النبيِّ ﷺ لا نَجِدُ مِثلَ ذلك الطعامِ إلَّا قليلاً، فإذا نحنُ وَجَدنَاهُ، لم يَكنْ لَنَا

مَنَادِيلُ إِلَّا أَكُفَّنَا وَسَوَاعِدَنَا وَأَقْدَامَنَا، ثُمَّ نُصَلِّي وَلَا نَتَوَضَّأُ. رواه البخاري.

లకు, మణికట్లకు, అరికాళ్ళకు రుద్దుకొని శుభ్రం చేసుకునేవాళ్ళం. ఆ తర్వాత సరిక్రొత్తగా వుజూ చేసుకోకుండానే నమాజ్ చేసేవాళ్ళం. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని భోజనాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. ఇందులో దైవప్రవక్త సహచరుల నిరాడంబర జీవనం వివరించబడింది. వారు తమకు లభించిన దాంతోనే కడుపునింపుకొని సంతృప్తితో జీవితం గడిపేవారు. సుఖసౌఖ్యాలు ఎలా ఉంటాయో రుచికరమైన భోజనాలు అంటే ఏమిటో కూడా తెలియని సాధు మనుషులు వారు.
2. ఉడికిన వస్తువులు తినటం వల్ల వుజూ భంగమవదు. ఇస్లాం ప్రారంభంలో ఉడికిన వస్తువులు తింటే వుజూ భంగమవుతుందన్న ఆదేశం ఉండేది. తర్వాత ఆ ఆదేశం రద్దయింది.



# 110వ అధ్యాయం

## ١١٠ - بابُ تكثيرِ الأيْدِي عَلَى الطَّعَامِ

## అన్నం తక్కువగా ఉండి తినేవాళ్ళు ఎక్కువమంది ఉంటే ఏం చేయాలి?

٧٥٥ - عن أبي هريرةَ رضيَ الله تعالى عنه قالَ: قالَ رسولُ الله ﷺ: «طَعَامُ الاثنَينِ كافي الثَّلاثةِ، وَطَعَامُ الثَّلاثةِ كافي الأربَعَةِ» متفقٌ عليه.

755. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : (కలిసి తింటే) ఇద్దరి అన్నం ముగ్గురికి సరిపోతుంది. ముగ్గురి అన్నం నలుగురికి సరిపోతుంది.

*(బుఖారీ - ముస్లిం)*

٧٥٦ - وعن جابرٍ رضيَ الله عنهُ قالَ: سمعتُ رسولَ الله ﷺ يقُولُ: «طَعَامُ الوَاحِدِ يَكْفِي الاثنَينِ، وَطَعَامُ الاثنَيْنِ يَكْفِي الأربَعَةَ، وطعامُ الأرْبَعَةِ، يَكْفِي الثَّمَانِيَةَ» رواه مسلم.

756. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ జాబిర్ (రజి) తెలియజేశారు : (కలిసి తింటే) ఒక్కరి అన్నం ఇద్దరికి సరి పోతుంది. ఇద్దరి అన్నం నలుగురికి సరిపోతుంది. నలుగురి అన్నం ఎనిమిది మందికి సరిపోతుంది. (ముస్లిం)

*(ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

పై ప్రవచనాలు బంతి భోజనాల్లో శుభం అవతరిస్తుందని బోధిస్తున్నాయి. పైగా ఈ విధంగా కలిసి తినటం వల్ల పరస్పరం ప్రేమానురాగాలు పెంపొందుతాయి.

## 111వ అధ్యాయం

## ١١١ - بَابُ أَدَبِ الشُّرْبِ وَاسْتِحْبَابِ التَّنَفُّسِ ثَلاَثاً خَارِجَ الإِنَاءِ، وَكَرَاهِيَةِ التَّنَفُّسِ فِي الإِنَاءِ، وَاسْتِحْبَابِ إِدَارَةِ الإِنَاءِ عَلَى الأَيْمَنِ فَالأَيْمَنِ بَعْدَ المُبْتَدِىءِ

## పానీయం సేవించే పద్ధతి : పానీయం సేవించేటప్పుడు చెంబు బయట మూడుసార్లు శ్వాస తీసుకోవటం అభిలషణీయం, చెంబులో శ్వాస వదలటం అవాంఛనీయం, పానీయాల పంపిణీ జరుగుతున్నప్పుడు పంపిణీదారుని తరువాత కుడి వైపు నుంచి ఆరంభించాలి

٧٥٧ - عن أنسٍ رضي الله عنه أنَّ رسولَ الله ﷺ كانَ يتنفَّسُ في الشَّرابِ ثَلاثاً. متفقٌ عليه. يعني: يَتَنَفَّسُ خَارِجَ الإِناءِ.

757. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) పానీయాన్ని మూడు శ్వాసల్లో తాగేవారు. (బుఖారీ - ముస్లిం)

అంటే చెంబు వెలుపల శ్వాసతీసుకునే వారని అర్థం.

*(సహీహ్ బుఖారీలోని పానీయాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

పానీయాన్ని మూడు శ్వాసల్లో త్రాగటం అభిలషణీయం. మూడు శ్వాసల్లో అంటే ముందు కొద్దిగా తాగి చెంబు ప్రక్కకు తీసి శ్వాస తీసుకోవాలి. మళ్ళీ కొద్దిగా తాగి చెంబు వెలుపల శ్వాస తీసుకోవాలి. అలాగే మూడవసారి కూడా చేయాలి. ఈ పద్ధతి వల్ల జీర్ణాశయంపై ఒత్తిడి పడకుండా ఉంటుంది. ఇంకా నీళ్ళు తదితర పానీయాలు త్రాగినప్పుడు జంతువుల్లా త్రాగే చెంబుల్లోనే శ్వాస వదలకూడదు. దానివల్ల మనిషి ఆరోగ్యం మీద ఎన్నో దుష్ప్రభావాలు పడవచ్చు.

758. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీరు పానీయాన్ని ఒంటె లాగా ఒకే శ్వాసలో త్రాగకండి. అలా గాకుండా రెండు లేక మూడు శ్వాసల్లో త్రాగండి. త్రాగేముందు దేవుని పేరు తీసుకోండి (బిస్మిల్లాహ్ పఠించండి). త్రాగినాక దైవాన్ని స్తుతించండి (అల్‌హమ్దు లిల్లాహ్ అని అనండి).

*(తిర్మిజీ - హసన్)*

٧٥٨ ـ وعن ابنِ عباسٍ رضي الله عنهما قال: قال رسولُ الله ﷺ: «لا تَشْرَبُوا وَاحِداً كَشُرْبِ البَعِيرِ، وَلكِنِ اشْرَبُوا مَثْنَى وَثُلاثَ، وَسَمُّوا إذا أَنْتُمْ شَرِبْتُمْ، وَاحْمَدُوا إذا أَنْتُمْ رَفَعْتُمْ» رواه الترمذي وقال: حديث حسن.

*(సుననె తిర్మిజీలోని పానీయాల ప్రకరణం)*

*ఈ హదీసు ఆధారాలు బలహీనంగా ఉన్నాయి. వివరాల కోసం అల్‌బానీ (రహ్మలై) గారి "తఖ్రీజుల్ మిష్కాత్" గ్రంథం చూడండి.*

759. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) (పానీయం త్రాగేటప్పుడు) చెంబులో శ్వాస తీసుకోవటాన్ని వారించారు.

*(బుఖారీ - ముస్లిం)*

٧٥٩ ـ وعن أبي قَتَادَةَ رضي الله عنه أن النبيَّ ﷺ نَهى أن يُتَنَفَّس في الإناء. متفقٌ عليه. يعني: يَتَنَفَّسُ في نَفْسِ الإِناءِ.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని పానీయాల ప్రకరణం)*

760. హజ్రత్ అనస్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) సన్నిధికి నీళ్ళు కలపబడిన పాలు (కానుకగా) వచ్చాయి. ఆ సమయంలో ఆయనకు కుడిప్రక్కన ఓ పల్లెవాసి ఉన్నాడు. ఎడమ ప్రక్కన హజ్రత్ అబూబక్ర్ (రజి) ఉన్నారు. దైవ ప్రవక్త (సల్లం) ఆ పాలలో కొంత త్రాగి మిగిలింది పల్లెవాసికి ఇచ్చారు. ఆ సందర్భంగా ఆయన, "ముందు కుడివైపున

٧٦٠ ـ وعن أنسٍ رضي الله عنه أنَّ رسولَ الله ﷺ أُتِيَ بِلَبَنٍ قد شِيبَ بمَاءٍ، وعَنْ يَمِينِهِ أَعْرَابِيٌّ، وعَنْ يَسَارِهِ أبو بكرٍ رضي الله عنه، فَشَرِبَ، ثُمَّ أَعْطَى الأَعْرَابيَّ وقال: «الأَيمَنَ فالأَيمَنَ» متفقٌ عليه. قوله: «شِيبَ» أي: خُلِط.

ఉన్నవారికి ఇవ్వాలి. ముందు కుడివైపున ఉన్నవారికి ఇవ్వాలి" అని (రెండుసార్లు) అన్నారు. (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని పానీయాల ప్రకరణం)*

٧٦١ - وعن سهل بن سعد رضي الله عنه أنَّ رسول الله ﷺ أُتِيَ بشراب، فَشَرِبَ مِنْهُ وعَنْ يَمِينِهِ غُلامٌ، وعن يَسارِهِ أَشْيَاخٌ، فقال لِلغُلامِ: «أَتَأْذَنُ لي أنْ أُعْطِيَ هؤُلاءِ؟» فقال الغلامُ: لا واللهِ! لا أُوثِرُ بِنَصِيبي مِنكَ أَحداً، فَتَلَّهُ رسولُ اللهِ ﷺ في يدِهِ. متفقٌ عليه. قوله: «تَلَّهُ»، أَيْ: وَضَعَهُ، وهذا الغُلامُ هو ابنُ عباس رضي الله عنهما.

761. హ॥జ్రత్ సహ్ల్ బిన్ సాద్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం)కు ఎవరో ఏదో పానీయం (కానుకగా) సమర్పించుకున్నారు. ఆయన అందులో కొంత త్రాగి వదలిపెట్టారు. ఆ సమయంలో ఆయనకు కుడి ప్రక్కన ఒక బాలుడు కూర్చొని ఉన్నాడు. పెద్ద వాళ్ళంతా ఎడమప్రక్కన ఉన్నారు. దైవ ప్రవక్త (సల్లం) ఆ పిల్లవాడితో, "(బాబూ!) నువ్వు అనుమతిస్తే నేనీ పానీయాన్ని పెద్దలకు ఇస్తాను" అన్నారు. అందుకా బాలుడు, "దైవసాక్షి! దానికి నేను ఒప్పుకోను. మీరిచ్చే ప్రసాదాన్ని నేను ఇతరులకి త్యాగం చేయలేను దైవప్రవక్తా!" అని అన్నాడు. అప్పుడు ఆయన ఆ పానీయ గిన్నెను ఆ బాలుని చేతికే ఇచ్చారు. *(బుఖారీ - ముస్లిం)*

ఆ బాలుడు హ॥జ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి).

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ సందర్భంగా షైఖ్ అల్ బానీ (రహ్మాలై) ఇలా రాస్తున్నారు : పూర్వపు ముస్లింలు పానీయ పంపిణీ జరుగుతున్నప్పుడు సమావేశంలోని పెద్దల నుండి ఆరంభించటం సంప్రదాయం (సున్నత్) అని భావించేవారు. అయితే వారి ఈ భావన సరయినది కాదు. అదేవిధంగా పంపిణీదారు తాను ముందుగా సేవించిన తర్వాత తన కుడివైపు నుండి ఆరంభించాలన్న ఇమామ్ నవవీ (రహ్మాలై) అభిప్రాయం కూడా సరయినది కాదు. 'మరి దైవప్రవక్త (సల్లం)

తాను ముందుగా త్రాగిన తర్వాతే పంపిణీ చేశారు కదా!" అన్న సందేహం కలగవచ్చు. వాస్తవం ఏమిటంటే, ఆ పానీయం దైవప్రవక్త (సల్లం) తనకోసం తెప్పించుకున్నారు. కనుక ఆ పానీయాన్ని ముందుగా దైవప్రవక్తే సేవించారు. మిగిలింది అనుచరులకు పంచిపెట్టారు.

ఈ సందర్భంగా పాఠకులు ఈ గ్రంథంలోనే ఇంతకుముందు వచ్చిన హదీసును గుర్తుచేసుకోవాలి. అందులో దైవప్రవక్త (సల్లం) తన అనుచరులకు పాలు పంపిణీ చేయించినప్పుడు హజ్రత్ అబూ హురైరా (రజి) పంపిణీదారుగా వ్యవహరించారు. అబూ హురైరా (రజి) అప్పుడు తాను పంపిణీదారు అయినందువల్ల అందరికీ పంచిపెట్టిన తరువాత త్రాగారు. ఆయన తర్వాత అందరికన్నా చివర్లో దైవప్రవక్త (సల్లం) మిగిలిన పాలు త్రాగారు. దీనిద్వారా తెలిసేదేమిటంటే సాధారణ పరిస్థితుల్లో ఏదయినా ఆహార పదార్థం పంపిణీ జరిగినప్పుడు కుడివైపునుండి ఆరంభించాలి. పంపిణీదారు ముందుగానే తినేయకూడదు. అలాగే కుడివైపు నుండి మొదలుపెట్టకుండా సమావేశంలోని పెద్దలనుండి మొదలుపెట్టడం కూడా సమంజసం కాదు.



112వ అధ్యాయం

## ١١٢ ـ بَابُ كَرَاهَةِ الشُّرْبِ مِنْ فَمِ الْقِرْبَةِ وَنَحْوِهَا وَبَيَانِ أَنَّهُ كَرَاهَةُ تَنْزِيهٍ لاَ تَحْرِيمٍ

## కూజాలు, నీళ్ళ తిత్తుల మూతికి నోరు తగిలించి నీళ్లు త్రాగటం అవాంఛనీయం, అయితే అలా త్రాగటం హరామ్ మాత్రం కాదు

٧٦٢ ـ عن أَبي سعيدٍ الخُدْرِيِّ رضي الله عنه قال: نَهَى رسولُ اللهِ ﷺ عن اخْتِنَاثِ الأَسْقِيَةِ. يعني: أَنْ تُكسَرَ أَفْوَاهُها، وَيُشْرَبَ منها. متفقٌ عليه.

762. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం : నీటి తిత్తిని వంచి, దాని మూతికి నోరు తగిలించి నీళ్ళు త్రాగ టాన్ని దైవప్రవక్త (సల్లం) వారించారు. *(బుఖారీ - ముస్లిం)*

అంటే నీటి తిత్తి మూతిని విప్పదీసి, దానికి నోరు తగిలించి త్రాగటమని అర్థం.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని పానీయాల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) ఆ విధంగా నీళ్ళ తిత్తిని, తలక్రిందులుగా వంచి దాని మూతికి నోరు తగిలించి నీళ్ళు త్రాగవద్దని వారించటంలోని ఆంతర్యం ఏమిటంటే, కొన్నిసార్లు వాటిలో పురుగులు లాంటివి ఉండవచ్చు. నోరు తగిలించి త్రాగటం వల్ల అవి నీళ్ళతోపాటు కడుపులోకి వెళ్ళిపోయే ప్రమాదముంది. అందుకే అలాంటి నీటి తిత్తులు, కూజాల్లోని నీటిని ఏదయినా గ్లాసులోకి వంచుకొని ఆ తరువాత తాగాలి. అలా త్రాగితే ఏ ప్రమాదం లేకుండా ఉంటుంది.

٧٦٣ ـ وعن أبي هريرةَ رضي الله عنه قال: نَهَى رسولُ الله ﷺ أَن يُشْرَبَ مِنْ فِي السِّقاءِ أو القِرْبَةِ. متفقٌ عليه.

763. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం: నీటి తిత్తి లేక అలాంటి వస్తువుల మూతికి నోరు తగిలించి నీళ్ళు త్రాగటాన్ని దైవప్రవక్త (సల్లం) వారించారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని పానీయాల ప్రకరణం)*
*ఈ హదీసు ముస్లిం గ్రంథంలో కనిపించలేదు.*

٧٦٤ ـ وعن أُمِّ ثابتٍ كَبْشَةَ بِنْتِ ثَابتٍ أُخْتِ حَسَّانَ بْنِ ثابتٍ رضي الله عنه وعنها قالت: دخل عَلَيَّ رسولُ الله ﷺ، فَشَرِبَ مِن فِي قِرْبَةٍ مُعَلَّقَةٍ قَائماً، فَقُمْتُ إلى فِيهَا فَقَطَعْتُهُ. رواه الترمذي وقال: حديث حسن صحيح. وإنَّمَا قَطَعَتْهَا لِتَحْفَظَ مَوْضِعَ فَمِ رسولِ الله ﷺ، وَتَتَبَرَّكَ بِهِ، وَتَصُونَهُ عَنِ الابْتِذَالِ. وهٰذا الحَدِيثُ مَحْمُولٌ علَى بَيَانِ الجَوَازِ، والحديثانِ السابقان لبيانِ الأفضلِ والأكملِ والله أعلم.

764. హస్సాన్ బిన్ సాబిత్ (రజి) సోదరి ఉమ్మె సాబిత్ కబ్‌షా బిన్తె సాబిత్ (రజి.అన్‌హా) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) నా దగ్గరికొచ్చారు. అప్పుడాయన నించొని వ్రేలాడదీయబడివున్న నీటి తిత్తిని వంచి, దాని మూతికి నోరు తగిలించి నీళ్ళు త్రాగారు. నేనెళ్ళి ఆ నీళ్ళ తిత్తి మూతిని కోసుకొని భద్రపరచుకున్నాను. *(తిర్మిజీ - హసన్, సహీహ్)*

దైవప్రవక్త (సల్లం) నోరు తగిలిన ఆ భాగాన్ని భద్రపరచటానికి, దాన్నుండి శుభాన్ని పొందటానికి, ఇంకా సామాన్య జనులు దాన్ని వాడకుండా కాపాడటానికి ఉమ్మె సాబిత్ (రజి.అన్‌హా) దాన్ని కోసుకొని ఉంచుకున్నారు. నీటితిత్తి మూతికి నోరు తగిలించి త్రాగటం ధర్మ సమ్మతమేనన్నది ఈ హదీసు ఉద్దేశ్యం. ఇంతకు ముందు రెండు హదీసుల్లోనూ అలా త్రాగకుండా ఉండటం ఉత్తమం అన్న విషయం బోధించబడింది.

*(సుననె తిర్మిజీలోని పానీయాల అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

ఇంతకు ముందు వచ్చిన రెండు హదీసుల్లో నీళ్ళతిత్తులు, కూజాల్లాంటి వాటి మూతికి నోరు తగిలించి నీరు త్రాగటాన్ని దైవప్రవక్త (సల్లం) వారించారని చెప్పబడింది. మరి ఈ హదీసులోనేమో దైవప్రవక్త (సల్లం) స్వయంగా ఆ విధంగా నోరు తగిలించి నీళ్ళు త్రాగారు. పరస్పరం విరుద్ధంగా కనిపిస్తున్న ఈ హదీసుల్లోని భావ సారూప్యం ఏమిటంటే, ఆవిధంగా మూతికి నోరు తగిలించి త్రాగకుండా ఉండటం ఉత్తమం. కాని ఏదైనా అనివార్య కారణం వల్ల అలా త్రాగటంలోనూ తప్పులేదు. అందుకే ఇమామ్ నవవీ (రహ్మాలై) శీర్షికలో ఆ విధంగా త్రాగటం అవాంఛనీయమనీ, నిషిద్ధం మాత్రం కాదని చెప్పారు.

## 113వ అధ్యాయం

## ١١٣ ـ بَابُ كَرَاهَةِ النَّفْخِ فِي الشَّرَابِ

## పానీయాల్లో ఊదటం అవాంఛనీయం

٧٦٥ ـ عن أبي سعيدٍ الخدريِّ رضيَ الله عنه أنَّ النبيَّ ﷺ نَهى عَنِ النَّفخِ في الشَّرَابِ، فقال رَجُلٌ: القَذَاةُ أراها في الإناءِ؟ فقال: «أَهْرِقْهَا»، قال: إنّي لا أَرْوَى مِنْ نَفَسٍ وَاحِدٍ؟ قال: «فَأَبِنِ القَدَحَ إذاً عَنْ فِيكَ» رواه الترمذي وقال: حديث حسن صحيح.

765. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) పానీయంలో ఊదటాన్ని వారించారు.

అది విని ఒక వ్యక్తి సందేహపడుతూ "మరి పానీయంలో నలకలు కనబడితేనో?" అని అడిగాడు. దాని కాయన, "ఆ పానీయాన్ని (కొద్దిగా) పారబొయ్యి" అని చెప్పారు. "ఒక్క శ్వాసలో త్రాగితే నాకు దప్పిక తీరదు" మళ్ళీ అన్నాడా వ్యక్తి. "అయితే శ్వాస తీసుకునేటప్పుడు చెంబుని నోటిదగ్గర్నుంచి ప్రక్కకు తీసుకో'' అని చెప్పారు దైవప్రవక్త (సల్లం). *(తిర్మిజీ - హసన్, సహీహ్)*

*(సుననె తిర్మిజీలోని పానీయాల అధ్యాయాలు)*

### ముఖ్యాంశాలు

పానీయంలో నలకల్లాంటి మలినాలేవయినా పడిపోతే ఆ పానీయంలో ఊదటానికి బదులు అందులోని కొంత పానీయాన్ని పారబోయాలి. అంతకంటే హానికరమైన వస్తువేదయినా పడిపోతే మొత్తం పానీయాన్నే పారబోయాలి. అంతేగాని అందులో ఊదకూడదు. పానీయంలో ఊదటం వల్ల ఎన్నో నష్టాలున్నాయి. ఖరీదైన పానీయాల్లో నలకలు పడిపోతే వాటిని చెమ్చాతో కూడా తీసిపారేయవచ్చు. ఒక నలుసు కోసం మొత్తం పానీయాన్ని పారబోయటం మంచిది కాదు కదా!

ఒక శ్వాసలో తాగితే దాహం తీరదనుకున్నప్పుడు పానీయమున్న చెంబును నోటికి దూరంగా జరిపి మళ్ళీ శ్వాస తీసుకొని త్రాగాలి. ఆ విధంగా మూడు శ్వాసల్లో పానీయం త్రాగటం అభిలషణీయమే కాకుండా దానివల్ల దాహం కూడా తీరుతుంది. అయితే టీ, పాలు

లాంటి వేడిగా ఉండే పానీయాలను గుటకలుగా త్రాగవలసి ఉంటుంది. కాబట్టి వాటిని ఎన్ని శ్వాసల్లోనయినా త్రాగవచ్చు.

٧٦٦ - وعن ابنِ عباسٍ رضي الله عنهما أنَّ النبيَّ ﷺ نهى أن يُتَنَفَّسَ في الإِنَاءِ، أَوْ يُنْفَخَ فيهِ. رواه الترمذي وقال: حديث حسن صحيح.

766. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) పానీయమున్న చెంబులో శ్వాస తీసుకోవటాన్ని లేక అందులో ఊదటాన్ని వారించారు.

(తిర్మిజీ - హసన్, సహీహ్)

(సుననె తిర్మిజీలోని పానీయాల అధ్యాయాలు)



## 114వ అధ్యాయం

# ١١٤ ـ بَابُ بيَانِ جَوَازِ الشُّرْبِ قَائِماً وَبيَانِ أَنَّ الأَكْمَلَ والأفْضَل الشُّرْب قَاعِداً

# పానీయం నించొని త్రాగటం ధర్మసమ్మతమే కాని కూర్చొని త్రాగటం ఉత్తమం

فيه حديث كبشة السابق.

ఇంతకు ముందు వచ్చిన కబ్‌షా (రజి.అన్‌హా) హదీసును కూడా ఇందుకు నిదర్శనంగా తీసుకోవచ్చు.

٧٦٧ ـ وعن ابنِ عباسٍ رضي اللهُ عنهما قال: سَقَيْتُ النَّبيَّ ﷺ مِنْ زَمْزَمَ، فَشَرِبَ وَهُوَ قَائمٌ. متفقٌ عليه.

767. హ॥జత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: నేను దైవప్రవక్త (సల్లం)కు జమ్ జమ్ నీరు త్రాపించాను. ఆయన దాన్ని నించొని సేవించారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని పానీయాల ప్రకరణం)*

٧٦٨ ـ وعن النَّزَّالِ بنِ سَبْرَةَ رَضيَ اللهُ عنه قالَ: أَتَى عَلِيٌّ رضيَ اللهُ عنهُ بَابَ الرَّحْبَةِ فَشَرِبَ قَائماً، وقالَ: إنِّي رَأَيْتُ رَسولَ اللهِ ﷺ فَعَلَ كما رَأَيْتُمُوني فَعَلْتُ. رواهُ البخاري.

768. హ॥జత్ నజ్జాల్ బిన్ సబ్‌రా (రజి) కథనం : ఒకసారి హ॥జత్ అలీ (రజి) బాబుర్రహ్‌బా లోకి (అంటే బహుశా మస్జిద్ ప్రాంగణంలోకి) వచ్చి నించొని నీళ్ళు త్రాగారు. ఆ సందర్భంగా ఆయన "ఇప్పుడు మీరు నేను ఏవిధంగా చేస్తుండగా చూశారో ఆ విధంగా దైవప్రవక్త (సల్లం) చేస్తుండగా నేను చూశాను" అని చెప్పారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని పానీయాల అధ్యాయాలు)*

769. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) కాలంలో మేము నడుస్తూ తినేవాళ్ళం. నించొని నీళ్ళు త్రాగేవాళ్ళం. *(తిర్మిజీ - హసన్, సహీహ్)*

٧٦٩ ـ وعن ابنِ عُمَرَ رضيَ اللهُ عنهما قـال: كنَّـا نـأكُـلُ عَلى عَهْـدِ رسُـولِ اللهِ ﷺ وَنَحنُ نَمشي، ونَشْرَبُ وَنَحنُ قِيَامٌ. رواهُ الترمذي وقال: حديث حسن صحيح.

*(సుననె తిర్మిజీలోని పానీయాల అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త అనుచరులు ఎల్లప్పుడూ అలాగే చేసేవారని దీనర్థం కాదు. అనివార్య పరిస్థితుల్లో అప్పుడప్పుడూ ఆ విధంగా చేసేవారని తెలియజెప్పడమే పై హదీసు ఉద్దేశ్యం. ఎందుకంటే రాబోయే హదీసుల్లో నించొని తినటం, త్రాగటం నికృష్టమైన చేష్టలు అని చెప్ప బడింది. కొంతమంది పండితులు ఈ హదీసుల్లోని వారింపును దృష్టిలో పెట్టుకొని నించొని తినడాన్ని, త్రాగటాన్ని అసహ్యకరమైన పద్ధతిగా పేర్కొన్నారు. ఇబ్నె హజర్ (రహ్మలై) ఈ అభిప్రాయాన్నే ఇష్టపడ్డారు. (ఫత్హుల్ బారీ)

770. హజ్రత్ అమ్ర్ బిన్ షుఐబ్ తన తండ్రి నుండి ఆయన తన తాతగారి నుండి చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) నించొని మరియు కూర్చొని (రెండు విధాలుగానూ) త్రాగటం నేను చూశాను. (తిర్మిజీ - హసన్, సహీహ్)

٧٧٠ ـ وعن عمرِو بنِ شعيبٍ عن أبيهِ عن جدِّه رضيَ اللهُ عنه قال: رَأَيْتُ رسُولَ اللهِ ﷺ يَشْرَبُ قَائماً وقَاعِداً. رواه الترمذي وقال: حديث حسن صحيح.

*(సుననె తిర్మిజీలోని పానీయాల అధ్యాయాలు)*

771. హజ్రత్ అనస్ (రజి) కథనం : మనిషి నించొని నీళ్ళు త్రాగటాన్ని దైవప్రవక్త (సల్లం) వారించారు.

ఖతాదా (రహ్మలై) ఇలా తెలిపారు : మేము అనస్ (రజి)ని నించొని తినడం గురించి అడిగాం. అందుకాయన, "అది ఇంకా నీచమైన (లేక) నికృష్టమైన పని" అని అన్నారు. (ముస్లిం)

٧٧١ ـ وعن أَنَسٍ رضيَ اللهُ عنه عن النبيِّ ﷺ أَنَّهُ نَهى أَنْ يَشرَبَ الرَّجُلُ قَائماً. قال قتادة: فَقُلْنَا لأنَسٍ: فالأَكْلُ؟ قالَ: ذلكَ أَشَرُّ ـ أو أَخْبَثُ ـ. رواهُ مسلم. وفي رواية له: أنَّ النبيَّ ﷺ زَجَرَ عَنِ الشُّرْبِ قَائماً.

వేరొక ఉల్లేఖనంలో దైవప్రవక్త (సల్లం) నించొని త్రాగటాన్ని కఠినంగా వారించారని ఉంది.

*(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

772. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీలో ఎవరూ కూడా సుతరామూ నించొని పానీయం త్రాగరాదు. ఎవరయినా మర్చిపోయి ఆ విధంగా త్రాగితే (త్రాగినదంతా) కక్కేయాలి. *(ముస్లిం)*

٧٧٢ ـ وعن أبي هريرةَ رضيَ اللهُ عنه قال: قالَ رسُولُ اللهِ ﷺ: «لَا يَشْرَبَنَّ أَحَدٌ مِنكُمْ قَائِماً، فَمَنْ نَسِيَ فَلْيَسْتَقِئْ» رواهُ مسلم.

*(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మొదట్లో పేర్కొనబడిన హదీసుల్లో నించొని తినటం, త్రాగటం ధర్మసమ్మతమని చెప్పబడింది. అయితే అనివార్య పరిస్థితుల్లో మాత్రమే అలా చెయ్యాలి. సాధ్యమైనంతవరకు కూర్చొనే తినాలి, త్రాగాలి. అదే సరయిన పద్ధతి. ఈ రోజుల్లో కొన్ని కొన్ని చోట్ల విందు భోజనాల్లో నించొని తినే పద్ధతిని అనుసరిస్తున్నారు. ఇలా చేయటం వల్ల జనమంతా ఒకేసారి భోజనం ముగించుకోగలుగుతారని చెబుతారు. కాని దీనివల్ల ఎన్ని నష్టాలున్నాయో, ఈ పద్ధతిని పాటించటంవల్ల ఎన్ని హదీసుల్ని తుంగలో తొక్కినట్లవుతుందో కాస్త ఆలోచించాలి. ఏది ఏమైనా ఈ తరహా భోజన ఏర్పాట్లను నిర్వహించటం ముస్లిం సముదాయానికి మాత్రం శోభాయమానం కాదు.

## 115వ అధ్యాయం

## ١١٥ ـ بابُ اسْتِحْبابِ كَوْنِ سَاقِي الْقَوْمِ آخِرَهُمْ شُرْباً

# పానీయ పంపిణీదారుడు అందరికన్నా చివర్లో తాగాలి

٧٧٣ ـ عن أَبي قتادة رضيَ اللهُ عنه عن النبيِّ ﷺ قال: «سَاقي القَوْم آخِرُهُمْ» يعني: شرْباً. رواهُ الترمذي وقالَ: حديث حسن صحيح.

773. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ప్రజలకు త్రాపించేవాడు అందరికన్నా చివర్లో ఉంటాడు. అంటే అందరికీ త్రాపించి తాను చివర్లో త్రాగుతాడని భావం.

*(తిర్మిజీ - హసన్, సహీహ్)*

*(సుననె తిర్మిజీలోని పానీయాల ప్రకరణం)*

## 116వ అధ్యాయం

١١٦ ـ بَابُ جَوَازِ الشُّرْبِ مِنْ جَمِيعِ الأَوَانِي الطَّاهِرَةِ غَيْرِ الذَّهَبِ وَالفِضَّةِ، وَجَوَازِ الْكَرْعِ ـ وَهُوَ الشُّرْبُ بِالْفَمِ مِنَ النَّهْرِ وَغَيْرِهِ بِغَيْرِ إِنَاءٍ وَلاَ يَدٍ ـ وَتَحْرِيمِ اسْتِعْمَالِ إِنَاءِ الذَّهَبِ وَالفِضَّةِ فِي الشُّرْبِ وَالأَكْلِ وَالطَّهَارَةِ وَسَائِرِ وُجُوهِ الاِسْتِعْمَالِ

## వెండి, బంగారు పాత్రలు మినహా పరిశుభ్రమైన ఇతర పాత్రలన్నిటిలో పానీయాన్ని సేవించవచ్చు. పాత్రలుగాని చేతులుగాని ఉపయోగించకుండా నేరుగా నోటితోనే సెలయేరు మొదలగు వాటినుండి నీళ్ళు త్రాగవచ్చు. తినటానికి, త్రాగటానికి, మలమూత్ర విసర్జన శుభ్రతకు, ఇతర వినియోగాలకు వెండి, బంగారు పాత్రలు ఉపయోగించడం నిషిద్ధం.

٧٧٤ ـ عَنْ أَنَسٍ رضيَ اللهُ عنه قال: حَضَرَتِ الصَّلاةُ، فَقَامَ مَنْ كانَ قَرِيبَ الدَّارِ إِلى أَهْلِهِ، وَبَقِيَ قَوْمٌ فَأُتِيَ رَسُولُ اللهِ ﷺ بِمِخْضَبٍ مِنْ حِجَارَةٍ، فَصَغُرَ المِخْضَبُ أَنْ يَبْسُطَ فِيهِ كَفَّهُ، فَتَوَضَّأَ القَوْمُ كُلُّهُمْ. قَالُوا: كَمْ كُنْتُمْ؟ قَالَ: ثَمَانِينَ وَزِيَادَةً. متفقٌ عليه،

774. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) కాలంలో ఒకసారి నమాజ్ వేళ అయింది. ఇళ్ళు దగ్గరున్న వారు (వుజూ చేసుకొని రావటానికి) తమ ఇళ్ళకు వెళ్ళేందుకు లేచి నిలబడ్డారు. కొందరు (తమ ఇళ్ళకు వెళ్ళలేక) అక్కడే ఉండిపోయారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) సన్నిధిలో (నీళ్ళు నింపివున్న) ఒక రాతి తొట్టె సమర్పించబడింది. అది అరచేయి ముంచి చాపలేనంత చిన్నదిగా ఉంది. అయినప్పటికీ ఆ (కొంచెం) నీటితో అక్కడున్నవారంతా వుజూ చేసుకున్నారు.

ఈ హదీసు వినిపించినప్పుడు ప్రజలు అనస్ (రజి) గారిని "ఆ సమయంలో

మీరెంతమంది ఉన్నారు?" అని అడి గారు. దానికాయన "ఎనభైమందికన్నా ఎక్కువే ఉండి ఉంటాం" అని చెప్పారు.

*(బుఖారీ - ముస్లిం)*

هذه رواية البخاري. وفي رواية له ولمسلم: انَّ النبيَّ ﷺ دَعَا بإِنَاءٍ مِنْ ماءٍ، فَأُتِيَ بِقَدَحٍ رَحْرَاحٍ فِيهِ شَيءٌ مِنْ مَاءٍ، فَوَضَعَ أَصَابِعَهُ فِيهِ. قَالَ أَنسٌ: فَجَعَلْتُ أَنْظُرُ إِلى الْمَاءِ يَنْبُعُ مِنْ بَيْنِ أَصَابِعِهِ، فَحَزَرْتُ مَنْ تَوَضَّأَ مَا بَيْنَ السَّبْعِينَ إِلى الثَّمَانِينَ.

ఇది బుఖారీ ఉల్లేఖనం. బుఖారీ - ముస్లింలలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దైవప్రవక్త (సల్లం) ఒక నీళ్ళ పాత్ర తీసుకొని రమ్మని ఆదేశించారు. ఆయన ఆదేశం ప్రకారం ఆయన దగ్గరికి మూతి తెరువబడి వున్న ఒక పాత్ర తీసుకురావటం జరిగింది. అది లోతు తక్కువగా ఉన్న పాత్ర. అందులో నీళ్ళు కొద్దిగా ఉన్నాయి. దైవప్రవక్త (సల్లం) ఆ పాత్రలో తన వ్రేళ్ళు ముంచారు.

అనస్ (రజి) ఇలా అంటున్నారు : ఆ సమయంలో దైవప్రవక్త (సల్లం) వ్రేళ్ళ మధ్య నుండి (ఊటలాగా) నీళ్ళు వెలువడటం నేను కళ్ళారా చూశాను. ఆ నీటితో వుజూ చేసుకున్న వారిని నేను లెక్కపెట్టాను. వారు డెబ్భై నుంచి ఎనభై మందిదాకా ఉంటారు.

*(సహీహ్ బుఖారీలోని వుజూ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్టతల ప్రకరణం)*

٧٧٥ ـ وعن عبدِ الله بنِ زيدٍ رضيَ اللهُ عنه قال: أَتَانَا النَّبِيُّ ﷺ، فَأَخْرَجْنَا لَهُ مَاءً في تَوْرٍ مِنْ صُفْرٍ فَتَوَضَّأَ. رواه البُخاري.

«الصُّفْر» بضم الصاد، ويجوز كسرها؛ وهو النحاسُ. و«التَّوْر»: كالقدح، وهو بالتاء المثناة من فوق.

775. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జైద్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఒకసారి మా దగ్గరికి వచ్చినప్పుడు మేము ఆయనకు ఒక ఇత్తడి పాత్రలో నీళ్ళు ఇస్తే, ఆయన దాంతో వుజూ చేసుకున్నారు. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని వుజూ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

వుజూ నీళ్ళ కోసం ఇత్తడి పాత్రల్ని ఉపయోగించవచ్చని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

776. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఒక అన్సార్ వ్యక్తి దగ్గరికి వెళ్ళారు. ఆ సమయంలో తనతోపాటు ఒక మిత్రుడు కూడా ఉన్నాడు. ఆయన ఆ అన్సార్ వ్యక్తితో మాట్లాడుతూ, "నీ దగ్గర నీటి తిత్తిలో నిన్నటి నీళ్ళుంటే ఇవ్వు. లేదంటే మేము సెలయేరు మొదలగు వాటి నుండి నేరుగా నోటితోనే నీళ్ళు త్రాగుతాం" అని అన్నారు. (బుఖారీ)

٧٧٦ ـ وعن جابرٍ رضيَ اللهُ عنه أنَّ رسُولَ اللهِ ﷺ دَخَلَ عَلى رَجُلٍ مِنَ الأنصارِ، وَمَعَهُ صاحِبٌ لَهُ، فَقالَ رسُولُ اللهِ ﷺ: «إنْ كانَ عِنْدَكَ ماءٌ بَاتَ هذِهِ اللَّيْلَةَ في شَنَّةٍ وَإلَّا كَرَعْنَا» رواهُ البخاري. «الشَّنُّ»: القِرْبَة.

*(సహీహ్ బుఖారీలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఎలాంటి పాత్రగాని, చేతులుగాని ఉపయోగించకుండానే సెలయేరు నుండి నేరుగా నోటితో నీళ్ళు త్రాగటం ధర్మసమ్మతమేనని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. ఇందులో దైవప్రవక్త (సల్లం) తమ అన్సార్ అనుచరుణ్ణి నిన్నటి నీళ్ళుంటే ఇవ్వమని కోరారు. వేసవి కాలంలో గడచిన రాత్రి నీళ్ళు తాగటానికి కమ్మగా ఉంటాయి. అందుకే దైవప్రవక్త (సల్లం) ఆ నీళ్లు అడిగారు. ఇతర ఆహార పదార్థాలు పాచిపట్టినట్లుగా నీరు పాచిపట్టదనే విషయాన్ని గ్రహించాలి.

777. హజ్రత్ హుజైఫా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని పట్టు వస్త్రాలు, ముతక పట్టు వస్త్రాలు ధరించటం నుంచి, వెండి, బంగారు పాత్రలలో పానీయం త్రాగటం నుంచి వారించారు. "ఈ వస్తువులు ఇహలోకంలో అవిశ్వాసులు వాడు తారు. పరలోకంలో ఇవి మనకు లభి

٧٧٧ ـ وعن حذيفةَ رضيَ اللهُ عنه قالَ: إنَّ النَّبيَّ ﷺ نَهانا عَنِ الحَريرِ والدِّيباجِ والشُّرْبِ في آنِيَةِ الذَّهَبِ والفِضَّةِ، وقالَ: «هِيَ لَهُمْ في الدُّنْيا، وهيَ لَكُمْ في الآخِرَةِ» متَّفقٌ عليه.

స్తాయి" అని చెప్పారు.

(బుఖారీ - ముస్లిం)

(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని వస్త్రధారణ ప్రకరణాలు)

## ముఖ్యాంశాలు

పురుషులకు పట్టువస్త్రాలు నిషిద్ధం. స్త్రీలకయితే అవి సమ్మతమే. అదేవిధంగా స్త్రీపురుషులిరువురికీ వెండి, బంగారు పాత్రల వాడకం నిషేధించబడింది. స్త్రీలు మాత్రం బంగారు, వెండి ఆభరణాలు ధరించవచ్చని అత్యధికమంది పండితులు అభిప్రాయపడుతున్నారు.

٧٧٨ ـ وعن أمِّ سلمةَ رضيَ اللهُ عنها أنَّ رسُولَ اللهِ ﷺ قال: «الَّذي يَشْرَبُ في آنِيَةِ الفِضَّةِ إنَّما يُجرْجِرُ في بَطْنِهِ نَارَ جَهَنَّمَ» متفقٌ عليهِ. وفي روايةٍ لمسلم: «إنَّ الَّذي يَأكُلُ أَوْ يَشْرَبُ في آنِيَةِ الفِضَّةِ والذَّهَبِ». وفي روايةٍ لَه: «مَنْ شَرِبَ في إناءٍ مِنْ ذَهَبٍ أَوْ فِضَّةٍ فَإنَّما يُجَرْجِرُ في بَطْنِهِ نَاراً مِنْ جَهَنَّمَ».

778. హజ్రత్ ఉమ్మె సలమా (రజి. అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ఎవరయితే వెండి పాత్రతో నీళ్ళు త్రాగుతాడో అతను నిజానికి తన పొట్టను నరకాగ్నితో నింపుకున్నట్లే. (బుఖారీ - ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో "ఎవరయితే వెండి, బంగారు పాత్రల్లో తింటాడో లేక త్రాగుతాడో" అని ఉంది.

ఇంకొక ఉల్లేఖనంలో, "ఎవరయితే బంగారు, వెండి పాత్రలతో నీళ్ళు త్రాగుతాడో అతను నిజానికి తన కడుపులో నరకాగ్ని నింపుకున్నట్లే" అని ఉంది.

(సహీహ్ బుఖారీలోని పానీయాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని వస్త్రధారణ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

బంగారు, వెండి పాత్రల వినియోగం దుబారా ఖర్చుతో కూడుకున్న పని. పైగా వాటి వాడకం గర్వాన్ని, పొగరుమోతుతనాన్ని సూచిస్తుంది. ఇవి రెండూ అల్లాహ్‌కు అత్యంత అయిష్టకరమైన విషయాలు. అంచేత వెండి, బంగారు పాత్రల్ని ఉపయోగించటం మహా పాపం. నరకమే దానికి శిక్ష.

# ٣ - كِتَابُ اللِّبَاس

# 3. వస్త్రధారణ ప్రకరణం

**117వ అధ్యాయం**

## ١١٧ - بَابُ اسْتِحْبَابِ الثَّوْبِ الأبْيَضِ، وَجَوَازِ الأحْمَرِ وَالأخْضَرِ وَالأصْفَرِ وَالأسْوَدِ وَجَوَازِهِ مِنْ قُطْنٍ وَكَتَّانٍ وَشَعْرٍ وَصُوفٍ وَغَيْرِهَا إلاَّ الْحَرِيرَ

## తెల్ల దుస్తులు ధరించటం అభిలషణీయం, ఎరుపు, ఆకుపచ్చ, పసుపుపచ్చ, నలుపు రంగుల దుస్తులు, అలాగే పట్టువి మినహా నూలు, వెంట్రుకలు, ఉన్ని మొదలగువాటితో నేయబడిన దుస్తులు ధరించటం ధర్మసమ్మతమే

قالَ اللهُ تعالى: ﴿ يَٰبَنِيٓ ءَادَمَ قَدۡ أَنزَلۡنَا عَلَيۡكُمۡ لِبَاسٗا يُوَٰرِي سَوۡءَٰتِكُمۡ وَرِيشٗاۖ وَلِبَاسُ ٱلتَّقۡوَىٰ ذَٰلِكَ خَيۡرٞ﴾ [الأعراف: ٢٦] وقال تعالى: ﴿وَجَعَلَ لَكُمۡ سَرَٰبِيلَ تَقِيكُمُ ٱلۡحَرَّ وَسَرَٰبِيلَ تَقِيكُم بَأۡسَكُمۡ﴾ [النحل: ٨١].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"ఆదం సంతానమా! మేము మీపై దుస్తులను అవతరింపజేశాము. అవి మీకు సిగ్గుపడే మీ శరీర భాగాలను కప్పుతాయి. మీ శరీర శోభకు సాధనంగా ఉంటాయి. భయభక్తులు ఉట్టిపడే దుస్తులే మంచి దుస్తులు."

*(అల్ ఆరాఫ్ : 26)*

"మిమ్మల్ని వేడిమి నుండి కాపాడే దుస్తులనూ, యుద్ధ రంగాలలో మిమ్మల్ని రక్షించే కవచాలనూ మీకు ప్రసాదించాడు."

*(అన్ నహ్ల్ : 81)*

**వివరణ :**

పైన పేర్కొనబడిన దివ్య ఖుర్‌ఆన్ సూక్తుల్లో దేవుడు మానవాళిపై దుస్తుల రూపంలో అవతరింపజేసిన అనుగ్రహాలను, వాటి ఉపయోగాలను గురించి వివరించాడు. ఈ దుస్తులు మనుషులను వేసవి, శీతాకాలాల్లోని ప్రకృతి వైపరీత్యాల నుండి రక్షిస్తాయి. యుద్ధ సమయాల్లో శత్రువుల తరపునుండి జరిగే కత్తిపోట్ల నుండి, ఖడ్గపు వేట్ల నుండి కాపాడతాయి. అన్నిటికీ

మించి దుస్తులు శరీర శోభను, సౌందర్యాన్నీ ఇనుమడింపజేస్తాయి. దేహానికి రక్షణ కల్పిస్తాయి. గ్రంథకర్త ఈ సూక్తుల్ని ఇక్కడ ప్రస్తావించటంలోని ఔచిత్యం ఏమిటంటే మనిషి దుస్తుల్ని ఉపయోగిస్తే అతనికి పైన పేర్కొనబడిన లాభాలన్నీ చేకూరుతాయి. దీనిద్వారా అన్ని రకాల దుస్తుల్ని ధరించటం ధర్మసమ్మతమేనని తెలుస్తోంది. అయితే పట్టు వస్త్రాలను ధరించటం పురుషులకు నిషేధించబడింది కనుక వారు ఆ వస్త్రాలు ధరించటం సమ్మతం కాదు.

హదీసుల్లో తెల్ల దుస్తులు ధరించటం అభిలషణీయమని చెప్పబడింది. కనుక తెల్లదుస్తులు ధరించటం ఉత్తమం. ఇతర రంగుల దుస్తులు ధరించటం కూడా ధర్మసమ్మతమే. అయితే వస్త్ర ధారణలో ఫ్యాషన్ల పేరిట పురుషులు స్త్రీలను అనుకరిస్తూ, స్త్రీలు పురుషులను అనుకరిస్తూ దుస్తులు ధరించటాన్ని మాత్రం ఇస్లాం ధర్మం గర్హిస్తుంది.

٧٧٩ ـ وعن ابنِ عبَّاسٍ رضيَ اللهُ عنهما أنَّ رسولَ اللهِ ﷺ قال: «الْبسُوا مِنْ ثِيَابِكُمُ البيَاضَ، فَإنَّهَا مِنْ خَيْرِ ثِيَابِكُمْ، وَكَفِّنُوا فِيهَا مَوْتَاكُمْ» رواهُ أبو داود، والترمذي وقال: حديث حسن صحيح.

779. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : తెల్లని దుస్తులు ధరించండి. ఇవి మీ దుస్తుల్లో అన్నిటికంటే శ్రేష్ఠమైనవి. మీలో మరణించిన వారి శవాలకు వాటితోనే వస్త్రసంస్కారం చేయండి. *(అబూదావూద్, తిర్మిజీ - హసన్, సహీహ్)*

*(సునసె అబూ దావూద్‌లోని వస్త్రధారణ ప్రకరణం, సునసె తిర్మిజీలోని జనాయెజ్ అధ్యాయాలు)*

٧٨٠ ـ وعنْ سَمُرَةَ رضيَ اللهُ عنه قال: قال رسُولُ اللهِ ﷺ: «الْبَسُوا البَيَاضَ، فَإنَّهَا أَطْهَرُ وَأَطْيَبُ، وكَفِّنُوا فِيها مَوْتَاكُمْ» رواهُ النسائي، والحاكم وقال: حديث صحيح.

780. హజ్రత్ సమురా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : తెల్లదుస్తులు ధరించండి. అవి ఎంతో పరిశుద్ధంగా, పరిశుభ్రంగా ఉంటాయి. మీలో మరణించేవారి శవాలకు వాటితోనే వస్త్రసంస్కారాలు చేయండి. *(నసాయి, హాకిమ్ - సహీహ్)*

*(సునసె నసాయిలోని జనాయెజ్ ప్రకరణం)*

٧٨١ ـ وعن البراءِ رضيَ اللهُ عنه قال: كانَ رسُولُ اللهِ ﷺ مَرْبُوعاً وَلَقَدْ

781. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) మరీ అంత పొడవరి కాదు, మరీ అంత పొట్టివారూ

رَأَيْتُهُ فِي حُلَّةٍ حَمْرَاءَ مَا رَأَيْتُ شَيْئاً قَطُّ أَحْسَنَ مِنْهُ. متفقٌ عليه.

కాదు, మధ్యస్థంగా ఉంటారు. నేనొక సారి ఆయన్ని ఎరుపురంగు దుస్తులు ధరించి ఉండగా చూశాను. అప్పుడు ఆయనలో ఉన్నటువంటి సౌందర్యం నేను మరే వస్తువులోనూ చూడలేదు.

(బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని వస్త్రధారణ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్ఠతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసుని ప్రాతిపదికగా చేసుకొని కొందరు పండితులు ఎరుపురంగు దుస్తులు ధరించటం ధర్మసమ్మతమేనని చెప్పారు. ఇమామ్ నవవీ (రహ్మాలై) అభిప్రాయం కూడా ఇదేననిపిస్తోంది. పై శీర్షికలో ఆయన ఈ విషయాన్ని ప్రస్తావించారు. అయితే దైవప్రవక్త (సల్లం) ధరించిన అరుణ వస్త్రాలు పూర్తిగా ఎరుపు రంగువికావనీ, అందులో ఎరుపురంగు గళ్ళుండేవని మరికొంతమంది పండితులు వ్యాఖ్యానించారు. అలాంటి దుస్తులు ధరించటం ధర్మసమ్మతమేనన్న విషయంలో ఎలాంటి భేదాభిప్రాయం లేదు. ఎందుకంటే అవి నిండు ఎరుపురంగు దుస్తులక్రిందికి రావు. అరుణ వస్త్రాలకు సంబంధించిన ఆదేశాలు దేశకాల పరిస్థితులను బట్టి మారుతూ ఉంటాయని ఇంకొంతమంది విద్వాంసులు వాదించారు. వారి అభిప్రాయం ప్రకారం ఏదయినా ప్రాంతంలో ఈ రంగు గనక అవిశ్వాసులకు ధార్మిక చిహ్నంగా ఉంటే, లేక అరుణ వస్త్రాలు ధరించటం స్త్రీలకు ప్రత్యేకమయితే అలాంటి ప్రాంతాల్లో ముస్లిం పురుషులు అరుణ వస్త్రాలు ధరించటం సమ్మతం కాదు. మరికొంత మంది పండితులు అరుణ వస్త్రాల గురించి వ్యాఖ్యానిస్తూ పురుషులు ఇళ్ళల్లోనయితే ఇలాంటి వస్త్రాలు ధరించవచ్చుగానీ, బయటికి వెళ్ళినప్పుడు, సభలు సమావేశాలకు హాజరైనప్పుడు అరుణ వస్త్రాలు ధరించటం పురుషులకు శోభాయమానం కాదని సూచించారు.

చెప్పొచ్చేదేమిటంటే ఎరుపు రంగు దుస్తులు ధరించటం అధర్మ విషయమేమీ కాదుగాని దేశ కాల పరిస్థితులనుబట్టి వాటి ఆదేశాలు మారుతూ ఉంటాయి.

٧٨٢ - وعن أبي جُحَيْفَةَ وَهْبِ بنِ عبدِ اللهِ رَضِيَ اللهُ عنهُ قال: رَأَيْتُ النَّبِيَّ ﷺ بمَكَّةَ وَهُوَ بالأَبْطَحِ في قُبَّةٍ لَهُ حَمْرَاءَ مِنْ أَدَمٍ، فَخَرَجَ بِلالٌ بِوَضُوئِهِ،

782. హజ్రత్ అబూ జుహైఫా వహబ్ బిన్ అబ్దుల్లాహ్ (రజి) కథనం : నేనొక సారి మక్కాలో దైవప్రవక్త (సల్లం) అబ్తహ్ అనే చోట చర్మంతో తయారు చేయబడిన ఓ ఎర్రని గుడారంలో కూర్చొని ఉండటం చూశాను. అప్పుడు

فَمِنْ نَاضِحٍ ونَائِلٍ، فَخَرَجَ النبيُّ ﷺ وَعلَيْهِ حُلَّةٌ حَمْرَاءُ، كَأَنِّي أَنْظُرُ إلى بيَاضِ سَاقَيْهِ، فَتَوَضَّأَ وَأَذَّنَ بلالٌ، فَجَعَلْتُ أَتَتَبَّعُ فَاهُ هَهُنَا وهَهُنَا، يقولُ يَمِيناً وشِمَالاً: حَيّ عَلى الصَّلاةِ، حَيّ عَلى الفَلاَحِ، ثُمَّ رُكِزَتْ لَهُ عَنَزَةٌ، فَتَقَدَّمَ فَصَلَّى يَمُرُّ بَيْنَ يَدَيْهِ الكَلْبُ وَالحِمَارُ لَا يُمْنَعُ. متَّفقٌ عليه. «العَنَزَةُ» بفتح النونِ: نَحوُ العُكازَةِ.

దైవప్రవక్త (సల్లం) వుజూ చేయగా మిగిలి పోయిన నీటిని హజ్రత్ బిలాల్ (రజి) బయటికి తీసుకువచ్చారు. (జనం ఆ నీటికోసం ఎగబడ్డారు). కొంతమందికి ఆ నీళ్ళు దొరికాయి. నీళ్ళు దొరికిన వారు దొరకనివారిపై తమ తడి చేతులు విదిల్చారు.

కొంతసేపటికి దైవప్రవక్త (సల్లం) కూడా బయటికి విచ్చేశారు. అప్పుడాయన ఒంటిపై ఎరుపు రంగు దుస్తులున్నాయి. నాకు ఇప్పటికీ ఆయన మడమల తెలుపుదనం స్పష్టంగా గోచరిస్తున్నట్లే ఉంది.

ఆయన వుజూ చేసుకున్నారు. బిలాల్ (రజి) అజాన్ పలికారు. ఆయన అజాన్ ఇస్తూ ముఖం అటూ ఇటూ త్రిప్పటాన్ని గమనిస్తూ ఉన్నాను నేను. ఆయన 'హయ్యా అలస్సలాహ్' అంటూ కుడివైపు నకు, 'హయ్యా అలల్ ఫలాహ్' అంటూ ఎడమ వైపునకు ముఖం త్రిప్పసాగారు. తర్వాత అక్కడ ఒక ఈటెను పాతటం జరిగింది. దైవప్రవక్త (సల్లం) దాని ముందు నించొని నమాజ్ చేయించారు. ఆయన ముందు పాతిన ఆసరాకు అవతలివైపు నుంచి కుక్కలు, గాడిదలు నడిచిపోయేవి. వాటిని ఎవరూ ఆపే వారు కారు. (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని నమాజ్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

'అబ్‌తహ్' అనేది ఒక ప్రాంతం పేరు. దాన్నే 'వాదియె మిహ్‌సబ్' అని కూడా అంటారు. నిఘంటువులో అబ్‌తహ్ అంటే పల్లం అని అర్థం. ఆ ప్రాంతం పల్లంగా ఉండి, వర్షాకాలంలో వర్షపు నీరు అటువైపు ప్రవహిస్తుండటంతో దానికా పేరు వచ్చింది. ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) అరుణవస్త్రాలు ధరించారని చెప్పబడింది. దీనిద్వారా ఎరుపు రంగు వస్త్రాలు ధరించటం పురుషులకూ ధర్మసమ్మతమేనని తెలుస్తోంది.

ఇందులో సుత్రా (ఆసరా) గురించి కూడా వివరించబడింది. నమాజ్ చేసే వ్యక్తి ముందు గోడలాంటిదేమయినా అడ్డంగా ఉండాలి. లేని పరిస్థితుల్లో ఏదయినా వస్తువుని సుత్రా (ఆసరా)గా ముందుంచుకొని నమాజ్ చేయాలి. ఆ విధంగా నమాజ్ చేసిన పక్షంలో సుత్రాకు ఆవలివైపు నుంచి ప్రజలు, పశువులు ఎవరు నడిచివెళ్ళినా నమాజ్‌కు అంతరాయం కలగదు.

783. హజ్రత్ అబూ రిమ్సా రిఫాఆ తైమీ (రజి) కథనం : నేనొకసారి దైవప్రవక్త (సల్లం) ఒంటిపై రెండు ఆకుపచ్చ రంగు వస్త్రాలు చూశాను. *(అబూదావూద్, తిర్మిజీ - ప్రామాణికమైన ఆధారాలతో)*

٧٨٣ ـ وعن أبي رِمْثَةَ رِفَاعَةَ التَّيْمِيِّ رضيَ الله عنه قال: رَأَيْتُ رسُولَ اللهِ ﷺ وعليْه ثوبانِ أخضرانِ. رواهُ أبو داود، والترمذي بإسْنَادٍ صحيحٍ.

*(సుననె అబూదావూద్‌లోని వస్త్రధారణ ప్రకరణం, సుననె తిర్మిజీలోని సంస్కార అధ్యాయం)*

784. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : మక్కా విజయం నాడు దైవప్రవక్త (సల్లం) మక్కాలో ప్రవేశించినప్పుడు, ఆయన నలుపురంగు తలపాగా ధరించి వున్నారు. *(ముస్లిం)*

٧٨٤ ـ وعن جابرٍ رضيَ اللهُ عنه، أنَّ رسُولَ اللهِ ﷺ دَخَلَ يَوْمَ فَتْحِ مَكَّةَ وَعَلَيْهِ عِمَامَةٌ سَوْدَاءُ. رواهُ مسلم.

*(సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

నలుపు రంగు వస్త్రాలు, నలుపు తలపాగా ధరించవచ్చని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. కాని మనదేశంలో ఒక ప్రత్యేక వర్గం నలుపురంగు వస్త్రాలను తమ సంతాప చిహ్నాలుగా, తమ మత ప్రతీకలుగా భావిస్తోంది. అందుకని వారి అనుకరణకు దూరంగా ఉండటానికి ముదురు నలుపు రంగు వస్త్రాలు ధరించకుండా ఉండటమే మంచిది. లేత నలుపు దుస్తులు ధరించటంలో ఎలాంటి ఆక్షేపణలేదు.

٧٨٥ - وعن أبي سعيدٍ عمرِو بنِ حُرَيْثٍ رضي الله عنه قال: كَأَنِّي أنظُرُ إلى رسولِ اللهِ ﷺ وعَلَيْهِ عِمَامَةٌ سَوْدَاءُ، قَدْ أَرْخَى طَرَفيها بَيْنَ كتفيْهِ. رواه مسلم. وفي روايةٍ له: أن رسولَ اللهِ ﷺ خَطَبَ النَّاسَ، وَعَلَيْهِ عِمَامَةٌ سَوْدَاءُ.

785. హజ్రత్ అబూ సయీద్ అమ్ర్ బిన్ హురైస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) నలుపురంగు తలపాగా ధరించి వున్నారు. దాని రెండు చివరలనూ తన భుజాల మధ్య వ్రేలాడదీశారు. ఆ దృశ్యం ఇప్పటికీ నా కళ్ళకు కట్టినట్లు కనిపిస్తోంది. (ముస్లిం)

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దైవప్రవక్త (సల్లం) ఒకసారి నలుపు రంగు తలపాగా ధరించి ప్రజలకు ఉపన్యాసమిచ్చారు.

*(సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

٧٨٦ - وعن عائشةَ رضي الله عنها قالت: كُفِّنَ رسولُ اللهِ ﷺ في ثلاثةِ أثْوابٍ بيضٍ سَحُوليَّةٍ مِنْ كُرْسُفٍ، لَيْسَ فيهَا قَمِيصٌ وَلا عِمَامَةٌ. متفقٌ عليه. «السَّحُوليَّةُ» بفتحِ السين وضمها وضم الحاء المهملتين: ثِيابٌ تُنْسَبُ إلى سَحُولَ: قَرْيَةٍ باليَمَنِ. «وَالكُرْسُفُ»: القُطْن.

786. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) (భౌతిక కాయం)ను మూడు తెల్లని నూలు వస్త్రాలలో చుట్టడం జరిగింది. ఆ వస్త్రాలు ఎమన్ దేశంలోని సహూల్ ప్రాంతంలో తయారుచేయబడినవి. ఆయన (భౌతికకాయం)కు చుట్టిన వస్త్రాలలో చొక్కాగాని తలపాగా గాని లేవు. (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జనాయెజ్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

పురుషుని శవాన్ని మూడు వస్త్రాలతో చుట్టాలి. వాటిలో చొక్కాగాని, తలపాగా గాని ఉండకూడదు. ఇంకో విషయం ఏమిటంటే శవానికి తెల్లని వస్త్రాలు చుట్టడం ఉత్తమం. తెల్ల వస్త్రాలు లభ్యంగాని పక్షంలో ఇతర రంగుల వస్త్రాలతోనయినా చుట్టవచ్చు.

٧٨٧ ـ وعنها قالت: خَرَجَ رسولُ اللهِ ﷺ ذاتَ غَدَاةٍ، وَعَلَيْهِ مِرْطٌ مُرَحَّلٌ مِنْ شَعَرٍ أَسْوَد. رواه مسلم.
«المِرْط» بكسر الميم: وهو كساءٌ. و«المُرَحَّل» بالحاء المهملة: هُو الذي فيه صورةُ رِحالِ الإبلِ، وَهِيَ الأكْوَارُ.

787. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) ఇంటినుండి బయలుదేరి నప్పుడు ఆయన ఒంటిపై వెంట్రుకలతో నేయబడిన ఓ నల్లని వస్త్రముంది. దాని మీద పటాలు చిత్రించబడి ఉన్నాయి. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని వస్త్రధారణ ప్రకరణం)*

٧٨٨ ـ وعن المُغيرةِ بنِ شُعْبَةَ رضي الله عنه قال: كنتُ مع رسولِ اللهِ ﷺ ذاتَ ليلَةٍ في مسيرٍ، فقال لي: «أَمَعَكَ مَاءٌ»؟ قلتُ: نَعَمْ، فَنَزَلَ عن راحِلَتِهِ فَمَشى حتى تَوَارَى في سَوادِ اللَّيْلِ ثم جاءَ فَأَفْرَغْتُ عَلَيْهِ مِنَ الإِدَاوَةِ، فَغَسَلَ وَجْهَهُ وَعَلَيْهِ جُبَّةٌ مِنْ صُوفٍ، فلم يَسْتَطِعْ أنْ يُخْرِجَ ذِرَاعَيْهِ منها حتى أخْرَجَهُمَا مِنْ أَسْفَلِ الجُبَّةِ،

788. హజ్రత్ ముగీరా బిన్ షోబా (రజి) కథనం : ఓ ప్రయాణంలో నేను రాత్రి వేళ దైవప్రవక్త (సల్లం) వెంట ఉన్నాను. ఆ సమయంలో ఆయన నన్ను పిలిచి, "నీ దగ్గర నీళ్ళేమయినా ఉన్నాయా?" అని అడిగారు. నేను ఉన్నాయన్నాను. అప్పుడాయన వాహనం నుంచి క్రిందికి దిగి ఓ ప్రక్కకు నడిచి వెళ్ళిపోసాగారు. అలా చీకటిలో ఎవరికీ కనపడనంత దూరం వెళ్ళిపోయారు. కాసేపటికి తిరిగొచ్చిన తరువాత నేను ఒక పాత్రతో ఆయన చేతులపై నీళ్ళు పోశారు. ఆయన ముఖం కడుక్కున్నారు. ఆ సమయంలో ఆయన ఓ ఉన్ని జుబ్బా తొడుక్కొని ఉన్నారు. (చేతులు పూర్తిగా కడుక్కోవటానికి) ఆయన తన చొక్కా చేతులు పైకి జరపాలని ప్రయత్నించారు. కాని అవి బిగుతుగా ఉండి పైకి పోలేదు. అంచేత జుబ్బా లోపలి నుంచి చేతులు బయటికి తీసి కడుక్కున్నారు. తర్వాత తలకు 'మసా' చేసుకున్నారు (అంటే తడిచేత్తో తుడుచుకున్నారు).

فَغَسَلَ ذِرَاعيهِ وَمَسَحَ برأسه، ثمَّ أَهْوَيْتُ لِأَنزِعَ خُفَّيْهِ فقال: «دَعْهُمَا فَإِنِّي أَدْخَلْتُهُمَا طَاهِرَتَيْنِ» وَمَسَحَ عَلَيْهِمَا. متفق عليه. وفي روايةٍ: وعَلَيْهِ جُبَّةٌ شَامِيَّةٌ ضَيِّقَةُ الْكُمَّيْنِ. وفي روايةٍ أنَّ هذهِ الْقَضِيَّةَ كانت في غَزْوَةِ تَبُوكَ.

ఆ తర్వాత నేను ఆయన కాళ్ళనుండి మేజోళ్ళు తీద్దామని క్రిందికి వంగాను. కాని ఆయన నన్ను వారిస్తూ, "ఫర్వాలేదు ఉండనివ్వు. నేను కాళ్ళు పరిశుభ్రంగా ఉన్న స్థితిలో మేజోళ్ళు తొడుక్కున్నాను" అని చెప్పి వాటిని తడిచేతుల్తో తుడుచుకున్నారు (మసా చేశారు). *(బుఖారీ - ముస్లిం)*

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : ఆ సమయంలో ఆయన సిరియన్ జుబ్బా ధరించి ఉన్నారు. దాని చేతులు బిగుతుగా ఉన్నాయి.

ఇంకొ ఉల్లేఖనంలో, "ఇది తబూక్ యుద్ధం నాటి సంఘటన" అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని వస్త్రధారణ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)*

**118వ అధ్యాయం**

## ١١٨ ـ بَابُ اسْتِحْبَابِ الْقَمِيصِ

## చొక్కా ధరించటం అభిలషణీయం

٧٨٩ ـ عن أُمِّ سَلمةَ رضي الله عنها قالت: كان أَحَبَّ الثِّيابِ إلى رسولِ الله ﷺ القَمِيصُ. رواه أبو داود،

789. హజ్రత్ ఉమ్మె సలమా (రజి. అన్హా) కథనం: దైవప్రవక్త (సల్లం) దుస్తులన్నిటిలో చొక్కాను అత్యంత ఎక్కువగా యిష్టపడేవారు.

*(అబూ దావూద్, తిర్మిజీ - హసన్)*

*(అబూ దావూద్, తిర్మిజీలోని వస్త్రధారణ ప్రకరణాలు)*

### ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) కాలంలో సాధారణంగా అరబ్బులు రెండు అంగ వస్త్రాలు ధరించేవారు. ఒక అంగ వస్త్రాన్ని క్రింద లుంగీలాగా చుట్టుకునేవారు. మరో దుప్పటిని ఒంటిమీద కప్పుకునేవారు. అక్కడక్కడా కొంతమంది చొక్కాలు కూడా ధరించేవారు. కాని చొక్కాల వాడకం చాలా తక్కువగా ఉండేది. అంగవస్త్రాల కంటే చొక్కాయే ఒంటికి ఎక్కువగా ఆచ్ఛాదనాన్ని కల్పించేది, హాయినిచ్చేది. అంచేత దైవప్రవక్త (సల్లం) చొక్కాను అతి ఎక్కువగా యిష్టపడేవారు. ఈ రోజుల్లో కూడా పాశ్చాత్య దుస్తులైన కోట్లు, ప్యాంట్లు, కురచదుస్తులు, నిక్కర్లకన్నా చొక్కా (లాల్చీ) షరాయీలే నయం. అవి శరీర అవయవాలను కప్పి ఉంచుతాయి. శరీరానికి శోభనూ, రక్షణనూ కల్పిస్తాయి.

## 119వ అధ్యాయం

## ١١٩ ـ بَابُ صِفَةِ طُولِ الْقَمِيصِ وَالْكُمِّ وَالْإِزَارِ وَطَرَفِ الْعِمَامَةِ وَتَحرِيم إسْبَالِ شَيْءٍ مِنْ ذٰلِكَ عَلَى سَبِيلِ الْخُيَلَاءِ وَكَرَاهَتِهِ مِنْ غَيْرِ خُيَلَاءَ

## చొక్కా, చొక్కా చేతులు, లుంగీ, తలపాగా కొనలు ఎంత పొడవు ఉండవచ్చనే విషయం, గర్వం కొద్దీ వాటిని వ్రేలాడదీయటం నిషిద్ధం, నిగర్వంగా వ్రేలాడదీయటం అవాంఛనీయం

٧٩٠ ـ عن أسماءَ بنتِ يزيدَ الأنصاريةِ رضي الله عنها قالت: كان كُمُّ قميصِ رسولِ اللهِ ﷺ إلى الرُّسغِ. رواه أبو داود، والترمذي وقال: حديث حسن.

790. హజ్రత్ అస్మా బిన్తె యజీద్ అన్సారియ్యా (రజి.అన్హా) కథనం : దైవ ప్రవక్త (సల్లం) చొక్కా చేతులు మణికట్ల దాకా ఉండేవి. *(అబూ దావూద్, తిర్మిజీ - హసన్)*

*(అబూ దావూద్, తిర్మిజీలలోని వస్త్రధారణ ప్రకరణాలు)*

٧٩١ ـ وعن ابنِ عمرَ رضي الله عنهما أنَّ النبيَّ ﷺ قال: «مَنْ جَرَّ ثَوْبَهُ خُيَلَاءَ لَمْ يَنْظُرِ اللهُ إليهِ يَوْمَ القِيَامَةِ» فقال أبو بكر: يا رسولَ اللهِ! إن إزاري يَسْتَرْخي إلَّا أنْ أتعاهَدَهُ، فقال له رسولُ اللهِ ﷺ: «إنَّكَ لَسْتَ مِمَّنْ يَفْعَلُهُ خُيَلَاءَ». رواه البخاري، وروى مسلم بعضه.

791. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : గర్వాతిశయంతో తన నడుం వస్త్రాన్ని నేలమీద ఈడుస్తూ నడిచేవాణ్ణి దేవుడు ప్రళయదినాన (కారుణ్య) దృష్టితో చూడడు.

ఈ మాట విని అబూబక్ర్ (రజి) స్వయం గురించి తల్లడిల్లుతూ, "దైవప్రవక్తా! నేనెంత జాగ్రత్త వహిస్తున్నా నా నడుంవస్త్రం క్రిందికి జారిపోతుంది" అని విన్నవించుకున్నారు. దానికి దైవప్రవక్త (సల్లం) ఆయనతో, "మీరు గర్వం కొద్దీ ఈడుస్తూ నడిచేవారు కారు" అని

అన్నారు. (బుఖారీ. ఇందులోని కొంత భాగాన్ని ముస్లిం కూడా ఉల్లేఖించారు)

*(సహీహ్ బుఖారీలోని ప్రవక్త సహచరుల మహిమోన్నతుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని వస్త్రధారణ ప్రకరణం)*

٧٩٢ ـ وعن أبي هريرةَ رضي الله عنه أنَّ رسولَ اللهِ ﷺ قال: «لا يَنْظُرُ اللهُ يَوْمَ القِيَامَةِ إلى مَنْ جَرَّ إزَارَهُ بَطَراً» متفق عليه.

792. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : గర్వంతో విర్రవీగుతూ తన ధోవతీని నేలమీద ఈడుస్తూ నడిచే వాడ్ని దేవుడు ప్రళయదినాన కన్నెత్తి (కటాక్ష వీక్షణలతో) చూడడు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని వస్త్రధారణ ప్రకరణం)*

٧٩٣ ـ وعنه عن النَّبيِّ ﷺ قال: «مَا أَسْفَلَ مِنَ الكَعْبَيْنِ مِنَ الإزارِ ففِي النَّارِ» رواه البخاري.

793. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన వేరొక కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : కాలి గిలకలకన్నా క్రిందికి వ్రేలాడే ధోవతీ (లుంగీ, షరాయి) భాగం నరకాగ్నికి ఆహుతి అవుతుంది. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని వస్త్రధారణ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసుని చూస్తే నరకాగ్నికి ఆహుతి అయ్యేవి కేవలం గిలకల క్రింద వ్రేలాడే వస్త్రాలేననిపిస్తోంది. వాస్తవానికి వాటితో పాటు ఆ విధంగా వ్రేలాడదీసే మనుషులు కూడా నరకానికి వెళతారు. అందుకే హజ్రత్ నాఫె (రహ్మాలై) గారిని ఈ హదీసు ఔచిత్యం గురించి అడిగినప్పుడు ఆయన, దానికి సమాధానమిస్తూ, "దుస్తులదేం పాపం?! వాటిని ధరించిన వారి కాళ్ళు నరకాగ్నికి ఆహుతి అవుతాయి" అని చెప్పారు.

٧٩٤ ـ وعن أبي ذرٍّ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «ثلاثةٌ لا يُكَلِّمُهُمُ اللهُ يَوْمَ القِيامَةِ، ولا يَنْظُرُ إلَيْهِم، وَلَا يُزَكِّيهِمْ، وَلَهُمْ عَذَابٌ أَلِيمٌ» قال: فقرأها رسولُ

794. హజ్రత్ అబూ జర్ర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ప్రళయదినాన దేవుడు ముగ్గురు వ్యక్తుల్ని పలకరించడు. వారిని

الله ﷺ ثلاث مِرَارٍ. قال أبو ذرٌّ: خابُوا وخَسِرُوا! مَنْ هُمْ يا رسولَ الله! قال: «المُسْبِلُ، والمنَّانُ، وَالمُنْفِقُ سِلْعَتَهُ بالحَلفِ الكاذِبِ» رواه مسلم. وفي روايةٍ له: «المُسْبِلُ إِزَارَهُ».

(కారుణ్య దృష్టితో) చూడడు. వారిని శుభ్రపరచడు కూడా. పైగా వారికి బాధాకరమైన శిక్ష ఉంటుంది.

దైవప్రవక్త (సల్లం) ఈ మాటలే మూడు సార్లు అన్నారు. అది విని అబూ జర్ (రజి), "అలాంటి వారు ఓటమిని చవి చూస్తారు. నాశనమయిపోతారు. దైవ ప్రవక్తా! అసలు ఎవరు వారు?" అని అడిగారు. దానికాయన "నడుంవస్త్రాన్ని మడమలకన్నా క్రిందికి వ్రేలాడదీసే వాడు, ఉపకారం చేసి దెప్పిపొడిచేవాడు, అబద్ధపు ప్రమాణాలు చేసి తన సరుకును అమ్ముకునేవాడు" అని అన్నారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని విశ్వాసాల ప్రకరణం)*

٧٩٥ ـ وعن ابنِ عمرَ رضي الله عنهما عن النبيِّ ﷺ قال: «الإِسْبَالُ في الإِزارِ، وَالقَميصِ، وَالعِمَامَةِ؛ مَنْ جَرَّ شَيئاً خُيَلاءَ لم يَنظُرِ الله إليهِ يَومَ القِيامَةِ» رواه أبو داود والنسائي بإسنادٍ صحيحٍ.

795. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు : ధోవతీని, చొక్కాను, తలపాగాను ఎక్కువగా వ్రేలాడదీసి ధరిస్తారు (ఇది మహాపాపం). కనుక అహంకారంతో విర్రవీగుతూ వస్త్రాన్ని వ్రేలాడదీసి (ఈడుస్తూ) నడిచేవాడ్ని దేవుడు ప్రళయదినాన కన్నెత్తి కూడా చూడడు. (అబూదావూద్, నసాయి - ప్రామాణికమైన ఆధారాలతో)

*(సుననె అబూ దావూద్‌లోని వస్త్రధారణ ప్రకరణం, సుననె నసాయీలోని అలంకరణల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

లుంగీ, ధోవతీ, పైజామా, షరాయి లాంటి నడుం వస్త్రాలను గిలకల క్రిందికి

వేలాడదీయటం ఘోరపాపమైనట్లే అహంకారం కొద్ది అవసరానికి మించి పొడవైన చొక్కాలు. తలపాగాలు ధరించటం కూడా మహాపాపమేనని పై హదీసు ద్వారా బోధపడుతోంది.

796. హజ్రత్ అబూ జురై జాబిర్ బిన్ సులైమ్ (రజి) కథనం : నేనొక వ్యక్తిని చూశాను. ప్రజలు ఆయన సలహాలను పాటిస్తున్నారు. ఆయన ఏది చెప్తే దాన్ని ఒప్పుకుంటున్నారు. నేను "ఆయన ఎవరు?" అని ప్రజల్ని అడిగాను. "ఆయన దైవప్రవక్త" అని చెప్పారు ప్రజలు.

నేనాయన దగ్గరికి వెళ్ళి, "దైవప్రవక్తా! అలైకస్సలాం" అని రెండుసార్లు అన్నాను. దానికాయన (నా వైపు తిరిగి), "అలైకస్సలాం" అని అనకు. అలైక స్సలాం అనేది చనిపోయిన వారికి చేసే సలాం. దానికి బదులు 'అస్సలాము అలైక' అని చెప్పు అన్నారు. తర్వాత నేను ఆయన్ని "మీరు దైవప్రవక్తా!?" అని అడిగాను. అందుకాయన "(అవును). నేను దేవుని ప్రవక్తను. నీకేదయినా ఆపద వచ్చినప్పుడు నువ్వాయన్ని (దేవుణ్ణి) మొరపెట్టుకుంటే ఆయన నీ ఆపదను దూరం చేస్తాడు. నువ్వు కరువు కాటకా లకు గురై ఆయన్ని ప్రార్థిస్తే ఆయన (ఆ దేవుడు) నీ కోసం భూమి నుండి పంటను పండిస్తాడు. నువ్వు ఏదయినా అడవిలోగాని, ఎడారిలోగాని ఉండి, నీ వాహనం తప్పిపోయినప్పుడు నువ్వా యన్ని సహాయమర్థిస్తే, ఆయన నీ వాహనాన్ని తిరిగి నీ దగ్గరకు చేరు స్తాడు" అని చెప్పారు. అప్పుడు నేనాయన్ని

٧٩٦ - وعن أبي جُرَيٍّ جَابِرِ بنِ سُلَيمٍ رضي الله عنه قال: رَأَيْتُ رَجلاً يَصْدُرُ النَّاسُ عَنْ رَأْيِهِ؛ لا يَقُولُ شَيئاً إلَّا صَدَرُوا عنه؛ قلتُ: من هذا؟ قالوا: رسولُ اللهِ ﷺ. قلتُ: عَليكَ السَّلامُ يا رسولَ الله! - مَرَّتَيْنِ - قال: «لا تَقُلْ عَلَيْكَ السَّلامُ، عَلَيْكَ السَّلامُ تَحِيَّةُ المَوْتَى . قُلْ: السَّلامُ عَلَيْكَ» قال: قلتُ: أنتَ رسولُ الله؟ قال: «أنَا رسولُ اللهِ الذي إذا أَصَابَكَ ضُرٌّ فَدَعَوْتَهُ كَشَفَهُ عَنْكَ، وَإذا أَصَابَكَ عَامُ سَنَةٍ فَدَعَوْتَهُ أَنبَتَهَا لَكَ، وإذا كُنتَ بِأَرْضٍ قَفْرٍ أَوْ فَلاةٍ، فَضَلَّتْ رَاحِلَتُكَ، فَدَعَوْتَه رَدَّهَا عَلَيْكَ»

“నాకు హితోపదేశం చేయండి” అని కోరాను. దానికాయన “ఎవరినీ తిట్ట మాకు” అని చెప్పారు. అప్పట్నుంచి నేను ఏ స్వేచ్ఛాపరుణ్ణిగాని, బానిసను గాని తిట్టలేదు. (ఆఖరికి) ఏ ఒంటెనీ, ఏ మేకనీ పల్లెత్తు మాట అనలేదు.

దైవప్రవక్త (సల్లం) నాకు చేసిన రెండో ఉపదేశం ఇది : “ఏ మంచి పనినీ అల్పంగా భావించకు. నీ సోదరుణ్ణి నగు మోముతో పలకరించటం కూడా మంచి పనే. ఇంకా నీ ధోవతీ (షరాయి, పైజామా)ని సగం పిక్కల వరకు ఎత్తికట్టుకో. కుదరదనుకుంటే కనీసం మడమల వరకైనా తప్పకుండా ఎత్తి ఉంచాలి. జాగ్రత్త సుమా! ధోవతీని మడమలకన్నా క్రిందికి వ్రేలాడదీయకు. ఎందుకంటే అది అహంకారానికి ఆనవాలు. దేవుడు అహంకారాన్ని యిష్టపడడు. ఎవరయినా నిన్ను తిట్టినా లేక తనకు తెలిసిన నీ లోపం గురించి దెప్పిపొడిచినా నువ్వు మాత్రం - అతని లోపం గురించి నీకు తెలిసివున్నా - అతన్ని దెప్పిపొడవకు. అతను తన పాపాన్ని తనే మోస్తాడు. *(అబూదావూద్, తిర్మిజీ - హసన్, సహీహ్)*

قال: قلتُ: اعْهَدْ إليَّ. قال: «لا تَسُبَّنَّ أحَداً» قال: فَمَا سَبَبْتُ بَعْدَهُ حُرّاً، وَلَا عَبداً، وَلَا بَعِيراً، وَلَا شَاةً «وَلا تحقرَنَّ مِنَ المَعرُوفِ شَيْئاً؛ وأَنْ تُكَلِّمَ أَخَاكَ وَأَنْتَ مُنْبَسِطٌ إليهِ وجهُكَ؛ إنَّ ذلكَ مِنَ المَعرُوفِ. وارفَعْ إزَارَكَ إلى نِصْفِ السَّاقِ، فَإن أَبيتَ فَإلى الكَعبَينِ، وإيَّاكَ وإسْبالَ الإزَارِ فَإنَّها مِن المَخِيلَةِ وإنَّ الله لا يُحِبُّ المَخِيلَةَ، وإنِ امْرُؤٌ شَتَمَكَ وَعَيَّرَكَ بمَا يَعْلَمُ فيكَ فَلا تُعَيِّرْهُ بما تَعلَمُ فيهِ، فإنَّمَا وبَالُ ذلكَ عليهِ» رواه أبو داود والترمذي بإسنادٍ صحيحٍ، وقال الترمذي: حديث حسن صحيح.

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం, సుననె తిర్మిజీలోని ఇస్తీజాన్ అధ్యాయం)*

**ముఖ్యాంశాలు**

ధోవతీ, లుంగీ, షరాయి, పైజామా మొదలగు వాటిని సగం పిక్కల వరకు ఎత్తి కట్టుకోవటం ఉత్తమం. ఈ విధమైన వస్త్రధారణలో వినమ్రతా అణకువలు ఉట్టిపడతాయి.

అలాగే గిలకలు బయటికి కనిపించేలా కట్టుకోవడంలోనూ తప్పులేదు. కాని గిలకల క్రిందికి వ్రేలాడదీసి నడుంవస్త్రాన్ని నేలమీద ఈడుస్తూ నడవటం ఘోరమయిన పాపం. దానికి శిక్షగా ప్రజలు నరకాగ్నికి ఆహుతి అవుతారని హెచ్చరించటం జరిగింది.

٧٩٧ - وعن أبي هريرة رضي الله عنه قال: بينما رجل يُصَلِّي مُسْبِلٌ إِزَارَه، قال له رسولُ اللهِ ﷺ: «اذهَبْ فتَوَضَّأْ» فَذَهَبَ فَتَوَضَّأَ، ثم جَاءَ، فقال: «اذهَبْ فَتَوَضَّأْ» فقال له رجُلٌ: يا رسولَ اللهِ! ما لكَ أَمَرْتَهُ أَنْ يَتَوَضَّأَ ثم سَكَتَّ عنه؟ قال: «إنه كانَ يُصَلِّي وهو مُسبِلٌ إِزَارَهُ، وإن الله لا يَقْبَلُ صَلاةَ رَجُلٍ مُسبِلٍ». رواه أبو داودَ بإسنادٍ صحيحٍ على شرط مسلم.

797. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : ఒక వ్యక్తి తన నడుంవస్త్రాన్ని (గిలకల క్రిందికి) వ్రేలాడదీసి నమాజ్ చేస్తుండగా దైవప్రవక్త (సల్లం) అతన్ని చూసి, "వెళ్ళి, వుజూ చేసుకొని రా" అని అతన్ని ఆదేశించారు. అతనెళ్ళి వుజూ చేసుకొని వచ్చాడు. దైవప్రవక్త (సల్లం) మళ్ళీ అతన్ని "వెళ్ళి వుజూ చేసుకొని రా" అని ఆదేశించారు.

అది చూసి ఇంకో వ్యక్తి, "దైవప్రవక్తా! మీరతన్ని వుజూ చేసుకోమని ఆదేశించి (కారణం తెలుపకుండా) మౌనం వహిస్తున్నారేమిటి?" అని సందేహపడుతూ అడిగాడు. దానికాయన, "ఇందాక ఈ వ్యక్తి తన నడుంవస్త్రాన్ని (మడమల క్రిందికి) వ్రేలాడదీసి నమాజ్ చేస్తున్నాడు. ఆ విధంగా నడుంవస్త్రాన్ని వ్రేలాడదీసే వాని నమాజును దేవుడు ఆమోదించడు" అని చెప్పారు.

*(అబూ దావూద్ దీనిని ప్రామాణికమైన ఆధారాలతో ముస్లిం షరతులననుసరించి తన గ్రంథంలో పేర్కొన్నారు).*

*(సుననె అబూ దావూద్‌లోని వస్త్రధారణ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసుని ఆధారంగా చేసుకొని కొంతమంది నడుంవస్త్రాన్ని గిలకలకన్నా క్రిందికి వ్రేలాడదీస్తే వుజూ భంగమవుతుందని వాదించారు. కాని ఈ వాదన సరయినది కాదు. షేఖ్ అల్ బానీ (రహ్మాలై)గారు ఈ హదీసును ప్రామాణికమైనదిగా ఖరారు చేసినవారు అపోహకు

లోనయ్యారని చెప్పారు. ఎందుకంటే ఈ హదీసుకు ముఖ్య ఆధారమయిన అబూ జాఫర్ మదనీ అనే ఉల్లేఖకుని గురించి పూర్తి వివరాలు లభ్యం కాలేదు. అంచేత ఈ హదీసు ప్రామాణికమైనది కాదు. షేఖ్ అల్ బానీ గారు ఈ హదీసుని 'జయీఫ్ అబూ దావూద్' క్రింద పొందుపరచారు.

ఏది ఎలా ఉన్నా నడుంవస్త్రాన్ని గిలకల కన్నా క్రిందికి వ్రేలాడదీసే విషయానికి సంబంధించినంత వరకు, ఇతర ప్రామాణిక హదీసుల్లో దీని గురించి తీవ్రంగా హెచ్చరించటం జరిగింది. ఇది నిషిద్ధమన్న విషయంలో ఎలాంటి సందేహానికీ తావులేదు. అంచేత నమాజులోగాని, బయటగాని ధోవతీ, పైజామా, షరాయి, లుంగీ మొదలగునవి గిలకల కన్నా క్రిందికి వ్రేలాడకుండా జాగ్రత్తపడాలి.

798. హజ్రత్ ఖైస్ బిన్ బిష్ర్ తగ్‌లిబి (రజి) కథనం : మా నాన్నగారు ఇలా తెలిపారు : ఆయన తరచూ అబూదర్దా (రజి)తోపాటు కూర్చొని మాట్లాడు తుండేవారు:

"డెమాస్కస్‌లో సహ్లా బిన్ హంజలియా అనబడే దైవప్రవక్త అనుచరుడు ఒకాయన ఉండేవారు. ఆయన ఎల్లప్పుడూ ఏకాంతాన్ని యిష్టపడేవారు. ఆయన ప్రజలతోపాటు కలిసి కూర్చో వటం చాలా అరుదు. పొద్దస్తమానం ఆయన ధ్యానంతా నమాజ్ మీదే ఉండేది. నమాజ్ ముగిసిన తర్వాత ఇంటికి వెళ్ళేవరకు తస్బీహ్‌లు, తక్బీర్లు పలకటంలోనే నిమగ్నులై ఉండేవారు.

ఒకసారి మేము అబూదర్దా (రజి) దగ్గర కూర్చొని ఉండగా ఆయన మా దగ్గ ర్నుంచి వెళుతున్నారు. అప్పుడు అబూ దర్దా (రజి) ఆయన్ని పిలిచి, "మాకేద యినా విషయం చెప్పండి. దానివల్ల మాకు ప్రయోజనం కలగాలి. అలాగే

٧٩٨ - وعن قَيسِ بنِ بشرِ التَّغلِبيِّ قال: أَخبَرَني أبي - وكان جَليساً لأبي الدَّرْداءِ - قال: كان بِدِمشقَ رَجُلٌ من أَصحابِ النبيِّ ﷺ يقال له: سهلُ بنُ الحَنظَلِيَّة، وكان رجُلاً مُتَوَحِّداً قلَّما يُجالِسُ النَّاسَ، إنَّما هو صَلاةٌ فإذا فَرَغَ فإنَّما هو تَسبيحٌ وتَكبيرٌ حتى يأتيَ أَهْلَهُ، فَمَرَّ بنا ونحنُ عِندَ أبي الدَّرداءِ، فقال له أبو الدَّرداءِ: كَلِمةً تَنفَعُنَا ولا تَضُرُّكَ. قال: بَعَثَ رسولُ اللهِ ﷺ سَرِيَّةً فَقَدِمَتْ، فَجاءَ رَجُلٌ مِنهم فَجَلَسَ في المَجلِسِ الذي يَجلِسُ فيهِ رسولُ اللهِ ﷺ، فقال لِرجُلٍ إلى جَنْبِهِ: لَوْ رَأَيتَنَا حِينَ التَقَيْنَا نحنُ والعَدُوّ، فحَمَلَ فُلانٌ وَطَعَنَ، فقال: خُذْها مِنِّي، وَأنَا الغُلامُ

الغِفَارِيُّ، كَيْفَ تَرَى فِي قَوْلِهِ؟ قال: مَا أُرَاهُ إِلَّا قَدْ بَطَلَ أَجرُهُ. فَسَمِعَ بِذلكَ آخَرُ فقال: مَا أَرَى بِذلكَ بَأْساً، فَتَنَازَعَا حَتى سَمِعَ رسولُ اللهِ ﷺ فقال: «سُبْحَانَ اللهِ؟ لا بَأْسَ أَنْ يُؤْجَرَ ويُحْمَدَ» فَرَأَيْتُ أَبَا الدَّرْدَاءِ سُرَّ بِذلكَ، وَجَعَلَ يَرْفعُ رَأْسَهُ إِليْهِ وَيقُولُ: أَنْتَ سَمِعْتَ ذلكَ مِنْ رسولِ اللهِ ﷺ!؟ فيقول: نعَمْ. فمازَالَ يُعِيدُ عَلَيْهِ حَتى إِنّي لأقولُ لَيَبْرُكَنَّ على رُكبَتَيْهِ. قال: فَمَرَّ بِنَا يوماً آخَرَ، فقال له أبو الدَّرْدَاءِ: كَلِمَةً تَنْفَعُنَا

మీకు నష్టం కూడా జరగకూడదు" అని కోరారు. అప్పుడాయన ఇలా చెప్పారు:

"ఒకసారి దైవప్రవక్త (సల్లం) ఓ సైనిక పటాలాన్ని (జిహాద్ నిమిత్తం) పంపారు. ఆ సైనిక పటాలం తిరిగొచ్చిన తర్వాత వారిలోని ఒకడు దైవప్రవక్త (సల్లం) ఆసీనులై ఉన్న సమావేశంలోకి వచ్చి కూర్చున్నాడు. తర్వాత అతను తన ప్రక్కనున్న మనిషితో ముచ్చటిస్తూ, "మేము, మరియు శత్రువులు పరస్పరం తలపడినప్పుడు (జరిగిన భీకరపోరును) నువ్వు చూస్తే బాగుండేది! మాలోని ఒకడు ఒక శత్రువుని ఈటెతో కొడ్తూ, "అదుగో నా తడాఖా చూడు. నేను గిఫార్ తెగకు చెందిన కుర్రోణ్ణి" అన్నాడు. ఇలా అనటం గురించి మీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు. దానికావ్యక్తి "అతని పుణ్యం వృథా అవుతుందని నా అభిప్రాయం" అని సమాధానమిచ్చాడు. అది విని ఇంకో వ్యక్తి లేచి, "నా అభిప్రాయం ప్రకారం అలా చేయటంలో తప్పులేదు (ఎందుకంటే అతను అహంకారంతో అనలేదు. పైగా శత్రువుని భయపెట్టే ఉద్దేశ్యంతోనే అలా అని ఉంటాడు)" అని చెప్పుకొచ్చాడు. ఆ విధంగా వీరిద్దరి మధ్య మాటా మాటా పెరిగింది. ఇద్దరూ వాదులాడుకో సాగారు. వారి గొడవ విని దైవప్రవక్త (సల్లం) "సుబ్‌హానల్లాహ్! ఆ వ్యక్తికి పుణ్యం దొరికినా, అతణ్ణి ప్రశంసించినా జరిగే నష్టమేమీ లేదు" అని అన్నారు.

ఈ విషయం విని అబూ దర్దా (రజి) సంతోషించటం నేను చూశాను. ఆయన ఇబ్నె హంజలియా వైపు తలెత్తి, "నిజంగానే మీరు దైవప్రవక్త (సల్లం) ఈ మాట చెబుతుండగా విన్నారా?" అని అడిగారు. ఇబ్నె హంజలియా 'అవున' న్నారు. ఆయన మాటిమాటికీ అదే ప్రశ్నవేస్తూ పోయారు. ఆయన్ని చూస్తే (ఇబ్నె హంజలియా పట్ల తనకున్న ప్రేమను వ్యక్తపరచటానికి) ఆయన మోకాళ్ళ మీదే కూర్చుంటారేమోనని పించింది నాకు!

మరో రోజు ఆయన (ఇబ్నె హంజలియా) మా దగ్గర్నుంచి వెళుతున్నారు. అబూదర్దా (రజి) ఆయనతో, "మాకు ఏదయినా విషయం తెలపండి. దానివల్ల మాకు ప్రయోజనం కలగాలి. అలాగని మీక్కూడా నష్టం జరగకూడదు" అన్నారు మళ్ళీ. దానికాయన, "(జిహాద్ కోసం ఉపయోగించే) గుర్రాలపై డబ్బు ఖర్చు పెట్టేవాడు తన చేతిని ముడుచుకో కుండా, ఎల్లప్పుడూ దానం చేయటం కోసం తెరిచిఉంచేవానితో సమానమని దైవప్రవక్త (సల్లం) మాతో చెప్పారు" అని అన్నారు.

ఇంకో రోజు ఆయన మా దగ్గర్నుంచి వెళ్ళారు. అబూ దర్దా (రజి) ఆయనతో, "మాకో విషయం చెప్పండి. దానివల్ల మాకు ప్రయోజనం కలగాలి. అలాగని మీకూ నష్టం జరగకూడదు" అన్నారు.

وَلا تَضُرُّكَ، قال: قال لَنا رسولُ اللهِ ﷺ: «المُنْفِقُ عَلى الخَيْلِ كالبَاسِطِ يَدَه بالصَّدَقَةِ لا يَقْبِضُها». ثم مَرَّ بنا يوماً آخَرَ، فقال له أبو الدَّرْدَاءِ: كَلِمَةً تَنْفَعُنَا وَلا تَضُرُّكَ، قال: قال رسولُ اللهِ ﷺ: «نِعْمَ الرَّجُلُ خُرَيْمٌ الأَسَدِيُّ! لَولا طُولُ جُمَّتِهِ وَإِسْبَالُ إِزَارِه!» فَبَلَغَ خُرَيماً، فَعَجَّلَ، فَأَخَذَ شَفْرَةً فَقَطَعَ بها جُمَّتَهُ إِلى أُذُنَيْهِ، ورَفَعَ إِزَارَهُ إِلى أَنْصَافِ سَاقَيْهِ. ثمَّ مَرَّ بِنَا يَوْماً آخَرَ فقالَ: لَهُ أَبُو الدَّرْدَاءِ: كَلِمَةً تَنْفَعُنَا وَلَا تَضُرُّكَ، قَالَ: سَمِعْتُ رسُولَ اللهِ ﷺ يقُولُ: «إِنَّكُمْ

قَـادِمُـونَ عَلـى إِخْـوَانِكُـمْ، فَـأَصْلِحُـوا رِحَالَكُمْ، وَأَصْلِحُوا لِبَاسَكُمْ حتى تَكُونُوا كَأَنَّكُمْ شَامَةٌ فِي النَّاسِ؛ فَإِنَّ اللهَ لَا يُحِبُّ الفُحْـشَ وَلَا التَّفَحُّـشَ». رواهُ أبـو داود بإسنادٍ حسنٍ، إلَّا قَيْسَ بنَ بشرٍ، فاخْتَلَفُوا في تَوثِيقِهِ وتَضْعِيفِهِ، وقد روى له مسلم.

అప్పుడాయన ఇలా చెప్పారు: ఒకసారి దైవప్రవక్త (సల్లం) ఖురైమ్ అసదీ (రజి) శిరోజాలు పొడుగ్గా, నడుంవస్త్రం గిలకల క్రిందికి వ్రేలాడుతూ ఉండకపోతే, అతను చాలా మంచివాడు అనిపించు కుంటాడని అన్నారు. ఈ విషయం తనకు తెలియగానే ఖురైమ్ ఒక కత్తెర తీసుకొని, దాంతో పెరిగిపోయిన తన శిరోజాల్ని చెవులదాకా కత్తిరించు కున్నారు. అలాగే తన నడుంవస్త్రాన్ని కూడా సగం పిక్కల వరకు ఎత్తికట్టు కున్నారు.

ఇబ్నె హంజలియా మరో రోజు మా సమీపం నుంచి వెళ్ళారు. అప్పుడు కూడా అబూదర్దా (రజి) ఆయనతో, "మాకే దయినా విషయం తెలపండి. దానివల్ల మాకు ప్రయోజనం కలగాలి. అలాగని మీకూ నష్టం జరగకూడదు" అని అన్నారు. ఆ సందర్భంగా ఆయన దైవ ప్రవక్త (సల్లం) తన అనుచరులకు ఈ విధంగా ప్రబోధిస్తుండగా తాను విన్నానని చెప్పారు:

"మీరు మీ సోదరుల దగ్గరికి వెళ్ళ నున్నారు. కనుక మీరు మీ అంబారీలను, దుస్తుల్ని చక్కబెట్టుకోండి. మొహం మీద పుట్టుమచ్చలున్న వ్యక్తి ఎంతమంది గుంపులోనయినా అవలీలగా గుర్తుపట్టగలిగేవిధంగా, అందంగా ఉంటాడు. మీరూ ఆ విధంగా తయారుకావాలి. అప్రయత్నం

గాగానీ, బుద్ధిపూర్వకంగా గాని తమ శరీరాకృతిని వికారంగా మలచుకునే వారిని నిశ్చయంగా దేవుడు యిష్ట పడడు.''

అబూదావూద్ ఈ హదీసును ప్రామాణిక మైన ఆధారాలతో ఉల్లేఖించారు. కాని దీని పరంపరలోని ఒకానొక ఉల్లేఖకుడు ఖైస్ బిన్ బిష్ర్ విశ్వసనీయులా కారా అన్న విషయంలో భిన్నాభిప్రాయాలు వ్యక్తమయ్యాయి. అయితే ఇమామ్ ముస్లిం (రహ్మాలై) ఈయన ఉల్లేఖించిన హదీసుని గ్రహించారన్న విషయం గమనార్హం.

*(సుననె అబూ దావూద్‌లోని వస్త్రధారణ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

1. యుద్ధంలో శత్రువుని భయపెట్టటానికి, అతన్ని మానసికంగా కృంగదీయటానికి మనిషి తన ధైర్యసాహసాల గురించి గొప్పలు చెప్పుకోవటం తప్పుకాదు. పైగా ఉద్దేశ్యం మంచిదవటం వల్ల అందుకు పరలోకంలో పుణ్యం కూడా లభిస్తుంది. ప్రపంచంలో ప్రజల నీరాజనాలు కూడా అందుతాయి.
2. శిరోజాల పొడవును బట్టి వాటిని మూడు రకాలుగా విభజించవచ్చు. భుజాల వరకు పెరిగిన శిరోజాలను 'జుమ్మా' అని, చెవి తమ్మెలకు - భుజాలకు మధ్య వరకు పెరిగిన శిరోజాలను 'లిమ్మా' అని, చెవితమ్మెల దాకా పెరిగిన శిరోజాలను 'వఫ్రా' అని అంటారు. దైవప్రవక్త శిరోజాలు లిమ్మా కంటే చిన్నవిగా వఫ్రా కంటే పొడవుగా ఉండేవి. మొత్తానికి దైవప్రవక్త శిరోజాలు కూడా పొడవుగా ఉండేవి కాని అవి జుమ్మా అంత పొడవుగా ఉండేవి కావు. పైగా అంత పొడవు శిరోజాలను ఆయన అసహ్యించుకునేవారు.
3. ప్రయాణం నుంచి తిరిగిరాగానే ముందు శుభ్రంగా స్నానం చేసి మంచి బట్టలు తొడు క్కోవటం అభిలషణీయం. అంతేగాని ప్రయాణం నుంచి తిరిగొచ్చి అవే మురికి బట్టలతో, మాసిన శరీరంతో ఉండటం మంచిది కాదు. కావాలని చేసినా, పొరపాటున చేసినా ఆ స్థితి అటు అల్లాహ్‌కూ అయిష్టకరం, ఇటు చూసేవారికీ అసహ్యకరం.
4. ఒక వ్యక్తిని చక్కదిద్దే ఉద్దేశ్యంతో అతని పరోక్షంలో అతని బలహీనతలు వెలిబుచ్చటం తప్పు కాదు. దైవప్రవక్త (సల్లం) చేసింది అదే. అది చాడీ క్రిందికి రాదు.

٧٩٩ ـ وعن أبي سعيدٍ الخدْريِّ رضيَ اللهُ عنه قال: قال رسولُ اللهِ ﷺ: «إزرةُ المُسلِمِ إلى نِصْفِ السَّاقِ، وَلَا حَرَجَ ـ أو لا جُنَاحَ ـ فِيمَا بَيْنَهُ وَبَيْنَ الكَعْبَيْنِ، فما كانَ أَسْفَلَ مِنَ الكَعْبَيْنِ فَهُوَ فِي النَّارِ، وَمَنْ جَرَّ إزارَهُ بَطَراً لَمْ يَنْظُرِ اللهُ إليهِ». رواهُ أبو داود بإسنادٍ صحيح.

799. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా తెలియజేశారు: ముస్లిం ధరించే అంగవస్త్రం సగం పిక్కల వరకు మాత్రమే ఉండాలి. పిక్కలకు-గిలకలకు మధ్య ఉన్నా ఫర్వా (లేక తప్పు) లేదు. కాని గిలకలకన్నా క్రిందికి వ్రేలాడే వస్త్రం అగ్నికి ఆహుతి అవుతుంది. ఎవరయితే అహంకారంతో విర్రవీగుతూ తన ధోవతీ (షరాయి, లుంగీ)ని ఈడుస్తూ నడుస్తాడో, అతని వైపు దేవుడు కన్నెత్తి కూడా చూడడు. (అబూ దావూద్ దీనిని ప్రామాణికమైన ఆధారాలతో ఉల్లేఖించారు)

*(సుననె అబూ దావూద్‌లోని వస్త్రధారణ ప్రకరణం)*

٨٠٠ ـ وعن ابنِ عمر رضيَ اللهُ عنهما قال: مَرَرْتُ عَلى رَسُولِ اللهِ ﷺ وَفِي إزَارِي اسْتِرْخَاءٌ، فَقَالَ: «يَا عَبْدَ اللهِ! ارْفَعْ إزَارَكَ» فَرَفَعْتُهُ ثُمَّ قَالَ: «زِدْ»، فَزِدْتُ، فَمَا زِلْتُ أَتَحَرَّاهَا بَعْدُ. فَقَالَ بَعْضُ القَوْمِ: إلى أَيْنَ؟ فَقَالَ: «إلى أَنْصَافِ السَّاقَيْنِ». رواهُ مسلم.

800. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: ఒకసారి నేను దైవప్రవక్త (సల్లం) సమీపం నుండి వెళ్ళాను. ఆ సమయంలో నా నడుంవస్త్రం (గిలకలకన్నా) క్రిందికి వ్రేలాడుతూ ఉంది. అదిచూసి దైవప్రవక్త (సల్లం) "అబ్దుల్లాహ్! నీ నడుంవస్త్రాన్ని పైకెత్తుకో" అన్నారు. నేను దాన్ని పైకెత్తు కున్నాను. ఆయన ఇంకా పైకెత్తమన్నారు. నేను ఇంకాస్త పెకెత్తుకొని కట్టుకున్నాను. ఇక అప్పట్నుంచి దాని విషయంలో నేను జాగ్రత్త వహించేవాణ్ణి.

కొంతమంది ఇబ్నె ఉమర్ (రజి) గారిని అడిగారు, "నడుంవస్త్రం ఎక్కడి వరకు ఉండాలి?" అని. దానికాయన, "సగం పిక్కల వరకు ఉండవచ్చని" చెప్పారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని వస్త్రధారణ ప్రకరణం)*

801. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా అన్నారు : అహంకారంతో విర్ర వీగుతూ తన నడుంవస్త్రాన్ని ఈడుస్తూ నడిచేవాని వైపు దేవుడు ప్రళయదినాన కన్నెత్తి కూడా చూడడు."

అది విని హజ్రత్ ఉమ్మె సలమా (రజి.అన్హా), "మరి స్త్రీలు తమ వస్త్రాలను ఎంతవరకు వదులుకోవచ్చు?" అని సందేహపడగా, దానికి దైవప్రవక్త (సల్లం), "నడిపిక్కల నుండి ఒక జానెడు క్రిందికి వదులుకోవచ్చు" అని అన్నారు. "స్త్రీలు అలా ధరిస్తే, వారి కాళ్ళు నగ్నంగా ఉంటాయి" అన్నారు ఉమ్మె సలమా (రజి.అన్హా). అప్పుడు దైవప్రవక్త (సల్లం) "అయితే ఒక మూరక్రిందికి వదులుకోవాలి. దానికి మించి వదులుకో కూడదు" అని అన్నారు. *(అబూ దావూద్, తిర్మిజీ - హసన్, సహీహ్)*

٨٠١ ـ وعنه قال: قال رسُولُ الله ﷺ: «مَنْ جَرَّ ثَوْبَهُ خُيَلاءَ لَمْ يَنْظُرِ اللهُ إِلَيْهِ يَوْمَ القِيَامَةِ» فقالَتْ أُمُّ سَلَمَةَ: فَكَيْفَ تَصْنَعُ النِّسَاءُ بِذُيُولِهِنَّ، قال: «يُرْخِينَ شِبْراً». قالَتْ: إذاً تَنْكَشِفُ أَقْدَامُهُنَّ. قال: «فَيُرْخِينَهُ ذِراعاً لَا يَزِدْنَ». رواهُ أبو داود والترمذي وقال: حديثٌ حسن صحيح.

*(సుననె అబూ దావూద్, సుననె తిర్మిజీలోని వస్త్రధారణ అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

నడుంవస్త్రం నడిపిక్కల వరకు ఉండాలన్న నియమం కేవలం పురుషులకు మాత్రమే. స్త్రీ పిక్కలు సతర్ (మర్మావయవాల) క్రిందికి వస్తాయి. వాటిని కప్పి ఉంచటం అవసరం. కనుక స్త్రీలు తమ అంగవస్త్రం దానికన్నా ఒక మూర క్రిందికి ఉండేవిధంగా కట్టుకోవాలి. పాదాలు సయితం మునిగిపోయేలా దుస్తులు ధరించినా ఫర్వాలేదు.

**120వ అధ్యాయం**

## ١٢٠ - بابُ اسْتِحْبَابِ تَرْكِ التَّرَفُّعِ فِي اللِّبَاسِ تَوَاضُعاً

## అణకువకొద్దీ ఖరీదైన దుస్తుల్ని ధరించకుండా ఉండటం అభిలషణీయం

قَدْ سَبَقَ فِي بَابِ فضلِ الجُوعِ وَخُشُونَةِ العَيْشِ جُمَلٌ تَتَعلَّقُ بِهذا البَابِ.

٨٠٢ - وعن معاذِ بنِ أنسٍ رضيَ اللهُ عنه أنَّ رسُولَ اللهِ ﷺ قال: «مَنْ تَرَكَ اللِّبَاسَ تَوَاضُعاً للهِ، وَهُوَ يَقْدِرُ عَلَيْهِ، دَعَاهُ اللهُ يَوْمَ القِيَامَةِ عَلى رُؤُوسِ الخَلائِقِ حَتَّى يُخَيِّرَهُ مِنْ أَيِّ حُلَلِ الإِيمانِ شَاءَ يَلْبَسُهَا». رواهُ الترمذي وقال: حديث حسن.

802. హజ్రత్ ముఆజ్ బిన్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఖరీదైన దుస్తులు ధరించే స్తోమత ఉన్నప్పటికీ అల్లాహ్ ప్రసన్నత కోసం వాటిని ధరించకుండా ఉండేవాణ్ణి ప్రళయదినాన దేవుడు సృష్టిరాశులందరి ముందుకు పిలిచి విశ్వాసపు దుస్తుల్లో తనకిష్టమైన దుస్తుల్ని ఎంపిక చేసుకునే అధికారాన్ని ప్రసాదిస్తాడు. *(తిర్మిజీ - హసన్)*

*(సుననె తిర్మిజీలోని ప్రళయవర్ణన ప్రకరణం)*

## 121వ అధ్యాయం

## ١٢١ ـ بَابُ اسْتِحْبَابِ التَّوَسطِ فِي اللِّبَاسِ وَلاَ يَقْتَصِرُ عَلَى مَا يُزْرِي بِهِ لِغَيْرِ حَاجَةٍ وَلاَ مَقْصُودٍ شَرْعِي

## వస్త్రధారణలో మధ్యేమార్గాన్ని అవలంబించటం అభిలషణీయం, అనవసరంగా వ్యక్తిత్వ న్యూనతకు దారితీసే నీచమైన వస్త్రాల్ని ధరించటం అవాంఛనీయం

٨٠٣ ـ عن عمرو بن شُعَيْب عَنْ أَبِيهِ عَنْ جَدِّهِ رضيَ اللهُ عنه قال: قالَ رسُولُ اللهِ ﷺ: «إنَّ اللهَ يُحِبُّ أَنْ يَرى أَثَرَ نِعْمَتِهِ عَلى عَبْدِهِ». رواهُ الترمذي وقال: حديثٌ حسن.

803. హజ్రత్ అమ్ర్ బిన్ షుఐబ్ తన తండ్రి నుండి, ఆయన తన తాతగారి నుండి చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : దేవుడు తన దాసులమీద తన అనుగ్రహాల ప్రభావం కనబడాలని కోరుకుంటాడు. (తిర్మిజీ - హసన్)

*(సుననె తిర్మిజీలోని సంస్కార అధ్యాయం)*

### ముఖ్యాంశాలు

దైవప్రసన్నతా దృష్టితో నిరాడంబరమైన వస్త్రాలు ధరించటం అభిలషణీయమైనట్లే, దేవుని వరాలను, అనుగ్రహాలను బహిర్గతం చేసే ఉద్దేశ్యంతో మంచి వస్త్రాలు ధరించటం, దానధర్మాలు చేయటంలో ఒకర్నొకరు మించిపోవటానికి ప్రయత్నించటం, అవసరార్థులను ఆదుకోవటం, బంధుమిత్రులతో ఉత్తమంగా వ్యవహరించటం కూడా అభిలషణీయమైన ఆచరణలే.

**122వ అధ్యాయం**

# ١٢٢ - بَابُ تَحْرِيمِ لِبَاسِ الْحَرِيرِ عَلَى الرِّجَالِ وَتَحْرِيمِ جُلُوسِهِمْ عَلَيْهِ وَاسْتِنَادِهِمْ إِلَيْهِ وَجَوَازِ لُبْسِهِ لِلنِّسَاءِ

# పట్టువస్త్రాలు ధరించటం పురుషులకు నిషిద్ధం, వాటి మీద కూర్చోవటం, దిండుగా చేసుకోవటం కూడా నిషిద్ధం, అయితే పట్టు వస్త్రాలు ధరించటం స్త్రీలకు సమ్మతమే

٨٠٤ - عن عمرَ بنِ الخطَّابِ رضيَ اللهُ عنه قال: قالَ رسُولُ اللهِ ﷺ: «لَا تَلْبَسُوا الحَرِيرَ؛ فَإِنَّ مَنْ لَبِسَهُ فِي الدُّنْيَا لَمْ يَلْبَسْهُ فِي الآخِرَةِ» متفقٌ عليه.

804. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : పట్టు వస్త్రాలు ధరించ కండి. వాటిని ఇహలోకంలో ధరించిన వారు పరలోకంలో ధరించలేరు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని వస్త్రధారణ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

పై హదీసులోని వారింపు ముస్లిం పురుషులకు మాత్రమే. స్త్రీలు పట్టువస్త్రాలు ధరించవచ్చు. పురుషులు పట్టువస్త్రాలు ధరించకూడదనటానికి ఎన్నో కారణాలు ఉన్నాయి. పట్టువస్త్రాలు కేవలం అలంకారప్రాయమైనవి. అది స్త్రీల ప్రత్యేక లక్షణం. అదీగాక పట్టువస్త్రాలు పురుషుల్లో సహజంగా ఉండే ధైర్యం, సాహసం, మొరటుతనం లాంటి పురుషలక్షణాలను ప్రభావితం చేయటమే గాకుండా వారిలో సౌకుమార్యాన్ని పెంపొందింపజేస్తాయి. పట్టువస్త్రాలు ధరించేవారిలో సహజంగానే గర్వం పుడుతుంది. ఇస్లాం దాన్ని సుతరామూ సహించదు. పురుషులకు పట్టు వస్త్రాలు అనుమతించకపోవటానికి ఇంకో ముఖ్య కారణం ఏమిటంటే, ఈ వస్త్రధారణ ఇస్లాం ధర్మం మానవునిలో తీసుకురాదలచిన నిరాడంబరతకు విరుద్ధం. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : నిరాడంబరత ఇస్లాంలో అంతర్భాగం (ఇమామ్ అహ్మద్, ఇబ్నె మాజా, హాకిమ్ తదితరులు ఈ హదీసును వెలికితీశారు). పై కారణాల వల్ల పురుషులు పట్టువస్త్రాలు ధరించటానికి అనుమతించబడలేదు.

805. హజ్రత్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: ఎలాంటి (ప్రతిఫల) భాగ్యానికి నోచుకోనివాడే పట్టువస్త్రాలు ధరిస్తాడు.
*(బుఖారీ - ముస్లిం)*

బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో "పర లోకంలో ఎలాంటి (ప్రతిఫల) భాగ్యానికి నోచుకోనివాడు" అని ఉంది.

٨٠٥ ـ وعنه قال: سَمِعْتُ رسُولَ اللهِ ﷺ يقولُ: «إِنَّمَا يَلْبَسُ الحَرِيرَ مَنْ لَا خَلَاقَ لَهُ» متفقٌ عليه. وفي روايةٍ لِلْبُخاري: «مَنْ لَا خَلَاقَ لَهُ فِي الآخِرَةِ». قولُه: «مَنْ لَا خَلَاقَ لَهُ»، أَيْ: لَا نَصِيبَ لَهُ.

*(సహీహ్ బుఖారీ - సహీహ్ ముస్లింలలోని వస్త్రధారణల ప్రకరణం)*

806. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ఇహలోకంలో పట్టుబట్టలు ధరించినవాడు పరలోకంలో వాటిని ధరించలేడు. *(బుఖారీ - ముస్లిం)*

٨٠٦ ـ وعن أنسٍ رضيَ اللهُ عنه قال: قالَ رسُولُ اللهِ ﷺ: «مَنْ لَبِسَ الحَرِيرَ فِي الدُّنْيَا لَمْ يَلْبَسْهُ فِي الآخِرَةِ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని వస్త్రధారణ ప్రకరణం)*

807. హజ్రత్ అలీ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) పట్టు (వస్త్రాన్ని) పట్టుకుంటుండగా నేను చూశాను. ఆయన దాన్ని కుడిచేతిలోకి తీసుకున్నారు. ఆ తర్వాత బంగారాన్ని ఎడమచేతిలోకి తీసుకొని ఇలా అన్నారు: ఈ రెండూ నా అనుచర సమాజంలోని పురుషులకొరకు నిషేధించబడినవి. (అబూదావూద్ దీనిని ప్రామాణికమైన ఆధారాలతో ఉల్లేఖించారు).

٨٠٧ ـ وعن عليٍّ رضيَ اللهُ عنه قال: رَأَيْتُ رسُولَ اللهِ ﷺ أَخَذَ حَرِيراً، فَجَعَلَهُ فِي يَمِينِهِ، وَذَهَباً فَجَعَلَهُ فِي شِمَالِهِ، ثُمَّ قال: «إِنَّ هٰذَيْنِ حَرَامٌ عَلَى ذُكُورِ أُمَّتِي». رواهُ أبو داود بإسنادٍ حسنٍ.

*(సుననె అబూ దావూద్‌లోని వస్త్రధారణ ప్రకరణం)*

٨٠٨ ـ وعن أبي مُوسى الأشْعَريِّ رضيَ اللهُ عنه أنَّ رسُولَ الله ﷺ قال: «حُرِّمَ لِبَاسُ الحَرِيرِ وَالذَّهَبِ عَلى ذُكُورِ أُمَّتِي، وَأُحِلَّ لإنَاثِهِمْ». رواهُ الترمذي وقال: حديثٌ حسن صحيحٌ.

808. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : పట్టు వస్త్రాలు, బంగారం నా అనుచర సమాజంలోని పురుషులకు నిషేధించబడ్డాయి. స్త్రీలకు సమ్మతించబడ్డాయి. (తిర్మిజీ - హసన్, సహీహ్)

*(సునన్ తిర్మిజీలోని వస్త్రధారణ ప్రకరణం)*

٨٠٩ ـ وعن حُذَيْفَةَ رَضيَ اللهُ عنه قال: نَهَانَا النَّبيُّ ﷺ أنْ نَشْرَبَ في آنِيَةِ الذَّهَبِ وَالفِضَّةِ وَأنْ نَأكُلَ فِيهَا، وعَنْ لُبْسِ الحَرِيرِ وَالدِّيبَاجِ، وَأنْ نَجْلِسَ عَلَيْهِ. رواهُ البخاري.

809. హజ్రత్ హుజైఫా (రజి) కథనం : బంగారు, వెండి పాత్రల్లో త్రాగకూడదనీ, తినకూడదనీ, పట్టువస్త్రాలు ధరించకూడదనీ, వాటిమీద కూర్చోకూడదనీ దైవప్రవక్త (సల్లం) మమ్మల్ని వారించారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని వస్త్రధారణ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పట్టు వస్త్రాల్లో అనేక రకాలున్నై. పల్చటి పట్టువస్త్రాల్ని 'ఇస్తబ్రక్' అని అంటారు. ముతక పట్టువస్త్రాల్ని 'దీబాజ్' అంటారు. అసలు పట్టు వస్త్రాలంటే సహజంగా పట్టుపురుగుల నుండి తయారుచేయబడినవే. కాని ఈ రోజుల్లో పట్టులాంటి వస్త్రాలు కూడా మార్కెట్‌లోకి వచ్చాయి. చూడటానికి అవి కూడా పట్టువస్త్రాల మాదిరిగానే కనిపిస్తాయి కాని వాస్తవానికి అవి పట్టువి అయివుండవు. అలాంటి కృత్రిమ వస్త్రాలు ధరించటం పురుషులకు నిషిద్ధం కాదు. కాని ఏదయినా ప్రాంతంలో ప్రత్యేకంగా స్త్రీలే అలాంటి బట్టలు ధరిస్తున్నట్లయితే ఆ ప్రాంతంలో పురుషులు కృత్రిమ వస్త్రాలు కూడా ధరించకుండా ఉండటం మంచిది.

అదేవిధంగా పట్టువస్త్రాల మీద కూర్చోవద్దని కూడా దైవప్రవక్త (సల్లం) వారించారు. అంచేత పట్టువస్త్రాలను దుప్పట్లుగా వాడటం, పరుపులకు, దిండ్లకు ఉపయోగించటం కూడా ధర్మసమ్మతం కాదు.

## 123వ అధ్యాయం

# ١٢٣ ـ بَابُ جَوَازِ لُبْسِ الْحَرِيرِ لِمَنْ بِهِ حِكَّةٌ

# గజ్జి, దురద ఉన్నవారు పట్టు బట్టలు ధరించవచ్చు

٨١٠ ـ عن أنسٍ رضيَ اللهُ عنه قال: رَخَّصَ رسُولُ اللهِ ﷺ، للزُّبَيْرِ وَعَبْدِ الرَّحْمٰنِ بن عَوْفٍ رضيَ الله عنهما في لُبْسِ الحَرِيرِ لِحِكَّةٍ بِهِمَا. متفقٌ عليه.

810. హజ్రత్ అనస్ (రజి) కథనం : హజ్రత్ జుబైర్ (రజి) మరియు హజ్రత్ అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (రజి)లకు గజ్జి ఉండటం వల్ల దైవప్రవక్త (సల్లం) వారి రువురికీ పట్టు బట్టలు ధరించటానికి అనుమతినిచ్చారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని వస్త్రధారణ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

అత్యవసర పరిస్థితుల్లో పట్టువస్త్రాలు ధరించేందుకు పురుషులకు కూడా అనుమతి ఉందని పై హదీసు ద్వారా బోధపడుతోంది. ఉదా : గజ్జి ఉన్నప్పుడు. అలాగే మరే రోగానికయినా అవసరమని భావిస్తే పట్టువస్త్రాలు ధరించవచ్చు. అదేవిధంగా విపరీతమైన ఎండకు, చలికి తట్టుకోవటానికి తమ దగ్గర పట్టువస్త్రాలు తప్ప మరేమీ లేనప్పుడు కూడా వాటిని ఉపయోగించుకోవచ్చు.

124వ అధ్యాయం

# ١٢٤ ـ بَابُ النَّهْيِ عَنِ افْتِرَاشِ جُلُودِ النُّمُورِ وَالرُّكُوبِ عَلَيْهَا

# చిరుత తోలుమీద కూర్చోరాదు, దాన్ని వాహనంమీద ఆసనంగా కూడా ఉపయోగించరాదు

٨١١ ـ عن مُعَاوِيَةَ رضيَ اللهُ عنه قالَ: قال رسُولُ اللهِ ﷺ: «لا تَرْكَبُوا الخَزَّ وَلَا النِّمَارَ». حديث حسن، رواهُ أبو داود وغيره بإسنادٍ حسنٍ.

811. హజ్రత్ ముఆవియా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీ వాహన ఆసనాల మీద పట్టువస్త్రాలు, చిరుత తోళ్లు ఉపయోగించకండి. (అబూ దావూద్, తదితరులు దీనిని ప్రామాణికమైన ఆధారాలతో ఉల్లేఖించారు).

*(సుననె అబూ దావూద్‌లోని వస్త్రధారణ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో 'ఖజ్' అనే పదం వాడబడింది. ఖజ్ అంటే ఉన్ని మరియు పట్టు కలిపి తయారు చేయబడిన వస్త్రమని కొందరు పండితులు అంటున్నారు. ఇలా అనేవారు ఖజ్ అనే వస్త్రాన్ని వాడుకోవటం ధర్మసమ్మతమేనని చెబుతారు. వీరి అభిప్రాయం ప్రకారం ఆ కాలంలో ముస్లిమేతర శ్రీమంతులు, పరలోక విస్మయకారులు తమ దర్పాన్ని ప్రదర్శించటానికి అలాంటి వస్త్రాలే ధరించేవారు. అలాంటి సమయంలో ముస్లింలు వారిని అనుకరించకుండా ఉండాలన్నదే ఈ వారింపు ఉద్దేశ్యం. పై హదీసుని ఈ అర్థంలో తీసుకుంటే, ఖజ్ వస్త్రాలు ధరించటం అవాంఛనీయమైనవిగా మాత్రమే పరిగణించబడుతుంది. కాని ఒకవేళ ఖజ్‌ను అసలైన పట్టువస్త్రమనుకుంటే, అలాంటప్పుడు ఖజ్ వస్త్రాలు ధరించటం నిషిద్ధంగా పరిగణించ బడుతుంది. చాలా మంది పండితులు ఖజ్ అంటే స్వచ్ఛమైన పట్టు అనే భావిస్తున్నారు.

ఏది ఏమైనా పట్టుతో నేయబడిన జీను ఉపయోగించటం, పట్టు అంబారీల మీద కూర్చోవటం ధర్మసమ్మతం కాదని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. అదేవిధంగా చిరుతపులి **తోలుతో** చేయబడిన జాకెట్లు, ఇతర వస్త్రాలు ధరించటం కూడా ధర్మసమ్మతం కాదు.

812. హజ్రత్ అబుల్ మలీహ్ తన తండ్రి నుండి చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) క్రూర మృగాల తోళ్ళను ఉపయోగించ రాదని వారించారు.

(అబూ దావూద్, తిర్మిజీ, నసాయీలు దీనిని ప్రామాణికమైన ఆధారాలతో ఉల్లేఖించారు).

తిర్మిజీలోని వేరొక ఉల్లేఖనంలో, "క్రూర మృగాల తోళ్ళపై కూర్చోవద్దని వారించారు" అని ఉంది.

٨١٢ ـ وعن أبي المَلِيح عن أبيه، رضيَ اللهُ عنه، أنَّ رسُولَ اللهِ ﷺ نَهَى عَنْ جُلُودِ السِّبَاعِ. رواهُ أبو داود، والترمذيُّ، والنسائيُّ بأسَانيدَ صحاحٍ. وفي روايةِ الترمذي: نَهَى عَنْ جُلُودِ السِّبَاعِ أَنْ تُفْتَرَشَ.

## ముఖ్యాంశాలు

ఈ హదీసు భావం ఇంతకు ముందు వివరించబడిన హదీసు భావం కన్నా విస్తృతంగా ఉంది. ఇందులో అన్నిరకాల క్రూరమృగాల తోళ్ళ వాడకాన్ని, వాటితో ప్రయోజనం పొందటాన్ని నిషేధించటం జరిగింది. క్రూరమృగాల తోళ్ళను ఎంత పరిశుభ్రం చేసినా వాటి వెండ్రుకలు అశుద్ధంగానే ఉంటాయనీ, అందుకే వాటి వాడకం నిషేధించబడిందనీ కొంతమంది పండితులు అభిప్రాయపడ్డారు. మరికొంతమంది ఈ నిషేధం పరిశుభ్రం చేయబడని తోళ్ళకు సంబంధించినదని అన్నారు. ఇంకొంతమంది పండితులు ఈ హదీసు గురించి వ్యాఖ్యానిస్తూ, "గర్విష్టులు, అహంకారులు క్రూర మృగాల తోళ్ళతో చేయబడిన బట్టలు ధరిస్తారు. కనుక ముస్లింలను వారిని అనుకరించకుండా ఉంచాలన్నదే ఈ నిషేధం ఉద్దేశ్యం" అని అభిప్రాయపడ్డారు.

ఈ సందర్భంగా అల్లామా షౌకానీ (రహ్మలై) చెప్పిన మాటలు గమనార్హమైనవి. ఆయన ఇలా అన్నారు :

"ఈ హదీసులోని వారింపు విస్తృతార్థంలో ఉంది. అంటే క్రూరమృగాల తోళ్ళు - అవి పరిశుభ్రం చేయబడినవయినా, చేయబడనివయినా వాటి వాడకం నిషిద్ధం. ఈ హదీసు "పరిశుభ్రం చేస్తే ఏ చర్మమయినా పరిశుభ్రమయిపోతుంది" అన్న హదీసు పరిధిలోకి రాదు. ఇందులోని నిషేధాజ్ఞే ఓ ప్రత్యేకమైన ఆదేశం. కనుక క్రూరమృగాల చర్మాలు ఎట్టి పరిస్థితుల్లోనయినా అశుద్ధంగానే ఉంటాయి. వాటిని ఉపయోగించటం ధర్మసమ్మతం కాదు.

## 125వ అధ్యాయం

## ١٢٥ ـ بَابُ مَا يَقُولُ إِذَا لَبِسَ ثَوْباً جَدِيداً أَوْ نَعْلاً أَوْ نَحْوَهُ

## కొత్త బట్టలు, కొత్త చెప్పులు మొదలగునవి తొడుక్కున్నప్పుడు ఏమని పలకాలి?

٨١٣ ـ عن أبي سعيد الخُدْرِيِّ رضيَ الله عنه قال: كانَ رسُولُ الله ﷺ إذَا اسْتَجَدَّ ثَوْباً سَمَّاهُ بِاسْمِهِ ـ عِمَامَةً، أَوْ قَمِيصاً، أَوْ رِدَاءً ـ يَقُولُ: «اللَّهُمَّ لَكَ الحَمْدُ أَنْتَ كَسَوْتَنِيهِ، أَسْأَلُكَ خَيْرَهُ وَخَيْرَ مَا صُنِعَ لَهُ، وَأَعُوذُ بِكَ مِنْ شَرِّهِ وَشَرِّ مَا صُنِعَ لَهُ». رواهُ أبو داود والترمذي وقال: حديث حسن.

813. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) క్రొత్త బట్టలు ధరించినప్పుడు - తలపాగాగాని, చొక్కాగాని, దుప్పటిగాని - అది ఏదయినా సరే దాని పేరు తీసుకొని ఈ విధంగా ప్రార్థించేవారు :

అల్లాహుమ్మ లకల్‌హమ్దు అంత కసౌతనీహి, అస్‌అలుక ఖైరహూ. వ ఖైర మా సునిఅ లహూ, వ అవూజు బిక మిన్ షర్రిహీ వ షర్రి మా సునిఅ లహూ."

"దేవా! స్తోత్రాలన్నీ నీకే చెల్లుతాయి. నీవే నాకు ఈ వస్త్రాన్ని తొడిగించావు. నాకు దీని ప్రయోజనాన్ని, దేనికోసం ఇది తయారు చేయబడిందో దాని ప్రయోజనాన్ని ప్రసాదించమని కోరుకుంటున్నాను. ఇంకా దీని కీడు నుండి, దేని కోసం ఇది తయారుచేయబడిందో దాని కీడు నుండి నీ శరణు వేడుతున్నాను."

*(అబూ దావూద్, తిర్మిజీ -హసన్)*

*(సుననె అబూ దావూద్‌లోని వస్త్రధారణ ప్రకరణం, సుననె తిర్మిజీలోని వస్త్రధారణ అధ్యాయాలు)*

**126వ అధ్యాయం**

## ١٢٦ - بَابُ اسْتِحْبَابِ الابْتِدَاءِ بِالْيَمِينِ فِي اللِّبَاسِ

## దుస్తులు ధరించేటప్పుడు కుడివైపు నుండి ఆరంభించాలి

هذا الباب قد تقدم مقصوده وذكرنا الأحاديث الصحيحة فيه.

ఈ అధ్యాయానికి సంబంధించిన అనేక ప్రామాణికమైన హదీసుల్ని ఇంతకు ముందే పేర్కొన్నాం.



# ٤ ـ كِتَابُ آدَابِ النَّوْمِ وَالإِضْطِجَاعِ وَالْقُعُوْدِ وَالْمَجْلِسِ وَالْجَلِيْسِ وَالرُّؤْيَا

# నాల్గవ ప్రకరణం

# నిద్రపోవటం, పడుకోవటం, కూర్చోవటం, సమావేశం, ఇతరులతోపాటు కలిసి కూర్చోవటం స్వప్నాలకు సంబంధించిన ఆదేశాలు

**127వ అధ్యాయం**

## ١٤٧ ـ بَابُ مَا يَقُوْلُهُ عِنْدَ النَّوْمِ

## నిద్రపోయేటప్పుడు చేయవలసిన ప్రార్థనలు

٨١٤ ـ عن البَراءِ بن عازبٍ رضي الله عنهما قال: كَانَ رسولُ اللهِ ﷺ إذا أوَى إلى فِرَاشِهِ نَامَ عَلَى شِقِّهِ الأيْمَنِ، ثُمَّ قال: «اللَّهُمَّ! أَسْلَمْتُ نَفْسِي إلَيْكَ، وَوَجَّهْتُ وَجْهِي إلَيْكَ، وَفَوَّضْتُ أَمْرِي إلَيْكَ، وَأَلْجَأْتُ ظَهْرِي إلَيْكَ، رَغْبَةً وَرَهْبَةً إلَيْكَ، لَا مَلْجَأَ وَلا مَنْجَى مِنْكَ إلَّا إلَيْكَ،

814. హజ్రత్ బరా ఇబ్నె ఆజిబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) పడక మీద మేను వాల్చినప్పుడు కుడివైపు తిరిగిపడుకొని ఈ విధంగా ప్రార్థించే వారు:

“అల్లాహుమ్మ అస్లమ్‌తు నఫ్సీ ఇలైక, వ వజ్జహ్‌తు వజ్‌హీ ఇలైక, వ ఫవ్వజ్‌తు అమ్రీ ఇలైక, వ అల్‌జాతు జహ్‌రీ ఇలైక రగ్‌బతన్ వ రహ్‌మతన్ ఇలైక, లా మల్జఅ వలా మన్‌జా మిన్‌క ఇల్లా ఇలైక ఆమన్‌తు బికితాబికల్లజీ అన్‌జల్‌త వ నబియ్యికల్లజీ అర్‌సల్‌త.”

(దేవా! నేను నా స్వయాన్ని నీకు సమర్పించుకుంటున్నాను. నా ముఖాన్ని నీ వైపుకు తిప్పుకున్నాను. నా వ్యవహా

آمَنْتُ بِكِتَابِكَ الَّذِي أَنْزَلْتَ، وَنَبِيِّكَ الَّذِي أَرْسَلْتَ». رواه البخاري بهذا اللفظ في كتاب الأدب من صحيحه.

రాలన్నీ నీకు అప్పగించాను. నిన్ను కోరుకుంటూ, నీ ఆగ్రహానికి భయపడుతూ నీ శరణుజొచ్చాను. నీవు ఆశ్రయమిస్తే తప్ప మరెక్కడా ఆశ్రయం లేదు. నీవు రక్షణ కల్పిస్తే తప్ప రక్షణ పొందటానికి మరో చోటులేదు. నేను నీవు అవతరింపజేసిన గ్రంథాన్ని విశ్వసించాను. నీవు పంపిన ప్రవక్తను నమ్మాను).

(ఇమామ్ బుఖారీ (రహ్మాలై) ఈ హదీసును ఈ వాక్యాలతో తన సహీహ్ గ్రంథంలోని సంస్కార ప్రకరణంలో పేర్కొన్నారు).

*(సహీహ్ బుఖారీలోని ప్రార్థనల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రతి రోజు రాత్రి పడుకోబోయేముందు తమ విశ్వాసాన్ని, తమ ఇస్లాం ధర్మాన్ని, తాము అల్లాహ్‌తో చేసిన వాగ్దానాన్ని గురించి ఆత్మపరిశీలన చేసుకుంటూ ఉండాలని ఈ హదీసులో బోధించబడింది. ప్రతి ముస్లిం ఈ విధంగా రాత్రి పూట ఆత్మపరిశీలన చేసుకుంటూ ఉంటే పగటిపూట పనివేళల్లో కూడా అతనికి దైవాదేశాలు తప్పకుండా గుర్తుంటాయి. దీనిగురించి మరిన్ని వివరాల కొరకు 7వ అధ్యాయంలోని 80వ హదీసు చూడండి.

٨١٥ ـ وعنه قال: قال لِي رسولُ اللهِ ﷺ: «إذا أَتَيْتَ مَضْجَعَكَ فَتَوَضَّأْ وُضُوءَكَ للصَّلاةِ، ثُمَّ اضْطَجِعْ عَلى شِقِّكَ الأيمَنِ، وَقُلْ..» وَذَكَرَ نَحْوَهُ، وفيه: «وَاجْعَلْهُنَّ آخِرَ مَا تَقُولُ» متفق عليه.

815. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) గారే చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) నాకు ఇలా ఉపదేశించారు:

“నువ్వు పడకమీదకు వెళ్ళదలచుకున్నప్పుడు నమాజ్ కోసం వుజూ చేసుకునే విధంగా వుజూ చేసుకో. ఆ తర్వాత కుడి వైపుకు తిరిగి పడుకొని ఈ విధంగా ప్రార్థించు... (ఇంతకు ముందు హదీసులో పేర్కొన్న ప్రార్థన).

ఈ హదీసులో ఈ వాక్యం అదనంగా ఉంది: ఈ ప్రార్థనా వాక్యాలు నీ తుది పలుకులు కావాలి (అంటే. ఈ ప్రార్థన తరువాత నీ నోటి నుంచి ఎలాంటి ప్రాపంచిక విషయాలూ వెలువడరాదు).

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వుజూ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని దైవధ్యాన ప్రకరణం)*

816. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) రాత్రిపూట పదకొండు రకాతుల (తహజ్జుద్) నమాజ్ చేసేవారు. ఉషోదయం కాగానే సంక్షిప్తంగా రెండు రకాతుల నమాజ్ చేసేవారు. ఆ తర్వాత కుడి వైపుకు తిరిగి పడుకునేవారు. ఆఖరికి ముఅజ్జిన్ వచ్చి ఫజ్ర్ నమాజ్‌కు వేళ అయిందని ఆయనకు తెలియపరిచేవాడు.

*(బుఖారీ - ముస్లిం)*

٨١٦ - وعن عائشةَ رضيَ الله عنها قالت: كَانَ النَّبيُّ ﷺ يُصَلِّي مِنَ اللَّيْلِ إِحْدَى عَشَرَةَ رَكْعَةً، فَإِذَا طَلَعَ الْفَجْرُ صَلَّى رَكْعَتَيْنِ خَفِيفَتَيْنِ، ثُمَّ اضْطَجَعَ عَلَى شِقِّهِ الأَيْمَنِ حَتَّى يَجِيءَ الْمُؤَذِّنُ فَيُؤْذِنَهُ. متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని ప్రార్థనల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో దైవప్రవక్త (సల్లం) రాత్రిపూట చేసే (ఖియాముల్లైల్ లేక తహజ్జుద్) నమాజు గురించి వివరించబడింది. విత్ర్‌తో కలిపి ఆ నమాజు మొత్తం పదకొండు రకాతులతో కూడి ఉండేదని ఆయనగారి సతీమణి హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) తెలిపారు. ఈ ఉల్లేఖనం సహీహ్ బుఖారీ గ్రంథంలో ఉంది. దాని ప్రకారం ఆయన రమజాన్ మాసంలోనయినా, ఇతర మాసాల్లోనయినా రాత్రిపూట చేసే నమాజు పదకొండు రకాతుల కంటే ఎక్కువ చేయలేదు. ఎనిమిది రకాతులు ఖియాముల్లైల్ (దీనినే రమజానేతర మాసాల్లో తరావీహ్ అంటారు) మరియు మూడు రకాతులు విత్ర్. మొత్తం కలిపి పదకొండు రకాతులు.

ఫజ్ర్‌పూట రెండు రకాతుల సున్నత్ నమాజ్ చేసి కుడి ప్రక్కకు తిరిగి కాసేపు పడుకోవటం సున్నత్ అని కూడా పై హదీసు ద్వారా బోధపడుతోంది.

817. హ|జత్ హుజైఫా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) రాత్రిపూట తన పడకమీదకు చేరుకున్నాక తన (కుడి) చెంపక్రింద చెయ్యి పెట్టుకొని, "అల్లా హుమ్మ బిస్మిక అమూతు వ అహ్యా" (దేవా! నేను నీ పేరుతోనే మరణిస్తున్నాను. తిరిగి నీ పేరుతోనే బ్రతుకుతాను) అని ప్రార్థించేవారు. తర్వాత నిద్ర మేల్కొన్నప్పుడు, "అల్‌హమ్దు లిల్లా హిల్లజీ అహ్యానా బాదమా అమాతనా వ ఇలైహిన్నుషూర్" (స్తోత్రాలన్నీ అల్లాహ్‌కే శోభిస్తాయి. ఆయన మమ్మల్ని మరణింపజేసిన తర్వాత తిరిగి బ్రతికించాడు. ఏదో ఒకరోజు మేమంతా ఆయన వైపుకే మరలిపోవలసి ఉన్నది)" అని పలికేవారు. *(బుఖారీ)*

٨١٧ ـ وعن حُذَيْفَةَ رضي الله عنه قال: كان النبيُّ ﷺ إذا أخَذَ مَضْجَعَهُ مِنَ اللَّيْلِ وَضَعَ يَدَهُ تَحْتَ خَدِّهِ، ثُمَّ يَقُولُ: «اللَّهُمَّ! بِاسْمِكَ أَمُوتُ وَأَحْيَا» وَإِذا اسْتَيْقَظَ قالَ: «الحَمْدُ للهِ الَّذِي أَحْيَانَا بَعْدَ مَا أَمَاتَنَا وَإِلَيْهِ النُّشُورُ» رواه البخاري.

*(సహీహ్ బుఖారీలోని ప్రార్థనల ప్రకరణం)*

818. తన తండ్రి తనకు ఈ విధంగా చెప్పారని హ|జత్ యయీష్ బిన్ తిఖ్‌ఫా గిఫారీ (రజి) తెలియజేశారు : నేనొకసారి మస్జిద్‌లో బోర్లాపడుకొని ఉండగా ఎవరో తన కాలుతో నన్ను కదుపుతూ, "ఇలా పడుకుంటే దేవుడు ఆగ్రహిస్తాడు" అని అంటున్నారు. లేచి చూస్తే నా ప్రక్కన దైవప్రవక్త (సల్లం) ఉన్నారు. (అబూ దావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో ఉల్లేఖించారు).

٨١٨ ـ وعن يَعِيشَ بنِ طِخْفَةَ الغِفَارِيِّ رضي الله عنه قال: قال أبي: بَيْنَمَا أَنَا مُضْطَجِعٌ في المَسْجِدِ عَلى بَطْني إذا رَجُلٌ يُحَرِّكُني بِرِجْلِهِ فقال: «إنَّ هٰذِهِ ضِجْعَةٌ يُبْغِضُهَا اللهُ» قال: فَنَظَرْتُ، فَإِذا رسولُ اللهِ ﷺ. رواه أبو داود بإسنادٍ صحيحٍ.

(సుననె అబూ దావూద్‌లోని నిద్ర ప్రకరణం)

**ముఖ్యాంశాలు**

బోర్లా పడుకోవటం అత్యంత అసహ్యాకరమైన చేష్ట. సభ్యత సంస్కారాలకు విరుద్ధం. అంతేకాదు, నైతికంగా, వైద్యపరంగా కూడా దానివల్ల ఎన్నో నష్టాలున్నాయి.

٨١٩ ـ وعن أبي هريرةَ رضي الله عنه عن رسولِ اللهِ ﷺ قال: «مَنْ قَعَدَ مَقْعَداً لَمْ يَذْكُرِ اللهَ تعالى فِيهِ، كَانَتْ عَلَيْهِ مِنَ اللهِ تعالى تِرَةٌ، وَمَنِ اضْطَجَعَ مَضْجَعاً لا يَذْكُرُ اللهَ تعالى فِيهِ، كَانَتْ عَلَيْهِ مِنَ اللهِ تِرَةٌ» رواه أبو داود بإسنادٍ حسن.

«التِّرَةُ» بكسر التاءِ المثناة من فوق، وهي: النَّقْصُ، وَقِيلَ: التَّبِعَةُ.

819. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఎవరయినా ఒకచోట కూర్చొని అక్కడ దేవుణ్ణి స్మరించకపోతే దేవుని తరఫునుండి ఆ చోటు అతని పాలిట తలవంపుగా పరిణమిస్తుంది. ఎవరయినా ఒకచోట పడుకొని అక్కడ దేవుణ్ణి స్మరించకపోతే దేవుని తరఫు నుండి ఆ చోటు అతని పాలిట తల వంపుగా పరిణమిస్తుంది. (అబూ దావూద్ దీనిని ప్రామాణికమైన ఆధారాలతో ఉల్లేఖించారు).

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

**128వ అధ్యాయం**

# ١٢٨ ـ بَابُ جَوَازِ الاسْتِلْقَاءِ عَلَى القَفَا وَوَضْعِ إِحْدَى الرِّجْلَيْنِ عَلَى الأُخْرَى إِذَا لَمْ يَخَفِ انْكِشَافَ العَوْرَةِ وَجَوازِ القُعُودِ مُتَرَبِّعاً وَمُحْتَبِياً

## వెల్లకిలా పడుకోవటం, ఆచ్ఛాదనం తొలగిపోదన్న నమ్మకముంటే, ఒక కాలిమీద మరొక కాలు పెట్టుకొని పడుకోవటం

٨٢٠ ـ عن عبدِ الله بنِ زيدٍ رضي الله عنهما أنَّهُ رأى رسولَ اللهِ ﷺ مُسْتَلْقِياً في المَسْجِدِ، وَاضِعاً إِحْدَى رِجْلَيْهِ عَلى الأُخرَى. متفقٌ عليه.

820. తాను దైవప్రవక్త (సల్లం)ను మస్జిద్‌లో ఒక కాలి మీద మరొక కాలు పెట్టుకొని వెల్లకిలా పడుకొని ఉండగా చూశానని హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జైద్ (రజి) తెలియజేశారు.

(బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని మస్జిదుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని వస్త్రధారణ ప్రకరణం)*

٨٢١ ـ وعن جابرِ بنِ سَمُرَةَ رضي الله عنه قال: كان النبيُّ ﷺ إذا صَلَّى الفَجْرَ تَرَبَّعَ في مَجْلِسِهِ حَتَّى تَطْلُعَ الشَّمْسُ حَسْنَاءَ. حديث صحيح، رواه أبو داود وغيره بأسانيد صحيحة.

821. హజ్రత్ జాబిర్ బిన్ సమురా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఫజ్ర్ నమాజ్ ముగించుకున్నాక సూర్యుడు బాగా వెలుతురుతో ఉదయించేదాకా ఆ చోట్లోనే బాసికపట్టు వేసుకొని కూర్చొనేవారు. (అబూదావూద్ తదితరులు ఈ హదీసును దృఢమైన ఆధారాలతో వెలికి తీశారు).

*(సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం, సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం).*

## ముఖ్యాంశాలు

బాసికపట్టు వేసుకొని కూర్చోవటం, ఫజ్ర్ నమాజ్ తర్వాత సూర్యోదయం వరకు మస్జిద్‌లోనే ఉండటం పుణ్యప్రదమని పై హదీసు ద్వారా బోధపడుతోంది. అంటే అలా చేయటం తప్పనిసరి కాదు, చేస్తే పుణ్యం లభిస్తుంది.

٨٢٢ ـ وعن ابن عمرَ رضي الله عنهما قال: رأيتُ رسولَ اللهِ ﷺ بِفِنَاءِ الكَعْبَةِ مُحْتَبِياً بِيَدَيْهِ هكذا. وَوَصَفَ بِيَدَيْهِ الاحْتِبَاءَ، وَهُوَ القُرْفُصَاءُ. رواه البخاري.

822. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) కాబా గృహ ప్రాంగణంలో ఈ విధంగా చేతులు కట్టుకొని ఇహ్తిబా పద్ధతిలో కూర్చొని ఉండగా నేను చూశాను.

ఇబ్నె ఉమర్ (రజి) ఇహ్తిబా పద్ధతి ఎలా ఉంటుందో చూపించారు. అది ఖుర్‌ఫుసా పద్ధతిలాగుంది. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పిరుదుల ఆధారంగా కూర్చొని తొడల్ని నిలబెట్టి చేతులు కాళ్ళకు చుట్టుకోవటాన్ని ఇహ్తిబా లేక ఖుర్‌ఫుసా పద్ధతి అని అంటారు.

٨٢٣ ـ وعن قَيْلَةَ بنتِ مَخْرَمَةَ رضي الله عنها قالت: رَأَيْتُ النبيَّ ﷺ وَهُوَ قَاعِدٌ القُرْفُصَاءَ، فَلَمَّا رَأَيْتُ رسولَ اللهِ ﷺ المُتَخَشِّعَ في الجِلْسَةِ أُرعِدْتُ مِنَ الفَرَقِ. رواه أبو داود، والترمذي.

823. హజ్రత్ ఖైలా బిన్తె మఖ్‌రమా (రజి.అన్‌హా) కథనం: నేనొకసారి దైవ ప్రవక్త (సల్లం)ను ఖుర్‌ఫుసా పద్ధతిలో ఒదిగికూర్చొని ఉండగా చూశాను. ఆయన అణకువను చూసి నేను ఆ సమయంలో భయంతో వణికి పోయాను. *(అబూ దావూద్, తిర్మిజీ)*

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

٨٢٤ ـ وعنِ الشَّرِيدِ بنِ سُوَيدٍ رضي الله عنه قال: مَرَّ بي رسولُ الله ﷺ وَأَنَا جَالِسٌ هٰكَذا، وَقَدْ وَضَعْتُ يَدِيَ اليُسْرَى خَلْفَ ظَهْرِي، وَاتَّكَأْتُ عَلى أَلْيَةِ

824. హజ్రత్ షరీద్ బిన్ సులైద్ (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) నా సమీపం నుంచి వెళ్ళారు. ఆ సమయంలో నేను ఈ విధంగా అనగా

يَدِي فقال: «أَتَقْعُدُ قِعْدَةَ المَغْضُوبِ عَلَيْهِمْ؟!» رواه أبو داود بإسنادٍ صحيحٍ.

ఎడమచేతిని వీపు వెనకాల పెట్టుకొని బొటనవ్రేలి క్రింది భాగం ఆధారంగా కూర్చొని ఉన్నాను.

దైవప్రవక్త (సల్లం) ఆ పద్ధతిలో కూర్చోవటం చూసి, "దైవాగ్రహానికి గురయిన వారి మాదిరిగా కూర్చుంటున్నావా?" అని నన్ను మందలించారు. (అబూ దావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో ఉల్లేఖించారు).

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవాగ్రహానికి గురయినవారంటే యూదులు, క్రైస్తవులు అని అర్థం. కూర్చునే ప్రత్యేక పద్ధతుల్లో వారిని అనుకరించకూడదని ఈ హదీసు ఉద్దేశ్యం. ప్రతిజాతికీ తన అస్తిత్వాన్ని కాపాడుకోవటానికి, తమ ఆత్మగౌరవాన్ని రక్షించుకోవటానికి అన్య జాతులను అనుకరించకుండా ఉండటం చాలా అవసరం. అందుకనే ముస్లింలు దైనందిన అలవాట్లు, వేషభూషణ మొదలగు విషయాల్లో వీలైనంతవరకు అవిశ్వాసుల్ని వ్యతిరేకించాలని ఈ హదీసు మనకు తెలియజేస్తోంది.



## 129వ అధ్యాయం

# ١٢٩ ـ بَابٌ فِي آدَابِ الْمَجْلِسِ وَالْجَلِيس

# సమావేశ నియమాలు

٨٢٥ ـ عن ابن عُمَرَ رضي الله عنهما قال: قال رسولُ الله ﷺ: «لا يُقِيمَنَّ أَحَدُكُمْ رَجُلاً مِنْ مَجْلِسِهِ ثُمَّ يَجْلِسُ فِيهِ، وَلَكِنْ تَوَسَّعُوا وَتَفَسَّحُوا» وَكَانَ ابنُ عُمَرَ إذا قامَ له رَجُل مِنْ مَجْلِسِهِ لَمْ يَجْلِسْ فِيهِ. متفقٌ عليه.

825. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీలో ఎవరూ (సమావేశంలో) ఇతరుల్ని లేపి వారి చోట్లో కూర్చోరాదు. అంతగా అవసరమయితే ఇతరులకు కూడా చోటు దొరికేలా, సర్దుకొని కూర్చోండని చెప్పండి.

ఇబ్నె ఉమర్ (రజి)ని చూసి సమావేశంలో ఎవరయినా ఆయనకు చోటు కల్పించటానికి లేచి నించుంటే, ఆయన ఆ చోట్లో కూర్చునేవారు కారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

సభలు, సమావేశాలు జరిగినప్పుడు ఒక వ్యక్తి ముందుగా వచ్చి ఒకచోట కూర్చుంటే ఆ తర్వాత వచ్చినవారు అతడ్ని లేపి ఆ చోట్లో కూర్చోవటం సమ్మతం కాదని ఈ హదీసు ద్వారా తెలుస్తోంది. అదేవిధంగా ఎవరయినా తమ సరుకు అమ్ముకోవటానికి లేక మరేదయినా పనిచేయటానికి బజారులు, సంతలు తదితర ప్రదేశాలకు ముందుగా వెళ్ళి ఒక చోటును నిర్ణయించుకుంటే, ఆ చోట్లో వ్యాపార కార్యకలాపాలు నిర్వహించుకోవటానికి వారే ఎక్కువ అర్హులుగా పరిగణించబడతారు. ఇతరులెవరయినా వచ్చి ఆ చోట్లో కూర్చోవటానికి ప్రయత్నిస్తే మొదటగా వచ్చినవారికి వారిని ఆపే హక్కు ఉంటుంది. అయితే ప్రభుత్వ స్థలాల దురాక్రమణను నియంత్రించే విషయంలో ప్రభుత్వ యంత్రాంగానికి పూర్తి అధికారం ఉంటుంది.

٨٢٦ ـ وعن أبي هُريرةَ رضيَ الله

826. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఎవరయినా ఒకచోట

كُفూర్చొని లేస్తే, తిరిగొచ్చిన తర్వాత ఆ చోట్లో కూర్చోవటానికి అందరికన్నా అతనే ఎక్కువ అర్హుడు. (ముస్లిం)

عنه أنَّ رسولَ الله ﷺ قال: «إذا قامَ أَحَدُكُمْ مِنْ مَجْلِسٍ، ثُمَّ رَجَعَ إلَيْهِ، فَهُوَ أَحَقُّ بِهِ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

827. హజ్రత్ జాబిర్ బిన్ సమురా (రజి) కథనం : మేము దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళినప్పుడు మాలో ప్రతి ఒక్కడు (సమావేశంలో) ఎక్కడివరకు వెళ్ళ గలుగుతాడో (ఎక్కడ స్థలం దొరుకు తుందో) అక్కడే కూర్చునేవాడు. (అబూ దావూద్, తిర్మిజీ - హసన్)

٨٢٧ - وعن جَابِرِ بنِ سَمُرَةَ رضيَ اللهُ عنهما قال: كُنَّا إذَا أَتَيْنَا النَّبِيَّ ﷺ، جَلَسَ أَحَدُنَا حَيْثُ يَنْتَهِي. رواه أبو داود، والترمذي وقال: حديث حسن.

*(సునన్ అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం, సునన్ తిర్మిజీలోని ఇస్తీజాన్ అధ్యాయాలు)*

828. హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ సల్మాన్ ఫార్సీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఏ వ్యక్తి అయినా జుమా రోజు గుసుల్ (స్నానం) చేసి, వీలైనంత వరకు శుచీశుభ్రతలు పాటించి, ఇంట్లో ఉన్న నూనె రాసుకొని లేక పరిమళం పూసుకొని, ఆ తర్వాత (జుమా ఆరాధన కోసం) ఇంటి నుండి వెళ్ళి (మస్జిద్‌లోకి ప్రవేశించిన తర్వాత) అక్కడ ఏ ఇద్దరి మధ్యలోనూ జొర బడకుండా, తనకోసం రాసిపెట్టబడిన నమాజ్ చేసి, ఇమామ్ ఖుత్బా (ఉప న్యాసం) ఇచ్చినప్పుడు మౌనం వహిస్తే, ఆ జుమా నుండి మరో జుమా వరకు అతని వల్ల జరిగే (చిన్న చిన్న) పాపాలన్నీ క్షమించబడతాయి. *(బుఖారీ)*

٨٢٨ - وعن أبي عبدِ الله سَلْمَان الفارسيِّ رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «لا يَغْتَسِلُ رَجُلٌ يَوْمَ الجُمُعَةِ وَيَتَطَهَّرُ مَا اسْتَطَاعَ مِنْ طُهْرٍ، وَيَدَّهِنُ مِنْ دُهْنِهِ أَوْ يَمَسُّ مِنْ طِيبِ بَيْتِهِ، ثُمَّ يَخْرُجُ فَلا يُفَرِّقُ بَيْنَ اثْنَيْنِ، ثُمَّ يُصَلِّي مَا كُتِبَ لَهُ، ثُمَّ يُنْصِتُ إذَا تَكَلَّمَ الإمَامُ، إلَّا غُفِرَ لَهُ مَا بَيْنَهُ وَبَيْنَ الجُمُعَةِ الأُخْرَى» رواه البخاري.

*(సహీహ్ బుఖారీలోని జుమా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసు ద్వారా బోధపడే ముఖ్య విషయాలు ఇవి :

1. జుమా రోజు చేసే తలంటు స్నానానికి ఎంతో విశిష్టత ఉంది. అందుకే కొంతమంది పండితులు దానిని 'ముస్తహబ్' (అభిలషణీయమైనది)గా భావిస్తే, మరికొంతమంది దాన్ని 'వాజిబ్' (తప్పనిసరి)గా తలపోశారు.
2. ఈ తలంటు పోసుకునే సమయం జుమా రోజు ఉషోదయం నుండి సూర్యుడు నడినెత్తి నుండి వాలేవరకు ఉంటుంది. అంటే జుమా నమాజుకు ముందు ఎప్పుడైనా గుసుల్ (స్నానం) చేయవచ్చు.
3. జుమా రోజు సువాసన గల నూనెలు, అత్తరు లాంటి సుగంధ ద్రవ్యాలు ఉపయోగించటం అభిలషణీయం.
4. మస్జిద్‌లో ఎక్కడ చోటు దొరికితే అక్కడ కూర్చోవాలి. అంతేగాని ప్రజల భుజాల మీద నుంచి గెంతుతూ ముందుకు వెళ్ళకూడదు. జనం మధ్యలో జొరబడి కూర్చోరాదు.
5. జుమా రోజు మస్జిద్‌లోకి ప్రవేశించిన తర్వాత అన్నిటికన్నా ముందు రెండు రకాతుల నమాజ్ చేయాలి. ఆఖరికి ఖతీబ్ ఖుత్బా (ఉపన్యాసం) ఇస్తున్నప్పుడయినా సంక్షిప్తంగా రెండు రకాతుల నమాజ్ చేసుకున్న తర్వాతే కూర్చోవాలి.
6. పై నియమాలన్నీ పాటించి జుమా నమాజ్ చేస్తే ఆ జుమా నుండి మరో జుమా వరకు మనిషి వల్ల జరిగే చిన్న చిన్న పాపాలన్నీ మన్నించబడతాయి.

829. హజ్రత్ అమ్ర్ బిన్ షుఐబ్ తన తండ్రి నుండి ఆయన తన తాతగారి నుండి చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : కలిసి కూర్చున్న ఇద్దరు వ్యక్తులను వారి అనుమతి లేకుండా విడదీయటం ఏ మనిషికీ సమ్మతం కాదు. (అబూ దావూద్, తిర్మిజీ - హసన్)

అబూ దావూద్‌లోని వేరొక ఉల్లేఖనంలో, "ఇద్దరు వ్యక్తుల మధ్య వారి అనుమతి లేకుండా కూర్చోకూడదు" అని ఉంది.

٨٢٩ - وعن عَمْرِو بنِ شُعَيْبٍ عن أَبِيهِ عن جَدِّهِ رضي الله عنه أن رَسولَ الله ﷺ قال: «لا يَحِلُّ لِرَجُلٍ أَنْ يُفَرِّقَ بَيْنَ اثْنَيْنِ إلَّا بِإذْنِهِمَا» رواه أبو داود، والترمذي وقال: حديث حسن. وفي روايةٍ لأبي داود: «لَا يُجْلَسْ بَيْنَ رَجُلَيْنِ إلا بِإذْنِهِمَا».

*(సుననె అబూ దావూద్, సుననె తిర్మిజీలలోని సంస్కార ప్రకరణాలు)*

830. హజ్రత్ హుజైఫా బిన్ యమాన్ (రజి) కథనం ప్రకారం వలయాకాలంలో ఉండే సమావేశం మధ్యలో కూర్చొనే వాణ్ణి దైవప్రవక్త (సల్లం) శపించారు.

(అబూ దావూద్ దీనిని ప్రామాణికమైన ఆధారాలతో ఉల్లేఖించారు)

తిర్మిజీ అబూ మిజ్‌లజ్ నుండి చేసిన కథనం ఇలా ఉంది : వలయాకారంలో ఉన్న సమావేశం మధ్యలో కూర్చొని ఉన్న ఒక వ్యక్తిని చూసి హుజైఫా (రజి) ఇలా అన్నారు:

"వలయాకారంలో ఉండే సమావేశం మధ్యలో కూర్చునేవాడు ముహమ్మద్ (సల్లం) నోట శాపగ్రస్తుడవుతాడు లేదా దేవుడు అతణ్ణి ముహమ్మద్ (సల్లం) నోట శపిస్తాడు." (తిర్మిజీ - హసన్, సహీహ్)

٨٣٠ ـ وعن حُذَيْفَةَ بنِ اليَمانِ رضي الله عنه أنَّ رسولَ اللهِ ﷺ لَعَنَ مَنْ جَلَسَ وَسَطَ الحَلْقَةِ. رواه أبو داودَ بإسنادِ حسن. وروى الترمذي عن أبي مِجْلَزٍ: أَنَّ رَجُلاً قَعَدَ وَسَطَ حَلْقَةٍ، فقال حُذَيْفَةُ: مَلْعُونٌ عَلى لِسَانِ مُحَمَّدٍ ﷺ ـ أَوْ: لَعَنَ اللهُ عَلى لِسَانِ مُحَمَّدٍ ﷺ ـ مَنْ جَلَسَ وَسَطَ الحَلْقَةِ. قال الترمذي: حديث حسن صحيح.

*(సునన్ అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం, సునన్ తిర్మిజీలలోని సంస్కార అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

సమావేశంలో కూర్చొని ఉన్న జనం మధ్య జొరబడకూడదనే ఈ హదీసు భావం కూడాను. అలా చేయటం సభ్యత అనిపించుకోదు. పైగా సభా నియమాలను ఉల్లంఘించినట్లవుతుంది.

ఈ సందర్భంగా గమనార్హమైన విషయం ఏమిటంటే ఈ హదీసుని వివరించిన ఉల్లేఖకుల పరంపరలో ఒకచోట లింకు తెగి వుందని షేఖ్ అల్‌బానీ (రహ్మాలై) అన్నారు. ఎందుకంటే అబూ మిజ్‌లజ్ (ఈయన అసలు పేరు లాహిఖ్ బిన్ హుమైద్) హజ్రత్ హుజైఫా (రజి) నుండి ఈ హదీసు వినలేదని చారిత్రక ఆధారాల ద్వారా నిరూపితమయింది. అయినప్పటికీ ఇందులోని భావాన్ని ప్రామాణికమైన హదీసులు బలపరుస్తున్నాయి.

۸۳۱ ـ وعن أبي سعيدِ الخُدْرِيِّ رضي الله عنه قال: سَمِعْتُ رسولَ اللهِ ﷺ يقول: «خَيْرُ المَجَالِسِ أَوْسَعُهَا». رواه أبو داود بإسناد صحيح على شرطِ البخاري.

831. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) తెలియజేశారు : విశాలంగా ఉండే సమావేశాలే అత్యుత్తమ సమావేశాలు.

(అబూ దావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో, బుఖారీ నియమాలననుసరించి ఉల్లేఖించారు)

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సమావేశం జరిగే స్థలం గనక ఇరుకుగా ఉంటే ఆ సమావేశానికి హాజరయ్యే జనం నానా ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుంది. అదే సమావేశపు స్థలం విశాలంగా ఉంటే జనం ప్రశాంతంగా కూర్చొని అక్కడ బోధింపబడే విషయాలు వింటారు. బయటినుంచి వచ్చేవారికి కూడా కూర్చోవటానికి తగినంత చోటు లభిస్తుంది. అన్నిటినీ మించి సభకు అంతరాయం కలగకుండా ఉంటుంది.

۸۳۲ ـ وعن أبي هريرةَ رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «مَنْ جَلَسَ في مَجْلِسٍ، فَكَثُرَ فِيهِ لَغَطُهُ فقال قَبْلَ أَنْ يَقُومَ مِنْ مَجْلِسِهِ ذلكَ: سُبْحَانَكَ اللَّهُمَّ وَبِحَمْدِكَ، أَشْهَدُ أَنْ لا إِلٰهَ إِلَّا أَنْتَ، أَسْتَغْفِرُكَ وَأَتُوبُ إِلَيْكَ؛ إِلَّا غُفِرَ لَهُ مَا كان في مَجْلِسِهِ ذلكَ». رواه الترمذي وقال: حديث حسن صحيح.

832. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఎవరయినా ఒక సమావేశంలో కూర్చొని ఎన్నో వ్యర్థమైన మాటలు మాట్లాడి, తిరిగి ఆ సమావేశం నుండి లేచేముందు, "సుబ్‌హానకల్లా హుమ్మ వ బిహమ్దిక, అష్‌హదు అల్లా ఇలాహ ఇల్లా అన్‌త, అస్తగ్‌ఫిరుక వ అతూబు ఇలైక్ (దేవా! నీవు నీ స్తోత్ర సమేతంగా పరిశుద్ధుడవు. నీవు తప్ప వేరొక ఆరాధ్యదేవుడు లేడని నేను సాక్ష్యమిస్తున్నాను. నేను నిన్ను క్షమాభిక్ష పెట్టమని వేడుకుంటున్నాను. నా వల్ల జరిగిన పాపాలపై పశ్చాత్తాపపడుతూ నీ వైపుకు మరలుతున్నాను)" అని అంటే

ఆ సమావేశంలో అతని వల్ల జరిగిన పాపాలన్నీ మన్నించబడతాయి.

(తిర్మిజీ - హసన్, సహీహ్)

*(సుననె తిర్మిజీలోని ప్రార్థనల ప్రకరణం)*

833. హజ్రత్ అబూ బర్జా (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఏదయినా సమావేశం నుండి లేవదలచుకున్నప్పుడు చివర్లో ఈ విధంగా ప్రార్థించేవారు:

"దేవా! నీవు నీ స్తోత్రసమేతంగా పరిశుద్ధుడవు. నీవు తప్ప వేరొక ఆరాధ్యదేవుడు లేడని నేను సాక్ష్యమిస్తున్నాను. క్షమాభిక్ష పెట్టమని నిన్ను వేడుకుంటున్నాను. నా వల్ల జరిగిన పాపాలపై పశ్చాత్తాప పడుతూ నీ వైపుకు మరలుతున్నాను."

ఒకసారి ఓ వ్యక్తి దైవప్రవక్త (సల్లం) ఈ ప్రార్థనా వాక్యాలు పఠిస్తుండగా విని, "దైవప్రవక్తా! మీరు ఇవ్వాళ మునుపు ఎన్నడూ పఠించని వాక్యాలు పఠించారేమిటి?" అని అడిగాడు. అందుకాయన "ఈ వాక్యాలు సమావేశంలో జరిగే తప్పులకు పరిహారమవుతాయి" అని చెప్పారు.

(అబూ దావూద్, ముస్తద్రక్ హాకిమ్ - హాకిమ్ దీని పరంపరను దృఢమైనదిగా ఖరారు చేశారు).

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

٨٣٣ ـ وعن أبي بَـرْزَةَ رضي الله عنه قال: كَانَ رسولُ اللهِ ﷺ يقولُ بِأَخَرَةٍ إذا أَرَادَ أَنْ يَقُومَ مِنَ المَجْلِسِ: «سُبْحَانَكَ اللَّهُمَّ وَبِحَمْدِكَ، أَشْهَدُ أَنْ لا إِلٰهَ إِلَّا أَنْتَ، أَسْتَغْفِرُكَ وَأَتُوبُ إِلَيْكَ» فقال رجلٌ: يا رسولَ الله! إِنَّكَ لَتَقُولُ قَوْلًا مَا كُنْتَ تَقُولُهُ فِيمَا مَضَى؟ قال: «ذلكَ كَفَّارَةٌ لِمَا يَكُونُ فِي المَجْلِسِ» رواه أبو داودَ. ورواه الحاكم أبو عبدِ اللهِ في «المستدرك» من رواية عائشةَ رضي الله عنها وقال: صحيح الإسناد.

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) నోటి నుండి వ్యర్థమైన మాటలు ఎన్నడూ వెలువడలేదు. అయినప్పటికీ ఆయన సమావేశం పూర్తి కాగానే పశ్చాత్తాపంతో కూడిన వేడుకోలు వచనాలు పఠించేవారు. దైవాన్ని స్తుతించటానికి, ఆయన పవిత్రతను, ఔన్నత్యాన్ని కొనియాడటానికి,

ముఖ్యంగా తన అనుచర సమాజానికి బోధించే ఉద్దేశ్యంతోనే ఆయన అలా చేసేవారు. కనుక మనం ఆయన సంప్రదాయాన్ని తప్పకుండా పాటించాలి.

834. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) ఏదయినా సమావేశం ముగిసిన తర్వాత ఈ విధంగా ప్రార్థించకుండా లేచి వెళ్ళిపోవటమనేది బహు అరుదు.

"దేవా! పాపాలకు ఒడిగట్టకుండా మమ్మల్ని అడ్డుకునేటంతటి పాపభీతిని మాకు ప్రసాదించు. మమ్మల్ని నీ స్వర్గంలోకి ప్రవేశింపజేసేటంతటి విధేయతా భావాన్ని మాలో కలిగించు. ఇహలోకంలో ఎదురయ్యే కష్టాలను అవలీలగా భరించగలిగే విధంగా మాలో (ధర్మం పట్ల) నమ్మకాన్ని పెంపొందించు. దేవా! నీవు మాకు బ్రతుకనిచ్చినంత కాలం మా చెవులద్వారా, కళ్ళద్వారా ఇతర శక్తుల ద్వారా మాకు ప్రయోజనాన్ని చేకూర్చు. ఇంకా ఆ ప్రయోజనానికి మమ్మల్ని వారసులుగా చెయ్యి (అంటే జీవితాంతం మా శరీరా వయవాలు ఆరోగ్యంగా ఉండేటట్లు చెయ్యి). మాపై దౌర్జన్యం జరిపే వ్యక్తికి నీవు ప్రతీకారం చెయ్యి. శత్రువులకు వ్యతిరేకంగా మాకు సహాయపడు. ధార్మిక వ్యవహారాల్లో మమ్మల్ని కష్టాల పాల్జేయకు. ప్రాపంచిక సౌఖ్యాన్ని మా జీవితాల ఉన్నతాశయంగా, మా విద్యార్జనకు గమ్యంగా చేయకు. మాపై దయజూపని వ్యక్తికి మాపై అధికారం ఇవ్వకు.

(తిర్మిజీ - హసన్)

٨٣٤ - وعن ابن عمرَ رضي الله عنهما قال: قلَّما كان رسولُ الله ﷺ يقُومُ مِن مَجلِسٍ حتَّى يَدْعُوَ بهؤلاء الدَّعوَاتِ: «اللَّهُمَّ! اقْسِمْ لَنَا مِنْ خَشْيَتِكَ مَا تَحُولُ بِهِ بَيْنَنَا وَبَيْنَ مَعَاصِيكَ وَمِنْ طَاعَتِكَ مَا تُبَلِّغُنَا بِهِ جَنَّتَكَ وَمِنَ اليَقِينِ مَا تُهَوِّنُ عَلَيْنَا مَصَائِبَ الدُّنْيَا. اللَّهُمَّ! مَتِّعْنَا بِأَسْمَاعِنَا، وَأَبْصَارِنَا، وَقُوَّتِنَا مَا أَحْيَيْتَنَا، وَاجْعَلْهُ الوَارِثَ مِنَّا، وَاجْعَلْ ثَأْرَنَا عَلى مَنْ ظَلَمَنَا وَانْصُرْنَا عَلى مَنْ عَادَانَا، وَلا تَجْعَلْ مُصِيبَتَنَا في دِينِنَا، وَلا تَجْعَلِ الدُّنْيَا أَكْبَرَ هَمِّنَا، وَلا مَبْلَغَ عِلمِنَا، وَلا تُسَلِّطْ عَلَيْنَا مَنْ لا يَرْحَمُنَا» رواه الترمذي وقال: حديث حسن.

(సునన్ తిర్మిజీలోని ప్రార్థనల అధ్యాయాలు)

٨٣٥ ـ وعن أبي هريرةَ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «مَا مِن قَوْمٍ يَقُومُونَ مِنْ مَجْلِسٍ لا يَذْكُرُونَ اللهَ تعالى فيهِ، إلَّا قَامُوا عَنْ مِثْلِ جِيفَةِ حِمَارٍ، وَكَانَ لَهُمْ حَسرَةً». رواه أبو داود بإسنادٍ صحيح.

835. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ఎవరయినా ఒక సమావేశంలో కూర్చొని దేవుణ్ణి స్మరించకుండా లేచి వెళ్ళిపోతే, వారు చనిపోయిన గాడిద శవం దగ్గరినుండి లేచి వెళ్ళిపోయారను కోవాలి. ఇంకా ఆ సమావేశం వారి పాలిట దుఃఖదాయకంగానూ పరిణమిస్తుంది.

(అబూ దావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికితీశారు)

*(సుననె అబూ దావూద్ - సంస్కార ప్రకరణం)*

٨٣٦ ـ وعنه عن النبيِّ ﷺ قال: «مَا جَلَسَ قَوْمٌ مَجْلِساً لَمْ يَذْكُرُوا اللهَ تعالى فِيهِ وَلَمْ يُصَلُّوا عَلَى نَبِيِّهِمْ فِيهِ، إلَّا كَانَ عَلَيْهِمْ تِرَةٌ، فَإِنْ شَاءَ عَذَّبَهُمْ، وَإِنْ شَاءَ غَفَرَ لَهُمْ» رواه الترمذي وقال: حديث حسن.

836. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఎవరయినా ఒక సమావేశంలో కూర్చొని దేవుణ్ణి స్మరించకుండా, తమ ప్రవక్త కోసం ప్రార్థించకుండా లేచి వెళ్ళిపోతే, ఆ సమావేశం వారి పాలిట దుఃఖ దాయకంగా పరిణమిస్తుంది. దేవుడు వారిని శిక్షించవచ్చు లేదా మన్నించనూవచ్చు. అది ఆయనిష్టం. *(తిర్మిజీ - హసన్)*

*(సుననె తిర్మిజీలోని ప్రార్థనల అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో 'తిరతున్' అనే పదం వాడబడింది. తిరతున్ అంటే దుఃఖదాయకం అని అర్థం. కొంతమంది దాన్ని నరకానికి గొనిపోయేది అని కూడా అనువదించారు. అంటే సమావేశంలో కూర్చొని దేవుణ్ణి స్మరించకపోతే, దైవప్రవక్త (సల్లం) కోసం ప్రార్థించకపోతే, ఆ సమావేశం వల్ల పుణ్యం లభించకపోగా, సమావేశంలో పాల్గొన్నవారిని అది నరకానికి గొనిపోతుంది. అందుకే కొంతమంది పండితులు సమావేశాల్లో కూర్చున్నప్పుడు తప్పనిసరిగా దైవప్రవక్త (సల్లం)పై దరూద్ పంపాలని అభిప్రాయపడ్డారు.

837. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ఎవరయినా ఒకచోట కూర్చొని అక్కడ (ఒక్క సారయినా) దేవుణ్ణి స్మరించకపోతే, దేవుని తరపునుండి ఆ కూర్చోవటం అతని పాలిట సిగ్గుచేటుగా పరిణమిస్తుంది. అలాగే ఎవరయినా ఒకచోట పడుకొని అక్కడ దేవుణ్ణి స్మరించకపోతే, దేవుని తరపునుండి ఆ పడుకోవటం అతని పాలిట సిగ్గుచేటుగా పరిణమిస్తుంది. *(అబూ దావూద్)*

٨٣٧ ـ وعنه عن رسولِ اللهِ ﷺ قال: «مَنْ قَعَدَ مَقعَداً لَمْ يَذْكُرِ اللهَ تعالى فِيهِ كَانَتْ عَلَيْهِ مِنَ اللهِ تِرَةٌ وَمَنِ اضْطَجَعَ مَضْجَعاً لا يَذْكُرُ اللهَ تعالى فِيهِ كَانَتْ عَلَيْهِ مِنَ اللهِ تِرَةٌ» رواه أبو داود . وقد سبق قريباً، وشرحنا «التِّرَةَ» فِيهِ.

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషి సర్వకాల సర్వావస్థల్లోనూ దైవం పట్ల ఏమరుపాటుకు లోనుకాకుండా అనునిత్యం ఆయన్ని స్మరిస్తూ ఉండాలన్నదే పై హదీసులన్నిటి సారాంశం. దాసుడు తనకు మంచి జరిగినా, చెడు జరిగినా, కష్టాలొచ్చినా సుఖాలు స్వాగతించినా, పస్తులుండవలసి వచ్చినా పరమాన్నాలు తినే అదృష్టం కలిగినా అన్నివేళల్లోనూ దైవాన్ని తలచుకుంటూ ఉండాలి. ఒక్క క్షణమైనా దైవాన్ని విస్మరించకూడదు. క్షణిక విస్మరణమే ఒక్కోసారి మనిషిని దైవాజ్ఞల్ని ఉల్లంఘించేలా, దేవుని హద్దుల్ని అతిక్రమించేలా చేస్తుంది సుమా!

ఇంకో విషయం ఏమిటంటే సాధారణంగా ప్రజలు ఒకచోట సమావేశమై కూర్చున్నప్పుడు అక్కడ లేని వారి గురించి చాడీలు చెప్పుకోవటం, దురనుమానాలు రేకెత్తించటం, నీలాపనిందలు మోపటం లాంటి చేష్టలకు పాల్పడుతూ ఉంటారు. దానివల్ల ప్రజల మధ్య విద్వేషం, వైషమ్యాలు చెలరేగి సమాజంలో సమైక్యతా భావం నశించే ప్రమాదముంది. అదే దైవనామ స్మరణ జరిగే సమావేశాల్లోనయితే సభ్యులు అలాంటి కుచేష్టలకు పాల్పడరని ఆశించవచ్చు. అందుకే సభలు, సమావేశాలు ఆఖరికి ఒంటరిగా కూర్చున్నప్పుడు కూడా దైవాన్ని స్మరించాలని తాకీదు చేయబడింది.

**130వ అధ్యాయం**

# ١٣٠ - بَابُ الرُّؤْيَا وَمَا يَتَعَلَّقُ بِهَا

## స్వప్నాలు, వాటికి సంబంధించిన విషయాలు

قال الله تعالى: ﴿وَمِنْ ءَايَـٰتِهِۦ مَنَامُكُم بِٱلَّيْلِ وَٱلنَّهَارِ﴾ [الروم: ٢٣].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు : "దేవుని సూచనలలో మీరు రాత్రి, పగలు నిద్ర పోవటం కూడా ఒకటి." *(అర్ రూమ్ : 23)*

٨٣٨ - وعن أبي هريرةَ رضي الله عنه قال: سمعتُ رسولَ الله ﷺ يقول: «لَمْ يَبْقَ مِنَ النُّبُوَّةِ إلَّا المُبَشِّرَاتُ» قالوا: وَمَا المُبَشِّرَاتُ؟ قال: «الرُّؤْيَا الصَّالِحَةُ» رواه البخاري.

838. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం: ఒకసారి దైవప్రవక్త (సల్లం) తన అనుచరులకు హితబోధ చేస్తూ, "ప్రవక్త పదవి (నబువ్వత్) భాగాలలో ఇక శుభవార్తాహరులు మాత్రమే మిగిలు న్నారు" అని చెప్పారు.

అది విని అనుచరులు సందేహపడుతూ, "శుభవార్తాహరులంటే ఎవరు?" అని అడిగారు. దానికాయన "శుభ వార్తా హరులంటే మంచి కలలు" అని చెప్పారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని తాబీర్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

కలలో మనిషి భయంకరమైన, బాధాకరమైన, సంతోషకరమైన, ఉత్సాహకరమైన దృశ్యాలెన్నో చూస్తుంటాడు. కొన్నిసార్లు భవిష్యత్తులో జరగబోయే సంఘటనలు ముందుగానే కలలోకి రావటంలోనూ ఆశ్చర్యం లేదు. పూర్వకాలంలో ప్రవక్తలకు వచ్చే కలలు నిజమయ్యేవి. అయితే అంతిమ దైవప్రవక్త ముహమ్మద్ (సల్లం)తో ప్రవక్తల పరంపర ముగిసిపోయింది. ఇక ఆయన తర్వాత ప్రపంచంలో మరో ప్రవక్త ప్రభవించే అవకాశాలు లేవు. కనుక వహీ (దైవవాణి) అవతరణ కూడా జరగదు. కాని ప్రవక్త పదవికి సంబంధించిన ఒక విషయం ప్రళయం వరకూ

కొనసాగుతూనే ఉంటుంది. అదే మంచి కలలు రావటం. సత్యవంతులయిన విశ్వాసులకు స్వప్నావస్థలో భవిష్యత్తులో జరగబోయే సంఘటనలు చూపించబడతాయి.

٨٣٩ ـ وعنه أن النَّبِيَّ ﷺ قال: «إذَا اقْتَرَبَ الزَّمَانُ لَمْ تَكَدْ رُؤْيَا المُؤْمِنِ تَكذِبُ، وَرُؤْيَا المُؤْمِنِ جُزْءٌ مِنْ سِتَّةٍ وَأَرْبَعِينَ جُزْءاً مِنَ النُّبُوَّةِ» متفقٌ عليه. وفي روايةٍ: «أَصْدَقُكُم رُؤْيَا أَصْدَقُكُم حَدِيثاً».

839. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ప్రళయం సమీపించే కాలంలో విశ్వాసికి వచ్చే కలలు సాధారణంగా అసత్యమైనవి కాజాలవు. ప్రవక్త పదవి (నబువ్వత్)లోని నలభై ఆరు భాగాలలో విశ్వాసికి వచ్చే కల కూడా ఒకటి. *(బుఖారీ - ముస్లిం)*

వేరొక హదీసులో ఇలా ఉంది : మీలో కలల విషయంలో అందరికన్నా సత్యవంతుడయినవాడే మాటల్లోనూ అందరికన్నా సత్యవంతుడయి ఉంటాడు.

*(సహీహ్ బుఖారీలోని తాబీర్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని స్వప్న ప్రకరణం)*

٨٤٠ ـ وعنه قال: قال رسولُ اللهِ ﷺ: «مَنْ رَآنِي فِي المَنَامِ فَسَيَرَانِي فِي اليَقَظَةِ ـ أَوْ كَأَنَّمَا رَآنِي فِي اليَقَظَةِ ـ لا يَتَمَثَّلُ الشَّيْطَانُ بِي». متفقٌ عليه.

840. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) తన అనుచరులకు హితబోధ చేస్తూ, "నన్ను స్వప్నావస్థలో చూసినవాడు త్వరలోనే (అంటే ప్రళయదినాన) జాగృదావస్థలో కూడా నన్ను చూస్తాడు (లేక ఆయన) అతను నన్ను జాగృదావస్థలో చూసినట్లే. ఎందుకంటే షైతాన్ నా రూపంలో (కలలోకి) రాలేడు" అని చెప్పారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని తాబీర్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని స్వప్న ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో రెండు విషయాలు బోధించబడ్డాయి. వాటిలో ఏది దైవప్రవక్త (సల్లం) చెప్పినదో ఉల్లేఖకునికి గుర్తులేదు. మొదటిమాట చెప్పిఉన్నట్లయితే - కలలో దైవప్రవక్తను

చూసిన వ్యక్తికి ప్రళయదినాన కూడా ఆయన దర్శన భాగ్యం లభిస్తుంది అని భావం. మరోమాటలో చెప్పాలంటే ఆ కల ఆ వ్యక్తి విశ్వాసాన్ని ధృవీకరిస్తుందన్నమాట!

ఒకవేళ దైవప్రవక్త (సల్లం) చెప్పినది రెండోమాట అయితే దాని భావం తెలుస్తూనే ఉంది. కలలో దైవప్రవక్త (సల్లం) ను చూస్తే నిజంగానే ఆయన్ని చూసినట్లుగా భావింపబడు తుంది. ఎందుకంటే ఇతరులెవరూ దైవప్రవక్త రూపంలో కనిపించరు. షైతాన్ దైవప్రవక్త (సల్లం) రూపంలో మనుషుల కలల్లోకి రాలేడు. అయితే యిక్కడ ఒక విషయం గమనార్హం. షైతాన్ దైవప్రవక్త రూపంలో మానవుల కలల్లోకి రాలేడు కాని మరెవరినో చూపించి ఈయనే దైవప్రవక్త అని భ్రమ మాత్రం కలిగించగలడు. అందుకని ముస్లిం అయిన ప్రతి వ్యక్తికీ హదీసుల్లో చెప్పబడిన విధంగా దైవప్రవక్తగారి రూపురేఖలు గుర్తుండాలి.

٨٤١ - وعن أبي سعيد الخدري رضي الله عنه أنه سمع النبيَّ ﷺ يقول: «إِذَا رَأَى أَحَدُكُمْ رُؤْيَا يُحِبُّهَا، فَإِنَّمَا هِيَ مِنَ اللهِ تعالى، فَلْيَحْمَدِ اللهَ عَلَيْهَا، وَلْيُحَدِّثْ بِهَا- وفي رواية: فَلَا يُحَدِّثْ بِهَا إِلَّا مَنْ يُحِبُّ - وَإِذَا رَأَى غَيْرَ ذٰلِكَ مِمَّا يَكْرَهُ، فَإِنَّمَا هِيَ مِنَ الشَّيْطَانِ، فَلْيَسْتَعِذْ مِنْ شَرِّهَا، وَلَا يَذْكُرْهَا لِأَحَدٍ، فإنها لا تَضُرُّهُ» متفق عليه.

841. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధి స్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) తెలియజేశారు: మీకు సంతోషకరమైన కలలు దేవుని తరపు నుండి వస్తాయి. కనుక అలాంటి కలలు వచ్చినప్పుడు దైవానికి కృత జ్ఞతలు తెలుపుకోవాలి. ఆ కల గురించి ఇతరులకు చెప్పుకోవాలి. వేరొక ఉల్లేఖనంలో 'తను యిష్టపడేవారికి మాత్రమే చెప్పుకోవాలి' అని ఉంది.

కాని మీలో ఎవరయినా కలలో అవాంఛ నీయమయిన విషయమేద యినా చూస్తే, అది షైతాన్ తరపు నుండి వచ్చిం దని గ్రహించాలి. కనుక అతను వాటి కీడు నుండి శరణు వేడుకోవాలి. దాని గురించి ఎవరితోనూ చెప్పుకోకూడదు. ఆ కల వల్ల అతనికి ఎలాంటి నష్టం జరగదు. (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని తాబీర్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని స్వప్న ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో మంచి మరియు చెడు- రెండు రకాల కలలగురించీ కొన్ని సూచనలు ఇవ్వబడ్డాయి. మంచి కలలు దేవుని తరపునుంచి శుభవార్తల్లాంటివి. వాటి గురించి ఇతరులకు

తెలియజేయదలచుకుంటే కేవలం మీ సన్నిహితులు, మీ శ్రేయం కోరే ఆత్మీయులకు మాత్రమే తెలియజేయాలి. కనిపించినవారికల్లా ఆ కలల గురించి తెలియజేయకుండా ఉండటమే మంచిది. ఎందుకంటే మీ పట్ల అసూయ ఉన్నవారిలో ఆ శుభవార్తలు మరింత అసూయను రగిలించవచ్చు.

ఇకపోతే చెడు కలలు : వీటిగురించి ఎవరితోనూ చెప్పకుండా ఉండటమే మంచిది. ఎందుకంటే సాధారణంగా ఇవి షైతాన్ దుష్ప్రేరణల వల్ల వస్తాయి. ప్రజలకు ఆ కలలు చెబితే వారు దుశ్శకునాలు చెప్పి మిమ్మల్ని మరింతగా భయపెడ్తారు. అలాంటి కలలు వచ్చినప్పుడు దైవాన్ని శరణువేడుకోవాలి. దైవం మీద గట్టి నమ్మకంతో, విశ్వాసంతో ఉండాలి. ఇన్షాఅల్లాహ్ వాటివల్ల ఎలాంటి నష్టం జరుగదు.

٨٤٢ ـ وعن أبي قَتَادَةَ رضي الله عنه قال: قال النبيُّ ﷺ: «الرُّؤْيَا الصَّالِحَةُ - وفي روايةٍ: الرُّؤْيَا الحَسَنَةُ - مِنَ اللهِ، وَالحُلُمُ مِنَ الشَّيْطَانِ فَمَنْ رَأَى شَيئاً يَكْرَهُهُ فَلْيَنْفُثْ عَنْ شِمَالِهِ ثَلاثاً، وَلْيَتَعَوَّذْ مِنَ الشَّيْطَانِ؛ فَإِنَّهَا لا تَضُرُّهُ» متفقٌ عليه.

«النَّفْثُ»: نَفخٌ لطيفٌ لا رِيقَ مَعَهُ.

842. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మంచి కలలు దేవుని తరఫు నుండి వస్తాయి. చెడ్డ కలలు షైతాన్ తరఫు నుండి వస్తాయి. కనుక ఎవరికయినా కలలో ఏదయినా చెడు విషయం కన్పిస్తే ఎడమవైపున మూడు సార్లు థూ... థూ అని చెప్పి షైతాన్ బారినుండి శరణు వేడుకోవాలి. అలా చేస్తే ఆ కల వల్ల అతనికి ఎలాంటి నష్టం జరగదు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని తాబీర్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని స్వప్న ప్రకరణం)*

٨٤٣ ـ وعن جابرٍ رضي الله عنه عن رسولِ اللهِ ﷺ قال: «إذَا رَأَى أَحَدُكُمُ الرُّؤْيَا يَكْرَهُهَا، فَلْيَبْصُقْ عَنْ يَسَارِهِ ثَلاثاً، وَلْيَسْتَعِذْ بِاللهِ مِنَ الشَّيطانِ ثَلاثاً، وَلْيَتَحَوَّلْ عَنْ جَنْبِهِ الذي كان عليه». رواه مسلم.

843. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీలో ఎవరికయినా చెడ్డ కల వస్తే మేల్కొన్న వెంటనే అతను ఎడమ వైపున మూడుసార్లు థూథూ అని మెల్లిగా ఉమ్మివేసి షైతాన్ బారినుండి మూడుసార్లు దేవుడ్ని శరణువేడుకోవాలి. ఆ తర్వాత మరో వైపుకు తిరిగి పడు కోవాలి. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని తాబీర్ ప్రకరణం)*

844. హజ్రత్ అబుల్ అస్ఖా వాసిలా బిన్ అస్ఖా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు: కన్న తండ్రిని వదలి వేరే వ్యక్తిని తన కన్న తండ్రిగా సూచించుకోవటం, (కలలో) చూడని దాన్ని చూశానని చెప్పటం, దైవప్రవక్త (సల్లం) చెప్పని విషయాన్ని చెప్పినట్లు ఆయనకు అబద్ధం ఆపాదించటం ఘోరమైన అపనిందలు. (బుఖారీ)

٨٤٤ - وعن أبي الأسقع وَاثِلَةَ بنِ الأسقع رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «إنَّ مِن أعظمِ الفِرَى أن يَدَّعِيَ الرَّجُلُ إلى غَيْرِ أبِيهِ، أوْ يُرِيَ عَيْنَهُ مَا لَم تَرَ، أوْ يَقُولَ على رسولِ اللهِ ﷺ مَا لم يَقُلْ» رواه البخاري.

*(సహీహ్ బుఖారీలోని మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కన్న తండ్రిని వదలి వేరే వ్యక్తిని కన్న తండ్రిగా సూచించుకోవటం ఘోరపాపం. అది ఎన్నో దుష్పరిణామాలకు దారితీస్తుంది. రక్త సంబంధాన్ని వక్రీకరించుకొని చెప్పుకోవటం వల్ల మానవ సంబంధ బాంధవ్యాల్లో తీవ్రమైన సంక్షోభం ఏర్పడుతుంది. ఆఖరికి వ్యవస్థ అంతా అస్తవ్యస్తంగా తయారయ్యే ప్రమాదముంది. అందుకే రక్త సంబంధాన్ని వక్రీకరించుకొని చెప్పేవారికి దేవుడు స్వర్గాన్ని నిషేధిస్తాడని దైవప్రవక్త (సల్లం) హెచ్చరించారు.

హదీసులో చెప్పబడిన రెండో విషయం తమకు వచ్చే కలలను గురించి అబద్ధం చెప్పటం. మనిషి ఇతరులు తనను గౌరవిస్తారనో లేక తన కల గురించి విన్నవారు తనను పొగుడుతారనో తన కల గురించి అబద్ధం చెబుతాడు. ఉన్నవీ, లేనివి కల్పించి వివరిస్తాడు. వాస్తవానికి కలలో చూడని విషయాన్ని చూశానని చెప్పటం దేవునికి అబద్ధం ఆపాదించటంతో సమానం. దేవుడు తనకు చూపించని విషయాన్ని చూపించాడని చెప్పటం ఎంత నేరం?! తనకే అబద్ధం ఆపాదించే సాహసానికి ఒడిగట్టిన వారికి దేవుడు ఎంతటి కఠినమైన శిక్ష విధిస్తాడో వేరే చెప్పనక్కర్లేదు.

ఇకపోతే చివరి విషయం, దైవప్రవక్త (సల్లం)కు అబద్ధాలు ఆపాదించటం. ఇది కూడా మహాపాపం. దైవప్రవక్త (సల్లం) చెప్పని విషయాన్ని చెప్పినట్లు ప్రకటిస్తే ఆయన అనుచర సమాజాన్ని అపమార్గానికి లోనుచేయటానికి ప్రయత్నించినట్లవుతుంది. అందుకే తన మీద అబద్ధం కల్పించి చెప్పేవారు తప్పకుండా నరకానికి పోతారని దైవప్రవక్త (సల్లం) హెచ్చరించారు.

# ٥ - كِتَابُ السَّلَام

# 5. సలాం ప్రకరణం

**131వ అధ్యాయం**

## ١٣١ - بَابُ فَضْلِ السَّلَامِ وَالأَمْرِ بِإِفْشَائِهِ

## సలాం విశిష్టత, దాన్ని సర్వసామాన్యం చేయాలన్న ఆదేశం గురించి

قال الله تعالى: ﴿ يَا أَيُّهَا الَّذِينَ آمَنُوا لَا تَدْخُلُوا بُيُوتًا غَيْرَ بُيُوتِكُمْ حَتَّى تَسْتَأْنِسُوا وَتُسَلِّمُوا عَلَى أَهْلِهَا ﴾ [النور: ٢٧]. وقال تعالى: ﴿ فَإِذَا دَخَلْتُمْ بُيُوتًا فَسَلِّمُوا عَلَى أَنْفُسِكُمْ تَحِيَّةً مِنْ عِنْدِ اللَّهِ مُبَارَكَةً طَيِّبَةً ﴾ [النور: ٦١]. وقال تعالى: ﴿ وَإِذَا حُيِّيتُمْ بِتَحِيَّةٍ فَحَيُّوا بِأَحْسَنَ مِنْهَا أَوْ رُدُّوهَا ﴾ [النساء: ٨٦]. وقال تعالى: ﴿ هَلْ أَتَاكَ حَدِيثُ ضَيْفِ إِبْرَاهِيمَ الْمُكْرَمِينَ ۝ إِذْ دَخَلُوا عَلَيْهِ فَقَالُوا سَلَامًا قَالَ سَلَامٌ ﴾ [الذاريات: ٢٤، ٢٥].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"విశ్వసించిన ప్రజలారా! మీ ఇళ్ళల్లోకి తప్ప ఇతరుల ఇళ్ళల్లోకి ఇంటివారి అంగీకారం పొందనంతవరకు, ఇంటివారికి సలామ్ చేయనంత వరకు (లోనికి) ప్రవేశించకండి." *(అన్ నూర్ : 27)*

"ఇళ్ళల్లోకి ప్రవేశించినప్పుడు మీరు మీ వాళ్ళకు సలామ్ చేయండి. ఇది మేలు కొరకు చేయబడే ప్రార్థన. అల్లాహ్ తరఫునుండి నిర్ణయించబడింది." *(అన్ నూర్ : 61)*

"మీకు ఎవరయినా గౌరవభావంతో సలామ్ చేస్తే వారికి మీరు అంతకంటే ఉత్తమమైన పద్ధతిలో ప్రతి సలామ్ చెయ్యండి లేదా కనీసం అదే విధంగానయినా చెయ్యండి." *(అన్ నిసా : 86)*

"ఓ ప్రవక్తా! ఇబ్రాహీమ్ యొక్క గౌరవనీయులైన అతిథుల గాథ కూడా నీకు చేరిందా? వారు అతని వద్దకు వచ్చి, 'మీకు సలామ్' అని అన్నారు. అతను, 'మీకు కూడా సలామ్' అని అన్నాడు."

845. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)ను, "ఇస్లాంలో అన్నిటికన్నా శ్రేష్ఠమైన ఆచరణ ఏది?" అని అడిగాడు. దానికి దైవప్రవక్త (సల్లం), "నువ్వు (ఆకలి గొన్నవారికి) అన్నం పెట్టు. పరిచయమున్నా లేకపోయినా ప్రతివ్యక్తికీ సలాం చెయ్యి. (అన్నిటికంటే శ్రేష్ఠమైన ఆచరణ ఇదే)" అని బోధించారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని విశ్వాస ప్రకరణాలు)*

٨٤٥ ـ وعن عبد اللهِ بنِ عمرِو بنِ العاص رضي الله عنهما أن رجلاً سَأَلَ رسولَ اللهِ ﷺ: أيُّ الإسلام خيرٌ؟ قالَ: «تُطْعِمُ الطَّعَامَ، وَتَقْرَأُ السَّلامَ عَلى مَنْ عَرَفْتَ وَمَنْ لَمْ تَعْرِفْ» متفقٌ عليه.

## ముఖ్యాంశాలు

నిరుపేదలకు, ఆకలిగొన్నవారికి అన్నం తినిపించటం చాలా గొప్ప పని. ఇందులో అవసరాల్లో ఉన్నవారి అవసరాలు తీర్చటం అనే అర్థం కూడా ఉంది. అదేవిధంగా పరిచయమున్నా లేకపోయినా ప్రతి ఒక్కరికీ సలాం చేయటం కూడా చాలా గొప్ప లక్షణం. ఈ రెండు పనులూ ఎలాంటివంటే - వీటివల్ల పరస్పరం ప్రేమాభిమానాలు పెంపొందుతాయి. హృదయాల్లో ఉండే అక్కసు, అసూయ, ద్వేషభావాలు నశిస్తాయి. ఇంకో విషయం ; సలాం అంటే 'అస్సలాము అలైకుమ్' అని చెప్పటమేగాని నమస్తే, ఆదాబ్ అర్జ్, గుడ్‌మార్నింగ్ మొదలగు పరిచయవాక్యాలు కావు. ఇవి సలాం క్రిందికి రావు. అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త బోధించిన పద్ధతి ఉండగా పరుల, పాశ్చాత్యుల పోకడలను అనుసరించటం తప్పు. అంతేకాదు, ధర్మనిర్లక్ష్యం కూడాను.

846. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : దేవుడు ఆదంను సృష్టించిన తర్వాత ఆయనతో, "వెళ్ళు, వెళ్ళి ఆ కూర్చొని వున్న దైవదూతలకు సలాం చెయ్యి. దానికి వారు ఏం సమాధానమిస్తారో జాగ్రత్తగా విను. వారు పలికిన సలామే నీకూ, నీ సంతానానికి సలాం (చేసే పద్ధతి) అవుతుంది" అని అన్నాడు. అప్పుడు ఆదం (అలైహి) వెళ్ళి వారికి 'అస్సలాము అలైకుం' అని

٨٤٦ ـ وعن أبي هريرةَ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «لَمَّا خَلَقَ اللهُ تعالى آدمَ ﷺ قال: اذْهَبْ فَسَلِّمْ عَلى أُولئكَ ـ نَفَرٍ مِنَ المَلائِكَةِ جُلُوسٍ ـ فاسْتَمِعْ ما يُحَيُّونَكَ، فإنَّها تَحِيَّتُكَ وَتَحِيَّةُ ذُرِّيَّتِكَ. فقال: السَّلامُ عَلَيْكُمْ، فقالوا: السَّلامُ عَلَيْكَ وَرَحْمَةُ اللهِ، فَزَادُوهُ: وَرَحْمَةُ اللهِ» متفقٌ عليه.

సలాం చేశారు. దానికి వారు 'అస్స లాము అలైకుం వ రహ్మతుల్లాహ్' అని ప్రతి సలాం చేశారు. వారు 'రహ్మ తుల్లాహ్' అనే పదాన్ని అదనంగా పలికారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని దైవప్రవక్తల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని స్వర్గ ప్రకరణం)*

847. హజ్రత్ అబూ ఉమారా బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) మాకు ఏడు విషయాలను గురించి ఆజ్ఞా పించారు : 1. వ్యాధిగ్రస్తుణ్ణి పరామర్శిం చటం. 2. శవం వెంట వెళ్ళటం. 3. తుమ్మిన వ్యక్తి (అల్‌హమ్దు లిల్లాహ్ అంటే అతని)కి సమాధానమివ్వటం. 4. బలహీనుడికి సహాయం చేయటం. 5. బాధితునికి సాయపడటం. 6. సలాంను సర్వసామాన్యం చేయటం. 7. ప్రమాణం చేసేవాని ప్రమాణాన్ని నెరవేర్చటం. *(బుఖారీ - ముస్లిం)*

٨٤٧ ـ وعن أبي عُمارةَ البَرَاءِ بنِ عـازِب رضـي الله عنهمـا قـال: أمـرنـا رسولُ اللهِ ﷺ بِسَبْعٍ: بِعِيَادَةِ المَرِيضِ، وَاتِّبَـاعِ الجَنَـائِزِ، وَتَشْمِيـتِ العَـاطِـسِ، وَنَصْرِ الضَّعيفِ، وَعَوْنِ المَظْلُومِ، وَإِفْشَاءِ السَّلامِ، وَإِبرارِ المُقْسِمِ. متفقٌ عليه، هذا لفظ إحدى روايات البُخَاري.

*(ఈ వాక్యాలు బుఖారీగారి ఒక ఉల్లేఖనంలోనివి)*

848. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీరు విశ్వసించన ంతవరకూ స్వర్గంలోకి ప్రవేశించలేరు. అలాగే మీరు పరస్పరం ప్రేమించుకో నంత వరకూ (పూర్తిగా) విశ్వసించలేరు. మీరు ఒండొకర్ని ప్రేమించుకోవాలంటే ఏం చేయాలో నేను మీకు తెల్పనా? మీ మధ్య సలాంను సర్వసామాన్యం చేసుకోండి (ఒండొకరికి ఎక్కువగా సలాములు చేస్తూ ఉండండి.) (ముస్లిం)

٨٤٨ ـ وعن أَبي هريرةَ رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «لَاتَدْخُلُوا الجَنَّةَ حَتَّى تُؤْمِنُـوا، وَلَا تُؤْمِنُوا حَتَّى تَحَابُّوا، أَوَلا أَدُلُّكُمْ عَلَى شَيْءٍ إذا فَعَلْتُمُوهُ تَحَـابَبْتُـمْ؟ أَفْشُـوا السَّـلامَ بَيْنَكُـمْ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

٨٤٩ ـ وعن أبي يوسفَ عبدِ الله بن سلام رضي الله عنه قال: سمعتُ رسولَ الله ﷺ يقول: «يَا أَيُّهَا النَّاسُ أَفْشُوا السَّلامَ، وَأَطْعِمُوا الطَّعَامَ، وَصِلُوا الأَرْحَامَ، وَصَلُّوا والنَّاسُ نِيامٌ، تَدْخُلُوا الجَنَّةَ بِسَلامٍ» رواه الترمذيُّ وقال: حديثٌ حسنٌ صحيحٌ.

849. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నానని అబూ యూసుఫ్ అబ్దుల్లాహ్ బిన్ సలామ్ (రజి) తెలియజేశారు : ప్రజలారా! సలాంను సర్వ సామాన్యం చెయ్యండి. (ఆకలిగొన్నవారికి) అన్నం పెట్టండి. బంధువుల యెడల ఉత్తమంగా మెలగండి. జనులు నిద్రపోయి ఉన్నప్పుడు (తహజ్జుద్) నమాజ్ చేయండి. వీటిని పాటిస్తే మీరు ప్రశాంతంగా స్వర్గంలోకి ప్రవేశిస్తారు. *(తిర్మిజీ - హసన్, సహీహ్)*

*(సుననె తిర్మిజీలోని అన్నపానీయాల అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

ఇద్దరు ముస్లింలు పరస్పరం కలుసుకున్నప్పుడు వారి మధ్య సంభాషణ మొదలవటానికి లేక పరస్పరం ప్రేమాభిమానాలను వ్యక్తం చేసుకోవటానికి ఇస్లాం ధర్మం ఒక చక్కని పరిచయ వాక్యాన్ని సూచించింది. అదే 'అస్సలాము అలైకుమ్' అని అనటం. పరిచితులయినా, అపరిచితులయినా ప్రతి ఒక్కరికీ సలాం చేయమంటోంది ఇస్లాం. "అస్సలాము అలైకుం" అంటే మీకు శాంతి కలుగుగాక! అని అర్థం. సలాం చేసేవ్యక్తి ఎదుటివ్యక్తి శ్రేయోశాంతుల కోసం దేవుణ్ణి ప్రార్థిస్తాడన్నమాట! పరస్పరం సలాం చేసుకునే ఈ ఆచారం ఈ నాటిది కాదు. ఆది మానవుడైన ఆదం ప్రవక్త కాలం నుంచే మానవుల మధ్య ఈ ఆచారం నడుస్తూ వస్తోంది. పైన పేర్కొనబడిన హదీసుల్లోని ఒక హదీసులో ఆదం (అలైహి) 'అస్సలాము అలైకుం' అని అంటే దానికి జవాబుగా దైవదూతలు "వ అలైకుముస్సలామ్ వ రహ్మతుల్లాహ్" అని ప్రతి సలాం చేశారు. అయితే మొదటగా సలాం చేసే వ్యక్తి స్వయంగా "అస్సలాము అలైకుమ్ వ రహ్మతుల్లాహి వ బరకాతుహూ" అని అనటం అభిలషణీయమనీ, దానివల్ల పుణ్యం కూడా ఎక్కువ లభిస్తుందని మరికొన్ని హదీసుల ద్వారా బోధపడుతోంది.

సలాం వల్ల ఎన్నో ప్రయోజనాలున్నాయి. దానివల్ల ఇద్దరి మధ్య ప్రేమ పెరుగుతుంది. పరస్పర భయభ్రాంతులు తొలగిపోతాయి. ఎదుటి వ్యక్తి శ్రేయాన్ని కాంక్షించినందుకు పుణ్యం కూడా లభిస్తుంది. దైవప్రవక్త సహచరులు కేవలం సలాం చేయటం కోసమే బజారుకు వెళ్ళేవారని రాబోయే హదీసులో చెప్పబడింది. దీనిద్వారా ఇస్లాం ధర్మంలో సలాంకు ఎంతటి ప్రాముఖ్యం ఉందో బోధపడుతోంది.

850. హజ్రత్ తుఫైల్ బిన్ ఉబై బిన్ కాబ్ తరచూ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి) దగ్గరికి వెళ్తుండేవారు. అలా వెళ్ళినప్పుడల్లా అబ్దుల్లాహ్ (రజి)తో పాటు సంతకు పోయేవారు. ఆయన ఇలా తెలియజేస్తున్నారు:

మేమిద్దరం సంతకు వెళ్ళినప్పుడు సంతలో పాత సామాన్లు అమ్మేవారు, వ్యాపారులు, అభాగ్యులు ఎవరు తారసిల్లితే వారికి అబ్దుల్లాహ్ (రజి) సలాం చేసేవారు. ఒకరోజు నేను ఆయన దగ్గరికి వెళ్ళాను. అప్పుడాయన తనతోపాటు నన్ను కూడా సంతకు రమ్మని పిలిచారు. అందుకు నేనాయనతో, "ఏమండీ, ఎందుకండి సంతకు? సంతలో ఏం చేస్తారు మీరు? మీరు ఏ వ్యాపారి దగ్గరా కూర్చోరు. ఏ సామాను గురించీ అడగరు. ఏ వస్తువునీ బేరమాడరు, ఆఖరికి సంతలో జరిగే సమావేశాల్లోనూ కూర్చోరు. అందుకని నా మాట విని ఇక్కడే కూర్చోండి. మనం ఇక్కడే మాట్లాడుకుందాం'' అని అన్నాను.

అందుకాయన "ఓయి బొజ్జవాడా! (తుఫైల్ కడుపు పెద్దగా ఉండేది) మనం కేవలం సలాం చేసే ఉద్దేశ్యంతో సంతకు వెళ్తున్నాం. సంతలో ఎవరు కానొస్తే వారికి సలాం చేస్తాం" అని అన్నారు. (ముఅత్తా. దీని ఆధారాలు దృఢమైనవి)

٨٥٠ ـ وعن الطُّفَيْلِ بنِ أُبَيِّ بنِ كَعْبٍ أنَّهُ كانَ يَأتي عبدَ الله بنَ عُمَرَ، فَيَغْدُو مَعَهُ إلى السُّوقِ، قال: فإذا غَدَوْنَا إلى السُّوقِ، لَمْ يَمُرَّ عبدُ اللهِ عَلى سَقَّاطٍ وَلا صاحِبِ بِيْعَةٍ، وَلَا مِسْكِينٍ، وَلَا أَحَدٍ إلَّا سَلَّمَ عَلَيْهِ، قال الطُّفَيْلُ: فَجِئْتُ عبدَ الله بنَ عُمَرَ يَوماً، فَاسْتَتْبَعَنِي إلى السُّوقِ، فَقُلْتُ لهُ: ما تَصْنَعُ بالسُّوقِ، وَأَنْتَ لا تَقِفُ عَلى البَيْعِ وَلَا تَسْأَلُ عَنِ السِّلَعِ، وَلَا تَسُومُ بهَا، وَلَا تَجْلِسُ في مَجَالِسِ السُّوقِ؟ وَأَقُولُ: اجْلِسْ بِنا هٰهُنا نَتَحَدَّثْ، فقال: يَا أَبَا بَطْنٍ! ـ وَكَانَ الطُّفَيْلُ ذا بَطْنٍ ـ إنَّمَا نَغْدُو مِنْ أَجْلِ السَّلام، فَنُسَلِّمُ عَلى مَنْ لَقِيناهُ. رواه مالك في الموطأ بإسنادٍ صحيحٍ.

*(ముఅత్తా ఇమామ్ మాలిక్‌లోని సలాం ప్రకరణం)*

## 132వ అధ్యాయం

# ١٣٢ ـ باب كَيْفِيَّةِ السَّلَامِ

# సలాంచేసే పద్ధతి

يُسْتَحَبُّ أَنْ يَقُولَ المُبْتَدِيءِ بِالسَّلام: السَّلامُ عَلَيْكُمْ وَرَحْمَةُ الله وَبَرَكَاتُهُ؛ فَيَأْتي بضَمِيرِ الجَمْعِ، وَإِنْ كانَ المُسَلَّمُ عَلَيْهِ واحِداً، وَيَقولُ المُجيبُ: وَعَلَيْكُمُ السَّلامُ وَرَحْمَةُ الله وَبَرَكَاتُهُ؛ فَيَأْتي بِواو العَطفِ في قوله: وَعَلَيْكُمْ.

సలాం చేయటంలో అభిలషణీయమైన పద్ధతి ఏమిటంటే, ఎదుటి వ్యక్తి ఒక్కడయినా సరే సలాం చేసే వ్యక్తి బహువచనాన్ని ఉపయోగిస్తూ, "అస్సలాము అలైకుం వ రహ్మతుల్లాహి వ బరకాతుహ్" అని అనాలి. దానికి సమాధానంగా ఎదుటి వ్యక్తి కూడా "వ అలైకుముస్సలాం వ రహ్మతుల్లాహి వ బరకాతుహ్" అని చెప్పాలి. ప్రతి సలాం చెప్పినప్పుడు అలైకుంకు ముందు 'వ' అని చెప్పాలి. (అంటే మీపై కూడా అని అర్థం).

٨٥١ ـ عن عِمْرَانَ بنِ الحُصَيْنِ رضي الله عنهما قال: جاءَ رَجُلٌ إلى النبيِّ ﷺ فقال: السَّلامُ عَلَيْكُمْ، فَرَدَّ عَلَيْهِ ثم جَلَسَ، فقال النبيُّ ﷺ: «عَشْرٌ» ثم جاءَ آخَرُ فقال: السَّلامُ عَلَيْكُمْ وَرَحْمَةُ اللهِ، فَرَدَّ عليهِ فَجَلَسَ، فقال: «عِشْرُون» ثم جَاءَ آخَرُ، فقال: السَّلامُ عَلَيكُم وَرَحْمَةُ الله وَبَرَكَاتُهُ، فَرَدَّ عَلَيْهِ فَجَلَسَ، فقال: «ثَلاثونَ» رواه أبو داود والترمذي وقال: حديث حسن.

851. హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, 'అస్సలాము అలైకుం' అని అన్నాడు. ఆయన అతనికి ప్రతి సలాం చేశారు. అతను కూర్చున్నాడు. అప్పుడాయన 'ఇతనికి పది పుణ్యాలు లభించాయి' అని అన్నారు. మరో వ్యక్తి వచ్చి, 'అస్సలాము అలైకుం వ రహ్మతుల్లాహ్' అన్నాడు. ఆయన అతనికి ప్రతి సలాం చేశారు. ఆ వ్యక్తి కూర్చున్నాడు. ఆయన 'ఇరవై పుణ్యాలు' అన్నారు. కాసేపటికి ఇంకో వ్యక్తి వచ్చి, 'అస్సలాము అలైకుం వ రహ్మతుల్లాహి వ బరకాతుహూ' అని అన్నాడు. ఆయన అతనికి సలాం చేయగా అతను కూడా కూర్చున్నాడు. అప్పుడాయన 'ముప్పై

పుణ్యాలు' అని అన్నారు. (అబూ దావూద్, తిర్మిజీ - హసన్)

*(సునన్ అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం, సునన్ తిర్మిజీలోని ఇస్తీజాన్ అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

'అస్సలాము అలైకుం' అని అంటే పది పుణ్యాలు, అదనంగా 'వ రహ్మతుల్లాహ్' అనంటే ఇరవై పుణ్యాలు, 'వ బరకాతుహ్' అనంటే ముప్పై పుణ్యాలు లభిస్తాయని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. వాటికన్నా ఎక్కువ పదాలు వాడటానికి హదీసుల్లో ఎక్కడా ఆధారాల్లేవు. కనుక అంతటితో ఆగిపోవటం ఉత్తమం.

852. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) నాతో మాట్లాడుతూ, "అదిగో, జిబ్రయీల్ దూత నీకు సలాం చెబుతున్నారు" అని అన్నారు. దానికి నేను, "వ అలైహిస్సలాం వ రహ్మతుల్లాహి వ బరకాతుహూ" అని ఆయనకు ప్రతి సలాం చేశాను. *(బుఖారీ - ముస్లిం)*

٨٥٢ ـ وعن عائشةَ رضي الله عنها قالتْ: قال لي رسولُ اللهِ ﷺ: «هذا جبريلُ يَقرَأُ عَلَيْكِ السَّلَامَ» قالَتْ: قُلتُ: «وَعَلَيْهِ السَّلامُ ورحمَةُ الله وَبَرَكَاتُه» متفقٌ عليه. وهكذا وقع في بعض روايات الصحيحين: «وَبَرَكَاتُه» وَفي بَعْضِها بحَذْفِهَا، وَزِيَادَةُ الثِّقَةِ مَقْبُولَةٌ.

*(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని మహిమోన్నతుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పరోక్షంగా ఉన్నవారికి ప్రతి సలాం చేసేటప్పుడు 'వ అలైహిస్సలాం వ రహ్మతుల్లాహి వ బరకాతుహూ' అని చెప్పాలి. అదే పరోక్ష వ్యక్తి స్త్రీ అయితే 'వ అలైహస్సలాం వ రహ్మతుల్లాహి వ బరకాతుహూ' అని చెప్పాలి.

853. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) దేనిగురించయినా చెప్పేటప్పుడు అందరికీ అర్థమయ్యే విధంగా ఒకేమాట మూడుసార్లు చెప్పేవారు. ఎవరి దగ్గరికయినా వెళ్ళినప్పుడు వారికి మూడుసార్లు సలాం చేసేవారు. *(బుఖారీ)*

٨٥٣ ـ وعن أنسٍ رضي الله عنه أنَّ النبيَّ ﷺ، كانَ إذا تكلَّمَ بكَلِمَةٍ أَعادَهَا ثلاثاً حَتى تُفهَمَ عنه، وَإذا أتى عَلى قَوْم فَسَلَّمَ عَلَيهِم سَلَّم عَلَيْهِم ثَلاثاً. رواه

البخاري. وهذا مَحْمُولٌ علَى مَا إذا كان الجَمْعُ كَثِيراً.

ఎదుటివారు అనేకమంది ఉన్నప్పుడు అలా చేసేవారని భావం.

*(సహీహ్ బుఖారీలోని విద్యా ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) ప్రజల మనోభావాలను ఎంతగానో గౌరవించేవారు. తన ప్రవర్తన వల్ల ఎవరి మనసూ నొచ్చుకోకుండా జాగ్రత్తపడేవారు. మనం కలవబోయే మనుషులు ఎంతమంది ఉన్నా అందరికీ సలాములు చెప్పి, అందరి సలాములకూ జవాబు పలకాల్సిన అవసరం లేదు. సమూహంలో ఉన్నవారందరికీ ఒకసారి సలాం చెబితే చాలు. అలాగే సమూహంలో ఉన్నవారందరూ సలాం చేసినా వారందరికీ ఒక సలాం చేసినా సరిపోతుంది. కాని దైవప్రవక్త (సల్లం) ఎవరి మనసూ నొచ్చుకోకూడదని ఒకటికి మూడుసార్లు సలాం చెప్పేవారు.

٨٥٤ ـ وعن المِقْدَادِ رضي الله عنه في حديثِهِ الطويل قال: كُنَّا نَرفَعُ للنَّبيِّ ﷺ نَصيبَهُ مِنَ اللَّبَنِ، فَيَجِيءُ مِنَ اللَّيْلِ، فَيُسَلِّمُ تَسليماً لا يُوقِظُ نَائماً، وَيُسْمِعُ اليَقظَانَ، فَجاءَ النبيُّ ﷺ فَسَلَّمَ كما كان يُسَلِّمُ. رواه مسلم.

854. హజ్రత్ మిఖ్దాద్ (రజి) ఓ సుదీర్ఘమైన హదీసుని వివరిస్తూ ఇలా అన్నారు : దైవప్రవక్త (సల్లం) వంతు పాలను మేము వేరుగా ఎత్తిపెట్టేవాళ్ళం. ఆయన కొంతరాత్రి గడిచిన తర్వాత వచ్చి నిద్రపోయినవారు మేల్కొనకుండా ఉండే విధంగా, మేల్కొని ఉన్న వారికి వినపడేలా సలాం చేసేవారు. ఆ రోజు కూడా దైవప్రవక్త (సల్లం) వచ్చి అలాగే సలాం చేశారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని పానీయాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కొంతమంది నిద్రపోతూ మరికొంతమంది మేల్కొని ఉన్నప్పుడు వారికి సలాం ఎలా చెయ్యాలో ఈ హదీసులో వివరించబడింది. అటువంటి సందర్భాల్లో నిద్రపోతున్నవారి నిద్రకు భంగం కలిగించకుండా మేల్కొని ఉన్నవారు వినగలిగేంత మెల్లిగా సలాం చెబితే చాలు.

٨٥٥ ـ وعن أَسْمَاءَ بِنتِ يزيدَ رضي الله عنها أن رسولَ اللهِ ﷺ مَرَّ في المَسْجِدِ يَوماً، وَعُصبةٌ مِنَ النِّسَاءِ قُعودٌ،

855. హజ్రత్ అస్మా బిన్తె యజీద్ (రజి.అన్హా) కథనం : ఒకసారి మస్జిద్ దగ్గర ఓ మహిళా సమూహం కూర్చొని ఉండగా దైవప్రవక్త (సల్లం) అటుగా

فَأَلْوى بِيَدِهِ بِالتَّسْلِيم. رواه الترمذي وقال: حديث حسن. وهٰذا مَحْمُولٌ عَلى أنه ﷺ جَمَعَ بَيْنَ اللَّفظ والإِشَارَة، ويُؤَيِّدُهُ أن في رِوايَةِ أَبِي داود: «فَسَلَّمَ عَلَيْنَا».

వెళ్తూ చేతి సంజ్ఞతో వారికి సలాం చేశారు.
(తిర్మిజీ - హసన్)

ఆయన చేతి సంజ్ఞతోపాటు నోటితో అస్సలాము అలైకుం కూడా చెప్పారని దీని భావం. అబూ దావూద్‌లోని వేరొక హదీసు ఈ విషయాన్ని ధృవీకరిస్తోంది. అందులో 'ఆయన మాకు సలాం చెప్పారు' అని ఉంది.

(సుననె తిర్మిజీలోని ఇస్తీజాన్ అధ్యాయాలు)

## ముఖ్యాంశాలు

1. దూరంలో ఉన్నవారికి సలాం చేసే ఉద్దేశ్యంతో చేత్తో సైగ చేయటం ముస్లిమేతరుల పద్ధతి. కనుక దూరంలో ఉన్నవారికి సలాం చేసేటప్పుడు చేత్తో సంజ్ఞ చేయటంతో పాటు నోటితో 'అస్సలాము అలైకుం' అని కూడా చెప్పాలి.
2. స్త్రీలకు సలాం చేయటంలో ఎంతైనా జాగ్రత్త పాటించటం అవసరం. వృద్ధ మహిళలకు సలాం చేయవచ్చు. కాని పరస్త్రీలకు, ముఖ్యంగా యువతులకు సలాం చేసే విధానం ఎన్నో అలజడులకు, ఉపద్రవాలకు దారితీయవచ్చు. అందుకని వయసులో ఉన్న ఆడవాళ్ళకు, యువతులకు సలాం చేయటం నిషిద్ధంగా ఖరారు చేయబడింది.

٨٥٦ ـ وعن أبي جُرَيّ الهُجَيْمِيِّ رضي الله عنه قال: أَتَيْتُ رسولَ اللهِ ﷺ فَقُلْتُ: عَلَيْكَ السَّلامُ يا رسولَ اللهِ! قَالَ: «لا تَقُل: عَلَيْكَ السَّلامُ، فَإِنَّ عَلَيْكَ السَّلامُ تَحِيَّةُ المَوْتىٰ». رواه أبو داود، والترمذي وقال: حديث حسن صحيح. وقد سبق بطوله.

856. హజ్రత్ అబూ జురై హుజైమీ (రజి) కథనం : నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి, "దైవప్రవక్తా! అలైకస్సలాం' అని అన్నాను. అందుకాయన, 'అలైకస్సలాం' అనకు, అలైకస్సలాం అనేది చనిపోయిన వారికి చెప్పే సలాం' అని బోధించారు.
(అబూ దావూద్, తిర్మిజీ - హసన్, సహీహ్)

133వ అధ్యాయం

# ١٣٣ ـ بَابُ آدَابِ السَّلَامِ

# సలాం నియమాలు

٨٥٧ ـ عن أبي هريرةَ رضي الله عنه أن رسولَ اللهِ ﷺ قال: «يُسَلِّمُ الرَّاكِبُ عَلى المَاشي، والمَاشي عَلى القَاعِدِ، وَالقَلِيلُ عَلى الكَثِيرِ» متفقٌ عليه. وفي روايةٍ للبخاري: «وَالصَّغِيرُ عَلى الكبيرِ».

857. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : వాహనం మీద వెళ్తున్న వ్యక్తి కాలి నడకన వెళ్ళేవ్యక్తికి సలాం చెయ్యాలి. అలాగే నడిచి వెళ్ళేవాడు కూర్చున్న వ్యక్తికి, తక్కువ మంది ఎక్కువ మందికి సలాం చెయ్యాలి.

(బుఖారీ - ముస్లిం)

బుఖారీలోని వేరొక ఉల్లేఖనంలో అదనంగా "పిల్లలు పెద్దలకు సలాం చేయాలి" అని ఉంది.

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

٨٥٨ ـ وعن أبي أُمَامَةَ صُدَيِّ بنِ عَجْلانَ البَاهِلِيِّ رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «إنَّ أَوْلى النَّاسِ باللهِ مَنْ بَدَأَهم بالسَّلامِ». رواه أبو داود بإسنادٍ جيدٍ.

858. హజ్రత్ అబూ ఉమామా సుదై బిన్ అజ్‌లాన్ బాహిలీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ముందుగా సలాం చేసేవారు దేవుని దృష్టిలో ప్రజలందరిలోకెల్లా శ్రేష్ఠులు.

(అబూ దావూద్ దీనిని మంచి ఆధారాలతో వెలికితీశారు)

ఇమామ్ తిర్మిజీ కూడా ఈ హదీసుని అబూ ఉమామా (రజి) ఆధారంగా వెలికితీశారు. అందులో ఇలా ఉంది: "దైవప్రవక్తా! ఇద్దరు మనుషులు కలుసు

ورواه الترمذي عن أبي أُمَامَةَ رضي الله عنه: قِيلَ: يا رسولَ اللهِ! الرَّجُلانِ يَلْتَقِيَانِ، أَيُّهُما يَبْدَأُ بِالسَّلَامِ؟ قَالَ: «أَوْلاهُمَا بِاللهِ تعالى». قال الترمذي: هذا حديثٌ حسنٌ.

కున్నప్పుడు వారిలో ఎవరు ముందుగా సలాం చేయాలి?'' అని దైవప్రవక్త (సల్లం)ను ఎవరో అడిగారు. దానికాయన "వారిరువురిలో దైవానికి అత్యంత సన్నిహితులు సలాం చెయ్యాలి'' అని చెప్పారు. (తిర్మిజీ - హసన్)

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం, సుననె తిర్మిజీలోని ఇస్తీజాన్ అధ్యాయాలు)*



134వ అధ్యాయం

## ١٣٤ - بَابُ اسْتِحْبَابِ إِعَادَةِ السَّلَامِ عَلَى مَنْ تَكَرَّرَ لِقَاؤُهُ عَلَى قُرْبٍ بِأَنْ دَخَلَ ثُمَّ خَرَجَ، ثُمَّ دَخَلَ فِي الْحَالِ، أَوْ حَالَ بَيْنَهُمَا شَجَرَةٌ وَنَحْوُهَا

## మాటిమాటికీ సలాం చేసుకుంటూ ఉండటం అభిలషణీయం. ఒకసారి సలాం చేసుకున్నాక లోపలికి వెళ్ళివచ్చినా లేక ఇరువురి మధ్య ఏదయినా వస్తువు అడ్డం వచ్చినా మళ్ళీ సలాం చేసుకుంటే మంచిది

٨٥٩ - عن أبي هُريرةَ رضيَ اللهُ عنه في حَديثِ المُسيءِ صَلاَتَهُ أنهُ جاءَ فصلى، ثُمَّ جاءَ إلى النبيِّ ﷺ، فَسَلَّمَ عَلَيْهِ، فَرَدَّ عَلَيْهِ السَّلامَ، فقال: «ارجِع فَصَلِّ، فإنَّكَ لَمْ تُصَلِّ» فرَجَعَ فَصَلَّى، ثُمَّ جاءَ فَسَلَّمَ عَلى النَّبيِّ ﷺ، حَتى فَعَلَ ذلكَ ثَلاثَ مَرَّاتٍ. متفقٌ عليه.

859. హజ్రత్ అబూ హురైరా (రజి) అధ్వాన్నంగా నమాజ్ చేసిన ఒక వ్యక్తి గురించి తెలియజేస్తూ ఇలా అన్నారు : ఆ వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి ఆయనకు సలాం చేశాడు. దైవప్రవక్త (సల్లం) అతనికి ప్రతి సలాం చేసి, "వెళ్ళి ఇంకోసారి నమాజ్ చెయ్యి. నువ్వసలు నమాజ్ చెయ్యలేదు" అన్నారు. ఆ వ్యక్తి వెళ్ళి తిరిగి నమాజ్ చేశాడు. నమాజ్ చేసుకొని వచ్చి దైవప్రవక్త (సల్లం)కు మళ్ళీ సలాం చేశాడు. (దైవప్రవక్త (సల్లం) అతనికి ప్రతి సలాం చేసి మళ్ళీ నమాజ్ చేయమని ఆదేశించారు). ఆ వ్యక్తి ఆ విధంగా మూడుసార్లు చేశాడు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని అజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నమాజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

కొద్ది కొద్ది సేపటికి సలాం చేసుకుంటూ ఉండాలని పై హదీసు ద్వారా నిరూపించ బడింది. ఈ విషయాన్నే గ్రంథకర్త సదరు అధ్యాయానికి శీర్షికగా పెట్టారు.

٨٦٠ - وعنه عَنْ رسولِ اللهِ ﷺ قال: «إذا لقِيَ أَحَدُكُمْ أَخاه، فَلْيُسَلِّمْ عَلَيْهِ، فَإِنْ حَالَتْ بَيْنَهُمَا شَجَرَةٌ، أَوْ جِدَارٌ، أَوْ حَجَرٌ، ثُمَّ لَقِيَهُ، فَلْيُسَلِّمْ عَلَيْهِ» رواه أبو داود.

860. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీలో ఎవరయినా తమ సోదరుణ్ణి కలుసుకున్నప్పుడు అతనికి సలాం చేయాలి. ఆ తర్వాత తమ మధ్య చెట్టు, గోడ, రాయి (లాంటిది) అడ్డు వచ్చి తిరిగి కలుసుకుంటే మళ్ళీ (ఇంకోసారి) సలాం చేసుకోవాలి. (అబూ దావూద్)

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## 135వ అధ్యాయం

## ١٣٥ ـ بَابُ اسْتِحْبَابِ السَّلَامِ إِذَا دَخَلَ بَيْتَهُ

## మీ ఇంట్లోకి ప్రవేశించేటప్పుడు సలాం చేసి ప్రవేశించాలి

قال الله تعالى: ﴿فَإِذَا دَخَلْتُم بُيُوتًا فَسَلِّمُوا عَلَىٰ أَنفُسِكُمْ تَحِيَّةً مِّنْ عِندِ اللَّهِ مُبَارَكَةً طَيِّبَةً﴾ [النور: ٦١].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

“మీరు ఇళ్ళల్లోకి ప్రవేశించేటప్పుడు మీ వాళ్ళకు సలాం చేయండి. ఇది మేలు కొరకు చేయబడే ప్రార్థన. అల్లాహ్ తరఫు నుండి నిర్ణయించబడింది. *(అన్ నూర్ : 61)*

٨٦١ ـ وعن أنسٍ رضيَ الله عنه قالَ: قالَ لي رسولُ اللهِ ﷺ: «يَا بُنَيَّ! إذا دَخَلْتَ عَلى أهْلِكَ، فَسَلِّمْ، يَكُنْ بَرَكَةً عَلَيْكَ، وَعَلَى أَهْلِ بَيْتِكَ» رواه الترمذي وقال: حديث حسن صحيح.

861. హ్రజత్ అనస్ (రజి) కథనం : దైవ ప్రవక్త (సల్లం) నాకు హితబోధ చేస్తూ, “అబ్బాయీ! నువ్వు నీ ఇంట్లోకి ప్రవేశించేటప్పుడు సలాం చెయ్యి. దానివల్ల నీకూ, నీ ఇంటివారికి శుభం ప్రాప్తిస్తుంది” అని అన్నారు.

*(తిర్మిజీ - హసన్, సహీహ్)*

*(సుననె తిర్మిజీలోని ఇస్తీజాన్ అధ్యాయాలు)*

**136వ అధ్యాయం**

# ١٣٦ - بَابُ السَّلَامِ عَلَى الصِّبْيَانِ

# పిల్లలకు సలాం చేయటం

٨٦٢ - عن أنسٍ رضي الله عنه أنَّهُ مَرَّ عَلى صِبْيانٍ، فَسَلَّمَ عَلَيْهِمْ، وقال: كانَ رسولُ اللهِ ﷺ يَفْعَلُهُ. متفق عليه.

862. హజ్రత్ అనస్ (రజి) ఓసారి పిల్లల దగ్గర్నుంచి వెళ్తూ వారికి సలాం చేశారు. ఆ తర్వాత వారితో, "దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా చేసేవారు" అని చెప్పారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

అసలు నియమం ప్రకారం చూస్తే పిల్లలే పెద్దలకు సలాం చేయాలి. కాని అప్పుడప్పుడూ పెద్దలే తొందరపడి పిల్లలకు సలాం చేస్తూ ఉండాలి. దానివల్ల పిల్లలకు ముందుగా సలాం చేసే సదాచారం అలవడుతుంది. పిల్లలు ప్రతి విషయంలోనూ తమ పెద్దల్ని అనుకరిస్తారనే విషయాన్ని మర్చిపోకూడదు.



137వ అధ్యాయం

# ١٣٧ - بَابُ سَلَامِ الرَّجُلِ عَلَى زَوْجَتِهِ وَالْمَرْأَةِ مِنْ مَحَارِمِهِ وَعَلى أَجْنَبِيَّةٍ وَأَجْنَبِيَّاتٍ لاَ يَخَافُ الْفِتْنَةَ بِهِنَّ، وَسَلَامِهِنَّ بِهٰذَا الشَّرْطِ

# పురుషుడు తన భార్యకు, మహ్రామ్ స్త్రీలకు, చెడుకు తావు లేని పక్షంలో పర స్త్రీలకు, అలాగే స్త్రీలు పురుషులకు సలాం చేయటం ధర్మసమ్మతమే

٨٦٣ - عن سَهْلِ بن سَعْدٍ رضيَ اللهُ عَنْهُ قالَ: كانَتْ فِينا امْرَأَةٌ - وفي روايةٍ: كانَتْ لَنا عَجُوزٌ - تَأْخُذُ مِنْ أُصُولِ السِّلْقِ فَتَطْرَحُهُ في القِدْرِ، وَتُكَرْكِرُ حَبَّاتٍ مِنْ شَعِيرٍ، فَإِذا صَلَّيْنَا الجُمُعَةَ، وَانصَرَفْنَا، نُسَلِّمُ عَلَيْها، فَتُقَدِّمُهُ إِلَيْنَا. رواه البخاري.

قوله: «تُكَرْكِرُ» أيْ: تَطحَنُ.

863. హజ్రత్ సహ్ల్ బిన్ సాద్ (రజి) కథనం : మా వీధిలో ఒకావిడ ఉండేది. (వేరొక ఉల్లేఖనంలో ఒక వృద్ధురాలు ఉండేది అని ఉంది). ఆమె కుండలో బీట్‌రూట్ మూలికలను వేసి ఉడక బెట్టేది. ఇంకా కొన్ని బార్లీ గింజలు నూరి పెట్టేది. మేము జుమా నమాజ్ చేసుకొని తిరిగొచ్చేటప్పుడు ఆమెకు సలాం చేసేవాళ్ళం. ఆమె (మమ్మల్ని పిలిచి) మాకు ఆ అన్నం వడ్డించేది. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని జుమా ప్రకరణం)*

٨٦٤ - وعَنْ أُمِّ هَانِىءٍ فَاخِتَةَ بِنتِ أبي طالب رضيَ اللهُ عَنها قالَتْ: أَتَيْتُ النبيَّ ﷺ يَوْمَ الفَتْحِ وَهُوَ يَغْتَسِلُ، وَفَاطِمَةُ تَسْتُرُهُ بِثَوْبٍ، فَسَلَّمْتُ، وذكرتِ الحديث. رواه مسلم.

864. అబూ తాలిబ్ కుమార్తె ఉమ్మె హానీ ఫాఖ్తా (రజి.అన్హా) కథనం : మక్కా విజయం నాడు నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళాను. అప్పుడాయన స్నానం చేస్తున్నారు. ఫాతిమా (రజి.అన్హా) ఆయనకు ఓ గుడ్డ అడ్డం ఉంచారు. ఆ సందర్భంగా నేనాయనకు సలాం

చేశాను. ( తర్వాత ఆమె మిగతా హదీసు వివరించారు). *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని శుచీశుభ్రతల ప్రకరణం)*

٨٦٥ ـ وعن أسماءَ بنتِ يزيدَ رضي الله عنها قالت: مَرَّ عَلَيْنَا النبيُّ ﷺ في نِسْوَةٍ فَسَلَّمَ عَلَيْنَا. رواه أبو داود والترمذي وقال: حديث حسنٌ، وهذا لفظ أبي داود، ولفظ الترمذي: أَنَّ رسولَ الله ﷺ مَرَّ في المَسْجِدِ يوماً، وَعُصْبَةٌ مِنَ النِّسَاءِ قُعُودٌ، فَألْوَى بِيَدِهِ بِالتَّسْلِيمِ.

865. హ్రజత్ అస్మా బిన్తె యజీద్ (రజి.అన్హా) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) ఓ మహిళా సమూహం దగ్గర్నుంచి వెళ్ళారు. (ఆ సమూహంలో నేను కూడా ఉన్నాను). అప్పుడాయన మాకు సలాం చేశారు. (అబూ దావూద్, తిర్మిజీ - హసన్)

పై వాక్యాలు అబూ దావూద్‌వి. తిర్మిజీ వాక్యాలు ఈ విధంగా ఉన్నాయి : ఒక రోజు మస్జిద్ దగ్గర ఓ మహిళా సమూహం కూర్చొని ఉండగా దైవప్రవక్త (సల్లం) అటువైపు నుంచి వెళ్తూ వారికి చేతి సంజ్ఞతో సలాం చేశారు.

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం, సుననె తిర్మిజీలోని ఇస్తీజాన్ అధ్యాయాలు)*

## 138వ అధ్యాయం

## ١٣٨ - بَابُ تَحْرِيمِ ابْتِدَائِنَا الْكُفَّارَ بِالسَّلَامِ وَكَيْفِيَّةِ الرَّدِّ عَلَيْهِمْ وَاسْتِحْبَابِ السَّلَامِ عَلَى أَهْلِ مَجْلِسٍ فِيهِمْ مُسْلِمُونَ وَكُفَّارٌ

## దైవ తిరస్కారులకు ముందుగా సలాం చేయటం నిషిద్ధం. వారికి సలాం చేసే పద్ధతి. దైవతిరస్కారుల, ముస్లింల ఉమ్మడి సమావేశాల్లోనున్న వారికి సలాం చేయటం అభిలషణీయం

٨٦٦ ـ عن أبي هُرَيْرَةَ رضي الله عنه أنّ رسولَ اللهِ ﷺ قال: «لا تَبدَؤوا اليَهودَ ولا النَّصارى بالسَّلامِ، فإذا لقيتُم أحَدَهُم في طَريقٍ فَاضطَرُّوهُ إلى أَضْيَقِهِ» رواه مسلم.

866. హ॥జ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : యూదులకు, క్రైస్తవులకు మీరు ముందుగా సలాం చేయకండి. వారిలో ఎవరయినా మీకు దారిలో కనబడితే వారిని ఇరుకైన దారి గుండా నడిచేలా చేయండి. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

٨٦٧ ـ وعن أنسٍ رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «إذا سَلَّمَ عَلَيْكُم أهلُ الكِتابِ فَقولُوا: وَعَلَيكُم» متفقٌ عليه.

867. హ॥జ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : గ్రంథవహులు (యూదులు, క్రైస్తవులు) మీకు సలాం చేస్తే, దానికి మీరు "వ అలైకుమ్" అని (మాత్రమే) అనండి. (బుఖారీ - ముస్లిం)

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

٨٦٨ ـ وعن أُسامَةَ رضي الله عنه أنَّ النبيَّ ﷺ مَرَّ عَلى مَجلِسٍ فِيهِ أخلاطٌ مِنَ المُسْلِمِينَ والمُشْرِكِينَ ـ عَبَدَةِ الأوثانِ واليَهُودِ ـ فَسَلَّمَ عَلَيْهِم النبيُّ ﷺ. متفقٌ عليه.

868. హజ్రత్ ఒసామా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ముస్లింలు, ముష్రిక్‌లు - అంటే విగ్రహారాధకులు, యూదులు - కలిసి కూర్చున్న సమావేశం దగ్గర్నుంచి వెళ్తూ వారికి సలాం చేశారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జిహాద్ ప్రకరణం)*



**139వ అధ్యాయం**

## ١٣٩ ـ بابُ اسْتِحْبَابِ السَّلَامِ إِذَا قَامَ مِنَ الْمَجْلِسِ وَفَارَقَ جُلَسَاءَهُ أَوْ جَلِيسَهُ

## సమావేశం నుంచి లేదా తనతోపాటు కూర్చొని ఉన్నవారి దగ్గర్నుంచి లేచి వెళ్ళేటప్పుడు వారికి సలాం చేసి వెళ్ళాలి

٨٦٩ ـ عن أبي هُرَيْرَةَ رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «إذا انتهى أَحَدُكُم إلى المَجْلِسِ فَلْيُسَلِّم، فَإذا أَرَادَ أنْ يَقُومَ فَلْيُسَلِّمْ، فَلَيْسَتِ الأولى بِأَحَقَّ مِنَ الآخِرَةِ» رواه أبو داود والترمذي وقال: حديث حسن.

869. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీరు సమావేశంలోకి అడుగుపెట్టగానే అక్కడున్న వారికి సలాం చేయాలి. తిరిగి అక్కణ్ణుంచి లేచి వెళ్ళిపోయేటప్పుడు కూడా సలాం చేయాలి. ఎందుకంటే తొలి సలాం తుది సలాం కన్నా గొప్పదేమీ కాదు. *(అబూ దావూద్, తిర్మిజీ - హసన్)*

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం, సుననె తిర్మిజీలోని ఇస్తీజాన్ అధ్యాయాలు)*

## 140వ అధ్యాయం

## ١٤٠ـ باب الاستئذان وآدابه

## అనుమతి కోరటం - దాని పద్ధతి

قال الله تعالى: ﴿ يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تَدْخُلُوا۟ بُيُوتًا غَيْرَ بُيُوتِكُمْ حَتَّىٰ تَسْتَأْنِسُوا۟ وَتُسَلِّمُوا۟ عَلَىٰٓ أَهْلِهَا ﴾ [النور: ٢٧]. وقال تعالى: ﴿ وَإِذَا بَلَغَ ٱلْأَطْفَٰلُ مِنكُمُ ٱلْحُلُمَ فَلْيَسْتَـْٔذِنُوا۟ كَمَا ٱسْتَـْٔذَنَ ٱلَّذِينَ مِن قَبْلِهِمْ ﴾ [النور: ٥٩].

దివ్య ఖుర్‌ఆన్‌లో అల్లాహ్‌ సెలవిచ్చాడు:

"విశ్వసించిన ప్రజలారా! మీ ఇళ్ళల్లోకి తప్ప ఇతరుల ఇళ్ళల్లోకి, ఇంటివారి అంగీకారం పొందనంతవరకు, ఇంట్లోవారికి సలాం చేయనంత వరకు (లోనికి) ప్రవేశించకండి." *(అన్‌ నూర్‌ : 27)*

**"మీ పిల్లలు యుక్త వయస్సుకు చేరుకున్నప్పుడు, తమ పెద్దలు అనుమతి తీసుకునే విధంగా తాము కూడా అనుమతి తీసుకొని మరీ లోనికి రావాలి." *(అన్‌ నూర్‌ : 59)***

٨٧٠ ـ وعن أبي موسى الأشعَريِّ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «الاستِئذانُ ثَلاثٌ، فإن أُذِنَ لكَ وإلَّا فارْجِع» متفقٌ عليه.

870. హజ్రత్‌ అబూ మూసా అష్‌అరీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మూడుసార్లు అనుమతి కోరాలి. అనుమతి లభిస్తే సరి; లేకపోతే తిరిగి వెళ్ళిపోవాలి. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్‌ బుఖారీలోని ఇస్తీజాన్‌ ప్రకరణం, సహీహ్‌ ముస్లింలోని ఇస్తీజాన్‌ ప్రకరణం)*

٨٧١ ـ وعن سهلِ بنِ سعدٍ رضي الله عنه قال: قال رسولُ الله ﷺ: «إنَّما جُعِلَ الاستئذانُ مِنْ أَجْلِ البَصَر» متفق عليه.

871. హజ్రత్‌ సహ్ల్‌ బిన్‌ సాద్‌ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : ఇతరుల ఇండ్లలోని స్త్రీల మీద దృష్టి పడరాదన్న ఉద్దేశ్యంతోనే అనుమతి తీసుకోవాలని ఆదేశించటం జరిగింది. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్‌ బుఖారీలోని ఇస్తీజాన్‌ ప్రకరణం, సహీహ్‌ ముస్లింలోని ఇస్తీజాన్‌ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇతరుల "ఏకాంతపు హక్కు"ని హరించటం కూడా పాపమే అవుతుంది. ఏకాంతంలో ఉన్నప్పుడు సాధారణంగా మనిషి తన వ్యక్తిగతమైన పనుల్లో నిమగ్నుడై ఉంటాడు. ఆ సమయంలో అతని ఏకాంతానికి భంగం కలగజేస్తే అతను చాలా మనస్తాపానికి గురౌతాడు. అనుమతి తీసుకోకుండా హఠాత్తుగా ఇతరుల ఇళ్ళల్లోకి ప్రవేశించటం వల్ల అక్కడ చూడరాని దృశ్యమేదయినా కంటపడవచ్చు లేక ఆ ఇంట్లో ఉన్న స్త్రీల మీద దృష్టి పడవచ్చు. దానివల్ల ఆ ఇంటివారు తీవ్రమైన ఇబ్బందికి గురవుతారు. ఒక నాగరిక సమాజంలో ఇలాంటి అవాంఛనీయ సంఘటనలు చోటుచేసుకోకుండా ఉండటానికి, సమాజంలో చెడు ప్రబల టానికి దోహదపడే కారణాలను నిర్మూలించటానికి అనుమతి తీసుకునే ఆజ్ఞ జారీ చేయ బడింది.

872. బనూ ఆమిర్‌కు చెందిన ఒకాయన తన సొంత సంఘటన గురించి వివరించారని రిబ్'యీ బిన్ హిరాష్ తెలియజేశారు : దైవప్రవక్త (సల్లం) ఒక గృహంలో ఉండగా ఆయన వెళ్ళి, "నేను లోనికి జొరబడ వచ్చా?" అంటూ లోపలికి రావటానికి దైవప్రవక్త (సల్లం)ను అనుమతి కోరాడు. దైవప్రవక్త (సల్లం) అది విని తన సేవకునితో, "నువ్వెళ్ళి ఆ వ్యక్తికి అనుమతి ఎలా కోరాలో చెప్పు. 'అస్స లాము అలైకుం. లోపలికి రావచ్చా?' అని అడగాలని చెప్పు" అన్నారు. ఆ మాటలు విని ఆయన, "అస్సలాము అలైకుం, లోపలికి రావచ్చా?" అని అడిగాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఆయనకు అనుమతినివ్వగా, ఆయన లోపలికి వచ్చాడు. (అబూ దావూద్ దీనిని ప్రామాణికమైన ఆధారాలతో వెలికి తీశారు.

٨٧٢ - وعن رِبْعِيِّ بن حِرَاشٍ قال: حدَّثنا رَجُلٌ من بَني عَامِرٍ استَأْذَنَ على النَّبِيِّ ﷺ وَهُوَ في بيتٍ، فقال: أَأَلِجُ؟ فقال رسولُ اللهِ ﷺ لخادِمِه: «اخرج إلى هذا فَعَلِّمهُ الاستئذانَ، فَقُل لَهُ: قُل: السَّلامُ عَلَيكُمْ، أَأَدخُلُ؟» فَسَمِعَهُ الرَّجُلُ فقال: السَّلامُ عَلَيكُمْ، أَأَدخُلُ؟ فَأَذِنَ له النَّبيُّ ﷺ، فدخلَ. رواه أبو داود بإسناد صحيح.

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇతరుల ఇండ్లల్లోకి వెళ్ళదలచుకున్నప్పుడు ముందు వారి గుమ్మం దగ్గర నిలబడి సలాం చేయాలి. సలాంకు జవాబురాగానే లోపలికి వెళ్ళటానికి అనుమతి కోరాలి. ఈ హదీసు ద్వారా బోధపడే మరొక విషయం ఏమిటంటే షరీఅత్ ఆదేశించే విషయాల గురించి తెలియనివారికి కూడా వాటిని బోధించాలి. దానివల్ల వారు కూడా షరీఅత్‌కు అనుగుణంగా ఆచరిస్తారు.

٨٧٣ ـ وعن كِلْدَةَ بنِ الحنبل رضي الله عنه قال: أَتَيْتُ النَّبيَّ ﷺ، فَدَخَلْتُ عَليهِ ولم أُسَلِّم، فقال النبيُّ ﷺ: «ارجع فقل: السَّلامُ عَلَيْكُم أَأَدْخُلُ؟» رواه أبو داود والترمذي وقال: حديث حسن.

873. హజ్రత్ కిల్‌దా బిన్ హంబల్ (రజి) కథనం : ఒకసారి నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి ఆయనకు సలాం చేయకుండానే ఆయనింట్లోకి ప్రవేశించాను. అప్పుడాయన (చిరుకోపంతో), “బయటికి వెళ్ళు. బయటికి వెళ్ళి ‘అస్సలాము అలైకుం’ నేను లోపలికి రావచ్చా?’ అని అడిగిరా” అన్నారు.

*(అబూ దావూద్, తిర్మిజీ - హసన్)*

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం, సుననె తిర్మిజీలోని ఇస్తీజాన్ అధ్యాయాలు)*

## 141వ అధ్యాయం

## ١٤١ - بَابُ بَيَانِ أَنَّ السُّنَّةَ إِذَا قِيلَ لِلْمُسْتَأْذِنِ: مَنْ أَنْتَ؟ أَنْ يَقُولَ: فُلَانٌ، فَيُسَمِّيَ نَفْسَهُ بِمَا يُعْرَفُ بِهِ مِنِ اِسْمٍ أَوْ كُنْيَةٍ، وَكَرَاهَةِ قَوْلِهِ: «أَنَا» وَنَحْوَهَا

## అనుమతి కోరినప్పుడు ఎవరని అడిగితే 'నేను' అని అనరాదు, తమ పేరు తెలియజేయాలి

٨٧٤ - عن أنسٍ رضي الله عنه في حديثه المشهور في الإسراءِ قال: قال رسولُ الله ﷺ: «ثُمَّ صَعِدَ بي جبْرِيلُ إلى السَّماءِ الدُّنيا فَاسْتَفْتَحَ، فَقِيلَ: مَنْ هٰذا؟ قال: جبْرِيلُ، قِيلَ: ومَنْ مَعَكَ؟ قال: مُحَمَّدٌ. ثُمَّ صَعِدَ إلى السَّمَاءِ الثَّانِيَةِ وَالثَّالِثَةِ وَالرَّابِعَةِ وَسائِرِهِنَّ، وَيُقَالُ في بَابِ كُلِّ سَماءٍ: مَن هذا؟ فيَقُولُ: جبْرِيلُ» متفقٌ عليه.

874. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) మేరాజ్ సంఘటనను వివరిస్తూ ఇలా అన్నారు: జిబ్రయీల్ (అలైహి) నన్ను వెంటబెట్టు కొని పైకి వెళ్తూ మొదటి ఆకాశం దగ్గరికి చేరుకున్నారు. అక్కడున్న ద్వారపాలకుణ్ణి ద్వారం తెరువమని కోరారు. లోపలి నుంచి 'ఎవరూ?' అని అడిగారు. దాని కాయన, 'నేను (దైవదూత) జిబ్రయీల్ని' అని సమాధానమిచ్చారు. 'మీ వెంట మరెవరైనా ఉన్నారా?' అని మళ్ళీ ప్రశ్నించటం జరిగింది. 'నా వెంట ముహమ్మద్ (సల్లం) ఉన్నారు' అని చెప్పారు జిబ్రయీల్. ఆ తర్వాత ఆయన నన్ను రెండవ, మూడవ, నాల్గవ, ఇంకా మిగిలిన ఆకాశాల మీదికి తీసుకొని వెళ్ళారు. ప్రతి ఆకాశపు ద్వారం దగ్గర 'ఎవరు మీరు?' అని అడగటం జరిగింది. దాని

కాయన, 'జిబ్రయీల్‌ని' అని సమాధాన మిస్తూ వెళ్ళారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సృష్టి ఆరంభ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

875. హజ్రత్ అబూ జర్ర్ (రజి) కథనం: ఒకానొక రోజు రాత్రి నేను ఇంటి నుండి బయలుదేరాను. దారిలో నాకు దైవ ప్రవక్త (సల్లం) కనిపించారు. ఆయన ఒంటరిగా ఎక్కడికో వెళ్తున్నారు. నేను (ఆయనకు కనపడకుండా ఆయన వెనకే) వెన్నెల ఛాయల్లో నడవసాగాను. కాని ఆయన వెనక్కి తిరిగి నన్ను చూసి 'ఎవరూ?' అన్నారు. 'నేనండీ! అబూ జర్ర్‌ని' అన్నాను నేను.

*(బుఖారీ - ముస్లిం)*

٨٧٥ ـ وعن أبي ذَرٍّ رضي الله عنه قال: خَرَجْتُ لَيْلَةً مِن اللَّيَالي، فَإذا رسولُ اللهِ ﷺ يَمْشي وَحْدَهُ، فَجَعَلْتُ أَمْشِي في ظِلِّ القَمَرِ، فَالْتَفَتَ فَرَآني فقال: «مَنْ هذا؟»، فقلتُ: أَبو ذَرٍّ. متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)*

876. హజ్రత్ ఉమ్మె హానీ (రజి.అన్హా) కథనం : ఒకసారి నేను దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళాను. ఆ సమయంలో ఆయన స్నానం చేస్తున్నారు. ఫాతిమా (రజి.అన్హా) ఆయనకు ఓ గుడ్డ అడ్డం ఉంచారు. (ఎవరో వచ్చినట్టు అలికిడి విని) ఆయన 'ఎవరూ?' అన్నారు. 'నేనండీ ఉమ్మె హానీని' అన్నాను నేను.

*(బుఖారీ - ముస్లిం)*

٨٧٦ ـ وعن أُمِّ هَانِىءٍ رضي الله عنها قالتْ: أَتَيْتُ النبيَّ ﷺ وَهُوَ يَغْتَسِلُ وَفَاطِمَةُ تَسْتُرُهُ، فقال: «مَنْ هذِهِ؟» فقلتُ: أَنَا أُمُّ هَانِىءٍ. متفقٌ عليه.

877. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : నేను దైవప్రవక్త (సల్లం) ఇంటికి వెళ్ళి తలుపు తట్టాను. లోపలినుంచి ఆయన,

٨٧٧ ـ وعن جابرٍ رضي الله عنه قال: أَتَيْتُ النبيَّ ﷺ فَدَقَقْتُ البَابَ،

قال: «مَنْ ذا؟» فقلتُ: أنَا، فقال: «أنَا أنَا؟!» كأنَّهُ كَرِهَهَا. متفقٌ عليه.

'ఎవరూ?' అని అడిగారు. నేను 'నేనండీ!' అన్నాను. దానికాయన, "నేను, నేనేంటి?" అన్నారు నేను పేరు చెప్పక పోవటం తనకు నచ్చలేదన్నట్లుగా.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఇస్తీజాన్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

'నేను నేను' అనంటే ఇంట్లో ఉన్నవారికి అనుమతి అడుగుతున్నదెవరో ఎలా అర్థమవుతుంది? అందుకని అనుమతి కోరినప్పుడు ఎవరని అడిగితే తమ పేరు తెలియజేయాలి. 'నేను' అని అనకూడదు. ఈ హదీసు ద్వారా బోధపడే మరొక విషయం ఏమిటంటే, తలుపు తట్టడం, కాలింగ్ బెల్ నొక్కటం కూడా అనుమతి తీసుకోవటం క్రిందికే వస్తుంది. ఆ శబ్దం విని ఇంట్లోవున్న వారు తలుపు దగ్గరికి రాగానే ముందుగా వారికి సలాం చేసి ఆ తర్వాత సంభాషణ మొదలెట్టాలి.



## 142వ అధ్యాయం

## ١٤٢ بَـابُ اسْتِحْبَـابِ تَشْمِيـتِ الْعَاطِسِ إِذَا حَمِدَ اللهَ تَعَالَى وَكَرَاهَةِ تَشْمِيتِهِ إِذَا لَمْ يَحْمَدِ اللهَ تَعَالَى، وَبَيَـانِ آدَابِ التَّشْمِيـتِ وَالْعُطَـاسِ وَالتَّثَاؤُبِ

## తుమ్మినవ్యక్తి 'అల్‌హమ్దులిల్లాహ్' అంటే దానికి సమాధానంగా 'యర్‌హముకల్లాహ్' అనాలి, 'అల్‌హమ్దు లిల్లాహ్' చెప్పకపోతే సమాధానంగా 'యర్‌హముకల్లాహ్' చెప్పటం అవాంఛనీయం. తుమ్ము, దానికి సమాధానం, ఆవులింతలకు సంబంధించిన ఆదేశాలు

٨٧٨ ـ عن أبي هُرَيرَةَ رضيَ اللهُ عنهُ أن النبيَّ ﷺ قال: «إن الله يُحِبُّ العُطَاسَ، وَيَكْرَهُ التَّثَاؤُبَ، فَإِذَا عَطَسَ أَحَدُكُمْ وَحَمِدَ الله تعالى كَانَ حَقاً عَلى كُلِّ مُسْلِمٍ سَمِعَهُ أَنْ يَقُولَ لَهُ: يَرْحَمُكَ اللهُ، وَأَمَّا التَّثَاؤُبُ فَإِنَّمَا هُوَ مِنَ الشَّيْطَانِ، فَإِذَا تَثَاءَبَ أَحَدُكُمْ فَلْيَرُدَّهُ مَا اسْتَطَاعَ؛ فَإِنَّ أَحَدَكُمْ إِذَا تَثَاءَبَ ضَحِكَ مِنْهُ الشَّيْطَانُ» رواه البخاري.

878. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : నిశ్చయంగా దేవుడు తుమ్మును యిష్టపడతాడు. ఆవులింతను ఆయన యిష్టపడడు. కనుక మీలో ఎవరయినా తుమ్మి 'అల్‌హమ్దులిల్లాహ్' అన్నప్పుడు, అది విన్న ప్రతి ముస్లిం దానికి సమాధానంగా 'యర్‌హము కల్లాహ్' అనాలి. ఇకపోతే ఆవులింత షైతాన్ మూలంగా వస్తుంది. కనుక మీలో ఎవరికయినా ఆవులింత వస్తే వీలైనంతవరకు దాన్ని ఆపటానికి ప్రయత్నించాలి. ఎందుకంటే మీరు ఆవులించినప్పుడు షైతాన్ మిమ్మల్ని చూసి నవ్వుతాడు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషి తుమ్మినప్పుడు అతని మెదడు తేలికపడుతుంది. ఒళ్ళు నెమ్మదిస్తుంది. కనుక ఇది ఉత్సాహకర విషయమే. అందుకని తుమ్ము వచ్చినప్పుడు, 'అల్‌హమ్దు లిల్లాహ్' అంటూ దైవాన్ని స్తుతించాలని చెప్పబడింది. దీనికి భిన్నంగా ఆవులింత సోమరితనానికి, అలసత్వానికి ఆనవాలు. అందుకే దాన్ని అవాంఛనీయమైన పనిగా చెప్పబడింది. వీలైనంతవరకు దాన్ని ఆపుకోవటానికి ప్రయత్నించాలని తాకీదు చేయబడింది.

٨٧٩ ـ وعنه عن النبيِّ ﷺ قال: «إذا عَطَسَ أَحَدُكُمْ فَلْيَقُلِ: الحَمْدُ للهِ؛ وَلْيَقُلْ لَهُ أَخُوهُ أَوْ صَاحِبُهُ: يَرْحَمُكَ اللهُ. فَإِذَا قَالَ لَهُ: يَرْحَمُكَ اللهُ، فَلْيَقُلْ: يَهْدِيكُمُ اللهُ وَيُصْلِحُ بَالَكُمْ». رواه البخاري.

879. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీలో ఎవరయినా తుమ్మినప్పుడు 'అల్‌హమ్దు లిల్లాహ్' అనాలి. అది విన్న అతని సోదరుడు లేక మిత్రుడు అతనికోసం 'యర్‌హముకల్లాహ్' (అల్లాహ్ నీపై దయజూపుగాక!) అని ప్రార్థించాలి. ఎదుటి వ్యక్తి 'యర్‌హముకల్లాహ్' అనగానే, తుమ్మినవ్యక్తి అతణ్ణి, 'యహ్‌దీకుముల్లాహు వ యుస్‌లిహు బాలకుమ్' (అల్లాహ్ నీకు సన్మార్గం చూపుగాక! నీ స్థితిని చక్కదిద్దుగాక!!) అని దీవించాలి.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రజలు ఒకర్నొకరు ఏవిధంగా దీవించుకోవాలో, ఉపకారానికి బదులుగా ఏవిధంగా ఉపకారం తలపెట్టాలో ఈ హదీసులో వివరించబడింది. చూడటానికి ఇవి చాలా చిన్న విషయాలే అయినా ఆచరణలో మాత్రం ఇవి కొండంత ప్రభావాన్ని చూపిస్తాయి. వీటిని ఆచరించేవారి మధ్య సంబంధాలు మెరుగుపడతాయి. పరస్పరం ప్రేమాభిమానాలు పెంపొందుతాయి. ముస్లింలు ఈ పసిడిపలుకులకు ప్రతిరూపాలుగా మారితే ఎంతబావుండు!

٨٨٠ ـ وعن أبي موسى رضي الله عنه قال: سمعتُ رسولَ اللهِ ﷺ يقولُ:

880. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ మూసా (రజి) తెలియజేశారు : మీలో

«إذا عطَسَ أَحَدُكُمْ فَحَمِدَ اللهَ فَشَمِّتُوهُ، فَإِنْ لَمْ يَحْمَدِ اللهَ فَلا تُشَمِّتُوهُ» رواه مسلم.

ఎవరయినా తుమ్మి, 'అల్‌హమ్దు లిల్లాహ్' అని అంటే దానికి మీరు అతని శ్రేయస్సుకోసం ప్రార్థిస్తూ, 'యర్‌హము కల్లాహ్' అని అనండి. ఒకవేళ తుమ్మిన వ్యక్తి, 'అల్‌హమ్దు లిల్లాహ్' అనకపోతే మీరు కూడా 'యర్‌హముకల్లాహ్' చెప్పకండి. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

٨٨١ ـ وعن أنس رضي الله عنه قال: عَطَسَ رَجُلانِ عِنْدَ النبيِّ ﷺ فَشَمَّتَ أَحَدَهُمَا وَلَمْ يُشَمِّتِ الآخَرَ، فَقَالَ الَّذي لَمْ يُشَمِّتْهُ: عَطَسَ فُلانٌ فَشَمَّتَّهُ، وَعَطَسْتُ فَلَمْ تُشَمِّتْنِي! فَقَالَ: «هٰذَا حَمِدَ اللهَ، وَإِنَّكَ لَمْ تَحْمَدِ اللهَ». متفق عليه.

881. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవ ప్రవక్త (సల్లం) సమక్షంలో ఇద్దరు వ్యక్తులు తుమ్మారు. ఆయన వారిలో ఒకరి కోసం ప్రార్థిస్తూ, 'యర్‌హము కల్లాహ్' అన్నారు. రెండో వ్యక్తి కోసం ప్రార్థించలేదు. అప్పుడు రెండో వ్యక్తి, "అతను తుమ్మితే తమరు అతని కోసం ప్రార్థించారు. మరి నేను తుమ్మినప్పుడు నా కోసం ఎందుకు ప్రార్థించలేదు?" అని దైవప్రవక్త (సల్లం)ను ప్రశ్నించాడు. అందుకాయన, 'ఆ వ్యక్తి అల్‌హమ్దు లిల్లాహ్ అంటూ దైవాన్ని స్తుతించాడు. కాని నువ్వు దైవాన్ని స్తుతించలేదుగా!' అని బదులిచ్చారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని సంస్కార ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

٨٨٢ ـ وعن أبي هريرةَ رضي الله عنه قال: كان رسولُ اللهِ ﷺ إذا عَطَسَ وَضَعَ يَدَهُ أَوْ ثَوْبَهُ عَلى فِيهِ، وَخَفَضَ ـ أَوْ غَضَّ ـ بِهَا صَوْتَهُ. شَكَّ الراوي. رواه أبو داود، والترمذي وقال: حديث حسن صحيح.

882. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) తుమ్మినప్పుడు ఎక్కువ శబ్దం రాకుండా నోటికి చెయ్యి అడ్డం పెట్టుకునేవారు. (అబూ దావూద్, తిర్మిజీ - హసన్, సహీహ్)

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం, సుననె తిర్మిజీలోని ఇస్తీజాన్ అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసులో బోధించబడినది మామూలు విషయం కాదు. చాలా ముఖ్యమైన విషయం. నలుగురిలో ఉన్నప్పుడయితే దీని ప్రాముఖ్యం మరింత పెరిగిపోతుంది. తుమ్ము వచ్చినప్పుడు నోటికి, ముక్కుకి చెయ్యిగాని గుడ్డగాని అడ్డం పెట్టుకోవాలి. దానివల్ల తుమ్ము మూలంగా వచ్చే శబ్దం తగ్గిపోతుంది. అంతేకాదు ఆ సమయంలో నోరు, ముక్కు నుంచి వచ్చే తుంపరలు జనం మీద పడకుండా ఉంటాయి. అదే గుడ్డ అడ్డం లేకుండా తుమ్మితే తుంపరలు మీదపడితే జనం అసహ్యించుకుంటారు. ఆ సమయంలో వెలువడే భయంకర శబ్దానికి ప్రక్కనున్నవారు వింతగా చూస్తారు. అలాంటి అవాంఛనీయ పరిస్థితి ఏర్పడకుండా ఉండాలంటే పై హదీసుని ఆచరించటం తప్పనిసరి.

٨٨٣ ـ وعن أبي موسى رضي الله عنه قال: كان اليهودُ يَتَعَاطَسُونَ عِنْدَ رسولِ اللهِ ﷺ، يَرْجُونَ أَنْ يقولَ لهم: يَرْحَمُكُمُ اللهُ، فيقولُ: «يَهْدِيكمُ اللهُ وَيُصْلِحُ بَالكمْ». رواه أبو داودَ، والترمذي وقال: حديث حسن صحيح.

883. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం : యూదులు దైవప్రవక్త (సల్లం) చేత 'యర్‌హముకల్లాహ్' అని చెప్పించు కోవాలన్న ఉద్దేశ్యంతో ఆయన సమక్షంలో తుమ్మేవారు. కాని దైవప్రవక్త (సల్లం) మాత్రం 'యహ్‌దీకుముల్లాహు వ యుస్లిహు బాలకుమ్' (అల్లాహ్ మీకు సన్మార్గాన్ని ప్రసాదించుగాక! మీ పరిస్థితుల్ని చక్కదిద్దుగాక!) అని ప్రార్థించేవారు. *(అబూ దావూద్, తిర్మిజీ - హసన్, సహీహ్)*

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం, సుననె తిర్మిజీలోని సంస్కార అధ్యాయం)*

٨٨٤ ـ وعن أبي سعيدٍ الخُدْرِيِّ رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «إذا تَثَاءَبَ أَحَدُكُمْ فَلْيُمْسِكْ بِيَدِهِ عَلى فِيهِ، فَإِنَّ الشَّيْطَانَ يَدْخُلُ» رواه مسلم.

884. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : ఎవరయినా ఆవులించేటప్పుడు షైతాన్ వారి నోట్లోకి జొరబడతాడు. కనుక మీకు ఆవులింత వస్తే నోటికి చెయ్యి అడ్డం పెట్టుకోండి. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

## 143వ అధ్యాయం

## ١٤٣ ـ بَابُ اسْتِحْبَابِ الْمُصَافَحَةِ عِنْدَ اللِّقَاءِ وبَشَاشَةِ الْوَجْهِ وَتَقْبِيلِ يَدِ الرَّجُلِ الصَّالِحِ، وَتَقْبِيلِ وَلَدِهِ شَفَقَةً، وَمُعَانَقَةِ الْقَادِمِ مِنْ سَفَرٍ، وَكَرَاهِيَةِ الانْحِنَاءِ

## పరస్పరం కలుసుకున్నప్పుడు కరచాలనం చేసుకోవటం, నగుమోముతో పలకరించటం, మంచి వ్యక్తుల చేతుల్ని ముద్దాడటం, తమ పిల్లల్ని ఆప్యాయంగా ముద్దాడటం, ప్రయాణం నుండి తిరిగొచ్చిన వారిని ఆలింగనం చేసుకోవటం లాంటి పనులు అభిలషణీయమైనవి, ఇతరుల్ని కలుసుకున్నప్పుడు వారి ముందు ఒంగటం అవాంఛనీయం

٨٨٥ ـ عن أبي الخَطَّابِ قَتَادَةَ قال: قلتُ لأنَسٍ: أَكَانَتِ المُصَافَحَةُ في أَصْحَابِ رسولِ الله ﷺ؟ قال: نَعَمْ. رواه البخاري.

885. హజ్రత్ అబుల్ ఖత్తాబ్ ఖతాదా (రహ్మాలై) కథనం : నేను అనస్ (రజి)ని 'దైవప్రవక్త సహచరుల్లో కరచాలనం చేసుకునే ఆచారం ఉండేదా?' అని అడిగాను. దానికాయన ఉండేదని సమాధానమిచ్చారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

కరచాలనాన్ని అరబీ భాషలో 'ముసాఫహా' అంటారు. ఈ పదం 'ముఫాఅలా'కు సమతుల్య పదం. కనుక దాని ప్రకారం ముసాఫహా అంటే ఒకని అరచేతిని మరొకతని అరచేత్తో కలపటం. ముసాఫహా ఒకే చేత్తో చేయాలని ఆ పదమే చెబుతోంది. దైవప్రవక్త (సల్లం) విధానం కూడా అదే.

٨٨٦ ـ وعن أنسٍ رضي الله عنه قال: لمَّا جاءَ أَهْلُ الْيَمَنِ قال رسولُ اللهِ ﷺ: «قَدْ جَاءَكُمْ أَهْلُ الْيَمَنِ، وَهُمْ أَوَّلُ مَنْ جَاءَ بِالْمُصَافَحَةِ» رواه أبو داود بإسنادٍ صحيحٍ.

886. హ[జత్ అనస్ (రజి) కథనం : యమన్‌వాసులు వచ్చినప్పుడు దైవప్రవక్త (సల్లం) తన అనుచరులతో, "మీ దగ్గరకు యమన్ వాసులు వచ్చారు. మొట్టమొదటగా కరచాలనం చేసే పద్ధతిని మీ దగ్గరకు తీసుకువచ్చింది వీరే!" అని అన్నారు.

(అబూ దావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో ఉల్లేఖించారు)

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

యమన్‌లో కరచాలనం చేసుకునే ఆచారం ఉండేది. అక్కణ్ణుంచి కొంతమంది మదీనాకు వచ్చినప్పుడు దైవప్రవక్త (సల్లం) సమక్షంలో తమ ఆనవాయితీ ప్రకారం పరస్పరం కరచాలనం చేసుకోసాగారు. దైవప్రవక్త (సల్లం)కు వారి ఆచారం నచ్చింది. ఆయన ముస్లింలు కూడా దాన్ని ఆచరించాలని ఆదేశించారు. ప్రపంచంలో మంచి అనేది ఎక్కడున్నా ఇస్లాం ధర్మం దాన్ని గ్రహిస్తుందని, దానికి విరుద్ధంగా రవ్వంత చెడుని కూడా తీవ్రంగా ఖండిస్తుందని ఈ హదీసు చాటిచెబుతోంది.

٨٨٧ ـ وعن البَرَاءِ رضي الله عنه قال: قالَ رسولُ اللهِ ﷺ: «مَا مِنْ مُسْلِمَيْنِ يَلْتَقِيَانِ فَيَتَصَافَحَانِ إلَّا غُفِرَ لَهُمَا قَبْلَ أَنْ يَفْتَرِقَا» رواه أبو داود.

887. హ[జత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : ఏ ఇద్దరు ముస్లింలయినా కలుసుకొని కరచాలనం చేసుకుంటే, వారు పరస్పరం విడిపోక ముందే వారిరువురిని మన్నించటం జరుగుతుంది. (అబూ దావూద్)

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

٨٨٨ ـ وعن أنسٍ رضي الله عنه قال: قالَ رَجُلٌ: يا رسولَ اللهِ! الرَّجُلُ مِنَّا يَلْقَى أَخَاهُ أَوْ صَدِيقَهُ، أَيَنْحَنِي لَهُ؟ قال:

888. హ[జత్ అనస్ (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం)తో మాట్లాడుతూ, "దైవప్రవక్తా! మాలో ఎవరయినా తమ సోదరుణ్ణిగాని, మిత్రుణ్ణిగాని కలుసు

«لا» قال: أَفَيَلْتَزِمُهُ وَيُقَبِّلُهُ؟ قال: «لا» قال: فَيَأْخُذُ بِيَدِهِ وَيُصَافِحُهُ؟ قال: «نَعَمْ». رواه الترمذي وقال: حديث حسن.

కున్నప్పుడు అతని ముందు ఒంగ వచ్చా?" అని అడిగాడు. దానికి దైవ ప్రవక్త (సల్లం) ఒంగకూడదని సమాధాన మిచ్చారు. "మరి అతన్ని కౌగిలించు కోవటంగాని, చుంబించటం గాని చేయ వచ్చా?" అని అడిగాడా వ్యక్తి. 'అది కూడా చేయకూడదు' అని సమాధాన మిచ్చారు దైవప్రవక్త (సల్లం). "అతని చేయిపట్టుకొని కరచాలనమయినా చేయవచ్చా?" ఆ వ్యక్తి మళ్ళీ అడిగాడు. అందుకాయన సమాధానమిస్తూ "అది చేయవచ్చు" అన్నారు. *(తిర్మిజీ - హసన్)*

*(సుననె తిర్మిజీలోని ఇస్తీజాన్ అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

ఇతరుల్ని కలుసుకున్నప్పుడు వారికి ఒంగి మరీ సలాములు చెప్పటం, వారి ముందు మోకరిల్లటం, పాదాభివందనం చేయటం ధర్మవిరుద్ధమైన చేష్టలని పై హదీసు ద్వారా బోధపడుతోంది. కొంతమంది ఈ హదీసు భావం రుకూ లాగా వంగకూడదని, ఎదుటి వ్యక్తి గౌరవార్థం కాస్తంత వంగటంలో తప్పులేదని అంటారు. కానీ ఇవన్నీ నిరాధారమైన మాటలు. హదీసులో అసలు ఒంగటమే వారించబడిందన్న విషయం గమనార్హం.

రెండో విషయం : కరచాలనం ఒంటి చేత్తో చేయాలన్న దానికి ఈ హదీసు ప్రబల నిదర్శనం. ఇందులో చూచాయగా కరచాలనం చేసే పద్ధతి వివరించబడింది. పృచ్ఛకుడు చేయిపట్టుకొని కరచాలనం చేయవచ్చా? అని అడిగాడు గాని చేతులు పట్టుకొని చేయవచ్చా? అని అడగలేదు. దైవప్రవక్త (సల్లం) కూడా అతను చెప్పిన ప్రకారం కరచాలనం చేసుకోవటానికి అనుమతినిచ్చారు. దీన్నిబట్టి ఒంటి చేత్తో కరచాలనం చేయటం మస్నూన్ పద్ధతి అని తేటతెల్లమవుతోంది.

٨٨٩ ـ وعن صَفْوَانَ بنِ عَسَّالٍ رضي الله عنه قال: قال يَهُودِيٌّ لِصَاحِبِهِ: اذْهَبْ بِنَا إلى هذا النَّبِيِّ، فَأَتَيَا

889. హజ్రత్ సఫ్వాన్ బిన్ అస్సాల్ (రజి) కథనం : ఒకసారి ఓ యూదుడు తన యూద మిత్రునితో మాట్లాడుతూ, "మనిద్దరం ఆ ప్రవక్త దగ్గరికి వెళదాం పద" అన్నాడు. ఆ తర్వాత వారిరువురూ

رسولَ الله ﷺ، فَسَألاهُ عَنْ تِسْعِ آيَاتٍ بَيِّنَاتٍ؛ فذَكَرَ الحَديثَ إلى قوله: فَقَبَّلا يَدَهُ وَرِجْلَهُ، وقالا: نَشْهَدُ أنَّكَ نَبِيٌّ. رواه الترمذي وغيره بأسانيد صحيحةٍ.

బయలుదేరి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి, ఆయన్ని తొమ్మిది స్పష్టమైన సూచనల గురించి అడిగారు. (ఉల్లేఖకుడు మొత్తం హదీసుని వివరించాడు. దాని చివర్లో ఇలా ఉంది:) వారిరువురూ దైవప్రవక్త చేతిని, కాలిని ముద్దాడి, "తమరు నిజంగా దైవప్రవక్త అని మేము ధృవీకరిస్తున్నాం" అన్నారు.

(తిర్మిజీ తదితరులు దీన్ని ప్రామాణికమైన ఆధారాలతో వెలికితీశారు)

*(సుననె తిర్మిజీలోని ఇస్తీజాన్ అధ్యాయాలు - సుననె నసాయిలోని విహార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసు తిర్మిజీ, నసాయి, ఇబ్నెమాజా మూడు గ్రంథాల్లోనూ పొందుపరచబడి ఉంది. అయితే మూడింటి ఆధారాలూ ఒక్కటేనన్న విషయం కూడా గమనార్హం. ఈ హదీసుకు సంబంధించిన ఆధారాల్లో అబ్దుల్లాహ్ బిన్ సలమా మురాదీ అనే వ్యక్తి ఉన్నాడు. హదీసు పరిశోధకులు ఇతన్ని బలహీన ఉల్లేఖకునిగా ఖరారు చేశారు. అందుకే ప్రముఖ ఆధునిక హదీసువేత్త షేఖ్ అల్‌బానీ (రహ్మలై) ఈ హదీసుని బలహీనమైన హదీసుల జాబితాలో పొందుపరిచారు.

٨٩٠ - وعن ابنِ عمرَ رضي الله عنهما قِصةٌ قال فيها: فَدَنَوْنَا مِنَ النَّبيِّ ﷺ فقبَّلْنَا يَدَهُ. رواه أبو داود.

890. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) ఒక వృత్తాంతాన్ని వివరిస్తూ ఇలా అన్నారు : మేము దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి ఆయన చేతిని ముద్దాడాము.

*(అబూ దావూద్)*

*(సుననె అబూ దావూద్‌లోని సంస్కార ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ హదీసుకు సంబంధించిన ఆధారాల్లో యజీద్ బిన్ అబూ జియాద్ హాష్మీ అనే వ్యక్తి ఉన్నాడు. ఈయన కూడా బలహీనమైన ఉల్లేఖకుడే. అందుకే షేఖ్ అల్‌బానీ (రహ్మలై) ఈ హదీసుని కూడా బలహీనమైన హదీసుల జాబితాలో పొందుపరచారు. అయితే ఈ అధ్యాయానికి సంబంధించిన ఇతర అనేక హదీసులు దైవప్రవక్త సహచరులు కొన్ని సందర్భాల్లో

ఆయన చేతిని ముద్దాడారన్న విషయాన్ని సమర్థిస్తున్నాయి. కనుక మహాత్ముల, దైవభక్తి పరాయణులైన పండితుల చేతుల్ని అప్పుడప్పుడూ ముద్దాడుతూ ఉండటంలో తప్పులేదు. అయితే దాన్ని ఆచారంగా చేసుకోకూడదు.

٨٩١ ـ وعن عائشةَ رضي الله عنها قالت: قَدِمَ زَيْدُ بنُ حَارِثَةَ المَدِينَةَ ورسولُ اللهِ ﷺ في بَيْتي، فأتَاهُ فقَرَعَ البَابَ، فقَامَ إليْهِ النبيُّ ﷺ يَجُرُّ ثَوبَهُ، فاعْتَنَقَهُ وَقبَّلَه. رواه الترمذي وقال: حديث حسن.

891. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : హజ్రత్ జైద్ బిన్ హారిసా (రజి) మదీనా నగరానికి వచ్చినప్పుడు దైవప్రవక్త (సల్లం) నా ఇంట్లోనే ఉన్నారు. జైద్ మా ఇంటికొచ్చి తలుపు తట్టారు. (వచ్చింది జైద్ బిన్ హారిసా అని తెలియగానే) దైవప్రవక్త (సల్లం) పట్టరాని సంతోషంతో తన అంగవస్త్రాన్ని ఈడ్చు కుంటూ ఎదురెళ్ళి ఆయన్ని ఆలింగనం చేసుకొని చుంబించారు. *(తిర్మిజీ - హసన్)*

*(సుననె తిర్మిజీలోని ఇస్తీజాన్ అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

షేఖ్ అల్ బానీ గారు ఈ హదీసుని బలహీనకోవకు చెందిన హదీసుగా నిర్ధారించారు. ఈ హదీసు పరంపరలో ముహమ్మద్ బిన్ ఇస్హాఖ్ అనే ఒకతనున్నాడు. ఇతను తద్లీస్ చేస్తాడని ప్రతీతి. ఇతనే గాకుండా బలహీనకోవకు చెందిన ఉల్లేఖకులు ఇంకా ఇద్దరు ఈ హదీసు ఆధారాల్లో ఉన్నారు.

ఏమైనప్పటికీ 'చుంబనా'నికి సంబంధించిన ఉల్లేఖనాలన్నీ కూడా హదీసు పరిశోధకులు, హదీసువేత్తల దృష్టిలో బలహీనమైనవిగా భావింపబడుతున్నాయి. కనుక పరస్పరం కలుసుకున్నప్పుడు కేవలం ఒంటిచేత్తో కరచాలనం చేసుకుంటే చాలు. వీలైతే ఆలింగనం కూడా చేసుకోవచ్చు. కొంతమంది పండితులు ఆలింగనాన్ని అభిలషణీయమైన ఆచరణగా భావిస్తారు.

٨٩٢ ـ وعن أبي ذرٍّ رضي الله عنه قال: قال لي رسولُ اللهِ ﷺ: «لَا تَحقِرَنَّ مِنَ المَعْرُوفِ شَيْئاً، وَلَوْ أَنْ تَلْقَى أَخَاكَ بِوَجْهٍ طَلِيقٍ» رواه مسلم.

892. దైవప్రవక్త (సల్లం) తనకు ఈ విధంగా ఉపదేశించారని హజ్రత్ అబూ జర్ర్ (రజి) తెలియజేశారు : "ఏ మంచి పనినీ అల్పమైనదిగా తలపోయకు. ఆఖరికి నీ సోదరుణ్ణి నగుమోముతో పలకరించటాన్నయినా సరే. *(ముస్లిం)*

٨٩٣ - وعن أبي هريرةَ رضي الله عنه قال: قبَّلَ النبيُّ ﷺ الحسنَ بْنَ عَليٍّ رضي الله عنهما، فقال الأقْرَعُ بنُ حَابِسٍ: إنَّ لي عَشَرَةً مِنَ الْوَلَدِ مَا قَبَّلْتُ مِنْهُمْ أَحَداً. فقالَ رسولُ اللهِ ﷺ: «مَنْ لا يَرْحَمْ لا يُرْحَمْ!» متفقٌ عليه.

893. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : ఒకసారి దైవప్రవక్త (సల్లం) (తన మనుమడయిన) హసన్‌ను ముద్దాడు తుండగా, అఖ్రా బిన్ హాబిస్ అనే వ్యక్తి అది చూసి ఆశ్చర్యపోతూ, "నాకు పదిమంది పిల్లలున్నారు. కాని నేను ఇప్పటివరకు వారిలో ఎవర్నీ ముద్దాడి ఎరుగను" అన్నాడు. అందుకాయన, "ఇతరుల మీద దయజూపని వ్యక్తి దయాదాక్షిణ్యాలకు పాత్రుడు కాజాలడు" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

# ٦ ـ كِتَابُ عِيَادَةِ الْمَرِيْضِ

# 6. రోగుల పరామర్శ ప్రకరణం

**144వ అధ్యాయం**

## ١٤٤ ـ بَابُ عِيَادَةِ الْمَرِيْضِ، وَتَشْيِيعِ الْمَيِّتِ وَالصَّلَاةِ عَلَيْهِ، وَحُضُوْرِ دَفْنِهِ وَالْمُكْثِ عِنْدَ قَبْرِهِ بَعْدَ دَفْنِهِ

## వ్యాధిగ్రస్తుణ్ణి పరామర్శించటం, శవం వెంట వెళ్ళటం, జనాజా నమాజ్ చేయటం, ఖనన సంస్కారాల్లో పాల్గొనటం, ఖననం పూర్తయిన తర్వాత సమాధి దగ్గర కాసేపు ఉండటం

٨٩٤ ـ عَنِ الْبَرَاءِ بْنِ عَازِبٍ رضي الله عنهما قال: أَمَرَنَا رسولُ الله ﷺ بِعِيَادَةِ الْمَرِيضِ، وَاتِّبَاعِ الْجَنَازَةِ، وَتَشْمِيتِ الْعَاطِسِ، وَإِبْرَارِ الْمُقْسِمِ، وَنَصْرِ الْمَظْلُومِ، وَإِجَابَةِ الدَّاعِي، وَإِفْشَاءِ السَّلام. متفقٌ عليه.

894. హజ్రత్ బరా బిన్ ఆజిబ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) వ్యాధిగ్రస్తులను పరామర్శించమనీ, శవం వెంట వెళ్ళమనీ, తుమ్మిన వ్యక్తి తుమ్ముకు సమాధానం పలకాలనీ, ప్రమాణం చేసిన వారి ప్రమాణాన్ని నెరవేర్చాలనీ, బాధితునికి సహాయం చేయాలనీ, ఆహ్వానించేవాని ఆహ్వానాన్ని అంగీకరించమనీ, సలాంను సర్వ సామాన్యం చేయమనీ మమ్మల్ని ఆజ్ఞాపించారు. *(బుఖారీ - ముస్లిం)*

٨٩٥ ـ وعن أبي هريرةَ رضي الله عنه أنَّ رسولَ الله ﷺ قال: «حَقُّ الْمُسْلِمِ عَلَى الْمُسْلِمِ خَمْسٌ: رَدُّ السَّلام،

895. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : ప్రతి ముస్లింపై సాటి ముస్లింకు ఐదు హక్కులున్నాయి: 1. అతని సలాంకు ప్రతి సలాం చేయటం.

وَعِيَادَةُ الْمَرِيضِ، وَاتِّبَاعُ الْجَنَائِزِ، وَإِجَابَةُ الدَّعْوَةِ، وَتَشْمِيتُ الْعَاطِسِ» متفقٌ عليه.

2. అతను వ్యాధిగ్రస్తుడయితే అతన్ని పరామర్శించటం. 3. అతను చనిపోతే అతని శవం వెంట (శ్మశానానికి) వెళ్ళటం. 4. అతని ఆహ్వానాన్ని అంగీకరించటం. 5. అతను తుమ్మి అల్‌హమ్దు లిల్లాహ్ అని అంటే దానికి జవాబు పలకటం. *(బుఖారీ - ముస్లిం)*

٨٩٦ ـ وعنه قال: قال رسولُ اللهِ ﷺ: «إنَّ اللهَ عَزَّ وَجَلَّ يقُولُ يَوْمَ القِيَامَةِ: يَا ابْنَ آدَمَ! مَرِضْتُ فَلَمْ تَعُدْنِي! قال: يَارَبِّ! كَيْفَ أَعُودُكَ وَأَنْتَ رَبُّ العَالَمِينَ؟! قال: أَمَا عَلِمْتَ أنَّ عَبْدِي فُلاناً مَرِضَ فَلَمْ تَعُدْهُ؟ أَمَا عَلِمْتَ أنَّكَ لَوْ عُدْتَهُ لَوَجَدْتَنِي عِنْدَهُ؟ يَا ابْنَ آدَمَ! اسْتَطْعَمْتُكَ فَلَمْ تُطْعِمْنِي! قال: يَا رَبِّ!

896. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : ప్రళయదినాన దేవుడు మానవునితో "ఓ ఆదం పుత్రుడా! నేను వ్యాధికి గురయినప్పుడు నువ్వు నన్ను పరామర్శించలేదు" అని అంటాడు. దానికి మానవుడు ఆశ్చర్యపోతూ, "ప్రభూ! నీవు సర్వలోకాలకూ ప్రభువువి. అలాంటప్పుడు నేను నిన్ను పరామర్శించటమేమిటి?" అని అడుగుతాడు. అప్పుడు దేవుడు అతనితో, "అది కాదు, ఫలానా నా దాసుడు వ్యాధిగ్రస్తుడయ్యాడని తెలిసి కూడా నువ్వతన్ని పరామర్శించటానికి వెళ్ళలేదు. అతణ్ణి పరామర్శిస్తే నువ్వు అక్కడ నన్ను పొంది ఉండేవాడివన్న విషయం నీకు తెలియదా?" అంతేకాదు, "ఆదం పుత్రుడా! నేను అన్నం పెట్టమని అడిగితే నువ్వు నాకు అన్నం పెట్టలేదు" అని అంటాడు. దానికి మానవుడు "ప్రభూ! సకల లోకాలకూ ప్రభువువి నీవు. నీకు నేను అన్నం పెట్టటమేంటి?" అని విన్నవించుకుంటాడు మానవుడు. దానికి దేవుడు, "అది కాదు, ఫలానా నా దాసుడు నిన్ను

అన్నం పెట్టమని యాచించాడు. కాని నువ్వతనికి అన్నం పెట్టలేదు. అతనికి అన్నం పెడితే నువ్వు నన్ను పొందేవాడివన్న విషయం నీకు తెలియదా?'' అంటాడు. "ఆదం పుత్రుడా! నేను నిన్ను మంచినీళ్ళు అడిగాను. కాని నువ్వు నాకు మంచినీళ్ళు కూడా ఇవ్వలేదు'' అంటాడు.

దానికి, "ప్రభూ! నీవు సకల లోక ప్రభువువి. నీకు నేను మంచినీళ్ళు త్రాపించటమేంటి?'' అని విస్తుపోతాడు మానవుడు. అప్పుడు దేవుడు అతనితో, "ఫలానా నా దాసుడు నిన్ను మంచినీళ్ళు అడిగితే నువ్వతనికి మంచి నీళ్ళు ఇవ్వలేదు. నువ్వతనికి మంచినీళ్ళు ఇచ్చివుంటే అక్కడ నువ్వు నన్ను పొందేవాడివన్న విషయం తెలియదా నీకు?'' అని అంటాడు. (ముస్లిం)

كَيْفَ أُطْعِمُكَ وَأَنْتَ رَبُّ العَالَمِينَ؟! قال: أَمَا عَلِمْتَ أَنَّهُ اسْتَطْعَمَكَ عَبْدِي فُلانٌ فَلَمْ تُطْعِمْهُ، أَمَا عَلِمْتَ أَنَّكَ لَوْ أَطْعَمْتَهُ لَوَجَدْتَ ذٰلِكَ عِنْدِي؟ يَا ابْنَ آدَمَ! اسْتَسْقَيْتُكَ فَلَمْ تَسْقِنِي! قال: يَا رَبِّ! كَيْفَ أَسْقِيكَ وَأَنْتَ رَبُّ العَالَمِينَ؟! قال: اسْتَسْقَاكَ عَبْدِي فُلانٌ فَلَمْ تَسْقِهِ! أَمَا عَلِمْتَ أَنَّكَ لَوْ سَقَيْتَهُ لَوَجَدْتَ ذٰلِكَ عِنْدِي؟» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు-సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

విశ్వంలోని దేవుని జీవరాశులు (మానవులయినా, పశుపక్ష్యాదులైనా ఏవయినా సరే) ఆపదలో ఉంటే వాటిని ఆదుకోవటం, వాటికి చేతనయినంత సహాయం చేయటం, వాటిపట్ల మంచిగా మెలగటం దైవం దృష్టిలో అత్యంత ప్రీతికరమైన ఆచరణ. అందుకు ఆయన గొప్ప పుణ్యాన్ని ప్రసాదిస్తాడు. మొత్తానికి ఈ హదీసులో అవసరాల్లో ఉన్న వారిని ఆదుకోవటాన్ని ఎంతో ప్రభావవంతమైన పద్ధతిలో, మరెంతో విలక్షణమైన రీతిలో బోధించటం జరిగింది.

897. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు : వ్యాధిగ్రస్తుణ్ణి పరామర్శించండి, ఆకలిగొన్న వానికి

٨٩٧ ـ وعن أبي موسى رضي الله عنه قال: قال رسولُ اللهِ ﷺ: «عُودُوا المَرِيضَ، وَأَطْعِمُوا الجَائِعَ، وَفُكُّوا

الْعَانِيَ«رواه البخاري «العَانِي»: الأَسِيرُ.

అన్నం పెట్టండి. ఖైదీలను విడుదల చేయించండి. (బుఖారీ)

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఇక్కడ ఖైదీలంటే యుద్ధంలో లేక ఇతర కారణాల వల్ల ఖైదీలుగా పట్టుబడిన ముస్లింలని భావం. అలాంటి ఖైదీలను ముస్లిమేతరుల కారాగారాల నుండి రక్షించటం ముస్లిం సమాజ సామూహిక విధిగా పరిగణించబడుతుంది. అదేవిధంగా నిష్కారణంగా జైలుపాలైన ముస్లింలు, రుణభారం క్రింద నలిగిపోతున్నవారు, ఆర్థిక అవసరాల్లో ఉన్న పూచీదారులు కూడా ఈ హదీసు భావపరిధిలోకి వస్తారు. అలాంటి వారిని కష్టాల నుండి గట్టెక్కించటం కూడా ముస్లింలందరి విధి.

٨٩٨ ـ وعن ثَوْبَانَ رضي اللهُ عنه عن النبيِّ ﷺ قال: «إنَّ المُسْلِمَ إذا عَادَ أَخَاهُ المُسْلِمَ لَمْ يَزَلْ في خُرْفَةِ الجَنَّةِ حَتَّى يَرْجِعَ» قِيلَ: يَا رسولَ اللهِ! وَمَا خُرْفَةُ الجَنَّةِ؟ قال: «جَنَاهَا». رواه مسلم.

898. హజ్రత్ సౌబాన్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : ఒక ముస్లిం తన సోదర ముస్లింను పరామర్శించటానికి వెళ్ళి తిరిగివచ్చేంతవరకూ స్వర్గంలో ఖుర్ఫా పనిలో ఉండటంతో సమానం.

అది విని సహచరులు, "దైవప్రవక్తా! స్వర్గంలో ఖుర్ఫా పని అంటే ఏమిటి?" అని సందేహపడగా, "స్వర్గవనంలో తాజా పండ్లు ఏరటం" అని చెప్పారాయన (సల్లం).

*(సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు-సత్సంబంధాల ప్రకరణం)*

٨٩٩ ـ وعن عَلِيٍّ رضي الله عنه قال: سَمِعْتُ رسولَ اللهِ ﷺ يقولُ: «مَا مِنْ مُسْلِمٍ يَعُودُ مُسْلِماً غُدْوَةً إلَّا صَلَّى عَلَيْهِ سَبْعُونَ أَلْفَ مَلَكٍ حَتَّى يُمْسِيَ، وَإِنْ عَادَهُ عَشِيَّةً إلَّا صَلَّى عَلَيْهِ سَبْعُونَ أَلْفَ مَلَكٍ حَتَّى يُصْبِحَ، وَكَانَ لَهُ

899. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ అలీ (రజి) తెలియజేశారు: ఒక ముస్లిం తోటి ముస్లింను ఉదయం పూట పరామర్శిస్తే, డెబ్భైవేల దైవదూతలు సాయంత్రం వరకూ అతని శ్రేయస్సు కోసం దేవుణ్ణి ప్రార్థిస్తూ ఉంటారు. అదే సాయంత్రవేళ పరామర్శిస్తే ఉదయం

خَرِيفٌ فِي الجَنَّةِ». رواه الترمذي وقال: حديث حسن. «الخَرِيفُ»: الثَّمَرُ المَخْرُوفُ، أي: المُجْتَنَى.

వరకు డెబ్భైవేల దైవదూతలు అతని శ్రేయస్సు కోసం ప్రార్థిస్తూ ఉంటారు. ఇంకా అతని కోసం స్వర్గఫలాలు ఏరి ఉంచబడతాయి. *(తిర్మిజీ - హసన్)*

*(సునన్ తిర్మిజీలోని జనాయెజ్ అధ్యాయం)*

٩٠٠ - وعن أنسٍ رضي اللهُ عنه قال: كَانَ غُلامٌ يَهُودِيٌّ يَخْدُمُ النَّبِيَّ ﷺ فَمَرِضَ، فَأَتَاهُ النَّبِيُّ ﷺ يَعُودُهُ، فَقَعَدَ عِنْدَ رَأْسِهِ فقال لَهُ: «أَسْلِمْ» فَنَظَرَ إِلَى أَبِيهِ وَهُوَ عِنْدَهُ؟ فقال: أَطِعْ أَبَا القَاسِمِ، فَأَسْلَمَ، فَخَرَجَ النَّبِيُّ ﷺ وَهُوَ يقولُ: «الحَمْدُ للهِ الَّذِي أَنْقَذَهُ مِنَ النَّارِ» رواه البخاري.

900. హజ్రత్ అనస్ (రజి) కథనం : ఒక యూద బాలుడు దైవప్రవక్త (సల్లం)కు సేవలు చేస్తుండేవాడు. ఒకసారి అతను వ్యాధిగ్రస్తుడయితే, దైవప్రవక్త (సల్లం) అతన్ని పరామర్శించటానికి వెళ్ళారు. అక్కడికి వెళ్ళి అతని తల దగ్గర కూర్చొని, "ఇస్లాం స్వీకరించు బాబూ!" అన్నారు. ఆ బాలుడు ఏం చేయాలో అర్థంకాక తండ్రివైపు చూడసాగాడు. తండ్రి కూడా, "అబుల్ ఖాసిం (దైవప్రవక్త - సల్లం) మాట విను" అంటూ కొడుక్కి హితవు చెప్పాడు. దాంతో ఆ బాలుడు ఇస్లాం స్వీకరించి ముస్లిం అయిపోయాడు. ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) "ఈ బాలుణ్ణి నరకాగ్ని నుండి కాపాడిన దైవానికి కృతజ్ఞతలు" అని అంటూ అక్కణ్ణుంచి బయలుదేరారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసు ద్వారా బోధపడుతోన్న విషయాలు ఇవి - ఒకటి : ముస్లింలు, ముస్లిమేతరులు అని చూడకుండా రోగులందరినీ పరామర్శించాలి. పైగా ముస్లిమేతరులను మన సద్వ్యవహారానికి ఎక్కువ అర్హులుగా భావించాలి. వారిని ఇస్లాం ధర్మం వైపు ఆహ్వానించాలి. రెండు : సజ్జనుల సాంగత్యంలో ఉంటే సత్యాన్ని గ్రహించే, మంచిపనులు చేసే అవకాశాలు లభిస్తాయి. మూడు : ఇస్లాంను ధిక్కరించేవారు ఇక సత్యాన్ని గ్రహించలేరని నిరాశకు లోనవరాదు. నాలుగు : తల్లిదండ్రులు తాము సన్మార్గం మీద నడవకున్నా కనీసం తమ పిల్లలనయినా సన్మార్గాన్ని అవలంబించమని హితోపదేశం చేయాలి.

145వ అధ్యాయం

## ١٤٥ ـ بَابُ مَا يُدْعَى بِهِ لِلْمَرِيضِ

## వ్యాధిగ్రస్తుని కోసం ఏమని ప్రార్థించాలి?

٩٠١ ـ عن عائشةَ رضي الله عنها، أنَّ النبيَّ ﷺ كَانَ إذا اشتكَى الإنسَانُ الشَّيْءَ مِنْهُ، أَوْ كَانَتْ بِهِ قَرْحَةٌ أَوْ جُرْحٌ، قال النَّبيُّ ﷺ بأُصْبُعِهِ هكذا، وَوَضَعَ سُفْيَانُ بْنُ عُيَيْنَةَ الرَّاوي سَبَّابَتَهُ بالأرْضِ ثُمَّ رَفَعَهَا وقال: «بِسْمِ اللهِ، تُرْبَةُ أَرْضِنَا، بِرِيقَةِ بَعْضِنَا، يُشْفَى بِهِ سَقِيمُنَا، بِإِذْنِ رَبِّنَا» متفقٌ عليه.

901. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) దగ్గరికి ఏ మనిషయినా తనకు ఒంట్లో నలతగా ఉందని వస్తే లేదా అతనికి పుండుగాని, గాయంగాని ఉంటే దైవప్రవక్త (సల్లం) తన చూపుడు వ్రేలితో ఇలా చేసేవారు.

హదీసు ఉల్లేఖకులు సుఫ్యాన్ బిన్ ఉయైనా (దైవప్రవక్త ఇలా చేసే వారంటూ) తన చూపుడు వ్రేలిని నేలకు ఆనించి పైకి ఎత్తారు.

ఆ సందర్భంగా దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రార్థించేవారు:

"బిస్మిల్లాహి తుర్బతు అర్జినా బిరీఖతి బాజినా, యుష్ఫాబిహీ సఖీమునా బియిజ్ని రబ్బినా"

(అల్లాహ్ పేరుతో, మా నేలమీది మట్టి మాలో కొందరి లాలాజలంతో కలిసి తద్వారా మా ప్రభువు ఆజ్ఞతో మా రోగికి స్వస్థత చేకూరుతుంది.)

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వైద్య ప్రకరణం, సహీహ్ ముస్లింలోని వైద్య ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

1. దైవప్రవక్త (సల్లం) తన చూపుడు వ్రేలిని నేలకు తగిలించి దానికి అంటిన మట్టిలో

లాలాజలాన్ని కలిపి రోగికి బాధగా ఉన్న చోట, పుండ్లు, గాయాల మీద పూసేవారు. తర్వాత పై దుఆ పఠించేవారు. దాంతో దైవ కృపవల్ల ఆ రోగికి ఉపశమనం కలిగేది. ఈ పద్ధతిని ఎవరయినా పాటించవచ్చు. ఈ పద్ధతిని పాటిస్తే మంచి ఫలితం ఉంటుందని అనుభవజ్ఞులు చెబుతున్నారు.

٩٠٢ ـ وعنها أنَّ النبيَّ ﷺ كَانَ يَعُودُ بَعْضَ أَهْلِهِ يَمْسَحُ بِيَدِهِ اليُمْنى ويقولُ: «اللَّهُمَّ! رَبَّ النَّاسِ، أَذْهِبِ البَأْسَ، وَاشْفِ، أَنْتَ الشَّافِي لا شِفَاءَ إلَّا شِفَاؤُكَ، شِفاءً لا يُغَادِرُ سَقَماً» متفقٌ عليه.

902. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం: దైవప్రవక్త (సల్లం) తమ ఇంట్లో ఎవరయినా వ్యాధిగ్రస్తులైతే వారిని పరామర్శించి, రోగికి నొప్పిగా ఉన్నచోట తన కుడి చేత్తో నిమురుతూ ఈ విధంగా ప్రార్థించేవారు :

"అల్లాహుమ్మ రబ్బన్నాసి, అజ్హిబిల్ బాస, వష్ఫి అంతష్షాఫి లా షిఫాఅ ఇల్లా షిఫావుక షిఫాఅన్ లా యుగాదిరు సఖమా"

(దేవా! మానవుల ప్రభువా! ఇతని బాధను దూరం చెయ్యి. ఇతనికి స్వస్థత చేకూర్చేవాడవు నీవే. నీవు తప్ప మరెవ్వరూ స్వస్థత చేకూర్చలేరు. వ్యాధి ఏమాత్రం మిగలకుండా పూర్తి స్వస్థత చేకూర్చు.) *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వైద్య ప్రకరణం, సహీహ్ ముస్లింలోని వైద్య ప్రకరణం)*

٩٠٣ ـ وعن أنسٍ رضي الله عنه، أنه قالَ لِثَابِتٍ رحمه الله: ألا أَرْقِيكَ بِرُقْيَةِ رسولِ اللهِ ﷺ؟ قال: بَلى، قال: اللَّهُمَّ!

903. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం తను సాబిత్ (రహ్మాలై)తో మాట్లాడుతూ, "దైవప్రవక్త (సల్లం) ఏమని చెప్పి మంత్రించేవారో నేను మీకు తెల్పనా?" అన్నారు. 'తప్పకుండా తెల్పండి' అన్నారు సాబిత్ (రహ్మాలై). అప్పుడు అనస్ (రజి) దైవప్రవక్త (సల్లం) వ్యాధిగ్రస్తుల మీద ఈ విధంగా మంత్రించి ఊదేవారని తెలిపారు:

رَبَّ النَّاسِ، مُذْهِبَ البَاسِ، اشْفِ أَنْتَ الشَّافِي، لا شَافِيَ إِلَّا أَنْتَ، شِفَاءً لا يُغَادِرُ سَقَماً. رواه البخاري.

"అల్లాహుమ్మ! రబ్బన్నాసి ముజ్హిబల్ బాసి, ఇష్ఫి అంతష్షాఫీ లా షాఫియ ఇల్లా అంత, షిఫాఅన్ లా యుగాదిరు సఖమా."

(దేవా! మానవుల ప్రభువా! బాధల నుండి విముక్తిని ప్రసాదించేవాడా! ఇతనికి స్వస్థత చేకూర్చు. స్వస్థత చేకూర్చేవాడవు నీవే. నీవు తప్ప స్వస్థత మరెవరూ చేకూర్చలేరు. వ్యాధి ఏ మాత్రం మిగలకుండా పూర్తి స్వస్థత నొసగు.)

## ముఖ్యాంశాలు

పై హదీసుల ద్వారా దైవప్రవక్త (సల్లం) ఆయన అనుచరులు రోగగ్రస్తుల మీద దుఆలు మంత్రించి ఊదేవారని తెలుస్తోంది. కనుక రోగగ్రస్తుల మీద మంత్రించి ఊదే విషయంలో ఎలాంటి సందేహానికీ తావులేదు. అయితే దానికోసం దైవప్రవక్త (సల్లం) ద్వారా నిరూపితమైన దుఆలు, దేవుని గుణగణాలతో కూడిన వాక్యాలు మాత్రమే మంత్రించాలన్నది నియమం. షిర్క్‌కు, దైవతిరస్కారానికి సంబంధించిన వాక్యాలు మంత్రించటం నిషిద్ధం. అదేవిధంగా ముఅవ్వజాత్ సూరాలు, ఫాతిహా సూరా, ఇంకా ఇతర దివ్య ఖుర్ఆన్ సూక్తులు పఠించి ఊదటం కూడా ధర్మసమ్మతమే.

٩٠٤ ـ وعن سعدِ بنِ أبي وَقَّاصٍ رضي الله عنه قال: عَادَني رسولُ اللهِ ﷺ فقال: «اللَّهُمَّ اشْفِ سَعْداً، اللَّهُمَّ اشْفِ سَعْداً، اللَّهُمَّ اشْفِ سَعْداً» رواه مسلم.

904. హజ్రత్ సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ (రజి) కథనం : నేను వ్యాధికి గురయినప్పుడు దైవప్రవక్త (సల్లం) నన్ను పరామర్శించి, "దేవా! సాద్‌కు స్వస్థత చేకూర్చు. దేవా! సాద్‌కు స్వస్థత చేకూర్చు. దేవా! సాద్‌కు స్వస్థత చేకూర్చు" అని (మూడుసార్లు) ప్రార్థించారు. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని వసియ్యత్ ప్రకరణం)*

٩٠٥ ـ وعن أبي عبدِ اللهِ عثمانَ بنِ أبي العاصِ رضي الله عنه، أنهُ شَكا إلى

905. హజ్రత్ అబూ అబ్దుల్లాహ్ ఉస్మాన్ బిన్ అబుల్ ఆస్ (రజి) కథనం ప్రకారం ఆయన ఒకసారి తనకు ఒంట్లో నొప్పిగా

ఉందని దైవప్రవక్త (సల్లం)కు చెప్పారు. దానికి దైవప్రవక్త (సల్లం), "నొప్పిగా ఉన్నచోట చెయ్యిపెట్టి మూడుసార్లు 'బిస్మిల్లాహ్' అని పలికి, ఏడుసార్లు "అవూజు బి యిజ్జతిల్లాహి వ ఖుద్‌రతిహీ మిన్ షర్రి మా అజిదు వ ఉహాజిరు" అని పఠించమని ఉపదేశించారు.
(ముస్లిం)

رسولِ اللهِ ﷺ وَجَعاً يَجِدُهُ في جَسَدِهِ، فقال له رسولُ اللهِ ﷺ: «ضَعْ يَدَكَ عَلى الذي يَأْلَمُ مِنْ جَسَدِكَ وَقُلْ: بِسمِ اللهِ، ثَلاثاً، وَقُلْ سَبْعَ مَرَّاتٍ: أَعُوذُ بِعِزَّةِ اللهِ وَقُدْرَتِهِ مِنْ شَرِّ مَا أَجِدُ وَأُحَاذِرُ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మనిషి ఇతరుల చేత కాకుండా తను స్వయంగా కూడా మస్నూన్ దుఆలు పఠించి ఊదుకోవచ్చని పై హదీసు ద్వారా బోధపడుతోంది.

906. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : వ్యాధిగ్రస్తుణ్ణి పరామర్శించి అతని దగ్గర ఏడుసార్లు, "అస్ అలుల్లాహల్ అజీమ రబ్బల్ అర్షిల్ అజీమి అంయ్యష్ఫియక" అని ప్రార్థిస్తే ఆ రోగి మరణం సమీపించని పక్షంలో దేవుడు అతనికి ఆ వ్యాధి నుంచి ఉపశమనాన్ని కలిగిస్తాడు. (అబూ దావూద్, తిర్మిజీ - హసన్. హాకిమ్ ఈ హదీసు బుఖారీ షరతులను అనుసరించి ఉల్లేఖించ బడిందని పేర్కొన్నారు.)

٩٠٦ - وعن ابنِ عباسٍ رضي الله عنهما عن النبيِّ ﷺ قال: «مَنْ عَادَ مَرِيضاً لَمْ يَحْضُرْهُ أَجَلُهُ، فقالَ عِنْدَهُ سَبْعَ مَرَّاتٍ: أَسْأَلُ اللهَ الْعَظِيمَ رَبَّ الْعَرْشِ الْعَظِيمِ أَنْ يَشْفِيَكَ؛ إلَّا عَافَاهُ اللهُ مِنْ ذلكَ المَرَضِ» رواه أبو داودَ والترمذي وقال: حديث حسن، وقال الحاكِم: حديث صحيح على شرطِ البخاري.

*(సుననె అబూ దావూద్‌లోని జనాయెజ్ ప్రకరణం, సుననె తిర్మిజీలోని శుచీశుభ్రతల అధ్యాయాలు)*

907. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) గారే చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) ఓ పల్లెవాసిని పరామర్శించటానికి వెళ్ళారు. ఆయన ఎవరిని పరామర్శించినా

٩٠٧ - وعنه أَنَّ النَّبِيَّ ﷺ دَخَلَ عَلى أَعْرَابِيٍّ يَعُودُهُ، وكانَ إذا دَخَلَ عَلى مَنْ

వారితో, "మీరేమీ చింతించకండి. దైవం తలిస్తే ఈ వ్యాధి మిమ్మల్ని పాపాల నుండి ప్రక్షాళనం చేస్తుంది" అని వారికి ధైర్యం చెప్పేవారు. *(బుఖారీ)*

يَعُودُهُ قال: «لَا بَأْسَ، طَهُورٌ إنْ شَاءَ اللهُ» رواه البخاري.

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పై హదీసులో దైవప్రవక్త (సల్లం) రోగిని 'తహూరున్' అని దీవించారు. తహూరున్ అంటే ఈ రోగం నీ మనసును పాపాల నుంచి ప్రక్షాళనం చేస్తుందని భావం. రోగి దగ్గర కూర్చొని ఈ విధంగా ఉత్సాహపరిచే, ధైర్యాన్ని కలిగించే మాటలు మాట్లాడటం సున్నత్ (దైవప్రవక్త సంప్రదాయం).

908. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం : జిబ్రయీల్ దూత దైవ ప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, "ఓ ముహమ్మద్ (సల్లం)! మీరు అనారోగ్యంగా ఉన్నారా?" అని పరామర్శించారు. దానికి దైవప్రవక్త (సల్లం) అవునన్నారు. అప్పుడు జిబ్రయీల్ (అలైహి) ఆయన కోసం ఈ విధంగా ప్రార్థించారు : "బిస్మిల్లాహి అర్‌ఖీక, మిన్ కుల్లి షైయిన్ యూజీక, మిన్ షర్రి కుల్లి నఫ్సిన్ అవ్ ఐనిన్ హాసిదిన్ అల్లాహు యష్ఫీక, బిస్మిల్లాహి అర్‌ఖీక."

(అల్లాహ్ పేరుతో మీపై ఊదుతున్నాను. అన్ని రకాల బాధల నుండి, ప్రతి ప్రాణి కీడు నుండి, అసూయాపరుని దిష్టి నుండి, దేవుడు మీకు ఉపశమనాన్ని ప్రసాదించుగాక! అల్లాహ్ పేరుతోనే మీపై ఊదుతున్నాను) *(ముస్లిం)*

٩٠٨ - وعن أبي سعيدٍ الخُدْرِيِّ رضي الله عنه أن جبْرِيلَ أتَى النَّبيَّ ﷺ، فقال: «يَامُحَمَّدُ! اشْتَكَيْتَ؟ قال: نَعَمْ، قال: بِسْمِ اللهِ أَرْقِيكَ، مِنْ كُلِّ شَيْءٍ يُؤْذِيكَ، مِنْ شَرِّ كُلِّ نَفْسٍ أَوْ عَيْنِ حَاسِدٍ، اللهُ يَشْفِيكَ، بِسْمِ اللهِ أَرْقِيكَ» رواه مسلم.

*(సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) కూడా మానవ మాత్రులే. ఇతర మానవుల్లాగానే ఆయన కూడా అనారోగ్యం పాలవుతుండేవారు. సాధారణంగా మానవులకొచ్చే వ్యాధులు, రోగాలు ఆయనక్కూడా వచ్చేవి. అందుకే ఈ హదీసులో వాటి బారి నుండి ఆయన రక్షణ కోసం ప్రార్థించటం జరిగింది.

909. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారని హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ, అబూ హురైరా (రజి)లు సాక్ష్యం చెప్పారు : ఎవరయినా "లా యిలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్" అని అంటే, దాన్ని ధృవీకరిస్తూ అతని ప్రభువు, "ఔను, నేను తప్ప వేరొక ఆరాధ్యదేవుడు లేడు, నేను అందరికన్నా గొప్పవాణ్ణి" అనంటాడు. మనిషి 'లా యిలాహ ఇల్ల ల్లాహు వహ్‌దహూ లా షరీక లహూ' అని అంటే, దానికి దేవుడు, 'నేను తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు. నేను ఒక్కణ్ణే. నాకు భాగస్వాములెవరూ లేరు' అని అంటాడు. మనిషి 'లా యిలాహ ఇల్ల ల్లాహు లహుల్ ముల్కు వలహుల్ హమ్దు' అని అంటే, దానికి దేవుడు, 'ఔను, నేను తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు. విశ్వ సార్వభౌమాధికారం నాదే. సకల స్తోత్రాలూ నాకే చెల్లుతాయి' అని జవాబు పలుకుతాడు. మనిషి, 'లా ఇలాహ ఇల్లల్లాహు వలా హౌల వలా ఖువ్వత ఇల్లా బిల్లాహ్' అని అంటే దానికి సమాధానంగా దేవుడు, 'ఔను,

٩٠٩ - وعن أبي سعيدٍ الخُدْرِيِّ وأبي هريرةَ، رضيَ اللهُ عنهما، أَنَّهُمَا شَهِدَا عَلى رسولِ اللهِ ﷺ أنه قال: «مَنْ قال: لا إلهَ إلَّا اللهُ وَاللهُ أَكْبَرُ، صَدَّقَهُ رَبُّهُ، فقال: لا إلهَ إلَّا أَنَا وَأَنَا أَكْبَرُ. وإذا قال: لا إلهَ إلَّا اللهُ وَحْدَهُ لا شَرِيكَ لَهُ، قال: يقولُ: لا إلهَ إلَّا أَنَا وَحْدِي لا شَرِيكَ لِي. وإذا قال: لا إلهَ إلَّا اللهُ لَهُ المُلْكُ وَلَهُ الحَمْدُ، قال: لا إلهَ إلَّا أَنَا لِيَ المُلْكُ وَلِيَ الحَمْدُ. وإذا قال: لا إلهَ إلَّا اللهُ وَلا حَوْلَ

وَلا قُوَّةَ إلَّا بِاللهِ، قال: لا إلهَ إلَّا أَنَا وَلا حَوْلَ وَلا قُوَّةَ إلَّا بِي» وَكَانَ يقولُ: «مَنْ قالَهَا في مَرَضِهِ ثُمَّ مَاتَ لَمْ تَطْعَمْهُ النَّارُ» رواه الترمذي وقال: حديث حسن.

నేను తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు. పాపాల నుండి రక్షించటం, సత్కార్యాల కొరకు ప్రోత్సహించటం నా వల్లే జరుగుతుంది' అని అంటాడు.

దైవప్రవక్త (సల్లం) ఇలా అనేవారు : ఎవరయినా వ్యాధికి గురయి ఈ వాక్యాలు పఠిస్తూ మరణిస్తే, నరకాగ్ని అతన్ని దహించజాలదు. *(తిర్మిజీ - హసన్)*

*(సుననె తిర్మిజీలోని ప్రార్థనల అధ్యాయాలు)*



**146వ అధ్యాయం**

## ١٤٦ ـ بَابُ اسْتِحْبَابِ سُؤَالِ أَهْلِ الْمَرِيضِ عَنْ حَالِهِ

## రోగి బాపతువారిని రోగి యోగక్షేమాలు అడుగుతూ ఉండటం అభిలషణీయం

٩١٠ ـ عن ابن عباسٍ رضي الله عنهما، أَنَّ عليَّ بنَ أبي طالب رضيَ اللهُ عنهُ خرجَ مِنْ عِنْدِ رسولِ اللهِ ﷺ في وَجَعِهِ الَّذي تُوُفِّيَ فيهِ، فقالَ النَّاسُ: يَا أَبَا الحَسَنِ! كَيفَ أَصْبَحَ رسولُ اللهِ ﷺ؟ قال: أَصْبَحَ بِحَمْدِ اللهِ بَارِئاً. رواه البخاري.

910. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) తమ నిర్యాణానికి కారణమైన వ్యాధికి గురైఉన్నప్పుడు హజ్రత్ అలీ (రజి) ఆయన దగ్గరి నుండి బయటికి వచ్చారు. ఆయన బయటకు రాగానే ప్రజలు (ఆయన్ని చుట్టుముట్టి), "అబుల్ హసన్! దైవ ప్రవక్త (సల్లం) ఉదయం మేల్కొన్నప్పుడు ఎలా ఉన్నారు?" అని అడగటం ప్రారంభించారు. దానికి సమాధానమిస్తూ అలీ (రజి), "దైవకృప వల్ల ఆయన బాగానే ఉన్నారు" అని అన్నారు.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ఇస్తీజాన్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

వ్యాధిగ్రస్తులను పరామర్శించటం పుణ్యప్రదమైన కార్యమే కాని వ్యాధి తీవ్రరూపం దాల్చి వ్యాధిగ్రస్తుడు నున్నితమైన పరిస్థితిలో ఉన్నప్పుడు ఒకేసారి ఎక్కువమంది పరామర్శించటానికి వెళితే రోగికి ఇబ్బంది కలగవచ్చు. అలాంటప్పుడు ఇద్దరు, ముగ్గురు చొప్పున వెళ్ళి రోగిని పరామర్శించి రావాలి. రోగి ఆరోగ్య పరిస్థితిని గురించి అతని ఇంటివారిని అడిగి తెలుసుకుంటూ ఉంటే మరీ మంచిది. రోగుల్ని పరామర్శించటానికి వెళ్ళేవారు ఈ విషయంలో వైద్యులతో సహకరించాలి.

147వ అధ్యాయం

## ١٤٧ ـ بَابُ مَا يَقُولُهُ مَنْ أَيِسَ مِنْ حَيَاتِهِ

## జీవితం మీద ఆశలు వదులుకున్నవాడు ఏమని ప్రార్థించాలి?

٩١١ ـ عن عائشةَ رضيَ اللهُ عنها قالت: سَمِعْتُ النبيَّ ﷺ وَهُوَ مُسْتَنِدٌ إلَيَّ يَقُولُ: «اللَّهُمَّ! اغْفِرْ لي وَارْحَمْنِي، وَأَلْحِقني بالرَّفِيقِ الأَعْلَى» متفق عليه.

911. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) నిర్యాణ సమయంలో నా దేహానికి తన వీపుని ఆనించి కూర్చున్నారు. ఆ సమయంలో తను ఈ విధంగా ప్రార్థిస్తుండగా నేను విన్నాను : "దేవా! నన్ను క్షమించు. నాపై దయజూపు. నన్ను సర్వోన్నత మిత్రునితో కలుపు." *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సలాం ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

సర్వోన్నత మిత్రుడంటే దేవుడేనని అత్యధికమంది పండితులు భావిస్తున్నారు. మరికొందరి అభిప్రాయం ప్రకారం దైవదూతలు, దైవప్రవక్తలు, అమరవీరులు, సదాచార సంపన్నులు కూడా సర్వోన్నత మిత్రులు కావచ్చు. హజ్రత్ యూసుఫ్ (అలైహి) దేవుడు తనను సదాచార సంపన్నులలో కలపాలని ప్రార్థించారు. దైవప్రవక్త (సల్లం) కూడా ఆ విధంగానే ప్రార్థించి ఉంటారని వారి అభిప్రాయం. ఏది ఏమైనా జీవితపు చివరి ఘడియల్లో మనిషి ఐహిక భవబంధాలన్నిటితో తెగత్రెంపులు చేసుకొని పరలోక జీవితం కోసం శ్రమిస్తూ ఉండాలి.

٩١٢ ـ وعنها قالت: رَأَيْتُ رسولَ اللهِ ﷺ وَهُوَ بالمَوْتِ، عِنْدَهُ قَدَحٌ فِيهِ مَاءٌ، وَهُوَ يُدْخِلُ يَدَهُ في القَدَحِ، ثُمَّ يَمْسَحُ وَجْهَهُ بالماءِ، ثم يقول: «اللَّهُمَّ!

912. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) గారే చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) మరణ వ్యాధికి గురయి ఉన్నప్పుడు నేనాయన్ని చూశాను. ఆ సమయంలో ఆయన దగ్గర నీళ్ళతో నిండి ఉన్న ఓ పాత్ర ఉండేది. ఆయన ఆ పాత్రలో చేతిని

أَعِنِّي عَلَى غَمَرَاتِ المَوْتِ وَسَكَرَاتِ المَوْتِ». رواه الترمذي.

ముంచి తీసి, తడి చేత్తో ముఖాన్ని తుడుచుకుంటూ, "దేవా! మరణ కాలపు కాఠిన్యంలో, అపస్మారక ఘడియల్లో నాకు సహాయపడు" అని ప్రార్థించేవారు. *(తిర్మిజీ)*

*(సునసె తిర్మిజీలోని జనాయెజ్ అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) మానవమాత్రులేనని పై హదీసు ద్వారా బోధపడుతోంది. సాధారణంగా మానవులకు వచ్చేవిధంగా ఆయనకు కూడా తీవ్రమైన వ్యాధివచ్చింది. ఆ వ్యాధి తాలూకు బాధను కూడా ఆయన అనుభవించారు. జీవితపు చివరి రోజుల్లో ఆయనకు విపరీతమైన జ్వరం వచ్చింది. తీవ్రమైన ఆ జ్వరం వేడి కారణంగానే ఆయన మాటిమాటికీ చేతులు నీటిలో ముంచి తడిచేతులతో ముఖం తుడుచుకునేవారు. అదేవిధంగా ప్రాణం పోతున్నప్పుడు సాధారణంగా మనుషులకు ఎలాంటి బాధ అయితే కలుగుతుందో దాన్ని కూడా ఆయన అనుభవించారు. మరణ బాధను తగ్గించమని కూడా ఆయన అల్లాహ్‌ను వేడుకున్నారు.

షేఖ్ అల్ బానీ ఈ హదీసును బలహీనకోవకు చెందిన హదీసుగా నిర్ధారించి 'జయీఫ్ సుననె తిర్మిజీ' క్రింద పేర్కొన్నారు. అయితే దైవప్రవక్తకు మరణావస్థలో అపస్మారక స్థితి ఆవరించిందని ప్రామాణికమైన హదీసుల ద్వారా కూడా రుజువు అవుతోంది (బుఖారీ గ్రంథంలోని మగాజీ ప్రకరణం చూడండి).

పైన పేర్కొనబడిన రెండు హదీసుల ద్వారానూ మనిషి, ముఖ్యంగా జీవితపు అంతిమ దశలో దైవసహాయాన్ని కోరుకుంటూ ఉండాలని బోధించబడింది.

## 148వ అధ్యాయం

## ١٤٨ ـ بَـابُ اسْتِحْبَـابِ وَصِيَّـةِ أَهْـلِ الْمَرِيضِ وَمَنْ يَخْدُمُهُ بِالإِحْسَانِ إِلَيْهِ وَاحْتِمَالِهِ وَالصَّبْرِ عَلَى مَا يَشُقُّ مِنْ أَمْرِهِ وَكَذَا الْوَصِيَّةِ بِمَنْ قَرُبَ سَبَبُ مَوْتِهِ بِحَدٍّ أَوْ قِصَاصٍ وَنَحْوِهِمَا

## రోగి పట్ల ఉత్తమంగా వ్యవహరించాలని, అతని మూలంగా కలిగే ఇబ్బందులపై సహనం వహించాలని రోగి ఇంటివారికి, అతని సేవకులకు హితవు చెప్పాలి. అలాగే మరణ దండన విధించబడిన వారిపట్ల కూడా ఉత్తమంగా వ్యవహరించాలని తాకీదు చేయాలి

٩١٣ ـ عن عِمْرَانَ بنِ الحُصَيْنِ رضي الله عنهما أَنَّ امْرَأَةً مِنْ جُهَيْنَةَ أَتَتِ النَّبِيَّ ﷺ وَهِيَ حُبْلَىٰ مِن الزِّنَا، فقالت: يا رسولَ اللهِ! أَصَبْتُ حَدّاً فَأَقِمهُ عَلَيَّ، فَدَعَا رسولُ اللهِ ﷺ وليَّهَا، فقال: «أَحْسِنْ

913. హజ్రత్ ఇమ్రాన్ బిన్ హుసైన్ (రజి) కథనం : వ్యభిచారం మూలంగా గర్భవతి అయిన జుహైనా తెగకు చెందిన ఒక స్త్రీ స్వయంగా దైవప్రవక్త (సల్లం) దగ్గరకు వెళ్ళి, "దైవప్రవక్తా! నేను (వ్యభిచార పాపం చేసి) శిక్షార్హురాలిని అయ్యాను. కనుక నాకు శిక్ష విధించండి" అని విన్నవించుకున్నది. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఆమె సంరక్షకుణ్ణి పిలిపించి, "(ఈమెను నీ వెంట తీసుకు వెళ్ళు). ఈమె పట్ల ఉత్తమంగా మెలగు. ప్రసవానంతరం ఈమెను తిరిగి నా దగ్గరికి తీసుకురా" అని చెప్పి పంపించారు.

إِلَيْهَا، فَإِذَا وَضَعَتْ فَأْتِنِي بِهَا» فَفَعَلَ، فَأَمَرَ بِهَا النبيُّ ﷺ فشُدَّتْ عَلَيها ثِيَابُهَا، ثُمَّ أَمَرَ بِها فرُجِمَتْ، ثُمَّ صَلّى عَلَيها. رواه مسلم.

ప్రసవానంతరం ఆ వ్యక్తి ఆమెను తిరిగి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి తీసుకు వచ్చాడు. అప్పుడామె శరీరాన్ని బట్టలతో గట్టిగా చుట్టి దైవప్రవక్త ఆజ్ఞ మేరకు ఆమెకు శిలాశిక్ష విధించటం జరిగింది. ఆ తర్వాత దైవప్రవక్త (సల్లం) ఆమె భౌతికకాయానికి జనాజా నమాజ్ కూడా చేయించారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని శిక్షల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) ఈ అధ్యాయానికి పెట్టిన పేరును పై హదీసు రుజువు చేస్తోంది. దీనిద్వారా బోధపడుతున్న మరొక విషయం ఏమిటంటే, వ్యభిచారం మూలంగా గర్భం దాల్చిన స్త్రీని వెంటనే శిక్షించరాదు. ఆమెను ప్రసవానంతరం శిక్షించాలి. ఎందుకంటే అందులో పిల్లవాడి తప్పు ఏమీ లేదు. అదేవిధంగా అటువంటి స్త్రీకి విధించబడే శిక్ష ఆమె చేసిన పాపానికి పరిహారం అవుతుంది. కనుక ఆమె జనాజా నమాజు కూడా చేయాలి.



## 149వ అధ్యాయం

١٤٩ - بَابُ جَوَازِ قَوْلِ المَرِيْضِ: وَجِعٌ، أَوْ شَدِيْدُ الوَجَعِ، أَوْ مَوْعُوْكٌ، أَوْ وَا رَأْسَاهْ، وَنَحْوَ ذٰلِكَ، وَبَيَانِ أَنَّهُ لاَ كَرَاهَةَ فِي ذٰلِكَ إِذَا لَمْ يَكُنْ عَلى سَبِيلِ التَّسَخُّطِ وَإِظْهَارِ الجَزَعِ

**దైవం పట్ల అప్రసన్నతా భావంతో కాకుండా, కళవళపాటుకు లోనుకాకుండా రోగి తనకు బాధగా ఉందని లేక జ్వరంగా ఉందని లేక విపరీతమైన తలనొప్పి ఉందని చెప్పటంలో తప్పులేదు.**

٩١٤ - عن ابنِ مسعودٍ رضيَ الله عنه قال: دَخَلتُ عَلى النَّبيِّ ﷺ وَهُوَ يُوعَكُ، فَمَسِسْتُهُ، فقُلْتُ: إنَّكَ لَتُوعَكُ وَعْكاً شَدِيداً، فقال: «أَجَلْ إنِّي أُوعَكُ كما يُوعَكُ رَجُلانِ مِنْكُمْ» متفقٌ عليه.

914. హజ్రత్ ఇబ్నె మస్‌వూద్ (రజి) కథనం : నేనొక రోజు దైవప్రవక్త (సల్లం) ఇంటికి వెళ్ళగా ఆయన జ్వరంతో బాధ పడుతున్నారు. నేనాయన శరీరం మీద చెయ్యిపెట్టి, "మీకు జ్వరం చాలా తీవ్రంగా ఉన్నట్లుంది" అన్నాను. అందు కాయన "ఔను, నాకు వచ్చే జ్వరం మీలో ఇద్దరికి వచ్చే జ్వరమంత ఉంటుంది" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

٩١٥ - وعن سعدِ بنِ أبي وَقَّاصٍ رضيَ الله عنه قال: جَاءَني رسولُ اللهِ ﷺ

915. హజ్రత్ సాద్ బిన్ అబూ వఖ్ఖాస్ (రజి) కథనం : నేను తీవ్రమయిన వ్యాధితో బాధపడుతున్నప్పుడు దైవప్రవక్త

يَعُودُني مِنْ وَجَعٍ اشْتَدَّ بِي، فَقُلْتُ: بَلَغَ بِي ما تَرَى، وَأَنَا ذُو مَالٍ، وَلَا يَرِثُني إلَّا ابْنَتِي، وذكر الحديث. متفقٌ عليه.

(సల్లం) నన్ను పరామర్శించటానికి వచ్చారు. అప్పుడు నేనాయనతో మాట్లాడుతూ, "దైవప్రవక్తా! నా అనారోగ్యం ఏ స్థితికి చేరుకుందో మీరు చూస్తూనే ఉన్నారు. నేనా ధనవంతుణ్ణి. నాకు ఒక్క కూతురు తప్ప ఇతర వారసులెవరూ లేరు" అని చెప్పాను. (సశేషం).

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణం, సహీహ్ ముస్లింలోని వీలునామాల ప్రకరణం)*

٩١٦ ـ وعن القاسم بن محمد قال: قالت عائشةُ رضيَ اللهُ عنها: وَا رَأْسَاهُ، فقال النَّبيُّ ﷺ: «بَلْ أَنَا وَا رَأْسَاهُ»، وَذَكَرَ الْحَدِيثَ. رواه البخاري.

916. హజ్రత్ ఖాసిం బిన్ ముహమ్మద్ (రహ్మాలై) కథనం : ఒక రోజు ఆయిషా (రజి.అన్హా) (తలనొప్పితో బాధ పడుతూ), "వామ్మో! నా తల పగిలిపోతున్నట్లుంది" అన్నారు. అందుకు దైవప్రవక్త (సల్లం) "వామ్మో! నా తల కూడా పగిలిపోతున్నట్లుంది" అని అన్నారు. (సశేషం).

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని వ్యాధిగ్రస్తుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం) సతీమణి హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) తనకు తీవ్రమైన తలనొప్పి ఉందంటూ ఆ బాధను వ్యక్తం చేయసాగారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) తనకు కూడా తీవ్రమైన తలనొప్పి ఉందంటూ ఆమె తన బాధను వ్యక్తం చేసినట్లు తనూ చేశారు. తీవ్రమైన వ్యాధికి గురయినప్పుడు ఆ బాధను మాటల ద్వారా వ్యక్తం చేయవచ్చన్నది ఆయన ఉద్దేశ్యం. అయితే దైవం పట్ల అప్రసన్నతతో బాధను వ్యక్తం చేయరాదు. కళవళపాటుకి లోనయి షరీఅత్‌కు విరుద్ధమైన కూతలు కూయరాదు.

ఈ హదీసు ఉల్లేఖకులయిన ఖాసిం (రహ్మాలై) ముహమ్మద్ బిన్ అబూ బకర్ (రజి) గారి కుమారుడు. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా)కు భ్రాతృజుడు (సోదర కుమారుడు) అవుతారు. మదీనా నగరంలో ప్రఖ్యాతిగాంచిన ఏడుగురు ధర్మవేత్తల్లో ఈయన ఒకరు.

**150వ అధ్యాయం**

# ١٥٠ ـ بَابُ تَلْقِينِ الْمُحْتَضَرِ: لاَ إِلٰهَ إِلاَّ اللهُ

# మరణం సమీపించిన వారిని లా యిలాహ ఇల్లల్లాహ్ కలిమా పఠించమని ప్రోత్సహించాలి

٩١٧ ـ عن معاذ رضيَ الله عنه قالَ: قالَ رسُولُ اللهِ ﷺ: «من كانَ آخِرَ كَلامِهِ لا إِلهَ إِلَّا الله دَخَلَ الجَنَّةَ». رواه أبو داود والحاكم وقال: صحيح الإِسناد.

917. హజ్రత్ ముఆజ్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : తన జీవితపు తుది పలుకు 'లా యిలాహ ఇల్లల్లాహు' అయిన వ్యక్తి స్వర్గానికి వెళ్తాడు. (అబూ దావూద్, హాకిమ్ - హాకిమ్ ఈ హదీసు ప్రామాణికమైన ఆధారం కలదని పేర్కొన్నారు).

*(సుననె అబూ దావూద్‌లోని జనాయెజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

మృత్యువు దాపురించినప్పుడు నోటినుంచి 'లా ఇలాహ ఇల్లల్లాహ్' (అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యదేవుడు లేడు) అనే పలుకులు వెలువడటం మృతుని విశ్వాసానికి చిహ్నం. విశ్వాసి అయినవాడు తప్పకుండా స్వర్గానికి వెళ్తాడు. అయితే అలాంటి వ్యక్తి కూడా తొలిదశలోనే స్వర్గానికి వెళ్తాడో లేక కొంతకాలం చేసిన తప్పులకు శిక్ష అనుభవించి ఆ తర్వాత స్వర్గానికి వెళ్తాడో మనం చెప్పలేము. అది దేవుని అభీష్టం మీద, ఆ తర్వాత వారి ఆచరణ మీద ఆధారపడి ఉంటుంది. అదేవిధంగా అతను తౌహీద్ కర్తవ్యాలను అర్థం చేసుకొని వాటిని ఆచరిస్తూ 'షిర్క్' (బహుదైవారాధన)కు దూరంగా జీవితం గడిపినవాడై ఉండాలి సుమా! అప్పుడే అతను స్వర్గానికి వెళ్ళగల్గుతాడు. ఒట్టి పేరుకు మాత్రమే ముస్లింలుగా ఉండి బహుదైవారాధనకు ఒడిగట్టేవారు స్వర్గానికి ఎలా వెళ్ళగల్గుతారు?!

٩١٨ ـ وعن أبي سعيدٍ الخُدْرِيِّ رضيَ اللهُ عنهُ قالَ: قالَ رَسُولُ اللهِ ﷺ: «لَقِّنُوا مَوْتَاكُمْ لا إِلهَ إِلَّا الله» رواه مسلم.

918. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : మీలో మృత్యువు దాపురించిన వారికి 'లా

యిలాహ ఇల్లల్లాహ్' (కలిమా పఠించ
మని) బోధించండి. (ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

హదీసు మూలంలో "మీ మృతులకు బోధించండి" అని చెప్పబడింది. ఇక్కడ మృతులంటే మృత్యువు దాపురించిన వారని భావం. జీవితపు చరమ ఘడియల్లో చావుబతుకుల మధ్య కొట్టుమిట్టాడుతున్న వారి దగ్గర జనం కూర్చొని 'లా యిలాహ ఇల్లల్లాహు' అని పఠిస్తూ ఉండాలి గాని, చదవమని రోగికి బోధించరాదనీ, దానివల్ల రోగి కళవళపాటుతో కలిమా పఠించడానికి నిరాకరిస్తే దైవతిరస్కారానికి ఒడిగట్టినట్లవుతుందని కొంతమంది పండితులు అభిప్రాయపడుతున్నారు. కాని షేఖ్ అల్‌బానీ (రహ్మాలై) గారు ఈ భావనను ఖండించారు. పై హదీసు ప్రకారం మృత్యువు దాపురించిన వారికి కలిమా గురించి బోధించడమంటే 'లా యిలాహ ఇల్లల్లాహ్' అని పలకమంటూ వారిని ప్రోత్సహించటమేనని ఆయన నిర్ద్వంద్వంగా తేల్చి చెప్పారు.



**151వ అధ్యాయం**

# ١٥١ ـ بَابُ مَا يَقُولُهُ بَعْدَ تَغْمِيضِ الْمَيِّتِ

# మృతుని కనురెప్పలు మూసినాక ఏమని ప్రార్థించాలి?

٩١٩ ـ عن أُمِّ سَلَمَة رضيَ اللهُ عنها قالت: دَخَلَ رسُولُ اللهِ ﷺ على أبي سَلَمَةَ وَقَدْ شَقَّ بَصَرُهُ، فَأَغْمَضَهُ، ثُمَّ قَالَ: «إنَّ الرُّوحَ إذَا قُبِضَ، تَبِعَهُ الْبَصَرُ» فَضَجَّ نَاسٌ مِنْ أَهْلِهِ، فقال: «لَا تَدْعُوا عَلَى أَنْفُسِكُمْ إلَّا بِخَيْرٍ، فَإنَّ المَلائِكَةَ يُؤَمِّنُونَ عَلى مَا تَقُولونَ» ثُمَّ قَالَ: «اللَّهُمَّ! اغفِرْ لأَبِي سَلَمَةَ، وَارْفَعْ دَرَجَتَهُ في المَهْدِيِّينَ، وَاخْلُفْهُ في عَقِبِهِ في الغَابِرِينَ، وَاغفِرْ لَنَا وَلَهُ يَا رَبَّ الْعَالَمِينَ! وَافْسَحْ لَهُ في قَبْرِهِ، وَنَوِّرْ لَهُ فيه» رواه مسلم.

919. హజ్రత్ ఉమ్మె సలమా (రజి. అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) అబూ సలమా (మరణవార్త విని ఆయన) ఇంటికి వచ్చారు. అప్పటికి అబూ సలమా కళ్ళు బిగుసుకు పోయాయి. దైవప్రవక్త (సల్లం) ఆయన కనురెప్పలు మూస్తూ, "ప్రాణం (దేహాన్ని) వీడుతున్నప్పుడు కళ్ళు దాన్ని వెంబడి స్తాయి" అన్నారు. ఆ మాట వినగానే అబూ సలమా ఇంటివాళ్ళు గొల్లుమ న్నారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) (వారిని సముదాయిస్తూ) "మీరు చెప్పే మాటలకు దైవదూతలు 'ఆమీన్' అని అంటుంటారు. కనుక మీ మృతుల విష యంలో మంచి మాటలే పలకండి" అని అన్నారు. తర్వాత ఆయన అబూ సలమా (రజి) కొరకు ఈ విధంగా ప్రార్థించారు:

దేవా! అబూ సలమాను క్షమించు. సన్మార్గం పొందినవారిలో ఇతనికి పదో న్నతి కల్పించు. ఇతని సంబంధీకుల సంతానంలో నుంచి ఇతనికి తగిన వారసుణ్ణి నిలబెట్టు. ఓ సకలలోక ప్రభువా! మమ్మల్నీ ఇంకా మరణించే వారందర్నీ క్షమించు. ఇతని సమాధిని విశాలపరచు. అందులో అతని కొరకు వెలుగుని ప్రసాదించు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

చనిపోయినవారి శ్రేయస్సును కాంక్షిస్తూ దుఆ చేస్తే, దానివల్ల మృతులకు ప్రయోజనం కలుగుతుందని ఈ హదీసు ద్వారా బోధపడుతోంది. ఇతర అనేక హదీసులు కూడా ఈ విషయాన్ని ధృవీకరిస్తున్నాయి. కనుక మరణించినవారి పట్ల సంతాపాన్ని ప్రకటించటం, వారి బంధుమిత్రుల్ని, ఆత్మీయుల్ని ఓదార్చటం, మృతుల శ్రేయస్సు కొరకు ప్రార్థించటం ధర్మసమ్మతమే. అంతేకాదు, అది మస్నూన్ పద్ధతి కూడా. దైవప్రవక్త (సల్లం) స్వయంగా అలా చేసేవారని హదీసుల ద్వారా తెలుస్తోంది.

దీనికి భిన్నంగా చనిపోయినవారి ఇంటి ముంగిట మూడ్రోజుల వరకు జనం బారులు తీరి కూర్చోవటం, ఫాతిహా ఖానీలు చేయటం లాంటి చేష్టలన్నీ అధర్మమైనవి. ధర్మంలో తలెత్తే ఇలాంటి కొత్త పోకడలకు దూరంగా ఉండటం చాలా అవసరం.



## 152వ అధ్యాయం

# ١٥٢ ـ بَابُ مَا يُقَالُ عِنْدَ المَيِّتِ وَمَا يَقُولُهُ مَنْ مَاتَ لَهُ مَيِّتٌ

# మృతుని దగ్గర కూర్చొని ఉన్నవారు, మృతుని కుటుంబీకులు ఏమని ప్రార్థించాలి?

٩٢٠ ـ عن أُمِّ سَلَمَةَ رضيَ الله عنها قالت: قالَ رَسُولُ اللهِ ﷺ: «إذا حَضَرْتُمُ المَرِيضَ ـ أَوِ المَيِّتَ ـ فَقُولُوا خَيْراً؛ فَإِنَّ المَلائِكَةَ يُؤَمِّنُونَ عَلَى مَا تَقُولُونَ»، قَالَتْ: فَلَمَّا مَاتَ أَبُو سَلَمَةَ، أَتَيْتُ النَّبِيَّ ﷺ فَقُلْتُ: يا رَسُولَ اللهِ! إنَّ أَبَا سَلَمَةَ قَدْ مَاتَ، قالَ: «قُولِي: اللَّهُمَّ! اغْفِرْ لِي وَلَهُ، وَأَعْقِبْنِي مِنْه عُقْبَى حَسَنَةً» فقلتُ، فَأَعْقَبَنِي اللهُ مَنْ هُوَ خَيْرٌ لِي مِنْهُ: مُحَمَّداً ﷺ. رواه مسلم هكذا: «إذا حَضَرتُمُ المَرِيضَ» أَوِ «المَيِّتَ» عَلى الشَّكِّ، ورواه أبو داود وغيره: «المَيِّتَ» بلا شَكّ.

920. హజ్రత్ ఉమ్మె సలమా (రజి. అన్హా) కథనం : దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : మీరు వ్యాధిగ్రస్తుని దగ్గర గాని లేదా మృతుని దగ్గర గాని కూర్చొని ఉన్నప్పుడు (వారి గురించి) పలికితే మంచిమాటలే పలకండి. ఎందుకంటే మీరు చెప్పే మాటలకు దైవ దూతలు 'ఆమీన్' అని అంటుంటారు.

ఉమ్మె సలమా (రజి.అన్హా) ఇలా తెలియజేస్తున్నారు: "నా భర్త అబూ సలమా మరణించినప్పుడు నేను దైవ ప్రవక్త (సల్లం) దగ్గరికి వెళ్ళి 'దైవప్రవక్తా! అబూ సలమా చనిపోయారు. (ఇక నా గతేం కాను?)' అని (బాధతో విలపిస్తూ) అడిగాను. అందుకాయన ఈ విధంగా ప్రార్థిస్తూ ఉండమని చెప్పారు: 'దేవా! నన్నూ, మా ఆయన్నీ క్షమించు. ఆయన తర్వాత నాకు మంచి ప్రతిఫలాన్ని ప్రసాదించు'.

నేనావిధంగా దుఆ చేస్తే నిజంగా దేవుడు ఆయన కంటే మంచి వ్యక్తి - ముహమ్మద్ (సల్లం)ను నాకు ప్రసాదించాడు."

*(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

తమ సంబంధీకులు ఎవరైనా చనిపోతే వారు లేని లోటుని పూరించటానికి పై విధంగా ప్రార్థించటం దైవప్రవక్త సంప్రదాయం. అలా ప్రార్థిస్తే అల్లాహ్ తప్పకుండా మంచి ప్రత్యామ్నాయాన్ని ప్రసాదిస్తాడు. అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు. ఆయన శక్తికి మించిన పని ఏదీ లేదు.

٩٢١ ـ وعنها قالت: سمعت رسولَ الله ﷺ يقول: «مَا مِنْ عَبْدٍ تُصِيبُهُ مُصِيبَةٌ، فيقولُ: إنَّا للهِ وَإنَّا إلَيْهِ رَاجِعُونَ، اللَّهُمَّ اؤْجُرْنِي فِي مُصِيبَتِي، وَأَخْلِفْ لِي خَيْراً مِنْهَا، إلَّا أَجَرَهُ اللهُ تَعَالى فِي مُصِيبَتِهِ وَأَخْلَفَ لَهُ خَيْراً مِنْهَا». قالت: فَلَمَّا تُوُفِّيَ أَبُو سَلَمَة، قلتُ كَمَا أَمَرَنِي رسولُ الله ﷺ، فَأَخْلَفَ اللهُ لِي خَيْراً مِنْهُ رسولَ الله ﷺ. رواه مسلم.

921. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఉమ్మె సలమా (రజి.అన్హా) తెలియజేశారు: ఏ దాసుడయినా తనకు ఆపద కలిగినప్పుడు, “మేమంతా అల్లాహ్‌కే చెందినవారము. మేము తిరిగి ఆయన వద్దకే మరలిపోవలసిన వారము. దేవా! నాకు ఈ ఆపదలో పుణ్యాన్ని ప్రసాదించు. నేను పోగొట్టుకున్న దానికంటే మంచి ప్రతిఫలాన్ని నాకు అనుగ్రహించు” అని ప్రార్థిస్తే దేవుడు అతనికి ఆ ఆపద తర్వాత మంచి ప్రతిఫలాన్ని ప్రసాదిస్తాడు.

ఉమ్మె సలమా (రజి.అన్హా) ఇలా అంటున్నారు : నా భర్త అబూ సలమా చనిపోయినప్పుడు నేను దైవప్రవక్త (సల్లం) నాకు ఆదేశించినట్లుగానే ప్రార్థించాను. ఫలితంగా దేవుడు నాకు ఆయన కన్నా మంచి వ్యక్తి దైవప్రవక్త (సల్లం)ను నాకు ప్రసాదించాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

٩٢٢ ـ وعن أبي موسى رضي الله عنه أنَّ رسولَ الله ﷺ قال: «إذا مَاتَ وَلَدُ

922. హజ్రత్ అబూ మూసా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: దాసుని బిడ్డ చనిపోయినప్పుడు దేవుడు తన దూతలతో,

العَبْدِ، قال اللهُ تعالى لِمَلائِكَتِهِ: قَبَضْتُمْ وَلَدَ عَبْدِي؟ فَيَقُولُونَ: نَعَمْ، فَيَقُولُ: قَبَضْتُمْ ثَمَرَةَ فُؤَادِهِ؟ فَيَقُولُونَ: نَعَمْ، فَيَقُولُ: فَمَاذا قالَ عَبْدِي؟ فيقولُونَ: حَمِدَكَ واسْتَرْجَعَ، فَيَقُولُ اللهُ تعالى: ابْنُوا لِعَبْدِي بَيْتاً في الجَنَّةِ، وَسَمُّوهُ بَيْتَ الحَمْدِ» رواه الترمذي وقال: حديث حسن.

"మీరు నా దాసుని బిడ్డ ప్రాణాలు తీశారా?" అని అడుగుతాడు. దానికి దూతలు 'అవున'ంటారు. "మీరు నా దాసుని గారాలపట్టిని చంపారా?" అని మళ్ళీ అడుగుతారు దేవుడు. దైవ దూతలు అవునంటారు. అప్పుడు దేవుడు, "మరి దానికి నా దాసుడు ఏమ న్నాడు?" అని అడుగుతాడు. "(దేవా! అంతటి కఠోర పరిస్థితిలో కూడా) అతను నిన్ను స్తుతించి, 'ఇన్నా లిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్' అని పఠించాడు" అని చెబుతారు దైవదూతలు. అది వినగానే దేవుడు ప్రసన్నుడై, "అయితే నా దాసుని కొరకు స్వర్గంలో ఒక గృహాన్ని నిర్మిం చండి. దానికి 'స్తోత్ర నిలయం' అని పేరు పెట్టండి" అని తన దూతల్ని ఆజ్ఞా స్తాడు. *(తిర్మిజీ - హసన్)*

*(సునసె తిర్మిజీలోని జనాయెజ్ అధ్యాయాలు)*

٩٢٣ - وعن أبي هُريرةَ رضي اللهُ عنه أنَّ رسولَ اللهِ ﷺ قال: «يقُولُ اللهُ تعالى: ما لِعَبْدِي المُؤْمِنِ عِنْدِي جَزَاءٌ إذا قَبَضْتُ صَفِيَّهُ مِنْ أَهْلِ الدُّنْيَا ثُمَّ احْتَسَبَهُ إلَّا الجَنَّةَ» رواه البخاري.

923. దేవుడు ఇలా సెలవిచ్చాడంటూ దైవప్రవక్త (సల్లం) ప్రవచించారని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలియజేశారు: విశ్వాసి దగ్గరి నుంచి నేను తను గాఢంగా ప్రేమించే ప్రాపంచిక వస్తువుని లాక్కున్నప్పుడు అతను పుణ్యఫలా పేక్షతో సహనం వహిస్తే, నా దగ్గర స్వర్గమే అతనికి బహుమానం. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని ప్రేమైక వచనాల ప్రకరణం)*

٩٢٤ - وعن أُسامةَ بن زيدٍ رضي اللهُ عنهما قال: أَرْسَلَتْ إحْدى بَنَاتِ النبيِّ ﷺ إلَيْهِ تَدْعُوهُ وَتُخْبِرُهُ أنَّ صَبِيّاً لَهَا - أَوِ ابْناً -

924. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) కుమార్తెలలో ఒకామె తన బిడ్డ చావుబ్రతుకుల్లో

في المَوْتِ فقال لِلرَّسولِ: «ارجعْ إلَيها، فَأَخْبِرْهَا أنَّ للهِ تَعَالى مَا أَخَذَ وَلَهُ مَا أَعْطَى، وَكُلُّ شَيْءٍ عِنْدَهُ بِأَجَلٍ مُسَمًّى، فَمُرْهَا، فَلْتَصْبِرْ وَلْتَحْتَسِبْ» وذكر تمام الحديث. متفقٌ عليه.

ఉన్నాడనీ, తమరు వెంటనే రావాలని (ఒక వ్యక్తి ద్వారా) దైవప్రవక్త (సల్లం)కు కబురంపారు. దానికి దైవప్రవక్త (సల్లం) కబురు తెచ్చిన వ్యక్తితో, "నువ్వు తిరిగి ఆమె వద్దకు వెళ్ళు. దేవుడు వెనక్కి తీసుకుంది అయనదేననీ, తాను ప్రసాదించినది కూడా ఆయనదేననీ, ప్రతి వస్తువుకూ ఆయన ఒక గడువు నిర్ణయించి ఉంచాడని ఆమెతో చెప్పు. ఇంకా ఆమెను సహనం వహించమనీ, పుణ్యాన్ని ఆశిస్తూ ఉండమని ఆజ్ఞాపించు" అని చెప్పి పంపించారు. (సశేషం) *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జనాయెజ్ ప్రకరణం)*

**153వ అధ్యాయం**

## ١٥٣ ـ بَابُ جَوَازِ الْبُكَاءِ عَلَى الْمَيِّتِ بِغَيْرِ نَدْبٍ وَلاَ نِيَاحَةٍ

## ఏడ్పులు, పెడబొబ్బలు లేకుండా మృతుని గురించి విలపించటం ధర్మసమ్మతమే

أمَّا النِّيَاحَةُ فَحَرَامٌ وَسَيَأْتِي فِيهَا بَابٌ فِي كِتَابِ النَّهْيِ؛ إنْ شَاءَ الله تعالى. وَأمَّا البُكَاءُ فَجَاءَتْ أحَادِيثُ كَثِيرَةٌ بالنَّهْيِ عَنْهُ، وَأنَّ المَيِّتَ يُعَذَّبُ بِبُكَاءِ أهْلِهِ، وَهِيَ مُتَأوَّلَةٌ وَمَحْمُولَةٌ عَلَى مَنْ أوْصَى بِهِ، وَالنَّهْيُ إنَّما هُوَ عَنِ البُكَاءِ الَّذِي فِيهِ نَدْبٌ، أوْ نِيَاحَةٌ، وَالدَّلِيلُ عَلَى جَوَازِ البُكَاءِ بِغَيْرِ نَدْبٍ وَلا نِيَاحَةٍ أحَادِيثُ كَثِيرَةٌ، مِنْهَا:

మనిషి మరణించినప్పుడు అతని గురించి పెడబొబ్బలు పెట్టటం నిషిద్ధం. దానిపై (ప్రత్యేకంగా) 'కితాబున్నహీ'లో ఇన్షాఅల్లాహ్ ఒక అధ్యాయం రాబోతోంది. మనిషి మరణం పట్ల రోదించటాన్ని వారించే హదీసులు కూడా అనేకం ఉన్నాయి. "మృతునికి అతని కుటుంబ సభ్యులు ఏడ్వటం వల్ల సమాధిలో యాతన కలుగుతుంది" అన్న హదీసు భావం ఏమిటంటే, మృతుడు చనిపోయేముందు తన మృతిపట్ల ఏడ్పులు, పెడబొబ్బలు పెట్టమని చెప్పిపోతే అప్పుడు అతను సమాధిలో యాతనకు గురవుతాడు. రోదిస్తూ, పెడబొబ్బలు పెడ్తూ ఏడ్వకూడదు. రోదించకుండా, పెడబొబ్బలు పెట్టకుండా విలపించటం ధర్మసమ్మతమేనన్న విషయాన్ని ఎన్నో హదీసులు ధృవీకరిస్తున్నాయి.

٩٢٥ ـ عَنِ ابنِ عُمَرَ رضي الله عنهما أنَّ رسُولَ اللهِ ﷺ عاد سَعْدَ بنَ عُبَادَةَ، وَمَعَهُ عَبْدُ الرَّحْمٰنِ بْنُ عَوْفٍ، وسَعْدُ بْنُ أَبي وَقَّاصٍ، وعَبْدُ اللهِ بْنُ مَسْعُودٍ رضي الله عنهم، فَبَكَى رسولُ اللهِ ﷺ، فلمَّا رَأَى القَوْمُ بُكَاءَ

925. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: సాద్ బిన్ ఉబాదా (రజి) రోగగ్రస్తులయితే దైవప్రవక్త (సల్లం) ఆయన్ని పరామర్శించటానికి వెళ్ళారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) వెంట అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్, సాద్ బిన్ అబూ వఖ్ఖాస్, అబ్దుల్లాహ్ బిన్ మస్వూద్ (రజిలు) కూడా ఉన్నారు. అక్కడికి చేరుకున్న తర్వాత దైవప్రవక్త (సల్లం) (సాద్ అనారోగ్య పరిస్థితి చూసి అప్రయత్నంగానే) కంట తడిపెట్టారు. ఆయన్ని చూసి మిగతా

رسـول الله ﷺ، بكـوا؛ فقـال: «ألا تَسْمَعُونَ؟ إنَّ اللهَ لا يُعَذِّبُ بدمع العَيْنِ، وَلا بِحُزْنِ القَلْبِ، وَلكِنْ يُعَذِّبُ بِهذَا أَوْ يَرْحَمُ» وَأَشَارَ إلى لِسَانِهِ. متفقٌ عليه.

వారందరూ కూడా దుఃఖించటం మొదలుపెట్టారు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రవచించారు : "చూడండి! కన్నీళ్ళ వల్లగాని, హృదయావేదన వల్లగాని దేవుడు మనిషిని శిక్షించడు. అయితే దీనివల్ల (దైవప్రవక్త తన నాలుక వైపు చూపిస్తూ అన్నారు) (మనిషి పెడబొబ్బలు పెడితే మాత్రం) దేవుడు తప్పకుండా శిక్షిస్తాడు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జనాయెజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

తీవ్రమైన దుఃఖం మూలంగా బాధపడటం, ఆ బాధను కన్నీళ్ల ద్వారా వ్యక్తం చేయటం మానవ సహజమైన విషయం. మనిషి దాన్ని ఎంత ఆపుకోవాలన్నా ఆపుకోలేడు. కాని ఆ బాధను వ్యక్తీకరించటంలో హద్దుమీరి ప్రవర్తించటం, ఏడ్చి పెడబొబ్బలు పెట్టటం మాత్రం ధర్మసమ్మతం కాదు.

٩٢٦ ـ وعـن أُسَـامَـةَ بـنِ زَيْـدٍ رضي الله عنهما أنَّ رسولَ اللهِ ﷺ رُفِعَ إلَيْهِ ابْنُ ابْنَتِهِ وَهُوَ في المَوْتِ، فَفَاضَتْ عَيْنَا رسـولِ اللهِ ﷺ، فقـال لـه سعـدٌ: مَـا هٰـذا يا رسولَ اللهِ؟! قال: «هٰذِهِ رحمةٌ جَعَلَهَا اللهُ تَعَالى في قُلُوبِ عِبَادِهِ، وَإنما يَرْحَمُ اللهُ مِنْ عِبَادِهِ الرُّحَمَاءَ» متفقٌ عليه.

926. హజ్రత్ ఉసామా బిన్ జైద్ (రజి) కథనం : దైవప్రవక్త కూతురి కొడుకు చావుబతుకుల్లో ఉన్నప్పుడు, అతణ్ణి దైవ ప్రవక్త దగ్గరకు తీసుకురావటం జరిగింది. (ఆ పసివాడు కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతున్నాడు). అతని పరిస్థితి చూసి దైవప్రవక్త (సల్లం) కంట తడి పెట్టారు. అప్పుడు సాద్ బిన్ ఉబాదా (రజి), "ఇదేమిటి దైవప్రవక్తా! (మీరు దుఃఖిస్తున్నారు)?" అని అడిగారు. దానికి దైవప్రవక్త (సల్లం) "ఇది దేవుడు తన దాసుల గుండెల్లో ఉంచిన కారుణ్యం. తోటివారిని కరుణించే దాసుల్నే దేవుడు కరుణిస్తాడు" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జనాయెజ్ ప్రకరణం)*

927. హజ్రత్ అనస్ (రజి) కథనం : ఒకరోజు దైవప్రవక్త (సల్లం) తన కొడుకు ఇబ్రాహీం దగ్గరికి వెళ్ళారు. అప్పుడతను కొన ఊపిరితో కొట్టుమిట్టాడుతున్నాడు. కొడుకు పరిస్థితి చూసి దైవప్రవక్త (సల్లం) కంట తడిపెట్టారు. అబ్దుర్రహ్మాన్ బిన్ ఔఫ్ (ఆశ్చర్యపోయి చూస్తూ) "దైవ ప్రవక్తా! మీరు కూడా దుఃఖిస్తున్నారా?" అని అడిగారు. దైవప్రవక్త (సల్లం), "ఇబ్నె ఔఫ్! ఇది వాత్సల్యం" అంటూ మళ్ళీ విలపించసాగారు. ఆ తర్వాత, ఆయన తన అనుచరులతో, "నిశ్చయంగా కళ్ళు కన్నీరు కారుస్తాయి. హృదయం ఆవేదనకు గురవుతుంది. అయితే మా నోటి నుండి మా ప్రభువుకు ప్రీతికరమైన పలుకులే వెలువడుతాయి. ఇబ్రాహీమా! నీ యెడబాటు వల్ల మేము తీవ్రమైన దుఃఖానికి గురయ్యాముర!" అని అన్నారు.

(బుఖారీ. ఈ హదీసులోని కొంతభాగాన్ని ముస్లిం కూడా వెలికితీశారు. ఈ అధ్యాయానికి సంబంధించిన ప్రామాణికమైన సుప్రసిద్ధ హదీసులు ఇంకా ఎన్నో ఉన్నాయి).

٩٢٧ ـ وعن أنسٍ رضيَ اللهُ عنه أنَّ رسُولَ اللهِ ﷺ دَخَلَ عَلى ابْنِهِ إبْرَاهِيمَ رضي الله عنه وَهُوَ يَجُودُ بِنَفْسِه فَجَعَلَتْ عَيْنَا رسولِ اللهِ ﷺ تَذْرِفَانِ. فقال له عبدُ الرَّحمٰنِ بنُ عوفٍ: وأَنتَ يا رسولَ اللهِ؟! فقال: «يَا ابْنَ عَوْفٍ! إنَّها رَحْمَةٌ» ثُمَّ أَتْبَعَها بأُخْرَى، فقال: «إنَّ الْعَيْنَ تَدْمَعُ وَالقَلْبَ يَحْزَنُ، وَلَا نَقولُ إلَّا ما يُرْضِي رَبَّنا، وَإنَّا بِفِرَاقِكَ يَا إبْرَاهِيمُ! لَمَحْزُونُونَ». رواه البخاري، وروى مسلم بعضه. والأحاديث في الباب كثيرة في الصحيح مشهورة. والله أعلم.

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఘనతా విశిష్టతల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త (సల్లం)కు హజ్రత్ మారియా ఖిబ్తియా (రజి.అన్హా) ద్వారా ఇబ్రాహీమ్ అనే పిల్లవాడు కలిగాడు. అబూ యూసుఫ్ అనే ఒక కమ్మరి భార్య ఆ పిల్లవాడికి పాలు పట్టేది. అయితే పుట్టిన కొన్నాళ్ళకే హి.శ. 10వ సంవత్సరంలో ఆ పిల్లవాడు అసువులు బాసాడు. దైవప్రవక్త (సల్లం) గారి మగ సంతానమంతా బాల్యంలోనే చనిపోయారన్న విషయం గమనార్హం.

## 154వ అధ్యాయం

## ١٥٤ ـ بابُ الكَفِّ عَمَّا يُرَى فِي المَيِّتِ مِنْ مَكْرُوهٍ

## మరణించిన వారి గురించి చెడుగా చెప్పుకోరాదు

٩٢٨ ـ عن أَبي رافع أَسْلَمَ مؤلى رسولِ اللهِ ﷺ أنَّ رسولَ اللهِ ﷺ قال: «مَنْ غَسَّلَ مَيِّتاً فَكَتَمَ عَلَيْه، غفرَ اللهُ لَهُ أَرْبَعِيْنَ مَرَّةً» رواه الحاكم وقال: صحيح على شرط مسلم.

928. హజ్రత్ అబూ రాఫే అస్లమ్ - దైవ ప్రవక్త ద్వారా స్వేచ్ఛ నొసగబడిన బానిస - కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : మృతుని (శవాని)కి స్నానం చేయించేవారు అతని లోపాలను బయటపెట్టకుండా ఉంటే, దేవుడు వారిని నలభైసార్లు క్షమిస్తాడు. (హాకిమ్ దీనిని ఉల్లేఖించి ఇది ముస్లిం షరతులను అనుసరించి వెలికితీయ బడిందని పేర్కొన్నారు).

### ముఖ్యాంశాలు

మృతుని భౌతిక కాయానికి స్నానం చేయించేవారికి అతనిలో శారీరక లోపాలేవయినా కనబడితే లేదా మరణం వల్ల అతని రూపురేఖల్లో ఏమయినా మార్పులు పొడసూపితే వాటిని ఇతరుల ముందు బయటపెట్టరాదు. అలా చేస్తే మరణించినవారిని అవమానించినట్లవుతుంది. అయితే ఇతరులకు గుణపాఠం బోధించే ఉద్దేశ్యంతో దైవశిక్షకు గురయినవారి శవాల స్థితిగతుల గురించి వివరించవచ్చని కొంతమంది పండితులు చెబుతున్నారు. అయితే హదీసు ఉద్దేశ్యాన్ని బట్టి చూస్తే దానికి కూడా దూరంగా ఉండటమే మంచిదనిపిస్తోంది.

**155వ అధ్యాయం**

# ١٥٥ - بَابُ الصَّلاَةِ عَلَى الْمَيِّتِ وَتَشْيِيعِهِ وَحُضُورِ دَفْنِهِ وَكَرَاهَةِ اتِّبَاعِ النِّسَاءِ الْجَنَائِزَ

# జనాజా నమాజ్ చేయటం, జనాజా వెంట నడవటం, మృతుని ఖనన సంస్కారాల్లో పాల్గొనటం గురించి, ఇంకా జనాజా వెంట స్త్రీలు వెళ్ళటం అవాంఛనీయం అనే విషయం గురించి.....

وَقَدْ سَبَقَ فَضْلُ التَّشْيِيعِ

జనాజా వెంట నడవటానికున్న ఔన్నత్యం గురించి ఇంతకు ముందే వివరించటం జరిగింది.

٩٢٩ - عن أبي هُرَيرَةَ رَضيَ اللهُ عنه قال: قال رسولُ اللهِ ﷺ: «مَنْ شَهِدَ الجنَازَةَ حَتَّى يُصَلَّى عَلَيها، فَلَهُ قِيرَاطٌ، وَمَنْ شَهِدَهَا حَتَّى تُدْفَنَ، فلَهُ قِيرَاطانِ» قِيلَ: وَمَا القِيراطَانِ؟ قال: «مِثْلُ الجَبَلَيْنِ العَظِيمَيْنِ». متفقٌ عليه.

929. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఎవరయినా మృతుని అంత్యక్రియల్లో పాల్గొని నమాజ్ ముగిసేవరకు జనాజా వెంట ఉంటే అతనికి ఒక ఖీరాతు పుణ్యం లభిస్తుంది. ఎవరయినా ఖనన సంస్కారాలు ముగిసేవరకూ జనాజా వెంట ఉంటే అతనికి రెండు ఖీరాతుల పుణ్యం లభిస్తుంది. "రెండు ఖీరాతు లంటే ఎంత?" అని ఎవరో అడగ్గా, దానికి దైవప్రవక్త (సల్లం) "రెండు పెద్ద పర్వతాల అంత" అని సమాధాన మిచ్చారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జనాయెజ్ ప్రకరణం)*

930. హజ్రత్ అబూ హురైరా (రజి) గారే చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : సంపూర్ణ విశ్వాసంతో, పుణ్యాన్ని ఆశిస్తూ ఒక ముస్లిం జనాజా వెంట నడిచి జనాజా నమాజు చేసి, ఆ తర్వాత ఖనన సంస్కారాలు ముగిసేవరకు శవం వెంట ఉండే వ్యక్తి తిరిగి వెళ్ళేటప్పుడు రెండు ఖీరాతుల పుణ్యం వెంట తీసుకొని వెళ్తాడు. అందులో ఒక్కొక్క ఖీరాతు ఉహుద్ పర్వతమంత ఉంటుంది. అయితే మృతుణ్ణి ఖననం చేయక ముందే కేవలం జనాజా నమాజ్ మటుకు చేసి తిరిగి వెళ్ళే వ్యక్తి ఒక ఖీరాతు పుణ్యం వెంట తీసుకొని వెళ్తాడు.

*(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని విశ్వాస ప్రకరణం)*

٩٣٠ ـ وعنه أنَّ رسولَ اللهِ ﷺ قال: «مَنِ اتَّبَعَ جَنَازَةَ مُسْلِمٍ إيمَاناً وَاحتِسَاباً، وكانَ مَعَهُ حَتَّى يُصَلَّى عَلَيها وَيُفرَغَ مِنْ دَفنِها، فَإنَّهُ يَرجِعُ مِنَ الأجْرِ بِقِيرَاطَيْنِ كُلُّ قِيرَاطٍ مِثلُ أُحُدٍ، وَمَنْ صَلَّى عَلَيهَا، ثم رَجَعَ قَبْلَ أَن تُدْفَنَ، فَإنَّهُ يَرجِعُ بِقِيرَاطٍ» رواه البخاري.

## ముఖ్యాంశాలు

దేవుని మీద విశ్వాసంతో, ఆయన ప్రసన్నతను బడసే ఉద్దేశ్యంతో జనాజాలో (అంత్య క్రియల్లో) పాల్గొన్నవారికి మాత్రమే పైన పేర్కొనబడిన పుణ్యం లభిస్తుంది. అలాగాకుండా చనిపోయినవాడు కేవలం తమ పొరుగువాడు అనో లేక పెద్ద ఆఫీసరు అనో లేక తమ బంధువు అనో తలచి అతని జనాజాలో పాల్గొంటే అప్పుడు దేవుడు తమకు పుణ్యం ప్రసాదిస్తాడని ఆశించనక్కర్లేదు.

931. హజ్రత్ ఉమ్మె అతియ్యా (రజి. అన్హా) కథనం : మమ్మల్ని జనాజాల వెంట వెళ్ళకుండా వారించటం జరిగేది. అయితే మరీ అంత తీవ్రంగా వారించటం జరిగేది కాదు.

*(బుఖారీ - ముస్లిం)*

٩٣١ ـ وعن أُمِّ عَطِيَّةَ رَضِيَ اللهُ عنها قالَتْ: نُهِينَا عَنِ اتِّبَاعِ الجَنَائِزِ، وَلم يُعزَمْ عَلَيْنَا» متفقٌ عليه. ومعناه: ولَمْ يُشَدَّدْ في النَّهيِ كما يُشَدَّدُ في المُحَرَّمَاتِ.

'మరీ అంత తీవ్రంగా వారించటం జరిగేది కాద'ంటే, నిషిద్ధ విషయాల్లో తీవ్ర వైఖరి అవలంబించినట్లు ఈ విష యంలో తీవ్రంగా వ్యవహరించటం జరిగేది కాదని అర్థం.

*(సహీహ్ బుఖారీ, సహీహ్ ముస్లింలలోని జనాయెజ్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

జనాజా వెంట స్త్రీలు కూడా బయలుదేరితే స్త్రీ పురుషుల కలయిక వల్ల ఎన్నో అనర్థాలు జరిగే ప్రమాదముంటుందన్న భయంతో స్త్రీలను జనాజా వెంట వెళ్ళకుండా వారించటం జరిగింది. ఇంకో విషయమేమిటంటే స్త్రీలు సాధారణంగా సున్నిత మనస్కులై ఉంటారు. శ్మశానాలు, శవాల్లాంటి భయంకరమైన దృశ్యాల్ని చూసి వారు తట్టుకోలేరు. స్త్రీలను శ్మశానానికి వెళ్ళకుండా వారించటానికి అది కూడా ఒక కారణం కావచ్చు. అయితే అలాంటి అనర్థాలు జరగవన్న నమ్మకముంటే జనాజా వెంట స్త్రీలు కూడా వెళ్ళవచ్చు. దైవప్రవక్త (సల్లం) కాలంలో ఈ విషయంలో తీవ్రవైఖరి అవలంబించబడలేదంటే సమాజ పరిస్థితులను బట్టి కాలానుగుణంగా షరీఅత్ నిర్దేశించిన నియమాలను ఆచరిస్తూ స్త్రీలు కూడా జనాజా వెంట వెళ్ళవచ్చని భావం. అందుకే అత్యధికమంది విద్వాంసులు ఈ వారింపును 'నహీయె తన్‌జీహి'గా పేర్కొంటూ జనాజాల వెంట స్త్రీలు వెళ్ళకుండా ఉండటమే అన్ని విధాలా ఉత్తమమని అభిప్రాయపడ్డారు.

*(ఫత్‌హుల్ బారీ)*



**156వ అధ్యాయం**

## ١٥٦ - بَابُ اسْتِحْبَابِ تَكْثِرِ الْمُصَلِّينَ عَلَى الْجَنَازَةِ وَجَعْلِ صُفُوفِهِمْ ثَلَاثَةً فَأَكْثَرَ

## జనాజా నమాజ్‌లో ఎక్కువ మంది పాల్గొనటం, మూడు లేదా అంతకంటే ఎక్కువ పంక్తులుగా నించోవటం అభిలషణీయం

٩٣٢ - عَنْ عَائِشَةَ رَضِيَ الله عنها قَالَتْ: قَالَ رسولُ الله ﷺ: «مَا مِنْ مَيِّتٍ يُصَلِّي عَلَيهِ أُمَّةٌ مِنَ الْمُسْلِمِينَ يَبْلُغُونَ مائَةً كُلُّهُم يَشْفَعُونَ له إلا شُفِّعُوا فِيهِ» رواه مسلم.

932. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : ఏ మృతుని జనాజా నమాజులోనయినా వందమంది ముస్లిములు పాల్గొని, వారందరూ మృతుని మన్నింపు కొరకు ప్రార్థిస్తే, అతని విషయంలో వారి సిఫారసు ఆమోదించబడుతుంది. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

٩٣٣ - وعن ابنِ عباسٍ رضيَ الله عنهما قال: سَمِعْتُ رَسُولَ الله ﷺ يقُول: «مَا من رَجُلٍ مُسْلِم يَمُوتُ، فَيَقومُ عَلَى جَنَازَتِهِ أَرْبَعُونَ رَجُلاً لَا يُشرِكُونَ بِاللهِ شَيئاً إلَّا شَفَّعَهُمُ اللهُ فِيهِ» رواه مسلم.

933. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) తెలియజేశారు : ఏ ముస్లిం వ్యక్తి అయినా చనిపోయి నప్పుడు దైవంతోపాటు ఇతరుల్ని భాగస్వాములుగా నిలబెట్టని (షిర్క్ చేయని) నలభైమంది గనక అతని జనాజా నమాజ్‌లో పాల్గొంటే దేవుడు అతని విషయంలో వారందరి సిఫారసునూ ఆమోదిస్తాడు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

٩٣٤ ـ وعن مَرْثَدِ بن عبدِ الله اليَزَنيِّ قال: كانَ مَالِكُ بنُ هُبَيْرَة رضي الله عنه إذا صَلَّى عَلى الجنَازَةِ، فَتَقَالَّ النَّاسَ عَلَيها، جَزَّأَهُمْ عَلَيها ثَلاثَةَ أَجْزَاءٍ، ثم قال: قالَ رَسُولُ اللهِ ﷺ: «مَنْ صَلَّى عَلَيهِ ثَلاثَةُ صُفُوفٍ، فَقَدْ أَوْجَبَ». رواه أبو داود، والترمذي وقال: حديث حسن.

934. హ(జత్ మర్సద్ బిన్ అబ్దుల్లాహ్ యజనీ కథనం : హ(జత్ మాలిక్ బిన్ హుబైరా (రజి) తను జనాజా నమాజ్ చేసినప్పుడు నమాజ్‌లో పాల్గొనేవారు తక్కువగా ఉన్నారని తనకు అనిపిస్తే, ఆయన వారిని మూడు పంక్తుల్లో నిలబెట్టేవారు. ఆ సందర్భంగా దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారని ఆయన ప్రజలకు తెలియపరిచేవారు: ఏ మృతుని కొరకయినా మూడు పంక్తుల జనం జనాజా నమాజ్ చేస్తే, ఆ మృతుడు తన కొరకు స్వర్గాన్ని అని వార్యం చేసుకుంటాడు.

*(అబూ దావూద్, తిర్మిజీ - హసన్)*

*(సుననె అబూ దావూద్, సుననె తిర్మిజీలోని జనాయెజ్ ప్రకరణాలు)*

## ముఖ్యాంశాలు

1. జనాజా నమాజ్‌లో ఎంత ఎక్కువ మంది పాల్గొంటే మృతుని కొరకు అది అంత మంచిదని పై హదీసుల ద్వారా బోధపడుతోంది. అయితే దానికోసం నమాజ్‌లో పాల్గొనేవారు ఏకదైవారాధకులు, సదాచార సంపన్నులు అయి ఉండటం అవసరం. బహుదైవారాధకులు, ధర్మభ్రష్టులు ఎంతమంది జనాజా నమాజ్‌లో పాల్గొన్నా దానివల్ల మృతునికి ప్రయోజనం ఉండదు.
2. జనాజా నమాజ్ చేసేవారు తక్కువమంది ఉన్నప్పుడు మూడు పంక్తులుగా నిలబడటం ఉత్తమం.

**157వ అధ్యాయం**

# ١٥٧ - بَابُ مَا يُقْرَأُ فِي صَلَاةِ الْجَنَازَةِ

# జనాజా నమాజ్‌లో పఠించబడే దుఆల వివరణ

يُكَبِّرُ أَرْبَعَ تَكبيراتٍ: يَتَعَوَّذُ بَعْدَ الأُولى، ثمَّ يَقْرَأُ فَاتِحَةَ الكِتَابِ، ثمَّ يُكَبِّرُ الثَّانِيَةَ، ثمَّ يُصَلِّي عَلى النبيِّ ﷺ، فيقول: اللَّهُمَّ صَلِّ عَلى مُحَمَّدٍ، وَعَلى آلِ مُحَمَّدٍ. وَالأَفضَلُ أن يُتِمَّهُ بقوله: كما صَلَّيْتَ عَلى إبراهِيمَ. . إلى قولِهِ: إنَّكَ حَمِيدٌ مَجِيدٌ. وَلا يَفْعَلُ مَا يَفعَلُهُ كثيرٌ مِنَ العَوَامِّ مِنْ قِراءَتِهم ﴿إِنَّ ٱللَّهَ وَمَلَٰٓئِكَتَهُۥ يُصَلُّونَ عَلَى ٱلنَّبِيِّ﴾ الآية [الأحزاب: ٥٦] فإنَّهُ لا تَصِحُّ صَلاتُهُ إذا اقتصَرَ عليهِ. ثُم يُكَبِّرُ الثَّالِثَة، ويَدعُو لِلمَيِّتِ ولِلمُسْلِمينَ بِمَا سَنَذْكُرُهُ من الأحاديثِ إن شاءَ اللهُ تعالى، ثم يُكَبِّرُ الرَّابعَةَ ويَدعُو، ومِنْ أَحْسَنِهِ: اللَّهُمَّ لا تحرِمْنَا أَجْرَهُ، ولا تَفتِنَّا بَعدَهُ، واغفِرْ لَنَا وَلَهُ. والمُخْتَارُ أنه يُطَوِّلُ الدُّعاءَ في الرَّابعة خِلافَ ما يَعْتَادُهُ أَكْثَرُ النَّاس؛ لحديث ابن أبي أَوْفى الذي سَنَذْكُرُهُ إن شاءَ الله تعالى. فَأَمَّا الأَدْعِيَةُ المأثُورَةُ بَعْدَ التَّكبِيرَةِ الثالثة، فمنها:

జనాజా నమాజ్‌లో నాలుగు తక్బీర్లు పలకాలి. మొదటి తక్బీర్ తర్వాత 'అవూజు బిల్లాహి...' చదివి, ఫాతిహా సూరా, (ఇంకొక సూరా) పఠించి రెండవ తక్బీర్ పలకాలి. రెండవ తక్బీర్ తర్వాత దైవప్రవక్తపై దరూద్ పఠించాలి. అల్లాహుమ్మ సల్లిఅలా ముహమ్మద్ వ అలా ఆలి ముహమ్మద్ నుండి కమా సల్లైత అలా ఇబ్రాహీమ అంటూ ఇన్నక హమీదుం మ్మజీద్' వరకు పూర్తి దరూద్ పఠించడమే శ్రేష్ఠమైన పద్ధతి. ఈ సందర్భంగా చాలా మంది ఇన్నల్లాహ వ మలాయికతహూ యుసల్లూన అలన్నబియ్యి' అనే సూక్తి మాత్రమే పఠిస్తుంటారు. అలా చేయకూడదు. ఆ సూక్తి పఠించటం సరయిన పద్ధతి కాదు. కేవలం ఆ సూక్తి పఠిస్తే నమాజ్ నెరవేరదు. దరూద్ షరీఫ్ పఠించాక మూడో తక్బీర్ పలికి మృతుని కొరకు, ముస్లింలందరి కొరకు దుఆలు చేయాలి. ఆ దుఆలను మేము ఇన్షాఅల్లాహ్ రాబోయే హదీసుల్లో పొందుపరుస్తాం. దుఆలు చేశాక నాల్గో తక్బీర్ పలికి ఆ తర్వాత ప్రార్థన చేయాలి. ప్రార్థనలన్నిటిలో అత్యుత్తమమైనది, అత్యంత ప్రియమైనది "అల్లాహుమ్మ లా తహ్‌రిమ్‌నా అజ్‌రహూ వలా తఫ్‌తిన్నా బాదహూ" అనే ప్రార్థన. నేడు చాలామంది సంక్షిప్త దుఆలకు అలవాటు పడిపోయారు. వారి పద్ధతికి విరుద్ధంగా ఇబ్నె అబూ ఔఫా హదీసులో పేర్కొనబడినట్లు నాల్గో తక్బీర్ తర్వాత సుదీర్ఘమైన దుఆలు చేయాలి. ఆ హదీసును మేము ఇన్షాఅల్లాహ్ త్వరలోనే

ప్రస్తావిస్తాం. ఇకపోతే మూడో తక్బీర్ తర్వాత పఠించబడే సంప్రదాయబద్ధమైన దుఆలు ఇవి:

935. హజ్రత్ అబూ అబ్దుర్రహ్మాన్ ఔఫ్ బిన్ మాలిక్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఒకరి జనాజా నమాజ్‌లో చేసిన దుఆను నేను కంఠస్థం చేసుకున్నాను. అందులో ఆయన ఇలా ప్రార్థించారు : (అల్లాహుమ్మగ్ఫిర్ లహూ వర్‌హమ్‌హు...." అనువాదం:) దేవా! ఇతన్ని క్షమించు. ఇతని మీద దయ జూపు. ఇతన్ని శిక్ష నుండి కాపాడు. ఇతన్ని క్షమించు. ఇతన్ని ఆదరించి మర్యాద చెయ్యి. ఇతని సమాధిని విశాలపరచు. ఇతన్ని నీళ్ళతో, మంచుతో, వడగళ్ళతో కడిగి, తెల్లని వస్త్రాన్ని మురికి లేకుండా శుభ్రం చేసినట్లు పాపాలనుండి ఇతన్ని పరిశుభ్రం చెయ్యి. ఇతనికి ఇహలోకపు ఇల్లుకన్నా మంచి ఇల్లునీ, ఇహలోకపు పరివారం కన్నా ఉత్తమ పరివారాన్నీ, ఇహలోకపు ఇల్లాలికన్నా మంచి ఇల్లాలిని ఇవ్వు. ఇతన్ని స్వర్గంలోకి ప్రవేశింపజెయ్యి. సమాధి శిక్ష నుండి, అగ్ని శిక్ష నుండి కాపాడు.

ఔఫ్ బిన్ మాలిక్ ఉవాచ : అప్పుడు దైవప్రవక్త (సల్లం) నోట ఆ ప్రార్థన వింటుంటే మరణించిన వ్యక్తి నేనయి వుంటే ఎంత బాగుండేదనిపించింది నాకు. (ముస్లిం)

٩٣٥ - عن أبي عبدِ الرحمٰنِ عَوْفِ بنِ مالكٍ رضي الله عنه قال: صلّى رسولُ اللهِ ﷺ عَلَى جَنَازَةٍ، فَحَفِظْتُ مِنْ دُعَائِهِ وَهُوَ يَقُولُ: «اللَّهُمَّ! اغْفِرْ لَهُ، وَارْحَمْهُ، وَعَافِهِ، وَاعْفُ عَنْهُ، وَأَكْرِمْ نُزُلَهُ، وَوَسِّعْ مُدْخَلَهُ وَاغْسِلْهُ بِالمَاءِ وَالثَّلْجِ وَالْبَرَدِ، وَنَقِّهِ مِنَ الخَطَايَا، كما نَقَّيْتَ الثَّوْبَ الأَبْيَضَ مِنَ الدَّنَسِ، وَأَبْدِلْهُ دَاراً خَيْراً مِنْ دَارِهِ، وَأَهْلاً خَيْراً مِنْ أَهْلِهِ، وَزَوْجاً خَيْراً مِنْ زَوْجِهِ، وَأَدْخِلْه الجَنَّةَ، وَأَعِذْهُ مِنْ عَذَابِ القَبْرِ، وَمِنْ عَذَابِ النَّارِ» حَتَّى تَمَنَّيْتُ أَنْ أَكُونَ أَنَا ذلكَ المَيِّتَ. رواه مسلم.

(సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)

936. అబూ హురైరా (రజి), అబూ ఖతాదా (రజి) ఇంకా అబూ ఇబ్రాహీం అష్హలీ తన తండ్రి నుండి - ఆయన తండ్రి దైవప్రవక్త సహచరుడు - చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) ఒకరి జనాజా నమాజ్‌లో ఈ విధంగా దుఆ చేశారు: (అల్లాహుమ్మగ్ఫిర్లి హయ్యినా, వ మయ్యితినా.... అనువాదం:) దేవా! మాలో బ్రతికున్నవారిని, చనిపోయిన వారిని, పిన్నలను, పెద్దలను, పురుషుల్నీ, స్త్రీలనూ అందరినీ క్షమించు.

దేవా! మాలో ఎవరిని బ్రతకనిచ్చినా ఇస్లాం ధర్మంపై బ్రతకనివ్వు. మాలో ఎవరికి మరణాన్ని ప్రసాదించినా విశ్వాస స్థితిలోనే మరణాన్ని ప్రసాదించు. దేవా! ఈ మరణించిన వ్యక్తి (విషయంలో సహనం వహించటం వల్ల లభించే) పుణ్యానికి మమ్మల్ని దూరం చేయకు. ఇతని తర్వాత మమ్మల్ని పరీక్షలకు గురిచేయకు.

ఈ హదీసును తిర్మిజీగారు, అబూ హురైరా, అష్హలీల ఆధారంగా వెలికి తీశారు. అబూ దావూద్ దీనిని అబూ ఖతాదా (రజి) ఆధారంగా ఉల్లేఖించారు. ఇమామ్ హాకిమ్ అబూ హురైరా గారి హదీసు బుఖారీ - ముస్లిం షరతులను అనుసరించి వెలికితీయబడిందని పేర్కొన్నారు. ఇమామ్ తిర్మిజీ కథనం ప్రకారం ఈ హదీసుకు సంబంధించిన ఉల్లేఖనాలన్నిటిలో అష్హలీ గారి ఉల్లేఖనం

٩٣٦ ـ وعن أبي هُريرة وأَبي قَتَادَةَ، وأبي إبْـرَاهيـمَ الأَشْهَلـيِّ عَـنْ أَبيـه ـ وأَبُـوه صَحَابيٌّ ـ رضي الله عنهم عن النبيِّ ﷺ أَنَّه صَلَّى عَلى جَنَازَةٍ فقال: «اللَّهُمَّ! اغفِرْ لَحَيِّنَا وَمَيِّتِنَا، وَصَغِيرِنَا وَكَبِيرِنَا، وَذَكَرِنَا وَأُنْثَانَا، وَشاهِدِنا وَغائِبِنَا. اللَّهُمَّ مَنْ أَحْيَيْتَه مِنَّا، فَأَحْيِهِ عَلى الإِسلام، وَمَنْ تَوَفَّيْتَه مِنَّا، فتَوَفَّهُ عَلـى الإِيمـانِ؛ اللَّهُـمَّ لَا تَحْـرِمْنـا أَجْـرَهُ، وَلا تَفْتِنَّا بَعْدَهُ» رواه الترمذي من رواية أبي هُرَيْـرَةَ وَالأشهَلِيِّ، ورواه أبو داود من رواية أبي هريرة وأبي قَتَادَةَ. قال الحاكم: حديث أبـي هـريـرة صَحِيـحٌ علـى شَـرْطِ البُخـاريِّ ومُسْلِـمٍ، قـال الترْمِـذيُّ: قـال البخـاريُّ: أصحُّ رواياتِ هذا الحديث روايةُ الأشْهَلِيِّ. قال البخاري: وَأَصَحُّ شيءٍ في الباب حديث عَوْفِ بن مالكٍ.

అన్నిటికన్నా ప్రామాణికమైనదనీ, ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసు లన్నిటిలో ఔఫ్ బిన్ మాలిక్ హదీసు ప్రామాణికమైనదని ఇమామ్ బుఖారీ (రహ్మాలై) పేర్కొన్నారు.

*(సుననె తిర్మిజీలోని జనాయెజ్ అధ్యాయాలు, సుననె అబూ దావూద్‌లోని జనాయెజ్ ప్రకరణం)*

٩٣٧ - وعن أبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: سَمِعْتُ رَسُولَ اللهِ ﷺ يقول: «إذا صَلَّيْتُمْ عَلى المَيِّت، فَأَخْلِصُوا لَهُ الدُّعَاءَ» رواه أبو داود.

937. దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధి స్తుండగా తాను విన్నానని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలియజేశారు : మీరు మృతుని జనాజా నమాజ్ చేసేటప్పుడు అతని కొరకు చిత్తశుద్ధితో ప్రార్థించండి. (అబూ దావూద్)

*(సుననె అబూ దావూద్‌లోని జనాయెజ్ ప్రకరణం)*

٩٣٨ - وعَنْهُ عَنِ النَّبيِّ ﷺ في الصَّلاةِ عَلى الجِنَازَةِ: «اللَّهُمَّ أَنْتَ رَبُّهَا، وَأَنْتَ خَلَقْتَهَا، وَأَنْتَ هَدَيْتَهَا لِلإِسْلام، وَأَنْتَ قَبَضْتَ رُوحَهَا، وَأَنْتَ أَعْلَمُ بِسِرِّهَا وَعَلانِيتِها، جِئْنَاكَ شُفَعَاءَ لَهُ، فاغفِرْ لَهُ» رواه أبو داود.

938. దైవప్రవక్త (సల్లం) ఒకరి జనాజా నమాజులో ఈ దుఆ పఠించారని హజ్రత్ అబూ హురైరా (రజి) తెలియజేశారు : (అల్లాహుమ్మ అంత రబ్బుహా వ అంత.... అనువాదం:) దేవా! నీవే ఇతని ప్రభువువి. ఇతన్ని నీవే పుట్టించావు. ఇతన్ని ఇస్లాం మార్గం వైపునకు నడిపిం చిందీ నీవే. ఆఖరికి ఇతని ప్రాణాన్ని తీసింది కూడా నీవే. ఇతని బాహ్య, అంతర్గత స్థితిగతుల గురించి నీకే బాగా తెలుసు. మేము ఇతని కొరకు సిఫారసు చేయటానికి వచ్చాము. నీవు ఇతన్ని మన్నించు." (అబూ దావూద్)

*(సుననె అబూ దావూద్‌లోని జనాయెజ్ ప్రకరణం)*

٩٣٩ ـ وعن وَاثِلَةَ بنِ الأَسْقَعِ رضيَ اللهُ عنه قال: صَلَّى بِنَا رسولُ اللهِ ﷺ عَلَى رَجُلٍ مِنَ المُسْلمِينَ، فَسَمِعْتُهُ يقولُ: «اللَّهُمَّ! إِنَّ فُلانَ ابْنَ فُلانٍ فِي ذِمَّتِكَ وَحَبْلِ جِوَارِكَ، فَقِهِ فِتْنَةَ القَبْرِ؛ وَعَذَابَ النَّارِ، وَأَنْتَ أَهْلُ الوَفاءِ والحَمْدِ؛ اللَّهُمَّ! فاغفِرْ لَهُ وَارْحَمْهُ، إنكَ أَنْتَ الغفور الرَّحيمُ» رواه أبو داود.

939. హజ్రత్ వాసిలా బిన్ అస్‌ఖా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) మాకు ఒక ముస్లిం వ్యక్తి జనాజా నమాజ్ చేయించారు. ఆ సందర్భంగా ఆయన ఈ విధంగా ప్రార్థిస్తుండగా నేను విన్నాను: (అల్లాహుమ్మ ఇన్న ఫులానబ్‌న ఫులానిన్ ... అనువాదం:) "దేవా! ఫలానా వ్యక్తి కుమారుడు నీ రక్షణలో, నీ చెంత ఉన్నాడు. నీవు అతన్ని సమాధి యాతన నుండి, అగ్ని శిక్ష నుండి కాపాడు. నీవు వాగ్దానాన్ని నెరవేర్చేవాడవు. స్తుతి పాత్రుడవు. దేవా! ఇతన్ని మన్నించు. ఇతని మీద దయజూపు. నిస్సందేహంగా నీవు అమితంగా మన్నించేవాడవు. అత్యధికంగా కరుణించేవాడవు.

*(అబూ దావూద్)*

*(సుననె అబూ దావూద్‌లోని జనాయెజ్ ప్రకరణం)*

٩٤٠ ـ وعن عبدِ اللهِ بن أبي أَوْفى رضي الله عنهما أَنَّهُ كَبَّرَ عَلَى جَنَازَةِ ابْنَةٍ لَهُ أَرْبَعَ تَكْبِيرَاتٍ، فَقَامَ بَعْدَ الرَّابِعَةِ كَقَدْرِ مَا بَيْنَ التَّكْبِيرَتَيْنِ يَسْتَغْفِرُ لَهَا وَيَدْعُو، ثُمَّ قال: كَانَ رَسُولُ اللهِ ﷺ يَصْنَعُ هٰكَذَا.

وفي رواية: كَبَّرَ أَرْبَعاً، فَمَكَثَ سَاعَةً حَتَّى

940. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబూ ఔఫా (రజి) స్వయంగా చేసిన కథనం ప్రకారం ఆయన తన కూతురి జనాజా నమాజ్‌లో నాలుగు తక్బీర్లు పలికారు. నాల్గో తక్బీర్ తర్వాత కూడా రెండు తక్బీర్ల మధ్య ఉండేంతసేపు అలాగే నిలబడ్డారు. ఆ సమయంలో ఆయన తన కూతురి మన్నింపు కోసం, ఆమె శ్రేయస్సు కోసం ప్రార్థిస్తూ ఉన్నారు. నమాజ్ ముగిసిన తర్వాత ఆయన (ప్రజలతో మాట్లాడుతూ) దైవప్రవక్త (సల్లం) ఆ విధంగా చేసేవారని చెప్పారు.

ظَنَنْتُ أَنَّهُ سَيُكَبِّرُ خَمْساً، ثُمَّ سَلَّمَ عَنْ يَمِينِهِ وَعَنْ شِمالِهِ. فَلَمَّا انْصَرَفَ قُلْنا لَهُ: مَا هـذا؟ فقال: إنِّي لا أَزِيدُكُمْ عَلى مَا رَأَيْتُ رَسُولَ اللهِ ﷺ يَصْنَعُ، أَوْ: هكذا صَنَعَ رسولُ اللهِ ﷺ. رواه الحاكم وقال: حديث صحيح.

వేరొక హదీసులో ఆయన్నుండి హదీసు గ్రహించిన ఉల్లేఖకుడు ఇలా అంటున్నాడు : ఆయన నాలుగు తక్బీర్లు పలికిన తర్వాత కూడా అలాగే నించున్నారు. అప్పుడు ఆయన ఐదో తక్బీర్ కూడా పలుకుతారేమో ననిపించింది నాకు. కాసేపటి తర్వాత ఆయన కుడి ఎడమలకు (మెడ త్రిప్పుతూ) సలాం చేశారు. నమాజ్ ముగించాక మేము ఆయన్ని "(మీరు నాల్గో తక్బీర్ తర్వాత అలాగే నించున్నారు) ఏమిటి విశేషం?" అని అడిగాం.

దానికి అబ్దుల్లాహ్ బిన్ అబూ ఔఫా (రజి) సమాధానమిస్తూ, "నేను దైవప్రవక్త (సల్లం) చేస్తుండగా చూసినదానికంటే ఎక్కువ ఏమీ మీ ముందు ప్రదర్శించను" (లేదా ఆయన) "దైవప్రవక్త (సల్లం) ఆ విధంగా చేసేవారు" అని చెప్పారు. *(హాకిమ్ - సహీహ్)*

## ముఖ్యాంశాలు

ఇప్పటి వరకు పేర్కొనబడిన దుఆలన్నీ దైవప్రవక్త (సల్లం) తరచూ జనాజా నమాజుల్లో పఠించినవే. కనుక జనాజా నమాజ్ చేసేటప్పుడు వాటన్నిటినీ కలిపి చదువుకోవచ్చు. అదీగాక ఇస్లాంలో మృతుని కొరకు చిత్తశుద్ధితో ప్రార్థించమని ఆదేశించబడింది కాబట్టి జనాజా నమాజ్‌లో వాటన్నిటినీ కలిపి చదువుకోవటాన్ని ఉత్తమంగా భావించవచ్చు.

రెండో విషయమేమిటంటే, జనాజా నమాజ్‌లో దుఆలు, సూరాలు బిగ్గరగా పఠించటం ధర్మసమ్మతమే. పైన పేర్కొనబడిన హదీసులు ఈ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి. దైవప్రవక్త (సల్లం) గనక జనాజా నమాజ్‌లో దుఆలను బిగ్గరగా పఠించి ఉండకపోతే ఆయన అనుచరులకు అవి తెలిసి ఉండేవి కావన్న విషయం గమనార్హమైనది. అయితే జనాజా నమాజ్‌లో ఇమామ్ వెనక ముక్తదీలు బిగ్గరగా 'ఆమీన్' అని పలకరాదు. ఎందుకంటే దైవప్రవక్త (సల్లం)గాని, ఆయన అనుచరులుగాని జనాజా నమాజ్‌లో బిగ్గరగా 'ఆమీన్' అని పలికినట్లు దాఖలాలు లేవు. అంచేత ముఖ్యంగా జనాజా నమాజ్‌లో ఆమీన్ బిగ్గరగా పలకరాదు.

**158వ అధ్యాయం**

## ١٥٨ - بابُ الإسراعِ بالجَنازةِ

## జనాజాను త్వరగా శ్మశానానికి తీసుకువెళ్ళాలి

941. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రబోధించారు: మృతుని అంత్యక్రియల విషయంలో తొందర చేయండి. ఎందుకంటే మరణించిన వ్యక్తి పుణ్యాత్ముడయి ఉంటే అతడ్ని మీరు సాఫల్యం వైపుకు తీసుకెళ్తున్నారన్నమాట. ఒకవేళ అతను పాపాత్ముడయి ఉంటే అతనొక చెడు పదార్థం. దాన్ని మీరు మీ భుజాల నుండి దించి వేయటానికి వెళ్తున్నారన్నమాట. (అందుచేత మృతుని భౌతిక కాయాన్ని వీలైనంత త్వరగా శ్మశానానికి చేర్చండి).

*(బుఖారీ - ముస్లిం)*

٩٤١ - عن أبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عنهُ عَن النَّبِيِّ ﷺ قال: «أَسْرِعُوا بالجَنَازَةِ، فإنْ تَكُ صَالِحَةً، فَخَيْرٌ تُقَدِّمُونَهَا إِلَيْهِ، وَإِنْ تَكُ سِوَى ذٰلِكَ، فَشَرٌّ تَضَعُونَهُ عَنْ رِقَابِكُمْ». متفقٌ عليه. وفي روايةٍ لِمُسْلِمٍ: «فَخَيْرٌ تُقَدِّمُونَهَا عَلَيْهِ».

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జనాయెజ్ ప్రకరణం)*

942. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించేవారు : ప్రజలు మృతుని భౌతికకాయాన్ని శ్మశానానికి సిద్ధం చేసుకొని భుజాలమీద మోసుకొని వెళ్ళేటప్పుడు అది మంచివాని శవమయితే, "నన్ను త్వరగా తీసుకెళ్ళండి" అని అంటుంది. మంచివాని శవం

٩٤٢ - وعن أبي سعيدٍ الخُدْرِيِّ رضي اللهُ عنه قَالَ: كَانَ النَّبِيُّ ﷺ يَقُولُ: «إذا وُضِعَتِ الجَنَازَةُ، فَاحْتَمَلَهَا الرِّجَالُ عَلَى أَعْنَاقِهِمْ، فَإِنْ كَانَتْ صَالِحَةً، قالتْ:

قَدِّمُونِي، وَإِنْ كَانَتْ غَيْرَ صَالِحَةٍ، قَالَتْ لِأَهْلِهَا: يَا وَيْلَهَا! أَيْنَ تَذْهَبُونَ بِهَا؟ يَسْمَعُ صَوْتَهَا كُلُّ شَيْءٍ إِلَّا الإِنْسَانَ، وَلَوْ سَمِعَ الإِنْسَانُ لَصَعِقَ» رواه البخاري.

కాకపోతే అది తన్ను మోసుకెళ్తున్న వారితో, "అయ్యో! నన్నెక్కడికి తీసుకెళ్తున్నారు" అని మొత్తుకుంటుంది. దాని అరుపుల్ని మానవుడు తప్ప మిగతా సృష్టిరాశులన్నీ వింటాయి. మానవుడు గనక ఆ అరుపుల్ని వింటే (అక్కడికక్కడే) సొమ్మసిల్లి పోతాడు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం)*

159వ అధ్యాయం

# ١٥٩ - بَابُ تَعْجِيلِ قَضَاءِ الدَّيْنِ عَنِ الْمَيِّتِ وَالْمُبَادَرَةِ إِلَى تَجْهِيزِهِ إِلاَّ أَنْ يَمُوتَ فَجْأَةً فَيُتْرَكَ حَتَّى يُتَيَقَّنَ مَوْتُهُ

# మృతుని అప్పు తీర్చడంలో, అంత్యక్రియల్లో తొందరచేయాలి, మనిషి హఠాత్తుగా చనిపోతే మరణం నిర్ధారితమయ్యేవరకు వేచివుండవచ్చు

٩٤٣ - عن أبي هريرةَ رضي الله عنه عن النبيِّ ﷺ قال: «نَفْسُ الْمُؤْمِنِ مُعَلَّقَةٌ بِدَيْنِهِ حَتَّى يُقْضَى عَنْهُ». رواه الترمذي وقال: حديث حسنٌ.

943. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : విశ్వాసి (చనిపోతే) అతను తీసుకున్న అప్పులు తీర్చబడనంతవరకు అతని ప్రాణం అనిశ్చితంగా ఉంటుంది. *(తిర్మిజీ - హసన్)*

*(సుననె తిర్మిజీలోని జనాయెజ్ అధ్యాయాలు)*

**ముఖ్యాంశాలు**

ప్రాణం అనిశ్చితంగా ఉండటమంటే ప్రపంచంలో అతను తీసుకున్న అప్పులు తీర్చబడేవరకు అతనికి ముక్తిని ప్రసాదించాలా లేక శిక్ష విధించాలా అన్న విషయం తెమలకుండా ఉంటుందని భావం. అతను తీసుకున్న అప్పులు దాసుల హక్కుల క్రిందికి వస్తాయి. మనిషి దేవుని హక్కుల్ని నెరవేర్చటంలో నిర్లక్ష్యం వహిస్తే దేవుడు క్షమిస్తాడేమోగాని తోటి మానవుల హక్కుల్ని కాజేస్తే మాత్రం, వాటిని తిరిగి నెరవేర్చనంతవరకు లేదా హక్కుదారులు క్షమాభిక్ష పెట్టనంతవరకు దేవుడు అతణ్ణి క్షమించడు. కనుక మనిషి చనిపోయినప్పుడు అతనెవరి దగ్గరయినా అప్పు తీసుకొని ఉంటే అతని వారసులు ముందుగా అతని అప్పు తీర్చటానికి ప్రయత్నించాలి.

٩٤٤ - وعن حُصَيْنِ بنِ وَحْوَحٍ رضيَ اللهُ عَنْهُ أنَّ طَلْحَةَ بنَ الْبَراءِ رَضِيَ اللهُ

944. హజ్రత్ హుసైన్ బిన్ వహ్వహ్ (రజి) కథనం : తల్హా బిన్ బరా (రజి) వ్యాధిగ్రస్తుడయినప్పుడు దైవప్రవక్త

عَنْهُ مَرِضَ، فَأَتَاهُ النَّبِيُّ ﷺ يَعُودُهُ فَقَالَ: إِنِّي لا أُرَى طَلْحَةَ إِلَّا قَدْ حَدَثَ فِيهِ المَوْتُ فَآذِنُونِي بِهِ وَعَجِّلُوا بِهِ، فَإِنَّهُ لَا يَنْبَغِي لِجِيفَةِ مُسْلِمٍ أَنْ تُحْبَسَ بَيْنَ ظَهْرَانَيْ أَهْلِهِ». رواه أبو داود.

(సల్లం) ఆయన్ని పరామర్శించటానికి వచ్చి (అక్కడున్న వారితో) ఇలా అన్నారు: తల్హాలో మరణ సూచనలు కన్పిస్తున్న ట్లున్నాయి. (ఒకవేళ ఈయన చనిపోతే) వెంటనే నాకు తెలియజేయండి. ఈయన భౌతికకాయాన్ని ఖననం చేయ టంలో తొందర చేయండి. ఎందుకంటే ఒక ముస్లిం వ్యక్తి శవాన్ని అతని ఇంటి వారి మధ్య (ఎక్కువ సేపు) ఉంచటం మంచిది కాదు. *(అబూ దావూద్)*

*(సుననె అబూ దావూద్‌లోని జనాయెజ్ ప్రకరణం)*

**160వ అధ్యాయం**

## ١٦٠ ـ بَابُ الْمَوْعِظَةِ عِنْدَ الْقَبْرِ

## శ్మశానంలో హితబోధ చేయవచ్చు

945. హజ్రత్ అలీ (రజి) కథనం : మేమొక జనాజా వెంట బఖీవుల్ గర్ఖద్ శ్మశానానికి వెళ్ళాం. అంతలో దైవప్రవక్త (సల్లం) కూడా అక్కడికి వచ్చి ఒకచోట కూర్చున్నారు. కాసేపటికి మేము కూడా ఆయన చుట్టూ గుమిగూడి కూర్చున్నాం. అప్పుడు ఆయన చేతిలో ఒక బెత్తం ఉంది. ఆయన తలక్రిందికి దించుకొని బెత్తంతో నేలమీద గీకసాగారు. కాసేప టికి (తల పైకెత్తి), "మీలో ప్రతి ఒక్కరి స్థానం స్వర్గం లేక నరకంలో ఉంటుం దనే విషయం (ముందుగానే) వ్రాసిపెట్ట బడింది" అని అన్నారు. ఆ మాట విని ఆయన సహచరులు, "దైవప్రవక్తా! అలా గయితే మేము ఆచరణను వదలిపెట్టి విధివ్రాతను నమ్ముకుంటే చాలుకదా!" అని విన్నవించుకున్నారు. అందుకాయన "(లేదు) మీరు కర్మలు ఆచరించండి. ప్రతి మనిషికీ అతని అదృష్టం మేరకే కర్మలు ఆచరించే భాగ్యం లభిస్తుంది" అని అన్నారు. (సశేషం)

*(బుఖారీ - ముస్లిం)*

٩٤٥ ـ عن عليٍّ رَضِيَ اللهُ عنه قال: كُنَّا في جَنَازَةٍ في بَقِيعِ الْغَرْقَدِ فَأَتَانَا رَسُولُ اللهِ ﷺ فَقَعَدَ وَقَعَدْنَا حَوْلَهُ وَمَعَهُ مِخْصَرَةٌ فَنَكَسَ وَجَعَلَ يَنْكُتُ بِمِخْصَرَتِهِ، ثم قال: «ما مِنْكُمْ مِنْ أَحَدٍ إِلَّا وَقَدْ كُتِبَ مَقْعَدُهُ مِنَ النَّارِ وَمَقْعَدُهُ مِنَ الجَنَّةِ» فقالوا: يَا رَسُولَ اللهِ! أَفَلَا نَتَّكِلُ عَلَى كِتَابِنَا؟ فقال: «اعْمَلُوا، فَكُلٌّ مُيَسَّرٌ لِمَا خُلِقَ لَهُ» وَذَكَرَ تَمَامَ الحديث. متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని విధివ్రాత ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసు ద్వారా శ్మశానంలో ప్రజలకు హితబోధ చేయవచ్చునే విషయం వెల్లడౌతోంది. గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) పెట్టిన శీర్షిక ఉద్దేశ్యం కూడా అదే. శ్మశానంలో శవాల్ని, సమాధుల్ని చూసినప్పుడు మనిషి హృదయం సహజంగానే వైరాగ్యం వైపుకు మొగ్గుతుంది. ఐహిక అనాసక్తత పెరిగి ప్రపంచం అశాశ్వతమన్న విషయం గుర్తొస్తుంది. మనస్సులు మెత్తబడతాయి. అలాంటి సందర్భాల్లో వారికి హితబోధ చేస్తే అతి త్వరగా వారిలో పరివర్తన వచ్చే అవకాశాలున్నాయి.

ఈ హదీసులో విధివ్రాత గురించి కూడా వివరించటం జరిగింది. స్థూలంగా దాని భావం ఏమిటంటే మంచి పనులు చేసేవారు స్వర్గానికి వెళ్తారు. చెడు పనులు చేసేవారు నరకానికి వెళ్తారు. ఈ విషయం సృష్టి ఆరంభంలోనే వ్రాసిపెట్టబడింది. దాన్నే 'విధివ్రాత' అని అంటారు. ప్రపంచంలో ఏది జరిగినా విధి నిర్ణయం ప్రకారమే జరుగుతుంది. అయితే విధివ్రాతలో వ్రాసిపెట్టబడినంత మాత్రాన మానవులు తమ కర్మలకు బాధ్యులు కారని చెప్పలేం. ఎందుకంటే విధివ్రాత గురించిన జ్ఞానం ఎవరికీ లేదు కనుక.



## 161వ అధ్యాయం

## ١٦١ - بَابُ الدُّعَاءِ لِلْمَيِّتِ بَعْدَ دَفْنِهِ وَالْقُعُودِ عِنْدَ قَبْرِهِ سَاعَةً لِلدُّعَاءِ لَهُ وَالاِسْتِغْفَارِ وَالْقِرَاءَةِ

## మృతుణ్ణి ఖననం చేసిన తర్వాత అతని శ్రేయస్సు కొరకు ప్రార్థించటం, కాసేపు అతని సమాధి దగ్గర కూర్చొని అతని మన్నింపు కోసం ప్రార్థించటం, ఖుర్‌ఆన్ పారాయణం చేయటం గురించి....

٩٤٦ - عن أبي عَمْرو - وقيل: أبو عبدِ الله، وقيل: أبو لَيْلى - عُثْمَانَ بنِ عَفَّانَ رضي الله عنه قال: كَانَ النَّبيُّ ﷺ إذا فَرَغَ مِنْ دَفنِ المَيِّتِ وَقَفَ عَلَيهِ، وقال: «اسْتَغفِرُوا لأَخِيكُم وسَلُوا لَهُ التَّثبِيتَ، فَإِنَّهُ الآنَ يُسأَلُ» رواه أبو داود.

946. హజ్రత్ అబూ అమ్ర్ లేక అబూ అబ్దుల్లాహ్ లేక అబూ లైలా ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) మృతుని ఖనన సంస్కారాలు ముగిశాక అతని సమాధి దగ్గర నిలబడి (తన సహచరుల్ని ఉద్దేశ్యించి) "మీ సోదరుని మన్నింపు కోసం ప్రార్థించండి. ఇప్పుడతన్ని విచారించటం జరుగుతుంది. కనుక మీరు అతనికి స్థిరత్వం లభించాలని కోరుకోండి" అని ఆదేశించే వారు. *(అబూ దావూద్)*

*(సుననె అబూ దావూద్‌లోని జనాయెజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

మృతుణ్ణి సమాధిలో పూడ్చిపెట్టిన తర్వాత దైవదూతలు వచ్చి అతన్ని సంక్షిప్తంగా విచారిస్తారు. అలాంటప్పుడు దేవుడు విశ్వాసులైన దాసులకు దైవదూతలు అడిగే ప్రశ్నలకు సరైన సమాధానం చెప్పే సామర్థ్యాన్ని ప్రసాదిస్తాడు. దాంతో వారు ఏమాత్రం భయపడకుండా తమ ప్రభువు అల్లాహ్ అనీ, తమ ధర్మం ఇస్లాం అనీ, తమ ప్రవక్త ముహమ్మద్ (సల్లం) అని చెబుతారు. కాని అవిశ్వాసులు సమాధిలో తమను విచారించినప్పుడు దైవదూతలు అడిగే ప్రశ్నలకు జవాబులు చెప్పలేక నెత్తీనోరు బాదుకుంటారు. పశ్చాత్తాపంతో కుమిలిపోతారు. అందుకే మృతుణ్ణి ఖననం చేసిన తర్వాత కాసేపు సమాధి దగ్గర నిలబడి అతని శ్రేయస్సు కోసం, మన్నింపు కోసం, స్థిరత్వం కోసం ప్రార్థించాలని హదీసుల్లో తాకీదు చేయబడింది.

٩٤٧ ـ وعن عمرو بن العاص رضي الله عنه قال: إذا دفنتموني، فأقيموا حول قبري قدر ما تنحر جزور، ويقسم لحمها حتى أستأنس بكم، وأعلم ماذا أراجع به رسل ربي. رواه مسلم. وقد سبق بطوله. قال الشافعي رحمه الله: ويستحب أن يقرأ عنده شيء من القرآن، وإن ختموا القرآن عنده كان حسناً.

947. హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) (తన వారసుణ్ణి) ఇలా కోరారు : (నా మరణానంతరం) నన్ను ఖననం చేసినప్పుడు మీరు ఒక ఒంటెను కోసి దాని మాంసాన్ని పంచిపెట్టినంతసేపు నా సమాధి చుట్టూ నించోండి. దానివల్ల నాక్కాస్త ధైర్యం లభిస్తుంది. నా ప్రభువు పంపే దూతలకు నేనేం జవాబు చెబుతానో తెలుసుకుంటాను.” *(ముస్లిం)*

ఈ ఉల్లేఖనం ఇంతకుముందు వివరంగా వచ్చింది.

ఇమామ్ షాఫయీ (రహ్మాలై) ఇలా అన్నారు: సమాధి దగ్గర కాసేపు ఖుర్ఆన్ పారాయణం చేయటం అభిలషణీయం. ఖుర్ఆన్ మొత్తం పారాయణం చేస్తే ఇంకా మంచిది.

*(సహీహ్ ముస్లింలోని విశ్వాస ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

మృతుణ్ణి ఖననం చేసిన తర్వాత సమాధి దగ్గర నిలబడి మృతుని మన్నింపు కోసం, మనస్థయిర్యం కోసం ప్రార్థించాలని దైవప్రవక్త (సల్లం) విధానం ద్వారా తెలుస్తోంది. సదరు హదీసులో దైవప్రవక్త అనుచరుడు అమ్ర్ బిన్ ఆస్ (రజి) కూడా దాని గురించే ఆదేశించారు.

ఇకపోతే ఇమామ్ షాఫయి (రహ్మాలై) చెప్పినట్లు సమాధి దగ్గర ఖుర్ఆన్ పారాయణం చేయటం మాత్రం సరయిన పద్ధతి కాదు. దైవప్రవక్త (సల్లం)గాని, ఆయన అనుచరులు గాని ఆ విధంగా చేసినట్లు ఆధారాలు లేవు. సమాధి దగ్గర కేవలం దుఆ చేయటమే మస్నూన్ పద్ధతి. దానికి మించి ప్రవర్తిస్తే ప్రవక్త విధానాన్ని ఉల్లంఘించినట్లవుతుంది. ఇంకో విషయం ఏమిటంటే, అసలు ఇమామ్ షాఫయి (రహ్మాలై) ఆ మాట అన్నారని కూడా పూర్తి నమ్మకంగా చెప్పలేం. ఎందుకంటే, ఫత్హుల్ బారీ, తఫ్సీర్ ఇబ్నె కసీర్ ఇంకా ఇతర గ్రంథాల ద్వారా ఇమామ్ షాఫయీ (రహ్మాలై) ఖుర్ఆన్ పారాయణం చేసి మృతులకు పుణ్యసమర్పణ (ఈసాలె సవాబ్) చేసే పద్ధతికి సుముఖంగా లేరని తెలుస్తోంది.

## 162వ అధ్యాయం

# ١٦٢ ـ بَابُ الصَّدَقَةِ عَنِ الْمَيِّتِ وَالدُّعَاءِ لَهُ

# మృతుని తరఫు నుండి దానధర్మాలు చేయటం, అతని శ్రేయస్సు కొరకు ప్రార్థించటం

قال الله تعالى: ﴿وَالَّذِينَ جَاءُو مِنْ بَعْدِهِمْ يَقُولُونَ رَبَّنَا اغْفِرْ لَنَا وَلِإِخْوَانِنَا الَّذِينَ سَبَقُونَا بِالْإِيمَانِ﴾ [الحشر: ١٠].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ సెలవిచ్చాడు :

"వారి తర్వాత వచ్చిన వారు ఇలా ప్రార్థిస్తారు: ఓ ప్రభూ! మమ్మల్నీ, మాకు పూర్వం విశ్వసించిన మా సోదరులందరినీ క్షమించు."

*(అల్ హష్ర్ : 10)*

**వివరణ :**

పైన పేర్కొన్న సూక్తిలో "వారి తర్వాత వచ్చినవారు" అంటే తాబయీన్లు, వారి తర్వాత ప్రళయం వరకు వస్తూ ఉండే ముస్లింలని అర్థం. అసలు "వారు" అంటే దైవప్రవక్త అనుచరులని భావం. ఈ సూక్తిలో తమ తర్వాతి తరాల మన్నింపు కొరకు, తమ సమకాలికుల మన్నింపు కొరకు ప్రార్థన ఉంది. పై సూక్తిని నిదర్శనంగా తీసుకొని ఇమామ్ నవవీ (రహ్మలై) మృతుని శ్రేయస్సు కోసం ప్రార్థించవచ్చని అంటున్నారు. అలాగే మృతుని తరవు నుండి దానధర్మాలు కూడా చేయవచ్చని ఇతర హదీసుల ద్వారా బోధపడుతోంది. కనుక ఈ రెండు మార్గాల ద్వారా మృతులకు ప్రయోజనం కలుగుతుందని చెప్పవచ్చు.

٩٤٨ ـ وعَنْ عَائِشَةَ رَضِيَ اللهُ عَنْهَا أَنَّ رَجُلاً قال لِلنَّبِيِّ ﷺ: إنَّ أُمِّي افتُلِتَتْ نَفْسَهَا وَأُرَاهَا لو تَكَلَّمَتْ، تَصَدَّقَتْ، فَهَل لَهَا أَجرٌ إن تصدَّقْتُ عَنْهَا؟ قال: «نَعَمْ». متفقٌ عليه.

948. హజ్రత్ ఆయిషా (రజి.అన్హా) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరికి వచ్చి, "నా తల్లి అకస్మాత్తుగా చని పోయింది. ఆమెకు ఆ సమయంలో మాట్లాడే అవకాశం లభించి ఉంటే ఆమె తన తరపున దానధర్మాలు చేయమని ఆదేశించి ఉండేదని నా అనుమానం. ఇప్పుడు ఆమె తరపు నుండి నేను దానధర్మాలు చేస్తే దానివల్ల ఆమెకు పుణ్యం లభిస్తుందా?" అని

అడిగాడు. అందుకాయన లభిస్తుందని సమాధానం చెప్పారు.

(బుఖారీ - ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని జకాత్ ప్రకరణం)

## ముఖ్యాంశాలు

మృతుల కొరకు చేయబడే 'దుఆలు' స్వీకరించబడినట్లుగానే వారి తరఫు నుండి చేయబడే దానధర్మాల వల్ల కూడా వారికి పుణ్యం లభిస్తుంది. దుఆలు మరియు దానధర్మాలు- మృతులకు పుణ్యం అందజేయటానికి ఉన్నవి ఈ రెండు మార్గాలే. ఇవి తప్పించి మన నాట బహుళ ప్రచారంలో ఉన్న సాప్తదిన కర్మలు, దశదిన కర్మలు, నలభై దినాల కర్మలు మొదలగు ఆచారాలన్నీ ధర్మవిరుద్ధమైన పోకడలు. ఒక విధంగా ఇవన్నీ సహవాస దోషం వల్ల ముస్లిం ప్రజానీకానికి అబ్బిన దురాచారాలని చెప్పవచ్చు. అదేవిధంగా మృతులకు పుణ్య సమర్పణ కోసం 'ఖురాన్ ఖానీలు' నిర్వహించటం కూడా అనాచారమే. ఇవన్నీ నిష్ప్రయోజనకరమైన పనులు. వీటిద్వారా చనిపోయిన వారికి పుణ్యప్రాప్తి జరుగుతుందని భావించటం అవివేకం!

٩٤٩ ـ وعن أَبي هُرَيْرَةَ رَضِيَ الله عَنْهُ أَنَّ رَسُولَ الله ﷺ قَالَ: «إذا مَاتَ الإِنسَانُ انقَطَعَ عَمَلُهُ إِلَّا مِنْ ثَلاثٍ: صَدَقَةٍ جارِيَةٍ، أَوْ عِلْمٍ يُنْتَفَعُ بِهِ، أَوْ وَلَدٍ صَالِحٍ يَدعُو له» رواه مسلم.

949. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : మనిషి చని పోగానే అతని ఆచరణల పరంపర తెగి పోతుంది. అయితే మూడు మార్గాల ద్వారా (మాత్రం అతనికి పుణ్యప్రాప్తి జరుగుతూనే ఉంటుంది). అవి : సదఖయె జారియా (ఎడతెగని దానం), ప్రయోజనకరమయిన విద్య, మృతుని శ్రేయస్సు కొరకు ప్రార్థించే సదాచార సంపన్నులయిన అతని సంతానం.

(ముస్లిం)

(సహీహ్ ముస్లింలోని వీలునామా ప్రకరణం)

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన మూడు మార్గాల ద్వారా మనిషికి మరణించిన మీదట కూడా పుణ్యం లభిస్తూ ఉంటుంది. వీటిని "సదఖాతె జారియా" (శాశ్వత పుణ్యకార్యాలు) అని

అంటారు. ఉదాహరణకు మృతుడు గనక తన జీవితంలో మస్జిద్‌లు, సత్రాలు, వైద్యశాలలు, పాఠశాలలు లాంటివి నిర్మించి ఉంటే అవి నడుస్తున్నంతకాలం, ప్రజలు వాటిద్వారా ప్రయోజనం పొందుతూ ఉన్నంత కాలం మృతునికి దానివల్ల పుణ్యం లభిస్తూనే ఉంటుంది. కనుక మనిషికి మరణానంతరం పుణ్యప్రాప్తి జరగటానికి ఇదొక మార్గం.

రెండో మార్గం, ప్రజలకు ఉపయోగకరమైన విద్యను బోధించి చనిపోవటం, ఉదాహరణకు ఖుర్‌ఆన్ హదీసుల గ్రంథాలను క్రోడీకరించటం, మంచి పుస్తకాలు రచించటం, ధర్మజ్ఞానాన్ని ప్రచారం చేయటం, ప్రజలకు ధర్మబోధ చేయటం మొదలగునవి. వీటివల్ల కూడా మనిషికి మరణానంతరం పుణ్యం లభిస్తూ ఉంటుంది. ఇకపోతే కన్నవారి శ్రేయస్సు కోసం ప్రార్థించే సంతానం మరణానంతరం మృతునికి లభించే పుణ్యానికి మూడో మార్గం. ఈ మూడు మార్గాలు తప్ప మరేమార్గం ద్వారానూ మృతులకు పుణ్యప్రాప్తి జరగదు.



## 163వ అధ్యాయం

# ١٦٣ ـ بَابُ ثَنَاءِ النَّاسِ عَلَى الْمَيِّتِ

# మృతుని మంచితనాన్ని కొనియాడవచ్చు

950. హజ్రత్ అనస్ (రజి) కథనం : కొంతమంది ఒక జనాజా సమీపం నుండి వెళ్తూ చనిపోయిన వ్యక్తి మంచి తనాన్ని కొనియాడసాగారు. అది విని దైవప్రవక్త (సల్లం) "వాజిబ్ (అనివార్యం) అయ్యింద"ని అన్నారు. ఆ తర్వాత మరొక శవం దగ్గర్నుండి వెళ్తూ చని పోయిన వ్యక్తి గురించి చెడుగా చెప్పుకో సాగారు. వారి మాటలు విని దైవప్రవక్త (సల్లం) మళ్ళీ, "వాజిబ్ (అనివార్యం) అయ్యింద"ని అన్నారు. అప్పుడు హజ్రత్ ఉమర్ (రజి) విషయం ఏమిటో తెలుసుకోవాలన్న ఉద్దేశ్యంతో "ఏం వాజిబ్ అయ్యింది?" అని అడిగారు. దానికాయన, "మీరు కొనియాడిన ఆ మంచి వ్యక్తికి స్వర్గ ప్రవేశం వాజిబ్ (అనివార్యం) అయ్యింది. మీరు చెడుగా చెప్పుకున్న ఆ రెండవ వ్యక్తికి నరకం వాజిబ్ (అనివార్యం) అయ్యింది. ఎందు కంటే మీరు భువిలో దేవుని సాక్షులుగా వ్యవహరిస్తున్నారు" అని అన్నారు.

*(బుఖారీ - ముస్లిం)*

٩٥٠ ـ عن أنسٍ رضي الله عنه قال: مَـرُّوا بجَنَـازَةٍ، فـأَثْـنَـوْا عَلَيْهَـا خَيْـراً، فقـال النبيُّ ﷺ: «وَجَبَتْ»، ثم مَرُّوا بأُخْرَى، فَأَثْنَوْا عَليها شَرّاً، فَقَالَ النَّبِيُّ ﷺ: «وَجَبَتْ» فَقَالَ عُمَرُ بنُ الخَطَّابِ رَضِيَ الله عَنْهُ: مَا وَجَبَتْ؟ قَـالَ: «هـذا أَثنَيتُـمْ عَلَيْـهِ خَيـراً، فَـوَجَبَـتْ لَـهُ الجَنَّةُ، وهذا أَثْنَيتُم عليه شَرًّا، فَوَجَبَتْ لَهُ النَّارُ، أَنتُم شُهَدَاءُ اللهِ فِي الأرضِ» متفقٌ عليه.

*(సహీహ్ బుఖారీలోని, సహీహ్ ముస్లింలలోని జనాయెజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పరిపూర్ణ విశ్వాసుల మాట నీతినిజాయితీ, భక్తీ పరాయణతల మీద ఆధారపడి ఉంటుంది. వారి మాటల్లో స్వార్థం గాని అసూయ, ద్వేషం లాంటి ప్రతీకార భావాలు గాని ఉండవు. అలాంటివారు ఎవరి అంతర్యాన్నయినా కొనియాడితే వారు స్వర్గస్తులవవచ్చు. మరెవరి అంతర్యాన్నయినా తూలనాడితే వారు నరకవాసులవవచ్చు. అయితే విశ్వాసులు కాని పాపాత్ములు, దుర్మార్గులు ఇతరుల గురించి చెప్పే అభిప్రాయాలకు మాత్రం ఎలాంటి విలువలేదు.

మరో విషయం ఏమిటంటే కొన్ని హదీసుల్లో మరణించిన వారి గురించి చెడుగా చెప్పుకోరాదని తెలుస్తోంది. మరి ఈ హదీసులోనేమో మరణించినవారి గురించి చెడుగా చెప్పవచ్చని తెలుస్తోంది. ఈ రెండు రకాల హదీసుల మధ్య సారూప్యం ఏమిటంటే భక్తీపరాయణతలతో కూడిన విశ్వాసుల జీవితాన్ని విస్మరించి కేవలం వారి లోపాలనే ఎత్తి చూపించటం, వారి వల్ల జరిగిన గోరంతల తప్పుల్ని కొండంతలు చేసి చూపించటం సమంజసం కాదు. ఇలా చేయటాన్ని షరీఅత్ తీవ్రంగా గర్హిస్తుంది. పోతే పరుల జాగ్రత్తకోసం, దైవాన్ని ధిక్కరిస్తూ, బహిరంగంగా పాపాలకు పాల్పడి చనిపోయినవారి గురించి ఇతరులకు తెలియ పరచటం, వారి దుష్ట వ్యక్తిత్వం గురించి ప్రజల్లో ప్రచారం చేయటంలో మాత్రం తప్పులేదు.

951. హజ్రత్ అబుల్ అస్వద్ (రహ్మలై) కథనం : ఒకసారి నేను మదీనాకు వచ్చి ఉమర్ (రజి) దగ్గర కూర్చున్నారు. ఆ సమయంలో మాకు దగ్గర్లో కొంతమంది జనం ఒక జనాజా (శవపేటిక)ను మోసుకెళ్తుంటే అక్కడున్న వారు ఆ చనిపోయిన వ్యక్తి మంచితనాన్ని మెచ్చుకుంటూ మాట్లాడుకోసాగారు. వారి మాటలు విని ఉమర్ (రజి) "వాజిబ్ (తప్పనిసరి) అయ్యింది" అని అన్నారు. కాసేపటికి మా సమీపం నుంచి మరో జనాజా వెళ్ళింది. అప్పుడు కూడా ప్రజలు మృతుని గురించి మంచి మాటలే చెప్పుకున్నారు. ఉమర్ (రజి) వారి మాటలు విని "వాజిబ్ (తప్పనిసరి) అయ్యింది" అని అన్నారు. మరికొంత

٩٥١ ـ وعن أبي الأسود قال: قَدِمْتُ المَدِينَةَ، فَجَلَسْتُ إلى عُمَرَ بنِ الخَطَّابِ رَضِيَ الله عَنْهُ فمَرَّتْ بِهِمْ جَنَازَةٌ، فَأُثْنِيَ عَلى صَاحِبِها خَيْراً فقال عُمَرُ: وَجَبَت، ثم مُرَّ بِأُخرَى، فَأُثنِيَ على صَاحِبِها خيراً، فَقَالَ عُمَرُ: وَجَبَت، ثم مُرَّ بِالثَّالِثَةِ، فَأُثْنِيَ عَلى صَاحِبِها شَرًّا، فَقَالَ عُمَرُ: وَجَبَتْ؛ قَالَ أبو الأَسْوَدِ: فَقُلْتُ:

وما وَجَبَتْ يَا أَمِيرَ الْمُؤْمِنِينَ؟ قال: قُلْتُ كما قَالَ النَّبِيُّ ﷺ: «أَيُّمَا مُسلِمٍ شَهِدَ لَهُ أَربعَةٌ بِخَيرٍ، أَدخَلَهُ اللهُ الجَنَّةَ» فَقُلْنَا: وثَلاثَةٌ؟ قال: «وثَلاثَةٌ» فقلنا: واثنَانِ؟ قال: «واثنَانِ» ثُمَّ لَم نَسأَلْهُ عَنِ الواحِدِ. رواه البخاري.

సేపటికి జనం ఇంకో శవపేటికను మోసుకెళ్తూ కనిపించారు. మా సమీపంలో కూర్చొని ఉన్నవారు చనిపోయిన వ్యక్తి గురించి చెడుగా చెప్పుకోసాగారు. వారి మాటలు విని ఉమర్ (రజి) "వాజిబ్ అయ్యింది" అని అన్నారు.

అప్పుడు నేను విషయం ఏమిటో తెలుసుకుందామని ఆయన్ని "విశ్వాసుల నాయకా! ఏం వాజిబ్ అయ్యింది?" అని అడిగాను. అందుకాయన "నేను దైవప్రవక్త (సల్లం) అన్నమాటే అన్నాను. ఆయన ఒకసారి మాకు హితోపదేశం చేస్తూ, "ఒక ముస్లిం మంచితనాన్ని గురించి నలుగురు వ్యక్తులు సాక్ష్యం ఇస్తే దేవుడు అతణ్ణి స్వర్గంలోకి ప్రవేశింపజేస్తాడు" అని చెప్పారు. అది విని మేము "ముగ్గురు వ్యక్తులు సాక్ష్యం ఇస్తేనో?" అని అడిగాం. అందుకాయన "ముగ్గురు సాక్ష్యం ఇచ్చినా సరే" అన్నారు. మేము మళ్ళీ "ఇద్దరు సాక్ష్యం ఇస్తేనో?" అని అడిగాం. "ఇద్దరు ఇచ్చినా సరే" అన్నారాయన. ఆ తర్వాత మేము ఒక వ్యక్తి సాక్ష్యం గురించి అడగలేదు" అని చెప్పారు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం)*

## 164వ అధ్యాయం

# ١٦٤ ـ بَابُ فَضْلِ مَنْ مَاتَ لَهُ أَوْلاَدٌ صِغَارٌ

# సంతాన వియోగం పట్ల సహనం వహించేవారికి లభించే పుణ్యం

٩٥٢ ـ عن أنسٍ رضي اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ: «مَا مِنْ مُسلِمٍ يَمُوتُ لَهُ ثَلاَثَةٌ لم يَبلُغُوا الحِنثَ إلَّا أدخَلَهُ اللهُ الجَنَّةَ بفَضْلِ رَحْمَتِهِ إيَّاهُمْ» متفقٌ عليه.

952. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : ఎవరయినా యుక్తవయసుకు రాని ముగ్గురు పిల్లల్ని కోల్పోతే దేవుడు ఆ పిల్లలపై తనకున్న మమకారం చలువతో అలాంటివారిని స్వర్గంలోకి ప్రవేశింపజేస్తాడు.

(బుఖారీ - ముస్లిం)

(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)

٩٥٣ ـ وعن أَبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قال رَسُولُ اللهِ ﷺ: «لا يَمُوتُ لأَحَدٍ مِنَ المُسْلِمِينَ ثَلاَثَةٌ مِنَ الوَلَدِ لا تَمَسُّهُ النَّارُ إلَّا تَحِلَّةَ القَسَمِ» متفقٌ عليه.

953. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : ముగ్గురు పిల్లల్ని కోల్పోయిన (అంటే వారి మరణం పట్ల సహనం వహించిన) ఏ ముస్లింనూ నరకాగ్ని ముట్టుకోజాలదు. అయితే ప్రమాణం నెరవేరటానికి అతను నరకం మీదుగా పోవలసి ఉంటుంది.

(బుఖారీ - ముస్లిం)

وَ«تَحِلَّةُ القَسَمِ» قولُ اللهِ تعالى: ﴿وَإِن مِّنكُمْ إِلَّا وَارِدُهَا﴾ [مريم: ٧١] وَالوُرُودُ:

ఎందుకంటే దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు : "మీలో నరకం మీదుగా పోనివారంటూ ఉండరు."

هُوَ العُبُورُ عَلى الصِّرَاطِ، وَهُوَ جِسْرٌ مَنْصُوبٌ عَلى ظَهْرِ جَهَنَّمَ. عَافَانَا اللهُ مِنْهَا.

(మర్‌యమ్ : 81) 'వురూద్' అంటే 'వంతెన దాటడం' అని అర్థం. నరకం పైన ఒక వంతెన కట్టబడి ఉంది. అల్లాహ్ మనల్నందరినీ క్షేమంగా ఆ వంతెన దాటేలా చేయుగాక!

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

నరకం మధ్యన ఓ వంతెన ఉంది. ప్రళయదినాన విశ్వాసులు, అవిశ్వాసులు అందరూ ఆ వంతెన దాటి వెళ్ళవలసి ఉంటుంది. అయితే విశ్వాసులు తమ ఆచరణలకు అనుగుణంగా కొందరు రెప్పపాటులో వంతెన దాటితే మరికొందరు మెరుపువేగంతో, వాయువేగంతో ఆ వంతెన దాటుతారు. కొందరు పక్షుల్లాగా, ఇంకొందరు అశ్వవేగంతో వంతెన దాటి వెళ్ళిపోతారు. మొత్తానికి చాలామంది విశ్వాసులు సురక్షితంగా వంతెన దాటుతారు. కొంతమంది బలహీన విశ్వాసులు మాత్రం ఆ వంతెన పూర్తిగా దాటలేక నరకంలో పడిపోతారు. ఆ తర్వాత కొంతకాలానికి ఎవరో ఒకరి సిఫారసుతో వారిని కూడా నరకం నుంచి రక్షించటం జరుగుతుంది. కాని అవిశ్వాసులు మాత్రం ఎట్టిపరిస్థితుల్లోనూ ఆ వంతెన దాటలేరు. వారిలోని ప్రతి ఒక్కరూ నరకాగ్నికి ఆహుతి అవుతారు. ముగ్గురు పిల్లల్ని కోల్పోయిన ముస్లిం నరకానికి పోడు. కాని దివ్య ఖుర్‌ఆన్‌లోని దైవనిర్ణయం నెరవేరటానికన్నట్లు అతను నామమాత్రానికి ఆ నరక వంతెన దాటి తన అసలు నివాసమైన స్వర్గానికి వెళ్ళిపోతాడు.

٩٥٤ ـ وعن أبي سعيدٍ الخُدْرِيِّ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: جَاءَتِ امرأَةٌ إلى رَسُولِ اللهِ ﷺ، فَقَالَتْ: يَا رَسُولَ اللهِ! ذَهَبَ الرِّجالُ بِحَديثِكَ، فاجْعَلْ لَنَا مِنْ نَفْسِكَ يَوْماً نَأْتِيكَ فيهِ تُعَلِّمُنَا مِمَّا عَلَّمَكَ اللهُ، قَالَ: «اجْتَمِعْنَ يَوْمَ كَذَا وَكَذَا»

954. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి) కథనం : ఒక మహిళ దైవప్రవక్త (సల్లం) సన్నిధికి వచ్చి, "దైవప్రవక్తా! మీ మాటలు వినే అవకాశం పురుషులకు మాత్రమే లభిస్తుంది. అందుకని మీరు మా కోసం కూడా ఒక దినం నిర్ణయిస్తే, ఆ రోజు మేమూ మీ సన్నిధికి వస్తాం. అప్పుడు దేవుడు మీకు నేర్పిన విషయాలు మాకూ బోధించవచ్చు" అని విన్నవించుకుంది. దానికాయన, "అయితే మీ స్త్రీలంతా ఫలానా రోజున

فَاجْتَمَعْنَ، فَأَتَاهُنَّ النبيُّ ﷺ فَعَلَّمَهُنَّ مِمَّا عَلَّمَهُ اللهُ، ثُمَّ قَالَ: «ما مِنْكُنَّ مِن امْرَأَةٍ تُقَدِّمُ ثَلاثَةً مِنَ الْوَلَدِ إلَّا كانُوا لَها حِجَاباً مِنَ النَّارِ» فَقَالَتِ امْرَأَةٌ: وَاثْنَيْنِ؟ فَقَالَ رَسُولُ الله ﷺ: «وَاثْنَيْنِ» متفقٌ عليه.

ఒకచోట సమావేశమవుతూ ఉండండి" అని అన్నారు. దైవప్రవక్త (సల్లం) ఆదేశానుసారం ఆ రోజు స్త్రీలందరూ సమావేశమయ్యారు. దైవప్రవక్త (సల్లం) వారి వద్దకు వెళ్ళి, దేవుడు తనకు నేర్పిన విషయాలు వారికి బోధిస్తూ "ముగ్గురు పిల్లల్ని కోల్పోయిన (అంటే వారి మరణం పట్ల సహనం వహించిన) స్త్రీ నరకానికి వెళ్ళకుండా ఆ పిల్లలు అడ్డు పడతారు" అని చెప్పారు. ఒక స్త్రీ ఈ మాట విని, "మరి ఇద్దరు పిల్లల్ని కోల్పోయి ఉంటేనో?" అని అడిగింది. అందుకాయన, "ఆ... ఇద్దరయినా" అని సమాధానమిచ్చారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జనాయెజ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని సత్కార్యాలు - సత్సంబంధాల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ధార్మిక సమావేశాలకు స్త్రీలు కూడా పాల్గొనవచ్చునీ, ధర్మజ్ఞాన సముపార్జనకు స్త్రీలకు కూడా అవకాశాలు కల్పించాలని పై హదీసు ద్వారా బోధపడుతోంది. స్వయంగా స్త్రీలలోనే ధర్మజ్ఞాన సముపార్జన పట్ల ఆసక్తి ఉండాలి. అప్పుడే వారు ధార్మిక విద్యను ఆర్జించి తమల్ని తాము సంస్కరించుకోవటంతో పాటు తమ కుటుంబాలను కూడా చక్కదిద్దుకోగల్గుతారు. తమ పిల్లలకు సరైన శిక్షణను అందించగల్గుతారు. ఇల్లాలి చదువు ఇంటికి వెలుగుతో సమానం. ఒక స్త్రీ చదువుకొని సరైన శిక్షణతో ధర్మజ్ఞానాన్ని ఆర్జిస్తే, ఆమె ఓ మంచి ఇల్లాలిగా, ఉత్తమ గృహిణిగా, ఉత్తమ మహిళగా సమాజానికి తన వంతు సేవను అందజేయగలదు. తన కుటుంబంలోని వారందరినీ సరైన బాటలో నడిపించగలదు.

165వ అధ్యాయం

١٦٥ ـ بَابُ الْبُكَاءِ وَالْخَوْفِ عِنْدَ الْمُرُورِ بِقُبُورِ الظَّالِمِينَ وَمَصَارِعِهِمْ وَإِظْهَارِ الافْتِقَارِ إِلَى اللهِ تَعَالَى وَالتَّحْذِيرِ مِنَ الْغَفْلَةِ عَنْ ذٰلِكَ

## దుర్మార్గుల సమాధుల, అవశేషాల మీదుగా వెళ్ళినప్పుడు భయపడుతూ, విలపిస్తూ వెళ్ళాలి, దైవం ముందు తమ అభాగ్యాన్ని చాటుకోవాలి. ఈ విషయంలో ఏమరుపాటుకు లోనుకారాదు.

٩٥٥ ـ عَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا أَنَّ رَسُولَ اللهِ ﷺ قَالَ لأَصْحَابِهِ ـ يَعْنِي لَمَّا وَصَلُوا الحِجْرَ: دِيَارَ ثَمُود ـ: «لَا تَدْخُلُوا عَلَى هٰؤُلاءِ المُعَذَّبِينَ إِلَّا أَنْ تَكُونُوا بَاكِينَ، فَإِنْ لَمْ تَكُونُوا بَاكِينَ، فَلا تَدْخُلُوا عَلَيْهِمْ؛ لَا يُصِيبُكُمْ مَا أَصَابَهُمْ» متفقٌ عليه.

955. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) తన అనుచరులతో పాటు హిజ్ర్ ప్రాంతానికి (అంటే సమూద్ జాతి నివసించిన ప్రాంతానికి) చేరుకున్నప్పుడు, ఆయన తన సహచరులతో, "ఈ దైవశిక్షకు గురయినవారి (ఇండ్ల) సమీపం నుండి వెళ్ళకండి. అటుగా వెళ్ళ వలసి వస్తే రోదిస్తూ వెళ్ళండి. రోదించ లేని పక్షంలో అసలు అక్కడికి వెళ్ళకండి. వారిపై విరుచుకుపడిన ఆపద మీపై కూడా విరుచుకుపడవచ్చు" అని ఉపదేశించారు.

వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దైవ ప్రవక్త (సల్లం) హిజ్ర్ ప్రాంతంగుండా వెళ్తున్నప్పుడు తన సహచరుతో ఇలా అన్నారు : "తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్నవారి ప్రాంతాల గుండా వెళ్ళి

وفي رواية قال: لمَّا مَرَّ رَسُولُ اللهِ بالحِجْرِ قال: «لَا تَدْخُلُوا مَسَاكِنَ الَّذِينَ ظَلَمُوا أَنْفُسَهُمْ أَنْ يُصِيبَكُمْ مَا أَصَابَهُمْ إِلَّا أَنْ تَكُونُوا بَاكِينَ» ثُمَّ قَنَّعَ رَسُولُ اللهِ ﷺ رَأْسَهُ وَأَسْرَعَ السَّيْرَ حَتَّى أَجَازَ الوَادِيَ.

నప్పుడు రోదిస్తూనే వెళ్ళండి. వారి మీద విరుచుకుపడిన ఆపదే మీపై కూడా విరుచుకుపడవచ్చు."

అలా అని దైవప్రవక్త (సల్లం) తలమీద గుడ్డ కప్పుకొని వడివడిగా అడుగులు ముందుకువేస్తూ ఆ లోయను దాటి వెళ్ళిపోయారు.

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ఐహిక అనాసక్తత ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

పూర్వం దైవధిక్కారానికి పాల్పడటం మూలంగా దైవశిక్షకు గురయిన జాతుల్లో సమూద్ జాతి ఒకటి. హజ్రత్ సాలిహ్ (అలైహి) ఈ జాతిని సన్మార్గంపై నడిపించటానికి పంపబడిన దైవప్రవక్త. మదీనా మరియు సిరియాకు మధ్య నున్న ఒకానొక లోయప్రాంతంలో ఈ జాతి నివసిస్తూ ఉండేది. సాలిహ్ (అలైహి) తమ జాతిని ఏకదైవారాధన వైపుకు, విశ్వాసం సదాచరణల వైపుకు పిలిచారు. కాని జాతివారు ఆయన్ని ధిక్కరించారు. తత్ఫలితంగా వారు దైవశిక్షకు గురయ్యారు. వారిపై ఒక పెద్ద ప్రేలుడు విరుచుకుపడింది. దాంతో వారు తమ గృహాలలో ఎలాంటి చలనం, చైతన్యం లేకుండా పడిపోయారు. అసలు వారు ఎప్పుడూ అక్కడ నివసించనే లేదన్నట్లుగా.

హి.శ. పదవ ఏట దైవప్రవక్త (సల్లం) తన అనుచరులతో తబూక్ దండయాత్రకు బయలుదేరినప్పుడు సిరియా సరిహద్దుల్లో ఉన్న 'హిజ్ర్' ప్రాంతంగుండా వెళ్ళారు. ఆ సందర్భంగా ఆయన తన అనుచరులతో అన్న మాటలివి. దీనిద్వారా తెలిసేదేమిటంటే, దైవశిక్షకు గురయిన ప్రాంతాల గుండా వెళ్తున్నప్పుడు అక్కడి అవశేషాలను కేవలం చారిత్రక దృష్టితోనే చూడకుండా వాటి ద్వారా గుణపాఠం కూడా నేర్చుకోవాలి. వాటిని చూసి తమలో దైవభీతిని, సదాచరణ చేసే సద్బుద్ధిని పెంపొందించుకోవాలి. అలాంటి భయంకరమైన శిక్షకు తాము గురికాకుండా ఉండటానికి గతంలో తమవల్ల జరిగిన పాపాలకు పశ్చాత్తాపపడుతూ క్షమాభిక్ష పెట్టమని దైవాన్ని వేడుకోవాలి.

# ٧ ـ كِتَابُ السَّفرِ

# 7. ప్రయాణ ప్రకరణం

**166వ అధ్యాయం**

## ١٦٦ ـ بَابُ اسْتِحْبَابِ الْخُرُوجِ يَوْمَ الْخَمِيسِ أَوَّلَ النَّهَارِ

## గురువారం రోజు ఉదయం ప్రయాణం మొదలు పెట్టడం అభిలషణీయం

٩٥٦ ـ عن كعب بن مالك رَضِيَ اللهُ عنهُ، أنَّ النبيَّ ﷺ خَرَجَ في غَزْوَةِ تَبُوكَ يَوْمَ الخَمِيسِ وَكَانَ يُحِبُّ أَنْ يَخْرُجَ يَوْمَ الخَمِيسِ. متفقٌ عليه. وفي رواية في «الصحيحين»: لَقَلَّمَا كان رَسُولُ اللهِ ﷺ يَخْرُجُ إلَّا في يَوْمِ الخَمِيسِ.

956. హజ్రత్ కాబ్ బిన్ మాలిక్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) తబూక్ దండయాత్ర కొరకు గురువారం రోజు బయలుదేరారు. ఆయన గురువారం రోజు ప్రయాణం చేయటాన్ని ఇష్టపడే వారు. *(బుఖారీ - ముస్లిం)*

బుఖారీ - ముస్లింలలోని వేరొక ఉల్లేఖనంలో ఇలా ఉంది : దైవప్రవక్త (సల్లం) గురువారానికి బదులు వేరేదినాల్లో ప్రయాణించటం బహు అరుదుగా జరిగేది.

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

٩٥٧ ـ وعن صَخْرِ بنِ وَدَاعَةَ الغامِدِيِّ الصَّحَابيِّ رَضِيَ اللهُ عَنْهُ، أنَّ رَسُولَ اللهِ قَالَ: «اللَّهُمَّ! بَارِكْ لأُمَّتِي في بُكُورِها» وَكَانَ إذا بَعَثَ سَرِيَّةً أَوْ جَيشاً

957. హజ్రత్ సఖ్ర్ బిన్ వదాఆ గామిదీ సహాబీ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) "దేవా! నా అనుచర సమాజం వేకువజాములో (చేసే ప్రయాణంలో) శుభాన్ని అవతరింపజేయి" అని ప్రార్థించారు. ఆయన ఏదయినా సైనిక

بَعَثَهُم مِنْ أَوَّلِ النَّهَارِ. وَكَانَ صَخْرٌ تَاجِراً، فَكَانَ يَبْعَثُ تِجَارَتَهُ أَوَّلَ النَّهَارِ، فَأَثْرَى وَكَثُرَ مَالُهُ. رواه أبو داود والترمذيُّ وقال: حديثٌ حسن.

పటాలాన్ని గాని లేదా సైనిక దళాన్ని గాని పంపినప్పుడు దాన్ని వేకువజామునే పంపేవారు.

ఈ హదీసును తెలియజేసిన సఖ్ర్ (రజి) స్వయంగా ఓ వ్యాపారి. ఈయన కూడా తన వ్యాపార సామగ్రిని వేకువ జాము లోనే రవాణా చేసేవారు. (దైవప్రవక్త (సల్లం) ప్రార్థన) ఫలితంగా ఆయన గొప్ప ధనికులయ్యారు. ఆయన సంపద వృద్ధిచెందింది.

*(అబూ దావూద్, తిర్మిజీ, హసన్)*

*(సుననె అబూ దావూద్‌లోని జిహాద్ ప్రకరణం, సుననె తిర్మిజీలోని వాణిజ్య అధ్యాయాలు)*

## ముఖ్యాంశాలు

ప్రయాణంగాని, వస్తు రవాణాగాని వేకువ జాములో మొదలయితే, అది లాభదాయకంగానూ, శుభకరంగానూ ఉంటుందని పై హదీసుద్వారా బోధపడుతోంది. ఆ సమయంలో మనుషులు తాజాగా, హుషారుగా ఉంటారు. పనిచేసే శక్తి, ఓపిక వారిలో పుష్కలంగా ఉంటాయి. అందుకనే ఆ సమయంలో చేసేపనులు చాలా తొందరగా పూర్తవుతాయి.

## 167వ అధ్యాయం

## ١٦٧ - بَابُ اسْتِحْبَابِ طَلَبِ الرُّفْقَةِ وَتَأْمِيرِهِمْ عَلَى أَنْفُسِهِمْ وَاحِداً يُطِيعُونَهُ

# ప్రయాణానికి కలిసి బయలుదేరటం, ఎవర్నయినా ఒకర్ని తమ నాయకునిగా ఎన్నుకోవటం గురించి...

٩٥٨ - عَنِ ابْنِ عُمَرَ رَضِيَ اللهُ عَنْهُمَا قَالَ: قال رَسُولُ اللهِ ﷺ: «لَوْ أَنَّ النَّاسَ يَعْلَمُونَ مِنَ الوَحْدَةِ مَا أَعلَمُ مَا سَارَ رَاكِبٌ بِلَيْلٍ وَحْدَهُ» رواه البخاري.

958. హ(జత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ఒంటరిగా ప్రయాణం చేయటం వల్ల కలిగే నష్టమేమిటో నాకు తెలిసినట్టుగా ప్రజలకు తెలిస్తే వారిలో ఏ రౌతూ రాత్రిపూట ఒంటరిగా ప్రయాణానికి సిద్ధపడడు. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

٩٥٩ - وعن عمرِو بن شُعَيْب، عن أبيه، عن جدّه رضِي اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «الرَّاكِبُ شَيْطَانٌ، وَالرَّاكِبَانِ شَيْطَانَانِ، وَالثَّلاثَةُ رَكبٌ». رواه أبو داود، والترمذي، والنسائي بأسانيد صحيحة، وقال الترمذي: حديثٌ حسن.

959. హ(జత్ అమ్ర్ బిన్ షుఐబ్ తన తండ్రి నుంచి, ఆయన తన తాతగారి నుంచి చేసిన కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : ఒక రౌతు షైతాను. ఇద్దరు రౌతులు కూడా షైతానులే. ముగ్గురు రౌతులుంటే ఒక ప్రయాణబృందం ఏర్పడగలదు.

అబూ దావూద్, తిర్మిజీ, నసాయీ తదితరులు దీనిని ప్రామాణికమైన ఆధారాలతో ఉల్లేఖించారు. తిర్మిజీ దీనిని హసన్‌గా పేర్కొన్నారు.

*(సుననె అబూ దావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

٩٦٠ - وعن أبي سعيدٍ وأبي هُريرةَ رَضِيَ اللهُ عَنْهما قَالا: قَالَ رَسُولُ اللهِ ﷺ:

960. హ(జత్ అబూ సయీద్ ఖుద్రీ మరియు అబూ హురైరా (రజి)ల కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా

«إذا خَرَجَ ثَلاثَةٌ في سَفَرٍ فَلْيُؤَمِّرُوا أَحَدَهُمْ» حديث حسن، رواه أبو داود بإسنادٍ حسن.

ప్రవచించారు: ముగ్గురు వ్యక్తులు (ఒక బృందంగా ఏర్పడి) ప్రయాణం చేసినప్పుడు వారు తమలో ఒకర్ని తమ నాయకునిగా ఎన్నుకోవాలి.

(ఈ హదీసు ప్రామాణికమైనది. అబూ దావూద్ దీనిని ప్రామాణికమైన ఆధారాలతో ఉల్లేఖించారు)

*(సుననె అబూ దావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

٩٦١ - وَعَنِ ابْنِ عَبَّاسٍ رَضِيَ اللهُ عَنْهُمَا عَنِ النَّبِيِّ ﷺ قَالَ: «خَيْرُ الصَّحَابَةِ أَرْبَعَةٌ، وَخَيْرُ السَّرَايَا أَرْبَعُمَائَةٍ، وَخَيْرُ الجُيُوشِ أَرْبَعَةُ آلافٍ، وَلَنْ يُغْلَبَ اثْنَا عَشَرَ أَلْفاً عَنْ قِلَّةٍ». رواه أبو داود والترمذي وقال: حديث حسن.

961. హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : నలుగురు మిత్రులతో కూడిన (ప్రయాణ) బృందం అత్యుత్తమ ప్రయాణబృందం. నాలుగొందల మందితో కూడిన సైనిక పటాలం అత్యుత్తమ సైనిక పటాలం. నాలుగు వేల మందితో కూడిన సైనిక దళం అత్యుత్తమ సైనిక దళం. పన్నెండువేల మందితో కూడిన సైనిక దళం తక్కువ సంఖ్య నెపంతో ఎన్నడూ ఓడిపోదు.

(అబూ దావూద్, తిర్మిజీలు దీన్ని ఉల్లేఖించారు. తిర్మిజీ దీన్ని 'హసన్' కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు)

*(సుననె అబూ దావూద్‌లోని జిహాద్ ప్రకరణం, సుననె తిర్మిజీలోని యుద్ధాల అధ్యాయం)*

## ముఖ్యాంశాలు

కాలినడకన గాని, వాహనంపైగాని రేయింబవళ్ళలో ఎప్పుడయినా ఒంటరిగా ప్రయాణం చేయటం ఎంతయినా ప్రమాదకరమే. ఒంటరిగా ప్రయాణించటం వల్ల మనిషి ఎన్నో భౌతిక, మానసిక కష్టాలకు గురయ్యే ప్రమాదముంది. ఒంటరిగా ప్రయాణించేవారి వెంట షైతాన్ ఉంటాడు. ఒంటరి వ్యక్తి చాలా సులభంగా పైశాచిక దుష్టప్రభావాలకు లోనవుతాడు.

ఇద్దరు వ్యక్తుల్ని కూడా షైతాన్ తన జిత్తులతో లొంగదీసుకోగలడు. అందుకే ప్రయాణం చేసేటప్పుడు కనీసం ముగ్గురు వ్యక్తులయినా కలిసి ప్రయాణించాలనీ, ప్రయాణం చేసేటప్పుడు తమలో ఒకర్ని నాయకునిగా ఎన్నుకోవాలని దైవప్రవక్త (సల్లం) ప్రబోధించారు.

కొందరు ఒక బృందంగా ఏర్పడి ప్రయాణం చేస్తున్నప్పుడు వారందరూ తమ నాయకునికి విధేయత చూపాలి. ప్రయాణావస్థలో తమ నాయకుని ఆదేశాలకు అనుగుణంగా మసలుకోవాలి. దీనివల్ల ఎన్నో లాభాలున్నాయి. బహుశా ఆ లాభాలను దృష్టిలో పెట్టుకునేనేమో కొంతమంది పండితులు ప్రయాణస్థితిలో నాయకుణ్ణి ఎన్నుకోవటం 'వాజిబ్' (తప్పనిసరి) అని అభిప్రాయపడ్డారు. అయితే అత్యధికమంది విద్వాంసులు మాత్రం ప్రయాణంలో నాయకుని (అమీర్) ఎన్నికను అభిలషణీయమైన అంశంగానే పరిగణించారు. గ్రంథకర్త ఇమామ్ నవవీ (రహ్మాలై) అభిప్రాయం కూడా అదే!

ప్రయాణం చేసేటప్పుడు ఎంత ఎక్కువమంది కలిసి ప్రయాణిస్తే అంత మంచిది. అందుకే చివరి హదీసులో నలుగురు వ్యక్తులతో కూడిన ప్రయాణ బృందాన్ని అత్యుత్తమ ప్రయాణ బృందంగా చెప్పటం జరిగింది. ఈ హదీసు ద్వారా బోధపడే ఇంకో విషయం ఏమిటంటే, పన్నెండు వేల మందితో కూడిన సైనికదళం దృఢచిత్తంతో, ధర్మంపై సంపూర్ణ విశ్వాసంతో పోరాడితే ప్రపంచంలోని ఏ శక్తీ దాన్ని ఓడించజాలదు. ఒకవేళ అది ఓడిపోతే శత్రుసైన్యం కన్నా తక్కువ సంఖ్యలో ఉండటం వల్ల ఓడిపోయిందని చెప్పకూడదు. దాని ఓటమికి వేరే కారణాలేవయినా ఉండి ఉండవచ్చు.



## 168వ అధ్యాయం

## ١٦٨ - بَابُ آدَابِ السَّيْرِ وَالنُّزُوْلِ وَالْمَبِيْتِ وَالنَّوْمِ فِي السَّفَرِ، وَاسْتِحْبَابِ السُّرَى، وَالرِّفْقِ بِالدَّوَابِّ وَمُرَاعَاةِ مَصْلَحَتِهَا، وَأَمْرِ مَنْ قَصَّرَ فِي حَقِّهَا بِالْقِيَامِ بِحَقِّهَا وَجَوَازِ الإِرْدَافِ عَلَى الدَّابَّةِ إِذَا كَانَتْ تُطِيقُ ذٰلِكَ

## ప్రయాణావస్థలో నడచివెళ్ళటం, సేదతీర్చుకోవటం, మజిలీలు చేయుటం, నిద్రపోవటం మొదలగు విషయాలకు సంబంధించిన నియమాల గురించి, రాత్రిపూట నడవటం అభిలషణీయం అనే విషయం గురించి, వాహన పశువుల పట్ల మృదువుగా వ్యవహరించటం, వాటికి తగినంతసేపు విశ్రాంతినివ్వటం గురించి, వాహన పశువు హక్కుని నెరవేర్చటంలో నిర్లక్ష్యం వహించేవారి పర్యవసానం గురించి, పశువులో సత్తువ ఉంటే దానిమీద ఇంకొకర్ని కూర్చోబెట్టుకోవటం సమ్మతమేనన్న విషయం గురించి...

٩٦٢ - عن أبي هُرَيْرَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رَسُولُ اللهِ ﷺ: «إِذَا سَافَرْتُمْ فِي الخِصْبِ فَأَعْطُوا الإِبِلَ حَظَّهَا مِنَ الأَرْضِ، وَإِذَا سَافَرْتُمْ فِي الجَدْبِ، فَأَسْرِعُوا عَلَيْهَا السَّيْرَ، وَبَادِرُوا بِهَا نِقْيَهَا، وَإِذَا عَرَّسْتُمْ، فَاجْتَنِبُوا الطَّرِيقَ، فَإِنَّهَا طُرُقُ الدَّوَابِّ، وَمَأْوَى الهَوَامِّ بِاللَّيْلِ» رواه مسلم. معنى: «أعطُوا الإِبِلَ حَظَّهَا مِنَ الأَرْضِ» أَيْ: ارفقُوا بِهَا فِي السَّيْرِ لِتَرْعَى فِي حَالِ سَيرِها وقوله:

962. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: మీరు పచ్చిక బయళ్ళగుండా ప్రయాణం చేసినప్పుడు, మీ ఒంటెకు అక్కడ మేతమేసే అవకాశం ఇవ్వండి. నెర్రలు విచ్చిన నేలగుండా ప్రయాణం చేసినప్పుడు దాన్ని వేగంగా పరుగెత్తించండి. దాని సత్తువ నశించక ముందే త్వరగా గమ్యానికి చేరిపోండి. మీరెక్కడయినా రాత్రిపూట మజిలీ

«نِقْيَهَا» هو بكسر النون، وإسكان القاف، وبالياء المثناة من تحتُ وهو: المُخُّ، مَعْنَاهُ: أَسْرِعُوا بِهَا حَتَّى تَصِلُوا المَقصِدَ قَبْلَ أَنْ يَذْهَبَ مُخُّهَا مِنْ ضَنْكِ السَّيْرِ. و«التَّعْرِيسُ»: النُّزُولُ في اللَّيْلِ.

చేయదలచుకుంటే దారుల్లో మజిలీ చేయకండి. ఎందుకంటే రాత్రిపూట వాటిగుండా జంతువులు వస్తూపోతూ ఉంటాయి. అదీగాక రాత్రిపూట అవి పురుగులకు స్థావరాలయి ఉంటాయి. (ముస్లిం)

(సహీహ్ బుఖారీ - నాయకత్వ ప్రకరణం)

٩٦٣ ـ وعن أبي قَتَادَةَ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: كَانَ رَسُولُ اللهِ ﷺ إذا كَانَ في سَفَرٍ، فَعَرَّسَ بِلَيْلٍ اضْطَجَعَ عَلى يَمِينِهِ وَإذا عَرَّسَ قُبَيْلَ الصُّبْحِ نَصَبَ ذِرَاعَهُ، وَوَضَعَ رَأْسَهُ عَلى كَفِّهِ. رواه مسلم. قال العلماءُ: إنَّمَا نَصَبَ ذِرَاعَهُ لِئَلَّا يَسْتَغْرِقَ في النَّوْمِ، فَتَفُوتَ صَلاةُ الصُّبْحِ عَنْ وَقْتِهَا أَوْ عَنْ أَوَّلِ وَقْتِهَا.

963. హజ్రత్ అబూ ఖతాదా (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ప్రయాణంలో ఉన్నప్పుడు రాత్రిపూట ఎక్కడయినా మజిలీ చేస్తే కుడివైపుకు తిరిగి పడుకునేవారు. అదే ఉషోదయానికి కాస్త ముందు ఎక్కడయినా ఆగితే కుడిచేతిని ఎత్తిపెట్టి అరచేతిమీద తల ఉంచుకొని పడుకునేవారు. (ముస్లిం)

గాఢ నిద్రలోకి జారిపోతే ఉదయం నమాజ్ వేళ తప్పించిగాని లేదా తొలివేళ తప్పించిగాని చేయవలసి వస్తుందన్న భయంతో దైవప్రవక్త (సల్లం) ఆ సమయంలో ఆ విధంగా చేతిని ఎత్తిపెట్టుకొని నిద్రపోయే వారని విద్వాంసులు అభిప్రాయపడ్డారు.

(సహీహ్ ముస్లింలోని మస్జిదుల ప్రకరణం)

٩٦٤ ـ وعن أنسٍ رَضِيَ اللهُ عَنْهُ قَالَ: قَالَ رسولُ اللهِ ﷺ: «عَلَيْكُمْ بِالدُّلْجَةِ، فَإنَّ الأَرْضَ تُطْوَى بِاللَّيْلِ». رواه أبو داود بإسنادٍ حسن. «الدُّلْجَةُ»: السَّيْرُ في اللَّيْلِ.

964. హజ్రత్ అనస్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఇలా ప్రబోధించారు : రాత్రిపూట ప్రయాణం చేయండి. ఎందుకంటే రాత్రిపూట భూమి చుట్టివేయబడుతుంది.

(అబూ దావూద్ - హసన్)

(సుననె అబూ దావూద్‌లోని జిహాద్ ప్రకరణం)

٩٦٥ ـ وعن أبي ثَعْلَبَةَ الخُشَنِيِّ رَضِيَ اللهُ عنهُ قَالَ: كَانَ النَّاسُ إذَا نَزَلُوا مَنْزِلًا تَفَرَّقُوا في الشِّعَابِ وَالأَوْدِيَةِ. فَقَالَ رسولُ اللهِ ﷺ: «إنَّ تَفَرُّقَكُمْ فِي هٰذِهِ الشِّعَابِ وَالأَوْدِيَةِ إنَّمَا ذٰلكُمْ مِنَ الشَّيْطَانِ!» فَلَمْ يَنْزِلُوا بَعْدَ ذٰلِكَ مَنْزِلًا إلَّا انْضَمَّ بَعْضُهُمْ إلى بَعْضٍ. رواه أبو داود بإسنادٍ حسن.

965. హజ్రత్ అబూ సాలబా ఖుషనీ (రజి) కథనం : ప్రయాణంలో ఎక్కడ యినా మజిలీ చేసినప్పుడు ప్రయాణీకుల బృందంలోని వారందరూ విడిపోయి వేర్వేరు లోయల్లోకి, కనుమల్లోకి వెళ్ళిపోయేవారు. ఒకసారి దైవప్రవక్త (సల్లం) ప్రయాణీకులు అలా విడిపోవటం చూసి, "ఈ విధంగా మీరు తలా ఓ కనుమలోకి, లోయలోకి వెళ్ళటం షైతాన్ చేష్ట" అని అన్నారు.

అప్పట్నుంచి ఆయన అనుచరులు ఎక్కడ మజిలీ చేసినా అందరూ ఒకేచోట కలిసి ఉండేవారు.

*(అబూ దావూద్-హసన్)*

*(సుననె అబూ దావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ప్రయాణంలో వీలైనంతవరకు తోటిప్రయాణీకులంతా కలిసి ఉండటం, మార్గమధ్యంలో ఎక్కడైనా మజిలీ చేయదలిస్తే అందరూ ఒకేచోట ఆగటం ఉత్తమం. ఎందుకంటే మధ్యలో ఎవరికైనా ఏదయినా ప్రమాదం జరిగితే వెంటనున్నవారు అతన్ని రక్షించగల్గుతారు. అలాగాకుండా చెట్టుకొకరు, పుట్టకొకరు అయిపోతే వారిలో ఎవరైనా ప్రమాదం బారిన పడవచ్చు. అందుకే దైవప్రవక్త (సల్లం) ప్రయాణీకులు విడివిడిగా ఉండటాన్ని అసహ్యించుకున్నారు.

٩٦٦ ـ وعَنْ سَهْلِ بنِ عمرو ـ وَقِيلَ: سَهْلِ بنِ الرَّبِيعِ بنِ عَمْرٍو الأَنْصَارِيِّ المَعْرُوفِ بِابْنِ الحَنْظَلِيَّةِ، وَهُوَ مِنْ أَهْلِ بَيْعَةِ الرِّضْوَانِ ـ رَضِيَ الله عنه، قالَ: مَرَّ رسولُ اللهِ ﷺ بِبَعِيرٍ قَدْ لَحِقَ ظَهْرُهُ بِبَطْنِهِ، فقال: «اتَّقُوا اللهَ في هٰذه

966. హజ్రత్ సహ్ల్ బిన్ అమర్ లేదా సహ్ల్ బిన్ రబీ బిన్ అమ్ర్ అన్సారీ ఉరఫ్ ఇబ్నె హంజలియ్యా - రిజ్వాన్ ప్రమాణంలో పాల్గొన్నవారిలో ఈయన ఒకరు- చేసిన కథనం : పొట్ట వీపుకు అతుక్కుపోయినట్లుగా బాగా బక్కచిక్కి ఉన్న ఒక ఒంటె సమీపం నుండి దైవప్రవక్త (సల్లం) వెళ్తూ దాని పరిస్థితి చూసి, "నోరులేని ఈ జంతువుల విషయంలో అల్లాహ్‌కు

البَهائم المُعجَمة، فَارْكَبُوهَا صَالِحَةً، وَكُلُوهَا صَالِحَةً» رواه أبو داود بإسناد صحيح.

భయపడండి. అవి ఆరోగ్యంగా ఉన్నప్పుడే వాటిమీద స్వారీ చేయండి. ఇంకా అవి ఆరోగ్యంగా ఉన్నప్పుడే వాటి మాంసాన్ని భుజించండి" అని చెప్పారు. (అబూ దావూద్ దీనిని దృఢమైన ఆధారాలతో వెలికితీశారు)

*(సుననె అబూ దావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

నోరులేని జంతువుల పట్ల దయతో వ్యవహరించాలని ఈ హదీసులో తాకీదు చేయబడింది. నోరులేని జంతువులు తమకు ఆకలి వున్నా, తమమీద శక్తికి మించిన బరువు మోపబడినా ఆ బాధను భరించటం తప్ప వాటికి గత్యంతరం లేదు. అవి తమ బాధను చెప్పుకోలేవు. అంచేత మనుషులే వాటి బాధను అర్థం చేసుకొని దయతో వ్యవహరించాలి. ఈ విషయంలో నిర్లక్ష్యం వహిస్తే, ప్రళయదినాన దేవుని సన్నిధిలో జంతువుల పట్ల తమ వ్యవహారం గురించి సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది.

٩٦٧ - وَعَنْ أَبِي جعفرٍ عبدِ اللهِ بن جعفرٍ رَضِيَ الله عنهما قال: أَرْدَفَنِي رسولُ الله ﷺ ذاتَ يَوْمٍ خَلْفَهُ، وَأَسَرَّ إِلَيَّ حَدِيثاً لا أُحَدِّثُ بِهِ أَحَداً مِنَ النَّاسِ، وَكَانَ أَحَبَّ مَا اسْتَتَرَ بِهِ رَسولُ الله ﷺ لِحَاجَتِهِ هَدَفٌ أَوْ حَائِشُ نَخْلٍ. يَعْنِي: حَائِطَ نَخْلٍ. رواه مسلم هكذا مختصراً.

967. హజ్రత్ అబూ జాఫర్ అబ్దుల్లాహ్ బిన్ జాఫర్ (రజి) కథనం : ఓ రోజు దైవప్రవక్త (సల్లం) నన్ను తన వెనక వాహనం మీద కూర్చోబెట్టుకున్నారు. ఆ సమయంలో ఆయన నాతో రహస్యంగా ఓ విషయం చెప్పారు. ఆ విషయం నేను ఎవరికీ చెప్పను. దైవప్రవక్త (సల్లం) మలమూత్ర విసర్జన సమయంలో ఏదయినా ఎత్తయిన వస్తువు (గోడ, దిబ్బలాంటి) లేక ఖర్జూర చెట్ల పొదలు తనకు అడ్డు ఉండటాన్ని ఆయన ఎక్కువగా ఇష్టపడేవారు.

(ఇమామ్ ముస్లిం (రహ్మాలై) ఈ హదీసును ఇలాగే సంక్షిప్తంగా వివరించారు)

وزاد فيه البَرْقاني بإسناد مسلم بعد قوله: حَائِشُ نَخْلٍ: فَدَخَلَ حَائِطاً لِرَجُلٍ مِنَ الأنْصار، فإذا فيهِ جَمَلٌ، فَلَمَّا رَأَى رسولَ اللهِ ﷺ، جَرْجَرَ وَذَرَفَتْ عَيْنَاهُ، فَأَتَاهُ النَّبِيُّ ﷺ، فَمَسَحَ سَرَاتَهُ - أَيْ: سَنَامَهُ - وَذِفْرَاهُ فَسَكَنَ؛ فقال: «مَنْ رَبُّ هذا الجَمَلِ، لِمَنْ هٰذَا الجَمَلُ؟» فَجَاءَ فَتًى مِنَ الأنْصَارِ فقالَ: هذا لي يا رسولَ الله! فقالَ: «أَفَلا تَتَّقِي اللهَ في هذه البَهِيمَةِ الَّتِي مَلَّكَكَ اللهُ إيَّاهَا؟ فَإنَّهُ يَشْكُو إِلَيَّ أنَّكَ تُجِيعُهُ وَتُدْئِبُهُ». ورواه أبو داود كرواية البَرْقَاني. قولهُ: «ذِفْرَاه» هو بكسر الذال المعجمة وإسكان الفاء، وهو لفظٌ مفردٌ مؤنثٌ. قالَ أَهلُ اللُّغةِ: الذِّفْرَى: المَوْضِعُ الَّذي يَعْرَقُ مِنَ البَعِيرِ خَلْفَ الأُذُنِ، وقوله: «تُدْئِبُهُ» أَيْ: تُتْعِبُهُ.

బుర్‌ఖానీ గారు ముస్లిం పరంపర ఆధారంగానే ఈ హదీసును వెలికితీశారు. అందులో అదనంగా ఈ వాక్యాలు ఉన్నాయి : దైవప్రవక్త (సల్లం) ఓ అన్సారీ వ్యక్తికి చెందిన తోటలోకి ప్రవేశించారు. అక్కడ ఆయనకు ఒక ఒంటె కనిపించింది. దైవప్రవక్త (సల్లం)ను చూడగానే ఆ ఒంటె ఒక్కసారిగా అరవటం మొదలుపెట్టింది. దాని కళ్ళవెంబడి నీళ్ళు కారసాగాయి. ఆయన ఆ ఒంటె దగ్గరికి వెళ్ళి దాని మూపురాన్ని, చెవి వెనుక భాగాన్ని నిమిరారు. దాంతో ఆ ఒంటె కుదుటపడింది.

ఆ తర్వాత ఆయన (అక్కడున్న వారిని), "దీని యజమాని ఎవరు?" అని అడిగారు. ఓ అన్సారీ యువకుడు ముందుకు వచ్చి, "దైవప్రవక్తా! ఈ ఒంటె నాదే" అని అన్నాడు. అప్పుడాయన (ఆ యువకుని మీద చిరుకోపం వ్యక్తం చేస్తూ), "నీవు దీని విషయంలో - దీన్ని నీకు వశపరచిన దైవానికి భయపడట్లేదా? నువ్వు తనను ఆకలితో మాడ్చుతున్నావనీ, (శక్తికి మించిన పని తీసుకొని) తనకు అలసట కలిగిస్తున్నావని ఇది నాకు ఫిర్యాదు చేస్తోంది" అని అన్నారు.

## ముఖ్యాంశాలు

పైన పేర్కొనబడిన హదీసుకు సదరు అధ్యాయంతో ఉన్న సంబంధమేమిటో హదీసు ప్రారంభంలోనే ప్రస్తావించబడింది. వాహనంగా ఉపయోగిస్తున్న పశువులో గనక సత్తువ ఉంటే

స్వారీ చేసేవ్యక్తి మరో వ్యక్తిని తనవెనక కూర్చోబెట్టుకోవచ్చని చెప్పడమే ఈ హదీసును సదరు అధ్యాయం క్రింద ప్రస్తావించటంలోని ఉద్దేశ్యం. దీనిద్వారా బోధపడే మరో విషయం ఏమిటంటే, వాహన పశువుకు మేత తక్కువ పెట్టి, ఎక్కువ పని చేయించకూడదు. అలా చేయటం అత్యాచారం క్రిందికి వస్తుంది. పశువుకు కడుపునిండా మేతపెట్టి సముచితరీతిలో దానిపై భారం వేయాలి. నోరులేని మూగజీవాల పట్ల దయతో వ్యవహరించాలి.

968. హజ్రత్ అనస్ (రజి) కథనం : మేము ప్రయాణంలో ఎక్కడయినా మజిలీ చేయదలచుకున్నప్పుడు వాహనాలపై నుంచి ఆసనాలను దించేదాకా నఫిల్ నమాజులు చేసే వాళ్ళం కాము. (అబూ దావూద్ దీన్ని ముస్లిం షరతుల ననుసరించి వెలికి తీశారు).

٩٦٨ ـ وعن أنسٍ رَضيَ اللهُ عَنْهُ قال: كُنَّا إذا نَزَلْنَا مَنْزِلًا، لا نُسَبِّحُ حَتَّى نَحُلَّ الرِّحَالَ. رواه أبو داود بإسناد على شرط مسلم. وقوله: «لا نُسَبِّحُ» أَيْ: لا نُصَلِّي النَّافِلَةَ، وَمعناه: أَنَّا ـ مَعَ حِرْصِنَا عَلى الصَّلاةِ ـ لا نُقَدِّمُهَا عَلى حَطِّ الرِّحَالِ وَإِرَاحَةِ الدَّوابِّ.

*(సుననె అబూ దావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దైవప్రవక్త అనుచరులు ఎక్కడయినా మజిలీ చేసినప్పుడు అన్నిటికన్నా ముందు వాహనాలపై మోపబడిన బరువును క్రిందికి దించేవారు. ఆ తర్వాతే నమాజులు చేసేవారు. దాంతో ఆ వాహన పశువులు కాసేపు సేద తీర్చుకోగలిగేవి. నోరులేని జంతువులు ఒక వైపు బరువు క్రింద నలిగిపోతూ ఉంటే వాటిని పట్టించుకోకుండా నఫిల్ ఆరాధనలు చేస్తే దేవుడు ప్రసన్నుడు కాడని తెలియపరచటమే ఈ హదీసు ఉద్దేశ్యం. ప్రయాణంలో ఉన్నప్పుడు నఫిల్ నమాజులు చేయటం అభిలషణీయమన్న విషయం కూడా ఈ హదీసు ద్వారా బోధపడుతోంది.

169వ అధ్యాయం

# ١٦٩ - بَابُ إِعَانَةِ الرَّفِيقِ

## తోటి ప్రయాణీకులకు సహాయం చేయటం

في الباب أحاديثُ كثيرة تقدمتْ كحديثِ: «وَاللهُ في عَوْنِ العَبْدِ مَا كانَ العَبْدُ في عَوْنِ أَخِيهِ». وحديث: «كلُّ مَعْرُوفٍ صَدَقَةٌ» وَأَشْبَاهِهِمَا.

ఈ అధ్యాయానికి సంబంధించిన హదీసులు కొన్ని ఇంతకు ముందు కూడా వచ్చాయి. ఉదాహరణకు : దాసుడు తోటి దాసునికి సహాయం చేస్తున్నంతకాలం దేవుడు అతనికి సహాయం చేస్తుంటాడు" అనే హదీసు (247వ హదీసు) "ప్రతి మంచి పని పుణ్యమే" నన్న హదీసు (134వ హదీసు) మొదలగునవి. మరికొన్ని హదీసుల్ని ఇక్కడ పేర్కొనడం జరుగుతోంది.

٩٦٩ - وعن أبي سعيد الخُدْرِيِّ رَضِيَ اللهُ عنهُ قال: بَيْنَما نَحْنُ في سَفَرٍ إذ جَاءَ رَجُلٌ عَلى رَاحِلَةٍ لهُ، فَجَعَلَ يَصْرِفُ بَصَرَه يَميناً وَشِمَالاً، فقالَ رسولُ اللهِ ﷺ: «مَنْ كانَ مَعَهُ فَضْلُ ظَهْرٍ؛ فَلْيَعُدْ بِهِ عَلى مَنْ لا ظَهْرَ لهُ، وَمَنْ كَانَ لَهُ فَضْلُ زَادٍ؛

969. హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ(రజి) కథనం : మేమొక ప్రయాణంలో ఉండగా ఒక వ్యక్తి మా దగ్గరికి తన వాహనం మీద వచ్చాడు. వచ్చీరాగానే అతను కుడి ఎడమల వైపు చూడ సాగాడు. అప్పుడు దైవప్రవక్త (సల్లం) ఇలా ఉపదేశించారు : ఎవరి దగ్గర యినా అదనంగా మరో వాహనం ఉంటే, వారు దాన్ని అసలు వాహనమే లేనివారికి పరోపకార భావంతో ఇచ్చి వేయాలి. ఎవరి దగ్గరయినా అవసరానికి మించి ప్రయాణసామగ్రి ఉంటే, వారు అసలు ప్రయాణసామగ్రి లేనివారికి దాన్ని పరోపకార భావంతో ఇచ్చి వేయాలి."

ఆ సందర్భంలో ఆయన ఇంకా ఎన్నో రకాల సొమ్మును గురించి ప్రస్తావించి,

فَلْيَعُدْ بِهِ عَلى مَنْ لا زَادَ لَهُ» فَذَكَرَ مِنْ أَصْنافِ المالِ ما ذَكَرَهُ، حَتى رَأَيْنَا أَنَّهُ لا حَقَّ لأحَدٍ منا في فَضْلٍ. رواه مسلم.

అలాగే చెప్పారు. ఆ మాటలు వింటుంటే మా అదనపు సొమ్ము మీద మాకు అసలు హక్కు లేదేమోనని పించింది మాకు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని సంప్రాప్త వస్తువుల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఈ రోజుల్లో బ్యాంకులు, ఇతర ఆర్థిక సంస్థలే స్వయంగా ప్రజలకు ఆర్థిక సహాయం చేస్తామని వెంటపడుతున్నాయి. ఇన్సూరెన్స్, హౌస్ బిల్డింగ్, ఫైనాన్స్ మొదలగు వాటికి సంబంధించిన ఆర్థిక సంస్థల రుణమేళాలు సర్వత్రా మార్మోగిపోతున్నాయి. కానీ ఇవన్నీ పేరుకు మాత్రమే సహాయ సంస్థలు. వాస్తవానికి వీటి ఆర్థిక విధానాలు పేదవాడి రక్తాన్ని పీల్చి పిప్పిచేసి, ధనికుల జేబులు నింపే విధంగా ఉంటాయి. దీనికి విరుద్ధంగా ఇస్లాం ధర్మం చిత్తశుద్ధితో కూడిన పరస్పర సహకారభావాన్ని పెంపొందిస్తోంది. ఎవరి దగ్గరయినా అవసరానికి మించిన వస్తువేదయినా ఉంటే దాన్ని సమాజంలోని నిరుపేదలకు, అభాగ్యజీవులకు కేవలం పరోపకార భావంతో, ప్రతిఫలాన్ని ఆశించకుండా ఇచ్చివేయాలని ఆదేశిస్తోంది. చట్టరీత్యా ఇదో నైతిక ఆదేశమే. కాని ముస్లింలు గనక తామందరూ ఒకే శరీర భాగాల్లాంటి వారమన్న ఐక్యతా భావాన్ని పుణికిపుచ్చుకున్నప్పుడు ఈ నైతిక ఆదేశం కూడా ఎన్నో అనూహ్యమైన సామాజిక సత్పరిణా మాలకు దారితీస్తుంది. అంతేకాదు, ఈ నైతిక ఆదేశాన్ని నిర్వర్తించినప్పుడే మానవుల విశ్వాసం పరిపూర్ణమవుతుంది. అంచేత నైతిక పరిపూర్ణతను కోరుకోనివారు ఈ నైతిక ఆదేశం పట్ల అశ్రద్ధ వహించినా, విశ్వాస పరిపూర్ణత కోసం తాపత్రయపడే సజ్జనులు మాత్రం దీన్ని ఏ దశలోనయినా నిర్లక్ష్యం చేయలేరు.

٩٧٠ - وعَنْ جابرٍ رضيَ اللهُ عنهُ، عَنْ رسولِ اللهِ ﷺ، أَنَّهُ أَرَادَ أَنْ يَغْزُوَ، فقال: يَا مَعْشَرَ المُهَاجِرِينَ وَالأَنْصارِ! إنَّ مِنْ إِخْوَانِكُمْ قَوْماً، لَيْسَ لَهُمْ مَالٌ، وَلا عَشِيرَةٌ، فَلْيَضُمَّ أَحَدُكُمْ إِلَيْهِ الرَّجُلَيْنِ، أَوِ الثَّلاثَةَ، فَمَا لأَحَدِنَا مِنْ ظَهْرٍ يَحْمِلُهُ إلا

970. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఒకసారి యుద్ధం చేయాలనుకున్నప్పుడు (ప్రజల మధ్య) ఈ విధంగా ప్రకటించారు : ముహాజిర్లారా! అన్సార్లారా! మీ సోదరుల్లో కొంతమంది దగ్గర ధనం లేదు. వారికి 'నా' అన్నవారెవరూ లేరు. కనుక మీలోని ప్రతి ఒక్కరూ తమ వెంట ఇద్దర్నిగాని, ముగ్గుర్నిగాని, (తమ వాహనాల మీద ఎక్కించుకొని) బయలుదేరండి.

ఆ ప్రకటన విన్న తర్వాత (యుద్ధానికి బయలుదేరినప్పుడు) మాలోని వాహన

عُقبةٌ كعُقبةِ، يَعْني: أحدهم. قال: فضممتُ إليَّ اثنين أو ثلاثةً ما لي إلَّا عُقبةٌ كعُقبةِ أحدهم من جملي. رواه أبو داود.

దారులందరూ తమ వాహనాలపై ఒకరి తర్వాత మరొకరు ఎక్కి ప్రయాణించ సాగారు. (అంటే ప్రతి వాహనందారుడు తన వెంట ఇద్దర్నిగాని ముగ్గుర్నిగాని తీసుకొని బయలుదేరాడు. వాళ్ళందరూ ఒకరి తర్వాత మరొకరు వంతుల వారీగా వాహనం మీద ఎక్కిపోయేవారు).

ఆ సమయంలో నేను కూడా ఇద్దర్నో లేక ముగ్గుర్నో నా వాహనం మీద తీసు కెళ్ళాను. ప్రయాణంలో నా ఒంటెమీద నా వంతు కూడా వారిద్దరి వంతులాగే గడిచేది. *(అబూ దావూద్)*

*(సుననె అబూ దావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

٩٧١ ـ وعنه قال: كان رسولُ الله ﷺ يَتخلَّفُ في المَسيرِ، فيُزجي الضَّعيفَ ويُردِفُ ويَدعو له. رواه أبو داود بإسناد حسن.

971. హజ్రత్ జాబిర్ (రజి) గారే చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) ప్రయాణంలో నడిచినప్పుడు అందరికన్నా వెనుక ఉండి బలహీనులకు ఊతమిచ్చి నడిపించేవారు. లేదా వారిని వాహనం మీద తన వెనుక కూర్చోబెట్టుకునేవారు. వారికోసం (దైవాన్ని) ప్రార్థించేవారు.

*(అబూ దావూద్ - హసన్)*

*(సుననె అబూ దావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

సైనికాధికారి లేక ఒక బృందానికి నాయకుడైనవాడు అందరికంటే ముందు కాకుండా అందరికంటే వెనుక బయలుదేరాలని పై హదీసు ద్వారా బోధపడుతోంది. నాయకుడు వెనుక ఉంటే బలహీనులకు దన్నుగా ఉంటాడు. వనరులు, ఆయుధాలు లేనివారికి వనరులు, ఆయుధాలు సమకూర్చగల్గుతాడు. లేదా కనీసం వారికోసం ప్రార్థన అయినా చేయగల్గుతాడు. ఎందుకంటే నాయకుని ప్రార్థన ఫలితంగా అనుచరుల అవసరాలు తీరటంలోనూ ఆశ్చర్యం లేదు. అయితే పరిస్థితుల అవసరాన్ని బట్టి ఈ పద్ధతిని మార్చుకోనూవచ్చు. కొన్ని సందర్భాల్లో నాయకుడు ముందు ఉండటం సమంజసంగా ఉంటుంది. మరికొన్ని సందర్భాల్లో వెనుక ఉండటం సముచితంగా ఉంటుంది. నాయకుడు ఈ విషయంలో విజ్ఞతతో వ్యవహరించాలి.

## 170వ అధ్యాయం

# ١٧٠ ـ بَابُ مَا يَقُولُ إِذَا رَكِبَ دَابَّتَهُ لِلسَّفَرِ

# వాహనమెక్కి ప్రయాణానికి బయలుదేరినప్పుడు పఠించవలసిన దుఆలు

قال الله تعالى: ﴿وَجَعَلَ لَكُم مِّنَ الْفُلْكِ وَالْأَنْعَامِ مَا تَرْكَبُونَ ﴿١٢﴾ لِتَسْتَوُوا عَلَىٰ ظُهُورِهِ ثُمَّ تَذْكُرُوا نِعْمَةَ رَبِّكُمْ إِذَا اسْتَوَيْتُمْ عَلَيْهِ وَتَقُولُوا سُبْحَانَ الَّذِي سَخَّرَ لَنَا هَٰذَا وَمَا كُنَّا لَهُ مُقْرِنِينَ ﴿١٣﴾ وَإِنَّا إِلَىٰ رَبِّنَا لَمُنقَلِبُونَ﴾ [الزخرف: ١٢ـ١٤].

దివ్య ఖుర్ఆన్‌లో అల్లాహ్ ఇలా సెల విచ్చాడు:

"మీ కొరకు పడవలనూ, పశువులనూ వాహనాలుగా చేసినవాడు ఆయనే కదా! మీరు వాటి వీపులపై ఎక్కడానికి; కనుక మీరు వాటి మీద కూర్చున్నప్పుడు మీ ప్రభువు ఉపకారాన్ని జ్ఞాపకం చేసుకొని ఇలా అనండి, "వీటిని మాకు వశపరచినవాడు పరిశుద్ధుడు. లేకపోతే, వాటిని వశపరచుకునే శక్తి మాకు లేదు. నిశ్చయంగా ఏదో ఒకరోజున మేము (కూడా) మా ప్రభువు వైపుకు మరలిపోవలసి ఉన్నది."

*(అజ్ జుఖ్‌రుఫ్ : 12 - 14)*

٩٧٢ ـ وعن ابنِ عمرَ رَضِيَ الله عنهما، أَنَّ رسولَ الله ﷺ، كانَ إذا استَوَى عَلى بَعِيرِه خَارِجاً إلى سَفَرٍ؛ كَبَّرَ ثَلاثاً، ثُمَّ قالَ: «سُبْحَانَ الَّذِي سَخَّرَ لَنَا هٰذَا وَمَا كُنَّا لَهُ مُقرِنِينَ، وَإِنَّا إِلى رَبِّنَا لَمُنْقَلِبُونَ. اللَّهُمَّ! إِنَّا نَسْأَلُكَ فِي سَفَرِنَا هٰذَا البِرَّ وَالتَّقْوَى، وَمِنَ العَمَلِ مَا تَرْضَى. اللَّهُمَّ! هَوِّنْ عَلَيْنَا سَفَرَنَا هٰذَا وَاطْوِ عَنَّا

972. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) తన ఒంటెపై కూర్చొని ప్రయాణానికి బయలుదేరినప్పుడు మూడుసార్లు "అల్లాహు అక్బర్" అని చెప్పి ఈ విధంగా ప్రార్థించేవారు -

సుబ్‌హానల్లజీ సఖ్ఖరలనా హాజా వమా కున్నా లహూ ముఖ్రినీన్ వ ఇన్నా ఇలా రబ్బినా లమున్‌ఖలిబూన్. అల్లాహుమ్మ ఇన్నా నస్అలుక ఫీ సఫరినా హాజల్ బిర్ర వత్తఖ్వా వమినల్ అమలి మా తర్‌జా అల్లాహుమ్మ హవ్విన్ అలైనా సఫరనా హాజా వ అత్వి అన్నా బూదహూ.

بُعْدَهُ. اللَّهُمَّ! أَنْتَ الصَّاحِبُ فِي السَّفَرِ، وَالخَلِيفَةُ فِي الأَهْلِ. اللَّهُمَّ! إِنِّي أَعُوذُ بِكَ مِنْ وَعْثَاءِ السَّفَرِ، وَكَآبَةِ المَنْظَرِ، وَسُوءِ المُنْقَلَبِ فِي المَالِ وَالأَهْلِ وَالوَلَدِ» وَإِذَا رَجَعَ قَالَهُنَّ وَزَادَ فِيهِنَّ: «آيِبُونَ تَائِبُونَ عَابِدُونَ لِرَبِّنَا حَامِدُونَ» رواه مسلم. معنى «مُقْرِنِينَ» مُطِيقِينَ. «والوَعْثَاءُ» بفتح الواوِ وإسكانِ العين المهملة وبالثاءِ المثلثة وبالمد، وَهِيَ: الشِّدَّة. و«الكَآبَة» بِالمَدِّ، وَهِيَ: تَغَيُّرُ النَّفْسِ مِنْ حُزنٍ وَنحوه. «وَالمُنْقَلَبُ»: المَرْجِعُ.

అల్లాహుమ్మ అంతస్సాహిబు ఫిస్సఫరి వల్ ఖలీఫతు ఫిల్ అహ్‌లి. అల్లాహుమ్మ ఇన్నీ అవూజు బిక మిన్ వాసాయిస్సఫరి వకఆబతిల్ మంజరి వ సూయిల్ ముంఖలబి ఫిల్‌మాలి వల్ అహ్లి."

(అనువాదం : ఈ వాహనాన్ని మాకు వశ పరచినవాడు పరిశుద్ధుడు. ఆయన వశ పరచి ఉండకపోతే, దీన్ని మేము వశ పరచుకునే అంతటి వాళ్ళం కాము. ఏదో ఒకనాడు మేము మా ప్రభువు వైపుకే మరలిపోవలసినవారమే. దేవా! ఈ ప్రయాణంలో మాకు మంచిని, భక్తిని, ఇంకా నీవు ఇష్టపడే పనుల్ని చేసే సద్బుద్ధిని ప్రసాదించమని నిన్ను కోరుతున్నాం. దేవా! మా ప్రయాణాన్ని సులభతరం చెయ్యి. దీని దూరాన్ని కుదించు. స్వామీ! నీవే మాకు రక్షకుడవు, మేము వదలి వెళ్తున్న మా ఇంటివారలకు సంరక్షకుడవూ నీవే. దేవా! నేను ప్రయాణ ప్రయాసల నుంచి, చెడు దృశ్యాల నుంచి, ప్రయాణం నుండి తిరిగి వచ్చినప్పటికి నా ఇంట్లో, నా ధనంలో, నా సంతానంలో చెడు పరిణామాలు చోటు చేసుకోవటం నుంచి నీ శరణు వేడుతున్నాను).

తిరుగు ప్రయాణంలోనూ దైవప్రవక్త (సల్లం) ఈ ప్రార్థనే చేసేవారు. అయితే అందులో అదనంగా ఈ వాక్యాలు పలికేవారు:

'ఆయిబూన, తాయిబూన, ఆబిదూన లిరబ్బినా హామిదూన"

(మేము ప్రయాణం నుంచి తిరిగొస్తున్న వాళ్ళం. దైవం వైపు మరలేవాళ్ళం. ఆయన్ని ఆరాధించేవాళ్ళం. మా ప్రభు వుని స్తుతించేవాళ్ళం). *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

పై హదీసులో పేర్కొనబడిన 'దుఆ' ఎంతో భావగర్భితమైనది. ప్రయాణంలో మనిషికి రెండు రకాల భయాలుంటాయి. ఒకవైపు తనకు ప్రయాణ విపత్తులు పొంచివుంటాయి. మరోవైపు తన పరోక్షంలో తన కుటుంబీకుల రక్షణ సమస్య కూడా అతన్ని దారిపొడుగునా పీడిస్తూ ఉంటుంది. పైన పేర్కొనబడిన దుఆలో ఆ రెండు సమస్యల పరిష్కారం కోసం ఎంతో సుందరమైన వాక్యాలతో దైవసన్నిధిలో రక్షణ ప్రార్థన చేయటం జరిగింది. తనకు, తన ఇంటివారికి అల్లాహ్ రక్షకుడిగా ఉంటే ఇక వారికి ఎవరు ఏం హాని తలపెట్టగలరు? అందుకని ప్రయాణానికి బయలుదేరినప్పుడు, ప్రయాణం నుంచి తిరిగొచ్చినప్పుడు - రెండు సందర్భాల్లోనూ ఈ దుఆ చేసుకోవాలి. తిరుగు ప్రయాణంలో "ఆయిబూన, తాయిబూన....." వాక్యాలు అదనంగా పలకాలి.

٩٧٣ ـ وعن عبد الله بن سَرْجِسَ رَضِيَ اللهُ عنهُ قالَ: كانَ رسولُ اللهِ ﷺ إذا سَافَرَ يَتَعَوَّذ مِنْ وَعْثاءِ السفَر، وَكآبَةِ المُنْقَلَب، وَالحَوْر بَعْدَ الكَوْنِ، وَدَعْوَةِ المَظْلُوم، وَسُوءِ المَنْظَرِ في الأَهْلِ وَالمَالِ. رواه مسلم.

973. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ సర్జిస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ప్రయాణానికి బయలుదేరినప్పుడు ప్రయాణంలో ఎదురయ్యే ప్రయాసల నుంచి, చెడు స్థితిలో తిరిగిరావటం నుంచి, స్థయిర్యం సడలి చాంచల్యం వైపుకు మరలించబడటం నుంచి, బాధితుని శాపానికి గురవటం నుంచి, ఆలుబిడ్డలు, సిరిసంపదల దయనీయ దృశ్యాలు చూడటం నుంచి దైవాన్ని శరణువేడేవారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం, సుననె అబూ దావూద్‌లోని ప్రార్థనల ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఈ హదీసులో 'హౌర్ - కౌన్' అనే రెండు పదాలు వాడబడ్డాయి. హౌర్ అంటే తలపాగా

మడత విప్పటం. కౌన్ అంటే తలపాగాకు మడతవేయటం అని అర్థం. ఏదయినా వస్తువుని బాగుచేసిన తర్వాత అది పాడయిపోయిందని చెప్పటానికి అరబీ భాషలో తలపాగా మడత విప్పిన తర్వాత తిరిగి మడతపడిందనే సామెత వాడతారు. ఈ సామెత అభివృద్ధి నుండి పతనం వైపుకు, స్థిరత్వం నుండి అస్థిరత్వం వైపుకు మరలించబడటం అనే అర్థాన్నిస్తుంది. పై హదీసులో సందర్భాన్నిబట్టి మేము దాన్ని, "స్థయిర్యం సడలి చాంచల్యం వైపుకు మరలించ బడటం" అని అనువదించాము. ప్రయాణావస్థలో మనిషికి అతని విశ్వాస స్థయిర్యాన్ని దెబ్బతీసే పరిస్థితులు ఎదురుకావచ్చు. అందుకే దైవప్రవక్త (సల్లం) వాటినుండి శరణువేడుకునేవారు.

٩٧٤ ـ وعن عَلِيِّ بن رَبِيعَةَ قال: شَهِدْتُ عليَّ بن أَبي طالب رَضيَ اللهُ عنهُ أُتِيَ بِدَابَّةٍ لِيَرْكَبَها، فَلَمَّا وَضعَ رِجْلَهُ في الرِّكَابِ قال: بِسْمِ اللهِ، فَلَمَّا اسْتَوَى عَلى ظَهْرِهَا قال: الحَمْدُ للهِ الَّذِي سَخَّرَ لَنَا هٰذَا، وَمَا كُنَّا لَهُ مُقْرِنِينَ، وَإِنَّا إِلى رَبِّنَا لَمُنْقَلِبُونَ، ثُمَّ قالَ: الحَمْدُ للهِ، ثَلاثَ مَرَّاتٍ، ثُمَّ قال: اللهُ أَكْبَرُ، ثَلاثَ مَرَّاتٍ، ثُمَّ قالَ: سُبْحَانَكَ إِنِّي ظَلَمْتُ نَفْسِي فَاغْفِرْ لِي إِنَّهُ لا يَغْفِرُ الذُّنُوبَ إِلَّا أَنْتَ، ثُمَّ ضَحِكَ، فَقِيلَ: يَا أَمِيرَ المُؤْمِنِينَ! مِنْ أَيِّ شَيْءٍ ضَحِكْتَ؟ قال: رَأَيْتُ النبيَّ ﷺ فَعَلَ كَمَا فَعَلْتُ، ثُمَّ ضَحِكَ، فقلتُ:

974. హజ్రత్ అలీ బిన్ రబీఅ (రజి) కథనం : ఒకసారి నేను హజ్రత్ అలీ బిన్ అబూ తాలిబ్ (రజి) దగ్గరికి వెళ్ళాను. స్వారీ చేయటంకోసం ఆయనకు ఒక జంతువాహనం సమర్పించబడింది. ఆయన 'బిస్మిల్లాహ్' అంటూ వాహనం రికాబుపై కాలుపెట్టారు. తర్వాత వాహనం వీపు మీద ఎక్కి కూర్చున్నప్పుడు ఈ విధంగా ప్రార్థించారు:

అల్‌హమ్దులిల్లాహిల్లజీ సఖ్ఖరలనా హాజా వమాకున్నా లహూ ముఖ్రినీన్ వ ఇన్నా ఇలా రబ్బినా లమున్ ఖలిబూన్.

- ఆ తర్వాత ఆయన మూడుసార్లు 'అల్‌హమ్దులిల్లాహ్', ఇంకో మూడుసార్లు 'అల్లాహు అక్బర్' పఠించారు. తర్వాత ఈ విధంగా ప్రార్థించారు:

"సుబ్‌హానక ఇన్నీ జలమ్‌తు నఫ్సీ ఫగ్ఫిర్‌లీ, ఇన్నహూ లా యగ్ఫిరుజ్జునూబ ఇల్లా అంత."

(ఓ అల్లాహ్! నీవు పవిత్రుడవు. వాస్తవానికి నేనే నా ఆత్మకు అన్యాయం చేసుకున్నాను. కనుక నన్ను క్షమించు. నిజానికి నీవు తప్ప పాపాలను క్షమించే వాడెవడూ లేడు).

يا رسولَ اللهِ مِنْ أَيِّ شَيْءٍ ضَحِكْتَ؟ قالَ: «إِنَّ رَبَّكَ سُبْحَانَهُ يَعْجَبُ مِنْ عَبْدِهِ إِذَا قَالَ: اغْفِرْ لِي ذُنُوبِي، يَعْلَمُ أَنَّهُ لا يَغْفِرُ الـذُّنُـوبَ غَيْـرِي». رواه أبـو داود، والترمذي وقال: حديثٌ حسنٌ، وفي بعض النُّسَخ: حسنٌ صحيحٌ. وهذا لفظ أَبي داود.

అందుకాయన "ఇప్పుడు నేను చేసినట్లుగా దైవప్రవక్త (సల్లం) చేస్తుండటం నేను చూశాను" అని అన్నారు. ఆ తర్వాత కాసేపటికి ఆయన మళ్ళీ నవ్వారు. "విశ్వాసుల నాయకా! తమరు ఇప్పుడు ఎందుకు నవ్వినట్టు?" అని ఎవరో అడగ్గా, అప్పుడాయన ఇలా చెప్పారు: దేవుని దాసుడు దైవాన్ని ప్రార్థిస్తూ, "దేవా! నా పాపాలను క్షమించు" అని అన్నప్పుడు మీ ప్రభువు చాలా సంతోషిస్తాడు. నేను తప్ప క్షమించేవాడెవడూ లేడని ఈ నా దాసుడు తెలుసుకున్నాడు అని అంటాడు.

*(సుననె అబూ దావూద్‌లోని జిహాద్ ప్రకరణం, సుననె తిర్మిజీలోని ప్రార్థనల అధ్యాయాలు)*



## 171వ అధ్యాయం

## ١٧١ - بَابُ تَكْبِيرِ الْمُسَافِرِ إِذَا صَعِدَ الثَّنَايَا وَشِبْهَهَا وَتَسْبِيحِهِ إِذَا هَبَطَ الأَوْدِيَةَ وَنَحْوَهَا، وَالنَّهْيِ عَنِ الْمُبَالَغَةِ بِرَفْعِ الصَّوْتِ بِالتَّكْبِيرِ وَنَحْوِهِ

## ప్రయాణంలో మెరక ప్రాంతాలకు వెళ్తున్నప్పుడు 'అల్లాహు అక్బర్' అని అనాలి, పల్లపు ప్రాంతాలలో దిగుతున్నప్పుడు 'సుబ్‌హానల్లాహ్' అని అనాలి, 'అల్లాహు అక్బర్ సుబ్‌హానల్లాహ్' అని మరీ బిగ్గరగా అనకూడదు

٩٧٥ - عن جابرٍ رَضيَ اللهُ عنه قال: كُنَّا إذَا صَعِدْنَا كَبَّرْنَا، وَإِذَا نَزَلْنَا سَبَّحْنَا. رواه البخاري.

975. హజ్రత్ జాబిర్ (రజి) కథనం : మేము ప్రయాణంలో ఎత్తయిన ప్రదేశాలకు వెళ్తున్నప్పుడు 'అల్లాహు అక్బర్' అంటూ వెళ్ళేవాళ్ళం. దిగువ ప్రాంతాలకు వెళ్తున్నప్పుడు 'సుబ్‌హానల్లాహ్' అని చెబుతూ వెళ్ళేవాళ్ళం. *(బుఖారీ)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం)*

٩٧٦ - وعن ابنِ عُمَرَ رَضيَ اللهُ عنهما قال: كانَ النَّبِيُّ ﷺ وَجُيُوشُهُ إذَا عَلَوُا الثَّنَايَا كَبَّرُوا، وَإِذَا هَبَطُوا سَبَّحُوا. رواه أبو داود بإسناد صحيح.

976. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: దైవప్రవక్త (సల్లం) మరియు ఆయన సైన్యం గుట్టలమీదకు ఎక్కినప్పుడు 'అల్లాహు అక్బర్' అంటూ ఎక్కేవాళ్ళు. అక్కణ్ణుంచి దిగినప్పుడు 'సుబ్‌హానల్లాహ్' అని పలుకుతూ దిగేవాళ్ళు. (అబూ దావూద్. దీని ఆధారాలు దృఢంగా ఉన్నాయి).

## ముఖ్యాంశాలు

ఎత్తయిన ప్రదేశాలకు వెళ్ళినప్పుడు మనిషిలో తాను చాలాపైకి ఎదిగిపోయాననే భావన కలగవచ్చు. అలాంటి భావన రాకుండా ఉండేందుకు ఎత్తయిన ప్రదేశాలకు వెళ్ళినప్పుడు "అల్లాహు అక్బర్" అంటూ దేవుని గొప్పదనాన్ని చాటుతూ వెళ్ళాలి. అల్లాహు అక్బర్ అంటే అల్లాహ్ అందరికంటే గొప్పవాడు, మిగతా సృష్టిరాశి అంతా ఆయన ఆధీనంలో ఉంది అని భావం.

అలాగే మెరకప్రాంతాల నుంచి కిందికి వచ్చినప్పుడు "సుబ్హానల్లాహ్" అంటూ దేవుని పవిత్రతను కొనియాడుతూ రావాలి. దిగటం అనేది క్షీణతను, పతనాన్ని సూచిస్తుంది. సుబ్హానల్లాహ్ అనగా అల్లాహ్ అటువంటి లోపాలన్నిటికీ అతీతుడని భావం.

٩٧٧ ـ وعنهُ قال: كانَ النَّبيُّ ﷺ إذا قَفَلَ مِنَ الحَجِّ أَوِ العُمْرَةِ كُلَّمَا أَوْفَى عَلَى ثَنِيَّةٍ أَوْ فَدْفَدٍ كَبَّرَ ثَلاثاً، ثُمَّ قال: «لا إلٰهَ إلَّا اللهُ وَحْدَهُ لا شَرِيكَ لَهُ، لَهُ المُلْكُ وَلَهُ الحَمْدُ، وَهُوَ عَلَى كُلِّ شَيْءٍ قَدِيرٌ. آيِبُونَ تَائِبُونَ عَابِدُونَ سَاجِدُونَ لِرَبِّنَا حَامِدُونَ. صَدَقَ اللهُ وَعْدَهُ، وَنَصَرَ عَبْدَهُ، وَهَزَمَ الأَحْزَابَ وَحْدَهُ» متفقٌ عليه.

وفي روايةٍ لمسلم: إذا قَفَلَ مِنَ الجيُوشِ أَوِ السَّرَايَا

977. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) గారే చేసిన కథనం : దైవప్రవక్త (సల్లం) హజ్ లేక ఉమ్రా నుండి తిరిగొచ్చినప్పుడు ఏదయినా గుట్టమీదికిగాని లేదా మరే దయినా ఎత్తయిన ప్రదేశానికి గాని ఎక్క వలసి వచ్చినప్పుడు మూడుసార్లు 'అల్లాహు అక్బర్' అని చెప్పి ఈ విధంగా ప్రార్థించేవారు:

"లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహూ లా షరీక లహూ లహుల్ ముల్కు వలహుల్ హమ్దు వహువ అలాకుల్లి షైయిన్ ఖదీర్. ఆయిబూన తాయిబూన ఆబిదూన సాజిదూన లిరబ్బినా హామిదూన. సదఖల్లాహు వాదహూ, వ నసర అబ్దహూ, వ హజమల్ అహ్జాబ వహ్దహూ."

(అల్లాహ్ తప్ప వేరొక ఆరాధ్యుడు లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు భాగస్వాము లెవరూ లేరు. విశ్వ సామ్రాజ్యాధికారం ఆయన చేతుల్లోనే ఉంది. సర్వస్తోత్ర ములు ఆయనకే శోభిస్తాయి. ఆయన

ప్రతి వస్తువుపైనా అధికారం కలిగి వున్నాడు. మేము ప్రయాణం నుండి తిరిగొస్తున్నవాళ్ళం. పాపాలపై పశ్చాత్తాప పడేవాళ్ళం. ఆరాధనలు చేసేవాళ్ళం. దైవానికి సాష్టాంగప్రణామాలు చేసే వాళ్ళం. మా ప్రభువుని స్తుతించేవాళ్ళం. దేవుడు తన వాగ్దానాన్ని నెరవేర్చాడు. తన దాసునికి సహాయం చేశాడు. తనొక్కడే సైన్యాలన్నిటినీ ఓడించాడు).

*(బుఖారీ - ముస్లిం)*

ముస్లింలోని వేరొక ఉల్లేఖనంలో "పెద్ద సైన్యాలతో, చిన్న సైన్యాలతో యుద్ధం చేసి తిరిగొచ్చినప్పుడు లేక హజ్, ఉమ్రాల నుంచి తిరిగొచ్చినప్పుడు ఆయన (ఈ దుఆ చేసేవారు)" అని ఉంది.

أَو الحَجِّ أَو العُمْرَةِ. قَوْلُهُ: «أَوْفَى» أَي: ارْتَفَعَ، وقولهُ: «فَدْفَدٍ» هو بفتح الفاءَين بينهما دالٌ مهملةٌ ساكِنَةٌ، وَآخِرُهُ دال أخرى، وهو: الغَلِيظُ المُرْتَفِعُ مِنَ الأَرْض.

*(సహీహ్ బుఖారిలోని జిహాద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

978. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం : ఒక వ్యక్తి దైవప్రవక్త (సల్లం) దగ్గరకు వచ్చి, "దైవప్రవక్తా! నేను ప్రయాణానికి బయలుదేరాలనుకుంటున్నాను. నాకు ఏమయినా ఉపదేశించండి" అని విన్నవించుకున్నాడు. "అనునిత్యం అల్లాహ్‌కు భయపడుతూ ఉండు. ఎత్తైన ప్రదేశాలకు వెళ్తున్నప్పుడల్లా 'అల్లాహు అక్బర్' అని అంటూ ఉండు" అని దైవప్రవక్త (సల్లం) ఆ వ్యక్తికి ఉపదేశించారు. అతను వెను

٩٧٨ ـ وعن أَبي هُرَيرَةَ رَضِيَ اللهُ عنهُ أَنَّ رَجُلاً قال: يَا رسولَ اللهِ إِني أُرِيدُ أَن أُسَافِرَ فَأَوْصِنِي، قالَ: «عَلَيْكَ بِتَقْوَى اللهِ، وَالتَّكْبِيرِ عَلى كُلِّ شَرَفٍ» فَلَمَّا وَلَّى الرَّجُلُ قال: «اللَّهُمَّ! اطْوِ لَهُ البُعْدَ، وَهَوِّنْ عَلَيهِ السَّفَرَ» رواه الترمذي وقال: حديث حسن.

తిరిగి వెళ్ళిపోగానే, "దేవా! ఈ వ్యక్తి వెళ్ళవలసిన దూరాన్ని కుదించు. ఇతని ప్రయాణాన్ని సులభతరం చెయ్యి" అని ప్రార్థించారు. *(తిర్మిజీ - హసన్)*

## ముఖ్యాంశాలు

ప్రయాణీకులు ప్రయాణానికి బయలుదేరేముందు తమకు తెలిసిన ధర్మకోవిదుల, ధర్మపరాయణులైన పెద్ద మనుషుల ఆశీర్వాదాలు పొంది బయలుదేరాలి. అలాంటి పెద్ద మనుషులు కూడా తమను సంప్రదించే వారిని చిత్తశుద్ధితో ఆశీర్వదించి పంపాలి. అంతేకాదు, ప్రయాణంలో అల్లాహ్ పట్ల, ఆయన ఆదేశాల పట్ల అజాగ్రత్తకు లోనుగాకుండా ఉండమని వారికి హితవు చెప్పి మరీ పంపించాలి.

979. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం : మేము ఒక ప్రయాణంలో దైవప్రవక్త (సల్లం) వెంట ఉన్నాం. అప్పుడు మేము ఏదయినా గుట్టమీదికి ఎక్కినప్పుడల్లా, "లా ఇలాహ ఇల్లల్లాహ్, అల్లాహు అక్బర్" అని బిగ్గరగా అంటుండేవాళ్ళం. దైవప్రవక్త (సల్లం) అది విని, "ప్రజలారా! మీ పట్ల మీరు మృదువుగా వ్యవహరించండి (మరీ అంత బిగ్గరగా కేకలు పెట్టకండి). ఎందు కంటే మీరు చెవిటివాడినో లేక దూరంగా ఉన్నవాడినో పిలవడంలేదు. మీరు పిలిచేవాడు మీతోపాటే ఉన్నాడు. ఆయన అందరి పిలుపులూ వింటాడు, పిలిచేవాడికి అతి చేరువలో ఉంటాడు" అని బోధపరచారు. *(బుఖారీ - ముస్లిం)*

٩٧٩ ـ وعن أَبي موسى الأشعَريِّ رَضيَ اللهُ عنهُ قال: كنَّا مَعَ النبيِّ ﷺ في سَفَرٍ، فَكُنَّا إذَا أَشْرَفْنَا عَلى وَادٍ هَلَّلْنَا وَكَبَّـرْنَـا وَارْتَفَعَـتْ أَصْـوَاتُنَـا، فقـالَ النبيُّ ﷺ: «يَا أَيُّهَا النَّاسُ! ارْبَعُوا عَلى أَنْفُسِكُمْ فَإنَّكُمْ لا تَدْعُونَ أَصَمَّ وَلا غَائِباً، إنَّهُ مَعَكُمْ، إنَّهُ سَمِيعٌ قَرِيبٌ» متفقٌ عليه.

«ارْبَعُوا» بِفتحِ الباءِ الموحدةِ، أَي: ارْفقوا بِأَنْفُسِكم.

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని దైవధ్యానం, ప్రార్థనల ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

దేవుని ఘనతను, ఆయన పవిత్రతను కొనియాడినప్పుడు మరీ బిగ్గరగా అరవకూడదని దైవప్రవక్త (సల్లం) తన అనుచరులకు ఉపదేశించారు. గొంతు చించుకుంటూ కేకలు పెట్టి ప్రార్థిస్తే దేవుడు ప్రసన్నుడవుతాడని ఎక్కడా లేదు. పైగా దేవుణ్ణి విలపిస్తూనూ, గోప్యంగానూ ప్రార్థించాలని దివ్య ఖుర్‌ఆన్‌లో ఆదేశించబడింది. దేవుడు దాసులకు అతి చేరువలో ఉంటాడు. పిలిచేవాని పిలుపును ఆయన వెంటనే వింటాడు. సప్తాకాశాలపై దైవపీఠం మీద ఆసీనుడయి వున్నప్పటికీ ఆయన జ్ఞానం విశ్వమంతటా వ్యాపించి ఉంది.

నేడు కొందరు ఫర్జ్ నమాజ్ పూర్తవగానే 'లా ఇలాహ ఇల్లల్లాహ్' అని గాని లేక 'సలాత్ వ సలాం' అని గాని బిగ్గరగా ప్రార్థించటం మొదలుపెడతారు. దానివల్ల ప్రక్కన నమాజ్ చేసేవారికి ఇబ్బంది కలుగుతున్నా పట్టించుకోరు. అలాగే మరికొందరు గుంపులుగా కూర్చొని, "అల్లాహు హువ" అంటూ బిగ్గరగా మొత్తుకుంటూ ఉంటారు. నిజానికి అలా చేయాలని ధర్మంలో ఎక్కడా లేదు. అలాంటివారికి ఈ హదీసు కనువిప్పు కావాలి.



## 172వ అధ్యాయం

## ١٧٢ - بَابُ اسْتِحْبَابِ الدُّعَاءِ فِي السَّفَرِ

## ప్రయాణావస్థలో 'దుఆ' చేయటం మంచిది

٩٨٠ - عن أَبي هُرَيْرَةَ رَضيَ اللهُ عنهُ قالَ: قالَ رسولُ اللهِ ﷺ: «ثَلاثُ دَعَوَاتٍ مُسْتَجَابَاتٌ لا شَكَّ فِيهِنَّ: دَعْوَةُ المَظْلُومِ، وَدَعْوَةُ المُسَافِرِ، وَدَعْوَةُ الوَالِدِ عَلَى وَلَدِهِ» رواه أبو داود، والترمذي وقال: حديث حسن. وليس في رواية أبي داود: «على ولدِهِ».

980. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు: ముగ్గురి ప్రార్థనలు అంగీకరించబడతాయి. అందులో ఎలాంటి సందేహం లేదు. (1) బాధితుని ఆర్తనాదం. (2) ప్రయాణీకుని ప్రార్థన. (3) తండ్రి తన సంతానానికిచ్చే శాపం. (అబూ దావూద్, తిర్మిజీ - తిర్మిజీ దీన్ని 'హసన్'కోవకు చెందిన హదీసుగా పేర్కొన్నారు).

*(సుననె అబూదావూద్‌లోని నమాజ్ ప్రకరణం, సుననె తిర్మిజీలోని ప్రార్థనల అధ్యాయం)*

### ముఖ్యాంశాలు

బాధితుడు తన మీద దౌర్జన్యం చేసినవారిని శపిస్తాడు. ఆ సమయంలో తనకు సహాయం చేసినవారిని దేవుడు చల్లగా చూడాలని దీవిస్తాడు. ప్రయాణీకుడు ప్రయాణావస్థలో ఉన్నప్పుడు తనమీద ఎవరయినా దౌర్జన్యం చేస్తే వారిని శపిస్తాడు. ఆ సమయంలో తనను ఆదుకున్నవారికి మంచి జరగాలని ప్రార్థిస్తాడు. అలాగే సంతానం తమ తల్లి దండ్రులపట్ల ఉత్తమంగా వ్యవహరిస్తూ, వారికి సేవలు చేస్తూ ఉంటే వారు సంతానాన్ని దీవిస్తారు. అలాగాకుండా సంతానం తమ పట్ల అనుచితంగా ప్రవర్తిస్తే తల్లిదండ్రులు పిల్లల్ని శపించనూవచ్చు. శాపం కూడా వాస్తవానికి ఒక ప్రార్థనే. పైన పేర్కొనబడిన ఈ మూడు రకాల వ్యక్తులు ప్రార్థిస్తే, దేవుడు వారి ప్రార్థనల్ని తప్పకుండా అంగీకరిస్తాడు. కనుక ఎల్లప్పుడూ బాధితుల, ప్రయాణీకుల, తల్లిదండ్రుల దీవెనల్ని మాత్రమే అందుకోవటానికి ప్రయత్నించాలిగాని వారి శాపానికి గురికాకూడదు.

## 173వ అధ్యాయం

## ۱۷۳ ـ بَابُ مَا يَدْعُو بِهِ إِذَا خَافَ نَاساً أَوْ غَيْرَهُمْ

## ప్రయాణంలో ఎవరయినా తమకు కీడు తలపెడతారేమోనన్న భయముంటే ఈ దుఆ చేసుకోవాలి

۹۸۱ ـ عن أَبي موسى الأشعَرِيِّ رَضِيَ اللهُ عنهُ أَنَّ رسولَ اللهِ كَانَ إِذَا خَافَ قَوْماً قال: «اللَّهُمَّ إِنَّا نَجْعَلُكَ فِي نُحُورِهِمْ، وَنَعُوذُ بِكَ مِنْ شُرُورِهِمْ» رواه أبو داود، والنسائي بإسنادٍ صحيحٍ.

981. హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ఎవరయినా తమకు కీడు తలపెడతారేమోనన్న భయముంటే ఈ దుఆ చేసేవారు: "అల్లాహుమ్మ ఇన్నా నజ్అలుక ఫీ నుహూరిహిమ్ వ నవూజు బిక మిన్ షురూరిహిమ్." (దేవా! మేము నిన్ను వారి ముందుంచుతున్నాం. వారి కీడు నుండి నీ శరణు వేడుతున్నాం).

*(అబూ దావూద్, నసాయి - దీని ఆధారాలు దృఢమైనవి)*

*(సుననె అబూ దావూద్‌లోని నమాజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

'నుహూర్' అనేది నహ్ర్‌కు బహువచనం. గొంతు దగ్గర కోయబడే చోటుని నహ్ర్ అంటారు. "మేము నీ సహాయాన్ని రక్షక కవచంగా భావిస్తున్నాం. ఈ అవిశ్వాసుల కుట్రల్ని నీవే మావైపు నుంచి వారిమీదకు తిప్పికొట్టాలి" అని పై ప్రార్థనకు భావం. ప్రయాణంలో శత్రువు బెడద ఎక్కువగా ఉంటుంది కనుక అలాంటి సమయంలో ఈ ప్రార్థనకు ప్రత్యేక ప్రాముఖ్యముంది.

## 174వ అధ్యాయం

# ١٧٤ ـ بابُ مَا يقُولُ إذَا نَزَلَ مَنْزِلاً

# ప్రయాణంలో దిగినచోట ఈ వాక్యాలు పఠించాలి

٩٨٢ ـ عن خَوْلَةَ بنتِ حَكِيمٍ رَضِيَ اللهُ عنها قالتْ: سَمِعْتُ رسولَ اللهِ ﷺ يقولُ: «مَنْ نَزَلَ مَنْزِلًا ثمَّ قَالَ: أَعُوذُ بِكَلِمَاتِ اللهِ التَّامَّاتِ مِنْ شَرِّ مَا خَلَقَ، لَمْ يَضُرَّهُ شَيْءٌ حَتَّى يَرْتَحِلَ مِنْ مَنْزِلِهِ ذلكَ» رواه مسلم.

982. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఖౌలా బిన్తె హకీమ్ (రజి.అన్హా) తెలియజేశారు : (ప్రయాణంలో) ఎక్కడయినా దిగినప్పుడు ఈ వాక్యాలు పఠించేవారికి తిరిగి ఆ ప్రదేశం నుండి బయలుదేరే వరకు ఎలాంటి కీడూ జరగదు -

"అవూజు బికలిమాతిల్లాహిత్తామ్మాతి మిన్ షర్రి మా ఖలఖ్"

నేను దేవుని సంపూర్ణ వచనాల ఆధారంగా యావత్తు సృష్టి కీడు నుండి ఆయన శరణు వేడుతున్నాను. (ముస్లిం)

*(సహీహ్ ముస్లింలోని దైవధ్యానం, ప్రార్థనల ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ఇక్కడ 'వచనాలు' అంటే దేవునికి చెందిన ఆదిమధ్యాంతరహిత గుణవిశేషాలు అని అర్థం. 'సంపూర్ణ' వచనాలంటే ఎలాంటి లోపానికి గాని, దోషానికిగాని ఆస్కారం లేని దేవుని పవిత్ర నామాలు, గుణవిశేషాలని భావం. ప్రయాణంలో ఎక్కడయినా దిగేముందు ఈ వాక్యాలు చదువుకునే మనిషి దైవకృపతో అన్నిరకాల కీడుల నుంచి రక్షణపొందుతాడు.

٩٨٣ ـ وعنِ ابنِ عُمَرَ رَضِيَ اللهُ عَنهمَا قال: كانَ رسولُ اللهِ ﷺ إذا سَافَرَ فَأَقبَلَ اللَّيْلُ قال: «يَا أَرْضُ! رَبِّي وَرَبُّكِ اللهُ، أَعُوذُ بِاللهِ مِنْ شَرِّكِ وَشَرِّ مَا فِيكِ،

983. హజ్రత్ ఇబ్నె ఉమర్ (రజి) కథనం: ప్రయాణంలో రాత్రి అయితే దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రార్థించేవారు : "ఓ భూమీ! నీకూ నాకూ ప్రభువు అల్లాహ్‌యే. నేను అల్లాహ్ శరణు వేడు

وَشَرِّ مَا خُلِقَ فِيكِ، وَشَرِّ مَا يَدِبُّ عَلَيْكِ، أَعُوذُ بِاللهِ مِنْ شَرِّ أَسَدٍ وَأَسْوَد، وَمِنَ الحَيَّةِ وَالعَقْرَبِ، وَمِنْ سَاكِنِ البَلَدِ، وَمِنْ وَالِدٍ وَمَا وَلَد» رواه أبو داود. «وَالأَسْوَدُ»: الشَّخص، قال الخَطَّابِي: «وسَاكِن البَلَدِ»: هُمُ الجِنُّ الَّذِينَ هُمْ سُكَّانُ الأَرْضِ. قال: وَالبَلد مِنَ الأَرْضِ مَا كَانَ مَأْوَى الحَيوانِ، وَإِنْ لَمْ يَكُنْ فِيهِ بِنَاءٌ وَمَنَازِلُ. قَال: وَيَحتَمِلُ أَنَّ المُرَادَ بِـ«الوَالِدِ»: إِبْلِيسُ، وَ «مَا وَلَدَ»: الشَّيَاطِينُ.

తున్నాను. నీ కీడు నుంచి, నీలో వున్న వాటి కీడు నుంచి, నీలో పుట్టించబడిన వాటి కీడు నుంచి, నీ ఉపరితలంపై నడిచేవాటి నుంచి, ఇంకా పులుల నుంచి, పెద్ద సర్పాలనుంచి, చిన్న పాముల నుంచి, భూలోకవాసుల నుంచి, తండ్రి నుంచి, అతని సంతానం నుంచి కూడా నేను అల్లాహ్ శరణువేడు తున్నాను.'' *(అబూ దావూద్)*

ఇమామ్ ఖత్తాబీ ఇలా అంటున్నారు : పై హదీసులో భూలోకవాసులంటే భూమిలో విహరించే జిన్నాతులు అని అర్థం. బహుశా తండ్రి అంటే ఇబ్లీసు అనీ, సంతానమంటే షైతానులు అని భావం కావచ్చు.

*(సుననె అబూ దావూద్‌లోని జిహాద్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఎంతో సమగ్రమైన, భావగర్భితమైన ప్రార్థనా వచనాలు ఇవి. భూమిలో ఉన్నవి అంటే హానికరమైన జంతువులు, నేలమీద పాకే విషపూరిత జంతువులు అని అర్థం. నీలో పుట్టించబడినవి అంటే చెట్లు మొదలగు వాటికి ఢీ కొనటం కావచ్చు. ప్రయాణంలో రాత్రిపూట ఇలాంటి ప్రమాదాలు జరగటానికి చాలా ఎక్కువ అవకాశాలుంటాయి. అంచేత ప్రయాణంలో ముఖ్యంగా రాత్రిపూట ఈ దుఆ చేసుకోవాలి.

**175వ అధ్యాయం**

## ١٧٥ ـ بَابُ اسْتِحْبَابِ تَعْجِيلِ الْمُسَافِرِ الرُّجُوعَ إِلَى أَهْلِهِ إِذَا قَضَى حَاجَتَهُ

## బాటసారి పని ముగిసిన వెంటనే ఇంటి ముఖం పట్టాలి

٩٨٤ ـ عن أَبي هُرَيرَةَ رَضيَ اللهُ عنهُ أنَّ رسولَ اللهِ ﷺ قال: «السَّفَرُ قِطْعَةٌ مِنَ العَذَابِ؛ يَمْنَعُ أَحَدَكُمْ طَعَامَهُ، وَشَرَابَهُ وَنَوْمَهُ، فإذا قَضَى أَحَدُكُمْ نَهْمَتَهُ مِنْ سَفَرِهِ، فَلْيُعَجِّلْ إِلى أَهْلِهِ». متفقٌ عليه. «نَهْمَتَهُ»: مَقْصُودَهُ.

984. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : ప్రయాణం కూడా ఒక విధమైన శిక్షలాంటిదే. అది మనిషి నిద్రాహారాలకు అంతరాయం కలిగిస్తుంది. అందువల్ల ప్రయాణీకుడు తన పని ముగిసిన వెంటనే ఇంటి ముఖం పట్టాలి. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఉమ్రా ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ప్రయాణంలో ఉన్నప్పుడు మనిషి తన భార్యాపిల్లలకు, ఆత్మీయులకు దూరంగా ఉంటాడు. దాంతోపాటు ప్రయాణంలో ఎన్నో ఇబ్బందుల్ని, విపరీతమైన అలసటను ఎదుర్కోవలసి వస్తుంది. అందుకే ప్రయాణం కూడా ఒక విధమైన శిక్షలాంటిదేనని చెప్పబడింది. కనుక ప్రయాణీకుడు తన పని ముగిసిన వెంటనే ఇంటి దారి పట్టాలి.

**176వ అధ్యాయం**

## ١٧٦ - بَابُ اسْتِحْبَابِ الْقُدُومِ عَلَى أَهْلِهِ نَهَاراً وَكَرَاهَتِهِ فِي اللَّيْلِ لِغَيْرِ حَاجَةٍ

## ప్రయాణం నుండి పగటిపూట ఇంటికి తిరిగి రావటం అభిలషణీయం. రాత్రివేళ తిరిగి రావటం అవాంఛనీయం

٩٨٥ - عن جابر رَضِيَ اللهُ عنهُ أنَّ رسولَ اللهِ قال: «إذَا أَطَالَ أَحَدُكُمُ الغَيْبَةَ فَلا يَطْرُقَنَّ أَهْلَهُ لَيْلاً». وفي روايةٍ أنَّ رسولَ اللهِ نَهَى أَنْ يَطْرُقَ الرَّجُلُ أَهْلَهُ لَيْلاً. متفقٌ عليه.

985. హజ్రత్ జాబిర్ (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : సుదీర్ఘ కాలంపాటు దూరంగా ఉండి ఇంటికి తిరిగివెళ్ళేవారు రాత్రిపూట వెళ్ళకూడదు.
వేరొక ఉల్లేఖనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) (ప్రయాణం నుండి) రాత్రివేళ తిరిగి రావద్దని వారించారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఉమ్రా ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

٩٨٦ - وعن أنسٍ رَضِيَ اللهُ عنهُ قَالَ: كَانَ رسولُ اللهِ ﷺ لا يَطْرُقُ أَهْلَهُ لَيْلاً، وَكَانَ يَأْتِيهِمْ غُدْوَةً أَوْ عَشِيَّةً. متفقٌ عليه. «الطُّرُوقُ»: المَجِيءُ في اللَّيْلِ.

986. హజ్రత్ అనస్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ప్రయాణం నుండి తిరిగొస్తే, (అకస్మాత్తుగా) రాత్రివేళ ఇంటికి వెళ్ళేవారు కాదు. ఉదయం గాని, సాయంత్రం గాని వెళ్ళేవారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని ఉమ్రా ప్రకరణం, సహీహ్ ముస్లింలోని నాయకత్వ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ప్రయాణం నుంచి రాత్రివేళ ఇంటికి తిరిగి రాకూడదంటే ఇంట్లో వారికి తాము వస్తున్నామని ముందుగా తెలియజేయకుండా అకస్మాత్తుగా ఇంటికి రాకూడదని భావం. ఒకవేళ తమ రాక గురించి ఇంటివారికి ముందుగానే తెలియజేసి రాత్రివేళ ఇంటికి చేరుకుంటే అందులో అభ్యంతరకరమైన విషయమేమీ లేదు. సమాచార రంగం అభివృద్ధి చెందిన ప్రస్తుత కాలంలో ఈ ప్రవచనాన్ని ఆచరించటం మరింత సులభం అయిపోయింది.

**177వ అధ్యాయం**

## ١٧٧ - بَابُ مَا يَقُولُهُ إذَا رَجَعَ وَإِذَا رَأَى بَلْدَتَهُ

## ప్రయాణం నుంచి తిరిగొచ్చి తమ నగరాన్ని చూడగానే ఏమని ప్రార్థించాలి?

فِيهِ حديثُ ابنِ عُمَرَ السَّابقُ في باب تكبيرِ المُسافِرِ إذا صَعِدَ الثَّنَايَا.

ఇంతకు ముందు "ప్రయాణంలో మెరక ప్రాంతాలకు వెళ్తున్నప్పుడు 'అల్లాహు అక్బర్' అంటూ వెళ్ళాలి" అనే అధ్యాయంలో వచ్చిన ఇబ్నె ఉమర్ (రజి) హదీసు ఈ అధ్యాయానికి కూడా వర్తిస్తుంది. *(967వ హదీసు)*

٩٨٧ - وعن أَنسٍ رَضيَ اللهُ عنهُ قال: أَقْبَلْنَا مَعَ النَّبِيِّ ﷺ، حَتَّى إذا كُنَّا بِظَهْرِ المَدِينَةِ قال: «آيِبُونَ، تَائِبُونَ، عَابِدُونَ، لِرَبِّنَا حَامِدُونَ» فَلَمْ يَزَلْ يَقُولُ ذٰلِكَ حَتَّى قَدِمْنَا المَدِينَةَ. رواه مسلم.

987. హజ్రత్ అనస్ (రజి) కథనం : మేము దైవప్రవక్త (సల్లం) వెంట ఒకసారి ప్రయాణానికి వెళ్ళి తిరిగొచ్చాం. మేమంతా మదీనా నగర సమీపానికి చేరుకోగానే దైవప్రవక్త (సల్లం) "ఆయిబూన, తాయిబూన, ఆబిదూన, లిరబ్బినా హామిదూన (మేము ప్రయాణం నుంచి తిరిగొస్తున్నవాళ్ళం, పాపాలమీద పశ్చాత్తాపపడేవాళ్ళం, ఆరాధించేవాళ్ళం, మా ప్రభువును స్తుతించేవాళ్లం)" అని పఠించటం మొదలు పెట్టారు. మదీనా చేరుకునే వరకూ ఆయన అవే పలుకులు పలుకుతూ ఉన్నారు. *(ముస్లిం)*

*(సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

**ముఖ్యాంశాలు**

ఏదయినా ప్రయాణానికి వెళ్ళి తిరిగొచ్చినప్పుడు తమ నగర సరిహద్దులకు చేరుకోగానే పైన పేర్కొనబడిన వాక్యాలు పఠిస్తూ నగరంలోకి ప్రవేశించాలి.

178వ అధ్యాయం

## ١٧٨ - بَابُ اسْتِحْبَابِ ابْتِدَاءِ الْقَادِمِ بِالْمَسْجِدِ الَّذِي فِي جِوَارِهِ وَصَلَاتِهِ فِيهِ رَكْعَتَيْنِ

## ప్రయాణం నుంచి తిరిగొచ్చేవారు, ముందుగా తమ ఇంటికి దగ్గర్లో ఉన్న మస్జిద్‌కు వెళ్ళి రెండు రకాతుల నమాజ్ చేసుకోవటం అభిలషణీయం

٩٨٨ - عن كعبِ بنِ مالكٍ رَضيَ اللهُ عنهُ أنَّ رسولَ اللهِ ﷺ كانَ إذا قَدِمَ مِنْ سَفَرٍ بَدَأَ بالمَسْجِدِ فَرَكَعَ فِيهِ رَكْعَتَيْنِ. متفقٌ عليه.

988. హజ్రత్ కాబ్ బిన్ మాలిక్ (రజి) కథనం : దైవప్రవక్త (సల్లం) ప్రయాణం నుండి తిరిగొచ్చినప్పుడు ముందుగా మస్జిద్‌కు వెళ్ళి రెండు రకాతుల నమాజ్ చేసేవారు. *(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని జిహాద్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని ప్రయాణీకుల నమాజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

ప్రయాణం నుండి క్షేమంగా, సురక్షితంగా ఇంటికి తిరిగి వచ్చినందుకు కృతజ్ఞతగా దైవసన్నిధికి వెళ్ళి స్వచ్ఛందంగా రెండు రకాతుల నమాజ్ చేయటం అభిలషణీయం. ప్రయాణం నుండి క్షేమంగా తిరిగి వచ్చినప్పుడు మనిషి సహజంగానే సంతోషిస్తాడు. సంతోష సమయాల్లో, ఆనంద ఘడియల్లో దైవానికి కృతజ్ఞతలు తెలుపుకోవటం, ఆయన ఘనతను, గొప్పదనాన్ని చాటడం విశ్వాసుల లక్షణం కదా!

## 179వ అధ్యాయం

## ١٧٩ - بَابُ تَحْرِيمِ سَفَرِ الْمَرْأَةِ وَحْدَهَا

## స్త్రీలు ఒంటరిగా ప్రయాణించటం నిషిద్ధం

٩٨٩ - عن أَبِي هُرَيْرَةَ رَضِيَ اللهُ عنهُ قَالَ: قالَ رَسُولُ اللهِ ﷺ: «لا يَحِلُّ لامْرَأَةٍ تُؤْمِنُ باللهِ وَالْيَوْمِ الآخِرِ تُسَافِرُ مَسِيرَةَ يَوْمٍ وَلَيْلَةٍ إِلَّا مَعَ ذِي مَحْرَمٍ عَلَيْهَا» متفقٌ عليه.

989. హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచించారు : అల్లాహ్‌నూ, అంతిమదినాన్ని విశ్వసించే ఏ స్త్రీ కూడా ఒక పగలు ఒక రాత్రి వరకు జరిగే ప్రయాణం మహ్రమ్ పురుషులు వెంట లేకుండా చేయరాదు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని నమాజ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

### ముఖ్యాంశాలు

1. ఈ హదీసులో ఒక పగలు, ఒక రాత్రి వరకు జరిగే ప్రయాణమని ఉంది. వేరొక హదీసులో రెండు పగళ్లు, రెండు రాత్రుల వరకు జరిగే ప్రయాణమని చెప్పబడింది. ఇంకొక ఉల్లేఖనంలో మూడు పగళ్లు, మూడు రాత్రుల ప్రస్తావన ఉంది. అందుకే పండితులు, ఇక్కడ ఎన్ని రోజులనే విషయం ముఖ్యం కాదు. వ్యవహారంలో 'ప్రయాణం' అనబడేంత దూరం స్త్రీలు ఒంటరిగా ప్రయాణించరాదని అంటున్నారు.
2. కొంతమంది విద్వాంసులు ఈ ఆదేశం వాజిబ్ (తప్పనిసరి) కాని ప్రయాణాలకు సంబంధించినదని అభిప్రాయపడుతున్నారు. వీరి అభిప్రాయం ప్రకారం స్త్రీ తను విధిగా చేయవలసిన ప్రయాణానికి ఒంటరిగానయినా బయలుదేరవచ్చు. ఉదాహరణకు స్త్రీకు స్తోమత ఉండి, తను హజ్ చేయటం విధి అయిపోతే, తనకు మహ్రమ్ బంధువులెవరూ లేనిపక్షంలో లేక వారు తన వెంట రాలేకపోయినపక్షంలో ఆమె విశ్వసనీయులైన ఇతర మహిళలతోపాటు హజ్ యాత్రకు వెళ్ళవచ్చు. దీనికి భిన్నంగా మరికొంతమంది పండితులు ఎలాంటి ప్రయాణానికయినా స్త్రీ ఒంటరిగా వెళ్ళటం నిషిద్ధమని అంటున్నారు.

   హాఫిజ్ ఇబ్నె హజర్ (రహ్మలై) 'ఫత్‌హుల్ బారీ' గ్రంథంలో ఈ రెండు అభిప్రాయాల గురించి కూలంకషంగా చర్చించారు. అయితే ఆయన ఈ రెండు అభిప్రాయాల్లో దేనినీ సమర్థించలేదు. నాకున్న పరిమిత జ్ఞానం ప్రకారం తొలి అభిప్రాయాన్ని ఆచరించటానికి షరీఅత్‌లో అనుమతి ఉందని నా అభిప్రాయం.

(వివరాల కోసం చూడండి, ఫత్‌హుల్ బారీ గ్రంథంలోని హజ్ ప్రకరణంలో 'స్త్రీల హజ్ యాత్ర' అధ్యాయం, ఫిక్‌హుస్సున్నహ్ గ్రంథం)

3. భర్త మరియు స్త్రీని వివాహం చేసుకోవటం ఎన్నటికీ ధర్మసమ్మతం కాని ఆమె పురుష బంధువులు 'మహ్రమ్‌లు' అనబడతారు. ఉదా : తండ్రి, కొడుకు, సోదరుడు, సోదర కుమారుడు, సోదరి కుమారుడు, అలాగే పాల సంబంధీకులైన తండ్రి, కొడుకు, సోదరుడు, సోదరకుమారుడు, సోదరి కుమారుడు. ఇంకా తన కూతురితో రతి సంబంధమేర్పరచుకున్న అల్లుడు. వీరు తప్ప ఇతరుల వెంట స్త్రీ ఒంటరిగా ప్రయాణించరాదు.

٩٩٠ ـ وعن ابنِ عباسٍ رَضيَ اللهُ عنهما أنَّهُ سَمِعَ النَّبيَّ ﷺ يقولُ: «لَا يَخْلُوَنَّ رَجُلٌ بِامْرَأَةٍ إلَّا وَمَعَهَا ذُو مَحْرَمٍ، وَلا تُسَافِرُ المَرْأَةُ إلَّا مَعَ ذِي مَحْرَمٍ» فقالَ لَهُ رَجُلٌ: يا رسولَ اللهِ! إنَّ امْرَأَتِي خَرَجَتْ حَاجَّةً، وَإنِّي اكْتُتِبْتُ فِي غَزْوَةِ كَذَا وَكَذَا؟ قال: «انْطَلِقْ فَحُجَّ مَعَ امْرَأَتِكَ» متفقٌ عليه.

990. దైవప్రవక్త (సల్లం) ఈ విధంగా ప్రవచిస్తుండగా తాను విన్నానని హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) తెలియజేశారు : ఏ పురుషుడూ పర స్త్రీతో ఏకాంతంలో గడపకూడదు - వారి వెంట మహ్రమ్ పురుషుడు ఉన్నప్పుడు తప్ప. అలాగే ఏ స్త్రీ కూడా తన వెంట మహ్రమ్ వ్యక్తి తోడు లేకుండా ఒంటరిగా ప్రయాణించ కూడదు.

ఒక వ్యక్తి అది విని, "దైవప్రవక్తా! ఫలానా యుద్ధంలో పాల్గొనేవారిలో నా పేరు నమోదు చేయబడింది. నా భార్యేమో హజ్ యాత్రకు వెళ్తోంది మరి?" అని సందేహపడ్డాడు. దానికాయన, "అయితే నువ్వు కూడా ఆమె వెంట వెళ్ళి హజ్ యాత్ర చెయ్యి" అని చెప్పారు.

*(బుఖారీ - ముస్లిం)*

*(సహీహ్ బుఖారీలోని నికాహ్ ప్రకరణం, సహీహ్ ముస్లింలోని హజ్ ప్రకరణం)*

## ముఖ్యాంశాలు

ఒక స్త్రీ తనకు తోడుగా భర్తగాని ఇతర మహ్రమ్ పురుషుడు గాని లేనప్పుడు పర పురుషునితో ఏకాంతంలో గడపటం చాలా ప్రమాదకరం. మానవుల మీద వల విసరటానికి షైతాన్ అలాంటి సందర్భాలను సువర్ణావకాశాలుగా భావిస్తాడు. ఏకాంతంలో ఉన్న స్త్రీ పురుషుల్లో

ఏ ఒక్కరయినా షైతాన్ వేసే వలలో చిక్కుకోవచ్చు. అలాంటి ఘోరమేదీ జరగకపోయినా కనీసం జనం వారిని అనుమానించనయినా అనుమానిస్తారు. గోరంతని కొండంతగా చేసి ప్రచారం చేస్తారు. దానివల్ల వారు సమాజంలో తలెత్తుకు తిరగలేని పరిస్థితి ఏర్పడవచ్చు. అందుకే ఇస్లామీయ షరీఅత్ అలాంటి సామాజిక నేరాలకు ఆదిలోనే అడ్డుకట్టవేయాలని నిశ్చయించి పరాయి స్త్రీ పురుషులు ఏకాంతంలో గడపరాదని తీవ్రంగా వారించింది.

మహ్రమ్ పురుషుడు వెంట లేకుండా స్త్రీ ఎక్కడికీ ప్రయాణం చేయరాదని వాదించేవారు పై హదీసునే నిదర్శనంగా చూపెడుతున్నారు. మరోవైపు అత్యవసర పరిస్థితుల్లో స్త్రీ ఒంటరి గానయినా ప్రయాణం చేయగలదని నమ్మేవాళ్ళు పై హదీసును స్త్రీ ఒంటరిగా ప్రయాణించటం ఉత్తమం కాదన్న భావంలో తీసుకుంటున్నారు. ఏది ఎలా ఉన్నా ఇంతకు ముందు ముఖ్యాంశాల్లో చెప్పబడినట్లు స్త్రీ కొన్ని ప్రత్యేక సందర్భాల్లో విశ్వసనీయమైన మహిళా ప్రయాణ బృందాలతోపాటు హజ్ యాత్రకు వెళ్ళవచ్చు. అయితే ఆ ప్రయాణంలో తను ఎలాంటి ఉపద్రవానికీ లోనుకానని పరిపూర్ణ ఆత్మవిశ్వాసంతో ఉండాలి. అలాంటప్పుడు ఆమె మహ్రమ్ తోడు లేకుండానయినా తప్పనిసరి ప్రయాణాలు చేయవచ్చు. షాఫయీ అనుయాయుల దృక్పథం కూడా ఇదే!

దైవ కృపవల్ల రియాజుస్సాలిహీన్ గ్రంథం మొదటి సంపుటి అనువాదం, ముఖ్యాంశాల వివరణలు పూర్తయ్యాయి. రెండవ సంపుటి మహత్యాల ప్రకరణం - దివ్య ఖుర్ఆన్ పారాయణ మహత్యానికి సంబంధించిన అధ్యాయంతో మొదలవుతుంది.

